# డ్యాజ్ లో డైమండు (రిజిస్టర్డు)

DAZLO
DIAMONDS
(REGD.)
For Economy
with Beauty
in jewellery
RS. 3 to 8
Per ct.

P. GOPALASWAMY NAIDU & SON
*Saint Thomas Mount P.O., Via Madras*

తేజస్సు, గట్టి వర్ణము, మేలిమి ఇవి యన్నిటియందును; అసలు వజ్రమునకు ఒప్పైనవి. వేనవేలు ఖర్చగుచున్నవి. కోరినవారికి క్యాటలాగు ఉచితము.

క్యారట్టు 1-కి ధర రు 3—రు 8. గ్లాసురాళ్లనుకొని మోసపోకుడు.

పి. గోపాలస్వామినాయుడు అండు సన్,
సెంటుతామస్ మౌంటుపోస్టు (మదరాసు.)


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

స చి త్ర మా స ప త్రి క

స ం పా ద కు లు:

కా. నాగేశ్వరరావు,

గన్నవరపు సుబ్బరామయ్య,

మల్లంపల్లి సోమశేఖరశర్మ,



సంపుటము ౭. భాగము ౧.

ఆంధ్రపత్రికా ముద్రాలయము _ మద్రాసు.

౧౯౩౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి—సప్తమ సంపుటము—భా. ౧.

## వ్యాసముల అకారాది సూచి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఏ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి – సప్తమ సంపుటము – భా. ౧.

## వ్యాసకర్తల అకారాదిసూచి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు

త్రివర్ణచిత్రములు—ఝాన్సీ లక్ష్మీబాయి; లద్దిపూజ; హారతి; షడ్జస్వరము; మోట బావి; గాంధర్వి: గీతము; తులసిపూజ.

సాధారణచిత్రములు—శ్రీపండిత జవహరిలాల్ నెహ్రూగారు, కర్నూలుచిత్రములు, వ్యంగ్యచిత్రములు ౫, ఇతరచిత్రములును.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



'ఝాన్సీ' లక్ష్మీబాయి

చిత్రకారుడు: శ్రీ చం. రామారావుగారు, ఆంధ్రచిత్రకళాపరిషత్, ఏలూరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు

అధ్యక్షుడు

నలువదినాలుగవ అఖిలభారత జాతీయమహాసభ, లాహూరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము, జనవరి ౧౯౩౦

సంపుటము ౭ — శుక్ల సంవత్సరము పుష్యమాసము — సంఖ్య ౧

# స్వవిషయము

భారతికి ఆరేండ్లు నిండినవి. ఏడవయే డారంభమైనది. క్రొత్త సంవత్సర మారంభమగునపుడు పంచాఙ్గశ్రవణమును జేసి గతాగత ఫలములను నిర్ణయించుకొనుట పురోవృద్ధికి సాధనము. భారతజాతీయ జీవనమున కంగమైన ఆంధ్రజాతీయజీవనమునందు భారతజాతీయ జీవనమునందు వలెనే గతించిన యాఱేండ్ల చరిత్రయును మహాఘట్టముగ నున్నది. ఆంధ్రజాతీయ హృదయమునందు నూతనవికాస ముదయించినది. స్త్రీలు పురుషులు, పండితులు, పామరులు, బ్రాహ్మణులు పంచములు, బాలురు బాలికలు, వృద్ధులు యువకులు దేశకల్యాణమునకును, మానవకల్యాణమునకును కానుకలను సమర్పించుచున్నారు. కవులు కావ్యములను, శిల్పులు శిల్పములను, గాయకులు గానములను, చిత్రకారులు చిత్రములను, పండితులు విమర్శనలను ఉత్పత్తి చేయుచున్నారు. పామరులు జయఘోషలను ప్రకటించుచున్నారు. జాతీయహృదయమునందు ప్రబలుచున్న నూతనవికాసము ప్రజాప్రవృత్తియందు సర్వాంగములందును ఉదయమగుచున్నది. సాహిత్యకళాస్వరూపిణియైన భారతియును ప్రజాప్రవృత్తియం దుదయించిన నూతన వికాసమును ప్రత్యక్షము చేయుచున్నది.

వర్తమానయుగము మహోదయ యుగమైనను మహాపరివర్తనయుగము. ప్రపంచమునం దంతటను ప్రాచీనసంస్థలు పరివర్తనమును బొందుచు నవయుగనిర్మాణమునకు సాధనంబులగుచున్నవి. రాజ్యాంగములు మారుచున్నవి. సాంఘిక వ్యవస్థలు నూతనాకృతిని దాల్చుచున్నవి. మతప్రవృత్తి విశ్వస్వరూపమును

7. 1 1



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సౌందర్యమున్న ... నైతికసంస్కారములు విశాల రూపమును వహించుచున్నవి. ఆర్థిక నిర్ణయములు ప్రజాక్షేమ పరాయణము లగుచున్నవి. సకలసంస్థలును నవీనస్వరూప స్వభావములను బడయుచున్న సమయమునందు పరివర్తనమునకు మూలాధారమైన ధర్మస్వరూప స్వభావములును నూతనార్థమును ప్రకటించుచున్నవి. సనాతనమైన భారతీయసంస్కారము నవయుగ పరిణామమును సహజముగ బడయుచున్నది. నవయుగపరిణామమునకై ప్రాచ్య పాశ్చాత్య సంస్కారములకును, ఆధ్యాత్మికాధిభౌతిక సంస్కారములకును, సాంఖ్యకర్మయోగములకును, ప్రాచీననవీనసంప్రదాయాచారములకును సంరంభసాహచర్యములు గలుగుచు, నవయుగనిర్మాణము సహజముగ గలుగుచున్నది. విశ్వవ్యాప్తములైన సాహిత్యములు, కళలు నవయుగనిర్మాణమునకు వినియోగపడగలవిధమును ప్రతిభావంతుల రచనలు విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముని సహాయ నిరాకరణోద్యమము,రవీంద్రనాథఠాకూరుగారి కావ్యములు, జగదీశచంద్రబోసుగారి శాస్త్ర పరిశోధనలు, రాధాకృష్ణయ్యగారి వేదాంత సిద్ధాంతములు మొదలగునవి నవయుగపరిణామ విధానమును విశదముచేయుచున్నవి. కవులు, శిల్పులు, కర్మకారులు, శాస్త్రజ్ఞులు, పరిశోధకులు, రాజనీతిజ్ఞులు, సాంఘికవాదులు, ఆర్థిక పండితులు నూతనయుగధర్మమును సంకీర్తనము చేయవలసిన యవసరము గలిగినది. ప్రతిభావంతులు అనుకరణమును మాని నిర్మాణమునకు బూనుకొనవలసిన యవసరమును నవయుగధర్మము విశదముచేయుచున్నది. కవులు, చిత్రకారులు, పరిశోధకులు, విమర్శకులు,పండితులు ప్రాచీన పాటనే పాడుటయును, నవీన పరిస్థితులను విస్మరించుటయును సదాచారముగ నున్నది. వాఙ్మయము, శిల్పము, లలితకళలు, కర్మకళలు నవయుగ నిర్మాణము నభిలషించుచున్నను పూర్వానుకరణము ప్రముఖముగ నున్నది. సర్వతోముఖమైన భారతీయ విజ్ఞానము స్తంభించినది. సాహిత్యము, కావ్యములు, కళలు దేశావసరములకును, ప్రజావికాసమునకును నిరుపయోగములగు చున్నవి. వర్తమానవిషాదస్థితియందు జాతీయ ప్రత్యభిజ్ఞానమును గలుగజేయుటకు గుణయుతమైన అనుకరణముకన్నను దోషయుతమైన నిర్మాణము ప్రయోజనకరమగుచున్నది. ప్రాణములేని యనుకరణము సుందరమైనను మానవకల్యాణమునకు నిరుపయోగమగుచున్నది. భారతియందు గతించిన ఆరేండ్లయందును ప్రచురింపబడిన వివిధవ్యాసములు, చిత్రపటములు, ఈవిషయమును పరిస్ఫుటము చేయుచున్నవి. ప్రతిభావంతులు నూతన రచనలను జేయుచున్నను సామాన్యముగ రచయితలు ప్రాత వాసనలనే యారాధించుచున్నారు. రచనల కాధారము ప్రాచ్యసంస్కారమును, పాశ్చాత్యసంస్కారమునను సత్యాశ్రయమును, ధర్మాశ్రయమును లేక, స్వాభిమానాశ్రయపూరితమై పురుషార్థమునకు నిరుపయోగమగుచున్నది. భారతి నారేండ్ల నుండియు సకలవిధముల పోషించి పెంచిన యాంధ్రమహాజనులకు కృతజ్ఞతాంజలులను సమర్పించుచు, భావికాలమునందును భారతి సర్వాంగశోభితమై విశ్వకల్యాణమునకు మంగళహారతులను సమర్పించునటు లనుగ్రహించి ఆదరింప వేడుచున్నాము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అవతారము

భోగరాజు నారాయణమూర్తి గారు

ఘనతగన్న యనేక కవికుమారక పికానీకమ్మునకు మావిమోఁకవమ్మ !
చిత్రచిత్రితనూత్నచిత్రకథారత్న రాజికిఁ రత్నాకరమ్మనమ్మ !
నవరసాలంకార కవితా మహాకావ్య కలహంసలకుఁ దటాకమ్మవమ్మ !
నాట్యసంగీతాది నానాకళా మయూరములకుఁ మేచకాభ్రమ్మవమ్మ !
భారతీ! తావకీనావతారకలన-ద్రవిడ భాషాంగనామణుల్ తలలు వంప
నాంధ్రభాషాపురంధ్రి నీరంధ్ర కీర్తి-నవనవోత్తేజ మొందుచున్నది కదమ్మ!

ఆచరించుచునుందు వతిభక్తి సంయుక్తి బహుళేష్ట దైవత ప్రార్థనముల
భూషించుచుందువు పూర్వాధునిక మహాకవిపుంగవుల ప్రసంగంబులెల్ల
ఖండించుచుందు వఖండ పాండిత్యాసిఁ గాకవిదుష్కావ్య కాననముల
వర్ణించుచుందువు వారాశి కాసారభూభృదారామాది వైభవముల
లలిత సత్కావ్యలక్షణ లక్షితవయి-యెన్ని పోకడ లెఱిఁగి తావేండ్లలోనె?
సాటి పత్రికాపుత్రికా కోటి మెచ్చు-భారతీ, నీదు సాహితీప్రౌఢరీతి !

సకలాచేతనచేతనాకలిత విశ్వంబున్ ముఖంబందు నం
దకుమారుం డొకమారె చూపె; నటు నిత్యంబుం బ్రదర్శింతు వీ
వకలంకాధునికాఖిలాంధ్ర కవిలోకాశేషముం గూడఁ ద
త్సుకవిత్వ ప్రతిభాకృతిప్రతతితో శోభారతీ! భారతీ!

ఈ డొక యింత లేదుకద యెన్నఁడు నేర్చితి విన్ని విద్దె లా
ఱేఁడుల ముద్దుబిడ్డ వయి; యేడవయేఁ డిపు డయ్యె నమ్మ! నూ
ఱేఁడుల యవ్వవైన వఱ కిట్టులఁ బల్లెలఁ బట్టణాల మా
ఱాడఁగ రాని కీర్తిఁ గొనియాడఁబడంగదవమ్మ, భారతీ!

కడు లేవయసుపత్రికాపుత్రికాభావ ముంచి నిన్నాశీర్వదించవలెనో
యసమానశాస్త్రవిద్యాధిదేవతగా స్మరించి నీకు నమస్కరించవలెనో
జిలిబిలిముద్దుపల్కుల నోల్కు క్రొందేనె లాని నీమోము ముద్దాడవలెనో
సతత మ్మపారవిజ్ఞాన వారాశిగా నెంచి నిన్నెపుడుఁ బూజించవలెనో
మాకు నీయందుఁగల్గు ప్రేమం బదెల్ల-వత్సలత యౌనో నిర్మలభక్తి యౌనో?
చెప్పి చేయించుకొనవమ్మ చేయఁదగిన-చేత లవి యేవొ భారతీ, ప్రీతి మీఱ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఊహూర్లఁ నుతు లొందుచుందువు తెనుం గున్నట్టి దేశాలలో
నాహూడోన్నతి; నాంధ్రరాష్ట్రమన నేలా, వంగరాష్ట్రంబు, బ
ర్మారాష్ట్రంబును, మధ్యరాష్ట్రము, మహారాష్ట్రంబునుంగూడ నీ
సౌహం బేరును దీరు వేమఱుఁ గడున్ శ్లాఘింపవే భారతీ!

ఆయాయిండ్ల నెలంత లొక్కయెడఁ బోగై వ్యర్థసంభాషలన్
జేయన్ గల్గుచునుండె వైర; మిపు డాస్త్రీకోటికిన్ నిత్యమున్
నీయాసక్తియ! భారతీ భగవతీ, నీపుణ్య మూలంబునన్,
మాయిండ్లన్ జగడంబు లుండవుసుమా మధ్యాహ్నకాలంబులన్.

కలకార్యంబుల వేగఁ దీర్చి శయనాగారంబులం జొచ్చి భ
ర్తలహస్తంబుల నున్న నిన్నడుగఁగాఁ దా మీయ మన్నంత భా
ర్యలు బల్మిం గొనఁ దత్కరద్వయ సముద్యత్కంకణ క్వాణముల్
నెలలో నష్టమరాత్రివేళ వినవే నీ వెప్పుడున్ భారతీ!

పంతం పట్టి నగల్ గొనంగఁ బతులన్ బాధింత్రు; లే విప్ప డా
పంతా, లల్క, లభోజనంబులు, నిన్నున్ వాంఛింత్రు, నిన్గొన్నచో
సంతోషింతురు; నీవ లేనియెడలన్ సామాన్య సంసారులా
కాంతుల్ కాంతల మెప్పు లెట్లు వడయంగా నేర్తురో భారతీ!

మధురశ్రావ్య నవీనకావ్య కవితా మందాకినీ స్నాతవై
పృథువర్ణాంచిత చిత్రచేలవయి, నీవిజ్ఞాన సంపచ్ఛటా
గ్రథితంబౌ కలగూరగంప నొకచంకం దాల్చి మాయింటికిన్
విధిగా మానుతు లందఁగా నెలనెలన్ విచ్చేయుమా భారతీ!

కథలం జెప్పుచు నవ్యభవ్య రసవత్కావ్య ప్రబంధావళీ
సుధవర్షింపుచు సత్కళావిభవముల్ శోధించి వ్రాక్రుచ్చుచున్
బుధరోలంబచిదంబకాంబుజమవై పొల్పొంది మాయింటికిన్
విధిగా మానుతు లందఁగా నెలనెలన్ విచ్చేయుమా భారతీ!

ఓంకారంబునఁ బద్మబాంధవ సహస్రోద్యత్ప్రభా మూర్తివై
పంకేజాసనసీమపైఁ జిఱునవుల్ భాసిల్లఁ గొల్వుండి, ని
శ్శంకన్ మా యకలంక కావ్యకవితాసాహిత్య సామ్రాజ్య మే
వంకం జూచిన నీవ వై యనిశమున్ బాలింపుమా భారతీ!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సంస్కృతవర్ణసమామ్నాయము

శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు యమ్. ఏ.

౧. సంస్కృతభాషావర్ణసమామ్నాయ మీక్రింద జూపబడినది.

| | | హ్రస్వము | దీర్ఘము |
|---|---|---|---|
| అచ్చులు:— | సమానాక్షరములు: | | |
| ,, | కంఠ్యములు: | అ | ఆ |
| ,, | తాలవ్యములు | ఇ | ఈ |
| ,, | ఓష్ఠ్యములు: | ఉ | ఊ |
| ,, | మూర్ధన్యములు: | ఋ | ౠ |
| ,, | దంత్యము. | ఌ | |
| సంధ్యక్షరములు: | కంఠ్యతాలవ్యములు: | ఏ | ఐ |
| ,, | కంఠోష్ఠ్యములు: | ఓ | ఔ |
| అనుస్వారము: | అనునాసికము: | ం | |
| విసర్గ | కంఠ్యము | ః | |

| | | అఘోషము | | ఘోషవంతములు | | |
|---|---|---|---|---|---|---|
| హల్లులు:— | స్పర్శలు: | | | | | |
| ,, | కంఠ్యములు: | క | ఖ | గ | ఘ | ఙ |
| ,, | తాలవ్యములు: | చ | ఛ | జ | ఝ | ఞ |
| ,, | మూర్ధన్యములు: | ట | ఠ | డ | ఢ | ణ |
| ,, | దంత్యములు: | త | థ | ద | ధ | న |
| ,, | ఓష్ఠ్యములు: | ప | ఫ | బ | భ | మ |
| అంతఃస్థలు: | తాలవ్యము: | | | | | య |
| ,, | మూర్ధన్యము: | | | | | ర |
| ,, | దంత్యము: | | | | | ల |
| ,, | దంతోష్ఠ్యము: | | | | | వ |
| ఊష్మలు: | తాలవ్యము: | | | | | శ |
| ,, | మూర్ధన్యము | | | | | ష |
| ,, | దంత్యము | | | | | స |
| ,, | కంఠ్యము | | | | | హ |

వేదమున ళ యను మరియొక యక్షరము కలదు. ఇది అజ్మధ్యస్థ డకారస్థానమున గనబడుచుండును. ఇది మూర్ధన్యవర్ణము-ఇట్లు ఋగ్వేదమున ఈడే యనుపదము ఈళే యని యుచ్చరింపబడుచుండును కాని ఈడ్య యను పదముమాత్ర మట్టిమార్పును పొందుటలేదు. ఈరీతిగానే మీఢుషేయను పదము మీళ్హుషే యని యుచ్చరింపబడునుగాని మీఢ్వాన్ అను పదముమాత్ర మట్టి విపరిణామమును పొందుటలేదు.

పైవర్ణములను పేర్కొనునప్పుడు వానికి కార శబ్దమును చేర్చి పేర్కొనుచుందురు. ఇట్లు అ యను వర్ణమును అకారమనియు, క యనుదానిని కకారమనియు, హ యను దానిని హకారమనియు వ్యవహరించుట యాచారమై యున్నది. ర యను వర్ణముమాత్రము రవర్ణమనుటకు మారుగా రేఫ యనుపించుకొనుచున్నది.

౧. అచ్చులకు స్వరములని పేరు. కంఠమునందు పుట్టిన నాదమే వివృతమగు ముఖమార్గముయొక్క యాకార భేదములచే వివిధవర్ణములుగా నేర్పడుటచే వీనికి స్వరములను నామము సార్థకమగుచున్నది. ఉదాత్తాది స్వరభేదములను కలవనుటచేనైనను నివి స్వరములు కావచ్చును. సమానాక్షరములనియు సంధ్యక్షరములనియు నివి రెండు విధములుగా నున్నవి.

౨. అకారము — ముఖమార్గమును స్వల్పముగా తెరచి జిహ్వాద్యవయవములను వానివానిస్థానములయందే యుంచి నాదయుక్తమగు నిశ్శ్వాసమును వదలునప్పు డీవర్ణమేర్పడుచున్నది. అందుచే నీవర్ణమున కేస్థానముతోడను సంబంధమున్నట్లు తోపదు. అందుచేతనే ప్రాతిశాఖ్యలలో నెచ్చటను నిది కంఠ్యమని చెప్పబడి యుండలేదు. పాణినీయవ్యాకరణమున మాత్రము కంఠ్యాచ్చు వేరుగ లేకపోవుటచే కాబోలును దీనికి కంఠము స్థానమని చెప్పబడియున్నది. హ్రస్వాకారము దీర్ఘమువలెకాక సంవృతమని అథర్వవేద వాజసనేయి ప్రాతిశాఖ్యలయందును, పాణినీయవ్యాకరణమునందును చెప్పబడియున్నది. ఇది యుచ్చారణమున నస్పష్టాచ్చును (ఎ) పోలియుండును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అకారమునకు 'ఇండో-యూరపియన్' మాతృభాషలోని a, e, o, m̥, n̥, అను వర్ణములు మూలమని భాషాశాస్త్రజ్ఞులు నిరూపించియున్నారు. ఉదాహరణములు: వీనిలో క్రింది సంజ్ఞలు వ్యవహరింపబడినవి.

ఇం.-యూ.—'ఇండో - యూరపియన్' మాతృభాష.

సం.—సంస్కృతభాష

వై.—వైదికభాష

గ్రీ.—'గ్రీక్' భాష-

లా.—'లాటిన్' భాష

గా.—'గాథిక్' భాష

ప్రా. హై. జ.—ప్రాచీన 'హై-జర్మన్' భాష.

ఐస్.—'ఐస్లెండిక్' భాష-

ప్రా. స్లై.—ప్రాచీన 'స్లెవోనిక్' భాష

లి.—'లిథువేనియన్' భాష.

*—ఈగుర్తు కల్పితరూపమును సూచించును.

ఇం.—యూ. a: సం. అజామి (* అజా), 'తోలుచున్నాను,' గ్రీ. agō, లా. ago, ఐస్. aka (తుమన్నర్థకము.)—వై. అజ్రః, 'పొలము, మైదానము,' గ్రీ. agros, లా. ager, గా. akrs.—సం. అక్షః, 'ఇరుసు,' గ్రీ. axon, లా. axis, ప్రా. హై. జ. ahsa.—సం. కర్కః, కర్కటః 'పీత,' గ్రీ. karkinos, లా. cancer.

ఇం.—యూ. e:—సం. అస్తి 'ఉన్నది', గ్రీ. esti లా. est, గా. ist.—సం. భరామి (* భరా), గ్రీ. pherō, లా. ferō, గా. baira.—వై. జనః 'వంశము, జాతి,' గ్రీ. genos, లా. genus.—సం. చ (సముచ్చయార్థకము), గ్రీ. te, లా. que.—సం. నభః 'మేఘము, ఆకాశము,' గ్రీ. nephos, లా. nebula, ప్రా. హై. జ. nebul.

ఇ.-యూ. o: వై. అష్టా. సం. అష్టౌ 'ఎనిమిది' గ్రీ. oktō, లా. octō, గా. ahtau.—సం. అస్థి 'ఎముక,' గ్రీ. osteon, లా. os.—వై. దమః 'ఇల్లు' గ్రీ. domos, లా. domus.—వై. అపః 'పని,' లా. opus,—సం. దదర్శ, 'చూచెనట,' గ్రీ. dedoske—సం. భరన్తి 'మోయుచున్నారు,' గ్రీ.—pheronti

ఇం.—యూ. m̥: సం. గతః 'వెళ్లిన,' గ్రీ. batos, లా. -ventus.—సం. శతమ్ 'నూరు,' గ్రీ. e-katon, లా. centum, గా. hund.—సం. దశ, 'పది,' గ్రీ. deka, లా. decem, గా. taihun—వై. సమః 'ఒకరు,' గ్రీ. amo,—గా. sums.

ఇం.—యూ. n̥: సం. మతః 'తలంపు,' గ్రీ.—matos, లా. —mentus, గా. munds.—సం. నవ, 'తొమ్మిది,' గ్రీ. ennea, లా. novem, గా. niun.n సం. అమృత 'అమర్త్య', గ్రీ. ambrotos.—సం. తన్వీ 'సన్నని', గ్రీ. tanu-, లా. tenuis, ప్రా. హై. జ. dunni.

'ఇండో,యూరపియన్' మాతృభాషలో m̥n̥—అను పైనచూపబడిన రెండచ్చులును మకారనకారపరకములగు నచ్చులు లోపించుటచే నేర్పడుచున్నవి. తేల్చి పలుకుటచే నాయచ్చులు లోపించుచుండెను. అందుచే మాతృభాషలో నీరెండచ్చులును యెల్లప్పుడును తేల్చి పలుకబడుచుండినవి. పదాంతరసాహచర్యమువలన స్వల్పసంఖ్యాకములగు పదములలో మాత్ర మివి యొత్తి యుచ్చరింపబడ నారంభించినవి.

ఉదా —సం. సప్త 'ఏడు,' లా. septem [ఇం.—యూ. * septom, ప్రాచీనరూపము *[septem,]

జన్యభాషలలో పైవర్ణముల విపరిణామములను గూర్చి భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయభేదములను కలిగియున్నారు. సంస్కృతమునందును 'గ్రీక్' భాషయందును రెండు విధములగు విపరిణామములను పొందినవనియు, తద్భిన్నభాషలలో నేకరీతిగా మారినవనియు కొందరి యభిప్రాయము. పదాంతమునందును, యకారవకారభిన్నమగు హల్లునకు పూర్వమునను నివి సంస్కృత 'గ్రీక్' భాషలలో అకారములోనికి మారినవనియు, యకారవకారములకును, అచ్చులకును పూర్వము అమ్, అన్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అను వర్ణములలోనికి మారినవనియును వీరు చెప్పుచున్నారు. మిగిలిన భాషలలో యేవర్ణముపరముగానున్నను నీక్రింది విధముగా మారినవని చెప్పుచున్నారు.

| | |
|---|---|
| లాటిన్. | em, en. |
| జర్మానిక్. | um, un. |
| లిథుఏనియన్ | im, in. |
| ప్రా. స్లేవోనిక్ | e̥ (im, in). |

మిగిలిన భాషాశాస్త్రజ్ఞులు పైవర్ణము లన్నిసందర్భములలోను సంస్కృతమున అకారములోనికి మారినవని చెప్పుచున్నారు. సంస్కృతమున అమ్, అన్ అను వర్ణఘటితములగు పదముల మాతృభాషా రూపములలో కేవలములగు m̥, n̥. అను వర్ణములుకాక m̥m, n̥ n అనువర్ణములుండినవని వీరియాశయము.

పైవర్ణములలో n̥ అనువర్ణముచే కంఠ్య, తాలవ్య, దంత్యవర్ణములు మూడును గ్రహింపవలయును.

౩. ఆకారము:—ఇది హ్రస్వాకారమువలె కాక విస్తృతముగా నుచ్చరింపబడుచున్నది. దీనికి 'ఇండో-యూరపియన్' మాతృభాషలలోని ā ē అను వర్ణములు మూలమని భాషాశాస్త్రజ్ఞు లందరును చెప్పియున్నారు. మాతృభాషలో m̥ n̥ అను దీర్ఘములు కలవనియు, నవిశూడ సంస్కృతమున ఆకారముగా పరిణమించినవనియు కొందరు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. ఉదాహరణములు:

ఇం.—యూ. a: సం. బాహుః 'చేయ,' గ్రీ. pachus, ప్రా. హై. జ. buog.—సం. భ్రాతా 'సోదరుడు,' గ్రీ. phrāter, లా. frater, గా. brothar—సం. మాతా 'తల్లి,' గ్రీ. māter, లా. māter. ప్రా. హై. జ. muoter.—సం. తిష్ఠామి 'నిలుచుచున్నాను,' గ్రీ. istami, లా. stare.

ఇం.—యూ. ē: సం. ఆద 'తినెను', ఆదివాన్ 'తినిన,' గ్రీ. edēdos, లా. ēdimus, గా. etum—సం. దధామి 'ఉంచుచున్నాను,' గ్రీ. tithēmi.—సం. ఆసమ్ 'ఉంటిని,' గ్రీ. ēa.—సం. రాజ్ 'రాజు,' లా. rex.—సం. స్యాః 'ఉండవచ్చును', లా. sies. గ్రీ. eies సం. భ్రాతా, మాతా; పైనచూడుము.

ఇం.—యూ. ō: సం. ఆశుః 'శీఘ్రమైన,' గ్రీ. ōkus, లా. ocior.—సం.ఆమః 'పండని,' గ్రీ. ōmos —సం. దానం 'దానము,' లా dōnum.—వై. భరతాత్ 'మోయుము,' గ్రీ. pheretō, లా. ferto.—సం. భరామి (*భరా)'మోయుచున్నాను,' గ్రీ. pherō, లా. ferō, గా. baira.

ఇం.—యూ. m̥̄: సం. అగాత 'వెళ్లిరి,' గ్రీ. ebāte.—సం. అగాత్, అగాః, అగామ్, గ్రీ. ebē, ebēs, ebēn.

ఇం.—యూ. n̥̄: సం. జాతః 'పుట్టినవాడు, కుమారుడు,' జాతిః 'పుట్టుక,' లా. gnātus, nātus, nātio.—సం. జానామి 'తెలసికొనుచున్నాను,' లా. gnārus.—సం. సాత; వాత; ఘాత; ఘాతి; మొ.

'ఇండో-యూరపియన్' మాతృభాషలో m̥̄,n̥̄ అను అచ్చులుండినవని యంగీకరింపని భాషాశాస్త్రజ్ఞులు పై యుదాహరణము లన్యథాసిద్ధములని చెప్పుచున్నారు. అగాత్, జాత, సాత మొదలగురూపములు ప్రసిద్ధములగు మకారాంత నకారాంత ధాతువులనుండి యుత్పన్నములైనవి కావనియు, తదర్థకములగు ఆకారాంత ధాతుజములనియు వీరి యభిప్రాయము.

౪. ఇకారము—దీని యుచ్చారణమున నాలుక తాలువునకు సమీపముగానుండును. అందుచే నిది తాలవ్యమనుచున్నది. దీనికిని, యకారమునకును వినిమయము కలుగుచుండును. మాతృభాషలోని ఇకారమును యస్పష్టాచ్చును (ə) దీనికి మూలమును-ఉదాహరణములు:

ఇం.—యూ. i సం. ఇమః 'వెళ్లుచున్నాము,' గ్రీ. imen—సం. దివి 'ఆకసమునందు,' గ్రీ. dii.—సం. ఇదమ్ 'ఇది,' లా. id— గా. ita.—సం. అవిః



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'గొఱ్ఱె', గ్రీ. ois, లా. avis, గా. awi.—సం. ఇహి (*ఇధి) 'వెల్లుము,' గ్రీ. ithi.

౩౦.—యూ. ә: సం. పితా 'తండ్రి,' గ్రీ. pater, లా. pater, గా. fadar.—సం. స్థితః 'నిలిచియున్న' గ్రీ. statos, లా. status.

'ఇండో-యూరపియన్' మాతృభాషలో నిఃశ్వాసదార్ఢ్యము నాధారముగా చేసికొనిన స్వరము వ్యవహారములోనుండినట్లు భాషాశాస్త్రజ్ఞు లూహించి యున్నారు. అందుచే నా భాషయందు దేల్చి యుచ్చరింపబడిన యచ్చులు క్షీణించుచుండెను. ఇట్లు a: e. o అను అచ్చులును కొన్నియెడల వీని హ్రస్వములు క్షీణించి యస్పష్టాచ్చుగా వినబడుచుండెను. దీనినే ә అను చిహ్నముచే భాషాశాస్త్రజ్ఞులు సూచించుచున్నారు. ఇది సంస్కృతమున ఇకారములోనికి మారినది.

౫. ఈకారము.—'ఇండో-యూరపియన్' మాతృభాషలోని ఈకారము దీనికి మూలము. ఉదాహరణములు. సం. జీవః, 'జీవము' లా. vīvus, గ్రీ. bios, గా. qius.—సం. పీవా 'బలిసిన' గ్రీ. pīon.—సం. పీతః 'త్రాగిన,' గ్రీ. pīthi.—సం. సీమా 'ఎల్ల,' గ్రీ. īmas.—సం. వీరః 'శూరుడు,' లా. vir, గా. wair, గ్రీ. īs. హల్పరకములను రేఫలకారములు పరమగునప్పుడు పైన వర్ణింపబడిన యస్పష్టాచ్చునుండ ఈకారములోనికి మారునని కొందరు భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఉదాహరణములు-సం దీర్ఘః 'పొడవైన,' గ్రీ. dolichos.—సం. శిరః 'శిరస్సు,' గ్రీ. kara. ఇట్లే గీర్ణ, కీర్ణ, మొ. ఈ విషయమును మరికొందరు భాషాశాస్త్రజ్ఞు లంగీకరింపక పై నుదాహరింపబడిన పదముల మాతృభాషారూపములలో రేఫలకారపరకమగు నస్పష్టాచ్చునకు బదులుగా ఋ(ౠ) కార ముండినదని చెప్పుచున్నారు. చూ. పేరా ౧౮.

౬. ఉకారము.—దీని యుచ్చారణమున పెదవులు సంకుచముగా చేయబడి ముందుకు త్రోయబడి యుండును. అందుచే నిది ఓష్ఠ్యవర్ణమగుచున్నది. ఒకారమునకును దీనికిని వినిమయము కలుగు చుండును. మాతృభాషలోని ఉకారము దీనికి మూలము-ఉదాహరణములు. సం. యుగమ్. 'కాడి, పుట్టించుట, యుగము, గ్రీ. zugon, లా. jugum, గా. juk.—సం. శునః 'కుక్క-(షష్ఠి),' గ్రీ. kunos.—సం. శ్రుతః 'వినబడిన, ప్రసిద్ధమైన,' గ్రీ. klutos.—లా. clutus.—సం. స్వాదుః 'తియ్యని,' గ్రీ. ēdus.—సం. ను 'ఇప్పుడు,' గ్రీ. nu, గా. nu. రేఫలకారపరక మగు నస్పష్టాచ్చు ఓష్ఠ్యవర్ణ సామీప్యమున ఉకారములోనికి విపరిణామమునుపొందు నని కొందరు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. ఉదాహరణములు: సం. పురు 'జాస్తియైన,' గ్రీ. polus. (*palus), గా. filu.—వై. ఉరణః 'గొఱ్ఱె,' గ్రీ. arnos.—సం. గురుః 'బరువైన, ముఖ్యమైన, గౌరవనీయమైన, గ్రీ. barus, గా. kaurus, లా. gravis.—సం. స్ఫురామి 'వేగముగా చలించెదను,' గ్రీ. spairo. ఈ యంశమును మిగిలిన భాషాశాస్త్రజ్ఞు లంగీకరింపక పైనుదాహరించిన పదముల మాతృభాషారూపములలో రేఫలకారపరకమగు నస్పష్టాచ్చు స్థానమున ఋ(ౠ) కారముండినదని చెప్పుచున్నారు. చూ. ౧౦

౭. ఊకారము.—మాతృభాషలోని ఊకారము దీనికి మూలము-ఉదాహరణములు. సం. ధూమః 'పొగ, ఆవిరి, గ్రీ. thūmos, లా. fūmus.—వై. మూష్-'ఎలుక,' గ్రీ. mūs, లా. mūs, ప్రా. హై. జ. mūs.—సం. శూరః—'బలవంతుడు, శూరుడు,' గ్రీ. kūros.—సం. భూతిః 'ఐశ్వర్యము,' గ్రీ. phusis.—వై. నూ 'ఇప్పుడు,' గ్రీ. nūn. హల్పరకములగు రేఫలకారములు పరముగుగల యస్పష్టాచ్చు ఓష్ఠ్యవర్ణ సామీప్యమున సంస్కృతమున ఊకారములోనికి మారుచుండు నని కొందఱు భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఉదాహరణములు-సం. పూర్వః 'మొదటి,' ప్రా. స్లై. pruvu, గా fruma.—సం. పూః 'పట్టణము,' గ్రీ. polis.—సం. ఊర్ధ్వాః 'పైకి,' గ్రీ. bortho, లా. arduus.—సం. ఊర్మిః 'కెరటము,' ప్రా. హై. జ. walm.—సం. ఊర్ణా 'ఉన్ని,' గా. wulla.—పూర్ణః 'నిండిన',



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా. fulls.—సం. భూర్జః 'భూర్జము,' ప్రా. హై. జ. pirihha. ఈ విషయమును మిగిలిన భాషాశాస్త్రజ్ఞు లంగీకరింపక పై నుదాహరింపబడిన పదముల మాతృ భాషారూపములలో రేఫలకారపరకాస్పష్టాచ్ఛస్థానమున ఋూ(ఌూ)కారముండినదని చెప్పుచున్నారు. చూ. ౧౧.

8. ఋకారము.—ఇది మూర్ధన్యవర్ణమని పాణినీయులు చెప్పుచున్నారు. వర్ణాంతరములకు మూర్ధన్యతాపాదకమగుటచే దీనిని మూర్ధన్యమనుట న్యాయము-ప్రాతిశాఖ్యలలో మాత్రమిది జిహ్వామూలీయమని చెప్పబడియున్నది. ఇది రేఫముతో వినిమయమును పొందుచుండును. ఇండో-యూరపియన్' మాతృభాషలలోని ఋకార ఌకారములు దీనికి మూలము.

ఇం. యూ. $\underset{\circ}{r}$: సం. ఋక్షః 'ఎలుగుబంటు,' గ్రీ. arktos, లా ursus.— వై. ఋణోమి 'లేచుచున్నాను, వెళ్లుచున్నాను, పొందుచున్నాను,' గ్రీ. ornumi, arnumai.—సం. ఋషభః 'ఎద్దు,' గ్రీ. arsen, arren.— వై. కృప్-'స్వరూపము,' లా. corpus.—సం. మృతః 'చనిపోయిన,' మృతిః 'మరణము,' లా. mors, ప్రా. హై. జ. mord.

ఇం.—యూ. $\underset{\circ}{l}$: సం. పృథుః 'విశాలమైన,' గ్రీ. platus, ని. platus.—సం, వృకః 'తోడేలు,'గా wulfs. గ్రీ. lukos.

౯. ఌకారము.—ఇది తాలవ్యమని పాణినీయ వ్యాకరణమున చెప్పబడియున్నది. ప్రాతిశాఖ్యలలో నిది ఋవర్ణమువలె జిహ్వామూలీయమని చెప్పబడియున్నది. ఇది లకారముతో వినిమయమును పొందుచుండును. 'ఇండో-యూరపియన్' మాతృభాషలోని ఌకారము సంస్కృతమున ఋకారములోనికి మారినదని పైన చెప్పబడినది. (చూ. పేరా ౮.) సంస్కృతమున ఌకారముక్లృప్-ధాతువు రూపములలో మాత్రే మగపడుచున్నది. ఇది ప్రాకృతభాషాసంసర్గమువలన నేర్పడిన కృప్‌ధాతువు రూపాంతరమని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

'ఇండో-యూరపియన్' మాతృభాషలలో $\underset{\circ}{r}$, $\underset{\circ}{l}$ అను రెండచ్చులను రేఫలకారపరకములగు నచ్చులు లోపించుటచే నేర్పడినవి. తేల్చిపలుకుటచే నాయచ్చులు లోపించుచుండెను. అందుచే మాతృభాషలలో నీరెండచ్చులును ఎల్లప్పుడును తేల్చియుచ్చరింపబడుచుండినవి. పదాంతరసాహచర్యమువలన స్వల్పసంఖ్యాకములగు పదములలో మాత్ర మివి యొత్తి యుచ్చరింపబడ నారంభించినవి.

ఉ॥—సం. వృకః 'తోడేలు,' లా. lupus, గా. wulfs. ['ఇం. యూ' * u$\underset{\circ}{l}$qos, ప్రాచీనరూపము * w$\underset{\circ}{l}$qo's.]

జన్యభాషలలో పైవర్ణములవిపరిణామమును గురించి భాషాశాస్త్రజ్ఞులభిప్రాయభేదములను కలిగియున్నారు. హల్లుపరముగానున్నపుడు ఋవర్ణములోనికిని, అచ్చుపరముగా నున్నపుడు రేఫలకారపరకములగు ఇకార-ఉకారములలోనికిని సంస్కృతమున మారునని కొందరు భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము-మిగిలిన భాషలలో వాని విపరిణామప్రకార మీక్రింద జూపబడినది.

హల్లుపరముగా నున్నపుడు:—గ్రీ. ar,ra, al,la. లా. or, ur; ol, ul, సెల్టిక్. ri, li, ప్రా. స్లే. ir il. అచ్చుపరముగా నున్నపుడు:—గ్రీ. ar, al, లా.ar, al. సెల్టిక్. ar,al. ప్రా. స్లే. ir,il.

మిగిలిన భాషాశాస్త్రజ్ఞులు పైవర్ణములన్ని సందర్భములలోను సంస్కృతమున ఋకారములోనికి మారినవనిచెప్పుచున్నారు. సంస్కృతమునరేఫలకారపరకములగు, ఇకార-ఉకారఘటితములగు పదముల మాతృభాషారూపములలో $\underset{\circ}{r}$, $\underset{\circ}{l}$ అను వర్ణములుకాక రేఫలకారపరకమగు నస్పష్టాచ్చు ఉండినదని వీరి యభిప్రాయము.

౧౦. ఋూకారము :— ఇది సంస్కృతభాషయం దతివిరళముగా ప్రయోగింపబడియున్నది. ఇది ఋకారాంతశబ్దముల కొన్ని బహువచనరూపములలో నగపడుచున్నది. పాణినీయ వ్యాకరణమున ఌకారము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకు దీర్ఘములేదని చెప్పబడియున్నది. మరికొందరు వైయాకరణులు ఌకారమునకు దీర్ఘముకలదని చెప్పియున్నారు.

మాతృభాషలో ఋ్య: (ౡ)కారము కలదాలేదా యనువిషయమున భాషాశాస్త్రజ్ఞులు విభిన్నాభిప్రాయములను కలిగియున్నారు. కలదనువారు అది సంస్కృతభాషయందు రేఫ (లకార) పరకమగు ఈకార-ఉకార-ఊకారములలోనికి మారుననిచెప్పుచున్నారు. ఈకార-ఉకార-ఊకారభేదము పరమందుండు వర్ణములభేదమును బట్టికలుగును. లేదనువారు మాతృభాషలో వానిస్థానమున రేఫ (లకార) పరకమగు నస్పష్టాచ్చు నంగీకరించెదరు. చూ. పేరాలు (౫, ౬, ౭).

ఉదాహరణములు:—ఋ్య: సం. ఊర్ధ్వః 'పైనున్న,' గ్రీ. orthos, లా. arduos.—సం. ఈర్మః 'బాహువు,' ధనుస్సు,' లా. armus, గా. arms.—సం. స్తీర్ణః 'పరచబడిన,' గ్రీ.strotos, లా.stratus.—సం. జీర్ణః 'అరిగిపోయిన' లా. granum.—సం. పూర్వః 'ముందరి' గ్రీ. protos.—సం. శీర్షమ్' శిరస్సు' గ్రీ. korse.—సం.గీర్ణః 'మ్రింగబడిన,' గ్రీ. bilrosko, 'తినుచున్నాను,'—సం. ధూర్తః 'నాశముచేయబడిన.' ౡ: సం. పూర్ణః 'నిండిన,' గ్రీ. polloi, 'అనేకము'—సం. ఊర్ణా 'ఉన్ని,' లా. lana, గ్రీ. oulos 'రోమములుగల,'—సం. మూర్ధా 'శిరస్సు,' గ్రీ. blothros 'ఎత్తుగా-పెరిగిన,'—సం. దీర్ఘః 'పొడవైన' గీ. dolichos.—సం. ఊర్మిః 'కెరటము,'—సం. స్థూణా 'కొయ్యస్తంభము'.

౧౧. ఏకారము:— దీనికి కంఠముతో కూడిన తాలువు స్థానమగుచున్నది. ఇది సంధ్యక్షరమని ప్రాతిశాఖ్యలలో కూడ చెప్పబడియున్నది. దీనియుచ్చారణము మాత్రము సమానాక్షరమువలె వర్ణింపబడి యున్నది. ఐకారౌకారములవలె దీని యుచ్చారణమున రెండచ్చులు వినబడునట్లు చెప్పబడి యుండలేదు. కాని అకార-ఇకారసంయోగమున నీవర్ణ మేర్పడుటచే నిది మొదట సంధ్యక్షరమువలె నుచ్చరింపబడియుండవచ్చును. అందుచే నిది సంధ్యక్షరములలో పరిగణింపబడుచున్నది. ఇకారమునకిది గుణమని చెప్పబడుచున్నది. మాతృభాషలోని ai, ei, oi అనుమూడు సంధ్యక్షరములును దీనికి మూలమని చెప్పుచున్నారు. ఉదాహరణములు:

ఇం:—యూ. ai: సం. ఏధః 'వంటచెరకు,' గ్రీ. aitho, లా. aedes, ప్రా. హై. జ. eit.—సం. సేతుః 'సేతువు,' లా. saeta 'కఠినమైన వెండ్రుక,' ప్రా. హై. జ. seid 'నలాదారము.'—సం. భరతే, భరన్తె, గ్రీ. pheretai, pherontai.

ఇం.—యూ. ei: సం.ఏమి, 'వెళ్లుచున్నాను,' గ్రీ. eimi. సం. ఏతి 'వెళ్లుచున్నాడు.' లి. eiti.—సై. హేమన్ 'శీతకాలము,' గ్రీ. cheima, cheimon.

ఇం.యూ. : సం. వేద 'తెలిసికొనుచున్నాను,' గ్రీ. oida, గా. wait.—సం. తే. 'వారు,' గ్రీ. toi, లి. te, గా. thai.—సం. రిరేచ, 'విడచితిని,' గ్రీ. leloipa, గా. laihw.—సం. భరేః 'మోయగలవు.' గ్రీ. pherois, గా. bairais.—సం. వృకేషు 'తోడేళ్లయందు,' గ్రీ. lukoisi.

'ఇండో-యూరపియన్' మాతృభాషలోని e, o అను వర్ణములు సంస్కృతమున అకారములోనికి మారినవని యిదివరలో చెప్పబడినది.(చూ. పేరా ౭). అందుచే మాతృభాషలోని ei, oi అను సంధ్యక్షరములు రెండును ప్రాచీనార్యభాషలో ai, అను సంధ్యక్షరములోనికి మారి తరువాత నిది సంస్కృతమున ఏకారములోనికి మారినదని చెప్పనగును.

౧౨. ఓకారము.— దీనికికంఠోష్ఠములుస్థానము. ఇది సంధ్యక్షరమని ప్రాతిశాఖ్యలలో గూడ చెప్పబడియున్నది. కాని యుచ్చారణమున సమానాక్షరమువలె వర్ణింపబడియున్నది. ఐకారౌకారములవలె దీనియందు రెండచ్చులు వినబడునట్లు చెప్పబడియుండలేదు. అకార-ఉకారసంయోగమున నీవర్ణమేర్పడుటచే నిది తొలుత సంధ్యక్షరమువలె నుచ్చరింపబడుచుండవచ్చును. అందుచే నిది సంధ్యక్షరములలో పరిగణింపబడుచున్నది. ఉకార



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున కిది గుణమునబడుచున్నది. మాతృభాషలోని au, eu ou అను మూడు సంధ్యక్షరములును దీనికి మూలమగు చున్నవి. ఉదాహరణములు.

ఇం.—యూ. au: సం. ఓజః, వై. ఓజ్మన్ 'బలము,' లా. augusstus, augmentum, augeo, గా. aukan.

ఇం.—యూ. eu: సం. బోధామి 'తెలసికొను చున్నాను,' గా. biuda, గ్రీ. peuthomai, pun thanomai.—వై. జోష్టర్ 'ప్రేమించుచున్న,' సం. జుషతే 'ప్రేమించు చున్నాడు,' గ్రీ. geno, లా. gustus, గా. kiusan.

ఇం.—యూ. ou: సం. బుబోధ 'తెలిసికొను చున్నాను,' గా. bauth.—సం. సూనోః 'కుమారుని యొక్క,' గా. sunaus.

'ఇండో-యూరపియన్' మాతృభాషలో ౯౦ అను వర్ణములు సంస్కృతములోని అకారమునకు మారుటచే మాతృభాషలోని eu, ou అను సంధ్యక్షరములు రెండును ప్రాచీనార్యభాషలో au అను వర్ణములోనికి మారి తరువాత నది సంస్కృతమున ఓకారములోనికి మారిన దని యంగీకరింపవలసి యున్నది. (చూ. పేరా ౧౧)

౧౩. ఐకారౌకారములు.—ఏకారౌకారములవలె వీనికికూడ కంఠముతో కూడిన తాలువును, ఓష్ఠములును స్థానము లగుచున్నవి. వీనియుచ్చారణమున రెండేసి యక్షరములు వినబడునని ప్రాతిశాఖ్యలలో చెప్పబడియున్నది. కాలమున అకారము ఇకార-ఉకారములతో సమానమని కాని, తక్కువయనికాని చెప్పబడియున్నది. అకారమునకును, ఏకారౌకారములకునుసంయోగముకలిగినప్పుడుఐకారౌకారములు యేర్పడుచున్నవి. ఇట్లు సంహితలోనే కాక స్వతంత్రముగాకూడ తద్ధితప్రత్యయాంతాది పదములలో నీవర్ణములు పుట్టుచున్నవి. ఇవి ఇకార-ఉకారములకు వృద్ధియనుపేరుకొను చున్నవి. ఉ. దైత్య, బౌద్ధ మొ॥ వీనిలో ఐకారమునకు మాతృభాషలోని āi, ēi, ōi అను దీర్ఘములగు సంధ్యక్షరములును, రెండవ దానికి మాతృభాషలోని āu, ēu, ōu అను దీర్ఘములగు సంధ్యక్షరములును మూలమని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఉదాహరణములు:

ఇం.—యూ. āi: చతుర్థ్యేకవచనప్రత్యయము. సం. సేనాయై 'సేనకొరకు,' గ్రీ. chōra, లా. men sae, గా. gibai, లి. rankai.

ఇం.—యూ. ēi: సం. అదైక్షమ్ 'చూపితిని,' గ్రీ. edeixa.

ఇం.—యూ. ōi: సం. వృకైః 'వృకములచేత' గ్రీ. lukois, లా. lupīs, లి. vilkais.

ఇం.—యూ. āu: సం. నౌః 'నావ,' గ్రీ. naus, ఐస్. naust.

ఇం.—యూ. ēu: సం. ద్యౌః, 'ఆకాశము,' గ్రీ. zeus.

ఇం.—యూ. ōu: సం. గౌః 'ఆవు', గ్రీ. bous, లా. bōs,

పైమాతృభాషావర్ణము . . రెండవ యక్షరము తరచుగాజన్యభాషలలో లోపించుచుండెను. ఉదా—సం. (గౌః) గామ్, గ్రీ. bōn; సం. (అష్టౌ) అష్టా, గ్రీ. oktō, లా. octo. ఏసందర్భములలో ని ట్లీరెండవ యక్షరము లోపించునో తెలిసికొనుటకు భాషాశాస్త్రజ్ఞుల కాధారములు దొరకలేదు. పాశ్చాత్యభాషలలో నిట్లు రెండవవర్ణము లోపించక హల్పరకమైన యెడల మొదటివర్ణము హ్రస్వమగుచుండును. ఉదా-సం. ద్యౌః, గ్రీ. zeus; సం. వృకైః, గ్రీ. lukois, లి. vikais. పాశ్చాత్యభాషలలోని యీదీర్ఘములును, హ్రస్వసంధ్యక్షరములును ఆయాభాషలలో నట్టి స్వతంత్రవర్ణములకు కలుగు విపరిణామములను పొందినవి.

౧౪. స్వరము.—సంస్కృతభాషలోని స్వరము నాదముయొక్క ఉచ్చత్వనీచత్వములతో సంబంధించియున్నది. కాని దార్ఢ్యముతో సంబంధించియుండలేదు. పాణినీయవ్యాకరణమున సంస్కృతస్వరభేదములీక్రిందివిధమున



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్ణింపబడియున్నవి. సూ—ఉచ్చై రుదాత్తః, నీచైరనుదాత్తః, సమాహారః స్వరితః. సామాన్యముగా నుదాత్తానుదాత్తములగు నచ్చులకు సంధి జరిగినప్పుడు స్వరితస్వర వర్ణమేర్పడుచుండును. ఉదాత్తవర్ణమునకు పరమందుండు వర్ణముకూడ స్వరితస్వరముతో నుచ్చరింపబడుచుండును. కాని దీనికి యుదాత్త వర్ణముపరముగా నున్న యెడల నిది యనుదాత్తమేయగును.

ఉ॥ తేన, తేవ కాని తేన్ర తే, తే చ స్వర్.

సంధివశమున నేర్పడిన స్వరితము నాలుగు విధములని ప్రాతిశాఖ్యలలో చెప్పబడియున్నది.

(౧) ఉదాత్తానుదాత్త స్వరములకు యణాదేశ సంధివలన నేర్పడిన వర్ణము ప్రకృతిప్రత్యయసంహితా సంబంధమైనయెడల జాత్యస్వరితమనియు, తదితరమైన యెడల క్షైప్రస్వరితమనియు వ్యవహరింపబడుచున్నది. ఉదా—క్వ, స్వర్, న్యక్, కన్యా, నద్యః, తన్వా (జాత్యము); వ్యాప్త, అప్స్వన్తర్ (క్షైప్రము). జాత్యమునకు నిత్యమని నామాంతరము కలదు. వేదమున సాధారణముగా పైసంధులు విడదీసి చదువవలసియుండును; కొన్ని గ్రంథములలో నట్లే వ్రాయబడికూడ నుండును.

(౨) ఉదాత్తా నుదాత్తస్వరములకు సవర్ణదీర్ఘ సంధిచేగాని, గుణసంధిచేగాని సిద్ధించినవర్ణము ప్రశ్లిష్ట స్వరితమని వ్యవహరింపబడుచున్నది. ఉదా—దివీవ, సూద్గాతా, నైవాశ్నీయాత్.

(3) ఉదాత్తములగు ఏకారౌకారములకు పరమున అనుదాత్తమగు అకారము లోపించునపుడు పూర్వమందుండు ఏకారౌకారములు అభినిహితస్వరితము లనబడుచున్నవి. ఉ॥ తేఽబ్రువన్, సోఽబ్రవీత్.

చతుర్వేదముల సంహితాభాగములలోను, తైత్తిరీయశతపథబ్రాహ్మణములలోను, తైత్తిరీయైతరేయారణ్యకములలోను, సుపర్ణాధ్యాయమను గ్రంథమునను మాత్రము స్వరము సూచింపబడియున్నది. పైగ్రంథములలో స్వరభేదములను సూచించు రీతులకు కొంతభేదముకలదు. ఋగ్వేదమున వర్ణముపై నొక నిలువుగీతచే స్వరితమును, క్రిందనొక యడ్డుగీతచే ననుదాత్తమును సూచింపబడును. ఉదాత్తమును సూచించుటకు చిహ్నము లేదు. పైఋగ్వేదరీతికిని, అథర్వణవాజసనేయి తైత్తిరీయ సంహితా తైత్తిరీయ బ్రాహ్మణారణ్యకములలోని రీతికిని విశేష భేదము లేదు. మైత్రాయణీసంహితలో నుదాత్తవర్ణమునకు పైన నిలువుగీతగీయబడియుండును. సామవేదమున స్వరభేదములు వర్ణములకు పైన సంఖ్యలచేకాని వర్ణములచేగాని సూచింపబడును. శతపథబ్రాహ్మణమున నొక్క యనుదాత్తము మాత్రము క్రింద నొక యడ్డుగీతచే సూచింపబడియుండును.

సంస్కృతభాషలో స్వరము నియతమైయుండ లేదు. అనగా పదమునందలి యక్షరముల స్వరూపమును పట్టికాని సంఖ్యనుపట్టికాని అపదమునందలి యేదోయొక యక్షరమే యెల్లప్పుడు నుదాత్తముగా నుచ్చరింపబడుచుండుటలేదు. సమాసప్రత్యయకార్యముల ననుసరించి పదమునందలి స్వరము మార్పును పొందుచుండెను. "అనుదాత్తం పదమేకవర్జమ్" అను రీతిగా పదములోని యొక్క యక్షరమే సాధారణముగా నుదాత్తమగుచుండును. తవై ప్రత్యయాంతపదములును, కొన్ని ద్వంద్వసమాసములును మాత్రము వేదమున రెండుదాత్తస్వరములను కలవిగానున్నవి. ఉ॥ ఏతవై, అపభరతవై; మిత్రావరుణా, ద్యావాపృథివీ. అనంత్యోదాత్తమగు పదము ప్లుతముగా నుచ్చరింపబడినప్పుడు తుదిప్లుతముకూడ నుదాత్తమగుచుండును కనుక రెండుదాత్తవర్ణములుకల పదమగును. బ్రాహ్మణములలో వావాయనునవ్యయములలోని రెండు వర్ణములు నుదాత్తముగానే యుచ్చరింపవలసి యున్నది.

వాక్యమునందలి స్థానమునుబట్టి పదస్వరము మార్పునుపొందుట మనభాషయందు సామాన్యముగా కనబడుటలేదు. కాని వాక్యమధ్యస్థమగు సంబోధక పదమును, స్వతంత్రవాక్యములోని క్రియాపదమును ఎల్లప్పుడును అనుదాత్తముగానుండును. ఉదా—నకిరింద్రత్వదుత్తరో, త్వమగ్నే వ్రతపాసి; అగ్నిందూతం వృణీమహే,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అస్మే ఇంద్రావరుణా శర్మ యచ్ఛతమ్-ఈక్రింద నుదాహరింపబడిన పదములు వాక్యమున నెల్లప్పుడును అనుదాత్తములుగానే యుండును. ఉదా. సర్వనామములు: మా, మే, నౌ, నః; త్వా, తే, వామ్, వః; త్వ; సమ. అవ్యయములు: చ, వా, ఉ, స్మ, ఇవ, చిద్, స్విద్, హ; కమ్, ఘ, భల, సమహ, ఈమ్, సీమ్.

సంస్కృతభాషాపదములలో (వేదములనుపట్టియు వైయాకరణుల యనుశాసనమునుపట్టియు) నేయేవర్ణములుదాత్తము లగుచున్నవో, మాతృభాషా పదములలో కూడ నాయావర్ణములే యుదాత్తములుగా నుచ్చరింపబడుచుండిన వనుటకు నిదర్శనములు కలవు. సంస్కృతమునందును 'బాల్టోస్లేవోనిక్, జర్మానిక్' భాషలయందును స్వరము నియతముగా నుండలేదు. అందువలన 'ఇండో-యూరపియన్' మాతృభాషలో కూడ నిట్లే స్వర మనియతముగా నుండెనని యూహించుచున్నారు. 'ఇండో-యూరపియన్' మాతృభాషలో స్వరవియుక్తములగు నచ్చులు లోపించుచుండినవి. అందుచే నాభాషప్రాథమికావస్థలో నిఃశ్వాసదార్ఢ్యము ననుసరించిన స్వరము కలిగియుండినట్లు భాషాశాస్త్రజ్ఞు లూహించుచున్నారు. సంస్కృతమునందును 'గ్రీకు' భాషయందును స్వరము కంఠధ్వని యుచ్చత్వముతో సంబంధించియుండుటచే మాతృభాషలో దాని యంత్యదశయందు తత్పూర్వమందుండు స్వరము మారి ఇట్టి స్వరము వ్యవహారములోనికి వచ్చినదని భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడి యున్నారు. మరియు సంస్కృతమువలెనే మాతృభాషలో కూడ కొన్ని సర్వనామములును, అవ్యయములును, వాక్యమధ్యస్థములగు సంబోధకపదములును, ప్రధానవాక్యములోని క్రియాపదమును ఉదాత్తస్వరరహితములుగానుండినట్లును వారూహించియున్నారు.

---

## హేమంతస్వాగతము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీలతోడ లసత్కలా శ్రీలతోడ-భరతఖండంబు తలయెత్తి తిరుగఁ గుతుక
పడుమహాత్ము హేమంత ప్రభాతలక్ష్మి-యడుగుచున్నది ప్రేమతో స్వాగతంబు.

అతులమహోన్నతిన్ మఱచి యార్తి మునింగినదై యధః (?)
పతనము నందుచున్న మన భారతభూతల ముద్ధరింప సం
తతకృషి సల్పుచుండెడి స్వధర్మపరున్ గనఁగల్గె నంచు స్వా
గత మడుగున్ ప్రభాతములు గాంధిమహాత్ముని హైమనంబునన్.

సేవ యొనర్చుచున్ జగము సేమమె సేమముగాఁ దలంచు నిన్
బావనుఁ గన్నులారఁ గను భాగ్యము నేఁటికిఁ బండెనంచు మో
దావృత భావమున్ దెలుపు నట్లుగ హైమనవాసరాళి దీ
పావిధి నెల్లచో మకర సంక్రమణోత్సవశాలి యయ్యెడిన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్ణింపబడియున్నవి. సూ—ఉచ్చై రుదాత్తః, నీచైరనుదాత్తః,సమాహారః స్వరితః. సామాన్యముగా నుదాత్తానుదాత్తములగు నచ్చులకు సంధి జరిగినప్పుడు స్వరితస్వరవర్ణ మేర్పడుచుండును. ఉదాత్తవర్ణమునకు పరమందుండు వర్ణముకూడ స్వరితస్వరముతో నుచ్చరింపబడుచుండును. కాని దీనికి యుదాత్త వర్ణముపరముగా నున్నయెడల నిది యనుదాత్తమేయగును.

ఉ॥ తేన, తేవ కాని తేన్ర తే, తే చ స్వర్.
సంధివశమున నేర్పడిన స్వరితము నాలుగు విధములని ప్రాతిశాఖ్యలలో చెప్పబడియున్నది.

(౧) ఉదాత్తానుదాత్త స్వరములకు యణాదేశ సంధివలన నేర్పడిన వర్ణము ప్రకృతిప్రత్యయసంహితా సంబంధమైనయెడల జాత్యస్వరితమనియు, తదితరమైనయెడల క్షైప్రస్వరితమనియు వ్యవహరింపబడుచున్నది. ఉదా—క్వ, స్వర్, న్యక్, కన్యా, నద్యః, తన్వ (జాత్యము); వ్యాప్త, అప్స్వన్తర్ (క్షైప్రము). జాత్యమునకు నిత్యమని నామాంతరము కలదు. వేదమున సాధారణముగా పైసంధులు విడదీసి చదువవలసియుండును; కొన్ని గ్రంథములలో నట్లే వ్రాయబడికూడ నుండును.

(౨) ఉదాత్తా నుదాత్తస్వరములకు సవర్ణదీర్ఘ సంధిచేగాని, గుణసంధిచేగాని సిద్ధించినవర్ణము ప్రశ్లిష్ట స్వరితమని వ్యవహరింపబడుచున్నది. ఉదా—దివీవ,సూద్గాతా, నైవాశ్నీయాత్.

(3) ఉదాత్తములగు ఏకారౌకారములకు పరమున అనుదాత్తమగు అకారము లోపించునపుడు పూర్వమందుండు ఏకారౌకారములు అభినిహితస్వరితము లనబడుచున్నవి. ఉ॥ తేఽబ్రువన్, సోఽబ్రవీత్.

చతుర్వేదముల సంహితాభాగములలోను, తైత్తిరీయశతపథబ్రాహ్మణములలోను, తైత్తిరీయైతరేయారణ్యకములలోను, సుపర్ణాధ్యాయమను గ్రంథమునను మాత్రము స్వరము సూచింపబడియున్నది. పైగ్రంథములలో స్వరభేదములను సూచించు రీతులకు కొంతభేదముకలదు. ఋగ్వేదమున వర్ణముపై నొక నిలువుగీతచే స్వరితమును, క్రిందనొక యడ్డుగీతచే ననుదాత్తమును సూచింపబడును. ఉదాత్తమును సూచించుటకు చిహ్నములేదు. పైఋగ్వేదరీతికిని, అథర్వణవాజసనేయి తైత్తిరీయ సంహితా తైత్తిరీయ బ్రాహ్మణారణ్యకములలోని రీతికిని విశేషభేదము లేదు. మైత్రాయణీసంహితలో నుదాత్తవర్ణమునకు పైన నిలువుగీతగీయబడియుండును. సామవేదమున స్వరభేదములు వర్ణములకు పైన సంఖ్యలచేకాని వర్ణములచేగాని సూచింపబడును. శతపథబ్రాహ్మణమున నొక్క యుదాత్తము మాత్రము క్రింద నొక యడ్డుగీతచే సూచింపబడియుండును.

సంస్కృతభాషలో స్వరము నియతమైయుండలేదు. అనగా పదమునందలి యక్షరముల స్వరూపమును పట్టికాని సంఖ్యనుపట్టికాని అపదమునందలి యేదోయొక యక్షరమే యెల్లప్పుడు నుదాత్తముగా నుచ్చరింపబడుచుండుటలేదు. సమాసప్రత్యయకార్యముల ననుసరించి పదమునందలి స్వరము మార్పును పొందుచుండెను. "అనుదాత్తం పదమేకవర్జమ్" అను రీతిగా పదములోని యొక్క యక్షరమే సాధారణముగా నుదాత్తమగుచుండును. తవైప్రత్యయాంతపదములును, కొన్ని ద్వంద్వసమాసములును మాత్రము వేదమున రెండుదాత్తస్వరములను కలవిగానున్నవి. ఉ॥ ఏతవై, అపభరతవై; మిత్రావరుణా, ద్యావాపృథివీ. అనంత్యోదాత్తమగు పదము ప్లుతముగా నుచ్చరింపబడినప్పుడు తుదిప్లుతముకూడ నుదాత్తమగుచుండును కనుక రెండుదాత్తవర్ణములుకల పదమగును. బ్రాహ్మణములలో వావాయనునవ్యయములలోని రెండు వర్ణములు నుదాత్తముగానే యుచ్చరింపవలసి యున్నది.

వాక్యమునందలి స్థానమునుబట్టి పదస్వరము మార్పునుపొందుట మనభాషయందు సామాన్యముగా కనబడుటలేదు. కాని వాక్యమధ్యస్థమగు సంబోధక పదమును, స్వతంత్రవాక్యములోని క్రియాపదమును ఎల్లప్పుడును అనుదాత్తముగానుండును. ఉదా—నకిరింద్రత్వదుత్తరో,త్వమగ్నే వ్రతపాసి; అగ్నిందూతం వృణీమహే,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అస్మే ఇంద్రావరుణా శర్మ యచ్ఛతమ్-ఈక్రింద నుదాహరింపబడిన పదములు వాక్యమున నెల్లప్పుడును అనుదాత్తములుగానే యుండును. ఉదా. సర్వనామములు: మా, మే, నౌ, నః; త్వా, తే, వామ్, వః; త్వ; సమ. అవ్యయములు: చ, వా, ఉ, స్మ, ఇవ, చిద్, స్విద్, హ; కమ్, ఘ, భల, సమహ, ఈమ్, సీమ్.

సంస్కృతభాషాపదములలో (వేదములనుపట్టియు వైయాకరణుల యనుశాసనమునుపట్టియు) నేయేవర్ణము లుదాత్తము లగుచున్నవో, మాతృభాషా పదములలో కూడ నాయావర్ణములే యుదాత్తములుగా నుచ్చరింపబడుచుండిన వనుటకు నిదర్శనములు కలవు. సంస్కృతమునందును 'బాల్టోస్లెవోనిక్, జర్మానిక్' భాషలయందును స్వరము నియతముగా నుండలేదు. అందువలన 'ఇండో-యూరపియన్' మాతృభాషలో కూడ నిట్లే స్వర మనియతముగా నుండెనని యూహించుచున్నారు. 'ఇండో-యూరపియన్' మాతృభాషలో స్వరవియుక్తములగు నచ్చులు లోపించుచుండినవి. అందుచే నాభాష ప్రాథమికావస్థలో నిశ్శ్వాసదార్ఢ్యము ననుసరించిన స్వరమును కలిగియుండినట్లు భాషాశాస్త్రజ్ఞు లూహించుచున్నారు. సంస్కృతమునందును 'గ్రీకు' భాషయందును స్వరము కంఠధ్వని యుచ్చత్వముతో సంబంధించియుండుటచే మాతృభాషలో దాని యంత్యదశయందు తత్పూర్వమందుండు స్వరము మారి ఇట్టి స్వరము వ్యవహారములోనికి వచ్చినదని భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడి యున్నారు. మరియు సంస్కృతమువలెనే మాతృభాషలో కూడ కొన్ని సర్వనామములును, అవ్యయములును, వాక్యమధ్యస్థములగు సంబోధకపదములును, ప్రధానవాక్యములోని క్రియాపదమును ఉదాత్తస్వరరహితముగానుండినట్లును వారూహించియున్నారు.

---

## హేమంతస్వాగతము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీలతోడ లసత్కళా శ్రీలతోడ-భరతఖండంబు తలయెత్తి తిరుగఁ గుతుక
పడుమహాత్ము హేమంత ప్రభాతలక్ష్మి-యడుగుచున్నది ప్రేమతో స్వాగతంబు.

అతులమహోన్నతిఁ మఱచి యార్తి మునింగినదై యధః (?)
పతనము నందుచున్న మన భారతభూతల ముద్ధరింప సం
తతకృషి సల్పుచుండెడి స్వధర్మపరుఁ గనఁగల్గె నంచు స్వా
గత మడుగుఁ బ్రభాతములు గాంధిమహాత్ముని హైమనంబునఁ.

సేవ యొనర్చుచుఁ జగము సేమమె సేమముగాఁ దలంచు నిఁ
బావనుఁ గన్నులారఁ గను భాగ్యము నేఁటికిఁ బండెనంచు మో
దావృత భావముఁ దెలుపు నట్లుగ హైమనవాసరాళి దీ
క్షావిధి నెల్లచో మకర సంక్రమణోత్సవశాలి యయ్యెడిఁ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కడగండ్ల కిక్కయౌ కారాగృహంబును స్వర్గంబుగా మార్చివైచినావు
గోనెసంచులఁ బోలు రే నాటికోకలఁ జీనాంబరములుగాఁ జేసినావు
ముదుసలియవ్వల ముందటి రాటంబు మంచి సౌధముల కెక్కించి నావు
పల్లెలలోని నూల్ వడకు పనిఁ గొప్ప నాగరికముగ నొనర్చినావు
ధర్మపథ ముద్ధరించెడు తలఁపుతోడ-నవతరించిన యవతార మగుదు వీవు
బళిర! యంచు హేమంత ప్రభాతలక్ష్మి-యడుగు గాంధిమహాత్ముని స్వాగతంబు.

శ్రీ మీఱఁ సకల ప్రకారముల వాసికి మోసె నొక్కప్పు డీ
భూమిఁ భారతవర్ష మంద్రు; కలమై పోయెఁ సమస్తంబు ని
స్సీమ ప్రాభవవైభవోజ్జ్వలములై చెల్వారు దేశాంతర
క్షేమంబుల్ గని దేవిరించెడిని వాసిం బాసి నీజాతి యిం
కేమాడ్కిఁ దరిఁజేర్తువో కదవె గాంధీ, దివ్యతేజోనిధీ!

శ్రీమద్భరతభూమి చేయూఁత యొసంచు ఘనగుణపూర్ణ, స్వాగత మె నీకు!
కావు మటం చార్తు లౌవార లర్థించు కరుణాలవాల, స్వాగత మె నీకు!
గాఢతితిక్షాప్రకంపితత్రైలోక్య గంభీరభావ, స్వాగత మె నీకు!
సకలలోకక్షేమ సన్న్యస్తసంసార కల్మషదూర, స్వాగత మె నీకు!
ఐకమత్యప్రతిష్ఠాపనా ధ్వరవర-సంతతాచరణవ్రతానంత దీక్ష!
సర్వ సమభావపూర్ణ విశాలవీక్ష!-స్వాగతమటయ్య, పూజ్య ప్రశాంతిపక్ష!

తొలిజన్మమునఁ బూలతోఁ బత్తితో జన్మభూమి నోఁచిన గొప్పనోముపంట
జ్ఞానవైరాగ్యముల్ నాట్యముల్ సలుపంగఁ గావించుకొనిన రంగస్థలంబు
దీనరక్షణమహాదీక్షావ్రతంబు సంతతము వసించు రత్నాలమేడ
ధైర్యసారము దేవతాలోకమందుండి దిగివచ్చి నిలిచిన దివ్యవాపి
మానముద్రావిభూతికి మందిరంబు-కష్టముల కోర్చు పనికి నిక్కమగు నిక్క
గాంధి యని యొక్కరీతి లోకంబులెల్ల-గణన సేయు మహాత్మ, స్వాగత మె నీకు!

జయతి మహాత్మా గాంధిః, జయతితరాం తంతువాయ జీవాతుః,
జయతి కరుణాలవాలః, జయతి మహాభారతైక్య సంధాతా.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# 'విస్మృతసంస్కృతకావ్యావళి—'

## ౧. కాళిదాసుని 'కున్తలేశ్వర దౌత్యము'

యియ్యాణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు గారు

(అధ్యక్షులు, ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు, విజయనగరము)

గీర్వాణాలంకార రత్నాకరమును మథించినయెడల ననేకానర్ఘరత్నములు బయలువెడలుచుండును. తన ప్రసన్నకవితావైభవముచే ఖండాతరవాసులంగూడ నాశ్చర్యసాగరమున ముంచి, యానందాబ్ధినోలలాడించిన కాళిదాసకవి సార్వభౌముఁడు ఋతుసంహారము, కుమారసంభవము, మేఘదూత, రఘువంశము నను కావ్యములను మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయాభిజ్ఞాన శాకుంతలములను, నాటకములను రచించెనని ముక్తకంఠముగ సకల విద్వల్లోకము నంగీకరించెను. ఈ పుంభావ భారతి కీర్తివాహకంబులగు నీ కావ్యనాటక రాజహంసములు ఖండాంతరములఁగూడ స్వైరవిహార మొనరించి తద్యశోలతల దశదిశల వ్యాపింపఁజేయుటచే నీ కవికులగురూదత్తమయములగు సర్వాంకషగవేషణాత్మక గ్రంథములు బహుభాషలలోఁ బ్రకటితముగ రచింపఁబడియున్నవి. జిజ్ఞాసూపయోగార్థమీనడుమఁబ్రకటింపఁబడిన యొండురెండు గ్రంథముల సూచించెద.

(i) 'కాళిదాస జన్మస్థలవిచారము' 'The Birth place of Kalidasa' by Prof: Pandita Lacchmi Dharkalla, Sastri,' M.A, M.O. L., Professor of Sanskrit and Hindi, St. Stephen's College, Delhi. 'The Delhi University Publications. No. 1., 1926.

(ii) 'కాళిదాసవిక్రమాదిత్యులు' '[Kalidasa and Vikramaditya' (Historical & Literary) 575 p.p. By Prof: S. C. De., M.A., I,E.S, Rtd., 1¾, Ray Street, Elgin Rd. P. O. Calcutta]

కాళిదాసమహాకవి విక్రమాదిత్య యశోఘన సారసురభీకృతముగఁ 'కున్తలేశ్వరదౌత్యము'ను నొక కావ్యమును రచించెనని గ్రాంథికోదాహరణముల వలనఁ దెలియుచున్నది. కాని "కాళిదాసునివంటి మహాకవి విక్రమాదిత్యుని యట్టి రాజేంద్రుని కీర్తి వెలయింపఁజేసిన 'కుంతలేశ్వరదౌత్య'మను కావ్యము కేవల మనాదరముచే నదృశ్యమయ్యెఁ గదా!"

ప్రకృతోపయుక్తములగు బిల్హణమహాకవిసూక్తుల నిట నుల్లేఖింపకుండుట దోషమేమో!

శ్లో. కించారుచారిత్రవిలాసశూన్యాః
కుర్వన్తి భూపాః; కవిసంగ్రహేణ;
కింజాతు గుఞ్జాఫలభూషణానాం
సువర్ణకారేణ వనేచరాణామ్. ౨౫

శ్లో. పృథ్వీపతేః సన్తి న యస్య పార్శ్వే
కవీశ్వరాస్తస్య కుతో యశాంసి;
భూపాః కియన్తో న బభూవురుర్వ్యాం
జానాతి నామాపి నకోఽపి తేషామ్ ౨౬.

శ్లో. లఙ్కాపతేః సంకుచితం యశో య
ద్యత్కీర్తిపాత్రం రఘురాజపుత్రః;
ససర్వ ఏవాదికవేః ప్రభావో,
న కోపనీయాః కవయః క్షితీశైః. ౨౭.

శ్లో. గిరాం ప్రవృత్తిర్మమ నీరసాపి
మాన్యా భవిత్రీ నృపతేశ్చరిత్రైః;
కేవా నశుష్కం మృదమభ్రసిన్ధు
సమ్భూనినీం మూర్ధని ధారయన్తి. ౨౮.

—విక్రమాఙ్కదేవచరిత్రమ్ ౧. సర్గః.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజలాఞ్ఛనమని యెంచియో, లేక తమయశో లతలకుఁ గావ్యకల్పభూజము లాలంబములనియో రాజులు కవికోకిలల నాదరించి స్వవిజయప్రశస్తి చరితాత్మకమగు వాని గానామృతమును వీనులారఁ గ్రోలుచుండిరి. కొన్నియెడలఁ బ్రభువులు భగవచ్చరితాత్మక కావ్యముల రచియింపించి, తన్ముఖాలంకారముగాఁ దమవంశావళు లం జొప్పించి నూది లోదార మన్నటులు, తామజరామరకీర్తి కళాకలాపులై విలసిల్లుచుండిరి. ఇహపరసాధకముగాని కేవల రాజగాథాకావ్యముల నెవఁడు పఠించును. కొందఱు ప్రసన్నకవీన్ద్రులు క్షుద్రవసుధాధిప వర్ణనా పంకదూషితమగు తమరసమును శౌరికథా సుధారసముచే శోధింపఁజొచ్చిరి.

'అసత్కీర్తనకాన్తార పరివర్తనపాంసులామ్,
వాచంశౌరికథాలాప గంగయైవపునీమహే.'

ప్రాచ్యవిద్యాప్రౌఢ సరస్వతులగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రిట్టులు వ్రాసియున్నారు:—సకల ధర్మాధర్మ విచారక్షమంబగు భారతంబును, జన్మతారకమగు భగవచ్చరిత్ర నిబన్ధనంబగు భాగవత రామాయణాది ప్రౌఢగ్రంథజాలంబును నొక్కపురుషాయువునకుఁ జాలినంతయుండ నున్మత్తచేష్టితపరంపరాప్రతిమాన మగు రాజగాథావళిఁ దత్కాలమునందక్కఁ జదువువారు సాధారణముగా నుండరు. మఱియు వైరిరాజన్యులు ప్రబలిన చోఁ దమచేవిజితులైనవారి కథలువిని వాని స్థిరీకరింప నొల్లరు. * * * రాజులు విద్వత్సభల నడపిపోషించుచున్నందున విద్యాసంచయముతో వారి ప్రశస్తులును గాలసముద్రమున భగ్ననౌకాంగములవలె నచ్చటచ్చటఁ గొట్టుకొని తీరాంతరముఁ జేరుచున్నవి. ఇట్టి రాజగాథాకావ్యములు ప్రౌఢకవితామనోజ్ఞములు గాకుండెనేని . యొక్క పురుషాయుః పరిమితకాలమైన నిలువవు. ప్రౌఢకావ్యములు నిలిచినను కేవలకావ్యవినోదులే చదివి కరుణాద్భుత శమాదిమనోధర్మముల క్షణకాల ముద్రిక్తులై యానందింతురు. కల్పనాకథారమణీయమగు 'కాదంబరి' నైనఁ జదువుదురుగాని, హర్షవర్ధనుని కీర్తివిస్తారకమగు హర్షచరితమును గవితారసము నకైనఁ జదువరు. బిల్హణునికీర్తి చోరశృంగార గాథారూపమున వెలయుచున్నదే కాని యతని 'విక్రమాంకదేవ చరిత' మించుక రసభరితమైనను జదువనొల్లరు. పరిమళకాళిదాస బిరుదాంకితుని 'నవసాహసాంక చరితము' ప్రసన్నకవితా వల్లభమయ్యుఁ బఠించువారు లేరు. ఇఁక 'శూద్రకచరిత్ర', 'శాతకర్ణహరణము', 'అశ్మకవంశము', 'దిలీపవంశము' మొదలగు కావ్యరత్నములు సహితము నష్టములగుట కేవలరాజగాథాప్రలాపములగుటచే నాత్మసంస్కారకములు, విశ్రాంతచింతా వినోదనములు, తత్త్వవిచారకములుఁ గాకపోవుటచేత నే యని యూహింపఁదగును. అట్టి రాజగాథాశల్యములు లభించునేని దేశచరిత్ర నిర్మాణశిల్పుల కత్యంతపరితోషకరములు గావచ్చును."

—'పుష్పాంజలి'—'కాళకళభకవి'

(భారతి. ౫ సంపు. ౨ సంచి. ౧౯౩ పు. ఫిబ్రవరి ౧౯౨౮; ప్రభవ—మాఘమాసము.)

మఱియుఁ గవిప్రభువుల వైభవమన్యోన్యాశ్రితమనియు నొకకవి నుడివియున్నాఁడు:

శ్లో. మణినావలయం వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః;
కవినాచ విభు ర్విభునా చకవిః
కవినావిభునాచ విభాతిసభా.

ఇఁకఁ బ్రాసంగికమును వదలి ప్రకృత 'కున్తలేశ్వరదౌత్య' విచారమునకుఁ గడంగుదము. వ్యాసదాస బిరుదలాంఛనుఁడును బహుగ్రంథ నిర్మాతయు నగు క్షేమేన్ద్ర కవీన్ద్రుఁడు "ఔచిత్య విచారచర్చ" ('కావ్యమాల' ౧ గుచ్ఛకము. ౧౩౯ పు) లోఁ గాళిదాసుని 'కున్తేశ్వరదౌత్యము' నుండి యొకశ్లోకము నుల్లేఖించియున్నాఁడు.

"అధికరణౌచిత్యం యథా కున్తేశ్వరదౌత్యే — కాళిదాసస్య:—

శ్లో. ఇహనివసతి మేరుః శేఖరః క్ష్మాధరాణా
మిహవినిహితభారాః సాగరాః సప్తచాన్యే,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇహమహిపతి భోగస్తస్య విభ్రాజ్యమానం
ధరణితలమిహైవ స్థాన మస్మద్విధానామ్.

పిమ్మట క్షేమేన్ద్రుఁ డీశ్లోకమునందలి ‘యధికరణౌచిత్యము’ నిట్టులు వివరించెను.

“అత్రమహారాజ దూతోఽపి సామన్తాస్థానే స్వప్రభు సముచిత గౌరవ పూజార్హ మాసన మనాసాద్య కార్యవశేన భూమావేవోపవిష్టః ప్రాగల్భ్య గామ్భీర్యై శ్వైవంబ్రూతే: యథాఽస్మద్విధానాం వసుధాతల ఏవ భుజగపతి భోగస్తస్య ప్రాగ్భారనిష్కమ్పే ధరాసనే స్థానం యుక్తం; యస్మాదిహైవ మేరు రచలచక్రవర్తీ సముపవిష్టః; సప్తమహాబ్ధయశ్చ; తత్తుల్యతైవాస్మాకమిత్యౌచిత్య మధికరణపద సంబద్ధమేవ.”

ఇటుఁ “గున్తలేశ్వర దౌత్యము”నటకుఁ ‘గున్తేశ్వర దౌత్యము’ను లకారలోప పాఠము ప్రామాదికము.

కాళిదాస మహాకవి మహారాజదూతయై నప్పటికి సామంత ప్రభువగు కున్తలేశ్వరుఁడు స్వప్రభు సముచిత గౌరవ పూజార్హాసనము నొసఁగకపోఁగాఁ గార్యార్థియగు కాళిదాసుఁడు ప్రాగల్భ్య గాంభీర్యముగా “అచల చక్రవర్తియగు మేరువునకు, సప్తమహాసముద్రములకు వసుధాతలమే స్థానము. అచలత్వ గాంభీర్యములఁ దత్తుల్యుఁడనగు నాకును భుజగపతి భోగస్తమ్భ ప్రాగ్భార నిష్కమ్పధరాసనమే సముచితస్థాన” మని నుడివి వసుధాతలముననే యుపవిష్టుఁడాయెను.

మఱియు దృఢవ్యుత్పత్తి సంపాదన క్షమములగు సాహిత్యాలంకారగ్రంథముల రచించిన రాజకవీశ్వరుఁడగు భోజదేవుని ‘శృంగారప్రకాశము’లోఁ ‘గున్తలేశ్వర దౌత్యము’లోని విక్రమాదిత్య కాళిదాస సంభాషణాత్మకమగు నొక శ్లోకము గాన వచ్చుచున్నది:—

“కాళిదాసః ‘కింకున్తలేశ్వరః కరోతి’ ఇతి విక్రమాదిత్యేన పృష్ట ఉక్తవాన్:—

శ్లో. అసకలహసితత్వాత్ క్షాలితా నీవ కాన్త్యా
ముకులితనయనత్వా ద్వ్యక్త కర్ణోత్పలాని;
పిబతిమధుసుగన్ధీ న్యాననాని ప్రియాణాం
త్వయి వినిహితభారః కున్తలానా మధీశః.

ఇద మేవోహయిత్వా విక్రమాదిత్యః ప్రత్యువాచ:—

పిబతు మధుసుగన్ధీ న్యానననాని ప్రియాణాం
మయి వినిహితభారః కున్తలానా మధీశః.”

—శృంగార ప్రకాశము (viii సాపేక్ష శబ్దశబ్దశక్తి ప్రకాశము)

[ఈయాకరము శ్రీ యదుగిరియతిరాజ సంపత్కుమార రామానుజ మునిప్రకాశిత (1926 సంవత్సరమున) యగు శ్రీభోజదేవుని ‘శృంగార ప్రకాశము’లోని, 22, 23, 24 ప్రకాశాత్మకమగు ప్రథమభాగ ప్రతికనుండి స్వీకరింపబడినది.]

(చన్ద్రగుప్త) విక్రమాదిత్యుఁడు కుంతలేశ్వరుని సంస్థానమునుండి యరుదెంచిన కాళిదాసుని గుంతలేశ్వరుని యోగక్షేమములం గూర్చి ప్రశ్నించెను. అందులకుఁ గాళిదాసుఁడు:—

“భువనభారము నీయందునునిచి కున్తలేశ్వరుఁడు ప్రియామధురాధర సుధాధారల ననవరతముఁ గ్రోలుచున్నాఁడ”ని నుడివెను. పై శ్లోకమునువిని విక్రమాదిత్యుఁ డమందానంద తుందిల హృదయారవిందుఁడై (కాళిదాస శ్లోకములోని తృతీయ తురీయ పాదముల మొదటి పదముల ‘పిబతు’, ‘మయి’ అనిమార్చి, ‘నాయందు భువనభారమునునిచి కున్తలేశ్వరుని సంతతము ప్రియామధురాధరోదిత సుధారసధారలఁ జొక్కనిమ్మ’ని కాళిదాసునకుఁ బ్రత్యుత్తర మొసంగెను.

బాలకవి కవిరాజ బిరుదభాజియగు రాజశేఖరుని ‘కావ్యమీమాంస’లో (xi అధ్యాయమున, 60–61 పు.) శబ్దహరణసమాలోచనావసరమున నీశ్లోక మొసఁగఁబడినది

“పాదైక దేశగ్రహణ మపిపాదైక దేశోపలక్షణ పరమ్ యథా:—‘అసకలే’ త్యాది.

యథాచోత్తరార్థే ‘పిబత్వి’ త్యాది

రాజశేఖరుఁడు (880—920 A. D.) భోజునికంటెఁ బ్రాక్తనుఁడు. పై యనుసన్ధానావసరమున రాజ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శేఖరుని గ్రన్థములోఁ గాళిదాస విక్రమాదిత్యుల నామము లొసఁగఁబడలేదు. పరంపరాగతమగు నైతిహ్యమునే రాజశేఖర భోజదేవులు గ్రన్థస్థముం జేసియుండిరి.

'కున్తలేశ్వర దౌత్యము' కవి వృత్తాన్తసూచకముగాఁ గానవచ్చెడిని. 'సేతుబన్ధ' ప్రబన్ధప్రణేతకుఁ గున్తలేశ్వరుఁడను నామాన్తరము గలదు. సేతుబన్ధ నిర్మాణమునఁ బ్రవరసేనునకుఁ గాళిదాసుఁడు సాహాయ్యము చేసెనని కింవదన్తి గలదు. పాశ్చాత్యవిద్వద్వతంసుఁడగు ఎ. బెరిడేల్ కీత్ (D. C. L.;D. Litt) మహాశయుఁడు తన "సంస్కృత సారస్వత చరిత్రము"లో నిట్టులు వ్రాసియున్నాఁడు:—

"Kalidasa prefers to hint at the greatness of the Guptas in the 'Raghuvamsa' rather than describe their deeds as sober history, and it may be true, as the legend insists, that the 'Setubandha' was written indirectly to celebrate the building of a bridge of boats across the Vitasta by king Pravarasena of Kashmir." [This may be thought to favour the view that thepoem—Setubandha—was Kalidasa's, written for Pravarasena"]

Dr. A. B. Keith's 'Classical Sanskr'it Literature'. P. 61.

ఈక్రింది వాక్యములుగూడఁ బ్రకృతోపయుక్తములు.

Prof. S. V. Venkateswara of the Mysore University, opines in his scholarly work "Indian Culture Through the Ages" (Vol. I. 'Education of the Propagation of Culture'—1928.)

"In the SETUBANDHA MAHAKAVYA of Pravarasena we have it stated that the poem was composed by Kalidasa, under the direction of Pravarasena. * * This Pravarasena was apparently the Vakata prince who was related to Chandragupta II Vikramaditya by marriage"—P. 216.

"State patronage of learning did not yet degrade the scholars as a class, though it made the Court, rather than the forest, the resort of men of culture. Individual instances of royal plagiarism are not proved in Sanskrit Literature. It is wrong to regard Kalidasa as fathering his work on Pravarasena, as the SETUBANDHA MAHAKAVYA clearly states at the end of every chapter that it was planned by the king and perfected by the poet"— P. 219—20.

ఈ విషయములన్నియుఁ గాళిదాస ప్రవరసేనుల కాలనిర్ణయమునకు విశేషోపకారకములు కాఁగలవు. 'కున్తలేశ్వర దౌత్యము' సూర్యాలోకముం బడసి కవిలోకము నెప్పు డానందార్ణవమున డోలాయమానము గావించునో!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## జిజాబాయి దీవెన

జి. జాషువకవి గారు

అన్నా! శాత్రవగర్భభేదనము సేయ న్నిన్ను వెన్నాడి వ
చ్చు న్నాతల్లి భవాని నీకరకు విచ్చుంగత్తిపై నుండు ధా
త్రి న్నాదివ్యపతివ్రతాత్వమున న్వ్యర్థీభూత మౌఁగాక నీ
యన్నం జంపిన వాని దోర్బలము పుత్రా! గెల్పు నీదే సుమీ!

వైరినెత్తురుబొట్టు వదనాబ్జమునఁ గ్రాల ముదమారఁ దిరిగి వచ్చెదవు గాక
తినిపించెదవు గాక యినుపకత్తుల కీవు ముదురుకందనగాయ భోజనంబు
త్రావించెదవు గాక దండిబల్లెములకుఁ బరులక్రొవ్వేఁడినెత్తురుల తేనె
కీలించెదవు గాక గెలుపుజెండాపూలు కంచుకోటలమస్తకములమీఁద
స్వర్గమున నుండి యన్న శంభాజి నీకుఁ-గుసుమకింజల్కవర్షంబుఁ గురియుఁగాక
భరతమాతృక మోదబాష్పములు విడిచి-ప్రేమ నిను దెచ్చి నాకు నర్పించుఁగాక!

నీయది సింహవాహనము, నీకరవాలము శంభురాణి, దీ
ర్ఘాయువు నీకు నాసలిపి నట్టినిరంతర పూజనంబు; నీ
దాయల గర్భపిండములు ధారుణిఁగూల్చి నటింపుమన్న గాం
గేయుఁడవై, కిరీటివయి గీష్పతికన్నులు కోరగింపఁగన్.

(శివాజీ ప్రబంధమునుండి)

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వసురాయ చాటుప్రబంధము

బండారు తమ్మయ్య గారు

ఉ. భావచమత్కృతుల్ ప్రకృతి
భవ్యవిలాస మనోజ్ఞ వర్ణనల్
ధీవరసత్ప్రశంసలు సు
ధీనుతమానితగోత్తమాంశముల్
వావిరిఁగూర్చి చాటువుల
వారితసంఖ్య రచించి సవ్యశః
శ్రీ విలసిల్లు ప్రౌఢకవి
శేఖరు నెంతు వసుప్రథాంకితున్.

దేశభాషలందు లెస్సయని పేరుమోసి తీరుతీయములు గలిగి వాసికెక్కిన మన తెలుంగుబాస తీయందనము, తెలుఁగుఁ గవీశ్వరుల ప్రబంధరచనమున నే కాక చాటుపద్యరూపమునఁ గూడ మేలుగఁ జాలువాఱిన సంగతి పలువురెఱింగిన విఖ్యాతవిషయము. కాని యాచాటువులు గ్రంథరూపమును దాల్పమి లోకులవాకులయందు మాత్రమే శరణమునొంది యందుచే నానాఁటికిఁ బూర్తిగా ఖిలమయి యంతరించుటయో, పలువికృతులఁ గాంచుటయో జరగుచున్నది. మఱియు వాని యథార్థకర్తల నామములు సరిగాఁ దెలియు నాధారములు లేకుంట నొకరిచాటువులు మఱొకరి కారోపితములయి వాని వలనఁ గలుగు కీర్త్యపకీర్తు లాయితరులఁ జేరుటకుఁగూడ నవకాశము కలుగుచున్నది. ఇట్టి వ్యవస్థలు గలుగకుండ నెవరి చాటువులనువారే వారి జీవితకాలములో గ్రంథరూపమున సంధానించుతలంపు పూర్వకవుల కేరికిఁ గలిగి నట్లు కానరాదు. గీర్వాణకవులలో జగన్నాథ పండితరాయలు మాత్రము వేర్వేఱు సమయములఁ గూర్పఁబడిన తన చాటువులను భామినీవిలాసనామక మంజూషయందు సంతరించి తన యభిప్రాయము నాగ్రంథమం దిట్లు వ్యక్తీకరించి యున్నాఁడు.

క. లంజల కొడుకులు హరియిం
పంజాతురు మామకీనపద్యమణు లటం
చం జనియించిన శంకరున్
మంజూషను దీనిఁ జేసి నాఁడం జుండీ.

(ఆంధ్రీకరణము)

అంతరింపఁగా నిలిచిన పూర్వాంధ్ర కవీశ్వరుల చాటువులను జాలవఱకు సంతరించి, చాటుపద్య మణిమంజరి, చాటుపద్యరత్నాకరము నను గ్రంథముల నెలయించి, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, దీపాల పిచ్చయ్య శాస్త్రిగారును నీవిషయమున భాషాసేవయొనర్చి యాంధ్రుల కృతజ్ఞతా ప్రశంసలకుఁ బాత్రములైరి కాని యీపద్యములలోఁ గొన్ని వారు ప్రకటించిన ట్లాయాకవులవే యని యాఢిపఱుపఁదగిన యవకాశములు లేవు

వర్తమానాంధ్రకవీశ్వరులలో వసురాయఁ డొక పేరెన్నికగన్న కవి. ఆయన యాంధ్రీకరించిన వేణీసంహారాది నాటకములు, మేఘసందేశ భామినీవిలాసాది కావ్యములు, స్వతంత్రముగ రచించిన శ్రీసూక్తి వసుప్రకాశికాదిక నీతిగ్రంథములు, భక్తచింతామణ్యాది భగవద్భక్తి ప్రబోధక శతకములు నాంధ్రలోకము నలుదెసల వ్యాప్తినిగాంచి, సహృదయ హృదయారవిందముల వికసింపఁజేసి, కీర్తిగాంచుచున్నవి. ఈయన కవితయందలి గొప్ప గుణవిశేషము పదములకూర్పునం దాయన కలవడిన జిగిబిగి పెంపని చెప్పవచ్చును. సామాన్యకవులు పెద్దపెద్ద పద్యములలో నిముడ్పనేరని భావములను జిన్నపద్దెములందే రసోచితములగు పదములను బిగించి బిగించి కూర్చి వెలయింపనేర్చు విన్నాణమునం దీయన మిగుల జాణ.

క. లలిత పదహృద్య పద్యం
బులన కథార్థంబు ఘటిత పూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁగా
హాలసంధించిన విధంబు నమరఁగ వలయున్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుకవి బ్రహ్మసరసకవితానిర్మాణ విధాన లక్షణమున కాధునిక కృతులలో నీయన గ్రంథములు చాలవఱకు జక్కని లక్ష్యములు కాఁగలవని నాయభిప్రాయము. మఱియు నీతఁడు ప్రకృతిని ప్రేమించి యారాధించి తన్మయుండగు కవిసత్తముఁడు. కేవలము ప్రకృతినుండియే దృష్టాంతములఁ గైకొని రచించిన బహువిషయిక నీతివృత్తముల వెలయు శ్రీసూక్తి వసుప్రకాశిక మనితర సాధారణమగు నీయన యప్రమేయ ప్రతిభకు బ్రకృతి తత్త్వపరిశీలన పటిమకు నాదర్శకమగుచున్నది. ఈ దృశంబగు నీకవివరుని ప్రతిభాశక్తులను బరిగణించి గౌతాంధ్ర భారతీ తీర్థము "కవిశేఖర" బిరుదమున నీయనను బహూకరించి చరితార్థమగుట సంస్తవనీయము.

కాని వసురాయని ప్రతిభ కేవలమాంధ్రీకరణము, లంగును స్వవిరచిత గ్రంథములందును మాత్రమే నిబద్ధమై సంకుచితము కాలేదు. ప్రకృతి ప్రేమస్వరూపిణియగు నీయన వాణి బహురూపకములను ప్రకృతి విలాస రామణీయకములను గాంచినపుడు కలుగు తాత్కాలికానుభవములనో, యావేశములనో చాటురూపమున జాలువార్పక యెట్లుండఁ గలదు? ఈయనరచించిన చాటువు లసంఖ్యాకములు; పలువిషయములకు బ్రసక్తములు. ఆ చాటుధారల నప్పుడప్పుడు గ్రోలి యానందించువారిలో నేనొకఁడను. సమీపవర్తులగు పరిచితుల దెసఁగాని ప్రసరింపనేరని వసురాయ చాటుపద్య ప్రసవామోద మిప్పు డాంధ్రదేశము నలుదెసలఁ బ్రసరించు భాగ్యము వసురాయ ప్రాణసఖుండగు విశ్వసుందర ప్రభుని సదాక్షిణ్యసమీరణమునఁ గలిగినందుల కెంతయు సంతసించుచున్నాను వసురాయకృతములగు చాటువులు రమారమి పదిరెండువందలు 1925 సంవత్సరమున వసురాయ చాటు ప్రబంధమను పేరఁ బ్రశంసా, ప్రకృతి, ప్రాస్తావిక, ప్రకీర్ణక, స్వవిషయములను పంచప్రకరణములుగఁ బ్రవిభక్తమయి గ్రంథరూపమును దాల్చి ముద్రింపఁబడియున్నవి. లోకమున కాగ్రంథపరిచయమును గలిగించుటయే యీ వ్యాసోద్దేశము. ఆధునిక కవుల చాటువులు గ్రంథరూపమును దాల్చుట కిదియే మొదలని తలంతును. శ్రీపాద కృష్ణమూర్తికవి రాజుగారుకూడఁ దమ చాటువుల నిప్పుడు తమ వజ్రాయుధపత్రికలో శ్రీ కృష్ణకవి రాజీయ మను పేరఁ బ్రకటించుచున్నారు.

చాటుశబ్దమునకు మనోజ్ఞమని యర్థము. అట్లని కథా సంవిధానమునఁ గూర్పఁబడు గ్రంథస్థపద్యములలో మనోజ్ఞమయిన వానికిఁ జాటువు లనువ్యవహారము లేదు. ఏదేని కథనుగైకొని కవి గ్రంథరూపమున రచించు పద్యములలోని కన్న ననుభవ పూర్వకముగనో, యావేశమూలకముగనో, తాత్కాలిక ప్రసక్తవిషయములనుగూర్చి వెలార్చు ప్రాస్తావికపద్యములలో సాధారణముగా మనోజ్ఞత హెచ్చుగానుండును. కావున నట్టివానికే చాటువులను వ్యవహారము గలిగినది. ఈవిషయమున వసురాయఁడుగూడ

ఉ. నన్నయ తిక్కనాదిరసనల్
　　గురియించిన చాటుధార లీ
మన్నన నింకఁ బోలునను
　　మాత్రము తద్రసమబ్బదెందు హా!
జున్నులలోనఁ జిన్నిపువు
　　జున్నియయట్టులు పద్దియంబులన్
మిన్నలు చాటువుల్ రసస
　　మృద్ధి ననిర్వచనీయ మాధురిన్.

అని లిఖించి చాటువులకుఁ గల యనిర్వచనీయ మధురిమను బ్రశంసించినాఁడు.

భావసమున్నతియో, కల్పనాశిల్పమో, యర్థగౌరవమో మఱే గుణవిశేషమో లేనిదేసాధారణముగా వసురాయఁడు పద్యమును వ్రాయువాఁడుకాఁడు. ఆశుకవితావ్యాఘ్రదంష్ట్రికకీయన కవితా లతాంగి నెరనేయఁజాలఁడు.

శా. కబ్బం బల్లుదు నైన నాశుకవితో
　　గ్రవ్యాఘ్రీ దంష్ట్రిక కే
నబ్బబ్బా! కవితా లతాంగి నెరనే
　　యంజాల నానాఁటికిన్
జుబ్బంజూఱగ గోరసాదులిముకొం
　　చుంబెంచి యబ్బాలచే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుల్ల్సింతుర్ రసికాంతరంగముల బి
ట్టూరింతు విద్వాంసులర్.

అని యీయన ప్రతిన రచించు నదొక్కటయినను బద్య ము బుధజనాహ్లాదమునుగాంచి తీఱవలయును. అందుచే నాలస్యమయినను నతియత్నమున నేని గుణవిశేష భూషితములగు రసవత్తర పద్యరత్నములనేగాని సామాన్యపద్యముల నాయన రచింపనొల్లఁడు.

గీ. చిన్నవోవుఁ గవిత చెడి ముఖవర్ణంబు
బుధులు మెచ్చుకొనక పోయిరేని
కాన నాత్రపడక ఘనయత్నమునసల్ప
ననును గృతులు సరసు లౌననంగ.

అను పద్యమీయన యాశయమును వ్యక్తమొనర్చును. కావున నీగ్రంథమందలి పద్యములను గొన్నిటిని మాత్రమే యేర్చిచూపుట మిగిలిన వానియందలి రసమును గ్రహింపనేరక వాని నగౌరవపఱిచినట్లగు నేమోయని తలంపుచున్నాను. అందుచే గ్రంథపరిచయమునకయి నేనుదాహరించు కొలదిపద్దియములు స్థాలీపులాకన్యాయ గృహీతములని పాఠకమహాశయు లెఱుంగఁ బ్రార్థించెదను.

వసురాయఁడు బాల్యాదికము నెప్పటఁ గడపినను దన యిరువదవయేట ౧౮౭౮ సంవత్సరములో రాజమహేంద్రవరమున స్వల్పవేతనమున నాంధ్రోపాధ్యాయుఁడుగాఁ బ్రవేశించి యప్పటినుండి యప్పటనే క్రమక్రమాభివృద్ధిగాంచి స్థిరనివాస మేర్పఱిచికొని యున్నవాఁడు. కావున నాంధ్ర మహాభారతమునకు జన్మస్థానమై, యాంధ్రమహాజను లెల్లరకుఁ బూజ్యపదమయిన యీపురీమతల్లికిఁ బ్రసక్తములయిన విషయములెన్నియో మన వసురాయని చాటువుల కాశ్రయములయినవి. అందుచే నీ పట్టణమందలి గౌరవాతిశయములనుబట్టి కూడ నాంధ్ర మహాశయుల కీగ్రంథరాజ మెక్కుడగ నాదరింపదగి యున్నది. పీఠికయందలి గ్రంథకర్తృ వాక్యములఁగూడ నీసందర్భమున నుదాహరించుట యనవసరము కానేరదు.

"ఈ చాటుప్రబంధమునం దితరవిషయవినోదముల కంటెఁ బురాతనమును, బుణ్యాక్షేత్రమును లక్ష్మీ సరస్వతీ లాస్యరంగమునయిన యీ గౌతమీతీరరాజము హేంద్రవర నగర రాజమునకు సంబంధించిన విశేషము లెక్కుడుగా నెక్కొనియున్నవి. ఏనాఁడో యొకటి రెండుపద్యములు శ్రీనాథాదు లీపట్టణమును గుఱించి వ్రాసినవి యిప్పుడు చదువుకొనుచు సంతసించెదు నాంధ్రుల కీకాలమునను, భావికాలమునను గూడఁ దత్పురీ విశేషము లనేకములు దెలుపు నీచాటుప్రబంధ పద్యములు డెందముల కమందానంద సంధాయకములు కాక పోవని నాయాశయము."

ఇట్టి ప్రకృతి ననుసరించి యిందలి ప్రకరణములను గ్రమముగఁ బరామర్శించెదను.

## (1) ప్రశంసా ప్రకరణము

రవిలేని జగమెల్ల నంధకారమయము. కవిలేని జగత్తుకూడ నట్టిదే. అంతియేకాదు. మనపూర్వులు "రవి గాననిచోఁ గవిగాన నేర్చు"నని రవికంటెఁగూడఁ గవికి గౌరవస్థానము నొసంగియున్నారు. రవి కవులకుఁ గల సామ్యమునుగూర్చిన వసురాయని చాటువత్యంత మనోహరము:

చ. నవరస సృష్టిజేసి వద
నంబుల వాడుమదీర్చు గూఢమౌ
వివిధము లైన భావములు
వెల్లడిసేయుఁ బ్రబోధమిచ్చి కర్
గవఁ దొఱపుర్, బదంబులిడఁ
గానసు సందియముం దొలంచు, స
త్కవి రవిభాతి; నాతఁడెటుఁ
గల్గఁడు చీఁకటికావు యాకడర్.

మఱియు జీతముబత్తెము లక్కఱలేని జగదీశ్వరాస్థానపండితుఁడు కవి. సృష్టిరహస్యములఁ దెలియఁ గవి హృదయమకన్న వేఱుతాళపుఁ జెవిలేదు. అప్రయత్నముగ నవ్యక్తమధురముగ దేవుని సృష్టి విలాసములఁగాన మొనర్చు కోకిలరాజము కవిమానసము. కవి కోకిలములకుఁ గల సాధర్మ్యము ప్రకృతి సిద్ధమయినది. కావుననే ప్రథమకవియగు ప్రాచేతసుని "వందేవాల్మీకి కోకిలమ్" అని కీర్తించినారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. దేవుని సృష్టివిలాసము
కోవిదుఁడగు కవి గ్రహించి కొనియాడుఁ గృతిక్
మావుల చైత్రవికాసము
కోవెల కని చెవులు సొగియఁ గోయనిపూరుక్.

అని మనకవిగూడ నీభావమును బ్రకటించినాఁడు.

లోక సురుండాత్మమహిమ ప్రపంచమునకుఁ దెలియఁ బ్రదర్శించు నల్లబల్ల (Black-board) యఁట యాకాశమండలము.

గీ. నల్లబల్ల మీఁదఁ బిల్లలు నేర్చుకో
నయ్యవార్లి ఖింతు రక్కరంబు;
లాత్మమహిమ దెలియ నాకాశమండలం
బందు నింతు చుక్క లన్యయుండ!

జీవితమెల్ల నధ్యాపకవృత్తిలోఁ గడపిన కవి నిత్తమున కాకసమిట్లు గోచరించుటలో నబ్బుర మేమి?

ఆంధ్రకవులలోఁ గథావస్తువును గనులకుఁ గట్టినట్లు చిత్రించు సరసకవితా నిర్మాణ శక్తియందుఁ దిక్కనయు, భక్తిపారవశ్యమును గూర్చు రసవత్కవితయందుఁ బోతనయు నాంధ్రుల మన్ననలకుఁ బాత్రములగుచున్నారు. ఈ కవిద్వయమునుగూర్చి వసురాయఁ డొనర్చిన ప్రశంసాపూర్వక చాటువు లాంధ్రుల కవశ్యపఠనీయములు. అవి యిదివఱ కాంధ్రపత్రికా సంవత్సరాది సంచికలలోఁ బ్రకటితము లవుటచే నిం దుదాహరింపమానుచున్నాను.

ఆంధ్రకవితాపథమునందు ప్రత్యేక ప్రతిభాస్వాతంత్ర్యములఁ బ్రకటించిన కవివర్యుఁడు పింగళి సూరనార్యుఁడు. ఉపలబ్ధములయిన యీతని కృతులు మూఁడును భాషాప్రపంచములో వినూత్న పక్కిని వేర్వేఱు మార్గములఁ ద్రొక్కిన యప్రతిమ రత్నములు. ఈతనిని గూర్చిన ప్రశంసలు:

క. పింగళి సూరనఁ దలఁచి తె
లుంగు గవిత్ లాఁతివానిలో నెంచుట, యిం
చుం గొట్టికిన నోరను బెం
డుం గొటుకుటకాదె? వేయినుడు లేమిటికిక్.

గీ. ఇభవృషభవాహు లిర్వుర నేకచిత్ర
మగలిఖించిన మెప్పరే మెచ్చి నేర్పు?
రాఘవార్థంబుఁ బాండవార్థంబు, నొక్క
కబ్బమునఁ గూర్చు కవిప్రజ్ఞ గాదె శ్లాఘ్య.

ఆంధ్రభాషా పోషకుఁడయి యాంధ్రభోజుఁడని వినుతికెక్కిన శ్రీ కృష్ణదేవరాయలందు "రాయలు" శబ్దమన్వర్థమయినదను చాటు వెత్యంత శ్లాఘ్యతరము.

ఉ. శ్రీయుత కాళిదాసుఁడు వ
చించెను శంభు "యథార్థవర్ణమా
నేయన యందనన్య విష
యేశ్వర శబ్దము" టంచు నాంది; నిం
ద్రాయిత కృష్ణదేవ వసు
ధావరు నందగునట్టి శబ్దమే
"రాయ" లటంచుఁ బల్కు వసు
రాయఁడు హంపిని సాహితీసభక్.

మదరాసు ప్రాంతములందలి విద్యావ్యాప్తికి Rev. William Miller దొరగారివలె గోదావరీ మండలములోని హూణ విద్యావ్యాప్తికిఁ గారణభూతులయి పలువురు బి. యే. లను దయారుచేసి యఖండవిద్యా ప్రదాతలై వన్నెకెక్కిన Edward Parr Metcalfe దొరగారి కీర్తి చిరస్మరణీయము. వారినిగూర్చిన ప్రశంసలు కొన్ని:

పిన్న తలమీఁదిద యున్న బెద్దతలను
నదియె రబ్బరు కుళ్లాయి యమరినట్లు
పాఠశాలకు మను, శాస్త్రపాఠశాల
కిపుడు, మెట్కాఫె, ముఖ్యుఁడై యెసఁగునౌర.

సీ. జన్మ సధ్యమునందుఁ జదువు రాదనుకొన్న
జడులు శాస్త్ర బ్రహ్మచారులైరి
హీనులై బిచ్చంబు నెత్తంగవలయు వా
రురు వేతనంపు టుద్యోగులైరి
నూనూఁగు మీసాలురాని కుఱ్ఱలు మహా
జనసభా పూజ భాజనములయిరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాట నేర్పెలుఁగని మొహముద్దులు యుక్తి
యుక్తప్రసంగసం శక్తులైరి.
ప్రూరులై సాధుజనులను గోడుపఱచు
మంకువారలు బహుబుద్ధి వంతులయిరి
యౌర! మెట్కాఫు కరుణాళు డరుసుడెంచి
నేర్పివిద్యను గాలేజి నిలుపఁబట్టె.

క. దానముల, విద్యయుత్తమ
దానమునూ, భుక్తి ముక్తిదాయకమగుటం
దానిని దనియ నొసంగెడి
దానిని మెట్కాఫుఁబోలు దాతలుగలరే.

రాజమహేంద్రవరములోని Government Arts College లోనే Principals గాఁ బనిచేసి కీర్తికెక్కిన Middle Mast దొరగారిని Couldrey దొర గారిని గూర్చిన చాటువులొండు రెండు :

గీ. జాజిపూవుతావి సహకారమాధురి
చందమామ వెలుఁగుఁ జందనంపుఁ
జర్చ సరసకవిత చక్కని మామిడిల్
మాస్టు మంచితనము మఱపురావు.

చ. తపనుఁడు భూపుఁడాతని ప్ర
తాపముఁ దాలిచి కొంప అర్కకాం
తపుశిలలుంబలెక్ వెలిఁగె
దర్ ప్రకృతిం గతినాధికారులై
యుపకృతియే స్వభావముగ
నొప్పెడి కూల్డ్రియి యుత్తముండు ప్రి
న్సిపలయి రాణ్మహేంద్రపురి
శీతకరుం దలఁపించు సౌమ్యతక్.

గుణగ్రహణ పారీణత వసురాయని గుణవిశేషము లలో నొకటి. శ్రీవాడ్రేవు విశ్వసుందరప్రభుని పరిణయ సందర్భమున మన కవివరుఁ డొనర్చిన గాయకప్రశంస లందులకు నిదర్శనములు:

గీ. వెదురుఁ గ్రోవి లేదె? మృదులాంగుళులు లేవె?
మాకు లేదె వదనమారుతంబు.
జనుల కర్ణములను సంజీవరాయని
వట్టు లిడవుగాని యమృతరసము.

గీ. మూర్ఛపుచ్చుఁ బ్రాణములఁ దేర్చునహహా! యీ
[1]నాగరత్నః మింతి నామమునకు
సూరిజనులు! విశ్వసుందర పరిణయా
హూతు! లరసి యర్థయుగముఁ జెపుడ.

క. మాయించును గను అప్పల
హాయియనం జేయు నోళ్ల నట్టిట్టు లాఁచుక్
మాయాదలల .. మేనుల
గాయక కోటయ[2] ఫిడేలు కాశలి నహహా.

క. పదభూషణ సహితము శా
రద నీసభ విశ్వసుందరా! నటియించుం
గదరా! సంగవ[3] తుంబురు
మృదువీణాకలననాద మిషఁ జెవి సోఁగియన్.

శ్రీ రాజా మంత్రి ప్రెగ్గడ భుజంగరావు బహద్దరు జమీందారుగా రాంధ్రదేశమందలి విద్వత్ప్రభువులలో నొకరు. ఆయన యొనర్చిన పుత్రికా వివాహములు వైభవసమృద్ధియం దన్యోన్యాధికములయి వన్నె కెక్కినవి. పండిత కవియగు నీ ప్రభుఁ పుర్యుఁ డీపరిణయ సమయముల వెలయించిన విశేషములలోఁ బ్రత్యేక ప్రశంసార్హమయి నది కవీశ్వర సమ్మానమని తెలియవచ్చెడిని. ఈమహో త్సవములకు సంబంధించిన మన కవీశ్వరుని చాటువులు కొన్ని చిత్తగింపుఁడు:

శా. మంత్రి ప్రెగ్గడ వంశదుగ్ధజలధిక్
మాణిక్య మార్వేల స
త్తంత్రావాప సమర్థగోత్ర శతప
త్రశ్రేణి మిత్రుండు గో
సంత్రాణుండు భుజంగరాయకృతి వే
శ్మక్ మాని తా వాణి నా

1. బెంగుళూరు నాగరత్నముగారు 2. గరికిపర్తి కోటయ్యదేవరగారు 3. పీఠికాపురం సంస్థాన వైణికులు తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంత్రించెన్ సుతపెండ్లిఁ దన్నుఁ బ్రతి సుధాం
పత్యాప్తికా జోటికిన్.

గీ. ముదుకవేని, రూపాయకు మూఁడు సేర్ల
ప్రాలు దొరకని సిద్ధార్థి వచ్చికఱవు
నందు రాజాన్న సంతృప్తు లైరి వేల
కొలఁదిగ భుజంగ రాట్కృతి కూఁతు పెండ్లి.

గీ. మాటికిటఁ బక్ష్యములు వ్రాయ మానసమునఁ
గవుల కుపమాపదార్థము లవునో కఱవు;
ఒండొకటి మీఱు కూఁతుల పెండిళుల భు
జంగ విభుబానసమున నక్షయము లవ్వి.

క. తలియలఁ బూజలకై శై
వులు గూరుచు తుమ్మిపూల ప్రోవులు తలఁపో
మిలమిలని డిల్లి భోగపుఁ
గలమాన్నముఁ గన భుజంగ ఘనుఁ డిడుబంతిన్.

గీ. పలుఁగనులు నోళ్లఁ జేతులఁ గఱకుమాట
నట్టెఁకు భుజంగరావు పిల్పింది పెండ్లి
కేఁగు దెంచిన నన్నింటి కెక్కు డలరి
కడుపు తన కొక్కఁడని కుందుఁ గుడుపు ముందు.

"కవి కవసూయకంధికిని తోరత లేమి యటన్న పండిత
ప్రవసన మెండుపట్ల నెటువంటిది యైనను గేవలంబవా
స్తవమది తిక్కయజ్వకడ......"

అని తిక్కన ప్రశంస సందర్భమున వసురాయఁడు నుడివి యున్నాఁడు అది యాయన దెసఁగూడ నట్టిదే యని వచించుట సత్యదూరము కాదని చెప్పవచ్చును. శ్రీ వాడ్రేవు విశ్వసుందర ప్రభుని సత్వరరాజ్య రమాభివృద్ధిని ప్రశంసించు సందర్భములో సమయోచితముగఁ గంసాలిభద్రకవికృతినుండి యాయన గ్రహించిన నుడికార మిందులకుఁ దార్కాణము:

ఉ. "ఎన్నఁడు సేరిచెం బెళుకు
లీచెలికన్ను" లటన్న పద్దియం
పున్నుడికార మెందుఁ దలఁ
పున్ గుణబంధురు విశ్వసుందరున్
మొన్నె వరించి ముద్దిడిన
ముగ్ధను రాజ్యరమన్ గనుంగొనన్
వన్నెలుఁ జిన్నె లయ్యుచిత
భావ ముదారత వింత గొల్పెడున్.

మఱియు నాశుకవిత్వ మనాదరించువాఁడయ్యుఁ గొప్పరపు సోదరకవుల యత్యద్భుతాశు కవితాశక్తిని బ్రశంసించుచు నీయనపల్కిన పద్యముకూడ నిందులకు నిదర్శనము కాఁగలదు:

ఉ. చక్కెర మెక్కఁ జేఁదను ర
సజ్ఞులు కల్గుదురయ్య యెందుఁ? జే
రక్కజముం ఘటించె భవ
దాశుకవిత్వపటుత్వ మీకుఁ డొ
క్కొక్కరికిచ్చు మెచ్చఁదగు
నొక్కొక విద్దెయుఁ ద్రోసిలోపముల్
ప్రక్కకు మిమ్ము నెన్ను వసు
రాయఁడు కుండినపుంగవీశులన్.

రాజమహేంద్రవరములో శ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు భిక్షువుల యుపయోగార్థమయి కట్టించిన ధర్మశాలకు మూలబంధ శిలాస్థాపన మొనర్చు సందర్భమున వసురాయఁడు కూర్చిన పద్యములలోఁ గరుణారసప్లుతములగు నీక్రింది చాటువులు బిచ్చగాండ్ర దుస్థితిని గనులకుఁ గట్టుచుఁ జదువరులకు జాలిని గలిగించుచున్నవి:

ఉ. గంపొకచంకఁ బెట్టుకొని
కట్టను రెండవచేతఁ బూని, వి
ల్వంపున మేను దోఁప, నడు
వంగను సత్తువ లేక, తూలుచుం
జింపిరి నెత్తితో మొలను
జింపిని గట్టి నగర్చుకొంచు, ము
ష్టింపచురాలు బిచ్చ మనఁ
"జీ! పొద"మన్ కలవార లుండరే ?

ఉ. కొమ్మకు వ్రేలఁగట్టి యొక
గుడ్డను, బుట్టిన బిడ్డ నందులో
నిమ్ముగఁ బెట్టి, వేసవుల
నీచెవిగాడుపు రాఁగ నాచెవిన్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సొమ్ములుపోయి, రథ్యలను
జూడఁగనయ్యెడు బిచ్చగాండ్రదై
న్యమ్ముఁ గనుంగొనం గడుపు
లక్కట! చుమ్మలుచుట్టవేరికిన్?

ఉ. వ్రేలుచు మీఁదఁ దోఁచు తల
క్రిందుఁబులుంగులుపోలెఁ గ్రింద లేఁ
జూలులుఁ దాము, నాండ్రు వడ
సోఁకి నిదాఘపునాళ్ల భూమి రు
ఙ్మూలములన్ వటించువెస
మోములభిక్షుకులం గనుంగొనం
జాలిఁగరంగదే హృది, వి
షాదము పుట్టి కసాయి కేనియున్.

అమెరికాలూథరను మిషన్‌వారు రాజమండ్రిలో స్థాపించిన స్త్రీవైద్యశాల యీప్రాంతమందలి కాంతాజనంబులపాలి కల్పవృక్షమయి వారి కత్యంతోపకారక మగుచున్నది. ఆవైద్యశాలకుఁ బ్రసక్తించిన చాటువు లొకటి రెండు:

చ. నులిసిననుల్కమంచమును,
నూనియ, కుంపటి, పాతచెప్పు, భూ
తులసియు, నుల్లిపొట్టు,పొగ
దూపము, నెన్నెమసుద్ది, చీఁకటిల్,
వెలిమిడిదివ్వె లేక, ప్రస
వించి యిటం జెలు వొప్ప నమ్మల
క్కలు కని తల్లిపిల్లలను
గ్రక్కున ముక్కున నుంతు రంగుళుల్.

చ. సతులకు మానరక్ష, శిశు
సంతతిపాలికిఁ బ్రాణభిక్ష, రు
గ్ణత పరిఘోరశిక్ష, మలి
నంబులకుం జొరరానికక్ష, యీ
యతివలక్షీరకంతులయు
నౌషధశాల నిరీక్ష, వాఁగువా
రతులితదీక్ష నల్పు సుకృత
తాళి. ఫలించినద్రాక్ష యాక్షితిన్.

కడచిన కీలకసంవత్సరమున ఘటిల్లిన గౌతమీ పుష్కర సందర్భమున విశేషధనవ్యయ మొనర్చి ప్రభుత్వమువారు తైర్థికుల యుపయోగార్థమయి రాజమహేంద్రవరమునం దొనర్చిన యేర్పాటులును, నప్పు డప్పట సబుకలెక్టరుగా నుండిన శ్రీ H. H. Burkitt దొరగారి యత్యద్భుత నిరంతరకార్యదీక్షయుఁ బ్రజల ప్రశంసల కత్యంతము పాత్రములయినవి. ఈసందర్భమందలి మన కవిశేఖరుని చాటువులుకూడఁ బ్రశంసనీయములు. వాని లోఁ గొన్నిమాత్ర ముదాహరించెద:

మ. మడిగా నుండినతల్లి కన్నకొడుకున్
మైమైలగా నంట నీ
కెడగల్గం జనుమంచుఁ గోపపడు; నీ
కీ మర్త్యులం దెంత ప్రే
మిడి; ని న్నెట్టియశుద్ధుఁడైనఁ గదియం
బూతాత్ముఁ గావింతు నీ
కడలం జేతుల నంటి, పావనఘునీ!
కళ్యాణి! గోదావరీ!

సీ. అసలు రూపఱి, కాలి కిసుక మెత్తగ సోఁకు
చదను దేరిన రథ్య చక్కఁదనము
వడియఁగట్టిన కూప వారి, వీథిని సుంత
బిరడఁ ద్రిప్పఁ దొరంగు మరహారంగు
నిసి పట్టపగలుగా నెఱపునబ్బురపుటా
[illegible] విరిదివ్వె వి[illegible]లాందరులయొఱపు
[illegible]జలుఁగు బెజ్జములఁ బిచ్చిలి నీరు వెలిచాపు
రముసోరుఁ గేరు కాగంజతీరు

గీ. వలసినపదార్థములుచేరువనె లభించు
మంచియంగళ్ల పసఁ గాంచి మెచ్చుకొందె
ప్రాఁతపుర మిచ్చి పుష్కర ప్రజలబసకుఁ
గాఁపురము సేయ నిటఁ బౌర గణము తటిని.

ఉ. పుట్టకపోవు పత్రములు
"పుష్కరపర్వదినంబులన్ మొదల్
ముట్ట ఋణంబుఁ దీర్తు"మని
మ్రుచ్చులచే నవి యెట్లు తీఱునో;



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




తద్దిపూజ

చిత్రకారిణి: శ్రీమతి డి. బుచ్చికృష్ణమ్మగారు, రాజమండ్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెట్టులక్రిందటం బసలు
చేయొడు సొమ్మలతోడఁ జేసియుం
జిట్టియుఁ జూచివోయెనని
చింతిలువారలఁ గాన మెచ్చటన్.

ఉ. అర్కుఁడు గానరాక పగ
లంతయు బోరున మొత్తువానలం
దిర్కులలో నిజప్రభు వ
దేపనిగా జన సౌఖ్యకాంక్షియై
కూర్కు భుజింపఁ దీఱనియ
పంతితదీక్షఁ బురిం జరించుటం
బర్కొటు ఘోటెనాఁటి యల
వాటున గొందులు దూఱు నిప్పుడున్.

చ. ప్రవితత రాణ్మహేంద్ర నగ
రంబునఁ గంటెని బుక్కరత్రయం
బెనరికి లేదు బర్కొటున
కీపదవిం గలపే; రితండు రే
పవలును, దీక్షఁ బుక్కరపుఁ
బర్వమునం బ్రజ కంటి రెప్పయై
కవికిని శిల్పి కిప్డు పని
కల్పనచేసెను; మేలు మే ల్గనున్.

నిరంతర మాంధ్రదేశాభ్యుదయమున కయి పాటుపడుచు యశస్సాంద్రయై వర్ధిల్లు నాంధ్రపత్రికా మతల్లినిగూర్చిన ప్రశంస:

గీ. ఆంధ్రమునఁ బుట్టె గిట్టె ననంత పత్రు
లంబ కష్టసుఖంబుల కైన దేది?
పాఁప బాధలఁ దల్లికిఁ బాపుతాప్తుపై
నట్లు నెగడుమీ చక్రితో నాంధ్రపత్రి.

## (2) ప్రకృతి ప్రకరణము

ఈగ్రంథమున కెల్ల మకుటాయమానమైనదియీప్రకరణమే యని యొత్తి వక్కాణింపఁదగును. ప్రకృతి తత్త్వ రిశీలనమం దీ కవికిఁగల యప్రతిమ ప్రతిభనుగూర్చి వెను కనే యుగ్గడించితిని. వేయేల, ప్రకృతిని వెలయించు టలో వసురాయఁడు వసురాయఁడే యని చెప్పనొప్పు ను. ఈ ప్రకరణమందలి ప్రతిపద్యము నవశ్యము ఎతిం పఁదగినది. ప్రకృతి ప్రబంధకర్తయగు పరమేశ్వరుని యద్భుత ప్రతిభ కచ్చెరువందుచు నీతఁడు ప్రకరణాదిని వ్రాసిన పద్యమే ప్రకృతియం దతనికిఁ గలగాఢానురక్తిని వ్యక్తమొనర్చుచున్నది:

మ. అరుదౌ నైకనవీనకల్పనము లే
కాంశంబునం గూర్చి తా
విరచింపన్ శతకాదికంబుఁ గవి ప్రా
వీణ్యంబు వేనోళులన్
సరసుల్ మెత్తురు; వృక్షపక్షి ముఖనా
నాజాతి భేదంబులన్
బరఁగున్ గోటులు తాదృశంబు లభవా!
త్వత్సృష్టి నెట్లెంతుగో.

### ప్రభాతము:

వేకువయందలి కోడికూఁతలోని త్రిభంగీభుగ్న కంఠధ్వని నుత్ప్రేక్షించుచు మను వసు చరిత్రకారులు రచించిన పద్యములు భాషాప్రపంచమున సుప్రసిద్ధములు. తద్విషయకములయిన వసురాయని చాటువులుగూడఁ బ్రశంసనీయములు.

ఉ. సృష్టిని బుట్టి నష్టి నొన
రించు త్రిమూర్తుల యిక్కయా మహో
త్కృష్టపు వేలు పీతఁడు, గ
తించెఁ ద్రియామ యటన్న భావముల్
స్పష్టముగాఁ ద్రిభంగిఁ గృక
వాకులు గాముల కూనినోపుదా
ర్లష్టదిశాముఖమ్ముల న
హర్ముఖమం దెలుఁగెత్తి కూసెడున్.

ఉ. ప్రాణము లేని కొయ్యగడి
యారము రేయిట మూఁడు గొట్టఁగా
మానవనిర్మితం బదిప్ర
మాణమె యంచుఁ ద్రిశుద్ధి మెచ్చున
ట్లానిమిషంబునందె చతు
రానన కల్పితకాలయంత్రముల్
పూనెను గొక్కరోయనఁగ
భుగ్నగళమ్ములఁదామ్రచూడముల్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెల్లవారు నప్పటి శశికాంతిని, దీపకాంతిని వర్ణించు నీక్రిందిపద్యములు రసికజనహృదయంగమములు:

చ. లడవులనుండిసుట్టునను
　　డాల్మిని దాఁకొనియున్న ప్రేపు మ
ప్పుడు ఫలకాఁకచేఁ గరఁగి
　　పొంగి తనుం దలిమంబు వాపి నె
వ్వడిఁ బ్రియు నిక్కఁ జేర్పఁగనె
　　బల్లున వేగినఁ దెల్లపోవున
ప్పుడఁటుక మోముచాయశశి
　　భాసిలెఁ బున్నమనాఁటి వేకువన్.

చ. నెలఁతనుగూడ నెంచియును
　　నిద్దురమంపునఁ గన్ను మూసి, తాఁ
బలపల వేగ మేలుకొని
　　బాళిని దత్తఱ మొందు శ్రోత్రియుం
డలఁపఁగఁజేయుచున్న యవి
　　ధామమునన్ మలయానిలాంకురం
బులకుఁ జలించుచున్ రజని
　　పోకకు వెల్వెలవోవు దీపముల్.

పతివ్రతలకు భర్తలతోడి సహగమనము ప్రాచీనార్యసమ్మతము. ఆధర్మము నుద్దేశించి కైరవిణీముకుళత్వము నుత్ప్రేక్షించుచు వ్రాసిన పద్యము చాల మనోహరముగ నున్నది:

గీ. చందురునితోడ వేడుకఁ జనెను దార
లంతరిక్షభూసఖ్య మనర్హ మకట!
నాథుతో నేఁగు భాగ్యంబు నాకు లేద
యనుచు వఱువాత మూర్ఛను మునిఁగెఁగలువ.

పిల్లతెమ్మెరలఁ గూర్చిన జిలిబిలిపలుకులతోడి యీక్రింది పద్యమందలి మనోజ్ఞవర్ణనము మనకు వీశ్వరుని వంటి సత్కవుల కవితనుగూడఁ దలఁపునకుఁ దెచ్చునను కొందును.

క. తెగిపోక కొనలు సాఁగుచు
మిసులను సుకుమారమగుచు మేనులు సాగియన్
సొగసుగ రవగాలులు చ
ల్లగ వేసవ విసరె విరులు లతికల నురలన్.

ప్రకృతిరామణీయకమునఁ గవికిఁగల యవ్యాజప్రేమమున కొక నిదర్శనము.

గీ. ప్రాతరుదితార్కరశ్మి సంపర్కమునను
మణిరుచుల మించుమంచుతుంపరల వఱలు
చిప్పపులువెన్నుఁ బువ్వులఁ జెప్పఁగాలఁ
ద్రొక్కఁగ బయళ్ల మనసు చివుక్కు మనును.

ప్రదోషము :

సాయంసమయమున రాజమహేంద్రవరమునందలి గౌతమీ నదీతీరము సకల జనమనోహ్లాదకరంబై, సంతాపహరంబై తనరారుచుండును. అప్పటి ప్రకృతిసౌందర్య మనిర్వాచ్యమై యుండును. తద్విషయములగు చాటువులొండు రెండు చిత్తగింపుఁడు:

సీ. మిను వ్రాలుచో నుదీచిని దళుక్కని క్రాలు
　　మెఱుఁగులతో నీలమేఘమాల
యద్దానిక్రింద దావానలజ్వాల రే
　　ఖలతోడి నల్లని గట్లచాలు
దానిముందఱ దట్టమైన కావిరి క్రమ్మి
　　యెడములు కబళించు వృక్షరాజి
దాని కివ్వల దృఢస్తంభపాళీశిరో
　　భాగనిర్మితమైన వారధియును.
దానిపై దారి, దిగువ లోఁతైనవారి
వాయుగతిఁ బాఱునావిరి బండ్లుఁ బడవ
లేటిదరికి వేసలిసంజ నేఁగువారి
కెల్లఁ గనువిందు రాజమహేంద్రమందు.

సీ. అకచంద్రునకు సుందరరూప సాహస్ర
　　ములు ఘటిల్లఁ జలించు నలలనలువు
నలలమీఁదను దళ తళలు తేరఁగ వెండి
　　జలపోఁత సలుపు వెన్నెలలచెలువు
వెన్నెలలకు సుంత వింత జాదొనఁగూడఁ
　　జదలఁ బర్వినయెఱసంజసంచు
నెఱసంజ మెలమెల్ల నిను వంకఁ దిగఁజాఱ
　　నిజనాథు నలరించు నిసిబెడంగు
నిసి ధరించిన గువ్వకన్నీలిచీర
కరణి రాణించు నంతరిక్షంబుడంబుఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాంచుచును, జల్లగాలి సేవించు జనులు
రేయిమొగమున నది యొరఁ బాయఁగలరె?

ప్రేమవెల్లియగు గౌతమీతల్లి మాతృప్రేమ నుగ్గడించు పద్యమొకటి కీలకపుష్కర ప్రశంసా సందర్భమున నిదివఱ కుదాహరించియుంటిని. తద్విషయకములు మఱి మూఁడు చూడఁదగినవి:

శా. తల్లీ! బిడ్డల ప్రేమ సంజతటి సం
తాపంబునం జేర ని
న్నుల్లోలాత్మకరంబులం బొదివి మ
మ్మయ్యాల లూఁగించుచుం
గొల్లల్గాఁగల నీపయస్సుఁ దనియం
గ్రోలించు చాడించెదీ
వుల్లాసంబునఁ దేలఁ బావనచరి
త్రోదార! గోదావరీ!

సీ. సుంద్రని పెనుగాజుఁగు ప్పె దీపమువోలెఁ
బశ్చిమాంబుధిఁ దేలు భానుఁ జూపి
పలురంగు లద్దిన వలువచెన్నున వన్నె
వన్నె మబ్బులఁ గ్రాలు మిన్ను చూపి
దాఁగిన చీఁకటుల్ తలలెత్తు చందాన
మసకారుతోఁపుల దెసలఁ జూచి
నీలాలవలెఁ దేటి నిర్మలంబగు నీట
విడిసంజఁ గ్రొంజాలు బెడఁగుఁ జూపి
చండ కరుధాటి మూర్ఛిల్లు జగతిమీఁదఁ
జిఱుతకరువలి చలిమిరుల్ చిలుకుచుండ
నావలను తూఁగు వేత్రాసనములఁ బొలుచు
గౌతమీతటి యలరించుఁ గన్నప్రజల.

గీ. కొండ గబ్బిలములు కుతుకెండి పయి కెక్క
లార్చుకొనుచు డాయ నలల చేతు
లెత్తి వానినోరికిడు నందికగ నీరు
ప్రేమవెల్లి గౌతమీమతల్లి.

సంజకెంజాయల వివిధవర్ణ సంకీర్ణత్వమును మాయలమారి వేసముతోఁ బోల్చిన పద్యము:

ఉ. మాయలమారివాని కుప
మానము నూసరవెల్లి చెప్పుచుం
డ్రాయది యప్రసిద్ధ విష
యం బుదయాస్తమయంబు లందుమిక్
లాయపు వజ్రవాహనము
లక్ నిముసంబున కన్నె వేసముల్
వేయుచు నుండఁ జూతురవి
పేర్కొన రేటికి వాని సాటికిన్.

## చంద్ర తారకలు:

చంద్రునకు రేపడంతి కూటమిచేఁ గలిగిన శోభావిశేషమునుగూర్చిన వర్ణన సరసభావ సంయుతమై కవికిఁ గల లోకానుభవమును జాటుచున్నది:

క. పేదకు సిరి యెత్తుకొనుం
బైదలి యొక్కొక తె చెట్ట వట్టిన దానం
దూదివలెఁ దోఁచు శీతల
పాదుఁడు వెలుఁగొందఁడే కుపాయోగమునన్.

స్త్రీలకు సిగ్గొక పెట్టనినగయని పెద్ద లుగ్గడింతురు. కావుననే లజ్జావతీశబ్దము స్త్రీ పర్యాయములలోఁ జేరినది. చంద్రోదయ మయినంతనే తారకలు నిజకాంతిని మాయు ప్రకృతిసిద్ధవిషయమును బైధర్మమును బురస్కరించుకొని కవి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు:

ఉ. తారకలార! తండ్రి మిము
దక్షుఁడు చంద్రున కేయుగంబునన్
ధారనుబోసెనో, విభుని
దగ్గఱ నింకను సిగ్గె మీకు; మేల్
తూరుపుఁగొండపై నతఁడు
తోఁచుడు దిగ్గన లేచి, లోనగన్
దూఱితి రట్టె; పుట్టునగ
తొయ్యలికిం బతిపజ్జ లజ్జగా.

చంద్రోదయాది వర్ణనములలోఁ గల్పనాశిల్పమును మెఱయించుట యాంధ్రగీర్వాణ కవులకుఁ జాలఁ బరిపాటి. వసురాయని చాటువులలోఁగూడ నీశిల్ప మనల్పముగా నున్నది. మచ్చున కొక కొన్ని చిత్తగింపుఁడు:

గీ. కాఁడు చందురుండు గట్టిగా రుబ్బిన
మినుపపిండిముద్ద; మిన్ను గాదు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పఱుచునీలిచీర; స్వర్ణాకరు లిడు వడి
యములు కాని తారకములు కావు.

క. లోనం బలు మీనంబులు
లీనంబగు గగనఘనివలెం గ్రాలెం, గో
టానంగోటులు చుక్కలు
కానంబడకుండఁ గాయు కౌముదిరాకన్.

గీ. విన్ను పెరుఁగుఁగడవ వెన్నెల తక్రంబు
వెలుఁగుచిలివెలుంగు వెన్న ముద్ద
చిన్ని చుక్కలన్ని చిందులు; శే, యీ వి
గోవుపాఁడి ద్రచ్చు గొల్లభామ.

గీ. అవని ప్రానీలి మేలికట్టంబరంబు
చిమ్మటలుగొట్ట నేర్పడ్డ చిల్లు లవ్వి
యనలి వెల్తురు దోఁచుతదంతరముల
రిక్కలం డ్రాఁరయక విపరీతమతులు.

గీ. జింకపిల్ల గాదు చెవులపిల్లి యుఁ గాదు
పాలవెల్లి నంటు బాడె గాదు
చందమామలోని కందు నే ననుకొందుఁ
బ్రతిఫలించినట్టి క్షితియటంచు.

## ఋతువులు:

నాల్గేసినెల లొకకారుచొప్పున మన పెద్దలు సంవత్సరమును మూఁడు కారులుగ నేర్పఱిచియున్నారు.

గీ. మాఘమాదిగ నాల్గేసి మాసములను
బలుకవలయును ననకారు వానకారు
నీతుకారని; నన, వానఁ జేరియుండు
నెండకా రిట్లు ముక్కారు లెఱుఁగనగును.

ఈయాకారులందుఁ గలుగు ప్రకృతి విశేషములఁగూర్చి మనకవి కూర్చిన నిసర్గమనోహరములయిన చాటువులు తప్పక చదువఁదగినవి. వానిలోఁ గొన్నిటి నుదాహరించెదను. సూర్యుని యుత్తరాయణ దక్షిణాయన ప్రయాణములకుఁ గారణము నుత్ప్రేక్షించు పద్యములు:

క. "చలువలు కడు వెదఁ జల్లెడు
నెలవులకును జనక జనులు నిలఁజాలరు రాఁ
గలనెలల" ననుచుఁ దెలుపుకొ
నలినాప్తుఁడు తిరిగె శిశిరనగమువలనికిన్.

క. జనులకు యమసదనమె యీ
దినముల శరణంబటంచుఁ దెలుప ననంగా
దినకరుఁడు తిరిగె దక్షిణ
మునకుం బ్రభ దఱిఁగి దివసములు కుఱుచలుగాన్.

మామిడిచెట్టులం దేకకాలమునఁ జివురులు, పూలు లేకుంట కర్థశ్లేష నూఁలిగాఁ గొని చూపు కారణము:

క. సుమనః పల్లవతతులకు
సమకూరదు మైత్రి, యరుదు; సహకారములన్
సుమనః పల్లవతతులకు
సమకూరమి మైత్రి యరుదె సహకారములన్.

"ఆలస్యాదమృతం విష" మ్మనుసూక్తికి నిదర్శనము:

క. రాలిచె మధురా కంతయుఁ
దాలిచె లేఁజివురు చింత తఱి యిదె గోయన్
జాల మొనరిచిన రుచి చెడు
నాలస్యము విషము సేయు నమృతము ననరే.

## వసంతగ్రీష్మర్తు వర్ణన విశేషములు:

ఉ. కో యను కోయిలల్ చెవుల
కుం జలదాతపఖండశీతల
చ్ఛాయలు మేనికిన్, విరులు
చల్లుసువాసన నాసకున్, ఫల
శ్రీయుత నమ్రశాఖికలు
దృష్టికి, స్వాదురసంబు జిహ్వ, కా
కాప్యాయ మొనర్చు నామ్రతరు
లామని తేనినిదాఘసత్రముల్.

గీ. మరునివిల్లు తీపి మలయానిలము తీపి
మల్లెపువ్వు తీపి మధువు తీపి
మావిపండు తీపి మదకోకిలము తీపి
మధుర తామయంబు మాధవంబు.

గీ. రసము గడ్డకట్టె రసనపైఁ బడునంతఁ
గరఁగి చల్లఁగాను గళము దిగును



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రదిమ, పసిమి, తావి మాధురి గల వింత
మంచుఁగరడు మంచి మావిపండు.

చ. అఱచుచు జీఱకంఠమున
　　నార్చుచుఁ జక్కనిరంగు ఱెక్కలం
దఱుముచుఁ గాకి గ్రద్దల, ని
　　దాఘదినంబుల నిప్పుటెండలో
నెఱకలు ప్రస్సనో యనక
　　యేదెసఁగ్రుడ్డులఁ బాల, ప్రోడఁగొ
బ్బెరతల నిల్చుచుం; గడుపుఁ
　　బ్రేమ సహింపని కష్ట మున్నదే.

గీ. కొట్లనిండఁ గోట్లకొలఁది రొక్కం బున్న
నేమిఫలము బీగ మెడపకున్న
జగతినెందు గాలి సంపూర్ణముగ నున్నఁ
గదలదేని దానఁ గలదె సుఖము.

చ. తళతళ వెండిరేకుల వి
　　ధంబున వెన్నెలలోన మట్టలా
కులు మలయానిలంబునను
　　గొంచెముగాఁ జలియింప, సందుసం
దులను దళుక్కుమంచు నెల
　　తోఁపఁగ, నేలను నీడలాడఁగా
నెలమి జనించురాతిరి శ
　　యింపఁగఁ గొబ్బెరచెట్లు క్రింగటన్.

గీ. వృక్షశాఖలఁ దలక్రిందు వ్రేలు కొండ
గబ్బిలమ్మలు గఱులార్చు క్రమము తోఁచు
వేసఁగిపగళ్లఁ బస్సుండి విడక జనులు
విసనకఱ్ఱలఁ గదలించు విధముఁజూడ.

గీ. తాటిగోలెంబులను దోఁడు నూతినీళ్లు
స్నానమునకును, మంటికూజాలఁ బోయు
నేటినీళ్లు పానమునకు నెంతొ చల్లఁ
దన మొసఁగు మండువేసఁగి దినములందు.

గీ. అగ్గిచెరుగు గాలి యావాలుఁ గారాలు
గుండ గొట్టు గాటు గొంప లేర్చు
చిచ్చుమంట, ఱోళ్లు చీలుచు బీఱెండ
దావపావకము నిదాఘసఖము.

మ. కలయర్థంబును ధారవోసి తమ కా
　　కాశంబునన్ వట్టివా
జలదాలన్ బురుడింప, నైకవిధ
　　సస్యంబుల్ ఫలంబుల్ జలం
బులు సర్వం బిడి భూతతృప్తికిఁ బొలం
　　బుల్ మావులున్ బావులున్
దలఁపించెన్ గృతవిశ్వజిన్మఘురఘున్
　　ద్రాఘిష్ఠపుంబ్రొద్దులన్.

[సశేషము.]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ద్వితీయాంకము

### రంగము ౧

స్థానము:—రాయలమందిరము.

సమయము:—మధ్యాహ్నము.

(విశ్వపతి ఆలోచనానిమగ్నుడై యటు నిటు ప్రచారము చేయుచుండును. చిత్రావతి వచ్చి వానివెను వెంటనే అల్లరిగా తిరుగుచుండును. విశ్వపతి చూచి)

విశ్వపతి:—ఏమిటి ఈ అల్లరి చిత్రా!

చిత్రావతి:—'చిత్రా'ట! అల్ల రేమిటి విశ్వా!

విశ్వ:—పో; పిచ్చిపిల్లా!

చిత్రా:—ఎవరైనా పిచ్చివాడున్నాడా 'పెళ్లాడాలి' అని తిరుగుతూంటే ఇంతలో నీవు కనిపించావు. (ముఖము వంక చూచి) నీకళ్లట్లా మెరుస్తునా యేం? ఎంత అందంగా ఉన్నాయో! రాత్రి చూచా; మాగండు పిల్లికళ్లిట్లాగే మెఱిశాయి.

విశ్వ:—ఇదుగో అల్లరి చేయక పో.

చిత్రా:—మానానునే. నీవు వెళ్లమంటే వెళ్లడానికి నీ వేం రాజువా?

విశ్వ:— (నవ్వుచు) వెళ్లకపోవటానికి నీవు రాణివా?

చిత్రా:—ఆఁ, రాణినే. (పకపక నవ్వుచు) మానాన్నగారు నన్ను చూచి నిన్న 'పిచ్చిరాణీ' అన్నారు. ఇదుగో 'రాణి' అంటే జ్ఞాపకంవచ్చించి, ఇందాకటి కథను పూర్తిచెయ్యవూ? ఆకుసుమాన్ని యువరాజేం చేశాడు?

విశ్వ:—ఇప్పుడు కాదు. అంతఃపురము పోయి మా అక్కయ్యతో ఆడుకో.

చిత్రా:—మీ అక్కయ్యేం? నాకుమాత్రం కాదూ అక్కయ్య?

విశ్వ:—పోనిమ్మట్లనే; నీవిప్పుడు వెళుదూ.

చిత్రా:—ఇప్పుడు చెపితే వెళిపోతా. ఆకుసుమా న్నేంచేశాడు?

విశ్వ:—మాలిని గరించినాడు.

చిత్రా:—మొగవాడు ముత్తైదుకి మల్లే పువ్వులు పెట్టుకుని కూర్చున్నాడు!

విశ్వ:—ఎట్లును సాగనీయవు గాని కథను, పొమ్మిచ్చటినుండి, పని యున్నది.

చిత్రా:—ఇందాక చేస్తున్న పనేనా? కళ్ళిట్లా పెట్టడం; ముఖమిట్లా ముడుచుకోడం; మఱి, వేలితో గాల్లో ఇట్లా అట్లా గీతలు గియ్యడం? ఊఁ—

విశ్వ:—(చేయి పట్టుకొని) నీవు మర్యాదగా పోవు.

చిత్రా:—బుద్ధి వచ్చిందిగా, ఇక అల్లరి చేయను. కథ వినేసి చక్కాపోతా. సాంతంగా వినకపోతే కంచెల్లో ముళ్ళుంటాయివి.

విశ్వ:—అబ్బా! ఆ రామకృష్ణ కవి అల్లరి అంతా నీకు పట్టుపడ్డది.

చిత్రా:—మా నాన్నగారి కెంత పేరుందో నీ కేం తెలుసు?

విశ్వ:—ఆ. వికట కవులకు గొప్ప పేరే వచ్చును.

చిత్రా:—ఆ పేరు కాదు.

విశ్వ:—మఱి?

చిత్రా:—ఆ బుడతగీచాయన రాలే, నన్నీజో నిన్నీజో, ఆయన అన్నారుకదా—అదొకపాఠంలా ఉందమ్మా, ఏమిటూ, ఊఁ— "అగ్రామ్య పరిహాస కుశలః యుగ కవీంద్రనాయకమణీ రామకృష్ణ కవిః": ఎంత సంస్కృతపాఠమో!

విశ్వ:— నీకొక నమస్కారము. దయయుంచి వెళుదూ.

చిత్రా:—నాకు నమస్కారం వద్దు గాని కథ చెప్పు, వెళిపోతాను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్వ:—మాట్లాడకుండా వింటావు?

చిత్రా:—మాట్లాడనుగా.

విశ్వ:—నోరెత్తకూడదు.

చిత్రా:—(అంగీకార సూచకముగా తలనూపును.)

విశ్వ:—ఆఁ. ఎంతవఱకు చెప్పితిని?

చిత్రా:—ఆపువ్వుని తలలో పెట్టుకున్నాట్ట. నీకు జ్ఞాపకశక్తి చక్కగా ఉంటే నాకు మౌనభంగం అయేది కాదుకదా? నే వెళిపోతాను.

విశ్వ:—కథ కొంచెములోనే ఉన్నది విని పో.

చిత్రా:—నీపైత్యం ఇది. కథ ఇట్లా ఉంటుం దేమిటి? అయినా నాకు తీరిక లేదు. చిన్నారాణీతో ఒక మాట చెప్పాలని వచ్చాను, వెళ్లాలి.

విశ్వ:—విని పోదూ బ్రతిమాలుకుంటాను.

చిత్రా:—"కథ చెప్పవయ్యా! బాబూ!" అంటే నోరెత్తకుండా వినాలన్నావే ఇందాక, ఇప్పుడు నేనంటాను, నోరెత్తకుండా చెపితే వింటాను.

విశ్వ:—అట్లాగైతే, ఆఁ—కొంత కాలమునకు వారివివాహవిషయము—

చిత్రా:—అదుగో నోరెత్తుతున్నావు. నే వెళిపోతాను.

విశ్వ:—నీఅల్లరి కిదియే విరుగుడు. (రెండుచేతులు గట్టిగా పట్టుకుని గబగబ) మంత్రి గ్రహించి విధి లేక ఆ అమ్మాయిని దేవేరిని జేసి ఆయువరాజునకు పట్టాభిషేకము జేసెను. ఆబ్రాహ్మణ కుమారుడు రాజుగారి భావమఱిదియై 'మంత్రిని త్రోసి రాజును' చేయుచు నెమ్మదిగా రాజసూత్రములను చేతిలోనికి లాగుకొనుచు—

చిత్రా:—అవి తెగి వెనక్కి పడ్డాట్ట. ఏం చిత్రంగా అల్లావయ్యా! కథకు కాళ్లు దేనికో చెవులూ ఉంటవంటారు. బ్రాహ్మణబ్బాయిట! కులం, గోత్రం విడిచి పెట్టుకుని రాజుగారి భావమఱిది అయాట్ట! నేనుకూడా రాణినైతే అంతా ఒప్పుకుంటారేమో! పగ్గాలు—కాదు—సూత్రాలు లాగిపట్టినా? తెగి వెనక్కి పడతానేమో. (విడిపించుకొని పకపక నవ్వుచూ పారిపోవును.)

విశ్వపతి:—ఏమిరా! చెడుగరపు టురుమునవ్వు లజడిగా వికటాట్టహాస భైరవనాదం బుగ్గలువారించి పోయినది! ఈగుప్తప్రతాపము స్తుతిగీతముల గనక సంతృప్తి నెట్లు గాంచును; బలాత్కరింపబడియైన, లోకము మెచ్చక తప్ప దీనుర్విధికుద్ధిని. ఒకటి సంకల్పించుట, బుద్ధికుశలతచే దానిని సాధించుట—యిది నా జీవికమూలము. ఇప్పుడు నేనాడబోవు నాటకమునకు ప్రస్తావము కూడ రక్తిగనే నడిచినది. నాత్రోవ కడ్డము రాకుండ, మంత్రి, రాజ్యాధికారమునుండి బహిష్కరింపబడగలడు. అనగా, "ఈ విశ్వపతి పౌరుషచ్ఛాయలో జయకన్య తపస్తంత్రయైనది" యన్నమాట. రాయలనుండి తిమ్మరుసును గుంజివైచితినా, మా ముద్దులమఱిది మస్తిష్క మెప్పుడును శూన్యమే; అప్పుడందు నాఆలోచనయే మెఱయగలదు. "ఇదుగో, భావా! రాజ్యమును నాచరణసీమ సమర్పించి పనివిను" మనుటయే శేషించును. అది జరిగియు దీరవలెను. లేకున్న ఈరాజత్వము, నీప్రత్యేకాదృష్టము వీని నొసటనే ప్రొద్దువొడిచెనేమి! ఏమిటి యీప్రత్యేకత?

సీ. సకలమానవులు నేకకులాయమును వీడి
వచ్చినవారె ప్రపంచమునకు
దైవసామగ్రీ ప్రదత్తాధిభాగ్యముల్
గడిమిమై గొనుట కొక్కడె కలండె
భోగ సామ్రాజ్యంపు బూలగద్దె వసించు
పట్టాభిషేక వైభవము యెన్న
ఒకని సొత్తా యది? ఒక్కడే దేవడో వా
నిది కాదె సర్వసంపద గతంబు
నాకు బ్రతిరోధి యెవ్వ డెన్నటికినైన
బట్ట భద్రుల నిల బడగొట్టగలను
ధారుణీశ్వర గండ పెండేరమునకు
త్రాచు 'బుస్సు'లతోడ గాల్చాచినాడ.

(వికటాట్టహాసము జేసి) "కటకరాజు దివాణమున విస్తరాకుల గుట్టుకొనుచు బరపెండాడుడవై మనియుండు మని నుదుట వ్రాసి, విధి యీప్రపంచమున పారవైచిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పేరిశాస్త్రి ఆ విధివ్రాలును 'ఛట్'న తుడిచివైచు కుని రాజశ్యాలక విశ్వపతియై నే డాంధ్ర చక్రవర్తి కాబోవుచున్నాడు. (దూరమున దృష్టి నిగుడ్చి) అదుగో, నాయుద్యమునకు ప్రసాధనముగ నవతరించిన నాసోదరి వచ్చుచున్నది. ఈ రాజమంత్రులకు విరోధమును గల్పించుటకు జాలనుపకరించు నీమె యభిమాన ప్రవృత్తి కింక గొంచెము సానబెట్టవలెను. (విశ్వపతి ప్రక్కగా తొలగును. వానికి ముందుగా చిన్నాదేవి ప్రవేశించును.) సోదరీ! మఱచితిని మహారాణీ!

చిన్నాదేవి:—వ్యంగ్యమా ?

విశ్వ:—కార్యార్థిని కనుక 'మహారాణీ' అంటిని.

చిన్నా:—ఏమిటి ఆ మహాకార్యము ?

విశ్వ:—మంజీరను శిక్షింపవలదని నా ప్రార్థన. మఱి_శక్తి లేనప్పుడు—

చిన్నా:—అవును. నేను చేతగాని దాననే. బుద్ధి తక్కువై రాజుదగ్గర నాఅధికారము చెల్లు నను కొంటిని. ఇప్పుడు తోచినది అది 'తప్పే' యని.

విశ్వ:—ఆఁహాఁ. మఱి యేల క్షమాపణ గోర లేదు ?

చిన్నా:—వారు వచ్చినతోడనే తప్పక కోరు కొందును. కాని నేనైనను మంజీర నిచ్చటికి రప్పించి కొంచెము బెదిరించి క్షమించి పంపవలెననే యను కొంటిని.

విశ్వ:—అది గౌరవముగనే యుండెడిది. ఇప్పుడు నీ కగౌరవము కల్గినది. ఈమాత్రము రాజసమును చెల్లించుకొనలేని అబలవు నీవిచ్చట నిరపాయముగ గాపురము జేయగలవా యని నా కనుమానము. ఆముహూర్త బలమేమిరో, నిన్ను 'సోదరీ' యని పిల్చిన నాటనుండియు నిన్ను నాసోదరివనియే ప్రేమించుచుంటిని. ఆప్రేమ నీహితముకొఱకు నన్ను బలినిచ్చుకొనుటకును బురిగొల్పుచున్నది. ఈ అగౌరవమును నా అగౌరవముగ జింతించుచున్నాను.

చిన్నా:—పోనీ, ఒకమారు మంజీర నిచ్చటికి తెప్పింపరాదా ఇప్పుడు ?

విశ్వ:—పట్టి తెప్పించవచ్చును.

(రాయలు ప్రక్కగా ప్రవేశించును. చిన్నాదేవి చూడదు. విశ్వపతి చూచిచూడనట్లు నటించుచు)

కాని భావగారికి వారియెడగల మొగమోటము.

చిన్నా:—నీవే స్వయముగ వెళ్లినచో వారు మాత్రము నిన్నేమనగలరు ?

విశ్వ:—కాని యొకమారు చక్రవర్తిచే దండన తప్పింపబడిన పిమ్మట దానినే చేయబూనుట యోగ్యమైనసంగతి కాదు. మహారాజు వారిగౌరవమున కది—

చిన్నా:—అది కాదు. వా రెన్నడు నాయాజ్ఞను త్రిప్పువారు కాదు. మంత్రిభీతిచే దండనాథుడే పరిస్థితులరయజాలక తిరిగివచ్చియుండును. అంతేకాని—

రాయలు:—(సమీపించి) దేవీ! నీవు క్షమించవలెను. నేనే నీయాజ్ఞను త్రిప్పివైచితిని. నాకొఱకు నీవు మంజీరను క్షమింపవలెను. అమాయికయగు నొకదుర్బల బాలికపై నీ కింత కోప మెందులకు ?

చిన్నా:—తమయనుగ్రహము పూర్తిగ నున్న నది దుర్బల యేమి ?

విశ్వ:—సోదరీ! శాంతింపుము. భావగారు తెలివితక్కువవారు కాదు మంత్రిదేవు నిప్పు డెదిరించుట మంచిదికాదు. సేనాధిపతులు, కోశాధిపతులు, మంత్రులు, దుర్గనాథులు, పురరక్షకులు నెల్లరు వాని బంధువులో, మిత్రులో, ఆశ్రితులో, హితులో యై యుండిరి. చండశాసనుడై యత డీరాజ్యము నేలుచున్నాడు. అతని నెదిరించిన యెటు పోయి యెటు వచ్చునో. శాంతించి యిప్పటి కీపట్టు మానుము.

చిన్నా:—ఎందుకు నన్నిట్లు బెదరించుట ? ఇచ్చట నా కొక గౌరవమున్న మంజీర నిప్పుడు రప్పింపుడు. నేనే క్షమించి విడిచిపెట్టెదను. నా కాయాశ కానప్పు డెందుకు వచ్చినమాట లివి ? (పోబోవును.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్వ:—సోదరీ! ఎచ్చటికి కాపోక? తుదకు నావ లన మహారాజు విపదభ్ధిబడె ననిపింతువా?

చిన్నా:—(వెనుకకు వచ్చి) ఏమిటి!

విశ్వ:—ఊహించుకొనుము. ఆమంత్రి చెప్పుచే తలలో నణగిమణగియుండి నిరుపద్రవముగ జీవితము గడు పుకొనుచున్న యీతనికి నిన్ను దీసుకువచ్చి కట్టినది నేను. నీమూలమున నెట్టి యుపద్ర మాతనికి సంభవించి నను దోషిని నే నగుదును.

రాయలు:—విశ్వపతీ! నీ పూరుకొనుము. దేవీ! ఈ నీయావేశము పట్ట మహిషి కుచితమైనది కాదు.

చిన్నా:—(రోషమున) నాథా! నేను పట్టమహి షిని కాగోరుటలేదు. ఎననిపీరత్వమును, శూరప్రజ్ఞను, ఉత్తమపురుష తేజమును వరించి అతనికొఱకు పితృగృహ మును, బంధుజనమును, స్వసంబంధిమోహసర్వస్వమును త్యజించి, యీపరభూములకు వచ్చితినో, ఆ నా ప్రాణ పతివగు నీయర్ధాంగినైన చాలును. ఒకసామాన్యబాలిక నాపతిని నాముందు నిందయొనర్చినది; సహింపజాలక నేను వైరశుద్ధికి బూనుకొన, అందులకు నాపతిబలమే నా కడ్డమువచ్చుటా! ఆహా! ఇంతటి పరాభవమా!

(ప్రస్థానము)

విశ్వ:—పిచ్చిదానా! ఈపరాభవాగ్రహము నీ కెందులకు సోదరీ! (వెంటనే పోవును)

రాయలు:—ఔను, నాకు పరాభవము జరిగినది, నిజమే. సహించియూరకుండుట నాకు విధాయకము కావచ్చును. కాని అభిమానవతియగు నాయర్ధాంగి నను ధ్ధతగా నుండు మనుటకు నాకేమి యధికారము కలదు? ఆహా! దుర్భరదృశ్యముల సహస్రములనైన నోర్వగల నాకు గోవిందరాయల యప్పటి యాక్రోధ సంధుక్షి తాంగభంగిమతైక్షిణ్యము దృష్టింప రాకపోయినది! దీని కేమి. ఇది యేమిటి విశ్వపతి యొక్క శంకాభల్లమును మెదడులో గ్రుచ్చిపోయినాడు! నా జీవితము, భవిత వ్యము మంత్రి దయాధర్మములమీద నాధారపడియు న్నవా! ఈకృష్ణదేవరాయ లిప్పటినుఱకు వానియిష్టము మీదనే యీసింహాసనముపై గూర్చొన గల్గుచుండెనా? స్వయంప్రకాశమునకు నా కీగద్దెపై నవకాశ మున్నదో లేదో యెన్నడు నింతవఱకు విచారించుకొనలేదు. నన్ను గురించి నే నిక నాలోచించుకొనవలసి వచ్చెనా!

(విశ్వపతి పునఃప్రవేశము)

విశ్వపతి:—భావగారూ!

రాయలు:—ఆఁ! బహుపర్యాయములు హెచ్చ రించియున్నాడవు; నన్నుగూర్చి నీవే యెక్కుడు సంక టపడుచున్నటు లున్నది: ఈవిషయము జెప్పుము.

విశ్వ:—ఏవిషయము?

రాయలు:—మంత్రివిషయము.

విశ్వ:—నాకేమి తెలియును?

రాయలు:—తెలియదు? క్షణముక్రింద నీసోదరి కుపన్యసించినది.

విశ్వ:—ఓహో! ఆవిషయమా? ఇప్పు డెందులకు? అయినను మావు వాగ్వ్యయమునకుగాక నీచెవి కెక్కునా?

రాయలు:—ఇప్పుడు చెప్పుము. వినుటకు సంసి ద్ధుడనై యున్నాను. ఇన్నిదినములనుండియు ప్రజల రహస్య సంభాషణలయందును, నంతఃపురస్త్రీల చాటు మాటలవలనను నేవిషయమును విని నవ్వి యూరకొనెడి వాడనో, ఆవిషయమునే ఆప్తుడవగు నీ నుండి మరియు దగ్గరగా వినుచున్నాను. నీయుపదేశములు నాహృదయ మును ముట్టడించినవి. నేను వినగోరుచున్నాను. చెప్పుము.

విశ్వ:—ఇట్టి స్థిరభావముతోడనే నేనును నిర్బం ధించియైన నేడు చెప్పగోరియే యుంటిని.

రాయలు:—వివ నొకవిషయమును విని తరు వాత చెప్పుము. అప్పాజీమీద నీవ్యాజ్యమని యెఱుగు దును. నీహృదయమున నతడు బింబకబళన పిపాసియగు రాహువువలె దిద్దబడియున్నాడు. సరి. నేను ముగించు నంతవఱ కభ్యంతరము సెప్పక వినుము. నాతండ్రి "చం పివారవేయు" మని నన్నీ మంత్రిచేతులలోనే పడవై చెను. కాని, యత డేమి చేసెనో యెఱుగుదువా? "వత్సా"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యని తనయక్కున చేర్చుకొని యుక్తవయస్కుడ నగు దాక పెంచి, సమస్తవిద్యలయందును, కళలయందును నన్ను దిద్దినాడు. తనబిడ్డలకన్న నన్నే యెక్కుడు గారాబమున పెంచెను. నీసోదరియుదంతము నీకు తెలియును; ఎట్టిపరిస్థితులలో మావివాహమున కాత డొప్పుకొనినదియు! తుదకు బలసంపన్నమగు నీవిశాలసామ్రాజ్యమును నాకు నప్పగించినాడు. "రాయలు నారాజు" అని యుద్వేగమున నానందమును వెలిపుచ్చుట వాని స్వార్థమని కవుల నిందాస్తుతి. ఇట్టివానికి నేను జూపవలయు కృతజ్ఞతలకు బరిధి యున్నదో లేదో విచార్యము. నా హృదయము ప్రబోధము లేకయే కొన్నియుగముల క్రిందనే యతని 'నప్పాజీ' యని పిలిచినట్లు స్మృతి. నా హృదయమును చించి చూడుము! అప్పాజీయొక్క నిష్కామధర్మతేజస్సౌమ్యమూర్తి నీకు సాక్షాత్కరింపగలదు. చాలు నిప్పుడు చెప్పుము. ఆ ప్రకాశగర్భమున నేమచ్చను నీ చర్మనేత్రములు చూడ గల్గినవో; శ్రద్ధధానుడనై యున్నాను.

విశ్వ:—అబ్బో! ప్రకాశగర్భమున మచ్చను జూపవలెనా? ఇంతటి స్థిరవిశ్వాసికి నచ్చజెప్పుట బ్రహ్మకును దరము కాదు. కాని ఒకటిమాత్రము చూచుచున్నాను. ఆ ప్రకాశగోళమున నీవు నిద్రను జపించుచు తిరుగుచున్నావు.

రాయలు:—తప్పించుకొనకుము. మంత్రి నేర మేమిటో చెప్పుము.

విశ్వ:—మంత్రి నేర మేమియు నుండదు, నీవు లేశమైన వ్యక్తిత్వమును స్థాపించుకొనగల్గినచో. ఏవ్యవహారమునగాని కృష్ణరాయలత్వము పూడ్చిపెట్టబడి ఆ స్థానే తిమ్మరుసత్వ మెటనుండియో ఘాటకరించుకొని వచ్చును. మా కిది దుస్సహము.

రాయలు:—ఇదియా తుదకు నీవ్యాజ్యము. వట్టి అమాయకుడవు.

విశ్వ:—నాయమాయకత్వమునకు జింతింపవలదు. నీ నిష్ప్రయోజకత్వమునకు విచారించుకొనుము. భరత ఖండార్ధభాగమున కధిరాజ వైనందుల కుబ్బకుము. అట్టి యర్హతయే యనూన స్వప్రతాపకృతియైన లోకమున స్థాపించుటచేత గల్గినదా? తిమ్మరుసుయొక్క దయాముష్టి దత్తవిభవమున కెందుల కీయార్భాటము!

రాయలు:—ఆగు మెవరో వచ్చుచున్నట్లున్నది.

(గోవిందరాజు ప్రవేశించును)

గోవిందరాజు:—జయము మహారాజా! మన రాజనగరునందు వ్యాపారకేంద్రముల నిర్మించుకొనుట కనుజ్ఞ వేడుచు గొందఱు పోర్చుగీసు వర్తకులు విజ్ఞప్తి నంపుకొనియున్నారు. ఆజ్ఞ నీయవచ్చునా యని మహామంత్రివారు—

రాయలు:—ఆలోచించి వారి నే చేయు మనుము.

గోవిందరాజు:—భాగ్యము. (ప్రస్థానము.)

విశ్వపతి:—ఇది నేను నిందించుట యనుకొనకుము. నీ యాశ్రితులచాటు వదరులలోని యొక పాడుపు మాట యిది. బాగుగ నాలోచించుకొనుము. నీ వొకపంజరములో నుంటివి. కృతిక జగత్తని యుదయ మేమో గోలపడితివే, యది యిదియే. నీయెదుట మసలు ప్రతిదియు నాతిమ్మరుసుయొక్క తీక్ష్ణపరీక్షయందు శిక్షాశుద్ధిని బొందినదే. ఆ స్థానమున కవులు, దండనాయకులు, సామంతరాజులు, నంతఃపురమున దాసదాసీజనమును భరతర్షిచే శిక్షింపబడి రంగము నలంకరించునటులవలె వర్తనముల నెల్ల స్థాయిలయందును 'తు' 'చ' తప్పక నటింతురు. వాని మతము పుచ్చుకొనినగాని యెవరు నీరాజ్యచక్రమున బ్రవేశింపజాలరు. వారు నొసట దాల్చు విభూతి వానిపాదధూళి. వానిమాట జపయోగ్యమగు మంత్రము. ఒక మహామత ప్రవర్తకుడై యత డిట వెల్గుచున్నాడు. అహో! విస్మయ మూర్ఛనమున ముగ్ధుడనగు నాహస్తము లప్రయత్నముగ నుద్ధతములై గౌరవాంజలి గూర్చుచున్నవి. మంత్రిదేవుని మహాప్రజ్ఞకు జోహార్!

రాయలు:—ఓయీ! వికట వ్యాఖ్యాతృ చక్రవర్తీ! అట్టి యతని ప్రజ్ఞాజయకన్య నుత్పాదపీఠి నర్పింపబడిన దేమి?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(గోవిందరాజు పునఃప్రవేశము)

గోవిందరాజు:—జయము మహారాజా! ఆపోర్చుగీసు వర్తకులు తమ కోశరక్షణార్థమై కొంత సైన్యము నుంచుకొనుట కవకాశము నర్థించుచున్నారు.

విశ్వ:—అట్టి సందర్భములో-

రాయలు:— మే మిప్పుడే కార్యాలయమునకు వచ్చుచున్నాము. విచారించెదము.

గోవిందరాజు:—భాగ్యము (ప్రస్థానము.)

రాయలు:—విశ్వపతీ! తొందరపడక ఆలోచించి చెప్పుము. చూచుచుంటివి కదా ప్రతివిషయము నేల-మతీ నాయనుమతిమీద-

విశ్వ:—కర్తవ్యమును పెట్టి వ్యవహరించుటయందువా? అదినే వాని నీతిలోని సూక్ష్మము. సామాన్యముగ నెత్తిపోడుపు మాటలుగూడ పిల్లిమీదనో, యెలుకమీదనో పెట్టినప్పుడు గాని యంద వీాయవు.

రాయలు:—రాజనీతిని నీ వింత చులకన జేయుట తగదు.

విశ్వ:—ఆఁ, రాజనీతి. పరిణామపరమసీమ నతిక్రమించి నప్పుడు దానినే స్వార్థనీతి యనవలెనని శాస్త్రము.

రాయలు:—ఆహా! నిన్ను వినుటకు సహనము నభ్యసింపవలెను. ఇంతకు నీరాద్ధాంత మిప్పుడు నన్నేమి చెయ్యమని?

విశ్వ:—రాద్ధాంతము కాదు. నీ వ్యక్తిత్వమును స్థాపించుకొనుట కిప్పు డెన్ని మార్గములు లేవు! ధనము, సైన్యము, బలము—ఎందులో నీకు తక్కువ? యావదుత్తర భారత సార్వభౌమముమీదను నీవు కన్నెర్ర జేయవచ్చునే. మంత్రి జోక్య మేమియు లేకుండనప్పుడెట్టి మహత్ప్రతాప గౌరవము నీచరణముల బడి జోహారులు చేయును!

రాయలు:—నీవు చెప్పునట్లు మాత్రము నే నేల చేయవలయు? అదిమాత్రము పరాధీనత కాదా? నాయిష్టము వచ్చినట్లు చేయుదు నూరుకొనుము. (ప్రస్థానము).

విశ్వ:—పొమ్ము. తిరస్కరించుచునే తెలివిలేక నాయధికారమును శిరమున మోసుకొనిపోవుచున్నావు. ఆఁ. ఇది వశీకరణవైఖరి యన్న. ఈవిశ్వపతి 'సవాల్' బ్రహ్మకపాల మంటవలెను.

## రంగము ౨

స్థానము: విహారవనకాసారోపాంతతరువీథి.

సమయము: సాయంతనము.

(తిమ్మర్సు, రామకృష్ణకవియు ప్రవేశము)

రామకృష్ణకవి:—ఉత్తరదేశ దండయాత్ర యొకటియే కాదు రాయలవారు సంకల్పించినది, కుమారునికి పట్టాభిషేకము గూడ జేయనున్నారట. ఆపిల్లవాని కింక నేడాదియైన నిండలేదు.

తిమ్మర్సు:—గమనించితిరా! ఎట్టి విషమస్థితులు ముట్టడించుకొని వచ్చుచున్నవియో! కుశాగ్రియబుద్ధు లీసమస్యను పరిష్కరింపుడు. సుడిగాలి, తుపాను విచ్చలవిడిగ జెలరేగినవి. ధూళిస్తంభములు లేచినవి. వానిపై భారభవనము లేర్పడుచున్నవి. అట్టివేళ ఫలాశచే పిట్ట చెట్టు కొమ్మపై గూర్చొన వచ్చునా?

రామకృష్ణ:—చెట్టుదిగి మ్రానితొఱ్ఱలో దూరవలెను. ఓపిక యున్నచో మెడ నిక్కబెట్టి బయలు జూడవలయును.

తిమ్మర్సు:—బాగుగ సెలవిచ్చినారు. "నేను వృద్ధుడనై పోతిని; అందుచే నుద్యోగభారమును నిర్వహింపజాల"నని రాయలకు వార్త నంపితిని.

రామకృష్ణ:—శ్రీవా రంగీకరించిరా యేమి?

తిమ్మర్సు:—అంగీకరించెను. నాస్థానే నాతో సంప్రతించుచు వ్యవహారముల నడుపునట్లు పెద్దనామాత్యులు నియమింపబడిరి.

రామకృష్ణ:—ఔను. మనవిశ్వాసమునకు పెద్దనామాత్యులే యర్హులును, సమర్థులును. కాని,—

తిమ్మర్సు:—ఏమియిట్లు తప్పుకొనుటలో పొరపాటేమియు లేదుగదా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామకృష్ణ:—పారిపోవుటలో గూడ తెలివి తేటలుండవలెనని యిప్పు డెఱిగితిని.

తిమ్మరుస్సు:—అటు కాదు.

రామకృష్ణ:—కాకున్న నేల విడిచి సామా?

తిమ్మరుస్సు:—కార్యవాదము నందలి సూక్ష్మ మదియే. జయలబ్ధి కొకప్పుడు వినుపుకూడ యవసరమే. అట్టివినుపు శతగుణాధికమగు పట్టు నీయగలదు. మాడుడు! ఆవచ్చునది యెవరు? విశ్వపతిరాయలువలె నున్నది. సరి; చిత్రావలి చెప్పెనంటిరే, యేమిటి, ఆకథ యెవరు చెప్పినట్లు?

రామకృష్ణ:—విశ్వపతి చెప్పినట్లు చెప్పినది.

తిమ్మరుస్సు:—మూలము దొరికెనా? అది వానియ హము, మనశ్శాస్త్రకారుల మతము, కలుషహృదయము లెప్పుడో యొకప్పు డెట్లనో యహంకథఁ గ్రక్కకమానవని. వానిపై గన్నుంపవలెనిది నిజమేని నేడు నా కొక ప్రతియోగియు బ్రతిరోధకుడును భువి నుద్భవించినట్లే. ఏమరిలకూడదు. తమరుమాత్రము రాయలను, పెద్దిరాజును జాగరూకులై నడిపించవలెను. పొండు. ఆశాలువ నిట్లిచ్చి పొండు. అవధానిని కావలె. ఒకచిత్రపరీక్ష జేసి యింతలో వచ్చెదను.

రామకృష్ణ:—(శాలువ నిచ్చి) తమరు వచ్చువఱకు గాసారముకడ వేచియుందును. (ప్రస్థానము)

తిమ్మరుస్సు:—విశ్వపతి యిటే వచ్చుచున్నాడు. చిత్రావళికి చెప్పిన యాకథనుబట్టి యాలోచించినచో నితడే యాయద్భుత పురుషుడని యనుమానము కల్గుచున్నది. ఇది రూఢియయ్యెనా, యొకప్రబల దుస్సంకల్ప ధారియై యతడిట జేరియుండుట తథ్యము. నారాజ్యలో నేను కల్గిన యీవికారసృష్టికి వీడే దుష్టబ్రహ్మ కావలెను. ఓహో!

గీ. అతడు నారాజు వాని నాయాసపరచు
భూతమా! దిరి రమ్మ జ్వాలాతితీవ్ర
దాహమంత్ర విభూతి త్వద్దర్పభుజగ
జిహ్వకల వట్టి చిరిమి భస్మీకరించు.

అతడీ దారిని పోవునపుడు నర్మగర్భముగ నెత్తిపొడిచెదను. దానితో గుట్టు బట్టబయ లగును. కను చీకటి నీమాత్రము మార్పు చాలును. గుర్తు పట్టజాలడు.

(విశ్వపతి ప్రక్కగా పోవును.)

తిమ్మరుస్సు:—(మారుగొంతుతో) ఎవరు నాయనా, దృష్టి ఆనటములేదు. ఆపురోహితుని కుమారులు గారూ! చూచినట్టు జ్ఞాపకము—

విశ్వపతి:—(కొన్ని యడుగులు నడిచి దిశలు పరికించి వెనుకకు దిరిగి) ఎక్కడిదీ దీశనపక్షి! ఈ పిశాచము నన్నెట్లు గుర్తించెను? ఏకాంతమును లక్షింపని సాహస మార్ష్య మాహా దీని వఁన నీయరాదు. (కత్తి దూసి మీదికి లంఘించి) చావుము. క్షుద్రనరకీటమా! (కత్తి విసరును.)

తిమ్మరుస్సు:—(ఆవ్రేటు తప్పించుకొని) చచ్చుటకు నాకు శక్తి లేదురా నిర్భాగ్యుడా! (ప్రస్థానము.)

విశ్వపతి:—ఇంతటి దుర్బలత్వము నా కెన్నడును గలుగలేదు. ఇంతటి నీచమర్యాదను పొందను లేదు. ఆహా! నా దైవసామగ్రి నిట్లు ఱెక్కలతో నూడ్చుకొనుచు వికట భైరవస్వరమున పరాజయజ్వరము నూది యెక్కడిదీపాడు ఘూక మిట్లు పోయినది! ఆః! దురదృష్టశాకిని మరల నిట్లు తల నెత్తుచున్నదా! అగుచో, ప్రతివిధీ! ఇదియే నాప్రతిజ్ఞ. అచిరకాలమున నీసింహాసనముపై నన్ను జూడగలవు. నేటికి నాకు ప్రతికూల పిశాచములు కొన్ని లేచిన వన్నమాట. పనిని త్వరగ జక్కబెట్టుకొనవలెను. ఆఁ! నాకా ప్రతిరోధము!

మ. అపరబ్రహ్మను నాకొకండు ప్రతి యో
గా రూఢు డౌనేని మ
త్కపటోపాయ భుజంగ ఫూత్కృతుల కా
కల్ చుట్టునల్రాడి త
ద్వపువున్ భస్మము సేయు నేటికి ప్రగ
ల్భ ప్రౌఢతల్ జాలు వి
శ్వపతిన్ గెల్చు దురాగ్రహోల్బణపు రో
షాల్ సాగిరా వేరికిన్.

(ప్రస్థానము.)

(యవనిక పడును.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రంగము 3.

స్థానము: రాజమందిరాంతర్విలాస భవనము.

సమయము: ఉదయము.

(చిన్నాదేవి ప్రచారము చేయుచుండును.)

చిన్నాదేవి:—

గీ. ఉదయబాలిక నవచరణోత్పలములు
వెలుగు చక్రాల దినవీథి విచ్చుకొనియె
చల్లనై లేలయందాల జల్లుకొనుచు
మలయపవనంబు హాయించి యలరు నహహా!

ఈ యుదయసంధ్య యింత హాయిగ నున్నది. కాని యీ సుఖము నెందుకో యనుభవింప లేకుంటిని? నా ప్రేమ యెంత తీవ్రముగ నాకర్షింపబడినదో యీ హృదయ మిట్లు రెక్కలు కట్టుకొని వచ్చి యిచ్చట వ్రాలినది. ఔను. అతని దాన నగుటకుగాక యీ యనాది ప్రేమ కీ సౌందర్యముతో యిలా వంటిపై జన్మ హేతు వెందుకు! ఆ పౌరుషసముద్రములో ముక్తి నొందుటకు చంగలించి పోవు ధన్యతరంగిణికదా నా జీవితము. కాని యిది యంతర్వాహినియై యిట్లు శోభ లేకయే పోవలెనా? అక్కటా! రెండుసంవత్సరములు కావచ్చినదే, యింతవఱకును నాథునికి నిజమును తెల్పుకొన లేకున్నాను. శత్రురాజు కుమార్తెనని తెలిసిన వారు నన్నిచ్చట నుండనిత్తురో లేదో. వారు నన్ను ప్రాణపదముగ ప్రేమించుచున్నారుకదా, నా కెందుకో యీ భయము! ఔను మంత్రు లొప్పుకొనరని విశ్వపతి చెప్పినాడు: అదే నా భయము. విశ్వపతి యిచ్చట యి ట్లుండుట బాగుండదు. మంచిగా చెప్పినపోడు, గట్టిగా చెప్పుద మన్న, పాపము, చాలమంచిగనే యున్నా డింతవఱకు. కాని అప్పుడప్పు డీ సత్యమును నాథునికి తెలియజేతునని బెదిరింపుతో నాపై నధికారము జూపుచుండునే, నా దౌర్బల్యము ననకాశముగ గొని నా చుట్టు నిట్లొకయురి నల్లినా డన్నమాట యీ విశ్వపతి. (ముందు వచ్చి యొక చీటీ పడును.) ఈ చీటీ ఏమిటి? ఎవరును లేరే! ఏమిటో! "తను పుట్టు పూర్వోత్తర మెరుకపడినది. మీరు పట్టమహిషిగా ఉండవచ్చును. కాని ఆ పురోహితుని కొడుకు విశ్వపతి యింక నిక్కడ నుండరాదు. త్వరలో సాగనంపుడు" ఎవరు వ్రాసిరో? ఆహా! మే మిర్వురమే యనుకొంటిని, మా రహస్యము నింకొకరుగూడ యెఱుగుదురా! వీ రెవరో సామాన్యులై యుండరు. సరే. ఇచ్చటినుండి నాకు తోడ్పాటు రాకపోదు.

(విశ్వపతి నవ్వుచు, ఠీవిగా నొయ్యారముగా నడుచుచు ప్రవేశము. చిన్నాదేవి చీటీని దాచును.)

విశ్వపతి:—ఏమిటో సోదరీమణివారు దీర్ఘాలోచించుచున్నారు!

చిన్నా:—ఏమున్నది—

(సిద్ధాంతిప్రవేశము.)

ఆహా! సిద్ధాంతిగారా? వందనములు. (నమస్కరించును.)

సిద్ధాంతి:—శీఘ్రమేవ పుత్రపట్టాభిషేకసిద్ధి రస్తు.

చిన్నా:—తథాస్తు. అయితే అబ్బాయి జాతకమును చూచి వచ్చినారా?

సిద్ధాంతి:—ఆ! (విశ్వపతిని చూచి) పత్రమో పుష్పమో అన్నారు. ఈదీనుని కానుకను స్వీకరించి మహాప్రభువులవా రనుగ్రహింపవలెను. (ఒకకమలము నొసంగును.)

విశ్వపతి:—ఓహో! విచ్చిన అరవిందము! (ఒక్కొక్కదళమునే చించివేయుచుండును.)

చిన్నా:—శుభముహూర్తము నెప్పు డేర్పరచినారు? దగ్గరలోనే నా?

సిద్ధాంతి:—అట్లా తొందరపడితే దేవేరివారికి నే నేమి మనవిచేయగలను? జాతకమును చూచి ముహూర్త మేర్పరచవలెను గాని—

చిన్నా:—జాతకమును చూచే; కాని కొంచెము దగ్గరలో ఉండేటట్టు చూడండీ!

సిద్ధాంతి:—మరి, అనుకూలగ్రహము లుంటవి, ప్రతికూలగ్రహము లుంటవి. ఏగ్రహమున కేశాంతి అవసరమో!—



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన్నా:—ఎన్ని శాంతులు చేయవలసివస్తే నేమి మన మేమి ఘనలోపము చేతుమా!

సిద్ధాంతి:—ఆఁ, ఆఁ, ఎంతమాట! జాతకము నూఱికే శాస్త్రముతో సంప్రతించుటయే కాని ముహూర్త మునకేమి, యెప్పుడుపడితే యప్పుడే యేర్పరచవచ్చును. శ్రీవారి నిప్పుడు దర్శించి రమ్మందురా! (లేవబోవును.)

చిన్నా:—కూర్చోండి, సిద్ధాంతిగారూ! అబ్బాయి జాతకమును చూచితి మంటిరి, మఱి, యేమియు జెప్పకపోతిరి.

సిద్ధాం:—ఏం చెప్ప మంటారు!

చిన్నా:—భవిష్యమంటాను. ఎంత ప్రతాపవంతు డౌతాడో—

సిద్ధాంతి:—దాని కేమి, మహాప్రతాపవంతులే ఔతారు.

చిన్నా:—అది కాదు: ఏఏ రాజ్యా లేలతాడో, ఎందఱి రాజుల్ని గెలుస్తాడో—

సిద్ధాంతి:—అప్పుడేం చేస్తారో ఆశాస్త్రరహస్య విషయము లిప్పుడు చెప్పుటకు సాధ్యమా!

చిన్నా:—పోనీండి కాని, ఆ చంద్రార్కంగా రాజ్యపరిపాలన చేస్తాడా? ఆమాత్రం చెప్పండి చాలు.

సిద్ధాంతి:—ఆ, పరిపాలిస్తారు. సర్వరాజభోగాలు ఆ బాల్యంగా అనుభవిస్తారు.

విశ్వ:—సిద్ధాంతిగారూ! ఈచెయ్యిని చూచి సాముద్రికము జెప్పగలరూ?

చిన్నా:—పాపం, సిద్ధాంతిగారు భక్తితో కానుకగా యిస్తే ఆపద్మాన్ని అట్లా రేకుల నన్నిటినీ రాల్చి వేస్తున్నా వేమిటి!

విశ్వ:—దీని జాతకమున నాచేతిలో దీనికి దశ దారిద్ర్యము వ్రాసియున్న దన్నమాట. సిద్ధాంతు లయ్యను నివ్వెర బోవుచున్నారు! ఇది యొక వేఱరహస్యము. ఈ ప్రపంచమున మానవుని దృష్టి దేనియొక్క సంపూర్ణ శోభను చూడలేదు. చూచి భరింపనూ లేదు. ఎడబాటులూ, తడబాటులూ, ఈ ఏకోనారాయణత్వములుకూడ యీశ్వర సృజ్యములే. అందుచేతనే యీమానవులు ఖండసుఖోపాసనలోనే కనుమూతలతో దేలిపోవుట చూడుడు! ఈ యరవిందమున నిప్పటి కీరేకులవలెనే శీర్ణవంతులగు నెందఱేకాకు లీప్రపంచమున శోభించుట లేదు? పోనిందు? పుష్కల కుటుంబీకులు తమకెందుకీ ఏకాంతబోధ. ఏదీ కొంచెము జాగ్రత్తగా నా భవిష్యమును చెప్పుడు!

సిద్ధాంతి:—(విశ్వపతి చేతిని చూచి) ఏమి దివ్య హస్తము! ఇట్టి సంపుల్లరేఖా చిహ్నిత హస్తము నింతవఱకు కని విని యెఱుంగను. ఓహో! మహాగొప్ప ప్రభువులు. ఒక్కటొక్కటే విశదముగా మనవి చేసుకొనుటకు సెలవా? ఆఁ. క్షీరనీరన్యాయ మనవచ్చును, చాలా అనుకూలదాంపత్యం.

విశ్వ:—అనుకూలదాంపత్యమా?

సిద్ధాంతి:—ఆహా! కాకపోతే సకృత్తుగా మనఃక్లేశములు—ఆఁహాఁ—ప్రణయకలహముల మోస్తరువి సంఘటిల్లుచు ఉండవచ్చును. అవి సరసులు కాంక్షించెడివే కదా!

విశ్వ:—ఇంతకూ నాభార్య గయ్యాళి అంటారూ!

సిద్ధాంతి:—రామ! రామ! మహాగొప్ప యిల్లాలు, పరమ పతివ్రత—

చిన్నా:—సిద్ధాంతిగారూ! మా అన్నగారికి ఇంకను వివాహము కాలేదు.

సిద్ధాంతి:—నాకు తెలియదూ? వివాహమైతే మాటే మనవి చేస్తున్నా.

విశ్వ:—పోనీయండి. ఆచంద్రార్కంగా నేను రాజ్యపరిపాలన చేస్తానా? అది ఒక్కటి చెప్పండి.

సిద్ధాంతి:—ఆ, చేస్తారు.

చిన్నా:—(నవ్వుతూ) అయితే ఆచంద్రార్కంగా అంటబూ చెయ్యవచ్చునా ఏమిటండీ, రాజ్యాః



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సిద్ధాంతి:—అబ్బే, ఆఁ-దాని కేమి, ఎవరిరాజ్యం వారు చెయ్యవచ్చును.

విశ్వ:—ఏదీ, నా చేతిలో ఆ రాజయోగ రేఖ ఎచ్చట నున్నదో నాకు చూపండి.

సిద్ధాంతి:—(చూచి) ఇదిగో చిత్తగించారూ! ఈ రేఖ రాజ్యరేఖయే. ఇది ఇట్లా కొంచెము విస్తరించి యే యున్నచో తప్పక చక్రవర్తిత్వమే లభించును. ప్రభువు వారొక చక్రవర్తు లయ్యేడివారు.

విశ్వ:—అది లేకున్న కాకూడదా?

సిద్ధాంతి:—ఎట్లా! శాస్త్ర మంగీకరించదు.

(సేవకుని ప్రవేశము.)

సేవకుడు:— శ్రీ వారియాజ్ఞ; సిద్ధాంతి గారిని సత్వరము వేంచేయు మనుచున్నారు.

సిద్ధాంతి:—మహాప్రసాదము. ఆజ్ఞ. (చిన్నాదేవికి, విశ్వపతికి నమస్కరించి ప్రస్థానము.)

చిన్నా:—సిద్ధాంతిగారూ! ఒక మనవి, ఉండండి.

విశ్వ:—సోదరీ!

చిన్నా:—సిద్ధాంతి గారితో ఒకమాట చెప్పి ఇప్పుడే వస్తా.

(ప్రస్థానము.)

విశ్వ:—ఏమి, నే నేల చక్రవర్తిని కాకూడదు? పచ్చలారని యొకపిల్లవాడు, కేవలము జన్మవంశవిశేష మాత్రమున, రేపు చక్రవర్తి యగుచున్నాడే! అమోఘ ప్రతాపుడనగు నే నేల కాను? స్వప్రతాపమునకన్న హస్త రేఖకు గల ఆధిక్య మేమిటి? పోనిమ్ము, శాస్త్ర సమ్మతి యంత యనిరుద్ధమైన యీరేఖ నట్లనే దీర్ఘింపజాలనా? (కత్తితో అట్లొనర్చి) అబ్బా! రక్తము జిమ్మెనదే! ఓః! ఖడ్గముచే నెత్తురోడ్చినగాని యీ యదృష్ట బలాత్కారమున నాకు జయసిద్ధి లేదని యిది సూచన. ఆఁ! దానికిమాత్రము నే నేల సంశయింపవలెను? బాల్యముననే నిర్దోషి నగు నానుండి జననీజనకులను తస్కరించుకొని పోయిన దుష్టదైవముగాని, వంశైకశోభయై, బంధు సర్వస్వమై నా ప్రాణపదమై, యొసంగు కసుగందు నా చిన్ని చెల్లెలిని పాత్తికలతో గూడ నోట గఱచుకొని పోయిన క్రూరవ్యాఘ్రముగాని తమనీచస్వార్థమును దక్కించుకొనుట కేమైన గటకట పడెనా! అకటా! బంధు దారిద్ర్యదుఃఖమును నా శిరమున మొట్టి, నిస్సహాయదైన్య జీవితముద్రను నా ఫాలమున రుద్ది, విధాతయే నన్నీ యుగ్రకర్కోరాటనమున విడిచినాడు. మిత్రవిరోధము, దంపతుల కెడబాటు, బాలవధ, యేత్శుద్రమునకు నే నేల సంశయింపవలెను?

ఉ. అంచిత పద్మపుష్పకుల జ
లాశయమై విలసిల్లు వంశమున్
జించి విధాత వేరుపఱచెన్
నను కౌసుమశోభనుండి యా
వంచన ఘోరనిష్ఠురము
పాలొనరించెను లోక మింక వీ
క్షించెదు నేకదాహవశ
మీ యరవిందమె విచ్చు నాదరల్.

(చిన్నాదేవి ప్రవేశము)

విశ్వ:—సోదరీ! రమ్ము. నేడు నీముఖారవిందమున నూత్నవర్చస్సు వికసించినది. సరి. ఒకమాట: ఏమి, గోవిందరాజు వచ్చినాడా? కుమారుని పట్టాభిషేకము నకు ప్రియురాలవు గనుక మహారాజు నెట్లో యొప్పించుకొన గల్గితివి. ఏది, మంత్రి సమ్మతి వచ్చెనా? ఉదయమునకే తెలియు నంటివే!

చిన్నా:—ఆ సంగతి సరియే; ఈశ్వర సంకల్ప మెట్లున్నట్లు జరుగును. కాని, విశ్వపతీ! నేడు నీ కొక విషయమును తెలుపవలె ననుకొన్నాను. సావకాశముగ వినవలెనని ప్రార్థన. ఒకప్పుడు వ్యర్థమయిపోవు ననుకొన్న నా జీవితమున కొక స్థిరత్వమును కల్పించినది నీవే. నీపుణ్యముననే నా కీసౌఖ్యజీవనము కల్గినది. దానికి బ్రదికియున్నంతవఱకు నీకు కృతజ్ఞురాలనే, కాని నీ వేమియు ననుకొననిచో నిన్నొక్కటి ప్రార్థించుచున్నాను. ఎందుకోగాని నీ విచ్చట నుండుట—

విశ్వ:—కష్టముగ నుండుటచే పొమ్మని వీనికి నీ యాదేశమా?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన్నా:——ఆవేళము కాదు.

విశ్వ:——ఏ వేళము మఱి? (నవ్వుచు) ఎప్పటినుంచి నీబుద్ధి కింతటి మంచిచురుకుదనము కల్గినది! అయితే నన్ను శంకించి యన్నమాట నీవు నీపనిని జక్కబెట్టుకొనుచున్నది.

చిన్నా:——చక్కబెట్టుకొనుట ఏమిటి!

విశ్వ:——కాకున్న యిప్పుడు నీకుమారుని కీపట్టాభిషేక మేమిటి? రాజు దండయాత్ర కేగుచున్నాడు, ఎటు పోయి యెటు వచ్చునో యని. ఔనా?

చిన్నా:—— నన్ను నిందింపకుము నీకు తెలియదా? మా వివాహమునకు ముందు మన మెచ్చటనో యుండుట, మహారాజు రహస్యముగ వచ్చి పోవుచుండుట; అందుచే నా యాభిజాత్యమును శంకించి నన్ను నీచముగ మాట్లాడుచు నాకుమారునికి రాజ్యార్హత లేదని కొందఱు రాజబంధువులే ఏమేమో అనుకొనుచున్నట్లు నీవేకదా చెప్పితివి?

విశ్వ:——అందుచే "మీ కంఠములో ప్రాణ ముండగనే అబ్బాయికి పట్టాభిషేకము చేయరా" అని ఒయ్యారమును కులికించినావు కాబోలు. ఐనను నాకెందుకు, నే నిచ్చట నుండుట యిష్టము లేనిచో చెప్పుము.

చిన్నా:——అది కాదు. నా కేమో—

విశ్వ:——ఈ "నా కేమో" లతో ప్రయోజనము లేదు. కారణము చెప్పుము. బలవంతిముగ నన్నిటనుండి తరిమివేయజాలవు. ఆరహస్యము నీవు నెఱుగుదువు—

చిన్నా:—— నేనే కాదు, ఇంకొకరుకూడ నెరుగుదురు.

విశ్వ:——ఇంకొకరు!

చిన్నా:——ఈ చీటిని చూడుము.

విశ్వ:——(చీటిని చదివి) దీనిని నీకు తెచ్చియిచ్చిన దెవరు?

చిన్నా:——ఇప్పుడే నాకాళ్ళముందు వచ్చి పడినది. ఎవరును కనబడలేదు.

విశ్వ:——పోనిమ్ము. నా కెందుకు? నీయిష్టప్రకారమటులనే వెడలిపోయెదను. నేను నాటిన మొక్క ఫలించినదా? ఆఫలముకూడ లోకమున కెట్లక్కఱకు వచ్చునో యదియు జూచి సంతుష్టితో నేగెదను. ఎల్లకాలము నిల్లే యుండుట నాకుమాత్రి మేమంత శ్రేయమా! కాని ఒక్క ప్రార్థనమాత్ర మున్నది. నన్ను చూచి నీవు భయపడ నక్కఱలేదు. నే నెప్పుడు నొకచోటనే గిరిగీసుకొని పడియుండెడివాడను కాను. నాకు నిత్యనూతన నవీయాద్భుత జీవితము కావలెను. ప్రతి ముహూర్త రసలీల నవనవాభినయనాయకనటాపకాళము, అదియే నా జీవితాశయము. ఇప్పటికే నా కీ రాజ్ఞీసోదర-రాజస్యాలక నాట్యసుఖానుభూతి మొగము మొత్తినది. అందుకొఱకైన ఇప్పటినుండి ప్రస్థానుడ నయ్యెదను. కాని మంత్రినిమాత్ర మొకకంట గని పెట్టియుండుము. ఇప్పుడు నీకుమారుని పట్టాభిషేకముకదా, ఈలోపుగా ఏ ప్రళయమును రాకుండ జూచుకొనుము. నీయనుజ్ఞ నాకక్కఱలేదు. అంతవఱకు వానిని నేను కనిపెట్టియుందును. కుమారరాయలను పట్టాభిషిక్తుని జేసి యేగెదను.

చిన్నా:——అంతటి యవ్యాజ కరుణ నీ కున్న కృతజ్ఞురాలనే.

విశ్వ:——నీకృతజ్ఞతను గోరునంతటి దుర్బలుడు కాడీ విశ్వపతి. వీనిది నిష్కామకర్మలిప్స. (ప్రస్థానము.)

చిన్నా:——వీనినే నమ్మవలదని హృదయము పెనగులాడుచున్నది. ఎందుచేతనో. వీని సామర్థ్యము భయావహము. ఇతడు నా కన్నయుట! మంత్రిని కనిపెట్టియుండుట యెందుకు? అతను నాకేమపకారము చేయును? ఏమో! ఈభయములతోనే నే నీయవస్థను తెచ్చుకొనుచుంటినా! అక్కటా నాస్థితి యెంతకు వచ్చినది!

సీ. సరస శుద్ధాంతవాసము జేయనగు రాజ
కన్యనై మనుగడ గాంచి కటక
రాజేంద్రు వంశమర్యాదకు భంగమే
యనియైన గనక సాహసము జేసి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## హోటేలు మెదుకులు




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## నే నొక రైలుటిక్కెట్టు కొన్నాను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎవనివెంటనో మనోధవు జేర నాగాక
        లేచి వచ్చుట నీపలీల కాదె
జననీజనకు లింక క్షమియింతురే యభా
        గినిని నాప్రాప్తి కే మనెదుహాన
నేబతిప్రత నయ్యు నేపాపముననో
ఇందు మోసము లేక వర్తింపనైతి
అకట దుర్వేశ్యవై ఖరి యయ్యె బ్రదుకు
ఇంక నీగతి నెట్లు తరింపగలనో!

ఆహా! ఈ విశ్వపతి యిప్పటియునికితో నాకూ పిరాడుట లేదే. ఈ గ్రహబాధ యెట్లు తప్పునో.

(రాయలు ప్రవేశము)

రాయలు:—చిన్నా! అప్పాజీ కుమారునిపట్టాభిషేకమునకు సమ్మతి యిచ్చినారు.

చిన్నా:—ఆహా! అయిన నెప్పుడు చేయ నిశ్చయించినారు?

రాయలు:—ఇంక రెండుదినములకు. బుధవారమే కుమారరాయల పట్టాభిషేకమని చాట బంపినాము. సర్వప్రయత్నములును జరుగుచున్నవి. మాయుత్తరదేశ దండయాత్రకూడ నొక్కమాసముదినములలో నున్నది.

చిన్నా:—నాథా! పసివానికి పట్టాభిషేకమేమిటని మొంటి మీ రన్నప్పుడు నా కెంతకోపము వచ్చినది! అప్పుడు మీరు—

రాయలు:—ఆ విషయ మింక తలపెట్టకుము. నీ సంతోషముకొఱ కేమి చేయు మన్నను—

చిన్నా:—పోనిండు— నాసంతోషమున మోహిని దేవతల కమృతమును పంచిపెట్టినట్లు—

రాయలు:—నీప్రేమసుధను నాకు పంచిపెట్టుదువా? దేవీ! నీప్రేమ యమృతమే. నీసౌందర్యము సుధాలోకమే. ఆ యమృతమును గ్రోలి యాలోకమున నానంద విహారము జేయునా కేమితక్కువ? కాని, నీ వెప్పుడైన, హఠాత్తుగ, తటిల్లిత నీలాకాశమున మెఱసి మరల నందు లీనమై పోయినట్లే, సంసారమున మాయమై పోయినచో నిన్నెట్లు వెదుకుకొనగలనో!

చిన్నా:—నాథా, ఇంతప్రేమకదా మీకు నామీద, పూర్వోదంత మింతవఱ కెరుగరుకదా మీరు, ఇప్పుడు— ఏసామాన్యవంశమునకో, విరోధికుటుంబమునకో చెందినది మీ చిన్నాదేవి అని తెలిసిన సహించగలరా!

రాయలు:—ఎందుకు సహింపజాలను? అది తెలిసినంతమాత్రమున ఈ సత్యప్రేమ, శాంతసౌఖ్యము, మోహనసౌందర్యము నేమైన మార్పుగలునా?

చిన్నా:—విన తెలుపమందురా?

రాయలు:—వలదు. నా ప్రణయయాత్రలో మార్గమధ్యమున నీ సహవాసము దొరికినది. ఆ సుఖము నట్లె అనుభవింపక ఎందుకువచ్చిన ప్రశ్నలివి మనోహరీ! సౌందర్యనందనము నజస్రము చాతుర్వక్రతువొనర్చుచు నిచ్చుట నిల్చిన జాలును. ఈ ప్రేమోపాసకుడు సౌందర్యార్చనమున దరింపగలడు.

చిన్నా:—ప్రియా! (భుజమున శిరమునానృచును)

రాయలు:—ప్రేయసీ! (తనభుజముపైనానిన శిరమును కన్నుల కద్దుకొనును.)

(యవనిక)

## రంగము ౪.

స్థానము:—రామకృష్ణకవిగృహము.

సమయము:—మధ్యాహ్నము.

(ద్వారమున కిరుపార్శ్వముల విశాలములగు వేదికలు గలవు. ఒకవేదికకు సమీపమున ద్వారమున కొక మందసముప్రేలాడ గట్టబడి యున్నది. చిత్రావతి ద్వారముముందు నిల్చునియుండును. చేతిలో రెండు తోటకూర కాడలున్నవి.)

చిత్రావతి:—

"మధ్యాహ్నబాలుడూ మల్లెపువ్వాచాయ
మల్లెపువ్వామీద మంకెనపాడిచాయ
శ్రీ సూర్యనారాయణా
మేలుకో హరిసూర్యనారాయణా."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏం మేలుకుంటాడు, నల్లగా ఇట్లా మబ్బులు ముట్టడించి ఉంటే. పాటమార్చనా గోవిందరాజువస్తున్నాడు.

వస్తున్న బాలుడూ బంతిపువ్వూవాయ
బంతిపువ్వూమీద బంగారు పాడిచాయ
గోవిందరాయాగ్రణీ!
నవకుర తేజోమణీ!

(వేదిక ప్రక్క దాక్కొనును.)

(గోవిందరాజు ప్రవేశము)

గోవిందరాజు:—చిత్రావతిపరుగు ఎంతహాయిగా ఉంటో. కదలికచే జారిపోయినయందాల మిలమిల లా సౌందర్యవల్లిని తిరిగి కలుసుకొనబోవునట్లు ఆ అడుగు లలో ఎగిరిమెరిసిపడుచున్నవి. ఆహా! లతలు కదలు నప్పుడో, అలస వీచికలపై కమలమూగునప్పుడో, తేటనీటి తెలిమాటున పద్మనాళము లాడుకొనునప్పుడో, కాని ఆ సౌందర్యము దర్శనముకాదు.

చిత్రావతి:—(గోవిందరాజు వెనుకగా వచ్చి)

వచ్చిన బాలుడూ బంతిపువ్వూవాయ
బంతిపువ్వూమీద బంగారు పాడిచాయ

గోవింద:—లేడిపిల్లకు ఱెక్కలుండి కోకిలకంఠ ముతో పాడుతూ రాగలిగితే అప్పుడు దానిని నీకు పోల్చవచ్చు.

చిత్రా:—కొండకు వాయువేగం ఉండి, ఉలు మునకు మల్లే మాట్లాడగలిగి ఇట్లావస్తే దానికి పోల్చ వచ్చుట నిన్ను. కోపంవస్తోం దిల్లేఉంది. పోనీలే నీకొక సంగతి చెప్పవలె ననుకొంటున్నాను.

గోవింద:— (ఒకఅరుగు మీదకూర్చుని) ఏమిటి ఆ సంగతి?

చిత్రా:—(అతనిప్రక్కనే కూర్చుని)చెప్పకపోతే నిలువనిస్తారూ! అంతా చెప్పి పాడవడం ప్రారంభిస్తారు.

గోవింద:—చెపుమా.

చిత్రా:—ఒక అబ్బాయిని నేను పెళ్లిచేసు కుంటానట.

గోవింద:—అమ్మాయినిచేసుకుంటావని ఎవరూ అనుకోరులే. కాని, ఆ అబ్బాయి యెవరు?

చిత్రా:—నన్నంటావే ఎప్పుడూ "ఉప్పెన, ఉప్పెన, వస్తోం"దని ఉడికిలించడానికి, ఉప్పెనకితగిన వరుడెవరు?

గోవింద:—ఎవరు?

చిత్రా:—ఎవరా ఎవరా పిశాసు

గోవింద:—చిత్రా: నిజముగా నేను వివాహమే చేసుకుందునేని నిన్నే—

చిత్రా:—మా నాయనే, పాపం, ఆశ! పోనీ ఉంగరాలు మార్చుకుందాం. అయ్యో నాకుంగరం లేదే.

గోవింద:—చిత్రా! నీవు నిజముగా ఇదిపిచ్చియా లేక అభినయమా.

చిత్రా:—నిజం చెప్పమంటావూ, అర్జునునికి "శ్రీకృష్ణఉవాచ" అన్నట్లుగా? లోకానికి పిచ్చిదా న్నిగా ఉంటాను అదిగీసిన సున్నాల్లోనే ఒదిగిఉండక పోవడంచేత. కాని కర్మసూత్రమునట్టుప దాసురాల్ని; విజ్ఞాన సరస్వతిని.

గోవింద:—కృష్ణుని గీతలకు భాష్యమునుచేసిన వారు కలరు గాని నీ—

చిత్రా:—అబ్బా! ఏమిటోయ్! నేనొకపాట పాడాలని ఉందిగాని వింటావూ!

గోవింద:—కానీ తప్పేముందీ?

చిత్రా:—సాంతంగా పాడేదాకా నీవు కదల కూడదు. అట్లా అయితేనే పాడతా.

గోవింద:—అట్లాగే.

చిత్రా:—పాట—

దేశాలలో గొప్పదేశ మేదన్న
దేశాలనేలేటి తెలుగు దేశంబె
రాజులలో గొప్పరాజు ఎవ్వండు
తెలుగుభోజుండైన తెలుగురాయండు
మంత్రులలో గొప్పమంత్రియెవ్వండు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంత్రులందఱిమంత్రి మంత్రి తిమ్మరుసు
కవులసిగపూవైన కవిచంద్రుడెవరు
రంగనిభక్తుండు రామకృష్ణుండు

(ఫణితిమార్చి)

అల్లరిచేష్టల అమ్మాయి యెవరు?
చిత్రవేషాల శ్రీ చిత్రావతేను
ఈ మహారాణిని యెవరేలుతారు
పిడుగుమోస్తరు వాడు వీరుడు ఘనుడు
అబ్బాయి పేరేమి? అందఱికి తెలుసు
చెప్పనా? హారతిపట్టుకొచ్చారా?
తెలుపుదగ్గిర పేరు చెప్పమంటారా?
వచ్చారు చిత్రతో—

(గోవిందరాజుని ఒకచెంపకాయవేసి పారిపోబోవును)

గోవింద:—(చిత్రావతిని పట్టుకొని) ఆహా! వన కోకిలకు పాఠము చెప్పుచున్నది నీవాణి! ఈ నిర్మలఫాలముపై, బ్రహ్మ, ఎట్లు సౌందర్యమును విలసించినాడో! ఈ నిర్మలజ్యోతిని ముద్దులతోనే పూజింపవలెను (ముద్దుపెట్టుకొనుచుండును. ఇంతలో రామకృష్ణకవివచ్చును. ఇర్వురు దూరముగా నిల్చుందురు)

రామకృష్ణ:—ప్రధానదండనాయకులా!

చిత్రా:—అట్లాగే కనబడుచున్నారు. ఇంత ఆలస్యముగా వచ్చినారేమండీ నాన్నగారూ! ఇంట్లో ఏమీ లేదు. ఉన్న సోలెడుబియ్యం రంగమ్మగారికి కావాలంటే ఇచ్చేశాను. మళ్లీ కొనుక్కుందామంటే మనధనం అంతా ఇంటులోనే గాదాపరం అందులో ఏమీ లేదు.

రామకృష్ణ:—ఒక ఇంటిదానివి కావచ్చు. గేస్తురాండ్ర ఉపోద్ఘాతాలప్పుడే యేమిటమ్మ నీకు?

చిత్రా:—ఏమిటా? శ్రీ చిత్రావతీ జనకులైన శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణకవి-బ్రహ్మ-చక్రవర్తి-ఈ శ్రీ శ్రీ వారికి వస్తుండవలసి వస్తుందేమో—

రామకృష్ణ:—చిత్రా! 'శాకభుక్కులు, పర్ణభుక్కులు" నన్నారు. అవితరిగినీళ్లలో ఉడకవేయుము. సరసాన్నభోజన సౌఖ్యములభించునో లేదో అప్పుడు చూడుము.

చిత్రా:—నాన్నగారు మంచిబ్రహ్మలు; నేను వచ్చేవంటకు సరస్వతిని సిద్ధంగానే ఉంచానా? కాని పోయిలోకి పుల్లలుకూడా లేవు. ఉన్న కాసినీ పాలేరు కావాలంటే ఇచ్చేశా. సరేలెండి ఏదో ఉపాయంచూస్తాను. వెళ్లివస్తాను. (గోవిందరాజుని చూచి చెక్కిలి నివురుకొనుచు) జ్ఞాపకం ఉంచుకోండి.

(ప్రస్థానము)

గోవిం:—కవిచంద్రమా! తమజీవితము కడుచిత్రమైనది. ఇంతవఱకును నిశ్చేష్టుడనై చూచుచున్నాను. (మందసమున కొన్ని రూకలవైచి) కర్తవ్య మిప్పటికి స్ఫురించినది.

రామకృష్ణ:—దానికేమి, నాన్నగారు సుఖముగనుండిరా?

గోవింద:—అది తెలుసుకొనగోరియే తమయొద్దకువచ్చితిని. నాన్నగారుద్యోగము నేలవిడిచిపెట్టిరి.

రామకృష్ణ:—వృద్ధాప్యముచేత.

గోవింద:—కాదు. తమరు దాచుచున్నారు. మదాంధుడై చక్రవర్తి నాతండ్రి నవమానించెను. దానికి విశ్వపతి కారణము.

(ఒక సేవకుడువచ్చి రామకృష్ణకవికొక లేఖ నిచ్చియేగును.)

రామకృష్ణ:—(లేఖను చూచుకొని స్థిరదృష్టితో గోవిందరాజును చూచుచు, గోవిందరాయా! నీవు క్షత్రవాడవు. యౌవన బలోద్రేకముచే యుక్తాయుక్తము లెఱుగకున్నావు. కొంతకాలము వఱకును నీవిట్టివిషయముల నాలోచింపరాదు. ఇదివఱకే నీప్రవర్తనము నీతండ్రిగారిని చిక్కులపాలు చేసినది. దానిని వృద్ధిచేయకుము. మంజీరనుకూడ పలుమారులు రాజమందిరమునకు పోవలదని నామాటగ చెప్పుము. నీవు ఆవేశపడకుము. మేము కర్తవ్యమెఱుగక పోలేదు. (ప్రస్థానము)

గోవింద:—ఇతడొకవిచిత్రపురుషుడు. యౌవనుడయ్యు వివాహము చేసికొనలేదు. కాని యేమిటో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అపుత్రికా మోహము చక్రవర్తులకును లభించని బాలికా మణిని పెంచుకొనుచున్నాడు. రాజకోశము నందలి ద్రవ్యసర్వస్వము ననుభవించు నధికారమును చక్రవర్తి యొసంగినను తనభాగ్యమును దీనులకొసగి తాను దారిద్ర్యము ననుభవించును. గొప్ప ప్రతిభావంతుడు. పూజ్యభావముచే నీతడును, ప్రేమచే చిత్రావతియు నన్నాకర్షించుచున్నారు. ఇతడు నిరర్థకముగ నెవరికి నెట్టి యుపదేశమును చేయువాడు కాదు. వీరియాజ్ఞ శిరోధార్యమునుగాక! (ప్రస్థానము)

(కొందఱు యువకులు ప్రవేశము)

యువకులు:— గీతిక

తెలుగుదేశము మాది
తెలుగువారము మేము
తెలుగురాయల దేశ
దేశాలనేలాలి
తెలుగు తల్లీ నీకు జోహార్!
తెలుగుజెండా సర్వ
రాజ్యాల నెగురాలి
తెలుగుతల్లీ నీకు జోహార్!

(ఇంతలో తిమ్మర్సు వచ్చి మందసమున ధనమును వైచి నిల్చొనును.)

తెలుగువారంటేను
దేవతలె మెచ్చాలి
తెలుగుతల్లీ నీకుజోహార్!

౧. దు:—శ్రీకృష్ణదేవ మహారాయలకు జయ్!

౨. దు:—అన్ని చరణాలూ పాడకుండానే జయ్!

౩. దు:—అన్ని చరణాలో ఎందుకోయ్! దేశదేశాల్ని ఏలాలి, జెండాపాతాలి, అందరు మెచ్చాలి. అంతే.

౧. దు:—ఆంధ్రప్రజల 'సర్వహక్కు ధనాగారము' నొద్దకేవచ్చితిమి. చక్రవర్తి యుత్తరదేశ దండయాత్రసలుపనున్నారు కదా, మనముకూడ విజ్ఞానదండయాత్ర సలుపవలెను.

౨. దు:—ఔను. పెళ్లాముతో సమముగా నా కుకవిత్వము చెప్పలేవన్ని మందలించినారని తాతగారి మీద కోపమువచ్చి ఎవరితోడను చెప్పకుండా పింగళి సూరన్నగారు కాశీకిపోయి కళాపూర్ణోదయం వ్రాసుకు వచ్చారట!

౧. దు:—కాశీకిపోయి విద్యాగోష్ఠిచేయుటకు సంసిద్ధులైన వారెవరో ముందునకువచ్చి యీ మందసములోని ధనమును తీసుకొనుడు.

౨. ౩. దు:—మేము సిద్ధముగనున్నాము. (అని తీసుకొందురు.)

౪. దు:—(తీసుకొనబోవును.)

౧. దు:—నీవేమి చేసెదవు?

౪. దు:—ఇంటిపట్టుననేఉండి యేదో కృషి జేసెదను.

౧. దు:—నీవు తీసుకొనుటకు వీలు లేదు.

౪. దు:—నేను విద్యావంతుడను కాను, నిర్ధనుడను; భార్య కాపురమునకు వచ్చినది. సంసారము నడువదు—

౧. దు:—నీవు నడు ఇక్కడినుంచి. సోమరిపోతులకు భోగులకు రామకృష్ణకవిగారి ధనమును ముట్టుకొనుటకు హక్కులేదు.

౪. దు:—ఎవరు చెప్పినారు?

౧. దు:—నన్నీజుగారు చెప్పినారు.

౪. దు:—నన్నీజూ లేదు నిన్నీజూ లేదు. నేను తీసుకొనెదను. (మందసముపైపు పోవును. ఇంతలో తిమ్మరుసు అచ్చటనే నిల్చునియుండుటను చూచి తెల్లబోయి) జయమహామాత్యశేఖరునకు, క్షమించుడు నేను కూడ చదువుకొందును.

అందఱు:—అమాత్యశేఖరునకు జయ్! ఆంధ్ర యువకునికి బహుపరాక్! (౪ వ వాని నెత్తుకొని నిష్క్రమింతురు)

(రామకృష్ణకవి వచ్చి యిటు నిటు చూచి)

రామకృష్ణ:—ఓహో!

తిమ్మరుసు:—పరామర్శకాను. జాబువచ్చినదా?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామకృష్ణ:— వచ్చినది. కటకరాజుపుత్రిక యంతర్ధానమై రెండుసంవత్సరములు కావచ్చినదట! కాని యావార్త గోప్యముగ రక్షింపబడుచున్నదట! కుమార్తె లేచిపోయిన దనిన వంశమునకు కళంకమని, గజపతి, కుమార్తెకు జబ్బుగానున్నదని మిష పెట్టి, యెవరు జూడరాదని యొకగదికి సర్వదాఘారాయుంచి తానును రాణియుమాత్రె మప్పుడప్పు డౌషధములగొని నిత్యము ఆగదిలో కొంతసేపు కూర్చుని ఏడ్చుచుందురట.

తిమ్మరుసు:—రామకృష్ణకవి గారూ! నాకు ఒక కాంక్షయుండెడిది. రాయలు దాసీపుత్రుడని యొకనింద యున్నది. అది గజపతియే ప్రచారము జేసెను.

అందుచేనతని పుత్రికనెట్లయిన రాయలకు వివాహ మొన ర్చవలె ననుకొంటిని. గజపతికి సందేశమునంపితిని. కాని యుగ్రుడై యతడు మాదూత నవమానించి పంపెను. ప్రతి క్రియచేయవలెనని యనుకొనుచుండగనే, యతనికుమార్తె "రాయలను మిక్కిలి వలచితి"నని యు"నెట్లయిన తనతండ్రి నంగీకరింపజేసి రాయలకు తనను చేసుకొనవలసిన"దనియు నాకు వ్రాసినది. ఆమెతండ్రికిని నాకును జరిగిన వ్యవహార మాపిల్లకు తెలియదు. నేను రహస్యముగ నాపిల్ల కభయమునుదెల్పుచు నొకవేగులవాని బంపితిని. అతడు వచ్చి నాకీవార్త నప్పుడే యెఱిగించెను. ఒకవేళ నామె యే యీమెయా!

రామకృష్ణ:—ఏమో సంకల్పసిద్ధులు తమరు—

తిమ్మరుసు:—ఇప్పు డనుమానము కల్గుచున్నది. ఆ ఆజ్ఞాపత్రమునందలి యక్షరములపోలిక. ఆపత్రమి ప్పుడు దొరకదే.

రామకృష్ణ:—ఆవేళ నన్నీజుగారికి చూపింతు నని చెప్పుచు మాచిత్రాపతి తీసుకొనివచ్చినది. చిత్రా!

(చిత్రాపతి ప్రవేశించును)

చిత్రా:—నంజయిప్పుడే అయినది. స్నానము చేయండి.

రామకృష్ణ:— మామగారినిమాడనా? మీఅబ్బాయీ మా అమ్మాయీ మనకు వియ్యమును కూర్చెట ట్లున్నారు. చిత్రా! చిన్నారాణి ఆజ్ఞాపత్రమును నన్నీ జుగారికి చూపించినావా?

చిత్రా:—ఆ. తనదేశంవెళ్లినప్పు డందతికీ చూపి స్తానన్నాడు.

రామకృష్ణ:—ఒక్కమారడిగి తీసుకొనీరా.

చిత్రా:—ఇంట్లోకి కుక్కవెళ్లకుండా చూస్తూ ఉండండి. (ప్రస్థానము)

రామకృష్ణ:—ఏదియెట్లున్నను విశ్వపతి నిచ్చట నుండి సాగనంపవలెను. చీటీని పంపియుంటిని. మహారాణి యేప్రయత్నమున నున్నారో.

తిమ్మరుసు:—మహారాణి యంతులకు సమర్థురాలని నాకు తోచుటలేదు. వీనిచే నామె యెట్టియురిలో చిక్కువడియున్నదో?

రామకృష్ణ:—మనమే యామెకేల ప్రత్యక్షముగ తోడ్పడరాదు?

తిమ్మరుసు:—అదికూడను. విశ్వపతి యుద్వాసము కాదు మాకుముఖ్యముగ కావలయునది. నారాజు యథాపూర్వముగ నాకు జిక్కవలెను. ప్రళయమెట్లును పొంగినది. దానిమున్మర మెంతవఱకో అదియు చూచెదము. ఈవిశ్వపతి సామాన్యుడు కాదు. వీనిసంబంబంధమున నెట్టియగ్నిరగులునో నారాజులో కొరవడియున్న యేశిక్షణ సంపూర్తి కాగలనో అది మనకు ముఖ్యము.

(చిత్రాపతి ప్రవేశించును.)

చిత్రా:—ఇదుగో ఆయనకు మళ్లీజాగ్రత్తగా ఒప్పజెప్పాలిట! నాన్నగారండీ! ఈసంగతి విన్నారా? చిన్నారాణి, అబ్బాయిని ఒళ్లో కూర్చోపెట్టుకుని ముద్దులాడుతూంటే, విశ్వపతిగారేమో అక్కడికివెళ్లి, "మేనల్లుడా! నీవు రాజువౌతున్నావు; ఈ బొమ్మను తీసుకొని నీకిరీటమిస్తావా" అని అబ్బాయిగారి బుగ్గగిల్లారట. రాణీగారు విలవిలించుకుందట. పిల్లవాడేడుస్తూంటేనైనా ఊరుకోవచ్చునా, ఈకోతిబావగారు, పైగానవ్వుతూ "సరేలే! రాత్రి నిద్రపోతూంటే దాచేస్తాలే" అని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెళ్లిపోయారట. చిన్నారాణిముఖం ఇంతచేసుకుని కంటతడి పెట్టారట.

రామకృష్ణ:—ఒక్కపని చేసుకురమ్మంటే ఊరంతా చక్కబెట్టుకుని వస్తావు. ఎవరుచెప్పినారు.

చిత్రా:—దారిలో దాసీ కనబడి చెప్పింది.

రామకృష్ణ:—సరేలే. పో, (చిత్రావతి ప్రస్థానము.)

తిమ్మరుసు:—కవిగారూ! విశ్వపతి హాస్యము గూడ నర్మగర్భముగనే చేయును. పాపము సాధ్యమైనంతవఱకు సత్యమును చెప్పవలెననియే వాని సదుద్దేశము. ఆఁ, హా..

రామకృష్ణ:—ఈయుదంతము నుండి యేమియో విషయోగమును సిద్ధాంతీకరించుచున్నారు!

తిమ్మరుసు:—ఔను. ఆ క్రూరుని మేలములో కుమారునిహత్య ధ్వనించుచున్నది. సాయంతనము చిత్రావతి నొకమారుపంపుము. తరువాత చెప్పెదను.

(ప్రస్థానము.)

(యవనిక)

---

# ముగ్ధసుందరి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

కొట్టుదునె? తిట్టుదునె? నిన్నుఁగోమలాంగి!
కూర్మిమైఁ జెక్కిలిని ముద్దుఁగొంచుఁగాని
కటికరానేలఁ గూర్చుండు కందిపోవ
గాత్రలత, నాదు నంకభాగంబు లేదె?
నను సమీపింపవలదు పొమ్మనుచుఁ గసరి
నానె? యెదుఁగుచు దా దాలకరిగ దేల?
శిరసుపై కెక్క కని శిక్ష సేసినానె?
మొగమువాంచి చరింతువు ముద్దులాఁడి!
నీదు ముఖచంద్రమునిఁగాంచి నిశ్చయముగ
సంతసింతునుగాని యసహ్యపడను

నీదుమృదుభాషలకు మెచ్చి నిన్ను గౌర
వింతుఁగాని చీకొట్టను బెట్టిదముగ.
భవ్యముగ నన్నుఁ గనవచ్చు త్వత్కటాక్ష
ములకు స్వాగత మర్పించి పూజసేతు;
అల్లకుల దేవతలఁబోలె నాదరింతు
గాని న్యక్కారమును జూపఁబోను దరుణి!
లేమ! సౌందర్యలాభ్యమా? లేక మాగ్ధ్య
మా! భవిష్యత్ప్రణయకోపమధురనాట్య
మా! తిరస్కారమా! యేదొ మదికిఁ దెలియ
నకట! నాదు చేతిలకు దోహదము లేదు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏ క వీ ర

విశ్వనాథ సత్యనారాయణ గారు, యమ్. ఏ.

[ఒకమాట-ఇందు, మధురనాయకులు, కుట్టాణ్, డినోబిలి వీరు చరిత్రలోని పురుషులు. ఊళ్ల పేరులు సంఘస్థితి ఆనాటిది. 'Nayak Kings of Madura' and 'Aravidu Dynastty' ఈ రెండు పుస్తకములు దీనిలోని చరిత్రాంశములకు నాకాధారభూతములు. ప్రేమసంబంధమైన తక్కినకథయంతయు కల్పితము. ఏకవీరాదేవి త్యాగింద్రియము యొక్క స్పర్శగుణములోని మహాకోమలత్వము, స్వచ్ఛత్వము, ఒకానొక విశిష్టమైన గుణము నీ చిన్నిగ్రంథములోని యుద్దిష్టార్థములు. ఇందు చరిత్రాంశములు, చరిత్రేతరాంశములు నతుకుట పనిగా పెట్టుకోబడినది. ఈరెండు విడిగా చూచిన జరిత్రాంశములు విడిగా గనబడును.]

౧

అది వేసగి. వైగై నది కృశించి ప్రోషితభర్తృకవలె సన్నగిల్లినది. ఈనది పుట్టుకకు కారణముగా మధురానగరమున సేవించియున్న శ్రీ మీనాక్షీ సుందరేశ్వరుల వివాహమునకు సంబంధించిన యొక్కకథయున్నది. మీనాక్షీదేవి పాండ్యరాజు కొమరిత; పార్వతీదేవి యవతారము. ఆమె పుట్టిననాటినుండి లోకనాయకుడును, నాదిభిక్షువు నగు శ్రీ సుందరేశ్వరునే వరించియున్నది. ఆమె బుద్ధి మరలించుటకు శక్యముకాక రాజుకూడ నామెను సుందరేశ్వరున కిచ్చుటకు సమ్మతించెను. ఆమెయన్నగారి కిష్టమే లేదు వివాహమునకు శ్రీ సుందరేశ్వరులు తరలి వచ్చినారు. పరివారము లేదు; బందుగులు లేరు. ఆదిభిక్షువు తానొక్కడే వచ్చినాడు. తనకు తగినట్లుగా నెంతయో పెద్దగా వివాహప్రయత్నము చేసిన పాండ్యరాజు నిస్సారపడిపోయినాడు. చేసిన ప్రయత్నములు చూపి, తెచ్చినపదార్థములు చూపి యివన్నియు నేమికావలెనని యల్లుని నిందించినాడు. పరమేశ్వరుడు నవ్వి తన వెంట గొనివచ్చిన యొక కుఱ్ఱవానిని చూపి యాపదార్థము లన్నియు నాకుఱ్ఱడు భుజించునన్నాడు. అతడొక రాక్షసుడు. అతని పేరు కుండోదరుడు. అతనిలో భగవంతుడు క్షుధాగ్నిసహస్ర ముఖంబులుగ ప్రజ్వలింపజేసినాడు. కుండోదరుడు సకలపదార్థములు నారగించి దాహమని యరచినాడు. మధురలోని బావులు చెరువులు చాల లేదు. కుండోదరుని చేయి పట్టుమని పరమేశ్వరుడు తన శిరోభాగమున భాగీరథీ మహాప్రవాహము నడ్డగించు జటాసమూహములో నొక జట సడలించినాడు. ఆరీతిగా పరమేశ్వర జటావివరాగ్రవినిస్సృతయగు గంగానది మధురాసమీపమున వైగై నదియై



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రవహించినది. పర్వతాగ్రముల నుండి ప్రవహించు సెలయేటివలె వైఁగై మిగుల తొందరకత్తె. వైఁగై యనగా ద్రావిడభాషలో 'చేయిపట్టుము' అని యర్థము.

ఆనాడు కుండోదరుని దాహము కొన్ని బిందువులతో మాత్రము తీర్చిన యాపుణ్యనది నేడు వేసగి కాకలకు సగమైపోయినది. వైఁగై మధురాపురి కొకదిక్కున కందకము వలె నైనదే. తక్కిన మూడువైపుల కోటగోడయు, గంధకము నున్నవి. నది నిండుగా ప్రవహించు నపుడు చిన్న యోడలు నదిలో తిరుగుచునే యుండును. కొంతవర కానది పైన వర్తకముకూడ జరుగుచుండును. ఇపుడు నది క్షీణించి యుండుటచేత చిన్నిచిన్ని పడవలు నది యిసుకతిన్నెలమీద నందందు వదలిపెట్టబడి యున్నవి.

వైఁగై చిన్నపాయగా కొబ్బరి నీళ్లవలె తళతళలాడుచు ప్రవహించుచున్నది. నదికి దిగువ భాగమున నొకపెద్దగుండ మున్నది. అది వేసంగిలోగూడ మిక్కిలి లోతుగానే యుండును. ఆగుండములోననే యేనుగులను కడుగుదురు. ఈ గుండమునకు పైగా నొక చోట నదిలోననే యొక చిన్న చెలువువలె నొక గుంట యేర్పడియున్నది. రాజాంతఃపురములకు నిత్యమును మంచినీర మీగుంటనుండి మహిషరాజములమీద తోలుతిత్తులతో తీసికొని పోవుచుందురు. ఇంకను నెగువ వర్షర్తువులో పడవలు నిలుచుచోటు. అంతకుపైనపట్టణమునకు చివరిభాగమున నిసుకతిన్నెలు మొగలి పుప్పొళ్లు చల్లి సిద్ధముచేసిన విశ్రాంతిస్థలమువలె నుండును. అచ్చటికి సాయంకాలములయందు పట్టణమునుండి విద్యార్థులు, రాజకుమారులు, పండితులు వచ్చి విశ్రమింతురు. సాంధ్యకాలములయందు విద్యార్థులు సంధ్యావందనములు చేసి శాస్త్ర ప్రసంగములు చేయుచుందురు. రాచకొడుకులు, వయసుపోకిళ్ల బిరుదుమగలు తమయశ్వారోహణ విద్యావైశద్యము చూపుచుందురు. కొంచెము ప్రొద్దుపోయినంత టనేయందఱును పురప్రవేశము చేయవలయును. నిశాభాగమెల్లను నాచోట రక్షకభటులు కృపాణపాణులై తిరుగుచుందురు జాముప్రొద్దుపోయినవెంటనే కోటతలుపులు మూసెదరు. తరువాత నొక ప్రాణి లోనుంచి బయటకుగాని, బయటనుంచి లోనికిగాని పోవుటకు వీలులేదు.

ఆనాడు కృష్ణచతుర్థి. సందె చీకటి. కొంచెము చీకటి పడువరకు వైఁగై నదీసికతాతలములన్నియు నిశ్శబ్దములు, నిర్మానుష్యములు నయ్యెను. కాని దూరమున విశ్రాంతిస్థలము లైన యిసుకతిన్నెలమీద నిద్దరు మాత్రము కూర్చుండి మాటలాడుచుండిరి.

'వీరా! నాకేమియు సుఖము లేదు. ఆ కార్యము మూన్నాళ్లు నాపిల్ల తలుపుదగ్గర నిలుచుండి నిలుచుండి చివరకు కొంగుపరచుకొని యందే పండుకున్నది. నే నామెవంక నైనను చూడలేదు. ఆమెవంక చూచుటకు నాకు బుద్ధిపుట్టలేదు. ఆమెకై చూడవలెనని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



హా ర తి

చిత్రకారుడు : శ్రీ వి. ఆర్. ఖాస్ ఖేల్, కలకత్తా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెప్పుడేని సంకల్పించిలినా నామెదుట నేను ప్రేమించిన యాదివ్యసుందరి సాక్షాత్కరించెడిది. ఇప్పుడు కూడ నదిగో నామెదుట నా ప్రణయమూర్తి. ఆహాహా?' అని కుట్టాన్ కనులవెంట నీరు పెట్టుకుని యేదో మనోమూర్తిని చూచుచున్నట్లుగా శూన్య దృక్కులను చాచెను. వీరభూపతి హృదయము మిక్కిలి చలించినట్లుగా నతని దేహ మొక వింతకదలిక వెల్లిగక్కించెను.

కొంతసేపైన తరువాత మరల కుట్టాన్ 'వీరా! ఆమె యెంత యందకత్తె. అంత సౌందర్యము భూలోక దుర్లభము. ఆమె దేహాంచలరేఖ లెంత విస్పష్టముగా నున్నవి. దినదిన మేదో పనిపెట్టుకొని వారియింటికి వెళ్లుచుంటిని. ఆ నెలనాళ్లు నెంతతొందరగా గడచిపోయినవి. ఇంతలో మాతండ్రి నన్ను రమ్మని కబురంపినాడు. నేను వెళ్లక తప్పదు. నేనే సామాన్య సంసారములోనో పుట్టినచో నాకామె యింతదూర మయ్యెడిది కాదు.' అని మరల కన్నీరు కార్చ జొచ్చినాడు.

'ఇప్పుడు నీవు మరల నచ్చటికి పోరాదా?' అని ప్రశ్నించినాడు వీరభూపతి, తన యెడమ చేయి యెడమచెక్కిలి కాన్చి, మోచేయి తొడమీద నుంచుకొని.

కుట్టాన్—'నే నెందున్నానో యెచ్చట నున్నానో, యేరోజున నేమిచేయుచున్నానో నిత్యము నాతండ్రికి తెలియఁజేయు చుండవలెను గదా. ఈ రాజధానిలో నేను లేకున్నచో నది నిమేషములో రామనాదుకు తెలియును' అని యొక్క నిట్టూర్పువుచ్చి 'వారియిల్లు మా మేనమామల యింటికి మిక్కిలి సమీపములో నున్నది.' అను నర్ధోక్తిలో వీరభూపతి 'అది యేయూరు' అని ప్రశ్నించెను. కుట్టాన్ ఆమాట వినిపించుకొనకుండ, 'నేను మొదట వారి యింటికి వెళ్లుచుండుట వారు నామంచితన మనుకొనిరి. క్రమక్రమముగా తెలిసినకొలది వారికి భయమైనది. నా మేనమామ, యాయనభార్య యీ విషయము తెలిసికొన్నారు. మాతండ్రి కబురువచ్చినది.' అని, 'ఛీ! ఛీ! ఈ జన్మ మెందులకు. నాకోర్కి యింత యలభ్యమైనదని తెలిసి కూడ నేను బ్రతికియున్నాను చూడు.' అని కుట్టాన్ పొంగివచ్చుచున్న దుఃఖమును గొంతులో స్తంభింపజేసెను. ఆపాం గణగనిచ్చి వీరభూపతి 'ఆమె నిన్ను ప్రేమించుచున్నట్లు నీకేమైన తెలిసినదా.' అని ప్రశ్నించినాడు. కుట్టాన్—'అయ్యో!' అని కొంచె మాగి మరల నిట్లు చెప్ప మొదలుపెట్టెను. 'తంబిచ్చి నాయకు డెదురు తిరిగినపుడు మొదట కృష్ణప్పనాయకుల వారి సహాయము చేసిన చిన్న కేశవనాయకునకు మాతాత కుడిభుజము వంటివాడు. అప్పు డాయన చాల పెద్దయాస్తి సంపాదించినాడు. మా మేనమామకు చాల దొడ్లు తోటలు నున్నవి. వారి యింటికి ముందుగానే మామామ పెద్దదేవాలయము కట్టించినాడు. కాశినుండి మాతాత విశ్వేశ్వరాచ్చ లింగము తెచ్చి ప్రతిష్ఠచేయించకుండగనే చని



SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయినాడు. మామామ యాలింగము నే ప్రతి ష్ఠించినాడు ప్రక్కనే స్వామికి 'పుష్పతోట' యున్నది. అ పిల్ల నదివరకు నేను రెండు మూడు సారులు చూచితినిగాని యామె నన్ను చూడలేదు. వారు పెద్దధనవంతులు కాకపోయి నను గౌరవకుటుంబము. ఆమె యొకనాడు 'పుష్పతోట'లో పూలుకోసుకుని దండగాచుట్టి వచ్చుచున్నది. నేనామెతో 'నెట్లామాట్లాడు నది' యని యెదురుచూచుచుంటిని గాన తొం దరగా నామె కెదురుపోయి 'శివద్రవ్యము తీసి కొని పోరాద'ంటిని. ఆమె నన్ను పూర్వము నిదానించి చూడలేదు గాని నే నెవరో యెఱు గును. నే నీ మాటయనినంతనే నావంక నిదా నించి చూచి భయపడినట్లు కనబడినది. నేను చిఱునవ్వు నవ్వితిని. ఆమె మరల నొకయర్ధ నిమేషములో పెదవులపైకి చిఱునవ్వు తెచ్చు కుని యా పూలదండ నాకాళ్లపై విసరి యచ్చ టినుండి పరుగెత్తుకుని పోయినది. నేను నీకీ మాటలు చెప్పుచున్నానే గాని యీ ప్రతివా క్యము నాహృదయమున శూలమువలె దిగబడు చున్నది. వీరా! ఎంతనిర్భాగ్యుడను. 'ఆపూల దండ—'కుట్టాన్ మాటాడలేక పోయినాడు. వెక్కివెక్కి యేడ్వ మొదలిడినాడు. వీరభూ పతి యతనిని కౌగిటిలోనికి తీసికొని, 'సేతూ! ధైర్యము పురుషలక్షణము. మనభాగధేయ ములకు మనమా యధికారులము? అయ్యో! ఏడువకుము.' అని యోదార్చెను.

కుట్టాన్—'అపూలదండ తీసికొని పోద మని నాకు బుద్ధి పొడమెను. కాని వంగితీసికొన బోగా శివద్రవ్యమనిపించినది. ఊరకే యింటికి పోయితిని. నాప్రియురాలి హస్తస్పర్శ పొందిన యాదండయే కృతార్థము. ఇంటికి పోతిని గాని మరల నాపాదములు స న్నచటికే లాగినవి. ఎంతసేపు; అరగడియకూడ గాలేదు. ఆపూల దండ యచ్చట లేదు. నాహృదయము వినిర్భి న్నమైనది. వీరా! ఆదండబడు లచ్చట నొక త్రాచైన పండుకొని యున్నదికాదు. ఆత్రా చును మెడలో వేసికొని యేమై యుందును?'

కుట్టాన్ కుడిచేయి వీరభూపతి కుడిచేతిని పట్టుకొని యున్నది. కుట్టాన్ వీరభూపతిచేయి నొక్కినాడు. కుట్టాన్ దేహమంతయు వణకి పోయినది. ఆచీకటిలో వీరభూపతి కుట్టాన్ దురవస్థను కనులార చూచుచునే యున్నాడు.

వీర—'సేతూ! నీవిప్పు డిట్లు దిగులు పొందరాదు. నీవు మరల వివాహముచేసి కొంటివి. ఆమె నీప్రాణము కుస్సురనును. నీవిప్పుడు నీభార్యను ప్రేమించవలసియున్నది! ఈ ప్రేమయంతయు నీభార్యపై మరల్పరాదా!'

వీరభూపతి యీమాటలు మనసా అన లేదు. కుట్టాన్‌స్థితి యతనికి దుర్భరమనిపించి నది. అతని హృదయోద్వేగమున కేదో యొక యడ్డు చెప్పినగాని కుట్టాన్ మంచిస్థితికి రాడని యతనికి తోచి యిట్లన్నాడు.

కుట్టాన్ వీరభూపతియన్న యీమాట విననతోడనే, 'వీరా! వీరా! ఏ మన్నావు? ఆ ప్రేమ యీామెమీద కెట్లు మరల్పవచ్చును? ఈవైరాగ్యనది మా రాఘునాథ తటాకములో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయిపడుచున్నది. ఏదీ యీనదీవేణి నిట్లు త్రిప్పి యింకొక ముఖముగా ప్రవర్తింపజేయుము. నా ప్రేమ నీ కంత సులభసాధ్యమైనదిగా కనబడుచున్నదా! కాదు కాదు.' అని వంగియున్న తన దేహమును నిలువుగా చేసిదీర్ఘ నిశ్వాసమును విడిచెను. అతనిముఖము గంభీర మయినది. వీరభూపతి కుట్టా నంత వీరుడు కాక పోలేదు. కాని యిప్పటి కుట్టాన్ మొగము జూచి వీరభూపతి చలించిపోయెను. వీరభూపతి యతనిని చూచి 'ఇతడు దేనికి సమర్థుడు కాడు? ఇతడు తలచుకొనినచో పడిపోయిన విజయనగర సామ్రాజ్యము మరల సాధించి మధుర నాయకులచే నేలించు నేమో' యనుకున్నాడు.

అప్పుడు వైగైయిసుక తిన్నెమీద దూరమున నొక సుడిగాలి రేగి, వారిదగ్గరగా నీల వేయుచు పడవలు నిలుచుచోటునకు దాటి పోయినది.

కొంతసేపటిలో కుట్టాన్ వదనము మరల విషాదపూరిత మయ్యెను. వీరభూపతి యింక నుండగూడదని 'పోదమా' అన్నాడు.

కుట్టాన్ 'వీరా! ఈదుఃఖము నాహృదయ శోణితమును త్రాగుచున్నది. ఈ ప్రేమనన్ను లోపలలోపలనే తినివేయుచున్నది. నే నింక చాలనాళ్లు బ్రదుకను.'

వీరభూపతి—'అశ్లీలములు పలుకకుము' అని 'సేతూ! ఇది యేమి, నే డింత మనసుపేద వైనావు? నీశౌర్యము, నీపౌరుషము నేమైనవి' అన్నాడు. దూరమునుండి 'ఎవరక్కడ' యని కేక వినంబడినది.

వీరభూపతి 'కుట్టాన్ సేతుపతి మహారాజు' అని యఱచినాడు. దూరమున రక్షకభటుడు మరల మాటాడలేదు. వీరభూపతియు కుట్టానును లేచి పురములోనికి పోవుచున్నారు. కుట్టాన్ వీరభూపతిమీద వ్రాలి నడచుచున్నాడు. వీరభూపతి నెమ్మదిగా చెవిలో, 'సేతూ! ఇంతధైర్యము వదలెదరా ? ఎవరికి తగిన కష్టము వారికి నున్నది. నాహృదయములో నెంత మహాగ్ని రవులు కొనుచున్నది! అది నీకు తరువాత చెప్పెదను' అన్నాడు.

కొంతదూరము పోయిన తరువాత నిరువురును విడివిడిగా నడచినారు. పట్టణము కోటతలుపువద్ద నశ్వశకటము వేచియున్నది. ఇరువురు నాశకటములో నెక్కి పట్టణములోనికి పోయిరి. రాజసౌధములకు సమీపమున నొక పెద్దతోట ముందు కుట్టాన్ దిగి వీరభూపతిని వారి యింటివద్ద దింపి రమ్మని బండివానితోఁ జెప్పి తా నింటిలోనికి పోయెను.

౨

కుట్టాన్ ఇరువంకల వివిధములైన పుష్పఫలవృక్షము లున్న బాటవెంట తన సౌధములోనికి బోయెను. ఆసౌధము తనతండ్రిది. రాజ్యములోనున్న పెద్దపెద్ద సరదారులందరకు మధురలో ప్రత్యేకముగ నంతఃపురములున్నవి. కుట్టాన్ తండ్రి శ్రైకదేవ ఉదయన్ సేతుపతి; ముత్తుకృష్ణప్పనాయక మహారాజులుం గారి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రధానమంత్రులలో నొక్కడు. ఉదయన్ సేతుపతి యీసౌధము మధురలోనున్న గొప్ప కట్టడములలో నొకటి. మీనాక్షీ దేవాలయములో నెంత శిల్పమున్నదో యీసౌధమునను నంత శిల్పమున్నది. చీకటిలో శిల్పపరీక్ష సాగదు.

కుట్టాన్ లోనికి పోయినంతనే సేవకు డరుదెంచి, 'ప్రభూ, స్నానమునకు నీరు సిద్ధముగానున్నది' అనెను. కుట్టాన్ తనగదిలోనికి పోయెను. అందు దాను బ్రవేశించుటతోడనే యెదురుగా నున్న నిలువు టద్దములో దన మూర్తి తనకు గోచరించెను. మొగమంతయు బాష్పకలుషితమై యుండెను. గదియంతయు దీపముల వెలుతురుచేత ధగద్ధగాయమానముగ నుండెను. కుట్టాన్ పైయుత్తరీయము తీసి తన కెడమ వైపుననున్న గోడపై చిలుకకొయ్యకు తగిలించెను. ఆచిలుకకొయ్య యొక్క గొప్ప మరకతోపలముతో చేయబడినది. దాని చిలుకతనముకన్నులుగాను, ముక్కుగాను నేర్పరుపబడిన మూడు మాణిక్యములతో సంపూర్ణమయ్యెను. ఇట్టి చిలుకకొయ్యలు గదిగోడలకు నాల్గువైపులను కలసి యెనిమి దేర్పరుపబడి యున్నవి. గోడలయందు ద్రావిడశిల్పమునకు ప్రధానచిహ్నము లయిన గోష్ఠపంజరము లున్నవి. ఒక గోష్ఠపంజరములో ద్రావిడభాషలో శ్రీరామచంద్రుని చరితామృతము ప్రవహింప జేసిన కంబన్న విగ్రహము రాతితో చెక్కిన దమర్పబడి యున్నది. దాని కెదురుగా బశ్చిమదిక్కుడ్యమునం దమర్పబడిన పరొక గోష్ఠపంజరములో శ్రీకృష్ణదేవరాయల వారు శ్రీవిశ్వనాథనాయకుల వారికి మధుర నిచ్చుచున్న ట్లుగా చెక్కబడిన రెండు శిల్పపు విగ్రహము లమర్పబడి యున్నవి. దక్షిణపువైపున నొక చిన్నయరుగు రాతితో జెక్కబడి యున్నది. దానిపైన మెత్తని రత్నకంబళము లమర్పబడి యున్నవి. ఆ యరుగున కెదురుగా నొకచిన్న చిత్తరువు గోడకానించబడి యున్నది. ఆచిత్రము పెద్దన్నగారిది. వీరభూపతి యీచిత్రమును వ్రాసి కుట్టాన్‌కు బహుమతిగా నిచ్చెను. కుట్టాన్ అంగీ యూడదీసి యింకొక చిలుకకొయ్యకు తగిలించి యీవితర్దిపై గూర్చుండి పెద్దనగారి చిత్రమువైపు చూచుచుండెను. కొంచెము సేపుండి లేచి తనపుస్తకము లున్న చోటికి పోయెను. కంబ మహాకవి విగ్రహమున కిరుప్రక్కల నొకవైపున తమిళభాషా గ్రంథములును, నొకవైపున నాంధ్ర సంస్కృత గ్రంథములును మెఱు గెక్కించి నగిషీ చేయబడిన సన్నని మెత్తయిన బల్లలపై నమర్చబడి యుండెను. అన్నియు తాటాకుల మీద వ్రాసిన గ్రంథములే.

కుట్టాన్ తా నెందుల కాపుస్తకము లున్న చోటికి వచ్చెనో తెలిసికొనలేక పోయెను.

ద్వారమునుండి 'ప్రభూ! స్నానము చేయుడి' యని ధ్వని వచ్చెను. కుట్టాన్ గది వదలిపెట్టి స్నానమునకు పోయెను.

ఆ మహాసౌధమునకు పశ్చాద్భాగమున నాల్గుపోక బోదెల నడుమ కొంచెమెత్తయిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చంద్రకాంతపు రాతిపై కుట్టా నాసీనుడాయెను. ఇరువురు సేవకులు రెండు పెద్దబిందెలలో నొకదానినిండ వేడినీరును, మరొకదాని నిండ చన్నీళ్లను తెచ్చి యతనికి నీరువోసిరి. స్నానముచేసి కుట్టాన్ దేహము తుడుచుకొనుచుండెను. (అతడు తుడుచుకొనుట లేదు. సేవకులే తుడుచుచుండిరి.ఇది రాజాచారము.) అప్పుడే చంద్రు డుదయించుచున్నాడు. మంచి గంధపుపొడిచే సమ్మిశ్రితమైన సున్నిపిండిచేత రుద్దిన యతని దేహము కమ్మనివాసన లతనికే చాల ఆనందము కలిగించెను. ఇంకొక సేవకుడు కస్తూరి కలిపిన యొక కమ్మని నూనె చేతులకు రాచుకొని యతని తలవెంట్రుకలకు రాచెను. ఈ కమ్మని వాసనలచేతను, ఉదిత చంద్రకిరణ శైతల్యము చేతను కుట్టాన్ మనస్సు కలక దేరిన ట్లయ్యెను.

భోజనముచేసి కుట్టాన్ సౌధపురోభాగమున నున్న మంటపములో గూర్చుండెను. దాక్షిణాత్యశిల్పము పల్లవులనాటి కన్న చోళులనాటికి, చోళులనాటికన్న విజయనగర రాజులనాటికి నంతకంత కభివృద్ధి పొందుచు వచ్చినది. తంజావూరు మధురాపురముల శిల్పమును దాక్షిణాత్య శిల్ప చరిత్రలో విజయనగర శిల్పమునుండి విడదీయరు. తంజావూరు మధురల శిల్పము విజయనగర శిల్పముకన్న నెక్కువ వృద్ధిపొందినదని చెప్పవచ్చును. మన కథాకాలమునాటికి, ననగా ముద్దుకృష్ణప్ప నాయకుని కాలమునాటికి, నది యాధునిక శిల్పముగా మారబోవు పరివర్తనమునం దున్నదని చెప్పవచ్చును. పల్లవులనాడు రథములును, చోళులనాడు గోపురములును, విజయనగర రాజులనాడు మంటపములును దాక్షిణాత్య శిల్పమునందు ముఖ్యములు. ఆయా రోజులలో నవి వృద్ధిపొందినవి. ఉదయర్క సేతుపతి తన యీ దివ్యసౌధము ముందు గొప్ప మంటపమును కట్టించి తనకు శిల్పవిద్యయందున్న యభిమానమును వెల్లడించు కొనెను.

ఆ మంటపములో పరచియున్న రత్నకంబళముపై కుట్టాన్ ఆసీను డయ్యెను.

ఆ పలుచపడుచున్న వెన్నెల ధారలలో నామంటపమునం దాసీనుడైయున్న యారాచకొడుకును చూచిన నమరావతిలో జయంతుడు మన్మథమంటపమునం దున్నట్లు చూపట్టకమానదు.

దూరమునుండి వీరభద్రభట్టరు కుట్టాన్ను చూచి యతడు సంతుష్టుడై యున్నాడనుకొని వినయముతో సమీపించి, 'ప్రభూ! పండుకొనుటకు వేళ యైనది' యన్నాడు. కుట్టాన్ కొంచెము కోపదృష్టితో నాతనివంక చూచెను గాని పోకచెట్ల మొవ్వల వెనుకనున్న వెన్నెలనీడలో వీరభద్రభట్ట రది చూడలేదు.

వీరభద్రభట్టరు కుట్టాన్ సత్ప్రవర్తన కలిగియుండునట్లు చూచుట కేర్పడిన యధికారి. కుట్టాన్ ఇతనికి తెలియకుండ నేపనిని చేయరాదు.

కుట్టాన్ లేచి లోనికి పోయెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ దివాణములో జాము గంటలు కొట్టిరి. అందఱకు నిద్రావేళ యయినది.

కుట్టాన్ పడకగదిలోనికిబోయెను. పడకగది విశాలమయినది; ముందున్న మంటపమంత యున్నది. పైకప్పు మిక్కిలి యెత్తుగానున్నది. ఇది సౌధములో రెండవ యంతస్థునందున్నది. గోడలనిండ గచ్చుపని చేసియున్నది. చిత్రచిత్రవర్ణములతో లతలు, చిలుకలు, చెట్లు గీయబడి యున్నవి. గోడలనిండ నొకవరుసగా ననేకచిత్రములు వ్రేలాడుచున్నవి. ఆచిత్రములన్నింటిలో మొగలులచిత్రవిద్యాచిహ్నములు స్పష్టపడుచున్నవి. పురాణకథ లనేక విధములుగా కుడ్యములనిండ చెక్కబడి యున్నవి. తూర్పుగోడయందు నొకచిన్న గూడుగా నేర్పరుపబడి యందొకరత్న ముంచబడినది. ఆ రత్నకాంతులు గది నంతయు తెల్లని వెలుగులో ముంచియెత్తినవి. గోడలవెంట చంద్రకాంత శిలావితర్దికలు, గొప్పపనికలిగినబల్లలు నుంచబడి, వానిపైన సువాసనాద్రవ్యములు, దంపతుల కానందమిచ్చు కొన్ని చిత్రములు, అద్దములు, చిలుకలు సమర్పబడియున్నవి. ఆగదికి వెనుకవైపున పెద్ద గవాక్షమున్నది. ఆ గవాక్షమునుండి దొడ్డిలో నెత్తుగావేయబడిన మల్లె జాజి పందిరుల మీది సువాసనా భరితమైన చల్లనిగాలి యుండియుండి లోనికివచ్చుచున్నది. ఆగవాక్షమువద్దనే పెద్దమంచ మున్నది. ఆ మంచము పందిరిస్తంభములు మహాశిల్పమును సూచించుచున్నవి. ఉపానము, పద్మము, కుముదము, వేదిక, నాగబంధము, కలశము, 'పుష్పబోదిగ' యన్నియు కొద్దిలో నా నాల్గు కంబములు సర్వసుందరముగా నున్నవి. పందిరి నుండి యనేక రత్నములు వ్రేలాడుచున్నవి. మంచము మిక్కిలి యెత్తుగా నుండి పైన వేయబడిన మైదుపరుపులవలన మానిసియెత్తున్నది. మంచముపైకి పోవుటకు మెట్లున్నవి. మంచము తలవైపున, కాళ్లవైపున ప్రక్కగా రెండు స్తంభము లున్నవి. ఆ రెండు స్తంభములు మంచమెత్తుననే యున్నవి. తలవద్ద కంబముపైన యొకబంగరు పళ్లెరమున తాంబూల ద్రవ్యములు, సువాసనా ద్రవ్యములు నుంచబడినవి. పందిరికంబమున నున్న నాగబంధమునందు రెండుసుదీర్ఘములు, మందారకుసుమగుంఫితములు, సంగతలవలీకిసాలములునగు మల్లెపూవుల దండలు వ్రేలాడుచున్నవి. సెజ్జనిండుగ మల్లెలు జాజులు దట్టముగ జల్లబడి యున్నవి. ఆమంచము ప్రక్కగా నింకొక మంచ మంతయెత్తు లేకున్నను సమానమైన సౌందర్యము కలది యున్నది. అందు మల్లికా సుమంబులు వెదజల్లి లేవు.

కుట్టాన్ పాముకుబుసములవంటి పంచె లొకటి కట్టుకొని యొకటి పైన వేసుకున్నాడు. యథాప్రకారముగా దన పెద్దమంచముపై పండుకొనుటకు పోయి మెట్లెక్కినాడు. ఒత్తుగా పరచిన మల్లెపూవులలో నేకవీర గోధుమవన్నెత్రాచువలె ముడుచుకుని పండుకున్నది. కుట్టాన్ నిర్ఘాంతపోయినాడు. ఏకవీర యెప్పుడును తనమంచముమీద పరుండలేదు. ఆమె కాపురమునకు వచ్చి మూడు నెల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లైనది. ఆమెను పతి పలుకరించలేదు. పతి నామె పలుకరించలేదు. పెద్ద మంచముమీద కుట్టాన్, చిన్నమంచముమీద నేకవీర; ఇట్లు మూడునెలలు గడచినవి. నేడిది యేమి? ఏకవీర కుట్టాన్ శయనించు మంచముమీద పండుకొని నిదురపోవుట కెట్లు సాహసించినది? ఏకవీర నిత్యమును నాకుపచ్చవారణాసిచీర ధరించును. పైన బంగరుటంచు కాశ్మీరపుసేలువ పైముసుంగిడుకొనును. ఒడలినిండ వెలలేనినగలు ధరించును. నేడిదేమి? తెల్లని పట్టుకోక కట్టి పరిమితభూషణములు ధరించినది. మేనగంచుకము లేదు. అభ్యంగము చేసినది కావలయును. శిరోజములు పొడిపొడిగా నుండి చల్లగాలి కల్లలనాడుచుండెను. తలంటి పోసుకున్నది, యొడలు తెలియక నిద్రపోయినది.కుట్టాన్ మిక్కిలి కోపము పొందెను. 'ఈదౌర్భాగ్యురాలు నాశయ్య నలంకరించగలదా? ఇన్నాళ్లనుండి లేనియాశ దీనికి నేడేల పుట్టవలయును?' ఏమహాసౌందర్యరాశి నా శయ్య విభాగించుకొనవలయునో యామెకు నాకు నీజన్మమున కలయికయే లేదు. నన్నీపిశాచ మావేశించినది. అయ్యో! ఈదయ్యము నన్నెట్లు వదలును?' కుట్టాన్ కుకొంచెము కోపము తగ్గినది.'అయ్యో! నాకీమె సహధర్మచారిణి కదా! ఈమె నన్ను వదలి యెచ్చటికి పోవును? ఇన్నాళ్లుగా నేను మాట్లాడకుండ నుండిన నెంత శోషిల్లినదో. నాతో నొక్కనాడు పలుకలేదే! స్త్రీ యెట్లు పలుకరించును? పురుషుడు తన యందు విముఖుడుగా నున్నపుడు స్త్రీకి తూష్ణీంభావమే ప్రధానము.' ఇంతలో కుట్టాన్ నేత్రములు మూతలుపడినవి. ఎట్టయెదుట నాతనిహృదయమాకర్షించిన లతాంగిరూపము సాక్షాత్కరించినది. కుట్టాన్ ఆ జగన్మోహన విగ్రహమును చూడలేక పోయినాడు. తటాలున కనులు తెరచినాడు. కనులలో నిండుపగింజలంత బాష్పములు నిలిచినవి.

ఏకవీర కదలినది. మూతపడిన యామె రెప్పలమీద గుడ్లుపోసినట్లు చిన్నిచిన్ని స్వేదబిందువులు నిలిచినవి. ఆహా! ఏ మావదన సౌందర్యము! కొండపైనుండి దూకు సెలయేఱు ప్రాతఃసూర్యకిరణములలో ధగద్ధగితమయినట్లున్నది. కుట్టాన్ సమ్మోహితుడైనాడు.

ఇదివరకు కుట్టాన్ ఏకవీరను పరిశీలించి చూడలేదు. ఆమె సౌందర్యవతి యనియే యనుకొనలేదు. అప్పుడప్పుడు 'ఆమె సౌందర్యవతియే యనుకొందము. అయిన మాత్రము నా కేమి? నాహృదయ మామెది కానేరదు.' అనుకొనుచుండును.

ఏకవీర పమ్మెద తొలగినది. కుట్టాన్ కనులు మూసికొన్నాడు. తన ప్రణయిని యెదురైనది. శోకములో కోపము తరుముకొని వచ్చినది కుట్టాన్ మహారాజునకు. అన్యాయ్యముగ తనశయ్య నాక్రమించుకొన్న ఏకవీరను క్రిందకు లాగివేయుద మనుకొన్నాడు. ఏకవీర దొంగనిద్రపోవుచున్నదని భావించినాడు. కోపముతో నత డామెచెక్కిలిపై శత్రుమారణసమర్థమయిన హస్తమును తీవ్రముగా విసర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బోయినాడు. అతనికి తెలియకుండగనే మహా బుద్ధిమంతుడగు కుట్టాన్ కరపద్మము పువ్వుల దండవలె నేకవీర చెక్కిలి కంటినది.

ఏకవీర యులికిపడి లేచినది. ఇద్దరు నిస్తబ్ధులై యున్నారు. ఏకవీర మనసులో నను కున్నది: 'నాతండ్రి నాకీసంబంధము చేసి నాల్గు నెలలైనది. ఈయన యింతవరకు నామొగము చూడలేదు. కార్యమునాడు కొంగుపరుచుకుని తలుపుదగ్గరనే పండుకుంటిని. నా గారామంత యు నిట్లయినది. ఈ క్రొత్తప్రదేశమునకు నేను లాగుకొని రాబడితిని. నాకు దిక్కు లేదు. మాటాడువారు లేరు. దాసీలతో నారహస్య ము నేమని చెప్పను? దినదినము మాగదిలోని యనుపయుక్తపదార్థములను చూచి దాసీలు నవ్వుకొను చున్నారు; నన్నడుగు చున్నారు. ఏమియు జెప్పలేకుంటిని. ఈ వివాహమునకు బూర్వము నాహృదయ మింకొకనియందు లగ్నమయినది. అత డెవ్వరో యేయూరివాడో తెలియదు. మానిసి సాధారణ కుటుంబము లోనివాడుగా నున్నాడు. అతనిని వెదకి లాభ ము లేదు. నాపుణ్యమువలననే నాకీ కుట్టాన్ సేతుపతి లభించినాడు. అతనికన్న ముంద యితనిని చూచిన నెంత బాగుండెడిది? ఇప్ప డైన నేమి? ఇతనినైన నకల్మషహృదయము తో సేవించగలను. ఇతనికి నాయందు ప్రేమ లేదు. ఇతనిప్రేమ కోసము కృశించి కృశించి యీనాడు సాహసించి యీశయ్యపైన పండు కున్నాను; నిదురపట్టినది. నాయీ సాహ సమున కిత డేమకున్నాడో?' ఈ భావము లన్నియు నేకవీర మనస్సులో నొక్కసారి మెఱుపువలెమెఱసినవి. కుట్టాన్ అనుకొన్నాడు: 'ఈమె యెంత యందగత్తె! నన్నుచూచి యెంత లజ్జపడుచున్నది. ఇప్ప డేమి చేయను? ఇన్నాళ్ల నుండి నాతప్పు మన్నించుమందునా? ఛీ! ఛీ! ఆనాప్రియురాలియెడ నేనంతతప్పుగా ప్రవర్తిం తునా! ఈహృదయ మామె కిదివరకే యర్పి తమైనది. ఇంక నొరుల కిది యీయజాలను!'

ఏకవీర నెమ్మదిగా మోకాళ్ల మీద లేచి పందిరికంబమున నాగబంధమునకు తగిలించబ డిన మల్లెపూదండ యొకటి తీసి యొక యర్థని మేషములో లజ్జావనతవదనయై కుట్టాన్ మెడ లో వేసినది. ఆ పూమాల మెడలో పడినదో లేదో, కుట్టాన్ రుద్రమూర్తి యైనాడు. తాట కనుచంపుటకు రామచంద్రుడు ధనుస్సు నంతవ డిగా లాగెనో లేదో, ఆపూలదండను కుట్టాన్ అంతవడిగా రెండుగా త్రెంచి నేలమీద విసరి నాడు. ఏకవీర మంచముపైన విరుచుకుని పడిపో యినది. ఇంక కొంచెమైనచో క్రిందబడెడిది, నిలువెత్తునుంచి తల పగిలిపోయి యుండును. కుట్టాన్ కన్నులనీళ్లు గిర్రున తిరిగినవి. కుట్టాన్ మెట్లుదిగి చిన్నమంచముపైన పోయి పండుకు న్నాడు. వెక్కివెక్కి యేడ్చుచున్నాడు.

ఏకవీరకు నిమేషములో నొడలు తెలిసి నది. పతి పజ్జలేడు. తన చిన్నమంచముపై బండుకున్నాడు. తాను మంచము తొందరగా దిగి, కంచుకము ధరించి, సాధారణముగా దాను ధరించుచీర తాల్చి యొడల నన్ని భూషణము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రస్తుతకాలమందు ప్రపంచమం దంతటను విస్తరించియున్న అనేక కళలకు పరిశోధనములకు భారతదేశమే ప్రథమ ఉత్పత్తిస్థానమని తెలుపబడుచున్నది. మరియు 49 సం॥ ములనుండి జగత్ప్రసిద్ధమైన

## ఆతంకనిగ్రహమాత్రలను

గురించి కూడ ఆమె యుప్పొంగుచున్నది. ఇవి మెదడు చీకాకుగానుండుట, మలబద్ధకము, ఇంద్రియ, మూత్రసంబంధమైన వ్యాధులన్నిటిని కుదుర్చుచున్నది.

**32 మాత్రలుగల డబ్బా 1-కి రు 1 మాత్రమే**

ఇతర వివరములకు మా మద్రాసు కార్యాలయమునకు వ్రాయవలెను.

ఆతంకనిగ్రహ ఫార్మసి, మద్రాసు ఆఫీసు.

**26, బ్రాడ్వే.**

---

## బంగారుతరుణం! బిరబిర రండు!

ఇనాంగా గడియారమును పొందుడు



చక్కని 14 కారెట్ రోల్డుగోల్డు సన్నని పాలీ పొదుగబడిన ముద్దులొలుకు ఫౌంటెన్ కలం ధర రు 2-8-0 లు

వి. పి. చార్జీ రు 0-6-0.

## మెం. ఎస్. సరస్వతీ అండు కో,

సాహుకార్ పేట, మద్రాసు.

---

# అమృతప్రభ

అనేకరోగములను రూపుమాపి ఆరోగ్యము నిచ్చుచున్నది.

---

ప్రతిగృహమున నుండుటవలన సంజీవి యున్నట్లు భావింపనగును. ఏవ్యాధియైనను, బాధయైనను, ఏకాలమునందయినను సంభవించినరోగము ఫలానిదని తెలియకున్నను అమృతప్రభను వెంటనే సేవించిన రోగమును పెరుగనివ్వదు. సర్వకాలసర్వావస్థల యందు ప్రతికుటుంబములోను తప్పక యుండుట అవసరము.

రోగము చెప్పిరాదు.

ఏవ్యాధియైనను సంభవించినప్పుడు తక్షణమే ఔషధసాహాయ్యము పొందనియెడల ధనవ్యయము, రోగికి ప్రాణాపాయము కలుగుచున్నవి.

యీక్రిందిరోగములకు అమృతప్రభ రోగబాణము:—

| | |
|---|---|
| చెవినొప్పి | వమనములు |
| పంటినొప్పి | ఇన్ఫ్లూయన్జా |
| తలనొప్పి | అతిసారము |
| వాయువు | అజీర్ణము |
| తేలుకాటు | దగ్గు |
| కాట్లు | ఉబ్బసము |
| కలరా | కడుపునొప్పి |
| విరేచనములు | జ్వరము |
| | రక్తక్షీణత |

నేడే ఒకబుడ్డి తెప్పించి పరీక్షింపుడు.

## నేషనల్ కెమికల్ డ్రగ్గుకంపెనీ,

21, బజారుగేటు వీథి, ఏ.

Post Box 268 బొంబాయి.

రోగములను దరికి రానియ్యదు. వచ్చినదో రూపుమాపుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొక్కోకము! కళాశాస్త్రము!! రతి రహస్యము!!!

అని యుద్రేకపూరితోత్సాహముతో కలవరించువారు, ప్రణయరస మహిమ తెలియచేయు పుస్తకములు లేవని పలవరించువారు, తృప్తిపొందునటులు - ఆనందము ననుభవించునటులు వెలువడిన యత్యద్భుత గ్రంథము. భోగానందము పొందుట కెదురుచూచుచుండు పురుషులకు ప్రత్యక్ష ఫలస్వరూప మీ గ్రంథరాజము. లోకమునగల స్త్రీలును పురుషులును నొక్కవిధమైన ననురాగము కలవారై ఒకరిపై నొకరు నిజనురాగము కలిగి, యొకరినొకరు చేపట్టి, కూడి యానందించి, సత్సంతానమును పొంది, గృహస్థధర్మములను సక్రమముగ నిర్వర్తించుచుండ యిందే నిజమైన యానందము కలదు; ఇట్టి సంతోషమయజీవితమును పొందుట కనువైనయటులు మన ప్రాచీనులు కొక్కోకము, వాత్స్యాయన కామసూత్రములు, కామకళాశాస్త్రము, మరి పలుగ్రంథములను సంస్కృతమునను దేశభాషలందును రచించియున్నారు. పై యన్నిగ్రంథములలోని సారాంశముల నెత్తి గృహస్థులు తప్పక చదువుటకై కూర్పబడిన శాస్త్ర మిది.

# ముద్దుల మర్మము

గ్రంథకర్త్రి: శ్రీమతి ప్రభావతీ కుమారి.

సంసారమును ఆనందమయముగ చేయుటకై యపేక్షించు భార్యాభర్తలు తక్షణమే

యీ యమూల్యగ్రంథరాజమును కొని చదువుడు.

వెల రూ. 1-0-0 తపాలుచార్జి 0-4-0 అణాలు.

ఎం. ఎస్. రాములు అండు కంపెని, పుస్తకవ్యాపారులు, రాయపురం, మదరాసు.



# వేనవేలు వాడుకలో నున్నవి



పెట్టర్ ఆయిల్ ఎంజినులు, పంపింగు, లైటింగు ప్లాంటులు. అన్ని పనులకు ఆదర్శనీలమైన పవర్ యూనిట్లు చిక్కులేనిది, నమ్మకమైనది, మితవ్యతమైనది.

క్రాంప్టన్ ఏ. సి. &. డి. సి. మోటారుల డైనమాలు, ఫాన్లు, రైసుహల్లర్లు, వి డి భాగములు, పిండియంత్రములు, చెరుకునుండి రసము తీయు యంత్రములు ఆయిల్ ఎక్సుపెల్లరులు, రోటరిఆయిల్ యంత్రములు లేతీలు, డ్రిల్లింగ్ మెషినులు, వ్యవసాయ పరికరములు, సెంట్రిఫ్యూగల్ పంపులు, పుల్లీలు, బెల్టింగులు, షాఫ్టింగులు, పెడెస్టలులు ల్యూబ్రికేటింగు చములులు, సినిమా ప్లాంటలు, ఎలెక్ట్రిక్ లైటింగు & జనరేటింగు సెట్లు, వగైరాలు మావద్ద గలవు. ధరలకు, ఇతరవివరములకు ఈ దిగువ విలాసమునకు వ్రాయుడు.

## మద్రాసు మెషినరి మార్టు పంపకదారులు,

1/22, బ్రాడ్వే, మద్రాసు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను పెట్టుకొని, కాశ్మీరసేలువ ముసుగిడి, కన్నుల నీరు గ్రమ్మగా తన చిన్నమంచమువద్దకు పోయి, రుద్ధమైన కంఠమునుండి మాట పెగుల్చుకుని, 'ప్రభూ! మీరు తమ మంచముపైననే పండుకొనుడు. నే నిందు పండుకొనెదను' అన్నది.

ఆమెవంక తిరిగి కుట్టాన్ చూచుసరికి యతనికన్నులు గిర్రున తిరిగిపోయినవి. హృదయము సహస్రధా విశీర్ణమైనది. కుట్టాన్ తాను చేసినపనికి చాల నొచ్చుకున్నాడు. ఏకవీరను కౌగిలించుకొని యామె శిరస్సున బాష్పాభిషేకము చేయవలె ననుకున్నాడు. ధైర్యము చాలలేదు. కుట్టాన్ నెమ్మదిగా లేచిపోయి తనమంచముపై నిదురించినాడు. ఏకవీర కన్నీళ్లతో చిన్న మంచముపై నున్న నాలుగుపరుపులు నడుగుదాక చివికిపోయినవి. ఏరాత్రివేళనో యామెకు నిద్రవచ్చినది. తెల్లవారుకడ కుట్టాన్‌నకు మెలకువ వచ్చినది. ఏకవీర యున్నదో లేదో యని యామె మంచమువంక జూచినాడు. ఆమె యందే వాడిపోయిన మందారమువలె మంచమున కంటుకొనిపోయియున్నది.

మఱునాడు దాసీలు నేలమీది పూలదండలు చూచి సభయనేత్ర లైరి.

3

మఱునాడు కుట్టాన్ నిదురలేచి కాల్యకృత్యముల దీర్చికొని, రతనాల జీను వేసి సిద్ధముగా నుంచబడిన యశ్వముపై నెక్కి కోటవెలుపలిభాగమునకు పోయెను. అచ్చట నదివరకే సమావేశమై నానామండలాధిపుల కుమారులు బారులు దీర్చి నిలుచుండిరి. మొదట తిరుచునాపల్లి మండలాధిపుని కుమారుడు. అతడు తెల్లనిగుఱ్ఱముపై నధిరోహించియుండెను. వయ సిరువదియేండ్లుండవచ్చును. తెల్లనియంగీ. తలపైన పచ్చలసరము చుట్టుననున్న యుష్ణీషము. అతనిపజ్జ తిన్నెవ్వేలి మండలాధిపుని కుమారుడు. అతనిపజ్జ సత్యమంగలమండలాధిపుని తనయుడు. వీరిరువురు సమానవయస్కులు; చూచుట కన్నదమ్ములవలెకూడ నుండిరి. అనంతరము మానామధుర మండలాధిపతియొక్కయు, శేందమంగళ మండలాధిపునియొక్కయు కుమారులు జోడుకోడెలవలె నిలుచుండిరి. వారిరువురు మేనత్త మేనమామలబిడ్డలు. పోలికలు రేఖలు నొకటిగానున్నవి. ఇరువురకును పదునెనిమిదేండ్లు దాటలేదు. వారిగుఱ్ఱములు భూమిమీద నిలుచుటలేదు. వారు బాలకులయ్యు నెంతయో పరిశ్రమగలవారివలె తా మెక్కిన యుత్తమజాత్యశ్వములను, తమ దేహములను కదలించుచు, పాదములను చాచుచు నడుపుపెట్టుచుండిరి. ధారాపుర, మారమంగళ, శేల, కణ్ణివీడు, పాలెగాండ్ల కుమారులు తరువాత వరుసగా నిలువబడియుండిరి. ఇంక ననేకమంది రాజకుమారులుండిరి. అంద రెక్కినవియు నుత్తమజాతిగుఱ్ఱములు. అందరి దేహములయందును వెలలేని భూషణములు. ప్రతివాని మొగమునందును శౌర్యలక్ష్మి. కుట్టాన్ పోయి వీరందరకును



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొట్టమొదట తనగుఱ్ఱమును నిలువబెట్టెను. తరువాత ప్రధాని కుమారుడును, రాయసం కుమారుడును వరుసగా వచ్చి వారియుచిత స్థానములయందు నిలువబడిరి. రాజసైన్యము బారులుతీర్చి వీరికి దూరము గా నిలువబడి యుండెను.

ఈరాజకుమారులుతీర్చిన బారున కెదురుగా నొకముసలి యుద్ధవీరుడు తెల్లని గడ్డమును, మీసములును భీష్మాచార్యభ్రాంతి గల్పింప, మహోన్నతమైన శ్వేతాశ్వముపై నెక్కి నిలువబడియుండెను.ఆయన వీరందరికి శిక్షాగురువు. మధురనాయకుల రాజ్యములలో దళవాయి ప్రధాన సేనాపతి.ఉదయన్ సేతుపతి కుట్టాన్ తండ్రి దళవాయి. మొదటి ముప్వురనాయకుల కాలములలో మహామేధాశాలియగు నార్యనాథుడీ పదవియం దుండెను. ఈపాండ్యపార్థివ ముద్దుకృష్ణ నృపతికి ఉదయన్ సేతుపతి దళవాయియైనాడు. ఉదయన్ సేతుపతి మహాసమర్థుడు. గొప్ప సేనాని. రాజకార్య నిపుణుడు. సేతుపతులు నాయకులతరమువారు గాదు. పాండ్యరాజులనాటినుండియు మధుర రాజులకు మండలాధిపులుగ నున్నారు. రామనాథప్రాంతమున నున్న దేశమంతయు వీరి వశమున నున్నది. రామేశ్వరమునకు పోవుమార్గములో చోరభయ మెక్కువై తైర్థికులకు మిగుల కష్టములుగానుండుటచేత నుదయన్ సేతుపతి యెక్కువ కాల మాప్రాంతముననే యుండవలసివచ్చినది. ఆయన లేని కాలములో సైన్యమంతయు నీ వృద్ధసింహముచేతిలో నుండును. ఈయన పేరు కస్తూరి రంగప్పనాయకుడు. విశ్వనాథ నాయకుని మనుమడైన వీరప్పనాయకునకు ముప్వురు కుమారులు: రెండవ కృష్ణప్పనాయకుడు, విశ్వప్ప, కస్తూరి రంగప్ప. ప్రస్తుతము రాజైన ముద్దుకృష్ణప్పనాయకుడు విశ్వప్ప కుమారుడు. కస్తూరి రంగప్ప ముద్దుకృష్ణప్ప రాజ్యమునకు రాకపూర్వము రాజ్యాపహారణము చేసినందున నతనిని ప్రజలు సంధ్యామంటపములో మడియించిరి. ఈవృద్ధసింహ మా కస్తూరి రంగప్ప నాయకునకు బావమరంది. ఈయన పేరు కస్తూరి రంగప్పయే. ఈయన ప్రస్తుతరాజు నెడల నభిమాని.

ఆవృద్ధుని కంటిచాయనుండి రాజకుమారు లొకరొక్కరే ముందరికి వచ్చి బాకువేయుటలో తీయుటలో, కత్తి ఝుళిపించుటలో విసరుటలో, గుఱ్ఱమును దుమికించుటలో నురికించుటలో తమ ప్రావీణ్యమును చూపిరి. తరువాత నీరాజకుమారులందరును సైన్యమువద్దకు తీసికొనిపోబడిరి. కస్తూరి రంగప్ప నాయకులు కుట్టాను పిలిచి సైన్యముచేత సర్వతోభద్ర వ్యూహము పన్నించుమన్నాడు. కామందకుడు సర్వతోభద్రవ్యూహము శత్రుహృదయ నిర్భేదక మన్నాడు. కుట్టాన్ తత్క్షణమే వ్యూహమున కురమును, కక్షులును, కోటియు, జఘనమును సంపాదించి యచలాకృతి నిలువ జేసినాడు. పొదలవలె పెరిగిన ముసలి కస్తూరి రంగప్పనాయకుని తెల్లని కనుబొమలలో సంతోషపు కదలిక గలిగినది. వృద్ధవీరుడు కుట్టాన్‌తో 'నాయనా, సైన్యముయొక్క జ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జఘన మాపత్తులో నున్న యెడ నే వ్యూహము పన్నెదవని యడిగెను. కుట్టాన్ సమాధానము చెప్పకుండనే సర్వతోభద్ర వ్యూహమును మకరవ్యూహముగా మార్చి వృద్ధపండితుని సంతోషింపజేసెను. అనంతరము తక్కిన రాజకుమారులందరును క్రమముగా శ్యేనసూచీ శకట వజ్రవ్యూహాదులను పన్నియు రంగప్ప నాయకున కానందము కలిగించిరి. కుట్టాన్ కతులు లేకుండ నొకవ్యూహము పన్ని రంగప్ప నాయకునివంక చూచెను. రంగప్ప 'వహ్వారే' యని మెచ్చుకొనెను. అనంతరము జాముప్రొద్దెక్కగా రాజకుమారు లెవరితావునకు వారు పోయిరి. సైన్యము కస్తూరిరంగప్ప యధీనమున కొంత సేపు మెలగి నియమితస్థలములకు పోయినది. కుట్టాన్ గృహమునకు బోయి మరల స్నానమాడి భోజనాదికములు నిర్వర్తించుటకు సౌధాంతర్భాగమునకు బోయెను. ఎట్టని కాశ్మీరశాలువ ముసుగులో ప్రక్కగా బోవుచున్న ఏకవీరను చూచెను. కుట్టాన్ వచ్చుచున్నాడని తెలిసి యామె తొందరగా పోదొడగెను. కాని మంజీరము కాలికి నొక్కుకొనగా కొంచెము నిలుచుండి వంగి సర్దుకొనక తప్పినది కాదు. కుట్టాన్ ఆమె లేతమలపాకుల వంటి చేతులు కాళ్లు పరీక్షగా చూచెను. అవి యంత సుకుమారములా! కుట్టా నసుకొననే లేదు. భోజనానంతరము కుట్టాన్ తాను చదువుకొను గదిలోనికి బోయెను. కుట్టాన్ చేయి యప్రయత్నముగా కౌటిల్యుని యర్థశాస్త్రము మీదికి పోయెను. తీయగనే యంతఃపుర రక్షణము గురించిన వాక్యములు వచ్చెను. కామందకుడును, కౌటిల్యుడును నీవిషయములో నొక్కటే యభిప్రాయులై యున్నారు. కౌటిల్యుడంతఃపురరక్షణమును గురించియు, నంతఃపురమునుండి రాజునకు వచ్చు నాపదల గురించియు తెలియజేయుట కెట్టి యుదాహరణల నిచ్చెనో కామందకుడుగూడ నవియే యిచ్చెను. తన భార్య గదిలో దాగియుండి యతని తమ్ముడు భద్రసేనుని చంపెను. తల్లిశయ్యక్రింద నడగియుండి కారూశనృపతి నతనికొడుకు సంహరించెను. కాశీరాజును, వైరాంత్యుని, సౌవీరుని వారిభార్యలే చంపిరి. — ఇది చదువు వరకనవసరముగా కుట్టానునకు భయము కలిగెను. కుట్టాన్ మరల ధైర్యము తెచ్చుకొనెను. కుట్టాన్ హృదయములో గలిగిన కొంచెమావేదన తగ్గించుకొనుటకు కంబరామాయణము తీసి యొక పద్యము చదువుకొనెను. కుట్టానునకు సంగీత మెక్కువగా రాదు గాని రాగచ్ఛాయగా పద్యము చదువుకొనగలడు.

ఇంతలో వీరభద్రభట్టరు ద్వారముకడకు చనుదెంచి యశ్వశకటము సిద్ధముగా నున్నదని చెప్పెను. కుట్టాన్ దుస్తులు వేసుకొని వీరభద్రభట్టరుతో గలసిపోయెను. శకటము రాజసౌధములున్న యెడకు బోయెను. అందొక మహాసౌధము ప్రత్యేకముగా రాజపురుషులకు రాజనీతి నేర్పుట కేర్పరుపబడినది. కుట్టానును, వీరభద్రభట్టరును లోనికి ప్రవేశించిరి. లోపలిభాగమతివిశాలముగా నున్నది. నేలయంతయు విలువ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వగల తివాసీలు పరుపబడి యున్నవి. వానిపైన పండితు లాసీనులై యుండిరి. రాజకుమారు లనేకులు వచ్చిరి. ఒక్కచోట భోజునియుక్తి కల్పతరువు, మరొకచోట జీమూత వాహనుని దాయభాగము, ఇంకొకచోట చండీశ్వరుని వివాదరత్నాకరము పాఠములు చెప్పబడు చుండెను. ఇంకొకచోట నొక ద్రావిడభాషా పండితుడు తమిళభాషలో వ్రాయబడియున్న విజ్ఞానేశ్వరవ్యాఖ్య బోధించుచుండెను. మరొక చోట వేరొక పండితుడు సంస్కృత భారత మును, రామాయణమును, నానాటి రాజ నీతిని కొందరు విద్యార్థుల కుపన్యసించు చుండెను. కుట్టాన్ భారత రామాయణము లుపన్యసింపబడుచోట గూరుచుండి శ్రద్ధగా వినెను. కొంచెము ప్రొద్దు గ్రుంకువేళకు రాజు మొగసాలలో గంటకొట్టబడెను. అది విని విద్యార్థు లెవరిదారిని వారుపోయిరి. వీరభూపతి యీపాఠశాలకు వచ్చెను. ఇంటికి పోవునపుడు కుట్టానును కలుసుకొనెను. ఇరువురును సంతోష పడుచు సేతుపతిగృహమునకు పోయిరి. వీర భద్రభట్టరు పనియుండి రాజసౌధము వద్దనే దిగబడెను. మార్గములో వీరభూపతి కుట్టాన్ తో నిట్లు మాటాడెను: 'సేతూ,నీతోనొకపని యున్నది.' కుట్టాన్'ఏమి'టని యడిగెను.

వీర—'తిరుమలనాయకుడు నీకు స్నేహితు డుగదా! నా కేదైనయుద్యోగ మిప్పించవలెను. నేను నీతిశాస్త్రమంతయు జదివితిని. విజ్ఞానే శ్వరము, వైశంపాయనుని నీతిప్రకాశిక పూర్తి చేసితిని. కౌటిల్యుని యర్థశాస్త్రము, కామంద కుని నీతిసారములలో చాల బాగుగ పరీక్ష నిచ్చితిని. నే నుద్యోగము చేయవలసిన యవ సర మంతకంత కెక్కువగుచున్నది.'

కుట్టాన్—'తిరుమల నాయకుడు నేడు విద్యాసౌధమునకు రాలేదే! ఈ సారి నే నాయ నను కలుసుకొన్నప్పుడు చెప్పెదను. వారు నిన్ను గూడ బాగుగా నెరుగుదురుకద?'

వీర—'ఎరుగ కేమి?'

తరువాత నేదియో మాటలాడుచు వారి యింటికి చేరిరి. వారిరువురు కుట్టాన్ గదిలోనికి బోవునప్పటి కందు ఫలహారములు సిద్ధముగా నుంచబడెను. ఇరువురును ఫలహా రముచేసి తాంబూలము సేవించి కూర్చుండగా కుట్టాన్ వీరభూపతిని కొంచెము సంగీతము పాడుమని యడిగెను. వీరభూపతి మధుర మీనాక్షిమీద నొక యరవకీర్తన గొంతెత్తి పాడెను. ఆధ్వనితో సౌధమంతయు నిండి పోయినది. పారిజాతపు పూవులు కొరుకు చున్న లేడిపిల్ల మెడ యాడించుకొనుచు లోనికి వచ్చి వీరభూపతి వంక తొంగిచూచి పోయినది.

౭

ప్రొద్దు గ్రుంకినది. చల్లబడినది. రాజసౌధ ముల ముందు మొగసాలలో మ్రోగింపబడు చున్న భేరీరావములు మేఘధ్వానములని భ్రాంతిజెందిన పెంపుడునెమళ్లు నృత్యము చేయుచున్నవి. సాయంకాల వాహ్యాళికై, కుట్టాన్ వీరభూపతు లశ్వశకటారోహము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసి వైగైనదీ సికతాతలములకు బోయి నారు. కుట్టాన్ సేతుపతి కొంచెము పొట్టి వాడు. నల్లనివాడు. విశాలమైన నేత్రములు. దైనందినవ్యాయామముచేత నతని యొడలు గట్టిబారినది. సంస్కృత ద్రావిడములలో నున్న రాజనీతిగ్రంథము లన్నియు నతడు చది వెను. అతని వయస్సు సుమా రిరువదియైదుం డవచ్చును. మీసములు నల్లగా తుమ్మెద ఱెక్కలవలె నంత గుబురుకాకుండ, నంతపలు చన కాకుండ వచ్చియుండెను. అతని మొగ ముచూచుటతోడనే ప్రధానముగా గనబడు నది యతని నాసిక. నది మిక్కిలి యెత్తు. ఆ ముక్కు, నావిశాలపద్మపలాశనేత్రములు నతని మొగమ్మున కమితమైన యందము తెచ్చినవి. ఆవిశాలమైన నేత్రములే యతని నత్కులీనతను చెప్పుచుండును. కుట్టాన్ మిగు లగంభీరమైనవాడు. అనవసరముగ నెవ్వరితో డను మాటాడడు. అతని కిష్టములేని పని నెవరైనను చేసిరేని వారివంక తీక్ష్ణమైన దృష్టి పరపుటయే యతడు తనయిష్టము లేమిచూ పించుట. ఆదృష్టిపాతము చాల కొలదిమంది యోర్చుకొనగలరు. అతడు ప్రసన్నుడైనప్పు డతనినవ్వు మివుల నానందము గలిగించును. అతని సర్వము ఉదయన్ సేతుపతితరువాత నతనియంతవా డనిపించుచుండును.

ఇంక వీరభూపతి యెఱ్ఱనివాడు. పొడు గరి. శరీరవ్యాయామము మిక్కిలిగా చేయని వాడగుటచేత నితని మెదురుఱొమ్ము కుట్టాన్ ఱొమ్మువలె తిర్యక్ప్రసారితమైన గండశిలవలె నుండదు. అతని నేత్రములు కుట్టాన్ నేత్ర ములంత విశాలమైనవి కావు. కాని మఱియు చిన్నవి కావు. నాసిక సామాన్యమైనది. అతని మొగము చూచినంతనే ప్రతివారు నతడు సుందరు డనుకొనక మానరు. కుట్టాన్ మొగ ములో నానుపూర్వికముగా యుద్ధముచేసి రాజ్యము నేలుచువచ్చిన పితరుల చిన్నెలు ద్యోతకమగుచుండును. వీరభూపతి వదనము శాంతమై చాలతరములనుండి వ్యవసాయము, చదువు వీనియం దలవాటు వడిన పితరుల చిన్నెలు కనబరచుచుండును. వీరభూపతి మీస ములు చివరలు మెలికలు తిరిగి తామరపూవు మీదవ్రాలినభృంగముల ననుకరించుచుండెను. మొత్తముమీద కుట్టాన్ వదనము పురుషు లెక్కువ మెచ్చుకుందురు. వీరభూపతి వద నము స్త్రీ లెక్కువ మెచ్చుకొందురు. వీరభూ పతి మొగము క్రోధముచే నెఱ్ఱబడినను నవ్వు చున్నట్లే యుండును. అతడు నవ్వుచున్నపుడు కన్నులు చిన్నవై చూచువారిని సూదులవలె గ్రుచ్చుచుండును. కుట్టాన్ నడచునపుడు మిక్కిలి తొందరగా నడచును. వీరభూపతి నెమ్మదిగా నడచును. కుట్టాన్ ఉదయన్ సేతు పతి కొక్కడే కుమారుడు. ఉదయన్ సేతుపతి 'తేవై'పురాధిపతి. సేతువులను రక్షించుట కేర్ప డిన యధికారి. రాజ్యములో ప్రవహించు నదులకు సేతువులను గట్టి వానిక్రింద భూము లను సాగుచేయుచుండిరి. ఈ సేతువుల కన్నిం టికిపైన నత డధికారి. అతడు చాల శివభక్తుడు అరియరాయని సైన్యములను నిర్మూలించి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాడు. ముద్దుకృష్ణప్ప నాయకునికి ప్రధాన మంత్రి. అతని కుమారుడైన కుట్టాన్‌నకు ఏలోపమును లేదు. కుట్టాన్ తనతండ్రి తరువాత నతనిస్థాన మాక్రమించుకొనుటకు తగిన శిక్ష మధురలోఁ బొందుచున్నాడు.

వీరభూపతి జన్మస్థానము రాజవల్లిపురము. అతని తల్లితండ్రులు కొంచెము బీదవారు. విశ్వనాథనాయకునకు శ్రీకృష్ణదేవరాయలుం గారు పాండ్యరాజ్య మిచ్చినపుడు తెలుగుదేశమునుండి విశ్వనాథనాయకులవారితో ననేకమంది సరదారులు మధుర ప్రాంతములకు పోయిరి. వీరభూపతి పూర్వులటుల తెలుగుదేశమునుండి మధురకు పోయిరి. కాని యచటికి పోయినతరువాత విశ్వనాథనాయకు డిచ్చిన భూమి నాధారముచేసికొని వ్యవసాయము చేసికొని జీవించుట మొదలుపెట్టిరి. వీరభూపతి రాజోద్యోగవాంఛచేత రాజవల్లిపురమునుండి మధురకువచ్చి రాజనీతిచదివెను.

మధురలో నాకాలమునందు విద్యావ్యాప్తి చక్కగా నుండెను. మధురలో నా రోజులలో నెప్పుడును పదివేలమంది విద్యార్థులకు తక్కువలేకుండ నుండిరి. ఈ విద్యార్థుల కన్నివసతు లేర్పరుపబడి యుండెను. విద్యార్థుల భోజనాదికములకు, నుపాధ్యాయులకు జీతములకు విజయనగర రాజులును, మధురనాయకులు నిచ్చిన భూము లనేకములున్నవి. ఆ భూములమీద వచ్చు నాదాయము మిగిలి పోవుచుండెను. సంస్కృతము, అరవము, తెలుగు నీ మూడుభాషలు నభ్యసింపబడుచుండెను. దేవాలయములు పాఠశాలలుగా నుపయోగింపబడుచుండెను. సమర్థులైన పండితులు షట్ఛాస్త్రములును, వేదములును విద్యార్థుల చేత పఠింపించుచుండిరి. వేఱుపాఠశాలలలో నరవము తెలుగును చెప్పబడుచుండెను. మధుర నాయకుల కాలములో తెలుగుభాష మిక్కిలి పోషింపబడెను రాజకుమారులకు రాజనీతి చెప్పుటకు వేరు పాఠశాలలుండెడివి. అందు ప్రధానమైనది రాజసౌధములోనే యున్నది. సంవత్సరమునకు రెండుసారులు సకల కళాశాలలలోనను విద్యార్థులు పరీక్షింపబడుదురు. పరీక్షయం దుత్తీర్ణులైన వారికి రాజు బిరుదములు, బహుమానములు నిచ్చుచుండును.

రాజనీతితరగతి యనేకభాగములుగా విభజింపబడి యుండెను: గ్రామపాలనము, దాయవిభాగము, శిక్షావిధానము, సైన్యవిభాగము. రాజకుమారులు సైన్యవిభాగ శిక్ష పొందుచుందురు. తక్కినవారు తక్కిన తరగతులలో జదివి తగిన యుద్యోగములు పొందుచుందురు.

మధురనాయకులు వేదరక్షకులు, వర్ణాశ్రమధర్మములను పరిరక్షించినవారు. బ్రాహ్మణులయందు భక్తి దేశమున సంపూర్ణముగా నుండెను. అయినను మధురరాజులు తక్కిన మతములయందు వైషమ్యము కలవారు కాదు. దక్షిణ హిందూస్థానమున ప్రథమమున క్రైస్తవమత ముడుగుపెట్టినది మధురరాజుల రాజ్య సీమలోననే.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మధురనాయకులు రాజ్యమును పాళ్య ముపద్ధతిగా విభజించిరి. రాజ్య మనేకమండల ములుగా విభజించి ప్రతిమండలము నొక్కొక యధికారిక్రింద నుంచిరి. ఆయధికారి తన మండలమునకు రాజువంటివాడు. అతడు మధుర నాయకునకుకప్పముకట్టుచు తనమండలముమీద తానుసర్వాధికారము చేసికొనవచ్చును. అతడు కొంతసైన్యమును పోషించుచు మధుర నాయకునకవసరము వచ్చినపుడు సహాయము చేయుచుండవలెను. మధురలో మాత్రము రాజు తాను కొందరు మంత్రుల సహాయముతో రాజ్యము చేయుచుండెను.

రాజ్యములో ప్రధానోద్యోగి దళవాయి. అతడే రాజ్యపాలనాధికారియు, సైన్యాధికారియు. పూర్వభారతదేశ పాలకులయందు వలె నీరెండధికారములు నొకటి మంత్రిక్రిందను, నొకటి సేనాపతిక్రిందనునుంచక మధురరాజులు దళవాయియొక్కనిక్రిందనే యుంచిరి. రాజ్యముయొక్క శాంతి, సాంఘికవ్యవస్థ, ఇతర రాజ్యములతో సంబంధము—నివి దళవాయి చూచెడిపనులు. తక్కిన యంద అధికారుల మీద నితడు పై యధికారి. దళవాయి తరువాతి యధికారి ప్రధాని. ఇతడు రాజ్యాదాయముమీది యధికారి. పన్నులు, తక్కిన రాబడులు, రాజ్యములో నగుచున్న ఖర్చు-నివి యన్నియు నితనిపనులు. దళవాయి యుద్ధకాలములో రాజధానినుండి వెళ్లిపోయినచో నితడు దళవాయి పనులన్నియు చేయుచుండును.

మంత్రులలో మూడవవాడు రాయసము. ఇతడు పరిపాలనలో ప్రధానపురుషుడు. రాజ్యముయొక్క సుస్థితి యీముగ్గురిమీద నాధారపడియున్నది. వీరి ముగ్గురి తరువాత ప్రధానాధికారులు కణక్కము (గణికుడు)ను, స్థానాపతియును. కణక్కము లెక్కలన్నియు సరిచూచు నధికారి. స్థానాపతి యితర రాజుల కానుకలు, కప్పములు, వానికి సంబంధించిన యన్ని కార్యములు చూచునధికారి.

కొన్ని గ్రామములుకలసి మాగాణమనియు నట్టి కొన్నిమాగాణములు గలసి యొకనాడనియు వ్యవహరింపబడుచుండెను. ఈ నాడునకే దేశము, రాష్ట్రము, రాజ్యము, మండలము నని పేరులు. ప్రతిగ్రామమునకు నధికారులుండిరి. గ్రామములలో న్యాయము గ్రామాధికారులచేతనే తీర్చబడుచుండెడిది. రాజ్యమంతలో నన్నివిధములైన న్యాయములయొక్కయు తీర్పరి ప్రధాని. గ్రామములలో తీర్పు గాబడని యన్నివ్యాజ్యములును మధురలో తీర్పు చెప్పబడుచుండెను. మధుర యతిసుందరముగా వినిర్మింపబడియుండెను. పట్టణమునకు సరిగామధ్యప్రదేశమందు మీనాక్షీ సుందరేశ్వరుల దేవళము కట్టబడియుండెను. ఆ దేవాలయము నాలుగువైపుల నాలుగు పెద్ద గోపురములు నిర్మింపబడి యుండెను. ప్రతి దిశయందును నీగోపురమువద్దనుండి యూరి చివరవరకును నొక్కటియేవీథి. శ్రీ మీనాక్షీసుందరేశ్వరుల దేవాలయమునకు చుట్టును చతురస్రముగా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గృహములు కట్టబడి యున్నవి. పట్టణమం దెచ్చటచూచినను దేవాలయములే. అన్ని దేవాలయములకు నాయకులిచ్చిన మాన్యము లున్నవి. ఏస్వామికిని భోగము లోపములేదు. అన్ని దేవాలయములలోను విద్యార్థులకు వేద శాస్త్రము లుపదేశింపబడు చుండెను. పట్టణము సర్వసమృద్ధమై యే విషయమునందు కొఱతబడకుండ నుండెను.

కుట్టాన్ వీరభూపతులు ప్రొద్దు గ్రుంకక ముందే వైగైనదికిపోయి నిన్న కూర్చున్నచోట నే కూర్చుండిరి. కొంచెముచీకటిపడుచుండెను. అస్తమితసూర్యుని యెఱ్ఱకాంతులింకను ధాత్రిని పూర్తిగా వదలిపోలేదు. వైగైనదీపరిఖున్న జల తరంగములపైన కొంచెముగా శైత్యమును సేకరించుకున్న వాయువు మందముగా వీచు చుండెను. పలుచగా పారవోలె నిసుకతిన్నెపై ప్రవహించుచున్న వైగైనదినీటిపాయలో చిన్నచేప కదలికకనిపెట్టి పైనుండి తీతువుపిట్ట కూయుచు హఠాత్తుగ గాలిలోనుండి దిగి దానిని కాల పొడుచుకొనిపోయెను. దూరమున పడమటిదిక్కునందు సూర్యభగవానుడు తన రక్తాంశువు లుపసంహరించుకొని కరడుగట్టిన నెత్తురు మన్ను వలె తొలగిపోయెనుపో, మెఱరు వేచి యొడలినిండ మసిపూసుకొన్న దొంగ వలె సంజచీకటివంగి తొంగిచూచెను. చీకటి లో తళుక్కున మెఱసిన గగనభాగమందలి నక్షత్రములు వైగై పలుచని నీటిపొరలో ప్రతి ఫలించి లోని వెండిమేను మీనుల యండముల క్రామేడితములు గల్పించెను. సన్నని నీటిపా యలలోని చిఱుకెరటములు త్రాచుపాము పిల్లలవలె నోడ్డునకు కొట్టుకొనుచు వచ్చు చుండెను...... (సశేషము)

—o—

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు: 'భారతి'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



బొడ్డు బాపిరాజుగారు

పెండ్లంటే ప్రేమ లేనివాళ్లుకూడా వుంటారా అని సందేహం. అప్పుడు పుట్టిన శిశువు లగాయతూ అరవై యేళ్ల ముసలాడివరకూ పెళ్లిమాట వింటే నే కులాసాగా వుంటారు. ఆకతాయి కుర్రాడొకడు "తాతా పెళ్లి చేసుకుంటావా?" అని మూడు కాళ్ల ముసలాయ నడగ్గా, "నా కింకా పిల్ల నిచ్చేవా ళ్లున్నారా?" అన్నాడట.

౧

"నీ కేలాంటి పెళ్లాం కావాలిరా బాబూ!" అని లోకం యింకా తెలియని పసిపిల్లవా ణ్ణడిగినప్పటికీ "నా కందమైన పెళ్లాం కావ" లన్న జవాబు వెంటనే చెపుతాడు. లోకం అంతా 'పెళ్లి, పెళ్లాం' అనే అమోఘమైన మోహనాస్త్రాల్లో ముగ్ధం అయిపోయింది. పూర్వకాలంలో పెళ్లిళ్లకీ యిప్పటికాలపు పెళ్లిళ్లకీ వ్యత్యాసం వుంది. పూర్వం తల్లిదండ్రులు సాంప్రదాయం, మర్యాద చూచి, మాపిల్లని మీపిల్లవాడి కిస్తామంటే సరే మహాసంతో దనేవారు. ఆ తల్లిదండ్రుల యిష్టంమీదయే అప్పటిపెళ్లిళ్లు. మాపిల్లని మీపిల్లవాడి కిస్తామంటే, అబ్బాయి వచ్చి చూచుకుంటాడు, తరువాత లాంఛనాలవిషయం మాట్లాడుకుందాంలేండి అని జవాబులు చెప్పేరోజు లివి.

"అబ్బాయి! నీకు సుబ్రహ్మణ్యంగారు పిల్ల నివ్వాలని చాలా పట్టుదలతో వున్నారు. ఆయన సంపన్నగృహస్థు. పాడీపంటా అన్నీ సలక్షణంగా వున్నాయి. అన్నివిధాలా మనకు తగినసంబంధం. ఇదివర కాయన యెప్పుడూ పెళ్లిళ్లు చేయలేదు గనుక చాల ఘనంగా పోతాడనే వుంది. మనవాళ్లందరికీ నచ్చింది. పిల్ల నలుపంటావా! నలుపూ యెఱుపూ కోరుకున్న తినరుగదా యెవరూ? యేమంటావు? నీయిష్టం" అంటే, "నా కాపిల్లమీద యిష్టం లేదు. భార్యాభర్తలంటే ఆ జన్మాంతం సంసారరథాన్ని లాగవలసిన యిరువురు భాగస్వాము లన్నమాట. అట్టివిషయంలో పరస్పరం భాగస్థులకు పడకపోతే సంసారంలో సుఖమనేది లేక భ్రష్టులు కావలసివస్తుంది. నావివాహం నాసమ్మతిమీద జరుగవలసిందే కాని మీయిష్ట మేమిటి? నా బాగోగులు నావే కాని మీవి కావుగదా?" అని తండ్రితో జవాబుచెప్పాడట వకకుర్రాడు.

తా నెట్లా వున్నా తాను పెళ్లాడేకన్యమాత్రం రంభాద్యప్సరసలనుకూడా తలదన్నేట ట్లుండాలి. కారణ మేమిటంటే, తనసంతతిలో సౌందర్యదేవత తాండవ మాడాలికదా? యిప్పటి యువకుల మతము లివి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇటువంటి శ్రేణికి చెందినవాడే మనసుందరం కూడాను.

సుందరం పేరుకు తగ్గరూపసి కాదు ఆంగ్లవిద్యా పరిచయం కలవాడు. అన్నిటికంటే లక్షాధికారి కొడుకు. ఇంకా యేం తక్కువ? అతనికి చక్కనిచుక్కను పెండ్లి చేసుకోవాలని బుద్ధి. అతడు తనకు కాబోయే భార్య



యిట్లా వుండాలని భావించుకొంటూవుండేవాడు. లేత గులాబీపూవులవంటి మెరుపురంగు, చంద్రునిముఖం, నవ్వితే చొట్టలుపడేబుగ్గలు, విశాలమైననేత్రాలు, పట్టుకుచ్చులా నిగనిగలాడే తలకట్టు, వుంగరాలుతిరిగిన ముంగురులు, తీర్చైనముక్కు, నవ్వులుకుమ్మరించే పెదవులు, ఆట్టే పొట్టీ పొడుగూ కాకుండావుండేకన్య అతనికిష్టము. ధనవంతుని కొడుకవటంచేత మనువులు చాలా వచ్చాయి గాని వక్క సంబంధం కుదరలేదు. కారణం సుందరానికి పిల్లనచ్చక పోవటమే. ఇట్లా బోలుడు సంబంధాలు చిట్లిపోయినై.

౨

సుబ్రహ్మణ్యం గావూరిలోవుండే కమ్మవారందరిలోనూ యెన్నికగన్నవాడు. షుమారు నలభైయకరాల మాగాణి, పెద్దమామిడితోట, యనభైగాళ్లపశువులు, పెద్ద పెంకుటిభవంతి, మూడెకరాల పూగతోట, పాడీ పంట అంతా సలక్షణంగావున్న కుటుంబీకుడు. గావూరిలో యేతగాయిదా వచ్చినా సుబ్రహ్మణ్యంగారి చావడే ధర్మనిర్ణయశాల. సుబ్రహ్మణ్యంగారే ధర్మనిర్ణయాధికారి. వారివాక్యము రామవాక్యము. ఆవూరివారు కోర్టుముఖం యెన్నడూ చూడనే చూడలేదని చెప్పవచ్చును. గావూరిలో పేరుప్రతిష్ఠలు సంపాదించినవాడు సుబ్రహ్మణ్యం. అంజియ్య, నర్సాగం చేతికక్కొచ్చారు. హాయిగా కృష్ణా! రామా! అంటూ కాలం గడుపుతున్నాడాయన. సుబ్రహ్మణ్యంగారికి శ్యామ లొక్కతియే ఆడపిల్ల. శ్యామల కడసారిపిల్లవటంచేత తల్లిదండ్రుల పంచప్రాణాలు ఆమెమీదనే వుండేవి. శ్యామల మంచి చురుకైనపిల్ల. గారాబంచేత తల్లిదండ్రులు బడికి పంపక పోయినప్పటికీ తోటిచెలికత్తెలు చదువుతూ వుంటే నాలుగైదుపద్యాలు, పాటలు నేర్చుకున్నది.

ఎట్లాగైనా శ్యామలను చలసాని నర్సయ్యగారి కోడల్ని చేయాలని సుబ్రహ్మణ్యంగారి గట్టిపట్టు. సాంప్రదాయం అదీ చూచి ఆడవాళ్లకూడా యివ్వాలని వుద్దేశం కలిగింది. శుభముహూర్తంచూచి పురోహితుడు రామశాస్త్రిని పిలిపించి, చెప్పవలసినమాటలన్నీ చెప్పి అంజయ్యను తోడిచ్చి సంబంధం కుదుర్చుకురావాలీ, అదీ శక్తి అని పంపించారు పోలారం. వెళ్లేటప్పుడు కుమారుణ్ణి బిలిచి రెండుమూడువే లెక్కువైనాసరే అనమని చెప్పారు.

పురోహితుడు, అంజయ్య కలసి, గావూరినుంచి మంగళగిరిస్టేషన్‌వద్దకు బండి కట్టించుకొనివచ్చి, అక్కడనుంచి రైలుమీద రాజమహేంద్రవరం స్టీమరుమీద పోలారం ప్రవేశించారు. దరియాప్తుమీద నర్సయ్యగారిల్లు తెలుసుకొని వెళ్లి, తాము వచ్చినకార్యము, మర్యాదలు, కుశలవార్తలు సర్వమూ అయినతర్వాత, నర్సయ్యగారిమనస్సు కెక్కేటట్టు నచ్చచెప్పారు—పదివేలుకట్నము. అయిదువేలు లాంఛనాలు. వెయ్యిన్నూటపదహార్లు ఆడబడుచు కట్నం. వచ్చే మాఘమాసంలో వివాహం చేయటం—నర్సయ్యగారి కన్నివిషయాల్లో సంతృప్తికలి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గింది కాని సుందరం వప్పుకుంటాడో నప్పుకోడో అని సందేహిస్తూ వున్నాడు. అయినా అంజయ్యను, పురోహితుణ్ణి మర్యాదచేసి అబ్బాయి పిల్లను చూచుకుంటానికి వస్తాడని చెప్పి పంపించాడు.

సుందరం యిదివరలో, "తనకు నచ్చితేనే కాని పెండ్లి చేసుకో" నని కచ్చితంగాచెప్పాడు తండ్రికి. ఆ కారణంచేత నర్సయ్యగారు సుందరాన్ని పిలిచి జరిగిన సంగతులా సర్వమూ చెప్పి, "పిల్ల నీకు నచ్చితే నేను యస్ అంటాను. చూసిరా" మ్మని పంపించారు నర్సయ్యగారు.

సుందరం వక్కడే బయల్దేరాడుగాపూరు. రైల్లో కూర్చున్నంత సేపూచూడబోయేపిల్ల రూపాన్ని తనకళ్లల్లో చిత్రించుకుంటున్నాడు. తానేం మాట్లాడాలో, వాళ్లేం అడుగుతారో ఆలోచించుకుంటున్నాడు. వకవేళ తనకు పిల్ల నచ్చకపోతే యేం చెప్పాలి? పిల్లేగనుక తనకు నచ్చకపోతే మానాన్నగారువచ్చి మాట్లాడుతారని చెప్పి తప్పించుకోవటానికి నిశ్చయించుకున్నాడు సుందరం.

సుందరం వస్తాడని కబురు తెలిసి తనకుమాళ్లిద్దర్ని బండిచేసి పంపించాడు స్టేషనుకు. సుందరం బండి దిగగానే మర్యాద చేసి యింట్లోకి తీసుకవెళ్లి, యిదివరలోనే పంచశాలీలో సిద్ధంగా వేసివున్న కుర్చీమీద కూర్చుండబెట్టి, కుశలప్రశ్నాదికము లైనపిదప వెండి కంచంలో ఫలహారం పెట్టుకొని, వెండి గ్లాసుతో మంచినీళ్లు పట్టుకొని వచ్చింది మస్తాదైన శ్యామల. శ్యామలను చూడగానే సుందరం మనసులో యేదో అనుకున్నాడు.

సుందరం పిల్లను చూసుకొని వెళ్లిన మూడోనాడే సుబ్రహ్మణ్యం గారు నర్సయ్యగారికి శుభముహూర్తం వ్రాసి రామశాస్త్రిగారిద్వారా పంపించారు. ప్రతిరోజూ ప్రతిశుభవార్త కోసం యెదురుతెన్నులు చూస్తూవుండేవారు సుబ్రహ్మణ్యంగారి కుటుంబం యావన్మంది.

పాపం! మానవులు చేసే ప్రయత్నాలన్నీ వృథా అయిపోత వొకొక్కప్పుడు. మానవుడు రాజ్యాధిపతిగా గోరుచుండిన దైవము భిక్షాపాత్రము చేతి కిచ్చునట్లు చేయును. దీనినే సృష్టివైచిత్ర మందురు.

నర్సయ్యగారివద్దనుంచి యిలా వుత్తరం వచ్చిందొకరోజున:

"మహారాజశ్రీ కొల్లిపర సుబ్రహ్మణ్యంగారికి, చలసాని నర్సయ్య నమస్కారములు చేసివ్రాయునది"—

"తరువాత: యిలా వుత్తరం వ్రాయవలసి వస్తుందని నేను కలలోనైనను అనుకోలేదు. చిరంజీవి సుందరం యిప్పుడు పెళ్లి వద్దని బ్రహ్మపట్టుపట్టి కూర్చున్నాడు. యీవిషయం మీకు తెలుపవలసి వచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. యెల్లాగయినా చిరంజీవికి నచ్చచెప్పి మీ సంబంధం వప్పుకునేటట్లు చేస్తున్నాము. నిరాశపడవద్దు. చిత్తగించవలెను.

"చలసాని నర్సయ్య వ్రాలు".



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యీ పుత్రకం చూచేటప్పటికి మొదలునరికిన మహావృక్షంలా, తొడిమసడలిన పరిపక్వఫలంలా, ప్రియా



గమనమును నిరీక్షిస్తున్న శకుంతము బోయవాని వాడియాలుగుచే నేల గూలిన విధంగా సుబ్రహ్మణ్యం నేలగూలబడ్డాడు.

## 3

సుబ్రహ్మణ్యంగారికి కిత్సయ్య ప్రాణమిచ్చిన స్నేహితుడు. కిత్సయ్యగారికి మిత్రుని వృత్తాంతమంతా తెలిసింది. ఆతని మనస్సు చివుక్కుమన్నది

అతని హృదయం పరాభవంచేత భగ్గుమన్నది. యేతీరునైనా తనమిత్రుని పగ తీర్చుకోవాలని పుద్దేశంకలిగింది. "కుక్కకాటుకి చెప్పుదెబ్బ"లా చేయాలనుకున్నాడు. తానొక గుణపాఠం నేర్పాలనుకున్నాడు యిప్పటికాలపు యువకులందరికీన్నీ.

కిత్సయ్యగారి కుమార్తె చాలా అందకత్తె. చలసాని నర్సయ్యగారికి తనపిల్లను వారికొమారుని కిస్తామని కబురు పంపించారు. మంగళగిరిప్రయాణం తగిలింది మళ్లీ సుందరానికి.

ఆరోజున సుందరం వస్తాడని తెలిసి కిత్సయ్యగారు వూళ్లో వుండే పెద్దమనుషులనలుసుర్నీ పిలిచి వచ్చారు. కచేరీచావడిలో జంబుకానాలు పరిపించి సిద్ధంగా వుంచారు. పిల్లను ముస్తాబుచేసి సుందరం రాకటమే ఆలస్యమన్నటుగా అన్నీ సిద్ధంచేసారు. పెద్దలందరూ వచ్చి కూర్చున్నారు.

సుందరం వచ్చాడు. పెద్దలందరికీ నమస్కారం చేసి నిర్దిష్టప్రదేశంలో కూర్చున్నాడు. అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు రెండునిమిషాలు. కిత్సయ్యగారు "సౌందర్యం..." అని కేకవేశారు. తలుపుచాటునుంచి సుందరం తలపు లూరేలాగా తటిల్లతలా వచ్చి కూర్చుంది తండ్రి ప్రక్కన. చాకలిలక్ష్మడు హార్మోనియం తెచ్చి దగ్గర పె



ట్టాడు. సౌందర్యం సిగ్గుతో సుందరాన్ని ఓరచూపు చూచింది. సుందరంశరీరం మొగ్గతొడిగిన కడిమిచెట్టులా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పులకరించింది. నేడు నాకోరిక యీడేరే సుదిన మబ్బిందిగదా అని సంతోషించాడు తనలో తాను.

సౌందర్యం హార్మోనియంలో శ్రుతిగలిపి జగన్మోహనంగా మోహనరాగ మాలాపించింది. సుందరం రాగ తరంగాల్లో తేలి యాడుచున్నట్లుగా తలంచాడు. యీ కన్యతో ప్రణయడోలికలలో పూగుచున్నాను అనుకొనే రోజులు ముందున్నవిగదా యని సంతోషించాడు. వెన్నెల్లో చెట్టాపట్టాలువేసుకొని వుద్యానవనంలో విహరిస్తున్నట్లనుకున్నాడు. నిలువునా ఆనందమైపోయాడు.

పిల్ల పాటాపివేసింది. మూడునిమేషాలు నిశ్శబ్దంగా వున్నారంతా.

ఇంతలో గ్రామమునసబు రంగనాధంగారు సుందరాన్ని దగ్గరకు పిలిచి, "నాయనా, పిల్లనచ్చిందా! నీకు? నాన్నగారియిష్టం కావాలా?" అని ప్రశ్నించాడు నెమ్మదిగా.

"తాతగారూ! నాకు పిల్లనచ్చింది; సందేహం యేమీ లేదు. ముహూర్తం పెట్టించేస్తే నేను వెళ్లి అన్నీ సిద్ధంచేసుకొని మా బంధువుల్ని తీసుకొనివస్తాను. నా వివాహవిషయంలో మానాన్న సర్వస్వతంత్రం నాకిచ్చిన కారణంచేత నాయిష్టమైతే చాలు" అన్నాడు సుందరం. కిష్టయ్యగారు నెమ్మదిగా సౌందర్యంవద్దకు జరిగి "అమ్మా! నీకీయన నచ్చారా?" అన్నారు "నాకీయనవద్దు" అని లేచి వెళ్లి పోయింది సౌందర్యం.

సుందరంమనస్సు నిరాశాఘాతంచేత శతచ్ఛిద్రములైన ట్లూహించాడు. ఒక్కసారి అతనిభావవీథిలో యిదివరకు తాను వద్దన్న కన్యలందరూ జేరి తన్ను వేళాకోళము చేయుచున్నట్లు తోచి నిర్ఘాంతపోయాడు.

---

# నాటిగీతి

సహదేవ సూర్యప్రకాశరావు గారు

దినదినాలు యుగాల వేదనల తీయ
తేనియల నాని జీవగీతికల రాసి
రాసిపోయగా, స్వప్నాల మాసికొనుచు
నవ్వప్రాతస్తుషారకణాల పూలు.

పూయు కుసుమాల కోసమై రేయినీలి
చలువకడుపులో కలత నిద్రల మునింగి
కలలమబ్బుత్రుళ్లింతల కలగిపోతి
ఫలితహాసాల ఎగయూర్పుకలకలాల.

ఇదియె మొదలేమొ, ఇసుమంత యివురువిరియ
లేనిదివసమ్ము, శుభ శారదానిలమ్ము
చిలుకరింపని నీరవజీవితమ్ము
కలపికోలేని కుంఠిత గళరవమ్ము.

ఇంత మధురించి అంత జీవించి ఇట్టె
పాడు వల్లకాడైనది బ్రదుకు బ్రదుకు
చూపుకొనసనేని కలగనిసుప్తి నేని
కురియబోదేమి సౌహార్ద్రసురభిరేఖ.

మండువేసవి కార్చిచ్చు నిండు జీవి
తంపుకొన మ్రోసిపోయిన తారకావి
పంచికా చకిత మిహికాపదము వీడి
సోలినది మేన మలినాశ్రుశోకగీతి.

నాటి కడగంటి వలపు కన్నీటిపాట
మొరసి పోవక, హృదయాన మూగవారి
జీరువారిన పచ్చ కర్పూరవిరహ
వేదనాకపోల పదాల సేదదీరు.

వృద్ధహేమంతు బిగికౌగిలింతలందు
మంచు జల్లుల వలపులు మాసిపోవ
నేల జీరాడి మృత్యుపదాల బడితి
నవవసంత కల్యాణ మెన్నటికి లేక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వకుళ

రాయసము వేంకటశివుడు గారు, యం. ఏ.,

ఆవి శీతకాలపు సెలవులు. నామిత్రుఁడు ఆదిశేషు ఆహ్వానము చేయఁగా కలకత్తా వెళ్లితిని. అతఁ డక్కడ వైద్యపరీక్షకుఁ జదువు చుండెను. హౌరా రెయిలు స్టేషనుయొద్ద నాకై కనిపెట్టుకొనియుండి, నాపేరుపెట్టి పిలుచుచుండినను, వాని నేనానవాలు పట్టలేక పోయితిని! క్రాపుజుట్టుపెట్టి, పంజెకట్టుగట్టి, కాళ్లకు బూట్సులతొడిగియున్న వానిని జూచి బంగాళావాఁ డేమో యనుకొంటిని! వాని యుచ్చారణయు బంగాళీయులదె! అదివఱ కెన్నఁడు నాదేశము చూడకపోవుట చేత, నాకన్నియు నచటఁ గ్రొత్తవె. ఆదిశేషు నాకచటి తన యాంధ్రస్నేహితులను, బంగాళీ మిత్రులను జూపించెను. అతనితోఁ బోయి నే ననేక ప్రదేశములు చూచితిని. మూలికారామము, కాళికాదేవాలయము, వస్తుప్రదర్శనశాల, జైనుల బంగరుగుడి, సార్వభౌమిక గ్రంథాలయము—ఇవి యన్నియు నాకతఁడు చూపించి, వీనిని గుఱించిన వినోదాంశములు విశదపఱచెను. ఏ నూతనలోకసందర్శనము చేయుసట్టుగనో నాకుఁ దోఁచెను!

ఒకనాఁడు నామిత్రుఁ డేదో పనియందుండుటచేత, నే నొంటరిగ నగరసంచారార్థ మేగితిని. ఆ రోజున హుగ్లీనది కవతలయొడ్డునందలి బేలూరునం దేదో మహాసమావేశము అయ్యెను. పాటలు, పద్యములు, ప్రసంగములు, హరికథలును నాకుఁ దెలియని బంగాళీభాషలో జరిగెను. వీనిని బురస్కరించుకొని యనేక మేళములు గానవచ్చెను. అనేక యుపాహారములు, పానీయములును విక్రయింపఁబడెను. అచట వేసినపందిళ్లు, గుడారములును ప్రేక్షకులతో నిండిపోయెను. అనేకభాషలు మాటాడెడి స్త్రీపురుషు లందు విహరించుచుండిరి. ఇంతలో సాయంసమయ మయ్యెను. ఆవలి యొడ్డునకు మరలఁ గొనిపోవుటకు చిన్నపొగనావల గుమి యపుడు నది దాటివచ్చెను. వెంటనే ప్రజలలో నొక్కమాఱుగ సంచలనము గలిగెను. పడవలలో ముందు గూర్చుండుటకై ప్రజలు వేవేగముగఁ బరువులెత్తిరి. అంత తొందరగఁ బరుగులిడ నా కుద్దేశము లేకున్నను, నదీప్రవాహవేగమునఁ గొట్టకొని పోవు కొయ్యకంబమువలె నేనును కాలికి బుద్ధి చెప్పితిని. కొందఱితోఁ గలసి నే నెట్టకేల కొక పొగపడవలో గూర్చుంటిని.

పడవపాయఁ ద్రోయునపుడు, టిక్కెట్లు ఇచ్చువాఁడు వచ్చెను. టిక్కెట్టు కొనవలెనని చొక్కాజేబులోఁ జేయిపెట్టితిని. వేళ్లకుడబ్బు సంచి గానరాదు! ఒకవేళ ప్రక్కజేబులో సంచి యుండవచ్చునని యక్కడ వెదకితిని. అచటను సంచిలేదు! "అయ్యో, ఇంకేమి గతి!" అని యొక కేకపెట్టి, నాయలజడికి నేనే సిగ్గుపడితిని. దగ్గఱనుండు నొకస్థూలకాయుఁడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కీ! కీ!" యని బంగాళీలో నన్నుఁ బ్రశ్నించెను. నాకాభాష తెలియదని యింగ్లీషునఁ జెప్పఁగా నాంగ్లమున నాతో నతఁడు మాటాడఁజొచ్చెను.

"నీవు మంద్రాజీవా?" యని బంగాళీయుఁడు.

"ఆంధ్రుఁడను" అని నేను.

"సొమ్ము పోఁగొట్టుకొంటివా?"

"ఔను నాడబ్బుసంచీ పోయినది. ఫలాహారము చేయునపుడు సంచితీసి, తిరిగి జేబులో నుంచితిని. ఎట్లో మాయమై పోయినది!"

"ఇంత జనసమ్మర్దముగ నుండుచోట సొమ్ము పోవుట కేమి యాశ్చర్యము! నీకీయూరు క్రొత్తదా?"

"వారము క్రిందటనే యిచటఁ జదువునొక స్నేహితునిఁ జూచుటకు వచ్చితిని."

"నీ కెంత లెక్క కావలయును?"

"అర్ధరూపాయి చాలును. ఐన నేను క్రొత్తవాఁడనే, నన్ను మీరెట్లు నమ్మి బదులీయఁగలరు?"

"దానికేమి లెండి. ఆపదలందు అందఱమును బంధుగులమె! ఈమాత్రము సాయము దొరకని యీ దేశమును గుఱించి క్రొత్తవాఁడవు నీవేమను కొందువు?"

అని యాపురుషుఁడు మందహాసము చేయుచు, అర్ధరూపాయి నాచేతనుంచెను. ఆయనకు వందనము లిడుచు నేను టిక్కెట్టు కొనుక్కొని, ఆతని విలాసమడిగి, మఱునాఁడె యాయన సొమ్మిచ్చివేసెదనని చెప్పితిని.

"ఈభాగ్యము నాకు ముట్టజెప్పుటకై మఱియింత సొమ్ము కర్చుపెట్టుకొని, నాయొద్దకు నీవు శ్రమపడి రావలయునా?" అని యాయన పలికెను.

"సమయమునకు సాయముచేసిన సత్పురుషుల ఋణముదీర్చి, వారియెడల కృతజ్ఞుఁడనై యుండుట నావిధి గదా!" అని నేనంటిని.

అంతట మేము లోకసమాచారములు చెప్పుకొను చుండఁగనే నావ యొడ్డుచేరెను. ఆయన యనుజ్ఞఁగైకొని, నేను బసచేరితిని.

౨

బంగాళీభాషగాని, కనీసము హిందీ హిందుస్తానీలలో నేదైనఁగాని, రానివారు కలకత్తా నగరసంచారము చేయుట కష్టము. ఆంగ్లేయ విద్యాపరిచితులును జనసమూహము వలెనే దేశభాషలోనే ప్రాయికముగ సంభాషింతురు. సతతము తెలుఁగునేస్తకాండ్రు పరివేష్టింపఁగా తమిళవాసన బొత్తిగ దరికిరాకుండఁ జేసికొనుటయె ముక్తి యనుకొని, ఏండ్లకొలఁది తిరువళిక్కేణివీథులలో తిరుగులాడుచుండు నాకు, ఈకొద్ది దినములలో దూరదేశపు బంగాళీభాష పట్టుపడునా? కావున బంగాళీ బాగుగఁ దెలిసిన యాదిశేషును వెంటఁదీసికొని, మఱునాఁటి మధ్యాహ్నము అప్పుతీర్చుటకై ప్రఫుల్ల చంద్ర నియోగిగారియింటికిఁ బైనమైతిని. మేమున్న బౌబజారునకు మిక్కిలి దూరమున



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నున్న చిత్పూరురోడ్డు పరిసరములనుండెడివారి గృహ మెట్టకేలకుఁ జేరితిమి. ఆ గృహమున తెనుఁగుజాడలు కొన్ని గానవచ్చెను. మమ్మును జూచి ప్రఫుల్లబాబు, తాను బీల్చుచుండిన హుక్కాగొట్టము నోటినుండితీసి, మా కది యందియ్యఁబోయెను. అభ్యాసము లేదని మే మది స్వీకరింపమైతిమి. అంతట మున్వరము ప్రసంగమునకుఁ జొచ్చితిమి

ప్రఫుల్లబాబునకు మద్రాసువా రనిన యభిమానము మెండు. తమ యింటిపేరు "నియోగి" యగుటకుఁ గారణమేమని నేనా యన నొకటిరెండుసారు లడిగితిని. ఆదిశేషు అపుడందుకొని, "బాబుజీ, నా మిత్రుఁడు నియోగిశాఖీయుఁడు. మీతోఁ జుట్టరికము గలపవచ్చునని యాసచేతనే తరిచి తరిచి మిమ్మీప్రశ్నలు వేయుచుండుటలేదు గదా!" అని చిఱునవ్వు నవ్వుచు ననెను.

మందహాసము చేయుచు ప్రఫుల్లబాబు, తెలుఁగుదేశమునందలి నియోగుల వృత్తాంత మంత మమ్మడిగెను. నేనుకొంతసమాధానము చెప్పితిని.

"నియోగులలో నేవైన ప్రసిద్ధగుణము లున్నవా? వా రెద్దానియందు దాతతేతే యుందురు?" అని బాబు మరల నన్నడిగెను.

నేను ప్రత్యుత్తర మీయఁబోఁగా, తా నందుకొని యాదిశేషు, "ఈకాలపు నియోగులు పలువురు ఉన్నది యూడ్చివేసికొని, సుష్టుగ సువారము లారగించుటయందు సుప్రసిద్ధులు: గోదావరి విశాఖపట్టణ మండలముల వారు మీసములు పెనవేసి చుట్టలు తగులఁ బెట్టుటయందును, కృష్ణా, గుంటూరు వారలు లిరిపమెత్తి పూఁటకూళ్లుపెట్టుటయందును, ఆఱితేఱియున్నారు!" అనిపలికెను. మేము మువ్వరము పక్కున నవ్వితిమి. ఆదిశేషున కిట్టి కటు నగుమాటలు స్వతస్సిద్ధమే! వైదికజన్మమెత్తిన యాతఁడు నియోగులమీఁదికిఁ దాడివెడలి, హాస్యరౌద్రరసములు వారిమీఁదికిఁ గురిపించి, తన చమత్కారమునకు మురియుచుండును! ఐనను ఆంతర్యమున నియోగులను గుఱించి యతనికి వైరబుద్ధిలేదని నే నెఱుఁగుదును.

అంతట నియోగిబాబు, "వానికేమి దేశమున మనమందఱము నిపుడు చేయు ఘనకార్యములే యివి! కాని నాకుఁ గావలసినది నియోగుల కేప్రత్యేక విద్యలందైన ప్రవీణత గలదాయని—వారి కేకళలందైన నైపుణ్యమున్నదా? ఉన్నట్టు నా కెవరో చెప్పిరి" అనెను.

అంత మరల ఆదిశేషు అందుకొని, "వారిలో నిపుడు మహాసంస్కర్తలు బయలుదేరి, మంచిప్రయోజకులైనారు! తమ వారు, ఊర్ధ్వపుండ్రములు చిదుపఁగూడదనియు, శ్రాద్ధపిండములు మెదపవచ్చుననియుశాసించుచున్నారు! ఇవియె వీరి విద్యాప్రవీణతలు!" అని పలికి, నియోగుల యధికతకు తిరిగి తిలోదక సమర్పణము చేయసమకట్టెను!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇది లెక్కసేయక నేనందుకొని, కొంత కాలమునుండి వైదిక కార్యభారము తమమీఁద లేక, లౌకికవ్యాపారములకే నియోగింపఁబడిన నియోగులు, ఎక్కువ తీఱిక గలిగి, లలితకళలందును, ముఖ్యముగ కవిత్వమందును నిపుణతఁగాంచి యున్నారని చెప్పి, ఆంధ్రకవులలోఁ బలువురు నియోగులుండుట దీనికి దృష్టాంతముగఁ బేర్కొంటిని.

అంతట బాబు, "ఔను. నేనిదే వింటిని. అయ్యో, మన ప్రసంగములలో ఫలాహారము సంగతి మఱచితినే! బాకులీ! బాకులీ! ఒల్పో హార్......" అని క్రిందకి కేకవేసెను.

3

పదునాల్గు వత్సరముల లేఁబ్రాయమున నుండు నొకసుందరి, చేత తళతళమను పళ్లెరముంచుకొని, మేడమెట్లెక్కి వచ్చెను. వెంట నొకపిల్లవాఁడు తేనీళ్లజారియు, మిల్లిగరిటెలు గిన్నెలును గొనివచ్చెను.

చిన్నబల్లలమీఁద మాకొఱకుఁ బెట్టఁబడిన యల్పాహారములు భుజింపుఁడని గృహాధిపతి మమ్మంతట కోరెను. జిహ్వారుచులందును నామిత్రుఁడు శుద్ధబంగాళీయుఁడే. కాని నేనే సందిగ్ధావస్థలో నుంటిని! చిన్ననాఁటనుండియు నాకుఁ గారపువస్తువులందేయిష్టము. తీపి నాకు బొత్తిగ సరిపడదు. "మీయమ్మ నీకు బాల్యమున కారపుపాలిచ్చెనా!" యేమి యని చెలికాండ్రు నన్ను గేలిసేయుచుందురు! కాని స్వతస్సిద్ధమై యభ్యాసమున స్థిరపడిన మన రుచుల నెట్లు నిరోధింపఁగలము? కలకత్తావచ్చినప్పటినుండి, కారపువస్తువులకు నేను మొకము వాచి, హౌరా మొదలు కాళీఘాటు వఱకును గల యంగడులు గాలించితిని. కాఫీ త్రాగుట కలవాటుపడిన నానోటికి తేనీరు మట్టిబెడ్డ వలె నుండును! నేనిపు డేమి చేతును?

ఈఫలాహారములు తనముద్దులకూఁతురు గల్పించినవని ప్రఫుల్లబాబు నొక్కి చెప్పుటచేతను, భుజింపుడని యాబాల స్వయముగ వడ్డించుటచేతను, నేనొక రసికుల్ల వితెచితిని. గదిలోఁ బ్రవేశించునపుడు నేనాపాలఁతి నంతగఁ బరిశీలింపలేదు. ఇపుడు ప్రసంగించునపుడాలలన వినయలావణ్యసంపదలు విదితమయ్యెను. అంత గుణవతిని, సౌందర్యవతిని నేనెన్నఁడును జూచియుండలేదు. నవశిరీష కుసుమమును బోలిన శరీర సౌకుమార్యమునఁ జెన్నొందెడి యాచేడియ చిఱునగవులు లేఁత వెన్నెలలు వెదఁజల్లుచుండెను. నే నిపుడు గ్రోలెడియానందము, జిహ్వాకీనూతన భక్ష్యవిశేషము సనుకూర్చుటవలనఁ గలిగినదా, లేక యీసుగుణసౌందర్యరాశి చతుర్వ్యగ్రమునకుఁ బ్రసన్నమగుట వలననా? సువర్ణకంకణ శోభితములగు నీమెలఁత మృదుకరస్పర్శ మహిమమున నే సర్వసామాన్యములగు నీ యాహారపానీయము లింత రుచిరములైనట్టు గానఁబడెను!

"మోమోటము వదలి భుజింపు బాబుజీ! మేము నీవారమె గాని పరులము గాములే!" యని ప్రఫుల్లబాబు నన్ను ప్రోత్సహించుచు, తన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్వీకులు ఆంధ్రదేశమునుండి వచ్చిరనియు, పూర్వపుపేర్లు గృహనామములును నశింపఁగా నిపు డొకశాఖానామము మిగిలి మనుచుంటి మనియుఁ జెప్పెను.

"సరే! నియోగిబాబు లొకరికిద్దరైనారు! నీరొట్టె నేతిలోఁ బడ్డది యిఁక పెండ్లికొడుకా! ఈవిందు అత్తవారింటి మనుగుడుపు అనుకొని కడుపునిండా మెక్కుము!" అని సమయము దొరికెనని యాధూర్తుఁడు, ఆదిశేషు, నన్ను పరిహాసము చేసెను. ఆ పలుకులు ములుకు లగుట నాకొకనికే కాదు. ననుసిగ్గుతో వకుళ పసిమిబుగ్గలొకింత తడవు అరుణ కాంతులతోఁ దళుకొత్తెను.

ఫలాహారానంతరము ప్రఫుల్లబాబు, తన కుమార్తె బెతూనుకళాశాలలో విద్యనేర్చి తర గతిలో మిన్నగనున్నదనియు, ఒక మంద్రాజి యాచార్యగురువు నొద్ద సంగీతము నేర్చుకొను చున్నదనియుఁ జెప్పి, పుత్రిక దెసఁ దిరిగి, "వకుళా! ఏపీ క్రొత్తచుట్టములకు నీసంగీత రసా యనముకూడ నొకింత చవి చూపవా?" యని కోరఁగా,మరల నరుణోదయచ్ఛాయ లాపడఁతి పసిఁడి చెక్కులకుఁ బూఁతపెట్టెను!

మావంశీకులలో నొకరికి లేఁత వెన్నెల సోఁకిన శీతలము గ్రమ్ముచుండెడిదఁట! నాచెవు లకు సంగీతము చప్పగఁ దోఁచుచుండును! నైజ గుణమున కెవరేమి చేయఁగలరు? కాని, యా సాయంకాలము వకుళ వీణమీఁదఁ బాడిన త్యాగరాయకృతులు, సంగీతముపట్ల నాహృద యము నావహించిన మాంద్యమును బారఁ ద్రోలెను! ఆపొలఁతి పలుకుపలుకునకు తేనియ లొలుకుచుండుట, త్యాగరాజుని యపారభక్తి మహిమముననా, ఈమధురవాణి వాక్సుధా రసప్రభావముననా యని నే నచ్చెరువొందితిని. సంగీతానంతరముఁ, "వకుళా! నీగీత రసాస్వాద నము చేసిన క్రొత్తబంధుగుల నుండి నీ కేమి కానుక కావలయును?" అని మేలమాడు జన కుని పంజరపుక్రంతలనుండి యజమానుని వ్రేళ్లు కొఱకఁజూచెడి చిలుకవలె, చుఱచుఱఁ జూచి, లజ్జా కోపములచే జేవుఱించిన ముఖకమలమున వకుళయట్టె గది విడిచిపోయెను!

౪

సౌఖ్యదినములు చయ్యనజరిగిపోవును. శీత కాలపు సెలవులు వేగమె ముగియఁగనే, నేను మరల చెన్నపట్టణప్రయాణము గట్టితిని. రెయి లులో స్వదేశమునకు వచ్చుచుంటినని నా కేల నో యిపుడిసుమంతయు సంతోషము లేదు. మరల కూవమహానది, అఱవ స్నేహితులు, చెన్నపట్టణనివాసము——నాకు సిద్ధ మయ్యెను! నాకలకత్తాప్రవాసము, బంగాళీయుల వదన బింబములు, ఆదిశేషుని సహవాసము, ఇపుడు నేను పయనముఁజేసిన రెయిలుబండి నడకల వలెనే యతివేగముగఁ గాలగర్భమునఁ గలసి పోయెను. శీతకాలపుటుదయమున దట్టమగుహి మములు మైదానమునుగప్పురీతిని,సమయదేవత నానూతనానుభవములనెల్ల నంధకార బంధుర మగు తన వదనగహ్వరమున వైచికొనెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని, యీపెనుజీఁకటి మధ్య తళుక్కుతళుక్కుమను దృశ్యమొకటి నామనోనేత్రము నెదుట సదా మెఱయుచుండును. అది నాకమితోత్సాహానందములఁ బ్రసాదించుచుండును. నాకుఁగల పెక్కు మనఃక్లేశములను, కష్టశోధనలను మఱపించెడి భావోద్రేకమును నాకుఁగలిగించుచుండును. అదియేదన, వకుళ కమనీయసురూపమును, కోకిలకూజిత సదృశమగు నామానిని మధురగానమును.

ఒకనాఁడు నేను కళాశాలనుండి బసకు వచ్చిచూడఁగా, నాకొఱకు రెండుఉత్తరములు గనిపెట్టుకొని యుండెను. అందొకటి నాప్రియ మిత్రము ఆదిశేషువ్రాఁతతో నొప్పుచుండెను. రెండవ లేఖ యెవరిదో దస్తూరినిబట్టి గ్రహింపనలవిగాకుండెను. ఇదెవరువ్రాసిరాయని సంచి చింపకయే నేనాలోచించితిని. నా పేరు ముందు "రాజశ్రీ"కిమాఱుగ "బాబు" అనియుండెను. పోరిసనురోడ్డుముద్రయుండుటవలనఁగూడ, నా క్రొత్త కలకత్తా నేస్తకాం డెవ్వరో వ్రాసియుందురనుకొంటిని. ఎవరువ్రాసిరి, విషయము లెట్టి యని తెలిసికొనఁగోరి నేసంతమాత్రమున కాకితపుసంచి విప్పితిని. క్రింది సంతకము గుర్తుపట్టలేకపోతిని. వడియుకురములతో జాబు లిఖింపఁబడియున్నను లోని విషయములు నా తలకెక్కినవిగావు. అవి నన్నుఁగూర్చిన సంగతులేమైనట్టున్నను, వ్రాయువ్వారికి నా వలనఁ గావలసిన ప్రయోజన మేమియో గ్రహింపలేకుంటిని! ఆదిశేషు ఉత్తరమొకవేళ దీనికి వ్యాఖ్య యొసరింపఁ గలదేమో చూతమని యది విప్పిచూచితిని. అది చదువునపుడు నా కనులు నేనమ్మజాలకుంటిని. నే నింకను కలకత్తాలో మిత్రుని యెదుట నుండునట్లును, అతఁడు తన సహజచమత్కారవచనముల నా ప్రేయసి వకుళనుగూర్చి నాతో ముచ్చటించుచున్నట్టును, నేను కలగనుచుండుటలేదుగదా? లేదులేదు—నేను నిక్కమముగ మద్రాసుననే యుండి, నాకలకత్తామిత్రునిలేఖ చదువుచుంటిని. జాబులోని విషయము లేమిటి? ప్రఫుల్ల చంద్రని యోగి, తనపుత్రిక వివాహమునుగూర్చి యాలోచించుచు, కూఁతుని కోరిక గనుగొమ్మని సతి నడుగఁగా నాఁడు తమ యతిథియైన యాంధ్రనియోగి యువకునిపై నాయువతి మనసునిలిపెనని తెలిసెననియు, తన యవలెనే తండ్రియు నాజవ్వనునిగూర్చి యభిప్రాయపడుచుండెననియు తేలెను. ఈ వృత్తాంతము నాకును, మాజనకునకును వ్రాసి, మా యభిప్రాయములుగనుగొనికాని, తనకుమార్తె పరిణయపుఁ బ్రయత్నములు సాగింప వలనుపడదని ప్రఫుల్లబాబు చెప్పుటచేత, ఆనాడే మా తండ్రికిఁగూడ సవిస్తరముగఁ దాను లేఖవ్రాసితిననియు, ఆసంగతి నాకును దామిడువుడును తెలియఁబఱచుచున్నా మనియు నాదిశేషు వ్రాసెను. ఇపుడు ప్రఫుల్లబాబు ఉత్తరము చదువఁగా, దాని యర్థము నాకు విస్పష్టమయ్యెను. ఇఁకనా కర్తవ్యమేమి?

*

పాఠకమిత్రుఁడా! నీవెపుడైన నమూల్యము గు కలగని, అందలి విషయములు మొఱకువ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చినతోడనె మటుమాయమగు ననుభయ మున మంచమునంటిపట్టుకొనియుండుట జ్ఞప్తి నున్నదా? నేనపు డిట్టియవస్థ నున్నాఁడను. వకుళ నేను గలలోఁగనిన పెన్నిధియె. నాజాగ్ర దవస్థాగమనమె యద్దాని యనుభవమునకు ప్రబలశత్రువు ఎందువలన ననెదరా! నేను లోక మెఱుఁగని కళాశాలావిద్యార్థిని. వకుళ నా భాగ్యదేవతయనుట నిక్కమే. కాని, మల్లెను పూల్లనుగల వేలకొలఁదిమైళ్ల విశాలదేశము మాప్రేమసాఫల్యమునకు ముఖ్యప్రతిబంధకము. పేరునకు నియోగియేకాని, అన్యజాతి మతా చారధర్మము లనుసరించిన బంగాళీకుటుంబపుఁ బడుచు వధువు. ఆంధ్రదేశమున పూర్వాచార పరాయణులగు వైదికశాఖవారిని తమ నిష్ఠచే ధిక్కరించెడిపద్ధతి నియోగిశాఖకుఁ జేరినవాఁడు వరుఁడు. ఎంతటి పరస్పరానురాగములతో నొప్పువారలయ్యును, ఇట్టి యువతీయువకులకు దాంపత్యసంఘటనభాగ్యము దుర్లభము గదా!

౬

నాకు లేఖలు రెండును మాతండ్రికిఁ బంపి వేసితిని. నాయుద్దేశమును వెలిపుచ్చెడియావంత మాటనైనను నేను తెలుపలేదు. ఏమని తెలుపు వాఁడను? నా యిష్టపత్నికిఁ బూర్వమే తలి దండ్రులు మంచి సంబంధ మొకటి కుదిర్చిరి. ఐన నేను పెండ్లికి పెడమొగము పెట్టుటచేత, నా కోరికను మన్నించి, వారు కార్యాచరణము నకు దిగకుండిరి. ఇంకఁ గొంతకాలమునకుఁ గాని నావిద్యాపరిపూర్తి కానేరదు. నా భక్తి గౌరవముల కాస్పదుఁడగు జనకుని యభిమత ము పడయక యేమొగము పెట్టుకొని యీ విదేశాంగనను బరిణయ మయ్యెదను? మా నియోగిసంఘమునం దిటీవల విశాలభావములు కొంతవఱకు వ్యాపించియుండుట వాస్తవమే. ఐనను మొత్తముమీద సంకుచిత సాంఘికాద ర్శములుగల తలిదండ్రుల యభిప్రాయములను ప్రతిఘటించి, యెటు లీనూతనపద్ధతి వివాహము నకు సిద్ధపడఁగలను? కావున నీసందిగ్ధ సమయ మందు మౌనమే యొప్పగుమార్గమని యెంచి, పొసఁగని నాప్రేమచరిత్రకథనమునకుఁ బూనక మా జనకునికి పైలేఖ లంపి యూరకుంటిని. ఒక్కొకసమయమున మౌనమే పదియుపన్యా సములపెట్టు! నాహృదయగత మగు కోరికలు గ్రహింప మా జనకుని సరసతకే వదలివైచి యూరకుంటిని.

ఒకవారము గడచెను. రెండువారములు జరిగెను. ఇప్పటికి మూఁడువారము లయ్యెను. ఎప్పుడు తపాలజవానువచ్చి, ఆకసమంటెడి నా ప్రేమసౌధమును గూలఁద్రోచి నా వలపును మూన్నాళ్ల ముచ్చటగ నొనరించెడి లేఖను నా చేత నుంచునోయని నా గుండియలు జల్లుమను చుండును. రెండుమాటలతో పరిసమాప్తి నొందింపవలసినకథ కింతటిజాగేల? "పుత్రకా, నీబాల్యచేష్ట లింకను వదలలేదేమి?" అను జన కుని సంక్షిప్తలేఖనముతో నాయాస లొక్కు మ్మడి యడుగంటునుగదా! ఈ కాలహరణ మేల? ఇట్లు నేననుకొనుచుండఁగ నొకనాఁడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాతండ్రియుత్తరమువచ్చెను. నాప్రేమ కథను వమ్ముఁజేసెడి యీలేఖ విప్పుటకు నా చేతులు వచ్చినవి కావు. సంచిచించునపుడు వినవచ్చిన సన్ననిచప్పుడు నాగుండియ లవిసిన ధ్వనివలెఁ దోఁచెను! నిరాశతో మనసు రాయిచేసికొని, నే నంత యుత్తరము చదువ సాహసించితిని. ఇదియేమిచిత్రము! లేఖ చదువునంత సేపును, నామనస్సు మర్త్యలోకమున నే లేదు. ఏమి చదువుచుంటినో నాకుఁ దెలియదు. అరేబియను రాత్రులకథలలోని యలాయుడ్డీను నేల సొరంగమునఁ జొచ్చి నేత్రపర్వముగఁ గాంచిన విచిత్రదృశ్యములు నేఁ జూడఁగంటిని. కొండగుహలో ఆలిబాబా కంటఁబడిన కాంచన రత్నరాసులు నాకు దృగ్గోచరమయ్యెను. భానుబింబము పశ్చిమదిశ నుదయించునట్లును, వృక్షజాలము వియత్పథమునుండి పృథ్వికి వ్రేలాడునట్లును నాకుఁ దోఁచెను. సనాతన వైదిక ధర్మనిష్ఠాపరుఁడగు మాజనకుఁడే నా కీజాబు వ్రాసెను! ప్రఫుల్లచంద్రనియోగి, ప్రస్తుత దేశకాలపరిస్థితులను బట్టి బంగాళీయుఁ డని వ్యాప్తిఁగొందియున్నను, సత్యమునకు స్వచ్ఛమగు నియోగివంశ సంజాతుఁడు, సజ్జన గరిష్ఠుఁడుననియు, ఆయనకుమార్తె తనకోడ లగుటకన్నివిధముల నొప్పియున్న దనియు, తాను బోయి స్వయముగ నీసంగతు లన్నియుఁ గనుగొంటిననియు, నాకీసంబంధముసమ్మతమైనచో నావివాహమునకుఁ దామందఱు నెదురుచూచుచుంటి మనియు, ఇవియే మాజనకుని లేఖావిషయములు. పిమ్మటి వృత్తాంతమంతయు రసజ్ఞులగు పఠితలే యూహించుకొనఁగలరు.

---

## కోకిలగీతము

పోలూరు శ్రీమన్నారాయణయ్య, గండ్రకోట సీతారామయ్యగార్లు

గున్నమామిడి చిగురుటాకులను మెక్కి,
　　కువలయానందముగఁ బాడుకొనెడి వేళ,
గానవిద్యా ప్రవీణులౌ కవివరేణ్యు
లరయుచున్నారు; కోకిలా! హాయిఁజెంది.

కంఠమందలి తంత్రులఁ గదియఁజేర్చి,
విశ్వమోహనముగ నాలపించువేళ,
వినెడిభాగ్యంబ దే మానవునకుఁ గలదొ
వానిజన్మము ధన్య మోవరపికంబ!!

ఎంగిలాకులజీవించు హీనమైన
యాత్మఘోషము నీగీతమహిత మనిన;
గానవిద్యాప్రవీణులౌ కవివరేణ్యు
లనుభవింతురు; నీదు గీతామృతంబు.

విరహిణులు కొంద ఱొక్కొకవేళ నిన్నుఁ
బలువిధంబులఁ దిట్టినఁ బాటలోని
నీటు గోరంత తగ్గునే? యేటిమాట
లెవ్వరేమన్న నేమి? నీకేమిలోటు?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వర్ణభేదముఁ బాటించువారు నిన్నుఁ
దులువతనమున నలుపని పలికినంత,
సదమలంబగు నీకీర్తి కొదవవడునె?
కాదువర్ణంబు ప్రఖ్యాతి కారణంబు.

పాలకడలియె, జననియై బరఁగుగాదె!
వెలయు నమృతమునకు,హాలాహలమునకును;
పుట్టినిల్లొకటియె, బలిపుష్టమునకు,
బాలపల్లవఖాదివై వఱలునీకు;
రాళ్లగుట్టలలో నుండు రత్న మెట్లొ
యట్లె, పులుగులరత్నంబ వగుదు వీవు
కాదు వంశంబు, చిరకీర్తికారణంబు.

కన్నబిడ్డలఁ గాకులు గష్టపెట్ట
నుల్లమున నించుకేని చింతిల్లఁబోవు,
నీదుడెందము పాషాణ నిర్మితంబొ!
హా! తెలిసె! సురభిపురుషునందు నీకుఁ
గలుగుప్రేమభరంబును బలుక వశమె?
సతికిఁబతి, "యేడుగడ"యన జగతి వినమె?

వరుసఁ దారలు హిమభాను వదలుఁగాక!
ద్యుతియువతి ద్వాదశాత్ముని దొలఁగు గాక!
నీవు సురభిని బాయక, నిక్కమైన
ప్రేమ తత్త్వంబుఁజాటెదు దీప్తధివియందు.

హాయిఁగూర్చు వసంతుని రాయబారి
వీవులేక, వత్సరములులేవు, కల్ప
ములును లేవు, లేవు నిఖిల భువనములును!
ప్రణయశరధి భంగాహత పాంథజనులఁ
గరుణఁ గనుఁగొని దరిఁజేర్చు తరణి వీవ!
నీవు లేకున్న జగమెల్ల నిదురఁ జెందు.

మెసవెదవు నీవు ఫలములఁ గిసలయముల
ననికిఁ బలుమఱు మార్చెదు యోగి రీతి,
పుష్పసమయమునకుఁ గూర్చు భోక్త వగుచు,
జ్ఞానమార్గంబుఁ దెల్పెదు గాన సరణి.

పూలమకరందమునఁ బొట్టఁబోసికొనెడి,
యళుల ఝుంకృతులకుఁ గల యర్థమేమొ?
సుఖము మీఱ డోలికయందు సుప్తిఁ జెందు
నర్భకుని నవ్వులకుఁ గల యర్థమేమొ?
హరిని బంధించి, మనమున హరిఁదలంచి,
శ్వాసకుంభించి, మించు తత్త్వము గ్రహించి,
యన్ని తానని యెంచి, లోనాలకించు
నపుడు ప్రభవించు, వివిధ నాదార్థమేమొ?
పలు పలుకులేల? గాములు, బవలు సేయు
వేల్పు, రిక్కలు, నుప్పరవీది నేఁగు
నపుడు గలిగెడి యులివుల యర్థమేమొ?
అరయ నీ గీతమున కర్థమదియె పికమ!!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వరదరాజేశ్వరి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

౧

బహుమాసముల క్రిందట సమరయాత్ర వెడలి దుర్భేద్యము లగు దుర్గముల పెక్కింటిని జయించి, దోర్బలులగు ప్రభువుల పెక్కుర నోడించి ప్రాభవోపేత మగు దనదిగ్విజయసూచకముగా జయస్తంభముల పెక్కింటి నెందందు నెలకొల్పి, తుట్టతుదకు దుర్నిరీక్ష్యప్రతాపుడగు ప్రతాపరుద్రగజపతిని జాతుర్యమున జయించి, యక్కటకవల్లభుని తనయయైన రుచీదేవిని బరిణయమాడి చతురంగబలములతోడను, అగణితధనరాసులతోడను, శచీసహితుండగు పురందరునివలె రుచీసహితుండై కృష్ణదేవరాయ లఖండవైభవముతో బురప్రవేశము చేసి మున్నటుగ మూడునాళ్లయినగాలేదు. ఆ రాజేంద్రుని స్వాగతోత్సవమునకై వేసినపందిళ్లు, కట్టినతోరణంబులు, తీర్చినరంగవల్లులు, యెత్తినధ్వజపతాకలు, పెట్టిన యంగళ్లు యింకను అట్లేయున్నవి. స్త్రీలును, బాలబాలికలును, ఉత్సవసందర్భమున పెట్టుకొనినయలంకారములు, ధరించినవస్త్రములు, పూసికొనిన లేపనములు, రాసికొనిన యత్తరువులు, వేసికొనిన తాంబూలరాగములు, యింకను తొలగలేదు. ఏ వీథి తిలకించిన, ఏ యంగడిని జూచిన, నేగృహంబునుగాంచిన యుత్సవచిహ్నము లింకను కనుమాయక కనుపించుచునే యున్నవి. కృష్ణరాయప్రభుని దోర్బలమును, తిమ్మరుసుమంత్రి బుద్ధిబలమును సమరయాత్రకువెడలివచ్చిన యోధు లింకను పౌరులకు నద్భుతంబు గొలుప వివరింపుచునే యున్నారు; ఆనందాశ్చర్యములతో జనులు వినుచునే యున్నారు. ఇంతలో యెల్లరిమనములు కలక జెంప నంతఃపురములో కలిగిన దొక్క విశేషము.

౨

అపుడే తెలతెలవాఱుచున్నది. మహారాజును మేల్కొల్పుటకు మ్రోగెడి మంగళతూర్యరవంబులింకను మ్రోగుచునేయున్నవి. ఆ నగారా మ్రోతలకు నిద్రనుండి మేల్కొని దాసదాసీజన మప్పుడే నిత్యకృత్యములకు గడంగినారు; కాని యున్నట్టుండి పనిపాటలాగిపోయినవి. ఎవరిపనులు వారుచేసికొనక యెక్కడివా రక్కడే గుంపులుగూడి గుసగుస లాడుచున్నారు; ఒకరిచెవి యొకరు కొఱికికొనుచున్నారు; అమ్మక్కయని ముక్కుపై వ్రేలు వేసికొనుచున్నారు; 'ఎంతసాహసి' యనుచున్నారు. "శిరశ్ఛేదము చేసినను పాపములే"దనుచున్నారు. "మగనినే చంపుటకు సాహసించిన మగువ యెంతకు చాల"దనుచున్నారు. "నిజముగా నట్టిదాని నంతఃపురమున నుంచుకొనుట రాజునకును, రాజ్యమునకును జేటే" యనుచున్నారు. "ఇది ఆమెతప్పుగాదు, మహారాజుతప్పే. ఓడిపోయినవానిబిడ్డను మోహపడితెచ్చుకొనిన అది చెఱుపు చేయక చెలిమిచేయునా? ఇది రాజునకు తోచకున్న మంత్రికైన నేల తోచకపోవలె"ననుచున్నారు. ఈ విధముగా యెవరికితోచిన విధమున వా రనుచున్నారు. కాని యిది మహారాజునకును విశేషించి యంతఃపురమునకును సంబంధించిన విషయముగాన యీపలుకులన్నియు గుసగుసలలోనే అణగుచున్నవి, సంజ్ఞలలోనే చల్లారుచున్నవి.

స్త్రీలు స్త్రీలతో, పురుషులు పురుషులతో, పురుషులు స్త్రీలతో, స్త్రీలు పురుషులతో, దాసీలు దేవేరులతో, దేవేరులు బంధుజనముతో, ఒకటే మంతనము, ఒకటే యబ్బురపాటు, ఒకటేచర్చ. అట్టుడికినట్టు లుడికి పోవుచున్నది.

మహారాజగు కృష్ణదేవరాయలు నిత్యము లేచు సమయమైన కాలేదు; కాని యానా డప్పటికే నిద్రనుండి లేచి తిమ్మరుసుతో రహస్యాగారమున యోచింపుచున్నాడు. పూర్ణేందునిభమైన యామహారాజువదనమున కత్తివాటువేసిన నెత్తురులేదు. లజ్జ, భీతి, చింత, నిరాశ మున్నగు భావములెన్నియో యాయవనీపతి ముఖమున ప్రతిబింబించుచున్నవి. ప్రభుహితైషియగు నావృద్ధసచి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వుడు గూడ నిర్విణ్ణుడై యట్టె మహారాజు మౌనముఖావలోకనము సేయుచు కూర్చున్నాడు. కొన్ని నిముసములు గడచిపోయినవి. వృద్ధామాత్యుని పెదవులు చలించినవి. "ప్రభూ!" అనినాడు. "ఏమిఅప్పాజీ" యనినాడు రాజు. "మొదటితప్పిదము క్షమార్హముగదా! మఱియొక యవకాశమిచ్చు టవసరమగునేమో" అనినాడు శంకింపుచు మంత్రి.

"అప్పాజీ! మొదటితప్పిదము క్షమింపదగినదగుట వాస్తవమే కాని యీవిషయమునమాత్ర మట్టులు కాదు. భర్తృసౌఖ్యకుతూహలముమై నుండెడిస్త్రీయేడ? పరస్పరాను రాగదాయకంబగు దాంపత్యధర్మ మేడ? బలవంతపువివాహ మనర్థదాయకము. ఆమె చిత్తవృత్తి నెఱుంగక యనురక్తుడ నగుటబట్టియేగదా నాకిట్టి ప్రమాదము వాటిల్లెను. మఱియు నామె పగతునితనయ; తనతండ్రిని ఓడించినక్రోధ మామె మనంబున నగ్గలమై ప్రజ్వరిల్లుచుండనోపు. కావుననే ఆమె యట్టిసాహసకృత్యమునకు సాహసించినది. కాన యిక నామెతోడి పొత్తు తగదు."

"అయిన నిక నామె నేమిచేయుదురు.?"

"పుట్టినింటికి బంపివేయుదును. ఆమె అభిప్రాయమెట్లున్నదో? ఆమె అభిప్రాయముతో మనకు పని లేదు. బలవంతముగనైన బంపివేయుటయే కర్తవ్యము. కాన అప్పాజీ! అందులకు తగినసన్నాహము గావింపుము."

ప్రభుఆజ్ఞకు సమ్మతించి వృద్ధామాత్యుడు వెడలిపోయెను. తాబడిన భంగపాటువలన నాందోళితహృదయుడై రాయ లేకాంతగృహంబున కరిగెను.

ప్రభుని యుత్తరువుప్రకార మాదినమే కటకరాజకుమారి పంపివేయబడినది.

## 3

గజపతి రాజకుమారిని శిబికారోహణుజేసి సాయుధులగు నాశ్వికులును, పదాతులును గొనినచ్చుచుండిరి. మార్గము కొండగుట్టచేతను భూరితరులతాగుల్మంబులచేతను భయంకరవనసత్వములచేతను నగమ్యముగా నుండెను. మఱియు నాటవికులగు దారిదోపిడికాండ్ర బాధయుగలదు. కాన అస్తంగతభాస్కరుని యరుణకాంతులు చూచినతోడనే రాబోవురాత్రిని దలచి అడలుచు యోధులు "ఇక ప్రయాణము సేయుట ప్రమాదము యీ రాత్రి యేచిన్నపల్లెయందైన నిలుచుటమంచి" దని దళపతితో దర్చించుచుండిరి. దళపతియునదియే మనంబున నిశ్చయించుచుండెను. ఇంతలో నొకచిన్నపల్లె గన్పడెను. దీనిని దాటిన నింతలో మరల పల్లెగన్పడుట కష్టమనియు, తాము సాంద్రారణ్యములో చిక్కుపడవలసి వచ్చుననియు యోధులు సేనాపతికి విన్నవించిరి.

"అవును నిజమే. దేవియభీష్టముకూడ కన్గొని యనుజ్ఞయైనచో యీరాత్రి యిక్కడ విడిసి రేపుకడ పయనింత" మని దళపతి యనుచరులకు బల్కి శిబికను సమీపించెను. 'లక్ష్మి', 'లక్ష్మి' యని దేవి దాసినిపిలిచెను. దళపతి మాటవినిలక్ష్మి శిబికతలుపోరగాదీసి "ఏమిపని అయ్యా" అనెను.

"పొద్దుగ్రుంకినది. ఇక ప్రయాణము సేయుట అపాయకరము. ఈరాత్రి యిక్కడ నిలిచిన బాగుండునని యనుకొనుచున్నాము. దేవిగారి అభిప్రాయ మెట్లున్నదో కనుగొనుము. 'దేవిగారి అనుమతి ప్రకారము పయనము సేయుడు' యని మహారాజగారు సెలవిచ్చిరి" యనెను.

సేనాపతి పల్కులను విని లక్ష్మిదేవివంక జూచి నిట్టూర్పువిడిచెను. అప్రయత్నముగా నామె కన్నులు చెమ్మగిల్లెను. సేనాపతికి జవాబీయజాలక పోయెను. "ఏమిలక్ష్మీ! అమ్మగారి నడిగితివా?" అని ప్రత్యుత్తరమునకు వేచియున్న సేనాపతి మరల యడిగెను.

సేనాపతి మరల ప్రశ్నించుటచే లక్ష్మికి పట్టరాని దుఃఖమువచ్చెను. కాన "అయ్యా, దేవిస్మృతి హీనయైపడియున్నది. విజయనగరమునుండి బయలుదేరినది మొదలా మెస్థితి యటులనేయున్న" దని శోకగద్గదస్వరముతో నే లక్ష్మి బదులుపలికి "అయినను నొకమాఱు పిలిచి చూచెద" నుండుడని "అమ్మా! అమ్మా! అమ్మా!" అనెను.

మూడవ పిలుపునకు హీనస్వరముతో "ఏమి!" అనెను దేవి.

"అమ్మా సేనాపతి అడుగుచున్నాడు."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఏమని?"

"ప్రొద్దుగ్రుంకినది, ఇక ప్రయాణముచేయుటకష్టము. కాన, యీరాత్రి యిక్కడ నిలుచుట కనుమతింతురా?" అని.

"ఎక్కడ?"

"ఇక్కడనేడున్న పల్లెయందు"

"మహారాజాంతఃపురమును పల్లెయందు వేమి?"

మతిహీనమైన దేవిపల్కు లక్ష్మిని మరల దుఃఖములోముంచెను. "అయ్యో! ఎంతటిబుద్ధిశాలిని! ఎంత వెఱ్ఱిదై పోయిన" దని లక్ష్మి యించుక బిగ్గరగనే విలపించెను. కాని నేనాపతికి జబాబొసంగు పని యొకటిగలదు గదా; కాన "అమ్మా! మహారాజాంతఃపురమునకును మనకును ఋణముతీఱినదికదా," అనెను లక్ష్మి.

"తీఱె," అన్నది దేవి.

"కటకమున కేగుచున్నాము."

"కటకమునకా? అక్కటకటా! అక్కటికము లేకనల్లుడని యైన శంకింపక, మహారాజనియైన జంకక, నిజకుమారికకు వైధవ్యము వచ్చుననియైన చింతింపక, శయ్యామందిరమున భర్తను వధింపుమని దుర్బోధలు జేసినాకును, నా పతికిని ఎడబాటుగావించిన యామాతృగృహమునకా? అయ్యో! పోజాలను. పోజాలను. ఆహా! ఆమహారాజెంతటి యుదారుడు! ఎంతటి కరుణార్ద్రహృదయుడు. ఎంతటి సజ్జనశేఖరుడు! ప్రథమ సమావేశతత్పరత మహోత్సుకుడై వచ్చిన దన్నుసముచిత సల్లాపసత్కారములచే సంభావింపక వాడికత్తిచే బొడుననున్న నాయకృత్యమును గన్నులారగాంచియు, చెఱను బంధింపక, శిరచ్ఛేదము సేయక, చిత్రవధ గావింపక సగౌరవముగ సాయుధాశ్విక పదాతులను సాయమిచ్చి పుట్టినింట కంపుచుండెనే. ఆహా! ఏమి యా మహామహుని యౌదార్యము! అయ్యో! ఇట్టి పావనచరితునేగదా నేజంప నుద్యోగించితిని. అక్కటా! నా కృత్య మెంతదారుణము! ఎంతక్రూరము! ఎవరు చూచెదరో యనుభీతిని నాతురతతో నేను మెలయందు దోపికొనిన పదనుకత్తి దైవికముగా నేలబడినది. లేకున్న...... లేకున్న...... మృత్యువునని యెటుగక మగ్గననితలంచి యా మహారాజు నన్ను చేరవచ్చి యుండును. మహాహంతకి నగు నేను నిశితకృపాణధార నా మధ్యమలోకమందారుని, ఆ దీనజనచింతామణిని, ఆకవిజనకల్పకమును, ఆ యాశ్రితావన దీక్షితుని గ్రచ్చియుండును. ఆదయాసాంద్రుని క్రొన్నెత్తురుచే భూతల మపవిత్రమైయుండును. కాని ఆ మహాత్ముని ధర్మశీలమే యాతని రక్షించినది. ప్రజలకు దుఃఖము, నా కపకీర్తి రెండును తప్పినవి...... ఆ పొరపాటు లేదు. లేదు. నాకపకీర్తి తప్పినదా? లేదు. ప్రజలదుఃఖము తప్పినది. మహారాజు ప్రాణోపద్రవము తప్పినది. కాని నా యపకీర్తి తప్పలేదు. అయ్యో! నా దుష్క్రియశాశ్వతమై పోయినది. దీనికి నిష్కృతిలేదు. అయ్యో? నేడాంధ్ర కర్ణాటరాజ్యములందలి యాబాలగోపాలము నాదుశ్చేష్టనే వర్ణించుచు నన్ను దూషించుచుందురుగదా? ఇక నా యపకీర్తి తొలగిన దెక్కడ? లేదు. పతికి దొలగితిని; ప్రభుతకు దొలగితిని; కాని అపకీర్తికి మాత్రము తొలగలేదు. అయ్యో! నా పాపకృత్యమును తలంచిన కొలది నా హృదయమున నెంతవేదన, యెంత దుఃఖము! అకటా! భరింపరాకున్నది గదా. అయ్యో! అప్పుడే యానాడికత్తితో నా పత్తుక నుత్తరించుకొని యుండిన నా కీయావేదనాదుఃఖములు లేక యుండెడివేమో? నా పాపముకొంతకు గొంత నశించియుండెడిదేమో? చేయనైతిని. ఏమీ? చేయుట కవకాశమేదీ? గల్లున నేలబడగనే నేను సంభ్రమముచెందుచుండ నాకత్తిని అమహారాజు రివ్వునవచ్చి తీసికొనిపోయెను గదా. అయ్యో! ఎంతపాపిని! ఎంతమందభాగ్యను? ఆదివ్యసుందరవిగ్రహుని, ఆకమనీయక్రమగుణాలంకారుని, ఆ శాత్రవరాజన్యానేకపసింహమును, ఒకమాఱు కన్నులార చూడనైతి; నోరార బలుకరింపనైతి; చేతులార నమస్కరింపనైతి. ఛీ! ఎందులకీపాడుజన్మము ఎంతశీఘ్రముగా నసువులువాసిన నంతమేలుగదా! ఆఁ! ఆఁ! ఎంత పొరఁబడుచుంటిని? అసువులువాసిన నపయశ మెట్లు పాయును? ఆమహారాజునకును, ప్రజలకును, నాశీలమును ఋజువుచేయకుండ, నా విశుద్ధహృదయమును వెల్లడింపకుండ, నాగాఢానురాగమును విశదీకరింపకుండ,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాణములు వీడనా? వీడను. ఏమైనసరియే అపకీర్తిమాపుకొనకుండ నసువులవీడను నాప్రాణపతియెడగల నావి నిర్మలభక్తిని, విశుద్ధానురాగమును, నెన్నిదినములకైన వెల్లడించియే విగతజీవి నగుదును. లేకున్న నాయపయశము స్థిరమైపోవునుగదా! కాని నాయపకీర్తి యెటులు తొలగును. మరల వెళ్లి నాజీవితేశ్వరుని పాదములపై బడి ప్రార్థింతునా? ఎట్లు? ఈభటులు తమప్రభుని యాజ్ఞ నుల్లంఘించి మరల దోడ్కొనిపోవుదురా? ఒకవేళ నేవిధముగనైన వెళ్లెదనే యనుకొనిన, భర్తృఘాతకినని విశ్వసించుచున్న యాప్రభుడు నాకుదర్శన మొసగునా? వట్టిది! వట్టిది! అటులజరుగదు. పోనిమ్ము; కటకమున కేగి మాతండ్రిని దోడ్కొనివచ్చి మహారాజు దర్శనము చేయుదునా? పిల్లను దాసీపుత్రున కిచ్చి వివాహముచేసి వంశమర్యాదను గంగను కలిపితివని మాయమ్మచేతను, అన్నలచేతను మునుపే సూదిపోట్లు తినుచున్న మాతండ్రి, నేనువెళ్లిన 'మంచిదిక్కడనే యుండు' మని యూరకొనునుగాని నన్ను విజయనగరమునకు దోడ్కొని వచ్చునా? ఒకవేళ మాతండ్రి యంగీకరించినను, కులములెక్కువవారితోడి సంబంధమయ్యెనని మహాదురభిమానముతో గింజులాడెడి మాతల్లియు, తోడబుట్టినవారు ఆయననుగాని నన్నుగాని, మరలవిజయనగరముమాటదలపెట్టనిత్తురా? లేదు. కాన అక్కడ కేగినచో మాతండ్రి మాట యటులుండ నేనైన మరల విజయనగరమునకు వచ్చుటగాని, నాభర్తను దర్శించుటగాని తటస్థపడదు. కాన కటకమున కేగినచో నాగతియేమి? దిగంతవిశ్రాంతకీర్తి శోభితుండగు కృష్ణదేవరాయలంతటిమహాప్రభుని జేపట్టియు నామరూపములులేక గజపతుల యింటిదాసినై జీవితశేషము గడపవలెను. పతివిడిచిన సతికి పుట్టినింటమాత్ర మేమాత్రపుపూజ్యతయుండును. రాచపుట్టుకబుట్టి వీరపుత్రినై, వీరపత్నినై అట్టినికృష్టపు బ్రతుకు బ్రదుకుటెంత నీచము! నీచపు బ్రదుకుకన్న చావు మేలు. ప్రాణత్యాగము నేసిన యీ మనోవ్యథలన్నియు దీఱును. కాని మఱియొకకర్తవ్యము నన్ను మరణోన్ముఖను గావింపకున్నదే? అకటా! ఏమిసేయుదును? ఎందుజొత్తును? పుట్టినింటి కేగ మనసులేదు. మహారాజునుదర్శించి నిర్దోషిత్వము తేటపఱచి క్షమాపణ వేడక ప్రాణత్యాగము సేయుటయు, సమ్మతముగాదు. ఏమికర్తవ్యము! ఇచ్చటనే యుందునా? అవునవు నిదియే మంచియుపాయము. ఇచ్చటనే నిలిచి భర్తృచరణకమలధ్యానముసేయుచు జీవితశేషము గడపెదను. నాతండ్రియొసగిన వెలలేనిసంపత్తి నే నెన్ని ధర్మకార్యములు సేయుటకైన చాలును. నాప్రచ్ఛన్నవృత్తి కీము నాగరకపుపల్లెయే తగును. కాని యీప్రదేశ మేప్రభుసీమలోనిదో కనుగొందును. లక్ష్మి! లక్ష్మి! ఈప్రదేశ మేప్రభురాజ్యములోనిది?"

"అమ్మా" నాయకు నడిగి కనుగొందును.

"అయ్యా! ఈస్థల మేప్రభురాజ్యములోనిది."

"మాప్రభురాజ్యమునిదే."

"అమ్మా! రాయలవారిరాజ్యములోనిదే యీ ప్రదేశమని సేనాపతి చెప్పుచున్నాడు."

"ఆహా! ఎంతపుణ్యాడు. కీడులో మేలు. నాపరదైవముదే నా యీపల్లె! లక్ష్మి! మహాభాగ్యముగదే! నాప్రాణేశ్వరపాలితదేశమునందే నా కిరవు దొరకినది."

"లక్ష్మి."

"అమ్మా!"

"పరివారము నిచ్చట యాపవలసినదని సేనాపతితో జెప్పుము. మఱియు నిచ్చటగల పల్లెపే రెద్దియో గూడ కనుగొనుము?"

"చిత్తము. అయ్యా! అమ్మగారిచ్చట నాగుటకు సమ్మతించిరి."

"చిత్తము."

"అయ్యా! ఈపల్లె పేరేమి?"

"చిన్న గొల్లపల్లె."

"అమ్మా, సేనాపతి యిక వెళ్లవచ్చునా?"

"వెళ్లవచ్చును. తమరాజధానికే వెళ్లవచ్చును. వారిసాయము మనకక్కఱలేదు. కాన రేపకడలేచి పరివారసమేతుడై సేనానిని తమరాజధానికి వెళ్లుమని చెప్పుము."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అమ్మా! వారిసాయ మిప్పుడేవిడనాడుకొని నచో నీదుర్గమారణ్యములను గడచి మనము సుఖముగా కటకమున కేగగలమా?"

"కటకమున కెవ్వరేగదలఁచిరి?"

"వెళ్లకున్న మనకీసాంద్రారణ్యములో దిక్కెవరు?"

"ఈశ్వరుడు."

'దేవీ! సాహసమువలదు. దైవదుర్విపాకమువలన మహారాజు మిమ్ములను బంపివేసిరి. ఇక నాతఁడు మిమ్ము రావింపఁడు. అట్టిచో తలిదండ్రుల ప్రాపుననే గదా స్త్రీ యుండుట ధర్మము. అటుపతికడనుగాక, యిటు తలిదండ్రులకడను గాక రాజపుత్రికలగు తామి టు లొంటరిగ వసించుట భావ్యమగునా? ఏమిముప్పు వాటిల్లునో!"

"ఇప్పుడువచ్చిన ముప్పుకంటె మిన్నయైనదిరాదు."

"అమ్మా! అటులనరాదు. తరుణవయస్కవు, రాజ కుమారివి; అంతఃపురము వీడరాని సమయమిది."

"లక్ష్మీ, ఎందుల కీభీతి! రాచకన్నెల ధైర్యసాహ సము నెఱుగవా? వారు మానముకొఱకు ప్రాణము బలి పెట్టుదురు. శీలమువారికి ప్రాణపదము. కాదు కాదు. అంతకంటే అధికతమము."

"అవును తల్లీ!"

"అయినచో నిక భయమేమి? శీలవతియగు మాన వతికి ప్రాణము తృణము. కాని ఆమెపవిత్రతను, మృత్యు వుకొనిపోలేదు. అగ్నికాల్చలేదు. కత్తియుత్తరింపలేదు. ఇకపరుఁడా స్పృశించునది? శీలవతియగు క్షత్రియస్త్రీ అగ్నికన్న పవిత్రురాలు; ఖడ్గముకన్న నిశితురాలుకదా."

"అమ్మా! నేను మీ శీలమును శంకించుటలేను. ఇచ్చట వసించుట కష్టతరమని శంకించు చున్నాను."

"సీత దుష్టరాక్షసుల మధ్యనే వసించెను. నేను మానవులైన యీ పల్లెజనులకడ నుండజాలనా?"

"అమ్మా! నీధైర్యసాహసములనంతముగా నున్నవి."

"అగును. లక్ష్మీ! నేను నాప్రాణేశ్వరుని దర్శించి నా యపరాధమును క్షమింప వేడుకొనువఱకు నేనిందే వసింప నిశ్చయించితిని. కాన సేనాపతిని రేపు పరివారము తో తమనగరమున కేగవలసినదని చెప్పుము. మీలో నెవ్వ రెవ్వరుకటకమునకేగదలంచితిరో వారెల్లరు రేపే వెడలుడు. నేచేసిన పాపమునకు నాకీదుర్గమారణ్యవాసమే యుచిత మైనది. నాగరికులపొత్తునకు నేనుదగను. కాన లక్ష్మీ, చె ప్పుము; సేనాపతితో గట్టిగా జెప్పుము. మీసాయము మాకక్కఱలేదనియు, మేమొంటరిగా నేగగలమనియు చెప్పుము. ఈయుత్తమాశ్వములను, నీభద్రగజములను వెంటగొని మీరెల్లరు కటకపురికేగుడు. నే నీజానపదు లతో గలిసి యీపల్లెయందు వసించెదను. మఱియు లక్ష్మీ! కటకపురిపరివారముతో నీవుగూడ మనదేశమున కేగుటకు సిద్ధమగుము. తెలిసెనా? ఈపుదయమగు సరికి విజయనగర కటకనగర పరివారజనములలో నెవరును నాచెంత నుండరాదు. ఇది నిశ్చయము."

"అమ్మా! నీ వింతదృఢనిశ్చయముతో నుండ నేనే మిసేతును? కాని దేవీ, నిన్నీయుగ్రారణ్యమున, నీయ నాగరికులనడుమ, విడిచిపెట్టి కటకమున కేగుదునా? ఎంతమాటంటివి? ఈ చెలి నిన్నెన్నడయిన యెడబాసి యుండ కంటివా? నిన్నెడబాయలేకనే గదా యీ ప్త బంధువర్గమునెల్ల విడనాడుకొని యీ దూరదేశమున కే తెంచితిని. ఇట్టి నన్ను అటు పెనిమిటి, కడనైనడింపక ఇటు పుట్టినింటికైన దోడ్కొనిపోవక యీయరణ్యమ ధ్యమున విడిచిపోదునా?

"లక్ష్మీ! పోయిన తప్పేమి? నీవిచ్చటనున్న మిగుల కష్టపడుదువు."

"మహారాజపుత్రివగు నీకు లేనికష్టము నాకా?"

"రాజోచిత భోగములనెల్ల బుద్ధిపూర్వకముగా వర్జించితిని గాన నాకు కష్టములేదు."

"నీవువిడచిననాడే నేనుగూడ విడిచితిని."

"ఇనుముననుగూర్చి అగ్గికి సమ్మెటపెట్టా? లక్ష్మీ నిర్హేతుకముగా నీకిట్టిక్లేశమును గల్గించుటకు నామనసొప్ప కున్నది. కాన యీపరివారముతోపాటు నీవు కటకరా జ్యమునకు వెళ్లిపొమ్ము. నావిషయమై విచారింపకుము. దిక్కులేనివారికి దేవుఁడేదిక్కు; కాన నాకేమియు ప్రమా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దమురాదు; వచ్చినను మోసములేదు. నిందమోసిన యీ బొంది యెంతశీఘ్రముగ యిహమును బాసిన నంతమేలు కాన లక్ష్మి, తప్పక నీవు కటకమునకు పోవలెను.”

“దేవీ! ఇట్టి దుర్భరకార్యమును నాపైఁ బెట్టకుము. చిన్నతనమునుండి మన మొకరినొకర మెడబాసియున్నవారము కాము. మేనులు రెండు; ప్రాణమొకటిగ వర్తించినవారము. అక్కడ చేయరాని యకార్యముచేసి మహారాజుచే నవమానకరముగ పంపివేయబడి, యిచ్చట దుర్గమారణ్యములో నిన్ను విడిచి, యీపరివారమును వెంటబెట్టుకొని తెసుదునని నేనేమని కటకపురి కేగుదును? ఏ ముగము పెట్టుకొని మీతల్లిదండ్రుల జూతును? మా పుత్రిక సుఖియా యని యడిగిన మీ తలిదండ్రులకేమని సమాధానమిత్తును? అమ్మా! నావల్లగాదీపని. నీవున్నచోటనే నేనుందును. మన యీ బాల్యస్నేహము తలచియైన దేవీ! నేను నీసన్నిధినే యుండుట కనుగ్రహింపుము. పరివారము పోవుట కనుజ్ఞనిమ్ము. కాని నేను మాత్రము పోను. నిన్ను వదలిపోను” అని లక్ష్మి దేవి పాదములబట్టుకొని గగ్గోలుగా విలపించెను. దేవికిఁక కాదనుటకు సాధ్యము కాలేదు.

౪

నాగరికు లెక్కడ నివసించిన నదియే నగరమై పోవును. దేవి బసచేసిన నాడు చిన్నపల్లెగా నున్న గొల్లపల్లె యత్యల్పకాలములో గొప్ప మహానగరమైపోయినది. దేవియాజ్ఞచే రాయలపరివారమామఱునాడే వారిని విడిచి చనెను. కాని దేవియందలి గాఢభక్తిచే నామె పుట్టినింటి పరివారజనులలో నొక్కరైన నామెను వీడి కటకమునకేగుట కంగీకరింపలేదు. కాన నా పరివారజనముల కా గజాశ్వముల కర్హములగు భవనములు, శాలలు, నిర్మించుట తప్పని సరియైనది. అమాయకులగు నా పల్లెజనులు చతురంగసేనలతో వచ్చి విడిసిన యా దేవిని తమపాలిటి దేవతగా దలంచి భవనములు కట్టుటకు, శాలలు నిర్మించుటకు, బావులు త్రవ్వుటకు దోడ్పడిరి. కోమటులు కొందఱు పసిపట్టివచ్చి దుకాణములు పెట్టిరి. శిల్పులు కొందఱు వచ్చి భవనములు నిర్మించిరి. వడ్రంగులు కొందఱువచ్చి దారుకృత్యములు నిర్వర్తించిరి. ఒకరేమి, రాళ్లుమోయువారు, సున్నముకాల్చువారు, బండ్లుతోలువారు. ఇటుకచేయువారు, వీరు వారననేల సకలవృత్తులవారు వచ్చి యచట నివాసములేర్పఱచుకొనిరి. ఇవ్విధముగా చిన్న గొల్లపల్లె మహానగరమై పోయినది. ఆమందిరములలో కెల్ల తొలుదొలుత నిర్మింపబడినదే గొప్పధర్మశాల. ఆ ధర్మసత్రమునం దహర్నిశలే సమయంబున జనినను భోజనమునకు లోపము లేదు. ఒక భోజనమే గాదు పాలువలయువారికి పాలు, నీరువలయువారికి నీరు, స్నానము వలయువారికి స్నానము, శయ్యలువలయువారికి శయ్యలు, యివియు నవియుననేల? నిష్ఠురపథశ్రమాకలితచిత్తులైయున్న బాటసారులకేయేసౌకర్యములు వలయు నవియెల్ల శ్రద్ధామతిసమకూర్చు నేర్పాటు లక్కడ విరివిగా జేయబడినవి. దేవియే దాని కధిపురాలు. లక్ష్మియే దానికి నిర్వాహకురాలు. పూర్వపశ్చిమములకు ప్రయాణము సల్పెడు పథికుల కా ధర్మశాల కల్పవృక్షమైనది. ఆ మార్గమున ప్రయాణము సల్పెడు బాటసారులలో నొక్కరైన యా ధర్మసత్రమున నిలిచి సత్కారమందక పోయెడివారు లేరు. అంతయేకాక భిన్నమార్గముల బోవలసినవారు గూడ ఆసత్రపు సౌకర్యముల దలచి యామార్గముననే పోవసాగిరి. ఇక జనులు శ్రీశైలయాత్రజేయు శివరాత్రి మున్నగు పర్వముల యందా ధర్మశాల కేవల మన్నపూర్ణనిలయమే! రేయుంబవల్లు జరిగెడి యా యన్నదానమునకు మేరయే లేదు. ఈ విధముగా ప్రజలకమూల్యోపకారము సేయుచున్న యా దేవి యెవరో యాపల్లెజనులకు గాని, యాత్రికజనులకుగాని తెలియదు. దేవియాజ్ఞచే నామె పరివారజనులలో నొక్కరైన యామె వృత్తాంతమును గాని నామధేయమును గాని యొరులకు దెలుపలేదు. కాన నిరంతరమన్నదానము సేయుటచే నన్నపూర్ణమ్మయనియు, కరివరదునివలె తమయభీష్టముల దీర్చుటజేసి వరదరాజమ్మయనియు, ప్రజలే యామెకు నామధేయములిడిరి. ప్రతిఫలరహితమైన యా యపూర్వ సత్కారములును, ఆనిరతాన్నదానమును, ప్రజల కామెయందు మాతృభావమును, గలుగజేసినది. పల్లెల పట్టణముల నామె నామము వ్యాపించినది. స్వర్గమునుండి దిగిన దేవతయని కొందఱు, పర్వత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కందరములనుండి యేతెంచిన యోగిని యని కొందఱు, యెవరికి దోఁచిన తెఱగున వారామెరాకకు కారణములు కల్పించియు, మహత్తు జొప్పించియు చెప్పుకొనసాగిరి. కాని నిరాడంబరయు, స్తుతివిముఖయు, పూతచరితయు, దానశీలయు, నిరంతరపతిపాదారవింద సందర్శన కుతూహలమతియై శ్రీ విష్ణుచరణకమలముల ధ్యానింపు చున్న రుచీదేవికీ ప్రపంచవార్తలే పట్టవు. ఎవరే పేరున బిలిచినను సరియే.

రుచీదేవియటనివాస మేర్పఱచుకొని కొలది సంవత్సరములు గడచినవి. ఆమె యసామాన్యవితరణమును, విశుద్ధజీవితమును, ధర్మానురక్తిని పాటలు పద్యములుగా నల్లి ప్రజ లాబాలగోపాలము గానము చేయుచున్నారు. ఇంటింట యామె పేరుతో బాలికలు వెలసినారు, కాని యామెకీర్తిని వినినవారేగాని యామెను గనినవారు లేరు. ఆమెయన్నము తినినవారేగాని యామెపలుకులు వినినవారు లేరు. ఆపరివారగృహములకు నడుమ, యాధర్మశాల కెడగా యామెనివాసమున కేర్పడిన దొక్క తృణకుటీరము. అందు భక్తగాథలేగాని ప్రపంచగాథలు వినరావు, విష్ణుకీర్తనమేగాని లోకకీర్తనము వినబడదు. భగవద్ధ్యానమేగాని భోగధ్యానము కనుపించదు. ఆకుటీరముచుట్టు శ్రీ విష్ణుపూజార్హములగు తులసిమొక్కలే గాని యన్యములగు మొక్కలు కానరావు. మందారము లేగాని మావిగున్నలగుపింపవు. పారిజాతసుమంబులే కాని యన్యసుమంబులు లేవు. ఆ దేవియొడలిపై నొక్క భూషణము లేదు. తెల్లని మేలుకమ్మిచీరయే యామెకు వెలలేని పట్టుచీరె. మాంగల్యమే యామెకు మణిహారములు. మట్టిగాజులే యామెకు రత్నకంకణములు. కుంకుమబొట్టే యామెకు కస్తూరితిలకము. ఆ దేవితృణకుటీరమున కెదురుగా నున్న దొక్క మందిరము. ఆ మందిరము సౌందర్యమునకు తావు; భోగములకు నెలవు; పరిమళంబుల కిక్క; ఆ రమణీయమందిరమున కనుదినము దేవి ప్రాతః సాయాహ్నములందు వేళతప్పక దేవాలయమున కేగినట్టు లేగివచ్చును. కల్యాణమందిరమని దేవి దానికి జేసిన నామకరణము. ఆకల్యాణమందిరమున నేమి కలదో దేవికిని యామె ప్రేమంపు చెలియైన లక్ష్మికిని దక్క యన్యులకు దెలియదు.

౫

సమస్తజీవకోటిని దురంతతాపంబున నలయించెడు నిదాఘసమయమేతెంచినది. వరదరాజేశ్వరి యశముపలెనే విస్తరించిన యామెనగరమున జలాభావమేర్పడినది. ఏ యొకటి రెండో తప్ప తక్కిన వాపీకూపతటాకాదు లెల్ల నెట్టిపోయినవి. సకలసంపత్సమృద్ధంబైన యానగరమున తగిన జలవసతిలేమి స్నానపానములకు జనులల్లాడుచుండిరి. జనులనీటియెద్దడినిజూచి వరదరాజేశ్వరి హృదయము సంతాపించిపోయెను. ఈ పురికి శాశ్వతమగు జలసమృద్ధి కల్గించుటెటులని దీర్ఘముగా యోచింప దొడగెను.

ఘనకార్యములు చేయదలచు వారికి తెఱవులు దొరకకుండునా? యోచింప యోచింప తన నగరమునకు మునైవ్వపుల నాక్రమించియున్న కొండలపై వర్షించెడి జలము వ్యర్థముగా వాగులంబడి పోవుచుండెననియు, ఆజలమట్లు పోకుండ దట్టమైన కట్టవేయించినచో కొన్నిమైళ్ల వైశాల్యముగల గొప్పతటాక మేర్పడుననియు, దాన ప్రజలస్నానపానములకు నీటి కఱవుదీరుటయే గాక వేలయెకరముల భూమిని సేద్యముచేయుటకనువైన భూరిజలాశయ మేర్పడుననియు దేవికి తోచెను. తత్క్షణమే వేనవేలజనుల రావించి కొండకుదీటగు నత్యున్నతమయిన కట్టను నాల్గవవైపున వేయించెను.

ప్రజలమానసముల నానందము తొలకరింపనాయేడు తొలకరి పూర్ణముగా చిందించినది. జనులమనమున సంతోషము ప్రపూర్ణముగా నూతనతటాకము జలప్రపూర్ణమై దేవిని, జనులనుగూడ సంతోషమున నోలలాడించినది. కాని పాపమా యానందమెంతసేపో నిలువలేదు. ఉత్తరక్షణముననే యొకమహావిపత్తువారి నెదుర్కొనినది. ఆకట్ట క్రొత్తదియగుటనో, కట్టుబడి యందు దార్ఢ్యము తక్కువగుటనో మఱేకారణముననో, ఒకమూల గండిపడినది. తోడనే యాజలమెల్ల యాగండిని పడి వెలుపలకు ప్రవహింప సాగినది. నీరువెడలినకొలది గండి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దది కాసాగెను. క్షణములో నీవార్త పురమెల్ల పొక్కెను. జనులు తండోపతండములుగా గండిచుట్టు మూగిరి. ఆగండి నెట్టులైన పూడ్చవలెనని గొప్పగొప్ప గండశిలల దొరలించిరి. ఇంక నేమేమో చేసిరి. గంగాదేవికెన్నియో మ్రొక్కులు మ్రొక్కుకొనిరి. కాని గండిపూడలేదు. ప్రవాహవేగమున వారు వేసిన యడ్డులెల్ల కొట్టుకొని పోసాగినవి. ఆస్థితి నారసి "అకటా! మనమెంత దురదృష్టవంతులము! మనతటాకము పోసిమి యెల్ల 'ఇదిగో పసుపు అదుగో ముసు'గన్నటులాయెనే! అయ్యో, ఏమిచేయుదము! నిలిచిననీరెల్ల వాగులంబడి పోవుచున్నది. అయ్యో! గంగమ్మతల్లీ! మాయాసలెల్ల యడియాసలుచేసి వెళ్లిపోవుచున్నావా తల్లీ? మామీద నీకేల దయలేదు? మేముచేసిన యపరాధమేమి? నీటికఱవుచేత నల్లాడు నీదీనుల నేలకటాక్షింప"వని ప్రజలువాపోవ దొడంగిరి. తానుచేసినపని వ్యర్థమగుటయు, జనులల్లాడుటయుగని దేవియు నేమియుదోచక కాలుగాలిన పిల్లిచందమున వేదనపడుచు బహుభంగుల దేవుని ప్రార్థింపుచుండెను. ఎవ రెన్ని యత్నములు చేసినను కట్ట నిలువలేదు. ప్రజలదుఃఖమును, దేవిసంతాపమును నగ్గలమైపోయినది. ఎవ్వడువున నీకట్ట నిలుచునని ప్రజలెల్లర కొకే యోచనయైనది. ఇంతలో నెవరుపుట్టించిరో కాని "గంగాభవానికి నరబలియిచ్చిన గాని కట్టపూడ"దను వాదుపుట్టినది. దుఃఖార్తులగు జనుల కావాక్యము చక్కగా మనస్సున నాటినది. 'నరబలి, నరబలి,' యనుమాట జనసమూహములో నొక్కమాఱు మ్రోగెను. అంతియేకాదు. ఒకముసలిదానికి శివముపూని యావాక్యమును కాయపఱచెను. వెంటనే యావృద్ధస్త్రీ వింతగా నాట్యముచేయుచు దేవీసదనమున కేగెను. ప్రజలందఱిటుల కల్లోలపడుచుండ దేవిమాత్రము శాంతముగానుండెనా? ఆమె దేవతామందిరమున నిశ్చలధ్యానపరమైయుండి "స్వామీ! ఆర్తరక్షామణీ! దీనజనచింతామణీ! ఈసేవకురాలిపై దయజూపవా? దప్పితీర్చుకొనుటకు పుడిసెడు నీళ్లులేక యల్లాడెడు నీయార్తులపై గరుణింపవా? ఓఆర్తరక్షా దక్షా! నీపాదకమలముల నుండి యుద్భవించిన గంగమ్మతల్లి యిచ్చోట నొక్కింత నిలుచునటు లనుగ్రహింపుము. నను గావుము. ప్రజలబ్రోవుము" అని దేవదేవుడైన నారాయణుని ప్రార్థింపుచుండెను. ఇంతలో శివముపెరిగిన వృద్ధురాలరుదెంచి "అమ్మా! నరబలి యిచ్చినగాని గంగమ్మ మనపురమున నిలువ ననుచున్నది కాన పెదకంబము, చినకంబము అని, నాకిరువురు కొడుకులు గలరు. వారిరువురు గంగకు బలియై కీర్తివంతులగుదురు. ఎన్నిదినములు జీవించినను మరణముతప్పునా? తనువు శాశ్వతము కాదు. తనువువలన ఆర్జించిన కీర్తిమాత్రము శాశ్వతమై యుండును. కాన వరదరాజేశ్వరీ, యనుజ్ఞయి"మ్మని వాకిటజేరి మొఱవెట్టెను. దేవి కింకను ఆవార్త చక్కగా వినిపింపనేలేదు. ఆమె సమాధాన మీయనేలేదు. ఇంతలో అవృద్ధురాలు మరల గంతులువైచుచు గండివద్దజేరి "గంగమ్మతల్లీ, ఇదుగో నాపుత్రులు; వీరిరువురిని బలిగొని మాపురమున నిలువు"మని మ్రొక్కెను. వెంటనే పెదకంబము చినకంబము గండిలోనికి దూకిరి. ధణధణమని తప్పెటలు మ్రోగెను; భంభంమని బాకాలూదిరి. 'జయీ గంగమ్మ! జయీ జయీ' యని యాబాలవృద్ధమొక్కమొగినఱనుచు వారిపయి పుట్టిగప్పిరి. చిత్రముగ గండికట్టువడెను. ప్రజలయానందము మిన్నుముట్టెను. ప్రజలీవిధముగా పరవశచిత్తులై తాండవింపుచుండ పూజావిధానము ముగించినదేవి బలివృత్తాంతము విని కరుణార్ద్రచిత్తయై 'గండిపూడకపోయిన మానె ప్రాణార్పణమునకు మాత్రము పాల్పడవల'దని వర్తమానమంపెను. అప్పటికే బలివిధానము జరిగిపోవుటచే దేవిసందేశము నిరర్థకమైపోయినది.

౬

నిఃస్వార్థమగు త్యాగమువలె మఱియొట్టి వితరణమును శాశ్వతకీర్తి నొసంగజాలదు. కంబసుసోదరుల యాత్మార్పణచే నిర్మితమైన యాతటాకమునకు కంబముచెఱువనియు, నానగరమునకు కంబమనియు నామము స్థిరపడిపోయినది. ఇప్పటికిని నాచెఱువునకును గ్రామమునకును నవియేపేరులు. ఆంధ్రదేశమునందలి జలాశయములలో కెల్ల కంబముచెఱు విప్పటికిని మిన్నయే. వరదరాజేశ్వరికి గండిపూడిన వర్తమానమును ప్రజలెఱుకపఱ

చిరి. బలివిసానమునకు కించగానున్నను, వారియాత్మా ర్పణమువలన కార్యము సానుకూలమైనందులకు మాత్రము దేవి మిగుల సంతోషించెను. వెంటనే తన యన్నపూర్ణ నామము సార్థకంబగునటు లష్టాదశవర్ణములకు భూరిసమా రాధనలు గావించెను. గంగపుత్రకులు కంబమసోదరు లకు వీరపూజలు గావించెను. మఱియు, "సతతము కృష్ణ దేవరాయప్రభుని చరణారవింద సేవాతత్పరయగు నొక సాధ్వీరత్న మీ తటాకమున్నిర్మించి యాప్రభూత్తమున కాయురారోగ్యైశ్వర్య కీర్త్యధికారంబులు పెంపొందు నటుల భగవదర్పితంబు గావించె"నని యొకశిలాశాసనంబు వ్రాయించి యా తటాకంబు దరిని స్థాపింప జేసెను.

నిన్నమొన్నటివఱకు చిట్టెడునీరులేక పచ్చని పూరికైకఱవైయయూసర క్షేత్రముగా నున్న యాప్రదేశము పూర్ణమైన జలవసతి యేర్పడుటచే నత్యల్పకాలములో సస్యశ్యామలమై పోయెను. ఒకవంక ఫలవృక్షముల తోటలు, వేఱొకదెశ చక్కని పుష్పారామములు, మఱి యొక చక్కి పచ్చని పైరులునై కంబపురి పరిసరమెల్ల నయనోత్సవకరమై క్రొత్తగ జూచువారికి నందనోద్యా నమువలె మురువు గొల్పసాగెను. చక్కని జలవసతి నగర మున కపూర్వశోభయేగదా. ఆ సౌభాగ్యము నారసి వరదరాజేశ్వరి పొందిన యానంద మింతంతగాదు.

జలాశయము నిర్మింపబడి కొలది వత్సరము లైనది. ఒక్కనాటి మధ్యాహ్నము రాయలు త్తమాశ్వ మునధిరోహించి తటాకము పొంతవచ్చి నిలిచెను. ఆతడుధరించిన దుస్తులును, తాల్చినయ స్త్రశస్త్రాది సాధ నములును,చూడనాతడుమృగయాక్రీడకరుదెంచెననితోచు చుండెను. మఱియు నాతని నలిగిన దుస్తులనైఖరియు, వాడిన మొగమును, పొడమిన చెమటబిందువులును నాత డు వేటయందు మిక్కిలి శ్రమచెందిన చందమును వివ రింపుచుండెను. ఆ రాజ వీరు డెవ్వడో యాగ్రామ వాసులకు తెలియదు; కాని తేజస్వంతుడగు నాతని ముఖారవింద మరసి యాతిడెవడో లోకోత్తర పురుషు డని మాత్ర మూహించి కుతూహలముతో జూడ దొడంగిరి.

ప్రజలెల్ల రిటులు కుతూహలముతో గన నామహీ పతి యా తటాకముచెంతఁ గుఱ్ఱముదిగి యా చెఱువులోని శీతలజలముచే శ్రమదీర ముఖప్రక్షాళనము గావించుకొని కరచరణంబులు కడిగికొనియా జలాశయమువంక తేఱిపాఱ చూచి అశ్చర్యముచెంది. "ఆహా! ఏమి జలాశయము! మహార్ణవముబోలె నున్నదే. ఇంత గొప్ప తటాకమును ద్రవ్వించి యూసర క్షేత్రమును బోలిన యీ ప్రదేశమును సస్యాఢ్యము గావించిన మహాత్ములెవ్వరో పూజనీయులు గదా."అని యాశూరశిఖామణి యచ్చట నున్న వారిని గని "ఈ తటాకము నిర్మించిన దెవ"రని యడిగెను. "అయ్యా! ఎవరున్నారు? మా అమ్మ, మాకన్నతల్లి, అతి థి యభ్యాగతులును నిరతాన్న ప్రదానముచే పూజించు అన్నపూర్ణాదేవి, మా వరదరాజేశ్వరియే యీ తటాక మును నిర్మింపజేసిన యా మహాతల్లి యని వారు ఏక కంఠ్యముగా జవాబిచ్చిరి. ఆ మాట నాలించుటతోడనే యా భూపతి యాననమున నాశ్చర్యమేకాక లజ్జయు ద్యోతకమయ్యెను. తోడనే యాత డాయపూర్వజలా శయమును నిర్మించిన యా పుణ్యాత్మ యెవ్వరో, నిరతా న్నదానము గావింపుచున్న యాదానశీల యెంతటి సచ్చరితయో, ఆమె నిజ నామ మెద్దియో తెలిసి కొనక నిజపురిమున కరుగరాదని నిశ్చయించి "అయ్యా నాకీపూట యీవీట వసియించుట కెక్కడైన వసతి లభించునా? భోజనము దొరకునా?" అని యా పౌరుల ప్రశ్నించెను. "అయ్యా! వేరు వసతియేల? మాయన్నపూర్ణ సత్రమే యన్నిటికిని గలదు. మీవంటి మహనీయు లెందఱో యట నిత్యమును విడిసి సత్కృతులై చనుచుందురు. మీరును నటకరుదెంచుడు. మేము త్రోవ చూపుదు"మనిరి. అనిన 'వల్లె'యని రాయలు వారివెంట వరదరాజేశ్వరి సత్రమున కేగ నెంచి తటాకమునుండి వెలు వడి గట్టునెక్కనచట దేవిచే ప్రతిష్ఠితమైన శిలాశాస నము గానవచ్చెను. అప్పుడాతనికి గల్గిన ఆశ్చర్యమునకు మేర లేదు. "నాచరణదాసిచే నీతటాకము నిర్మింపబడిన టు లిందు వ్రాయబడినది! నాకు దెలియకయే నాచరణ దాస్యము సేయుచు, నిరతాన్నదానాది ధర్మకార్య ములు సేయుచు, సజ్జన స్తవనీయ చరితయు, యశోవిశా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లయునై దీనజనకల్పకముగా నున్న యీసతీరత్నమెవ్వరు? ఇట్టియామె నెప్పుడును చూచినజ్ఞాపకమైనలేదు. నాకు చరణసేవ చేయునంతటి మహాభక్తి యీమెకు నాయం దేలయుదయించెనో, నారాజ్యమున వసింపుచు, నన్ను సేవింపుచు, నాదేశము సుభిక్షముగనుండెడి యిట్టి మహత్కార్యముల గావించుచు నుండెడి యీసాధ్వీరత్నమును తెలిసికొనక తప్పొనర్చితినిగదా" యని యోచించి రాయలు వరదరాజేశ్వరీ సత్రమున కొకబాటసారి వోలె వెడలెను.

౭

ఎప్పుడును మానవులు ఆశాహతులు కాగూడదు. మనసారకోరెడు సంకల్పము లెప్పుడును సఫలములు కాకమానవు. అందును పవిత్రహృదయులగు వారి తపము లెప్పుడును వట్టిపోవు. మహాసాధ్వియగు వరదరాజేశ్వరి యేవిభుచరణారవిందముల దర్శించి క్షమాపణవేడెడి భాగ్యమును ప్రసాదింపుమని నిరంతరము శ్రీమన్నారాయణుని ప్రార్థింపుచుండెనో ఆచిరంతనాకాంక్షితమును సాఫల్యపఱుప శ్రీమహావిష్ణువు సంకల్పించెను. లేకున్న యెక్కడో విజయనగరమున వసించెడిరాయలు వేటమార్గమున వచ్చుటేమి! కంబపురి చేరుటేమి! వరదరాజేశ్వరి కీర్తివినుటేమి! ఆమె ధర్మశాల కతిథి యగుటేమి! ఆశ్చర్యముగదా! మహారాజును గుర్తించినవారు పెక్కుమంది యచట నుండుటచే యాతడు కృష్ణదేవరాయలని తెలిసికొనుట కచ్చటివారి కెక్కువకాలము పట్టలేదు. కాన వెంటనే కొందఱు స్త్రీ లతిథి పూజార్హవస్తుసమితితో నాతని నెదుర్కొని స్వాగతంబిచ్చిరి. తత్క్షణమే యొకస్త్రీ మహారాజు మజ్జనమునకు పరిమళభరిత నీరమును సిద్ధముచేసెను. వేఱొక స్త్రీ రమ్యకౌశేయముల గట్టనిచ్చెను. మఱియొకతె షడ్రసోపేతములగు వంటకముల నాయత్తపఱచెను. ఇంకొకతె వడ్డించెను. మహారాజు భుజింపుచుండ నింకొకవెలది వీవనచే శ్రమదీఱ విసరెను. అకాలములో ఆనాడు కల్యాణమందిరపు తలుపులు దీయబడినవి. అచ్చటనే మహారాజు సేవించుటకు విడెమును, శయనించుటకు శయ్యయు సిద్ధముచేయబడెను. "స్వామి! ఇటేటని" స్త్రీలు మందిరమునకు త్రోవజూప భోజనానంతరము మహారాజందు ప్రవేశించెను. "ఆహా! ఏమి యామందిర రామణీయకము! ఎక్కడ జూచిన శిల్పుల యనల్ప శిల్పకళావైదగ్ధ్యమే! ఎక్కడ చూచిన నిలువుటద్దములే! ఎందు గనిన చిత్తరువులే! వెండికంబములు! పైడిపూతలు! రత్నములకూర్పులు! అహో, ఆమందిరవైభవ మసదృశముగదా! మహారాజామందిర రమణీయతను గనినంతనే యాశ్చర్యమగ్నుడై నిలువబడెను. విడెము సేయవలెనని వేడ్కగలుగలేదు. శయనింపవలెనను నిచ్చ పొడమలేదు. ఆమందిర రమణీయతను, ఆచిత్తరువుల సొంపును సవిమర్శకముగ వీక్షింపవలయుననెడి కుతుకమే యాతని కెక్కువయ్యెను. మహారాజు చిత్తరువుల చూడసాగెను. ఏమిచిత్రము! అవియన్నియు నాతనివే! "అహో! ఇదియేమి? మాయయా! ఇంద్రజాలమా! పరమాద్భుతముగా నున్నదే! ఏపటము చూచిన నాయాకృతినే ప్రతిబింబింప జేయుచున్నదే! ఇవి అద్దములు కావుగదా! కావు కావు. నేను నిలువబడి చూచుచుంటిని. ఇందుకూర్చుండినవి, పండుకొనినవి, అశ్వారోహణము చేసినవి ఆదిగాగలవి పెక్కులున్నవి. ఇవి ప్రతిబింబము లెటులగును? కాని నాచిత్రము లెవరో నిపుణులగు చిత్రకారులు వ్రాసియున్నారు. ఆహా! ఈ చిత్తరువు లెంత యథాతథముగ చిత్రింప బడినవి? నిజముగా నీచిత్రకారులనైపుణ్య మసదృశము. వేలకువేలు బహుమానము లొసగి ఎందరో చిత్రకారులచే నాచిత్తరువులు వ్రాయించియుంటిని గాని యవేవియు నింతరమణీయముగ లేవు. కాని యీధర్మశాలయందు నాయీచిత్తరువు లుండుటకు గారణమేమో! వీనిని రచించినవా రెవ్వరో యూహింప నశక్యముగా నున్నది. మఱియు నీచిత్తరువు లమర్చిన చట్రములుగూడ కొలదివిలువ కలవి కావు. ఈవెలలేని దంతము! ఈజిలుగునేత! ఈబంగారుపొదుగు, ఈరత్నముల కూర్పు! ఒక్కొక్కదాని కెంతధనము వ్యయమైయుండును! కాని నారూపపటముల కింత సన్మాన మెందులకు? ఈదేశపు ప్రభువునని యేనా? కాదు కాదు. రాజగౌరవము దెలుపుట కిన్ని చిత్తరువు లెందులకు? ఒకటి చాలును; రెండుచాలును; కాని యిన్నియా? లేదు. ఇందు రాజభక్తికన్న నధిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగా ప్రస్ఫుటమగుచున్నది ప్రణయరక్తి. కాని యిప్పట నాయందిట్టి యపూర్వానురాగమును భక్తిని వెల్లడించుచున్నవా రెవ్వరు? ధర్మశీలయగు వరదరాజేశ్వరియే యిటుల గావించియుండునా? ఛీ, ఛీ! ఏమి నామతిహీనత! ఆమె యెవ్వరు? నే నెవ్వరు? పరపురుషుడనగు నాచిత్తరువుల నేల యామె తనమందిరమున బ్రతిష్ఠించుకొని యుండును? లేకున్న నాకీయెడ నపూర్వసన్మానపూజ్యత లెందులకు? ఈ వరదరాజేశ్వరి యెవరో నిన్న పేరు గాదు. కన్నసురిపి గాదు. ఆమె పూర్వవృత్తమునుగాని, యామె నిజనామధేయమును గాని తెలిసికొనవలయునన్న నిప్పట నొకరైన తెలుపువారు కానరాకున్నారు. కొందఱు అన్నపూర్ణమ్మయని, కొందఱు వరదరాజమ్మ యని, యిరుతెరగులుగా జెప్పుచున్నారు. ఇందులో నేది యామె నిజనామము? లేక యీరెండును గాక వేఱొకట్టి రేదైన నామెకు గలదేమో! ఏమియు తెలియకున్నది. శౌరులవలనగాని, పరిజనులవలనగాని యీమెవృత్తాంత మెఱుగుటకు సాధ్యముకాదు. కాన ఈచిత్తరువుల వలననే యామెవృత్తాంత మేమైన గ్రహింపవలెను." అని మహారాజు మరల సవిమర్శకముగ తనచిత్తరువుల నొకటియు బీరుపోకుండ చూడసాగెను. ఇటుల చూడం జూడ నొకచో నొకస్త్రీ దీనయై తన చెంత నిలిచి ప్రార్థించుచుండినటులు, వేఱొకచో తాను కృపాణధారియై తీవ్రదృక్కుల బఱపుచు నిలువబడియుండ నొకస్త్రీ నేలబడి మహావేదనతో దురపిల్లుచున్నటులు, మఱియొకచో దా నొక లేఖను దీసి చదువుచున్నటులును, ఆలేఖయం దీశ్లోకములును వ్రాయబడియుండెను:

శ్లో. సరస్వనాంతే నవమంజరీషు
నవల్పరో గంధఫలీ మజిఘ్రత్,
సా కిన్న రమ్యా సచ కిన్న రంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా. ౧

శ్లో. మా కింశుక! ప్రకట యాత్మ నిమేషమాత్రం
మన్మస్తకే విహరతీతి మధువ్రతోయమ్,
కిం మాలతీ విరహవేద నయా త్వదీయం
దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ. ౨

శ్లో. భ్రమర భ్రమతా దిగంతరాళే
క్వచిదాస్వాదిత మీక్షితం శ్రుతంవా,
వద సత్య మపాస్య పక్షపాతం
యది జాతీకుసుమానుకారి పుష్పమ్. 3

శ్లో. కుసుమాని లిఖంతు నామ చిత్రే
కతిచిత్కారు విశేషరూఢ శిక్షాః,
సురభి త్వ మమూని కిం లభంతే
కిము చైతేషు రసం పిబంతి భృంగాః. ౪

శ్లో. కిం మాలతి మ్లాయసి మాంవిహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః,
లోకే చతుర్భిః శ్చరణైః పశుః స్యా
త్స షడ్భిరత్యర్థపశు ర్న కిం స్యాత్. ౫

"ఆహా! ఏమికవిత! ఈ శ్లోకము లైదును నైదనర్ఘ్యరత్నములేగదా ఆహా! ఎంతభావగర్భితముగ నున్నవి! ఎంత మనోజ్ఞముగ నున్నవి. ఒకానొక స్త్రీ భర్తృతిరస్కృతయై పరిత్యజింపబడి యా నాథుని యనుగ్రహప్రాప్తికై పరితపించుచుండుట యీ శ్లోకముల భావముగా నున్నది. ఆభర్తను నేనగుట గాబోలు నాచిత్తరువునం దీ శ్లోకములు పొందుపఱుపబడియున్నవి. ఆహా! ఏమి యీ స్త్రీబుద్ధికౌశలము! చిత్రరచనమునందును కవిత్వమునందును నసమానమగు విన్నాణ మున్నటులున్నదే! అయినను నీమె యెవ్వరు? ఓహో! తెలిసినది తెలిసినది. చిత్రములగాథయు, శ్లోకముల భావమును, నా సంబంధమును జూడ గజపతి రాజపుత్రిగాథ యొకింత జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఆమె యీమె కాదుగదా. ఎటులగును? ఈమె పేరు అన్నపూర్ణయట, వరదరాజేశ్వరియట. ఆమెకు తుకాదేవియనియు, రుచీదేవియనియు రెండునామము లున్నటులు వింటిని. అయినను ఆమెను పుట్టినింటికి బంపితినిగదా. ఆమె యిప్పట కెట్లు వచ్చును? ఏమియు దోచకున్నది. అప్పాజీ కెఱిగించినగాని దీని నిజవృత్తము తెలియబడదు."

మహారా జిట్లు యోచింపుచుండ సూర్యుడు పశ్చిమమునకు మరలెను. ఎండవేడిమి తగ్గెను. డోలాందోళితచిత్తముతో నున్న రాయలు దవ్వులనున్న పరివారమును గలిసికొన నశ్వారూఢుడై వెడలిపోయెను.

## ౭

"ప్రభూ! ఆమె నిశ్చయముగా గజపతిరాజ పుత్రియే. నా డామెతో వెడలిన సేనాపతిని నేనువిచారించితిని. వా రామె నిప్పుడు నిలిచియున్న తావుననే విడిచినట్లు చెప్పుచున్నారు."

"అటులైన అప్పాజీ! ఆమె నెటులైన మన నగరికి దోడ్కొనిరావలెను. నాకై యవ్విధి నల్లాడెడు సాధ్వి నింకను నుపేక్షించుట న్యాయముకాదు. కాని అప్పాజీ! ఇట్టి సాధ్వీరత్న మానాడు శయనాగారమున సంగుప్త కృపాణయై యుండు టెలమో, అది యామె స్వయంకృతాపరాధమో, పరప్రేరణమో తెలియదు."

"చిత్తము; దేవర కా విషయమునగూడ సందేహము నివృత్తియగునట్లు చేసెదను. ఆవిషయమున తమశంకా నివారణచేసికొనిన వెనుకనే యామెను పరిగ్రహింపవచ్చును; కాని దేవరవారు నాతోగూడ ప్రచ్ఛన్న వేషముతో నటకరుదెంచుట కనుమతింపవలెను."

"అప్పాజీ! అట్లే. రేపు వేసుజాముననే కంబపురి కేగుదము. గమనవేగముగల యుత్తమాశ్వముల పయనమున కాయత్తముసేయ నేర్పాటుచేయుము."

"చిత్తము."

ఏర్పాటుప్రకారము మఱునాడు వేకువ రాయలును, తిమ్మరుసుమంత్రియు నశ్వారూఢులై ప్రచ్ఛన్న వేషముతో వరదరాజేశ్వరి నగరమున కేగిరి.

## ౮

కంబపురిలో వరదరాజేశ్వరి యుదయము రెండు గడియలప్రొద్దువేళ తనకుటీరాంతర్భాగమున నేదియో కార్యనిమగ్నయై యుండ, నొక పరిచారిక అరుదెంచి "అమ్మా, కటకపురినుండి యొకయోధు డొకజాబును గొనివచ్చి తమతల్లిగారు వ్రాసిన యా జాబును తమ కందజేయుమని కోరుచున్నాడు. 'మా యమ్మగారు తీసుకొని రమ్మనిన తీసుకొనివెళ్లుదు నందు'మని యాతని నంద నిలిపి తమసన్నిధి కరుదెంచితిని. ఏమని యాజ్ఞ" యనెను.

"మాతల్లిగారి తావునుండి వచ్చినది గావున నవశ్యము దాని జూడవలెను. ఆ యుత్తరమును వెంటనే తీసికొని ర"మ్మని దేవి యాతురతతో బల్కెను. తత్క్షణమే యా దాసి వెలుపలి కేగి యా కమ్మ నందుకొని తెచ్చి దేవి కర్పించెను. దేవి యా జాబును విచ్చి యిట్లు చదువుకొనెను:

"చిరంజీవి సౌభాగ్యవతియగు నస్మత్తనయామణి యగు రుచీదేవికి మీ యమ్మ దీవించి వ్రాయునది యేమనగా,—

"కుమారీ! నీవు భర్తను సంహరించు కార్యములో విఫలవైనను, కులహీను డగు నాదాసీపుత్రుని పొత్తుచేయక మనరాచమర్యాదను వంశగౌరవమును, నిల్పి ఆత్మగౌరవముగల వీరక్షత్రియ కన్యకకు నుచితముగు తెఱంగున ప్రవర్తించినందులకు నేనేగాక మన నిఖిలబంధువులును కడుంగడు సంతసింపుచున్నారు. కాని కుమారీ! ఆతడు పంపివేసిన వెంటనే సగౌరవముగా మననగరమునకు రాక యాతని రాజ్యములో వసించుటమాత్రము యుక్తముగ లేదు. నిను కడుగారాబమున ప్రోవగల తల్లిదండ్రులము జీవితులమై యుండ, నీవా యరణ్యములయందు సిలుగుల బడనేల? నీ యునికి వినినదాది నాకు చాల దుఃఖముగా నున్నది. కాన ఈ జాబు చూచిన తత్క్షణమే సపరివారముగ నిటకు తరలిరాగోరెదను. ఏమాత్ర మాలస్యము చేయవలదు.

ఇట్లు నీ మాగమనము కోరు తల్లి,

"గజపతి మహారాజ్ఞి."

ఆ యుత్తరము చదివినతోడనే దేవికి కోపము విషాదముకూడ గల్గెను. కన్నీరుపైటచెఱగున నద్దుకొనుచు, "లక్ష్మీ! కలము కాగితము నిటకుదెమ్ము; మా యమ్మ పేర నిప్పుడే యొక కమ్మ లిఖించెద"ననెను. లక్ష్మి వెంటనే కలము కాగిత మందీయ ప్రత్యుత్తర మిట్లు లిఖించెను.

"మహాలక్ష్మి సమానురాలగు శ్రీ శ్రీ శ్రీ తల్లిగారి పాదపద్మములకు తమకొమరిత రుచి యనేకసాష్టాంగ దండప్రణామములు చేసి చేయుగల విన్నపములు"

"అమ్మా, నీవు ప్రేమతో వ్రాసి పుత్తెంచిన లేఖను వందనములతో నందుకొని చదువుకొంటిని, కాని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీవు కోరినట్లు కటకపురికి రాజాల నందులకు క్షమింప కోరెదను. తల్లీ, దైవజ్ఞులు చెప్పినట్లు నేను మహారాజునకు పత్నినైతిని. కాని నాయభాగ్యమునజేసి నీవు చేసిన దుర్బోధలు నాజీవితమును నీచాతినీచముగ జేసి వైచినవి. నా సౌఖ్యామృతమున చే జేత నేనే మట్టికొట్టికొంటిని. నీచెడుబోధలచే నానిర్మలమానసమును కలుషితము గావింపకున్నచో దాసికై జారును నా మొలయందు దోపుట కంగీకరించియుండను; భర్తృవధ కాయత్తనై యుండను. మఱియు నా జీవితముగూడ నిట్లు దుఃఖభాజనమై యుండక మహాసుఖభోగవిరాజితమై యుండును. నీయొక్క చెడుసలహాచే నాచేసిన కుశ్చేష్టిత మా మహారాజు సన్నిధిని తనంతబయల్పడెను. ఉదారగుణాకరుడగు నా ప్రాణేశ్వరుడా క్రూరకర్మమును కనులార గాంచియు నా కట్టికీడును సేయక సగౌరవముగ వీడ్కొల్పెను. ఆహా! ఏమి యా మహాప్రభుని సౌశీల్యము! మఱియు నాభర్త కులహీనుడని వ్రాసితివి. ఉత్తమక్షత్రియులగు సాగివారివంశమున నుద్భవించిన నాగమాంబతనయుడు కులహీను డెట్లగును? పూర్వము మాయత్త తనసవతితో నోడినవారు గెలిచినవారి కాలు నెలలు దాసీత్వము చేయునట్లు పందెమిడుకొని, యాడిన చదరంగపాటలో నోడుటచే మాయత్తగారికి దాసియనువాదు పరిహాసముగావచ్చెను. కాని తుళువాన్వయాంబుధిరాకాశశాంకుడగు కృష్ణదేవరాయ భూపతి దాసీపుత్రుడుగాడు. అమ్మా! మనయెఱుకలేమి నా కిట్టిపాట్లకు గారణమయ్యెను. నాపాపఫలము నే ననుభవింపుచున్నాను. ఎట్టివారికైన ప్రారబ్ధ మనుభవింపకతీఱదు గదా. తల్లీ! కటకమునకు రమ్మంటివి. నేనును నొకరాజపుత్రినై యుండి యిట్టి నీచస్థితియందు కటకపురి కెట్లు రానేర్తును? కాన సాళువాన్వయ క్షీరపారావారరాకాసుధాకరుండును, వినయవివేకాద్యనేక కమ్రగుణాలంకార శోభితుండును, పరిపంథిరాజన్యానేకప సింహుండును, సురుచిర సుందరాకారుండును, కవిజనకల్పకమును, నర్థిజనచింతామణియు, దయాసముద్రుడును నగు నాప్రాణేశ్వరు పాదపద్మముల ధ్యానింపుచు నే నిందే నాజీవితము గడపెదను. నాపాపకృత్యమున కిదియే తగుశిక్ష. తల్లీ! యీకుమార్తె నింక మఱచిపొమ్మా.

ఇట్లు తమవిధేయ పుత్రిక,

రుచి."

ఈరీతిగా జాబు వ్రాసి యాయోధున కొసంగి, యిష్ట మృష్టాన్నములచేతను, నమూల్య బహుమానముల చేతను నాతని సంతుష్టిపఱచి పంపివేసెను.

౬

కటకపురి భటవేషము దాల్చిన యావిజయనగర యోధుడు వేవేగ వెడలి ప్రచ్ఛనవేషులై పురబాహ్యమున నిలిచియున్న రాయలకును, నాతని మంత్రివర్యుడైన తిమ్మరుసుమంత్రికిని నా లేఖ నందించెను.

ఆయుత్తరము చూచుటతోడనే రాజమంత్రు లిరువురకును విషాదాశ్చర్యము లొక్కమాఱుగ నొదవి యొక్కింతసేపు చిత్రప్రతిమలైరి. అంత వృద్ధామాత్యుడు ప్రభుని గని "ప్రభూ! చూచితిరా ఆమెసౌశీల్యము! యథార్థమున కామె నిరపరాధ. తల్లిదుర్బోధలు, దాసీ దుస్తంత్రములు నామెను చెఱచినవి. లోకములో సత్యాసత్యముల నిరూపణ మిట్లుండును. అపరాధులు విడువబడుదురు. నిరపరాధులు దండింప బడుదురు. రాజేంద్రా! తమచే పరిత్యజింపబడియు, ననవరతము మిమ్మే ధ్యానింపుచు, పూజింపుచు, ఆ మహాసాధ్వి యెట్లు దుఃఖిల్లునో కనుడు. పాప మికనైన నాసతీరత్నమును తపఃరాజ్ఞిగ గైకొని యామెయార్తి బాపుట ధర్మము."

"అప్పాజీ! నాకును నట్లే కౌతూహలము కలదు. కాని యింతకాలమునుండి యామె నుపేక్షించిన నా కామెతోడి సమాగమమన బిడియముగ నున్నది. కాన నీవు ముందామెతో ప్రసంగించి యామెకు మనరాజధానికి రా మనసు గలదో లేదో కనుగొనుము. ఆమెహృదయ మెఱుగక ముందుగా నేనే వెడలుట లాఘవముగదా."

"మహారాజా! చక్కగా సెలవిచ్చితిరి. మీరు ముందుగా నేగుట మంచిదికాదు. కాన నే నమాత్యోచితమగు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీవితో నామెసన్నిధి కేగెదను. మీరు నామిత్రులట్లు నావెంట గావలెను."

వృద్ధసచివు డిట్లు హితము గఱప మహారాజు సమ్మతించెను. అంత రాజమంత్రు లిరువురు శారద రాజేశ్వరి యాలయమున కేగి ద్వారాంతికమునగల పరిచారికలతో 'కర్ణాటాంధ్రావనీ పతియగు శ్రీ శ్రీ శ్రీ కృష్ణదేవరాయ రాజేంద్రులవారి ప్రధానామాత్యులు శ్రీ తిమ్మరుసుమంత్రులు వారు దేవిగారి దర్శనముచేయ నేతెంచిరని తమభృత్యునిచే చెప్పించిరి. పరిచారిక దేవి కావర్తమాన మెఱింగించెను. దేవి యపరిమితానంద భరితురాలై సగౌరవముగ వారిని దోడితెమ్మని యాజ్ఞాపించెను.

దేవిగారి యాజ్ఞచే తిమ్మరుసుమంత్రి సగౌరవముగ దేవిగారి కుటీరాభ్యంతరమునకు ప్రవేశపెట్టపడెను. లోన దేవి, ఈవల తిమ్మరుసుమంత్రి; వారిరువురికి నడుమ నొకదట్టమగు తెఱ. మంత్రివర్యు నుత్తమాసనాసీనుం గావించి పరిచారికలు శ్రమదీఱ వీవనతో విసరుచు, కాండపటమునకావల నమ్మగారు గలరనియు, మీరు మాటాడవచ్చుననియు విన్నవించిరి. అంత తిమ్మరుసుమంత్రి యాతెఱ వంక గాంచి, "అమ్మా! నీవు మాతల్లివి, మేము మీతనయులము. తనయులసన్నిధిని తల్లికి మఱుగా," అనెను.

"మీరు నాకు పితృసదృశులు. నేను మీకు పుత్రికాతుల్యను. కాని రాజమర్యాద నవలంబింపవలసి వచ్చె" నని దేవి నెమ్మదిగాను బల్కె.

"తల్లీ! అటులైన మన కీమఱగు లెందులకని తిమ్మరుసు తటాలున తెఱ తొలగద్రోసికొని దేవిసన్నిధి కేగి, "అమ్మా, మీరు విజయనగరమున కరుదేరవలయును" అనెను. అమ్మాటలు వినినతోడనే గతాగతములు మదికి దోచి విషాదానందము లొక్కుమ్మడి కలుగజేయ, నశ్రుపూర్ణలోచనయు, గద్గదస్వరయునై దేవి "ఈదీనురాలట్టి సన్మానమునకు తగునే! తండ్రీ!" అనెను.

విరాగసూచకమైన దేవి నిరలంకారాకృతియు, దయనీయములగు నామెవచనములును కనుటతోడనే మంత్రివర్యునకు మితిలేని దుఃఖ మొదవెను. కాని ధీరుడగుటనాత డాదుఃఖమును నెమ్మెల్లో సంబాళించుకొని, తల్లీ! కష్టసుఖములు దైవదత్తములు. సంచితార్థ మనుభవింపక యెట్టివారికిని దీఱదు. మా సార్వభౌముడు మీ సౌశీల్యమును గాంచి, మీ భర్తృసేవాతత్పరతనుగ్రహించి, మీనిరపరాధిత్వ మెఱింగి, తాను మీయెడ మున్ను చేసిన తిరస్కృతికి పశ్చాత్తాపతప్తుడై యిపుడు మిమ్ము దనయంతఃపురమునకు దోడ్కొనిపోవ నువ్విళులూరుచున్న వాడు. తొలుదొలుత కటకపురమున మీరూపపటమును గాంచినది మొదలు మా రాజేంద్రునకు మీయందుగల కూరిమి చెప్ప శక్యముగాదు. కాని పరస్పర ప్రేమప్రకటనములతో నభిమత సౌఖ్యమరీచికల నుయ్యాల లూగవలసిన శయనాగారమున కఠిన కృపాణధారిణివై యుండుటయు, శత్రుపుత్రిక వగుటయు గని మామహారాజు శంకించి మిమ్ము వీడ్కొలుపవలసె. మీ వధోద్యోగమునకు కారణము పరప్రేరణ యని యరయలేక, మహాసాధ్వివగు మిమ్ము మర సౌఖ్యమును గూర్చు నమృతమని యెఱుగక హాలాహలముగా భావించి యెడమకాల దొలగద్రోచె. ఆ యవిచారకృత్యమునకు మా మహారాజిప్పుడు పొందుచున్న సంతాపమును తల్లీ, వివరింపనేరను. మీ ధర్మశాల కతిథియై వచ్చి మీరు రచియించిన చిత్తరువులు, శ్లోకములు గనినదాది మాప్రభునకు రేలు సుఖనిద్ర లేదు; పగలు భోజనము నఱగోలయే. కాన మహారాజ్ఞీ, నావెంట విజయనగరమున కరుదెంచి పరితప్తమానసుండగు నీ ప్రాణేశ్వరుని చిత్తము సంతోషాయత్తము గావింప వేడెద."

తిమ్మరుసు ఇట్లు పలుక గత వృత్తాంతము స్మృతికి వచ్చి రుచీదేవికి పట్టరాని దుఃఖ మొదవెను. కాన నవ్వారిగా వెడలెడి కన్నీటిధారల పైటచెఱగున నద్దుకొనుచు, "అయ్యా! నేను నేటికి ధన్యను, నాచిరతపఃఫలము ఫలించినది. నాప్రాణనాథుడు నా నిరపరాధిత్వ మెఱిగి నానేరము క్షమియించె నంటిరి. నా కదియే చాలును. నేను భర్తృద్రోహము చేసిన పాపాత్మను. ఆ జన్మమిటనే యుండి నాపాపఫలమును నేననుభవింతును. ఏకాంత భర్తృచరణధ్యానైకవృత్తిచే దక్క వేఱొకట నాపాప ముపశమింపదు. పతిరాజ్యమున వసించుటయే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకు భర్తృసాన్నిధ్యమున నుండి నంతటి సంతోషకరము. నాయపరాధమును నాపెనిమిటి క్షమించె ననెడి చల్లనిపలుకే నాకు సమస్తసౌఖ్యములు; నాకదియే పదివేలు. భోగభాగ్యములు నాకేనాడో దూరమైనవి. ఆనాడెట్లు సకలజనులచే భర్తృహంతకినని దూషింపబడి నేడు నే నేముని విజయనగరమున కేతెంతును? చితికినముత్యమకుకు నే? చేసినయకృత్యము మాయునే? కాన నావంటి పాపాత్మకేకాంతవాసమే యోగ్యమైనది. కాని నాప్రాణేశ్వరునకు నాపై నిండారు దయ గలదేని యొక్కమాఱు దర్శనమొసంగుడని కేలు మోడ్చి విన్నవించితినని యారాజేంద్రునకు నావేడికోలందజేయుము. తండ్రీ! నాకదియే పదిలక్షలు" అని కన్నీళ్లు చెక్కిళ్లపై జాఱుచుండ తలవంచెను. అంతవఱకు యవనిక మఱుగున నుండి యామె సంభాషణమును వినుచున్న రాయలాసమయమున స్వస్వరూపముతో నటకరుదెంచెను. రాయలవారి రాక గని తిమ్మరుసటనుండి తొలగిపోయెను. దుఃఖనిమగ్నయై తలవాల్చియున్న దేవి యారాకపోకలే గమనింపలేదు. కాన తిమ్మరుసే యట నుండెననుకొని, అయ్యా! నాకిక నేకోర్కెయు లేదు. నాప్రాణేశ్వరుని దివ్యమంగళ విగ్రహము నొకమాఱు కనులార గాంచి యామహాపురుషుని పాదాబ్జముల కొకమాఱు మనసార నమస్కరించి యాసదయహృదయుని పాదకమలములను నాయనుతాపాశ్రువులచే కడిగి నాచేసిన యకృత్యమునకు క్షమాపణ వేడికొనుటకు మాత్రమొకమా అనుగ్రహింపుడని మాత్రము విన్నవింపుడు. ఆమహారాజందుల కంగీకరించెనేని నాకదియే జన్మసాఫల్యము; అదియే నాపరమావధి; అదియే నాచిరంతనవాంఛ. ఆమహనీయున కివే నాసాష్టాంగనమస్కృతులు" అని చేతులు జోడించి దుఃఖవివశయై సాష్టాంగముగ నేలపడెను. ఆమె దుఃఖస్థితి కనలేని కనికరము గలవాడై రాయలు తటాలున నామెను దనరెండుచేతులబట్టి లేవదీసి సాదరంబున నక్కున జేర్చుకొని "సతీరత్నమా! నేను రాయలను, నీ ప్రాణేశ్వరుడ" నని పల్కుచు, యోడకవెఱలెడి యామె కన్నీటిధారల దన కొనగోళ్ల జిమ్ముచు, దేవీ! "నీయం డట్టి యపచారమొనర్చితిని! నీకడ నానాడు కత్తియుండుటకు గారణము పరప్రేరణమని తెలియకపోవుటయు, చూచినపుడైన నిన్నడుగక పోవుటయు, నిన్ను పురినుండి వెడలగొట్టినదాది నీవేమైతివని నీవృత్తాంతమే యారయక పోవుటయు నాదిగాగల నేరములన్నియు నాయందే గలవు. నీవు నిరపరాధవు; నేను సాపరాధుడను. నీవు నన్నుగాదు, నేను నిన్ను వేడికొందును. నన్నేలుకొనుము. నారాజ్యమున కేతెంచుము" అనెను. అమృతరసాయనంబుల బోలు నావాక్కుల వినినంతనే దేవి యానందకందళితహృదయారవిందమై కను విచ్చి ప్రాణేశ్వరునిగని యాతని పాదములపై వాలి "నాథా! నాతప్పులు క్షమించితిరా! క్షమించితిరా! ఆహా! ఎంతధన్యను! ఎంతధన్యను!" అని పల్కి యాతని చరణంబులు కనులకద్దుకొనుచుండ రాజేంద్రుడామె ననురాగంబున గనుచు "దేవీ! వైరాగ్యవ్రతం బుజ్జగించి నీవు నాయంతఃపురరాజ్ఞివయ్యెదవా? రాజ్యం బుజ్జగించి నేను నీయాశ్రమవాసుడను గానా?" యనెను. అనురాగభరితంబులగు నవ్వాక్యంబులకు ప్రేమైక భాసురంబగు చిఱునవ్వు దేవిమోవిపై తొలంకెను. ఆహా! ఎంతనిసర్గమనోహరమా యెలనవ్వు!

───────



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పతితపావనత
## (జీసస్సు)

అల్లంరాజు రంగనాయకులు గారు

ఒక యుషస్సున మలయానిలోర్మి వితతి
నధివసించి సర్వేశ్వరుం డమృతశీత
హస్తములతోడ నిమిరి, చరాచరాత్మ
సంచయమ్మును మేల్కొల్పు సమయమందు

నిదుర మేల్కాంచి జీసస్సు నిజగృహాన,
స్నానమొనరించి శుభ్రవస్త్రములు దాల్చి
జీవితేశ్వరుహృదయానఁ జేర్చి కొలిచి
శిష్యులకు సత్యబోధలఁ జేయుచుండ.

పక్షిసంతతి మేతకై పరువులెత్త,
తమ్మిపువ్వులు విరిసి నెత్తావిగురియ,
నళికుమారులు పుష్పాడియాటలాడ,
పూర్వదిక్కాంత కుంకుమబొట్టు పొలిచె!

అప్పు డొక పరిచారకుం డరుగుదెంచి
క్రీస్తునకు వందనం బాచరించి—"ప్రభువ!
నేఁడు మీరలు మాస్వామి నిలయమునకు
విందుగుడువఁగ నేతేర వేఁడుచుంటి."

అని మనవిచేసి "మెస్సయా" యభిమతంబు
వడసి యభివాదనముఁ జేసి వెడలినాఁడు.

* * * *

వ్యాధిబాధితజీవుల కమృతమూర్తి
కరుణ దీవించి స్వస్థత కలుగఁజేసి
మతము దూషించువారల మానసముల
కిహపరార్థమ్ము లవలీల నెఱుకపఱిచి,

శాంతసుస్థిరచిత్తుఁడై సత్యమూర్తి
ఆశ్రితావళిఁగూడి గృహమ్ము వెడలి
దీనమానవోద్ధరణకై దీక్షఁబూని
పాపజీవుల రక్షించు వ్రతముపట్టి
జ్ఞానబీజమ్ము లెల్లెడఁ జల్లుకొనుచు—

"నీవు స్పృశియించునంతనే నిఖిల కలుష
హారమౌను మాబిడ్డల"కనుచుఁ గొంద
రంబుజాక్షులు జీసస్సునందు మిగులఁ
బ్రేమభక్తులు కలవారు ప్రియసుతాళి
నెత్తుకొని పర్వుపరువున నేఁగుదెంచి,
ఆతఁ డరుదెంచు తెరువున కడ్డపడగ,
వారిశిశువుల ననురాగ పూరితాత్ముఁ
డగుచు నాశీర్వదించి ముద్దాడి యనిపి
"సిమను" మందిరరాజముఁ జేరఁబోయె.

* * * *

స్నాతకుఁడు "జాను" వోలె జీసస్సుగూడ
"యూదు"లకు నీతిగరపుచు యూదగురువు
లందు గలుగులోపంబు లందందుఁజాటి
ప్రజలలో భేదభావముల్ ప్రాఁకఁజేసి
స్వమత సంవృద్ధికై కృషి సలుపుచుండ—
ప్రభువు జీసస్సుపై భక్తి శూన్యంబయ్యు
నతని కెవ్విధినేని నాహ్వానమంపించి
నిజనివాసముఁ జేర్చి నీతిబోధలు సల్పి
నవ్యమార్గమునుండి నయముతోనె మరల్ప
మదిలోనఁ దలఁచి "సిమన్" యేసుఁ బిలిపించె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకతంబునఁ బ్రభువున కతిథికొసఁగు
నర్ఘ్యపాద్యాది సత్కృతులందు నొక్క-
టేని జరుపక నిర్లక్ష్య మూనియుండె;

నైన నీయవమానమ్ము నాత్మ నెంచ
కాతఁ డపుడు తదంగణమందుఁ గలుగు
నాసనమ్మున నుపవిష్టుఁ డయ్యె, నంత-
ప్రభుసుబోధల వినుటకై భక్తిపరులు
కొంద ఱాతని డాయ, నానంద మొంది
విమలమతితోడ సుజ్ఞానవృష్టిఁ గురిసి
తన్మయులఁ జేసె వారలధర్మమూర్తి.

ఆసుధామృత వారాశి నంద ఱట్లు
మునిఁగియుండ, దుశ్చరితయౌ ముగుద యొర్తు
పరమగురుని దర్శింప లోపలికిఁ జొచ్చి
ప్రభుపదాంభోరుహమ్ముల పజ్జ నిలిచె.

*   *   *   *

ప్రొద్దుపొడుపునఁ జేసిన బోధలందు
"ఎట్టి కిల్బిషకర్ముల కేని గాని
రక్షణముగల"దని పాపరక్షకుండు"
పలుకఁగా విని, తాఁ జేయు పాపరాజి
నుండి వెలువడుమార్గమ్ము నూహఁ జేసి,
అతని దరిఁ జేర నిదె మంచియదనటంచు
ఆ "కులట" విందు భుజియింప నరుగవారిఁ
గలిసి ధైర్యమ్ముతోడ లోపలికి నేఁగె.

*   *   *   *

అట్లు ప్రభుసన్నిధిని నిల్చు నంచయాన
సాధు శీతలహృదయ (శ్రీ) చరణయుగము
చెంత శిరసుంచి కోమల కుంతలములు
ధరణిపైఁ బడిపార్ల, సంతప్తమాన
సోద్భవోష్ణాశ్రుధారల నొలికి యేసు
పాదకంజములు కడిగి, భక్తితోడ
గంధసారాళిఁ బూజించి, కరవుదీర
తత్పదాంభోజ సురభి నెత్తావి ద్రావి
ముద్దులంగొని నయనాల కద్దుకొనుచు
"స్వకృతదోషమ్ములన్నియుఁ బాసిపోవ
నవ్యయ మతీతమౌ పథ మందికొనఁగ
సర్వసముఁ డీశ్వరుండె నాపూర్వజన్మ
పుణ్యవశమునఁ బ్రభువయి పుట్టెనేమొ?"

అనెడి విశ్వాసమున సర్వమామె మఱచె!
ఆవిచిత్రదృశ్యముఁ గాంచి యచటివారు
విస్మయముఁ జెంది క్రోధాగ్ని పెచ్చుపెరుఁగ
నంద ఱొకమాఱె లేచి యాయబలఁ జుట్టి.

"ఈదోషకర్మురా లింతేని భయమూన
కీపవిత్రస్థాన మెటుచెరెనో? దీని
వెడలఁ ద్రోయుఁ డిపుడె వెలికి" నం చాయనా
ధనుబట్టి గెంటఁ దొందరపాటు నొందఁగా.

భీతిలజ్జలు మనమునఁ బెనఁగొనంగ
భీతహరిణేక్షణాంచల, ప్రేమమయుని
శరణు వేఁడెడు దృక్కుల నరసి, యతని
పదసరోరుహములకడ నొదిఁగిపోయె!

సకలజీవదయాళుండు శాంతమూర్తి
ప్రభువు, దుర్భ్రాంతచిత్తులై పడతినేహ్యా
భావమునఁ గనుఁగొను యూదభక్తవరుల
యవిరతంబగు కోపానలార్చు లపుడు
శీతలోక్తులఁ జల్లార్చి, చెలియవైపు
అభయహస్తముఁ జాఁచి "ఓ యబ్జవదన!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇపుడు నీకలుషము క్షమింపఁబడెను!
ధన్యతమమయ్యె నీజీవితమ్ము నేడు !!
ఈవొనరించు దుష్కృతులకు నీవు
తగిన విషాద వేదనలను బొంది
భక్తి ప్రపూర్ణమౌ స్వాంతమ్ముతోడ
సేవఁ జేసి ముదంబుఁ జేకొంటివమ్మ!
విమలహృదయమ్ముతో నన్ని వేళలందు
పరమపూరుష ధ్యానతత్పరత గలిగి
ప్రేమ రాజ్యమ్ములో విహరింతువేని
నిత్యశుభములు చేకూరు నీ కిఁకైన!”
అనుచు దీవింప నంత, నవ్వనజగంధి
తనకు రానున్న నరకబాధలు తొలంగి
విబుధలోకసౌఖ్యములు ప్రాప్తించు ననెడి
మోదపూర్ణామృతమ్ములో మునిఁగిపోయె!!!

---

## ప్రణయాశయము

కె. అన్నమరాజశర్మ గారు

ఎన్నటి ప్రేమ భూతి యొుల
యింపక దివ్యమనోహరాకృతిన్
భిన్న మొనర్చుచుండె, కను
పించెదవే కను దోయిమూసినన్
స్విన్నముఖంబుతోడ కమ
నీయమృదూక్తుల నిన్ను ‘గూర్చివి
ద్యున్నవవల్లి కోపమవ
మోరుచిరాంగి! జపించుచుండెదన్.

విరహవిషాదవృత్తినిఁద
పించెడినా కిఁక శాంతిలేదె, సుం
దరమగు ప్రేమ బంధము మ
నంబుఁ గలంచు తెఱంగెఱింగినన్,
నిరవధి శార్తి బాష్పతటి
నీతటమందునఁ దానమాడినన్,
బరుసఁ దనంబు వోవిడి కృ
పామతిఁ బూనక పోవుకోమలీ!

సరసాలోల దృగంచలేషుతతులన్
స్వాంతంబు ఖండించి,దు
స్తరదావానలపీతమం దునిచి చిం
తామాత్రమోహంపుఁజి
త్తరునై తాపమునించెదే ప్రణయగం
ధంబుల్ పిసాళింప న
న్నరవిందాయతనేత్ర! నీమృదుల బా
హాగ్రంథి బంధింపుమా.

అర్ధగర్భిత నీలలోలాంబకముల
మగువ దాఁచితె మధురంపుమర్మగతుల
ప్రేమతత్వంబు నీలోనఁ బిచ్చలింప
సిగ్గుతెర జీల్చికొని రాఁగఁ జింత సేతు.

హృదయ చషకంబు నందలి ప్రేమసుధను
బంచి పెట్టఁగ వచ్చెదే స్వప్నవీథి
స్వర్గమందైన మనవాంఛ సఫలమొందు
ననెడి యడియాస నెచ్చెలీ! యధిగమించె.

బహుళపరిణామ కర్మ ప్రవాహమందు
కొట్టుకొనిపోయి యెన్నటికో త్వదీయ
పాణిపల్లవముం గేలఁ బట్టి కొనక
పోను నాకాంక్ష విఫలమై పోవు టెట్లు?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## స్వయం వరణం

హనూమాన్ (కవితాసమితి)

అనగనగా కాశ్మీర దేశంలో కనకశర్మని ఒహాపండితు డుండేవాడు. ఆయన చతుర్వేదాలు, షట్‌శాస్త్రాలు చదివి లోకంలో యింతవాడు మరొహాడులేడనే చిరకీర్తి గడించి కాలం గడుపుతూండేవాడు. ఈ పండితునికి ఒహాచక్కనిఅమ్మాయి ఉంది. ఈమెకుచక్కదనాన్కి సాయం తెలివితేటలు మిక్కుటంగా ఉండేవి. ఈమె క్రమక్రమంగా తండ్రిగారివద్ద సర్వకళ లభ్యసించడమేకాకుండ, తండ్రిగారు చేస్తూన్న శాస్త్రార్థాలు, ఆయన యుక్తిప్రత్యుక్తికలు శ్రద్ధగా వింటూ పెద్దపండితురాలైపోయింది. ఎన్నాళ్లాడపిల్లయింట్లో ఉంటుంది. గులాబిచెక్కిళ్లమీాద సిగ్గుదొంతరలు కనిపింపజొచ్చేయి. పండితుఁడు భార్యతో ఆలోచించేడు అమ్మాయి వివాహావిషయం.

కొనకు వారిద్దరు మరునాడు "శుభస్య శీఘ్రం" అని వరుణ్ణి వెదకడానికి ముహూర్తం నిర్ణయించేరు.

శర్మగారు మరునాడు బయలుదేరి ఒహాపల్లెటూరిప్రాంతం చేరేరు. అప్పుడు సమంగా సూర్యోదయం అయింది. ఈయన తిన్నగా ఆపూరుప్రక్క పారుతూన్న తాబేరు గట్టుమీాదకి వెళ్లి ఒహాపెద్దమనిషిని ఆఊరి సమాచారం కనుక్కుంటూ నదిలో నిష్ఠాగరిష్ఠులై సంధ్యవారుస్తూఉన్న యువకులను చూచేసరికాయన కొహా అభిప్రాయం తట్టింది. మళ్లీ వారిని చూసేడు. నచ్చింది. నూనూగుమీాసం, బంగారపుశరీరం, నల్లని పెన్నెరులు, శబాసనుకుని ఒకక్షణం ప్రతీక్షించేసరికి ఆ యువకులు సమీాపించేరు. అందులో నొకనిని శర్మగారు "నీపేరేమి" అన్నారు. యువకుడు నవ్వుమొగంతో "కింశుకశాస్త్రి" అన్నాడు. పండితుడు సరే అని కింశుకశాస్త్రితో వారి ఇంటికి వెళ్లి ఆరోజు కక్కడుండి కింశుకశాస్త్రినివెంట పెట్టుకుని మర్నాటికి తమ యిల్లు చేరేడు. తగిన పెళ్లికొడుకు వచ్చేడని శర్మగారిభార్యకు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంతోషం కలిగింది. పెళ్లికొడుక్కి పిండివంటలతో భోజనంపెట్టగా నాతడు భోంచేసి చావడిలో పచారు చేయుచుండగా అమ్మాయి పెండ్లికొడుకుని చూడడానికి వచ్చింది. చూచింది వాళకం; పెదవి విరిచింది. పెండ్లికొడుకుకూడ గమనించే డమ్మాయిని. అప్పుడామె "అయ్యా! తామేమి చదువుచున్నా"రంది. పెళ్లికొడుకు "భారవి" అన్నాడు. అమ్మాయి "సరేగాని అయ్యా! విహాస్య అన్నది యేవిభక్తి" అంది. పెళ్లికొడుకు వెంటనే "షష్ఠి" అన్నాడు. అమ్మాయి మళ్లీ "విహాయ"అన్నదో? అందిపెళ్లికొడుకుజంకకుండా"చతుర్థి"అన్నాడు. అమ్మాయి:"అహం?" అబ్బాయి: "ద్వితీయ". అమ్మాయి: "కథం?" అబ్బాయి: "ద్వితీయ". ఇంకేముంది, తెలిసిపోయింది అమ్మాయి కబ్బాయి పస. తండ్రిగారు అమ్మాయిని పిలిచి,"అమ్మా, చూసేవా పెండ్లికుమారుని? నీకుతగినవాడేనా?"అన్నారు అందుల కమ్మాయి నైస్పృహ్య సూచకంగా ఒహానవ్వు నవ్వి—"కింశుకశాస్త్రి".

శ్లో. "యస్య షష్ఠీ చతుర్థీ స్యాత్
విహాస్యచ విహాయచ;
అహం, కథం, ద్వితీయా స్యాత్
ద్వితీయా స్యా మహం కథం."

అందట:—చూచితిరా విద్యాధికయగు సతీమణి విమర్శకతా నైపుణి. ఇట్టియువతి తగిన వరుని బరిణయమాడి యెంతచక్కగా గాపురము సేసి వన్నె కెక్కునో గదా!

---

## తులువ తుమ్మెద

విద్వాన్ కె. నరసింగ రావు గారు, బి.ఏ.,యల్.టి.

తులువతుమ్మెద యొక్కటి చలము బూని
కొలము కొమరును దొంగిలదలచి మదిని
చెలిమినాకున కలువల కొలను జేరి
పలుక మొదలిడె మెల్లని మెలుగుతోడ.

కూర్మిగంటికి సొంపును గూర్చు మీరు
కొలనిలో బడియుండంగ గోరదగునె
వదలి రండిక గండుతుమ్మెదలకెల్ల
తేటి చవిదేనె పంచుడు తెలివిపాగ.

ఉన్నచోటనె పడియుండ పన్నుగాదు
నన్ను మేటిగ నెంచుడు చెన్నుమీర
అన్నిసుఖముల దేలింతు నలత లేక
దయ్య మిచ్చెను దేహంబు దనివితీర్ప.

అన్నమాటల వలపుల కలరి యవియు
వెలుపలికి వచ్చి సత్తితో కులుకుచుండి
వన్నె తేనెల పోనాడి చిన్నవోయి
తెలివిమాలిన నడతకై తిట్టికొనియె.

తుమ్మెద చెఱచి జుమ్మని తొలగిపోయె
సంత ముగిసినపిదప నీవంత యేల?
తనర వెన్నుండు పెట్టిన తావులందె
మీరు వారును చెడకుండ మెలగగాదె?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



మో ట బా వి

చిత్రకారుడు: శ్రీ పొట్లూరి హనుమంతరావు గారు, ఆంధ్రజాతీయకళాశాల, బందరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సంఘం అంటే ఏమిటి ?

గురుభాగవతుల ధర్మారావుగారు, యం. ఎ.

ఎక్కడెక్కడ జీవిఉందో అక్కడల్లా సంఘం ఉందనిచెప్పవచ్చును. ఎంచేతంటే ఒక ప్రాణి తనవంటిప్రాణుల సంఘంలో కాని పుట్టలేదు; పెరగలేదు. సంఘజీవనం జీవవృక్షం యొక్క పై శాఖలని చెప్పతగిన ఉన్నతప్రాణుల్లో స్పష్టంగా కనుపిస్తుంది. అలాంటి ప్రతిప్రాణిన్నీ సంఘంలో పుట్టి, సంఘంలో పెరిగి, సంఘంమూలాన్నే తనస్వభావాన్ని, లోపాలని తెలుసుకుంటుంది. సంఘం మనచుట్టూ ఉండడమే కాకుండా మనతో కూడాఉంది. ఏరిస్టాటిల్ ఈసత్యమే ఇలాగు చెప్పేడు. "మనుష్యుడు సంఘజీవన బద్ధుడైన ఒకమృగం." (Man is a social animal)

సంఘంఅంటే శారీరికంగాను, మానసికంగాను సమానధర్మాలుకల వ్యక్తులసముదాయం అనిచెప్పవచ్చు. సమానధర్మాలులేకపోతే వ్యక్తులు కలిసి ఉండలేవు; కలిసి తమఉద్దేశాలు నెరవేర్చుకోలేవు; స్నేహం, అన్యోన్యత, సంఘీభావం, ఇవిఉండాలంటే వ్యక్తులు వాటివాటికి ఉన్నఏకత్వం గ్రహించాలి. ఒక వ్యక్తినిపోలి యింకో వ్యక్తిఉండవచ్చుకాని అవ్యక్తులన్నీ ఒకసంఘం అని అనిపించుకోలేవు. ముఖ్యమైన హంశాల్లో పోలికఉన్నప్పటికీ, వ్యక్తికీ, వ్యక్తికీ, భిన్నత్వంకూడా ఉండాలి. కారణమేమంటే ఈభిన్నత్వమే వ్యక్తులన్నింటినీ కలిపిపరస్పరసహాయంవల్ల ఒకేలక్ష్యం సాధించడానికి కారణభూతం అవుతుంది.

సంఘం అనేశబ్దంలో ఇంకో అభిప్రాయం ఉంది. అది యేదంటే "సంఘంలో ఉండే వ్యక్తులు ఒకదానిమీద మరొకటి ఆధారపడి ఉంటాయని." సంఘంప్రథమంలో కుటుంబంగాఉంటూ ఉండేది. కుటుంబంలో స్త్రీలు పురుషులపైనిన్నీ, పురుషులుస్త్రీలపైనిన్నీ ఆధారపడి ఉంటారు. స్త్రీలు పురుషసహాయంవల్లనూ, పురుషులు స్త్రీలసహాయం వల్లనూ పరిపూర్ణత్వం పొందుతారు. కుటుంబంలో వర్తిస్తూ ఉన్న యీసూత్రమే బాహుళ్యంగా సంఘంలోకూడా వర్తిస్తూఉంది. కాని సంఘంలో ఒకరిమీద యింకొకరు ఆధారపడియున్న విధాలు హెచ్చుగా ఉంటాయి. ఆప్రదేశం కూడా చాలా విరివిగా ఉంటుంది. అతిపురాతనకాలంలో కులాలు, జాతులు, గ్రామంలో నివసించే సంఘాలు మిక్కిలి సంకుచితంగా ఉండేవి. వాటికిన్నీ చుట్టూఉన్న ప్రపంచకానికిన్నీ,ఏవిషయంలోనైనా,ఇచ్చిపుచ్చుకోవడం ఉండేదికాదు. కులానికీ, జాతికీ, గ్రామానికీ, వెలుపల ఉన్న వాళ్లంతా శత్రువులనే అప్పటి వాళ్లనమ్మకం. అయితే యీయుగంలో దేశదేశాలకీ,ఖండ ఖండాలకీ,సంబంధం హెచ్చయిపోతూఉంది. దేశానికీ దేశానికీ యుద్ధంపుట్టి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాకపోకలకు అడ్డంవచ్చేటపుడు ప్రజలు ఎంత బాధపడతారో మనకు తెలుసు. రానురాను ఈపరస్పర సంబంధం అధిక సంఖ్యాకులలో ఏర్పడడమే కాకుండా అది అశిథిలంగా తెంచడానికి వీలులేకుండా పరిణ మిస్తూఉంది.

సంఘంఅంటే సహకార మన్నమాట. సంఘాన్ని కూడ చేసేశక్తులకూ, యుద్ధాలకూ, పరస్పరవిరోధం కనిపిస్తుంది. యుద్ధంవైషమ్యాలనుపెంచి, నాశన కారణ మవుతుంది. సంఘం దానిలో ఉండేవ్యక్తులకు సమానాశయాలు కల్పించి ఆవ్యక్తుల్ని ఒకదగ్గరకు పోగుచేస్తుంది.

సంఘం గురించి మనంనేర్చుకొన్న సంగతులివి: సంఘంలోఉండే వ్యక్తులకు సమాన ధర్మాలు ఉంటాయి. ఒకరిమీాద మరొకరు ఆధారపడి ఉంటారు. సంఘంలో ఒకరికోసంఅందరూ, అందరికోసం ఒక్కొక్కరూ సహాయం చేస్తారు. అయితే సంఘం అంటే ఇంతేనా? కాదు. సంఘం ఒకవలలాంటిది. అందరమూ ఒకటేఅన్న సంగతి గ్రహించినవ్యక్తుల ఇచ్ఛాశక్తి, ఉద్దేశములూ, వీటివల్లఏర్పడిన పరస్పర బంధాలే సంఘజీవనానికి ప్రాణంపోస్తాయి. సంఘతత్వంగురించి ఆలోచించేటప్పుడు సంఘం అంటే ఒకఆంతరికమానసికావస్థ అని భావించిరి. కాని ప్రత్యేకవ్యక్తుల సదుపాయానికి గాని వాటిసౌఖ్యంకోసంగాని ఏర్పడిన సంస్థ కాదు. సంఘంలో తల్లికీ, పిల్లకీ, ఉండేసంబంధం దేనితో కనిపిస్తుంది?

తల్లికి పిల్లమీాద ఉండేప్రేమతోను, బిడ్డకు తల్లిపై ఉన్నప్రేమతోనూ ఈప్రేమ మూలముగా ఇద్దరి ఆంతరంగిక స్వభావం కూడా వ్యక్తమవుతుంది.

సంఘములయొక్క యథార్థ స్వభావవిచారణ ఈ దృష్టితోచెయ్యాలి. సంఘంలో వ్యక్తిత్వంలాగ ఉండకుండా వ్యాకోచం అవుతుంది. వ్యక్తిస్వార్థపరత్వం అనేగొలుసు తెంచేసి ఇతరవ్యక్తులతో సంబంధాలు కల్పించుకుంటుంది. ప్రతిమనుష్యుడికీ నేను ప్రత్యేకవ్యక్తిననే జ్ఞానం కలిగి, తరతరాలకూ వ్యక్తియొక్కప్రత్యేకత్వం నశించకుండా వంశక్రమాగతంగా వస్తుంది. యౌవనం పోషింపబడుతుంది. స్త్రీపురుషుల అన్యోన్యసంబంధాలవల్ల వాళ్లగుణపుష్పాలు వికసిస్తాయి. ప్రకృతి రహస్యాల కనుగొని దాన్ని తనవశానికి తెచ్చేటందుకు మనుష్యుడు చేసేప్రయత్నాలన్నీ ఏకలక్ష్యబద్ధం అవుతాయి. తరతరాలనుంచీ వంశక్రమాగతంగా వచ్చే మనుష్యుల ఆచారాలు, వ్యవహారాలు, అభిప్రాయాలు, నడుస్తూ ఉంటాయి. కాలక్రమేణ మనుష్యులు సంపాదించే జ్ఞానం అంతా సంఘానిదే. సంఘంయొక్క మహాదుద్దేశంలో, అందులో నివసించే మనుష్యులవైరాలూ, వాళ్లస్నేహాలూ ఇమిడి ఉంటాయి.

విధులు, ధర్మాలు, వాటివిభాగం

సంఘానికి అవసరమైన పనిఏదైన కావలసి ఉంటే ఆపనిచెయ్యవలసినవిధి అందరిదీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయిఉంటుంది. ఆకారణంచేత ఆపనిఅందరూ కలసి చెయ్యాలి. అనగా ఏదయిన పనిచెయ్య డానికి పడవలసిన కష్టం అందరూ పంచుకో వలసి ఉంటుంది.

సంఘం సహకారంమీద ఆధారపడి ఉంటుంది. ఇంతేకాక సంఘం మొత్తంమీద కావలసినపనిలో ఎవరివంతువారు చెయ్యాలి. ఎవరుఎంతపనిచెయ్యాలోఅది ఒకప్పుడు ప్రకృతే నిర్ణయిస్తుంది. ఉదాహరణం క్రింద కుటుంబ జీవనంతీసుకుందాం: శిశుపోషణ విషయంలో తల్లితండ్రులిద్దరిలో ఎవరివిధి వారు నెరవేర్చడం చూస్తున్నాం. తొమ్మిదిమాసాలు మోసి, తల్లి తన జీవంతో ఇంకో జీవాన్ని పోషిస్తుంది. శిశువు పుట్టిన తరువాతకూడా కొన్ని సంవత్సరాల వరకూ పిల్ల తల్లిమీద ఆధారపడి ఉంటుంది. తండ్రికూడా తనజీవన కుసుమమని చెప్పడానికి తగిన శిశువుమీదనుండే సహజ ప్రేమవల్ల శిశువుకి కావలసిన సదుపాయా లన్ని చేస్తాడు. శిశుపోషణభారాన్ని, ప్రకృతే భార్యా భర్తలమీద వాళ్లస్వభావానుగు ణ్యంగాపంచుతుంది. ఈవిధుల్ని ఇంకోఅపుడు సంఘంలో నుండే వ్యక్తులే బుద్ధిపూర్వకంగా కొన్నిసామాన్యలాభాల కోసంగాని సామా న్యసదుపాయాల కోసంగాని నిర్ణయిస్తాయి. వైదిక కాలంలో ఆర్యులసంఘం ఈఉద్దేశాన్ని అనుసరించే, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనేనాలుగు భాగాల యింది. ఏభాగం (వర్ణం) తాలూకుపని ఆభాగమే చెయ్యాలనే యీ ప్రత్యేకత్వ నిర్ణయం, (Specialisation) వల్ల రెండు లాభాలు ఉన్నాయి. మొదటిది: మనుష్యులకి వాళ్ల వాళ్ల పనులు నేర్పుతోను, సౌలభ్యంతోనూ చెయ్యడానికి అవకాశం కలగడం. రెండవది: ఎవరి స్వభావానికి అనుకూలమైనపని వాళ్లు చెయ్యడానికి వీలుండడం. "Caste is based on the law of spiritual economics", అని కొందరు చెప్తారు.

ఈవిధులవిభాగంవల్ల సంఘంలో ఉండే ఒకజాతి లేక తెగ ఇతర జాతులపైని, ఇతర తెగలపైని, ఆధారపడి ఉండడమే కాకుండా ఒకజాతియొక్కగాని, తెగయొక్కగాని, అవసరం ఇతర జాతులకూ, తెగలకూ ఉండడమే కాకుండా, జాతిజాతికీ తెగతెగకీ సమానత్వం ఏర్పడి హెచ్చుతక్కువలులేకుండా సంఘంలో ఉండే అందరికీ ఒకవిధమైన అన్యోన్యమైత్రి ఉంటుంది.

పూర్వం ఒకప్పుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు ఒకరినొకరు సమాన గౌరవంతో చూస్తూ ఉండేవారని అనుకోడానికి ఆధారాలున్నాయి. జ్ఞానం అధికమవుతూఉన్న కొలదీ, ప్రకృతి శక్తులను మనుష్యుడు తన సౌఖ్యం కోసం వినియోగించినకొలదీ, సంఘంలో వ్యక్తులధర్మాలు, విధులు, వీటివిభాగం జరుగుతూ ఉంటుంది. అదే సభ్యత అని చెప్ప వచ్చు. ఈవిధుల విభాగంవల్ల మనజాతియొక్క బుద్ధి వికసించి జ్ఞానాభివృద్ధి కలుగుతుంది.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రణాంగణము
(రంగరాయ ప్రబోధము)

మున్నంగి లక్ష్మీనరసింహ శర్మ గారు

తరతరమ్ములనుండి మాతరము దనుక
పౌరుషము బాలనమ్ము గాపాడినారు;
దురమునకుఁ బెండ్లికింబలెఁ దరలినారు;
ఆలమునఁ గేలిసల్పి సింగాలలీల

పరబలద్విపయూధకుంభములు వ్రచ్చి
సహజకరవాలజీవి వంశప్రతిష్ఠ
లిహపరమ్ముల డవిణ్రమోయించినారు;
గణ్యతకు మించె మీ పరాక్రమము క్రమము.

శాస్త్రపహాదలఁ, గేలశస్త్రము దనర్చి
కర్మయోగమునెఱపిన క్షాత్త్రధర్మ
రతులు మన వంశకర్తలాంధ్రనృపవరులు;
వారికడుపునఁ బుట్టినవార మంచు

మఱతుమే? వంశములకెల్ల మాసిపోని
మచ్చఁగూర్తుమె? యాహవక్ష్మాతలమున
వీరవిఖ్యాతియొనర్చి బొబ్బిలిప్రతాప
డిండిమధ్వని జగతి నిండింపవలయు;

దిగ్విజయకేతనముల నెత్తింపవలయు;
భరతవీరప్రతాపప్రభావమల్ల
దివిజలోకంబుదాఁక నందింపవలయు;
చావుబ్రదుకుల చర్చలు సమయ వలయు;

అరులబలములఁ జించి చెండాడవలయు;
'కోటవిడుఁ'డంచు, 'నౌబతుకూడ'దంచుఁ
గూయు పగవానినాలుకఁ గోయవలయు;
లాతిపాలనమునకు సలామొనర్చు

సిగ్గుమాలినబ్రదుకు నశింపవలయు;
నేటితోఁ బరాధీనత మీటవలయు;
జన్మభూమికి దాస్యమోక్షమ్ము లేక——
లేదు భౌతికవిభవంబు; లేదు శాంతి;

లేదుస్వర్గము, మనుటకు లేదధికృతి;
సిరులు మెఱుపులు, రాజ్యమస్థిరము- తనువు
బుద్బుదము-క్షణికమ్ములు బూటకములు.
వచ్చుసుకృతదుష్కృతములేపఱచి వెంట;

ప్రాణము లశాశ్వతము; లభిమాన మొకఁడె
పరఁగు గలకాల మాచంద్రభాస్కరముగ.
త్రెంచుకొనుఁ డిహబంధముల్ దెరలిరండు!
ప్రకృతి "జాతస్యమరణమ్ ధ్రువ"మ్ము శౌర్య

ధనులు మీ; రసిధారావ్రతమ్ముఁ గొనుఁడు!!
సంఖ్యాతద్వీప, శ్రీకృష్ణ జయజయజయ!
శాంభవీ, కాళి, చండికా జయజయ జయ!!
లయమహాకాలరుద్ర, జే జయజయజయ !!!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఉల్కలు (Meteors)

వింజమూరి హనుమంతరావుగారు

రాత్రిభాగమందు నక్షత్రములవంటి కొన్ని జ్యోతిస్సులు వియత్తలమునుండి శరవేగముతో భూలోకమున కవతరించుచు మార్గమధ్యమున నమసిపోవుట మన మందరము తరుచుగా చూచుచుందుము. ప్రాయికముగా నిట్టిజ్యోతిర్గణములు ఘంటకు నాలుగైదు వంతుననంబర వీథిని బొడకట్టి యొకత్రుటికాలములో మాయమగుచుండును. మందగాములగు కొన్ని ఒకటి రెండు నిముసములవరకు దృక్పథమున నుండును. ఒక్కొక తఱి యీ జ్యోతిస్సులద్భుత తేజః పుంజములై గగనభాగమంతయు వెలుతురుచే నింపును. వానియాగమనమున నంధకారము పటాపంచలగును. ఇట్టి మూర్తములను (Bodies) ఉల్కలందురు. ఉల్కలేవిధమున ప్రత్యక్షమైనను వాని జీవన మల్పకాలమే.

అనుదినము రాత్రిభాగమున కనబడునుల్క లతి సూక్ష్మములై మనదృష్టి నాకర్షింపవు. వెన్నెలరాత్రుల యందివి దివినైనాడు విహంగములవలె దోచును. వీనినేరసజ్ఞులగు కవులు తమ కావ్యములలో చకోరకములనియు, వెన్నెలపురుగులనియు వర్ణించెదరు. మనమిట్టి మూర్తములనుజూచియు సరకుసేయము. కొన్ని సమయములందివి యసంఖ్యాకములయి భయోత్పాదకములగును. ప్రపంచచరిత్రయం దిట్టితరుణము లనేకములువర్ణింపబడియున్నవి. అరేబియాలో ౫౯౯ సంవత్సరం మొహరం పండుగ కడపటి రాత్రియంతయు, నుల్కలు మిడుతలదండువలె నిటునటు బారజొచ్చినవట. జనులు భయభ్రాంతులై భగవంతునిగూర్చి ప్రార్థించిరట. దేవమాతయగు మహమ్మదుగారి యవతరణమందు తప్ప మఱియెన్నడునిట్టివింతనుజూడలేదని యనుకొనిరట. క్రీ. శ. ౧౭౯౯ లోను, క్రీ. శ. ౧౮౩౩లోను నిట్టిభయంకరసృష్టి సంభవించెనని చరిత్రలయందు వర్ణింపబడియున్నది.

ఉల్కలు సూక్ష్మవాతావరణము (Regions of rarer atmosphere) గల యున్నత ప్రదేశములయందు మేఘమండలమునకు చాలపైనుండగనే కనుపించును. వానిస్వభావము నూహించుటకుదగిన ధ్వన్యాదిహేతువు లెవ్వియు వానియాగమనమును పురస్కరింపవు; కాని యపూర్వ సమయములయందు నఖండతేజోవంతములగు నుల్కల యవతరణము సంకులఘోరజీమూత ఘుమఘుమారావమును ధిక్కరించు భయంకరనినదముతో గూడియుండును. అట్టితఱి లోహపాషాణాదులు భూమిపైబడుట యుగలదు. చాలకాల మీపాషాణపదార్థముల స్వత్వము (constitution) ఖనిజశాస్త్రజ్ఞుల కభేద్యమైదుర్గ్రాహ్యముగనుండెను.

రానురాను పదార్థతత్వమెఱుంగుటయందు నిపుణులగు శాస్త్రజ్ఞులు ఈ పదార్థముల బాగుగ పరీక్షించి వీనిలో మూలద్రవ్యములు (Elements) ఖనిజేతరములు కాకపోయినను వీని సమ్మేళనవిధానము భూమియందు దొరకు మిశ్రపదార్థసమ్మేళన విధానములలో దేనిని బోలియుండలేదనియు ఆకారణమున నివి భూమ్యతిరిక్తములనియు నిరూపించిరి. ఇట్టి యుత్పాతమును కన్నులారజూడకపోయినను, సామాన్యపరిశోధనచే నేపదార్థమైనను ఉల్కాశకలమని ఖనిజశాస్త్రజ్ఞుడు సులభముగా పోల్చదగిన కొన్ని విచిత్రలక్షణము లీపతితపదార్థసమ్మేళనమునకు సహజమైయున్నవి.

అంతరిక్షమున నుల్కలసంఖ్యాకములు. ఇవి సూర్యునిచుట్టు ననేకవిధములగు కక్ష్యల (orbits)లో భ్రమ్మరుచుండును, భూమి తన కక్ష్యలో నీమూర్తములను సర్వదా డీకొనుచున్నది. ఈతాకుడుచే సూక్ష్మములగు మూర్తములు దగ్ధమగుచున్నవి. దగ్ధమగుతఱి ఉత్పన్నమగు జ్వాలను మనము ఉల్కయనుచున్నాము.

సంఘట్టనమాత్రమున మూర్తమేల దగ్ధముకావలెను? వందలకొలది మైళ్లదూరమువరకు కనబడునంతటి దీప్తకాంతిత్రుటికాలములో నెట్లుకలుగును అను సందియములు తోడమవచ్చును. ఈ యంశముల నరయుటకు ప్రకృతిశాస్త్ర పరిచయమవసరము. ఘర్షణవలన వేడిమి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గల్గుననుట జగద్విదితము. పూర్వులు యజ్ఞయాగాదిక్రతువులయందు దారుమథనముచే నిప్పురాజేయుచుండిరిగదా. అది ఎట్లుగలిగె? త్రిప్పుచున్న కర్రలోని యణువులకు గతిబలము (kinetic energy) వృద్ధియగుటచే అడుగుననున్న దుక్కపు ఆయణువులు తమబలము నొసగును. అడుగుకర్రకదలకుండుటచే తిరుగుడు కర్రయొక్కగతిని నిరోధించును. ఆనిరోధము (Resistance) చే గతిబలమువేడిమిగా మారును. కావున ఉష్ణత గతియొక్క వికృతి. ఉష్ణవాయువునకు శీతవాయువునకు గల భేదమేమి? ఉష్ణవాయువులోని యణువులు శీతవాయువులోని యణువులకంటె ద్రుతస్పందనము (Rapid vibration) గలిగియుండును. అట్టి వాయువు ఇతర వస్తువులపై సోకినపుడు వాని యణువులకు సహా గతిబలము హెచ్చి స్పందనముగలుగును. ఆయణుస్పందనమే వస్తువును ఉష్ణతమముగ జేయును. కావున ఒక మూర్తము అతివేగముగ గాలిలోపోవునపుడు చుట్టుప్రక్కలనున్న గాలి చల్లగానున్నను, మూర్త మేవేగములో పరుగిడుచుండునో అదేవేగముతో దానిని మార్కొనుచుండును. ఈసంఘర్షణచే నామూర్తముయొక్క గతి బలముష్ణతగా మారి యది ఉష్ణాధిక్యమగును. వేగము హెచ్చిన కొలది మూర్తముయొక్క ఉష్ణత హెచ్చుచుండును. గాలిలో క్షణమునకు ౧౨౫ అడుగులవేగముతో వెళ్లునట్టి యొక వస్తువునకు దగ్గరగా నుష్ణతమాపకము (Thermometer) నుంచిన యెడల ఉష్ణము ౧° హెచ్చునట్లు కనబడును అని తామ్సను అను ప్రకృతిశాస్త్రవేత్తగనుగొనెను. ౨౫౧ అడుగులవేగముగల వస్తువు ౪° ఉష్ణతనిచ్చును. ఈసిద్ధాంతమును ఉల్కలయుత్పాతమునకు ప్రయోగించిచూతము.

భూమి తన కక్ష్యలో క్షణమునకు ౯౭౦౦౦ అడుగులవంతున వెళ్లుచున్నది. స్థిరమగు నొకమూర్తమును ఈవేగముతో భూమి ఢీకొనినయెడల పైసూత్రప్రకారము మూర్తముయొక్క ఉష్ణత $\frac{౯౭౦౦౦^{౨}}{౧౨౫^{౨}} = (౭౭౬)^{౨} =$ ౬౦౨౧౭౬° ఎక్కువయగును. ఇంత యుష్ణము మనము కనిని యెఱుగము. ఇందులో $\frac{౧}{౧౦౦}$ వంతు ఉష్ణత నుద్భవింపజేయుట యసాధ్యము. ఇందుకు దోడుపై వియద్మూర్తము స్థిరముగాక గమనవేగము గల్గినయెడల భూమియొక్కయు మూర్తముయొక్కయు వేగయోగము విపరీతమై వాని సంఘట్టనచే నుష్ణత మఱింత హెచ్చును.

నవంబరునెలలో కనబడు నుల్కలు భూమి కభిముఖములై క్షణమునకు ౨౬ మైళ్లవంతున ప్రయాణము చేయుచున్నవి. భూమి క్షణమునకు ౧౮ మైళ్లవంతున నరుగుచున్నది. ఈరెండు మూర్తములు క్షణమునకు ౪౪ మైళ్లవంతున సమీపించుచున్నవి. పై సూత్రము ననుసరించి ఈవేగము ౩౫౦౦౦౦౦° ఉష్ణమునకు సమానమగుచున్నది. ఆ యుష్ణతయంతయు ఉల్కలకు చెందునది యని యూహింపకూడదు. సంఘట్టనచే నంతయుష్ణత బయలుదేరెను. గురుతమమగులోహము సహితము ౨౧౦౦ వేడిని పొందుసరికి కరిగి నీరై పిదప భస్మమగును. భస్మమగువేళ మిరుమిట్లు గొలుపు కాంతులు వెడలుట సహజము. ఒక క్షణమున ౩౫౦౦౦౦౦° ఉష్ణ ముద్భవించినయెడల నావేడిమిలో చాలవరకు గ్రహించిన మూర్తము ఎంతవేగిరము క్షయమగునో, అట్లగునపు డెంత వెలుగునిచ్చునో చదువరులే యూహింపవలెను.

ఈ యుల్కలలో చాల పెద్దవి మనవాతావరణములోనికి వచ్చునపుడు గల్గువేడిమి వానిని నిశ్శేషముగా హరింపకమునుపే భూపతనమగుట తటస్థించును. భూమిని సమీపించు కొలది సాంద్రతర (more dense) వాతావరణము నవి మార్కొనుచున్నవి. మఱియు భూమిని సమీపించుకొలది వాతావరణము శీతలతరమగుటచే మూర్తముయొక్క యుష్ణమును తగ్గించుచుండును. వాతావరణ సాంద్రత యధికతరమగుటచే నీపతన పదార్థమును తుత్తునియలుగా జేయును. చిటికిపోవు సమయమున ఘోరమగుశబ్దముగలుగును. ఉల్కలు ప్రాయికముగా నల్పపరిమాణము గలవగుటచే మార్గమధ్యముననే దగ్ధమై పోవుచుండును. తఱుచు కనబడు నుల్కలు ౭౫ మైళ్ల ఎత్తునుండిగా దృక్పథమునబడి ౫౫ మైళ్ల ఎత్తునకు దిగులోపల క్షయమగునని కనిపెట్టబడెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకాశమున ఉల్కలు అన్నివైపుల కనబడును అందుచే వీని కక్ష్యలు అన్నిదిశల నన్నిస్థానముల యందుండునని యూహింపవలసి యున్నది. కాని ఉల్కాసమూహముయొక్క గమనము ప్రత్యేకోల్కయొక్క గతికి భిన్నమై సర్వదా యొకనియమము ననుసరించి నటులు కనబడుచున్నది.

ఒక యుల్కాసమూహము మన దృక్పథమున బడినపుడు అందలి యుల్కల కక్ష్యలనన్నిటిని ఖగోళము (Celestial sphere) పై మనము గుర్తించినయెడల నవి యన్నియు రమారమి సమానాంతరములై యేకబిందు సంపాతములై యుండును. దీనినిబట్టి పైమూర్తముల కక్ష్యలన్నియు సమానాంతరము లనియు, అన్నిటి గమ్యస్థానమొకటియే యనియు తేలును. ఈ గమ్యస్థానమునే 'యుజ్జ్వలస్థానము' (Radiant Point) అందురు.

న్యూటను అను పాశ్చాత్య గణితశాస్త్రవేత్త ఉల్కల చరిత్ర నరయుటకై క్రీస్తు శకారంభమునుండి అతని నాటివరకు గల దేశచరిత్రలనెల్ల శోధించెను. అనాదినుండి 33 సంవత్సరముల కొకమారు ఉల్కావృష్టి వ్రాయబడి యుండెను. అంతేకాక ప్రతిమారును నవంబరు ౧౨, ౧౩ తేదీలలోనే ఈవృష్టి సంభవించి నటుల తెలుపబడియుండెను. దీనిని బట్టిచూడగా భూమి తనకక్ష్యలో నొక నిర్దిష్టస్థానమును జేరునపుడెల్ల నుల్కాపాతముగల్గున గ్లగపడుచున్నది.

పై యంశములనుబట్టి నవంబరు వృష్టికి కారణభూతములగు నుల్కాసమూహములు ఒక నియమితకక్ష్యలో సూర్యునిచుట్టు భ్రమించినట్లు మన మూహింపవలసి యున్నది. ఈ కక్ష్యయొక్కయు, భూకక్ష్యయొక్కయు సంపాతస్థానమొక శతాబ్దమునకు ౧౹° చొప్పున తూర్పునకు జరుగుచున్నది. ఉల్కాసమితి తనకక్ష్య యందంతయు వెదజల్లినట్లుండక కొంతమేర దట్టముగా క్రిక్కిరిసి యుండును. భూమి యీసమూహమును 33 సంవత్సరముల కొకమా రెదుర్కొనుచుండును. తక్కిన కాలములో భూమియు నుల్కలగుమియు సంపాతస్థానమందు నేకకాలమం దుండకపోవుటచే వృష్టి సంభవింపదు.

న్యూటన్ మహాశయుడు చరిత్రాంశముల ననుసరించి ౧౮౬౬ సంవత్సరము నవంబరు ౧౩ దిని ఉల్కావృష్టి సంభవించునని ముందుగా తెలియజేసెను. అట్లేయుల్కావృష్టి సంభవించుటచే నతనిజోస్యము రూఢియయ్యెను. అనంతరము ఇటాలియన్ దైవజ్ఞుడు కడుకడు తీవ్రకృషి సలిపి ధూమకేతువుల కక్ష్యలకును, ఉల్కాసమూహముల కక్ష్యలకును సన్నిహిత సంబంధముకలదని సిద్ధాంతీకరించెను. ఇతడేకాక మరికొందరు జ్యోతిశ్శాస్త్రవేత్తలు కూడ స్వతంత్రముగా గుణించి యతని సిద్ధాంతమును నిర్ధారణచేసిరి. ఉల్కాసమూహముయొక్క యావర్తపరమావధి (maximum period of recurrance) 33౹ సంవత్సరము లనుకొని అందుపై గణితముచేసి ఇటాలియన్ దైవజ్ఞుడు వాని కక్ష్యను నిర్ణయించెను. కొంతకాలమున కొక ధూమకేతువు అదే కక్ష్యలో ప్రయాణముచేయునట్లు కనుగొనబడెను. ఆ సంవత్సరము నవంబరులో నుల్కావృష్టి సంభవించెను. ఈధూమకేతువు తనదారిని పోవునపుడు దీనివెంబడించుచనణుసమూహముల భూమిమార్కొనుటచే నా ఉల్కావృష్టి సంభవించెనని యిందువలన తేలెను.

చాల కాలమునుండి ప్రతి యాగస్టు నెలలోను పరాశర (Perseus) నక్షత్రమునుండి ఉల్కలవర్షము కురియుట లోకానుభవము. అట్లనుటచే పరాశరనక్షత్రము చితికిపోవుచున్నదని యనుకొనజనదు. పరాశరనక్షత్రమెటుండునో ఆవైపునుండి సూర్యమండలమునకు ఉల్కలనేకములు వచ్చుచున్నవి. ఆగస్టునెల ౯,౧౧,౧౧ దిలలో నీయుల్కలు ఒకటి వెనుక నొకటి విరామము లేక కనబడుచుండును. వీనియందలి విశేషమేమన, వానిజాడ కొంతవడి కాంతిమయమై వెలుగుచుండును. గణితజ్ఞుడొకడు వీని కక్ష్యాసమస్యను ఛేదించి ౧౮౬౨ సంవత్సరములో రెండవమారు కనబడిన ధూమకేతువుయొక్క కక్ష్యయు, నీయుల్కలకక్ష్యయు నొకటియే యని నిర్ధారణచేసెను. కావున నీయుల్కలు ఆధూమకేతువుచే విసర్జింపబడిన యణుసమూహములని తేలెను. వీనియుజ్జ్వలస్థానము పరాశరనక్షత్రము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౮౭౨లో నవంబరు ౨౭న ఉల్కావృష్టి సంభవించునని సూచింపబడెను. 'బైలా' ధూమకేతువు ౧౮౪౬.లో చితికి రెండుభాగములయ్యెను. అందొకటి మొదట సూక్ష్మముగానుండి క్రమక్రమముగా వృద్ధియగుటచే కొంతకాలమునకు రెండుభాగములు రెండు ధూమకేతువులవలె స్పష్టముగా కన్పించెను. ఇట్లు కనబడిన మరియొకమాసములో రెండుభాగములు క్షీణించి యంతర్ధానమైయెను.

ఈధూమకేతుకక్ష్య భూకక్ష్యకు సమీపమందుండుటవల్ల ప్రతిసంవత్సరము నవంబరు ౨౭ తేది భూమి యీకక్ష్యను దాటిపోవుచుండును గణితమునసనుసరించి ఈకక్ష్యలో విహరించు ధూమకేతువు ౧౮౩౨ సంవత్సరము సెప్టెంబరులో భూకక్ష్య నతిక్రమంచి చనవలసియుండెను. సామ్యమనుసరించి భూమి సంపాతస్థానమును జేరినపుడు ధూమకేతూచ్ఛిష్టోల్కా ప్రవాహము నెదుర్కొనుటకు దగినకారణము లుండెను. ఇంతేకాక యీప్రవాహము ఉత్తరాభాద్ర (Andromeda) నక్షత్రమండల మేవంక కన్పించునో అటుండిబయలువెడలునట్లు కనబడుననియు అందుచేత ఉత్తరాభాద్ర నక్షత్రమే దీనియుజ్జ్వల స్థానమనియు నిర్ధారణచేయబడెను. తదుపరి ప్రత్యక్షానుభవము వలన నీసిద్ధాంతము ప్రత్యంశము నిజమయ్యెను.

పై యంశములను బట్టి ఉల్కలు వేరనియు ఉల్కాసమూహములు (Meteorite) వేరనియు, ఉల్కాసమూహములు ఆదిని ధూమకేతువులకు చెందినట్లును తెలియుచున్నది. ధూమకేతువుల స్వత్వమునుగురించి మరియొక వ్యాసమున జర్చింపబడును.

---

# శక్రచాపము

అనంతపంతుల రామలింగస్వామిగారు

ఓయవేద్యవిచిత్రమా! యొసఁగుహాయి
తావకీనైకసూక్ష్మ సందర్శనంబు;
గాయక కవీంద్ర చిత్రలేఖకుల సఫల
జీవిత స్నిగ్ధసుస్వప్న భావమీవా?
శక్రచాపము నీవనజాల నేను.

భువనమోహన కల్యాణ మూర్తివైన
తత్పరాత్పరు సౌందర్య తత్వసార
మను విచిత్రచిహ్నంబ వీవగుదువేమొ?
శక్రచాపము నీవనఁజాల నేను.

అప్పుడప్పుడు పర్వదినాళు లందు
సమరసామ్రాజ్యమందు నత్యంత మెగురు
నట్టి జాతీయ కేతన మగుదు వేమొ?
శక్రచాపము నీవనఁజాల నేను.

అవ్యయానందకందమౌ నట్టి నాక
తలము జనుధన్యజీవుల దారిలోన
చిత్రచేలాత్తపథ మీవా చెప్పలేను
శక్రచాపము నీవనజాల నేను.

వర్షరూపకమునను మున్వచ్చి మధుర
మోహనానూనరూపసంబోధితమగు
నట్టి ప్రస్తావనన్జేసియరుగు నటివా?
శక్రచాపము నీ వనజాల నేను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అలనిలింపనదీజల మాడువేళఁ
దీరమందున రతిదేవి యారవైచు
నేడు రంగులచీర వీ వేమొకాని
శక్రచాపము నీవనజాల నేను.

జాళువా తమ్మిపూవుల చాలునేలు
మేలిచదలేటి చెంగట మెఱయు చిత్ర
వర్ణసైకత సీమవై వఱలు దేమొ?
శక్రచాపము నీవనజాల నేను.

నందనవనాంతికస్థలమందు నెగడు
వివిధవర్ణ కుసుమచయ విరచితమగు
స్వాగతద్వార మీా వన వచ్చునెమొ?
శక్రచాపము నీవనజాల నేను.

అల్లమిన్నేటిసీటఁ బ్రయాణమునకు
నందనవనానఁ ద్రిమ్మరు నాకబాల
లేడు రంగుల పూవుల నేరితెచ్చి
తి విరిరచియించినట్టిపూఁ దెప్పవేమొ?
శక్రచాపము నీ వనఁజాల నేను.

భూమిజనుల లొనరుచు పాపపుణ్య చరిత
రచితమగు చిత్రగుప్తుని గ్రంథరాజ
పత్రమొండగు చీవు గన్పట్టుచుందొ?
శక్రచాపము నీవనఁజాల నేను.

అరయనస్తవ్యసన సమాయత్తమైన
భౌమజీవన చాంచల్య భావమనెడు
నేడు రంగులచిత్ర మీావేమొకాని
శక్రచాపము నీ వనఁజాల నేను.

ఆదితేజంబ వైనను నాదితేజ
భిన్నమటు దోఁచినను భ్రమపెట్టుచుండు
నీవు జీవాత్మ పరమాత్మ భావబోధ
క ప్రథితచిత్రరూపటీక వగుదేమొ?
శక్రచాపము నీ వనఁజాల నేను.

జీవహింస యొనర్చు నిశితవధోప
కరణములు గన నాకు దుఃఖంబుగలుగుఁ
గాని తత్సాధనాభిఖ్యవైనను నిను
గనినయంతనె కలుగు నఖండ ముదము.

ఆకతంబున నిన్ను వజ్రాయుధముగ
ననసహింపను—శాంతి చిహ్నంబ వందు
చల్లనౌ వానకును నీకు జరుగుచెలిమి
నెట్టులింక సమర్థింతు; నిదినిజంబు.

ఎన్నక నీదు తత్వ! మది
యేమని పిన్నతనంబునందునే,
గన్నుల విందుగాగ నినుఁ
గాంచితి; నేఁడు తదీయమోదభా
వోన్నతి వోయె మామకవ
యోగత తార్కిక బుద్ధిచేత; నా
పన్నుఁడనైతిఁ; గాని గత
బాల్య దశాస్మృతియయ్యె; ధన్యుఁడన్.

చాలును తార్కిక ప్రకృతి,
సచ్చిదనంతునిలీల లెన్నఁగాఁ
జాలవు, వానిసృష్టిని ని
జంబుగ నీవణువంత యొప్పు, నిం
కేల వృథాశ్రమంబు? సక
లేంద్రియ గోచర సర్వమాతఁ డం
చో లిభజింపు, మద్దిమె మ.
హోపకృతి న్బొనరించు మానవా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశ ఆర్థికస్థితి

చావలి వెంకట హనుమంతరావుగారు, యం. ఏ.

## 3

### కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల ఆర్థికసంబంధములు

ఇదివరకు ప్రచురింపబడిన రెండవ వ్యాసములో భారత కేంద్ర ప్రభుత్వమువారి ఆదాయమార్గములనుగూర్చి విచారించి యుంటిమి. ఇప్పుడు వారేవిషయములకై తమఆదాయమును ఉపయోగించుచున్నారో, ఆఉపయోగించుపద్ధతిలో ఏమేమి మార్పులు కావలెనో చూచెదము. ఇదివరలో చెప్పబడినట్లుగా ఇండియాగవర్న మెంటువారు చేయవలసినపనులలో ముఖ్యమైనది దేశరక్షణ. ఇదికాక పరదేశ వ్యవహారములు (Foreign affairs) ఇతరదేశములతో రాయబారములు మొదలైనవి జరుపుట, నాణెములను తయారుచేయుట, వాటిని సరియైన పద్ధతులపైనడుపుట (Currency Management) తమ అధికారముక్రింద నున్న ఇతర ప్రభుత్వశాఖలను సరియైన త్రోవలో నడచునట్లుచూచుచు వాటికి కావలసిన ఖర్చును పెట్టుట, ఇవికూడ కేంద్ర ప్రభుత్వమువారు చేయవలసినపనులే. వీటిలో మొదటిది రెండవది ఆపనులవలన ఏవిధమైనరాబడియు లేకుండగనే చేయవలసిన ఖర్చులు. అనగా వాటి నుండి ప్రభుత్వమువారికి వచ్చు ఆదాయము లేదు. మూడవది ప్రస్తుతకాలములో ప్రభుత్వమువారి యాజమాన్యమున నున్నప్పటికిని కొలదికాలములో ఏర్పాటు చేయబడనున్న సెంట్రల్ బ్యాంకు (Central Bank) లేక రిజర్వు బ్యాంకు (Reserve Bank) వారు చేయవలసిన పనియగును. నాల్గవది: తప్పనిసరియగు ఖర్చు. ప్రభుత్వశాఖలు సామర్థ్యముతో నడపబడవలెననిన వాటి నట్లునడుపుమనుష్యు లుండవలెను. కాన ఆఖర్చుపద్దు సంపూర్ణముగ ఎత్తివేయుట అసాధ్యము; వీలున్న యెడల అవకాశ మున్నప్పుడెల్లను అక్కడక్కడ తగ్గింపులను చేయవచ్చును.

మొట్టమొదట దేశసంరక్షణను గూర్చి ఆలోచింతము. దేశసంరక్షణకు కావలసిన ముఖ్యపరికరము సైన్యము, దానికి సంబంధించిన ఉపకరణములు. హిందూదేశమందు సైన్యముపై ఖర్చుఇప్పుడు ౫౫, ౬౦ కోట్ల రూపాయలమధ్య నున్నది. ప్రభుత్వమువారి ఖర్చుపద్దులలో ఇదియే ప్రధానస్థాన మాక్రమించుచున్నది. మనదేశ ఆర్థికపరిస్థితినిబట్టి సైన్యముపై ఇంతఖర్చు అనవసర మనియు, ఈ సైన్యము మనదేశపు లాభముకొరకు కాక ఇంగ్లండుదేశపు లాభము కొరకే ఏర్పాటు చేయబడినదనియు, ఈఖర్చులో 3 వంతులు బ్రిటిష్ సైన్యముమీదనే పెట్టబడుచున్నదనియు దానిని చాలవరకు తగ్గించుటకు ఆవశ్యకతకలదనియు మన దేశనాయకులు అనేక సంవత్సరములనుండి ప్రభుత్వమువారిని హెచ్చరించు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నారు. ఇండియా ప్రభుత్వమువారి ఖర్చుల విషయమై ఆలోచించి ఏయే శాఖలలో తగ్గింపులు చేయవలెనో సలహానిచ్చుటకై ఏర్పాటు చేయబడిన ఇంచ్ కేప్ కమిటీ (Inchcape Committee) వారు సైన్యముపై వ్యయమును ౫౦ కోట్ల రూపాయిలకు తగ్గించవలెననియు, అంత కన్న ఎక్కువ ఖర్చు అవసరము లేదనియు సూచించియుండిరి. సైన్యములో ఎక్కువగా హిందూదేశస్థులను పెద్ద ఉద్యోగములకు ఏర్పాటుచేయుటవలనను, హిందూదేశపు మిలిటరీఖర్చులో కొంతభాగము ఇంగ్లండు దేశమును భరించునట్లుచేయుటవలనను, ఇంగ్లండు దేశపుయుద్ధములలో పోరాడుటకు హిందూ దేశసైన్యములను పంపకుండుటవలనను, ఇంకను ఇతరములగు అవసరములగు మార్పులను చేయుటవలనను, మన దేశపు మిలిటరీవ్యయము (Military Expendiure) ౫౦ కోట్ల రూపాయల పరకేకాకుండ అంతకంటె తక్కువకు కూడ తగ్గించుట కవకాశము లున్నవి. ఈ విషయమై ఇచ్చట విస్తరించివ్రాయుట కవసరము లేదు. ప్రభుత్వమువారు సైన్యపుఖర్చును ఇంచ్ కేప్ కమిటీవారు సూచించిన ప్రకారము ౫౦ కోట్ల రూపాయలలోనికి తగ్గించుటకు పూనుకొనవలెను. అట్లు చేయుటవలన సంవత్సరమునకు ౫ కోట్ల రూపాయిలు ఆదాచేయవచ్చును.

ఇక ప్రభుత్వోద్యోగస్థుల జీతములను గురించి యోచించిన మనకు కన్పించున దేమనగా ప్రభుత్వమువారు పెద్దఉద్యోగస్థుల జీతములను వీలయినపుడెల్ల హెచ్చించుచునే యున్నారు. ౧౯౨౪ సంవత్సరములో ప్రభుత్వము వారిచే ఏర్పాటుచేయబడిన లీకమిషన్ (Lee-Commission) వారి సలహాపై అఖిల భారత ప్రభుత్వ శాఖల (All India Services) గు ఐ. సి. యస్., ఐ. డి. యస్. మొదలగు శాఖలలో ఉద్యోగీయుల జీతములన్నియు హెచ్చు చేయబడెను. ఈ హెచ్చు చేయుటవలన సంవత్సరమునకు ౬౦ లేక ౭౦ లక్షల రూపాయల ఎక్కువఖర్చును దేశీయులు భరించవలసివచ్చు చున్నది. ప్రభుత్వశాఖలపై ఖర్చు తగ్గించవలెనని ఎప్పుడు సూచింపబడినను ప్రభుత్వమువారు చిన్నఉద్యోగస్థులను తీసివేయుట, వారిజీతములను తగ్గించుటయే జరిగించుచున్నారు కాని నిజముగా దేశమును క్రుంగదీయుచున్న పెద్ద ఉద్యోగస్థుల జీతములను తగ్గించుటకు ప్రయత్నించరు. ప్రపంచములో ఏ ఇతర దేశమందు కూడ మన దేశములో ప్రభుత్వోద్యోగస్థుల కిచ్చునంత హెచ్చుజీతములిచ్చుచుండుట లేదను సంగతి ఎల్లరకును విదితమే. హైందవులను గొప్పఉద్యోగస్థులుగ విరివిగ తీసుకొనుటవలన ఖర్చుతగ్గిపోవుననుటకు సందేహము లేదు; కాని ప్రభుత్వమువారి ఇండియనైజేషన్ (Indianization) పద్ధతికి ఇంతవరకు సుముఖులుగా నుండుట లేదు.

ఇండియా ప్రభుత్వమువారి ఖర్చుపద్దులలో ముఖ్యమైన వేరొకటి జాతీయఋణమును పరిపాలించుట. మన దేశపుఋణము (National debt)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండువిధములుగ నున్నది; కొంతభాగముమన దేశమందు చేయబడినది; కొంతభాగము ఇంగ్లండునందు చేయబడినది.*౧౯-౨౦-౨౧ సంవత్సరపు లెఖల ప్రకారము ప్రభుత్వమువారు మన దేశస్థులవద్ద ౫ కోట్ల రూపాయలును, ఇంగ్లండు దేశస్థులవద్ద ౨౫౬ కోట్ల రూపాయలును అప్పుతీసుకొనియున్నారు. వీనిలో చాలభాగము దేశలాభమును చేకూర్చు పనులకు (Productive works) ఖర్చుపెట్టబడుట ఒక్కటియే సుగుణ సూచకము. ఇంగ్లండు దేశమునందు చేయబడిన అప్పుపై ప్రతి సంవత్సరమును సుమారు ౧౯ కోట్ల రూపాయిలు వడ్డీ మనము చెల్లించవలసి యున్నది. ఈ అప్పును తీర్చు విషయములో ప్రభుత్వమువారికి చాలకాలమువరకు ఒకపద్ధతియే యుండెడిది కాదు. మన దేశమునందు చేసిన అప్పుపైవడ్డీ ప్రతిసంవత్సరమును ఈయ నవసరములేదు కాని ఇంగ్లండు దేశమందుచేసిన అప్పుపైమాత్రము ఏసంవత్సరపువడ్డీ ఆ సంవత్సరమే చెల్లించవలసి యున్నది. కొద్దికాలములో తిరిగిఇచ్చివేయు పత్రములపై (Short term securities) ఆఅప్పు చాలభాగము చేయబడినదగుటచే అట్లు సంవత్సరము సంవత్సరమును వడ్డీ ఈయక తప్పదు. ఈ అప్పులో సుమారు అంతయు మన దేశపురైల్వేలను అభివృద్ధిచేయునిమిత్తము చేయబడినది. ఈరైల్వేల అభివృద్ధి ఎక్కువ ముఖ్యమా లేక వ్యవసాయమునకు పనికివచ్చు కాలువలు మొదలగు నీటి దారు లేర్పాటుచేయుట ఎక్కువ ముఖ్యమా యను విషయములు చర్చనీయాంశములై యున్నవి. కాని ఆచర్చ ఇచ్చట అనవసరము. ఏదిఎట్లున్నను మన దేశమునకు లాభములేని షరతులపై ఇంత అప్పును ఇంగ్లండు దేశములో చేయుపద్ధతినిమాత్రముఖండించవలసియున్నది. దీనికి జవాబుగ ప్రభుత్వమువారు మన దేశములో అప్పిచ్చువారు చాల అరుదుగ నున్నారనియు, ఇంగ్లండు దేశములో పుట్టినంత సులభముగ మన దేశములో అప్పుపుట్టదనియు చెప్పుచున్నారు. కాని వ్యవసాయపు కట్టడములు (Irrigation Works) మొదలగు వాటికి కావలసిన అప్పంతయు మన దేశములో వచ్చినదనియు, యుద్ధసమయములో 3 సంవత్సరములలో మన దేశస్థులు ౨౦ కోట్ల రూపాయలు అప్పిచ్చినసంగతియు, ఇతర సమయములలో మన దేశములో ప్రభుత్వమువారు సంపాదించిన అప్పుసంగతియు మనము జ్ఞాపకముంచుకొనిన, ప్రభుత్వమువా రీవిషయములో దేశమునకు ఎంత అరిష్టదాయకమగు విధానము నవలంబించుచున్నారో గ్రహించనగును. ఈనష్టదాయకమగు పద్ధతికి తోడుగా ప్రభుత్వమువారు ప్రజాప్రతినిధుల ప్రాతికూల్యమునుత్రోసిపుచ్చి రూపాయ మారకమును (Exchange) షిల్లింగు నాలుగుపెన్నులనుండి షిల్లింగు ఆరుపెన్నుల కెక్కువచేయుట వలన ప్రతి సంవత్సరమును సుమారు ౨౦ కోట్లరూపాయలకు పైగా మన

* ఆసంవత్సరములో జాతీయఋణమునుగూర్చియు దానిని తీర్చువిధమునుగూర్చియు ప్రభుత్వమువారుక్రొత్త విధానము నేర్పాటుచేయుటచే ఆసంవత్సరపు లెక్కలు తీసుకొనబడినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశపుసొమ్ము వడ్డీ రూపకముగ పరదేశస్థుల పాలగుచుండుట జరుగుచున్నది. యుద్ధానంతరమున ఈపద్ధతిలో కొంతవరకు మార్పుచేయబడినది. ౧౯౨౬ సం.లో ఏర్పాటు చేయబడిన External Capital Committee (పరదేశముల నుండి అప్పునుతీసుకొను విధానమును గూర్చి విచారణచేయుట కేర్పరుపబడిన సంఘము) వారుచేసినసూచనప్రకారము ప్రభుత్వమువారు జాతీయఋణమును వీలైనంతవరకు మన దేశస్థులవద్దనుండియే తీసికొనుటకేర్పాటుచేసికొనినట్లు మన మూహింపవచ్చును. ఇదికాక ౧౯౨౪ సంవత్సరపు ఆదాయవ్యయపట్టికపై చర్చసందర్భమున అప్పటి ఆర్థికమంత్రియగు సర్ బాసిల్ బ్లాకెట్ (Sir Basil Blackett) గారు అప్పును తీర్చువిషయములోకూడ నొకక్రొత్త సూత్రమును ప్రతిపాదించియున్నారు. దానిప్రకారము ఉన్నఋణము నుండి విముక్తి పొందుటకును, క్రొత్తఋణమును చేయుట కవసరము లేకుండునట్లును ప్రతిసంవత్సరమును ఆదాయము నుండి ౪ కోట్ల రూపాయిలు ప్రత్యేకించుటకును, అది కాక ౧౯౨3 సంవత్సరపుమార్చి నెలాఖరునాటికున్న అప్పుకుపైగా అయిన అప్పులో ౧/౮౦ భాగముకూడ అప్పుతీర్చుటకై ప్రత్యేకించుటకును తీర్మానించబడినది. ఈ తీర్మానములో కొన్నిలోట్లున్నమాట నిజమే; దానిని అప్పట్లో లెజిస్లేటివ్ అసెంబ్లీలో అనధికార సభ్యులు ఖండించినమాట కూడ నిజమే కాని, సర్ బాసిల్‌గారు చేసిన మార్పునందు కొన్నిలాభములున్నవనిమాత్రము ఒప్పుకొనకతీరదు. ఇక ముందు జాతీయఋణమును మనదేశమందే చేయుపద్ధతితో ప్రతి సంవత్సరమును మనము ఇంగ్లండు దేశమునకు చెల్లించవలసిన వడ్డీ మొత్తము కొంతవరకైనను తగ్గునను విషయమునకు సంతోషించవలసియున్నది.

క్రొత్తసంస్కరణములు ప్రవేశపెట్టబడిన తరువాత కేంద్రరాష్ట్రీయప్రభుత్వముల ఆదాయమార్గము లెట్లు వేరుచేయ వలెనో అట్లే ఖర్చు పద్దులు (Items of Expenditure) కూడ వేరుచేయవలసి యుండును. ఇట్లుసంపూర్ణముగ అధికారవిభజన కష్టమనియు, కొన్ని విషయములలో కేంద్రప్రభుత్వమువారికి చివర యాజమాన్యము (Final Authority) నిచ్చుట అవసరమనియు పన్నుల విచారణ సంఘము వారు తమ రిపోర్టునందు సూచించి యుండిరి. కాని అట్టి విభజనవిధానము నేర్పాటుచేయుట విషయమై ఆలోచనచేయుట ప్రాముఖ్య మని కూడ ఆకమిటీవారే వ్రాసియున్నారు. ఈ వ్యాసములలో చేయబడిన సూచన లీవిషయములో తోడ్పడునని తలంపవచ్చును.

రాష్ట్రప్రభుత్వ ఆదాయవ్యయములు

ఇంతవరకు భారతకేంద్రప్రభుత్వమువారి ఆదాయవ్యయ విషయములను గూర్చి ఆలోచించియుంటిమి. ఇకమీదట రాష్ట్రప్రభుత్వముల విషయములనుగూర్చి ఆలోచించెదము. ఇకముందు మనదేశమందు రాష్ట్రములన్నియు సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగియుండు నను ప్రధానసూత్రమును మనస్సునం దుంచుకొని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మన మీవిషయమై విచారణ ప్రారంభించ వలెను. రాజకీయ పరిపాలనా విషయములలో రాష్ట్రములు స్వాతంత్ర్య మెప్పుడుకల్గియుండు నో అప్పుడే ఆర్థికవిషయము లందు కూడ స్వాతంత్ర్యము కల్గియుండుననుట నిర్వివాదాంశము. ఆర్థిక విషయములలో స్వాతంత్ర్యము లేనిదే, అనగా పన్నులను విధించుటకును తగ్గించుటకును తీసివేయుటకును వాటిద్వారా వచ్చుసొమ్మును ఇష్టము వచ్చినట్లు ఖర్చుపెట్టుటకును అధికారము లేనిదే, రాష్ట్రీయ స్వాతంత్ర్యము వట్టిబూటకమే యగును.

రాష్ట్రప్రభుత్వము లికముందు ప్రజోపయుక్తములగు అనేక కార్యములు చేయవలసి యుండుననియు, ఆపనులను లాభము ఎక్కువ వచ్చునట్లుచేయుటకు కావలసినంత సొమ్ము ఆ ప్రభుత్వములవారి చేతులలోనుండుట అవసరమనియు ఇదివరలో చెప్పియుంటిమి. ఈ విషయమునుగూర్చి ఆలోచించునప్పుడు మన మొకసంగతి జ్ఞాపకముంచుకొనవలెను. హిందూదేశములో అన్ని రాష్ట్రములును ఒకేవిధముగ నుండక, వేర్వేరురాష్ట్రములు వాటివాటి ప్రజాబాహుళ్యము, పరిమితి, వృత్తులు వ్యాపారములు ఇతరవిషయములనుబట్టి వేర్వేరు పరిమితిగల ఆదాయవ్యయములు కలిగియున్నవి. ఈ విషయము ఒక ఉదాహరణము వలన తేటతెల్లమగును. మనమద్రాసురాష్ట్రముచాలభాగము వ్యవసాయము ముఖ్యవృత్తిగా గలవారున్న రాష్ట్రమై యున్నది. ప్రజలలో నూటికిముప్పాతికమంది వ్యవసాయము వలననే తమ జీవయాత్రను గడుపుచున్నారు. రాష్ట్రాదాయములో సగమువంతునకు పైగా భూమిపన్ను (Land Tax) నుండి వచ్చుచున్నది. ఈవిషయము లన్నిటినిబట్టి మద్రాసురాష్ట్రప్రభుత్వము వారు వ్యవసాయమునకును వ్యవసాయదారులకును ఎక్కువ సహాయకరములుగా నుండు పనులను చేయవలసియుండును. ఇంక బొంబాయి రాష్ట్రముసంగతి చూతము: ఆ రాష్ట్రములో పరిశ్రమలు ఇతరరాష్ట్రములలో కన్న అభివృద్ధి గాంచినవి; ముఖ్యముగబట్టలపరిశ్రమ (Textile Industry) అచ్చట వేళ్లుపాతుకొనియున్నది. బొంబాయి రాష్ట్రమువారి ఆదాయము చాలవరకు ఆదాయపుపన్ను (Income-tax) మూలముగ వచ్చుచున్నది. పరిశ్రమలకును వాటియందు పనిచేయు కూలివాండ్రకును సంబంధించిన విషయములందు ఆరాష్ట్రప్రభుత్వమువారు ఎక్కువ శ్రద్ధతీసుకొనవలసి యుండును. ఇట్లే ఇతర రాష్ట్రములందు కూడ ఆరాష్ట్రపరిస్థితులనుబట్టి ఆదాయ వ్యయములు నిర్ణయించబడును.

రాష్ట్రప్రభుత్వముల ఆదాయ మార్గములలో ప్రధానమైనవి భూమిపన్ను, అబ్కారీ పన్ను, కోర్టుస్టాంపులపై పన్ను, నీటి సప్లయి రుసుములు నై యున్నవి మనదేశములో చరిత్ర మొదలుపెట్టినకాలమునుండియుకూడ భూమిపన్ను చాల ప్రాముఖ్యము వహించి యున్నది. ఇప్పటికికూడ భూమిపన్నే చాల ఆదాయమునకు మార్గముగ నున్నది. ఈపన్నును విధించుటలో మొట్టమొదట ఆలోచించవలసిన విష



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము, ఆపన్నును చెల్లించువారికి దానివలన ఎక్కువ బాధగా నుండకుండునట్లును, దానివలన వ్యవసాయము సాగించుటకు వారి కభ్యంతర ముగా నుండకుండునట్లు నుండవలయు ననునది. భూమిపన్నును విధించుటలో వేర్వేరు రాష్ట్రములు వేర్వేరుపద్ధతుల నవలంబించు చున్నవి. బెంగాలునందును, బీహారుఒరిస్సా, సంయుక్త రాష్ట్రములయందును శాశ్వతపుసెటిల్ మెంటు (Permanent Settlement) అమలునం దున్నది. మద్రాసు, బొంబాయి, పంజాబు మొదలగు రాష్ట్రములలో అశాశ్వతపు సెటిల్ మెంటు (Temporary Settlment) పద్ధతి అమలునం దున్నది. శాశ్వతపు సెటిల్ మెంటు ప్రకారము రైతు ప్రభుత్వము వారి కీయ వలసిన పంటపాలు (Share of the produce from land) ఒక్కసారిగానే ఎల్లకాలమునకు ఏర్పాటు చేయబడినది. ఆపద్ధతి అమలునం దున్న రాష్ట్రములలో ప్రభుత్వము వారు భూమిని, జమీందారులకును తాలూకా దారులకును శాశ్వతపు హక్కులతో నిచ్చివేసి వారిభాగమును వారా జమీందారుల వద్ద నుండియే వసూలు చేసికొందురు. నిజముగా భూమిని సాగుచేయు వ్యవసాయదారులతో ప్రభుత్వమువారి కేవిధమైన సంబంధము లేదు. ఇంక అశాశ్వతపు సెటిల్ మెంటు పద్ధతిలో ప్రభుత్వమువారు సూటిగ రైతులతోడనే వ్యవహరించుచు వారివద్దనుండియే భూమిసిస్తును వసూలు చేసికొనుచున్నారు. అదియే కాక కొన్ని సంవత్సరముల కొకసారి (సాధారణముగ ౩౦ సంవత్సరములకు) క్రొత్తభూమి పన్ను ఏర్పాటుచేయుటకు, అనగా భూమిపన్నును హెచ్చించుటకు, తగ్గించుటకు కూడ, ప్రభుత్వమువారి కధికారము కలదు. కాని ప్రతి క్రొత్తసెటిల్ మెంటు సమయమునందును భూమి పంటలో ప్రభుత్వభాగమును హెచ్చు చేయుటకే ప్రభుత్వము వారును, వారి ఉద్యోగస్థులును ప్రయత్నింతురు కాని దానిని తగ్గింతు రనుమాట అసంభవము. ఈపద్ధతి ఏర్పాటైయున్న ప్రాంతములలో భూమిపన్నులు, వాటికి సంబంధించిన ఇతరవిషయములు ఆలోచించుటకును తగిన విధానము నమలు నందుంచుటకు ప్రభుత్వోద్యోగస్థులకే (Executive Officials) అధికారము కలదు కాని ప్రజాప్రతినిధులుగల శాసనసభవారి కేవిధమైన హక్కును లేదు. మాంటేగ్యు సంస్కరణములను విచారించుట కేర్పాటు చేయబడిన జాయింటుపార్లమెంటరీకమిటీ (Joint Parlaimentary Committee) వారు లాండు రివిన్యూ విషయములను నిర్ధారణచేయు అధికారము ఆయా రాష్ట్రములశాసనసభల, (Legislative Councils) కిచ్చుట సమంజసమనియు, వీలైనంత త్వరలో ప్రతిరాష్ట్రప్రభుత్వమువారును వాటిని చట్టరూపకముగ ఏర్పాటుచేయుటకు పూనుకొనవలెననియు సూచించియుండిరి. ఇప్పటికి పది సంవత్సరములయి సంస్కరణములు అమలునం దుండినప్పటికిని ఒకరాష్ట్రప్రభుత్వము కూడ అట్టి చట్టమును తయారు చేయుటకు ప్రయత్నము చేసియుండలేదు. ఈమధ్య బార్డోలీలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జరిగిన సత్యాగ్రహ సంరంభానంతరము ఈ విషయమై తీవ్రమైన ఆలోచనలు సాగుచున్న వనుటకు నిదర్శనములు కన్పించుచున్నవి. ఇండియా దొరతనమువారు కొన్ని మాసముల క్రిందట రాష్ట్రీయ ఆర్థిక-రెవెన్యూ శాఖల ప్రభుత్వసభ్యుల సమావేశము నొకదానిని పిలిచి దానియందు ల్యాండు రెవిన్యూవిషయమై చర్చ చేసియుండిరి. దానిఫలితము ఇంతవరకు ఏమియు తెలకపోయినప్పటికిని క్రొత్త సంస్కరణములు వచ్చినతరువాతనైనను ల్యాండు రెవిన్యూ శాఖ చట్టసమ్మతముగ జరుగునట్లు ఏర్పాట్లు చేయ బడునని ఊహింప వచ్చును. కేవలము ప్రభుత్వాధికారుల చేతులలోనే ఈఅధికార ముండు నంతకాలము రైతులు చెల్లించవలసినపన్నులు ఎక్కువ యగుట, న్యాయము జరుగకుండుట మొదలగు బాధలు తప్పవు. ఒక ముఖ్యవిషయము నీ సందర్భములో గమనించవలసి యున్నది: ఏరాష్ట్ర ప్రభుత్వము కాని ఇక ముందు భూమిపన్ను మూలముగ ప్రస్తుతము కన్న ఎక్కువఆదాయమును సంపాదింప దలంచుట నిరర్థకము. అట్లు భూమిపన్ను నెక్కువ చేయుట పైన చెప్పబడిన మూలసూత్రమునకు విరుద్ధము. ఎందువల్లనన, భూమి ప్రతిచోటను ఇప్పటికే ఎక్కువపన్నుల భారమును వహించుచున్నది. రైతులు దేశమందంతటను ఎక్కువ ఋణబాధితులై తమవృత్తి నుండి ఏ మాత్రమును లాభమును పొందలేకున్నారు.

భూమిపన్ను విషయమై ఆలోచించు నప్పుడు దాని సాధకబాధకములను గుర్తించుటపసరము. భూమిపన్ను శిస్తా, లేక పన్నా (Rent or Tax) యను విషయమై మనదేశమందు చాలకాలమునుండి ప్రబలుచున్న వాదప్రతివాదముల నిప్పుడు మన మెక్కువగ గణించవలసిన పనిలేదు. ఆవిషయమై ఇప్పటికైనను ఒక తెగింపునకు మన దేశస్థులు వచ్చిరని చెప్పుట కష్టము. ప్రభుత్వమువా రవలంబించిన పరిపాలనాకార్యక్రమమువలన భూమి ఎక్కువ సారవంతమై వ్యవసాయదారుల కెక్కువ లాభము కలిగిన,లాభములో ప్రభుత్వమువారు కూడ కొంతపాలును పుచ్చుకొనగోరుట సమంజసమని మన మంగీకరింపక తీరదు. కాని పాలు వ్యవసాయదారులు ఇచ్చుకోకలిగిన దానికన్న ఇప్పుడే ఎక్కువగా నున్నదనియు, దాని నెక్కువ చేయుదలంచుట అన్యాయ మనియు, వీలైన తగ్గించుటకు గాని,ఇతరమార్గములనుండి దానిలోటును పూర్తిచేయుటకు గాని అవకాశముల నరయుట అవసరమనియు గ్రహింపవలయును. ఈ సందర్భములో మన దేశమందు ఆర్థికశాస్త్రజ్ఞులు చేయు ఒక ముఖ్యసూచనను మరవకూడదు. ప్రస్తుతము భూమిపై వేయబడుచున్న పన్నును తీసివేసి పంటపై వచ్చు ఆదాయముపైన ఇతరరకముల ఆదాయముల పైవలెనే ఆదాయపుపన్నును వేయవలెనని ఆ సూచనయొక్క సారాంశము. ఈ సూచన సమంజసముగా నున్నట్లే కనుపించినప్పటికిని, దానిని దేశమున కంతకును సమన్వయింప జూచుట నష్టదాయకమును, అన్యాయమును అని ఒప్పుకొనక తీరదు. ఎందువల్లనన, మన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గాంధర్వి : (గీతము)

చిత్రకారుడు: శ్రీ ఆర్. నారాయణరావుగారు, రాజమండ్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశమందు నూటికి ౭౦ మంది (బెంగాలులో తప్ప) చిన్న వ్యవసాయదారులు; వారికి భూమిపై వచ్చు సంవత్సరాదాయము చాల తక్కువమై యున్నది. ఆఆదాయముపై ఆదాయపుపన్నును విధించుటకు ప్రస్తుతమున్న నిబంధనల ప్రకారమువీలులేదు.(౨,౦౦౦రూపాయలకు పైబడిన ఆదాయముల పైననే ఆదాయపుపన్ను విధింపబడుచున్నది.) మరియును, ఆపన్ను విధింపబడకపూర్వము కొన్ని ముఖ్యమైన సంగతులు గమనించవలసి యున్నది. ఒకటి: మొత్తంఆదాయములో కొంతభాగము పన్ను వేయకుండ వదలివేయవలయును. రెండు: ఎవరికి ఎంతపన్ను విధించవలెనో నిర్ణయించుటకు సాధారణముగ రెండుమూడు సంవత్సరముల ఆదాయమును లెక్కలోనికి తీసికొనవలెను. మూడు: ఒకఆదాయముపైననే రెండుచోట్ల పన్ను విధింపబడకుండ చూడవలెను. నాలుగు: పన్ను రేటును నిర్ణయించకపూర్వము ఆపన్నును భరించువారి జీవితస్థితి (Standard of living) సంపూర్ణముగ ఆలోచించవలెను. ఇప్పుడు భూమిపంట ఆదాయముపై యీపన్నును విధించవలెనన్న, ౨,౦౦౦ రూపాయిలకు తక్కువకాని ఆదాయములపై పన్నును వేయకూడదను నిబంధన ననుసరించి నూటికి ౭౦ మంది వ్యవసాయదారులు ఏవిధమైన పన్నును చెల్లించ నవసరము లేని పరిస్థితు లేర్పడును ఇట్లు ఇంత ఎక్కువప్రజాభాగమును వారు ప్రభుత్వమువారి వలన పొందుచున్న లాభములకు పన్నురూపకముగ ఏవిధమైన సహాయమును చేయవలసిన బాధ్యత లేకుండ చేయుట చాల అన్యాయము. దాని సారాంశము పన్నులన్నియు ౧౦౦ కి ౩౦ మంది మాత్రమే చెల్లించవలసియుండుసని.

ఇంతవరకును చేయబడిన చర్చవలన తేలినది, భూమిపన్నును తీసివేసి ఆదాయపుపన్నును వేయుట అశాశ్వతపు భూమిపన్ను ఏర్పాటున్నప్రాంతములకు సరిపడదని. ఇంక ఎవరివిషయములో ఈసూచన అనువదించునో చూతము. బెంగాలునందును, బీహారు ఒరిస్సారాష్ట్రమందును, సంయుక్తపరగణాల యందును శాశ్వతపుభూమిపన్ను ఏర్పాటు ౧౭౯౩ సం. లో చేయబడినదని చెప్పియుంటిమి. ఆ ఏర్పాటులో భూములు ఎక్కువఫలవంతము లైనవి. ఆదాయము ఎక్కువ వచ్చుచున్నది. జమీందారులు భాగ్యవంతు లగుచున్నారు, కాని రాష్ట్రాదాయములకుమాత్రము ఆభాగ్యములో రావలసిన పాలు వచ్చుట లేదు. బెంగాలు జమీందారులు ౧౭౯౩ సం.లో ఎంత పన్నును చెల్లించియుండిరో అంతపన్నే ఇప్పుడు కూడ చెల్లించుచున్నారు. ఇది చాల అన్యాయము; దానివలన ఇతరరాష్ట్రవాసులకు ఒత్తిడి ఎక్కువమై వారు ఎక్కువ పన్నులను చెల్లించవలసిన అవసర మేర్పడుచున్నది. ఈఅన్యాయమును సరిచేయుటకు రెండేమార్గము లున్నవి. ఒకటి: అచ్చటకూడ మద్రాసు, బొంబాయిరాష్ట్రములలో నున్నట్లు అశాశ్వతపు భూమిపన్ను ఏర్పాటుచేయుట; రెండు: జమీందారులకు భూమిపై వచ్చుచున్న ఆదాయముపై ఆదా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యపుపన్నును విధించుట. మొదటి సూచనను ఆచరణలోనికి తెచ్చుటకు చాల అసందర్భములున్నవి: పరిపాలనా దృష్టినుండి చాలకష్టము; రాజకీయముగ నష్టము కలదు. కాన ఇప్పుడున్నస్థితినే జరుగుబాటునం దుంచి దాని అన్యాయమును తగ్గించుటయే సమంజసము. దానికి రెండవసూచనయే విచారణీయము. జమీందారుల ఆదాయములపై ఆదాయపుపన్ను, ఆ ఆదాయము౫,౧౦౦౦ రూపాయిలకు ఎక్కువయైనచోట అదనపుపన్నులనుకూడ విధించుట లాభకరముగ నుండును. ఈపద్ధతికి జమీందారులుకూడ ఏవిధమైనఅడ్డును చెప్పుటకు వీలులేదు. దానివలన బెంగాలురాష్ట్రములో ఆదాయము ఎక్కువయగుటయే కాక, బీదప్రజలకు కష్టముగనున్న అనేకచిన్నపన్నులను,రుసుములను తగ్గించుటకు వీలగును. సుమారు 150 సంవత్సరముల క్రిందట సరియైన విచారణ, దూరాలోచన లేక ఏర్పాటుచేయబడిన ఒక గొప్పన్యాయవిరుద్ధమైనపనిని సరిజేయుట కవకాశము లేర్పడును.

ముందుభాగములో రాష్ట్రప్రభుత్వములకున్న ఇతర ఆదాయ మార్గములను గూర్చి చర్చించెదము.

---

## ఆంధ్ర ప్రశంస

కాళ్లకూరి గోపాలరావు గారు

అభినవ బ్రహ్మవిఖ్యాత విశ్వామిత్ర కులవార్ధిచంద్రు లాంధ్రులు దలంప;
మగధసామ్రాజ్య నిర్మాణదీక్షాదక్ష దోర్బలోపేంద్రు లాంధ్రులు దలంప;
సింహళాదిద్వీపచిరపాలనాఢ్య సాద్గుణ్యానిస్తంద్రు లాంధ్రులు దలంప;
బర్మాముఖాఖిల ప్రాగ్దేశ సౌభాగ్య ధుర్యామరేంద్రు లాంధ్రులు దలంప;
ధైర్యసాహసశౌర్య గాంభీర్యవీర్య-కలితచాతుర్యసాంద్రు లాంధ్రులు దలంప;
ఆంధ్రు లేవిధంబునఁ గన్న నగ్రగణ్యు;-లాంధ్రుల కసాధ్య మనున దీ యవనిఁ గలదె?

పరశురామక్షేత్ర భవ్య భాగ్యోదయోద్ధురులు నంబూద్రు లాంధ్రులు దలంప;
పుదుకోటసంస్థాన సదమల పాలనోజ్జ్వలకీర్తిమూర్తు లాంధ్రులు దలంప;
అద్వైతశైవ సిద్ధాంత ప్రతిష్ఠాపకులు పూజ్యపాదు లాంధ్రులు దలంప;
అఖిలశరణ్యవిద్యారణ్య ముఖ్యగురుప్రతిమాను లాంధ్రులు దలంప;
పాండురంగ తిక్కనముఖ ప్రాజ్ఞమంత్రి-కులవరేణ్యు లగణ్యు లాంధ్రులు దలంప;
ఆంధ్రు లేకీభవించి ప్రయత్నపడిన-నెల్ల దేశంబు లొకటిగ నేలఁగలరు!

['తిమ్మరుసు' నాటకమునుండి]

---

# "నేను హిందూదేశమున కేందుకు వచ్చితిని ?"

(సోదరి మీరాబాయి అద్భుత జీవితకథ)

మాగంటి బాపినీడుగారు, బి. యస్-సి. (కార్నెలు), యం. యస్-సి.
(కాలిఫోర్నియా), ఆంధ్ర సెనెటుసభ సభ్యుడు.

రవీంద్రుని శాంతినికేతనము భారతదేశములోని యాత్రాస్థలములలో నొకటి. వివిధజాతుల నాగరికత, వాఙ్మయము, కళలు చూచుటకు, చదువుటకు, పాండిత్యము సంపాదించుటకు, పరిశోధనచేయుటకు అవకాశము గల మహాసంస్థ విశ్వభారతి. ఇచ్చటకు వివిధదేశములనుండి, వివిధ రాష్ట్రములనుండి యెల్లపుడు పండితులు విజ్ఞానమును దెచ్చుచుందురు. ఇట్టి మహాసంస్థను సందర్శించు మహాభాగ్యము యెంతకాలమునుండియో కల్గుచున్నది. కలకత్తా కాంగ్రెసుకువెళ్లి శాంతినికేతనమున కొంత కాలము గడిపితిని. అప్పుడు సోదరి మీరాబాయిగారి ద్వితీయదర్శనభాగ్యము కలిగినది. మహాత్ముడు తమిళనాడుయాత్రముగించి బరంపురమునకు వెళ్లుచున్నపుడు మరునాడు మెయిలులో మీరాబాయి బరంపురము వచ్చుననియు, ఆమెను యేలూరు స్టేషనువద్ద కలుసుకొని పాలు, పండ్లు నందజేయుమని చెప్పెను. అట్లే మరునాడు రైలులో వెదుకగా నామె మూడవతరగతి స్త్రీల పెట్టెలో నుండెను. ఆమెదుస్తులు చూచిన నామె ఆంగ్లేయస్త్రీయని అనుకొనుటకు వీలు లేకుండెను. మూటలో నుంచి యొకచెంబుతీసి మేము యిచ్చినపాలు జాగ్రత్త పెట్టుకొని యుండెను. ఈచెంబునే శాంతినికేతనమునకు వచ్చినపుడు ఆమె స్వహస్తముతో తోముకొనుచుండెను. సాధనచే జీవితము నెట్లు లోబరచుకొనవచ్చునో యీ ఆంగ్లేయ వనితజీవితమే దృష్టాంతము. ఒకనాడు తనజీవితమునందలి పూర్వచరిత్ర, ప్రస్తుతపుమార్పు యెట్లుకలిగెనో చెప్పియుండెను. జీవితము రెండుభాగములుగా వర్ణించెను. ౧. యూరపుదేశమునందు ఒకకల. ౨. ప్రస్తుతము గాంధితో గడపుచున్న నూతనజీవితము.

ఈమె పూర్వాచారపరాయణులైన ఒక సామాన్యాంగ్ల కుటుంబమునకు జెందినపిల్ల. ఈమెకు చిన్నప్పుడు గుఱ్ఱపుస్వారియనిన మిక్కిలి యిష్టము. జీవితాదర్శమును గురించి మనస్సెప్పుడును స్థిరము లేకుండెడిది; పారమార్థిక



సోదరి మీరాబాయి

చింతలో మునిగి యేమియుతోచక యుండెడిది. శాంతి లేక కొట్టుకొనుచుండెడిది. ౧౫ వ యేట బెట్హోవెన్ యొక్క ఆస్ట్రేలియాదేశపు సంగీతము విని కొంచెము మనస్సున ఉత్సాహము కలిగెను. తండ్రి నాకాదళ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములో గొప్ప యుద్యోగి. అడ్మిరల్. తండ్రితోపాటు అనేక దేశములలో రేవుపట్టణములకు వెళ్లుచుండెను. ౧౫వ యేట లండనువెళ్లినప్పుడు ఆకాలపు నాగరికతయొక్క దుష్ఫలితములు మొదటిసారి చూడగలిగెను. ఎచటచూచినను అశాంతియే. ఆడువారి షోకులకు, వారి అలవాట్లకు అంతులేకుండెను. పేదవారికి సౌఖ్యములేదు. పేదరికము హెచ్చుచుండెను. ధనికులకు అనవసరములగు నలవాట్లచే వ్యయమెక్కువ యగుచుండెను. వారికి ఆదాయముకంటె ఖర్చెక్కువ యగుచుండెను. అందుచే వారికిని సౌఖ్యము లేకుండెను. తన మనశ్శాంతికై సంగీతముతో కాలమును పుచ్చుచుండెను. ఇంతలో యుద్ధమువచ్చెను. మనస్సు మరింత కలవరపడెను. నాగరికతయందు విశ్వాసము పూర్తిగా కోల్పోయెను. ప్రతి అవినీతికార్యమునకు గూడ యేసుక్రీస్తుపే రుపయోగించుచుండెడివారు. యుద్ధము మరింత నిరాశను హెచ్చించెను. మనశ్శాంతికై సంగీతము నేర్చుకొనుచుండెను. ఫ్రెంచిభాషను నేర్చుకొన మొదలుపెట్టెను. ప్యారిస్ వెళ్లి ఫ్రెంచిభాష నభివృద్ధిచేసికొనెను. రోమెయిన్ రోలెండు స్విడ్జర్లాండులో నుండునప్పుడు ఆయనను చూడవలెనని యొకజాబు వ్రాసెను. ఆయన స్వహస్తముతో జాబువ్రాసిరమ్మనియాహ్వానించెను. రమ్మని యాహ్వానించిన పిమ్మట ఆయనను కలసికొనెను; అప్పటికి హిందూదేశమును గురించి యేమియు తెలియదు. ౧౭వ యేట హిందూదేశమునకు వచ్చెను. అప్పుడు పెద్దపెద్ద ఉద్యోగస్థులను, మహారాజులను, రాణీలనే చూచెనుగాని, అసలు హిందూదేశమును చూచియుండలేదు. రోమెయిన్ రోలెండు వలననే హిందూదేశమునుగూర్చి మొదట తెలుసుకొనెను. ఆమెజీవితమోక్షమార్గము రోమెయిన్ రోలెండు వలననే వచ్చుననియు, లేనిచో ఆత్మనాశనమేయని గాఢముగా నమ్మియుండెను. ఆయన అత్యాదరముతో నాహ్వానించియుండెను. కాని స్లేడుకన్య హృదయమును విప్పలేక నిరాశజెంది స్వగృహమున కేగెను. ఇట్టి నిరుత్సాహముతో ఉన్నపుడు రోమెయిన్ రోలెండునుంచి మనసు విప్పిమాట్లాడుటకు రమ్మని, మరియొక ఆహ్వానము వచ్చినది. ఈసారి వెళ్లినప్పుడు- మనస్సు విప్పిమాట్లాడగలిగినప్పుడు-కొంచెము మనశ్శాంతి గలిగెను. అప్పుడు గాంధినిగూర్చి తానువ్రాసిన పుస్తకమునుగూర్చి చెప్పెను. గాంధి పేరు క్రొత్తగా ఉండెను. రోమెయిన్ రోలెండు గాంధిమహాత్ముడు ఈకాలపు ఏసుక్రీస్తని చెప్పినపుడు గాంధి తనకు ముక్తిదాత యగునని యామె యనుకొని యుండలేదు. ఇంటికి వచ్చినపిమ్మట తృప్తి, మనశ్శాంతి కలిగెను. తండ్రితోపాటు యీజిప్టుకు వెళ్లెను. అచట గాడిదలమీద ప్రయాణము చేసెను. రెండు మూడునెలల పిమ్మట ప్యారిస్ పట్టణమునకు మరల వచ్చెను. అప్పుడు రోమెయిన్ రోలెండ్ వ్రాసిన గాంధిజీవితము కొని పెక్కుసార్లు పఠించెను. గాంధిజీవితము అశాంతి, అసంతృప్తి కలవరములతో నిండియున్న తనజీవితమునకు నూతనజ్యోతి యయ్యెను. తుపానులో కొట్టుకొనుచున్న ఓడకు ఒక లైటుహౌసు అయ్యెను. గాంధి మహాత్ముని దర్శించి ఆయనకు సేవచేయుటకు నిశ్చయించి అట్టి అర్హతకు ప్రయత్నముల నారంభించెను. ఆయన గ్రంథము లన్నియు మరలమరల పఠించెను. జీవితము, భోజనము, క్రమముగా మార్చివేసెను. ఇట్లు సిద్ధముగానుండుట కొకసంవత్సరము సాధన చేసెను. ఇంతలో మహాత్ముని తీవ్రోపాసనము వచ్చెను. అప్పటి ప్రజలు గాంధి చచ్చిపోయిన చూతమని మురియుచుండెడివారట. ఈభక్తురాలు అదిసహింపలేక పోవుచుండె. గాంధి చనిపోవునని నమ్మలేకపోయెను. గాంధిమీద భక్తి హెచ్చెను. రోమెయిన్ రోలెండుగారిని కలుసుకొని ఆశ్రమమునకు వెళ్లుటకు నిశ్చయించుకొనినట్లు చెప్పి గాంధిగారికి వ్రాసెను. ౧౯౨౫ ఆగస్టులో రమ్మని గాంధిగారు వ్రాసెను. ౨౫ అక్టోబరున ఓడకు ప్రయాణమాయెను. అప్పుడు రోలెండ్ యిట్లు చెప్పెను. "నీ వెంత అదృష్టవంతురాలవు! ఆధునికుడగు ఏసుక్రీస్తునొద్దకు వెళ్లుచున్నావు! నీ వెంత అదృష్టవంతురాలవు! నీవెంత అదృష్టవంతురాలవు!" లండనువెళ్లి తనవద్దనున్న వస్తుసామగ్రినంతయు తల్లిదండ్రుల కిచ్చి సెలవుతీసుకొనెను. ఆంగ్లేయస్త్రీ కుండవలసిన వస్తుసామగ్రి ఏమియు లేక పుస్తకములతో మాత్రము బయలుదేరి నవంబరు 2-వ తేదిన తనజీవితాదర్శమగు సబర్మతీ చేరెను. సర్దార్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పటేలు స్టేషనునకు వచ్చి కలుసుకొనెను. గాంధి 'ప్రియమైన బిడ్డా! ర'మ్మని కౌగిలించుకొనెను. అప్పటి నుంచియు గాంధిమహాత్ముని "నీవేతల్లివి; తండ్రివి; గురుడవు; ముక్తిదాయకుడ"వని నమ్మియుండెను. అప్పటినుండియు గాంధి తల్లియై తండ్రియై గురువై ముక్తిదాయకుడై యుండెను. మిస్సుస్లేడు మీరాబాయి సోదరిగా మారెను. ఆ తేదీనుండి ఆమెకు నూతనజన్మ. ఆకారము మారెను; ఆచారములు మారెను; ఆత్మమారెను; గౌను టోపీ మేజోళ్లు బూట్సులు ధరించు గొప్ప ఎడ్మిరలు కూతురు, ఆంగ్లేయనారి, సాధారణజీవిరియై, లోకోత్తర పురుషుని పెంపుడుకూతురై, శిష్యురాలై, హైందవనారీమణియై గొప్ప సాధకురాలయి మనసోదరి మీరాబాయియైనది. పునర్జన్మ ఎచటనో యుండు ననుకొందుముగాని, కండ్ల ఎదుట నీదృష్టాంతము కన్పడుచున్నది. మిల్టను "We can make hell of heaven, heaven of hell" "నరకముస్వర్గముగాను, స్వర్గము నరకముగాను చేసుకొనుశక్తి మనలోనున్న"దనెను. అది ఈమెకు వర్తించుచున్నది. యూరపు దేశములో తాను జన్మించినందుకు ఏదో పాపము చేసి యుంటినని యనెను. భాగ్యభోగ్యములు తండ్రి ఉన్నతోద్యోగి అనుటవల్ల అధికారబలము, తెల్లజాతికి చెందుటవల్ల జాత్యహంకారము, ఆధిక్యము అన్నియు ఉన్నను శాంతిలేక పోయెను. ముక్తిమార్గము కానరాదాయెను; కాని సబర్మతి ఆశ్రమము, తండ్రిగాంధి, మాతృదేశము హిందుస్థానము, స్వర్గమువలెనుండె. జీవనము ధన్యమగుచుండె. ఆశ్రమమునందు తనకు నౌకర్లులేరు. తెల్లవారు, మనలో కొందరు "Live to eat" తినుటకొరకే బ్రతుకు-అట్టి అలవాటులోనున్నను – "Eat to live"– ఆహారమెంత అవసరమో అంత తిన ప్రారంభించెను. పూర్వాచార బ్రాహ్మణ వితంతువువలె కేశఖండనము గావించెను. రాట్నము చేతబట్టెను. గాంధిమహాత్ముని పాదపూజ చేయుచు, గీతాపఠనము చేయుచుండెను. ఆశ్రమమున మొదటి సంవత్సరము, ఆత్మోన్నతికివలయు ఉపదేశములు, పఠనము పొందుచుండెను. రెండవ సంవత్సరము హిందీ పాండిత్యమును సంపాదించెను. మూడవసంవత్సరము ఏకులు చేయుటలో నూలువడకుటలో ఆరితేరెను. ఇట్లు మూడు సంవత్సరములు ఆశ్రమమునందు సుశిక్షితురాలైన పిమ్మటనే సేవచేయుటకు అర్హురాలై బయలుదేరెను. దేశసేవచేయువారు ఈమెవద్దనుండి ఎంతసుగుణపాఠము నేర్చుకొనవలసియున్నది! మూడు సంవత్సరములు తాను శిక్షపొంది అప్పుడు బయలుదేరెను. హిందూదేశమునకు వచ్చిన పిమ్మట ఎచటను ఉపన్యాసములు యిచ్చియుండలేదు. ఇదియే ప్రథమము కార్యదీక్షమెండు. రాజపుటానాయందు స్త్రీలలో ఖద్దరు ప్రచారమునకై గాంధిగారు పంపియుండిరి. అచట ఒంటెలమీద నెక్కి గ్రామములు తిరుగుచూ రాట్నములు పెట్టుచూ సేవ చేయుచుండెను. మాతృదేశమునకు కావలసినది ఇట్టి నిజసేవకులు. స్వామి వివేకానంద ఒక ఆంగ్లవనితను ఆకర్షించగల్గి ఆమె జీవితము మాతృదేశమునకు సమర్పించు నట్లు చేయగల్గెను. ఆమెకు హిందూదేశము ముక్తినిచ్చెను. ఆమెజీవితము హిందూదేశమున కిచ్చెను. ఆమె చిరపరిచితయగు సోదరి నివేదిత. మరల గాంధి సోదరి మీరాబాయిని ఆకర్షించెను. ఆమెకు హిందూస్థానమె స్వర్గ మనుకొనెను; గాంధియే మోక్ష మనుకొనెను. అందులకు ఆమె పవిత్రభారత భూమికి ఆత్మార్పణము చేయుచున్నది. ఆంగ్లేయు మహాశయుడు ఇట్లే తనవిజ్ఞానము, శక్తి, సర్వస్వము మన మాతృదేశమునకు ధారపోయుచున్నాడు? ఓహో, మాతృదేశముక్తికి కేవలము భారతీయులుగాక విదేశీయులు గూడ ఎట్లు ప్రాణములు అర్పించుచున్నారు! ఇంకెంత మంది ఎంతకాలము ఇట్లు ఆత్మార్పణము చేయవలెనో!! ఎంతకాలమైనను ఎంత అయినను తప్పునా!!!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri










తలిశెట్టి
రామారావు.

నాటకానికి వెళ్లివచ్చాను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మైసూరి యాత్ర *

సీరిపి ఆంజనేయులు గారు

అనంతపురమున రాయలసీమ కళాశాలాభవనము

(ప్రవేశము : యస్. సావిత్రమ్మ—కే. నారాయణమ్మ)

నారాయణమ్మ—

అక్కా! మైసూరి యాత్రాసందర్భమున మనముచూచి వచ్చినస్థలములు మఱవవలయు ననుకొనినను మఱపునకు రాకయున్నవి. స్వప్నములయందు సయితమచ్చటివి శేషము లేపాడఁ గట్టుచున్నవి:

సీ. తిలకించితిమి గదా తులలేని మందిరా
 ప్తినిఁ గడుఁబొలుపారు బెంగుళూరు
కాంచినారముగదా కమనీయసౌరభా
 న్వితమగు 'నైట్ లేడి'సతులచేడి
నరసినారముగదా యభ్రచుంబిత తరు
 ప్రతతికిధామ మారామసీమ
వీక్షించితిమిగదా వివిధార్థగణ సమా
 శ్రయము వస్తుప్రదర్శన గృహమ్ము
సుందరోద్యాన వీథుల సొబగునెంచి
దివ్యహర్మ్యవాటికల పొందిక గణించి
వివిధవస్తు విక్రేతల విభవ మరసి
తనిసితిమి మయిసూరి యాత్రను దలిర్చి.

సావిత్రమ్మ—

ఔను—చెల్లెలా! నీవు వర్ణించిన వన్నియును బెంగుళూరునఁ జూచిన విశేషములే. అంతియకాదు. ఇటువినుము:

సీ. చూచియుంటిమి గదా సుభటరక్త నిషిక్త
 రంగవేష్టితము శ్రీరంగపురము
చొచ్చియుంటిమిగదా సురపదమ్మునకు మే
 ల్జాడ యాటిప్పుసుల్తాను మేడ
పరికించియుంటిమి పాతాళమున యంత్ర
 జాలాత్మకము విద్యుదాలయమ్ము
ప్రాఁకియుంటిమిగదా నాకలోకమునకు
 వెలిమెట్లుగట్టు కావేరిగట్టు
కోట గవఁకుల నెక్కి, శృఙ్గాటకముల
నరసి, కన్నమబాడి పెన్దరిఁ జరించి,
కమలగంధాక్తవిమలపూరములఁ గ్రుంకి
సల్పియుంటిమి శ్రీరంగశాయి సేవ.

(ప్రవేశము: ఎ. కమలాబాయి)

కమలాబాయి—

మీ సంభాషణ మధ్యమున నడ్డువచ్చుచున్నందులకు నన్ను క్షమింపుఁడు. నేను మీ వాక్యములను శ్రద్ధాభక్తులతోడ వినుచుంటిని. మీరు వచించిన క్రమము సరిగనే యున్నది గాని, శివసముద్ర జలపాతమునుండి మరలిన వెనుక, మైసూరువెళ్లినపిమ్మటఁగదా కన్నమబాడి యానకట్ట చూచినది? మీరీయానకట్టను గూర్చి నుడువుటకు ముందు, మైసూరి నగరమును వర్ణింపవలసి యుండెను. మీరు మీ వాక్యధోరణిలో ముఖ్యమైన దగు మైసూరిని గూర్చియే చెప్పమానితిరే!

---

* ఇది శ్రీ రాజకీయోన్నత బోధనాభ్యాసనమహిళాపాఠశాలా వార్షిక పారితోషిక ప్రదానోత్సవ (16-వ నవంబరు 1929) సమయమునఁ దత్పాఠశాలాయువతులు గావించిన సంభాషణము. —సీ. ఆం.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారాయణమ్మ—

నీకనియే వదలినారము. దానిని నీవు పూర్తిచేయవచ్చును.

కమలాబాయి—

నాకట్టి యవకాశ మిచ్చినందుకు నేను మీయెడఁ గడుఁ గృతజ్ఞను; కాని యానగరావతంసమునుగూర్చి వర్ణింప నా కెట్లు సాధ్యమగును? అందు—

సీ. రమకు నక్షత్రహారము సమర్పించు బి
త్తరియనఁ జాముండి గిరి రహించు
దైత్యారికైన రత్నాలకిరీటం బ
నంగ మహారాజు నగరు పొనరు
శతశిల్పి మయున కంచితధామ మోయన
నల జగన్మోహినీనిలయ మలరు
దివిజేంద్రుకొలకునై భువిఁబొల్చు కామ్యనం
దనమనఁ బ్రమదావనమ్ము తనరు
ఇది యది యటంచు వేర్వేఱ నెంచినుడువఁ
గలమె? నగరము సర్వశృంగార యుతము;
విజయదశమిని మైసూరివిభవ గరిమఁ
గాంచవలెఁగాని వర్ణింపఁగ ల్గ దరంబె;

నారాయణమ్మ—

ఈసందర్భమున నే నొకవాక్యము మనవి చేయకుండఁజాలను.

సావిత్రమ్మ—

నిశ్శంకఁగఁ దెల్పుము. సభ్యులును వినఁ గుతూహలులయి యున్నవారు.

నారాయణమ్మ—

గీ. చెలులు కూపస్థ మండూకముల విధానఁ
గడపఁదాఁటకయుంట యుక్తమ్ముగాదు;
తమకుమిగులు కాలముసృష్టితత్త్వమరయఁ
గడపి, లోకవిజ్ఞానమ్ము వడయు టొప్పు.

సావిత్రమ్మ, కమలబాయి—

సత్యము-సత్యము.

(ప్రవేశము: ఎ. సావిత్రమ్మ)

సావిత్రమ్మ—

(సభవంకఁ జూచి) మా యీయువతులు మైసూరియాత్ర సల్పివచ్చినపిమ్మటఁ, దామందందుఁ గాంచిన సుప్రసిద్ధప్రదేశముల నన్నింటి నొక్కొకటిగ నభివర్ణించుచు, నాంగ్లమునను నాంధ్రమునను మన కీవఱకే వినిపించియుండిరి. నేఁటి యీసంభాషణమువలన నావిషయములను వీరు మరల స్మృతిపథమునకుఁ దెచ్చి, మనలఁ బ్రమోదమగ్న మానసులఁ గావించియున్నారు. వీరి యిట్టి యాదరంపుఁగల్మికై వీరలయెడ మనము మన కృతజ్ఞతను దెల్పుట యావశ్యకము. (రంగమువంకఁ జూచి)

సీ. భారతమాతకుఁ బైఁట చెఱంగుగాఁ
బరగెడు మైసూరి పురవరమున
విజయదశమిఁబొల్చు విభవోన్నతులనుసం
దర్శించి వచ్చిన ధన్యలార!
మీ వాక్యఫణితిచే మేమెఱుంగఁగనయ్యె
బెంగుళూరైఱఁగు, శ్రీరంగనగరి
చెలువు, గన్నమబాడి కలరూపు,శివసము
ద్రంపు ఝరీప్రవాహంపు సొంపుఁ
గీ. గాన, మీవిహారశ్రమకారణమునఁ
గల్గె మాకు సద్విషయక జ్ఞాన, మిట్టి
కతన, మేముచూపెదుగృతజ్ఞతఁగొనుండు;
చందురున కగు నూల్పోగు చందమునను.

(అందఱు నిష్క్రమింతురు.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆకస్మిక ఛాయాచిత్రములు

## (SNAP SHOTS)



'అమ్మయ్య! లేచాను' (మొదటి బహుమానము)

శ్రీ పి. వి. సుబ్బరావుగారి చిత్రము



'బూచి' (మూడవ బహుమానము)

శ్రీ పి. భూపతినాయుడుగారి చిత్రము




'ఊరేగింపు' (రెండవ బహుమానము) శ్రీహరి శేషగిరిరావుగారి చిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. శివసముద్ర జలపాతము (వానకాలమున)

శ్రీ బి. సుబ్రహ్మణ్యముగారొసగిన చిత్రములు.



౨. శివసముద్ర జలపాతము (ఎండకాలమున)



త్రిమతకూటము

శ్రీయుత పహాబుద్దీను చిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఇంద్రశబ్దనిర్వచనము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

ఇంద్రశబ్దము అనేక విశేషార్థములు కలది. ఋగ్వేదమందలి యీశబ్దమునకు యాస్కుఁడు మొదలగు పూజ్యులు నిరుక్తాదులందు చూపిన యనేకనిర్వచనములను సాయణాచార్యులవారు ఋగ్వేదభాష్యమునఁ దెలిపి యున్నారు. భారతీపాఠకు లానిర్వచనముల విశేషమరయుదురు గాక.

(౧) ఇరాం=అన్నమును, దదాతి=సృష్టినిష్పాదనముచే నిచ్చువాఁడు ఇంద్రుఁడు. (౨) ఇరాం=తృప్తికారణమైన సస్యమును, దధాతి=జలప్రదానముచేఁ బోషించువాఁ డింద్రుఁడు. (3) ఇరాం = అన్నము నిమిత్తము, విదారయతి = కర్షకముఖమున భూమిని దున్నువాఁడు. (౪) ఇరాం = అన్నమును, ధారయతి = నాశరహితముగా నిలుపువాఁడు. (౫) ఇందుం = సోమవల్లీ రసమును గూర్చి, ద్రవతి = యజ్ఞభూమికిఁ బరుగెత్తువాఁడు. (౬) ఇందౌ = సోమరసమందు, రమతే=క్రీడించువాఁడు. (౭) ఇంధఇతీంద్రః, అనఁగా, ప్రాణిదేహములందు చైతన్యరూపమునఁ జొచ్చి వానిని ప్రకాశింపఁ జేయువాఁడు.

పైవానిలోఁ గడపటి నిర్వచనమును వాజసనేయులు గూడఁ జెప్పుచు, సర్వేంద్రియాధిష్ఠాన పురుషరూపుఁడై జంతుదేహములను ప్రకాశింపఁ జేయువాఁడగుటచే నితఁడు, ఇంధుఁడయ్యె ననియు, ఇతనినే ఇంద్రుఁ డనుచున్నారనియు వివరించిరి

మఱికొన్ని బ్రాహ్మణాంతరములలో నిట్లున్నది: పరమాత్మరూపుఁడైన యీ దేవుని ప్రాణములతోను, వాగాదీంద్రియములతోను . గూడిన వానినిగా నుపాసకులు ధ్యానించుచు ప్రకాశింపఁ జేయుచున్నారు కావున నితని కింద్రనామము సంపన్నమైనది— ఈపక్షమున (8) ఇధ్యతే=దీప్యతే, అని కర్మార్థకవ్యుత్పత్తి చెప్పవలెను.

ఆగ్రయణనామక మునీంద్రుఁడు (9) ఇదం కరణాదింద్రః—అని చెప్పెను. అనఁగా, పరమాత్మరూపుఁడయిన యితఁ డీజగత్తును జేయుటచే నింద్రుఁడయ్యె ననుట. ఔపమన్యవముని, (10) ఇదందర్శనాదింద్రః— అని నిర్వచించెను. అనఁగా, వివేకముచే, ఈ యపరోక్షమైన పరబ్రహ్మమును జూచుచున్నవాఁ డనుట. దీనిని గూర్చి, ఆరణ్యకమున నిట్లున్నది. (11) ఇదమదర్శమ్. సమస్తజగద్రూపమున వ్యాపించిన యీ పరమాత్మను నేను జూచితిని. అందుచే నితఁడిదంద్రుఁడను పేరుగలవాఁడయ్యెను. ఇతనినే ఇంద్రుఁ డను చున్నారు—

మఱికొందఱు (12) ఇది పరమైశ్వర్యే—ఇది ధాతువునుబట్టి, స్వమాయచే జగద్రూపమైన పరమైశ్వర్యముగలవాఁ డింద్రుఁడనిరి. ఇఁకఁ గొందఱు, ఈశ్వరవాచకమైన (13) 'ఇన' శబ్దములోని అకారమును లోపింపఁ జేసి, దానికి దృధాతువును—ద్రుధాతువునుగూడఁ జేర్చి, ఇంద్రశబ్దనిష్పత్తి గావించిరి. అపుడు శత్రువులను భయపెట్టువాఁడనియు, శత్రువులను బరుగెత్తించువాఁ డనియుఁ గ్రమముగా నర్థములగును. ఇట్లే ఇంద్రశబ్దమునకింకను అనేక నిర్వచనములు కనఁబడుచున్నవి.

పైవానిలో 12-13-సంఖ్యలుగల వ్యుత్పత్తులు మాత్రము లౌకికములు. తక్కినవన్నియు వైదికములు. అందును, మొదటి నాల్గును, ఇంద్రుఁ డాహారపదార్థముల కాధారభూతుఁడైన వర్షాధిష్ఠాన దేవతయనియు, కృష్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధిష్ఠాన దేవతయనియు దెలుపుచున్నవి. 5-6-వ్యుత్పత్తు లతనిని యాగమునకుఁ బ్రధానదేవతఁగా నిరూపించుచున్నవి. 7-8-9-వ్యుత్పత్తులు సకలజంతు సంతతియందును చైతన్యరూపమునఁ బ్రవేశించిన పరమాత్మయే యింద్రుఁడను భావమును సూచించుచున్నవి. 10-11-నిర్వచనములు, సకలజగత్కారణమైన పరబ్రహ్మము వేఱనియు, అపరబ్రహ్మమును దొలుతఁ జూచినవాఁ డింద్రుఁడనియుఁ జెప్పుచున్నవి.

కాలక్రమమున మాఱుచువచ్చిన పైవ్యుత్పత్తుల యర్థములను బరిశీలింపఁగా, సత్యాన్వేషణ తత్పరులును ఆధ్యాత్మిక జ్ఞానపారంగతులు నగు నార్యుల విజ్ఞానము క్రమక్రమముగా నెట్లు వెల్లివిరిసినదో దెలియఁగలదు.

---

## రహస్సుధ

కొల్లూరు ధర్మరాయకవి గారు, బి. యే.

నీ తొడపై శిర స్సునిచి నే నిదురింతును గాఢ తామసీ
శీతలఫాల సీమపయి చెమ్మటగ్రమ్మ పయంట కొంగుతో
నీతలిరాకుఁగేల మృదు నిస్వనితం బగు గాలి వీవ నా
యీ తను వెల్ల కన్నులుగ నీక్షణఁ జేతును నిన్ను బ్రేయసీ.

మెల్లగ రమ్ము గాఢపు తమిస్రముఁ జీలిచి కొంచు నాయెదన్
తల్లడిలంగఁ జేయుము సుధా మధురాంగి! యొకళ్లొకళ్ల కౌఁ
గిల్లఁ బెనంగి యీజగతికిన్ తుడపల్కు వచింత మింత శో
పిల్లిన యీ రహఃప్రణయ జీవుల యొక్క మధుక్షణంబునన్.

నీ దృక్పాతము నీలి మబ్బు వలెనా నిర్నిద్ర చేతంబు నా
చ్ఛాదింపగ పులకింతు నిల్వున; మృదుస్పర్శా సుఖాకాంక్షమై
నా దేహంబును నీదు బాహుయుగ బంధంబందు బంధింప, ఛా
యాదేవీ! నశియింతు స్వప్నగత మాయామూర్తినై నీ యెదన్.

ఒక నిసివేళ నా తనువునుండి బయల్వడి పోయినాఁడ ప్రే
మకొఱకు చేయి చాఁచుకొని స్వప్నపు చీఁకటులందు నంధభి
క్షుకుని విధాన, నో ప్రణయసోదరి! యాఁకొనియున్న నీ హృదం
తికపు కవాటముల్ దెఱచితి కనుఁగొంటి సుధాతి థేయమున్.

ఈ మధుమాసశర్వరి యిదేగతి వేకువ లేక కాలవి
శ్రామముదాఁక నా పరిసరంబున నుండును నీలిరేకమై,
ప్రేమసుధాక్షుధార్తిని తపించిన యీ హృదయద్వయిన్, నిశా
కామిని! జంటగట్టుదము కన్నులకాటుక దిద్దు చీఁకటిన్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కవి-వైదికసాహిత్యము

అనువాదకుడు, పల్ల వెంకటశాస్త్రి, (రామకృష్ణసమితి)

(వేదతీర్థ, నరదేవశాస్త్రి, సుధాబిందు.)

కవి శబ్దము అత్యంత ప్రాచీనమైనది. ఇయ్యది వైదిక సాహిత్యమందు అనేకపర్యాయములు వచ్చుచున్నది. ఋగ్వేదములో యేడువిభక్తులయందును యీపదము వాడబడినట్లు అనేక ప్రయోగములు కానవచ్చుచున్నవి. అందీపదము తరచు దేవతలకు విశేషణపదముగా వాడబడినది. వైదికసాహిత్యమందు కవిశబ్దము విద్వాంసుడను అర్థమందును విశేషముగా క్రాంతిదర్శియను అర్థమందును అనువర్తించుచున్నది. కవయఃకస్మాత్ దూరదర్శినోభవంతి, (నిరుక్త) కవియని ఎందుకు చెప్పుచున్నారు? క్రాంతిదర్శి యగుటచేతనే. అనగా దూరదర్శి యగుటచేతనే. ఈ కవిశబ్దము ఉపనిషత్తుల యందుకూడ అనేకమారులు వచ్చియున్నది. అందీపదము ఈశ్వరుని కొరకే ప్రయుక్తమగుచున్నది. రానురాను యీ కవిశబ్దము లౌకిక సాహిత్యములోనికి రాగానే ఋగ్వేదమందును, ఉపనిషత్తుల యందును యేఅర్థమున వాడబడుచున్నదో అట్టి అర్థము శూన్యమైనది. కవిశబ్దము ఋగ్వేదమందు,

| | | | | | |
|---|---|---|---|---|---|
| కవయః | ౭౦ | మార్లు | కవినా | ౨ | మార్లు |
| కవయే | ౮ | ,, | కవిప్రశస్థః | ౧ | మార్లు |
| కవిసఖః | ౧ | మారు | కవిభిః | ౯౬ | మార్లు |
| కవిః | ౮౦ | మార్లు | కవిం | 30 | ,, |
| కవిక్రతుః | ౬ | ,, | కవిఇవ | ౧౦ | ,, |
| కవిక్రతుం | ౪ | ,, | కవియన్ | ౧ | మార్లు |
| కవిక్రతో | ౧ | మారు | కవియమానః | ౧ | ,, |
| కవిఛద | ౧ | ,, | కవివృధః | ౧ | ,, |
| కవితమః | ౨ | మార్లు | కవిశస్తః | 3 | మార్లు |
| కవితమం | ౪ | ,, | కవిఇతి | ౮ | ,, |
| కవితమస్య | ౨ | ,, | కవీన్ | ౨ | మార్లు |
| కవిత్వనా | ౧ | మారు | కవీనాం | ౧౭ | ,, |
| కవితరః | ౧ | ,, | కవే | ౫౦ | ,, |
| కవిత్వా | ౧ | ,, | కవేః | ౪ | ,, |
| | | | కవ్యతా | ౧ | మారు |

వచ్చియున్నది. లౌకికసాహిత్యమందు నకవిశబ్దముయొక్క ఆ వ్యాపకము అర్థములేకుండా పోయినది. ప్రస్తుతము కవిశబ్దముమాత్రమే మిగిలినది అయినప్పటికీ క్రాంతిదర్శిత్వమనగా ప్రతిభాశీలత్వము కవియందు కూడ స్వీకరించబడినది. దీనియందు ఈషణ్మాత్రమును సందేహము లేదు. కవి గావలెనన్నచో రాజాలడు అతడు ప్రతిభాయుక్తుడై జన్మించుచున్నాడు. వైదికఋషుల యొక్క స్ఫూర్తినిచూడుడు. వారి ప్రతిభచే ఏరీతిగా సూక్తము వెంటసూక్తముపరిశ్రమరహితముగ తరలివచ్చుచుండెడిది. రామాయణము, మహాభారతము మొదలగు పురాణములను చూడుడు. వీటి కర్తలు వైదిక ఋషికోటియందు చేరకపోయినను వీరియొక్క ప్రతిభ ఎటువంటి వేగముతో పరుగెత్తుచున్నదో. రామాయణ మహాభారతాది పురాణములకు ఆధారమైన రచనాసాహిత్యమున గోచరము కాగలదు. ఈవిషయముల యొక్క ప్రతిభపూర్వవర్తులయిన ప్రాచీన కవుల ప్రతిభవలె లేకపోయినను, వీరి కవిత్వమందు ఏకొలదిపాటి ముగ్ధతనైనను చేకూర్చు శక్తి లేక పోలేదు. ఇక ప్రస్తుతకవిబృందమును తిలకింతుమా యిందొకానొకడును విద్వాంసుడు లేడు. దూరదర్శి అంతకుముందే కానరాడు 'హతా దాకృష్టానాం కతిపయపదానాం రచయితా' అతికష్టముమీద ఇందులోని, అందులోని పదములను స్వీకరించి రచియించెడి యీ మూడవ తరగతి కవులవల్ల భారతదేశము యొక్క ఉద్ధారకముగాని, భారతీయ వాతావరణమం దపేక్షించెడి ఉత్కృష్టత్వముగాని ఎట్లుకా గలుగుచున్నది. ఈతర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గతి కవి గోస్వామి తులసీదాసు పాదపద్మముల సన్నిధిని కూర్చొనుటకు కూడ యోగ్యుడు కాడు. అయినప్పటికి వీరు తమరచనలను దివ్యకృతులుగా తలచుచున్నారు. సృష్టిప్రారంభము మొదలుకొని నేటివరకు ఏసమయమందుకూడ కవిశబ్ద మింతటి దురుపయోగమయి యుండ లేదు. అనగా నేడెంతటి దురుపయోగముగా వాడబడుచున్నదో అంతటి దురుపయోగముగా, పైగా ఏప్రకారముగాని యంత్రణశక్తి లేకపోవుటనల్ల. "సర్వాన్ పుచ్ఛవతోహయాన్" అనగా తోకగల సమస్తజంతువులును గుఱ్ఱములనుగా తలపబడుచున్నవి. ఇది దౌర్భాగ్యవిషమై యున్నది. ఋగ్వేదము. 1-11-4. యందు కవిశబ్దముతో 'అమితౌజాః' అని శబ్దముకూడ వచ్చియున్నది. 'అపరమిత ఓజః' కవియనువాడు తేజస్సమేతుడై ఉండవలెను. విద్వాంసుడై యుండవలెను. దూరదర్శియయి యుండవలెను. అతడే నిజమైనకవి కాగలుగుచున్నాడు. ఈ కాలమున మనహిందీ సంస్కృత కవులలో నెవరైన అట్టి సర్వశక్తిసమన్వితులగు కవులు కలిగియున్నారా! లేరు, లేరు. ఆధునికమున విద్వాంసులే చాల తక్కువ. అందునను దూరదర్శి లేనేలేడు. ఒకవేళ విద్వాంసుడైన దూరదర్శి ఎవరైన ఉన్నట్లయితే అతడు శక్తియుక్తుడై యుండుట దుర్లభము. ఈప్రకారము ఆంధ్రసంస్కృత హిందీకవులలో శక్తియుతమగు చమత్కారమే లేకుండెను. మనకవులలో నాట్యకారుల ప్రత్యేకకృతులు నీరసములు, శక్తి విహీనములుగా నుండియున్నవి. నాకుతముచే పరాధీన దేశమందు శక్తియుతులైన కవులుండుట కూడ అసంభవమనియే భావించుచున్నాడను. ఎందుచేతనంటే దూరదర్శి తేజస్సమన్వితుడు. స్వతంత్రుడు అగు కవి మనదేశమువంటి . దాస్యవాయుమండలమున ఎందుకు జన్మించును! ఒకవేళ జన్మించినను వాని నీతియుతప్రతిభ దేశమున వ్యాపించు అవకాశ మెట్లు లభించును? స్వేచ్ఛాభ్యుదయోన్ముఖదేశముననే అట్టికవి జన్మింపగలుగుచున్నాడు. ఆదేశమున కభ్యుదయోన్నతులు, కలిగించుట కతడే ప్రబలకారణమగుచున్నాడు ప్రస్తుతము అట్టి నిజమైన కవులు లేనేలేరు. అడవియందలి ముండ్లచెట్లవలె కుకవిబృందము పెచ్చుపెరిగి పోవుచున్నది. దీనికి ప్రధానకారణము పరాధీనతయే! ప్రజలు వైదిక సాహిత్యమును క్లిష్టముగా తలచి దానిని వీడి దూరముగా కూర్చొనుచుండిరి. శ్రద్ధాయుతమగు పరిశ్రమ చేసినచో వేదములయందు కూడ వారికి నానావిధరసానందము. విశేషముగా లభించగలదు. వేదములు స్వతఃఛందోమయములు. అవి ఋషులయొక్క దూరదర్శితాప్రతిభల వలన ఉద్భవించినవి. ఛందోరచనా ప్రారంభము అన్నిటికంటె ముందు వేదములనుండియే కలిగినది. స్వాభావికవర్ణనయు నానావిధ రసములు వేదములయందు కొరవడి యుండలేదు. వేదవాఙ్మయమున గల ఉపమలు, అలంకారములు, మరియే భావమయమును, ఎన్నిటికిని ఏరికి దొరజాలవు. సారాంశమేమనగా కవులకొరకు వైదికసాహిత్యమం దింతటి అధికసామగ్రి కలదు.

అయితే కవులు దానియందు పరిశ్రమచేసి దానియొక్క యథార్థోపయోగమువలన లోకోపకార మాచరించి ధన్యులయ్యెదరు గాక, లోకము, పరమార్థము యీ రెంటికిని సహజముగానే కలయిక కలదు. వైదిక సాహిత్య జ్ఞానవిహీనతచేతనే లౌకిక కవిపరిపూర్ణుడు కాలేక పోవుచున్నాడు. లౌకిక కవులకు నాప్రార్థనయేమనగా, వారు సంస్కృతజ్ఞానము కలవారగుచో ముఖ్యముగా వైదికసాహిత్యమందు ధ్యానముంచెదరు గాక! ధర్మమును, ఆదిస్రోత వేదములనుండియే నేర్చుకొనెను. ఆర్యసభ్యతను ఆదిస్రోత వేదోపాసనచేతనే పొందగలిగెను. గనుక వేదమాతను ఉపాసించి క్రాంతిదర్శిత్వము. అమితశక్తులను సంపాదింపగలిగిన లౌకిక కవి ఏమి చేయజాలడు? అట్టి కవితానుసంకల్పించిన రీతిగా తనకృతిచే ప్రపంచకమును ఏతీరుగనైన త్రిప్పగలడు. కవులయొక్క శక్తికి పారములేదు. వైదికశబ్దములయందు కవి అగ్నితో ప్రార్థనముచేసి యీ చిన్నివ్యాపమును ముగించుచున్నాను. "అగ్నే తవ శ్రవో వయో, మహి భ్రాజంతే. అర్చయో విభావసో, బృహద్భానో శవసా వాజముక్థ్యం దధాసి, దాశుషే కవే"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ముద్దు

శొంఠి శ్రీపతి శాస్త్రి గారు

ప్రేమ మషీరసార్ద్రీభూతమైన
లలిత కోమల చిత్రఫలకంబునందు
మోవి యచ్ఛాది, కపోలపత్రమునఁ
దవిలియొత్తెడు చిఱుతడిముద్ర ముద్దు.

అననుభూతమహోత్తరానంద భావి
భవ్యానుభోగసంభవ నిశ్చయతకు,
మనసులు నిండార మాటలులేని
లీలావిశేషమహా లేయొట్టు ముద్దు.

పండు వెన్నెల గల నిండునెలవలె
నెఱజవ్వనపుటింపు చిఱుత పాయంపుఁ
జెలిమికలిమికిఁ, జిక్కులు లేనిదయ్యు,
సడలింపనీని ప్రేముడి ముడి ముద్దు.

ఆయుర్వనంబులో యౌవనాంకురము
మోహదోహదముచేఁ బూచుపుష్పమునఁ,
గామపరాగ సంకలిత మాధురిని
గరఁగ, సధరశీతకరబింబ మురలి
చిందు ప్రణయహిమబిందువు ముద్దు.

అలసి సొలసియున్న, నెలసిగ్గుగొన్న,
వలపుఁ దలఁపులెడ గిలిగింత లిడఁగఁ,
గులుకుఁ బలుకు లాడుకోఁ జాలనపుడు,
జిలిబిలిమూగి మాటలమూట ముద్దు.

స్నిగ్ధసందిగ్ధవిస్తృత నిశీథమున
రాగారుణోదయక్రమసూచ్యమగుచు,
నిర్నిరీక్షణ పద్మనిర్నిద్రమగుచు,
రవణించు రిక్క, వేకువచుక్క ముద్దు.

మనగోల గనిచాలఁ దనలోనఁ దానె
కెరలి నవ్వుకొనుచుఁ, బొరలి కెవ్వనుచు,
నుబుసులాడుచు నెద్దియో బాసలోన;
జెలువొందు కసుఁగందు చెలగాట ముద్దు.

ప్రణయప్రబంధంబు రచియించు నెడల
నాశ్వాసములకు నాద్యంతంబులందు
నొనర నుపక్రమణోప సంహార
ములఁ జెల్లు లక్షణ ముఖ్యంబు ముద్దు.

దూరపు టెడఁబాటు తుదిచేత ముద్దు;
వగపుఁ గడలిఁ దేల్చఁదగుదోనె ముద్దు;
వయసు భేదములేని చెయిదంబు ముద్దు;
సుమనోజ్ఞతార్థవచోనిధి ముద్దు.

తలఁపులో నెలకొన్న వలపులఁ దెలుపు
నతులార్థవంతమ వగు దీవుగాక,
యోటిమాటలఁ బల్కి యేటిలాభంబు?
ఇఁకమాటలేల? నీకొకముద్దు ముద్దు!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## వర్షాకాలం, మా సమకాలికుల యభిప్రాయం




---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## హిందూస్త్రీలు_నాట్యరంగ ప్రవేశము

హిందూ నారీమణులు పాశ్చాత్య సోదరీమణుల వలెనే నాట్యరంగములలో భూమికాధారణముచేయ నగునాయను ప్రశ్న మనఆంధ్రదేశములో చాలామంది విద్యాధికుల మనస్సులను కలతపెట్టుచున్నది. గతసంవత్సరము జూన్ నెలలో తెనాలిలో ఆంధ్రనాటక కళాపరిషత్తు జరిగినతరువాత కొన్ని నాటకసమాజములలో స్త్రీలను భూమికాధారణమునకై నియోగించుటయు, స్త్రీపురుషులతో కలిసిన సమాజములను నాటకాభినయమునకై క్రొత్తగా నేర్పరుచుటయు జరుగుచున్నది. ఆంధ్రపత్రికయు, సమదర్శినియు తమనూతన సంస్కారాభిమానమును పూర్తిగా వెల్లడించినవి.

కాని, పాశ్చాత్యసోదరీమణు లీభూమికాధారణమునకు విలాసార్థమో, వృత్తిగానో, కళాభిమానముననో దగియుండిరిగదా యని మనహిందూస్త్రీలును అట్లేల చేయరాదని యీయర్థమును సమర్థింపఁజూచినచో నిది యట్లు సులువుగా పరిష్కరింప బడనేరదనియే నా యూహ. నాట్యరంగములలో భూమి కాధారణము చేయు పాశ్చాత్యస్త్రీలు సాధారణముగా నవివాహితలే. అదియటుండ, పాశ్చాత్యస్త్రీలు చేయగల యద్భుతచర్య లెన్నో గలవు. వారికి పురుషులతో సమానమైన తరిబీయతుగలదు. వారు గుఱ్ఱములపై స్వారీచేయగలరు; మోటార్లు నడపగలరు; పిస్తోళ్లు పేల్చగలరు; నీళ్లలో ఈదగలరు; పరసహాయములేకనే ఖండ ఖండాంతరములు చెక్కుచెదరకుండా తిరిగిరాగలరు; మానరక్షణ చేసుకోగలరు; ఏపురుషుడైనా పెంకెతనపు మాటలాడితే తలయెత్తలేకుండా జవాబుచెప్పగలరు; మితిమీరితే అడాపెడా లెంపలు వాయించకలరు. ఇట్టిపనులు మనహిందూనారీమణులు చేయగలరా? లేనప్పుడు పులిని చూచిన నక్కసామెతగా తగుదుమని మననారీమణులు పాశ్చాత్య సోదరీమణులతో నాట్యరంగప్రవేశ విషయములో మాత్రము సాపట్యము కలిగించుకొనుట న్యాయమైనపనిగాదు. వారభినయించు నాట్యాభినయము ననుకరించుటయును తగదు.

అయితే ఈప్రశ్న మనహిందూసంప్రదాయమునకు కేవలము విరుద్ధమా అన్నవిచాగణ కలుగకమానదు. ఈసంప్రదాయ విషయమును మాభారతీతీర్థ నాట్యవిభాగవిమర్శలలో తేలినవిధానము ననుసరించి యీవ్యాఖ్యానములో విశదపరచుచున్నాను.

ఆంధ్రదేశములో బొమ్మలాటవాళ్లనునొకజాతి ప్రజలు కలరు. వీళ్లకు సంగీతసాహిత్యములలో మంచి ప్రవేశము కలదు. భారత రామాయణాదిపురాణగాథలు సంగీతసాహిత్య సమ్మిళితముగా రంగులబొమ్మల సహాయముతో జనసామాన్యమునకు విశదపరచుట వీరికి తరతరములనాటి కులవృత్తియై యున్నది. దీనిని చక్కని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాండితీవైభవముతోను, మేలైన నాట్యకళా వైదుష్యముతోను నిర్వహింపగలిగిన బొమ్మలాటవాండ్ల జట్టులు నాచిన్నతనములో కొన్ని చూచియుంటిని. నాటకప్రదర్శనములు మనదేశములో ప్రబలి బొమ్మలాటలు నెనుకబడ్డతరువాత వీరును దేశకాలానుసారముగా బొమ్మల సహాయమును వదలి, తామేస్వయముగా వేషములు వేసుకొని తొల్లింటి పురాణగాథలనే ఆటకలాపములుగాగాక నాటకములుగా వర్ణించి నూతన నాట్యరంగములయందు ప్రదర్శింప నారంభించిరి. వీరు కుటుంబములకు కుటుంబములుగా నీవృత్తిసంస్కారము నవలంబించిరి. ఇందులో వారి కులసంప్రదాయమునకు విరుద్ధమైనపని యేమియును లేదు. దీనినిబట్టి చూడగా పూర్వము హిందూనాటక రాజములు సంస్కృత ప్రాకృతములలో ప్రదర్శింపబడిన కాలములలో కూడా నాట్యవృత్తిని కులవృత్తిగా పరిగణించిన జాతు లీదేశములో నుండినట్లే తోచును. అట్టిపరిస్థితులలో నాట్యప్రయోగమందు స్త్రీ లెట్లు సాయపడుచుండిరో తెలిసికొనుటవల్ల మనప్రశ్న కొంతవరకు సమర్థింపబడగలదు. ఇట్టివిమర్శకు భరతనాట్యశాస్త్రమే ముఖ్యమైన యాధారము గనుక ఆగ్రంథము ననుసరించియే కొన్నియంశము లుదాహరించుచున్నాను.

నాట్యశాస్త్రములో (కావ్యమాలా సీరీసుప్రతి) మండపవిధానము నుపన్యసించు ద్వితీయాధ్యాయములో "శాలాస్త్రీభిరలంకృతాః" అని ప్రేక్షాగారాది నాట్యశాలాస్తంభములు స్త్రీలచే నలంకరింపబడవలసినవని శాస్త్రకారుడు చెప్పుచున్నాడు. గృహాలంకరణపద్ధతి స్త్రీలకే యెరుకగదా! నాచిన్నతనములో చూచినబొమ్మలాటకంపెనీలవారు స్త్రీపురుషులు తామువచ్చిన గ్రామములో నాట్యశాలానిర్మాణమును తదలంకరణములును స్వయముగా చేసికొనియుండుట నేను చూచి యెరుగుదును. ఇదియే ప్రాచీన సంప్రదాయము.

నాట్యప్రయోగ ప్రాశస్త్యము నుపన్యసించుచో భరతనాట్య శాస్త్రమునందు—

శ్లో. ప్రాయేణతుస్వభావాత్
　　స్త్రీణాం గానం నృణాంచ పాఠ్యవిధిః;
స్త్రీణాం స్వభావమధురః
　　కంఠో నృణాం సులలితత్వంచ.

అని స్వభావగుణాతిశయము లుగ్గడింపబడినవి.

పురుషులకు స్వభావసిద్ధముగా కంఠములలితముగాను, స్త్రీలకు మధురముగాను ఉండును గనుక పురుషులకుపాఠ్యమును, స్త్రీలకు గానమును విధింపబడుచున్నది. దీనినిబట్టి నాటకప్రయోగమందు స్త్రీలకు ప్రత్యేకస్థానములుకలవనియే నిర్ణయింపవలసి యున్నది. మరియు

శ్లో. యేస్త్రీణాం పాఠ్యగుణాభవతి
　　నరాంణాంచ గానమధురత్వమ్;
జ్ఞేయో ఽలంకారో ఽసౌ
　　నహిస్వభావోహ్యయం తేషామ్.

అనియు కలదు. స్త్రీలలో పాఠ్యగుణములును, పురుషులలో గానమాధుర్యమును గలచోట నవి వారికలంకారములనియు స్వభావగుణములు గావనియు నీ నిర్వచనము. కనుక పూర్వపు హిందూనాటకములలో స్త్రీలు గానవిశేషములు గల భాగములును, పురుషులు పాఠ్యవిశేషములుగల భాగములును ప్రదర్శించుట యాచారమై యుండినట్లు తోచకమానదు. తొల్లింటి యార్యనాటక సంఘములలో వాద్యకులు పాఠకులు, మొదలగువారితో పాటు "గాయిక"లు కూడా ఉండినట్లు "గాయిక"లను గూర్చిన నిర్వచనమునుబట్టి యూహింపవచ్చును. అది యిట్లున్నది.

## గాయికా నిర్వచనము

శ్లో. రూపగుణకాంతియుక్తా మా
　　ధుర్యోపేత సత్వసంపన్నాః;
పేశలమధురస్నిగ్ధాను నాద
　　సమరక్త శుభకంఠాః.
సువిహిత సమకవిధాయి
　　న్యత్యోభ్యగీతతాలలయకుశలాః;
ఆతోద్యార్పితకరణా
　　విజ్ఞేయా గాయికా శ్యామాః.

ఇంతేకాదు:



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకృతి వికల్పనమనుఅధ్యాయములో భూమి కాధారణ విధానమును బట్టి నాట్యప్రయోగములు (1) అనురూప, (2) విరూప, (3) రూపానురూపము లని మూడు తెరగులుగా విభాగింపబడినవి. పురుషులు పురుషప్రకృతులను, స్త్రీలు స్త్రీప్రకృతులను అభినయిం చునాటకములు అనురూపములు.

---

శ్లో. స్త్రియాస్తు స్త్రీకృతో భావః
పౌరుషః పురుషస్యచ;
యథావయ స్తథా తస్మిన్
అనురూపాసా భవేత్.

బాలకులు వృద్ధభూమికలను వృద్ధులు బాలభూమికలను భావప్రకటనముపల్ల నభినయించినచోట నది విరూపనాట్యమగును. పురుషులు స్త్రీగతభావముల నభినయించినచో నది రూపానురూపనాట్యమగును.

శ్లో. పురుషః స్త్రీగతం భావం యత్రప్రకురుతే పునః;
రూపానురూపా సాజ్ఞేయా ప్రయోగేప్రకృతి స్తథా.

ఈనిర్వచనములను బట్టియు స్త్రీలే స్త్రీభూమికల నభినయించుట నాట్యప్రయోగ ప్రాశస్త్యముగా ఆర్యనాట్యాచార్యు లంగీకరించినట్లు స్పష్టము.

మరియొకవిశేషము: కొన్ని నాటకములు స్త్రీల చేతనే ఆడింపవలెననియు, కొన్నివిధములైన నాటకములలో స్త్రీలు భూమికలు ధరింపతగరనియు కూడా నియామకము కలదు. ఎట్లనగా:—

శ్లో. శృంగారరస మాసాద్య స్త్రీణాం
భాణంప్రయోజయేత్

శృంగారరస సమన్వితమగు భాణమును స్త్రీలచేతనాడింపవలెను.

శ్లో. ఈహామృగేఽపితత్ స్యాత్
కేవలమత్రస్త్రియాయోగః.

ఈహామృగమను రూపకమును కేవలము స్త్రీలచేతనే ఆడింపవలెను,

శ్లో. యుద్ధోద్ధ తావేగ కృతాః
సంరంభ బహులాశ్చయే;

న తే స్త్రీభిః ప్రయోక్తవ్యా
ప్రయోజ్యాః పురుషైస్తు తే.

యుద్ధము, ఔద్ధత్యము, వేగము, సంరంభబాహుళ్యమును గల నాటకములు పురుషులే ప్రయోగించవలెను. స్త్రీలచేత నాడింపకూడదు.

నాట్యప్రయోగమందు మిషగా గాని, విలాసార్థముగాని, వంచనకుగాని వస్తువిన్యాసాను సారముగా స్త్రీలు పురుషవేషమును పురుషులు స్త్రీవేషమును ధరించవచ్చును. తదనురూపముగా స్త్రీలు ధీరత్వముగాను, పురుషులు లలితముగాను వేషభావలచేత కావ్యరసాభినయము చేయవలసియుండును. ఇందువిషయమైన నిబంధనశ్లోకము లిట్లున్నవి:—

శ్లో. వ్యాజేనక్రీడయావాపి
తథాభూయశ్చ వంచనాత్;
స్త్రీపుంసః ప్రకృతింకుర్యాత్
స్త్రీభావం పురుషోఽపివా.

ధైర్యాదార్యేణ సత్వేన
బుద్ధ్యా తద్వచ్చ కర్మణా;
స్త్రీపుమాంసం త్వభినయే
ద్వేషవాక్య విచేష్టితైః.

స్త్రీవేషభాషితై ర్యుక్తః
ప్రేక్షితా ప్రేక్షితై స్తథా;
మృదుసన్నగతి శ్చైవ పుమాన్
స్త్రీభావ మాచరేత్.

ఈ నిబంధనములనుబట్టి సహజముగా నాటకప్రయోగములో స్త్రీలు స్త్రీభూమికలను, పురుషులు పురుషభూమికలను ధరించుటయే సంప్రదాయమని స్పష్టపడుచున్నది.

ఇట్లు భారతీయనాట్యశాస్త్రప్రకారము స్త్రీలే స్త్రీభూమికలు ధరించుట సంప్రదాయమైనయెడల శృంగారాభినయమందు స్త్రీపురుషులు నాయక నాయికావేషధారులు రంగస్థలమందు కావ్యరసాభినయము చేయునప్పుడు చిక్కులు కలుగవాయని ప్రశ్నకలుగును. దీనికి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమాధానము నాట్యశాస్త్రమందే గలదు. నాట్యరంగమందు ప్రయోగింప కూడనివని కొన్ని శృంగార భావాభినయములు నిషేధింపబడినవి. ఎట్లనగా

శ్లో. నకార్యం శయనం రంగే నాట్యధర్మం విజానతా,
కేనచిద్వచనార్థేన ఛేన మత్ర ప్రయోజయేత్.
యదాస్యపే దర్థ వశాదేకా కీసహి ఒతోపి వా,
చుంబనా లింగనాదీని రంగమధ్యేన కారయేత్.
దంతం నఖక్షతం ఛేస్యం నీవీస్రంసన మేవచ,
స్తనాధరవిమర్దనం చ రంగమధ్యేన కారయేత్.
భోజనం సలిలక్రీడాం తథా లజ్జాకరంతు యత్
ఏవంవిధం భవే ద్యద్య త్తత్త్రంగే నకారయేత్.

ఇట్టి రంగవర్జ్యములను పరిగణించుచు నాట్యప్రయోగమును సాగించినయెడల స్త్రీపురుషులు కలిసి నాట్యభూమికలు ధరించు రంగప్రయోగములందు వ్రీడాజుగుప్సాకరములగు నభినయము లుండ నేరవు. స్త్రీలు స్త్రీభూమికలును ధారాళముగా ప్రయోగించవచ్చును.

ఇదియంతయు యుక్తమే యైనను నేపథ్యగృహమందు (green room) స్త్రీపురుషులు వేషములు వేసుకొనుచోట స్త్రీశీలమునకు భంగము కలుగగలదేమోయను సంకోచ ముండవచ్చును. ఈ యంశమునుగూర్చియు నాట్యశాస్త్ర నియామకము గలదు. ఎట్లనగా:—

శ్లో. న స్వయంభూమి కాన్యాసం
బుధః స్త్రీణాంప్రయోజ యేత్.

తెలివిగలవా డెవడును స్త్రీలకు స్వయముగా భూమికాధారణము చేయించగూడదు. స్త్రీలు తమవేషధారణమును తామే చేసుకొనవలెను. ఇట్లు నేపథ్యమందును, ఆహార్యవిధియందును స్త్రీపురుషులు ప్రత్యేకముగా నుండినయెడల స్త్రీలు నాట్యరంగము లందును తమనిత్యనివాసములందువలెనే తమశీలమానములు కాపాడుకొనవచ్చు ననుటకు సందేహము లేదు.

బుర్రా శేషగిరిరావు,
ఆంధ్రభారతీ తీర్థ ప్రధాని.

## భారత నాట్యాచార్య
## చట్టి చిన్నపూర్ణయ్య పంతులుగారు

సుప్రసిద్ధనటులును ఆచార్య బిరుదాంకితులును, ఆంధ్రభారతీతీర్థగౌరవసభ్యులును, విశేషించి క్రొత్తగ నిర్మించబడిన ఆంధ్రనాట్య కళాపరిషత్తున కధ్యక్షులు నగు చట్టి చిన్నపూర్ణయ్యపంతులుగారు విఖ్యాతులయ్యు ఆంధ్రలోకమున కంతగ ముఖపరిచయ మొసంగిన యశఃకాములు కారు. వీ రాంధ్రగీర్వా ణాంగ్లకన్నడభాష



శ్రీ చట్టి చినపూర్ణయ్య పంతులు గారు

లలో పండితులు. భరతశాస్త్రము నామూలాగ్రముగ నెరింగినవారు. ఆంగ్లరంగస్థల నియమముల బాగుగ గుర్తించువారు. నేటి కిరువదై దేండ్ల నుండి నాట్యరంగమున పేరొందిన పాత్రధారులు. ఆది నాంగ్ల నాటకములలోన నాడి యటుపై నాంధ్రరంగస్థలిని ప్రఖ్యాతి గడించిరి. ఒక్క నాయకపాత్రలందే కాక సామాన్యవేషములందును వీరు తమ పాత్రపోషణ నైపుణిని వెల్లడించి యశము గాంచిరి. గద్యపద్యసమ్మిళితములగు నవీనాంధ్రనాటక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శివాజీ పాత్రము

"శివాజీ:—ఈ సింహగడము మరల శత్రువులకు చిక్కినేని మన మాతృభూమికి రాజధానియగు రాజగడము వారికి సులభసాధ్యమగును. రాజగడమే పడిన మహారాష్ట్రమే పడినట్లు. కావున నో వీరులారా! రణరంగంబున పరాజయ మెరుంగని యో శూరులారా! వీరభారతజననీ గర్భసంజాతుల రగు నో ధీరులారా! మహారాష్ట్ర రాజ్యమును మీ రీధరపై సుస్థిరముగ నెలకొల్పదలంతురేని, వెనుకటి మీ వీరపితృ పూతరక్తంబు మీ రక్తనాడుల నేటికిని ప్రవహించునేని, సాటివీర హైందవకోటిలో మీరు తలెత్తి తిరుగదలతురేని, మీ కాంతలను శత్రులబారి బడకుండ మీరు గావ దలంతురేని, నేటి సూర్యుడస్తమింపక మునుపే విజయలక్ష్మిని గైకొనుడు."                    (రోషనార)

ములలో పద్య మొకరీతి రసభంగ మొనరించుట గుర్తించి, గద్య ముచితరీతి నుచ్చరింపమి దానికున్న పటిమ వెల్లడి గాకున్నదనియు, పద్యము సంగీతములోన గావలసినంతగ భావప్రకటన కవకాశ మొసగకున్నదనియు, గడచిన పదేండ్లనుండి వీరు తామభినయించు పాత్రలందు పద్యములగూడ గద్యముగ మార్చి పాత్రపోషణము చెడకుండ రంగస్థలమును వన్నె కెక్కించుచున్నారు. కంస దుర్యోధనాది పౌరాణిక పాత్రలందును, తానీషా శివాజీ మొదలగు చారిత్రిక పాత్రలందును, దుష్టబుద్ధి రఘునాథరావు మొదలగు సాంఘిక నాటక పాత్రలలోనుగూడ వీరు పద్యముల వీడి మరియు ఖ్యాతి నొందగలిగిరి. అంతేకాదు, గానవిశారదులగు ప్రఖ్యాతనటులతోగూడ నదే రంగస్థలమున దమ యభిమానపాత్ర లభినయించుచు పద్య మొక్కటియు చదువక మెప్పులందిరి. వీరి నిపుణత కింకొక్క విషయమేమన రంగస్థలమున దనతోడ నుండు నటుల లోపములెవ్వియు గానరానీయరు. సరిగదా వీరి యాజమాన్యమున జరుగు నాటకములందు ప్రేక్షకులకు లోటు గనబడకుండు లాగున జేయగల సమర్థులు. కాబట్టియే వీరు మూల గంజాం మండలముననె యింతకాల ముండియు ప్రఖ్యాత నటులచే నాట్యకళాపరిషదధ్యక్షులుగ నెన్నుకొనబడుటే గాక, తమ నాట్యకౌశలము నెరింగిన వారి వలన ఫ్రాన్సుదేశమునుండి నాట్యాచార్యపట్టమును గూడ బడసి సన్మానింపబడిరి.

వీరి ప్రఖ్యాత భావచిత్రము ఛాయాగ్రహణమునకైన తగిన సదుపాయములు లేనిలోపమున పంతులుగారి మూర్తి తప్ప తక్కుంగల దృశ్యమెల్ల లోపభూయిష్ఠమై యుంటకు ద్రష్టలు క్షమింతురుగాక.

జయంతి వెంకట కృష్ణారావు

---

## శ్రీగోవిందరాయ సురభినాట్యమండలి

డిసెంబరు మొదటినాళ్లలో ఈనాట్యమండలివారు చెన్నపురమున కొన్ని నాటకముల నాడిరి. ఈ మండలియందు స్త్రీలు పురుషులు గలరు. వీరందరు చాలవరకు ఒకకుటుం

బమునకు చెందినవారే. స్త్రీలుకూడ పురుష పాత్రములను ధరింతురు. వీరికి నాట్యకళ యందు పరిపాటి చాలినంత గానరా దనవలసి




నారదుడు-మన్మథుడు

శ్రీమతి నరసమ్మ-శ్రీమతి సుభద్రమ్మ

యున్నది. ఇందువలన సామాజికరంజనము సమకూరుట దుర్లభము. నాట్యకళాభివృద్ధికయి పెక్కు తెలుగుల పలువురు పాటుపడుచున్న యీ కాలమున ఈ మండలివారును తమ నటకులను దేశకాలముల కనుగుణముగ సంస్కరించి చక్కదిద్దుకొనుట సమంజసము. వీరి ప్రదర్శనములలో నారదపాత్రము (నరసమ్మ) కొంత మెచ్చదగియున్నది.—భారతి.

---

ఆంధ్రనాటక రంగోద్ధారక

నెల్లూరు నాగరాజారావు గారు




పాపారాయడు - భావప్రదర్శనము

"ఆహా ఇన్నాళ్లకు నా చేతికి ఆటిన యడవి నఱపడు దొరకినది. రండోయి మొనగాండ్రారా! రండి! తాండ్రపాపయ్య నయ్యా!"






శ్రీ భక్తవత్సలదాసు పట్నాయకుగారు

విజయనగర కాలేజి విద్యార్థి. ఆంధ్ర విశ్వవిద్యాలయము పట్టప్రదానోత్సవమునందు మూడుపతకములను బడసిరి. గణితశాస్త్రమునందు ప్రప్రథములుగ నుత్తీర్ణులైరి.




కె. శేషగిరిరావుగారు

కాకినాడకాలేజి విద్యార్థులు. గణితశాస్త్రమునందు సర్ ఆర్. వెంకటరత్నంగారి పతకమును బడసిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్ర మహాసభ - బర్మా




అధ్యక్షులగు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారిని ఓడ దిగినతోడనే స్థానికనాయకులు సన్మానించుట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




అధ్యక్షులు నాగేశ్వరరావుగారు, ఆహ్వానసంఘాధ్యక్షులు సేనాదళమును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




ఆంధ్రసభ రంగూనులో జూబిలీ హాలునందు సమావేశమగుట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రసభలు—బర్మా



రంగూనులో ఆంధ్రసభ జరుగుచున్నపుడు జూబిలీహాలులో వెనుకభాగము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ మహిళామండలి




సెకంద్రాబాదు బాలికాపాఠశాలయందు ఉపాధ్యాయులుగ నున్న వీరిలో కుడివైపు నిలిచియున్న వారు మిస్. మేరీ జాన్, బి. ఏ; ఎడమవైపు మిస్ మేరీ డేవిడ్, బి. ఏ. యల్. టి.; ప్రధానోపాధ్యాయి. శ్రీ పి. కామేశ్వరమ్మగారు, బి. ఏ. వీరు ఈ సంవత్సరముననే ప్రవేశించినారు.




శ్రీమతి దామెర్ల కమలరత్నంగారు

రాజమండ్రిలో స్పెషలు మేజస్ట్రేటుగ నియమింపబడినది. ఈమె ఆర్టుకాలేజి లెక్చరరు. శ్రీదామెర్ల వెంకటరావుగారి సతీమణి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri










(౧) శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు. ఆంధ్రవిశ్వవిద్యాలయ విద్వాన్ పరీక్షయందుత్తీర్ణలయిరి. (౨) శ్రీమతి యస్. కమలాదేవిగారు. బి. ఏ., పరీక్షయందుత్తీర్ణ లయిరి. (3) శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు, బి. ఏ. పరీక్షయందుత్తీర్ణలయిరి.



శ్రీమతి చావూరి రుక్మిణి అమ్మాళు గారు, బి. ఏ.,



శ్రీమతి హిల్డా లాజరసు కన్యగారు.

వీరిరువురును ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సెనెటరులుగా ఎన్నుకొనబడిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీ సనాతన విద్యాలయము, రాజమండ్రి

ఈ విద్యాలయమును శ్రీలకు దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారు ౧౯౨౮ సం॥ మేనెల ౧౦ వ తేదినాడు రాజమహేంద్రవరమున స్థాపించినారు. ఇందు శ్రీలకు వైదు మందికి మించియున్నారు. వీరి భోజనాదులకు, ఉపాధ్యాయులకు, ఇంటి అద్దెకు వ్యయము నెలకు రు ౫౦౦ అగుచున్నది. ఇది ఆంధ్రదేశమునందలి యుదారాశాయుల ద్రవ్యసహాయముచే నడుచుచున్నది. స్థిరవసతులేమియు దీని కింతదనుక లభింపకున్నవి. ఇందు ఇపుడు అయిదవతరగతివఱకు గలదు. అన్ని తరగతులయందును గలిసి ౭౨ బాలికలు సనాతనపద్ధతుల ననుసరించి గృహిణీజీవితమున కుపయోగించు విద్య నేర్పబడు




శ్రీ సనాతన విద్యాలయము నందలి బాలికలు

చున్నది. పైనుండి వచ్చి యిచ్చట విద్య నభ్యసించుచున్న బాలికలు గాక ఇచ్చటనే భోజనాది సౌకర్యములను పొందుచు చదువుకొనుచున్న బాలికలు అన్నికులములవారు ఇరువది చదువుచున్నారు. సంస్కృతము, హిందీ, ఆంధ్రము, సంగీతము, కుట్టుపని, నూలువడకుట, ఊలుపని మొదలయినవి నేర్పబడుచున్నవి. ఇట్టి సంస్థ మన ఆంధ్రదేశమున నిది కాక గుంటూరున శారదానికేతన మొకటి గలదు. దీనిని శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు నడుపు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నారు. ఇట్టిసంస్థలు ఆంధ్ర దేశమునకు కొన్ని యేని ఆవశ్యకములు. ఇట్టి స్థితిలో నిపు డున్న రెండే చక్కగా నడచుటకు వలసిన ధనము సమకూడకుండుటచేత సంస్థాపకులు ఎన్నియో కష్టములకు లోనగుచున్నారు. ఉదారాశయులగు స్త్రీ విద్యాభిమాను లందఱు ఈసంస్థలకు తగిన ధనసహాయమును చేయదగుదురు. అందును ఆంధ్రులు మిక్కిలిగ ధనమును స్వయముగ నిచ్చియు, ఇతరులచే నిప్పించియు తమ దేశమున కలంకారములుగ నున్న యీచిన్ని స్త్రీ విద్యాలయములు దినదినాభివృద్ధిని గాంచ జూచుట పరమావశ్యకము. ఈసంస్థకు మొన మొన్న శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ౫౦౦ సహాయము చేసిరి.

గురుకుల బాలికలు

—భారతి



—

శ్రీ కార్తిక తిరునాళ్ రాజకుమారి

తిరువాంకూరుమహారాజుగారి చిట్టిచెల్లెలు. తిరువాంకూరు సంస్థానమున బాలికాభటులకు నాయకురాలుగా నియమింపబడెను.



శ్రీ యన్. కన్నియమ్మాళ్ గారు

ఉత్తర ఆర్కాడుజిల్లా సంఘమునకు మెంబరుగా నియమింపబడెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీ నౌరంగ బాలకుడు, శ్రీ షుమెల్లకన్య



వీరిది సింధుదేశమునందలి హైదరాబాదు. బాలునికి వయస్సు ౭ ఏండ్లు. చిత్రమునగల అన్నివాద్యములను వాయింపగలడు. మధురముగ పెక్కురాగముల పాడగలడు. హార్మోనియమును, పిల్లనగ్రోవిని, జలతరంగమును ఒకేమారుగ వాయింపగలడు. బాలికకు వయస్సు ౨ ఏండ్లు. శ్రావ్యముగ బహురాగములలో పాడగలదు.

న్యూసు ఇల్లస్ట్రేటెడు ఏజెన్సీవారి ఛాయాచిత్రము.

---

ప్రపంచమునకు నాశనము గలదా?

ప్రొఫెసరు లియోనార్డు హిల్ అనువారు 'సన్ డే డిస్పాచ్' పత్రికలో నిట్లు వ్రాయుచున్నారు:

కొద్దికాలమునకు క్రితము కొన్ని జ్యోతిర్లింగముల పతనమువలన సైబీరియా దేశమునందు ముప్పది చతురపుమైళ్లవైశాల్యముగల అరణ్యము దగ్ధపటలమైనది. అదృష్టవశమున ప్రపంచ చరిత్రలో ఇట్టివి తఱుచుగా సంభవింపు చుండవు. రూపసిద్ధి నొందుచున్న ఒకానొక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




గ్రహముయొక్క శకలములనదగిన జ్యోతిర్లింగములు ఎందువలననో పతనమునొందుచు భూగోళమును చేరి మండుచుండును. ఇంతమాత్రమున ఎప్పుడో ఒకప్పుడు ఒక్కసారిగ మానవలోకమంతయూ వీనివలన తుడిచిపెట్టుకొనిపోవునట నమ్మరాని విషయము. ఈభూమి యుగయుగాంతరములుగ నున్నదని భూగర్భశాస్త్రము దృష్టాంతీకరించుచున్నది. భూమియందు గర్భీకృతమైయున్న శేషియో తీవ్రశక్తులు శాంతిని బొందు పద్ధతియు నీవిషయమునే చెప్పుచున్నది. సూర్యునివేడి ఇంతట అంతట చల్లారునది కాదనియూ, మానవపరిణామము పూర్తియగుటకు ఇంకను ఎన్నియో కోట్లయుగములు జరుగవలసియున్నదనియు ఖగోళశాస్త్రజ్ఞులు నొక్కి వక్కాణింపుచున్నారు. అయినను భూగోళమున నేదే నొకప్రదేశమునకు నొక్కొక్కప్పుడు స్వరూపనాశనము సంభవించుటయు గలదు. క్రాకటోయా అను సస్యశ్యామలమగు ద్వీపము అగ్నిపర్వతములు బ్రద్దలగుటచే ఛిన్నాభిన్నమైనది. ఆసమయమున బయలుదేరిన ఉప్పెన సముద్రతీర పట్టణముల నెన్నిటినో సర్వనాశనము చేసినది. క్రాకటోయా ద్వీపముయొక్క సారవంతమైనభూమి అంతయు ధూళియై ఎగసిపోయినది. అందుతో ఆద్వీపము ఎట్టిప్రాణియు లేక పచ్చము పాడైనది. కాని ఆద్వీపమట్లెంతకాల మున్నది? సముద్రమున కొట్టుకొనివచ్చు తుక్కుతోడను, పక్షిపాదములకు అంటుకొనియుండు మట్టితోడను కూడివచ్చి విత్తనములు ఆద్వీపముయొక్క మిగిలిన రాతిసేలలపై నెలకొని మొలకెత్తినవి. ఆద్వీపము నేడు తిరిగి పచ్చనిచెట్లతో, ఇతరమగు ప్రాణిజాలముతో పరగుచున్నది. అగ్నిపర్వతములు, భూకంపములు, వరదలు, తుపానులు అనేకపర్యాయములు కలిగినవి. ఇంతతో మానవలోకమునకు తుది చీటి వచ్చినదా యనిపించినవి. ప్రకృతి చేయు ఈనాశనకర కార్యములు చాలనట్లు, మానవుడు తనబుద్ధిబలమునంతయు నుపయోగించి యుద్ధములందు గనులప్రేల్చి, బాంబుల వైచి, విషవాయుల విడిచి మానవలోక మారణమునకు తోడ్పడుచున్నాడు. మానవుడు తానార్జించిన విజ్ఞానమును ప్రాణిహింసకు గాక ప్రాణిని హింసించు ప్రబలరోగములను పారద్రోలుటకు వినియోగించుట ముఖ్యావసరమని రోగనిర్మూలన విషయమున తీరనిపరిశోధన చేయుచున్న మావంటివారు నమ్ముచున్నారు. ఐరోపా మహాసంగ్రామానంతరము ప్రపంచమునంతను ఇన్ఫ్లూయంజా జ్వరరాక్షసి చుట్టుముట్టి ఆయుద్ధమున మడిసినవారికంటె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హెచ్చుమందిని తనపొట్టబెట్టుకొని యున్నది కదా! ఒక్క భారతదేశముననే అప్పుడాజ్వరము పదిలక్షలమందిని మ్రింగివైచినది. ఇట్టిస్థితిలో ఇట్టిదే మఱియొకరోగము ప్రబలి నిరంతర పట్టణవాసమున ఆరోగ్యభ్రష్టులైన పశ్చిమఖండప్రజలను, మంది ఎక్కువగుటచే తినుటకు సరియైనతిండిలేక నీరసించియున్న తూర్పుఖండపు ప్రజలను తుడిచివేయజాలదా? అని ప్రశ్నింపవచ్చును. వైద్యశాస్త్రవేత్తల విశాలపరిశోధనముల వలన రోగనిరోధమునకు మార్గములు కనుగొనబడుచున్నవి. గాలితోడను వెలుతురులోను కలిసి తిరుగుచు రోగములను కొనివచ్చు సూక్ష్మజీవులను నాశనముచేయుట; పరిశుద్ధమైన పానజలమును సరఫరాచేయుట; పాలు, ఫలములు, వెన్న, గ్రుడ్లు మొదలగు పుష్టికరములైన ఆహారపదార్థములను అందుబాటున నుండునట్లు చేయుట—మొదలగుపద్ధతుల నవలంబించుటవలన అంటురోగములు నిరోధింపబడుచునే యున్నవి. ఇట్టి ఆరోగ్యకరమైన పద్ధతులు సమగ్రముగ నవలంబింపబడుచో అచిరకాలముననే అంటురోగములు దుంప శుద్ధిగ నాశనమొంది తీరుననుట నిక్కువము. ఈశరీరమార్గమును రోగమనుశత్రువుల దాడి నుండిజాగ్రత్తగకాపాడుకొందము. సరే. అయినను ప్రపంచము నాశనమగు నన్నభయము కలుగుటకు మఱియొక కారణము గలదు. అది ప్రస్తుత మానవలోకమున విపుల ప్రచారముననున్న జన్మనిరోధవాంఛ. మానవునిప్రాక్తన నాగరికతా చరిత్రమున కొన్ని దేశము లొకప్పుడు శిఖరమునకు పోయినవి. నిరంతర నగరవాసమున పాడటిన అట్టి నాగరికజాతుల జాతీయారోగ్యమునకు నూతనోత్తేజమును కల్గించుటకు అరణ్యములనుండి మోటుజాతివారు దాడివెడలి వచ్చి వారితో కలియుచుండిరి. ఆపరిస్థితు లిప్పుడు మాఱిపోవుచున్నవి. వార్తాపత్రికలు, సినీమా, రేడియో మొదలగునవి ప్రపంచముయొక్క మూలమూలల కూడ నాగరికతాబీజములను విత్తుచున్నవి. నాగరికత జన్మనిరోధమును ప్రేరేచుచున్నది. దీనికి వ్యతిరేకప్రచారము జరుగవలసియున్నది. ప్రపంచము బహుజనాకీర్ణమై యున్న దనువాక్యమున సత్యమిసుమంతయు లేదని నేను నిరాఘాటముగ చెప్పగలను. బ్రిటీషుద్వీపముల ప్రాంతముననున్న చిన్నిద్వీపమగు వైటునందు సరస్సునందు పద్మములుండు మాదిరిగా ప్రపంచమునందలి మానవులందఱు నిలిచినచో, ఇంకను పెక్కుమందికి తావుండునని గణింపబడినది. అట్టిచో విశ్వము విశేషజనాకీర్ణమైన దనుటకు వీ లెక్కడ? మానవునిపాదములు త్రొక్కిచూడని భూము లెన్నియో ఇంకనుగలవు. శాస్త్రపరిశోధనమున భూమినుండి ఇంకను మంచిఫలితమును తీయవచ్చును. తేలిన పర్యవసాన మేమనగా, జన్మనిరోధమునకు ప్రస్తుత పరిస్థితులలో అవసర మెంతమాత్రమును లేదని. మానవు లీసత్యమును కొలదికాలములోనే గ్రహింతురు; జన్మనిరోధమునెడ విముఖులు కాగలరు. ప్రపంచమునకు ఇంతట అంతట నాశనము లేదు.

ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.






పాంచాలకేసరి శ్రీ లజపతిరాయిగారి విగ్రహము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పాంచాల కేసరి శ్రీలజపతి రాయిగారి కంచువిగ్రహము

బరోడాలోని గొప్పశిల్పి శ్రీ కే. కోల్హాత్ గారు దీనిని చేసిరి. ఈవిగ్రహమును మొన్న ౩౦వ తేదినాడు లాహూరులో శ్రీపటేలుగారు సంస్థాపించిరి.

---

## ఖద్దరు—ఆచార్య రాయిగారు

లాహోరులో కాంగ్రెసువారేర్పాటు చేసిన స్వదేశీ ప్రదర్శనమును తెరచు సందర్భమున శ్రీయుత ప్రఫుల్ల చంద్ర రాయ్‌గారు ఖద్దరు ఉద్యమమును గూర్చి చక్కని యుపన్యాస మొసంగినారు. అందు ౧౯౦౫ సం॥ నాటి స్వదేశీ ఉద్యమమునకును నేటి ఖద్దరు ఉద్యమమునకును గల భేదమును గూర్చియు, ఖద్దరు ఉద్యమముయొక్క ఆశయములను గూర్చియు దెలుపుభాగము లీక్రింద నుదాహరింపబడుచున్నవి.

### స్వదేశీ ఖద్దరు ఉద్యమముల భేదము

"ఖద్దరు ఉద్యమము ౧౯౦౫ సంవత్సరము నాటి స్వదేశీ ఉద్యమమునుండి పుట్టినదే యన్నట్లు పైకి కాన్పించినను నిజమది కాదు. ఆనాడు నిజమగు స్వదేశీ ఇది యని నిర్ణయింపదగినదిగ నుండలేదు. రాటమును మరల చేబూనెదమనియు, విదేశీవస్త్రము గొనుటకంటె గోనిసంచులతోనే సంతృప్తిజెందెదమనియు మన మానాడు శపదించితిమి. తుదకు బొంబాయి అహమ్మదాబాదు మిల్లులపై నాధారపడితిమి. అంతటితో మన స్వదేశీతత్వము తృప్తినొందినది. కాని అసహాయోద్యమము ప్రబలుచుండిన దినములలో మరల చర్ఖాప్రసంగము వచ్చినప్పుడు ఇది వెనుకటిస్వదేశీ ఉద్యమపు తరంగమే యొకటి మరల వచ్చుచున్నదని మనము తలచితిమి. ఈస్వదేశీ ఎల్లరకు గాకపోయినను, వంగదేశీయులమగు మాకు సుపరిచితమే. రాట మొక శిథిలమైపోయిన పనిముట్టుగ మేము తలచితిమి. దానినిగాని, దానిపేరునుగాని, ఇంతకు ముందు మే మొకసారి ఉపయోగించియుంటిమి. దానినిబట్టి భిన్నములగు నిప్పటి రాజకీయ పరిస్థితులలో రాటపు సవరింపు దుర్బలమగుటచే ప్రయోజనకారిగ నుండదని మేము తెలిసికొంటిమి. ఐనను దానిప్రచారమును సాగించుచునే యుంటిమి.



ఆచార్య రాయి గారు

"కాని గాంధి-తత్వము క్రమక్రమముగ నభివృద్ధి నొందుచున్న కొలదిని ఆయన చర్ఖాఉద్యమమునకును 'స్వదేశీ'కిని ప్రధానముగనే భేదము కలదని స్పష్టమైనది. స్వదేశీఉద్యమము కేవలము రాజకీయాధికారములను సంపాదించుటకొక యాయుధముగ దలంపబడెను. గాంధిజీ ఖద్దరుఉద్యమ మట్లు కాదు. దన్ను ప్రయోగించువారియెడలను, తన ప్రయోగమునకు లక్ష్యమగువారి యెడలను గూడ, ఉభయత్ర, ప్రేమమీదనే యాధారపడియున్నది రాటము."

అటుపై ఖద్దరు ఉద్యమముయొక్క ఆర్థిక ప్రయోజనమును వివరించిన తరువాత దాని యాశయములనుగూర్చి వా రిట్లు నుడివిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### ఆ శ య ము

"ఇంతయయ్యును గాంధిజీ ఉద్యమము కేవలము నత్యుదాత్తమగు నౌదార్యముమీదనే యాధారపడియు న్నది. ఇంగ్లీషువారినిగాని, మరి యెవ్వరినిగాని, తుద కొక యీగనుకూడ, గాంధి బాధింపదలపడు. తన పరి శ్రమలనన్నిటిని గోల్పోయి ఇంగ్లండు పస్తుండవలెనని అయన కోరడు. భారతదేశమును దాని యిచ్చవచ్చినట్లు బ్రతుకనిండని ఇంగ్లీషువారి నతడు కోరుచున్నాడు. రాజ కీయ నిర్బంధముల సహాయమున బ్రిటీషు వస్త్రమును హిందూదేశముపై ద్రోయుట మానవలయునని వారి నత డడుగుచున్నాడు. దీనితోపాటుగనే తన స్వీయపరి స్థితులను చక్కబెట్టుకొని బాగుపడు మార్గమునుగూడ ఇంగ్లండు దేశమున కాయన సూచించుచున్నాడు. లక్షల కొలది ఆసియాదేశీయులను దారుణములగు బాధలలో పడ ద్రోయకయే ఇంగ్లండు జీవింపగలదు. ఆజీవిత మెట్టిదో ఆదేశ మింకను తెలిసికొనవలసియున్నది. తన ఊహలోని, తన ఆశయములకు జెందిన భారతదేశము నుదాహర ణముగ జూపి, యందుండి గుణపాఠము నేర్చుకొన వలసినదని గాంధిజీ ప్రపంచము నడుగుచున్నాడు. జీవిం చుట యేమో, జీవింపనిచ్చుట యేమో నేర్చికొమ్మని హిం సాత్మకమగు ప్రపంచము నాయన అడుగుచున్నాడు. ఇదియే ఖాదీ స్వదేశీ ఉద్యమములకుగల ప్రధానభేదము.

"దూరాలోచన లేనివారి కది కేవలము ఆర్థికమగు పన్నుగడ యని తోచవచ్చును. కాని రాజనీతికి, ఔదా ర్యమునకు, మతమునకు, దయాగుణమునకు సంబంధించిన యత్యున్నతములగు నాశయములు ఖాదీయుద్యమమున గర్భితములై యున్నవి.

"రాటమును స్వీకరించుటయన్న యంత్రసాధన ముల నధఃకరించుటయని తలపరాదు. అది కేవలము విరు ద్ధము. రాట్నమే ఒకయంత్రము. తాను యంత్రముగనే భావింపబడదగునని యని కోరుచున్నది. గాంధిజీకూడ యంత్రముల ప్రచారము సాగవలయుననియే కోరుచు న్నాడు. కాని షర తిది: ధనవంతులనురాశికు సాయపడి దరిద్రుల నణదివేయుట కవి సాధనములు కాగూడదు. ఇదియే గాంధి-తత్వము; ఇదియే చర్ఖాఆశయము. జాతీ యపతాకపై ముద్రితమగు రాటమున కర్థ మిదియే. నిఖిల మానవసోదరత్వమే భారతీయాదర్శము. జాతీయ పతాకపైని చర్ఖా యిదియే చెప్పును."

---

## మో హ ము

వేలూరి శివరామశాస్త్రి గారు

(గీతి)

౧

రాత్రికిని రాత్రికిని మధ్య రాయి వోలెఁ
బగలు సృజియించు బ్రహ్మ దుర్భాజనుండు.
లోకముల కెల్ల మోహమే యేకదైవ
మాదిదైవము కాకున్నయట్టు లయిన
నిమ్మహా విశ్వ మేరీతి నేఁగుదెంచు?
కాముఁ డొక్కఁడె ప్రేమ కేకాంతగురువు,
విషయసుఖములు గ్రోలెడు విశ్వమూర్తి.
ధరణి నెల్లెడ మన్మథ తాండవంబె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉల్లము ల వెల్ల మన్మథు నుపనంబు
లే. వసంతము, తొలకరు లిక్షుశరు వి
భూతులే. యల్ల హేమంతములు ప్రసూన-
బాణు బిగికౌఁగిలింత లీవాఁకదిన్నె
లందు నతఁ డొంటరిగఁ బోవు నప్పుడపుడు.

౨

మదనుఁడా! యిందు రాదురా మాకు నిద్ర;
గాలిచేఁ గ్రాలు శైల శృంగములయందు,
వికసి తాశోక వృక్ష వాటికలయందు,
ప్రణయ కలహా కటాక్షోదరములయందు,
అదయ విరహాసమాలోల హృదయమందు,
చలిత ధూర్త విపక్ష వక్షముల యందు,
తోడఁ జైత్ర వసంత చంద్రులను గొంచు,
మెత్తగాఁ బాన్పు వేయరా యత్తమిల్ల.

౩

అల్ల ధనదుని నవనిధుల్ కొల్లగొందు;
శుక మునీంద్రుని గుంభదాసుని బొనర్తు;
ప్రేమ నలకూబరునకు నెమ్మోముఁ జూపి
రంభ గుండియలందున రాయి నైతు.
ఇంద్రునకు మోముఁ జూపక యేడిపింతు;
గాథ వైరాగ్యమునకు శృంగార కావ్య
తతుల దైనందినంబును గృతుల నిత్తుఁ
బ్రవరుచేత వరూథినీ భాగ్యవతిని
వేడఁగాఁ జేసి నిచ్చలు విఫలపఱతు.

౪

సిగ్గుల్ తగ్గులు వారి వీరి భయముల్ చేదస్తముల్ చాటుగా
నగ్గంబైన విలాసముల్ మఱియు నేమండీ యటం చెన్నికల్
పగ్గాలున్ మఱి కక్కుకళ్లెములునుం బంచాస్త్రు గుర్రాని కీ
దృగ్గాథా వ్యతిరేక సౌఖ్యములు మీ కెల్లప్డు లాభించుతన్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## వైదిక నిలయము

లోకమాన్య తిలకు మహారాజు రచించిన 'The Arctic Home in the Vedas' అను గ్రంథమునకు స్వేచ్ఛానువాదము. అనువాదకులు: మానికొండ సత్యనారాయణ శాస్త్రి గారు. ప్రకాశకులు: విజ్ఞానచంద్రికా మండలి, బెజవాడ. క్రౌను ౧౬ సైజు; ౨౪౮ పుటలు. వెల రు. ౨-౮-౦.

ఆర్యుల ఆదిమనివాసము ఉత్తరధ్రువప్రాంతమని సిద్ధాంతీకరించుట ఈ గ్రంథము తాత్పర్యము.

ఈ విషయమై పెక్కుసిద్ధాంతములు ప్రబలియున్నవి. ఆర్యులు తొలుత మధ్యఆసియాలో నుండియుండిరని యొకవాదము. భరతవర్షమే వారితొలుతటి యావాసభూమియని యొకటి. క్రిస్టదొరవారు నార్వేప్రాంతమని సిద్ధాంతము చేసిరి. భారతీయులలో భరతవర్ష వాదము చాలగ ప్రబలియున్నది. భరతవర్షమే కాబోలునని యెంచుచుండిన తిలకగారికి వేదవాఙ్మయాదులలో ఉత్తరధ్రువప్రాంతముపై అనుమానము ప్రాకించుపట్లు తెసులగా పరిశోధన బలపఱిచి యీగ్రంథము వెలువఱిచినది. ఆర్యజాతుల పూర్వవాఙ్మయము వీరు తరిచిరి. వేదభాష్యములలో భరతవర్షమే ఆర్యుల ఆద్యావాసమును దృష్టిలో వ్యాఖ్యాతలు గావించినసమన్వయములలో అసమంజసతలు గ్రంథకర్తకు గోచరించినవి. జ్యోతిషాదిశాస్త్రముల సంగతిని ధ్రువప్రాంతవాదమునకు సమన్వయము కుదురుట పొడగట్టినది. పార్సీ, గ్రీకు, నార్వే, ఇండో-ఇరేనియన్, ఇండో-జర్మన్ మున్నగు ఆర్యవాఙ్మయములలో ఈ సిద్ధాంతమునకు ఉపష్టంభకము లగు విషయములు దొరకినవి, భారతవాఙ్మయములోని విషయములతో సరిపోయినవి.

మంచుతో నిండి వాసయోగ్యము గాని ఉత్తరధ్రువప్రాంతము అంతసభ్యతతో వెలిగిన ఆర్యజాతికి ఆద్యావాసమగు భాగ్యమున కెట్లు నోచుకొనగల్గె ననుశంకకు పురాతత్త్వశాస్త్రము, భూగర్భశాస్త్రము సమాధాన మొసగినవి. పూర్వము రెండుకాని, యెక్కువకాని హిమప్రళయములు వచ్చియుండెననియు, రెండుహిమప్రళయముల నడుమ ధ్రువప్రాంతముల శీతోష్ణస్థితి ఎక్కువ అనుకూలమై నిత్యవసంతముగ నుండెడిదనియు, కడచిన హిమప్రళయములో ఆస్థితి చెడి ఆప్రాంతములు వాసయోగ్యములు కాకపోయెననియు, మఱి ఆ నిత్యవసంతభూమిని గొప్పసభ్యమానవసంఘము వసించుచుండెననియు, వారిసభ్యత ఏనాడు మొదలయ్యెనో చెప్పజాలమనియు, ప్రళయానంతరము వారా భూమిని విడిచి అనుకూల గృహాన్వేషణమున దక్షిణదిశకు చేరిరనియు, పిదప తమ ప్రాచీనసభ్యతను వాగ్రూపమున భద్రపఱుచు కొన్నారనియు భౌతికశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. వేదములు అనాదులనియు, అపౌరుషేయములనియు, ప్రళయమున వేదములు నశింపగా, పిదప ఋషులు తమ తపశ్శక్తిచే తాము జ్ఞప్తియం దుంచుకొన్న వేదములను 'కేవల మవే మాటలతో కాకపోయినను, అవే అర్థములతో తిరిగి నిర్మించిరి'. అనియు చెప్పు మనవైదికుల అభిప్రాయము. ఈ శాస్త్రవాదముతో సరిపోవుచున్నవి. ఈ శాస్త్రములు ధ్రువప్రాంత సిద్ధాంతమునకు చాల తోడ్పడినవి. నేటిధ్రువప్రాంతస్థితి ఈ సిద్ధాంతమునకు అడ్డు తగులనేరదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్రువబిందువు కడ ఆఱుమాసములు పగలును, ఆఱుమాసములు రాత్రియు, సంవత్సరమంతయు నొక్కపవలు, నొక్కరాత్రిగ నుండును. భూమధ్యరేఖ వంకకు వచ్చుకొలది, క్రమముగ ఐదుమాసములు దీర్ఘ దివసమును, ఐదుమాసములు దీర్ఘరాత్రమును, నడుమ ఎనిమిది జాముల అహోరాత్రములును (అవియు విషమ ప్రమాణములు); నాల్గుమాసముల దీర్ఘదివస దీర్ఘరాత్రములు; ఒకమాసము ప్రమాణము గలవి; రానురాను ఇరువది నాల్గుగంటల సమానములగు అహోరాత్రములు పరిణమించును: దీర్ఘదివస దీర్ఘరాత్రము లుండుచోట సంధ్య పెద్దదిగ—కొన్ని దినములు, ధ్రువముకడ సుమా రొక్క మాసము కూడ—ఉండును. ఈలక్షణముల వర్ణించు భాగములును, సూచించు వైదికగాథలును పెక్కులు ఈగ్రంథమున వివరించిరి. అవి ఆర్యుల అనుభవగతము లైనటులును సమంజసముగ నిర్ధరించిరి. మన సంవత్సరమే దేవతలకు ఒకదినమనియు, మేషసంక్రాంతితో వారికి సూర్యోదయమనియు, తులాసంక్రాంతితో తదస్తమయమనియు ప్రాచీన వాఙ్మయమందు విరివిగ గలదు. ఇటీవల మకర సంక్రాంతితో సూర్యుని ఉత్తరగతి ప్రారంభ మగుటచే అది ఉత్తరాయణ ప్రారంభమనియు, కర్కాటక సంక్రాంతితో దక్షిణగతి ఆరంభమగుటచే నది దక్షిణాయన ప్రారంభమనియు వాడుకవచ్చినది గాని, పూర్వము భూమధ్యరేఖకు ఉత్తరమున సూర్యుడున్నంతకాలము, అనగా మేషసంక్రమణము మొదలు తులాసంక్రమణము వఱకును ఉత్తరాయణము, తక్కిన వత్సరార్ధము దక్షిణాయనమును. తరువాతి వాడుకనుబట్టి 'ఉత్తరాయణము దేవతలకు పగ లెట్లగునని శంకించిన భాస్కరాచార్యుల వారిశంకకు ఇది నివృత్తియు. 'ఖగోళశాస్త్రప్రకారము అప్పటి వారు లెక్కవేసి చూచి యీవిషయమును (తమకండ్లార చూడకయే, వినకయే) కేవలము మేధాశక్తివలన కనుగొనిరని కొంద ఱూహింపవచ్చును. కాని......ఖగోళశాస్త్రమును, తత్సంబంధమగు గణితమును సంహితా బ్రాహ్మణకాలముల కిటీవలనే వృద్ధినొందినవి. బ్రాహ్మణకాలమున వారికి గణితము తెలియునని నమ్ముటకు వీలు లేదు. కాన నీవిషయమును వారు కండ్లార చూచియైన నుండవలెను; లేదా, తమతాత ముత్తాతలు చెప్పుకొనుచుండగ వినియైన నుండవలెను.' అని గ్రంథకర్త వాదము.

ఇట ఉదాహరించిన పార్సీగ్రంథము 'వెండిడాడ్' లోని గాథ దీనికి చాల ఋజువుగ నున్నది. ఋగ్వేదమున నొకచో సప్తర్షి మండలము చాల ఎత్తుగ నున్నదని వర్ణన గలదు. అది ఉదయించునని కాని, అస్తమించునని కాని వర్ణింపక, పగలు కన్పింపదనియు, రాత్రి కన్పించుననియు మాత్రము చెప్పియున్నది. ఇది కేవలము ధ్రువప్రాంతలక్షణము.

ఇట తిలకుగారు తడవని ఇంకొక సమన్వయము పొడగట్టెడిని. సంధ్యావందనములో అర్ఘ్యప్రక్షేపణమైనవెనుక, 'అసావాదిత్యో బ్రహ్మ' యని ఆత్మప్రదక్షిణము చేయుట కలదు: దీనికి, ఎదురుగ నుండు సూర్యుని జూపి 'ఈ ఆదిత్యుడు బ్రహ్మ' యని చెప్పక, చుట్టు చూపుటచే ఇంకొక ఆదిత్యుడు ఆ వలయగతితో నున్నాడనియు, అతడు బ్రహ్మయనియు కొందఱు పండితులవ్యాఖ్య వినబడుచున్నది. కాని ఇది శాస్త్రసిద్ధముగ గాన్పింపదు. ధ్రువప్రాంతములందు సూర్యుని వర్తనము చుట్టు అడ్డముగ నుండుటచే మనపూర్వులా ప్రాంతముల వసించినప్పటి ఆచారమే యిది యని చెప్పుకొనవగును.

ఇక వేదమందు వర్ణితమైన ఉషస్సు ధ్రువప్రాంత లక్షణములకు సరిపోవుట చర్చింపబడినది. పిదప దీర్ఘదివసము, దీర్ఘరాత్రము ఇత్యాది. దీర్ఘరాత్రమును తొలగించి సూర్యుని విడిపించుటయే వృత్రవధ యని వీరు సమన్వయించిరి. దీర్ఘసత్రములు (ఏడుమాసములవి, తొమ్మిదిపదిమాసములవి మున్నగునవి) రాబోవుదీర్ఘరాత్రమున ఇంద్రునికి 'వల!'తో జరుగుయుద్ధమున జయము చేకూరుట నిమిత్తమట. ఇట్లు పెక్కువిషయములు సప్రమాణముగ, సయుక్తికముగ సమన్వయింప బడినవి.

పిదప ఇతరార్యవాఙ్మయములలోని పోలికలు కూర్పబడినవి. పౌరాణికగాథలలోనే కాక, ఆనుషంగిక భాషాతత్త్వశాస్త్రము (Comparative Philology)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుసరించి భాషయందును పోలికలు చూపి ఈఆర్య జాతుల పూర్వజులు ధ్రువప్రాంతవాసు లని చూపబడినది.

క్రిస్ దొరవారు నుడివినట్లు, నార్వే ప్రాంతమని నిర్ణయించుటకు ఆధారములు లేకపోయినను, ధ్రువప్రాంత మగుట మాత్రము సత్యమని ఈ గ్రంథకర్త సిద్ధాంతము.

వాదము మిక్కిలి సమంజసముగ గావింపబడినది. రచనామాత్రము కడుసొంపుగా కూర్పబడియున్నది. విషయము అతివిస్పుటముగా విడబడి విందుగా నున్నది.

అనువాదము యథామూలముగా నున్న ఇంకను ప్రాముఖ్యము వహించియుండెడిది. అయినను తెలుగులో తెలియునట్లు చెప్పుటకు వీలుపడని పారిభాషిక సాంకేతిక విషయములతో గ్రంథభాగములు దుర్బోధ మొనరించుట కంటె తెలుపగల్గునవే పొందించిన బాగుండునని యెంచి యుందురు అనువాదకులు. ఇది చక్కని సంగ్రహానువాదము. ఇట్టి గ్రంథమును కడు భరళమగు శైలిలో నింత రుచిగా వ్రాయుట మిక్కిలి ప్రశంసనీయము. కొం. జ.

---

## Hindu Marriage *Vs.* Polygamy

'హిందూ వివాహములు—బహు భార్యాత్వము' అను విషయమునుగూర్చి రాజమహేంద్రవర నివాసులును, న్యాయవాదులును నగు కె. వి. యస్. ఆచార్యగారు ఆంగ్లభాషలో వ్రాసిన 90 పుటల క్రౌను సైజు గ్రంథ మిది. సంస్కృతము తిన్నగ అర్థముచేసికొనలేరక న్యాయాధికారులు చేసిన తీర్పులనుబట్టి హిందువులలో మధ్యమ తరగతివారిలో బహుభార్యలను గ్రహించు నాచారము ఏర్పడ్డదను నిజమును ఆచార్యుల వారు బహుగ్రంథముల పరిశోధించి ఇందు నిరూపించియున్నారు. వివాహ మంత్రములుగాని, హిందువుల ఆచార వ్యవహారములుగాని బహుభార్యాత్వమును ప్రేరేచుట లేదను సంగతి వీరు బహుప్రమాణములతో నిర్ధారణ చేసినారు. అయితే ప్రస్తుతము హిందూసంఘములో బహుభార్యల పరిగ్రహించు ఆచారము నెలకొనుటకు కారణ మేమి ? అని ప్రశ్నించుకొని గ్రంథకారులు వాని తగిన ప్రత్యుత్తరముల నిచ్చియున్నారు. బహుభార్యాత్వమునకు భారతీయులను మొదట ప్రేరేచినది కోర్టు తీర్పులు. ఈ కోర్టుతీర్పుల నుపలక్షించి యువకులు ఆడువారియెడల అలసభావము వహించుటయు, తాము ఎన్నిసారులైన వివాహమాడుటకు హక్కు గలదను ధీమా నొందుటయు సంభవించినది. ఇందుకు తోడు దేశమున ప్రబలిన వరశుల్కములు యువకుల జాత్యహంకారమును మరింత పెంచినవి. ఇవి అన్నియు కూడి స్త్రీలజీవితమును దుర్భరము చేసినవి. ఈపట్టున ఆచార్యులుగారు—తాము ప్లీడర్లు అయియుండుట-ఉన్న సంగతుల నన్నిటిని చక్కగ ఎట్టి గజిబిజియు లేక వివరించిరి. అంతతో బారూరుకొనక స్త్రీల జీవితమును దుర్భరముచేయుచున్న బహుభార్యా పరిగ్రహణాచారమును రూపుమాపుటకు ప్రభుత్వము శాసనము గావింపవలయునని హెచ్చరించుచు శాసనము ఉండవలసిన పద్ధతికూడ ఒక్కింత సూచించియున్నారు. హరవిలాస శారదావంటి దేశహితైషులెవరో ఇట్టిపనికి పూనుకొని అది జయప్రదముగ నిర్వహించి దేశకళ్యాణమునకు తోడుపడవలసిన అవసర మెంతేనిగలదని ఈ గ్రంథపాఠకులు విశ్వసించి తీరెదరు. స్త్రీలస్థితిని చక్కచేయ పలువురు పలుముఖములుగా పనిచేయుచున్నారు. వారి స్థితిని చక్కచేయుటకు మార్గము లన్వేషించి వానికి తగు ప్రచార మిచ్చుటకును, లోకాభిప్రాయమును సంస్కరించి రాగల ప్రభుత్వమువారి శాసనమునకు స్వాగతోపచారము చేయుటకును నిట్టి గ్రంథమును రచియించిన ఆచార్యులుగారిని అభినందించుచు విరమించుచున్నాను.

ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

---

## అభినవకృష్ణుడు

దివ్యజ్ఞాన సమాజమనబడు Theosophical Society వారు ఇరువదియేండ్లుగ, రాబోవు జగద్గురువు జిడ్డు కృష్ణమూర్తిగారి నావేశించి వారిపరముగ లోకమునకు మతబోధ గావించునని ప్రచురించుచుండుట మన మెఱుంగుదుము. నేడు కృష్ణమూర్తిగారు తాను లోకగురువును కాననియు, తన్నాశ్రయించి ఎవరు నుండకూ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డదనియు, మనుష్యులయొక్కయు, గ్రంథములయొక్కయు అభ్రాంతత (అపౌరుషేయత్వము)ను నమ్మియుండరాదనియు, తాను థియోసఫీప్రచారము చేయుచుండుటలేదనియు, ఏయొక్క మతముగాని ఆచారముగాని పరిపూర్ణమును, పరిశుద్ధమును కాదనియు, సకలమానవులును పరాశ్రయమును, మూఢవిశ్వాసమును, ఛాందసమును, పలురకములగు విగ్రహారాధనను, అన్నివిధములగు పరిమితులను విడిచిపుచ్చి అనాది-అనంతతత్త్వము ననుభవమునకు తెచ్చుకొనవలయుననియు బోధించిరి. తన్ను లోకగురువుగ, పరమాదర్శముగ పెట్టుకొని థియోసాఫికల్ సంఘముతరపున సభ్యులుగ చేరి పరాశ్రయులై, శ్రోత్రరకపు ఛాందస మలవరచుకొనుచుండిన 'తారక సంఘము'ను తీసివేసి, సత్యమును, దైవమును, పరిమితులు గలిగిన ఒక పేరున ముద్రవేయబడునవి కావని చెప్పిరి. తా నేమతమునకు, ఏసంఘమునకు చెందనివాడ ననిరి. సకలప్రాణులయందలి జీవముయొక్క ఐక్యమును గుర్తింపుమనిరి. తనకు తానే వెలుంగుగా నుండవలెననిరి. స్వాత్మ నిర్బంధమునుండి విముక్తిని పొందవలెననిరి. ఎవరిలక్ష్యమును వారే స్థాపించుకొని తత్ప్రాప్తికొఱకు త్రికరణశుద్ధితో నిరంతరము ప్రయత్నింపవలె ననిరి. పరమశాంతియు, సుఖమునే పరమాశయములనిరి. సత్యమే దేవుడనిరి. స్వానుభవములనుండి వివేకజ్ఞానముల సంపాదింప వలెననిరి. ఎవరికిని, దేనికిని దాసులము కాగూడదనిరి. ఆత్మీయస్వేచ్ఛ నలవరచుకొనవలె ననిరి. స్వయంతరణమును పరమావధిగ స్థాపించుకొని ఇక్కడనే, ఇప్పుడే దానిని సాధింపవలెను; అదియే మానవజన్మప్రయోజనమనిరి. తన్ను గ్రుడ్డిగా అనుసరింపవల దనిరి. ఎవరి ఆత్మలను వారు కోల్పోవవలదనిరి. కృష్ణమూర్తిగారిసందేశముల అర్థమును మానవులు సరిగ తెలిసికొందురుగాక! వ్యక్తులకు, సంఘములకును మనుష్యు లమ్ముడుపోకుందురుగాక!

ఈపుస్తకమునందు కృష్ణమూర్తిగారి జీవితచరిత్ర సంగ్రహమును, బోధనలును కలవు. ఇప్పటికాలపు వీరిని గూడ పాచీనుడగు శ్రీకృష్ణునితో సమన్వయము చేయవలసిన ఛాందసమే మనకు పోవలెను. జ. బ్ర.

---

## విమర్శనము

### పతితనళిని

గ్రంథకర్త: పోడూరి రామచంద్రరావుగారు, బి. ఏ., బి. ఎల్. సరస్వతీగ్రంథమాల, కాకరపర్రు: ౨౨వ పుష్పము. డెమ్మిసైజు, ౧౭౬ పుటలు. వెల ౧-౧౨-౦.

ఈ నవల "అత్యద్భుత అపరాధపరిశోధక నవల" గా చెప్పుకొనబడ్డది. కొన్నిపుటల ప్రకటనలు మొదలైనవి త్రిప్పగా అసలు కథ మొదలైనది. చదువగా చదువగా, విమర్శదృష్టిని తాకినది కథాక్రమము లేమి. ఏనవలకైనా-అత్యద్భుత, అపరాధపరిశోధక నవలకైనా-కథాక్రమము ప్రాణము. నవలకు మరికొన్ని ప్రాణాలు ఉన్నా, 'ప్లాటు' ఆయువుపట్టు. ఇదే మన నవలలో దొరకకపోవుట దురదృష్టకరము. ఇంతకూ ఇది ప్రథమభాగము. ఇకపై ఎన్నిభాగాలు ప్రకటించబడునో పరమేశ్వరుని కెరుక. కాని ఒకటి. దీనిని చదివిన పిమ్మట వచ్చే భాగముకొరకు ఎవరైనా ఆత్రుత పొందుతారా అన్నది సందేహాస్పదము. మామట్టుకు మాత్రము అట్టి ఆత్రుత లేదు.

ఈ నవలలో అద్భుతములు లేవు (ఇదే ఒక అద్భుతము కాకపోతే). అపరాధ మున్నా పరిశోధక చాకచక్యము లేదు. ఐనా ఇది "అత్యద్భుత అపరాధపరిశోధక నవల" అనుకొనుటవల్ల అందుకొరకే ఆవురావు రను పాఠకు లున్నారు. శ్రీ. శ్రీ.

---

### విక్టోరియా క్రాసు

గ్రంథకర్త్రి: కవితిలక పులవర్తి కమలావతిదేవి గారు, సీతావిలాస్, రాజంద్రి. పుటలు ౧౧౫ వెల రు. ౧.

ఎట్టి రచనలోనైనా 'స్వతంత్రత' అనే గుణము వాంఛనీయము, స్తవనీయము. 'విక్టోరియా క్రాసు' అన్న నవలలో ఈ గుణము ఎంతవరకు ఉన్నదంటే, ఐరోపా సంగ్రామాన్ని కథావస్తువుగా తీసుకున్నంతవరకు-అంతే! ఆపై సంగ్రామసందర్భాలను పేరుకోవడములోను, వాటిని మూలకథతో మేళవించడములోను (కొన్నిటినే చెప్పవలెనంటే) శిల్పలోపము కానవస్తుంది. యుద్ధవిశే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షాలు పత్రికావార్తలవలె చెప్పబడినవి కాని నవలాచైతన్యములో. కూడుకున్నవిగా లేవు. పత్రికాకథనములో కళారమ్యత దొరకకుంటే దోషము కాదు కాని నవలా రచనలో అట్టిలోటు గట్టిలోటు కాకపోదు. ఇట్టిలోపే కథ అల్లికలోను కానవస్తుంది. జటిలత లేనందువల్ల "అల్లిక" అన్నపదము ఉపయోగించ నక్కరలేదేమో. ఒక చిన్నమూలకథకు ఐరోపాయుద్ధాన్ని అంటించగా ఈనవల ఏర్పడింది. గ్రంథకర్త్రిగారు (ఉపోద్ఘాతము ప్రకారము) 'బహుయోర్పుతోడ నెన్నియోవిషయముల నేకూర్చి' రనుట నిర్వివాదాంశము. అయితే వాటి నన్నిటినీ వ్రాసివేయు ఉత్సాహము కళానిబంధనలను నిరసించింది.

ఈనవలను "ఐరోపాయుద్ధ అసమగ్రచరిత్ర"గా చెప్పవచ్చును. ఇందు అందము సమకూర్చని అచ్చుమాట అటుండగా, "పుడమిపతి" (పుట 39), "తాత్కాలిక వంతెనలు" (79), "సామ్రాజ్యపిచ్చి" (82) మొదలైన "సమాసతప్పులు" కొన్ని దొర్లినవి. పైని ఉపోద్ఘాతము నుండి ఉద్ధృతమైన "బహుయోర్పు" ఈ తెగకే చెందుతుంది.

ఈ పుస్తకమందలి భాష సరాసరిగా గ్రాంథికమే. శైలి ఎగుడుదిగుడుగా ఉన్నది. మచ్చుకి రెండుచోట్ల శైలి చూపించుచున్నాము:

"సర్వియాదేశవిస్తీర్ణము 34,000 చదరపుమైళ్లు. జనసంఖ్య 5,000,000. ఆదాయము 4,808,262 నవరనులు. వ్యయము 5,230,588నవరనులు......"(పు.54-55).

"ఈ దీప మొక పుటాకార దర్పణము యొక్క ప్రధానకేంద్రమున నుంచబడును. ఈదీప కిరణములు దర్పణముపై బడునపుడు వాని నన్నివైపుల చెదరనీయక, యొక్కవైపునకే పరావర్తింపజేయును. ఇది గాక యీ పరావర్తకిరణము లన్నియు సమతరములుగా బోవును. ఈ సెర్చిలయిట్లు నుపయోగించు వలయాంతర్మధ్యరేఖ సాధారణముగ నొకగజ ముండును......"(పుట. 72).

ఇట్టివి తమ్ముగూర్చి తామే చెప్పుకోగలవు. కాని కథకు వీటిప్రయోజనము స్వల్పము. సంబంధము దూరము. నవలాపాఠకుడికి వీటివల్ల కల్గునది ఉత్సుకత అని చెప్పజాలము.

ఇప్పటినవలలలో అసంఖ్యాకములవలె ఇదికూడా ఒకసాధారణనవల. కాని స్వయంవరానికి తయారయిన నాయికకు చర్చిలో పెళ్లిచేయించడ మొకటి అసాధారణమే అనిపించకపోదు. దీనిసమంజసత ఎట్లున్నా, ఇట్లు చదివినపిమ్మట మాకు సంతోషము జనించలేదు. శ్రీ. శ్రీ.

---

## కలువ రేకులు

గ్రంథకర్త:—బి. టి. కె. ఆచార్య (కవికుమార సమితి). చిన్నసైజు ౨౫ పుటలు; కానిఠపుఖరీదు.

ఇది యొక చిన్న విషాదగీతగ్రంథము. దీనిలో ౨౦౫ చరణములు మాత్రమే కలవు. ఇందు కేవలము వైరాగ్యవిషయకమగు విషాదము, నిర్వేదము గానబడుచున్నవి. కవికి భగవంతుడు "మెచ్చి కృపతోడ దర్శనమిచ్చినా"డట. కవియొక్క విషాదమున కీ క్రిందికష్టములు కారణములు:

హృదయమును బట్టిపిండిన చెదరికురియు
రుధిరకణములు నాపద్యరుతము, లోయి-
నిర్మలంబైన-శూన్యమనీవు మిచ్చి,
యనుభవింపుము వానిభావామృతంబు.
...............బాడబాగ్ని
.........వంటిరోగాల......
సాంతమే లేని దారిద్ర్యసాగరంబు
మోయలేనికష్టాల, విమోచనంబు
లేనిభగ్నప్రణయ భవరిక్తదుఃఖ
మాదిగాగల...

కావున కవి

నాదుకవితాంబు నాహినీస్వాదుసలిల
బిందువుల నీదు పాదారవిందములను
మనసు దీరంగ కడుగుచు దినము లెట్లొ
గడిపెదను జీవయాత్రను కాలమూర్తి.

అని యనుచున్నాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కష్టములు భగవత్కృతము లగునా కావా అను విషయములను గూర్చి గాంధిమహాత్ముడిట్లు చెప్పుచు న్నాడు: "మనుష్యుడు ఎంత ప్రయత్నించినను వికారము చెందుట మనకు తెలియును. అటులే భగవంతు డడ్డుపడి ఎదురొడ్డి రక్షించుటయు మనకు దెలియును. ఇదియం తయు ఎటుల సంభవించును? మనుజుడు ఎంతవఱకు స్వతంత్రుడు? ఎంతవఱకు పరతంత్రుడు? ఎంతవఱకు పురుషప్రయత్నము పనిచేయును? ఎప్పుడు ఈశ్వరేచ్ఛ రంగమున ప్రవేశించును? ఇదియంతయును గహనము; ఎన్నటికి గహనమే." (ఆత్మకథ ౩౫వ పుట.)

ఇట్టికష్టములను పురుషకారముచేతను, జీవనేచ్ఛ చేతను జయింపవచ్చును. విషాదగీతముల రచనకొఱకు విషాదపుటూహల పెంపొందించుకొనుట కష్టములు తరగ జేసికొనుమార్గము కాదు. ఈవిధమైన ప్రయత్న మీగ్రంథమునందు కానరాదు.

కవికి తనకవిత్వపు విషయమైన అహంభావ మీ చిన్నగ్రంథములో హెచ్చుగా కనబడుచున్నది.

కవిగ బుట్టింప నేల...
నాదుగీతాల వినువారు నాస్తి తండ్రి
విన్నను గ్రహింపజాలరు...
......నాకు నిర్మలమగు
సాధుకవితా ప్రవంతి నొసంగినావు.

మొదలగు వాక్యములందు తనకవిత్వమున కెక్కువ ఘనత నారోపించుకొనుచున్నాడు.

శైలి ధారాళముగనే యున్నది. అచ్చటచ్చట దుష్ప్రయోగము లున్నను, 'విన్నను గ్రహింపజాలని' రీతిగా లేదు.

వలయువారు గ్రంథకర్తపేర భవానీముద్రాక్షర శాల, బెజవాడ అని వ్రాయవలయును. జే. కా.

---

## అనాథ బాలిక

గ్రంథకర్త:—పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు. క్రౌను ౧౩౬ పుటలు. కాగితపు బైండు. వెల ౦-౧౦-౦. రాజమహేంద్రవరము, కలాభివర్ధనీ పరిషత్తుచే ప్రకటింపబడినది.

ఇది యొక సాంసారిక నవల. మనలో సాంఘిక నవలలు బహుతక్కువ. ఆయున్నవైనను చాలవఱకున కనువాదములే గాని స్వంతరచనలు గావు. ఇది మన చేతగానితనమే! ఇటీవల యీకొఱత కొందరిచే దీర్చబడుచున్నది. శాస్త్రిగా రట్టివారిలో నొకరు.

గ్రంథవిషయము:—వెంకటరావు పరమబ్రహ్మ సామాజికుడు. అతడొకవితంతువును వలచి సాంఘికదురాగ్రహములవలన నామెను ఇహలోకమునుండియే గోలోవ్వయెను. పిమ్మట దైవికముగా అండజేరిన ఒక అనాథబాలికకు తాను నాథుడై తనయుదారస్వభావమును, విశాలహృదయమును గనబరచెను. కాని తా జేసికొన్న వివాహము తుదకు బాల్యవివాహమేగాని ప్రౌఢవివాహమైన గాదు. వివాహపుతంతు యథాప్రకారముగా నాలుగువేలేండ్ల క్రిందట శాస్త్రములలో వ్రాసిచ్చిన రీతియే—కొన్ని కొన్ని పట్ల మంత్రములకు అర్థమును పురోహితుడు తెలియజెప్పెనట.

ఈగ్రంథమందు సంసారగోష్ఠి, సంభాషణలు బహుచాతుర్యముతో రచింపబడినవి. స్త్రీలకు అక్షరజ్ఞానము లేమిచే వారి సంభాషణలం దెంతసేపూ 'పిచ్చాపాటీ' కబుర్లుతప్ప చదువుకొన్నవారికి రుచించు విషయ ముండదు. శాస్త్రిగారి అసామాన్య పరిశీలన, అద్భుత భావన, కళానిర్వాహకత్వ మిందు ద్యోతక మగుచున్నవి.

శైలివిషయము:—గ్రంథకర్త చెప్పినట్లు వారి భావపరిణామము శైలిలో గన్పడుచున్నది. సాంఘిక రచనలకు గ్రాంథికము గాక వ్యావహారికము సరియైనదని కొంత స్పష్టమగుచున్నది. కాని శాస్త్రిగారు వ్యావహారికము ఒక్క-సంభాషణలందు మాత్రమే ప్రయోగించి తమవెఱపు జూపినారు. శైలియొక్క రసవిషయము వేరుగా చెప్పనవసరము లేదు: అమృతప్రవాహము-ఎంత త్రాగినను తనివి తీరదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలయువారు—పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, కలాభివర్ధనీపరిషత్తు, రాజమండ్రి-అని వ్రాయవలెను. జే. కా.

---

## తండ్రినుండి కుమార్తెకు జాబులు (ఆంగ్లము)

## (Letters from a Father to his Daughter)

గ్రంథకర్త:—జవహరిలాల్ నెహ్రూగారు. ౧౨౨ పుటలు. దళసరి మెఱుగుకాగితములు. అట్టబైండు. వెల తెలియదు.

ఇది యొక లోకజ్ఞాన ప్రదాయకమగు పుస్తకము. నెహ్రూగారు తమ పదేండ్లబాలిక యగు ఇందిరకు జాబుల మూలకముగా ప్రకృతిశాస్త్రములు, దేశచరిత్ర ఇత్యాది విషయములకు సంబంధించిన జ్ఞానమును తెలియజేసిరి. బాలబాలికల కీరీతిగా శాస్త్రములందును, చరిత్రలందును కౌతూహల మలవడజేయుట కిట్టిగ్రంథము లత్యవసరము. ఆంగ్లమునం దిట్టివికలవు గాని మనదేశభాషలందు బొత్తుగా లేవు. సమస్త విషయములలోను అగాధమైన జ్ఞానమును సేకరించిన యీకాలమునగూడ బాలబాలికలకు పూర్వకాలమునందు వలెనే తర్కమునకుగాని తత్త్వమునకుగాని నిలువలేని పురాణకథల పఠింపజేసి నీతిని, తత్త్వమును బోధింప జూచినచో, వాటి అర్థము గ్రహింపలేక వారి లేతమనస్సులు కౌతూహలమును, జ్ఞానేచ్ఛను గోల్పోయి, జడము లగుచున్నవి. జ్ఞాన మెరుగని పసిబిడ్డలకు నీతి, వేదాంతములయొక్క ప్రయోజనముకంటె ప్రాపంచికజ్ఞానము లెస్సగా కావలెను.

నెహ్రూగా రీగ్రంథమందు ఖగోళభూగోళ చరిత్రలు, జీవోత్పత్తి, జలచర, భూచర, నరాదిజీవుల విషయము, జీవుల అనుకూల్య (Adaptation) విధానము, ధీశక్తిప్రయోజనము, రామాయణ భారత కాలములు ఇత్యాది సమస్తవిషయములను ఇందు సూక్ష్మముగా దెలిపియున్నారు. బాల బాలికల కత్యుపయోగమగు గ్రంథము.

ఈగ్రంథమందు పెక్కు-మచ్చపైన చిత్రపటములు గలవు.

ఈగ్రంథమునకు హిందీఅనువాదము తయారగుచున్నదట. తెలుగులోనికి గూడ ననువదించిన లెస్సయగును.

వలయువారు—జవహరిలాల్ నెహ్రూ, అలహాబాద్-అని వ్రాయవలెను. జే. కా.

---

## రక్షాబంధనము

గ్రంథకర్త:—పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. 362 పుటలు. సాదాకాగితములు, అట్ట బైండు. వెల 1-8-0. కలాభివర్ధనీ పరిషత్తునుండి ప్రకటింపబడినది.

ఇదియొక పారిశోధకనవల. పారిశోధకనవలలు ప్రస్తుతకాలమున సాంఘికనవలలతో సమానపు తాహతను బడయుచున్నవి. ఇట్టి నవలారచనలు నాగరికలక్షణము గాకున్నను ప్రస్తుతపరిస్థితులలో ప్రకృతిని మార్చుట కష్టము.

ఈగ్రంథమందు మనకు స్పష్టముగా రెండు వేర్వేరు కథలు కనబడుచున్నవి. ఈ రెండిటికిని ఐక్యమధికముగా లేదు. మొదటిది సాంసారికము, రెండవది పారిశోధకము. మొదటిభాగములోని పాత్రలు చాలమట్టుకు రెండవభాగములోనికి రారు. మొదటిభాగము యొక్క విషయము కేవలము సాంసారికము, రెండవభాగము పారిశోధకము. పూర్వభాగమందలి పాత్రలుత్తమములు, ఉత్తరభాగమునందు నీచపాత్ర లధికము. వ్యభిచారకుల మింకను మనదేశమం దడుగంటలేదు. అయ్యది యే మన నాగరికస్థితిని విస్పష్టము జేయుచున్నది. రెండవభాగమునందలి స్త్రీపాత్రలు పడపుకత్తెలు. ప్రకృతిని బింబించుట కళలో నొకయంశము గనుక సాంఘికస్థితులు మారువరకును మనము చేయజాలిన దేదియు లేదు. ఇందలి అశ్లీలము హద్దులోనే యున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురుషపాత్రలలో నరసింహము యొక్కయు, రెడ్డియొక్కయు ప్రజ్ఞావిశేషములు వర్ణనాతీతములు. జగ్గారాయని విశాలహృదయమే కథయొక్క అనివార్య గమనమునకు కారణము. గ్రంథకర్తయొక్క ప్రజ్ఞ అగాధము గాకున్న నిట్టి సాంద్రకథాకల్పన, పరిపూర్ణ పాత్రపోషణ సాధ్యముకావు. శ్రీరాములు కేవలము నవలా పాత్ర గాక సజీవవ్యక్తియే యనిపించును. వాని సంభాషణలు మరపునకు రావు. మొత్తముమీద మనము పాత్రల మధ్య గాక నిక్కముగు స్త్రీ పురుషుల మధ్యనే తిరుగుచున్నా మనిపించును. శాస్త్రిగారి మౌలికత్వము (originality) అద్వితీయము.

ఇందలి పూర్వభాగమందలి స్త్రీ పాత్రల విషయమేమన, గ్రంథవాసన లేని వారల సంభాషణలు వంటిల్లు దాటవు. కాని వీరు ప్రకృతియందలి మనస్త్రీలవలె గాక, చమత్కారము, భళోక్తి, సంభాషణ నైపుణ్యమును గలిగి కొంత మెచ్చదగి యున్నారు.

శైలి విషయము:—ఉపోద్ఘాతమందు గ్రంథకర్త శైలివిషయమై తన యుద్దేశమును పూర్తిగా వ్యక్తపఱచియున్నారు. అందు శిల్పకళకు, కావ్యకళకు గల పోలిక గొంత చర్చించియున్నారు. అందు ఒక చిన్న లోపము గలదు. శిల్పచిత్రకళలకును కావ్యకళకును పోలిక సమగ్రము గాదు. అదేలయన, శిల్పచిత్రకళలు కావ్యకళకంటె ప్రకృతికి చేరువగా నున్నవి. ఉదా:—'ఓడ' అనుమాట తీసికొందము. ఓడ చిత్రమును వ్రాసిచూపిన యేజాతివాడైనను, పసిబాలుడైనను, 'ఫలానావస్తువు యొక్క చిత్ర'మని పోల్చుకొనును. కాని ఓడ అనుమాటను వ్రాసినచో మనభాషరాని విజాతీయుడు గాని స్వజాతీయుడు గాని తెలిసికొనలేడు. అనగా భాషకంటె చిత్రము ప్రకృతికి సమీపములో నున్నది. చిత్రకళకంటె శిల్పకళ పదార్థసమన్వితమగుట ప్రకృతికి ఇంకింత చేరువగా నున్నది. ఇప్పట్టున గ్రాంథిక వ్యావహారికముల విషయము చూతము: వ్యావహారికము సజీవము, గ్రాంథికము సజీవేతరము. గ్రాంథికమునకు మనుష్యుల భావనలో స్థానము గలదు. వ్యావహారికమునకు మనుష్యుల వ్యవహారములో స్థానము గలదు. అనగా గ్రాంథికము వ్యావహారికముకంటె ప్రకృతికి కొంచెము దూరములో నున్నదనుట. సాంఘికరచనలు వ్యవహారవిషయములు గనుక వ్యావహారిక భాషాప్రయోగమే ఎంతయు ఉచితము. గ్రాంథికము యొక్క విభాగము (roll) నిర్వహించుట కష్టము. కాని దానియొక్క తత్వము మాత్రము తేటపరచియున్నాము. మరియొక విశేషము: గ్రాంథికములో కృత్రిమ గ్రాంథికము, సహజ గ్రాంథికము అను విభజన చేయవచ్చును. సహజగ్రాంథికమునందు దీర్ఘసంస్కృత సమాసములు, మారుమూల పదములు, విపరీతాలంకారములు, అనవసర వ్యాకరణ బంధనలు దొర్లవు.

గ్రంథ శైలినిగూర్చి వేరుగా చెప్ప నవసరము లేదు. అమృత ప్రవాహము. ఎంత త్రావిన ఇంకను త్రాగవలె ననిపించును— జాతీయములకు, స్పష్టతకు, సౌలభ్యమునకు. చే. కా.

---

# స్వీకారము

## దాంపత్యము

(ఆంధ్రప్రకాశికా గ్రంథమాల. ౧) రాయల్ సైజు. పుటలు ౧౦౪. చందాదారులకు అంచెకూలితో వెల రు ౧-౦-౦. సంపాదకులు: దొంతంశెట్టి నాగేశ్వరరావుగారు ప్రకాశకులు: విశ్వభారతీ అండు కో. వారు, ౮౪, బందరువీథి, మద్రాసు.

## Thoughts on Diet

(ఆంగ్లము.) క్రౌను సైజు. ౮౮ పుటలు. వెల రు ౦-౮-౦.

గ్రంథకర్త: గౌరవనీయులగు న్యాయమూర్తి సర్ వేపా రామేశంగారు.

ప్రకాశకులు: The Indian Naturopathic Association, Bezwada.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## South Indian Music Series Book 2 (Stage 3)

క్రౌనుసైజు. ౭౫ పుటలు. వెల ౧-౮-౦

గ్రంథకర్త: పి. సాంబమూర్తిగారు, బి. ఎ., బి. ఎల్. ప్రకాశకులు: The Indian Music Publishing House, G. T. Madras.

## శబరి (చిన్ననాటిక)

గ్రంథకర్త: వావిలాల గోపాల కృష్ణయ్యగారు, ఆంధ్రపత్రిక, చెన్నపురి.

ఇది 'గృహలక్ష్మి' మాసపత్రికయందు ప్రకటితమయినదానికి విడిప్రతి.

## సంగీత పార్వతీపరిణయము (అయిదంకముల నాటకము)

డిమ్మీసైజు. పుటలు ౬౧. వెల రు ౧-౮-౦.

గ్రంథకర్త: సత్యవోలు రాధామాధవరావుగారు. సకలానంద గ్రంథమాలిక, క్రొత్తపల్లి, పిఠాపురము, గోదావరిజిల్లా.

## అహల్యాసహస్రాతీము(ఏడంకములనాటకము

డిమ్మీసైజు. పుటలు ౬౮. వెల రు ౦-౧౨-౦.

గ్రంథకర్త: కల్లూరి యజమాన వెంకటనారాయణరావుగారు, బి.ఎ., ఆత్మకూరు. ఈగ్రంథము రాజమహేంద్రవరమున సరస్వతీ పవరుప్రెస్సున ముద్రితము.

## గ్రహతంత్రము

(జ్యోతిషసారస్వత తంత్రగ్రంథమాల-౨)

డిమ్మీసైజు. పుటలు ౨౬. వెల రు ౦-౬-౦.

సంపాదకుడు: రామారి వెంకట గోపాలరావుగారు, విజయనగరం.

## సత్యవ్రతి శతకము

క్రౌనుసైజు. పుటలు ౫౮. వెల రు ౦-౪-౦.

గ్రంథకర్త: భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు. ప్రకాశకులు: భాగవతుల లింగమూర్తి పంతులుగారు, ఛత్రపురము, గంజాంజిల్లా.

## My Mother's Picture

క్రౌనుసైజు. పుటలు ౨౭౬. వెల రు ౪-౦-౦.

గ్రంథకర్త: పండిత శ్యామసుందర చక్రవర్తిగారు. ప్రకాశకులు: కైలాసచంద్ర ఆచార్య, ౨౭, హారిసన్ రోడ్డు, కలకత్తా.

## శ్రీమదాంజనేయ జననము

క్రౌనుసైజు. ౩౫ పుటలు. వెల రు ౦-౫-౦.

గ్రంథకర్త: అమ్మనబ్రోలు వెంకట సుబ్బారాయ శర్మగారు, రేలంగి, రేణుకపోస్టు, పడమటిగోదావరి జిల్లా.

## దేవకీనందన శతకము

క్రౌనుసైజు. ౨౦ పుటలు. వెల తెలియదు.

ప్రకాశకులు: విక్రాల వెంకటాచార్యులు గారు, సంస్కృత పండితులు, శ్రీచెన్నకేశవ కళాశాల గద్వాల సంస్థానము.

## ప్రణయసౌరభము

రాయల్ సైజు. పుటలు ౬౨. వెల రు౧-౧౨-౦.

గ్రంథకర్తలు: కొండపల్లి గోపాలరావుగారు, హరి రామలింగ శాస్త్రిగారు- కల్వపాముల, కాటూరుపోస్టు, కృష్ణాజిల్లా.

## వాదిరాజతీర్థగురుచరిత్ర

ఫూలుస్కేపుసైజు. పుటలు ౯౬. వెల ౧-౨-౦.

గ్రంథకర్త: ప్రొద్దుటూరి నరసింగరావుగారు, బి. ఎ., గురుప్రసాద(లచ్చిరాజువీథి)సూర్యరావుపేట, కాకినాడ.

## శ్రీమదాంధ్ర మాతృశతకము

రాయల్ సైజు. పుటలు ౩౩. వెల ౦-౪-౦.

గ్రంథకర్త: త్రిపురాన సత్యానందరావుగారు, ఉపాధ్యాయుడు, రెడ్డియారు బ్రాంచిస్కూలు, No. ౬౮, డఫరెండు స్ట్రీటు, బోగటాంగ్, రంగూన్.

## విజ్ఞానకందశతకము

డిమ్మీసైజు. పుటలు ౩౧. వెల ౦-౩-౦

గ్రంథకర్త: మదరాసు రాజారావుగారు, చీనాబజారు, బర్హాంపురము, గంజాము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### ఆత్మదర్పణము

(శ్రీవివేకానంద స్వామి ప్రణీతము) శ్రీ సనాతన గ్రంథమాల ప్రసూనము. క్రౌను సైజు. పుటలు ౪౭. వెల ౦-౩-౦.

మానేజరు, సనాతనగ్రంథమాల, సనాతనాశ్రమం, క్రాపపోష్టు,(via) కొల్లూరు, గుంటూరుజిల్లా.

### శ్రీమదాంధ్రోపనిషద్జ్ఞానదీపము - భా. ౧.

డిమ్మీసైజు. పుటలు ౨౩౮. వెల రు ౧-౮-౧. గ్రంథకర్త: అమ్మనబ్రోలు వెంకటసుబ్బారాయ శర్మ గారు, రేలంగి, తణుకుపోస్టు, పడమటి గోదావరిజిల్లా.

### శ్రీరామ పట్టాభిషేక నాటకము

రాయల్ సైజు. పుటలు ౧౦౧. వెల రు ౧-౦-౦. గ్రంథకర్త: పాతాళభేది సుబ్రహ్మణ్యకవిగారు, క్రొత్త వీథి, తిరుపతి.

### శ్రీమదాంధ్ర లింగపురాణము

డిమ్మీసైజు. పుటలు ౭౯౧. వెల తెలియలేదు. గ్రంథకర్త: విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారు, ఆంధ్రోపాధ్యాయుడు, తాలుకాహైస్కూలు, తెనాలి.

---

## చమత్కారచంద్రిక

తాడూరి లక్ష్మీనరసింహ రావుగారు

మూలము

తుంగం తురంగ మధిరోహతి రంగనాథే
గోత్రారి రాత్త కుతుకః కులిశం బిభర్తి;
భేదంచ మోద ముపయాతి నగేంద్రకన్యా
నాగాజినేన పరిముహ్యతి హాలి మీశః.

తెనుఁగు

రంగనాథుండు గుఱ్ఱమెక్కంగఁ గాంచి
దాల్చె నగవైరి వజ్రాయుధంబు వేడ్కఁ
బార్వతికి మోదఖేదముల్ వచ్చెఁ దనదు
శిరము మీఁదను గరితోలు శివుఁడు కప్పె.

వివరణము

శ్రీరంగములో రంగనాథస్వామి స్వారి వెడలుటకై యశ్వారూఢుఁడు కాఁగా జన సమూహముయొక్క త్రొక్కుడుచేత నేల ధూళి రేగి సూర్యమండలము కప్పివేసి సముద్రము పూడ్చివేసినది. అంతట దేవేంద్రుఁడు తొల్లి తనదాఁడికి వెఱచి సముద్రములో డాఁగిన మైనాకుఁ డిప్పుడు సముద్రములో నీరు లేమిచే నందు నిలువఁ దనకవకాశము లేక వెడలివచ్చుననియును, వాని ఱెక్కలు నఱుక వచ్చుననియు నెంచి వజ్రాయుధముఁ జేతఁ బట్టినాఁడు. చిరకాలగతుఁడైన తనసోదరుఁడు మైనాకుఁడు వచ్చునను నాశచే సంతోషమును వాఁడు వచ్చినయెడ వాని ఱెక్కలు దేవేంద్రుఁడు తొంటిపగచే నఱుకునను దిగులుచే దుఃఖమును బార్వతీదేవి పొందినది. సూర్యమండలము భగ్నమగుటచే సాయంకాల మైనదని భ్రమసి సంధ్యాతాండవ మాడుటకై శివుఁడు తననెత్తిమీఁదను గజచర్మము గప్పికొన్నాఁడు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# [1] లేఖ ౧-కర్నూలు

## గన్నవరపు సుబ్బరామయ్య గారు

కర్నూలుమండలము దక్షిణహిందూదేశమున చరిత్ర కెక్కిన ప్రసిద్ధమండలములలో నొకటి. ప్రాచీన కాలమునుండియు నీమండలము నలుదైపులవ్యాపించియుండిన రాజ్యములకు కూడలిపట్టయి యుండినందున నాయా రాజ్యముల రాజులు దీనిపయి కన్నువైచి యోడొరులు తీరక పోరాడుచువచ్చిరి. ఈకారణమున నిది పెక్కుసారులు, పెక్కుతెఱగుల, చీలికలయి, పెక్కురు రాజులపాలనమునకు లోనయి, శాంతిమారమై యుండెడిది. ఇందుకు నిదర్శనముగ ఈమండలమున ప్రతిగ్రామమునను నేటికిని కోటల శిథిలములు గాన్పించుచున్నవి. ఈ మండలముయొక్క ప్రాచీనచరిత్రను ఆంధ్రవాఙ్మయము, శాసనములు, స్థానికచరిత్రలు మొదలయినవాని నాధారముగా గొని పలువురు చరిత్రకారులు విశదీకరించియున్నారు. ఇకకర్నూలుపట్టణమునుగూర్చిచెప్ప మొదలిడుటకు పూర్వము తన్మండలముయొక్క ప్రకృతస్థితినిగూర్చి యొక్కింత యిప్పుడు ముచ్చటించుట అప్రస్తుతము కాజాలదు.

### నేటి కర్నూలు మండలము

ప్రకృత మీమండలము ౭,౫౮౦ చదరపుమైళ్ల విస్తీర్ణము గలిగియున్నది. చెన్నరాజధానియందలి మండలములలో విస్తీర్ణమున నిది రెండవదగుచున్నది. ఈ మండలమున ౭౭౯ గ్రామములును, రెండుపట్టణములును(కర్నూలు, నంద్యాల) గలవు. ఇందలి జనసంఖ్య ౯,౧౯,౮౯౦. ఈసంఖ్యనుబట్టిఒకచదరపు మైలు మేరను ౧౨౧ జనులున్నట్లు తేలుచున్నది. గ్రామములయు, జనులయు సంఖ్యవిషయమున రాజధానియందలి మండలము లన్నిటికి నిది వెనుకబడు చున్నది. మండలమునకు తూర్పు అంచున వెలిగొండలు ౧౦౨ చ. మైళ్లను, మండలము తూర్పుసగమున నల్లమలలు ౫౩౨ చ. మైళ్లను, పడుమర సగమున ఎఱ్ఱమలలు ౩౦౦ చ. మైళ్లను వ్యాపించియున్నవి. ఈకొండలపైనను, వీనికి చేరికప్రదేశములు ౧,౬౩౩ చ.మైళ్లమేరను అరణ్యములుగలవు. మొత్త మీయరణ్యముల విస్తీర్ణము ౨,౫౬౭ చదరపుమైళ్లు. అడవులు,కొండలుగల ఈప్రదేశమంతయు జననివాసయోగ్యము కాకుండుటయే యీ మండలమున జనసంఖ్య తక్కువ అగుట కొకకారణము కావచ్చును.

కర్నూలు, డోను, పత్తికొండ, నంద్యాల, నందికొటుకూరు, కోయిల్‌కుంట్ల, సిరివేల్, మార్కాపురము, కంభము, అను తొమ్మిది తాలూకాలుగల యీ మండలము అయిదు తాలూకాబోర్డులుగా విభజింపబడినది. యూనియను బోర్డులు ఇంకు ౧౫ గలవు. మునిసిపాలిటీలు రెండు—కర్నూలు, నంద్యాల—గలవు. ౭,౫౮౦ చ. మైళ్లు విస్తీర్ణముగల మండలమున, ౮౧౧ మైళ్లు ౭ ఫర్లాంగులు పొడవుగల రోడ్లున్నవి. అనగా నూరు చ. మైళ్లకు ఇంచుమించు ౧౧ మైళ్లు వంతున నున్నదనుట. ఇందు (1) చిత్తూరునుండి కర్నూలుమీదుగా హైదరాబాదునకు పోవురోడ్డు (పొడవు మై. ౮౬ ఫ. 3), (2) కర్నూలునుండి బెంగుళూరునకు పోవురోడ్డు (పొడ

---

1. ఈలేఖారచయిత కర్నూలున నున్నంతకాలము తమ సొంత వ్యయముతో నెల్ల సౌకర్యములను పరమాదరమున సమకూర్చి ఈలేఖ యుత్పత్తికి తగిన అవకాశమును గల్గించిన శ్రీదంపూరి బాలసుబ్రహ్మణ్యము పంతులు (జిల్లా హెల్తాఫీసరు)గారికిని, అచ్చటగల ప్రాచీనశిథిలములను, ఇతరస్థలములను ఆదరాసక్తులతో స్వయముగ గొనిపోయిచూపిన శ్రీ యస్. వైద్యనాథఅయ్యరు (మునిసిపల్ హైస్కూలు చారిత్రకాధ్యాపకులు) గారికిని, ఈలేఖతో పాటు ముద్రితము లైన వివిధదృశ్యముల ఛాయాచిత్రములను స్వయముగదీసి సాదరమున నొసగి యీలేఖ విలువను పెంపొందించిన శ్రీయుత యం. యస్. కుప్పుస్వామిఅయ్యరు (సబ్ అసిస్టెంటు సర్జను, మునిసిపల్ వైద్యాలయము) గారికిని ఈ లేఖారచయిత సవినయముగ వందనసహస్రముల నర్పించుకొనుచున్నాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వు మై. ౫౧, ఫ. ౪), (౩) కర్నూలునుండి గుంటూరు నకు పోవురోడ్డు (పొడవు మై. ౫౯ ఫ. ౭). ప్రధానము లైనవి. ఇక మండలముననే శాఖలుగా ౧. కర్నూలునుండి బళ్లారికి, ౨. కర్నూలునుండి ఆత్మకూరికి, ౩. నంద్యాల నుండి ఆత్మకూరికి, ౪. నంద్యాలనుండి కోయిల్ కుంట్లకు, ౫. పాణ్యంనుండి గోనవరమునకు, ౬. కోయిల్ కుంట్ల నుండి ఆళ్లగడ్డకు, ౭. కంభమునుండి బేస్తవారపుపేటకు, ౮. మార్కాపురమునుండి ఎఱ్ఱగొండపాళెమునకు, ౯. కంభమునుండి మార్కాపురమునకును, ౧౧. కడపసరిహద్దు నను రోడ్లుకలవు. రాజధానిలోనిఇతరమండలములకంటె రోడ్లసౌకర్య మీమండలమున చాలతక్కువగా నున్నది. ఈయన్నిరోడ్లపైనను మోటారుబస్సులు నడచుచుండును.

గుంటకల్లు-గుంటూరుఇనుపదారి మండలమునపడు మరనుండి తూర్పునకు పోవుచున్నది. మఱియు డోను నుండి కర్నూలు మీదుగా తుంగభద్రనుదాటి హైదరా బాదుకు పోవు ఇనుపదారియు గలదు.

దత్తమండలములు నాల్గింటిలో ఈ మండలమున హిందువులు తక్కువగను, ముసల్మానులు, క్రైస్తవులు అధి కముగను ఉన్నారు. అట్లే హిందూస్థాని మాటలాడు వారును అధికముగ నున్నారు. చెన్నరాజధానిలో గుంటూరు మండలమునకు తర్వాత నీమండలముననే హిందూస్థాని మాటలాడువారధికముగ నున్నారు. నైజాము రాష్ట్రము సన్నిహితముగనుండుట యిందుకు కారణము కాదగును.

కర్నూలు మండలమున, జనసంఖ్య ౧౮౯౧ సంవత్సరమున ౮౧౭, ౮౧౧ గనుండి క్రమముగ ౧౯౦౧ వ సంవత్సరమున ౮౭౨,౦౭౦ గను, ౧౯౧౧ వ సంవత్సరమున ౯౨౫, ౨౫౯ గను పెరిగి, ౧౯౨౧ వ సంవత్సరము నాటికి ౯౧౪౮౯౦ కి తరిగినను ౧౮౯౧ సంవత్సరమున కంటె ౯౮౦౭౯ అధికమయినది. ఈసంఖ్య నేటికింకను పెరిగియుండుట సహజము. ౧౯౨౧ సంవత్సరపు జనసంఖ్య ౯౧౪, ౮౯౦ లో (పురుషులు ౪౬౩, ౨౫౫, స్త్రీలు ౪౫౧,౬౩౫) చదువను, వ్రాయను వచ్చిన వారు ౫౫, ౭౭౮ (పురుషులు ౫౧,౦౯౧, స్త్రీలు ౪,౬౮౭) మంది యుండిరి. ఇందు ఇంగ్లీషు వచ్చినవారు ౪౧౭౧ (పురుషులు ౩౯౯౧, స్త్రీలు ౧౮౧ ఉండిరి ౧౯౨౭-౨౮ సంవత్సరమున బడులలో చదువుచున్నవారు మాత్రము ౬౧, ౫౪౫ మంది గలరనిన వీరిసంఖ్యయు పెరిగినదని వేఱుగ చెప్పబనిలేదు. ఈసంఖ్యలో బాలురు ౪౯,౭౪౪, బాలికలు ౧౧,౮౦౧ గలరు. వీరి కొరకు మండలమున నన్నిరకముల పాఠశాలలు ౨౦౧౩ గలవు. వీనిలో సెకండరీ పాఠశాలలు ౧౫, ఎలిమెంటరీ పాఠశాలలు ౧౯౮౩, ట్రెయినింగు పాఠశాలలు ౩, పారిశ్రామిక పాఠశాల ౧, ప్రాచ్యవిద్యా కళాశాల ౧ ఉన్నవి. ఈపాఠశాలల వివరములకును, బాలబాలికల సంఖ్యలు మొదలయినవానికిని ౧—౪ పట్టికలను గాంచదగును. ఈమండలమున ప్రత్యేకించి స్త్రీలకు ట్రెయినింగు పాఠశాలకాని పారిశ్రామిక పాఠశాలకాని లేదు. ఇట్లుండుట అసంగతముగ కాన్పించుచున్నది. ౧౯౨౬-౨౭ సంవత్సరమునకంటె తరువాతి సంవత్సరమున పాఠశాలలు ౬౩ పెరిగినవి. ౧౪౭౫ మంది విద్యార్థులును పెరిగిరి. ౧౯౨౧ సంవత్సరపు జనసంఖ్యనుబట్టి ౧౯౨౭-౨౮ సంవత్సరమున చదువుకొనువారు నూటికి ౬.౭ వంతు నున్నారు. ప్రత్యేకించి బాలురు నూటికి ౧౦.౭ వంతు నను, బాలికలు ౨.౬ వంతునను గలరు. దత్తమండలములు నాల్గిటిలో విద్యావిషయమున నీమండలము మిన్నగ నున్నది. స్త్రీవిద్యయందు మఱింత మించినది. కడపమండలమున నీమండలమునకన్న పాఠశాల లధికముగనున్నను విద్యార్థులుమాత్రముచాలతక్కువగనున్నారు. ప్రభుత్వము వారు రాష్ట్రాదాయమునుండి రాజధాని మండలములన్నిటికి విద్యకొరకు నిచ్చుధనమున నూటిలో ౨.౫ వ వంతు నీమండలనందలి విద్యకొరకిచ్చినారు. దత్తమండలములలో నీమండలమున కిచ్చినధన మొకింత అధికమేయైనను ఆంధ్రమండలములతో బోల్చిచూచిన దత్తమండలముల కిచ్చునది తక్కువయని తేలుచున్నది. సెకండరి పాఠశాలలలో చదువుచున్న బాలురలో రమారమి మూడవ వంతు బాలురు మండలమున సెకండరి పాఠశాలలు లేని స్థలములనుండి వచ్చి చదువుకొనుచున్నారు. బాలుర ఎలిమెంటరీ పాఠశాలలలో నున్న ౨౩౭౫ మంది ఉపా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పట్టిక ౧— కర్నూలుమండలము - తెలుగు సంవత్సరము సెకండరి పాఠశాలలు, వానియందు చదువువారు.

| | పాఠశాలల సంఖ్య | ఆరవ ఫారము | అయిదవ ఫారము | నాల్గవ ఫారము | మూడవ ఫారము | రెండవ ఫారము | ఒకటవ ఫారము | అయిదవ తరగతి | నాల్గవ తరగతి | మూడవ తరగతి | రెండవ తరగతి | ఒకటవ తరగతి | మొత్తము విద్యార్థులు | బాలుర బడులలో చదువు బాలికలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| (బాలురవి) | | | | | | | | | | | | | | |
| ప్రభుత్వమువారిది (మహమ్మదీయులది) | ౧ | ౩౪ | ౨౯ | ౨౮ | ౨౯ | ౨౭ | ౩౭ | ౩౦ | ౨౮ | ... | ... | ... | ౨౪౨ | |
| మునిసిపాలిటివారివి | | | | | | | | | | | | | | |
| కర్నూలుస్కూలు | ౧ | ౪౯ | ౬౦ | ౭౩ | ౬ | ౭౩ | ౧౧౫ | ౮౩ | ... | ... | ... | ... | ౫౨౧ | |
| నంద్యాల స్కూలు | ౧ | ౩౨ | ౩౨ | ౪౫ | ౩౨ | ౩౨ | ౩౫ | ౨౪ | ౨౮ | ... | ... | ... | ౨౬౦ | ౧ |
| నంద్యాల మహమ్మదీయుల స్కూ. | ౧ | ... | ... | ... | ౧౪ | ౬ | ౯ | ౨౧ | ౨౩ | ... | ... | ... | ౭౨ | |
| మొత్తము— | ౩ | ౮౧ | ౯౨ | ౧౧౮ | ౧౧౩ | ౧౧౧ | ౧౫౯ | ౧౨౭ | ౫౧ | ... | ... | ... | ౮౫౨ | ౧ |
| లోకలుబోర్డువి | | | | | | | | | | | | | | |
| కోయిల్‌కుంట్ల స్కూలు | ౧ | ౨౧ | ౧౬ | ౧౬ | ౨౫ | ౧౯ | ౩౭ | ౪౧ | ౧౯ | ... | ... | ... | ౧౯౩ | ౪ |
| ఆత్మకూరు స్కూలు | ౧ | ౨౧ | ౧౧ | ౧౫ | ౬ | ౧౮ | ౨౫ | ౧౫ | ౨౬ | ... | ... | ... | ౧౩౭ | ౨ |
| మార్కాపురము స్కూలు | ౧ | ౩౨ | ౨౭ | ౩౦ | ౨౪ | ౨౫ | ౩౨ | ౨౬ | ౩౦ | ... | ... | ... | ౨౨౬ | ౩ |
| కంభము స్కూలు | ౧ | ... | ... | ౩౧ | ౨౪ | ౩౧ | ౨౩ | ౨౭ | ౧౯ | ... | ... | ... | ౧౫౫ | |
| నందికొటుకూరు స్కూలు | ౧ | ... | ... | ... | ౮ | ౬ | ౧౧ | ౧౦ | ౧౦ | ... | ... | ... | ౪౫ | |
| పత్తికొండ స్కూలు | ౧ | ... | ... | ... | ౯ | ౧౯ | ౧౯ | ౩౬ | ౪౧ | ... | ... | ... | ౧౨౪ | ౬ |
| గిద్దలూరు స్కూలు | ౧ | ... | ... | ... | ౬ | ౧౪ | ౧౭ | ౧౮ | ౨౭ | ... | ... | ... | ౮౨ | ౧ |
| మొత్తము— | ౭ | ౭౪ | ౫౪ | ౯౨ | ౧౦౨ | ౧౩౨ | ౧౬౪ | ౧౭౨ | ౧౭౨ | ... | ... | ... | ౯౬౨ | ౧౬ |
| మిషనువి (ప్రభుత్వసహాయముగలవి) | | | | | | | | | | | | | | |
| కర్నూలుకోల్సుమిమోరియలుస్కూ. | ౧ | ౩౭ | ౨౬ | ౩౭ | ౧౯ | ౨౨ | ౩౬ | ౩౭ | ... | ... | ... | ... | ౨౧౪ | ౬ |
| నంద్యాల S. P. G. స్కూలు | ౧ | ౪౮ | ౩౩ | ౩౧ | ౩౩ | ౪౫ | ౪౭ | ౩౯ | ౮ | ... | ... | ... | ౨౮౪ | ౧ |
| బేస్తవారపుపేట A. B. M. స్కూ. | ౧ | ... | ... | ... | ౩౦ | ౨౨ | ౨౮ | ౨౭ | ౨౯ | ... | ... | ... | ౧౩౬ | ౩౭ |
| మొత్తము— | ౩ | ౮౫ | ౫౯ | ౬౮ | ౮౨ | ౮౯ | ౧౧౧ | ౧౦౩ | ౩౭ | ... | ... | ... | ౬౩౪ | ౪౪ |
| (బాలికలవి) | | | | | | | | | | | | | | బాలికల బడులలో బాలురు |
| ప్రభుత్వమువారిది | | | | | | | | | | | | | | |
| కర్నూలు స్కూలు | ౧ | ... | ... | ... | ౩ | ౨ | ౪ | ౬ | ౧౦ | ౧౨ | ౧౩ | ౪౯ | ౯౯ | ౮ |
| మొత్తము-బాలబాలికలవి— | ౧౫ | ౨౭౪ | ౨౩౪ | ౩౦౬ | ౩౨౯ | ౩౬౧ | ౪౭౫ | ౪౩౮ | ౨౯౮ | ౧౨ | ౧౩ | ౪౯ | ౨౭౮౯ | |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్నూలు చిత్రములు



౧ కర్నూలు నబాబులకోటలోని శిథిలభవనము



౨. 'వాహాబు' సమాధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. కర్నూలు నవాబులకోటలోని ప్రధానద్వారమునకు లోపైపు

దీని ఎదుట కడపరాళ్లతో గచ్చుతో కట్టిన శిథిలజలాశయము, దానిలోనికి దిగుటకు మెట్లు కానవచ్చును.
ఈ జలాశయము సుమారు నలువదిగజముల చదురము గలిగియుండును



౪. వేఱొక శిథిలభవనము, లోన చిన్న మసీదు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



జుమ్మామసీదు - ఇది వెనుక హిందూదేవాలయముగ నున్నది.



౬. జిల్లాకలెక్టరు కార్యాలయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౭. ప్రాత కోటబురుజుపై కట్టిన మేడ

ఇది ' బంగారు కడియాల సుబ్బారావుగారి ' మేడ.



౮. ౭-వ చిత్రమునందలి మేడయొక్క దూరదృశ్యము

ఒకవైపున శిథిలమగుచున్న కోటగోడ కాన్పించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కర్నూలు చిత్రములు



౧౩. తుంగభద్ర వంతెన



౧౪. హంద్రీనదిపై మూడు వంతెనలు

౧. ముందు రైలువంతెన. ౨. నడుమ కడప-కర్నూలు కాలువవంతెన.(aqueduct) ౩. చివర 'సివిలురోడ్డు' వంతెన.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౫. కోటబురుజు, దానిపై బంగళా, రెండువైపుల కోటగోడలు



౧౬. జిల్లా న్యాయస్థానము. క్రొత్తగా అందముగా కట్టబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్నూలు చిత్రములు



౯. కాన్వెంట్ స్కూలు



౧౦. యునైటెడ్ క్లబ్బు
'బంగారుకడియాల సుబ్బారావుగారి' మేడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౧. మునిసిపలు వైద్యాలయము

ఇది పూర్వము కర్నూలును పాలించిన హిందూరాజుల కోటవాకిలి



౧౨. మునిసిపలు వైద్యాలయము ఎదుటనున్న వీథి

పడివైపున నవాబుల ప్రాతకట్టడములు. ఇపుడు దీనియందు దుకాణములు మొదలయినవి కలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పట్టిక ౨— కర్నూలుమండలము సంవత్సరము తెలుగు- ఎలిమెంటరి పాఠశాలలు, వానియందు చదువువారు

| | పాఠశాలలసంఖ్య | ఎనిమిదవతరగతి | ఏడవతరగతి | ఆరవతరగతి | అయిదవతరగతి | నాలుగవతరగతి | మూడవతరగతి | రెండవతరగతి | ఒకటవతరగతి | మొత్తము విద్యార్థులు | బాలుర బడులలో బాలికలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బాలురవి (Recognised) | | | | | | | | | | | |
| ప్రభుత్వమువారివి | ౨౧ | ... | ... | ... | ౧౧ | ౨౫ | ౪౧ | ౪౨ | ౪౫౬ | ౫౭౫ | ౧౬౧ |
| మునిసిపాలిటీవారివి | ౨౩ | ... | ... | ... | ౨౩ | ౧౧౬ | ౨౫౩ | ౩౦౪ | ౮౨౪ | ౧౫౨౧ | ౫౮ |
| లోకలుబోర్డువి | ౬౧౧ | ... | ౨౮ | ౭౫ | ౭౫౪ | ౨౫౭౮ | ౩౨౪౪ | ౪౧౮౨ | ౧౩౭౭౧ | ౨౪౬౨౧ | ౨౩౮౨ |
| ప్రభుత్వసహాయమును బడయునవి | ౧౦౫౨ | ౯ | ౨౪ | ౪౬ | ౮౩ | ౧౪౭౯ | ౩౦౭౫ | ౪౮౦౮ | ౪౨౯౨ | ౨౩౮౨౫ | ౩౭౫౩ |
| ప్రభుత్వసహాయమును బడయనివి | ౧౧౪ | ... | ... | ... | ... | ౩౦ | ౧౪౩ | ౩౭౫ | ౧౫౪౨ | ౨౧౯౧ | ౨౯౦ |
| | ౧౮[illegible]౯ | ౧౯ | ౫౨ | ౧౨౧ | ౮౭౧ | ౪౨౨౮ | ౬౭౫౬ | ౯౭౧౧ | ౩౧౮౮౪ | ౫౨౬౩౧ | ౬౫౯౩ |
| ప్రైవేటువి (Unrecognised) | ౪౩ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౭౮౧ | ౧౧౨ |
| మొత్తము | ౧౮౫౨ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౫౩౪౧౨ | ౬౭౦౫ |
| బాలికలవి (Recognised) | | | | | | | | | | | |
| ప్రభుత్వమువారివి | ౧ | ... | ... | ... | ... | ... | ... | ౬ | ౨౫ | ౩౧ | |
| మునిసిపాలిటీవారివి | ౧౦ | ... | ... | ౬ | ౧౩ | ౩౩ | ౬౭ | ౧౦౨ | ౫౦౧ | ౭౨౧ | బాలికలబడులలో బాలురు |
| లోకలుబోర్డువారివి | ౮౨ | ... | ... | ... | ౫ | ౧౨౫ | ౨౫౧ | ౪౭౬ | ౨౧౭౫ | ౩౦౩౨ | |
| ప్రభుత్వసహాయమును బడయునవి | ౨౮ | ౧౮ | ౩౧ | ౪౭ | ౭౩ | ౬౭ | ౭౪ | ౧౦౯ | ౬౬౧ | ౧౧౮౧ | |
| | ౧౨౧ | ౧౮ | ౩౧ | ౫౩ | ౯౧ | ౨౨౫ | ౩౯౨ | ౬౯౩ | ౩౩౬౧ | ౪౮౬౭ | ౮౭ |
| ప్రైవేటువి (Unrecoguised) | ౧౦ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౧౮౦ | ౧౩ |
| మొత్తము | ౧౩౧ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౫౦౪౭ | ౧౦౦ |
| మొత్తము బాలబాలికలవి— | ౧౯౮౩ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౫౮౪౫౬ | |
| సెకండరి పాఠశాలలు | ౧౫ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౨౭౮౯ | |
| కుల్లు | ౧౯౯౮ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౬౧౨౪౫ | |
| ట్రెయినింగు పాఠశాలలు | పాఠశాలలసంఖ్య | | | ... | ... | ... | ... | ... | ... | విద్యార్థులు | |
| ప్రభుత్వమువారిది | ౧ | | ... | ... | ... | ... | ... | ... | ... | ౯౭ | |
| మిషనువారివి (ప్రభుత్వసహాయమును బడయునవి) | ౨ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౧౨౧ | |
| | ౩ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౨౧౮ | |
| పారిశ్రామిక పాఠశాలలు | | | | | | | | | | | |
| మిషనువారిది (ప్రభుత్వసహాయమును బడయునది) | ౧ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౫౬ | బాలిక ౧ |
| ప్రాచ్యవిద్యాశాలలు | | | | | | | | | | | |
| మద్రాసా-ఇ-ఇస్లామియా (అరాబిక్ కళాశాల) | ౧ | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ౨౭ | |
| మండలమునగల పాఠశాలల మొత్తము | ౨౦౧౩ | | | వానియందు చదువువిద్యార్థులు | | | | | | ౬౧౫౪౫ | |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పట్టిక 3—ఎలిమెంటరీపాఠశాలలలో చదువు బాలబాలికల సంఖ్యను తెలుపును (౧౯౨౭-౨౮)

| | బాలుర పాఠశాలలు | | | బాలికల పాఠశాలలు | | | మొత్తము | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | మొత్తము | బాలురు | బాలికలు | మొత్తము | బాలురు | బాలికలు | మొత్తము |
| ప్రభుత్వమువారివి | ౪౧౫ | ౧౬౧ | ౫౭౬ | ... | ౩౧ | ౩౧ | ౪౧౫ | ౧౯౧ | ౬౦౬ |
| మునిసిపాలటీవారివి | ౧౪౬౨ | ౫౮ | ౧౫౨౦ | ... | ౭౨౧ | ౭౨౧ | ౧౪౬౨ | ౭౭౯ | ౨౨౪౧ |
| లోకలుబోర్డువారివి | ౨౨౨౩౯ | ౨౩౮౨ | ౨౪౬౨౧ | ... | ౩౦౩౨ | ౩౦౩౨ | ౨౨౨౩౯ | ౫౪౧౪ | ౨౭౬౫౩ |
| ప్రభుత్వముసహాయముగలవి | ౨౦౦౭౨ | ౩౭౫౩ | ౨౩౮౨౫ | ౮౭ | ౯౯౩ | ౧౦౮౦ | ౨౦౧౫౯ | ౪౭౪౬ | ౨౪౯౦౫ |
| ,, ,, లేనివి | ౧౮౫౦ | ౨౪౦ | ౨౦౯౦ | ... | ... | ... | ౧౮౫౦ | ౨౪౦ | ౨౦౯౦ |
| ప్రైవేటువి | ౬౬౯ | ౧౧౨ | ౭౮౧ | ౧౩ | ౧౬౭ | ౧౮౦ | ౬౮౨ | ౨౭౯ | ౯౬౧ |
| | ౪౬౭౦౭ | ౬౭౦౫ | ౫౩౪౧౨ | ౧౦౦ | ౪౯౪౪ | ౫౦౪౪ | ౪౬౮౦౭ | ౧౧౬౪౯ | ౫౮౪౫౬ |
| సెకండరీపాఠశాలలలో | ౨౬౨౯ | ౬౧ | ౨౬౯౦ | ౮ | ౯౧ | ౯౯ | ౨౬౩౭ | ౧౫౨ | ౨౭౮౯ |
| ట్రెయినింగుపాఠశాలలలో | ... | ... | ... | ... | ... | ... | ౨౧౭ | ... | ౨౧౭ |
| పారిశ్రామికపాఠశాలలలో | ... | ... | ... | ... | ... | ... | ౫౫ | ౧ | ౫౬ |
| ప్రాచ్యవిద్యాశాలలలో | ... | ... | ... | ... | ... | ... | ౨౭ | ... | ౨౭ |
| మొత్తము— | ౪౯౩౩౬ | ౬౭౬౬ | ౫౬౧౦౨ | ౧౦౮ | ౫౦౩౫ | ౫౧౪౩ | ౪౯౭౪౩ | ౧౧౮౦౨ | ౬౧౫౪౫ |

పట్టిక ౪—సెకండరి పాఠశాలలలో చదువు బాలబాలికల సంఖ్యను తెలుపును. (౧౯౨౭-౨౮)

| | బడులు | బాలురు | బాలికలు | మొత్తము |
|---|---|---|---|---|
| బాలురవి | | | | |
| ప్రభుత్వమువారివి | ౧ | ౨౪౨ | ... | ౨౪౨ |
| మునిసిపాలిటీవారివి | ౩ | ౮౫౧ | ౧ | ౮౫౨ |
| లోకలుబోర్డువారివి | ౭ | ౯౪౬ | ౧౬ | ౯౬౨ |
| మిషనువారివి | ౩ | ౫౯౦ | ౪౪ | ౬౩౪ |
| | ౧౪ | ౨౬౨౯ | ౬౧ | ౨౬౯౦ |
| బాలికలవి | | | | |
| ప్రభుత్వమువారివి | ౧ | ౮ | ౯౧ | ౯౯ |
| మొత్తము— | ౧౫ | ౨౬౩౭ | ౧౫౨ | ౨౭౮౯ |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్యాయులలో ట్రెయినింగు అయినవారు ౧౪౧౨ మంది కలరు. ఆంధ్రమండలము లన్నింటిలో నిక్కడ వీరు అధిక సంఖ్యాకులున్నారు. బాలురకు రాత్రి పాఠశాలలు ౩౪౩ ఉన్నవి. బాలికలకు లేవు. బాలికల ఎలిమెంటరీ పాఠశాలలలోనున్న రెండువందల ఉపాధ్యాయులలో నూటఏబండ్రు ట్రెయినింగు అయినవారు. బాలబాలికల ఎలిమెంటరీ బడులలో ఒకటి మొదలు అయిదు వఱకుగల తరగతులలో విద్యార్థుల సంఖ్య ఒకదానికంటె నింకొకటి క్రమముగ చాల నీరసించిపోవుట రెండవ పట్టికవలన విశదమగును. నిర్బంధ ప్రారంభవిద్యావిధానమమలులోనికి రాకుండుట యిందుకు గారణమగును. ఆవిధానము అమలులోనికి వచ్చినచో బాలబాలికలు విద్యాలాభము నధికముగ పొందుట కుపకరింప గలదు. ౧౯౨౮-౨౯ సంవత్సరమున మండలమునందలి లోకలు బోర్డు పరిపాలనముక్రింద ఎలిమెంటరీ పాఠశాలలు ౬౮౪ ఉండినవి. వానియందు చదువువారు ౨౭, ౨౯౩— బాలురు ౨౧,౯౩౭, బాలికలు ౫,౩౫౬— గలరు. పాఠశాలల సంఖ్య పెరిగినను, చదువువారిసంఖ్య మాత్రము తరిగినది. ఈపాఠశాలలో ఉపాధ్యాయుల వేతనములు చాలతక్కువ. దానిని పొడిగించుటకు లోకల్ బోర్డు వారికి ధనము లేదు. అట్లు కావింపకున్న ప్రారంభవిద్య పెంపొందజాలదు. అందుకు ప్రభుత్వమువారు ఎక్కువ ధనసహాయము చేయవలసియున్నారు.

లోకలుబోర్డుపరిపాలనముక్రిందనున్న ఎలిమెంటరీ పాఠశాలలసంఖ్య, వానియందు చదువువారిసంఖ్యదత్తమండలములు నాల్గింటిలో నీమండలమున నధికముగ నున్నది. ఈసంవత్సరము సెంకడరీపాఠశాలలు ఏడింటిలో చదువుచున్న వారిసంఖ్య ౯౪౧. వారిలో సెకండరీతరగతులజదువువారు ౬౦౯ మందియున్నారు. కడచినసంవత్సరముకంటె నీసంఖ్యయు కొంత తరిగినది. ఈపాఠశాలల యందును ఉపాధ్యాయులకు తగినవేతనములు ఏర్పాటుచేయుటావశ్యకము. డిస్ట్రిక్టుబోర్డువారి సూచనల ననుసరించి ఎలిమెంటరీ సెకండరీ పాఠశాలలలోని ఉపాధ్యాయులకు వేతనములు హెచ్చయి తగిన ప్రోత్సాహము కలుగకున్న విద్యాభివృద్ధికి చక్కని అవకాశము లభింపదు. ఉపాధ్యాయులేకదా విద్యార్థుల విద్యాభివృద్ధికి ఆధారభూతులు.

'మద్రాసా—ఇ-ఇస్లామియా' అను అరాబిక్ ప్రాచ్యవిద్యాకళాశాల కర్నూలుపట్టణమున నున్నది. ఇందు మహమ్మదీయులు ప్రాచ్యవిద్య నభ్యసించి పట్టపరీక్షలయందు కృతార్థులగుచున్నారు. దీని నొకమహమ్మదీయమహాశయుడు స్థాపించి ధనమును ప్రోగుచేసి జరుపుచున్నాడు. ఇందలివిద్యార్థుల కిత డొకసుందరమయిన 'హాస్టలును' కట్టించుచున్నాడు. దీని కేబదివేలరూపాయలు పట్టును. ఇప్పటికి సగముపని యైనది. ఇంకను ఇరువదియైదువేలు కావలసియుండును. ప్రాచ్యవిద్యాభిమాను లీయుదారుని ప్రయత్నములకు చేయూత యొసగదగుదురు.

ఈమండలమున వివిధవిగములగు విద్యాసంస్థలకు ౧౯౨౭-౨౮ సంవత్సరమున వ్యయమయిన ధనము.

| | | |
|---|---|---|
| ప్రాచ్యవిద్యకు | రు. | ౬,౦౫౯ |
| సెకండరీవిద్యకు | ,, | ౬౧,౮౭౪ |
| ఎలిమెంటరీవిద్యకు | ,, | ౪౬౮,౮౫౭ |
| ట్రెయినింగువిద్యకు | ,, | ౩౮,౪౭౪ |
| పారిశ్రామికవిద్యకు | ,, | ౬౧,౮౭౪ |
| | మొత్తము రు. | ౬,౩౭,౧౩౮. |

అగుచున్నది.

ఇందు ప్రభుత్వమువారు లోకలు బోర్డువారు మునిసిపాలిటీవారు ఒసగుధనమును, ఇతరవిధముల లభించినధనమును గలిసియున్నది.

ఈమండలమున ౬౯౫ రైతువారిగ్రామములున్నవి. దిట్టము ననుసరించి (౧౩౩౭ ఫసలీ–౧౯౨౭–౨౮ సం.) రైతుల స్వాధీనమున ౧,౫౦,౨౭౨ ఎకరముల మెట్టయును, ౩౯, ౭౯౯ ఎకరముల మాగాణియును కలదు. ఇందు మెట్టపొలమునకు రు. ౧౩,౧౩,౨౮౮, మాగాణి పొలమునకు రు. ౨,౭౦,౪౦౪ శిస్తు అగుచున్నది. నిమ్నజాతులకు పొలములను సాగుబడికి ఇచ్చినందున కడచినఫసలికంటె ఈఫసలిలో మెట్ట ఎ. ౮,౬౧౪, మాగాణి ఎ. ౪౪ను దిట్టమునకెక్కినవి. రైతుల స్వాధీనమున నున్న



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ పొలములలో ఎ. ౧౩,౧౧,౭౯౬ మెట్టయు, ఎ. ౩౬,౯౬౯ మాగాణియు సాగుబడి అయినది. కాలమున వానలు కురియుటచే వెనుకటి ఫసలీకంటె ఈ ఫసలీలో ఎ ౩౨,౦౨౭ మెట్ట అధికముగ సాగుబడి అయినది. రాజధానిమండలము లన్నిటిలోను, ఈ మండలమున మాగాణిసాగుబడి తక్కువగా నున్నది. ఈమండలమున పొలము సారవంతమైనను చాలినంత నీటివసతి లేకపోవుటచే నీమండలమున కీదుస్థితి సంభవించినది.

ఈమండలమున జలాధారములలో పేర్కొనదగినవి: కర్నూలు-కడప కాలువ, కంభముచెరువు. మఱికొన్ని చిన్నిచిన్ని ఊటకాలువలు, ఏటికాలువలు కలవు నల్లమల లకు తూర్పుననున్న కంబముచెరువునుండి యామట్టుపట్టుల చాల పొలమునకు నీరుపారును. దీనిని శ్రీకృష్ణదేవరాయల భార్య, 'వరదరాజమ్మ' యను నామె త్రవ్వించినదని చరిత్ర తెలుపుచున్నది. కర్నూలుపట్టణమునకు ఎగువ ౧౯ మైళ్ల దూరమున సుంకేసలవద్ద తుంగభద్రకు అనకట్ట కట్టి అచ్చటనుండి కర్నూలు-కడపకాలువను ప్రభుత్వము వారు త్రవ్వించిరి. ఇందు ౧౮౭౧ వ సంవత్సరము మొదలుకొని నీరుపారుచున్నది. ఈకాలువ పొడవు ౧౯౦ మైళ్లు. ఇది కడపమండలమున కృష్ణాపురము రైలుస్టేషన్ ప్రాంతములవఱకు వచ్చుచున్నది. ఈ కాలువ ౧౮౨ మైళ్లు కర్నూలు మండలముననే ప్రవహించును; విస్తీర్ణము అధికముగగల యీ మండలమునకు ఈ జలాధారములు చాలవు. మెట్టూరువద్దసాగుచున్న, 'కావేరి-ప్రాజెక్టు'వలె 'తుంగభద్రప్రాజెక్టు'ను ప్రభుత్వమువారుత్వరలో నుత్పన్నముచేసి, నీటివసతిని సమృద్ధిగ గల్పించినయెడలసారవంతమైన భూమిగల యీమండలమును, దీనికిచేరువ మండలములును మిక్కుటముగ పంటలు పండి తదితరమండలముల కన్న ధనధాన్య సంపదలతో వెలయగలవు.

ఈ మండలము పంటలలో ముఖ్యమైనవి (పచ్చ) జొన్న, ప్రత్తి. ఇటీవల కొన్ని యేండ్లనుండి వేరుసెనగ పంట యభివృద్ధి యగుచున్నది. వరిపంట చాలతక్కువ. ౧౯౩౮-౧౯౩౯ సం.న నీమండలమున ౮,౨౩,౬౬౮ ఎకరముల విస్తీర్ణముగల పొలమున వేరుసెనగ పంట పండిన ది. రాజధానిలో నీ పంట అధికముగ పండించిన మండలములలో నిది మూడవది.

ఈమండలమున మార్కాపురమున 'స్లేటు' పలకలను[1] తయారుచేయువారికిని, కర్నూలు, నంద్యాల, కోయిల్‌కుంట్లలలో అద్దకము పని చేయువారికిని, నోసమున లక్కపని చేయువారికిని ఆయాపరిశ్రమలను సులభముగను, శ్రేష్ఠముగను, లాభకరముగను చేసికొనుటకు వసతులుసమకూర్చుటనుగూర్చి ఇటీవల ప్రభుత్వమువారు పర్యాలోచించుచున్నారు. ఈప్రయత్నము కొనసాగినచో లెస్సయగును. ఈమండలములో పారిశ్రామిక పాఠశాల (కోల్సువొకేషనల్ మిడిల్ స్కూలు) కర్నూలుపట్టణమున నొక్కటిమాత్రమే కలదు. ఇందు బట్టలనేత, ఆయిలుఇంజనులను నడుపుటమాత్రమే కొలది మందికి నేర్పబడుచున్నది. ఇదికాక, కర్నూలు ట్రెయినింగ్ పాఠశాల యందును, మునిసిపలు హైస్కూలునందును, నంద్యాల మునిసిపలు హైస్కూలునందును, ఆత్మకూరు, కోయిల్‌కుంట్లలోకలబోర్డు హైస్కూళ్లయందును ఆత్మకూరు ఆది-ఆంధ్ర ఎలిమెంటరీ పాఠశాలయందును, పరిశ్రమలతరగతులు గలవు. ఈతరగతులయందు ౯౦౩ గురు బాలురు వడ్రంగము, నూలువడకుట, నేత మొదలయిన పరిశ్రమల నభ్యసించుచున్నారు.

ఇచట నింకను ఎక్కువ పారిశ్రామికవిద్యాశాలలుండుటావశ్యకము. ప్రభుత్వముకాని, సంపన్నులను నీమండలవాసులుగాని పారిశ్రామిక విద్యాశాలలను కొన్నిటిని స్థాపించి వాటియందు వివిధము లయిన పరిశ్రమలను ప్రజలు నేర్చుకొనుటకు సౌకర్యములను సమకూర్పవలెను. స్త్రీలకుగూడ గృహపరిశ్రమలను నేర్పుటకు తగినసౌకర్యములను సమకూర్పవలెను. ముఖ్యముగ దీనికి ప్రభుత్వమువారే పూనుకొనవలయును.

౧౯౩౭-౩౮ సంవత్సరమున నీమండలమున మద్యములవలన రు ౨౨,౮౧,౨౪౯ను, నల్లమందు, గంజాయి మొదలయిన వానివలన రు ౧,౪౧,౯౯౬ను (మొత్తము

1. వీనికి చట్రము వేయుటకు మెత్తనికలప నల్లమలఅడవులలో లభించును.

రు ౨౩,౮౩,౨౫౬) ఆదాయము వచ్చెను. దేశమునకు, దేశీయులకు దారిద్ర్యమును, అనారోగ్యమును గలిగించు నీశాఖవలన దత్తమండలములు నాల్గింటిలో నీమండలముననే ప్రభుత్వమువారెక్కువయాదాయమును పొందుచున్నారు. దీనినిబట్టి త్రాగు డీమండలమున నధికమని వేఱుగ చెప్పబనిలేదు. ఇట్లగుట విచారకరము.

ఆరోగ్యశాఖవారిచే మద్యపానమును మానుప ప్రచారము చేయుటకయి యిటీవల నియమింపబడిన సంఘమువారీవిషయమున నెక్కువశ్రద్ధను పూని మండల ప్రజల నీత్రాగుడు, త్రింగుడు పిశాచములబారి నుండి తొలగజేయుట శ్రేయము.

కర్నూలు మండలమున వైద్యాలయములు ౩౪ ఉన్నవి. వానిలో ప్రభుత్వముభరించునవి నాలుగు. స్త్రీలకు ప్రత్యేకముగ వైద్యాలయము మిషన్‌వారిది ఒకటిమాత్రమున్నది. లోకలుబోర్డు, మునిసిపలు వైద్యాలయములు ౩౦ లో నొకటి ఆయుర్వేదవైద్యాలయము. ఈ ౩౪ వైద్యాలయములును ౩౨ కేంద్రముల యందున్నవి. ఇవి ౨౩౭ చ. మైళ్లకొక కేంద్రమువంతున అగుచున్నవి. ఒక్కొక కేంద్రమునను ౨౭,౧౧౧ మందికిపైగా చికిత్సచేయవలసి యుండును. ఇవికాక మరిరెండు ఆయుర్వేద వైద్యాలయములునుగలవు. ఈమండలమున ౧,౧౬,౫౧౩ మందికి మలేరియాజ్వరము తగిలినది. రాజధానిలో నిక ఏమండలముననను ఈజ్వరబాధ యింతయధికము లేదు. ఈ జాడ్యముమండలమునందలి ప్రజల ఆరోగ్యమును పాడుచేయును. కడచిన రెండేండ్లనుండియు జిల్లాఆరోగ్యశాఖాధికారులు గట్టిగా పూనికతో గ్రామగ్రామములకు క్వయినాను పంచిపెట్టుచున్నను దీనిబాధ తగ్గకున్నది. ఇంకను ఎక్కువగ ప్రయత్నించి త్వరలో దీనిని రూపుమాప జూచుట శ్రేయము.

౧౯౨౭-౨౮ సంవత్సరమున ఈమండలమున జననములసంఖ్య ౩౭,౦౯౫. ఇది మండలజనసంఖ్యలో వేయింటికి ౪౦·౫ వంతున నగుచున్నది. మరణముల సంఖ్య ౩౯,౪౦౭. ఇది వేయింటికి ౪౩·౧ వంతున నగుచున్నది.[1] ఒక చెన్నపురమునందు తప్ప నిక నేమండలమునను మరణము లింత యధికముగ లేవు. కడచిన సంవత్సరమున నీమండలమున వేయింటికి ౩౯·౦ మాత్రమే యుండెను. ఈయేడు రాజధాని సరాసరి వేయింటికి ౨౬·౪. కడచిన సంవత్సరమునకంటె నీసంవత్సరము మరణములు అధికమయినవి. మొత్తము మరణముల సంఖ్యలో కలరావలన ౩,౭౯౨, జ్వరములవలన (ఎక్కువ మలేరియావలన) ౧౯,౫౨౭ జనులు మరణించిరి.

౧౯౨౮ సంవత్సరము లెక్కల ననుసరించి, ౨,౫౬౭ చ. మైళ్లు విస్తీర్ణముగల అడవు లీమండలమున గలవని యిదివరకే తెలుపబడినది.[2]

ఇందు రైతుల స్వాధీనమున ౧౯౧ చ. మైళ్లును, ప్రభుత్వమువారి స్వాధీనమున ౨,౩౭౬ చ. మైళ్లును గలవు. ఈయడవులు వెలిగొండలను, నల్లమలలను, ఎఱ్ఱమలలను, వాని నంటిన ప్రదేశములను వ్యాపించియున్నవి. ఈ యడవులలో రక్తచందనము, కరక, టేకు, వేము, నల్లమద్ది, ఏపి, జిట్రేగి, నారేపి, ఎఱ్ఱమద్ది, జాల, నూకుర ద్రాను మొదలయిన ద్రానుల కలప విశేషముగ దొరకును. వెదుళ్లును బాగుగా లభించును. శ్రీగంధము శ్రీశైలముప్రాంతమున స్వల్పముగ లభించును. ఇది కాక వంటచెఱుకున కుపయోగించు చెట్లు చాల గలవు. ఈ యడవులు రమారమి అంతవేరయు మంచిగడ్డి పెరుగుటచే కంచెక్రింద నుపయోగించును కావున దగ్గరవారే కాక దూరపువారును పుల్లరి చెల్లించి తనపశువులను, సన్నజీవములను ఈ కంచెలలో మేపుకొందురు. ఇచ్చటి మేత పశువులకు మంచిబలమును, పుష్టిని గలిగించును. ఈపుల్లరివలన మంచిలాభముకలదు. ఇంతేకాక, చింతపండు, కుంకుడుకాయలు, సారపప్పు, వెదురుప్పు, బంకలు, తేనె, తంగెడుచెక్క, ముష్టిచెక్క, రేలచెక్క, ఇండ్లు కప్పు

1 ౧౯౨౮–౨౯లో జననములసంఖ్య ౩౬,౮౪౨, మరణములసంఖ్య ౪౧,౮౫౯ తేలినది. మరణములసంఖ్య పెరుగుటకు ముఖ్యముగ కలరా, తరువాత జ్వరములు కారణములు.—Administration Report of the District Board, Kurnool, for 1928-29.

2. తరువాతి రిక్లాసిఫికేషన్ ప్రకారము ఈ విస్తీర్ణము సుమారు ౨,౩౪౦ చ. మైళ్లు అని తేలినది.—G.O. No. 762, Dated 26-4-1929.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొనుటకు విడవలి, ఊడ్పుపాలములకు పచ్చిఆకు మొదలయిన వానివలనను సొమ్ము లభించుచున్నది. ఈ యడవులవలన ప్రభుత్వమువారి కీసాలున ౩,౬౮,౨౨౬ రూపాయలు ఆదాయము వచ్చినది.

అడవులలోని కలపను నరకుటకును, చిల్లర వస్తువులను సేకరించుటకును ముఖ్యముగ ఇచటనే గూడెములయందు నివసించుచున్న చెంచువాండ్ర నుపయోగించుకొనవలెను. వీరి సంఖ్య రమారమి ౨,౫౦౦గలరు. ఇందు ౮౦౦ మందికి ప్రభుత్వమువారు చిన్నచిన్న నౌకరీలను కల్పించియున్నారు. వీరి గూడెములు ఇరువదియైదిటికి మించి కలవు. అందు ఇరువది నల్లమలలయందు ఉన్నవి. వీరిలో యోగ్యులు కొందఱు ఆగూడెములకు 'హెడ్ మెనులు'గను, 'డిప్యూటీ హెడ్ మెనులు'గను ౧౨,౭ రూపాయల జీతముపై నియమింపబడియున్నారు. ఉద్యోగములయందున్నవారు గాక తక్కినవారు ఈయడవులలోనే కూలికి పనిచేయుచున్నారు. మఱియు, వీరి కాచుట్టుపట్టుల గ్రామములవారు తమ పంటలను కాపాడుటకై ఏటా కొంతమిరాసి యిచ్చుచుందురు. ఇంకను శ్రీశైలయాత్ర పోవువారు తమత్రోవదాపున నుండు గూడెములవారి కొక్కొక్క అణా యిచ్చిపోవుచుందురు. ఈ చెంచువాండ్ర మంచి సెబ్బరలను విచారించుకొనుచు, వీరిని సరిదిద్ది కట్టుదిట్టములలో నుంచుటకయి ఒక పెద్దయుద్యోగిని ప్రభుత్వమువారు నియమించియున్నారు. వీరిపై సర్వాధికార మాయనకు గలదు. ఈ చెంచువారి కుఱ్ఱవాండ్రకొఱకు ౧౯ ఎలిమెంటరి పాఠశాల లున్నవి. వానియందు ౨౭౨ బాలురును, ౧౫౬ బాలికలును చదువుకొనుచున్నారు. వీరి కొక అణా విలువచేయు భోజనము మధ్యాహ్నపువేళ పెట్టబడును. వీరిలో కొందఱికి వడ్రంగము, నేత మొదలయిన చేతిపనులును నేర్పబడుచున్నవి. ఒకానొకబడిలో బాలికలకు కుట్టుపనియు నేర్పబడుచున్నది. వడ్రంగమున తేరినవారికి బహుమతులుకూడ నొసగబడెను. ఈ బాలబాలికలను, ఉపాధ్యాయులను మలేరియాజ్వరము తరచు పీడించుటచే నీబడులు సరిగా సాగకపోవుచుండును. వీరి కందరకును ఉచితముగ అన్నవస్త్రములను, ఆరోగ్యమును పెంపొందించు సౌకర్యములను ప్రభుత్వమువారు సమకూర్చినచో వీరు త్వరలో మంచిస్థితికి రాగలరు. చెంచువారికి వ్యవసాయము వంటబట్టునది కాదు. వ్యవసాయమునందు వీరికి అభిరుచిని గలిగించుటకు వ్యవసాయ శాఖవారు ఎక్కువ పనిపూనవలెను.

వీరి కొఱకయి ఏటా సుమారు ౨౯,౦౦౧ రూపాయలను ప్రభుత్వమువారు వెచ్చించుచునేయున్నారు. ఇన్నివిధముల సౌకర్యము లున్నను వీరు నైతికమార్గదూరులై అప్పుడప్పుడు నేరములను చేయుచు దండనమును బొందుచునేయున్నారు.

౧౯౨౮ సంవత్సరమున హత్యలు ౩౫, బందిపోట్లు ౭, దోపిడులు ౨౪, కన్నపుదోపిడులు ౨౮౭, ఇతరములగు దొంగతనములు ౨౧౮ పశువుల దోపిడులు ౬౫ (మొత్తము ౬౩౧) ఈమండలమున జరిగినవి. కడచిన రెండేండ్లకంటె నీయేడివి అన్నియును తగ్గినవి. దోపుడు వోయిన వస్తువుల విలువ రు ౫౫,౧౨౭ లలో పోలీసువారు కనిపట్టి రాబట్టినది రు ౧౧,౬౪౧ మాత్రమే యయినను ఈమండలమున గల పోలీసుసిబ్బంది ఏమండలమునను గానరాదు. జిల్లా సూపరింటెండెంటు మొదలు కాన్‌స్టేబిలులవఱకు ౧,౧౬౦ మంది కలరు. పోలీసుస్టేషనులు ౪౬ను, ఔటుపోస్టులు ౬ను గలవు.

సివిలువ్యాజ్యములు దత్తమండలములయందన్ని మండలములకంటె తక్కువగ నున్నవి. ౧౯౨౮ వ సంవత్సరమున ఈ మండలమున అసలు వ్యాజ్యములు గ్రామమునసబుకోర్టులలో ౩౫౨, పంచాయతి కోర్టులలో ౧,౭౩౦, సివిల్ కోర్టులలో ౪,౬౩౧ దాఖలయినవి. మండలమునందలి ప్రజలలో ౧౩౫ మంది కొకటి వంతున వ్యాజ్యములు పుట్టుచున్నట్లు తేలుచున్నది. అపీల్లు జిల్లాకోర్టులో ౧౮౧, హైకోర్టులో ౧౫, మొత్తము ౧౭౬ దాఖలయినవి. వీనియందును క్రమముగ ఏటికేటికి తగ్గుదల కనిపించుచున్నది.

ఈ ౧౯౨౮ వ సంవత్సరముననే క్రిమినలు కేసులు గ్రామమేజస్ట్రీటు కోర్టులలో ౧౭, పంచాయతి కోర్టు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలో ౬౩౬, ఇతరములగు మేజస్ట్రీటుకోర్టులలో ౬,౨౫౬ దాఖలయినవి. అపీల్లు సెషన్స్ కోర్టులో ౨౮౪, హైకోర్టున ౨౧ జరిగినవి. దత్తమండలములు నాల్గింటిలో ఈ మండలమున క్రిమినలు కేసులు అధికముగా పుట్టినవి. ఇక్కడ గ్రామమునసబుకోర్టులు ౧౮౧, పంచాయతి కోర్టులు ౨౬ ఉన్నవి.

౧౯౨౯ సంవత్సరమున కర్నూలు మండలములో వేరుసెనగకాయల పొట్టును ఊడదీయు కార్ఖానాలు ౧౯, చమురుతీయునది ౧, ప్రత్తిని గింజలూడదీసి బేళ్లు కట్టునవి ౪౬—మొత్తము ౬౬—గలవు. అన్నిటియందును వేరుసెనగ పొట్టూడదీయుట కేర్పాటు గలదు. ఈ కార్ఖానాలయందు మగవారు ౧,౪౧౨, ఆడువారు ౧,౦౨౯—మొత్తము ౨,౪౪౧—మంది పనిచేయుదురు. ఇందు బాలబాలికలు లేకుండుట యొక మేలు.

చూచి ఆనందింపదగిన ప్రకృతి విచిత్రము లీమండలమున చాల గలవు. ఒకమారు నల్లమలల ప్రాంతములకు బోయిన జాలును. అచట ప్రకృతి కన్నుల పండువుగ నుండును. ఎటు చూచినను ఆకాశము నంటు మ్రానులు, కొండలనుండి పుట్టు ఊటకాలువలు, నీటిబుగ్గలు మనస్సునకు హాయిని గూర్చుచుండును. చరిత్ర ప్రసిద్ధమయిన శ్రీశైలమహాక్షేత్రము ఈకొండలపైనను, మహానందిక్షేత్రము కొండల నానుకొనియు నున్నవి. శ్రీశైలమును, తద్యాత్రాపరిశ్రమమును, అందు నెలకొనియున్న మల్లికార్జునుని మహిమమును, పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రమున కన్నులకు గట్టినట్లు వర్ణించియున్నాడు. మహాశివరాత్రి సమయమున నచ్చట మహోత్సవము మహద్వైభవముతో నేటా జరుగుచుండును. వేలకొలది యాత్రికులు దూరదేశముల నుండి కూడ వచ్చుచుందురు.

మహానందిక్షేత్రమునను అపుడే ఉత్సవము జరుగును. త్రిపురాంతకము, అహోబిలము మొదలయిన క్షేత్రములు దర్శనీయములు కొన్ని గలవు. 'ఏటా' ఆయా క్షేత్రములయందు నెలకొనియున్న దైవములకు గొప్ప ఉత్సవము జరుగుచుండును. మండలమునందలి భిన్నభిన్నశాఖల అధికారులు, ఉత్సవసమయము లందు తైర్థికులకు కొంత సౌకర్యమును సమకూర్చుచుందురు. వీరు ఇంకను ఎక్కువసౌకర్యములను గలిగింప జూడవలెను.

ఇక నీమండలమును గూర్చిన వివరముల గట్టిపెట్టి కర్నూలుపట్టణమును గూర్చి తెలిసికొందము.

## కర్నూలుపట్టణము - ప్రాచీనచరిత్ర లేశము

మండలమునకు ముఖ్యపట్టణమయిన కర్నూలును చరిత్రప్రసిద్ధమయినది. ఆంధ్రవాఙ్మయము, శాసనములు, స్థానికచరిత్రలు దీనిని కందనవోలు[1] లని పేర్కొనుచున్నవి. ఈ కందనవోలు తొలుత, క్రమముగ చాళుక్య చోళ యాదవాంధ్ర రాజుల పరిపాలనమున నుండి, క్రీస్తు పదునూడవ శతాబ్దమున గుల్బర్గ బహామని రాజులవశమయ్యెను. మరల కొన్ని యేండ్లకు విజయనగర రాజులస్వాధీనమయి తలికోట యుద్ధమునాటివఱకు వారియేలుబడియందే యుండెను. ఆంధ్రభోజబిరుదాంచితుడు, విజయనగరసామ్రాజ్యాధీశుడు నగు శ్రీ కృష్ణదేవ రాయలకు సవతితమ్ముడు అచ్యుతదేవరాయ లీకందన

1. కర్నూలున కీపేరు గల్గుట నీక్రిందికథ తెలుపుచున్నది: కర్నూలున కీశాన్యమున తుంగభద్ర కావలియొడ్డున నెనిమిది మైళ్లదూరమున 'అలంపూరు' అను గ్రామమున్నది. అచ్చట క్రీ. ౧౧ వ శతాబ్దమున చాళుక్యులు కట్టించిన దేవాలయ మొకటి కలదు. ఆ దేవాలయమును గట్టుటకై రాళ్లను బండ్లపై గొనిపోవు ఒడ్డెవాండ్రు తుంగభద్రను దాటుటకుబూర్వ మిపుడు కర్నూలున్నచోటను బండ్లనువిప్పి ఇరుసులకు గందెన పెట్టువారట. వీరికి గందెనకు జమురు నచ్చటనున్న యొక తెలుకులవా డిచ్చుచుండెడివాడట. ఇట్లుక్రమముగ నక్కడ నొకచిన్నపల్లె ఏర్పడెనట. అదియె అప్పటప్పటకి పెరిగి మార్పులను కూర్పులనుగాంచి చరిత్రకెక్కి నేటి స్వరూపమును దాల్చినది. కందెన కారణముగా దొలుత కందెనవోలు_పిదప కందనవోలు_క్రమముగ 'కర్నూలు' గా మారి తుదకు మండల నామముగకూడ రూఢికెక్కినది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వోలున కోటను కట్టించెనట. విజయనగరసామ్రాజ్యము నంతమునొందించిన తలికోటయుద్ధమునకు తరువాత నిది బీజపుర పుసుల్తానులవశమున నుండినను, వారికిలోబడి దీని పరిపాలనము విజయనగర సామ్రాజ్యాధీశుల సంతతివారే కావించుచుండిరి. తరువాత క్రీస్తు పదునేడవశతాబ్దారంభకాలమున బీజపురపుసుల్తాను ఈ కందనవోలును వీరి పరిపాలనమునుండి తొలగించుటకయి తనగవర్నరు అబ్దుల్ వాహబుఖానును పంపెను. అతడు సేనలతో వచ్చి యీకోటను ముట్టడించెను. అపుడు కందనవోలును అళియరామరాజు మనుమడు గోపాలరాజు పరిపాలించుచుండెను. అతడు వాహబుఖాను దాడి నెదుర్కొనజాలక కోటను విడిచి ఉత్తరద్వారముగుండ పారిపోయెను. ఆ ద్వారము శిథిలమై 'గోపాలదరవాజా' అనుపేరున నేటికిని కర్నూలున గలదు. ఈగోపాలరాజు నగళ్ల శిథిలములును గొన్ని కలవు.

ఇట్లు గోపాలరాజు పారిపోవగా కోటను వాహబుఖాను స్వాధీనపఱచుకొని పదునాఱేండ్లు పరిపాలించెను. ఇతడు ఇచటి హిందూదేవాలయముల నన్నిటిని పడగొట్టి మసీదులను జేసెను, ఇదియే ఈతడొనరించిన ఘనకార్యము. పట్టణమునుకూడ కొంత పెంపొందించెను. ఇతడు క్రీ. శ. ౧౬౧౮ వ సంవత్సరమున చనిపోయెను. కర్నూలున హంద్రీనదియొడ్డున ఇతడు తనకొఱకు కట్టించియుంచిన గోరీయందే యితని మృతశరీరము సమాధిచేయబడెను. ఇది వాహబుసమాధి (చిత్రము ౨) అను పేర నేటికిని చెక్కుచెదరక యున్నది. ఇది రాతికట్టడము. దీనికి దూలములు లేవు. చిన్నచిన్న నల్లరాతిముండ్లను జోడించి దూలములుగ గట్టి దానిపై కట్టడము కట్టబడియున్నది. శిల్పమంతగా లేకున్నను దీనినిర్మాణకౌశలమెన్నదగినది. కర్నూలున చూడదగినవానిలో నిది ముఖ్యమయినది.

వాహబునకు తర్వాత నితనితమ్ముడీకందనవోలున కధికారి అయ్యెను. ఇట్లే యిది బీజపురము సుల్తానుల పరిపాలనమున నుండి క్రీ. శ. ౧౬౮౬ లో ఢిల్లీచక్రవర్తుల వశమయినది. తరువాత క్రీ. శ. ౧౭౧౦ వ సంవత్సరమున వారివలన 'దావూదుఖాను' అను పటాను దీనిని జాగీరుగాబడసెను. అది మొదలు క్రీ. శ. ౧౮౩౮ వ సంవత్సరమున బ్రిటీషువారు రాజ్యము గైకొనునాటి వరకు నీదావూదుఖాను సంతతివారే జాగీరును అనుభవించు



కాదర్ బాగు

ఇచ్చట క్రీ.శ. ౧౭౫౦ ప్రాంతముల కర్నూలు నబాబగు హిమాయత్ ఖాను హైదరాబాదు నబాబు నాసరుజంగు యొక్క సేనాపతి హిమ్మదయారుఖానును అతని మూడువందల సేనలతో మడియించినాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్నూలు చిత్రములు



ప్రభుత్వ వైద్యాలయము (పట్టణమునకు వెలుపల నున్నది.)



'షా మిష్కిన్ దర్గా' యందున్న సుందరమయిన నల్లరాతి తొట్టి

ఒకరాతియందు మలచినది. అతిసుందరముగనున్నది. పొడవు సుమారు ౬ అడుగులు. వెడల్పు ౪ అడుగులు. ఎత్తు ౩ అడుగులు. భద్రపరచువాగ లేమిచే నొకింత బీటవారినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



పట్టణమునడుమనున్న ఒక పాతబురుజు

దీనియందు ప్రభుత్వమువారు నల్లమందును నిలువచేయుంచి దీనిని పోలీసుకాపలాలో నుంచినారు.



రామానాయడి బురుజు శిథిలములు

ఈ రామానాయుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్నూలు చిత్రములు



ప్రభుత్వ వైద్యాలయము (పట్టణమునకు వెలుపల నున్నది.)



'షా మిష్కిన్ దర్గా' యందున్న సుందరమయిన నల్లరాతి తొట్టి

ఒకరాతియందు మలచినది. అతిసుందరముగనున్నది. పొడవు సుమారు ౬ అడుగులు. వెడల్పు ౪ అడుగులు. ఎత్తు ౩ అడుగులు. భద్రపరచువారు లేమిచే నొకింత బీటువారినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



పట్టణమునడుమనున్న ఒక పాతబురుజు

దీనియందు ప్రభుత్వమువారు సల్లమందును నిలువయుంచి
దీనిని పోలీసుకాపలాలో నుంచినారు.



రామానాయడి బురుజు శిథిలములు

ఈ రామానాయుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్నూలు చిత్రములు



ప్రభుత్వ వైద్యాలయము (పట్టణమునకు వెలుపల నున్నది.)



'షా మిష్కిన్ దర్గా' యందున్న సుందరమయిన నల్లరాతి తొట్టె

ఒకరాతియందు మలచినది. అతిసుందరముగనున్నది. పొడవు సుమారు ౬. అడుగులు. వెడల్పు ౪ అడుగులు. ఎత్తు ౩ అడుగులు. భద్రపరుచువారు లేమిచే నొకింత బీటవారినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



పట్టణమునడుమనున్న ఒక పాతబురుజు

దీనియందు ప్రభుత్వమువారు నల్లమందును నిలువయుంచి దీనిని పోలీసుకాపలాలో నుంచినారు.



రామానాయడి బురుజు శిథిలములు

ఈ రామానాయుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుండిరి. వీరిపరిపాలనమున నుండిన నూటపాతికఏండ్ల కాలమున నీమండలముపై పెక్కురు రాజులు కన్నువైచి యొండొరులతో పోరాటము సాగించుచుండిరి. ఈకాలమునకు సంబంధించిన చరిత్రము చాల గలదు. దానిని విపరింపదగును. ఇతడు తనపై తిరుగుబాటు కావింప మందుగుండు సామానులను సేకరించుకొనుచున్నాడను నేరమును ఆతనిపై మోపి బ్రిటీషువారతనికి, అతని కుటుంబమునకు జీవనాంశముగా ఏటా కొంతసొమ్ము



కాదర్ బాగ్-ఇపుడిచట వ్యవసాయము సాగుచున్నది

వివరించుట కిచట నవకాశము లేదు. కాని కర్నూలునకు కట్టకడపటి జాగీరుదారయిన గులాము రసూల్ ఖాను* పరిపాలనమును గూర్చి మాత్రము యించుక నిచ్చుట కేర్పాటుకావించి యాతనినుండి జాగీరు నూడ జెరికికొనిరి. ఇతనికాలమున జాగీరు పరిపాలనము సని గాలేకుండెను. రైతు లొసగవలసిన సిస్తు సొమ్మునకు

* కర్నూలు జాగీరుదారుల చరిత్రను దెలుపగల రికార్డు చాల నశించినదట. ఈ చివరజాగీరుదారుని తండ్రి 'మునౌవరుఖానుకు' పట్టము గట్టునపుడు వచ్చియుండిన బ్రిటీషు సిపాయీలు కోటలోనున్న 'రికార్డు దస్త్రములను' జూచి వింతగొని వానిని తలక్రిందులు చేసివైచిరట. జాగీరుదారుడు వానిని సరిచేసుకొనజాలనివాడయి యేమిచేయుటకును పాలుపోక దీకాకుపడెను. చివరకు ఆదస్త్రములను తనయేనుగుల పైనను, ఒంటెలపైనను ఎక్కించుకొనిపోయి నిండుగ బ్రవహించుచున్న హంద్రీనదియందు పడద్రోయించెనట. ఇట్లు వానిని ఏటగలుపుటకు కొన్నిదినములు పట్టెనట. ఎన్నిదస్త్రములో! ఎంతరికార్డో! పెక్కు దురంతములకును, దుఃఖకరమయినచరిత్రకును ప్రమాణము కాదగిన యారికార్డు నంతనుఇట్లు నదీప్రవాహము కొనిపోయి శాశ్వతముగ మరుగుపరిచి వైచినది. ఇక పట్టణముయొక్క ప్రకృతస్థితిని చర్చింతము.

సరియైనలెక్క లుంచక యితడు తనయిష్టము చొప్పున వారివలన సొమ్మును పుచ్చుకొనుచుండెడివాడు. ఇంకను అత్యాశాపరుడై పండినపంటలను రైతులకు దక్కనీయక తనసిబ్బందిచే కొల్లగొట్టించి తెచ్చుకొనుచుండెడివాడు. ఇట్టి దురంతములను సహింపజాలక యూళ్లను పాడు వైచి రైతులు పారిపోయెడువారు. ఇంతయే కాదు. ఈజాగీరుదారుని గుఱ్ఱమొకటి 'నన్నూరు' అనుగ్రామమున మృతినొందెనట. దానిక్రయము ౫ వేలరూపాయలు ఆయూరిశిస్తున కంటగట్టి రైతులవద్ద రాబట్టుకొనెను. మఱియు నితడు భోగలాలసుడట. ఇతడు కోటకు చెంత తుంగభద్రానదిలో నొకసౌధమును గట్టించుకొని అందు భోగపరాయణుడై స్వైరముగ విహరించుచుండెడివాడని చెప్పుకొందురు. తుంగభద్రప్రవాహము నడుమ నేటికిని ఈసౌధముయొక్క శిథిలములు కాన్పించుచున్నవి. ఇతడు కొంత పిచ్చికళలు గలవాడనియు ప్రతీతి.

ఇతనిమనుమ డొకడుమాత్ర మిప్పుడు మిగిలియున్నాడు. శిథిలము కాగా మిగిలియున్నకోటలోని యొక భవనమున నితడు నివసించుచున్నాడు. అదియును శిథిలము కాదగిన స్థితియందున్నది.

## కర్నూలు పట్టణము-నేడు

కర్నూలునకు బోవువారు చెన్నపురము నుండి గుంటకల్లునకు, అటనుండి బెజవాడకు పోవు రైళ్లపై ప్రయాణించిన ద్రోణాచలమునకు చేరుదురు. ఆంధ్రదేశము వారు బెజవాడనుండి బయలుదేరిన అచ్చటకు జేరుదురు. పిదప ద్రోణాచలము నుండి రైలుపై కర్నూలునకు బోవలెను. మఱియు చెన్నపురినుండి గుత్తికి పోయి యక్కడనుండి 'బస్సు'లో ప్రయాణముచేసినను కర్నూలు చేరవచ్చును. ఈ ప్రయాణము ౬౦ మైళ్లు బెంగుళూరి నుండి కర్నూలుకు బోవు 'సివిల్ రోడ్డు'పై చేయవలెను. ఈరోడ్డు చదునయి అందముగ నుండును. గుత్తిలో ఉదయమున తొమ్మిదిగంటలప్రాంతమున బయలుదేరు బస్సు ఈరోడ్డున నిరంతరాయయగా సాగిపోయినయెడల పండ్రెండుఘంటలకు కర్నూలు చేరును. గుట్టలపయినను, గుట్టలనడుమను ఎక్కుచు, దిగుచు, గుట్టలయంచున నిటునటు పామువలె మెలికలు దిరుగుచు నుండు రోడ్డుపై చేయు ప్రయాణము ఒకింత భయసంభ్రమములకు తావొసగునదయినను ఇరుప్రక్కల ప్రసన్నముగ వెలయుచున్న ప్రకృతి నేత్రపర్వమై హృదయానందమును గలిగించుచుండును. ద్రోణాచలమునుండి యీరోడ్డు ఇనుపదారి ననుసరించియే యున్నది. ఊరికి వెలుపల నున్న కర్నూలు జిల్లా వైద్యాలయము, జిల్లాకలెక్టరుకచేరిల ప్రక్కనుండి పోయి హంద్రీనదిని దాటి యీరోడ్డు కర్నూలులో ప్రవేశించును. కర్నూలున కిటువైపు హంద్రీనది, అటువైపు తుంగభద్రానదియు గలవు. హంద్రీనదిపై ఇచ్చట మూడు వంతెనలు ఎగువవైపున ఇనుపదారి వంతెన, నడుమ కడప-కర్నూలు కాలువ-పారుటకు వంతెన, దిగువ సివిలురోడ్డు వంతెన-ఉన్నవి. సివిలురోడ్డు ఇక్కడనుండి చీలి ఒకటి రైలుస్టేషన్ వైపునకును, ఇంక నొకటి రెండు పట్టణములోనికిని బోవును. సరిగా పట్టణములోనికి బోవువఱకు నీరోడ్లు విశాలముగనే యుండును. వీని కిరువైపుల బంగళాలు, చిన్న తోటలు, స్కూళ్లు, మిషనువారి బంగళాలు నుండును. రోడ్లు ఇక్కడ చదునుగనే యుండును. స్టేషనుకు పోవు రోడ్డు మరల కడప-కర్నూలు కాలువను దాటవలెను. కాలువదగ్గరనుండి రైలుస్టేషనువఱకు రెండుఫర్లాంగుల మేర రోడ్డు సరిగా లేక ఎగుడుదిగుడుగ నుండి బండ్లకును, మనుష్యులకును-ముఖ్యముగ వానకాలమున-చాల ఇబ్బందిని కలిగించును. పట్టణమున నాలుగైదురోడ్లుమాత్రము ఒకింత విశాలముగ నుండును. తక్కినరోడ్లన్నియు గొందులుగను, ఎగుడుదిగుడుగను ఉండును, వర్షము కురిసినచో నెక్కడ నీరక్కడనే నిలువయుండవలయును గాని ఆవలకు పోవుటకు వీలుండదు. పట్టణమునకు ఉత్తరము, తూర్పు దిక్కుల ప్రవహించుచున్న తుంగభద్రను దాటుటకు సివిలు రోడ్డుకు వంతెన లేదు. ఇది యొక గొప్పలోపము. ఇచ్చట చక్కగా వ్యాపారము సాగకపోవుట కీ లోపము చాలవఱకు కారణమగుచున్నది. తుంగభద్ర బ్రిటిషు నైజాము రాజ్యములు రెంటికిని సరిహద్దుల నుండుటచేత ఉభయప్రభుత్వములవారును దీనిపయి వంతెన కట్టు విషయమును తలపెట్టకున్నారు కాబోలును. ఇనుపదారివంతెనమాత్రము కలదు కావున సుమారు రెండేండ్లనుండి రైలుసరాసరి నైజాము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యములోనికి బోవుచున్నది. ఈవంతెన కట్టి ద్రోణాచలమునుండి కర్నూలువరకు గల ఇనుపదారిని నైజాము వారు తమ ఇనుపదారిలో కలుపుకొన్నారు. ఈప్రాంతముల తుంగభద్రను కాలినడకను దాటుట కెప్పుడును వీలుండదు. 'అరిగలు' అను పేములు మొదలయిన వానితో అల్లిన గుండ్రముగ నుండు బుట్టలపయి దాట వచ్చును. వీనిపై ౧౦, ౧౨ మంది ఎక్కవచ్చును. వీనిపయినే తుంగభద్రకు ఆవలియొడ్డున గల గ్రామములవారు కూరగాయలు మొదలయిన వానిని కర్నూలున నమ్మకొన ననుదినము గొనివచ్చుచుందురు. అరిగలపయి నదిని దాటుట కొంతభయావహముగనే యుండును.

తుంగభద్ర ఒడ్డున నరమైలు చదరముగ కర్నూలు నబాబులకోట శిథిలములు గలవు. పట్టణమున నడుమ నడుమ శిథిలములైన బురుజులు, పూడిన కందకములుగలవు. కందకములపట్టుల వానకారున నీరు నిలువయుండును. కావున పట్టణమునడుమ నిండ్లులేక కొంతబయ లేర్పడినది. కందకమున నిలిచియున్న యొకబురుజున ప్రభుత్వము వారు నల్లకుంటను నిలుపచేసికొని యున్నారు. తుంగభద్రవైపున కోటగోడ కొంతదూరము వెనుక కొన్ని యేండ్లనుమునుపు నదీప్రవాహమున గొట్టుకొని పోయినది. ఇక కొంతదూరము బురుజులతోగూడ శిథిలమగుచు క్రమముగ నేలమట్టమగుచున్నది. శిథిలములయిన రెండు బురుజులను స్వాధీనము చేసికొని దానిపయి కడప-కర్నూలు కెనాలు డిప్టికలెక్టరుగ నుండిన బంగారు కడియాల సుబ్బారావుగారు గొప్పమేడలు కట్టించిరి. కోటలోని జాగీరుదారులనగళ్లు చాలసుందరముగ నుండినట్లు తచ్ఛిథిలములయందు కొన్నినిదర్శనము లున్నవి. గోడలన్నియు కడపరాళ్లతునుకలు చేర్చి కట్టినవి. వానిపయి ౨ అంగుళములు మొదలు ౧౨ అంగుళముల వఱకు మందము గల గచ్చుపూతయుండును. ఆపూతపయి శిల్పచిత్రములు, వర్ణచిత్రములు చిత్రింపబడినవి. అచ్చట క్రీడాసరస్సొకటి పద్మాకారమున మిగుల రమణీయముగ నున్నది. ఇంకను కొన్ని సరస్సులు, నీటితొట్లును నగళ్లలో నున్నవి. వీనిని నింపుటకును, స్నానపానాది కార్యములకు నిలువచేసి యుంచుకొనుటకును నీటిని తుంగభద్రనుండి ఏదియో దేశీయయంత్రము సహాయముగ రాతిగొట్టముల గుండను, లోహపుగొట్టములగుండను పారించికొనెడివారు. ఈ గొట్టములతునుకలు అక్కడక్కడ కనుపడుచున్నవి. మఱియు నిచట ఎన్నియో విధములయిన కట్టడములు, మసీదులు నున్నవి. ఇవియన్నియు నిపుడు రాళ్లప్రోవులు. నగళ్లంతయు చెట్లు చేమలు, పొదలు మొదలయినవానితో నిండి జంతునివాసయోగ్యముగ నున్నవి. ఈనగళ్లలో నొకచోనున్న యొక యసంపూర్ణమగు మసీదుతప్ప నల్లరాతి గట్టికట్టడ మొకనొక్కటియయిన నుండినజాడ కానరాదు. నగళ్ల సింహద్వారము నంటి ఒకటిరెండు కట్టడములభాగములు శిథిలావశేషములుగ నిలిచియున్నవి. వానియందు నేడున్న జాగీరుదారు (పేరునకు) నివసించుచున్నాడు. ఆభాగములును క్రింద గూలుస్థితియందే యున్నవి. పాడుపడియున్న యీశిథిలములనుయీ చూచువారికించుకహృదయము విచారమును చెందకపోదు. ఇచటనే కాక పట్టణమంతటను ప్రాచీననిర్మాణములు, హిందూరాజులవో, మహమ్మదీయరాజులవో, శిథిలములయి యున్నవి. ఇట్టివానిలో కొత్తపేటయందున్న 'సామిష్కిన్‌దర్గా'* అనునది ప్రసిద్ధమయినది. ఈనిర్మాణములయందు గచ్చుపని సొగసుగ నున్నది. మఱికొన్ని మసీదు లీపురమున వాహబుకాలమున హిందూ దేవాలయములు మార్చి కట్టబడినవి. ఇట్టివానిలో నిదే జుమ్మామసీదు ఒకటి. హంద్రీనది యొడ్డున నొక శివాలయము బంగాళాగా మారినది. ఇపుడందు జిల్లాబోర్డు కార్యాలయ మున్నది. నదివైపునతప్ప ఈ నగళ్లకు తక్కినవైపుల నిపుడు ఇండ్లుబలకొనుచున్నవి.

ఈ పురమున—మండల మంతటనుగూడ—ఇండ్లు పయికప్పు కాలిపోగా నిలిచిన మొండిగోడలవలె ఘోరస్వరూపమున నుండును. అవి మట్టిమిద్దెలట! నలుప్రక్కలగోడలు పైకప్పుకంటె నెత్తుగ నుండును. కప్పుపయిబడిన వాననీరు పోవుటకు గోడలలో గొట్టములతో

* వెనుకటి జాగీరుదారుని గురువగు 'సామిష్కిన్' అనునాత డిచట సమాధి చేయబడెను. ఇచట కర్నూలు జాగీరుదారులు కొందఱు సమాధి చేయబడిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తూముల నుంతురు. లోనికి గాలి, వెలుగు చొచ్చుట కవకాశము చాలయిండ్లకున్నట్లు కానరాదు. ఉన్న యిండ్లకు కప్పుపయిన అ. ౨ నిడివి, అ. ౧ వెడలుపుగల రంధ్రములుండును. వాన వచ్చినపుడంతయు నారంధ్రములను రేనితోనైన మూయుచుండవలెను. గోడలు కడపరాతిచెక్కల పేర్పుడులు. వారివారి ఆయతి ననుసరించి వానికి మట్టితో గాని, గచ్చుతోగాని పూత పూయుదురు. పైపూత యూడినచో గోడలు క్రింద గూలుటకు సిద్ధమగును. అట్టి గోడలపయి కఱ్ఱదూలముల నుంచి, వానిమీద కొంచెము పాటి చదునయిన మోకాటిలావు అడవికఱ్ఱలను మూరకు, అడుగునకు ఒకటిగ నుంచి, వానిమీద వెదురు లేక ఈతపేళ్లచాపలను పరచి, అటుపయి మన్ను పోయుదురు. సంపన్నులయినవారు ఆమట్టిపై గచ్చు పూయుదురు; పయిన గదులు మొదలయినవానిని క్రిందిభాగముల విధముననే కట్టుకొందురు. ఇచట ఇటుక కనుపించుట అరుదు. పట్టణములోపలనే కడపరాతి గనులు అపరిమితముగ నున్నవి. పైమట్టి నింతకుల్లగించిన అంతయు రాతిమయము. దానినుండి పలుచగను, మందముగను రాళ్లనూడదీసికొనవచ్చును. మందముగ నుండు నీరాతితుండ్లను సిమెంటుతో అతికి కట్టినకట్టడములు చూడ సొంపుగ నుండును. మిగుల శ్రీమంతులు ఇపుడిపుడిట్టియిండ్లను కట్టుకొనుచున్నారు.

పట్టణమున నేవో కొన్నిమాత్రము తప్ప తక్కిన వీథులన్నియు మిగుల ఇరుకుగ నుండును. చాలవఱకు మూడుగజముల వెడలుపయినను లేక మిట్టపల్లములుగ నుండును. ఇండ్లలోనుండి వచ్చుమురికినీరు, వాననీరు ఈ గొందులలో నిలువతాకి మురుగుచుండును. సహజముగనే దోమలకు పుట్టినిండ్లయి తత్ఫలముగ నచటి జనులను తరుచు మలేరియా జ్వరమువాత బెట్టుచున్న యీ గొందుల ఇట్టిస్థితి వారి యనారోగ్యమును నలుమడుంగుల పెరుగజేయుట నిశ్చయము. పట్టణమునందు ముప్పాతికవంతుకు మించి ప్రజలు ఈ గొందులలోనే నివసించుచు బాధ నొందుచున్నారు. ఈ యిరుకుమురికి గొందులు; గాలి వెలుగులు కరవయిన మట్టిమిద్దెలు, నిరంతరరోగబాధచే చిక్కి శల్యములవలె నున్న ప్రజలు-ఇది యంతయు ఒకభయానకదృశ్యము. ఈగొందులలో నిండ్లదుమపెక్కు మసీదులు, గోరీలు, పాడువడిన ప్రాతయిండ్లు లెక్కకుమిక్కిలిగగలవు. నేడును ఇండ్లనడుమనే మహమ్మదీయులు శవములను పాతిపెట్టుచుందురని వినుకలి. ఒకింత విరివిగను, వంపులు దిరిగినను మిగుల పొడవుగను ఉన్న బజారువీథియు చదునయినది కాదు. అందును నీరు వడిసిపోవుటకు మార్గము లేదు; చూడ నసహ్యముగను ఉండును. అన్ని వీథులలోను పెంటకూడ సరిగా తీసివేయు నేర్పాటును కానరాదు. ఇట్టిపట్టుల పురపాలకసంఘమువారు తొలుత పట్టణముయొక్క దుస్థితిని తొలగించి పౌరుల కారోగ్య భాగ్యమును సమకూర్పవలసియుండ, కడచిన సంవత్సరము ౨౬౫,౦౧౦ రూపాయలు ప్రభుత్వమువారి వలన ఋణము గొని విద్యుచ్ఛక్త్యుత్పాదక యంత్రములను స్థాపించి పట్టణమును (అధికముగ సంపన్నులున్న భాగములకే యగును) విద్యుద్దీపములచే నలంకరింప బూనినారు. దీనికి కావలసినపను లన్నియు జరుగుచున్నవి. త్వరలో ముగిసి యుపయోగమునకు రాగలదు. ఈ విద్యుచ్ఛక్తి కొళాయిలకు నీరు తోడు యంత్రమునకును ఉపయోగించును. మఱియు నిండ్లలో దీపములు మొదలయిన వానికి, మరలలో యంత్ర సంచాలనాదులకు నుపయోగించును. కాన క్రమముగ లాభకారియే కావచ్చును. కాని, అది ఏ నాటికి కాగలమాట! అంతవఱకు పౌరులు—సామాన్యస్థితియందున్నవారు, బీదలు—ఇట్లే యుండవలయునా? భారతీయులకు బ్రిటిషువారికి గల తారతమ్య మిట తెలియును. విద్యుచ్ఛక్త్యుత్పాదనమునకై ఋణమిచ్చినచో ఆధనమంతయు బ్రిటిషువారు తయారుచేసిన యంత్ర సాధనములను కొనుటకే వ్యయింపబడును. అందువలన— అల్పమాత్రమే యగును గాక—వారినిరుద్యోగబాధ యించుక కొరతవడును. వారు మొదటినుండియు వ్యాపారమునందు కుశలు లేకదా! మనము—భారతీయులము—ఇంటివారు చచ్చుచున్నను కన్నెత్తి చూడము కాని బయటివారి అడుగులకు మడుగులొత్తి మనసర్వస్వమును ధారపోయుదుము. ఈ మునిసిపాలిటీవారు పట్టణాభివృద్ధికయి గూడ ప్రభుత్వమువారికడ ఋణమును గైకొనరాదా వారు ఇవ్వకున్న నీ ఋణమును గూడ మానివేయరాదా! ఆరోగ్యము చక్కగానున్న చీకటిలోనయిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోవచ్చునుగదా! ఇది అనాలోచితమయిన పనిగా కాన్పించుచున్నది.

ఈ పట్టణమున ౧౯౨౧ సంవత్సరము జనాభా లెక్కల ననుసరించి జనసంఖ్య ౨౭,౯౦౮ (పురుషులు ౧౩,౮౪౪, స్త్రీలు ౧౪,౦౬౪). ఇందులో హిందువులు ౧౪,౪౧౨ (పురుషులు ౭,౧౦౬, స్త్రీలు ౭,౩౦౬), మహమ్మదీయులు ౧౨,౯౨౦ (పురుషులు ౬,౪౨౭ స్త్రీలు ౬,౪౯౩), తక్కినసంఖ్య క్రైస్తవులు మొదలయినవారు. ఈ పట్టణమునందలి జనసంఖ్య ౧౮౮౧ సంవత్సరమున ౨౦,౩౨౯; ౧౮౯౧ సంవత్సరమున ౨౪,౩౭౬; ౧౯౦౧ సంవత్సరమున ౨౫,౩౭౬; ౧౯౧౧ సంవత్సరమున ౨౬, ౦౪౧; ౧౯౨౧ సంవత్సరమున ౨౭,౯౦౮. ఇట్లుక్రమముగ నభివృద్ధిపొందుచున్న జనసంఖ్య నేటి కింకను అభివృద్ధిని గాంచియుండును.

౧౯౨౭_౨౮ సం.న ఈ పట్టణమున ౫ సెకండరి పాఠశాలలును(బాలురు౧౦౦౫, బాలికలు౯౭, మొత్తము ౧౧౦౨), ఎలిమెంటరి పాఠశాలలు౪౮(బాలురు ౧౯౫౧, బాలికలు౯౪౨, మొత్తము౨,౮౯౩), ప్రైవేటుపాఠశాలలు ౩ (బాలురు ౧౬౬, బాలికలు ౨౪, మొత్తము ౧౯౦), కలిసి ౫౬ పాఠశాలలోను చదువు బాల బాలికలు (బాలురు౩,౧౨౨, బాలికలు ౧,౦౬౩) మొత్తము౪,౧౮౫ గలరు. ౧౯౨౮-౨౯లో మునిసిపాలిటివారి యాజమాన్యమున ఎలిమెంటరి పాఠశాలలు బాలురకు ౧౨, బాలికలకు ౫ను, సెకండరీ పాఠశాల ఒకటియు నుండినవి. అందు ఎలిమెంటరీ పాఠశాలలలో బాలురు ౧,౦౬౧ మంది, బాలికలు ౩౭౯ మంది చదివిరి. కడచిన సంవత్సరమున ౧౯ బడు లుండెను. వానిలో బాలురు ౯౯౭, బాలికలు ౪౫౨ చదువుచుండిరి. ఈ పాఠశాలలలో నొకటి ఆది ఆంధ్రుల కొఱకు ప్రత్యేకింపబడినది. చదువుకొనవలసిన వయసుననుండు బాలురలో నూటికి ౧౯ మందికి, బాలికలలో ౫౪ మందికి చదువ వసతులు సమకూరకున్నవి. ప్రారంభవిద్యను మునిసిపాలిటీవారు తమ పాఠశాలలలో ఉచితముగ నేర్పుచున్నారు. సెకండరి పాఠశాలలో సెకండరి తరగతులలో విద్యార్థుల సంఖ్య ౪౬౧. కడచిన సంవత్సర మీసంఖ్య ౪౩౭ మాత్రమే యుండెను.



కాలువలకు పారు నీటిని నిలువచేయు రెండు పెద్ద జలాశయములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈపాఠశాలను, పెద్దదిచేయుటకుగాను సుమారు ౩౫,౧౧౦ రూపాయలు వెచ్చించి కట్టడమును పెంపొందించుచున్నారు. ఇక్కడి సెకండరీ పాఠశాలలకు హాస్టళ్లును ఉన్నవి. (తక్కిన పాఠశాలలలో చదువు బాలబాలికల సంఖ్యను గూర్చి ౧-౨ పట్టికలను చూచునది.)

ఈ సంవత్సరమున పట్టణమునందు జననములు వేయింటికి ౮౮; మరణములు ౩౮. ఇచట కడచిన రెండు మూడేండ్లనుండి అంటువ్యాధు లేవియు నంతగా లేవు. పట్టణవాసులకు స్నానపానాదుల కొఱకు వలసిన నీటికి కొళాయి లున్నవి.



కర్నూలు కర్షకుడు

౧౮౯౭ సం.న నీకొళాయిలపద్ధతి ఏర్పాటు అయినది. రైలుస్టేషనునకు ఎగువ రెండుఫర్లాంగుల దూరమున ఎత్తయినచోట కొళాయిలకు పారించు నీటిని నిలుపచేయుటకుగాను రెండు పెద్దజలాశయము లున్నవి. స్టేషనకు దిగువ కడప కర్నూలు కాలువనుండి యంత్రసహాయమున తోడిన నీరు గొట్టములగుండ పైరెండు జలాశయములలోనికి పారును. వానియందు కొంత తేరి నీరు మరల గొట్టముల ద్వారమున వాని కొక ఫర్లాంగు మేర ఇవతల నున్న నాలుగు గచ్చుకుండ్లలోనికి వచ్చును. వానియం దొకదానినుండి యింకొకదానిలోనికి నీరు నిర్మలముగ వడిసి ఆచేరువనే భూమిలోనున్న తటాకములలో నిలువయుండును. అచటనుండికొళాయిలలోనికి పారును. ఇచట నీటిని నిర్మలముగ చేయుపద్ధతి యుత్తమమయినదట. ఇట్టిపద్ధతి చెన్నరాష్ట్రిమున మఱెచ్చటను లేదని ప్రతీతి. కాని పట్టణమునకు వలసినంత నిర్మలమగు నీరు సమకూడమిచేత గాబోలు మురికినీటినిగూడ నపుడపుడు కలిపి కొళాయిలకు విడుచుచుందురని వాడుక కలదు. పురవాసులఆరోగ్యమును పాడుచేయుట కిదియు తోడుపడును గావున దీనిని మాన్పుటకు మునిసిపాలిటీవారు ప్రయత్నింపవలెను.

ఇచ్చటి పురుషులకు కరుసగడ్డములు, కోరమీసములు నుండును. స్త్రీలు, పురుషులుగూడ బిరుసుచర్మము, ఒడ్డు, పొడవు, బిగువు గలిగియుందురు. వారిలో నెచ్చటనైన సౌందర్యము కానవచ్చును కాని, సౌకుమార్యము కానవచ్చుట అరుదు. వారు పరులయెడ మంచిమర్యాద గలిగి ప్రవర్తింతురు. అమాయకులు, సాధుస్వభావము గలవారు నయి యుందురు. సామాన్యముగా నీ మండలమునందలి ప్రజలు సులభకోపులుగారు. వీరికి కోపమువచ్చునేని హత్యలతో కాని దానికి నివృత్తి లేదు. హిందువులును, మహమ్మదీయులును, ఐకమత్యము గలిగి మెలగుదురు. ఇచ్చట హిందువులలో కృషికులు ఎక్కువగా నున్నారు. వీరిలో కొందఱు కన్నడముమాటలాడుదురు. కొందఱు తెలుగే మాటలాడుదురు. ఇచటి తెలుగుమాటలలో కన్నడ పదములు, హిందుస్థానిపదములు కలిసియున్నను తెలుగు మాత్రము అచ్చముగ పట్టుకత్తిరించినట్టులుండును గోషాలేని హిందూస్త్రీలకంటె గోషాగల మహమ్మదీయస్త్రీల స్థితి, వారి నివాసస్థానములబట్టి పరికింతుమేని, దుస్సహముగ నుండవలెనని యూహింపవలసి యున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈమండలమున నిండుగ వానలుకురియుట అరుదు; పంటలును నిండుగ పండుట అరుదు. ఈ కారణమున దేశము దారిద్ర్యపీడితమై యుండును. పురవాసులలో నూటికి ఎనుబదిటికి పయిగా దరిద్రులుగ నుందురు. వీరు కష్టించి కూలిచేసిన గాని జీవితము గడచుట కష్టము. కూలియుదొరకుటయు కష్టము. వర్షలోపము చేవ్యవసాయ పనులు తక్కువ. పరిశ్రమలు నీమండలమున సంతగా సాగుటలేదు. నిజామురాష్ట్రము లోనికి రైలు తిన్నగా పోవుట యిటీవలనే కనుక వ్యాపారమును సంతగా సాగుచున్నదని చెప్ప వీలులేదు.

బీడీల కార్ఖానాలు ఈపురమున కొన్ని గలవు. వానిలో ౮ మొదలు ౧౬ ఏండ్లలోపు వయసు గల బాలురు చాలమంది (వేయిటికి మించియుందురు) అర కడుపునకయిన చాలని కూలికి పనిచేయుచున్నారు. వీరికి చదువుసున్న; శరీరపరిశ్రమ బండిసున్న. ఇట్టి నికృష్టస్థితియందున్న వీరికీ కార్ఖానాలు వదలినచో జీవనోపాయ మెట్లు? 'ఉభయభ్రష్టత ఉపరిసన్న్యాసము' అన్నట్లు ఏయనుచితమార్గమునో అవలంబింప వలసి వచ్చును. ఇప్పటి కుఱ్ఱవాండ్రేకదా భావిభారతదేశము నకుపట్టుగంబములు. అట్టివారు ఇట్టిదుస్థితి నుండగం చుట సహింప నశక్యము. ఈ బాలురలో కొందఱికి నాలుగయిదుమణుగుల బరువుగల మ్రానితుండ్లను ఇనుప గొలుసుతో కాలికిబంధించియున్నారు. వీరు పనిచేయక పరువెత్తిపోవుదురట! అందులకని వీరికీశిక్ష. పశువులకే యిట్టిక్రూరశిక్ష వచ్చుటచ్చుటకనుచుందుము. ఇక్కడమను ష్యులకుగూడవ్యాపించినది. 'నాగరికత-నాగరికత'అను మాట దిక్కులు మారుమ్రోగుచున్న యీకాలమున నిట్టి క్రూరచేష్టలు దుస్సహములు. పురపాలకసంఘమువారు, ప్రభుత్వమువారు నీవిషయమును గమనించి దీనిని నశింప జేయుటత్యంతావశ్యకము. ఒకకార్ఖానా యజమాని ప్రజల యారోగ్యమును పీల్చిపిప్పిచేయు బీడీలను సృష్టి చేయుటకై వీరి నందఱిని పనికిమాలిన వారిని చేయు చున్నను, తాను దేశసేవ చేయుచుంటి నని సగర్వముగ చెప్పినాడు. ఇది ఎట్టి దేశసేవయో?

ఇంకను ఎందఱో బాలురు చదువులేక, పని పాటులులేక సోమరులయి, తిండిలేక కృశించుశరీరులయి వీధులవెంట తిరుగుచుందురు. నిర్బంధ ప్రారంభవిద్యా విధాన మమలులోనికి దెచ్చినచో వీరి కొకింత చదువయిన లభించి తత్పురోభివృద్ధికి తోడుపడగలదు.

ఈ పట్టణమున ఏడు మార్కెటులున్నవి. నైజాము రాష్ట్రములోనికి రైళ్లు సరాసరిని పోవుచుండుటచేత నొకటిరెండేండ్లనుండి వ్యాపార మిచ్చట కొంచెము తల యెత్తుచున్నదని చెప్పవచ్చును.

ఈమండలమువారికి ముఖ్యాహారములు జొన్నలు, సజ్జలు మొదలయిన మెట్టధాన్యములే. వీనిపిండిని రొట్టెలుగను, సంకటిగను జేసితినెదరు. 'సజ్జరొట్టె, పుండుకూర!' అనునానుడి యిక్కడి వాడుకలో నున్నది. 'పుండుకూర' అనగా గోగాకు. ఇవి యీమండలమువారి ముఖ్యాహారవస్తువులు. తక్కిన ఆహారపదార్థములును ఇతర వస్తువులును ఇచట మిగుల ప్రియముగనుండును. మఱియు వస్తువులు మంచివి లభింపవు. ఇచ్చట సామాన్యస్థితిని జీవనము జరుపుకొనుట కొకమనుజునకు నెలకు కనీస మిరువదియైదు రూపాయలయినను ఆవశ్యకమని అనుభవమువలన నిర్ధరింపడగియున్నది.

ఈమండలమున విరివిగా నేయబడుచున్న జముకాణములు, అచ్చటచ్చట కొలదిగా నేయబడుచున్న కంబడులు నీపురమున విక్రయింపబడుచుండును. ప్రత్తి మిల్లులలో గింజలూడదీసిన ప్రత్తియు, వేరుసెనగమిల్లుల లో పొట్టూడదీసిన గింజలును ఇటనుండి ఎగుమతి యగుచుండును. వేరుసెనగపప్పునుండి తీసిననూనెయు ఎగుమతియగును. వారమునకొకమారీయూర సంతజరుగును. ఇట్టిసంత లీమండలమున నింకను పెక్కుచోటుల గూడ జరుగుచుండును. ఆనాడు ధాన్యములు, వివిధములయిన ఇతర వస్తువులు బజారున రాసులుపోసివిక్రయింపబడును. ఆనాడన్నివస్తువులు నొకింత నయముగ లభించునని భావము.

ఇచ్చట కాఫీహోటలులు లెక్కకు మిక్కిలిగనే యున్నవి. నాటకశాలలు, సినీమాలుగూడ లేకపోలేదు. ఇవి ఎవ్వియు సరిగానుండవు.

మోటారు బస్సులు నలుబది ఏబది ఈపురము నుండి అన్నివైపులకును ననుదినము, ఉదయము సాయం కాలము పోవుచ వచ్చుచు నుండును. కానివీని రాకపోకల కును, చార్జిలకును నియమము లేకపోవుటచే తఱుచు ప్రయాణికులకు మిగుల నసౌకర్యము గలుగుటయే కాక వారికార్యములును భగ్నములగుచుండును. వీనివిషయ మున మంచి ఏర్పాటు జరుగుట ముఖ్యము.

ఇక నొకింతయీపురమున ఖద్దరు వ్యాపకమును గూర్చిముచ్చటించియీ లేఖకు స్వస్తిచెప్పవలెను. ఈపుర ముననొక ఖద్దరుడిపో కలదు. ఈమండలమున ఖద్దరు ఉత్పత్తిచాలతక్కువ. అయినను ఖద్దరు డిపో అధికారి భిన్న భిన్న రాష్ట్రములనుండి భిన్న భిన్న విధములగుఖద్దరును తెప్పించి ప్రజలకు ఖద్దరుపై ననురక్తిని గలిగించుట కెంతయు పాటుపడుచుండుట మిక్కిలి సంతోషావహము. ఇచ్చట దినమునకు సరాసరి ౫౦, ౬౦ రూపాయలు విలువగలఖద్దరు అమ్మబడుచుండును. డిపో లిమిటెడ్ కంపెని పద్ధతులపై నడుపబడుచున్నది. షేరువిలువ రు ౧౦ మాత్రమే. మండలమునందలి తాలూకాలన్నిటిలోను ఈ డిపోకు శాఖ లున్నవి. అన్నిటి యందును విక్రయము బాగుగ సాగుచుండును. ఖద్దరుఉత్పత్తిని గురించియు నీ డిపో వారు చాల ప్రయాసపడుచున్నారు. వీరి ప్రయాస ఫలప్రదమై ఈ జాతీయపరిశ్రమ దినదినాభివృద్ధిని గాంచునుగాక!

పురపాలక సంఘమువారును పట్టణమును బాగుపఱచి, పురవాసుల ఆరోగ్యైశ్వర్యములను వెంపొందించు మార్గముల త్వరలో నరయుదురుగాక!

మఱియు ప్రభుత్వము వారును మండలవాసుల అభివృద్ధికి తగినసౌకర్యములను సమకూర్చ జూడవగుదురు.

### ఈ లేఖ కాధారములు

1. Current Reports on the Administration of Various Departments, Government of Madras.

2. Administration Report of Dt. Board, Kurnool.

3. Kurnool District Manual.

4. Aravidu Dynasty by Father Heras.

5. స్వానుభవము.



యం. యస్. కుప్పుస్వామి అయ్యరు గారు, కర్నూలు.
మునిసిపల్ వైద్యాలయ వైద్యులు, సరసులు,
ప్రజాసేవాపరాయణులు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గోపాలరాజు నగళ్ల శిథిలములు.



గోపాలరాజు నగళ్ల శిథిలములు
మహమ్మదీయులు ఇటీవల మరమ్మతుచేసిన భాగము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కర్నూలు చిత్రములు



షా మిష్కిన్ దర్గా, అచట కర్నూలు నవాబుల సమాధులు

ఆచేరువనున్న మఱికొన్ని శిథిలములగు కట్టడములు.



షా మిష్కిన్ దర్గా

షామిష్కిన్ ఇచట సమాధిచేయబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాభిప్రాయ విశేషములు

(౨౮-౧౨-౧౯౩౪ నాడు వ్రాసినది)

శ్లో. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ. —గీ.అ.౧౧. ౧౯:

భారతరాజ్యాంగ చరిత్రయందు లాహోరు కాంగ్రెసు ఒకమహాఘట్టముగను పరిగణింపబడగలదు. కాంగ్రెసునాయకులును, అనుచరులును, ప్రజలును సంశయాత్ములై కింకర్తవ్యతామూఢత్వమునుబూనుచున్నారు. ఇర్విను ప్రభువు చేసిన ప్రసంగ మాశాజనకమై భారతీయనాయకులహృదయమును ద్రవింపజేసినది. బ్రౌక్వె గారు భారతరాజ్యాంగ విషయమై బ్రిటీషుపార్లమెంటునందు వివాదములు లేని తీర్మానమును ప్రతిపాదించిరి:

"భారతస్వపరిపాలన సమస్యను పరిష్కరించు విషయమున భారతీయులు మనసతోడ్పడ నంగీకరించుచున్నారనుటకు నిదర్శనములను సూచనలను ఈసభవారు స్వాగత మొసగుచు, పరిపాలనలోను, కార్యనిర్వాహణము నందును, ముఖ్యముగా రాజకీయాభిప్రాయములను వెల్లడించుటలోను భారతీయులలో సద్భావము కలుగునట్లు ఇండియాదొరతనమువారు ప్రోత్సహింతురని విశ్వసించుచున్నారు."

తీర్మానమునందు పస లేకపోయినను, పార్లమెంటు తీర్మానము నేకగ్రీవముగ నామోదించుట బ్రిటీషురాజ్యతంత్రజ్ఞుల ప్రతిభను విశదము చేయుచున్నది. అన్నిపక్షములవారును తియ్యనిమాటలతో భారతీయులను సంతృప్తులను చేయగలనేర్పును బ్రిటీషురాజ్యతంత్రజ్ఞుల ప్రసంగములు విశదము చేసినవి. వెడ్జివుడు బెన్నుగారుపార్లమెంటులోచేసిన ప్రసంగమును హృదయద్రవము నభివృద్ధి చేసినది. వెడ్జివుడు బెన్నుగారు వారిప్రసంగమునందు పరోక్షముగ కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గము నిర్ణయించిన షరతుల నంగీకరించుచున్నటులు తెలియచేసెను. ఇర్వినుప్రభువు చేసిన ప్రకటనము బెన్నుగారి యామోదమునే కాక పార్లమెంటు సమ్మతమును సయితము బడసినది. రాజకీయనిర్బంధితులను విడుదల జేయుట కేర్పాటులు జరుగుచున్నవి. సైమనుకమిటి రిపోర్టును నితర రిపోర్టులతోపాటు సమాలోచనసభయందు విచారింపబడగలదు. అధినివేశపరిపాలన మాదర్శముగ గ్రహింపబడునటు లంగీకరింపబడినది. బెన్నుగారు వారి సంభాషణమునందు జేసిన సమర్థనము కన్నను వారిప్రతిపక్షులకిచ్చినప్రత్యుత్తర మాశాజనకమైనను, ప్రయోజనకరము గాదు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమును, అఖిలపక్ష సమావేశమును సమాలోచనసభ భారత రాజ్యాంగ విధానమును నిర్ణయించుటకు మూలాధారముగ నుండవలయునని నిర్ణయించినవి. బెన్నుగారి సమరసమైన దీర్ఘోపన్యాసమునందు డొమి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియనుస్టేటసు ప్రశంస కనుపడదు. వారు భరతవర్షము డొమినియను స్టేటసు మార్గమునందు నడుచుచున్నదని చెప్పిన వాదము కేవలము మాయావాద మని బాలిశులు సయితము గ్రహింపగలరు. నానాజాతి సమితియందును, ఆయుధవిసర్జన సభయందును, నితరసభల యందును భరతవర్షమునకు గల ప్రాతినిధ్యము మాయాప్రాతినిధ్యము గాని నిజమైన ప్రాతినిధ్యము గాదు. ఆమాయా ప్రాతినిధ్యమువలన నైనను బ్రిటీషు సామ్రాజ్యమునకే లాభము గలుగుచున్నది. భరతవర్షమున కేవిధమైన లాభమును గలుగుటలేదు. ఆసమితులందు ప్రతినిధి తెల్లవాడైనను నల్లవాడైనను, నిరంకుశాధికారవర్గముచే నియమింపబడుచున్నాడు. వ్యయభారము భరతవర్షమునకును, లాభము బ్రిటీషు సామ్రాజ్యమునకును సంక్రమించుచున్నది. ఆయుధధారణమే నిషేధింపబడిన భారతీయులాయుధవిసర్జనమును నిర్ణయించుట కధికారులు గాజాలరు. సైనిక వ్యయనిర్మాణములందును, నౌకాదళనిర్ణయములందును, ఆర్థికనిర్ణయముల యందును నధికారము లేని భరతవర్షము డొమినియనుస్టేటసు మార్గమునను నడచుచున్నదని చెప్పుట యతిసాహసము. బ్రిటీషుమంత్రుల మాటలందును, ప్రతిజ్ఞలందును విలువలేదని చిరకాలానుభవము విశదముచేసినది. ఆ యనుభవమునే బెన్నుగారి ప్రసంగమును సమర్థించుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యాభిమానులు బహిరంగముగను నిరాకరించెడివిషయమునే బెన్నుగారి ప్రసంగము గోప్యముగ తెలుపుచున్నది.

కాని పార్లమెంటు బ్రాక్వేగారి తీర్మానము నేకగ్రీవముగ నంగీకరించుట మాత్ర మాశాజనకముగ నున్నది.

* * * *

పార్లమెంటు నిర్ణయము

బ్రాక్వేగారి తీర్మానమును పార్లమెంటు భేదాభిప్రాయము లేకుండా నిర్ణయించుట చోద్యముగ గనుపడుచున్నది. ఉక్కుపంజర సిద్ధాంతమును ప్రతిపాదించిన లాయడుజార్జిగారెప్పటివలెనే వ్యతిరేకముగ నభిప్రాయమును తెలియజేసి భారతీయులపరాధీనస్థితిని సమర్థించుట లిబరలుపక్షము భారతరాజ్యాంగ సంస్కరణముపట్ల నవలంబింపగల రాజ్యనీతిని విశదము చేసెను. లాయడుజార్జిగారు వ్యతిరేకముగ మాటలాడియును వ్యతిరేకముగ సమ్మతి నొసంగకపోవుట గమనార్హమైన విషయము. కన్సర్వేటివుపక్షనాయకుడు సర్ సెమ్యుయలు హోరుగారును వ్యతిరేకముగ మాటలాడియు వ్యతిరేకముగ వోటు నివ్వలేదు. కన్సర్వేటివు పక్షనాయకుడు బాల్డ్విను గారును తటస్థభావమును వహించెను. పర్యవసాన మెట్లులు జరిగినను పార్లమెంటు బ్రాక్వేగారి తీర్మానము నేకగ్రీవముగ నంగీకరించుటవలన భారతీయుల కాంక్షలకు ధర్మవిజయము గలిగినదని యంగీకరింపవలసియున్నది. భారతీయుల కాంక్షలను సాదరభావముతో విచారింపవలయు నను సిద్ధాంతమును పార్లమెంటు అంగీకరించినది. పార్లమెంటు నిర్ణయించిన తీర్మాన మేమూపమును దాల్చునదియును కాలము నిర్ణయింప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలదు. పార్లమెంటునందు హిందూదేశమునకు ప్రస్తుత మొకగండము తప్పినది. లిబరలు కన్సర్వేటివుపక్షములవారు వారి నిస్సహాయస్థితి వలన ద్రాక్వెగారి తీర్మానమును ప్రతిఘటించుటకు బూనుకొనలేదని పర్యవసానము తెలుపుచున్నది. పార్లమెంటు చేసిన తీర్మానమును ఆచరణమునందు పెట్టించవలసినభారము భారతీయులమీదను గలదు.

*  *  *  *

భారతీయుల కర్తవ్యము

బ్రిటిషు రాజ్యాంగవేత్తలయందు గలిగిన భావపరివర్తనమును వారి ప్రసంగములు విశదముచేయుచున్నవి. బెన్నుగారి ప్రసంగము మాయమాటలతో నిండియున్నను సానుభూతిని విశదము చేయుచున్నది. కారణ మేదియైనను బ్రిటీషురాజ్యాంగ తంత్రజ్ఞులు భరతవర్షము పట్లను నవీనరాజ్యాంగనీతి నవలంబించవలసిన యవసరమును గ్రహించుచున్నారని తేటపడుచున్నది. ఈ మార్పుదలకు హిందూదేశమునందు ఇర్విన్నుప్రభువును, గ్రేటుబ్రిటనునందు లేబరుపక్షసభ్యులును గారకులని వారి ప్రసంగములు,వ్యవహారములువిశదము చేయుచున్నవి. ఇర్విన్నుప్రభువు భరతఖండమునందు వ్యాపించుచున్న యశాంతిని గ్రహించినవిధమును వారి ప్రసంగములు విశదము చేయుచున్నవి. భరతవర్షము బ్రిటీషుసామ్రాజ్యమునుండి జారిపోవుచున్నవిధమును బెన్నుగారును, ఇతరులును గ్రహించుచున్నటులు వారి ప్రసంగములు విశదము చేయుచున్నవి. గ్రేటుబ్రిటను నందు ప్రజలస్థితిగతులు దుర్భరముగ నున్నవి. పనివాండ్రు పనిపాటులు లేకను కష్టములననుభవించుచున్నారు. గ్రేటుబ్రిటను పోషణమునకు మూలాధారములైన వ్యాపారపరిశ్రమలు క్రమక్రమముగ క్షీణించుచున్నవి. సామ్రాజ్యము నుండి హిందూదేశము జారిపోయినపుడు బ్రిటీషుభాగ్యదేవత యస్తమించినదని యంగీకరింపవలసియున్నది. భారతీయుల మిత్రత్వము వలన బ్రిటీషుద్వీపముల కపారమైన లాభము గలుగగలదు. ప్రపంచమునం దంతటను ధర్మబలము వృద్ధిని బొందుచున్న సమయమునందు బ్రిటీషు రాజ్యాధికారులకును ధర్మబలము నారాధించవలసిన యవసరము గలుగుచున్నది.

బ్రిటీషు రాజనీతిజ్ఞులకు శాంతికాముడైన గాంధిమహాత్ముని ధర్మబలమును గ్రహింపవలసిన యవసర మేర్పడుచున్నది. 1929 సంవత్సరము ముగియుచున్నది. 1930 సంవత్సరారంభమునందు గాంధిమహాత్ముడు నాయకత్వమును బూని కలకత్తాకాంగ్రెసు తీర్మానమును నాచరణమునందుబెట్టుటకు బూనుకొనునపుడు భావిపరిణామమును నిర్ణయించుట దుస్తరము. గాంధిమహాత్ముడు స్వరాజ్యభావమును ఆబాలగోపాలమునకును స్మరణీయము చేసినటులు సంపూర్ణస్వాతంత్ర్యభావమును నయితము దేశమునందంతటను వ్యాపింపజేయుటకు దీక్షను బూనుకొనునపుడు, ఫల మెటు లున్నను, బ్రిటీషురాజ్యాధికార మస్తంగతమైనటు లూహింపదగియుండును. స్వాతంత్ర్యభావ వ్యాపనమును చతుర్విధోపాయములను నరికట్టుట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రిటీషుసామ్రాజ్యమునకు ప్రయోజనకరము. దూరదృష్టి గల బ్రిటీషురాజ్యాధికారులు లాహోరునందు గాంధిమహాత్ముడు సంపూర్ణ స్వాతంత్ర్య వాదమును బూనకుండుటకై నాటక ప్రదర్శనమును నేర్పాటు చేసియుందురు. ఈనాటక ప్రదర్శనమునకు ఇర్విన్‌ప్రభువు సూత్రధారుడుగ గనుపడినను గాంధిమహాత్ముడు నిజమైన సూత్రధారుడు. భారతీయ నాయకులును, ఇర్విను ప్రభువును, బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులును సత్యాగ్రహ దీక్షా పరాయణుడైన గాంధిమహాత్ముని మార్గము నవలంబింపగోరుచున్నారు.

డిల్లీయందు గాంధి, నెహ్రూ, జిన్నా, సప్రు, పటేలుగార్లతో జరిగిన ఇర్విన్‌ప్రభువు సంప్రతింపులు విఫలమయినవి. పారతంత్ర్య ముక్రింద క్రుంగిపోవుచున్న మాతృ భూమి నుద్ధరించుటకై యువజన హృదయము పరితపించుచున్నది. దేశమోక్షమునకై సర్వ సంగ పరిత్యాగమును జేసి అహర్నిశమును పాటుపడుచున్న గాంధిమహాత్ముడును దేశా రాధనమునందితరులకు తీసిపోడు. సంకల్పము సఫలమగుటకు సంకల్పమున కనురూపమైన సాధన గావలసియున్నది. బ్రిటీషుప్రభుత్వము భారతీయుల సంకల్పమును సఫలముచేయుటకు భారతీయుల సంయోగబల మవసరంబగుచు న్నది. అన్నిపక్షములవారి విశ్వాసమునకును గాంధిమహాత్ముడు పాత్రుడై నాయకత్వమును బూనుటకు సకలవిధములను దగియున్నాడు. అన్నిపక్షములవారును స్వాభిమానమును, స్వ ప్రయోజనములను విసర్జించి గాంధిమహాత్ముని వలెనే మాతృదేశారాధనమును జేసి లోకము నందు ధర్మబలవిజయమును స్థాపింతురుగాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St, Madras



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విషయ సూచిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు

చిత్రకారుడు: శ్రీ చావలి నాగేశ్వరరావుగారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౩౦

సంపుటము ౭ శుక్ల సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨

# ఏకోపాసన

వేలూరి శివరామ శాస్త్రిగారు

౧

దేవుఁ డొక్కఁడె యెందు కీ దేవులాట - మతము లొక్కటె యెందు కీ మదము మనకు
ఉన్న మతముల నన్నియు నొకటిఁ జేసి - ఒక్క దేవునె కొలుత మం చూహఁ జేసి.

ఉపనిషత్తులను దా నొక్క యార్యుఁడు తెల్లపాల రాళ్లుగఁ జేసి పట్టి తెచ్చె
జెందవెస్తాఁ బారసీకుఁ డొక్కఁడు కాంతిమద్రత్నసమితిగా మార్చి తెచ్చె
అల ఖురానును దురుష్కాచార్యుఁ డమల మాణిక్యంబులుగను బొందించి తెచ్చె
బైబిలు నొక క్రైస్తవప్రముఖుండు తాఁ బచ్చరాలుగఁ బొందుపఱిచి తెచ్చె
తక్కఁగల దేశములవారు తమదుతమదు - గ్రంథములనెల్లఁ గెంపులు గాఁగ నద్ద
ములుగ రవ్వలు గాఁగను మోచి తెచ్చి - గుట్టఁ బోయంగ నవి యొక్క కొండ యాయె.

నానారూపసమేతుఁడున్ మఱియు నానానామధాముండు తా
నైనన్ నామము లేక రూపమును లేకాయేకదైవం బొగిన్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నానా రత్న శిలాకలాపమగు నానవ్యాచలంబందు నా
నీనుం డామెను సర్వమానవ మన స్సిద్ధాంతయోగ్యంబుగన్.

ధారుణియందుఁ గల్గిన మతంబులలోపలి సార మైన యా
చారము లెల్ల నేకమగు చాలునఁ బోతను బోసి యమ్మహో
దార ధరాధరేంద్రవలయం బయి యుండెడు భాతి రాతిర
స్తా రచియించి కొండకుఁ బ్రదక్షిణముం బొనరించి రెల్లరున్.

ఈశ్వరారాధనముగూడ నేకరీతి-వలయు నంచును నెల్లరు వాంఛఁ బొంది
'ఎగురు చీశ్వరు ధ్యానించు టింతనుండి-ఒప్పు' నంచును యోచించి రప్పు డెదల.

అందఱుగూడ నప్పగిది ధ్యానము నొప్పిరి కాని యింక నా
చందము నొప్పకున్న జనసంతతి యున్నెడ వారిగంతులుం
జిందులుఁ జూచి క్రోఁతులని చెప్పనొ యొప్పని దిప్పకాయలం
చుం దలపోయునో మఱియుఁ జోద్యపు దయ్యములంచు నెంచునో.

ఆపటినుండియు మొదలుగ-నాపరమేశ్వరుని నేకమగు గతిఁ గొలువం
బ్రాపనుచు నెల్ల ప్రజ యీ-లోపుగ లేకుండ నొక్క-లోపం బేసిన్.

ఒక్క-రూపముతోడ నుండఁగా నెదఁ గోరి సిగలు లేకుండఁగాఁ జేసికొనిరి
పలుకు లాడఁగ నొక్క- బాస లేకుంటచే మాట లాడుటె ముందు మానుకొనిరి
ఒక్క-వేసముతోడ నొప్పారి యుడఁగా వలువలు దాల్చుటే వదలుకొనిరి
మతవిరోధము దెల్పు మచ్చ లటంచును దిలకంబు దిద్దుట తీసివైచి
రిట్టి రూపంబు వ్యవహార మిట్టి వేస-మిట్టి మోములతోడుత నెల్లవారు
గంతులను వైచుచును భగవంతుఁ గొలువఁ-జెల్లరే కొండచుట్టు సంసిద్ధు లైరి.

౨

అలవారల తొందర పా-టులు గమనింపంగఁ బో కెటులు వచ్చునో య
ట్టులె యీ శేపును వచ్చెను;-జెలఁగునె కాలంబు జనులు చెప్పిన త్రోవన్.

అల్లి గట్టు చుట్టు నత్యంతమును వింత-వింత లైన జనులు విడిసినారు
అందు నోరు కల్గినట్టివాఁ డొక్కండు-బిట్టు లేచి నిల్చి యిట్టు లనియె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మన మీనాఁట న్నిజముగ-జనులారా! మతము లెల్ల సమములె యంచుఁగ
గనినాము కాన నీకొం-డను నూరేఁగింత మట్టి నడత ధ్రువపడఁగ.

తమదు తమదైన బాసలఁ దమదు తమదు-ప్రజల కెల్లరకును బోధపడెడునటులు
అనువదించిరి కొంద ఱీయర్థములను-విశ్వమాతయు నీ మాట వినియె నంత.

అందుండి యొక్క ముదుసలి-ముందరి కేతెంచి—అయ్యో! మొదటికె మోసం
బిందాయెఁ 'బలుకవల'దను-చుం దమరే పలుకు వారె? చోద్యము కాదే?

అది యటు లుండుత మీఁగ-ట్టదిరా యీప్రజలచేత నటు లేచినను
జడకిలఁబడదా? పడుచోఁ-బదములు తలలెల్ల నూఱు పఱియలు గావా?

ఆతఁ డిట్లు వల్క నందఱు ప్రజలును-అగునునగు నటంచు నాడి యాడి
చదువు వాని కన్నఁ జాకలియే యెక్కు-డన్నమాట వితగఁ జన్నె? యనిరి.

అంతం గ్రీస్తు మతావలంబి యగు నొ క్కాచార్యుఁ డల్లంతఁ దత్
ప్రాంతంబందున లేచి నిల్చి కనుఁడీ బల్ పచ్చరాకూటిమే
మెంతో గొప్పది దీనిఁ దేలికగ నూరేఁగింపఁగా వచ్చు నం
చంతర్వాణుల కేసి చూచుచు నుపన్యాసంబు చేసెన్ వడిన్.

అంత మహమ్మదీయుఁ డొకఁ డాతురుఁడౌచును లేచి—ఓరి నీ
వంతట నోరు మూసికొను మంచు ఛెటేలున చెంపకాయ గ
ల్లింతయుఁ గొట్టె; నాతఁడును లీలగ రెండవ చెంపఁ జూపె; రెం
డింతల కిన్కతో మలక—యేమిర నీ కిది చాలకున్నదే?

మా మహమ్మదుగా రన్యమార్గులైన-కాఫరులఁ గత్తితోడను గలుపు మనిరి
సరవి నింకను రాల్ రువ్వి చంపు మనిరి-అని శిలావర్షమును గురియంగఁ దొడఁగె.

మతమన నేమియో యెఱుకమాలిన మానిసి యొక్కఁ డేపుమై
నతని సమీప మేఁగి యగురా మతమన్నను బ్రాణ మార్పుటా?
గతమగు ప్రాణ మిచ్చు నదిగా కది గాకయ మీఁఖురాను నే
కతముగ నట్లు చెప్పు మను కాంతము దాని నిజానిజంబులన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని యతఁ డన్నయంత జనమంతయు నౌ నవు నౌ నటంచు వా
కొనిరి మహ్మదీయుఁడును గొంకి సలా మొనరించి యో ఖురా
న! నిజము నల్కుమం చనియె నావుడు నల్ల ఖురాను వ్రాయి పో
యినగతి మాటలాడ దెటు నెందును బొత్తము మాటలాడనే?

అందఱును నవ్వి రంత నత్యంతముగను-మలక యలుకను జెందుచు మా ఖురాను
వేఱు; మేమును వే ఱంచు విశ్వ మద్రువ-అఱచె నందఱు నట్టులె యఱచి రంత.

పరిశిష్టములఁ ద్రోసి పాలరాలను దీసి యూనిక మోసికొం చొకరు చనిరి
తమ రత్నములఁ బ్రయత్నముతోడఁ బై కూడఁ దీసికొం చొక్కరు పాసి చనిరి
మాటలాడని తమ మాణిక్యముల నేకముగఁ జేసి యొకరు నేర్పగను జనిరి
కొట్టినంగూడను గోపగింపని పచ్చరా లెత్తుకొని యొక్క రొలిఁ జనిరి
మిగులు వారలు మందన్న మిత్తి యగునె?-మత మనంగను మద మహానె? మన కిదేల?
మనకు నాదేవదేవుఁడే మతము గాక-పిచ్చి మతము లి వేల యం చెచ్చి చనిరి.

ఆయుత్తర నిమిషంబున-నాయెడ నాకొండ లేద యాప్రజయును లే
దేమెడ నుండెడు వారలు-నాయెడకే పోయి రొక్క యావేశముతోఁ.

---

# బసవపురాణము వెల రు. ౨-౫-౦

గ్రంథకర్త:—పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త:—వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవశతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైలి మతోద్ధారకు డగు బసవేశ్వరునియు; తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్నరాష్ట్రములకుజెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది. పాఠాంతరములు సూచింపబడినవి. పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పు.) యిందుగలదు. ఆకాలపు టపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కగు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము. విలాసము:— ఆంధ్రగ్రంథమాల, 7, తంబుశెట్టివీథి, మద్రాసు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ధర్మనిరతుడు కార్లయిలు

ప్రొ. తణికెళ్ల వీరభద్రుడుగారు, యం.ఏ., యల్. టి.

కార్లయిలు క్రీ. శ. ౧౯ వ శతాబ్దమున నాంగ్లదేశమున జన్మించిన మహాపురుషుడు. ఇంగ్లాండులో విక్టోరియా మహారాణి రాజ్యపాలన మొనరించుచుండిన కాలమున తన బుద్ధిచేతను, యథార్థపరత్వముచేతను పండితులను, తత్త్వజ్ఞానులను కార్లయిలు పరిపాలించెనని చెప్పవచ్చును. ఇతడు రాజకీయ రంగమున వేషము ధరింపకపోయినను దేశభక్తులలో నుత్తముడని చెప్పుటకు లేశమయినను సందియము లేదు. కావ్యములు వ్రాయకపోయినను కవివరుడను బిరుదమున కర్హుడని చెప్పుటకు సంశయ ముండకూడదు. ఈతనిచే వ్రాయబడినవి వచనగ్రంథములే కాని, యవి సామాన్య వచనవ్యాసములు కాక యుత్సాహపూరితము లగుటచే గద్యకావ్యములలో వన్నెకెక్కినవి. శైలి గ్రంథకారుని స్వభావమును సూచించునను విద్వద్వాక్యమున కీతని పుస్తకములు తార్కాణములు. పెక్కులగు నీతని గ్రంథములలో మహాపురుషుల జీవితములును, దేశచరిత్రలును,కవీశ్వరుల యున్నతాభిప్రాయములును జర్చింపబడినవి. వీరశిఖామణుల జీవితములు వర్ణించినను, కవిపుంగవుని కావ్యరసము వర్ణించినను, కార్లయిలు గొప్పవిమర్శకుడని చదువరికి దోచకతప్పదు. ఏ గ్రంథమందయినను సత్యప్రియత్వమును, పరతత్త్వాభిలాషయును వెల్లడింపబడుచుండును. ఈత డెన్ని గ్రంథములు వ్రాసినను,ఉపన్యాసము లిచ్చినను, వాని సారాంశ మొక్కటియే యని మనము చెప్పగలము. ఏపురుషుని జీవితమం దున్నతాశయము కలదో యాతనిజీవితము ధన్యమైనది. వేషధారణమే ముఖ్యముగా నెంచికొనిన జీవితములు వ్యర్థములు. ప్రతిపురుషుడును లోకతత్త్వమును బోధపఱచుకొనుటకు యత్నింపవలెను. దానినిగూర్చి నిరంతరమును ధ్యానింపవలెను. జీవితసారమును గ్రోలి తనమిత్రులకు యథార్థ ప్రతిబింబమును జూపి వారి నుత్తీర్ణులను జేయవలెను. అట్టి సత్ప్రయత్నమం దందఱకును ఫలము లభింపక పోవచ్చును. ఒకనికి జయము వచ్చినను, మఱియొకనికి జయము లోపించినను, సదుద్దేశముతో రణభూమియందు వీరిద్దఱును ప్రాణములను ద్యజించుటచే ఘనులే. వీరే వీరశిఖామణులు. ఇట్టి శూరాగ్రేసరులు లోకమందు వేర్వేరు వేషములతో సంచరించుచుందురు. ఒకడు సాహిత్య సీమయందు నిరంకుశ ప్రభుత్వము కలిగియుండును. ఒకడు మతసంస్కర్త యయి మతస్థాపనమునకయి ప్రాణమును గోల్పోవును. ఒకడు నాట్యరంగమున పాత్రను ధరించి, సృష్టిలోని రహస్యములను గని, వాని చిత్రవిచిత్రములను మనకు జూపి, బ్రహ్మానందము నిచ్చును. కాని లోక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములో గణ్యత నొందినవారు వీరలే. లోకసారము వీరిలోనే యిమిడియున్నది. వీరిసందేశమును గ్రహించుటయే మన పరమావధి. ఈమహాతత్త్వమును గ్రంథ గ్రంథమందును, మాట మాటయందును అభినివేశముతో, గంభీరధ్వనితో బోధించినవాడు కార్లయిలు మహాశయుడు. ఏగ్రంథము చదివినను విషయము నూతనము కావచ్చును, కాని సార మిదియే. ఏయుపన్యాస మందైనను చరిత్ర క్రొత్తది కావచ్చును, కాని రహస్య మిదియే. ఇతడు మహాపురుషుల జీవితార్థమును వెల్లడింప సమకట్టిన రహస్యవేది. వారిసందేశమును దెలుపగల దూత. ఇతడు మహారాజ్ఞి విక్టోరియా కాలమునాటి మహాపురుషులలో నగ్రగణ్యుడని చెప్పుట యతిశయోక్తి కానేరదు. అయితే వ్యావహారికము తెలియని పిచ్చివాడని కార్లయిలును గూర్చి వాదింప సాహసించువారు లేకపోలేదు. ధనమును, దాని లాభములను గ్రహింపజాలక దేశకాల పరిస్థితులను గమనింపలేని మూర్ఖుడని యితనిని నిరసించువారును కలరు. కాని విక్టోరియారాణి కాలమున విద్యుచ్ఛక్తిమూలమున నేమి, ధనమదాంధత చేత నేమి, యాంగ్లదేశము గర్వించియున్నప్పుడు ప్రవాహమున కెదురేగి నవీనభౌతిక శాస్త్రములను, వాని యపార్థములను బట్టబయలు చేసి, లోపములను సూచించి, భయోత్పాతము కలిగించిన ధైర్యశాలి కార్లయిలు. ఈశతాబ్దమున పాశ్చాత్య వ్యామోహములో బడియున్న ప్రాణికోటిని నవనాగరకతవలన కలుగు బాధలనుండి తొలగించి, ప్రాచీననిరాడంబర జీవనము నెలకొల్పి, వారికి సత్యాభిలాషను కలుగజేయ సమకట్టిన మహాత్ముని వలె కార్లయిలు కొంతవఱకు తనకాలమున లోకోద్ధరణమునకు బాటుపడెనని చెప్ప సాహసింతుము.

కార్లయిలు జర్మనీదేశమునందు మిక్కుటమగు నభిమానము కలవాడు. జర్మనీలోని కవీశ్వరులును, శాస్త్రవేత్తలును తనకు గురువులని గర్వముతో బలికియున్నాడు. జర్మనీ శాస్త్రజ్ఞుల యాదర్శములను తన దేశీయులకు దెలియజేసి తన 'గురుభూమి'లో నిరంతరము ప్రవహించుచున్న జ్ఞానరసమును తన యాంగ్లమిత్రులకు నించుక చవిచూపుటయే తన ముఖ్యకర్తవ్యమని పెక్కుసార్లు చెప్పియున్నాడు. గేఠీ మొదలగు జర్మను మహాశయుల సంపర్కము కలుగుటచేతనే తన మనఃక్లేశములు ఖండింపబడెననియును, లోకరహస్యము తెలియక, యడవిలో దారి గానక, మతిలేక తిరుగుచున్న తనకు సరియయిన బాట చూపబడెననియును పదేపదే చెప్పియున్నాడు. ఒకానొకప్పుడు లోకాతీతమగు పదార్థ మేది కలదో దానియందు తాను నమ్మకము లేనివాడయి యుండెనట.

అరాజకత్వమను తీవ్రజ్వరము నాహృదయమును బీడించుచుండ, నేను జీవితముతో సమాధానపడలే కుంటిని.

ఈశ్వరుడు కలడా లేడా యనుసంశయము, లేడను నిర్ధారణలోనికి దింప, ఇంత కఠినమగు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోక మున్న దనువార్త లేమిచే, పని తెలియని వెఱ్ఱివానివలె నిటునటు దేశమంతటను దాను తిరుగుచుండెనట. భగవంతుని యందలి యప నమ్మకము ప్రతివస్తువునందును నపనమ్మకముగా మాఱుటచే, నాతనికి మనశ్శాంతి యెట్లు కలుగగలదు? అతని బాధ నెవ్వరు తొలగింపగలరు? ధన మేమయినను సాహాయ్య మొనరింపగలదా యని ప్రశ్నించిన, యాత డీ ప్రత్యుత్తరము నిచ్చెను:—

> కాదు కాదు. నీకు కలిగినకొలది నసంతృప్తి హెచ్చును. బైరనుప్రభు వాగర్భ శ్రీమంతుడు. కాని యొక్కనాడయినను సుఖపడెనా? నరు డెన్నడును సంతుష్టి పొందజాలడు. నీవు కొంచె మతనికి పెట్టితివా, ఇంకను కావలెనని మఱిమఱి నిన్ను బాధించును. కావుననే మనకాలపు నాటి యుత్తమ పురుషు డిట్లు సూచించెను: మనుష్యుడు తనయాశలను త్యజించినపుడే జీవితము ప్రారంభమయినదని చెప్పవలెను. నాయనా, సుఖపడ వలచితివా, నీబైరను మూయుము. గేఠీని చదువ మొదలిడుము!

ఈవిధమున జ్ఞానరాహిత్యమను నంధకారములో బడి, విసిగి, వేసరి, తుదకు గేఠీమహాశయుని యండ దొరకి, భక్తి ప్రేరేపింప జేసికొని కార్లయిలు గురుదక్షిణను గృతజ్ఞతాపూర్వకముగా సమర్పించెను. తిరిగితిరిగి, చదివిచదివి, కార్లయిలు కనుగొనిన పరమరహస్య మిది:

> నమ్ముము! నమ్మము! నమ్మితివా, అన్ని 'న' కారములును దొలగిపోవును.

ఇటులనే జర్మనీ విజ్ఞాన ప్రతిబింబమును ఆంగ్లేయులకు కార్లయిలు చూపగలిగెను. కార్లయిలునకు తనహృదయ ప్రతిబింబము తనకు జూపబడుట జర్మనీవలననే యనికూడ మఱువకూడదు.

కార్లయిలు తనకాలపునాటి సంఘసంస్కర్తలలో ముఖ్యుడని చెప్పగలము. ఆంగ్ల చరిత్రలో విక్టోరియా శకము ఘనతకెక్కిన మాట వాస్తవమే కాని కార్లయిలునకు మాత్ర మట్లు తోచలేదు. ఈశతాబ్దమందు మూడు ముఖ్యవిషయములు కలవు. ౧. భౌతికశాస్త్రము లభివృద్ధిజెంది, విద్యుచ్ఛక్తి వలనను, యంత్రబలము వలనను దేశమున కనేక సౌకర్యములు కలిగినవి. ౨. యంత్రబలము హెచ్చుటచేతను వర్తకవాణిజ్యములు హెచ్చి ప్రజలు ధనికులగుటయు, దూరదేశములందు నయిత మాంగ్లరాజ్యము స్థాపితమగుటయు సంభవించినవి. 3. దేశమంతటను సుఖము హెచ్చినతోడనే సామాన్యప్రజలకు గౌరవము వృద్ధియయి స్త్రీపురుషాదులందు విద్యాభిమానము కలుగుటయు, రాజకీయమందు ప్రజాపరిపాలనా పద్ధతు లమలులోనికి వచ్చుటయు తటస్థించినవి. అనగా ప్రకృతి శాస్త్రము, ధనము, ప్రజాస్వాతంత్ర్యము, ఈమూడును పరిమితిలేని యౌన్నత్యమును బొందినవని చెప్పవచ్చును. కాని కార్లయిలు మహాశయునకు మాత్ర మివియన్నియు దేశారిష్టమునకే సమకూడినవని యభిప్రాయము. ధనము కూడినతోడనే స్వలాభ పరాయణత్వము పెరిగి వితరణము తగ్గినది. బీద సాదలయందు దయ యంతరించినది. దైవభక్తియు, మతాభిమాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును గగనకుసుమము లయినవి. దేశము మొత్తముమీద ధనము కూడియుండవచ్చును గాని, ధనికులకు ధన మెక్కువ కాగా, పేదలలో దరిద్రత హెచ్చినది. జనులు తమ సొమ్ములు వృద్ధికాగల మార్గములను వెదకుటయే కాని, యిహలోకము వదలినవెనుక నెక్కడకు బోవలెనో, యేమి కావలెనో, ఉత్తరలోకమున తమగతి యేమగునో, యించుకయినను యోచన చేయరయిరి. ఇట్టి ధనాపేక్షయందు మునిగి తేలుచున్న తనదేశీయులను సంస్కరింపదలచి, వారిదూషణలను భరించి వారితో తీవ్రవాదము సల్పి, గొప్ప ప్రచారమును గావించి, దేశమును సంరక్షింప బూనిన మహోపకారి కార్లయి లని చెప్పగలము. వరదకాలమున ప్రవాహమున కడ్డుపడి యెదురీత నీదగలిగిన సాహసవంతుడనియు మనము చెప్పవచ్చును.

కార్లయిలునకు కోపము కలిగించు విషయములలో నవీనార్థశాస్త్రము మొదటిది. అతనికాలము నాడు ఆర్థికశాస్త్రప్రజ్ఞ దేశమందు వ్యాపింప మొదలుపెట్టెను గాని, యార్థిక శాస్త్రవాదులన కార్లయిలునకు తలనొప్పి. దేశమందు మొత్తముధనము వృద్ధిచేయవలె ననుసంకల్పము రాజ్యతంత్ర ప్రవీణులలో హెచ్చెను. కాని దేశధనము పెరిగినకొలదిని ప్రజలసౌఖ్యము క్షీణించుటకు ప్రారంభమయినది. ధనము పాపభూయిష్ఠ మగుటచే నెవ్వరును ముట్టుటకు గాని, యనుభవించుటకు గాని నోచరయిరి. పూర్వమందు మైదాసు అనురాజొక డుండెనట. మిక్కుటమగు ధనతృష్ణ కలవాడయి యాతడు పరమేశ్వరుని వరమడిగెనట. తాను చేతితో నే పదార్థమును దాకినను అది సువర్ణముగా మారవలెనట. అటులనే తుదకు వరమీయబడెను. కాని రాజునకు మాత్రము సుఖము లేకపోయెనట. భోజనసమయమున నాహారపదార్థములు చేతికి సోకినంత మాత్రముననే యవి బంగారమయినవు డాత డేమి తిని బ్రతుకగలడు? ఇంగ్లండు దేశములోని ధన మీ స్థితియందే యున్నదనియు, సామాన్యప్రజల కించుకయినను సుఖము కలుగుట లేదనియు కార్లయిలు గంభీరముగా వాదించెను. ఆర్థికశాస్త్రము ముఖ్యమయినదని మేధావులందఱును బరిశ్రమచేయ మొదలిడిన కాలమున దానిని 'దుఃఖశాస్త్ర'మని కార్లయిలు నిరసన చేయుచుండెను. రాజ్యాంగ తంత్రజ్ఞులు శాసనసభలలోను, ఇతరచోట్లలోను తీర్మానము లనేకములను గావింపవచ్చును; నూతన రాజ్యాంగపద్ధతులను ప్రతిష్ఠ చేయవచ్చును; కాని యీశాసనములును, తీర్మానములును చప్పుడు చేయగలిగినను ప్రజాసౌఖ్యమునకు నిరుపయోగములు. ఈ మార్గములన్నియు ప్రజలవలన హెచ్చుపన్నులు వసూలు చేయుటకు సాధనములు. సామాన్యప్రజలు నోరెఱుగని గొఱ్ఱెలమంద వంటివారు. రాజ్యాధికారు లందఱును, వీని ఉన్ని కత్తిరించి వీనిని నిస్సహాయులనుగా జేయుటకు పూనుకొనినారని చెప్పుటకు సందేహము లేదు. కార్లయిలు చెప్పిన దేమన,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిత్యమును కూలిపని చేసికొని దారపుత్రు లను సంరక్షించుకొను బీదవానికి రాజ్యాంగ పద్ధతులతో నిమిత్తము లేదు. ఏరాజే భూమి నేలినను గమనింపనివాడతడు. అతనికి కావ లసినది, శాసనసభా తీర్మానములు కావు; ఆర్థిక శాస్త్రవాదములు కావు; ఆకలివేయు నప్పుడు బాధ నివారణ చేయుటకు దగినయా హారమును, చలికాలమున శరీరమును గాపా డుటకు దగినబట్టయును, ఈరెంటికిని కొదువ కలిగినప్పుడు గ్రంథ ప్రకారము దేశధనము హెచ్చినను, తక్కువయినను లాభము లేదు. ఈ యభిప్రాయమునే మహాత్మ టాకనసందర్భ మున రవీంద్రునితో వాదము సల్పినపుడు చెప్పియుండెను: "ఆకలిచేతను, దప్పిచేతను పరి తపించుచున్న కూలివానికి కబీరుకీర్తన లయి నను ఆనందము నీయజాలవు. ప్రాణమును నిలుపు భోజనముతప్ప మఱియేవియు నాతని బాధ నివారింపజాలవు సుమా!" చూడగా కార్లయిలునకు దోచిన విషయ మిది: యథా ర్థముగా బీదలసౌఖ్యముకొఱకు పాటుపడుమం త్రి యొక్కడును కానరాడు:

ఈ యధికారులందఱును చతురంగ మాడువా రితో బోల్పదగుదురు. రెక్కలులేని ద్విపాదజంతువు లనేకములు భూమిమీద బోర్లపడియుండిన కాలమున నిర్భయముగా నీమహనీయులు చతురంగమందు బంట్లను ముందు వెనుకలకు ద్రోసినట్లుగా ప్రజల సుఖదుఃఖము లను ముందువెనుకకు ద్రోసి యాడుచున్నారని చెప్ప వచ్చును. దేశమంతయు నిట్టి దుస్థితియందుండ క్రీ. శ. 1789 సం. న కలిగిన విప్లవమువంటి సంక్షోభము లోక మ్మునందటను గలుగవచ్చు ననుటలో నాశ్చర్యమేమి కలదు? పరిపాలకులు సోమరులయి సాపాటురాములను బిరుదుల కర్హులయియుండ, దేశమంతటను దారిద్ర్య పిశాచ మేల తిరుగుచుండదు? ఆకలి భరింపజాలమిచే "అన్నము అన్నము" అని యఱచుచు, కట్టగుడ్డ లేక, నోట నిప్పులు గ్రక్కుచు, లెక్కలేని శిరస్సులు కలిగి, తన నాలుకల నుండి జ్వాలలను వదలుచు, వీథులలో పరుగిడుచు, పిన్న పెద్దలకు బీభత్సరసము వెదజల్లుచు, నోరు తెఱచినంతనే రాజ్యమంతను మ్రింగివేయజాలిన దారిద్ర్య పిశాచ మేల బయల్వెడలదు?

"లాభనష్టము"లను వాదములతో గూడిన యార్థికశాస్త్రమును నమ్మిన తర్వాత నిట్టి ఫలము కాక మఱియేమి చేకూరకలదు?

కుర్చీలతో నలంకరింపబడిన గదియే మనకు శివా లయమయి కుర్చీలును రత్నకంబళ్లును, గలధనికుడు మతా ధికారి యయినపుడు దేశము నశింపక యెట్లు జీవించును? కాబట్టి వట్టి యంత్రబలము చాలదు. యంత్రబలము పశు బలమువంటిది. దీనికంటె నతీతమగు మహాశక్తిని నమ్మ్మ ము. దానిని చూడవలెనన్న, నవీన తర్కశాస్త్రముతో జేయబడిన ముక్కుద్దములు పనికిరావు; పరమేశ్వరునిచే బ్రసాదింపబడిన మానవహృదయముతో జూడుము: నీ కది గోచరము కాగలదు!

కార్లయిలు తనదేశీయులకు బోధించిన సందేశములోని ముఖ్యాంశ మిది. మనుష్యుడు తన జీవితకాలమును సద్వినియోగము చేయ వలెను. జీవితకాల మనగా క్రీడాసమయమని తలచువారు మూర్ఖులు. పరమేశ్వరునిచే నీయ బడిన కొలది గడువులో విషయ సుఖములను బూర్తిగా ననుభవించుటయే ముఖ్యమని యెంచువారంధులు. అట్టి జీవితము లసత్య జీవితములు. జీవిత మనునది భావగర్భితమగు ప్రశ్నము. సామాన్యుల కలవిగాని విచిత్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయము. లోతు తెలిసికొనుటకు సాధ్యము కాని జలరాశి. అది యొక యద్వితీయమగు "బహిరంగ రహస్యము". మనుష్యజీవిత మను నది యెల్ల ప్రాణులకు దృశ్యమగుటచే బహిరంగమని చెప్పవచ్చును. దానిసారము కొలది మంది కయినను లభింపకపోవుటచే నది యెప్పుడును రహస్యమే యనవచ్చును. జీవయాత్ర సలుపుట త్రాచుపాముతో జెలగాటము చేయుట. క్రూరమృగముతో సంచరించువాడు జాగ్రతగా నుండవలెను. దానికంటె నధిక బలాఢ్యుడని దానికి తెలిసెనా, దానిపని వాడు చెప్పును. మెత్తనివాడని దానికి తోచెనా, వాని పని యది చెప్పును. థీబ్సు దేశమున నొకచిత్రమగు జంతు వుండెనట. అది రెక్కలుగల మృగమట. దానికి శరీరము పైభాగము స్త్రీరూపమును, క్రిందిభాగము సింహరూపమును నుండెనట. ఆబాట నెవ్వరయినను నడచుచుండిన యెడల వారి నది యొకవింత ప్రశ్న వేయునట. ఈ కష్టతమమగు సమస్యకు తగిన జవా బియ్యలేనివారి నెల్లను నిమిషములో నామృగము మ్రింగివేయుచుండెనట. తుద కొక బుద్ధిమంతుడు ఒకనా డీ విషమ సమస్యను బూర్తిచేయగా, ఓడిపోతి ననుసిగ్గుచేత నీవింతమృగము గుట్టమీదనుంచి సముద్రములోనికి దుమికి యాత్మహత్య గావించికొనెనట. జీవయాత్ర కూడ నిట్టి వింతజంతువని కార్లయిలు పలుమారు వర్ణించియున్నాడు. ఒక పురుషుడు కాని, సంఘముకాని వృద్ధికావలె నన్నచో, నున్నతాదర్శము కావలెను. భగవంతునియందును, భగవదాకారమగు ప్రకృతియందును, దైవస్వరూపులగు మానవులయందును భక్తి యుండి తీరవలెను. సృష్టికర్తయందలి భక్తియే మతము; భక్తిరాహిత్యమే దుర్మతము, సామాన్యముగా మనము బుద్ధిమంతులమని తలచి మతవిషయిక సంస్థలను దృణీకరించుచుందుము. కాని కార్లయిలునకు నిట్టివి, సృష్టియంతయు నేమహాశక్తి వ్యాపించియున్నదో, దానికి బాహ్యచిహ్నములు. ఇవి సంస్థాపకుల కొకానొకనాడు వట్టిచిహ్నములు కాక యథార్థములే యయియుండెను. దేవళ మనగా ప్రాచీనులకును, పూర్వాచారపరాయణులకును భక్తి యుండెను. మన కన్ననో, దేవాలయమునకు వెళ్లువారు హాస్యాస్పదులుగా నున్నారు. కార్లయిలునకు దేవళ మనగా నుత్సాహము:

దేవాలయమా! ఆహా! ఎట్టిపదము! గోలకొండలోనియు, సమస్తదేశములలోనియు ధనమంతయు కలిపినను దాని విలువకు సరి కాదుకదా!

ఇట్టి భక్తిని నూతన ప్రకృతి శాస్త్రములు ప్రబలి యంతరింపజేసినవి. ప్రతి విషయమును గూర్చియు నిది నిజమా కాదా యను కువాదమునకు ప్రోత్సాహము నిచ్చినవి. ఆశ్చర్యమును, భక్తియును తఱచుగా మిళితమయి యుండును. లోకాధీశుని కృత్యములం దాశ్చర్యము కలుగకపోయినచో నాతని మాహాత్మ్యమందు భక్తి యెట్లు జనించును? ఈసందర్భమున హిందూదేశస్థుల ప్రవర్తనము శ్లాఘనీయమని కార్లయిలు సూచించెను. వారి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ౪౪-వ భారత జాతీయమహాసభా చిత్రములు-లాహోరు*



చిత్రము ౧



చిత్రము ౨

* ౧_౫ చిత్రములు జాతీయమహాసభాధ్యక్షుని ఊరేగింపునకు సంబంధించినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చరిత్రలో నిదియే ముఖ్యాంశమని యాతని యభిప్రాయము. హిందూమత ప్రకారము, సృష్టియందలి ప్రతిపదార్థమును బరమేశ్వరుని ప్రతిబింబమనియు, కావున పూజనీయమనియు జనుల నమ్మకము. భగవంతునియంశ కలది యగుటచే బ్రతివస్తువుకూడ పవిత్రమయినదిగా భావింపబడును. ప్రాణికోటి కెల్లను నరుడే ముఖ్యమయినట్టియు, చిత్రమయినట్టియు విష యమగుటచే నట్టిమానవజీవితము పావనమైన దని కార్లయిలువాదించెను. ఆతని యభిప్రాయ మీా గంభీరవాక్యములలో సూచింపబడినది:

భక్తితో గూడనిబుద్ధి యచిరకాలములోనే యంతరించును. జగదీశ్వరుని కృతుల జూచి యేమానవు డాశ్చర్యమును బొందుట కలవాటుపడడో (ఆశ్చర్యపడి భగవంతుని భక్తితో బూజింపడో), అట్టివాడు నవీనయుగమందలి భౌతిక శాస్త్రజ్ఞులలో బ్రథముడయినను, నేత్రములు లేని యంధుడు ధరించిన సులోచనముల వంటివాడు. మనుష్యునికి భగవంతునిచే బ్రసాదింపబడిన నేత్రము లుండెనా; సులోచనము లుపయోగించును, లేదా, యవి నిరర్థకములు!

బీదసాదలయందు కార్లయిలు న కత్యంత ప్రేమ. ప్రతినరుడును భగవదంశ సంభూతు డగుటచే పూజ్యుడు. నిరుపేదలను నీచులుగా భావించి వారిని జూచి యసహ్యపడువారు పశు సమానులు. నూలువడకిగాని, నేత నేసిగాని, బాటను సరిచేసి కాని జీవనోపాధి జూచికొను కూలివాడు పరమపూజ్యుడు. వాని జీవితము పవిత్రమైనది. పేదలనుజూచి హేయపడు వారి యందు కార్లయిలునకు గల యాగ్రహము దిలకింపుడు:

ఆ చినిగిన యంగీని తొడిగికొనిన పౌరుషవంతుడగు నరుని జూచి యెన్నడయినను నీవు గౌరవము జూపితివా? అతను ప్రాతచొక్కాయితో నుండినంతకాలమును అతడు పౌరుషము కలవాడని యించుకయినను గ్రహింపగలిగితివా?

ఎన్ని దేశములు వెదకినను ఒక్కటియే నిజమగు దేవళము కనుపించునట. అది మానవసోద రుని శరీరమేయట! ఒక్క శక్తిచేత నే యన్ని ప్రాణులును సృజింపబడినపుడు మన ప్రేమకు నన ర్హమగు వస్తు వేమి కలదు? పెద్దవయినను చిన్నవయినను, ప్రాణులన్నిటి యందును నొక్కశక్తియే ప్రవహించుచున్నదను గాఢ మగు నమ్మకముతో నీమహాశయు డిట్లు తీవ్ర తతో బ్రశ్నించుచున్నాడు:

నల్లనిమసితో నిండి యినుపదిమ్మ మీాదికి వంగిన కమ్మరివాని కొలిమిలోని వెలుగు (దానితోనే నీగుఱ్ఱపు లాడమును మరమ్మతు చేయదలచితివి) ప్రత్యేకమగు చిన్నమంట యనియు, భూమ్యాకాశములతో నేమియు సంబంధము లేనిదనియు దలచితివా? లేక త్రెంపజాలని త్రాటితో గట్టబడి, బ్రహ్మాండముతో నేకమయియున్న దని తలచితివా? ఓరీ! మూర్ఖుడా! అది కాదు. ఆకమ్మరి కొలిమి ప్రప్రథమమున సూర్యమండలమున వెలిగింపబడినది. సృష్టికాలము నుండియు (నోవాకాలము నాటి నుండియు) వీచుచున్న గాలిచే మంటగా చేయబడుచున్నది. .........వేరా? వేరు కాదు. అట్టి ప్రత్యేకత యెన్నటికిని లేదని నేను చెప్పగలను.............సరిగా నాలోచించితివా, ఎట్టి చిన్నపదార్థమయినను తుచ్ఛమని చెప్పరాదు. దానిద్వారా తత్త్వజ్ఞాని మానసికనేత్రము అనంతశక్తిని చూడగలిగిన గవాక్షమే సృష్టిలోని వస్తుజాలమని గ్రహింపుమా!

కావున కార్లయిలు బోధించిన సందేశ ములో ముఖ్యమయినది కూలిపని చేసి శాంత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముతో బ్రవర్తించువాని యాస్నత్యము. పని చేయువా డుత్తముడు. కష్టపడి పనిచేయుటయే భగవంతుని పూజించుట. మట్టిమోయుట యయినను, రాళ్లు పగులగొట్టుట యయినను, మురికిగుంటలోని నీరుబయట బారబోయుటయయినను, ఏదయినను శరీరకష్టముతో బని చేయుట యనగా భగవదారాధనము సేయుట. పని సంకల్పించుకొనిచేయ మొదలుపెట్టితిమా, సందేహములన్నియు చెల్లాచెదరయి పోవును. 'న' కారములన్నియు నదృశ్యములగును మనలను బీడించు సంశయములను దొలగించుటకు పని పూనుటకంటె వేరుమార్గము లేదు. దీనినే కార్లయిలు పలువిధముల బోధించెను:

నీ కందుబాటులో నున్న పనిని, నీవు నిర్ణయించి కొని విధియని నమ్మినపనిని చేయుము. ఇది చేసితివా, నీవిధియగు రెండవపని యేదెమో నీకే స్పష్టము కాగలదు................చేయుము! చేయుము! ఎంత స్వల్పమయినను, అణుమాత్రమే యయినను, చేయుము! భగవంతుని స్మరించి చేయుము. నీలోనున్న యావచ్ఛక్తియు నీస్వల్పమే యనుము. అయినను దానిని వెలిదీయుము! లెమ్ము! లెమ్ము! నీచేతి కేపని దొరకునో, దానిని పూర్ణమగు నుత్సాహముతో జేయుము. 'నేడు' అని చెప్పుట కవకాశము చిక్కినప్పుడే కృషి జేయుము. ఏలయన, రాత్రి సమీపించి, చీకటి ప్రవేశించెనా, మనుజు డేమియు పనిచేయజాలడు సుమా!

కావుననే నూలు వడకుట యను నల్పవృత్తి కూడ పవిత్రమైనదని కార్లయిలు చెప్పుచుండెను. నూలు వడకి జీవించు పురుషుడు మహాత్ము డనదగును. లోకములో నిద్దఱుపురుషులు ఘనులని కార్లయిలు తలచుచున్నాడు: శరీరమున కత్యావశ్యకమైన తిండికై పాటుపడు వాడొకడు; పొట్టకై కృషి చేయుచు, మనస్సున కత్యావశ్యకమగు జ్ఞానమునుగూడ నియ్యగలిగినవాడు మఱియొకడు.

వ్యవసాయదారుడగు యోగీశ్వరు డెవ్వడయినను దొరకెనా, అతనికంటె మహనీయుడు లోకమంతయు వెదకినను లేడని చాటింపగలను. అట్టి పురుషుడు లభించుట దుర్లభము. నీ వాతనిని చూడవలెనన్న, 19 శతాబ్దములు దాటి నాజరెతు వెళ్లవలెను.

కాని యిన్నిశతాబ్దములు వెదకివెదకి నాజరెతు వడ్రంగిసోదరుని సబర్మతీ నేతగాని యందు లోకులు గాంచగల్గుట హిందూదేశ మహాభాగ్య మని చెప్పుట యతిశయోక్తి కానేరదు.

(సశేషము)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## తొలకరి

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

అర్కుతత్తంబౌ మహాబ్ధి మధ్యమునుండి యాకాశవీథి కంతంత లేచి,
యటు వ్రాకి యిటు వ్రాకి యాశాంతముల దాకి యంబరంబంతయు నావరించి,
పొరలలో బొరలు దొంతరల దొంతరలునై నీలనీలంబులై నిలిచి నిలిచి,
పశ్చిమ యామ్య దిగ్భాగద్వయంబుమధ్యంబు పెందెరువుగా దరలి తరలి,
లోని తేజంబు తళుకు తళుక్కుమనుచు-మెరిసి పైబడ దిగ్దిగంతరము లెల్ల
దద్దరిల్లంగ నురిమి, యుత్సాహజృంభ-ణమును, నున్నత గగన యానంబు దనర.

అడ్డమై నిల్చు సహ్యాద్రిపంక్తుల కల్గి యురుముపై నురుముగా హుంకరించి,
పెళిలు పెళిల్లను బిడుగుల నయ్యద్రి మూర్ధంబు పిండిగా మొత్తిమొత్తి,
ఎలగోలు వర్షించి యేకోదకంబుగా మలయాళమును జలమయము జేసి,
పెనుగాలిజత గూడి వినువీథి నడయాడి యాపర్వతాగ్రంబు లంత దాటి,
నీలగిరి శృంగముల మ్రోల నిగిడి పఱచి-ద్రవిడ కర్ణాటకంబులు దాటిపోయి
భరతభూమికి భూషణప్రాయమైన-యాంధ్రరాష్ట్రి మధ్యంబున కరుగుదెంచి,—

తొలకరి మేఘముల్ చదల దోచె, నభస్తరుణీ వినీలకుం
తలములు జీరుకాడెడు విధంబున, భూస్థలికిన్ డిగున్ మహో
జ్వలమగు స్వర్గజీవనము; జాల మికేటికి లెమ్ము లెమ్ము నీ
హలము ధరించి రమ్ము సమయం బరుదెంచె నిదే కృషీవలా!

ఆహిమాచలము లక్ష్యంబుగా నవె కొన్ని యరుగుచునుండె నీలాంబుదములు;
పూర్వాభిముఖములై పోవుచున్నవి కొన్ని బ్రహ్మదేశమునకు వార్ధి దాటి;
పాయలు పాయలై పరుగెత్తు నొకకొన్ని తీరుగా నుత్తరదిశకు సాగి;
మెలికలు తిరిగి చుట్టలుజుట్టుకొని కొన్ని దొరలుచున్నవి వసుంధరకు డిగుచు;
తరళసౌందర్య లీలావిధాన మొనర-నవ్యమోహనమగు గగనాంగణమున
సహజ చాంచల్య లలిత స్వేచ్ఛావిహార-సంభృతంబైన వాయుసంచాలనమున;
కనుచూపుమేర దిగంతమం దవె కొన్ని పర్వతశ్రేణి నా బరిఘవిల్లు;
ఆకసంబున నీదు లాడు నోడలభంగి యవె తేలు నొకకొన్ని యంబుదములు;
మీదిమీదికి బోయి మిహిరమండలము నాచ్ఛాదించు నవెకొన్ని జలధరములు;



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆసూర్యకాంతు లంతందు నంచుల వెల్ల నింగి మధ్యంబున నిలుచు కొన్ని;
గగనముననుండి భూమికి దిగుచు కాళ్లు-సాచె నవె కొన్ని యపరదిశాంచలమున
నచట వర్ధిల్లు ధరణీరుహ వ్రజంబు-వాన తెలిముసుగునందు కప్పంగబడియె.

ఇవె వ్రాలుచున్న వీ యింద్రకీలాఖ్యధరాధరాగ్రమున ధారాధరములు;
అవె కొండవీటిపై నవె మంగళాద్రిపై నల్లని పొగమబ్బు లల్లుకొనియె;
అటు పాపికొండలం దిటు కోరు కొండపై నల్లాడె కొన్ని నీలాంబుదములు;
భద్రశైలము సింహపర్వతంబును దాకి వర్షించె నొకకొన్ని వారిదములు;
గ్రీష్మ మది యంతరించెను మృగశిరా ప్ర-వేశమై యొప్పె నాంధ్ర పృథ్వీతలమున
తప్తమగు భూమి వర్షాన దడిసి యునికి-కమ్మనగు మట్టివాసనల్ కలయ బర్వె.

అరుణ భూరజము నొయ్యన దాల్చి శోణవాహిని యయ్యె నల్లదే కృష్ణవేణి;
నిండుజీవనమును, నెలజవ్వనము దాల్చె వృద్ధగౌతమియు విజృంభణమున;
కృష్ణరాజ్యము సంస్మరించెడునోజ యుప్పొంగు చున్నది యదే తుంగభద్ర:
తిప్పలన్నియు ముంచి తెప్పల దేలించి యలలతో పెన్న తూగాడుచుండె;
నాటవికజృంభణంబున నడ్డమైన-కొండల బగిల్చి, యడవుల గూల్చివైచి;
యడవి కోయదొరలయింటి యాడుబిడ్డ-యెఱ్ఱకాలువ యత్తింటి కేగసాగె.

అనుకొన్నారొకో యెవ్వరైన మునుపి ట్లానంచు? నా చండ శా
సను రాజ్యంబును వోలె మాడ్చినది గ్రీష్మం బింతకాలంబు; నూ
తన చైతన్యము నవ్యధర్మవిజయోత్సాహంబు శోభిల్లుచ
ల్లని వర్షాగమముం గనుంగొనుము కాలం బెంతలో మారునో!

కడలి గర్భమునందు కరడుకట్టినకారుకటికచీకటి గొంతకాల మలసి,
యటునిటు ద్రొక్కి- తూ గాడెడు కెరటాల నడకలలో గొన్నినాళ్లు నలిగి,
తీర్చి కాసెడు నెండదెబ్బకు గొన్నాళ్లు యెసరుపొంగును వోలె మసిలి మసిలి,
యెఃయించి వినువీథి కెగురవైచెడు గాలి దేలి తూలుచు కొంతకాల ముండి,
ఆకసము నంటియున్న నైల్యంబునందు-కొన్ని దినములు పైకి రాకుండ కరగి,
యిన్నిచిక్కులు కడదాకి యిపుడు చూడు-మంబుదంబులు మిన్నంటి యాడ దొడగె.

పాయల్ పాయలుగాగ నల్లవె నభోభాగంబునం దేలి బల్
తోయంబుల్ గురిపించుచున్, బ్రబల సంతోషంబు నిండార స్వే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ్ఛాయానంబున నత్యుదాత్తగతి సంచారంబుఁ గావించు తా
మీ యానందము నెందు దాచుకొనెనో యిందాక నీ మేఘముల్!

అల్లిబిల్లిగ జడలల్లిన మొయిళుల కురుల సందులను చిక్కులు వదల్చి,
తరులజొంపము వోలె దళమైన మబ్బుల వలుద చీకటుల లోపలకు బోయి,
తళుకు తళుక్కున బెళుకారు మెరుపుల సొలపు చూపులలోని వలపు లెఱిగి
తెలిమబ్బుగుబురుల తెరలలో నురుములు పలికించు పలుకులు తెలుగు జేసి,
శిశువు గని యంత క్రొంబాలచేపుదాల్చి-యుబ్బి తొలుకాడు మాతృపయోధరముల
కరణి పొలుపారు నీవానకారు సొరు-విప్పిచెప్పరె భావముల్ విప్పుకవులు!

(స శేషము)

---

## దీర్ఘ నిశ్వాసము

జి. జాషువకవి గారు

తెలుఁగుంబాసకు వన్నె దెచ్చిన జగద్వీరుండు, మాకృష్ణరా
యలు కట్టించిన వజ్రదుర్గముల శుద్ధాంత ప్రదేశంబులన్
దలక్రిందై తప మాచరించెడిని సంతానార్థమై, గబ్బిగ
బ్బిలపుం గుబ్బెత లక్కటా మొయిలు గప్పెం బూర్వ మర్యాదలన్.

పన్నీటం దలసూపి కాఁపుగొను రంభామల్లికా వాటికల్
చిన్నాదేవి గులాబితోఁటలు నశించెన్ గ్రచ్చ లుమ్మెత్తలున్
గన్నేరుం బొద లావులించినవి రంగత్తుంగభద్రానదిన్
బన్నుండె న్మనమోహనాంగికవితాప్రాగల్భ్యసౌరభ్యముల్.

నాయకురాలి మాయకదనంబున మా పలనాటి పౌరుష
శ్రీ యడుగంటె, గడ్డి మొలిచెం బులిచారలగద్దెమీఁదఁ, గెం
జాయ మొగానఁ గ్రమ్మ జలజప్రమదామణి, నాగులేటిపై
వ్రాయుచునున్న దిప్పటికి, బాలునిశౌర్యకథా ప్రబంధముల్.

వాసినిఁ గన్న రెడ్లపరిపాలన, కొండలదండల న్శిలా
శాసనసంగతి న్నిలిచి చచ్చియుఁ జావదు, రెడ్డిరాణి, మైఁ
బూసిన కుంకుమంబు పసుపుంబస లంటిన కన్నెతొండ నేఁ
డూసరవెల్లిమై నవయుచున్నది, పందువెదుళ్లసందులన్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వసురాయ చాటుప్రబంధము

బండారు తమ్మయ్యగారు

(వెనుకటి సంచిక తరువాయి)

## వానకారు

సహజశక్తి సమేతుండగు నరవరుండు నిజపరాక్రమమును బూర్తిగఁ గన్పఱుచు నక్కఱ లేకయ శత్రురాజులను శాసింపనేర్చుట లోకప్రసిద్ధము. ఇందులకు దృష్టాంతము:

గీ. సన్నచినుకు రాల్చి చల్లార్చె రోహిణి
మిన్నుముట్టు మంట మృగశిరస్సు
కన్నుబొమ్మ సన్న గడగడ లాడించు
శక్తి యున్న యన్న శత్రువులను.

వానకారున నేలపైఁ జలిచీమల బారులు చెలరేఁగుట ప్రకృతిసిద్ధము. భూమణాలంకరణమున సపత్నులన్యోన్యధిక్కరణ మొనర్ప నెంచుట గూడ స్వాభావికము. దివిభువులకు సాపత్న్య మారోపించి పయిని జెప్పిన ప్రకృతి సిద్ధవిషయము నుత్ప్రేక్షించు చాటువు:

ఉ. క్రోవలు నల్లపూసలను గ్రుచ్చిన సోగవి దాల్చెనో నిజ
గ్రీవను భూమిదేవి బహురీతుల నీలపయోదమాలికల్
శ్రీ విలసిల్ల నింగి నలు గ్రేవను వ్రేలుట గాంచి యంచనన్
ద్రోవదొలంగకుంజనడరుజలిచీమల బార్లు తొల్కరిన్.

జలద మయూరములకు బాంధవము భగవన్నిర్మితము. పరమమిత్ర బంధుదర్శనమున నుప్పొంగు సత్పురుషునివలె మేఘోదయమును గాంచినంతనే మయూరములత్యంత హర్షమున నృత్యమొనర్చి కేకారవంబులతోఁ గేరుచుండు స్వాభావికవిషయమునకు మనకవి యుత్ప్రేక్షించు కారణములు:

క. మారుతశిక్షను వారిద
ధారలు నాట్యంబు సేయఁ దదనూయఁ బలెన్
బ్రారంభించె నటింప మ
యూరతతుల్ వాని మింపనో యన మించుల్.

క. "ఎప్పుడుఁ గనఁబడు కన్నుల
నొప్పెడు మావిప్పపింఛ మొక్కొక్కయెడన్
గప్పడు నీతారక"లను
నుప్పరమును నిక్క మెడ మయూరము లేకన్.

దానము సత్పాత్ర వినియుక్త మయినప్పుడే యుభయతారకమయి పరస్పరౌత్కృష్ట్యమును గూర్చును. అందులకుఁ బ్రకృతినుండి మనకవి చూపు దృష్టాంతము చాల సరసముగ నున్నది:

గీ. తామరాకులం దుదకబిందువులు కంధ
రుండు రాల్ప మణుల రూపుఁ దాల్చె
నవ్విధంబు, దివ్యుఁ డనుదాత మహిమంబొ
పావనాత్మపాత్ర వరమహిమమొ.

ఋతువు లన్నిటిలో వర్షర్తువును, హేమంత ర్తువును విరహుల కత్యంత దుర్వహములు. ఈవిషయమును బురస్కరించికొని చెప్పిన యీ క్రిందిపద్య మనుభవ రసికులకు హృదయంగమముగ నుండఁ గలదు:

సీ. శ్రావ్యమర్దళ మృదుస్వనమనోహరములై
యుప్పరంబున మెయి ఘుమఘుమచుండఁ
జిమ్మచీకటిలోనఁ గ్రొమ్మించు లెడనెడఁ
దోతెంచి, కిటికీలఁ దొంగిచూడ
మర్మరధ్వనులతో మబ్బుపైగాలిక
మ్మనివానతావి నుస్సనుచు వీవ
ముత్యాల జాలరుల్ ముసుఁగు వేసినదారి
నుదకధారలఁ జూరు లొప్పుచుండఁ

గీ. బట్టెమంచముఁ, బానుపుఁ బందిరియును
జాలరును, దోమతెర, పూలుఁ, మేలుకట్టుఁ
బచ్చడము, నడపముఁ గల్గు పడుకటిల్లు
ముదితదవ్వుల నుండిన ముల్లు గాదె?

## సీతుకారు

శారదవేళను మేఘములు నిర్మలములయి ప్రకాశించుట ప్రకృతి సిద్ధము. అప్పుడు జలములు, తెల్లులు విమలము లగుటగూడ స్వాభావికము. సహజములగు నీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంఘటనలకుఁ గార్యకారణ సంబంధము నారోపించు చాటువు:

క. శరదములఁ జెరుఁగు మన కా
శరదములనె యనుకరింపఁ జనుననుచు, నదీ
శరములుఁ దత్పరిసరమున
శరములు విమలంబులయ్యె శారదవేళన్.

మంచుఁదుంపురులతోడి గడ్డిచే నాచ్ఛాదితమగు భూసతిని జరఠాక్రాంతగా నుత్ప్రేక్షించు పద్యము:

ఉ. శారదరాత్రి పైని సర
సంబుగఁ జందురు మామ చిల్కప
న్నీరనఁ బొల్చు పల్చనియ
ణీయపు మంచున మించు దూర్వలం
ధారిణి వేసవం దగె, స
నాతన కావున సంభృతజ్జరా
భారవశంబునన్ బలిత
పాండుర కేశ కలాపయయ్యె నాన్.

పతికి సతి యర్ధాంగియను నార్యోక్తిని రూఢి పఱుచు చమత్కృతి:

క. "ఒడ లొకడె పతికిఁ బతి"కను
నుడికిం దొలకరియు సీతును బ్రమాణంబుల్
నడివేసఁగి వేర్వేఱని
యెడునెడ నది యేకసాత్మ్య మెటు గ్రాహ్యమగున్.

పైయార్యోక్తికిఁ గారణభూతులయి జగజ్జనకు లయిన పార్వతీపరమేశ్వరు లర్ధనారీశ్వరు లగుటకుఁ గారణము నిత్యహిమాలయ వాసులవుటఁ జలిబాధ నోర్వలేక గాఢాశ్లేషము నభిలషించుటయే యను చమత్కారము కూడఁ జూడఁదగినది:

ఉ. జంపతులార! వినదుమ
సం దిసుమంతయుఁ దోఁపనీకుఁ డీ;
కంపిలఁ జేయు మిమ్ము నవ
కాశము లేశము చిక్కనేని యుం;
గొంపలఁ దూఱితూఱి వెద
కుం బొలయల్కల వారి సీతు; చిం
తింపుఁడి పార్వతీ భవుల
నిత్య హిమాలయ శృంగధాములన్.

సాధారణముగా వృక్షములన్నియు వసంతాగమమునకే యాకులు రాల్చుచుండ వేపచెట్టు సీతుకాలమందే యట్లొనర్చుటకుఁ గారణ మారయఁ దగినది:

గీ. పుష్య మాఘ ఫాల్గునములు మూఁడు నెలలు
వ్యవధి యుండఁగనే వసంతాగమమున
కేమిపుడె యాకు రాల్చు నీవేము? తెలిసెఁ
బూవుగాదికి సిద్ధంబు గావలెఁ గద!

## శిశువు; వృద్ధు

మానవునకుఁ గలుగు నాలుగవస్థలలోను బ్రథమ చరమావస్థలు రెంటినిగూర్చి మనకవికూర్చిన చాటువులు చాల మనోహరములుగా నున్నవి. మచ్చునకుఁ గొన్ని: పొత్తుల బిడ్డఁడు గాళ్ళేతులు కదల్చు శైశవచేష్టను, దానికముందు సంసార సాగరము నీఁదుట కభ్యాస మొనర్పురీతిగా వర్ణించిన పద్యము:

క. తలిమంబునఁ బొత్తుల వెలి
కిలి వెనుకకు ముందరకును గేరుచుఁ గాళ్ళే
తులు గదలుచు నిసు వీభవ
జలధిని నీఁదంగ నభ్యసము సల్పునన్.

మఱియు శిశువులు వ్రేలిని మాటిమాటికి నోటియందుంచికొని చప్పరించుచు నానందించు చందమును నిస్సారమగు సంసారమునకయి సంతసించు పామరప్రక్రియతోఁ బోల్చిన పద్యము:

గీ. సారహీనమయ్యు సంసారము ప్రియం బ
దేమొ కాని మిగులఁ బామరులకుఁ
బాలు గీలు లేని వ్రేలుంచుకొని నోరఁ
జాల నుల్ల సిల్లుఁ జంటి నిసుఁగు.

జిలిబిలి పలుకులతోఁ గూర్చిన యాక్రిందిపద్దములు నిసర్గమనోహరములయి కవిస్వభావోక్తి రమణీయతను బ్రకటించు చున్నవి:

చ. జిలిబిలి తేనెపల్కులను
జిల్కెడు కమ్మని ముద్దునోరఁ గెం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుల తులకింపు సన్నపెన
వుల్ జిగివంతపుఁ బాలబుగ్గలుఁ
గలువల నేలు కజ్జలపుఁ
గన్నులు నల్లని చుక్కబొట్టు నం
గల విరివమ్మె సంటి పసి
కందు మొగం బలరింపదే మదిన్.

గీ. పాలతల్లికన్నఁ బటికబెల్లము కన్నఁ
బక్వఫలము కన్నఁ బప్పుకన్నఁ
బాదరక్ష యన్నఁ బసిపాపలకుఁ దీపి
కుఱ్ఱవాఁడ్రబుద్ధి కుక్కబుద్ధి.

క్రొత్త వింత, ప్రాఁత రోఁత యను సామెతకుఁ జక్కని దృష్టాంతము:

గీ. శిల్పములును సృష్టి శిశువుల నలరించు
శిశువుచేష్ట లలరఁజేయు మనల
నేవి వీనిలోన హృదయంగమంబులు
క్రొత్తవింత ప్రాఁత రోఁత యింతె.

బాలుర ముగ్ధ వాక్యములు కొన్నియెడల నత్యంత భావగర్భితములయి యవ్యక్తము, నని ర్వాచ్యమునగు కవితాసంపదతో నిండారు చుండును. అందుకుఁ గొన్ని దృష్టాంతములు:

గీ. దేవు నలమారు తలుపులు తెఱచియుండ
నర్భకుఁడు మూయుచోఁ దండ్రి యాఁగ వాఁడు
"మూయకున్న దేవుఁడు పాఱి పోవు" ననియె
ముగ్ధ తావ్యక్త మధురముల్ బుడుత నుడులు.

గీ. మఱక పసరుటాకుఁ గొఱుకుటఁ గని మేఁక
తమ్ములమ్మ నేయుఁ నమ్మ! యనును
గాగితమున గీఁటఁ గని దార మను బాల
కందు నుడులు భావగర్భితములు.

చ. కనుఁగొని బాలుఁ డాఁడుఁ బసి
కందును "వీనికి నూడకుండ గోఁ
చి నెవరు కట్టిరో" యనియె
స్త్రీపురుషాకృతి గుర్తెఱుంగమిన్;
మును, వని ముఖ్యత్ర్యంగుఁడు "త
పోధనులార! యొకండె నాకు మో
మున, మఱిరెండు కొమ్ములెద
మొల్చెను మీ" కన లేద వేశ్యలన్.

షష్టిపూర్తి మహోత్సవము లిప్పుడు శ్రీమంతులలో నాచార మయినవి. ఈ యుత్సవమునకుఁ గారణముఁ దెలుపు చాటువు:

గీ. బలిమి చెలువములకుఁ బదునాలు, నలువది
తద్విరుద్ధములకుఁ దనువు మార్చు;
మంత్రశక్తిఁ గలుగు మరలఁ దొల్లిటి వని
షష్టిపూర్తి మహము జరుపుకొంద్రు.

వార్ధక్యమునఁ బళ్లూడిపోవుటయు, బాల్యమునఁ బోలె నవి మరల రాకుండుటయు నను స్వాభావిక విషయములకుఁ గారణముల నాపాదించు పద్యములు:

గీ. అఱువదేండ్ల ప్రాయ మప్పుడు, మానవుల్
మృదుపదార్థములను మెసఁగ వలయుఁ;
గఠిన మఱుగఁ జేయఁ గను పోపదని, యప్డు
ప్రాయికముగ స్రష్ట పండ్లు డుల్చు.

గీ. పాలపండు లూడి, పదుచు పండులు వచ్చు;
ముదుక పండ్లు రాల మొలవు నెండి
కోడెకాని జఠర కోశంబు కడు బలి
ష్ఠంబు; దుర్బలంబు జరఠు కుక్షి.

నిద్రా మరణములకు సాధర్మ్యమును గుఱించిన పద్యము:

చ. మరణము నిద్ర రెండును స
మంబులు; నిద్రకు రేయివంటిదే
జర మృతి; కందు షష్టికడ
సంజ; శతం బురు నిద్రవేళ; యీ
శ్వరుఁ డది జీవిత క్రమము
సర్వము దీఱఁగ నేర్పరించె; న
త్తఱుణమునందుఁ గోరుదురు
తప్పక తొందర దాని నందఱున్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౪౪_వ భారత జాతీయమహాసభా చిత్రములు-లాహోరు



చిత్రము ౪



చిత్రము ౬ స్త్రీ సేవాదళము



చిత్రము ౭ మహాసభా మంటపము



చిత్రము ౫

సభాధ్యక్షుడు, సర్దార్ మంగళసింగ్ మొదలగు నాయకులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము ౯



చిత్రము ౧౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వార్ధకమున బలము తగ్గుట సర్వజీవులకు స్వాభావికము; కాని యీధర్మము వృక్షములలోఁ దాళము నందును, మానవులలో భారతవీర శ్రేష్ఠుఁడగు భీష్ము నందును విపరీతమయినది. భీష్ముఁడు తాళధ్వజుండౌట యీయసాధారణ ధర్మసామ్యమును బట్టియేయఁట:

చ. చాల ముసల్లి కంగమున
సత్తువ సన్న మగుంగదా, మహో
త్తాలపుఁ దాళమందుఁ బలెఁ;
దద్విపరీతత దోఁచు భీష్మునం
దాలములోన వాని కడి
యాలము తప్పటుసాల మోటరన్
మూలము, చేఁ బట్టి యను
పోలికయే యనుచుం దలంచెదన్.

## పొలములు, పిట్టలు మున్నగునవి

వివిధ సస్యవిలసిత మగు లంకపొలమును గూర్చి యొనర్చిన యీ క్రిందివర్ణనము స్వాభావిక రామణీయకమునకుఁ జక్కని దృష్టాంతము కాఁగలదు:

సీ. పూవుపిందెల, వ్రేలు పొడవుఁ గాయలఁ గొమ్మ
లొరగి పచ్చగ నున్న మిరెపచేలఁ
దెల్లపూగొలలలేఁ దీఁగె లొండొంటితో
నెనసి వాసనగొట్టు ననుపచేల
గవ్వగుత్తులవంటి పువ్వుగుత్తులు పూచి
గమగమ వలచుకొ త్తిమిరిచేల
మొక్కలై రెక్కొని ముదిరి లేఁ బాకాన
మిగుల గమాయించు మెంతిచేల
గీ. నలదు జడగట్టికాచిన యావచేల
వట్రనును గింజవెన్నిను వరగచేల
వలుఁద దుబ్బులు పైనగొన్న యులవచేల
లక్ష్మి! నా నోయనుచు నుండె లంకపొలము.

పన్నీరుబుడ్డితోఁ బోల్చిన యుల్లికోడు వర్ణనము:

గీ. తలను సన్న బెజ్జములరవపూఁ జెక్కి
నట్టు మరకతంపు గొట్ట మున్న
చిన్నితిమ్మకెంపుఁ బన్నీరుఁ గొప్పె, నా
నొప్పె దుంపతోడి యుల్లికోడు.

మశకమత్కుణములవలన మానవునకుఁ గల బాధ వర్ణనాతీతమయినది. మత్కుణ బాధగూర్చి గీర్వాణకవి యొకఁ డిట్లు చమత్కరించినాఁడు:

శ్లో. రవి రంబరమధ్యస్థః శేషే శేతే హరి స్తథా,
గిరౌచ గిరిశ శ్శేతే మన్యే మత్కుణ శంకయా."

దీనినే యాంధ్రకవి యొకఁడు

క. "శివుఁ డద్రిని శయనించుట
రవిచంద్రులు మింట నుంట రాజీవాక్షుం
డవిరళముగ నబ్ధి(శేషు)పయిని
బవళించుట నల్లిబాధ పడలేక సుమీ!"

యని యనువదించినాఁడు. వీనిని దొంగలతోఁ బోల్చిన వసురాయని చాటువులుగూడఁ జూడఁదగినవి:

ఉ. పాములు దేళ్లు జెఱ్ఱులిటు
వంటివి దాఁగి చరించుఁ జీఁకటిన్
దా మొరుఁజోలికిం జనవు
తె మ్మలిగింపక యున్న నక్కటా!
దోమలు బందిపోటు గజ
దొంగలు; చొచ్చి వెలుంగులోనె యి
ళ్లేమితలంక కార్చుచుఁ బ
యిం బడి దొమ్మి హరించు రక్తమున్.

చ. మెలపున నింటివా ర్నిదుర
మేల్కొనకుండఁగ గ్రొచ్చి గోడలం
గలుముల దోఁచి పారుదురు
కన్నపు దొంగలు రాత్రులందు; న
ల్లులు శయనాసనాదుల క
లుంగుల లోననె డాఁగి నిద్రమే
ల్కొలిపియె వింతతస్కరతఁ
గ్రోలు నొడల్లున నల్లరేవగల్.

ఎంతపదిలముగ దాఁచినను దవ్యపదార్థములను జీవుల బారినుండి కాపాడుటయందుఁ గల కష్టములు గృహస్థుల కెల్ల ననుభవ వేద్యములు. అమృతము భూలోక గతము కాకుండుట కీచీముల భయమే కారణమను పద్యము చాల హృద్యముగ నున్నది:



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. చీమలకడలి, పయోనిధి
లో మెదలం దాఁగి, దైత్యులుఁ సుర లెత్తన్
భూమిఁ గనకభయ మమృతం
బామరలోకమున కరిగె హాయిగ బ్రదుకన్.

## వృక్షాదికములు

సృష్టిలో నెల్ల మానవజన్మ మత్యుత్కృష్ట మని పెద్దలు వాక్రుత్తురు. కాని స్వార్థపరుండయి, స్నాయువసాది పంకిల శరీరుండగు నరునికంటె నిలువెల్ల నాజన్మముపరోపకారములగు తరురాజముల జన్మమే యుత్తమమని నేను బలుమాఱు తలంచుకొను చుందును. "పరోపకారార్థ మిదం శరీర"మ్మను పవిత్రధర్మము సృష్టిజాలములో వృక్షములయెడఁ జెల్లినట్లు మఱే వేనిదెసను నెఱవేఱినట్లు గానరాదు. కావున సత్కవుల దృష్టికి భూమిజములు దయాసముద్రుఁడగు పరమేశ్వరుని ధర్మపురుషార్థక శాలలుగా గోచరించు టొక వింత గాదు. ఇందుఁ గూర్చిన వసురాయని చాటువు:

ఉ. వేడుకఁ దూఁగుటూయెలల
వేకువ నూఁగుచు గాలిపాటలం
బాడు శకుంత దంపతుల
పచ్చని మెచ్చుల దొంతి సౌధముల్
నీడ నొసంగి, యధ్వగవ
నీపకతిర్యగనీక మెప్పుఁ గా
పాడు విధాతృ ధర్మపురు
షార్థకశాలలు, వృద్ధసాలముల్.

మఱియు నేఁ జెప్పిన పయివిషయమున క్రిందివృత్తాంతము దృష్టాంతము గాకమానదు. ట్రెయినింగు కాలేజీలోఁ బనిచేయుకాలమున నారోగ్యము చెడి మన కవి యొకపుడు సెలవు కోరఁగా నప్పటి వైస్‌ప్రిన్సిపల్ నిరాకరించెనఁట. అప్పు డతికష్టమునఁ గాలేజీకిఁ బోయి పనిచేయుచు నొక నాఁటి మధ్యాహ్న మధికారినిర్దయకుఁ జింతించుచు శ్రమమునఁ గిటికీవద్ద నిలువఁబడియుండ సమీపమందలి యొట్టిదిరిసెనచెట్టు మందమలయానిలాదికముచేఁగన్నులకుఁజల్లఁ దనమిచ్చి యాయనకుఁ దాపోపశమనమును గలిగించెనఁట. అప్పు డావృక్షమునై చెప్పిన చంపకమాలిక ప్రకృతికి నీకవికిఁగల యన్యోన్య ప్రేమమున కాదర్శకమై స్వార్థపరులగు మానవులకు నీతిబోధక మగుచున్నది.

అందలి కొన్ని పాదములు చిత్తగింపుఁడు.

............................................

నరులకు నున్నతస్థితి మ
న స్సుఫలం బగుఁ బ్రాయికంబుగం
దిరుసెన! యెప్డు నీదుసుమ
న స్సతిపేశల; మావసంతపుర్
సిరులను నిట్లు వర్ధిలుచు,
నేదను దర్శనమాత్రతేఁదీర్తు కన్
దిరిగెదు నాకు; నీజనకు
దీనదయాళుత నిన్నుఁ జెంచెనో;
"నరులకు భావ వేఁబుపడి
నం గనుపట్టదు సానుభూతి" యం
దురు; తరు వీవు నే నరుఁడ;
దుస్సహబాధ మదీయ మేగతిం
గరఁచెనో నీయెడం..............

..............................

దిరిసెన! నీదు సచ్చరిత
దిద్దునుగా కుపకారశూన్యులన్.

ఆంధ్రగ్రంథములలో సంస్కృతశ్లోకములనఁ బరివర్తింపఁబడు భాగ్యము పాలుకురికి సోముని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములకు, రామరాజభూషణుని వసుచరిత్రమునకు మాత్రము గలిగినది. అట్టి గౌరవము వసురాయని యీక్రింది చాటువునకుఁగూడ నబ్బుట ముదావహము. దీనికి స్వయముగ మన కవియు, సమకాలీనులగు శ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, కస్తూరి శివశంకరశాస్త్రిగారు రచించిన శ్లోకములు గ్రంథమునఁ గాననగును:

మ. అకటా! నేరెడులార! మీదెసకు నే
నత్యంతముం గుందెదన్
నికటం బందలి యీముసిండి గమికిన్
మీపాటు లేఁ; దాఁగదా,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యకృతజ్ఞుల్ ఫలదానశీలురను వి
　　మ్మస్మాదులం గొట్టిరే?
సుకృతుల్ కష్టము పాలు కావుటకె యీ
　　క్షోణీస్థలిం బుట్టుటల్.

ప్రకృతికిని నీకవికిని గల పరస్పరానురాగ మీప్రకరణమున మాటిమాటికి వ్యక్తమగుచుండును. కాలేజీలోఁ బనిచేయు వసారగదియందు పంకా లేక తపించునపు డప్పటి నీమచింత లవ్యాజ ప్రేమముతో నాలోపమును దీర్చి శ్రమ మడం చెడివఁట:

గీ. శ్రమికిఁ గాలేజి వెనుక వసారగదిని
లేదు పంకా యటన్న వెత్తిని దొలంచి
నాకు నవవీవనలు వీచు మీకు నేని
తాంతముఁ గృతజ్ఞుఁడను నీమ చింతలార!

సృష్టివైచిత్ర్యమునకు గోరింట యొకదృష్టాంతము. దానిని గూర్చిన చాటువు:

గీ. పచ్చనాకు నూటి పొంగిణి వెట్టినఁ
గెంపు జాయ పట్టి యింపుఁ గూర్చుఁ
బచ్చలోనఁ గెంపుఁ బ్రకృతి యేగతి బాఁచె
సృష్టి నెఱిఁగి యెవఁడు చెప్పఁగలఁడు?

క్షీరనీరవిభాగ నిపుణంబగు మరాళంబును గవులు మెచ్చుట స్వనామపక్షపాతము చేనటగాని యంతకంటె నరంటియే శ్లాఘ్యతర మఁట!

ఉ. పాలను నీళ్లు మిశ్రమగు
　　పాత్రను నీరముఁ ద్రోసి క్షీరముం
గ్రోలు మరాళముం గవిన
　　రుల్ కడు మెత్తురు; కళ్మలంపుఁగీ
లాలమునం గ్రహించి విమ
　　లంబును రస్యఫలమ్మె వైళ మీఁ
జాలు నరంటి కంటె నది
　　శ్లాఘ్యమె? యౌర! స్వనామ పక్షతల్.

ప్రకృతియెడ నరుఁడు చూపు దౌష్ట్యమున కొండు రెం డుదాహరణములు:

క. నాముద్దుఁ గాన్పుఁ బుట్టెను
మామ్మముం దుమ్మెదలు నెమ్మి ముద్దాడుఁగదా!
తా మెఱిఁగి నరులు ధర్మము
హా! మెడఁ దునిమెద రిదేమి? యనుకొనునో లతల్.

క. "గోముఖ శార్దూలంబులు
నూ మానవు లస్మదీయ సూనుల నకటా!
మాముం దెచీల్చి తిం" డ్రని
భూమిజలత లేడ్చుఁ జిన్నవోయి సొనమిషల్.

తింత్రిణీ వృక్షమన్న మనకవి కభిమానమమెండు. అందులకుఁ గారణములు చాలఁ గలవు. (ఒకప్పు డది యాయనకుఁ బ్రాణదాతకూడ నయ్యెనఁట.) స్వవిషయ ప్రకరణమందలి క్రింది సీసములో నవి సూచింపఁబడినవి. ఇందుకు సంబంధించిన గాథావిశేషములు గ్రంథమునఁ గాననగును. బహుభంగులఁ జింతానాదంబను దీనికి భాషావికృతిచేఁ గలిగిన "చింత" యను నామ మీయనకుఁ జింతాకర మగుచున్నది.

సీ. బడికిఁ గొంపోవచ్చు బంట్రొతుఁ గనుఁబ్రామి
　　పిననాఁడు ననుఁ జంకఁ బెట్టుకొంటి
కంఖాణశకటవేగంబు నాఁగి యనేక
　　హాక్యసార్థముగఁ బ్రాయమున మనిచి
తడుగు కాదల శారదా తప మేర్వ నా
　　తిథ్య మిచ్చితి నేద దేర ముదిమి
ననుదిన మపు డిప్పు డనక జిహ్వకఁ జారు
　　భావంబునను దుష్టి పఱుచుచుంటి
గీ. నవ్యకోరంగి; రామచంద్రపుర దక్ష
వాటికారథ్య; గోవూరి బాహ్యసీమ;
నచట నిచటన కెల్లెడ నామ్లభూజ
నీఁగు వసురాయఁ డేదారి నీఋణంబు.

శా. గొం తెండన్ శరదాతపంబునను న
　　డ్గుల్ వొక్కఁగా, వంతెనన్
శ్రాంతిన్ గాల్నడదాఁటి గౌతమిని జే
　　రన్ రాఁగఁ గోవూరు, త
త్ప్రాంతంబందు వసించి సల్పితివి తా
　　పం బాఱ నాతిథ్యముం;
జింతాహంత్రికి నీకుఁ బెట్టఁ దగునే
　　చింతాభిదం? దింత్రిణీ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. యాతాయాత జనుల కీ
తాతపవర్షార్తిఁ బాపు నధ్వాగమ ! యీ
యాతిథ్యఫలము నీదో ?
భూతదయ న్నిన్నుఁ బెంచు పుణ్యాత్మునిదో ?

జగన్నాథ పండితరాయలు వృక్షములన్నిటిలో రసాలమున కాధిక్య మొసంగియున్నాఁడు. కాని మన కవి తన యభిమానముకలిమి నీ తింత్రిణికి దానికంటెఁ గూడ నధికత నొసంగుచున్నాఁడు:

క. పూవునకుం జివురున కం
తో వైరము మావి; నుండ వొకచో రెండున్;
గోవెల కేఁటుల కిడెదవు
నీవే సహపంక్తిఁ దింత్రిణీ, వేసంగిన్.

బంధుమిత్రుల యిండ్ల కేఁగునపుడు వారొనర్చు విందుల కంటె మన కవి కచ్చటి ప్రకృతి రామణీయకమే మఱింత విందొనర్చుచుండుట గూడ నీయన ప్రకృత్యభిమానమునకుఁ బ్రబలదృష్టాంతము కాఁ గలదు. చూడుఁడు:

ఉ. పాలను బంచదార యిడి
పాయసముం బొనరించి క్రోలుచో
నాలుక పొందు సంతసము
నాసికకుం ఘటియిల్లె కేయిన
ల్జాలును, మాలతీసుమ
సౌరభమిశ్రపుహోస్నహోన(నైటుక్వీను)పూ
బాలలకమ్మతావులను
1 బాలెపు సత్కవి తోఁటలోఁగిటన్.
(ప్రకేం. ప్ర. ౨౩౯.)

చ. కువకువఁ గూయుకోయిలల
కూఁతలచేతను వీనువిందుఁ గ
మ్మ వలపుఁ గ్రుమ్మరించు కుసు
మమ్ములజృంభల నాస విందు; వే
కువనె ఘటిల్లు విందు లిటు
కొల్లలు వేంకటరామయా 2 ! భవ
ద్భవనమునన్ వసంతమునఁ
బాంధులకున్ వసురాయపుత్త్రప్రియా.
(స్వ వి. ప్ర. ౭౬.)

గోదావరి యడుగున బురద యుండుటకు సరసమైన కారణము:

గీ. జనులదేహాత్మమాలిన్య మనుదినంబు
నీవు లోఁగొనుదానవు గావె ? జనని!
గౌతమీ ! దాని కతమునఁ గాఁ దలంతు
నడుగునను దావకీనతోయముల కసలు.

ప్రకృతియందుఁ గలుగు నపూర్వ సంఘటనలను, వింతమార్పులను దాత్కాలికముగ నబ్బురముగ విలోకించిన జనసామాన్యము వాని నంతలోనే మఱచిపోవుచుండును. ఇట్టి విషయముల మనకవీశ్వరుని హృదయ మొక దిన చర్యాపుస్తకమని (diary) చెప్పనొప్పును. లోకము శాశ్వతముగ గుర్తెఱుంగుట కీయన యెప్పటికప్పుడే వానిని జాటు పద్య నిబద్ధములుగఁ జేయుచుండును. ఇందుల కొండు రెండు దృష్టాంతములు:—

క. ఖరదుర్మతి నామక న
త్సరముల నైదాఘతీవ్రతపతాపంబున్
భరియించి, బ్రతుకుమర్త్యులు
సరకుగొనరు ద్వాదశార్క సప్తరసనలన్.

గీ. నభము చిల్లులు పడినట్లు నాలుగేను
నాళు లుఱుమని మెఱుమని గాలివాన
కార్తికంబునను రుధిరోద్గారిఁ బట్టెఁ
బంట లవి నోటియారని పంటఁ గలియ.

క. వహవా ! విరోధికార్తిక
బహుళేతరపక్షదశమిఁ బంగుదినమునన్ (2-11-1889)
బహుళకలభ సైన్యంబులు
విహాయసముఁ గప్పె జనులు వింతగఁ జూడన్.

పయిని జెప్పిన ఖర సంవత్సరమున (౧౮౯౧) ఖరకర తైక్ష్ణ్యముతో గ్రీష్మర్తు వతిభీష్మముగ వర్తిల్లిన

1. శ్రీ పాలెపు వేంకట సూర్యగోపాలముగారు, అమలాపురము.
2. శ్రీ చెఱకువాడ వేంకటరామయ్యగారు, చెఱకువాడ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిమ్మట వర్షర్తు ప్రారంభమునఁ దగినంతవాన లేకయే గౌతమీనది బ్రహ్మాండమును నిండు వెల్లువతోఁ బొంగిపొరలి వచ్చి దేశమును నాశమొనర్చినదఁట. అప్పు డా మహాప్రవాహముపయి వసురాయఁడు కూర్చిన "గౌతమీ మహాజల మహిమానువర్ణనము" అను ౩౦౮ పాదములుగల చంపకమాలిక భాషాభిమాను లవశ్యము పఠింపఁదగినది. మనోహరభావసంపదకుఁదోడు, వఱదకుఁ గొట్టుకొనివచ్చిన వివిధవన్యమృగ వస్తుగృహోపకరణాదుల వివరణముతోఁ గూడిన వర్ణనము కవికిఁగల విశేషలోకానుభవమును బ్రదర్శించి హంసవింశతికారునిఁ దలఁపించుచుండును. విస్తరభయమున నచ్చటచ్చట కొన్నిపాదములమాత్ర మందుండి యుదాహరించి యీప్రకరణప్రశంసను ముగించుచున్నాను.

.....................

అలమటఁ జెంది యట్టుడికి
        నట్టుడికెన్ బడగొట్టు సర్వభూ
వలయము; శాలిపాలికల
        వాలుఁ గనుంగవనుండి తెక్కునే
పొలమున మింటనుండి యొక
        బొట్టు పొటుక్కున రాలదయ్యె;........

....................................

పోలుపున నైంద్ర చాపమును
        బూని శిఖండి యఖండతాండవం
బలర నవీననీలజల
        దార్జునఁ డొక్కు మొగిన్ మహాశరా
వళి గురియింపఁ జావకయ
        త్రాలు వివృద్ధతపర్తు భీష్మమై
నోలి కడురక్తబిందువులొ
        కో యన, నెఱ్ఱగ శక్రగోపముల్
నలుఁగడనోఁచె.....................

కలిగిన యంతలో నిమిలి
        కన్నులు మారెడు బండుఁ లేదుముం
దుల బుల్లిగోళ్లఁ గస్తురి పు
        నుం గగలుం గొఱకొమ్మ లక్ష్మికే

మ్ములు గురువెందపూసలును
        బువ్వుల గుత్తులఁ దాంద్రబెత్తులున్
వెల పొదుగైన బా లవురు
        వేళ్లను జిల్లలు జీడిగింజలున్.......
        ...మఱియు
        మట్లురు లుగ్గిళు లట్లు బందముల్
పలుపులు మోకు సిక్కములఁ
        బగ్గము లాదిగఁ ద్రాళ్లు తోళ్లు రోఁ
కళులును గుందులుం బిడులఁ
        గాములు బండలు దుడ్లఁ దెడ్లు నాఁ
గళులును మేఁడు లేఁడులును
        గాఁడులు గొంగలు దబ్బి చిప్పలున్
ములుగర గొట్టుకఱ్ఱలును
        బుట్టలు మూటలఁ గారెముల్ తలం
బులు సిడిమాపు లాకులును
        బోలిరు సడ్డలు బండ్లుగండ్లు గా
.............................

## ప్రాస్తావిక ప్రకరణము

ప్రస్తావవశమునఁ బ్రసక్తములయిన విషయములఁ గూర్చిన చాటువులును, గొన్ని యన్యాపదేశములును నిందుఁ గూర్పఁబడినవి.

ఎల్ల రాడుమాట కల్లయైనను నిజముగనే పరిగణింపఁబడుటకుఁ దార్కాణము:

గీ. ఏఱు దాఁటి తెప్ప నెవ్వరుఁ గాల్పరే
    సామెతయ్యె నద్ది యేమికతమొ?
    చింత్రు సత్తు వ్రాసి చిత్తైత్త రా మాట
    యెల్లరాడుమాట కల్ల నిజము.

మర్త్యలోకమును భగవంతుఁడు దుఃఖభూయిష్ఠముగా నొనర్చుటకుఁ గారణము:

ఉ. తప్పులు సల్పువారి కను
        తాపము గల్గి క్రమ క్రమంబుగా
    "నొప్పుగ సంచరింపవల
        యున్ మన మిం" కను మేల్తలంపు లో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుప్రతిలింగఁ జేయుటకు
నుండవలెం జెఱసాల; యందుకై
యప్పరమేశ్వరుండు బహు
శాస్త్రనిధాన మొనర్చె మర్త్యుమున్.

మానవశరీరము నూటకలముతోఁ (fountain pen) బోల్చిన పద్యము

గీ. ఊటకలముతోడ నుపమింపఁ దగుఁ దను;
వోడుమషిగ నూపి రాడి యాడి
యంతమొందు నంత నక్షర వ్యాపార
మడఁగుఁ గట్టె మిగులు నాశె యుడుగు.

అతిపరిచయ మవమతికారణ మనుట కొక తార్కాణము:

గీ. బుట్ట బొమ్మలోన నట్టు వొక్కఁడు చూతి
వేయు గంతు లెంతొ వింతఁ గంద్రడు
బొందిఁ జొచ్చి సలుపు పురుషుచేష్టలు మెచ్చ
రవమతికి నిమిత్త మతిపరిచితి.

ఆంధ్రదేశ దౌర్భాగ్యమునకు నేఁడు కారణమగుచున్న బ్రాహ్మణాబ్రాహ్మణ నైరస్యములకు వగచి యిరు జాతులకు సౌభ్రాత్రమును బ్రబోధించుపద్యము:

గీ. కాయగసరులు మెసవు చిల్కలును గీట
కక్రిములఁ దినుగోరువంకలును నైక
మత్యమున మాట పొందిక ప్రాన బ్రదుకు
బ్రాహ్మణాబ్రాహ్మణేతరుల్ వానిఁ గనరె.

నోరుగలవానిదే రాజ్య మనుటకు సరసమయిన నిదర్శనము:

ఉ. జీవులలోనఁ జేరుపని
చెట్టుల గట్టులఁ జెప్ప నేల? స
ర్వావయవంబులుం గల మ
హాబలశాలుల సింహముఖ్యనా
నావనజంతులం బళుగ
ణంబులమానిసి పట్టియేలెపుం;
భావ మిదేమొ "నోరు గల
వానిది రాజ్య" మటన్నమాటకున్

అట్టులే నోరు గలట్టిదే ప్రాణి యనుటకు:

ఉ. క్రన్నవ ముక్కునం గఱచి
కాకము పిచ్చుకఁ గొంచుఁబోవ నా
పన్నతదార్తనాదమున
బగ్గుమనున్ మన; సట్టి పిచ్చుకే
యెన్నియొ పుర్వులం గమిచి
యిట్టటుఁ ద్రోటి విదుర్చుచుండ ను
త్పన్నము గాదు జాలి యటు
వాయి గలట్టిదె ప్రాణి సృష్టిలో.

ఇట్లని, చైతన్యరహితములుగఁ దోఁచు స్థావరములకుఁ గూడఁ బ్రాణ మున్నదను ప్రకృతితత్త్వపరిశోధకుల నూత్నసిద్ధాంతమును మనకవి యంగీకరింపక పోఁడు:

గీ. పర్వతంబునకును బ్రాణంబు లేకున్న
నెట్లు దానిపైని జెట్లు పెరుఁగు?
బ్రతికియున్న వాని పైఁ గాక నెంద్రుకల్
కుణపమం దెదుగునె గొఱిగి చూడ?

ప్రజలకు బాధకరమయినది రాజుయొక్క పరిపాలనము గాక యందుఁ గుదిరిన దుష్టసేవకు లనుటకు సాదృశ్యము:

గీ. గాలివలన జనుల కనులు మండునె? దానఁ
గలియు కొన్ని రేణువులనె కాని;
పాలనంబు కాదు బాధకం; బద్దాన
నమరు కుజనులు విబుధార్తికరులు.

బ్రహ్మవ్రాసిన వ్రాఁత తప్ప దనుట కొక మనోహరోదాహరణము:

ఉ. అంబుధి బాడబానలశి
ఖావళితాపము దప్పు నంచు ము
త్తెంబు పయోజగంధి జగ
తీసుతనాసిక నాశ్రయించె; హా
యంబుజసూతి వ్రాఁత విత
యౌనె? దపప్రతిమాన విప్రయో
గంబున మాఁడ్చె నామె నిధు
గాటపుటూరుపు టగ్గి వేడుముల్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భార్య యనుకూలవతి యైననే యర్ధాంగి గాని లేని చోఁ బ్రక్కలోని మృత్యువేయఁట:

క. కానిదని తెలిసినపు డర
మే నను కో కాలిఁ బక్క మిత్తిగఁ గనుఁగో;
మ్మేనంగు నంటి మానిసి
పీనుం గగుటయు ఘటిల్లు విటు ఖడ్గహతిన్.

అన్యాపదేశములకుఁ గొన్ని యుదాహరణములు.

గీ. నీలకంఠ ద్యుతికిఁ దోడు నిటల మందు
భూతి చెలువంబుఁ దాల్చితి పోతుఁబిచిక!
చిత్తమున శివసాదృశ్య చింత యున్న
వేసముల కేమి లే కామ విజయి వసుము.

క. విడిచిన తామరపూవా!
తడ వేటికి సలిపె దీవు? త్వత్సన్నిధి కి
ప్పుడు వచ్చిన యీతు మ్మెదఁ
గడుపు తనియఁ గ్రోలనిమ్ము కమ్మని తేనెన్.

గీ. ఎంతదొడ్డవాఁడె యింజిరావల్లభు
బొడ్డుఁదమ్మికన్న ముద్దుబిడ్డ;
కనుల నీరు గాఱుఁ గటకటా! పడనై చె
మల్లు కంపమీఁద మల్లెపూవు.

ఉ. అంటినఁ గందిపోయెడ వ
టంచును నుల్లము తల్లడిల్లు; ని
న్నంటనిచో నవజ్ఞయగు
నంచును జంకు జనించుఁ; గాన నీ
రెంటికిఁ దప్పుకొంటకు ని
రీక్షణభృంగకులంబుచేత ని
న్నంటియు నంటకుంటి; మది
నల్గకుమీ నవకుందమాలికా!

గీ. పువ్వుమై పుట్టి జనులఁ నిన్ బ్రువ్వఁదిట్ట
బ్రదుకుచున్నా వి సీ! రోఁత బ్రదుకి దేల?
చెంతఁ గరవీరమును జూచి సిగ్గుపడవు;
సీమబాదమ! దుర్గంధ ధామ మైతి.

## ప్రకీర్ణకప్రకరణము

వివిధవిషయ ప్రసక్తములయి పయిప్రకరణముల క్రిందఁ జేరని చాటువు లిందుఁ గూర్పబడినవి. మఱియుఁ గొన్ని సంస్కృతచాటువులు, ఉత్తరరామచరిత్రనాటకమందలి కొన్ని యంకములలోని శ్లోకములు, శంకరాచార్య కృత భజగోవిందాది శ్లోకములు మున్నగువాని కీయన యొనర్చిన యాంధ్రీకరణములును, బంధుమిత్రుల యొక్కయు, వీరేశలింగకవి, వేంకటరత్నకవి మొదలగు సోదర కవులయొక్కయు, విక్టోరియారాజ్ఞి, ఎడ్వర్డు చక్రవర్తి మున్నగు వారియొక్కయు నిర్యాణములను గూర్చి వ్రాసిన పద్యములును నిందుఁ జేరినవి. మొదటి తరగతి చాటువులను మాత్రమే కొన్నిటి నుదాహరించుచున్నాను.

కవిత్వమును మన పెద్దలు చిత్రకళలలోఁ బరిగణించిరి. కేవల చిత్రకళ, కవిత్వము నను రెంటిలో నేది యధికతర మను సంగతి చాలఁగాలమునుండి తేలని విషయము. ఏకళాభిమాను లాకళకే ప్రాశస్త్యము నాపాదింతురు. ఈ విషయకమయిన వసురాయని చాటువు భావగర్భితమయి యాయన యభిమానవిషయమగు కవిత యెడనే పక్షపాతమును సూచించుచున్నది.

మ. కవితాచిత్రకలా విలాసవతు ల
క్కాసెల్లి యండ్రైన జా
హ్నవితోఁ బార్వతితోడఁ బోల్పఁదగు గ
న్యల్; చక్కనైనట్టి య
క్కవయం దెక్కువ తక్కువల్ దెలిసికోఁ
గష్టంబయా; నైన, మ
క్కవయాంధ్రం బయిఁ బ్రక్కఁ
దాల్చు నిటలాంకుండౌనో దక్షుండటన్.

కవికిని, గర్భిణీస్త్రీకిని సాధర్మ్యము చూపు పద్యము.

క. మాలాలితనముఁ బిదపను
బాలెంతతనంబుఁ దెచ్చి ప్రసవక్లేశమునుం
దూలించి, కందు, తల్లిం
దేలించు సుఖాబ్ధిం; గృతియు గవినట్లే.

శృంగారమనుశీర్షికక్రింద నీప్రకరణముననున్న పద్యములన్నియు శృంగారరసప్రియులు తప్పక చదివి యానందింపఁ దగినది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాల్గంటుల క్రీఁగంటిచూడ్కుల వాఁడితనముఁ గూర్చిన చాటువు.

సీ. వాఁడిగోళ్లనొసంగి వ్యాఘ్రసింహములకుఁ
గొమ్ముచీటియ లేనుఁగుల కమర్చి
దృఢవిషాణంబులు వృషభంబులకునిచ్చి
ఖరఖురంబులు ఘోటకములకునిచి
కుంభీనసములకుఁ గోఱలు దయచేసి
వృశ్చికములకిడి విసపుఁగొండి
నీడోద్భవములకు నిశితపంచువు లుంచి
తొండములఁ ఘటియించి తుమ్మెదలకుఁ

గీ. బకృతిప్రజలకుఁ దనపగ్గె బయలుపఱుప
నట్టి వుడిగిప్రసాదించె నబలలకును
గలికిచూ; పడియామె క్రేఁగంటఁబఱపు
మాత్ర, మూర్ఛ మానంగని మగలుఁగలరె?

"నానాసూన వితానవాసనల..." అను వసుచరిత్రకారుని పద్య మాంధ్రవాఙ్మయమున సుప్రసిద్ధము. దానికంటె గుణాతిశయముగల వసురాయని చాటువు చిత్తగింపుఁడు:

చ. కనకము తన్నులోకులు సు
గంధము లేనిది యంట కెంతయుం
గనలుచుఁ జంపకాకృతిని గైకొన
నప్పుడు కూడ, దేఁటియం
టని దిది యేటిపూవనఁ, బ
డంతుక మేనయిపుట్టి, సర్వభూ
జన నయనాళు లెంతయును
సంతసిలం గొఱలేక భాసిలున్.

చెన్నపురిని దర్శించి నపుడప్పటి విశేషములఁ గూర్చి యీకవి వ్రాసిన పద్యములుకూడ నాసక్తితోఁ జదువఁదగియున్నవి. అందొకటి:

చ. టకటకధావ దశ్వఖుర టంక
పుటాంచల ఘట్టనార్భటిన్
జెకుముకిఁ బోలె రాకటికి
నేలను జెల్లడేరన్ మిడుంగుఱుల్
నికట ధరాతలం బదర నేమి
పరిభ్రమణంబులం బృహ
చ్ఛకట ఘటావిహారములు
సాగును సాగరవేల సంజలన్.

పోస్టుకార్డువిలువ యరణా యేసంవత్సరమునసైనదని ప్రశ్నించినచో మనబోఁట్లు వెంటనే చెప్పజాలమనుకొందును. అందుల కీక్రిందిపద్యము వల్లించుట మంచిది.

క. ఏఁబది రేడులరాజ్ఞీ
జూబిలి పద్యములనంటెఁ జొకుక్కుచు "పచ్చం
జాబొక్క నేబుతో" నని
దూఁబరదుంధుభిని "రెంటితో" ననవలసెన్.

రైలుఁబండిని గూర్చిన చాటువులుకూడ మెచ్చుకోల్పుచున్నవి. ఉదయమయిన తరువాతఁగూడఁ గలువపూలు పూర్తిగా ముకుళింపకుండుట సాజము. అందులకుఁ గారణము రైలురొదయాయని కవిప్రశ్నించుచున్నాఁడు.

గీ. కలువతీఁగెలార! కాంతునితో రేయి
సలుపు జాగరంబు చాలదొక్కొ
కన్నుమోడ్పరేమికత? మింత ప్రొద్దెక్క
రైలురొదను నిదుర రాదొ మీకు?

రేవుస్టీమరును గర్భిణీస్త్రీతోఁ బోల్చినపద్యము:

గీ. రేవుదాఁటెడు ప్రజలు లోఁ గ్రిక్కిఱియఁగ
వడికి నెదురెక్కనేరక వఱద యేట
మందగతి నేఁగుచున్న స్టీమరును జూడఁ
బూర్ణగర్భాలసాంగనా స్ఫురణమయ్యె.

కాకినాడ రాజమహేంద్రవరములఁ గూర్చిన చాటువు:

గీ. ఈడునకు జిన్నదై కాకినాడనగరి
యెమ్మెలను మీఱు రాజమహేంద్రపురిని
బదుచు బోగపుఁ జానకుఁ బసలుమెండు
ముసలి ముత్తైదువకు నింత పసుపుఁ బొందు.

ఆంగ్లపరిపాలమునఁ గలిగిన నాగరకతా విశేష



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౪౪-వ అఖిలభారత జాతీయమహాసభ-లాహోరు-చిత్రములు




లజపతిరాయి నగర ద్వారము




లజపతిరాయి నగరములోని దృశ్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




లజపతిరాయి నగరమునందలి దృశ్యాంతరము



జాతీయపతాకము-జాతీయాంజనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముం బట్టి ప్రతిఘ వారిని సృష్టికి ప్రతిసృష్టి యొనర్చిన విశ్వామిత్రునితోఁ బోల్చిన పద్యము.

సీ. శైలుషఘోషకు జంకి మూలమూలలదాఁగె
        బంగరడ్డల గూఁటి పల్లకీలు;
బ్యాండు మేళము కంటఁ బడసిగ్గు పడెఁ బెండ్లి
        తోరణాలదరించు వీరణాలు;
మాయమై పోయె ముద్రాయంత్రముల దాడిఁ
        దాళపత్రాలు గంటాలు నోలెలు;
నగ్గిపుల్లలపెట్టి యలయార్చటికి విచ్చి
        మొగ్గలయ్యెను జెకముకులు తాలు;
గీ. నాటకలముల పాళీల పోటికోడి
బాతురెక్కలీక లంగళ్లు పాసిపోయెఁ
జల్వఁ బ్రతి శిల్పమును బూర్వ శిల్పమునకు
నబ్బురంపు విశ్వామిత్రు లాంగ్ల జనులు.

వడ్లుదంచెడు స్త్రీలను గూర్చినపద్యము స్వభావోక్తి రామణీయకమున కొక నిదర్శనము.

ఉ. రోఁకటి తోడ దోర్లతలు
        రోజములాడ నతోన్నతంబులౌ
మూఁకనడల్పు పోటులకు
        హుంకృతులూఁతగఁ గాళ్లు ముందుకుం
దూఁకను వీఁకఁ జూచి యువ
        తుల్ సలయంబుగఁ బాడుచుం బదా
లూఁకున వడ్లుదంత్రు చెమ
        టోడికలల్ జిలకట్లు నానఁగల్.

కాల్వనీటిలోఁ బ్రతిఫలించు తాడిచెట్లను బాములతోఁ బోల్చెడి పద్యము:

క. అలలముడుంగుచు సాగునుఁ
దలక్రిందుగఁ గాల్వనీటఁ దాళంబుల నీ
డలు, పాతాళమునకుఁ జను
పలుదలలబిలేశయముల పగిదిఁ దనర్చున్.

ధీమణీపత్రికాధిపతులు బ్రహ్మశ్రీ పుల్లెల శ్రీరామశాస్త్రిగారి సాధ్వీమణి శ్రీమతి వెంకట సుబ్బమ్మ గారి మరణ మత్యంతవిషాదకరమును వీర రసప్లుతము నయి లోకమునకుఁ జిరస్మరణీయ మగుచున్నది. సహజభీరురాలగు నీసతీతిలకము రాక్షస సంవత్సర భాద్రపద శు 9 గురువారము నాఁటి నడురేయిఁ బుత్ర ప్రేమము మెయిఁ బురుషులకుఁగూడ నసాధారణంబగు నప్రతిమ సాహసమును దెచ్చికొని యొక ఘోరకాకోదరముతోఁ బోరాడి వీరవిహార మొనర్చి పుత్రులకొఱకుఁ బ్రాణదాన మొసంగి వీర స్వర్గమలంకరించినది. తల్లియాత్మార్పణమువలనఁ బ్రాణములు దక్కిన యాబాలు రిరువురు నిప్పుడున్నతవిద్యావంతులయి వర్ధిలుచున్నారు. ఇట్టి వీరమహిళలచరిత్రములు కవులకు గేయములగుటలో నాశ్చర్యము లేదు. ఈ వృత్తాంతము జరగిన వెనువెంటనే కొందఱు కవికుమారు లీయమ యనిర్వాచ్యపవిత్రపుత్ర ప్రేమోజ్జనితములగు నద్భుతధైర్య సాహసములను గాన మొనరించిరి. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు భారతిలోఁ బ్రకటించిన "కడుపుతీపు" అను రసవత్ఖండ కావ్యమున కీనారీరత్నము చరిత్రయే యితివృత్తమయి యుండునని తలంచెదను. ఈ వీరాంగన మరణమునుగూర్చి మన వసురాయని చాటువు:

ఉ. వెళ్లిన తొల్కరిన్ వఱద
        వెల్లునఁ గొట్టుకవచ్చి, యేటి ప్ర
క్కల్లెగఁ బ్రాఁకి, దాఁగి పగ
        లెల్లను గప్పున, మాపు క్రిందికిం
జల్లగజాతి, ప్రక్కల దె
        సంజను త్రొఁచును బట్టెఁ జేతితోఁ,
బిల్లలతల్లి; హా! కడుపుఁ
        బ్రేమకుఁ బ్రాణము గడ్డిపోఁచగా.

జరగిన సంగతు లిందు సరిగా వర్ణితమయినట్లు తోఁచదు. పాముపయినుండి పడుటలోనే ప్రక్కలదెసఁ గాకసరిగా శ్రీవేంకటసుబ్బమ్మగారిమీఁద నేపడెననియు, నామె యందుపై నిద్రనుండి దద్దఱిల్లి లేచి చూచునంతలో నది పిల్లలున్న వైపునకుఁ బ్రాకిపోవుచుండుట గాంచి యామె మహాసాహసముతో లంఘించి దానిని బట్టుకొని యెన్నికాట్లు వేసినను బట్టు విడువక పెనఁగులాడెననియు శ్రీశాస్త్రిగారు నాతోఁ జెప్పియుండిరి. ప్రకృతిప్రకరణములో వృక్షాదిక ప్రశంసాసందర్భమున



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వార్థపరుఁడగు నరుని జన్మముకంటెఁ బరోపకారపరములగు తిరురాజముల జన్మమే యుత్తమమని నేను వ్రాసియుంటిని. ఇటుకావముల కయి నఱకుపడుఫలభూజములనుగాంచి మనసు కరఁగి మనకవివలికిన చాటువులు నా యీయభిప్రాయమునకు సాయమగుచున్నవి.

మ. ఫలభూజాతములార! యెక్కడను మీ
పాలింటికిన్ వచ్చె నీ
వలచెండాటలు నిట్టుకావము లయో!
వజ్రప్రహారంబులన్
గులభూధ్రంబులు వోలెఁ గూలెదరిటుల్
గొడ్డంద్రఘాతంబులన్
నిలుచున్ మీబహులోపకార సుకృతుల్
నిచ్చల్ రసజ్ఞాత్మలన్.

మ. జననంబన్నను మీదె జన్మము
మహీ జాతంబులారా! జగం
బున; జీవంబుననున్న యప్పుడది త
మ్మంబాసి చన్నప్డు మీ
తనువుల్ లోకహిత క్రియార్థవినియు
క్తంబుల్; మిముం గన్నదే
జనయిత్రీమణి; మాతృయావవ
వన స్వాహాధవుల్ దుర్భవుల్.

## స్వవిషయ ప్రకరణము

కవి తనజీవితసంరలి స్వవిషయములకు సంబంధించిన చాటువుల నిందుఁ జేర్చుటచే దీని కీ పేరు గలిగినది. వసురాయని సాంసారికజీవితము చాలవఱకు దుఃఖభూయిష్ఠమే యన నొప్పును. ఈయనకుఁ గలిగిన కళత్రవియోగము లనేకములు. అందులకు సానుభూతిఁ దెలుపుచు నొకరిట్లు వ్రాసియున్నారు.

చ. వరకవి తాలతాంగినన
వద్యమతిన్ గవి గూడి శేవగల్
చిరతరసౌఖ్య కీర్తులను
జెందుచుఁ దమ్మొకరీతిఁ జూడ నీ
సురుచిర గాత్రలంద ఱది
చూచి సహింపఁగలేక గాదె దు
ర్భరతర చింతతోడ నెడఁ
బాసిరి మిమ్ముల నిట్లు మిత్రమా!

తనకు వాటిల్లిన జాయా వియోగములఁగూర్చియుఁ దృతీయ కళత్రమువలనఁ గలిగిన ప్రహ్లాదకుమారుని మరణముఁగూర్చియు నీయన వ్రాసిన కరుణరసపూరితములగు చాటువులు "సతీస్మృతి, సుతస్మృతి" యను పేర నిదివఱకే ప్రత్యేకపుస్తకరూపమునఁ బ్రకటింపఁబడినవి. అవి యిప్పుడిందుఁ జేర్పఁబడలేదు.

రాజమహేంద్రవరము చేరిన తరువాతఁ జాలఁగాల మద్దెయిండ్లలోఁ గాఁపురముసేయుచు మనకవిపడిన కష్టము లనేకములు. తరువాత స్వగృహము కట్టినప్పుడీయన వ్రాసినచాటువు లీదృశానుభవము గలవారి కింపు నింపఁగలవు. అందొకటి రెండు:

సీ. స్వాతంత్ర్యభూతల స్వర్గసౌఖ్యావహ
మిలు ఱేఁడులకు సొంత గృహముసూవె
పరగేహవాసోగ్ర నిరయదుఃఖావహ
మిలు ఱేఁడులకు సొంత గృహముసూవె
పృథుగృహచ్ఛిద్ర గుప్తిస్నేహ ధూర్వహ
మిలు ఱేఁడులకు సొంత గృహముసూవె
కాయ యాత్రాకష్ట కంటకోపాసహ
మిలు ఱేఁడులకు సొంత గృహముసూవె

గీ. మధుర సంపత్పయోరుహ మధులిహమ్మ
నిల్లు ఱేఁడులకును సొంతగృహముసూవె
నైకదివ్యఫలామరా నోకహమ్మ
నిల్లు ఱేఁడులకును సొంత గృహముసూవె.

సీ. "గ్రాసమన్యులదైన వాసంబు తనది గా
వలె" నన్నలోకోక్తిఁ దలఁచితలఁచి
"యిల్లులేనమ్మతా హీనతపడు" నన్న
యాఁడుసామెత సారె కరసియరసి
"పరగృహావాసంబు నిరయ కల్పం" బను
పండిత వాక్యంబుఁ బట్టిపట్టి
పిల్లిపిల్లలఁ బోలెఁ జెల్లు సంసారంబుఁ
దరలించి యిల్లిల్లుఁ దిరిగి తిరిగి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. యీసడంబులు పడిపడి యిటికి యిటికి
విసిగి వేసారి యీశ్వరు వేడివేడి
యిరువదేండ్లుండి రాజమహేంద్రనగరి
నిపుడు మన్మథ వసురాయఁ డిల్లుఁ గట్టె.

* శ్రీనాథుఁడు తనచేతి గోరొకటి విఱిగినప్పుడు చెప్పిన చాటువని యీమధ్య శృంగార గ్రంథమాలా సంపాదకులు ప్రకటించిన క్రీడాభిరామము (ద్వితీయ ముద్రణము)లోఁ బీఠికా కర్తలొక పద్యము నుదాహరించిరి. అందలి నిజము పరమేశ్వరున కెఱుక. పది రూపాయల రొక్కముతోఁ బ్రమాణపత్రమర్పించు పండితులకుఁ గాని మొగము సూపనేరని యాకృతిలలామమందలి పద్యమును జనులకెల్ల సుఖముగ నందుఁ బాటగు నీపత్రికలోఁ బ్రకటించి గ్రంథ ప్రకాశకులకు నష్టము గలిగించు నిష్టములేక దాని నిందుదాహరింప జాలకున్నాను. తనదంత మొకటి యూడినపుడు మనకవి పల్కిన చాటువులుగూడఁ జదువరులకు వినోదముఁ గూర్పఁగలవు గాన వానిలో రెంటి నుదాహరించెద.

చ. ఎడలఁగ బాలపండ్లు మొల
కెత్తితి వెన్నఁడొ పిన్ననాఁడు, నేఁ
గడిచెన నిష్టమౌ బిఱుసుఁ గూడును
గూరలు వర్వు లప్పడాల్
వడెములు వేఁగ భక్ష్యములు
వాచవిగింజలు నీబిగిం; గటా!
యుడిగము నేఁబడే శ్వలిపి
యూడితివే వసురాయ దంతమా!

చ. తెలివి ప్రకాశమానమగు
దేహబలంబునఁ జేసి; దేహపుం
బలము ప్రవర్ధమానమగు
మర్త్యున కిష్ట పదార్థ భుక్తిచే
నలయు పదార్థముల్ దినుట
త్వత్పటిమంగదు; యింతయేల? నీ
చెలిమిన భక్ష్య భోజ్యరుచి
జిహ్వ కలంతివె నీవుదంతమా!

నఖదంతముల స్థానభ్రంశము గూడఁ గొన్ని యెడల గారవమునే గాంచు ననుటకు దృష్టాంతము.

క. స్థానభ్రంశము నొందిన
చో, నఖములు దంతములను శోభిల; వైనం
గానమె గారవ మెనయం
గానవి వ్యాఘ్రములవైన గజములవైనన్.

శ్రీసూక్తి వసుప్రకాశ మందలి యొక పద్యము యొక్క పూర్వార్థమునకు లోక దృష్టాంత సమన్వితమగు నుత్తరార్థము కుదురకలోక మంతయు గాలించి యాలోచించుచుఁ గంటికిఁ గూర్కులేక యొకరే యెల్ల గడపినప్పుడు చెప్పిన పద్యము కవితామృతములకుఁ గల సాఫల్యమును సరసముగా నెలకొల్పుచున్నది.

క. అమృత కవనంబులకు సా
మ్యము కేవల మొక్కమధురి మనెకాదుసుమీ
సుమనో జీవనములునై
యమరత్వము ననిమిషత్వ మని యొదవించున్.

వసురాయఁడు తనతండ్రి కంకితముగా రచించిన విశ్వరూప స్తవమను తారావళియు, మంగళాద్రి నృసింహస్వామిని దర్శించినపుడు భక్త్యావేశముతో నుడివిన పంచాశికయు నిదివఱకుఁ బ్రత్యేకముగా ముద్రింపఁ బడినను నిందుఁగూడఁ గూర్పఁబడినవి. వానిలో నొండు రెండుమాత్ర ముదాహరించెద.

చ. ఇముడుచు శక్తినీది పర
మేశ్వర, యద్భుత గోచరంబు; వి
శ్వము భవదీయ దేహమున,
స్వల్పపు బీజమునన్ వటావనీ
జము బలె సంతరించి; తెది
సాగదు నీవెద నెంచ? నాదునే

* వ్యాసమున కింతయైన సంబంధింపని యిట్టి విషయములను అనావశ్యకముగ నవకాశము గలిగించుకొని యిరికించుట సమంజసము కాజాలదని తలతుము.—సంపాదకుడు, భారతి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రమున నజాండమెల్లఁ జొర దా?
వరదా! మురదావ నీరదా!

క. కానిక నీకుం బెల్ల పుఁ
బానకమే యనఁగ నేల? భక్తులుకలదే
దేనోకఁడర్పింతురు; కొను
మా, నాకవనంబు; మంగళాద్రి నృసింహా.

క. నీనామము కలకండము
గా, నాకవనంబు విమల కమలముగాదా?
పానకమే తిన్మేళన;
మానుము చెవులార; మంగళాద్రి నృసింహా.

మహాశయులారా! మంగళాద్రి నృసింహ స్తవముతో మంగళముపాడి యీవ్యాసము నింతటితో ముగించుచున్నాను. మొదటఁ జెప్పినట్టు నేనిందుఁ జేర్కొనిన పద్యములు స్థాలీపులా కన్యాయగృహీతములే గాని యిందలి రసవత్తరపద్యము లింతమాత్రములే కావు. ప్రతిపద్యము నేదో యొకతీరునఁ జవులూరుచునే యుండును. కావున నాంధ్రమహాజనులెల్ల నీప్రబంధము నాదరించి యందలి కవితామృతమును గ్రోలి యానందింతురు గాక యని ప్రార్థించు చున్నాను.

---

## విటచపేటము

ఎం. వేంకటశర్మ గారు

పువులే వేశ్యల మేనుదీవె లనుచుఁ జూదేనెలే మోవిలో
చవు లంచున్ సరసంబె స్వర్గమనుచున్ శ్లాఘించెదే సారె కా
నవులే పైపయి వన్నెలన్ గనియె మోహం బందగా వచ్చునే
పవులే వారల చిత్తముల్ వినుము నా పల్కుల్ భుజంగాగ్రణీ!

వెలకాంతల్ పచరించు వింతవగలున్ విన్నాణముల్ వేడుకల్
కులకాంతల్ రచియింప నేర రని వాకోబోకు మాచిత్రముల్
కులుకుల్ కూర్ములు కాసుకోసమె సుమీ! కొన్నాళ్లబుల్పే సుమీ!
కలకాలంబని నమ్మబోకుమి భుజంగగ్రామణీ ధీమణీ!

జిలుగుల్ వల్వలు జూచి మోము మెరుగున్ సింగారముఁ జూచి బల్
..............జూచి సోగకనుదళ్కున్ బెళ్కులుం జూచి తె
క్కలిపల్కున్ పస జూచి వేశ్య వల జిక్కన్ బోకుమీ గూటిలో
జిలుకన్ జేసి హరించివేయుజుమి నీస్వేచ్ఛన్ భుజంగాగ్రణీ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సొగసున్ దావుల జిల్గుదువ్వలువలున్ సొంపౌ నలంకారముల్
వగలున్ సైగలు మందహాసములు మవ్వంపున్ విలాసాలు మ
చ్చిగలున్ రాగములున్ సరాగములు బల్శృంగారపుం జావళుల్
సొగియన్‌జేయును గాక వేశ్యలకడన్ జోద్యంబు వే రున్నదే
నగుబా టీతగులాటముల్ విడువు మన్నా పల్లవగ్రామణీ!

అరుణపల్లవ కోమలాధరంబును గన్న, మదిలోన రాగ సంపద జనించు
నవనీలకుంతల నైగనిగ్యము గన్న గాఢాంధకారంబు కనుల ముంచు
మదమరాళమనోజ్ఞమందయానము గన్న దళముగా మతికి మాంద్యము ఘటించు
లోలంబులగు వాలు గ్రాలుగన్నులు గన్న తలపు సంతత చలత్వము వహించు
ప్రసవసుకుమారతనుసౌరభమును గన్న-మరులువేదురు తల కెక్కి మగత బెంచు
గాలి సోకియు బ్రతికిన ఘనులు లేరు-చనకు మా వేశ్యచాయ భుజంగరాయ!

నలుగురు నిన్ను జూచి మది నవ్వ నెఱుంగవు నీదుమిత్రులే
చులుకదనంబు నీయెడల జూపు నెఱుంగవు నీదు భృత్యులే
యలుసుదనంబు జేయు టది యైన నెరుంగవు నీకులంబులో
పలుచదనం బెరుంగవహ పాప మిదేమి? భుజంగపుంగవా!

పదరా చెప్పెడు బుద్ధులన్ వినవు నీబాగోగు లూహించుకో
గదరా! నీ కిది పెద్ద యంగదర; నీకర్మంబుచే నీకు నా
పద రా నున్నదెరుంగ వే మనెదరా బాగామె చా లింటికిన్
పదరా! రోమదిరాక్షియి ల్విడిచి యిప్పాటన్ భుజంగాగ్రణీ!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సత్యహరిశ్చంద్ర-జీవితాదర్శములు

ఏ. వి. రత్నము గారు

సత్యహరిశ్చంద్ర కథను విమర్శించుటకు పూర్వము, అవతారికా పూర్వకముగ భారతీయ పూర్వ నాగరకతను గురించి యించుక ప్రసంగింప నవసరమయ్యెడిని.

మహాభారత మహిమాతిశయమును గూర్చి యర్థవంతమగు నొక చిన్నకథ గలదు. మున్నొకపుడు నైమిశారణ్యమున గూడిన మునిబృందము మహాభారతము నొకవైపునను, తక్కుంగల సకలవేదవేదాంతేతిహాసాది సారస్వత సంభారము నొకవైపునను తులనిడి తూచగ, మహాభారతమువైపునకే ములు సూపినదట. అందుచే, నది యంత మహత్తరంబయిన భారము కలదగుటచే, దానికి మహాభారతమను పేరు సుప్రసిద్ధమయ్యెనని.

అట్టి వరప్రశస్తం బైనట్టి, మహానర్ఘ భారవహంబగు మహాభారతమును, "అనేకవిధ పదార్థప్రపంచ సంచితంబును, నుపపర్వ మహాపర్వ శోభితంబును, నుపద్వీప మహాద్వీపసంభృతంబయిన భువనంబు వజుండు నిర్మించినట్లు, కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు నిర్మించెను." ఇట్లు నిర్మింపబడిన మహాభారతము, కృష్ణద్వైపాయనో ద్యానజాత పారిజాతము," వేదవేదాంతార్థ ప్రతిబోధకమగు నొక గొప్పధర్మసంహిత, ఒక ఆమ్నాయము మాత్రమే కాదు; కొండొక కాలము నాటి మిగుల ప్రాచీనమయిన ఆర్యుల నాగరకతను, సభ్యతను, వైభవమును, ప్రతిపాదించు చరిత్రము, ఇతిహాసముకూడను. అది అతిప్రదీప్త ప్రజ్ఞాప్రభావములచే ప్రకాశించిన వీరయుగము యొక్క చారిత్రము, ఆ నాగరకతా విశేషములు, ఆసభ్యతా సమీచీనములు, ఆ వీరయుగము మహాభారత యుద్ధముతో భరతవర్షమున నంతరించెను. అంతనుండియు స్థిరత్వమును నిశ్చలత్వమును నొంది, యనుపహతముగ నేటివరకు నొకేతీరున, భారతవర్షమునం దంతటను వ్యాప్తమయి ఘనీభవించియున్న యొక విశిష్టనాగరకతా సభ్యతలు, సాధనారాధనములు, సంకల్పములు, జీవితధర్మములు, పెంపొంది యుండుట గాననగును. * ఈ సాంఘిక జీవితము నాదర్శప్రాయముగ, ఒక రాజచరిత్రమును గైకొని యథాతథముగ, ఉదాత్తకావ్యగుణంబున నభివర్ణించునట్టి యితిహాసము రామాయణము. హిందూసమాజమున నేటివరకు నవ్యయముగ నిలిచియున్న ఆ నాగరకతను, ఆ వర్ణాశ్రమ ధర్మములను నేర్పుగ ప్రతిబింబితము చేయు విమలమణి దర్పణము రామాయణము రామాయణము నాటికే ఒక ప్రామాణిక జాతీయ జీవితధర్మపథము, నీతినిబంధనము భరతవర్షమున నాటుకొనెను. రామాయణమున నేగృహస్థధర్మములు, ఏ సంకల్పములు, ఏ సామాజిక జీవితధర్మములు చిత్రితములయ్యెనో, అవియే నేడును భారతజాతీయ జీవితమునందు వ్యక్తమగుచుండును. కావుననే ఒక పాశ్చాత్య పండితవర్యుడు, "రామాయణము నెఱిగినవాడు హిందూదేశము నెఱుగు" నని యథార్థము వచించెను. అనగా, హిందువుల సాంఘిక నిర్మాణమును, జీవిత వ్యవహారములను తెలిసికొనగోరు వారు హిందూదేశమునకు ప్రయాణమై పోనక్కరలేదు, రామాయణము చదివిన గ్రహింపనగునని.

భారత రామాయణములిట్లు కావ్యరూపమును గొన్న భారతీయుల యితిహాసములు, సాంఘికచరిత్ర

---

* ఆర్యనాగరకత భారతదేశమున పుట్టినదాదిగ నేటివరకు నవిచ్ఛిన్న సంతతధారావాహినిగ వచ్చుచున్నదని చెప్పెడి వారి నుడివిని కొన్ని విశేషములతోడను, నిపాతములతోడను గ్రహింపవలసి యుంటుంది. ఆనాటి కర్మకాండ, ఆవైదిక ధర్మములే నేటికిని హిందూసమాజపు కట్టుబాటుల ననుశాసింపవచ్చును. కాని, జీవితసరణియందు, సాంఘికవృత్తమునందు చాలవ్యత్యాసముగలదు. అప్పటికి నిప్పటికి మహాభాగతముపలనద్యోతకమగు నీవ్యత్యాసమును గాంచదగియున్నది. సూక్ష్మముగ ఒకమాటలో చెప్పుచో, ఒకటి తేజోవంతము; ఒకటి తేజోహీనము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు, ధర్మకావ్యములు. అందు రామాయణముయొక్క సత్త్వమువేఱు. అది యొకయపూర్వకావ్య వస్తుసంపత్తితో నలరారు సమగ్రమహాకావ్యము, ఆదికావ్యము. రామాయణము భావ్యములతో గూడిన కావ్యానంద మును నొనగూర్చు నొకదేశకాల పాత్రముల చరిత్రమే కాదు; భారతీయుల జాతీయ జీవితచరిత్రమే కాదు. అది ఒకదేశమునకే చెందిన సక్కఅలేదు. అది జీవితము మీద నొక మహాద్భుత విమర్శనమువలె కూడ నుండును.

రామాయణము బోధించునది, వినిపించునది, "విధి విలసితములు మానవుల కనుల్లంఘ్యములు, అప్రతిహతములయి, మానవు డెంతటి మహిమాన్వితు డైనను, విధిముందర నిష్క్రియుడయి పోవుననియూ, లేదా తన జీవిత రేఖానిర్మాణమునకు తానే కర్తయనియూ, మానవుల మహారంభముల నిష్ఫలత్వమునా, ఆదర్శ జీవితము దుర్లభమనియూ, ధర్మాను స్థానమును జీవితముతోనే చెల్లింప వలసియుండుననియూ, న్యాయప్రధానదేవత (Nemesis) యొక్కదండమునా, జీవితము దుఃఖమయ మనియూ, జీవితనిస్సారతనా,—ఏద్దియో యపూర్వము, అశ్రుతపూర్వము, అగాధము, హృదయ సంవేద్యమునగు ప్రతిబోధమును వెనుకనుండి వినిపించు చుండుడు. రామాయణఫలశ్రుతి, ఐహికమో, ఆముష్మికమో, అపవర్గపదసౌఖ్య ప్రాప్తియో, బ్రహ్మానంద సంధానమో, ధర్మాన్వేషణమో, అఘమర్షణమో, ఆపదుద్ధరణమో, పరమపురుషుని తెలిసికొనుటయో, లేక రామభక్తియో, ఇదియేమోగాని మానవుని నిర్విణ్ణునిచేసి చేతులు మోడ్చి, 'నమో నారాయణాయ' యనునట్లుచేయును. ఈశ్వరుడే తాసృజించిన సృష్టిశృంఖలములకు కట్టువడి, గాలమునకు పడిన చేపవలె, ఆత్మనిముక్తికై గిజగిజ కొట్టుకొనుచున్నాడో యనునట్లుండును. ఇది రామాయణగానము యొక్క భారమువలె గన్పట్టును.

వాల్మీకి రామాయణమున శ్రీరాముడు వేదవేద్యుడగు పరమపురుషుని యవతారమూర్తిగ నుండలేదు. శ్రీరాముడు కేవల మొక మహాసత్త్వసంపన్నుడును, ధీరోదారుడునగు మానవునివలె కన్పట్టును గాని, దేవతా మహిమగల వానివలెను, తానొక యీశ్వరావతారమనెడి దివ్యజ్ఞానముతో ప్రవర్తించినట్లును లేదు. శ్రీకృష్ణ లీలలవంటి మహిమాద్భుతములు శ్రీరాముని చరిత్రమునందు లేవు రాముడు పరిపూర్ణుడును కాదు; స్థితప్రజ్ఞుడునుగాదు. రాము డర్కకుల శీలనిధి; మహిత గుణాభిరాముడు; కర్తవ్యపరాయణుడు; రాజధర్మానువృత్తిపరుడు; యుగధర్మపరిపాలకుడు; జగద్వీరుడు. ఇట్టి మహితగుణములచే తేజరిల్లు రాముడు, ధీరోదాత్తుడు, రామాయణ మహాకావ్యమునకు కథానాయకుడు.

వాల్మీకి ఆకస్మికా విర్భూత శబ్దబ్రహ్మ ప్రకాశము గలవాడై, తన కుదయించిన మహాకవిత్వ తేజముతో సర్వలక్షణ సమన్వితుడగు నొక్క మహాపురుషుని జీవితము ప్రకాశింపజేయ సంకల్పించియుండ, విధాత ప్రత్యక్షమై, "మునివరా, వాగ్దేవిచే ప్రబుద్ధుండవైతివి. నీవు కవిచంద్రుడవు. రాముడు నరచంద్రుడు. నీవాక్యరత్నములచే ఇనకులాన్వయరత్నము లోకమునందు దీపించునట్లు రామచరితమును కీర్తింపు" మని చెప్పి యంతర్ధానము నొందెనట. బ్రహ్మకు రామచరిత్రమే కాని మరేదియు గన్పట్టలేదు! పోనీ! దాని నావేశపూరితుడగు వాల్మీకి కవిచంద్రుని చెవినే పడవేయవలెనా! మరెక్కడను తనకవిత్వధారకు తగిన కథ లేదన్నట్లుగ, వాల్మీకి రామాయణము నెత్తికొనెను. నరచంద్రుడగు రామచంద్రుని చరిత్రమును కీర్తింపవలెనన్న, రామునికడ నెన్నదగిన ప్రథితగుణంబు లెన్ని లేవు? ఒక్కవాని కీర్తనముతో రామచరితమును ముగించిన నెంత బాగుండెడిది! కాదు. అట్లుకాదు. అట్లయినచో రామాయణ మొక ఉత్తమోత్తమ కావ్యము కాజాలదు. రామాయణమున నీగుణగాన మొకయెత్తుగను, రాముని యంతరంగమును బహిరంగము చేయుట యొకయెత్తుగను నున్నది. ఇందే వాల్మీకి మహర్షి తన ఆర్షదృష్టిని, నిరతిశయ కవితా మహిమంబును ప్రకాశింపజేసెను. ఇందే వాల్మీకి దివ్యవాణి అమృతత్వము నందెను.

రాముడా, ఇనకులతిలకము. వంశమా, ఇక్ష్వాకుల నాటనుండి జగద్విఖ్యాతిం గాంచిన అర్కవంశము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోసలరాజ్యమా, సకలరాజ్య రమాసంపదలతో తులతూగు మహామహీరాజ్యము. అయోధ్యానగరమా, అతులనాగరిక భోగవిలాసములకు నిలయము. ఈ యభ్యుదయపరంపరా శుభోదయము దశరథక్ష్మాపాలుని నాటికి, మధ్యందినదినమణిమండలంబున, గగనమధ్యస్థమై, అర్కకులప్రతిష్ఠ పరాకాష్ఠ నందినది. అట్టి మహోన్నతస్థితిలో అర్కకుల క్షీరాబ్ధిచంద్రుడగు శ్రీరామచంద్రుని యుదయముతోడనే హాలాహలము, బడబానలముకూడా ఉద్భవించినవి. ఇది యొక మహాద్భుతవిషయము. లోకవృత్తమునం దట్లగుట సహజమేమో! ఇక్ష్వాకువంశంబున చిరకాలాగతమగు శుభాశుభకర్మఫలభారము రాముని నెత్తిమీద మోపబడినదో యన్నట్లయినది. ఆమహాభారము క్రింద రాముని దుఃఖమయజీవితమై, అగ్నితప్తంబగు సువర్ణమువలె సంలక్షింపబడినది. రాముడు రత్నాకరునివలె ఆ బడబానలమును తన హృదయాగాధమున ధరించును. కైలాసేశునివలె ఆ హాలాహలమును కంఠస్థముచేయును. మేరువువలె నిలబడును. వాల్మీకి మహాకవి రామునిహృదయాగాధమునుజొచ్చి యీబడబానలమును బయటపెట్టును. ఆ మేరుపర్వతమునందలి రత్నకందరములను వివరించును.

మానవుల యాశలను భగ్నముచేయుచు, క్రూరవిధి వెనుకనుండి మానవుల ప్రయత్నములను వెక్కిరించుచు, వికటహాస్యము చేయుచుండునో యనునట్లయినది రాముని కథ. ఎందనింద్యసౌఖ్యముయొక్క పరసీమను, స్వర్గధామమును కనుగొనజూతుమో, యదియే దుర్విధిచేతికందిచ్చి గోల్పోవునట్లు చేయునోయనునట్లుండును రామచరితామృతము. రాముడు సింహాసనాసీనుడు కాబోవుచు, అడుగులోనే పడిపోవును. దశరథక్ష్మాపాలుడు భూమినిపడి దొర్లును. అంతఃపురములే అల్లకల్లోలమగును. రాచనగరులే వెలవెలబోవును. అయోధ్యానగరము మీదనే ముసురుపట్టును. ఎక్కడజూచినను నశ్రుబిందువులే. రాముడిందులకేమీ తొణకడు, బెణకడు. కంటతడి పెట్టలేదు. మహామహీరాజ్యము నొక్క త్రుటి పటాంతలగ్న తృణకణమువలె పరిత్యజించును. నాగరికసౌఖ్యములే విడిచిపుచ్చి, జనావాసములే విడిచిపోయి, భీకరారణ్య వాసమునే చేసికొనును. ఈదుర్విధి కించుకయు చలింపడు; వికారము నొందడు; విచారపడడు. అగ్నిపర్వతము బ్రద్దలయిననేగాని, భూగర్భము విచ్చిననేగాని, "క్షుద్రనిర్ఘాతపాతాభి ఘాతమునను వసుంధర చలింప" యట్లు మహావీరుడగు రాముడు వీటికివేటికిని కంపింపడు. అట్టివీరుడు సీతాకాంతా వియోగమున ఆకసము విరిగి మీదపడినట్లు నిర్వీరునివలె విలపించును. పక్షులే ఆలకించును. మృగములే చేష్టలుదక్కును. వాయువులే స్తంభించును. ప్రకృతియే దుఃఖాశ్రువులను నిశ్శబ్దముగ విడుచును. పాషాణములే కరగును. వజ్రహృదయములే వ్రక్కలగును. ఈ ఆగర్భశ్రీమంతుడు, ఈ మహారాజు, ఇద్ధోరుచరిత్రుడు, అరణ్యముల పాలయి, దిక్కులేని పక్షివలె, అట్లసదృశముగ విలపించునపుడు బ్రద్దలవనిదేది? కరగనిదేది? కన్నీరుకార్చనిదేది? ఆలకింపనిదేది?........ అయింది, యింతటితోసరి,- ఆయినకుల తేజః ప్రసారప్రాభవములు. ఆ అయోధ్య రాచనగరునందలి వైభవ విస్ఫురణములు, కళాకాంతులింతటితో నిరస్తమయ్యెను. అయోధ్యారాజ్యరమ, కాంతిహీనమయి రామరాజ్యముతో కోసలదేశమునుండి నిర్గమించును. అటుపైని కోసలరాజ్యము నామమాత్రావశిష్టము.

రామునిచరితము రామాయణముతో ముగినేటట్లయితే రాముడు ధన్యుడే. లేదు, రామాయణము ఉత్తరకాండయందు పర్యవసన్నము కావలెను. రామునిచిత్తవృత్తి, హృదయము, పరిస్థితులు లెస్సగపరికించిన మహాకవి రామాయణముతో రామునిచరిత్రమును ముగింపడు. * రామాయణారోపణ బీజము ఫలవృక్షమై ఫలించినదే ఉత్తరరామాయణము. రాము డిప్పుడు రాజ్యపరిపాలనముచేయు మహారాజయి యున్నాడు. రాము

* ఉత్తరరామాయణమునందలి యసందర్భములను, ప్రక్షిప్తములను గాంచినచో, నియ్యది వాల్మీకిమహాకవి రచించియుండునా యని శంకించుట కవకాశమొదవును గాని, అవి విడిచి కథాసరణిని గమనింపవలెను. బహుశా దీని ననుకరించియే ఉత్తరార్థములుగల ఉత్తరహరివంశము మున్నగు కృతులు పుట్టియుండునేమో యని తోచెడిని.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము ౧. డీ హావిలన్ కమాను

౧-౫ చిత్రములు 'ఇండియన్ పిక్టోరియల్ ఎడ్యుకేషన్' అను పత్రికనుండి కైకొనినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము ౨. టిప్పుసుల్తాన్ గోరీలోని శిల్పము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిక రాజ్యభోగముల కేమికొదవ? ప్రాసాదములా, రమ్యహర్మ్యములా, కాసారోపవనంబులా, తతహంస తూలికా తల్పములా, దివ్యాంబర భూషలా, దాసదాసీ జనంబులా, కవిగాయక ప్రసంగములా......ఎన్ని? ఈ అన్నింటి మధ్యను దగ్ధహృదయుడై రాముడు దురంత విషాద వేదనానలమున మ్రగ్గిపోవుచున్నాడు. ఇవన్నియు రామునియం దణగియున్న బడబానలమును మరింత ప్రజ్వలింపజేయుటకే సహకార మగుచున్నవి గాని, చల్లార్చుటకు గాదు. ఈమహాభాగుడు యావజ్జీవము దుఃఖభాగు డగుటయే రామచరిత్రముయొక్క విచిత్రము. రావణుడు మహాపాపుడో, మహాపుణ్యుడో—ఆసృష్టికర్తకే ఎఱుక. నిద్రాహారములు లేక ఒకసంవత్సరమో, అర్ధసంవత్సరమో, మహా మనస్సంక్షోభము ననుభవించినాడు. అంతటితో సర్వము శాంతినొందినది. పౌలస్త్యుడిప్పుడు నిర్వాణసుఖము, బ్రహ్మైక్యము నొందియున్నాడు. రావణుడే ధన్యుడు. కాని, శత్రుసంహారము గావించి జీవించియున్న రామునిమాట యేమి? ఇప్పుడా ఆయుధములనే తనమీదకు ప్రయోగము చేసికొనుచున్నాడు రాముడు. తనఆయుధములను తీసికొని తానే పొడుచుకొనుచున్నాడు. రామునిదుఃఖము నిరవధికము, అశరణము, అప్రతివిధేయము, అహర్నిశము దహించునదయిపోయినది. రాముడు లోకమునకు మహాభాగ్యవంతుడే. కాని, రాము డరణ్యమున, "నాకంటె నిర్భాగ్యుడు లోకంబున లేడు," "నాయభాగ్య మ్మెటువంటిదో, చూచితే, లక్ష్మణ, కాల్పఁగఁనోపుఁ గృశానునేనియుఁ" అని విలపించినట్లుగనే రాముడు, జగదీశ్వరుడు, నిఖిలలోక శరణ్యుడు, దుఃఖభాజనుడయి పోయెను.

రామాయణమును మథించి యందలి సారమును గ్రహించి, రామాయణాధారమున, "ఏకోరసః కరుణ ఏవ" అనిశ్రుతి గావించిన భవభూతి ఉత్తరరామ చరిత్రమునందు రాముని శోకమూర్తిని ప్రత్యక్షము చేయుచున్నాడు: రాముని యీ యంతర్గూఢఘనవ్యథ, అనిర్భిన్నగభీరత్వముచే, పుటపాక ప్రతీకాశమయినది. దుఃఖసంవేదనము కొఱకె రామునియందు చైతన్యము పోసుండ గట్టిగ, హృదయమర్మములను భేదించునట్టి ప్రాణములచే, 'వజ్రతాపటము' చేయబడినది......... రామునియందు చైతన్యము నశింపకుండా అన్నది.... రాముడు చచ్చిపోయినా డనేదిలేదు......అనియీ ప్రకారము శ్రీరాముడు శోకించుచున్నాడు. ఇట్లు శోకాగ్ని సంతప్తహృదయరక్తధారలందు తనహృదయము నుడికించుకొని తినునట్టి లోకోత్తరుడైన రాముని విధి విపాకమునుగూర్చి యేమనుకోవలెను? అయ్యో! రాముడు తాపడినపా టెల్ల వ్యర్థమయిపోయింది. "యత్రకపీంద్ర సఖ్యమపిమేవ్యర్థం......" అనిరాముడీలాగున తన హృదయమును త్రవ్వుకొనుచున్నాడు. ఆర్తశరణ్యుడగు రామునకు దుఃఖమే శరణమయినది. రామోదంతము దిగంత విశ్రాంతమయినదికాని, రామునకు దిక్కులే శూన్యమయ్యెను. ఇట్టి నిరవధిక మహాదుఃఖము, ఇట్టి లోకోత్తర చరిత్రము ఒక్కచో సమావేశమగుట విశ్వవాఙ్మయమునందు మృగ్యము.

జీవితసత్యములే దొర్లిపోవునపుడు, నిరస్తమగునపుడు, సమసిపోవునపుడు మహాకవులు మేల్కొని విక్రోశింతురు. రామాయణావతరణ మూలకందమగు ఛందస్సునందే వాల్మీకిమహర్షి ఛందము నిమిడియున్నది. "అవ్యాహతజ్యోతి రార్షం తే చక్షుఃప్రతిభాతు" అని బ్రహ్మ వచించినట్లు, ఆర్షదృష్టితో రచించిన యీ మహాకావ్యము, శాశ్వతబ్రహ్మకల్పము, హృదయచైతన్యము గల మానవలోక మున్నంతకాలము మహాజ్యోతివలె వెలుగును. కవి బ్రహ్మలు, సృష్టికర్తలగు కవులు గలరుగాని, ఆర్షదృష్టిగల కవిద్రష్ట లెక్కడనో,—కనబడుటరుదు. సంస్కృత కవితా సామ్రాజ్యమేలి వారిలో ద్రష్టలని పేర్కొనదగిన వారు, ఒక్క-వ్యాస వాల్మీకి మహర్షులే. వీరికి సత్యదృష్టియొక్క మహాప్రభయే కాని, యితర కవితిలకులవలె జీవితసత్యముల యెడ భ్రమవిభ్రమములకు భాషిత్వము లేదు.

రామునివంటి వీరులు, దృఢవ్రతులు, పుణ్యచరిత్రులు మహాభారతమునందును గలరు గాని, రామునివంటి దుఃఖతరచరిత్రులు మాత్రము లేరు. రామాయణ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహాభారత కథలకు గల అంతరములో నిదియొక యెన్నదగిన ముఖ్యవిశేషము. ఈయంతరము రామాయణ భాగతములందు ప్రతీయమానములగు జీవితవ్యాపారమునందును, సామాజిక సభ్యతయందును గానవచ్చును. రెండింటికి గల విశేష తారతమ్యమేమన, రామాయణ స్త్రీపురుషుల చరిత్రములు, అందు ముఖ్యముగ స్త్రీలవి, మహాభారత స్త్రీపురుషుల చరిత్రములకు వ్యతిరేకముగ నడచును. మహాభారతసభ్యతకేసి, ముఖ్యముగ నందలి స్త్రీలోకము కేసి ఒకమారు దృష్టిని ప్రసరింపజేసిన నంతియు విశదమగును. ఈ మధ్య నేమియాపతితమయినదో తెలియనగును. మహాభారతపు స్త్రీలు పురుషులకు ప్రజ్ఞాచక్షువులగు నర్ధాంగులు. రానురాను రామాయణకాలము నాటికి అర్ధాంగు లంధప్రాయులగు వ్యర్థాంగులగుట గాననగును. మహాభారత స్త్రీలు ధీరమతులు, వివేకవతులు, దూరదృష్టులు, చతురోపాయులు. వారి యెడగల ప్రజ్ఞాప్రభావము, వైదుష్యము, ఇంగితజ్ఞానము, సదసద్వివేకము అద్భుతము గొలుపును. జగన్నాటకరంగమున పురుషులు వారికి వెనుకపడియుందురు; అందు ప్రధానవ్యాపారము, పాత్రము స్త్రీలదనే చెప్పవచ్చును. అటువంటి ప్రజ్ఞాప్రదీప్తమగు వీరవనితాలోకము మరల భరతధాత్రిని తలయెత్త లేదు. ఇది మహాభారతప్రతిపాదిత నాగరకతయందు గుర్తింప దగిన ముఖ్యవిషయము.

మహాభారత కాంతారత్నములు విక్రమస్ఫురణంబున కదలిపోవునపుడు వేదములే లేచి నృత్యముచేయును. సరస్వతియే వచ్చి వారిముఖాంభోజమున నాసీనయగును. దివ్యవాణియే పలుకును. గంధర్వులే పాడుదురు. కిన్నరులే ఆలకింతురు. ప్రకృతియే పరవశమగును. పంచభూత మహాపదార్థములే సాయపడును. దేవతలే దిగివత్తురు. దిక్పాలురే ఆశీర్వదింతురు. వనదేవతలే పాలింతురు. దైవమే పరాభూతమగును. మృత్యువే జయింపబడును. శ్రీయే వారి నాశ్రయించును. లోకములే విస్మయమునందును. ఇట్లు:

ధర్మనిరతిని, స్వకార్యతత్పరమతిని, సురాసురలోకవంద్యుడగు ధర్మప్రతిష్ఠాతవలన స్వధర్మాను మోదమును బడయు గురుపుత్రిక యొకతె. ధర్మాధర్మ వివేకశూన్యుడై శాపంబీనున్న మునిఘోటకుని నాటకపు శకుంతలవలె విహ్వలగాక, ప్రతిఘటించి ధర్మవ్యాధుని యొద్దకు పంపువనితాలలామ యొకతె. తనకొరకై ఋషికుమారుడు జీవితమునే యర్పించునట్లు ప్రేమయొక్క విశుద్ధసత్త్వస్వరూపమును పరీక్షించు కన్యారత్నమొకతె. మహారాజాస్థానమునకు వచ్చి, వేదములే మూర్తీభవించి మ్రోయుచున్నవో యనునట్లు, విశ్వశ్రేయస్కరమయిన తనగంభీరసత్యవాణిని ప్రకాశింప జేయురామామణి యొకతె. లోకపాలుర చేతనే భర్తకు వరములిప్పించి, కలిపురుషుని ప్రయత్నములను భగ్నముచేసి, దిక్కులేక పరిభ్రమించు వానిని లోకము విస్మయ మొందునట్లు తిరిగి తెచ్చుకొను ప్రత్యుత్పన్న ఉజ్జ్వలమతి యొకతె. లోకోత్తరప్రేమ మహిమంబున, ప్రియునిమృత్యుముఖమునుండి విడిపించి తెచ్చుకొను ధీరమతియొకతె. అత్యుదార బుద్ధిసంపన్నతచే "మహానుభావురా"లని సన్నుతిగన్న వీరమాత యొకతె. దిగ్దంతులవంటి ఋషులు, మహావృద్ధులు, ధర్మవేత్తలుగల విపులసభాంతరాళమున ప్రవేశించి, వారు తలవంచుకొనునట్లు మాట్లాడు "పండిత" బిరుదమును గొన్న మహాప్రాజ్ఞురాలొకతె. ఇట్లెందరో యనన్యసాధారణప్రజ్ఞా వైభవంబున నలరారు వరవర్ణినులు మహాభారతలోకము నలంకరించుట గాననగును. ఎవరోవీరు, ఎందుండి వచ్చిరో,—ఈ మహానుభావురాండ్రు, ఊర్జిత, ఉజ్జ్వల, మనోహరచరిత్రలు. మర్త్యభామినులే వీరు, కాక దివ్యలోకమునుండి మర్త్యలోకము నుద్ధరింపవచ్చిన దివ్యాంగనలా యన్నట్లుండును. వీరి చరిత్రములు, * —కృష్ణద్వైపాయనోద్యానజాత పారిజాత ప్రసూనములు.

* ఇట్టి యపూర్వస్త్రీలోకమును వీక్షించినమీద, పురుషునకు స్త్రీ తప్పనిసరియైనఅనర్థమని, చపలతయేస్త్రీయని, కల్లలకుపుట్టినిల్లని, స్త్రీలు పశుప్రాయులని, పరభృతములవంటివారని, "నరక ద్వారము...దుస్తరమాయాశతపేట...దంభనిధి, ...పూరుష గళోద్బంధక్రియాపాశ"మని, యివ్విధంబుగ లోకమునగల కవులు, మనీషులు, తత్త్వజ్ఞులు స్త్రీజాతినిగురించి చేసినపరిభావనములతో నేకీభవించుటయెట్లని? ఏకీభావమెట్లు? వ్యాసభగవానునిముందర మూకీభావము వహింపవలసి వచ్చుచున్నది. వాస్తవస్త్రీలోకమువైపునకు తిరిగివిచారపడవలసి వచ్చుచున్నది. అంతే యథార్థము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టి స్త్రీలోకదృశ్య మికమీద నదృశ్యమగును. ఇక వచ్చేది దీనికంతయు విపరీతము. అదంతా ఒకటే మాదిరి. ఒకే అచ్చున పోయబడినపోత. ఒకే ప్రతిమానము. ఒకేమూర్పు కొంచె మెచ్చుతక్కువగ నది భారతజాతీయ:జీవితమునం దేమి,వాఙ్మయమునం దేమి స్థిరీభూతత్వము నొందినది. ఇట్టి స్త్రీత్వమునకు కేంద్రస్వరూపిణిగ,ముకుటాయమానముగ, నిదర్శనముగ–Typeగ ఉన్నది రామాయణసీత. పాపము! వట్టిముగ్ధ సీత; అమాయకురాలు. ముందువచ్చేది, వెనకవచ్చేది యేమీ తెలియదు. రమ్మంటేవస్తుంది, పొమ్మంటేపోతుంది. మధ్యమధ్య కొంత తక్కెత్తే సొమ్ములున్నా, అవి యెరువుసొమ్ములు, సొంతసొమ్ములు గావు. సీతాకాంతారత్నము భారత కాంతారత్నములలో నొక్కరిని పోలియుండెనా, రామాయణకథ వేఱుగా నడచేది. యావజ్జీవ దురంతదుఃఖవేదన కవకాశముండెడిది కాదు. సీత రామునితో కాననములకు వెళ్లకపోయినను బాగుగ నుండిపోయేదే అనిపించును. 'ఇంట్లో ఉండమంటే రాముని నెందు కనుసరించినట్లు? ఏమీ లేదు,—అంతఃపురాలలో ఉగ్గుపాలనుంచి సీతకు నూరిపోసినారు పతివ్రతాధర్మము. చంద్రిక చంద్రునివలె, భార్య భర్తనుఛాయవోలె ననుసరింపవలెనని, రాముడు తనవెంట రావలదన్నప్పుడు, ఆ నేర్చినవిద్యయే చిలుకపలుకులవలె అప్పచెప్పుతుంది. అట్లుచేయుట పతివ్రతాధర్మము, ఐహికాముష్మికసౌఖ్యప్రదము. అది తనకర్తవ్యము,(Duty). అంతే సీతభావము. అంతకంటె మరొక విశిష్టభావము, దృష్టి లేదామెకు. (అంటే సీతకు మంచిప్రేమ లేదనికాదు; ఆమె రామమయ జీవితయే.) సీతయేమి, సత్యవతా, దమయంతా?—వారివలె నుడువుటకు, నడచు కొనుటకు? * మహాభారత కాంతలకు నీతులు నేర్పేవారెవ్వరు లేరు. వారొకరియొద్ద నీతి నేర్చుకో నక్కరలేదు. తామేనీతినిధులు. తమకుతామే ధర్మువులు. సమస్తలోకము వారియొద్దనే నేర్చుకోవలెను. సీత కట్లా కాదు. తనవద్ద సెలవు పుచ్చుకొనుటకు వచ్చినప్పుడు, సీత పుట్టినింట నేర్చుకొన్నది మఱచిపోవు నేమోయని చెప్పి, అత్తగారుకూడా నీతులు, పతివ్రతాధర్మము బోధిస్తుంది.§ దుఃఖస్థితిలో నున్న రాముని బాగాచూడమని ఆఁ—బాగుగనే కనిపెట్టింది రాముని! దించ ఎత్తరాని

*"సావిత్రి సత్యవంతున, కేవిధ మావిధమటంచు నీమది నన్ను నూహింపు" మని సీత రామునితో నంటుంది, తన్ను వెంట రావలదన్నపుడు. (చూ. ఆం. వా. రా.) సీత తానొక స్వతంత్రబుద్ధిమంతురాలయితే, ఒకరిసాటి తన కేటికి? ఒకరి నాదర్శముగ తనయెదుట నెందుకు పెట్టుకోవలె? ఎవరిదారి వారిది; ఎవరిచిత్తవృత్తి వారిది. ఒకరివిధముగ ఒక రెందు కయ్యేదరు? సావిత్రివిధముగ తాను రామునకు కాగలిగినదా? అదిగాక, ఒకరినిచూచి మనము నేర్చుకోవలెనా? మనలను చూచి యొరులు నేర్చుకొనేటట్లుండవలెనా? మహాభారతకాంతారత్నములలో నెవరయినను తమకాదర్శముగ నేకాంతారత్నము పేరైన నెత్తెదరేమో చూడండి! సావిత్రి సత్యవంతునివరించినట్లే వరించినదా! తానురాముని అట్లా సావిత్రి చేయగలిగినదా! సావిత్రి మృత్యువునే జయించింది. తానో? తనకేమిజయము లేదు, అంతాపరాజయమే, పాపము!

§ సీతకు స్త్రీస్వభావము వర్ణించుచు కౌసల్య యిట్లంటుంది:—

"బొంకుల పుట్టినిండ్లయి స్వపూరుషు గేలిగ వెక్కిరించుచుఁ
గొంకక దుష్టచింతనలకుఁ నిధులై భృశగూఢ చిత్తలై
మంకుతనంబునఁ వయసుమంపున రోయఁగఁజేయుచుందు రే
ణాంకముఖుల్ నిమేషమునఁ బ్రాణమువోలెను జూచువారినేఁ." (చూ. ఆం. వా. రా.)

అప్పుడు సీత, "అత్తా, మీమాట కడ్డువచ్చానుగాని, మీ రెప్పుడయినా మీప్రాయంపు వయస్సులో అట్లా వున్నారా యేమిటి?" అంటే, అత్త యింకాయేమి ధర్మోపన్యాసము సాగించునో! పాపము, అమాయకపుసీత! కోడలిధర్మము వహించి ఊఁకట్టుతుంది. స్త్రీలు, అందులో నుత్తమఇల్లాండ్రు తమజాతినిగురించి తామే యిట్లింత

గంపెడు దుఃఖభారము రామునినెత్తిమీద తెచ్చి పెట్టింది. బ్రతికి నన్నాళ్లు అనుభవించింది; అనుభవింప జేసింది. * సీతమ్మ శోకములో విశేషము, వింత యేమీ లేదు; ఒకటే సన్నని మంట—రాముడు లేడని. అది కూడా వాల్మీకాశ్రమము చేరిన తర్వాత రాముని జీవత్ ప్రతిబింబములను చూచుకొంటూ వుంటే, ఆమంట చల్లారిచల్లారక కొంతసేపు సుఖము, కొంతసేపు దుఃఖము అనుభవిస్తూ కాలక్షేపము చేస్తుంది. ఇక రాముడో! రాముని దంతా కార్చిచ్చే. ఆసుధ్య కర్కోటకుడొకడు లేచి ఒకకాటు వేస్తూవుంటాడు. ఆవిషానల కీలలతో వేదన మరింత యెక్కువవుతూవుంటుంది. అరణ్యావాసమున, కాకాసురునితోనే వెంటపడ్డాడు కర్కోటకుడును. అదివరకు స్ఫటికమువలె స్వచ్ఛమయిన రాముని యంతరాత్మకు రంగు, సంపర్కము కలుగుతుంది యిక్కడనుండి. రాముని మానససరోవరము కలతనొందుతుంది. రామునకు సీతవుంటే ఒకదుఃఖము, లేకపోతే ఒకదుఃఖము. దేనిని రాముడు తనజీవిత మహాపవిత్రపదార్థముగా జూచుకొని, యందు లీనమై తన ఆత్మను సమర్పింపదలచుకొనెనో, అట్టి దానినే పరులు స్పృశించుట కలిగినది. ఇంకేమిటి! ఎవడో ఒకడు వచ్చి యెత్తుకుపోతూ వుంటా డీమహాపవిత్ర పదార్థమును, ఈజాతపూతను. సీత కాత్మరక్షణము చేసికొనే సంస్కారము గలదా యంటే, అదేమిలేదు. ముద్దరాలగు సీత యేమి గ్రహింపగలదు రామునియొక్క యీహృదయ విషాదమును? ‘ఓరామా, పరుడు నన్ను ముట్టుకొన్నాడంటే, అందుకు నేనేమిచేయను?........నావల్ల దోషమేమీ లేదు. చితియెక్కమందువా, యెక్కెదను.’ అని రామునికేసి చూస్తూ ఏడుస్తుంది, పాపము,—గుండె నీరయిపోయే టట్లు. పరులబారినుండి తన్నుదా నెట్లు కాపాడుకో గలదు? అంతఃపుర నాగరకతలో పుట్టి పెరిగి బాల్యముననే రాముని కొసంగబడిన సుకుమారి సీత కేమి చేతవును? సత్యభామవలె, రుక్మిణివలె విల్లు చేతపట్ట గలదా? రథము నడుపగలదా? కేవలము పాతివ్రత్య ధర్మము నూతగా గొని వెళ్లింది అడవులకు. ఆపాతివ్రత్యము తన్ను రక్షింపలేకపోయింది యొంటరిగా నున్నపుడు. అటువంటప్పు, డంత అబల యయినప్పుడు, చపల కాకుండా వుండి రామునికొంగున ముడివేసికొని కంటికి రెప్పవలె కాచుకొనేనా వుండవలసింది—సావిత్రి లాగున. ఆ తెలివితేట లేకపోయింది. అదివుంటేనా, సీతారాములజీవితనౌక అట్లా ముక్కలయిపోయేదికాదు. కాంతాశిరోరత్నములనదగు సత్యవతి, దమయంతులు, చూడుడు, ఎట్లుముక్కలయిపోయే నావను దరిజేర్చి తరింతురో! పాపము, సీత కాయోడ నడపడ మేమియుచేత నయిందికాదు. ముద్దరాలు సీతను చూస్తే జాలివేస్తుంది. హిందూస్త్రీలదుఃఖపాటు అంతా సీతనెత్తిమీదమోపిరో యన్నట్లుంటుంది సీతమ్మవారి శోకచరిత్రము. అగ్నిపరీక్ష కీలోకమున ఫలితమేమీ లేదో యన్నట్లుకూడా ఉంటుంది. ఇదంతా అంతఃపుర నాగరికతయొక్క

---

చులకనగావించుకొంటే,యింకా సభ్యతనుగూర్చి యేమనుకోవలెను? సీత అనసూయతో తన వివాహవృత్తాంతమును చెప్పునపు డిట్లనును:—

"కూఁతులఁగను నాతఁడు కాఁ-రూక్కఁతలు విను వియ్యమాడి కొలఁదులచేనో
లాఁతులచేనో-తన తల్వ్రాఁతకొలఁది..." (అం. వా. రా.

చూడుడు: దీనినిబట్టి సీత యెటువంటి సభ్యత కలవాటుపడినదో! ఎట్లు తలలోని కెక్కించినారో! కూతులనుగన్న తండ్రుల తలవ్రాతి అట్లువ్రాలిపోవుటకు, కూతులము మేమేమి పాపము చేసినామని చెప్పి సీత ఒకనిట్టూర్పయినను విడువదు! ఈవిషయమునను మహాభారతస్త్రీలను విచారింపుడు, ఎవరయిన నట్లు బుద్ధి దలంతురేమో!

* "ప్రత్యాసన్న విపత్తిమూఢ మనసాం ప్రాయో మతిః క్షీయతే" అని బుద్ధితలంచువారికి గాని, రామాయణమున కంతరార్థములు, అర్థాంతరములు చెప్పజూచేవారికిగాని నాయీవ్యాసముకాదని మనవిచేయుచున్నాను. రామాయణ సరళార్థమును యథామతి గ్రహించి వ్రాయుచున్నానని మనవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఫలితము. సౌకర్యములకు, స్వార్థములకు బాగా ఉపయోగించేటట్లు శాసనములమీద నిర్మింపబడిన సభ్యతా సౌధముయొక్క పాటిదంతయు! ఆయంతఃపుర నాగరిక సంస్కారమునకే అర్పించింది జాతపూతయగు సీత తన జీవితమును! దానికే బలియయ్యెను నిక్షేపమువంటి రాముడు. రామరాజ్యమున రామునకే వచ్చింది గత్యంతరములేని దుఃఖస్థితి, యీ యంతఃపుర నాగరికతమూలమున. ఎక్కడ స్త్రీలు పూజింపబడుదురో అక్కడ సంపదలు రమించునని మనుధర్మశాస్త్రము. ఓ! బాగుగనే పూజింపబడినారు, హిందూస్త్రీలు, గుడిలో విగ్రహములలాగున! అందుచే, హిందూదేశచరిత్రమున శత్రువులవల్ల గుళ్లోవిగ్రహాలకు భంగపాటుపూజ, స్త్రీలకు చితిపూజయో, లేక సాహెబుల యంతఃపురాలపూజయో మాత్రము తప్పిందికాదు. భారతవీరుల పాదధూళిచే, పవిత్రముకాబడిన పుణ్యభూమి, కర్మభూమియగు ఆర్యావర్తమునకు గలిగిన పాటుసొంపిది.

ఇంకా రంగుదిగుతుంది సత్యహరిశ్చంద్ర కడకు వచ్చేటప్పటికి. బానిసలతో జీవిత భాగస్వామిత్వము చేసుకొనేవారు కూడా బానిసలవుతారనే సత్యమునకు నిదర్శనము సత్యహరిశ్చంద్ర చరిత్రము. సత్యవాక్పరిపాలనమున నీకథయందుగల యనుపపత్తి నటుండనిండు. భారత రమణీమణులు జీవితమహాసత్యముల నిమిత్తమై దైవముతోనే ప్రతిఘటింతురు. వాటికి కలిగే ఆపత్తులనే ఉపరోధింతురు. ఇక చంద్రమతి సత్యము పేరు చెప్పి, అసత్పరిపాలనమునకు, భర్తనే త్వరపెట్టుతుంది. విపత్తులనే అనురోధిస్తుంది; అందుకు దైవమునే పిలుస్తుంది; ఊర్జితసత్యమునే పరుండబెట్టుతుంది; జీవిత మహాపవిత్ర సత్యపదార్థమునే విక్రయించి యొకమిథ్యాసత్యమును పోషింపచుంటుంది. "భార్యనైన విక్రయించి భర్తకు నుపద్రవమును జెడబాయగాదగు" నంటుంది చంద్రమతి. భర్తకు నుపద్రవమంటేయేమిటో తనకు తెలియదు! వేదములు భర్తకు భార్య ఆత్మయటంచు మ్రోయుచుంటే, ఆ ఆత్మనే విక్రయము చేసుకుంటుంది! ఇది చంద్రమతి బుద్ధి. కాకుంటే, దాసీలుగా చేయబడి, పురుషుల వినోదార్థము, పంజరములో చిలుక పిట్టలలాగున పోషింపబడేవారికి, మరొక ఉదారబుద్ధి యెట్లుకలుగుతుంది? సూత్రములచే నడిపింపబడేవారికి సొంతహృదయము, సొంతబుద్ధి యెటనుండివచ్చును? దాసిగా విక్రయింపబడినపుడు, ఊర్జిత జీవితసత్యమునే పోగొట్టుకొన్నపుడు, తనకు పాతివ్రత్యముమాత్ర మెట్లు నిలుస్తుందని యనుకొంటుంది? ముదుసలి కొనుక్కున్నాడనా? లేక, విశ్వామిత్ర సృష్టియని ముందుగానే తెలిసికొని యీకపట నాటకము నాడుచున్నారా చంద్రమతీ హరిశ్చంద్రులు? స్వాభిమానధన యగు సీతకడగల ఆమాత్రపు ఆత్మగౌరవమయినా లేదేమి, అర్కకులమువారి కోడలనని చెప్పుకొను చంద్రమతియందు! జీవితమహాసత్యములనే పోగొట్టు వ్రతనిష్ఠలు, సత్యవ్రతములు, ఆదర్శములు, ధర్మములు సత్యములుగావు, అవి భ్రాంతి సత్యములు.

జీవితమహాపవిత్రసత్యములనే పోకడబెట్టి యంత్రము లాగున తూచా తప్పకుండ, ధర్మపదవిని నడిచే సత్యహరిశ్చంద్రుని పాత్రము విచారింప నక్కఱలేదు. ఇట్టివారికడ ధర్మాభిజ్ఞతయే (sense of duty) కాని, ధర్మజిజ్ఞాస (conception of duty) కన్పట్టదు. ధర్మముయొక్క అక్షరత్వమేగాని, ధర్మముయొక్క సత్తత్త్వము వీరిబుద్ధియందు మృగ్యము. ఇందుకు నిదర్శనముగ, సంస్కృత మార్కండేయ పురాణమున చంద్రమతిని వధించు సందర్భమున హరిశ్చంద్రుడు, "అహో! స్వాధీనవృత్తు లెంతధన్యులో కదా, అస్వాధీన వృత్తుల కాత్మహత్యకైనను వీలులేదు." *అని కార్యమునకు గడంగుచు తనధర్మాభిజ్ఞతను వ్యక్తపరచును. ధర్మముతో సహకారము చేయుట అంటే యిట్టిదియే కాబోలు.

*ఇట్టిప్రశస్త్యాంశ మయిన దొక్కటి మారనమార్కండేయపురాణమునగాని, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునగాని కానరాదు, వట్టి పదాల ప్రాశస్త్యమేగాని. తెలుగు కవుల భాషాంతరీకరణధోరణి కిదియొక యుదాహరణము.—రసపట్టులు జారిపోతాయి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వామి కార్యతత్పరమతిని, నిరపరాధిని భార్యను వధించు సత్యవ్రతరతు లొకరు! నిష్కారణ పితృభక్తి పరాయణత్వమున, "మాతృదేవోభవ" యను శ్రుతివాక్యమునకు విరుద్ధముగ మాతనువధించు స్థితప్రజ్ఞులొకరు! నీతిబోధ పేరున ఇహపరములకు దూరముచేయు నిట్టి కట్టుకథల కేమి విలువ యివ్వవలెనో తెలియదు.

శ్రీరాముడు తన జీవితప్రకాశము, సత్యము, సౌందర్యము పోగానే అంధకారబంధురుడై "సైపగ రాని యార్తిచే నదీతటమ్మాపలెఁ గూలిపోవును." సత్య హరిశ్చంద్రుడు తనజీవిత మహాపవిత్ర సత్యమునే చేతులార విక్రయించి, సత్యధురంధరుడై ధర్మప్రకాశముచేయును. ఇది దీనికి దానికి జీవితాదర్శములలో గలతేడా; ధర్మతత్త్వములో గల యంతరము. సత్యహరిశ్చంద్రుని కథయందు ప్రీతివిశ్వాసములు గలవా రింకొక సంగతిని గమనింపవలసి యుంటుంది. రామాయణమున దశరథునకు కైక సత్యమును గుర్తించి బోధించుపట్ల యెన్నిసార్లుదాహరణముగా నెత్తినను, 'the devil quotes the scripture' అన్నట్లు, ఉదారచరిత్రులగు శిబిచక్రవర్తి, అలర్కుని పేర్లే యెత్తుతుందిగాని, తనభర్త వంశములోని వాడగు త్రిశంకు పట్టిపేరే యెత్తదు. ఇది చారిత్రకముగ, నైతికముగ పాఠకులు గమనింపవలసిన యంశము. వసిష్ఠుడు శ్రీరామునకు పూర్వరాజవృత్తాంతమును చెప్పుసందర్భమున త్రిశంకునిపేరు వినబడుతుంది గాని, యీప్రసిద్ధపురుషుడగు త్రిశంకుపట్టి హరిశ్చంద్రునిపేరు వినబడదు. ఆంధ్రనాటక రంగధాముడు, ఆంధ్రుల కత్యంత ప్రీతిపాత్రుడగు నీసత్యహరిశ్చంద్రు డెవ్వరో విచారింప దగియున్నది.

"కవితాయద్యస్తి రాజ్యేనకిం?" అని అంటారు కొందరుకవులు. అదికాదు సత్యము. మహాకవులదృష్టి వేరు. అదియెంతో భావగర్భిత మయినది. "కాంతా యద్యస్తి రాజ్యేనకిం, కింవా త్రైలోక్యాధిపత్యేన?" అనేది సత్యం. రాముడీసత్యమును చూచుకొనే, అందుకొఱకే పడరానిపాట్లుపడి బ్రతకచూస్తే, హతవిధి మరొకలాగున చూసింది. రాముని బ్రతుకు కాలా అయిపోయింది. వీరుడగురాముడు రాజ్యము కావలెనన్నాడా ఎన్నడయినను? ఈ కిరీటాధిపత్యము లేకపోయిననే బాగుండిపోయేదే యని విచారించువాడు.

మహాభారతకవి విశ్వశ్రేయములగు జీవితమహాసత్యములను ప్రతిష్ఠించును. రామాయణకవి ఆపవిత్ర జీవితసత్యములు తొలగిపోవు నపుడాక్రోశించును.

"అసతో మా గమయ సత్" అనేశ్రుతికి వ్యతిరేకమయినది సత్యహరిశ్చంద్ర. ఈకథ యిట్లు రసములేక నీరసముగా నుండుటచేతనే కాబోలు, ఆసేతు హిమాచలము చాలాకాలము నుంచి వ్యాప్తమయియున్నను, ఏసత్కవియు దీనిని కావ్యరూపమునగాని, రూపకముగగాని వ్రాసియుండలేదు.

---

# మా వ్యాసకర్తలకు

---

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భా ర తి'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భ్రమర గీతము

రావు వేంకట శేషారావుగారు

ఎండఁ బడి వచ్చుటను నొకయింత సేపు
బడలికలు వాయ విశ్రాంతిఁ బడయఁగోరి
"పేలసు లయిబ్రరీ"* యందు పెద్దమేడ
మీఁద పేముకుర్చిలోన మేను వాల్చి,
పుస్తకము విప్పి యిటునటుఁ బుటలఁ ద్రిప్పి
కొనుచు నేమేమొ యోచించుకొనుచు నుండ;
శ్రుతికి నింపానఁగూర్చు ఝూంకృతులతోడ,
మిసమిసలఁ గ్రక్కు నెమ్మేని పసిమితోడ,
నధిక లావణ్య మొప్పఁగ నతిముదమ్ముఁ
గూర్చు చిఱుతెక్క లట్టె యల్లార్చికొనుచు,
జాలకమ్ముల సందుల జాడనుండి
వచ్చె లోనికి నొక మదబంభరంబు.

*　　*　　*

భ్రమరమా! యేమి పని గొని వచ్చినావు?
వచ్చినావు సరే! నీకు స్వాగతంబు.

మించిపోయెడి కార్యంబు కొంచెమేని
నవల లేకున్నచో క్షణ మాఁగిపొమ్ము,
మంచిచెడ్డల మాటాడ నెంచెదేని,
ముచ్చటల నాడికొన నీకు ముచ్చటేని.

*　　*　　*

నిగనిగల నీను తెక్కల నిగ్గుతోడి
త్వన్మనోహర రూప సౌందర్యగరిమ
తనివి తీఱఁగ నద్దాల తలుపులందుఁ
జూచికొన నెంచి యీమేడఁ జొచ్చినావొ!
శ్రమను బడియున్న ననుఁ గాంచి జాలి నొంది
త్వన్మనోహర మధుర గీతమ్ము లనెడు
జోలపాటలచే నిద్రఁ జొనిపి నన్ను
సేద దేర్చగ నిటు దయచేసినావొ!

తరులతాగుల్మపుష్పసంతతులచేతఁ
జిత్త మలరించు నారామసీమలందు
సంతతానంద సంచార సరణి విడని
యతుల సౌభాగ్యశాలివి యైన నీవు;

బహుళ బహువిధ పుస్తకప్రతతిచేతఁ
జారుతరమైన పుస్తకాగారమందుఁ
బ్రవిమలామోదయుతుఁడ "శ్రీరాజపుస్త
కాలయపరిరక్షకుఁడ"† నే నగుదుఁజుమ్మ.

పుష్పవనమందు నుండఁగ బుద్ధి నీకుఁ,
బుస్తకాలయమం దుండ బుద్ధి నాకు;
నన్నిగుణములఁ గాకున్నఁ గొన్నిగతుల
నీకు నాకును బోలికల్ లేకపోవు.

పలురకంబుల పుష్పముల్ గలుగు నీకు,
పలురకంబుల గ్రంథముల్ గలుగు నాకు;
పుష్పములఁ గాంచి యుప్పొంగిపోదు వీవు,
పొత్తములఁ గాంచి యుప్పొంగిపోదు నేను.

పూలలోపలఁ దిరుగుచుఁ బూలపైని
వ్రాలుచును లేచుచుండెడి పట్టులందుఁ
బుప్పొడుల నీవు మునిఁగెడు చొప్పుగానె,
గ్రంథభాండారమున నేను గ్రంథములను
బైకిఁ దీయుచు నుండెడి పట్టులందు,
బీరువాలందు నుంచెడి వేళలందు,
దుమ్ము రేఁగఁగ మునుఁగుదు దూళులందు.

* Palace Library.
† Palace Librarian.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుష్పచయమున మకరందపుష్టి గలుగు,
గ్రంథవితతిని రసపుష్టి గలుగుఁ జుమ్మ;
పుష్పపుటములలోఁ దూఱి పూవుఁదేనె
తనివి తీఱఁగ మఱిమఱి త్రాగు దీవు;

గ్రంథపుటములపై దృష్టి కడఁక వ్రాల్చి
కవితలోఁ గల్గు రసమును గఱవు దీఱ
నిత్య మాస్వాదమొనరింతు నేను గాన
నీకు నాకును బోలికల్ లేకపోవు.

ఎన్ని పూలను వెదకిన, నెంతశ్రమము
పడిన మధురస మొక్కఁటే పడయు దీవు;
గ్రంథములలోన నాహ్లాదకరములైన
నవరసంబులు లభ్యముల్ నాకు, వినుము.

పుష్పములలోని తేనియ బొట్టులట్టు
లుండి యుండని యట్లుండకుండుఁ జుమ్మ;
పట్టి యాకర్షణము సేయునట్టి శక్తిఁ
గలిగి యోలల నాడింపఁగలుగుఁ జుమ్మ,
నవనిధుల మించఁజాలెడు నవరసములు.

తీయనైనట్టి విరితేనె తేటలందు
మరులుకొని నీవు సర్వంబు మఱచునట్లు,
చదువ మొదలిడి యట్టులె చదువుకొనుచుఁ
బోవఁగా రసస్ఫూర్తిని బొంది, నేను
తన్మయత చెందుచుందును దఱచుగాను.

అతిమనోజ్ఞంబులై లోక మాదరింప
నలరు వస్తువుల్ రెండిలఁ గలవు సుమ్మ:
గంధఫలియును, విను మఱి కామినియును;
పటుతరంబైన వలపులఁ బర్వఁజేసి
వనరమకు వన్నెఁగూర్చు సంపంగి పూవు
మాటనైనను దలఁప వదేటిబుద్ధి?

దవ్వుదవ్వులనే నిల్వఁ దలఁతు కాని
దరియ వెప్పుడు, వాహ్యాళి మఱచియైన:
భయమొ, ద్వేషమొ, క్రోధంబొ, పలుకరాదె?
శాశ్వతవిరోధ మిది యేల సంఘటిల్లె?

భ్రమరమా! విను నైష్ఠికబ్రహ్మచారి
పటుతరంబైన వలపుల భ్రమయఁ జేసి
చిత్తము హరించు కామినిఁ జేరఁడేమొ,
దవ్వుదవ్వులనే నిల్వఁ దలఁచునేమొ;
దరికిఁ జేరుట యనఁ గడు వెఱచునేమొ;
ధైర్యముగఁ జూడఁగానైనఁ దలఁపఁడేమొ;
భయమొ, ద్వేషమొ, క్రోధంబొ, పలుకఁడేమొ:
యిందు మీ కిర్వురకు సామ్య మేమి కలదొ!

తమ్మిపూఁ దేనెసోనల తమినిఁ దగిలి
కాలగతి నీవు తెలిసికోఁజాల వకట!

ప్రొద్దుపోవఁగ గమలంబు తద్ద ముడుఁగఁ
దమ్మిపువుగర్భమున నీవు తగులుఁ జెంది
యెంతగాఁ దల్లడిల్లుదో యెవరి కెఱుక!
కోరి కష్టంబు పైవేసికొనఁగ నేల?

సంపెఁగకుఁ దోడు నీ వంబుజమును గూడ
విడిచి తేనియు దినములు గడపవొక్కొ?
ఆఁకలిని దీర్చుకొనఁగ నాహార మొదవి,
దప్పిఁ దొలఁగింప మంచితీర్థంబు దొరకి,
చదువుకొనుటకు గ్రంథముల్ చాలఁ గలుగ,
నింతకంటెను భాగ్య మింకేమి వలయు?
కాని హృదయంబు సంతుష్టిఁ గాంచఁబోదు,
కోరికలె కోరి మిగిలిచికొనును గాని.

భ్రమరమా! యింక నొకమాట పలుకఁదలఁతు:
నిన్ని సదుపాయములు నాకు నున్న, నిట్లు
సౌఖ్యయుతముగ దినములు జరుగుచున్న,
భ్రమరమై నేను సతతంబు వనములందుఁ
దను లతా గుల్మ పుష్పసంతతుల నడుమఁ
దనివి తీఱఁగ విహరించు తలఁపు గలదు;



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోరకంబులఁ బరికింపఁ గోర్కె గలదు;
విఱియు పూవుల దర్శింప వేడ్క గలదు;
పూవుపూవున వ్రాలఁగా బుద్ధి గలదు;
ఉద్ధతిని పుష్పాదుల మున్గ నూహ గలదు;
మధుర మధురస మానఁగా మనసు గలదు;
వాసనలఁ దృప్తి నొందఁగా నాస గలదు:
కోర్కె లున్నవి, నెరవేర్చికొనుట యెట్లు!
భ్రమర మగు టెట్లు!! వీనిని బడయు టెట్లు!!
నీవె దీని కుపాయంబు నిర్ణయింపు.

*        *        *

పసరుపురుగును నెచటనో పట్టి తెచ్చి
ఝుమ్మనుచు రేచు ధ్వనులచే సొమ్మసిలఁగఁ
జేసి, చుట్టును నృత్యంబుఁ జేసికొనుచు
మధురగీతంబులనో, లేక మంత్రములనో
గ్రుక్కత్రిప్పక జపియించి యొక్క మొగిని
భ్రమరముగ మార్పఁజాలు నీప్రజ్ఞ యంట;
ఏది చూతము, నీప్రజ్ఞ యెట్టియదియొ,
భ్రమరముగ నన్ను మార్పఁగా రమ్ము! నీకు
నేను గూడను సాయంబు నెఱపుకొఱకుఁ
గన్నులను మూసికొందు నాకరయుగమునఁ,
జిక్కఁబట్టుదఁ జిత్తంబు చెదరనీక,
నిన్నె ధ్యానించుచుందును నియతితోడ.

నీవు దీనిని సాధింప నేర్తువేని—
అగును మన కెంతొ యానంద మపుడు తేటి!
మిత్రభావంబు మనకు సమృద్ధిగాఁగ
యొక్కరొకరికి సాయమై యుండవచ్చు;
బాలపవనుండు పూలవీవనల విసరఁ
దీఁగయుయ్యాలలం గూడి యూఁగవచ్చు;
దట్టమైనట్టి పొదరిండ్ల నిట్టె దూఱి
కూడి దాఁగుడుమూఁతల నాడవచ్చు;
కంఠముల నెత్తి శ్రుతులను గలియఁజేసి
మృదుల గీతాళి వన మలరింపవచ్చు;
క్రమతరమైన పుష్పాడి గంధములను
కొల్లలుగ మేనులకుఁ బూసికొనఁగవచ్చు;
నవనవోత్సాహభరిత మానసుల మగుచు.

నీవు దీనిని సాధింప నేర్తువేని—
భ్రమరకీటకన్యాయంబు ప్రబలినట్లె
భ్రమరమానవన్యాయంబు ప్రబలఁ గలదు;
నీకు యశ మబ్బుఁ, గోరిక నాకుఁ దీఱు.
అళిరో! క్షణమని చాలసే పాడినాఁడఁ,
దప్పు క్షమియింపఁగాఁ దగు చొప్పు గనుము.
నిన్ను వీడిన వనలక్ష్మి చిన్నవోవుఁ
గాన నీ వింక మరలుటే కర్జమే మొ;
ఏరొ పేర్వెట్టి పిలుచుచున్నారు నన్ను
దిగువనుండి, యదెట్టిదో తెలిసికొనఁగఁ
బోయి వత్తును, నీవును బొమ్ము; కాని
యళిరో! మఱువకు, దయయుంచు; నంతె చాలు.
చిన్నవిషయము నొక్కటి చిత్తగింపు
మిట్లు గా నుంటి మిన్నాగి మింతవఱకు;
నన్నిప్రాణులయందును నెన్నొగతులఁ
బ్రకృతిలో మార్పె సతము గన్పట్టుచుండ,
నెపుడు నిట్లుందుమని చెప్ప నెటులు తేఁటి!
ప్రకృతిశాస్త్రానుగుణ్యమై భావియందు
మార్పు లేవేని రావచ్చు మనలఁ గూడ,
భావములయందొ! జీవితపథమునందొ!!
తనివి దీఱఁగ నుద్యానవనములందు
వేడుకలతోడ దినములు వెళ్లఁబుచ్చి,
కొంతకాలంబు చన్న యనంతరంబు
మఱచిపోవక దయ యుంచి మఱల రమ్ము;
మార్పు గలుగుటయే సంభవంబు గాన,
మంచిచెడ్డల మాటాడ వచ్చుఁ గాన,
ముచ్చటలఁ జాల నాడికోవచ్చుఁ గాన.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# అభినవ శ్రీకృష్ణుడు

పెద్దిభొట్ల వీరయ్యగారు, బి. ఏ., బి. యల్.

విమర్శనము

హిందూమతమునకు వేరుపురుగు లగు ఆర్యసమాజ బ్రహ్మసమాజపు దివ్యజ్ఞానసమాజ మతములు కొంతకాలముగ మనదేశమున ప్రబలుచున్నవి. అందు దివ్యజ్ఞానసమాజము ఆంగ్లేయ రాజకీయసంబంధముతో ప్రారంభింపబడి మనలో ఆంగ్ల విద్యాధికులు దేశము కొరకు పాటుబడుటలో వెనుకంజవేయుటకు నుద్దేశింపబడిన పెద్దత్రోవయని కొందరు తలంచుచున్నారు. ఇంతకు దివ్యజ్ఞానసమాజము మతమా యనుసందియము గలదు. నామిత్రులగు శ్రీవఝ్యం భోగప్పయ్యశాస్త్రిగారు వంశపారంపర్యముగ పూర్వాచారసాంప్రదాయమునకు జెందియుండి బంధువులలో కొందరు దివ్యజ్ఞానసామాజికులుండుటచేత కాబోలు వారి సాంగత్యమువల్ల వీరికి దివ్యజ్ఞానావేశము గలిగి యిటీవల 'అభినవ శ్రీకృష్ణుడు' అను చిన్న పుస్తకమును ప్రచురించియున్నారు. అందు శాస్త్రిగారు మనమతము నాచారములను చాలవరకు ఖండించుచు కృష్ణాజీగారి యందు తమకుగల అభిమానమును పూర్తిగ వ్యక్తపరిచియున్నారు. ఇప్పుడు శాస్త్రిగారి పుస్తకమును విమర్శించి అందలి సంగతులను కొన్నిటిని చదువరుల కెరుకపరచుచున్నాను.

దివ్యజ్ఞానసామాజికుల దృష్టిలో జిడ్డు కృష్ణమూర్తిగారు లోక గురువుగ నున్నారు. అంతమాత్రముగాక భోగప్పయ్యశాస్త్రిగారు లోకదృష్టి నానాటికి కృష్ణాజీగారిదెస దిరుగుచున్నదనియు, వారి ఉపదేశరత్నములను సాక్షాత్తుగ విన సర్వమానవు లభిలషింపుచున్నారనియు, ప్రాగ్దేశీయులు మతసిద్ధాంతములన్నింటికిని జన్మస్థానమగు దేశమే తమ జన్మభూమియని పరిగణించుచున్నారనియు, వారికిని కృష్ణాజీగారిని వినవలెననెడి కుతూహలము వృద్ధినొందుచున్నదనియు వ్రాయుచున్నారు. లెడుబీటరుగారికి 'యోగీ' బిరుదమును తగిలించినారు, కృష్ణాజీగారిని బాల్యమున బిసెంటమ్మగారు లెడ్బీటరుగారి శిక్షణములో నుంచిరనియు, ఆయన హఠయోగవిద్యాశిక్షణమేగాక ఆహారవిహారప్రవర్తనమునందుగూడ శిక్ష నిచ్చుచుండెననియు, మహర్షి దేవాపిగారికడకు కొన్ని దినములు ప్రతిరాత్రియు కృష్ణమూర్తిగారి స్థూలదేహము నిద్రించువేళ సూక్ష్మశరీరముతో యోగీలెడ్బీటరుగారు తీసికొనిపోవుచుండెడివారనియు, అత్తరి పదిపదిహేను నిమిషములు శ్రీమహర్షులవారు కృష్ణమూర్తిగారికి సాధనచతుష్టయమును బోధించుచుండిరనియు, ఏ రెండుమూడు వాక్యములో తప్ప వారిమాటలతోనే "పరమగురుచరణసన్నిధి" అను పేరుతో నాంగ్లమున నొక గ్రంథరాజమును శ్రీ కృష్ణాజీగారు రచించి దానిని లోకహితార్థమై ప్రకటించిరనియు శ్రీశాస్త్రిగారు తమపుస్తకములో వ్రాసియున్నారు. దివ్యజ్ఞానము లేనివారికీ పైకథ విశ్వాసానర్హ మని వేరుగ వ్రాయనక్కరలేదుగదా.

బిసెంటమ్మగారు శ్రీ జగద్గురువులగు శ్రీ మైత్రేయమహర్షులు కృష్ణమూర్తిగారి శరీరము ద్వారా ఆవేశించి ధర్మస్థాపన జేయుదు రనేసంగతి జగద్గురువుల వారివల్లనే వింటిమనియు, కృష్ణమూర్తిగారికి తగు విద్యాబుద్ధుల నిచ్చు బాధ్యత తమయందును, లెడ్బీటరుగారియందును ఉంచిరని ప్రపంచమునందు వెల్లడిజేసిరనియు శ్రీశాస్త్రిగారు వ్రాయుచున్నారు. ఇది రెండవకథ. పరకాయప్రవేశబోధ కిది యాధారము కావచ్చును. కృష్ణాజీగారియొక్క శరీరము శ్రీ జగద్గురువుల యవతరణమునకు తగిన యుపాధియే యని అనేకమందిసభ్యులు నమ్ముచుండిరట. అనగా నమ్మనివారును కొందరు గలరుకాబోలు! కృష్ణాజీగారి తండ్రి నారాయణయ్యగారికి తారకసంఘోద్దేశములందును, వానిప్రచారమునందును నమ్మకము బోయి పిల్లలస్వాధీనమునకై హైకోర్టులో దావా తేగా వ్యాజ్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్యవసానమును ముందుగనే గ్రహించి సదరు కోర్టువారి తీర్పు అమలుజరుప వీలు లేకుండునట్లు ఇండియాదేశము నుండి కృష్ణమూర్తిగారిని బెసెంటమ్మగారు మున్ను శ్రీకృష్ణుని కంసునిబారినుండితప్పింప గోకులబృందావనమున కుబంపినట్లు ఇంగ్లాండుదేశమునకు బంపిరని శ్రీ శాస్త్రిగారు వ్రాయుచున్నారు. ఆహా! ఏమిసాహసము! అమాయకుడగు నారాయణయ్యగారిని కంసునితో పోల్చుటయా! పాశ్చాత్యదేశములందు నిరుపమానమగు అనుభవజ్ఞానమును సంపాదించి సహచరులతో గలిసి మెలంగుచు తమయభిప్రాయములను జర్చించుచుండిన కృష్ణాజీగారు గళాశాలలందు సామాన్యముగ నేయుండి, పట్టపరీక్షలలో కృతార్థతబొంద ప్రయత్నించినట్లు గానరాదని శ్రీ భోగప్పయ్యశాస్త్రిగారు వ్రాయుచున్నారు. వీరి సహచరులెవరోగదా! వీరికి గలిగిన అనుభవజ్ఞానవివరములు తెలిపిన బాగుగనుండెడిది.

ఇక మూడవకథయొకటి గలదు. హాలండుదేశములో ఆమెను పట్టణమున జరిగిన వార్షిక తారకసంఘ సమావేశ సందర్భమున శ్రీ జగద్గురువులు త్వరలో నవతరించుదురనియు, వారికి పన్నిద్దరు శిష్యులుందురనియు, అందులో నేడ్గురిని పేర్కొనిరనియు బిసెంటమ్మగారు ప్రకటించిరట! వీరిశ్రేష్ఠనే మనవలెనో తెలియుటలేదు. ౧౯౨౫ లో అడయారుసభలో కృష్ణమూర్తిగారి ఉపన్యాసము విని శ్రీ జగద్గురువులు కృష్ణమూర్తిగారి నావేశించి మాట్లాడినట్లనుకొనిరని శాస్త్రిగారు వ్రాయుచున్నారు. దయ్యము లావేశించుట కని వినియుంటిమిగాని గురువు లావేశించుట ఒక పిల్లకథగా నున్నది. పూర్వోత్తర సందర్భములు పెక్కులు తెలిసియున్నవు అతిపరిచయదోషముకలిగి సత్యగ్రహణమున కాటంకమగునని శ్రీ శాస్త్రిగారు వ్రాయ సాహసించుచున్నారు. మానసికారణ్యములలో నూతనోపదేశబీజములు వృద్ధికిరావని శాస్త్రిగారే విపులముగ చర్చించుచున్నారు. చెట్లనీడనుపడు బీజములు చావక ఏమికాగలవు? అచట ఉపదేశము లరణ్యరోదనములు కాగలవు. "పూర్వపు శాస్త్రజ్ఞానములతోను, అభిమానములతోను, పూజలతోను, ఆచారములతోను, నమ్మకములతోను నూతనోపదేశములను సంకీర్ణముచేసినయెడల తత్త్వము పాడగట్టును" అని శాస్త్రిగారు వ్రాయుచున్నారు. ఇది బ్రహ్మంగారి తత్త్వము మించినటులున్నది. పూర్వాచారములు నూతనోపదేశములవల్ల సంకీర్ణమగుటకు మారుగా నూతనోపదేశములే పూర్వాచారములవల్ల సంకీర్ణమగుననుట కడుంగడు సాహసము.

పూర్వాభిప్రాయములే నిత్యసత్యములని నిశ్చయించుకొని వానితో నూతన సందేశములు ఎంతవరకు సరిపోవునాయని విమర్శచేయదొడగిన యథార్థము చిక్కదట. అటు నొకకాలును, ఇటు నొకకాలును నుంచువారికి నుభయపదభ్రష్టత్వము కూడ తటస్థించు నని శ్రీ భోగప్పయ్య శాస్త్రిగారు వ్రాయుచున్నారు. ఒక భ్రష్టత్వమును వారంగీకరించినందులకు వారికి మనము కృతజ్ఞులమై యుండవలెను. అభినవ శ్రీకృష్ణసందేశ యథార్థమును గ్రహింపవలె నన్న నట్టి గ్రహణమునకై దృఢసంకల్పము చేయవలెనట ఇష్టానిష్టములను కొంతతడవైనను కట్టిపెట్టవలెనట.— "మన విద్యావిశేషము చాలనట్టుకు ఎరువుసొమ్ము. అది మనదికాదు. మనయర్థములు, తాత్పర్యములు మనవి కావు. ఇతరులవి" అని దివ్యజ్ఞానసమాజికులగు శాస్త్రిగారు వ్రాయుటలో వింతలేదు. వారియనుభవ మట్టిది. ఆంగ్లేయసారమును గ్రహించువారికి గీతాశాస్త్రార్థము లందు విపరీతము దోచుట సహజము. కృష్ణాజీగారి సందేశగ్రహణసామర్థ్యమును సంపాదించుకొనక వృథాసందేహములతో తంటాలుపడుచున్నారమట— అంతట శాస్త్రిగారు మనలకు నాల్గవ కథను బోధించుచున్నారు. "జన్మముసాఫల్యమైనదనియు, కృతకృత్యులమనియు, ఆప్తకాములమనియు, తమ ప్రియతముని తమలోనే కనుగొని ప్రియతమునితో నైక్యమైతిమనియు, సర్వులలోని ప్రియతములు తామేయనియు, జీవన్ముక్తులమనియు, పరిపూర్ణులమనియు, అపరిచ్ఛిన్నులమనియు అద్వితీయులమనియు, నఖండైకరసానంద స్వరూపులమనియు శ్రీకృష్ణాజీగారే విస్పష్టముగ నుడువుచుండ— ఇతరుల వాక్యములు ప్రమాణమై మన సందేహములను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బోగొట్టగలవా!" అని శాస్త్రిగారు తెలియజేయు కథను చదువరు లెంతవరకు విశ్వసింపగలరో కదా. ఏలెడ్బీటరుగారి సహాయములేనిదే దీనిని గ్రహించు టెట్లు? సంసారమునుండి తప్పించుకొన నిశ్చయించితి నేని అభినవ శ్రీ కృష్ణ సందేశ మురళీగానమాధుర్యపానము జేయవలెనని శాస్త్రిగారు బోధించుచున్నారు. క్షారజలమిశ్రితకూపోదకపానము చేయుట కలవడిన శాస్త్రిగారివంటి వారి కికనట్టిపానీయము లనవసరమని శాస్త్రిగారియొక్క యభిప్రాయము.

శ్రీ కృష్ణాజీగారి సందేశము గూడ ప్రాచీనోపదేశములకంటె భిన్నమనియే చెప్పవలసియున్నదని శ్రీభోగప్పయ్యశాస్త్రిగారు వ్రాయుచున్నారు. నూతనోపదేశము లగ్రాహ్యము లనుట వివేకశూన్యలక్షణము అని శాస్త్రిగారు చాటుచున్నారు. శ్రీ కృష్ణాజీగారును పిన్నవయసులోనే దేవాపి మహర్షులయొక్క యుపదేశ పాత్రు లయిరని మనము నమ్మవలెదా యని శాస్త్రిగా రడుగుచున్నారు- మిగిలినవారి పాత్రులు కాబోలు! వారు కృష్ణాజీగారి సందేశమున కర్హులో వారే నిర్ధారణ చేసికొనవలెనట! శాస్త్రలోకజ్ఞానాధిక్యము లిందుకు పనికిరావట! కృష్ణాజీగా రవతారపురుషులైనను పూర్వపు అవతారపురుషులవలె మహిమల నేమియు జూపుట లేదట! ఏసుమహిమలను కన్నులార జూచినశిష్యులే వారిని త్యజించిరనియు, ముప్పదిసంవత్సరములకు ముందటికథయగు దివ్యజ్ఞానసమాజస్థాపకులలో నొకరగు మేడం బ్లవాట్స్కీ అమ్మగారు కొన్ని యద్భుతములజూప అప్పుడు నమ్మినవా రందరు తరువాత అవన్నియు అబద్ధములని త్రోసివేయలేదా యనియు శాస్త్రిగా రడుగుచున్నారు- అప్పుడే అవి కల్పనలని పత్రికలలో ప్రచురింపబడినది- అప్పటి కూటుహూమీ లిప్పుడు లేరు కాబోలు! జర్మనీదేశపు పసిబాలకు డొకడు తన తల్లి ప్రక్కను కూర్చుని శ్రీ కృష్ణాజీగారు ఆంగ్లమున నిచ్చిన యుపన్యాసమును విని ఆంగ్లభాష బొత్తిగా తెలియకున్నను ఆ యుపన్యాససారమును తనభాషలో నుడివెనట! చేపలు చెట్లెక్కు కథవలె నున్నది. ఇట్టిమహిమలు కొన్ని కృష్ణాజీగారియం దున్నటుల శాస్త్రిగారు వ్రాసిరి.

అభినవ శ్రీ కృష్ణుడు సార్థకనామధేయుడట. "మనకిదివర కెవరును 'నేనుముక్తుడను' అని ముఖతః చెప్పినవారు లేరుకదా. ఇది మనకు నూతనభాగ్యము కాదా" అని శాస్త్రిగారు వ్రాసియున్నారు. అభినవకృష్ణలీలల నన్నిటిని దెలుపక సార్థకనామధేయు డనుచున్నారు. ఆ వివరములు శాస్త్రిగారికే తెలిసియుండవలెను. మనము పూర్వాచార్యుల యభిప్రాయములను స్వానుభవజన్యవివేకజ్ఞానముతో బరిశోధింపజాలకున్నామట! అభిమన్యునివలె మన శాస్త్రసిద్ధాంత సంప్రదాయాచారములలో మునిగి వానిబంధములనుండి బయటపడజాలకున్నామట! శాస్త్రిగారి యభిప్రాయములో సన్యాసులు బైరాగులు హరిదాసులెల్ల బూటకులని ధ్వనించు వాక్యములు వ్రాయుచు చిన్న సెలయేళ్లలో స్నానముచేయుచు రాళ్లను బూజించుచు యాత్రలు సలుపునట్టి అభ్యాసముగలవానకు నిరంజనమగు కృష్ణాజీగారి సందేశమనే రాజబాట విసుగుపుట్టింపకమానదుగదా యని యనుచున్నారు. మోక్షమార్గములను గురించి క్రైస్తవులు మొదలగు మతస్థులందరు తమదే రాజబాటయనుట మిషనుపాఠశాలలలో జదివిన శాస్త్రిగారికి దెలిసినవిషయమై యున్నది. కర్మలుగాని, బాహ్యప్రమాణములుగాని మోక్షమునకు సహకారి కానేరవని శాస్త్రిగారు ఎవరికి వారే ప్రమాణము కావలెననుచున్నారు. ఒక ప్రమాణమునందు విశ్వాసము తగ్గగా మరొక ప్రమాణము నన్వేషించుచు కప్పవలె గంతులు వేయుచున్నామట! బాహ్యప్రమాణము లనేకములు గలవు. ఏదని అంగీకరింతుమని భోగప్పయ్యశాస్త్రిగారు శంకించుచున్నారు. కృష్ణాజీగారి వాక్యములందైనను గుడ్డినమ్మకము గూడ దనుచున్నారు. అది స్వబుద్ధికి యుక్తమని తోచవలెనట. పరమార్థవస్తువు కర్మలవల్ల లభ్యమగునట్టిదికాదనియు, విద్యాగంధముగలవారు సహితము పూర్వాచారములను వదలలేకున్నారనియు, ఈశ్వరుడు కుక్కమాంసము తినుదారిలో నున్నాడని తెలిసి మానవులలో విషమత్వమును జూపుచు ప్రవర్తించు మనకు ఈశ్వరపూజ లెట్లు ప్రయోజనము లగునని ప్రశ్నించుచున్నారు. దేవాలయములయొక్క ప్రయోజనము కొంతకాలము క్రిందయుండినను ఇప్పు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డది జీర్ణించినదట. సంధ్యావందనములు వదలి మరొ కజపమునం దాసక్త లగుచుంటిమని శాస్త్రిగారు వ్రాయుచు మోక్షార్థికి కర్మలాటంకములని, పరాశ్రయబుద్ధిని వదలి స్వాశ్రయపరులు కావలెనని బోధించుచున్నారు. ఇట్టిదే మెట్టవేదాంతము. దివ్యజ్ఞాన సమాజము నాశ్రయించుటలో వీరికి పరాశ్రయబుద్ధి లేదు కాబోలు! వీరు సర్వసంగ పరిత్యాగమును బోధించుచున్నారు. త్యజింపవలెనన్న పారవేయమని కాదని నిర్వచనము చేయుచున్నారు. కోరికలనుండి, అనుభవములనుండి తప్పించుకొన నెవరికి సాధ్య మని శాస్త్రిగా రడుగుచున్నారు. పరానుభవములను అనుసంధానము చేయవలెననియు అట్లు చేయుట సామాన్యులకు సాధ్యము కాదని శాస్త్రిగారనుచున్నారు. సరళత్వము లేని మనస్సు దేహశాస్త్రముల కుటాభిమానములలోను, కుతర్కములలోను, గురువులలోను, కర్మకలాపములలోను తగులుకొని చిక్కుపడి లక్ష్యము నంటదట! కృష్ణాజీగారికి లెడ్బీటరుగారు గురువుగ నేల కావలసిరో గదా! వాసుదేవ పరబ్రహ్మమే తానని సాక్షాత్కారము గలిగిన ముక్తుడగునని శాస్త్రిగారు బోధించుచున్నారు. ఇందుకు దివ్యజ్ఞానసమాజ మవసరము లేదుగదా!

చిత్తశుద్ధి, సత్వశుద్ధి, అహంకారశుద్ధి కలిగిన సాక్షాత్కారము కలుగుననియు, అటుల ముక్తిబొందిన మానవుడే ఈశ్వరుడనియు, స్వయంతీర్ణుడుగాని మనుజుండు నితరులకు మార్గజ్యోతిగ నుండజాలడనియు, సంఘము మున్నగు బాహ్యములు జీవితమును ఆధ్యాత్మికముగ మార్పజాలవనియు "అందుకనియే శ్రీ కృష్ణాజీగారు సుమారు ౨౦ సంవత్సరములనుండియు తమఅధ్యక్షతక్రింద పనిచేయుచుండిన తారకసంఘమును తీసివేసి"రట! భళిర–ఈస్వల్పవిషయము తెలిసికొనుట కవతారపురుషుడనేవానికే ౨౦సంవత్సరములుపట్టిన సామాన్యులసంగతి ఎట్లుండునో చదువరులే తెలిసికొనగలరు. లోకభయము, శాస్త్రభయమును వీడి కృష్ణాజీగారి ఉపదేశముల ననుష్ఠింపవలెనట! మార్జాలకిశోరన్యాయకాలము గతించిన దని మర్కటకిశోరన్యాయకాల మస్తమించుచున్న దనియు సింహకిశోరన్యాయకాల ముదయించినదని భోగప్పయ్యశాస్త్రిగారు బోధించుచు ఎవరికి వారే గురువుగా నుండవలెననుచున్నారు.

ఇంతవరకు శ్రీ శాస్త్రిగారు కృష్ణాజీగారి ఉపదేశముల సారమును తమవాక్యములలో దెలియజేసియున్నారు. సాధ్యమైనంతవరకు శాస్త్రిగారి మాటలనే యనువదించియున్నాను–ప్రతిమతము బోధించుసంగతులకంటె శ్రీకృష్ణాజీగారు నూతనముగ విశేషముగ బోధించిన సంగతులు లేకపోగా పూర్వాచారములు మొదలగువానిని, గురువులను త్యజించి ఎవరికి వారే లక్ష్యమని, అనుభవమే ప్రధానమని చేయుబోధ కలికాలములో నెంతవరకు కార్యకారికాగలదోగదా. దివ్యజ్ఞానసమాజమునకు జెందిన కట్టుకథలను వివరించి వానియందు శాస్త్రిగారికి గల నమ్మకమును దెలుపుటచూడ కామిర్లు గలవానికండ్లకన్నియు పచ్చగానుండునటు లున్నది. శాస్త్రిగారికి గల దివ్యజ్ఞానదృష్టివల్ల కొన్నిదృశ్యములు వారి మనఃఫలకమున జేరియుండవచ్చును. అది 'సంగదోష' ఫలితము కావచ్చును–అందుకు కొంత శుద్ధిసంస్కార మవసరము. శ్రీభోగప్పయ్యశాస్త్రిగారు మిక్కిలి శ్రమనొంది తాము త్రికరణశుద్ధిగ నమ్మిన సంగతులను లోకభయము, శాస్త్రభయము లేకుండ దెలియపరచినందులకు నాకు సంతోషముగ నున్నది. లోకములో అభిప్రాయభేదము లెన్నోయుండగలవు. నామిత్రునితో, వారి దివ్యజ్ఞానసమాజకవృత్తాంతముతోగాని, కథామంజరితోగాని, ఉపదేశభాగములతోగాని యేకీభవించకుండినను, శ్రీ శాస్త్రిగారి యెడ నాకు బాల్యమునుండి గల గౌరవమును, విశ్వాసమును వెల్లడించుచు వారిపుస్తకమును గురించి వారి యభినవ శ్రీకృష్ణునిగురించి నాకు దోచినవిధంబున విమర్శించియున్నాను. ఇంతకన్న విపులముగ వ్రాయుటెడల వ్యాసబాహుళ్యమగునని, సంక్షేపముగ నాయభిప్రాయములను, సందేహములను వివరించి శాస్త్రిగారి గ్రంథమునందలి ముఖ్యవిషయములను వారిమాటలలోనే సాధ్యమైనవరకు విశదపరిచియున్నాను.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏ క వీ ర

విశ్వనాథ సత్యనారాయణ గారు, యం. ఏ.

(వెనుకటి సంచిక తరువాయి)

౫

కుట్టాన్ వీరభూపతి భుజముపై చేయి వైచి, 'వీరా! సరే! నా హృదయము మండుచున్నది నిన్న సాయంతనమున నీవుగూడ నీకేదో మహాభార మున్నట్లు చెప్పితివి. అది నాతో చెప్పవా?' అని యడిగెను. వీరభూపతి కొంచె మాగి, 'మరల నాకథ నా కేల స్మృతికి దెచ్చెదవు? ఈ జన్మ కింతియే. అవివాహితుడనుగా నీజీవితాంత ముండవలసిన స్థితియున్నను నాశరీరము మీాద నాకే యధికారము లేకున్నది. వివాహ మేమో చేసికొనక తప్పునట్లు లేదు.' అని సాలోచనాత్ముడై చీకటు లుమియుచున్న పడమటి దిక్కుపంక నదే విధముగ చూడ మొదలిడెను. కుట్టాన్ లేచి నీటిపాయ వద్దకు బోయి పాదక్షాళన మాచరించి, బొడ్డులోనున్న కత్తి తీసి పదును సరిగా చూచి మరల నొరలో నమర్చి, నీరు పుక్కిలించి యుమిసి వీరభూపతి యొద్ద కూర్చుండెను. వీరభూపతి 'సేతూ! నీవు మహారాజుల బిడ్డవు. నేను మిక్కిలి బీదవాడను. మన మిరువుర మొక్కతరగతి చదువుకొనుచుండుట మాత్రముచేత మన కిట్టి స్నేహ మెట్లొడగూడినది? ప్రాణపదములైన రహస్యములు నీ వేమో నాకు చెప్పితివి. నేను నీ కెట్లు చెప్పకుండగలను?' అని తన చేతితో నిరుపాయలుగా తీయబడియున్న సేతుపతి తలవెండ్రుకల నిమురుచు, స్నిగ్ధములైన తనచూపు లతని మొగమున నిలిపి, 'సేతూ! నీవు నీభార్యతో నివసించుచుంటివి. మీాయిరువురికి సుఖము లేదని నాతో చెప్పితివి. పాప మాపిల్లను చక్కగా ప్రేమించుము. మహారాజుల యింటిబిడ్డ పేదగుడిసెలో నివసించు పిల్లకన్న నందకత్తె కాకపోదు. కాదుపో! అంత సౌకుమార్యము పేదవారి కెక్కడనుండి వచ్చును? నా మనఃపూర్తిగా నిన్ను నీభార్యను ప్రేమించుమని యడుగుచున్నాను. నీ భార్యను నీవు ప్రేమించెదవని గట్టిగా నాతో చెప్పిన గాని నా కానందము లేదు. రేపు నేను వివాహము చేసికొన బోవుచున్నాను. నేను ప్రేమించిన స్త్రీ యేమో నాకు దుర్లభ. వివాహము చేసికొనకా తప్పదు. ఏమి చేయుమందువు? ప్రాణము పోయినను వివాహము చేసికోనని పట్టుపట్టనా? ఇట్లని నాపైననే యాశలన్నియు పెంచుకొన్న తల్లిదండ్రుల యాత్మలకు ముసలితనములో నెంత యావేదన తీసికొని రమ్మందువు? వివాహము చేసికొందును. అనంతరము వచ్చినభార్యతో విముఖుడనై యుండి యేమిసంపాదించుకొందును? ఇహమా! పరమా! ఈజన్మ లెత్తినది సుఖము లనుభవించుటకు గాదు. కావున సేతూ! నీభార్యను నీవు ప్రేమింతువని వాగ్దానమిమ్ము! అట్లొసం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గినచో నాకథ నేను చెప్పెదను.' వీరభూపతి యిట్లు చెప్పుచుండగా కుట్టాన్ కనులవెంట నీరు కార్చుచుండెను. వీరభూపతి కొంచె మాగి, 'తమ్ముడా! నిన్ను నే నిటుల సంబోధించుటకు నీవే యింత చన విచ్చితివి. కన్నులవెంట నీరు దేనికి. నేను నీకన్న నేవిషయములోనను పెద్దవాడను గాకపోయినను వయసులోనైన పెద్దవాడను. అయ్యో! ఇ ట్లేడ్చెదరా!' అని వీరభూపతి తన యుత్తరీయపు కొంగుతో కుట్టాన్ కన్నీళ్లు తుడిచెను. వీరభూపతి మరల, 'ఏమి! వాగ్దానము చేసెదవా! అది నీమేలుకో సమే చెప్పుచున్నాను. నీయందు నాకు గల స్నేహము నీవలన నీవాగ్దానము తప్పక పుచ్చుకొమ్మని నన్ను వేధించుచున్నది. ఇకముందు నీభార్యతో నీవు సరిగా నుందువని నాచేతిలో చేయి వేయుము!' అని కుట్టానును బలవంత పెట్టెను. కుట్టాన్ మాటలాడలేదు. వీరభూపతి మరల 'నీభార్య యందకత్తెయేనా' యని యడిగెను. కుట్టాన్ మారు పలుకలేదు. వీరభూపతి 'సేతూ! ఈప్రశ్న వేయగూడదని నేనెఱుగుదును. నీయంతఃపురమును గురించిన నాయీప్రశ్న నాయందు నీ కింత నెయ్యము లేనిచో నాశిరస్సును మొండెమునుండి విడిగా చూచియుండును. నీ వామె సౌందర్యవతియని యనుకొంటి వేని యామెనుగూడ నీ ప్రేమలో కొంత పంచిపెట్టుము.' కుట్టాన్ మాటాడలేదు. వీరభూపతి—'సౌందర్యవతి కాద యేని కాదని చెప్పుము.' కుట్టాన్ పెదవులు కదలినవి. వీరభూపతి-'సేతూ! బిగ్గఱగా చెప్పుము.. నాగొంతులో ప్రాణ మున్నంతవఱకు నీరహస్యమును బయటకు పోనిచ్చువాడను కాను. నీకు నాయం దంత నమ్మకములేదా?' కుట్టాన్ నెమ్మదిగా, 'ఇదివరకు నే నామెను పరిశీలించి చూడలేదు గాని గడచినరాత్రి చూచితిని. ఆమె యందకత్తెయే యగును' అన్నాడు. వీరభూపతి 'అయిన నింక నేమి? నీ వసుందరమైన వస్తువును ప్రేమించుట లేదుకద. ఇది గృహస్థధర్మము. ప్రతివాడును చేయతగినవిధి. నేను నిన్ను ప్రార్థించు చున్నాను.' వీరభూపతి కన్నుల నీళ్లు గ్రమ్మినవి. మరల వీరభూపతి యిట్లన్నాడు: 'నాకు వచ్చుచున్న దుఃఖమును ప్రయత్నముచే నాపుకొనుచుంటిని. నాయనా! నా కీవాగ్దాన మిమ్ము! కలకంఠికంట కన్నీ రొలుకరాదట. శ్రీ యింట నుండ నొల్లదట. నా కీ వాగ్దాన మిచ్చినగాని నేనిందుండి లేవను.' అని వీరభూపతి కుట్టాన్ పాదములపై బడుటకు సంసిద్ధు డైనాడు. కుట్టాన్ తొట్రుపాటునంది, 'వీరా! ఎంతమంచివాడవు. ఇన్నాళ్లనుండి యేమో వట్టిస్నేహితుడ వనుకొంటినిగాని నేను నీవుగా నూహించుకొను నంతటి ప్రేమ నాయందు నీ కున్నదని తెలిసికొనలేకపోతిని. నిజముగా నింత ప్రేమకు నే ననర్హుడను. నే నా స్త్రీని ప్రేమించ లేకున్నాను. నీకోసమని ప్రేమించుమందువా! ప్రేమించెదను. ప్రేమించెదను. వీరా! ప్రయత్నము చేసెదను. కాలము పట్టునట్లున్నది. క్షమింపు' మని కుట్టాన్ వెక్కి వెక్కి యేడ్వ మొదలుపెట్టినాడు. వీరభూపతి యతనిని గాఢముగా కౌగిలించుకొని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యతనిశిరస్సును మూర్కొని, 'కాలము పట్టి నంత మాత్రముచేత నేమియు తొందర లేదు. సుష్ఠుగా విచారించి చేయుము! పదిసారులు నేను చెప్పవలసిన దేమున్నది? వాగ్దాన మిచ్చి తివి జ్ఞాపక ముంచుకొమ్ము.' 'ఆ. ఇచ్చితి'నను నర్ధకంఠస్వరములో కుట్టాన్ శిరస్సు అంగీకారార్థ చలనము గనపరచినది. తరువాత నర్ధ ఘటికసే పెవ్వరును మాటాడలేదు. కుట్టాన్ తల యెత్తి వీరభూపతివంక చూచెను. ఆచూపు వీరభూపతి నతనిగాథ చెప్పుమని యడుగు నట్లున్నది వీరభూపతి కన్నులలో మెఱుపు మెఱసినట్లయినది. అతడుతలవంచి,కుడిచేతితో వ్రేఁగై యిసుక గుప్పిళ్లుగాఁ దీసికొనుచు వద లిపెట్టుచు, 'సేతూ, ఈరహస్యము నే నెవ్వరికిని చెప్ప దలంచుకొనలేదు. ఎవ్వరికిని చెప్పనని యొట్టు పెట్టుకొంటిని. ఆయొట్టునుకూడ నిర్లక్ష్యముచేసి నీకు చెప్పించుచున్న యీశక్తి యెం దున్నదో నాకు తెలియుటలేదు. నీవు నీ రహస్యములు నా కంతగా చెప్పుటచేత నాహృదయము నీయెడల కరగి నీరైనది. నీవంటి వాడు నాతో నంత చనవు, నంత ప్రేమ చూపించుటచేత నాహృదయమునకు లేనిమార్దవము వచ్చినది. ఉన్నపట్టుదల సడలినది. కాని, సేతూ! నాకథ చెప్పెద ననుకొనుము. చెప్పి ఫలితము లేదు. నాజన్మలో నాకోరిక సఫలము కాదు. అగుటకు వీలు లేదు. అది నాకు తెలియును. అయినను దానివలన నాహృదయము బాధపడుచునే యున్నది. ఆవిషయము నామనస్సు మఱువలేకున్నది. నిజముగా నీసంగతి చెప్పదగినవా రెవరైన నున్నారా యనినచో, నీవుతక్క నిం కెవ్వరును లేరు. కాని నా దొక ప్రార్థన. నే నాకథ చెప్పుచుండగా నీవు నన్నేమియు నడుగవద్దు. ఎంత చెప్పవలయునో యంతయు చెప్పెదను. ముఖ్యముగా నూరిపేరులు మాత్రము దాచెదను. అవి చెప్పుట నా కిష్టము లేదు. అవి తెలిసినంతమాత్రమున నాకు లాభము లేదు. అయినను చెప్పెదను. మాది రాజవల్లిపురము; తెలుగు దేశము. మా తాత తండ్రి విశ్వనాథ నాయకులవారి వెంట నీదేశమునకు వచ్చినాడు. యుద్ధసమయములయందు మాపూర్వులు కత్తులుగూడ పూనిరి గాని, వారెక్కువభాగము వ్యవసాయదారులు. మా తాతలు ముగ్గు రన్నదమ్ములు. మాతండ్రులు నల్గురు. మాతండ్రికి మేము ముగ్గురము. విశ్వనాథ నాయకులుగా రిచ్చిన భూమియంతయు మావంశముక్రింద పంపుళ్లయిపోయినది. నేటికి నే నుద్యోగము చేయ వలసివచ్చినది. నా కిప్పు డిరువది యెన్మిదేండ్లు. మా యన్నదమ్ములు నేము పంచుకొని సంవత్సర మైనది. మావారు పూర్తిగా వ్యవసాయము చేసికొనుచున్నను యుద్ధవాంఛ మాయింట పూర్తిగా చావలేదు. అవసరము వచ్చెనేని యిప్పుడైనను దేశక్షేమమునకై రక్త మొడ్డుటకు మాయింట పసిపిల్లకూడ వెనుతీయదు. నాయిరువది నాల్గవయేట, నేటికి నాలుగేండ్ల క్రింద, నేనొక కారణాంతరముచేత నొక యూరు పోతిని. ఆ యూరిపేరుగాని, యాపనిగాని నన్నడిగి నామనస్సు కలతపెట్టకుము.ఒకనాడు నేను స్నానము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము ౪. మైసూరు సంస్థానమునందలి శ్రీరంగపట్టణమున గల కోట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసి తెల్లని మడుపులు ధరించి యామెగారి వెంట వాహ్యాళిపోయితిని. ఆత్మస్తుతి యను కొనకుము. అప్పుడు నేను చాలఅందముగా నుండెడివాడను. గృహసంబంధ మైనవియు, నా మనోజనిత మ ఖునవియు ననేక కష్టముల చేత నాయందమంతయు పోయినది. ఇప్పుడు నాకనులలో దూరాలోచన యేర్పడినది. అప్పుడు నానేత్రములు దుఃఖ మెఱుగని జీవి నేత్రములవలె, సాయం వికసిత నీలకైర వమ్ములవలె నుండెడివి. నా కాయమారు క్రొత్త. పోవుచుండగా నూరిబయట నొక వీథియందు పెద్ద సౌధ మున్నది. ఆ సౌధగవాక్షమునుండి యొక జగన్మోహనాకృతి నావంక చూచుచుం డెను. నే నామెవంక చూచితిని. ఆహా! ఆ యం ద మేమని చెప్పుదును! అది సాయంకాలము. శిశిరర్తువు వెనుకబట్టుచున్నది. వసంతమే తెంచు చున్నది. వసంతము తన వెంట తెచ్చిన యన్ని కుసుమములలో గూడ నంత సౌందర్యము లేదు. నేను చూచితినో లేదో, యామె తల వెనుకకు తీసికొన్నది. ఏమి చేయుదును? కదలిపోవుటకు కాళ్లాడలేదు. పెల్లి పోవుద మనుకొంటిని. కన్నీ ళ్లు వచ్చినవి. చూచినచో నాసౌధ మెవ్వరిదో గొప్పవారిదివలె నున్నది. నే నెక్కడ? ఆ సౌధ శ్రీ యెక్కడ? నా హృదయమున నాశా తంతువులు ఇది తలచుకొన్న కొలది భిన్న భిన్నము లయ్యెను. ఇంతలో గవాక్షముమీద నొక పట్టుతెర దిగిపోయినది. ఆ తెర నా ప్రేమ జ్యోతి నార్పివేసిన ట్లున్నది. వదలలేక వదల లేక, కాలు పెగుల్చుకొని బసకు పోతిని. ప్రొద్దు గ్రుంకలేదు. తెల్లవార లేదు తెల్లవారులు నిదుర లేదు. తెల్లవారక ముందె కాల్యకృత్య ములు నెఱవేర్చుకుని, మరల స్వచ్ఛదుకూల ములు ధరించి, తల దువ్వుకుని, బసలో నిలువు టద్దమున్నది—దానివద్దకు పోయి చూచు కుంటిని. తెల్లవారులు నిదుర లేక కన్నులు జోతులవలె నెఱ్ఱగా నున్నవి. చెక్కిళ్లు లోసుకు పోయినవి. కనులు మూతలు పడుచున్నవి. కాని యెంత యందముగా నుంటి ననుకొం టివి! నన్ను చూచి నేనే మోహపడి పోయి తిని. అది యంతయు మనసులో నున్న దేమో తెలియదు. సుఖదుఃఖములు గాని, సౌంద ర్యా సౌందర్యములు గాని మనస్సు ననుసరించిన వే కదా. సరి; మరల నావీథినే పోయితిని. పోయి యేదో పని యున్నటు లందు తిరుగుచుంటిని. కొంత సేపటికి గవాక్షముపైని తెర చిలుక ఱెక్కవలె ముడుచుకున్నది. లోనుండి యా జగన్మోహనవదనము నా కనులయెదుట కనం బడినది. నేతూ! అది కనంబడినదో లేదో నేనే నమ్మలేకుండ నున్నాను. అది యేదో బహుపుణ్యరాశియగు నక్షత్రము, ఏ పాపలేశ ముచేతనో భూమిమీద వచ్చి పడినది. ఒక్క నిమేషము మే మిర్వురము పరస్పర దృక్ప్రసార ప్రవాహములో మునిగిపోతిమి. మరల నెమ్మ దిగా తెర దిగినది. ప్రొద్దెక్కిన కొలది నాకు ధైర్యము సడలినది. నే నం దున్నంత సేపు మాటిమాటికి తెరనుండి యామె నావంక చూచుచునే యున్నది. అది మొదలు నేను నా యాయూరు పోయినపని మరచి, యుద్ధ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము సాయంతనము నా వీథికి పోవుట, యామెను చూచుటతోడ నేగడపితిని. ఆమెయు నాయందు సాభిప్రాయవలెనే మెలంగినది. ఇట్లొక వారమురోజులు గడచినవి. ఆమె యినుపకోటలో నున్నది. బయటకు వచ్చుటకు వీలు లేదు; నేను లోనికి పోవుటకు వీలు లేదు. ఏమి చేయుదును? ఈవారము రోజులలో నామె యెప్పుడప్పుడు గవాక్షమువద్ద కనుపించుటకు వీలు లేకుండెడిది. ఒకనాడు సాయంకాలమున నామె నావంక కనుఱెప్ప వాల్పక చూచి, కనులు గట్టిగా మూసికొని, కొంచెము సేపుండి తెరచి లోనికి పోయినది. మరల రాలేదు. అది యేదో సంకేతమని యనుకొంటిని గాని నాబుద్ధి దాని నిజమ్ము గ్రహింప గలిగినంతగా పోలేదు. బసకు పోయి భోజనము చేసి, యారాత్రి—చీకటిరాత్రి—రెండుజాముల వేళ నా సౌధగవాక్షముకడకు పోయితిని. గవాక్షమునుండి వెలుతురు కనంబడుచుండెను. నేను గవాక్షమునకు కొంచెము దూరముగా నిలుచుండి దగ్గితిని. ఆమె యది గ్రహించి లోనుండి యొకవస్తువు విసరివైచి లోనికి పోయెను. గవాక్షము చీకటి యై పోయినది. నేను చీకటిలో వెదకికొంటిని. వీథియంతయు గుమ్మున బరిమళించుచుండెను. వెదకుచున్న వస్తువు దొరకినది. అది పెద్దజాజులు, మల్లెలు కూర్చి కట్టిన చెండు. ఆసువాసన నేను పట్టలేక పోయినాను. బసకు పోయి యీ పూలచెండు నెదురొమ్ముపై నుంచుకొని కనులు మూసుకొని పండుకుంటిని. మనసు నిలువలేదు. నిద్ర యెక్కడనుండి వచ్చును? అది పూలచెండు మాత్రమే కాదనుకొంటిని. మనసులో దేవతలుకూడ వాంఛించని కోరికలు నిర్మించుకొంటిని. అందరు నిద్రపోవుచుండిరి గాన దీపము దగ్గరకు పోయి చెండును ముద్దుపెట్టుకొంటిని. ఎదురొమ్మున నాన్చుకొని యాప్రియురాలి హస్తము తాకినట్లు సంతసించుచుంటిని. నా యొడలు గగుర్పొడిచినది. నవ్వుకొనియెదవా? ఏమి చేయను? అన్నియు నీతో జెప్పుచుంటిని. ఏదో బుద్ధి పుట్టి పూలచెండు చిదిమివేసితిని. ఆశ్చర్యమైపోయినది. లోన నొక యుత్తరమున్నది. భూర్జపత్రమునిండ నక్షరములు విస్పష్టముగా గనంబడుటకు కస్తూరియు, పునుగును నలంద బడియున్నవి. ఆవాసన లిల్లంతయు గ్రమ్మివేసినవి. ఆవాసనలచేత దీపము పోవునేమో యనుకొంటిని; ఇంటిలోనివారందఱు మేల్కొందురేమో యనుకొంటిని. ఉత్తరము చదువుకొనకముందే దాచుకొనవలయు ననుపించినది. ఎచ్చట దాతును? హృదయము చించిలోన దాతునా? హృదయము చించుకొనుటకు పజ్జకత్తి లేకపోయినది. ఆవారము దినములనుండి నాబాకు బొడ్డులో లేకుండగనే నేను తిరుగుచుంటిని. మరల నావేశ మాపుకుని యుత్తరమును చదువ మొదలుపెట్టితిని. ప్రత్యక్షరమునందును నూత్నస్వర్గములు నిర్మింప బడియున్న యాయుత్తరము పూర్తిగా చదువుట నాచేత కాలేదు. తక్కినది రేపు చదువవచ్చునలే యని పోయి పండుకుందును. ఎట్లు పండుకొనగలను? మరల దీపమువద్దకు పోదును; కొం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెము చదువుదును. ఎవ్వరైన లేచెద రేమో యని భయము. ఆరాత్రి నాజీవితములో పరమమైన కాలము. అంత యానంద మారాత్రి యనుభవించితిని గాన తరువాత నీనాటివరకు దుఃఖము వారడి యనుభవించవలెనని వ్రాసినాడు కాబోలు విధాత. నేను నిద్రపోవు వరకు కోడి కూసినది. నిద్రపోవువరకు కాదు, మఱల శయ్యపై బండుకొనబోవు వఱకు. తెల్లవారు సరికి నేను వచ్చిన కార్య మాలస్యమయినదని నాతండ్రిగారు వచ్చిరి. నేను వెళ్లిన కార్యము చాల తొందరమైనది. నే నాపని చేయక పోవుటలో నా కెంత యేనియు తప్పే. కాని నే నేమి చేయగలను? మరునాడు పని యైనది. ఇంటికి పోవలెను. నే నాయూరు వదలి పెట్టలేను. మా తండ్రితో వెళ్లితీరవలెను. దారిలో బండి నెక్కి మాయూరు పోవుచున్నాము. మాతండ్రి నాకట్టెను మాయూరికి జేర వేయుచున్నాడు. నన్ను సహస్రనాగములు తోకలతో మెలివేసి వెనుకకు లాగుచున్నవి. ఆయుత్తమమైన కస్తూరి తావులు నూనా యనను సమాకర్షించినవి; న న్నడిగినాడు. నేను చెప్పలేదు. ఇంటికి పోవువరకు రహస్యమంతయు మాతండ్రికి తెలిసినది. మాయమ్మ గారికి నాయనగారు చెప్పినారు. ఉత్తరములో నామె యెవరో, నే నెట్లా మెను కలసికొన వలయునో, సర్వము వ్రాయబడియున్నది. ఇంక నెన్నివిషయము లున్నవి? అవి నేనుదక్క నింక నెవ్వరు చూడరాదు; వినరాదు. అవి మాతల్లియు, తండ్రియు నెఱింగినపుడు నామనోవ్యథ యెట్లున్నది? త్రాచును పైనుండి పక్షులు పడగమీద తన్నుచు బాడుచుచు నుండిన దాని కెంతవ్యథయో యంతనరకబాధ యనుభవించితిని. కాని వారు నాతల్లితండ్రులే కదా! ఆరహస్యము నాల్గననోట బడలేదు. తక్కిన నాసహోదరులు నెరుగరు. నాజననీ జనకులు నన్ను గడ్డము పుచ్చుకుని బ్రతిమాలిరి; ప్రార్థించిరి; మహాపద నెత్తిపైకి తెచ్చుకో వద్దనిరి. జొన్నచేనులో మంచెయే కాని సౌధము కూడ దనిరి; అనేక వారములు కన్నీరు పెట్టుకొనిరి. సేతూ! ఇటు మనస్సులోని కోరిక చంపుకొననా? ఫలోన్ముఖ మైనది. ఎదుట స్వర్గములు స్పష్టముగా కాన్పించుచున్నవే! కనులు మూసికొన్న నామె తక్క నింక నే యాకృతియు లేదు. అటుల తల్లిదండ్రుల మనస్సున కానందము గలిగించనా! ఆరోజులలో నాకు భోజనము లేదు. నిద్ర లేదు. పిచ్చివానివలె చూచుచుంటిని. నా తల్లియు తండ్రియు నొక్కనిమేషముకూడ నన్ను వదలి యుండలేదు. రెండు నెల లైనతరువాత నాతల తిరిగినది. ప్రపంచకములో పడినాను. ఆరోజులలో నా స్వప్నములు, కన్ను మూసిన కనంబడు ఘోరదర్శనములు నేమని చెప్పుదును. చివరకు తల్లితండ్రులమీది ప్రేమయే జయించినది. తరువాత సంవత్సరము వరకు కనులు మూసినచో నా ప్రేయసి కనంబడు చుండెడిది. ఇప్పు డామె నాకలలోనికికూడ వచ్చుట మాని వేసినది. నే నది మొదలాయూరు పోవుటకు వీలు లేకుండ చేసినారు నాతలిదండ్రులు. నే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాయూరు వెళ్లినచో నాతలిదండ్రులు చని పోవుదురని నాకు భయము. వార ట్లన్నారు. నే నా గ్రామమువంక చూడనని నాతల్లికి, దండ్రికి వాగ్దానము చేసితిని ఈరీతిగా నాప్రేమ యెడారిలో తనంత దా నదృశ్యమైన నదివోలె మాయమైనది.'

తరువాత నిశ్శబ్దత; అంధకారము.

౬

దినములు యథాస్థితిగ చనుచున్నవి. కుట్టాన్ మనస్సు కల్లోలము వీరభద్ర భట్టున కు గొంచెము తెలిసినది. కారణము తెలి యలేదు. రామనాథమున కుత్తరము పోయెను. ఒకరోజున కుట్టాన్ వీరభద్రభట్టులు రాజ నీతి పాఠశాలకు పోయిరి. మధ్యాహ్నమున సూర్యుడు తీక్ష్ణాంశువులను చిమ్ముచుండెను.

ఏకవీర భోజనము క్రమక్రమముగా తగ్గి పోవుచుండెను. ఆమె శారీరకముగా రోజురోజు కు క్షీణించిపోవుచుండెను. మాంసలములైన యామెనేత్రములు గుంటలుపడినవి. కపోల ములయందు రక్తమాంసములు క్షీణించి, పాపు రాయిపెట్ట పొట్టవలె మృదువై తళతళలాడు నామెవదనము తేనెప ట్టూడిపోయిన వృక్ష శాఖవలె శోభాహీనమైనది; చిక్కిపోయినది. దినదినము సంస్కారము లేక యామె కేశ ములు సంస్కృతములైనపుడు స్నిగ్ధము లయ్యు, తక్కిన వేళల నరమ్యముగా నుండెను. వచ్చినక్రొత్తలో తలమాయనీయక,వలువమా యనీయని ఆయెలనాగ శ్రద్ధ క్రమముగా వాని పైనుండి తొలంగి పోవుచుండెను. ఈరహస్య ములు దాసీజనములనుండి యెట్లు తప్పించుకొ నగలవు? ఏకవీర మిగుల ధైర్యము కలది. దిట్ట మైన గుండె కలది. పరమములైన రహస్య ములు జీవితాంతము తనమనస్సులోననే దాచి యుంచగల మనోదార్ఢ్యము గలది. ఆమెరహ స్యము బ్రహ్మదేవునికిగూడ తెలియదు.

తిరుచునాపల్లి మండలములో 'అల్వారు కురుచ్చి' యను నొకగ్రామ మున్నది. ఆగ్రామ మునే యంబాసముద్ర మనియు వ్యవహరిం తురు. అంబాసముద్రము తిరుచునాపల్లి మం డలములో పెద్దయూరు. తిరుచునాపల్లి యంత కాకపోయినను కొంచెము తక్కువగా నైన నుండును. తిరుచునాపల్లి మండలాధిపుని క్రింద పదిమంది పాళెగాండ్రుండిరి. మధురనాయకు లకు మండలాధిపు లెట్టివారో మండలాధిపు లకు వీ రట్టివారు. అంబాసముద్రముపాళె గానిక్రింద నారువందల గ్రామము లున్నవి. ఈనూరువందల గ్రామముల మీద నతడే యధికారి. అతనిక్రింద నైదువేల సైన్య మున్నది. తిరుచునాపల్లి మండలాధిపుని పాళె గాండ్ర యందరిలోనను నంబాసముద్రాధిపతి మిక్కిలి ధనవంతుడు; బలశాలి. అంబాసము ద్రములో నతనికోట యున్నది. చిన్నపాళె గాండ్రు కోటలు కట్టరాదు. అయినను నితడు కోట కట్టినపుడు మండలాధిపు డేమియు నన లేక యూరకుండెను.

ఏకవీర యతని కూతురు. ఏకవీరకు తమ్ము లిద్ద రున్నారు. ఆమె తండ్రి కామె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క తెయే స్త్రీసంతానము. చిన్నప్పటి నుండియు నేకవీర గొప్పయింట బుట్టినది గాన తక్కిన రాజభోగముల ననుభవించినది గాని తండ్రి వాత్సల్య మెఱుగదు. తండ్రి యొక రాక్షసుడు; మిక్కిలి క్రూరుడు. అతడు తనపాళెములో పన్నులు పోగుచేసినపుడు కాని, తక్కిన యేరాచకార్యమందుగాని మిగుల కఠినుడు. భార్యయందు గాని, బిడ్డలయందుగాని ప్రేమ యననేమో యతనికి తెలియదు. అతని వదనము విలోకించిన రాక్షసుని చూడనక్కఱ లేదు. కాని యేకవీర తల్లి సుగుణాలవాల. సామాన్యముగ ప్రపంచమున దుర్జనునికి సుగుణవతిని సుజనునకు దుష్ట యగు భార్యను, కురూపికి నందకత్తెను నందగానికి కురూప యయిన యువతిని సంతరింపజేయు భగవంతునియుద్దేశ మేమో యెవరికి తెలియును? ఏకవీర తండ్రి యెంత దుర్మార్గుడో తల్లి యంత సన్మార్గ. తండ్రి యెంత రాక్షసుడో తల్లి యంత భూదేవత. తండ్రి యెంత వికృతస్వరూపుడో తల్లి యంత సౌందర్యవతి. ఏకవీర సౌందర్యమునందు మూడుమూర్తుల తల్లినిబోలి పుట్టినది.

ఉదయన్ సేతుపతి తన కుమారునకు నేకవీరను చేసికొన్నందువలన నతనికి పది గ్రామములు వచ్చినవి. ఏనుగులు, గుఱ్ఱములు, ధనము తగినంత ముట్టినవి. వివాహము ఆల్వారుకురుచ్చిలోనే జరిగినది. వివాహము మూడురోజులు పెండ్లికూతురునకు జబ్బే. పెండ్లికుమారునకు జబ్బే. ఆ మూడురోజులు పెండ్లికుమార్తె యేడ్చుచున్నది. అందరు పసిపిల్ల భయపడిన దనుకున్నారు. కొంతవరకు మౌగ్ధ్య మనుకున్నారు. పెండ్లిలో కుట్టాన్ స్థితి చిత్రముగా నున్నది. అతడు తండ్రికి భయపడి యేమియు మాటాడలేదు. తండ్రి లేనపుడు అందరిమీద విసుగుకొనుచుండెడివాడు. పెండ్లిలో నొకరు కోరికిన తములపాకు లొకరు కొనుకలేదు; ఒకరి పేరొకరు చెప్పలేదు. చివర దినమున నేకవీర చెప్పినది. కుట్టాన్ నోట మాట రాలేదు. అందరికి భయ మైనది.

ఏకవీర కిపుడు పదునెనిమి దేండ్లు. ఆమె సౌందర్యమునకు పోలిక నిండుగా ప్రవహించునది; కంకె విడిచి మురువులొలుకు పంటచేను. ఆమె ద్రావిడభాషలోని చక్కని గ్రంథములన్నియు జదివినది. తనతండ్రియింట నొక పుస్తకమైన లేదు. తల్లితో చెప్పి పురోహితుని వద్ద నుండి తెప్పించుకుని చదివినది. ఆమె మనస్సు చక్కని గ్రంథములు చదువులచేత చిగిర్చి, ఫలములు గాచి, పరిపక్వమైనది ఆమె సుకుమార భావములకు పుట్టినిల్లు.

ఆ మధ్యాహ్నమున సూర్యుడు తీక్ష్ణాంశువుల చిమ్ముచుండెను. ఏకవీర గదిలోనికి పోయి పండుకున్నది. తన పెట్టెతీసి అందులో నుంచి 'అవ్వయ్యార్' వ్రాసిన 'కొండ్రైవెందన్', 'ఆతిచ్చూడి' అను రెండు చిన్న పుస్తకములను తీసి చదువుచుండెను. అవ్వయ్యార్ అఱువదియేండ్ల వృద్ధస్త్రీ. సరస్వతీదేవి యపరావతారము. ఆయమ వ్రాసిన గ్రంథములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిక్కిలి సులభములై, యర్థవంతములై, యాంధ్రభాషలోని భీమకవి సుమతీశతకమువలె పిల్లలకు పాఠయోగ్యములుగా నుండును. ఏకవీర 'ఆలిచ్చూడి' గ్రంథము తీసి మొట్టమొదటనే 'ఆరంజేవిరుంబు' (ధర్మము చేయుము), 'ఆరవదుశినం' (కోపపడకుము) అని చదువుకుని పుస్తకము మూసెను. పుస్తకములు రెండును మరల పెట్టెలో పెట్టెను. ఆమెమనస్సులో మాటిమాటికి 'ఆరంజేవిరుంబు', 'ఆరంజే విరుంబు' అను ధర్మ మూరకే మ్రోగుచున్నది. ఆమె కనులు మూసికొని తనసెజ్జపై పండుకున్నది. పండుకున్నది హఠాత్తుగా లేచి తలుపు దగ్గరకు పోయి యెవరో వచ్చి రనుకొని చూచి, పొరపాటుపడితి ననుకుని పోయి మరల పండుకున్నది. వేసగి. ఒడలంతయు దుకతుకలాడిపోయినది.

సౌధ పశ్చాద్భాగమున కుడ్యమున వసారాలో నొక చిన్నగోడ చదరముగా కట్టబడియున్నది. దానినిండ నెల్లపుడు నీరము నిండియుండును. గచ్చుతో గట్టబడియుండుటచేత నందులోని నీర మెల్లవేళల చల్లగా నుండును. ఏకవీరనగ లన్నియు దీసి, నేలువ దూరముగా నుంచి, బంగారపు పనిగల తనచీర విప్పకుండనే యానీటి దగ్గరకు పోయి నీటిలో మునిగెను. ఆనీర మామెకు నెద-ఱొమ్ముమరకు వచ్చెను. శిరస్సు పూర్తిగా నీటిలో ముంచెను. అంతకు ముంద సేవకురాలు మల్లికాసురీమళభరితమైన తెలనూనె రాచి సంస్కరించిన యామె కేశములు జడముడి యామె యూడతీసి వదలి పెట్టుటచేత నాచిన్ని నీటిగుంటలో నాచువలె మెఱసెను. ఆమెతలనూనె వాసనచేత నీరమంతయు గుమ్ము మని పోయినది.

ఒకపనికత్తె యిది చూచి, 'అమ్మా! ఇది యేమి? ఒడలు తోముదానా?' అన్నది. ఆజ్ఞాబద్ధమైన యేకవీరబొమముడికి బెదరి యది మాటాడకుండ పోయి ద్వారము వెనుకనుండి యామెవంక తొంగిచూచుచుండెను. ఏకవీర కొంచెము సేపైన తరువాత లేచి తనగదిలోనికి బోయినది. పోయిన దారి యందు నీరు ప్రవాహము కట్టినది. గదిలోనికి పోయి తలుపు వేసికొని, తడిబట్ట విప్పకుండనే నేలమీద చదికిలబడి, యెడమ పిడికిలి యెడమ చెక్కిలి కాన్చి కూర్చుండెను. ఎదురుగా గోడమీద మీనాక్షీదేవి వస్త్రము శ్రీ సుందరేశ్వరుడపహరించు చున్నట్లుగా చెక్కబడిన విగ్రహము లున్నవి. అవి గోడలోననే గచ్చుతో చేయబడినవి. వానివంక చూచుచుండెను. 'ప్రభూ! సుందరేశ్వరా! యోగీశ్వరేశ్వరుడవగు నీకుగూడ నీమోహపాశములు వదలలేదా? తన మనస్సంతోషమునకై మనుష్యుడే నిన్నిట్లు వ్రాసినాడు!!!' ఏకవీర నిలుచుండి చీరకొంగులు చేతిలో పిండినది. నీళ్లు నేలమీద కాలువకట్టినవి. ఏకవీర యాచీర విప్పి తలయు, నొడలు శుభ్రముగా దుడుచుకుని పెట్టె తీసెను. పెట్టెలోనున్న అన్ని వస్తువులు తీసి క్రింద పరచెను. పెండ్లినాడు తనమేనమామ తన కొక చీర పెట్టెను. ఆ చీరమీద నేకవీరకు మిక్కిలి ఇష్టము. అది తీసి కట్టు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కున్నది. భూషణము లన్నియు నమర్చికొన్నది. నిలువుటద్దమువద్ద నిలుచున్నది. తన సౌందర్యమునకు తానే వగచినది. ఏదో భావ మంతలో నేకవీర మనస్సులో మెఱుపువలె మెఱసినది. ఏకవీర ప్రక్కనున్న సెజ్జపై పడిపోయినది; ఏడ్చి యేడ్చి నిదురపోయినది.

౭

రుద్రమూర్తియై కుట్టాన్ పూలదండ విసరి త్రెంచిననాటనుండియు నతడు జేల నేకవీరతో నిదురించుటకు పోవుటలేదు. దేహ మస్వస్థతగా నున్నదని చెప్పి తనగదిలోననే నిద్రించుచున్నాడు. సరిగ పాఠశాలకే పోవుట లేదు. వీరభద్రభట్టరునకు కారణము తెలియ లేదు.

వెనుకటి ప్రకరణములోఁ జెప్పినవిషయములు జరిగినమఱురోజున కుట్టాన్ పగలెల్ల నేమియుతోచక తిరుగులాడి సాయంకాలమున స్నానముచేసి శుభ్రవస్త్రధారియై సాయంవాహ్యాళి పోయి యింటికి పెందలకడ తిరిగివచ్చెను. ప్రొద్దు క్రుంకబోవుచున్నది.

చదువుకొను గదిలో కుట్టాన్ తనసెజ్జపై పండుకొనెను. అతనికన్ను లెఱ్ఱగా నుండెను. కుట్టాన్ కన్నులు మూతవడెను. మూతవడిన వెంటనే యతన్ని ప్రేయసి మొగము కనంబడి మరల కానరాకుండెను. కుట్టాన్ కనులుతెరచి మరల మూసికొనెను. వీరభూపతి దీనములైన కనులతో తన్ను తనభార్యను ప్రేమించుమని బ్రతిమాలుచున్నట్లు కనంబడెను. కుట్టాన్ లేచికూర్చుండెను. అతడిట్లాలోచించెను: 'వీరభూపతి నన్నేల నాభార్యను ప్రేమించుమని యడుగవలెను? అతనికి నాభార్యకు నేమి సంబంధ మున్నది? నేను నాభార్యను ప్రేమించిన నతనికేమి? ప్రేమించకున్న నతనికేమి? నేను నాగృహవిషయము లతనికేల చెప్పితిని? అయ్యో! అంతఃపురవిషయము లతనితో చెప్పునంతటి బుద్ధిహీనుడ నైతినే.' కొంచెముసేపు నిశ్చలమైన చూపుతో గవాక్షమునుండి బయటనున్న పోకచెట్లవంక కుట్టానొకతీరీతిగా చూచెను. అంతలో మరల శయ్యపై బండుకొనెను. మరల నతని మనస్సాలోచనచేయ మొదలుపెట్టెను: 'వీరభూపతి నాకు మిక్కిలి నెచ్చెలికాడు. చెలికానితో జెప్పగూడని రహస్యము లేముండును? వీరభూపతి కీరహస్యములు చెప్పినందున తప్పేమియులేదు. అతడు మాత్ర మతనిరహస్యములు నాతో చెప్పలేదా? అయ్యో! ఎంత దుఃస్థితిలో నుంటిని. నానీడను చూచుకొని నేనే బెదరుచుంటిని. నేను మిత్రుడను గనుక నాక్షేమము కోరి నాకు హితముచెప్పెను. ఇంతమాత్రమునకు నాభార్యకు నాతనికి సంబంధ మేల యుండవలెను? మనస్సుమిక్కిలి చెడ్డది. దీనికీభావము రావచ్చును, ఈభావము రారాదు అని లేదు. ఆస్త్రీమొగము చూడలేకున్నాను. ఆమెతో మాటలాడుటెట్లు? ప్రేమించుటెట్లు?' కుట్టాన్ లేచి వ్రాతబల్లవద్దకు పోయెను. బల్లసొరుగులోనుండి యొకభూర్జపత్రము దీసి కలము, సిరాబుడ్డియు దగ్గర నుంచుకొనెను. ఎవరికో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుత్తరము వ్రాయవలెనని సంకల్పించినాడు. ఉత్తరము వ్రాయుట మరల నంతలో సంశ్లేషించి శయ్యపైపోయి పండుకున్నాడు. కనులు మూసికొన్నాడు. అసందర్భములైనభావములు లక్షలు వచ్చెను. 'ఈపాటున నేను చనిపోయి నచో నే మగును? ప్రొద్దుపోవువరకు నెవరికి తెలియదు. భోజనమువేళకు వీరభద్రభట్టరు వచ్చును; నన్నుచూచును; కేకలు వేయును. అందరు వత్తురు. రాజుకూడ నన్నుచూచుటకు వచ్చును. రాజుగారి రెండవ కుమారుడు తిరుమలనాయకుడు నాకుపరమమిత్రుడు. నేచని పోతినని విన్నచో నత డేమగునో? ఈ వార్త విని మాతండ్రియు, తల్లియు వత్తురు. మాతల్లి బ్రతుకదు. అయ్యో! నేను చనిపోవుటకు కారణమిది యని యెవరికి తెలియగలదు. నా ప్రేయసి నేను చనిపోతి ననువార్త వినినచో నేమనుకొనును? ఇప్పటి నా భార్య యేమి చేయును. ఏడ్చునా? ఏడ్వదు. నాకు నా మెకు నేమి సంబంధము? అయిన నేమి?జీవితాంతము విధవాత్వ మనుభవించవలదా? కొంత ప్రేమ యుండకపోదు. లేకున్న నారాత్రి పూదండ నామెడలో నేల వేయును?' కుట్టాన్ భావవాహిని యాగలేదు. ఆప్రవాహము ప్రవహించి ప్రవహించి కొంతదూరము పోయి యాగినది. కుట్టాన్ లేచికూర్చుండెను. కుట్టాన్ ప్రాణము నెమ్మదివడినట్లుండెను. వ్రాతబల్లవద్దకు పోయెను. ఇట్లు వ్రాయ మొదలిడెను: 'ప్రాణేశ్వరీ!' యని సంబోధించెను. అతని మన స్సభ్యంతర పెట్టెను. అది కొట్టివేసి, 'కులకామినీ!' అని సంబోధించినాడు. ఆపత్రము చింపివేసి వేఱొక క్రొత్తపత్రముదీసి దానిపై 'కులకామినీ'సంబోధనము వ్రాసినాడు. తరువాత తన పూర్వప్రేమవిషయము వ్రాసినాడు. ఇది యంతయు నెందుకనుకొని పత్రము మరల చించివేసెను. ఇంటిలో నున్న దానికి లేఖవ్రాయుట యెందులకు అని తోచినది. వెళ్లి యేకవీరతో మాట్లాడుదమనుకొన్నాడు. మరల 'యేమని?' అని ప్రశ్న వచ్చినది. ఆలోచన తెగలేదు. ఇంతలో తలుపుచప్పుడయినది. అటు చూచినాడు. వీరభద్రభట్టరు తలుపు తెరచుకొని లోనికి వచ్చి యొకలేఖ యందిచ్చినాడు.

కుట్టాన్— 'ఏమి టిది?'

భట్టర్—'తమ నాయనగారివద్దనుండి వచ్చినది లేఖ.'

కుట్టాన్— 'ఏమని?'

భట్టర్— 'చిత్తగించుడు.'

కుట్టాన్— 'మీరు చెప్పుడు.'

భట్టర్— 'తమరికి మనస్స్వాస్థ్యము లేకున్నదని వ్రాసితిని.'

కుట్టాన్— 'ఏల లేదు?'

భట్టర్— 'కొంచెము జబ్బుగా నున్నదనుచుంటిరిగా నాల్గునాళ్లనుండి.'

కుట్టాన్—'అవును. లేనిది దేహస్వాస్థ్యము.'

భట్టర్— 'వైద్యులు నాడిలో నేదోషము లేదన్నారు గదా?'

కుట్టాన్—'తరువాత?'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భట్టర్ — 'అమ్మగారు "పరమేశ్వర సముద్రములో" తమమేనమామగారి యూరిలో నున్నారట. మిమ్మచటికేగి నాల్గురోజులుండి విశ్రాంతితీసుకుని రమ్మన్నారు.'

కుట్టాన్— (ఆలోచించినట్లు నటించి) 'మఱి వెళ్లవలసినచో నెప్పుడు-'

భట్టర్ —'ఇప్పుడే భోజనము చేసి బండి కట్టించుకుని బయలుదేరినచో నెల్లుండి తెల్లవారు వరకు చేరవచ్చును.'

కుట్టాన్—'మీరు ప్రయాణమునకు సిద్ధముచేయుడు.'

౭

ఆరోజులలో నెద్దుబండ్లకు నాల్గుచక్రములుండెడివి. రాజశకటములయినచో వానిపైన కొప్పెరలుకూడ నుండును. శకటమని కాని రథమనికాని దానిని వ్యవహరింతురు. రాజశకటములుచూడ ముచ్చటగా రంగులతోడను, గంటలతోడను నెసంగుచుండును మార్గములు చక్కగా నేర్పడియుండెను. ప్రధానములైన పెద్దపట్టణములకు మార్గములు శిలానిర్మితములుండెను. తిక్కినచోట్లకు రథచక్రముల యరవడులచేత గల్గినవే మార్గములు. మార్గముల యందు దొంగలభయ మెక్కువగా నుండెను. తిరువత్తూరు మధుర కీశాన్యముగా నున్నది. పరమేశ్వరసముద్రము తిరువత్తూరు మధురలకు మధ్య నున్నది. ఆరోజులలో నూరుపేరులకు చివర"నాడు""సముద్రము""మంగళము" మొదలగునవి యుండెడివి. మధురకు పరమేశ్వర సముద్రమునకు పదునేనామడ యున్నది. పది యామడలు దాటిన తరువాత దొంగలభయమున్నది. మధుర సమీపములో దొంగలభయము లేదు.

మధురలోనుండి యొకప్రాణి బయటకు పోవుచున్నను, క్రొత్తవారు పట్టణములోనికి వచ్చినను నధికారులకు తెలియజేయవలెను. దానికి వేరేయధికారి యేర్పడి యుండెను. ఆ సాయంతనమున నే వీరభద్రభట్టరు తదధికారి సమీపమున కుట్టాన్ సేతుపతిమహారాజు పరమేశ్వర సముద్రమునకు వెళ్లుచున్నాడని తెలియజేసెను.

ఏకవీర వచ్చినతరువాత కుట్టా నెచ్చటికైన పోవుట కిదియే మొదటిసారి. ఆమెను కూడ వెంట దీసికొనిపోవుటా, పోకుండుటా యనుప్రశ్న వచ్చినది. భట్టరు వినయముతో 'ప్రభూ! తీసికొనిపోవుటయే మంచిది' అనిచెప్పినాడు. కుట్టాన్ 'దారిలో దొంగలు. రెండు రోజులు ప్రయాణము. ఆమెనుకూడ తీసికొని వెళ్లినచో పరివారము దాసీలు చాలమంది బయలుదేరవలసి వచ్చును. నాల్గురోజుల పనికింత యెందుకు' అన్నాడు. అందరు తలలూచినారు.

రాత్రి జామున్నర ప్రొద్దుపోయిన తరువాత ప్రయాణమైనారు. అయిదు శకటములు. మధ్యశకటములో మెత్తనివిలువగల పరుపులు పరచినారు. అందులో కుట్టానొకడు విశ్రమించినాడు. ఈబండికి వెనుక రెండుబండ్లు. ముందు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండుబండ్లు. ఈనాలుగు బండ్లలోను బండికి నలుగురు చొప్పున బంటులు కూర్చున్నారు. ఈపదునారుగురు కాక యయిదుగురు సారథులు. అందరును సాయుధ హస్తులే. అందఱికి తల కుట్టాన్. కుట్టాన్ కుఱ్ఱవాడయ్యు నతని బాహుబలము, వివేకము మధురరాజ్యములో విస్తృతి పొందినవే. బండ్లు బయలుదేరినవి. వీరభద్రభట్టరు తక్కిన సేవకులతో నంతఃపుర రక్షణకై మధురలోననే యున్నాడు. బండ్లు కోటతలుపులవద్దకు పోయినవి. కోటతలుపులు మూయబడినవి. తలుపులు తెరువలేదు. దళవాయి యూర లేడుగాన ప్రధాని యాతనిపని చూచుచుండెను. ప్రధానియాజ్ఞ లేనిదే కోట తలుపులు బ్రహ్మవచ్చినను తెరువరు. రాజకుమారులైనను తీయుట కాజ్ఞలేదు. ఒకసేవకుని వీరభద్రభట్టరువద్ద కుఱికించిరి. భట్టరా రాత్రిపోయి ప్రధానినుండి యాజ్ఞ తెచ్చినాడు. కోటతలుపులవద్ద రక్షకసైన్యము మిగుల జాగరూకతతో నిలచియున్నారు. తలుపులు తెరచిరి. అయిదుబండ్లును నొకనిమేషములో బయటకు బోయెను. వీరభద్రభట్టరుని 'అయ్యా! సెలవు' అన్నమాటలు గభాలున మూయబడిన కోటతలుపులధ్వనిలో మునిగి పోయెను.

చీకటిలో బండ్లు పోజొచ్చెను.

మెత్తని దూది పరుపులమీద కుట్టాన్ పండుకున్నాడు. దారి మెత్తగా నున్నది. కుట్టాన్‌కు నిదురపట్టుట లేదు. కుట్టాన్ భావనాశక్తి విజృంభించెను; 'నేను ప్రేమించిన యువతి యున్నచోటికి మామాత్రండ్రి నేను వెళ్లుట కెట్లనుమతించినాడు? ఆమె యిష్టపడచ్చుట లేదా? లేక యేమగును? భార్యతో సంసారము చేయుచున్నవాడు మరల నట్టి భావము లేల తలపెట్టుననుకున్నాడా? ఏకవీర యీ మూడు నెలలనుండి యింట నొంటరిగా లేదుకదా? నేను వచ్చివేసిన తరువాత నెట్లుండునో? నేను లేనని యామె యేడ్చునా? నేను పరమేశ్వర సముద్రమునకు పోయిన తరువాత నాప్రేయసి నాకు కన్పించునా? నాకు కన్పించనీయరేమో? ఆమెకు వివాహమై యామె భర్తయింటికి పోయెనేమో? ఆమె నన్ను వదలిపెట్టి యింకొకని పెండ్లిచేసుకొనునా? ఏలచేసికొనదు? నేను చేసికొనలేదా? నేనస్వతంత్రుడను కదా? ఆమె స్వాతంత్రయా?' మొదలుతుదలేని యీ యాలోచన తెగలేదు.

కుట్టాన్:—'ఎంతదూరము వచ్చితిమి?'

సారథి:—'ఒక క్రోశము వచ్చితిమి.'

కుట్టాన్:— 'క్రోశము వచ్చితిమా? నిద్దుర పట్టుటలేదు. ఆళ్వారును పిలువుము కథ యేమైన చెప్పునేమో.'

వెనుక బండిలో నున్న యాళ్వారు వచ్చెను. బండివెంటనే నడచుచు చిన్నతనములో తనకు తన నాయనమ్మ చెప్పిన కథలన్నియు చెప్పెను. కొంతదూరము పోయిన తరువాత నాళ్వారునకు తెలియకుండగనే కుట్టాన్ నిదురపోయెను. కొంత సేపయిన పిదప నాళ్వారు తన బండిలోనికి పోయి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పండుకొనెను. వంతులుగా సేవకులు మేల్కొని యుండిరి. తెల్లవారువరకు శోళాపురము చేరిరి. శోళాపురము చెరువు కలువలచేతను, తామరలచేతను శోభాయమానముగ నున్నది. అందరును బండ్లుదిగి కాల్యకృత్యములు తీర్చుకొని మరల పయనమైరి. బండ్లు జాముప్రొద్దెక్కువరకు తిరువెంగడనల్లూరు చేరినవి. ఆ యూరిలో పాండ్యరాజులు కట్టించిన పెద్ద సత్రమున్నది. మధురనాయకులు పాండ్యరాజులు చేసిన ధర్మసంస్థలన్నియు జరుపుచుండిరి. బండ్లు సత్రము ముందాపిరి. సత్రములో నొకగదిలో కుట్టాన్ సామానంతయు జేర్చి యా గదిలో పరుపులు వేసి సిద్ధముచేసిరి. తక్కినవారు భోజనాదికములు సమకూర్చు పనులమీద నున్నారు.

కుట్టాన్ గదిలో తలుపు వేసుకొని కూర్చుండి తనపెట్టె తీసి యందులోనుంచి యొక మంచిగందపు కొయ్యతో చేసిన చిన్న చందుకాయపెట్టెను తీసెను. ఆపెట్టెలో నాలు గరలున్నవి. ఒకయరలో వాడివత్తలైపోయిన మల్లెపూవు లున్నవి. రెండవయరలో మన్నున్నది. తక్కిన రెండరలలోను కస్తూరియున్నది. వెనుక కుట్టాన్ తన ప్రేయసిని కలుసుకొన్నపుడొకరోజున నుదయమున నామెను వెంబడించి వారి యింటివరకు వెళ్లెను. దారిలో దొందరగా వెళ్లుచుండుటచేత నామె తలలోని మల్లెపూవులచెండు జారి పడిపోయినది. ఆచెండు కుట్టాన్ బహుభద్రముగా దాచుకొన్నాడు. అవే ఆమొదటి యరలోని వాడివత్తలైన మల్లెపూలు. మఱొకనాడు సాయంకాలము కుట్టాన్ ప్రేయసి దేవాలయములో ముందు పూలతోటలో కూర్చున్నది. ఆమె లేచిపోయిన తరువాత కుట్టాన్ అచ్చోటి దుమ్ము కొంచెము తెచ్చుకుని దాచుకున్నాడు. అందులో మరికొంచెము మంచిగందపు పొడి కలిపి యది రెండవయరలోనుంచినాడు. (ఇట్టి రహస్యములు బయలుపెట్టినందులకు, మమ్ము కుట్టాన్‌ను, పాఠకులుకూడ క్షమింతురు గాక.) మూడవది కస్తూరి. కుట్టాన్ తనప్రేయసి కొకనాడు కొంతకస్తూరి పంపించెను. ఆమెయందులో సగముంచుకొని సగము మరల నతనికి పంపించెను. అది యిది.

కుట్టాన్ పెట్టె కన్నుల కద్దుకొని దుమ్ము కొంచెము నొసటనుంచుకుని కస్తూరి పెదవుల కంటించుకున్నాడు. అతని కనులవెంట నీరు కారి యందులో పడెను.

కుట్టానకు భోజనము సయించలేదు. కొంచెము ప్రొద్దువాటారినతోడనే బండ్లుకట్టిరి. ఎండలో పోయిపోయి బండ్లు ప్రొద్దు గ్రుంకువరకు తిరుత్తణి జేరినవి. అచట మరల భోజనములు చేసిరి. ఇంతవరకు బండ్లు పదియామడ వచ్చినవి. ఇకముందుదొంగలభయము. రాత్రి పెందలకడనే బండ్లు కట్టిరి. అందఱును జాగరూకతతో నుండిరి.

ఆంధ్రభృత్యవంశముగోజులలోను, చోళ చాళుక్యుల కాలములలోను దక్షిణదేశపు రాజులు సముద్రపురేవులు, వర్తకము, ఇతర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వీపములతోడను, దేశములతోడను సంబంధము వదలుకొనలేదు. చాళుక్యుల నాడును, తత్పూర్వమును తెలుగులు సముద్రముమీద పోయి యితరద్వీపములను జయించుచు కూడ వచ్చిరి. తరువాత కాకతీయుల నాడు వారి రాజధాని సముద్రమునకుగాని నదికిగాని సంబధములేనిచోట కట్టబడి తత్పూర్వనౌకాజీవనము బాగుగా కుంటుపడినది. కొండవీటి రెడ్ల కాలమున మరల వర్తకము విజృంభించినది. శ్రీకృష్ణదేవరాయలు వారుకూడ నౌకాజీవనము గురించి యెక్కువశ్రద్ధ తీసికొనలేదు. మనశాస్త్రములైన చతురంగబలములో నౌకలు కలుపలేదు. అందుచేత భారతరాజులు సముద్ర విషయము లెక్క చేయ లేదు. వచ్చినయాపదయు నచటినుండియే వచ్చినది.

మధురరాజులును సముద్రవర్తకమును గురించి యాలోచించలేదు. రేవులన్నియు పోర్చుగీసువారికిని, యితర దేశీయులకును వదలిపెట్టిరి. అందుకని యితరదేశీయులుకూడ మన వారిని తక్కువగా చూచుచుండిరి. దయావంతులగు మనరాజు లితరదేశీయులు వచ్చినతోడనే వారి నతిథిధర్మప్రకారము గౌరవముచేసి వారికి కావలసిన పనులు చేసిపెట్టుట, వారు తిన్న ఇంటివాసముల లెక్కపెట్టుట తటస్థించినది.

ఇతరదేశముల నుండి నానాజాతివారును వచ్చి దేశములోనన్ని విధములన శాంతినెలకొల్పుచుండిరి. రేవుపట్టణములన్నియు మధురరాజుల చేతిలోలేవు. దొంగలు దేశముమీద దోచుకొని రేవుపట్టణములలో తల దాచుకొందురు. దొంగ లెక్కువభాగము విదేశీయులే. యూరపులో బ్రదుకలేనిజనమంతయు వచ్చి యితర దేశములమీద పడుచుండెడిది. అది సరియే. సాహసించి భారతదేశమున తనమతవ్యాప్తి మొదలుపెట్టినది. ఇన్నిసంవత్సరములైన తరువాతనైనను తనమతములెట్టివో, భారతదేశమతములెట్టివో తెలిసికొనలేని యితరదేశీయుల యజ్ఞత విచార్యము.

రాత్రి రెండుజాముల ప్రొద్దు పోవువరకు బండ్లు పెద్దయడవిగుండ పోవుచుండెను. అందఱును శ్రద్ధగా నుండిరి. ఒక పెద్ద తటాకము. దానిచుట్టు దట్టముగాచెట్లు. అచటి కేగువరకు దొంగలగుంపొకటి బండ్లపైబడెను. అందఱును కత్తులుదూసి నిలంబడిరి. కుట్టా బండిలో నుండి సింగపుకొదమ వలె దూకి దొంగలను నరికెను. దొంగలందఱును పారిపోయిరి. కత్తి దెబ్బతగిలియొకడు మాత్రము నేలనుండి లేవలేకయుండెను. కరదివ్వె వెలిగించి యాతని జూచిరి. సేవకులందఱు 'పరంగి, పరంగి' యని కేకలువేసిరి. అతని కాలుచేతులుకట్టి వెనుక బండిలో నెక్కించిరి. ఈ యాలస్యముల వలన మఱునాడు పరమేశ్వరసముద్రము చేరువరకు బండ్లకు ప్రొద్దెక్కినది.

౬

తెల్లమనిషి కనబడుటతోడనే పరమేశ్వర ప్రజ లొరిగిపోయిరి. పరమేశ్వర సముద్రము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పల్లెటూరు. తిరువత్తూరుకు పోవుమార్గములో లేకపోయిన నీయూరునకు శిలానిర్మితమార్గము నుండెడిది కాదు. తిరువత్తూరునుండి మధురకో మధురనుండి తిరువత్తూరునకో పోవు గుఱ్ఱముల నేనుగుల నే గుంపులుగుంపులై వచ్చి చూచు పరమేశ్వరసముద్ర జనులు తెల్ల మనిసిని వింతగా జూతురనుటలో నచ్చెరువు లేదు. మూడువందల సంవత్సరము లైన తరువాత ముప్పతిప్పలుపడ్డ తరువాత ఇప్పటికే తెల్ల మనిసి మొగము క్రొత్తవదలలేదే దేశమునకు, అప్పటికెట్లు వదలును? అందఱు భోజనమున కేగిరి. పిల్లలు మాత్రము బండి చుట్టును మూగియే యుండిరి.

కుట్టాళ మేనమామ కుమారుడు అతి వీరవర్మ. అతనికి పాతిక యేండ్లుండును. మొగ మున రాజకళ తరుముకొని వచ్చుచున్నది. అత డుత్సాహపురుషుడు. తనయింట చావ డిలో గూర్చుండి, 'ప్రొద్దువాటారినది, ఫరంగిని తీసుకుని ర'మ్మన్నాడు. తెచ్చిరి. ఫరంగి వినయ ముతో లోనికివచ్చెను. అతివీరవర్మ 'యతనికి భోజనము పెట్టించినారా' యని యడిగెను. పెట్టించితిమనిరి. 'గాయమునకు కట్టుకట్టించిరా' యనెను. సేవకులుకట్టించితి మనిరి. ఊరమంగ లిని పిలిపించి కుట్టాళమామ యతనిగాయము కట్టించెను.

అతివీరవర్మ అతనిని 'ద్రావిడభాష వచ్చు నా'యని యడిగెను. అతడు వచ్చునని చెప్పెను.

వీరవర్మ—'బాధ తగ్గినదా?'

ఫరంగి—'తగ్గినది.'

వీరవర్మ—'మీ దేశములో నిట్టి వైద్యు లున్నారా?'

ఫరంగి—'లేరు.'

వీరవర్మ—'మీ దే దేశము?'

ఫరంగి—'ఇటలీ.'

వీరవర్మ—'నీకీదొంగవృత్తి యెందుకు?'

ఫరంగి—'మేము క్రైస్తవులము. మా ఫాదిరీ "దక్షిణ హిందూ దేశములో దోచుకొన వచ్చును. హిందువులు చాల ధనవంతులు. దోచుకొన్నచో తప్పులే"దన్నాడు.'

వీరవర్మ—'అబద్ధములుచెప్పకుము. మీ క్రైస్తవమతము చాల మంచిదట కదా. మీ మతమునుగురించి నీ కేమైన తెలియునా?'

ఫరంగి—'ఏసుక్రీస్తు రక్షకుడు.'

వీరవర్మ—'మీ మతమును గురించి నీ కెక్కువ తెలియదు.'

ఫరంగి—'తెలియదు.'

వీరవర్మ—'ప్రతిమాటకు తల యూపెద వేమి?'

ఫరంగి—'తెలియ కేమి, తెలియును. ఏసు క్రీస్తును నమ్ముకొన్నచో మోక్షము వచ్చును. ఇంక నేమి తెలియవలెను.?'

వీరవర్మ—'మీ దేశములోమీమతమును గురించి నీకువలెనె తెలిసినవా రెందరుందురు.'

ఫరంగి—'చాలమంది యున్నారు.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరవర్మ—'ఈ దేశములకు బోధచేయుదు మని వచ్చువారందఱు మీ యందఱకు చెప్ప రాదా? ఇక్కడి కేల వచ్చెదరు?'

ఫరంగి—'తిండికోసము.'

అందఱును పకాలున నవ్విరి. సేవకులు ప్రజను వెనుకకు త్రోయలేక చచ్చిపోవు చుండిరి. వారికి ఫరంగిచేయు నభినయములు, మాటలు నన్నియు చాల చిత్రములుగా నుం డెను.

అతివీరవర్మ యాళ్వారును పిలచెను. ఆళ్వారు వచ్చెను.

వీరవర్మ—'ఇతని నేమి చేసెదరు?'

ఆళ్వారు—'మధురకు తీసికొనిపోయి రాజపురుషుల కప్పగించెదము.'

వీరవర్మ—'పాపము వదిలిపెట్టరాదా?'

ఆళ్వారు మాటాడ లేదు. మఱునాడు ప్రొద్దుటికి ఫరంగినివదలిపెట్టిరి. అతని కాయూళ్లన్నియు పరిచితములే. ఊరిబయిటకు పోయి తనవెంట వచ్చినజనముతో 'మా దేశము పోయి సైన్యమును తెచ్చి మీ దేశము కొల్ల గొట్టెదను చూడు' అన్నాడు.

పిల్లలు నవ్విరి. ఒక పెద్దవాడు 'అవును, దుర్జాతిలక్షణము' అనెను.........

(సశేషము)

---

## మా చందాదారులకొక మనవి

---

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముం దున్నది. చందా దారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భా ర తి.'

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయిగారు

౧

నేను మిక్కిలి చిఱుతప్రాయముననే యత్తవారింట నడుగిడితిని. అజ్ఞానమింకను నన్ను పూర్తిగ వీడ లేదు. ఇతరులతో మాటలాడు టెట్టులోగూడ నాకు తెలిసెడిది కాదు. తలయెత్తి యొరులను చూడజాల కుండెడి దాన నిక భాషించు టెట్లు! స్త్రీలయొద్దకు వెళ్లినపుడు కూడ సిగ్గునందెడిదానను. నేను కొలదిగ తెలుగుమాత్రము చదివితిని. ఉపన్యాసములు, నవలలు మొదలగువాని యందణుమాత్రము నిష్టముండెడిది కాదు. తీఱిక యున్నపుడెల్ల రామాయణము చదివెడిదానను. రామాయణ పఠన మన్న నాకు మిక్కిలి ప్రేమ. రామాయణము మనుజకృతమని యెంచెడిదాన కాను. ఏదేవతయో దాని రచియించి యుండనోపు నని నానమ్మకము. పనలంతయు నేనింటియం దేదేని యొకపని చేయుచునే యుండుదానను. పనిలేనప్పుడు రాట్నముమీద నూలువడకెడిదాన. అత్తమామలయెడ మిక్కిలి భయభక్తి విశ్వాసములతో మెలగెడుదాన. ఒకనాడు మామగారు కూరలో నుప్పు కొంచెము తక్కువగా నుండవలె ననిరి. ఆమాట వినుటతోడనే నాహృదయము కంపించె. మిన్నువిరిగి మీదబడినట్లాయె. ఇంతకన్న నెక్కుడు వేదన నికనే భరింపజాలనని భావించితిని.

ఈ నా యజ్ఞానము నాభర్త కిష్టముండెడిది కాదు. వారు న్యాయవాదివృత్తికి గడంగి యెన్నోదినములు కాలేదు. వారు గొప్పగొప్ప చదువులుచదివి యెన్నియో బిరుదము లందినారు. నన్ను వారు మిక్కిలి ప్రేమించెడివారు కాని వారిప్రేమయందు విశేషభాగము జాలి. స్త్రీవిద్యాభ్యుదయమన్న వారికి మిక్కిలి మక్కువ. వారి మనోనుకూలముగ నే మెలగజాలకుండుట చూచి వారు విచారమానసులై యుండువారు. అది నా యపరాధము కాదనియు, హైందవజాతి యాచారవ్యవహార ప్రభావమే యనియు నెంచువారు. వారికి నాతో ప్రేమాలాపములు సల్పుటలో నిసుమంతేని యానంద ముండెడిది కాదు. రాత్రి నిద్రింపబోవునపుడే ఇంగ్లీషునవలనో వెంటగొనివచ్చి నిదురించు నంతవరకు దాని జదువుచుండు వారు. ఎప్పుడేని నేను "ఏమిచదువుచున్నారు?" అని ప్రశ్నింప కరుణారసమొల్కనన్నుదిలకించి "యిది 'ఆస్కార్ వయిల్డ్' అను నాంగ్లగ్రంథకారుని సర్వోత్కృష్టమగు నవల" యనిమాత్రము చెప్పెడివారు. ఆమాటలు వినినంత నేను నా యయోగ్యతను నిందించుకొనుచు, "విద్యాప్రవీణు డగు నిట్టి పురుషవతంసునకు దగుయోగ్యత నాకడ లేదాయెనే" యని విచారించెడిదానను. "ఏమూర్ఖునకో పత్నిగ నుండవలసిన దాన" నని తలపోయుచుండు దాన. నాభర్త నన్ను దయార్ద్రదృష్టి గనుచుండువారు. అయ్యదియే నాసౌభాగ్యము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అది సంధ్యాసమయము. ఇంటిముంగలిచసారాయందు కూర్చుని నేను రామాయణము చదువుచుంటిని. రాముని రాజ్యమునకు మరలి రమ్మని కోరుటకు భరతుడు వెడలెనని యీ కథాసందర్భమున జదివితిని. భరతుని కరుణాలాపములు, దీనభావణములు భ్రాతృవాత్సల్యము నా మనసును కరగించి వైచినవి. నేత్రముల నుండి యశ్రుధారలు స్రవించుచుండెను. ఇంతలో నాభర్త గదిలో నడుగిడెను. వెంటనే నేను పుస్తకము మూసి వైచితిని. వారి ముందఱ నా యీ యజ్ఞానము ప్రకటము కాకుండు నట్లు ప్రయత్నింప సాగితిని. వారు నాచేత నున్న పుస్తకమును గాంచి "రామాయణమా?" యని ప్రశ్నించిరి.

అపరాధినివలె జూచుచు,

నేను—"ఆ! అవును, ఏదో కాలక్షేపము" అంటిని.

నాభర్త—పుస్తకము మంచిది; అందులో సందేహము లేదు. సద్భావములు కొల్లలుగ నుండును. అయిననేమి? ఇంగ్లీషుభాషయందు వర్ణింపబడి యున్నంత బాగుగ మనపుస్తకములలో పాత్రలు వర్ణింపబడవు. నీకు నేను చెప్పిన ఆశ్చర్యముగ నుండును. ఆంగ్లకవులు మనోభావాధిక్యము నెంతో చక్కగ చిత్రించెదరు. మన కవులో పదపదమునకు పూర్వధర్మములనియు, నీతియనియు జెప్పి రేమేమొ చొప్పించుచుందురు. అందుచే మన వారి భావము లస్వాభావికములై కన్పట్టును.

నేను—ఇంగ్లీషుపుస్తకముల జదివి వాటిభావముల గ్రహించు టెట్లు?

నాభర్త—అంత దుష్కరము గాదు. అనుదిన మొకగంటచొప్పున చదివినచో కొలది దినములలోననే ఆంగ్లభాషయందు మంచి జ్ఞాన మలవఱచు కొనగలవు. అదెట్లు! నీవు నామాట వినకుండుటకు నిశ్చయించుకొంటివిగా? నాయొద్ద సిగ్గేలని యెన్నియో మారులు చెప్పితిని. నీవు చెవియొగ్గనైన లేదు. శుభ్రముగ నుండుమనియు, పరమాత్మ డొసగిన సౌందర్యము వమ్ముజేసికొనకు మనియు నెన్నియోసారులు బోధించితిని. నా మాటలు నీకు లెక్కలేదు. నాబోటి సురూపికి భార్యగా నున్నపు డెట్లుండిన నేమి యని యాలోచించుచుంటివా? దివారాత్రములు పరిశ్రమజేసి యింటికి వచ్చుసరికి నీ క్రేగంటిచూపుల, నీ మృదులహాసమున, నీ ప్రేమాలాపముల నాశ్రమ వాయునని యెంతును. కాని నీమౌనము నాయాశల నడియాసల నొనర్చుచున్నది. స్త్రీలు జన్మించుట వంటవండుటకు, బిడ్డలగని పోషించుటకు, భర్తృసేవసేయుటకు, ఏకాదశి మొదలగు పర్వదినముల నుపవసించుటకునే కాదు. వారి పుట్టుకకు మహత్కారణము కలదు. ఆడుది భర్త సాంఘిక, మానసిక విషయముల నన్నిట పాల్గొనుట కధికారిణి. పురుషునివలె ఆమెకును స్వాతంత్ర్యమున కధికార మున్నది. నీయస్వతంత్రత గాంచ నాకు జాలి వొడముచుండును. స్త్రీ పురుషున కర్ధాంగి యని మన పెద్దలసుద్ది. కాని నీవు నా మానసిక సామాజిక విషయములలో పాల్గొన జాలవు. నాధర్మములు వేరు, నీయాలోచనలు వేరు. సుఖసంతోషములూ వేరు. నీవలన నాకే విధమగు సహాయము, సానుభూతియు లేదు. ఇట్టి పరిస్థితులలో నానందాబ్ధి నోలలాడదగు నాజీవితము నెట్టి నిరానందముగా గడపుచున్నానో నీవే యోచింపుము.

నాభర్త చెప్పినది యథార్థము. నేను వారి స్వేచ్ఛాజీవితమునం దొక కంటకము వలె నుంటిని. "ఇక నేటినుండి మావారు చెప్పినటుల నడచుకొందు" నని దృఢప్రతిజ్ఞ గావించు కొంటిని. నాభర్త నప్రసన్నచిత్తుని చేయగల్గుదు నే!

౨

నగలన్నను, బట్టలన్నను మొదట నాకు మిగుల నిష్ట ముండెడిదికాదు. నాపుట్టినింట ఆబాలవృద్ధము స్వయముగ నూలువడకి బట్టల నేయించి ధరియించెడి యాచారము. విదేశవస్త్రముల వాడెడివారముకాము. నే నెన్నడేని గ్లాసుగోముల్లు అద్దకములకు ముచ్చటపడిన మాయమ్మ వారించుచుండెడిది. సింగారించు కొనుటకు మనసుపడిన 'మనకిట్టి పలాపక శృంగారములు తగవమ్మా' యని బోధించెడిది. అంతవర కెందుకు?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



" మురళీవాలా "

చిత్రకారుడు: శ్రీ నండిమెడ వెంకటసుబ్బరావుగారు, ఛత్రపురము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మకురమున కెదుటనిల్చి ముంగురులు సవరించుకొనబో విసువుకొనెడిది. ఇప్పుడు భర్తను సంతోషపెట్టుటయే నావిధి యనుకొంటిని. నాహావభావవిలాసములు మాఅత్తాదుబిడ్డలకు కష్టముగ నున్నవి. వారియందు నాకొక యలక్ష్యభావ మేర్పడజొచ్చెను. మెల్లమెల్లగ భార్యాభర్తల మనోభావములు కలియుచున్నవి. మావారియందు పూర్వవిచారములేదు. మిగుల సంతోషముతో గనబడుచు వారు నాకు వింతనగుచీరెలు, అందమగు "జాకెట్లు", సున్నితములౌ "స్లిపర్సు" కొనితెచ్చుచున్నారు. కాని వానినే ధరించి నల్గురిలోనకు వెళ్లుట కింకను జంకెడిదానను. వానిని కేవలము నాభర్త యొద్దకు బోవునపుడే ధరించుకొనుటకు నిశ్చయించుకొంటిని. నాశృంగారము జూచి నాభర్త యెంతయో సంతసించెడివారు. తన భర్త సుఖమునకు స్త్రీ యెట్టి శృంగారముల నొనర్చుకొనదు! ఇక నింటికార్యములందు నాచిత్తము చొచ్చుటలేదు. నాసమయమంతయు నన్నునే సింగారించుకొనుటలోను పుస్తకావలోకనమునందును వెచ్చింప దొడగితిని. నవలలయందు రుచి మిక్కుటమాయె.

ఇంతవరకు నా అత్తమామల నేను మిగుల గౌరవించెడిదానను. వారికెదురుగ 'జాకెట్లు' 'స్లిపర్సు'తో వెళ్లుటకు భయము సంకోచము నుండెడివి. "ఇక నాభర్త వందలకొలది రూప్యములు సంపాదించుచుండ నింటిదాసినై యెంతకాల మిట్లు నేనుందును!" అను అభిమానము హెచ్చజొచ్చెను. "ఇంటి యజమానురాలైన నేనుండ అత్తమామలెవ్వరు నన్నాజ్ఞాపింప" అను అహంభావము వృద్ధికాదొడగె. అత్తగారేదేని పనిచేయుమని చెప్పిన ఆమాట చెవి జొరనిచ్చెడుదానకాను. "ఫలహారము నేడేమేని చేయు"మని యొకనాడు అత్తగారు చెప్ప ఆమాట విని విననట్లూరకుంటిని. కొంతవరకామె నారాక కెదురుచూచి తుదకు ప్రాణము విసిగి గట్టిగ కేకలువేయ నారంభించెను. ఆమె చాల కోపిష్ఠిది. చిట్టికొట్టు స్వభావము కలది. మరికొంతసేపటి కామె నాగదిలోనికి వచ్చి, "నేను ఫలహారమున కేమైన చేయుమని చెప్పితినే, చేసితివా" యని గద్దించెను.




క్రోధారుణితనేత్రనై నేను-"తీరికలేనందున చేయలేదు." అని ప్రత్యుత్తర మిచ్చితిని. అప్పుడామె "—ఏమి? దిన మంతయు కూర్చుండియుండుట తప్ప నీకువేరుపని యేమున్నది? ఇంత గర్వమా! 'నా భర్త సంపాదించుచుండ నే నేలపనిచేయవలయు' నని విఱ్ఱవీగుచుంటివేమొ! అట్టి పొరపాటు పడకుము. నీభర్త లక్షలు సంపాదింపనిమ్ము, ఈ యింట నా యధికారమే చెలాయించును. నేను నాల్గుపళ్ళాలు గడించు నంతనే యింతకాలములకు నే యజమానురాల నైతినని కులుకుచున్నావేమొ! విద్యాబుద్ధులు గఱపి పెంచి పెద్దవానిజేసిన మేము మన్నుకొట్టుకొని పోవలసినదేనా! ఎంత గర్వించుచున్నావే! ఆహా! కాలవైపరీత్యము! నిన్నమొన్నటి పిల్లల కెట్టి స్వతంత్రాలోచనలు!—" అని నన్ను తూలనాడెను.

నే నేడ్వసాగితిని. నానోట మాట రాలేదు. నా పెనిమిటి వారి కచ్చేరీగదిలో కూర్చుని వార్తాపత్రిక చదువుచుండిరి. ఈ మాటలు వారి చెవినిబడె కాబోలు. రాత్రి నిదురింప వచ్చినపుడు నన్ను చేరబిలిచి, "చూచితివా మా అమ్మగారి క్రోధపూరిత వాగ్బాణ పరంపరలు! స్త్రీ జన్మ యిట్టి కఠోరవాగ్బాణముల సహించుటకేనా! ఇట్టి మాటల నాలకించినపుడు నే బొందు మనోవేదన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుస్సహము. జీవితము భారముగ దోచును. హృదయము కంపించును. జలవాయు ప్రకాశములు లేక శుష్కించు మొక్కవోలె మనుజుని విద్యాభిజ్ఞానము లడుగంటుచున్నవి. ఇంతేల? నే నామె ముందు నోరెత్త నేరనైతి. తలిదండ్రులు నాయెడ సర్వాధికారులై యుండుటచే నానోట మాటేని రాలేదు. నావలన నీకు నట్టిగతియే కల్గుచున్నందులకు విచారముగ నున్నది. నీవు వారిమాటల వినజాలక ప్రత్యుత్తర మొసగుదేని నాకు మిగుల కష్టముగ నుండును. విషపాన మొనర్చి ప్రాణత్యాగ మొనర్చుకొనవలె నను బుద్ధి వొడముచును. సరే. ఇప్పుడు మనకు రెండే మార్గములున్నవి. ఒకటి వారి సూదిపోటుమాటల నన్నిటి విని సహించి యూరకుండుట, రెండవది మన మార్గము మనము స్వతంత్రముగా జూచుకొనుట. చెప్పుము, ఇందేది నీకిష్టమో. అమ్మగారి స్వభావ మిక నెన్నటికేని మాఱునని యూరకొనుట మాత్ర మిక అసంభవము. నీ యిష్ట మేమి?”

నేను భయపడుచు భయపడుచు “మీ కేది సమ్మతమో నాకు నదియే సమ్మతముగు. ఆమె నన్ను చదువ వలదనిన మానివైతును. నే నెటుల ప్రవర్తించిన నామె ప్రసన్నచిత్తయగునో యటులనే ప్రవర్తింతును. నేను చదివి యేమిచేయవలయు” నని ప్రత్యుత్తర మిచ్చితిని.

నాభర్త—“నీవు చెప్పునది నాకెంతమాత్రమును నచ్చలేదు. అవిద్యాంధకారమున బడి యెంతకాల మిట్లీనులాడుట? అమ్మ నేడు దూషించుట ప్రారంభించినది. అనుదినము దూషణము హెచ్చునే కాని యిక తగ్గదు. నేను నిన్నెంత విద్యావతిగ చేయదలచిన నన్నామె యంత యడ్డును. చిన్ననాటి పరిస్థితులు మారినవనియు, నేడు భారతమాతకు సత్పుత్రికారత్నముల యవసరము ముఖ్యమనియు, స్త్రీలు చేతగాని పిరికిపందలవలె నింట గూర్చుండి దేశమందలి యాందోళన మెఱుంగక, దేశస్థితి దెలియనేరక వృథాలాపముల కాలము పుచ్చు సమయ మిది కాదనియు నామె యెన్నటికి నెఱుగ నేరదు. కాన నామాట బాగుగ నాలోచింపుము. మన మే పట్టణమునకైన బోయి యొకరి యొత్తిడి లేక స్వతంత్రముగ జీవింతము. ‘ఇక్కడ ప్రాక్టీసు బాగుండదే’ యను మిష మీద ఇంటనుండి మెల్లగ దాటిపోవచ్చును.

నాపెనిమిటి పలుకులన్నియు విని నేను వారికి విరుద్ధముగ నేమియు జవాబు నీయలేకపోతిని. ఒంటరిగ నుండవలయునే యనుజ్ఞకున్నను కాని అచ్చట నే పోరులేక సుఖముగ కాలయాపన మొనర్పవచ్చునను నుద్దేశ్యము మదీయమానసమును వికసింపజేసెను.

## 3

నాటినుండియు నాయత్తగారు నాతో మాటలాడుట మానివేసినది. ఇరుగుపొరుగు అమ్మలక్కల పరిహాసములకు నే గురియైతిని. ఇదంతయు నాకు మిగులకష్టముగ నుండెడిది కాని వారందఱిమాటల సహించి యూఱకుండుట కంటె నాయత్తగారి తిట్లే మేలనితోచెను. ప్రపంచమునకు నాభర్తగారియెడ గూడ గౌరవ మర్యాదలు తగ్గ నారంభమయ్యెను. నేను నాభర్తను మందుమాకుల వశీకరణ మొనర్చుకొంటినను వదంతి ప్రబలెను.

శ్రావణమాసము, కృష్ణాష్టమి, లోకరక్షకుడగు కృష్ణభగవానుని పుట్టినదినము. నాడు మాయింట నందఱును ఉపవాస ముండిరి. నేను నుపవసించితిని. పరాత్పరుడగు మాధవుడు రాత్రి పండ్రెండుగంటలకు జనించెను. మేమందఱ మొక్కచో గుమిగూడి యాసర్వేశ్వరుని మీద పాటల పాడుచుంటిమి; ప్రార్థన సేయుచుంటిమి. నాభర్త యిట్టి మూఢాచారములన్న మండిపడువారు. ఇట్టిదినముల వారు స్నానముకూడ మానెడువారు. ఆనాటిరాత్రి యుత్సవమంతయు ముగిసినపిమ్మట నిదురించుటకు నేను గదిలో కాలిడితిని. అప్పుడు వారు—“ఎందులకిట్లు శరీరము శోషింపజేసికొనెదవు? కృష్ణుడు తప్పక మహానుభావుడే. అతని పూజించుటయు మనకర్తవ్యమే కాని యిట్లు పస్తుండుటవలన కల్గు లాభమేమియో నాకు తెలియకున్నది. ఇదియొక నటన. భక్తియన పవిత్రత, విశ్వాసము, సత్యము.” అని బోధింప దొడగిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాభర్త భగవద్గీతల విశేషముగ కొనియాడుచుండువారు. పఠించుటెప్పుడు నే గనలేదు. ఉపనిషత్తుల ప్రశంసించునపుడు నోట పుష్పవృష్టి కురిసెడిది. వారు పనిషత్తుల నుచ్చరించుట నాచెవుల నెన్నడు బడలేదు. వేదాంతమే భారతదేశ దౌర్భాగ్యమునకు మూలకారణమని వారి ప్రబలవిశ్వాసము—"భారతదేశ పునరుద్ధరణమునకు నేను శౌర్యనిధులగు పుత్రపుత్రికా రత్నముల యావశ్యకత యెక్కువగా కలదు. ఇది ముక్కు మూసుకొని కూర్చుంట కదను గాదు."

నాభర్త వాక్యములకు ప్రత్యుత్తర మొసంగు సామర్థ్యము నాకెక్కడ? వీరు కేవలపాశ్చాత్యమార్గానుసరణులై యుండిరే యని తలపోసితిని.

౪

మేము చెన్నపురి జేరితిమి. రెండంతస్థుల మేడ నొకదాని బాడుగకుతీసి యందు వసింప నారంభించితిమి. ఆభవన మెంతయో శృంగారముగ నుండెను. విద్యుద్దీప ప్రకాశమున తద్భవన శృంగారము ద్విగుణీకృతమగుచుండెను. ఇరుపార్శ్వముల నున్న తరులతాగుల్మాదులు పథికులకు తమ నీడచే విశ్రాంతి గలుగజేయుచు సృష్టివైచిత్ర్యమును విశేషముగ జాటుచున్నవి. మాయొద్ద అయిదుగురు నౌకరు లుండిరి. స్త్రీలిద్దరు, ముగ్గురు పురుషులు. ఎల్లప్పు డొకనవల చేతగొని పడకకుర్చీలో పరుండి చదువుచుండుట దప్ప యింట పనియేమియు నాకు లేదు. కంచు, ఇత్తడి మొదలగు పాత్ర లింట మచ్చుకేని గానవచ్చుట లేదు. గాజుప్లేట్లు, సాసర్లు, కప్పులు మొదలగు విదేశవస్తు సామగ్రి వాటిస్థాన మాక్రమించెను. భోజనము సేయురీతియు పాశ్చాత్యదేశజులనే యనుసరించితిమి. అట్లు తినుటయందు మావారి కెంతేని యానందము. కొలదిదినములవరకు నా కట్లు తినుట సిగ్గుగ నుండెడిది. క్రమేణ నేనును ఆ పద్ధతికే యలవడితిని.

మాయొద్ద నొక మోటారు, జోడు గుఱ్ఱముల బగ్గీయు కలవు. కాలినడక బొత్తుగ మఱచితిమి. ఎవరినేని చూచుటకు పదియడుగుల మేరపోవలయు నన్న బండి సిద్ధముగ నుండవలె. నాభర్త "అప్ టూ డేట్ ఫేషన్ అన నిదే" యనెడి వారు.

మెల్లగ మాకు రాబడిదినములు తగ్గె. ఇంటి ఖర్చు గూడ సరియగు మార్గము త్రొక్కలేదు. మధ్యమధ్య వారి ముఖమండలము విషాద మేఘాచ్ఛన్న మగుట గనెడిదాన. రాబడి తక్కువగ నున్నపు డీవ్యయమేల తగ్గింపరాదు? ఇంత పెద్ద భవనము మనకేల? ఏచిన్న యిల్లో తీసికొన్న మనకు చాలదా? అయిదుగురు నౌకరు లవసరము మనకేమి! ఇద్దఱున్న కాలక్షేపమగునే! యని యెన్నియో సార్లు వారికి చెప్పుచుండుదాన. నా మాటలు విని పరిహసించుచు, "మనము దరిద్రులమని డప్పువాయించి చాటుకొందుమా? దారిద్ర్యప్రకటనము దారిద్ర్యానుభవముకన్నను దుఃఖకరము. మనము నిర్ధనుల మనుమాట మఱచిపొమ్ము. లక్ష్మియనతికాలముననే మనయెడ మరల ప్రసన్నయగు. వ్యయము వృద్ధియగుట, అవసరములు పెంపొందుట ద్రవ్యోపార్జనమునకు ప్రథమ సోపానములని నమ్మము. కష్టములకు కించపడుచు నొక్కచో గూర్చున్న నడుగు ముందుకు పడునే! సుఖానుభవమునకు యోగ్యుల మగుదుమే!"

ఏది యెటులైనను మావ్యయము దైనందినాభివృద్ధి నందుచునే యుండెగాని తగ్గుదల నూపలేదు.



"క్రమేణ నేనును ఆపద్ధతికే యలవడితిని."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మేము వారమునకు నాలుగైదు మారులు "సినిమాలకు", నాటకప్రదర్శనములకు వెళ్లెడివారము. వారమునకు రెండు మూడు పర్యాయము లైన మా యింట మిత్రులకు విందు జరుగుచుండెడిది. జీవిత ముఖ్యాదర్శము సుఖభోగానుభవమే యనుభావము నాకుగూడ పొడకట్టెను. మన మనుభవింపనే భగవంతుడు ఉత్తమ వస్తుజాలముల ప్రసాదించినాడు. అనుభవించుటె మనపంతు."

ఒకక్రైస్తవస్త్రీ నాకు నాంగ్లభాషను నేర్పను, సంగీతము చెప్పను వచ్చుచుండెడిది. "పియానో" నొకటి కొంటిమి. ఈకృత్రిమ మహదానంద సాగరమున మున్గి నేను రామాయణ భారత భాగవత పఠనమునకు స్వస్తి జెప్పితిని. ఇప్పుడు నా కాపుస్తకములన్న మిగుల నేవగింపు జనించె. దేవతలయందు నాకుండెడి భక్తివిశ్వాసములు తొలగ దొడగె.

నానాట ఇక్కడి పెద్దమనుష్యులతో స్నేహము కుదిరె. నూత్నముగ స్త్రీసంఘ మొకటి మేముండు ట్రిప్లికేనులో స్థాపింపబడె. ఈసంఘసభ్యురాండ్ర నడకలు, పోకడలు నాకు మొదటిలో ఆశ్చర్యము గొల్పెడివి. ఈసంఘమున నేను చాలదినములవరకు కేకి మూకమధ్య కాకివలె నుంటిని. ఈసంఘస్త్రీలు గుఱ్ఱపుస్వారి, టెన్నీసు ఆటలు, ఈతలు నేర్చి నేర్చుచు కేరింతలు గొట్టుచుండువారు. స్త్రీవిద్యాభివృద్ధి, స్త్రీస్వాతంత్ర్యములగూర్చి చర్చలు, వార్తాపత్రికలు మొందిడుకొని యందలివ్యాసముల దోషా దోషముల చర్చించి నిరూపించుతఱి వారు చూపు బుద్ధికుశలత, చాకచక్యము, వాగ్వివాదపటిమ నాకచ్చెరువు గొల్పెడివి. వీరపరసరస్వతులవలె నాకుదోచెడివారు. సంకోచసంభ్రమములవీడి బీచియొడ్డున పురుషులతో చేతుల గల్పి యటునిటు నడయాడుచుండుట గాంచి మొదటిలో వారి సాహసమున కాశ్చర్యపడుదాన. వారు నన్ను తమవెంట రమ్మనెడివారు. నేను లజ్జావశమున వెళ్లజాలకుండెడిదానను. ఆస్త్రీలమోము లెప్పుడు సంతోషవికసితములై యుండెడివి. వ్యాకులచిత్తలైవా రెన్నడు నాకు కానరాలేదు. మిస్టర్ కృష్ణారావ్ జబ్బుగా నున్నప్పటికి మిసెస్ రావ్ మోమున చింతారేఖ కానరాదు. మిస్టర్ రావ్ హృద్రోగమునకు లండను నగరమున చికిత్సనందుచున్నను మిసెస్ రావ్, మిస్ పూర్ణ నిత్యము టెన్నిసుఆటలకు వచ్చుచునే యుండిరి. ఇట్టి నాగరికతామూర్తుల మధ్య నాయవస్థ యెట్లుండెనో నాకే యెఱుక.

ఈస్త్రీల సంభాషణముల నెట్టి యాకర్షణశక్తి కలదో కాని, మెల్లమెల్లగ నాకుగూడ వారి ఆమోదప్రమోదములలో పాల్గొనవలయునను కోర్కి జనింప మొదలిడెను. వారిబోలె స్వాతంత్ర్యము గాంగియుండవలయునను నిచ్ఛ ప్రబలనుగుచుండె. ఇంగ్లీషున వారు భాషించుకొనుచుండ నెన్నడు నాకట్టిభాగ్య మబ్బునా యని తలచుచు సుఖస్వప్నముల గాంచుచుండుదాన.

ఇట్లుండ నాస్థితి క్షేనజవకమగుచువచ్చె. నాభర్త నన్ను "మైలవ్", "మైడియర్" "మైడార్లింగ్" అని సంబోధించువారు. ఆమాటలు హృదయమునుండి వచ్చినవికావనియు, నందు కృత్రిమత యున్నదనియు తెలపోయుదాన. వారికి నాయెడ నున్న స్నేహములో హార్దికభావములకు మాఱు అలంకారము లెక్కువగా నున్నటుల కన్పట్టుచు వచ్చినది. అన్నిటికంటె నెక్కుడు నాకుగూడ నాభర్తయెడ నుండు శ్రద్ధాభక్తులు తొలగిపోనారంభించె. వారికి శిరోవేదన కల్గిన తొల్లిటి యట్లు నాకిపుడు హృదయవేదన కల్గుటలేదు. నాయందు ఆత్మాభిమానము, స్వార్థపఱత హెచ్చె. ఇప్పట్టున నేను సింగారించుకొనుట కూడ నాకర్తవ్యమునకే గాని నాభర్త నానందింప జేయుటకు గాదు. నాసౌందర్యమందు నాకు గర్వము. నేను జీవించుట యొరులకొఱకు గాదనియు, నాకొఱకే యనియు భావింప దొడగితిని. త్యాగము, సేవ హృదయము నుండి దూరము లయ్యె.

నల్గురిలో మాత్రము తిరుగుటకు నా కింకను సంకోచముగనే యున్నది. పలువురనోట నాసౌందర్యాధిక్యము వినవలయునని కుతూహలము. ఒకనాడు మిస్టర్ రావ్ ప్రభృతులతో మా వారు కూర్చుండిరి. నాకును వారికిని మధ్య కేవలమొక తెఱ యడ్డు. నేను వారియెదుట స్వేచ్ఛగా కూర్చుండలేదని నాభర్తకు కష్టముగా నుండెను. నే నిట్లుండుట వారి గొప్పతనమున కేమొ లోపమని నాభర్త భావించువారు. "నాభార్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వస్త్రధారణ సౌందర్యలోపయూలమునగాదు ఈవలకు రాకుండుట, లజ్జావశమున" అని వారలకు జెప్పువారు. నానగలు, నాబట్టలు, నాఅందము వారికి కనబడుటకు మాటిమాటికి నన్ను తెఱయొద్దకు బిలుచువారు. ఎట్టకేలకు నాభర్త యిష్టమే నెరవేఱెను. రెండుసంవత్సరము లగు సరికి నేను సంభ్రమసంకోచముల వీడి నాభర్తతో కలసి "షైర్" చేయ మొదలిడితిని ఆ "షైర్" వెనుక "టెన్నిసు" వంతు వచ్చెను. "క్లబ్బులో మెంబరు" నైతిని మొదట నాకీ "టెన్నిసు" "క్లబ్బు"లన తల నొప్పిగా నుండునవి.

క్లబ్బునందు ఇంతకన్నను చిత్రము. జనులు ఇంగ్లీషుమాటల తనుభావములో దొర్లించుచు వెకిలిన వ్వుల నవ్వును, సారహీనసంభాషణముల కాలము బుచ్చు వారు. స్త్రీల యానిర్లజ్జత, పురుషులభావశూన్యత మొద టిలో నాకాశ్చర్యము గొల్పెడివి. నలుదెసల నీపాశ్చా త్యపద్ధతులు హాస్యజనకములుగ నుండెను. ఏమైననేమి? నేనును వారి ననుసరించితిని. నాకిప్పుడు నిత్యము క్రొత్త క్రొత్త దుస్తులు, సింగారములు. క్లబ్బునందు టెన్నీసు ఆడునపుడు అందఱిదృష్టులు నామీద ప్రసరింపవలయు నను ఉత్సాహము. నాభర్తకుజేయు సేవాసత్కారము లందుండు శ్రద్ధకన్న నాయలంకారములందు నాకెక్కువ శ్రద్ధ కలుగజొచ్చెను. అంతేకాదు. పరులనోటినుండి నాసౌందర్యప్రశంస వినవలెనను కుతూహలము. ఏసౌం దర్యమున్న, నెట్టి శృంగారములన్న నాశరీరమున రోమ రోమము హేయభావమున కంపించుచుండెడినో, యెట్టి హాస్యకటాక్ష వీక్షణములు విషతుల్యములై నన్ను మృత్యుముఖమున జొర ప్రేరేపించెడివో యట్టి యిహ లోకసౌఖ్యములందు నాకిపుడొక యున్మాదపూర్ణమౌ హర్షము కలుగుచుండెను. కాని యెన్నడేని నాపూర్వ స్థితి దలచుకొన్న మనమున మాత్రమొకవిధమగు భీతి జనించుచుండును. ఈ నావ యేయొడ్డున జేరునో యను తలంపు. కొన్నిసమయముల క్లబ్బునకు పోగూడదనియు, స్వేచ్ఛాపరలగు నీయువతులతో స్నేహము వలదనియు ననుకొనుదాన. అయిననేమి, సమయ మగుటతోడనే క్లబ్బునకు సిద్ధపడుచుంటిని. నేను నావశమున లేను. మనమందలి సత్కల్పనలన్నియు మంట గలియుచుండు. సద్భావములన్నియు నశించు.

నాభర్త స్వభావమున మార్పు కల్గుచుండెను. వారు విచారమానసులై కనబడుచున్నారు. ఏదో కఠిన మగు చింతచే కృశించుచున్నట్లు కనబడుచు వచ్చిరి. ముఖము పాలిపోయె. తమమిత్రులతో పోట్లాడ నారం భించిరి. బయటకు వెళ్లుటకూడ తగ్గించిరి.

ఇంత శోకమానసము క్రితము వా రెన్నిపను లున్నను క్లబ్బునకుమాత్ర మవశ్యము వెళ్లువారు. క్లబ్బు నకు వెళ్లని దినమున వారికి మతిపోయినట్లుండెడిది. కాని వా రిప్పు డధికముగ వారి గదియందే పడకకుర్చీ మీదనో పరుండి వార్తాపత్రికనో, పుస్తకమునో చదువు కొనుచుండు వారు. ఇట్లుండుటకు కారణ మేద్దియో మాత్రము నే నూహింపజాలకుండుదాన.

౫

ఒక దినమున వారు జ్వరపీడితులై యెట్లున్న వా రట్లనే స్మృతిలేక మంచముమీద పడియుండిరి. వారి యొద్దకు బోవలెనను బుద్ధియే నాకు కలుగలేదు. సభలు, ఉపన్యాసములు వీనియందు నామనస్సు తగిలి యుండెను. వారియొద్దకు వెళ్లుచుందును; క్షణములో మరలి వచ్చి,"టెన్నీసునకు టైమ్అయ్యెను. వెళ్లనా, వద్దా"యను సంశయములో మునుగుచుంటిని. తుదకు "ఎక్కడనున్న నేమి లాభము? నే నిచ్చటనున్న మాత్రాన వారిజ్వరము తగ్గునా? ఆగుటవలని ప్రయోజనమేమి? వెళ్లిననే బాగుండు"నని నిశ్చయించుకొంటిని. నేను దుస్తుల తొడిగికొని "రేకట్" తీసుకొని క్లబ్బునకు వెళ్లితిని. అక్కడి చెలికత్తెలు మిసెస్ రంగనాథఅయ్యర్, మిసెస్ రాస్, మిస్ పూర్ణలతో నాభర్తయవస్థ జెప్పి సజల నయనములతో కూర్చుంటిని. టెన్నీసుకోర్టునకు మిస్ పూర్ణ నన్ను కేకవేయ నొక దీర్ఘనిశ్వాసము మాత్రము వదలి వారివెంట వెళ్లి యాడితిని.

నేటికి మూడుసంవత్సరములకు పూర్వము! నా భర్త యిట్టి విషజ్వరముచే పీడితులై యున్నపుడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాత్రియంతయు నిద్రలేక వారికడ కూర్చుని విసరుచునే యుంటిని. వ్యాకులహృదయనైతిని. "వారి కేల రావలె ఆజ్వరము, నాకేలరాదు" అని తలపోసితిని. ఆహా! కాల వైపరీత్యము. ఇప్పు డాహృదయము స్నేహశూన్య మయ్యెఁ; పాషాణప్రాయమయ్యె. నే నెప్పటివలె రాత్రి తొమ్మిది గంటలకే యిల్లు జేరితిని. నాభర్త మంచిస్థితిలో నున్నట్లే కాన్పించిరి. వారు కేవల మొక్కపరి దీన దృక్కులు నాపై బఱపి యటు ఒత్తిగిలి పరుండిరి. నేను భోజన మొనర్చి పరుండునెడ నా యంతరాత్మ నాస్వార్థపరత్వమునకు, ఈ లీలావినోదములకు నన్ను నిందించె.



"నేను దుస్తులతొడిగికొని......క్లబ్బునకువెళ్లితిని."

ఇప్పుడు నేను ఆంగ్లోపన్యాసములను, నవలలను అవలీలగ గ్రహించుచున్నాను. మాసంభాషణ తఱుచు ఇంగ్లీషుననే. మాకన్న తక్కువ వారితో మాటాడుట హేయముగ భావించుచుంటిమి. హైందవస్త్రీలు నాగరి కతాశూన్యలని తలపజొచ్చితిమి.

మఱుచటి దినమున గూడ నా భర్త జ్వరము తగ్గలేదు. నేను క్లబ్బునకు వెళ్లలేదు. కాని మూడు దినములవరకు జ్వరము తగ్గకుండుట చూచి మిసెస్ కే. ఎస్. రావ్ 'డాక్టర్ తిరుమల్‌కు కబురు పంపరాదా' యని సలహానిచ్చెను. నే నట్లుచేయ నంగీకరించితిని. మరునాటి నుండియు డాక్టర్ వచ్చుచు పోవుచుండెను. నాభర్త సేవాశుశ్రూషలకు "నర్సు" ఒకతె నియమింప బడెను. నాకు గూడ భర్తకు సేవచేయు అవసరము తప్పెగదాయను సంతుష్టికల్గెను. రెండుదినములు నేను క్లబ్బునకు వెళ్లుట పడకపోయినప్పటికి మనస్సు అక్కడనే యుండెను.

ఒకనాటి మట్ట మధ్యాహ్నమున నేను పడక కుర్చీలో కూర్చుని యింగ్లీషునవల నొకదాని చేతగొని చదువుచుంటిని. ఆకస్మికముగ నామనమున 'నాభర్తరోగము తిరుగుట దుస్సాధ్యమయినచో నెట్లు?' అనుభావము జనించెను. ఈశోకమయ కల్పనవలన నాకు దుఃఖముకల్గుటకు మాఱు ఆనందము కల్గెను. 'మిసెస్ రావ్, మిసెస్ రాస్, మిస్ పూర్ణ నాయెడ సానుభూతి ప్రకటింతురు. వారిని చూచుటతోడనే నే నశ్రుపూరితనేత్రనై నిలిచి, 'సోదరీమణులారా! నా జీవన మిప్పుడు భయానకమ్మైకాన దీపమువలె క్రుంగి యంధకార భూయిష్ఠమై పోయినది. నన్ను జూచి జాలి నందనేల?...'అని మనమునందొక శోక పూరితమగు నుపన్యాసరచన గావించుకొంటిని పాపము క్షమించుగాత! శవమువెంట పోవునపు డెట్టిబట్టల కట్టు కొనవలయునో యనునిర్ణయము కూడ మనమున చేసి కొంటిని. వీరి మృత్యువార్త పట్టణమెల్లెడ వ్యాపించును. ప్రతిసంఘము నుండియు, పరిచయముగల ప్రతివ్యక్తికడ నుండియు నాకు సానుభూతిలేఖలు కొల్లలుగవచ్చును. వానికి నేను ప్రతియుత్తరమునకు ప్రత్యుత్తరమునీయ నగునర్థము. శోకసంతప్త హృదయకు నాకు సమయ మెక్కడ? "అందఱకు కృతజ్ఞురాల. మృతాత్మశాంతికి సర్వేశ్వరుని ప్రార్థింప మిమ్ము వేడెద" నని పత్రికాముఖమున ప్రకటింతును." ఇట్టి యాలోచనలలో మునిగి తేలుచుండ నర్సు వచ్చి—'అమ్మా! అయ్యగారు పిల్చు చున్నారు —'అనెను.

అది నాకు క్లబ్బువేళ. వారప్పుడు నన్ను పిల చుట నా కాటంకము. ఏమిచేయుదు? ఎటులనో వెళ్లితిని. నాభర్తమంచము నెక్కి నేటికి రమారమి మాసము దినములు కావచ్చినది. వారు నావైపు దీననేత్రముల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూచుచుండిరి. ఆకనుల నీరు నిండియుండె. వారిని చూడ నాకును జాలిపొడమె. కూర్చుని ధైర్యము చెప్పుచు, "ఏమి చేయుదు? మరియొక డాక్టరును బిలతునా?—"

"నే నిచ్చటనున్న నాకీరోగము మరలదు. నన్ను మాయమ్మ యొద్దకు గొంపొమ్ము."

"ఏమి! ఇక్కడకన్న నెక్కువ చికిత్స జరుగునా యక్కడ?"

"జరుగనిమ్ము, జరుగకుండనిమ్ము. నామనమేలనో మాతృదర్శనముగోరి వేగిరపడుచున్నది. ఔషధసేవవలన గాకున్నను మాయమ్మ దర్శనముననే జీవింపగలను అను ధైర్యము నాకు కల్గుచున్నది."

"ఇది వట్టి భ్రమసుమండీ."

"భ్రమే కానిమ్ము—నా ప్రార్థన నాలకింపుము. ఈ రోగమువలన గాదు. మన ప్రస్తుత జీవితమార్గమునుండియే నాకు దుఃఖము కల్గుచున్నది."

ఆశ్చర్య చకితనై నేను నాభర్తను తిలకించితిని.

వారంత— "ఈ జీవనమునుండి నేను మిగుల విసిగితిని. నిర్మలజలప్రవంతులచే పవిత్రమగు భూమి మన మాతృభూమియేయని నే నీనాడు గుర్తింప కల్గితిని. నేనింతకుపూర్వము ఈ హేయజీవనమును మిగుల ప్రేమించితిని. ఇప్పుడు నాకు దాని యాంతరంగికావస్థలు బాగుగ బోధపడినవి. ఆద్యంతము కంటకావృతమైన జీవితమందు నేటివరకు తిరుగాడుచుంటిని. ఈ జీవనమున హృదయానందముగాని, యాత్మకు శాంతిగాని లేదు. ఇది యొక యున్మత్త, అశాంతిమయ, స్వార్థపూరిత, విలాసయుతమౌ జీవితము. దీనియందు నీతి, ధర్మము, సహానుభూతి, సహృదయత శూన్యములు. పరమాత్మ ప్రీతికొఱకైన నీవు నన్నీయగ్నినుండి రక్షింపుమా! ఉపాయాంతరమేమియు లేనిచో మాయమ్మ కొక లేఖనైన బంపుము. ఆమె తప్పక వచ్చును. ఆమె మమతాపూర్ణదృష్టి, ఆప్రేమయుతశుశ్రూష నా కమృతోపమములగు. నే జీవింతును. ఆమె వచ్చును. ఆమె తప్పక వచ్చును. వచ్చి యీనిర్భాగ్యుని యవస్థ గాంచును. ఈ నీచాతి నీచమగు నవనాగరకతాసంఘముల గాలి ఆమె కింకను సోకలేదు. ఆమె వచ్చును; వచ్చును; తప్పక వచ్చును. నాకన్నులు ఏ ప్రకాశమాన పవిత్ర దివ్యజ్యోతికినై తహతహలాడుచున్నవో ఆజ్యోతి యింకను ఆమె మొగమందే తాండవమాడుచుండును. ఆమె హృదయమున స్నేహము, సత్యము, విశ్వాసము పాదుకొనియున్నవి. ఆపవిత్ర మాతృమూర్తి యంకముననే చనిపోయినను నాయాత్మకు శాంతికల్గును. మోక్షము కరతలామలకమగు. స్వర్గలోక సంతోష మంద గల్గుదును."

జ్వరతీవ్రతచే వాగ్ధోరణి హెచ్చెనేమో, 'టెంపరేచరు' తీసి డాక్టరుయొద్దకు బోదునని 'నర్సు' 'థర్మామీటరు' తీసికొని వారియొద్దకు వెళ్లెను. నాభర్త యామె చేతిలోనుండి యీజ్వరమానయంత్రమునుదీసి నేలగొట్టిరి. అది ముక్కముక్కలయ్యెను. వారు నన్నంత హాస్యమయదృష్టి నవలోకించి "దుస్తుల దాల్చితివి. క్లబ్బునకుపోదువుగాబోలు. ఆదారిని పోవునపుడు డాక్టరుగారిని కలసికొని— మావారి టెంపరేచరు తుదిడిగ్రీకి యెక్కెనని మాత్రముచెప్పుము" అనిరి.

నేనంత భయభీత నైతి. హృదయమున కరుణావిచారములు ముప్పిరిగొనె. కంఠము రుద్ధమయ్యె. నాభర్త తమనేత్రముల మూసిరి. వారి యుచ్ఛ్వాసనిశ్వాసములు తీవ్రములయ్యె. డాక్టరును పిలుచు తలంపుతో నేను ద్వారముకడ కేగునంతలో వారు లేచి కూర్చుని నావైపు దీనముగ జూచుచు "కమలా! నేను నీతో కొంచెము సేపుమాటాడవలెనని చాలాకాలమునుండి యోచించుచుంటిని. కాని సాహసము కలుగదు. నేడు తప్పక నాహృద్గతములను నుద్దేశముల చెప్పివేయదలచితిని.— పూర్వజీవనమునందే సుఖమునందవలయునని యాశించుచున్నాను. ఈ జీవితమున్న నా కసహ్యము కల్గుచున్నది. ఇదే నారుగ్మతకు ముఖ్యకారణము. శరీరకష్టమున కాదు—మానసికకష్టమున గృశించిపోవుచున్నాను. నిన్ను తిరుగ ఆజ్ఞావర్తినిగ, భగవదారాధనా తత్పరవుగ, రామాయణ పఠనాసక్తవుగా గాంచవలెనని యూహ. గృహకార్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్వహణమున శ్రద్ధాభక్తులుకల్గి, రాట్నపరిశ్రమ మొనర్చుచు సర్వేశ్వరసంసేవను కాలముగడపు నీయానాటి మూర్తి మరల గాంచవలెనను నాయాశ వృథ కాజనదు. నన్ను నీవానినిగా గ్రైకొమ్ము; నీవు నాదానవు కమ్ము. వంచనారహితమగు నాపరిశుద్ధజీవితమందే వాస్తవిక సుఖముకలదని నే నీనాడు గ్రహింపగల్గితిని. చెప్పుము. నీకేది యంగీకారమో? నీ వెన్నడు నామాట జవదాట లేదు. నాముద్దు చెల్లింపకున్న ఈనికృష్టజీవన మెట్లు పరిణమించునో! ఏమి? కమలా! నాముద్దు చెల్లింపవా? చెప్పుము—చెప్పవా? —"యని బ్రతిమాల దొడంగిరి.




"నిన్ను తిరుగ ఆజ్ఞానువర్తినిగ.........రామాయణ పఠనాసక్తవుగా గాంచవలెనని యూహ."

వెంటనే నేనేమియు ప్రత్యుత్తర మొసగ జాలనైతిని. ఈ స్వాతంత్ర్యజీవితమందున్న సుఖమునుగూర్చి యాలోచింప దొడగితిని. ఈయానందమక్కడ నెక్కడ! ఇన్నిదినములు స్వతంత్రరాజ్యమునందు స్వేచ్ఛాభ్రమణ మొనర్చిన పిదప మరల నస్వతంత్రతా జాలముల చిక్కువడు టెట్లు! సేవకురాలినై యచ్చట కాలముగడపు టెట్లు? నాభర్తయేగా నా కీస్వాతంత్ర్య పాఠముల నేర్పినది. పవిత్రపురాణపఠనమం దనిష్టత గలుగజేసినది వారే గదా! నేను వారి యిచ్ఛానుసారము మెలగితినే. ఏమి యపరాధ మొనర్చి యుంటిని?—అని ఆలోచింప దొడగితిని. కాని నాభర్త దీనతాపూర్వదృక్కుల నవలోకించి నంత నేనేమియు చేయజాలనైతిని. "ఇక్కడ మీ కేమి కష్టముగా, నున్నది?" అని మాత్రమంటిని.

నాభర్త తిరుగ లేచి కుర్చుని నావైపు కఠినముగ జూచుచు, "ఈప్రశ్న నన్నడుగుటకు పూర్వము నీహృదయమునే యడిగిన బాగుండును. నేటికి మూడేండ్లక్రితము నీకుగల ప్రేమ నేడున్నదా? నీకన్న నన్నివిధముల యుత్తమునిగ తలచిన నాయెడ నీవు నే డెట్టి యనాదరణ జూపుచున్నావు? ఈయర్వాచీననాగరికత నారీజనమును సర్వనాశన మొనర్చుచున్నదని నేనిప్పుడు గ్రహింపగల్గితిని. మూడువత్సరములకు పూర్వము నే నిట్టి దశయందున్నప్పుడు నన్ను వదలి యీరీతి యిరుగు పొరుగిండ్లకు వెళ్లెడిసాహసము నీకుండెడిదా? నేను రోగపీడితుడనై మంచముమీద బడియున్నపుడు నోరార నెవ్వరితోడనైన మాటలాడెడిబుద్ధి నీకుపొడమెనా? ఇతరుల నెన్నడేని కంట జూచితివా? స్త్రీలహృదయపేటికారత్నము ప్రేమ. ఈనవనాగరికత దాని నాశనమునర్చుచున్నది. నా కిప్పట్టున పూర్వాచారములే పవిత్రములుగ గన్పట్టుచున్నవి. వారి జీవితోద్దేశము ఆత్మికశారీరకాభ్యుదయము, హృదయపవిత్రత. ఈ హేయాతిహేయమగు జీవితోద్దేశము నిర్లజ్జ, స్వేచ్ఛాప్రవృత్తి, మాయావము —ఏమి కమలా! అట్లు చూచెదవు? నాప్రస్తావన నీకిష్టము లేదా?"

నాహృదయమున వజ్రపాత మయ్యె. అందు దాగియున్న లజ్జ పునరుజ్జీవితమయ్యె. నాయంతరాత్మ నీవానాటి పవిత్రాత్మవు కావని బోధింపగడగె. ఆనాటి సౌశీల్యము, నేటినిర్లక్ష్యత, విలాసము, స్వార్థపఱత కన్నులకు గట్టినట్లాయె! 'నీకర్తవ్యమును నీవు మరచితివి సుమా!' యను అంతరాత్మ ప్రబోధములకు మేల్కొనియు కొండొకవడి నిశ్చేష్టనై నిల్చితి.

అంత ముకుళితకరకమలనై భర్తృచరణములకు శిరము సోక నేల వ్రాలితిని. కంఠావరోధమున నోట మాటరా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అహమదాబాదులో నున్న హాతీసింగ్ సమాధి

'టైమ్సు ఆఫ్ ఇండియా' అన్నుయలు నుండి క్రైకొనినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దయ్యె. నయనము లశ్రుధారాపూరితము లయ్యె. నాథ్తగారు నన్ను గాఢాలింగనమున గారవించిరి. మాహృదయము లొక్కటియయ్యె.

ఇలు జేరితిమి. మా యత్తగారి గౌరవమునకు పాత్రనైతిని. మావారు సంతుష్టహృదయు లైరి. ప్రాత ర్మస్తు మునస్వస్తి జెప్పిభగవద్గీతపారాయణమున, సంధ్యా వందనాది పూజార్చనముల శ్రద్ధకల్గియున్నారు. నేనును భారత భాగవత రామాయణాది పురాణముల మిగుల శ్రద్ధతో జదువుచున్నాను. ఈమధ్య రాట్నప్రచారము విరివిగ జరుగుచుండుటజేసి రాట్నము త్రొల్లి టికంటె శ్రద్ధతో వడకుచున్నాను.




---

త్వరపడుడు!  ఆంధ్రగ్రంథమాల ౧౦-వ గ్రంథము  త్వరపడుడు!!

# ఆత్మకథ

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము.) ప్రథమసంపుటము.

క్రౌన్‌సైజు, పుటలు ౪౫౦, మేలయిన కాగితము, ముచ్చటలు గూర్పు అచ్చు.

అమూల్యమైన ఈ గ్రంథమునకు వెంటనే ఆర్డరులు పంపుడు.

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు తెనిగించినది

(వెల పండ్రెండు అణాలు మాత్రమే) తపాలఖర్చులు ప్రత్యేకము.

మేనేజరు—ఆంధ్రగ్రంథమాల,

నెం. 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

7. 2- 10 ౨౫౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గురు శిష్య సంవాదము

కూచి నరసింహముగారు

## II

### (అభివంద నాశీర్వాదముల తరువాత)

శి:—ఈ నడుమ మీ రేమైన వ్రాసినారా?

గు:—ఈ నడుమ ననఁగా?

శి:—భారతీ పత్రికకు వెనుక మీరంపిన "గురు శిష్యసంవాదము"నకుఁ బిదప నన్నమాట.

గు:—ఆ! ఏవో యొకటి రెండు. వార్ధివలెఁ బొంగుచున్న వాఙ్మయములో నవి కణములవంటివి; పేర్కొనఁదగినవి కావు. ఏ మిట్టిప్రశ్న వేసితివి?

శి:—మ రేమియు లేదు. ఇంకొక్క "గురు శిష్యసంవాద" మీవలికి వచ్చునేమో యనునాశతో నట్లడిగినాను.

గు:—ఎట్లు రాఁగలదు నాయనా? బుద్ధి చేఁపు పోయినది.

శి:—వత్సవక్త్రి సంస్పర్శమువలన మరల రావచ్చును. ఏదో వార్తాపత్రిక చదువు చున్నట్లున్నారు!

గు:—ఔను, "తరుణ భారతపత్రిక—Young India." ముసలితనములో నాకది నల్లమందైనది.

శి:—నల్లమందుపట్టు పోకముందే నాలుగుమాటలు సెలవిండు మఱి. అతిశ్రద్ధతో నిప్పుడు మీరు చదువుచున్న పత్రికా భాగ మేది? ఏ విషయమును గూర్చి వ్రాయఁబడినది? ఎవరిచే వ్రాయఁబడినది?

గు:— "దేశాయము—దేశదారిద్ర్యము" అను శీర్షకముతోఁ బ్రకటింపఁబడిన యొక విలేఖనము; దానిని వ్రాసి నాయన ప్రస్తుతము "ఘూర్జర విద్యాపీఠము"లోఁ బనిచేయుచున్న యొక గొప్పపండితుఁడు, అర్థశాస్త్ర వేత్త; ప్రపంచ పర్యటనముచేసి వివిధదేశ ప్రజల సుఖాసుఖములను స్వయముగాఁ జూచివచ్చిన లోకజ్ఞుఁడు. ఆయనపేరు శ్రీ కుమారప్పగారు.

శి:—సరియేకాని, దేశదారిద్ర్య మనుచున్నారేమి కర్మము? చీమల బారులవలెఁ గ్రిందఁ బ్రాఁకుచున్న శతసంఖ్యాకములగు రెయిలు బాటలతో, తంబుఱ తీఁగలవలెఁ బైని వ్యాపించు విద్యుద్వార్తా తంత్రులతో, బహుళములైన భారతీ భవనములతో, చిత్రచిత్రవ్యాధి నివారణ పరికరములతో నిండియుండు చికిత్సాశాలలతో సస్యసమృద్ధములగు భూములతో, సమస్తసుఖసదుపాయములతో నొప్పారుచు స్వర్గతుల్యముగనుండు మనదేశము దరిద్రదేశమని యెవఁడు చెప్పఁగలఁడు? ఇప్పటి మిద్దెలు, మేడలు, కుర్చీలు, సోఫాలు, విద్యుద్దీపములు, విద్యుద్వ్యజనములు, ఏటఁజేయనగు పనులు పూఁటలోఁజేయు నానాద్భుత యంత్రశాలలు—ఇవన్నియు మా ముత్తాతలుగాని, తాతలుగాని యెఱుఁగుదురా?

గు:—మీ ముత్తాతలకును, తాతలకును లేని సౌకర్యము లిప్పుడనేకము లున్నవనుమాట వాస్తవమే. కాని వారి యాయురారోగ్య జవసత్త్వము లిప్పటివారికి లేవనుమాటయు నంతసత్యమే! దీనికిఁ గారణమేమో కనిపట్టవలెను. పూర్వకాలములతోఁ బోల్చి చూచుకొనియు, సమకాలికులగు నితర దేశ జాతులవారితోఁ బోల్చి చూచుకొనియుఁ గష్టసుఖతారతమ్య నిర్ణయము చేసికొనవలెను. పాశ్చాత్యుల యద్భుతమైన ప్రకృతిశాస్త్ర ప్రావీణ్యము వలన, దానియొక్క దినదినాభివృద్ధివలనఁ బూర్వులెఱుఁగని సౌకర్యము లనేకములు యావత్ప్రపంచమందును ప్రజ లిప్పు డనుభవించు చున్నారు. తల్లాభములవలన గలుగు సుఖమైనను మనకంటె నితర దేశస్థులకే యెక్కువగా నున్నది. యంత్రాది నిర్మాణశక్తి మనకు లేదు; లేకపోవుటకు మనబుద్ధిమాంద్యమో కారణము, ఇతర కారణము లేమైన నున్నవో కనిపట్టవలెను. ధూమశకటాది గమన సౌకర్యముల వలనఁ బ్రజలనుండి వచ్చు రాబడి దేశాభివృద్ధికొఱకు వినియోగపడుచున్నదో, ధన సంపన్నులగు నితర దేశీయుల మఱింత శ్రీమంతులఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుటకును, స్వాతంత్ర్యహీనులైన ప్రజలను మఱింత యస్వతంత్రులఁ జేయుటకును ఉపయోగ పడుచున్నదో —అది చూచుకొనవలెను. యంత్రములువచ్చి చేతిపనులు చెడఁ గొట్టుటయును, బూర్వము జగత్ప్రసిద్ధిఁగాంచిన శిల్పాది వృత్తుల నశింపఁజేయుటయును అభ్యుదయ సూచకమో, అనర్థ సూచకమో దూరదృష్టితోఁ గనుఁగొనవలెను. ఇఁక నీవు పేర్కొన్న మేడలును మిద్దెలును, విద్యుద్దీప విద్యుద్వ్యజనాదులును దేశములో నెంతమంది కున్నవో చెప్పుము. వేయిమంది పొట్టలు చేతఁ బట్టుకొని తిరుగులాడుచుండ నెవఁడో యొకఁడు పంచభక్ష్యపరమాన్నములు గుడుచుచుండుట దేశభాగ్యలక్షణమో, దేశాభాగ్య సూచనమో—అది వాఁపో, బలుపో—బాగుగా నాలోచించి చెప్పుము.

శి:—ఇవన్నియు శ్రీకుమారప్పగారు పరిశీలించి చెప్పినారా యేమి?

గు:—దీనిలో నవియన్నియు లేవుగాని, ముందు పత్రికలలో రావచ్చును. ఆయన వ్రాసిన విషయము లందఱు శ్రద్ధతోఁ జదివింపఁదగిన వని శ్రీగాంధిమహాత్ముఁడుగారు చెప్పినారు. ఆచెప్పుసందర్భమున మన కుతూహలము రేఁపుట కొకమాట చెప్పినారు.

శి:—అది యేది?

గు:—ప్రపంచములో నెల్ల ధనవత్తమమైన దేశము అమెరికా దేశమని యెఱుఁగుదువు గదా!

శి:—ఆ! ఎఱుఁగుదును.

గు:—మహత్తమమైన యాదేశము తనకు వచ్చు పన్నుల మొత్తములో—సైన్యపోషణమునకును, అప్పులు దీర్చుటకును, పరిపాలన కృత్యములకును—నూటికి 48.8 వ్యయము చేసికొనునఁట; ఇఁక దరిద్రదేశమని పేరెక్కిన మనదేశము ఆ ప్రయోజనములకే నూటికి 93·7 వెచ్చపెట్టునఁట.

శి:—ఎవరు చెప్పినారు?

గు:—కుమారప్పగారే వ్రాసినారఁట.

శి:—కాని, అయ్యా! అర్థవంతమైన అమెరికా కంటె దాదాపుగా రెండురెట్లు వెచ్చింపఁ గల మన దేశము దరిద్రదేశమని యెట్లు చెప్పఁగలము?

గు:—అట్లు వ్యయించు కొనుచుండుటచేతనే దరిద్రదేశమైనది. ఆరోగ్యాభివృద్ధికి, విద్యావ్యాప్తికి, జీవికాకల్పనములకుఁ, బ్రజాసౌఖ్యావహములగు నితర సత్ప్రయోజనమునకుఁ డబ్బు చాలకున్నది. పొదుఁగులో నున్నపాలన్నియుఁ బిదికి పైవారికే పోయుచో నిఁక దూడ త్రాగి బ్రతుకుటకుఁ బాలెక్కడనుండును? అమెరికా ఖర్చుపెట్టు 48·8%ను ఆదేశములోనే తనవారికే వినియోగ పడుచున్నది. మనహిందూదేశము ఖర్చుపెట్టు 93·7%లోను అత్యధికభాగము దేశముదాఁటి పోయి యన్యదేశీయుల పెట్టెలలోఁ బడుచున్నది. మన దేశమాత యీమహోపద్రవమునుండి విముక్తురాలైనఁ దక్క నామెకు స్వరాజ్యసుఖముగాని, మఱి యేరాజ్య సుఖముగాని యలవడ నేరదు—అని మహాత్ముఁడు చెప్పుచున్నాఁడు.

శి:—ఆలాగుననా? కుమారప్పగారీ యన్నియు వ్రాసినారేమి?

గు:—వ్రాసినట్టే; దేశము సుఖవంతమై భాగ్యవంతమై యుండుటకుఁ బరిపాలనాపద్ధతి ప్రాచీనన వీనార్థ శాస్త్రసంప్రదాయములఁ బట్టి యెట్లుండవల యునో కుమారప్పగారు కొన్ని చక్కని సామాన్యసూత్రములతో నిటఁ దెల్పినారు.

శి:—అవేవో సెలవిందు.

గు:—నీ వింగ్లీషు రానివాఁడవు గావు. ఇదిగో! పుచ్చుకొని చదువుకొనుము.

శి:—అందులకుఁ బనికట్టుకొని నే నింతదూరము మీకడకు రానేల? మీమాటలతోఁ జెప్పవలెను, నింగ్లీషు రాని యాంధ్రుల కుపయోగించును.

గు:—అర్థశాస్త్రవాసన నాకంతగా లేదు. అయినను నీమాట త్రోసివేయఁ జాలను. కుమారప్పగారి యుపదేశముల నతిసంగ్రహముగాఁ జెప్పెదను విను.—



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(పన్నులనఁగాఁ బ్రజలు సత్పరిపాలనముకై రాజున కిచ్చువారితోషికములని ప్రాచీనాభిప్రాయము; కనుకఁ బోషకస్థానమునం దుండు రాజునకును పోష్యస్థానమునందుండు ప్రజలకును ఒకరీతి యొడంబడిక యున్నదన్నమాట. "ప్రతిఫలరూపముగాఁ బ్రభువు సమస్త భోగములు ననుభవింపవచ్చును, కాని ప్రజారక్షణ విషయమున దాసునివలెఁ బనిచేయవలెను." అని నీతిశాస్త్ర కర్తయగు శుక్రాచార్యుఁడు చెప్పినాఁడఁట.

శి:—అవి, కృతయుగము నాఁటి మాటలు, పోనిండు; ప్రస్తుతకాలపుఁ బరిపాలకులఁ గూర్చి కుమారప్పగారేమని చెప్పినారు?

గు:—అర్థశాస్త్ర వేత్తలును, ప్రజాహిత పరాయణులును అగువారే పరిపాలన కృత్యములోఁ బ్రవేశింపవలెను; అర్థశాస్త్ర జ్ఞానము దుర్వినియోగము చేయు స్వార్థపరులు ప్రభువు లగునెడలఁ బ్రజాపీడకు లగుదురు.

సత్పరిపాలకులు, తమకాలపుఁబ్రజల క్షేమమే యాలోచింపక, భావిదేశలాభమునుగూడ మనసులోఁ బెట్టుకొని దూరదృష్టితోఁ దమ పాలనకృత్యములు నెఱవేర్చుకొందురు. దాదాపుగా ప్రపంచమందలి దేశములన్నియును ఇప్పుడు వాణిజ్యాదులచేఁ బరస్పర సంబంధములు గలిగియున్నవి గనుకఁ, దాత్కాలిక లాభమునే చూచి వ్యవహారము నడపుకొను దేశము, రాఁబోవు తనవారికే కాక యితరదేశీయ భావిప్రజావర్గమునకుఁ గూడ బాధగలిగించునది యగును. ప్రస్తుతలాభమునే యపేక్షించి, అమెరికా సంయుక్తరాష్ట్రములవారు, సేద్యమునకును, రాచబాటలకును తమ పెద్దపెద్ద యడవుల నఱికి తగులఁ బెట్టుచున్నారఁట; యితరులతో వర్తకపుపోటీ పెట్టుకొని తమదేశములోనుండు ఖనిజతైల కూపములనుండి చమురు వేవేగ తోడి వేయుచున్నారఁట. ఇది ముందుముందు దేశమునకే కాక యన్యదేశములకుఁ గూడ మహానర్థముగాఁ బరిణమించునని కుమారప్పగారు చెప్పుచున్నారు.

శి:—అమెరికామాట మనకేల? మనహిందూదేశపు పరిపాలనగూర్చి యేమైనఁ జెప్పినారా?

శి:—నాయనా! తొందరపడకు! స్వదేశసమాచారకథనమున కుపోద్ఘాతముగా నవి యన్నియుఁ జెప్పినారు. హిందూదేశమును గూర్చి విపులముగానే వివరించినారు, విను:—

మనదేశ మిప్పుడు తానుండిన స్థితినుండి మాఱి మఱియొకస్థితిలోఁ బ్రవేశింపనున్నది. ప్రజలు కేవల కృషి జీవనము వదలి శిల్పాద్యనేక వ్యాపారములలోఁ జొరఁ జూచుచున్నారు; చేతిపనులు మాని కర్మాగారములు స్థాపించి వానిని యంత్రసాహాయ్యమునఁ గావించుకొనఁ బ్రయత్నించుచున్నారు. విషమమైన యీసంధికాలములో వేయికన్నులతోఁ జూచుచు బహుజాగరూకతతోఁ బరిపాలకు లీమహత్తమమైన ప్రజోత్సాహశక్తిని దేశక్షేమానుకూలముగాఁ ద్రిప్పి నడపవలెను.

గు:—ఈసందిగ్ధ శుష్కోపన్యాస వచనములతో నేమి ప్రయోజనము? ఎట్లు నడపవలెనో నిర్ధారకముగా నేమైనఁ జెప్పినారా?

గు:—చెప్పినారయ్యా! కొంచె మోపికపట్టుము; గ్రుక్క త్రిప్పుకొననీయ వేమి గ్రహచారము? "కట్టె, కొట్టె, తెచ్చె"నని సంక్షిప్త రామాయణమువలెఁ జెప్పిన లాభము లేదు గదా! ముసలివాఁడను, విషయ మనభ్యస్తము; ఆలోచన కించుక యవకాశ మీయవలెను.

శి:—క్షమించి యట్లే సావకాశముగానే సెలవిండు. ఎట్టి వారికైనను ముసలితనములోఁ బూర్వవయసునవడి యుండుట కష్టము.

గు:—ఏ మార్గమైనను, మంచిదగునెడలఁ, బ్రజలయొక్క పదార్థోత్పాదన శక్తి హెచ్చుచేయవలెనుగాని క్షీణింపఁ జేయఁగూడదు. కనుకఁ బ్రభుత్వము వారు నవీన వ్యాపారఫల పరీక్షణార్థము యుక్తమైన వ్యయము చేసి, పరిశీలన పర్యవసానము ప్రజల కెఱుకపడు నేర్పాటులు గావింపవలెను. అర్థబలమును, వ్యాపార నైపుణ్యమును గల పరదేశస్థులు పోటీగావచ్చి క్రొత్తగా నంకురించిన వృత్తుల నశింపఁజేయకుండఁ గఠినమైన దిగుమతి పన్నులువేసి వానిని సంరక్షింపవలెను. ప్రథమావస్థలోఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రజాసుఖకరము లైన నూత్నవ్యాపారములకుఁ జాలిన ధనసాహాయ్యము చేయుచుండవలెను. బహుముఖముగా నిట్లు పరిపాలకులు తోడ్పడుటవలన నందఱు జనులకు వారు సమానమైన యవకాశము లొసఁగిన వా రగుదురు. కాని దేశములో నెవరో యల్పసంఖ్యాకులు విత్తాఢ్యులై యుండుటగాని, యేదో యొకవృత్తికయిరే ప్రజలు ప్రభువులనుండి తోడ్పాటు పడయుటగాని దేశమునకు మంచిది గాదు.

శి:—నాకు బోధపడలేదు. ఏల మంచిదిగాదు?

గు:—మొదటి దానివలనఁ బెక్కుర కతృప్తి గలుగును; అందుచే నంతఃకలహములు పుట్టును.

శి:—అతృప్తి యేల కలుగవలెను?

గు:—సమానముగాఁ బాటుపడు ప్రజలలోఁ గొందఱకడ ధన మత్యధికముగాఁ జేరియుండుట సహజముగా నితరుల కసూయాజనకమగును.

శి:—సరియే, రెండవ దానివలన నేమిబాధ?

గు:—దేశములో నందఱుఁ గృషీవలవృత్తియే యవలంబించి జీవింపఁజూతు రనుకొనుము; ఆయొక్క వృత్తి నభివృద్ధి నొందించుటకే పరిపాలకులు ధనాది సాహాయ్యమొనర్తు రనుకొనుము. దీర్ఘానావృష్టిక్షామ బాధలు తటస్థించునెడల, నప్పుడు దేశదురవస్థ యెట్లుండునో యోజించుకొనుము.

శి:—కాలము సరిగా లేకున్నచో, నేకజీవిక నాధారము చేసికొను దేశప్రజలు బాధపడుదు రనుట నిజమే.

గు:—కాలము సరిగానున్నను ఆ యపాయము పూర్తిగాఁ బోదు. ఏఁటేటఁ బ్రజాభివృద్ధి యగుచుండును.

శి:—ఏమో! పుట్టుకలతోపాటు చావులు నున్నవి.

గు:—నన్నొక విషయమునుండి యొక విషయమున కీడ్చుచున్నావు ప్రజాగణనముచేసి ప్రకటించు ప్రభుత్వము వారి లెక్కలను ప్రమాణముగాఁ గొనుచో, నీ కట్టిసందేహము కలుగఁ గూడదు. మనదేశములో స్త్రీలకు వివాహము లైచ్ఛికములు గావు. సంతానహీను లత్యల్పసంఖ్యాకులుగా నుందురు. అర్థలోపము కావలసినంత యున్నది గాని అపత్యలోప మెంతమాత్రము లేదు. "బీదలకు బిడ్డ లెక్కువ"యను లోకోక్తి నీవు వినియేయుందువు. ఆఱుగురు బిడ్డలఁగని తలిదండ్రు లిద్దఱు గతించిన, జనసంఖ్యలో మునుపటికం టెనలుగు రెక్కువగానుండరా?

శి:—ఔను, మీమాటల కడ్డురాను; సంభాషణము సాగిపోనిండు.

గు:—ప్రజలు నానాఁటికి హెచ్చుచుందురు. భూమిమాత్రము యథాపూర్వముగానే యుండును. భూసారము తగ్గిపోవుచుండును. ఎన్నిక్రొత్త యెరువులువేసి సేద్యము చేసినను, తిండికిఁ జాలు సస్యముండని రోజులు రాకమానవు. కనుకఁ బరిపాలకు లీచిక్కులన్నియు నాలోచించి వ్యవసాయము, వర్తకము, శిల్పములు, నింక నితరవృత్తులు—వీని కన్నిటికి యథోచితముగా సాయపడుచుఁ బ్రజలను గాపాడవలెను. యావద్దేశప్రజావర్గములో నుండు బుద్ధిబలదేహబలములకుఁ దగు నవకాశము లిచ్చి తోడ్పడి వారు వానిని దేశాభివృద్ధికై యుపయోగించుకొనవలెను.

శి:—ఇన్నిటికి సాయపడుటకు సొమ్ముండవలెను గదా!

గు:—ఉండవలెను. అందుకయియే పన్ను లేర్పడినవి. కాని యాపన్నులు వేయుటలో రాజు ప్రజలకెంతమాత్రము బాధకలిగింపక వారు సంతోషపూర్వముగా నవి చెల్లించుకొనునట్లు చూచుకొనవలెను—అని కుమారప్పగారు చక్కని ప్రాచీన వీనోపమానములతో విశదీకరించినారు. చెట్టునకు హానికలుగకుండ బాగుగాఁ బక్వమైన పిదపఁ బండ్లు కోసికొనునట్లు, ప్రజల కావంతయైన నొప్పి కలుగకుండఁ బ్రభువు వారినుండి పన్నులు గొనవలయును—అని కౌటిల్యుఁడు చెప్పినాఁడఁట.

శి:—ఏకాత్ముఁడుగా రేమియుఁ జెప్పలేదా?

గు:—ఎరువువేసి నీరుపోసి మొక్కలను బుష్టముగా బెంచినపిదపఁ దోఁటకాఁపు పూవులును, ఫలము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లును ఎట్లు కోసికొనునో, రాజట్లే ప్రజలను సుఖపెట్టి, యనాయాసముగా పన్నులు చెల్లింపఁగల శక్తి వారికి మొట్టమొదట నిచ్చి, పిదపఁ బన్నులు పుచ్చుకొనవలెను- అని శుక్రాచార్యుఁడు కూడ నట్లే చెప్పినాఁడు. మఱియుఁ బన్నులవలనఁ బ్రజలవస్తూత్పాదనశక్తి తగ్గఁగూడదు. కత్తిరించి గొఱ్ఱెనుండి ఉన్నిగొనవలెను గాని వాని యొడలొలిచి తీసికొనరాదు. సుఖజీవనమునకుఁ జాలిన ధనము ప్రజలకడనుంచి, యతిరిక్తముగా నున్న విత్తము నుండియే, రాజుపన్నులు గ్రహింపవలెను. అధికారులా యమూలములను శుష్కింపఁజేసినాశము చేయఁగూడదు. మరలఁ బుష్పించుశక్తి పుష్కలముగా మొక్కల కుండ నిచ్చి, పుష్పవిక్రేత, యిఁక నటనున్న వాడి రాలిపోవుట దక్క సస్యోపయోగ మేమియు వానివలన లేనప్పుడే, పూవులుకోసి యమ్ముకొనును. సరిగాఁ బ్రభువట్లే ప్రజల నుండి పన్నులురాఁబట్టుకొనవలయును; లేనిచో బొగ్గులకై ఫలవృక్షములను బడగొట్టి కాల్చినకాఁ పెంత బుద్ధిమంతుఁడో భూపతియు నంత బుద్ధిమంతుఁడే యగును.

శి:—నిదర్శనములు చాల హృదయంగమములుగా నున్నవి సుండీ!

గు:—బుద్ధిమంతులగు పూర్వులు తెచ్చిన దృష్టాంతము లవ్యర్థా యుండునా? నాయనా, కుమారప్పగారింకొక ముఖ్యమైనవిషయమునుగూర్చి చెప్పినారు విను.

శి:—చిత్తము.

గు:—పనువఁగూడును, కట్టబట్టయునున్నవారా, కారా? యనుసందిగ్ధదశలో—లేమియొక్క సరిహద్దులో—నున్నవారి నుండి రాజెట్టిపన్నును గ్రహింపఁగూడదు; ఆలోటు ధనాఢ్యులనుండి కూడఁ దీసికొనవలెను. క్రేతలకు భారము గలిగించు “పరోక్షకరములు— Indirect Capaxes” జీవనమున కత్యావశ్యకములగు సామాన్యాహారపదార్థములపై వేయక, కేవల భోగపదార్థములపైనే వేయవలెను. అట్లు చేయుటవలన బీదల కేబాధయు నుండదు. ధనవంతులగు భోగపరాయణు లట్టిపదార్థము లెంతడబ్బు పెట్టియైనను గొనఁగలరు. ఇట్టి యప్రత్యక్షపుఁ బన్నులవలన దేశపు టాదాయము హెచ్చగును. చివర కాపన్నులు చెల్లించువారు భోగులగు ధనికులే కనుక, వారి కవి చెల్లించుచున్నట్లే కాన్పింపదు. అది పూవు లెఱుఁగకుండఁగనే, తేఁటి పుష్పమరందముఁ గ్రోలిన ట్లుండునని పూర్వులు చెప్పినారు.

శి:—యథాన్యాయముగాఁ బరిపాలించుకొనఁదలఁచు రాజు బహుజాగరూకుఁడై యుండవలెనన్న మాట.

గు:—ఔను నాయనా! అందుచేతనే “రాజ్యాంతమందు నరకము ధ్రువము” అన్నారు పెద్దలు. సామాన్యకుటుంబియగు సంసారియే, ధనార్జనములో కంటెఁ దద్వినియోగములో నెక్కువ తెలివి తేట లగపఱుపవలెనుగదా, యిఁక దేశకుటుంబియగు దేశాధిపతి యెంతతెలివి తేట లుపయోగింపవలెనో యోజించుకొనుము. పన్నురూపముగావచ్చు ప్రతిరూపాయయును ప్రజాపదార్థోత్పాదన పాటవ మెక్కువచేయుచున్నదో లేదో యతఁడు కనిపట్టుచుండవలెను. ధనబలము గలవారినుండి విశేషముగా డబ్బులాగి బలహీనులగు దరిద్రులను బోషించుచుండవలెను; విత్తవంతులనుండి గ్రహించిన విత్తములోఁ బామరులలో విద్యావ్యాప్తి గావింపవలెను. అంతేకాని పేదలను బాధించు పన్నులు వేసి, యవి ధనవంతులను ధనవత్తరులఁ జేయుట కుపయోగించుట యవివేకము, అధర్మము, చివర కది యాత్మవినాశ హేతువుకూడ నగును. అబ్ధినుండి యత్యధికమైన జలము ఆవిరిగాఁ బైకిబోయి వర్షరూపమునఁ గ్రిందఁ బడి యల్పజలాశయములను బుష్టము చేయుచుండుట లేదా?

పరిపాలనము బాగుగా నడపుటకైనను యుక్తవ్యయమే చేయవలయునని కుమారప్ప పండితుఁ డింకొక హితోపదేశము చేసినాఁడు.

శి:—మంత్రి బృందముల వేతనము లధికముచేసి చిన్నచిన్న యుద్యోగుల గొంతుకలు గోయుమనియా?

గు:—కాదు, పరిహాసములు కట్టిపెట్టి పండితుని వాక్యములు శ్రద్ధతో వినుము:—

రాబడిని బట్టి గృహస్థుఁడు నవుకరుల నెట్లు పెట్టుకొనునో, దేశముయొక్క ఆయమునుబట్టియు, దేశ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాగ్యమును బట్టియుఁ, బన్నులు చెల్లింపఁగల ప్రజా శక్తిఁ బట్టియుఁ బ్రభువు పరిపాలనపు టేర్పాటులు గావించుకొనవలయును. రాజ్యాంగ వ్యాపారము చక్కగా గడియారమువలె నడచుచున్నది గదాయని యమిత వ్యయము చేయఁగూడదు. పరిపాలనపు ఖర్చు ప్రజలు సునాయాసముగా భరించుటకై, యది దేశమునందలి మనుష్యుని సగటాదాయమున కిన్ని రెట్లుండవలయును—అని యొక కఠినియమము చేసికొనుట మంచిదని కుమారప్పగారు చెప్పుచున్నారు. అట్లు చేసికొను నెడల, భిన్న దేశ ప్రజా సామర్థ్యములలోఁ గాని, భిన్న దేశ వస్తుమూల్యములలోఁగాని కన్పట్టు భేదము దానియంతట నదియే యంతరించి పోవునఁట. రాజ్యము విత్తవీర్య సుఖసంపన్నముగావించుట కవశ్యాపేలంబనీయములగు సూత్రము లివ్వియని యాయన యీ పత్రికలో వ్రాసినాఁడు.

శి:—అయ్యో! అప్పుడే ముగించినాఁడా?

గు:—ఇంతంతే యున్నది. మనదేశమాత మహా వైభవ మనుభవించిన చంద్రగుప్తుఁడు అశోకుఁడు మున్నగుచక్రవర్తుల కాలమునుమాట యెత్తుకొనక, బ్రిటిషురాజ్యమునకు సన్నిహిత పూర్వమున హిందూదేశపు టార్థికస్థితి యెట్లుండెనో సప్రమాణముగ ముందు పత్రికలోఁ బ్రకటించెదనని కుమారప్పగారు చివర వ్రాసినారు.

శి:—అట్లైన నింకొక గురుశిష్యసంవాదమునకు సామగ్రి యున్నది.

గు:—సామగ్రి కేమికొనవ? పనిగట్టుకొని నీవు వచ్చుచుండ వలయును, అప్పుడు నా కారోగ్యమును, తీఱికయును నుండవలయును.

శి:—శ్రమయిచ్చినందులకు క్షమించి యిఁక నాకు సెలవిండు. నమస్కారము.

గు:—శుభమస్తు! సుఖీ భవ!

---


# ఆంధ్ర దినపత్రిక

| ఆంధ్రదినపత్రిక | పొరుగూరివారికి | చెన్నపట్నంవారికి |
|---|---|---|
| సంవత్సరమునకు | ౨౪-౦-౦ | ౨౦-౦-౦ |
| ఆరుమాసములకు | ౧౨-౦-౦ | ౧౦-౦-౦ |
| మూడుమాసములకు | ౬-౪-౦ | ౫-౪-౦ |
| మాసమునకు | ౨-౨-౦ | ౧-౧౨-౦ |

# వార పత్రిక

వారపత్రికకు సంవత్సరచందా　　　　　　　　　　౪-౦-౦

వారపత్రిక సంవత్సరమునకు తక్కువ కాలమునకు పంపబడదు.

# సంవత్సరాది సంచిక

దినపత్రిక చందాదారులకు ౧-౦-౦　　　వారపత్రిక చందాదారులకు ౧-౪-౦

చందాదారులు కానివారికి ౨-౦-౦　　　పాతసంచికలు సంచిక ౧ కి ౧-౦-౦

సంచికల సంపుటకు తపాలఖర్చులు ప్రతి ౧ కి　　　౦-౪-౦

ఆంధ్రపత్రికా కార్యాలయము, నెం. 7, తంబుశెట్టివీథి, జి. టి. మదరాసు.




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనికవ్రాతము లోభసంక్షుభిత చేతస్సారమై దిక్కుఁగా
నని చందంబున సంభ్రమింపఁ, గలదానన్ నిత్యతృప్తుండనై
ఘనులన్ వేఁడక యల్పులన్ దెగడ కే కార్పణ్యమున్ లేక మే
లొనరన్ హర్షసుధాతరంగముల నే నోలాడు టింకెన్నఁడో!

ఘనకీర్తి ప్రియులైన తోడికవు లుద్గ్రంథంబులన్ వ్రాయ నే
ప్రణుతుల్ గోరక విశ్వరూప పటుకావ్య శ్రీపరామర్శనం
బునన్ దత్కర్త మహత్త్వమున్ దెలియుచున్ ముక్త ప్రబంధుండనై
యొనరన్ హర్షసుధాతరంగములనే నోలాడు టింకెన్నఁడో!

ఫలసంగంబు పరిత్యజించి యెది విశ్వశ్రేయమో దాని న
గ్గలికన్ సల్పుచు, సంధ్యలన్ జగదలీకత్వంబు దర్శించుచున్
వెలి సంరంభిని లోఁ బ్రశాంతుఁడనునై విశ్వైకరంగంబునం
దలఘు ప్రౌఢి నటత్వమున్ నెఱపు నాహ్లాదంబు నాకెన్నఁడో!.

శీతోష్ణంబులు, సంపదాపదలు, నాశీశ్శాపమున్ ఖ్యాత్యవి
ఖ్యాతుల్ మేనికిఁగాని, లేవు మఱినాకంచుం బ్రబుద్ధుండనై
ద్వైతాద్వైత విభేద శూన్య విమల స్వారాజ్య సింహాసనం
బాతంకం బఱనెక్కి నిర్భరతనే హర్షించు టింకెన్నఁడో!.

తను భిన్నంబగు తత్త్వమే ననుట ప్రత్యక్షంబుగాఁ దోఁప, మి
త్త్రిని మిత్త్రమ్ముగ నిష్టబంధ విరహార్తిన్ బెన్వినోదమ్ముగాఁ
గనుచున్, బ్రాణులకెల్ల నియ్యమలవిజ్ఞానంబు చేకూర్చి, క్షో
ణిని నిర్వాణ సుఖైక రాజ్యమును నే నెక్కొల్పు టింకెన్నఁడో!.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## దోమసాని కథ

అయ్యగారి సత్యనారాయణమూర్తి గారు, బి. ఏ.

అనగనగా దోమసాని ఒకటి ఉండేది. మంచి మొగుణ్ణి వెతుక్కుంటూ కంచికి ప్రయాణ మైంది. కంచికి వెడుతుంటే దోమ సానికి ఏనుగు ఎదురైంది. ఏనుగు "దోమ సానీ! దోమసానీ! ఎక్కడికి వెడుతున్నావు" అని అడిగింది దోమసానిని. దోమసా నందట "మంచి మొగుడికోసం కంచి కెడుతున్నా" నని. అంటే "నన్ను పెళ్లిచేసుకోరాదా" అని ఏను గందట. అందుకు దోమసానందట "ఏనుగట! ఎత్తుకాళ్లట, తన్నట, నేనట, పెళ్లాడాలట, అయ్యో! న్నా బతుకో బ్రతుకు" అని. ఏనుగు వెళ్లిపోయింది. దోమసాని మొగుడికోసం కంచికి ఇంకా వెడుతూనేఉంది. కొంతదూరం వెళ్లిన తరువాత లొట్టిపిట్ట ఎదురుగుండా వచ్చిందట. లొట్టిపిట్ట అందట "దోమసానీ! దోమసానీ! ఎక్కడికి వెడుతున్నావు" అని. "మంచి మొగుడికోసం కంచి కెడుతున్నాను" అని దోమసాని బదులుచెప్పిందట. అంటే "నన్ను పెళ్లిచేసుకోరాదా" అని లొట్టిపిట్ట అందట. అందుకు దోమసాని "లొట్టిపిట్టట! లోవంకట, తన్నట, నేనట, పెళ్లాడాలట. అయ్యో! న్నా బతుకో బ్రతుకు" అని అందట, దోమసాని యింకా వెడుతూనేఉంది. వెడుతూ ఉంటే గుఱ్ఱం ఎదురొచ్చింది; "దోమసానీ! దోమసానీ! ఎక్కడికెడుతున్నా"వని అడిగింది గుఱ్ఱం. "మంచిమొగుడికోసం కంచి కెడుతున్నా" నంది దోమసాని. అందుమీదట "నన్ను పెళ్లిచేసుకోరాదా" అని అడిగిందట గుఱ్ఱం. అంటే "గుఱ్ఱమట! గుదికాళ్లట, తన్నట, నేనట, పెళ్లాడాలట, అయ్యో! న్నా బతుకో బ్రతుకు." అందట దోమసాని. దోమసాని ఇంకా వెడుతూనేఉంది. ఇంతలో కోతి ఒకటి ఎదురువచ్చింది. "దోమసానీ! దోమసానీ! ఎక్కడికి వెడుతున్నావు" అని అడిగింది కోతి. దోమసాని అంది "మంచి మొగుడికోసం కంచి కెడుతున్నా" నని. కోతి అంది "నన్ను పెళ్లి చేసుకోరాదా?" అని. దోమసాని "సరే" అని ఆ కోతిముక్కులో దూరి గులగుల లాడడం మొదలుపెట్టిందట. కోతి ముక్కు నలుపు కొంటూ వడ్లావాడి ఇంటికి వెళ్లి "వడ్లావాడా! వడ్లావాడా! ముద్దుల పెళ్లాం ముక్కులో దూరింది; ముక్కు చెక్కరా వడ్లావాడా" అని అడిగింది. వడ్లావాడు కోతిముక్కు చెక్కి వేశాడు. అంతట దోమ తుర్రుమని ఎగిరి పోయింది.—

కథ కంచికి వెళ్లింది, మనం ఇంటికి వచ్చాం.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మిణుగురులు

(పిల్లల గీతములు)

**కీ. శే. గురజాడ వెంకట అప్పారావు గారు,**
**బి. ఎ., ఎఫ్. యమ్. యు.**

౧

మల్లెలు మొల్లలు పూచే వేళ
చల్లనిగాలులు వీచే వేళ
మేనుల గంధం బలదే వేళ
ఉరుములు మెరుపులు మెరసే వేళ
తొలకరివానలు కురిసే వేళ
మామిడిపండులు పండే వేళ
మన్మథబాణం మ్రోగే వేళ
మగువల మనసులు కరిగే వేళ.

౨

బూరుగుచెట్టు
చిలకలతోను
ఏమని పలికింది
పండిన పండు
ఎండిన దూదై
పకపక నవ్వింది.

౩

చిలకల్లార!
చిలకల్లార!
కలవలతోను,
ఏమని పలికారు?
కలవల్లార!
కలవల్లార!
రాజు వచ్చెను,
కన్నులు విప్పండి.
కలవల్లార!
కలవల్లార!
రాజు గ్రుంకెను,
కన్నులు మూయండి.

౪

అరిటికాయబజ్జి,
మినపప్పుప్పొ సాజ్జి,
కలసి మెలసి తిందాం,
కథలువిథలు విందాం.

౫

ఏనుగు ఎక్కి మనము
ఏవూ రెళదాము?
ఏనుగు ఎక్కి మనము
ఏలూ రెళదాము.
గుఱ్ఱం ఎక్కి మనము
ఏవూ రెళదాము?
గుఱ్ఱం ఎక్కి మనము
గుంటూ రెళదాము.
మోటా రెక్కి మనము
ఏవూ రెళదాము?
మోటా రెక్కి మనము
మోటూ రెళదాము.
వెన్నుని ఎక్కి మనము
ఏవూ రెళదాం?
వెన్నుని ఎక్కి మనము
వెయ్యూ ర్యాళ్ చూదాము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రుడు

భావరాజు వేంకట కృష్ణరావుగారు, బి.ఏ., బి.ఎల్.

భారతఖండములో వున్న అన్ని రాష్ట్రిలతో పాటు ఆంధ్రరాష్ట్రముకూడా అన్నివిషయాల లోనూ అన్ని ఉద్యమాలలోనూ ఏమీ లోటు రానీయకుండా ముందడుగు వేస్తూయున్నదని ఆంధ్రు డూరికే ఉప్పొంగి పోతూవున్నాడు. కాని ఆంధ్రదేశము అన్ని విషయాలలోనూ సరిగా ఆలోచించి చూస్తే యెంత వెనకబడియున్నదో గమనించ లేకుండా వున్నాడు. తెలుగు భూమిపేరు చెప్పితే సగంకంటె పైగా వున్న దేశం అభాగ్యస్థితిలోనే వున్నది. దేశమంతా రెండు మూడుచీలికలై కళదక్కి సృక్కి ఉన్నది. ఒక జీర్ణ భాగం నైజాం యిలాకాలో చేరి ఉన్నది. కొంత భాగం బ్రిటిషు పరిపాలనలో వున్నా చాలావిషయాలలో వెనకబడి ఉన్నది. మూడవభాగము, ఆంధ్రుడింకా కన్ను విప్పి తేరిచూడని ఏజన్సీసీమ అయివున్నది. ఈ మహాంధ్రభూమిలో చదువను వ్రాయనూ నేర్చిన వారు నూటికి సగటున ఏడ్గురుకంటె ఎక్కువమంది లేరు అదైనా యితరరాష్ట్రిలతో సరిపోల్చి చూస్తే ఆంధ్ర రాష్ట్రిమే తీసికట్టే అని అనిపిస్తుంది. పట్టుమని నలుగురుకలసి ఒకపని చేద్దామంటే కలవడానికి తగినచోటు, ఓరాజధాని నగరము, ఓ ప్రత్యేకరాష్ట్రిం, లేదు. సొంతమంటూ ఏదీ లేదు! ఇంతేవలకు మన ఆంధ్రుడికి. కాని ఎందులకో తాను చాలాగొప్పవాడ ననుకుంటూ, తన కేమీ లోటు లేదనుకుంటూ, మైమఱపుతో, తెలివియేలుగని ఆనందముతో, ఆంధ్రుడు పొంగిపోతూ వున్నాడు. ప్రతీ దానికీ తాను తగుదునమ్మా అని ముందు కొస్తువుంటాడు. మళ్లీ అంతలోనే వెనకంజకూడా, సంకోచము లేకుండా, వేస్తుంటాడు. తిన్ను తానే మోసగించుకుంటున్నాడు. పాపము అతడు ఒక్కనాటయినా తనహృదయములో తన చర్యలో తన ప్రజ్ఞను పరిశీలించుకొనడు. పరిశీలించుకొనడానికి అతనికి కావలసినంత దురభిమానము. దురభిమానముతో పాటు సోమరితనము, యేసురుపాటు సాహచర్యంగా వస్తూనేవున్నాయి. జాగ్రతగా, కన్నులు తెరచి, అన్నిసంగతులు స్వయంగానే చూచుకుని చక్కబెట్టుకుంటూవుంటేనే ఎప్పుడూ సరిగా వ్యవహారం నడువని యీనాడు ప్రపంచములో, పుట్టెడు దురభిమానముతో, అహంభావముతో, ఒడలు మరచి, "నాకేమి లోటురా!" అని అనుకుంటూ, కన్నులు మూసుకొని, పొరుగువాడి కరసాహాయ్యం చూచుకొని ముందూ వెనకా, గోతులు గట్లూ చూచుకోకుండా గొర్రెపోతులాగున తలవంచుకొని వెళ్లేవాడికి ఈ జీవితం అసలే సరిగా సాగదు. సరిగా సాగుతున్నదని భ్రమించడం శుద్ధ తెలివితక్కువ! లోపలి తెలివితక్కువని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నం చేయడం, తన్నుతా మోసగించుకొనడ మవుతున్నది. లోకంలో నిరంతరమూ ఆత్మవంచన చేసుకొని జీవించేవాళ్ల భ్రమలకులోనై జీవితం సుఖప్రదమైనదని ఎవ్వరూ అనరు. పైగా ఎపుడో ఒకప్పుడు చేటుమూడక తప్పదు.

ఏదైనా వకవస్తువును చూచి దాన్ని తనకు కావలెనని, యిచ్చినదాకా మారాముపట్టి ఏడుస్తూవుండే బాలుడు జ్ఞాపకంవస్తాడు ఆంధ్రునిగురించి యెపుడయినో పర్యాలోచన చేసినపుడు. ఏవస్తువునిగురించి పసివాడు ఏడుస్తూవుంటాడో దాన్ని వాడి కివ్వడానికి వీలు లేనప్పుడు, బిడ్డను మరపించడానికి మరొక పనికిరాని వస్తువును జూపించి తల్లి వానిదృష్టి మరలింప జేస్తువుంటుంది. అంతట బిడ్డ యేడ్పు మాని కన్నీటి కండ్లతోనూ, ఆశ్చర్యముతోనూ క్రొత్తవస్తువుని పరిశీలిస్తూ, అదికూడ తనకు కావలెనని పట్టు, బట్టి ఏడుస్తువున్న వస్తువుమాట మరచిపోతాడు. ఆంధ్రుడిలాటి బాలుని వైఖరివాడనటానికి ఏమాత్రం సందేహింప నక్కరలేదు. లేకుంటే ఎన్నాళ్లక్రితమో తనకు కావలెనని గోలపెట్టి, ఆందోళనచేసి, యిపుడు మరియొక ఆందోళన తనమనసు ఆకర్షించడంచేత తనపూర్వపు ప్రత్యేకాంధ్రరాష్ట్రోద్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మమమాట మరచిపోవడము ఏలాగున సంభవించగలదు? శిశువు యొక్క అమాయకత్వము, ఏడ్పు మానియుండడము చూచేవాండ్లకు ఆనందదాయకమే, కాని బిడ్డకు మాత్రము అనర్థదాయకము. మన ఆంధ్రుడిట్టి పసిబిడ్డవలెనే మధ్యమధ్య యొకటి దానిసంగతి జ్ఞాపకమునకు వచ్చినపుడు ఒక్క క్షణకాలము ఒక్కమొగము పెట్టి అది కావాలని అడుగుతాడు. మళ్లీ ఏదో మరపు మేఘం ఆవరించే సరికో, లేకపోతే యెవళ్లయినా కోపగించే సరికో ఇంకోదానికి ప్రాకులాడుతు ఉంటాడు. ఆంధ్రుడికి కొంతదూరం సాగేటంత ఉత్సాహం, ధైర్యం వెన్నాడి ఉంటాయి గాని, కార్యసానుకూలం అవకుండా సంశయం, మొగమాటం, భయం ఎక్కడనుండో తరుముకొనివచ్చి ముందున్నవాటిని వశపఱచుకుంటాయి. వయసుబట్టీ, ప్రాచీనమై గౌరవప్రదమైన చరిత్రనుబట్టీ ఆంధ్రుడు చాలా ప్రాజ్ఞుడనీ, మహామహుడనీ లోకులంతా అనుకుంటారు. కాని అమాయకపు ఆంధ్రుడు, వయసుచేత వాటిల్లిన బుద్ధి చాపల్యముచేతనో, లేక తన పూర్వపు చరిత్రమును అంతా సంపూర్ణంగా మరచిపోవడం చేతనో, యిపుడు మతిస్థిమము చాలక, రెండవ బాల్యావస్థయందు పొరలాడుతున్నాడు. ఆంధ్రుడి కీరోజులలో నిండు జవ్వనములో వుండవలసిన దేహసౌష్ఠవము, ఉత్సాహబలము, మంచి ప్రౌఢ నిర్ఝరవయఃపాకమున ఉండవలసిన బుద్ధిబలమూ, దేహ దారుఢ్యము కనబడడము లేదు. ఆంధ్రుడికి ఆత్మపరిశీలన లేదు. తాను బుద్ధిసంపదలో ఇతరరాష్ట్రముల వారికంటె మిన్నయని అనుకొంటున్నాడు గాని, సరిపోల్చుకొని చూచి పరిశీలించుకొనడం లేదు. నిజం ఆలోచిస్తే వారిముందట ఆంధ్రుడింకా బాల్యావస్థలోనే వున్నాడు. మనవారు ఆంధ్రుడు ప్రకటిస్తూ ఉన్న ఉత్సాహం చూచి అది నిజమైన బుద్ధిబలమువల్ల జనించిన ఉత్సాహతేజముని భ్రమసిపోతున్నారు. ఇది తెలిసీతెలియని ఆత్మవంచనము క్రింద పరిణమిస్తూ వున్నది. ఆంధ్రుడికి ధీరత్వముగాని గాంభీర్యముగాని వున్నట్లు ఎక్కడా ప్రకటితము కాలేదు. ప్రజ్ఞ చూపించడము, ప్రతిజ్ఞ చెల్లించుకోవడము ఆంధ్రుడికి ఉన్నట్లు మనలను భ్రమియింప జేయడమే గాని ఫలితార్థము అన్వేషింప వచ్చేటప్పటికి అదృశ్యమయిపోతున్నాయి. ఇది అందరికీ అనుభవైకవేద్యమే. ఉదాహరణము లనవసరము. కడచిన యీపాదశతాబ్దములోనూ ఆంధ్రుడు ధీరుడై, గాంభీర్యముతో, స్థిరచిత్తము గలిగి తనప్రతిన చెల్లించుకొని నిర్వహించిన ఘనకార్య మొకటయినా కనిపించడములేదు. మనకీ ధీరత్వము, గాంభీర్యము, స్థిరచిత్తము లేకపోవుటచేతనే దేశానికిన్ని పాట్లు సంభవిస్తున్నాయని అనుమానం జనిస్తూ ఉన్నది. ప్రజ్ఞ, బుద్ధి, వీటివిషయంలో ఆంధ్రుడింకా బాలుడేయని చూపించడానికి గుప్పెడునిదర్శనాలున్నవి. వీటిని విప్పిచెప్పితే ఆంధ్రుడికి ఎక్కడా లేని దురభిమానము పాలపొంగులా వస్తుంది.

హృదయం చీల్చి చూస్తే, నిజంగా ఆంధ్రుడికి దేశమంటేనూ, ఆంధ్రులంటేనూ ప్రేమ, గౌరవము, అభిమానము లేశమయినా లేవు. ఆంధ్రుడికి దేశం అంటే ఏమిటో కూడా అవగాహన కాలేదు. "దేశమంటే మట్టి గాదోయి! దేశమంటే మనుషులోయి!" అని తెలియడం లేదు. తెలుగుభాష మాటాడే పన్నెండు బ్రిటిషు జిల్లాలు, ఆరు నైజాంగారి జిల్లాలు కలిసి ఆంధ్రదేశం అవుతుందని తెలిస్తే తెలియవచ్చును. కాని ఆంధ్రదేశమంటేయేమిటో, ఆంధ్రప్రజ, ఆంధ్రభాష, ఆంధ్రులచరిత్ర, ఆంధ్రనాగరికత, ఆంధ్రసాంప్రదాయములు అంటే ఏమిటో, వాటిపై అభిమానం అంటే ఏమిటో నిజమైన మూలతత్త్వం ఇంకా ఆంధ్రునికిబోధపడినట్లు కనబడదు. నేను ఆంధ్రుడనని ఊరికే గర్వించిపోతాడు. ఎందులకో? అట్లా మురిసి గర్వించి పోతూవున్నప్పుడు హృదయంమాత్రం ఇసుమంతైనా చలించదు! ఆంధ్రుడికి ఇంతవరకు దేశం అంటే హృదయం చలించడం లేదని, ఆ విషయమై ఆతడు చింతన చేయడం లేదనీ ఉదాహరణ ఒక్కటి చూపిస్తాను. నెల్లూరిలో పినాకినిచెంత ఆరు నూరేండ్ల క్రిందట పుట్టి వర్ధిల్లిన కవిబ్రహ్మ తిక్కనసోమయాజి హృదయంలో ఏభావం జనించి, రగిలి, జ్వాలవలె పైకెగసి ఆపాదమస్తకమూ ఆమహనీయుణ్ణి మహాభారతము పదిహేను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్వాలు వ్రాసి ముగించినదాకా దహించివేసిందో ఆంధ్రు డొకసారి తెలుసుకొని గ్రహించాలి. అంతే కాదు, అనుభవంలోకి తెచ్చుకొని ఆనందించాలి. భారతరచనకు దొడగిన యాతడు అది "అనన్య సామాన్యకరణంబగు పరమ ధర్మప్రకారంబు" అని, చింతించి,

ఉ. "కావున భారతామృతము
 కర్ణపుటంబుల నారగ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు
 నట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చి త్త
 ముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్య
 ములన్ రచియించెదం గృతుల్."

అని మహోత్సాహంతో, స్థిరచిత్తముతో, దేశముపై అపరిమితమయిన అనురాగముతో, అభిమానంతో కవిబ్రహ్మ గంటం బట్టి వ్రాయడం మొదలు పెట్టినాడు. నేటి దాకా—నేటివరకు అన నేమిటికి! ఆచంద్రతారార్కం, ఆంధ్రభాష యీపృథివిపై వెలసియున్నంతవఱకు తిక్కనసోమయాజి మహాభారతకావ్యశరీరంతో కోటిసూర్యప్రభతో వెలిగిపోతూ, ఆంధ్రుల కృతజ్ఞతానమస్కారములందు కొంటూ వుంటాడు. ఇక యీచిత్రం చూడండి! చేతిలో అధికారము పెట్టి, మంచి జీత మిచ్చి, 'ఆంధ్రావలి మోదముం బొరయునట్లుగ' నిర్వహింపుమని యొక్క మహాంధ్రసంస్థను తన కొప్పగించినంతమాత్రాన మన ఆంధ్రు డేమి చేసినాడో కన్నులు విప్పి ఒకసారి పరికించండి. పాలు కుడువవచ్చిన లేగదూడల మూతులు బిగియగట్టి, వాటికి బాధాకరమగునట్లుగా గోవుతో చెలగాటము లాడి వేధించుచున్నాడు. ఆంధ్రావలి హృదయం వ్రయ్య చేస్తున్నాడు. కన్నబిడ్డ లాకటి చిచ్చుచే మలమల మాడుచు అన్నమో రామచంద్రా యని యలచుచు దిక్కుమాలియుండ వండిన వంటకములన్నిటిని, కలి అంబలితో సహా పొరుగింటి బాలురకు వెక్కసముగునట్లుగా మెసవపెట్టిన యిల్లాలి నెవరు ప్రశంస చేయుదురు? అది ఔదార్య మనిపించుకొనునా, లేక హృదయదౌర్బల్య మనిపించుకొనునా, లేక ఏమనిపించుకొనును? తనకు మాలిన ధర్మము, మొదలు చెడ్డ బేరము లేదందురు. కాని అది యీనాటి ఆంధ్రులలో వ్యక్తమవుతూ వున్నది. చూడండి, మరియొక్క ఆంధ్రు డేమి చేయుచున్నాడో. తెనుగుభాషకు వ్యుత్పత్తిశాస్త్రమును సమగ్రముగా రచియింపగల సమర్థుడై ఉండిన్ని తన యవసాన కాలము కొంచం 'ఆంధ్రావలి మోదముం బొరయునట్లుగ వినియోగించక, తన ఆంధ్రభాషాపాండిత్యమును, విజ్ఞానమును చెదలుపట్టి పాడయిపోవుచున్న చిన్నకాగితపు ముక్కలుపాలుచేసి, తనకంటబడకుండా వాటిని దేవదారు పెట్టెలో పెట్టి, పొరుగింటి కొంకజాతులవారి గాసటబీసట భాషకై తన జీవితశేషసర్వస్వమును జంకును గొంకును లేక ధారపోస్తున్నాడు. వీరిద్దఱకూ దేశాభిమానం, ఆంధ్రప్రజపై ప్రేమ యేమయినా వున్నవా? లేక చచ్చి చెడి జీర్ణమయిపోయినవా?

ఇలాంటి పెద్దమనుష్యులను ఎందరనో ఎత్తిచూపించవచ్చును. ఆంధ్రుడికి నామాటయం దింకా విశ్వాసము పుట్టక సంశయించినట్లయితే ఉదాహరణ లెత్తి ఎన్ని చూపించినా ఇంక ఆట్టే ప్రయోజనం కనబడదు. వండినపదార్థము రుచిచూడడానికి అంతా భుజింపనక్కర లేదుకదా! మనఆంధ్రుని కొఱకు,

"స్వంతలాభము కొంతమానుకొ(ని)

* * * *

దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయి
పూని యేదైనా ఒకమేల్
కూర్చి జనులకు చూపవోయి."

అని హృదయం చలించి దేహం పులకాంకిత మయ్యేటట్టు పాడి స్వర్గస్థుడైనాడు కవిశేఖరుడు. చెవిటివాని చెంత శంఖము పూరించిన నెంతప్రయోజన మున్నది! ఇటువంటిపాటలు జీవం ఒలికేవి ఎన్ని, ఎంత శ్రావ్యముగా, ఎంత మనోహరముగా పాడితే నేమిప్రయోజనము! ఆంధ్రుని హృదయంమాత్రం చలించడము లేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రుడి దురదృష్టం కొద్దీ కాబోలు: 'మరపు' ఒకటి పుట్టుకతోనే పిత్రార్జితమైన ఆస్తివలె ప్రతివానికీ సంక్రమిస్తున్నది. క్షణక్షణానికి పరాకు రావడం, తనస్థితి మరచిపోతూవుండడం కూడా మనదురదృష్టపు ఆంధ్రుడి బాల్యావస్థనే సూచిస్తు ఉన్నవి. ఆంధ్రుడు హంపీక్షేత్రం దగ్గర తుంగభద్రానది యొడ్డున పుట్టినా, లేక పినాకినీనది ప్రవహించుసీమలలో జననమొందినా, లేక నాగావళీ వంశధారానదులు పొంగి పొరలి పారే దేశంలో ఉద్భవించినా, ప్రశాంతంగా, లేక గంభీరంగా ప్రవహించే గోదావరీ సహ్యజానదులకు ఇరుపార్శ్వాలమన్న సీమలలో నెలసినా, కాక, నైజాముగారి పాలనలో వున్న త్రిలింగభూమిలో జన్మించినా, ఆంధ్రభాష మాతృభాషగా మాట్లాడుతూ, ఆంధ్రదేశంలో పుట్టిన ఆంధ్రుడే అవుతున్నాడు గాని అన్యుడు కావడంలేదు. ఈమహాంధ్రభూమిలో యేమూలపుట్టినా, ఏమూల పెరిగినా ఆంధ్రుడు ఆంధ్రుడనియే పిలుచుకొనుచున్నాడు. ప్రతి ఆంధ్రు డింటిలోనూ ఆంధ్రభాషే వినబడుతూ ఉన్నది. పూర్వకాలమున విరాజిల్లిన ఆంధ్రకీర్తికాంతులన్నియు ఆంధ్రులరక్తములో కలిసి, ప్రాచీనఆంధ్రనాగరకత, సాంప్రదాయములు, ఆచారములు, ఆంధ్రచరిత్రలతో పాటు ప్రతిఫలిస్తూ, యెటు చూచినా ఆంధ్రత్వమే ఆవరించి, ప్రతిక్షణము ఉత్సాహ తేజములు కలిగిస్తూయున్నవి. ఆంధ్రు డెక్కడ పుట్టినా తాను ఆంధ్రుడనని గర్వించిపోవాలి. గంజాంలో పుట్టిన ఆంధ్రుడికి, అనంతపురంలో పుట్టిన ఆంధ్రుడికి, ఓరుగంటిసీమలో జన్మించిన ఆంధ్రుడికి మాట్లాడేభాషలో స్థానిక వ్యత్యాసములుంటే వుండవచ్చును, గాని అందరు ఒక్కజాతివారమేయని ఒకరినొకరు ఎరచురికలేని స్నేహంతో, సోదరభావంతో ప్రేమించుకోవాలి. ఎన్నిమాటలు చెప్పితే నేమి ప్రయోజనము? కండ్లులేని వానికైనా దేవుడు మతి యిస్తే ఎక్కడవున్న వస్తువైనా అంతర్దృష్టికి తన తేజోమూర్తిలో కనిపిస్తుంది గాని మతి లేకపోయినపుడు కన్నులు గలవాండ్లకైనా దిక్కులంతా ఆవరించి వెలుగుచున్న తేజఃపుంజము కనిపించదు. శుక్లపక్షమునాటి సప్తమచంద్రాకృతి గలిగి మనోహరమై నిగ్గులు తేరి తేట వెన్నెలలు ప్రసరింపచేసే తెలుగుభూమి తెలుగువారి ప్రభతో, ప్రాచీనగౌరవముతో వెలిగిపోవుచు, కన్నులకు మిరుమిట్లు గొలుపుచు; హృదయానికి ఆవేశము, ఆనందమూ కలిగిస్తూ ఉత్సాహం పోస్తువుంటే, మన తెలివితక్కువ ఆంధ్రునికి కన్ను లున్నా కనిపించక పోవడము దురదృష్టము కాక మరియేమి? ఆంధ్రదేశంయొక్క విశ్వరూపము ఆంధ్రుడి విశాలనేత్రములకు హృదయదౌర్బల్యం చేత కలిగిన అంధత్వము ఆవరించడంవలన కనబడడం లేదు. రాయప్రోలు సుబ్బారాయకవి గానము చేసినట్లు శాతవాహనుల ప్రాభవమును మాటిమాటికి స్మరణకు తెచ్చెడు కృష్ణానదీతటము, చాళుక్యుల నాగరకతా గౌరవములు తన కడుపులో దాచి గంభీరంగా ప్రవహించే గోదావరియు, పల్నాటివీరుల సాహస వీరకృత్యములను దలపునకు దెచ్చే కార్యమపూడి రంగమును, తిక్కకవినాథుడు తిక్కచమూపతులు వెలసి ఆంధ్రవీరుల ప్రతిభాశౌర్యములు లోకమునకు చాటిన పుణ్యభూమియు, కాకతీయుల వైభవము మాటిమాటికి ఘోషించు ఓరుగంటి సీమయు, దక్షిణహిందూరాయ సురత్రాణులకు ఆటపట్టయి అలరారి మహదైశ్వర్యమును చవిచూచిన విజయనగరసీమయు తెలుగునాటిలోనివే! ప్రసిద్ధి గన్నట్టి ఒక పట్నం, ఒకపల్లె, ఒకతావు, ఒకకొండ, ఒక ఏరు, ఒకమహానది యెక్కడున్నా సరే,ఆంధ్రదేశంలో తెలుగువారికందరికి అది సమానమైనహక్కు కలిగించి గౌరవము కలిగించు తున్నది. పోతన్న ఒంటిమిట్టవాడైతే నేమి, ఓరుగంటివాడైతే నేమి, వేములవాడ భీమకవి దాక్షారామవాస్తవ్యుడైతే నేమి, నైజాంమండలవాసి యైతే నేమి? దురభిమానం పెట్టుకొని నిజమైన గౌరవప్రేమ చంపుకొని ప్రవర్తిస్తాడు ఆంధ్రుడు. ఎక్కడ వుండినా, ఎక్కడ పుట్టినా, పోతన భీమనకవులు ఆంధ్రదేశం అంతటికీ సమానమైన గౌరవార్హులే! ఈ పిచ్చి తల యెక్కడం చేతనే కాబోలు ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తు మావూళ్లో వుండాలి, మాజిల్లాలో వుండాలి, వుంటేనే గాని సంపూర్ణమైన ఆంధ్రత్వం దానికి ప్రాపింపదు అని ఆంధ్రుడు గందరగోళము చేయుచున్నాడు. అది పుట్టి ఆరేండ్లయినా పట్టుమని నిలవడానికి నీడ ఉండీ లేకుండా జీవిస్తున



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మై, త్రిశంకు స్వర్గనైభవము అనుభవిస్తూ యున్నది. ఆంధ్రదేశాభిమానం క్షణికమైన దౌర్బల్యమునకు లొంగిపోయి ఆంధ్రుని చంచలచిత్తప్రవృత్తికి కన్నీటితో దాస్యం చేస్తూవున్నది. మహేంద్రగిరివద్ద పుట్టిన ఆంధ్రుడికి బెజవాడలో పుట్టి పెరిగిన ఆంధ్రునికి కృష్ణా అమరావతులపై ఎంత అభిమాన గౌరవప్రేమలు ఉంటాయో, అంతా ఉండితీరవలెను. ఆంధ్రకవితాకన్యను తొలికాలమున వెలయింప జేసిన గోదావరీ సైకతములను తిలకించి రాజమహేంద్రపురవాసి పులకితగాత్రుడై యెంత పొంగి పొరలిపోతాడో అనంతపురం, చిత్తూరు, కృష్ణా మండలవాస్తవ్యులును అంతేగా పులకాంకితులు కావాలి. ప్రతితావునందు, ప్రతి ఆంధ్రునియందు ఆంధ్రావలి యొక్క విశ్వరూపము ఆంధ్రుడు చూడగలిగిన నాడే- ఆతనికి నిజమైన దేశాభిమానం ఉన్నదన్నమాట! ఇపుడు ఆంధ్రుని కున్నదల్లా దూరదృష్టి లేని దురభిమానం, ప్రతి విషయంలోనూ చిన్నచూపు. స్వగ్రామాభిమానం స్వంతలూకాభిమానం, స్వాభిమానం నానాటికి ప్రబలనువుతూ నిజమైన దేశాభిమానంక్రింద చెల్లుబడి అవుతున్నాయి.

తెలివితక్కువ ఆంధ్రు డీనడుమ క్రొత్త విద్య యొకటి నేర్చుకున్నాడు: ఆంధ్రంలో ఏమీ గొప్ప లేదనీ, ఆంధ్రదేశం గొప్పవీరులను కనలేదనీ, ఆంధ్రభాష నుద్ధరించడానికి మహాకవులు పుట్టలేదనీ, ఆంధ్రుడు గర్వింపదగిన పూర్వపు సచ్చారిత్రము యేమీ లేదని ఆంధ్రం అన్నదానినెల్లా తుదవఱకు నిరసించి, 'హేళనచేయడం ప్రారంభించినాడు. ఈ యాంధ్రుడి దృష్టిలో నన్నయ, తిక్కనసోమయాజి, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన, సూరకవులు కవులు గారట! పోతరాజు, రామదాసు, వేమన, త్యాగరాజు మొదలయినవారు మహాభక్తులుగారట! జ్ఞానులు గారట! వీరిజననం వల్ల ఆంధ్రావనికి గౌరవం హెచ్చలేదట. కాని యితడు బంగాళాదేశంలో పుట్టిన చైతన్యుని స్మరించి ఉప్పొంగి పరవశుడై పోతాడు. ఠాకూరు కవిశేఖరుని, బంకించంద్రుని చూచి అంతటి మహాకవులు ఆంధ్రులలో పుట్టలేదంటాడు. కేశవచంద్రునివంటి మహాజ్ఞానిని ఆంధ్రదేశం కనడానికి నోచుకోలేదంటాడు. పరదేశములను, పెరవారి సౌభాగ్యము మెప్పుచూపులతో చూచి ఉప్పొంగి పరవశుడై, తనవారి యొక్క గొప్పదనాన్ని చిన్నచూపు చూచి, ఒక్క హైన్యమునే కనిపెట్ట కలిగిన ఆంధ్రుడికి నైతికమోక్ష మెక్కడిది? ఇంటిలోనున్న సౌందర్యరాశిని గుర్తింపలేక ఆంధ్రుడు పరునింటనున్న సౌందర్యమునకు ప్రాకులాడుతున్నాడు. సత్రభుక్కులకు తనయింట భోజనరుచించునా? రంధ్రాన్వేషణపరునకు గుణం ఎక్కడనైనా కానుపించునా?

ఇంత నిష్ఠురముగా వ్రాసినందులకు ఆంధ్రునికి నాపై తప్పకుండా ఆగ్రహం కలుగుతుంది. పోనియ్యండి; ఇంతవఱకు తెలుగుభూమిని పుట్టిన ఉద్యమము చిరకాలం ఒక్కలాగున ఉండి వర్ధిల్లి యొక్క మహాసంస్థయై ఆంధ్రుని జీవితములో కలిసిపోయి ఆతని అభ్యున్నతికి తోడ్పడినది- ఒక్కటి వ్రేలు మడిచి చూపించండి! ప్రత్యేకాంధ్రరాష్ట్రోద్యమముతో ప్రారంభమయిన ప్రతి యుద్యమమూ ఆంధ్రదేశంలో ఒకటి తరువాత నింకొకటి నీరు కారిపోయింది. ఆంధ్రుని పట్టుదల, మనస్సంకల్పము ఇట్టిదని వేరే వ్రాయనక్కర లేకుండా, అవి క్రమక్రమంగా యేలాగున పరిణామము పొందుతూ వుంటవో వేరొక సందర్భమున సారంగు తమ్మయ్య చెప్పిన చిన్నపద్యంలో ఉదాహరింపవచ్చును. ఆంధ్రుని మనస్సంకల్పము ఆదిలో వజ్ర (పంజర) సన్నిభమై యున్నా, రానురాను,

"..................
..........లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృ
క్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరంగెం బో
బో నీళ్లకుం బల్చనై."

అని నిర్భయంగా నుడువవచ్చును

అదేమిచిత్రమో గాని, ఒకఉద్యమము సగం సాగేవఱకు మరియొకటి అమాయకుడైన ఆంధ్రునిదృష్టిని ఆకర్షిస్తూఆతనిబుద్ధిని మరలిస్తువుండడం, దానితో మొదటిదానిపై కొంచెము వైముఖ్యం కలగడం, మొదటిలోవున్న వజ్రసన్నిభమైన సంకల్పము కొంచెం కొంచెంగా సడలిపోవ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డం, చివరకు రెండూకూడా తిరుపతిమంగలివాని క్షౌరములాగున సగం నడిచి యెదుగుబొదుగులేకుండ ఆగిపోవడము ఆంధ్రుని ఆధునికజీవితంలో పరిపాటి అయిపోయింది. దేశంలో ఏమూలయినా క్రొత్తయుద్యమం తలయెత్తేసరికి ముందు ఆందోళన ఆంధ్రుడిది. క్రొత్తదానిని వాసనబట్టి హడావిడి చేయడమూ, తిరిగి అంతలోనే దానిని మొగమోటం ఏమీ లేకుండా జారవిడవడము ఆంధ్రునికి అలవాటైన విషయము. చూడండి! ఉదాహరణము కావలసినయెడల—వంగరాష్ట్ర విభజనోద్యమము మొదలుకొని నేటి స్వదేశీ, ఖాదీ, స్వాతంత్ర్యోద్యమముల వఱకును ఆంధ్రు డేలా వ్యవహరించినాడో! చిందులు త్రొక్కడం, నలుగురిదృష్టి ఒకసారి ఆకర్షించడం తప్ప, ఘనంగా నిలిచేకార్యము ఒకటి అయినా కొనసాగింప లేకపోయినాడు. చివరకు అన్నిటికంటె యెక్కువగా చెప్పవలసిన దేమిటంటే, మహాప్రయత్నం చేసి సంపాదించినదాన్ని,కూడా సరిగా నిర్వాహకం చేసుకోలేకపోతూవుంటాడు. చూడండి: మనఆంధ్రుడు ఇతర రాష్ట్రాలవారి వెక్కిరింతలకు గురియైనాడు. ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తు విషయం ఒక్కటి ఆలోచించిచూస్తే, పాపం, ఆంధ్రుడేలానలుగురినోళ్లాపడి నవ్వులపాలైనాడో తెలియగలదు. ఆంధ్రుడు గొఱ్ఱెపొట్టియలాగున తలవంచుకొని ఒక్కరీతిగా ముందువెనుక అని ఆలోచన లేకుండా నడచిపోతూవుండడంకంటె, పరుగు నిలిపి త్రొక్కుకుని నిలబడి ఒకమాటు కలయజూచుకుంటె తన నిజావస్థ తెలుస్తుంది. అంతటి స్తిమితం యేదీ? అంతటి జ్ఞానం యెక్కడిదీ? ఈ మహాసంఘాన్ని, ఆంధ్రావళి ప్రజ్ఞానుసారంగా నడిపించి గమ్యస్థానం చేర్పగల దక్షుడైన మహానాయకు డెవడైనా కనిపించిననాడే, ఆంధ్రునిపౌరుషము, మహిమ, ప్రతిభ వెల్లడి కాగలవు.

ఒక్కమాటు ఆంధ్రప్రపంచం అంతా సింహావలోకనం చేసి చూస్తే ఆంధ్రుడికి వ్యవహారనిర్వహణదక్షత మొదలే శూన్యమేమో యని తోస్తున్నది. రాజకీయవ్యవహారమయినా అంతే, సాంఘికవిషయమైనా అంతే. ముందు అతనికి ముఖ్యంగా వుండవలసినది, తోడివారిపై కరుణ, మిత్రభావము లేకపోవడంచేత వ్యవహారం నడిపించే దూరదృష్టికూడా లేకుండా ఉన్నది. అతనికి భటుని కుండే ఉత్సాహం, ధైర్యము, సాహసోక్తులు తామర తంపరగా వున్నాయిగాని నాయకుని కుండవలసిన గుణలక్షణములలో కార్యైకదీక్షావిధి, ఆలోచనానిమగ్నత, చిత్తస్థైర్యము, గంభీరమైన హృదయము, యీ మొదలయినవి ఒకటీ ఆంధ్రునియందు కాన్పించవు. అందులకే ఆంధ్రు డింకా బాల్యస్థితి దాటనివాడని మాటిమాటికి చెప్పవలసి వస్తున్నది.

రాజకీయములు అటుంచినా, యితర విషయములలోనూ, ఇతర ఉద్యమములలోనూ ఆంధ్రుడు నిర్వాహకంచేసి పేరు గడించి దేశానికి ఉపకృతి చేసిం దేదయినా ఒకటీ కనిపించదు. చేయెత్తి సత్కార్యముల కొరకై దానధర్మములుచేసిన దొకటి చూపించండి. ఒక్క విద్యాసంస్థను గాని, ఒక్క సాంఘికసంస్థను గాని, ఒక దేశ ప్రజాహితైకసంస్థను గాని పట్టుమని ఒకమహాదానము చేసిన మహామతి ఆంధ్రులలో కంచుకాగడా పెట్టి వెదకినా దొరకడం లేదు. ఎంతసేపు చూచినా ఆంధ్రుడికి లోభత్వమూ, కృపణవృత్తి, నీచమైన స్వార్థపరత్వమూ కనిపించుచున్నవి గాని, కరుణ, మైత్రి, దానము ఇవి కనబడడం లేదు. ఆంధ్రుణ్ణి అయినప్పటికి కుటిలమతితోనూ, వక్రబుద్ధితోనూ నిందాశీలుడనై నేను ఈమాటలు పలకడం లేదు. ఆంధ్రుడికి మానవత్వం నశించిపోవడం చేతనూ, కేవలం పశుత్వముకన్నా నీచమైన స్థితి అవహిస్తు ఉండడంచేతనూ, దయ, దానము, దమము మొదలయిన సద్గుణములు మృగ్యమవుతూవుండడంచేతనూ యిన్ని అనర్థాలు వాటిల్లుతూ యున్నవి.

మరియొక విషయము. ఆంధ్రుడు తాను చాలా సౌందర్యపిపాస గలవాడ నంటాడు. సౌందర్యాన్ని తాను మెచ్చుకున్నట్లు, సృజించినట్లు, కలిగివున్నట్లు యితరు లెవరూ చేయడంలేదని గొప్పలు చెప్పుకుంటున్నాడు. అమరావతీ శిల్పసౌందర్యమంటాడు, సింహాచలపు జిలుగు లంటాడు. అటు జీర్ణవిజయనగరం మొదలుకొని యిటు శ్రీకూర్మక్షేత్రంవఱకు, అటు సహస్రస్తంభదేవాలయమువఱకు అనేక చిత్రశిల్పసౌందర్యాలు చూపి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తాడు. వాటిని తలచుకుంటూ హృదయం ఏమాత్రం కూడా చలించకుండా మురిసిపోతాడు. కనబడ్డవారితో కూడా అప్పుడప్పుడు చెబుతాడు. కాని ఆ సౌందర్యం ప్రతిఫలించే నూతనసృష్టిని ఆంధ్రుడీనాటి ప్రపంచకములో వెలయింప జేసిన దేదీ? అమరావతీ శిల్పచిత్రాలు, నాగార్జున కొండ, భట్టిప్రోలు, జగ్గయ్యపేట శిల్ప చిత్రాలు యితరతావులకు యితరులు గొనిపోతూవుంటే కన్నులు మిటకరించి ఊరికే చూచాడు గాని పల్లెత్తు మాటాడిఆటంకపఱప లేకపోతే పోయెను,అసమ్మతినైనా తెలుప లేకపోయినాడు,తన దేశంలో ఏ మూలనో,ఏ కేంద్రంలోనో చిత్రవస్తు ప్రదర్శనశాల కట్టించి ఉంచమని కోరలేదు. ఆంధ్రచిత్రకారుడు తాను ప్రత్యేకప్రతిభ కల వ్యక్తి నంటాడు. కాని అతని సృష్టిలో ఆంధ్రత్వమూ, నూతన సృష్టి, కల్పన, ప్రతిభ ప్రతిఫలించుటకు మారుగా అతని ప్రజ్ఞ ఏ పెద్దబంగాళీవాడి అనుకరణమో, ఏ పురాతన గ్రీకుకళానువాదమో ప్రతిబింబించుటలో సరిపోతూవున్నది. ఇది ఆంధ్రచిత్రకళావిమర్శనమునకు తావు గాదు గాని ఆంధ్రుల నూతన జీవనము అందులో ప్రతిఫలించడము లేదని మాత్రము చెప్ప సాహసిస్తాను. ఔను. అసలు ఆంధ్రజీవనమే కృపణత్వమును పొంది శోషించి పోతూవుంటే ఆంధ్రచిత్రకళకూడా దానినే చిత్రించుతూ వున్నదని చెప్పవలెను గదా! జాతియొక్క కోమలమైన భావసౌందర్యము, సూక్ష్మమయిన విజ్ఞాన సంపత్తి నిత్యజీవనంలో కనిపించాలి. దీనికి లలితకళలు, కవిత్వము, వాఙ్మయము ఇవేకదా సాక్షీభూతములు! లలితకళలలో కొన్నింటిని చూచితిమిగదా! ఇక మిగిలినవి నాటకకళ, సంగీతము, నృత్యము, కవిత్వము ఎలాగున వున్నవో ఒక్కసారి పరిశీలించండి. మన నాటకకళ ఎన్నేండ్లయి పుట్టినా ఎదుగు బొదుగులు లేక మరగుజ్జువాని శరీర సౌష్ఠవముతో ప్రకాశిస్తూ యున్నది! నూతన నాటకముల సృష్టి లేదు. నాటకాభినయనము వృద్ధిపొందుట లేదు. ప్రసిద్ధనటుని యాజమాన్యము క్రింద అనేక సమాజాలు వెలిసిపోతూ, ధనాకర్షణప్రవాహంలోబడి కొట్టుకొని పోతూ, నాటకకళను గొంతు పిసికి వేయుచున్నారు. ఇన్నాళ్లయినా ఆంధ్రులలో మగవాడు ఆడదాన్ని అవతల వుంచి, ఆమెను ఒక చిత్రవస్తువులలాగున చూస్తున్నాడు గాని నిత్యజీవనంతోపాటు ఆమెనుకూడా దేశాభ్యుదయ కార్యములందు తావు వున్నదని గ్రహించడం లేదు. ఈమానవలోకము ఒక పురుషునితోనే సాగడం లేదు. స్త్రీ పురుషు లుభయుల తోటే సాగుచున్నది. స్త్రీని వెలికి త్రోసి ఆమె సాహచర్యం లేకుండా పురుషుణ్ణిగదా అని అతానే అంతా నిర్వహింప జూస్తాడు ఆంధ్రుడు. సౌందర్యనిర్మాణానికి మగవా డెంతచేసినా ఆడదే అందాలు దిద్దాలి. ఇక కవిత్వము, సాంస్కృతసృష్టి చూడండి. ఏదీ, వేలు మడచి ఘనమైన కావ్య మొకటి యీనాటిఆంధ్రుడు సృష్టించిన దొకటి చూపించండి. ఒక్క కావ్యమే కాదు, ఒక్క నాటకమే కాదు, ఒక్క నవలే కాదు. ఒక్క శాస్త్ర గ్రంథము, ఒక దేశచరిత్ర, జాతీయవికాసమునకు తోడ్పడే ఒక్క గ్రంథము, ఏదయినా ఒక్క గొప్ప గ్రంథం ఆంధ్రభాషలో వెలువడినది ఒకటి కనబడదు! ఆంధ్రభాష సంగీతానికి అనువైన దన్న గర్వపుమాటయే గాని ఆంధ్రునికింకా సంగీతకళయొక్క రహస్యము, ఉపయోగము గోచరించ లేదు. సంగీతకళ అభివృద్ధిపొందడం లేదు. ఆంధ్రనర్తకి యొకప్పుడు తన భక్తి శృంగార విలాస భావాభినయములలో దేశమును ఆనందపారవశ్యములో ముంచిన దేమో గాని, యీనాడు జగన్మోహనమైన ఆనృత్య మడుగంటి పోయినది. జీర్ణమయి పోవుచున్న నాట్యకళ నుద్ధరించే దక్షుడే కనబడడం లేదు. దేశంలో నాట్యకళ, నర్తన అవాచ్యమై, అగౌరవప్రదము లై పోయినవి. కొందరి దృష్టిలో నర్తకి హేయమైన పశుజాలము కంటె అధమతరమై పోయి కంటబడుటకు గూడ అనర్హమై, అసహ్యకరమై పోయినది. ఎవని దీలోటు? ఈలాగున వ్రాసినందులకు ఆంధ్రుడు కన్ను లెఱ్ఱజేసి క్రోధావేశమును గనబరుస్తాడు. కాని ఆ ఆవేశమునకు, క్రోధమునకు భయపడ నక్కర లేదు. చేతనైన సిగ్గుపడి ఆంధ్రుడు ఆత్మపరిశీలన చేసుకోవాలి; ఆత్మవంచన చేసుకొనడము మాని ఉన్నసంగతి కన్నులు విప్పి చూచి గ్రహించుకోవాలి!

ఈకాలపు ఆంధ్రుని ఉత్సాహం సోడాబుడ్డిలో బంధింపబడిన గాసువంటిది. ఆగాసు కొంచెము బంధ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విమోచనం కావడంతోనే బుస్సుమనిపొంగి యువతల పడి చల్లారిపోవుచున్నది. ఆంధ్రుడి ఉత్సాహం అంతా యీలాగే నిష్ప్రయోజనం అయిపోవుచున్నది. అది అంతటితో ఊరకుండక తోడివాండ్లకు, తరువాత వచ్చే యువతీ యువకులకుకూడా నిరుత్సాహకర మగుచున్నది. ఉత్సాహం చచ్చి, పిరికికండ బయటపడ్డ తరువాత మనిషికి తిరిగీ ఉత్సాహం జనించదు. లేచి పడిపోయిన సముద్రపు కెరటములాగే ఉత్సాహకెరటము గూడా విరిగి పడిన తరువాత తిరిగి మొలకెత్తలేదు. చివరకు ఆంధ్రులందరిని ప్రసిద్ధుడైన గిరీశంగారి "మృదుమధుర వచనాలతో" అభినందించవలసిన దౌర్భాగ్యం కలుగుతుంది.

ఆంధ్రుడి అజ్ఞాన దౌర్భాగ్యంవల్ల లోభత్వము, లాలసలతోపాటు అసహనాంకురము మొలకయెత్తి నీటిలో నాచువలె ఆంధ్రునిజీవితసాగరమంతా చుట్టివేసుకుంటూ యున్నది. వేరుపురుగై మహోదారుడైన వాని హృదయం బిద పట్టించి నమిలివేయుచున్నది, మానవత్వము చంపించి రాక్షసత్వము అలవరింపజేస్తూ ఉన్నది. మనుష్యునికి పేరాశ, లోభత్వమే కాని రాక్షసునకు హింస కూడా ప్రీతియైనది. ఆంధ్రదేశంలో మానవుడికి యీ రాక్షసత్వముకూడా అబ్బడముచేత హింస ప్రబలి కరుణను, మైత్రిని నాశనం చేస్తున్నది. హింసయొక్క మరోరూపము అసహనము. అది బలము కలిగినపుడు హింస యగుచున్నది, చేతగాని తన మబ్బినపుడు అసహన మనిపించుకుంటున్నది. ఈఅసహనముకూడా ఆంధ్రుని బాల్యావస్థనే సూచిస్తుఉన్నది. ఇది పూర్వము కథలో చెప్పినట్లు దాక్షారామ భీమేశులింగమువలె మింటికి ఎగసిపోవుచున్నది. దీనికి నడినెత్తిపై సరిగా చూచి శిల గొట్టగల సమర్థుడు ఆంధ్రులలో అవతరించాలి. ఈ అసహనము శివుడు కాముణ్ణి తనచిచ్చుఱకంట కాల్చి భస్మీపటలం చేసినట్లు, జ్ఞాననేత్రంతో, దేశాభిమాన పూరితుడై, ఆంధ్రుడు దగ్ధంచేయాలి.

ఆంధ్రుడిలో మరోదుర్గుణం ఉన్నది. అతడు దురభిమానముతో స్వోత్కర్ష చేసుకోమంటే ముందు వెనుక లరయడు. తోటి ఆంధ్రుణ్ణి గొప్పవాడని మరియొకడు మెచ్చుకుంటే వాని లోపాలు వెదకి తటాలున తడుముకోకుండా చెప్పి వాడి గొప్పదనాన్ని మరుగుపరచడానికి ప్రయత్నంచేస్తాడు. ఆంధ్రేతరుణ్ణి మాత్రము గొప్పవాడని చెప్పితే మెచ్చుకోడానికి సంకోచింపడు. ఎంత గొప్పవాడయినా తోటివాడు ఆంధ్రుడు దృష్టిలో వ్యర్థుడే. ఎంత సామాన్యుడయినా పరదేశీయులు తమవాడు గొప్పవాడని ప్రచురిస్తే ఆంధ్రుని దృష్టిలో సమర్థుడే! ప్రతిభాశాలియే! బ్రతికివున్ననాళ్లు ఆంధ్రుడు తనసోదరుని మహిమలు ఎన్నబోడు. చచ్చిన తరువాత కల్ల ఏడ్పు వినిపిస్తాడు. ఆతని హృదయంలో కరుణ అన్నది లేదు. బ్రతికివున్న రోజులలో "ఆంధ్రరత్న" యొక్క మహిమ, ప్రజ్ఞ ఎవడూ కనిపెట్టి మెచ్చుకో లేకపోయినాడు. చచ్చినతరువాత కొంత తాటియాకులచప్పుడు చేసినాడు. మరల గాఢనిద్రావస్థలో, మైమరపులో కూలిపోయినాడు.

ఆజన్మ సంసిద్ధమైన యీ అసహన దోషంవల్ల ఆంధ్రుడు తలపెట్టినకార్యము ఒకటీ కొనసాగడం లేదు. ఈ అసహనంచేతనే పొరిగింటివాడు తలపెట్టిన మహత్కార్యము కూడా నడవడంలేదు. అది జయప్రదమయ్యే మార్గాలు చూపించి, దానికి కావలసిన సహాయము చేసి ఒకదరి చేర్చుటకు మారుగా దాని నేలాగయినా విఘ్నంచేయగల ఉపాయాల నన్వేషించి, అది కడతేరినదాకా దేవులాడి. కండ్లు చల్లపఱచు కొంటున్నాడు. దీనితో హింసావ్రతము పూర్తిఅవుతున్నది. ఆంధ్రుని మానవత్వము క్రమంగా అసురత్వములోనికి పరిణమిస్తూ యున్నది.

ఆంధ్రు బాల్యచాపల్యము అపుడపు డింకొకరీతిగా కూడా పరిణమిస్తు యున్నది. దీనికి అతనిమనోదౌర్బల్యమే ప్రధానకారణము. ఈ మనోదౌర్బల్యము ఆంధ్రుని పురోభివృద్ధికి ప్రబలమైన ఆటంక మవుతూ ఉన్నది. ఆంధ్రుడు తన కేది ముఖ్యముగా ఆవశ్యకమో గ్రహింపగల్గి తీవ్రంగా ఆందోళన చేయడమే కష్టము. సక్రమంగా, స్థిరచిత్తముతో, ఏకాగ్రతతో ఉద్యమాన్ని నడిపించగల సమర్థత యింకా ఆంధ్రుడికి చేతవడం లేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందుచేత ఆందోళన ఆరంభించి చేస్తూఉంటున్నపుడు మరియొక సదుద్యమము, అఖిలభారత దేశానికి సంబంధించినదో మరియొకటో, బయలుదేరినపుడు మొదటియుద్యమానికి కన్నీరయినా విడువకుండా స్వస్తిచెప్పి, జీవచ్ఛవమును చేసి మహోత్సాహంతో రెండవదాన్ని పట్టుకొని దేశభక్తుడని ఊరేగుతాడు. కాని రెండింటిని సమంగా నడిపించి కార్యసాధనం చేసుకోవానికి ప్రయత్నం చేయాలి. ఒక ఉద్యమానికి మరియొక ఉద్యమం అడ్డుతగిలినపుడు ఉత్సాహం, పట్టుదల రెండింటిమీద సమంగా కనుపఱచి ప్రజ్ఞతో రెండింటిని సాధించాలి. స్వరాష్ట్రోద్యమములు వెనకను అఖిలభారత రాష్ట్రోద్యమముల ముంగిటను నడిపింపరాదు. రెండవది యెంతముఖ్యమైనదో, మొదటిదికూడా అంతముఖ్యమైనదే. బాగా ఆలోచిస్తే స్వరాష్ట్రవిషయం ముందు, అఖిలభారత దేశమునకు సంబంధించిన విషయము తరువాత చూడాలి. ఇంట గెల్చిగదా రచ్చ గెలవాలన్నాడు శాస్త్రకారుడు. ఒక్కగుఱ్ఱమునే స్వాధీనంచేసుకొని నడిపించలేకుండావున్న ఆంధ్రసారథి రెండు మూడు గుఱ్ఱాలను చేర్చి రథము నడిపింపగలడా? ఏకకాలమునందు రెండు ఉద్యమములమీద ఏకాగ్రత కుదురుట కష్టతమము. ఆంధ్రుడింతవఱకు ఒక్కదానిమీదనే ఏకాగ్రత కుదిరి, నడిపింప సామర్థ్యము కనబఱుప లేనపుడు రెండింటిపై సమానముగా కనబఱప లేకపోవడము ఆశ్చర్యకరమైన విషయము కాదు!

ఈలోపమంతా ఎందువలన కలిగినదో ఆంధ్రుడు పరుగు విడిచి నిలబడి ఒకసారి ఆలోచించాలి. ఆంధ్రావళి యిపుడు సేనానిలేని బలసమూహంలాగున వున్నది. ఈ ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వపు రోజులలో ప్రతివాడును సేనానీ అయియుండాలి, సైనికుడూ అయి యుండాలి. శిక్షణ పొందని సైనికుడు మూకకు జయం కూర్చుటకు మారుగా ఎట్లు చేటావహింప జేస్తాడో శిక్షణలేని ఆంధ్రుడీ కాలములో దేశంలో వ్యాపించియున్న ప్రతియుద్యమమునుకూడా ఆభాసుపాలు చేస్తున్నాడు. తనసత్తువ యెంతో తెలిసికొని ప్రవర్తించడము ఆంధ్రుడి ఆత్మగౌరవమునకు గొప్ప కళంక మవుతూఉన్నది. ప్రతి ఆంధ్రుడూ ఒళ్లు తెలియక తాను గాంధీ మహాత్ముడంతటి దేశభక్తుడని గర్వించి పోతున్నాడు. ప్రజ్ఞాబుద్ధులలో తాను యే మోతీలాలు, మహమ్మదాలీ, పట్టాభిసీతారామయ్య నంతటివాడననో భ్రమపడుతూవుంటాడు. గిరీశంగారిలాగున "మాటిమాటికి తనబుద్ధి దాట్లేస్తుంది గాని తా నంతవాడను గానా" అని అనుకుంటాడు. ఎందులో చూచినా తాను చాలా గొప్పవాడనని అనుకుని అహంభావంతో సాహసిస్తాడు. బుద్ధిశాలి యైనవాడూ, మహోదారుడయినవాడూ ఒకడు నాయకుడని అంగీకరించడం, వాని ఉపదేశానుసారం ముందడుగువేయడం దేశము, జాతి వీటియొక్క అభ్యున్నతికోసం కొంత స్వార్థత్యాగం చేయడమూ అంటే ఆంధ్రుడికి కిట్టదు. అది ఆతని ఆత్మగౌరవానికి కళంక మవుతుంది. మనసునకు నొప్పి కలిగిస్తుంది. ఆంధ్రుడైనవా డెవడూ ఒకణ్ణి నాయకుడని అంగీకరించడు. ఆతని దృష్టిలో నాయకుడు కాదగినవాడు ఒకడూ కనబడడు. ఉన్నాడని చెప్పినా వినీవిననట్లు ఊరకుంటాడు. అక్కడ మహాత్ముని ఒకణ్ణి నిలవబెడితే వాడికేదో కళంకం వెదికి పట్టుకొని వాడు నాయకుడు కాజాలడంటాడు. బ్రతికియున్న వాణ్ణి యెవణ్ణీ ఆంధ్రుడు గొప్పవాడనీ, నాయకత్వానికి యోగ్యుడనీ మెచ్చుకొనడు. ఆంధ్రుడీ దురహంకారమును భస్మీపటలం చేయాలి. మంచి అన్నది ఎక్కడైనా వుంటే దాన్ని తెలుసుకొని యితరులకు ప్రకటించుకోవాలి. అన్నిటికంటె శిక్షణను పొందాలి. అహంభావము అణచుకోవాలి. సొంతలాభం కొంత మానుకొని దేశం కోసం పాటుపడి తోడి జనులకు కొంత మేలు చేసి చూపించాలి. దేశభక్తి గలవాడనని జ్ఞానంతో ఆనందం అనుభవించాలి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి చందాదారుల కొఱక ముఖ్యమైన విజ్ఞప్తి

---

ఈ దిగువ నమోదుపఱచినసంఖ్యలుగల చందాదారులచందాలు ఈశుక్ల మాఘమాస సంచికతో ముగియుచున్నవి. ఆయా సంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మణిఆర్డరుద్వారా పంపుట గాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు మార్చి ౧-వ తేదీ లోగా మాకు మణిఆర్డరు గాని, వి. పి. అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము. చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పివేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుప ప్రార్థితులు.

1895, 1982, 2302, 2355, 2359, 3159, 3478, 3488, 3519, 3928, 3913, 3945, 3963, 4288, 4355, 4619, 4666, 4676, 4678, 4679, 4686, 4691, 4693, 4699, 4708, 4714, 4756, 4769, 5053, 5054, 5088, 5091, 5097, 5127, 5132, 5451, 5461, 5463, 5466, 5467, 5469, 5473, 5476, 5477, 5482, 5486, 5488, 5489, 5491, 5493, 5494, 5502, 5503, 5504, 5509, 5513, 5514, 5524, 5539, 5540, 5553, 5554, 5561, 5640, 5771, 5782, 5791, 5794, 5806, 5811, 5813, 5817, 5818, 5823, 5825, 5827, 5829, 5831, 5832, 5839, 5841, 5843, 5853, 5864, 5867, 5921,

మేనేజరు 'భారతి'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాముద్రికం

సామినేని ముద్దుకృష్ణ గారు

ఎంత ఉన్నతస్థితిలో ఉన్న విజ్ఞానాన్నైనా తుత్తునియలుచేయడానికి ఒకవిప్లవం చాలును. ఒకవిప్లవానంతరంఅంతకన్నా దుస్తరమైన ఇంకొకవిప్లవం ప్రబలుతూ అనేక శతాబ్దాల నుంచీ చీకట్లపాలయి దారీ తెన్నూ కానని దుర వస్థలో చిక్కుకున్న భారతీయవిజ్ఞానం సంగతి చెప్పనక్కరలేదు. చరిత్రనపిహితం తన దీర్ఘహస్తాన్ని ఎంతచాపినా అందుకోడానికి వీలులేని నాటి భారతీయవిజ్ఞానాన్ని ఎంత కన్నులు తెరిచినా పరిశీలించలేము. ఏడవ శతాబ్దం నుంచీ విరిగిపడుతూవున్న విప్లవాలు మన ప్రస్తుతం మనపూర్వాన్ని అనుసరించకుండా చేయడం వల్ల బొత్తిగా దీనస్థితిని చేరుకున్నాము. ఈ దుర్దినాలలో మనం పోగొట్టుకున్న అనేక శాస్త్రాలలో సాముద్రికం ఒకటి. సంపూర్ణ స్వాతంత్ర్యతేజస్సులో ఆత్మాన్వేషణకు పూనుకున్ననాడు తిరిగీ దేశం గొప్పవిజ్ఞానంతో కల కలలాడుతుంది.

తిరిగీ దేశం గొప్ప విజ్ఞానంతో కలకల లాడుతుంది, అనే నా ఆశకు ఆధారం ఏమిటంటే: "కీరో" అనే పాశ్చాత్య సాముద్రిక శాస్త్రవేత్త చెప్పిన ఒకకథ:

ఈయన హిందూదేశాన్ని దర్శించడానికి వచ్చినప్పుడు ఈయన అదృష్టవశాత్తు ఒక పురాతన బ్రాహ్మణ కుటుంబము తరతరాల నుంచీ జాగ్రత్తగా గుప్తంగా దాస్తూవున్న ఒకగ్రంథం చూడడం తటస్థించినది. ఆనాటి భారతవిజ్ఞానం విలువ అమితంగా పొగుడుతూ ఈయన అన్నాడు :

"ఈ అపూర్వమైన గ్రంథం మనుష్య చర్మంతో తయారు చేసినారు; అద్భుతమైన తెలివితేటలతో పేజీలు కూర్చినారు. గ్రంథం చాలాపెద్దది. దానిలో అనేకవందల పటములు నీటుగావ్రాసి, ఎప్పుడు ఏలక్షణం ఏవిధంగా ఫలించినదో చెప్పుతూ, ఆసూత్రాన్ని విశదంగా బోధించినారు. అన్నిటికన్న ఎక్కువ వింతైనసంగతి ఏమిటంటే: దానిలోని అక్షరాలు ఎర్రనిద్రవపదార్థంతో వ్రాసినారు. ఆ అక్షరాల స్ఫుటత్వాన్నిగాని, అందాన్నిగాని, ఎన్నోవందల సంవత్సరాలు పాడుజేయలేకపోయినవి. ముదరపసుపు చర్మందళాలపైన ఆ యెర్రని స్ఫుటాక్షరాలపొందిక చాలా అద్భుతంగా కనిపించినది. ఏవో మూలికలతో తయారుచేసిన పదార్థంతో పేజీలకు వార్నిషుతోవలె నిగనిగలాడే మెరుపు వున్నది. ఆ పదార్థం ఏమిటైనా అది కాలాన్ని ధిక్కరించినట్టు కనిపిస్తుంది. పైఅట్టలు మాత్రమే జీర్ణిస్తున్నట్టుగా కనపడినవి. అది మూడుభాగాలుగా విడదీసినారు; మొదటి భాగంలోని లిపి ఎంత పురాతనంఅయినదోగాని కొద్దిమంది బ్రాహ్మలే తప్పఎవ్వరూపోల్చుకుని చదవలేకపోయినారు."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—Cheiro's Language of the Hand.

ఈకథ చదివిననాటినుంచీ నాకు ఉత్సాహం ద్విగుణీకృతంకాగా ఎక్కువపట్టుదలతో సాముద్రికాన్ని పరిశీలించడం ప్రారంభించినాను. మనపూర్వవిజ్ఞానం స్మృతిగా మిగలడమే కాకుండా జాడలు అక్కడక్కడ ఉన్నట్టు కనిపిస్తూవుండడమువల్ల ఏనాటికైనా ప్రాక్ సాంప్రదాయాలు సిద్ధించవా అని. కాని ఇంతవరకూ ఉపయుక్తంగావుండే శాస్త్రం ఒక్కటీ లభించలేదు. ప్రహ్లాద, నారద, వరాహ మిహిరవిరచిత సంస్కృతగ్రంథాలు, లాహోరులో సంస్కృత మాతృకతోనూ, హిందీ వ్యాఖ్యతోనూ రెండు పెద్దభాగాలుగా ప్రచురించిన సాముద్రికశాస్త్రాన్ని పరిశీలించి చూడగా ఎక్కువతృప్తికరంగా తోచలేదు. అందుచేత పాశ్చాత్యశాస్త్రవేత్తలను విస్తారం అనుసరించడం తప్పినదికాదు. ఇంతకూ విజ్ఞానానికి ప్రాక్ప్రతీచీ భేదాలు నిర్ణయించడం దోషం గనుక, జ్ఞానాన్వేషకులు సహిస్తారనీ, సహృదయులైన పాఠకులు తమ తెలియబాటులో వున్న శాస్త్రజ్ఞులను తెలియజేసినా, అందుబాటులోవున్న శాస్త్రాలను 'భారతీ' పత్రికాముఖమున నాకు దయతో పంపినా, కృతజ్ఞతతో అంగీకరిస్తాను గనుకనూ, పెద్దన్న మెత్తనిమాటలతో అందరి సానుభూతినీ కోరుతాను:

"వీరు వా రనగనలవ,
దనఘ! సద్విద్య యెందున్న గొనగవలయు."

ఇక సాముద్రికం గౌరవించదగిన శాస్త్రాలలో చేరుతుందా? అనేప్రశ్న వున్నది. స్థూలదృష్టినేకాని విశ్వసించని పాశ్చాత్యులలో, ముఖ్యంగా అమెరికనులలో, ఈ అవిశ్వాసం పూర్వం మెండుగా వుండేది. గర్భకోశంలో శిశువు నవమాసములు లేతపిడికిళ్లు పట్టివుండడమువల్ల రేకలు ఏర్పాటవుతవని వీరిలో చాలమంది విశ్వసించేవారు. పలుసంగతులు ప్రజాబాహుళ్యం గ్రహించవలెననే సదుద్దేశంతో శాస్త్రవేత్తలచేత వ్రాయించిన, 'ఎన్సైక్లోపీడియా బ్రిటానికా'! (Encyclopaedia Brita'nnica)లో సాముద్రికాన్ని గురించి ప్రసంగిస్తూ: "వాట్లంతటఅవే ఏర్పాటగు ఈగీతలకు ఏట్టి గుహ్యమైన, మానసికమైన, రాబోయేదాన్ని సూచించగలిగిన అర్థం ఉన్నదేమో అనడం ఉత్తపిచ్చిఊహ. కొన్ని బాపతుల మనస్సులకు దీనిమీద గమ్మత్తుఆకర్షణ వున్నట్టుకనిపిస్తుంది, ఒకదాన్ని ఒకటి అనుసరించేఅర్థం దీనిలో ఏమాత్రం లేనందుచేత బుద్ధిపరిసరాలలో దీని ప్రశంస ఎత్తవీలులేదు." అని గీటునపెట్టినారు. ఇది సామాన్య పాశ్చాత్య బుద్ధిమంతుని గట్టి నమ్మకము మొన్నటివరకూ. ప్రస్తుతం ఈ నమ్మకం మారిపోయి అమెరికాలోనూ, యూరపులోనూ సాముద్రికాన్ని పెద్ద చదువుగా ఎంచుకుని జీవితం ఇందునిమిత్తం అనేక వేలమంది వెచ్చించుతూవున్నారు. ఈవిద్య నభ్యసించడానికి యూరపు, అమెరికా ఖండాలలో పెద్దపెద్దవిశ్వవిద్యాలయాలు స్థాపించి సాముద్రికాన్ని గొప్పశాస్త్రంగా పఠిస్తూవున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాశ్చాత్యదేశాలసంగతి అటువుంచి, బైబిలుబోధించని ప్రతిహాంశము అవిశ్వసనీయము, సైతాను ప్రబోధము అనేగుడ్డినమ్మకంతో జ్యోతిషం, సాముద్రికం, నిమిత్తం మొదలయిన మనశాస్త్రాలన్నీ పిచ్చినమ్మకాలనే యేసుమత ప్రచారకుల బోధనలకు తావిచ్చినవారిని, పాశ్చాత్యవిజ్ఞానాన్నితప్ప ఇతరాన్ని మన్నించమనే ఆవేశంతో వున్నవారిని తప్పించుతే, మనదేశంలో ప్రజాబాహుళ్యం ఈ శాస్త్రం ఉత్కృష్టతను పూర్తిగా అంగీకరిస్తారు. విశ్వసించినవారి వినోదార్థం, విశ్వసించనివారి బుద్ధి ప్రేరేపించడానికి కొన్ని సంగతులు తెలియజేస్తాను.

జనవరి — ౨౯ - ౧౮౯౦ సంవత్సరం స్కాట్లండులో ఎడిన్బరో విశ్వవిద్యాలయము (Edinburgh University) వారు ప్రకటించే "ది స్టూడెంట్" (The Student) అనే పత్రికలో ఒకవైద్యవిద్యార్థిరాసిన జాబు :

"కొన్ని సంవత్సరాలక్రితం నేను 'రాయల్ ఇన్ఫర్మరీ' (Royal Infirmary) ఆస్పిటల్లో రోగులమధ్య సంచరిస్తూవుండగా, హఠాత్తుగా ఒకరోగిచేయి పరీక్షించవలెనని బుద్ధిపుట్టినది. ప్రక్కనేవున్న రోగిశరీరమేమీ పరిశీలించకుండా చేయి మాత్రం పరీక్ష చేశాను. ప్రధానరేఖలు, వాటిలో విరుపులు ప్రమాదాలను సూచిస్తవి అనేసంగతితప్ప నాకు సాముద్రికం ఏమీ తెలియదు. ఆరోగి రెండుచేతులలోనూ ఆయుష్యరేక విరిగిఉన్నది, అదృష్టరేక ఉండవలసిన దానిలో నాల్గవ వంతే ఉన్నది; దాని నడకనుఒక పెద్దక్రాసు- X -అడ్డినది. రోగిని ప్రశ్నిస్తే వయసు ఇరవైమూడు సంవత్సరాలనీ, 'థైసిస్'(Phthisis)అనేరోగం చాలామించిపోయినదనీ తెలుసుకున్నాను. ఆరోగి కొద్దిరోజులలో మరణించాడు. దీనినిబట్టిచూస్తే ఈ గీతలకూ, మనిషిబ్రతుకు నిర్ణయించే మెదడులోని 'గ్రే మేటర్' (Gray Matter) కూ, ఒకవిధమైన సంబంధం వున్నదని నిరూపించడానికి మీరు అంగీకరిస్తారు అనుకుంటాను."

ఇంకొకవింత. ౧౮౯3 సం.ఆగస్టునెలలో ఫ్రాన్సు దేశంలోని పేరిస్ (Paris) పట్టణంలో 'అకేడెమీ డే సైన్సస్' (Academies des-Sciences) శాస్త్రవేత్తల సభలో, ప్రత్యేకం చెవులపరీక్షవల్ల ఎన్నో సంవత్సరాల తరువాత రాబోయేపిచ్చికనిపెట్టవచ్చునని నిరూపించారు. ఇది ఏవిధంగానంటే, చెవి పైభాగము పిచ్చిబయటపడుటకు చాలా సంవత్సరాలు ముందే ఒక వింతమార్పును పొందుతుంది. ఆభాగం మొద్దెక్కి దళంకావడంవల్లగాని, లేక అక్కడ ఒకవిధమైన రక్తపుగడ్డ పెరగడంవల్లగాని తటస్థిస్తుంది. ఇది ముఖ్యంగా పిచ్చి జన్మతః వచ్చినవారిలో కనబడుతుంది.

ఇదికాక 'సైంటుజెర్మైన్', 'పీరో' మొదలయిన సాముద్రికశాస్త్రజ్ఞులు రోగాలు చాలావరకూ గోళ్లను పరీక్షించడంవల్ల నిర్ణయించవచ్చునని స్థిరపరిచారు. ముందు ప్రకటించే వ్యాసాలలో ఈహాంశం సచిత్రంగా విశదీకరిస్తాను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శరీరమంతలోనూ హస్తానికే యింత ప్రాముఖ్యము ఈయడానికి కారణం ఏమిటంటే: పరిణామశాస్త్రవేత్తల (Evolutionists) అభిప్రాయం ప్రకారం భూగోళం ఆయుష్యము రెండువందల కోట్లసంవత్సరాలకన్నా ఎక్కువ. భూమివేడి తగ్గిన కొన్నివేల సంవత్సరాలకు మొదట చేపలు, తరువాత పాములు, ఆతరువాత కొన్నివేలసంవత్సరాలకు పక్షులు, ఈ విధంగా ప్రాణికోటులు సృష్టిలోనికి వొస్తూ, నూటయేభైవేలవత్సరాలక్రితం కోతిరూపుతో మానవాకారానికి దగ్గరగా వున్న ప్రాణి వున్నట్టు నిశ్చయించారు. స్పెయిను దేశంలో దొరికిన అస్థిపంజరాలను పరీక్షిస్తే మనలను పూర్తిగా పోలిన మొదటి మానవ రూపం ముప్పైవేలసంవత్సరాలక్రితం ఏర్పాటయినట్టు తేలినది. హెచ్. జి. వెల్సు అనే చరిత్రకారుని లెక్కప్రకారం అరవైవేల సంవత్సరాలకు పూర్వం భూమిమీద మానవాకారాన్ని పూర్తిగా పోలినజాతి వుండేది. అది రాతిఆయుధాలను, నిప్పు, ఇతర జంతువుల చర్మాలను వాడినట్టున్నూ, మనవలెనే కుడిచేతిని ఎక్కువ చాకచక్యంతో ఉపయోగించినట్టున్నూ తార్కాణాలు తేలినవి. వాళ్ల బొటన వ్రేళ్లు మాత్రం చేతికి మనంత అనుకూలంగా లేవు.

"About sixty thousand years ago, there lived a creature on earth so like a man..............We have skulls and bones of it and a great accumulation of the larger implements it made and used. It made fires. It probably dressed skins and wore them. It was right-handed as men are. Their thumbs were not opposable to the fingures as mens' are."

—H. G. WELLS,
A Short History of the World, p. 33.

ఈపరిణామవాదాన్ని మనదశావతారాల వర్ణనను బట్టిచూస్తే ప్రపంచంలో ప్రాణి మొట్టమొదట జలచరావస్థనుంచి ప్రస్తుత మానవస్థితికి చేరడానికి ఒకగొలుసు ఏర్పాటు కనబడుతుంది. జంతుజాలంకన్నా భిన్నంగా అవయవాలను ఎక్కువ ఉపయుక్తంగా వాడేది కోతి. అనగా కోతి ముందుకాళ్లను ఒక్క నడకకే కాక చేతులుగా ఉపయోగించ గలుగుతుంది. అందుచేత ఇతరజంతువులకన్నా దానిబుద్ధి విశేషంగా ప్రసరించడం కలిగినది. అంగశాస్త్రజ్ఞులు కోతిఅవయవాలకూ మనుష్యుని అవయవాలకూ విస్తారం భేదంలేదని నిర్ణయించారు. కాని కోతికీ మనిషికీ ఒక్కభేదం వున్నది. కోతి చేతులుగా ముందుకాళ్లను ఉపయోగించడంవల్ల తక్కిన జంతువులకన్నా ఉన్నతదశకు రావడం తటస్థించినది. మనిషి కోతికన్నా ఉత్తమ దశకు రావడానికి కూడా చేయిఒక్కటే కారణం. కోతిచేతిలో బొటనవ్రేలు తక్కినవ్రేళ్లకన్నా చాలా దిగువగాను, అనగా బొటనవ్రేలికొన చూపుడువ్రేలి మొదలువరకైనా అందకుండాను వంగకుండాను, నిరుపయోగంగాను వుంటుంది. తరువాత మనుష్యులఅరచేతిలో వ్రేళ్ల మొదళ్లలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈశాస్త్రంలో తారాస్థానానాలని వాడే ఎత్తు ప్రదేశాలు లేవు. పుట్టుకనుంచీ మేధాశక్తిలేని జడునిచేతిలోకూడా ఇవి ఉండవు. "They do not exist in the monkey's so called hands,and are absent in the hands of the congenital idiot."

—Adrien Adolphe Desbarrolles.

ఇది గాక, ప్రొఫెసర్ మార్విన్ — (Prof. F. S. Marvin) చరిత్రకారుడు,మానవుడు కోతిజాతిలో నుంచి వేరుపడి ప్రస్తుత ఉన్నతస్థితికి రావడానికి ఒక్క బొటనవ్రేలి ప్రయోజనమే కారణ మంటాడు.

దీనినిబట్టి చూస్తే, ప్రాణి ఇన్ని వేలసంవత్సరాలనుంచీ పొందుతూవున్న మార్పులకూ, అత్యుత్తమమైన ప్రస్తుత మానవదశకు రావడానికీ చేయి చాలా ప్రధానాంగం అని తేలుతుంది. మానవాధిక్యాన్ని చేయి ఒక్కటే నిర్ణయించినప్పుడు, మానవప్రకృతిని నిర్ణయించడానికి అన్నిఅంగాలకన్నా హస్తమే ఎక్కువ ఆధారం అని నిరూపించడానికి ఇంతకన్నా వాదం అవసరం లేదనుకుంటాను.

హస్తం దాని విలువ తెలుసుకున్నాము గనుక, అరచేతిలో కనిపించే తారా స్థానాలు అని ముందుచెప్పిన ఎత్తులు, రేకలనివాడేగీతలు పరిశీలించడంవల్ల స్వభావం,జీవితం ఎలా తెలియగలవు అనేప్రశ్న వున్నది. శరీరశాస్త్రవేత్తలు మెదడులో 'గ్రే మేటర్' (Gray Matter) అనే ఒక ద్రవపదార్థం ఉన్నదనీ, అదే ఈ మానవయంత్రాన్ని అన్నివిధాలా నడపడానికి కారణం అనీ తెలుసుకున్నారు. ఈ 'గ్రేమేటర్' నరముల ద్వారా అన్ని అవయవాలతోనూ రాయబారాలు నడుపుతూ వాటిని నడిపిస్తుంది అని చెప్పడమేగాని దాన్నిగురించి అంతకన్నా తెలిసికోలేకుండా వున్నారు. శరీరానికంతకూ ప్రధానమైన 'గ్రేమేటర్కూ', నరాలకు దానితో గల సంబంధమూ ఒప్పుకుంటే చేతి ప్రాముఖ్యము వెంటనే నిర్ణయించవచ్చును. మెదడునీ చేతినీ కలుపుతూవున్నన్ని నరములు ఇంక ఏ అవయవాన్నీ మెదడునీ కలపడం లేదు. 'గ్రే మేటర్'లో కదలికలేనిదే ఏ అవయవం ఉపయోగపడదు. ఈపరిస్థితులనుబట్టి చూస్తే 'గ్రే మేటర్'లోని కదలికలన్నీ చేతిలో ప్రతిబింబించడం వింతగా తోచదు. సైంట్ జెర్మైన్ అన్నట్లు: "చేతిసలహాలేనిదే 'గ్రే మేటర్' ఏ పనీచేయదు." ఇంకొక సంగతి: మెదడునుండి చేతిలోనికి ప్రవహించే నరాలు చురుకైన గ్రహణశక్తిగల 'పేసినియన్ కార్ప్యూసిల్స్' (Pacinian Corpuscles) అనే పదార్థాలుగా ౨౯౦ మొదలు 3౦౦ వరకూ అరచేతిలో ఏర్పాటవుతూవున్నవి. ఈ 'పేసినియన్ కార్ప్యూసిల్స్'వల్ల ప్రయోజనం ఏమిటంటే:—

పంచేంద్రియాలలో ముఖ్యమైన స్పర్శ చర్మంవల్ల కలుగుతుంది. ఈస్పర్శశక్తి శరీరం అంతకన్నా అరచేతిలోహెచ్చుగా వుండడానికి 'ఈపెసినియన్ కార్ప్యూసిల్సే' కారణం. దీనిని గురించి ఆ గొప్ప ఫ్రెంచిశాస్త్రజ్ఞుడు డెస్బ్రెల్లో:



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"స్పర్శశక్తి చేతిలోనూ, ముఖ్యంగా వ్రేళ్ల కొనలలోనూ కేంద్రీకృతమై మిగిలిన ఇంద్రియాలకార్యాన్ని తానే ప్రత్యేకం నిర్వహించ గలుగును అన్నవాదాన్ని తిరస్కరించ వీలు లేదు. గ్రుడ్డివారు, చెవిటివారు, మూగవాళ్ళు, కూడా తమతమచేతుల్లు చక్కనిస్పర్శ గలిగి వుంటే గ్రహణశక్తిపోకుండా బాహ్యప్రపంచం తోసంబంధం కలిగివుంటారు. హస్తానికి వున్న ఈమహాశక్తిని గ్రహిస్తే 'గ్రేమేటర్' వాడుక ఎక్కువగా చేతిలోనే వున్నదనీ, చేతివల్లనే మెదడు ఎక్కువ ఉపయోగపడుతుందనీ తేలుతుంది. ఇదిగాక తక్కిన నాలుగు ఇంద్రియాల సలహాలనూ నిర్వర్తించేది ముఖ్యంగా చేయి."

ఈసబబైన వాదాలనుఅనుసరించి చూస్తే హస్తంవిలువా, మానవప్రకృతిని తెలుసుకోడానికి దాని ప్రాధాన్యమూ తెలుస్తుంది. శరీరంలో ఇప్పటికి వున్నటువంటీ, ఇకరాబోయేటటువంటీ రోగాలు తెలుసుకోగలమనీ, అంతేకాక మెదడులో ఊహాలవల్లకలుగుతూవున్న మార్పులు కూడా చేతిగీతలలో ప్రతిబింబిస్తవనీ పైవాదనలు నిరూపించినవి. మన ఊహాలే చాలావరకూ మనభవిష్యత్తుని నిర్ణయిస్తవని అంగీకరిస్తే సాముద్రికం విలువ ఒప్పుకున్నట్టే.

ఇంకొకసంగతి చెప్పి అసలు వ్యాసం ప్రారంభిస్తాను. ఇంకా నమ్మకం లేనివారు తమ జీవితంలోనూ, ఊహాలలోనూ మార్పులు కలుగుతూవున్నప్పుడుతమచేతులు పరీక్షచేస్తూవుంటే ప్రతి ఆరుమాసాలకూ క్రొత్త రేకలు ఏర్పటవుతూవున్నట్టుకనుక్కోగలుగుతారు. ఇక, ఈరేకలకూ ఆ మార్పులకూ సంబంధం వున్నదా? అది తెలిసికోగలమా? అంటే,—ఒకసారి శాస్త్రపరీక్షచేసి సంశయించడంన్యాయం.

---

## మురళీధర స్తుతికరణము

కవిభూషణ, కవిరాజ, శ్రీ రాజా వత్సవాయ వేంకట నీలాద్రిరాజు గారు

సతతగతి ప్రచార సహసా పరికల్పిత లాస్యమండల
ప్రతి లతికాంతరస్థితిఁ గరంబుఁ జెలంగి మిళిందబృందముల్
శ్రుతి హిత ఝుంకృతిన్ మనసు సోఁకఁగఁ జేసె వ్రజాంగనాంతరా
ళిత నిజ రాసకేళి తరళీకృతవ న్మురళీధరాకృతిన్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశ ఆర్థికస్థితి

చావలి వెంకట హనుమంతరావుగారు, యమ్. ఏ.

## కేంద్రరాష్ట్రప్రభుత్వముల ఆర్థికసంబంధములు

(వెనుకటి సంచిక తరువాయి)

౪

మూడవభాగములో రాష్ట్రప్రభుత్వములకు ఆదాయమార్గములలో ముఖ్యమైనదగు భూమిపన్నును గురించి విచారించితిమి. ఆప్రభుత్వములకు ఆదాయమార్గములలో రెండవదియగు కోర్టుస్టాంపులు, కోర్టు రుసుములు మొదలగువాటినిగూర్చి ఆలోచింతము. స్టాంపులలో రెండువిధములు కలవు. ఒకటి, వర్తక వ్యాపారములకు ఉపయోగించు స్టాంపులు (Commercial Stamps). రెండు, కోర్టుఫీజుస్టాంపులు (Court fees Stamps). మొట్టమొదటిది వర్తకులు సరకుల కొనునప్పుడును, అమ్మినపుడును అగ్రీమెంట్లు వ్రాసుకొనుటకు మొదలగువాటికి ఉపయోగించబడును. రెండవది కోర్టులో వ్యాజ్యములు వేయుసందర్భములో ఉపయోగించునవి. ప్రతిసంవత్సరమును ఈరుసుములను తగ్గించవలయునని సాధారణముగ అన్నిరాష్ట్రీయశాసన సభలయందు తీర్మానములు చేయబడుచున్నవి. ప్రస్తుతము ఈమార్గమునుండి ౧౪ కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచున్నది. ఈ ఆదాయమంతయు రాష్ట్రప్రభుత్వముల ఖజానాలలోనికే పోవుచున్నది. కోర్టుఫీజుస్టాంపు రుసుములను తగ్గించవలెనని కోరుట చాల పొరపాటని మాఅభిప్రాయము. ప్రభుత్వమువారు ప్రజలకుచేయుచున్నట్టియు, చేయవలసినట్టియు సౌకర్యములలో న్యాయమును ప్రతివారికిని అందుబాటులోనుండునట్లు చేయుట ముఖ్యమైనది. అట్టి లాభకరమగు పనిచేయుచున్నప్పుడు ప్రభుత్వము దానిఖర్చుకై ప్రజలయొద్దనుండి కొంతరాబడి తీసుకొనజూచుటలో ఆశ్చర్యమేమియు నుండవలసిన పనిలేదు. మరియు, దేశమందు డబ్బును, నాగరికతయు ఎక్కువయగు కొలదిని ప్రజలు న్యాయస్థానముల నెక్కువగా ఉపయోగించుకొనుట కవకాశము లున్నవనుట సామాన్య విషయము. న్యాయస్థానములలో ప్రజలు తమసొమ్మును వ్యయముచేయుట సరియైనపనియా కాదా యను విషయము ప్రస్తుతము చర్చనీయాంశముకాదు. ఏకారణము చేతనైననేమి, వ్యాజ్యములు ఎక్కువయగుచున్నవి; దానిమూలముగ న్యాయస్థానములపై ఎక్కువ ఖర్చుపెట్టవలసిన ఆవశ్యకత కలుగుచున్నది. ఆఖర్చునకు కావలసినసొమ్ము ప్రభుత్వమువారిచేతులలో నుండినగాని లాభములేదు. ఈవిషయమునుగూర్చి మనము స్థిరమనస్కులమైన తరువాత ఈ రాబడి ఏప్రభు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వమువారికి చెందవలెనను సంగతి విచారించ వచ్చును. ప్రస్తుతము ఈ రాబడియంతయు రాష్ట్రప్రభుత్వములకే చెందుచున్నదని పైన చెప్పియుంటిమి. ఆవిధముగ కాక దానిలో కొంతభాగము అనగా వ్యాపారసందర్భము లలో ఉపయోగించు స్టాంపులపై ఆదాయము సుమారు ౪ కోట్లరూపాయలు కేంద్రప్రభుత్వ మువారికి చెందునట్లు ఏర్పాటుచేయవలెనని కొందరుసూచించుచున్నారు. ఈసూచనసంస్క రణముల మొదటను కేంద్రప్రభుత్వమువారి ఆదాయములో లోటున్నప్పుడు చేయబడినదై యుండుటచే అప్పట్లో కొంత దానికి బలముండి నప్పటికిని ఇప్పుడు ఆప్రభుత్వమువారి ఆదా యము ఎక్కువయగుచున్న సందర్భములో దాని కేమాత్రమును కారణమున్నట్లు కన్పిం చదు. కేంద్రప్రభుత్వమువారి ఖర్చుకు సరిపో వుఆదాయము ఇతరమార్గములద్వారా వచ్చు చున్నప్పుడు ఈసూచనప్రకారము రాష్ట్రప్ర భుత్వముల ఆదాయమును తగ్గించు మార్పు నకు అవసరములేదు. అయినను పరిపాలనా విధానపు దృక్పథమునుండి చూచిన ఈమా ర్పుచేయుటకు కొంత కారణము కలదేమోఅని యనుపించును. ఎందువల్లననగా వ్యాపార వర్తక సంబంధములగు స్టాంపులు సాధారణ ముగ ఎగుమతి దిగుమతులు, విదేశవ్యాపా రము, ప్రభుత్వమువారి బాండ్లు (Government Securities), అమ్మకము, మున్నగు పనులకు ఉపయోగింప బడుటచేతను, ఇండియా ప్రభు త్వము వారికే వర్తకము, విదేశవ్యాపారము మొదలగు శాఖలపై అధికార ముండుటవల నను ఆశాఖపైవచ్చు ఆదాయము వారికే చెంద వలెను. ఈవిషయమై ఆలోచించుట కేర్ప రుపబడిన అనేకసంఘములలో ఒకటియగు జాయింటుపార్లమెంటరీ కమిటీవారు వర్తకవ్యా పారముల స్టాంపులు కేంద్ర ప్రభుత్వమువారి యాజమాన్యము క్రిందనే యుండవలెననియు, కోర్టుస్టాంపులు రాష్ట్రప్రభుత్వముల క్రింద నుం డవలెననియు సూచించియుండిరి. కాని మెస్టను కమిటీ (Meston Committee) వారాపద్ధతికి వ్య తిరేకముగ అన్నిరకముల స్టాంపులనుండివచ్చు ఆదాయమును రాష్ట్రప్రభుత్వములకే పోవల యునని అభిప్రాయము నిచ్చియున్నారు. ఈరెం డు అభిప్రాయములలోను చివరదానితోనే మన మేకీభవింపవలసి యుండునని పైచర్చ వలన తేలుచున్నది.

రిజిస్ట్రేషన్:— రాష్ట్రప్రభుత్వములకా దాయ మార్గములలో రిజిస్ట్రేషను రుసుముల (Registration fees) నుంచి వచ్చు ఆదాయము కూడ ముఖ్యస్థానము నాక్రమించుచున్నది. స్టాంపులలో రెండురకము లుండినట్లే రిజిస్ట్రే షనులోకూడ రెండువిధము లున్నవి. మొద టిది దస్తావేజులు (అనగా తనఖాదస్తావేజులు, భూములు అమ్ముటకు కొనుటకు దస్తావేజులు మొదలగునవి) మున్నగువాటికి రిజిస్ట్రేషను చేయించుట. రెండవది కంపెనీలు, పబ్లికుసం స్థలు మున్నగువాటిని రిజిస్ట్రేషను చేయిం చుట. మొదటిరకములో చేరిన వాటిలో రిజి స్ట్రేషను ముఖ్యముగ అవసరమయినవి కొన్ని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వా లు చూ పు లు

'హిందూస్థాన్' ప్రజామిత్ర'నుండి కైకొనినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలవు; మరికొన్నిటికి రిజిష్టరు చేయించుటా, చేయకపోవుటాయను విషయము వాటిని వ్రాయించుకొనువారి ఇష్టానిష్టములపై ఆధారపడి యుండును. ప్రస్తుతములో ఏఆస్తిఅయినను ఒకరి చేతులనుండి ఇంకొకరి చేతులలోనికి మారునప్పుడెల్లను రిజిస్ట్రేషన్ అవసరమగు చున్నది. ఈమార్గముగా రాష్ట్రప్రభుత్వములకు సంవత్సరమునకు ౧౩౦ లక్షలరూపాయలు ఆదాయము వచ్చుచున్నది. దానిలో సుమారు ౬౫ లక్షలు ఖర్చుక్రింద తీసివేసినను నికరాదాయము ఇంకొక ౬౫ లక్షలవరకుండు ననుటకు సందేహములేదు. ఇప్పటికన్న ఈమార్గమునుండి ఎక్కువ ఆదాయమును సంపాదించుటకవకాశములు కలవు. ఒకటి పుట్టుకలు, పెండ్లిండ్లు, చావులు రిజిస్టరు చేయబడుటకు ఏర్పాటుచేసి ఒక్కొక్క రిజిస్ట్రేషన్‌కు ఒక అణాచొప్పున సుంకము విధించిన సుమారు ౧౫ లక్షల రూపాయలు ఎక్కువ ఆదాయము రాగలదు. శారదాగారి బాల్యవివాహ నిషేధక చట్టము క్రింద ఇట్టి రిజిస్ట్రేషన్‌కు చాలఅవసరముకూడ కలదు. బాలికాబాలకులకు పెండ్లి సమయమందు వయస్సు నిర్ణయించవలసివచ్చినప్పుడు ఈరిజిస్ట్రేషన్ చేయుటవలన చాలలాభముండును. ఏవిధమైనతకరారులు లేకుండ వయస్సు నిర్ణయించుటకు వీలగును. రెండవది, వ్యాపార సంబంధములగు దస్తావేజులపైనను, వాటిని ఖరీదుచేయునప్పుడును కొంతరుసుము నువిధించిన ఇంకొక ౧౦ లక్షల రూపాయిలు ఆదాయమును సంపాదించవచ్చును. ఈరెండు మార్గములను పరిశోధించుటకును, ఉపయోగములోనికి తీసికొనివచ్చుటకును ప్రయత్నములు చేయుట ముఖ్యము.

మద్యపానముపై ఆదాయము:—మద్యపానములేక ఆబ్కారీశాఖ మాంట్‌ఫర్డు సంస్కరణముల అనంతరము రాష్ట్రీయప్రభుత్వముల అధికారము క్రింద చేర్చబడినది. ఈమూలముగ రాష్ట్రప్రభుత్వములకు వచ్చు ఆదాయము ౨౦ కోట్ల రూపాయలకు దాదాపుగ నున్నది. ఈఆదాయమును వసూలుచేయుటకు ౧౫౦ లక్షల రూపాయలవరకు ఖర్చగునని అంచనావేసి నప్పటికిని నికరాదాయము ౧౮ కోట్ల ౫౦ లక్షలవరకును తేలును. ఈఆదాయము సందర్భములో మనదేశ సంఘసంస్కర్తలు, రాజకీయవేత్తలు ఇతరులు అనేకవిధముల ప్రభుత్వము వారిని ఖండించుచున్నారు. జనులను దుర్బలులనుచేసి, వారిశారీరికమానసికదార్ఢ్యములను నీరసింపజేసి ప్రభుత్వమువారు ఆదాయమును సంపాదింప జూచుట శోచనీయమని మన మొప్పుకొనక తప్పదు. ఈమార్గమునుండి వచ్చుఆదాయమును వీలైనంతవరకు తగ్గించవలెననియు, అవకాశములున్న మద్యపానమును నిషేధించుచు ప్రభుత్వమువారు శాసనము చేయవలెననియు మనదేశీయులు కోరుచున్నారు. శాసనాధికారమువలన సంఘసంస్కరణమును తీసికొనివచ్చుటకుప్రయత్నించుట తప్పనియు, ప్రజలలో ప్రబోధమువలననే అట్టి సంస్కరణము చేయుటకు ప్రయత్నించవలెననియు కొందరు చెప్ప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాటలను ఈకాలములో ఎక్కువపాటింప వలసిన అవసరములేదు. ప్రతి సంవత్సరమును ప్రతిరాష్ట్రశాసనసభయందును మద్యపాన శాఖామంత్రులను ఈవిషయమై ప్రశ్నలు వేయుచు నిషేధక చట్టములను ప్రవేశ పెట్టవలయునని అనధికారసభ్యులు కోరుచున్నారు. కానిఅట్లు చేయుటకు కొన్నిముఖ్యమైన అడ్డంకులను ప్రభుత్వమువారు చూపుచు ఆవిషయమై శ్రద్ధపుచ్చుకొనక ముందెప్పుడో అనుకూలపరిస్థితులేర్పడి నప్పుడు దానివిషయమై ఆలోచించెదమని చెప్పుట వాడుకయైనది. మద్రాసు రాష్ట్రములో ౨౦ సం॥లోపుగ మద్యపాననిషేధమును పూర్తిగ అమలులోనికి తీసుకొనిరావలసినదని శాసనసభవారు తీర్మానము చేసియున్నారు. దానిపై ఈసంవత్సరమే మద్యపాననిషేధమును గురించి రాష్ట్రమంతటను ప్రచారము చేయుటకుప్రభుత్వమువారు౨లక్షల రూపాయలను సాంక్షను చేసి పనిసాగించుచున్నారు. దీనివలన ఏమైన లాభముండునా యనునదియు, ఒకప్రక్క ప్రతిచోటను మద్యపానమునకు వీలగునట్లు క్రొత్తషాపులను తెరచుట కనుమతినిచ్చుచు, వేరొకప్రక్క మద్యపాననిషేధమును గూర్చి ప్రచారము సాగించుటవలన ప్రభుత్వమువారీవిషయమై దీక్షగలిగి యున్నారా యనునదియు ఆలోచించవలసిన విషయములే.

మద్యపానమువలన వచ్చు ఆదాయము తగ్గిపోయిన ఆలోటును పూడ్చుటకు ఏమైన విధానములను ప్రజాప్రతినిధులు సూచించిన మద్యపాన నిషేధమును ప్రవేశ పెట్టుటకు ఏవిధమైనఅడ్డంకులు నుండవని ప్రభుత్వమువారివాదనమై యున్నది. మఱియు మన దేశములోకూడ అమెరికా దేశములో చేసినట్లు మద్యపాననిషేధము నమలులోనికి తీసుకొని వచ్చినఆనిషేధము సరిగాసాగుచున్నదో లేదో విచారించుటకు, అది సరిగా సాగునట్లు చూచుటకు ఇప్పటి కన్న చాల ఎక్కువమంది ఉద్యోగస్థులును, ఎక్కువ ఖర్చును కావలసియుండునని కూడ వారు వాదించుచున్నారు. ఈవిషయమును గూర్చిచర్చించుటలో పరస్పర విరుద్ధములగు రెండు సంగతులు మనము జ్ఞప్తియందుంచుకొనవలెను. ఒకటి ప్రజలమానసిక శారీరకసౌభాగ్యమునకు సంబంధించినది; రెండవది ప్రభుత్వమువారి ఆదాయమును గురించినది. మొదటిదాని వలన ప్రజలకు చాల, లాభము కలుగు ననుమాట నిజమే; రెండవది తగ్గిపోవుటవలన ప్రజలకు నష్టము కల్గునన్న మాటకూడ నిజమే.ఏలనన ప్రభుత్వాదాయము తగ్గిపోయిన ఆలోటును పూర్తి చేయుటకు ఇతరపన్నులను విధించుట అవసరమగు. దానివలన నష్టపడువారు ప్రజాసామాన్యమే యనుసంగతి తేటతెల్లము. ఈవిషయము ముఖ్యముగా గమనార్హమై యున్నది. కాని క్రొత్తపన్నుల నిచ్చుకొనుటవలన ప్రజలకువచ్చు నష్టమును, మద్యపాననిషేధము వలన వారికివచ్చు లాభములను సరిచూచిన రెండవదానివలన వచ్చు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నష్టమే చాలతీవ్రమైనదని ఒప్పుకొనక తీరదు. మనదేశములో ముఖ్యమైన సంస్కరణము లలో ఈమద్యపాన నిషేధ మొకప్రధానమైన దని మాఉద్దేశ్యము. ఈసూత్రమును ప్రభుత్వ మువారు ఆచరణలోనికి తీసుకొనివచ్చుటకు తీవ్రముగప్రయత్నము చేసిననాడు శాసనస భలు తప్పక దానివలనకల్గు ఆదాయపులో టును పూడ్చుటకు క్రొత్తపన్నులను తప్పక ఆమోదించుననుటకు సందేహములేదు.

ఈసందర్భములో కొందరు అర్థికశాస్త్ర జ్ఞులు ఒకసూచన చేయుచున్నారు. అదిఏమన, మద్యపానముపైవచ్చు ఆదాయమును కేంద్ర ప్రభుత్వము వారి యాజమాన్యము క్రిందకు మార్చి ఆదాయపుపన్ను రాబడిని రాష్ట్రప్ర భుత్వములు కీయవలెనని. పన్నుల విచారణ సంఘము వారుకూడ ఈసూచన నామోదిం చుచుతమ రిపోర్టులో వ్రాసియుండిరి. ఈసూ చన (ఇంతకుముందే దీనినిగూర్చి తెల్పియుం టిమి) చాలవరకు సమంజసముగ నున్నను కొన్ని అసందర్భములుకూడ దానియందున్న వని చెప్పక తీరదు. ఆదాయపుపన్ను విధించు అధికారము రాష్ట్రములకు మార్చివేసిన దేశ మందంతటను ఒకేపద్ధతిపై పన్నును విధించుట కవకాశములు తగ్గిపోవును. ఏరాష్ట్రమునకా రాష్ట్రము వేర్వేరు పద్ధతులపై ఆదాయపు పన్నును విధించు పరిస్థితు లేర్పడును. కాని ఇదివరలో చెప్పినట్లుగా ఇకముందు రాష్ట్రము లుచేయవలసియుండు ఖర్చుసంగతి మనస్సునం దుంచుకొని ఆలోచించిన ఆదాయపు పన్ను వంటి అత్యుత్తమ ఆదాయమార్గము వాటిచే తులలో నుండుట చాలలాభమని స్పష్టమ గును. ఇంక కేంద్ర ప్రభుత్వమువారి దృక్పథ మునుండి ఆలోచించిన, ఇకముందు మద్యపాన నిషేధమును ప్రవేశపెట్టు భారము వారిభుజ ములపైపడును. దానివలన వారిఆదాయము తప్పక తగ్గిపోవును. కాని ఎగుమతి దిగుమతి సుంకములను ఎక్కువగ విధించుట వలనను, పైదేశములనుండి దిగుమతియగు త్రాగుడు మత్తుపదార్థముల (foreign liquors and intoxicants) పై నిషేధపు సుంకములను విధిం చుట వలనను, రైల్వేలనుండి జనరల్ రెవిన్యూ లకు వచ్చు భాగమును వృద్ధిచేయుటవలనను ఈలోటును తేలికగ పూర్తిచేసుకొనవచ్చును. ఇప్పుడున్న పద్ధతి ప్రకారముకూడ ఇతర దేశ ములనుండిదిగుమతియగు త్రాగుడువస్తువులపై ఇండియా ప్రభుత్వమువారే పన్నులను విధించు చున్నారు. వాటిపై యెంత ఎక్కువ పన్నును విధించిన అంత లాభము; ఏలనన ఆవస్తువులను ఉపయోగించువారు ఎక్కువ డబ్బుగలవారే యగుటచే వా రెంతపన్నయినను ఇచ్చుకోక ల్గినవారై యుందురు. పైనచెప్పబడిన సూచన ఆచరణ యోగ్యమై, లాభదాయకమై యుం డుననుటకు సందేహము లేదు. క్రొత్తసంస్క రణములను ప్రవేశపెట్టుసమయములో దానిని మనస్సునం దుంచుకొని మనదేశ నాయకులు ఆమార్పునుచేయవలెనని కోరుట ఆవశ్యకము.

ఇదికాక వేరొక సూచన ఏమనగా, ఆబ్కారీశాఖ కేంద్రప్రభుత్వము వారికి పూ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్తిగ అధీనముచేసి, వారికి మద్యపాననిషేధమును ప్రవేశ పెట్టుటవలన వచ్చునష్టమును పూర్తి చేయుటకు ఆదాయపుపన్ను వలన వచ్చు ఆదాయములో సగము కేంద్ర ప్రభుత్వమునకును, సగము రాష్ట్రప్రభుత్వములకును ఈయవలయుననునది. ఈపద్ధతిలో ముఖ్యముగానున్న లోటేమన: ఆదాయము విభజనచేయుట ఈకాలములో ఆర్థికశాస్త్రతత్వమునకు వ్యతిరేకము దానివలన రెండు ప్రభుత్వములకు మధ్య పరస్పర భేదాభిప్రాయములు, తగవులాటలు కలుగుట కవకాశము లున్నవి. ౧౯౧౨ సం॥ వరకు మన దేశపు ఆర్థికవిధానము ఈ పద్ధతిపై నడుపబడుచుండుటచే చాలనష్టము కలిగి యున్నది. ఈ కారణము లన్నిటిని బట్టి ఈ సూచన ఎక్కువ ఆమోదకరము కాదు.

అటవీశాఖ:— మన దేశములో ప్రభుత్వము వారికి ఆదాయ మార్గములలో అటవీశాఖకూడ ప్రాముఖ్యస్థాన మాక్రమించుచున్నది. ఈ శాఖనుండి సంవత్సరమునకు ౬ కోట్లరూపాయల వరకు ఆదాయము వచ్చుచున్నదని చెప్పిన దాని ప్రాముఖ్యము స్పష్టమగును. ఈ ఆదాయము ఏవిధమైనపన్ను (Tax)లవలన గాక, రాయల్టీస్(Royalties), అడవులలో నుండు కలప, గడకర్రలు, గడ్డి మొదలగు పదార్థములను ఉపయోగించుకొను వారిపై విధింపబడు రుసుముల (Dues) వలన వచ్చుచున్నది. (పన్నులకును, రుసుములకును కలభేదమేమన: మొదటివి ఒక శాసనసభవారు శాసనము మూలముగ విధించునవి; రెండవది ఆయా దేశభాగములలో ఆయా ప్రత్యేకాధికారుల వలన విధింపబడునవి. ఇంకొకభేదము: పన్నులు అందరకును ఒకేమోస్తరుగ ఒకేవిధానమునుబట్టి విధింపబడును. రుసుము లట్లుగాక వేర్వేరు భాగములకు వేర్వేరు విధములుగ వేర్వేరువిధానములను బట్టి విధింపబడును.) మన దేశములో అడవులు చాలవరకు ప్రభుత్వమువారి స్వంత యాజమాన్యము క్రింద (Government nonopoly) నుండి, వారిచేతనే నడుపబడి దానివలనవచ్చు ఆదాయమును వారే తీసుకొనుచున్నారు. కేవలము వ్యాపార దృష్టి (commercial and business standpoint)నుండి చూచిన ఈశాఖను ప్రభుత్వమువారు సరియగు పద్ధతులపై నడిపించుచు ఇంకను పూర్తిగ అభివృద్ధి పొందక అభివృద్ధి పొందుట కవకాశములు కల అడవులను ఒక పద్ధతిపై అభివృద్ధి పొందించుట కేర్పాట్లు చేసిన, మన దేశమున కపారమగు లాభము వచ్చుటయే కాక ప్రభుత్వము వారికి ఎక్కువఆదాయము వచ్చుటకు కూడ అవకాశములు కలవు. మన దేశపు అడవులలో పెరుగుచు పరిశ్రమలకు ఉపయోగముగా నుండు వస్తువులు (Forest Produce) సుమారు ౭౮౦ కోట్ల రూపాయలు విలువకలిగి యుండునని అంచనా వేయబడినది. ఈ అడవులలోనున్న చెట్లను, ఇతర వస్తువులను శాస్త్రోక్తముగ పెంచు ఏర్పాట్లుచేసిన దేశమున కుపయుక్తములగు కాగితము, అగ్గిపుల్లలు, రబ్బరు, సోపు మొదలగు పరిశ్రమలకు ఎక్కువ ప్రోత్సా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హము కలుగ చేయవచ్చును. ప్రతిసంవత్సరమును మన దేశమందు తయారగు చున్న ౩౦,౦౦౦ టన్నుల కాగితము కాక సుమారు ౮౦,౦౦౦ టన్నుల కాగితమును మనము దిగుమతిచేయుచున్నాము. అట్లే పరదేశములనుండి ప్రతియేటను ౧౮౦ లక్షలఅగ్గిపెట్టెలను మనము దిగుమతి చేయుచున్నాము. అడవులను అభివృద్ధిచేయుటవలన ఈ పరిశ్రమలకు కావలసిన కలప, గడకర్ర, గడ్డి, మంచిగంధపుచెక్క, మొదలగువస్తువుల నన్నిటిని ఈదేశమందే సేకరించుకొనవచ్చును. వీటినన్నింటిని ఉపయోగించుకొనుటకు హిందూదేశపు కంపెనీల వారికే అధికారమిచ్చిన వాటివలన వచ్చులాభమంతయు మన దేశమందే నిల్చిపోవును. ఈఅభివృద్ధి ఏర్పాట్లు చేయుటకు ప్రథమములో (Initial Expenditure) ౫౦ కోట్లరూపాయిలు అగునప్పటికిని దానిపై కొన్నాళ్లయినతరువాత ౧౦ కోట్ల రూపాయిలు ఆదాయము వచ్చుననుటకు సందేహములేదు. దానిలో ౨ కోట్లు వడ్డీక్రింద తీసివేసినను నికరాదాయము ౮ కోట్లవరకునుండును. అడవులశాఖ మాంటాగ్యుసంస్కరణముల ప్రకారము రాష్ట్రీయప్రభుత్వముల యాధీనము క్రింద చేర్చబడినది. ఇకముందుకూడ ఆపద్ధతియే సాగించుట సమంజసము. పైన సూచించిన అభివృద్ధి ప్రణాళిక అట్టి పరిస్థితులయందు మాత్రమే సాధ్యమగును.

నీటిపన్ను:—రాష్ట్రీయ ప్రభుత్వముల ఆదాయ మార్గములలో నీటిపారుదల రుసుములు (Irrigation Dues) కూడ ముఖ్యమైనవని చెప్పియుంటిమి. ప్రభుత్వమువారు నీరుసప్లయి చేసినందులకు చార్జిచేయు రుసుములలో పన్ను సంబంధ (element of taxation) మేమైన ఉన్నదా యనువిషయమునుగూర్చి భేదాభిప్రాయము లున్నవి. పన్నులవిచారణ సంఘమువారు ప్రభుత్వము వారీరుసుముల వలన లాభమును పొందజూచుటచే వాటిని గూడ పన్నులుగానే పరిగణింప బడవలెనను నభిప్రాయము నిచ్చియున్నారు. ఈరుసుములను పోస్టలుచార్జీలతో పోల్చిచూచిన ఈవిషయము స్పష్టమగును. పోస్టాఫీసు శాఖ (Postal Department) ప్రజోపయుక్తమగు శాఖగా నుండవలయుననియు, దానినుండి ప్రభుత్వమువారు లాభమును తీయుటకు ప్రయత్నించకూడదనియు ఇదివరలో చెప్పియుంటిమి. ఆసూత్రమునుబట్టి ప్రభుత్వమువారు పోస్టుకవర్ల కార్డులయొక్క ఖరీదు నిర్ణయించుటలో ప్రజలు వాటిని విరివిగా ఉపయోగించుట కందుబాటులోనుండునట్లు చూడవలెననియు కూడ ఇదివరలో చెప్పబడినది. కాని వ్యవసాయపు నీటిసప్లయిరుసుములు ఈవిధముకాక ప్రభుత్వము వారికి ఒకముఖ్యఆదాయము మార్గముగా నుండుటచే వాటిలో పన్నుసంబంధమేమియు లేదని చెప్పవీలులేదు. భూమిపై పండు పంటనుబట్టి నీటిరుసుముల నిర్ణయమును ప్రభుత్వమువారు చేయుచున్నారు. కాన నీటిసప్లయి ప్రభుత్వమువారు ప్రజలకుచేయు ఒక సేవకు ఖరీదు (cost of services rendered)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాక ఆదాయము సంపాదించు మార్గము (source of revenue) గా నున్నది.

ఈకాలములో ప్రభుత్వమువారు వ్యవసాయాభివృద్ధికి నీటివసతుల నేర్పాటుచేయుట ఆవశ్యకమని గ్రహించి ఆపనికి ఉత్సాహముతో కడంగుచున్నారు. నీటివసతి సరిగలేక కేవలమువర్షముపై నాధారపడియుండుటవలన వ్యవసాయపరిశ్రమకు తీరనినష్టము వాటిల్లుచున్నదనియు, దేశమునందు క్షామములు పదేపదే సంభవించుచున్నవనియు స్థిరపడిన తరువాత ప్రభుత్వమువారు వ్యవసాయమునకు నీటివసతులనేర్పర్చుటకుపూనుకొనియున్నారు. పంజాబ్ రాష్ట్రము నందలి సట్లెజ్ వాలీ ప్రాజెక్టు (Sutlej Valley Project) సింధురాష్ట్రములోనిసుక్కూరుబారేజి(Sukkur Barrage), మన రాష్ట్రములో మెట్టూర్ ప్రాజెక్టు(Mettur Project), ఇంకను ఇతరములగు వ్యవసాయపు కట్టడములు ఈపూనికయొక్క ఫలితములే యని చెప్ప వచ్చును. ఈకట్టడముల కన్నిటికిని సుమారు ౪౮ కోట్ల రూపాయలు ఖర్చగుననియు, వాటివలన సుమారు ౭౦లక్షలయెకరముల భూమిని క్రొత్తగా సాగుబడిచేయుటకు వీలగుననియు అంచనా వేయబడినది. ఈసొమ్మంతయు ఇంగ్లండు దేశములో అప్పు చేయబడినది; దానిపై మనము వడ్డీ నిచ్చుకొనుచున్నాము. కాని వాటివలన మనకు ప్రతి ఫలము(Productive) వచ్చుచుండుటచే ఎక్కువ నష్టము లేదని చెప్ప వచ్చును.

నీటిరుసుములు వేర్వేరు రాష్ట్రములలో వేర్వేరు విధములుగ విధింప బడుచున్నవి. కొన్నిరాష్ట్రములలో అవి భూమి పన్నుతో కల్పియే విధింపబడుచున్నవి; కొన్నిరాష్ట్రములలో ముఖ్యముగా మనరాష్ట్రములో భూమి పన్ను వేరుగను, నీటిపన్ను వేరుగను విధింపబడుచున్నవి. నీటితీరువరేట్లుకూడ వేర్వేరు విధములుగనుండి ఒకరాష్ట్రములోనే వివిధములగురేట్లు అమలునం దున్నవి. ఇట్లే ఏసంవత్సరమున కాసంవత్సరమే రుసుములను విధించు పద్ధతి కొన్నిప్రాంతములయందును, కొన్ని సంవత్సరముల కొక్కసారియే కంట్రాక్టు పద్ధతిపై రుసుములను విధించుపద్ధతి ఇంక కొన్ని ప్రాంతములందును అమలునం దున్నవి.

మనదేశమందు వ్యవసాయపు కట్టడములు (Irrigation Works) మూడు విధములుగ నున్నవి. (౧) ప్రతిఫలము నిచ్చు నట్టివి(Productive Works)-అనగా ఇవి వ్యవసాయము నభివృద్ధిచేయుటకే ముఖ్యముగా కట్టబడినప్పటికిని వాటిపై ఖర్చు పెట్టబడిన సొమ్మునకు వడ్డీయే కాక పైగా లాభముకూడ వచ్చుచున్నట్టివి.(౨)వ్యవసాయపు సంరక్షణకొరకు కేర్పడినట్టివి - వీటినే (Productive Irrigation Works) అందురు. అనగా ఇవి క్షామము తరుచుగావచ్చు ప్రదేశములో వ్యవసాయము నీటిఇబ్బంది లేకుండ సాగుట కేర్పాటు చేయబడినవి కాని లాభము వచ్చునను ఉద్దేశ్యముతో కట్టబడినవి కావు. (3) చిన్నకట్టడములు (Minor Irrigation



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

Works) వీటిలో ౫౦,౦౦౧ రూపాయలకు ఎక్కువ కాకుండ కట్టబడిన కాలువలు, చెరువులు మొదలగున వన్నియు చేరును. వీటికన్నిటికిని సుమారు ౯౮ కోట్ల రూపాయలను ప్రభుత్వమువారు వ్యయపఱచియున్నారు. ఆసొమ్ముపై వడ్డీ సంవత్సరమునకు ౩౮౦ లక్షల రూపాయలు (౧౯౩౮-౩౯ సంవత్సరపు లెక్కల ప్రకారము) పోను నికరాదాయము ౬౦౦ లక్షల రూపాయలు మిగులుచున్నవి. ఇప్పటికన్న ఈవ్యవసాయపు కట్టడముల నెక్కువ చేయవలసిన యావశ్యకత వ్యవసాయవృత్తియే ప్రధానవృత్తిగాగల మన దేశములో ఎక్కువ కలదని వేరుగ చెప్ప నక్కరలేదు.

ఈవిషయమును గురించి ఆలోచించు సందర్భములో పన్నుల విచారణసంఘమువారు వ్యవసాయ రుసుములను విధించుటనుగూర్చి చేసిన సూచనలను గమనించుట ముఖ్యము. వీలయినంతవరకు నీటిరుసుములను భూమిపన్ను నుండి వేరుచేయవలెననియు, వ్యవసాయ సంరక్షణ కేర్పడిన కట్టడముల విషయములో తప్ప ఇతర సమయములందు నీటిరుసుములను విధించుటకు పూర్వము నీటిసప్లయివలన వ్యవసాయదారునకు వచ్చుచున్న లాభములో ఒక చిన్న భాగముగమాత్రమే ఆరుసుము లుండునట్లు చూడవలెననియు వారిసూచనయొక్క సారాంశము. నీటిరుసుములు వ్యవసాయదారులకు కష్టములేకుండ ఇచ్చుకోకల్గియుండునట్లు ఏర్పాటుచేయుట చాలముఖ్యము; అది ప్రభుత్వమువారి విధియై యున్నది. ఈవిషయమైకూడ భూమిపన్ను విధించుట కుండవలయునట్లుగానే 'చట్ట' బద్ధమగునియమము లుండినగాని లాభము లేదు. ప్రతిరాష్ట్రప్రభుత్వమును అట్టిచట్టములనేర్పాటుచేసివ్యవసాయదారులకు నీటిసప్లయిపై గల జన్మహక్కులను (natural rights) ను స్పష్టీకరించుట అవసరము.

---

## ఆ మె కొ ఱ కె

పురిపండా అప్పలస్వామి గారు (కవితాసమితి)

ఆ మెఱుపుకన్నె నాప్రియురాలు; ఆమె
 చంచల దృగంచలమ్ముల ఛాయలందె
నేవిహరింతు; ఆమెకెమ్మోవిఁ గాయు
లేతవెన్నెల కొఱకె యర్పింతు నా స
మస్తజీవితమును; ఆమె మధుర మధుర
భాషణమ్ముల కొఱకె నే పలవరింతు;
ఒక్క చుక్కేని లేని యీయుగ్రరాత్రి
నీమహానీరవాంధకారామనస్య
వాటికల భయంకర వజ్రపాత నిబిడ
నిస్వనమ్ముల నున్మత్త నియతి తోడ
నామె కొఱకె యన్వేషింతు నామె కొఱకె.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గ్రామగ్రంథాలయము

యస్. ఆర్. రంగనాథన్‌గారు,
మదరాసు విశ్వకళా పరిషద్గ్రంథాలయాధికారి

గ్రంథాలయముకంటె ఎక్కువ లాభకారి, జాతి పునరభివృద్ధికి అవకాశాలు గలది, మానవుడు తనకై నిర్మించుకొన్న మార్గము మరొక్కటేదీ లేదనవచ్చును. మరొక్కటి యేదీ అంతకంటె విరివి అయిన పరిసరము, సరళమైన గంగము, విస్తృతమైన తాత్పర్యము చలాయించుకోలేదు. అయినప్పటికీ అది తన రాజ్యమును ప్రవేశించడానికీ, చేపట్టడానికీ జంకుతూ ఉంది, వెను దీస్తూ ఉంది.

చిన్నపాఠశాల మొదలు పెద్దకళాశాలలవరకు గల విద్యాశాల లన్నిటికంటెనుకూడా సౌకర్యములోనూ, స్వాతంత్ర్యములోనూ గ్రంథాలయము మిన్న. యౌవకవిద్య (వ్యక్తులైనవారి విద్య) విషయమై అవసరానికి ఆదుకో గలిగిన సంస్థ ఇది ఒక్కటే. విద్యాప్రణాళిక, కట్టడి, వయస్సు-వీనివిషయమై కొలతలుకాని, మతము, ధర్మము, కులము-వీనివిషయమై నిర్బంధములుకాని దీనికి లేవు.

ప్రాజ్య(పబ్లికు)గ్రంథాలయములలో గ్రామ గ్రంథాలయము ప్రత్యేక మొక తరహా. ప్రత్యేకము సాధించుకోవలసిన సమస్యలు దానివి దానికి ఉన్నవి. గ్రామభూములలో జనాభా చెదరి ఉండడముచేత భావైక్యము, క్రియైక్యము కష్టము. జనపదముకంటె నగరము క్రియారంభానికి ఎక్కువ ఏర్పాటుగా ఉంటుంది. కాబట్టి ఏకతానతతో ఆశయము, కార్యము సరియైనమార్గములో పెట్టడానికి ఒక సన్నాహకేంద్రము చాలా ఆవశ్యకము. ఈవిషయము సర్వవిధాలా గ్రామీణసమస్యకు ఒక అంగము. గ్రామ గ్రంథాలయాశయము నెఱవేఱవలె నంటే, ఈకేంద్రము పూచీ వహించాలి. ఆపూచీ గ్రామస్థుని చేతులలో విడిచి పుచ్చడము లాభము లేని పని.

మన రాజధానిలో గ్రామ గ్రంథాలయానికి గొప్ప ఆవశ్యకము ఉన్నది. మన గ్రామస్థునికి సమృద్ధిగా ఉన్న దేదీ అంటే తీరిక. దాదాపు అర్ధసంవత్సరము తీరికే. ఆతీరిక ఏవిధముగా వినియోగించవలెనో అతనికి తెలియడము అరుదు. అదనమైన ధనమూ, శక్తీ ఏలాగో, ఆలాగే అదనమైన సమయమున్నూ వ్యర్థముగా విడిచి పెట్టితే గొప్పఅనర్థం తేగలదు. గ్రామస్థుని మెండైన తీరిక సరియైనమార్గములో సంఘము ఉపయోగ పెట్టుకొనకపోతే, అతడు దానిని దూబరఖర్చు చేసి తీరుతాడు; దుష్టజీవనములో తన ఆధ్యాత్మిక సంపద వ్యర్థపుచ్చివేస్తాడు; మఱి—తఱచుగా సంభవిస్తూనే ఉంది—వ్యాజ్యాలు మరిగి, కాలము చంపుకొనే జ్వరములో కోర్టులమీద విరుచుకుని పడతాడు.

అటువంటి వ్యాపారము నుంచి గ్రామస్థుని కాపాడడానికి గ్రామ గ్రంథాలయము చాలా తోడుపడక మానదు. ఇక్కడ కనపడుతుంది దీనికిగల గొప్ప అవకాశము. ఏమంటే, తీరికవలననే కదా శిక్షణ ఫలించేది; ముఖ్యముగా ఈశిక్షణకు సాధనముగానే గ్రామ గ్రంథాలయము పనిచేయవలసిఉంది.

ఇంతే కాక గ్రామస్థుడు తనగ్రామమును విడిచి పట్టణాలకు వలసపోయే దుస్సంఘటనము మాన్పడానికి కూడా ఈ గ్రామ గ్రంథాలయము సాధనముగా చేసుకోవచ్చును. ఈవలసపోకకు అనేకప్రవాహాలు కారణభూతములై యున్నవి. మొదటిది, ఆర్థికప్రవాహము. దీనిపై గ్రంథాలయానికి ప్రభావము అరుదు; ఒకవేళ ఉన్నా మారుమూల. రెండవది గ్రామజీవనపు జడత్వము వలన బయలుదేఱినది. ఆర్థికప్రవాహము గ్రామము చాలభాగము తుడిచిపెట్టినమీదట, గ్రామజీవనము నిండుగాను, వివిధముగాను, సంతోషకరముగాను చేసి యుండిన అనేకపద్ధతులు వాడుక తప్పిపోయినవి; ఇక నగరసంబంధమైన అందచందాలకు, మఱి దేనికీ కాక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆకస్మిక ఛాయా చిత్రములు

(SNAP SHOTS)



౧. ఎడతెగని పోరాటము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయినా, వ్యామోహపడి, అనేకులు గ్రామము విడిచి నగరాలలో చేరుకుంటున్నారు. ఆలాగున గ్రామమును విసర్జించడము జాతీయాభివృద్ధికి మంచిది కాదు. అది మాన్పవలెను. అది మాన్పవలెనంటే గ్రామజీవనము ఎక్కువ ఆకర్షకముగా చేసి మేధాసంపదకు దోహదము చేసే విధానములు సమకూర్పవలెను. గ్రామ గ్రంథాలయము, ముఖ్యముగా గ్రంథములు ఎత్తి వారివారికి పంపి చదివించే యేర్పాటు, ఈ ప్రయత్నము నెఱవేర్చే ముఖ్యమార్గాలలో ఒకటి.

ఈ తీరిక గలవారిలో పట్టణవాసము చేయడానికి తగిన స్తోమతు కలవారికి మాత్రమే ఉపయోగపడేటట్లు గ్రామ గ్రంథాలయము సంచారము చేయగలదని తెలపరాదు. పైపెచ్చు సరియైన మార్గములో నిర్వహిస్తే, అది పల్లెటూరి పనివాని జీవితము సహితము ఎక్కువ లాభయుక్తముగా చేయగలదు. చదువుకునే యేర్పాటులు అభివృద్ధిచేసే ప్రయత్నాలు చూచి పల్లెటూరి వ్యవసాయదారుకు మొదట అనుమానము, అపనమ్మకము పడవచ్చు. మన విద్యాపద్ధతి వృత్తుల నభిమానించక, కేవలము వాఙ్మయపరాయణము కావడము దీనికి కొంత కారణము. విద్యావిధానమంటే వ్యవసాయదారునికి భయము; ఏమంటే, అది అతని పిల్లలను పొలము నుంచి లేవదీసికొని పోతుంది; అంతకంటే మంచి బ్రతుకు తెరువు ఏదీ చూపించనూ చూపించదు. మన కనుభవమే గదా: తనపొలములో నిజాయితీగా, ఆరోగ్యముగా, సంతృప్తితో బ్రతుకగలిగిన వ్యవసాయదారుని కొడుకు బడి చదువు పూర్తిచేసినమీదట చేతిపని; పొలము బ్రతుకు అంటే ఒక నిరసనబుద్ధి పెంచుకుంటాడు. అంతకంటేనయమని దగ్గర పట్టణములో గుమాస్తా పని సంపాదించుకొని, దానివల్ల ఆరోగ్యం చెఱుచుకొని, అప్పులుతన్నుతూంటే, దౌర్భాగ్యంతో బాధపడుతాడు. గ్రంథాలయముకూడా ఆలాటి వినోదాలకూ, సారస్వతానికీ సంబంధించిన పుస్తకాలుమాత్రమే సప్లయిచేస్తూవుంటే, పాఠశాలలపట్ల ఉండే నిరాదరమే దీనికీ సిద్ధించవచ్చు. ఇంగ్లాండువంటి దేశములో ఇది యథార్థముగా అనుభవగతమే ఐనది.

ఈ అంతరాయమును దాటే విధానము 'కేంబ్రిడ్జిషైర్ గ్రామ గ్రంథాలయాధికారి' రిపోర్టునుంచి ఉట్టంకించిన ఈ క్రిందిభాగము సూచిస్తుంది:—

"స్థానిక పరిశ్రమలకు—వ్యవసాయమునకు, తోట పనికి—సంబంధించిన పుస్తకాలకోసం ఆత్రముతో ఎదురు చూస్తూ ఉంటారు. సందర్భానుసారంగా మేము అవలంబించవలసివచ్చే ఒక విధానమును నే నీయెడల తడువుతాను. ఎప్పుడూ గ్రంథాలయము త్రొక్కబోని కొందఱు మనుష్యులకు ఉపయోగించేవని మనకు తెలిసిన పుస్తక మొకొక్కటి. తఱుచుగా మనకు సమాశంటుంది. అటువంటి సందర్భంలో చదువుతాడని తోచిన మనిషికి అది పంపుతాము,—అది ఒకసారి చూచి తనకు నచ్చినట్టయితే వారమో, రెండువారాలో అది తనవద్ద ఉంచుకోవలసిందని ఒకవార్తతో సహా. ఈవిధంగా అనేక సాంకేతిక (technical) గ్రంథములు పంచిపెట్ట గలిగినాము. అవి మఱొకవిధాన చదివించడం సాధ్యపడేది కాదు. ఒకసారి పుస్తకము తిరిగిరావడం కష్టమయింది; పుచ్చుకున్న ఆసామీకి అది లేనిదే పని సాగనంతటి ఉపయోగంగా కనబడింది. సాహసించి నేను పంపిన పుస్తకమువల్ల పళ్లు రవానా చేసే విధమూ అవీ నేర్చుకున్న ఆ పెద్దమనిషి ఈపాటికి తక్కిన వారికంటె చాలా భాగ్యవంతుడై ఉంటాడని నా నిస్సందేహమైన నమ్మిక! ఇంకొక మిత్రుణ్ణి సంపాదించాము. ఇంకొక పాఠకుణ్ణి తయారుచేశాము. మనరైతులు, తోటమాలీలు కేవలము తమ మంచిచెడ్డలకే సంబంధించిన పుస్తకాలు పృథివిలో ఉన్నాయనే గుర్తించడం లేదని నాకు నమ్మకం కలుగుతూ ఉంది. వారి ఈ యభిప్రాయం సరిదిద్దడం మాపని. మే మది చేస్తున్నామనికూడా నానమ్మకము."

గ్రామ గ్రంథాలయాలు స్థాపించడం తప్పనిసరి అనడానికి ఇంకా ఒక ముఖ్యమైన సంగతి ఉంది.

ప్రాథమికవిద్యకు, అవిద్యా నివారణానికి మన రాష్ట్రములో ప్రతిసంవత్సరము లక్షలకొలది రూపాయలు వెచ్చిస్తున్నారు. ప్రతిసంవత్సరము వందలూ వేలూ పిల్లలు మన ప్రాథమిక విద్యాలయాలలో నుండి ఉత్తీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్ణులైపోతున్నారు. గడిచినకొద్దీ ఈసంఖ్యలు కొన్నిరెట్లు పెరుగుతాయి, తప్పదు. అంత ఖర్చుపెట్టి నేర్పిన విద్య నిలకెట్టుకోవడానికి ఎందఱు విద్యార్థులకు సౌకర్యాలు లభిస్తున్నాయి? ఈవిధంగా కట్టుకువచ్చిన విద్య నిలబెట్టుకోవడానికి గాను కనీసం నూటికి ఐదువంతునైనా మినహాయించడం అవసరం అని సామాన్యబుద్ధికి గూడా తోచుతుందిగదా! పబ్లిక్‌వర్క్సు శాఖవారు కట్టడాలకు ఖర్చుపెట్టేటప్పుడు సంవత్సరం వారీ మరామత్తుకు నూటికి ఇంతా అని యేర్పాటు చేసితీరుతారు. ఆర్థికముగా అది ఒక అవసరం. పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ (ప్రాజ్య విద్యా)శాఖ విషయంలో మాత్రము అది అంతటి అవసరమూ కాదూ?

తయారైన కట్టడాన్ని సరియైనస్థితిలో ఉంచడం ఎంతముఖ్యమో చదువుకున్నవాళ్లని సరియైనస్థితిలో ఉంచడం అంతముఖ్యం. ప్రస్తుత సంవత్సరం* ప్రాథమిక విద్యనిమిత్తం ఒకకోటీ ముప్పైలక్షల రూపాయలు అంచనా వేసుకున్నాము. గ్రామ గ్రంథాలయాలను పోషించడానికి అధమం ఆరులక్షలైనా వినియోగించకపోతే, ఆపెట్టుబడిసొమ్ములో చాలాభాగం వ్యర్థం అయిపోదా? గ్రంథాలయాలే కదా. మఱి పిల్లల్ని తిరిగి అవిద్యలో పడిపోకుండా కాపాడేసాధనం! 'పల్లెటూళ్ళ గ్రంథాలయాలకు ఆరులక్షలా!' అనవచ్చు ఎవరైనా. కాని ఆ కోటీ ముప్పైలక్షలు జాతికి నిలబెట్టడానికే ఈ ఆఱులక్షలు కావలసినది- అని మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి.

గ్రామ గ్రంథాలయం ఒక పబ్లిక్ ఇన్‌స్ట్రక్షను (విద్యా) శాఖతోనే కాక యింకా పెక్కు ప్రభుత్వశాఖలతో ఇటువంటిసంబంధము కలిగి ఉంటుంది. ఉదాహరణానికి, ఆరోగ్యశాఖ చూడండి. రోగనివారణనిమిత్తం అది సాలుకి ౪౭ లక్షలు ఖర్చుపెట్టుతుంది. ప్రజలు హృదయపూర్వకంగా సహకారం చూపకపోతే రోగనివారణానికి ఏపద్ధతి అవలంబించినా బూడిదలో పోసినపన్నీరే. ప్రజల నాగరికబుద్ధి పరిణతం చేసి నిత్యమూ పదును పెట్టుతూ ఉంచేనే తప్ప, ఈసహకారం చేకూరుతుందా? అలాగు చెయ్యాలంటే తగినఏర్పాట్లతో, తగినమనుష్యులతో కూడుకున్న ప్రాజ్యగ్రంథాలయము సాయము లేకుండా ఏవిధానమూ నిర్వాహకం చెయ్యలేదు. ప్రాజ్యారోగ్యమంత్రిగణము ప్రయత్నమువల్ల ఫలించిన ఆంగ్లేయుని సగటు సుమారు జీవనములోని గొప్ప పెరుగుదల ఆంగ్ల దేశంలోని ప్రాజ్యగ్రంథాలయ విధానంయొక్క అభివృద్ధినిబట్టియే, అభివృద్ధితో పాటే వర్తించింది అంటే, అది దైవాత్తు సంభవించింది కాదు; దానిలో సార్థకత ఉంది. ౪౭ లక్షలు ఆరోగ్యానికి ఖర్చుపెట్టి ఆరులక్షలు గ్రంథాలయానికి ఖర్చుపెట్టడానికి వెనుదీయడం శుద్ధ- తెలివితక్కువ. ఆరోగ్యానికి ఖర్చుపెట్టే ప్రతిరూపాయకీ వచ్చేప్రతిఫలం గ్రంథాలయానికి సరిగా ఖర్చుపెట్టిన ప్రతిరూపాయవల్లా పదింతలు కాక తప్పదు.

ఇంకొక ప్రభుత్వశాఖ తీసుకొందాము- వ్యవసాయశాఖ గ్రామానికి ఇంతకంటె ఆదరపాత్రము కావలసినశాఖ మఱిఒకటి లేదనవచ్చును. దీని సంవత్సరం వారీ అంచన ౩౯ లక్షలదాకా ఉంటుంది. రైతును నిత్యమూ ఆకర్షించే విషయాలలో విలువైన పరిశోధన చాలా జరగడానికి ఇది యేర్పాటు చేస్తుంది. కాని, దీనిప్రకటనలు, చరిత్రలు, వివరణాలు, అవి గ్రామస్థులు పదిమందీ తెలుసుకొనేటట్టు చెయ్యకపోయిన తర్వాత, ఏమిలాభం? 'రీడింగ్' అనేచోట ఒకగ్రంథాలయంలో మాకోయంబుత్తూరు, పూసా ప్రచురణలు రైతులెంతో శ్రద్ధతో అధ్యయనం చెయ్యడంచూచి నాకు ఆశ్చర్యం అయింది. మనరైతులు అవి చదువుతారా? చదవరు. చదవకపోవడానికి ఒకకారణం ఏమంటే, రైతులకూ, ఆప్రచురణలకూ కావలసిన మంచిసంసర్గం కుదిర్చే గ్రంథాలయం లేదు ఇక్కడ. 'రీడింగు'లో ఉంది అలాటి గ్రంథాలయం. సరియైన పుస్తకములో, సరియైన మనిషికి, సరియైనరీతి సంసర్గం నెలకొల్పడం ఒకకళ అని జ్ఞాపకం ఉంచుకోవాలి. ఇదే గ్రంథాలయంయొక్క ప్రత్యేక రంగం. కొన్నియేళ్ళ క్రిందట ఉంటూవచ్చిన ప్రచురణ కార్యాలయం (Publi-

* ఈవ్యాసం మొదట ప్రకటించిన తేది ౨౪-౫-౧౯౨౯.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

city Office) ఆ ప్రచురణలను పోస్టుద్వారా అవిముర్శ ముగా గ్రామస్థుల నెత్తిని రుద్దడం, పై చెప్పిన ప్రధాన కర్తవ్యాన్ని విస్మరించడంచేతనే జరిగింది. గ్రామస్థునికి పబ్లిసిటీ ఆఫీసు ఏమీ కదులు పుట్టించ లేదంటే, అది అవలంబించిన మార్గం తప్పు కనుకనే.

ఈమధ్య గ్రామాలలో వ్యావసాయిక సభా సన్నాహాలు (Agricultural Demonstrations) జరుగుతూ ఉన్నట్లు తెలుస్తూఉంది. అవి చాలా అవసరమే అనడం, కాని అవి చాలవు. సభా సన్నాహాలు క్షణికోత్సాహం రేపుతాయి. కాని యీ ఉత్సాహం చావనీయక, గ్రామస్థు లధికవిజ్ఞానం సంపాదించి శాశ్వతాసక్తి పెంచుకొనే లాగు దానిని శ్రద్ధతో పట్టి నడపకపోతే, ఈ సన్నాహాలకైన వ్యాయామంతా చివరకి నిష్ఫలమైపోతుంది. చక్కగా ఏర్పాటేచిన గ్రామగ్రంథాలయసేవావిధి కాక ఈపని చెయ్యడానికి తగిన సాధనం ఏముంది?

ఉత్సాహపూరితులైన సంఘసేవాపరులతో నింపి మంచి పద్ధతులపైని గ్రామ గ్రంథాలయాలు పడుగుపేకలు వేస్తే, అవి ఆనైమిత్తిక సన్నాహాల పనిని ఒక్క కంజాయింపుతో శాశ్వతరీతిని సాగించ గలుగుతాయి.. అటువంటి గ్రంథాలయాలు ఆసరాగా, వ్యవసాయశాఖవారి పని ఎక్కువ స్తుతిపాత్రమై ప్రజలకు ఎక్కువ ఉపయోగపడుతుంది. కనుక గ్రామస్థుని శిక్షణావశ్యకతలు ఆలోచించినా, గ్రామము జాగ్రత్తపెట్టుకొనే విషయము ఆలోచించినా, రైతుకు మంచివిద్యా, అర్థాతా చేకూర్చుకొనే అవసరం ఆలోచించినా, ప్రభుత్వశాఖలు పెక్కింటిలో ఒకవిధముగా వృథా ఐపోయే పెద్ద నష్టాన్ని తగ్గించుకోవలసినస్థితి ఆలోచించినా, అన్నింటికీ ఒక్కటే పర్యవసానం—మన రాష్ట్రములో గ్రామ గ్రంథాలయాలు పడుగుపేకలు అల్లడానికి ఏమాత్రమూ జాగుచెయ్యరాదని తేలుతుంది.

[అనువాదకుడు: కొం. జ.]

---

# ధర్మపత్ని

శ్రీమతి రాజేశ్వరి గారు

(ఆంధ్ర గీర్వాణ సాహిత్య సమ్మేళనము)

మాతాపితృభ్యాం హృదయేశ్వరస్య
నాథాయ సద్విప్ర గురూత్తమేభ్యః,
నమస్కరో త్యంబుజలోచనా యా
సా ధర్మపత్నీతి పరిస్తుతా స్యాత్.

మిథ్యాం మా వద, సత్యమేవ వద, దుర్భావం న సంభావయ
ధర్మం పాలయచైవ, చింతయ పరప్రాణావనాదిక్రియాః,
కామక్రోధమదాది శత్రువిజయం కాంక్షూ విముక్త్వా కురు
పుత్రి! త్వం భవ తావకాత్మ విభుసేవాయత్తచిత్తా సదా.

సంప్రదాయకుటుంబ సంజాతవని మెచ్చ, గన్నవారింటికి వన్నెతెమ్మ
పతిపాదపద్మషట్పద మీామె యని పల్క, సాధ్వీమణులలో ప్రశస్తిగాంచు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మత్తమామల యాజ్ఞ కడుగు దాఁట దటంచు, మేదిని జనులలో మెప్పుఁ గొనుము
ఆనంద సంధాయకాననలక్ష్మివై, హృదయేశు హృదయానఁ గుదురుఁ గనుము
సేవలో దాసివై, యూహఁ జెప్ప మంత్రి-వై స్వరూపమునకు లక్ష్మివై, భరింప
ధరణివై, భోజనపువేళఁ దల్లివై, శ-యించువేళల రంభవై మెసఁగు మమ్మ.

బంధు ర్భర్తా హితో భర్తా, గురు ర్భర్తా న సంశయః,
న ఏవ సర్వదా సర్వం, సతీనా మితి చింతయ.

కనుపాప నీభర్త; కాంచు శక్తివి నీవు; ఆతని కనుసన్న కమరవలయు.
శిరసు నీభర్త; భాషించు శక్తివి నీవు; తలలోని నాల్కవై మెలఁగవలయు.

హారంబు నీభర్త; యందు దారమ వీవు; మనసులో మనసువై మనఁగవలయు.
అబ్దంబు నీభర్త; యందు వృష్టివి నీవు; పతిదేహకల్పవై పరఁగవలయు.

జగతిఁ గులధర్మపత్నినాఁ బొగడికఁ గను-భాగ్య మీభారతావని ప్రజలకె కద!
యట్టి పుణ్యభూమిని నీవు పుట్టు కెల్ల-చిరపతివ్రతాకీర్తిఁ బోషింపఁ గాదె!

---

ఆశావ్యాప్త పరిమళం, విమల దివ్యామోద రాగోదయం,
మాధుర్యామృత పూరితం, వరదయాసారైక సంవర్ధితమ్,
నిత్యస్నిగ్ధ వికస్వరం, సువికసన్నిర్మాయిక శ్రీమయం,
లాలిత్యం మృదుళంచ కంప్రకసుమం, సాధ్వీమణీ మానసమ్.

వాగర్థముల విధంబున-నా గౌరీ శంకరులకు నవినాభావ
శ్రీ గల్గె ననెడు సుకవివ-చో గుంభనలో సతీత్వ సూక్తిని గనుమా.

మమ తనయే! చర నిరతం, పతివాక్పరిపాలనా సమాసక్తా,
పతిహితకార్యా చరణా, ప్రవర్తతే జిహ్వికా యథా శిరసి.

ఏ తరుణమున వివాహిత-వైతివో, యానాఁడె మాకు నాత్రము దీరెన్
పూత చరితవై మెలఁగుము-'నాతల్లీ! కులవధూజనమతల్లిక వై.'

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# పునర్విమర్శనము

## ఉత్తరరామచరిత రసవిచార ప్రశంస

౧

బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రి గారు

ఉత్తర రామచరిత నాటక రసవిచార మను వ్యాస రాజమును భారతి— ఆషాఢ శ్రావణ సంచికలలోఁ బ్రకటితము చేసిరి. దానిమీఁద బ్ర. శ్రీ. మల్లాది రామమూర్తి శాస్త్రిగారు ఒక వ్యాసమును, శ్రీయుత మున్నంగి లక్ష్మీ నరసింహశర్మ గారు ఒక వ్యాసమును ఆశ్వయుజమాస భారతి సంచికలోఁ బ్రకటితము గావించిరి. రసవిచార మందు నాకును గొంత యభిలాషముండుటంజేసి యిందేది న్యాయమైన వ్యాసము, ఎవరిది ఉత్తమపక్షము యను నంశమున నా యభిప్రాయము వివరింపఁదలఁచి యీ మూఁడు వ్యాసములను నేను కలిపి చదివితిని. బ్ర. శ్రీ. రామమూర్తిశాస్త్రిగారి వ్యాసముఁ జదువఁగనే వ్యాస కర్తయొక్క అసూయాజనకమైన వ్యాసధాటికి నాకు నవ్వువచ్చినది.

### ఆపాతతః వెదచల్లుట

రామమూర్తిశాస్త్రిగారు తమ వ్యాసము నుపక్ర మించుటయందు శ్రీ సుబ్బారాయశాస్త్రులవారి వ్యాస “మందలి విషయములు, పూర్వపక్షములు, సిద్ధాంతములు, సర్వతోముఖములుగా నుండి శ్రీశాస్త్రులవారి సాహిత్య పటిమను ఆపాతతః వెదచల్లుచున్నవి” అని ఋజువు చూపకుండ తీర్మానించిరి. శ్రీ సుబ్బారాయశాస్త్రుల వారి సాహిత్యపటిమ సులభముగాఁ బడిపోవునదికాదని యెఱింగిన నాకు రామమూర్తిశాస్త్రులవారి యీ వ్రాఁత విలువయైనదిగాఁ దోఁచుటలేదు. ఇక్కడ శ్రీశాస్త్రుల వారి సిద్ధాంతములు మున్నగునవి సర్వతోముఖములై యుండియును వారి సాహిత్యపటిమను ఆపాతతః వెద చల్లుచున్నవనుటలో శ్రీ శాస్త్రులవారి సాహిత్యపటిమ వాదములోఁ బడిపోవునన్న యభిప్రాయమే తప్ప “ఆపాతతః” అనుటకు ఇంకొక యర్థమును రామమూర్తి శాస్త్రిగారు చెప్పఁబూనరని నాతలంపు. అట్లయినచో నేది? రామమూర్తిశాస్త్రిగారు తమ ప్రాగల్భ్యమును జూపి శ్రీసుబ్బారాయశాస్త్రులవారివాదమును ఆపాతము చేయుటకుఁ దగిన యుక్తులను బైకిఁ దెచ్చి శ్రీ సుబ్బా రాయశాస్త్రులవారిచే సవరణ వ్రాయించుటకై వ్యాస లేఖనమునకు సాహసించిన దానిని బలపఱచుకొనుటకు ఇంకొకసారి పూనుకొని తమ ధీశక్తిని ప్రదర్శింపవలెను. లేదా “ఆపాతతః” అనుమాటనైనను ఉపసంహరించు కొనవలెను.

### ఎవరిది పరమ సాహసము ?

“ఈవ్యాసమునందలి విషయమునంతను శ్రీశాస్త్రి గారు తమ స్వంతబుద్ధితో నాలోచించినారట. ఎంత ఆశ్చర్యము! నిజముగా నిదియంతయు శ్రీశాస్త్రిగారి ప్రతిభచేతనే వ్రాయఁబడినచో వారు జగద్వంద్యులేకాని శ్రీ శాస్త్రిగారి పరమ సాహసము గాని, యిందు వీరి ప్రతిభాలేశముగూడ కానంబడుటలేదని నేను తెలి యజేయుచుంటిని” — అని రామమూర్తి శాస్త్రిగారు వ్రాసిరి. ఇది పరమసాహసమయిన వ్రాఁత! శ్రీ కుమార తాతాచార్యులవారివాదమునే శ్రీసుబ్బారాయ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాస్త్రులవారుకూడ సాగించినపుడు రసచర్చకు సంబంధించిన లాక్షణికగ్రంథపరికరమును, లక్ష్యమునకై ఉత్తరరామచరితమునుండి ఉగ్గడింపఁబడవలసిన ఆయాఘట్టములును, పారిభాషికపదములును, ఉపక్రమోపసంహారాదులును ఒకదాని నొకటి పోలియుండుట సహజము. ఈసారస్యమెఱుంగక శ్రీ శాస్త్రులవారి ప్రతిభాలేశము గూడ లేదని తృణీకరించి వ్రాయుటచూడఁగా రామమూర్తిశాస్త్రిగారు పరమసాహసముచే నిట్లు వ్రాసిరని తలంచుచున్నాను.

## తు, చాలలోఁగూడ భేదము లేదా?

రామమూర్తిశాస్త్రిగా రిట్లువ్రాసిరి:

"శ్రీకుమార తాతాచార్యవిరచితంబయిన "కల" యను వ్యాఖ్యానములో ఉత్తరరామచరిత నాటకము ౧౯౨౬ సంవత్సరమున ఆనందముద్రణాలయమున చెన్నపురిలో ముద్రింపఁబడియున్నది. కాని యీ గ్రంథము పునర్ముద్రితము కాకుండుటచే ప్రస్తుతమున విరళప్రచారముగలిగియున్నది. ఆవ్యాఖ్యాత యీ నాటకమందలి రసమును "ఏకోరసః కరుణఏవ"యను శ్లోకవ్యాఖ్యానమున విపులముగా చర్చించినాఁడు. అందలి విషయముల నే తు, చాలలోఁగూడ భేదములేకుండ శ్రీసుబ్బారాయ శాస్త్రిగారు ఆంధ్రీకరించినారు"—

ఈవ్రాఁత పరమ సాహసమయిన వ్రాఁతయని పదింబదిగఁ జెప్పఁదగియున్నది. ఈ యంశములు చెప్పునపుడు శ్రీ సుబ్బారాయశాస్త్రులవారి రసవిచారమంతయు తు, చాలు తప్పకుండ శ్రీ కుమార తాతాచార్య వాఙ్మయమేతప్ప నితర మెద్దియును లేదనుటకు రామమూర్తిశాస్త్రిగారు తగునిదర్శనము లిచ్చి నిరూపించుకోఁదగియున్నారు. లేదేని వారివ్రాఁత రూఢిలేనివ్రాఁతయగును. శ్రీకుమార తాతాచార్యునివాదభాగముల నాంధ్రీకరించి అవ్వానికి శ్రీసుబ్బారాయశాస్త్రులవారు తమ పరిశోధనమం దితరత్ర లభించిన వాదసామగ్రిని చేర్చి అందుకుఁ దోడుగా నుత్తరరామచరితమందలి ఆయాఘట్టములను లక్ష్యముగా సమకూర్చిరి. విప్రలంభశృంగారవాదమును శ్రీకుమార తాతాచార్యుని కంటె ఎక్కువ పరికరముతో శ్రీసుబ్బారాయ శాస్త్రులవారు సుస్థాపించిరి. విరళప్రచారమందియున్న శ్రీకుమార తాతాచార్యుని 'కల' ఆంధ్రపాఠకులకు దుర్లభ్యమయియుండఁగా దాని యందలి విప్రలంభవాదమును—ఆవ్యాఖ్యాత సమకూర్చుకొనియుండని గోవర్ధనాచార్యాదులను, అమరసింహుని, కాళిదాసుని, పండితరాయలను, సింగభూపాలుని, భోజభూపాలుని ఉద్ఘాటించుచు రసతరంగిణి, కావ్యప్రకాశబాలబోధినీవ్యాఖ్య మున్నగు గ్రంథపరికరముతో శ్రీసుబ్బారాయశాస్త్రులవారు మఱింత ప్రకాశమునకుఁ దెచ్చిరి. శాస్త్రమును చేతఁబట్టుకొని వాదింపఁదగిన యంశములందు లక్షణగ్రంథములందలివాక్యములను, లాక్షణిక సూత్రావళిని, లక్ష్యసామగ్రిని, పరిభాషను విడిచి ఎవ్వరును సభకెక్కరు. అన్నిటిని విడిచి సభకెక్కినచో ఆవాదము శాస్త్రవాద మనఁబడదు. శ్రీసుబ్బారాయశాస్త్రులవారు "ఇ ట్లింతవఱకు"—"అనియిట్లు" పూర్వవాదములను ప్రకాశపరచుచువీరరసవాదులను, శుద్ధకరుణవాదులను, విప్రలంభవాదులను గూడ ఎదుటికిఁ దెచ్చుచు "నాబుద్ధికోలఁది విచారింపఁగా"అని ఉపసంహారముచేయఁ బూనిరేకాని వేఱుకాదు. ఇట్టిస్థితిలో "విషయమునంతను శ్రీశాస్త్రిగారు తమ స్వంత బుద్ధితో నాలోచించినారట. ఎంత ఆశ్చర్యము!" అని రామమూర్తిశాస్త్రిగారు లిఖించిరి. పరికరమంతయు నెదుటికిఁ దెచ్చి "యీ పరికరమునుబట్టి నాబుద్ధికిఁ దోఁచిన దేమనఁగా"అను నర్థముగల వాక్యములకుఁగూడ రామమూర్తిశాస్త్రిగారి కింత ఖేదమేలకో?

## నామ స్పర్శనము

ఆహా! తెలిసినది. వీరిఖేదకారణములలో నీక్రిందిది యొకటి! "సాహిత్యచక్రవర్తియగు తాతాచార్యుని గ్రంథమునంతను భాషాంతరీకరించి యవ్వాని నామమునైనను స్పృశింపక యిదియంతయు" నాబుద్ధికోలది విచారణ యని వ్రాయుచుండిన శ్రీశాస్త్రిగారి స్వంతము సాహసముగాక ప్రతిభయగునా? తాతాచార్యవ్యాఖ్యయందలి ఒక్కొక్క సంస్కృతవాక్యము నే తీసి యాంధ్రభాషలోనికి తర్జుమాచేసినచో శ్రీశాస్త్రిగారి వ్యాసము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ను, చాలుతప్పనుండా తయారగును. * * * *
ఇటుల సాహసించుట అన్యాయమనియు, పండితద్రోహమనియు శ్రీశాస్త్రిగారికి తెలియజేయుచు నాయభిప్రాయములను నంగీకరించి మహాపండిత తాతాార్యునికి కృతజ్ఞులై, "నాబుద్ధికొలందిని" అని విడిచి "తాతార్య వ్యాఖ్యానుసారము వ్రాసితిని" అని శ్రీసుబ్బారాయశాస్త్రిగారు స్వయముగా తమవ్యాసమును భారతిలో సవరింపజేయవలె" ననిరి. ఆంధ్రీకరణముగా వాదపరికరము నేర్పఱచుకొనుటకు సాహస మెట్లగునో, అన్యాయమెట్లగునో, పండితద్రోహ మెట్లగునో తాతార్యుని, నాటకకర్తయగు భవభూతిని ఘనశ్యామవీరరాఘవ ప్రముఖులగు నితరవ్యాఖ్యాతలను, ఉత్తరరామచరితము నాంధ్రీకరించిన కవులను, లక్షణవేత్తలగు భరత, గోవర్ధనాచార్యాదులను, ఇంకను పెక్కండ్ర గ్రంథములను వాదమునకుఁ దెచ్చినపుడు వానిపై "నా బుద్ధి కొలందిని" అనుమాట యెట్లు విరుద్ధమగునో ఇన్నిటిని విచారించినమీఁదట నా బుద్ధికొలందిని అనుటకూడ రామమూర్తిశాస్త్రిగా రధిక్షేపింపఁ జెల్లునేమో పాఠకులు నిర్ణయింపఁ గలరు. అందఱి వాదములను బైటికిఁ దెచ్చినప్పుడు కేవలము "తాతార్యవ్యాఖ్యానుసారము వ్రాసితిని" అని యేల సవరింపవలెనో నాకు బోధపడుట లేదు. మఱియు రామమూర్తిశాస్త్రిగారు అనుమానజనకమైన దృష్టితో శ్రీ సుబ్బారాయశాస్త్రిగారి వ్యాసమును సరిగాఁ జదువలేకపోయిరి కాఁబోలు! "నేను వ్రాసినంతవఱకుఁ బ్రాచీనవవీన సహృదయసమ్మతమునే వ్రాసినాఁడనుగాని యిందు స్వకపోలకల్పిత మెద్దియును లేదు"—అని శ్రీ సుబ్బారాయ శాస్త్రులవారు స్పష్టముగా లిఖించియుండిరి. ఇంకను గనుఁడు!—"వ్యాఖ్యాత లందఱు మనకు మహోపకారులు. వారి వ్యాఖ్యానములం జూచి కొంత పరిజ్ఞానము సంపాదించుటచేతనే యిట్టి విమర్శముల జేయఁగలుగుచున్నారము. కావున వారియెడ మనము కృతజ్ఞులమై యుండకతీఱదు"—అని శ్రీసుబ్బారాయశాస్త్రులవారి వ్యాసమందు కలదు. మఱియు "ఈ నాటకమునకు మఱి కొందఱు కుమార తాతాచార్యప్రభృతులు విప్రలంభ శృంగార మే ప్రధానమని వ్యాఖ్యానము లొనరించిరి"—అని పైరీతిగా పూర్వవ్యాఖ్యాతల పయి అత్యంతము కృతజ్ఞబుద్ధిగల శ్రీ సుబ్బారాయ శాస్త్రులవారిపయి—ఇంకను విశదముగా స్వకపోలకల్పిత మెద్దియును లేదని తెలుపుచున్న విబుధవిధేయులగు శ్రీ శాస్త్రులవారిపయి-పయిరీతిగా ద్రోహ మాపాదించి పరమ సాహసమనియు, నామసంస్పర్శమైనను జేయ లేదనియు, అన్యాయమనియు, పండిత ద్రోహమనియు కఠోరము లాడుటమూడఁగా కావ్యవిషయికమయిన విపులహృదయాభియోగము దానందించుటకు సమర్థత లేకుండుటచేతనే రామమూర్తిశాస్త్రిగారికి ఇట్టి ఖేదహేతువు గల్గినదని విస్పష్టము.

> గుణదోషగవేషణా జనానాం
> విహతా యద్యపి కాలవైభవేన,
> క్వచి దస్తి సచేతసాం నివాసో
> విపులాయా మితి సార్థక శ్శ్రమో నః.
>
> —సద్రూపకప్రశంసా.

కాలవైభవముచే గుణదోషవిచారముచేయు సహృదయుల సంఖ్య తగ్గినను కొందఱయినను లేకపోలేదు. కావున సరియగువారిక్రొఁత నిరర్థక మెన్నటికిని గాదన్న సారాంశమే రామమూర్తిశాస్త్రిగారివంటివారిని గొందఱను విడిచి శ్రీసుబ్బారాయశాస్త్రులవారి లేఖిని రసవిచారపరతంత్రులగు సాహిత్యజ్ఞులనువృష్టిపఱచఁదగియున్నది. ఈసారాంశము—సద్రూపక ప్రశంసనుండి యెత్తి శ్రీ సుబ్బారాయశాస్త్రులవారు రసవిచారపరిసమాప్తియందు శ్రీకుమార తాతాచార్యుని మనసా స్మరించుచు సగౌరవముగా ఉల్లేఖించిరి.

౨

శ్రీయుత మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారిది యిందుపై రెండవ వ్యాసము. రామమూర్తిశాస్త్రిగారి వలెగాక శ్రీశర్మగారివాదము కొంత సహేతుకమయి నదిగాఁదోఁచును. కావునవారివాదమునందలి కొన్ని యంశములనుసావకాశముగాఁ జూడ నభిలషించెదను. బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణులగు వేదము వేంకటరాయశాస్త్రులవారిని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీసుబ్బారాయ శాస్త్రులవా రనుకరించి యీవ్యాసము వ్రాసి నారనియుఁ, జాడలేదనుట నమ్మఁ బల్కుట యనియు వ్రాయుచు సంశయచిత్తమును పాఠకులలో వ్యాపింపఁజేయుచున్నది, శ్రీ శర్మగారి లేఖిని. శ్రీ సుబ్బారాయశాస్త్రులవారి ధారాళస్వాదయమును, రస భావాదులపైఁ గావించు హేతువాద సామర్థ్యమును తెలిసినవారి నెవ్వరినైనను శ్రీశర్మగారిలేఖిని సంశయ చిత్తులను ఏరీతిగనైనను చేయఁజాలదు. బ్ర. శ్రీ. కళా ప్రపూర్ణులగు వేదం వేంకటరాయశాస్త్రిగారు భాను మిశ్రుని రసమంజరి కనువాదకులు-శ్రీ సుబ్బారాయ శాస్త్రులవారన్నన్నో భానుమిశ్రుని రసతరంగిణి కనువాద కులు. ఉభయులును వారివారి యభిమానశాస్త్రములందు గూలంకషప్రజ్ఞ గలవారు. అయితే కీర్తివ్యాపించుట లోను మతికొన్ని యితరపరిస్థితులందును తారతమ్యము లుండినవి. అందులకు హేతువులు మనకుఁ బనిలేదు. ఇత్తఱి రసవిచారవ్యాససందర్భమున నమ్మఁబల్కినట్టి సంశయచారిత్రమును శ్రీసుబ్బారాయ శాస్త్రులవారిపయి సమన్వయము చేయఁబూనిన శ్రీ శర్మగారికి సదుత్తర మొసంగుట అప్రస్తుతముకాదు. "ప్రతియోగి ప్రమితిం వినానిషేధానుపపత్తిః" —అను న్యాయముచేత శ్రీ శర్మగారు చేతఁబట్టిన శ్రీ కళాపూర్ణులగ్రంథము నాకిం కను లభ్యముకానందున వారివాదముపై జబాబునకుఁ దొందరపడితినో నానిషేధము చెల్లదని యుండదు గనుక కళాపూర్ణుల గ్రంథమును సంపాదించిచూచి శ్రీ శర్మగారి యాధిక్షేపములకు జబాబిచ్చెదను — గడువు కావలెను.

దువ్వూరి జగన్నాథశర్మ

---

## రహస్సుధ ౨.

కొల్లూరు ధర్మారాయ కవిగారు, బి. యే., ఆం. గీ. సా. ప.

ఈలే వెన్నెలరేల నొంటరిగ నీ వే తెంచుచో నీదు పా
దాలన్ జిందులువాఱు కుచ్చెళులయాతల్ బ్రేమదూతల్ బలెన్
నాలాతూరుణ లోచనంబులకు నానందంబుగూర్పన్ నిశీ
థీ లీలావతి! చేతమే యుడిగి సుప్తిన్ గాంతు రాబొమ్మనై.

నిదురయొడిన్ మెయిన్ విడచి నే నెవొ స్వాప్నికసీమలందు బో
యెదను, మధుప్రమత్తత యొకించుక పట్టు సడల్చుదాక; నం
త దనుక నాదుమోడు వెడదన్ భరియింపుము నీయురస్థలీ
సదనమునందె యోచెలియ! సాంద్రతమఃపతిసీరచాటునన్.

ఏ శుభవేళ నొండొరుల కీమధురార్తిజనించె నప్డె యా
కాశము పెండ్లిపందిళులఁ గల్పన చేసెను రిక్కమల్లెలన్;
లేశము వెల్గుమచ్చయును లేని నిశాకుహరాన బ్రేమమూ
ర్తీ! శిరసుల్ స్పృశింప నిదురింతము వేకువలేని నిద్దురన్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## సంచుల యల్లిక-౧

కో. నరసింహాచారి గారు

### పిడులు

ఈ కాలమున ప్రతివారును అంగడికి పోవునపుడు వస్తువులను వేసికొనివచ్చుటకును, పాఠశాలకు బోవునపుడు బిడ్డలు తమపుస్తకములను వేసికొనుటకును నూలుసంచుల నుపయోగించుట యందఱకు దెలియును. నూలుసంచులను క్రయమునకు దీయునెడల నొక్కొక్కటి అయిదాఱణా లగును. నూలునుమాత్రము కొని సంచులను మనమే యల్లుకొన గలిగినయెడల మూడణాలలోనే సంచి రాగలదు. ఈ సంచుల నల్లుట బహుసులభము. సులభసాధ్యములగు వస్తువులను మనమే స్వయముగ జేయ నేర్చుకొనిన యెడల లాభము మాత్రమే కాక పనియందుత్సాహమును, బుద్ధికుశలతయు హెచ్చును.

సంచుల నల్లుటకు ముందు రెండుపిడుల నల్లుకొనవలెను. పిడులు రెండుమూడు విధములు. ఒక్కొక్క సంచియొక్క పిడులు రెండును సమానమగు నిడివి కలిగి యుండవలెను. కాన రెండు నూలుతాళ్లను ఒకేకొలతకు కోసికొనవలెను. ఒక్కొక్కతాడు సుమారు మూడు లేక నాలుగుగజముల నిడివి యుండవలెను.

### పిడి నల్లురీతి

ఒకనూలుత్రాటిని దీసికొని దానికొనలను జేర్చి ముడివేయవలెను. మొదట దానికొనలలో నొకదానిని (క, చిత్రము ౧.) రెండవకొన గ పైన ఉంచవలెను. పిమ్మట చిత్రము ౨ నందువలె ముడివేయవలెను. మొట్టమొదట పైతట్టు పెట్టిన క ముడివేసిన తర్వాత గూడ పైకి వచ్చును. మరల క ను పైకిని, గ ను క్రిందికిని నుండునట్లు చిత్రము ౩ నందువలె పెట్టి, చిత్రము ౪ నందువలె రెండవముడిని వేసి, బిగించి లాగిన యెడల చిత్రము ౫ నందు వలె ముడి యేర్పడును. ఈరీతిని ముడివేసిన యెడల నూలు నెంత లాగినను వీడిగాదు. మొదట పైకి వచ్చిన క ను రెండవమారు క్రిందుగా పోనిచ్చి ముడివేసిన యెడల, బిగించి లాగినపుడు ముడి వీడివచ్చును. ముడివేసిన పిమ్మట నాలుగు గజముల నూలంతయు నొక వలయము లేక చుట్టుగా నేర్పడును. దానిని కాలి బొటనవ్రేలికిగాని, మఱేయాధారమునకు గాని తగిలించి దానినుండి సుమారు ౧౫ అంగుళముల దూరమున చిత్రము ౬ నందువలె ఎడమచేతి చూపుడు వ్రేలిపైన బట్టుకొని త్రాటి నంతయు నాలుగు చిన్నచుట్లుగా చుట్టుకొనవలెను. ఈ నాలుగు చుట్లను సమముగా నుండునట్లు చేసికొనిన పిమ్మట వ్రేలినుండి నాలు గంగుళముల దూరమున నొక సాధారణమగు కట్టును కట్టవలెను (చిత్రము ౭). పిమ్మట బొట్టనవ్రేలిపైనుండి చుట్లనన్నిటిని దీసి యందలి నాలుగు చుట్లను చిత్రము ౮ యందువలె వేర్వేరుగా నాలుగు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నై పుల విడదీయవలెను. ఈనాలుగుచుట్లును చిత్రము ౮ యందు ట, ఠ, డ, ఢ అని గుర్తింపబడియున్నవి. ఇందలి చుట్టునొక దానిని (ట) దీసికొని దాని ప్రక్కన నుండు ఠ పైన వంచవలెను. పిమ్మట ఠ ను డ పైనను, డ ను ఢ పైనను వేసి కడపట ఢ మొదటి దగు టను వంచుటవలన గలిగిన వంపులో నుండి దూర్చవలెను (చిత్రము ౧౧). ఇట్లు దూర్చినపిమ్మట ట, ఠ, డ, ఢ లను కొంచెము కొంచెము లాగుచు బిగించిన యెడల చిత్రము ౧౨ నందువలె మధ్య నొక యల్లిక యేర్పడును. మరల పూర్వమువలెనే యొకచుట్టును దీసికొని






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానిప్రక్క నుండు దానిపైనను, రెండవదానిని మూడవదాని పైనను, మూడవదానిని నాలుగవ దానిపైనను వేసి, నాలుగవ దానిని మొదటిదాని యొక్క వంపులోనుండి దూర్చవలెను. అప్పుడు మొదటి రీతిగనే మధ్య నొకయల్లిక యేర్పడును. అల్లికను బిగించు నప్పుడు నూలులను మెలికలు పడనీయక సమాంతరము (parallel) గా నుండునట్లు చూడవలెను. ఇట్లొకటి రెండల్లిక లేర్పడిన పిమ్మట మొదట కట్టిన సాధారణపు కట్టును విప్పివేయవచ్చును. ఈరకపుపిడికి చుట్లు మూడింటికి తగ్గక యెన్నియైన నుండవచ్చును. ఈరీతిగా నల్లుచు రెండవకొననుండి, మొదటవిడిచినట్లు నాలుగంగుళముల దూరము మిగులువఱకు వచ్చి యల్లికను చాలించవలెను. అప్పు డల్లిక చిత్రము ౧౪ నందువలె నేర్పడును.

## రెండవరకపు పిడి

ఈరకపు పిడి యల్లినతర్వాత చిత్రము ౧౫ నందువలె నుండును. మొదటిరకపుపిడిని అల్లుచు మధ్య నెట్టి స్థితియందైనను విడిచినయెడల పిడి చెడిపోజాలదు. రెండవరకము మధ్య విడిచిపెట్టినయెడల చిక్కుపడును. కాన పిడిపూర్తికానిది లేవరాదు. దీనియందు అల్లిక భాగమున కిరుప్రక్కల చిత్రము ౧౫ నందు ల, వ లవలె కట్లు కట్టి, వాటి నట్లే యుంచవలెను.

## కట్లను కట్టురీతి

చిత్రమునందు జూపబడిన కట్లు ముడులు లేక యేర్పడినవి. రెండుపిడులకును నాలుగుకట్లు కావలెను. కట్లు సమముగా నుండిన బాగుండును కాన నాలుగు కట్లకును సమానమగు నిడుపుగల నూలు తునుకలను త్రెంపుకొనవలెను. ఒక తునుక అయిదాఱంగుళము లుండిన జాలును. చిత్రము ౬ నందు జూపబడిన చుట్లను చేర్చి పట్టుకొని, ఒక కొననుండి నాలుగంగుళముల దూరమున, పై తునుకలలో నొక దానియొక్క యొక కొనను చుట్లయొక్క నిడివి భాగమువైపు చూచునట్లు చుట్లతో చేర్చిపెట్టవలెను. (చిత్రము ౯, చ). ఇది కాక మ అను మఱియొక నూలును మడిచి దాని మడతవంపుగూడ నదే ప్రక్కకు చూచునట్లు పెట్టి, పై నూలు తునుకను వీటినన్నిటి చుట్టును బిగించి చుట్టుచు రావలెను (చిత్రము ౯). ఇట్లు నూలుతునుకలో నొకయంగుళముమాత్రము మిగులు నంతవఱకు చుట్టి దాని రెండవకొనయగు జ ను మడిచిన నూలుయొక్క మడతయగు మ యందు దూర్చి, మడిచిన నూలును లాగినయెడల జ అను కొనలోపలనే నిలిచి పోవును (చిత్రము ౧౦).

## పిడి నల్లు రీతి

ఇట్టిపిడికిగలచుట్లు బేసి సంఖ్యగలవిగానుండవలెను. దీని నల్లుటకు వ్రేళ్లన్నిటితోను చుట్లను పట్టుకొనవలసియున్నది. కావున చేతులందలి బొట్టనవ్రేళ్లు కాక గల యెనిమిదివ్రేళ్ళయందును బేసియగు ఏడువ్రేళ్లకును ఏడు చుట్లుండవలెను. లేనియెడల అయిదుగాని, మూడుగాని చుట్లుండవచ్చును. చిత్రము ౧౦ యందువలె నొక ప్రక్క కట్టిన పిదప ఒక్కొక్కచుట్టు నొక్కొక వ్రేలికి దగిలింపవలెను. ప్రస్తుతము వర్ణింపబడు పిడికి ఏడు చుట్లు గలవనుకొందము. చిత్రము ౧౩ నందు జూపిన రీతిని కుడిచేతి వ్రేళ్లలో చూపుడు వ్రేలు(చూ), నడిమి వ్రేలు (న), ఉంగరపువ్రేలు (ఉ)-వీటిపై నొక్కొక్క చుట్టును ఎడమచేతిలోని నాలుగువ్రేళ్లకును నాలుగుచుట్లును తగిలింపవలెను. లేక కుడిచేతికి నాలుగుచుట్లును, ఎడమచేతికి మూడుచుట్లునుగా గూడ నుండవచ్చును. మూడుచుట్లు మాత్ర ముండు చేతియందు అనుగున నుండు చిటికినవ్రేలు విడిగా నుండవలెను. ఇట్లు వ్రేళ్లపై చుట్లనన్నిటిని తగిలించినపుడు ప్రతిచుట్టునందును వ్రేలికి పైతట్టుగా నొకభుజమును, క్రిందితట్టుగా నొకభుజమును వచ్చియుండుటను గమనించవలెను. వ్రేళ్లకు పైవైపుగా వచ్చియుండు భాగములకు చిత్రము ౧౩ నందు ౧ అనియు, క్రిందివైపుగా వచ్చియుండు భాగములకు ౨ అనియు గుర్తించబడియున్నవి.

కుడిచేతియందు విడిగా నుండు చిటికెనవ్రేలిని ఎడమచేతియందలి చుట్లయొక్క ౧ భాగములకు క్రిం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుగాను, ఎడమచేతి చిటికినవ్రేలినుండి వరుసగా నడిమివ్రేలి చుట్టువరకును దూర్చుచు పోవలెను. పిమ్మట చూపుడువ్రేలిపైనుండుచుట్టును కుడిచిటికెనవ్రేలికి మార్చుకొని, మరల తక్కినచుట్లగుండా వెలుపలికి లాగుకొనవలెను. ఇప్పుడు కుడిచేతివ్రేళ్లన్నియు చుట్లను కలిగి యుండును. ఎడమచేతి చూపుడువ్రేలియొక్క చుట్లు కుడిచిటికెనవ్రేలికి పోయినందున నది విడిగా నిలిచినది. ఎల్లప్పుడును వ్రేళ్లన్నిటిలోను అడుగున నుండు చిటికెన వ్రేలే విడిగా నుండవలెను. కాన యెడమచేతియందు నడిమివ్రేలిచుట్టును చూపుడువ్రేలికిని, ఉంగరపువ్రేలిచు



11



12



13


14

15




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ట్టును నడిమి వ్రేలికిని, చిటికెన వ్రేలిచుట్టును ఉంగరపు వ్రేలికిని మార్చుకొనవలెను. అప్పుడు ఎడమ చిటికెన వ్రేలు విడిగా నిలుచును.

ఇప్పుడు ఎడమ చిటికెన వ్రేలిని కుడిచేతి చిటికెన వ్రేలు, ఉంగరపు వ్రేలు, నడి వ్రేలు–వీటిపైనుండు చుట్లయొక్క ౧ భాగముల క్రిందుగా మార్చి, ఆచేతి చూపుడు వ్రేలిపైనుండుచుట్టును తనపైకి మార్చుకొని ఆచిటికెన వ్రేలిని బయటికి తీసికొనవలెను. ఇపుడు మరల కుడిచూపుడు వ్రేలువిడిగా నుండును. పూర్వపురీతిని ఆ చేతిలోని చిటికెన వ్రేలు, ఉంగరపు వ్రేలు, నడిమి వ్రేళ్లపై నుండు చుట్లను పైకి మార్చుకొని చిటికెన వ్రేలిని విడిగా పెట్టుకొనవలెను. ఈరీతిగా మార్చుచు అల్లుచు వచ్చునపుడు చక్కగా లాగుచు వచ్చినయెడల పిడియొక్క యల్లిక యందముగా నుండి బలము కలిగియుండును. రెండవ ప్రక్కనుండి నాలుగంగుళముల దూరముండువఱకు అల్లి అప్పటి పూర్వపురీతి మరల నొకకట్టు కట్టవలెను. ఇదే రీతిని రెండవ పిడినిగూడ నల్లుకొనవలెను.

## మూడవరకపు పిడి

ఈ రకపు పిడి యంత కష్టమయినది కాదు. దీని యందు అల్లికభాగ మేదియు లేదు. మొదటి రెండు విధముల పిడులకువలెనే మనయిష్టమువచ్చినన్ని చుట్లు చేసికొని, వాటిపైన చిత్రము ౧౦ యందు జూపిన రీతిని కట్టవలెను. కాని యీరీతిని కట్టునట్టినూలు చాల పొడవై కడవఱకును చుట్టుటకు దగియుండవలెను. చుట్టుపద్ధతి మాత్రము చిత్రము ౧౦ యందు జూపిన రీతిగనే యుండును. ఇట్లు పిడులను చేసికొన్నపిదప సంచుల నల్లుటకు నేర్చుకొనవలెను. ఇందును గురించి మఱియొక వ్యాసమున వివరింపబడును.

---



# రాటపుపాటలు



కుర్రా వెంకటసుబ్బారావు చౌదరి గారు

౧

శ్రీకృష్ణరాయుడు చిటికె వేసితే
కనక యావులమంద కదలి వచ్చెను
ఆవుల్లమందకి పేరుపడ్డాడు
అన్న కాటమరాజు పాపసైదోడు.

౨

భూమేలె వారింట పుట్టింది పట్టి
జగ మేలె చంద్రుడా చేసుకోవయ్య.

౩

వూరికి బోకన్న వుండ బోకన్నా
వుద్యోగ పరమంత అబ్బినదాక
చేనికి బోకన్న చెప్పబోకన్నా
చెప్పరానీ పుట్లు పండినాదాక
ఆలి మంచిదని అడుగబోకన్నా
అది వచ్చి కాపురము చేసిన్నదాక.

౪

నిమ్మచెట్టద్దమ్మ నీలమేఘమ్మ
అన్న నీగుఱ్ఱమ్మ చంద్రమేఘమ్మ.

౫

జనపనార పగ్గాలు జముజడ్డిగాలు
వెన్నెట మాగొఱ్ఱు వెదబెట్టి వచ్చు
గోగునార మోకులు కొనజడ్డిగాలు
కోటిపాల మొల్లుట్ల కొమలు దున్నేరు.

౬

యీవూరి పేరేమి యిందర పేరేమి
యీరచ్చ గూర్చున్న రాజుపేరేమి
యీవూరు మాదమ్మ యింతపని మాది
దంతపు తలుపుల్లు దరవాజులు మావి
యీరచ్చగూర్చున్న రాజు మాఅయ్య.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭
నిండుకుం డెదురాయె నిత్య మెదురాయె
జనకునికి సీతమ్మ సత్య మెదురాయె
నిండు కుండనీళ్లు తొణక దోసమ్మ
నీళ్లాపు నిందలు కట్ట దోసమ్మ.

౮
ప్రాణమ్ము వుంటేను బలుసు తినవచ్చు
పగవారి పంచల్ల పడియుండరాదు.

౯
నిప్పు చేతా బడితె నీరుబుగ్గాయె
నిజ మాయె మాతాత వెంకయ్య చావు
వొయికుంఠ మెళ్లేటి ఓ పక్షులార
అక్కడ మాతాత యెక్క డెదురాయె
వెల్లాది గుర్రమ్ము వెండికళ్లెమ్ము
వైకుంఠ మెళ్లేటి వాకి టెదురాయె.

౧౦
కట్టమీద నిమ్మ కాయల్ల నిమ్మ
కాయ కొంచెమైన కల్పవృక్షమ్ము
నిమ్మ కొంచెమైన నీడ చల్లన్న.

౧౧
ఆదివారపు పాలు అనుకున్న పొంగు
అలంకరించా గౌరి తనలోనె పొంగు
ఆదివారపు లక్ష్మి మాయింటి కొస్తే
అచ్చమల్లెల దండ గుచ్చి మెడ నేతు
శుక్రవారపు లక్ష్మి మాయింటి కొస్తే
సున్నాన తాంబూలం చుట్టి నే నిస్తూ
మంగళారపు లక్ష్మి మాయింటి కొస్తే
మరువక నే నిస్తు మంగళారతులు.

౧౨
అలసంద పప్పొండి ఆవునెయి కాచి
అమ్మ సీతమ్మల్ని యేపేర పిలుతు
శంభులింగము లెమ్మి జపమూర్తి లెమ్మి
నందికేశవ లెమ్మి నాప్రాణవిభుడా.

౧౩
వచ్చేవు పొయ్యేవు వాలేవు చిలకా
వకరక్ష పుట్టింట వారత లేమి
పెద్దకొడుకూ పెండ్లి పెరుమాళ్ల సేవ
ఆడబిడ్డసమర్త అల్లుడు మనుగుడుపు.

౧౪
యెంత దొడ్డారాజు బిడ్డవో గాని
యెప్పుడు నాతోను యెదురాడవమ్మ.

౧౫
ఆవులకి లేగలకి దొడ్డి రాలుండు
అక్క మా రామయ్యకి అంశరా లుండు.

౧౬
రామన్న నీ అడివి రాకాసు లడివి
పిట్టలు గూయంగ భీ తెందు లేదు.

౧౭
చెరువు కట్టలమీద కొంగల్ని జూచి
చెరువుచేప లన్ని చెల్లాట లాడె
మందకట్టల మీద అన్నల్ని జూచి
మచ్చికలు వేసేరు మామకూతుల్లు.

౧౮
మద్దినా లప్పుడు మాయ జంగమ్ము
బిచ్చాని కొచ్చేడు బిరుదు వేసుకొని
అమ్మ బిచ్చమ్మని అడుగ జాలాడు
తల్లి బిచ్చమ్మని తలకనేరాడు.

౧౯
యెన్నడు యెరుగమ్ము యింతసోద్యమ్ము
చుక్కలకు సూరేడు పొడయందినట్లు.

౨౦
సూరేడు పెండ్లాయె శుభలగ్నమాయె
యోగేశ్డు పెండ్లాయె వడక లగ్గమ్ము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## శ్రీ సింగరాజు నాగభూషణరావు గారు

ఆంధ్రనాటక సారస్వతమువలె నాంధ్రనాటక రంగము సైత మింకను బాల్యదశయందే యున్నది. రంగస్థలముఁ బాటకచ్చేరీగా మార్చి రాగాలాపన మందలి యారోహణావరోహణములతోఁ పాటు చేతులను జేఁటతోఁ జెరుగుచున్నట్లు లెత్తుటయు దించుటయు నభినయ మని మొన్న మొన్నటివఱకుఁ దలఁపఁబడుచుండెడిది. ఇప్పు డాదినములు గడచిపోవుటయే కాక తెనుఁగు దేశమున నభినయకళాకుశలు రగు నయిదాఱుగురు నటులుగూడ నవతరించియున్నారు. వారిలో సుప్రసిద్ధులు శ్రీమాన్ తాడిపత్రి రాఘవాచార్యులుగారు. ఖండాంతరవాసులు సైతము వీరి యభినయ నైపుణ్యమును గొనియాడియున్నారు. విజయనగర సామ్రాజ్యపతన మను నాటకములో నాచార్యులవారు ధరించిన పటానువేషముయొక్క ఛాయాచిత్రములు కొన్ని త్రివేణియందుఁ బ్రచురింపఁబడియున్నవి. వానిలోని యొక దానియందుఁ బటానుయొక్క ప్రణయపాత్రమగు ఆషాబీ యప్రియతమములగు వాక్కులతో నాతనిని యుద్ధమునకుఁ బురిగొల్పునప్పుడు యుద్ధపరాఙ్ముఖుఁడగు నాతని మనస్సులోఁ గలిగిన కళవళపాటు ప్రదర్శింపఁబడియున్నది. సుప్రసిద్ధ నటకశేఖరు లగు నాచార్యుల వారి కళాకౌశలము విశ్వవిఖ్యాతము. విద్యాధికులగు మనయువకులు గూడఁ గొంత కేతక్కళయందలి గాఢాభిమానముచే మన నాటకరంగముయొక్క యభివృద్ధికిఁ దోడ్పడుచుండుట యత్యంత శుభసూచకము. అట్టివారిలో నొకరగు శ్రీయుత సింగరాజు నాగభూషణరావు గారి విషయమిప్పుడు భారతిపత్రికయొక్క చదువరులకు నివేదించుకొనుచున్నాఁడను. వీరు గుంటూరు మండలములోని బాపట్ల వాస్తవ్యులు. పట్టపరీక్షయందును, బోధక పరీక్షయందును-ఉత్తీర్ణులై వారి స్వగ్రామమందలి యున్నతపాఠశాలలో నుపాధ్యాయపదవి యందున్నారు. సహజముగా నవికత్థనులగు శ్రీ నాగభూషణరావుగారీవ్యాసముతో జతపఱుపఁబడిన ఛాయాచిత్రముల గ్రహింపనీయక మొదటఁ గొంత ప్రయాసపెట్టినను దుదకు నొప్పుదలచూపియుండుటచే వారు నాకువంద్యులు.

ప్రథమచిత్రము పైనివర్ణింపఁబడినట్లు పటాను కళవళ పడుచుండఁగాఁ దీయఁబడినది. మనోగతభావమగు కళవళపాటుయొక్క అనుభావరూపము ముఖమునఁ జక్కఁగాఁ బ్రదర్శింపఁబడియున్నది. రెండవచిత్రము ప్రతాపరుద్రీయములోని నాలుగవ యంకమందలి మొదటిపద్యము చదువుచుండఁగా గ్రహింపఁబడినది. ఆలంకారికమతమున నీ పద్యము అమర్ష మను వ్యభిచారిభావమునకు లక్ష్యము.* తురకల సైన్యములను

* పరకృతావజ్ఞాది నానాపరాధజన్యో మౌనవాక్యపారుష్యాది కారణభూత శ్చిత్తవృత్తి విశేషోఽమర్షః.
—రసగంగాధరము.

అమర్ష స్స్వపరాధేషు చేతఃప్రజ్వలనం మతమ్. శత్రుకృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః.—విద్యానాథుఁడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీమలోనికిఁ జొరనిచ్చినందునను జనార్దనుని యుగంధరుఁడు తీవ్రముగా ఖండించుచున్నాఁడు. నవలక్ష ధనుర్ధరులను దనచేత నుంచుకొనియు, యుద్ధముచేఁ గాఁగల కార్యమును యుద్ధముచే సాధింపక మిన్నకుండి రాజునకును,రాజ్యమునకును ముప్పు తెచ్చిపెట్టిన జనార్దన మంత్రిపై యుగంధరునకుఁ గలిగిన విసుగును, గినుకయు నప్రతిమానమగు నేర్పుతోఁ బ్రదర్శింపఁబడినవి. వేషములోనున్న శ్రీనాగభూషణ రావుగారి ముఖవైఖరి యుగంధరుఁ డఖండధీశక్తి సంపన్నుఁడని చెప్పకచెప్పుచున్నది.

మిగిలిన చిత్రములు వెఱ్ఱివానిది. యుగంధరుఁ డభినయించినది వాతపిత్తసంసర్గోన్మాదము. "హాస్యము, చిఱునగవు, నృత్యము, గానము, మాటలు, అవయవ విన్యాసము, రోదనము, ఓర్పు లేకుండుట, ఆర్భాటముచేయుట, ఇతరులను భయపెట్టుట, పరుగెత్తుట కారణము లేక కోపము తెచ్చుకొనుట మొదలగునవి దాని లక్షణములు.* శ్రీ నాగభూషణరావుగారు వెఱ్ఱివాని వేషముధరించి యీలక్షణములను ప్రేక్షకులు దిగ్భ్రమఁ జెందునట్లు ప్రదర్శింపఁగలరు. పిచ్చివానిచిత్రములలో మొదటిది వారు "అన్నమైతేనేమిరా మఱి సున్నమైతే నేమిరా" యనియు,వేషభాషాదులయందే కాక చూపులయందు సైతము వెఱ్ఱితన ముట్టిపడునట్లు చేయఁగలిగిన వీరి యభినయచాతురి యెంతయుఁ బ్రశంసనీయము.

మొన్న నీనడుమ బాపట్లయందలి సరస్వతీసాహిత్యసభవారు ప్రదర్శించిన ప్రహ్లాదనాటకములో శ్రీనాగభూషణరావుగారు హిరణ్యకశిపుపాత్రముఁ బ్రదర్శించిరి. సాధారణముగా దానవుల కారోపింపఁబడు దంష్ట్రికరాళవక్త్రిత్వాదికముల వర్జించియుఁ బ్రేక్షకులకు వెఱపు గలిగింపఁజాలినవారి వేషము మిక్కిలి కొనియాడఁదగియుండెను. వారు వేషముతో రంగస్థలముపై నడుగిడిన తరువాత రెండు నిమిషములకాలము ప్రేక్షకులు ప్రత్యక్షముగా హిరణ్యకశిపుని జూచుచున్నట్లు నిశ్చేష్టులై యుండిరని చెప్పినచో వారి వేషమందలి యుత్కృష్టత కొంతవఱకు బోధపడఁగలదు.

సంస్కృత సాహిత్యప్రపంచమునందు సృష్టింపఁబడిన ప్రతి నాయకపాత్రములు కేవల రాక్షసత్వముచే నిర్జీవములయిన పాషాణప్రతిమలు గావు. వాల్మీకాది మహాకవులు తాము చిత్రించిన యుద్ధతపాత్రములయొక్క యాథార్థ్యము నేకాక వారు భగవంతునియెడఁ జూపిన యనన్యసామాన్యమగు భక్తిని, దమ సంతానముపైఁ జూపిన యవ్యాజమగు పితృప్రేమను, దమ ప్రణయినుల యెడఁజూపిన యపారమైన యనురాగమునుగూడ మనోహరముగా వర్ణించియున్నారు. అయినను మనవారు కొందఱు కథానాయకునియందలి గౌరవాధిక్యముచేఁ బ్రతినాయకుని సుగుణసంపత్తును మరుగుపఱిచి వానిని దృణీకరించుచున్నారు. అది సహృదయలక్షణము గాదు. అట్లే మన నటకులలోఁగూడ రావణభీమసేనాదులు రంగస్థలముపై నేమి మాటాడినను (తుదకు భార్యతో సంభాషించునపుడు సైతము) పెద్దగొంతుకతో రౌద్రరసమే యొప్పింపవలయునని తలఁచెడివారు గలరు. అనఁగా రావణాదులయం దొక్క రాక్షసత్వము దక్క నెన్నఁదగిన యితరగుణము లెవ్వియు లేవని వారితాత్పర్యము.

శ్రీ నాగభూషణరావుగారీ యభిప్రాయమునకు లోనుగాక తాము గైకొన్న పాత్రమును జక్కని నేర్పుతోఁ బ్రదర్శించిరి. ధిషణాధురంధరుండగు షేక్స్పియరు మహాకవియొక్క నాటకములలోఁ గనుపట్టు "భావసం

---

* అస్థానే రోదనాక్రోశహసితస్మితనర్తనమ్, గీతవాదిత్రవాగంగవిక్షేపాస్ఫోటనానిచ.

—వాగ్భటము, ఉత్తరస్థా. అ. ౬. శ్లో. ౬.

అసామ్నా వేణువీణాది శబ్దానుకరణం ముహుః. —వాగ్భటము, ఉత్తరస్థా. అ ౬. శ్లో. ౮.

పిత్తాత్సంతర్జనం క్రోధో ముష్టిలోష్టాద్యభిద్రవః. —వాగ్భటముఉత్తరస్థా అ ౬. శ్లో ౧౧.

అమర్ష సంరంభ వినగ్నభావాః సంతర్జనాతిద్రవణౌష్ణ్యరోషాః. —మాధవనిదానము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘర్ష" మను నాటకాంగమీ ప్రహ్లాదనాటకమునఁగూడఁ గనుపించుచున్నది. కవి హిరణ్యకశిపునిహృదయమందు విష్ణుద్వేషమునకును, బుత్రప్రేమకును బ్రచండమైన పోరాటముఁ గల్పించియున్నాఁడు. ఈ సంకులభావసమరములో నొకతూరి విష్ణుద్వేషమును, మఱియొకతూరి పుత్రప్రేమయు విజయముఁ బొందుచుండును. కావున హిరణ్యకశిపు నిది మానవత్వ రాహిత్యముచే కొయ్యబాఱిన రాక్షసత్వము గాదు. ఈవిశేషము ప్రేక్షకుల మనస్సులో నాటునట్టు లీ మానసభావములయొక్క క్షణక్షణము లగు జయాపజయములఁ బ్రదర్శించుటకు మంచి నేర్పరియైన కుశీలవుఁ డుండవలయును. శ్రీనాగ



చిత్రము ౧

భూషణరావుగారు మొన్నటి ప్రదర్శనములో సరస్వతీ సాహిత్యసభవారికి కొఱఁత లేకుండఁ జేసిరి. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని గీతములయందలి వస్తువును గర్హించుచు వాని మాధుర్యమును బ్రశంసించు సందర్భములను, బ్రహ్లాదుని విష్ణుభక్తి ప్రదర్శనముచేఁ దనయం దుద్దీపితమైన విష్ణుద్వేషమువలన హిరణ్యకశిపువు తనకనేకవరము లిచ్చిన బ్రహ్మనుగూడ మఱచి తానే ముల్లోకము నేలు దైవము నని ప్రకటించుకొనుపట్టును, "చోద్యంబయ్యెడి నింతకాల మక్కటా......," "నాకుం జూడఁగఁ జోద్య మయ్యెడిఁగదా నాతండ్రి......" మొదలగు పద్యములలోఁ బొంగిపొరలెడి పుత్రప్రేమను అభినయించునపుడు శ్రీ నాగభూషణరావుగారు చూపిన ప్రతిభ సులభసాధ్యము గాదు.



చిత్రము ౨

రంగస్థలముపై నౌచిత్యము భంగము కాకుండఁ బద్యముఁ జదువుటకుఁగూడఁ గొంత నేర్పవసరము. శ్రీ నాగభూషణరావుగారు పద్యములు నిరక్షరకుక్షులకు సైతము బోధపడునట్టు చదువఁగలరు. అంతియకాక వారు రాగమంతయుఁ బద్యముననే యిమిడ్చి పద్యము చివర రాగముఁ జాలించు నలవాటుగలవారు. ఈపద్ధతి యత్యంత ప్రశంసాపాత్రము. సంభాషణ మధ్యమున శ్రోత తాను వినుచున్న వాక్యములకు బ్రత్యుత్తరముగాఁ దనముఖమునఁ గొన్ని భావముల జూపవలసియుండును. పద్యరూపమగు సంభాషణములో వక్త పద్యావసానమున దీర్ఘముగ రాగ మాలాపింప సాగినచో శ్రోత తనముఖ



చిత్రము ౩



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునఁ జూపవలసిన భావ మెద్ది? కావునఁ బద్యముతోఁ బాటు రాగముకూడ నాపకపోవుట యొక దురభ్యాసము.

హృదయంగమములగు నిట్టి యుత్తమాదర్శములతోఁ గూడిన యభినయ కళయందు నిష్ణాతులైన శ్రీ నాగభూషణరావుగారు ఆంధ్రనాటక రంగోద్ధరణమునకు ముందుముందు లెస్సగాఁ దోడ్పడఁగలరని నానమ్మకము.

లక్కరాజు నరసింహారావుగారు.

---

## "గర్బా" నాట్యము

శ్రీయుతులు సౌదామినీ మెహతా, బి. ఏ. గగన్‌విహారియల్ మెహతా, (యమ్. ఏ.) గార్లు "మాడరన్‌రివ్యూ" పత్రికయందు గుజరాతు, కథియవాడు దేశములం దనాదినుండియు ఆచారముగా వచ్చుచున్న "గర్బా" యను నాట్యవిశేషమును గురించియు, ఆకళయొక్క పునరుద్ధరణము, అందలి సంస్కరణములనుగూర్చి యుసంగ్రహముగా చర్చించియున్నారు. ఆంధ్రులలోఁగూడనిట్టి క్రీడావిశేషము లనేకముగ వర్తమానకాలమున జీర్ణదశనంది, క్రమక్రమముగా రూపుమాయుచున్నవి. ఆంధ్రదేశమునందు పలుతావులలో స్త్రీలు "గొబ్బితట్టు" ఆచారముగలదు. ఇయ్యది సాధారణముగా సంకురాత్రిపండుగ సందర్భమున జరుగును. ఇది కొంతమట్టునకు గుజరాతీయుల "గర్బా"ను బోలియుండును. మరియు ఆంధ్ర బాలికలువేయు "జడకోలాటము" ఘూర్జరస్త్రీల "గోఫా" వంటిదే. ఇదియునుగాక ఆంధ్ర దేశమందీనాటికిని అచ్చటచ్చట సప్తాహములు, బ్రహ్మసత్రములు, శ్రీరామయుత్సవములు జరుపబడుచున్నవి. వీనియందు రాసక్రీడాదికములను సలుపుచున్నారే కాని, రానురాను వీని ప్రచారము సన్నగిల్లుచున్నది. అష్టపదులు, గీతగోవిందము, నారాయణ తీర్థులవారి తరంగములు మొదలైనవానిని సంకీర్తనము గావించువారుగాని, అట్టివారినాదరించి, ప్రోత్సాహమొసంగువారుగాని అరుదుగా కాన్పించుచున్నారు. ఇట్టి తరంగకాలక్షేపములు, యక్షగానములు, జంగంకథలు, భక్తిప్రదీపకములును, ఆనందసంధాయకములేగాక, జాతీయ భావవిలసితములై ఆంధ్రత్వమునుగూడ ప్రతిబింబింప జేయుచున్నవి. ఘూర్జరదేశమునం దిట్టు జీర్ణములై, కనుమరగుచున్న నీగర్బా రాసక్రీడావి నాట్యకళలు యిరువది, యిరువదియైదు సంవత్సరములుగా పునర్వికాసమునంది, నేఁడు పల్లెలు, పట్ట



చిత్రము ౧



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణము లందంతటను, విద్యాధికులు, జనసామాన్య మెల్లరచే సర్వజనాదరణమును బడయుటకు ఘూర్జర దేశమందలి యాధునికకవికుమారులయొక్కయు, కళాసేవకులు, కళాభిమానులయొక్క ఉత్తమోత్తమ కృషియేకారణము. ఆంధ్రలోక మిట్టికళలందు పూర్వము పేదఱిక మనుభవించియుండలేదు. వలయు సంస్కారములతో వానినెల్ల పునరుద్ధరించుటకు బూనుకొను భారము కళోపాసకులును, విద్యావిశారదులు నగు పండితజనులపై గలదు. ఘూర్జరదేశమం దీకళావ్యాప్తి యెట్లుకలిగెనో విశదీకరించు నీవ్యాసము ఆంధ్రుల సంకల్పసిద్ధికి తోడ్పడు గాకయని కోరుచున్నాను.

“గర్బా” నాట్యము గుజరాత్ కథియవాడు రాష్ట్రములకే ప్రత్యేకముగా చెందినదై యున్నది. దీనిని కనులార తిలకించి, అందలి మంజుగానమును వీనులార నాలకించిననేగాని ఈనాట్యముయొక్క కళాకౌశలము సంపూర్ణముగా విదితముగాజాలదు. రమణీయమగు తాళప్రస్తారము, తదనుసారియగు సులలితమందగమనము మంజులగాన సముపేతమై ఘూర్జర దేశస్త్రీలకీనాట్య మమూల్య శోభను కలుగజేయుచున్నది. ఈ నాట్యవిశేషమును స్వయముగ వీక్షింపనివారి ఉపయోగార్థమై సంగ్రహముగా వివరించుచున్నాము.

వివిధాలంకారభూషితలగు పెక్కండ్రు స్త్రీలు చంద్రాకృతిగ నిలచి, తాళయుక్తముగ పాటలు పాడుచు, తాళమున కనుగుణముగ మందగతుల హృదయానందకరముగ చరింతురు. వీరిలో ముందుగ నొకయువిద ఒక్కొకచరణముగ చెప్పుచుండును. మిగిలినవారందరు దానినే తిరుగబాడుచుందురు. “గర్బా” యందు “సాఖీ” యనుభాగములుగూడ కొన్నిగలవు. “సాఖీ”లను పాడునపుడు వానికి తాళముండదు గావున ఊరకనిలచి పాడెదరేకాని తిరుగుచుండరు. లయప్రస్తారము, అడుగులపొందిక, హస్తసంచలనము, తాళమునకై యొకింత క్రిందికి వంగినపుడు ఇంపగు వీరి శరీరాకృతియు, గానగమనముల సమన్వయమును, వివిధాలంకరణములును–ఇవి యన్నియు నొకచోగలసి నేత్రపర్వమొనర్చుచు ప్రేక్షకజనచిత్తముల నెంతయు కట్టివైచును.

“గర్బా”నాట్యము కడుంగడు ప్రాచీనమైనది. నవరాత్రులందు కాళికాదేవికిని, మిగిలిన దేవతలకును “గార్బో” యనుపాత్రలచే, నారాధన జరుపుటంజేసి దానినుంచి “గర్బా” నాట్యమేర్పడినదని యూహింపవచ్చును. మట్టితో గుండ్రముగా తెల్లనిరంగుగల పాత్రలనుచేసి వానికిచుట్టును సన్ననిరంధ్రములుచేసి పాత్రలలో నేతిచే నొకదీపములను వెలిగింతురు. వీనినే “గర్బో” లందురు. విజయదశమికి నవరాత్రములలో నీపండుగను తమ తమగృహములందు సలుపువారందరు నీవిధముగ ఊరిలోని స్త్రీలనందరను పేరంటమునకువలె “గర్బా” నాట్యమున కాహ్వానింతురు. వీరితో పాటు యింటి యజమానురాలు (గృహిణి) గూడ “గార్బో” పాత్రను తలపైనిడుకొని నాట్యమునందు పాల్గొనును. ఈయాచారము నేటికిని గుజరాతు దేశమున వాడుకయందున్నది. అనగా నవరాత్రములలో కడపటి దినమున అనగా దశమిపండుగకు లోగడరాత్రి, రేయంతయు “గర్బా”లతో జాగరణచేసి, ఉదయమగుటతోడనే దేవత నంపకముచేయుటతో బాటు “గర్బో”లనుగూడ నదిలో విడచివత్తురు. నవరాత్రములందును, గర్బాలు పాడుట కాహ్వానింపబడిన స్త్రీలకందరకును “పాటాసము” లనబడు గుండ్రని చక్కెరబిళ్లలు పంచిపెట్టబడును. ఇప్పుడిపుడు ఈ తినుబండారములను ఇత్తడిపాత్రలలోనుంచి (మనవారు ముత్తయిదువులకు వాయనము లిచ్చునట్లు) యిచ్చుట వాడుకయైనది. ఈవాయనమును “లహాణీ” యనిచెప్పుదురు. ఏయింట నీగర్బాజరుగునో ఆయింటి గృహిణి నవరాత్రములం దొకదినమున తనవంతు దానము లొసంగును. మిగత నెనిమిది దినములందును మిగిలినవారిలో యథాశక్తి ఉభయములను పెట్టుకొందురు. నవరాత్రిదినములందు ప్రతిపట్టణమునను, ప్రతిపల్లెయందును వీథులందన్నిట, యింటింటను నీగర్బాలు వినుపించుచుండును. ఆప్రాంతములో నివసించు స్త్రీలెవరైనను వీనియందు పాల్గొనవచ్చును. పురుషులు వీనిని, చూచి ఆనందింతురు. పూర్వమునుండియు “గర్బా”లందు మామూలుగ ‘ఢోలకు’ (ఉత్తరదేశమందలి మృదంగము) వాయింపబడుచుండెడిది. కాని ప్రస్తుతము హార్మోనియము మొదలైన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవీన వాద్యములుగూడ ఉపయోగింపబడు చున్నవి. సాధారణముగానీ "గర్బాలు" భద్రకాళీ, బహుచరజీ, అంబాజీ మున్నగుదేవతల ప్రీత్యర్థమై కావించెడి ఆరాధనలు. ఇతర ప్రాంతములందువలెనే ఇచ్చట మతమే కళకు ప్రోత్సాహజనకమై యున్నది. నాట్యగానములు, మతవిశ్వాసమును భక్త్యుత్సాహములను ప్రకటించుచుండును. ప్రేమగీతమగు మరొక క్రీడావిశేషము సర్వసాధారణమై యున్నది. దీనియందు ధర్మనిష్ఠమగు భక్తిశీలమును, కావ్యక్రియావిషయికమగు ప్రేమతత్త్వమునకును ఆనందసంధాయకమగు సమన్వయము గుదుర్చబడినది. ఈ భక్తి ప్రపూరితములగు గీతములు సరళమగు చక్కని శైలిగలిగియుండుటచేతను, కేవలము కవిత్వమే ప్రధాన



చిత్రము ౨

కథియవాడు దేశమున "రాస" యను మరొక విధమగు "గర్బా" అధికముగా వాడుకలోనున్నది. బృందావనవిహారియు, నందునిపట్టియునైన గోవిందుడు గోపికలతో సలిపిన రాసక్రీడనుండియే ఈ "రాస" జనించెనని చెప్పవచ్చును. కథియవాడునందు స్త్రీపురుషు లుభయులును పాల్గొనజాలెడి "సంయుక్త రాసక్రీడలు" నేటికిని ఆచారముగా వచ్చుచున్నవి. స్త్రీలకు ప్రత్యేకముగ నెట్లు రాసక్రీడగలదో పురుషులకును ఆదేవిధముగా ప్రత్యేక రాసక్రీడయును గలదు. పురుషులు "దండీ"లనెడి చిరుగంటలు కట్టబడిన చిన్నకర్రలను చేతబూని వానితో తాళమువేయుచు, వలయాకృతిగ తిరుగుచు పాడుచుందురు. ఈక్రీడయందు గానమాధుర్యము కంటెను, వారినటన కౌశలమే ప్రధానముగా మనదృష్టి నాకర్షించును. దేవీ సంబంధమగు "గర్బా" గాక శ్రీకృష్ణుని ముగాలేక సంగీతమున కధికముగా తావొసంగబడియుండుటచేతను ఇయ్యవి, ఆధునికకవులు రచించుచున్న గీతములకంటెను అన్నివిధముల నెక్కువ జనాదరణను బడయుచున్నవి. శ్రీ. మీరాబాయ్, వల్లబ్‌గార్లు రచించిన "గర్బా" గీతములు, శ్రీ. నరసింహ మెహతాగారు రచించిన "రాస" గీతములు చాలా ప్రచారమునం దున్నవి. శ్రీ కృష్ణలీలను వర్ణించు సుప్రసిద్ధ కవిశేఖరులగు దయారాంగారి "గర్బా" గీతము లిప్పటికిని గుజరాతు దేశమున పెక్కుతావుల పాడబడుచునే యున్నవి. పూర్వకాలమునం దీ "గర్బాలు" నోటబాడుచు ఒకరినుండి యొకరు నేర్చుకొనుసాంప్రదాయముగ నేర్పడెనే గాని వ్రాతమూలముగ రాలేదు. ఇటీవల ఆధునికకవులీ "గర్బా"లను వ్రాయగడంగుచున్నారు. వేర్వేరుకాలములం దాయాకవులు రచించిన "గర్బా"లు సేకరింపబడి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముద్రింపబడుచున్నవి. వర్తమాన కవులలో నెక్కుడు ప్రఖ్యాతి వడసినవారు నందలాల్ డి. కవిగారు. వీరి గీతములందు సరసమును, ప్రౌఢమును నగు కవనమేగాక మంజులమగు గానముకూడ నిమిడియున్నది. మరియు వీరు తమగీతముల కేర్పరచిన రాగతాళములు (మట్టులు)మిగుల సులభమై "గర్బా"లకు ప్రత్యేకముగ అను కూలించియున్నది. వేర్వేరు సమయములందు బాడుటకనువగునట్టుల వివిధములగు గీతముల నెన్నింటినో వీరు రచించిరి. వీరుగాక మరియు శ్రీయుతులు, యన్. బి. దివాతియా, ఖబర్దార్, బోతక్కర్, కేశవసేట్, దేసాఖ్జీపార్మర్, త్రిభువనవ్యాస మొదలగువారు పెక్కుమంది 'గర్బా'లను వ్రాయువారు లేకపోలేదు.

కొలది సంవత్సరములుగ, జానపదుల పాటలందును, పల్లెటూరి ప్రజల "గర్బా" గీతములందును ప్రజ లెక్కుడు శ్రద్ధ చూపుచున్నారు; పట్టణములందలి విద్యాధికలగు స్త్రీలుసైతము వానిని బాడుచున్నారు. పల్లెలలో పాటకజనులచే పాడబడెడి గ్రామ్యభావయందు రచింపబడిన ఈ "గర్బా"లు ప్రత్యేక కళాస్వరూపమును కలిగియున్నవి. వీనియందలి కవిత్వమంతటిని లక్షణయుక్తము గాకపోయినను, మధురిమను, సమ్మోహనమును నగు వానిగానము మాత్రము వానికొచ్చట లేనివన్నె దెచ్చుచున్నవి. సహజమగు, అకృత్రిమశైలియందు వ్రాయబడియుండుటచే నియ్యవి చదువుటకంటెను పాడుట కెక్కువ ఆహ్లాదకరముగ నుండును. ఇట్టి అమూల్యమగు పాటకజనుల పదమునను వానియంతట నవి నశింపకుండ పునరుద్ధరించి, విద్యాధికులకు వీనిరమ్యతను ప్రకటించినవారు కథియవాడునందలి రాన్పూరు "సౌరాష్ట్ర"యను గుజరాతి వారపత్రికా సంపాదకీయవర్గమునకు జేరిన శ్రీ జావర్చంద్ మేఘాని గారు. గుజరాతు, కథియవాడునందు నివసించెడిలోధులు, భిల్లులు, ఖావసులు, పెడ్లు మొదలైన వేర్వేరు తెగలవారిలో నీనాట్యము లిప్పటికిని వాడుకయందున్నవి. సామాన్యముగా నవరాత్రములందు దేవీపూజల సందర్భమునందీ "గర్బా"లు జరుపబడుట వాడుకయైనను, క్రమముగా నీయాచారము పేక్షింపబడుచువచ్చెను. కాని గడచిన ౨౦ లేక ౨౫ సంవత్సరములాదగా మరల నీ "గర్బా"లు పునరుద్ధరింపబడి, వినూత్న భావములతో నవీనకళలతో నిర్వచింపబడుచున్నవి. ఒక నవరాత్రి, "పూజా" పండుగలందేకాక జన్మదినోత్సవములు, వివాహములు మొదలైన శుభసమయములందు గూడ మతసంబంధ మెంతమాత్రమును లేకయే విలాసార్థమీ 'గర్బా' నాట్యములు జరుపబడుచున్నవి. అందుచే ప్రస్తుతము గుజరాతు, కథియవాడు దేశములందు సామాన్యముగ పాఠశాలలు, కళాశాలలు,



చిత్రము 3



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సభలు, సమావేశములు, నాటకములు, ప్రదర్శనములు, అన్నిటియందును ఈ నాట్యము ప్రదర్శింపబడుచునే యున్నది. ఆశ్వినమాసాదియందు గుజరాతు దేశమున కరిగినచో దేశమందల్లెడల స్త్రీలీనాట్యమును గావించుట చూడవచ్చును.

ఈగర్బాలం దిటీవల నూతనముగా కొన్ని మార్పులు చేయబడినవి. పూర్వకాలమునందు చేతులు తట్టుచు మాత్రమే తాళమును వేయుచుండెడివారు. ప్రస్తుతము "కలశము"లను వెండిగిన్నెలతోను, "తంబుర" "ఖంజరీ", "మంజీరా", మొదలైనవాని నుపయోగించి మంజులారవములను జనింపజేయు చున్నారు. స్త్రీలు కొన్ని సమయములందు మృణ్మయపాత్రలలో దీపములు వెలిగించి వానితో నాట్యమును సలిపెదరు.

ఈ "గర్బా"లందు "గోఫా"యను మరొక నాట్య విశేషముగలదు. అదియును ఇప్పుడిపుడే పునరుజ్జీవన మును గాంచుచున్నది. ఇందు పాల్గొనెడి స్త్రీలు పాటల పాడుచు, వలయాకారముగ తిరుగుచు పైనుండి వ్రేలాడ గట్టబడియుండెడి త్రాళ్లను జడగా అల్లి, మరల నాజ డను విప్పెదరు. ఇయ్యది జడకోలాటమును బోలియుం డును. ఈనూతన విధానములన్నియు "గర్బా"నాట్యము నకు వింతశోభను సమకూర్చినవి. "గర్బా"లందు నాట్య మున కెక్కుడు ప్రాధాన్యమొసంగబడుచు, క్రమాభి వృద్ధినందుచున్నది. ఇదివరలో లేతరంగులు గల చీరలను ధరించువా రిటీవల కొలది సంవత్సరములనుండి, రాజ పుటానా, కథియవాడు ప్రాంతములందు అద్దింపబడు చున్న చుండారీ, బాంద్ భానీయను చీరల క్రొత్త రకము లెక్కువగా వాడబడుచున్నవి. వీని అంచులపై వెండి, బంగారు జల్తారులచే నందముగా అల్లికవేయబడి యుండును. సామాన్యముగా నీ నాట్యములు రాత్రి వేళలందు జరుపబడుటచే దీపకాంతులముం దీచక్కని, నిండువర్ణములు వింతరంగుల నీనుచుండును. స్త్రీలు తమ పాదముల ధరించు అందియల చిరుమ్రోతలు వారి కోమల కంఠస్వరమునందు మేళవింపబడి వారి గానమును మరింత ఆహ్లాదజనకముగ జేయును. "గర్బా"యందు, వర్ణము, గానము, సొబగు, మాధుర్యము లిమిడియున్నవి. ఇది యొక సుందరమును, సుమనోహరము నగు కళాస్వరూ పము. ప్రజల విజ్ఞానమును, ఆత్మశక్తిని ప్రకటింప గల లలితమగుకళాసాధనము. విద్యాధికులందును, సామా న్యజనులలోను సమధికాదరణమును గలిగియున్నది. వ్యష్టి సమష్టిజీవితానందముల దొకటియై, భరతవర్ష పు కళాసాంప్రదాయములకును, కళాభ్యున్నతికిని మిక్కిలి తోడ్పడుచున్నది."

నీలంరాజు వెంకట శేషయ్య

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# అఖిలభారత మితవాదమహాసభ

కడచిన డిసెంబరునెల 29,30,31, తేదీలలో అఖిల భారతమితవాద మహాసభ పం్రెడెండవ సమావేశము మదరాసునగరమున జరిగినది. ఆసమావేశము నలంకరించిన పెద్దలలో శ్రీయుతులు శ్రీనివాసశాస్త్రి, సప్రూ, సెతల్వాడ్ శివస్వామిఅయ్యర్, చింతామణి, రామచంద్రరావు మున్నగు ప్రముఖులు గలరు.

మొత్తము ప్రతినిధులందరును గలిసి ౨౦౧ మంది యుండురు. పెద్దలలో రంగనాథముదలి, జతీంద్రనాథవసు మున్నగు నే యిద్దరుముగ్గురో తప్ప మిగిలినవారందరును నూల్లతోనే సభాభవనము నలంకరించిరి. ఇది మిక్కిలి విచారకరమగు సంగతి. విదేశవస్తువులను, విదేశవస్త్రములను ఉపయోగించుట నష్టమైనచో-బహుశః మితవాదులీ సిద్ధాంతము నొప్పుకొనరు-విదేశీయమగు జీవిత విధానము ననుసరించుట అంతకుమించిన నష్టము. మొదటిది కేవలము భౌతికము: విదేశవస్తువులను దీసి పారవైచుట సాధ్యము. కాని రెండవది ఆచరణము మానవుని జీవితమును శాసింపదగిన మానసికస్వాతంత్ర్యమునకు సంబంధించినది. మొదటిది భౌతికదాస్యము, రెండవది నైతికదాస్యము. భౌతికదాస్యముకన్న నైతికదాస్యము నూరురెట్లు భయంకరము. మనము ఆంగ్లదేశమున, ఆంగ్లేయుల సంఘములో, నిరంతరము జరుగుచుండు నవసరములలో వారి వేషభాషలనే పూర్తిగ స్వీకరించుట యవసరమైన నగుగాక. కాని భారతదేశములో, భారతీయులనడుమ, భారత జాతీయతను చాటుచు, భారతీయుల స్వాతంత్ర్యపరత్వము ను ఢంకాబ్రమోగించి ప్రపంచమునకు బ్రకటింపవలసిన యిట్టిసందర్భములలో యువకులకు మార్గదర్శకులుగ నుండవలసిన పెద్దలు భౌతికముగ, నైతికముగ విదేశీయదాస్యమునే ప్రకటించుకొనుటకు సంసిద్ధపడినచో ప్రపంచము మనలను ఏదృష్టిలో గ్రహించునో ధీమంతు లూహించుకొందురు గాక. ఐన నిది అధ్యక్షులు, ఆహ్వాన సంఘాధ్యక్షులు, తమ యుపన్యాసములలో సూచించిన మితవాదుల 'ఆధునిక నాగరకతావిశ్వాసము'నకు 'ఆధునికవిజ్ఞానవిశ్వాసము'నకు నిదర్శనమైనచో, నది మిక్కిలి శోచనీయ మగునవస్థ.

సహజముగ, సమావేశము మూడుదినములలోను, చాలభాగము నాక్రమించినవి, తీరుమానముల వరుసలో గూడ చాలభాగము నాక్రమించినవి (తీరుమానములువ్యాసము చివరనీయబడినవి.) లండన్ సభనుగూర్చిన నిర్ణయములు. ఇవికాక మరిరెండుపెద్ద తీరుమానములు గలవు. అందొకటి తూర్పుఆఫ్రికా భారతీయులకు సంబంధించినది. రెండవది స్వదేశసంస్థానములకు జెందిన తీరుమానము. ఇదియు చాలభాగము ఏదోవిధముగ లండన్ సభకు సంబంధించినదే. ఈసందర్భమున గమనింపవలసిన యంశ మొకటి కలదు: సంస్థానములసమస్య మిక్కిలి క్లిష్టమైనది. సాంఘికసమస్యతో బాటుగ హిందూదేశపు స్వరాజ్యప్రాప్తికి నిరంతరముగ నడ్డు దగులుచున్న ప్రబలనిరోధములలో ప్రధానమైన దిది. ఇట్టి ప్రధానాంశమునకు సంబంధించిన తీరుమానము, చర్చకుపాలగుట కనట భేదాభిప్రాయమే లేకపోయినను, అగమపక్షము, నాయకుల వ్యాఖ్యానము నక్కైన పూర్తిగ తప్పియుండెను. ఇట్లయ్యు, సప్రూ, చింతామణి, రామచంద్రరావు మున్నగు ప్రముఖులు, విషయము బాగుగ దెలిసిన నాయకు, లచటనుండియు దానిని రవ్వంతయు వివరించి చెప్పకపోయిరి. మామూలు ప్రతినిధులకిది యొక గొప్పనష్టము. ఇంక ఉపన్యాసముల నాక్రమించినది ఇర్విన్ ప్రకటనము ఈయుపన్యాసములలో గూడ చాలభాగము కాంగ్రెసును దూషించుటతో ముగిసినది.

అధ్యక్షులగు శ్రీయుత ఫిరోజ్ సెత్నా గారు చెప్పినట్లు ఈప్రముఖులలో చాలమంది, ఇంతకుముందు, ఏదో ఒకవిధముగ ప్రభుత్వాంగముతో ప్రత్యక్షసంబంధము గలిగియుండినవారు. శ్రీయుత శ్రీనివాసశాస్త్రిగారు సెలవిచ్చినట్లు ఇప్పటి పరిస్థితుల క్లిష్టత్వము అసాధారణము; సాటిలేనిది. ఇట్టియీ సందర్భమున మితవాదులు తమబాధ్యత నెంతవరకు నిర్వహించినదియు తెలిసికొనుట అవసరము.

# ప్రతివాదిభయంకర రంగాచార్యులుగారు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మితవాదుల కార్యక్రమమునుగూర్చి సమాలోచించు నపుడు మనము రెండు సంగతులను మాత్రము గట్టిగ జ్ఞాపకముంచుకొనవలయును. మొదటిది అధినివేశప్రతిపత్తి (Dominion Status); రెండవది శాసనబద్ధమైన ఆందోళనము. మొదటిది ఆదర్శము; రెండవది ఆదర్శమార్గము, అధినివేశప్రతిపత్తితప్ప భారతదేశమునకు ఆశపడదగిన రాజకీయౌన్నత్యము వారిదృష్టికి కనబడదు; వారియభిప్రాయము ప్రకారము ఆంగ్లభారతదేశముల యీస్నేహము, బ్రిటిషుసామ్రాజ్యముతోడి సంబంధము భారతీయుల మహాభాగ్యమువలన లభించినవి. ఇట్టియీ సంబంధమును వదలుకొనుట యాత్మద్రోహము. మనము గట్టిగ వాదించినచో ఇంగ్లీషువారు మనకు అధినివేశప్రతిపత్తి నిచ్చితీరెదరు. అందుచేత ఈఅధినివేశ ప్రతిపత్తిని సంపాదించుటకు గూడ మనకున్నది ఒక్కటేసాధనము. అది శాసనబద్ధమగు నాందోళనము. ఐనఁ; శాసనబద్ధము అనుపదమున కర్థముమాత్రమింతవరకెవరును స్పష్టముగ వివరింపలేదు. మితవాదుల యభిప్రాయము ననుసరించి ప్రభుత్వములో పదవుల నంగీకరించుట మొదలు సైమనుకమిషను బహిష్కారము వరకు శాసనబద్ధమగు విధానము; కాని గాంధిమహాత్ముని ఆసహాయోద్యమము మాత్రము ట్లుకాదు! ఎట్లయిననేమి, మనకిప్పట కావలసినది మితవాదుల ఆశయము; దానిసాధనము. ఆసహాయోద్యమము శాసనబద్ధమా కాదా యను చర్చ యిచట ననవసరము. పైన జెప్పినట్లు వారియాశయము బ్రిటిషు సామ్రాజ్యమునకు లోబడిన స్వాతంత్ర్యము; దానికిసాధనము శాసనబద్ధమయిన ఆందోళనము. ఈరెంటిపై నాధారపడియే నేటివరకు వారికార్యక్రమము నడిచినది. దీని ననుసరించియే మొన్నటి పండ్రెండవ మితవాద మహాసభ కార్యక్రమము గూడ సాగినది. అధ్యక్షుని యొక్కయు, ఆహ్వానసంఘాధ్యక్షునియొక్కయు నుపన్యాసములును, సభవారి తీరుమానములును పైసంగతులను స్పష్టముగ జాటినవి.

"అధినివేశప్రతిపత్తి మనకీయరాదని ఇంగ్లండుదేశము తలచినను ఈయకతప్పదు; అట్లీయకుండుట సాధ్యమైనను, అట్టికోరిక ఇంగ్లండునకు ఉండదు. ఇది మాగట్టినమ్మకము. కావుననే మాలక్ష్యము అధినివేశప్రపత్తి." (అధ్యక్షుడు: సర్ సెతల్వాడు)

"కావున, బ్రిటిషు సామ్రాజ్యాంతర్గతమైన, సంపూర్ణమగు స్వాతంత్ర్యము మాపక్షముయొక్క ఆశయముగ నున్నంతకాలము, వాదములు, శాసనబద్ధమగుప్రతిఘటనము (Constitutional Oppositoni), శాసనబద్ధమగు సహకారము (Constitutional Co-operation) పై యాశయమునకు సాధనములుగ నున్నంతకాలము మాపక్షముయొక్క కాని, దేశముయొక్కగాని భవిష్యత్తును గూర్చి మేము భయపడవలసిన యవసరమేమియు లేదు."

(ఆ. సం అధ్యక్షులు: సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు.)

వీరిరువురి ఉపన్యాసములను హిందూదేశము నేడే అధినివేశప్రతిపత్తికి తగియున్నదని నిర్ధారించు ప్రబలవాదములు. రామస్వామి అయ్యరుగారు తమరాజకీయ పరిజ్ఞానము నంతను వినియోగించి, ఏదేశములోనైనను రాజకీయ స్వాతంత్ర్యము వచ్చినమీదటనే యభివృద్ధి సాధ్యమైనదని చక్కగ నిరూపించిరి. సెతల్వాడుగారు తమ ఉపన్యాసమున చాలభాగము ఇర్విన్ప్రభువుగారి 'రౌండ్ టేబుల్ సమావేశమును' గూర్చిన ప్రకటన భారతీయు లంగీకరించి తీరవలయునను వాదమునకు వినియోగించిరి. వారి యభిప్రాయము ప్రకారము దాని నంగీకరింపకున్నచో "హిందూదేశము మిక్కిలి గొప్ప తప్పు చేసిన దగును." కాని, ౧౯౧౯ సం. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టముయొక్క * ఉపోద్ఘాతము లోని యంశములలో మార్పేమియు నుండదని పార్లమెంటులో ప్రభుత్వము ప్రకటించినదికదా. అట్టిచో మన సహకారమున కవకాశమెక్కడ? అనుసందేహము ప్రజల

* హిందూదేశమునకు బాధ్యతాయుత ప్రభుత్వము, ఒక్కసారిగగాక, క్రమక్రమముగ నొసంగబడుననుటయు, ఇట్లు క్రమముగ నెప్పుడెప్పుడెంతెంతయభివృద్ధిని పొందవలయునో ఆ పరిమాణమును నిర్ణయించు నధికారము పార్లమెంటుకే కలదనుటయు ఈ యుపోద్ఘాతముయొక్క సారాంశము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఆకస్మిక ఛాయా చిత్రములు



3. సంతృప్తి
(మొదటి బహుమానము) ౧-౩ శ్రీయుత యం. కె. రంగస్వామి అయ్యంగారి చిత్రములు.



౪. కణ్వానదీస్నానఘట్టము-అంగరవద్ద
(మూడవ బహుమానము) శ్రీయుత యం. నాగేశ్వరరావుగారి చిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౫. 'మల్లేలమ్మా మల్లేలు యీ తల్లీ సత్యం చూడండో' !
శ్రీయుత కె. ఆర్. రాజరత్నముగారి చిత్రము.



౬. సముద్రప్రాంత ప్రకృతి-విశాఖపట్టణం
(రెండవ బహుమానము)
శ్రీయుత వి. తెన్నేటిగారి చిత్రము.

కుండవచ్చును. ఐన నట్టిసందేహమును పారద్రోల వలయు నని వారి యభిప్రాయము. వారు తలచినట్లు సందేహము లేకుండ చేసికొనుటకు దగు ప్రబలకారణము లేవియు లేకున్నను, ఆయనుమానము ప్రబలుటకే తగుకారణము లగపడుచున్నను, మనము వైస్రాయిగారి యాహ్వానము నంగీకరించియే తీరవలయును. ఇందుకు వారికిగల కారణ మొక్కటియే వారికే కాదు, మితవాదులందరికి గూడ ప్రకటనము నంగీకరించుట కదియే కారణము. "ప్రస్తుత స్థితిగతులలో అనిర్బంధములు, ఆపగతులు ఉండకాని వాగ్దాన మొనర్చుటకు ప్రభుత్వమునకు కేవలము అసాధ్య మైపోయినది. కాని అంతమాత్రముననే పార్లమెంటు అవసరమైనచో, వానిని తొలగించనని భావింపకూడదు" అని వారి వాదము. ఇట్లు మనమందరము నమ్ముచుండ, మితవాదులు నమ్ముచున్నారు గదా యన్నదితప్ప మరి యొక కారణ మేదియు గానరాదు.

ఎట్లయిన నేమి, వైస్రాయిగారి యాహ్వానము ననుసరించి, లండనులో జరుగబోవు సభ రౌండ్ టేబిల్ సమావేశమనియు, నచ్చట చర్చింపబడు విషయము అధినివేశప్రతిపత్తివిధానమే యనియు ఒకనమ్మకము దేశము లోని రాజకీయనాయకులను, చాలమంది, నావహించినది. కాంగ్రెసులోనే చాలమంది యట్లు తలచువా రున్నప్పుడు మితవాదులమాట యింక చెప్పవలసిన దేమి? మొత్తము మీద నీగడబిడ, యీతొందర చాలవిచిత్రముగ మాత్ర మున్నది. ఇర్విన్‌గారి ప్రకటనములో నెచ్చటను, రౌండ్ టేబిల్ సమావేశము అనుమాట లేదు. ప్రతిపత్తినిర్ణయమునుగూర్చిన వాగ్దానముగాని, సూచనగాని యెందును గానబడదు. సభనుగూర్చి ప్రకటనమున నిట్లున్నది: "అందుచే, సైమను కమిషనువారున్న, సెంట్రల్ కమిటీ వారును తమనిర్ణయములను ప్రకటించిన తరువాతను, బ్రిటిషుప్రభుత్వమువారికి, ఇండియాప్రభుత్వముతో సంప్రతించి, ఉన్న సాత్త్వ్యమునుబట్టి పైనిర్ణయములను సమాలోచించుటకు అవకాశము గలిగినమీదటను, వారు (బ్రిటిషుప్రభుత్వమువారు) బ్రిటిషు ఇండియాప్రతినిధులను, స్వదేశసంస్థానముల ప్రతినిధులను ఆయాసందర్భములనుబట్టి, కలిసికాని, లేక వేరువేరుగాగాని తమ్ము గలిసికొని, భారతదేశసమస్యలనుగూర్చిన సమాలోచనము సాగించుటకై యాహ్వానించెదరు. ఈపద్ధతివలన ఈక్లిష్టసమస్యలపై, సాధారణముగ, నేకీభావముతో గూడుకొన్న నిర్ణయములను పార్లమెంటువారియెదుట నుంచుటకు వీలగునని వారియాశ."

ఇందెచ్చటను రౌండ్ టేబిల్ అనుపదము రాలేదు. 'సమాలోచనములను సాగించుటకై' అన్నచోటమాత్రము (For the puruose of Conference and discussion) అనుమాటలుపయోగింపబడినవి. ఇందలి కాన్ఫరెన్సు (Conference) అనుపదమే 'రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు' తీర్మానముల కాధారమై యుండవచ్చును.

ఇంక, అధినివేశప్రతిపత్తిని గూర్చి యిట్లుకలదు:

"...కాలపరిపక్వతనుబట్టి హిందూదేశము సామ్రాజ్యములోని తక్కిన డొమినియనులతో సమానమగు ప్రతిపత్తిని బడయుటయే బ్రిటిషు ప్రభుత్వమువారి కోరిక యని బ్రిటిషు మంత్రులు పెక్కుసారులు బహిరంగముగ ప్రకటించియే యున్నారు. కాని ౧౯౧౯వ సంవత్సరపు చట్టమును అమలుపరచుటలో ప్రభుత్వమువారికిగల యభిప్రాయములనుగూర్చి హిందూదేశములోను, ఇంగ్లండులోనుగూడ సందేహములు కలిగినవి. అందుచేత, ౧౯౧౭వ సం॥పు ప్రకటన ప్రకారము, హిందూదేశముయొక్క శాసనబద్ధమైన అభివృద్ధికి సహజలక్ష్యము అధినివేశప్రతిపత్తియేయను సంగతి దానిలోనే గర్భితమైయున్నదని స్పష్టముగ బ్రకటించుటకు బ్రిటిషు ప్రభుత్వమువారు, తమపక్షమున, నన్ను నియోగించి యున్నారు."

కాలము పరిపక్వమైనప్పుడు డొమినియన్ ప్రతిపత్తిని అనుభవించుటను గూర్చియు, మనరాజకీయాభివృద్ధికి సహజమైన లక్ష్యము డొమినియన్‌ప్రతిపత్తి యనుటనుగూర్చియు ప్రభుత్వముగాని, దానికి సంబంధించిన యేవ్యక్తిగాని, యెన్నడును, ప్రతికూలాభిప్రాయము బ్రకటించియుండలేదు. నెహ్రూరిపోర్టులో ఇంచుమించు సగముభాగ మాక్రమించిన సర్ మాల్కం హెయిలీగారు

గూడ పైసంగతిని ప్రసిద్ధమగు తమ * ఉపన్యాసములో ఒప్పుకొనియేయున్నారు. ఇట్టిచో, మనకు కావలసినది లక్ష్యము డొమినియన్ పదవియే యను నధికారినిర్ణయము కాదు. ౧౯౧౯ సం॥ చట్టముప్రకారము హిందూదేశపు డొమినియను ప్రతిపత్తికి కాలము పరిపక్వమైనదా లేదా యని నిర్ణయంచు నధికారము పూర్తిగ బ్రిటిషుపార్లమెంటు చేతిలో నున్నది. ఆయధికారమును లాగికొనుట యే మన మిప్పుడు చేయవలసినపని. ఆయధికారమును సంపాదించుటయే మనకు గావలసినది. ఇట్టిమార్పునకు అవకాశమిచ్చునప్పుడే వైస్రాయి గారి లండన్ సభ, రౌండ్ టేబుల్ సమావేశ మగును. కాని యిట్టి యధికారపరివర్తనమును గూర్చిన సూచన రవ్వంతయు ప్రకటనలో గన్పింపదు. కాబట్టియే గాంధిమహాత్ముడు ౨౩ డిసెంబరు నాటి ఢిల్లీసమావేశమున 'సభసమావేశము డొమినియన్ ప్రతిపత్తిని నిర్ణయించుటకే' యని ప్రభుత్వమువారు వాగ్దానము నీయవలయునని పట్టుబట్టినాడు. లండన్ సభకు రౌండ్ టేబుల్ తత్వమును సమకూర్చుటయే దీని యభిప్రాయము. మరియు, మితవాదులకైనను డొమినియన్ ప్రతిపత్తి వెంటనే కావలయును. ఎన్నడో కాలము పరిపక్వము కావలెనను నభిప్రాయమునువా రంగీకరింపరు. ఈవిషయమున సెత్నాగారు తమయభిప్రాయము నిట్లు వెల్లడించినారు.

"వెంటనే అధినివేశప్రతిపత్తిని స్థాపించుటను గూర్చిన సమస్య చర్చనీయాంశములనుండి తొలగింపబడినచో, మేముసభలో (లండన్ సభలో) పాల్గొనుట కంగీకరింపజాలము."

(అధ్యక్షోపన్యాసము.)

లండన్ సభయందు పాల్గొనవలయునను తీరుమానము నుపపాదించుచు, సప్రూగారిట్లు చెప్పిరి.

"డొమినియన్ ప్రతిపత్తి సిద్ధాంతమునకును, దాని తత్క్షణ ప్రాప్తికిని సంబంధించినంతవరకు మితవాదులు ఇచ్చటగాని, దేశమునగాని ఉత్తమమగు పోరాటము సాగించెదరు."

ఈవిధముగ, లిబరల్ పక్షమువారికి గావలసినది, వెంటనే డొమినియన్ ప్రతిపత్తిని స్థాపించుటయే. ఇంతకన్న తక్కువ వారికైనను అక్కరలేదు. కాంగ్రెసు కూడ దానితో తృప్తిజెందును. అ. ప. సభవారిచే నామోదింపబడిన నెహ్రూరిపోర్టుకూడ దాని నంగీకరించుచునే యున్నది.—నెహ్రూరిపోర్టును మితవాదులు సంపూర్ణముగ నామోదించియుండిరి. ఇంతయైనను, వైస్రాయిగారి ప్రకటనము పైసంగతినిగూర్చి మౌనముదాల్చినది. తుది నిర్ణయము జేయు నధికారమును పార్లమెంటుకే యిచ్చినది. "ఈసందర్భమున ప్రతి బ్రిటిషుపక్షమునకును తన యిష్టమువచ్చినట్లు ప్రవర్తించుటకు సంపూర్ణముగ నధికారము గలదు" అని కూడ చెప్పుచున్నది.

ఈవిధముగ, నెట్లుచూచినను, వైస్రాయిగారి లండన్ సభలో రౌండ్ టేబుల్ తత్వము రవ్వంతయు కనబడక పోయినను, ఈలోపము తెలిసియుండియు, బ్రిటిషుప్రభుత్వమువారు, బుద్ధిపూర్వకముగ, దానిని సవరించుకొనుట మానివైచినను, ఇచ్చటి రాజకీయపక్షములన్నియు నేకగ్రీవముగ న ం గీ క రి ం చి న డొమినియన్ ప్రతిపత్తికి లండన్ సభతో నె ట్టి స ం బ ం ధ ము లేకపోయినను, అ ం తి యే కా క, దానినితిరస్కరించు సూచనలు ఎన్నియో స్పష్టము గ గనబడుచున్నను, లిబరల్ పక్షమువారు వైస్రాయిగారియాహ్వానము నంగీకరింపవలయునని తీర్మానించిరి. మూడుదినములు కాంగ్రెసును దూషించుటతో కాలక్షేపముచేసిరి. పైపెచ్చు, కాంగ్రెసువారు కల్పించుదుఃస్థితినుండి దేశమును రక్షించుట తమ విధి యని తమ

* ఇది 1924 సం॥లో సర్ మాల్కం హెయిలీగారు హోం మెంబరుగ నున్నప్పుడు భారతశాసనసభలో నొసంగిన యుపన్యాసము. ఇందు వారు, 1917 సం॥నాటి ప్రకటనలో సూచింపబడిన బాధ్యతాయుతప్రభుత్వము డొమినియన్ ప్రతిపత్తి కాదనియు, బ్రిటిషు రాజ్యాంగవేత్తలు ఆలోచించి బుద్ధిపూర్వకముగనే అప్పుడామాట నుపయోగించిరనియు జెప్పిరి. ఇచ్చటి రాజకీయనాయకులు మాత్రము అది డొమినియను ప్రతిపత్తియేయని తలచుచుండిరి. అందుచేత హెయిలీగారి వ్యాఖ్యానము వారిని కలవరపరిచినది. తమవాదమును సమర్థించుకొనుచు నారీవిషయమును నెహ్రూరిపోర్టులో చాలదూరము చర్చించియున్నారు.

కరుణామయత్వము ప్రకటించి, యొకవిధముగ, నిటుపై నవతరింపబోవు ప్రభుత్వమువారి నిర్బంధవిధానమునకు ఆహ్వాన మంపిరి. వింటర్టన్ ప్రభువులకు, ఓడ్వయర్లకు ప్రోత్సాహమొసంగిరి.

ఇంగ్లీషుపత్రికలు, ఆంగ్లోఇండియన్ పత్రికలు నప్పుడే నిర్బంధవిధానమును ప్రోత్సహించు చున్నవి. భారతదేశపు శత్రువులు భారతీయనాయకుల నిర్బంధ మును సూచింప మొదలిడినారు.

టైమ్సుపత్రిక ప్రతినిధి డిల్లీనుండి యిట్లువ్రా యుచున్నాడు.

"న్యాయశాసనము నమలుజరుపుటతో ఇండి యాప్రభుత్వమువారి నూతనవత్సర మారంభించును. హిం సాపద్ధతులకు, మామూలు నేరములకు, సమిష్టిశాసనోల్లం ఘనమునకు జెందిన సంస్థలకునేగాక, ప్రజలను నేరము లకు బురికొల్పు ఉపన్యాసములకు గూడ నీశాసనము వర్తించును."

వింటర్టనుప్రభువు గాంధిమహాత్ముని నిర్బంధ మును సూచించుచున్నాడు.

ఇట్టివ్రాతలకు, సూచనలకు మితవాదుల యాశాం తిరక్షణ బాధ్యతలు, విధులు' నెట్లు దోహద మొసంగునో తమ ప్రతికూలప్రచారము ఈపద్ధతిని సాగినచో, దేశమే స్థితికి వచ్చునో, 'బాధ్యతలను' ప్రకటించు సెతల్వాడ్, సెత్నా మున్నగు మితవాదనాయకులు, కొంచె మూహిం చుకొనియున్న బాగుండెడిది. ఈసందర్భమున, ఆహ్వాన సంఘాధ్యక్షులగు రామస్వామి అయ్యరుగారు తమ యుప న్యాసమున జెప్పినమాటలు గమనింపదగినవి. "మరియు, ప్రజాక్షేమమునకై, స్వార్థత్యాగులు, నిష్కల్మష దేశభ క్తులనను వారిచే నడిపింపబడినదియు, ఇంచుమించుగ మా పక్షసభ్యులందరిచే ననుసరింపబడినదియు నగు భారతదే శీయమహాసభవంటి మహాసంస్థల పలుకుబడిని క్షీణింప జేయగోరువా రెవ్వరు నుండరు."

మితవాదనాయకులు పైవాక్యమున గర్భితమై యున్న భావమును పూర్తిగ బోధపరుచుకొనుట యుక్తము. రామస్వామి అయ్యరుగారు తమ యీయభిప్రా యమును పూర్తిగ నమలుపరిచెదరనియే, తోడి మితవా దులచే అమలుపరిపించెదరనియే నమ్మెదము.

## తీరుమానములు

౧. వైస్రాయిగారిరైలుబండిని భగ్నముచేయుటకై కావింపబడిన క్రూరప్రయత్నమును తీవ్రముగఖండిం చుచు, భగవదనుగ్రహమున, వైస్రాయిగారును, వారి భార్యయు సపరివారముగ తప్పించుకొన్నందుకు వారి నీసభవారభినందించుచున్నారు. భారతీయులజీవితమునకు, విజ్ఞానమునకు పూర్తిగ విరుద్ధమైన యీ నేరము హేయమని యీసభవారు నిర్ణయించుచున్నారు.

ఈతీరుమానమును టెలిగ్రాముద్వారా వైస్రా యిగారి కందజేయుటకు ఈసభవా రధ్యక్షున కధికారమి చ్చుచున్నారు.

౨. మితవాదపక్షసభ్యులలో ప్రముఖులుగ నుండిన శ్రీయుత నారాయణవిష్ణుగోఖలే, సర్ గంగాధరచిట్ను వీస్, గోకర్ణనాథ మిశ్రా గారల మరణమువలన దేశమునకు గలిగిననష్టమును ఈసభవారు గుర్తించుచున్నారు.

3. 1929 సం॥ అక్టోబరు 31 తేదీనాడు వైస్రాయి గారు గావించినప్రకటన, 1917 సం. పు ప్రకటన ప్రకా రము, భారతదేశమునకు రావలసినది డొమినియన్ ప్రతిపత్తి యే యని సాధికారముగ స్థిరపరచుచున్నది; బ్రిటిష్ఇండి యాయును, స్వదేశసంస్థానములును గలిసి ఏకమై యుండ వలయు ననుటను స్పష్టముగ నంగీకరించు చున్నది; రాబో వురాజ్యాంగవిధానము ననుసరించి తాను బ్రిటిషుప్రభు త్వముతో సమానప్రతిపత్తిని గలిగియుండవలయు నను భారతదేశపు హక్కును ఒప్పుకొనుచున్నది. అందుచేత ఇండియన్ నేషనల్ లిబరల్ ఫెడరేషన్ వారు పైప్రకటన మునకు హృదయపూర్వకముగ స్వాగతమొసంగుచున్నారు.

మరియు, పైప్రకటనలో సూచింపబడిన సభయందు లిబరల్పక్షము పాల్గొనవలయునని యీసభవారు నిర్ణ యించుచున్నారు. ౧౯౩౦వ సంవత్సరములో, సాధ్యమై నంత శీఘ్రముగ, రౌండ్ టేబల్ సభ సమావేశము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జరుగవలెననియు, దేశములోని అభివృద్ధిపరములగు నభిప్రాయముల కంటె ఎక్కువ ప్రాతినిధ్య ముండవలయునని యీసభవారు గట్టిగ హెచ్చరించుచున్నారు.

౪. ఈనడుమ వెలువడిన వైస్రాయిగారి ప్రకటనము హృదయపూర్వకముగ నంగీకరించుచు, అది వెంటనే సంపూర్ణముగ, ఫలవంతమగునట్లు చేయుటకు సిద్ధముగనున్న పక్షములన్నియు నేకమై * పరివర్తనకాలమునకు సరిపడు మినహాయింపులతో కూడుకొని, డొమినియన్ ప్రతిపత్తిపై నాధారపడియుండు నొక రాజ్యాంగప్రణాళికను తయారుజేయవలయునని యీసభవారు హెచ్చరించుచున్నారు.

౫. (క) వైస్రాయిగారి ప్రకటనమును ప్రముఖులగు భారతీయ సంస్థానాధిపతు లంగీకరించినందుకు సంతృప్తి దెలుపుచు, ఇటుపై డొమినియన్ ప్రతిపత్తిమీద నాధారపడియుండు భారతదేశముయొక్క ఏప్రభుత్వవిధానము నందైనను, సంస్థానముల ఆంతరిక స్వాతంత్ర్యమునకు జెందిన వారిహక్కులును, విధులును కొనసాగునట్లు తగు హామీ ఉండవలయుననుసంగతి ఈసభవారు అంగీకరించుచున్నారు.

(ఖ) సంస్థానాధీశులు బ్రిటిష్ఇండియాలో అమలునందున్న పరిపాలనపద్ధతులతో సమానముగనుండునట్లు తమతమ సంస్థానములలోని పరిపాలనవిధానమును తామే సవరింతురని యీసభవారు నమ్ముచున్నారు.

౬. యూరపియన్ సంఘపు ప్రతినిధుల సంఖ్యను ఎక్కువజేయుటకుగాను సర్ విల్సన్ సామ్యూల్ గారి నివేదికలో సూచింపబడిన సలహా కెన్యాలోని దేశీయప్రజలకును, భారతీయులకును ఎక్కువనష్టము గలిగించునని యీసభవారు అభిప్రాయ పడుచున్నారు. సామాన్య నియోజక వర్గములలో (Common Electorate), సామాన్య నియోజనధికారము (Common Franchise) ప్రకారము, తగురీతిని, ప్రాతినిధ్యము వహించుటకు అప్పటి దేశీయప్రజలు అర్హులగువరకు, తూర్పు ఆఫ్రికా కాలనీలలో నెచ్చటను రాజ్యాంగవిధానమున పైమెట్టుకు అంగీకార మీయబడరాదని యీసభవారి దృఢవిశ్వాసము. అందుచేత, ప్రస్తుతమున్న ప్రత్యేకనియోజకవర్గములకు బదులుగ, సామాన్య నియోజకవర్గములను స్థాపింపవలయునను హిల్టన్‌యంగ్ కమిషనువారి సలహా నంగీకరించుచు, భారతీయుల సౌఖ్యమునకేకాక, మొత్తముమీద, కాలనీ అంతటి సౌఖ్యమునకుగాను, సామాన్య నియోజకవర్గమును స్థాపించుటకై విచారణ కొనసాగింపవలయునని యీసభవారు సామ్రాజ్యప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౭. ఈసభవారు ౧౯౩౦ సం॥నకు సర్ సి. పి. రామస్వామి అయ్యర్ క. సి. ఐ. ఇ; ఆనరబుల్ రావు బహద్దరు జి. ఏ. నటేశన్ గార్లను ఇండియన్ నేషనల్ లిబరల్ ఫెడరేషనుకు సంయుక్త కార్యదర్శులుగ నియమించుచున్నారు.

౮. ప్రస్తుతస్థితిగతులను బాగుపరచుటకై తగు చర్య దీసికొనవలయుననియు, తమ కార్యక్రమమును శీఘ్రము ముగింపవలయుననియు విట్లేకమిషనువారిని ప్రభుత్వమువారు కోరవలయునని యీ సభవారు నిర్ణయించుచున్నారు.

౯. సాక్ష్యమునంతను ప్రోగుచేసి డొమినియన్ ప్రతిపత్తికి గావలసిన వాదమును తయారుచేయుటకు ఈసభవా రొకసంఘమును నియమించుచున్నారు. దానికివలయు ద్రవ్యమును సంస్థకుజెందిన నిధినుండి తీసి వ్యయపరచుటకు అధ్యక్షుని కధికార మొసంగుచున్నారు.

సంఘసభ్యుల పేర్లు

౧. సర్. పి. యస్. శివస్వామిఅయ్యర్
౨. సర్. సి. పి. రామస్వామి అయ్యర్
౩. దివాన్‌బహద్దరు, టి. రంగాచార్యర్
౪. సి. వై. చింతామణి.
౫. సర్, మోరోపంత్ జోషీ
౬. సర్. చిమన్లాల్ సెతల్వాడ్.
౭. సర్. శంకరరావు చిట్నవీస్
౮. సర్. టెజ్ బహాదూర్ సప్రూ (సమావేశకర్త)

* కాని యీ పరివర్తనకాలముయొక్క పరిమితినినిర్ణయించు నధికార మెవ్వరిది? బ్రిటిషువారిదా? భారతీయులదా!

# నలువదినాలుగవ అఖిలభారత జాతీయమహాసభ, లాహోరు.

## తీర్మానములు

౧

భారత కాంగ్రెసుస్థాయిసంఘమునకు వెనుక కార్యదర్శిగా నుండిన పండిత గోకర్ణనాథ మిశ్రీగారు, ప్రొఫెసరు బి. ఎం. పరంజపిగారును శ్రీయుత పి. భక్తవత్సల నాయుడుగారును, రోహిణీ కాంతగారును, ఆర్. కె. లాహిరీగారును, బి. చక్రవర్తిగారును దివంగతులైనందుల కీ మహాసభవారు సంతాపమును వెల్లడించుచున్నారు.

౨

జతీంద్రనాథ విజయులు గావించిన మహాత్యాగము నీసభవా రభినందించుచు వారికుటుంబమునకు సానుభూతి తెల్పుచున్నారు. మరియు భారతదేశమున గల విదేశీయ ప్రభుత్వమే వీరిట్టియాత్మ సమర్పణ కావించుటకు కారణమని అభిప్రాయ పడుచున్నారు.

౩

ఈ సభవారు వయిస్రాయి బండిమీద గావింపబడిన బాంబు ప్రయోగమును నిరసించుచు, ఇట్టి చర్యలు కాంగ్రెసు సిద్ధాంతమునకు వ్యతిరేకమనియు, జాతీయ సమరమునకు నష్టకరమనియు తమకు గల యభిప్రాయమును తిరుగ దృఢపరచుచున్నారు. మరియు దైవవశమున ఇర్విన్ దంపతులు, వారిపరివారము ప్రాణోపద్రవము లేకుండ తప్పించుకొనగలిగినందులకు వారి నభినందించుచున్నారు.

౪

ఈ సభవారు అక్టోబరు ౩౧ వ తేదీని రాజప్రతినిధి గావించిన ప్రకటన సందర్భమునులో కాంగ్రెసువాదులతో సహా వివిధ పక్ష నాయకులు సంతకములు చేసి గావించిన ప్రకటన విషయమై కాంగ్రెసువారు గావించిన చర్య ననుమతించుచు, స్వరాజ్యమునకై గావింపబడుచున్న జాతీయోద్యమమును రాజీగా పరిష్కరించుటకై వయిస్రాయిపడిన శ్రమ కభినందించుచున్నారు. మోతీలాల్ నెహ్రూమున్నగు నాయకులు వయిస్రాయితో సంప్రతించుటవలన కలిగిన ఫలితముల గమనించి ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొని లాభములేదని యీసభవారు తలంచుచున్నారు.

మరియు, గత సంవత్సరము కలకత్తా కాంగ్రెసులో గావింపబడిన తీర్మానము ననుసరించి ఈ కాంగ్రెసువారిపుడు కాంగ్రెసు ఆదర్శమందలి 'స్వరాజ్య' పదమునకు 'సంపూర్ణస్వాతంత్ర్యము' అను అర్థము నిర్వచించుచున్నారు. కావున అధినివేశ ప్రతిపత్తికిగా నిర్మింపబడిన నెహ్రూప్రణాళిక ఇంతటితో రద్దయినదని ప్రకటించుచున్నారు. మరియు కాంగ్రెసునందలి సర్వపక్షములవారు తమయావచ్ఛక్తుల సంపూర్ణస్వాతంత్ర్య సంపాదనకై వినియోగింప గలరనియు, నెహ్రూరిపోర్టులో సూచింపబడిన తాత్కాలిక, సాంఘిక వివాదపరిష్కార సాధనముల మూలమున కాంగ్రెసునుండి ఎడతొలంగవలసిన లేక కాంగ్రెసునందు చేరుటకు వీలుగాని, ప్రముఖులును, నేడు మరల కాంగ్రెసునందు చేరి ఎల్లరకు సంబంధించిన ఈ ఆదర్శమును సాధించుటకు తీవ్రకృషి సలుపుదురనియు నమ్ముచున్నారు.

సంపూర్ణ స్వాతంత్ర్యసమరము సాగించుటకు సన్నాహమొనర్చు మొదటి మెట్టుగాను, కాంగ్రెసు విధానము ఆదర్శము మార్చినందుల కనుగుణ్యముగ నుండుటకుగాను రాష్ట్రకేంద్ర శాసన సభలను బహిష్కరింపవలయునని ప్రకటించుచు, ఇకపయి ప్రత్యక్షముగ గాని, పరోక్షముగ గాని ఈశాసనసభలతో జోక్యముకల్పించుకొన రాదనియు, ప్రస్తుతము శాసనసభలందు సభ్యులుగా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నున్న వారు తత్‌క్షణమే రాజీనామా నిచ్చివేయవలయున నియు కాంగ్రెసువాదులను కోరుచున్నారు. మరియు, దేశీయులు తమయావచ్ఛక్తుల నిర్మాణ కార్యక్రమము నిర్వహించుటకయి వినియోగింప వలయునని కోరుచు, తయారుగానున్నట్లుతోచినపుడు అవసరమైన అన్ని జాగ్రత్తలతోటి కొన్ని ప్రత్యేకస్థలములోగాని, సమిష్టిగాగాని పన్నుల నిరాకరణముతో సహా శాసనోల్లంఘనము ప్రారంభించుటకు అఖిలభారతకాంగ్రెసు సంఘమునకు ఈసభవా రధికారమిచుచ్చున్నారు.

౫

తూర్పు-ఆఫ్రికాయందు భారతీయులు పట్టువలతోనుండి తమజాతీయభావమును ప్రకటించినందుకు వారి స్వసౌఖ్యమునయిన త్యజించి యీమధ్యనే ఆదేశమునకువెడలివచ్చిన శ్రీమతి సరోజినీనాయుడు గారిని కాంగ్రెసుసభ అభినందించుచున్నది. సాంఘిక ప్రాతినిధ్యములను, ఆస్తి గల భారతీయులనుగూడ ఓటింగు అధికారమియ్యక అనవసరభేదములు పాటించు నిర్మాణవిధానమెట్టిదిగూడ భారతీయులకు సంతృప్తికరముగ నుండజాలదని యీసభవారు తలంచుచున్నారు.

౬

శ్రీ సాపూర్జి సక్లత్వాలాగారును పార్లమెంటు మాజీసభ్యుడును ఇంగ్లాండులోను, యితర విదేశములందున్న యితర భారతీయులును తిరిగి స్వదేశమునకు రాగోరినపుడు అనుమతిపత్రముల నివ్వకుండుటను యీసభవారు నిరసించుచున్నారు.

౭

కాంగ్రెసులో పేదవారును, సామాన్యజనమును ఎక్కువ ప్రాతినిధ్యము వహింపవలసి యున్నందునను, డిసంబరు ఆఖరున సభ జరిగినచో పేదవారిచలినుండి సంరక్షించుకొనుటకు ఎక్కువవస్త్రములుమున్నగు వానికొరకయి చాల వెచ్చింపవలసి యున్నందునను, యింక ననేకవిధములవారికి అసౌకర్యముగ నుండుటచేతను, కాంగ్రెసుసభ యికముందు ఫిబ్రవరి లేక మార్చిమాసములలో జరుపుటకు సభను, ఆహ్వానించు రాష్ట్రసంఘములతోసంప్రతించి వర్కింగు కమిటీవారు నిర్ణయించవలెను.

౮

విదేశీయ పరిపాలకులచే ప్రత్యక్షముగా గాని, పరోక్షముగాగాని భారతదేశముపయి మోపబడిన ఋణభాగ స్వతంత్ర భారతదేశము సహింపజాలదు.

౧౯౨౨ సంవత్సరములో గయా కాంగ్రెసు మహాసభవారిచే నామోదింపబడిన తీర్మానము నీ మహాసభవారు స్థిరపరుచుచు, ప్రస్తుత ప్రభుత్వమునుండి సంక్రమించిన బాధ్యతలును, సౌకర్యములును, స్వతంత్రభారతదేశమునందు స్వతంత్రమగు నొకవిచారణ సంఘమువారిచే పరీక్షింపబడుట ఈసభవారి యుద్దేశమని తెలిసికొనదగినవా రందరకు నిందుమూలముగా నీసభవారు ప్రకటించుచున్నారు.

౯

దేశీయ సంస్థానమునందలి ప్రజలకు సంస్థానాధీశులకు బాధ్యతాయుత ప్రభుత్వమొసంగుటసమయముచేకూరునది- కావున ప్రజలవాక్స్వతంత్ర్యము, సభలుజేసికొను అధికారము, ప్రాణధనసంరక్షణము మున్నగునవి యొసంగుచు చట్టముగావింపవలెనని యీసభవారు సంస్థానాధీశులను కోరుచున్నారు.

౧౦

నెహ్రూ నివేదిక రద్దయినందునను, స్వాతంత్ర్య ప్రభుత్వమునందు సాంఘికసమస్యల, పట్ల కాంగ్రెసు విధానము వేరుగ ప్రకటింప నవసరము లేదు. కాని నెహ్రూ నివేదికయందు సూచింపబడిన సాంఘిక సమస్యా పరిష్కార విధానముపట్ల సిక్కులును, మహమ్మదీయులు మరికొన్ని అల్పసంఖ్యావర్గములు అసంతృప్తి వెలిపుచ్చినందున, యికముందేదయిననిర్మాణ విధానము సూచింపబడునప్పుడు అందుకు సంబంధించిన సంఘములవారికి సంతృప్తికరముగ నుండనిచో కాంగ్రెస్ సంస్థ యంగీకరింపదని యీ సభవారు నమ్మకముగ తెల్పుచున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౧

రాబోవు కాంగ్రెసు మహాసభ కరాచిలో జరుగుటకును; ౧. పండిత మోతిలాలు నెహ్రూ, ౨. మహాత్మ గాంధీ, ౩. జె. యం. సేనుగుప్త, ౪. మౌలానా అబ్దుల్ కలాం అజాదు, ౫. సర్దారువల్లభాయిపటేలు, ౬ సర్దారు శార్దూలసింగ్, ౭. డాక్టరు సత్యపాలు, ౮. డాక్టరు పట్టాభి సీతారామయ్య, ౯. సి. రాజగోపాలాచారి, ౧౦. జయరామదాసు దౌలత్‌రాం గార్లు సభ్యులుగను, డాక్టరు సయ్యద్ మహమ్మదు (బీహారు), శ్రీప్రకాశ్ (కాశి)గార్లు కార్యదర్శులుగను, జమ్నాలాల్ బజాజ్, శివప్రసాదగుప్తాగార్లు కోశాధిపతులుగను నుండుటకు ఈ మహాసభవారు తీర్మానించుచున్నారు.

---

## కుంతి విచారము

శ్రీ వేంకట కాళిదాస కవులు
(ఆంధ్ర గీర్వాణ సాహిత్య సమ్మేళనము)

దుర్వాసమహాని చంద్రుఁడు పుత్రలాభమంత్రోపదేశముఁ జేసియుండ నేల ?
కన్య నయ్యుఁ దనూజకాంక్ష, మంత్రముఁ బరీక్షింప, సూర్యుని నుపాసింప నేల ?
సౌమ్యరూపముఁ దాల్చి సవితృదేవత నాకుఁ బ్రత్యక్షముగఁ గానఁబడఁగ నేల ?
పొమ్మంచుఁ బ్రార్థింపఁ బోకుండ నాకు నీదివ్య పుత్త్రునిఁ బ్రసాదింప నేల ?
కటకటా ! యేమి యొనరింపఁగలుగుదాన ?-నెవరితోడ నేమని వచియింపుదాన ?
ఏమహాత్ముని దూషింప నెంచుదాన ?-నెటులు లోలోన నీరీతి నేడ్చుదాన ?

శా. నాకుం గల్గిన నాకుమారకుని చందం బింక నేరీతిగా
సాకల్యంబుగఁ దల్లిదండ్రులకుఁ బ్రస్తావించి వార్కుచ్చెదన్ ?
లోకుల్ దీని నెఱుంగఁ జాలినయెడన్ లోలోపలన్ నవ్వరే ?
యాకన్యన్ నిరసింపరే ? కటకటా ! యింకేమి నేఁ జేసెదన్ ?

ఉ. కన్నియ యేడ ! సుందరవికాస విభాసురుఁడైన నందనుం
గన్నవిచిత్ర మేడ ! యిది కల్పనయా ? యనృతంబ ? సత్యమా ?
యెన్నఁడు నిట్టివింత విననేనియు లేదని లోకు లెల్లరున్
నన్నుగుఱించి చెప్పుకొన నవ్వరి లోన నెటుల్ చరించెదన్ ?

చ. కనుక మహాపకీర్తి జనకమ్ముగ నెవ్వరికైనఁ గాని నీ
జననరహస్యముం దెలుప శక్యమె ?—యట్లని నిత్యదుఃఖభా
జనముగ నీపవిత్రతరశైవలినీహృదయాంతరంబునన్
నినుఁ గడుపారఁ గన్నసుతు నిర్దయతన్ విడువంగ శక్యమే ?

మ. సహజంబై లసమానసత్త్వకలనా సౌందర్య సంపూర్ణమై
మహితంబై యసమాన పావనకళామాధుర్యసంయుక్తమై



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహనీయోజ్జ్వలమై కరం బలరు యుష్మద్దివ్యతేజస్సమా
వహలావణ్య పవిత్రమూర్తి విడువన్ స్వాంతంబు నా కొప్పునే?

తే. వింతయగు దివ్యకాంతితో వెలుఁగి సహజ-కవచకుండలంబులతోడ నవతరించి
నట్టి సూర్యనారాయణుఁ డనఁగ నొప్పు-నిన్ను విడనాడి యేరీతి నిల్పుదాన?

చ. కటకట! యీయమాయికపుఁగన్నియ కన్నులనుండి మెల్లనం
బొటబొటఁ గారు బాష్పకణముల్ పడ, నార్ద్రవికానభావవి
స్ఫుట మగునట్టి నీమధురమోహన దివ్యముఖంబులోని నీ
చటులవిలోకనప్రభలు స్వాంతము నెన్నటికేనిఁ బాయునే?

ఉ. నీనునుపాలబుగ్గల వినిర్మల పావనభావ మొప్పు ము
ద్దేనియుఁ బెట్టలేనిది సుమీ! నినుఁ గాంచిన కుంతి యీమె, వి
జ్ఞానవిహీనఁ గన్నసుతు శైవలినీ జలమందుఁ ద్రోయఁగా
నూనినపాపచిత్త, నయయో! యిఁక నెంచకు మాయి తల్లిగా!

చ. కలుషములైన మత్కరయుగంబునఁ గన్నులు మూసె దేల? ని
ర్మలతరనిమ్నగాంచితతరంగచయధ్వని మెల్ల జోలపా
టలగతి నీదువీనులఁ బఠన్ నినదించెద; నింక నీను తే
నెలఁ దులకించు వీక్షణము నిల్పుము నాపయి, ముద్దునందనా!

సీ. ఏచాన ఘన్నెంబు లాచరించెనో, నిన్నుఁ బ్రీతితోఁ బాలిచ్చి పెంచుకొఱకు
ఏతన్వి నోముల నెన్నినోచెనో, నిన్ను ముద్దాడు భాగ్యంబుఁ బొందుకొఱకు
ఏసాధ్వి వ్రతములం జేసియుండెనో, నిన్ను గని సదానందంబుఁ గాంచుకొఱకు
ఏయంగన తపంబు నెలమిఁ జేసెనో, నిన్ను భవ్యనందనునిగాఁ బడయుకొఱకు
ఎవతె భగవంతుదయ గడియించెనోకద?-నిన్నుఁ బోషించుమాతయై నెగడుకొఱకు
ఆపతివ్రత యెందు భాగ్యంబు నొంద-నక్కటా నోచనైతిఁగదా! కుమార!

చ. అమల పయఃప్రపూరిత మహాతటినీ! యిదిగో! త్వదీయ మ
ధ్యమున మదీయనందనుని నక్కట పేటికలోన నుంచి పా
ప మనక యెంతయుం గఠినభావమునం బడఁద్రోయుచుంటిఁ; బ్రే
మముఁ గొని యింక నీపసికుమారునిఁ బ్రోచుభరంబు నీదె యౌ.

శా. ఓగంభీరతరంగిణీ! వినయసంయుక్తైక చిత్తంబునన్
నీ గర్భంబున నియ్యదే, విడుచుచుంటిన్; వత్సలత్వంబుతో
నీగారాబుకుమారునిం గొనుచు నిం కేరీతి రక్షించ నా
పైఁ గారుణ్యముఁ జూపెదో?—త్రిజగదంబాయై నమస్తే నమః.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆకస్మికఛాయాచిత్రములు



౭. తిరుచినాపల్లి-కొండపైనుండి



౮. మాతృభూతేశ్వర దేవాలయము-తెప్పకోనేరు-తిరుచినాపల్లి ౯-కొండపైనుండి

౬-౧౦ శ్రీయుత జే. సుబ్రహ్మణ్యంగారి చిత్రములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౯. కొల్లడపు క్రొత్తవంతెన-జంబుకేశ్వరమువద్ద




౧౦. ప్రపంచమంతా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



### జన్మనిరోధము

డిశంబరు మాసపు 'స్ఫియరు' పత్రికలో 'లేడీ డ్రమ్మండుహే' అనునామె జన్మనిరోధమును గురించి యిట్లువ్రాయుచున్నది.

బ్రిటన్ దేశము మితిలేని జనసంఖ్యచేత నిండియున్నది. ప్రతిదేశములోను ఆదేశముయొక్క పాడిపంటల యోజించుకొని దాని కనుగుణ్యముగ జనసంఖ్యమితి మీరకుండునట్లు జాగ్రతపడవలసిన దినములు వచ్చుచున్నవని బర్మింగ్‌హాము బిషప్‌గారు చెప్పినమాట సత్యేతరము కాజాలదు. మతాచార ప్రవర్తకులైన బిషప్‌గారు ధైర్యముచేసి దేశమతాచార విరుద్ధమైన యీసంగతిని వెల్లడించినందులకు నేను వారిని ప్రశంసించుచున్నాను.

ప్రపంచము యావత్తు అనంతకోటి మానవులతో నిండియున్నది. అధికజనసంఖ్య, దానివలన కలుగు సాధక భాధకములు ప్రస్తుత దేశావస్థలకు మూలకారణము లగుచున్నవి. మనోవ్యసనము, రోగము, బీదతనము, బుద్ధిహీనత, ఆత్మహత్య మొదలగు కీడులన్నియు నీ అధిక జనసంఖ్యవలననే కలుగుచున్నవి. విశాలహృదయముతో పరీక్షించిన ప్రపంచములోకెల్ల నేడొక్క ఐరోపాఖండమునందు మాత్రమే అచ్చటిపాడి పంటలకు తగిన జనసంఖ్య కనబడుచున్నది.

ఈ విషయములో ఫ్రాన్సుదేశము ప్రథమగణ్యమై యున్నది. ప్రపంచ మహాయుద్ధము జరిగిన పదునొకొండు సంవత్సరముల పిమ్మట ఐరోపాఖండ మంతటిలోను యుద్ధమువలన కష్టనష్టములకు పాలుగాక విజృంభించుచున్న దొక్క ఫ్రాన్సు దేశమే. సైన్యాధిక్యము మొదలగు విషయములందుకూడ దీనిదే మందడుగు. ఈదేశమునందు నిరుద్యోగ సమస్య లేనేలేదు. ఆదేశమునందు కలిగిన పాడి పంటలకు విస్తీర్ణతకు సరిపోయిన జనసంఖ్య మాత్రమే ఉండుట దీనికికారణము. ఇదిగాక ఫ్రాన్సుదేశముయొక్క జనాభా మామూలు సంఖ్యకంటె తక్కువగా కూడ ఉన్నది.

దీనితరువాత వచ్చు దేశములు స్వీడను, నార్వే, స్విట్జర్‌లాండు. ఇటీవల స్విట్జర్‌లాండులో కూడ జనసంఖ్య అధికమగుచున్నట్లు తెలియుచున్నది. హాలెండు దేశస్థులను మాత్రము మూడువేలమైళ్ల విస్తీర్ణముగల యీస్టిండీస్ దీవులు వలసపోవుట కనుకూలమై వెన్నిధివలె గాపాడుచున్నవి.

తరువాత జనసంఖ్యచేత బాధపడుచున్న దేశములను గురించి ఆలోచించుటలో ఐరోపాఖండము లోనెల్ల ఇంగ్లాండు మొదటిదిగ కనబడుచున్నది. నిరుద్యోగము, భరింపరాని పన్నులు, జనబాహుళ్యము మొదలగు దుర్భర కష్టములకు లోనై పీడింపబడుచున్న దీదేశము. ఇందలి జనసంఖ్య (15,00,000) పదిహేను లక్షలకు మించియున్నది.

తరువాత జర్మనీదేశము. ఇందును పదిహేనులక్షల జనసంఖ్య కలిగి మిక్కిలియిక్కట్టుల పాలగుచున్నారు. ఆస్ట్రియాదేశము గూడ అరువదియైదు లక్షల జనసమూహముతో నిండి ఉద్యోగము, కూడు, గుడ్డ దొరకక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాధపడుచున్నారు. పైరీతినే ఇటలీదేశము గూడ అనేక లక్షలమంది జనసమూహముచే దుర్భర కష్టముల నందు చున్నది. ఇందు ప్రతిసంవత్సరము నాలుగు లక్షలకు తక్కువగాని జనసంఖ్య పెరుగుచున్నది

జపాను దేశములోగూడ వృత్తివ్యాపకములు లేక అనేకమంది జనులన్నాతురులై బాధపడుచున్నారు. ఈదేశపు జనాభా సంవత్సరమునకు 8½ లక్షలకు తక్కువగాకుండ వృద్ధిజెందుచున్నది. అనతికాలములోనే యీ సంఖ్య మించవచ్చును. ఇటులయినచో నవటి సం॥ నకు పదిలక్షలకుగూడ జనసంఖ్య మి తి మీ ర గ ల దు. ఈపరిస్థితుల నాలోచించి టోకియో పట్టణపు మ్యునిసి పలు సంఘమువారు జన్మనిరోధ పద్ధతులను వ్యాప్తిజేసి ప్రజాక్షేమమునకు దోడ్పడ ప్రయత్నింపగా ఆపట్టణ రాజకీయోద్యోగులు, ఫోలీసువారు, అయ్యది శాసనోల్లం ఘనమని ఆపుజేయించిరి.

ఒకప్పుడు పరిశ్రమలో ముందంజ వేయగలిగినప్రజా సామర్థ్యమునకే నవీన నాగరకతా యంత్రసాధనములు ఒకవిధముగ తీరరాని నష్టమును గల్పించినవని చెప్పనగును. ఈకర్మాగారములలో సమూహముతో గలసి పనిచే యుట కలవాటుపడిన ప్రజలు దూరదేశములకు వలసపో వుటకుగాని, ఒంటరితనమునకు గాని, స్వస్థల వియోగము నకు గాని ఓర్వలేక బాధపడుచుండుట వాస్తవము. దేశ శాంతియు,ప్రజాక్షేమమును కోరిన యేరాజకీయ నిర్వా హకుడుగాని యీవలస పంపించు టొకనిమాయకముగ జేసి, జనబాహుళ్యముచేత బాధపడుచున్న జర్మనీ, ఆస్ట్రియా, యిటలీదేశములలోని ప్రజలను తక్కువజన సంఖ్య కలిగి ఎక్కువ ధనసమృద్ధి గలిగిన దక్షిణాఫ్రికా ప్రాంతములకు పంపుటుచితము. జపాను దేశముగూడ తనజనసంఖ్య తగ్గించుకొని భావ్యభివృద్ధి నందుట కేదే నొకమార్గ మవలంబింపక తీరనిమాట సత్యము. ప్రస్తుత వైద్యశాస్త్ర ప్రాబల్యము, ఆరోగ్యశాస్త్రము, గృహ పారిశుధ్యము ప్రజలను మృత్యువునకు దూరముచేసి జన సంఖ్య పెరుగుటకు సాయము చేయుచున్నవి. నిజమున కివి కొంతకాలములోమరికొన్ని రెట్లజనసంఖ్యవృద్ధిచేయగలవు.

ఏ కెల్లాగునట్టము (Kelloge Pact) గాని, ఏ అంతర్జాతీయ సమస్యలు(League of Nations) గాని ప్రకృతి తత్వమును మార్పజాలవు.

చివరకు జన్మనిరోధ మవలంబించుటయే ధర్మమా? వలస పంపించు టగత్యమా? లేక యుద్ధమే శరణ్యమా?

పి. అన్నాజీ శర్మ.

---

## హైదరాబాదు సంస్థానమునందలి పురాతన గ్రంథాలయములు

(వెయ్యి సంవత్సరములకు పూర్వము)

హైదరాబాదు పరిశోధనసంఘమువారు ఈ మధ్య ప్రచురించిన నాగాయ్‌జి శాసనములవల్ల హిందూ దేశమున అనేకవందల సంవత్సరములకు పూర్వము కొన్ని వేల గ్రంథాలయములు కలవనియూ, అందును ముఖ్యముగా నైజాం సంస్థానము నందుండెడివనియు నిర్ధారణ చేయ బడినది. ఈ శాసనములవల్ల నాగాయ్‌జి అనునది నైజాం సంస్థానమునందు వాడీకి దగ్గరనున్న ఒక పట్టణమనియు, అక్కడ ౧౦౫౮ క్రీ. శ. ఒక దేవాలయ ముండి యుండె ననియూ, చాళుక్యవంశీయులకు చెందిన మధుసూదనుడు అనురాజు అచ్చట ఒకపాఠశాలను, గ్రంథాలయమును స్థాపించెననియు తెలియుచున్నది. పాఠశాలలో వేదము లను బోధించువారు ముగ్గురును, కళలను నేర్పువారు ముగ్గు రును గ్రంథాలయమునందలి ఆరువిభాగములను చూచు టకు గ్రంథాలయాధికారులు (లైబ్రేరియనులు) ఆర్గు రును ఏర్పాటు చేయబడియుండిరని తెలియుచున్నది. దీనినిబట్టి ఈగ్రంథాలయము ఎంత గొప్పదైయుండెనో తెలిసికొనవచ్చును. కళాధ్యాపకులకును, తత్త్వశాస్త్రా ధ్యాపకులకును ఇచ్చువేతనమే గ్రంథాలయాధికారులకును ఇచ్చుచుండెడివారనికూడ తేలుచున్నది. ఇట్టి స్థితిలో గ్రంథాలయములఅభివృద్ధిపట్ల సానుభూతినిమా పుటప్రభు త్వమునకు యుక్తముగా తోపకపోవుట శోచనీయము. (తెలుగు సమాచార్ నవంబరు డిసెంబరు సంచికనుండి)

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఇండియన్ పిక్టోరియల్ ఎడ్యుకేషన్‌లోని చిత్రముల వివరము

చిత్రము ౧:—ఈకమాను మైసూరు సంస్థానమున శ్రీరంగపట్టణములోవున్న యొక సుందరదృశ్యము,

చిత్రము ౨:—టిప్పుసుల్తాను సమాధి శ్రీరంగపట్టణములో లాలుబాగునవున్నది. ఇది నలుచదరముగనున్నది. దీని నాలుగుమూలలను పైన నాలుగు శిఖరములుగలవు. చుట్టుగలవసారాలో రాతికంబములు నున్నగ మెరుగెక్కింపబడినవి. దంతపుతాపటనుగల మహత తలుపు లున్నవి.

చిత్రము ౩:—యమునానదిపై నంతెన. ఇదిభారతదేశమందలి పెద్దరైలువంతెనలలో ఒకటి. కాన్పూరునుండి రైల్లు అనుదినము పెక్కురు ప్రయాణీకులను, బరువైన సామానులను గొని పోవుచుండును. ఈకాన్పూరు గొప్పవర్తకస్థానము. ఇచ్చట అయిదురైల్ల శాఖలు కలియును.

చిత్రము ౪:—ఈకోట మైసూరు సంస్థానమందలి శ్రీరంగపట్టణమున నున్నది. టిప్పుసుల్తాను కాలమున బ్రిటిషుసైన్యములు దీనిని పెక్కుమారులు ముట్టడించుట చరిత్రప్రసిద్ధము. మొదటిముట్టడి 1791 వ సం|| మేనెలలో జరిగినది. రెండవముట్టడి 1799 సం|| ఏప్రిల్ 17 వ తేదీ నాడు ప్రారంభమై మేనెల 4 వ తేదీనా డంతమొందినది. అప్పుడు టిప్పుసుల్తానునకు గాయము తగిలినది. అపుడు కోట దిడ్డివోనవద్ద కడలమెదల జాలక పడియుండగా శత్రుసేనలో నొకడు ఆతని రత్నఖచితమైన దట్టీని ఊడదీసికొనివచ్చి సుల్తానుచే దెబ్బతిని అతనిని కాల్చివైచెను.

చిత్రము ౫:—ఈనగల్లు హిందూశిల్ప విధానము ననుసరించి నిర్మింపబడినది. ఇందలి దసరాసభామంటపము మిగుల సుందరమయిన వేలకొలది జనులు కూర్చుండుటకు అనుకూలముగా వుండును.

---

## ముద్రితలోకము

శ్రీలెనిన్. సి. మార్షల్‌గారు "మానవాభివృద్ధి కథనము" నం దీక్రింది అంకెల నుదాహరించిరని ౧౯౩౫ సం|| ఆగస్టునెల ౭వ తేదీ వెలువడిన "The World's Press News" నం దుల్లేఖింపబడెను.

అమెరికాఖండము నందలి యూనైటెడ్ స్టేట్స్‌నందు
౩౦౧ పత్త్రికలు బిడ్డలకు,
౭౦౦ పత్త్రికలు కృషికులకు,
౨౫,౦౦౦ దినవార్తా పత్త్రికలు,
౧౫,౦౦౦ క్రొత్తపుస్తకములు ప్రతిసంవత్సరమును,
౪౦,౦౦౦,౦౦౦ ప్రతిదినమువార్తాపత్త్రికలు,
౨౦,౦౦౦,౦౦౦ (పీరియాడికల్స్) పత్త్రికలు,
౫౫,౦౦౦,౦౦౦ వారపత్త్రిక (మ్యాగజీన్)లు,
ప్రకటింపబడు చుండును.

౧,౧౦౦,౦౧౦ టన్నులకాకితముపుస్తకముద్రణమునకు,
౧,౫౦౧,౦౧౧ టన్నుల కాగితము వార్తాపత్త్రికాముద్రణమునకు నుపయోగింపబడుచుండును.

వా. గో. కృష్ణయ్య

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri








## హిందూ చిత్రకళాభ్యుదయము!

## కజిన్సుమహాశయుని ప్రపంచయాత్ర

ఆర్యావర్త మన్నివైపులనుండియు సమహర్చిన చిత్తరువులలో యిప్పటి ఇరువదినలుగురు ప్రఖ్యాతకళా కుశలుల అరువది చిత్రములను—హిందూదేశప్రత్యేకవ్యక్తిత్వమును చూపువానినిఏరి—కజిన్సుపండితుడు మొదట జీనేవాయందలికళా సంఘమునకు హిందూదేశప్రతినిధిగబోయి ప్రపంచయాత్రచేసి గత మాసమున తన నిజదేశముగ జేసికొనిన భారత దేశమునకు తిరిగివచ్చెను. బిసెంటు,ఆండ్రూసు మొదలుగాగల వారలవలె హిందూదేశమునకై పాటు బడుచున్న వారిలో కజిన్సుదంపతులు ముఖ్యులు.

లండను నందలి విఖ్యాతమగు ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్సు (faculty of arts, Piccadilly) లో యీచిత్ర సముదాయము ప్రదర్శింపబడెను. అమెరికాయందలి 'న్యూయార్కు టైమ్సు' (New York Times) యొక్క లండను విలేఖరి యీప్రదర్శనమును గాను తన పత్రికకిటుల తంతినంపెను. The marvellous contribution of India's art to world's art.) మరియు 'యిలస్ట్రేటెడు లండను న్యూసు యింగ్లండు' (Illustrated London News) సంపాదకుడు ప్రత్యేకవ్యక్తిత్వమును చూపు అయిదు చిత్తరువుల (ఢిల్లీ,కలకత్తా, మద్రాసు) నేరికొని, శ్రీకజిన్సుపండితునిచే యొకవ్యాసమునువ్రాయించికొని యీమాసములోవచ్చిన సంవత్సరాది సంచికలో ప్రచురించెను. ప్రాశ్చాత్యదేశముల ప్రసిద్ధిగన్న యీపత్రిక హిందూచిత్తరువుల మొదటిసారి ప్రచురించినది. ఇది చాలా గొప్పవిషయమట!

తన యభిప్రాయమును సంపాదకు డిటులవ్రాయుచున్నాడు:— 1914వ సంవత్సరమున హిందూ కళాభ్యుదయము మొదలిడిన నాటి నేటివరకు క్లుప్తముగ కథ, హిందూ చిత్రకళయొక్క యున్నతస్థానమును చూపు యిప్పటి చిత్రకారుల చిత్తరువులు అయిదు ప్రచురించబడినవి. పాశ్చాత్యకళనుంచి హిందూకళ ఎంతయు ప్రత్యేకత చూపుచున్నదనుట కీచిత్తరువులే నిదర్శనము. ప్రాచ్యులు పాశ్చాత్యులవలన కళావిషయమున నేర్చికొనవలసినది, నేర్చికొనినది అంతయు లేదు అనుట స్పష్టము.

తదుపరి కజిన్సుపండితుడు తనవ్యాసము నీవిధముగ మొదలిడెను:—

"When Rabindranath Tagore, in 1912 fled from the distractions of literary popularity in his native Bengal to find peace in obscurity in London, and got it in the form of an English translation of his poetry, a British knighthood and Nobel Prize! he achieved much more than a personal success. To Europ~, Tagore was something new. In India he was something old in his expression of an ancient tradition, albeit in modern moods and forms, and something established among the high triumphs of a a vividly national culture. The recognition of Tagore by Europe became a recognition of India and gave assurance particularly to the then young effort to restore the almost lost art of Indian Painting."

తన స్వదేశమగు వంగరాష్ట్రమున రవీంద్రనాథ టాగూరుగారికి కలిగిన అపారవిఖ్యాతి ప్రసిద్ధులవలన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారికి కలిగెడి బుద్ధిచాంచల్యమును దరిచేరనీయకుండ తప్పించుకొనుటకై, ౧౯౧౩ వ సం॥న వారు లండను నగరమునకుపోయి మారుమూలప్రశాంతముగా కాలము గడపదలంచిరి. వారదివరకు రచించియుండిన కావ్యముల నే ఆంగ్లములోని కవటుకుండగా అనువదించిరి. తద్ద్వారా నోబెల్ ప్రైజు, సర్ బిరుదముపొందిరి. ఇది వారికి ఒక విజయము. యూరోపుఖండవాసులకు టాగూరుగారొక క్రొత్తవింతగా నుండిరి. కాని భారతదేశము నందు చిరకాలానుగత ప్రాచీన సాంప్రదాయసిద్ధమగు భావప్రకటనమే వారు చేసిరి. అయితే యిట్టి భావములు వారిచే నూతనాకారములతో, నూతనలక్షణములతో ప్రకటింపబడిన మాట వాస్తవమే! జీవకళ లుట్టిపడు విశిష్టభారతజాతీయ విజ్ఞానముయొక్క మహోన్నత ప్రాచీన ప్రావీణ్యమునందే టాగూరిగారి భావప్రపంచ మిమిడియున్నది. కావున టాగూరుగారి ప్రతిభను యూరపువాసులు గౌరవించి పరిగణించుటవల్ల భారతజాతినే గౌరవించిన ట్లగుచున్నది. అందులకు ముఖ్యముగా ప్రస్తుత ప్రాచీనభారత చిత్రకళా పునరుద్ధరణమునకై పాటుపడుచున్న యీనాటి యౌవ్వనోత్సాహమునకీగౌరవాదరణ మొకయభయహస్తమువలె పరిణమించినది.

ఈ అయిదింటిలో 'గోవులకాపరి గోపాలుడు' (శ్రీ కవుతా ఆనందమోహన శాస్త్రిగారు, మద్రాసు)అను



శ్రీ కవుతా ఆనందమోహనశాస్త్రిగారు

చిత్తరువునకు మొదటిస్థాన మివ్వబడినది. దీనినిగూర్చి— "The shepherd of souls; And his consort Radha is never away" అని కజిన్సుగారి విశదీకరించిరి. రెండు ఉకిలు (డిల్లీ) గారివి. ప్రమోదచటర్జీగారిది 'ఉషః కన్య'. ఉకిలుగారిచే రచింపబడినవి కాలమేఘుడు, వర్షము, తుపాను అనునవి. ఈ అయిదింటియొక్క మూలములు (originals) అమెరికా, ఇటలీ, ఇంగ్లాండు దేశములలో ప్రవాస మున్నవి.

అమెరికా చికాగో విశ్వవిద్యాలయమందు యివి ప్రదర్శింపబడినపుడు అప్పటి 'ఏషియా' అను సచిత్ర మాసపత్రిక శ్రీ కజిన్సుగారికి రమారమి ౫౦౦ రూపాయల నిచ్చి ఒక సచిత్రవ్యాసమును వ్రాయించి ప్రచురించెను. వీటిలో ప్రఖ్యాతశిల్పి వెంకటప్పగారి శివరాత్రి కూడ నొకటి.

శ్రీ కజిన్సు పండితుడు తన అమెరికను ప్రయాణములోని వింత అనుభవములనుకొన్ని మాతో నిటులు చెప్పెను:—అమెరికాదేశమునకు వెళ్లిన తర్వాత మేమో హిందూదేశమునకు చేసిన అపకృతి స్పష్టముగ కానుపించెను. ౧౬ ఏండ్ల ప్రాయముగల ఒక కళోపాసకుడు రెండవసారి చెప్పిన ప్రదర్శనమునకు వచ్చి ఒక భూతద్దముతో చిత్తరువుల పరీక్షించి, ముగ్ధుడయి నాదగ్గరకు వెదకికొనుచువచ్చి యీచిత్తరువులు నిశ్చయముగ హిందూదేశస్థులు రచించినవేనా! హిందూదేశము అనాగరకదేశము అడవిదేశము అని మేము మావిద్యాలయములలో గరపబడితిమి. కాని యీచిత్తరువులు అనాదినుండివచ్చు నాగరికతను ఎంతగాచూపుచున్నవి అనెను. ఇట్లు ఆశ్చర్యపడిన అనేక వేలమందిలో నితడొకడు. ఈపుత్రవాడు ముఖాముఖిని స్పష్టముగ హిందూదేశ మెంత గొప్పనాగరికతగల దేశమో చూసిన తరువాత తన"జన్మము ఒకనిముసమయినను మేమోలాంటివారల అసత్యాధారములగు గాథల నమ్మనా!" అని చెప్పెను.

అమెరికాయందలి సుప్రసిద్ధ కళానిపుణుడు జే. టర్టిలు అనునాయన ఆనందమోహన శాస్త్రిగారి యొక చిత్తరువులో వర్ణసంయోగ లాలిత్యముల కచ్చెరు వంది



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తాను కొనుక్కొనెనని చెప్పుట కెంతయు సంతస మగు చున్నది.

శ్రీ జే. కజిన్సు పండితునియొక్క అమెరికాలో ఫిలడెల్ఫియా ముఖ్యస్థానములో ఈచిత్రకళా ప్రదర్శనము గూర్చి 'Philadelphia Enquirer' అనుపత్రిక ప్రదర్శనమునుగూర్చి యిటుల వ్రాసెను.

"That a vigorous and enthusiastic, artistic renaissance is now in progress in India, seems to be amply proved by the remarkable collection of Indian Paintings....

"No occidental influence whatever is observable in these beautifully composed and wonderfully coloured pictures....

"Here are nomenclature and terminology with which we occidentals are only vaguely familiar, but the pictorial interpretations of such ideas are of such supreme beauty as to be acceptable by any eye sensitive to aesthetic impressions....

"What a pity this fascinating exhibition, could not have remained longer in Philadelphia.

ఈప్రశస్త భారతీయ చిత్రరచనా సంపుటివల్ల నొక్కవిషయము పూర్తిగా రుజువగుచున్నది. భారత దేశములోని కళాప్రపంచమునం దొకనూతనవిజ్ఞానోత్తేజము ప్రచండరూపమున గాఢాభినివేశముతో నావిర్భవించినదని రుజువగుచున్నది. రమ్యముగా రచింపబడిన యీ యద్భుత చిత్రరచనలందు పాశ్చాత్య సంపర్కమేమియు కానబడదు. పాశ్చాత్యుల మైన మనకు పరిచితము లైన శబ్దప్రయోగములు నామములు యిందుకలవు. కాని అట్టిభావములను సచిత్రముగా ప్రదర్శించుట అత్యంత సుందరముగానున్నది. రసోచితభావప్రకటనము నను గ్రహింపగలవారికందరకును ఇవి ఆదరణీయములే యనునంత సొంపుగానున్నవి.

ఇట్టి మనోరంజకమైన చిత్రప్రదర్శనము ఫిలడెల్ఫియా నగరములలో కొలదిదినములే యుంట ఎంతయు మనదురదృష్టము. యూరపునందలి అనేక ముఖ్యసంస్థలయొక్కయు, విశ్వవిద్యాలయముల యొక్కయు ఆహ్వానముపైని కజిన్సు మహాశయుడు తిరిగి ఏప్రియలు మాసమున యూరపున కేగనున్నారు. వీరికి భగవంతుడు ఆయురారోగ్యముల నిచ్చుగాత!

---

# ధ మ్మ ప ద ము

## (వ చ న ము)

గ్రంథకర్త: శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు, యం. ఏ., యల్. టి.

ఈ పుస్తకం ఆంధ్రగ్రంథమాలలో ఏడవది. బౌద్ధధర్మమతసారమయిన ధమ్మపదం అనే పుస్తకానికి అనువాదం. ఇది 'అహింస' ముఖ్యధర్మం అన్నవిషయం ఈ పుస్తకంలో చక్కగా వివరింపబడింది. మఱెన్ని కొన్ని గొప్పధర్మాలు ఇందు ప్రతిపాదింపబడినవి. ధర్మజిజ్ఞాసువులు తప్పక చదువవలసిన పుస్తకం ఇది. ప్రతులు కొలదిగనే ఉన్నవి.

క్రౌనుసైజు పుటలు ౧౫౦, వెల రు. ౦-౧౦-౦.

మేనేజరు—ఆంధ్ర గ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీధి, మద్రాసు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## ఆంధ్రవాఙ్మయ సూచిక

ఆంధ్రగ్రంథమాలలో ౧౧ వ గ్రంథము

క్రౌను నాల్గుపుటల సైజు ౬౧౪ పుటలు. వెల రు. ౩ లు. ప్రకాశకులు మేనేజరు ఆంధ్రగ్రంథమాల ౬, ౭, తంబుసెట్టి వీథి, చెన్నపురి.

'దేశభాషలందు, తెలుఁగు లెస్స' యని పొగడ్తను బడసిన యాంధ్రవాఙ్మయ మహోదధియందు బొదసుండి వెలువడిన గ్రంథరత్నముల నన్నింటిని ౧౦ సంవత్సరముల నిరంతర పరిశ్రమము చేసి ఇట్లు గ్రంథరూపమున ప్రకాశకులు ప్రచురించి యాంధ్రభాషా జిజ్ఞాసువులకు మహోపకార మొనర్చిరి.

ఈ సూచిక ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికలని రెండుభాగములుగ విభజింప బడినది.

ఇందు మొదటిభాగమున మొదటి పుటనుండి ౨౮౬ వ పుటవఱకు గ్రంథము, గ్రంథకర్త, విషయము, ఆగ్రంథము ముద్రితమయిన సంవత్సరము, విశేషములు అనుశీర్షికలక్రింద నకారాదిగ ముద్రితాంధ్రగ్రంథముల సమగ్రపరిచయము కలిగింపబడెను. దాదాపు ౧౨,౦౧౦ గ్రంథము లుదాహృతములు. పుట ౨౮౯ నుండి ౩౩౭ వఱకు గ్రంథకర్తల పేరు, యింటిపేరు వానిక్రింద వరుసగా, నకారాదిగ వారిచే రచియింపబడిన గ్రంథములు నుదాహృతములు. పుట ౩౩౮ నుండి ౩౯౧ వఱకు విషయములక్రింద విభాగించి యాయా విషయమునకుచెందిన గ్రంథములు నాయాశీర్షికల క్రింద వఱుసగ నకారాదిగ నుదాహరింపబడెను.

ఈ మొదటిభాగమున "అనుబంధము" అను పేరిట ౧౯౨౧ సం. అక్టోబరు నెలమొదలు ౧౯౪౫ సం. డిసెంబరు నెల వఱకును, "అనుబంధము(అ)" యను పేరిట ౧౯౪౬ వ సం. జనవరి మొదలు ౧౯౪౭ సెప్టెంబరు నెలవఱకు ప్రచురింపబడిన ముద్రితగ్రంథములు. విషయ విభాగము క్రింద విడదీసి ఆయావిభాగమున గ్రంథములు గ్రంథకర్తల పేర్లతో నకారాదిగ గలవు.

ఇక రెండవభాగము. ఇందు గల గ్రంథములన్నియు నిప్పటికి నముద్రితములు. విషయ విభాగశీర్షికల క్రింద గ్రంథము. గ్రంథకర్త, రచనము, పరిమితి, విశేషములు అకారాది పట్టికలుగా వరుసగా కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్ పుస్తకభాండాగారము, తంజావూరు సరస్వతీ పుస్తకభాండారము, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములలోని లిఖితగ్రంథముల పట్టికలు విడివిడిగా గలవు. ఈ రెండవభాగము ౨౬ పుటలు మాత్రమే. ఇందు విశేషములను శీర్షికక్రింద ప్రతులసంఖ్య, నామాంతరములు మొదలగువిశేషము లుదాహృతములు.

ఈ సూచిక ప్రారంభమున సూచికా ప్రకాశకులగు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు రచించిన ౧౧౮ పుటలు గల పీఠిక కలదు. ఈ పీఠికయందు వేదకాలమునుండి నేటివఱకు జరిగిన ఆంధ్రభాషా స్వరూప పరిణామ నిరూపణమును సవిమర్శముగ, విపులముగ గావించిరి. ఈ పీఠిక కేవల మొక వాఙ్మయచరిత్ర మనదగినది. ఇది ఈ సూచికతో చేరి యుండుటవలన దీని విలువ పెంపునొందుచున్నది.

ఇది ప్రతిగ్రంథాలయమునను, ప్రతిభాషాభిమాని కడను, విమర్శకునివద్దను, ప్రతియాంధ్రుని హస్తమునను ఉండి తీరవలసిన గ్రంథరత్నము. గ్రంథాలయాధిపతులకు ముఖ్యము.

వా. గో. కృష్ణయ్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శంభుతో నొకనాటి సహవాసము (ఆంగ్లము:)

### A day with Sambhu.

చిన్నసైజు పుస్తకము. ముద్దులుమూట గట్టుచున్నది.

వెల రు. 1-0-0

సుప్రసిద్ధాంగ్ల గ్రంథకర్తలగు కె. యస్. వెంకటరమణిఅయ్యరుగారు రచించిన యీచిన్నిపొత్తము, కౌమారదశయందుండు విద్యార్థు లనుసరింపవలసిన జీవితక్రమమును ముద్దులు మూటగట్టు తేటమాటలతో బోధించుచున్నది. రామేశ్వరయాత్రకు బోవుచున్న యొకసాధువు మార్గమధ్యమున నొకయూరి సత్రములో శంభుడను నొకబాలుని గలసికొని యనేక నీతు లతనికి నేర్పును. వేకువజామున మేల్కొని రాత్రి శయనించువరకు బాలు రెట్లు నడచుకొనిన పరిపూర్ణశరీర మనోవికాసముల నొంది, ఆయురారోగ్య భాగ్యముల కునికిపట్టులై తమకును లోకమునకును మేలొనరింప వచ్చునో రసవంతముగా నిందు వర్ణింపఁ బడినది. కాఫీ మొదలగు నుద్రేకపానీయముల యనర్థముల గూర్చి సాధువు శంభునకుజేసిన యీ క్రింది మహోపదేశము బాలురేకాక తల్లిదండ్రులును గమనింప దగినది.

"నీతల్లినీకు కాఫీనిచ్చుచో, నీ కది వలదని మెల్లగా జెప్పుము. మనదేశమునకు కాఫీ క్రొత్త వస్తువు. దీనిని తలుచుగా త్రాగుటవలన నిత్యమును త్రాగుచుండవలసిన చెడ్డయలవాటు పట్టువడును. ఇది యౌషధియే కాని, యెదుగుచున్న నీ లేతశరీరమునకు పుష్టినిచ్చు నాహారము కాదు."

ఇట్టి యమూల్య నీతిరత్నములతో నొప్పుచున్న యీయాంగ్లగ్రంథము దేశభాషలలో ననువదింపబడినచో బాలుర కెంతో యుపయుక్తముగా నుండుననుటకు సందేహ మానంతయు లేదు.

వలయువారు మదరాసు, మైలాపురం, శ్వేతారణ్యాశ్రమమునకు గ్రంథకర్తగారి పేర వ్రాసికొన వగును.

వె. వేం. కృ.

---

## పొట్టికత

గ్రంథకర్త: కవికొండల వేంకటరావుగారు క్రౌను సైజు, మెరుగు కాగితములు, ౬౬ పుటలు, కాగితపుబైండు. వెల ౦-౮-౦. ౧౯౩౫ సం.

ఇదియొకచిన్న వినోదకథల సంపుటి. పిల్లలకొరకు వ్రాయబడినది. మన యెరికలోనున్న అనేక అల్పవిషయము లిందు విచిత్రముగా రచింపబడి బాలబాలికలకు, ఆనందమును, జ్ఞానమును చేకూర్చునట్టివిగా యున్నవి.

ఉదా:—పంచ భూతములు, చతురంగబలము, మొదలైనవి. మరికొన్నికథలు కేవలము కల్పితములు. ఉదా:—సర్కసు మర్కటము, కామధేనువు, కోడెదూడ మొదలైనవి.

పురాణకథలందువలె పక్షులు, జంతువులు, చెట్లు నిర్జీవవస్తువులు మొదలైనవాటిచే మాట్లాడించి, చర్యలు చేయించి పసివాండ్రకు కౌతూహల మొసగునట్లుగా రచింపబడినది. కావ్యవిషయములు బాలురమనసు రంజించునట్టివిగా యున్నవి.

శైలి:— గ్రాంథికవ్యావహారికముల మిశ్రము. సమాస ఘట్టములం దొకప్పుడు గ్రాంథికమును ఒకప్పుడు గ్రామ్యము నుపయోగింపబడుటచే సగళముగా లేదు. కేవలము వ్యావహారికభాషలో వ్రాసియుండిన మెరుగుగానుండెడిది. ఏదైనను గ్రంథకర్త గద్యశైలి పద్యశైలివలె పక్వస్థితిలో లేదు. భాష సులభముగను, జాతీయములతో కూడినదిగ ఉన్నది.

చే. కా.

---

## చిట్టికైత

గ్రంథకర్త: కవికొండల వెంకటరావుగారు. క్రౌను సైజు, 30 పుటలు. మెరుగు కాగితములు, కాగితపు బైండు. వెల ౦-౬-౧

ఈచిన్న పద్యగ్రంథము బాలబాలికలకు పఠనీయగ్రంథముగా నుపయోగపడు నిమిత్తమై వ్రాయబడినది. ఇట్టిరచనలలో నట్టిపసివారికి పద్యములలోగల యతిప్రాసలవల్లను, గణననియమములవల్లను, అక్షరధ్వనుల కలయిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అఖిలభారత సర్వపక్ష సమావేశము




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వల్లను గలుగు, బాహ్యాంతర్గానములచే నాకర్షించి కొన్ని కొన్ని స్వల్పవిషయములను నేర్పుటయే ఆశయముగ నుండును. కావున సులభముగను, ఆకర్షకములుగను ఉండు సామాన్యవిషయములు అనఁగా, దేశచరిత్రకథలు, కథలు మొదలగువాటిని గూర్చి వ్రాసి వారికి వాఙ్మయములోఁగల గొప్పవిషయములను పరిచయము చేయుటయు, చిన్నచిన్న నీతులను నేర్పుటయు నిందు గలదు. ఇట్టిరచనలు పసివాండ్రకు కవిత్వమునం దభిరుచి గలుగజేయుట కొక మెట్టుగాఁగూడ నుండును. పై ఆశయముల సాధనకై వ్రాయబడిన యీకవితయందు కృతక మధికముగా నుండుట తప్పదు. అనగా ఈరచనలు స్ఫురణచేతను, ఉద్దీపనము (Inspiration) చేతను, 'మనోహరభావము కందళించుట' చేతను వ్రాయబడినవిగా ఉండవు. సహజకవిత్వమున కుండవలసిన లక్షణము లుండవు. గణబద్ధమై (Versification) అసహజ కవిత్వమును గలిగియుండును. బాలబాలికలకుగల నిసర్గములను (Instincts) ప్రేరేపించి వాటిని తృప్తిపరచి సంతోషపెట్టుట యిట్టికవితలో ముఖ్యముగా గానబడును.

శైలి, భాష సులభము. భావము దుర్గ్రాహ్యముగా లేదు. వృత్తము లనవసరముగా వాడబడియున్నవి. కవిత్వము కొంత ధారాళముగానే యున్నది. కావ్యవస్తు విషయములు చిన్నపిల్లల ఊహల కతీతముగా లేవు.

వే. కా.

---

## చదువులదుత్త

గ్రంథకర్త:— కవికొండల వేంకటరావుగారు. క్రౌనుసైజు ౧౫ పేజీలు, మెరుగుకాగితములు, కాగితపుబైండు, వెల ౦-౪-౦.

ఈచిన్న పుస్తకమందు గ్రాంథికలక్షణములు, జానపదలక్షణములుగల ఖండకావ్యములు గలవు. ఈగ్రంథము కూడ పిల్లలకొరకు వ్రాయబడినదే. కావ్యవిషయములు పిల్లలకి పనికివచ్చునట్లుగా సులభముగా నున్నవి. కవిత్వము సహజముగా నున్నది. స్ఫురణవల్లను, ఉద్దీపనవల్లను గడియింపబడినది. వీరి 'చిట్టికైత' యందువలె అసహజ కవిత్వ మిందు లేదు. బాలబాలికలకు నిజముగా జ్ఞానమును, సంతోషమును ఇచ్చునదిగా నున్నది. ఇది పొగడదగిన గ్రంథము.

ఈగ్రంథమందు చరణపు విరుపులు గలవు. వీటిని గురించి 'ఆగడపులు' అను గ్రంథముయొక్క విమర్శనలో చెప్పబడును. శైలి వ్యావహారిక భాషలో రసవంతముగ, సులభముగ నున్నది.　　　　　వే. కా.

---

## దేవకీనందన శతకము

క్రౌన్‌సైజు ౨౦ పుటలు. వెల తెలియదు. పేపరుబైండు.

దీనియందు "కృష్ణా దేవకీనందనా!" అను మకుటముతో ౧౦౫ పద్యములు గలవు. ఈగ్రంథరాజమును రచించిన కవితల్లజుని నామధేయ మీయాంధ్ర ప్రపంచమున నేఁటివఱకు బయలుపడుటలేదు. కాని, ఈతని శతకములోని

మ. చతురంభోధి పరీతభూవలయ రాజన్యైకకోటీర రం
　జిత మాణిక్యవిరాజమాన పదరాజీవుండు ధర్మాత్మజుం
డతికార్పణ్యముతోడ మత్స్యపతిఁ దానాశింపఁ జేతావకా
　యతకారుణ్యము గల్గునంతకును గృష్ణా దేవకీనందనా."

అనుపద్యము అప్పకవీయము మూఁడవ యాశ్వాసమున నించుక మార్పుచేఁ గాన్పించుచున్నది. అందుచే నీకవిచంద్రుఁడు అప్పకవికంటెఁ బ్రాచీనుఁడని మాత్రము చెప్పవచ్చును.

నామమాత్రావశిష్టమై యింతవఱకును మఱుఁగుపడియున్న యీగ్రంథము శ్రీశ్రీశ్రీ గద్వాలసంస్థాన పుస్తకభాండారమునఁ దాళపత్ర లిఖితమయియుండుటఁ జూచి శ్రీమంతమహారాజ్ఞిగారు ముద్రింపించి ప్రకటించి లోకోపకార మొనర్చిరి. అట్టి శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాజ్ఞిగారి ఔదార్యము, భాషాభిమానము ఈయాంధ్ర ప్రపంచమునఁ జిరస్థాయియై వెలయుఁగాక.

కవనము ద్రాక్షాపాకముచేతను, వైదర్భీరీతిచేతను బంధితపామరహృదయంగమమయి ముద్దులు గులుకుచున్నది. పద్యములు భక్తిభరితములయి యనేక నీతుల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నున్వోభించుచున్నవి. సామాన్యముగా నీ పద్యములలో నపూర్వములగు దృష్టాంతములు పురాణగాథలు, చూపఁ బడుచునే యున్నవి.

శా. పాత్రాపాత్ర వివేకముల్ సమసెపా
పం బెచ్చెఁ బర్వెంబు లే
మిత్రఘ్నుత్వము కల్లలాడుటలు స్వా
మిద్రోహముల్ కొండెముల్
ధాత్రిం బూజ్యములయ్యె సాధువుల చం
దం బెట్లు రక్షించెదో
సత్రాజిత్తనయామనోరమణకృష్ణా,
దేవకీనందనా.

శా. అందెల్ చిన్నిపసిండి గజ్జెలును మ్రో
యన్ మేఖలా ఘంటికల్
క్రందై తోఁపఁగ రావిరేక నుదుటన్
గన్పింప గోపాంగనా
నందం బొందఁగ వెన్నముద్దలకునై
వర్తించు నీ బాల్యపున్
చందం బాదివిజుల్ నుతింపఁదగుఁగృష్ణా,
దేవకీనందనా.

శా. నీడల్ దేరెడు చెక్కుటద్దములతో
నిద్దంపునెమ్మోముతో
కూడీకూడని చిప్పకూఁకటులతో
గోపార్భక శ్రేణితో
క్రీడాశూన్య కటీరమండలముతో
వ్రేపల్లెలో నీవు నాఁ
డాడేశైశవమూర్తినే ఁదలఁతుఁగృష్ణా
దేవకీనందనా.

మ. అమరుల్ పద్మజు వ్రాఁత దాఁట రెవఁడో
క్కబ్బంబు షెడయ్యెదు
ర్దమనోర్దండ పటుప్రతాపనిజసం
రంభామరానీక వి
క్రమదుర్వారగజాసుర ప్రళయమిం
కం జేసిన ట్టీశ్వరున్
సమరక్షోణిజయించు నర్జునుఁడుకృష్ణా
దేవకీనందనా.

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

---

సముచితాహారము

(Thoughts on Diet)

క్రౌనుసైజు పుటలు ౮౮. వెల రు. ౦-౮-౦

గా. న్యాయమూర్తి సర్ వేపా రామేశం పంతులుగారిచే, ఆంగ్లభాషలో వ్రాయబడిన యమూల్యగ్రంథమున పంతులుగారు, ఆహారవిషయమునందును, సంతాన నిరోధవిషయమునందును చాల కృషి సలుపుచున్నారు. వీనిలో ఆహారవిషయము అఖిలజనోపయుక్తమగుట కట్టి సంశయమును లేదు. ఈవిషయమున వీరు ప్రామాణికులలో నొకరని చెప్పుటగూడ సాహసోక్తి కాజాలదు. వీరీవిషయమున అనుష్ఠానపూర్వకముగనే బోధించుచున్నారు. పాశ్చాత్యులీవిషయమున వ్రాసిన గ్రంథముల నెన్నిటినో వీరు చదివియున్నారు. తెల్లచక్కెర, ఫాక్టరీ లేక మరబియ్యము లేక మిలురైసు, మెరుగుబియ్యము లేక పాలిష్డురైసు, అమితాహారము, ఉపవాసము లేక నిరాహారము, విటమినులు, అల్యూమినముపాత్రలు, సంగ్రహము అను ప్రకరణముల క్రింద నీగ్రంథము విడదీయబడినది. సంగ్రహమునందు గ్రాహ్యములును, వర్జనీయములును స్పష్టపరుపబడెను. ఏయే విటమినులు ఏయే పదార్థములలో ఏయే పరిమితులలో నుండునదియును తెలుపునట్టిపట్టికగూడ నిందు కలదు. దీనిని బెజవాడలో ప్రకృతిచికిత్సాసంఘమువారు ప్రకటించిరి. వలయువారిటుల వ్రాయవలెను: మేనేజరు, ది ఇండియను నేచరోపతిక అసోసియేషను, బెజవాడ.

వెదురుమూడి శేషగిరిరావు.

---

దిఇండియన్ నేషనల్ కాంగ్రెస్
దెన్ అండ్ నౌ

(The Indian National Congress
Then & Now)

గ్రంథకర్త: శ్రీయుత యస్. భీమశంకరరావుగారు, బి. ఏ., ఫస్టుగ్రేడు ప్లీడరు, రాజమండ్రి. క్రౌనుసైజు, ౯౦ పుటలు. వెల రు. ౧-౦-౦.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇది భారతజాతీయమహాసభ సంక్షిప్తచరిత్ర. దేశమునందలి రాజకీయపక్షములన్నియు కాంగ్రెసువేదికపై నేకము గావలయుననియు, కాంగ్రెసుసంస్థ యొక్కటియే యిట్టి యైకమత్యమున కవకాశ మీయగల అఖిలభారత రాజకీయసంస్థ యనియు గ్రంథకర్తగారి యభిప్రాయము. ఈయభిప్రాయమును గాదనువా రెవ్వరు నుండరు. ఇట్టి యైకమత్యమును సాధించుటకు మితవాదుల కార్యవిధానము నవలంబించుట యొక్కటియే సాధనమని వీరు తలంచుచున్నారు. తాము మితవాదులగుటచే మితవాదనాయకుల కార్యక్రమములను భీమశంకరరావుగారు పొగడుటయు నంత ఆశ్చర్యకరము కాదు. కాని తమ పక్షపాతమును మితిమీర సాగించి నేటి కాంగ్రెసునాయకులను మహాత్మగాంధి, మోతీలాల్ నెహ్రూ, జవహర్లాల్ నెహ్రూ మున్నగు ప్రముఖులను అపవిత్రహస్తులనియు, కాంగ్రెసువంటి పవిత్రసంస్థ యట్టి వారి చేతులలో నుండరాదనియు వీరు నిందించుట కేవల మసభ్యముగ నున్నది. సర్ సి. పి. రామస్వామి అయ్యర్ గారిని బోలు మితవాది ప్రముఖులకే కాంగ్రెసునాయకులు, అకలంక దేశభక్తులు, స్వార్థత్యాగులు నైనప్పుడు, రావుగారికి వారపవిత్రహస్తులుగ గానవచ్చుట మిక్కిలి ఆశ్చర్యము గల్గించుచున్నది.

ఇంక గ్రంథకర్తగారు ఐకమత్యమునకు మార్గము లేవో తమపుస్తకములో నెందును స్పష్టముగ వివరించియుండలేదు. మితవాదనాయకుల డొమినియన్ స్టేటసువలెనే వీరియైకమత్యవాదముకూడ గాలిలో మేడగ నున్నది. డొమినియన్ స్టేటసును సంపాదించుటకు దగిన ప్రబల సాధనములను మితవాదు లెన్నడును సూచింపరు. అట్లే ఐకమత్యమునకు వలయు సాధనము లేవో వీరును సూచింపరు. ఏమైననేమి, వీరియభిప్రాయమున మన దేశమునందలి రాజకీయపక్షములలో నైకమత్యము లేనందుకు నేటి కాంగ్రెసువాదుల నిరంకుశత్వమే కారణము. తక్కిన పక్షములవారిని అసహాయవాదులు కాంగ్రెసునుండి తరిమివైచుచున్నారట. ఐన వీరియైకమత్య మెట్టిదో గమనింతము. మొత్తముమీద వీరివాదముయొక్క సార మిది. "కాంగ్రెసు ప్రత్యేకముగ నేరాజకీయపక్షము చేతులలోను ఉండకూడదు. అందు అన్నిపక్షములవారికిని, స్వాతంత్ర్య పక్షమువారికికూడ స్థాన ముండవలయును. కాంగ్రెసులో చేరినంతమాత్రమున ఏపక్షమును దానిలో పూర్తిగ నంతరించిపోయి తన వ్యక్తిత్వమును గోల్పోవ నక్కరలేదు." ఇదియొక విలక్షణవాదము. కాంగ్రెసు నిజముగ నొక రాజకీయకార్యవిధానము గలిగిన సంస్థయై యుండవలసినచో, భీమశంకర రావుగారు సూచించిన ఐకమత్యముకన్న ఎక్కువగ కాంగ్రెసును నిర్జీవముగనొనరింపజాలు పద్ధతి మరియొకటి యుండదు. కార్యనిర్వాహకవర్గము లెప్పుడును ప్రధానపక్షమువారి స్వాధీనమున నుండుటయే ప్రజాపరిపాలన సంస్థల ప్రధానలక్షణము. ఇంక, అసలు, కాంగ్రెసులో చేరుటకే వీలు లేకున్నదన్నచో నీవాదముగూడ దుర్బలమే. ఇందుకు వీరికారణములు మూడు: దుస్తుల నిర్బంధము, శాసనోల్లంఘనము, సంపూర్ణ స్వరాజ్యాదర్శము. ఆర్థిక రాజకీయ సమస్యలు సంపూర్ణముగ నొకదానిలో నొకటి కలిసిపోయియున్న యీకాలమున స్వదేశీ నియమమును విడిచిపెట్టుటకన్న కాంగ్రెసు ఆత్మహత్యకు ప్రబలోపాయము మరియొకటి యుండదు. ఇది మితవాదులకు తెలియని సంగతి కాదు. మనమందరమును తత్క్షణమే కావలయునని కోరుచున్న డొమినియన్ ప్రతిపత్తిని పార్లమెంటువారీయకున్న ఇచ్చెదరనుటకు సాక్ష్య మొక్కటియు గానరాదు. మనకప్పుడు శాసనోల్లంఘన మొక్కటియే మిగిలినమార్గము. అది హింసారహితమే కావచ్చును, హింసాసహితమే కావచ్చును. అట్టిచో కాంగ్రెసు పక్షము శాసనోల్లంఘన విధానము నవలంబింపక తప్పదు. ఇంక సంపూర్ణస్వాతంత్ర్యవాదులకుగూడ కాంగ్రెసులో స్థాన ముండవలసినప్పుడు సంపూర్ణస్వాతంత్ర్యము తప్ప మరియొక తక్కువ యాదర్శమును కాంగ్రెసు ఎట్లు అవలంబింపగలదో మాకు బోధపడుటలేదు.

ఈవిధముగ వీరుసూచించిన మూడు నిర్బంధములును నిజమునకు నిర్బంధములుకావు. ౧౯౨౩, ౨౪ సం॥ల నాటి స్వరాజ్యపక్షమును, నేటి రెస్పాన్సివు కోఆపరేషన్ పక్షమును అనుసరించి, మితవాదులుగూడ కాంగ్రెసులోనే యుండి తమయాశయములకై పోరాడుట యొక్కటియే ప్రస్తుతమునగల ఐకమత్యసాధనము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అదియే అతివాదులను, మితవాదులను ఒకవేదికపై కేర్చుట కుపాయము. దీనిని గమనించి భీమశంకర రావుగారు తక్కినపక్షములను కాంగ్రెసులో చేరుటకు పురికొల్పిన బాగుండెడిది. అందుకు బదులుగ నాగు నిందను కాంగ్రెసు నెత్తిపై ద్రోయుట యన్యాయము.

సైమన్ కమిషను బహిష్కారమును గూర్చియు, వైస్రాయిగారి ప్రకటనము గూర్చియుగూడ వీరు కొంత వరకు చర్చించిరి. ఈభాగములును ఐకమత్యమునుగూర్చిన వాదమువలెనే అసంబద్ధములగు నభిప్రాయములతో నిండియున్నవి. ఇంకొక ముఖ్యమైన సంగతి: పుస్తక శీర్షికలోని 'అప్పుడు ఇప్పుడు' అనుపదముల యర్థమును గ్రంథకర్త యెందును వివరింపలేదు. ప్ర. రం.

---

## దీనచింతామణి అను తత్త్వవివేచనము.

క్రౌనుసైజున 19 పుటలు. ఇందు 109 పద్యములు గలవు. వేపకుశైండు.

గ్రంథకర్త:—అమ్మనబ్రోలు వెంకటసుబ్బారాయ శర్మగారు. ఇది దీనచింతామణీ అను మకుటము గల వృత్త శతకము. ఇందలి కవనము సరసమయి మృదుమధుర శైలి నొప్పారుచున్నది. శతకము పండిత జనాస్వాదనీయ మగుటయే గాక విశేషించి వేదాంత శాస్త్రజ్ఞులు చదువదగియున్నది. ఆయాతావుల నద్వైత వేదాంత సిద్ధాంతము లద్దమునఁ బ్రతిబింబమురీతిని సులభముగాఁ జూపఁబడియున్నవి. అట్టి సిద్ధాంతము తెలిసికొనుటకు నందు ప్రతిపాదితము లయిన యమూల్యములగు దృష్టాంతములే యాధారములు. మచ్చునకు రెండు పద్యములు:

శా. పాపం బెక్కడ పుణ్యమెక్కడ పర
బ్రహ్మంబునందుఁ గుణ
వ్యాపారంబులు కర్తృభోక్తృవిధి స
ర్వంబుఁ బృథాకల్పితం
బై పొల్చుఁ గళశృంగధారియయి వం
ధ్యాపుత్రుఁ డున్నాఁడటం
చాపాదించుట విశ్వముండుట రా
మా దీన చింతామణీ!

శా. ఆకాశం బవకాశ మిచ్చునది శూ
న్యంబయ్యు నీలత్వమే
యాకారంబుగ లోక మెంతురు మహీ
జాలిన్ ధరిత్రీస్థలిన్
సోఁకన్ వ్రాలిన యట్టు లుండు నటనో
శోధింపఁ దద్వర్ణమే
యాకారంబును లేదు మాయ యిది రా
మా దీనచింతామణీ.

గ్రంథము వెల రు. 0-4-0 అణాలు. వలయువారు గ్రంథకర్త పేర కృష్ణాజిల్లా భీమవరం తాలూకా గణపవరమునకు వ్రాసినఁ బడయఁగలరు.

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

---

## విజ్ఞాన కందశతకము

గ్రంథకర్త: మద్రాసు రాజారావుగారు. వేగుఁజుక్క గ్రంథమాలవారిచేఁ బ్రకటితము. డిమ్మి ౧౬ సైజున ౩౧ పుటలు.

ఇయ్యది "శౌరీ" అను మకుటముగల శతకము. ఇందు ౧౧౫ కందపద్యములు సులభమైనశైలిని గలవు.

ఇందులో గ్రంథకర్తగారి దైవప్రార్థన తప్ప ఎట్టి విజ్ఞానమును, నీతియును గానరాదు. మచ్చునకు కొన్నిపద్యములు చూపఁబడుచున్నవి:

క. పరమాత్మా! వరదా! యని
పరమార్గముఁ గోరి నిన్ను భక్తవరేణ్యుల్,
పరమప్రీతిన్ గొలువఁగ
పరికింపక యుంట నీకు భావ్యమె శౌరీ!

క. గర్వం బుండిన దానిన్
సర్వంబు నణంచుశక్తి సామర్థ్యకళా
ధూర్వహుఁడవు గద వినత సు
పర్వా! నినుఁ గొల్చుదినము పర్వము శౌరీ!.

గ్రంథమువెల ౦–౩–౦. ఒకసారి ౪ ప్రతులు కొనువారు తపాలాఖర్చు భరింపఁ బనిలేదు. వలయువారు మేనేజరు: వేగుఁజుక్క గ్రంథమాల, పూడిపెద్దివారివీధి, బరంపురం, గంజాముజిల్లా, అని వ్రాసినఁ బడయఁగలరు.

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అన్నపూర్ణాదేవి జీవితము

గ్రంథకర్త్రి:—శ్రీమతి అట్లూరి వెంకటసీతమ్మ గారు. ౮౨ పుటలు, సాదాకాగితములు, కాగితపుబైండు, క్రౌన్‌సైజు, వెల ౧-౪-౦, ౧౯౨౯ సం. శ్రీ అన్నపూర్ణాదేవి గ్రంథమాల, ద్వితీయపుష్పము.

జీవితచరిత్రలు మన భాషయందు బహుకొద్ది. దానికి కారణము మనకు ప్రాపంచిక విషయములందుగల అశ్రద్ధయే. ఇటీవల యీరకమగు వేదాంతమును కొంచెము కట్టిపెట్టి లౌకికవిషయములందు శ్రద్ధవహించి బహోపకారుల భాషపరిణామమును, జీవితపరిణామమును తెల్పు జీవితచరిత్రల వ్రాసి ప్రజలకు నూతనాదర్శముల బోధించి దేశోన్నతికి తోడ్పడుచున్నాము.

శ్రీమతి అట్లూరి వెంకటసీతమ్మగారి అనుగ్రహము వల్ల మనకు శ్రీఅన్నపూర్ణాదేవి జీవితచరిత్ర లభించినది.

అన్నపూర్ణాదేవిగారు బ్రహ్మమతావలంబకులగు రామస్వామి చౌదరిగారి పుత్రిక. చౌదరిగారు మత సంఘదాస్యములనుండి విముక్తిగాంచినవారు. వీరు 'ఆడవారికి వంటచేయుటగాక మరొకటేల' అను నట్టి తరగతి ప్రజను సంబంధించిన వారు గారు. వారును వారిభార్యయగు పిచ్చమ్మగారును అనేక కష్టములకోర్చి అన్నపూర్ణమ్మకు కలకత్తాయందు (ఆంధ్రదేశమందు స్త్రీలకున్నత కళాశాలలు లేవుగాన) ఉన్నతవిద్య నభ్యసింప నవకాశమిచ్చిరి. తల్లిదండ్రు లిట్లు దృఢసంకల్పులైనచో బిడ్డలు విద్యావంతులుగారా!

అన్నపూర్ణమ్మయు కన్నవారికి కీర్తి తెచ్చు కుమార్తెగాన స్వసంపాదనపై నాధారపడవలెనను ఉద్దేశ్యముతో గ్రంథరచన ప్రారంభించి నిర్వహించినది.

ఈమె భర్తయగు 'ప్రియమైన నీడు' గారిని గుఱించి వేరే చెప్పవలసినది లేదు. వారియొక్క ఉదార స్వభావము, విశాలహృదయమే అన్నపూర్ణమ్మకు పెక్కు ఘనకార్యములుచేయుట కవకాశ మిచ్చినవి.

మనదేశము రెండువిధములగు దాస్యమునబడి తన్నుకొనుచు కుమిలించుచున్నది. ఒకటి మతసంఘదాస్యము, రెండు విదేశ ప్రభుత్వదాస్యము. ఈరెంటిలో మన మే యొక్కటి జయించినను లాభములేదు. ఏలయన రెండవది మనలను మారుమాటాడక ధ్వంసముచేయును. కావున మన మీ రెండురకములగు దాస్యములనుండియు పరిపూర్ణముగా విముక్తులము గావలెను. అట్లైనగాని మనప్రజలు సుఖపడరు, మనదేశ మౌన్నత్యమునకు రాదు.

అన్నపూర్ణాదేవి తండ్రిగారి కాలముననే వారి కుటుంబము సంఘమత దాస్యములనుండి విముక్తిగాంచినది. అన్నపూర్ణాదేవి తనకాలమున దేశమును ప్రభుత్వదాస్యమునుండి విడిపించుటకై గాంధీమహాత్ముని ప్రియపుత్రికయై ఆతని ఆజ్ఞలను శిరసావహించి దేశసేవకై తన జీవితమంతను ధారవోయ సమకట్టి పెక్కుసంవత్సరముల పాటు తనదీక్షను, దృఢసంకల్పమును వెల్లడిచేసెను. మనయొక్క అభాగ్యమువల్ల అత్యల్పవయస్సుననే మనలను విడనాడి (౧౯౧౦-౧౯౨౪) తన కార్యభారము మనకు ఒప్పగించినది. ఆ ఉన్న అల్పకాలమును సర్వదా అనారోగ్యవతియైయుండి తా జేయగలిగినంత చేయజాలకపోయినది. ఈమె తనజీవితములో నెరవేర్చుకొనదలచిన వేమన: ౧. స్త్రీలకొక కళాశాల (అన్నపూర్ణాదేవి పాఠశాలయే కళాశాలయగుగాక): ౨. మోహనదాస్ పరిశ్రమాలయ మభివృద్ధిపఱచుట. ఈరెంటిని ఆంధ్రస్త్రీలు నెరవేర్తురుగాక.

శ్రీ అన్నపూర్ణాదేవి జీవితము నాదర్శముగా నిడికొని ఆంధ్రస్త్రీలు సంఘమత దాస్యమునుండియు, ప్రభుత్వదాస్యమునుండియు విడివడెదరని పదేపదే చెప్ప నవసరములేదు. గ్రంథశైలి అధికగ్రాంథికముగా నున్నది. భాష యింకనూ కొంతసులభముగా నుండవలెను. శైలి రసవంతముగ నున్నది.

ఈ గ్రంథమాలాధికార్లు అన్నపూర్ణాదేవి జీవితచరిత్రను ప్రచురించినట్లే ఆమె జాబులనుకూడ ప్రకటించెదరని తలచుచున్నాను.

వలయువారు—శ్రీ అన్నపూర్ణాదేవి గ్రంథమాల, బ్రాడీపేట, గుంటూరు అని వ్రాయవలెను.

ఉేకుమల్ల కామేశ్వరరావు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## బాల్యవివాహ తత్త్వసారము

"డెమ్మీసైజు. 116 పుటలు. వెల రు. 1-0-0. అచ్యుతుని వేంకటాచలపతిరావు గారు. ప్రకాశకులు: మేనేజరు, స్వధర్మప్రకాశిని, కీలుపాకు, మద్రాసు.

"బాల్య వివాహమువల్లనే దేశము క్షీణించుచున్న" దనియును, "అట్టి దంపతులకుఁ బుట్టిన శిశువులు, దుర్బలులు, బుద్ధిహీనులు, పిరికిపందలు నగుచున్నారు" అనియును, మఱియు "నీబాల్యవివాహమువల్లనే యకాలశిశుమాతృమరణములు సంభవించుచున్న" వనియును, "సంఘశుద్ధిచెడుచున్న" దనియును, అను నీమొదలగు బాల్యవివాహ నిషేధశాసన ప్రతిపాదకసంస్కర్తల యాక్షేపణములు గ్రంథకర్త యీగ్రంథమున మున్ముందుచూపి, వానిని యుక్తియుక్తములును, సప్రమాణములును నగు సమాధానములచే బిమ్మట ఖండించిరి.

బాల్యవివాహములు, మహమ్మదీయులు మనదేశమును పాలించుకాలమునుండి యారంభమయినవి కాని, ఇవి ప్రాచీనములుగావను నాశయమును, వేదకాలమునుండియును బాల్యవివాహములు జరుగుచున్నట్టును, సీతాదేవికి ఒకటవసంవత్సరముననే వివాహము జరిగినట్టును, రాముఁడప్పటికి 16 సంవత్సరముల వాడయినట్టును అను నీమొదలగు హేతువులు చూపి ఖండించిరి. బాల్యవివాహములు జరుగుచున్న కాలములలోనే, బుద్ధిమంతులు, ధైర్యవంతులు, బలవంతులు నగు సంతానము విశేషముగా నున్నట్లు సహేతుకముగాను, సప్రమాణముగాను రుజువుచేసిరి. బాల్యవివాహములు విడనాడి ప్రౌఢావివాహములు తఱుచుగా జేసికొనువారి దేశములలోనే సంస్కర్తలు బాల్యవివాహముల కంటగట్టిన చిక్కులు సంభవించుచున్నట్లు తేటపఱచిరి. అకాలశిశుమరణాదులు, బాల్యవివాహములు జరుగుచున్న సంఘములలో గాక తదితరులలోనే విస్తారమున్నట్లు వ్యక్తపఱిచిరి. సంఘశుద్ధి ప్రౌఢావివాహములు చేసుకొనువారి దేశములలో లేశమయినను లేనట్టును, బాల్యవివాహములు జరుగుచున్న దేశములలో బాగుగ నున్నట్టును తెలియబఱచిరి. బాల్యవివాహములులేని దేశములో వారు దుర్భరదుఃఖముల కాస్పదులయి వాని నాచరింప మొదలిడుచున్నట్లు పాశ్చాత్యప్రముఖుల వాక్యములనే ప్రమాణములు చూపిరి. "ఎస్కిమోలు" పిల్లపుట్టిన తరువాతిగాని తత్పూర్వము గాని పిల్లతండ్రిని వివాహమునకయి యొడంబరచుకొను నట్లును, "ఆస్ట్రేలియా" దేశమువారును, న్యూజీలండువారును, న్యూగినియావారును పిల్లలు పుట్టినవెంటనే వెళ్లి వివాహముచేసికొనునట్లును ప్రమాణములను చూపిరి. ఇంగ్లాండుదేశమున 16 వ శతాబ్దివఱకును బాల్యవివాహములు జరుగుచుండెడి వనుటకు నిదర్శనములు చూపిరి. నిష్కపటమును, పరమ పవిత్రమును నగు దంపతుల ప్రేమకు బాల్యవివాహమే మూలకారణ మయినట్టు సహేతుకముగా రుజువుచేసిరి. బాల్యవివాహము విద్యార్థులకు మేలొనరింప లేదనువిషయము కల్లయనియు, అట్టివివాహము చేసికొనినవారలు సకల విద్యాపారంగతులయి ఎల్లవిషయముల సంఘమునకు మహత్ప్రయోజనకారకులయిరనియు దృష్టాంతములు చూపి ఖండించిరి. బాల్యవివాహములు లేని దేశములలో వారుపడుచున్న దుఃఖములను చూపిరి. హిందూమతమును, హిందూదంపతుల పవిత్రప్రేమను, వివేకసాహసాదులను పాశ్చాత్యమహాశయులు వేనోళ్లఁ బొగడి రన్నందులకు నిదర్శనములు చూపించిరి. పాశ్చాత్యవిద్యవలన హిందువులు స్వకులాచాగ ధర్మములను విడనాడి స్వకీయమతమునకు కళంక మాపాదించుచుండుటను పాశ్చాత్యుల గ్రంథములనుండి ప్రమాణముల నుద్ధరించి తెలియ జెప్పిరి. మత విషయములలో దొరతనమువారు జోక్యముచేసికొనఁ గూడదని చెప్పిరి. శారదాచట్టము విషయమై శాసనసభాదులలో ప్రతికూలురసంఖ్య హెచ్చుగానున్నట్టును, అనుకూలురు తక్కువై నట్టును రుజువుచేసిరి. మఱియును ననేకవిషయములను జూపి ప్రౌఢా వివాహములు అనాదిసిద్ధములు కావనియును, ప్రమాదభూయిష్ఠము లనియును, విదేశవిద్య నేర్చుకొనుటచే మనవారీదేశమునకు ఈముప్పును దెచ్చిపెట్టుచున్నా రనియును పర్యవసానము తేల్చిరి. అట్టి బాల్యవివాహములు చేయగూడ దనియును, శారదాచట్టమును రద్దుచేయించుటకు మనము ప్రయత్నింప వలయుననియును రూఢముగాఁ దెట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పఱచివి. అట్టియీ గ్రంథమును సావధానముగాఁ బ్రతి యాంధ్రుఁడును జదివి తత్ఫలమును బడయఁగలుగుచుఁ దేని గ్రంథకర్త పరిశ్రమము సఫలముగాఁగలదు. పాశ్చాత్య విద్యావ్యామోహ ప్రోద్భలములవలన హిందూమతమున బ్రవేశింపనున్న యీ క్రొత్త సంస్కారము మూలమున కలుగనున్న బాగోలు కాలమువలన అనుభవమువలన తేల గలవు. కీడే కలుగనున్నను ప్రతిఘటన మింతలో జరుగక పోవచ్చును; కాని కలిగినపుడుమాత్రము తప్పక ప్రతిఘటనము జరుగక పోదు.

గ్రంథస్థవిషయము లన్నియు పండిత పామరజన సుబోధముగ నుండునట్లు సులభశైలి నున్నవి. ప్రచారము నుద్దేశించిన గ్రంథము లిట్టులే యుండదగినవి.

ఉభయ భాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

## పువ్వులతోఁట

గ్రంథకర్త: సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు, తెలుఁగు పండితులు, మహబూబ్ కాలేజి, సికింద్రాబాదు. క్రౌనుసైజు, ౧౧౩ పుటలు. వెల ౮అ.

ఇది వివిధవస్తువులు గల ఏఁబది ఖండకావ్యముల సంపుటము. ఇందు 'కవి—అభినవస్వర్గము,' 'భావకవి' అను కావ్యములనుబట్టి ఈకవి కవితా సంభావన, తదభిరుచి వ్యక్తతరముగ తెలిసికోవచ్చును. సత్యసూచన లేని వర్ణనలకు పాత్రమగు, సత్యముతో సూత్రబంధమేని లేని అవాస్తవ వస్తుజాలముతోడిది వీరి 'అభినవ స్వర్గము' జ్ఞానపిపాసువులై విద్యయందు రమించు మర్త్యలోకవాసులకు, కవిజనమునకు మఱియు, అంతగా సమ్మతముకాదు. వీరీకావ్యములందు వ్యక్తీకరించిన అభిరుచి వీరి కవితలో నిరూఢమై కన్పట్టెడిని. కాని వీరు 'భావకవి' యెడ వెలిపుచ్చిన అభిప్రాయములలో అధమము ఒక్కటి తమకే ఒప్పగించుకోవచ్చును: "శక్తి నార్జించి వ్రాయఁగా" నింకను యత్నింపఁజనును వీరు.

"ప్రకృతి దృశ్యము"లో వీరు పైఁడి మేడలనుండి భూకాంతులనుపిలిచి, వెండి బంగారములు లెక్కించు "కుబేరుల"ను పిలిచి, "ప్రభుతఁ బ్రకటించు నధికారిపర్యుల"ను బిలిచి, "సర్వకాలంబు సౌధజాలమునందె" కడపక,

"ప్రకృతి దృశ్యంబులను జూడవచ్చు మీరు
రండు! మా గ్రామతటీకుటీరముల వైపుఁ
గనుఁడి"

అని యెచ్చరించి,

"ముక్కుతోఁ బట్టి సన్నని పుడక యొకటి
యాకసమునందుఁ బరువెత్తుకాకి యదిగో!
*　　*　　*　　*　　*
యమునివలె దున్నపై నెక్కి యరుగుచుండె
గొడ్లకాఁపతఁడు వాఁడుగో యొకండు!"

అనుచు నిట్లు సెలయేళ్లు, జంతువులు, పక్షులు, జనవిశేషములు మున్నగువానిని "అవిగో, అదిగో, రండు కనుఁడు" అనుచు చూపిచూపి,

"ఇంక నెన్నేనిఁ గనుదోయి కింపు నింపు
దృశ్యములు గానఁబడుచుండు నిచట మీకు;
విలువ గట్టుఁడు మీసౌధములకు మాదు
గుడిసెలకుఁ బక్షపాతంబుఁ గొనక మీరు"

అని వదలినారు. పిలుపులో ఆకర్షణ లేకున్నను, కవి కాఁబోలు పిలుచుచున్నాఁడను సద్భావముతో వారు విన వచ్చి (చూడనే వచ్చినచో కవి ప్రభావము గణనకు రాదుగా), మెచ్చక వెడలిపోయినచో, వారిని విరసులనుటకు వీలు లేదు. ఆశాభంగమునకై ప్రకృతితోపాటు వారును సానుభూతి పాత్రులుకాఁదగను.

'ప్రభాతము'నవలె, ఒక విషయమై భావనా ప్రసారము వెలివడుట కాక,—అది తక్కువ—అనావశ్యకమగు కథనము, "కాల్యకృత్యముల్ తీర్చి, భాస్కరున కర్ఘ్య మిచ్చి మరలితి"నను నట్టివి, కావ్యమును విరూపమొనర్చును. 'సుందరి,' 'సౌందర్య లుబ్ధుఁడు' మున్నగు కావ్యములు కొంత అభిరుచి నిమ్నతను సూచించును. 'నామనః ప్రవత్తి' వంటి వానిలో భావములు ఇంపుగూర్పకున్నవి. వచనములో చెప్పుటకైనను విశేషము లేని భావసామగ్రి యిందు మెండు. భావకవితకు అవస్థా ద్యోతన మున్నఁ జాలదు; ఆ అవస్థ ఆకర్షించుకొన్న భావన,—నుడిరీతిలో మెలఁగి,— కావ్యమునకు గౌరవపరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాణము నిర్ణయించును. లలితమగు, కవిత్వసమ్మతమగు భావవిన్యాసము వీరికవితలో ఇంకను చాలను వివిధవస్తు సంతతితో మాటాడ నుత్సహించును వీరిమనస్సు; నిష్ఠతో నిగ్గతేరి యెడతెగించు పూనిక, కళ పెంపొంద వలెను.

'పంచవన్నెల చిలుక,' 'తృణకణములు'లో కొన్ని భాగములు లోనగునవి చక్కఁగ నున్నవి. శైలి ధారాళము; సుబోధము. భాష నిర్దుష్టము. కొం. జ.

## కమలావాచకములు

ఈవాచకములలో రెండవది భారతి ఆరవసంపుటము పదునొకొండవసంచికయందు విమర్శింపబడినది. ఇపుడు తరువాతి వాచకములు విమర్శింపబడును.

ఈ వాచకములశైలి యొడుదొడుకుగ నున్నది. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కాక సంకరమయియున్నది. అనుక్రమము, పొందిక చాలకొఱత పడినది. ఇందువలన చదివినవెంటనే భావము గోచరించుట కష్టము. చిన్నపిల్లల పుస్తకములయందు విషయము చేతనొలిచి పెట్టిన యరటిపండువలె సులభగ్రాహ్యముగ నుండుటావశ్యకము. ఈ వాచకములయందలి పాఠములు చాలవరకట్టివి కావు. ఆమూలాగ్ర మివి సంస్కారమును గాంచనిచో వీనిని చదువువారికి లాభము గలుగజాల దనుట సాహసముకాదు.

నేఁడు బాలబాలికలకొఱకు పుట్టుచున్న పుస్తకములలో నూటిలో తొంబదిటికి నీగతియేపట్టినది. జీవిక జరుగని సామాన్య విద్యావంతులు, అసంస్కారులు గ్రంథరచనమునకు దొడంగుట యిందుకు కారణము. వీనివలన గ్రంథకర్తలకు, పాఠకులకు లాభము అల్పమాత్రమే—అనగా వీనికయి ప్రకాశకులవలన గ్రంథకర్తలకు లభించు సొమ్మును, వీనిని చదువుటవలన బాలబాలికలకు లభించు జ్ఞానమును తక్కువ యనుట. ఇక వీనిని బోధించు నుపాధ్యాయులపాట్లు చెప్పతరము కానివి. ఇన్నియుపద్రవములను పాఠ్యగ్రంథ నిర్ణయసంఘము తప్పింపవచ్చును. కాని అందలి సభ్యులు వాచకపుస్తకములగుణాగుణముల నిశ్చయింపగల సామర్థ్యము, శ్రద్ధ, పసిపాపల విద్యాభివృద్ధిపట్ల సానుభూతి గలవారు కానంతవరకు నదిసాధ్యము కాదు. నిర్దిష్టములగు అధమజాతి పాఠ్యగ్రంథములను బట్టి చూడ సభ్యులు ఏవంగుణ విశేషణవిష్టులు కారేమోయని సంశయింపవలసి యున్నది. ఈముప్పు తప్పుటకయి బాలబాలికల పోషకులు తీవ్రముగా ప్రయత్నింపవలయునని వెనుకటివలెనే ఇపుడును కావించుచున్న యీ హెచ్చరికను వ్యర్థపరుపక కర్తవ్యమునకు బూనుకొందురుగాక!

ఇకవీనియందు స్థూలముగ గోచరించు నసంగతములకొన్నిటి నీక్రింద జూడదగును.

### మూఁడవవాచకము

"దీని(వేపచెట్టు) యాకునకు ఏడు మొదలు తొమ్మిదివఱకు చిఱుతపత్రములుండును" పుట. 7. ఇక్కడ విస్తరముగా చెప్పక వృక్షశాస్త్రపాండిత్యము చూపుట వలన లాభము లేదు.

"సామాన్యముగా మనము భుజించు నాహారపదార్థములన్నియు వండుకొని తినవలసినవిగనే యుండును."పు.24.

"ఈగది మంటెడిగా నుండుటయే మంచిది."పు. 25.

"మీరు రెండవ తరగతిలో వారములను గూర్చి నేర్చుకొంటిరి. నాలుగు వారములు కలిసిన యెడల నొకమాసమగును. ('వారములు' అనుపదములకు రెండుచోట్ల నొకటేయర్థమా?) దీనినే నెలయని కూడ అందురు. నెలకు ముప్పది దినములు." పుట 43. పై లెక్క ప్రకారము ముప్పది దినములెట్లు? వారమునకు $7\frac{1}{2}$ దినములందురా?

"ఇంగ్లీషు మాసములందు తిథులకు బదులుగా తేదీలను వాడుదురు. మాసము నందున్నవన్నియును తేదీలగును." పు. 44.

"(చంద్రుడు) దినమునకు రెండేసి గడియల చొప్పున వృద్ధిపొందుచు ...... పూర్ణిమనాటికి రాత్రియంతయు వెన్నెల ప్రకాశించును." పు. 44.

ప్రకాశించు ధాతువు అకర్మకము. సకర్మకము కాదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"(చంద్రుఁడు) బహుళవిదియనాడు పాడ్యమి నాటికంటె మఱికొంచెము క్షీణించి * * * * ప్రకాశించును." పు 44. కొంచెమనిన ఎంతయని?

ఉత్తరము, జలాశయములు అను పాఠములు చాల ఎగుడు దిగుడుగనుండి వింతను గొలుపుచున్నవి. 'మేకీరాణి పాఠమున___" "ఈమె టెక్ ప్రభువునకు జనించెను" అని మరల "ఈమె ప్రభుకుటుంబములోనిది" అనికలదు. ఇచట పునరుక్తి.

"ఒకపుడు చిత్తూరు పట్టణమునుండి యొక మనుజుఁడు బండితోలుకొని పొరుగూరికి పోవుచుండెను" పు 55. అని ప్రారంభించి మరల ౮ బంతులతరువాత దీనిని మఱచిపోయి "ఆ రెండును ఈ స్థితిలోనుండగా బండివాడొకడు చూచెను" అని ఇంకొకని కొనివచ్చినారు.

ఇట్టివి ఎన్నియయినను చూపవచ్చును. 'నీతిగల గాడిద' 'ఏసుక్రీస్తు ఎరూషలేము ప్రవేశించుట' మొదలయిన పాఠములకంటె మంచివి దొరకకపోయినవి కాబోలు! ఇది పోనిండు.

అపశబ్దములు చూడుడు:

తక్షణము, ఉడత, పీవెన, యవ్వనవతి, పిందె, చక్కిలము మొదలయినవి.

అర్థ వివేచనమును గనుడు: వలచిన=కోరిన (పు. 4.) ఇక్కడ ప్రేమించిన యనుట తగును.

ముద్దినుసు=మూడు + దినుసులు = అనేకరకములు (పు. 16)

దురాశ=ఎక్కువ ఆశ (పు. 24) అగునా?

ఆనందము=సంతోషము, ఉత్సాహము = సంతోషము. (పు. 42.) రెండు పదములకు నొక్క యర్థమెట్లు పొసగును.

మాతృభాష=తల్లి భాష పు. 51. స్వభాష కదా!

వ్యాకరణాంశములలో 'ఎ ఏ'లు తప్పతక్కిన అచ్చులు మొదటగల పదములను వరుసగా చెప్పి 'ఈ పదముల మొదటి అక్షరములు అచ్చులు' అనిరి. 'ఎ ఏ'లు అచ్చులు కావనుకొన్నారో; లేక, ఇంకొకవాచకమున వానిని చెప్పదలచుకొని మీదు పెట్టినారో?

ఇక వీరి పద్యకవిత్వమును పాఠకులు కొంచెము చవిచూడదగును. "బరువుగల ఫలములచె వంగుతరులతోడ; జనులకింపొడఁగూర్చు వసంత మహహ" (పు. 37.)

## నాలవవాచకము

అసంగతములను చిత్తగింపుఁడు: రంగు "ముదురగనో లేక తేలికగనో" 14 పు.=ముదురురంగు లేతరంగు అనుట తెనుగు జాతీయము. "ఆ ఋతువులలో వచ్చు పుష్పములు" పు. 18. పూచు పుష్పములని కాబోలు!

"దీనిని (తులసిని) పెంచువారిని పవిత్రులనియు (ఇంతవరకు బాగున్నది) మర్యాదగల వారనియు పెంచుచున్నారు" పు 23. తులసిని పెంచకున్న మర్యాద లేదా?

"యంత్రసహాయమున గుట్టుట చేతఁబడెనేని" పు. 26. చేతనగునేని అని కాబోలు భావము.

సుకన్య సంయాతి పుత్రికయట. పు. 19. శర్యాతిపుత్రికగాని సంయాతి పుత్రిక కాదు. "గోమయమున గుమ్మరిబూడిద కలిపి యలుకవలెను" పు. 39. కుమ్మరి ఆవమునందలి బూడిద అని కాబోలు అర్థము. కాకున్న కుమ్మరినే బూడిదచేయవలసివచ్చును! "పెంకుముక్కలు నలుగగొట్టి మెత్తని బూడిదగజేసి" పు. 39. పెంకులను నలుగగొట్టితే బూడిద అగునా? ఇది వింతగా ఉన్నది.

శ్రీమహా విష్ణువుంగూర్చి తపస్సుచేయగా కృష్ణుడు ప్రసన్నుడైనాడట. పు. 52.

"తోడికోడండ్రిద్దరు నిజముయిన అక్కచెల్లెండ్రవలె." పు. 66.

"ముందు కుంతీదేవికి ధర్మరాజుపుట్టెను. (పు. 66.) అని చెప్పి మరల (పు. 67 లో) "కుంతికి క్రమముగా ధర్మజ (పునరుక్తి) అర్జున నకుల సహదేవులను నైదుగురు కుమాళ్లు పుట్టిరి. వారిని కౌంతేయులనియు, పాండవులనియు బిలిచిరి." అనిరి. కుంతికి తక్కినవారి

తోపాటు నకుల సహదేవులు కూడ పుట్టిరట! అందరు కొంతేయులట!

మురాసురుడు నరకాసురునికి తమ్ముడట! (పు. 51.)

" మేఘములు- వర్షము, వాయువు, నీటెని పరిశుభ్రముచేయుట- మొదలయిన పాఠము లిందున్నరీతిని పిల్లల తలకెక్కజాలనివి. మరియు వాక్యరచన ఒక పురుషమునుండి ఇంకొకపురుషములోనికి దాటుచుండును. (చూ. 8 పాఠము.)

వింతసమాసములు వింతపదములు చూడుడు:

పూలహారము (పు. 2); మనస్ఫూర్తిగ, భార్యాబిడ్డలు (పు. 19.), పడిసెభారము (పు. 24), సొంత (పు. 25), ఉపయోగపర్చుకొందురు (పు. 26), ఘాటు (పు. 26), సులభనరలకు (పు. 27), ఊహాపోహలు (పు. 28), వ్రయప్రయాసలు (పు. 28), అశ్వినీదేవతలు (పు. 22), వదెనా (పు. 36), ఉదయాస్థమయములు (పు. 37), నొక్కిరాసి (పు. 39), అర్జునుడు (పు. 41), మలుచటికోజును (పు. 53), సకల కోరికలు (పు. 58.), ఇత్యాదులు.

అర్థసారస్యములను దిలకింపుడు: అవమానము=సిగ్గు (పు. 4.) నిరసనభావము=నీచపుచూపు (పు 14) కారి=చేయునది. (పు 25). ఈ వింతపదము ఇందే కనిపించుచున్నది. ఇట్టివి పెక్కులు. ఎన్నియని పేర్కొనవచ్చును! ఇక దీనిలోని పద్యకవిత్వమును చిత్తగింపుడు.

" దాహమని బాటసారులు దల్లడిలుచు, బహువెల్లను నీటికై పరుగులిడుచు, వెదకి చలిపందిరినిగాంచి వేడ్కనొంది, చలువకై యేగు నటుకు గ్రీష్మంబునందు.

చలిని జనులెల్లఁ దిట్టుశీతలమె యిపుడు, వలయునంచును గీర్తింపఁబడుచునుండు, గ్రీష్మమందలి వేడికి వేగలేక, నీలగిరికేగి యచ్చట నీడగంద్రు. (పు. 50)

తరువాతివాచకమమాట తరువాత.—భారతి.

## ప్రణయ సౌరభము.

రాయల్ సైజు. పుటలు 62. వెల 0-12-0

రచయితలు-కొండపల్లి గోపాలరావు, హరిరామలింగశాస్త్రిగార్లు, కలవపాముల, కాటూరుపోస్టు, కృష్ణా జిల్లా.

"ప్రణయ సౌరభము" నాలుగు వీచికలుగా విభజించబడిన పద్యకావ్యము. ఇందు కథాచిత్రణమున నైపుణ్యము కానరాకపోయినా కథనములో సౌలభ్యము గోచరిస్తుంది. రచనలో ఉత్సాహమున్నంత పటిష్ఠత కనిపించదు. తమకవిత్వానికి మేలుబంతి పూర్వులదని నయితలు 'విజ్ఞప్తిలో'

'ఎందును లేవు పూర్వకవు లేగని త్రోవలు సత్కవిత్వని, ష్యంది మరందధారలు రసావహముల్ త్రిపురాసురారి మా, శీందుకళాభిష క్తము లహీనము లయ్యవి,లేమి కావ్యముల్, సెందుసె లోకమాన్యత, రుచించు నె కావ్య రసజ్ఞ పాళికిన్'

అని తెలియజేసినారు. కాని ఇందుపూర్వుల ఉత్కృష్టతలు ప్రతి ఫలించక పోయినవి.

'మాతులుంగలవంగ మాకంద జంబీర ఖర్జూరకదళికా క్రముకచయము.'

వంటివి వీరే తొలుత వ్రాయలేదు. ప్రకృతి వర్ణనలలో ప్రయత్నములే పొడకట్టుతూ ఉన్నవి. ఈ పుస్తకములో కానవచ్చునవి ఇంతకంటే మంచి నిర్వహణకు వాగ్దానములు. శైలికి ఉదాహరణగా మీది ఉత్పలము ఉపకరిస్తుంది. క్వచిత్తుగా వచనముంచడానికి ఇష్టము లేనట్లు వ్రాయబడినట్లున్న

'అనుచుఁ బెద్దయుఁ దపవారీతిమిగుల, బలిమాలు కొనుటకు ప్రత్యుత్తరంబు, నొసగంగఁ దరితీపు నొనరించునట్టి, యాపె నుద్దేశించి యంటి నిటు సఖి.'

వంటిపద్యాలెక్కడో గోచరిస్తవి కాని మొత్తానపద్యాలన్నీ బాగులేకపోనివి; విసుగుపొందక పాఠకుడు చదువుకోగలిగినవి. శ్రీ. శ్రీ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧ శివానందలహరీస్తోత్రము

(నా గ రి లి పి)

చిన్నసైజు, పుటలు ౩౨. వెల రు ౦-౩-౦.

ఇందు శంకరాచార్యకృత శివానందలహరీస్తోత్ర శివాపరాధ క్షమాపణ స్తోత్రములు, శ్రీధర వేంకటేశ్వరాచార్య విరచిత ఆర్తిహరాష్టకము నున్నవి.

౨ ఇంద్రాక్షీ స్తోత్రమ్

(నా గ రి లి పి)

చిన్నసైజు, పుటలు ౩౨. వెల ౦-౩-౦.

ఇందు ఇంద్రాక్షీస్తోత్రము, శ్రీశంకరభగవత్పాదకృత దేవీనవరత్నమాలికా స్తోత్ర, దేవీభుజంగస్తోత్ర, అర్ధనారీశ్వరస్తోత్రములు, మార్కండేయకృతమృత్యుంజయ స్తోత్రము నున్నవి. ఈరెండుపుస్తకములను ప్రకాశకులు చక్కగా పరిశోధించి,నిర్దుష్టముగా ప్రకటించినారు.

పైరెండు గ్రంథముల ప్రకాశకులు కడలంగుడి బ్రహ్మశ్రీ నటేశశాస్త్రిలుగారు, ౭౨ బిగ్ స్ట్రీటు, తిరువల్లిక్కేణి, చెన్నపురి.

---

౧. శ్రీవైష్ణవ తిరుమాళిగ

క్రౌను ౨౧ పుటలు. వెల ౨ అణాలు

౨. ఆండాళ్ తిరుక్కల్యాణము

[శ్రీవ్రతము (తిరుప్పావు) తులసీపూజ] క్రౌను. ౭౫ పుటలు. వెల ౮ అణాలు.

ఈ పైరెండు చిన్నపుస్తకములును విద్వాన్ నారాయణాచార్య కూరత్తాళ్వారయ్యంగారు రచించినవి.

విలాసము: యన్. క. వకుళాభరణం, ౨౨ పచ్చయప్పమొదలివీథి, కోమలీశ్వరన్ పేట, చెన్నపట్టణము.

పేరులవలననే యివి వైష్ణవ సంప్రదాయ గ్రంథములని తెలియుచున్నది. మొదటిదానియందు గృహస్థుల దినచర్య, భక్తిజీవనముగూర్చిన విషయములు గలవు. రెండవది ఆండాళు జీవితకథ, ఆమెవ్రాసిన తిరుప్పావునకు పద్యానువాదమును గలది. ఇందు ఐకమత్యము సంసార ఆధ్యాత్మ అనుభవముల గూర్చిన బోధనలు కలవు.

జ. బ్ర.

---

దాంపత్యము

ఇది దంపతులకు మిగుల నుపయుక్తమైన గ్రంథము. వాత్స్యాయనుని కామసూత్రములు, కొక్కోకము, కళాశాస్త్రము, చరకసుశ్రుతాది వైద్య గ్రంథములు, మహాభారతాదినీతిగ్రంథములు, మొదలయినవానినుండి దాంపత్య ధర్మములనేగూర్చి వ్రాయబడిన కొన్ని ముఖ్యవిషయము లిందుచెప్పబడినవి. "పెక్కు గ్రంథములు పరిశోధించి అశ్లీలమునకు దావులేకుండ శాస్త్రసమ్మతముగ క్లుప్తముగ సతీపతుల శారీరక మానసి కోల్లాసముల కనువగునట్లు దీనిని వ్రాసితి నని గ్రంథకర్తగారు పీఠికయందు జెప్పుకొనిరి. కామపురుషార్థ సంబంధమున సదుపదేశము లొసంగు గ్రంథమొక్కటిరైన భాషయందు గానరాదనియు, తామా కొఱతదీర్ప నీ గంథమును రచించితిమనియు వారు సూచించిరి. కామశాస్త్ర బోధనమని పేరు బెట్టి కొంద ఱొకకొన్నిగ్రంథముల మిగుల పచ్చిగా వ్రాసిరనుట వాస్తవమేకాని కామశాస్త్ర విషయిక గ్రంథములన్నియు నట్టివనుట సాహసము. కొంద ఱవిషయముల జాలవిస్పష్టముగా వ్రాయవలయుననియు, కొందఱు దంపతులకెల్ల నిట్టి రహస్యవిషయిక జ్ఞానము స్వాభావికముగా యౌవనాగమముతో నెవ్వరి ప్రబోధము లేకుండ నభివృద్ధిచెందుననియు, అట్లనుటచేత నట్టి రహస్య విషయికమైన గ్రంథరచన వట్టియనర్థదాయక మనియు వాదింతురు. ప్రథమాధ్యాయమున గ్రంథకర్త యీ వాదములను కొంతవిమర్శించి కామశాస్త్రోత్పత్తియు, దాని యావశ్యకతయు నిరూపింప బ్రయత్నించెను. పచ్చిగా జెప్పబడిన కామశాస్త్రీయగ్రంథములు కామోన్మత్తులగు పామరులను, బాలకులకు దుర్వికారములకును, దురవసలకును బాలుసేయును. సర్కారువారట్టి గ్రంథముల నిషేధించుటయు నత్యవసరము. "ఒక స్త్రీగాని, ఒక పురుషుడుగాని తమ శీలమును బుగ్గిగలపి స్వేచ్ఛగా విహరించిన జాతియంతయుఁ జెడిపోవుచున్నదని తలంపవలయును. ఏ జాతి తనయందలి స్త్రీనిగౌరవించునో ఆ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాతి చిరస్థాయిగా వర్ధిల్లి కృతార్థత గాంచగలదు. స్త్రీ మాతృదేవతయొక్క ప్రతిబింబము. ఏనాడు స్త్రీ తనపతిని దైవముగా భావించి అన్యపురుషుల సోదరులవలె జూచునో, ఆనాడే స్వాతంత్ర్య లక్ష్మి మనయింట దాస్య మొనరింపగలదు? మానవుని యున్నతనీచములు, గౌరవాగౌరవములు, ధర్మాధర్మములు, స్త్రీలపవిత్రశీలముపై నాధారపడియుండును." అని వీరీగ్రంథమున బలుతావులను ఘోషించుట చాల ముదావహముగనున్నది. ఈ గ్రంథము కామశాస్త్ర విషయికమగు మర్మముల వెల్లడించునదైనను ఎచ్చట నసభ్యముకాని, అశ్లీలముకాని కానరాదు. దంపతులకు కామసంతృప్తి, పరస్పర వైషమ్యము, తన్నివారణోపాయములు, వంధ్యాత్వము, సంతాననిరోధము, సుఖరోగములు, వానిచికిత్స, కన్యావిస్రంభణము, ఉపచారవిధులు, సంయమావశ్యకత మున్నగు విషయములీగ్రంథమున వర్ణింపబడినవి.

పాశ్చాత్య విద్వాంసుల గ్రంథములనుండియు, ప్రబంధములనుండియు దాంపత్య ధర్మములతో సంబంధమున్న కొన్నివిషయము లీగ్రంథమునం దుద్ధృతములైనవి మాదిరికి, కొన్ని యుదాహరణములు:—

మను చరిత్రమునుండి:

ఎవ్వడు మీఁదెఱుంగక యధేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా, నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁ దా, నవ్వెడఁగ మ్మనుష్యపశువ య్యవివేకి చెడుఁగా జగంబునన్, నవ్వఁగఁబాలు గౌరవమునన్ బడఁబాలును నిందపాలునై.

మహాభారతమునుండి:

శ్లో. అపత్యోత్పాదనార్థంచ తీవ్రం నియమమాస్థితః;
కాలేనియమితాహారో బ్రహ్మచారీ జితేంద్రియః।

ఉద్ధృతభాగములలో నర్థముల తప్పులును, వాక్యసమన్వయదోషములును కొన్ని పొడకట్టుచున్నవి. విషయావబోధమున కిది అడ్డుఅగును.

గ్రంథము 105 పుటలు. వెల ఒక రూపాయి. వలయువారు దొంతిశెట్టి నాగేశ్వరంవు, 2, రామానుజ కూటంవీథి, పాతచాకలపేట, మదరాసు. అని వ్రాసిన బడయగలరు.

దివాకర్ల సోమసుందర రావు.

## South Indian Music Series

## Book II. (Stage III.)

(మేళకర్త రాగములపట్టికతోను, రెండు అనుబంధములతోను సహా.) గ్రంథకర్త: పి. సాంబమూర్తి గారు, బి. ఏ., బి. యల్., లెక్చరర్ ఇన్ ఇండియన్ మ్యూజిక్, క్వీన్ మేరీస్ కాలేజ్, మద్రాసు. క్రౌను సైజు ౧౫ పుటలు. వెల ౯ అ.

ఈ గ్రంథకర్త మిక్కిలి అనుభవముతోను, పరిజ్ఞానముతోను వ్రాసిన ప్రాథమిక సంగీత బోధినులు మూటిలో నిది చివరది.

ఇందు ముఖ్యముగ రాగములనుగూర్చి యిచ్చిన వివరములు మిక్కిలి ప్రశంసనీయముగనున్నవి. ద్వాదశ చక్రములలో పూర్వోత్తర మేళకర్తలు 72 ను స్వరూపములతో అనుకూలముగ కూర్పబడినవి. శుద్ధమధ్యమ ప్రతిమధ్యమములు పూర్వ-ఉత్తర మేళకర్తలకు సర్దుకొనగా ఆయాయి ఋషభగాంధార ధైవతనిషాదభేదములు ఏయే చక్రములందు వచ్చునో ఒక పద్ధతిగ వివరింపబడినది. జన్యరాగములలో వక్రావక్ర భేదములు, వాని అవాంతరభేదములు, వర్జావర్జములు, ఉపాంగ భాషాంగములు, నిషాదాంత్య ధైవతాంత్య పంచమాంత్యములు, ఇవికాక ప్రాచీనవిభాగము లగు శుద్ధరాగ, ఛాయాలగ (సలగ) రాగ, సంకీర్ణ (సంక్రమ; మిశ్ర) రాగములు-వీనినైనను తెలుపబడినది. స్వరముల వాది, సంవాది, వివాది, అనువాది భేదములు, గ్రహ, న్యాస, అంశభేదములు వివరింపబడినవి. ౧౨ రాగముల సమగ్ర, లక్షణములు ప్రామాణికములగు కొన్ని రాగచరిత్రములతోను, సంచారాది విశేషములతోను ఈయబడినవి. ఇటఘున, నయ (రక్తి), దేశీయరాగ విభేదవివరణము కలదు. తుదను స్వరజ్ఞా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్యాసములును, ౧౭౦ జన్యరాగముల మేళ స్వరూపములును రెండు అనుబంధములుగా కూర్చబడినవి. రాగసంచారములను బాగుగచూపు తానవర్ణములు మూడు చేర్చబడినవి. శాస్త్రీయ గేయరచనయందు వర్ణముల ఔత్కృష్ట్య మిట వివరింపబడినది.

వివిధపారిభాషికపదవివరణము తొలుతనే కలదు. కృతులు, వర్ణములు మున్నగు గేయరచనల చర్చించుటయందును, వివిధజంత్రవాద్యములగూర్చిన ప్రకరణమునను, జనసామాన్యము వాడుకగా పాడుకొను పాటల రకములను వేఱుపఱిచి చూపుటయందును పొందికైన భోగట్టా యెంతయో కలదు.

సప్తతాళములు జతిభేదములచే ౩౫ గను, పిదప గతిభేదములచే నవి ౧౭౫ గను ఏర్పడుట దీని వెనుకటి గ్రంథములలో వివరించియుండెనట. ఇచట దేశాది, మధ్యాది, చాపు భేదములు తెలుపబడినవి. గ్రంథముతుదను ౨౫ ప్రశ్నములున్నవి. మంచిశాస్త్రజ్ఞతి, ప్రామాణికత, విద్యార్థులకవి యుపయోగపడురీతి ప్రయోగించు సామర్థ్యము, రచనయందు పొందిక ఈ గ్రంథమునకు ప్రాముఖ్యము నిడుచున్నవి.

ఈ వరుస మూడు గ్రంథములును ఒక్కసంపుటముగ 'Elements of Karnatic Music' అనుపేర ప్రకాశకులు (The Indian Music Publishing House, G. T., Madras.) ప్రకటించినారట.

కాం. జ.

---

# స్వీకారము

ఆంగ్లదేశచరిత్ర సంగ్రహము. ప్రథమభాగము క్రౌనుసైజు, పేజీలు 115 వెల రు 0-10-0.

ద్వితీయ భాగము. క్రౌనుసైజు, పేజీలు 88, వెల 0-8-0 గ్రంథకర్త: భాస్కరసుబ్బయ్యగారు, బి.ఏ., యల్.టి., సహాయ చారిత్రకోపాధ్యాయుడు, బసవరాజా హైస్కూలు, పుంగనూరు.

దొరకుచోటు: వి. రమణా అండ్ కో,
వేపేరి; మద్రాసు.

---

గుంటూరుజిల్లాలో గోలిఅను గ్రామము వద్దనున్న స్తూపమునందలి బౌద్ధశిల్పము:
(Bulletin of the Madras Government Museum)

ఆంగ్లము: డిమ్మీసైజు, పుటలు 44 ఆర్టు కాగితము. పెక్కు శిల్పచిత్రము లున్నవి. వెల రు 2-12-0 1929 సం.

గ్రంథకర్త శ్రీటి. యన్. రామచంద్రన్ గారు, యమ్. ఏ., ఆర్కియాలజి అసిస్టంటు; ప్రకాశకులు: సూపరింటెండెంటు, గవర్నమెంటు మ్యూజియం, చెన్నపురి.

---

ఆంధ్రమేఘసందేశము

క్రౌను, ౭౪ పుటలు. మేలికాగితము. అందమయిన అచ్చు. వెల రు ౦-౧౨-౦.

గ్రంథకర్త: గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారు, యం. ఏ., ఆంగ్లోపన్యాసకులు, వేంకటగిరిరాజాగారి కళాశాల, నెల్లూరు.

---

శ్రీరాఘవేంద్రస్తోత్రము.
(సంస్కృతము-సటీక)

క్రౌను ౪౨ పుటలు, నునుపుకాగితము. వెల రు. ౦-౪-౦. ౧౯౩౦. సం.

టీకాకారుడు: ప్రొద్దుటూరి నరసింగరావుగారు, బి. ఏ., గురుప్రసాద, (లచ్చిరాజువీథి) సూర్యారావుపేట, కాకినాడ.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## హోమియో వైద్య చికిత్సాసారము

మాలికారహస్యము భా ౧

క్రౌను ౧౪౯ పుటలు. నునుపుకాగితము. వెల రు ౨-౭-౦, ౧౯౩౦. సం.

గ్రంథకర్త:—డాక్టరు బి. శ్రీరాములుగారు హోమియోపతిస్టు, బయో-కెమిస్టు, విజయనగరము.

---

## పాతపాటలు

క్రౌను ౨౧ పుటలు. నునుపు కాకితము, అందమైన ముద్రణము. వెల అ. ౨. ౧౯౩౦. సం.

సంపాదకులు: వేకమళ్ళ కామేశ్వరరావుగారు, బి.ఏ.

---

## పుష్పాంజలి

(కావ్యములు) సంపుటము ౧

డిమ్మి ౧౭౭ పుటలు. రఫ్ కాగితము. వెల రు. ౧-౪-౦. ౧౯౨౯. సం.

గ్రంథకర్త: కల్లూరి వేంకటనారాయణ రావుగారు, బి. ఏ., యల్. టి.

ప్రకాశకులు: కల్లూరు యజమాన సుబ్బారావు గారు, ఆత్మకూరు, అనంతపురంజిల్లా.

---

## శ్రీమద్రామాయణతత్త్వజిజ్ఞాస

(ఆదిశైవ గ్రంథమాల ౭) డిమ్మి ౩౯ పుటలు. రఫ్ కాగితము. వెల అ. ౪. ౧౯౨౯సం. శ్రీగురుకులాశ్రమము. చిలుమూరు, అనంతవరముపోస్టు, గుంటూరుజిల్లా.

గ్రంథకర్త: పొన్నలూరి సూర్యనారాయణ శర్మగారు.

---

## ముకుందమాల

(అ ను వా ద ము)

క్రౌను ౧౦ పుటలు. రఫ్ కాగితములు. వెల అ. ౨ లు. మచిలీపట్టణమున సత్యసాధనీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

అనువాదకులు: చెఱుకూరి కాళహస్తీశ్వర శర్మగారు.

ప్రకాశకులు: కోన ఆదినారాయణ వర్మగారు, సత్యసాధని ప్రెస్సు, బందరు.

---

## పశు వైద్యవస్తుగుణదీపిక

(చతుర్థపుష్పము) క్రౌను ౨౬౨ పుటలు. మంచి కాగితము. పేపరుబైండు. వెల రు. ౨. ౧౯౨౯ సం.

గ్రంథకర్త: యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు, అంగలూరు, కృష్ణాజిల్లా.

---

## ఆంధ్రాధ్యాత్మరామాయణము

రాయల్ సైజు, ౪౫౦ పుటలు. నునుపుకాగితము. అందమైన ముద్రణము. క్యాలికోబైండు. వెల రు. ౩ లు. ౧౯౨౯ సం.

అనువాదకుడు: పిసుపాటి నారాయణ శాస్త్రిగారు, పొన్నూరు, గుంటూరుజిల్లా.

---

## Kampili and Vijayanagaram

(ఆంగ్లము) క్రౌనుసైజు ౩౭ పుటలు. వెదురుగుజ్జుకాగితము. అట్టబైండు. వెల తెలియదు.

రచయిత: యన్. వెంకటరమణయ్యగారు యమ్. ఏ., పి. హెచ్. డి. చారిత్రకోపన్యాసకులు. క్రైస్తవకళాశాల, చెన్నపురి.

---

## హిందీ మొదటి పాఠపుస్తకము భా. ౨

క్రౌను ౩౬ పుటలు. నునుపుకాగితము. వెల అ. ౩. ౧౯౨౯ సం.

రచయిత: కూచిమంచి సుబ్బారావుగారు, గ్రేజరుపేట, కాకినాడ.

---

## శ్రీ అల్లిపుర వేంకటేశ్వర స్తోత్రరత్నములు

దండకము: డిమ్మి చిన్నసైజు, ౭ పుటలు. వెల అర్ధణా. ౧౯౩౦ సం.

రచయిత: వక్కలంక శ్రీనివాసరావుగారు.

ప్రకాశకులు: అందే కృష్ణమూర్తి బ్రదర్సు, ౪౪ కొట్లు, బజారువీథి, విశాఖపట్టణము.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(Moonbeams)

(ఖండకావ్యముల సంపుటి.)

ఆంగ్లము. క్రౌను ౩౪ పుటలు. వెదురు నుజ్జు కాగితము. అందమైన బైండు. వెల తెలియదు. ౧౯౨౯ సం॥

ప్రకాశకులు: యూత్ ఆఫ్ ఏషియా సొసైటీ, మచిలీపట్నము.

గ్రంథకర్త: వి. యస్. భూషణ్ గారు,

---

౧. వావిళ్ల వాచక పుస్తకము

మొదటి తరగతి:

| | | | | |
|---|---|---|---|---|
| పుట ౭౬ | వెల రు. | ౦ | ౩ | ౦ |

రెండవ తరగతి:

| | | | | |
|---|---|---|---|---|
| పుట ౯౨ | ,, | ౦ | ౩ | ౦ |

మూడవ తరగతి:

| | | | | |
|---|---|---|---|---|
| పుట ౧౧౬ | ,, | ౦ | ౪ | ౬ |

నాల్గవ తరగతి:

| | | | | |
|---|---|---|---|---|
| పుట ౧౨౦ | ,, | ౦ | ౫ | ౦ |

పుస్తకము తీరు, అచ్చు, అందముగా నున్నది. ౧౯౨౯.

గ్రంథకర్త: జయంతి గంగన్నగారు,
బి. ఏ., యల్. టి.,
వీరేశలింగం హైస్కూలు ప్రధానోపాధ్యాయులు,
రాజమహేంద్రవరము.

౨. సులభగణితము, భా. ౧.

నాల్గవ తరగతి:

| | | | | |
|---|---|---|---|---|
| పుట ౧౭౪ | వెల రు. | ౦ | ౭ | ౧ |

గ్రంథకర్త: శ్రీకంఠం కృష్ణారావుగారు,
బి. ఏ., యల్. టి.,
బోర్డుహైస్కూలు, కావలి. ౧౯౨౯.

3. శ్రీ ప్రమోదూతనామ సంవత్సర పంచాఙ్గమ్

తిరుమల కాండూరు వేంకటతిరుమలాచార్య సిద్ధాంతిగారు గణించినది. వెల రు. ౦-౨-౦.

పై మాటికి ప్రకాశకులు:
వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్,
చెన్నపురి.

---

## పత్రిక

ఆనందవాహిని

సంపుటము ౧. సంచిక ౧.

౧౯౩౧ సంవత్సరం జనవరి నెలలో ప్రారంభమయిన పత్రిక—సంవత్సరం చందా రు. ౧-౦-౦.

ప్రకాశకులు: యస్. యస్. వార్ష్ణేగారు,
244, టంకసాల వీథి, మదరాసు.

---

Renasent India (ఆంగ్లము)

క్రౌను ౧౧౫ పుటలు. మేలుకాగితము అందమయిన బైండు; వెల రు. ౧-౦-౦. రెండవకూర్పు.

గ్రంథకర్త: కే. యస్. వెంకటరమణిగారు, విలాసము: శ్వేతారణ్యాశ్రమము, మైలాపూరు, చెన్నపురి.

పుష్పాంజలి

డిమ్మిసైజు. సంపుటము ౧. సంచిక ౧. ఈ పుష్యమాసముతో ప్రారంభమయినది. సంవత్సర చందా రు. ౧-౧౨-౦. సంపాదకుడు: శ్రీ జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు. ప్రకాశకులు: కర్పగం అండ్ కంపెని, ౪, వీరాస్వామిపిళ్లె వీథి, మదరాసు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






## బ్రహ్మశ్రీ ఈమని అచ్యుతరామశాస్త్రిగారు

వీరు గోదావరి మండలములోని రామచంద్రపురం తాలూకా ద్రాక్షారామ గ్రామ నివాసులు. వీణాగాన ప్రవీణులు. వీరి తండ్రిగారగు బ్రహ్మశ్రీ సుబ్బారాయ శాస్త్రిగారు వైణికవతంసులై విజయనగరప్రభువులును, అభినవాంధ్రభోజులును నగు శ్రీప దానందగజపతి మహారాజావారి యాస్థానగాయక శిఖామణులలో నొక్కరై ప్రసిద్ధి కెక్కినవారు.

అచ్యుత రామశాస్త్రిగారు తండ్రిగారివద్దనే విద్య నభ్యసించుచు దీక్షతో గొప్ప కృషి చేయుటయేకాక దక్షిణదేశ సంచారముచేసి అచ్చట గొప్పవిద్వాంసుల బాణీలన్నియు జూచి మెళుకువలను గ్రహించి వచ్చి బహువిధము లగు సాధనలు చేసి యారితేరిరి.

వీరు విద్వత్తునందు మాత్రమేగాక మంద్రమధ్యమ తారాది స్వరములయందలి నైపుణ్యమును జూపి సుఖ బాణీలచే సభ్యులను సంతోషపరవశులను గావించి యానందింప జేయుటలో బహుసమర్థులు.

వీ రిదివరకు దేవరకోట, దక్షిణవల్లూరు సంస్థానములయందు చాలకాలము విద్వాంసులుగా నుండి ప్రస్తుతము స్వగ్రామ పరిసరమునను గల వేగాయమ్మపేట సంస్థానమున తదాస్థానప్రభువుల యాదర గౌరవములకు పాత్రులై యున్నారు. ఆంధ్రపత్రిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri







## శ్రీమతి షానో దేవిగారు

ఈమె జలంధరునందలి కన్యామహావిద్యాలయపు ప్రధానోపాధ్యాయిని. తూర్పు ఆఫ్రికాకువెళ్లి యీమె ఈ విద్యాలయమునకు లక్షరూపాయలను సంపాదించి తెచ్చెను. ఇంకను ధనమును సమకూర్చుటకు ముందు దక్షిణాఫ్రికాకు వెళ్లనున్నది.




## శ్రీమతి చిన్నలక్ష్మమ్మగారు

ఈమె అనంతపురము విద్యాసంఘసభ్యురాలుగా నియమింపబడిరి.

7. 2- 21 3౫౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీమతి జి. ఆనందరావు సతిగారు

ప్రభుత్వమువారీమెను నెల్లూరు మునిసిపలు కౌన్సిలు సభ్యురాలుగా నియమించిరి.



శ్రీమతి బి. వి. సుబ్బమ్మగారు

నెల్లూరు జిల్లాబోర్డు సభ్యురాలుగా నియమింపబడిరి. ఇదివరకీమె నెల్లూరుజిల్లా విద్యా సంఘమునను, నెల్లూరు మునిసిపలు సంఘమునను సభ్యురాలుగా నుండిరి.

---

# చమత్కార చంద్రిక

తాడూరి లక్ష్మీనరసింహారావు గారు

## మూలము

అపూర్వేయం ధనుర్విద్యా
భవతః శిక్షితా కుతః;
మార్గణౌఘ స్సమాయాతి
గుణో యాతి దిగంతరమ్.

## తెనుఁగు పద్యము

తే. ఇట్టి నీదైన విలువిద్య యెందు నేర్చి
తివి యపూర్వంబు దీని పెంపేమొ కాని
మార్గణాళిని రాఁదీసి మర్కువమున
గుణము వదలెడు దిక్కుదిక్కులకుఁ బాఱ.

## వివరణము

ఇందు దాతయగు రాజునుగూర్చి యొక కవి చెప్పుచున్నాఁడు. మార్గణశబ్దమునకు బాణమనియును యాచకుఁడనియు నర్థములు గలవు. గుణశబ్దమునకు వింటినారియనియు, దాతృత్వాదిసద్గుణమనియు నర్థములు గలవు లోకములో విలువిద్య నేర్చినవాఁడు తన చెవిదాఁకను గుణము [నారి] లాగి మార్గణము [బాణము] వదలిపెట్టును. ఇందుఁ జెప్పిన రాజు మార్గణ [యాచక] సమూహములను దనయొద్దకు లాగికొని గుణము [దాతృత్వగుణము]ను దేశము నలుదెసలకును వ్యాపింపఁజేయుచున్నాఁడు. ఇది యపూర్వమైన విలువిద్య.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాభిప్రాయవిశేషములు

ప్రపంచపరిణామమునందు ఘటనాఘటన నిర్ణయము దుస్తరము. ఒకకాలమునందు ఘటనమునకు సాధనము వేరొక సమయమందు అఘటనరూపమును బొందుచుండును. ఆరంభమునందు అఘటనరూపమునను గనపడెడి విషయము కాలాంతరమున ఘటనరూపమును దాల్చుచుండును. ఘటనాఘటనయోగములు రెండును పురోభివృద్ధికి సాధనములగుచున్నవి. సృష్టియందు విలయము, విలయమునందు నవీనసృష్టియు ప్రపంచప్రవృత్తికి సహజావస్థలు. ప్రవృత్తికి సహజమైన విలయావస్థ మహాయోగులను సైతము విషాదపరవశులను జేయుచుండును. ధనుర్ధారియైనను విజయుడు కురుక్షేత్రమందు వలెనే విశ్వరూపసందర్శనమందును విషాదయోగపరవశుడై ధర్మనిరీక్షణమును జేయజాలకపోయెను. ధర్మలక్ష్యరహితమైన ప్రపంచప్రవృత్తి యంతయు భయభ్రాంతులను గలుగజేయుచు ప్రజ్ఞావాదనమునకు సాధనమగుచున్నది. ధర్మలక్ష్యసహితమైన ప్రపంచప్రవృత్తి పురుషార్థమునకు సాధనమగుచున్నది. ప్రపంచప్రవృత్తిని ప్రజ్ఞావాదనతో గాక ధర్మలక్ష్యముతో జూచునపుడు అన్ని సంశయములును పోయి ధర్మనిర్వహణము సాధ్యమగును. వర్తమానకాలమునందు ప్రజ్ఞావాదనమునకు గల ప్రాబల్యము ధర్మలక్ష్యమునకు గలుగకున్నది. పరివర్తనసమయమునందు సకలరంగములందును ప్రజ్ఞావాదదక్షులైన నాయకులు బయలుదేరి ప్రజాహృదయమునందు మహాసంక్షోభమును గలుగజేయుచున్నవిధము ప్రపంచప్రవృత్తి అనంతముఖముల విశదము చేయుచున్నది. నాయకుల గంభీరోపన్యాసములు ప్రజలను సంశయపరాయణులను జేయుచు కార్యవిముఖులను జేయుచున్నవి. అనధికారులైన నాయకులు గలుగజేయుచున్న మహాసంక్షోభము ప్రపంచపరిణామమునకు సాధనభూతమైనను, భయభ్రాంతులను గలిగించుచున్నది. ప్రపంచావృతమైన మహాపరివర్తనము భరతవర్షమునందును మహాసంక్షోభమును గలుగజేయుచున్నది. పాలక పాలిత జాతిభేదము, హిందూమహమ్మదీయ భేదము, కులభేదములు, మతభేదములు గల విశాలమైన భరతఖండమునందు పరివర్తనపరిణామము భయంకరరూపమును దాల్చుట సహజము. పాలక పాలితులకు, హిందూ మహమ్మదీయులకు, జాతీయ స్వాతంత్ర్యవాదులకు పరస్పర విశ్వాసము లేనపుడు ధర్మలక్ష్యనిర్వహణము దుర్లభమై పరివర్తనప్రయోజనము భయసంభ్రమములను గలుగజేయుచున్నది. స్వాతంత్ర్య సంరంభమునందు గాంధి మహాత్ముడు నిర్వహించుచున్న ధర్మలక్ష్యము సయితము ప్రజ్ఞావాదమునకు బలి

7. 2- 22 3x3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగుచున్న విధమును లాహోరు కాంగ్రెసు వ్యవహారములు విశదము చేయుచున్నవి.

* * * *

నాయకరాజప్రతినిధుల సమావేశము

భారత స్వాతంత్ర్య సంరంభమునందు 1929 డిసంబరు 23-వ తేది మహాముహూర్తముగను పరిణమించినది. ఢిల్లీ నగరమునందు ఇర్విను ప్రభువునకును, గాంధి నెహ్రూ సప్రు జిన్నా గార్లకును జరిగిన సమావేశము గోప్యమైనను దూరాధిగూఢముగను బరిణమించినది. ఆ సమావేశమునందు నడిచిన వ్యవహారములు రాజ్యతంత్రమునకును, ధర్మనిర్వహణమునకును గల భేదమును విశదము చేసినవి. ఢిల్లీ సమావేశమునందు త్రికోణ సంరంభము వ్యక్తమైనది. లండను నగరమునందు గూడ వలసిన వివిధపక్షసమావేశమునకు మూలాధారము అధినివేశస్వపరిపాలనము. రాజప్రతినిధియును, జిన్నా సప్రుగార్లును వారిదృష్టిని వివిధపక్షసమావేశమునందు లగ్నము చేసినటులు అధినివేశస్వపరిపాలనమునందు లగ్నము చేయలేదని గాంధిమహాత్ముని లాహోరు ప్రసంగములు, నవజీవనపత్రికలోని వ్యాసములు, రాజప్రతినిధి సామ్రాజ్యశాసనసభయందు జనవరి 25-వ తేదిని జేసిన ప్రసంగము విశదము చేసినవి. వివిధపక్ష సమావేశము చేసిన నిర్ణయములను బ్రిటీషు ప్రభుత్వము సమర్థించుటకు బూనుకొననపుడా నిర్ణయములు కార్యరూపము దాల్చకను కాగితపు నిర్ణయములుగానె యుండును. నిర్ణయములను బ్రిటీషుప్రభుత్వము నిరాకరించినను ఇర్విను ప్రభువైనను సమర్థించుటకు బూనుకొననపుడు వివిధపక్ష సమావేశమువలనను స్వరాజ్య నిర్ణయమునకు ప్రయోజనము గలుగదని విశదమైనది. పేరంటమునకు వలెను సమావేశమునకుబోవుటకు సప్రు జిన్నా గారు లంగీకరించినను గాంధిమహాత్ముడు నిరాకరించి మాతృదేశమునకు మహోపకారమును జేయగలిగెను. స్వరాజ్యప్రయోజనము లేని వివిధపక్ష సమావేశమును కాంగ్రెసు నిరాకరించుట ధర్మము గాని ఆమోదించుట ధర్మము గాదు. స్వరాజ్యలక్ష్యము లేని సమావేశమును నిరాకరించిన గాంధిమహాత్ముడు ప్రశంసలకు పాత్రుడు గాని నిందలకు పాత్రుడుగాడు. అధినివేశ స్వపరిపాలనమును సంపాదింపగల నాయకులు లండను నగరమునకు పోయి స్వపరిపాలనమును సంపాదించిన మొదలను కాంగ్రెసు కృతజ్ఞతతో స్వీకరింపగలదు.

రాజప్రతినిధి సామ్రాజ్యశాసనసభయందు జేసిన సంభాషణము తరువాతనైనను ప్రతికూలాభిప్రాయమును వెల్లడీచేసినవారు వారి యభిప్రాయములను మార్చుకొనుట ధర్మము. ఢిల్లీసమావేశమునందు ఇర్వినుప్రభువు చూపిన రాజ్యనీతి బ్రిటీషుప్రభుత్వమునకు సహజమైనను లాహోరు కాంగ్రెసు నిర్ణయములకు సాధనభూత మైనది.

* * * *



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## లాహోరు కాంగ్రెసు

భారతస్వాతంత్ర్య సంరంభమునందు లాహోరు కాంగ్రెసు పరంజ్యోతివలెను ప్రకాశింపగలదు. కాంగ్రెసు గమ్యస్థానము పూర్ణస్వరాజ్యమని (Complete Independence) గాంధిమహాత్ముడు ప్రతిపాదించిన తీర్మానమును కాంగ్రెసు ఆమోదించినది. గాంధిమహాత్ముడు కలకత్తా కాంగ్రెసునందు జేసిన ప్రతిజ్ఞను లాహోరు కాంగ్రెసునందు పాలింపగలిగెను. ఇర్విన్ప్రభువు అధినివేశస్వపరిపాలనమును సమకూర్చుటకు గాకపోయినను సమర్థించుటకు సయితము నిరాకరించినపుడు పూర్ణస్వాతంత్ర్య లక్ష్యమును ప్రతిపాదింపవలసిన బాధ్యత గాంధిమహాత్మునకు గలిగినది. దేశభక్తుడును, సత్యప్రియుడును నైన గాంధిమహాత్మునకు మార్గాంతరము లేదని మహాత్ముని తీర్మానము, వారిప్రసంగము విశదము చేసినవి. డిశంబరు 31-వ తేది రాత్రి 1½ గంటలకు కాంగ్రెసు పూర్ణస్వరాజ్యతీర్మానమును పరమోత్సాహముతో నామోదించినది. ఆసమయమునందు కాంగ్రెసుప్రతినిధులు చూపిన యుత్సాహము ప్రజాహృదయము నావరించుచున్న స్వాతంత్ర్యేచ్ఛను వ్యక్తము చేసినది.

"ఈ సభవారు అక్టోబరు 31వ తేదీని రాజప్రతినిధి గావించిన ప్రకటన సందర్భములో కాంగ్రెసువాదులతో సహా వివిధ పక్ష నాయకులు సంతకములు చేసి కావించిన ప్రకటన విషయమై కాంగ్రెసువారు గావించిన చర్య ననుమతించుచు, స్వరాజ్యమునకై కావింపబడుచున్న జాతీయోద్యమమును రాజీగా పరిష్కరించుటకై పయిప్రాయిపడిన శ్రమ నభినందించుచున్నారు. మోతీలాల్ నెహ్రూ మున్నగు నాయకులు వయిస్రాయితో సంప్రతించుటవలన కలిగిన ఫలితముల గమనించి ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొని లాభము లేదని యీసభవారు తలంచుచున్నారు.

మరియు, గత సంవత్సరము కలకత్తా కాంగ్రెసులో గావింపబడిన తీర్మానము ననుసరించి ఈ కాంగ్రెసు వారిపుడు కాంగ్రెసు ఆదర్శమందలి 'స్వరాజ్య' పదమునకు 'సంపూర్ణస్వాతంత్ర్యము' అను అర్థము నిర్వచించుచున్నారు. కావున అధినివేశ ప్రతిపత్తికిగా నిర్మింపబడిన నెహ్రూప్రణాళిక ఇంతటితో రద్దయినదని ప్రకటించుచున్నారు. మరియు కాంగ్రెసునందలి సర్వపక్షములవారు తమయావచ్ఛక్తుల సంపూర్ణస్వాతంత్ర్య సంపాదనకై వినియోగింప గలరనియు, నెహ్రూరిపోర్టులో సూచింపబడిన తాత్కాలిక సాంఘిక వివాదపరిష్కార సాధనముల మూలమున కాంగ్రెసునుండి ఎడలొలంగవలసిన, లేక కాంగ్రెసునందు చేరుటకు వీలుగాని, ప్రముఖులును నేడు మరల కాంగ్రెసునందు చేరి ఎల్లరకు సంబంధించిన ఈ ఆదర్శమును సాధించుటకు తీవ్రకృషి సలుపుదురనియు నమ్ముచున్నారు.

సంపూర్ణస్వాతంత్ర్యసమరము సాగించుటకు సన్నాహ మొనర్ప మొదటిమెట్టుగాను, కాంగ్రెసు విధానము, ఆదర్శము మార్చినందుల కనుగుణ్యముగ నుండుటకుగాను రాష్ట్రకేంద్ర శాసన సభలను బహిష్కరింపవలయునని ప్రకటించుచు, ఇకపయి ప్రత్యక్షముగ గాని, పరోక్షముగ గాని ఈశాసనసభలతో జోక్యము కల్పించుకొన రాదనియు, ప్రస్తుతము శాసనసభలందు సభ్యులుగా నున్న వారు తత్క్షణమే రాజీనామా నిచ్చివేయవలయుననియు కాంగ్రెసువాదులను కోరుచున్నారు. మరియు, దేశీయులు తమయావచ్ఛక్తుల నిర్మాణ కార్యక్రమము నిర్వహించుటకయి వినియోగింప వలయునని కోరుచు, తయారుగా నున్నట్లు తోచినపుడు అవసరమైన అన్ని జాగ్రత్తలతోటి కొన్ని ప్రత్యేకస్థలములలో గాని, సమష్టిగాగాని పన్నుల నిరాకరణముతో సహా శాసనోల్లంఘ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నము ప్రారంభించుటకు అఖిలభారతకాంగ్రెసు సంఘమునకు ఈసభవా రధికార మిచ్చుచున్నారు.

విదేశీయ పరిపాలకులచే ప్రత్యక్షముగా గాని, పరోక్షముగాగాని భారతదేశముపయి మోపబడిన బుః బాధ స్వతంత్ర భారతదేశము సహింపజాలదు.

౧౯-౨౨ సంవత్సరములో గయా కాంగ్రెసు మహాసభవారిచే నామోదింపబడిన తీర్మానము నీ మహాసభవారు స్థిరపరుచుచు, ప్రస్తుత ప్రభుత్వమునుండి సంక్రమించిన బాధ్యతలును, సౌకర్యములును స్వతంత్రభారతదేశమునందు స్వతంత్రమగు నొకవిచారణ సంఘమువారిచే పరీక్షింపబడుట ఈసభవారి యుద్దేశమని తెలిసికొనదగినవా రందరకు నిందుమూలముగా నీసభవారు ప్రకటించు చున్నారు."

పూర్ణస్వాతంత్ర్యము సకలజాతులకును జన్మస్వత్వము. భారతీయులకు స్వీయజన్మస్వత్వమును బడయుటకు శక్తిసామర్థ్యము లున్నను లేకపోయినను, జన్మస్వత్వమునందు విశ్వాసమును గలిగియుండుట స్వత్వప్రాప్తికి మూలాధారము. ప్రవృత్తియం దసహజస్థితి నెంత పోషించినను స్వతస్సిద్ధముగ నది యంత రించుటయును, సహజస్థితి వికసించుటయును సహజము. హస్తినాపురమునందలి జీర్ణములైన డిల్లీనగరములు సురాజ్యము లసహజములనియును, స్వరాజ్యమె సహజమనియును విస్పష్టముచేయుచున్నది. లాహోరు కాంగ్రెసు సహజమైన యీస్థితినె ప్రతిపాదించినది. కార్యసిద్ధికి సంకల్పము బీజమైనటులు సాధనము బీజము గాదు. సంకల్పము దృఢమైనపుడు సాధనలు సహజముగను సంప్రాప్తము లగుచున్నవి. పూర్ణస్వాతంత్ర్యమును సంపాదించుటకు స్వరాజ్యసంపాదనమునకు నిర్ణయించిన శాంతి సాధనములనే అవలంబించుటకు కాంగ్రెస్ నిర్ణయించినది. అసాధారణమైన కాంగ్రెసు నిర్ణయము సత్యాగ్రహసంస్కారములేని పాశ్చాత్యులకు వలెనే పాశ్చాత్యసంస్కారజాతులైన ప్రాచ్యవిద్యాసంభవులకును సత్యాగ్రహసాధనమందు విశ్వాసము గలుగుట దుర్లభము. సత్యాగ్రహసాధనమందు గాంధీమహాత్మునకు గల విశ్వాసము లాహోరు కాంగ్రెసునందు విజయమును బొందినది. అహింసాసిద్ధాంతములందు విశ్వాసములేని యువజనవర్గము సహితము మహాత్ముడు ప్రతిపాదించిన తీర్మానము నామోదింపవలసిన యవసరము గలిగినది. నిత్యనైమిత్తికధర్మములందు నిత్యధర్మమునకు గల ప్రతిష్ఠ నైమిత్తికధర్మమునకు లేదని ప్రపంచప్రవృత్తి విశదముచేయుచున్నది. నైమిత్తికధర్మము ప్రబలియున్న వర్తమానయుగమునందు నిత్యధర్మమును వ్యాపింపజేయుటకు పూనుకొనిన గాంధీమహాత్ముని ప్రయత్నములు కాంగ్రెసునందు విజయమును పొందుట భారతసంస్కారవిజయమునకు చిహ్నముగ నున్నది. స్వాతంత్ర్యసంపాదనకు అనిత్యములైన బాహ్యసాధనములను విడిచి నిత్యమైన ఆత్మసాధనము నారాధించుట పరమధర్మమని కాంగ్రెసు తీర్మానము ప్రతిపాదించినది. ఇతరులు ప్రతిపాదించినసవరణలను గాంధీమహాత్ముడు నిరాకరించి సత్యాగ్రహస్వరూపస్వభావములను పాలకపాలితులకు సువ్యక్తముచేసెను. ప్రపంచప్రవృత్తియందు విజయమును సమకూర్చుటకు ఆత్మత్యాగమునకుగలసామర్థ్యము పరపీడనకులేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వాతంత్ర్యసంపాదన సాధనము

లాహోరు కాంగ్రెసు స్వాతంత్ర్యసంపాదనకు ప్రపంచమునకు పరిపాటియైన దౌర్జన్య సాధనములను నిరసించినది. దుర్మార్గులు ఇర్విన్‌ప్రభువుపైన ప్రయోగించిన బాంబు సాధనమును నిరసించినది. బాంబుప్రయోగ నిరసనమును కాంగ్రెసు ఆమోదించి దౌర్జన్య రహితమైన అసహాయయోగమునందు కాంగ్రెసునకుగల విశ్వాసమును వ్యక్తముచేసినది. కాంగ్రెసునందును, దేశమునందును దౌర్జన్య సాధనములందు విశ్వాసముగల దేశాభిమానులు గలరని దేశవ్యవహారములు విశదము చేయుచున్నవి. దేశమునందు దౌర్జన్యసాధనములు వ్యాప్తిని బొందుటకు నిరంకుశాధికారులును బాధ్యులని దేశవ్యవహారములు విశదముచేయుచున్నవి. ప్రేమవలనను ప్రేమయును, ద్వేషమువలనను ద్వేషమును, స్వార్థమువలనను స్వార్థము, త్యాగమువలనను త్యాగమును గలుగుచున్నవి. స్వపరిపాలనమునకు పరితపించుచున్న హృదయమునందు నిర్బంధాస్త్రప్రయోగము హృదయవేదన నభివృద్ధి చేయును గాని ఉపశమింపజేయదు. రాజద్రోహాభియోగములు యువజన హృదయమునందు స్వాతంత్ర్య జ్వాలలను ప్రజ్వలింపజేయుచున్నవి. ప్రజ్వలితమైన స్వాతంత్ర్యజ్వాలల ఫలమును నిర్ణయించుట దుస్తరము. స్వాతంత్ర్యసమరమును శాంతియుతముగ జేయుటకు గాంధిమహాత్ముడు కంకణమును గట్టుకొనియున్నాడు. లాహోరు కాంగ్రెసు వ్యవహారములు, దేశావృతమైన యశాంతి శాంతిమార్గసాధనములందు ప్రజా విశ్వాసము సన్నగిలుచున్న విధమును విశదము జేయుచున్నవి. శ్రీయుత బులుసు సాంబమూర్తి, సుబాసుబాబు, కిరణ శంకరరాయి గారులు మొదలగు దేశభక్తుల నిర్బంధములు ప్రజాహృదయమునందు రోషావేశములను గలుగజేయుచున్నవి. నిరంకుశాధికారవర్గము శాంతిసంరక్షణమునకు శాంతిసాధనముల నుపయోగించుట ప్రయోజనకరము గాని నిర్బంధ సాధనములను ప్రయోగించుట ప్రయోజనకరము గాదు. ప్రపంచచరిత్రము సహస్రముఖములనుబోధించుచున్న గుణపాఠమును బ్రిటీషు నిరంకుశాధికారవర్గము మననము చేయుట సకలజనుల శ్రేయస్సునకును సాధనము గాగలదు. లాహోరు కాంగ్రెసు నిర్ణయించిన స్వాతంత్ర్యప్రస్తావము స్వార్థపరులకును, సంశయాత్ములకును, జోహుకుమువాలాలకును రోషావేశమును, భయభ్రాంతులను గలుగజేసినను, యథార్థముగను శాంతిస్థాపనమునకు సాధనంబని ధర్మస్వాతంత్ర్యప్రియులు గ్రహింపగలరు. శాంతియుతమైన స్వాతంత్ర్యసంరంభమునకు శాసనసభల బహిష్కారము, శాసనోల్లంఘనము, పన్నులనిరాకరణము మొదలగు సాధనములు నిరూపింపబడినవి. ఆ సాధనములను సఫలముచేయవలసిన బాధ్యత స్వాతంత్ర్య ప్రియులమీదను, ముఖ్యముగాను కాంగ్రెసు ప్రియులమీదను గలదు.

* * * *



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాసనసభా బహిష్కారము

సహాయనిరాకరణ యోగప్రయోగము నకు శాసనసభలు సులభమైన రంగములుగ నున్నవి. భారతజాతికి పారతంత్ర్యపాశములు శాసనసభలయందు సృష్టింపబడుచున్నవి. పారతంత్ర్యపాశములను సృష్టించుటయందు భారతీయులు ప్రమేయమును కల్పించుకొనునపుడు భారతీయులకు ధర్మబలము గలుగుచున్నది. సహాయనిరాకరణయోగమున కంగములైన బిరుదములను, న్యాయస్థానములను, పాఠశాలలను, ఉద్యోగములను నిరాకరించుట యుచితమైనను శాసనసభాబహిష్కారమువలెను సుకరమును, సాధ్యమును గాదు. వందలమంది మాత్రమే శాసనసభలను బహిష్కరింపవలసి యుందురు. ముఖ్యముగాను కాంగ్రెసుపేరు చెప్పుకొని శాసనసభలయందు కాంగ్రెసు ప్రతిజ్ఞలను గాపాడుటకు ప్రవేశించిన సభ్యులు వెంటనే శాసనసభలను బహిష్కరించుట పరమధర్మమై యున్నది. లాహోరు కాంగ్రెసు చేసిన తీర్మానమును పాలించుచు వారిసభ్యత్వమును చాలించుకొనిన కాంగ్రెసుసభ్యులు ప్రశంసనీయులు. సభ్యత్వమును వదలుకొనని వారును, వదలుకొనియును తిరిగి వెంటనే అభ్యర్థులుగ నుండగోరెడివారును ఆత్మగౌరవమును గోల్పోవుచున్నారు. శ్రీయుత ప్రకాశము పంతులుగారు, మొదలగు నాంధ్ర నాయకులు శాసనసభలను సంపూర్ణముగను బహిష్కరించి కాంగ్రెసు ప్రతిష్ఠను గాపాడుదురుగాత!

* * * *

శాసనోల్లంఘన ప్రస్థానము

గాంధీమహాత్ముడు శాసనోల్లంఘనప్రస్థానమును నిర్ణయించుటకు యోచించుచున్న విషయమును వారివ్యాసములు, ప్రసంగములు విశదము చేయుచున్నవి. స్వాతంత్ర్యప్రకటన విషయము భావమునందువలెను కార్యమునందు ప్రజాసామాన్యము నాకర్షించుట దుర్లభము. బర్డోలి సత్యాగ్రహము ప్రత్యక్షము గను బర్డోలిప్రజల నాకర్షించినవిధమున నితర ప్రాంతవాసుల నాకర్షింపజాలదు. శాసనోల్లంఘనప్రస్థానము సమష్టిపరమైనను వ్యష్టిపరమైనను, శాంతివాతావరణము, శిక్షణము, కాంగ్రెసుసభ్యత్వము ముఖ్యసాధనములుగ నున్నవి. దేశమునందంతట నవీనసిద్ధాంతము నంగీకరించిన కాంగ్రెసుసభ్యులను జేర్చుటయును, కాంగ్రెసుసంఘములను స్థాపించుటయును నవసరము. సుశిక్షితులైన శాంతిసేవకులను సమకూర్పవలసియున్నది. స్వాతంత్ర్యప్రియులందరును నీప్రయత్నములందు నిమగ్నులై కాంగ్రెసు నిర్ణయములను సఫలము చేయుదురుగాక! కార్యనిర్వాహకసంఘము నిర్ణయించిన స్వాతంత్ర్యప్రకటనము దేశీయుల స్వాతంత్ర్యదృఢసంకల్పమును విశదముచేయుచున్నది.

* * * *

సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటన

"ప్రపంచములోని తక్కిన అన్ని జాతులవలెనే, భారతీయులుకూడ స్వాతంత్ర్యమును బొంది తమ కష్టార్జితమును తా మనుభవించుచు, జీవయాత్ర కావశ్యకమగు అన్నవస్త్రాదులను బడసి, జాతీయాభ్యుదయమునకు వల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు పరిపూర్ణావకాశములను కలిగియుండవలయుననియూ, ఈ విషయములలో వారి హక్కు అప్రతిహత మనియు మావిశ్వాసము. ఏప్రభుత్వమైనను, ప్రజల కుండే ఈహక్కులను హరించి వారిని పీడించేయెడల ఆప్రభుత్వమును మార్పుచేయుటకు గాని, మాపుచేయుటకు గాని ఆ ప్రజలకు గూడ హక్కు ఉన్నదని మా నమ్మకము. భారత దేశములోని బ్రిటిష్‌ప్రభుత్వము భారతజాతియొక్క స్వాతంత్ర్యమును హరించుటయే కాక, భారతీయప్రజాసామాన్యమును తనస్వప్రయోజనములకు వినియోగించుట వల్లనే వర్ధిల్లుచు, భారతదేశపుభాగ్యభోగ్యములను, రాజకీయస్వాతంత్ర్యమును, విజ్ఞానసంపత్తిని, స్వధర్మమును నశింపచేసినది. (కావున) భారతదేశము బ్రిటిష్‌వారి సంబంధమును విడకొట్టుకొని 'పూర్ణస్వరాజ్యము'ను అనగా 'సంపూర్ణస్వాతంత్ర్యము'ను సంపాదింపవలెనని మా ఆశయము.

భారతదేశపుభాగ్యము నాశనముచేయబడినది. ప్రజలద్దనుండి వసూలుచేయుచున్న పన్నులు వారి ఆదాయముతో నెట్టిసంబంధమును లేకుండా మితిమీరియున్నవి. మనదేశములో సగటున మనిషికి దినమునకు అణాము క్కానిమాత్రమే నిత్యాదాయము. మనము చెల్లించే దుర్భరమైన పన్నుల భారములో నూటికి ౨౦ వంతులు రైతు లిచ్చుకొనే భూమిశిస్తు, నూటికి 3 వంతులు బీదలను పీడించేఉప్పుపన్ను. రాటముతో నూలు వడుకుట మొదలగు గ్రామపరిశ్రమలన్నియు ధ్వంసముచేయబడినవి. అందుచే రైతులు కనీసము ఏడాదిలో నాలుగునెలలు నిర్వ్యాపారులై చేతిపను లేమియు లేక బుద్ధిమాంద్యముతో వృథాకాలక్షేపము చేయుచున్నారు. నాశనము చేయబడిన చేతిపరిశ్రమలకు ప్రత్యామ్నాయముగ నితర దేశములలోవలె నిట నేరెద్దియు నెలకొల్పబడియుండలేదు. నాణెముల చలామణి, సరకులరవాణాపై పన్నులు, వీని విషయములలో చూపు హస్తలాఘవమువలన రైతుల నెత్తిపై నింకను భారము పడినది. మన దిగుమతిసరుకులు విస్తారముగ బ్రిటిష్‌వారు తయారుచేయు వస్తుసామగ్రియే. రవానాపన్నులు చూచినచో, బ్రిటిష్ వారు తయారుచేయు సరకులపట్ల చూపు పక్షపాతము విశదమగును. ఇట్టి ఆదాయమును ప్రజలపన్నుల భారమును తగ్గించుటకు గాక, అమితవ్యయముతో గూడిన ఈ ప్రభుత్వమును నిలువబెట్టుకొనుటకే ఉపయోగించుకొనుచున్నారు. నాణెముల చలామణి నిర్ణయముతో గూడ వారిచిత్తము వచ్చినట్లు వ్యవహరించుటచే కోట్లకొలది ధనప్రవాహము దేశాంతరమునకు తరలిపోవుచున్నది.

రాజకీయముగ జూచిన భారతదేశస్థితి బ్రిటిష్ వారి హయాములో దిగినంత అధోగతి కెన్నడును వచ్చియుండలేదు. ఏరాజకీయసంస్కరణములవల్లను ప్రజలకు నిజమైన అధికారము లభించలేదు. మనలో మహామహులు సహితము విదేశీయాధికారమునెదుట తలలొగ్గవలసియున్నది. స్వేచ్ఛగా మన అభిప్రాయముల ప్రకటించుటకును, సమావేశమగుటకును మన కుండదగుహక్కులు నిరాకరింపబడినవి. మనదేశీయులు చాలమంది విదేశములలో ప్రవాస మనుభవించుచున్నారు. వారు మాతృదేశమును తిరిగి సందర్శించుటకు ప్రాప్తము లేకుండనున్నది. మన దేశీయుల పరిపాలనాదక్షత రూపుమాపబడినది. ప్రజలు గ్రామనౌకరీలతోను, గుమాస్తాగిరీలతోను తృప్తిపడి యుండవలసివచ్చినది.

ఇక విజ్ఞానసంపత్తి చూతమన్న, ఇప్పటి విద్యావిధానము మన పూర్వసంప్రదాయ తంతువులను ఛేదించి వైచినది. మనము పొందిన శిక్షణమువలన మనల నిర్బంధించు సంకెళ్లే మనకు మరిపెము లైపోయినవి.

స్వధర్మరీత్యా యోచించిన, నిర్బంధముగ మనల నిరాయుధులను చేయుటచేత మనకు మగసిరి అంతరించినది. మనదేశము నాక్రమించుకొన్న విదేశీయసైన్యము మన నిరోధకశక్తి నతిదారుణముగ నణచివేయుటకు నియమింపబడి, మనలను మనము జాగ్రత్తపరచుకొనజాలమనియు, ఈవిదేశీయులదాడి నరికట్టజాలమనియు, దొంగాతోడుబోతులవల్ల అపాయము లేకుండా మన ఇల్లువాకిళ్లను, భార్యాబిడ్డలను సంరక్షించుకోజాలమనియు తలంపజేయుచున్నది.

మనదేశము నిట్లు, చతుర్విధముల విపత్తుపాల్జేసిన ఈపరిపాలనకు ఇంకేమాత్రమును లొంగియుండుట దైవద్రోహమనియు, మానవద్రోహమనియు మా యభిప్రాయ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము. ఐనను, మనస్వాతంత్ర్యమును స్థాపించుటకు, ప్రబలతమసానుకూలమార్గము కత్తిగట్టుట కాదని గుర్తించుచున్నాము. కావున, బ్రిటిష్ ప్రభుత్వముతో మాకుగల ఐచ్ఛికసంబంధమునంతను సాధ్యమైనంతవరకువదలుకొని, పన్నులనిరాకరణముసహా, శాసనోల్లంఘనమునకు సన్నాహముగావించెదము. మేము స్వేచ్ఛాపూర్వకముగ గావించుసహాకారము మానివేసి, ఎంత రెచ్చగొట్టినను దౌర్జన్యమునకు దిగకుండ పన్నులను నిరాకరింపగల్గుచో ఈ యమానుష పాలన మంతరించుట రూఢియని మాకు నచ్చినది. కాన, 'పూర్ణస్వరాజ్యము'ను స్థాపించుటకుగాను ఎప్పటికప్పుడు కాంగ్రెసువా రిచ్చు ఆదేశముల నెరవేర్చెదమని ఇందుమూలమున ప్రమాణపూర్వకముగ నిశ్చయించుకొనుచున్నాము. వందేమాతరమ్."

జనవరి 26-వ తేదిని దేశమునందంతటను స్వాతంత్ర్యప్రకటనమును చేయుటయందాబాలగోపాలము చూపిన సాహసధైర్యములు, ప్రశాంతస్వభావము, పరమోత్సాహము ప్రజాహృదయమునందు సుప్రతిష్ఠిత మగుచున్న స్వాతంత్ర్యేచ్ఛను విశదము చేయుచున్నది. అధికారుల ప్రవర్తనము ప్రశంసనీయము. బ్రిటీషుప్రభుత్వము కాలప్రభావమును గ్రహించి స్వధర్మనిర్వహణమును జేయుటకు భగవదనుగ్రహమును బడయుగాత!

---

Printed and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రివర్ణ చిత్రములు—భూపుత్రి; రంగూను దృశ్యము.

సాధారణచిత్రములు—ఉత్తరహిందూస్థానచిత్రములు ౮; శ్రీ సుధీరరంజన ఖస్తగిర్ గారి బంకమట్టి బొమ్మలు ౭; లాహోరు సెంట్రల్ మ్యూజియమునందలి చిత్రములు ౬; చల్లపల్లి రాజావారి పట్టాభిషేక చిత్రములు ౪; పండిత జవహరిలాలుగారి ఛాయాచిత్రములు ౧౪. వ్యంగ్యచిత్రములు ౨; ఇతర చిత్రములును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



భూ పు త్రి

చిత్రకారుడు: శ్రీ వి. ఆర్. చిత్రగారు, చెన్నపురి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము, మార్చి ౧౯౩౦

సంపుటము ౭ శుక్ల సంవత్సరము ఫాల్గుణమాసము సంఖ్య 3

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావుగారు, బి. ఏ., కామరాజుగడ్డ శివయోగానందరావు గారు

## ౧

### హంపీస్థాపన

[ఆనెగొందిపక్కనున్న చిన్నపల్లెటూరు హంపి. దాని స్థాపననుగురించి అక్కడివారు అను శ్రుతముగా చెప్పుకొనే కథ యిది. ఓరుగల్లు కాకతీయులతో ఢిల్లీపాదుషాలు పోరాడి వరసగా పన్నెండుసంవత్సరాలు ఓడిపోయినారు. చివరకు యుద్ధములో గెల్చి రాజును ఖైదీగా పట్టుకొన్నారు. హరిహరరాయ బుక్కరాయలలో ఒకరు మంత్రి, ఒకరు సేనాపతి. పాదుషా ఢిల్లీ వెళ్లేటప్పుడు ఆ అన్నదమ్ములను జామీనుగా ఉంచుకొని, యుద్ధాలలో తనకయినఖర్చు యావత్తూ ఇస్తే వారిని వదిలివేస్తా నన్నాడట. తెలుగువారు డబ్బు యివ్వలేదట. లాభము లేదని పాదుషా వారిని విడిచిపెట్టి వెళ్లిపోయినాడు. తర్వాత అన్నదమ్ములు సిగ్గుతో అడవు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలో తిరుగుతూ ఉంటే శ్రీ విద్యారణ్యస్వామివారు వారి రాజ్యతంత్రాలు గ్రహించి, హంపీలో వారిని ప్రభువులుగా నిలిపినారట. కొంతకాలానికి వారు చూపిన అనాదరణకు స్వామివారు వారిని శపించినారట. ఈశాపము మార్చినాము.]

"ఆహావనష్ట మైనసిరి యంతయు ఈవలె తెల్గువారు, హా
మీ హరిబుక్క దేవులు సుమీ" అను మ్లేచ్ఛుని గేలిపల్కులో
సాహస మున్నదా? మరువ జాలెన? ద్వాదశవర్ష సంగర
శ్రీహరణమ్ము "తెల్గునృపసింగము" చేత ప్రతాపరుద్రుచేన్.

ప్రారంభోదయ నైజతేజులును, పారంపర్యశౌర్యాగ్నికీ
లారక్తాత్ములు హీనులై తురక సామ్రాడ్బద్ధులై, వాంఛనా
రా రత్నాద్రిశిశీర్షముల్? జలదధారాభిన్నమై మేరువే
నీరైపోయిన? చూతురా "తెలుగురాణీ"గర్భ నిర్భేదముల్?

కాకతిరాజ్యవైభవ వికల్పనదక్షుడు మ్లేచ్ఛరాజు ఢి
ల్లీకి ప్రయాణమై చనె; ఫలించిన పంటలకాసుగూడ బం
దీకృతమోక్షయత్ననిరతిన్ వ్యయపెట్టరు తెల్గువారు; రి
క్తీకృత లాభనిశ్చయవిధిన్ చ్యుతులా హరిరాయసోదరుల్.

మొగిలుమరుంగునం బడి విముక్తరుచుల్ ప్రకటించు భాస్కరుల్
తెగబడలేరు కర్మనియతిన్ అటులే హరిరాయసోదరుల్
జగముల నేలజాలు గుణసాగరు లయ్యు పరాజయవ్యథా
నిగళము దాల్చి తెల్గు జననిన్ భజియింపగ రారు ముక్తులై.

కాలము మారిపోయి శునకంబులు బొబ్బటిలంగ బెబ్బులుల్
చాలక నిల్చిపోయినవి, శాశ్వతమా విజయప్రవృత్తి? ఆ
శాలవబీజమే పరవశంబున పొంగి పునఃప్రయత్నవాం
ఛాలత లల్లి నిర్మలయశస్సుమముల్ విరియించుచుండు పో.

వనవాసవ్రతనిష్ఠురత్వమున సర్వాంగవ్యథాశుష్కుడ
య్యును ఆంధ్రావనిఘోషలో తనకు సాయుజ్యంబు లేదంచు నెం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన సన్న్యాసి ప్రతిష్ఠ జేసెనట సుశ్రీయుక్తుగా హక్కరా
యుని విద్యానగరాంధ్రభూపతి సదుద్యోగంబులో పొంగుచున్.

విష్ణువర్ధను డపుడు నవ్వెనట, హర్ష-బాష్పపులకిత శంపాభవంబు నూత్న
తేజ మొక్కటి ఆంధ్రభూదేవునోసట-తోచినదియంట దేవదుందుభులు మెరయ.

అరయుచుండ్రి విమానముల్ వరుస నిలిపి-తన్మహోత్సవమాధుర్య తన్మయులయి
గౌతమీ శాతవాహన శాతకర్ణి-వంశభవులును "చాళుక్యవంగడమును."

పంచాంగస్థిర సన్ముహూర్త నగరప్రారంభ మా దానధ
ర్మాంచద్భూషణవస్త్రరత్నచయ ప్రఖ్యాతి నాశీస్సు గా
వించెన్ భూసురపాణి; అం దొకటి తృప్తిం జెందగా లేక కో
పించెన్, పాతకు లయ్యు విప్రు లపు డుర్వీనాథసంపూజ్యులే.

విద్యారణ్యమహర్షి నిత్య మని భావించెన్ మహారాజ సం
పద్యోగంబున హక్కరాట్కులము దేవస్వామి కన్నెఱ్ఱయై
సద్యోవైరము దాల్చి మండెనట మాత్సర్యాగ్నిలో ధూమవే
ణీద్యోతంబయి నేలమట్టమట హంపీపట్టణశ్రీద్యుతుల్.

---

## మంత్రి ప్రశంస

కాళ్లకూరి గోపాలరావు గారు

బలములకున్ బలంబు మఱి ప్రాణపదం బన వన్నెకెక్కి, ని
శ్చలమహిమంబుతో నితరసర్వబలంబుల నేలు శేముషీ
బలమె బలంబు; తద్బల విభావిభవాఢ్యుడె మంత్రి; మంత్రికిన్
గలుగదు స్వప్రయోజనము, కార్యము దేశహితంబె యెయ్యెడన్.
వైభవంబు పటాటోపపాటవంబు-మఱి కిరీటంబు లే వను మాటె కాని
రాజునకు రాజు మంత్రి; సర్వత్ర వార-లాత్మయు శరీరముం బోలె నలరుచుండ్రు!

(తిమ్మరుసు నాటకమునుండి)

---

7.　　3.　　1౨　　3౽3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఛందస్సు కీ. శే. మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు 'కళాప్రపూర్ణ'

ఛందస్సనఁగా పద్యలక్షణము.

యతిపరిచ్ఛేదము

౧. పాదమున నిలుపుదలమీఁది యక్షరము యతి.

[యతికే విరతి, విశ్రాంతి, విరామము, యమము, విశ్రామము ఇత్యాది నామములు గలవు. పద్యప్రథమాక్షరమునకు యతిసంజ్ఞ ఔపచారికము.]

౨. ఏకపాదయతు లన్నిటిలోను ప్రధానవర్ణములు సవర్ణములు గావలయు.

[ఏకపాదములో, ఒకయతిలోని ప్రధాన వర్ణములు కడమ యన్ని యతులయందలి ప్రధానవర్ణములకును సమానముగా నుండవలయును. ఇందుల కపవాదము లున్న సూచింపఁబడును.]

3. యతులయందు స్వరసామ్యము తప్పదు. ఆస్వరము పదాది కాదేని దానితోడి హల్లునుం బ్రధానమే.

ఉ: "కేదారేశు భజించితిన్ శిరమునన్
గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్, ప్రయాగనిలయున్
బద్మాక్షు......"

ఉ: "దేవా [వ+ఆ] దుల్ శ్రీహరిఁ గాంచి
మ్రొక్కిరి ప్రమో
దా[ద+అ]ంభోధి మునుఁగంగన్."

యతులలోని ప్రధాన వర్ణములకే సామ్యము వలయును. యతిస్థానములందుఁ బదచ్ఛేదము కలదేని అట ఉత్తరపదాదివర్ణము ప్రధానము. అది స్వరమేని స్వరసామ్యము చాలును. అది హల్లగునేని, ఆహల్లును, దానితోడిస్వరమును రెండునుం బ్రధానములే. ఆరెంటనొక్కొక్కటికిని సామ్యము సరిపడవలయును. ఉత్తరపదాదితో సంయోగము కలదేని అంగలి హల్లు ఒకటియు, దానితోడి స్వరమును రెండును బ్రధానములు. సమవృత్తములలో ఏకపాదమున బహుయతు లున్నచో వానియందెల్ల ఒక్కస్వరమునకే, ఒక్కహల్లునకే సామ్యము నిర్వహింపవలయును. అనఁగా రెండు యతులలో నొక ద్వయమునకు సామ్యమును, వేఱు రెండు యతులందు వేఱుద్వయమునకు సామ్యమునుంగా అల్లఁగూడదు.

యతిలో పూర్వపదాంత హల్లుతో పదచ్ఛేద మున్న పూర్వపదాంతహల్లును ప్రధానమగుటయుం గలదు.

౪. హల్లునకును అచ్చునకును సామ్యము లేదు.

సామ్య మెట్లనఁగా:

౫. (౧) అ ఆ ఐ ఔ లు; (౨) ఇ ఈ ఋ ౠ ఎ ఏ లు; (3) ఉ ఊ ఒ ఓ లు; (౪) క ఖ గ ఘ లు; (౫) చ ఛ జ ఝ శ ష స లు; (౬) ట ఠ డ ఢ లు; (౭) త థ ద ధ లు;



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౮) పఫబభవలు; (౯) నణసమములు; (౧౦) ఙ్ఞనణలు; (౧౧) ఉసమయుక్పఫబభమలు సమములు.

ఇందు, తుద నున్న "సమములు" అను పదము ఒక్కొక్క సమాసమునకును విశేషణము. కావున, ఒకదాని కొకటి సమానములయిన వర్ణములెల్ల ఒక్కొక్క సమాసమునఁ జెప్పఁబడినవి.

నణసమములు (సమములు—నకారమునకు సమమగు వర్ణమును, ణకారమునకు సమమగు వర్ణమును) ఒకదాని కొకటి సమానములు. అనఁగా, తవర్గవర్ణమునకు పూర్వమందున్న పూర్ణబిందువు టవర్గవర్ణమునకు పూర్వమందున్న పూర్ణబిందువునకు సమానము. ఉ: ంత = ంట. ఈ విషయము పై సూత్రమున విశదమగును.

ఉసమయుక్... మకారములు (సమములు)—ఉసమములనఁగా ఉకార సమవర్ణములు; ఏవియనఁగా, ఉ ఊ ఒ ఓ లు (హ్రస్వము దీర్ఘగ్రాహకము); అం దొక దానితోఁ గూడిన పఫబభమలు నొండొంటికి సమము. ఉ: పో=ము.

౬. బిందుపూర్వకస్పర్శములు తత్తద్వర్గానునాసికములకు సమములు.

౭. ఋవర్ణము ఇకారసమవర్ణయుతమైన రేఫమునకు చెల్లును.

౮. ఋవర్ణము ఋయుక్తములకు సమము. ఋ = కృ, కృ = సృ.

౯. యహల మీఁద స్వరము ప్రధానము.

౧౦. అస్థ్థానికము అగు ఓ అకారలోపమున పదము.

అ-సమమును అకారమునకు సవర్ణముగాఁ గొనఁదగినది.

"రామస్ అహమ్" అనుచోట సంధి రాఁగా, అస్ అనుదానికి బదులుగా ఓకారము వచ్చి, అహమ్ అను దాని యొక్క ప్రథమ వర్ణమైన అకారము లోపించి, "రామో ఽహమ్" అయినది. ఇట్టి చోట్ల ఇట్టి ఓకారమును పదముగాను, అకారముగాను గ్రహింపవలయును.

౧౧. అందుకా, అన్నకా, అంటెకా-పదములు.

సప్తమీవిభక్తియగు అంచు వర్ణకమును, కొందఱ మతమునఁ బంచమీ విభక్తులగు అన్న, అంటె వర్ణకములను పదములనుగా గ్రహింపవలయును.

౧౨. అపదాది ఋ ఌ య హాచ్చు లొండె.

ఒండెకా=వైకల్పికముగా=ఇష్టమైనప్పుడు. పదాదులు గాని ఋ ఌ వర్ణములను, యకార హకారముల మీఁది పదాదులు గాని యచ్చులను ఇష్టమైనప్పుడు పదములనుగా గ్రహింపవచ్చును.

౧౩. ఋరలు, ఌలలు, పూర్ణబిందు తత్పర సవర్గానునాసికములు, మకార యాదిపరక పూర్ణబిందువులు, ల ళ డ లు; ప్రాసమందును.

ఇవి ప్రాసమందును, యతియందును ఒకదాని కొకటి బదులుగా నుండవచ్చును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్ణబిందు...ములు(సమములు)—పూర్ణ బిందువు దానితరువాతనున్న హల్లుయొక్క వర్గలోని యనునాసికమునకు సమానము; వర్గ హాలు లేనియెడల మకారమునకు సమానము. వర్గము లెవ్వియనిన,—క ఖ గ ఘ ఙ లు—కవర్గ, చ ఛ జ ఝ ఞ లు—చవర్గ, ట ఠ డ ఢ ణ లు—టవర్గు, త థ ద ధ న లు—తవర్గు, ప ఫ బ భ మలు — పవర్గు: ఇవి వర్గహల్లులు. ఇందు ఙ ఞ ణ న మలు—అనునాసికములు; కావున, పూర్ణబిందువు కవర్గ హల్లునకు పూర్వమం దుండెనేని ఙకారమునకు సమానము. ఉ: ం క=ఙ. ఇట్లే కడమ వర్గ హల్లులకు నెఱుంగవలయును. ఉ:ం చ=ఞ.

మకార...బిందువులు (సమములు).

పూర్ణబిందువు య ర ల వ శ ష స హ ల లో నొకదానికి పూర్వమం దుండెనేని మకారమునకు సమము. ఉ. ం య=మ.

౧౪. యుష్మదస్మచ్ఛబ్దములపై,శకంధ్వాదుల, కర్ణాటాదుల, పూషఘాదుల, ఉపసర్గలపై, నఞ్ సమాసములు, అప్యర్థక ఏని, విభాగార్థక ఏని, రేఫాగమ పూర్వక ఆలు నామగత అప్వాదుల-పదాద్యచ్చు, అపదాదిప్లుతము పదమును.

పదమును= పదమునుగానైనను, తదితరముగానైనను గ్రహింపవచ్చును.

దేని నిట్లు గ్రహింపవచ్చుననఁగా, పదాదిగాని ప్లుతమును, అనఁగా, భయశోకాదులందు మూఁడు మాత్రలు గలుగున ట్లుచ్చరింపఁబడిన పదాదిగాని యచ్చును. ఉ: నీ,వే గతి కావనే రఘుపతీ". ఇంక దేని నిట్లు గ్రహింపవచ్చుననఁగా, సూత్రమందు అప్వాదుల వఱకును జెప్పఁబడిన పదాద్యచ్చును. (సూత్రమందు పదాద్యచ్చనుమాట తత్పూర్వమున కెల్ల నన్వయించును.) ఇందువలన, యుష్మచ్ఛబ్దముపై యచ్చు, అస్మచ్ఛబ్దముపైదియు వికల్పముగాఁ బదాది. ఎట్లనిన, యుష్మదాగమనము (యుష్మత్ + ఆగమనము) అనుచోట ఆకారము పదాదియేని కేవ సూత్రమువలన అది మాత్రమే ప్రధానమగును. అప్పుడు దానికి మాత్రమే సమముగా నొకవర్ణమును కడమ యత్యక్షరములలో నుంపవలయును; అందువలన స్వరయతిమాత్ర మగును. ఆయాకారము పదాదికాదేని, దకారమును, ఆకారమును, రెండును ప్రధానము లగును; రెంటికిని సమానముగా రెండువర్ణములు కడమప్రతియతియందును ప్రయోగింపఁబడును; అనఁగా హాల్యతి యగును.—పదాది గాని ప్లుతమును అట్లే అగును. ఇట్లే ఈసూత్రమం దెల్ల గ్రహింపవలయును.

శకంధ్వాదులు—శకంధు(శక + అంధు), కర్కంధు (కర్క + అంధు), కులట (కుల + అట), సీమంత (సీమ + అంత), మనీషా (మనస్ + ఈష), లాంగలీషా (లాంగల + ఈషా), ఉష్ణీష (ఉష్ణ + ఈష), మంజీర (మంజు + ఈర), వేదండ (వేద + అండ), సారంగ (సార + అంగ),—ఇత్యాదులు.

ఉపసర్గలు—ప్ర, పరా, అప,సం, ని, అవ, అను, నిర్, దుర్, వి, అధి, సు, ఉత్, పరి,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతి, అభి, అతి, అపి, ఉప, ఆ—ఈ యిరువది. ఉ: ప్రాణము (ప్ర + అన).

కర్ణాటాదులు—కర్ణాట (కర్ణ + అట), వనౌకః (వన + ఓకః), ద్వీప (ద్వి + అప్), అంతరీప (అంతర్ + అప్), మందార (మంద + అర), పదార్థ (పద + అర్థ), అన్యోన్య (అన్యః + అన్య), జనార్దన (జన + అర్దన), స్వాంత (స్వ + అంత), ఏకాంత (ఏక + అంత), ఆపోశన (ఆపః + అశన), సిద్ధాంత (సిద్ధ + అంత), రాద్ధాంత (రాద్ధ + అంత), నారాయణ (నార + అయన), వాతాయన (వాత + అయన) రసాయన (రస + అయన), రామాయణ (రామ + అయన), మార్తాండ (మార్త + అండ),—ఇత్యాదులు.

నఞ్ సమాసములు—ఉ: అనేక (న + ఏక), నాక (న + అక), నాగ (న + అగ),—ఇత్యాదులు.

అఱుట యనఁగా నశించుట. అంతమందు అఱుధాతువుగల రూపఱ, మెంపఱ, పెల్లఱ, ఏపఱ, క్రచ్చఱ, ఉక్కఱ మొదలగు కొన్ని శబ్దపల్లవధాతువులును, క్రిక్కిఱియు (ఇఱి యు + ఇఱియు), ఇట్టివి కొన్నియు రూప ఱాదులు.

"కృతయుగమునందు ఎంత దుష్టుఁడేని హరిని భజించును."—ఇది అప్యర్థకమగు ఏని శబ్దము. "సత్యభామ ముత్తైదువలకు నాలు గేసి చీరలు, పదేసి యుంగరములు నిచ్చెను."—ఇది విభాగార్థకమగు ఏసి శబ్దము. "ముద్ద రాలు, బాలెంత రాలు".—ఇది రేఫాగమపూర్వకమగు ఆలు శబ్దము.

అప్పాదులు—వెంకప్ప, సోమయ్య,—ఇత్యాది నామములయందలి అప్ప, అమ్మ, అయ్య, అన్న, అక్క, ఆయి,—ఇత్యాదులు.

౧౫. ద్వీపాదుల వికృతియే ప్రధానము

ద్వీపము మొదలగు శబ్దములయందు స్వరయతి యగునప్పుడు పదాద్యచ్చు అప్రధానము, దానికి బదులుగా వచ్చిన యచ్చే ప్రధానము. ఉ: ద్వీపశబ్దమందు అప్ శబ్దము యొక్క ఆదియగు అకారము అప్రధానము; దానికి బదులుగా వచ్చిన ఈకారమే ప్రధానము.

## ప్రాసపరిచ్ఛేదము

౧. పాదముల ద్వితీయాక్షరము ప్రాసము.

పద్యములయందు ప్రతిపాదమందును రెండవ యక్షరము ప్రాస మనఁబడును. ఎట్లనిన, "రాముఁడు" అని పాదాదియం దుండెనేని, 'ము' అనునదియు, "రాష్ట్రము" అని పాదాది నుండెనేని, 'ష్ట్ర' అనునదియు ప్రాస మనఁబడును.

౨. అన్నిట నొక్కటియే గురులఘుపూర్వకము.

ఒకపాదమందలి ప్రాసము ఏయక్షరమో, కడమయన్ని పాదముల యందలి ప్రాసమును ఆయక్షరమే కావలయును. మఱియు ప్రాసమునకు పూర్వమున, ఒకపాదమందు గురు వుండెనేని అన్నిటను గురువే యుండవలయును; ఒకపాదమందు లఘు వుండెనేని అన్నిటను లఘువే యుండవలయును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అచ్చులకే గురులఘు సంజ్ఞలను చెప్పుట చేత, గురు లఘు పూర్వ మనుటచే ప్రథమా చ్చువఱకే ప్రథమాక్షరమనియు, అందు వలన అచ్చువఱకు నక్షరమనియు, అందువలన అటుపై ద్వితీయాచ్చువఱకు ఎన్నివర్ణము లున్నను అవి యన్నియు ద్వితీయాక్షర మని యు, అనఁగా ప్రాసాక్షరమనియు గ్రహింపవలయును.

3. బిందు విసర్గములు హల్లులు.

౪. గీత సీస సంగీత మంజరీ కృతులఁగాదు.

ఆటవెలఁది యనుపద్యమును, తేట గీతి యనుపద్యమును గీతపద్యము లనఁబడును.

౫. హ్రస్వ దీర్ఘములమీఁది సంయోగ ములో తుది ర ల లు, దీర్ఘమునకును క గ చ ట త ప ల కును నడిమి అరసున్నయు అప్రధానములు.

సంయోగ మనఁగా కేవలహల్లుల సము దాయము. ఉ: ర్క్మ, ల్ప్ర).

ప్రాసవిషయమై, దీర్ఘము మీఁది ౘకార వడి (◡),లావడి(ග),ఏదైన నొక దీర్ఘాచ్చున కును క గ చ ట త ప-అను నీ యాఱింటిలో నే దైన నొకదానికిని నడుమ నుండు అరసున్నయు అప్రధానములు. అనఁగా, ఈ చెప్పఁబడినవి ఒకప్రాసమం దుండెనేని,కడమయన్ని ప్రాసము లందు నుండవలయు నను నియమము లేదు.

౬. అచ్చులు, నసర తత్థ్సానికి ణషలలు, ఒబమ్ములు, గ్రంథాది థధలు, బోధాది దధలు సమములు.

ఈసూత్రమందు "సమము" లను పదము పూర్వమునకెల్ల నన్వయించును.

నసర...ణషలలు (సమములు)—నకార సకార రేఫములును, వానికి బదులుగా వచ్చిన ణకార షకార లకారములు వరుసగా ఒక దాని కొకటి సమానములు.

ప్రాసవిషయమై, ఏ యచ్చయినను మఱి యేయచ్చునకయినను సమానము; ౦బ=మ్మ; గ్రంథాదిశబ్దముల థకారము ధకారమునకును; బోధాదిశబ్దముల ధకారము దకారమునకును సమానము.

విషమప్రాయ యతిప్రాసముల కుదా హరణములు:—

"అంబకు మ్రొక్కి నా* కలవడినట్లు
ఇమ్ముగా యతి కుదా*హృతులు సెప్పెదను.
ఓ కవీశ్వరులార* యోగీశ్వరులకు
ఆఁకేమి హరుఁడు మ*నోబ్జమం దుండ.
ఆబుష్పిత్రాతత లో*కౌఘరక్షకుఁడు
హేరాళముగను వే*దైక వేద్యుండు.
వినయంబున నజప్ర*భృతి దైవతములు
త్రిణయనుండని యేని*ధృతిఁ గొల్తు రట్టి.
కంధర ఖండాభ*ఖర కాలకూట
గ్రంథిలకంఠుఁడు*జ్ఞాన యోగంబు.
శ్వసన యోగము మేలు*చాతుర్య మిచ్చు
విషమ మార్గమునుండి* పెడఁ బాపు మదిని.
నమ్ముఁడీ మనల జా*ణలఁ జేసి కాలు
నిందమనల వెస నం*టింపక ప్రోచు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భోధ గగ్గిన మనః*మును లెల్లఁ బ్రణవ
నాద మాత్రఁడని తజ్*జ్ఞత మీఱ నంద్రు.

ఏల మాటలు వాని*క్వేపేశ్వరులును
ఆడి పాడ రె స్వాంత*మం దజా యనుచు.

నా కలవడిన=నాకున్ + అలవడిన. మనో బ్జ=మనస్ + అబ్జ. లోకౌఘ = లోక + ఓఘ. వేదైక=వేద + ఏక. త్రిణయన=త్రి + నయన. విషమ= వి + సమ. కాలునింమనల=కాలునిన్ + మనల.

---

గణపరిచ్ఛేదము

౧. హ్రస్వము లఘువు.

హ్రస్వాచ్చు లఘు వనఁబడును.

౨. దీర్ఘము; పొల్లునకు, నెఱసున్న విస ర్గలకు, ఏకపద సంస్కృత ప్రాకృత సంస్కృ తసమాససమసంయోగమునకు పూర్వహ్రస్వ మును గురువులు.

పొల్లనఁగా అచ్చుతోఁ గూడని పదాంత హల్లు. ఉ: రామునిన్, హరిన్. దీర్ఘాచ్చును, పొల్లునకుఁ గాని, నెఱసున్నకుఁగాని, విసర్గకుఁ గాని పూర్వమున నుండు హ్రస్వమును (ఉ: హరిన్, హరి గ్గనియె, సంత, రామః), ఏకపదము, సంస్కృతము, ప్రాకృతము, సం స్కృతసమాససమము:- ఈ నాలుగింటియందు సంయోగమునకు పూర్వమున నుండు హ్రస్వ మును (ఉ: అన్ని, యస్యజ్ఞాన, తపఃజ్జేవ్వా, వృషభధ్వజుఁడు)—గురువు లనఁబడును.

సంయోగమునకు పూర్వమం దుండు హ్రస్వము గురువు గాదు:

ఉ: "క. గురుపాదధ్యానముచేఁ
బరమైశ్వర్యంబుగలుగుఁ బ్రాజ్ఞతమీఱన్."
"క. గురుపదముల ధ్యానించినఁ
బరమైశ్వర్యంబుగలుగుఁ బ్రాజ్ఞతమీఱన్."

'పాదధ్యాన'—(ద)గురువు. 'పదముల'—(ల) గురువు గాదు.

3. అద్రుచాదులఁ గాదు.

అద్రుచు, విద్రుచు, ఇత్యాదులయందు సంయోగమునకు పూర్వమున నున్న హ్రస్వ ము గురువు గాదు.

౪. గలలు గురు లఘు ద్యోతకములు.

ద్యోతకములు=తెలియఁజేయునవి. గ= గురువు. ల=లఘువు.

౫. ద్వంద్వము క్రమ సముచ్చయద్యో తకము.

క్రమము = వరుస. సముచ్చయము = కూర్చుట.

ద్వంద్వముచేఁ జెప్పఁబడిన గణ గురు లఘువులను ఆ చెప్పిన వరుస తప్పకయే కూర్ప వలయును. ఇందువలన - న్న = రెండు నగణ ములు; లల=రెండు లఘువులు; న్య=నగణము, దాని వెంటనే యగణము; నలము=నగణము, దానివెంటనే లఘువు. భజసలు = వరుస తప్ప కుండ భగణము, జగణము, సగణము.

౬. ఆకారాంతము ద్విరుక్త సమము.

ఉ: నా=న్న=నన=రెండు నగణములు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭. క. తొలి,నడుమఁ, గొననె,గురువుగ-నలరు
భ,జ,స,లవె లఘువులు య,ర,త,లలోస-
ర్వ లఘు,గురులు,న,మ,లీగణ-ముల మూఁ
డే యచ్చులు లగము,గలమును,వ, హ, లా.

తొలిన్ (ఏ)=ఆదియందు (మాత్రమే); నడుమన్ (ఏ) = మధ్యయందు (మాత్రమే); కొననె= అంతమందు మాత్రమే; గురువుగన్ గురు వుండెనేని; భజసలు = వరుసగా భగ ణము, జగణము, సగణము; అలరున్= అగును.

అనఁగా—గలల = భగణము; లగల= జగణము; లలగ=సగణము. అవె = ఆ తొలి నడి కొనలుమాత్రమే; యరతలలోన్=వరు సగా యగణమందు, రగణమందు, తగణ మందు; లఘువులు = లఘువర్ణములుగా నుం డును. అనఁగా—లగగ=యగణము; గలగ= రగణము; గగల=తగణము. నమలు=వరుసగా, నగణము, మగణము; సర్వలఘు గురులు= సర్వలఘువును, సర్వగురువును. అనఁగా లలల= నగణము, గగగ=మగణము. లగ=వగణము; గల=హగణము.

౮. క. నల, నగ, సల, భ, ర, త,ము లిం-ద్రులు
న, హ, లర్కులు, నవంబుతో, నలల,నగా-
సలల, నవ, సహలు, నహముం-భల, భగ,
తల, తగ,రల,రగ,మల,ములు చంద్రుల్.

---

పద్యపరిచ్ఛేదము.

గణబంధాది నియమములు గల కవనము పద్యము.

తదితరకవనము గద్యము.

ఆది నియమ విశేషములు—ఒక్కొక్క పద్యమునకు నాలుగుపాదము లుండవలయును. పద్యములు సమవృత్తములు,విషమవృత్తములు నని యిరుదెఱంగులు. సమవృత్తము లందు నాలుగు పాదములందును గణక్రమము ఒకటే. విషమవృత్తములందు ఆ నియమము లేదు.

ఉ: శార్దూల విక్రీడితము సమవృత్తము. గీత సీస కందాదులు విషమవృత్తములు.

అన్నివృత్తములందును (దండకములలోఁ దప్ప) యతిప్రాసలు కలవు.

నియమ విశేషములు ఆయా పద్యము కడం జెప్పఁబడును.

సంజ్ఞలు

శక్ర=ఇంద్ర. ఇన, అర్క, అర్యమ, రవి, ప్రొద్దు=సూర్య. నెల=చంద్ర. యుగ, యుగళీ, యుగళ, ద్వయ, ద్వితయ, ద్వితయి=౨. శుచి, ఎరగలి=3. మాత్ర, ఉసుఱులు=౫. రుచి, షట్=౬. అద్రి, గిరి, ధరాధర, శైల, పర్వత, భూధ్ర, కుధర, సప్త=౭. సామభూ, హస్తి, కరి, అష్ట=౮. ధాత, బ్రహ్మ, పరమేష్ఠి, అబ్జజ, అజ, ఆత్మజ, బిలాలి, మణి, నవ =౯. ఆశ, దిక్కు, దెస, దిశ=౧౦. ఈశ, ఈట్, పంచశ రారి, గిరిశ, శివ, మిగులఁగనుదోర=౧౧. ద్వాదశాత్మ, భాస్కర, రవి, ఖర, ద్వాదశ= ౧౨. భువన, విశ్వ = ౧3. మను = ౧౪. నృప = ౧౬.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# *ఉత్తరహిందూస్థాన చిత్రములు



౨. ఖైబరు కనుమలో మోటారులబాట, ఒంటెలదారి



౪. తక్షశిల-ధర్మరాజస్తూపము



౧. 'టాంగా'లు అనుబండ్లు-లాహోరు



3. మంచు క్రమ్మిన యిండ్లు-ముర్రే

* ఈచిత్రములు శ్రీ. సుబ్బారావుగారు తీసిపంపినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౬. జలియనువాలాబాగులో చనిపోయిన భారతీయుల శవములను త్రోసిన నూయి



౫. లాహోరుకోటయొక్క సింహద్వారము



౩. లాహోరుపట్టణము



౭. జలియనువాలా బాగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యా య ము లు

ఇన్నవపాదమునకని నిర్దేశింపక చెప్పిన లక్షణము ప్రతిపాదమునకును అగును.

యతికి పూర్వమున ఈ వ్రాత్తమున ఈ * గుర్తు ఉండును.

సమవృత్తములలో గురులఘువులు అన్ని పాదములలోను ఒక్కటే వరుసను ఉండును. విషమవృత్తముల నట్లుండవు.

వక్ష్యమాణ పద్యలక్షణముల యందలి సంఖ్య, సమవృత్తములలో ఏకపాదమున, పూర్వయతినుండి ప్రస్తుతయతివఱకు వర్ణములను లెక్కపెట్టఁగా నేర్పడిన సంఖ్యగాను; విషమవృత్తములలో ఏకపాదమందు, పూర్వయతి మొదలుకొని ప్రస్తుతయతి యుండు గణమువఱకు గణములను లెక్కపెట్టఁగా నేర్పడిన సంఖ్యగాను ఉండును. ఆతుదగణముయొక్క మొదటివర్ణము యతి యగును.

యతికి బదులుగా ప్రాసమువచ్చుననుచో, యత్యక్షరములను యతిలక్షణము ప్రకార ముంపక, వానిపై యక్షరములను ప్రాసలక్షణము ప్రకార ముంపవలయును.

ప ద్య ము లు

౧. పద్యమున నాలుగు పాదములు.

క ం ద ము:—

౧. కంద మనగా భ జ స నల, లం-దెవ్వియు మూఁడు నైదు* యతి మూఁటిపయిన్, బొందునల మొ జ మొ యాఱిట, నొందును దుద గురువు జగణ * ముండదు బేసిన్.

౫౭ = సగము.

సగమునకు లక్షణము:

గా, భ, జ, స, నల, అను గణములే తొలిపాదమున మూఁడును, రెండవపాదమున అయిదును ఉండును. రెండవపాదమున నాలవగణము తొలియక్షరము యతి; ఆఱవది నలమో, జమో అగును; తుదను గురు వుండును. కడమ సగమునకు ఇదే లక్షణము.

ఆటవెలఁది గీతి:—

(౩ సూర్యులు, ౨ ఇంద్రులు చేసి పాదము; ౫ సూర్యులు సరిపాదము; యతియొ, ప్రాసమొ, ౪.),

3. ఇనులు ముగ్గు రింద్రు * లిద్దఱు చేసికాళ్లు ర్కు ఏవురు సరు * లాట వెలఁది.

కాళ్లు= పాదములు. ఏవురు = అయిదు గురు. సరులు= సరిపాదములు. యతి నాలవ గణమని తేటగీతిలక్షణమం దున్నది.

తేటగీతి:—

(సూర్యుఁడు, ౨ ఇంద్రులు, ౨ సూర్యులు; యతియొ ప్రాసమొ, ౪.),

౪. ఇనుఁ డొకఁడు శక్రవులిద్ద*ఱిదఱు తేట గీతి, ప్రాసమొ యతియొ నా*ల్గింట గీతి.

గీతిన్ = గీతపద్యమందు, అనఁగా, ఆటవెలఁది యందుఁ గాని, తేటగీతియందుఁ గాని.

సీసము:—

(౪ ఇంద్రులు చేసిపాదము; ౨ ఇంద్రులు, ౨ సూర్యులు సరిపాదము; పాదములు ౮; అటుపై గీతి.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫. సీసమున నల్గు రింద్రులు
బేసియడుగు;లింద్రయుగర*విద్వయము సరుల్
ప్రాస మొ యతి యో మూఁటన్
వ్రాసి పదాష్టకము, గీత*పద్య మిడు తుదన్.
ఇదు = వ్రాయుము.

ఉత్పలమాల:—
(భ ర న భ భ ర వ, ౧౦.)
౬. ఉత్పలమాలలో భ,ర,న,*లొప్పను భా, రవ లున్ దిశాయతిన్.

చంపకమాల:—
(న జ భ జ జ జ ర, ౧౧.)
౭. న జ భ జ జా ర లీ శ య మ* నంబను జంపకమాల నై చనున్.

శార్దూలవిక్రీడితము:—
(మ స జ స త త గ, ౧౩.)
౮. శార్దూలిన్, మసజల్ సతాగములు వి*శ్వ శ్రాంతితోఁ జెల్వగున్.

మత్తేభవిక్రీడితము:—
(స భ ర న మ య వ, ౧౪.)
౯. మను విశ్రాంతియు సభ్రనమ్యవములున్*మత్తేభవిక్రీడ యౌ.

స్రగ్ధర:—
(మ ర భ న య య య, ౮, ౮.)
౧౦. చాలున్, మ ర్భన్యయా ల*ష్టయతియుగళమున్*స్రగ్ధరావృత్తమందున్.

మహాస్రగ్ధర:—
(స త త న స ర ర గ, ౯, ౭.)

౧౧. స త త న్సల్ రాగముల్ వి*శ్రమయుగళి మహా*స్రగ్ధరన్ బ్రహ్మ హ స్తిన్.

లయగ్రాహి:—
(భ జ స న భ జ స న భ య)
(ప్రాసము ౯, ౯, ౯.)
౧౨. ఇ[ంబ] లరు దిక్కుల భ*జ[ంబు] స న భ ం బు జ స*న[ంబు] భ మ ప్రాసముల *య[ంబొ]రయు గ్రాహిన్.

లయవిభాతి:—
(న స న న స న స న న స గ ప్రాసములు ౧౦, ౧౦, ౧౦.)
౧౩. న స న న స నా స న లు*న స గ ము లు ప్రాసయతి*పొసఁగుపదులన్ వరుస*వెస లయవిభాతిన్.

లయవిహారి :—
(న న న స న న న న న న న సగ, ప్రాసములు ౧౧, ౧౧, ౧౧.)
౧౪. నగణములు పదునొకఁడు* సగలు యతిప్రతినిధులు-మిగులఁ గను దొరలపయిఁ-దగులు లయహారిన్.

సాధ్వి:—
(భ న జ న స న న భ గ, ౮, ౮, ౮.)
౧౫. చాలును గరికరి*సాధ్వని భనజన *సన్న భగములును*సామజమున్.

లాక్షణి: —
(భ న న న న భ న న స, ౧౬.)
౧౬. లాక్షణి యగు భ న న న న భ న న సలు*లాలిత నృపతి విరమణముతోన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శిఖరిణి :—

(య మ న స భ వ, ౧౩.)

౧౭. వెసన్, యమ్నస్భల్ వంబును శిఖరిణిన్-విశ్వవిరతిన్.

క్రౌంచపదము:—

(భ మ స భ న న న య, ౧౧.)

౧౮. పంచ శరారిన్ క్రౌంచపదంబా *భ మ స భ న న న య*పరమేష్ఠియతిన్.

మానిని:—

(భ భ భ గ భ భ భ గ, ౭, ౭, ౭.)

౧౯. భా భ భ భా భ గ*భాసిత మానిని *పాయదు పర్వత*పార్శ్వములన్.

రమణకము:—

(న న న న న న న స న లగ, ౯, ౯, ౯.)

౨౦. న న న న న న న న*నలగలు న వ న వ*నవవిరతుల రమ*ణక మమరున్.

మందాక్రాంత:—

(మ భ న త త గ గ, ౧౧.)

౨౧. మందాక్రాంతన్ గిరిశవిరతిన్ *మభ్నతాగా చెలంగున్.

ధ్రువకోకిల:—

(న భ ర స జ జ గ, ౧౨.)

౨౨. రవియతిన్ ధ్రువకోకిలన్ నభ *రంబు సజ్జగమున్ దగున్.

మత్తకోకిల:—

(ర స జ జ భ ర, ౧౧.)

౨౩. మత్తకోకిల వృత్త మీశయ *మంబుతో రసజాభముల్.

తరళము:—

(న భ ర స జ జ గ, ౧౨.)

౨౪. తరళ మొప్పు నభర్సజాగము *ద్వాదశాత్మ విరామమున్.

తరళ:—

(న న న న న న న గ, ౧౩.)

౨౫. తరళ న న న న న న న గలు *దనరుభువన విరతితోన్.

తరళి:—

(భ స న జ న ర, ౧౧.)

౨౬. సారమహిత భస్నజనర * సాంద్ర తరళి యీడ్యతిన్.

మలయజము:—

(న జ స న న న భ ల గ, ౮, ౮, ౮.)

౨౭. మలయజ మష్టయ*మముల నజ స్నలు*మఱి ననభంబులు * మఱి లగమున్. ؏

తన్వి:—

(భ త న న స భ భ న య, ౧౩.)

౨౮. విశ్వవిరామంబు భ త న స భ భల్ *వేడుకతో నయలును దగు తన్విన్.

కవిరాజవిరాజితము:—

(న జ జ జ జ జ జ వ, ౮, ౭, ౭.)

౨౯. రహి నజషడ్వ వి*రాట్కవిరాజ వి*రాజిత మష్టధ*రద్వయితోన్.

లాటీవిటము:—

(స స స స మ త య, ౧౩.)

౩౦. స స సల్ సమతల్ యగణంబును వి*శ్వక్రాంతిన్ లాటీవిటమందున్.

---

؏ దీనికి గణలక్షణము సరిపోవకున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నర్కుటము:—

(న జ భ జ జ వ, ౧౧.)

౩౧. న జ భ జ జ ల్ ఎసర్చగ శివుఁడు *నర్కుటమందుఁ దగుగ.

హరిణి:—

(న స మ ర స వ, ౧౨.)

౩౨. హరిణియగు నస్మర్స్వంబై భాస్క*రాత్తవిరామమై.

పంచచామరము:—

(జ ర జ ర జ గ, ౧౦.)

౩౩. జ ర ల్ జ ర ల్ జగంబు పంచ*చామరంబు దిగ్యతిగ.

మాలిని:—

(న న మ య య, ౯.)

౩౪. న న మ య య లు గూడు*న్మాలినిం దొమ్మిదింటగ.

మదనము:—

(త భ జ జ జ గ, ౯.)

౩౫. ధాతగ యతిగ మదనమా * తభజాజగంబుల్. §

సుగంధి:—

(హ హ హ హ హ హ హ గ, ౯)

౩౬. తొమ్మిదింట హమ్ము లేదు *తోగ హా సుగంధికిగ.

వనమయూరము:—

(భజసనగగ, ౯.)

౩౭ ఔ వనమయూరము బి*లాలి భజసగ్గా.

కరిబృంహితము:—

(భన భన భనర, ౧౩.)

౩౮. మూఁడు భనములు రేఫమును బదు*మూఁట యతి కరి బృంహితగ.

మణిగణనికరము:—

(న న న న స, ౯.)

౩౯. మణిగణనికరము*మణి నననసల్.

వసంతతిలక:—

(త భ జ జ గ గ, ౮.)

౪౦. క్రాలుగ వసంతతిల*కగ గరితోఁ ద్భజాగా.

మంజు భాషిణి:—

(స జ స జ గ, ౯.)

౪౧. మణియుగ సజల్ సజగ * మంజు భాషిణిగ.

రుచిరము:—

(జ భ స జ గ, ౯.)

౪౨. నవాంకముగ రుచిరము*నగ, జభస్జగల్.

కుసుమ విచిత్రము:—

(న య న య, ౭.)

౪౩. కుసుమ విచిత్రగ * కుధరనయన్యల్.

మణిమాల:—

(త య త య, ౭.)

౪౪. భూధ్రంబు తయత్యల్ * పొల్చుగ్ మణిమాంగ.

§ దీని గ లక్షణము 'వసంతతిలక'ను బ లియున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పృథివి:—

(న భ జ ర, ౮.)

౪౫. వెస నభ్రజ పృథి*విఁ గరి నెక్కుఁ.

ద్రుత విలంబిత:—

(న భ భ ర, ౭.)

౪౬. ద్రుతవిలంబిత*తో న భ భర్ గిరుల్.

వంశస్థము:—

(జ త జ ర, ౮)

౪౭. జత్రజవంశస్థము*సామభూయతిఁ.

జలోద్ధతగతి:—

(జ స జ స, ౮.)

౪౮. జలోద్ధతగతిఁ జ*సల్ జసకరిఁ.

ప్రమితాక్షరము:—

(స జ స స, ౯.)

౪౯. ప్రమితాక్షరంబు మణి*పై స జ సా.

తోదకము:—

(న జ జ య, ౮.)

౫౦. న జ జ య తోదక * నామను హస్తిఁ.

ఇంద్రవంశము:—

(త త జ ర, ౮.)

౫౧. ఔ నింద్ర వంశంబున * హస్తితా జరల్.

మణిరంగము:—

(ర స స గ, ౬.)

౫౨. శ్రీ ర సా గ రు * చిఁ మణి రంగఁ.

భద్రకము:—

(ర స వ.)

౫౩. భద్రకంబు రసల్ వసుఁ.

భుజంగప్రయాతము:—

(య య య య, ౭.)

౫౪. భుజంగ ప్రయాతం*బునఁ శైల యా యా.

స్రగ్విణి:—

(ర ర ర ర, ౭.)

౫౫. స్రగ్విణిఁ రా ర రల్ * శైల విశ్రాంతియుఁ.

చంద్రిక:—

(న న ర వ, ౯.)

౫౬. చను న న ర వ బ్రహ్మ*చంద్రికల్.

సుముఖి:—

(న జ జ వ, ౭.)

౫౭. న జ జ వ లద్రి*నలిఁ, సుముఖిఁ.

శాలిని:—

(మ త త గ గ, ౭.)

౫౮. సిల్వేడింటఁ శాలి*నిఁ మత్తగాయుఁ.

ఇంద్రవజ్ర:—

(త త జ గ గ, ౮.)

౫౯. ఈ తాజగాహస్తియు*నింద్రవజ్రఁ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపేంద్రవజ్రః—

(జ త జ గ గ, ౮.)

౬౦. ఉపేంద్రవజ్రన్ గరి*నొప్పు జత్జగా.

ఉ ప జా తిః—

౬౧. ఇంద్రవజ్రోపేంద్రవజ్రాపాద సంకరము ఉపజాతి.

తోటకము:—

(స స స స, ౯.)

౬౨. అగుసాసస తోటక* మబ్జజుతోన్.

దోధకము:—

(భ భ భ గ గ, ౭.)

౬౩. దోధకమా గిరి*తో భ భ భ గ్గల్. దీనికే పాదపమనియుం బేరు.

పృథ్వీ:—

(జ స జ స య వ, ౧౨.)

౬౪. చతుర్దశయతిన్ జసల్ జసయవల్ వె*సం బృథ్వి యా.

స్వాగతము:—

(ర న భ గ గ, ౭.)

౬౫. స్వాగతంబు రన*భల్ గగ మద్రిన్.

రథోద్ధతము:—

(ర న ర వ, ౭.)

౬౬. ఒప్పురన్ రవ ర*థోద్ధతన్ గిరిన్.

సరసాంకము:—

(సజససయ, ౧౦.)

౬౭. సరసాంకమాశల యతిన్ * సజ సాయ లొప్పగన్.

విద్యున్మాల:—

(మ మ గ గ, ౫.)

౬౮. మాగా విద్యు*న్మాలన్ మాత్రల్.

మంగళమహాశ్రీ:—

(భ జ స న భ జ స న గ గ, ౯, ౯.)

౬౯. చక్కఁగ భజస్నభజ * సన్గగలు మణ్యాజుల*శ్రాంతులును మంగళమహాశ్రీ.

తరువోజ:—

(3 ఇంద్రులు, సూర్యుఁడు,
3 ఇంద్రులు, సూర్యుఁడు; 3, 3, 3.)

౭౦. ముగు రింద్రు లొకప్రొద్దు*మూఁడిట విరతి * ముగియఁగా రెట్టింప* మొగిఁ దరువోజ.

ఉత్సాహ:—

(ఏడుగురు సూర్యులు, గురువు, ౫.

౭౧. ఉసులు, లేడు ప్రొద్దులునుగ * ముత్స దాక్త సాహ యా.

అంతరాక్కర:—

(సూర్యుఁడు, ౨ ఇంద్రులు, చంద్రుఁడు; రెండవఇంద్రుని తుదివర్ణము యతి.)

౭౨. రవియు శక్రద్వితయి నెల రాణమీఱు, యతియునింద్రులతుది నంతరాక్కరంబు.

మధురాక్కర:—

(సూర్యుఁడు, 3ఇంద్రులు, చంద్రుఁడు; ౪.

౭౩. రవియు శక్రత్రయము నెలరాణ మీఱు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యతియు నాల్గింటఁగా మధ్యాక్కరంబు.

మధ్యాక్కర:—

(౨ ఇంద్రులు,సూర్యుఁడు, ౨ ఇంద్రులు సూర్యుఁడు; ౪.)

౭౪. ఇంద్రయుగ మర్యమునిఁ బెట్టి యినుమడింప,

యతిని యిడ నాలుగింటమధ్యాక్కరంబు.

అల్పాక్కర:—

(౨ ఇంద్రులు, చంద్రుఁడు;. 3)

౭౫. ఇంద్ర యుగళంబునుఁ జంద్రుఁడింపు మీఱ,

యతిని మూఁడిటఁ బెట్ట నల్పాక్కరంబు.

ద్విపద రగడ ద్విపదలు:—

౭౬. ద్విపదలోను, రగడలోను రెండేపాదములు. అయినను కవీశ్వరులు సాధారణముగా ఎన్నో ద్విపదలను ఎడతెంపు లేక చెప్పుదురు.

ద్విపద:—

(3 ఇంద్రులు, సూర్యుఁడు; యతియో, ప్రాసమో, 3 ను.)

౭౭. సాంద్రవిశ్రామంబు*చను మూఁట ద్విపద.

౭౮. రగడయందు దంత్యప్రాసముకూడ నుండును.

హయప్రచారరగడ:—

(౪ సూర్యులు, 3.)

౭౯. ఇనులు నల్వు * రెరగలియతి, చనుహయప్ర*చారనియతి.

౮౦. హయప్రచారములు=౧.తురగవల్గన రగడ.

౮౧. ౨.తురగ వల్గనములు= ౧ విజయ మంగళ రగడ.

ద్విరదగతి రగడ:—

(౪ గణ, 3, ౧ గణ=౫ల, ౨ల=౧గ.)

౮౨. కరము పంచ లస దృ*గ్గణ చతుష్టయము చే,

విరమంబు రెంటిపయి * ద్విరదగతి నయముచే.

౮3. ౨.ద్విరద గతులు= విజయ భద్ర రగడ.

మధురగతి రగడ:—(౪ గణ, 3,౧ గణ=౪ ల, ౨ ల=గ.)

౮౪. నాలుగుమాత్రల * నాలుగు గణములు

సోలు మధురగతి*శుచివిరమణములు.

హరిగతిరగడ:—(నల, న, భ, ఈగణములే ౮; ౪.)

౮౫. నలనభగగముల నెన్మిది సేరఁగ* నాల్గిటిపై యతి నయముగ హరిగతి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నా మంచిపాట నాలో నేనే పాడుకుంటాను.
నే-పైకి-పాడ.
నే-పైకి-పాడే-పాటమెల్లా, రెంపోరకమేను—
నాకలమున్మలచి, కాయితాన్నుంచి, 'కైతా!' అంటాను
నే-నేమీ-వ్రాయ.
నే-వ్రాస్తే-వచ్చే-దంతామేలిం, వ్రాయ నంతేను— ॥ నామంచి ॥

నామెడదాబెంచి, కళ్లానించి, నవరసమొలికిస్తా
నా-పెదవీ-విప్ప.
తేపీ-తేపి-నాల్క-చివర-నాపి, ఊకొడుతూ— ॥ నామంచి ॥

నీలోకంగాస్తూ, శోకంమూస్తూ, లోలూపునైపోతా,
నే-నేడ్వ-నవ్వ,
నా-చెక్కి-ళ్లంటాకాతేనీరు నవనాళ్లనింకించి,— ॥ నామంచి ॥

నే బేరంసారం, దూరంభారం, నేరాను కించిత్తు
నే-నేమీ-కోర
నాగడపాకొచ్చి నన్నూపిల్చి ననుగోనిపోతూంటే— ॥ నామంచి ॥

నా రాజ్యంపూజ్యం, రాగంత్యాగం, నేనే రాజ్ బంటు
నా-కెవరూ-లేరు,
నా-నాణే-మెచ్చి, సంచీనిడించి, నాదంటె ఏదంటూ— ॥ నామంచి ॥

నే కవినీగాను, కథకూడగాను, ఏకాలంగలయే
నే-నిదరా-బోను
సిరామెదిపి, సిరావిదిపి, శ్రీరామ సుశ్రీనే— ॥ నామంచి ॥

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# 'విస్మృత సంస్కృత కావ్యావళి'

## 2. భట్టబాణుఁడు—"ముకుటతాడితకము."

యాయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు

జగద్గీతకీర్తియు, గద్యకవితా సామ్రాజ్యలక్ష్మికి నధీశ్వరుండునగు భట్టబాణుని కవితాసౌరభము నాఘ్రాణింపని యంశ్వరాణి యుండఁడు. రాజకవిశిరోమణియగు హర్షవర్ధన కల్పభూజము నాశ్రయించిన భట్టబాణకవి కోకిల కవితాగాన మాధురీమహిమ సార్వవిద్వల్లౌకికము. గీర్వాణగద్యకవితాతారాపథమున దివ్యజ్యోతివలె వెలుఁగు నీ కవిపుంగవుని గూర్చి ఆంగ్లము, జర్మన్, ఫ్రెంచిభాషలలో గవేషణాత్మకములగు గ్రంథరాజములు పెక్కులు గలవు; ఇటఁ గొన్నిటిఁ జేర్కొనెద.

1. P. V. Kane's Introduction to his edition of Bana's "Harsacaritam". 1918.

2. The elegant and spirited translation—into English—of the"Harsacarita"by Profs. Cowell and Thomas.

3. Dr. P. Peterson's interesting and instructive Introduc'ion to his edition of the "Kadambari."

4. Prof. M. R. Kale's Introduction to his edition of the "Kadambari."

5. 'The Sanskrit Poems of Mayura and Bana' ed'ted by G. P. Quackenbos. [Harvard Oriental Series.]

6. Introduction to the 'Parvati-Parinaya'. [Vani Vilas Press, Srirangam.

7. Dr. A. B. Keith's latest monumental work, 'A History of Sanskrit Literature', published in 1928.

8. Dr. A. B. Keith's "Classical Sanskrit Literature".[Heritage of India Series.]

9. సంస్కృతకవి జీవితము, 1 సంపుటము, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి నిర్మితము. 1911.

" కాదంబరీ రసజ్ఞానా మాహారోఽపి న రోచతే"

అను సుధీసూక్తిఁ బాత్రమగు బాణుని కవితాసుందరి పాశ్చాత్య విద్వద్రసికుల హృత్కుశేశయముల వికసింపఁజేయఁజాలక పోయెను.

జర్మన్యప్రాచ్యసాహిత్యపరిషత్పత్రికలో (1854 సం.) వీబర్ విద్వన్మణి భట్టబాణుని గద్యకావ్యముల నిట్టులు నిరసించెను:—

"Bana's prose is an Indian wood' where all progress is rendered impossible by the undergrowth, until the traveller cuts out a path for himself and where even then he has to reckon with malicious wild beasts in the shape of unknown words that affright him". [From the Journal of the German Oriental Society for 1854].

బాణుని కవితలో లోపములు లేకపోలేదు; కాని పైవిమర్శమతి మాత్రతీక్ష్ణముగానున్నది. బాణుఁడు వక్రోక్తికవితామార్గమున సిద్ధహస్తుఁడు. సంస్కృతరాఘవ పాండవీయమహాకావ్య నిర్మాతయగు కవిరాజసూరి భట్టబాణుఁడు వక్రోక్తిమార్గనిపుణుఁడని యుల్లేఖించియున్నాఁడు.

"శ్లో. సుబన్ధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః,
వక్రోక్తి మార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా."
—రాఘవపాండవీయము, 1 స. 41 శ్లో.

చాళుక్య ప్రభుపుంగవుఁడగు సోమదేవుని సంస్థానాలంకార భూతుఁడగు విద్యామాధవ విద్వత్కవి"పార్వ

7. 3- 3 32న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీరుక్మిణీయ"మను ద్వ్యర్థికావ్యములో నిట్లులు వ్రాసియున్నాఁడు:—

శ్లో. బాణస్సుబన్ధుః కవిరాజసంజ్ఞో
విద్యా మహామాధవపండితశ్చ,
వక్రోక్తిదక్షాః కవయః పృథివ్యాం
చత్వారఏతే నహి పంచమోఽస్తి."

[*Vide* 'A Descriptive Catalogue of Sanskrit Manuscripts in the Govt. Oriental M S S. Library, Madras, Vol. XX. p. 7779; R. No. 11606.]

సూర్యశతకముం జెప్పి, ప్రభాకరుని ప్రసన్నునిగాఁ జేసికొని నీరోగుఁడైన మయూరమహాకవిని వలెనే, భట్టబాణుఁడును గద్యంబు చెప్పి శంకరుం గరము ప్రసన్నుం జేసికొని కరలాభ మొందెనని యైతిహ్యము గలదు. పెదపాటి ఎఱ్ఱాప్రెగడ "కుమార నైషధము"లో (చూ. 'ప్రబన్ధరత్నావళి,' 23 పు. 76 ప.) నిట్టులు నుడివియున్నాఁడు:—

"గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసిన బాణుఁడలఁతు."

(ఇట్టి యైతిహ్యములు 'బసవపురాణము'లోఁ (ఆ. ౬౫ పుట; ప్రాచీనప్రతి) గూడ నుల్లేఖింపఁబడియున్నవి:

" చేతులు రెండు సంప్రీతిఁ బూజింప
ఖ్యాతిగఁ జేతులు బాణునకిచ్చె
కన్నులు రెండు సమున్నతిఁ బూన్పఁ
గన్నులప్రోవిడెఁ గాళిదాసునకు
* * * * *
భానునిచేఁ బోని లోని కుష్ఠడఁచి
పూని మయూరుని మే నిచ్చెఁ గాదె
హరిచేతఁ బోని దుస్తరమైన కుష్ఠు
హరియింపఁడే దండి యర్థిఁ గీర్తింప."*

సోమశేఖరకవి 'వరసభూపాలరాజీయము' లో (1 ఆ. 8 ప.) నిట్టులు నుడివి యున్నాఁడు:)

"వరవృత్తములు మాని వాణి యెవ్వానికై
నలచి నానా శ్లేషములకుఁ జిక్కె."

తరిగొప్పుల మల్లనమంత్రి 'చన్ద్రభాను చరిత్ర'లో (1 ఆ. 5 ప) నిట్టులు బాణునిగూర్చి వ్రాసియున్నాఁడు:—

" అసమబాణాంకిత నలరారియు నలిక
నేత్రు మెప్పించిన నిర్మలాత్ముఁ"దలఁతు.

బాణునికి గద్యకవితలో నున్న నైపుణ్యము పద్యకవితలో లేదని యాలంకారికుల యభిప్రాయము:

ప్రకాశేశ్వరుఁడు "రసార్ణవాలంకారము"†లో నీ విషయమై యిట్టులు నుడివి యున్నాఁడు:—

శ్లో. యాదృగ్గద్యవిధౌ బాణః పద్యబన్ధే న తాదృశః,
ప్రతిమార్గమియం (స్ఫెదః) చిత్రా హి సరస్వతీ."
111 పరిచ్ఛేదము. 87 శ్లో.

పై శ్లోకమునందలి పూర్వార్ధము భోజదేవుని "సరస్వతీ కంఠాభరణము"లోఁగూడ [P.142 of Vol. I of the Benares Edition]నుట్టంకింపఁబడియున్నది. బాణుఁడు పద్యకవితారచనమునఁగూడ నిపుణుఁడు; కాని యీతని పద్యగద్య కవిత్వములఁ బోల్చినపుడాతఁడు గద్యకవితారచనమున నిరంకుశప్రజ్ఞాసంపన్నుఁడని విశదమగును. నిర్దుష్ట గద్యకావ్యరచనము బహుకష్టసాధ్యము. అందుచే నాలంకారికులు కవియొక్క సాహిత్యరత్నపటలికి గద్యకావ్యరచనము నికషాయమాణమని నుడివియున్నారు.

ఆలంకారిక శిరోమణియగు వామనుఁడు తన "కావ్యాలంకార సూత్రవృత్తి" [I. iii, 21] లో నిట్టులుల్లేఖించియున్నాఁడు: "గద్యం కవీనాం నికషం('నికశం' పా.) వదన్తి." శ్రీమత్పండిత పాండురంగవామన

* ఈవిషయము నాకు శ్రీయుత నిడుదవోలు సుందరము పంతులుగారివలనఁ దెలిసినది.

† Published as a supplement to the "Indian Historical Quarterly" of Calcutta, Vol. V, No. 1, March, 1929.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాణే మహోదయులు 'హర్ష చరితా' పీఠికలో నిట్టులు లిఖించియున్నారు:—

"We must not forget that Bana was handicapped in verse. We have quoted above a critic's opinion that Bana does not excel so much in verse as in prose. That remark could not have been based on the few verses that occur in the two prose works of Bana. They rather refer to some compositions in verse written by Bana. We suggest that 'Parvatiparinaya' may be one of them." [Prof. P. V. Kane's Introduction, p. XVIII to his edition of the 'Harsacaritam.']

బాణుని మనోహర గద్యకవిత్వముండఁగ నాతని పద్యకవిత్వము చప్పగా నుండుటచేతనే కాఁబోలుఁ దన్నిర్మిత "ముకుటతాడితక, పద్యకాదంబరులు" లుప్తములై యుండును. గద్యపద్య కవితా తారతమ్యముంగూర్చి కాలాంతరమునఁ జర్చింతెద.

తిరుచినాపల్లి జాతీయ కళాశాలా సంస్కృతాచార్యులగు శ్రీమత్పండిత వాసుదేవ శర్మగారు బాణుని నిరసించిన పాశ్చాత్య విమర్శకుల కిట్టులు ప్రత్యుత్తర మొసంగిరి:—

"The western English knowing scholar, whose language is singularly free from the complexity caused by the compounding of expressions, is sore afraid of Bana's lengthened *samasas*. But to one steeped in the tradition of Sanskrit learning, these will appeal, I am sure, but as an instance of 'lengthened sweetness, long drawn out.' Prof. Weber and along with him Dr. Peterson, and Prof. Keith following them both at a respectable distance (of time) and quoting them, are frightened out of their wits, 'by the wild beasts in the shape of unknown words' lying in wait for the innocent way-farer. But a little more acquaintance with the language and its genius, we are convinced, would go much towards robbing these innocent but uncouth denizens of the wilds, of their supposed ferocity and revealing the beauty of it all. If Bana chose to indulge in sentences running upto six pages in print, it is only indicative of his erudition and scholarly exuberance and should have been a matter more for admiration, than for any adverse comment. All glory to that master! We only wish we had many more of that type!" [From the Introduction to his English Translation of the 'Harsacarita Sangraha'. Jananukoola Press, Trichinopoly, 1927.]

ఆంధ్రగీర్వాణవిద్వత్కవిపుంగవు లనేకులు బాణుని, నాతనికవితను బహుధా స్తుతియించిరి. అత్యంతోపయుక్తము, నతిమాత్రచేతోమోదావహము నగుటచే భట్టబాణస్తుతికుసుమాంజలి నిట రసికాళికి సమర్పించుచున్నాను:—

బాణుని 'హర్ష చరితము'ను మించవలెనని 'ఉదయసుందరీచంపువు'ను రచించిన సోడ్ఢలుఁ డనేక శ్లోకములలో బాణుని స్మరించియున్నాఁడు:

౧. ఈ క్రిందిశ్లోకములో హర్షవర్ధనుఁడు బాణుని గనకాభిషిక్తుం జేసినట్టులు సూచింపఁబడిది:—

శ్లో. 'శ్రీహర్ష ఇత్యవనివర్తిషు పార్థివేషు
నామ్నైవ కేవల మజాయత వస్తుతస్తు,
గీర్హర్ష ఏష నిజసంసది యేన రాజ్ఞా
సంపూజితః కనకకోటిశతేన బాణః.'

—I ఉచ్ఛ్వాసము.

౨. ఈ శ్లోకములో బాణుని 'హర్ష చరితము' స్తుతింపఁబడినది:—

'శ్లో. బాణస్య హర్ష చరితే నిశితా ముదీక్ష్య
శక్తిం న కేఽత్ర కవితాస్త్రమదం త్యజన్తి,
మాన్ద్యం న కస్య చ కవే రిహ కాలిదాస
వాచాం రసేన రసితస్య భవ త్యతృప్యమ్.'

—ఉదయసుందరి, I ఉ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩. అభినన్దుని వాగీశ్వరత్వము, వాక్పతిరాజు వర్థేశ్వరత్వము, కాళిదాసుని రసేశ్వరత్వము బాణునియందు మూర్తీభవించినట్టు ఈశ్లోకమున సూచితము:—

శ్లో. 'వాగీశ్వరం హన్త భజేఽభినన్ద
మర్థేశ్వరం వాక్పతిరాజ మీడే,
రసేశ్వరం స్తౌమిచ కాళిదాసం
బాణంతు సర్వేశ్వర మానతోఽస్మి.'
—ఉదయసుందరి, VIII ఉ.

౪. శ్లో. 'హాలే నోత్తమపూజయాక విన్నృపః
శ్రీపాలితో లాలితః
ఖ్యాతిం కామపి కాళిదాసకవయో
నీతాః శకారాతినా,
శ్రీహర్షో వితతార గద్య కవయే
బాణాయ వాణీ ఫలం
సద్యః సత్క్రియయాభినన్దమపిచ
శ్రీహారవర్షోఽగ్రహీత్'
—రామచరితము, XXII స. ౧౦౦ శ్లో.

౫. ఇన్ద్రసూరి (క్రీ. శ. ౭౭౮)'కువలయమాల' (ప్రాకృతకావ్యము):—
'లావన్న వయణసుహయా
సువన్న రయణుజ్జ లాయబాణస్స,
చన్దావీడస్సవణే
జాయా కాయంబరీ జస్స.'

ఛాయ:— 'లావణ్యావచనసుఖదా సువర్ణ రచనోజ్జ్వలాచ, బాణస్య చన్ద్రాపీడస్య వనే జాతా కాదంబరీ యస్య.

౬. ధర్మదాససూరి:—
శ్లో. 'రుచిరస్వరవర్ణ పదా రసభావవతీజగన్మనోహరతి,
తత్కిం? తరుణీ? నహినహి, వాణీ బాణస్య
మధురశీలస్య'
—'విదగ్ధముఖమండనము.'

౭. గోవర్ధనాచార్యులు:—
శ్లో. 'జాతా శిఖణ్డినీ ప్రాగ్యథా శిఖణ్డీ తథావగచ్ఛామి,
ప్రాగల్భ్య మధిక మాప్తుం వాణీ బాణో బభూవేతి.'
—'ఆర్యాసప్తశతి.'

౮. ధనపాలుఁడు:—
శ్లో. 'కేవలోఽపి స్ఫురన్బాణః కరోతి విమదాన్కవీన్,
కిం పునః క్లృప్తసన్ధానపులిన్ధ్ర (న్ధ్ర?) కృతసన్నిధిః.'
—'తిలకమంజరి', 26 శ్లో.

౯. త్రివిక్రముఁడు:—
శ్లో. 'శశ్వద్బాణ ద్వితీయేన నమదాకారధారిణా,
ధనుషేవ గుణాఢ్యేన నిశ్శేషో రఞ్జితో జనః'
—'నలచంపువు.'

౧౦. సోమేశ్వరదేవుఁడు:—
శ్లో. 'యుక్తం కాదంబరీం శ్రుత్వా
కవయో మౌనమాశ్రితాః,
బాణధ్వనా వనధ్యాయో
భవతీతి స్మృతి ర్యతః.'
—'కీర్తికౌముది', 1 స. 15 శ్లో.

౧౧. రాజచూడామణి దీక్షితులు:—
శ్లో. 'బాణో ధురీణః కవిపుఙ్గవేషు
ప్రకాశతాం భవ్యఫలోదయశ్రీః,
అనుచ్ఛమానోఽపి గుణం పరేషాం
విధ్యాన మర్మాణి విశేషతో యః.'
—'రుక్మిణీ కల్యాణము'

[D. C. S. MSS. Vol. xx, p. 7850.]

౧౨. శ్రీ చన్ద్రదేవ కవి:—
శ్లో. 'శ్లేషే కేచన శబ్దగుమ్ఫవిషయే కేచి ద్రసేచాపరేఽ
లంకారే కతిచి త్సదర్థవిషయే చాన్యే కథావర్ణనే,
ఆసర్వత్ర గభీరధీరకవితా విన్ధ్యాటవీ చాతురీ
సఞ్చారీకవికుమ్భికుమ్భభిదురో బాణస్తుపఞ్చాననః.

౧౩. జయదేవుఁడు:—
'హృదయవసతిః పంచబాణస్తు బాణః.'
—'ప్రసన్న రాఘవము', I అ.

౧౪. శ్లో. హృది లగ్నేన బాణేన యన్మన్దోఽపి పదక్రమః,
భవే త్కవికురఙ్గాణాం చాపలం తత్ర కారణమ్.'
—త్రిలోచనుఁడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౫. శ్లో. 'కాదంబరీరసజ్ఞానా మాహారోఽపి న రోచతే,
కాదంబరీరసజ్ఞానా మాహారోఽపి న రోచతే.'

౧౬. జల్హణుని 'సూక్తిముక్తావళి' (రాజశేఖరున కారోపితము):—

శ్లో. 'శబ్దార్థయోః సమో గుంఫః పాంచాలీ రీతిరిష్యతే'
శీలా భట్టారికా వాచి బాణోక్తిషు చ సా యది.'

౧౭. 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం'.

౧౮. కవిరాజసూరి 'రాఘవపాండవీయము.'

౧౯. విద్యామాధవ విద్వత్కవి: 'పార్వతీ రుక్మిణీయము'

పైరెంటియందలి బాణస్తుతిపరశ్లోకములు పూర్వోద్ధృతములు.

ఆంధ్రకవి కుంజరులచే 'భట్టబాణస్తుతి'

౨౦. అమరేశ్వరుఁడు (చిమ్మపూడి):—
'బాణవాగ్భామి నీప్రసవమంజరి విశా
రదుల కలంకార రమణఁ జేయు.'
—'విక్రమసేనము.'

౨౧. పోతన (బమ్మెర):—
'మృదుమధుర వచనవర్గ పల్లవిత
స్థాణునపు బాణునకుఁ బ్రణమిల్లి.'
—'భాగవతము.'

౨౨. శ్రీనాథుఁడు:—
'గణుతింతు నిరవద్య గద్యపద్యనిబంధ
పరితోషితస్థాణు భట్టబాణు.'
—'భీమఖండము.'

౨౩. శ్రీనాథుఁడు:—
'భట్టబాణమయూర భారతీ సంసర్గ
సౌభాగ్య గరిమంబు సంగ్రహించి.'
—'శృంగారనైషధము.'

౨౪. ఎఱ్ఱాప్రెగడ (పెదపాటి): 'పమారనైషధము:—
గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసిన బాణుఁ దలఁతు.'

౨౫. దామెర వేంగళభూపాలుఁడు:—
'ఇల మయూరసమూరు లలిత సంగతి మెచ్చి
బాణ పుష్పితలతఁ బ్రస్తుతించి.'
—'బహులాశ్వచరిత్ర.'

౨౬. రామరాజభూషణుఁడు:—
'బాణు వేగంబును భవభూతి సుకుమారతయు
మాఘు శైత్యంబు దండిసమత.'
—'నరసభూపాలీయము,' I ఆ. ౧౫ ప.

౨౭. సోమశేఖరకవి:—
'వరవృత్తములు మాని వాణి యెవ్వానికై
వలచి నానాశ్లేషములఁ జిక్కె.'
—'నరసభూపాల రాజీయము', I ఆ. ౮ ప.

౨౮. కాకమానిమూర్తి:—
ఉ. 'చోరుసలంక్రియావిహృతి
సొంపు మయూరుని సౌకుమార్యముల్
భారవికాంతిసంపదయు
బాణు గుణాఢ్యతరప్రయోగ మా
దారి మురారి కోమలప
దంబు ప్రసాదముఁ గల్గునట్లుగా
భారతి యిచ్చుఁ గాతఁ బ్రతి
భారతి మత్కృతికిం జపుత్కృతిన్.'

౨౯. కాకమాని గంగాధరుఁడు:—
'వర్ణింతు నుద్వేల వాణీసుధాపూర
పాథోధిపరిబాణు భట్టబాణు.'
—'బాలభారతము.'

౩౦. మాడయ్య:—
'సమ్మతియొనరింతు సర్వజ్ఞ బిరుదాంక
భద్రవాచాస్థాణు భట్టబాణు.'
—'మైరావణచరిత్ర,' I ఆ. ౧౧ ప.

౩౧. తరిగొప్పులమల్లన:—
'అసమబాణాంకిత నలరారియు నలిక
నేత్రు మెప్పించిన నిర్మలాత్ము' బాణుఁదలఁతు.
—'చంద్రభానుచరిత్ర,' I ఆ. ౫ ప.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩౨. అయ్యలరాజు నారాయణామాత్యుఁడు:—
'కవితాభ్రభూష్టమాధవమయూరు మయూరు
భాసురాకృతిఁ బుష్పబాణు బాణుఁ బ్రార్థింతు.
—'హంసవింశతి,' I ఆ. ౧౦ ప.

౩౩. కూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడు:—
'వీరారిభుజగమయూరు మయూరుని
బంధురసవప్రసూనబాణుఁ బాణు' బ్రస్తుతింతు.
—'రాజశేఖరవిలాసము,' I ఆ. ౧౦ ప.

౩౪. రాజా జనార్దనరంగారావు:—
'పటుకరశాస్త్రప్రభారవి భారవిఁ
బవనపటునావేగబాణు బాణు' నభినుతింతు.
—'మిత్రవిందాపరిణయము.'

౩౫. వక్కలంక వీరభద్రకవి:—
'వ్యాసు భారతసుధీవ్యాసు వర్ణనచేసి
బాణు భామాపంచబాణుఁ దలఁతు.'
—'వాసవదత్తాపరిణయము', I ఆ. ౧౦ ప.

౩౬. మొల్లరామాయణము, I. ౯—:
'వివిధకళాన్వితవిఖ్యాతి భవభూతిఁ
బ్రకటకావ్యధురీణు భట్టబాణుఁ' దలఁతు.

౩౭. అప్పకవీయము, I ఆ. ౨౬ ప:—
'భట్టబాణునప్రాభవంబు గణించి
కాళిదాసున కిరుగేలు మోడ్చి.'

౩౮. ఆలూరు కుప్పనకవి:—
'ఎవ్వాఁడు కావ్యంబు లిలకుఁ దార్కొనఁబూన్చె
నెవ్వాఁడు రసవృత్తి నెలమిఁ బఱచె.'
(కాళిదాస భట్టబాణులు సూచితులు.)
—'శంకరవిజయము,' I ఆ.

౩౯. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి:—
'బాణమయూరసుబంధుప్రబన్ధమ
రందరసాప్తి కానంద మొంది.'
—'శ్రీకృష్ణకల్యాణము,' I ఆ.

౪౦. శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యకవి:—
'బాణునివేగంబు భావించి చోరుని
యర్థసంగ్రహవృత్తి నభినుతింతు.'
—'దేవవ్రతచరిత్ర,' I ఆ. ౪౪ ప.

భట్టబాణుఁడు 'హర్షచరితా' పీఠికలో ననేకకవీశ్వరులను, గ్రంథములను పేర్కొనియున్నాఁడు; అందుచే నీతనికాలము నిశ్చయింపఁబడినచో నాయా కవులకాలము గూడ నిశ్చితమగును.

బాణుఁ డీకావ్యములను, గవులను స్మరించెను:—

౧. వ్యాసులు; ౬. భాసుఁడు;
౨. వాసవదత్త; ౭. కాళిదాసుఁడు;
౩. భట్టారహరిచన్ద్రుఁడు; ౮. బృహత్కథ;
౪. సాతవాహనుఁడు; ౯. ఆఢ్యరాజు.
౫. ప్రవరసేనుని "సేతుబన్ధము";

హర్షుఁడు క్రీ. శ. ౬౦౬—౬౪౮ లో రాజ్యపాలన మొనరించియున్నాఁడు. అతని యాస్థానాలంకారభూతుఁడు గావున బాణుఁడు క్రీ. శ. సప్తశతాబ్దాంతమునను, సప్తమశతకపూర్వార్ధమునను విలసిల్లియుండెనని చెప్పనగు. బాణునికాలనిషయమై 'కాణే' పండితుని విపుల సమాలోచనముం గనఁదగు.

[Panduranga Vamana Kane's Edition of Harsacarita's I ntroduction, pp. V—XII.]

## భట్టబాణ నిర్మిత గ్రంథావళి

౧. 'హర్షచరితము', ౨. 'కాదంబరి' బాణనిర్మితములని సర్వవిద్వల్లోకము నేకగ్రీవముగ నంగీకరించెను. ౩. బాణుని మూఁడవగ్రంథము 'చండీశతకము.' ఈగ్రంథము బాణునిదా యని యనేక విమర్శకులు శంకించుచున్నారు. 'కాదంబరి'లో చండికాలయము నత్యంత మనోహరముగా బాణుఁ డభివర్ణించియున్నాఁడు. 'చండీశతక' శ్లోకములు 'సరస్వతీ కంఠాభరణము'లోను, 'కావ్యప్రకాశము' లోను, అర్జునవర్మదేవ నిర్మితమగు 'నమరుశతక వ్యాఖ్య'లోను నుల్లేఖింపఁబడియున్నవి. అర్జున వర్మదేవుఁడు 'చండీశతకము' బాణనిర్మితమని నొక్కి వక్కాణించి యున్నాఁడు: "ఉపనిబద్ధంచ భట్టబాణేనైవంవిధ ఏవ సంగ్రామ ప్రస్తావే దేవ్యా స్తద్భక్తైః భగవతా భర్గేణ సహ క్రీతి ప్రతిపాదనాయ బహుధా నర్మ యథా 'దృష్ట్వావా సక్తదృష్టిః" [చం. శతకము, ౩౭



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో. వ్యాఖ్య.] ఈశతకము పూర్వోద్ధృతమగు 'The Sanskrit Poems of Mayura and Bana' (Harvard Oriental Series) అను గ్రంథములో ముద్రింపఁబడియున్నది. ఈశతకముంగూర్చి మున్ముందు విపుల సమాలోచనము ప్రచురించెద. ఈశతకము సవ్యాఖ్యముగఁ 'కావ్యమాలా' చతుర్థగుచ్ఛమున ముద్రితమై యున్నది.

౪. 'పార్వతీపరిణయ' నాటకము (Vani Vilas Sanskrit Series,Srirangam) బాణున కారోపింపఁబడియున్నది. ఇది బాణనిర్మితమని సయుక్తికముగ శ్రీ పాండురంగ వామన కాణే పండితుఁడు నొక్కి వక్కాణించియున్నాఁడు. [Prof. P. V. Kane's Edition of Bana's' Harsacarita.,Introduction, pp. XVII,XVIII.] ఈనాటకముంగూర్చి కాలాంతరమున విపులముగఁ జర్చించెద.

౫. 'సర్వచరితనాటక'మనునొక గ్రంథమును గూడ బాణుఁడు రచించినట్లుగ స్వర్గీయ పండిత రాధాకృష్ణ మహోదయుని 'పుస్తకసూచీపత్రిక' (౨౩ పు)లోఁ గలదని Aufrechet పండితుఁడు "Catalogus Catalogorum"లో వ్రాసియున్నాఁడు. '['This important collection (in 48 pages 800) of Manuscripts belonged to the late Pandit Radhakrishna of Lahore, who was famous not only for his enlightened views, but also for his great knowledge of Sanskrit Lore'.] ఈ గ్రంథవిషయము విమర్శనీయము.

౬. బాణగద్యము:—శివస్తుతిపరముగ బాణుఁడీ గద్యము చెప్పి శంకరు కరుణవలనఁ గరములు పడసెను. ఈగద్యము కాలగర్భమున నంతరించియుండును.

ఈవిషయమై పూర్వోల్లిఖితములగు 'కుమారసైపధాదులయందలి యనుకృతులఁ (Quotations)జూచునది.

౭. బాణుని 'పద్యకాదంబరి':—క్షేమేన్ద్రకవీన్ద్రుని 'యౌచిత్యవిచారచర్చో'ద్ధృతము: ఈ గ్రంథముంగూర్చి రాఁబోవు వ్యాసమున పండితమండలికి విన్నవించుకొనియెద.

## ౮. బాణుని "ముకుటతాడితకము"

త్రివిక్రమభట్ట నిర్మిత "నలచంపూకావ్య" (దమయంతీకావ్య) వ్యాఖ్యానములో గుణవిజయగణియుఁ, జండపాలుఁడును బాణుని 'ముకుటతాడితకనాటకము'లోని దని యీశ్లోకము నుట్టంకించి యున్నారు:—

"యదాహ 'ముకుటతాడితక' నాటకే బాణః—

శ్లో. ఆశాః ప్రోషితదిగ్గజా ఇవ గుహాః
ప్రధ్వస్తసింహా ఇవ
ద్రోణ్యః కృత్తమహాద్రుమా ఇవ భువః
ప్రోత్ఖాతశైలా ఇవ,
బిభ్రాణాః క్షయకాలరిక్తసకల
త్రైలోక్యకష్టాం దశాం
జాతాః క్షీణమహారథాః కురుపతే
ర్దేవస్య శూన్యాః సభాః.'

ఈనాటకముంగూర్చి యింతకంటె నిపు డేమియుఁ దెలియదు. ఇందలి యితివృత్తము భారతము నుండి స్వీకరింపఁబడినట్లుగ తోఁచెడిని. ఈనాటకము బయలుపడి యే గవేషణపరాయణునో జాగ్ద్దీక్షిం జేయుఁగాక !



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శరదాగమము

వేంకట కాళిదాస కవులు
(ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు)

చీర సింగారముల లీల చిందులాడ
సిగ్గు చూపుల యౌవనశ్రీలు గురియఁ
గరమునన్ వెండి కుంకుముబరణిఁ బూని
పోమెదవు కాలినడకల ముద్దరాల!

కొలువుఁ దీర్చిన బొమ్మల కూటమునకుఁ
బిలుతువా యేమి రండని పేరటాండ్ర?

ఈ విజయవాసరమ్మున నీ ప్రభాత
కాలమున లేచి రాలని పూల నెల్ల
సేకరించెద వేల భాషాకుమార!
భారతీదేవిఁ బూజింప వలయు ననియొ?

ఉదయమున జలకమ్మాడి, నుదుటఁ దిలక
రేఖ యిడి, క్రొత్తచీర ధరించి, యారి
చెదరిన కురులు విడివడి కదలియాడ
గుమ్మమున నిల్చి వలపులు గురియు కనుల
నేల చూచెద వోకుమారీ లలామ
పండుగకువచ్చుప్రియుని భావమున నెంతొ?

ఓయి బాలక! సుమసముదాయములనె
చిమ్ముచున్నది నీదు బాణమ్ము నేడు

భారతీయ పురాయశో వైభవములె
ప్రతిఫలించుచున్నవి నీదుపాటలందు.

పూత వెట్టిన తెలిరెల్లు పూలువోలెఁ
దెలుపు దోఁచిన మేఘ శకలము వోలె,
నీ మనోహర శారద యామినులను
జల్లుచున్నావు వెన్నెలల్ చందమామ!

కలువకన్నెల విరహదుఃఖంబుఁ బాపి
కడలికెరటాల కుద్వేలగతులఁ జూపి
కవికుమారుల హృదయరంగముల వేపి
విసువకుండువు, యుగములు వెడలనిమ్ము.

ఈశరద్వాసరముల నూహించు కొందు
వేమి భావాల నీమృదుహృదయమందుఁ?
గ్రొత్తగా హాయిగాఁ బాడుకొందు వేమి
నవన వమనోజ్ఞ గీతముల్ కవికుమార!

దివ్య వర్చస్వినీ! భారతీ మతల్లి!
పత్త్రికాపుష్పములతోడ భక్తి నిన్నుఁ
బూజసేతురు పుత్త్రికాపుత్రులెల్ల,
మంగళాశీస్సు లిడు మభిమాన సరణి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శ్రీ సుధీరరంజన ఖస్తగిర్ గారి బంకమట్టిబొమ్మలు



౧. శీతకాలపురాత్రి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## తృ తీ యా ం క ము

### రంగము ౧

స్థానము:—రాయల విలాసమందిరము.

సమయము:—సాయంసంధ్య.

(రాయలు, చిన్నా దేవి విలాసవేషములనుందురు. చిన్నా దేవి యానందమున విహారనాట్యమున గాన మొన ర్చుచుండును. రాయలు వినోదించుచుండును.)

రాయలు:—ఆనందమయీ!—ఆనందమయీ!—ఓ ఆనందమయీ! అమరీకిశోరమధురిమ చిందిపడుచున్నది నీగానలహరిలో.

చిన్నా దేవి:—ఆఁ! అవును; ఆనందమయినే. రాజైనాడుకదా కుమారుడు నేడీవిశాలభూమికి! పట్టాభిషేకవేళ, ప్రజలు నా కన్నవాని కర్పించిన రత్నోపహారములు, మంగళహారతులు వానిచుట్టును సౌభాగ్య తేజోమండలము నల్లుటను మీరు చూడలేదా! ఆనందము గాక ఏమిటి! నాకుమారుడొకరాజు, నానాథుడొక రాజు.

రాయలు:—దేవీ! పట్టాభిషిక్తుడు కుమారుడు ప్రజలకు రాజు; నేనెవరికి-మఱి-రాజును!

చిన్నా దేవి: - నాకు. నీవు నా రాజువి. ఆనందించుచున్నాను, గర్వముతో అట్లు పిల్చుకొని.

రాయలు:—ధన్యుడను ప్రేయసీ! "రాయలు నారాజు" అని యానందించువా డప్పాజీ యొక్కడే యిదివరకు.

చిన్నా దేవి:—ఆఁ; అప్పాజీ: ఆత్మసర్వస్వము నర్పించుకొని అగాధప్రేమ తరంగ కలకలమువంటి చిరునవ్వుతో నీలోకమున నెవరు నిట్లు పిల్చుకొనలేరు. మనోహరా! ఈ శుభదినమున నేను మీ కర్పించుకొను కానుక—

రాయలు:—ఈ ఆనందమయి బాహులతలతో-

చిన్నా దేవి:—ఆహాఁ. కంఠహారము చాలు నేమి! చిత్రా! అబ్బాయిదగ్గర కూర్చొన మన లేదటే? నీకొక చోట కాలు నిలువదుకదా!

(చిత్రావతి 'పూలకోయిల' నెగురనైచుచు పాడుకొనుచు ప్రవేశము. రాయలు, చిన్నా దేవియు నొకరి సరస నొకరు విలాసముగ నిల్చుని చిత్రావతి ఒయ్యారము ననిమిషులై చూచుచు మందహాసమును చేయుచుందురు.)

చిత్రావతి:—(నాట్యము చేయును)

#### పా ట

పూలతో కోయిలను పుట్టించినాను
ఈ విచిత్రము చూడ నెవరు రారేమి!
నీలాంబరాలలో నీలాలు చింద
ఆనీలముల దేహ మందగించాను.
ఎఱ్ఱగన్నేరే మెఱుపు విచ్చింది
ఆమెఱుపుతో నాస మమరించినాను,
కన్నెజాకామల్లె కడుపుబ్బ నవ్వె
ఆనవ్వువెలుగు జూకాలు పెట్టాను.
కాశిరత్నాలమ్మ కళలదేరాయి
ఆతేటకెంపులే కాళ్ళు చేశాను.
ఇందీవరాల్ విచ్చె నందాల ఈకు
లాఈకులను ఱెక్కలుగ గూర్చినాను.
ఇంతముస్తాబుతో ఈ నల్లపిట్ట
రంగు రంగులపూల రాణి అయిందీ.
బుద్ధమతి దీపంబు బొజ్జ వెలిగించి
ఎల్ల యాకాశల నెగిరించినాను.
పకపక నవ్వుతూ పడవైచినాను.
తెలుగు రాయలకీర్తి దేశదేశాల
తెలిపి మాసందేశముల పాడుకొనుచు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎల్ల విశ్వాల యాకాశాలలోని
తీర్థాలు సేవించి తిరిగి రమ్మంటి!
ఈ చిన్ని కోయిల యీపరీక్షలకు
ఎటు నిల్చునో వింత చూడంగ రారె!
ఎవరు రారట పూలకోయిలా! ఐన
గంధర్వ్వాలను నేనె పిలిచి వస్తాను.
పూవుల్ల కోయిలా.! పువ్వువర్షాలు
కురియించి వెళుతారె! ఆశీర్వదించి.

రాయలు:—పూలకోయిల యేమిటి చిత్రా!

చిత్రావతి:—కుమారుని పట్టాభిషేకం చేసుకొంటున్నారు కామా—మా పెండ్లికుమారునికి కట్నం పట్టుకువచ్చాను. మాగంధర్వ్వసంపత్తు లాశీర్వదిస్తే దీనికుక్షిలోలక్ష కానుక లుంటాయి.

రాయలు:—(పూలకోయిలను పరిశీలించుచు) ఏమిటో ఇందు చిత్రా, లేఖ లున్నవి!

చిత్రా:—నన్నీజాగారు, పరాసుదేశంలో ఉన్న తనస్నేహితునికి వ్రాశారట. దానిని ఇవాళ ఆదేశం పంపిస్తారట. ఇదిగో అది. (అని ఒకఉత్తరమును తీసి ఇచ్చును. రెండవలేఖను చిన్నాదేవికి చూపిస్తూ) ఈ కానుక నీకు.

రాయలు:—(ఆలేఖను చిన్నాదేవిని చూడమని యిచ్చును.)

చిన్నా:—అయితే ఇది యిక్కడి కెందుకు తీసుకుని వచ్చావు?

చిత్రావతి:—తెలుగులో వ్రాయించుకొని వచ్చాను. చూడండి. ఆయన నిరీక్షించుచున్న ఆ భూలోకస్వర్గం మనదేశంలో సాక్షాత్కరించిందట.

రాయలు:—చదువు.

చిన్నాదేవి:—ఎందుకు అంతఉత్సాహం. మీఘనతను స్తుతించి ఉంటారనా? అమ్మ!

రాయలు:—చదువుదూ.

చిన్నాదేవి:—అబ్బాయి పట్టాభిషేకాన్ని గురించి, ఆబాలరాయలవారి ఘనరాజసాన్ని గురించి—కీర్తించి ఉంటారు.

చిత్రావతి:—ఎందుకు. పోట్లాడుకుంటారు! నా సౌందర్యాన్ని వర్ణించా రందులో.

చిన్నాదేవి:—ఆఁ, నీ అల్లరిని కాదూ! చూస్తాను. వినండి మరి చదువుకున్నాను. (చదువును.)

"ప్రియమిత్రమా! నే నిప్పు డాంధ్రదేశములో ఉన్నాను. ఇది కడు సుందరమైన దేశము. ఇచ్చటిజీవిత మెట్టివారికిని మోహమును కల్గించును. మనము ప్రత్యేక కళగ నభ్యసించునాట్యము ఇచ్చటిజనులకు సహజము. స్త్రీలు మామూలుగా త్రోవ బోవునప్పుడు కూడ నొయ్యారముగ కులుకుచు, చూపుల నల్లకలువల తోరణములు కట్టుచు, క్రేగనుల మెఱయు విలాస సందేశసంచాలనల, నంతలో, నరమోడ్పు కనుదోయుల, మాయించుచు, సిగ్గుపడుచు లలితంగా నడుస్తారు."

రాయలు:—నన్నీజా కేవలము నొక చరిత్రకారుడే యనుకొంటిని; కానీ, సౌందర్య సంస్తుతీచణ కవికుమారుడు కూడనే!

చిన్నాదేవి:—ఉండండీ! మనపురుషప్రతాపం బయలుపడుతోంది:—

"పురుషులు కూడ గంభీరంగా ఉంటారు కాని, ప్రవర్తనలో మాత్రము ధీర, లలిత, అభిసారికల బురణించు స్త్రీ ప్రకృతినే విశేషించి యుపాసింతురు."

(నవ్వుచు) చిత్రా! ఈ మగతనం అర్థమయిందిటే.

చిత్రా:—నా కెట్లా తెలుస్తుందేమిటి!

చిన్నా:—చెప్పనా? (పకపక నవ్వును.)

రాయలు:—ఆ నవ్వెందుకు? (చెవి పట్టుకుని) చిన్నా!—

చిన్నాదేవి:—(విడిపించుకొని) పోనీ, 'ధీర'లు, 'లలిత'లు అంటే అన్నాడు—మీమీద ఎందుకో అంత పక్షపాతం ఆయనకి—'అభిసారికలు'ట! (పగలబడి నవ్వును.)

రాయలు:—ఇంతకు నీ పాండిత్యంలో నేనా అభిసారికను?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన్నాదేవి :— ఇంకా ఏమందో.

" ప్రతివానిలోను కవిత్వ మున్నది. చక్రవర్తి కృష్ణదేవరాయలు కవి. మంత్రి తిమ్మరుసు నిగూఢ కవి. మండలాధిపతి పెద్దన—ఆయన కవులకు తాతవరుస. రాజు మంత్రిని తండ్రిగా, మంత్రి రాజును తన బిడ్డగా, ప్రజలను బంధువులుగా చూచుకొందురు. ఇంత చనువు, అన్యోన్యత యున్నను, ధర్మ నిర్వహణమునం దెల్లరు మహాధీరులు. ఎట్టి నిష్ఠురసాధన నైనను చేయగలరు. సందర్భమును బట్టి మల్లెపువ్వు కాగలరు; మండ్రగబ్బ కాగలరు. ఈ దేశమంతా ఒక కవిత్వము."

రాయలు :— గొప్ప వ్యాఖ్యానము చేయుచున్నాడే.

చిన్నాదేవి :— "సరస గంభీర సౌందర్యాన్ని ఉపాసించిన బౌద్ధులు ఆ అంశను 'మంజీర' అని వ్యవహరింతురు."

చిత్రావతి :— బౌద్ధులు మంజీర నేమన్నా అంటే గోవిందరా జూరుకుంటాడా?—

రాయలు:— చనువు—

చిన్నాదేవి:— "వా రీదేశము నా పేరున పిల్తురు. రాజు మొదలుకొని సేవకుని వఱకు నీ రాజ్యమంతా ఒక కుటుంబము. దీనికి పెద్ద ఘటం తిమ్మరుసు అనే ఒక మంత్రి. ఆతడే ఈ కుటుంబాన్నంతా ఇంత మనోహరంగా దిద్దుకుంటూ వస్తున్నాడు."

చిత్రావతి :— నాకేమీ అర్థంకావటం లేదు.

చిన్నాదేవి:— ఊరుకో చిత్రా! చదవనీ.

" ఇప్పుడిప్పట నొక వినోదము జరిగినది. మనము బంధు కుటుంబసమావేశములలో పిల్లలకు పెద్దరిక మిచ్చి ఆడించి ఆనందించు నట్లే చక్రవర్తి తన పసిపిల్లవానికి పట్టాభిషేకము చేసి తాను మంత్రిగాను, మంత్రి కార్యదర్శిగాను ఏర్పడి స్థిరోత్సవము నిజముగానే చేయుచున్నారు. అడ్డు చెప్పని ఒక అమాయిక సత్యమునకే ఐనను ఈ రాజమంత్రుల స్వయంప్రాతినిధ్య మీ బాధ్యత యెంత మనోహరముగ నున్నదో చూడుము. మిత్రమా! ఈ కుమార రాయల పట్టాభిషేకము నే నింత కాలము నిరీక్షించుచున్న యానంద స్వర్గమును నాకు కటాక్షించినది. ఈదేశము— ఈప్రభుత్వము— ఈమానవ జీవితము నేమని వర్ణింతును! ఆపరాత్పరుని జగన్నాటకము వలెనే ఇదియు నొక స్వర్గ నాటకము!... ఇంతే! "

ఇంతే. ఔనులెండి; ఇది నిజముగా గొప్ప కట్నమే.

చిత్రావతి :— ఈ కట్నం మా పెండ్లి కుమారునికి చదివించాలిట!

రాయలు :— చదివించాలి! (చిత్రావతిచెవిపట్టుకొనబోవును.)

చిన్నాదేవి :— ఉడికిలతా కెందుకు? ఏం తప్పు మాటా? ఇతర దేశాల్లో సహా మీకే కాకుండా మీదేశానికి కూడా కీర్తి కలుగుతుంది.

రాయలు :— ఆహా! అట్లాగా! (చిత్రావతి చెవి విడిపించుకొని నవ్వుమా పారిపోవును.) నవ్వుతావూ! నిన్ను పట్టుకోలేను. (తరుముచు పోవును.)

చిన్నాదేవి :— ఏమిటి, చిన్నవాడికిమల్లే, ఆ పిల్లతోనా మీకు పంతం!— ఆనందపారవశ్య మిది! ఆహా! ఇవాళ స్వర్గ సౌందర్యం నాముం దిట్లా నాట్యం చేస్తోందా! ఆహా! హా!

గీ. శైల బాలయు కైలాస శైలవీధి
చివురు కెంజాయ తేట రంజిలెడు శివుని
సాంధ్య నృత్యోత్సవ మందు లేశమును కాంచ
గలదె యీ మోహనానంద గమన మెలమి.

ఈ రెండవ కానుక ఏమిటో. (రెండవ లేఖను విప్పి)

"అన్నపూర్ణా! నీకు భయము లేదు. విశ్వపతిని పంపివేయుము. నీ నిజస్థితిని మాత్రము రాయల కప్పుడే తెలుపకుము."

అక్కటా! నా పేరుకూడా తెలిసిపోయినదే ఎవరికో, నేను గజపతి కుమార్తెనని మాత్ర మేల తెలీయదు? చిత్రావతి కెట్లు చిక్కిన దీబాబు— దానికి తెలియకుండునా ?—

(రాయలు చిత్రావతిని పట్టి తీసుకొని వచ్చును.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(రెండవ జాబును దాచివైచి) దొంగ దొరికినదా?

రాయలు :—దొరకదా? ఏదీ రెండవ కానుక, చిత్రా! అది యెవరికి?

చిత్రావతి :—పెండ్లి కూతురికి. (విడిపించుకొని) ఏఘండోయి! పెండ్లి కుమారుడుగారూ!—

రాయలు :—పో. నీకు సిగ్గు లేదు.

చిన్నాదేవి :—చిత్రా! ఊరికే పెండ్లికుమారుడు, పెండ్లికుమారుడని ఊరించుటయేనా? ఎక్కడనైనా పెండ్లికుమార్తెనుకూడా చూచి ఉంచావా?

చిత్రా :—ఇంకా 'చూచావా' అంటున్నారూ?—ప్రత్యక్షంగా చూస్తుంటేను!

రాయలు :—ఈ ధోరణి కేమి? ఏదీ ఆ రెండవ కట్నము?

చిత్రా :— ఈ అమ్మాయిని (చిన్నాదేవిని చూపి) వరించండీ అన్నాజీ! అప్పుడీరాణీని గర్వం అంతా వదిలేటట్లు, 'వదినా' అని నా కసితీరా పిలుస్తాను. ఉండరండి ; మీ పెళ్ళికి నేను పౌరోహిత్యం చెయ్యాలి.

రాయలు :— ఏమైనా మంచి సంబంధ మేమో ననుకుంటిని; ఇదేమిటి పిల్లా! నా భార్యనేనా?—

చిన్నాదేవి :—(వ్యంగ్యముగ చూచును.)

చిత్రా :— నీ భార్యను కాకపోతే ఎవరి భార్యను తెచ్చి కడితే ఎవ రూరుకుంటారు? ఇదుగో నండోయ్! అన్నాజీ! అబ్బాయిగార్నే—ఇందాక సింహాసనంమీద—మీకు రాణీ ఉండాలా అంటేను 'సరే' నన్నట్లే తల ఊగించారు, చక్కలిగిలి పెట్టి నవ్వించా.

చిన్నాదేవి :— మా చిట్టి తండ్రి యివాళ సాక్షాత్తు దేవేంద్రుడే. నాథా! నాకు నవ్వాగటములేదు. ఎందుకా, అబ్బాయిని, పట్టాభిషేకమైన తరువాత, "ఏమ్మండీ బాలరాజులూ!. సింహాసన మ వ రో హిం ఛురా దయచేసి" అని తీసుకోబోతేను 'దిగనన్నట్లే (విలాసముగా తల నూపి)ఇలా, తల నూగించాడు. డింపుటకు బుద్ధి పుట్టలేదు. మరి,—అబ్బాయిని, ఇవాళ—రేపు ఎప్పటికి సింహాసనం మీదనే ఉంచితే బాగుండదూ?

చిత్రా :— పైన ఛత్రంలేమా, దానికి ఉయ్యాల కట్టిస్తే సరి.

చిన్నా :— పో. కొంటిపిల్లా! నాథా! కొంచెము నే పబ్బాయి దగ్గర కూర్చుందము రద్దురూ. మన బాలరాజు వైభవము చిత్రవిచిత్ర మోహాల వల్లరుల లో రణాల మనకు స్వాగత మీయగలదు. రా. చిత్రా!

రాయలు :— ప్రేయసీ! మన ఆనందమున కనురూపముగ కుమారునికి ఒక పుష్పకిరీటమును గూడ స్వహస్తములతో నిర్మించి తీసుకొనిపోదము.

చిత్రా! నీవు నాకు సహాయము చేయుము. మంచి మంచి పువ్వులను కోయవలెను. (రాయలు చిత్రావతి పువ్వులు కోయుచుందురు.)

చిన్నాదేవి :— (పువ్వులు కోయుచు కొంచెము దూరముగా పోయి) చిత్రా, ఈ పువ్వులు నా కందటము లేదే. ఇట్లా రా, కోసి పెడుదువుగాని.

చిత్రావతి :— మనస్సు మనస్సులో లేదా ఏమిటండీ వదినెగారూ! మీ కందని పువ్వులు నా కందుతాయా!

చిన్నాదేవి :— అబ్బా! ఇట్లా రద్దూ—ఒకటే ధోరణీ.

చిత్రావతి :— (చిన్నాదేవి దగ్గిరకు వచ్చి) ఈ చేమంతి పువ్వులా మీ కందనివి ?

చిన్నా :— సరికాని, ఈ రెండవ లేఖ నిచ్చినది ఎవరే నీకు ?

చిత్రా :— ఎవరూ ఇయ్యలేదు. ఇక్కడే గడపదగ్గిర పడిఉంటేను తీసుకొని వచ్చాను.

చిన్నా :— అల్లరి కాదు. కోపమును తెప్పించక నిజము చెప్పుము.

చిత్రా :— నాకు తెలియదమ్మా అంటేను.

చిన్నా :— నీ కేమి కావలసిన అవి ఇస్తాను, బ్రతిమాలు కుంటాను, చెప్పవే.

చిత్రా :— నా కేం కావాలో ఆలోచించుకోవాలా?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన్నా :— విసుగు తెప్పించకు. అల్లరై నా ముదిరితే ముద్దు కాదు.

చిత్రా:— ఇక్కడుంటే ముదిరేటట్టే ఉంది. (అని దూరముగా పోయి) పేరు చెపుతాను.

రాయలు:— (సమీపించుచు) పేరు చెప్పేదేమిటి చిత్రా!

చిన్నా :— అయ్యో! ఏమి చేయను? ఇది చెప్పదు కదా! (చెప్పవద్దని చిత్రావతికి సంజ్ఞ చేయును.)

చిత్రావతి :— ఏమిటా, అన్నాజీ! పెళ్లి కుమారు డెవర్ని పెళ్ళిచేసుకుంటాడో.

రాయలు :— మీ వదినకే. దేవీ! ఇంకను పువ్వులు కోయుచునే ఉన్నావా! (సమీపించి) ఏవీ: ఏమాత్రము కోసినావు? ఎంత ఆయాసము సభినయించుచున్నావు. ముఖమునకు చెమటకూడ పట్టినదే! ఒక్కొక్కపువ్వే కల్పవృక్షాల్ని యాచించి తీసుకువచ్చినట్లు అయిదా కోసినవి సుకుమారీ?

చిత్రావతి :— అందకపోతే ఎట్లా కోస్తారేమిటి పాపం! అరుగో ఆంధ్ర తాతయ్యగారు వస్తున్నా రెందుకో.

చిన్నాదేవి:— ఆంధ్ర తాతయ్యగారేమిటి? పెద్దపిన్న తారతమ్య మక్కర లేమా!

చిత్రా :— "ఆంధ్ర కవితాపితామహా! అల్లసాని పెద్దనకవీంద్రా" అనాలా!

చిన్నా:— ఊరుకో వస్తున్నారు.

(పెద్దన ప్రవేశించును)

రాయలు :— పితామహుల కభివందనములు. కవిత్వమును చెప్పుకొన నీయకుండ, కొన్నినాళ్ళు దుర్గాధిపత్యము, నిప్పుడు మంత్రిత్వము నిచ్చి వృద్ధాప్యములో తమరిని కష్ట పెట్టుచున్నాను. క్షంతవ్యుడను.

పెద్దన :— తాత లెప్పుడును మనుమల హాస్యమున కిక్కలు కదా! మహారాజా! కుమారుని పట్టాభిషేకమునకు పంపిన ఆహ్వాయమును—

చిత్రా :— ఏహాయమును?

రాయలు :— (నవ్వును)

పెద్దన :— పండితురాల వధిక్షేపించుచుంటివి. ఆహ్వాయమన్నను, ఆహ్వానమన్నను ఏకార్థ ప్రతిపాదకంబు లగుట సమానములే. (రాయలను చూచి) ఆ, గజపతి నీచోత్తరమున తిరుగగొట్టినాడు.

రాయలు :— ఏగజపతి?

పెద్దన :— కటకపురాధీశ్వరుడు.

రాయలు: — అతని కాహ్వాన మెవరు పంపిరి!

పెద్దన :— నేను.

రాయలు :— నా కేల చెప్పలేదు?

పెద్దన :— కార్యభారంబున విస్మరించితిని. కాని అమాత్యులప్పాజీ కెఱింగించితిని.

రాయలు:— తమ రమాత్యశేఖరులు, తమకర్తవ్యమును తెలుసుకొను తీరుబడియైన లేకుండిరా! ఏదీ ఆప్రత్యుత్తరము? (అని తీసుకుని చదివి) మేమును మానించినట్లే అయినది. మా ఆభిజాత్యమునే ఓకరించినాడు! ఇప్పుడు దీనికి ప్రతిక్రియ యేమిటి?

పెద్దన :— ఎల్లరాజులకు నాహ్వానంబులు పంపబడు సందర్భమున వీనికి పంపకుండుట భావ్యంబు కాదని పంపితిమి. ఇష్టము లేకున్న రాకపోవచ్చు గాక ఇట్టి లేఖ వ్రాయుట యెంత సాహస మెంత సాహసము!

రాయలు :— పంపిన పంపిరి. దీని కిప్పు డేమి ప్రతిక్రియ నాలోచించిరి!

పెద్దన :— ఆ అహంభావపూరితునికి గర్వభంగము చేయవలె బలిమినైన వానిపుత్రికను తమరు వివాహముచేసుకొనినచో—

చిన్నా :— (ఉలికిపడును.)

రాయలు :— ఆజన్మవిద్వేషి. వాని పుత్రికను వివాహమాడుటయా! వానివిషము వాని సంతానమునకు సంక్రమింపదా!

చిన్నా:— (నొచ్చుకొనును.)

పెద్దన:— వివాహము చేసుకొని వేరుగా నుంపవచ్చునుకదా? అప్పాజీ కూడ దీనికి సమ్మతింతురు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాయలు:— ఒకరి సమ్మతి యెందుకు? తమ యోచన బాగుగనే యున్నది. నేను గజపతి కుమార్తెను తప్పక వివాహము జేసుకొనెదను. నేడే దూతను పంపుడు. శాంత క్రమమున దన కుమార్తెను నాకు పరిణయము చేయుగలడో లేదో, లేకున్న బల మనివార్యమని తెల్పుడు. సరి, వందనము.

పెద్దన :— నే నిక పని వినియోదను. (ప్రస్థానము.)

రాయలు :— దేవీ! నీకు సవతిని తెచ్చుచుంటి నని గినియకుము. చూడు మీ లేఖను నాది హీనజన్మ యట! ఎట్టి కళంకము లేని శుభ్రవంశ మతని బాంధవ్యమైన న న్నీనిందనుండి రక్షింపగలదు గాక! వివాహము మాత్రమే చేసుకొనెదను. ఈసౌధమున గాలు పెట్టనీయ నా ద్వేషజాతను. ఊరిచివర నిల్లు గట్టి యం దుంచెదను.

చిన్నా దేవి :— పవిత్ర హృదయముతో నొక వేళ ఆకన్య మిమ్ము మనసార ప్రేమించినచో—

రాయలు :— మీ స్త్రీల దొంగనాటకము. ఇప్పుడు నన్ను మాట్లాడించుట కసహ్యముగ నున్నది. (నిష్క్రమించును.)

చిన్నా :— చిత్రా! పోయి కొంచెము బాయి దగ్గర కూర్చో అమ్మా! (చిత్రావతి బిక్కమొగముతో ప్రస్థానము.) అక్కటా! క్షణక్షణ గండమైపోయిన దే నా బ్రదుకు! ఈ ఒక్క జన్మలో నెన్ని జన్మల యనుభవమును పొందుచున్నాను! ఇప్పుడు నా తండ్రికిని నా నాధునికిని ఘోరసమరము జరుగునే! హా! నాథా! ఎవరిని నీవు వివాహ మాడ దలచుకొంటివో, ఊరి చివర నురి వేయగోరితివో ఆ యభాగినిని నే నొకప్పు డూరి చివరనే యుంటిని; నిన్ను వివాహముచేసుకొని యిప్పు డిక్కడే యుంటిని. నీ కోర్కె లీడేరనే యీడేరెను కదా! ఒక్క ఉరి మాత్రమే లేదు. ఎందుకు వృథాయాస పడవలె నా నాథుడు? నా తండ్రిని జయించినగాని మాత్రమున నిచ్చటనే యున్న నే నచ్చట యెట్లు లభింపగలను? నేను సత్యమును వెల్లడించిన నా తండ్రికి ముప్పు తప్పును కదా! నా గతి యేమైన గానిమ్ము. అకటా! ఆ కోపముచే నన్ను పరిత్యజించి నాకుమారుని సింహాసన భ్రష్టుని జేసి,

ఉ. హా! విధి! యింత నిష్ఠురుడ
వైతివె! ప్రొద్దున గద్దె నిల్పి 'ధా
త్రీవలయంబు నేలు' మని
దీవన సేసలు జల్లి యింతలో
నే విభవంబు నెల్ల హరి
యించిన యీ పసికూన యక్కటా
ఈ విపరీతమైన దుర
దృష్టము నింక భరింపగల్గునే!

అయ్యో! నే నేమి చేయుదు. సత్యమును నాథుని కప్పుడే తెలియజేయవలదని శాసించిరే, వారి యుద్దేశ మేమిటో— ఈ చీటి వ్రాసినవా రెవరో నా క్షేమమును కోరువారేయైన ఈదీనదశలో నాకు సాక్షాత్కరించి కర్తవ్యము నుపదేశింపరాదా? నా తండ్రికి ఆహ్వానమును పంపుమనినది అప్పాజీయట. ఒకవేళ నప్పాజీయేమో యిట్లు చేయుచున్నది! ఆ ధర్మాత్ముడే అయినచో నేను ధన్యనే. కాకపోయినను పోయి నేను శరణు వేడిన నన్ను రక్షింపరా? పైకి మంత్రిత్వమును వదులుకొనెనే కాని సర్వరాజకార్యములు వారివలననే సాగుచున్నవి. ఉదయము వారి నొకమారు దర్శించుట యెందుకైనను మంచిదే.

(రామకృష్ణ కవి ప్రవేశము.)

రామకృష్ణకవి :— మహారాజ్ఞీ వారికి జయము! మా అమ్మాయి యిచ్చట నున్నదా?

చిన్నా :— దయచేయుడు. (పోబోవుచు) ఇచ్చటికి పంపమందురా? (ప్రస్థానము)

రామకృష్ణ :— అతిసావధానము! అమిత గౌరవము! మారహస్య లేఖల ప్రభావము! అప్పాజీ జ్యోతిమతకురాక్షరమును సక్రమముగ నడచుచున్నది. 'చిన్నారాణి నేత్రములు మహాసంక్షోభదుఃఖాశ్రుజలధి జలకమాడి తేరుకొనిన తేట నలార్చుచున్నవి! పితామహులు కూడ అప్పాజీ విధించిన సంభావనక్రమమునే యిచ్చట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మచిత్రభంగి నడిపినట్లున్నది. ఈ భయంకర నాటకమున మంత్రి దేవులు సమర్థముగానే సూత్రధారణ జేయుచున్నారు. విశ్వపతి, ఈ రాత్రి, రాజకుమారుని సంహరించి ఆ నేరమును తన మీదనో, గోవిందరాజు పైనో పెట్టునని కూడ జ్యోతిషము జెప్పిరే, అది మాత్ర మేమి యథార్థము కాదు!

(చిత్రావతి ప్రవేశించును.)

చిత్రా :— నాన్నగారూ! ఎందుకండీ మళ్ళీ వచ్చారు? విశ్వపతిని నేను కనిపెట్టే ఉన్నాను.

రామకృష్ణ :— కుమారు నీరాత్రి ఎక్కడ పడుకొనబెట్టునది నీకు తెలియునా?

చిత్రా:— బహుశా ఈ రాత్రి అంతా సింహాసనం మీదనే ఉంచుతారనుకుంటా. మహారాణీగారి కంతటి ఉబలాటంగా ఉంది.

రామకృష్ణ :— పాప మమాయకురాలు! సరే. నీవు మాత్రము కుమారుని తల్పమును కనిపెట్టి యుండుము. ఎవరైనా సమీపించునట్లు నీకు తోచెనా?

చిత్రా :— విశ్వపతేగా!

రామకృష్ణ :— ఆఁ. వచ్చే సమయము కనిపెట్టి కుర్రవానిని దాచి—

చిత్రా :— నాకిన్ని చెప్పనక్కర్లేదు లెండి. ఏదో కుతంత్రం చేసి, వాడు తాను నిజంగా చంపాననిఅనుకునేటట్లు చేసి, అబ్బాయిని భద్రంగా తెచ్చి మీకు వప్పగించనూ? అప్పుడు మీ రొక నాటకం ఆడించవచ్చనుకుంటాను.

రామకృష్ణ :— జాగ్రత్త సుమా! నీకు చేత కాదని తోచిన ఒక కేక వేయుము. ఇద్దరు దాసీలును నీ సమీపముననే ఆయుధములతో సహా పొంచి యుందురు. దుష్టుని బంధింపగలరు. కాని అంతవఱకు రానీయకూడదు!

చిత్రా :— నేనూ కత్తిపడ్డాణం పెట్టుకునే వచ్చాను. భయం లేదు లెండి.

రామకృష్ణ :— సరే. నేనుకూడ ఈరాత్రి విలాసభవనముముందు వనమండపములో శయనింతును. కుమారు నచ్చటికి తీసుకుని రావలయును సుమా! జాగ్రత్త.

(ప్రస్థానము.)

చిత్రా :— చిత్రావతి అల్లరి పిల్ల అంటారు కాదూ? పోనీ, తెలివిగల అల్లరిపిల్ల, మంచి అల్లరిపిల్ల అనేటట్లు చెయ్యనూ, ఈ విశ్వపతి పొగరు తెలుపులబండిని బోల్తాకొట్టించగలిగితే! రాజ్యం కోసమని కుర్రవాణ్ణి చంపుతాట్ట! అప్పాజీ చెప్పేటప్పటికే నాకు గుండె బ్రద్దలై పోయింది! అమ్మ, విశ్వపతి ఎంతవాడు! ఇదంతా చూస్తే నాక్కూడా బుద్ధి పుడుతుందేమో, రాజ్యం కావాలనో, ఒక మహామంత్రిని కావాలనో. పోవాలమ్మ.　　　　(ప్రస్థానము.)

—యవనిక—

---

# మా వ్యాసకర్తలకు

---

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములలో బంతులు దూరదూరముగా దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.　　　　సంపాదకుడు, 'భారతి'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సామరస్యము

ఇవటూరి సుందరయ్యగారు

శ్రీ వినూతన శోభావిశేష గరిమ
ప్రకృతియందంతటనునని ర్వాచ్యమగుచుఁ
దోఁచెఁ; దకులతాగుల్మసందోహ మందుఁ
జారురక్తప్రవాళ మంజరులు వొడమెఁ;
జిఱుతగొమ్మలఁ గూర్చుండి చివురుమెసవి
శక్రమకలకంఠ కులములుత్కంఠ మెఱయ
విరహిజనకర్ణపుట సముద్భేదనముగఁ
గుహుకుహూరావములతోడఁ గూయఁదొడఁ
బాంథబృందంబు వేఁటాడఁ బైనమైన [గెఁ
ప్రసవబాణుని ములుకులు పదనువెట్టి
మొనలుగనిపింప నింపినపొదు లనంగఁ
గొనలు నిగుడించి నిలుచు పూగొలలతోడ
మావిగున్నలు దనరారె; మధుపకులము
కలితసుకుమార కేసరాగ్రములు గలిగి
యంటిననుగందు పూగుత్తులందు ద్రావి
మధువు లానుచు మత్తిలి మసలఁ దొడఁగె
మలయసానుతటంబులఁ గలయఁదిరిగి
తివుటఁబొదరిండ్ల రతికేళిఁ దేలి యలసి
యంబుదముక్రింద, సాంధ్యరాగంబు పైని
నమరుమోముల రక్తహస్తములఁ జేర్చి
నిదురఁ జెందిన చెంచుకన్నియల చెక్కు
దోయిఁబొడమిన ఘర్మబిందువులఁ దడిసి
కమ్మపుప్పొడి వాసనల్ గడలుకొనఁగఁ
బిల్లతెమ్మెరకూనలు వీవఁదొడఁగె
నిట్టలంబగు తమిహెచ్చు నిట్టివేళఁ
గటితటంబునఁ బులితోలు కరము మెఱయ
నఱుతరుద్రాక్షమాలిక లమరు చుండఁ
గంబుగళమున గరళంబు గ్రాలుచుండ
శ్రవణయుగమున సర్పభూషణము లొప్ప
ఫాలతలమున సెగకన్ను పరఁగుచుండ
విమలశశిరేఖ మౌళిపై వెలుఁగుచుండ
పల్లవారుణఘన జటాపటలి మెఱయ
శారదస్వచ్ఛ చంద్రికాచారు రుచుల
యోగనిద్రానిరూఢితో నొక్కవ్యక్తి
జాహ్నవీతోయ శీకరాసార పూత
విధుశిలాతల నిర్మలవేది యందు
భువికి దివికిని నైక్యంబు పొందువడఁగఁ
గొంతతడవట్లు కనుమోడ్చి కూరుచుండి
కన్నులనువిప్పి దిశలెల్లఁగలయఁ జూచి
యిప్పు డీచిత్త వికృతికి హేతువేమి.
యుంచుఁదలపోసి" తెలియంగ నయ్యె నకట!
సతిని గోల్పోయియున్న నాచంద మరసి
చిత్తసంభవుఁ డీరీతిఁ జేయ నోపు
వీనినూరక యుండిన విఱ్ఱవీఁగి
యనదలను బాధపెట్టెడు నంచు నెంచి
నొసటికంటిని దెఱవంగ నసమశరుఁడు
నిలువునీఱయ్యె; నంతట నీలగళుఁడు
సతియుదంతము తలపోసి మతి కలంగి
"దక్షునింటుకిఁ బోవంగఁ దగ"దటంచుఁ
జెక్కు తెఱఁగుల జెప్పిన వినకయేఁగి
తనువుదొఱఁగెను నాసతీతరళనయన
యేమిసేయుదు విరహాబ్ధి నీఁదుటెట్టు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీ సుధీరరంజన ఖస్తగీర్ గారి బంకమట్టి బొమ్మలు



౫. లీల



౬. సాంతాలుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. శ్రీ సుధీరరంజన ఖస్తగీర్ గారు, శిల్పకారుడు



౬. సమర్పణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లంచుఁ జింతించిచింతించి యంతలోనె
మోద మందుచు "నెంతటిమోసమయ్యెఁ
జెలువఁ గోల్పోయితి నినంచుఁ దలఁచు టెల్ల
వట్టిభ్రమగాని నిక్కమౌ వార్తగాదు
పృథ్వినేనొదు గంధంబు పువ్వుఁ బోఁడి
జలము నారూప మింతియే చల్లఁదనము
హోత్రి నేనొదు నామెయే హోతృగరిమ
చంద్రుఁడను నేను నామెయేచంద్రిక యగు
దపనుఁడను నేను దరుణియే తాపమగును
నగ్ని నేనొదు నుష్ణత యబల నిజము
పవనుఁడను నేను వ్యాపనపటిమ యామె
పదము నేనొదు నందలి ధ్వనియె లలన
చిగురు నేకాదు మృదుత యే చెలువ యగును
విరిని నేనొదుఁ దావియే వెలఁది మిన్న
మధువు నేనొదు నింతియే మధురిమంబు
ఫలము నేనొదు రుచి యిందువదనగాదె!
పలుపలుకు లేల! సకలమౌవస్తు చయము
నేనయగుదును దచ్ఛక్తియే లతాంగి
కాన నామెకు నాకును గలదె వేఱు
నాదుమూర్తిని విడిచి యానాతియున్నె!"
యంచుఁదన దేహమెల్ల వీక్షించునంతఁ
దలను నొకదెస కేశముల్ నలుపుచెందెఁ
గజ్జలం బొక్కకంటను గానవయ్యె
శ్రవణ మొంటను గర్ణపూరంబు దోఁచె
సగము మెడయందు ముత్తెపుసరులు పరఁగెఁ
గంకణము లొక్క కేలను గ్రాలుచుండె
గటినిసామున రక్తాంశుకంబు మెఱసె
వేయునేటికి వామంబు వెలఁదియయ్యె.

నంతవెఱగంది దరహాస మాచరింపఁ
బిల్లతెమ్మెర కూనలుఁ మెల్లఁజాఱె
షట్పదంబుల ఝుంకృతుల్ నస్సగిల్లె
చూతకళికలు చిటికెలో సురిఁగిపోయెఁ
గ్రమకలకంఠగుతములు కడలువట్టె
రక్తపల్లవ జాలంబురహి దొలంగె
ప్రకృతిసౌభాగ్య మంతయుఁ బాసిపోయెఁ
దనరుపులితోలు, రుద్రాక్షదామకములు,
సర్పభూషలు, గరళంబు చంద్రరేఖ,
కటిసగంబున విలసిల్లుకావి చీర,
కంఠహారంబులును, బైఁడి కంకణములు,
కర్ణ పూరంబు, కన్నుల కాటుకయును,
మాయ మయ్యెను జిత్రమౌ మహిమతోడ
నాఁడురూపును మగరూపు నంతరించి
చంద్రసూర్యానలద్యుతి శబల మగుచు
నప్రతర్క్యంబు దుర్నిరీక్ష్యంబు నగుచు
రక్తశుక్లప్రభావిమిశ్రమము నగుచు
త్రైపురంబగు తేజంబు దశదిశలను
నిండి వెలుఁగుచు నిత్యమై నిలిచియుండె
విశ్వమోహన శృంగార విలసితంబు
బంధవిచ్ఛేద వైరాగ్యబంధురంబు
ధ్యానగమ్యంబు దుఃఖవిదారకంబు
జ్ఞానలభ్యంబు సచ్చిదానందదంబు
ప్రకటశివశక్తి సమరసత్వంబు దెలుపు
సత్ప్రకాశంబు వర్ణింపఁ జాపలమున
సాహసించితిఁ గావున సరసులార!
కృపను గుణమునె గొనుచు వీక్షింపరయ్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏకవీర

విశ్వనాథ సత్యనారాయణగారు, యం. ఏ.

(వెనుకటి సంచిక తరువాయి)

కుట్టాన్ తల్లి పేరు మంగమ్మాళ్. ఆమె మొగములో సౌందర్యము, పాతివ్రత్యము, మాధుర్యము పెనవేసికొన్నవి. ఆమె యమిత శాంతమూర్తి.

నా డేకాదశి. మంగమ్మాళ్ రోజంతయు నుపవాసము చేసినది. రాత్రి పిష్టాహారము తిని దొడ్డిలో చాప వేసికొని పండుకున్నది. కాళ్లవద్ద కుట్టాన్ కూర్చున్నాడు. ఆకు నాకు కదలుట లేదు.

మంగ:—'నాయనా! ఏకవీర సురక్షితముగా నున్నదా?'

కుట్టాన్:—'ఊఁ'

ఇది తల్లి తనకు వేసిన మొదటి ప్రశ్న. ప్రొద్దుటినుండియు నతడు తల్లిని చూడలేదు. ఆమె దొడ్డిలో చాప వేసి పండుకొని పుత్రునికై కబురంపినది. అతడు వచ్చికూర్చున్నాడు.

మంగ:—'తల్లిదండ్రులు క్షేమముగా నున్నారు. ఆమె భారమంతయు మనదే సుమా. చాల సుకుమారి. చదువుకొన్నదట. నీకు తెలిసియే యుండును. ఆమెను ప్రేమగా చూతువు గదా! భార్యాభర్తలు మీకు నేను చెప్పవలయునా! నీ వన్న నామెకు ప్రేమయేకదా?'

కుట్టాన్ లజ్జావనతుడై 'ప్రేమయే' అన్నాడు. ఈమాట కుట్టాన్ నోటినుండి యతనికి తెలియకుండ వచ్చినది. కుట్టాన్ తనలో 'ఆమెకు నేనన్న ప్రేమ యున్నదా?' అనుకున్నాడు. పూలదండసంగతి జ్ఞాపకము వచ్చినది. కుట్టాన్ ప్రసంగము మార్చ తలంచుకుని, 'అమ్మగారూ! మీ రిచ్చటికి వచ్చి యెన్నాళ్లయినది? రామనాథములో నాయనగారెట్లున్నది తెలియుట లేదు. వీరభద్ర భట్టరుగా రుత్తరములు నాకు చూపించక కబురులు మాత్రము చెప్పారు' నన్నాడు.

మంగ:—'నీవు మా కొక్కడవే బిడ్డవు. తండ్రీ! నీకు చెప్పగూడని రహస్యము లేముండును నీతండ్రికి? నీవ ట్లనుకొన్నచో నడుగుము. భట్టరుగారు నీకుత్తరములు చూపించెద రనుకొందును.'

కుట్టాన్:—'అమ్మా! అది కాదు నాయుద్దేశము. వారి క్షేమము తెలియుట లేదనియే. నిన్ను చూడలేకుండ నే నుండలేను.'

అకారణముగ మహావీరుడైన కుట్టాన్ కనులవెంట నీరు కారెను. ఒకబొట్టు మంగమ్మాళ్ పాదముపై బడెను. మంగమ్మాళ్ గ్రహించెను. లేచి కూర్చుండి కుమారుని కౌగిలించుకుని చెక్కిలిపై ముద్దిడుకొనెను.

కుట్టాన్ హృదయ మతని తల్లియెడల నతికోమలమే కాని యిప్పటి అతని యీ బాష్పములు పూర్తిగా దన తల్లియెడల గల ప్రేమచేతనే వచ్చిన వనుటకు వీలు లేదు. కుట్టాన్ తన వంచితప్రేమ తలంచుకుని తలంచుకుని దీను డైపోయినాడు. ఆదీనతయే యీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాటలలోను వ్యాపించినది. మంగమ్మాళ్ కౌగిలి వదలెను.

కుట్టాన్:—'అమ్మా! గాలి లేదు. విసరనా?'

మంగ:—'తండ్రీ, వద్దు. ఏకవీరనుకూడ తీసికొని రాకపోతివా? పిల్లనుకూడ చూచెడి దానను. ఏమైన చిక్కినదా?'

కుట్టాన్:—'ప్రయాణము కష్టమని తీసుకుని రాలేదు.'

కోడలినిగూర్చి కుమారు డుత్సాహముగ మాటలాడుట లేదని మంగమ్మాళ్ గ్రహించినది. యథార్థము పుత్రునినుండి లంగవలయునని తలంచినది.

మంగ:—'నాయనా! ఏకవీర నీమాటలకు సమాధానము చెప్పనా? నీవు పలుకరించిన నూరకుండునా?

సమాధాన మేమి చెప్పవలయునో కుట్టాన్ కు తెలియలేదు.

మంగ:—'నాయనా! మీరిరువును సుఖముగా నుండ చూచుటకన్న మా కేమి కావలయును? నాకు నలువది దాటినవి. ఇం కెన్నాళ్లు బ్రదుకుదును? నీకడుపున నొకకాయ కాచి నచో చూచి పోయెదను.'

కుట్టాన్ కంఠములో నాపరాని శోకముండగట్టి గిరగిర తిరిగినది.

మంగ:—'నాతో చెప్పవచ్చును తండ్రీ! చెప్పుము. మీరు సుఖముగా నున్నారా! చెప్పుము.'

కుట్టాన్ గొంతుకనుండి మాట పెగుల్చుకుని, 'సుఖముగానే యున్నాము. అమ్మా! అట్లడిగెద వేల' యన్నాడు.

తల్లిని వదలిపెట్టిన తరువాత కుట్టాన్ మేడమీద పోయి పండుకున్నాడు.పండుకొన్నప్పటినుంచియు నొకటే యాలోచన. 'అందఱును నేకవీరను ప్రేమించు మనుచున్నారు. మీ భూపతి యదే మాట. ఇచ్చటకు వచ్చిన తల్లియు నదే మాట. ఇందులో నేదో రహస్యమున్నది. నేను ప్రేమించిన స్త్రీని వదలిపెట్టి బలవంతముగా నా మెడకు కట్టిన స్త్రీనా ప్రేమింపవలెను? నా కర్థము గుట లేదు. ప్రేమించుట, ప్రేమించకపోవుట యనునది నాస్వాధీనములో నున్నదా? ఎవరిస్వాధీనములో నున్నది? భగవంతుని స్వాధీనములో నున్నది. ఏ భగవంతుని స్వాధీనములో నిది యున్నదో యాభగవంతుడే నాకీ స్త్రీని తెచ్చి పెండ్లిచేసెనుకదా! భగవంతుడు కాదు. నాతండ్రి చేసినాడు. భగవంతుని యిచ్ఛ లేనిది నాతండ్రి యెవరు చేయుటకు? ఈ స్త్రీకిని నాకును సంబంధ మేమున్నది? ఏమియు లేకున్న మే మిరువురము భార్యా భర్తలుగా చేయబడుట యెట్లు? పూర్వజన్మములలో నే సంబంధ మున్నదో?'

భావనా సోపానములలో నేసోపానము మీదనో యెరిగి కుట్టాన్ నిదురించినాడు.

తెల్లవారినది. ప్రాకృతి యనంత కాలము నుండి ప్రతియుదయమున నెట్లు ప్రకాశించుచున్నదో యట్లే నేడును బాల సూర్యుని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యరుణబింబము మొగమున కుంకుమబొట్టుగా దిద్దికొని ముసలి ముత్తైదువవలె ప్రకాశించినది. ఆమె మంజీరధ్వనులవలెనె పక్షుల కలకల ధ్వనులును తోచినవి. నిదుర మేల్కాంచి కాల్యకృత్యములు తీర్చుకొని పుణ్యస్త్రీలు గోమయంబులకై పొరుగింటి గోస్వామి గృహములకు పోవుచుండిరి. నాగళ్లు కట్టి కాపులాకు మళ్లు దున్నుటకై పోవుచున్నారు. ఆ బాలలో సాబాలునకై బుడుతలు చిన్ని చెంబులు పూని, పాలు తీయు తండ్రులకు దగ్గరగా నిలుచున్నారు. కొందరు చిఱుతుకలు ఇంటిముంగిళుల రంగవల్లులు తీర్చు తల్లులపయ్యెదకొంగులు పూని యేడ్చుచుండగా దల్లులు వారిని వీపులపై పండుకొన బెట్టుకుని రంగవల్లులు తీర్చుచున్నారు. పాలు పితుకుచుండగా గృహస్వామి దూరముగా కట్టివేసిన యాదూడలు పలుపులు మెడ నొరుసుకొనగా తల్లి పొదుగుల దగ్గరకు మెడ చాచగా పెనగులాడుచుండెను.

పరమేశ్వర సముద్రము పల్లెటూరు గాన ప్రాతఃకాలమున నింత యందముగా నుండెను. కుట్టాన్ నిద్రలేచుట తోడనే పుణ్యస్త్రీల ముఖారవిందములు తోచినవి. కుట్టాన్ కాల్యకృత్యములు నిర్వర్తించుకొనెను.

వచ్చినప్పటినుండియు కుట్టాన్ తన ప్రియురాలిని చూడవలెననియే ప్రయత్నము చేయుచున్నాడు. నేడు ప్రొద్దున లేచిన తోడనే యతని కా భావ మంత వడిగా నున్నట్లు లేదు. అతసభావ మింటివద్ద నేకవీర యేమి చేయుచున్నదో యని పోయినది. తనకు తెలియకుండ నేకవీరతనహృదయములో నింతదూర మెట్లు వచ్చినదని యచ్చెరువైనది కుట్టానునకు. కుట్టాన్ తన ప్రేయసియింటికి పోద మనుకున్నాడు. బాగుండ దేమో యని సందేహించినాడు. ఊరకే చూచి వచ్చుటలో తప్పేమున్నదని నిశ్చయించుకున్నాడు. అప్పటికి కొంచెము ప్రొద్దెక్కినది.

కుట్టాన్ వారి యింటికి వెళుసరికి మీనాక్షి నిన్న సాయంతనము బద్ధకముచేత దండ గ్రుచ్చకుండ నిదురపోయిన మల్లెపూలు బాగుగా విచ్చిపోయినవి, చావడిలో గూర్చుండి దండ గ్రుచ్చుచున్నది. కుట్టాన్ నేడు మరల నామె యందము చూచి గుండె చెదరి పోయినాడు. మీనాక్షి తనప్రియుని చూచినది. చేతిలో నున్న దండ వదలిపెట్టి సబాష్పాక్షియై యింటిలోనికి పోయినది. మీనాక్షి తల్లి వచ్చి, 'ఓహో! సేతుపతి! నాయనా! ఎప్పుడు వచ్చితివి' అని చాప తెచ్చి పరచినది. కుట్టాన్ అవనతవదనుడై యాసీనుడైనాడు. మీనాక్షితల్లి 'నీభార్య క్షేమముగ నున్నదా? నీపెండ్లికిమమ్ము పిలిచితివైన గాదు. పేదవాండ్లము. మమ్మెందులకు పిలిచెదవులే' అన్నది. ఆభాగ్యశాలినికి ఈమాటలు కుట్టాన్ హృదయములో పరశుఘాతము లగునని యేమి తెలియును? ఆమె మరల 'మామీనాక్షికి మంచిసంబంధ మెక్కడనైనను చూచిపెట్టుము తండ్రీ; నీవు తలచుకొన్నచో నది యెంతసేపు? వెదకి వెదకి వారిపని యగుచున్నది. వా రూరిలో లేరు. సంబంధముకొరకే వెళ్లినారు. రాజవల్లిపురము కావ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లయు పోయినది' అన్నది. కుట్టాన్‌బుద్ధి పరి భ్రమించుచున్నది. చివరమాట లతనికి వినం బడలేదు. 'రేపు మాఘమాసములో నెన్నైనను పెండ్లి చేసి తీరవలెను. ఇప్పటికే చాలకాలము దాటిపోయినది. నీవే మాకల్లుడవు కావలసినది. మే మంత నోము నోచుకొనవలదా? అందని మ్రానిపండ్ల కఱ్ఱులు చాచు'టని యన్న దామె మరల. కుట్టాన్ వంచినతల యెత్తలేదు. మీనాక్షీతల్లి యమాయిక హృదయ. భారత దేశములో నిట్టి పిచ్చితల్లు లెంతమంది? కొంత సే పయిన తిరువాత కుట్టాన్ లేచి నిలంబడెను. నాల్గువంకల చూచెను. మీనాక్షి తన కెక్క డను కన్పించనే లేదు. అడుగులు లెక్కపెట్టుచు కుట్టాన్ బయటికి వచ్చెను. ఆనాడు సాయంత నమే తనతల్లివద్ద సెలవు తీసుకొని కుట్టాన్ మధురకు ప్రయాణమై పోయినాడు.

౧౧

మధురకు కుట్టాన్ చతుర్దశి యుదయ మునకు చేరెను. ఆనాడు చతుర్దశి మిగు లు న్నది. అప్పటి కమావాస్య గడియలు వచ్చి నవి.

కుట్టాన్ బండి దిగినవెంటనే యంతః పురమునకు బోయెను. ఏకవీర పడకగదిలో కుట్టాన్ మంచముపై శయనించి యేదో యాలోచించుకొనుచుండెను. కుట్టాన్ వచ్చిన వెంటనే మంచము దిగి పజ్జ హైమపాత్రతో నుంచిన నీళ్లతో కుట్టాన్ పాదములు కడిగి బంగరుపువ్వులతో దళతళలాడు తనచీర కొంగుపెట్టి యాపాదములు తుడిచెను. కుట్టాన్ ఇది యంతకు పూర్వమైన నామెను విసరి కొట్టెడువాడే కాని యపు డేమియు ననలేదు. ఏకవీర లేచి నిలంబడినది. అవనతవదన. కాని యామె చెక్కిళ్లనుండి యెంత సేపటినుండియో సంతతధారగా బాష్పములు స్రవించుచున్న వని కుట్టాన్‌నకు నామె వదనము చూచిన వెంటనే తెలిసినది.

కుట్టాన్ కొంచెముసే పాగి, 'ఏకవీరా' యని సంబోధించినాడు. వివాహ మైన తరు వాత నాల్గునెలలలో కుట్టాన్ ఆమెను సంబో ధించుట కిదియే మొదటిసారి. ఆమాట వినిన త్రోడనే యామె మేఘగర్జనము విన్న రాజ హంసివలె బెదరి నేలపై బడిపోయినది. ఆమె యొడ లుత్పులకమైనది. అమందవాయువునకు గదలిన కదళివలె యామె నిలువెల్ల వణకి పోయినది. ఆజానుదీర్ఘంబులై హిరిణ్మణిమయ స్తంభంబులకు గులస్వాములైన తనచేతు లతో కుట్టాన్ ఏకవీరను నేలపైనుండి లేవ దీసి తన యెదుటొమ్మున కదుముకొనెను.

ఏకవీర మహదానంద సముద్రములో దేలిపోయినది. కౌగిలి వదలిపెట్టి కుట్టాన్ నిశ్చలముగా నిలుచుండి ఏకవీరమోముపై దృష్టి నిలిపి యిట్లు మొదలుపెట్టినాడు: 'ఏక వీరా! నిన్నిట్లు నేను సంబోధింపగనే నీవు మహానంద మనుభవించితివని నేను గ్రహించి తిని. నిన్ను నేను కౌగిలించుకొనిన నీవు పొందిన పారవశ్యమును చూచితిని. నీవు నన్నింత ప్రేమించుచుంటివని యిదివరకు నాకు తెలి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యదు. ఏదో కొంచెముగా ప్రేమించుచుంటి వనుకొంటిని గాని యింతగా నని తెలియదు. ఇంతకు నీవెంత మంచిదానవో నే నంత మంచి వాఁడను గాను. నీవు నాయెడ జూపించుచున్న ప్రేమలో వెయ్యిభాగమైన నీయెడల నేను ప్రేమ చూపించుట లేదు. నేను చూపించలే కున్నాను. నిన్ను నేను ఏకవీరా యని పిలిచి నది ప్రేమచేత గాదు. మన మిరువురమును నీ జన్మంలో ని ట్లొకయెడకు ద్రోయబడినాము. నీయెడ నాకు ప్రేమ లేదని క్రోధ మున్న దను కొందువా? అదియు లేదు. నీయెడ నా కెట్టి భావమును లేదు. కాని యొకమాట. ఈజన్మకు మన మిర్వురమును భార్యాభర్తల మైనాము. నేను కష్టపడి నిన్ను ప్రేమించుటకు ప్రయ త్నించెదను. ఆప్రయత్న మెన్నాళ్లు పట్టునో నేను చెప్పలేకున్నాను. నెలయయిన దాటక మునుపే నిన్ను ప్రేమించవచ్చును. కాదా, పదిసంవత్సరములు పట్టవచ్చును. నేను నిన్ను ప్రేమించక పోయినను ప్రేమించినను, నీవే నాకు భార్యవు. ఈగొంతులో ప్రాణ మున్నం తవరకీ శరీర మన్యాదత్తము చేయను. నీకు వాగ్దానము చేయుచున్నాను. ఈ మాటల వలన నీకు ప్రయోజనము లేదు. కాని నీకు నాప్రేమను గురించి యనుమాన ముండవచ్చు ను గాని, నా ధర్మవర్తనమును గూర్చి యను మాన పడవద్దని చెప్పుచున్నాను. నీప్రేమ నా యెడ లేనపుడు నీధర్మమును గురించి నా కేల యందువా? అది కాదు. నీయెడ నేను ప్రేమ సాధించెదనని చెప్పుచున్నాను. నాయందు దయయు, నమ్మకము నుంచుము.'

'ఇంతకు గారణము చెప్పెద వినుము. మా మేనమామలయూరు పరమేశ్వర సముద్రమని యెఱుగుదువుగదా. మన వివాహమునకు పూర్వ మాయూరిలో మా మామగారి యింటి దగ్గరగా నొక యిల్లున్నది. వారు పేదవారు. మీయంత కాని, మాయంత కాని ధనవంతులు కానే కారు. వారి కొక కుమార్తె యున్నది. ఆమె పేరు మీనాక్షి. ఆమెను నేను, నన్నా మెయు ప్రేమించితిమి. నాయిష్టమునకు వ్యతి రేకముగానే నాకు నిన్ను వివాహము చేసిరి. నేను మొన్న వెళ్లినది పరమేశ్వర సముద్రము నక్కే. ఆమెకు వివాహము కాబోవుచున్నది. దైవచిత్రము. మన మేమి చేయగల్గుదుము? ఆమెమీద నా కున్న ప్రేమను పూర్తిగా నాశ నము చేసెదను. అప్పుడు నీమీద ప్రేమ పెంచె దను. నీ వేమియు ననుకొనకుము. ఈ రహస్య ములు నీకు చెప్పకుండరా దనిపించినది. చెప్పి తిని. ఎవరియెడల నెవరికి ప్రేమ యున్నదో యెట్లు తెలియును? నీవు నన్నింతగా ప్రేమించు టచేత ననుకొనుచున్నాను, నీవు నన్నే ప్రే మించితివని. ఇదివర కెవ్వనియెడ నైన నీప్రేమ ప్రవహించెన యేని యీ మనవివాహము నీ కెంత కష్టముగా నుండును! నాస్థితి యట్లే యనుకొను'.

ఏకవీర కన్నులలో పిచ్చిచూపు లేర్పడి నవి. ఏకవీర నిలుచుండ లేకపోయినది. కుట్టా నిది గ్రహించి యామెను నెమ్మదిగ మంచము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పైన పరుండబెట్టి చెంబులోని నీర మామెమో మున చిలకరించి పైయుత్తరీయముతో విసరినాడు. ఆమెశిరస్సు తనతొడపై నిడుకొన్నాడు. ఇదంతయు కుట్టాన్ నిర్వ్యాజముగ జేసిన పని. ఏకవీరకు తెలివి వచ్చినది. కన్నులు తెరచి చూచునరికి తనతల కుట్టాన్ తొడపై నున్నది. తొందరగా లేచి యేకవీర మంచము దిగబోయినది. కుట్టాన్ కూర్చుండ బెట్టినాడు. కుట్టాన్ మరల నిట్లన్నాడు: 'నా కొక మిత్రు డున్నాడు. అతనిపేరు వీరభూపతి. అతడు మన యింటికి తరుచుగా వచ్చుచుండును. అంతఃపురములో నున్న నీ వతనిని చూచుటకు వీలు లేదు. అతడు చాల మంచివాడు. నాయీ సంగతి యంతయు నతనికి తెలియును. అతడు చెప్పినాడు, నాకు మీనాక్షిపైగల ప్రేమ యంతయు నీపైకి త్రిప్పుమని. నా కీభావము కలిగించినది యతడే. అతనియెడ నే నెంతయు గృతజ్ఞుడను.' ఏకవీరకు వీరభూపతి యెవరో యెట్లు తెలియును? కుట్టాన్ తన స్నేహితుడని చెప్పుచున్నాడు. కుట్టాన్ ఆగి మరల చెప్పుచున్నాడు: 'ఏకవీరా! నే చెప్పవలసినదంతయు జెప్పితిని. ఇం కేమి చెప్పుమనెదవు? నీయెడల నాకు కోపము గాని, ద్వేషముగాని లేదు. నీతో నాకు మాటలాడుటకును సందేహము లేదు. ఇంటిలో నం దఱితోడను నెట్లు మాట్లాడుదునో యట్లే నీతోడను మాటలాడెదను. నా దొకడే ప్రార్థన: నాయందు నీ కిప్పు డెంత ప్రేమ యున్నదో యా ప్రేమ తగ్గనీయకుము. ఏకవీరా! నామాటలు చాల కఠినములుగా నున్న వనుకొనియెదను. ఏ మందువు?'

ఏకవీర తన రెండుచేతులు కుట్టాన్ మెడ చుట్టు వేసి తల యతని భుజములమీద నాన్చి, 'ఇప్పుడే ప్రేమించుము. ఇప్పుడే ప్రేమించుము.' అని యేడ్చినది.

ఏకవీర యీమాట లెందు కన్నదో యామెకే తెలియదు. 'ఊరకున్న బాగుండెడిది' యని తరువాత మనస్సులో ననుకున్నది.

కుట్టాన్:—'నాచేత నగుటలేదు. ఏమి చేయుమందువు? క్షమింపుము. అయినను నీ కేమి లోప మున్నది? నీతో మాటాడుదును. ఎవరికిని మననిజస్థితి తెలియుటకు వీలు లేదు.'

కుట్టాన్ అంతకంతకు నిశ్చలుడై పోయినాడు. అతని కనులలోనుండి బాష్పములు పోయినవి. పలుకు లంతంతకు కఠినము లైనవి. అతడు లేచి ద్వారమువరకు వెడలినాడు. ఏకవీర పోవుచున్న యతని యడుగుల నైశ్చల్యము చూచినది. మాటాడలేదు అతడు ద్వారము వరకు పోయి తలుపు తెరచి బయటికి పోబోయినాడు. కాలాడలేదు. వెనుక తిరిగి చూచినాడు. ఏకవీర పోయి యతని రెండుచేతులును పట్టుకున్నది. ఏకవీర కన్నుల వెంట బాష్పము లోడుగట్టెను. అతడు 'ఏకా! చెప్పితినికదా, నీవద్దకు వచ్చునపుడు పరిశుద్ధమైన హృదయముతో వచ్చెదను. అచ్ఛమైన ప్రేమ కోరదగిన దానవు, వ్యామోహమునకై వాంఛించెద వెందుకు' అని గడప దాటిపోయినాడు. ఏకవీర మంచముపై బడిపోయినది. ఆమె హృద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యములో 'ఆరంజే విడుంబు-ఆరంజే విరుంబు' అని ధ్వని మ్రోగుచున్నది.

౧౨

కుట్టాన్ భోజనము చేసి తనగదిలోనికి పోయి యొక భూర్జపత్రము తీసి దానిపై 'పరాభవనామసంవత్సర వైశాఖ బ ౧౩' అని వ్రాసినాడు. ఆయాకు మంచిగందపు చందుకాయపెట్టిలో పూర్వము తాను మీా నాక్షీ ప్రేమచిహ్నములు దాచిన దానిలో దాచినాడు.

నాడమావాస్య యగుటవలన పాఠశాలకు సెలవు. ఏమియు దోచలేదు. బండి కట్టించుకుని వీరభూపతి యింటికి వెళ్లినాడు. వీరభూపతి యింటివద్ద లేడు. రాజవల్లిపుర మేగినాడట. వీరభూపతి ప్రక్కనున్న యింటిలో నొక యుత్తరమిచ్చి పోయినాడు. అందులో వీరభూపతి తనతండ్రి యుత్తరము వ్రాసెననియు, వివాహమునకే వలె తోచుచున్నదనియు, నెల్లైనను నైదారునెలలవరకు మరల వచ్చుటకు వీలు లేదనియు, జ్ఞాపక ముంచుకొనవలెననియు వ్రాసియున్నాడు. మిత్రవియోగము నేతుపటికి దుర్భర మనిపించినది. కుట్టాన్ ఇంటికి పోయినాడు. తనగదిలో పుస్తకములన్నియు సర్దినాడు. ఎంత సేపటికి ప్రొద్దుపోలేదు. పండుకొని నిదురకై ప్రయత్నించినాడు. నిదుర రాలేదు. కొంతికాల మైన తరువాత లేచి స్నానము చేసి యల్పాహారమును తీసికొన్నాడు. ప్రొద్దు వాటారినది.

కుట్టాన్ పూలతోటలో తిరుగబోయి, నిత్యపరిపోషణముచేత నిండుగా వికసించియున్న పూవోటలోకూడ నానందము కన్పించక, తిరుమల నాయకుని చూచి వత్తునని పోయెను.

ప్రొద్దు క్రుంకవచ్చినది. ఏకవీర పూదోటలోనికి పోయినది. పెంపుడు లేడి వెంట వచ్చినది. ఎఱ్ఱగన్నేరు మొగ్గలు త్రుంచి యేకవీర లేడిపిల్ల కందించెను. అది రెండు కొటికి తల యాడించుకొనుచు దూరము పోయినది. ఏకవీర దోసిలిలోనున్న తక్కిన మొగ్గలు నేలపై బోసినది. ఏకవీర మంచి పనినేరుపరి. పూమాలలు వినిర్మించుటలో నామెశక్తి యనన్యప్రాప్తము. గన్నేరులు, మందారలు, మల్లెలు, జాజులు కోసి యామె యొక దండ గ్రుచ్చినది. ఆదండ చిత్ర మేకవీరకే తెలియును. దండ యిటు లాగిన చిన్నది, యటు లాగిన పెద్దది యగును. చిన్న దైనప్పుడు జాజులు, మల్లెలు నెడమై మందారలను, గన్నేరులను మూసివేయును. పెద్దదిగా నున్నప్పు డన్నిపూవులు కనబడును; దండ సన్నగా నుండును. ఈ దండ నెవరికి చూపించకుండ నేకవీర తీసికొని పోయి తనగదిలో దాచుకొనెను. ఆనాడు ఏకవీర చిత్రముగా నున్నది. ఆమె మొగము తొల్లిటివలె మిక్కిలి ప్రకాశించను లేదు, శోకముచేత కలుషితము గాను లేదు. ఆమె పుష్యమాసపు నదివలె పుష్టయు గాక కృశయుగాక, యొండుచేత గోధుమవన్నె గలదియు గాక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# లాహూరు సెంట్రలు మ్యూజియమునందలి చిత్రములు*



౩. బోధిసత్త్వుడు



౨. హారీతి (కుబేరపత్ని)



౧. కుబేరుడు

* ఇవి గాంధారవిధానము ననుసరించిన గ్రీకో–బౌద్ధశిల్ప చిత్రములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. మారసైన్యము



౯. గౌతముడు (తపఃకృశుడు)



౭. బోధిసత్త్వుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొబ్బరినీళ్లవలె నతిశబలయు గాక, యిప్పుడే వికసించి సంపూర్ణశోభతో చెలువారని, పూర్తిగా వడలిపోయి శోభాహీనముగాని,నవ మల్లికవలె ప్రకాశించినది. ఆమె నిటాలమున కస్తురిబొట్టు సెగకన్నుగా, తలపై రావిరేక చంద్రవంకగా, నిటాలస్వేదబిందువు శిరస్థ గాంగఝరము చెమ్మగా, నామె పార్వతివలె ప్రకాశించినది.

ప్రొద్దు గ్రుంకినది. వైగైపులినములనుండి తిరిగి వచ్చిన కుట్టాన్ భోజనము చేసి రాత్రి చాల ప్రొద్దుపోవువరకు నేదియో చదువు కొనుచుండెను. రాత్రి జాముస్నర యైనది. ఏక వీర యొకదాసిని పిలిచి, 'మహారాజును నేను పిలిచుచుంటినని చెప్పుము.' అన్నది.అది బయ టకు వచ్చి యందఱు దాసీలలో కలవరము కలిగించినది. ప్రొద్దున స్వామి పరమేశ్వర సము ద్రమునుండి వచ్చినవెంటనే యంతఃపురము లోనికి బోయెను. ఇప్పుడీవర్తమానము. అం దఱు నాశ్చర్యపోయిరి.ఇదివరకువా రనుకొనిన వన్నియు నయథార్థములా యేమి? భార్యా భర్తలకు చాల నన్యోన్య మున్నదివలె నున్నది. మొన్న దండ చీలికలై నేలపై నుంట యేమి? దానికి బ్రణయకోపార్థములు కలి పింప బడినవి.

పనికత్తె కుట్టాన్ గదివద్దకు పోయి నిలం బడినది.

కుట్టాన్ తలుపుకదలిక విని, 'ఎవరు వారు' అన్నాడు.

దాసి 'బాబూ! అమ్మగారు—రమ్మ నుచున్నారు' అన్నది. కుట్టాన్ మఱుమాట లేదు. పుస్తకములు మూసి యంతఃపురములో నికి పోయినాడు. అతడుపోయిన దారియంతయు ప్రశస్తమైన కస్తూరికా వాసనలు గుమగుమ లాడినవి. అంతఃపుర సేవకురాండ్రు నిస్తబ్ధలు, సాశ్చర్యలై పోయినారు. రాతిరి రెండు జాము లైనది. గదిముందు పడుకున్న బాలసారంగి కనులు మూసికొని నడుమ నడుమ నెమరువే యుచు నిదుర పోవుచున్నది.

కుట్టాన్ పోయి గదిలో మంచముపై గూర్చున్నాడు. ఏకవీర నిలుచుండి తల వంచు కుని పూలదండ తీసి దీర్ఘమును, సన్నదియు నైన మాలనొక సూత్రాకర్షణముచేత హ్రస్వ మును, చిక్కనయు చేసి, మరల దీర్ఘీకరించి, యతనివంక తల యెత్తి భావాభిరామముగ జూచెను.

కుట్టాన్:—'ఇది యెవరు కూర్చిరి?'

ఏకవీరకనులలో నామెయే యది కూర్చినదని స్పష్టపడినది.ఏకవీర మాలను హ్రస్వీకరించి కు ట్టాన్ మెడలో వేసెను. కుట్టాన్ బాగున్నదని కుడిచేతితో దానిని మెడలో సద్దుకొనెను. వ్యతి రేకసూత్ర మజ్ఞాతముగ జేతికి తగిలి సూత్రము పొడుగైపోయెను. జాజులు,మల్లెలు,గన్నేరులు, మందారలు విడివిడిగా నై పోయినవి. ఇరువురు చేరియొక శయ్యపై నిదురించినారు.

రాతిరి చాల ప్రొద్దు పోవువరకు నిదుర లేమి నారక్తమంజులములైన విశాలనేత్రములతో, దీర్ఘ నవీనపుష్పమాలికాలంకృత వక్షఃస్థల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ్మతో బయటికి వచ్చిన కుట్టాన్ ప్రభువును చూచి యందఱు పనికత్తెలు చకితనేత్రలు, సస్మితాస్యలు, లజ్జాదరహాసాధరలు, ససంభ్రమ దత్తమార్గలు నైనారు. ఉద్దేశ పూర్వక కృత కృతక మందహాసాననాంచల యేకవీర వారిని మరింత కలవరపెట్టినది. అసంస్కృతభావలు వా రామెమొగమున నిగూఢ విచార ముద్ర తెలియజాల రైరి.

రోజులు గడచుచున్నవి. నెలలు దాటి పోవుచున్నది. ఋతువులు వెనుకబట్టుచున్నవి. కుట్టాన్‌లో మార్పు లేదు. రోజులు గడచిన కొలంది ఏకవీర యొడలినుండి యొకొక్కనగ యుత్సర్జించుచున్నది. కొన్నాళ్లకు, కామె మెడలో మంగళసూత్రము,నల్లపూసలు దక్క నేమియు మిగులవేమో. ఏకవీర యంతంతకు స్వచ్ఛదేహ యగుచున్నది: పాలిపోయి యామె దేహము తెల్లబడుచున్నది. కనులు సగము మూతలు పడి క్రొత్తయందము విరజిమ్ముచున్నవి.

కుట్టాన్ దినదినము మంచి గంధపు చందుకాయపెట్టి తీయును. దానివంక నూరకే చూచును. ఆభూర్జపత్రముమీద తాను వ్రాసినది చదువును. రోజులు లెక్కవేసి కొనును. తనహృదయము పరీక్షించుకొనును. మార్పేమియు లేదు. అది తనపెట్టెలో నుంచి యేదైన పుస్తకము తీసిచదువును. పాఠశాలకు పోవును.సాయంతనములయందు వైగై యిసుక తిన్నెలమీద నొంటిగా గూర్చుండును. ప్రొద్దు గ్రుంకిన వెంటనే యింటికి వచ్చును. మనస్సు పరమేశ్వరసముద్రములో, దేహము మధురలో.

ఏకవీర కనంబడినపు డేదియో పలుకరించును. అది యూరకే పలుకరించవలెనని పలుకరించినట్లు కనంబడుచునే యుండును.

౧౩

తిరుమలనాయకు డెంత మిత్రుడైనను రాజకుమారుడు. స్నేహితుడైన నేమి, కుట్టాన్ కన్న గొప్పవాడు. అతనితో మైత్రి యుండవచ్చును గాని పరస్పర హృదయావేదనలు బయల్పరచుకొనుటకు వీలు లేదు. పగల్లెల్ల నతనితో కాలము గడపుటకును వీలు లేదు. ఏకవీర యిట్లున్నది. అతనికి నామెకు నేమి సంబంధము? స్నేహితునివలె మాట్లాడునా? హృదయప్రేమ పంచుకొనునా: అందుచేత కుట్టానునకు రోజులు గడవలేదు. తెల్లవారినది మొదలు ప్రొద్దు గుంకుట యెట్లు? దినములంతంతకు దుర్భరము లై పోయినవి.

కుట్టాన్ మరల వీరభూపతి మధురకు వచ్చినచో బాగుండుననుకొన్నాడు.తన కేమి? దళవాయి కుమారుడు; తిరుమలనాయకుని మిత్రుడు. సంపూర్ణ ప్రయత్నము చేసినాడు. స్థానాపతి మాఘమాసములో చనిపోయి నాడు. స్థానాపతియు, కణక్కమును పారంపర్యముగా వచ్చు నుద్యోగములు కావు. అందు చేత నాస్థానమునకు వీరభూపతికై కుట్టాన్ ప్రయత్నించి సాధించినాడు. క్రొత్తలెక్కలు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చైత్రమాసముతో ప్రారంభమగును. వీరభూపతి యప్పటికి వచ్చి యుద్యోగములో ప్రవేశింపవలెను.

కుట్టాన్ వీరభూపతికి తెలియజేసినాడు. మాఘమాసములో వీరభూపతికి వివాహమయినది. వివాహములోననే యీయుద్యోగవార్తయు జేరినది. అందఱును వీరభూపతికి మంచిరోజులు వచ్చిన వన్నారు. వివాహము మహానందముగా జరిగినది.

స్థానాపతి యధికారము రాజ్యములో ప్రధానోద్యోగములలో నొకటి. దానికి జీతము సంవత్సరమునకు పదివేలపన్నులు 'పన్ను' అని మధురనాయకులకాలములో వాడబడు బంగారు నాణెము పేరు.

చైత్రము దరిసినకొలంది కుట్టాన్‌కు ప్రాణములు చేరుకున్నవి. వీరభూపతివచ్చును.

వీరభూపతి వచ్చినాడు. ఉద్యోగములో ప్రవేశించినాడు. వీరభూపతికి పెద్దసౌధ మొకటొసంగబడినది. అత డందులో ప్రవేశించినాడు. చైత్రములో మీనాక్షీదేవి కళ్యాణమైనది. వైశాఖము శుక్లపక్షమైపోయినది. వీరభూపతిభార్యను మధురకు తీసుకొని వచ్చిరి. కృష్ణపాడ్యమి ప్రయాణమునకు మంచిది. ఆరోజున బయలుదేరదీసి స్థానాపతిభార్యను తదియనాటికి మధురకు తీసుకునివచ్చిరి. ఆమె మధురలోననే యున్నది.

పూర్వపుస్థానాపతి మాఘములో పోయినాడు. మాఘఫాల్గుణములు లెక్కలు పేరుకున్నవి. వీరభూపతికి చైత్రవైశాఖములు పని బరువైపోయినది. వైశాఖాంతమునకు పనికొంచెము తెరపియిచ్చినది. వీరభూపతి వచ్చిన క్రొత్తలోననే యింత శ్రద్ధగా పనిచేసినందుకు తిరుమలనాయకుడు సంతోషించినాడు. యువరాజు ముత్తువీరప్పనాయకునితో చెప్పినాడు. రాజుగారికి చెప్పినారు. కుట్టాన్ సంతోషించినాడు. వీర భూపతికి నుత్సాహముగానే యున్నది.

ఒకరోజున కుట్టాన్ నిదుర లేచి కాల్యకృత్యములు తీర్చికొని, సౌధపురోభాగమున నున్న మంటపములో, ప్రాతర్వాయువులు చల్లగా వీచుచుండగా, వచ్చి కూర్చున్నాడు. పురోహితుడు వచ్చి నిలుచుండి, 'ప్లవంగనామ సంవత్సర వైశాఖ బహుళ అమావాస్య' అన్నాడు. పంచాంగము చంకను పెట్టుకుని, విభూతిరేఖలు మొగమున మెఱయగా శుక్రునివలె నిలుచున్న యాపురోహితుని నిలువున జూచి కుట్టాన్ భగవంతు డారూపమున వచ్చి తన కేదో జ్ఞాపకము చేయుచున్నాడనుకున్నాడు. ఆదిగ్భ్రమలో కుట్టానునకు పురోహితుడు చెప్పిన వారమును వినిపించలేదు. కుట్టాన్ లేచి లోనికి పోయి తనపేటిక తీసి, యందులోని మంచిగందపు చందుకాయపెట్టెను తీసి, యా భూర్జపత్రమును తీసినాడు. దానివంక చూచి చూచుచుండగనే యాయాకుపై నొక కన్నీటిబొట్టు రాల్చినాడు. పెట్టెలో నున్న వాడిన పూలచెండు విసరి పారవేయ నుద్దేశించినాడు. మన సొప్పలేదు. మరల నవి యన్నియు భద్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగా బెట్టెలో దాచినాడు. తొందరగా నంతఃపురములోనికి చనినాడు. ఏకవీర నిరాభరణ సుందరమైన యొడలితో, తెల్లనిచీరతో, గదితలుపు నానుకుని నిలుచున్నది. కుట్టాన్ ఎదురుగా బోయి నిలుచున్నాడు. ఏకవీర కర్థము తెలియలేదు. లోనికి బోయి మంచపు కోడు నానుకుని నిలుచున్నది.

ఏక:—'సేతుపతు లెందుకోవచ్చినారు.'

కుట్టాన్:—'ఏకా. నేడు వైశాఖ బహుళ అమావాస్య'

ఏక:—'సంవత్సరము ప్లవంగి. వారము శని.'

కుట్టాన్:—'నేటికి సంవత్సరమైనది.'

ఏక:—'పన్నెండు నెలలు అని గోడవైపునకు చేయి చూపినది. ఆగోడమీద నల్లని బొట్లు పన్నెం డున్నవి. కుట్టాన్ లజ్జావనత శిరస్కుడై నెమ్మదిగా ద్వారబంధముకడకు పోయినాడు. వెనుకనుండి యేకవీర యొక పాట పాడుచున్నది. ఆ పాట ద్రావిడ దేశములో నారోజులలో జనులందరు సామాన్యముగా పాడుచుండెడిదే. జనాపవాదభీతుడైన రాముడు సీతను వనములో విడిచిన తరువాత సీతాదేవి దుఃఖించుచున్న మాటలే యాపాటలోని మాటలు. కుట్టాన్ మంత్రరుద్ధభుజగము వలె కదలలేక పోయెను. వెనుకకు పోయి యామెను గాగిలించుకొనవలె ననిపించినది. ఒకదాసి యేదో కనుగొనుటకు నేకవీరకడకు పోయినది. కుట్టాన్ తన గదిలోనికి పోయినాడు. మంచముపై బండుకుని మొగము శయ్యపై నాన్చి తా నిన్నాళ్లేల బ్రదుకవలెనను కొన్నాడు. మీనాక్షి యేమైనదో! ఆమె నెవరి కిచ్చి పెండ్లి చేసినారో! ఆమెమీద నింకను నాస మెందులకు? సేవకునిబిలిచి, 'స్థానాపతిగారి యింటికి పోయి నేను నేడు వారియింటికి భోజనమునకు వచ్చెదనని చెప్పు'మన్నాడు. సేవకుడు పోయినాడు.

పెట్టె తెరచి సేతుపతి మంచిగందపు చందుకాయ పెట్టెలోనుంచి వాడు పూలు, గందపుదమ్ము, కస్తూరి తీసి యింకొక చోట నుంచినాడు. ఒక్క భూర్జ పత్రము మాత్రమే యందుంచినాడు. ఆదుమ్ము రెండుచేతులకును రాచుకొని మొగమున బూసుకొన్నాడు. అద్దములో జూచుకున్నాడు. దాక్షాయణీ శోకతప్తుడైన శివునివలెనున్నా ననుకున్నాడు. వసనాంచలముతో మొగము సరిగా దుడుచుకుని మిగిలిన ప్రేయసీచిహ్నములు వేఱొక చోట దాచినాడు.

వంటబ్రాహ్మణుడు వడ్డించగా కుట్టాన్ వీరభూపతులు వీరభూపతియింటిలో భోజనము చేసినారు. కుట్టాన్ మనస్సు విషాదచ్ఛన్నమయ్యెను వీరభూపతితో గలసియున్నప్పుడతనికి సంతోషమే. భోజనము చేయుచున్నప్పుడు రెండు మూడు సార్లు వీరభూపతి నతని భార్యను గూర్చి యేమో యడుగుద మనుకొన్నాడు. కాని మనస్సు సరిగ లేక యూరకున్నాడు. ఇంతవరకు కుట్టాన్ వీరభూపతి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వివాహవిషయమై యతనితో ప్రస్తావించ లేదు. అత డంతకు ముందే మాటలాడలేదు. దీనికి గారణము లున్నవి. కుట్టాన్ తన దుఃఖములో మునిగి యావిషయము సంప్రశ్నించ లేదు. వీరభూపతి తనభార్య విషయము కుట్టాన్‌తో చెప్పుటకు తనకు సరియైన యుత్సాహము లేక పోయినది.

భోజనానంతరమున నిరువురును రాజసౌధమునకు బోయిరి. కుట్టానున కెట్లో ప్రొద్దు గ్రుంక వలయును. పగలు గడపవలయును. మొగసాలలో ననేకమంది గూర్చుండి తాటాకులమీద గంటములతో గ్రంథములు వ్రాయుచుండిరి. వీరందరికిని జీతములు బత్తెములు రాజిచ్చును. ఆ గ్రంథములు పుస్తకభాండాగారములకు రాజ్యములోని యితర పాఠశాలలకు పంపించబడును.

వా రిరువురు నచ్చటనుండి కదలిపోయిరి. ఎదురుగా సంధ్యామంటపము కనబడినది. కుట్టాన్ మనస్సులో కస్తూరి రంగనాయకుని ఘోరమృతి మెఱుపువలె మెఱసినది. అనంతరము దళవాయికుమారుడును, స్థానాపతియు తిరుమలనాయకుని యొద్దకు బోయినారు. తిరుమలనాయకుడు ముద్దుకృష్ణప్పనాయకుని రెండవకుమారుడు. అతని నేత్రములు దీర్ఘములై రక్తరేఖలతో విరాజిల్లుచుండెను. అతని వక్షఃస్థలము విశాలమై కోట యినుపతలుపులవలె నొప్పుచుండెను. అతని బాహువులు దీర్ఘములై, యాజానులంబమానములై, యాయసస్తంభములవలె కఠోరములైయుండెను. అతని మొగము జూచినవా డతడే భావి మధురరాజ్యమునకు రాజగునేమోయని యనుకొనును గాని, యతని యన్నగారు ముద్దువీరప్పనాయకుడు యువరాజున్నాడని సందియము కలుగును. తిరుమలనాయకుని వదనము ప్రసన్నగంభీరమై యత డొక నిశ్చయముచేసి కొన్నచో దాని ద్రిప్ప నెవ్వనికి సాధ్యము గాదని తెలియజేయు చుండెను. తిరుమలనాయకుని కప్పటి కిరువదిరెండేండ్లు దాటలేదు. కాని యతని తండ్రి గాని, యన్నగారు గాని యతనికి జెప్పకుండ నేపనియు జేయరు. అతని సర్వావయములందును మహాదృష్టరేఖ లున్నవి. అతనికాలములో మధురరాజ్యము పరమోత్కృష్టమైన మహాదశ పొందునని కార్తాంతికులు చెప్పిరి. ముద్దువీరప్పనాయకుడు ననూయారహితముగ తమ్ముని యభ్యుదయమునే వాంఛించినాడు తిరుమలనాయకుడు కుట్టాన్ స్థానాపతులతో గొంచెము సేపు మాటలాడి, కుట్టాన్‌తో, 'దళవాయీ! నీతో నొకమాట'యని చాటునకు దీసికొని పోయినాడు. అచ్చట నేదో రాచకార్యవిషయము మాటలాడిన తరువాత ప్రొద్దు గ్రుంకు వేళకు కుట్టాన్ వీరభూపతులు వైగైయిసుకలకు బోయినారు. నాటికి నేటికి మరల వేసగిలో వేగై పరిఖిన్నస్రవంతి పలుచని నీటి ధారలో స్నేహితు లిద్దరు నొకరి బుజములపై నొకరు చేతులు వైచుకొని చీలమండలు తడుపుకొని నీరు పుక్కిలించి యుమిసినారు. నేలపైనుండి గాలి వెచ్చగా వచ్చినది. ఇద్దరు స్నేహితులును నీళ్లతో మొగములు కడుగుకొన్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పాములవాఁడు

వేలూరి శివరామశాస్త్రి గారు.

కప్పలకుప్పలన్ మెసవి కాయము చుట్టలు చుట్టి మంచుపెన్
దుప్పర కుప్పతిప్పలుగఁ దోఁగెడు నిత్తఱి మంపుపెంపు కన్
గప్పఁగ నీవు కట్టు కనికట్టునఁ బుట్టను నిద్ర బోవు నీ
త్రిప్పలమారి కుండలిని దీయుమ! పాములవాఁడ! పైకిఁకన్.

ఇది గిదిగో నీ శిశువుల్ - ముదమునఁ గాంచంగ వచ్చి మూఁగుచునున్నా
రదిరా తుమ్మెద లుదయము - మొదలున విరిదమ్మిచుట్టి మూఁగినయట్టుల్.

ఔరా రజ్జువువోలెఁ బందుకొనె నీవ్యాళంబు మోమెత్తఁగా
నారంభింపదు నీదునాగసారకాయన్ గాలిఁ బూరింపుమా!
చేరంగాఁ జని వక్రచక్రములలోఁ జేతం దగం దట్టుమా!
సారస్యంబుగ దిగ్విమోహనముగా సంగీతముం బాడుమా!

సానందంబుగ మ్రోఁగుచుం దిరుగు నీసన్నాయి విన్నంతి గా
డ్వానం గొంచెము లేచెఁగాని యలగా డ్వానాసయందుండి దా
నీ నాసంబడి పోవుదెంచె నటులే యీనాసయందుండి తా
నానాసంబడిపోమె నిశ్చలతఁ దా నందంగఁబో దక్కటా!

ఊఁదు మూఁదుఃము ముఖవీణ యూఁచమట్టు-బుగ్గలలబూరెలంబోలెఁ బొంగిపోవ,
ఎత్తుమెత్తుము పడగను నెత్తుగాఁగఁ-బొందికగఁ బ్రొద్దతిరుగుడు పూవువోలె.

ప్రాణపిపాసులైన యల పన్నగ మల్లన లేచియాడుచున్
గానమునందుఃలన్ నినునె గాటుగొనన్ గమకించెనో ప్రభూ!
ఔనోకా పాముతోడఁ జెరలాటము లేమిది మాకు నేలొకో
పానలు? పాములందులనె పండెడు నీ కిది యొక్క లెక్కయే?

కుబుసంబు మెయినుండి కూలిపోవఁగ నాగబెత్తంబు నీవు పై కెత్తుమయ్య
నీ నాగసారకాయ నింపినట్టులు దీని నెమ్మేని గాలితో నింపుమయ్య
దండంబువలె నిల్చియుండంగ నలయేడు స్వగములు గాలించి పాడుమయ్య
నీచూపుతోపాటు నెఱి దీనిచూపును నీమీఁదనే యుంప నేర్పుమయ్య.
పాలు గీలును వలద యీపాఁపఱేని - కిమ్ము గొంచెమ్ము నీ విరిదమ్మి తేనె
పిమ్మట ఫణామణి ప్రకాశమ్ముతోడ - నివ్వటిల్లుత మిది నడ దివ్వెవోలె.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మోహినీ విలాసము

కొప్పర్తి నారాయణమూర్తిగారు, బి. ఏ., యల్. టి.,
(సాహితీసమితి)

## ౧

అన్యదేశ సంపర్కమువలనను, నానారాష్ట్రవార్తా పత్రికల మూలమునను ఆంధ్రులలో సర్వమానవ వృత్తులందును తీవ్రపరిణామ సంచలన మారంభమాయెను. ఆంధ్రాభ్యుదయసమస్యయందు ఆంధ్రభాషా ప్రాముఖ్యము నుత్తేజించి వీరేశలింగ ప్రభృతులు సంస్కృతాంగ్ల భాషా గ్రంథములనుండి యనువాదముల బ్రచురించి యాంధ్ర భాషాగ్రంథరాజములను పెంపుసేయుచుండిరి. పురగ్రామ వాసులకు సయితము నానాదేశవార్తలదెలిపి ప్రపంచజ్ఞానము ప్రసాదింప నాంధ్రపత్రిక సమకట్టినది. కావ్యవిమర్శ విధానము నూతనమార్గముల దిరిగినది. భావగీతముల తరగతిలో జేరిన యభినవకవిత్వము విద్యార్థుల కలమునుండి యూరుచున్నది; పండితుల యాదరణ నందుచున్నది. సామాన్యజనులజ్ఞానాభివృద్ధికి వ్యావహారిక భాషా ప్రయోగ మత్యంతావశ్యకమని రామమూర్తి పంతులుగారు నిరూపించిరి. భాషాసంఘము లనేకములు స్థాపింపబడినవి. మాతృభాషా మూలమున విద్య నేర్పబడవలెననియు, నాంధ్రవిశ్వవిద్యాలయ మవసరమనియు తీర్మానించుటకు సభలు జరుగుచున్నవి.

బంగాళాదేశమునుండి విపినచంద్రపాలుడు మున్నగువారు ఆంధ్రదేశమున రాజకీయ ప్రచారము గావింపుచున్నారు. స్వరాజ్య సంకీర్తనలు పల్లెటూళ్లలోగూడ వినిపించుచున్నవి. శిశువులకు 'స్వరాజ్యం', 'వందేమాతరం' అని కొందరు నామకరణములు చేసిరి. ప్రత్యేకాంధ్రరాష్ట్రమును గోరుచు విన్నపములు చెలరేగినవి. కళాశాలలో చదువుచున్న కొందరు విద్యార్థు లనుచితప్రవర్తనమునకు శిక్షింపబడిరి; రాజకీయ ప్రచారావేశము వలన మరికొందరు దుష్ఫల మనుభవించుచున్నారు.

మతవిషయమునందు గూడ నుత్కృష్ట సంచలన మాంధ్రదేశము నావరించెను. ఆర్యసామాజికుల యుద్బోధనమున ప్రార్థనసమాజ మందిరము లేర్పాటు గావింపబడుచున్నవి. హిందూదేవాలయములు, మతసంప్రదాయములు నిరసింపబడుచున్నవి. జన్నిదములు జారిపోవుచున్నవి. క్రాపింగులు కళ దెచ్చుచున్నవి. తిలకము పని తీరిపోవుచున్నది. పాఠశాలలయందలి విద్యార్థులు సెలవుదినములలో స్వగృహముల కేతెంచి పూర్వాచార పరాయణులైన పెద్దల వెక్కిరింపుచున్నారు. మతమును పునరుద్ధరించుటకు పత్రికలు, సభలు జరుగుచున్నవి.

సంఘ సంస్కరణాభిలాషతో వీరేశలింగం గారు ప్రహసనముల వ్రాయుచుండిరి. నిమ్నజాత్యుద్ధరణకు విద్యాధికులు కంకణము కట్టుకొనిరి. వితంతు వివాహముల ప్రోత్సాహపరచుటకు జమీందారులు ధనము వెచ్చింపుచుండిరి. అనాథశరణాలయములు నెలకొల్పబడినవి. మహిళాపత్రికల మూలమున స్త్రీలు తమ యభిప్రాయములను, హక్కులను స్వేచ్ఛగా ప్రచురింపుచుండిరి. ప్రిన్సిపల్ వెంకటరత్నం నాయుడుగారి శిష్యులు సాంఘిక సేవాపరులై కీర్తి గాంచుచుండిరి. కాంగ్రెసు సందర్భమున సాంఘిక సమావేశమునందు (Social Conference) శ్రీనాయుడుగారు 'వేశ్యల, గూర్చి యొసంగిన గంభీరార్థ్యతోపన్యాసము ఆంధ్రలోకమున ప్రతిధ్వనింపుచుండెను. వేశ్యావృత్తి మాన్పించుటకనేక ప్రయత్నములు సాగుచున్నవి.

ఇట్టి ప్రయత్నములకు నాటకరంగ మెంతయో సాయపడెను. ఆంధ్రులకు నాటకములపట్ల నభిరుచి హెచ్చుచున్నది. లక్ష్మీనరసింహముగారి గయోపాఖ్యానమును ప్రదర్శింపని నాటకసమాజమువారును, తిలకింపని యాంధ్రులును లేరని నిశ్చయింపవచ్చును. సామాజికుల దుష్ప్రవర్తనమువలన నాటకరంగమున కాపాదింపబడిన దోషమును, నైచ్యమును తొలగించుటకై విద్యాధికులు, ఉద్యోగస్థులు, సంపన్నులు పూనుకొనిరి. అప్పారావుగారి కన్యాశుల్క నాటకప్రదర్శనమం దనేక పట్ట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భద్రులు పాత్రధారులై ప్రేక్షకుల మెప్పు వడసి యాంధ్ర నాటకరంగమున కొక వన్నె దెచ్చిరి.

౨

సాంఘికుల విద్యాప్రవర్తనలబట్టి సంఘౌన్నత్య ముండుచో 'మోహినీవిలాసనాటకసంఘము'వా రెంతయు స్తుతిపాత్రులని చెప్పక తప్పదు. ఇందు నాయకుని వేష మును ధరించు నతడు సంఘాధ్యక్షుడగు విలాసరావు. విలా సరా విరువదినాల్గేండ్ల రూపవంతుడు. నాల్గుసంవత్సర ముల క్రిందట పట్టపరీక్షయందు కృతార్థుడై కలక్టరు కచ్చేరీలో గుమాస్తాగా చేరెను. హిందూ సంఘమునందలి మతాచారముల కెంతయు గుందుచు, వానిని సంస్కరించు టకు మార్గముల నన్వేషించుచుండెను. జనసామాన్యము నందు ప్రబోధము గావింప నాటకములమూలమున సాధ్య పడునని విశ్వసించి, కళంక రహితముగ నుండున ట్లొక నాటకసంఘమును ఉద్యోగస్థులతోడ్పాటుచే స్థాపించెను. వీరు ప్రతి శనివార మొక ప్రదర్శన మిచ్చుటయు, వచ్చిన ద్రవ్యమును సాంఘికసేవకై వినియోగించుటయు జరుగు చుండెను. సాధారణముగ నాటకరంగమున కంటియుండు వ్యభిచారము, పానము, జూదము మొదలగు దోషములకు తావీయకుండుటచేతను, విద్యాధికత స్పష్టపరచుటచేతను, ఈసమాజమువా రెంతయు వాసిం గాంచుచున్నారు.

ఇట్టిరీతి విజయనగరం మహారాజాగారి కీనాటక ప్రదర్శనమును వీక్షించి సాంఘికుల కొక్కింతప్రోత్సాహ మొసగ నిచ్ఛపుట్టి విలాసరావునకు తా మానాడు నాటక మును దర్శించెదమని వర్తమాన మంపిరి. ఆమితోత్సా హములో సాంఘికు లెల్లరు వారి పాత్రోచితములగు దుస్తు లను, పరికరములను చక్కబెట్టుకొనుచుండిరి. రంగముల యమరిక మొదలగున వన్నియు సంసిద్ధము చేయబడినవి. హార్మోనియం వాయించు పాపారా వానాడు వ్యాధి గ్రస్తుడై యున్నను, మహారాజావారు విజయం చేయు తరుణమున తన విద్య కనబరుపు సంకల్పము తో నాతడును నియమితకాలమునకు తన శిష్యురాలగు మోహినీసమేతుండై నాటకశాల కరుదెంచెను. సరిగా తొమ్మిది గంటలకు రాజాగారు వచ్చుటతోడనే తెర యెత్తిరి. పాత్రధారులు తమ నైపుణ్యాతిశయముల చక్కగ స్పష్టపరచుచుండిరి. ప్రేక్షకులెల్లరు సెబాసు, 'నన్సమోరు'లను పరిపించుచుండిరి. నాటక మెంతయు రక్తికట్టుచున్నది. గుట్టునుబట్టియున్న పాపారావు, పాపము! జ్వరముచే నోడ లెరుగకుండ వణకుచుండెను. హార్మోనియం ప్రయోగ మెట్లు? నాటకమునకు ప్రధా నాంగము హార్మోనియమే! నాటకరంగము గానసభగా పరిగణింపబడుదినములలో హార్మోనియమునకు టెంకాయ గొట్టిన గాని తెరయెత్తు నాచారము లేదు.

విలాసరావు గుండెలలో రాయి పడినది. కీర్తికి బదులు అపఖ్యాతి వచ్చునని అతడు భయపడుచుండెను. పాపారావు కొలదికాలములో లేచునట్లు లేదు. పావు గంటవరకు కర్తవ్యా మాలోచించిరి గాని యుపాయము తోపలేదు. ప్రేక్షకులనుండి వెక్కిరింపులు వినబడుచు న్నవి. గోలిలోవారు గడియారముల తీసి చూచుచు న్నారు. స్త్రీప్రేక్షకులు తీవ్రముగ విమర్శించుచు న్నారు. విలాసరావు కన్నుల నీరు గ్రమ్ముచుండెను.

ఈ సందర్భమంతయు గ్రహించిన మోహిని కొంత కాలక్షేపము జరుగుటకు హార్మోనియముపై వాయింపుచు చక్కని త్యాగరాయకృతి పాడ నారం భించెను. సభికుల 'హాయిహాయి'ల కంతము లేదు. మహా రాజావా రనేకసారు లానందము వెలిబుచ్చిరి. విలాస రావు మోహినీగానసుధారసాస్వాదనమున నాటకము నందలి యంతరాయమును మరచి మోహినిచెంత చేరి యామెకు మెలమెల్లగ విసరుచుండెను. కృతిముగియుట తోడనే కరతాళధ్వనులచే ప్రేక్షకు లామెను బహూక రించిరి. వెచ్చని తేనీరు ఆమె పెదవుల కందించి విలాస రావు కృతజ్ఞతను వెలిబుచ్చెను.

హార్మోనియమును మోహిని సమర్థించుటచే నాట కము తిరిగి ప్రారంభింపబడెను. నాయిక నుద్దేశించి పలుక వలసిన వాక్యములను మోహిని వైపు చూచి విలాసరావు పలుకుచుండెను. చిఱునవ్వుతో మోహిని విలాసరావును ప్రోత్సాహపరచుచుండెను. కొంతసేపటికి నాటకము సమాప్తి నొందెను. నాయికానాయకుల కొరకు రాజా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా రుద్దేశించి తెచ్చిన పతకములను మోహినీవిలాసరావు లకు నొసంగిరి. మోహినీగాననైపుణ్యమును మెచ్చుకొనని వారానాటి ప్రేక్షకులలో నొక్కరు నుండియుండరు.

విలాసరావు తండ్రి ప్రఖ్యాతి గాంచిన న్యాయవాది, అతడు రెండేండ్ల క్రిందటనే చనిపోయెను. విలాసరావు వివాహమునకై తండ్రి యెంత ప్రయత్నించినను, తన యిచ్చవచ్చినపుడు తన యిచ్చవచ్చిన యువతిని వివాహమాడెదననియు, తానా ప్రయత్నము చేయ నక్కరలేదనియు విలాసరావు ఖండితముగా చెప్పుచుండెను. తండ్రి గతించిన పిమ్మట గూడ ననేక సంబంధములు వచ్చినను అతడియ్యకొనలేదు. తాను ప్రేమించు యువతీ గుణాతిశయములపట్ల నింతె లక్ష్యముగల విలాసరావును మోహినీగానకళా నైపుణ్యము జయింపగల్గెనా? కాదు, కాదు! పరిణయమునకుమాత్ర మర్హత గల్గిన యువతిగా మోహిని విలాసరావున కగపడెను. దీర్ఘ పరిణయమువలనగదా మంచిచెడ్డలు స్పష్టపడుట!

మోహినితో పరిణయము గల్గించుకొను నుద్దేశముతో విలాసరావు పాపారాయుని సమ్మతిపై మోహినిని సంఘములో సభ్యురాలుగా జేర్చెను. పిమ్మట మోహినివంటి సమర్థురాలు దొరకినపుడు నాటకకళను పెంపుజేయు నవకాశమును వ్యర్థపరుపకుండుటకు తనయుద్యోగమునకు రాజీ నిచ్చి నాటకరంగోద్ధరణకు సమకట్టెను. తనయాజమాన్యముక్రింద యథావిధిగ మోహినీ విలాస నాటకసమాజమును స్థాపించెను. అందు పాత్రధారులకు ఉదార వేతనముల నొసగుటచే సత్ప్రవర్తన గలవారాకర్షింపబడిరి. పిత్రార్జితమగు ద్రవ్య మధికముగ నుంటచే నద్భుతమగు సీనులను నిర్మింపగల్గెను. రానురా నీ సమాజమువా రితరపట్టణములలోగూడ ప్రదర్శనముల గావించి ప్రసిద్ధి గాంచుచుండిరి.

## 3

దసరాయుత్సవ సందర్భమున కాకినాడలో నాటక పోటీ ప్రదర్శనము లేర్పరుపబడినవి. అయిదారు నాటకసమాజములు పోటీకి నిలిచినవి. అందు ముఖ్యమైనది విజయనగరపు మోహినీవిలాసనాటక సంఘము. వీరి నటనాకౌశల్యమును పొగడని పత్రిక లక్కాలమున లేవు. వీరినే యితర సమాజములవా రాదర్శకులుగ గైకొనుచుండెడి వారు. వీరి ప్రదర్శనములను తిలకించుటకనేక పట్టణములనుండి ప్రజలు కాకినాడలో విడిసియున్నారు. ఇందు ప్రధానపాత్రల కొసంగుటకు పోలవరం జమీందారుగారు బంగారు పతకములు సిద్ధపరచియుంచిరి; నాటక ప్రదర్శనమును చూడకయే పత్రికా విలేఖరులు విమర్శలు వ్రాసి సిద్ధముగ నుంచుకొనియున్నారు. వీరిని పొగడుచు వ్రాసినపద్యము లప్పుడే కాఫీహోటల్సునుండి సోడాషాపులకు పయన మగుచున్నవి; నాటక విమర్శన గ్రంథములలో నొక ప్రకరణము చేర్చవచ్చునని గ్రంథకర్త లువ్విళ్లూరుచున్నారు.

“రేపటి పత్రికలో వేయవలెను; ఈ దినము పత్రికలో వేయరాదు”అని ఖండితముగ తెలియజేయుచు సమాజము వారి ఘనతనుగూర్చి యొక విలేఖరి తంతినిచ్చెను.

ఈ నాటకసమాజమువారు విడిసియున్న మేడకు సమీపమున ననేక కాఫీక్లబ్బులు, సోడాషాపులు, వంటపూటిళ్లు, కిళ్లీలు చుట్టలు వగైరా కొట్లు, బయలుదేరినవి; ఇందు చిత్ర మేమన, నవన్నియు 'మోహినీవిలాస నామమున బరగుచుండెను!

విలాసరావు మోహినియెడ కాంక్షించి పడసిన పరిచయ మామె సుగుణరాశి యని నిరూపించుటచే నాతని కామెయెడ గాఢానురాగము కలిగినది. అనురాగ ముత్కృష్టతచే ననుమానహేతు వాయెను. మోహినివంటి లావణ్యరాశి, సుగుణనిధానము, విద్యావంతురాలు తన్ను నిజముగ ప్రేమించునా యను శంక విలాసరావుమనంబున బొడమి దినదినాభివృద్ధి గాంచెను. మరునాడు నాటక మాడవలసిన దిన మనగా చాలరాత్రి వర కిట్టి యనుమానముచే బాధపడుచు, తుదకెట్టులో కన్నులు మూతపడ, నతని యనుమానమును బలపరచు నట్లొక స్వప్నము వచ్చెను. అందు మోహిని తన్ను విడిచి యొక సౌందర్యహీనునకు పరిచర్య చేయుచున్నట్లు గాంచెను. తోడనే మేల్కాంచి యతడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషాదసముద్రమున మునిగిపోయెను. మోమెత్తి మోహినితో మాట్లాడలేకపోయెను. మాంద్య మాతని నావహించెను. నాటక మాడవలసిన దినమున నుండు ఉత్సాహ మావంతయు లేకపోవుట సామాజికుల గుసగుసలకు హేతువాయెను. ఆ సమాజమందలి క్రమశిక్షావిధానమును బట్టి యెవ్వరు విలాసరావుతో నీయంశము ముచ్చటింప లేకపోయిరి. విలాసరావు మౌనమును తనయెడ నాతనికి గల నిర్లక్ష్యభావసూచకముగ గ్రైకొని యాతని విముఖత్వమును సహింపజాలకపోయెను మోహిని. తనస్వాధీనమందున్న ప్రేమనంతను విలాసరావునకు ధారవోయు నవకాశముకొరకు సమాజమునందు జేరిన తన్ను నిరాకరించిన కృతఘ్నుని దరి నుండుట తనయాత్మగౌరవమునకు లోపముగ నెంచుచు సమాజము వీడిపోవుట కాయత్తపడుచున్నది, మోహిని.

కార్యక్రమము ప్రకారము ఆరాత్రి నాటకము జరుగక తప్పదు. మోహినీవిలాసరావులు నాయికానాయక పాత్రల ధరించి రంగస్థలమున నిలిచిరి. నాటి నాటక కథ కేవలము కల్పితము. ఇదివర కెవ్వరును ప్రదర్శింపనిది గాన ప్రేక్షకులకు కథ యేమియు తెలియని కారణముచేత కొంతవరకు సమాజమునకు మర్యాద దక్కినది. నాటక కథతో నేమియు సంబంధము లేని సొంత ప్రసంగములోని కిరువురును దిగిరి.

విలాసరావు:— ఆహా! స్త్రీల రహస్యవృత్తుల కనుగొన నెవరితరము?

మోహిని:—స్త్రీలవృత్తుల నిర్హేతుకముగ శంకించువారి పౌరుష మదేటికి?

విలాసరావు:— మానవతులు పౌరుషహీనుల నాశ్రయింపరుగా?

మోహిని:— మానవతుల నాశ్రయించుటచే పౌరుషహీనులు పౌరుషవంతు లగుదురు.

విలాసరావు:— పురుషుల చిత్తవృత్తుల కనువుగ మానవతి మెలగవలదా?

మోహిని:—తనచిత్తవృత్తులను పురుషుడు తన ప్రియురాలి కెరింగింప వలదా?

విలాసరావు:— తాను నిజముగ వలచిన పురుషుని చిత్తవృత్తుల స్త్రీ కనుగొనలేదా?

మోహిని:—తాను నిజముగ ప్రేమించిన స్త్రీని వశపరచుకొనునట్లు పురుషుడు తన చిత్తవృత్తుల మార్చుకొనలేడా?

విలాసరావు:—పురుషుని స్త్రీ వశపరచుకొనగల్గినట్లు పురుషుడు స్త్రీని వశపరచుకొనుట కల్ల.

మోహిని:—అట్లే స్త్రీకి గల మనోనిశ్చయము పురుషుల కుండుట కల్ల.

విలాసరావు:—నీమనోనిశ్చయము నిన్నటిరాత్రియే తెలిసెను.

మోహిని:—నీ మనోనిశ్చయము నా కింకను తెలియలేదే!

విలాసరావు:—నామనస్సు నిన్నిదినములు కనిపెట్టలేనపుడు నన్ను వదలుట మంచిది కాదా?

మోహిని:—నిన్ను కలియుటకొరకే నిన్ను విడువ నిశ్చయించితిని!

కడపటిమాటలు చెప్పుచు రంగస్థలము వీడి ప్రక్కతెరలోనికి పోయెను, మోహిని. ఎదుట తెర దిగెను. నాటక మభాసయినందులకు సామాజికు లెల్లరు నగుచుండిరి. విలాసరావు లోననున్న పడకకుర్చీపై పడిపోయెను. ప్రధానపాత్రధారునకు జబ్బుగ నుండుటచే నాటకము ఆపుచేయబడినదనియు, టిక్కట్ల రుసుము తిరిగి చెల్లింపబడుననియు నొకసామాజికుడు తెరయెదుటికి వచ్చి ప్రకటించెను. సామాజికులు టిక్కట్ల రుసుము చెల్లించుచుండిరి. ప్రేక్షకు లాశాభంగముచే వెడలిపోవుచుండిరి.

విలాసరావు మనస్సున ననేక ఊహలు పొడమెను. అనేక సంబంధములు నిరాకరించి వివాహమున కియ్యకొనక తుదకు తన కన్నివిధముల నచ్చిన మోహినిని భార్యగా గ్రైకొన దలచియుండ, నిట్టి విఘాతము సంభవించినందులకు విలాసరావు ఐహికసుఖమున కాతడు నోచికొనలేదని. నిశ్చయించుకొనెను. మోహిని లేని నాట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కరంగ మతని కేహ్యముగ గాన్పించెను. మోహిని గావించిన పరాభవమునకు తోడివారిలో తల యెత్తికొనజాలక పోయెను. ఆమె యెచ్చటికి పోయెనో, ఆమెగతి యే మాయినో ఆతడు తలపెట్టలేదు.

మరునాడు సామాజికుల జీతముల నిచ్చి, తెరలు మొదలగు నాటకపరికరములను అచ్చట విడిదియున్న యితరసామాజికుల కమ్మివేసెను. పిమ్మట మూడు నాల్గు మాసము లెచ్చటో తల దాచికొనెను గాని, నిర్వ్యాపారత్వమువలన కాలము దుర్భర మగుటచే, మన్యపుజమీందారువారి క్రింద దివానుపని స్వీకరించెను.

౮

కళావంతులకులమునకు జెందిన రామారావు పిన్ననాటనుండియు బీదవిద్యార్థి వసతిగృహమునందు జేరి ఉచితముగ విద్య నేర్చుచుండెను. ఏడెనిమిది వత్సరములు విద్యాభ్యాసము చక్కగ జరిగెను గాని పిదప మశూచికవ్యాధిచే నంగవైకల్యమే గాక మేధాశక్తి క్షీణించుటయు నాతనికి తటస్థించెను. ప్రవేశపరీక్షలో దాటుట కనేక దండయాత్రలు సల్పినను అపజయము యథా ప్రకారముగ గలుగుచుండెను. తన యసమర్థతను సమర్థించుకొనుటకు అపజయకారణముల పెక్కులు కల్పించుచుండెను. తాను పరీక్షలలో కృతార్థుడై యున్నతోద్యోగమును చేయుచుండ చూచుట నభిలషించిన తనతల్లి కొలదిమాసముల క్రిందనే మృతి పొందెను. ఇంక తన కీప్రపంచమున దిక్కెవ్వరు తోపలేదు. ఉచితవసతిగృహమం దతనికి తావు దొరకదు. ఇదివరలో కొంత ద్రవ్యసాహాయ్యము చేయుచుండిన మిత్రులు వెనుకాడిరి. ఇట్టియిక్కట్టులతోపాటు ఉబ్బసపుదగ్గు ప్రాప్తించెను. జీవనోపాధికి వలయుప్రయత్నములు చేయవలసి వచ్చెను.

ఉద్యోగముకొరకు రామారావు కాకినాడ వచ్చి సత్రములో బసచేసెను. సత్రపు అరుగుపై గది కెదురుగ పరుండి ఖళ్లుఖళ్లుమని దగ్గుచు నిదుర పట్టమి విలపించుచుండెను. దోమలబాధ నివారించుటకు ఆపాదమస్తకము పాతపట్టుకండువాతో కప్పికొని, దీపమును మిణుకు మిణుకు మనునట్లు సన్నముగజేసి శయనించి తనయవస్థను తలచికొనుచుండెను.

రాత్రి పదిగంట లయినది. పౌరు లెల్లరు పోటీ నాటకప్రదర్శనవీక్షణమునకై యేతెంచుటచే వీథులు నిర్మానుష్యముగ నున్నవి. ఎగిరి వచ్చినట్లు జట్కాబండి యొకటి సత్రమువద్ద నిలిచెను. తోడనే యొక మానవవిగ్రహము చేత చిన్నట్రంకుపెట్టెతో బండిలోనుండి దిగినట్లాయెను. రామారావు కన్ను విప్పి చూచునప్పటికి మేలిముసుగులోనుండి స్త్రీ కంఠధ్వని తనచెంతనే వినబడినది. రామారావు నివ్వెరపడి లేచి కూర్చుండెను. సత్రపు గుమాస్తా యెచ్చటికో పోయెననియు, గదుల తాళములాతనియొద్దనే యుండుననియు, తనక్రింద నున్న గదిలో నామె కిష్ట మున్నచో నుండవచ్చుననియు రామారావు అయ్యావతి ప్రశ్నల కుత్తరముగా, మధ్యమధ్య దగ్గుచు చెప్పెను. అంత రాత్రివేళ చేయునదేమియుదోచక రామారావుగదిలోనే రాత్రి గడపుటకు మోహిని నిశ్చయించుకొనెను. తోడు నీడ లేని యాతని కీమె దేవతవలె తోచెను. సానుభూతిని వెదజల్లు నామె ముఖలక్షణములచే ప్రోత్సహింపబడి, తనయవస్థ నింతవరకు వినెడువారు లేరని చింతించుచున్న రామారావు తన దీనదశనంతయు సవిస్తరముగ వివరించెను. ఆమె హృదయము కరగగా, రోగపీడితుడైన యాతనికి మందుసీసా నందిచ్చుట, దాహమిచ్చుట మొదలగు పరిచర్య చేయుచుండెను. రామారావువలె తానును దిక్కు లేనిదని యామెజీవితములో మొదటిసారి గుర్తించెను. రామారావు దీనవచనము లామె యాలోచనను భంగపరచు చుండెను. ఇంతియ గాక యాతని యవస్థ విన సహింపలేక, "నాయనా! చాల రాత్రి యయినది; ఇంక పరుండుము; ఇంకను మేల్కొనిన జబ్బు ఎక్కువగును" అని యామెబుజ్జగింపగా నాతడు కంట తడిపెట్టుకొని, "అమ్మా, నే నెటులయిన చాల కాలము బ్రతుకజాలను; నీసన్నిధిని చనిపోవుటకంటె నా కీప్సితము లేదు." అని యాతడు వెక్కివెక్కి యేడ్వసాగెను. కరుణాంతరంగిణియైన యామె అట్లు బాసచేయ కొంతసేపటికి రామారావు నిదురించెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మోహినికి మాత్రము కునుకు పట్టలేదు. విలాస రావు గావించిన తిరస్కారమున కామెహృదయ మొక ప్రక్కనుండి దహించుకొని పోవుచున్నది. ముందు తనగతి యేమియో స్ఫురింపకున్నది. కర్తవ్యమునుగూర్చి చాల సే పాలోచించి తుదకు కొంతకాలము రామారావుతో నుండుట యుత్తమ మని నిశ్చయించెను. సౌందర్యమునను, విద్యయందును తనకంటె చాల తక్కువదశయందున్న రామారావుతో నుండిన లోకు లన్యథా తలంచరు; రామారావువచనముల బట్టి చూడ నాతడును తనయెడల నవ్యక్తముగ ప్రవర్తింపడు. పురుషునియండ నుండు టెందుకైనను స్త్రీకి మంచిది. పలువురకంటబడి యపవాదలకు పాలుగాకుండ తనయెడ సోదరభావముననున్న యీతనితో కాలము గడపుట మంచిది.

తెల్లవారుచున్నది. రామారావు ఉలికిపడి లేచి, 'అమ్మా, అమ్మా' అని కేకవేసెను. మోహినియు 'ఏమి, నాయనా?' అని యూరడించెను.

"అమ్మా! నన్ను విడిచిపెట్ట నన్నావుగా!"

"ఔను."

"ముమ్మాటికి విడిచిపెట్టవుగదా!"

"అలాగే కాని నే నెవ్వరినో, ఎట్లు నీవద్ద నుంటినో, ఎవ్వరితోను చెప్పరాదు. తెల్లవారకపూర్వము మన మిచ్చటినుండి పోవలెను. కారణ మడుగకుము."

"రేపు ఉదయముననే నాకు ఉద్యోగ మిచ్చెదనని ఇచ్చట నొక జమీందారు వాగ్దానము చేసెను. రేపు సాయంకాలము మన మేగుదము."

"అటులయినచో నిచ్చట నాయునికి నతిరహస్యముగ నుంచుము. ఉద్యోగపుటుత్తరువును పొందినవెంటనే రైలెక్కి మనము తప్పక పోవలయును."

"ఇదిగో! ఇప్పుడే జమీదారుదగ్గరకు పయనమగుదును." అని లేచి కాల్యకృత్యముల దీర్చికొని తెల్లవారగానే జమీదారుని దర్శించి మన్యములోనున్న పేరుపల్లెకు తాణేదారుగా నియమింపబడిన ట్లుత్తరువు గైకొని, శీఘ్రముగా బసచేరి, యా శుభవర్తమానము మోహిని కెరింగించెను. రామారావు కుండు ఐశ్వర్యసంపదపై మోహినియొక్క సౌఖ్యము ప్రస్తుతపరిస్థితులలో నాధారపడియుండుటంబట్టి ఆమెయు మిగుల సంతసించెను. ఆలస్య మేమియు జేయకుండ కాకినాడను విడిచి రైలుమీద పయనము గావించిరి.

౫

పేరుపల్లెకు పోవుమార్గమున నున్న మెకపుటాడ గ్రామమందున్న దివానుగారిచేతిక్రింద రామారావు ఉద్యోగము చేయవలసియుండుటచే వారింట నొకదిన మాగి వారిదర్శనము చేయుట లౌకికరీతిని మంచిదగుటచే రామారా వట్లు దివానుగారి గృహమునకు మోహినీయుక్తముగ నేతెంచెను. తనరాకకు కారణ మెరింగించిన పిమ్మట దివానుగా రాతని నెక్కుడుగా నాదరించెను. ఇట్టియాదరణకు వేరుకారణ ముండునేమో యని తరువాత జరిగిన వృత్తాంత మనుమానమును కలిగింపక మానదు.

మన్యములో పనిచేయుట కిదియే ప్రథమ పర్యాయ మగుటచేతను, మన్యప్రజనులకును భయమును కలిగించు శీతాకాలము చొరపడుచుండుటవలనను, ఆరోగ్యమును కాపాడుకొనుట కతిజాగ్రత్త వహింపవలయునని దివాను శంకరరావు రామారావునకు హితబోధ గావించెను. ఎక్కువగా పనిచేయక పోయినను తాను సైరించెదననియు దివాను వాగ్దానము చేసెను. ఇట్టియనూనప్రేమకు రామారా వెంతయు కృతజ్ఞత చూపించెను. అనారోగ్యకరమగు మన్యములో స్త్రీలతో కాపురముండుట ప్రమాదకర మగుటచే కొంతకాలము మోహినిని దివానుగారింట నుంచుటకు దివాను శంకరరావు ప్రోత్సాహముపై రామారావు సమ్మతించెను. మన్యపునుంచిచెడ్డల నరయునరకు మెకపుటాడలో నుండుటయే భావ్యమని మోహినియు తలచెను. మరునాటి యుదయమున రామారావు పేరుపల్లెకు దివానుగారి జవానును సాయముగా గొని యేతెంచెను.

ఉత్తరక్షణమునుండి మోహినియొక్క ప్రేమను సంపాదింప శక్తికొలది శంకరరావు ప్రయత్నించుచుం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డెను. మదరాసునుండి పండ్లు, పెద్దాపురమునుండి పట్టు చీరెలు, మలబారునుండి సబ్బుబిళ్లలు, కలకత్తానుండి వాసననూనెలు వచ్చి పడుచుండెడివి. శంకరరావు ఇంటిపెత్తనము మోహినిపై బెట్టుచుండెను. సేవకులు, పురవాసులు మోహినిని చిన్నమ్మగారని పిలుచుచుండెడివారు. మాణిక్యాంబ పెద్దమ్మగారయినది. మోహినిని స్వయముగ వశపరచుకొను ప్రయత్నములు భగ్నమగుటచే సిగ్గువిడిచి శంకరరావు ఈపనికి మాణిక్యాంబను పురికొల్పెను. తనగౌరవము శంకరరావుదయపై నాధారపడియుండుటచే నాతనిని మాణిక్యాంబ వారింప సాహసింపలేకపోయెను. సుగుణోపేతయగు మోహినియెడ తానిట్టిరీతిని ప్రవర్తింప మాణిక్యాంబకు మనసు పుట్టదాయెను. మోహినినిగూర్చి యోచించినకొలది మాణిక్యాంబ కామెయెడ ప్రేమ యధికమగుచుండెను.

తుద కొకనాడు మాణిక్యాంబ తన మనస్సును మోహినికి వెలిబుచ్చెను. శంకరరావు దుర్మార్గుడనియు, మోహిని శీఘ్రముగ నాతనిగృహము వీడుట యుక్తమనియు నామె సూచించెను,

"నీప్రక్క నుండ నాకు శంకరరావువలన నేమి భయము?"

"అట్లనకుము. నన్నుకూడ నితడు మోసపుచ్చెను."

"అదెట్లు?"

"వెఱ్ఱిదానా! నే నాతని భార్యనని నీవుగూడ నమ్ముచున్నట్లున్నది. ఇతనికి భార్య చనిపోయి నాలుగేండ్లయినది. ఈతడు మూడేండ్ల క్రిందట బళ్లారిలో ఉద్యోగము చేయుచున్నప్పుడు వితంతువైన నన్ను మోహించి వివాహమాడెదనని వర్తమాన మంపుచుండెడివాడు. ఇంతలో నాతని కీగ్రామము బదిలీయగుటచే నాతని నమ్మి వెంటవచ్చితిని. ఇప్పట నాప్రవర్తనకు కళంకము కలిగించెనే కాని యథావిధిగ వివాహ మాడకుండెను. ఇప్పు డీతని విడిచి పోయిన నేనధోగతిపాలగుదును. చిన్నతనముచేత నీగతికి దిగితిని. పూటకి, గుడ్డకు లోటు లేదు గాన నిచ్చటనే యుండ నిశ్చయించితిని. ఇక రెండు దినము లుండిన నీవును నాగతికే వచ్చెదవని భయపడుచున్నాను. ఇట్లు చెప్పినందులకు క్షమింపుము."

"మోసగానికి మోసమే శిక్ష!"

"అబ్బో! ఆతని మోసపుచ్చుట సాధ్యము కాదు."

"అట్లనకుము. నీవు పూర్తిగ నాకు సాయపడినచో ............"

"నాప్రాణములైన నీయధీనము చేసెదనని నమ్ముము."

ఇట్టిప్రసంగమున నున్న యువతులయెదుట హడావిడిగా ప్రత్యక్షమై, అతితొందరపని తటస్థించుటచే తాను పీరుపల్లె వెళ్లవలసి యున్నదనియు, తత్క్షణమే బయలుదేరుదుననియు శంకరరావు తెలిపి, మాణిక్యమువైపు భావయుక్తముగ వీక్షించి, "నేను తిరిగి పదిదినములలో వచ్చేసరికి నేచెప్పినది సిద్ధపెట్టుము" అని దీనముగ బల్కి వెడలిపోయెను.

శంకరరావునకు పరీక్షాయోగ్యతలు లేవు. ఉద్యోగానుభవమును తక్కువ. సామర్థ్యమును చాలదు. అయినను వితంతువివాహము చేసికొననున్నట్లాతడు జమీందారుగారికి విన్నవించుటచే సంఘసంస్కర్తయగు నామహనీయు డీగొప్పయుద్యోగము నాతని కిచ్చెను. ఉద్యోగము దొరకినపిమ్మట బహిరంగముగ మాణిక్యమును వివాహమాడుట కాతడిష్టపడకుండెను. పీరుపల్లె కాతడిప్పుడు పోవుటకు కారణము మోహినివృత్తాంతమును తెలిసికొనుటకే. రూపసంపద లేని రామారావునకు మోహిని భార్య కాదని శంకరరావు శంకించెను. మోహినిని వివాహమాడుతలంపుతో శంకరరావు తనమార్గమున నాటంకములు లేకుండ జూచుకొను నుద్దేశమున నుండెను. అట్టిసమయమున నాతని కొక లేఖ చేరినది:

"అయ్యా!

"నేనును, మాణిక్యాంబయు చామర్లకోటలో నున్నాము. రేపు సాయంకాలము రాజమండ్రీ వెళ్ళుచున్నాము. అచ్చట మాణిక్యాంబ పునర్వివాహము వారము రోజులలో జరుగును. ఈసంగతి నాకిప్పుడే తెలిసినది; తెలియక ఆమెతో పయనమయితిని. అయినను ఆమెతో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూడ నుండుటచేత తమకీజాబువలన కృతజ్ఞతా పూర్వక ముగ కొంత మేలు చేసినదాన నగుదునని సంతసింపుచు న్నాను. జాగు చేయక వలయు ప్రయత్నములు చేయుడు. తొందరచే గలిగిన లోపములు క్షమింపుడు.

చిత్తగించవలెను,

"మోహిని."

ఎవ్వరితోనేమియు చెప్పక, జాబును చదివినవెంట నే చామర్లకోటకు బయలుదేరి, మార్గాయాసమునకు వెనుదీ యక జట్కామీద ప్రయాణము చేసి, యాసాయంకాలము నకు సామర్లకోట సత్రమును జేరికొని, యచ్చట మోహినిని గాంచి, "మాణిక్యమేది" అని యడిగెను.

"కాబోవు భర్తతో కాకినాడ వెళ్లినది."

"ఎందుకు ?"

"ఉద్యోగముకొరకు జమీదారుగారిని దర్శించి భర్తకు ఉద్యోగ మిమ్మని కోరునట !"

"కొంప మునిగిందే!"

"ఏల ?"

"ఏమయితే నేం! నాప్రారబ్ధం. ఇదివరకే నే నా మెను వివాహమాడిన ఈయుపద్రవము జరుగకుండెడిది... అయినను, మోహినీ! నీజాబువలన నొనర్పదలచిన మహో పకారమును పూర్తిచేసి నన్ననుగ్రహింపుము. నీయెడ నా కిదివరలో కలిగిన చెడుతలంపులకు నన్ను మన్నింపుము. మాణిక్యమును వివాహమాడుటకు సిద్ధముగ నున్నాను. ఆమె నన్ను వివాహమాడనిచో నాయుద్యోగము పోవును. వితంతువివాహమును చేయదలచికొనినందులకు నాబందుగు లిదివరకే నన్ను వదలిపెట్టిరి. నీవు తప్ప నా కిప్పట్టున దిక్కు లేదు. అమ్మా! దీనుని రక్షింపు."అని శంకరరావు విలపించెను.

కొంతసేపాలోచనను నటించి తాను కాకినాడ వెళ్లి మాణిక్యాంబను కలిసికొని యామెకు నచ్చచెప్పి మరునాడుదయము రాజమండ్రీకి తీసికొనివచ్చెదననియు, శంకరరావు వెంటనే రాజమండ్రీ వెళ్లి మరునాడే వివాహ ము జరుగుట కేర్పాట్లు చేయవలయుననియు నాతనితో చెప్పి పంపివేసెను.

తెల్లవారుజాముబండిలో మోహినీమాణిక్యాంబలు రాజమండ్రీ వెళ్లి యుదయ మేడు గంటల కచ్చటచేరిరి. శంకరరావు కొందరి మిత్రులతో స్టేషనునద్ద కాచుకొని యుండెను. మాట్లాడినచో భావికార్యమున కేమిభంగము ల్గునోయని యందరును మౌనము వహించిరి. శంకరరావు వారిరువురను గమ్యస్థానమునుజేర్చెను. అనాథశరణాలయ మందు బ్రహ్మసమాజఫణితిని శంకరరావు మాణిక్యాంబను వివాహమాడెను.

మోహినీ మాణిక్యాంబలు పన్నినయుపాయము శంకరరావు ఎఱుంగడు. తనభార్య లేచిపోయెనని పలువు రాక్షేపింతు రను భీతిచే కాకినాడ వెళ్లి జమీదారుగారిని చూచి వేరొకస్థానమునకు బదిలీ నొందెను. మోహినిని పేరుపల్లెలో దిగవిడిచి బదిలీ గ్రామమునకు భార్యాసహిత ముగ వెడలెను, శంకరరావు.

## ౬

జరుగుబాటు లేనివారికి సౌందర్యమే శత్రువు. సౌందర్యరక్షణకై ఇదివరలో నేర్పరచిన సైనికదళమును వదల్చుకొనిన గాని తనకు క్షేమము కలుగదని మోహిని యెంచి అద్దము నావల నుంచెను; సబ్బులకు స్వస్తి చెప్పెను; దువ్వెన దవ్వున కేగెను.; పట్టుచీరలు పెట్టె దాగెను.; వాసననూనెల వాసనే లేదు.; చేతిరుమాళ్ళు చెదరిపోయె ను. ముంతంతకొప్పు, రూపాయంతబొట్టు, కచ్చాపోసి కట్టు, పాతమేలికమ్మిచీర, తురకబొంబాయిగుడ్డ రవిక మొదలగు లాంఛనములతో పేద పల్లెటూరి ముత్తయిదువ వలె మోహిని ఇప్పు డరణ్యములో నజ్ఞాతవాసము గావింపు చున్నది. రామారావు పనిపాట లేమియు తలపెట్టక ఆ రోగ్యమును కాపాడుకొనుచు నెట్టెటో కాలము గడపు చుండెను.

రెండుదినముల క్రిందట క్రొత్తదివాను చార్జీపుచ్చుకొ నెను. అప్పుడే యాయన యుదారస్వభావుడనియు, ధని కుడనియు, రూపవంతుడనియు ధన్యమంతయు మ్రోగు చున్నది. నాటిసాయంకాలము దివానుగారు పేరుపల్లె వచ్చెదరని తాకీదును జవాను పట్టుకొని వచ్చెను. రామ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రావు తాఖీ దందిన ఘడియనుండియు దివానుగారి కుచిత రీతిని మర్యాదచేయుట కేర్పాట్లు చేయుచుండెను.

కులభేదము పాటింపని దివా నారాత్రి రామారా వింట నతనిపంక్తిని భోజనము చేయుచుండెను. పూర్వపు దివానువలన కలిగిన కష్టము లీతనివలన కలుగునేమోయని మోహిని చాటుగ మెలగుచుండెను. వంటక మెద్దియో కావలసి రామారావు 'మోహినీ' యని పిలిచెను. మోహిని వంటకముతో నెదుట నిలిచెను. దివా నామె మోమును దిలకించుటలో నిద్దరిచూపులు కలిసిపోయెను. మోహిని మూర్ఛిల్లెను. దివాను విడిదిగృహమున కేగెను. రామారావు మోహిని కుపచారము చేయుచుండెను. కొంత సేపటికి, దివానుగారికి హఠాత్తుగా జ్వరము వచ్చుటచేత మెకపుటాడ వెళ్లిపోయినా రను వర్తమానము రామారావు నకు తెలిసినది. మూర్ఛ తేలిన మోహిని యా నీవార్త విని 'కృతఘ్నుడు' అని తిరిగి మూర్ఛపోయినట్లు శయనించెను. మోహినీవిచిత్రచర్యలును, దివానుగారి ఆకస్మిక నిష్క్రమణమును రామారావు మనస్సు కలగించెను.

కాకినాడలో గాంచిన కల నిజమాయెనని నూతన దివాను విలాసరావు తలపోసెను. మోహిని నెంతయు లోలోన దూషింపుచుండెను. కొలదిదినముల క్రిందట నే ఈయుద్యోగమునందు ప్రవేశించుటచేత నిప్పుడే బదిలీని కోరుట తగదని యూహించెను గాని యామె యున్న ప్రాంతముల నుద్యోగము చేయుట కాతనికి శృంగభంగముగ దోచెను. ఇట్లు డోలాయమాన మానసుండైన దివానువిలాస రావునకు జమీదారుగారు జరూరుగా నుత్తరువు గావించిరి. పేరుపల్లెతానేదారు వసూలుచేసిన దస్తునుండి ఎనిమిదివేలరూపాయల నతి త్వరలో పంపవలెనని జమీదారుగారి యాజ్ఞ. దివాను తానేదారు రామారావునకు వ్రాసి పంపగా నాత డొక్కనూరు రూపాయిలైన వసూలు చేయలేదని జవాబిచ్చెను. దివా నీసంగతిని జమీదారువారి కెరుక జేసి, తానేదారుని అతని యశ్రద్ధకు సంజాయిషీ యడిగెను.

తనయశ్రద్ధకు గలుగు దుష్ఫలమునుండి తప్పించుకొనుటకు రామారా వొక కుట్ర పన్ని యందు మోహినిని సహాయము కోరెను. తనమోహినిని దివాను మోహించి యామెను పొందుటకు తన్ను పాడు చేయ దివాను సంకల్పించుకొని యన్యాయముగ దోషారోపణ గావించుచున్నాడని జమీదారున కర్జీ నిచ్చెను. అర్జీవిచారణసమయమున నిజస్థితి బయలుపడునని విలాస రావును అపవాదనుండి తప్పించుటకు తనసాక్ష్య మవసర మగుటచే నాతడు తనసాయమును కోరక మానడనియు, అప్పుడు విలాసరావుతో సంయోగము కలుగగలదనియు మోహిని దృఢముగ నమ్మి రామారావు పన్నిన కుట్రలో జేరెను.

ఈ అర్జీసంగతి దివానునకు తెలిసి చాల విచారించెను. మోహినినిజచరిత్ర నెల్లడించుట కాతని కిష్టము లేదు సరేకదా, మోహినిపే రీయర్జీలో నుండు టామెకును తనకును మానహానిగ దోచెను. మోహిని కీయర్జీసంగతి తెలిసియుండదనే యాతనినమ్మకము. కావలసినంత ధన మున్న విలాసరావున కీయుద్యోగము లెక్కలేదు కాని ఈనేరారోపణ తనగౌరవమునకు భంగకరమని మిక్కిలి చింతిల్లుచుండెను. మోహిని తనపై నబద్ధపు సాక్ష్య మిచ్చుట కల్ల యను గాఢవిశ్వాసముతో నాతడు మెదలకుండెను.

౭

విలాసరావు నాకర్షించి తిరస్కరించిన మోహినిని చూచు కాంక్ష వొడముటచే జమీయజమాని సొంతముగా నీయర్జీని విచారించుటకు కాకినాడనుండి పేరుపల్లి వచ్చియుండెను. రామారావు బలవంతపెట్టగా నాపూటనాతని గృహముననే విందారగింప నియ్యకొనెను. మోహినీ సౌందర్యవీక్షణాయత్తచిత్తుండగు యజమాని వినాయకరావున కీ యాహ్వాన మమితామోదమును కలిగించెను.

మోహినిని జూచు నవకాశమును పొడిగించుటకో యన వినాయకరావు భోజనసమయమున ననేకవిషయములగూర్చి ప్రస్తాపించుచుండెను. అందు, విచారణకున్న యర్జీనిగూర్చి ముచ్చటించుచు, తీర్పు మోహినిసాక్ష్యముపై నాధారపడియున్నదని సూచించి దృష్టి మో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హినిపై ప్రసరింపజేసెను. "అట్లయిన న్యాయము దొరకు" నని రామారావు సంతోషముగ పలికెను. తనగౌరవ మును రామారావు కాపాడజాలడని మోహినికి విశదమా యెను. వినాయకరావు చేష్టలవలన నాతనికి తనయెడగల దురుద్దేశమును మోహిని గ్రహించెను. ఇట్టిసందర్భమున మూకీభావము కూడదని యామె నిశ్చయించుకొనెను.

"ఆడుదానిమాటయా మీ కాధారము?" అని వేళాకోళము చేసెను, మోహిని. అదను దొరకెగదా యని వినాయకరావు సంభాషణ పెంపుచేసెను.

"ఆడుదానిమాటయే యర్జీ కాధారముగదా!"

"అట్టియెడ నాడుది పరిష్కరింపవలసిన తగవు కదా యిది?"

"తగవు గలదా లేదాయని విచారించుటకుమాత్ర మే నేను వచ్చితిని."

"స్పష్టము కాని తగవునకు తగ వేమి?"

"తగవు గలిగించినవారి నడుగవలసిన విషయ మది."

"ముం దట్టివారిని విచారించినగదా సాక్షుల విచా రింపవలెను."

"సాక్షుల నడిగినగాని తగవు స్పష్టపడు టెట్లు?"

"తగవును స్పష్టపరుపని యర్జీ విచారణ యేల?"

"అర్జీ విచారణలో బెట్టకపోయిన నీపరిచయ మెట్లు కలుగును?"

"కేవల పరిచయమువలన లాభ మేమి?"

"పరిచయమువలన లభించుమార్గములువిశదమగును."

"వచ్చినమార్గ మేమార్గము?"

"అట్లన రామారావును కాకినాడకు బదలీచేసె దను."

"అట్లు చేసిన అర్జీని బుట్టలో వేయవచ్చును" అని మోహిని అనుటతోడనే ఇంతవరకు సంభాషణ మెట్లు పరిణమించునో యని కాచికొనియున్న రామారావు, "అంతకంటె మాకు కావలసిన దేమి?" అని తృప్తిని వెల్ల డించెను.

"హుజూరులోనున్న పనిపాట లుండవనా?" అనెను చిరునవ్వుతో మోహిని.

"హుజూరువారి పనిపాటల నీవింక చూచెదవు కదా?" అని వినాయకరా వందికొనెను.

కాకినాడకు రామారావును బదలీచేయుట నిశ్చ యింపబడిన పిదప భోజనమును ముగించిరి. ఈబదలీ యం దరకును సంతృప్తిదాయకముగ నుండెను. దివాను తనపై మోపిననేరము మాసిపోయెనని, రామారావును,మోహినిని తరచు చూచుభాగ్యము కల్గునని వినాయకరావును, విచా రణ లేకుండా అర్జీని బుట్టదాఖలు చేయించితిమని మోహిని యు సంతసించిరి. ఆ స్థలము వదలిపోవునని మోహినీ రామారావు లుత్సహించిరి. మరునాడే వీరిరువురును, వినా యకరావును కాకినాడకు పయనమైరి.

౨

కాకినాడలో నింకను రామారావు కాపురము స్థిరపడలేదు; వినాయకరావు తన నీచప్రయత్నముల నారంభింపలేదు; అర్జీవిచారణవలన కలిగిన యాశాభంగ మింకను మోహినికి చల్లారలేదు; అప్పుడే మెకపుటాడ దివాను రామారావుపై అర్జీవలన తనకు గల్గిన మర్యాద నష్టమునకు పరిహారముగ పదివేలరూప్యములకు దావా తేనున్నవా డను నిశ్చయమైన కబురు రామారావునకు తెలిసినది.

అర్జీలోని సంగతి యబద్ధమని యెరిగియున్న రామారావున కీవార్తసహింపరానిదయ్యెను. దావాలోతా నోడిపోవుట నిశ్చయము,పదివేలరూప్యముల నిచ్చు టెట్లు? ఆతనిచేత గవ్వయినను లేదే! కారాగృహప్రవేశము తప్పదని యతడు విలపించెను. విలాసరావు పాదములపై బడి క్షమాపణను కోరుటకంటె గత్యంతర మాతనికగపడలేదు. తనకు తటస్థింపనున్న యాపదను మోహిని కెరిగించి తన సంకల్పమున కామె యభిప్రాయము వేడెను. తన యుపాయములు వ్యర్థమయినందులకు లోలోన నగచు చున్న మోహిని కర్తవ్యమునుగూర్చి రామారావుతో నేకీభవించెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సహజముగ రామారావు పిరికివాడు. తాను చేసిన యపరాధ మాతని మరింత పిరికివానిగ జేయుటచే నాత డొంటిగ విలాసరావును దర్శింపలేక మోహినిని తన వెంట నాతనికడకు రమ్మని యతివినయముగ బ్రార్థించెను. విలాసరావునెడ నామెకు గల ప్రేమ యామెను మరింత ప్రోత్సాహపరుప నామె రామారావుతో నెకపుటాడకు బయలుదేరెను.

మోహినియు, రామారావును ఎదుట బడగానే విలాసరావు మనస్సున క్రోధము, ఆశ్చర్యము, జుగుప్స ఒండొంటితో బోరాడుచు దృఢముగ నిలుచుటచే గొంత తడ వాతడు పలుకజాలకపోయెను. భయము రామారావు గొంతుక నొక్కివేసెను. కార్యనిర్వహణ భారము తనపై బడినదని మోహిని గుర్తించెను.

విలాస:—శంకరరావును మాయచేసినట్లు నన్నును మాయచేయ వచ్చితివా ?

మోహిని:—మాయనుండి మిమ్ము తప్పించుటకే వచ్చితిమి.

విలాస:—నీవు మాయనుండి తప్పించుకొనిన పిమ్మట నాసంగతి యాలోచింతువు గానిలే!

మోహిని:—నే నొరుల మాయలో బడలేదే!

విలాస:—రామారావును, ఆతడిచ్చిన యర్జీయును సాక్షులు.

మోహిని:—సాక్ష్యము నాకే బలకరము.

రామా:—అవును, తప్పకుండ నంతే!

విలాస:—ఛీ! స్వలాభముకొరకు భార్య నపవిత్ర నుగ గావించిన నీప్రసంగము కట్టిపెట్టుము.

రామా:—రామరామా! ఈమె నాతల్లి. నా ప్రాణమును రక్షించి, మానమును కాపాడి యుద్యోగ మును నిలువబెట్టిన మహాదేవత!

సంభాషణము ముదురుచున్నటుల గ్రహించి, నాటకశాల వదలిన దాదిగ నాటివరకు జరిగిన వృత్తాంత మంతయు సవిస్తరముగ మోహిని యెరింగించి, 'నిన్ను కలియుటకే నిన్ను విడిచెద'నని తా నానా డనిన పలుకుల జ్ఞప్తికి తెచ్చెను.

అప్పు డొక వయోవృద్ధుడు ఆకస్మికముగ లోని కరుదెంచి మోహినిం గౌగిట బట్టి, సంభ్రమమువలన నూత నముగ కొలగింపబడిన ఆశాభంగము వెలువడునట్లు బాష్పముల విడుచుచుండెను. మోహినీ విలాసరావులు వేరుపడిరని వినినప్పటినుండియు మోహినిజాడల నరయ ననేక పట్టణముల దిరిగి తుద కానా డామెను జూడగల్గిన పాపారావు సంతోషమునకు మేరలేదు. వేశ్యామణి యగు నాగమణి కులవృత్తినుండి తనకూతురును తప్పించు టకు మూడేండ్లయీడుననే మోహినిని తనకు గురువైన పాపారావున కప్పగించెను. ఆతని కాత్మజులు లేని లో పము మోహినివలన తీరెను. పాపారాయ దంపతులు జననీజనకులనియే మోహిని తలచెడిది. వారును మోహినీ జన్మవృత్తాంతమును మరుగుపరచిరి. కొలదికాలము క్రిం దట నాగమణి మరణించిన వార్తయైనను మోహిని యెరుంగదు. పాపారాయుని దర్శనమువలన మోహిని కెట్టియానందము కలిగియుండునో! విస్మయమునుండి తేరిన పిదప విలాసరావు పాపారాయుని గౌరవించి యిష్టాగోష్ఠి ప్రారంభించెను. మోహినీవిలాసు లొకరిపై నేరముల నొకరు పాపారాయునకు దెల్పుచుండిరి. ఈతగ వును తీర్చుటకు రామారావు సాక్ష్య మవసరమాయెను. రామారావు తాను నాగమణియను వేశ్యాపుత్రుడనియు, కులవృత్తిపై రోతగల్గి యాతనితల్లి తన్నొక బీదవిద్యార్థి వసతిగృహపు యజమానుల కప్పగించెననియు, నామె కొన్నిమాసముల క్రిందటనే గతించెననియు, దిక్కులేక యల్లాడు స్థితిలో మోహిని తన్ను సోదరునివలె గాపాడిన దనియు చెప్పుచుండగా, పాపారా వొక కాగితమును జేబునుండి తీసి విలాసరావున కందించెను. విలాసరావు కుర్చీనుండి తత్తరపాటుతో లేచి మోహినిని కౌగిలించు కొని క్షమాపణ వేడెను.

ఈ కాగితము నాగమణి మరణకాలమున వ్రాసిన మరణశాసనము. అందు తనబిడ్డలగు రామారావు మోహి నులకు సమముగ నీయగలందులకు పదివేల రూపాయల సొత్తును పాపారావునకు స్వాధీనపరిచెనని యున్నది.

మరుసటి దినముననే రాజమండ్రీలో రామారావు కన్యాదానము గావింప, బ్రహ్మసమాజ విధానమున మోహినీవిలాస పరిణయము శోభాయమానముగ జరిగెను.

---

7. 3- 8 రగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## వటమూలమందిరా !

చూపులు రెండు ముక్కుతుదఁ జొన్పియు జూచిన చూపు వెంటనే
లోపలఁ జూచి చండకరులో శశిఁ గూర్చి చతుర్దళంబుపై
దీపము వెట్టి దాని తుద తేజము తానయి విశ్వమంతయున్
వ్యాపకుఁడైన పుణ్యుఁడు మహాత్ముఁడగున్ వటమూలమందిరా !

కన్నులుమూసి నాదుమదిగన్ను (?) త్రికోణమునందు జొన్పి, లో
సన్నపు దిండిఁదూర్చి జలజంబుల నిచ్చెన యెక్కి మింటిపై
వెన్నెలరాజుఁ జేరి సుఖవేళలయందును నీవు నేనయై
యున్ననుగాని నాహృదయ ముబ్బద యావటమూల మందిరా !

గట్టిగ వేదలార్గురిని ఖండలు సేయక యేడు చింతలన్
గొట్టక మూడ్గు రిండ్లు చెడగూల్పక (......) మబ్బునా భువిన్
బొట్టును బోనమున్ (......) పోకులు బూడిద పూఁత లూరకే
పెట్టునుగాని నీదుదయ పేర్పడునా వట మూలమందిరా !

వాలినయింద్రియాలయ కవాటములన్నియు మూసి నెమ్మదిన్
దాళము వెట్టి లోవెలుఁగు తత్త్వముఁ గన్గొని తట్టి సుందరిన్
లాలితనాగకన్య నుపలాలనచేసిన వాఁడె యోగియా
మాలిన వేషముల్ జమునిమార్కొను నే వటమూలమందిరా !

సాగినకోపవహ్ని నిజశాంత జలంబులఁ జల్లనార్చియా
శాగిరులన్ నివృత్తి కులిశాహతి నుగ్గుగఁ జేసి యత్తమో
నాగవిభున్ వివేకమృగనాయకుచే నణఁగించి లోన సం
యోగ వియోగముల్ విడువ యోగియగున్ వటమూలమందిరా.

తునాతునకలగు చున్న 'కడిద'ము అను నల్లని రంగుపూత గల కాగితముపై పిండిబలపముతో వ్రాయబడియున్న యీపద్యము లొక ప్రాచీన శతకము లోనివి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఉగ్గుగిన్నె

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు (కవితాసమితి),

ఏ "మండీ! మీకు కచేరీ వారంరోజులు శెలవులు వస్తున్నాయట? ఆశెలవులలో ధర్మవరం వెళదామండీ!" అంది కనకమ్మ.

కనకమ్మ కాపురానికి వచ్చి నాలుగేళ్ళయింది. ఆమె మంచి ప్రౌఢ; లోకజ్ఞానం విశేషంగా సంపాదించింది. కావ్యాలూ గట్రా కొంత్రవరకూ చదువుకుంది. సోమనాథం బి. ఎల్. పరీక్షలో కృతార్థుడయ్యేడు. మునసబుపని సంపాదిద్దామని, లిస్టులో పేరు వేయించుకుందామని ఈ మధ్యనే చెన్నపట్నం వెళ్ళి వచ్చేడు. అక్కడనుండి తిరిగి వచ్చిన దగ్గరనుంచీ యేవో పుస్తకాలు చదువుతున్నాడు ఆలోచనలో మునిగిపోయినట్టుంటున్నాడు. కనకమ్మ ఆసంగతి కనిపెట్టింది గాని కారణం ఊహించలేకపోయింది. తాను నాలుగేళ్ళయి కాపురానికి వచ్చింది గాని ముచ్చట తీరడానికి కొక మొలకయినా కలిగింది కాదని ఆమె నొచ్చుకొనేది. సోమనాథానికి కూడా అదే విచారం అనుకుంది. ధర్మవరం వెళితే సన్యాసయ్య తప్పకుండా పుడతాడని ఆమెనమ్మకం. అందుకో సం భర్త నడిగింది. అత డీమధ్య చదువుతూవున్న పుస్తకాలూ, పెద్దపెద్దవాళ్ళు చెపుతూవున్న ఉపన్యాసాలూ, కొందరు మహనీయులు చేస్తూన్న ఉపదేశాలూ ఇవన్నీ కలిసి సోమనాథం మతం మార్చేశాయి.

"పోనిస్తూ! ఏం ధర్మవరం! నీ కీ పిల్లలపిచ్చి పట్టుకుం దేం? చక్కగా కడిగిన ముత్యాల్లాగ మనమిద్దరమూ కలసి మెలసి కాలక్షేపం చేయకుండా ఆలంపటం కూడా యెందుకు కోరుతావు?" అన్నాడు సోమనాథం. కనకమ్మ కళ్ళు విశాలంగా విప్పి భర్త నెగాదిగా చూచింది. ఆశ్చర్యదేవతయి అలా నిలబడిపోయింది. "అయితే వంశాభివృద్ధి జరుగురు లేదంటారా? యేమిటి?" అంది.

సోమనాథం "జరుగుతే గాని, మన కింతవేగం పిల్లలక్కర లేదు. వంశాభివృద్ధికి కావలిస్తే ముందెప్పుడో ఒక మొలకని కంటాను! అదే మానయి ప్రవర్ధిల్లుతుంది. చాలదూ?" అన్నాడు.

కనకమ్మ:—"ముందెప్పుడో అంటే యెప్పుడు? మనయౌవనం కాస్తా జారిపోయిన తరువాతా?"

సోమనాథం: —"ఉండు మరి! కోపపడకూ! ఇవిగో యీపుస్తకాలు చూచేవా? మొన్న చెన్నపట్నం వెళ్ళినప్పుడు నాకో హైకోర్టు జడ్జీగారిచ్చేరు. వాట్లలో యేం వ్రాసి ఉందంటే, ఏదంపతులయినా సరే కోరినప్పుడు మగో ఆడో, వారి కేపిల్ల కావలస్తే ఆపిల్లని కనవచ్చును. వారికి పిల్లలక్కర లేదని తోస్తే కనడం మానివేయవచ్చును. మాటకి, నీధర్మమా అని ఈ నాలుగేళ్ళయీ నీవు కనలేదు గాని కనివుంటే మన కీపాటి నలుగురు పిల్లలు పుట్టేదురా? ఆమూలాన్ని నీయౌవనసౌకుమార్యం అంతా అంతరించి పోతుందా? ఇప్పుడు నీకు నామీదనున్న ప్రేమ మూడువంతు లాపిల్లలమీదికి పోతుందా? అప్పుడు నేను ముచ్చటపడి నిన్ను పిలుస్తే నీకు పలకడానికయినా తీరుబాటుంటుందా? ఇంతలోనే మనం ముసలాళ్ళమయిపోతే యేముందీ? భగవంతుడు ప్రసాదించినన్నినాళ్ళయినా మనము యౌవనసౌఖ్య మనుభవించాలా? అది అలా ఉండగా, పిల్ల లెక్కువయినకొద్దీ మన ఆస్తి పలువపడిపోతుంది. వాళ్ళకి కావలసినవన్నీ యిచ్చి మంచి జీవనవిధానా లేర్పాటు చెయ్యడానికి మన కప్పు డవకాశం ఉండదు. మనపిల్లలు పేదవాళ్ళయి తిరుగుతూ ఉంటే మన కానందంగా ఉంటుందా?"

కనకమ్మ కనుబొమలు ముడేసింది. తీక్ష్ణంగా భర్తవైపు చూచి అంది: "మునసబుపని కనకనా, హైకోర్టుజడ్జీ యివ్వాలా? ముచ్చటలు వద్దనడాని కాయనే కావాలీ? భగవంతుడు మనుష్యుల తిప్పుతూన్న యీ ప్రకృతిని మార్చుగల కావ్యాలుకూడా వస్తున్నాయీ? పిల్లలను కంటే ఆడుదాని యౌవనం జారిపోతుందని మగవాడికి భయమా? ఆహా! యేమివిశాలహృదయం! మగవాడంతే ఆలోచించేడు గాని, ఆడుదాని యౌవన మున్నంతకాలం తాను సజీవుడయి యుండి ఆ యౌవన సౌభాగ్యం జుర్రుకుంది కేమయినా యేర్పాట్లు చేసికొన్నాడా? వాని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆయుర్భాగ్యం వాని చేతిలో నున్నదా? అది గాక, యౌవనానుభవాకాంక్ష యెంతకాల ముంటుందో నిర్ణయించాడా? వాని కెప్పటికయినా దీనియెడల విముఖత గలుగుతుందా? పిల్లలు లేని నావంటి నిర్భాగ్యురాళ్ళు త్రిదశులయి దేదీప్యమానంగా వెలిగిపోతున్నారా? శాశ్వత యౌవనసౌభాగ్య మనభవిస్తున్నారా? ఆడుదాని యౌవనమొక్క విచారభారంతో క్రుంగిపోతుం దన్న సంగతి యే శాస్త్రవేత్తయినా కనిపెట్టేడా? అదికాక, మగవాడు కోరినట్టాడుదాని యౌవనం స్థిరంగా నిలబెట్టగల డనుకుందాం,—తనమా టేమిటి? తాను నిత్యయౌవనుడై నిర్మలంగా విడ్డపూవులాగు కలకలలాడుతూ ఉంటాడా? నిష్కల్మష ప్రేమకి యౌవన మొక్కటే లక్ష్యమా? వానప్రస్థులయిన దంపతుల కే యౌవనం ఉంది? వారొకరి నొకరు ప్రేమించుకో లేదూ? వలపు కేవలము పశుత్వం క్రింద పరిణమిస్తూం దేం? ఇంత స్వార్థపరత మగవానికే గాని యాడుదానికక్కర లేదూ? ఇట్లు నిత్యపశుత్వపరత్వమునబడే మగవాని యౌవనం మరి జారదు గాబోలు. ఇంకొక మాట—మగవానికంటె కాపు దెలా కనబడుతుంది?ఆడుదనగా మగవాని యనుభవమునకే పుట్టినదని వానికలవు గాబోలు. వాసనచూచి పారేసే పువ్వనుకున్నాడా?

"అది గాక, పిల్లలు పుట్టడంతోనే మగవానిమీది ఆడుదాని ప్రేమ పిల్లలమీదికి పోతుందా? ఈ నవీన ప్రేమతత్వమాత్రం నాకు బోధపడ లేదు. అయితే జగత్తులో ఆడుదానికి మగవాడు తప్ప మరి ప్రేమింపదగిన వస్తువే లేదన్నమాట. భగవంతుని మీది ప్రేమ పరగడలు త్రొక్కవలసిందే? తలిదండ్రులమీది ప్రేమ తారుమారు కావలసిందే? అన్నదమ్ములమీది ప్రేమ అడుగంటవలసిందే? స్నేహితులమీది ప్రేమ చిందరవందర కావలసిందే? బంధువులపైని ప్రేమ పాడుకావలసిందే? ఇరుగుపొరుగువారిమీది ప్రేమ యింకిపోవలసిందే? దేశప్రేమ దిబ్బ జేరవలసిందే? అంతేనా? అదేనా ప్రేమతత్వం? మగవాడాడేమాటలకీ, చేసేచేతలకీ అర్థం ఉండదా యేమిటి?

"ఇంక—పిల్ల లెక్కువయితే ఆస్తి పలుచబడుతుందన్నారు. ఇది మగవాని అర్థశాస్త్రజ్ఞాన సౌభాగ్య కాబోలు! 'నెలనడుమ నాటి వెన్నెల—యలవడునే గాదె బోయ నమవసనిసికిౕ' అన్నాడు పెద్దన్న. ఆ స్తిని శాశ్వతంగా నిలబెట్టే ఉపాయా లెన్ని కనిపెట్టేరు? శ్రీమంతులెందరిచేతికో చిప్ప వచ్చింది. అక్కడల్లా బిడ్డలసంఖ్యే కారణమా? మీ రన్నట్లు కావలసిన ట్టొక్క కొడుకును గన్నారనుకొండి. ఆకొడుకు మొద్దయితేనో?చపలు డయితేనో? చచ్చు పెద్దమ్మయితేనో? ఎందరుపండితుల కడుపున శుంఠలు పుట్టలేదు? పంకితపుత్రు డన్నమాట వినలేదూ? ఇక ఆరోగ్యవిషయ మాలోచించండి. పిల్లలను పెంచే విధా లెరిగిన దంపతు లెంద రున్నారో లెక్కపెట్టండి. అలాగ పెంచుకున్నా రనుకుందాం; అంటువ్యాధులు రాకుండా నిలబెట్టే ఉపాయాలు స్థిరమైన వేవయినా ఉన్నాయా? రోగాలకు తిడితే గ్రుద్దినట్టు పనిచేసే మందు లున్నాయా? అవేవి లేనప్పు డొక్కమొలకను కని పెట్టుకున్న తలిదండ్రుల దినం యెలా దిబ్బజేరుతుంది? మగవా డన్నవాడు జీవుడిని నిత్యం వెన్నంటి ఉండే మృత్యుదేవతను దూరంగా తరిమే స్థిరోపాయం కనిపెట్టాలి. తనయొక్కయూ, తన కుటుంబముయొక్కయు ఆయుర్భాగ్యాన్ని అభివృద్ధిచేసే ఉపాయం కనిపెట్టాలి. పాదరసంలాగు పరుగెత్తే తన మనస్సు వ్యసనసంసక్తం కాకుండా మరలించే ఉపాయాలు కనిపెట్టాలి దుర్వ్యాపారాలలో తల దూర్చకుండా ఉండే కట్టుబాట్లు చేసుకోవాలి. అప్పుడు జననతత్వంమీద స్వతంత్రత సంపాదిస్తే రాణిస్తుంది!"

సోమనాథం:—"అబ్బ! ఏమి టలా గచ్చపోవలాగ గలగల లాడుతున్నావు? జణజణ లాడించేశావే! మగవాడిమీ దేమిటి నీమాట లిలా బాణాలలాగ కురిపించేశావు? నేను చెప్పినమాటలు నీ వర్థంచేసుకో లేకపోయావు. ఈమాటు స్పష్టంగా చెపతాను విను. పిల్లలు కంటే ఆడుదానిబలం క్రమక్రమంగా తగ్గిపోతుంది. దానివల్ల ప్రకృతి సిద్ధమయిన జీవితకాల పరిమితినైనా చూడకుండా ఆస్త్రీ అవతారం చాలించెయ్యాలి. లేదా, రోగపీడితయై మంచం పట్టాలి. అందుకోసం మితిమీరకుండా ఒకడో ఇద్దరో పిల్లలను కని కాన్పు త్తివేయగలిగితే స్త్రీఆరోగ్యం అంతగా చెడదు. దేహసౌఖ్యం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెప్పుడైతే ఉందో గేహసౌఖ్యం అప్పుడే ఉంది. ఇలాటి సంగతులన్నీ వ్రాసినవాళ్ళునన్నీ ఆలోచించే వ్రాస్తారు. వాళ్ళకి మనపాటీ బుద్ధి ఉండదా?"

కనకమ్మ:—"వాళ్ళు మనం కారు కాబట్టి వాళ్ళకి మనకంటె యెక్కువబుద్ధి ఉంటుందనా మీవాదం? అలాగయితే నేను మారాడలేను గాని బుద్ధిమంతులు లోకానికి తమ చేతలచేత, మాటలచేతా కూడ తెలియాలి. కేవలం యితరుల ఊహలమీద పండితులబుద్ధి వన్నెకెక్క కూడదు. ఒక్కగెల వేసి యరటిచెట్టంతరిస్తూంది. ఒక మాటేని తేలు శరీరం విడిచేస్తూంది. ఒకపిల్లను చేసి తుమ్మెద తొలగిపోతూంది. ఇది ప్రకృతి నిర్మాణతత్వమా? చిత్రకారుని శిల్పచాతుర్యమా? ఇంక నెన్నియో జంతువులు ఒక్కొక్కతూరి నాలుగయిదు కూనలను బెట్టి నిత్యారోగ్యముతో నిగనిగలాడుతున్నాయి. ఇది ప్రకృతి తత్వమా? ప్రకృతి శాస్త్రవేత్త భావపరిణామమా? ప్రకృతిలో భాగమయిన మనుష్యజాతికి ప్రకృతిసూత్రములంటవా? వెనుకటి కెవడో రాజుగారి కోటకు గలేబు కుట్టించమన్నాడట. మగవాడన్నవాడు ప్రకృతి తత్వము నెఱిగి తదనురూపమగు ప్రవర్తన నేర్పరచికొని దాని ననుసరించి ప్రకృతి సిద్ధమయిన పురుషుడు కావలెను గాని సానిదాని సౌష్ఠవముపలె కృత్రిమవేషధారి యైతే యేం లాభం? ఈసందర్భంలో నాకో చిన్నకథ జ్ఞాపకం వచ్చింది. చెప్తాను వినండి. నేను పదేండ్లదానినై యున్నపుడు మాఅన్న కేశవరావు కోయంబత్తూరునుండి శలవు లేవో వస్తే యింటి కొచ్చాడు. మానాన్న మాపెరట్లో గులాబిమొక్కొకటి వేశాడు. అప్పు డది సోగకొమ్మలేసి కొమ్మకొమ్మకూ గుత్తులుగుత్తులు మొగ్గలు తొడిగింది. కేశవరా వప్పుడు వ్యవసాయ కళాశాలలో చదువుతున్నాడు. అతడీ చెట్టు చూచి, 'చెల్లీ! చీడపురుగులు లాగ చెట్టుకిన్ని మొగ్గ లెందుకే! చెట్టు సత్తువ చెడుతుంది. ఫలప్రదం పోతుంది. చూడు కొమ్మంటికే ఒక్కటే పువ్వు పూపిస్తాను. అప్పుడు దానందం చూ' డన్నాడు. సరే అలాగే కానీ అన్నాను. అతడు కత్తెరొకటి పట్టుకొని చుట్టూ ఉన్న మొగ్గలన్నీ కత్తిరించేసి మధ్యనున్న మొగ్గమాత్రం కొమ్మను విడిచేశాడు. ఆమొగ్గ క్రమక్రమంగా పెరిగి పెద్దదయి కొమ్మనిండా ఒక్కటే పువ్వు విడ్డాది. దళంగా, గుజ్జుగా, రేకులు దట్టంగా యెదిగేయి. పువ్వు మరీ సొగసుగా ఉంది. పెద్దది! దానిని కోసి యెప్పటివాడుకచొప్పున వాసనచూచేను. ఏం చెప్పేది! దాని మునుపటి పరిమళమంతా పోయింది. నేను తెల్లబోయేను. మరీమరీ పసిపట్టడానికి ప్రయత్నించేను. వెగటువాసన వేసింది గాని గులాబివాసన లేనేలేదు! ఎందుకాపువ్వు! ఆబల్లమీద జీలుగుబెండు పూ వెలా గుందో చూడండి! దానికీ దీనికీ యేమిటి భేదం? ఇంకా యీబెండుపువ్వే నయం! కొంతకాలం చెడకుండా ఉంటుంది. ఈమధ్య బెంగుళూరునుండి వచ్చిందని పెద్ద చేమంతిపువ్వు మీరు తెచ్చేరే, అది కాగితపుపువ్వులాగు కలకలలాడడమే గాని కొంచెమేనా పరిమళించిందండీ? ఎందుకీ నిర్గంధకుసుమాలు? ఎక్కడయితే ప్రకృతివిరుద్ధంగా వస్తు శరీర నిర్మాణతత్వం మారుతుందో, అక్కడల్లా గుణం కొరత పడుతుంది."

సోమనాథం:—"ఉం డయితే! దీని కేం చెపతావు? ఇప్పటి లోకపరిస్థితులు చూచేవా? మంచిచెడ్డ లాలోచించకుండా యెక్కువయింది పిల్లలను కనేస్తూంది లోకం! ఈపిల్లలతో కాలేజీలు నిండిపోతున్నాయి! కర్మాగారాలు క్రిక్కిరిసి పోతున్నాయి! కళాప్రవీణు లెక్కువై పోతున్నారు. వాళ్ల సంఖ్యలతో నిరుద్యోగపు సమస్య లెక్కువయి పోతున్నాయి. అభిప్రాయభేదాలకు హద్దే లేదు. తెగలలో భేదాలు తెరిపి తెన్ను లేకుండా వస్తున్నాయి. బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదాలు బలిసిపోతున్నాయి. ఇవన్నీ తగ్గి దేశమంతా యేకముఖంగా పనిచేయాలంటే జనసంఖ్య తగ్గాలి. గాంధి మహాత్ముడు కూడా యీమాటే అంటాడు. కాని అతని విధానం వేరు. స్త్రీపురుషసంయోగాని కవకాశమే యివ్వకూడ దంటాడు. ఈగ్రంథాలలో ఉందే, స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా జీవిస్తూ కొన్నికొన్ని యంత్రసాధనాలవల్లా, మందులవల్లా సంతానవంతులు కాకుండా ఉండవచ్చు ననే నూతనసిద్ధాంతం చెప్పబడి ఉంది."

కనకమ్మ:—"అబ్బ! ఆమాటలు వినడమే కష్టంగా ఉంది! ఏమి టిది? పిల్లలు లేకపోతే కాలేజీ లెందుకు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కర్మాగారా లెందుకు? జగత్తులో అభిప్రాయభేదమే లేకపోతే జగత్తే లేదు. చూచేరా, ఆబుద్ధిమంతులలోనే రెండుతెగ లేర్పడ్డాయి. గాంధిమహాత్ముని దొకత్రోవా, గ్రంథకాగుల దొకత్రోవా—మనుష్యున కున్న ప్రత్యేకతయే యభిప్రాయభేదము; అభిప్రాయభేదమువలననే ప్రజలలో విద్యాకాంక్ష; దానివలననే జ్ఞానాభివృద్ధి; అదియే దేశక్షేమాభివృద్ధికి కారణ మవుతూంది. ఏయంశమయినా 'గుడ్డెద్దు చేలో బడ్డట్టు' జనులందరూ అభిప్రాయభేదం లేకుండా సాగితే ఒకదాని వెనుక నొకటి పోయేగొర్రెల మం దవుతుంది మనుష్యలోక మంతాను. అప్పుడు మనుష్యత్వం నశించి పశుత్వం యేర్పడుతుంది. సృష్టికత్వం ఒకమాటు నిదానించి చూడండి! జనులముఖా లెన్నో అన్ని భేదాలు! వ్రాత లెన్నో అన్ని భేదాలు! మన స్తత్వా లెన్నో అన్ని భేదాలు! శరీరనిర్మాణా లెన్నో అన్ని భేదాలు! ఇంకేలా? వ్రేలిముద్ర లెన్నో అన్ని భేదాలు! జనసంఖ్య తగ్గితే సారూప్య మేర్పడుతుందా? అభిప్రాయబాహుళ్యం తగ్గుతుందేమో గాని అభిప్రాయభేదం మాత్రం తగ్గదు. అభిప్రాయభేదం తగ్గితే సంస్కారమే లేదన్నమాట!

"ఈ మహాకార్యానికి యంత్రసాధనం కూడా కని పెట్టేరూ? ఇది మరీ బాగుంది. యంత్రసాధనసంపత్తి యెప్పు డింత లావయింది? ఈయంత్రసాధనంవల్ల పిల్లల తల్లులు కావలసినవారిని మీపిడికిటిలో పెట్టుకున్నా రనుకుందాం! గొడ్రాలికి బిడ్డలను ప్రసాదించే యంత్రాలున్నాయా? ఇక్కడ మీయాటలు సాగవుగదా! పొరుగువాళ్ల మాలక్ష్మి నాతోటిదే. ఇద్దరు పిల్లలను కంది; ముద్దు ముచ్చటా చక్కా అనుభవిస్తూంది. నా కేదీ? ఇప్పుడు గదా వచ్చింది మీ కీపరశువేది. ఇన్నాళ్లాయా కూడదూ?"

"అది. కాదే!" అని సోమనాథం యేదో చెప్పబోయేడు.

"ఏదీ కాదూ! మరింక యీబూతుపురాణం కట్టెయ్యండి. ఇంతవరకూ నాలుకలు పవిత్రం అయ్యేయి. ఇంట్లో పెద్ద లెవరూ లేరు కాబట్టి మన మాడింది మాట, పాడింది పాటా అవుతూంది. సరే, మీయంత్రా లేవో మీ రుపయోగించండి. దైవం లేదా? ప్రకృతి సమత్వతత్వసూత్రా లెరుగదా? మీతో నా కెందుకూ యీ వాదం? ఆ వేదాంత—కాదు—లోకాంతగ్రంథా లేవో సమగ్రంగా చదువుకోండి. లేదా, చెన్నపట్నం పోయి సంత చెప్పుకోండి. నే నవతలకు పోయి వండుకోవాలి" అని కనకమ్మ లోపలకు వెళిపోయింది. సోమనాథం చిఱునవ్వు నవ్వుతూ అలా కుర్చీలో కూర్చున్నాడు. ఎవరి సంతుష్టి వారిది.

౨

"జానే? ఏం చేస్తున్నావు? ఇదిగో మంచివస్తువు తెచ్చేను నీకోసం" అని సోమనాథం కేక పెట్టేడు. కనకమ్మ పెరట్లో అశ్వత్థ ప్రదక్షిణాలు చేస్తూంది. ఆకేక వినీవినిపించకోకుండానే, "మూలతో బ్రహ్మరూపాయ" అని గట్టిగా చదివింది. "ఏమే? రావేం? నీకు కావాలా అక్కర లేదా?— రావే! ఆరావిచె ట్టెక్కడికి పోతుందీ?" అన్నాడు సోమనాథం. కనకమ్మ గబగబా వచ్చింది. "ఏమి టాబంగీ?" అంది.

సోమనాథం:—"ఏమిటో చెప్పుకో."

కనకమ్మ:—"గాజులా? గడియారం గొలుసా?"

సోమనాథం:—"అంతకంటే యెక్కువదే?"

కనకమ్మ:—"రవలదుద్దులా?"

సోమనాథం:—"సరే. ఆడవాళ్ళ కెంతసేపూ నగల మీదే ధ్యానం. బంగారం, వెండీనగలు పదినెలలు పెట్టుకుంటే అరిగిపోతాయి. మెరుగు తగ్గిపోతాయి. అంతకంటే యెక్కువైం దిది. శాశ్వతయౌవనం! శాశ్వతారోగ్యం! శాశ్వతసౌఖ్యం! శాశ్వతానందం! బంగీ విప్పు తాను చూడు!"

కనకమ్మ:—(దగ్గరా వెళ్ళి చూచి) "ఏమిటిదీ? పిల్లలే లేని నాలాటిగొడ్రాలి కీ ఉగ్గు గి న్నెందుకూ? నన్ను వెక్కిరించడానికి తెచ్చేరా? పిల్లలు లేని చిన్నతనం నాకొక్కర్తికేనా యేమిటి? మీకు మాత్రం చిన్నతనం లేదూ? బాగా ఆలోచించుకోండీ!"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సోమనాథం:—"వెక్కిరింపు కాదే వెఱ్ఱిదానా! ఇదేమిటో సరీగా చూచి దెబ్బలాడు! ఇది స్త్రీలపాలిటి వరప్రసాదిని! ఈచిన్నిగిన్నె స్త్రీల యౌవనధనాగారం! ముంగొంగు బంగారం! తెలిసిందా? ఆకంపెనీవాళ్ళు చెప్పినట్టూ మనం చేయగలిగేమంటే ఇక భార్యాభర్తల నడుమ శాశ్వతానురాగం స్థాపించే మన్నమాటే! ఇక వారి మధ్య పానకం పుడకలాగు బిడ్డ లుండరు."

కనకమ్మ:—"సరే! రోజురోజుకీ మీ కీపిచ్చి లావవుతూం దేం? కానీయండి. మీద దేవుణ్ణి క్రిందను బెట్టి యయినా సరే ఆడుది పిల్లలను కని తీరుతుంది. కాలం కర్మం కలసివస్తే కాదనేవా ళ్లెవరు? మీతో నాకేలా? యీపకీమాలినవాదం?" అని లోపలకు వెళ్లిపోయినది."

* * * * *

ఆరునెల లయింది. మనుపటికంటె సోమనాథాని కిప్పుడు కనకమ్మమీద ప్రేమ లావయింది. అతని కన్నుల కిప్పుడు కనకమ్మ మరీ అందంగా కనబడుతూంది. ఆమె చెక్కులతెలుపూ, పెదవిపైని జాలిరేఖలూ, కనురెప్పల బరువూ, అడుగులమెల్లనా, అతిసుకుమారం, ఇవన్నీ కనకమ్మ సహజసౌందర్యానికి వన్నె తెచ్చేయి. ఆమెకు కూడా సోమనాథాన్ని క్షణమైనా విడవడానికి మనసొప్పేది కాదు. కారణం ఏమిటా అని సోమనాథం ఒకటి రెండుమాట్లాలోచించేడు గాని వాని కేమీ తెలిసింది కాదు. ఏదయితే నేమిటి? వారినడుమ ననురాగ బంధం అధిక మయినప్పుడు?

మఱి అయిదునెలలకి కనకమ్మ కొడుకును కంది. సోమనాథానికి మోడువారిన మనస్సు పుష్పించిన ట్టయింది. వెలితి బ్రతుకున కేదో నిండువచ్చిన ట్టయింది. కాని అవన్నీ పయి కనేవాడు కాడు. క్రమక్రమంగా ఆతనికి పిల్లడిమీది ప్రేమ అధిక మైంది. అస్తమానం ఆపిల్లడి నలా చేతులలో యెత్తుకొని వానిమీద ముద్దులు కురిపిస్తూ సోమనాథం కచేరీపనికూడా మరచిపోయేవాడు.

ఒకనా డాతనికి ఉగ్గుగిన్నె సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే బజారుకు వెళ్ళి వెండి ఉగ్గుగిన్నె పట్టుకొని వచ్చేడు. "ఔనే! ఇదిగో! చూ"డన్నాడు. కనకమ్మ త్రుళ్ళిపడి వెళ్ళి ఆచేతిలో ఉగ్గుగిన్నె అందుకుంది. చెమ్మగిల్లిన కన్నులతో ఆగిన్నె చూచింది. ఆ సోమనాథం ముఖం చూచింది. వడుకుతూన్న కంఠంతో "దీని ముందు గాజు లెందుకూ? గడియారం గొలు సెందుకూ? రవలదుద్దు లెందుకూ?" అంది కనకమ్మ.

"ఔనే!" యని ఆబాలెంతరాలి పసుపుబుగ్గలు సోమనాథం ముద్దుపెట్టుకున్నాడు.

---

## నిశాంగన

శ్రీ విక్రమదేవవర్మ గారు

చంద్రకాంతునిఁ బొంద న్నిశాచిరంటి
యల యరుంధతి యను ముత్తియమ్ముతోడఁ
జను వసిష్ఠాఖ్య మగు బులాకిని విశాఖ
యనెడు మౌక్తికదామంబు నార్ద్రి యనెడు
చెందిరము బొట్టు ధ్రువకుంభనందను లను
నమలవజ్రాల తమ్మంట్ల నభ్రగంగ
యనెడు తెల్లని పట్టుచీరను ధరించి
మీనరాశిలోచన యని మిషతనొంది
తనరు రసికాళి సంతోషదాత్రి యగుచు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అ ం ట రా ని త న ము

చిత్రకారుడు శ్రీ. కే. భాష్యంగారు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# పిట్టకథలు

## కప్ప కథ



“ఆఅమ్మాయి నదిలో వేసింది. మళ్లీ కప్ప ఒళ్లో పడ్డది”

అనంగా అనంగా ఒక రాజున్నాడు. ఆ రాజుకు పిల్లలు లేరు. ఆయన భార్య రోజూ నదికి వెళ్లి స్నానము చేస్తుండేది. ఒకనాడు ఒక పెద్దకప్ప కనబడ్డది. “అయ్యో, ఒక ఆడపిల్లన్నా పుట్టితే ఈ కప్ప కిచ్చి పెళ్లి చేస్తును కదా” అనుకొన్నది. ఆ నెలే తప్పింది. చంద్రబింబంలాంటి కూతురు పుట్టింది. ఆపిల్లకు పదేండ్లు వచ్చినవి. ఒకరోజు తల్లితో గూడ పిల్ల నదికి వెళ్లింది. తల్లి ముందు స్నానము చేసి ఇంటికి వెళ్లింది. పిల్ల అటూ ఇటూ ఆడుకొని ఆలస్యంగా నదిలోకి దిగింది. దిగంగానే కప్ప వచ్చి ఒళ్లో పడ్డది. ఆ అమ్మాయి దాన్ని నదిలో వేసింది. మళ్లీ కప్ప ఒళ్లో పడ్డది. అట్లా చాలాసారులు చేసి చివరకు విసుకు పుట్టి, ఒళ్లో వేసికొని, పరికిణి పైకికట్టి ఇంటికి వస్తున్నది. దారిలో అంతా “అమ్మాయీ నీ ఒళ్లో దేమిటి?” అని అడిగినారు. “తమలపాకుల కట్ట” అని చెప్పింది. అప్పుడు ఒళ్లో కప్ప—

“కప్పాయి కప్పాయి అనరాదా?
కాళ్లగిజిగా డనరాదా?
మన్యపుసూర్యు డనరాదా?
మాఇంటిమగవా రనరాదా?
తనకప, నేనప
తమలపాకుల కట్టనప!
తన్నుదునా తల పగల.”



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



"అప్పుడు ఒళ్లోకప్ప......తన్నుదునా తలపగల"

అన్నదట. అప్పుడు గబగబా ఇంటి కెళ్లి ఆపిల్ల తండ్రితో, "ఇదేమిటండీ, నాన్నగారూ! ఈ కప్ప ఇట్లాన్నది? ఈ సంగ తేమిటో నాకు చెప్పండీ" అన్నదట. "మీ అమ్మ నడగ"మని చెప్పినాడట. లోపలకు వెళ్లి తల్లి నడిగితే, "ఔనే అమ్మా! నీవు చాలరోజులదాక పుట్టక పోతే నేనట్లా మొక్కుకున్నాను. నీవు పుట్టిం తరువాత ఆమాటే మరచిపోయినాను." అని ఆకాశమంత పందిరి వేయించి, భూమి అంత అరుగు వేయించి కప్ప కిచ్చి పెండ్లిచేసింది. ఆ



"కప్ప కిచ్చి పెండ్లిచేసింది."

పెండ్లికి వెళ్లితేనే నాకు ఓలాగు ఓవొక్కా కుట్టించినారు. ఈకథ చదివేవారికి చాటెడు ముత్యాలు. విన్నవారికి వీశెడు బంగారం.

కొ. అ. అ. బె.

---

ఇద్దరు కోడళ్లు, ఒక దొంగాడు

అనగా అనగా ఒకవూరు. ఆవూళ్లో వొక యింట్లో యిద్దరు కోడళ్లున్నారు. ఆ యిద్దరు కోడళ్లు మినుములు విసురుతున్నారు. విసురుతూ వుండగా వొకదొంగా డొచ్చేడు. వాళ్లు



"వాళ్లు వారినిచూచి......సిద్ధంగావున్నారు"

వారినిచూచి భయపడి అరవడానికి సిద్ధంగా వున్నారు. అప్పుడు వాడన్నాడుకదా, 'మీ పిండి మీదానాదా?' అని. ఆకోడళ్లు 'మాదే' అన్నారు. దొంగాడు 'కాదు, నా' దన్నాడు. వాళ్లు 'నీ దెలాగయింది, మాదే' అన్నారు. ఆ దొంగాడు 'మీదయితే మీరు బుక్కండి, నాదయితే నేను బుక్కుతా'అన్నాడు. అప్పుడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



"బుక్కడం మొ. లెట్టేరు"

వాళ్లు రెండుచేతులతోను బుక్కడం మొద లెట్టేరు. దొంగాడు మీదపడ్డాడు పిండి నోట్టి కంటుకోవడంచేత వాళ్లరవలేక పోయేరు.



"వాళ్లవొంటిమీద నగలన్నీ వొలుచుకొని ......"

వాళ్లవొంటిమీది నగలన్నీ వొలుచుకుని పారిపోయేడు. కథ కంచికి వెళ్లింది. మనం ఇంటికి వచ్చాము. కే. కా.

---

## చమత్కారచంద్రిక

తాడూరి లక్ష్మీనరసింహారావుగారు

### మూలము

కుఠారమాలికాం దృష్ట్వా
కంపంతి తరవో వనే,
తత్ర వృద్ధతరుః ప్రాహ
మామకో నాస్తి కిం భయమ్.

### తెనుఁగు పద్యము

తే. గండ్రగొడ్డళ్ల గుది చూచి కరము బెదరి
వడవడ వడంకెఁ జెట్లెల్ల నడవిలోన
నందు నొకముదుసలి వృక్ష మప్పు డనియె
లేఁడు మనవాఁడు భయమింక లేదటనుచు.

### వివరణము

గండ్రగొడ్డళ్లనేకములు త్రాటికి గుది వేసి బుజముమీఁదను వ్రేలాడవైచికొని వన మార్గమున నొకానొక పురుషుఁడు పోవుచుండెను. తిమ్మ్మ వాఁడు నఱకునో యని చెట్లన్నియు వడఁకినవి. అందు మనవాఁడు లేఁడని ముదుసలివృక్షము చెప్పిన దాని కర్థము గొడ్డళ్లకు కామలేదని. కామయుండినఁగదా గొడ్డలి యుపయోగించుట కనుపడును. లోకములోఁ దమవారు శత్రుపక్షము చేరినయెడఁ దమకు నాశమగునని ధ్వని.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చిత్రకళ — భావోదయము

కవిభూషణ కవిరాజ, శ్రీ రాజా వత్సవాయ వేంకటనీలాద్రి రాజు గారు

తీరిచి తీర్చి దిద్ది మఱి దిద్దియు మార్చియు మార్చి రూపురే
ఖారమణీయ భావ మదిగ్గాఁ లిఖించితి నందుఁ గాని వి
స్ఫారితమైన యిందుఁ గనుపట్టదు తద్వరవర్ణినీమణీ
చారుతనూ విలాసనవసౌష్ఠవ వైభవ షోడశాంశముల్.

కానఁగ వచ్చుచున్న యువ కాంతపటంబు లిఖించువేళ రే
ఖానికటంబులన్ నఖముఖంబు చెమర్చినవ్రేళ్ల జాడ, లా
పైని కపోల మండలముపై నపుడొల్కిన బాష్పబిందువుల్
గానఁగనయ్యెడున్ బ్రచురగాఢవిలేపనముల్బణంబునన్.

ఆ నవమోహనాంగి యెదురై కనుపట్టినయట్లు తన్మయం
బైన మనంబునన్ బ్రమదమందుచునుండఁ బునః ప్రపంచక
జ్ఞానములోనికిన్ దిగిచినాఁడవె నన్ను వయస్య, ప్రేయసీ
భావనువాపి చిత్రపటభానము గ్గాఁగఁ జేయనేటికిన్.

ఆయలినీలవేణిఁ గలనైనఁ గనుంగొను భాగ్యమబ్బునే
మాయను నాశయున్ గలుగకున్నది నిద్దురలేమిఁ జేసి, పో
నీ యని యీపటంబుపయి నేనియు నక్కమలాననాముఖ
చ్ఛాయను జూతమన్న నది సాగగనీయవు బాష్పపూరముల్.

———



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మన యాహారము

గో॰ కేటి జోగిరాజు గారు

అనేక విషయములందు మన మిపు డున్న హీనస్థితి నుండి వెలువడుటకు సలుపవలసిన కృషిలో, మన యాహారమును సంస్కరించుకొని, ఆరోగ్యమును వృద్ధి నొందించుకొనుట యొకముఖ్యాంశము. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అని యార్యోక్తి ఘోషించుచున్నది.

౨. శ్రీగాంధి మహాత్ముడును, ఇతరులును, 'యంగ్ ఇండియా,' 'హిందూ', 'ఆంధ్రపత్రిక' మొదలగువానిలో నిటీవల వ్రాయుచువచ్చిన వ్యాసములను బట్టి ప్రజలలో నాహారసంస్కార విషయమున కొంతసంచలనము గలిగెనని చెప్పవచ్చును. లేకరిహూడ గత రెండుసంవత్సరములనుండియు నీవిషయమై కొంత కృషిచేసి తనయారోగ్యము నభివృద్ధి నొందించుకొన గల్గుటచే తనయనుభవము నితరులకు దెలుప నభిలషించి యీవ్యాసమును వ్రాయ సాహసించెను.

3. ఆధునిక శాస్త్రజ్ఞు లింకను ఆహార విషయమయి సంపూర్ణమగు పరిశోధనలను సలిపి యెల్లరకును మార్గదర్శకములగు సూత్రములను ఏర్పరుపగలిగిరని చెప్ప వీలులేదు. అయినను ఇంతవరకు జరిగిన కృషికి ఫలితముగ తేలిన కొన్నియంశములు గలవు. వీని నాధారము చేసికొని యెవరికి వారు తమభోజనము సంస్కరించుకొనుటకు చాల నవకాశము గలదు.

౪. ఈక్రింద ఆహారపు పట్టికల నేర్పరచుకొనుటలో గమనించవలసిన కొన్ని ముఖ్యసూత్రములు వివరింపబడెను. వానినిబట్టి మాదిరికొరకు వ్రాయబడిన వాలుగు పట్టికలు అనుబంధములుగ జేర్చబడినవి. (II, III, IV, V పట్టికలు చూడుడు.)

౫. మూలసూత్రములకు భంగము కలుగకుండ నీపట్టికలందు పేర్కొనబడిన వస్తువులకు బదులు ఇతర వస్తువులు స్వానుభవమునుబట్టి ఏవి తమ తత్త్వమున కనుకూలించునో చూచికొని వానినే తినుచుండవలయును. ఒకేవస్తువు ఒకరికి పడుటయు, మరియొకరికి పడకపోవుటయు చాలమంది కనుభవమే. కావున, అనుబంధమున జేర్చిన పట్టికల నెల్లరును అట్లే అవలంబింప వీలుపడదు. దేశకాల పాత్రల ననుసరించి సంస్కరించుకొనవలెను.

## ఆహారనిర్ణయమునకు గమనింపవలసిన కొన్ని ముఖ్యసూత్రములు

1. ప్రతిమనిషియు తాను చేయు బాహ్యవ్యాపారమునకును, హృదయచలనము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు మొదలగు నాతని యంతశ్శరీర వ్యాపారమునకును వలయు నంత శక్తి నిచ్చుటకు తగిన యాహారమును తినవలయును.

2. (a) సామాన్యముగ నిదురించుచు గాని, నిదురింపక గాని, కదలక పరుండి యుండునెడల ౧౦౦ పౌనులు తూనికగల మనిషికి అంతశ్శరీర వ్యాపారమునకు తగిన శక్తి నిచ్చుటకు సగటున గంటకు సుమారు ౬౦ కాలరీల ఉష్ణత(కాలరీ యనగా ౧ గ్రాము నీటికి ౧⁰ (శ.)ఉష్ణత గలుగజేయుటకు తగిన వేడిమి) నిచ్చు ఆహారము కావలెను.

(b) సామాన్యముగ వ్రాయుచు, చదువుచు, తినుచు, కూర్చొని విశ్రాంతిగ నుండు ప్రతి గంటకును ౧౦౦ పౌనుల తూనికగల మనిషికి సగటున సుమారు ౨౫ కాలరీల యుష్ణత నిచ్చు ఆహారము కావలయును.

(c) నడచుట మొదలగు తేలిక పనులు చేయు ప్రతిగంటకు ౧౦౦ పౌనుల తూనికగల మనిషికి సగటున గంటకు సుమారు ౭౫ కాలరీల యుష్ణత నిచ్చు ఆహారము కావలయును.

(d) త్రవ్వుట, గొడ్డలిపని, దండెములు తీయుట మొదలగు కఠిన వ్యాయామము చేయు ప్రతిగంటకును ౧౦౦ పౌనుల తూనికగల మనిషికి సుమారు ౧౩౦ కాలరీల యుష్ణత నిచ్చు ఆహారము కావలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అనుబంధము I. ఆయా ఆహారవస్తువుల సారమును తెలుపు పట్టిక

| ఆహారవస్తువు | అందలి (ఔన్సు 1కి గ్రాములు) | | | అవి యొసగు కాలరీలు | | | | అందలి ఖనిజ ద్రవ్యములు (100 పౌ. బరువు శరీరమునకు కావలసిన పరిమితిలో నూటికి) | | | అందలి విటమినులు (vl. గుర్తు మిక్కిలి కొంచెమనియు, X, XX, XXX గుర్తులు కొంచెము, మధ్యమము, హెచ్చు అనియు వరుసగా తెలుపును) | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మాంసకృత్తి | చమురు | కర్బనోదజ పదార్థములు | మాంస. | చమురు | కర్బనోదక | మొత్తము | సున్నము | భాస్వరము | ఇనుము | ఎ | బి | సి |
| **తృణధాన్యములు** | | | | | | | | | | | | | |
| 1. చే బియ్యము | 2.30 | 0.09 | 22.30 | 9 | 1 | 89 | 99 | 0.60 | 6.30 | 5.50 | vl. | X | 0 |
| 2. గోధుమలు | 3.90 | 0.54 | 20.35 | 16 | 5 | 81 | 102 | 2.70 | 6.30 | 6.30 | X | XX | 0 |
| 3. జొన్నలు | 2.90 | 1.17 | 19.70 | 12 | 10 | 79 | 101 | – | – | – | X | XX | 0 |
| 4. చోళ్లు | 2.78 | 0.46 | 23.35 | 11 | 4 | 93 | 108 | – | – | – | X to XX | XX | 0 |
| 5. గంటెలు | 3.64 | 1.38 | 19.40 | 14 | 13 | 78 | 105 | – | – | – | X | XX | 0 |
| 6. బియ్యపు తవుడు | 3.52 | 3.52 | 17.61 | 14 | 32 | 70 | 116 | 4.80 | 40.00 | 35.00 | | | |
| 7. గోధుమ పొట్టు | 3.33 | 0.55 | 17.92 | 13 | 5 | 72 | 90 | 7.50 | 38.00 | 21.50 | X | XX | 0 |
| **కాయధాన్యములు, చమురు గింజలు మొద.** | | | | | | | | | | | | | |
| 1. మినుములు | 6.84 | 0.33 | 17.81 | 27 | 3 | 71 | 101 | – | – | – | X | XX | 0 |
| 2. పెసలు | 6.36 | 0.32 | 16.87 | 25 | 3 | 67 | 95 | – | – | – | X | XX | 0 |
| 3. కందులు | 5.28 | 0.40 | 18.41 | 21 | 4 | 73 | 98 | 6.90 | 10.10 | 13.20 | X | XX | 0 |
| 4. వేరుసెనగలు | 8.72 | 14.78 | 3.96 | 35 | 133 | 16 | 184 | 4.40 | 12.80 | 5.60 | vl. | XX | 0 |
| 5. బాదంపప్పు | 6.50 | 16.89 | 5.50 | 26 | 152 | 22 | 200 | 11.00 | 10.80 | 8.00 | | | |
| 6. కొబ్బెరకాయ (సగము ముదిరినది) | 1.00 | 9.00 | 4.75 | 4 | 81 | 19 | 104 | – | – | – | | | |
| 7. కొబ్బెరకాయ (ముదిరినది) | 1.61 | 14.31 | 7.90 | 6 | 129 | 32 | 167 | – | – | – | X | XX | 0 |
| **పాలు మొదలుగునవి** | | | | | | | | | | | | | |
| 1. ఆవుపాలు | 0.94 | 1.02 | 1.36 | 4 | 9 | 5 | 18 | 6.20 | 2.40 | 0.50 | XXX | XX | X |
| 2. పెరుగు | 1.40 | 1.00 | 0.80 | 6 | 9 | 3 | 18 | – | – | – | XX | X | X |
| 3. మజ్జిగ | 0.85 | 0.14 | 1.36 | 3 | 1 | 5 | 9 | 5.50 | 2.60 | 0.60 | X | X | X |
| 4. వెన్న | – | 23.10 | – | – | 208 | – | 208 | 0.80 | 0.30 | 0.60 | XXX | 0 | 0 |
| 5. పాలపై మీగడతఱక | 11.00 | 12.00 | 1.00 | 44 | 108 | 4 | 156 | 1.90 | 1.00 | 1.60 | – | – | – |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **కూరగాయలు, 1వ తరగతి** | | | | | | | | | | | | | |
| 1. ములుదోసకాయ | 0.17 | 0.02 | 0.57 | 1 | – | 2 | 3 | 0.70 | 0.80 | 0.40 | 0 | X | XX |
| 2. వంకాయ | 0.34 | 0.09 | 1.44 | 1 | 1 | 6 | 8 | – | – | – | 0 | X | X |
| 3. సీమవంకాయ | 0.20 | 0.03 | 1.27 | 1 | – | 5 | 6 | 0.70 | 0.70 | 1.00 | XX | XXX | XXX |
| 4. ఫ్రెంచిచిక్కుడు | 0.52 | 0.03 | 1.36 | 2 | – | 6 | 8 | – | – | – | X | XX | XX |
| 5. తియ్యగుమ్మడి | 0.28 | 0.03 | 1.47 | 1 | – | 6 | 7 | – | – | – | 0 | X | X |
| 6. గాజరదుంపలు | 0.25 | 0.03 | 2.26 | 1 | – | 9 | 10 | – | – | – | X to XX | XX | X to XX |
| సగటు | 0.30 | 0.04 | 1.40 | 1 | – | 6 | 7 | 0.70 | 0.80 | 0.70 | | | |
| **కూరగాయలు, 2వ తరగతి** | | | | | | | | | | | | | |
| 1. బెండకాయ | 0.57 | 0.33 | 1.70 | 2 | 3 | 7 | 12 | – | – | – | 0 | X | X |
| 2. నూలుకోలు | 0.27 | 0.16 | 3.30 | 1 | 1 | 13 | 15 | – | – | – | vl. | X | X |
| 3. ఉల్లిపాయ | 0.37 | 0.03 | 3.06 | 1 | – | 12 | 13 | 2.10 | – | – | | | |
| సగటు | 0.40 | 0.17 | 2 68 | 1 | 2 | 11 | 14 | – | – | – | | | |
| **ఆకుకూరలు, 3వ తరగతి** | | | | | | | | | | | | | |
| 1. కాబేజి | 0.34 | 0.03 | 1.27 | 2 | – | 5 | 7 | 2.60 | 0.80 | 2.90 | XXX | XX | XXX |
| 2. లెట్యూసు | 0.31 | 0.06 | 0 54 | 1 | 1 | 2 | 4 | 2.80 | 1.40 | 4.40 | XX | XXX | XX |
| 3. మట్టుబచ్చలి | 0.51 | 0.06 | 0 82 | 2 | 1 | 3 | 6 | 3.50 | 1.80 | 8.40 | XXX | XXX | XXX |
| సగటు | 0.40 | 0 05 | 0.88 | 1 | – | 4 | 5 | 3.00 | 1.30 | 5.20 | | | |
| **దుంపకూరలు, 4వ తరగతి** | | | | | | | | | | | | | |
| 1. బంగాళాదుంప | ∩ | | 8.15 | 3 | – | 32 | 35 | 1.20 | 2.60 | 5.20 | vl. | X to XX | 0 |
| 2. పెండలం | | | 31 | 2 | – | 25 | 27 | – | – | – | X | 0 | X |
| సగటు | | | 23 | 2 | – | 29 | 31 | – | – | – | – | – | – |
| **కూరగాయలు, 5వ తరగతి** | | | | | | | | | | | | | |
| 1. బటానీలు (పచ్చివి) | 2.00 | 0.25 | 4.85 | 8 | 2 | 19 | 29 | 1.60 | 3.80 | 3.60 | XX | XX | XX |
| 2. రాజులచిక్కుడు | 2.66 | 0.11 | 6.45 | 10 | 1 | 26 | 37 | – | – | – | X | XX | XX |
| సగటు | 2.33 | 0.18 | 5.65 | 9 | 2 | 23 | 34 | – | – | – | | | |
| **పండ్లు** | | | | | | | | | | | | | |
| 1. ఆపిల్ | 0.09 | 0.06 | 3.54 | – | – | 15 | 15 | 0 30 | 0.30 | 0.60 | — | X | X |
| 2. పచ్చిద్రాక్ష | 0.17 | 0.03 | 3 98 | 1 | – | 16 | 17 | 0.30 | 0.60 | 1.00 | — | X | vl. |
| 3. దబ్బ | 0.14 | 0.14 | 0.88 | – | 1 | 4 | 5 | 1 10 | – | – | — | X | XXX |
| 4. నారింజ | 0.25 | 0.03 | 2.69 | 1 | – | 11 | 12 | 2.00 | 0.50 | 0.40 | X | X | XXX |
| 5. పంపరపనస | 0.23 | 0.06 | 2.96 | 1 | – | 12 | 13 | 1.20 | 0.50 | 0.80 | X | X | XXX |
| 6. చేరీ | 0.09 | 0.03 | 2.29 | – | – | 9 | 9 | 0.86 | 0.70 | 0.70 | — | X | X |
| 7. అనాస | 0.11 | 0.09 | 2.75 | – | 1 | 11 | 12 | 1.10 | 0.80 | 1.40 | — | — | XX |
| 8. ఫుప్ప | 0.11 | 0.06 | 1.90 | – | 1 | 8 | 9 | – | – | – | — | — | X |
| 9. బొప్పాయి | 0.16 | – | 0.10 | – | – | – | – | – | – | – | X | X | XX |
| 10. జామి | 0.37 | 0.20 | 2.27 | 1 | 2 | 9 | 12 | – | – | – | | X | X |
| 11. అరటి | 1.41 | 0.77 | 6.29 | 6 | 2 | 25 | 33 | – | – | – | vl. | X | X |
| 12. మామిడి | 0.04 | 0.32 | 5.20 | – | 2 | 21 | 23 | – | – | – | X | — | X |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎండిన పండ్లు

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. ఖర్జూర | 0.50 | 0.07 | 22.75 | 2 | – | 100 | 102 | 2.80 | 1.20 | 5.70 | — | X | 0 |
| 2. అంజూర | 1.14 | 0.10 | 21.40 | 5 | 1 | 86 | 92 | 7.60 | 2.80 | 6.40 | — | X | 0 |
| 3. ప్రూన్సు | 0.54 | – | 17.40 | 2 | – | 70 | 72 | 2.70 | 2.60 | 6.70 | — | X | 0 |
| 4. ద్రాక్ష | 0.75 | 1.00 | 22.00 | 2 | 9 | 88 | 100 | 3.90 | 4.00 | 13.20 | — | X | 0 |
| 5. చింతపండు. | 0.39 | – | 8.89 | 2 | – | 35 | 37 | – | | | X | X | 0 |

మధురద్రవ్యములు

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చక్కెర | – | – | 28.30 | – | – | 113 | 113 | | | | 0 | 0 | 0 |
| 2. బెల్లం | 0.08 | – | 25.00 | – | – | 100 | 100 | | | | 0 | vl. | 0 |
| 3. తేనె | 0.11 | – | 20.21 | – | – | 81 | 81 | 0.40 | 0.60 | 2.80 | vl. | vl. | 0 |

3. ఆహారమున పైని చెప్పినట్లు మనిషితూనికను, పనినిబట్టియు కావలసినంత యుష్ణత నిచ్చు తగిన ముఖ్యద్రవ్యములగు కర్బనోదజనితములు (Carbo-hydrates), చమురు (oil or fat), మాంస కృత్తులు (Protieds) ను ఉండవలెను. ఇది కాక, యుష్ణత నీయకపోయినను, శరీరమున జరుగువ్యాపారమునకు తగినంత యుండవలయును.

4. కర్బనోదజనితములును, మాంసకృత్తులును గ్రాము (అనగా తులములో సుమారు ౩౦-వ వంతు) ౧-కి సుమారు ౪ కాలరీల యుష్ణతయు, చమురుపదార్థములు గ్రాము ౧-కి ౯ కాలరీల యుష్ణతయు ఇచ్చును.

5. (a) ఆహారమున మనిషి తూనికనుబట్టి పౌను ౧-కి ½ గ్రాము హెచ్చు మాంసకృత్తులను తినకూడదు. అట్లు తినునెడల, కీళ్లనొప్పులు మొదలగునవి సంభవింపవచ్చును. ఇటీవల కొన్నిపరిశోధనల వలన మాంసకృత్తులు ⅓ గ్రామునకు తగ్గినను హాని లేదని తేలెను. కాని యీవిషయమై యింకను పరిపూర్ణమగు పరిశోధన జరుగవలసి యున్నది.

(b) కర్బనోదజనితములను సామాన్యముగ మనిషి తూనికను బట్టి పౌను ౧-కి సుమారు ౨ గ్రాములవరకు తినవచ్చును. కాని అతిమూత్రవ్యాధి గలవారుమాత్రము వ్యాధియొక్క తీవ్రతనుబట్టి ¼ మొదలు ౧ గ్రామువరకు మాత్రము తినదగును.

(c) చమురుపదార్థమును కర్బనోదజనితముల తూనికను రెట్టింపుచేసి, దానికి మాంసకృత్తుల పరిమితిలో సగము కలిపినయెడల వచ్చుమొత్తమున కెక్కువగా తినకూడదు. అట్లు మించినయెడల నొకవిధమగు వ్యాధి కలుగునని కనుగొనబడెను.

6. బలయు సుష్ణత నిచ్చుటకు కావలసిన పైద్రవ్యములును, నీరును మాత్రమే గాక శరీరమునకు కావలసిన ఖనిజ ద్రవ్యములుకూడ ఆహారమున తగినంత ఉండవలయును. సామాన్యముగ నాహారమున లోటుపడుచుండు ముఖ్యద్రవ్యములు సున్నము, స్ఫురము, ఇనుమును మాత్రమే. సున్నమును, స్ఫురమును ఎముకలను మంచిస్థితిలో నుంచును. ఇనుము రక్తము పరిశుద్ధముగ నుండుట కావశ్యకము.

7. మరియు నాహారమునకు జీవశక్తి నిచ్చునని యిటీవల కనిపెట్టబడిన A, B, C, వగైరా విటమినులు కూడ తగినంతింత యుండవలెను.

8. పై నియమములకు సరిపోవుటయేగాక, ఆహారము ఆయామనుష్యుల ప్రత్యేకశరీరతత్త్వములకు సరిపడవలయును. ఇది చాలవర కనుభవమునుబట్టియే నిర్ణయించుకొనవలెను.

9. ఆహారమున సామాన్యముగ నూటికి ౧౦ వంతులు ఒంట బట్టక వెడలి పోవును గాన, పై లెక్కలను బట్టి కావలసిన దానికన్న నూటికి ౧౦ వంతులచొప్పున హెచ్చుగా తినవలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అనుబంధము II. పక్వాహారము - సామాన్యారోగ్యవంతులకు

| ఆహారవస్తువు | నూరుపౌనుల బరువు గల మనిషికి కావలసిన పరిమితి | అందలి | | | | అందువలన కావలసిన ఖనిజద్రవ్యములలో నూటికెంత వరకు సప్లయి అగునదియు | | | విటమినులు-వానిపరిమితి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఔన్సులు | మాం. (గ్రా.) | ఫ. (గ్రా.) | క. (గ్రా.) | అందువలన కలిగే కాలరీలు మొత్తము | సున్నము | భాస్వరము | ఇనుము | ఎ | బి | సి |
| **మధ్యాహ్నము** | | | | | | | | | | | |
| 1. చేబియ్యము | 4 | 9.20 | 0.36 | 89.20 | 396 | 2.40 | 25.20 | 22.00 | vl. | X | |
| 2. కందిపప్పు(పొట్టుసహా) | 2 | 10.56 | 0.80 | 36.82 | 196 | 13.80 | 20.20 | 26.20 | X | XX | 0 |
| 3. కూరగాయలు,1వ తర. | 6 | 1.80 | 0.26 | 18.40 | 42 | 4.20 | 4.80 | 4.20 | X | XX | XX |
| 4. డిటో 3వ తర. | 2 | 0.80 | 0.10 | 1.76 | 10 | 6.00 | 2.60 | 10.40 | XXX | XXX | XXX |
| 5. వెన్న * | $1\frac{1}{2}$ | — | 34.65 | — | 312 | 1.20 | 0.50 | 0.90 | XXX | 0 | 0 |
| 6. పెరుగు | 6 | 8.40 | 6.00 | 4.80 | 108 | 37.20 | 14.40 | 3.00 | X | X | X |
| | | 30.76 | 42.15 | 140.98 | 1064 | 64.80 | 67.70 | 66.90 | | | |
| **రాత్రి** | | | | | | | | | | | |
| 1. చేబియ్యము | 3 | 6.90 | 0.27 | 66.90 | 297 | 1.80 | 18.90 | 16.50 | vl. | X | 0 |
| 2. కందిపప్పు | $1\frac{1}{2}$ | 7.92 | 0.60 | 27.62 | 167 | 10.35 | 15.15 | 18.55 | X | XX | 0 |
| 3. కూరగాయలు,1వతర. | $4\frac{1}{2}$ | 1.35 | 0.20 | 6.30 | 32 | 3.15 | 3.60 | 3.50 | X | XX | XX |
| 4. డిటో 3వ తర. | $\frac{1}{2}$ | 0.60 | 0.08 | 1.32 | 8 | 4.50 | 1.95 | 7.80 | XXX | XXX | XXX |
| 5. వెన్న * | $\frac{3}{4}$ | — | 17.33 | — | 156 | 0.60 | 0.25 | 0.45 | XXX | 0 | 0 |
| 6. పెరుగు. | $4\frac{1}{2}$ | 6.30 | 4.50 | 3.60 | 81 | 27.90 | 10.80 | 2.25 | X | X | X |
| | | 23.07 | 23.98 | 105.74 | 741 | 48.30 | 50.65 | 49.05 | | | |
| మొత్తము | | 53.83 | 65.13 | 246.72 | 1805 | 113.10 | 118.35 | 115.95 | | | |
| రద్దుకొరకు 10% తీసివేయగ | | 5.38 | 6.51 | 24.67 | 181 | 11.31 | 11.84 | 11.60 | | | |
| నికరము | | 48.45 | 58.62 | 222.05 | 1624 | 101.79 | 106.51 | 104.35 | | | |

* నేయిగాని, నూనెగాని ఉపయోగించుచో ఇందు $\frac{4}{5}$ వంతు మాత్రమే ఉపయోగింపవలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అనుబంధము III. పక్వాహారము - సామాన్యారోగ్యవంతులకు

| ఆహారవస్తువు | నూరు పౌనుల బరువు గల మనిషికి కావలసిన పరిమితి | అందలి | | | | అందువలన కావలసిన ఖనిజద్రవ్యములలో నూటి కెంత వరకు సప్లయి అగునదియు | | | విటమినులు-వాని పరిమితి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఔన్సులు | మాం.(గ్రా.) | చ. (గ్రా.) | పి. (గ్రా.) | అందువలన గలుగు మొత్తము కాలరీలు | సున్నము | భాస్వరము | ఇనుము | ఎ | బి | సి |
| **మధ్యాహ్నము** | | | | | | | | | | | |
| 1. చేబియ్యము | 2 | 4.60 | 0.18 | 44.60 | 198 | 1.20 | 12.60 | 11.00 | vl. | X | 0 |
| 2. గోధుమలు | 1 | 3.90 | 0.54 | 20.35 | 102 | 2.70 | 6.30 | 6.30 | X | XX | 0 |
| 3. మినుములు | 1 | 6.84 | 0.33 | 17.81 | 101 | 6 80 | 10 10 | 13.20 | X | XX | 0 |
| 4. కూరగాయలు, 1వతర. | 6 | 1.80 | 0.26 | 8.40 | 42 | 4.20 | 4 80 | 4.20 | X | XX | XX |
| 5. డిటో 3వ తర | .2 | 0 80 | 0.[illegible]0 | 1.76 | 10 | 6 00 | 2.60 | 10.40 | XXX | XXX | XXX |
| 6. వేరుసెనగ గింజలు | 1 | 8.72 | 14.98 | 3.96 | 184 | 4 40 | 12 80 | 5.60 | vl. | XX | 0 |
| 7. పండ్లు | 4 | 0.62 | 0 26 | 9.32 | 42 | 4.00 | 2.00 | 2.80 | 0 | X | XX |
| 8. ఎండుద్రాక్ష | 1 | 0.75 | 1.00 | 22.00 | 100 | 3.90 | 4 00 | 13.[illegible]0 | 0 | X | 0 |
| 9. వెన్న | 1 | — | 23.10 | — | 208 | 0.80 | 0 30 | 0.60 | XXX | 0 | 0 |
| 10. మజ్జిగ | 6 | 5.10 | 0.84 | 8.16 | 54 | 33 00 | 15.60 | 3.60 | X | X | X |
| | | 33.13 | 41.59 | 136.36 | 1041 | 66 00 | 71.10 | 70.90 | | | |
| **రాత్రి** | | | | | | | | | | | |
| 1. చేబియ్యము | 3 | 6.90 | 0.27 | 66.90 | 297 | 1.80 | 18.90 | 16.50 | vl. | X | 0 |
| 2. కందిపప్పు | 1½ | 7.92 | 0.60 | 27.60 | 167 | 10.35 | 15.15 | 18 55 | X | XX | 0 |
| 3. కూరగాయలు, 1వతర | 4½ | 1.35 | 0.20 | 6.30 | 82 | 3 15 | 3.60 | 3 50 | X | XX | XX |
| 4. డిటో 3వ తర. | 1½ | 0.60 | 0.08 | 1.32 | 8 | 4.59 | 1.95 | 7.80 | XXX | XXX | XXX |
| 5. వెన్న | ¾ | — | 17.33 | — | 156 | 0.60 | 0.25 | 0 45 | XXX | 0 | 0 |
| 6. పెరుగు | 4½ | 6 30 | 4 50 | 3.60 | 81 | 27.90 | 10.80 | 2 25 | X | X | X |
| | | 23.07 | 22.98 | 105.74 | 741 | 48 30 | 50.65 | 49.05 | | | |
| మొత్తము | | 56.20 | 64.57 | 242.10 | 1782 | 114.30 | 121.75 | 119.95 | | | |
| రద్దునకుగాను 10% తీసివేయగ | | 5.62 | 6.46 | 24.[illegible]1 | 178 | 11.43 | 12 18 | 12.00 | | | |
| నికరము | | 50.58 | 58.11 | 217.89 | 1604 | 102.87 | 109.57 | 107.95 | | | |

వీటినన్నిటి చేర్చి ఆవిరిమీద ఉడికించవలెను*

* ఇందు బియ్యమును అట్లే వాడవచ్చును; గోధుమలను గింజ 1కి 2, 3 ముక్కలగునట్లు విసరియు, మినుములను పిండిగా విసరియు, కూరలను సన్నముగ తరిగియు ఉపయోగింపవచ్చును. వేరుసెనగగింజలను నీటిలో నానవేసి మొలక కట్టి వేరుగ తినుట మంచిది. లేక వీనినికూడ నలుగగొట్టి పై ఆవిరి రొట్టెలో చేర్చవచ్చును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అనుబంధము IV. మధ్యాహ్నము పక్వాహారము, రాత్రి అపక్వాహారము-
## సామాన్యారోగ్యవంతులకు

| ఆహారవస్తువు | నూరుపౌనుల బరువు గల మనిషికి కావలసిన పరిమితి | అందలి | | | | అందువలన కావలసిన ఖనిజద్రవ్యములలో నూటికెంత వరకు సప్లయి అగునదియు | | | విటమినులు- వాని పరిమితి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఔన్సులు | మాం. (గ్రా.) | క్రొ. (గ్రా.) | పి. (గ్రా.) | అందువలన కలుగు కాలరీలు | కాల్షియము | ఫాస్ఫరసు | ఇనుము | ఎ | బి | సి |
| **మధ్యాహ్నము** | | | | | | | | | | | |
| 1. చేబియ్యము | 2 | 4.60 | 0.18 | 44.60 | 198 | 1.20 | 12.60 | 11.00 | vl. | X | 0 |
| 2. గోధుమలు | 1 | 3.90 | 0.54 | 20 35 | 102 | 2.70 | 6.30 | 6.30 | X | XX | 0 |
| 3. మినుములు | 1 | 6.84 | 0.33 | 17.81 | 101 | 6 80 | 10.10 | 13 20 | X | XX | 0 |
| 4. కూరగాయలు, 1వ తర. | 6 | 1 80 | 0.26 | 8.40 | 42 | 4.20 | 4.80 | 4.20 | X | XX | XX |
| 5. డిటో 3వ తర. | 2 | 0 80 | 0 10 | 1.76 | 10 | 6.00 | 2.60 | 10.40 | XXX | XXX | XXX |
| 6. వేరు సెనగ గింజలు | 1 | 8.72 | 14.98 | 3.96 | 184 | 4.40 | 12.80 | 5 60 | vl. | XX | 0 |
| 7. పండ్లు | 4 | 0.62 | 0.26 | 9.32 | 42 | 4.00 | 2.00 | 2.80 | 0 | X | XX |
| 8. ఎండు ద్రాక్ష | 1 | 0.75 | 1 00 | 22 00 | 100 | 3.90 | 4.00 | 13.20 | 0 | X | 0 |
| 9 వెన్న | 1 | — | 23.10 | — | 208 | 0.80 | 0.30 | 0.60 | XXX | | |
| 10. మజ్జిగ | 6 | 5 10 | 0.84 | 8.16 | 54 | 33.00 | 15.60 | 3.60 | X | X | X |
| | | 33.13 | 41.59 | 136.?6 | 1041 | 66.00 | 71.10 | 70.90 | | | |
| **రాత్రి** | | | | | | | | | | | |
| 1. వేరు సెనగ గింజలు (మొలకకట్టి) | 1 | 8.72 | 14.78 | 3.96 | 184 | 4.40 | 12.80 | 5.60 | vl. | XX | XX |
| 2. గోధుమలు మొలకకట్టి) | 2 | 7.80 | 1.08 | 40.70 | 204 | 5.40 | 12.60 | 12.60 | X | XX | XX |
| 3. కూరగాయలు, 1వ తరగతి (పచ్చివి) | 4 | 1.20 | 0.16 | 5.60 | 23 | 2.80 | 3.20 | 2 80 | X | XX | XX |
| 4. పండ్లు | 4 | 0.68 | 0.26 | 9.32 | 42 | 4 00 | 2.00 | 2.80 | 0 | XX | XX |
| 5. ఎండు ద్రాక్ష | 1 | 0.75 | 1.00 | 22.00 | 100 | 3.90 | 4.00 | 13.20 | 0 | X | 0 |
| 6. వెన్న | ½ | — | 11.55 | — | 104 | 0 40 | 0.20 | 0.30 | XXX | | |
| 7. పాలు | 4 | 3.76 | 4.08 | 5.44 | 72 | 24.80 | 9.60 | 2.00 | XXX | XX | X |
| | | 22.91 | 32.91 | 87.02 | 734 | 45.70 | 44.40 | 49.30 | | | |
| మొత్తము | | 56.04 | 74.50 | 223.38 | 1775 | 111.70 | 115.50 | 120.20 | | | |
| రద్దునకుగాను 10% తీసివేయగ | | 5.60 | 7.45 | 22.34 | 178 | 11.17 | 11.55 | 12.02 | | | |
| నికరము | | 50.44 | 67.05 | 201.04 | 1597 | 100.53 | 103.95 | 108.18 | | | |

వీటినన్నిటిని చేర్చి ఆవిరిమీద ఉడికించవలెను *

* ఇందు బియ్యమును అట్లే వాడవచ్చును; గోధుమలను గింజ 2, 3 ముక్కలగునట్లు విసరియు, మినుములను పిండిగా విసరియు, కూరలను సన్నముగ తరిగియు ఉపయోగించవచ్చును. వేరు సెనగగింజలను నీటిలో నానవేసి మొలకకట్టి వేరుగ తినుట మంచిది. లేక వీనినిగూడ నలుగగొట్టి పై ఆవిరి రొట్టెలో చేర్చవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అనుబంధము V. అపక్వాహారము - సామాన్యారోగ్యజంతులకు

| ఆహారవస్తువు | నూరుసేనుల బరువు గల మనిషికి కావలసిన పరిమితి | అందలి | | | | అందువలన కావలసిన ఖనిజద్రవ్యములలో నూటి కెంతవరకు సప్లయి అగునదియు | | | విటమినులు-వానిపరిమితి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఔన్సులు | మాం. (గ్రా.) | క్రొ. (గ్రా.) | క. (గ్రా.) | అందువలన గలుగు శక్తి కాలరీలు | సున్నము | భాస్వరము | ఇనుము | ఎ | బి | సి |
| **మధ్యాహ్నము** | | | | | | | | | | | |
| 1. వేరుసెనగ గింజలు (మొలకకట్టి) | 1 | 8.72 | 14.78 | 3.96 | 186 | 4.40 | 12.80 | 5.60 | vl. | XX | XX |
| 2. కందులు | 1 | 5.28 | 0.40 | 18.41 | 98 | 6.90 | 10.10 | 13.20 | X | XX | XX |
| 3. గోధుమలు | 3 | 11.70 | 1.62 | 61.05 | 306 | 8.10 | 18.90 | 18.90 | X | XX | XX |
| 4. కూరగాయలు, మొదటి తరగతి (పచ్చివి) | 4 | 1.20 | 0.16 | 5.60 | 28 | 2.80 | 3.20 | 2 8 | X | XX | XX |
| 5. పండ్లు | 4 | 0.68 | 0.26 | 9.32 | 42 | 4.00 | 2.00 | 2.80 | 0 | X | XX |
| 6. ఎండు ద్రాక్ష | 4 | 0.75 | 1.00 | 22.00 | 100 | 3.90 | 4.00 | 13 20 | 0 | X | 0 |
| 7. వెన్న | 1 | — | 23.10 | — | 208 | 0.80 | 1.30 | 0.60 | XXX | 0 | 0 |
| 8. మజ్జిగ | 6 | 5.10 | 0.84 | 8.16 | 54 | 33.00 | 15.6[illegible] | 3.60 | X | X | X |
| | | 33.43 | 42.16 | 128.50 | 1020 | 63.90 | 66.90 | 60.70 | | | |
| **రాత్రి** | | | | | | | | | | | |
| 1. వేరుసెనగ గింజలు (మొలకకట్టి) | 1 | 8.72 | 14.78 | 3.96 | 184 | 4.40 | 12.80 | 5.60 | vl. | XX | XX |
| 2. గోధుమలు | 2 | 7.80 | 1.08 | 40.70 | 204 | 5.40 | 12.60 | 12.60 | X | XX | XX |
| 3. కూరగాయలు, 1వ తరగతి (పచ్చివి) | 4 | 1.20 | 0.16 | 5.60 | 28 | 2.80 | 3.20 | 2.80 | X | XX | XX |
| 4. పండ్లు | 4 | 0.68 | 0.26 | 9.32 | 42 | 4.00 | 2.00 | 2.80 | 0 | X | XX |
| 5. ఎండుద్రాక్ష | 1 | 0.75 | 1.00 | 22.00 | 100 | 3.90 | 4.00 | 13.20 | 0 | X | 0 |
| 6. వెన్న | ½ | — | 11.55 | — | 104 | 0.40 | 0.20 | 0.30 | XXX | 0 | 0 |
| 7. పాలు | 4 | 0.76 | 4.08 | 8.44 | 72 | 24.80 | 9.60 | 2.00 | XXX | XX | X |
| | | 22.91 | 32.9 | 87.02 | 734 | 45.70 | 44.40 | 49.80 | | | |
| మొత్తము | | 56.04 | 74.[illegible]0 | 223.38 | 1775 | 11[illegible].70 | 115.50 | 120.20 | | | |
| రద్దుకొరకు 10% తీసివేయగ | | 5.60 | 7.45 | 22.34 | 178 | 11.17 | 11.55 | 12.02 | | | |
| నికరము | | 50.44 | 67.05 | 201.04 | 1597 | 100.53 | 103.95 | 108.18 | | | |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చల్లపల్లి రాజావారి పట్టాభిషేక చిత్రములు



౧. శ్రీ శ్రీ చల్లపల్లి రాజాగారు-సింహాసనాసీనులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. శ్రీ శ్రీ చల్లపల్లి రాజాగారు-పట్టాభిషిక్తులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౬. పై నిబంధనలకు లోబడియుండు ఆహార పట్టికల నేర్పరచుకొనుటకు, మనము తిను ఆహారవస్తువులలో దేనియం దెంతెంత మాంసకృత్తు, కర్బనోదజనితము, చమురు, ఆయా ఖనిజపదార్థములు, ఆయావిటమినులు గలవో తెలిసికొనవలయును. కాని, యీపరిశోధన మనదేశమునందు దొరకు నాహారద్రవ్యములలో చాల వానిని గురించి జరిగియుండలేదు. అయినను, ఈదేశమున గాని, ఇతరదేశములందు గాని జరిగిన పరిశోధనలను బట్టి లభించిన అంకెలను కొన్నిటిని జేర్చి I-వ యనుబంధమునగల పట్టిక తయారుచేయబడెను. * ఈపట్టికలో మాంసాహార వస్తువులు చేర్చబడలేదు.

౭. II-వ అనుబంధమునందు గల పట్టికలోని ఆహారము సామాన్యపు టాంధ్రుని భోజనమును సంస్కరించి ఏర్పరుప బడినది. అందు శరీరమున కావశ్యకము గానివియు, అనారోగ్యత కలుగజేయునవియు నగు పచ్చళ్లు, పులుసు మొదలగునవి తొలగించి తక్కినవస్తువులు సౌమ్యముగ నుండునట్లు చేసికొని తినున ట్లేర్పరుపబడెను. కావున నీపట్టిక నెల్లరును సులభముగ నవలంబింపవచ్చును.

౮. III-వ యనుబంధమునందలి పట్టికలో రాత్రి ఆహారము మొదటిపట్టికలో వలెనే యుంచి, మధ్యాహ్నాహారమునందు అన్నము, పప్పు, కూర వేర్వేరుగా వండ నవసరము లేకుండ, అన్నిటిని జేర్చి ఒకే ఆవిరి రొట్టిగా చేయున ట్లేర్పరుపబడెను. ఇందువలన వంటబాధ చాలవరకు తగ్గును. ఈపట్టికలో వ్రాయబడినట్లు కొన్నిదినములు మధ్యాహ్నపు పూట యీఆవిరి రొట్టెను తిని, క్రమముగా రాత్రికూడ నీరొట్టెను (ఆయా వస్తువులను మధ్యాహ్నమునకు చెప్పిన తూనికలో $\frac{3}{4}$ వంతు మాత్రమే) తినవచ్చును.

౯. ఆహారపదార్థములను వండుటవలన నందలి విటమినులు (ముఖ్యముగ C అనునది) తగ్గిపోవునని శాస్త్రజ్ఞులు కనుగొనిరి. కావున వానిని కొంతవరకు గాని, పూర్తిగా కాని అపక్వముగ భుజించుట మంచిది. కావున III-వ పట్టికయందలి ఆహారపదార్థములను క్రమముగ నపక్వముగనే తినుట ప్రారంభింపదగును. IV-వ పట్టికయందు మధ్యాహ్నము పక్వాహారమును, రాత్రి అపక్వాహారమును ఏర్పరుపబడెను. V-వ పట్టికయందు రెండు పూటలందును చాలవరకు అపక్వాహార మేర్పరుపబడెను. ఇందు చేర్చబడిన మజ్జిగ పక్వాహారమే. అయినను, దీనిని గాని, పాలు, వెన్న మొదలగు గో సంబంధ పదార్థములను గాని విసర్జించుట మంచిది కాదు. కేవల వృక్షసంబంధమైన పదార్థములందలి మాంసకృత్తులకంటెను, చమురుకంటెను జంతు సంబంధమైన పాలు, పెరుగు మొదలగు వానియందలి మాంసకృత్తులును, చమురును మానవ శరీరమున కెక్కువ అనుకూలమని శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. మరియు మనదేశమున ప్రజలు మిక్కిలి ప్రాచీనకాలమునుండియు గో సంబంధమగు పాలు, పెరుగు మొదలగు పదార్థముల కెక్కువ అలవాటుపడి యుండుటచే వీని నిప్పుడు మానవలసిన యగత్యము లేదు.

నూరుపౌనులు తూనిక గలిగి దినమునకు ఒక గంట కఠిన వ్యాయామమును, 3-గంటలు లఘువ్యాయామమును చేయుమనిషికి:—

| | | కాలరీలు |
|---|---|---|
| ౧ గంట కఠిన వ్యాయామమునకు | ............ | ౧౭౦ |
| 3 గంటల లఘువ్యాయామమునకును... | 3 × ౭౫= | ౨౨౫ |
| నిదురించు ౮-గంటలును, పైని చెప్పినట్లు వ్యాయామముచేయు ౪ గంటలును గాక తక్కిన౧౨ గంటల వ్యాయామ రహిత కాలమునకును... | ౧౨ × ౨౫= | 300 |
| రాత్రింబవళ్లు అంతశ్శరీర వ్యాపారమునకు ౨౪ గంటలకు... | ౨౪ × ౪౦= | ౯౬౦ |
| | మొత్తము | ౧,౬౫౫ |

కావలెను. II, III, IV, V, పట్టికలు ఇట్లు సుమారు ౧,౬౦౦ కాలరీల ఉష్ణత నిచ్చుటకు తగినట్లు వ్రాయబడెను ఇంతకంటె తూనికగలవారును, హెచ్చు వ్యాయామము చేయువారు అందుకు తగినట్లు ఆయా పదార్థముల తూనికలను హెచ్చించుకొనవలెను.

ఈవ్యాస మింతవరకే దీర్ఘమగుటచే, తెలుపదగిన మరికొన్ని యంశములు మరియొకవ్యాసమునకు విడువవలసి యుండును.

---

* ఈయంకెలు కొన్ని రాబర్టు మెక్కారిసన్‌గారి 'Food' అను గ్రంథమునుండియు, అమెరికన్ 'Red-cross' వారి 'Food & Nutrition' అను గ్రంథమునుండియు సేకరింప బడినవి. తక్కినవి కొన్ని ప , కలనుండి తీసికొనబడినవి. కొన్ని సామ్యమునుబట్టి యూహించి వ్రాయబడినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## బాలభాష *

౧

ఉత్తముని పే రేమి? ఊరి పే రేమి?
సత్యపురుషుల గన్న సాధ్వి పే రేమి?
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య
సత్యపురుషుల గన్న సాధ్వి కౌసల్య.

* * * *

శ్రీరామ! జయరామ! శృంగారరామ!
కారుణ్యగుణధామ! కళ్యాణనామ!
జగతిపై రామయ్య జన్మించినాడు
సత్యమ్ము లోకాన స్థాపించినాడు
తల్లిదండ్రులమాట చెల్లించినాడు
ఇల్లాలితోపాటు హింసపడ్డాడు
సీతామహాదేవి సృష్టిలోపలను
మాతల్లి వెలసింది మహనీయురాలు.

* * * *

దండమ్ము దండమ్ము దశరథరామ!
దయతోడ మము గావు దాక్షిణ్యధామ!

౨

విఘ్నమ్ము లేకుండ విద్య నియవయ్య
విఘ్నేశ్వరుడ నీకు వేయిదండాలు.

౩

ఉంగరమ్ములు పెట్టి ముంగురులు దువ్వి
ఒద్ద పెట్టుకు తల్లి ముద్దులాడింది
పలకబలపము లిచ్చి పద్యాలు పాడి
సరస పెట్టుకు తండ్రి చదువు నేర్పాడు.

౪

పిల్లలందరు రండి బళ్లోకి పోయి
చల్లన్నిగాలిలో చదువుకొందాము
విసరు విసరు గాలి విసరవే గాలి
మల్లెపూవుల గాలి మామీద విసరు.

౫

చదువంటె అబ్బాయి చండికేశాడు
బద్దెపలుపా రావె బుద్ధి చెప్పాలి
చదువంటె అబ్బాయి సంతోషపడును
అగసాలి రావయ్య నగలు చెయ్యాలి.

౬

అరటిపండా తీపి ఆవుపాల్ తీపి
మాచిన్ని అబ్బాయి మాటల్లు తీపి.

౭

చదువుకో నాయన్న! చదువుకో తండ్రి!
చదువుకొంటే నీకు సౌఖ్య మబ్బేను!
ఆడుకో నాయన్న! ఆడుకో తండ్రి!
ఆడుకొంటే నీకు హాయి కలిగేను!

* * * *

పొరుగుపిల్లలతోను పోట్లాడబోక
ఇరుగుపిల్లలతోను మేట్లాడబోక
చక్కగా నీచదువు చదువుకో తండ్రి!
చదువుకొంటే నీకు సౌఖ్య మబ్బేను!

---

* ఈ పుటలోని భాగము 'గృహలక్ష్మి'యందు ప్రకటితమయ్యెను ఈ 'బాలభాష'ను సంపూర్ణముగ భారతియందు ప్రకటింప నుండుటచే మరల ముద్రితమయ్యెను. సం. భా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## అ యి దు వే ళ్లు



తిందాం తిందాం ఒక వేలు
ఎట్లా తిందాం ఒక వేలు
అప్పు చేసి తిందాం ఒక వేలు
అప్పెట్లా తీరుతుంది ఒక వేలు
ఉన్నాగదా నేను అన్నింటికీ
పొట్టివాణ్ణి గట్టివాణ్ణి బొటన వేలు!

వివరణము

[చిటికన వ్రేలు, ఉంగరము వ్రేలు, నడిమి వ్రేలు, చూపుడు వ్రేలు, బొటమన వ్రేలు-అని అయిదు వ్రేళ్లకు పేళ్లు. ఈ అయిదు వ్రేళ్లూ అనుకొన్నట్టు ఒకొక్క వ్రేలినీ చూపుకొంటూ బాలకు లీపదము పాడుదురు.]

## ఎ ం దు కు ?

ఎండలు కాసే దెందుకురా
మబ్బులు పట్టే టందుకురా
మబ్బులు పట్టే దెందుకురా
వానలు గురిసే టందుకురా
వానలు గురిసే దెందుకురా
చెరువులు నిండే టందుకురా
చెరువులు నిండే దెందుకురా
పంటలు పండే టందుకురా
పంటలు పండే దెందుకురా
ప్రజలు బ్రదికే టందుకురా
ప్రజలు బ్రదికే దెందుకురా
స్వామిని గొల్చే టందుకురా!
స్వామిని గొల్చే దెందుకురా!
ముక్తిని బొందే టందుకురా!

## సూ ర్య డు

తొలిదిక్కు తెలుపెక్కగా—
ఆకసము
తెల తెల్ల వారగాను,
వృక్షములు కదలుగాను-
వానిపై
పక్షుల్లు లేవగాను-
కలకల ధ్వనులతోను జగమెల్ల
కార్యములు చేయగాను
ఉదయించె కర్మసాక్షీ
తనకాంతి
పదిదిక్కులకు బారగా.

*  *  *  *

పుట్టేటి భానుడా! పుష్యరాగపుచాయ
శ్రీసూర్య నారాయణా!
పుష్యరాగము మీద పొంగు బంగరుచాయ
శ్రీసూర్యనారాయణా!
జాము ఎక్కి భానుడా జాజిపువ్వులచాయ
శ్రీసూర్యనారాయణా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాజిపూవులమీద సంపెంగపువుచాయ
శ్రీసూర్యనారాయణా!
మధ్యాహ్న భానుడా! మల్లెపూవులచాయ
శ్రీసూర్యనారాయణా!
మల్లెపూవులమీద మంచి వజ్రపుచాయ
శ్రీసూర్యనారాయణా!
మూడ్జాములభానుడా మునగపూవుల చాయ
శ్రీసూర్యనారాయణా!
మునగపువ్వులమీద ముత్యాలపొడి చాయ
శ్రీసూర్యనారాయణా!
క్రుంకేటిభానుడా గుమ్మడీపువుచాయ
శ్రీసూర్యనారాయణా!
గుమ్మడీపువుమీద కుంకుంపువుచాయ
శ్రీసూర్యనారాయణా!
ఆయురారోగ్యములు ఐశ్వర్యములు నిమ్మ
శ్రీసూర్యనారాయణా!

ఉన్న ఊరు, కన్న తల్లి

ఉన్నఊరూ విడిచి ఉండనేలేము
కన్నతల్లిని విడిచి ఘడి యుండలేము.
ఉన్న ఊరే నాకు చెన్నపట్నమ్మ
కన్నతల్లే నాకు కల్పవృక్షమ్మ.

చెలిమి

కానివారీతోను కావించు చెలిమి
కట్టె విరిచీ పొయిని పెట్టిన ట్లుండు
అయినవారీతోను కావించుచెలిమి
ఆకు మడచీ మడత పెట్టిన ట్లుండు.

*  *  *  *

కానివారీమాట కంట్లోది నలుసు
ప్రాణం పోయిందాక ప్రక్కలో పోటు
అయినవారీమాట అమృతంపు తేట!
బ్రదికి ఉన్నందాక భాగ్యంపుమూట.

నెత్తిమీద గోరింక



ఓ అ(బ్బా)మ్మాయి నెత్తిమీద గోరింక.
చెప్పకు చెప్పకు చెడిపోతావు
చెపితే నీముక్కు తెగ్గోస్తా
దూలం మీంచి దూకిస్తా
పందిలి మీంచి పాకిస్తా
కంచం అన్నం తినిపిస్తా!
కడవెడు నీళ్లు తాగిస్తా!

వివరణము

[ఎవరితలమీద నైనా ఆకు గాని, పుల్ల గాని, ఇంకేదైనా గాని పడి ఉంటుంది. లేదా ఈ పదం పాడేవాళ్లే పెట్టుతారు. అది యెవరితల మీద ఉన్నదో వాళ్లు గుర్తించ లేకపోతారు. అంత కొంతసేపు వేళాకోళపు నవ్వు నవ్వి దగ్గర ఉన్న ఎవరితలమీదనో ఉన్నట్టుగా ఈ పదం పాడుతారు. ఈపరాచకముచేత అసలు ఎవరితలమీద ఉన్నదో వాళ్లు అనుమానించి తల తడివి చూచుకొని అక్కడ ఉన్నపుల్లనో దేన్నో తీసి వేసుకొంటారు. నలుగురూ నవ్వుతారు.]

[స శే ఎ మ]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశ ఆర్థికస్థితి

చావలి వెంకట హనుమంతరావు గారు, యమ్. ఏ.

## కేంద్రరాష్ట్రప్రభుత్వముల ఆర్థికసంబంధములు

(వెనుకటి సంచిక తరువాయి)

౫

ఇంతవరకును మన దేశములో ఏ యే ప్రభుత్వభాగమున కేయే ఆదాయము వచ్చు మార్గము లేర్పాటు చేయబడవలెనో, ఇప్పుడు అమలునందున్న పద్ధతిలో ఏయే మార్పులు చేయబడవలెనో సూచింపబడినది. ప్రస్తుతము అమలు జరుగుచున్న కేంద్రరాష్ట్రప్రభుత్వ ఆదాయవ్యయవిభజన విధానము మెస్టను కమిటీ (Meston Committee) వారి రిపోర్టును బట్టి ఏర్పాటు చేయబడినది. మాంటాగ్యు సంస్కరణములు ప్రవేశపెట్టబడక పూర్వము ఇండియా ప్రభుత్వమువారు ఈ ఆర్థికవిధానమును గూర్చి సంపూర్ణముగ ఆలోచించి సూచనలను చేయుటకు మెస్టనుప్రభువు అధ్యక్షతక్రింద నొక కమిటీ నేర్పాటుచేసిరి. వారు చేసిన సూచనలలో కేంద్రప్రభుత్వము వారికి ఏర్పాటుచేయబడిన పన్నులనుండి వచ్చు ఆదాయములో (ఆ పన్నులు ఏవో మొదటిభాగములో సూచింపబడినవి) లోటు పూర్తియయి ఆప్రభుత్వమునకు తగిన ఆర్థికబలము చేకూరువరకు రాష్ట్రప్రభుత్వములు కొంతధనమును కప్పముల (contributions) రూపముగ చెల్లించవలెననియు, కేంద్రప్రభుత్వమువారి ఆదాయవ్యయములు సరితూగిన తరువాత ఆ కప్పములను పుచ్చుకొనుట వారు మానివేయవలెననియు రెండు ప్రధానములైనవి కలవు. ఆకమిటీవారు ఆదాయవ్యయమార్గముల విభజన ఎట్లుండవలెనో దానికికూడ ఒకపట్టిక నేర్పాటు చేసి, ఏయేప్రభుత్వమునకు ఏయే శాఖలపై అధికార ముండవలెనో వివరముగ తెల్పియుండిరి. వారు తయారుచేసిన కప్పముల ప్రణాళికయందు వ్యవసాయమే ముఖ్యవృత్తిగాగల మద్రాసు, సంయుక్తపరగణాలు, బెంగాలు మొదలగు రాష్ట్రములు ఎక్కువ సొమ్మును చెల్లించవలెనని సూచించియుండిరి. అది ఆయా రాష్ట్రముల ప్రభుత్వములకు చాల ఇబ్బంది కలుగచేయు ఏర్పాటని సూచింపబడినప్పటికిని ఆ కమిటీవారు దానికంటె ఎక్కువన్యాయముగా నుండు పద్ధతిని సూచింపలేక, ఎంతత్వరలో కేంద్రప్రభుత్వమువారు రాష్ట్రములపై బరువును తొలగించుట కవకాశము లుండునో అంత త్వరలో కప్పములను పుచ్చుకొనుట మానివేయుటయే సాధనమని వ్రాసియుండిరి.

ఈ మెస్టనుకమిటీ విధానములో ఒకగొప్ప లోపము ఏమన, రాష్ట్రప్రభుత్వములకు వ్యవసాయము, విద్య, పరిశ్రమలు మొదలగు ఖర్చుశాఖలపైఅధికారమునిచ్చివాటికి తగిన ఖర్చుపెట్టు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టకు కావలసిన సొమ్ము వచ్చు మార్గములను వారికి కుదుర్చకుండుట యనునది. పైన చెప్పబడిన వివిధ ప్రజోపయుక్త కార్యములకు సొమ్ము కావలయుననిన, రాష్ట్రప్రభుత్వములు క్రొత్తపన్నులను విధింపవలసిన అవసరము వచ్చెను; క్రొత్త పన్నులను విధించుటకు రాష్ట్రీయశాసనసభలు వ్యతిరేకములుగా నుండుచు వచ్చెను. కాన అన్ని విధముల రాష్ట్రములు పూర్వస్థితియందే యుండి ముందడుగు వేయ జాలని అవస్థలో పడుట తటస్థించెను. కాని ౧౯౨౨ సంవత్సరపు బడ్జెటు సందర్భములో ఇండియా ప్రభుత్వము వారు తమ భాస ననుసరించి రాష్ట్రీయకప్పములను సంపూర్ణముగ తొలగించుట కనుమతించిరి. ఆసందర్భములో ఇండియా ప్రభుత్వ ఆర్థిక సభ్యుడగు సర్ బాసిల్ బ్లాకెట్ గారు చెప్పిన వాక్యములలో ఇకముందు రాష్ట్రములు తమకు చేకూరిన ఎక్కువసొమ్మును దేశాభ్యుదయమునకు చేదోడుగా నుండు పరిపాలన శాఖలపై వినియోగించుట కవకాశము లున్నవని హెచ్చరికతో చెప్పినమాటలు గమనార్హములు. ఈకప్పముల తొలగింపు (Remission of Provincial Contributions) రాష్ట్రములపై ఇదివరకు గొప్ప అడ్డంకులుగా నున్న బరువుల నావల త్రోసివైచి, వాటికి తమతమ బలమును తిరిగి సంపాదించుకొనుటకు అవకాశములు కలుగచేసినవి. మెస్టను కమిటీవారి సిఫార్సులు ఇకముందెప్పుడును తిరిగి అనువర్తింప చేయుటకు అవసరము కలుగదని ధృఢముగ చెప్పవచ్చును; ఎందువల్ల ననగా, వారు తమ రిపోర్టునందే అవి తాత్కాలికావసరములను బట్టి చేయబడినవనియు, ఆ అవసరములు తీరి, ఆపరిస్థితులు మారిన వెంటనే వాటిని మార్చివేయ వచ్చుననియు వ్రాసియుండిరి. మెస్టను కమిటీవారి సూచనలు మొదటినుండియు కొన్ని రాష్ట్రములచేత ఖండించబడుచునే యున్నవి. వ్యవసాయ వృత్తి ప్రధానముగా గల మద్రాసు రాష్ట్రము వారు వ్యవసాయమునకు చాలసొమ్ము అవసరమనియు, కాన వారు చెల్లించవలసిన ౩౪౮లక్షల రూపాయిలను చెల్లించుట కష్టమనియు వాదించుచుండిరి; పరిశ్రమలు ఎక్కువ అభివృద్ధిగాగల బొంబాయి రాష్ట్రమువారు ఆదాయపుపన్ను కేంద్రప్రభుత్వము వారు తీసికొనుటవలన వారీయవలసిన ౫౬ లక్షలరూపాయిలను చెల్లించలేమని ప్రతిసంవత్సరమును మొరపెట్టుకొనుచు వచ్చిరి. ఇట్లే ఇతర రాష్ట్రములవారుకూడ తమతమ కప్పమును చెల్లించుట కున్న అభ్యంతరములను, కష్టములను చెప్పుకొనిరి. కాని కమిటీవారు తమ ఆదాయమార్గ విభజన విధానమువలన రాష్ట్రములకు వచ్చు ఎక్కువ రాబడిలో ఈకప్పములను చెల్లించిన తరువాతకూడ అభివృద్ధి మార్గములలో ఖర్చుపెట్టుటకు కొంతధనము మిగులు నను అభిప్రాయముతో తమ కప్పముల సూత్రములో ఏ విధమైన మార్పును చేయుట కంగీకరించలేదు. చివరకు సారాంశములో రాష్ట్రములకు ఎక్కువ ఆదాయము వచ్చు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టకు మార్గములు కన్పించలేదు కాని కప్పములను చెల్లించుటమాత్రము తప్పినది కాదు. ఏది ఎట్లున్నను, ౧౯౨౮ సం॥ లో వాటిని పూర్తిగ తొలగించుటతో రాష్ట్రముల ఇబ్బందులు చాలవరకు తొలగిపోయిన వని చెప్పవచ్చును.

కాని రాష్ట్రప్రభుత్వములకు ఎక్కువ ఆదాయము వచ్చు శాఖలపై అధికారముల నిచ్చిన కాని రాష్ట్రకప్పముల నిర్మూలనము వలన ఎక్కువ లాభము చేకూరనేరదు. ఇదియే, అనగా రాష్ట్రప్రభుత్వములకు తమతమ ఆదాయవ్యయమార్గములపై సంపూర్ణ యాజమాన్యము నిచ్చి, క్రొత్తగా పన్నులు వేయ నవసరము లేకుండ కాలానుక్రమముగ ఎక్కువ ఆదాయము నిచ్చు పన్నులను వారి చేతులలో నుంచుటయే, ఇప్పుడు చేయబడవలసిన మార్పులలో ముఖ్యమైనది. మెస్టన్ కమిటీవారి ఆర్థిక నిర్ణయము (Meston Settlement) వలన కలిగిన ప్రధానమైన మార్పు రాష్ట్రముల సంపూర్ణ ఆర్థికస్వాతంత్ర్య సూత్రమును ప్రతిపాదించుటయే. మేమ్యో ప్రభువుకాలములో మొట్టమొదట ఏర్పాటు చేయబడిన ఆర్థిక విభజన (Financial Decentralization) లక్ష్యమునకు ఈ మెస్టనుకమిటీ ఏర్పాటు ఒకపెద్దమెట్టని చెప్పవచ్చును. ఇకముందు ఆ మెట్టు నాధారము చేసికొని ఆర్థికస్వాతంత్ర్య సౌధమును చేరుటకు ప్రయత్నములు చేయవలసిన బాధ్యత కలదు. సైమన్ కమిషన్ వారి లక్ష్యముయొక్క ప్రాముఖ్యమును గ్రహించిరనుటకు కొన్ని నిదర్శనములు కన్పించుచున్నవి. రాష్ట్రములు తమతమ విధులను లోటు లేకుండ నిర్వర్తించుటకు సరియగు ఆదాయవ్యయమార్గములను ఏర్పాటుచేసి, అట్లే కేంద్రప్రభుత్వమువారికి కూడ వారికి కాలసిన రాబడి వచ్చు మార్గములు స్థిరపర్చుట ఆవశ్యకము. ఇక ముందు ప్రభుత్వమువారు కార్మికులను గూర్చియు, వారికి ఇండ్లు, పెన్షనులు మొదలగు సౌకర్యముల ఏర్పాటును గూర్చియు ఎక్కువ మొత్తములు ఖర్చుపెట్టవలసివచ్చును. దానికై ఎక్కువ అసంతృప్తి కలుగచేయకుండ తేలికవిధముగ ఎక్కువ ఆదాయము నిచ్చు Indirect Taxes పైని, అందు ముఖ్యముగ ఎగుమతి దిగుమతి పన్నులపైని ఆధారపడి యుండుట, మిలిటరీ ఖర్చులను తగ్గించుట మొదలగు ఇదివరలో సూచింపబడిన సంస్కరణముల నవలంబింపవలసియుండును. ఇవి కాక వీలైన యెడలను, అవసర మున్న ఎడలను క్రొత్త ఆదాయమార్గములను కూడ తడవి చూడవలసియుండును. అవేవో ఇంతకు పూర్వము సూచింపబడియే యున్నవి; తిరిగి ఒకసారి వాటిని పొందు పరుచుచున్నాము:—(౧) బెంగాలునందు వ్యవసాయమునుండి జమీందారులకు వచ్చుచున్న ఆదాయములపై ఇతరఆదాయములపై విధించుచున్నట్లుగానే ఆదాయపు పన్నును విధించుట; (౨) మరణపుపన్నులు, అదనపుపన్నులు మొదలగునవి ఇదివరకుకన్న



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హెచ్చుగా విధించుట; (3) పట్టణములలో భూమి అమ్మకము సమయములలో పన్నులను విధించుట; (౪) వినోదముల (entertainments), పైనను,భోగవస్తువుల (luxuries) పైనను పన్నుల విధించుట. ఇవి క్రొత్తపన్నులుగా కన్పించుచున్నను నిజముగా వాటియందు క్రొత్త ఏమియు లేదు. కొన్నిపన్నులు తొలగింపబడుట వలనను, మరికొన్ని తగ్గింపబడుటవలనను దేశోపయుక్తములగు కార్యములకు ఎక్కువ ఖర్చుపెట్టుటకు కావలసినసొమ్మును సంపాదించుటకును, ఆకార్యనిర్వహణములో ఏమైన లోటు వచ్చిన పూర్తిచేయుటకును ఈక్రొత్త పన్నులు సూచింపబడినవే గాని ఈపన్నులు వెంటనే విధింపబడ వలెనను ఉద్దేశముతో కాదు. ఇదివరకే మనదేశమందు ప్రజలు ఇచ్చుకొనుచున్న పన్నులు వారికి వచ్చుచున్న ఆదాయములో చాలభాగము మ్రింగివేయుచు వారిని క్రుంగదీయుచున్న సమయములో క్రొత్త పన్నులను వారిపై విధించుట క్రొత్తబరువును భుజములపై నెత్తుటయే యగును. కాని పైన ఉదాహరింపబడిన పన్నులయొక్క ముఖ్యోద్దేశ్యము ప్రజలపై పన్నులబరువునెత్తుట కాకవారిలోనున్న ఆర్థికములగు హెచ్చుతగ్గులను (economic inequalities) వీలైనంతవరకు రూపుమాపి ప్రజాబాహుళ్యములో సరిసమానత్వమును పెంపొందించుటయే మైయున్నది. మఱియు ప్రజలకు ఎక్కువ ఆర్థికబలమును చేకూర్చు మార్గములను కొంతవరకు త్రొక్కిన తరువాతను, వారికి దానివలన కావలసిన లాభము వచ్చిన తరువాతను క్రొత్తపన్నులను విధించుటలో కొంతన్యాయ ముండును. ఆవిధముగా ప్రజాసామాన్యముయొక్క ఆదాయమునందును దానితోపాటు వారిజీవిత ప్రమాణము (standard of living) నందును అభివృద్ధిని సమకూర్చుటకు ఇంతకు పూర్వము సూచింపబడిన మార్పులు చాల తోడ్పడకలవు.

---

అను బంధ ము

## సైమన్ కేంద్ర సంఘమువారి ఆర్థికవిషయ సూచనలు

పైసంగతులు వ్రాయబడిన తరువాత సైమన్ కేంద్రసంఘము (శంకరన్ నాయరు కమిటీ) వారి రిపోర్టు ప్రచురణమైనది. వారి సూచనలలో ప్రధానమైనది వెంటనే సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వమును రాష్ట్రములలో ప్రవేశ పెట్టవలె ననునది. ఆసూత్రమును మూలాధారమును చేసికొనియే వారి ఇతర సూచనలన్నియు చేయబడినవి. మనకు ప్రధానమగు ఆర్థిక విషయములలో వారి అభిప్రాయములను ఈ క్రింద పొందుపర్చుచున్నాము:

"కేంద్రప్రభుత్వముపూర్తిగ బాధ్యతాయుతముగ మారునంతవరకు రాష్ట్రఆదాయమార్గములును,వాటిపైవచ్చు ఆదాయమును పూర్తిగ రాష్ట్ర ప్రభుత్వములచేతులలో నుండవలెను. కాని కేంద్రప్రభుత్వమువారికి ఈమార్పువలన ఏమైన ఆర్థికముగ ఇబ్బందులు కలిగేయెడల, వాటిని తొలగించుటకు న్యాయమైన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మధ్య వర్తిసంఘము నొకదాని నేర్పాటుచేసి, వారి తీర్పుప్రకారము రాష్ట్రప్రభుత్వములు కొంత కొంత కప్పముల నాప్రభుత్వమువారికి చెల్లించవలెను."—(కేంద్రసైమను సంఘము వారి రిపోర్టునుండి.)

పై సూచనలో రెండు ముఖ్యలోపములు కలవు:—(౧) కేంద్రప్రభుత్వము బాధ్యతాయుత మగు సంతవరకు రాష్ట్రములకు ఆర్థిక స్వాతంత్ర్య ముండవలెనని చెప్పుటలో ఏవిధమైనన్యాయము కాని, అర్థము కాని లేదు. కేంద్రప్రభుత్వము బాధ్యతగల సంస్థ యైన వెనుక ఆర్థిక అధికార మంతయు వారికి తిరిగి ఇచ్చివేయవలెను-అని కమిటీవారి అభిప్రాయమైన ఎడల, అది చాల అసమంజసము; చరిత్రకును, సామాన్య విచక్షణజ్ఞానమునకును అది వ్యతిరేకము. "రాష్ట్రస్వాతంత్ర్యము" అను పదములో రాష్ట్ర ఆర్థికస్వాతంత్ర్యము అను అర్థముకూడ ఇమిడియున్నదని వేరుగ చెప్ప నక్కరలేదు. (౨) రాష్ట్రప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వమునకు ద్రవ్యలోపమును పూర్తి చేయుటకై కొంత కప్పముల నీయవలె నను సూత్రముకూడ రాష్ట్రీయస్వాతంత్ర్యమునకు లోటే. అదియు కాక, ఈ కప్పములపద్ధతి మొట్ట నుకమిటీవారి సూచనల ప్రకారము ప్రవేశ పెట్టబడిన తరువాత ఏవిధముగ పనిచేసినదో, రాష్ట్రముల కెంత అన్యాయముగ పరిణమించినదో అందరకును తెలిసినవిషయమే. ఇట్లు ఏకగ్రీవముగ ఖండింపబడిన పద్ధతిని ఇంకొక రూపముగ తిరిగి ప్రవేశపెట్ట జూచుట గొప్ప పొరపాటు.

కాని సైమను కేంద్రసంఘము వారి పై సూచన వేరొక తప్పు అభిప్రాయముపై ఆధారపడి యున్నది. అది ఏదన, వారు ఆదాయపు పన్ను, ఎగుమతి దిగుమతి పన్నులుకూడ రాష్ట్రప్రభుత్వముల యాజమాన్యముక్రిందకు మార్చవలెనని సూచించియుండిరి. రాష్ట్రీయ ప్రభుత్వములకు ఏయే పన్ను శాఖలపై అధికార ముండవలెనో చర్చించుచు, ఆదాయపు పన్ను రాష్ట్రములకును, ఆబ్కారీపన్ను కేంద్ర ప్రభుత్వమువారికిని మార్చుట సమంజసమని ఇదివరలో సూచించి ఆమార్పునకు కారణములుకూడ తెల్పియున్నాము. ఎగుమతి దిగుమతి పన్నులను రాష్ట్ర ప్రభుత్వములకు మార్చుటను గురించి, అవి కేంద్రప్రభుత్వపు యాజమాన్యముననే ఏలయుండవలెనో లోగడ వ్రాసియున్నాము. అట్టి మార్పులో గల ఒక ముఖ్యలోపముమాత్ర మిచ్చట చూపెదము. ఎగుమతి దిగుమతి పన్నులు సాధారణముగ ఏరాష్ట్రములో సరకులు ఎగుమతి దిగుమతి యగుచుండునో ఆ రాష్ట్రమునందే విధింపబడుచుండును. రాష్ట్రప్రభుత్వముల కీ పన్నులను విధించు అధికార మీయబడిన, వాటివలనవచ్చు ఆదాయమంతయు ఒకరాష్ట్రమునకే పోవును. నిజముగా ఏరాష్ట్రప్రజలు ఆవస్తువులను ఉపయోగించుచున్నారో ఆరాష్ట్రములకు ఏవిధమైనలాభమునుండదు. వారికి ఆపన్నులను విధిం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుటవలన ఆదాయము రాదు. అది చాల అన్యాయము. దానివలన ఏరాష్ట్రమున కాపన్ను మూలమున ఎంతద్రవ్యము రావలెనో అది రాకుండుటయే గాక, రాష్ట్రరాష్ట్రముల మధ్య కలతలు బయలుదేరుట కవకాశములు కూడ కలవు. దిగుమతిపన్నుల రేట్లలో ఒకవిధమగు సమానత్వము (uniformity) చేకూరవలెననిన, కేంద్రప్రభుత్వమువారి చేతులలోనే ఈపన్నుండుట లాభము. అదియుకాక, కేంద్రప్రభుత్వము వారికి ద్రవ్యలోపము లేకుండ చేయ వలెనని నను, రాష్ట్రకప్పములు పునరుద్ధరింప కుండ వలెనన్నను, ఈపన్నులను విధించు అధికారము కేంద్రప్రభుత్వము వారి కిచ్చుటయే మంచి మార్గము.

సైమను కేంద్రసంఘములో ముగ్గురుసభ్యులు (సర్ శంకరన్ నాయర్, నవాబ్ ఆలీ ఖాన్, సర్దార్ సింగ్ ఉబెరామ్‌గార్లు) రిపోర్టులోని సూచనలకు తమ భిన్నాభిప్రాయములను తెల్పుచు, కమిటీ ఆర్థిక సూచనలలోగల లోపముల నన్నిటిని ఎత్తి చూపిరి. వారు చెప్పిన విషయములలో సంపూర్ణరాష్ట్ర స్వాతంత్ర్యము జయప్రదముగ కొనసాగుటకు రాష్ట్రఆర్థిక స్వాతంత్ర్యము అత్యావసరమనియు, అట్టి స్వాతంత్ర్యము నేర్పాటుచేయుటకే ప్రయత్నములు చేయవలెననియు చెప్పినవి గమనార్హములు. ఆర్థికవిభజన (Financial Decentralization) సూత్రమునుగురించి సర్ జాన్ స్ట్రాచీగారు అనుకూలముగా నిచ్చిన అభిప్రాయమును తెల్పుచు, లార్డు మేయోకాలములో ప్రథమమున ఆచరణలో నుంచబడిన ఆసూత్రమును పూర్తిగ అమలునం దుంచుటకు ఖండితముగ ఏయేప్రభుత్వ భాగమునకు ఏయేఆదాయమార్గములపై అధికార ముండవలెనో నిర్ణయించి ఏర్పాటుచేయుట అవసరమని వారు తెల్పియున్నారు. వారి అభిప్రాయములతో ఎల్ల రేకీభవించవలసిన దే. కాని ఆవిభజన ఏపద్ధతులపై జరుగవలెనో మాత్రము వారు నిష్కర్షగ తేల్చక అది ఒకపండితుల కూటము (Experts' Committee) వారిచే ఏర్పాటు చేయబడవలెనని వ్రాసియున్నారు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్వరకల్పన

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

"శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణీ"
అనునార్యోక్తి సంగీతము మానవులనేగాక ప్రపంచముతో నెంతయో పరిచయము లేని శిశువును, బుద్ధిబలము లేని పశువును, చివరకు విషజంతువైన పామును కూడ మెప్పించునని తెల్పుచున్నది. లలితకళలలో నిదియే సులభగ్రాహ్యము. కవిత నెఱుంగుటకు సాహిత్యమున కొంత ప్రవేశ ముండవలెను. చిత్రకళ నెఱుంగుటకు ప్రకృతి సౌందర్యమును కొంత తెలిసి యానందించి యుండవలయును. సంగీతమును విని యానందించుట కట్టి పునాదు లేవియు నవసరములు కావు.

సంగీతమునకు సప్త స్వరములు[1] ఆధారములు. ప్రపంచములోని నాగరిక జాతు లన్నియు సప్తస్వరములనే వాడుక చేయుచున్నవి. వినువారి హృదయమున కానంద మిచ్చునట్లు కూర్చబడిన స్వరముల చేరికయే రాగ[2] మనబడును. దాని కారోహణము, అవరోహణ మని రెండంగములు. ఆరోహణమున నొక స్వరమునుండి దానికన్న హెచ్చు నాదముగల స్వరమునకు ప్రసరించుట, అవరోహమున్న నొక స్వరమునుండి తగ్గుస్వరమునకు దిగుట.

ఒక రాగము నందలి కళల ననుసరించి తాళము నడుపుచు పాడుట కనుకూలమై పరమేశ్వరునికి కృతి నిచ్చిన సాహిత్యరచనను కృతి యని పిల్చుచున్నాము. కృతి సాధారణముగా మూడు భాగములు కలిగియుండును. పల్లవి రాగముయొక్క బహిః స్వరూపమును వ్యక్తము సేయును. అనుపల్లవి రాగముయొక్క ఆరోహణావసానమును చూపుచుండును. చరణములు రాగములోని స్వరప్రస్తారములకు సాహిత్యోదాహరణములు. కృతులలోని విరామకాలము లందును, పల్లవి అనుపల్లవి, చరణము అనువాని ముందునను స్వరకల్పనను అనగా ఆ రాగమునకు సంబంధించిన స్వరసమ్మేళనములను గాయకులు పాడుట యిటీవల నలవాటయిపోయినది.

స్వరకల్పనకు గానమందు ప్రాముఖ్యము హెచ్చిపోవుచున్నది. కృతిలోని సాహిత్యమున నెక్కడైనను దీర్ఘ మున్నచో నా దీర్ఘమును వదలివైచి ఆ కాలమునందు స్వరము వాడుటకూడ నలవాటయినది. 'మీనాక్షి మేముదం దేహి'యను కృతిలో 'మధురాపురీనిలయే మణివలయే' యను భాగమున పురీ యనుచోట నకారదీర్ఘము మాని, పేరు పొందిన దక్షిణాపథగాయకు డొకడు స్వరములను వాడి యుండెను. రాజమహేంద్రవరములో నొక గాయకుడు స్వరములను మధ్యమధ్య ప్రయోగించి రాగాలాపనము చేసినాడు. గాయనులు స్వరము వాడకుండుటను గాంచి సభ్యులు స్వరకల్పన సేయవలసినదని తాకీదుల నంపుచున్నారు. హరిదాసులు కథలలోని కీర్తనలలో స్వరకల్పన చేయుచున్నారు. గంగిరెద్దు దాసులలో గూడ స్వరకల్పన వ్యాపకము గాంచుచున్నట్లు వల్లూరి జగన్నాథరావుగారి ఉత్తరదేశపుబిచ్చగాండ్రు అను గ్రామఫోను రికార్డువలన గోచరించుచున్నది. కొవ్వూరి స్టేషనులో ముష్టివాడొకడు ఫిడేలుపై స్వరములు వాడిన పాటలు పాడుచు తిరుగుచున్నాడు. కళలలో సంగీతమునకు వలెనే సంగీతములో స్వరకల్పనకు వ్యాప్తి హెచ్చిపోవుచున్నది.

కవులు కాదన్నను, చిత్రకారులు చిత్తమనకపోయినను, కళలలో సంగీతమే యుత్కృష్టకళ. దేశకాలపాత్రములతో సంబంధము లేక, శిశుబాలవృద్ధు లను వ్యత్యాసము లేక, జీవకోటి నానందములో తేల్చి యా

1. తానే రంజించునది స్వరము. ఈ స్వరములు స, రి, గ, మొదలగు అక్షరములచే తెలుపబడుచున్నవి.

2. రంజకో జన చిత్తానాం స రాగః కథితో బుధైః.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డించునది సంగీతమే. ఇట్టిసంగీతమునందు స్వరము వ్యాప్తి నొందుటకు కారణ మేమి? అని ఆలోచింతము. ఈ వ్యాప్తి న్యాయ్యమే యైనచో స్వరకల్పన గానవిద్యాదర్శములను చక్కగా పాలించవలసి యుండును. అట్లుగాక గాన విద్యాదర్శములను స్వరకల్పన పాలించనిచో దానికి గానమునందుగల వ్యాప్తి అక్రమమే. గాన విద్యాదర్శము లేవి? నాదోపాసన, గీతోపాసన, రంజకత్వము నని హరి నాగభూషణముగారు వ్రాయుచున్నారు.3 ప్రస్తుతము నాదోపాసన, గీతోపాసన రెండును సమర్థు లెందరో లేకుండుటను బట్టి మూల బడినవి. నాదోపాసనకు స్వరము లవసరములు కావు. అందు భావమే యుండదు. కేవలము నాదము మూలముననే జీవాత్మ పరమేశ్వరుని కంజలి యొసంగును. గీతోపాసనకు కూడ స, రి, గ ల జ్ఞాన మక్కర లేదు.4 కబీరు, రామదాసు, తలారి, రంగదాసు ప్రసిద్ధి జెందిన గీతోపాసకులు. వారు సరిగలు వాడియుండలేదు. గరిమెళ్ల సత్యనారాయణ గారు విఖ్యాత గీతకవులు. వారు పాటలను రచించునప్పుడు ముందు సరిగమలు కట్టుకొని పిమ్మట తదనుగుణమగు సాహిత్యరచనను చేసికొనలేదు. గాయకుల కుత్తమాదర్శములైన నాద, గీత ఉపాసనలకు స, రి, గ, మ ల యాట లావశ్యకములు కావని ఇందుమూలమున తెలియుచున్నది. ఇంక మూడవ ఆదర్శము జనరంజనము. దీనికి జీవకళా5 జ్ఞాన మవసరము. ఈ జ్ఞానమునకు ఆలాపనమే మూలాధారము. గాయకులు ప్రయోగించు సంగతులును, కళలును, అన్నియు రంజించుగుణమును కలిగియుండవు. అందు కొన్ని మాత్రమే ప్రేక్షకులను మెప్పించ జాలియుండును. ఆలాపనము సేయుచు నేదైన నొకచోట నీ జీవకళలు పడినచో, నా జీవకళకుగల స్వరసమ్మేళనమును గుర్తించి, ఇంకేయితర రాగమునకైనను ఈ స్వరసమ్మేళనముల నుపయోగింప వీలున్నచో, నారాగమునకు జెందెడి కీర్తనలోని సాహిత్యమునకు పై జీవకళ యద్దినచో వినువా రానంద భరితులగుదురు. అంతియే కాని కేవలము స్వరకల్పన సేయ నేర్చినంత మాత్రమున పై జీవకళాజ్ఞాన మలవడదు. ఏలన, జీవకళలు స, రి, గ, మలను ముందు సరిపెట్టుకొని పిమ్మట రాగరూపమున వెలువరింప వీలిచ్చునవి కావు రాగరూపమున ముందు సాధకముచేసి పిమ్మట కృతి సాహిత్యమున కద్దవలసినవి. కాబట్టి స్వరకల్పనా సామర్థ్యము జనరంజనమునకు కూడ సహాయకారి కాదు.

ఈ వాదమునకు ప్రతిపక్షు లున్నారు. స్వరములను గమక భేదములచే పాడినచో నవి రంజింపగలవట. వీరికి ముందుముందు జవాబు చెప్పగలను. మఱికొందరు స్వరములను గమకములతో పాడి రాగకళలను కూడ నిబిడము సేయుట చాల కష్టమనియు, నట్లు పాడినచో రంజించుటయే కాక, సంగీతమునకు ముఖ్యములైన భావ, రాగ, తాళములకు భంగకారి కాకుండ స్వరములను పాడు పద్ధతి యొకటి క్రొత్తగా నవతరించుననియు వాదించుచున్నారు. రెండవవారి వాదమునే ప్రస్తుతము చర్చింతును. 'కష్ట'మైన నన్నియు సత్కళలేనా? కేవలము కర్తయొక్క కష్టపరిశ్రమలపైన మాత్రమే ఆధారపడి వేఱు విధమగు రంజనములేని విద్యలకు సభలయం దెట్టి పురస్కార మర్హ మో ముందు చర్చింతును. ప్రతిపక్షుల వాదములో మొదటిభాగ మయినది. ఇక రెండవ భాగము: "అట్లు పాడినచో రంజించుటయే గాక" అనునది. రంజించునా? లేదా? అనుదానికి రెండు విధముల జవాబులుకూడ వచ్చును. ఈ రంజనము స రి గ ల వల్ల కాక, వాటి చేరికలపై నాధారపడియుండు కళవలననే పుట్టుచున్నదని ప్రతిపక్షులే అంగీకరింతురు. అట్టియెడ ప్రయాసము వహించి ఆ స రి గ మ లను బిగించి పాడవలసిన యవసర మేమి? మరియొక సంగతి: పైన చెప్పిన ట్లొకగాయకుడు పాడె ననుకొనుడు. ఆ స్వరముల నంటియుండు రాగము నూహించి, గాయకుడు పాడు స్వరములను గాక, ఆ రాగమునే యాకర్షింపగల శక్తిగలవారే దాని నానందింపగలరు. ఇతరు లట్లు చేయ

3., 4. త్రివేణి, 2 వ సంపుటము, 1 వ సంచిక, 55 వ పుట.

5. ఇదియొక క్రొత్త మాట అని పాఠకులు కినియ నక్కర లేదు. ఇది ఇక్కడితో సరి.

లేరు. కాబట్టి ఈ రంజనము సార్వజనీనము కాదు. ఇంక మూడవభాగమగు "రాగకళలను నిబిడము సేయుచు పాడినచో భావ, రాగ, తాళముల కాపాట భంగకారి కా" దనువాదమును పరికింతము. భావ, రాగ, తాళ ములు పోకుండు బెట్టిది? గమకముల కన్నిటికి భావ మున్నదా? లేదు. వాటిచేరికల కుండును గాక. అక్షర ములకు వేర్వేరర్థములు లేకున్నను వాటిచేరికల కున్నట్లే, గమకములకు ప్రత్యేకముగా నర్థములు లేకున్నను వాటి చేరికయైన రాగమునకు విశిష్టార్థ మున్నది. ఈ గమక ములు పైవారు పాడుమని చెప్పుపాటలో స, రి, గ మొదలైన అక్షరములచే భేదింపబడియున్నవి. కాబట్టి యొకదానిలోని కొకటి సరిగా మేళవించి, కళాకారుని హృదయోద్గత భావమును వెలువరించు భాగ్యము స్వర ములతో కూడుకొన్న ఈ గమకములకు లేదు. ఇక రాగము వీటివల్ల భంగము కాదను మాటకు వత్తము. "రాగకళలను నిబిడము చేసినారు కాబట్టి రాగభంగము రా" దని వారి వాదము. ఈ వాదమునకు పునాదులైన కొన్ని యభిప్రాయములను మనము పరిశీలించవలెను. (౧) రాగకళ యనునది విశిష్టమని: [ఇదే ముఖ్యమైనది. ఈ యభిప్రాయము నిరాధారమని నిరూపించగలిగినచో పై వాదము భగ్నము సేయగలుగుదుము]; (౨) తమకు తెలిసిన వేకొంచెమో మాత్రమే రాగకళలని. అంతే కదా! రాగకళలు నిబిడము సేయవలె ననుట తా మెరింగిన కళ లేవో వాటిని గాయకులు తాము పాడెడి స్వర సమ్మేళనములలో నిబిడము సేయవలె ననుటే. ఇది హా స్యాస్పదము. ఇక మొదటి యభిప్రాయము మాట 'రాగకళ' యన నేమి? రాగమువలె పాడుట కనుకూల

మైనదా? అట్లే కానిండు. సమర్థుడగు గాయకు డొకడు సాధకబలమున కనుగొనిన నూతన కళలను శ్రోత లెఱింగియుండుట కవకాశములు లేవు కదా! అట్టిగాయ కు డొకడు [ఉదా: హరి నాగభూషణముగారు] సభ చేసి ఆయన నేర్చిన 'రాగకళ'లు కురిపించినచో నివి రాగకళలే యని చెప్పగలిగిన వా రెవరు? లేరు. అట్లని ఆయన ఆరాగకళలను పాడుట మానివేయవలెనా? ఒకరు రాగరూపమున వెలువరించలేని దానిని మరియొకరు పాడ గల్గుదురు. మొదటి వారికి రాగకళ కాని సమ్మేళనము రెండవవారికి రాగకళ యౌను. మొదటివారు స్వరరూప మున పాడకూడదని చెప్పిన సమ్మేళనమును రెండవవారు పాడవచ్చు నందురు. వీరికిని వారికిని సంధి కుదురు టెట్లు? ఈ సంగతి గ్రహించిన నాబోటివారు పసస-గరిధ-మొద లైన కల్పిత స్వరములను పాడవచ్చునని గాయకులకు సల హా నిచ్చి పాడించినచో కాదనుట కెవ్వరికీ వీలు లేదు. ఏలన, ఇది రాగకళ కాదు అని తప్పకుండ నిర్వచించుట కెవరికిని సాధ్యము కాదు. కాబట్టి "రాగకళలు నిబిడీకృ తము చేయుచు పాడవలె" నను పై వాదము నిలువదు. రాగకళలు వ్యక్తులతో భేదించును. నాకు రానికళ నేను కాదందును. మీకు రానిది మీరు కాదందురు. న్యాయ ము చెప్పుట కాధారములు లేవు. పోనీ, గాయకుడే స్వర ములు పాడి, ఈ స్వరముల నంటియుండు కళలను కూడ పాడి చూపవలె నందురా! స్వరసమ్మేళనములకు పనియే యుండదు. పాట చర్వితచర్వణము, కేవలము ప్రజ్ఞా ప్రకటనము క్రింద మారిపోవును. మరియొక సంగతి: ఒక క్రొత్తరాగపు కృతి నిచ్చి పాడుమన్నప్పుడు గాయ కుడు ప్రయోగించు స్వర సమ్మేళనములు 'రాగక'ళాను సరణములో కావో ఎట్లు నిర్ణయించుట? రాగకళానుసర ణము కాదందురా? సాధకమువలన గాని ఈ నిజము తే లదు. ఒకరికి సాధ్యము కానంత మాత్రమున నది రాగ కళ కాదనుట దౌర్జన్యము. కాబట్టి రాగము భంగము కాదను ప్రతిపక్షుల వాదము సక్రమము కాదు. తాళ మున కీ స్వరకల్పనయు భంగకారి కాదు. కాబట్టి ఇది మన చర్చలోనికి రాదు.

స్వరకల్పన సేయు పద్ధతి వాగ్గేయ కారకుల యు పయోగమునకు కనిపెట్టబడినదని మరికొందర నుచున్నా రు '<u>వాచం గేయంచ కురుతే యస్స వాగ్గేయకారకః</u>' అనిసంగీత రత్నాకరము. వాచకము, గానము అనురెంటిని చేయువాడే వాగ్గేయ కారకుడని దాని యర్థము. అనగా గీతరచన సేయు వాడే వాగ్గేయ కారకు డనిపించుకొన గల డన్నమాట. గీతోపాసనకు స్వరకల్పన సహాయకారి కాదని యిదివరకు సునవిచేసి యున్నాను. '<u>శబ్దరూప మైన సాహిత్యము మాతు; స్వరరూపమైన వర్ణమెట్టు</u>



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధాతు. ఈ రెంటిని చేయువాడే వాగ్గేయకారకుడు' అని సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామ దీక్షితులవారు. త్యాగరాజునకు స్వరకల్పనవలననే వాగ్గేయకారకత్వము సార్థక మయ్యెనా? దీక్షితులవారు వాగ్గేయకారకులని వ్రాసినవారిలో పెక్కురు స్వరరూపమగు మెట్టు రచించియుండలేదే! కాబట్టి వాగ్గేయ కారకులు తప్పక వర్ణమెట్టు రచింపవలెనను నియమము లేదు. రామదాసు, కబీరు, వీరు వాగ్గేయకారకులు కారా? కేవలము రసానుకూల సాహిత్య ప్రయోగమే వాగ్గేయకారకత్వము నిల్పగలదు. వర్ణమెట్టు రచించితీర నక్కరలేదు,....... సంగీతాదర్శమునకును స్వరకల్పనకును గల సంబంధబాంధవ్యము లిట్టివి. గాన విద్యాదర్శములను సరిగా పాలింపకుండినను స్వరకల్పనకు కవితలో సమస్యాపూర్తికివలె వ్యాప్తి హెచ్చినది. ఈ ప్రచార మలవడుటకు దీనిలో నేదియో రహస్య ముండి యుండవలెను.

స్వరకల్పన మెట్టిదది? రసికుల నాకర్షించగల యంశ మేదైనను దానిలో నున్నదా? యని మనము తర్కింతము. నిరావళి (పల్లవినే వేర్వేరు సంగతులలో భావరాగములు విస్తృతమగునట్లు పాడుట) రసికుల రంజించుననుటకు దాని నెవ్వరూ నిరసన భావముతో చూడకుండుటయే సాక్ష్యము. ఇక స్వరకల్పనయే ప్రశ్నార్హము. పల్లవిలో స్వరకల్పనా భాగమే ప్రస్తుతము విమర్శింపబడుచున్నది. నిరావళిలోని యవకతవకలు మనకిప్పుడు వద్దు. స్వరమే ప్రస్తుత విషయము. దానిని నిరసించుటకు పూర్వము తజ్ఞులిచ్చిన యభిప్రాయములను పరీక్షింతము. "గాయకుని ధీశక్తిని కల్పనా సామర్థ్యమును ప్రదర్శించుట కనువైన నాలుగు మార్గములలోను పల్లవి యొకటి [పల్లవి యనగా స్వరకల్పన చేయుచు పల్లవినే పాడుటయని ఇక్కడ అర్థము]......పల్లవి యనుభవము కేవలము మానసికము, తక్కువ మందినే మెప్పించుననుట సత్యమే. గాయకుడరుగు విచిత్ర మార్గముల నవగాహనము చేసికొనుటకు శ్రోత కూడ వాటి నవగాహనము చేసికొనవలసియున్నది. అంతియే గాని గాయకుని నిందించుట వివేకము. దక్షిణదేశగాయకుల అశేషధీవిశేషఫలము పల్లవి. దాని నిరసించు నిమిత్తము, స్వీయశాసనము చెక్కించు నిమిత్తము ప్రాచీన శిలాశాసనము నరుగదీయించిన పాండ్యరాజు ననుకరించకు"డని యొకరు. 6 "పల్లవి గాయకుని ధీవిశేషమును, కళాభిజ్ఞతను పరిశీలించుటకు కనిపెట్ట బడినది......తన్మయత్వమును పొందగలిగి సంగీత సాగరముయొక్క లోతు చూడ గలిగినవాడే ఈ కళాభాగమునందు ప్రవీణతను సాధించ గలడు.........స్వరగానము గాయకునికి రాగతాళములను గూర్చిన సంపూర్ణ జ్ఞానమలవరుచునని నా యభిప్రాయ"మని యింకొకరు. 7

ఈ యభిప్రాయములను చూడగా, పల్లవి సంగీతమునకు నిగ్గుదెచ్చు ప్రధానాంశమని తేటబడుచున్నది. అట్లయినచో తక్కిన సంగీత భాగములనువిని యానందించువారెందరో దీనిని మెచ్చుకొన కుండుట కేమి కారణము? ఒకటి: అది కళ కాక గారడీ విద్య కావలయును. లేదా పల్లవిని నిరసించు వారు వితండవాదులై "ద్రాక్షపండ్లు పుల్లగా నుండు"నన్న నక్కవలె, తా మానందించలేని గాన భాగమును గారడియనియు, కుస్తీపట్టనియు, సర్కసనియు పేర్లు పెట్టి గాన విద్యనుండి పల్లవిని తప్పింప యత్నించువారైనను కావలయును. ఇందేది నిజమో మన మోపినంతవట్టు తేల్చ ప్రయత్నింపవలెను. ముందు "పల్లవి గారడీ విద్య" యను వాదమును చూతము. పల్లవియందు రంజక భాగము లేవి?అని ప్రశ్నించుకొని జవాబులు చెప్పుకొన్నచో, పల్లవి గారడీ విద్యయో, మరి ఏదో తేలిపోవును.

స్వరకల్పన విని యానందించువారి కాయానందమిచ్చు నంశములేవి? ౧. గమకము; ౨. మద్దెలదరువులు; 3. స్వరకల్పనలోని చాకచక్యము. ప్రాకృతులకు గమకము, తాళజ్ఞాన మున్నవారికి మద్దెలదరువులు, రాగజ్ఞాన మున్నవారికి స్వరకల్పన ఆనందమొసంగునని గాయకుల జవాబు.

6. Hindu, 25—4—29.

7. A Lecture on Music.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈవాదము నెదుర్కొనుటకు పూర్వము మన మొకవిషయము మరువకూడదు. గోంగూరపచ్చడిలో పంచదార, బూరెలలో కారము 8 వేసినచో రుచికరమగునా? ఏల కాదు? దీనిలో పంచదార—చెఱకు తీపిలోని సారము—లేదా, దానిలో నెంతతిన్నను మొగముమొత్తని కారము లేదా? ఇక బాగుండకుండు టెట్టిది? అనుట సమంజసము కాదు. రుచికరముకదా యని పంచదారను గొనివచ్చి గోంగూరకా జతగట్టుట? ఇది అన్యాయము కాదా? పంచదారనుండి సంపూర్ణముగురుచిని పొందుటకనువైన గోదుమపిండి, నెయ్యి మొదలగు పదార్థములతో గలసినప్పుడే పంచదారరుచి సార్థకము కాగలదు. ఒకపదార్థమునుండి మనము పొందగలిగినంత యుపకారమును పొందినప్పుడే ఆపదార్థ 'ముపయోగించితి' మని చెప్ప సబబు.

౧. గమకమన్న స్వరముల కదలిక. ఇది అకారరూపముననే యుండును. కాబట్టి అకారప్రస్తారమైన రాగములోను, (భావసహితమైన) కృతిలోను రాణించినట్టిది పొడియక్షరరూపమగు స్వరకల్పనలో రాణించదు. రంజించునది కదా యని గమకమును స్వరచిహ్నములకు తగిలించుట న్యాయము కాదు. ప్రాకృతుల కానంద మిచ్చునన్న గమకము స్వరకల్పనలో నన్యాయముగా బందీకృత మగుచున్నది. అశోకవనిలో బందియైన సీతాసౌందర్యమును రాక్షసులు మెచ్చుకొనియే యుండిరి. కాని ఆసౌందర్యము నిజమన జెల్లునా? కోయిలగానమును దానిని పంజరమున నుంచియా యానందించవలెను?

౨. గానమందు మద్దెలపని లయప్రదర్శనమే. రాగముతో దానికి పనిలేదు. ఘాతకు ఘాతకు నడుమగల లయ బిగువగుటకు దరువులు పనిసేయును. దరువులన్నీ చప్పుళ్లదండలు. రాగములోని స్వరముల9 వలె నొకదానితో నొకటి మేళవించి, తమచేరికను నిగూఢము సేయవలసిన పనిలేదు. కావున స్వరకల్పనలో నీయంశము అనగా మద్దెలదరువులు రాణించవలెనన్న స్వరకల్పన జారుగా నుండక పొడిగా నుండి ఏస్వరచిహ్నమున కది విడిగా కనబడునట్లుండవలెను. లేకున్న దరువులకును, స్వరములకు సంపూర్ణ సామరస్యముండదు. ఇంతే కాదు. తద్ధిత్తకిట–ధిత్తకిట–తధిత్తకిట–తధింగిణతోం–మొదలైన కొలిపింపుజాతుల ననుసరించిన–పద్రిస్సనిధ–ద్రిస్సనిధ–ధరిస్సనిధ–రిసనిధమ–మొదలైనస్వరము లున్నచో మద్దెలగానికి పండుగ. స్వరకల్పనలోని యానందదాయకాంశములలో రెండవదానికి ప్రాముఖ్యము నీయవలెనన్న, "నాట్యములోని కొలిపింపును, మురజములోని జాతులును స్వరపంక్తములై పరిణమించవలెను."10 వేయేల, మురజము ననుసరించి గానము ప్రవర్తించవలెను. ఇది శాస్త్రవిరుద్ధము. గమకము, మద్దెలదరువులు నైనవి. మిగిలినది స్వరకల్పనలోని చాకచక్యము. ఇది కళాభాగము కాదు. కవిత్వములో బంధశ్లేష చిత్ర ఆశు కవితలు తత్కర్తయొక్క సామర్థ్యమునకు తోడై కేవలము తద్రచనలోని కష్టపరిశ్రమల నెరింగినవారిమెప్పును మాత్రమే పడయునట్లు స్వరకల్పనగూడ స్వయముగా దాని నెరింగిన వారిమెప్పునే పడయగలదు. ఈసంగతి మృదంగవాద్యము నాపినచో తేటబడిపోవును. సామాన్యులు ఘాతకు ఘాతకు నడుమ మృదంగ మొనరించు చప్పుళ్లతో కలిసి తాళముపైన దృష్టి నిలిపి ఘాతలను తొడ, లేక తలవల్ల చూపుచు ఆనందింతురు. మద్దెల యాగినట్లయిన స్వరకల్పనయొక్క నిస్సారత బయల్పడును. అది యట్లుంచి పదిమంది విని యానందింతమని వచ్చినసభలలో మనోహరగానసత్కళలనా, తన స్వరకల్పనా సామర్థ్యమునా పాటకుడు వెలువరించవలెను? గానకళల మాని తమప్రజ్ఞ చూపుట గాన విద్యాభిలాషుల లక్షణమా? ఈమాటలను బట్టి స్వరకల్పనకు సంబంధించిన మూడంశములలోను ఏదియు సక్రమము కాదని తెలియుచున్నది.

8. కొందరికి తీపి, మరికొందరికి కారము ఇష్టము, ఇట్లు వ్రాసినాను.

9. స్వర మనగా నిచ్చట 'స' కాదు. దాని నంటియుండు నాదము.

10, గాన భాస్కరము, ౪౧౪ పుట.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అట్లయినచో స్వరకల్పన గారడీ విద్యయేనా? సత్కళ కాదా? సత్కళయన నెట్టిది? అను విషయము లను చర్చించవలసియున్నది. "సౌందర్య ప్రతిపాదకమైనది కళ" యని యొకరు11. ఈ సౌందర్య మేమో గాని యింతవరకు వర్ణన కందలేదు. "వృష్టియం దుద్భవించు భావములను, ఆకస్మిక ప్రవృత్తులను వ్యక్తీకరించు విధానము కళ"యని వేరొకరు12. దీనినిబట్టి భావ, సంజ్ఞలు కళలు కావలసివచ్చును. కోపము వచ్చినచో నాకస్మికముగా శత్రువు చెంప ఫెడేలుమనును. దుఃఖము వచ్చినప్పుడు కళ్లవెంబడి బాష్పములు కారును. ఇవి కళలా? "ఊహ్యములగు ఛాయలను మన యింద్రియములకుగాని, మనస్సునకుగాని తట్టినట్లు చేయువిధానము కళ యనబడు"నని వేరొకచోట13. ఈనిర్వచనము చూచుటకు బాగున్నది కాని ఉపయోగించుట కష్టము. ఏల యన, "ఊహ్యములగు ఛాయలు..."(something phenomenal) అనునది విశిష్టముకాదేమో అని సందేహము. గజారోహణాసక్తి, మల్లవిద్యాసక్తి, అవధానము, ఉపన్యాసము మొదలైన వీ నిర్వచనములోనికి వచ్చునా? "ఊహ్యములగు ఛాయల" రాజ్యము చాలవైశాల్యముగా కాన్పించుచున్నది. ఫలానిదంళ మీ రాజ్యములోనిదా, కాదా? యనువిషయము నిర్ణయించుటకు వీలుకాదేమో? అనుభయము ఈనిర్వచనమును గ్రహించుట కడ్డువచ్చినది. కళ ఎట్టిదైనను అది మానవనిర్మితము. వేరొక మానవు నాకర్షించును లేదా మనస్సును చూఱగొనును. మానవుని యుత్సాహములను వ్యక్తీకరించునదే పలువురి కంటును. భావ మొదలైనవి మనస్సులోని భావములను వ్యక్తీకరించును. ఇవి యొకపనిని నెరవేర్చుటకు, అనగా ఒకరి మనస్సులోని తలపు మరియొకనికి అర్థమాన ట్లొనర్చుటకేయుద్దేశింపబడినవి. రెండవవారికి తిరిగి కర్తకు జనించిన తలపులే జనింపజేయుట భావయొక్క యుద్దేశ్యము కాదు. భావ మానవుల వ్యవహారమునకు మాత్రమే పనికి వచ్చును. కళయొక్క యుద్దేశ్య మది కాదు. పదిమంది తన్ను విని, తన్ననుకరించునట్లు చేయగలిగినది కళ. మానవు డొక దృశ్యమును చూచికాని, ఒక వింత (సాధారణముగా ప్రాపంచిక వ్యవహారమునకు భిన్నమైన భావన చేసికాని తానే యానందించి యూరకొనలేదు. శుభకార్యము చేసికొనునప్పుడు తానే పిండివంటలతో భోజనముచేసి తృప్తిని బొంది యూరకొనక, తన పరిచయస్థులనందరినీ పిలిచి వారందరితో జేరి ఎట్లానందించునో అట్లే తన యుత్సాహమునుకూడ పరులకు పంచి వారితోకూడ ఆనందించుటయే యతని యుద్దేశ్యము. తన యుత్సాహము పరులలో పుట్టింపగోరి (రంగులు, పదములు, శిల మొదలైన సామగ్రి గైకొని) మానవుడు వెలువరించినది కళ. ఈ నిర్వచన చేయుటతో నాపని పూర్తికాదు. కళాలక్షణములను కొన్నిటిని సేకరించి తల్లక్షణములు స్వరకల్పన కున్నవాయని తూచి చూడవలెను. అప్పుడుగాని స్వరకల్పన కళ యైనది కానిది తేలదు. కళకు మొదటిలక్షణ మానందోద్దీపనము. ఈయానందము కేవలము మానసికము కాదు. కళానుభవము ఉత్సాహపూర్వకముగానే యుండవలయునని ప్రొఫెసర్ శ్రీనివాసన్ గారు. కళకును శాస్త్రమునకును ఇక్కడనే యున్నది తేడా. కళ నానందించుటకు ప్రేక్షకున కాకళనుగూర్చిన జ్ఞాన మేమియు నక్కరలేదు. మాకొద్దీ తెల్లదొర తన మను పాటను విని పొంగిన ఆంధ్రజానపదులు భాషా, సంగీతవేత్తలు కారు. వెంకటస్వామినాయుడుగారి ఫిడేలువాద్యము నానందించుటకు సంగీతము నేర్చినవారే దక్షులా? సింహాచల శిల్పము, పాలకొల్లు గోపురము రామారావు చిత్రములను పండితులే యానందించినారా? కళానుభవము మానసికము కానే కాదు. శాస్త్రానుభవము కేవలము మానసికమే. వాయువిమానము, దూరదర్శిని మొ॥లగు శాస్త్రదత్త విచిత్రములను గాంచి పామరులానందించరు. ఆశ్చర్యపడుదురేమో. కాని శాస్త్రవేత్తలాచిత్రములను లోకమున కర్పించిన మహనీయుని తెలివి

11. పాశ్చాత్య విమర్శకులు.

12. A Lecture on Music.

13. Triveni, Vol. II, No. I.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చల్లపల్లి రాజాగారి పట్టాభిషేక చిత్రములు



3. శ్రీ శ్రీ చల్లపల్లి రాజాగారి నగరు-తిత్స్వరోభాగము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. శ్రీ శ్రీ దర్శి రాజాగారి నగరు—స్వర్ణోత్సవమునకు అలంకరింపబడినది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేటలను అర్థముచేసికొని మెచ్చుకొందురు. శాస్త్రకారుడు ప్రజల యుపయోగమునకో, లేదా వ్యవహారమునకో తోడ్పడునట్టి యంత్రముల నిర్మించును. ప్రజలకు తన యానందమో, లేదా యుత్సాహమో పంచు నుద్దేశ్య మాతని కుండదు.

ఇప్పు డీ లక్షణములను స్వరకల్పనకు జతజేసి అది కళయో లేక శాస్త్రమో నిర్ణయింపవలెను. స్వరమును గాయకుడు తన యుత్సాహమును ప్రేక్షకుల కగ్దు తలంపుతో వెలువరింపడు. ఏలయందురా, మానవుని యుత్సాహము పదముగాని, నాదముగాని, ఈ రెంటిలో నొక దానివల్ల పరులకు కొనిపోబడును. స్వరకల్పనలో సాహిత్యభాగమగు స, రి, గలు, సంగీత భాగమగు గమకము ఉండవచ్చును కాని ఈ రెంటికి కార్యమగు భావప్రదర్శనము లేదు. స, రి, గలు సంగీతమున కడ్డు. భాషకు సంగీత మడ్డు. రాగము, సంగతులు మాత్రము కళలే. ఏల యందురా, ఆనంద సమయములలో తీసిన కూని రాగముల స్మృతి రాగము. దానిలో నవ్యక్తమైన భావమున్నది. ఆకలి వేళ పిల్లి యఱచు నఱపులో నున్నట్లే, హృదయ పూర్వకముగా పాడిన రాగములలో మానవ హృదయము నొరసి ప్రవహించు భావలహరు లున్నవి. కన్నడ గౌళ (ఓఱచూపు జూచేది న్యాయమా), సావేరి (లేమగో మా మువ్వ గోపాలుడు) మొదలగు రాగము లాలాపన చేసినప్పుడు హృదయము కరగి దుఃఖ రానందరసము కన్నుల వెంట ప్రవహించుట రసకు లనుభవసిద్ధమే. హృదయమునుండి జీవముతో, భావముతో వెలువడినవి సంగతులు. సంగీతమున ప్రధానస్థానము వహించు భావమున కీసంగతులు వాహనములు. స్వరకల్పన కీ భాగ్యము లేదు. అది భావప్రదర్శనము కొరకుగాని, ఒక గానకళాసౌందర్యమును ప్రేక్షకులను చూపి యానందింపజేయు నుద్దేశ్యముతో గాని వెలునరించబడదు. స్వరకల్పన గారడి విద్య. గారడి వాడు రెండు, మూడు, నాలుగు బంతుల నెగురవైచి యాడునట్లు స్వరకల్పనకారుడు స్వరచిహ్నములతో నాడును.

స్వరకల్పన శాస్త్రమే యైనచో దానికి సభలలో నెట్టి స్థాన మున్నది? శాస్త్రప్రదర్శనమునకు రసికుల సభలలో నెట్టిపురస్కార మీయవలెను? శరీరమునకు అస్థిపంజర మెట్టిదో కళకు శాస్త్ర మట్టిది. శాస్త్రము అస్థిపంజరము నిర్మింపగా కళ దానిని సుందర విగ్రహమును జేయును. శాస్త్రము బహిఃస్వరూపము: కళ సవర్ణ చిత్రము. అది నిళ: ఇది చంద్రోదయము. అది పువ్వము ఇది తావి; లేదా వర్ణము. మానవులకు బహిఃస్వరూపములు నచ్చవు. కాని కళాకారున కవి విడరానివి. భవనమునకు పునాది యెట్టిదో సంగీతమునకు స్వర మట్టిది. రసజ్ఞులకు పునాది కాక ఆపునాదిపై నాధారపడి యుండు భవనమే ఎట్లానందదాయకమో, అట్లే సంగీతములో స్వరకల్పన కాక తత్కల్పన ననుసరించి యుండు రాగమే మోదదాయకము. సంగీతమున స్వరము కావ్యమున పద్యము వంటిది. రాగ మాఛందఃకల్పన ననుసరించి యుండు కవిత్వము. రసానుభవమునకు పద్యము కాక కవితయే ఆధార మైనట్లు ఆనందము పొందుట కీ స్వరకల్పన కాక సంగీతకళయే మూలాధారము. కేవల పద్యకారులు కవులు కానట్లే కేవల స్వరసాధకులు గాయకులు కారు. ఇంపుగా నున్నచో స్వరకల్పనకొప్పు కొందురాయనుట రసవంతమైనచో ఆకువు లోభనీయము కాదా అను ప్రశ్నవలె నుండును. కేవలము కాలము, ధార గణనించుచు నల్లినయాశువునందు రస ముండుటకు వీలు లేనట్లే తాళము, స్వరములు మనసులో పెట్టుకొని చేసిన స్వరకల్పనలు మనసును రంజింపజాలవు. రసికుల కాశువువలెనే స్వరము నానందదాయకము కాదు. చిత్రకళా ప్రదర్శనమున చిత్రకారున ప్రథమావసకు సంబంధించిన బహిఃస్వరూపములను (sketches) ప్రదర్శించు టసహ్యము. పదార్థవిజ్ఞానశాస్త్రీయప్రదర్శనములలో ద్రవపదార్థము మట్టము చూచుకొను ననుసూత్రమును బోధించుటకు, U వలెనుండు గాజుగొట్టమున నీరు పోసి రెండుభుజములలోను నీరు సమానమట్టమునకు వచ్చుటను చూపుట సమంజసము కానేరదు. దీన ప్రేక్షకులకు పై సత్యము మనసునకు పట్టదు. అట్లు గాక, జలయంత్రములో, కొళాయిలో చిన్న వస్తురూపమున చేసి చూపినచో శాస్త్రజ్ఞులు కృతకృత్యులు కాగలరు. కాబట్టి ప్రాకృతులకు శాస్త్రసూత్రములు గాక, వ్యవహా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రమున వాటినుండి తయారుచేయు యంత్రములే మోదమునిచ్చును. స్వరకల్పన శాస్త్రము. రాగము శాస్త్రవ్యవహారము. రాగమే గాని (శాస్త్రముగు) స్వరకల్పన ముదాహరణము కాకుండుటచే సభలలో దానికి స్థానమే లేదు.

స్వరకల్పన వలన సంగీతము కళాస్వరూపము నశించి గారడీవిద్య యగుచున్నది. కళారూపమున వేలకొలది జనులను పండితులు, పామరులు, బాలురు, వృద్ధులు ననువ్యత్యాసము లేక హర్షింపజేయు సంగీతము స్వరరూపమున సాధకు మెరింగిన గుప్పెడుమందినిమాత్రము మెప్పించుచున్నది. లలితకళ లన్నిటిలో సంపూర్ణానంద మొసంగు శక్తి గానమునకే యున్నది. అట్టిసంగీతము స్వరరూపమున దుర్గ్రాహ్యము, దుస్సహము, నొటముదాహరణము కాదు. ఏండ్లతరబడి స్వరకల్పన చేసియు గాయకుడు పని చేసి బడలినవారికి విశ్రాంతి నీయలేడు. స్వరకల్పన చేయ మొదలుపెట్టినచో శ్రీకృష్ణునైనను గోవులు పాడిచియుండును. సంగీతమున కున్న జగన్మోహనత్వమును స్వరకల్పన పోగొట్టుచున్నది. పైపెచ్చు క్రమముగా సంగీతమున విశాలమై కళాభాగములను తొలగించు చున్నది. రాజమహేంద్రవరమున నొకనాట్యకర్త "నాదబిందు కళాదీ..." యను కీర్తనలో స్వరకల్పన కొంతవరకు చేసి "ధిత్తకిట—ధిత్తకిట—" మొదలైన జాతులను వాడి పల్లవి నందుకొనుట నారంభించినది. స్వరగానము మురజము ననుసరించిన గానమని ఇందుమూలమున ద్యోతకమగుట లేదా? "గరిస్సనిధ—గరిస్సనిధ" యను స్వరకల్పనలకు బదులుగా నామె మద్దెల జాతులనే వాడినది. ఈపద్ధతి విజృంభించితే గానకళ గతి ఏమికాను?

స్వరగానము గాయకుని యుపజ్ఞను చూపునని కొందరు. ఇటు చూడుడు: "చాలకాలమునుండి వాడుకలోనున్న పల్లవిని సంగీతమునుండి తుడిచిపెట్టుట సమంజసము కాదు. పల్లవి గాయకుని మౌలికత్వమును చూపుచుండును. కాన సభలలో దాని కర్హస్థాన మొసంగి గౌరవించవలెను." 14 అని యొక అయ్యవారు. ఏమి? గాయకుడు రాగాలాపనములో తన కింపు గూర్చునవని తోచిన కళల నుపయోగించలేడా? కీర్తనలలోని చరణములకు తన యిష్టము వచ్చిన సంగతుల నేరి వాడలేడా? ఇది యుపజ్ఞ కాదా? ఐనచో స్వరకల్పన కీ యుపజ్ఞ నాపాదించనేల? అది యటుండ నిండు. స్వరకల్పన వలెనే మురజములోని జాతులు వాడుటకూడ యుపజ్ఞయే. అట్లని దానిని సంగీతములోనికి లాగుదమా? స, రి, గ, మ లతో రాగము పాడుటకూడ యుపజ్ఞయే. కీర్తనలోని సాహిత్యము తీసివైచి స్వరము వాడుటకూడ మౌలికత్వమే. కీర్తననే తప్పించి కేవలము స్వరములోనే పాడుటకూడ మౌలికత్వమే. ఇట్టి మౌలికగుణములు వేనవేలున్నవి. గోరుతో కాగితముపై బొమ్మ వ్రాయుట, జీలుగు బెండుతో విగ్రహములు తయారుచేయుట, ఏకాక్షరములో పద్యము చెప్పుట, వాడినపదమే ముప్పది అర్థములతో వాడుట, తంబుర పై వీణావాద్యము చూపుట, ఇవన్నియు మౌలికగుణములే. వీటి నన్ని కళలలోనికెక్కించెదమా?

స్వరకల్పన సంగీతభాగమనియు, తానము, జావళి మొదలైనవాటి కట్టిస్థాన మున్నదో దీనికి అట్టిస్థానమే కలదని మరికొందరు. రాగాలాపనకు తాళము గమనించవలసిన పనిలేదు. స్వరకల్పనకు గణించవలెను. తాళము నిలుపుచు రాగమునకు కల స్వరసమ్మేళనముల చూపుట స్వరకల్పనపని యని వారివాదము. తాళము నిలుపుచు రాగస్థ స్వరసమ్మేళనమును అకారరూపమున చూపి రంజింపచేయు పద్ధతి నిరావళిలో కనపడుచున్నది. "పాండునృపతి జనక జయ......" యను మహారాష్ట్రకీర్తనలో "పాండునృపతి" యను శబ్దములకు పూర్వము మనవారు వాడు స్వరకల్పనను పోలిన అకారకల్పన యున్నది. (ఇది నిరావళికన్న కొంచెము భిన్నము.) ఇది తాళము నిలుపుచుపాడిన అకారమే. కాబట్టి స్వరకల్పనకీవిషయములో ప్రత్యేకత లేదు. తానము వంటిదే స్వరమని రెండవ వాదము. తానము కృతి ననుసరించి యుండదు. దానికి ప్రత్యేకత్వ మున్నది. స్వరకల్పన కృతిననుసరించి బయలుదేరిన బదనిక. దీనిని ఛేదించినగాని సంగీతాభివృద్ధికి నష్టము గల్గుట సిద్ధము.

---

14. Swarajya.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పల్లవిని మెచ్చుకొనువారియభిప్రాయమును మనము పరీక్షించలేదు. "గాయకుని ధీశక్తిని, కల్పనా సామర్థ్యమును ప్రదర్శించుట కనువైన నాలుగు మార్గముల లోను పల్లవి యొకటి." కావున నది లోభనీయమని మొదటివారి వాదన. ధీశక్తిని మాత్రమే వెలువరించునది కళ కాదు. సంగీతము కళ. కళ కాని దానిని కళలో జొప్పించుట హానికర మను సంగతి అంద రెరింగిన దే.

"ఆరున్నొక్కటి యొనివిఁది,
సారముగను నేడునైదు సలలితమూడుల్,
ధీరత రెండుల్ తొమ్మిది
శ్రీరామా కడకునాల్గు శ్రీరఘురామా."

అను పద్యము ఎటు కూడినను పదిహేను వచ్చు పథకమును 15 సూచించ దు. ఇది కవిత కాదు. అది కళ కాదు. స్త్రీల బొమ్మలతో నేనుగును సరిపెట్టుటకు (ఇట్టి వాంధ్ర పత్రిక యుగాది సంచికలో నచ్చుపడినవి) ధీశక్తి కావలెను. చిత్రకళ కిది లోభనీయ మా? అర్ధగోమూత్రికా బంధము, పాదగోమూత్రికా బంధము, అర్ధభ్రమము, సర్వతోభద్రము, మొదలైనరచనల నేయుటకు ధీశక్తి యవసరము. వీనినన్నిటిని నేయుట కళా నాశమునకు పునాది వేయుటే. 'ధీశక్తి'పనియైనది. ఇక కల్పనా సామర్థ్యము మాటయా? ఈ కల్పన కర్థము లేదు, భావము లేదు; అను ప్రాసలను కుమ్మరించు వక్తృత్వమునకు వలె దీనికి సదా వేళయూ లేదు. భాషా జ్ఞానమూ లేదు. ఇది కళ యగునా? ఇది పూజనీయమా? 'కల్పన' అను మాటకు స్వరకల్పన తగదు. ఇక రెండవ వారి వాదములో స్వరగానము గాయకునికి రాగతాళములను గూర్చిన జ్ఞాన మలవర్చుటకు కనిపెట్టబడినదనే భాగమే విమర్శకు మిగులును. ఇది నిజమే అనుకొందము. ఫలానిది నారాగాలాపనకు సాయము చేసినదని సభలలో మన కేల ప్రదర్శించవలెను. ఇంటి దగ్గిర తన యిష్టము వచ్చినట్లు స్వరములే పాడుకో మనండి, ప్రొద్దుటినుండి సాయంకాలము వరకూ. అంతే కాని సభల కెక్కి కళాకారుడ నను బిరుదు ధాల్చి,

"పదనిప సానిదానిపప పస్సరి సారిస పామగారిసా
సదగద, నీరిసారి దరి సా గరిసానిరిసా రిపా రిసా
గదగద పాదపాద సదగా పదగా నిదగా దగా దగా 16

యని మొదలు పెట్టి ఈ 'దగా'లమన నెత్తిని రుద్ద నేల? సంగీత శాస్త్రమునకు సంబంధించిన స్వరజతులు, అలంకారము లాదిగాగల స్వర భాగములను ప్రదర్శించవలసిన యవసరము గాయకునికున్నదా?

స్వరజతులు, అలంకారము లంటే జ్ఞప్తికి వచ్చినది. మనపూర్వగాన పద్ధతిని తిలకింపుడు. ముందు స్వరజతులు, తరువాత గీతములు, ఆ వెనుక నలంకారములు, అటుపిమ్మట వర్ణములు, పిదప కృతులు, ఆఖరున రాగాలాపనమును సంగీత విద్వాంసులు తమ శిష్యులకు నేర్పుచున్నారు. దీనిని గమనించినచో వ్యవహారగాన పరమావధి రాగమని తేలిపోవుచున్నది అట్టియెడ ప్రస్తుతగాయకులు విరివిగా ప్రయోగించు స్వరకల్పనకు గౌరవ మేల యుంచవలెను? తమకు కలాభిజ్ఞతను వెలువరించ దేవురించు నీగాయకులను, 'గానపండితుల'ను మన మేల బహూకరించవలెను?

ప్రాచీనకాలమున స్వరకల్పన నేయు నాచారమున్నట్లు చెప్పుట కాధారములు లేవు. పల్లవిని సమర్థించుటకు శాస్త్రాధారములు లేవని హరి నాగభూషణముగారు. "ప్రాక్పసిద్ధగాన పద్ధతులలో పల్లవిపాడుట యనుపద్ధతి యొకటిగనపట్టలేదు. తరువాత తాళములతోను,కట్టుదిట్టములతోను తమతమ మనోరథమైన గానశైలిని ప్రకటించుటకై సుమారు రెండు శతాబ్దములకు మునుపు గాయకోత్తము లచే స్వీకరించబడెను." అని వ్రాసారు. అది

15

| | | |
|---|---|---|
| 6 | 1 | 8 |
| 7 | 5 | 3 |
| 2 | 9 | 4 |

16. "గుంటూరి సీమ"లో తిరుపతి వేంకటేశ్వరులు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెట్టి సమయము? బీజపూరు, గోల్కొండ, ఢిల్లీ రాజ్యములు హైందవ నాగరికతను మూలమట్టముగ ఛేదింప కత్తి పట్టిన సమయము. ఆరోజులలో కళాభిమాన మెవరికి? ఆంధ్రకవులు కేవలము పాండిత్యప్రకర్షయే యాదర్శముగా జేసి యాదవరాఘవపాండవీయాది కావ్యముల వ్రాసివేసిన కాలమది. ఆంధ్రుల శిల్పము శిథిలమునందు సమసిపోయిన పాపపు రోజులవే. అట్టి కాలమున కవిత్వమున బంధ, చిత్ర, శ్లేష కవితలవలెనే సంగీతమున మురజము ననుసరించిన గాన ముద్భవించినది. కళాకన్య దేశీయుల రక్తపాతమును చూడలేక పారిపోయిన పాపకాలమునందు పాండిత్యప్రకర్షయే ముఖ్యోద్దేశ్యముగా గాయకు లర్పించిన మహారాక్షసి యీస్వరకల్పన. దీని కొకనియమము లేదు. ఒక్కొక్క డొకపద్ధతిని లేవదీయుచున్నాడు. "తాళ నియమంబులు తప్పక, కల్పనలు చేసి, వచ్చిన సంగతులు రాక, విచిత్రశయ్యలతో, సామర్థ్యమునకు తగినట్లు..." ఇంకేమో పాడవలెనని సుబ్బరామ దీక్షితులవారు.* "పల్లవి పాటకుడు భావ రాగ తాళములకు భంగము సేయ జనదు." అని వేరొకరు. 17 "పాణిపేశల పల్లవి యొక్కటే సక్రమమైన"దని దొరస్వామి అయ్యంగారు. 18 స్వరప్రస్తార సాగరకారు డీ పద్ధతిని వివరించుచు చాల కథ వ్రాసినాడు. ఇం దెవరి ననుసరించవలెను? ఎవరి వాక్యములు ప్రమాణములు? ఈప్రశ్నకు జవాబులేదు. "ఎవరి చిత్తము వచ్చినట్లు వారు"అని గాయకులు. "అది (స్వరకల్పన) ఇటీవల నేర్పడిన దురలవాటు. దీనిని సర్వవిధముల నిరుత్సాహపరుపవలసి యున్నది. నిరావళియే స్వరకల్పనకంటె శ్రేష్ఠమైనది." 19అని బాలసుందరము మొదలియారుగారు.

కర్ణాటక సంగీతమున తప్ప మరిరే యితరదేశ సంగీతమునను స్వరకల్పన సభలలో వినబడదు. ఈలొచ్చు మన మేల యుంచుకొనవలెను. రేడియోవల్ల మనసంగీతమును ఆంగ్లేయు లాదిగా గల ఇతరజాతులు విని స్వరకల్పనను "కర్ణాటకసంగీతమునం దసంబద్ధప్రలాపము" 20అని వ్యవహరింతురు. గాన విశ్వమున ప్రత్యేక ప్రపంచమని చెప్పదగు మనసంగీతమున కీస్వరకల్పన మచ్చవలెనున్నది. దీనివలన రాగరూపమున వెలువరించవలసిన కళలను స్వరరూపమున వెలువరించి గాయకులు తమబరువు తగ్గించుకొనుచున్నారు. ఈయలవాటు వృద్ధిగాంచుచో సంగీతమున కృతులకును, రాగమునకును వ్యాప్తి తగ్గిపోయి స్వరమే వాటిస్థల మాక్రమించుకొనును. కృతిసాహిత్యములో స్వరమును వాడుటే దీని కారంభము. సత్వరముగా దీనికి ప్రతిక్రియ జరుగకున్నచో మోసము సిద్ధము. చరణములకు రస మద్దవలె నన్న రాగమే ముఖ్యము. స్వరకల్పన మానినచో భావ, రాగ తాళముల కట్టిలోపమును వాటిల్లదు. గాయకులు గాంధర్వ విద్యాదర్శముల పాలించ నెంచినచో, "రాల్గరగించువిద్య" యను పరువును సంగీతమున కుంపదలచిన పక్షమున, భావరూపమైన సంగతులనుండి రాగరూపమైన నిరావళికి గళితమైన సంగీతమును తాళరూపమైనస్వరకల్పనకు జారిపోకుండ రక్షించు నాసక్తి ఆంధ్రగాయకుల హృదయములందు వెలుగుచున్నచో, ఆంధ్రగానసభలలో స్వరకల్పన వినబడకుండుగాక! సంగీతము నేర్చుటకు స్వర మెంతయో సహాయకారి. మెప్పించుటకు మాత్రము కాదు. కాబట్టి సభాస్థలిని స్వరకల్పన మదృశ్యమవుటయే గానకళ కభ్యుదయము.

---

17. హరి నాగభూషణముగారు.

18. Swarajya, 5-11-29.

19. Hindu, Tuesday—July, 1929.

20. Rev. Popley: Lecture on Music in Rajahmundry.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తొలకరి

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

[వెనుకటి సంచిక తరువాయి]

నాహృదయావనీతలమునన్ వికసించిన భావపుష్పసం
దోహము దండగ్రుచ్చి వయితు న్నఋతన్ రసభావవల్లరీ
దోహదధూపధూమములు, తోయదపంక్తులు సాక్షిగా మనో
మోహనుడైన ప్రేమమయమూర్తికి గర్షకచక్రవర్తికిన్ !

శా. సంఘం బొక్కెడ రాజకీయమగు నస్వాతంత్ర్య మింకొక్క చ
క్కిం ఘోరంబుగ ని న్నమాయికపు పక్షిం గూట బంధించెబో
జంఘాలత్వము సూపి యీప్రబలపాశవ్రాతముల్ ద్రెంచి యు
ల్లంఘింపంగలవా పయోదములలీలం గర్షకా నీ విఁకన్ !

శా. ఏసందేహము లేల నీకు గను మోయీ కర్షకా! మేఘరా
జీ సంచారములే నిరోధములు గాంచెన్ జూడు మాచక్కి, సం
త్రాసం బించుక లేక వీచెడు జగత్ప్రాణుండు మేల్కాంచి స్వే
చ్ఛా సందేశము లాలకించికొనుమీ స్వాతంత్ర్య మింపారగన్.

శా. హేయంబైన కుజీవనం బిటులు నీ వెన్నాళ్లు సాగించెద
య్యా యార్యుండవు నిన్ను నీ వెఱుగవో యామేఘముల్ చూడుమా
ఆయానందము నాస్వతంత్రతయు నాయౌన్నత్య మాయీవియు
న్నాయావేశము నీకు గ్రొత్త లగునే యావంతలో నెంచినన్ !

మ. నిను నీవే తెలియంగజాలని దశానీచత్వముల్ వట్టి, న
ట్టి నికృష్టంబగు బానిసాన నిను గట్టెం గాక యిన్నాళ్లుగా
నిను నీకున్ తెలియంగ మ్రోయు ఘనసందేశంబు లాలించినన్
వనధుల్ పూడ్చవె పర్వతంబులను బైపై వైచి యెక్కుమ్మడిన్.

సీ. సర్వసర్వంసహా చక్రతలంబు నీ కారయ రత్నసింహాసనంబు,
యటు నిటు వ్రాలి యజాండమును గప్పు నీలాంబరం బరయ ముత్యాలగొడుగు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాయకష్టము సైచి గడియించుకొనెడు సన్మార్గులే నీకు సామంతనృపులు
క్ష్మానేతయును నధికారవర్గంబును గనుగొన పరిచారకవ్రజంబు
కార్మికయుగాధినాథ! స్వాగతము నీకు, కర్మయోగివరేణ్య! స్వాగతము నీకు,
క్ష్మాపురంధ్రీకుమార! స్వాగతము నీకు, త్యాగమయమూర్తి! సుస్వాగతంబు నీకు!

ఉ. కా రధికారు లెవ్వరు నొకండు ప్రభుండన లేడు నీకు, నీ
వారయ సార్వభౌముడవ. యాదువు నీదగు చేతిబిచ్చ మా
ధారము వీరి కెల్ల, వసుధారమణుండును నీకు పెద్దపా
లే రవనిం జరించెడు నిలింపుడ వీవు తలంప గర్షకా!

ఉ. రేలుబవల్లు నాక యిటు తెక్కలు ముక్కలుగాగ జేసి యీ
నేలను సాగుచేయు మహనీయుడ వీ విటు లుండ గాలిపై
గాలిడి కూరుచుండు స్వసుఖప్రియులైన పరాన్నభుక్కు లీ
నేలకు నాథులై నిను గణింప రదేల కృషీవలాగ్రణీ!

చ. లలితఘనాఘనాంత సువిలాసముల౯ వెలయించుచు౯ రసో
జ్జ్వలము, సుధాసమంబునగు భాగవతం బిల నాడ గోరి ని
ర్మలమగు కృష్ణరూప మదె రంగముపై నిను బిల్చుచుండగా
హలధరుడైన నీవు తడయం జన దీయెడ నోకృషీవలా!

చ. చెవి యటు లొగ్గి చిత్తమును జేర్చి వినం దగు నోయి కర్షకా!
ప్రవిమల సత్యసారములు, భావిసుభోదయ రమ్యగీతికల్
భవనవిమోహనంబులు నపూర్వరస ప్రచురప్రబోధముల్
నవయుగధర్మముల్ ఘనఘనాఘన ఘుంఘుణఘోషణంబుల౯.

చ. రసముల బీల్చి క్రౌర్య మది రాజ్యము నేలగ ధర్మవల్లికల్
నసి చెడి వాడ నార్యజనసంఘము డెప్పరమైన డప్పి సా
మ్మసిలబడ౯ సమస్తమును మాడ్చి వెలింగినయట్టి చెట్ట గ్రీ
ష్మసమయ మంతరించె నిక సంతస మందగదయ్య కర్షకా!

చ. పడమటివైపు చూడు మదె పచ్చనిచెట్లకు పై వినీలమై
యడరెడు నాకసంబున నహో, విలువంపుగ నింద్రచాపమే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్పడి పలువింతరంగులు ధరాస్థలిపై వెదజల్లుచున్న ది
ప్పుడమి తనంత స్వర్గ మయిపోయె కనుంగొనుమోయి కర్షకా!

చ. ఇలపయి వర్షబిందువు లివే కనుగొమ్ము విశాలశాద్వల
స్థలమున నాణిముత్తెముల చందము దాలిచి నీపదాంబుజం
బుల కభిషేక మార్చెడు ప్రభుండవు నీవని కష్టజీవనో
జ్వల చరితుండవంచు పతితపావనమూర్తివటంచు కర్షకా!

చ. నింగిని దేలియాడెడు వినీలపయోదములీవి జూచి స
ర్వాంగము లంటి వీచు మృదులానిలు స్వైరవిహార మెంచియు
త్తుంగతరంగశోభ దులదూగు నదీరవ మాలకించి చే
యంగల కార్యమందలి రహస్యము లీవు గ్రహించు కర్షకా!

---


కొలది ప్రతులుమాత్రం ఉన్నవి

# శతక మంజరి (భక్తిసంపుటము)

ఆంధ్రగ్రంథమాలలో మొదటి పుస్తకము

ప్రకాశకులు: కాశీనాథుని నాగేశ్వరరావు

ఈపుస్తకంలో వృషాధిపశతకము, సర్వేశ్వరశతకము, దేవకీనందనశతకము, ఒంటిమిట్ట రఘువీరశతకము, నారాయణశతకము, కాళహస్తీశ్వరశతకము, దాశరథిశతకము, రంగశాయి శతకము, రామతారకశతకము, రామచంద్రశతకము అనే పదిశతకాలు ఉన్నవి. ఒక్కొకశత కానికి దానిని విమర్శిస్తూ ప్రకాశకులు వ్రాసిన మంచిపీఠిక ఉంది. చాలా వ్రాతప్రతులతో సరి చూచి వాటిల్లోనుంచి తీసిన పాఠాంతరాలున్ను ఎక్కించబడినవి.

డిమ్మీసైజు ౨౪౫ పుటలు, మంచికాగితాలు, మేలు బైండు. వెల రు. ౧-౮-౦.
ఈ శతకాలు ఒక్కొక్కటీప్రత్యేకం దొరకును. ఒక్కొకదాని వెల రు. ౦-3-౦.

'భారతి' కార్యాలయము, నెం. 7, తంబు శెట్టివీధి, మదరాసు.


---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పిశాచారాధన మెచ్చట నుండి వచ్చెను?

తేకుమళ్ల రామచంద్రరావుగారు, యం. ఏ., బి. యల్.

౧

బౌద్ధ, హిందూ, క్రైస్తవ, మహమ్మదీయమతములు నాగరకత గలిగిన జనులయం దుద్భవించిన మతములు. ఇవి యిప్పటికి కొన్నిశతాబ్దములనుండి ప్రపంచ భాగముల నాక్రమించి గొప్పగొప్ప వేదాంతములతో నైక్యమూలై మానవుని యైహికాముష్మిక జీవితమునకు బట్టుగొమ్మలై యున్నవి. కాని, ఈ మతములకును, వేదాంతములకును పూర్వము, మానవులు మతమునకును, నొకవిధమగు నింద్రజాలమునకును మధ్యస్థితిలో నుండిరి. దేవతలు, దయ్యములు, పిశాచములు మొదలగు వానిని వారారాధించుచుండిరి. యావత్ప్రపంచమును నిట్టివ్యక్తులచే నిండియున్నదనియు, మానవులకు గలుగు మంచిచెడ్డల కీవ్యక్తులే కారణభూతములనియు వారి యభిప్రాయము. ఈవ్యక్తులను పరితుష్టిగావించుట ముఖ్యావసరమనియు, వీనితోగొందలు స్వల్పసంఖ్యాకులగు మానవులు ప్రసంగింపగలరనియు, ఈ స్వల్పసంఖ్యాకులగు మానవులకు అపరోక్షీకృతములగు నీవ్యక్తులామానవులు చేయుపూజలు, నృత్యము మొదలగు విధానములచేత వారికోరిక ననుసరించి తిమప్రపండతను వెలిపరచుటయో, యుపసంహరించుకొనుటయో గావించుననియు నప్పటి మానవుల గాటమగు విశ్వాసము. నాగరతగల మతముల నవలంబించుచున్న జనసముదాయమునగూడ కొంతవఱకిట్టియూహలు గలవు. ఏ గురువుద్వారముననో, లేక నేక్రీస్తుద్వారముననో, భగవత్సాన్నిధ్యమును బడయగలుగుదుమనియు, దేవతలు మొదలగు వారితోను, పిశాచాదులతోను ముఖాముఖిని మాటాడగల మనుజులున్నారనియు నాగరతగలజను లనేకులు నమ్మెదరు. ఐంద్రజాలికులు, మాయలు, మంత్రతంత్రములు గారడీలు చేయువారు ప్రతిదేశమునను గలరు. భయంకరములగు క్షుద్రదేవతలను, పిశాచములను, దయ్యములనుపూజించువారీనాగరకత గలవారిలో గలరు. కావున నీవ్యక్తులందదు నమ్మకముండుట మానవచరిత్రమునందలి శైశవదశకు సంబంధించిన విషయమేగాక, నేటికిని యావత్ప్రపంచమునను నిలిచియున్న విషయమనుట నిర్వివాదాంశము.

ఈ నమ్మకమింత విరివిగ భూమండలమును నే డాక్రమించుకొనియున్నను, దాని ప్రాముఖ్యము మాత్రమణువునకన్నను స్వల్పమైయున్నది. ఆర్యు లార్యావర్తమును ప్రవేశించినప్పు డనేక దేవతలను వారు ప్రార్థించుచుండిరి. ఆదేవతలందఱును శుభప్రతిపాదకులు, సుఖప్రదాతలు. కాని వారు దయ్యములు, పిశాచములే ముఖ్యారాధితములుగ గలవారు కారు. వా రార్యావర్తమును ప్రవేశించినప్పుడు పిశాచారాధనమునకంటె నెంతయో ముందుకుసాగి మిగుల నాగరకత గలవా రైరనుట చరిత్రయందు ప్రసిద్ధిపడసిన విషయము. కావున ఆర్యుల నుండి యీ యభ్యాసము మనదేశములో జొరబడిన దనుట కాధారములు లేవు.

మనదేశమునందు, ముఖ్యముగా దక్షిణదేశమున అమ్మ వారల యారాధనము కానవచ్చు చున్నది 'అమ్మన్' 'అమ్మన్ కోయిల్' మొదలగు పదములు అరవదేశమున వాడుకలో నున్నవి. సవరలు, ఖాండ్లు, తోడాలు మున్నగు వారిలోను, శూద్రులలోను, వారికంటె నధికముగ నాదిద్రావిడులలోను ఇట్టి వేల్పులు కానవచ్చుచున్నారు. ఏ యిటికరాతికో పసుపుకుంకుములు పూసి, నత్తగుల్లలపేరొకటి తగిలించి, ఏ చెట్టు మొదటనో దాని నుంచి, యొకడబ్బాకుపైన నాణెములు దూరుచిల్లినిచేసి ఆప్రక్కనే పెట్టియుండు తావులు దక్షిణదేశమున ననేకములు మనకు గాన్పించును. ఇంతకంటె కొంచెము స్థితిమంతులగు దేవతలు అగుసులవలె కట్టబడిన ఆగారములలో నుంచబడుచున్నారు. ఇంతకంటెను పెద్ద గుడులునుగలవు. ఎల్లమ్మన్, ముండకన్ని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమ్మల్ మొదలగు దేవతలకు సాధారణముగ నిట్టి పెద్దపడుగులు గలవు. పండుగల సందర్భమున నింతన్యాయము లతోను, డప్పులు, మోతలతోను, గజ్జెల ప్పుల్లతోను, అరపు లతోను కొందఱీ దేవతల నారాధించుచున్నారు. విజ్ఞాన వంతులును, ధనవంతులు నగు వారందఱు నార్య మతావలంబకులైనందున నీగుడు లంతధనవంతములు గావు. విద్యావంతులను, ధనవంతులను నివి యాకర్షించుట లేదు. ఈ అమ్మల్ దైవములు ఈజిప్టునుండియో, ఆస్ట్రేలియానుండియో వచ్చెనని యాధారబలమంతగ లేని యొకయూహ కలదు.

ఇట్లే యాంధ్రదేశమునను అంకాళమ్మ, గంగమ్మ, గంగానమ్మ, నూకాలమ్మ, ఎల్లమ్మ మొదలగు దేవతల గుడులు గలవు. అరవదేశమునందువలెనే యాంధ్రదేశము నను ఈదేవతారాధనము జరుపబడుచున్నవి.

ఈదేవతల ప్రీతికై బలులును, జాతరలును జరుగు చున్నవి. గోదావరి కుత్తరతీరమునను, చెన్నపురికి దక్షి ణమునను ఈజాతరలు మహోత్సవములుగ జరుగు చున్నవి. వీనిని చూచుటకు వేలకొలది ప్రజలు మూగు చుందురు. ఈదేవతల సంతృప్తికొఱకై గరిగెలు తలపై పెట్టుకొని, వానికి కొన్నిరకముల యాకులను——ముఖ్య ముగ వేపాకులనుకట్టి, పసుపుకుంకుమ మొదలైనవానితో నలంకరించి, గజ్జెలు మున్నగువానిని ధరించి భయంకరా కారులైన యొక మనుజు లూరేగుచుండుట మన మెరిగిన దృశ్యమే గదా!

ఇవిగాక మరిడమ్మ, మారెమ్మ యను దేవతలు పల్లెలపై విరుచుకొనిపడుదురను నమ్మకము మనవారికికలదు. మరిడమ్మ అర్ధరాత్రివేళ నల్లకడవ నెత్తిమీద పెట్టుకొని 'చల్లోయమ్మ, చల్లా'యని యరచుచు బోవుననియు, నాశబ్ద మెవరికి వినిపించిన వారు రోగగ్రస్తులై యాదేవత కాహుతు లగుదురనియు నొక గొప్ప నమ్మకము మన పల్లెలలో నిప్పటికిని గలదు. మారికారిజాడ్యములను గలిగించు దేవతల యారాధనము గావించువారును మన వారిలో గలరుగదా!

ఇవిగాక చేతబడులు మున్నగునవి గావించి రోగ ములు, మరణములు తెప్పించువారును గలరు. దేవతలను ప్రత్యక్షము చేసికొని, ఆబలమున కీడు గలిగించుటయో, తొలగించుటయో కొందఱకు సుసాధ్యమని నమ్మువారు మనలో ననేకులుగలరు. కొంద ఱర్ధరాత్రమున శ్మశానము లలో దిరిగి కపాలములతో, కళేబరములతో మంత్ర తంత్రాదుల సాహాయ్యముతో నేవో పూజాదులుగావిం చియు, భయంకరములగు నిట్టికృత్యములననేకములను జేసి యు క్షుద్రదేవతలను తమచేతి కీలుబొమ్మల వలె తిప్పు కొన గలుగుదురని నమ్మక మింకను మనలో ప్రబలి యున్నది.

క్షుద్రదేవతలను, దయ్యములను, పిశాచములను కొలుచుపద్ధతిని మన సౌకర్యార్థమై 'పిశాచారాధనము' అనియీవ్యాసమున పేర్కొందును.

భారతదేశములో నిట్లు కొంతవఱకు వ్యాప్తమై యున్న పిశాచారాధన మెచ్చటనుండి వచ్చినది? మన దేశములోనే పుట్టి యితరదేశములకు వ్యాపించినదా? నీగ్రోలదా? ముండా జాతివారిదా? ఈజిప్టునుండి వచ్చి నదా? సిథియన్ జాతులనుండి వచ్చినదా? మంగోలు లదా? లేక ఇన్నిజాతుల వారిపూర్వులు మానవచరిత్రము నందలి శైశవదశలో నుండగా వారందఱును నమ్మినదా? లేక మన దేశమున వ్యాప్తమైయున్న పిశాచారాధనము నందలి యొక్కొక్కభాగ మొక్కొక్కదేశమునుండి వచ్చి దిగుమతియైనదా?

ఈ ప్రశ్నముల కిచ్చు ప్రత్యుత్తరములు సరియగు పరిశోధనముపై నాధారపడియుండవలెను. ప్రపంచము నందలి యేయేభాగములం దీయారాధనములన్నియుగాని, కొన్నిగాని, వాని యంశములుగాని యెప్పు డెప్పుడభ్యాసరూపమును దాల్చియుం డెనో తెలిసికొనవలెను. ఆ యభ్యాసములందే యేయం శములకే యేవిధానము లవలంబింపబడుచుండెనో బాగు గ తెలిసికొనవలెను. లేనిచో పరిశోధన విజ్ఞానవంతము కాజాలదు. కాని యిది తెలిసికొనుటకు మనకు గల యాధారములు చాలకొలదిగ నున్నవి. మసకమసకగనో,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేక మఱికొంచెము విశదముగనో మనకు గొన్ని యంశములు బోధపడినను, ఈపిశాచారాధనమునందలి యావత్తు తంతు తెలియుట కష్టము. కావున నిప్పుడు ప్రపంచమున నేభాగమ నందైనను పిశాచారాధన మే మతముగ గల జనసముదాయము గలదా? యని నేను పరీక్షింప నారంభించితిని. అట్టి వా రున్నచో మునుపటికన్న పెక్కురెట్లు విశదముగ మన కీవిషయము బోధపడుటకును, పరిశోధనము కొంత సులభసాధ్యమగుటకును వీలేర్పడు నని నాయభిప్రాయము.

ఉత్తర ఆసియాయందు సైబీరియా యనునొక దేశము గలదు. ఇది ప్రస్తుతము రష్యావారి యేలుబడిలో నున్నది. ఈ సైబీరియాకు తూర్పుభాగమున ఉగ్రోఫిన్నులు, టుంగుసీలు, మంగోలియన్లు, కొందఱు తుర్కియులును గలరు. వీరందఱును చాలకాలము పిశాచారాధనమునే గావించుచుండిరి. కాని, బౌద్ధ, మహమ్మదీయ, గ్రీక్, క్రైస్తవ మతములు వీరిలో కొందఱను ఆకర్షించుకొనెను. ఈకారణముచే ప్రస్తుతము టుంగుసీలలోను; బైకాల్ సరస్సునకు పడమట నివసించుచున్న బుర్యాతులలోను; సాజాక్, ఆల్టాయ్ పర్వతములందలి టార్టార్ జాతికి చెందిన కొన్ని తెగలలోను; సామోన్ తెగల వారిలోను ఈయారాధనము వ్యాపించి యున్నది. టుంగుసీ జాతికి చెందిన మంచూలును, బైకాల్ సరస్సునకు తూర్పునను, దక్షిణమునను నివసించు బుర్యాతులును బౌద్ధమతస్థులు ఉత్తరసైబీరియాలోని యకూట్లు క్రైస్తవులు. కొందఱు టార్టార్లు మహమ్మదీయులు. కాని వీరియం దందఱిలోను పిశాచారాధనము ప్రబలముగనే యున్నది. కాలక్రమమున నితర మతముల ప్రాబల్యమున నీపూర్వసంప్రదాయము కృష్ణపక్షమునందలి చంద్రుని వలె క్షీణించుచున్నది. కొలది సంవత్సరములలో ప్రపంచమున నిది ప్రస్తుతపు వ్యక్తిత్వమును గోలుపోవును.

సగమింద్రజాలమును, సగము పిశాచారాధనమును గల యీమతమునరాని 'మతము'నకు 'షమనము' అను నామము నొసంగబడెను. ఈ 'షమనము' అను పేరు 'షమన'నుండి పుట్టినది. ఈజనుల పూజాది స్థానములకు ప్రతినిధిగ, పూజారిగ, గురువుగ, నధికారిగ నుండువాడు 'షమనుడు'. ఈశబ్దమునుండి 'షమనము' అను పేరు పుట్టినది. సంస్కృతమునందలి 'శ్రమణ'(పాలి: శమన॰ సన్యాసి) అను పదమే 'షమన' అయ్యెనని యొకవాదము గలదు కాని, మంచూభాషలోని 'షమక్' అను పదము యొక్క మఱొకరూపమే యీ 'షమన' శబ్దమున కాధారమని కొందఱు విద్వాంసులు తీర్మానించిరి. మంచూ భాషలోని యీ మాటకు 'ఆవేశపూరితుడు' అని యర్థము. ఈ 'షమను'లందఱు నావేశపూరితులై యొడలు మఱచినట్లు 'మతి' నిధానములందు నృత్యాదులను చేయుదురు గావున వీరి కీపేరు గలిగెను. ఒకవిశేషమేమనగా, నీపేరు టుంగుసీలలో మాత్రమే కానిపించుచున్నది. బుర్యాత్, యాకూట్, ఓస్ట్యాక్, సామోన్, టార్టార్ వా రితరపదముల నుపయోగించుచున్నారు.

పైన పేర్కొనబడిన వారిలో, నొక్క టార్టారులలో దప్ప, నందఱిలోను స్త్రీలుగూడ 'షమనులు'గ నుండవచ్చును. అమూర్ నదీప్రాంతములందలి గోల్డులలోను, కామస్కాట్లాలోని కాంచడేలులలోను స్త్రీలుగూడ 'షమనులు'గ నుందురు. కొన్ని యంశములను బట్టి మన మాలోచించుచో షమనత్వమునకు పురుషులకన్న స్త్రీలే ముఖ్యులని మనకు గోచరించును. పెటగోనియాలో పురుషులగు 'షమనులు' స్త్రీల యుడుపులను ధరించుట యవసరమైయున్నదని ల్యాంటిమర్ అను నతడు వ్రాసెను. కాల్మిక్ జిల్లాలోని గూహల్లలో పురుషులగు షమనులు స్త్రీలు ధరించు నుడుపులనే ధరింపవలెను స్త్రీలవలె వారు నడిపాపిడి తీసి జుట్టు దువ్వుకొందురు. సాధారణ షమనునకన్న నించుక యధికమగు శక్తి యెవ్వనికి గలదో ఆషమనుడు స్త్రీవలె శిశువులను గనగలడనియు, ఏషమనుడైనను మృగములను, పక్షులను గనగలడనియు అనాయసలపు నా ప్రజల విశ్వాసము. (శిరోషెవిస్కీ అను పండితుడు పై ప్రకారముగ వ్రాసెను.)

విశ్వమునుగూర్చి అన్ని జాతుల షమనులకు నించుమించుగ నొకేయభిప్రాయము గలదు. ఊర్ధ్వ, మధ్య, అధోలోకములను మూడులోకములు గలవు. ఊర్ధ్వలో మన సుఖుల పదునేడు లోకములు గలవు. అక్కడ నెప్పుడును వెలుతురు ప్రకాశించుచుండును. ఆ పదునేడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోకములందును మానవులకు మంచిచేయు దేవత లుందురు. మధ్యలోకము భూలోకము. దీనిక్రింద ఏడు లేక తొమ్మిది అధోలోకములు [1] ధ్వాంతమయములై యుండును. అచ్చట దయ్యములు, పిశాచములు నివసించుచుండును. ఎల్లప్పుడు మానవుల కివి కీడుచేయ బ్రయత్నించుచుండును. ఇక ప్రపంచ సృష్టి కారంభ మెట్టిదనిన,—

మొట్టమొదట ప్రపంచమంతయు నొకేనీటిమయము. అప్పుడు భూమిగాని, లోకములుగాని, సూర్యచంద్రులుగాని లేరు. పారములేని ఆజలమున 'కైరకన్' అనునాదిదేవుడు నివసించుచుండెను. [2] కొంతకాలమున కాదేవుడు తనవంటి రూపముగల యొకనిని ('కిషి'=మనుష్యుడు) సృజించెను. [3] 'కిషి'యు, కైరకన్ దేవుడును నల్లని నీటిబాతులరూపములతో నపారమగు నాజలమున చరించుచుండిరి! ఇట్లుండగా 'కిషి' కి కైరకన్‌ను మించవలెనని బుద్ధిపుట్టెను. ఈకారణముచే ఎగురుశక్తి నశించినవాడై 'కిషి' నీటిలో మునిగిపోయెను. దేవు డాతనియందు దయతలచి మునుగకుండ నాతడు నివసించుటకుగాను ఆ నీటియధోభాగమునుండి కొంతభూమిని పైకి తెమ్మని యాజ్ఞాపించెను. కాని 'కిషి' కొంతభూమిని నోటిలో దాచుకొనెను. నీటినుండి 'కిషి' పైకి వచ్చుటతోడనే నోటిలోని భూమిత్రివిక్రమునివలె పెద్దది కాజొచ్చెను. ఊపిరి యాడ లేదు. దేవు డాతనియెడ దయ తలచుటచే నాతడది యుమ్మివైచెను. ఆభూమి ముక్కముక్కలుగ పడి బురదతో కాలుపెట్టిన జారు చిరు కొండలుగ నేర్పడెను. కైరకన్ సృష్టించిన భూమి పైదానముగను రహస్యముగ నుండెను. దేవునకు కోపము వచ్చి 'కిషి'కి ఎర్లిక్ అను పేరు పెట్టి చీకటిలోనికి తరిమివేసెను. అచ్చట నతడు నరకాధిపతి యయ్యె [4]. ౪ అధోలోకములలో మూడవది యాతని నివాస మయ్యెను. కైరకన్ మానవుని బుద్ధిహీనునకు వెగటొంది అన్నిటికంటె నెత్తుననున్న పై పదునేడవ లోకమున తనని వాస మేర్పరచుకొనెను.

అధోలోకములోని దయ్యములతోను, పిశాచములతోను చేరి ఎర్లిక్ కైరకన్ నివాసమువలె తా నొక నివాసము నిర్మించుచుండగా, కైరకన్ దానిని ముక్కముక్కలుగ భేదించెను. ఆముక్కలు భూమిమీద పడి పర్వతములు, లోయలు నేర్పడెను. ఎర్లిక్ అధోలోకములలో నట్టడుగు లోకమునకు పోవలసినవాడయ్యెను.

కైరకన్ నుండి దేవతలు జన్మించిరి. అందు బయ్‌ ఉల్గన్ పై పదునారవ లోకవాసి. కైసగన్ తొమ్మిదవ లోకమునను, మెర్గెన్ ఏడవ లోకమునను నున్నారు. ఏడవ లోకమున సూర్యుడును (స్త్రీ-తల్లి), ఐదవలోకమున చంద్రుడును (పురుషుడు—తండ్రి) నున్నారు. బయ్‌ఉల్గన్ కుమారు లిరువురును మూడవ లోకమున నున్నారు. ఇచ్చటనే ప్రాణమున కుత్పత్తికి నాకరమైన [5] పాలసముద్ర మున్నది; [6] దేవతలపర్వతము లున్నవి; పుణ్యాత్ములుండు స్వర్గలోక మున్నది. ప్రజలు కష్టములలో నున్నప్పుడు, పుణ్యాత్ములై స్వర్గముననున్న

1. మహమ్మదీయమతమునందు ఏడు ఊర్ధ్వలోకములు, ఏడు అధోలోకములు గలవు. హిందువులలో కూడ మల్లోకములును, ఏడూర్ధ్వలోకములును, ఏడధోలోకములును గలవు. బౌద్ధమతమున ననేకములగు స్వర్గములును, ననేకములగు నరకములును గలవు.

2 హిందువుల యభిప్రాయము దీనితో సరిపోవుచున్నది.

3 క్రైస్తవులయొక్కయు, యూదులయొక్కయు నభిప్రాయముతో నిది సరిపోవుచున్నది.

4 పార్సీల'ఇమ'(యమ) అనువతడు ఎర్లిక్‌వలెనే మొట్టమొదటిమనుష్యుడు. హిందువుల యముడునరకాధిపతి.

5 హిందువుల మతగ్రంథములందు పాలసముద్రమునుగూర్చియు, అందు ప్రాణమున కాకరమగు నమృతము పుట్టుటనుగూర్చియు విరివిగ కలదు.

6 గ్రీకుల దేవతలు కొండలపై నుండిరి. మేరుకైలాసాది పర్వతములు మన విష్ణు, శివాదులకు నిలయములు. మన కిన్నరులు, గంధర్వులు కొండలలోను, లోయలలోను తిరుగుట గ్రంథ ప్రసిద్ధము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్వులు దేవతలతోఁ జెప్పి తమ సంతతివారిని కష్టముల నుండి గట్టెక్కింతురు.

ఈ యూర్ధ్వలోకములకు క్రింద 'జెర్స' అను లోక మున్నది. ఇదియే మనము నివసించుచున్న భూలోకము. అనేకులగు చిన్నచిన్న దేవత లీ భూలోకమున గలరు. వారి కృషివలననే భూలోకము సమృద్ధముగు చున్నది. భూమికి నట్టనడుమ, అనగా నాభిదేశమున, కైరకన్ వంటి బలశాలియు సమర్థుడునగు జోకన్ నివసించును. ఈతని దగ్గర పదునేడు సముద్రములకును, పదునేడు పర్వతములకును నాథులగు పదునేడుగురు దేవతలుందురు. పదునేడు సముద్రములును కలియుచోట మహాసముద్రనాథు డొకడు గలడు. ప్రజానాథుం డగు అల్టాయ్‌కన్ అనునొక దేవుడుకూడ కలడు. ఊర్ధ్వలోక నివాసులగు దేవతలవలెనే భూలోకనివాసులగు నీదేవతలును మానవునికి మంచిని చేయుటకే ప్రయత్నించుచుందురు.

ఎర్లిక్కును పాతాళమునకు పంపిన పిమ్మట కైరకన్ భూలోకమున ప్రజాసముదాయము నుద్భవింప జేయబూనెను. అతడు పెద్దవృక్షమును, తొమ్మిది శాఖలతో నొప్పుదానిని, సృష్టించెను. అందలి యొక్కొక శాఖనుండియు నొక్కొక మానవు డుద్భవమయ్యెను. ఈ తొమ్మండుగురికి 'సోమో' అనుపేరు గలదు. వీరు మానవసంతానమునకు కారకులై సర్వదా తమవంశముల వారిని రక్షించుచుందురు.

మధ్యవర్తిగాని, పూజారిగాని యవసరము లేకుండనే ఎవరికి వారు భూలోక దేవతలను పూజింపవచ్చును. అనగా, ఏచెట్టుకో, ఏపుట్టకో, ఏగోడకో యింతపసుపు కుంకుమ పూసి మనవా రారాధనలు చేయునట్లే చేయవచ్చునని యూహింపవలెను. కాని ఊర్ధ్వలోకమునందును, అధోలోకమునందును ఉన్న దేవతలను, పిశాచములను, దయ్యములను ఆరాధించుటకు మధ్యవర్తి యొక డవసరము. ఈతడే షమనుడు.

అధోలోకమునందు దయ్యములును, పిశాచములును నివసించును. ఎర్లిక్ నుండి యివి బయలుదేరి మానవుని శత్రువులై అదృష్టహీనత, దారిద్ర్యము, మృత్యువు, పాపము మున్నగు ననేక కష్టములు మానవునికి గలుగునట్లు చేయును. పుట్టుకనుండి చావువఱకు దేవతలకును పిశాచాదులకును మానవుని విషయమై గుద్దులాట జరుగుచునే యుండును. మానవుడు పుట్టగనే బయ్‌ఉల్గన్ మంచి దేవతను పాలసముద్రమునందలి ప్రాణప్రదములగు క్షీరములతో పంపి, యెల్లప్పుడు నాతనికి సన్మార్గము చూపుచు కాచియుండుమనును. ఎర్లిక్‌కూడ ఒక పిశాచమును ఎప్పుడు నాతని తప్పుత్రోవల లోనికి పోనిమ్మని పంపును. మానవుడు చనిపోయిన వెంటనే ఆత్మ ఎర్లిక్‌కడ కేగును. అచ్చట మనచిత్రగుప్తునివలె, నాతని జీవితాంతమువఱకు గనిపెట్టియుండిన దేవతయు, పిశాచమును నాతని పుణ్యపాపముల నేకరువుపెట్టును. హిందువుల యమునివలె షమనుల ఎర్లిక్‌గూడ న్యాయాధికారిపని నిర్వహించువాడై, పాపముకన్న పుణ్య మధికమగుచో నా యాత్మను మూడవయూర్ధ్వలోకమునందలి స్వర్గమునకు బంపును. పాప మెక్కువ యగుచో తెకతెకకాగు తారుకుండులో వానిని బడవైవ నుత్తరు విచ్చును. 1

ఒక మంచి దేవతయు, నొక చెడ్డదేవతయు ప్రతి మానవుని జీవితాంతమువఱకు నాతని కాచియుండి పాప పుణ్యముల లెక్క వ్రాసిపెట్టుట యూదులయొక్కయు, మహమ్మదీయుల యొక్కయు గ్రంథములందు కానవచ్చును. చూడుడు: (1) "ఇరువురు దేవతలు-ఒకరు మంచివారు, ఒకరుచెడ్డవారు – ప్రతిమానవుడు గుడినుండి సబ్బాతు దినమున నింటికి వచ్చునప్పు డాతనితో వత్తురు."—టాల్మూడ్ సబ్బాతు, 119. (2) "మానవుని వెంబడించు నీరెండు దేవతలును ఆతని వర్తనమును తెలుపుదురు.—టాల్మూడ్: హగీగా, 16.

1 పార్శీల జోరాస్ట్రియన్ మతమునందలి అహిర్మన్ అను నతనికిని, షమనుల ఎర్లిక్‌కును చాల పోలిక కానవచ్చుచున్నదని ఐ. ఎం. కాసనోవిక్జ్‌గారు వ్రాయుచున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహమ్మదీయులలో కూడ నీయభిప్రాయము కలదు. పుణ్యము వ్రాయుటకు కుడిప్రక్కను, పాపము వ్రాయుటకు ఎడమప్రక్కను ఇరువురు దేవతలు మానవునితో నుందురు. (1) ఖొరాన్ సుర, xiii, 12 లో: "ప్రతిమానవుని ముందును, వెనుకను చాలమంది దేవదూత లుందురు. అల్లాయొక్క ఆజ్ఞానుసారము వీరు మానవుడు చేయు కార్యములను కనిపెట్టి చూచుచుందురు" అనియు, (2) ఖొరాన్ సుర, L, 16 లో: "మానవుని కనిపెట్టుటకు పంపబడిన ఇరువురు దేవతలును అతని కుడి ఎడమప్రక్కల కూరుచుండి మానుకొనునప్పుడాతడొక్క ముక్కయైనను ఉచ్చరింప జాలడు" అనియు లిఖితమై యున్నది.

మనుల యొక్క యీపై యభిప్రాయములను గమనించినచో, ప్రకృతియందలి వివిధములగు శక్తుల నన్నిటి నొక వేదాంత సూత్రముతో నేకముగ చేర్చి ఊర్ధ్వాధోభేదములతో మంచి చెడ్డ యను భేదములను గలిపి ఈ రెండిటినడుమను మానవుడు వసించుచున్నాడని వారు ప్రతిపాదించినట్లు విదితమగుచున్నది. మానవుడు ప్రకృతిని చూచి యందలియద్భుతములకచ్చెరువందివానిని దిగ్భ్రమతో, భక్తితో చూచుట మతమునకు ప్రథమ సోపానమని కీ. శే. కేశవ్ చంద్రసేన్ గారు వ్రాసియున్నారు. ఈప్రకృతి శక్తుల యారాధనముతో పాటు మన 'మతస్థు'లలో మఱొక విశేష ముండుటయే మన ప్రస్తుతాంశమునకు మిక్కిలి ముఖ్యమగు విషయము. మంచి గావించు శక్తులకు—అనగా, దేవతాదులకు—మానవుడు తనకు మంచి సంభవింపవలెననియు, హానిగావించు శక్తులకు—అనగా, పిశాచములకు దయ్యములకు—మానవుడు తనకు హాని తప్పిపోవలెననియు పూజలు, బలులు మొదలగునవి సమర్పించును. మానవుని శైశవావస్థయం దీయభిప్రాయము సర్వవ్యాప్తమై యున్నది. కాని మంచి చేయు శక్తులను—అనగా, దేవతలను—సంతృప్తిపరచుట విధాయకము కాదనియు, చెడ్డశక్తులను—అనగా, పిశాచాదులను—తృప్తి నొందించుట అత్యావశ్యకమనియు మన 'మతస్థు' లొక్కరే నమ్ముచున్నారు. ఏలయన: మంచి చేయు వారు మంచి చేయుదురు; దానివలన మనుజుల కిబ్బంది లేదు: కాని చెడుగు గావించువారారాధనతో సంతృప్తులు గాకున్నచో హానిసంభవించును; హాని చేయుట వారి నైజముగావున దానిని మానవుడు తప్పించుకొనవలెను. ఈకారణముచే మన 'మతస్థు'లలో పిశాచాద్యారాధన మధికమగు ప్రాముఖ్యమును దాల్చెను.

ఈయారాధన మెవనికి వాడుగాని, యేకుటుంబమునకాకుటుంబమువారుగాని చేసికొనుచో నెటుపోయి యెటు వచ్చునో యను భయము మిక్కుటముగ నుండుట మనకు సుబోధమగు సంగతియే. ఈకారణముచే మధ్యవర్తు లవసరముగ నుండితీరవలెను. కావున కొన్నికుటుంబములవారో, దేవతలచే నిర్దేశితులగు మనుజులో, మంత్రతంత్రములను, ప్రార్థనాదులను, బలివిధానములను, కట్లను, నృత్యములను, గంతులను, పాటలను, కూతలను, డప్పువిద్యను మొదలగువానిని బాగుగ నేర్చినవారై కొంతకాల మభ్యాసముచేసిను, ఇంకను కొన్నిసంప్రదాయసిద్ధములగు నడవడులచేతను తరిఫీదునడసినవారై, యీమధ్యవర్తిత్వమును గ్రహింతురు. ఇట్టివారేగాని యన్యులగు మానవులు పిశాచాదులను ముఖాముఖిని దర్శించుట కూడనిపని. ఈ మధ్యవర్తిని 'మను'వందురు. ఈ 'మనుత్వము'ను, పిశాచాద్యారాధనమును మన 'మతము'నకు మూలస్తంభములై యున్నవి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# డొమినియను ప్రభుత్వము - కెనడా

దిగవల్లి వేంకట శివరావుగారు, బి. ఏ., బి. యల్.

బ్రిటీషు సామ్రాజ్యమున మొదట వలస రాజ్యములుగ నుండిన కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూఫౌండ్లాండు, న్యూజీలాండ్ రాజ్యములును, మొన్న మొన్నటివరకు నింగ్లాండు రాజ్యముతోపాటుగ పరిపాలింపబడుచు వేరుపడిన ఐర్లాండుదేశమును నేడు బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగ స్వతంత్రరాజ్యములుగ నున్నవి. వీని పరిపాలనా విధానమునకే "డొమినియను" ప్రభుత్వమని పేరు. ఈ రాజ్యములెల్ల బ్రిటీషు సామ్రాజ్యములోని వేరింటి కాపురములని చెప్పవచ్చును. ఇవి బ్రిటీషు పతాకముక్రింద, చక్రవర్తిగారి పరిపాలనమున జేరియున్న వనుమాటయేగాని వీని యాంతరంగిక వ్యవహారములపైన బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమున కెట్టి యధికారమును లేదు. వీనికి సంపూర్ణ నిర్నిరోధ స్వరాజ్యము కలదని చెప్పవచ్చును. ఈ డొమినియను ప్రభుత్వరాజ్యాంగ తత్త్వము నెఱుగవలెనన్నచో నీదేశముల పరిపాలనా విధానము నెఱిగి తీరవలెను.

కెనడా రాజ్యము అమెరికాఖండపు టుత్తరపుభాగమున నున్నది. ఈరాజ్యమున డొమినియను ప్రభుత్వము ౧౮౬౭వ సంవత్సరములోస్థాపింపబడినది. నేడు కెనడారాజ్యమున క్విబెకు, ఒనటారియో, నోవాస్కాటియా, న్యూబ్రంస్విక, ప్రిన్సు ఎడ్వర్డు ఐలెండు, మనిటోబా, సస్కాచేవన్, ఆల్బర్టా, బ్రిటీషు కొలంబియా, యూకన్ అను రాష్ట్రములు కలవు. కెనడారాజ్యముయొక్క వైశాల్యము ౩,౬౫౪,౦౦౦ చతురపు మైళ్లు. ఇందలి జన సంఖ్య రమారమిగ ౯౦ లక్షలు.

కెనడా రాజ్యాంగమున కార్యనిర్వాహకాధికారము (Executive) శాస్త్రప్రకారము చక్రవర్తిగారి యందు కలదు. ఆయన ప్రతినిధియగు గవర్నరు జనరలే ముఖ్యపరిపాలకుడు. ఈ గవర్నరు జనరలుకు సహాయముగ నొక "ప్రీవీ కవున్సిలు" సభ యుండును. గవర్నరు జనరలే దీనిలోని సభ్యులను నియమించును. ఈ ప్రీవీ కవున్సిలులోని ముఖ్యమంత్రులే కార్యనిర్వాహక సభగ నేర్పరుపబడుదురు.

కెనడారాజ్యమున శాసన నిర్మాణాధికారము (Legislative power) చక్రవర్తి గారు, సెనేటు సభయు, కామన్సుసభయు కలసిన "పార్లమెంటు" అను రాజ్యాంగమున గలదు. సెనేటుసభలో ౯౬ గురు సభ్యు లుందురు. వీరు గవర్నరుజనరలువారి యావజ్జీవ సభ్యులుగ నియమింపబడుదురు. ఒక్కొక సభ్యునికి నాలుగువేల డాలరుల విలువగల ఆస్తి యుండవలెను. సభ్యులు ముప్పదియేడుల వయస్సు కలవారుగ నుండవలెను. వీరికి సాలుకు ఇరువదియైదువందల డాలరులు వేతనముగ నీయబడుచుండును. కామన్సుసభలో ౨౩౪ గురు సభ్యు లుందురు. ఒక్కొకమారు కామన్సు సభ కూడినప్పుడు (Session) మొత్తముగ నిరువదియైదువందల డాలరుల చొప్పున నొక్కొక కామన్సుసభ్యునికి వేతనమీయబడును. సభకు హాజరుకాని సభ్యుల వేతనమున మినహాయింపు చేయబడుచుండును. వివిధరాష్ట్రముల యొక్క జనసంఖ్యనుబట్టియు, విస్తీర్ణమును బట్టియు నాయా రాష్ట్రములు కామన్సుసభకు పంపు ప్రతినిధుల సంఖ్య నిర్ణయింపబడుచుండును.

కెనడా డొమినియను పార్లమెంటుయొక్కయు, రాష్ట్రముల శాసనసభలయొక్కయు అధికారములు ౧౮౬౭ సంవత్సరమున కెనడా డొమినియను ప్రభుత్వమునుగూర్చి బ్రిటీషు పార్లమెంటువారు శాసించిన చట్టమున ౯౧, ౯౨ సెక్షనులలో నిర్ణయింపబడియున్నవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౯. వసెక్షను:—చక్రవర్తిగారికి కెనడారాజ్యపు సెనేటు యొక్కయు, కామన్సుసభ యొక్కయు సలహాతోను, అంగీకారముతోను కెనడా దేశముయొక్క శాంతికి, క్రమపరిపాలనకు, సత్ప్రభుత్వమునకును ఈ చట్టమువలన రాష్ట్రీయశాసనసభకు ప్రత్యేకముగ నొసగబడిన విషయములందు తప్ప తక్కిన విషయములందెల్ల శాసనముల జేయుట కధికారము కలదు. ఇంకను స్పష్టముగా నుండుటకు, ఈ దిగువ నుదాహరింపబడిన విషయములనుగూర్చి శాసనములు చేయుటకు సంపూర్ణాధికారము పార్లమెంటునకే కలదు:—

౧. రాజ్యముయొక్క ఋణము, ఆస్తి.

౨. వర్తకము, వ్యాపారమునుగూర్చిన నియమములు.

౩. పన్నులు విధించుటమూలముగ ఆదాయమును సమకూర్చుట.

౪. రాజ్యముయొక్క పరపతిపైన ఋణములు తెచ్చుట.

౫. తపాలావ్యవహారములు.

౬. జనాభా, ప్రజలస్థితినిగూర్చిన వృత్తాంతములు.

౭. సైన్యము, సైనికవ్యవస్థ, నౌకాదళము, దేశరక్షణము.

౮. కెనడా ప్రభుత్వముయొక్క ఉద్యోగుల వేతనములు, బత్తెములు.

౯. సముద్రమార్గ దర్శకసాధనములు: తీరమునందలి దీపములు, దీపస్తంభములు, ప్లవలు (Buoys) (అనగా సముద్రమునందు రాళ్లు మున్నగునవి యున్నచో గుఱుతుకొరకు తేలునట్లు వేసియుంచునవి), సేబిల్ ఐలెండు.

౧౦. నౌకావిషయములు, నౌకాయానము.

౧౧. "క్వారంటైన్"—అనగా నౌకలలో నంటు రోగము లున్నవని యనుమానము కలిగినచో నావలను రేవులలో నిరోధించుట; నావికుల వైద్యాలయములు.

౧౨. సముద్రతీరము, దేశములోని మత్స్యాశ్రయములు (Fisheries), చేపలవర్తకము.

౧౩. ఒకరాష్ట్రమునకు నింకొకరాష్ట్రమునకును మధ్యగాని, రాష్ట్రములకును బ్రిటీషువారి దేశములకును మధ్యనుగాని, రాష్ట్రములకును ఇతరదేశములకును మధ్యనుగాని ఉండు 'బల్లకట్లు'.

౧౪. నాణెములు, చెలామణి (Currency).

౧౫. బ్యాంకులు, వానిస్థాపనము; కాగితపు ద్రవ్యము.

౧౬. సేవింగ్సు బ్యాంకులు.

౧౭. ఎత్తురాళ్లు, కొలపాత్రలు.

౧౮. హుండీలు, చెక్కులు, ప్రామిసరీనోట్లు.

౧౯. వడ్డీ.

౨౦. దేశవ్యవహారములందు తప్పక చెలామణియగునట్లు ప్రభుత్వమువారు నిర్ణయించు ద్రవ్యము (Legal Tender).

౨౧. దివాలా.

౨౨. పరిశోధనలందును, క్రొత్తవస్తువుల స్వరూపస్వభావములందును ప్రజలకు గల హక్కు—వీనికే "పేటెంటు" (Patent) అందురు— వీనిని రక్షించుట.

౨౩. కాపీరైటు స్వామ్యములు: గ్రంథములందు, పత్రికలందు, ఇతర వస్తువులందును సర్వస్వామ్యములను రక్షించుట.

౨౪. కెనడా దేశములోని తెల్లవారుగాక యెఱ్ఱ యిండియను లను నాదిమవాసుల యోగక్షేమములు: వారి కొరకు నిర్దేశింపబడిన భూములు.

౨౫. పరదేశీయులు, వారికి సౌకర్యము నిచ్చు నధికారము.

౨౬. వివాహములు, వివాహబంధ నిర్మూలనము (విడియాకు లిచ్చి భార్యాభర్తలను వేరుచేయుట).

౨౭. దండనస్మృతి: క్రిమినలు ధర్మపరిపాలనము చేయు న్యాయస్థానముల నిర్మాణపద్ధతి గాక ధర్మాచరణ పద్ధతులు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨౮. ప్రాయశ్చిత్త కారాగారములు (Penitentiaries) స్థాపించుట, పోషించుట, పరిపాలించుట.

౨౯. ఈ చట్టమువలన రాష్ట్రీయశాసనసభలకు మాత్రమే అధికార మీయబడిన విషయములలో స్పష్టముగ ప్రత్యేకింపబడినట్టివి.

౯౨ వ సెక్షను: ప్రతిరాష్ట్రీయశాసనసభయు నీ క్రింద నుదాహరింపబడిన విషయములను గూర్చి శాసనములను జేయవచ్చును:—

౧. రాష్ట్రపరిపాలకుని (లెఫ్టినెంటుగవర్నరు) యొక్క ఉద్యోగమునుగూర్చి గాక తక్కిన రాష్ట్రీయ రాజ్యాంగమును గూర్చి అప్పుడప్పుడు కావలసిన మార్పులు చేయుట.

౨. రాష్ట్రీయవ్యవహారములకొరకు ధనము సమకూర్చుటకు రాష్ట్రమున పన్నులు విధించుట.

౩. రాష్ట్రము యొక్క పరపతి పైనవె అవసరమైన ఋణములు చేయుట.

౪. రాష్ట్రీయోద్యోగులను నియమించుట, వారి యుద్యోగకాల నిర్ణయము, వారికిచ్చు వేతనములు.

౫. రాష్ట్రముయొక్క 'సర్కారు' భూములు, వాని అమ్మకము.

౬. రాష్ట్రమునకు గావలసిన కారాగారములు, సంస్కరణకారాగారములు (Reformatory Prisons)

౭. నావికుల వైద్యాలయములు గాక రాష్ట్రమునందలి వైద్యాలయములు, శరణాలయములు, ధర్మసంస్థలు, దానములు.

౮. పురపాలకసంస్థలు.

౯. రాష్ట్రప్రభుత్వమునకు, పురపాలక స్థానిక సంస్థలకును ధనము సమకూర్చుటకు, అంగళ్లకు, విక్రయశాలలకు, సారాడిపోలకు, వేలములు వేయు సంఘములకు అనుమతిపత్రముల (లైసెన్సు) నిచ్చుట.

౧౦. ఈక్రింద పేర్కొనబడినట్టివి గాక ఇతర పనులు రాష్ట్రమున చేయించుట (Local works and undertakings.):

i. స్టీమరులు, ఇతర నౌకామార్గములు, రైలుదారి, కాలువలు, తంతిమార్గములు, రాష్ట్రము నితర రాష్ట్రములతో కలుపుపనులుగాని, రాష్ట్రముసరిహద్దుదాటి జరుపవలసినపనులుగాని.

ii. రాష్ట్రమునకును, ఇతర బ్రిటిషు దేశమునకును, పరదేశములకును మధ్య నుండు స్టీమరుమార్గములు.

iii. రాష్ట్రముననె నిర్మింపబడియు నిర్మాణమైన పిదప గాని, మఱి యెప్పుడైన గాని కెనడాపార్లమెంటు వారివలన కెనడా దేశమున కెల్ల గాని, రెండురాష్ట్రములకు గాని, ఇంక నెక్కుడు రాష్ట్రములకు గాని ప్రయోజన కరములని నిర్ణయింపబడిన పనులు.

౧౧. రాష్ట్రమునకు సంబంధించిన యుద్దేశములతో స్థాపింపబడిన కంపెనీలను అంగీకరించుట (Incorporation).

౧౨. రాష్ట్రములోని వివాహముల నంగీకారమును గూర్చిన శాసనములు.

౧౩. రాష్ట్రములోని ప్రజల ఆస్తిని గూర్చినట్టియు, వ్యక్తులనుగూర్చినట్టియు హక్కులు (Civil rights).

౧౪. రాష్ట్రీయ న్యాయస్థానములను నిర్మించి వాని సివిలు క్రిమినలు ధర్మపరిపాలనా విధానములను నిర్ణయించుట.

౧౫. ఈ సెక్షనులో చెప్పబడిన విషయములను గూర్చి తాము చేసిన శాసనములను అమలుచేయుటకు అపరాధమునుగాని, శాస్తినిగాని, శిక్షనుగాని విధించుట.

౧౬. రాష్ట్రీయ పరిపాలనకు సంబంధించిన అన్ని సామాన్యస్థానికవ్యవహారములు.

కెనడా, ఆస్ట్రేలియా రాజ్యముల డొమినియన్ ప్రభుత్వము "ఫెడరల్" రాజ్యాంగపద్ధతికి జెందినట్టిది. అనగా నివి స్వపరిపాలనముగలరాష్ట్రములసమ్మేళనములు. వీని ప్రభుత్వము లొకేపద్ధతికి జెందినవైనను శాసననిర్మాణాధికార విధానమునందు తారతమ్యము కలదు. కెనడా రాజ్యాంగ చట్టమువలన రాష్ట్రీయ శాసనసభలకు స్పష్టముగ నీయబడిన అధికారములు గాక తక్కిన అధికారము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీ పండిత జవహర్‌లాలుగారి ఛాయాచిత్ర సంచయము



౧. త్రోపుడు బండిలో-దగ్గర తల్లి



౨. తనచెల్లెలితో



౩. లక్నో పురమున: గుఱ్ఱముపై-౧౯౦౪ సం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౬. హారోలో (ఇంగ్లాండు) ఓ. టి. సి.



౭. వటువు



౮. తల్లి, కుమారుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లెల్ల డొమినియనుల పార్లమెంటువే. ఆస్ట్రేలియాలో నన్ననో, ఆ రాజ్యాంగచట్టమునవలన డొమినియను పార్లమెంటున కీయబడిన అధికారములు గాక తక్కిన యధికారములెల్ల రాష్ట్రీయశాసనసభలవే. ఇక దక్షిణాఫ్రికా సమితి ప్రభుత్వ మన్ననో, "యూనిటరీ" రాజ్యాంగపద్ధతికి జెందినదై యున్నది. ఇందలి కార్యనిర్వాహకాధికారము గవర్నరు జనరలు కార్యనిర్వాహక సభయం దిమిడియున్నది. శాసననిర్మాణాధికారమెల్ల సమితి పార్లమెంటున, అనగా రాజప్రతినిధి, సెనేటు, అసెంబ్లీ సభయు కలిసిన రాజ్యాంగమున నిమిడియున్నది. ఈ సమితిలోని రాష్ట్రములకు కెనడా, ఆస్ట్రేలియా రాష్ట్రములవలె స్వపరిపాలనాధికారము లేదు. రాష్ట్రీయసభలు పురపాలకసంఘసభలవలె స్థానికవ్యవహారములఅధికారములును, సమితి పార్లమెంటు వారు వాని కిచ్చు నధికారములును కలిగియుండును. *న్యూఫౌండ్లాండ్, న్యూజీలాండ్ రాజ్యముల ప్రభుత్వములు యూనిటరీ రాజ్యాంగపద్ధతివే.

---

# ప్రాకృతుఁడు

దువ్వూరి జగన్నాథశర్మగారు

దైవ మెందుండె ననఁగ-నద్వైత వీథి  
నతఁడుసర్వోపగతుఁడని యంద్రు బుధులు-  
తత్త్వవేత్తల కిది సమాధాన మగుటఁ  
బ్రాకృతునివోలె నూహింపవలతు-నన్ను.

వాద భేదార్భటుల శంక వాయ-వివిధ  
వైఖరుల లోఁగి-తిరుగాడి-వాడి-రిత్త  
వడితి-నాయువు సగఁ బాలు గడచెఁ దుదకు  
సందియము వోక-నిర్జన స్థలుల నిలుతు!

ప్రకృతి శ్రుతిఁగూర్ప నవ్వయుం బాడు నొక్కఁ  
డవల-నతఁ డెవఁడో! అనాహతనినాద  
గీతికా వీచికలు చెవుల్ గిగురెత్తె; రహి మె  
లర్చి కుండలిలోఁ బ్రాణలయము గూడె.

అచట బుద్ధి యంతర్ముఖ మగుట దెలిసె-  
నాగరుఁడ నని యనుటలో నహి-నిజంబు!  
ప్రాకృతుఁడ నిఁక! న్నాపాపు ప్రకృతిమై-న  
మీఁప పడఁ గందు నాద్య నమేయు నీశు!

---

* వాచే రచియింపబడి విజ్ఞానచంద్రికామండలిచే ప్రకటింపబడిన దక్షిణాఫ్రికా చరిత్రను చూడుడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పురాణచరిత్రము

కవికొండల వెంకట సత్యనారాయణమూర్తిగారు

నేనీ పురాణ చరిత్రమును వ్రాయు నుద్దేశము అజ్ఞానులగు పూర్వాచార పరాయణులపై నూతనవిజ్ఞానము వెదచల్లి వారి నుద్ధరించుట కని కాదు. మహావిజ్ఞానసంపన్నులగు పౌరాణికులను నిందించుటకుఁ గాని, వారివ్రాఁతలలోఁ గల లోపముల నెత్తి చూపుటకుఁ గాని కాదు. ఇదివఱకు లోకములో నెవ్వరును కనుఁగొనని నూతన విషయమును కనుఁగొంటినని మెప్పొందుటకుఁ గాదు. బ్రాహ్మణమతము నామమాత్రావశిష్టము కాఁ జొచ్చి బౌద్ధమతము దేశమంతయు మహాజాజ్వల్యమానముగా నల్లుకొనుచున్న దినములలో మరల బ్రాహ్మణమతమును వృద్ధి పొందించుటకును, బౌద్ధమతమును క్షీణింపఁజేయుటకును బ్రాహ్మణమత కర్త లెన్నెన్ని విధములుగా నెన్నెన్ని పురాణములనో వ్రాసి, యెన్నెన్ని ధర్మశాస్త్రములనో వ్రాసి బ్రాహ్మణమతమును పునరుద్ధరించి బ్రాహ్మణ మతమునకు శాశ్వతమహోపకార మొనరించిరి.

కాని వారిగ్రంథములయందు చరిత్రము ప్రధానాంశముగా లేకపోవుటచేతను, అది వారి కప్పటికవసరము లేకపోవుటచేతను, మన మిప్పుడా నాఁటి చరిత్రమును తెలిసికొందమనిన వారు వ్రాసినగ్రంథములు తప్ప నేటి ఆధారములు లేకపోవుటచేతను, ఆగ్రంథములనుబట్టియే వీలైనంతవఱకు పురాణచరిత్ర మనుపేర చిన్నవ్యాసమును వ్రాయ నెంచితిని. ఈవ్యాసమును వ్రాయుటకు నాకుఁగల ముఖ్యోద్దేశము పండితులయొద్దనుండి అమూల్యమగు నూతన విజ్ఞానమును విమర్శనపూర్వకముగ నేను పొందుటకేకాని నావ్రాఁతలే నిజమైన వ్రాఁతలనిపించుకొనుటకు కాదు. తప్పో ఒప్పో యేవో కొన్ని యభిప్రాయములను నేను వ్యాసరూపమున ప్రచురించిన చరిత్రాభిలాషులగు పండితులు నావ్యాసములో నేవైన లోపములున్న వానిని సద్బుద్ధితో సవరించి చరిత్రమునకు లాభము కలుగఁజేయుదురను సంపూర్ణవిశ్వాసముతో నే నీచరిత్రమును ప్రచురించుచున్నాను.

## జంబూద్వీపము

పూర్వము మనవారు ప్రాచీన గ్రంథములలో నుదాహరించిన సప్తద్వీపములలో జంబూద్వీప మొకటి. మన పూర్వు లెల్లరును ప్రప్రథమమున నీ జంబూద్వీప మధ్యభాగమున నివసించి క్రమక్రమముగ జంబూద్వీపములోని దక్షిణభాగమగు భారతవర్షమునకు వచ్చియుండుటచే మనపూర్వులయొక్క చరిత్రమును వ్రాయుటకు ముందు జంబూద్వీప పరిజ్ఞానమును కొంచెముగానైన చదువరులకుఁ దెలియఁజేయుట మంచిది. మార్కండేయాది పురాణముల జంబూద్వీప మీవిధమున వర్ణింపఁబడెను:—

ఈ జంబూద్వీపము—౧. హిమవంతము, ౨. హేమకూటము, ౩. నిషధము, ౪. మేరువు, ౫. నీలగిరి, ౬. శ్వేతాచలము, ౭. శృంగవంతము అని యేడువర్ష శైలములు కలవు. ఈపర్వతముల నడిమిభాగమున నర్ధచంద్రాకారమున ఇలావృతవర్షము కలదు. ఆయిలావృతవర్షమునకు తూర్పున భద్రాశ్వవర్షంబును, దక్షిణమున హరివర్ష, కింపురుషవర్ష, భారతవర్షంబులును, పశ్చిమంబున కేతుమాలావర్షంబును, ఉత్తరమున రమ్యక, హిరణ్యక, కురువర్షంబులును కలవు. ఈ తొమ్మిది వర్షంబులును నవవర్ష సంజ్ఞం జెలఁగు. ఇలావృతవర్షంబు నడుమ మేరు పర్వతము కలదు. ఆ మేరుపర్వత మధ్యభాగమున బ్రహ్మపురము కలదు. ఆ మేరువున కష్టదిక్కులయందును ఇంద్రాద్యష్టదిక్పాలకుల పురంబులును కలవు.

మేరుపర్వతమునకు నాలుగు దిక్కులను నాలుగు పర్వతశాఖలు కలవు. అందు తూర్పుశాఖ మందరాద్రి యనియు, దక్షిణశాఖ గంధమాదనమనియు, పశ్చిమశాఖ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విపులమనియు, ఉత్తరశాఖ సుపార్శ్వమనియుఁ బిలువం బడును. ఈనాల్గుశాఖలకును విష్కంభనగరములని పేరు.

ఇవి కాక మేరువునకుఁ దూర్పున ౧. జఠరము, ౨. దేవకూటము అను పర్వతములును, దక్షిణమున ౩. కైలాసము ౪. హిమవంతము అను పర్వతములును, పశ్చిమమున ౫. నిషధము, ౬. పారియాత్రమును, ఉత్తరమున ౭. శృంగవంతము, ౮. చారుధి యనుపర్వతంబులును కలవు. ఈ యెనిమిదింటికిని మర్యాదనగంబులని పేరు. మఱియు మేరువునకు తూర్పున శీతాంతము, ముకుంజము, కంకవంతము, మణిశైలము, సుమేఘము మున్నగు పర్వతములును, దక్షిణమున త్రికూటము, రుచకము, పతంగము లోనగు నగంబులును, పశ్చిమంబున సువర్ణము, శిశిరము, వైడూర్యము మున్నగు పర్వతంబులును, ఉత్తరమున శంఖకూటము, ఋషభము, హంసనాభము మున్నగు పర్వతంబులును కలవు.

## వనములు-సరస్సులు

| పర్వతము | అందలివనములు | అందలి సరస్సులు |
|---|---|---|
| ౧. మందరము | చైత్రరథము | అరుణోదము |
| ౨. గంధమాదనము | నందనము | మానససరోవరం |
| ౩. విపులము | వైభ్రాజము | శీతోదము |
| ౪. సుపార్శ్వము | సావిత్రము | మహాభద్రము. |

మందరనగమున చైత్రరథ మను వనమును, అరుణోద మను సరస్సును కలవు. గంధమాదనమున నందన మను వనమును, మానససరోవర మను సరస్సును కలవు. విపులమున వైభ్రాజ మను వనమును, శీతోద మను సరస్సును కలవు. సుపార్శ్వమున సావిత్ర మను వనమును, మహాభద్ర మను సరస్సును కలవు.

## నదులు

సీత—'సీత' యను నది మేరుపర్వతమున జనించి మందరాద్రి కేగి, యచ్చటి చైత్రరథవనమునం గల అరుణోదసరస్సును బ్రవేశించి, దానినుండి యితరపర్వతముల లోయలమార్గమునభద్రాశ్వవర్షమునసముద్రమునంగలసెను.

అలకనంద—అలకనంద యను నది మేరుపర్వతమున జనించి యక్కడనుండి గంధమాదన పర్వతమునందలి సరోవరములను, వనములను బ్రవేశించి, యక్కడనుండి త్రికూటపర్వతమున కేగి యటనుంటి హిమాలయోత్తర భూములం బ్రవేశించి, తూర్పుగా కొంతదూరము ప్రవహించి, పిమ్మట దక్షిణమునకు మరలి భారతవర్షమున సముద్రమునం గలసెను. భారతవర్షమున నీనదికే బ్రహ్మపుత్రయని పేరు. ఈగంధమాదనపర్వతమునుండి ప్రవహించిన నదులు తూర్పుముఖమున మూఁడును, పశ్చిమముఖమున మూఁడును, దక్షిణముఖమున నొకటియును వచ్చెను. దక్షిణమునఁ బ్రవహించినది భాగీరథి.

సుచక్షువు—ఈసుచక్షువు మేరుపర్వత పశ్చిమభాగమున జనించి విపులాద్రి కరిగి, యందలి వనములను, సరోవరములను బ్రవేశించి, యనేకనగము లతిక్రమించి కేతుమాలావర్షంబున సముద్రమునం గలసెను.

భద్రసోమ—ఈభద్రసోమ మేరువున కుత్తర భాగమున జనించి సుపార్శ్వపర్వతంబున కరిగి, యచ్చటి వనంబులను, సరోవరములను బ్రవేశించి, యటనుండి శంఖకూటాది పర్వతములతిక్రమించి, యుత్తర కురువర్షమున సముద్రమునం గలసెను.

పురాణములలో నుదాహరింపఁబడిన ఇలావృతవర్షమునం గల మేరుపర్వతమునే మనము ప్రస్తుతము 'తియన్‌షన్' పర్వతములుగా గ్రహింపవచ్చును. ఏలయన, చీనాభాషను 'తియన్'అనఁగా 'దేవతలయొక్క' యనియును, 'షన్' అనఁగా పర్వతమనియును నర్థము. అనఁగా:—'తియన్‌షన్'పర్వతమనఁగా దేవతలయొక్క పర్వత మని యర్థము. మన మేరువును దేవతలు నివసించు పర్వతముగనే మన వారు వర్ణించుచున్నారు. అంతియ కాక మేరుపర్వతమునకు నాలుగు దిక్కులను మందరాది పర్వతశాఖ లున్నవని చెప్పినట్లే 'తియన్‌షన్' పర్వతములకును నాలుగు పర్వతశాఖలు కలవు. కావున నీ'తియన్‌షన్' పర్వతమునే మేరుపర్వతముగా మనము భావించుకొనుటయందు నెట్టి పొరపాటును రానేరదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈసందర్భమున మఱియొకవిషయముకూడ మఱవఁ దగినది కాదు. జంబూద్వీపము, దక్షిణమున హిమాలయ పర్వతమును, దానికి దక్షిణమునంగల యున్నతములగు కొన్ని సమీపభూములవఱకునే కలదు గాని, యిప్పటి భారత ఖండమంతయు నందుఁజేర లేదనియును, దక్షిణహిందూ స్థానమునకును ఉత్తర హిందూస్థానమునకును నడుమఁ గల పల్లపులోయభూములన్నియును సముద్రముగా నుండె ననియునుకూడ మాచదువరులు జ్ఞప్తియం దుంచుకొని యెదరుగాక!

ఇంతియ కాక యీ భారతవర్షము భారతవర్ష నామము వహించునప్పటి కింత విస్తీర్ణతను కలిగియుండ లేదు. ఈభారతవర్షము ప్రప్రథమమున నొక చిన్నమండలమంతకలదు. దీనికి పూర్వనామము 'అజనాభము.' భారతవర్షమును పరిపాలించిన భరతుని తండ్రియగు ఋషభుఁడు 'యజ్ఞనాభ'మను మండలమును పరిపాలించుచుండెను. ఈ ఋషభునకు పెక్కుండ్రు పుత్రులు కలరు. అందే జ్యేష్ఠుఁడగు భరతునకు 'అజనాభ' మనుమండలము నొసఁగెను. దానికే పిమ్మట భరతఖండ మనునామము కలిగెను. ఈభరతుఁడు పిమ్మట మఱికొంత దేశము నాక్రమించుకొని, దానిని తొమ్మిదిభాగములుగాఁజేసి తన తొమ్మండుగురు పుత్రులకును—౧. కుశావర్తము, ౨. ఇలావర్తము, ౩. బ్రహ్మావర్తము, ౪. ఆర్యావర్తము, ౫. మలయకేతువు, ౬. భద్రసేన, ౭. ఇంద్రస్పృక్, ౮. విదర్భ, ౯. కీకటు లనునామములతో—ఒసఁగెను. దీని కంతటికిని భారతవర్షమని పేరు. ఈభూభాగమంతయు హిమాలయముల యందును, వానికి దక్షిణమునను, గంగానది పల్లపులోయల కుత్తరభాగమునను కలదు.

## జంబూద్వీపవాసులు

### (జాతులు)

ఇప్పుడు భారతవర్షమున బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగుజాతు లున్నట్లే వేదకాలమునకుఁ బూర్వము ౧. ధర్మప్రజాసర్గము, ౨. ఈశ్వర ప్రజాసర్గము, ౩. కస్యపప్రజాసర్గము, ౪. పులహప్రజాసర్గము అనినాలుగు ప్రజాసర్గములు కలవు. ఇందు పులహప్రజాసర్గముకంటె కస్యపప్రజాసర్గమును, కస్యపప్రజాసర్గముకంటె నీశ్వర ప్రజాసర్గమును, ఈశ్వర ప్రజాసర్గముకంటె ధర్మప్రజాసర్గమును నాగరికతయందు ఆధిక్యమును వహించియుండెను.

వీరి నాగరికత వీరికిఁగల ధనము, రూపము, ఆయువు, బలము, ధర్మము, బుద్ధి, పరాక్రమము, తపస్సులనుబట్టి నిర్ణయింపఁబడినవి. ఇందు రెండవదియగు నీశ్వర ప్రజాసర్గముతప్ప తక్కిన మూఁడు ప్రజాసర్గములును వారి మూలపురుషులగు ధర్మ, కస్యప, పులహుల నామములచేతనే పిలువఁబడుచుండెను. అందొక్కొక్క మూలపురుషుఁడు పెక్కండ్రు స్త్రీలవలన కన్న సంతానము ఆయాస్త్రీలనామములతో శాఖోపశాఖలై మరల వృద్ధిపొందెను. పై ప్రజాసర్గములలో నొక్కొక్క ప్రజాసర్గము మరల నీక్రిందివిధమున విభాగింపఁబడెను:

ధర్మప్రజాసర్గము:—ధర్మునకు ౧. సాధ్య, ౨. వసువు, ౩. విశ్వ, ౪. మరుత్వతి, ౫. భాను, ౬. ముహూర్త, ౭. లంబ, ౮. సంకల్ప, ౯. విధి, ౧౦. పృథివియని పదుగురుభార్యలు కలరు. ఆ పదుగురివంశము ౧. సాధ్యులు, ౨. వసువులు, ౩. విశ్వేదేవులు, ౪. మరుత్తులు, ౫. భానులు, ౬. ముహూర్తులు, ౭. లంబులు, ౮. సంకల్పులు, ౯. విధులు, ౧౦. పృథివి విషయములు అని పదిశాఖలుగా విభాగింపఁబడెను.

ఈశ్వర ప్రజాసర్గము:—ఈ యీశ్వరప్రజాసర్గమున కీపే రెట్లువచ్చినదియు నించుక తెలియఁజేయవలసి యున్నది. పూర్వకాలమున ఋషులు ౧. పరమ ఋషులనియు, ౨. మహర్షులనియు, ౩. సత్యర్షులనియు, ౪. శ్రుతర్షులనియును నాలుగు తెగలుగ విభాగింపఁబడిరి. అందు మొదటి మూఁడు తెగల ఋషులును మంత్రములను, నాల్గవతెగ ఋషులు బ్రాహ్మణములను రచించిరి. మంత్రములు రచించిన ఋషులలో ప్రాచీనులు పరమఋషులని పిలువఁబడిరి. వీరికే—* 'ఈశ్వరు'లనియు నామము కలదు.

* వాయు॥, మత్స్య॥, బ్రహ్మాండ పురాణములంజూడనగు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరురచించిన మంత్రములకే యీశ్వరప్రోక్తములని పేరు కలదు. ఈ యీశ్వరశబ్దమునకు నాధునికులు భగవంతుఁడను నర్థము చెప్పి యీశ్వరప్రోక్తములగు వేదమంత్రములు భగవంతుని నోటినుండి వెలువడినవని వ్రాయ నారంభించిరి. పిమ్మట నామంత్రములకు 'అపౌరుషేయము' లని పేరిడిరి.

ఈపగిది ఋషులగు నీశర్వుల సంతతియే యీశ్వరప్రజాసర్గము. ఈ యీశ్వరులలోఁ బ్రధానపురుషులను గొందఱి నిట నుదాహరించెదను: ఈశ్వరులు— ౧. భృగువు, ౨. మరీచి, ౩. అత్రి, ౪. అంగిరసుఁడు, ౫. పులహుఁడు, ౬. క్రతువు, ౭. మనువు, ౮. దక్షుఁడు, ౯. వసిష్ఠుఁడు, ౧౦. పులస్త్యుఁడు.[1]

వీరి వంశజులు—౧. భార్గవ, ౨. మారీచ, ౩. ఆత్రేయ, ౪. ఆంగిరస, ౫. పౌలహ, ౬. క్రతవ, ౭. మానవ, ౮. ప్రాచేతస, ౯. వాసిష్ఠ, ౧౦. పౌలస్త్యులను పేర్లం బరఁగిరి.

కస్యపప్రజాసర్గము:—ఈ కస్యపునకుదితి, అదితి, దనువు మున్నగుభార్యలు పెక్కండ్రు కలరు. వారివారి నామముల నాయాసంతతివారు ఆదిత్యులు, దైత్యులు, దానవులు మున్నగు నామములఁ బిలువఁబడుచుండిరి. వీరలే సుర, అసుర, యక్ష, గంధర్వ, దైత్య, దానవ, కిన్నర, కింపురుష, రాక్షసాది బహునామములఁ బ్రవర్తిల్లిరి.

పులహప్రజాసర్గము—ఈ పులహప్రజాసర్గము ౧. హరయులు, ౨. వానరులు, ౩. గజులు, ౪. గవయులు, ౫. సారమేయులు, ౬. భూతములు, ౭. పిశాచములు మున్నగు పది పండ్రెండు తెగలుగా విభాగింపఁబడినది.

## అన్యోన్య సంబంధము

నామరూపాదిభేదములచే నిన్నిజాతు లేర్పడి యుండినను వీరిలో వీరికి పరస్పర సంబంధ బాంధవ్యములు లేకపోలేదు. ఒకప్రజాసర్గములోని స్త్రీపురుషులు వేఱొక ప్రజాసర్గములోని స్త్రీపురుషులను వివాహము చేసికొనుచుండిరి. ఆకాలమున వివాహవిషయమున నెట్టి నిబంధనలు గాని, నిర్బంధములుగాని యున్నట్లు కనఁబడదు. వయసువచ్చిన స్త్రీపురుషు లెవరియిచ్ఛవచ్చినట్లు వారు విహరించుచుండిరి. అందుచేతనే సురలు మానవస్త్రీలతోడను, మానవులు సురకాంతలతోడను, దానవులు మానవకాంతలతోడను, మానవులు దానవకాంతలతోడను, నీవిధముగ జంబూద్వీపమందలి ప్రజ లెల్లరును స్వేచ్ఛగా విహరించుట భారత యుద్ధకాలమువఱకును (ద్వాపరాంతమువఱకును) కాననగుచున్నది. ఈ వివాహవిషయిక నిబంధనలు, నిర్బంధములు కొన్ని శతాబ్దముల క్రిందట మనదేశమున బయలువెడలిన అసంఖ్యాకములగు మతముల, మతద్వేషములవలం పెచ్చుపెరిఁగి దేశమును ప్రస్తుతస్థితిలోనికిఁ దీసికొనివచ్చెను.

## వారి నివాసస్థానములు

ఇక వారి నివాసస్థానములఁ గూర్చి యించుక చెప్పఁగొనవలసియున్నది.

పైనుదాహరింపఁబడిన ప్రజాసర్గములు ఉత్తరధ్రువము లేక మహామేరువు మొదలు దక్షిణసముద్రపర్యంతము* నివసించుచుండిరి. ఈదేశమంతయు వివిధకాలముల వివిధనామములతోఁ బిలువఁబడుచుండెను. మొదటి ప్రకరణములో నుదాహరింపఁబడిన నవవర్షములును ఋగ్వేదమునకు పిమ్మట నేర్పడినవై యుండవలెను. కొంతకాల మీదేశమంతయు మూఁడుభాగములుగా విభాగింపఁబడి, స్వర్గ, మర్త్య, పాతాళము లను నామముల వ్యవహరింపఁబడుచుండెను. తత్పూర్వము ఉత్తరసముద్రమునకును దక్షిణసముద్రమునకును నడుమఁ గల జంబూద్వీప మంతయు (దక్షిణమునుండి) ౧. భూలోక, ౨. భువర్లోక, ౩. సువర్లోక, ౪. మహర్లోక, ౫. జనలోక, ౬. తపోలోక, ౭. సత్యలోకము లని యేడులోకములుగను, జంబూద్వీపము

1. వీరందఱును సమకాలికులని చదువరులు భ్రమింపరాదు. వీరు వివిధకాలముల నాఁటివారు. కాని ఒకే తరగతిలోనికి వచ్చెదరు.

*దక్షిణ సముద్ర మనఁగ—నుత్తరహిందూస్థానమునకును దక్షిణహిందూస్థానమునకును నడుమనుగల సముద్రము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకు దక్షిణమునం గల దేశమంతయు ౧. అతల, ౨. వితల, ౩. సుతల, ౪. రసాతల, ౫. మహాతల, ౬. తలాతల, ౭. పాతాళము లని యేడులోకములుగను విభాగింపఁబడి యుండెను.

## స్వర్గ - మర్త్య - పాతాళములు

అందు హిమాలయపర్వతపు కనుమలును, వాని కించుక కుత్తరమునను దక్షిణమునను, గల ప్రదేశమంతయు మర్త్యలోకముగను, మర్త్యలోకమున కుత్తరమున నుత్తరసముద్రమువఱకును గల దేశమంతయు స్వర్గలోకముగను, మర్త్యలోకమునకు దక్షిణమునం గల దేశమంతయు పాతాళలోకముగను నిర్ణయింపఁబడినట్లు తోఁచుచున్నది. ఇందు స్వర్గలోక వాసు లందఱును సురలు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు మొదలగు నామముల విలసిల్లిరి. ఇందుకు మార్కండేయ పురాణమున నిట్లు చెప్పఁబడెను:—

చ. హిమకుధరోత్తరస్థితమ
హీధరమధ్యమునందుఁబోల్చు దే
శము లభిరమ్యము ల్ద్విజ
సాధ్యవియచ్చరసిద్ధకిన్నరా
శ్రమములు సర్వకాలబహు
సౌఖ్యకరంబులు క్షుత్తృషామయ
శ్రమరహితమ్ము లుల్లసిత
సౌరభసంగిసమీర హృద్యముల్.

గీ. అందు లేకుండు పుణ్యపాపార్జనములు
పుణ్యఫలభోగులై మంద్రు పురుషులెల్ల
భారతాదిచతుర్దిశాపత్రమేరు
కర్ణికాస్థితి నిట్లు భూకమల మమరు.

చ. హిమగిరిదక్షిణంబున మ
హీశ్వరపాల్యను భారతాఖ్యవ
ర్షము విను కర్మభూమి యది
సంతతముం బహుపుణ్యపాపక
ర్మము లొనరించి యద్ద్విజ
మానవనారకతిర్యగాదిజ
న్మములను నాకమోక్షములు
మానుగఁ బొందుదు రందు నన్నరుల్.

## మర్త్యలోకము - ఆదిమనివాసులు

ప్రప్రథమమున నీమర్త్యలోకమున పులహప్రజాసర్గమునకుఁ జెందిన 'భూతము'లను నొక జాతివారు నివసించుచుండిరి. ఈభూతములు, పురాణములలో నుదాహరింపఁబడిన ఋక్ష, వానర, భూత, పిశాచ, సర్ప ప్రముఖజాతు లెల్లను మనుష్యజాతిలోనివేగాని జంతుజాతిలోనివి కావు. ఋక్షరాజగు జాంబవంతుఁడు తన కుమార్తెను శ్రీకృష్ణునకిచ్చి వివాహముచేయుటయందును, నాగకన్యకయగు నులూపిని అర్జునుఁడు వివాహమాడుటయందును నింతకంటె వేఱర్థ ముండఁ బోదు. (సశే.)

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఓరుగల్లుదుర్గము

ఆ. వెం. రామచంద్రరావు గారు

నైజాము రాజ్యములో చరిత్రాత్మకమగు కట్టడములలో నెల్ల తప్పక చూడదగినది ఓరుగల్లు దుర్గము. సుమారు వేయిసంవత్సరములనాటి ఆంధ్రుల దుర్గమైనను, ఇప్పటికిని శిథిలావస్థయందున్న గోడలు, దేవాలయములు, రాజమహలులు, బావులు, దుర్గపు తలుపులు మున్నగునవి చూచిన దాని పూర్వౌన్నత్యము మనసునకు తట్టక మానదు. ఎంత కఠినహృదయుడైనను దానిప్రస్తుతావస్థ చూచినపుడు కన్నీరురాల్పక మానడు.

వరంగల్లు రైలుస్టేషనునుండి యీదుర్గ మొకమైలు దూరమున నున్నది. స్టేషనునుండి దుర్గపు మట్టిగోడ కానవచ్చును. దానిచుట్టును సుమారేబది అడుగులయెత్తు గలిగి భూమికి పైభాగమున నిరువదియడుగుల వెడల్పుగల యొక మట్టిగోడ వలయాకారముగ నున్నది. దానిలోనికి రాతితో గట్టిన ద్వారముగుండా పోవలయును. అది కూడ ఇప్పుడు శిథిలావస్థయందే యున్నది. దానిలోపల నిప్పటికిని పల్లెలు గలవు. లోపలనున్న దారివెంట సుమారు రెండుఫర్లాంగులు నడచిన పిమ్మట రాతిగోడ యొకటి కానవచ్చును. ఓరుగల్లుదుర్గమునకు మొదట రాతిగోడ కట్టడమును, దానిచుట్టును ఎత్తయిన మట్టిగోడ కట్టడమును కలవు. ఈ రాతికట్టడము యొక్క ద్వారము నల్లరాతిమీద చెక్కిన విగ్రహములచే నలంకరింపబడి యున్నది. అది శత్రువు చొర శక్యముగాని ద్వారమై యుండవచ్చునని తోచును. అది శిథిలావస్థయందున్నను, అందలి శిల్పనైపుణ్యము జూచిన దేవశిల్పులు తప్ప నితరులెవ్వ రట్టి చెక్కడపు పనులు చేయజాలరని చెప్పవచ్చును. మనుజులే వానిని చెక్కినను వారిని దేవతలగానే భావింపవలసి యుండును.

లోపలి రాతికట్టడము కాకతీయవంశజుడగు మొదటి ప్రతాపరుద్రుడు ఓరుగల్లు తనరాజధానిగ చేసికొని



౧. ప్రతాపరుద్రుని శిలావిగ్రహము

పరిపాలించుచుండిన కాలమందు కట్టించెనని తెలియుచున్నది. ఈ రాతిగోడ దాటినతోడనే పెద్దరాళ్లతో కట్టబడిన రాజమహలులు దృగ్గోచరమగును. ఒక్కొక్కరాయి సుమారు పది అడుగుల పొడవును, నాలుగడుగుల వెడల్పును, మూడడుగుల యెత్తును గలిగియున్నది. ఇంత పెద్దరాళ్లను ఆకాలములో నేవిధముగ నెత్తగలిగినదియు చెప్పలేము. కాని ఆకాలములో ప్రసిద్ధములైన "యింజనీరింగు" పనులు చేయగల సమర్థులుండిరని చెప్పగలము. ఇప్పుడు పైకప్పులు లేనిగోడలును, కమానులును(arches) మాత్రమే నిలిచియున్నవి. ఒకరాతిమీద మరియొకటి పేర్చినటుల కాన నగును గాని సున్నముతో అతికించినటుల గానరాదు. శత్రువునకు నాశనముచేయ శక్యముగాని రాళ్లుమాత్రమే నిలిచియున్నవి. ఆమహలులోని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. (a) మహలులోని కమానులు



౧. (b) దుర్గములోని ద్వారబంధము

'ఆర్చిల' యొక్క యెత్తును, వెడల్పును జూచిన ఆశ్చర్యము గలుగకమానదు. దాని సమీపముననే నీళ్లుపోయుటకై ఒకేఱాతిలో చెక్కిన చతురపు గోళెములు చాల గానవగును. ఒక్కొక్క గోళెము సుమారుఎనిమిదడుగులపొడవు, ఎనిమిదడుగుల వెడల్పు, ఆరడుగులయెత్తును గలిగియున్నవి. అంత బలువైన గోళెములను ఒకచోటనుండి మఱియొకచోటునకు నెట్లుకొనిపోయినదియు జెప్పలేము.

దర్బారు హాలుండిన స్థలము తెలుపుటకో యన్నట్లు దానిచుట్టును ఉన్న నాలుగు పెద్ద ఱాతిద్వారములు తప్ప మరేమియు కానరావు. ఒక్కొక్క ఱాతిద్వారబంధముయొక్కయెత్తు సుమారు ముప్పది అడుగులును, వెడల్పు ఇరువది అడుగులును నుండును. వాటిమీద చెక్కియున్న నగిషీపనులు వర్ణింప మనతరము కాదు. ప్రతిద్వారబంధము మీద అందమైన రెండు హంసలు కానవచ్చును.



౨. దుర్గములోని మహలు, శిల్పమండితమగుద్వారబంధము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుర్గములోపల ననేక దేవాలయములు ఉండెను. ప్రస్తుతకాలములో కొన్ని భూమిక్రింద పూర్తిగా గప్పబడియున్నవి. మఱికొన్ని సగము కూలిపోయి గాడిదలకు, పాములకు, గబ్బిలములకు నివాసస్థానములై యున్నవి. ఒక్కదేవాలయము మాత్రమే యిప్పుడు మంచి స్థితియందున్నది. అందు రెండు పెద్దనందులున్నవి. ఒకదానిమీద ఱాతితో కొట్టిన, కంచుమీద కొట్టినప్పటి ధ్వని వినవచ్చును. ఈ దేవాలయముకూడ భూమిలో నణగియే యున్నది. వందలకొలది సంవత్సరములు గడచిన పిమ్మట మట్టి వానిని తన పొట్టలో పెట్టుకొనుటలో నాశ్చర్యము లేదు.



౩. దుర్గములోని శివాలయమునందలి నందులు

దుర్గములో పెక్కు బావులు కలవు. అవికూడ పెద్దఱాళ్లతో కట్టబడియున్నవి. ఇప్పటికి దుర్గములోని గ్రామస్థులు వానిని సేద్యమునకును, త్రాగుటకును ఉపయోగించుచున్నారు. అందు కొన్ని యెప్పుడును ఎండిపోకుండుటయే కాక వాటిలోని నీటిలోతు కనుగొన శక్యముగాకుండకూడ నున్నవి. ఈ బావులగురించి అనేకకథలు కలవు. అందు రెండు బావులు కలసియున్నవి. వానిని సవతి నూతులని పిలిచెదరు. అందు ఒకటి యెప్పుడును ఎండియుండును. రెండవదానిలో చాల నీరుండును. అదే విధముగ "అక్కా చెల్లెండ్ర" నూతులని పిలువబడుచున్న రెండు నూతులు కలవు. వానియందు ఎప్పుడును నీళ్లుండును. "కాగితాల నూయి" అని పిలువబడు నూయి మరియొకటి కలదు. ఈ పేరెట్లు వచ్చెనో తెలియదు. వాని గోడలు మాత్రము చాల ప్రమాదకరముగ నున్నవి.

దుర్గమధ్యమున ఒక నున్నని పెద్ద శిల కలదు. అది ఒకే ఱాతికొండ. అది సుమారు మూడువందల అడుగుల యెత్తుండును. ఈ శిలనుపట్టియే ఏకశిలానగరమను నర్థము గల ఓరుగల్లని పేరు వచ్చినది. దానిపై కెక్కుటకు మెట్లులున్నవి. దానిపై నొక చిన్న కొలను కలదు. ఆశిలపై నొక దేవాలయమును, సిపాయిలు నిలుచుండుటకు ఒక యెత్తయిన గదియు కట్టబడియున్నవి. దేవాలయము శిథిలమై యున్నది. కాని పారాగదిమాత్రము గట్టిగనున్నది. అందు



౪. దుర్గమునందలి ఏకశిలపయినున్న సిపాయీల పారాగది



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మీాద నిలుచున్న యెడల నలుప్రక్కల మూడుమైళ్లవర కన్నియు గానవచ్చును. ఈ శిలక్రిందనే ఒక చెలము వున్నది. అది త్రాగుట కుపయోగించదుగాని యేకాల మందును ఎండదు.

ఈ దుర్గమునుండి హనుమకొండదగ్గర కొండపై నున్న పద్మాక్షీ దేవాలయమునకు భూమిలోనుండి సొరంగము కలదని చెప్పుదురు.

---

## పద్మము నిశతో

దివాకర్ల వెంకటావధాని గారు

ఓ నిశాకాంత! పూర్వకాలాన నెక్కు-
డీర్ష్యచే దంపతుల కేరి కెడము నీవు
గలుగఁ జేసినదానవో కమలభవుఁడు
పక్ష దినచంద్ర భోగమే వ్రాసిపెట్టె
నీకు;
నీకనైన దుర్బుద్ధి పోకయుండె.

అరుణకరములు సర్వదిగంతములకు
పరుగులిడ మ్రదతి వినోద పరవశుఁడయి
లీల నూఁగెడు మన్నాథు మ్రింగి నన్ను
విరహ వారాన్నిధిని ముంచి వేసినావు.

అనుభవించక తప్పునే అఘఫలమును
వచ్చుజన్మమునంబైన బ్రహ్మ నిన్ను
నున్నభోగము సగమును సున్నఁ జేసి

భర్తృ విశ్లేష దుఃఖసంబాధితాంగ
శాలినిగఁ జేయకుండునే? సత్యమూర్తి.

* * *

ఖలులు మిత్రులు జారతస్కరులు నీకు
విరహదుఃఖ ప్రదాయిని వరయ నీదు
ఆస్యదర్శన మాత్రాన నఖిలపాప
ములకు నెలవౌదు రిల జను ల్దలఁచి చూడ.

అందుచేత నె కాఁబోలు నబ్జపీఠి
నిశ:రవోవఁగ సృష్టించె నిశలయందు.

* * *

ఇంత కధికము నన్ను నీ వేమి చేయఁ
గలవు?
నీరూపు రేపు భాస్కరుఁడు మాపు
వఱకె, నే నిట్లు విరహార్తిఁ బడి వగచుట
నిరపరాధులకష్టముల్ నిష్ఫలములె?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## భారతవిజ్ఞాన కళాశాల

క్రమధాటి వెంకటగిరిగారు, బి.ఏ.,యమ్.యస్.సి. (Hon.)

ఈ భారతవిజ్ఞాన కళాశాల J. N. తాతా (Jamsetjee Nusserwanjee Tata) గారి దాతృత్వమువలన స్థాపింపబడెను. 1896 సంవత్సరమున దేశీయ పారిశ్రామికాభివృద్ధికొరకై తాతాగారు ఒక నవీనపరిశ్రమ కళాశాలను స్థాపించుటకు పూనిరి. ఈ కార్యార్థముకొఱకు 30 లక్షలు విలువగల ఆస్తిని తనయెజుకతో ఇతరుల స్వాధీనమున బెట్ట, ఇందునిమిత్తము ఇంగ్లాండు దేశములోను, మన హిందూదేశములోను ఉండు ముఖ్యులగువారి అభిప్రాయము కనుగొని ఈ భారతవిజ్ఞాన కళాశాల నిర్మాణ విచారణ సంఘమును బొంబాయి సర్వకళాశాలయొక్క వైస్ ఛాన్సలర్ (Vice-Chancellor)గారి అధ్యక్షతక్రింద నిర్మాణించి, కార్యక్రమ ప్రకటనమును తయారుచేసిరి. 1898 సం॥ డిసెంబరు 31-వ తేదీని, లార్డు కర్జన్ దొరవారివద్దకు పంపిరి. ఆ మరుసంవత్సరమున వారియొక్క 'స్కీము'కు ఇండియా గవర్నమెంటువారు అనుమతి యిచ్చిరి.

1900-1901 సంవత్సరమున తాతాగారు నిర్మాణించిన కమిటీ యుద్దేశమును అనుసరించి, సర్ విలియం రామ్‌సే (Sir William Ramsay) అను ఒక ఆంగ్లేయ శాస్త్రకోవిదుడు ఈ 'స్కీము'ను పరిశోధించి, దాని మంచిచెడ్డలను, కార్యక్రమమును ఇండియా గవర్నమెంటువారికి తెలియపరచుటకు మన దేశమునకు వచ్చిరి. ఇంతలో మైసూరు గవర్నమెంటువారుకూడ సర్ శేషాద్రిఅయ్యర్ దివాన్‌గారి ద్వారా 371 ఎకరములు విస్తీర్ణముగల స్థలమును, 5 లక్షల రూపాయలు పథమును ప్రారంభఖర్చులకుగాను ఇచ్చెదమని వాగ్దత్తము చేసిరి. స్వల్పకాలములోనే మైసూరు గవర్నమెంటువారు ప్రతి సంవత్సరము 30,000 రూపాయల ప్రకారము 10 సంవత్సరములవరకు ఇచ్చెదమనియు, అటుపిమ్మట 50,000 ఇచ్చెదమనియు 'కమిటీ'కి తెలియుచేసిరి. ఇండియా గవర్నమెంటువారు కూడ సంవత్సరమునకు 1,50,000 రూపాయలు 'గ్రాంటు' ఇచ్చుకుట సమ్మతించి తాతాగారి కోరికప్రకారము ఒకవిజ్ఞాన కళాశాలను ముఖ్యముగా రసాయన శాస్త్రములో నవీనపరిశ్రమ (research) కొఱకై స్థాపించవలెనని తీర్మానించిరి. ఇంతలో తాతాగారు 1904 సం॥ 'మే'నెల 19 వ తేదీని గతించిరి. ఆయన చనిపోయినను సర్ డి. జె. తాతా, సర్ ఆర్. జె. తాతాగార్లు తమ తండ్రియొక్క కోరికను నెరవేర్చవలెనని ఇండియా గవర్నమెంటువారికి తెలియజేసిరి.

ఇండియా గవర్నమెంటువారు ఆగస్టు నెల 1906 సంవత్సరమున (Dr. Morris



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

W. Travers, F.R.S.) Dr. M. W. ట్రావర్స్ అను ఒక విజ్ఞాన కారునిని 'డైరెక్టరు'గా నుండుటకు పిలిపించిరి. ట్రావర్స్ గారు ఆ నవంబరు నెలలో ఇండియాదేశమునకు వచ్చి ఇండియా గవర్నమెంటు, మైసూరు గవర్నమెంటు, డి. జె. తాతా గారు, ఆర్. టి. తాతా గారు—వీరితో ఆలోచించి, ఆ 'స్కీము' ఆచరణ క్రమమును ఏర్పాటు చేసిరి.

ఈ కళాశాలయొక్క కార్యక్రమమును నడిపించుటకుగాను ఒక 'కౌన్సిల్' (Council) ను ఏర్పాటు చేసిరి. 1909 సంవత్సరమున 'కౌన్సిల్' కట్టడములు కట్టుటకును, అందులో కావలసిన ఉపకరణములను, సన్నాహములను సమకూర్చుటకును ఉత్తరువు నిచ్చిరి.

1911 వ సంవత్సరమున జూలై నెలలో వేరువేరు డిపార్టుమెంటులు ఏర్పాటు చేయుబడెను. 1921 వ సంవత్సరమున జీవరసాయనమున (Bio-Chemistry) నవీన పరిశ్రమముకొఱకు ఒక డిపార్టుమెంటు స్థాపింపబడెను. కొన్ని సంవత్సరము లయిన పిమ్మట ఎలెక్ట్రో టెక్నాలజీ(Electro- Technology) డిపార్టుమెంటు కూడ స్థాపింపబడెను. ఈ కళాశాల ముఖ్యముగా దేశీయపారిశ్రామికాభివృద్ధికి సంబంధించిన ప్రజోపయోగవిజ్ఞానముల యందు నవీన పరిశ్రమములకై స్థాపింపబడ్డది.



చిత్రము ౧:—ఇందులో డైరెక్టరుగారి ఆఫీసు, కౌన్సిల్ చేంబరు (Council Chamber), సూక్ష్మ జీవ శాస్త్ర నవీనపరిశ్రమశాల ఉన్నవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము ౨:—సూక్ష్మ జీవశాస్త్ర నవీన పరిశ్రమశాల (Bacteriological Laboratory)



చిత్రము 3:—ఎలెక్ట్రో టెక్నాలజీ డిపార్ట్‌మెంటు (Electro-Technology Department)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము ౪:—తాతాగారి స్మారక చిహ్న ప్రతిమ

ఈ భారతవిజ్ఞానకళాశాలయొక్క రాబడి సాలుకు 4,30,000 రూ. ఇందులో:

| | |
|---|---|
| J. N. తాతాగారు ఒసగునది సంవత్సరమునకు | 2,15,000 |
| ఇండియా గవర్నమెంటువారు ఇచ్చునది | 1,50,000 |
| మైసూరు గవర్నమెంటువారు ఇచ్చునది | 50,000 |
| నైజామ్‌గవర్నమెంటువారు ఒసగునది | 10,000 |
| మదరాసు గవర్నమెంటువారు ఇచ్చునది | 5,000. |

ఈకళాశాల స్థాపించిన పిమ్మట అనేక ప్రజోపకారకములైన పరిశ్రమములు గావింపబడెను. అందులో ముఖ్యమైనవి:—

1. చందనపు చెక్కనుండి తైలము తీయువిధము కనిపెట్టబడెను. ఈ పరిశోధనమును అనుసరించి యా తైలమును తీయుటకు మైసూరు గవర్నమెంటువారు రెండు యంత్రములను స్థాపించిరి.

2. పెయింటు (paint)తయారుచేయుటకు కావలసిన వైట్ లెడ్ (white lead) ను చేయువిధము కనిపెట్టబడినది. మైసూరు గవర్నమెంటువారు ఈ వైట్ లెడ్‌ను తయారుచేయుటకు ఒక ఫాక్టరీ స్థాపించిరి. ఈ ఫాక్టరీయందు సంవత్సరమునకు 200 టన్నులు వైట్ లెడ్ తయారు అగుచున్నది.

3. సబ్బును తయారుచేయు విధమును కూడ ఇచ్చట పరిశోధించిరి. మైసూరు గవర్నమెంటువారు బెంగుళూరునందు సబ్బుచేయుట కొక 'ఫాక్టరీ'ని స్థాపించిరి. ఈ ఫాక్టరీయందు ఇప్పుడు మంచి నాణ్యమైన సబ్బులను తయారుచేయుచున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

4. పెన్సిల్స్ (pencils) చేయు విధానమును ఈ కళాశాలయందు కనిపెట్టిరి. మదరాసునం దొక 'ఫాక్టరీ' స్థాపింపబడెను.

ఈ ఫాక్టరీలన్నియు స్థాపించుట యీ కళాశాలయందు కేవలము బద్ధికుశలతతో చేసిన పరిశ్రమ ఫలమేకదా.

ఇది కాక మన దేశమునందు దొరకు పెట్లుప్పును పరిశుద్ధపరచు మార్గములను బాగు పఱచిరి. చింతపండునుండి తార్ తారిక్ (tartaric acid) అను ద్రావకమును తీయువిధము పరిశోధింపబడెను. ఇట్లే యెన్నియోవిధముల ఇక్కడ శ్రప్రజోపయోగ విజ్ఞానములయందు నవీనపరిశ్రమములను గావించుచున్నారు.

పై చెప్పినవే కాక జీవరసాయనమునందు అనేకవిధములైన పరిశ్రమములను సాధించుచున్నారు. మదరాసు గవర్నమెంటువారి కోరికను అనుసరించి, తోళ్లు పదునుచేయు స్థలమందు పారవేసిన తోళ్ల చెత్తనుండి 'గ్లు' (glue) అను ఒకవిధమైన బంకను తీయువిధమును విమర్శన చేసిరి. నాగజెముడుయొక్క లక్షణమును, దానియొక్క ఉపయోగములును విశదముగా పరిశోధింపబడెను. ఇది గాక లక్కను కృషిచేయువిధమును, లక్కపురుగుల పరిశోధనమును, సర్జరసము, రంగులు చేయు విధము—మైసూరు గవర్నమెంటువారి కోరికను అనుసరించి, పై చెప్పినవన్నియు విశదముగా పరిశోధించుచున్నారు.

చందనపుచెట్టుకు ఒకవిధమైన రోగము (Spike disease) తఱచుగా వచ్చుచుండును. ఆరోగముయొక్క లక్షణములు, దానిని పోగొట్టు మార్గములును తెలిసికొనుటకై పరిశోధనలు కావింపబడుచున్నవి.

---


## భారతి సచిత్రమాసపత్రిక

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. 6 | 0 |
| అర్ధసంవత్సర చందా | 3 | 0 |
| విడిపత్రిక | 0 | 10 |

విడిపత్రికల నుచితముగ బంపుటకు వీలు లేదు. మాదిరిపత్రికలు వలయువారు తపాలు బిళ్లలు పంపవలెను.

## ప్రకటనలు

| | | | |
|---|---|---|---|
| ఒకనెలకు సాధారణపుట | 1-కి | రు.25 | 0 |
| సాధారణపుట | ½-కి | 15 | 0 |
| సాధారణపుట | ¼-కి | 8 | 0 |
| కంట్రాక్టుపుచ్చుకొనిన నెల | 1-కి | 20 | 0 |
| ,, ,, | ½-కి | 13 | 0 |
| ,, ,, | ¼-కి | 7 | 0 |
| వ్యాసముల మధ్యపుట | 1-కి | 30 | 0 |

'భారతి' కార్యాలయము, నెం. 7, తంబు శెట్టివీధి, మదరాసు.




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri








శ్రీ సుధీర రంజన ఖస్తగిర్ గారు

భారతీయ శిల్పమున తలయెత్తిన నూత్న వ్యవస్థను కళాభిరతులగు యువకులు ఉత్సాహముతో క్రొత్తపద్ధతుల నలవఱచికొని యుపాసించుచున్నారు. ఈ విషయమై ఈనడుమ శాంతినికేతనము శ్రద్ధ వహించి యువకులచే ప్రశస్తముగ పనిచేయించుచున్నది.

నికేతనమునకు చెందిన శ్రీ సుధీరరంజన ఖస్తగిర్ గారు చేసిన మట్టిబొమ్మల ఛాయాచిత్రములు కొన్ని ఈ సంచికయందు ముద్రితములై యున్నవి. సహజకళాభిరుచిగల శ్రీ ఖస్తగిర్ గారు తరుణము తప్పకుండ శాంతినికేతనమున కళాభ్యసనము ప్రారంభించిరి. అచట చేరిన కొం దినాళ్లకే చిత్రలేఖనమునను, ప్రతిమారచనయందును వారిచేయి తిరిగినది. వీరి రచనలు ఒక ప్రత్యేకవ్యక్తిత్వముతో అలరారుచు, భారతీయజీవనస్వారస్యమును ప్రతిబింబించుచుండును. వీరి 'Mother' ('తల్లి') అను ప్రతిమ పటిష్ఠమైనకల్పన; మౌలికత్వముతో నొప్పుచున్నది. స్త్రీ ముఖభాగము కోమలమగు అనురాగముద్రతో చాల సుందరముగ నున్నది.

ఇట్టిదే 'Offering' ('అర్పణము') కూడను. సున్నితమగు స్వరూపస్వభావములతో నిది దివ్యముగ నున్నది. ఈ రెండు రచనములందును వస్త్రవిన్యాసము ప్రాచీన ఇటలీ శిల్పాచార్యుల ప్రోద్బలము కనబఱచినను భావనఅంతయు భారతీయమై మౌలికముగ నున్నది.

'Winter' ('చలికాలము') అను ప్రతిమ ముసలమ్మ కుంపటియొద్ద కూరుచుండిన ట్లున్నది. ఇది చలికాలపు రాత్రిపూటను చక్కగ తలపునకు తెచ్చుచున్నది. ఫలాన శిల్పవ్యవస్థ ప్రోద్బలము దీనియందు కానవచ్చునని చెప్ప వీలులేదు సరికదా, సాహసికమై మనసునకు నాటునట్టి వీరి సొంతమగు శైలి యొకటి గోచరించు పొంకమైన కల్పనయిది.

రవీంద్రుని శిరః ప్రతిమ ఆయన పోలికనే కాక రసాత్మతను, ఠీవిని సాధించి వెలయుచున్నది.

'సాంతాలుని' శిరఃప్రతిమ వీరు తమ సేవకుని పరిశీలించి వ్రాసినది. కూర్పులో చొరవ కన్పడును.

శ్రీ ఖస్తగిర్ గారు రెండేండ్లనుండి ఈపని సాగించుచున్నారు. దక్షిణ భారతశిల్పము పరిశీలించుటకై వీరు యాత్ర బయలుదేరినారు.

వి. ఆర్. చిత్ర.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శ్రీ పండిత జవహర్‌లాలుగారి ఛాయచిత్ర సంచయము



౭. తండ్రి, కుమారుడు: లండనులో



౮. బ్యారిస్టరు-౧౯౧౨ సం.



౯. నూతన దంపతులు



౧౦. ఆలు మగలు, పిల్ల-౧౯౧౮ సం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశము-మద్యనిషేధము*

సి. రాజగోపాలాచార్యులు గారు

మద్యపానమునకు సంబంధించిన నైతికసమస్య దాని ఆర్థికసమస్యకన్న ప్రధానమైనను, రెండవ సమస్యయే మొదటి దానికన్న ఎక్కువశ్రద్ధ నాకర్షించి నైతికసమస్యను గప్పివైచినదనుట నిజము. వ్యక్తికిగాని, సంఘమునకుగాని మద్యపానమువలన గలుగు ఆర్థికముగు నష్టమేదియు లేకున్నను, అది మేదడు కొకవిషము. భిన్నభిన్నములగు నిగ్రహ శక్తులతోగూడిన మానవసంఘములో, ఎట్టి ధనవ్యయముగాని లేక, గాలివిధమున, శరీర కలభించినను సరే, ఈవిషవ్యాప్తిని మానవుడు, నిర్నిరోధముగ విడువజాలడు. ఐనను, ఆర్థికసమస్యయే ప్రధానముగగల పాశ్చాత్యసభ్యత: ఆర్థిక దృష్టితోడనే మద్యపానమును పరీక్షించి, ఆర్థికముగ నది యొక చెడుగని నిర్ణయించుట సహజమే; దానిచే గలుగు ఆర్థికవినాశనమే దాని చెడుగునకు సంపూర్ణమగు నిదర్శనముగ నుండుట మంచిదే. దానికగు ధనవ్యయమును బట్టియే కాక, అసలు మద్యపానమే యొక దురాచారముగ, భారతదేశమునను, ప్రాచ్యప్రపంచమునను ఎంతకాలమునుండియో నిర్ణయింపబడుచున్నది. మద్య పదార్థములన్నియు పాపభూయిష్ఠములనియు, అపరిశుభ్రములనియు ప్రజలనైతిక ధార్మికాభిప్రాయములు వానిని నిరసించి యున్నవి. ప్రాత యభిప్రాయములు అతిశీఘ్రముగ శిథిలమై పోవుచున్న కాలమునగూడ ఈ మద్య నిషేధాశయము భారతదేశమున తన యౌన్నత్యము నిల్పుకొన్నది.

వ్యక్తిసంబంధమైన నైతికనిర్ణయమునుబట్టి కాక, జాతిధర్మము అలవాటు అనే కారణములనుబట్టియే ఆయా జాతులలోనివ్యక్తులు మద్యపానమును బహిష్కరించుచున్నను, ఈనిషేధమునకు ఆధారము ఆ యా జాతులయొక్క తెగలయొక్క నైతికజ్ఞానమే, పురాతన ధర్మకర్తల నిర్ణయమే యైయున్నది. సర్వాంగీకారమును బొంది, స్థిరీకృతమైన ఒకానొక విస్పష్టమగు నైతికనిర్ణయమునకు సంబంధించిన సహజమైన స్వయంప్రకటనమే యది. కావున, యూరప్ దేశముల ఆర్థికసభ్యతను స్వీకరింపని-ఎన్నడును దానిని సంపూర్ణముగ స్వీకరింపమనియే మన మాశించుకొందము-మనదేశములో మద్యపానముయొక్క నైతికవిభాగమే బలవత్తరమైనది; మన ప్రచారములో రూపాయలకు, అణాలకు పైసలకు మన మెక్కువకాలమును స్థలమును వినియోగింతుమేని, దానికి కారణము ఆర్థికసమస్యయే యెక్కువ ముఖ్యమైనదనుట కాదు. రెండవది (నైతికసమస్య) విస్పష్టమగుటచే, దానిని ప్రజలు తమంతట తామే చక్కబెట్టుకొనగలరనుటయే ఆకారణము.

త్రాగుడుకు సంబంధించిన ఆర్థికసమస్య, పాశ్చాత్యదేశములలోకన్న, నియమితమగు తన కార్యరంగమున, మనదేశములో ఎక్కువగ హానికరమగుచున్నది. మన దేశపు దారిద్ర్యము విపరీతమగుటచే, నీయవస్థ ననుసరించియే, పాశ్చాత్య దేశములలోకన్న, నీదురాచారము, మనదేశమున మరింత యెక్కువ ప్రచారము గలిగియున్నది. ఈత్రాగుడు విలాసములకై, ఇంగ్లాండు దేశము ఏటేట 300 మిలియన్ల పౌనులను ఖర్చుపెట్టుటకు నిశ్చయించుకొనవచ్చును. అమెరికా సంయుక్తరాష్ట్రములు, మరల వెనుకకుతిరిగి, మూడు బిలియన్ల డాలర్లను వ్యయపరచుటకు నిశ్చయించుకొనవచ్చును. కాని భారతదేశములో, ఏడాదికి తలకొక్కింటికి ఏబదిరూపాయల యాదాయమైన లేని జనము, వ్యవసాయము చేసికొని చాలభాగము వ్యవసాయదారులకు మాత్రమే యుపయోగపడు వస్తువులను మాత్రము తయారుచేసికొని జీవిత

---

* కడచిన డిసెంబరు నెల 28 వ తేదీనాడు లాహోరునగరమున మద్యనిషేధసభ సమావేశమైనప్పుడు, అధ్యక్షులగు రాజాగోపాలాచార్యులు గారు ప్రసంగించిన యుపన్యాసమునకిది యనువాదము.

7. 3- 16 క్లు క్ష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను గడపు మనము మనసంసారములకు సంబంధించిన ఖర్చులలోగాని సంఘమంతకును సంబంధించిన ఆహారపదార్థములలోగాని మద్యపదార్థములకు తెచ్చి భరింపజాలము. తత్క్షణమే జనించు ప్రబలమయిన ఆర్థిక పరిణామమునకు సంబంధించినంతవరకు, దుష్టమగు మద్యాభివృద్ధికి గొనిపోవు ఒక్కొక్కమెట్టు గూడ పాశ్చాత్య దేశములలో కన్న మనదేశములో నెక్కువ హానికరమగును. ఒక్కమాటలో నిదియంతయు స్పష్టపరచవచ్చును. గ్రేట్‌బ్రిటను దేశములో తలకొక్కంటికి పౌ. 6. షి 9. పె 10. లు (త్రాగుడుఖర్చు) సగటు ఆదాయములో ఎనిమిదవవంతు మాత్రమే యగుచున్నది. ఇదిపోను, ఇంకను ఏడాదికి రు 650 లు తక్కిన ఖర్చులకై మిగులుచున్నవి కాని త్రాగుడుకై రోజుకు నాలుగణాలను ఖర్చుపరచినచో దానికై ఒక భారతీయ కుటుంబముయొక్క ఆదాయములో సగము ఖర్చగుచున్నదన్నమాట, ఆరోగ్యకరమైన జీవితము గడపవలెనన్న, అధమపక్షము తప్పనిసరిగ ఎంతకావలసి యుండునో, దానికన్న తక్కువయే యింక మిగులుచున్నదన్నమాట. ఆర్థికస్థితిగతులు భయంకరములగు నిట్టి పరిణామములకు వచ్చినవన్నచో, మనము మితిమీరిన మనియే దాని యర్థము. ఆర్థికపరిణామము అనమగు నీతిమాలినతనముగ మారుచున్నదనియే దీనిభావము.

తుదకు మనము సారాయిని నల్లమందును, హానికరములగు ఇతర మద్యపదార్థములను, నిషేధించియే తీరవలయుననుట అందరును ఒప్పుకొన్న సంగతియే. ఈనిషేధము ఇప్పుడా, మరికొంతకాలము సాగిన మీదటనా? అనునదియే యింక మిగిలిన ప్రశ్న. వేచియున్నచో లాభమేమైన కద్దా? ఎప్పుడో కంటే ఇప్పుడే మంచిదని నా నమ్మకము. కాలము గడచిపోయిన కార్యము మరింత కష్టసాధ్యమై పోవును. సంవత్సరములు గడచినకొలది నిదురభ్యాసములు మరింత వేరునాటుకొనిపోయి వ్యాపించుట తప్పదు. ఎక్కువ ధనసంపద యేమియు లేక, ఇంచుమించుగ వ్యవసాయమే ప్రధానాధారముగ గల మదరాసువంటి రాష్ట్రమునకు జెందిన లెక్కలను తీసికొనుడు. ఒక్కయేడాదిలో లేక రెండేండ్లలో మద్యపానము పొందగలిగిన యభివృద్ధిని జూతును. 1928_29 సం॥ లో ఖర్చయిన బీరు-సారాయి (Beer) 1927_28 సం॥ లో కంటె నూటికి ముప్పదివంతుల చొప్పున ఎక్కువైనది. 26_27 సం॥ లో కంటె 41 వంతుల చొప్పున నెక్కువయినది. 1928_29 సం॥ లో ఖర్చయిన నాటుమద్యములు వెనుకటి సంవత్సరములో కంటె నూటికి 11 వంతుల చొప్పున పెరిగినవి. దిగుమతియైన సారాయములు (విదేశములనుండి) 1926_27 సం॥ లో కంటె నూటికి 20 వంతుల చొప్పున వృద్ధిబొందినవి. ఈపద్ధతిని ఏండ్లకేండ్లే దొర్లిపోనిచ్చినచో, భవిష్యత్తులో మనమీ దురాచారము నెట్లుకొనగలుగుదుమా?

కాలము గడచిపోయిన కొలది పరిష్కారమునకు వీలులేకుండ ఆర్థికమయిన క్లిష్టత్వముగూడ మరింత గట్టిపడిపోవుచుండును. ముప్పది యేండ్లకుమునుపు, హిందూదేశములోని పెద్దరాష్ట్రములలో గూడ ఈవ్యాపారమువలన వచ్చు ఆదాయము ఒకకోటి రూపాయలకు మించియుండ లేదు; కాని నేడు మదరాసురాష్ట్రములో నీయాదాయము ఆరుకోట్లకు దగ్గరబడినది. బొంబాయిలో నాలుగు కోట్లవరకున్నది. పంజాబులోను, మధ్యరాష్ట్రములలోను, బెంగాలులోను ప్రధానమైన ఆదాయపుమొత్తములో, నీయాదాయము నాల్గవవంతగును; బొంబాయిలో మూడవవంతు; మదరాసులో ఇంతకన్న కొంచె మెక్కువ. బీహారులో నీత్రాగుడురాబడి అసలు ఆదాయములో నించుమించుగ సగమున్నది. పోలీసుతో సహా, మొత్తము ఈపరిపాలనశాఖ కంతకు గావలసిన వ్యయము బొంబాయిలో ఎక్సైజు ఆదాయము (వస్తువులపై పన్ను)నకు సరిపోవును. మదరాసులో నది సాధారణ పరిపాలనమునకు పోలీసు న్యాయశాఖలకు గావలసిన వ్యయముతో తులతూగును. అన్నిరాష్ట్రములయందును అది విద్యాశాఖ వ్యయమునకు రెండింతలకన్న నెక్కువయైనది. ప్రభుత్వమున ప్రతిశాఖలోను ఖర్చు ఎక్కువై పోవుచున్నది. రాబడి సాధనములు అభివృద్ధిలో నున్నట్లు కనబడదు. కావున, ఆర్థికదృష్టిని బట్టి ఇంతకన్న అనుకూలమగు తరుణము ఇకముందెన్నడు లభింపబోదు, అంతేకాక, అది మరింతకష్టసాధ్యమగుటయు నిశ్చ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము. ఆదాయమును బట్టి వ్యయమును ఎక్కువచేయవలయునని యే సాధారణమగు నభిప్రాయమై యున్నది. వ్యయము నెక్కువగ నపేక్షించు బలీయములగు సంబంధములు సృష్టింపబడును. ఇవి మరి వెనుకకు మరలనీయక ప్రబలమైన యాతంకములుగ నేర్పడిపోవును.

త్రాగుడువల్ల వచ్చు రాబడి, నిజముగ, నసలొక రాబడియే కాదు; దూబరా ఖర్చునుండి యేరుకొన్న బాపతు. కొంచెము మన ఆలోచనశక్తిని ధైర్యమును ప్రోగు చేసికొని, జడత్వమును విసరి ఆవలపారవైచినచో, మన మీ దూబరాఖర్చును నిరోధింపగలము. ప్రభుత్వధనాగారములోనికి బోవుదానికి బదులెల్ల సొమ్ము మన యిండ్ల నిల్వ కొనగలము. ఆర్థిక సామర్థ్యము విషయమునను నైతికాభివృద్ధి విషయమునను దేశములోని పనివాండ్ర, కిట్లు చేసినచో, కావలసినంత మిగులును. నేరములను నిరోధించుటలోను శిక్షించుటలోను తగులుచున్న ఖర్చులో నెంతయో తగ్గిపోవును. ఈ లాభము మిగులు, ఇదియంతయు, కొరకపోదు; ప్రభుత్వమునకు కావలసిన ధనమును మరల, పైసలతో సహా, సమకూర్చును. ఇదియంతయు అమెరికాలో ప్రత్యక్షమైన అనుభవమువల్ల తెలియబడినదియు, నిష్పక్షపాతులైన సమర్థులగు అర్థశాస్త్రవేత్తలచే నంగీకరింపబడినదియు.

కాని వ్యవహారము సాగించుటకు కావలసిన ఖర్చు సంగతియేమి? ఇదియొక పెద్ద వాదముగ, నిషేధమువల నమవారు ఇప్పుడైనను, వస్తుల వ్యాపారమునకుగాని మద్యములను తయారు చేయుటకుగాని స్వేచ్ఛ లేదనియు, అల్పవిషయములలో గూడ ఎన్నియో విధములను నిషేధములు ఆలోచింపబడుచున్నవనియు జ్ఞాపకముంచుకొనరు. నిషిద్ధ వస్తువుల నిర్మాణమును, వ్యయమును, ప్రతి అల్పవిషయమునుగూడ పరీక్షించుటకు నేడు మనకు ప్రతి రాష్ట్రమునను 20 మొదలుకొని 50 లక్షల రూపాయలవరకు వ్యయమునకు కారణమగుచున్న ప్రభుత్వశాఖ యొకటికలదు. నేటి యీ అస్థిరములైన లైసెన్సునియమములకన్న, నిజముగను, నిషేధనియమములలో పెట్టుటకే ఖర్చు తక్కువగును. దొంగతనములను, దోపిడులను, గుత్తకిచ్చి లైసెన్సు సంపాదించి దోపిడిగాండ్రు నిర్ణయించు కాలనియమమునకు, పద్ధతులకులోబడియుండు నియమములతోను, దోపిడిపంపకములతోను గూడిన కార్యవిధానము నేరమును పూర్తిగ నిషేధించి, నిరోధించు కార్యవిధానముకన్న చౌకపద్ధతి యగునా? సంపూర్ణ నిషేధము మొదటమొదట యెక్కువ వ్యయకరమే యగునని భావింతము. ఐనను, అది మన వెనుకటి నేరముయొక్క విలువ. కట్టుదిట్టముగ నములుపరచినచో కార్యము సులభమగుననియు, మామూలు పోలీసుశాఖకగు ఖర్చులో నొక భాగముగ మాత్రమే యీ ఖర్చు మారుననియు విశ్వసించి పై విలువను మనము చెల్లించి తీరవలయును. దీనిని గూర్చి, ఇంక నే విధముగను ఇబ్బంది పెట్టని నూతనముగ నొకటి సృష్టిగాంచును అల్లరి కల్పింపవలయునని త్రాగుడు-ప్రచారకులు ప్రయత్నములను కొనసాగించినను, నిషేధము అమెరికాలో జరిమానాలవల్లను, శిక్షలవల్లను తనకయిన ఖర్చుకన్న యెక్కువగనే ఆదాయమును సమకూర్చినది. భగ్నము చేయవలయునను యత్నములు సాగుచున్నంతవరకు జరిమానాలు, శిక్షలు ఎక్కువగనే యుండును; ఇవి తగ్గిపోయిన నిషేధము సుసాధ్యమైపోవును.

అమెరికా తొందరపడి నిషేధము నవలంబించినది. ఇప్పుడు మరల పశ్చాత్తాపపడుచున్నది. అందుచేత మన మాపొరపాటు చేయకూడదు అని చెప్పువారు కొందరుగలరు. అమెరికాకు నిషేధమవలంబించుటకు చాలకాలము పట్టినది, అందుచేత మనము గూడ చాలకాల మట్లే గడపవలయును అని కొందరందురు. ఈ రెండు తెగలవారును పొరపడుచున్నారు. మొదటివాదము సిద్ధాంతములో తప్పు; రెండవవాదము నిర్ణయములో తప్పు. అమెరికా తొందరపడి నిషేధము నవలంబింపలేదు. జాతీయ నిషేధము (National prohibition) నందుకు నొనిచ్చుటకు 66 ఏండ్లుపట్టినవి. మెయిన్ ప్రభుత్వము 1881 లో నిషేధము నవలంబించెను, నార్త్‌డకోటా 1889 సం॥లో నవలంబించినది. ఇట్లే క్రమముగ 1893 సం॥లో ఇంకొక ఆరు ప్రభుత్వములు నిషేధము నవలంబించినవి. 1913 సం॥లో 9 ప్రభుత్వములు సంపూర్ణనిషేధము గలిగి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండినవి; 39 రాష్ట్రములు కొంతవరకు నిషేధము కలిగియుండినవి. 1920 సం॥కు,అనగా, జాతీయనిషేధము అమలు జరుగుటకు, పూర్వము 33 రాష్ట్రములు తమంతట పూర్తి నిషేధము నవలంబించినవి. ఇంకొక 15 రాష్ట్రములు చాలభాగము నిషేధము గలిగియుండినవి. మొత్తము అమెరికా సంయుక్త రాష్ట్రముల వైశాల్యములో నూటికి 85 భాగములు — ఈ 85 భాగములలోను మొత్తము జనసంఖ్యలో మూడింట రెండు వంతుల ప్రజలు నివసించుచున్నారు— 18* వ సవరణ అంగీకరింపబడిన నాటికి నిషేధము గలిగియుండెను. 18 వ సవరణ అమెరికన్ కాంగ్రెసువారిచే నామోదింపబడి 1917 సం॥ న వానియామోదమునకై 48 రాష్ట్రములకు పంపబడినవి. 1919 సం॥లో వాల్ స్టెడ్ ఆక్ట్ అనబడు నిర్బంధ నిషేధ శాసనమును (Prohibiton Enforcement Act) కాంగ్రెస్ ఆమోదించినది. అధ్యక్షుని అనంగీకారము (Veto) వచ్చిన తరువాత ప్రతినిధి సభయు సినెట్ సభయు, రెండును, అధికసంఖ్యాకముగ దాని నామోదించినవి. 15 నెలలలోపుగ 45 రాష్ట్రములు సవరణ నామోదించినవి. 46 వది 1922 సం॥లో నామోదించెను. రెండు ప్రభుత్వములు మాత్రమే దాని నంగీకరింపలేదు. వెనుకటి 17 సవరణలలో నేదియు, రాష్ట్రముల సంఖ్యను బట్టికాని, శాసనసభలలోని వోట్ల సంఖ్యను బట్టికాని ఇంతగొప్ప యామోదము సంపాదించియుండలేదు.

అంతేకాక, హెర్బర్ట్ హూవర్ 444 వోట్లలో అధ్యక్షపదవి కెన్నుకొనబడెను, వ్యతిరేకములైన వోట్లు 82 మాత్రమే. అతడు నిషేధపక్షమువాడు. గవర్నర్ స్మిత్ మొదలగు వ్యతిరేక పక్షమువారు దానినే ప్రధానసమస్యగదీసికొని తమ పోటీసాగించిరి. దీనినిబట్టి, తాత్కాలికమైన విపరీతపవిత్రతా వేశముతోగాని దురభిమానముతోగాని, అమెరికా నిషేధము నవలంబింపలేదనుట స్పష్టమగుచున్నది. ఇంకేమి?

ఒక దేశము సత్యమును గ్రహించుటకు ఏన్నో యేండ్లు, పొరపడి, చీకటిలో తిరుగవలసివచ్చినదన్నచో, నంతమాత్రమున తక్కినదేశములు గూడ అందుకై అన్నియేండ్లకాలము చీకటిలో గడపవలయునని యెక్కడనూ లేదు. మానవ సంఘమునందు సత్యదీపము వ్యక్తినుండి వ్యక్తికి, జాతినుండి జాతికి క్రమముగ సంక్రమించుచుండును. ఇతరులు ముగించిన చోటనే మనమారంభింతుము. ఇదియే మానవసంఘముయొక్క అభివృద్ధికి మార్గము; ఇట్లే ఒకజాతికి మరియొకజాతి తోడ్పడుట. కళలు

* అమెరికా సంయుక్తరాష్ట్రముల రాజ్యాంగవిధానముయొక్క 18 వ సవరణ మద్యనిషేధమునకు సంబంధించిన. 1917సం. నీ అమెరికన్ కాంగ్రెసుసభ-ఇదియే అమెరికాపరిపాలన వ్యవహారములను నిర్వహించును.—ఈ సవరణ నామోదించినది. 1919 సం. జనవరిలో నది వివిధరాష్ట్రములచేతను అంగీకరింపబడి 1920 సం. జనవరి నె.లో అమలులుకు వచ్చినది. సవరణ యిది.

1 వ భాగము—ఈ శాసనము అంగీకారమును (ఆయారాష్ట్రములయొక్క) పొంది ఒక సంవత్సరము గడచినది మొదలుగ త్రాగుడుకొరకు అమెరికాలో మద్యములను తయారుచేయుటగాని అమ్ముటగాని ఒకప్రాంతము నుండి మరియొకప్రాంతమునకు పంపుటకాని అమెరికాకు వానిని దిగుమతి చేయించుకొనుట గాని అమెరికానుండి వానిని ఎగుమతి చేయుటగాని ఇందుమూలమున నిషేధింపబడుచున్నది.

2 వ భాగము—అనుకూలమగు శాసనపద్ధతిని ఈ శాసనభాగము నమలుపరచుటకు కాంగ్రెసునకును; ఆయా రాష్ట్రములకును సమానములగు నధికారము లుండును.

3 వ భాగము—రాజ్యాంగవిధానములోని నియమమునననుసరించి కాంగ్రెసు దీనిని వానివాని యామోదమునకై పంపిన ఏడేండ్లకలోపుగ, ఆయా రాష్ట్రముల శాసనసభలచే రాజ్యాంగవిధానమునకొక సవరణగ నంగీకరింపబడిననే తప్ప యాశాసనభాగము అమలులోనికి రాజాలదు.

[ప్ర. రం.]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాస్త్రములు, ప్రభుత్వము-అన్నిటికి నిది యొక్కటియేదారి.

క్రమక్రమముగ దుకాణములను తగ్గించుటచే క్రమక్రమముగ నీ దురాచారమును మాన్పుదమనునంతటి అర్థములేనిమాట మరియొకటిలేదు. సలహాసంఘము వారియభిప్రాయములు అక్కడ నొక దుకాణము ఇక్కడనొక దుకాణము ఎత్తి వేయుటను సూచించుచున్నట్లు ఎక్సైజుశాఖవారి నివేదికలలో తెలియజేయబడుచుండును 1904 సం॥లో 90,000 కల్లు దుకాణములుండినవి. ఖాతాదారులకు ఏరవ్వంత నష్టమును గలుగజేయకయే పై సంఖ్య చల్లగ 45,000కు తగ్గింపబడినది. దుకాణముల సంఖ్య సగము తగ్గిపోగా త్రాగుడురాబడి నాలుగింతలు పెరుగుట దీని ఫలితమైనది. ఎక్సైజు సలహాసంఘము వారి సలహాలు మామూలుగ ఇరుగు పొరుగుల ఆస్తిపై ఆధారపడియుండు శాంతికాములగు ప్రజలకై చేయబడునవికాని, సంస్కరణకార్య క్రమముతో వానికి సంబంధమేమియులేదు. నిజమునకు, త్రాగుబోతు అలవాటులకును క్రమక్రమముగ దుకాణములను తగ్గించుటకును సంబంధములేదు; మొదటిదాని నడక వేరు, రెండవదాని నడకవేరు. కాని ప్రభుత్వమువారిని మన మీవిషయమున విమర్శించు నప్పుడు, దురదృష్టవశమున, వారొకేయభిప్రాయమునకు లోబడియున్నారని జ్ఞాపకముంచుకొనవలయును. వారిదృష్టి యెల్లప్పుడును దొంగతనముగ వస్తువును తయారుచేయువానిపై నుండును. ఇట్టి నేరగాండ్రు లేరని యెవ్వరును చెప్పుటలేదు. కాని వారితో పోటీచేసి మనము పరిపాలనము సాగింపజాలము. వారిని, తక్కిన నేరగాండ్రవలెనే, శిక్షించి యణగద్రొక్కుట యొక్కటియే మన పనియై యుండవలయును. వ్యాపారపద్ధతిని, చౌక అమ్మకములనుబట్టి, మనము వారి నోడింపజాలము. కాని ప్రభుత్వమువారుచేయ జూచుచున్న పని యిదియే. ప్రతి రాష్ట్రమునందును పరిపాలనశాఖ నివేదికలు ధర లెక్కువ చేయుటనుగూర్చి, దుకాణములను తగ్గించుటనుగూర్చి అమ్మకమున కేర్పడిన కాలనియమములను గూర్చి మొర పెట్టుకొనుచుండును. 'అయ్యో, మన వ్యాపారమంతయు పడిపోవుచున్నది. దొంగ ఆదాయమునంతయు కాజేయుచున్నాడు!" అనియే ప్రతి ఎక్సైజు కమీషనరూ పాడేపాట. అసలులోపము ధైర్యహీనత. నేరగాండ్రను చక్కబరచుటకు దగిన ఆత్మవిశ్వాసము లేకుండినచో, వారికి లైసెన్సులిచ్చి వారితో పోటీచేసి వారికంటె తాను తక్కువధరల కమ్మవలయునని సూచించినచో, ఏ ప్రభుత్వముగాని యేలుబడి సాగించుటకు తగదు.

కొన్నియేండ్లకు మునుపు తాను స్వీకరించిన సంస్కరణ విధానమును కొనసాగించుటకు బొంబాయి ప్రభుత్వము తిరస్కరించినది. ఆర్థికపరిస్థితులు చక్కబడువరకు, ౧౯౨౭ సం॥పు 'మితి' పద్ధతినే యవలంబింపవలసి యుండుననియూ, అంతకన్న సరకు వాడకమును తగ్గించుటకు ప్రభుత్వమువా రంగీకరింపరనియు, మంత్రి శాసనసభలో ప్రకటించెను. ఇట్లనుటకు గల కారణములను మేమంగీకరింపము. ప్రభుత్వ వ్యాపారములోనున్న కాపట్యమును స్పష్టపరిచి సభ్యప్రపంచముయొక్క నిరసనకు పాల్పరచుటకు ఈమంత్రిగారి మాటలకన్న మంచి సాధనము మరియొకటి యుండదు. రవ్వంత పరీక్షించి చూచినచో ఈమితి కర్థములేదని తెలియగలదు. మితి వ్యక్తికికాదు, దేశమునకంతకును. డబ్బుగలవాడు ఎంతయైన కొనవచ్చును. వాడుకదారుపై నిదితప్ప మరియొక నిర్బంధమేదియు లేదు. ఈవిధముగ జిల్లా మొత్తమునకు ఏర్పరుపబడిన మితి యెంతయనిచూచిన అదియు మామూలువాడుకకంటె యెక్కువయే. కడచిన ఆరేండ్లలోను ఈమితి అసలు వాడుకకంటె ౨౧ లక్షల ప్రూఫ్-గాలన్లు ఎక్కువగనే యుండెను. ప్రభుత్వము చిల్లర అమ్మకమును పూర్తిగ స్వాధీనపరచుకొని, వ్యక్తిమీదను వస్తువు పరిమాణముమీదను బలీయమగు నిర్బంధమేదైన నుంచిననే తప్ప ఈ మితియనునది అర్థములేనిమాట. ఎక్సైజు ఉద్యోగుల దృష్టి మారనంతవరకు ఏప్రయత్నమును కొనసాగదు. నిషేధమనునది లోపలనుండి రావలసినదే కాని పైనుండి రావలసినది కాదని ఎక్సైజు డిపార్టుమెంటువారి ప్రియసిద్ధాంతము. ఏదైన దురాచారమును మానవలయునను కోరిక లోనుండి రావలసినదే, బయటనుండి కాదు. నిజమే. ఒకరిబుద్ధిని పాడుచేయుటను మానవలయు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుటయు ఈనియమమునకు లోబడియుండవలసినదే. జ్ఞానము వ్యాపింపజేసిననే బలవంతమగు బహిష్కారము సాధ్యమగును. ఇంతమాత్రమున దీనినిబట్టి యీలోపుగ ప్రజలయెదుట మనమెన్ని యాకర్షణములనైన ఉంచ వచ్చునని తలపరాదు. బహిష్కారము లోనుండియే కాని పైనుండి రావలసినదికాదను సిద్ధాంతముతో ప్రభుత్వము వారు స్వతంత్రముగ రహస్యవ్యాపారమును సాగనిచ్చెదరా? జ్ఞానవ్యాప్తినిబట్టియే విచక్షణశక్తినిబట్టియే పూర్తిగ బాగుపడుట సంభవించును. కాని మనము ఈ కష్టమును అవతలివైపునుండి కూడ, అనగా 'బాహ్య బహిష్కారము' వలనగూడ, తగ్గింపవలసి యుండును. నిషేధశాసనములను మనము కోరుచున్నచో, పూర్తిగ వానిమీదనే యాధారపడవలయునని కాదు; మన ప్రచారము, మన సంస్కరణము, తృప్తికరముగ వృద్ధిబొందునట్లు అవి మనకు తోడుపడవలయు ననియే. ఎవరైన రోగగ్రస్తులైనప్పుడు వారికిని వారినికాచుకొని యుండు వారికినికూడ మనము ఆహారనియమమునుగూర్చి బోధింతుము, కాని 'నిషేధము లోపలినుండి పుట్టవలసినదే' యనిచెప్పుచు, మనమే, ఆశపెట్టి వారి మనఃస్థైర్యమును పరీక్షించుటకుగాను, అపథ్యపదార్థములను వారియెదుట నుంచము. మానవునకు జూదము మొదలగు దురాచారములపై మనసుంచుట సహజము. ఎన్నియో దొంగదారులను గలిగియుండి మానవుడేదో యొకవిధముగ జూదమును తగిలియేయుండును. అన్నిజూదములను మాన్పుట దుస్సాధ్యమని మన మెఱుగుదుము. 'ఆంతరిక బహిష్కారమే' జూదమునాపుటకు దారి. కాని మన ప్రభుత్వమువారి త్రాగుడు వర్తకమును అంత మొదించుటకు గావించునాందోళనముగూడ పైపద్ధతినేయున్నది. తనుతమ ఆర్థికనైతిక లాభములను జాగ్రత్తపరచుకొనవలసినదని మనము ప్రజలకు బోధింప వచ్చును. కాని 'పాల్' అన్నట్లు "ఎవ్వరును, తమసోదరులలో నెవ్వరిని, అందరికంటె బలహీనులనైననుసరే, పడద్రోయునట్టి యాటంకములను గాని అవకాశములను గాని కల్పింపకుందురుగాక"

మొన్నమొన్ననే మదరాసు ఎక్సైజుడిపార్టుమెంటు అధికారి నాతో గలిసి కొన్ని పల్లెటూళ్లకు వచ్చెను. అక్కడ నతనికి విలక్షణమగు దృశ్యమొకటి కన్పించినది. దుకాణములవద్ద మూగిన త్రాగుబోతులు గూడ దుకాణములను మూయవలయునని ఆయన నడిగిరి. 'మరి యింక దుకాణము నెక్కడపెట్టుదము' అని ఆయన ప్రశ్నించెను. "ఎక్కడో, దూరముగ, మేము నడిచి రాలేనట్లు, పదిమైళ్లదూరమున" అని వారు సమాధాన మిచ్చిరి. మనదేశమువలె నిషేధమునకు సిద్ధమగనున్న మరి యొకదేశము లేదనుట నిస్సంశయము. సుమారు నూరేండ్లనుండియు, నీదురాచారము బాగుగ వ్యాపించి స్థిరపడునట్లు ప్రభుత్వమువారు ప్రయత్నములను సాగించుచు వచ్చిరి. ఇంతయైనను, 1919 సం॥ నాటి అమెరికాకన్నను, నేటిగ్రేట్‌బ్రిటనుకన్నను గూడ మనము సంపూర్ణ నిషేధమున కెక్కువగ తగియున్నాము. ఉదాహరణముగ, బెంగాల్ రాష్ట్రమును గొనుడు. ఇది గ్రేట్‌బ్రిటను కన్న పెద్దది. మొత్తముమీద నిచ్చట నూర్గురికి ¾ గాలన్ల మద్యము ఖర్చగుచున్నది. ఇంగ్లండ్ దేశములో 117 గాలన్లు. దీనినిబట్టి త్రాగుడులేని వారి సంఖ్యను పోల్చిచూచిన, బెంగాలులో 156 గురున్నచో ఇంగ్లండులో ఒక్కరుండురు. ఐనను ప్రభుత్వమువారు సంపూర్ణ నిషేధము ప్రకటింపరు; ఎక్కువ అనుకూలమగు తరుణమునకై కాచియుందురు; ఈలోపుగ పైసంఖ్యను (156 ను) తగ్గించుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నించెదరు. రవ్వంత యవకాశమునైన నొసంగక యీ ప్రభుత్వముతో మనము పోరాడవలయును. విజయము మనది.

గతవత్సరము డిసెంబరునెలలో కలకత్తానగరమున సమావేశమైన అఖిలపక్షమహాసభవారు భారతదేశపు రాజ్యాంగవిధానములో, సంపూర్ణమగు మద్యనిషేధము, వైద్యపారిశ్రామికకార్యములకు తప్ప, ఒక ప్రధాన సిద్ధాంతముగ నుండవలయు నని తీరుమానించిరి. ఆరోగ్యాభివృద్ధికై నైతికాభివృద్ధికై, తగు విద్యాప్రబోధము గలిగియుండుట యెట్లో, ఈ దుర్వ్యాపారమునుండి రక్షింపబడుట గూడ అట్లే పౌరుల హక్కై యున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిషేధమనగా, విదేశముల దిగుమతుల నంతమొందించి కార్యవిధానమును సమన్వయపరచుకొనుటయు; సైనిక దళములతో సహా, అన్నిశాఖలయందును ఖర్చు తగ్గించుటయు గూడ నగును. అందుచే దానిని రాష్ట్రప్రభుత్వముల శాసనముక్రింద పరిపాలనముక్రింద నుంచుటకు వీలులేదు. మాంటేగ్యూసంస్కరణములలోని విభజన సిద్ధాంతమును అవలంబించినచో నిషేధము అసాధ్యమై పోవును.

పరిస్థితి ఆశాజనకముగ నున్నది. ఉద్యమమును ధ్వంస మొనర్చు వ్యాధి ప్రతిఘటనము కాదు, నిర్బంధనము గాదు, ఉపేక్ష. ఈ ఉపేక్షను మనము దాటినాము. ఈ సమస్యపై నింత విశాలము, హృదయపూర్వకమునగు ధ్యాస యింతకుమునుపెన్నడును పుట్టలేదు. పత్రికలలో వెనుకటికన్న చాల ఎక్కువగ నిషేధమునకు స్థానమొసంగబడుచున్నది. అన్నివైపులనుండియు నీసమస్యను చర్చించిన యుపన్యాసకులు ఇంతకుముందు తక్కువగ నుండిరి. ఇంతవరకు ఉపేక్షవహించి యుండిన రాజ్యాంగవేత్తలు ఇప్పుడు దీనిని తమ కార్యక్రమములో ప్రధానభాగముగ దీసికొనుచున్నారు. నిషేధమునకు వ్యతిరేకాభిప్రాయము హిందూదేశములో నెన్నడు నుండదు; [illegible]ని యీ విషయమున నిర్మాణాత్మకమగు సమాలోచన చాల ఎక్కువగ గన్పించుటయే యిప్పటి విశేషము. నిషేధము వచ్చుచున్నదని ప్రతియొక్కడును తలంచును. జనసామాన్యము, హృదయపూర్వకముగ దృఢముగ నిషేధమున కనుకూలమై యుండి, నాయకులకు సాయపడుటకు సిద్ధముగ నుంటయే కాక, తనకు తానై నాయకత్వము వహించుటకుగూడ తగిన శక్తి గలిగి యున్నది. ఇది నిషేధమును నిశ్చయపరచు చున్నది.

ప్రపంచపరిస్థితులు గూడ మన కనుకూలముగ నున్నవి. అమెరికా తన సంస్కరణముతో తృప్తిబొంది యూరకుండదు. ప్రపంచము దంతటను ఈ శత్రువు నెదిరించి పోరాడి తీరవలయును. సభ్యప్రపంచమంతయు త్రాగుడుకు వ్యతిరేకముగ నున్నది. ఈ పిశాచమును పారద్రోలుటకు భగవంతుడు మనకు శక్తినొసంగు గాక.

[అనువాదకుడు: ప్ర. రంగాచార్యులు.]

---

భారతీయ మహిళామండలి




మిస్. శాంతాబాయి గారు బి. ఏ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## వాక్యావళి

1. మరణమునకంటె భయంకరమగు జీవితము ననుభవించుటయె నిజమగు ధీరత్వము. (సర్. టి. బ్రౌని)

2. అపజయమన్న భయపడుటయే అపజయము నకు కారణము. (షేక్స్పియర్)

3. ఎవ్వరును ఎల్లప్పుడు బుద్ధిహీనులుగా నుండరు. కాని ఎల్లరును అప్పుడప్పుడు బుద్ధిహీను లగు చుందురు. (యంగ్)

4. నేత్రానందము క్షణభంగురము. శారీరక నేత్రము ఆత్మకు నేత్రము కాదు. (శాండ్)

5. ద్వేషించుటకంటె ప్రేమించుట మనుజస్వ భావము. (హాథారన్)

6. సానుభూతి, దయ మానవులందరను ఒక్కొ కొకరిని బంధువులనుగా నొనర్చుచున్నవి. అందరి శరీర ములలోను ఎర్రగనె ప్రవహించెడు రక్తమునకు గాని, అందరి కండ్లనుండి ఉప్పగ నొలుకు కన్నీటికి గాని కులభేదము లేదు కదా! (ఆర్నాల్డు)

7. ఈ రోజు నిన్నటి దినము కాదు. మనము దినదినమును మార్పుచెందుచున్నాము. మనము చేయు పనులు, తలచెడు తలపులు సౌఖ్యదాయకములుగ నుండ వలెనన్నచో నవి మారుచుండవలయును. మార్పు మొదట కష్టముగ దోపవచ్చును. కాని ఇది అత్యవసరము. (కార్లైలు)

8. మానవజీవితము ఒక ప్రచురణము మాత్రమే ప్రకటింపబడిన గ్రంథము.

9. ప్రేమించి ప్రేమింపబడకుండుట విచారకరము. కాని ప్రేమింప లేకుండుట మరియు విచారకరము. (మేటర్లింక్)

10. ప్రపంచమునందెచ్చటనైనను అనువదించి చెప్ప నక్కరలేని భాష గాన మొక్కటిమాత్రమే. "గానభాష" యందు ఒక ఆత్మ మరొక ఆత్మతో సంభాషించును. (ఫర్రార్)

11. ఆచారమువంటి నిరంకుశమైనది మరొకటి లేదు. దానిని అతిక్రమింప లేనిచోట స్వేచ్ఛ యుండదు. (బోలీ)

12. నిజమగు విద్య "ఓ, న, మ"ల నుండి ప్రారంభించదు. తల్లి కంటిచూపుతోను, తండ్రి దల యూపుతోను, సోదరి కరస్పర్శముతోను విద్యయుద యించుచుండును. (సాలా)

వడ్లమూడి గోపాలకృష్ణమూర్తి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ప్రాత-క్రొత్త

ప్రాత–మానవుని ప్రధానగమ్యము ఈశ్వర సంకీర్తనమే.

క్రొత్త–మానవుని ప్రధాన గమ్యము వ్యక్తిగను, జాతిగను తాను వర్ధిల్లుటయే.

ప్రాత–మానవుడు స్వతస్సిద్ధముగ నీచుడు, బూడిదలోని పురుగు.

క్రొత్త–మానవుడు స్వతస్సిద్ధముగ మంచివాడు, అనంతమైన అవకాశములు గలవాడు.

ప్రాత-మానవుడు ఈశ్వరేచ్ఛకు తలయొగ్గవలయును.

క్రొత్త–మానవుడు అన్యాయమునకును, ఆర్తికిని ఎదురాడక తలయొగ్గరాదు; మఱియు తత్కారణముల తొలగింప యత్నింప వలయును.

ప్రాత–సత్యము ఒక్క మతమునందే కలదు.

క్రొత్త-అన్నిమతములందును, వెలుపటను గూడ సత్యము లున్నవి.

ప్రాత–జగత్తును, మానవుని ఈశ్వరుడు సృష్టించినాడు.

క్రొత్త-జగత్తు, మానవుడు పరిణామఫలములు.

ప్రాత–పాపము, ముక్తి, ప్రాయశ్చిత్తము, ప్రార్థన, యజనము-ఈభావములు ముఖ్యములు.

క్రొత్త–మతమున ఈ భావములు అముఖ్యములు.

ప్రాత–ముక్తిమానవునికి బాహ్యమునుండిలభించును.

క్రొత్త–అభివృద్ధిఅంతరమునుండివచ్చును.మానవుడుగాని,ఈశ్వరుడుగాని వేఱొకమానవుని 'రక్షింప'జాలడు.

ప్రాత–నరకము పాపులు శాశ్వతముగ యాతనపడు నెలవు.

క్రొత్త–ధర్మజీవనము భంగించుటవలన గలుగు స్వాభావికమగు ఫలమే ఆర్తి.

ప్రాత–స్వర్గము సత్పురుషులు నిర్యాణానంతరము పోవు తావు.

క్రొత్త–ధర్మాచరణమే ఒకానొకతృప్తి నిడును.

"ది వర్ల్డ్స్ యూత్."

---

లండన్ నగరమున భారత కార్యాలయ నూతనభవన చిత్రములు 3




౧. కిటికీలపై ఏనుగుతలలు చెక్కబడినవి.

7. 3. 17 ౭౯౫౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౨. మధ్యనున్న చావడికి ఎగువ చుట్టును గల చలువ రాతిపై శిల్పము. ఇది డిల్లీలో తయారయినది. ఈ చలువరాయి ౨౪ అంగుళము దళసరి అయినది.




౨. ప్రదర్శనపు హాలునందు విలువగల కఱ్ఱతో బల్లసరంబీ అమర్చి దానిపై శిల్పమును చేర్చుట.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## జవహరిలాలు నెహ్రూగారు-భారతదేశాదర్శము

అమెరికాదేశపు సుప్రసిద్ధ వ్యాసకర్త యగు అప్టను క్లోజుగారు గతవత్సరాంతమున భారతదేశమునకు వచ్చి మహాత్మ గాంధిగారు, పండిత జవహరిలాలు నెహ్రూగారు మున్నగు నాయకులను సందర్శించి యీదేశపరిస్థితులను స్వయముగ జూచిపోయిన పిదప 1929 డిశంబరు 22వ తేదీ న్యూయార్కు టైమ్సు పత్రికలో దీర్ఘ వ్యాసమును వ్రాసిరి. మహాత్మునితోను, పండిత జవహరిలాలు నెహ్రూగారితోను ఆయన ముచ్చటించిన దాని గూర్చి ఆయన వ్రాసిన యీదిగువ వ్యాసభాగము గాంచినచో భారత యువజనాదర్శము లెట్లున్నవో, యెట్టియున్న తాశయములు వారి యాత్మల వికసింప జేయు చున్నవో తెలియగలదు. వా రిట్లు వ్రాసిరి:—

భారతీయ విప్లవమునందు స్వాతంత్ర్యప్రకటన దినముగ 1929 డిశంబరు 31 తేదీ పరిగణింప బడవచ్చును. మహాత్మాగాంధిగారును, వా రీమధ్య పరుపుపై చేరబడి నాతో ముచ్చటించుచున్నపుడు చుట్టు నుండిన వారి అనుచరులును అట్లే ఆశించిరి. భారతదేశమున ఈ చివర నుండి ఆచివరవరకు బోయి చూచివచ్చితిని. నే గాంచినవి పెక్కు చిత్రములు గలవు: వృద్ధుడగు పత్రికాసంపాదకుని చెరబట్టుట, తెంపు లేని వాదపరంపరలో నిమగ్నమైన పత్రికలు, స్థలము లేకుండ నిండిన జెయిళ్లు, మెడకు కాళ్లకు ఇనుపసంకెళ్లతో కఠిన నిర్బంధమునం దుంచ బడిన గుంపులు, ఉద్రేకపూరితములగు కుట్రకేసులు, జెయిళ్లప్రవర్తన సహింపక నిరశనవ్రతె మూని ప్రాణములు త్యజించు ముద్దాయిలు.

"1930 జనవరి 1 వ తేదీనాటికి మాపరతు లంగీకరింపబడక, బ్రిటిషు సామ్రాజ్యముతో భారతదేశమునకు గల మోమోటములన్నియు తీరిపోయినచో నాభారము తీరును" అని భారతదేశపు మహోత్తర పురుషుడును, గొప్పత్యాగియు, రాజకీయ నిధియు నగు మహాత్ముడు నుడివెను. "అందువలన మే మింకను ఎక్కుడు బాధల పడవలసి యుండును. అట్టి బాధల నొందుట మాకు మంచిదే. మే మందుల కర్హులమే యగుదుము. నే నట్టి బాధల కోరి కొందును. చివరకు భారతదేశము నిజముగు స్వేచ్ఛను బడయగల్గును; రాజకీయ వైజ్ఞానిక ఆర్థి కాధ్యాత్మిక స్వేచ్ఛను బడయును."

తీక్ష్ణదృష్టియై సగర్వముగ జూచుచుండిన జవహరిలాలు నెహ్రూ, యౌవన భారత ఆదర్శపురుషుడు, జాతీయ మహాసభాధ్యక్ష పీఠము నధిష్ఠింప నున్నవాడు, "స్వేచ్ఛ"యను నపుడు తల పంకించి కదలుచుండిన పెదవులను బిగబట్టెను. బాధల నొందెదమని మహాత్ము డన్నపుడు భారతీయ యువకులును బాధలకు వెరవరని నే గాంచిన దృశ్యముల బట్టి యనుకొంటిని.

నెహ్రూ కుమారునితో నేను చాలసేపు ముచ్చటించితిని. మాపాదముల వద్ద నున్న గట్టుదిగువను పవిత్రమగు నిర్మలోదకములు ప్రవహించుచుండెను. పైనున్న అర్ధచంద్రుని కిరణములు ఎగువ నున్న వంతెనను, తాజమహాలు శిఖరములను జూపుచుండెను. ఆతని అస్పష్టోచ్చారణయు, గంభీరమగు కంఠస్వరమును ఆదేశపు నేటి యౌవన విప్లవకారు లందరియం దుండు ఆత్మోద్రేకమును మరుగుపరచుచున్నవని నేను గుర్తించితిని.

ప్రస్తుత మున్న చిక్కులను, ముందు ప్రపంచమునందు జరుగనున్న మార్పులనుగూర్చి మేము ముచ్చటించి లేచుచుండ, "అవును, ఇది యొక(great game) గొప్ప వేట—మాకు ధైర్యము కలిగించునదియే. నేను పోవలసి యున్నది." అని యాతడు చేతిగడియారము చూచుకొనెను. "అర్ధరాత్రిలోపల జైలుకు చేరవలెను. నేను రాత్రి మీతో ఏమంటినో ఆమాటలే యన్నందుకు మాలో నొకరిని బంధించిరి. ఆగొప్పింటి యువకునిచే చేయరాని నీచపుపనులు చేయించుచున్నారు. ఆతను నిరాకరించెను ; రెండు వారములనుండి చీకటి కొట్టులో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడియున్నాడు. నన్నుతప్ప అత నింకెవ్వరిని చూడ వీలులేదు. నే నాతని వకీలుగ జూడవచ్చును. నేను—లేక, మాలో నెవరయినను—రే పాతనివలె పడియుండ వలసివచ్చును. క్షమింపుము. నే నాతనికి ఆశాభంగము కలిగింపరాదు."

బిళ్లబంట్రోతులు మాకు బయటకు దారి జూపిరి. ఇరువురము చెరియొకవైపునకు ఆచీకటిరాత్రిని బోతిమి.

డిశంబరు 31 వ తేదీని జరుగబోవుదాని గూర్చియు, భారతయువకుల మన స్తత్వముల గూర్చియు ఆతను నా కించుక సూచించెను. "ఆరోజున అన్నంతపని చేయుటకు సిద్ధముగ నున్నారా?" అని నేను ప్రశ్నించియుంటిని.

"మే మనుకొనినదంతయు చేయజాలము." అని కొంత తాళి, "మా ప్రత్యర్థులు అనుకొన్నదాని కంటె ఎక్కువే చేయ గల్గుదుము" అనెను.

"అప్పుడేమి జరుగును?"

"ఏమి జరిగినను జరుగ వచ్చును. ఏమీ జరుగక పోదు."

"బ్రిటిషు వారు అధినివేశ స్వత్వము ఇత్తు మన్నచో?"

"వారు విశదముగ నొక తేదీ నిర్ణయించువరకు వారిమాటలను మేము గణింపము. తేదీ నిర్ణయించి, మే మంగీకరింపదగ్గ కార్యక్రమము సూచించి, మహాత్ముడు చెప్పినట్లు, వాగ్దానముల కనుగుణ్యమగు వైఖరి గన్పరచు వరకు సరకుజేయము. డిశంబరు 31 లోపల మా రాజ్యాంగ విధాన సూచనల ప్రకారము సంపూర్ణస్వపరిపాల నావకాశముగల అధినివేశస్వత్వము నిర్ణీతమగు స్వల్పకాలములో నొసంగబడునని నమ్మకముగ దెల్పినచో, అది స్థిరపడుటకు కొంతవ్యవధి నొసంగెదము. నూతన పరిపాలన విధానము ఏర్పాటుజేయునట్టి కమిషనులో మాకు పూర్తిగ భాగ ముండవలెనని కోరెదము."

"మరి బ్రిటిషువారు జవాబు చెప్పకున్నను, అస్పష్టముగ బల్కినను నూతనవత్సరాదినాడు దౌర్జన్యము కల్గునా?"

"అట్లే, ప్రారంభమున నే యట్లుండదు. మా నమ్మికలు వేరైనను మా గురువును గౌరవింపవలెను. మొదట సాత్వికనిరోధము మరల తీవ్రముగ ప్రారంభింపబడును. పన్ను నిరాకరించుట, బ్రిటిషు కోర్టుల నుపయోగించకుండుట (ప్రభుత్వాతీతములగు సొంతకోర్టులను స్థాపించుకొందుము), బ్రిటిషువస్తు బహిష్కారము, ప్రజాప్రబోధము, వీలయినచో ప్రభుత్వకార్యస్థానముల నాక్రమించుట జరుగును."

"అటు పిమ్మట?"

"బ్రిటిషువారు విడిచిపోవలెను, లేదా మరఫిరంగులను తేవలెను."

"మరఫిరంగులే తెత్తు రను కొనుము?"

నెహ్రూ తన కోమలములగు పెదవులను కదిపి ఒక ప్రక్కకు వంచి మందహాస మొనర్చి, "మాలోని త్యాగమూర్తులను వారు కాల్చి చంపిన, కోపోద్రేకఫలితముగా వారిపై దౌర్జన్యము జరుగునని మీ రనుకొనరా?" అని యాతడు మెల్లగ ననెను. పిదప నిట్లు సమర్థించెను: "కాని మావలెనే వారుగూడ దౌర్జన్యము కోరరు. ఆ యొక్క విషయమునందే బలహీనముగ నుంటచే మేము దౌర్జన్యమునకు దిగము. వా రంతవరకు రానిచ్చుట కిష్టగింపరు. ఏమన, దేశీయ సైన్యముల పరిమితి వారికి తెలియదు. 70,000 మంది బ్రిటీషు వా రున్నచోట నూట యేబది వేలమంది మంచి సిపాయీలు, స్వదేశమునందున్నవారు, గలరు, తెలియునా? వారిచేతిలో ఆయుధములు గలవు. తక్కిన వెక్కడ నున్నవో వా రెరుంగుదురు. తమ గురువులను కాల్చి చంపినచో ఈసిపాయిలు కినియవచ్చును."

"కాని మీకు ఆయుధములు లేవు—బయటనుండి రాకుండ అధికారులు కాపలా కాయుదురు."

ఆతను చేయి చాచెను. "త్రోవ లేక పోలేదు. పోలీసువారు తెలిసికొనజాలనివి అనేక లక్షల తుపాకులు ఇండియాలో గలవు. వాటి తెచ్చెడి విధము తెలిసిన వారుగూడ గలరు."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కార్మిక ప్రభుత్వము చాల మేలు చేయునని మీ రాశించుట లేదా ?"

"నేను సోషలిష్టు పక్షమునకు చెందిన వాడను" అని యువకుడగు నూతన భారతదేశనాయకు డనెను. "మహాత్మునితోను, మాతండ్రిగారితోను నే నేకీభవింపని విషయ మిది యొకటి. కావున నేను రామ్సేమాగ్డనాల్డుగారిని ప్రశంసింతును. కాని ఆతడు అధికారమునకు వచ్చుటే మాకు ప్రతిబంధకముగ నున్నది. అంతకుముందు మాత్రోవ చక్కగ నుండెను — సంకుచిత స్వభావులగు టోరీలు మమ్మెన్నడు గౌరవింపరు; సర్వదా మరఫిరంగులనే ఉపయోగింతురు. ఏది యెంతవరకు జరుగునో మేము తెలిసికొందుము—చివరవరకు పోరాట మయ్యెడిది.

"మహాత్మునకు మాతండ్రిగారికి గల భేదాభిప్రాయమునందు నేను మహాత్మునితో నేకీభవింతును. సంపూర్ణ స్వాతంత్ర్యము బడయువిషయమున బ్రిటిషు సామ్రాజ్యముతో నెట్టి రాజీకి రాగూడదని నా సొంత యభిప్రాయము. ఎట్టి పరిస్థితులలోనైనను కార్మిక ప్రభుత్వము వారు ఆశియాఖండమునకు పెద్దసైనికదళమును పంపెదరని మే మనుకొనము.

"బహుశః రామ్సే మాగ్డనాల్డుగారు మా కోర్కెలన్నింటి నంగీకరించుటకు నిశ్చయింపవచ్చును. కాని కార్మికపక్షమునకు చెందిన ప్రధానియైనను ఆంగ్లేయుల నోటికూటిని పడగొట్టునట్టి సూచనల గావించునని యనుకొనజాలను. మా అంత్యసందేశమున కదే యర్థము. ఆతడట్లు చేసినను ప్రతికూలపక్షమువారి దాడి నోర్చి ఆతని ప్రభుత్వము బ్రతుకజాలదు. మేము స్వయంసహాయము పైనే ఆధారపడెదము. తీవ్రప్రతిఘటనకు సంసిద్ధుల మయ్యే యుందుము. మాగ్డనాల్డుప్రభుత్వము ఈతగవు పరిష్కరించినచో కృతజ్ఞతజూపకపోము. ఆతడు గొప్ప సౌహార్దహృదయు డనిపించుకొనును. అంతే గాక బ్రిటిషుసామ్రాజ్యమును వదలుకొనిన ప్రధాని యనిగూడ పేర్కొనబడును."

---

## జుట్టుముడుల వింతవైఖరులు



ముద్దులొలుకు ముచ్చటముడి గిరజాలు

ఈయనకగు కర్చులోసగము తలనూనెకు. మరియు గిరజా తిప్పుటకు మహాశ్రమపడినాడని తెలియవచ్చుచున్నది.



కొబ్బరిటెంకజుట్టు శాస్త్రులు గారు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాస్త్రములు వచ్చునో రావో గాని జుత్తువల్లనైనను సార్థకనామధేయుడు. ఈయన తాతగారికి శాస్త్రములుకూడా వచ్చునట.



లెక్కకు పదివెంద్రుకలు

ఈయన అతివాది కాని హిందువుల పూర్వపుటౌన్నత్య చిహ్నముగ ఈ పదివెంద్రుక లుంచినాడు. పేలు ఒక పెద్దమహాసభ చేసి అందులో ఈయనమీద ఒకపెద్ద తీర్మానము చేసి నైస్రాయిగారికి పంపిరట!



'షాయ్యి!'

అంటే ఈయనకు మిక్కిలి కోపము వచ్చును. షాయ్యిజుట్టు నెల్లూరువైపు లెక్కకు మిక్కుటము.

---

## ఔరంగజేబు లేఖలు

"The poets in our youth begin in gladness
But thereof come in the end despondency
and sadness."

"మనము (కవులము) మన యౌవనకాలమును ఆనందముతో నారంభింతుము. కాని దాని అంతము నిరాశాదుఃఖములతో నగును." అనుమిల్టను (Milton) కవి వాక్యములు కవులకే కాక సకల మానవులకును వర్తించును. ఔరంగజేబు చక్రవర్తి మేధాశాలియై, రాజ్యలోలుడై, మతావేశపరుడై, ఉద్రేకోత్సాహములతో తనజీవితము నారంభించెను. ఆసార్వభౌముడు తనవాంఛాప్రపూర్తికొరకు సలిపిన నిరంకుశ వ్యాపారములు అనల్పములు; చరిత్రప్రసిద్ధములు. అంతిమకాలమున నాతడు భగ్నహృదయుడై పశ్చాత్తప్తుడై తన ప్రాణముల విడిచెను. చివర నిముసములం దాతడు కుమారులకు లిఖించిన ఈ క్రిందిలేఖలవలన ఆతని వ్యాకుల హృదయము గ్రహింపనగును:

౧

"యువరాజగు ఆజమునకు_

నీకును నీవారికిని శాంతి కలుగు గాక! నే నతి వృద్ధుడను, బలహీనుడను అయిపోయితిని. అవయవముల పటుత్వము నశించినది. నేను నొంటరిగ పోవుచున్నాను. ఈ లోకమున కేల వచ్చితినో, ఎచటినుండి వచ్చితినో నాను తెలియదు. భగవదర్చనమును మరచి గడపిన కాలమున కిపుడు విలపించుచున్నాను. దేశమునకు గాని, ప్రజలకు గాని నే నేయుపకారమును చేయలేదు. వత్సరములు నిష్ఫలముగ గతించినవి. ఈశ్వరుడు నాహృదయముననే వసించుచుండెను. కాని నా అంధకారనయనములు వాని తేజస్సును గ్రహింపలేక పోయెను. జీవితము క్షణభంగురము. గడచిన క్షణము తిరిగి వెనుకకురాదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భావిని నా కేఆశయును లేదు. జ్వరము పోయినది. కాని చర్మమును, శుష్కించిన మాంసమును మాత్రమె నావిగా నున్నవి. సైన్యములు దైవమునకు దూరమై, హృదయశాంతిలేక యుండిన నావలెనే నిస్సహాయములై ధైర్యవిహీనములై యున్నవి. వారికి ప్రభువున్నదియు లేనిదియు తెలియదు.

నేను ప్రపంచమున కేమియు తీసికొనిరాక రిక్తహస్తుడనై వచ్చితిని కాని వెడలునపుడు మాత్రము పాపభారమును మోసికొని పోవుచున్నాను. నాకై ఏశిక్షలు విధింపబడియున్నవో ఎరుగను. భగవంతుని కరుణయందు నాకు సంపూర్ణ విశ్వాసమున్నను నాపాపములకై విలపింపక తప్పదు. నాయందలి ఆశనే నేను గోల్పోయినపుడు, ఇతరులయం దెటులాశింప గలను. రానున్నవి రానిండు. నానౌకను జలములలో వేల్చితిని-పోయెదను."

## ౨

"కడసారి కుమారుడగు కాముబక్షునకు—

ఆత్మాధికుడా! నేనిపుడు ఒంటరిగ పోవుచున్నాను. నీనిస్సహాయత కెంతయు శోకించుచున్నాను. కాని ప్రయోజనమేమి? నేను గావించిన ప్రతిహత్యయు, నేనొనర్చిన ప్రతిపాపమును, నేను సలిపిన ప్రతిదోషమును వీని ఫలితమును నాతో మోసికొనిపోవుచున్నాను. నేనీ ప్రపంచమునకు శూన్యహస్తములతో వచ్చి ఇపుడు కడుభరమగు పాపసామగ్రిని కైకొని పోవుచున్నాను. నే నెక్కడ దృష్టించినను భగవంతునే చూచుచున్నాను. నేను మహాపాతకముల నొనర్చితిని. నాకై ఎట్టిఘోర యాతనలు వేచియున్నవో నే నెరుంగను. ముస్లిములు వధింపబడి ఆనింద నానిరర్థక శిరముపై పడకుండునుగాక. నిన్నును నీకుమారులను దేవున కప్పచెప్పి వీడ్కొలుపు తీసికొనుచున్నాను. నేను నిశితముగ బాధింపబడితిని. వ్యాధిగ్రస్తుడను నీతల్లి ఉదయపురి నాతో మరణింపవచ్చును."

పైజాబులు రెండును "లేనుపోల్" నుండి అనువదింపబడినవి.

పురిపండా అప్పలస్వామి

---

## ఏ గ్రూపు తెనుగుటెక్స్టు-టిప్పణములు
## స్కూలు ఫైనలు పరీక్ష

ఈ నడుమ స్కూలుఫైనలు పరీక్షవిషయములో అధికారులు ప్రకటించిన ప్రకటనలో "ఇప్పటివలెనే యికముందున్నూ, టిప్పణములతోగూడిన తెనుగుటెక్స్టు అధికారులు ప్రచురిస్తారు" అనే అర్థము గల మాటలున్నవి. "ఇప్పటివలెనే" అన్నమాటలో ఉద్దేశింపని స్వారస్యము (అన్కాన్షస్ యూమర్) కొంత స్ఫురిస్తూ ఉన్నది. ఈ (౧౯౨౯–౩౦) సంవత్సరపు-"ఏ" గ్రూపు తెనుగు టెక్స్టున్ను, దాని టిప్పణములున్ను పరిశీలిస్తే ఆస్వారస్యం కనపడుతుంది.

ముందు టిప్పణములరీతి చూడండి. (రా.=రామాయణము. భా.=భారతము. సా.=సారంగధర చరిత్రము. నీ.=నీలాసుందరీ పరిణయము. ప.=పద్యము. టి.=టిప్పణము.)

౧. అతిసులభములయి అర్థము చెప్పనక్కరలేని పదములకు అర్థము చెప్పినచోట్లు:—

ఈరు=మీరు (రా. ౮ ప.); అంతట్ = అంతట (రా. ౧౩ ప.); రాముఁడు = శ్రీరాముఁడు (రా. ౧౩); ఎంతయున్ = మిక్కిలి (రా. ౧౩); మేనిగాలిన్=శరీరముయొక్కగాలిచేత (రా.౧౪); కురియుచున్=వర్షించుచు (రా.౧౪); దిశల్=దిక్కులు (రా. ౧౪); పగులన్= పగులునట్లు (రా. ౧౪,; ఆర్చుచున్= ఆరుచుచు (రా.౧౪); ఏగుదేరన్=రాఁగా (రా.౧౫); అయ్యెడన్-అప్పట (రా.౧౬); కాంచిరి=చూచిరి (రా. ౧౬); చేరన్‌కాన్=సమీపింపఁగా (రా.౨౮);అపుడు= ఆసమయమున (రా.౨౮);శిరంబు=తలను (రా.౨౮), మొ.

౨. ఇంతో అంతో కఠినములయి అర్థము చెప్పవలసినపదములకు అర్థము చెప్పనిచోట్లు:—

నాగ (రా.౪); శరాసన (రా. ౧౩); ఆతంక, చక్కటి (రా. ౧౮); ప్రవర, భూరి, దట్టన (రా. ౧౯); రజము, ముహూర్తము, సాయకము, శరము, అస్త్రము, దస్సి, అగ్రనాస (రా. ౨౦); యాతు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధానులు (రా. ౨౨); భీమగాత్రము (రా. ౨౩); శస్త్రము (రా. ౨౬); ముక్తనిశాటము (రా. ౨౭); కుదుర్చు (భా. ౮); అకుంఠిత తేజులు (భా. ౭); ఒప్పరి కించు (భా. ౭); శుద్ధవిచారా (భా. ౧౮); కొలిగాపి (భా. ౨౦); అలమట (భా. ౨౧); ప్రకటిత సత్త్వఁడు, విశ్రుతుఁడు (భా. ౨౨); పలచు (భా. ౨౩); డిందు పఱచు (భా. ౨౮); సంశీలత (భా. ౩౧); ఉజ్జ్వల, స్ఫురణము (భా. ౩౪); నెట్టన, పాడి (భా. ౪౧); వెడ వెడ (భా. ౪౮); అవధానము (భా. ౪౯); ఎక్కటి (భా. ౫౦); నిరుత్తరుఁడు (భా. ౫౧); అనురూపము (భా. ౬౧); నెఱి (భా. ౬౨); గరిష్ఠ (భా. ౬౩); లాఁతి, తెలుంగు (భా. ౬౬); పరిణతి (భా. ౬౮); అస్ఖలితము, భారసహ (భా. ౬౯); ఎల్లిదము, పఱివోవు (భా. ౭౬); ఓలగించు (సా. ౧.); బలియు (సా. ౩); చొకాటపు (సా. ౪); పంచకము, సాహిణి (సా. ౪), మొ.

3. అర్థము చెప్పడములో విశేషములు:—

"పాటితదుష్టసత్త్వవన-వాటక, నిద్ధబలావరుద్ధ శృం
గాటక, గ్రంథిలభ్రుకుటి-గాఢలలాటకఁ గ్రూరతారకా
నాటక, నాంత్రకాంచిపరి-ణద్ధశవప్రపతత్క్రిమిచ్ఛటా
కీటక, రక్తసిక్తపటు-ఖేటకఁ దాటకఁ గాంచిరయ్యెడన్.
(రా. ౧౬.)

".....ఆంత్ర=పేగులనెడు, కాంచి=మొలత్రాటిచే, పరిణద్ధ=బిగింపఁబడిన, శవ=శవములందు, ప్రపతత్=పడుచున్న, క్రిమి=సన్నటి పురుగులయొక్క, ఛటా=సమూహముయొక్కయు, కీటక=పురుగులయొక్కయు, రక్త=నెత్తుటిచేత, సిక్త=తడుపఁబడిన, పటు=దృఢమయిన, ఖేటకన్=పక్షులు గలదియు........." అని టిప్పణము.

గ్రంథకర్త యెన్నో పాట్లుపడి "టక టక"లు కూర్చుగా వ్యాఖ్యాతగారు దయమాలి 'కీటక' శబ్దముతో సమాసము అంతముచేయని కారణమేమో? కీటకశబ్దము తరువాతనున్న కామా (,) నయినను పాటించినారు కారు. ఖేటకశబ్దమునకు డాలు అని సుప్రసిద్ధ రూఢార్థముండగా ఆ అర్థము గ్రహింపక, అప్రసిద్ధమున్ను, కేవలము యౌగికమున్ను అయిన 'పక్షులు' అనే అర్థము ఏల చెప్పుకోవలసి వచ్చినది?

"వినుము యుధిష్ఠిరుసైరణ
మనవారలు వెలిపుగా సమర్థింతురు డీ
కొనఁగాఁ దగరని వాసినఁ
గని యొటమి వెట్టినట్లు-కౌరవనాథా." (భా. ౧౦.)

"పొట్టేలు కదలకున్న కొండను గని యది యోడెనని పలుకునట్లు" అని టి. పద్యమందు కొండమాట లేదు. మనకు తోచినమాటలు పద్యములో లేకున్నా తెచ్చి పెట్టుకో వలసిన దేనా? స్తంభమో, గోడో, మానో అధ్యాహార్య మనుకో వచ్చునా? "డీ| కొనఁగం దగ కొండం| గని" అని పాఠాంతరము గలదు. అట్టి దేదయి నను సూచింపవలయునా సూచింపలేదు.

"...సాదు లేఁగనేని
న్నీవు తలపాలమునను కాని-నిలువదు సుమ్మీ."
(భా. ౧౧.)

"సాదు(వికృతి), సాధువు (ప్రకృతి). తలపాలము=పాలిమేర వెంబడి నున్న పొలము." అని టి. ఈవాక్యమునకు వివరణము చాలదు.

"అనయము నొచ్చుచున్న యవి-
యంగము లెల్లను వేగి వచ్చుట
న్మనము వశంబు గాదు..."
(భా. ౧౩.)

"అనయము=సతతము...వేగ వచ్చుటన్ అనునది దేహళీదత్త దీపన్యాయముగా నుభయాన్వయి" అని టి. 'అనయము' అనగా ఇక్కడ మిక్కిలి అని అర్థము చెప్పడము సమంజసము. మరి దేహళీదత్తదీపన్యాయము నగా స్కూలు ఫైనలు విద్యార్థులకు తెలుస్తుందా?

"తముఁ దారెఱుఁగుట, వేగప
డమి. తాలిమి, వినువు గలుగుటయు లేనిప్రభు
త్వము గలదె వారియందీ
సుమానుషము లొండుఁ బట్టి-చూడంగలఁడే."
(భా. ౨౫.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టిప్పణమున 'వేగపడమి' కి 'చిరకారిత' అని అర్థము వ్రాసినారు. తేలికయిన తెనుగుమాటకు కఠిన మయిన సంస్కృతపదము అర్థముగా చెప్పడము అటుండ నిండి. 'వేగపడమి' కిన్ని 'చిరకారిత' కున్ను భేద మున్నది. తగినితొందర కూడదని 'వేగపడమి' తెలియజేస్తుంది. అనావశ్యకమయిన జాగుచేయడము అని 'చిరకారిత' తెలియజేస్తుంది. "ఓర్పు: 'క్షమయా ధరిత్రీ' అనునట్లు భూదేవి సర్వమును భరించి యోర్చుకొనునది. తండ్రి యెన్నికష్టములను బెట్టినను సహించినవాఁడు ప్రహ్లాదుడును గలఁడు" అని టి. 'క్షమయా ధరిత్రీ' అన్న వాక్యము ఇక్కడ యుక్తము కాదు. మరి ప్రహ్లాదుని ఓర్పు చేతగాని ఓర్పు. ఆపోలిక తగదు. "విడుపు (త్యాగము): దీనికి శిబిచక్రవర్తి, దధీచిమహాముని, జీమూతవాహనుఁడు మొదలగువారు నిదర్శన భూతులు" అని టి. ఇక్కడ 'విడుపు'నకు శిబి ప్రభృతుల త్యాగమువంటి త్యాగమే అర్థమయినయెడల కర్ణుని త్యాగము ఈచెప్పిన వారి త్యాగముకు సాటిరాదా? 'వారియందున్' అని పద్యమందున్న మాటకు కర్ణ శకుని దుశ్శాసనులయందు అనికదా అర్థము. 'వారియందున్' అన్నమాటకు కర్ణశకుని దుశ్శాసనులయందు అని అర్థమున్ను వివరించవలసినదే.

సా. ౪ ప. టిప్పణములో, "మురువు=సొగసు. మురువు మురుగు రూపాంతరము" అని ఉన్నది. 'మురుగు' శబ్దముకు హస్తాభరణము అర్థమయినప్పుడు దానికి 'మురువు' రూపాంతరము. 'మురువు' శబ్దముకు సౌందర్యము అర్థమయినప్పుడు దానికి 'మురుగు' రూపాంతరము కాదు. "బిరుదు + తలాడంబు=గొప్ప తలగడ" అని టి. 'తలగడ'కు రూపాంతరము 'తలాడ,'—'తలాడము' కాదు. పద్యమందు 'తలాడము'లో ఉన్న డకారము టకారముకు మారుగా పడిన అచ్చుతప్పు. తలాటము=గుర్రాలనెత్తికి కట్టే తురాయి. గుర్రానికి తలగడ యెందుకు?

౪. వ్యాకరణవిశేషాలు తెలియజేయడపు నైపుణ్యము:—

(రా. ౧౩.) "త్రికంబుమీఁది యసంయుక్తంబులగు ఊష్మరేఫేతరహల్లులు ద్విత్వమయి త్రికంబు హ్రస్వమగును" అని టి. 'త్రికము' అనగా ఏమో తెలిసినవిద్యార్థికి ఈసూత్రము అవగతమయి ఉండదా? 'త్రిక' శబ్దార్థ మెరుగనివారికి ఈసూత్రము ఉదాహరించడము వల్ల ప్రయోజన మేమి? మరి "హల్లులు ద్విత్వమయి" అన్నారు; హల్లులకు ద్విత్వమా, హల్లులే ద్విత్వమా?

(రా. ౪ ప.) "ఋషి అర్థమగునేని మిత్రశబ్దము పరమగునపుడు పూర్వపదమునకు దీర్ఘము వచ్చును" అని టి. 'పదమునకు దీర్ఘము' అనగా ఎటువంటిది? 'విశ్వ' అన్న పదముకు అంతకూ దీర్ఘము రాలేదే. ఈసంస్కృత వ్యాకరణ విశేషము ౭ వ ఫారము తెనుగు విద్యార్థుల కెందుకు?

(రా. ౧౯ ప.) 'కినుక' 'కిన్క' అయినందుకు సూత్రము చెప్పినారు గాని 'కావుత మంచున్' అన్న చోట సూత్రము చెప్పలేదు. మొదటిది కఠినమున్నా, రెండవది సులభమున్నా అని ఊహ కాబోలు!

(భా. ౧ ప.) 'దేవర' మధ్యమపురుష సర్వనామముకు మారుగా ప్రయోగించడపు సంప్రదాయము వివరించవద్దా?

(భా. ౫ ప.) 'కలఁడు' అనేశబ్దము ఇక్కడి అర్థమందు వచ్చినందుకు సూత్రము చెప్పలేదు. ఏమో?

(భా. ౧౧ ప.) 'ఏమిని' అనేపదమువద్ద వ్యాకరణ చర్చ వద్దా?

(భా. ౧౨ ప.) "జూదమున యప్పుడు (జూదము + అప్పుడు); ఇచ్చట మధ్యన కారము వచ్చుట విశేషము. ఇట్టివి: ఒకరత్నమ్ము విదర్భదేశమునయందు; ఉత్తరమున యందు కన్నులు" అని టి. నకారము అనగా నకారపుహల్లు (న్); అకారముతో గూడిన నవర్ణము కానేరదు. నకారము వచ్చినయెడల 'జూదమునప్పుడు' అవుతుంది. అదీ కాక, 'విదర్భదేశమున యందున్,' 'ఉత్తరమునయందున్' అన్నచోట్ల నగాగమముకు నిమిత్తము విభక్తిప్రత్యయము పరముకావడము;



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'జూదమున యప్పుడు' లో తత్పురుష సమాసము కావడమువల్ల వచ్చినది.

(భా. ౧౪ ప.) "నెవ్వగ=నెఱ+వగ. సూ॥ అన్యంబులకు సహిత మిక్కార్యంబు కొండొకచోఁ గానంబడియెడి" అని టి. దేనికంటె 'అన్యంబులు'? 'ఇక్కార్యంబు'—ఏకార్యము? కుర్రవిద్యార్థులకు వ్యాకరణ విశేషము వివరించవలసిన విధమా యిది?

(భా. ౨౮ ప.) "సంతాపంబు శమించునట్లు భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొల్పు" అని మూలము. "వచనామృతము=ఉపమిత సమాసము" అని టి. "సంతాపంబు శమించునట్లు", "వెల్లిగొల్పు" అనేపదములను బట్టి ఆలోచిస్తే, "వచనామృతము" అనేది రూపకసమాసము గాని ఉపమితసమాసము కాదు.

(భా. ౪౨ ప.) "వండంబుఁ బరుసఁదనము"— బువర్ణము తరువాత అరసున్నా, పకారమునకు బకారాదేశమూ రావడమునకు నిమిత్త మేమి?

(భా. ౪౪ ప.) "అధికుల హీనులతోడ"— వ్యాకరణ విశేషము?

(భా. ౫౪ ప.) "పువ్వుఁదేనియ, సప్తమీ తత్పురుషము" అని టి. అరసున్న యెందుకు వచ్చినది?

(నీ. ౧ ప.) "పిల్లనగ్రోలు=మురళి (పిల్ల+క్రోలు). సూ॥ నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదుల కగు" అని టి. సెబాస్. 'పిల్ల' శబ్దము 'నల్లాదుల'లోది కాదు. అయినయెడల 'పిల్లక్రోలు' అని కాని, 'పిల్లని క్రోలు' అని కాని ఉండవలెను. 'నల్లకాకి' అని కాని, 'నల్లని కాకి' అని కాని ఉంటుంది గాని 'నల్లనకాకి' అని ఉండదుగదా.

౫. వ్యుత్పత్తులు:—

స్కూలు ఫైనలు విద్యార్థులకు పురందరుఁడు, సంజయుఁడు మొదలయిన శబ్దములకు వ్యుత్పత్తి చెప్పడము ఆవశ్యకమనిన్నీ, శరాసనము, పుంగవుఁడు, అనుజుఁడు, నిశాచరి అనేకశబ్దముల అనావశ్యకమనిన్నీ వ్యాఖ్యాతగారికి తోఁచినది. ఆశ్చర్యము!

౬. భారతశబ్దోత్పత్తి:—

"భరతవంశజుల చరిత్రమును ప్రస్తుతించుటంజేసి భారతంబయ్యెనని సామాన్యజనుల యభిప్రాయము. కాని పద్మపురాణమునందలి యీశ్లోకమునుబట్టి శ్లో॥ భారతాన్నాధికం విష్ణోః మహిమావాచకం క్వచిత్, భారతాన్న విరాగాయ భారతాన్న విముక్తయే॥...ఇది ముక్తి సాధనమని తేలుచున్నది. 'భారతః పంచమో వేదః'అను వార్యోక్తిచే......మహాభారతం బని ప్రసిద్ధి వడసెను"అని టి. ('కాని', 'సామాన్యజనులు' అనే మాటల కిందనున్న గీట్లు నేను గీసినవి.) 'కాని' శబ్దము తరువాతి వాక్యములు తత్పూర్వ వాక్యమందున్న 'సామాన్యజనుల' అభిప్రాయమును ఖండించి దానికి భిన్నమైన 'పండితుల' అభిప్రాయమును స్థాపిస్తూ ఉన్నవా? 'భారత' శబ్దోత్పత్తి విషయమున పండితుల అభిప్రాయ మేమి అయినట్టు?

౭. అస్థానప్రాగల్భ్యము:—

వ్యాఖ్యాతగారు టిప్పణములనడుమ సంస్కృతశ్లోకములు విచ్చలవిడిగా కురిపించినారు. సంస్కృతము అభ్యస్యమాన భాష. కాని కుర్రవాళ్లకోసం వ్రాస్తూఉన్న టిప్పణములు సంస్కృతశ్లోకోదాహరణలకు అస్థానమని వేరే చెప్పవలెనా? ఇతరకవుల తెనుగుపద్యాలు మాత్రము అనావశ్యకముగా అనేకములు ఉదాహరించడము ఎందుకు?

౮. కఠినత:—

పఠనీయభాగములు ఎంచిన వారి ఉచితజ్ఞత (సెన్స్ అవ్ ప్రాపోర్షన్) తెలియడానికి వారు సారంగధరచరిత్రలో ఎంచిన పద్యాలున్నూ, మన వ్యాఖ్యాతగారు తమపని యెంత తృప్తికరముగా నెరవేర్చినారో తెలియడానికి వారు ఆపద్యాలకు వ్రాసిన టిప్పణములున్నూ చూడవలెను.

మొత్తముమీద టిప్పణములు చూడగా, "యశ్శక్యం తన్నకృతం య దకృత్యం కృత్యవ త్త దాచరితమ్" అన్నవాక్య జ్ఞప్తికి వస్తుంది.

బులుసు పాపయ్యశాస్త్రి గారు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## నాగాయి శాసనములు

ప్రకాశకులు: నిజాంరాజ్యము పురాతత్త్వ శాఖ వారు. పరిశోధన పరిష్కర్తలు: గౌనర్మెంటు శాసన శాఖ అసిస్టెంటు సూపరింటెండెంటు సి. ఆర్. కృష్ణమాచార్యులుగారు. వీరు తమ సంపాదకీయ ధర్మమును చాల సమర్థతతో నిర్వహించి వీటిని చక్కగ ప్రకటించినందుకు ప్రశంసాపాత్రులు.

ఈశాసనము లన్నియు 'నాగాయి' లోనివి. ఈగ్రామము యన్. జి. యస్. రైల్వేమీదనున్న 'చితాపూర్' రైలుస్టేషనుకు సమీపమున నున్నది. ప్రకటితములైన ఈశాసనములనుబట్టి ఈగ్రామము యొక్క పూర్వపుపేరు "నాగవావి" (సంస్కృతమున నాగవాపి). శాసనములను బట్టి యిది కల్యాణపుర పశ్చిమచాళుక్య ప్రభువుల కాలమున చాల ప్రసిద్ధి వహించిన గొప్ప విద్యాపీఠముగ గనబడును. ఇచ్చటి విద్యాసంస్థ నెవరు స్థాపించినది, అది యెట్లు సాగుచుండినది—ఈ మొదలైన (దానికి సంబంధించిన) వివరములను దెలుపుటయందే ఈశాసనముల ప్రాముఖ్యము కలదు. ప్రాచీనకాలమున మతవిషయిక సంస్థలుగనే కాక వైదికవిద్యకు కూడ దేవాలయములు ప్రధానస్థానములుగ నుండి, అగ్రహారమహాజనుల సంస్కృతి పరిణామమునకును తోడ్పడుచుండినట్లు ఇతర దక్షిణ హిందూదేశ శాసనములవలన తెలియవచ్చుసత్యము ఈశాసనములవలన సయితము రూఢిపడుచున్నది. ఈశాసనములన్నియు కల్యాణపుర పశ్చిమ చాళుక్య ప్రభువులనాటివే. వీటియందు వర్ణితములైన దానధర్మములు ఆవంశములోని త్రైలోక్యమల్ల (క్రీ. శ. ౧౦౪౨—౧౦౬౮), త్రిభువనమల్ల (క్రీ. శ. ౧౦౭౬—౧౧౨౬), జగదేకమల్ల (క్రీ. శ. ౧౧౩౮-౩౯—౧౧౪౯) ప్రభువులకాలమున జరిగినవి. ఇవి మతవిషయిక మైనట్టియు, విద్యావిషయిక మైనట్టియు దానధర్మములను తెలుపును. వీటిలో పై నుడివిన చాళుక్యప్రభువుల వంశానుక్రమ, పరాక్రమ కార్యములును, ధర్మకర్తలైన దండనాథులయొక్కయు, ప్రసక్తులైన మహామండలేశ్వరుల యొక్కయు వంశప్రశస్తులును కలవు. దానంజేసి విద్యావిషయికముగనే కాక చారిత్రకముగ గూడ ఇవి చాల ముఖ్యమైనవి.

ఇందు ప్రచురింపబడిన నాలుగు శాసనములలో మొదటిది "వాజ్ఞస"వంశసంభవ కాళిమరసు ప్రముఖులై నాగవావి అగ్రహారములోని నాలుగు వందల మహాజనులును, సమస్త 'నకరాలు'ను కలసి చాళుక్య విక్రమవర్షము ౧౬ వ ఆంగిర సంవత్సర వైశాఖ పౌర్ణమాస్య ఆదిత్యవారము సోమగ్రహణ పుణ్యకాలమున నాగవావి అగ్రహారములో చీరల, పోకచెక్కల అమ్మకము మీద విధింపబడిన సుంకమును లక్ష్మణేశ్వరదేవర అంగభోగ రంగభోగాదులకును, మొక్కుబడులు కలవారు చెల్లించు ముడుపులను రామేశ్వరదేవర గోపుర నష్టోద్ధారమునకును చేసిన దానమును తెలుపును. ఈదానకాలమునకు సరియైన ఇంగ్లీషు తేది ౨౫ వ ఏప్రియలు ౧౦౯౨.

రెండవ శాసనము దేవాలయతటాకారామ నిర్మాణములకును, విద్యాస్థాన సంస్థాపనమునకును సంబంధించినది. ఇది వీరమార్తాండదేవ, రాయనారాయణ, ఆహవమల్ల బిరుదాంచితుడైన పశ్చిమ చాళుక్యాధిపతి త్రైలోక్యమల్లుని నాటిది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చాళుక్య వంశ మిట్లు వర్ణితమైనది: బ్రహ్మమానస పుత్త్రుఁడు స్వాయంభువమనువు. అతని కొడుకు మానవ్య ముని. ఇతని నుండియే ఇతని వంశమువారు మానవ్య-సగోత్రులైరి. అతనికొడుకు హారితుడు. ఇతనికి హారీతి జన్మించెను. ఇతని కుమారుడు చళుక్యుడు. ఇతనివలననే ఈవంశము చాళుక్యవంశమని పేరొందెను. చాళుక్య వంశోత్పత్తి కథనమున నిది యొక కూర్పు. ఈవంశము వారిది కుంతలదేశము. వీరు కుమారునినుండి మయూర ధ్వజమును, విష్ణువునుండి వరాహముద్రయు, కాత్యాయనీదేవినుండి రాజచ్ఛత్రమును బడసిరి. ఈవంశమున విష్ణువర్ధన, విజయాదిత్య, సత్యాశ్రయాది మహనీయుల తరువాత తైలపుడు పేర్కొనబడెను. తైలపునినుండి ఈశాసనమున నీయబడిన వంశావతార క్రమ మిది:




వసిష్ఠగోత్రులైన "వార్నస" వంశజులగు బ్రాహ్మణులు ఈచాళుక్య ప్రభువులకు మంత్రులుగను, దండనాయకులుగను ఉండిరి. ఈవంశమున గోవిందరాజు కొడుకు కాళిదాసును, అతని సోదరులునే కాక కాళిదాసు కుమారులైన గోవిందరాజ, బాచిరాజ, మధుసూదనాదులుకూడ గొప్ప దండనాయకులై, సంధివిగ్రహులై పేరొందిరి. గోవిందుని మనుమడైన మధువపరసను మధుసూదన దండాధిపతి చేసిన దానధర్మములను దెలుపుటకే ఈశాసనము పుట్టినది. ఇతడు త్రైలోక్యమల్లునినుండి నిజజనకుడైన కాళిదాసయ్య దండనాయకుని (?) పేర "పరమేశ్వరదత్తి"గ తామ్రశాసనమును వ్రాయించి పొంది చతుర్వేద పారావార పారగులనిపించుకొన్న నాలుగువందల బ్రాహ్మణోత్తములకు జీవనార్థముగా అభినవ బ్రహ్మలోక మిది యన ప్రసిద్ధి బడసి సకలవసుమతీ తలమునకు తలయని పేరొందిన మహాగ్రహారమైన నాగనావిలో కటక కమలార్క-మను పేర త్రైపురుష దేవుని కాలయమును, నిజాభిధానాభిరంజితమగు మధుసూదనాలయమును, రామతీర్థాభిరామమగు రామేశ్వరాలయమును, రామతీర్థమును, నిజధర్మకారితాధికారపదవీవిరాజితమైన శాలాకైంకర్యమును చేయించి, "ఘటికాస్థాన"మను విద్యాశాల నేర్పాటుచేసి, దానికి శ్రీత్రైలోక్యమల్లుడు పృథ్వీరాజ్యము చేయుచు కందూరునాటికి రాజధానియగు కోసూరునం దుండగా అతనిచేతినుండి "మన్నెయము"ను, ఆహిహయ (హైహయ) కుల కమలమార్తాండుడగు అయ్యరసు చేతినుండి భూమిని ధారాపూర్వకముగ గ్రహించెను. ఈ భూమి నతడు ధర్మకార్యముల నిమిత్తము వినియోగించెను. విద్యాసంస్థయైన "ఘటికాస్థానము"ను రెండువందలమంది వేదాధ్యాయుల నిమిత్తమును, ఏబది యిద్దరు శాస్త్రాధ్యాయుల నిమిత్తము నేర్పాటుచేసి, వారికొఱకు ముగ్గురు శాస్త్రోపాధ్యాయులను, భట్టవర్శన, న్యాస (? న్యాయ), ప్రభాకర వ్యాఖ్యాతలు ముగ్గురను, వేదోపాధ్యాయులు ముగ్గురను, సరస్వతీ భండారికులు ఆర్గురను నియమించెను. వీరందఱును గలసి మొత్తము ౨౬౮ గురు. వీరి "అశన (భోజన), ఆచ్ఛాదన (వస్త్రము)"లకును, (దేవాలయ) జీర్ణోద్ధార ఖండస్ఫుటిత నవసుధాకర్మలకును, గంధాక్షత పుష్ప ధూప దీప నైవేద్యములకును, త్రైపురుష దేవశాలా పరివృత్తులోని "మానుల" (గౌరవనీయుల)కును ౧,౦౦౦ మత్తర్లభూమి నొసంగెను. భట్టవర్శన వ్యాఖ్యాతకు ౩౫ మత్తర్లు, (?) న్యాస వ్యాఖ్యాతకు ౩౦ మత్తర్లు, ప్రభాకరవ్యాఖ్యాతకు ౪౫ మత్తర్లు, ప్రతిసరస్వతీ భండారికునికి ౩౦ మత్తర్లు, ఘటికాప్రహారికి (గంటలు కొట్టువానికి) ౩౦ మత్తర్లు ఇచ్చెను. ఇంకను ఇతర ధర్మములును గలవు. ఇది శక వర్ష ము ౯౭౦ నాటి శాసనము.

మూడవ శాసనముహూడ "వాణస" వంశజుడైన మధుపరసును, అతని కుమారుడు కాళియరసును చేసిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానములను దెలుపును. త్రైలోక్యమల్లుడు "బణ్ణెయ దండు"లో నుండగా శకవర్షము ౯౭౮ అగు శోభకృతు సంవత్సర పుష్యబహుళ ౬ మంగళవారము ఉత్తరాయణ సంక్రాంతి పర్వనిమిత్తమున త్రైలోక్యమల్ల దేవర కరమునుండి పడసి అతని మహామండలేశ్వరుడును, అహిహయకులజుడును అయిన "చౌట్టినాయ్చరసు" చేతి నుండి "పరమేశ్వర దత్తి"గను, "ఈశ్వర దత్తి"గను "నాగవావి," "రావూరు" మధ్యస్థితమైన భూమిని పొంది, దానిని ధర్మకార్యములకు వినియోగించెను. కడచిన శాసనమున ఈతడు తనపేర కట్టించినట్లు తెలుపబడిన మధుసూదనాలయము వర్ణన ఇందు కలదు. అది "ఉత్తుంగ తోరణ ప్రాసాద ప్రాకారసమన్వితము"; "అభ్రలగ్న విభ్రాజితోత్తుంగ సౌవర్ణకలశోపలసితము"; "అనేక కూట కోటివిశాలసాలభంజికారంజితము"; "నాట్యశాలాలంకృతము"; "ఏకదండి, త్రిదండి, స్నాతక, బ్రహ్మచారి, హంస, పరమహంసానుష్ఠానభవనము"; "ఋగ్యజుస్సామాథర్వణాభిధానా ద్యనేకశాఖాసహస్ర వేదవేదాంగ పఠనముఖవిరాజితము". త్రిభువన మల్ల దేవుడు కల్యాణపురమునుండి పరిపాలనము చేయుచుండ చాళుక్యవిక్రమ వర్షము ౧౦ అగు క్రోధన సంవత్సర భాద్రపద "పుణ్ణమి"ఆదిత్యవారము సోమగ్రహణ పుణ్యకాలమున కాళియరసు మధుసూదనదేవర నిమిత్తమును, నాగవావి అగ్రహారములోని నాలుగువందల మహాజనుల నిమిత్తమును "తాళకంగణిగె" ప్రతిష్ఠించి, "త్రిభోగాభ్యంతర సిద్ధి"యు, "సర్వనమస్యము"నుగా త్రిభువనమల్లుని చేతినుండియు, అతని మహామండలేశ్వరుడైన అహిహయకులజుడగు "లోకరసు"చేతినుండియు భూమిని ధారాపూర్వకముగ పరిగ్రహించి దానిని బ్రాహ్మణులు మొదలైన వారి నిమిత్తము ధర్మకార్యములకై వినియోగించెను.

నాలుగవ శాసనము త్రిభువనమల్లవిక్రమాదిత్యుని నాటిది. ఇందు మహాదేవరసు చేసిన దానములు—రామతీర్థమునకు, రామేశ్వరాలయమునకు సంబంధించినవి—వర్ణితములైనవి. ఏతదాలయ విద్యాస్థానమున నాలుగు వందల మంది విద్యార్థులు విద్య నభ్యసించుచుండువారు. వారిలో నూటుగురు "కవినూను"ని, నూటుగురు వ్యాసుని, నూటుగురు మనువును అధ్యయనము చేయుచుండిరని శాసనము తెలుపుచున్నది. శాసనపంక్తులు చెడుటచేత మిగిలిన నూర్వురు ఏగ్రంథములు చదువువారో తెలియుటలేదు. కవినూనుడు ఔశనసుడు: కవినూనుని జదువువారన ఔశనసస్మృతి నధ్యయనము చేయువారనియు, మనువును జదువువారన మనుస్మృతి నధ్యయనము చేయువారనియు నూహింపదగును. అట్లే వ్యాసరచితములైన గ్రంథములను–వ్యాససూత్రములను, వ్యాసస్మృతినిగూడ–అధ్యయనము చేయువారు. వ్యాసరచితములైన పురాణములుకూడ పఠనీయములలో చేరిన చేరియుండవచ్చును. పదపాఠముగూడ పాఠ్యగ్రంథము కావచ్చునని పరిష్కర్తలనుచున్నారు. మొదటి అధ్యయనగ్రంథములు రెండును స్మృతులే కావున మూడవదికూడ (వ్యాస) స్మృతియే యగునేమో. అట్లయిన నిచట ప్రత్యేకమీ స్మృతిత్రయాధ్యయనమునకు ప్రాముఖ్య మొసంగబడినట్లు ఊహింపవచ్చును. ఇందే జగదేకమల్లునినాటి మఱియొక దాన శాసనముకూడ గలదు. అది అతని పదునొకండవ వర్షమునాటిది. ఈశాసనము నందును అహిహయవంశజులైన మహామండలేశ్వరులు గొందఱు పేర్కొనబడియున్నారు. ఈ నాలుగవ శాసనమున మతవిషయికములైన దానములును, అగ్రహారదానమును పేర్కొనబడినవి.

ఈవిధమున ఈ శాసనములు క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు శతాబ్దులనాటి మన ప్రాచీన వైదిక విద్యాసంస్థల వ్యవస్థను దెలుపుచుండుటచేత మన ప్రాచీన విద్యావిషయిక చారిత్రమున కివి చాల ముఖ్యమైనవి. ఈ "ఘటికాస్థానము"న ఆఱుగురు సరస్వతీ భండారికులు ఉండినట్లు ఈశాసనములు తెలుపుచున్నవి. సరస్వతీ భండారికులు ఇప్పటి "లైబ్రేరియనులు". ఆఱుగురు పనిచేయుచుండుటకు ఆ సరస్వతీ భండారము ఎంత గొప్పదిగ నుండి యుండవలయునో! కల్యాణపుర పశ్చిమ చాళుక్యులనాటి అహిహయ (హైహయ) వంశజులను గుఱించి తెలిసికొనుటకుకూడ ఇవి తోడ్పడుచున్నవి.

కృష్ణమాచార్యులుగారు వీటిని చాల శ్రద్ధతోను, జాగ్రత్తతోను ప్రకటించినను అందందు ఒకటి రెండు ప్రమాదములు దొర్లినవి. అవి ప్రమాదములు మాత్రమే.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏడవపుట ౨౭-వ పంక్తిలో కాళిదాసయ్య మధుసూద నుని తాతగారని చెప్పబడినది. ప్రమాద మిది: తాతగారు కాదు; మూలమున అతడు మధుసూదనునికి "నిజజనకు" డనియే కలదు. ఇదే ప్రమాదము ఆపుటలోని ౩౧-వ పంక్తిలోకూడ పడినది. వేదాధ్యాయులు రెండువందల మంది, శాస్త్రాధ్యాయులు ఏబది యిద్దరు అని చెప్పి, పిదప ఆచార్యులుగారు ఆపుటలోనే వేదోపాధ్యాయులు ముప్వురు, భట్టదర్శన, న్యాయ (?న్యాస), ప్రభాకర ములను నేర్పుటకు శాస్త్రోపాధ్యాయులు ముప్వురు, సరస్వతీ భండారికు లార్వురు అని విద్యాశాలలోని యుపాధ్యాయాదులను పేర్కొను సందర్భమున వ్రాసియున్నారు; కాని యిది పొరపాటు: మూలపాఠ మిది:

"వేదాధ్యాయగ ళిన్నూర్వర్గ్గం శాస్త్రాధ్యాయగ ళయ్వదింబర్గ్గం తదుపాధ్యాయ గళు 3 భట్టదర్శన, న్యా[స], ప్రభాకర వ్యాఖ్యాతృగళ్ మూవర్గ్గం, వేద మనోదిసు వుపాధ్యాయ మ్మూర్వర్గ్గం శాలెయసరస్వతీభండారిగ ళార్గ్గం అంతు........౨౬౭. "

దీనిని బట్టి చూచిన,

| | |
|---|---|
| వేదాధ్యాయులు | ౨౦౦ |
| శాస్త్రాధ్యాయులు | ౫౨ |
| శాస్త్రోపాధ్యాయులు | 3 |
| భట్టదర్శన, న్యాస, ప్రభాకర వ్యాఖ్యాతలు | 3 |
| వేదోపాధ్యాయులు | 3 |
| సరస్వతీ భండారికులు | ౬ |
| మొత్తం | ౨౬౭ గురు. |

౨౬౭ కు మూలమున ౨౫౭ పడినది. భట్టదర్శన, న్యాస, ప్రభాకరములు నేర్పుటకై శాస్త్రోపాధ్యాయులు ముప్వురనుట ప్రమాదము. మూలమును ప్రకటించు సందర్భమున నీ రీతప్పును సవరించియుండుటచేత వివరణములోని ఈవ్రాత ప్రామాదికమే యగును.

ఈశాసనములనుబట్టి మనకు తెలియవచ్చు మరియొక ముఖ్యవిషయము కలదు. మూడవశాసనమున మధువరసు త్రైలోక్యమల్లుని చేతినుండి పడసి, అహిహయకులజుడైన మహామండలేశ్వరునిచేతినుండి భూమిని పరిగ్రహించినట్లు కలదు. ఇట్లే కాళియరసు త్రిభువనమల్లునిచేతినుండి ధారాపూర్వకముగ బడసి, అహిహయకులజుడైన మహామండలేశ్వరుని చేతినుండి భూమిని ధారాపూర్వకముగ పరిగ్రహించినట్లు కూడ మూడవశాసనముననే తెలుపబడి యున్నది. పరిగ్రహీతలు భూమిని మహామండలేశ్వరులనుండి పొందినయెడల వారు చాళుక్యప్రభువులనుండి పొందిన దేది? దీనికి జవాబు రెండవశాసనములో కలదు. ప్రభువు నుండి పొందుచువచ్చినది "మన్నెయము". కన్నడమున "మాన్యము" యొక్క తద్భవము మన్నెయము. పరిగ్రహీతలు "దత్తి" (దానభూమి)ని "మాన్యము" చేయించి, అనగా ప్రభువునుండి సత్త్వమును గ్రహించి, అసలుభూమిని— అది మహామండలేశ్వరుల రాజ్యములో నిదై యుండుటచేత కావచ్చును— వారినుండి పడయుచు వచ్చిరి. భూమి సామంతులైన మహామండలేశ్వరుల రాజ్యములోనిదైనను వారు దానిని మాన్యముచేసి దానమొసంగుటకధికారము లేకపోయినకారణముననే కావచ్చును, దానపత్రమున నట్లు వ్రాయబడవలసివచ్చెను. ప్రభువుయొక్కయధికారము కాని, ఆనతి కాని లేనిదే మహామండలేశ్వరులకు భూమిని దానమాన్యముగ నిచ్చుటకధికారము లేదనుననియే మనకు దెలియవచ్చు రాజకీయమైన ముఖ్యవిషయము. పైనుడివినశాసనములలో దాతలు చాళుక్యప్రభువులే. పరిగ్రహీతలును, ధర్మకార్యము లాచరించినవారును మంత్రి, దండనాథులు. "దత్తి"ని పరిగ్రహీతలు గ్రహించినది మహామండలేశ్వరులనుండి. ఈసిద్ధాంతము సరియైనదగునో కాదో తెలిసికొనుటకు ఇతర పశ్చిమచాళుక్య శాసనముల నింకను పరిశోధింపవలసియున్నది. ఇతర శాసనములనుబట్టి నిజముగునో కాదోకాని, యీశాసనములనుబట్టిమాత్ర మట్టి సిద్ధాంతము చేయుట కవకాశము కలదు. ఈ విషయము శాసన వివరణములలో అంత పరిస్ఫుటము కాలేదేమోయని నాయనుమానము.

"పరమేశ్వరదత్తి", "ఈశ్వరదత్తి"— ఈపదములకును, "తాళకంగణిగె" పదమునకును సరియైన యర్థము తెలియుటలేదు. "సర్వనమస్య" మనునది భూమిభోగము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లలో నొకటియని కల్యాణపుర చాళుక్యప్రభువుల శాసనములను ప్రకటించు సందర్భమున బార్నెట్టు దొరగారు వ్రాసియున్నారు కాని అదెట్టి భూమిభోగమో వారు తెలిపియుండలేదు. "సర్వనమస్యము" గా ఇయ్యబడిన భూమిదానము మూడవశాసనమున తెలుపబడినది. "సర్వనమస్య" విధానమునకు "మాన్య" పద్ధతికి ఎట్టి సామ్య, వ్యత్యాసములు కలవో.

కృష్ణమాచార్యులుగారు బహుపరిశ్రమ చేసి ప్రకటించిన ఈశాసనగ్రంథము చరిత్రాభిమానుల కవశ్య పఠనీయము. (మ. సో. శర్మ.)

---

## ఆత్మదర్పణము

శ్రీ వివేకానందస్వామి ప్రణీతము. శ్రీ తత్వానందస్వామిచే ఆంధ్రీకృతము.

క్రౌను. పు. ౪౭. వెల రు ౦-౩-౦.

శ్రీ సనాతనాశ్రమమువారిచే తదాశ్రమ గ్రంథమాల తృతీయప్రసూనముగా ప్రకటింపబడిన పరమపవిత్రమగు నీగ్రంథరాజమును కృతజ్ఞతతో నందుకొంటిమి. ఇది గ్రాంథికాంధ్రమున వచన గ్రంథముగా వ్రాయబడినది.

ఇందలి విషయమంతయును వేదాంత చర్చయే. భారతదేశమునందు సకల మతములనుగూర్చియు—వేద ప్రామాణ్యము నంగీకరింపని జైనబౌద్ధాదిమతములనుగూర్చి సంగ్రహముగను, వేదప్రామాణ్యము నంగీకరించిన మతత్రయమును, అనగా ద్వైత, విశిష్టాద్వైత, శుద్ధాద్వైత సిద్ధాంతత్రయమునుగూర్చి విపులముగను—ఇందు వివరింపబడెను. చివరకు అద్వైతసిద్ధాంతమే వేదాంతముయొక్క ఉత్తమ పరిణామమని స్థిరపరుపబడెను. ఈ మూడు సిద్ధాంతముల ముఖ్యలక్షణములును, భేదములును, సమాన ధర్మములును గూడ వివరింపబడెను. కాని యీ మూడునుగూడ సోపానసదృశములని తెలుపబడెను. అధికారి భేదమునుబట్టి అధమాధికారులగు బహుజనులు గ్రహింపగలిగినది ద్వైతమేయనియు, దానిపై మెట్టు విశిష్టాద్వైతమనియు, దానిపైమెట్టు అద్వైతమనియును, ఈ అద్వైత సిద్ధాంతము సాధారణముగా గ్రాహ్యమగుటయే కష్టమనియును, గ్రహింపగలిగిన వారిలోగూడ వాని ననుష్ఠానమునకు తేగలుగువారు మిక్కిలి కొద్దిగానే యుందురనియును ఇందు సూచింపబడెను. ఈ మూడు సిద్ధాంతములును అనాది కాలమునుండియును కలవు. శ్రీమధ్వ శ్రీరామానుజ శ్రీశంకరులు ఈసిద్ధాంతములకు పునరుద్ధారకులే గాని వానిని నూతనముగా నిర్మించినవారు కారు. శ్రుతి స్మృతి పురాణాదులన్నిటిలోను ఉభయవాదులకును గూడ నాధారములు లేక పోలేదు. కాన వీనిన్యూనతాధిక్యములను గూర్చి యిదమిత్థమని నిర్ణయించుట యేరికినిగూడ శక్యముగాదు. వారివారి పూర్వ సంస్కారములను బట్టి ఆయా మతముల నవలంబించుచున్న వారి కుటుంబములలో జన్మములు లభించుచుండును. వారువారు ఈ సంప్రదాయముల ననుసరించుచున్నట్లు భావింపబడుచుందురు గాని అదిగూడ నిజము కాదు. మధ్వల కుటుంబములలో పుట్టినవారిలో శ్రీమధ్వాచార్యులవారి సిద్ధాంత మిది యని చూచాయగానైన గ్రహింప గలిగిన వారు నూటికి పదిమందియైన నుండరు. అట్టిచో ఆమహనీయుడు వ్రాసిన అమూల్యగ్రంథరత్నములను, వానిపైని వ్రాయబడిన టీకలు, టిప్పణులు మున్నగు అసంఖ్యాక ద్వైతవాఙ్మయమును సరిగా ఉపదేశించుట కధికారులగు గురువులవద్ద నభ్యసించినవారికనెందరుందురో వేరుగ చెప్ప బనిలేదు. అద్వైతసిద్ధాంతము ననుసరించెడు వారనబడు వారిలో దానిని సరిగా గ్రహింపగలిగిన వారింకను చాల తక్కువగనే యుందురు. అట్టిచో నిట్టి యఖండవిషయమునుగూర్చి యీచిన్న పొత్తమున సాకల్యముగా చర్చించుట కవకాశ ముండదని మాట నిజమే యైనను, వీని ముఖ్యలక్షణము లన్నియును చాలవరకు ఖండాంతరులకు గూడ గ్రాహ్యమగునట్లు లిందు విస్పష్టముగనే వివరింపబడెను. ఆంధ్రమహాశయులీగ్రంథము నించుక శ్రద్ధతో చదివినచో త్రిమతసిద్ధాంత సార స్థూల స్వరూపమును గ్రహింపగలుగుదురనుట కెట్టి సంశయమును లేదు. దీని నాంధ్రీకరించిన శ్రీ తత్వానంద స్వామియును, దీనిని ప్రకటించిన శ్రీ సనాతన గ్రంథ మాల వారునుగూడ ఆంధ్రులకృతజ్ఞతకు పాత్రులు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈగ్రంథమాలకు సాలు చందా ఒకరూపాయి. రెండునెలల కొకగ్రంథము చందాదారుల కందజేయబడును. ఇదివరకు గృహస్థాశ్రమ తత్వము (శ్రీరామతీర్థ ప్రణీతము), మృత్యుంజయము (సోక్రటేసు ప్రవచనము) అను రెండుగ్రంథములు వెలువడినవి. ఈ ఆత్మదర్పణము (శ్రీ వివేకానంద ప్రణీతము) మూడవది. మొదటిగ్రంథము పునర్ముద్రణము కానున్నది. విడి సంచికలను బడయగోరువారు రు ౦-౩-౬ కు తపాలబిళ్లలను ఈదిగువ అడ్రెసుకు పంప ప్రార్థితులు:

శ్రీయుత కందేవు నరసింహంగారు,
మేనేజరు, శ్రీ సనాతనాశ్రమము,
క్రాపపోస్టు, కొల్లూరు మార్గము, గుంటూరుజిల్లా.
వెదురుమూడి శేషగిరిరావు.

---

## భారతదేశ పునరుద్ధరణము

### RENASCENT INDIA

ఆంగ్లగ్రంథము. వెల ఒకరూపాయి.

ఆంగ్లభాషా కోవిదులును, మృదుమధురరచనాధురీణులు నగు శ్రీమాన్ కె. ఎస్. వెంకటరమణి అయ్యరుగా రీగ్రంథమున భారతదేశ స్వాతంత్ర్య సమస్యను సమగ్రముగా చర్చించినారు. ఐరోపా మహాసంగ్రామము పూర్తియై నప్పటినుండియు ప్రపంచమందెల్ల సర్వమానవ శాంతి సౌఖ్యములకై తీవ్రసంక్షోభము జరుగుచున్నదనియును, భూలోకస్వర్గ నిర్మాణ మనదగు నిట్టి ఫలితమునకు భారతదేశము చేయవలసియున్న దివ్యకృషికి స్వతంత్రస్థితి యత్యవసరమనియు నిందు నిరూపింపబడినది. ఈ స్వరాజ్యభవనము విదేశాచారముల యనుకరణము పైగాక అర్యనాగరకతా కీలక మన దగుత్యాగసంపత్తిపై నాధారపడవలెనని వీరు చేసిన ప్రతిపాదన వీరి సూక్ష్మదృష్టికి తార్కాణము. సకలభాగ్యభోగ్యముల కాలవాలమై, భూదేవికి శోభాయమాన మగు తిలకమై ఆర్యావర్తము విలసిల్లిన పూర్వపు సుదినములలో వలె భావిస్వరాజ్యయుగమున గూడ గ్రామమే రాజ్యాంగమునకు సమస్తజీవకళాప్రదమగుహృదయమై విరాజిల్లవలెనని వీరి ఆశయము. దేశీయమహాసభా ప్రారంభదశలో నెట్లున్నను, రాజకీయరంగమున సత్యాగ్రహశక్తి బయల్వెడలిన నాటినుండియు జాతీయనాయకుల కృషికూడ నీవిషయమున ప్రబలముగా జరుగుచునే యున్నది. రాట్నతత్వ మిదియే కదా! భారతదేశము ప్రపంచమునకొసగవలసిన యాధ్యాత్మిక సందేశమునకు ప్రాణాధారమైన స్వాతంత్ర్యసిద్ధికి చరిత్రప్రసిద్ధము లగు నాంగ్ల భారత జాతులు రెండును సర్వవిధత్యాగముల సల్పవలసియుండు నని గ్రంథకర్తగారు హెచ్చరించుచున్నారు, దైవ మిందుకు తోడ్పడుగాక యని ప్రార్థించుచున్నారు. వివిధదేశ విజ్ఞానాధిదేవత లిందుకు తమ తమ యుచ్చైస్స్వరముల బల్కుచున్న ధన్యవాదము లీదేశభక్తుని మనోరథము త్వరలో నీడేరగలదని తెలుపుచున్నవి.

సకల విధముల స్తవనీయమై యొప్పుచున్న యీ యుద్గ్రంథమున నొక గొప్పలోపము స్ఫురించుచున్నదని చెప్పవలసి వచ్చినందుల కెంతయు చింతిలుచున్నాము. గ్రంథకర్తగారు ప్రతిపాదించిన ప్రాచ్యనాగరకతా జీవశక్తియను త్యాగాదర్శమునకు నవయుగమున ప్రత్యక్షసుందరమూర్తులై, తమ పవిత్రపాద స్పర్శచే భారతదేశమును బునీత మొనర్చి, తత్సందేశమును దశదిశలకు వెదజల్లి నట్టియు, ప్రస్తుత మాసందేశవ్యాప్తిని సకల ప్రాజ్ఞలోక సన్నుతార్హమైన విధమున నిర్వహించుచున్నట్టియు మహాత్ముల పేరెత్తకుండుట సమంజసము కాదు. వీరారాధనాతత్పరమగు యువభారతహృదయమున కిది మిక్కిలి ఆశాభంగకరము. కీర్తిశేషులైన శ్రీమద్వివేకానందస్వాముల వారి పేరు పొరపాటున నీగ్రంథమునబడిన ట్లున్నది. రాబోవు పూర్వసందీలో టును దీర్చి ఇంకను గ్రంథమున కెంతయు వన్నె తేదగునని శ్రీఅయ్యరుగారికి వినయపూర్వకముగా మనవిచేయుచున్నాము. మొత్తముమీద గ్రంథము తీవ్రాలోచనా ప్రేరకమై దేశహితైకసేవాభిలాషు లెల్లరును శ్రద్ధాళువులై పఠింపదగి యున్నది.

వలయువారు శ్వేతారణ్యాశ్రమము, మైలాపూరు నకు గ్రంథకర్తగారి పేరిట వ్రాయనగును.

వె. వేం. కృ.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రవిడియన్ ఫైలాలజీ-శ్రీనారాయణరావుగారు

## AN INTRODUCTION TO DRAVIDIAN

(Philology) by M.C. Narayana Rao, M A;L.T

ద్రావిడశబ్దశాస్త్రమున సపోద్ఘాతమని చెప్పి, శ్రీ చిలుకూరి నారాయణరావుగారొక పుస్తకమును రచించి ప్రచురింపించిరి. ప్రాచీన ద్రావిడశబ్దశాస్త్రమునుగూర్చి యిటీవలలోఁ గృషిసల్పినవారు దాక్షిణాత్యులలోఁ జాలతక్కువ. ఒకరిద్దఱినిఁ జాలును. ఆంధ్రులలో నాకు తెలిసినంతవఱకు శ్రీ రామమూర్తి పంతులవారి తర్వాత, వారి శిష్యవర్గములోని వారనదగు శ్రీ నారాయణరావుగారే.

ఈ పుస్తకములోని విషయమంతయు వారొకతూరి చెన్నపురి విశ్వవిద్యాలయము పక్షమున, ఆంగ్లమున నిచ్చిన యుపన్యాసముల యొక్క సారాంశమే. అదియునుగాక ఆంధ్రచారిత్రక పరిశోధక సంఘమువారి పత్రికలో వీరువ్రాసిన వ్యాసమీపుస్తకమందలి విషయమునకెల్లను మాతృకయని చెప్పవచ్చును. (Influence of Sanskrit and Prakrit on Telugu(October1926 The quarterly journal of Andhra Historical Society. Rajahmundry.) అను వ్యాసమును జదువరులు చూడనగును; గ్రంథనిబంధనమున కన్న విమర్శనము సులభమని చెప్పెదరు గాని, విమర్శకుఁడు కృతికర్తకన్న గ్రంథస్థ విషయపరిజ్ఞానమునందు మిన్నయై యుండవలెను. అల్పజ్ఞుఁడగు నాకీగ్రంథవిమర్శన మలవికాని పనియేమో? కాని గ్రంథకర్తకే, శాస్త్రమునందుల పాండిత్యము పదిపాళ్లు తక్కువయని సంశయములేదు.

ఈ గ్రంథరచనమునకుఁ గారణము, కాల్డ్వెల్ పండితుఁడు రచించిన 'Comparative Grammar' లోని విషయము లన్యదేశీయుని దృక్పథము ననుసరించి వివరింపఁబడుటచే, నందులకుగాను రెండవ పక్షమైన దేశీయ దృక్పథమును గూడ విశదీకరించుటకునై యున్నది. ఆంగ్లమున రచించుటకుఁ గారణము బహుళాంగ్లమయప్రపంచమునకుఁ దెలియఁజేయుటకు.

కాల్డ్వెల్ పండితుని వాదములు (1) ద్రావిడ భాషలకును సిథియన్ భాషలకునుగల అన్యోన్య సంబంధము. (2) ద్రావిడ భాషల యొక్క సారూప్యము రెండవది నారాయణరావుగారు ఒప్పుకొనినదే. మొదటిది వారొప్పరు. శబ్దశాస్త్రజ్ఞు లొప్పరు. అందులో విశేషములేదు. (3) సంస్కృత భాషలో ద్రావిడ భాషల కేవిధమైన సంబంధమును లేదు. ఈ విషయమై ముఖ్యముగ నారాయణరావుగారి అతివాదము గ్రంథమునందు గలదు. వీరి వాదము సమంజసమే. ద్రావిడ భాషావ్యాకరణ నిర్మాతలు ద్రావిడ భాషలను వికృతి గణములోఁ జేర్చిరని అందరు నెరింగినదియే. ఆంధ్రవ్యాకరణములు జదివిన వారీ సూత్రముల నెఱుంగక మానరు.

సంస్కృతంబు ఆర్యప్రకృతి. ప్రాకృతంబు ద్వితీయ ప్రకృతి-ఆంధ్రభాషవికృతి-సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు-సంస్కృతప్రాకృత భవంబగు భాష తద్భవంబు. ఇట్టి సూత్రముల ననుసరించి సంస్కృత ప్రాకృతభాషలకును ద్రావిడభాషలకు నన్యోన్యమై రుద్ధ్యములేదనియు, వీని కన్యోన్యమైత్రిగలదనియు స్పష్టము. అదియె కాల్డ్వెల్ పండితుఁ డొప్పడు. నారాణరావుగారి ముఖ్యవాద మిదియే. ద్రావిడభాషలయందు తత్సమపదములను దద్భవపదములను బ్రత్యేకించి చూచిన యెడల దేశ్యము లెక్కిలి అరుదని వీరి విశ్వాసము.

నారాయణరావుగారు ద్రావిడభాషలను గూర్చి చర్చించుచు, వీరాంధ్రమునుగూర్చియే ముఖ్యముగ ప్రశంసించిరి. వీరాంధ్రమునకును, ఇండో-ఆర్యన్, ఇండో-ఇరానియన్ (Indo-Aryan Indo Iranian) భాషా సమూహములకును గల ప్రత్యేకసంబంధమును సూచించిరి. ప్రాకృతభాష సంస్కృతభాషకన్న పురాతనమనియు, సంస్కృతము మొదటి ప్రకృతియనియు, తర్వాతప్రకృత భాషలు క్రమక్రమముగా అపభ్రంశములని నామమును దాల్చె ననియు, వీనిలో శౌరసేన, మహారాష్ట్రిభాషలు ప్రాకృతభాషలలో ముఖ్యము లనియు, అపభ్రంశములనె పైశాచీభాషలుగా వ్యాకరణకర్తలు పరిగణించిరనియు, నారాయణరావు గారు వక్కాణించి యున్నారు. కాల్డ్వెల్ పండితుఁడు ద్రావిడభాషలలోనుండి సంస్కృత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములోనికిఁ గొన్ని పదములు వచ్చిన వనెడు వాదమును ఖండించి, ఆపదములు వేదములలో గలవని నిరూపించిరి.

పాలీ, మహారాష్ట్రిము, శౌరసేని, పైశాచి భాషల నుండి, ఆంధ్రములోనికి పదములు వచ్చిన విషయమును లక్ష్యములనిచ్చి చూపిరి. పాలీభాషనుండి, ఆంధ్రభాష మూఁడు వందల పదములు పరిగ్రహించెనని వీరు నుడువుచున్నారు. అపదముల పట్టిక నంతయునిచ్చిన భాషకు మేలుకలుగఁజేసిన వారగుదురు. Childers Pali Dictionary provides us with about three hundred words to which Telugu words can be traced' అనివీరు ఆంధ్రచారిత్ర పరిశోధక మండలివారి పత్రికలో రచించిన వ్యాసమునందుఁ దెల్పిరి. ఈ వ్యాసమునే కొంచెము మార్చి 'I have picked up at randam 300 Pali originals to Telugu words' అని ఈ గ్రంథమునందు వ్రాసిరి. ఆంధ్రభాషలో తద్భవములు, వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణవ్యత్యయముచేఁ గలుగునని ఆంధ్రవ్యాకరణ కర్తలు వ్రాసిన ప్రకారము, ప్రాకృత భాషలైన పాలీ భాషయందును, తదితర మహారాష్ట్రి, శౌరసేన భాషలయందునుగల పదముల గాలించి, వానికిని ఆంధ్రభాషయందలి పదములకును గల సారూప్యమును నిర్ణయించినఁగాని ప్రాచీనాంధ్రభాషా తత్వము తెలియదు.

ఆంధ్రభాషాపండితులు ఆంధ్రభారత రచనాకాలమునాటికి ప్రాకృత పైశాచీభాషలయందు పరిపూర్ణ పాండిత్యముగలవారని రాజరాజునందంపూడి శాసనమునుబట్టి తెలియచున్నది. నారాయణభట్టు ప్రాకృతపైశాచీభాషలయందు ప్రావీణ్యముగలిగి వానిలోఁ గవిత్వము చెప్పగలవాఁడని శాసనము వక్కాణించుచున్నది. "యఃసంస్కృతకర్ణాట ప్రాకృతపైశాచికాంధ్రభాషాసు; కవిరాజశేఖర ఇతిప్రథితః సుకవిత్వభవేన"

ప్రాకృత పైశాచీభాషలలోఁ బాండిత్యము సంపాదించిన వారుగాని ఆంధ్రభాషకును ఆభాషలకును గల మైత్రిని నిరూపింపఁ జాలరు. శ్రీ నారాయణరావుగారు ద్రవిడవాఙ్మయములలో దేశ్యపదములే లేవనియు, దేశ్యములని చెప్పఁబడు పదములు ఏప్రాకృతభాషలలోనో కనఁబడుననియు, నవి గ్రామ్యప్రాకృతభాషలుగాఁ బరిగణింపబడిన అపభ్రంశభాషలలోఁ గన్పట్టుననియు వక్కాణించుచున్నారు. వీరిమతమున ద్రావిడభాషలు పూర్తిగా సంస్కృతప్రాకృతభవములు. ఈభాషలకుమాతృకలు పాలీ, పైశాచీభాషలు. దేశ్యపదములు లేనేలేవు. ఈ కడపటి లక్షణమునకు లక్ష్యములు సకారణముగఁ జూపరైరి. ఒకటి రెండు పదములు జెప్పినఁ జాలదు. ఆంధ్రమునఁగల దేశ్యములన్నియు నపభ్రంశభాషలలోనుండియే వచ్చెనా? భాషను సంస్కృతభవము, ప్రాకృతభవమని వక్కాణించి, దేశ్యము అనియుఁ గూడ నేల విభజింపవలెను? శబ్దరత్నాకరము ప్రకారము ఆంధ్రభాషలో ౧౨, ౩౩౬ దేశ్యపదములున్నట్లు శ్రీనారాయణరావుగారే లెక్కపెట్టినారు. ఈ ౧౨, ౩౩౬ దేశ్యపదములను అన్యదేశములై ఏపైశాచీభాషాపద జాలమునకో ముడిపెట్టనగునా? ఆంధ్రభాష ప్రాకృత పైశాచీభాషాంతర్గతమా? ఆంధ్రభాష కేవలము పైశాచీభాషయేనా? భాషకు ప్రత్యేకవ్యక్తిత్వము లేదా? ఇట్టి ప్రశ్నలకు వారి గ్రంథము ప్రత్యుత్తరమిచ్చుటలేదు. ఆంధ్రభాష సంస్కృత ప్రాకృతతుల్యము, సంస్కృత ప్రాకృతభవము అని చెప్పుచుండుటచే నియ్యది ముఖ్యముగా నేప్రాకృత భాషలలోనుండియో పెక్కుపదములను గ్రహించెనని వేఱెచెప్పనక్కరలేదు. 'That at least the Telugu Language had its origin in a variety ot Paisachi seems to be the opinion of some of the Telugu grammarians' అని నారాయణరావుగారు వ్రాయుచున్నారు.

ఆంధ్రభాషయందనాద్యములగు వర్ణములు ఎ, ఒ, ఁ, చ, జ, ఱ, అనెడి యాఱక్షరములు సంస్కృత ప్రాకృతభాషలందు లేవు ఈ వర్ణములు గల పదములు కూడ ప్రాకృతపైశాచీపదములేనా?

శ్రీ నారాయణరావుగారు ప్రాకృతభాషలకును, ఆంధ్రభాషకును గల సంబంధము పదజాలముతోను, వ్యాకరణ సారూప్యముతోను కొంతవఱకు నిరూపించిరి. ఆంధ్రపదములు, ప్రాకృతపదములు ఆంగ్లాక్షరములలో వ్రాయఁబడుటచేఁ జదువుటకు కష్టముగానుండి, పదముల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొందిక సులభముగా గ్రహింపలేకపోతిని. వారి పరిశోధనపథము తెలియుటచే నంతగా శోధింపలేదు.

వీరి ముఖ్యవాదము ద్రావిడభాషలు సంస్కృత ప్రాకృత భాషాభవములు-అందుముఖ్యముగా నాంధ్ర భాష యట్టిదియ. ప్రాకృత భాషలయందలి వాఙ్మయమును, వాని వ్యాకరణమును గృషిచేసినచో, వానికిని ఆంధ్రభాషకును గల పరస్పర బాంధవ్యమును గనుఁగొనవచ్చును అని ఈ విషయము వారు చెప్పినట్లుగ ఆంధ్ర వ్యాకరణకర్త లిదివఱకే శాసించియున్నారు. పరిశోధన కావలయును. అందు వీరు ముఖ్యముగ పరిశోధనలు సల్పుచుండుటచే, వీరి కృషి ఫలించి, ఆంధ్రభాషకు మేలు కలుగుగాక!

కుందూరి ఈశ్వరదత్తు.

---

## ఆం ధ్ర మే ఘ సం దే శ ము

ఇది శ్రీ వేంకటగిరి రాజావారి కళాశాలాగ్రంథమాలలోలి కుసుమము. నెల్లూరియందలి శ్రీ వేంకటగిరి రాజావారి కలాశాలలో నాంగ్లేయోపన్యాసకులయిన మ.రా.రా.శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్బరామయ్య,(యమ్.ఏ.)గారు దీనియనువాదకులు.

వీరు చాలఁ గష్టపడి దీని నాంధ్రీకరించినట్లు తామే పీఠికలో వ్రాసినారు. నిజమే, కాళిదాసుగారి కావ్యము లాంటికావ్యములంబోలె సుకరముగ నాంధ్రీకరింపవీలుగానిదిగదా! అయినను, వీరు సుకరముగనో, కష్టపడియో-యెట్టులయిననేమి-తమ కందినంతవట్టు భావమును గ్రహించియు, వ్యస్తపదములను సమస్తముగఁ జేసియుఁ, గొన్నిచోట్ల వ్యాఖ్యానమునందలి ప్రతిపదములను గ్రహించియుఁ, దమగురువుగారి పదప్రయోజనికయందు దృష్టియుంచియుఁ జాలవఱకుఁ జక్కఁగానే యాంధ్రీకరించియున్నారు. అయినను, అందందు నాకు గోచరించిన మూల విరుద్ధాంశములను మాత్రమే చూపఁదలచుకొన్నాను.

మొట్టమొదటి శ్లోకములో "జనకతనయాస్నాన" అనియుండఁగా, వీరు "సీతజలకేళిని" అని తెనిఁగించినారు. మూలమునందలి "స్నాన" శబ్దసారస్యమును వీరి "జలకేళి" సాధింపఁజాలదు. సామాన్యముగ, జలకేళి, వనవిహారము మొదలయినవి శృంగారరసాంగములుగాఁ గవు లుపయోగించుచుందురు. ఆశ్రమములు శాంతరసప్రధానములు గనుక నందు "జలకేళి"యుండదు. అదిగాక, సీతయవస్థ యప్పట్టున జలకేళికిఁ దగియున్నదా? లేదనక తప్పదు. ఆయాసంగతులను, మనసులోనుంచికొనియే కాళిదాసు "స్నాన"శబ్దమును ప్రయోగించియున్నాఁడు. వాస్తవములో జలకేళియన్నను నీటిలో మునుఁగుటయే యైనను, ఆనీటికి స్నానముచేఁ గలిగిన పావనత జలకేళి వలనఁ గలుగదు కావున నిది యౌచిత్య భంజకమగును. మఱియు, యక్షుఁడు శాపముచేత నస్తంగమితమహిమఁడయినట్టు సన్నిహితముగాఁ బ్రయోగింపఁబడిన యా రెండుపదముల యర్థమును వ్యవహితముగఁ జేయుటచే మూలమునందలి యభిప్రాయ మందు రాఁజాలదు. మూలములో "స్నిగ్ధచ్ఛాయాతరుషు"అనియును, "రామగిర్యాశ్రమేషు" అనియు నుండఁగా, వీరు "సాంద్రనుత నమేరువులు" "రామగిరిప్రథితాశ్రమములు" అన్నారు. ఇందలి నుత ప్రథితశబ్దములు ఛందస్సును పూర్తిచేయుటకే యుపయోగించును గాని యంతకంటె విశేషమును తెలుపవు.

౨ వ పద్యములో—మూలమున "తస్మిన్నద్రౌ" అని యుండఁగా, వీరు "అందె" అన్నారు. దీనిచే రామగిరి ప్రథితాశ్రమములందే యని యన్వయించును గాని, ఆకొండయం దని యన్వయింపదు. "ఏ" ఎందులకో? కాళిదాసుగారి "కామి" ఇందు లేఁడు "వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయమ్" అని మూలమున నుండఁగా, వీరు "పరితోద్యద్వప్రఖేలాతి సంతోషాయాత కరీంద్ర రమ్యము" అని యంతకన్నను పెద్దసమాసములో మూలములో లేని యంశమును గూడఁ జేర్చి కూర్చియున్నారు. పాదాదిని "ఆషాఢ"మును ప్రయోగించుటచే "ఘుసా-సంతోష"పదము లనవసరముగ నిందుఁ గూర్పక తప్పినది గాదు.

3 వ పద్యములో — "కౌతుకాధానహేతువను నామేఘునియెదుట" నని మూలార్థ మగుచుండఁగా, వీరు "అటనే" అన్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪ వ పద్యములో—మూలములో లేని "సుభగుఁడు" భకారప్రాసకే యుపయోగించినాఁడు గాని యంతకుమించిన ప్రయోజనము వాని కచ్చుటలేదు. "స్వకుశలమయీం ప్రవృత్తిమ్" అనుదానికి "స్వక్షేమ దుర్లభవృత్తాంత" మన్నారు. "ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ" అను పదములకు వీరు "నూత్న కుటజార్ఘ్యంబిచ్చి" అని తెలిఁగించినారు. కాని కాళిదాసుగారి యభిప్రాయము యక్షుఁడు మేఘునికిఁ బూలు గోసి యిచ్చుట గాదు. మఱేమన? అతఁ డాపూలను అర్ఘ్యముక్రిందను మనసులోఁ గల్పించు కొనుటయే. "ప్రీతిన్, ప్రమోదభరంబు" రెండెందులకు? మొదటిది "ప్రీతః" అను దానికిని, రెండవది "ప్రీతిప్రముఖవచనమ్" అను దానికిని గాఁబోలును! "స్వాగతం వ్యాజహార" అని మూలములో నుండఁగా, వీరు "స్వాగతంబొసఁగుచున్ దాఁగొల్చె జీమూతునిన్" అన్నారు. స్వాగత మడిగెనని మూలమున కర్థము. "కుశలాగమనం ప్రపచ్ఛేత్యర్థః" అని మల్లినాథసూరియు, "కుశలముగా వచ్చితివా—అను మాటను పల్కెను" అని శ్రీ శాస్త్రులవారును స్పష్టముగా వ్రాసియుండఁగా, వీరు—అడుగుటకు బదులు ఒసఁగుచున్—అన్నారు. స్వాగతసత్కారము వాగ్వ్యాపారముగాని హస్తవ్యాపారము గాదు. "ఒసఁగుచున్ దాఁగొల్చె జీమూతునిన్" అనుటచేఁ గొల్చినంత సేపును ఒసఁగుచుండెనని యర్థమేర్పడుచున్నది. మూలము లోఁగొలుచుట లేనేలేదు. లేకపోయినను వీరు యక్షుని చేతను మేఘునికొల్పించినారు. ఇదియొక మెఱుఁగో యేమో? మఱియుఁ గాళిదాసుగారు ౨౩వ శ్లోకములో "స్వాగతీకృత్య కేకాః" అన్నచోటనుగూడ "నెమిళ్లు తమ కేకలను స్వాగతవచనములుగఁజేసి" యనుటకుమాఱుగా "స్వాగత మిడఁ గేకలన్" అని ప్రయోగించి యిప్పించినారుగాని యడిగింపలేదు. ఇది యిప్పటివారి సంప్రదాయము గాఁబోలును!

౫ వ పద్యములో—"ధూమజ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః" అనుమూలమునకు వీరు, "ధూమము, జ్యోతి, మారుతముఁ, దోయముఁ జేరిన మేఘమేడ!" అని తెలిఁగించినారు. సన్నిపాత మనఁగా సంఘాతము=కూటమియని యర్థముగాని (చేరిన=కలసికొనిన) అని యర్థము కాదు. "పటుకరణైః ప్రాణిభిః" అని మూలములోనుండఁగా, "మహితేంద్రియుల్ మనుజులే" అని వీరన్నారు. అట్లేని మూలకర్త "మానవైః" అనలేకపోయినాఁడా? మనుజులే కాని దేవతలు వార్తను గొనిపోఁగూడదా? మఱియు పటుపదమునకు, మహిత పదము సరియైనది గాదు. "చేతనాచేతనములు"—అనుట సంప్రదాయము గాని, అచేతనచేతనము లనుట కాదు. "కామార్తాః ప్రకృతికృపణా హి" యనుమూలమునకు "కామవిపన్ను లయ్యెదరుగా సహజప్రవృత్తిమై" యనుట సరియైన తెలుఁగు కాదు.

౬ వ పద్యములో—"జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానామ్" అని మూలము. దీనికి వీరు "ఆవర్తకపుష్కలంబు లనఁ బేర్గన్నట్టి వంశంబునన్ జననం బందితి" వని వ్రాసియున్నారు. "లోకవిదితమయిన పుష్కలావర్తకముల వంశమందుఁ బుట్టినవాఁడవు" అని మూలమున కర్థము. ఆవంశము పుష్కలావర్తకము లదిగాని పుష్కలావర్తకము లని పేరందలేదు. మఱియు, పుష్కలావర్తక మేఘము లనియే లోకమునఁ బ్రసిద్ధము గాని ఆవర్తకపుష్కలము లని కాదు. "పుష్కలాశ్చ, ఆవర్తకాశ్చ కేచిన్మేఘానాం కూటస్థాః పుష్కలావర్తకా ఇత్యుచ్యన్తే" అని మల్లినాథసూరి వివరించియున్నాఁడు. "పుష్కలములు ఆవర్తకములు అను పేర్లుగల కూటస్థమేఘముల యొక్క" అని శ్రీ శాస్త్రులవారును వ్రాసియున్నారు. "మఘోనః ప్రకృతిపురుషమ్" అను మూలమునకు వీరు "ఆస్వారాడమాత్యుండవు" అని తెలిఁగించినారు. ప్రకృతిపురుషుఁ డనఁగా, ప్రధానపురుషుఁ డనియే వ్యాఖ్యాతలు వివరించినారు గాని, అమాత్యుఁ డనలేదు. "రాజ్యాంగాని ప్రకృతయః" అని యమరసింహుఁడు. ఇంతేకాక, ఈ మేఘుఁ డింద్రునకు మంత్రి కాఁడుకూడను. కావునఁ బ్రధానపురుషుఁ డనఁగా ముఖ్యపురుషుఁ డనియే కాని యమాత్యుఁడను నర్థము రాదు. "యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా" అను మూలమునకు వీరు "అల్పునెడన్ గోర్కె ఫలించుకంటె నది కోల్పోవుట మేల్ గుణిన్ వేఁడుచోన్" అని తెనుఁగుచేసియున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇది మూలమునందలి యభిప్రాయమును తెలుపఁజాలదు. "అధికగుణములుగల పురుషుని విషయమున యాచన విఫలమయినను ఇంచుక ప్రియము, నిర్గుణునివిషయమున యాచనమో లబ్ధకామ మయినను ఇంచుక ప్రియముగూడఁగాదు" అని వ్యాఖ్యాతలు వివరించియున్నారు. "వరం మనాక్ప్రియ"మ్మని యమరసింహుఁడు. కావున మూలములోని యభిప్రాయ మీ తెనిఁగింపులోనికి సరిగా రాలేదని నాయభిప్రాయము.

ఇఁక ప్రతిపద్యమును విమర్శింపఁబూనక యందందుఁగల కొన్ని విశేషములను మాత్రమే విమర్శించెదను.

౯ వ పద్యములో—"మందం మందం నుదతి పవనశ్చానుకూలో యథా త్వాన్" అన్న మూలమునకు "అనుకూలానిలుఁ డొప్పురీతి నిను నల్లల్లన్ వహించున్" అని వీరు తెనిఁగించినారు. "నుదతి=ప్రేరయతి" అని వ్యాఖ్యానము. వహించున్=మోయును—అనవలెనుగదా; ప్రేరణ చేయుట యనఁగా మోయుట కాఁజాలదు. "వామశ్చాయం నదతి మధురం చాతక స్తే సగంధః" (ఇదిగో గర్వముతోఁ గూడినదై నీయొక్క యెడమప్రక్కనున్న చాతకముకూడ మధురముగఁ బలుకుచున్నది) దీనికి వీరు "సగంధనవ ప్రేరిత చాతకంబు లెడమన్ దా మొప్పి వే గూయుఁ దీయనఁగా" అని తెనిఁగించియున్నారు గాని, దానికెట్లర్థము చేసికొనవలయునో నాబుద్ధికి గోచరింప లేదు. శుభసూచకముగాఁ గాళిదాసుగారొక్క చాతకపక్షిని మాత్రమే కైకొన్నారుగదా! అని "అధికస్యాధికం ఫల"మ్మని కాఁబోలును వీరు పెక్కింటిని గైకొన్నారు. (వే=వేగము) మూలములో లేనిదైనను దీనివలన నేమేని ప్రయోజనమున్నదా? లేక పాదపూరణార్థమే ప్రయోగించినారా? పాదపూరణప్రయోజకముగనో "దా మొప్పుచున్ గూయు" నన్న సరిపోదా? ఏమో వా రెందులకా 'వే' ప్రయోగించియున్నారో? "పవనశ్చ, చాతకశ్చ" అని రెండు చకారములున్నవి. వానియర్థము వీరు కైకొనలేదు. ఎందుచేత? నిష్ప్రయోజనమని. అటులేని కాళిదాసు వ్యర్థముగా రెండుచకారము లేల ప్రయోగించును? "నిరర్థకములగు పదములు కాళిదాసునికవిత్వమునం దెచ్చటను గన్పించుట లేదు...ఆమహాకవి వాడిన ప్రతిపదముకూడ గంభీరమగు అర్థమును స్ఫురింపఁజేయునట్టిదిగనున్నది" అని పీఠికలో వారు వ్రాయించియున్నారుకూడను. కావున, ఆచకారార్థము లుండనేవలయునేమో?

౧౦ వ పద్యము—మూలమునందలి "ప్రాయశః=తఱచుగా, అనయము=ఎల్లప్పుడు", అనికదా చెప్పవలెను. మఱియు, మూలమునందలి యుత్తరార్థమునకు వీరు తెనిఁగించిన భాగమంత సరసమయినదిగఁ గనుపట్టదు.

౧౧ వ పద్యములో—మూలములోని "ప్రభవతి"కి వీరి "మేటి" సరియైన యర్థముగాదు. ప్రభవతి=సమర్థమగుచున్నది. మేటి=ఏలిక, శ్రేష్ఠము. శ్రవణసుభగమ్=చెవులకింపైనది. దీనికి మేలిమివీనువిందు—అని వీరి తెనుఁగు. మానసోత్సుకములై, అను మూలమునర్థమునకు వీరు "మానసశ్రీల వరించి" యన్నారు. హంసలు మానసశ్రీల వరించి యనుటచేఁ బురుషహంసలనిమాత్రమే తోఁచును. వానకారున హంసలన్నియును మానస సరస్సున కేఁగునుగదా! "రాజహంసాః" అనుదానికి స్త్రీపుంహంస లనియే యర్థము. అప్పుడు స్త్రీలింగపుంలింగస్వారస్యమునఁ గలుగు వరించుట యనుచితముగాదా? హాలిని, మూలానుక్తమయినను "హాళి" యనవలెను. మేలి, మిశ్రీలు, హాళి యివి ఛందస్సును సరిపఱచునవేకాని వేఱుకావు.

౧౨ వ పద్యము—"పుంసాం వంద్యైః రఘుపతి పదైః మేఖలాసు అంకితమ్" పురుషులకు వంద్యము లయిన రఘుపతి పాదన్యాసములచేతను కటకములయం దంకితమైన" అను నర్థమునకు వీరు "సుపర్వవంద్యమహిజానాథాంఘ్రిపద్మద్వయాంకితసానుండు" అని తెనిఁగించినారు. పుంశబ్దమునకు సుపర్వులనఁగా దేవత లర్థముగాదుగదా! దేవతలనియు, మనుజులనియు విభాగము లేకుండ ప్రతిపురుషునకు రాముని పాదములు వంద్యములే యగును. మేఖలలు=కటకములు. అవి సానువులుగావు.

౧౩ వ పద్యము – "త్వత్ప్రయాణానురూపం మార్గమ్=నీప్రయాణమునకుఁ దగినదారిని" అనుదీనికి "సుకరపున్ పథము" అన్నారు. కాని మూలమునందలి భావమును ప్రకటింపఁజాలదు. "సుకరపున్" కంటె "సుగమపున్" అనుట యుక్తము. "పరిలఘు స్రోతసాంపయః=



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిగులఁ దేలిక యగు ప్రవాహముల నీటిని" అను దానికి వీరు "పయోలఘుభోజనము" అన్నారు. లఘుశబ్దము నీటికి విశేషణముగదా! మేఘునికిని లఘుభోజనము గురుభోజనము ఉండునా?

౧౪వ పద్యము — "ఉన్ముఖీభిః ముగ్ధసిద్ధాంగనాభిః చకిత చకితం దృష్టోత్సాహః=ఉన్నత ముఖులయిన ముగ్ధలగుసిద్ధస్త్రీలచేతను మిగుల భయసంభ్రమములతోఁగూడు కొన్నట్టు చూడఁబడిన యుత్సాహముగలవాఁడవై" అను దీనికి "భీతిదాగ్దోఁగనుదుర్ నినుఁ శశిముఖుల్ మొగమెత్తుచు సిద్ధముగ్ధలు అని తెలిఁగించినారు. ముఖమెత్తిమాత్రు రుగాని ఎత్తుచు చూడరు." ముగ్ధసిద్ధాంగనలకు సిద్ధముగ్ధలు శశిముఖుల్ సరియైనట్టు లేదు. చకితశబ్దమునకు భయముతోఁ గూడిన సంభ్రమమర్థముగాని వట్టిభీతి యర్థముగాదు. కాళిదాసుగారి యుత్సాహము వీరి తెనిఁగింపులోఁ గానరాదు. "సరసనిచులాత్ అస్మాత్ స్థానాత్ = సరసనిచులమైన యీచోటనుండి" అను దీనికి "ఆభోగము నొంది సన్నిచుల మోహనమానిటన్" అనునది సరియేకాదు. మఱియు "సరస" పదమునర్థము వేఱు "సత్" పదమునర్థము వేఱు. "పథిదిఙ్నాగానాం స్థూలహస్తావలేపాన్ పరిహరన్ ఉదఙ్ముఖస్సన్ ఖం ఉత్పత=మార్గమందు దిఙ్నాగసంబంధములైన స్థూలహస్తావలేపములను పరిహరించుచు నుత్తరముఖుఁడవగుచు నాకాశమునుగూర్చి యెగురుము" అను దీనికి "స్థూలదిఙ్నాగకరావలి ప్తెఁ నలఁగన్ దివి నేఁగుము దఙ్ముఖుండవై" అని వీరి యనువాదము. అప్పుడు కాళిదాసుగారి "పథి" విడిచినందున "సారస్వతమార్గమందు" అను ధ్వని యందు రాఁజాలదుగదా!

౧౫ వ పద్యము — "వల్మీకాగ్రాత్ ప్రభవతి" పుట్టకొననుండి పుట్టుచున్నది" అని మూలమున నుండఁగా "పుట్టఁ బుట్టున్" అని అనువదించినారు. "యేన తవ శ్యామం వపుః స్ఫురితరుచినా బర్హేణ గోపవేషస్య విష్ణోః శ్యామం వపురివ అతితరాం కాంతిమాపత్స్యతే=దేనిచేతను నీనల్లనిశరీరము స్ఫురితరుచియగు బర్హముచేతను గోపవేషుఁడగు విష్ణుని నల్లనిశరీరమువలె మిక్కిలి కాంతిని పొందఁగలదో" అను దీనికి వీరు, "అది కై తవగోపకు విష్ణుదేహమున్ దండిగఁ బొల్చుపించెమటు నల్లని నీవపువున్ మహాప్రభామండితముం బొనర్చి విసుమాన మొసంగును గన్నదోయికిన్" అని తెలిఁగించియున్నారు. కాని యిది సరియైనదికాదు.

౧౬ వ పద్యమున — "మాలం క్షేత్రం సద్యఃసీరోత్కషణ సురభి ఆరుహ్య=మాల మను పేరి పొలమును తత్కాలమందే నాఁగళ్లచేతను దున్నుటచేత పరిమళము గలది యగునట్లుగా నెక్కి" అను దీనికి "దున్నఁజేఁదానిగుబులొక్క న మాలమెక్కి" అని తెనిఁగించియున్నారు. మూలమునందలి "క్షేత్ర" పదమును వీరు విడిచినారుగదా! "మాలమెక్కి"యనుదానికిఁ దెనుఁగువారు లేమని యర్థము చేసికొనఁగలుగుదురో యాలోచింపవలదా? కించిత్పశ్చాత్ వ్రజ, లఘుగతిః భూయః ఉత్తరేణైవ వ్రజ=కొంచెము వెనుకకు అనఁగా, పడమరగా వెళ్ళుము. వేగగమనము గలవాఁడవై మరల నుత్తరమార్గముననే వెళ్ళుము" అను దీనికి పశ్చిమ మొక యింత దాటి మఱి చెచ్చెఱ నుత్తరమార్గమేఁగుమా" అని తెల్గు. లఘుగతి యర్థము చెచ్చెరను వచ్చునా? చెచ్చెర_లఘురేఫ యుతముగా నగపడుచున్నది. దాటుట వెళ్ళుటయగునా?

౧౭ వ పద్యములో — అధ్వశ్రమపరిగతుఁ డన్య షేఃనిబిడుఁ డగునా? కాఁడు. దానియర్థము వేఱు, దీనిది వేఱు నని తోఁచెడిని.

౧౮ వ పద్యము — "ఛన్నోపాంతః పరిణతఫలద్యోతిభిః కాననామ్రైః=చుట్టును పరిపక్వము లయినఫలములచేతను ప్రకాశించు నడవిమామిళ్ళచేతను కప్పఁబడిన పార్శ్వములు గలది" అనుదీని తెనుఁగు "ప్రక్కలఁ గాననామ్రములు పండుచుఁ గప్పఁగ" అనునది. మూలమునందలి "ద్యోతి" పదము విడుచుటచే "పదప్రయోజకత" లోని "ఫలములు పెక్కులై యాకుల నగపడనీయక తామే యగపడుచున్నవి" అనుభావము వీరియనువాదములో నభావము నునది. "పండుచున్" వర్తమానకాలము పనికిరాదు. భూతకాల ముండవలెను. "పండినకాననామ్రములు ప్రక్కలఁ గప్పఁగన్." అనినను గొంతవఱకు మూలముగ నుండునేమో? మఱియు, "స్నిగ్ధవేణీసవర్ణే త్వయి శిఖర మారూఢే సతి=నిద్దపుజడతో సమానమయిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాంతిగల-అనఁగా, నలుపురంగుగల నీవు శిఖరము నెక్కి-నవాఁడ వగుచుండఁగా" అనుదీనికి వీరు "నీవు శృంగమం దెక్కఁగ నున్నవేణికళ లీనుచున్" అని తెల్గించినారు. ఇక్కడను "ఈనుచున్" అని వర్తమానకాలము నే ప్రయోగించినారు. "నీవు నీలదేహుండవు శృంగదేశమున నుండగన్" అనినను సరిపోవునుగదా! "పాండు" శబ్దమునకు వీరిచట "వెల్లనైన" దని గ్రహించినారు. "పండిన పండ్లయిన పసుపుగాను తెల్లగాను ఉండును" అని పద ప్రయోజనిక. మఱియు నీ "పాండు" శబ్దమునకే యుత్తరమేఘములోని రెండవశ్లోకము పద్యమునందు "పసిఁడి వింతలు" అని యన్నారుకూడను. సామాన్యముగ మామిడిపండ్లు పచ్చగ నుండు నని వీ రెఱుఁగరు గనుక నా ఏల "వెల్ల" యన్నారు? "హరిణః పాండరః పాండుః" అని యమరము-అచటఁ బాండుశబ్దమునకుఁ బసపురంగుతోడితెలు పనియే యున్నది. "నూనం యాస్యత్యమరమిథునప్రేక్షణీయా మవస్థామ్=నిశ్చయముగ దేవదంపతులచేఁ జూడఁదగిన యవస్థను పొందఁ గలదు" అను మూలమునకు, "మిక్కిలి నేత్రపర్వ మనిమేషయుగాళి కిడున్" అని వీరి తెనుఁగుసేఁత! "ప్రక్కల"తోఁ బద్య మెత్తుబడి చేయుటచే మూలమునకుఁ గాని "మిక్కిలి" ప్రాసకై వేయవలసివచ్చినది. 'మిః'కి యతిస్థానమున 'మే' పెట్టకతీఱినదిగాదు. అందుచే "అనిమేషయుగాళి" ప్రయోగించినారు. కాని మూలమున "అమరమిథున" పదము వినఁగానే దేవదంపతు లని స్ఫురించును. వీరి "అనిమేషయుగాళి"కి నిమేష మనఁగా ఱెప్పపాటు, అది లేనివా రనిమేషులు, అనఁగా దేవతలు. వారి "యుగ=జంట" ఆజంటల "అళి=సమూహము" అని యింతవఱకుఁ జెప్పినను మూలార్థము రాజాలదు. "అచలము చూడఁదగిన యవస్థను పొందఁగలదు" అనుమూలము నర్థమునకు వీరు "గిరీంద్రమున్" నేత్రపర్వమిడున్" అనిమాత్రమే యన్నారు. కర్తృపదమయిన "గిరీంద్రము"నకు సముచ్చయ మెందులకో? ఇంతయినను "నూనమ్" పదార్థము లేనేలేదు.

౧౯ వ పద్యము—"ఉపలవిషమే వింధ్యపాదే విశీర్ణాం రేవాం గజస్య అంగే భక్తిచ్ఛేదైః విరచితాం భూతిమివ ద్రక్ష్యసి=ఱాలచే విషమమయిన వింధ్యపాదమునం దంతటను వ్యాపించినదైన నర్మదానదిని, ఏనుఁగుయొక్క శరీరమునందు రేఖలభంగులచేతను విరచింపఁబడిన భూతినివలెఁ జూడఁగలవు" అనునిట్టిదీనికి వీరు "శిలావిషమాయత వింధ్యపాదశీర్ణను గనులారఁగాంచుమట నర్మద, వారణధాతుభూతి నాన్" అని యనువదించినారు. మూలమున "తస్మిన్=ఆకొండయందు" అని యొక్కసారి మాత్రమే ప్రయుక్త మయినది. దానికి వీ రావృత్తిచేసి. "వనచరవధూభుక్తకుంజే తస్మిన్ముహూర్తం త్వా=వనచరస్త్రీలచే అనుభవింపబడిన పొదలుగల ఆకొండయందు ఇంచుకసే పుండి, అనుదీనికిఁ దెలుఁగగు 'వనచర కామనీమణులవాంఛలు దీర్చు నికుంజపుంజముల్ గన నగు నయ్యెడన్ క్షణము కాలము నిల్పి' అను దానను, 'అయ్యెడన్' అని యొకసారియు, కాంచుమటన్' అను దానిలో అటన్ అని ఒకసారియు నుపయోగించినారు. మఱియు "విశీర్ణామే" అనుపదములో ముఖ్యముగా నుండఁదగిన "విని" విడిచినారు. అక్కఱకు మాలిన "ఆయత" పదమును చేర్చినారు. మూలమున కనుగుణమైన "కాంచెదు" మాని "కాంచుము" అన్నారు.

౨౦ వ పద్యములో—"వాంత వృష్టిస్సన్ తిక్తైః వనగజమదైః వాసితం జంబూకుంజప్రతిహతరయం తస్యాః తోయం ఆదాయ గచ్ఛేః=ఉద్గీర్ణవర్షుఁడ వగుచుఁ దిక్తములయినవనగజమదములచేతను వాసితమును, నేరేటిపొదలచే నడ్డఁబడ్డ వేగముగలదియు నగునానర్మదయొక్క నీటిని గ్రహించి పొమ్ము" అనెడి మూలమునకు వీరు "వానను గ్రక్కి నాగమద వాసిత తిక్తనదీ జలంబు జంబూనివహప్రరుద్ధయమున్ గ్రహియించియుఁ బొమ్ము" అని యాంధ్రీకరించి యున్నారు. నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది శబ్దములు గౌణవృత్తి నాశ్రయించినప్పుడే సుందరములనియు లేనిచో గ్రామ్యకక్ష్యాదోషమును పొందునవియు ననుశాసన మున్నది. వీరు వ్యంగ్యరూపమునఁ దోఁచునర్థమునుపయోగించుటచే నా దోషము తప్పినది గాదు. "తిక్తములయిన వనగజమదములచేతను వాసిత మయిన దాని నీటిని" అని కాళిదాసుగారు రచింపఁగా "వీరు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగమదవాసిత తిక్తనదీజలంబు" అని రచించినారు గాని ఆసొంపు దీనికి రాలేదు. ఆయన పైశ్లోకమున నర్మదను చెప్పినారు గనుక నిందు దానిని తచ్ఛబ్దముతోఁ బరామర్శించినారు. వీరు అట్లు చేయక కేవల నదినే ప్రయోగించినారు. "దానివారి" అనవలసినది. మూలములో "జంబూకుంజ" అని యున్నది. వీరు, ఆకుంజ పదము విడిచి కేవలజంబూశబ్దమునే కైకొన్నారు. కుంజ పదముతోఁ గూడిన ప్రయోగములును, తత్ఫలమును శాస్త్రులవారు చక్కఁగా వివరించియున్నారుకూడను. జంబూ కుంజము లయిననే నీటి వేగము నడ్డును గాని జంబూ ఆకులు నీటికిఁ దగులను జాలవుగదా! "గ్రహియించియున్" సముచ్చయ మేల? వృక్షము లడ్డను జాలవు "రిక్తస్సర్వోఽపి లఘుర్భవతి? =అంతస్సారశూన్య మయిన దంతయుఁ జులుక నగును" అనుదీనికి వీరు "హీన బలుండు చుల్క నగు నెచ్చటన్" అన్నారు. కాళిదాసుగారు రచనవలన, ప్రతివస్తువును అంతస్సారశూన్య మయినచోఁ దేలిక యగు నని తేలుచుండఁగా, వీరి రచనవలనఁ బురుషుఁడు మాత్రమే చుల్క నగునని తేలుచున్నది. సర్వశబ్దమునకు వీరు "ఎచ్చటన్" అన్నారు. "ఎవ్వఁడున్" అనినను మూలము ననుసరించెడిని. "పూర్ణత్వము గౌరవముకొఱ కగును" అని మూలము. వీరు "పూర్ణుఁడు గౌరవాఢ్యుఁడౌ" నన్నారు. "పూర్ణత గౌరవార్థమౌ" ననిననే లెస్సగనుండును. ఇచ్చటను పైయట్లే వస్తుపరముగా నుండుటయే సమంజస మగును.

౨౧ వ పద్యము—"సారంగాః అర్ధరూఢైః కేసరైః హరితకపిశం నీపం దృష్ట్వా చ, అనుకచ్ఛం ఆవిర్భూతప్రథమముకుళాః కందళీః జగ్ధ్వా చ, అరణ్యేషు అధిక సురభిం ఉర్వ్యాః గంధం ఆఘ్రాయ చ, జలలవముచ స్తే మార్గం సూచయిష్యన్తి=సారంగములు, ఏకకోద్గతము లయిన కింజల్కములచేతను హరితము, కపిళమునగు నీపమును చూచియు, అనుపములయందు ప్రథమోత్పన్న ముకుళములగు నేలయనఁటులను తినియు, అరణ్యములయందు హెచ్చుగా ఘ్రాణతర్పణము యిన భూమియొక్క గంధము నాఘ్రాణించియు జలలవములను విడుచునీ దారిని సూచింపఁగలవు." ఇది కాళిదాసుగారి రచనయు దానియర్థమును. దీనికి వీరు వ్రాసిన పద్యమిది. "సరవిన్ నీపాడిచిన్కుదారిఁ దెలుపున్; సామెల్వఁ గింజల్కముల్, హరితంబున్ గపిశంబు నౌ కడిమి నత్యాసక్తి నీక్షించి, కచ్ఛరుహమ్ముల్ తొలిమొగ్గనేలయనఁటుల్ చక్కంగ భక్షించి, కాన రహింపన్ భువితావి మూరుకొని యానందించు సారంగముల్." "సామెల్వన్" ఇది సమాసమా? కానిచో "సాము"లోని మువర్ణమునకు లోప మెట్లు? వృత్తియందే సాములోని "ము"లోపించును. "సామేను—సాబాలు" ఇత్యాదులు ప్రయోగములు, మూలార్థములో "వానిభక్షించి" అని మాత్రమే యుండఁగా వీరు "అత్యాసక్తినీక్షించి చక్కంగభక్షించి" అన్నారు. మూలములోని "అధికసురభి"ని వీరు పూర్తిగానే వదలి దానికి బదులుగా "రహింపన్" చేర్చినారు. "ఆనందించు" మూలములో లేనేలేదు. సముచ్చయార్థకములయిన చకారములను వీరు పాటింపనే లేదు.

౨౨ వ పద్యము—"అంభోబిందు గ్రహణ చతురాన్ చాతకాన్ వీక్షమాణాః=జలబిందువులను గ్రహించుటయందుఁ జతురములయిన చాతకములను చూచుచున్నవారై" అను దీనికి వీరు "విసుమానముగా జలబిందువుల్ గ్రహింపన్నేర్పు గల్గుచాతకసమాజముఁ గాంచునున్"అని తెనిఁగించి యున్నారు. ఇందు "విసుమానముగా"అనునది మూలమునకుఁ గానిది. "గ్రహణచతురములైన చాతకములను" గ్రహింప న్నేర్పు గల్గుచాతకసమాజము" చతుర శబ్దమునకు నేర్పు సరియైనదిగాదు. కాక, తెలుఁగు చదువరు లేమని యర్థముచేసి కొందురో? "శ్రేణీభూతములైన బలాకలను పరిగణనచేతను నిర్దేశించుచున్నవారై" "శ్రేణి గట్టియాసన్నము లౌబలాకలను జక్కఁగ నెన్నుచున్" ఇందు "ఆసన్నములు—చక్కఁగ" మూలానుక్తములే.

౨౩ వ పద్యము—"నీవు సమీపించినవాఁడ వగుచుండగా, దశార్ణ దేశము, ముకుళాగ్రములయందు వికసితములయిన మొగిలిపూవుల చేతను పాండువర్ణములయిన యుపవనావరణములు గలదియు, కాకాదిగ్రామ్యపక్షులకులాయనిర్మాణములచేత సంకీర్ణములయిన గ్రామరథ్యా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వృక్షములు గలదియు, పండినపండ్లచే నల్లనైన నేరేటి వనములచేతను రమ్యమైనదియు, కొన్నియేదినములు నివసించు నంచలు గలదియుం గాఁగలదు." ఇది మూలశ్లోకమునర్థము. దీనికి వీరి తెలుఁగు: "అరవిరిగేదఁగుల్ వెలయ నచ్ఛపుఁదెల్పగుఁ దోఁటకట్టువల్; కరటతతుల్ కులాయములఁ గట్టుటఁ గ్రందగు రచ్చచెట్టులున్; పరిణత మైన పండుగమి నల్పగు నేరెటితోఁపులున్; మనోహరమగుఁ గొన్నినాళ్లవిడియునంచలు; నీవు దశార్ణ మేఁగఁగాన్." అనునది. దీని కిట్లర్థము చెప్పవచ్చును "నీవు దశార్ణ మేఁగఁగా, తోఁటకట్టువలు=తోఁటకంచెలు, అరవిరిగేదఁగుల్ = మొగ్గమొగలులు, వెలయన్ = ఒప్పఁగా, లేక ప్రకాశింపఁగా, అచ్ఛపుఁదెల్పు=స్వచ్ఛమైన శుక్లవర్ణము, అగున్=అగును. కరట తతుల్=కాక సమూహములు, కులాయములన్ = గూండ్లను, కట్టుటన్ = కట్టుటచేతను, క్రందు=అలికిడి, లేక, సందడి, అగు= అయిన, రచ్చచెట్టులున్ = రథ్యావృక్షములును, పరిణతము =పండినది,ఐన, పండుగమిన్ = పండుపిండు చేతను, నల్పు అగు నేరెటి, తోఁపులున్ = తోఁటలును, కొన్ని, నాళ్ల్=దినములు; విడియు నంచలు=పోవుచు నొక్కచో బసచేసిన హంసలును, మనోహరము=చక్కనిది, అగున్. ఇట్లుగదా చెప్పవలయును. వీరి పద్యమునకు దండాన్వయము చెప్పవలయుచో—("మేఘుఁడా!) నీవు దశార్ణము వెళ్ళఁగా, తోఁటకంచెలు, మొగ్గమొగలులు ఒప్పఁగా లేక ప్రకాశింపగా, స్వచ్ఛమైన శుక్లవర్ణము అగును. కాకసమూహములు గూండ్లను కట్టుటచేతను అలికిడి లేక సందడి అయిన రథ్యావృక్షములున్ను, పండినదియైన పండుపిండుచేతను నల్పు అయిన నేరెటితోఁటలున్ను, కొన్నిదినములు పోవుచు నొక్కచో బసచేసిన హంసలున్ను చక్కనిది అగును. కాళిదాసశ్లోకార్థము, వీరి పద్యము, దానియర్థము, దండాన్వయము నాబుద్ధిని నిఘంటువునుబట్టి వ్రాసియున్నాను. కడమవిషయములు చదువరులే గ్రహించుకొందు రని యాభారము వారికే వదలుచున్నాను. "కొన్నినాళ్లు+విడియు" వీ రీపదమునకు ఉకారలోపముచేసి "నాళ్లవిడియు" అని ప్రయోగించినారు. కాని బాలవ్యాకరణములోని ప్రకీర్ణపరిచ్ఛేదమున ౧౬ వ సూత్రము "పదాంతంబులయి యసంయుక్తంబులైన ను లు రు లయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు" దీనిప్రకారమునఁజూడఁగా ఉత్వలోపము రాదు. "నాళ్లు" అని సంయుక్తము గదా! గేదఁగి యనఁగా, పచ్చనిపూవులుగల మొగిలి గదా; దీనిచేతను అచ్ఛపుఁదెల్పెట్లగును? పాండుశబ్దమునకుఁ బసపుతెలుపువర్ణమని యర్థము చెప్పఁబడియున్నది.

౨౫ వ పద్యము—"దిక్కులయందుఁ బ్రసిద్ధమయిన విదిశ యనుపేరుగల యాదశార్ణదేశపు రాజధానినిగూర్చి పోయి యపుడే విలాసితకుఁ బూర్ణమయిన ఫలము నీచేతను పొందఁబడఁగలదు" ఇది మూలమునర్థము. దీనికి వీరు "అవిరళకీర్తి నద్దెసల నా విదిశాఖ్యను రాజధానినిన్, దవులుచు నొందు పూర్ణఫలితంబు విలాసితకు" అని తెలిఁగించియున్నారు. మూలమునందలి తచ్ఛబ్దమునర్థమును వీరు గైకొనమిచే నీరాజధాని దేని దని చెప్పుట? పోయి అని భూతకాలము ప్రయోగింపఁబడియుండఁగా "తవులుచున్" అని వర్తమానకాలమును ప్రయోగించియున్నారు. ఇచ్చటనే కాదు వీరు భూతమునకు వర్తమానము తఱచుగనే ప్రయోగించినారు. నీచేతను ఫలము పొందఁబడఁగలదు—అనఁగా నీవు ఫలమును పొందెదవు అనుదానికి వీరు ఫలమును పొందుము అన్నారు. "సభ్రూభంగం ముఖమివ" అనుదానికి "అధరంబును భ్రూకుటియుక్తమున్ బలెన్" అన్నారు. అధర మెప్పు డయినను భ్రూకుటియుక్త మగునా? వ్యాఖ్యానములో "ముఖమివ=అధర మివేత్యర్థః" అని యున్నది. అయధరపదమునే వీరు గ్రహించుటచే నాక్షేపార్హమైనది. "స్తనితసుభగం" దీనికి 'స్తనితనైపుణమై' అనునది సరియైనది గాదు. ఇంకను విమర్శింపబూనినచో నిం కెంతేని గలదు.

౨౬ వ పద్యము—"ప్రౌఢపుష్పములగు కదంబములచేన్" దీనికి వీరు "నీపస్ఫుటాంచత్సుమంబు" అన్నారు. "నాగరుల యుద్దామము లయిన యౌవనములను" ఇది మూలార్థము. దీనికి వీరు "నాగరోద్యద్వయః; శ్రీ సౌభాగ్యము" అని తెనిఁగించినారు. "అవిదిశ దగ్గఱ విశ్రాంతి కొఱకు నీచైర్గిరియందు వసింపుము" దీనికి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్రమించి యట వాసిక దేలు నీచైర్గిరిన్" అన్నారు. "వాసిక దేలు" మని కాళిదాసుగా రననే లేదు.

౨౭ వ పద్యము—"చెక్కుల చెమ్మటను తుడుచుటచే నైన పీడచేతను క్లాంతములయిన కర్ణోత్పలములు గల పువ్వులాడి ముఖములకు ఛాయాదానమువలన క్షణ పరిచితుఁడవై పొమ్ము" అను దీనికిని "పొమ్ము వీకదో వల్ బాలకపోలపుల జెమటఁ బాపుట వాడిన పువ్వులా వికాజాల ముఖాళికిక జలద, చాయ నొసంగి క్షణాను రక్తిమై" అని తెనిఁగించినారు. ఇది యేటి తెనిఁగింపో కద ! కలువలు వాడినట్లు కాళిదాసుగారనఁగా, ముఖములు వాడినట్లు వీరన్నారు. ఇదియు నొక మెఱుఁగో యేమో!

౨౯. వ పద్యము— "తరంగచలనముచేతను మాఖరము లయిన పక్షులవరుసయే కాంచీగుణముగఁ గలది" దీనిని తెలిఁగించిన విధ మిట్లున్నది:

"కలితోర్మిస్తనితద్విజ ప్రకరమే కాంచీగుణంబై తగక" "స్ఖలితసుభగముగ సర్పించినదియు, దర్శితావర్తనాభియు, అగు దీని తెలుఁగు "స్ఖలితాంచత్సుభగ ప్రవృత్తినుడి నాఁగక నాభి కన్పండువౌ" అనునది. ఎంత సరసముగఁ దెల్గింపఁ బడినదో చిత్తగింపుఁడు.

౩౪—వ పద్యము—"ఇచటఁ బ్రద్యోతుని ప్రియదుహితను వత్సరాజు హరించెను" "చనెఁ బ్రద్యోతను నన్గుఁగూఁ తుఁగొని యిచ్చట వత్సరాజియ్యెడక" ఇది మూలమునకు సరికాదు. "ఇచట నా ప్రద్యోతరాజుదేయగు బంగారపు తాటిచెట్లవన ముండెడిది" "కనకంబాతని తాళవృక్షవనముక గ్రాసెక గదా యిచ్చటక" అతని దనఁగా వత్సరాజుదా? లేక ప్రద్యోతునిదా? వీరి రచన వత్సరాజు దనియే చెప్పుచున్నది. "ఇచట నలగిరి—(అనఁగా ప్రద్యోతుని కింద్రుఁ డిచ్చిన యేనుఁగు) మదము వలన స్తంభమును పెల్లగించి యెగిరి భ్రమణము చేసినది" "పనికక గంబముఁ బీకి యానలగిరి ప్రాంచద్ద్విపంబిక్కడక" పనికక=ఆగ్రహించెను—అని నిఘంటు. ఆనలగిరి—ఏనలగిరి? ప్రాంచద్ద్విప మేమిటో? మూలము నర్థ మెట్లున్నది—వీరి తెనుఁ గెట్టున్నది? మూలస్థ కిలార్థమును వీరు గైకొననే లేదు. "ఇట్టివైన కథలచేతను, వెనుకఁజెప్పఁబడినకథల నెఱిఁగిన జనము దేశాంతరమునసుండి వచ్చిన బంధువులను వినోదింపఁజేయుచుండును "కనుమం చానతబంధుకోటికిడు నానందం బభిజ్ఞుం డటక" దీనితో పద్యము సరి.

౩౬ వ పద్యము—"బంధుప్రీతి" యను మూలమునకు" బంధురతి సరి గాదు. మఱియు "కేశసంస్కారధూపము" లని కాళిదాసుగా రనఁగా "కేశధూపము" లని వీ రన్నారు.

౩౭ వ పద్యము—"తను ప్రభువైన నీలకంఠుని యొక్క మెడయొక్క కాంతివంటి కాంతిగలవాఁడ వను కారణమునఁ బ్రమథుల చేతను ఆదరముతోఁ జూడఁబడుచున్న వాఁడవై పావనమును, కలువలపుప్పొడియొక్క పరిమళము గలదియు, జలక్రీడాసక్త లయిన యువతుల స్నానద్రవ్యములచేతను పరిమళము గలదియు నగు గంధవతీనది వాయువులచేతను కదల్పఁబడిన యుద్యానముగలదియు నగు త్రిభువనగురుఁడగు చండీశ్వరునిస్థానము నుగూర్చి పొమ్ము" ఇది మూలము నర్థము. దీనికి వీరి తెలిఁగింపిట్లున్నది "ప్రమథులు భర్తకంఠపుప్రభక గలఁపించుట నిన్ను నాదరం, బమరఁ గనక, త్రిలోకపతి యంబికా నాథుని పుణ్యధామ మేఁగు; ముపవనిక గదల్చు నటఁ, గ్రొందోవ పుప్పొడి వల్చు వారికేళిమతులస్నానపుక వలపు లిబ్బులు గంధవతీసమీరముల్" మూలార్థమునకును తెనుఁగునేఁతకును గల భేదమును చదువరులే తెలిసికొని సంతసింతురుగాక;

౩౮ వ పద్యము—"శ్లాఘనీయమైనశూలియొక్క సాయంకాలపుఁ బూజయందలి ఢక్కా వాద్యమును గలుగఁజేయుచున్న వాఁడై కొంచెము గంభీరము లయిన యుఱుములకుఁ బూర్ణమయిన ప్రయోజనమును పొందఁ గలవు" అని మూలార్థము. దీనికిఁ దెనుఁగు "కడు శ్లాఘ్యంబౌ మహాదేవు నయ్యెందంపుక గడసంజపూజఁ బటహోహ్లాదంబునక గూర్చుచుక బొందంగల్గుదు మంద్రగర్జలకు సంపూర్ణంపు సాఫల్యముక" అని యున్నది. భేదమేమేని యున్నచోఁ జదువరులే తెలిసికొందురు.

౩౯ వ పద్యము — "ఆ సంధ్యాపూజ యందుఁ భాదన్యాసములచేతను ధ్వని చేయుచున్న మొలనూళ్లు గల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారున్ను విలాసముచేతను కంపింపఁచేయఁబడినవియు, కంకణమణులకాంతిచేతను ఖచితములయిన (చామర)దండములు గలవియు నగు చామరములచేతను బడలికనుచెందిన హస్తములు గలవారును అగు వేశ్యలు నీకలన నఖక్షతముల యందు సుఖకరములు లేక సుఖహేతువులుఅయిన వర్షము యొక్క మొదటిచినుకులను పొంది నీయందు మధుకర శ్రేణిదీర్ఘములయిన కటాక్షములను విడువఁగలరు” ఇట్లు మూలమునర్థమై యున్నది. దీనికి వీరు రచించినపద్య మిట్లున్నది—“ఆవేళల మొలనూళ్లు మ్రోఁగఁ బదవిన్యాసంబుచే, లీలమై వీవఁగ రత్నపుకాంతి గ్రమ్మపిడులన్ వింజామరల్ చేతు లెంతే వాడన్, గణికల్ నఖక్షతములన్ నీవానతొల్చుట్లు సౌఖ్యావేశం బిడఁబన్ను) నీకడకు దీర్ఘాపాంగభృంగావళిన్” “మధుకర శ్రేణిదీర్ఘములయిన కటాక్షములను”అని కాళిదాసుగారనఁగా, వీరు “దీర్ఘాపాంగ భృంగావళిన్” అన్నారు “రత్నపుకాంతిగ్రమ్మపిడులన్ వింజామరల్ చేతులు” అన్వయక్రమమెట్లో నాకుఁ దోఁచలేదు.

౪౧ వ పద్యము—“ఆయుజ్జయినియందు రాతిరి ప్రియుని యింటికిఁ బోవుచున్న స్త్రీలకు, సూచిభేద్యములయిన చీకట్లచేతను అడ్డగింపబడిన దృష్టిప్రసారము గలదైన రాజమార్గమందు, బంగారముయొక్క ఒరయిక గీఱవంటి దీప్తిగలదైన మెఱుపుచేతను దారిని చూపుము. వానచేతను,ఉఱుములచేతను ధ్వనిచేయువాఁడవుకాకుము. వారు భీరువులు” ఇట్లు మూలము ననుసరించిన యర్థము. దీనికి వీరిట్లు పద్యము రచియించియున్నారు. “రమణుని జేహసీనుకట రాతిరి యేగెడు చెల్వకోటికన్ బ్రమొదవ నూచి భేద్యతిమిరప్రతిరుద్ధవిలోకరాజమార్గముఁగనకోల్ల సన్నికషకల్పతటిల్లతచేతఁ దెల్పు; వర్షమునను గర్జలన్ విమతరావము సల్పకు; భీరువుల్ సుమా.”రెంటతారతమ్యమును పాఠకులే తెలిసికొనుదురుగాక!

౪౩ వ పద్యము—మూలమున “ప్రణయిభిః” అని యుండఁగా వీరు “కాముకు” లన్నారు. కావున “పదప్రయోజనిక” లోనిభావము వీరికి రాలేదు. మఱియు, “ఆతఁడును పద్మినియొక్క కమలవదనమున నుండి హిమాశ్రువును శమింపఁజేయుటకై ప్రత్యాగతుఁడై నీవు కరరోధము చేసినవాఁడ వగుచుండఁగా, అధికవిద్వేషము గలవాఁ డగును” ఇట్లు మూలార్థము. దీనికి “అతండు పద్మినిన్ దనుకలిఁ దీర్పఁ దామరలి, తామరమోముహిమాశ్రుధారఁ బుచ్చు; నిజకరాళి కడ్డ మగుచో నతఁ డొందు నమందరోషముల్” అని వీరి తెనుఁగు. ఇందలి తనుకలిపదమున కర్థమేమో నాకుఁ దెలియలేదు. నాయొద్దనున్న “లక్ష్మీనారాయణీయ” మనునిఘంటువులో ఆపదము లేదు. “అనల్పాభ్యసూయుఁడు=అధికద్వేషుఁడు” అని యర్థము వ్రాసియుండగా వీరు “అమందరోషము” అని వ్రాసియున్నారు. మూలమున “సోఽపి” అని ఉండగా “అతండు, అతఁడు” రెండుమార్లన్నా రెందుకు?

౪౪ వ పద్యము—“గంభీరయనెడి నదియొక్క, చిత్తమువలెఁ బ్రసన్నమయిన నీటను, స్వభావముచేతనే సుందరమయిన నీప్రతిబింబ శరీరమేనియుఁ బ్రవేశము నందగలదు...ఇది మూలార్థము. దీనికి చిత్తంబున్ జలముల్ బ్రసన్నమగుచున్ జెల్వొందు గంభీరలో హత్తున్ నీసహజప్రకృష్టమగు ఛాయారూపమేన్;” అని వీరి తెలుఁగు. ఏమితెనుఁగో? ఏమా? ధ్వనితమగు నర్థముకూడ మూలముతోఁ జేర్చినారుగా! “ప్రకృతిసుభగము.” దీనికి “సహజప్రకృష్టము” సరియైనది కాదు. “దుర్వ్యత్తిన్” దీనికి మూలము లేదు.

౪౫ వ పద్యము—“హరించియు” యు ఎందులకో! “జ్ఞాతాస్వాదుఁ డెవఁడు వివృతజఘనను విడుచుటకు సమర్థుఁ డగును?” ఇది మూలార్థము. దీనికి “ఏరసవేది వలంతి యౌను గన్పట్టఁగ నీలవేణిజఘనంబు, రయంబునఁ బాసి పోవఁగన్” అని వీరు తెనిఁగించినారు గదా! ఇది సరియైన రచనయే యగునా అని సందేహము.

౪౭ వ పద్యము—“నియతవసతిం స్కందమ్= నిత్యసన్నిహితుఁడైన కుమారస్వామిని” అను దీనికి “కాపుండ కందున్ కాపుండు కందు నని కాఁబోలును! అగుఁ గాక! అయినను నియతవసతికి, కాపుండు సరి కానే కాదు. మఱియు, స్వర్ణదిగాని స్వర్నది గాదు. (“స్వర్ణదీసురదీర్ఘికా” అమరము.) “ఆకుమారుఁడు, ఇంద్రునివి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యగు నేనలమొక్క రక్షణకొఱకు బాలచంద్రధారిచేతను వహ్నిముఖమునం దుంపఁబడినదియు సూర్యుని మించినదియు నగు తేజముగదా!" అనుమూలార్థమునకు "ప్రభవించెఁ గద, హవ్యభుజ్ముఖమునన్ బాలేందుభృత్సంభృతుం డభయాపాది మహేంద్రుసేన, కతఁ డత్యాదిత్యతేజుండు నై" అనెడి వీరి తెనుఁగురచనము సరియైనదిగా దని స్పష్టపడుచునే యున్నది.

౪౭ వ పద్యము—"పుత్రప్రేమ్ణా=పుత్రస్నేహముచేతను" అని మూలమై యుండఁగా, వీరు "పుత్రరతిన్" అన్నారే! శివశివా! ఎక్కడనైనను తల్లికిఁ గొడుకునందు రతి యుండునా? పద్యము రచించు నాన్నమన్న సంబరమే కాని యౌచిత్యము చూచుకొన నక్కఱ లేదా? ప్రేమ వేఱు, రతి వేఱు, అని మాత్ర మెఱుఁగరా? ఏల యిట్లు ప్రయోగించినారో? వారియభిప్రాయ మెక్కడ నెట్టిదో? పరబుద్ధి యప్రత్యక్షము గదా? ఏమయినను వెనుకటి "బంధురతి" ఈ "పుత్రరతి" రెండునుగూడ ననుచితప్రయోగములే అని నామతము.

౪౯. వ పద్యము—"వీణిభిః=వీణలు గలవారగు, సిద్ధద్వంద్వైః=సిద్ధమిథునములచేతను" అను దీనికి "వైణికసిద్ధదంపతుల్" అని వీరి తెన్గు. కాని కాళిదాసుగారు వీణలు గలవా రని యర్థ మిచ్చు "వీణిభిః" అను పదమును ప్రయోగించినారు. వీరో "వైణిక" అన్నారు. వీణలు దగ్గఱ లేకున్నను వైణికులు గావచ్చును. కనుక నిది సరియైన తెలుఁగు గాదు. మఱియు, "సురభితనయాలంభజామ్" అను పదమునకు "సురభిభవేష్టిజంబు" సరియైనది గాదు.

౫౦ వ పద్యములో—"క్షత్త్రప్రధనపిశునమ్=రాజులయుద్ధమునకు సూచకమైన" అనుపదమునకు "క్షత్రియసమితైప్రశున్య విభ్రాజి" అని వీరి తెలుఁగు. మూలము మించిపోయినది. "అర్జునుఁడు నిశితబాణ సహస్రములచేతను రాజులముఖములను, ధారాపాతములచేతను కమలములను నీవువలె నభిముఖముగా వర్షించినాఁడు" ఇదిమూలార్థము. దీనికి "ధారావృష్టిన్ నినుఁబోలి, గాండివి మహారాజన్య వక్త్రాబ్జముల్ తా వాలంపఱవాన ముంచెన్" అనునది వీరి తెలుఁగు. ఇందు మేఘుఁడు కమలములకభిముఖముగా ధారాపాతములచే వర్షించినాఁ డన్నది వచ్చునా? మూలములో ముఖములు వేఱుగాను, కమలములు వేఱుగాను చెప్పఁబడినవి గాని, వీరు అది యంతయు సమాసము చేసివేసినారు. పాడయినది.

౫౩ వ పద్యము—"సమరవిముఖుఁడైన లాంగలి" అనుదానికి "కయ్యమునకుఁ జెడమో మిడినట్టిసీరి" యనునది సరియైనదిగాదు. "అభిమతరసామ్=అభీష్టస్వాదను" దీనికి "అభీష్టరుచ్యను" సరిగాదు. సరస్వతికి భిన్నవిశేషణమువలన నేమేనియుఁ బ్రయోజన మున్నదా?

౫౪ వ పద్యము—"ఆకురుక్షేత్రమునను౦డి కనఖలపర్వతసమీపమందు శైలరాజావతీర్ణయు, సగరుని కొడుకుల స్వర్గసోపానపంక్తియు నగు జాహ్నవినిచూచి పొమ్ము" ఇది మూలార్థము. దీనికి "కనఖల మేఁగి, పొంతఁ గనఁగా నగు నాగిరినాయకావతీర్ణ నవఘుజహ్నుకన్య, సగరప్రభుపుత్త్రులు నాకమెక్కు సోపానములపంక్తి" అని వీరి తెనుఁగు. రెండును సరిగఁ జూచినవారికి భేదము తెలియకపోదు. ఇది శ్లోకపూర్వార్థము. ఇంక నుత్తరార్థము—"ఏ జాహ్నవి గౌరియొక్క ముఖమునందలి భ్రూభంగకరణమును నురుగులచేతను నవ్వినవలె (శిరోమాణిక్యభూతుఁడైన) చంద్రునియందు లగ్నములైన యలలనెడి హస్తములు గలది యగుచు శంభుకేశగ్రహణమును చేసినదో" అనునది. "ఫేనములఁ బార్వతిభ్రూకుటి గేలిసేయుతీఱున, శశి నూర్మికేల్ తగుల రుద్రుని జూటముఁ బట్టుకొనెన్ చెలిన్" అని వీరి తెనుఁగు.

౫౫ వ పద్యము—"ప్రవాహమునందు సంక్రమించుచున్న నీ ప్రతిబింబముచేతను" అనుదానికి "ప్రవాహములోఁ జొరు నీదుచాయచేన్" అని తెనిఁగించినారు గాని "చొచ్చు" ధాతువునకు "జొరు" ఎప్పుడాదేశమగునో గమనించినవారుగాను. కనుకనే "చొచ్చు"నకు "చొరు" అన్నారు. "సూ. అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరం బగునపుడు కారా చొరు చూడు లగు." బాలవ్యాకరణము-క్రియాపరిచ్ఛేదము.

౫౬లో—"ఉత్తములసంపదలాపన్నులయార్తి నివారించుటయే ప్రయోజనముగఁ గలవిగదా!" దీని

తెనుఁగు "ఉదాత్తులసంపద లార్తరక్షకే" అనునది. కాళిదాసుగా రన్ని యక్షరాలతోఁ జెప్పినదానిని వీరు చాలఁ గొలఁదియక్షరములతోనే చెప్పఁగలిగినారు. సంస్కృతము సంస్కృతమే; తెనుఁగు తెనుఁగే!

౪౮ వ పదములో — "నిష్ఫలములయిన పనుల యందుఁ బ్రవర్తించువా రెవరు తిరస్కారపదము కాకుందురు?" అనుదానికి "ఎంతవా రయ్యును నిష్ఫలం పుఁబను లంట తిరస్కృతి నంద కుందురే." అనునది తెలుఁగు. ఎంతవా రనునది మూలము గాదు. ఎవరనునదియే. ఇది నాస్థూలదృష్టిని గావించిన విమర్శనము. ఎట్లో యింతవఱకుఁ బూర్వమేఘమును ముగింపఁగల్గితిని. ఇఁక నుత్తరమేఘము నాగామిసంచికలోఁ బూర్తిగ విమర్శించి కృతార్థుఁడ నగుటకై భారతి యనుగ్రహించును గాక!

పు. సూ. నా.

---

## మూన్ బీమ్స్

(Moon-Beams.)

క్రౌనుసైజు. ౩౨ పుటలు.

గ్రంథకర్త: వి. యన్. భూషణ్ గారు.

ప్రకాశకులు: దియూత్ ఆఫ్ ఏషియా సొసైటీ (The Youth of Asia Society), మచిలీపట్టణము.

ఇది ఆంగ్ల ఖండకావ్యముల సంపుటము. చిత్తశుద్ధితో, స్వాభావికమును, మనోజ్ఞమును భావనతో, సంజులమగు శైలిలో శ్రీభూషణ్ గారు ఈ చిన్నికావ్యములు రచించినారు. గ్రాటిట్యూడ్ (Gratitude), వాయిసెస్ (Voices), టు ఎ జాస్మిన్ (To a Jasmine) మున్నగుకావ్యములు వీరి భాషాసంస్కృతికి, రచనాలాలిత్యమునకు, విశాలాభిరుచికి నిదర్శనములు. రసానుభూతికి తావలమగు హృదయకేంద్రమునుండి ఆవేశము సమగ్రముగ స్ఫురింపజేయు యత్నము వీ రింకను చేయవగును. కఠినపదప్రయోగాభిలాషమును తమకు సహజమగు సౌకుమార్యప్రియతకు ఇంకను లోబఱుచుకొనుట మెఱుగు.

కొం. జ.

---

## కమలావాచకములు-ఐదవతరగతి

ఈవాచకమునుగూర్చి చెప్పవలయునన్న వాచకమంత చెప్పవలసియుండును. ఇంతకు మున్ను భారతియందు ప్రకటితములయిన ౨, ౩, ౪ తరగతుల వాచకముల విమర్శనములే యీ కమలావాచకముల యోగ్యతను, ప్రయోజనమును ఆంధ్రలోకమునకు తెలియజేసినవి. వానికి తరువాతిది వానికి 'అన్న'యే కాన దీనినిగూర్చి విశదింప బనిలేదు. తమతమ బాలబాలికల విద్యాభివృద్ధి నాకాంక్షించు నాంధ్రమహాశయు లిట్టి వాచకముల ప్రచారము నరికట్టు ప్రయత్నమునకు బూనుట విధి. పాఠ్యగ్రంథనిర్ణయ సంఘమువారును బాలబాలికల విద్యాభివృద్ధివిషయమున గల తమబాధ్యతను చక్కగా గుర్తించి ఉచితము లగువానినే పాఠ్యగ్రంథములుగా నిర్ణయింపవలెను. లేకున్న సంఘమువలని ప్రయోజనము క్రమముగా శూన్యమగుటయే కాక తత్సంఘ నిర్వహణమునకగు వ్యయము వ్యర్థమగును. గ్రంథరచయితలును తమకు గల సామర్థ్యమును తెలిసికొనక అవకతవకగా గ్రంథములను-పిల్లలకొఱకయిన వానిని-రచియింపకుండుట శ్రావ్యము.

—భారతి.

---

# గ్రంథస్వీకారము

(౧) పాండురంగ భక్తవిజయము

రాయలు సైజు. ౨౪౨ పుటలు. వెల ౬ రు.

గ్రంథకర్త: కోయిల్ ధనాల దేవరాజదాసులవారు.

(౨) శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు

క్రౌనుసైజు. ౫౭౨ పుటలు. వెల ౩ రు. పరిశోధనకర్త: విద్వాన్ కె. వి. శ్రీనివాసయ్యంగారు.

(3) సంగీత సుధాంబుధి

క్రౌనుసైజు. ౪౬౧ పుటలు. వెల 3 రు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౪) శ్రీత్యాగరాజ హృదయము

1. క్రౌను సైజు. సంపు ౧. ౫౩౫ పు. వెల ౪ రు.
2. ,, ౨. ౫౧౨ ,, ,,
3. ,, 3. ౫౫3 ,, ,,

గ్రంథకర్త: విద్వాన్ కె. వి. శ్రీనివాసఅయ్యంగారు.

పై గ్రంథములకు ప్రకాశకులు: యమ్. ఆది అండ్ కంపెని, 11/286, ఎస్ప్లనేడు, మద్రాసు.

---

(౧) వీరపూజ

ప్రథమభాగము: భారతశౌర్యము. క్రౌను సైజు. ౧౪౯ పుటలు. వెల ౧ రు.

(౨) శ్మశానవాటిక

నవల. క్రౌను సైజు. ౨౧౭ పుటలు. వెల ౧ రు.

(3) వారకాంత

నాటకము. క్రౌను సైజు. ౯౬ పుటలు. వెల ౮ అ.

పై మూటికి

గ్రంథకర్త: పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

కలాభివర్ధనీ పరిషత్తు, రాజమహేంద్రవరము.

---

ఆంధ్రవచన శ్రీకల్కిమహా పురాణము

క్రౌను సైజు. ౧3౫ పుటలు. వెల రు. ౧-౪-౦.

గ్రంథకర్త: కే. విజయ రాఘవయ్యంగారు, మేనేజరు, మ్యునిసిపలు ఆఫీసు, తాడిపత్రి.

---

బాలకృష్ణ వాచకపుస్తకములు:

మొదటి వాచకము

క్రౌను సైజు. ౫౪ పుటలు. వెల 3 అ.

గ్రంథకర్త: దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు.

ఆంధ్రపత్రికా కార్యాలయము, 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

---

స్వప్నలబ్ధాఽద్వైతబోధ

క్రౌను సైజు. మొదటిభాగము ౧౯౧ పు. రెండవ భాగము ౪౭ పుటలు. ఒక్క సంపుటముగా. ౫ అణా బిళ్లలు గ్రంథకర్తకు పంపిన ఉచితముగా ఒక్కొక ప్రతి పంపబడును.

గ్రంథకర్త: నిమిషకవి వెంకయ్యగారు, మోడేకుర్రు, రాజోలు తాలూకా, తూర్పుగోదావరి.

---

జన్మాంతరము

క్రౌను సైజు. ౪౬ పుటలు. వెల 3 అ.

శ్రీ అభేదానందస్వామి ప్రణీతము.

అనువాదకులు: తత్వానందస్వామి. ప్రకాశకులు: కందేవు నరసింహముగారు, శ్రీసనాతనగ్రంథమాల మేనేజరు, క్రాపపోస్టు, కొల్లూరు మార్గము, గుంటూరు జిల్లా.

---

ఆనందాబాయి

చరిత్రాత్మకమగు వచనరూపకము. డెమ్మిసైజు. ౧3౬ పుటలు. వెల ౧౨ అ.

గ్రంథకర్త: పప్పు సూర్యనారాయణగారు,

బోర్డు హైస్కూలు ఉపాధ్యాయులు, పాలకొండ, విశాఖపట్టణం జిల్లా.

---

మారుతి విజయము

అయిదంకముల నాటకము. డెమ్మిసైజు. ౮౦ పుటలు. వెల ౧ రు.

గ్రంథకర్త: జీలపాటూరు సుబ్బరావు గారు.

ప్రకాశకులు: రేణబాల సుబ్బరావుగారు, 67, తులసింగ పెరుమాళ్ కోవెలవీథి, తిరువళిక్కేణి, మద్రాసు.

---

శ్రీరామపాదుకా పాలనము

నాటకము. డెమ్మిసైజు. ౧౦౭ పుటలు. వెల ౧ రు.

గ్రంథకర్త: గుండు లక్ష్మణ శాస్త్రిగారు, వేళంగి, కాకినాడ తాలూకా, తూర్పు గోదావరి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ప్రేమ

క్రౌనుసైజు. ౬౩ పుటలు. వెల ౮ అ.

గ్రంథకర్త: అశ్వినీకుమారదత్తుగారు.

అనువాదకుడు: వెలువోలు సీతారామయ్యచౌదరి గారు, శ్రీభాషా సంజీవినీసంఘము, అమృతలూరు, తెనాలి తాలూకా.

---

## శ్రీవేంకటపతిదేవ మహారాజు

క్రౌనుసైజు. ౪౮ పుటలు. వెల ౧ రు.

గ్రంథకర్త: టి. శివశంకరంగారు, పెనుగొండ.

---

## ముప్పది యిద్దఱు మంత్రుల చరిత్రము

క్రౌనుసైజు. ౧౨౦ పుటలు. వెల ౧౨ అ.

గ్రంథకర్త: కనుపర్తి మార్కండేయ శర్మగారు,

స్వధర్మ ప్రకాశిని, బృందావనం, కీల్పాకు, మద్రాసు.

---

## గ్రంథ విమర్శనా రత్నమాల

డెమ్మిసైజు. ౧౬౨ పుటలు. వెల రు ౧-౮-౦.

గ్రంథకర్త: యేలూరి బుల్లి కొండల రాయుడుగారు,

గవర్నమెంటు మేడపాడు, కాకినాడ తాలూకా, తూర్పు గోదావరి.

---

## ప్రబంధోపకథావళి

క్రౌనుసైజు. ౮౮ పుటలు. వెల ౯ అ.

గ్రంథకర్త: చింతలపూడి శేషగిరిరావు గారు,

ఎడ్వర్డు హైస్కూలు, పొన్నూరు, గుంటూరుజిల్లా.

---

## విఘ్నేశ్వర చరిత్రము

క్రౌనుసైజు. ౮౮ పుటలు. వెల ౧౨ అ.

గ్రంథకర్త: గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు,

ప్రకాశకులు: ఆంధ్రావళి గ్రంథమాలా కార్యదర్శి, యలమంచిలి.

---

## అంబరీష విజయము

డెమ్మి సైజు. ౬౫ పుటలు. వెల ౧౨ అ.

గ్రంథకర్త్రి: గుడిపూడి ఇందుమతీదేవి గారు.

c/o గుడిపూడిరామారావుగారు, గాంధీనగరము, బెజవాడ.

---

## నిషా

క్రౌను ౩౨ సైజు. ౩౨ పుటలు. వెల ౧ అ.

గ్రంథకర్త: కె. వెంకటరమణాచార్యులుగారు, తాడిపత్రి.

---

## దశరథనందన శతకము

గ్రంథకర్త: పొత్తూరి రాఘవకవిగారు.

విశాఖపట్టణం శ్రీశారదాముకుట ముద్రాక్షరశాలలో ముద్రితము.

---

## జానకీపతి శతకము

గ్రంథకర్త: కొవ్వలి వెంకట రాజేశ్వర రావుగారు,

c/o భారతీ ముద్రణాలయము, బరంపురం, గంజాం.

---

## చెన్నకేశవ శతకము

వెల ౩ అ.

గ్రంథకర్త: వంకాయలపాటి రామకోటయగారు,

గొట్టిపాడు, ప్రత్తిపాడు పోస్టు, గుంటూరుజిల్లా.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సిద్ధాంత పత్రిక

'శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులగారి పరంపరాగతమత నిర్ణయంబునకై, శ్రీమచ్చతుష్షష్టికళాత్మకాలంకార సార్వభౌములగు గుణ్ణం వెంకన్నశాస్త్రులగారిచే విరచితంబైన శ్రీ ముఖవ్యాఖ్యాగ్రంథ పఠనకుగాను శ్రీమదేకాంబరేశ్వరాలయిమున జేరిన, శ్రీ చెన్నపట్టణసిద్ధాంత శైవ విద్వన్మహాసభయందు అగ్రాసనాధిపత్యము వహించిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యోభయ వేదాంత ప్రవర్తక శ్రీవేదాంత రామానుజ జియ్యగార్లగారి సిద్ధాంత పత్రిక.'

---

## గురురత్న మాలికా

(సంస్కృతము.)

శ్రీసర్వజ్ఞ వతాశివ బ్రహ్మేంద్రకృతము.

కామకోటిపీఠము, కంచి.

---

## స్వరాజ్ కాన్స్టిట్యూషన్

(Swaraj Constitution)

క్రౌనుసైజు. ౧౬ పుటలు. వెల ౪ అ.

గ్రంథకర్త: కె. యస్. వెంకటరమణిగారు.

శ్వేతారణ్యాశ్రమము, మైలాపూరు, మద్రాసు.

'రినేసెంట్ ఇండియా' (Renascent India) అను గ్రంథమునుండి పునర్ముద్రితము.

---

## తామ్రశాసనములు

(ఆంగ్లము.) కామకోటిపీఠ శ్రీ శంకరాచార్య స్వాములవారికి చెందినవి.

(Copper-Plate Inscriptions belonging to the Sri Sankaracharya of the Kamakoti Pitha)

రాయలుసైజు. ౧౩౪ పుటలు.

గ్రంథకర్త: టి. ఎ. గోపీనాథరావు గారు, 'సూపరింటెండెంట్ ఆఫ్ ఆర్కియాలజీ', తిరువాన్కూరు రాజ్యము.

## ఉషాపరిణయ నాటకము

(సంస్కృతము.) డెమ్మిసైజు. ౮౮ పుటలు.

గ్రంథకర్త: గుండు రామస్వామిశాస్త్రి గారు.

౧౯౧౦ లో ప్రకటితము. దొరకు చోటు: గుండు లక్ష్మణశాస్త్రిగారు, వేళంగి, కాకినాడ తాలూకా, తూర్పుగోదావరి.

---

## శంకరాచార్య ది గ్రేట్ అండ్ హిజ్ సక్సెసర్స్ ఇన్ కాంచి

(Sankaracharya the Great and His Successors in Kanchi)

క్రౌనుసైజు. ౧౦౬ పుటలు. వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త: యన్. వెంకటరామన్, యమ్.ఏ, ప్రొఫెసర్ ఆఫ్ ఫిలాసఫీ, మహారాజావారి కళాశాల, విజయనగరము.

---

## పారిజాతాపహరణము

నంది తిమ్మనార్యకృతము. నాగపూడి కుప్పుస్వామయ్యగారు రచియించిన పరిమళోల్లాసమను వ్యాఖ్యానముతో గూడినది.

డెమ్మిసైజు. ౪౦౦ పుటలు. వెల రు. ౩ ఆంధ్రపత్రికా కార్యాలయము, తంబుశెట్టివీథి, చెన్నపురి.

---

# పత్రికలు

## ది జర్నల్ ఆఫ్ ది మ్యూజిక్ ఎకాడెమీ మద్రాసు

The journal of the Music Academy, Madras

త్రైమాసిక పత్రిక

౧వ సంపుటము—౧వ సంచిక, జనవరి, ౧౯౩౦, మాకార్యాలయము చేరినది. క్రౌనుసైజు. ఈసంచిక ౮౧ పుటలు. సంపాదకులు: టి. వి. సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్. ప్రకాశకులు: ది మ్యూజిక్ ఎకాడెమీ, ౩౨౩, తంబుచెట్టి వీథి, జి. టి. మద్రాసు. వార్షిక మూల్యము ౪ రు. విడిసంచిక వెల రు. ౧ అ. ౪



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




శ్రీ యస్. యం.
కామాక్షీసుందరశాస్త్రిగారు



౧. శ్రీ యస్. యం.
కామాక్షిసుందర శాస్త్రిగారు



౨. కీచకపాత్రధారి యగు శాస్త్రిగారు

శ్రీ శాస్త్రిగారు చెన్నపురి ఆంధ్రమహాసభ నటకులలో నగ్రగణ్యులు; ఆ సభవారు ప్రదర్శించు నన్ని నాటకములలో నాయక ప్రతినాయకపాత్రముల నభినయించుచుందురు. అవి కీచక, హిరణ్యకశిపు, అర్జున, పాపారాయ,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. కీచకుడు సైరంధ్రిని వేడుకొనుట
సైరంధ్రి: శ్రీ. టి. యస్. గోపాలస్వామి అయ్యంగారు.
వీరు చెన్నపురిఆంధ్రసభ నటకులలో నాయికా పాత్రము
లను గ్రహించుచుందురు.



శ్రీ ఎం. రామలింగశాస్త్రిగారు కృష్ణుడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుర్గాదాస, నారద, రామదాసాదిపాత్రములు. వీరు చెన్నపురమునందలి 'ఇంజనీరింగు' కళాశాలలో సహాయాధ్యాపకులుగా నున్నారు. వీరుతమకుగలనాటకకళాభిమానమునుపురస్కరించుకొని ఆంధ్రనాటకసభాస్థాపకులలో నొకరుగ నుండి, ఇట్లు తరచునాటకములయందు నటకులయి చెన్నపురి ఆంధ్రసభకు వన్నె దెచ్చుచుండుట ప్రశంసింపదగినది. వీరు అరవ నాటకములయందును పాత్రధారణమును గావించుచుందురని ప్రతీతి. వీరి శివాజిపాత్రము మెప్పువడసి వెనుక వీరికొక బంగారు పతకమును సంపాదించినదట.

వీరు ధరించు పాత్రములకు వీరి ఆకృతి యొప్పియుండును. వీరు బాగుగా నేర్చి యలవరచుకొన్న పద్యములను, పాటలను తప్ప తక్కిన వచనభాగమును సరిగా నుచ్చరింపజాలకుందురు. చిరకాలమునుండియు నాంధ్రనాటకములయందు ప్రధాన పాత్రములను ధరించుచుండు శాస్త్రిగారీలోపమును దీర్చికొనియుండవలసినది. వాచికాభినయ మిందువలన కొరతపడును. వీరు తరుచు రంగమున పాటలను పాడుచుందురు. రససిద్ధికి భావప్రకటనము ప్రధానము. ప్రత్యేక ప్రయత్నమునగాని బయలువెడలక భావప్రకటనమునకు భంగమును గలిగించు పాటలను వీరుజ్జగించుట మంచిది. మఱియు శాస్త్రిగారు పాత్రౌచిత్య పోషణముకంటె తమ యుత్సాహమునకు ప్రాధాన్యము నొసంగుచు నొక్కొక్కతరి సామాజికులను రంజింపజాలకుందురు. నటకుడు తాను, తాను గాక వేరొక వ్యక్తిగా మారియుండుటయు, తద్వ్యక్తి స్వరూపస్వభావాదులనే తాను చక్కగా ప్రదర్శించి రసికులగు సామాజికులను రంజింపజేయుట తనధర్మమనియు గుర్తించి ప్రవర్తించు టావశ్యకము.—భారతి.

### శ్రీ యం. రామలింగశాస్త్రి గారు

వీరు సుప్రసిద్ధు లగు నటులు; సంస్కరణాభిలాషులు. ఆంధ్ర నాటకరంగమును వంగ మహారాష్ట్రాదినాటకరంగముల వలె సంస్కరించి, అభివృద్ధి నందజేయవలయునను దీక్షతో కృషిసలుపు యావనోత్సాహులలో నొకరు. విద్యావంతులు. ఔత్తరాహ గానమునందు మంచిపరిచయము గలవారు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాయింట్లో పెండ్లి బాగుండేది—


పందిరి సిద్ధమై యుంటే —


మంగళ్లు మోసంచేయకపోతే—


సానులు సుందరంగా ఉంటే—


పెండ్లిపెద్దలు యుద్ధం చేయకపోతే—


ఆడంగులు నిందచేయకపోతే—


వంటలు బాగుండి ఉంటే—


అల్లుడు కట్నానికి సంతోషించి ఉంటే —


ఖర్చు తక్కువై యుంటే — — —

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

<u>ఆంధ్ర భారతకవితావిమర్శనము</u>: (ఆంధ్రగ్రంథమాల ౧౨-వ గ్రంథము) క్రౌను ౪౨౦ పుటలు. వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: కోరాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ.,

ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల; ౭, తంబుశెట్టివీథి, చెన్నపురి.

ఈ గ్రంథమునందలి విమర్శింపబడిన ఈ క్రిందివిషయములే దీని ప్రశస్తిని వేనోళ్ల చాటుచున్నవి.

ఆంధ్రవాఙ్మయము ; ఆంధ్రమహాభారతము :

విమర్శనపద్ధతులు ఆంధ్రవాఙ్మయయుగములు ప్రాచీన దేశకాలపరిస్థితులు, చాళుక్యుల కాలమున నాంధ్రభాషాస్థితి, అహదనకరశాసనములోని తెలుఁగుభాగము, చాళుక్య భీమరాజు శాసనము, దీర్ఘాసిశాసనము, యుద్ధమల్లుని శాసనము, శిష్టభాష, జానుదెనుఁగు, భారతరచన-ఛందస్సామగ్రి, ప్రాచీన భాషాస్వరూపము-జన్యభాషలు.

మతస్థితి-వాఙ్మయము :

భారతరచన-అవతారికలు, నన్నయవైదికదృష్టికి నిదర్శనములు, నన్నయ తరువాతి కాలస్థితి, ఆరణ్యపర్వశేషపూరణప్రశంస, ఆరణ్యపర్వశేషమునందలి తిక్కన యనుకరణములు, తిక్కన భారతరచన, తిక్కన అద్వైతభావము, తిక్కన యవతారికలు, తిక్కన కవితావేశము.

తిక్కనార్యుని కళాప్రతిభలు :

విరాటపర్వకథ, అందలి వస్త్వైక్యము, పాండవప్రవేశము, శమీవృక్షముపై నాయుధనిక్షేపణము, బృహన్నల సారథిగాఁ గుదురుకొనుట, విరటునికొలువు-భీముఁడు, కీచకవధఘట్టము, కీచకవధానంతర విశేషములు.

భారతాంధ్రీకరణము—తిక్కన :

విరాటపర్వము—ప్రబంధలక్షణములు, మూలకథపై తిక్కనవేసిన యాంధ్రతాముద్ర, తిక్కనార్యుని వర్ణనలు, ప్రకృతివర్ణనలు, తిక్కన మనోవృత్తివివరణశక్తి, నాటకకళా చాతుర్యము, తిక్కన శృంగారవర్ణనలు, పాత్రపోషణరీతులు, రసపోషణరీతులు, నాటకరీతులు, తిక్కనార్యుని భాషాశైలులు, పూర్వోత్తరసందర్భములకుఁ జక్కనిపొందిక కల్పించుట, ఉపమాలంకార ప్రయోగము, సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁజేయు పదరచన, ఆంధ్రభాషా జాతీయప్రయోగ నైపుణ్యము, అర్థముమాఱిన ధాతువులు, పదజాలము, కారకవిశేషములు, ఉపసంహారము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెలువడినది ! కొలదిప్రతులుమాత్రమే వెలువడినది !!

త్వ ర ప డు డు.

# ఆంధ్ర వాఙ్మయ సూచిక

(ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలు — ఆంధ్రగ్రంథమాలలో ౧౧-వ పుస్తకము)

ఈ పుస్తకమున ౧౯౨౭-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకముల పట్టిక ఒకటి, ఆ పుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆయా విభాగములక్రింద వచ్చిన పుస్తకములకుపట్టిక ఒకటి, ఇంకా కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురమున ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగుపుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమయిన ప్రకాశకులపీఠిక ౧౦౮ పుటల పరిమితిగలది యీ పుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలోపుట్టిన పుస్తకములను, వానిలో ఇప్పటికి అచ్చయినవానినీ, కానివానినీ తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజుపుస్తకము, పుటలు ౬౨౦, మంచి కాగితములు, వెల మూడురూపాయలు మాత్రమే

అంచెకూలి కొనువారిదే.

# శతక మంజరి (భక్తిసంపుటము)

ఆంధ్రగ్రంథమాలలో మొదటి పుస్తకము

ప్రకాశకులు : కాశీనాథుని నాగేశ్వరరావు

ఈపుస్తకంలో వృషాధిపశతకము, సర్వేశ్వరశతకము, దేవకీనందనశతకము, ఒంటిమిట్ట రఘువీరశతకము, నారాయణశతకము, కాళహస్తీశ్వరశతకము, దాశరథిశతకము, రంగశాయి శతకము, రామతారకశతకము, రామచంద్రశతకము అనే పదిశతకాలు ఉన్నవి. ఒక్కొకశతకానికి దానిని విమర్శిస్తూ ప్రకాశకులు వ్రాసిన మంచిపీఠిక ఉంది. చాలా వ్రాతప్రతులతో సరిచూచి వాటిల్లోనుంచి తీసిన పాఠాంతరాలున్నూ ఎక్కింపబడినవి.

డిమ్మీసైజు ౨౯౯ పుటలు, మంచికాగితాలు, మేలు బైండు. వెల రు. ౧-౮-0.

ఈ శతకాలు ఒక్కొక్కటీప్రత్యేకం దొరకును. ఒక్కొకదాని వెల రు. 0-3-0.

## మేనేజరు : ఆంధ్రగ్రంథమాల,

6-7, తంబుశెట్టివీధి, జార్జిటవున్, చెన్నపురి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచప్రవృత్తియందు కపటనాటకప్రదర్శనమునకు గల ప్రతిభ సత్యప్రదర్శనమునకు గలుగకున్నది. మమకారాహంకారములకు గలప్రతిష్ఠ సత్యమునకు గలుగకున్నది. స్వార్థమునకు గల యవలంబనము త్యాగమునకు గలుగకున్నది. భోగభాగ్యములకు గల సమాదరణము ధర్మమునకు గలుగకున్నది. ధర్మక్షేత్రమునందు విజయు నావసించిన విషాదయోగము మహాసమ్మోహమును గలుగజేయుచున్నది. ప్రజలకు, నాయకులకు, వ్యక్తులకు, జాతులకు ధర్మనిరీక్షణము సంకుచితమై నిత్యమైన మానవధర్మము వికృతరూపమును దాల్చుచున్నది. కులధర్మము, జాతిధర్మము, స్త్రీధర్మము, పురుషధర్మము, వర్ణాశ్రమధర్మము, మతధర్మము, సంఘధర్మము, రాజ్యధర్మము మొదలగు ధర్మశాఖలు ప్రబలుచు నిత్యధర్మమును నావరించుచు ధర్మారాధనమును దుస్తరము చేయుచున్నవి. వ్యక్తులు, జాతులు భాగ్యభోగముల నుపార్జించుటకై ధర్మమును ధ్వంసము చేయుచున్నవి. ధర్మోపదేశములు పరుల కేర్పడుచున్నవి కాని, యుపదేశకుల కేర్పడుట లేదు. వ్యక్తులకును, కుటుంబములకును, జాతులకును స్వధర్మానుష్ఠానమునందు లక్ష్యము పోయినది; పరధర్మానుష్ఠానమునందు లక్ష్యము ప్రబలినది. చిన్నరాజ్యములందును, పెద్దరాజ్యములందును, స్వతంత్రరాజ్యములందును, పరాధీనరాజ్యములందును పరధర్మానుష్ఠానము ప్రతిష్ఠను బడయుచున్నది. సాంఘిక వ్యవస్థలు, రాజ్యాంగములు, పరిశ్రమలు, వాణిజ్యము స్వప్రయోజనమునకును, పరపీడనమునకును వినియోగపడుచున్నవి. ప్రపంచావృతమైన ప్రళయావస్థయందు శాంతిస్థాపనము దుస్తరముగ నున్నది. నానాజాతిసమితి, మహారాజ్యముల సమావేశములు స్వల్పప్రయోజనములకు వినియోగపడుచున్నను మహాప్రయోజనములకు నిరర్థకము లగుచున్నవి. యుద్ధనావలను నియమించుటకై లండనునగరమునందు సమావేశమైన వివిధరాజ్యముల సమావేశ మీ విషయమును సహస్రముఖములను బోధించుచున్నది.

* * * *

## సంగ్రామవ్యయము

ఐరోపామహాసంగ్రామానంతరము భావికాలమునందు సంగ్రామములు దుస్తరములని పండితులు నిర్ణయించిరి. వర్తమానకాలమునందు సంగ్రామసన్నాహములకై మహారాజ్యములు చేయుచున్న వ్యయము ప్రజలను నాశనము చేయుచున్నవిధమును ఫిలిపు స్నోడను గారు బట్టబయలు చేసిరి. ప్రపంచమునందు వివిధరాజ్యములందును పరిశ్రమలు పాడుపడుచున్నవి. ఆయురారోగ్యములు క్షీణించుచున్నవి. ఆహారము దుర్లభ మగుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంగ్రామసన్నాహ జ్వరము మాత్ర మభివృద్ధిని బొందుచున్నది. ఇంతవరకును మితిమీరి పెరుగుచున్న సైన్యవ్యయమునకును, నౌకాదళ వ్యయమునకును ఆకాశయానవ్యయము జతపడినది. గ్రేటుబ్రిటను గతసంవత్సరము నందు ఆకాశయానములకై 1,69,60,000 సవరనులను వ్యయము చేసినది. సంగ్రామసన్నాహములకై నిమిషమునకు 1,000 సవరనులను, సంవత్సరమునకు 52 కోట్ల సవరనులను గ్రేటుబ్రిటనువ్యయము చేయుచున్నది. ప్రపంచమంతయును 90 కోట్ల సవరనులను నౌకాదళమునకు వ్యయముచేయుచున్నది. నౌకాదళములను నియమించుట కేర్పడిన సమావేశమునందెవరికి వారు మినహాయింపును గోరుటయును, సమావేశము నిరర్థకమగుటయును జగద్విదితమైన విషయము. చేసిన ఆర్భాటమున కించుకైనను ఫలము గలుగలేదు. వాయువార్తలు, గంభీరోపన్యాసములు, ధర్మోపదేశములు, రాజసందేశములు దరిద్రమనోరథములుగ నంతమునొందినవి. సామ్రాజ్యములు పరరాజ్యములను పీడించుచు బలియదలచినంతవరకును రాజ్యములకును, ప్రపంచమునకును శాంతిసౌఖ్యములు దుర్లభములు. బ్రిటిషు రాజ్యనీతి వివిధప్రాంతములందును సంపూర్ణముగను మారవలసిన యవసరమును గ్రేటుబ్రిటను స్థితిగతులును, సామ్రాజ్యాంతర్భాగముల స్థితిగతులును విశదము చేయుచున్నవి. 'కౌపీనసంరక్షణార్థమయం పటాటోపః' అను నార్యోక్తిని గ్రేటుబ్రిటను స్వస్థలమునకువలెనే భరతవర్షమునకును సమన్వయము చేయుచున్నది.

*        *        *

భరతవర్షార్థికస్థితి

సామ్రాజ్యశాసనసభయందును, రాష్ట్రీయశాసన సభలయందును చర్చింపబడుచున్న కోశవ్యవస్థలు దేశము నావరించిన దుర్దశను విశదము చేయుచున్నవి. దేశాదాయమునందు 55 కోట్ల రూప్యములు సైన్యవ్యయమునకు వినియోగపడునపుడు దేశమునకు శుభస్థితి దుర్లభము. ఆదాయమునకు మించిన వ్యయ మెప్పుడును సంప్రాప్తమగుటయును, క్రొత్తపన్నులు వేయుటయును సహజావస్థలు. విదేశవస్త్రములు, చక్కెర, కిరోసినునూనె మీదను సుంకము వృద్ధిచేయుటకును, ఆదాయపు పన్నును వృద్ధిచేయుటకును సర్ జార్జి షూస్టరుగారు నిర్ణయించిరి. ఈ నిర్ణయమువలనను 410 లక్షల రూప్యము లధికముగ రాగలవు. సైన్యవ్యయమును తగ్గించుటయందు తెలిపిన సమాధానము యథార్థమైన సమాధానము గాదు. బ్రిటీషువస్త్రముల మీదను సుంకమును హెచ్చింపకుండుట బ్రిటీషు రాజ్యనీతి కనురూపముగ నున్నది. షూస్టరుగారు బ్రిటీషుప్రజల ప్రార్థనయని తెలుపుటకంటెను నిరంకుశప్రభుత్వపుటాజ్ఞ యని తెలుపుట యుక్తముగ నుండెగలదు. కోశవ్యవస్థలందు గారడివిద్యను చూపుటయందు కోశాంగమంత్రి సమర్థుడు. శక్తిలేని సామ్రాజ్యసభ షూస్టరుగారి నిర్ణయముల నంగీకరించుట యవసరము. భార



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీయ కోశవ్యవస్థలు బ్రిటీషు ప్రయోజనము లకు వినియోగపడునటులు భారతీయుల ప్రయోజనములకు వినియోగపడుట లేదని షూస్టరుగారు ప్రకటించిన ఆర్థికపత్రము విశదము చేయుచున్నది. దారిద్ర్యము ననుభవించుచున్న ప్రజలు పన్నులను, వ్యయమును తగ్గించుటవలనను లాభమును పొందగలరు కాని పన్నులను, వ్యయమును హెచ్చించుటవలనను లాభమును పొందలేరు. కేంద్రప్రభుత్వమునందువలెనే రాష్ట్రప్రభుత్వమునందును కోశవ్యవస్థలు ప్రజాభ్యుదయమునకు నిరుపయోగముగ నున్నవి.

చెన్నరాష్ట్రాదాయ మేటేటను నభివృద్ధిని జెందుచున్నను ప్రజాభ్యుదయమున కవసరమైన పను లభివృద్ధిని జెందుటలేదు. రాష్ట్రాదాయము 1928-29 వ సంవత్సరమునందు రూ. 18,08,13,360; 1929-30 నందు 18,75,88,000; 1930-31 నందు 18,47,24,800 మదింపు వేయబడినను హెచ్చుట సహజము. రాగల సంవత్సరమునందు వ్యయము 18,61,90,300: లోటు రూ. 14,65,500 మదింపు వేయబడినను ఆదాయము హెచ్చగుటయును, వ్యయము తగ్గుటయును సంభవము. నాలుగేండ్లయందు దాదాయము షుమారు నాలుగు కోట్ల రూప్యములు పెరిగినది. ఆదాయమునందు భూమిపన్ను, మద్యము, స్టాంపులు వృద్ధిని జెందుచున్నవి. భూమిపన్ను ఇదివరకే హెచ్చుగా నున్నను ముందు హెచ్చించుటకవకాశము లుండవని ఆర్థికసభ్యుడు పలవరించుట విచిత్రముగ నున్నది. 1929-30 యందు మద్యాదాయము, 59,639 వేల రూప్యములు: అంచనాకన్న 43 లక్ష లధికముగ వచ్చినది. రాగల సంవత్సరమునందును నధికముగా గలదను సూచనలు గలవు. శాసనసభ మద్యపాలన నిషేధమును జేయవలయునని తీర్మానించినది. వ్యవహారమునందు మద్యపానమనుదినము వ్యాప్తిని గాంచుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు 36 లక్షలును, మద్రాసు క్రైస్తవ కళాశాలకు కొన్నిలక్షలును మంజూరు చేయబడినవి. ప్రాథమిక విద్యావ్యాపనమునకు ద్రవ్యము లేకున్నది. జలాధారములను, మార్గములను, నీటివసతులను నభివృద్ధిచేయుటకై యేర్పాటులు జరుగుట లేదు. సంస్కరణములవలనను ప్రజావికాసమునకు ప్రయోజనము గలుగక పోయినను, ఖర్చులు మాత్రము హెచ్చుచున్నవి. ప్రజాదాయము నభివృద్ధి చేయుటకు సాధనములను ప్రభుత్వ మవలంబించుట లేదు. వ్యవసాయము, గృహపరిశ్రమలు, చేతిపనులు వృద్ధి చేయుటకు ప్రభుత్వము శ్రద్ధవహించుట లేదు. నానారాష్ట్రములందును ఈ దురవస్థనే ఆదాయవ్యయ వ్యవహారపరిస్థితులు విశదము చేయుచున్నవి. ఈ దురవస్థ కేవలము భరతవర్షమునకే గాక ప్రపంచములోని యన్నిరాజ్యముల నావహించి మిక్కిలి సంతాపమును గలిగించుచున్నవిధమును ప్రపంచపరిస్థితులు విశదము చేయుచున్నవి. భిన్నదేశములందు రాజ్యాంగసమస్యలు భిన్నరూపములను వెలయుచున్నను, ప్రజలను కృశింపజేయుచున్న



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యయభారసమస్యయె అన్నిరాజ్యములకును ప్రధానసమస్యగ నున్నది. భారతీయ స్వాతంత్ర్యసమస్యకును వ్యయభార సమస్యయె మూలకారణముగ నున్నది. గాంధిమహాత్ముడు సంస్కరింపగోరిన 14 విషయములును నీ సమస్యకే సంబంధించినవి. లాహోరు కాంగ్రెసు నిర్ణయించిన స్వాతంత్ర్య తీర్మానమునకును వ్యయభారసమస్యయె కీలకముగ నున్నది.

లాహోరు కాంగ్రెస్, స్వాతంత్ర్యనిర్ణయము

లాహోరునందు భరతవర్షము శాంతి మార్గమున పూర్ణస్వరాజ్యము సంపాదింపవలయునని కాంగ్రెసు నిర్ణయించినది. ఆ నిర్ణయమున కనురూపముగ శాసనోల్లంఘన ప్రస్థానమును నిర్ణయించుటకు సబర్మతీ సత్యాగ్రహాశ్రమమునందు ఫిబ్రవరి 14 తారీఖున కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము కూడినది. ఆసభకు వివిధప్రాంతములనుండియు నాయకులు వచ్చియుండిరి. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము ఈ క్రింది తీర్మానమును చేసినది:

"పూర్ణస్వరాజ్యమును బడయుటకు అహింసాధర్మమునందు సంపూర్ణవిశ్వాసము గలవారే శాంతి సహిత శాసనోల్లంఘనమును ప్రారంభింతురని కార్యనిర్వాహకసంఘమువారు నమ్ముచున్నారు. కాని, కాంగ్రెసు సంస్థయందు అట్టివారే గాక ప్రస్తుతస్థితిలో అహింస నవలంబించుట తాత్కాలికముగ లాభకరమని నమ్మువారుగూడ జేరియున్నందున, గాంధిమహాత్ముని సూచనను ఈ సంఘమువారు ఆమోదించి, వారును, వారితో గలసి పాటుపడుచు అహింసను విధ్యుక్తధర్మమని విశ్వసించువారును శాంతిసహిత శాసనోల్లంఘనమును వారి యిష్టము వచ్చినప్పుడు వారు చేయదలచిన విధమున వారు నిర్ణయించెడి పరిమితిలోపల నిర్వహించుటకు అధికారమిచ్చుచున్నారు. ఈ సంరంభము కొనసాగుచున్న సమయమున, కాంగ్రెసుసభ్యు లందరును, తదితరులును సత్యాగ్రహావలంబులకు సర్వవిధముల తోడ్పడి, ఎట్టి కోపకారణముల మధ్య నయినను సంపూర్ణమగు దౌర్జన్యరాహిత్యమును అవలంబించి దాని కెట్టిభంగము కలుగకుండ కాపాడెద రని కార్యనిర్వాహక సంఘమువారు నమ్ముచున్నారు. సమష్టిశాసనోల్లంఘనము జరుగునెడల, నింతవరకు ప్రభుత్వముతో ఐచ్ఛిక సహకారము సలుపుచున్నవారు, అనగ న్యాయవాదులును, ప్రభుత్వము ద్వారా లాభము బొందుచున్నవారు, అనగ విద్యార్థులును సహకారమును మాని, దానివలన గలుగు లాభములను విడనాడి, స్వాతంత్ర్యమునకై జరుగు సంరంభమునందు పాల్గొనెద రని కార్యనిర్వాహక సంఘమువారు నమ్ముచున్నారు. నాయకులు అరెస్టుచేయబడి, కారాగృహమునందు బంధింపబడినపుడు వెనుకనుండి త్యాగబుద్ధియు, సేవాసక్తియు గలిగినవారు కాంగ్రెసు సంస్థలను నిర్వహించుచు, కాంగ్రెసు ఉద్యమమును శక్తిసంచన లేకుండ సాగించెదరని కార్యనిర్వాహక సంఘమువారు నమ్ముచున్నారు."

ఈ తీర్మానము గాంధీమహాత్మునకును, వారియనుచరులకును శాసనోల్లంఘనప్రస్థానమును నడిపించుటకు సంపూర్ణాధికారమొసగుచున్నది. గాంధీమహాత్ముడు శాసనోల్లంఘనప్రస్థానమును కాంగ్రెసుఆజ్ఞ ననుసరించి నడుపుచున్నను, స్వయముగ నడుపుచున్నటులును, కాంగ్రెసుపక్షమున నడపనటులును పై తీర్మానము విశదముచేయుచున్నది. గాంధీమహాత్ముడు చేయదలచిన శాసనోల్లంఘనప్రస్థానవిషయమై రాజప్రతినిధికి మార్చి 2 వ తేది శ్రీముఖమును బంపినటులు వార్తలు తెలుపుచున్నవి. దీనిపర్యవసానము కాలము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశదముచేయగాదు. అహమ్మదాబాదునందు మార్చి 20 వ తేదీయందు కూడనున్న అఖిల భారతకాంగ్రెసుసంఘము భావికార్యవిధానమును నిర్ణయింపనున్నది. గాంధీమహాత్ముడు శాసనోల్లంఘనము చేసి నిర్బంధింపబడునంతవరకును ఇతరులు శాసనోల్లంఘనమును జేయకూడదని గాంధీమహాత్ముడు తెలిపియుండెను. మహాత్ముని నిర్బంధానంతరమన్ని రాష్ట్రముల వారును వారివారిసంస్కారానుసారము శాసనోల్లంఘనము చేయవచ్చునని, ఆప్రస్థానమును ఆపజనదనియును మహాత్ముడు తెలియజేసెను.

కాంగ్రెసునందు రెండుపక్షములు కలవు. ఒకపక్షము అహింసాధర్మమును పరమధర్మమని నమ్ముచున్నది. రెండవపక్షము అహింసాధర్మము వర్తమానకాలమునందు స్వరాజ్య సంపాదనకు సాధనముగా నంగీకరించుచున్నది. ఈ రెండుపక్షములవారును శాసనోల్లంఘన ప్రస్థానమును కాలక్రమమున నడుపవచ్చునని గాంధీమహాత్ముడు తెలిపియున్నాడు. దౌర్జన్యమునకు అవకాశములు నిరంకుశప్రభుత్వవిధానమునందే కలవు. ప్రజలందరును శాసనోల్లంఘన ప్రస్థానమును చేయుటకు పూనుకొనినపుడు దానిపరిణామము నిర్ణయించుట దుస్తరము. సామాన్యముగ శాసనోల్లంఘనము చేయుటకు దేశము సిద్ధముగ లేదను నభిప్రాయము వెడలుచున్నది. కాని ఇది యుక్తమైన అభిప్రాయము కాదు. ప్రజాహృదయమునందు ఉత్సాహము,కార్యపరత్వము ప్రబలునపుడు వేనకువేలు నిరంకుశాధికారవర్గమును ప్రతిఘటించుటకు బయలుదేరుట సహజము. గాంధీమహాత్ము డిట్టివిశ్వాసముతోడనే శాసనోల్లంఘనప్రస్థానమును ఉపక్రమించినటులు వారివ్యాసములు సంభాషణలు విశదముచేయుచున్నవి. ఆంధ్రమహాజనులందరును వారివిశ్వాసమును సఫలముచేయుదురను విశ్వాసము కలదు.

బెజవాడయందు ఫిబ్రవరి 23 వ తేదీయందుకూడిన ఆంధ్రరాష్ట్రీయసభచేసిన యీ క్రింది తీర్మానమును గాంధిమహాత్ముని శాసనోల్లంఘన ప్రస్థానమునందు విశ్వాసమును వ్యక్తముచేయుచున్నది. ఆంధ్రమహాజనులు గాంధీమహాత్ముని విశ్వాసమును ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ విశ్వాసమును పూర్ణస్వరాజ్యప్రస్థానమును సఫలముచేయుదురనినమ్ముచున్నాము.

(ఏ) అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు ఈనెల 15 వ తేదీని శాసనోల్లంఘనమును గూర్చిగావించినతీర్మానము నీసభవారు హృదయపూర్వకముగా నామోదించుచు, రాబోవు సంరంభములో మహాత్మగాంధిగారి నాయకత్వమునందు తమకు గల సంపూర్ణ విశ్వాసమును ప్రకటించుచున్నారు.

(బి) కార్యనిర్వాహక సంఘమువారి తీర్మానములు జరుపుటకు వలసిన స్వచ్ఛంద సేవకులను, అహింసావ్రతమును ధర్మవిశ్వాసముగా నమ్మినవారి నాయకత్వము క్రింద పనిజేయుటకు శపథము వహించినవారిని, ఆంధ్రరాష్ట్రముయొక్క ఆవశ్యకమునకు చాలినంతమందిని సమకూర్చుట కీసభవారు తీర్మానించుచున్నారు.

(సి) ఈ రాష్ట్రములోని కాంగ్రెసు సభ్యులందరును శాసనోల్లంఘనోద్యమమునందు జేరి శాసనోల్లంఘనవాదులయెడల సర్వవిధముల సంపూర్ణ సహకారాభిమానములను జూపుచు, ఎంతటి ఆగ్రహోద్రేకసందర్భములలోను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంపూర్ణమైన అహింసావ్రతమునే చేపట్టియుండవలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు.

(డి) ఈదేశములో గవర్నమెంటువారితో పూర్తిగానో కొంతవరకో సంబంధముగల సంస్థలలో జేరియున్న లాయర్లు, ఉపాధ్యాయులు, విద్యార్థులు మున్నగువారందరును దేశముయొక్క ఆఖరుస్వాతంత్ర్యసమరములో జనసమూహ మందరితో పాటు చేరవలెనని యీ సభవారు గోరుచున్నారు.

(ఇ) ఈతీర్మానములను ప్రయోజనకరముగా నమలుజరుపుటకు కావలసిన ప్రచారముచేయుట, స్వచ్ఛందసేవకులను సమకూర్చుట మున్నగు కార్యముల నిర్వర్తించుటకును, ఆంధ్ర రాష్ట్రములో శాసనోల్లంఘన సంరంభమును ప్రారంభించి నడిపించుటకు సంపూర్ణాధికారము పొందిన ప్రత్యేకోపసంఘము నొకదానిని నెలకొల్పుటకును అ. రా. కా. కార్యనిర్వాహక సంఘమున కీసభ వా రిందుమూలముగా అధికార మిచ్చుచున్నారు.

(యఫ్) ఈలోగా జిల్లా కాంగ్రెసు సంఘములన్నియు తమతమ స్థానికసందర్భముల కనుగుణ్యముగా ఏయే అనుకూలప్రదేశములందు ఎటువంటి శాసనోల్లంఘన ప్రయత్నముల నెంతవరకు సాగించుటకు వీలుగా నుండునో, ఆట్టిచోట్ల నెట్టి సానుభూతి సహాయముల కవకాశ మున్నదో ఆయావివరముల నెల్ల ౧౯౩౦ సం॥ మార్చి ౭ వ తేదీలోగా అ. రా. కా. సంఘ కార్యస్థానమునకు జేరునట్లు పంపవలెనని యీసభవారు కోరుచున్నారు.

(జి) ఈపై తీర్మానములను వీలైనంతత్వరలో అమలు జరుపుటకుగాను జిల్లా కాంగ్రెసు సంఘములన్నియు కాంగ్రెసు ప్రచారకుల సమావేశములను తమ తమ జిల్లాలలో వెంటనే సమకూర్చవలెనని యీ సభవారు కోరుచున్నారు.

ప్రపంచమునం దంతటను మహాసంచలనము బయలుదేరినది. స్త్రీలు యువకులు, పండితులు పామరులు, ఆస్తికులు నాస్తికులు, ధనస్వాములు, కర్మకారులు మహాపరివర్తనమును గోరుచున్నారు. అన్ని దేశములందును సైన్యవ్యయభారము ప్రజలను కృశింపజేయుచున్నది. పరాధీన దేశములందు వ్యయభారమునకు పారతంత్ర్యము తోడ్పడి ప్రజలను కృశింపజేయుచున్నది. భరతవర్షము నూతన మార్గమున ప్రపంచోద్ధరణమును, స్వాతంత్ర్యసంపాదనమును చేయుటకు నిర్ణయించినది. ప్రపంచమునకు సామాన్యముగ నపరిచితమైన సత్యాగ్రహ ధర్మమును నిరంకుశప్రభుత్వము సకలవిధములను ప్రతిఘటించుటకు విశ్వప్రయత్నములను జేయుట సహజము. ప్రపంచమును దుఃఖమయము చేయుచున్న ఆయుధముల నియమమునకు, మద్యనిషేధమునకు, పారతంత్ర్య ప్రతిఘటనమునకు మహాత్యాగ సాధ్యమైన సత్యాగ్రహము పరమ సాధనముగ నున్నది. సత్యాగ్రహ ప్రస్థానమునకు ౩౩ కోట్ల ప్రజలుగల దేశమునంతయును సిద్ధము చేయుట సాధ్యము గాదు. భరతవర్షము సత్యాగ్రహ ప్రస్థానమునం దొక యంతరమును నధిష్ఠించుటయందు దుఃఖవేదన ననుభవించినను, లోకకల్యాణమునకును, దేశకల్యాణమునకును నిది వినియోగ పడగలదు. గాంధిమహాత్ముని సత్యాగ్రహదీక్ష భరతవర్షమునకును, లోకకల్యాణమునకును నుపచరించుటకు భగవంతు డనుగ్రహించు గాత !

---

Printed and Published by K.Nageswara Rao, at the Andhra Patrika Press, No.7,ThambuChetty St.,Madras.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు—పరిశీలన; రాగదీపగ.

సాధారణ చిత్రములు—ఆకస్మిక ఛాయాచిత్రములు; చెన్నపుర జలాధార చిత్రములు; ఐరోపాఖండయాత్ర చిత్రములు; వ్యంగ్యచిత్రములు, ఇతర చిత్రములును.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



'పరిశీలన'

చిత్రకారుడు: శ్రీ సి. వెంకటరావుగారు, చెన్నపురి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శ్రీ ప్రమోద సంవత్సరాది

సెట్టి లక్ష్మీనరసింహము గారు

శ్రీదేవి చైదములకుఁ బ్రమోదము గని యామెకుం బ్రమోద మొసఁగు దా
మోదరుఁడు నాదరుఁడయి ప్రమోద మొసఁగు మేదినికిఁ బ్రమోదాబ్దమునన్.

ఉ. "సీతమ యానవాలు దయచేసి, 'విభుం గొని తెమ్ము శీఘ్ర ప్రమో
దాత,' యటన్న," దన్న, "భవదూర్జితశక్తియె నాకు వప్రమో
దాత," యటంచు మారుతసుతుఁ స్తుతియించిన రాముఁ డీ ప్రమో
దాత ప్రమోదదాతగను దోఁచఁగఁ జేయునుగాత ధాత్రికిన్.

భుజంగప్రయాతము

ప్రమోదాఖ్య సంవత్సరం బైన నేమీ,
ప్రమోదాతి కానేమి? భావించి చూడం
బ్రమాదంబు లే దంతమాత్రంబుచేతం;
బ్రమోదంబె హెచ్చై ప్రవర్తిల్లు దీనన్.

పంచచామరము

ప్రమోదవత్సరంబునందుఁ బాఁడి పంట లన్నియుఁ
సమృద్ధిగాఁగఁ గల్గి, సర్వసంపదల్ లభించుచుఁ,
సమస్తరీతులఁ సమస్తజాతులుఁ సుఖింపఁగాఁ,
బ్రమోదమే! ప్రమోదమే!! నిరంతర ప్రమోదమే!!!

ప్రకృతిరమా మాధవవివాహమందు సానాయిమేళము చేసెఁ గోయిలగమి;
మోసులెత్తిన మావిమొగ్గలు పిండెలై వేపపువ్వులతోడ నియ్యమందెఁ;
దమయిండ్ల బ్రాహ్మణోత్తములు శ్రోతలకుఁ బంచాంగశ్రవణము సల్పంగడఁగిరి;
:ంరంభమున భక్తజనులు శ్రీరామలీలా సమారంభాభిలాషులైరి;
"వచ్చె మరలఁ గ్రొత్త వత్సరం, బిద మహో-
త్సవదినం," బటంచు జనపదనగ-
రముల ప్రజలు పొంది రమితప్రమోదంబు:
ముదముల పెను గాది గద యుగాది!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము, ఏప్రెల్ ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪

# హంపీ క్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావుగారు, కామరాజుగడ్డ శివయోగానందరావుగార్లు.

## ౧

### నేటి స్థితి

అవి చరిత్రలో చూచిన యణువు లట్టె-మరువబడినవి, అవి కావ్యకరణమందు
అతిశయోక్తులు నమ్మరా దయ్యె వాని-కల్ల నిజమయ్యె నీవు సాక్షాత్కరింప.

పొంగిపోయిన యెడదలో పుటముపెట్టి-రగుల జొచ్చెను మాదు సామ్రాజ్య నాశ
నంపు తలపులు లోని యానంద మంత-యావిరిగ మారె, ఆర్ద్రము లాతలపులు.

బ్రతికియు వేయి, ప్రాణములు బాసియు వేయి మదేభమన్నసా
మెత కనుఱూపమా చరితమేయగు నీయది. కానిచో మహో
న్నతి నఖిల ప్రపంచ గణనంబున మాయనికన్ను నేటి దు
ర్గతి గని గూడ మాయుటకు రాదు భవత్కథ శాశ్వతం బటే.

7. 4- 10 ౫౩౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కొండలు

కొండకు కొండకుఁ బ్రకృతి కొక్కెము పాదెను, లంకెలంకెలై
చండసురాధిపాయుధ వశంబులు గానివి బారుబారులై
యుండె. మహాద్రివప్రవలయోన్నత గోపుర దుర్గపట్టణం
బెండిన యేటిదిబ్బవలె యెట్లిటు బీటలు విచ్చిపోయెనో!

ఒకకొండ కొకకొండ ఊపి రాడగనీని ఉరిత్రాటియుచ్చు"లా" నొప్పు నొకట
ఒకకొండ నొకకొండ యొడిలోన లాలించి చుబుకంబు నిమురు"లా" చొచ్చు నొకట
ఒకకొండ నొకకొండ ఓడించి మెత్తులో జబ్బలు చరచు"లా" సాగు నొకట
ఒకకొండ రాజు పేరోలగంబున గట్లు కొలిచి యుండినలాగు కుదురు నొకట
కొండలును రాతిబండలుగూడ నిట్లు-మానవుల చేష్టలం దోనమాలు దిద్దు
వరవడి గ్రహింపగా జీర్ణవైభవముల-మరచి పోగల్గుదుమె తెల్గుచరితమందు!

అచలము లంచలంచలుగ నల్లిన కోటల దాట రీనదీ
ప్రచలతరంగ ఘాతముల బాధకు నక్రనిశాతదంతపుఁ
రుచులకు, పైన కూల్చెడి విరోధులబండలకుఁ దెగింప లే
క, చకితులైన మూఢులు వికర్తనకర్తలచే తుదిఁ నృపుల్.

## తుంగభద్ర

పరిఖావ్యాజముతోన చుట్టుకొని పంపాస్రోత మాత్మీయ సుం
దర నీలాకృతి తత్పురాద్రిచయ బద్ధస్వాంగమై వప్రబం
ధుర దుర్గ ప్రతి బింబితాంబు చలనోద్యోగంబులో పొంగి శ
త్రురయంబుఁ పరిమార్చి నైజబలమందుఁ పొందెనా సన్నుతుల్.

నిగనిగలాడు సోయగము నాదేకాని నీలిమబ్బులకు రానేర దనుచు
గబగబ నడచు లాఘవము నాదేకాని తెలిమబ్బులకు పట్టిదే యటంచు
తళతళ లాడెడు తళ్కు నాదేకాని మబ్బు దివ్వెల నుత్తమాట యనుచు
జిలుజిల్లు మనిపించు చలువ నాదేకాని వర్షాభ్రముల రిత్తవాక్య మనుచు
సొగసులో పారుదలలోన చుట్టుపట్ల-చిందుశీకరములలోన జీవనముల
లోన పంపాస్రవంతిక సానువులను-వ్రేలు మేఘప్రవాహాల నేలుకొనును.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# దశరూపకోక్తమయిన
# అభిసారికాలక్షణ వాక్యమున కర్థనిర్ణయము

మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు, 'కళాప్రపూర్ణ'

దశరూపకమందు

మూలము: "కామార్త్యాభిసరేత్ కాన్తం సారయేద్వాఽభిసారికా."

టీక: "యథాఽమరుశతకే:

ఉరసి నిహితస్తారోహారః కృతాజఘనేఘనే
కలకలవతీ కాఞ్చీపాదే రణన్మణినూపురౌ,
ప్రియమభిసరస్యేవంముగ్ధేత్వమాహతడిణ్డిమా
యది కిమధికత్రాసోత్కమ్పాదిశస్సముదీక్షసే.

యథాచ—

నచ మేఽవగచ్ఛతి యథా లఘుతాం
కరుణాం యథాచ కురుతే సమయి,
నిపుణం తథైన ముపగమ్య వదే
రభిదూతి కాచి దితి సందిదిశే."

[మాఘ. ౯ (౫౬).]

అమరుకమందు—

"ఉరసి నిహితః" ఇత్యాదిశ్లోకముపై వేమభూపాలుని టీకయందు ఇట్లున్నది:—

"హిత్వా లజ్జాం సమాకృష్టా
మదనేన మదేనచ,
యాఽభిసారయతే కాన్తం
సా భవే దభిసారికా.

[సారయత ఇత్యత్ర స్వార్థే ణ్యన్తః.]

దర్పణమందు:

"అభిసారయతే కాన్తం యా మన్మథవశంవదా,
స్వయంవాఽభిసరత్యేషాధీరైరుక్తాఽభిసారికా.

క్రమా ద్యథా:—

నచ మేఽవగచ్ఛతి.........
ఉత్క్షిప్తం కరకఙ్కణద్వయ మిదం
బద్ధా దృఢం మేఖలా
యత్నేన ప్రతిపాదితా ముఖరయో
ర్మఞ్జీరయో ర్మూకతా,
ఆరబ్ధే రభసా న్మయా ప్రియసఖి
క్రీడాభిసారోత్సవే
చణ్డాలస్తిమిరావగుణ్ఠనపటా
క్షేపం విధత్తే విధుః."

దశరూపకమునుండి యుద్ధరించిన పై లక్షణవాక్యములో సారయేత్ అనుచో "దూతీం సారయే" త్తని నవీనులొకానొకరు టీకించినారు. ఆటీక సరి గాదనియు, "కాన్తం సారయేత్" [అనగా "కాన్తమభిసారయేత్"] అని వాక్యపూర్తి చేసి కొనవలయుననియు పై సంవాదములచేత స్పష్టపడుచున్నది. మఱియు దూతీప్రేషణమే అభిసారికా లక్షణమగునేని ఈ క్రింది యుదాహరణమున నాయికకలహాంతరిత యెట్లగును?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మల్లినాథవ్యాఖ్యతోఁడి మాఘమందు.—

"అథ కాచిత్కలహాన్తరితా కాన్తం
ప్రతి త్రిభి ర్దూతీం సందిశతి"—

అని యవతారించిన మూఁడు శ్లోకములలో మూఁడవది.—

"తదుపేత్య మాస్మ త ముపాలభథాః
కిల దోష మస్య నహి విద్మ వయమ్,
ఇతి సంప్రధార్య రమణాయ వధూః
విహితాగసేఽపి విససర్జ సఖిమ్.'

టీకయందు - "ఏషా కలహాన్తరితా ప్రౌఢాచ" అని యుపసంహారము.

అట్లయిన మల్లినాథసూరి పూర్వోదాహృత'నచమే'శ్లోకమును 'కాచిన్నాయికా దూతీం వాచిక మను శాస్తి" అని యవతారించి, టీకలో "నాయికాతు కలహాన్తరితా-'కోపాత్కాన్తం పరానుద్య పశ్చాత్తాప సమన్వితా' ఇతి లక్షణాత్" అని యుపసంహారము చేసినాఁడు. దీనిని అభిసారికోదాహరణముగా ధనికాదులు కొనియుండఁగా కలహాంతరిత యని యీయన వ్రాయుట యెట్లు సంగతపడును? ఇందేమి మతద్వయమా? అని యాక్షేపము:—

అందుల కుత్తరము.—

ఇందు నాయకునిం దోడితెమ్మని తాత్పర్యమేని నాయిక యభిసారికయగును; ఒండుచో కలహాంతరిత యగును. ఈ తాత్పర్యభేదముం బట్టి పైనాయికాభేద మేర్పడినది. మఱియు-మాఘకావ్యమునందు ఈఘట్టమున ఈ కలహాంతరితనాయికలపంపున దూతికలును, సఖులును బోయి నాయకులను మంచి మాటలం దేర్పఁడు వారు నాయికలకడకు వచ్చి రని చెప్పఁబడియున్నది:—

"దయితాహ్వృతస్య యువభి ర్మనసః
పరి మూఢతా మివ గతైః ప్రథమమ్,
ఉదితే తతః సపది లబ్ధపదైః
క్షణదాకరేఽనుపదిభిః ప్రయయే."౯(౨౦).

ఇట నీఘట్టమునం దోడితెమ్మని యేని రమ్మనియేనియు లేకున్నను ఇట్లు, దూత్యుక్తులచే నాయకులు బెట్టు వదలి నాయికలకడకు వచ్చిరనియు నున్నది గావున ధనంజయాదులు 'కరుణాం యథాచ కురుతే సమ' యిత్యాది వాక్యములకు తోడి తెమ్మనుటయందే తాత్పర్యము గ్రహించి' 'నచ మేఽవగచ్ఛతి' శ్లోకమందలి నాయికను అభిసారికనుగా నుదాహరించిరని తలంపనగును. నాయకులు నాయికలయందు అపరాధము లేమిని దూత్యాదివాక్యములవలన నెఱిఁగి స్వబుద్ధిచేతనే వచ్చిరనుట తాత్పర్యముగాఁ గొని మల్లినాథసూరి యీ నాయికల నభిసారికలనుగాఁ జెప్పక దూత్యము పంపుటకు మున్ను జరిగియున్న నాయికాకలహముం బట్టి కలహాంతరితలనుంగాఁ గొనిమెననియు ఉక్తద్రఢీకరణము.

కావున దూతీప్రేషణమాత్రము అభిసారికాలక్షణము గానేరదు.

ప్రతాపరుద్రీయమందు.—

"కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తాసాభిసారికా
యథా-సంభ్రమై రల మల్పక్షే....."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అందుపై టీక: అభిసారికా మాహ-కాన్తే తి-కాన్తస్య కర్మణః కర్తుర్వాఽభిసరణే ఉద్యు క్తా-అత ఏ వోక్తమ్; 'స్మరార్తాఽభిసరే త్కా-న్తం సారయేద్వాఽభిసారికా' ఇతి-సార యే దితి దూత్యాది ముఖే నేతి శేషః --- ...అత్ర కాన్త కర్మకాభిసరణ ముక్తమ్-ఏవం కాన్త కర్తృకాభిసరణేఽ ప్యుదాహార్యమ్."

నరసభూపాలీయమునందు-మూలము——

"కాంతాభిసరణ

శీల యభిసారికాఖ్యయై చెలువుమెఱయు."

అందుపై వింజమూరి కృష్ణమాచార్య బహుజనపల్లి సీతారామాచార్యు లిరువురును రచించిన టిప్పణి:——

"కాంతు నభిసరించునది గాని, దూతికా దులచేతఁ గాంతు నభిసరింపించునది గాని య భిసారిక యనంబడును."

రత్నాకరమునందు——

"అనురక్తా స్వయం యాతి

కాన్తం యా సాభిసారికా."

అందుల టీకలో-"అథాభిసారికాం లక్ష యతి-అనురక్తేతి-'స్మరార్తాఽభిసరే త్కా-న్తం సారయే ద్వాభిసారకా' ఇతి ద్వివిధ మభిసర ణమ్-సారయే దితి-దూత్యాదిముఖేనేతి శేషః-త త్రాద్యపక్షావలమ్బనే నోదాహరతి-రావణే నేతి."

కావ్యానుశాసనమందు——

"అభిసర త్యభిసారయతివా కామార్తా కాన్త మి త్యభిసారికా.—— యథా 'ఉరసి నిహితః......' తథా 'నచమే......' "

ఇందును సూత్రవాక్యముం బట్టి 'నచమే' అనునది 'కాన్త మభిసారయే' త్తనులక్షణము నకు ఉదాహరణము గాని, 'దూతీం సారయే' త్తను నవలక్షణమునకుం గాదు.

రసార్ణవసుధాకరమందు——

"అథాఽభిసారికా - మదనానలసంతప్తా యాఽభిసారయతి ప్రియం, జ్యోత్స్నీ తమస్వినీ యానయోగ్యా మ్బరవిభూషణా, స్వయం వా ఽభిసరే ద్యాతు సా భవే దభిసారికా."

[జ్యోత్స్నీ 'మల్లికామాల్య...'

తమస్వినీ 'సంచర న్తి మృగనాభి...' ]

రసమంజరియందు——

"స్వయ మభిసరతి ప్రియ మభిసారయతివా యా సాఽభిసారికా."

అందుపై వ్యఙ్గ్యార్థకౌముది యను టీకలో "క్రమ ప్రాప్తా మభిసారికాం లక్షయతి స్వయ మితి - అభిసరణాభిసారణాన్యతరవ త్త్వ మిత్యర్థః. ఉక్తంచ 'యాకాన్తాఽభిసరే త్కా-న్తం సారయే ద్వాఽభిసారికా' ఇతి."

'దూతీం సారయే' త్తను నవవ్యాఖ్యంబట్టి చూడఁగా——

దశరూపకమందు——

"అథాసాం సహాయిన్యః-

'దూత్యో దాసీ సఖీ కారూ

ర్ధాత్రేయీ ప్రతివేశికా,

లిఙ్గినీ శిల్పినీ స్వంచ

నేతృ మిత్ర గుణాన్వితాః.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దర్పణమందు—

'లేఖ్యప్రస్థాపనైః స్నిగ్ధై
ర్వీక్షితై ర్మృదుభాషితైః,
దూతీ సంప్రేషణై ర్నార్యా
భావాభి వ్యక్తి రిష్యతే.'

దూత్యశ్చ—

'దూత్య స్సఖీ నటీ దాసీ
ధాత్రేయీ ప్రతివేశినీ;
బాలా ప్రవ్రజితా కారూః
శిల్పిన్యాద్యాః స్వయం తథా.'

కావ్యానుశాసనమందు—

మూలము: "అన్త్యత్ర్యవస్థా పరస్త్రీ". టీక; "పరస్త్రియాతు కన్యోఢే-సంకేతాత్ పూర్వం విరహోత్కణ్ఠితే- పశ్చాద్విదూషకాదినా సహాఽభిసరన్త్యా వభిసారికే" అను నిత్యాది నానా ప్రమాణములంబట్టి సఖీ దాస్యాదులు పలువురు దూత్యాదులుగా నుండం దగును గావునను, విదూషకునిఁ బంపుటయుం గలదుగావునను— దశరూపకమందలి యభిసారికోదాహరణము లందు (ధనికునివలెనే ఇంక ననేకులు దశరూపకమునకు వ్యాఖ్యలు వ్రాయుట సంభవింపం దగును గావునను) వారు వా రొసంగెడి యా యా యుదాహరణములందు ఎవరిని బంపిన వారినే సారయేత్తునకు కర్మగా చెప్పకొని లక్షణవాక్యమును పూర్తిచేసికొనవలసివచ్చుటయు సంభవించును జాబుపంపిన 'లేఖంసారయే' త్తని లక్షణమగును. అవ్విధమున ననేకలక్షణములను ద్వితీయాభిసారికకు అవాంతరభేదములకయి కల్పించుకొనవలసివచ్చును. అనవస్థ యగును. 'దూతీ'మను నీ నవీనకల్పనయుం జెడును. మఱియు 'దూతీంసారయే' త్తను నీ కల్పనలో దూతిని తనకు (నాయికకు) బదులుగా నాయకునికడకు వలరాచ గందరగోళములకై పంపుట యేల యర్థము గారాదు।

ఇట సారయేత్తను పదము అభిపూర్వకముగా నందున 'కాన్తం సారయే'త్తను నన్వయము పొసఁగ దనుట భాషాస్వాభావ్య విరుద్ధము. ఇదియునుం గాక అభిశబ్దము ఉపస్థితముగా నుండను ఉన్నది. లేని యుపసర్గలను సయితము తాత్పర్యానుసారముగా నూహించుకొనుట యీ భాషయందుఁ గలదు.—

'పలాశకుసుమభ్రాన్త్యా
శుకతుణ్డే పత త్యళిః,
సోఽపి జమ్బూఫలభ్రాన్త్యా
త మళిం హర్తు మిచ్ఛతి.'

ఇట 'ధర్తుమ్', 'హన్తుమ్' అను పాఠములకన్న హర్తు మనుటయే శ్రేయమనియు, దానికి 'అభ్యవహర్తుమ్' అని యభిప్రాయమనియు సాంప్రదాయికులమతము.

మురారినాటకములో—

'చేతశ్శుక్తికయా నిపీయ శతశ
శ్శాస్త్రామృతాని క్రమా
ద్వాన్తై రతురమూర్తిభి స్సుకవినా
ముక్తాఫలైర్గుమ్ఫితాః,
ఉన్మీలత్కమనీయనాయకగుణ
గ్రామోపసంవర్గణ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రౌఢాలంకృతయో లుఠన్తి కృతినాం
కణ్ఠేషు హారస్రజః.'

అనుశ్లోకముపై రామానందీయ వ్యాఖ్యలో హారశబ్దము వ్యాహారపరమని వివరణంబును, వ్యాఙ్పూర్వకము గాని హారశబ్దము వ్యాహారపర మెట్లగునని యాక్షేపంబును, వ్యాఙ్లు లేకపోయినను బాధ లేదని సమర్థనంబునుం గలవు. హరిహరదీక్షితీయ వ్యాఖ్యయందు ఈవిషయము ఇట్లే సమర్థింపఁబడి యున్నది. మురారిలో 'విరమతి మహాకల్పే' అను శ్లోకముపై వ్యాఖ్యలలో కల్పశబ్దమునకు సంకల్పపరత్వము గూడ చెప్పఁబడి యున్నది.

కిరాతార్జునీయ ప్రథమసర్గలో 'క్రియాసు యుక్తై'రిత్యాది చతుర్థశ్లోకవ్యాఖ్యలో మల్లినాథసూరి 'యుక్తైః' అను పదమునకు 'నియుక్తైః' అని యర్థము వ్రాసినాఁడు. అట్లే ఇచ్చటను 'సారయే'త్తనఁగా 'అభిసారయే'త్తని గ్రహించుట సమంజసము.

మఱియు నిట సారయే త్తనుటకు అభిసారయేత్తని యర్థము గాదనుట ఉదాహృతములయిన యాలంకారిక సార్వభౌముల వ్యాఖ్యానములకు విరుద్ధముగా నున్నది.

సాహిత్యదర్పణమునకు ఐరోపీయపండితవరేణ్యులు రచించిన యాంగ్లానువాదములో ఈవిషయ మీక్రిందియట్లున్నది:—

## TEXT

No. 115. She, who, acknowledging the power of Love, sends to seek *her lover*, or goes herself to seek him,—this one is called by the learned, the one 'who goes after *her lover*'

The heroine making Advances

## COMMENTARY

*a*. These two cases are here exemplified in their own order as "'Having understood his feelings thoroughly, speak to him in such a manner that he may not discern my levity in sending to lure him back after having capriciously repelled him, and that he may act tenderly towards me':— thus did a certain one instruct her female messenger".

[*Magha-Cantos. VIII (56)*]

"'I have laid aside this my pair of bracelets; I have fastened my girdle tight; with much pains I have produced dumbness in my chattering anklets;—and, O my dear friend, just when I had begun to be eagerly impatient toset out onLove's errand this wretch of a moon throws aside the protecting mantle of the dark!'".

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బాలవ్యాకరణ కవిజనాశ్రయములు

విద్వాన్ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు

(౧) బాలవ్యాకరణము

"చేదర్థంబునందు వృత్తంబగుభావలక్షణంబు నందు న వర్ణకంబు ద్రుతాంతం బగు. (బా. క్రి. ౪౧ సూ.) వానలు కురిసినం బంటలు పండును. వాఁడు రమ్మనినఁ బోయితిని." చేదర్థంబునం దున్నట్టి భావలక్షణార్థమున ద్రుతాంతం బయిన నప్రత్యయము వచ్చును- అని యీ సూత్రమునకుఁ బుస్పూర్తికమగు నర్థము. పలువురు పండితులు దీనికీ యర్థమునే వివరింతురు. గుప్తార్థప్రకాశిక ప్రథమద్వితీయ ముద్రణములు రెంటను నిట్లే యర్థము వివరింపఁబడి యున్నది. కాని యీయర్థము సూరి సమ్మతమును, స్వారసికమును, లక్ష్యసాధనోపయుక్తము నగునా యని విమర్శించుట మనకుఁ బ్రసక్తము.

ప్రకృతసూత్ర ప్రథమోదాహరణంబున వానలు కురిసిన౯ (=కురిసినచో) పంటలు పండు నను రీతిని జేదర్థము చక్కగా స్ఫురించుచున్నది. కాని ద్వితీయోదాహరణంబునఁ జేదర్థస్ఫురణ మించుకయుఁ గానరాదు. వాఁడు రమ్మనినచోఁ బోయితిన నను నర్థ మేమియుఁ బొసఁగియుండదు. వాఁడు రమ్మనెను; అనుటచే నేను బోయితిని—అను నీయర్థమున మాత్రమే యీవాక్యము ప్రయుక్తమగుచుండును. కావున నన్ వర్ణకమునకుఁ జేదర్థ సంబద్ధమగు భావలక్షణమే యర్థమని పయిసూత్రమును సమన్వయించినచోఁ జేదర్థప్రతీతి గానరాని యిట్టి చోటుల లక్షణ మెట్లు సంగతమగు నను నాక్షేపము దుర్నివారమై యున్నది. ఇట 'రమ్మనిన౯' అను దానికిని, 'పోయితిని' అనుదానికిని గార్యకారణ భావము గలదు గాన గుప్తార్థప్రకాశికా వివరణానుసారముగ నెట్టెటో లక్షణసంగతి నంగీకరింత మన్నను 'చేత్' అను నవ్యయము కార్యకారణభావ మాత్రద్యోతకముగ సంస్కృత భాషలోఁ గానరాదయ్యె. చేచ్ఛబ్దఘటితమగు వాక్యములఁ గొన్నిటఁ గార్యకారణభావము గూడ నార్థికముగ నొకప్పుడు పొసఁగియుండిన నుండఁదగును గాని యంతమాత్రమున నదియే చేచ్ఛబ్దమున కర్థమనిమాత్రము నిరూపింపవలనుపడదు. చేచ్ఛబ్దము సంస్కృతభాషలో నెల్ల యెడలఁ బక్షాంతరద్యోతకమై కన్పట్టును. వానలు కురిసినం బంటలు పండు నను వాక్యముచే వానలు కురియకుండుటచేఁ బంటలు పండ లేదనిగాని, వానలు కురియనిచోఁ బంటలు పండవనిగాని పక్షాంతరము తప్పక స్ఫురించెడిని. ఇట్లే సంస్కృతమునఁగూడ 'ఆహూతశ్చే దాగమిష్యామి'—పిలువఁబడినచో వచ్చెదను అను నర్థముగల యీవాక్యముచేఁ బిలువఁబడనిచో రానను పక్షాంతరము స్ఫురింపక మానదు. కావున నే 'పక్షాన్తరేచే ద్యదిచ' అని కోశకర్తల నిర్ణయము. దీనింబట్టి చేదర్థ విశిష్టభావలక్షణార్థ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున నన్వర్ణక మగునను సమన్వయము సమం జసము గాదని స్పష్టపడు చున్నది. ఇఁక నేది సమంజసమో పరిశీలింతము.

చిన్నయసూరిగారు (౧) చేదర్థము, (౨) వృత్తమగు భావలక్షణము (వృత్తము= కడచినది: భూతకాలికమని భావము) నను నీ రెం డర్థము లందును నన్వర్ణకము వచ్చునను తలంపుతో నీసూత్రము రచించి యుండిరని మన మూహింపవలసి యున్నది. కాలనిశేష నిర్ణయము లేని(శుద్ధ)భావలక్షణమున 'తుమర్థభా వలక్షణంబులందు నుజి యగు'నని నుజివర్ణకము నుసామాన్యముగ విధించి, యనంతరము భూత కాలికభావలక్షణమందు నన్వర్ణకమును విధిం చిరి. ఇట్టియాశయ ముండుటంబట్టియే రెండర్థ ములకును వేర్వేఱుగ రెం డుదాహరణములఁ జూపియుండిరి. ఇట్లు మన మూహింపక తొలుత నిరూపించిన రీతి నొకేయర్థమున నీప్రత్యయము విహితమన్నచో రెండవ యుదాహరణ మనా వశ్యకముగను, నసంబద్ధముగను జూపఁబడిన దనవలసివచ్చును. అట్టి యసంగతోదాహరణ ము లుండుట సూరిగారి రచనాపద్ధతి కెంతయు విరుద్ధము. మఱియు నీరీతిని జ్ఞాపక క్రియ భూత కాలికము గావుననే 'రమ్మనిరి' అనుచో 'భూతంబునందిగాగమంబగు'నను సూత్రముచే నిగాగమము సుసాధమగును. ఇది యటుండ సూరిగారు నన్వర్ణకమును బేర్కొనవలసిన తావులందెల్ల 'శతృతు మానంతర్యచే దాద్యర్థ కంబులు'(బా. సంజ్ఞా, ౧౨); 'చేదాద్యర్థనాంతం బయిన యుండుట కున్నాదేశంబు విభాష నగు' (బా. క్రియా. ౫౭)నని యిట్లు చేదాద్యర్థకమని యాదిపద ఘటితముగ వ్యవహరించుట వలనఁ గూడ నీప్రత్యయమునకు నర్థద్వయ మభిప్రేత మని స్పష్టమగుచున్నది. అట్లు గానిచో నీయాది పదములకు సరసమగు సార్థక్యము గానరాదు. ఇదంతయు సమగ్రముగ నాకలించియేగాఁబో లును శిష్టు కృష్ణమూర్తికవిగారు సూరిగారి యీ సూత్రమును "చేదర్థేనో ద్రుతాన్త, స్తద్వద్,వృత్తేభావలక్షణే"అని సంస్కృతీకరించి యున్నారు. (చూ. హరికారికావళి; క్రియా. ౧౫ శ్లో.)ఇట సూరిగారిరచనము 'చేదర్థంబునం దు ను వృత్తంబగు భావలక్షణంబునందు ను నవ ర్ణకంబు ద్రుతాంత బగు'నని యిట్లుసముచ్చయా ర్థక ను శబ్దఘటితముగ నుండక యించుక ప్రౌఢ మగు రీతిలో నుండుటయే యిట్టి భ్రాంతికి హేతు వయ్యెనని తోఁచెడిని. ఇట్టిప్రౌఢి బాలవ్యాకరణ మున నెన్నో తావులఁ గాననగును. వానినన్నిం టి నిటఁజూపుట యప్రసక్తము గాన నీవిష యము నింతటితో ముగించి విషయాంతరమును బరిశీలింతము.

(౨) కవిజనాశ్రయము

జాత్యధికారమున నవకలిసీసలక్షణమున సామాన్యముగ సమసీసములలో నొక్కొక పాదమున కాఱింద్రగణములును, రెండు సూర్య గణములు నుండవలయునని నిరూపించు సంద ర్భమున

'పాదంబు నాలుగు పాదముల్గాఁ జేసి
మొదలిమూఁటికి లోకవిదితమైన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యలయాఱుగణముల వెలయ నిర్ మూఁడిడి
మానుగాఁ దక్కినవానియందు
నగణముల్ రెండిడి...' (కవిజ. ౬౫పే)

అనుపాఠము ముద్రితమై యున్నది. అలయాఱు అనుదానికి నలనామ అను పాఠాంతరము మూఁడు వ్రాఁత ప్రతులలో నున్నట్లు దిగువఁ జూపఁబడినది. ఇట నప్రధానముగ దిగువఁ జూపఁబడిన 'నలనామ' అనునది యే భీమకవికి సమ్మతమగు ప్రధానపాఠముగ గ్రహింపఁదగును. ఏలయన నీప్రకరణమున భీమకవి నల, నగ, సల, భ, ర, త-యను నీ యింద్రగణములను బేర్కొనవలసినపుడు వానిలో నొకటియగు నల శబ్దమును న, గల-యను నీ సూర్యగణంబులఁ బేర్కొనవలసినపుడు న-యను శబ్దమును నుపలక్షణరీతి ననుసరించి వ్యవహరించిన ట్లంగీకరింపక తప్పదు. అట్లంగీకరించిన పక్షమున నే పయిపద్యభాగములో 'నగణముల్ రెండిడి' యనుచో నగణము లన సూర్యగణములను నర్థమును గ్రహింప వీలగును. కాకున్నచో నీసపాదముతుదిని రెండును నగణములే యుండవలయునను విరుద్ధార్థము గ్రహింపవలసి వచ్చును. సవిమర్శముగఁ బరికించినచో భీమకవి యిట్లీ యుపలక్షణపద్ధతి నవలంబించిన స్థలము లీజాత్యధికారమున నే పెక్కులు గానఁబడును. పరిశీలింపుఁడు.—

౧. తరువోజ:

"నలనామగణము లినగణంబు తోడ
నాలుగుగాఁ జేసి నాటించి యిట్లు
కలయంగ నెనిమిది గణములై......".
(కవిజ. ౬౮పే.)

మూఁడింద్రగణములు, నొక సూర్యగణమును, మరల మూఁడింద్రగణములు, నొక సూర్యగణమును గ్రమముగ నున్నచోఁ దరువోజ పాదమగును. పయిపద్యమున నలనామ గణములన నింద్రగణములని చెప్పకున్నచోఁ దరువోజకు లక్ష్యముగఁగూడఁ జూపఁబడిన యీప్రకృత పద్యమే లక్షణవిరుద్ధమగును.

౨. ఎత్తుగీతి:

"(శ్రీ)దయితాధిపా న
యోదయ నలనన త్రి గి
యోదితమైన నెత్తు
గీదియ యొప్పుఁ గృతుల".
(కవిజ. ౬౮, ౬౯పే.)

ఈలక్షణ పద్యమునకు దిగువ దీనిం గూర్చిన విశేషముల (foot-notes) నిరూపించు తావున "లక్షణ మస్పష్టము. ఒక యింద్ర గణము, రెండు సూర్యగణములు చేరి యొక పాదమని లక్ష్యము తెలుపుచున్నది. ...... గి. క. డ. నల నన త్రి" అని వ్రాయంబడియున్నది. ఈ 'నల,నన, త్రియోదిత'మను పాఠమే భీమకవి కభిప్రేతమనియు, నలమన నింద్రగణమనియు గ్రహించినచో లక్షణము సుస్పష్టమై లక్ష్యసంగత మగుచున్నది.

౩. ప్రగీతి:

" మూఁడు నేసి నగణములు రెండు నలములు
మూఁడినగణములును మొగి నహంబు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘోడిగాఁగ నర్థమున కగు మీఁద ని
ట్లుండఁ జెప్పవలయు నొగిఁ బ్రగీతి."

(కవి. ౬౯ పే.)

ప్రగీతిలోఁ దొలిపాదమున మూఁడు సూర్యగణముల పయి రెండింద్రగణములును, రెండవ పాదమున నైదు సూర్యగణములు నుండవలయును. ఇట్లే యుత్తరార్ధమునకును లక్షణము.

ఇట, 'చేసి + ఇనగణములు'అని వివరణమున విభాగము చూపఁబడియున్నది. భీమకవి క్త్వార్థసంధి నెచటను బ్రయోగింపలేదు. అది యాతనికి సమ్మత మనఁ జాలము. అదియుఁగాక యీ ప్రకృత పద్యముననే నలములన నింద్రగణములని యొప్పకతప్పదుగాన నారీతిగనే నగణశబ్దమును సూర్యగణ పర్యాయముగ గ్రహింపక యీక్లిష్టసమన్వయమునకుఁ గడంగ నేల? కావున "చేసి + ఇనగణములు"అను విభాగము భీమకవి కభిప్రేతమని తలంచుట న్యాయ్యము గాదు. చేసి + నగణములు - అని యే విభజింపఁదగును.

౪. మేలనగీతి:

"ఒనర నేడమైనగణములొప్పఁ బెరసియుండ
ఘనతరముగ వళ్లు నిట్లు గలసియుంచ నిలిపి
వినుత మేలనమనుగీతి..............
చెప్పె............................"

(కవిజ. ౬౯-౭౦ పే.)

"ఏడు + అ=ఏడ. ఇనగణములు=ఇన సంబంధిగణములు."అని దీనికి వివరణముగలదు. ఇటుఁగూడఁ బూర్వోక్తరీతి ననుసరించి 'ఏడు + అ + ఇ, నగణములు=ఏడమై, నగణములు (=సూర్యగణములు)అని విభజించుటయే భీమకవి కభీష్టమనుట నిర్వివాదము.

ఈ సందర్భమున నుపలక్షణభంగి నంగీకరించిన పక్షముననే లక్ష్యలక్షణములు సుసంగతము లగును.

ఈ బాలవ్యాకరణ కవిజనాశ్రయ సమన్వయముల రెంటెని బరిశీలించి గ్రంథప్రకాశకులు పునర్ముద్రణావసరమునఁ దత్తద్వివరణ వాక్యములను, పాఠములను సుసంగతముగ సంస్కరింతురుగాక.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నా తోఁట

పెనుమర్తి వెంకటరత్నముగారు

ఏమని చేతు లెత్తి స్తుతియింతు, దయారసమూర్తివైన ని
న్నేమని నిందచేసి సహియింతుఁ బురాన్నుగ పాపభారముల్
ప్రామిన నా యధోగతిఁ గృపాజలధీ! యిటు క్రుంగఁజేయ జీ
వామృతధార లెండి నరుగై బెడ బాసితి సృష్టిలీలకున్.

చీఁకటి దేవతల్ నిరియఁజేసిన కారుమొయిళ్ల నొక్క-శం
పాకృతి లేదా, విశ్వవిలయాంబుద గర్జలవోలు మేఘమా
లా కఠినస్వరంబులె బలంబుగ గింగురు వెట్టు నీభవిన్
నీకృప లేని తావు గని నేను కుటీరము గట్టుకొంటిరా!

ఏదియొ యాసచే కరము లెత్తెద నీలనభోగ్రవీథి, మి
థ్యాదివముల్ సృజించుకొని తాండవమాడెదఁ గొంతసేపు న
న్నాదని తాఁకరాని గగనంబు హసించు; సహస్రకోటి తా
రాదుల తళ్కులో తునుకలై నుసియౌ పరమాణుభావముల్.

నా గళ మెత్తి దివ్యగగనంబునఁ బుల్గుల యెల్గులందునన్
రాగము నేర్వఁగాఁ బలుకరాక, నిరుద్ధగళశ్రుతుల్ నిరా
శాగతి బోటఁదీయు; విహగావళు లీదురదృష్ట జీవునిన్
మూఁగనుబోలెఁ జూచు మధుమోహనరాగము లాలపించుచున్.

నా విధి నాటి పోయిన వనం బిది నేఁడు ఫలించె, జన్మ జ
న్మావళులందు దోహదము లన్ని యొసర్చితి, నస్మదీయహృ
జ్జీవనధారఁ గాలువలు చేసి కుదుళ్లను గట్టియుంటి, నేఁ
డీవనిలోననే యనుభవింతును నాఫలసాయ మెల్లయున్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కవి సార్వభౌముడు - కాదంబరి

విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రి గారు

శ్రీమద్భట్టబాణ మహాకవి వెలుఁగని సంస్కృత భాషావేదియు, శ్రీనాథకవిసార్వభౌము వెలుఁగని యాంధ్రభాషాభిజ్ఞుఁడు నుండఁబోరు. బాణుఁడు తన కాదంబరిలో నపూర్వమైన రచనా ప్రణాళిక నేర్పఱచికొని రసాలంకార రీతివృత్తి శయ్యా పాకాదుల సమగ్రముగా సాంగముగాఁ బ్రకటించి, లోకమున శబ్దబ్రహ్మమునకుఁ బరిపూర్ణ వికాసము వెలయించి, పరిపంథికవివుల హృదయబాణమై, "బాణోచ్ఛిష్ట మిదం జగ"త్తను నాభాణకము నచ్చరింపఁజేసిన మహానుభావుఁడు. సంస్కృతకవులలో నాతని కీడాతఁడే. ఆంధ్ర కవి లోకమున శ్రీనాథుఁడు సునిశితసువర్ణపుంఖ విభ్రాజమాన బాణత్వముం బొంది యనేకములను కంచుఢక్కలం బగులఁగొట్టి ముత్యాలశాలలఁ గనకాభిషేకముం గాంచి వెలుఁగొందినవాఁడు. ఆంధ్రకవితాకుమారికి నానవోన్మేషముం గూర్చి ప్రోచినవాఁడీ శ్రీనాథుఁడే కదా. కావున బాణ శ్రీనాథకవు లిరువురు నన్యోన్య సాదృశ్యము గలవారు.

నన్నయ భట్టారకుం డాదిగ ననేకాంధ్రకవులు తమతమ కృతులందు బాణకాదంబరీ వాక్యములఁ గొన్నింటి ననుకరించియుఁ, గొన్నింటి ననువదించియు నున్నారు. శ్రీనాథుండన్ననో, యవసరమైనపుడెల్ల, ననువైనపుడెల్ల బాణకాదంబరీ వాక్యముల నుపయోగించుటయే కాక, శివరాత్రి మహాత్మ్య కృతివ్యాజమున రసవత్తరములగు కాదంబరీ భాగములనెల్ల నాంధ్రీకరించి యున్నాఁడు. కాదంబరీ భాగముల ననువదించు నిచ్ఛయే శ్రీనాథునకుఁ బొడమకున్న శివరాత్రి మాహాత్మ్యమను నొక ప్రబంధమే యాంధ్రమున వెలసెడిది కాదు. ఈశివరాత్రి మాహాత్మ్యమునకు మూలము సంస్కృతమున నీశానసంహితయందుఁ గలదు. ఈశానసంహిత శంకర సంహితాదులవలె నతి ప్రసిద్ధమైనదికాదు. అయ్యది నూతనముగా నొక తాళపత్ర గ్రంథమున నుపలబ్ధమైనది. ఈశివరాత్రి మాహాత్మ్య ప్రతిపాదకమగు కథ యందునూఱుశ్లోకములలోఁ గలదు. ఆ నూఱుశ్లోకములనే నాలుగాశ్వాసముల గ్రంథముగా శ్రీనాథుఁడు సంతరించినాఁడు.

కాశీఖండమున గుణనిధి చరిత్రమున శివరాత్రి మాహాత్మ్యము వర్ణింపబడినది. అందు గుణనిధి యను రాజపురోహితాత్మజుఁడు వేదాధ్యయన మొనరించు వయసున జూదమాడ మరగి, చాటునమాటునఁ దల్లిచే ధనము గొని సభికుల కర్పించి, తన దుర్వృత్త మెఱింగిన తండ్రిచే నిష్కాసితుండై, యూరువాసి, తిండికిదూరమై మూఁడుమూఁడి, యొకశివరాత్రి పర్వమున శివనివేదితాన్నము నాఘ్రాణించి, శివపూజ నాలోకించి, శివస్తుతుల నాలించి, శివాలయమున జాగరణంబొనర్చి, శివనివేదితాన్నమును ముచ్చిలి శివనికేతనోపాంతమున మృతుఁడై తత్సుకృత పరిపాకవశమునఁ గైలాసమున బ్రమథత్వ మొందెనని శివరాత్రి ప్రభావము వర్ణింపఁబడినది. ఈకథ సంస్కృత కాశీఖండమునమున్న దాని నట్లే శ్రీనాథుఁ డాంధ్రీకరించినాఁడు. కాని యంతమాత్రమున శివరాత్రి వ్రతమున కధిక మహత్త్వము గాని, పతితున కధిక పాతిత్యము గాని ప్రకటింపఁబడమిచే నిహపరలోక మహారౌరవమునకు నిదాఘాత ఘంటాపథమును నిర్మింపఁదలంచి శ్రీనాథుఁ డీశివరాత్రి మాహాత్మ్య ప్రబంధమును సంధానించినాఁడు. ఇందలి కథ చిత్తగింపుఁడు.

రత్నపురాధిపతియగు హేమాంగదునకుఁ బ్రధానామాత్యుఁడు యజ్ఞదత్తుఁడు. అతనికి లేక లేక, యనేక దానధర్మములు సేయఁజేయ వాని మహత్త్వమునం జేసి సుకుమారుఁడను కుమారుఁ డుదయించి, వేదవేదాంగాది సమస్త విద్యలను, జతుష్షష్టికలలను సముపార్జించి, యౌవనాగమమునఁ గన్నుగానక మదాతిరేకమున మదవతీ మదిరాపానములకు వశుఁడై, తన సౌందర్య సౌకుమార్యములకు వలచిన పౌరసీమంతినుల నశేషముగఁ, జిన్న పెద్దలనక, గురుదారలనక, రమించి, ద్యూతాదిధూర్త వ్యాపారములఁ బార



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మేది, పట్టఁ బగ్గముల కగ్గలమై విజృంభించినాఁడు. వాని దుష్ప్రవర్తనల సైఁపలేని పౌరుల యాక్రోశము నాలించి రాజు వాని నూరు వెడలించెను. రాజనిష్కాసితుఁడైన వాఁ డడవులంబడి తడవులం బోయిపోయి, కొండొకతఱి నిర్మలాంభః పూరమగు నొక్క కమలాకరముం దఱిసి, యం దవగాహన మాచరించి నీరు ద్రావి లేదూఁడుఁ దీవలి మెసవి, పరిశ్రాంత సులభయగు నిద్రకుం జిక్కి పవలెల్ల నొడ లెఱుంగక నిద్రించి, యెఱసంజవేళ మేల్కని యట నిట చూచుచున్నంత నాతని కట్టెదుట నొక్కచండాల కన్య, నీలంపు సాలభంజికల మేలుడాలు డీలు సేయఁజాలు మై చాయ గలది, లావణ్యరసజలధి, పరిపూర్ణ యౌవన విలాసములది, గాననయ్యెను. ఆయిరువురు నన్యోన్య సస్పృహనిరీక్షావశంబునఁ గొంతతడ వున్నంత, సుకుమారుం డు మారబాణాభితప్తుండై యమ్మత్తకాశిని నొడంబఱిచి యటనే తత్క్షణకల్పితమైన పల్లవతల్పంబున నాసంధ్యా సమయమున నాచండాలిని నిర్విశంకముగ రమించి మహాపాతకి యయ్యెను. మఱియు వాఁడు చండాలీ సంకేతితమగు భద్రకాళీ నికేతనమున వసించుచు, జనంగ మవనితానీతమగు నన్నమును భుజించుచు, నీదుర్వర్తన మును మఱుఁగుపఱుచుచు నెడనెడ బ్రాహ్మణులయిండ్ల జరగు శ్రాద్ధసంతర్పణాదుల కరిగి భుజించుచుఁ, దా నొక్కఁడే కాక యాయూరి బాడబకులమునెల్ల మైలపఱి చెను. ఇట్లుండఁ గొంతకాలమునకు వాని దుశ్చరిత్ర మా యూరఁ దేటతెల్లమగుడు, వాఁ డామాలెతను గూడి యా దేశంబువాసి కిరాతదేశంబున కరిగి, దానితోఁ గాఁపురము సేయుచు దానియం దిరువురుకూఁతులను, నొకకొమరునిం గనియెను. అంతఁ గొంతకాలంబునకుఁ దనపాపఫల మను భవించుటకోయన నా మాలెత పరలోకమున కేఁగెను. సుకుమారుండు సతీవియోగము సరకుగొనక ధైర్యము నాలంబించి, చిఱుతకూఁకటి ప్రాయముగల తన కూఁతుఁ గుఱ్ఱలనే భార్యలుగాఁజేకొని దాంపత్యసుఖ మనుభవింపు చు, నొక్క శివరాత్రి దినమునఁ దన ముద్దుగుమ్మలకు బూలును, మాంసమును గొనివచ్చుచు మధ్యేమార్గమున శివాలయమున జరగు నర్చనాదికము నలవోక నవలో కించి ధూతకల్మషుండై మరణానంతరమున శివలోక మునఁ బ్రమథత్వ మొందెను. ఇది శివరాత్రి మాహా త్మ్యమునందలి కథ. కాశీఖండకథకు దీనికి నెంత తారత మ్య మున్నదో యోజింపుఁడు. వాస్తవముగ శివరాత్రి వుత్కర్ష మును, దోషికి, బాతిత్యమును బ్రకటింపవలె నన్న నీకథకుఁ గాశీఖండకథ యిసుమంతయేని సాటి గాఁజాలదుగదా ?

ఉన్న కథయేమో స్వల్పపరిమితి గలది. తాను రచింపనున్న ప్రబంధమో పెద్దది. శ్రీనాథుఁడెంతటి కవి సార్వభౌముఁడైన నాతని కృతులన్నియు నేదేనొక్క మూలకృతి కనువాదములే గాని స్వతంత్రకృతులు గావు. ఈ సార్వభౌముఁడు లబ్ధప్రశమనస్వస్థుఁడే కాని సొంతముగ నిర్మించువాఁడు గాఁడనుట విదితమే. కావున నీప్రబంధము ననుబంధించుటకుఁ గాదంబరీమత్తు గావలసి వచ్చినది. సంపూర్ణ మూలముగల కృతులందే యాతఁడు కాదంబరీ రసపాన మొనరింపక మానఁడు. అట్టియెడ కేవల స్వల్పమూలములగు నిట్టి కృతులందుఁ గాదంబరీ రసము వెల్లివిరియకుండునా ? ఈ గ్రంథమునఁ గాదంబరిలోని వర్ణనములు, వాక్యములు మూఁడుపాళ్లును, స్వతంత్రరచన మొక్క పాలును గలదు. ఏకారణముననో కాని కాదం బరికిని ననూదితభాగములకును గొన్ని భేదము లగపడు చున్నవి. వాని నీసారిది నుదాహరింతును.

"చక్రధర ఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖ చక్రలాంఛనః, గంగాప్రవాహ ఇవ భగీరథపథప్రవృత్తః, రవి రివ ప్రతిదివసోపజాయమానోదయః, దిగ్గజ ఇ వాన వరతప్రవృత్త దానధారార్ద్రీకృతకరః, కర్తా మహాశ్చ ర్యాణామ్......ఆదర్శ స్సర్వశాస్త్రాణామ్, ఉత్పత్తిః కలానామ్, ఉత్పాతకేతురహిత జనస్య, ఉదయశైలో మిత్రమండలస్య." కా-ప్ర. భా-గ. ౧.

"గ్రహగణ ఇవ బుధానుగతః, పశుపతి రివ మహా సేనానుగతః, భుజగరాజ ఇవ క్షమాభరణ గురు."

ప్ర. భా-గ. ౨౩౨.

సీ. "శివునికైనడి మహా సేనానుయాతుండు
బలభేదిపగిది నపత్యపాయుఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డరవింద హితులీల నధిగతాభ్యుదయుండు
    బుధునిక్రియ నజహత్ప్రవక్రుండు
గంగాప్రవాహంబు కరణిఁ బావనమూర్తి
    భుజగాధిపునిభంగి భోగశాలి
యేనుంగుచందాన దానధారాశోభి
    శౌరిలాగున శంఖచక్రపాణి
కర్త యాశ్చర్యములకు నాకరము నీతి
కఖిలవిద్యాగమములకు నాస్పదంబు
పగఱకుత్పాతకేతువు బంధుకోటి
కమరలోకద్రుమంబు హేమాంగదుండు."

శి-ఆ. ౨, ప. ౧౩.

ఇందు గంగాప్రవాహ ఇవ భగీరథ పథప్రవృత్త యనుదానిని గంగాప్రవాహంబు కరణిఁ బావనమూర్తి యనియు, ఉదయశైలో మిత్రమండలస్య అను దానిని బంధుకోటి కమరలోకద్రుమంబు అనియు, గ్రహగణ ఇవ బుధానుగత అను దానిని బుధునిక్రియ నజహత్ప్రవక్రుండు, భుజగరాజ ఇవ క్షమాభరణగురు అను దానిని భుజగాధిపునిభంగి భోగశాలి యనియు నాంధ్రీకరించినాఁడు. మక్కికి మక్కిగా నాంధ్రీకరించు నెడలఁ బై గద్యముల భావము నాంధ్రమునకుఁ గొనివచ్చుట కెంతయు శ్రమ పడవలసియుండును గదా. పైఁగా నాంధ్రీకరణ మంత సొంపుగాఁగూడ నుండదు. దానంజేసి గడుసుదారి కవి మూలమందలి భావముల మార్చి, లేనివి చేర్చి యాంధ్రీకరణము నొక్క స్వతంత్రప్రాయముగాఁ గూర్చినాఁడు.

"ధౌమ్య ఇ వాజాతశత్రోః దమనక ఇవ భీమస్య సుమతి రివ నలస్య." ప్ర. భా-౫. ౨౮౩.

వ. "ఆరాజునకు నఖిలకలా కలాపావగాహన గభీరబుద్ధి యజ్ఞదత్తుండను బ్రాహ్మణుండు అజాతశత్రునకు ధౌమ్యుండును నలునకు దమనకుండునుం బోలె."

శి-ఆ. ౨, ప. ౧౫.

మూలమున భీముండను రాజు, సుమతియను మంత్రియు నుండ నాంధ్రీకరణమున వారిని విడుచుటయే కాక నలునకు భీముని మంత్రియగు దమనకుని గూర్చినాఁడు. నలుని భార్యయగు దమయంతి భీముని పుత్రి యనియు, నామె దమనకుని యుపాయము వలన జనించుటచే దమయంతి యను పేరఁ బరఁగెననియుఁ బ్రసిద్ధమే. సుప్రసిద్ధమయిన యీకథ యాంధ్రీకరణమున దారుమారగుట కేమిహేతువో?

"గళగృహ్యమాణజరచ్ఛాగమ్" కా-ప్ర. భా.

గీ. "జరఠమేషంబు కంఠదేశమున జుట్టె
    బుప్పడుం డుఃభకము నొక్క పువ్వుబోఁడి." శి. ౨.

గళగృహ్యమాణ మనఁగా విశేషనము చేయఁబడుచున్న యని యర్థము. ఇట్లు విశేషనము చేయుట యుత్కలాది దేశములం దాచారము. ఆంధ్రీకరణమునం దీయర్థము రాదు. వ్రాయునన్న క్లిష్టమార్గమునఁ దేవలయును.

"శ్రూయతేహి పురా చండకౌశిక ప్రసాదాన్మగధేషు బృహద్రథో నామ రాజా జనార్దనస్య జేతారమతుల బల పరాక్రమం జరాసంధం నామ తనయం లేభే దశరథశ్చ రాజా పరిణతవయా అపి విభండక మహామునిసుతస్య ఋశ్యశృంగస్య ప్రసాదా న్నారాయణ భుజానివాప్రతిహతా నుదధీని వా ఙ్భోభ్యాన వాప చతురః పుత్రాన్."                ప్ర. భా. ౩౧౦.

వ. "సర్వజగత్ప్రసిద్ధంబు గదా యితిహాసంబు: తొల్లి చండకౌశికు వరప్రసాదంబున మగధాధిపతి యగురాజు దైతేయకులవిమర్దనుం గెలువం దగినయట్టి శౌర్యనిధి జరాసంధుం గాంచె. దశరథుండు విభండక తనయు నారాధించి దిగ్గజంబులం బోలిన కుమారుల సకలలోక హితంబుగా నలుగురం బడసె. "శి-ఆ. ౨, ప. ౩౫. మూలముననున్న బృహద్రథపద మాంధ్రమున విడువంబడుట కవి లోపమో లేక లేఖకులలోపమో? కాని దశరథుడు నారాయణ భుజములం బోలె నుదధులవలెను నలువురఁ గొడుకులఁ బడసెనని యుండ, దిగ్గజములవలె నలుగురనుట మాత్రము యుక్తముగాదు. ఎనిమిదియను ప్రసిద్ధిగన్న దిగ్గజములలో నాల్గింటిని బ్రత్యేకించుట లోకవిరుద్ధము. కాదంబరీ భాగములకు నాంధ్రీకరణమునకు నిట్టి భేదము లనేకము గపడుచున్నవి. ఇవికాక యాతని స్వతంత్ర కల్పనములందును గొన్ని దోషము లగపడుచున్నవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. "ఈశ్వరుం డద్రిజా నాథుఁ డిందుమౌళి
కరుణ లేకను సుతుఁ డెట్లు కలుగనేర్చు
చంద్రనందనచంద్రికాశైత్యమైన
ఘనపరిరంభ సౌఖ్యంబు పుర్వుబోణి."

శి-ఆ. ౧, ప. ౩౩.

ఇందుఁ బూర్వాపరార్థముల కన్వయమే లేదు. ఉత్తరార్థమునకుఁ గ్రియ లేదు.

"మహుదినము లమ్మహాసతి వు పట్టపుదేవికి."

శి-ఆ. ౨, ప. ౫౦.

శా. "సీమంతోన్నల సంభ్రమంబు వెలయం
జేయించె శ్రీయజ్ఞద
త్తామాత్యాగ్రణి కావ్యపాలకుఁడు."

ఆ. ౧, ప. ౫౨.

సచివునిభార్య పట్టపుదేవి యగునా? సీమంతోన్నయన మెవరికి? యజ్ఞదత్తునకా, యాని భార్యకా? సంతోషవాచకమైన తెలుఁగు సంబరము సంస్కృత సంభ్రమమగునా?

గీ. "పగవు లిచ్చిరి పుట్టింటి తల్లి ప్రజలు"

పుట్టింటి ప్రజలా? పుట్టింటితల్లి ప్రజలా?

క. "కరశీకరార్ద్రీపుష్కర
కరుఁడై యాత్రండు గంధకరిరాజు క్రియన్
పరిషేకాంతరమున దా
సరసిరుహాకరము వెళ్లి చయ్యన వచ్చెన్."

ఆ. ౩, ప. ౨౩.

పరిషేకాంతము లేక పరిషేకానంతరమ్ముగాని పరిషేకాంతరము కాదు పరిషేకాంతరమునఁగా స్నానసమయమున నని యర్థము.

క. "కొలనిదరినటమునీడన్
శిలాతల్పమునందుఁ గొంతసేపు శయించెన్
జెలువ మగు వలిపె దుప్పటి
తలగడఁగాఁ జేసి సచివతనయుం డంతన్.

గీ. "బహుళపక్షక్షపాకదంబములలోనఁ
ప్రభవ మందిన యాంగ్లకారంబువోని

కొలనిదరికాననంబునఁ గొంతప్రొద్దు
నలపువాయంగ నిద్రించె యజ్ఞదత్తి.

గీ. "దప్పి దీఱంగ మధురకాంతములఁ గ్రోలి
కడుపు నిండంగఁ దూఁడుఁ దీఁగల భుజించి
రెండు వాలారు నందాఁక నిండుకొలని
తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు."

ఈ పద్యములలో మూఁడవదానికిఁ దొలిరెండును బాఠాంతరములుగా నున్నవి. మొదటి రెండు లేకున్నను సందర్భహాని రాదు. మొదటి రెండుపద్యములు పరస్పర విరుద్ధములుగా నున్నవి. మొదటిదానియందుఁ గొలనిదరి వటము నీడ నిద్రించెనని యుండఁగా రెండవదానిలో గొలనిదరి కాననంబున నని కలదు. కాననము వటము, వటము కాననము గానేరవుగదా? అనునన్ని నీపద్యము లనవసర ప్రయుక్తములే యనక తీఱదు. మూఁడవ యాశ్వాసమునఁ జండాలీ సుకుమారసమాగమావసరమున మంచి రసవంతమైన పట్టునఁ "గలుగుచున్నవి యనేకములు వికల్పము" లిత్యాద్యుత్ప్రేక్షోపవర్ణనములును, స్త్రీ పురుషదూషణములును నెంతయు రసభంగమును గలిగించుచున్నవి. ఇట్టి వింక ననేకములు గలవు గాని వానినెల్ల నిట వివరింపఁ దావు చాలదు. శ్రీనాథుఁడు కాదంబరీకథ నీగ్రంథమున నెంతవఱకు యోగించెనో యింక పరికింపుదము.

కాదంబరిలోని శూద్రకుఁడును, తారాపీడుఁడును గలిసి యిందు పేమాంగదరూపము నొందినారు. కాదంబరిలోని శుకనాసుఁడే యిందు యజ్ఞదత్తుఁ డయినాఁడు. కాదంబరిలోని తారాపీడుని పట్టపుమహిషి, విలాసవతియు శూద్రకుని యంతఃపురమును జేరి యిందు యజ్ఞదత్తామాత్యుని భార్య సుశీలగా నవతరించినారు. సుశీల బ్రాహ్మణి మంత్రిభార్యయైనను నిందుఁ గాదంబరీ రసపరవశత్వమునఁ బట్టమహిషీత్వ మొందినది. కాదంబరిలోని చంద్రాపీడ వైశంపాయనులే యిందు విద్యాభ్యాసంగము విషయమున సుకుమారత్వము నొందిరి. కాదంబరిలో శుకమును దీసికొని వచ్చిన చండాలదారికారూపచ్ఛన్న యగు మహాలక్ష్మియే యిందుఁ గథానాయిక యగు జనంగమ కన్యారూపమునఁ బరిణమించినది. అందలి పక్కణమే యిందలి పక్కణము. అందలి శబర సేనాపతి మాతంగకు డింద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాలెతతోఁ గాఁపురము సేయు సుకుమారపాత్ర భూమిక దాల్చినాఁడు. అందలి శేబర పైనిషలిందు వృద్ధసుకుమారుని పరివారమై యున్నారు. కాదంబరిలోఁ దారాపీడమహిషి విలాసవతి సంతతి లేక విచారించుట, భర్త యామె నోదార్చుట, శివాలయమునఁ బౌరాణికునివలన నపుత్రకులకుగతి లేదని వినుట, దానధర్మాదు లాచరించుట, గర్భప్రాప్తి, ప్రసూతిగృహాలంకారము, ప్రసవము, ప్రసూతికాల కార్యాచరణము, కుమారసంవర్ధనము, కుమారజ్ఞానసంక్రమణము మొదలగునవి శివరాత్రి మాహాత్మ్యమునందు యజ్ఞదత్తుని భార్య, విలాసవతికుమారుఁడు, సుకుమారుఁడు వీరి విషయమున సరిగ నట్లే సంక్షేపించి వర్ణింపఁబడినవి. శివరాత్రి మాహాత్మ్యమున సీమంతోన్నయన పుంసవనములు మాత్రము స్వతంత్రముగాఁ గాదంబరిలో లేనివి వర్ణింపఁబడినవి. ఆరెండు కర్మములు నేకకాలముననే జరుపఁబడినట్లు వర్ణింపఁబడుటచే శ్రీనాథుని కాలము నాఁటికే అథమాథమమగు అశ్వాథవాపకము మనదేశమున నెలకొన్నదని తెలియనగును. ఇప్పుడాకర్మలు స్వరూపముతోడనే నశించుటచే వాని విచారమే యక్కఱలేదు. సుకుమారుడు యౌవన ప్రాదుర్భావానంతరము దుర్వృత్తుఁడై చెడుపోకలు పోవుచున్నపుడుగూడ నాతఁడు కాదంబరీ రసాస్వాదము మానలేదు. ఏవో శివయమదూతల యుద్ధములు, శివరాత్రివ్రత విధానము మొదలగు కొన్ని సందర్భముల నావలనుంచిన మిగిలినదెల్లఁ గాదంబరియే. అట్టిభాగములం దక్షరమక్షరమునకును గాదంబరియందు మూలము గలదుగాని బాసుగ కాదంబరి యంతగతము గానివారికావిషయమున నమ్మిక కలుగుట కష్టము. మాయదారి శ్రీనాథుఁ డింగ్లీషు ప్రభుత్వమువలె నైదువేలమైళ్లదూరముననున్న పదముల కేకబంధము గల్పించి యతుకున్ను. ఇది యాతని హస్తలాఘవవిశేషము. ఇట్టి ప్రజ్ఞ యాతనికిఁదక్క నింకెవ్వరికి నింతవఱకలవడలేదనుట గురుదూషణము గాకుండుఁగాక. ఇంతతో నీవిషయము నటుంచి యొక్క విశేషముమాత్ర మిటఁ జేర్కొనియెదను.

శివరాత్రి మాహాత్మ్య పీఠికలో నీగ్రంథము ౨౦ సంవత్సరము లజ్ఞాతవాస మొనరించినదని వ్రాసియుంటిని: అది ప్రమాదము. ఈగ్రంథముగూడఁ గొంతకాలము ప్రకటముగానే యుండి యాంధ్రకవుల కాదరపాత్రమై యుండెడిదని తెలియనగును. చిత్తగింపుఁడు:

ఉ. "కాయజవిక్రియం బడయఁ
    గానికులంబున సంభవించి య
న్యాయము సేయునే యిటు దు
    రాత్ముఁడు వీఁడు ప్రతాపాభిమానముల్
మాయఁగఁ దట్టి యంచు నతి
    మాత్రము లజ్జితుఁడైన కైవడిం
దోషజవంశబాంధవుఁడ
    ధోముఖుఁడయ్యె నభోంగనమ్మనన్.

శా. "ప్రాలెం బశ్చిమశైలశృంగముపయిం
    బ్రత్యగ్ర మహ్యాగమో
న్మీలత్కింశుకకోరకస్తబకకాం
    తి న్మానుసన్మండలం
బాలంబించె మరుండు హస్తమున దా
    ల్పారామలీలావతీ
భ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముం
    బుండ్రేక్షుకోదండమున్.

క. "క్రుంకె విభాకరబింబము
పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్వీథిన్
గంకేళీతరుపల్లవ
సంకాశచ్ఛాయఁ గొమరు సంజ జనించెన్."
                    శివరాత్రి మా. ౩ ఆశ్వా

ఈపద్యములకుఁ బ్రతిబింబములు మనుచరిత్రమునఁ గలవు.

చ. "తరుణి వసన్యకాంత నతి
    దారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి సంగభవు
    బారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁడ
    హంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించె నోయన న
    భోమణి దాల్చెఁ గషాయదీధితిన్."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. "శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బా
కెం బక్షు లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృ
ష్ణావార్ధు లింకెన్ జపా
శోణం బయ్యెఁ బతంగబింబము దిశా
స్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు ని
ద్రాణంబు లయ్యెం గడున్."

ఆంధ్రకవితాపితామహుఁడు కవిసార్వభౌముని యీ శివరాత్రి మాహాత్మ్యముం జూచె ననుట కీపద్యములే తార్కాణము. మనుచరిత్రమునందే కాక యితర ప్రబంధములం దనేకములు శివరాత్రిమాహాత్మ్యమునుండి యనుకరణము గలవు. వీని నెల్లఁ బర్యాలోచించిన నీగ్రంథము చాలకాలము ప్రచారముందే యుండి దౌర్భాగ్యవశమున గొంతకాలముమాత్రమే యజ్ఞాతమైనదని తెలియనగును. ఆంధ్రసాహిత్య పరిషదుల యఖండ వ్యవసాయమున నేకైక శిథిలాతిశిథిలప్రతి లభించినది. దాన గ్రంథపాతములు బహుళముగ నుండుటచే నీగ్రంథము విషయమై యొక్కమాటయైనను నిస్సంశయముగఁ జెప్ప ననువుగా కున్నది. ప్రత్యంతరము శాంతయ్య యవతారికతోడనో, లేక దానితో శూన్యముగానో లభించువఱకు మన కీడో లోత్సవము తప్పదు. ఆంధ్రభాషామతల్లి కడుపు చల్లనగా నా ప్రత్యంతర మచిరకాలముననే లభించుఁగాక. మహాశయులారా! కవిసార్వభౌముఁడు కాదంబరీరసాస్వాదతత్పరతచే శివరాత్రి జాగరణంబు సేయించి కైలాస మార్గంబు చూపినాఁడు. నేను నా కాదంబరీ మత్తావలననే యుత్తమమగు విూకాలమును హరించినాఁడను. నన్ను మన్నింపుఁడు.

---

## పా పా యి లీ ల లు

బసవరాజు అప్పారావుగారు

(వాగీశ్వరీరాగము - జంపెతాళము, ఖండజాతి)

దినదినముపాపణ్ణి దీవించిపొండీ
దేవలోకములోని దేవతల్లారా!
నాపాపనిద్దట్లొ నవ్వుకుంటాడు,
ఆస్సెకాలాడేనొ అప్సరలతోను? ॥దిన॥
మాతండ్రినిద్దట్లొ మాటాడుతాడు,
తెలియజెప్పేనేమొ దేవరాశ్శాలు? ॥దిన॥
కన్నయ్యనిద్దట్లొ కన్నుగిలికేను,
వెఱ్ఱిలోకముజూచి వెక్కిరించేనొ? ॥దిన॥
వాగీశ్వరీప్రేమ రాగమాలించి,
చిన్నయ్యబబ్బోర శ్రీరామరక్ష! ॥దిన॥
దినదినముపాపణ్ణి దీవించిపొండీ
దేవలోకములోని దేవతల్లారా!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆకస్మిక ఛాయా చిత్రములు

**(SNAP SHOTS)**



'సోసి'

(మొదటి బహుమానము)

శ్రీ ఏ. యస్. గోవిందరాజుగారు తీసిన ఛాయాచిత్రము.



'సావాసము'

శ్రీ కె. వి. గిరిగారు తీసిన ఛాయాచిత్రము.



'ఓ రక్కడ, అమ్మా!'

(రెండవ బహుమానము)

శ్రీ పి. భూపతినాయుడుగారు తీసిన ఛాయాచిత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## తృతీయాంకము

### రంగము ౧

స్థానము:—రాజమందిరము.

సమయము:—ఉదయము.

(విశ్వపతి ప్రచారము చేయుచుండును తెల్లని యుడుపులు ధరించియుండెను. ఉత్తరీయము లేదు. క్షాత్ర వీశమును చిత్రముగా చేతులపు పెనవైచుచుండును.)

విశ్వపతి:—అర్భకుడు పాపము నిష్కారణముగ హతుడైనాడు. ఎవడురా అక్కడ?

(ద్వారరక్షకుని ప్రవేశము.)

ద్వార:—ఏమి ఆజ్ఞ ప్రభూ!

విశ్వ:—మహారాజు విచారగ్రస్తులైయున్నారు. ఎవరైన పరామర్శించుటకు వచ్చిన యిప్పటికి పంపుమని యప్పటి ద్వారరక్షకునికి తెల్పుము. నాయాజ్ఞ లేనిదే ఎవరిని లోనికి పోనీయరాదు. పొమ్ము.

ద్వార:—చిత్తము. (ప్రస్థానము.)

విశ్వ:—అమాయకుడే. నాతృష్ణాపథమున కంటకముగ వచ్చినాడు. విధి లేక నేను నామార్గమును నిష్కంటకముగ జేసుకొంటిని. తప్పా? పోనిమ్ము దీనికి నిష్కృతి నేను కుమారరాయల యాత్మను శాంతి నాశీర్వదింతు గాక! (వికారముగ నవ్వుకుని) హత్యానంతరము పాప భీతిచే కలుగు హంతకసామాన్యమగు యాతనయు నాకు లేకున్నదే. ఆహా!

క. ఇదియేమి మాయ ఘన శాం
తిదమై క్షమ తోచుచున్నదే! యిక శ్రేయో
రుదయం బానో యేమో
యిది! పశ్చాత్తాప మెందు నిట్టిది కలదే!

(శిరఃకంపనజేసి) ఆఁ—ఆఁ—వాని అదృష్టమును నే ననుభవించునంతకాలము నతడు నాకు చిరస్మరణీయుడౌ గాక! ఈ పవిత్ర చింతనమే నాకు సాంత్వనము. ఔను! ఈ పవిత్రోద్దేశము నే దక్కించుకొనగల్గినచో హంతకు లెల్లరు ధన్యులౌదురు కదా! ఓహో!

మ. తనభాగ్యోదయ సంధిదోషమున ద
గ్ధంబైన జీవంబు నా
త్మనె పూజించి కృతజ్ఞుడౌ నధముడుర్
ధన్యుండె; హత్యాఘు మా
తని నేమాత్రము నంటరాదు ఘనవే
దజ్ఞుల్ ప్రవర్తించు త్రో
వను పోజాలు మహాప్రబుద్ధుడగు వి
ద్వాంసుండ నైతిన్ భళీ!

నాది నిజముగ సాత్వికదౌర్జన్యము. ఉగ్రముగ నాడు గూఢశక్తి నను రెచ్చగొట్టకున్న ఇంతలో నింత ఘోర మొనర్చియుండను. నా వ్రతమును చెడగొట్టి నాలో నెచ్చటనో యలసరైయై పడియున్న హింసాభుజంగికి నలజడి గొలిపి దానికోరలు పట్టుకుని చిలిపి చేష్టలుచేసిన విషయోగము పట్టును. దానికి నేనా బాధ్యుడను? ఇది మాత్రము నే నెంత నిర్లక్ష్యముగ జేసితిని! ముందుగురి మాత్రము చూచుకుని, వానివైపు చూడకుండ, ఖడ్గమును వెనుకకు బెట్టి ఒక్కటే కదా పోటు పొడిచినది-తరువాత కత్తినైన చూడకుండ తుడిచి యొఱబెట్టి తిరిగిచూడకుండ వచ్చితిని. నేను మాత్రము హత్యను చూడగలనా!

(సేవకుని ప్రవేశము)

సేవ:—దేవా! జయము జయము.

విశ్వ:—ఏమి విశేషము?

సేవ:—మహామంత్రి వారును, గోవిందరాయలు వారును శ్రీవారిని పరామర్శింప వచ్చి తమకు తెలుపగోరు చున్నారు.

విశ్వ:—నేను వచ్చి వారిదర్శనము చేతునని చెప్పుము. ఇప్పుడు వారెచ్చట నుండిరి?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సేవ:—పెద్ద నామాత్యులవారి కార్యాలయమున నుండిరట.

విశ్వ:—సరే. వచ్చుచున్నామని వార్తనంపుము.

సేవ:—చిత్తము. (ప్రస్థానము.)

విశ్వ:—కాని ఇప్పుడు శవము మాయమైనదే' ఏమి టీ చిత్రము? కళేబరచౌర్యము! ఎవరో గొప్పశత్రువులే యేర్పడినారు. ఎంత ప్రయత్నించినను వారిజాడ నరయలేకుంటిని. ఏమి మందబుద్ధి! ఛీ-ఛీ; యిప్పుడీ తృణము తెలుసుకొనవలెను. లేకున్న విశ్వపతీ! నీ విక శిరచ్ఛేదనము జేసుకొనవలసినదే. (అప్రయత్నముగ నరిని ముష్టి, శిరమున ఘాతమగును.) దుర్భేద్యమగు నాయజ్ఞాతము నొరులు పసిగట్టుట సాధ్యమా, నేనై చెప్పకున్నచో! (రహస్యము ప్రత్యక్షమైనట్లు. నయనముల విరుసుకొని) ఆఁ. ఔను. నేనే చెప్పితిని. చిత్రావలికి స్వీయ కథనే చెప్పితిని. ఆపిల్ల తా విన్నకథను చతుర్దశభువనములకును చాటించిగాని నిద్రింపదు. ఆకథలోనైన నెచ్చటో అఖాతమున ధ్వనించు నావ్యూహమును పసిగట్టగల్గు మేధామూర్తు లెవ్వ రిచ్చట? రామకృష్ణకవి, తిమ్మరుసు-వీరికి గాక యిట్టిప్రతిభ యెవరికిని లేదు. వారే నాశత్రువులు. ఇది యీవఱకె తోచిన యిప్పటి కప్పుడె హత మార్చియుందునే.

(చిన్నాదేవి దుఃఖక్రోధములు సంపడిగొను డెంధమున వచ్చును. కుడిచేతిలో బాకున్నది. ఎడమచేతిలో నొక చీటీయున్నది.)

చిన్నాదేవి:—

గీ. సింహపీఠిని, ప్రేమ నాశీర్వదించి
నిద్రవుచ్చిన పిల్లవానిని దురీశ!
భయద ఛండాల హీనచార్వాకవృత్తి
కసిమసంగిన యట్టి యాఖలుఁడ వీవె!

అఘోరుడా! నాకుమారుని నాసర్వస్వముసు మారణమొనర్చిన హంతకుడవు. నాస్వర్గమును నాయుబలాటమును బురదలో పూడ్చిన ఖలుడవు. శోకముచే నాపతికి మతిపోయినది. నాదేహము మండిపోవుచున్నది. శోకములో నేనును మునిగిపోకముందే నేను రాణిని హంతకుని నిన్ను-(ఆగును.)

విశ్వపతి:—ఆగెద వెందులకు? ఆధోరణి సాంతము కానిమ్ము.

చిన్నాదేవి:—ఈబాకును నీహృదయములో పిడివరకు గ్రుచ్చెదను. నాదేహ మెట్లు మండుచున్నదో చూచితివా?

విశ్వపతి:—చూడ కేమి! క్రుద్ధభుజంగి తోకకొనమీద నిల్చొనినది. వేయినోళ్ళతో విశ్వమున ప్రతిహింసాగరశమును చండవిషగ్రీష్మమును గ్రక్కుచు నాదిశేషుడే వచ్చినట్లున్నది. ఆమంట యుబుకులకు తలమీది భూమి యెగిరి యదిరిపడుచున్నది.

చిన్నాదేవి:—(దేహము కంపించును.) ఒక్కపదగ చాలదూ నిన్నాది వేయుటకు? పాపమనకు జంకని యీపాషాణమూర్తి యసహ్యమయి నాశక్తి నూది వేయుచున్నది; శక్తిపోకముందే- నిన్ను- అంతమొనర్చెదను. (చేయి విసరును. బాకు జారిపోవును. కదిలిపడి మూర్ఛిల్లును.)

విశ్వపతి:—మూర్ఛపోయినది. దేవజాతిసర్పము; నగుని చూచి ఈ యాదిశేషువు తలమీది భూమిని విసరిపడవైచి వేయి శిరస్సుల దానికి వైచి చితుకగొట్టుకొనుచున్నాడు. వీని తల జితుకగొట్టుదునా? (చిన్నాదేవి చేతినుండి జారిపడియున్న చీటిని జూచి) ఆఁ! ఈ చీటీ యేమిటి! (తీసుకొని చదువును.) "నీకుమారుని చంపినది విశ్వపతియే. జాగ్రత్త." అని వ్రాయబడినది. ప్రతిస్పర్థి పండితుడా, మూర్ఖుడా? కర్తవ్యమును సూచింపక యీమె యేమిచేయగలదని యీహెచ్చరిక! కాదు. పోగరు గుప్పిన ప్రతిభను శుద్ధవాచాలుడ ననుచుంటిని. ఊహా మేఘములనే మెఱయు నాబుద్ధి యఖండమైనదని గర్వాంధుడ నైతిని. ప్రత్యక్ష జగత్తున ప్రయోగానుభవమున నిక నా బుద్ధి సిద్ధిజెందవలెను. మొదట చీటీ రాణికి స్వాగతము, నాకుద్వాసము—ఇప్పుడీ హెచ్చరిక! రెండును నాకంటబడినవి. ఇది వారి సంకల్పమైకూడ నుండును. వచ్చినవాని వచ్చినట్లే గుప్తముగనే సాగనం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుటకు పన్నిన పన్నాగ మిది! శత్రుభయమున కంగారు పడి కాలికి బుద్ధిచెప్పుదునని యూహించియుందురు. కాని మ్మాశత్రుజంజాటమును మూటగట్టి పూడ్చిపెట్టు దును గాక!

చిన్నాదేవి:—(మూర్ఛదేరి) అయ్యో! ఇంకను నీవు చావలేదు?

విశ్వపతి:—చావలేదు. అది చాల కష్టముకూడ సోదరీ!

చిన్నా:—సోదరీ! అయ్యో! నే నిక భరింపజా లను. సత్యమందరికిని చెప్పివైచెదను.

విశ్వ:—(పట్టుకుని నోరు మూసి) అరచితివా జాగ్రత్త!

చిన్నా:—(బలముగా విశ్వపతిని త్రోసివైచి) ఛీ! నన్ను స్పృశింతువా దురాత్మా!

విశ్వ:—మనసుట్టు బయలు చేసితివా నీకును నాకును రహస్యసంబంధ మున్నదని చెప్పెదను. జాగ్రత్త! నీ ఆటలు నాదగ్గరా:

చిన్నా:—ఆఁ—ఆఁ—ఇంత పచ్చివాడవా!

విశ్వ:—బిగ్గరగ మాట్లాడకు మింతవర కెవ్వరును లేరు. అదృష్టమే. పిచ్చిదానా! ఎవరో పంపిన యీ దొంగ చీటిని నమ్మి యింత యాయాసపడినావు! నీకోప వేగము నాపుటకు వేరుగతి లేక అంతటి యనాద్యము నానోట వెలువడ:లసి వచ్చినది. క్షమించుము. ఇంత బ్రదుకు బ్రదికి యది నాకర్మను కాకున్న పసిపత్రవా నిని చంపవలెనా? నాకు నవ్వును, దుఃఖమును కూడ కల్గుచున్నవి. సోదరీ! శాంతముగా బుద్ధికలిగి విను

చిన్నా:—విన నక్కఱలేదు. నీనైచ్యమునకు లొంగవలసి వచ్చినదే యని యేడ్చుచున్నాను. అయ్యో! "కిరీటమును దాచెదనులే" యని యాహాస్యమునే నిజము చేసితివే!

విశ్వ:—బిగ్గరగ మాట్లాడవలదని చెప్పినాను. సరి. ఇక నీవు నన్ను నమ్మవు. జ్ఞాపకమున్నదా నా యొద్ద నేమహాస్త్రము కలదో యిప్పుడు చెప్పితిని! వృథాయాసపడక బుద్ధికలిగి ఉండు మింకను నాకు నీతో పని యున్నది.

చిన్నాదేవి:—నీకన్న తెలివిగలవారు లేరని త్రుళ్ళిపడకు! ఈబోనులోనుండి నన్ను తప్పించగలవారే లేరా!

విశ్వపతి:—ఈచీటీ నీకు తెచ్చియిచ్చిన దెవరు?

చిన్నాదేవి:—ఆఁ. నా అదృష్టదేవత.

విశ్వపతి:—దేవతలకు, భూలోకమునకు వచ్చి, నీ కుత్తరముల జేరవేయు దుర్గతి యింకను కలుగలేదు; నిజము చెప్పు మెవరు తెచ్చియిచ్చిరి?

చిన్నాదేవి:—నేను చెప్పను.

విశ్వపతి:—చెప్పవూ? చెప్పించనా? (సమీపించును.)

చిన్నాదేవి:—(దూరముగా పోయి) విశ్వపతీ! ఇంత దుర్మార్గము నీకు తగదు. అట్లా హూర్చుని తల మోకాళ్ళమీద పెట్టుకుని కొంచెము నేపాలోచించుకో యీనీనైచ్యము—

విశ్వపతి:—(అట్లా హూర్చుని వికటముగ నవ్వుచు) ఈశ్రలలో నద్భుతమైన భావాలు ఓదెలుగా పడియుండి యవసరము కల్గినప్పుడు కాని తాఁంచువ్వలవలె పైకెగు రవు. నిన్నరికట్టుటకు ప్రయత్నించిన యవసరమున నామెదడులో మెలికలు తిరిగినది మన రహస్య సంబంధపు టాలోచన. ఇంతవఱకు నిన్ను మోహదృష్టితో చూడ వలెననియే తెలియదు! ఇప్పుడు నీవు నాకు మోహినీదేవి వలె గనబడుచున్నావు. నిన్ను కామమున మోహించవలె ననిసించుచున్నది. (చిన్నాదేవి నిర్జీవప్రతిమవలె నిలచిన చోటనుండి యంత్రమువలె వెనుకకు జరిగిపోవును) ఎదుట నుండకుము పొమ్మ. (చిన్నాదేవి వెడలిపోవుట నరసి) అసహ్యము గొట్టిపోయినది. నాది చాల కర్కశత్వము. అప్రయత్నముగనే పైకుబుకుచుండును.

గీ. కాలకంఠుడు మ్రింగిన కాలకూట
గరళమున కన్న చేదైన కర్కశత్వ
విషము నెటెగిగొ మ్రింగి హృత్పేటియందు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బదిలపరచితి నద్ది దుర్వ్యాళ రభస
ఇప్డి నెతి జిమ్మ నాదు నిశ్వాసములను.

ఆహా! గరళభోజనము! విషనిశ్వాసము! శంకరుడటు. నే నిటు. ఫాలనేత్రము విప్పి భాగ్యపాచిక వైచెదను. అదిగో మరల వాచాలుడ నగుచుంటిని. ప్రళయము ముసురుకొని వచ్చుచున్నది. వ్యవధి లేదు. కానిమ్ము హత్యాపరాధమును రామకృష్ణకవిని జోడించి తిమ్మరుసు తలపై గొట్టితినా నిశ్మాత్రవమగును. రాజిప్పుడు వికలుడై యున్నాడు. అపరాధుల విచారించి శిక్షించు నధికారమును ముందు హస్తగతము జేసుకొనెదను. మధ్యాహ్నములోపలనే శత్రుశుద్ధి కావలెను. (ప్రస్థానము.)

(చిత్రావతి ప్రవేశించును.)

చిత్రావతి:—ఏమిటో విశ్వపతి ఆమాట అనగా నే మాచిన్నారాణి అట్లా అసహ్యంగా భయపడ్డ దెందుకో! (దూరమున చూచి) నాన్నా! నాన్నా! ఇక్కడ. ఇట్లా రా!

(రామకృష్ణకవి ప్రవేశము.)

రామకృష్ణకవి:—ఇప్పుడు విశ్వపతియు, చిన్నాదేవియు నిట్లు వచ్చి వెళ్ళిన ట్లున్నది; ఏమిటి విశేషము?

చిత్రా:—ఏం చెప్పమంటారు? అంతా ఒకగొడవగా ఉంది. ముందే చిన్నారాణీ కోపంతో వచ్చి విశ్వపతినే బాపతో పొడవబోయి మూర్ఛపోయారు. నేను దాక్కొని చూస్తున్నానాయె, ఎట్లా శైత్యోపచారం చెయ్యడం! పాపం అట్లాగే మూర్ఛదేరి కేకలు వేశింది. అప్పుడే విశ్వపతే ఇంత గ్రుడ్లుచేసి ఏమిటో రహస్య సంబంధంట అది ఉందంటాను అని బెదిరించాడు; చిన్నారాణి ముఖం ఇంతచేసుకుని అట్లాగే వెళిపోయింది.

రామకృ:—ఔరా! నీచప్రతాపము! ఛీ! ఛీ! ఇట్టి యల్పునిమీద కోపము మాత్ర మెట్లు వచ్చును.

చిత్రా:—అయితే నాన్నా రహస్యసంబంధం అంటే ఏమి టేమిటి!

రామకృ:—ఛీ! ఊరుకో.

చిత్రా:—చెంపలు వేసుకుంటా! తప్పుమాటని తెలిస్తే అడుగుతానా అసలు.

రామకృ:—నాబంగారు తల్లివి. నీవు దబ్బున వెళ్ళి చిన్నారాణీ దగ్గరే ఉండు. మధ్యాహ్నం వస్తువు గాని ఇంటికి. పో.

చిత్రా:—అబ్బాయి నెక్కడ దాచారు. పాలు పట్టారో లేదో.

రామకృ:—(చిత్రావతి శిరమును మూర్కొని) మా చిట్టితల్లి కొక అబ్బాయి! ఈ బ్రహ్మచారి కొక మనుమడు! అద్దెలమారి సంసారమైనా ఎంత మనోహరముగా నున్నదో!

చిత్రా:—అబ్బా! ఏమిటండీ నాన్నాజీ! మీ రెక్క డుంటారు.

రామకృ:—నేను తెలియజేయుదును లే. పొమ్ము' జాగ్రత్త!

చిత్రా:—ఏమిటో నాకు భయంగా ఉంది కనుక్కుంటూ ఉండండి నన్ను. (ప్రస్థానము.)

రామకృ:—అబ్బా! ఈ విశ్వపతిలో నొకభయానక నరకమున్నదాయేమి! ఎట్టి నైచ్యమును వెలిబుచ్చినాడు! అహాయికి యగు మాచిత్ర నిర్మలవాణినుండి వినుటచే కొంచెము స్థైర్యము చిక్కి యందలి యల్పత్వమును మాత్రమే గ్రహించి శాంతింపగల్గితిని కాని యీదారుణము నింకొకరినుండియే వినుట సంభవించిన కోపతాపముచే నీవిశ్వపతి నిప్పుడే చిత్రవధ జేయకుండెడివాడనా! ఇతనిని చంపకూడదా! అప్పాజీ ఆదేశము దుర్భరముగ నున్నది. ఇతని క్రౌర్యసహాయమున రాయల వ్యక్తిగతమగు నహంనైజభుజంగిని పట్టవలెనట. ఈనరకగానమున గాని దానిపడగ తుదిదాక విప్పదట! కోరలకు విషదారిద్ర్యము కల్గునటుకు నది మమ్ము కఱచునట్లు చేయవలెను; విషదగ్ధము గాకుండ ప్రాణమును రక్షించుకొననూవలెను. త్రికమకలలో తదేకసాధన! ఓహో! ఏకాగ్రదృష్టిని, రుద్రశేపస్సున, ఫాలమున నగ్ని నేత్రము జేసుకొన్న మృకండుని శిరస్సును, తాపభగభగల ఛీటులువారనీక, శీతాంశురేఖతో, జటానివాసినియై, శాంతిసేవజేయు గంగాకుమారివలెనే, నిష్ఠుర కర్మతాపమున మామతి క్షుద్రము గాకుండ స్నిగ్ధశీల సుధాంశురేఖతో మా కీషిల్లయే శాంతిని గూర్చుచున్నదా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(సేవకుని ప్రవేశము.)

సేవ:—అమాత్యశేఖరులు శ్రీ వారిని దర్శింప బోవుచు తమరిని బిల్వనంపిరి.

రామకృష్ణ:—శుభము. (సేవకునితో ప్రస్థానము.)

(యవనిక)

---

## రంగము 3.

స్థానము:—రాయల మందిర ప్రదేశ గోపురము. గుంప్రమును విశాలమునగు గది. అంతర్ద్వారములు యవనికలచే నాచ్ఛాదితములై యున్నవి. మధ్యగా కొన్ని యాసనము లెదురుబదురుగా వేయబడియున్నవి.

సమయము:—రెండవ ఝామము.

(విశ్వపతి చేరుమాలుచే ముఖమును తుడుచుకొనుచు నొక యాసనమునకు జారగిలబడి నిల్చొని, ప్రవేశము.)

విశ్వపతి:—పుత్రశోకముచేతనే రాయలు క్రుంగిపోయినాడు. నే నప్పాజీ ననుమానించుట యతనికి పిడుగు పడినట్లయినది. వెఱ్ఱిచూపు వెట్టిమరణయాతనపడుచున్నాడు—పడనిమ్ము—వివశుడై-అప్పు_న నమ్మెను. నేరమును విచారించుటకు నా కధికారము నిచ్చెను. కాని నే నేల చేయి జేసుకొనవలెను? (నడుముననున్న ఖడ్గమును తీసి బల్లపై బెట్టును.) ఎటు పోయి యెటు వచ్చునో!

శా. అప్పాజీ కడుపూజ్యు డాయనఘునిన్
        హత్యాపరాధంబుచే
    గప్పన్ గల్గెడివార లెంత ఘనులో
        కానిమ్ము నే నేల యీ
    అప్పాజీ ప్రభుడైన రాయలె తడ
        న్యాయంబు గావించునో
    ముప్పే యైన, బలే! జయోదయ మహీ
        భోగంబు నాదే కదా!

ద్వారరక్షకా! ద్వారరక్షకా!

(ద్వారరక్షకుడు ప్రవేశించును.)

మారమున నాదండనాథు లెవరు?

ద్వార:—శ్రీవారిని పరామర్శింపవచ్చిన గోవిందరాయల వారితో వారు వచ్చిరి. తమ యాజ్ఞ రామివా రెప్పటి కేగిరో, వారికొఱకు వీరిచ్చట వేచియుండిరి. గోవిందరాజుగారు తమ కీ లేఖను పంపిరి. (అని యిచ్చును.)

విశ్వపతి:—(లేఖను తీసుకొని) మంచిది. నీవును పోయి కొంచెము దూరముననే వేచియుండుము. ఎవరు నీచుట్టుపట్టుల రాకుండ జూచుచుండుము.

ద్వార:—మహాప్రసాదము. (ప్రస్థానము.)

విశ్వపతి:—(లేఖను చదువును) "శ్రీ వారిబాధ్యత మాకన్న మీ కెక్కుడు లేదు. ఇక సహింపము. అనుమతించిన సరి. లేకున్న మేమై శ్రీవారిని దర్శింతుము." ఆహా! వీనినడత కెప్పుడు నశ్వధాటియే. ముందు వీనికి శాస్తిజేయవలెను. తన విషయమునే మఱచిన నన్ను రెప్పగొట్టి తలమీదికి దెచ్చుకొనుచున్నాడు. నే నేమి చేయగలను? ఆబోతు విజృంభించినప్పుడు దాని యెదుటు గిట్టల భూభగ్నమైన తప్పేచ్చట? దాని బట్టుకొనిన జోరీగల ముక్కుకొనపదునులో నున్నది. సావధానము! గోవిందరాయా!

గీ. ప్రళయ భారంబు మోసుకు వచ్చువేళ
    నేలరా నాదురిచ్ఛ మఱెంత రెచ్చ
    గొట్టితివి! ఇంక తప్పదు. కుదురు జేసు
    కొనుము నీతల మృత్యు న_ర్తనపు విధికి!

నిజమే సాక్షాత్తు తిమ్మరుసుపై నింద మోపరాదు. ఈతడీ పని జేసినా డన్నను వెంటనే నమ్మటకు వీని యవిధేయ నైజమే యనువు పడగలదు.

(రాయ లొకద్వారమునుండి ప్రవేశము.)

రాయలు:—విశ్వపతీ!

విశ్వ:—(ఎదురేగి) అయ్యో! ఇదియేమి యిచ్చటికి వచ్చిరి. (పట్టుకుని ఒకయాసనముపై నాసీను జేసి) ఏమి?

రాయలు:—నే నిక నాలోపల నుండజాలను.

విశ్వ:—అయ్యో! పుత్రశోకము దుర్నివార్యము కదా! అక్కటా! ముక్కు పచ్చలారని పిల్లడే-నిద్రా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సక్తుడే—నిరపరాధుడే-మాభవిష్యత్కళ్యాణము నంతయు వానిపై నాసబెట్టుకుని యుంటిమే - ఆ మా చిరంజీవిని-ఆ ఆనందజ్యోతి నార్పుటకు వానికి చేతు లెట్లు వచ్చెనో!—

రాయలు:—విశ్వపతీ! నీదుఃఖముచే నన్ను మఱింత దుఃఖపెట్టుచున్నావు.

(దాసి ప్రవేశము.)

దాసి:—ప్రభూ! మహారాణి శ్రీవారి దర్శనము గోరుచున్నారు.

విశ్వ:—ఒకరిని చూచి యొకరు దుఃఖించుటకా!

రాయలు:—ఏముఖముతో నే నిక ఆమెను చూడ గలను!

విశ్వ:—ఈదుఃఖముచే నామె యున్మాదినికూడ నైనది. ఏకాంతముచేగాని ఆమె ప్రకృతికి రాదు. దాసీ! పోయి, ఆమె నెచ్చటికిని కదలనీయక జాగ్రత్తగ జూచు చుండుము. పొమ్ము. (దాసీ ప్రస్థానము.) ఆహా! అప రాధి యెవరో తెలిసియు వానిబలమునకు వెరచి నోరెత్త రాకున్నదే!

రాయలు:—అప్పాజీ! ఇట్లు చేయునా? నమ్మ జాల. నమ్మజాల.

విశ్వ:—ఔను. లోక విశ్వాసము నీ విధముగ భద్రముచేసుకొనియే పాప నైజము ప్రవృత్తికి గడంగును.

రాయలు:—చిన్ననాడు తనచేతులలోనే పడి యుంటిని కదా! అప్పుడే-

విశ్వ:—ఇప్పుడు మాత్రము, తమమీద వాని కెట్టి విరోధమును లేదు. అతనికి లోబడియున్న జాలు, వాని వలన నెట్టి ద్రోహభయమును లేకుండ తమజీవితము గడిచి పోగలదు. రాజనీతి చిత్రమే యటువంటిది.

రాయలు:—ఎటువంటిది!-

విశ్వ:—తమ రతినివశేమునకు వచ్చునప్పటికున్న రాజ్యము స్వల్పము. మిమ్మాధారముగ బెట్టుకుని రాజ్యము నఖండముగ వృద్ధిజేసెను. కర్మపరతయందలి సూక్ష్మమే మన, స్వార్థము లేనిదే యెవరు నే పనియు జేయరు. వృద్ధి నైన రాజ్యములో ప్రధాన కార్యస్థానము లన్నిటియం దును తన బంధుమిత్రులను కాపుంచుకొని తరుణమును వేచియుండెను. దానధర్మ సత్కారములచే నింతటి ధర్మాత్ముడు లేడను ప్రజల విశ్వాసమును బలపరచుకొ నెను. తమపేర తమభాగ్యము నాతడే యనుభవించుచుం డెను. ఏమి తొందర? కాని తమకు పుత్రోదయమైన ప్పటినుండియు నలజడి ప్రారంభించి యుండవలెను. అమంగళము శాంతించుగాక! తనుతో తమవంశ మంత రించిన ప్రజల వేడికోలుమీద గతిలేక ప్రభుత్వము నంగీ కరించినట్లు నటించి యిష్టసిద్ధిని జెందవలెను.

రాయలు:—విశ్వపతీ! నేను మోసపోతిని. చిన్న నాడు, నాతండ్రి నన్ను చంపుమనియే నే యనుకొనుచు. నన్ను రక్షించి నాతండ్రిని మోసగించుట మాత్రము రాజ ద్రోహముకాదా! ఈ ద్రోహబుద్ధి యిప్పటిది కాదు.

విశ్వ:—ఆఁ. మఱియు నీమహాసంకల్ప మెంత కాలముక్రింద ధారణము జేయబడెనో గోవిందరాయల వయస్సునుబట్టి యూహింపుడు. ఆ ఆశయ మిట్లు పుత్ర రూపమున ప్రతాపించినది. ఇప్పటికైన అప్పాజీ బుద్ధి పూర్వకముగ నీపని చేసియుండరు కట్టుదిట్టములు లేనిదే యతడు దేనికిని తొందరపడడు. తండ్రి యాశయము గుర్తెఱిగిన వాడౌట పట్టాభిషేకముకూడ నైనదే యని యుద్వేగమున గుప్తముగ నీపని గావించియుండును.

రాయలు:—అకటా! ఇంతటి ద్రోహమా!

విశ్వ:—ఎంతబలమును చూచుకొనక నాడు తమ యెదుట కత్తి దూసి దుర్భాషలాడుట కతడు సాహసించి యుండును: విధిలేక పాపము నైజముయొక్క జాడల నిట్లు పరిచయముచేసుకొని యూహించి యిది సంభవమే యని విశ్వసించుచున్నాను.

రాయలు:—ఆ విశ్వాసఘాతకు నిప్పుడే పట్టి తెప్పింపుము. యమసదనమున కంపెదను.

(పెద్దిరాజును, గోవిందరాయలును ప్రవేశము.)

పెద్దిరాజు:—జయము ప్రభువులవారికి.

రాయలు:—(పరాఙ్ముఖు డగును.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్వపతి:—అలవాటుచొప్పున వచ్చు తమ జయ వాచకము దుఃఖమునే తెచ్చిపెట్టుచున్నది. తమ రేమి చేయగలరు. కూర్చుండుడు.

పెద్దిరాజు:—చిత్తము. చిత్తము. విధి దుస్తర మాప్రభు సంకల్ప మిట్లుండ నెవర మేమి చేయగలము.

గోవిందరాజు:—అన్నాజీ-

రాయలు:—(అర్ధస్ఫుటముగ) అన్నాజీ? (ముఖ మును చేతులతో గప్పుకొనును.)

గోవింద:—ప్రధాన దండనాయకుడ నగుటచే నీదుర్గరక్షణ భార మంతయు నామీద నున్నది. ఇది నా అజాగ్రత్తయొక్క ఫలితమే యని దుఃఖించుచు న్నాను.

రాయలు:— ఈహత్యకు నీవే బాధ్యుడవు.

గోవింద:—ఔను. నే నిక దుఃఖము నాపుకొన లేకున్నాను.

విశ్వ:—దుఃఖాశ్రువులు కలుషహరములు. తమ కు మనశ్శాంతి కల్గుగాక! విధి విధాయకమునకు మన మేమి చేయగలము! వానిసృష్టి. ఇది నేను చేసినదా, మీరు చేసినదా!

రాయలు:—అతడు చేసినది. నాకుమారుని చంపి నాభవిష్యత్తును శూన్యముచేసి, ఛీఛీ, పరామర్శింప వచ్చి తివా?

గోవింద:— నేనా!

రాయలు:—ఔను. పెద్దిరాజుగారు! మారు మాట వలదు. ముందీ కృతఘ్నుని వధ్యస్థానమునకు బంపుడు.

పెద్దిరాజు:—ఏ మాశ్చర్య మిది!

విశ్వపతి:—మహారాజా! నావిన్నప మాలింపుడు. ఇది లఘువిశ్వాసమైన పోనిండు. సత్యము స్థిరపడువఱ కైన కారాగారమున నుంపుడు. తరువాత పశ్చాత్తాప పడవలసి వచ్చును. మన మప్పాజీ ముఖమును మరల నెట్లు చూడగలము!

రాయలు:—ఈతండ్రి కుమారులు చేసినదే యిది. నీ వడ్డు చెప్పకుము.

పెద్దిరాజు:—మహారాజా! తమరు కొంచెము విశ్ర మింప మనవి-హంతకు నన్వేషించి శిక్షింపగలము-

రాయలు:—నేను విశ్రమింప నక్కఱ లేదు. నే నారోగ్య బుద్ధుడనే. ఇంక నన్వేషించున దేమి!

గోవింద:—ఎవరి దుర్బోధయో యిది యర్థము గుట లేదు.

విశ్వపతి:—గోవిందరాయా! గౌరవముచే నూర కొంటిమి. మహారాజు తను రపరాధులని నిశ్చయించి నారు. ప్రతిభాషణము చేయరాదు. మాకు హృదయ ములు లేకపోలేదు. శ్రీవారిని శాంతునిజేసి విచారిం చియే కర్తవ్యమును నిర్వహింతుము.

గోవింద:—(గుడ్లెఱ్ఱజేసి విశ్వపతిని చూచును.)

రాయలు:—ముందు వీనిని నిర్బంధమున నుం చుడు.

విశ్వపతి:—(ద్వారము వంక చూచి) సేవకా కారాగృహ యజమానుని పిలుచుకొని రమ్ము.

(రామకృష్ణ కవి ప్రవేశము.)

రామకృష్ణ:—(పెద్దిరాజు సమీపముగా వచ్చి రాయలకూరక నమస్కరించి) అప్పాజీ వచ్చుచున్నారు.

విశ్వ:—క్షమించి వారి నిప్పుడిచ్చటికి రావలదని చెప్పుడు.

రామకృష్ణ:—ఏమి!

గోవింద:—ఏమా? విశ్వపతి వారియాజ్ఞచే ఉద యమునుండియు మనకు శ్రీవారి దర్శనము లభించలేదు. ఎందుకో ననుకుంటిని. ఈ ప్రబుద్ధుడు (విశ్వపతిని చూ పును) రాయలవారి నిట్లు మస్తాబుచేయు టాలస్యమైనది. ఇప్పుడు తెర దీసినారు. బొమ్మ బయటపడినది.

రామకృష్ణ:—గోవిందరాయా! నీకు మతిభ్రంశ మైనదా!

గోవింద:—ఇంకను పూర్తిగా కాలేదు. రాజ కుమారుని హత్యకు నేనును, నాతండ్రిగారును బాధ్యుల మట!

(కారాగృహ యజమాని ప్రవేశము.)

విశ్వ:—(గోవిందరాజుని చూపి) వారిని సగౌరవముగ నీ రక్షణక్రింద నుంచుము.

రామకృష్ణ:—కొంచె మాగవలసినదని నామనవి. (పెద్దిరాజుతో రహస్యముగ) అదుగో! అప్పాజీని త్వరగ తీసుకుని రండు.

పెద్దిరాజు:—(ప్రస్థానము.)

విశ్వ:—తమ రేమియు నిప్పుడుకల్పించుకొనకుడు.

గోవింద:—ఇది నీసత్ర—రామకృష్ణ కవిగారు! క్షమింపుడు. నాకర్తవ్య మిప్పుడు విషమస్థితికి వచ్చినది. నాతండ్రిగాని నేనుగాని దోషులము కామని మామనస్సాక్షికి దెలియును. ఆగౌరవమున క్షాత్రధర్మము నాహ్వానించుచున్నాను. దండనాయకులారా! విశ్వపతిని బంధింపుడు.

(వారట్లు చేయుదురు.)

రామకృష్ణ:—గోవిందరాయా! ఏమి యాగడమిది ?

రాయలు:—రాజద్రోహులు! రాజద్రోహులు! ఏదీ నాఖడ్గము.

గోవిందరాజు:—(రాయల చేయి పట్టుకుని) ఖడ్గమెందులకు?

(తిమ్మరుస్సు, పెద్దిరాజుతో ప్రవేశించును.)

గోవింద:—(రాయలచేతిని వదలి నిల్చొనును.)

తిమ్మరుస్సు:—కుమారా! ప్రబుద్ధుడ వైతివి! దండనాయకులారా! ఎంతటె విచక్షణు లైతిరి! (దండనాథులు విశ్వపతిని విడిచిపెట్టి దూరముగ నిల్చుందురు.)

గోవింద:—మనము హంతకుల మని యీతడు బోధించుటయు, తాను విశ్వసించుటయునా! నన్ను నిరోధింపకుడు. ఈక్రూరునికి శిక్ష కావలసినదే.

తిమ్మరుస్సు:—ఓరకొనుము.

రాయలు:—(ఒక ఆసనములో కూలబడి) నే నేమి చేసితినని యింత పగ నామీద!

తిమ్మరుస్సు:—ఔను. నాయనా!

మ. పగ కాదా మఱి! యీత్రిలింగధరణీ
భాగంబు సర్వంబు నే
లగ వీడే తగునంచు నీతనిని ని
ల్వంజేసి యీషీతి, కీ
ర్తి గరీయం బొనరించి మాకుగల
మైత్రీ బంధ మేనాటికిన్
బగుఃం బోదని విశ్వసించిన దురా
పంబైన పాపంబునన్.

రాయలు:—పాపము! రాజ్యవేలు నాకేమే లేదు.

తిమ్మరుస్సు:—మూర్ఖుడా!

శా. నేనే రాజ్యము గోరియున్న యలనా
డే లీలమై మద్దయా
ధీనంబై చను నీదుజీవనకళా
లేజంబు బోనార్పి సు
శ్రీ నీరాజన శోభితాంధ్ర ధరణీ
సింహాసనం బెక్కనే
యీనాడా దురభీష్ట దోషి నను టే
వృద్ధాప్యమం దక్కటా!

రాయలు:—ఈ విషభావము చిన్ననాటనుండి యుండియే యున్నది. నాతండ్రిని మోసగించినావు. ఇప్పుడు నన్ను మోసగించినావు. విశ్వపతీ! నే నీ దండనాథుల నెవరిని విశ్వసింపజాలను. ఆపోర్చుగీసు వర్తకులకు సైన్యసహాయము నర్థించితి మని వార్త నంపుము.

తిమ్మరుస్సు:—

గీ. అవసరము లేదు మాకు మేమైపశం వ
దులము కాకున్న గాక యేబలము లేల
ఇదుగొ చిక్కితి నింక మీ కెదురు లేదు
కట్టగావచ్చు నన్ను శృంఖలల చేత!

రాయలు:—ఈ నాటకమును చూచెదను. (దండనాథుల చూచి) మీరాజభక్తి సత్యమేయైన వానిబంధింపుడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిమ్మరుసు:—(దండనాయకులకు సంజ్ఞ చేయును.)

రాయలు:—ఏమి శిక్ష విధించినను పాపము లేదు.

గోవింద:—గుడ్లుపెరికి ఆజన్మాంతము కారాగారమున త్రోయుము. అప్పటికిగాని పాపము పరిణామమునకు రాదు.

రాయలు:—గ్రుడ్లు పెరుకవలసినదే. కాని అవసరము లేదు. నిర్బంధమున నుంచుడు.

తిమ్మరుసు:—ఈ దయమాత్ర మెందులకు? నీవు పొమ్మనకున్న యేమి నీయిష్టమునే నెరవేర్చెదను.

శా. "అంధుం డైనపతిం వరించి పతిభా
　　వాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదన మాచరించె నియమ
　　ప్రఖ్యాతయై" నాడుత
ద్గాంధారీసతి నేడు తిమ్మరుసు నా
　　దారిం జనుంగాక యీ
యంధుం డైన నృపుం వరించి నృపభా
　　వాసక్తి నిశ్శంకమై.

(అని కన్నులకు గుడ్డను చించి కట్టుకొనును) దండనాయకులారా! నన్నిక బంధింపుడు.

(దండనాయకులు బంధింప వత్తురు.)

రాయలు:—ఆగుడు! పుత్రశోకముచే దుర్బలుడనై తిని—కృతఘ్నుడను కాజాలను. అది వారి స్వార్థసాధనయే యైనను దాని మూలముననే నా కీభాగ్యలబ్ధి యైనది. వారిని స్వేచ్ఛగ పోనిండు. ఈపృథ్వి చాల విపులమైనది. ఆస్వార్థము నెచ్చట పూర్తి చేసుకొనగూడదు!

(ప్రస్థానము. విశ్వపతి వానివెంటనే యేగును.)

తిమ్మరుసు:—నాస్వార్థ మిచ్చటనే పూర్తి కావలయును. ఈ వృద్ధాప్యములో నిప్పు డెచటికి పోగలను!

(యవనిక)

---

# అలసిపోయితిని

మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు

అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని;
కటకటా, నీ కింత కాఠిన్య మేల?
　తిరిగితిఁ దిరిగితిఁ దెరవు లన్నియును;
　వెదకితి వెదకితి వేసారిపోతి;
　ఏమూల నుంటివో యీచలం బేల?
　ఎందు దాఁగుంటివో, యేల కన్పడవు?
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని;
కటకటా, నీ కింత కాఠిన్య మేల?
　గట్టుపైఁ బుట్టపైఁ గాల్జారి జారి
　పడుచు లేచుచు ముండ్లబాట లన్నియును
　వెదకితి వెదకితి విసివిపోయితిని;
　తిరిగితిఁ దిరిగితిఁ దెరవు లన్నియును;
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని;
కటకటా, నీ కింత కాఠిన్య మేల?
　ఆకసంబున మబ్బు లలముకొన్నపుడు
　చీకటి యంతటం జెదరి యున్నపుడు,
　వర్షంబు బోరన పడుచున్నయపుడు,
　తిరిగితిఁ దిరిగితిఁ దెరవు దప్పితిని;
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని;
కటకటా, నీ కింత కాఠిన్య మేల?
　గాలి వీచుచు భీతి గలిగించువేళ,
　చెట్టుకొమ్మల మీఁద నట్టాడువేళ,
　ఊపిరాడక చిత్త మునుసురన్‌వేళ,
　వెదకితి వెదకితి వేసారిపోతి;
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని;
కటకటా, నీ కింత కాఠిన్య మేల?
　ఏవంక నుందువో యెఱుక లేదయ్యో;
　త్రోవ తప్పితి నయ్యో, త్రోవుపా టయ్యో;
　త్రోవ చెప్పినవాఁడు తోడ రాఁడయ్యో;
　ఈవేళ నా కేల నిట్టిపా టయ్యో?
అలసిపోయితి నయ్యో, అలసిపోయితిని;
కటకటా, నీ కింత కాఠిన్య మేల?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౧౪

వీరభూపతి వైగైనుండి వచ్చి, కుట్టాన్‌ను వదలిపెట్టి యింటికి పోయి, స్నానము చేసి భోజనము చేసి, మేడపై చల్లగాలికి పండుకొనెను. రాత్రిరి ప్రొద్దుపోవువేళకు నతనిభార్యయు వచ్చెను. ఆమె యతనికి కొంచెె మెడముగా గూర్చుండి తమ్మలపాకులు చుట్టి యిచ్చుచుండెను. అతడు తాంబూలమును సేవించు చుండెను గాని యతడుత్సాహముగా నున్నట్లులేదు. వీరభూపతి లేచి కూర్చుండి 'ఇంక నక్కరలేదు' అనెను. ఆమె యాకుమడుపు లిచ్చుట మాని వేసెను.

వీర—'కాళ్లు నొప్పిగా నున్నవి. సేవకుని పిలిచెదవా?'

భార్య—'నేను పిసికెదను.'

వీర—'నన్ను నీవు ముట్టుకొనెదవా ?'

భార్య—'సేవకభావములో దోషము లేదు. మీరు మాటికి కట్లే మాటాడెదరు. ప్రభూ! నాకు దానిపై నిచ్ఛ లేదు. భార్యాభర్తృత్వ సంబంధమున కదియే ప్రధానమా? నామనస్సున కట్లు తోచుటలేదు. నే నేమి చేయుదును?'

వీర—'సనాతనుల ఋషుల మత మది. "ప్రజాయై గృహమేధినాం" అన్నారు. సంతానార్థి కావుననే వివాహము చేసికొనుట. నా తల్లితండ్రులు చీకులు. నాజీవిత మంతయు వారిని సంతోష పెట్టుటకే వ్యయపరచుచున్నాను. నీతో జెప్పితిని గదా? నిన్ను వివాహము చేసికొనుటకూడ వారిని సంతోష పెట్టుటకే. నాల్గునెలలు గడచిపోయినవి. నీ విట్లే యథాప్రకారముగ నాయెడల విముఖవై యున్నావు. నీయీవిముఖత్వమునకు గారణము నాకు తెలియుటలేదు. ఎన్ని సారులు ప్రశ్నించినను చెప్పవు.'

భార్య—'స్వామీ! మీయెడల నాకేమియు విముఖతయే లేదు. అట్లనుకొనెద రేల? మీ రన్న నాకు ప్రేమయు గలదు. మీతో భార్యవలె మాటలాడెదను. నేను చేయవలసిన పరిచర్య లన్నియు జేసెదను. ఏలనో ఆ కార్యమునెడల వైముఖ్య మేర్పడినది. నాకు సంతాన మక్కరలేదు. ఎందులకుసంతానము? ఈజన్మయే దుఃఖ భూయిష్ఠము. ఇంకను సంతానము గని వారలనుగూడ నెందుకు దుఃఖముల పాలు చేయవలె?'

వీర—'నీయీసిద్ధాంతము సర్వజనసమాచరణీయ మగునయేని నేటితో సృష్టి యంతమగును. పరమేశ్వరుని లీల కెదురునడచెదవు?,

భార్య — 'క్షణభంగురమైన యీసౌఖ్యమునకై యింత సూయాస మెందులకు? నిత్యానందాభిలాషుల మేల కారాదు? ఈదుర్మోహములో బడి నశింతుమని యెపుడు మనకు సరిగా తెలియుట?'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీర—'అటులైన వివాహ మేల చేసికొంటివి? నీతలితండ్రులతో నీమాటలే చెప్పకపోతివా? నిన్ను పెండ్లిచేసికొన్నవాడు లోకసామాన్యముగ నిన్ననుభవించుట కిచ్ఛయించునా? అతని కేల నీ వపకారిణి వైనావు. తొలుతనే యోగినివి కాకపోతివా?'

భార్య—'నా తలితండ్రులు నామాట వినలేదు. పతులు మీరైన నామాట వినరాదా? నిజముగా మీరు నన్ను ప్రేమింతురేని నా యీ కోర్కి కనుగుణముగా వర్తించుట కన్న నా కెక్కువ యిష్ట మేమి కూర్తురు?'

వీర—'నీకు నాకన్న నెక్కువ నా డెవడైన పతి కావలయునని కోర్కి యున్నది కావలయు. లేకున్న నింతయలజడి యేల కలిగించెదవు?'

భార్య—'నా కిది గొప్ప సంబంధము కాదా? నేను స్థానాపతిభార్య నగుదునని యెవరనుకొనుచున్నారు? నాతలితండ్రుల పేదతనమునకు మీరునాకులభించుట మహాభాగ్యము. మీరు గనుక మాసంబంధ మొప్పుకున్నారు.'

వీర—'దానిలో మాసద్భావ మేమియును లేదు. వివాహానంతరమున తెలిసినది నాకీ యుద్యోగ మైనదని. తత్పూర్వము మేమును మీవంటి వారమే కా. నా కీ యుద్యోగ మైనను మామిత్రుని వలన నైనది.'

భార్య—'ఎవ రామిత్రులు?'

వీర—'నీ వెరుగవా? నేడు మనయింటికి భోజనమునకు గూడ వచ్చెనుగదా!'

భార్య—'ఎవరో స్నేహితులు వచ్చిరని వింటిని. వా రెవరో తెలియదు.'

వీర—'అతనిపేరు కుట్టాన్. ఉదయర్క సేతుపతి దళవాయి కుమారుడు.'

అతనిభార్య యచటినుండి మెఱుపువలె లేచిపోయినది. వీరభూపతి యేపనిమీదనో వెళ్లిన దనుకున్నాడు.

చాల ప్రొద్దు పోయినది. రాతిరి రెండుజాములు తిరిగినది. వీరభూపతి లేచి లోనికి పోయినాడు. దీపము చందమామవలె వెలుతురులు గాయుచున్నది. వీరభూపతిభార్య మంచముపై బండుకున్నది. అమె బంగరుదేహమునందు నాలు కలసిపోవుచుండెను. మొగము కలకలనవ్వుచుండెను. వీరభూపతి యామె నిదురపోవుచున్న దనుకొన్నాడు. దగ్గరకు వెళ్లి చూచినాడు. ఆమెచెక్కిళ్ల వెంట నీరు కారుచున్నది. వీరభూపతికి కారణము తెలియలేదు. పుట్టినిల్లు నదలిపెట్టి చాలరోజు లైనది; అందుకని యేమో అనుకున్నాడు. నాలుగైదురోజులలో పరమేశ్వరసముద్రమున కొకసారి పంపించెద ననుకొన్నాడు. ఆ దివ్యసుందర విగ్రహమును చూచిన వీరభూపతికి మన సాగలేదు. ఒక్కసారి ముద్దిడుకొనవలె ననిపించినది. ఇదివర కాత డామెను తాకికూడ యెఱుగడు. ఆమె యతనితో చక్కగా మాటలాడును. అవసరము వచ్చెనేని కొంచెము నవ్వును. అంతియ. అత డామెను ముట్టుకొనెనా, యామె రౌద్రమూర్తి యగును. అందుచేత వీరభూపతి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వివాహము నాటనుండి యామె యిష్టప్రకారమే నడచుచుండెను. ఇప్పుడు ముద్దిడుకొన్ననామె లేచునేమో? వీరభూపతికి గుండె చలించినది. అతనిసని యెట్లున్నది? పెరటిలో ధననిక్షేపము మూల్గుచున్నది. ముట్టుకొన్నచో ప్రాతాపై కరువవచ్చును. తదేకదృష్టితో నామెవంకనే చూచుచున్న వీరభూపతికి పూర్వపు నిగ్రహము సడలినది. అనన్యస్పృష్టములైన యామె గులాబిపూరేకులనంటి పెదవుల మీద నతసి నల్లనిమీసములు తుమ్మెదలవలె నాడినవి. వీరభూపతి కొడలు తెలియలేదు.

అతనిభార్య నిదురపోవుచుండుటలేదు. వీరభూపతి తన్ను ముద్దిడుకొన్నాడని యామె గ్రహించినది. అతనికి తనపై నింతప్రేమ యున్నందునకు మరల నతని తాను ప్రేమించజాలనందులకు తన్ను తాన నిందించుకొన్నది. అపుడు కన్నులు తెరచుట కామె కిష్టములేదు. నిదురలోనే తన్నాయన ముద్దిడుకొన్నాడని వీరభూపతి ననుకోని మ్మనుకున్నది.

వీరభూపతి నెమ్మదిగా తనగదిలోనికి పోయినాడు. తలుపు లోపల మూసుకున్నాడు. పెట్టె తెరచి యందులోని తనపూర్వప్రణయినీలేఖ తీసి చదువుకొన్నాడు. ఆమె యెవ్వరో మరల కనుపడలేదు. తెలియలేదు. తన మనసు నుండి గ్రహించి యామె రూపము నతడు చిత్రించినాడు. ఆ చిత్రముగూడ నందులో నున్నది. దానివంక నద్దేప్రకారముగా నరగడియసేపు చూచి చూచి, మరల నవి పెట్టెలో నుంచినాడు. వీరభూపతి ఫాల్గునమాసములో తనభార్య చిత్రమునుగూడ గీసినాడు. అది తీసి దానివంక కొంతసేపు చూచి యాచిత్రము నాచిత్రము నొకచోట నుంచినాడు. అవి యట్లుంచి తనభార్య నిదురపోవుచున్న గదిలోనికి పోయి యామెను పిలిచినాడు. ఆమె మేలుకొనియే యున్నది. పలుకలేదు. మంచము దగ్గరకు పోయి వీరభూపతి 'ప్రియా!' అని పిలిచినాడు. ఆమె పలుకలేదు. ఎడమచేతితో నామె పాదము పట్టుకుని కదల్చినాడు. ఆమె లేచి కూర్చున్నది.

భార్య—'నన్నెందులకు వృథాగ వేధించెదరు? మీరు మరల వివాహము చేసికొనుటకు నేనొప్పుకున్నాను. స్వామీ! ఆవివాహమునకు నేనుకూడ వచ్చెదను. నన్ను క్షమించుడు.'

వీర—'ఆమాట నిన్నెవ్వ రడిగినారు? నేను మరల వివాహము చేసికొందునని నీతో చెప్పితినా? అనవసరముగా మాటలాడుచున్నావు.'

వీరభూపతికి కోపము వచ్చిన దనుకొన్న దామె.

భార్య—'క్షమించుడు. ఇప్పు డెందులకు నన్ను మేల్కొల్పితిరి?'

వీరభూపతి 'నీతో పని యున్నది. ఇటుల రమ్ము' అని పోదొడంగెను. ఆమెయు నతని ననుసరించినది. ఆగదిలోనికి పోయిరి. వీరభూపతి యామెకు రెండు చిత్రములను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూపి, 'ఈ యిద్దరిలో నెవ రందముగా నున్నారు?' అన్నాడు. ఆమె తనది కాని చిత్రము చూపించి, 'ఇది యెవరిది' అని యడిగెను. వీరభూపతి యామె చిత్రమును చూపించి, 'ఇది యెవరిదో యెఱుగుదువా?' అని యడిగెను. ఆమె 'తెలియదు; ఎవరిదో చెప్పుడు' అన్నది. వీరభూపతి 'యామెనే యడుగుము' అన్నాడు. ఆమె గ్రహించినది. తనదే అని తెలిసికొన్నది. తల వంచుకొని, 'ఇది యెవరు వ్రాసినారు' అన్నది. వీరభూపతి 'నీ యీదాసుడు' అన్నాడు. అతనిభార్య నేల మీద మోకాళ్లూది 'క్షమించుడ'న్నది, దోసిలి పూని. వీరభూపతి యామెను లేవదీయుటకు చేతులు పుచ్చుకోబోయినాడు. ఆమె చేతులు వెనుకకు లాగుకున్నది.

ఆమె 'రెండవచిత్తరు వెవరి' దన్నది. వీరభూపతి యాకథయంతయు చెప్పినాడు. అతని భార్య సాశ్చర్య మైనది. వీరభూపతి యాలేఖ యామెకిచ్చినాడు. ఆమె చదువుకొన్నది.

భార్య—'ఆమెపే రేమి?'—

ఉత్తరముక్రింద నామెపేరు చూపించి నాడు వీరభూపతి. అతనిభార్య ఆపేరు పది సార్లు చదువుకొన్నది. గడియసేపాచిత్రము వంక చూచినది.

భార్య—'మీరు మరల నాయూరే పో లేదా?'

వీర—'నీతోడు.'

తొలికోడి కూసినది.

౧౫

ప్లవంగ పోయినది, కీలక వచ్చినది. అది వైశాఖము. తెల్లవారినచో నమావాస్య. తెల్లవారులు కుట్టానునకు నిదుర పట్టలేదు. అతనికి హృదయములో నేమో భయము వేసినది. రాతిరి రెండుజాములప్పుడు లేచి యొక్కడును పాదచారియై స్థానాపతియింటికి ప్రయాణమైనాడు. ద్వారమువద్ద నిదురపోవుచున్న సేవకుడు లేచి, 'ప్రభూ! ఎచ్చటకు?'—కుట్టాన్ మాటాడకుండ బోవుచున్నాడు. సేవకుడు కత్తి దూసి స్వామి వెంట నడచినాడు. స్థానాపతి యింటికి బోయినతరువాత సేవకుడు ఖడ్గము నోరలో నుంచి, 'ప్రభూ! తలుపు తట్టుదునా?' యన్నాడు. లోనుండి తలుపు తెరువబడినది. వీరభూపతిని మేల్కొల్పిరి. వీరభూపతి లేచి వచ్చి సేవకుని, కుట్టానును చూచి, 'నాయనా! ఇప్పుడు వచ్చితి వేమి?' యని కుట్టానును కౌగిలించుకున్నాడు ఇరువురును సౌధాగ్రభాగమునకు బోయినారు. కుట్టాన్ సేవకుడు మరలి పోయినాడు. స్థానాపతియింటి తలుపులు గడియవేయబడినవి.

సౌధాగ్రభాగమున స్నేహితు లిరువురు గూర్చుండిరి. కుట్టాన్ కనులవెంట నీరు కార్చ దొడంగెను. వీరభూపతి కుట్టా నోదార్చుచు, 'బాబూ! నే నుండగా నీ కింత దుఃఖ మెందుకు? నేను నా దుఃఖమంతయు భరించగల్గుదును; నీ దుఃఖమును పంచుకొనగల్గుదును. నాతో చెప్పు' మన్నాడు. కుట్టాను 'రేపటికి రెండుసంవత్స



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రము' లన్నాడు. వీరభూపతి 'నాకు తెలియుట లే' దనెను.

కుట్టాన్—'ఈ రహస్యము నీనుండి యి న్నాళ్లుగా దాచితిని. నీకు చెప్పకూడదని కాదు కాని, యేమో చెప్పలేదు. పరాభవనామ సం వత్సర వైశాఖ బ॥ అమావాస్యనాడు నా భార్యతో చెప్పితిని, "నే నిదివరకు ప్రేమించిన స్త్రీనుండి నా మనస్సు మరల్చుకొని నిన్ను ప్రేమించెద" నని. "నా కీసద్బుద్ధి నుపదేశించినది వీరభూపతి యను నామిత్రు డున్నాడు, అత" డని చెప్పితిని. అన్నా! ప్రయత్నము చేసెదనని చెప్పి రేపటికి రెండుసంవత్సరములు. చేసిన ప్రయత్న మేమియు లేదు. ఇప్పటికిని నాహృద య మంతటిమీదను నా పూర్వప్రణయినియే సామ్రాజ్యము సేయుచున్నది. సూర్యోదయ మెట్లు చూతునా యని భయము వేయుచున్న' దని కనులకు చేతు లడ్డముపెట్టుకొని కుట్టాన్ ప్రభువు విలపించినాడు. వీరభూపతికిని కనుగొ నలనుండి రెండు బిందువులు పడెను. వీరభూ పతి 'కుట్టాన్! ఓదారు మోదారుము. నీవంటి విద్యాధికులును, వీరులే యోర్వలేరేని జగత్తు లో దుఃఖము లోర్వగలవా రెవ్వ' రన్నాడు.

కుట్టాన్—'అన్నా! యీ యంతఃపుర రహస్యము లెవ్వరికి చెప్పునవి కావు. అందులో మనము గొప్పయిండ్ల పుట్టినందున మనస్త్రీలకు రాణివాసములు. ఏవిషయము నెవ్వరితోను చెప్పుటకు వీలు లేదు. నీతో కాక యింకెవ్వరితో చెప్పుదును? నాకు స్వాతంత్ర్య మున్నచో, నేను నాభార్యను ప్రేమించినచో నిన్ను నాయంతఃపు రములోనికి దీసికొనిపోయియుందును. నిన్ను నే నంత ప్రేమించుచున్నాను.'

వీరభూపతి కుట్టాన్ చేయి పట్టుకొని గద్గదస్వరముతో 'నాకు తెలియును; నాకు తెలియు' నన్నాడు. కుట్టాన్ మరల: 'నే నీ దుఃఖాగ్ని నెట్లు చల్లార్చుకొందును? నా భార్య యంతఃపురములో వడిలిపోవుచున్నది. ఈ యప్రతిష్ఠ యెన్నాళ్లని భరింతును?'— కుట్టాను నోటినుండి రోదనధ్వని బిగ్గరగా వచ్చెను. వీరభూపతి యతనిశిరస్సును కౌగిలిం చుకొని యొకఃఅరొమ్మున కాన్చుకొని, చేతు లతో నతనిశిరస్సును నిమిరెను. వీరభూపతి 'కుట్టాన్, ఇంతమాత్రమునకే యింతదుఃఖిం చెద వెందుకు? నాలో నెంతమహాగ్ని నే నిమిడ్చుకొన్నాను. ఆరోజున నీతో చెప్పిన కథయంతయు జ్ఞాపకమం దున్నదా? అదిగాక నాశిరస్సుపై నొక క్రొత్త బెడంద వచ్చిపడినది. ఇది నీతో చెప్పలేను: నీదుఃఖమునకు నాదుఃఖ మును జోడించు టెందులకని; దినదినము నీ విషణ్ణవదనము చూచుటకు చాలదాయని. కాని నీ యీదుఃఖము చూచి నా హృదయ ములో నారహస్యము దాగుటలేదు. చెప్పు చున్నాను వినుము. నేను వెనుక నీయూరినుండి పోయినది నా తండ్రియొద్దనుండి వచ్చి యని తెలియును గదా? ఇంటికి బోయిన వెంటనే మాతండ్రి సంబంధము స్థిరపరచినాడు. ఈపిల్లనే నేను వద్దని చెప్పినాను. జీవితాంతము బ్రహ్మ చారిగ నుందు నన్నాను. నాతండ్రి యొప్పు కొనడని నాకు తెలియును. అయినను నాభావ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు చెప్పవలయుననియే చెప్పితిని. వివాహము జరిగినది. ఆపిల్ల యత్యంత సౌందర్యవతి. వెనుక నీతో నేను చెప్పిన యామెకన్న నీమెయే యెక్కువ యందకత్తె యేమోయని సందేహము కలుగుచున్నది. అయినను నామె నన్ను ప్రేమించినది. నే నీమెను ప్రేమించినాను. అదియే భేదము. వివాహములో నామె తల యెత్తి నావంక చూడలేదు. ఐదవనాడు గదిలో తలుపుదగ్గరగా నిలుచున్నది. ఆమెను చూచిన నా కే యప్సరఃస్త్రీయో యనిపించినది. ఆతెల్లవారలు నాదగ్గరకు రాలేదు. ఆ మూడురేలు నాతో మాటలాడలేదు. నేను పలుకరించిన పలుకదు. తాకబోయినచో నావంక క్రోధదృష్టి బఱపును. కుట్టాన్, నీవు నన్నెఱుగుదువుగదా! నే నేమి పశువును గాదు. పశుమార్గ మవలంబించలేదు. ఆమెను సానునయముగా, "ప్రియా! ఏల నాయెడల నీ కింత వైముఖ్యము? నే నేమి తప్పు చేసితిని? విరాగిణివో? అనవసరముగ నన్నేల వివాహములోనికి దించితివి? దగగొన్న నాపితరుల కేల మృగతృష్ణికలు చూపించితివి?" అని యేమేమో చెప్పితిని. వారియూరిలో మూన్నాళ్లు గడచినది. మాయూరు వచ్చితిమి. క్రమక్రమముగ నాతో మాటలాడుట మొదలుపెట్టినది. కాని నన్ను ముట్టుకొన నీయలేదు. ఇంతవరకు నే నామె నెఱుగను. ఈ రహస్యము లెవరితోనైన చెప్పునవేనా? ప్రాణబంధుడవు కనుక నీతో చెప్పుచుంటిని. తలంచుకొనిన నాహృదయము వ్రయ్యలగుచున్నది. ఆ పోయిన దుఃఖము చాలక భగవంతుడు నా కీక్రొత్తదుఃఖము సంపాదించి పెట్టినాడు. మాటలాడుట మొదలుపెట్టిన తరువాత కొన్నాళ్లకు కామె నెమ్మది నెమ్మదిగా తనకు—'

ఇక్కడ వీరభూపతి యాగినాడు. కుట్టానునకు చెప్పుటకు సంశయించుచున్నటుల కనబడినది. కుట్టాన్ వీరభూపతి చేతిలో చేయి వైచి యతని మైదుప్రేళ్లసందున తన మైదుప్రేళ్ల దూర్చి, 'వీరా! నాతో జెప్పుటకు సంశయపడవలెనా? నీకు తెలిసిన నొకటియు, నాకు తెలిసిన నొకటియునా? ఈ శిరస్సు పడిపోక ముందు నీరహస్యము లీ నోటిలోనుండి బయటకు పోవునా?' యన్నాడు. వీరభూపతి నిట్టూర్పు విడిచి, 'కుట్టాన్, నీవన్న నా కాభయము లేదు. ఈ ప్రపంచములో నీకన్న నాకు పరమాప్తు డెవ్వడు? నోటివెంట నామాటలు చెప్పలేకున్నాను! చెప్పలే కేమి? చెప్పెదను. వినుము. తనకు సంసారవాంఛ లేదన్నది. లోకముతో తనకు సంబంధము లేదట. మరి నన్నెందుకు వివాహముచేసికొనవలె నన్నాను. తన తల్లిదండ్రులు చేసినా రన్నది. ఈపరమయోగిని నాపాలబడినది. నా కేమియు దుఃఖము లే దనుకొనుము! నాతలితండ్రులయొక్క కోరిక యీ రీతిగా ఫలించినది. ఇట్లని నీతో చెప్పితిని. నే నిది చెప్పుట యేల యనగా, నాదుఃఖము నీవు పంచుకొనుటకు గాదు, నీదుఃఖము నీవు మరచిపోవుదు వని. ఆమె యింతవర కట్లే యున్నది. గృహములో సరిగానే ప్రవర్తించును. పనికత్తె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుండియు గూడ నా కనేకపరిచర్యలు తానే చేయుచుండును. తములపాకు మడుపు లందిచ్చును. ఈబాధ నాహృదయములో శల్యము వలె నాటుకొన్నది. ఆమెవదనము చూచి నప్పుడు ప్రయత్నించి చేసిన మందహాసము లోపలితత్వము గోచరించుచున్నది. ఆమెను నేను తాకరాదు. తాకినచో నామె గోదుమ వన్నె త్రాచువలె చురచుర జూచును. పురుషుడనైకూడ, కుట్టాన్, ఆమెవద్ద స్త్రీవలె నైపోతిని. కాదని యామెను తిరస్కరించి మరల వివాహము చేసికొందునా? ఇప్పటికి రెండుప్రణయయాత్ర లిట్లైనవి. మూడవదానిని గురించి గగనసౌధనిర్మాణములు చేయుదునా? చూచితివా నాదుఃస్థితి! ఇంచుమించుగ నామె యాజ్ఞాబద్ధుడనై పోయినాను. ఆమె మందహాసములకే సంతోషించుచున్నాను' అని వీరభూపతి సహజమైన ధైర్యము వీడి వలవల యేడ్చినాడు. కుట్టానునకు దుఃఖ మాగలేదు. ఇరువురు నిశ్శబ్దముగ చాలసేపు కూర్చుండిరి. కొంతసే పైన తరువాత కుట్టాన్ నెమ్మదిగ 'నీ యత్తవా రేయూ'రన్నాడు. వీరభూపతి కొంచెము సే పూరకుండి 'పరమేశ్వరసముద్ర' మన్నాడు. కుట్టానున కేమో యొడలంతయు తేళ్లు ప్రాకిన ట్లయ్యెను. కుట్టాన్ లేచి నిలుచుండెను. 'వీరా! మీ మామగారి పేరు?' వీరభూపతి 'దొడ్డదేవరా' యని సమాధాన మిచ్చినాడు.

కుట్టాన్—'నీ భార్యపే రేమి?'

వీరభూపతి 'మీనాక్షి' యన్నాడు. కుట్టాన్ 'అయ్యో!' అని క్రింద పడిపోవుటకు సిద్ధమైనాడు. వీరభూపతి లేచి యతనిని సందిట బూని పరుండబెట్టినాడు. కొంతసేపటికి కుట్టానునకు మెలకువ వచ్చినది. కుట్టాన్ లేచి తొందరగా బయలుదేరి పోవుచు, 'నేను పోవుచున్నాను!' అనెను. వీరభూపతి 'ఏ మయ్యెను?' అని యడిగెను. కుట్టాన్ కంఠమునుండి యేడ్పుతో గలసిన గద్గదధ్వని 'ఏమియు లేదు, ఏమియు లేదు' అని బయటికి వచ్చెను. అనుచునే కుట్టా నాగలేదు, తొందరగా పోయినాడు.

ఎదురుగా కమ్మరవాని కొలిమిలో పండ గ్రాగిన యినుపగుండువలె సూర్యోదయ మైనది. కుట్టా నరగడియలో తన సౌధమునకు బోయెను. పోవుచునే యంతఃపురములోనికి పోయెను. గదిలో గోడమీద ఎర్రనిబొట్లు రెండు నెత్తురులు చిమ్మినవి. అప్పుడే రెండవసంవత్సరము గుర్తుపెట్టిన ఏకవీరచేతికైన నూనె కలిపిన కుంకుమవర్ణ మతని హృదయమునుండి యామె నెత్తురు తీసిన ట్లతనికి తోచెను.

౧౬

రాజునకు గొప్పవ్యాధి సంక్రమించినది. రాజు బ్రదుకునట్లు లేదు. దళవాయికి రమ్మని యుత్తరము వ్రాసినారు. రాజ్యములో లెక్కలన్నియు సరిగా జూచుచున్నారు. స్థానాపతి తెల్లవారక ముందే రాజాస్థానమునకు బోయెను. రాత్రిర ప్రొద్దుపోవువరకు నింటికి వచ్చుటకు వీలు లేకపోయెను. ప్రొద్దున కుట్టాన్ చాలదుఃఖముతో నింటికి వెళ్లినాడు; అతడెట్లున్నది వీరభూపతికి తెలియలేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకస్మిక ఛాయాచిత్రములు



'హంపివద్ద సూర్యాస్తమయము' శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



కుఱ్ఱవాని ఆలోచనలు  శ్రీ యం. కె. రంగస్వామయ్యంగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుట్టా నంత దుఃఖించుటకు కారణము వీరభూపతికి తెలియలేదు. తనభార్యపేరు చెప్పి నపు డత డట్లుగా నయ్యె ననుభావ మతనికి పో లేదు. కుట్టాన్ తన దురవస్థలు తలంచుకొ నియే యట్లయ్యె నని యనుకొన్నాడు.

వీరభూపతి రాతిరి ప్రొద్దుపోయి యింటికి వచ్చి, భోజనము చేయకయ కుట్టాన్ వద్దకు పోయినాడు. కుట్టాన్ నిదురపోవుచున్నాడు. వీరభూపతి యొక సేవకుని బిలిచి, 'మీ స్వామి నే డెట్లున్నాడు' అని యడిగెను.

సేవ—'బాబూ! ప్రొద్దుటినుండియుభోజ నము చేయలేదు. స్నానమాడ లేదు. వారివద్దకు పోవుటకు మాకు భయము వేసినది. కనులు చింతనిప్పులవలె నున్నవి. ఏమో ఆలోచించు చున్నారు. పగలెల్ల నిల్లంతయు, తోటయంత యు నేదో పని యున్నట్లుగా తిరుగుచున్నారు. జాముప్రొద్దున్న దనగా నీనిద్దురకు పడినారు. ఇపుడు జాముప్రొద్దు పోయినది. నిద్ర లేవలేదు. ప్రాణము శోష వచ్చునేమో? లేపనైన లేపుడు.'

వీరభూపతి కుట్టానును కదల్చవద్దని చెప్పి యింటికి పోయినాడు. ఆ రాత్రియంతయు నిశ్శ బ్దమున ప్రశాంత గంభీరముగ గడచిపోయినది.

తెల్లవారినది. ఆణిమాసము వచ్చినది. పలుచని సంజ మొగిలు తెరచాటున నుదయిం చిన సూర్యబింబము కొంచెము పైకి వచ్చిన తరువాత స్వచ్ఛకిరణసమూహాములతో లోక మున కంతయు వెలుగు విరజిమ్మెను.

రాజున కానాడు కొంచెము నెమ్మదిగా నున్నది. స్థానాపతి రానక్కరలేదని కబురు వచ్చినది. కొంచెము నెమ్మదిగనే యున్నదని దళవాయికి వర్తమానము చేసిరి.

కుట్టానునకు జాముప్రొద్దెక్కిన తరు వాత మెలకువ వచ్చినది. లేచి మంచముపైన కొంతవరకు శాంతముగా గూర్చుండి, స్నానా దికములు చేసినాడు.

వీరభద్ర భట్టరును బిలిచి అంగడికి రెండువందలపన్నుల వెలగల యొకచీరయు, పసుపు, కుంకుమ తత్క్షణము కావలయునని చెప్పినాడు.

అవి వచ్చెను. మంచిగందపు చందుకాయ పెట్టెలోనుండి భూర్జపత్రము తీసి, యా యర లలో వాడినపూలును, కస్తూరియు మరల నుంచి, యాపెట్టెయు, చీరయు, పసపు కుంకుమ లును పూని వీరభూపతి యింటికి పోయినాడు. నిన్న నెల్ల భోజనము లేకపోవుటచేత నడువలేక పోయెను. బండి వద్దనెను.

వీరభూపతి పసుపు, కుంకుమ, చీరయు చూచి యివి యేమిటని యడిగెను.

కుట్టాన్ — 'నెమ్మదిగా చెప్పెదను. త్వరపడకుము. (కొంత యాగి) నే నీరోజున నిచ్చటనే భోజనము చేసెదను.'

వీరభూపతి 'సరే' నన్నాడు.

కుట్టాన్—'మనమిరువురమే కూర్చుం దము. మనకు నీభార్య వడ్డనచేయవలెను.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీర—'ఆమె నడిగెదను. ఆమె యొప్ప కొనవలెనుగదా. నీవు దళవాయి కొడుకువు, నీ యెదుటకు వచ్చునో రాదో?'

కుట్టాన్—'నే నడిగెదను. అన్నగారి వద్దకు రాగూడదా? ఎంత తెరచాటయినను, నంతఃపురస్త్రీలయినను, నన్నలకు, బంధులకు కనంబడరాదా?'

ఇరువురును మేడపై బడకగదిలోనికి బోయిరి. మీనాక్షి లేచి నిలుచున్నది. కుట్టానును గుర్తుపట్టినది. లోతైన కనులతో నతని వంక చూచినది. కుట్టాన్ కనులు క్రొత్తగా కాపురమునకు పోయిన చెల్లెలిని చూచు నన్నగారి కనులవలె సోదరస్నేహసూచిత మందహాసములు వెలిగ్రక్కినవి. అతని విశాలములైన నేత్రముల కొనలయందు బాష్పములు నిండినవి.

వీర—'మీనా! మీ అన్నగారికి నేడు నీవు భోజనము పెట్టవలెనట. ఈయన నెఱుగవు కాబోలు; ఈయనే కుట్టాన్ సేతుపతి. నీకు చెప్పితినిగదా నాకు పరమాప్తుడని! నేను తినుచున్న ప్రతిమెతుకును నితనిదే.'

మీనాక్షి స్తబ్ధ మైపోయెను. ఆమె నేత్రములవెంట రెండు బాష్పబిందువులు రాలెను. వారివంక చూడలేక తలవంచుకున్నది.

కుట్టాన్—'అమ్మా! ఎందుల కట్లు నిస్తబ్ధవయ్యెదవు? ఇది కోరరాని కోరిక యనియా? నీభర్తకు నాకు నున్న స్నేహ మట్టిది. నీవు నాకు సహోదరివి. సందియ మెందులకు? నీవు వడ్డించగా భోజనము చేయవలె ననిపించినది. అందుచేత వచ్చినాను. నీ విష్టపడవేని పోయెదను.'

మీనాక్షి పెద్దనిట్టూర్పు పుచ్చి, 'అన్నా! వడ్డించెదను. నేను నిస్తబ్ధనైనది యందుకు కాదు. తరువాత చెప్పెదను' అన్నది.

ఆ మూడునెలలనుండి మీనాక్షి నంతయుత్సాహముగా నెవ్వరును నెప్పుడును చూడలేదు. భోజనానంతరమువరకు నామె మహోత్సాహముతో నున్నది. మీనాక్షికూడ భోజనము చేసి వచ్చినది. మేడపై గదిలో తివాచి పరచి కూర్చున్నారు. మీనాక్షినికూడ కూర్చుండుమని కుట్టాన్ బలవంతము చేసినాడు. ఆమెయు గూర్చున్నది. కుట్టాన్ వీరభూపతితో నిట్లు మొదలుపెట్టినాడు: 'అన్నా! నీకు నే నిప్పుడు కొన్ని సంగతులు చెప్పబోవుచున్నాను. అవి విచారకరమైనవో, ఆనందకరములైనవో నాకే తెలియదు. చెప్పవచ్చునో, చెప్పరాదో కూడ తెలియకున్నది. అవి యన్నియు జెప్పుటకు నాచెల్లెలు మీనాక్షి యనుజ్ఞ కూడ తీసికొనవలసియున్నది.' అని యామె వంక చూచినాడు. ఆమె తల వంచుకుని తన యభిమతమును శిరశ్చాలనమువలన తెలిపినది.

కుట్టాన్—'వీరా! నీవంటి ధైర్యవంతులు, బుద్ధిమంతుడు నివియన్నియు విన్న తరువాత యథాప్రకారముగనే ప్రవర్తింపగలడను నుద్దేశముతో చెప్పుచున్నాను. నే నిపుడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీకొకమాట చెప్పబోవుచున్నాను. భయపడ కుము. నిగ్రహము పూనుము. చెప్పుదునా?'

వీరభూపతి తల యూపినాడు.

కుట్టాన్—'నీతో నే నిదివరకు ప్రేమించితినని చెప్పితినే,—చాల జాగ్రతగా నుండుము—ఆమె యీామె.'

వీరభూపతికి తల తిరిగిపోయినది. అతడు 'ఆ!' అని బిగ్గరగా నరచినాడు. మీనాక్షి యేకధారగా కన్నీళ్లు జార్చుచున్నది.

కుట్టాన్—'వీరా! ఇదియేనా ధైర్యము? ఓర్చుకొనుము. మించివచ్చిన దేమియు లేదు. ఇదియంతయు భగవంతుని లీల. మన మేమి చేయ గల్గుదుము? నేను నీకు పరమాప్తుడను. నాకన్న నిన్ను ప్రేమించువారు జగత్తులో నెవరు? నీ కింక నధైర్య మెందుకు? శోక మెందులకు? అన్నా! నీ కశుభము కలుగుటకు పూర్వము నాగొంతుక తరుగుకొని పోనిమ్ము.'

వీరభూపతి కొంచెము యథాస్థితికి వచ్చినాడు.

కుట్టాన్—'మొన్నరాత్రి నీవు నీసంగతి యంతయు నాతో చెప్పినావు. నేను పాతాళమునకు త్రొక్కబడితి ననుకున్నాను. హఠాత్తుగా విన్న యీవార్త నా తల బ్రద్దలుకొట్టినది. ఇది వినుటకు నీ కిప్పు డెట్లున్నదో నాకు నప్పు డట్లున్నది. అప్పు డింటికి పోయి, యేమి చేయుదును? ఏమియు దోచలేదు. ఏమో నేను నూరుబ్రహ్మహత్యలు చేసిన ట్లనిపించినది. వీరా! నాకు పిచ్చిమెత్తు ననుకున్నాను. అపుడు పిచ్చియే మెత్తినది. కాని శ్రీసుందరేశ్వరుడు నాయందున్నాడు. ఈమహాకల్లోలము నిన్న పగలు రెండుజాములు దాటువరకు దాటినాను. నీవు నాకు పరమాప్తుడవు. నీకన్న నాకు ప్రపంచములో ప్రేమింపగలవారు లేరు. అట్టి నీభార్యనా నేను ప్రేమించుట? నాహృదయము కణకణలాడు నిప్పుకలలో పడవేసి కాచిన ట్లయినది. విషసంలిప్తాగ్రములైన వెయ్యి బాకు లొక్కమారుగా నాహృదయములో దిగవేసినను నంత బాధ యుండదు. చివర కీ ప్రవాహములో బడి నశించిపోకుండ నొడ్డుకు జేరుకున్నాను. ఈమె యెడల నిదివరకు నాకు గల ప్రేమయంతయు సోదరప్రేమగా మార్చుకున్నాను. వీరా! నాకు అక్కలు గాని చెల్లెండ్రుగాని లేరు. భగవంతుడు నా కాలోప మీాప్రకారముగ తీర్చినాడు. నిజముగా మీారిద్దరు సుఖముగా సంసారముచేయుచున్న చూచుటయే నేను కోరినది. ఇక నాపూర్వవిషయము నాకు జ్ఞప్తికి రాదు. ఏలన, నిన్న దానికంతకు తగినంత నరకబాధ మానసికముగా ననుభవించితిని. ఆభావము నాలోనుండి పోయినది. ఇప్పు డీమెను నేను సోదరివలె చూచుచున్నాను. అట్లు చూడగలను. వీరా! ఏదురూహయు లేకుండ నీమె నిపుడు కౌగిలించుకొనగలను. నాచెల్లెలనుచు నెవరైన నున్నచో నామె నెట్లు కౌగిలించుకొందునో ఈమె నట్లు కౌగిలించుకొనగలను. నిన్న నేను పొందిన మహాబాధవలన, నాతపస్సువలన నా కీశక్తి వచ్చినది. వీరా! ఈ జీవితములో నన్ను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీమెడ నెంత కృతజ్ఞునిగా జేసికొంటివి! నన్ను ఘోరపాపమునుండి రక్షించితివి. నా ధర్మపత్నిని ప్రేమించుటకు మార్గము చూపితివి. ఇంకేమి చేయవలయును ? నీవు నాకు గురువువంటివాడవు'—అని కుట్టాన్ ఏడ్చుచు వీరభూపతి పాదములు కనుల కద్దుకొనెను. వీరభూపతి యతని చేతులు తీసి, 'కుట్టాన్, నా పూర్వజన్మసుకృతమువలన నీవు నాకు స్నేహితుడ వైనావు. నీకు నాకు పోలిక యెక్కడ? నీవు ఋషివి: నే నింకను మనుష్యుడనే. శ్రీ సుందరేశ్వరుడ వి ట్లవతరించినావు' అని కన్నీళ్లు పెట్టుకున్నాడు. కుట్టాన్ చీరయు, పసుపు కుంకుమలును, చందుకాయ పెట్టెయు మీనాక్షి కిచ్చి, 'అమ్మా! బుద్ధిమంతురాలవు. విద్యాధికురాలవు. నీకు నే చెప్పవలసిన దేమున్నది? ఈచీర కట్టుకొనుము' అనెను. ఆమె కన్నీళ్లు తుడుచుకుని ఆచీర ధరించి వచ్చి కుట్టానుకును, భర్తకును నమస్కారము చేసెను. నమస్కృతిలో మీనాక్షి వీరభూపతి పాదములను చేతులతో చక్కగా నిమిరెను.

౧౭

మీనాక్షి 'అన్నా! యిక రెండురోజు లుండు' మన్నది. వీరభూపతి పోనిచ్చినాడు కాదు. కుట్టాన్ పంచమివరకు వీరభూపతి యిల్లు వదలిపెట్టుటకు నీలు లేకపోయినది. కుట్టానున కేకవీరను చూడవలెనని యున్నది. ఆమెతో నిదియంతయు జెప్పవలె ననిపించినది. మీనాక్షిమాట తీసివేయలేక యున్నాడు. రాజునకు దదియనాటికే యెక్కువ యయినది. దళవాయిని తొందరగా రమ్మని మరల వర్తమానము చేసినారు. దళవాయి వచ్చుటకు నీలు లేకపోయినది. మారవదేశము ముద్దుకృష్ణప్ప నాయకుడు రాజ్యమునకు రాకపూర్వము దొంగలచే నిండియుండెను. రామనాథము మధురకును రామేశ్వరమునకును మధ్య నున్నది. రామనాథము వద్ద పెద్ద చెరు వున్నది. దానికి 'పాంశ్యాకమ్మై' అని పేరు. అది పూర్వ మెప్పుడో పాండ్యులు త్రవ్వించిన చెఱువట. ఆతటాకము వద్ద చోరులు మూగి రామేశ్వరమునకు పోవు మార్గములో యాత్రికులను దోచుకొనుచుండెడివారు. ఈమార్గము విశ్వనాథనాయకుని కాలమునుండియు నిట్లే యున్నది. కాని ముద్దుకృష్ణప్ప నాయకుడు దానివిషయమై శ్రద్ధతీసికొని దళవాయి నచ్చటికి పంపించి, యా మారవదేశమును స్వాధీనము చేసికొనెను. మధుర నాయకులకు రామనాథదేశము స్వాధీనము చేసికొనవలసిన యగత్య మున్నది. సముద్రపు టొడ్డంతయు పోర్చుగీసువారి యధీనతలో నుండిపోయెను. పోర్చుగీసు రాజప్రతినిధులచేత నియమింపబడిన యధికారులు సముద్రపు టొడ్డులనున్న పల్లెలలో, పట్టణములలో వర్తకముచేతను వచ్చుచున్న రాబడులు,పన్నులు వసూలు చేసికొనుచుండిరి. ఆయాస్థలముల యందు నేరములు, శిక్షలు మొదలగు సర్వాధికారములు పోర్చుగీసువారే చూచుచుండిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వదేశరాజులనుండి యిట్టి యధికారమును పోర్చుగీసువారు పొందలేదు. పారవులు (పల్లెవారు) తూర్పు సముద్రతీరములం దున్నవారందఱు పోర్చుగీసు రాజునకే ప్రజయట. అక్షరజ్ఞానము లేని యీ సముద్రతీర ప్రజను పోర్చుగీసువారు మతబోధకులవలనను, నల్ప పారితోషికముల వలనను వారి నాకర్షించి వారిని క్రైస్తవ మతములోనికి మార్చి, వారి యండ గొని యిట్టి యక్రమములను దేశములో జేయజొచ్చిరి. ఈ రాజకీయ దౌర్జన్యమును, ధననష్టమును నివారించుటకు మధుర రాజులు మారవదేశమును చక్కగా నుంచుట యవసరమైనది. రామేశ్వరమునకు బోవు యాత్రికులను దోచుకొనుట కూడ నా రోజులలో క్రైస్తవమతాభివృద్ధి చేయుటగా భావింపబడెను కాబోలు. మొదట ఉదయన్ సేతుపతి యీ పనిమీద నియమింపబడినది విశ్వావసు నామ సంవత్సరమున.

సేతుపతి దళవాయి యచ్చటకు చేరిన తోడనే మొట్టమొదట రామేశ్వరమునకు బోవు మార్గము బాగుపరుచుటకై రామనాథమునకును, పోగళూరునకును కోటలు కట్టి యచ్చోట సైన్యముంచెను. యాత్రికులను గుంపులుగుంపులుగా చేసి, ప్రతి గుంపువెంటను కొందఱు సైనికులను పంపించుచుండెను. రామనాథమునుండి యిట్టి యాత్రికులు ప్రొద్దున నొకగుంపు, సాయంతన మొకగుంపును బయలుదేరును. వారివెంట నేబదిసైనికులు, వీరి వెంట నేబదిసైనికులును పోవుచుందురు. ఈ రెండు సైనికుల జట్టులును మఱునాడు రామేశ్వరమునుండి వచ్చు యాత్రికులతో వత్తురు. ఇచ్చటినుంచి మఱునాడు మరి రెండు యాత్రికులగుంపులు బయలుదేరును. ఇట్లు మొదట యాత్రికులకు సౌలభ్యముచేసి, యనంతరమున నాచుట్టుపట్ల నిరంకుశముగా బ్రవర్తించుచున్న చిన్నచిన్న పారవులనాయకులను క్రమక్రమమున సాధించి కాళయ్యార్ కోవెల, పట్టమంగళము మొదలగు స్థానములలో తగిన యధికారుల, నుంచి కట్టుదిట్టములు చేసెను. తరువాత సేతుపతి రామనాథము చుట్టుపట్లనున్న యరణ్యములను ఛేదించి పాండ్యకమ్మై జలముతో భూమియంతయు సాగుచేయించెను. దేశము చోరభయము లేక తృణజలకాష్ఠసమృద్ధి గలిగి సేతుపతి పరిపాలనమున శాంతి కలిగి యుండెను. పరదేశీయుల యుబ్బును తాత్కాలికముగా తగ్గెను. కాని మతవిషయికమైన యే పనులు సేతుపతి చేయలేదు.

రాజునకు చాల జబ్బుగా నున్నది, రమ్మని కబురు వచ్చుటచే దళవాయికి భయము వేసినది. రాజున కెట్లుండునో! ఒకవేళ రాజు మృతినొందెనా, తా నీరామనాథ ప్రాంతములలో జేసిన ప్రయత్నము లన్నియు నిష్ఫలములగును. సామాన్యముగా రాజు మారినప్పుడు సామంతులును, శత్రువులును తమ స్వాతంత్ర్యమునకును, పోయినభూములు మరల సంపాదించుకొనుటకును ప్రయత్నింతురు. కనుక నిదియే సమయమని, 'దళవాయి రాజధానిలో ననేక కార్యములు చూచుచుండును,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చుటకు వీలు లేదని తెలిసి, యణగద్రొక్కబడిన చిన్నచిన్ననాయకులు మరల తమ స్వాతంత్ర్యమును వహించిరా,యీసారి వారిని గెలుచుటకూడ కష్టమైపోవును. అందుకని తాను రాజధానికి పోకమున్నె తనకుమారుని రమ్మని దళవాయి కబురంపినాడు. తనకుమారుని తనయధికారములో నుంచి తాను రాజధానికి పోవలయును. దళవాయి తత్క్షణము రాజధానికి పోవలె. కుట్టాన్ తత్క్షణము రామనాధమునకు రావలయును.

జ్యేష్ఠ శుక్లపంచమినాడే కుట్టాన్ బయలుదేరవలసివచ్చెను ఏకవీరను చూచుటకుగూడ వీలు లేక పోయినది.

దళవాయి మధురకు దశమికి చేరుకొనెను. రాజు ముద్దుకృష్ణప్ప నాయకుడు మంచములో పరుండియే తన యిద్దరు కొడుకులను, దళవాయిని, ప్రధానిని, రాయసమును కూర్చుండబెట్టుకుని రాజ్యమంతయు తనకొడుకుల కప్పగించెను. పెద్దకుమారుడైన వీరప్పనాయకుని రాజును చేయవలసినదని నిర్ణయించెను. రెండవ కుమారుడును, మహాసమర్థుడునైన తిరుమల నాయకునితో నన్నగారికి జేదోడు వాదోడుగా నుండుమనియు, కస్తూరి రంగప్పవలె ప్రవర్తించరాదనియు, నట్లయిన రాజ్యము బహుధా పంచుకునిపోయి శత్రువులకు సాధ్యమగుననియు చెప్పెను. తిరుమలనాయకుడు తండ్రి పాదములవద్ద కూర్చున్నవాడు, సాల ప్రాంశువు, లేచి, కత్తి పూని, తనయన్నగారినే సేవించెదననియు,నన్నగారికి సంతానము కలిగెనేని యతని తరువాత తనయన్నసంతానమునే రాజు జేసెదననియు ప్రమాణము చేసెను. తరువాత రాజు దళవాయి, ప్రధాని, రాయసములతో తననువలెనే తనకుమారునికూడ సేవించవలెననియు, వారి రాజభక్తివలననే రాజ్యము సాగుచున్నదనియు జెప్పి, సేతుపతి చేసిన మహాత్కార్యములను, నతడు చూపించిన రాజభక్తిని గొనియాడెను. వారందఱును రాజ్యమును పూర్వమువలెనే కాపాడెదమని ప్రమాణము చేసిరి. తరువాత రాజు చాలసేపు శాంతముగా నుండెను. అదివరకే పాళెగాండ్రందఱు ననేక కార్యముల మిష మీద మధురకు పిలిపింపబడిరి. రాజు సాయంతనమున నొకరొక్కరినే పిలిచి వారివద్దనుండి గూడ వాగ్దానములు తీసికొని యానాడే వీరప్ప నాయకుని కభిషేకము చేయించెను. క్రొత్త రాజున కందఱును జోహారులు చేసిరి. మఱునాడే కాదశి. ఆనాడు చంద్రోదయసమయమునకు (శ్రీ) ముత్తుకృష్ణప్ప నాయకుడు పరమపదించెను.

రాజసౌధమంతయు రోదనధ్వనులతో నిండిపోయెను. దళవాయియు, తిరుమలనాయకుడును పోయి యూరడించిరి. మంచిగంధపు చెక్కమీద నేతిగిండ్లు క్రుమ్మరించి వృద్ధరాజ శవము నాహుతిచేసిరి. వీరప్పనాయక మహారాజులుంగారు సహస్రగోదానములును, శతాగ్రహారదానములు చేసెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామంతరాజులయు, ప్రధానాధికారుల యు రాజభక్తివలన రాజ్యము మరల శాంత ముగా జరుగుచుండెను. క్రొత్తరాజునకు పాళె గాండ్రిచ్చిన కానుకలతో రాజసౌధము నిండి పోయెను. వృద్ధరాజు పోయినా డన్నదుఃఖ మేయంతఃపురమునందు దాగియున్నదో కాని, మధురరాజ్యమంతయు నూతనభూపతి పట్టాభి షేకోత్సవమునందలి యానందచిహ్నముల తోడనే కలకల లాడుచుండెను.

వీరభూపతి యుదయన్ సేతుపతిని ఒక నాడు భోజనమునకు బిలిచెను. వీరభూపతి చిన్నవాడు. చనిపోయిన వృద్ధనరపతికూడ వీరభూపతికి స్థానాపతి యధికారము వచ్చి మూడునెల లయినను మిక్కిలి సమర్థతతో వర్తించినాడని చెప్పెను. వీరభూపతి నిదివరకు వృద్ధసేతుపతి చూడలేదు. అతని కీ యుద్యో గము కుట్టాన్ తిరుమలనాయకునితో చెప్పి యిప్పించెనని యతనికి తెలియును. వీరభూపతిని చూచిన ఉదయన్ సేతుపతికి ముద్దయినది, కుఱ్ఱవాడు, తెలివితేటలు కలవాడని.

భోజనవేళ మీనాక్షి వడ్డించినది. దళ వాయి మీనాక్షి నెఱుగును. ఆశ్చర్యపోయి నాడు. వీరభూపతి నడిగినాడు. స్థానాపతి కథ యంతయు సంక్షిప్తముగా దళవాయికి తెలి యజేసెను.

మీనాక్షి 'కక్కా! అన్నకు నాయెడల నెంతప్రేమ యనుకొంటిరి' యన్నది. తన కుమారుని సంసారమునకు మంచిరోజులు వచ్చినవని దళవాయి సంతసించినాడు. ఇప్పుడు కొడుకును, కోడలిని విడిగా నుంచరాదు. దళ వాయి నాటితిథి యడిగెను: 'ఆషాఢ బహుళ చతుర్దశి.'

౧౭

మీనాక్షి సేతుపతుల సౌధమునకు పోవుచు వచ్చుచుండెను. ఏకవీరకు నామెకు మిక్కిలి చెలిమి మైనది. ఏకవీరకూడ రెండు మూడుసారులు స్థానాపతియింటికి వచ్చినది. ఆమె వచ్చిన రెండు మూడుసారులును స్థానా పతి యింటివద్ద లేడు. రాచకార్యము లంత యొత్తిడిగా నున్నవి. వీరభూపతి యింటికే వచ్చుటలేదు. వరుసగా వారమునము లీ పూట వచ్చుటకు వీలు లేదు, ఈపూట వచ్చు టకు వీలు లేదని యత డింటికి వర్తమానము లంపెను. మీనాక్షి సేతుపతుల ప్రణయమును గూర్చి వీరభూపతికి తెలిసినతరువాత కుట్టాన్ మూడుదినములు వీరభూపతి యింటనే యుం డెను. అనంతరమున నతడు రామనాథము నకు వెడలిపోయెను ఆతరువాత మీనాక్షి వీరభూపతుల చర్యలలో ననేక మార్పులు కలి గెను. వీరభూపతి పైన ప్రేమ నానాటికి మీనాక్షి కభివృద్ధి నొందుచుండెను. మీనాక్షి నిత్యము వీరభూపతి యున్నచోట గాని యుం డదు. అతనితో మాటాడునపు డామె మొగ ములో నవ్యక్తములైన స్వర్గవాంఛలు తల చూపుచుండును. ఆ నాలుగైదు రోజులలో మీనాక్షి తనంతట తాను వీరభూపతిని రెండు సారులు కౌగిలించుకొన్నది. కాని వీరభూప తిలో కదలిక లేదు. అతడు మున్నువోలె నామెను పలుకరించుటకూడ లేదు. తనవద్దనే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూర్చున్న మీనాక్షి నచటినుండి లేచి పొమ్మ నును. ఆమె తనవద్దకు వచ్చినవెంటనే తన కేదో పని యున్నట్లు లేచిపోవును. మీనాక్షి యతని కౌగిలించుకున్నపుడు రంభాపరిష్వంగ మున నిశ్చలుండును, నియతేంద్రియుడైన శుకు నివలె కూర్చుండెను. ఇతని యీ తూష్ణీం భావము మీనాక్షికి దుఃఖము కలిగించ లేదు. అంత కంత కామె ప్రేమ వృద్ధియగుచునే యుండెను. పొంగి వచ్చు నా ప్రేమప్రవాహ మును వీరభూపతి తాళుకొనలేకపోయినాడు. ఆమెచేయు ప్రేమద్యోతక కార్యములను నోర్చు కొనలేకపోయినాడు. అతనిమనస్సు కదలి పోయినది. సేతుపతి, మీనాక్షి - వీరిరు వురి ప్రేమము నతనిమనస్సు నావరించెను. ఇప్పుడు వారి ప్రేమ సోదరీ సోదరప్రేమ కదా! శారీరకమైన సంయోగము లేకపోయి నను వారిరువురే భార్యాభర్తలు. వారి యా ప్రేమ యూరకే పోవునది కాదు. వారిజీవితము లున్నంతవఱకు నది తుడిచివేయబడునది కా దు. ఇప్పటి వారి యునికి యథార్థమైనను, ప్రథమప్రేమ, మీనాక్షీ హృదయపుమొగ్గ, కుట్టాన్ సేతుపతియే వాసన చూచినాడు. ఇప్పుడది యనన్యభోగ్యము. వీరభూపతికి నిద్ర లేదు. ఆహారము లేదు. నిరంతరము మీ నాక్షీ సాహచర్య మోర్చుకొనలేక రాజసౌధ మునకు పోయి యందే నివసించుచుండెను.

వీరభూపతి యింటికి వచ్చి వారము దినము లైనది. మీనాక్షి యతనికొరకు రాజసౌధ మునకు బోద మనుకున్నది. కాని అట్లు చేయరా దనుకున్నది. ఉన్నన్నినా ళ్లింక వచ్చెనా, ఇక తొందరలో రావచ్చు నను కున్నది. తొందరపడి సంభ్రమర్యాద నుల్లం ఘించుట యేల యనుకున్నది. వీరభూపతిని గూర్చి యామె యూహించినపుడెల్ల నామె మొగము చివరలు రేఖాసౌష్ఠవసీమలును, కనులు జ్యోతిరాస్థానములు నగుచుండెను. ఆమె యొడలంతయు పులకరించిన ట్లుండెను. ఈ మహాప్రేమలో నామెకు వీరభూపతికి తన యెడ నెట్టిభావ మున్నదో తెలియలేదు. తన పూర్వనైల్యమంతయు కుట్టాన్ తపస్సుచే బరిక్షాళిత మైపోయిన దనుకున్నది. వీరభూపతి వంటి బుద్ధిశాలి కందలి సమున్నతార్థము గోచరించకుండుట దుర్లభ మనుకున్నది. వీర భూపతి యీ యంతఃపుర్యాశ్రయము పని యొత్తిడివలననే కలిగె ననుకున్నది. రాజు పో యిన క్రొత్తరిక మాయూహకు బల మిచ్చినది.

నాడు శ్రావణ శుద్ధదశమి. ఆకసమున మొగిళ్లు కృష్ణసారమృగములవలె, అగురు ధూమములవలె, ఎలుగుబంట్లవలె, ఏనుగు గున్నలవలె, దుముకుచుండెను; వ్యాపించుచుం డెను; కదలకుండెను; ఘీంకరించుచుండెను. తూరుపున పట్టినమబ్బు చుట్టుపట్ల నున్న పది మబ్బుల కలుపుకుని వాన యొలుక బోసినదే యనిపించినది. కాని యింతలో నొక పెద్దగాలి వచ్చి దానిని పునరేకాదశథా విడ బరచెను. సూర్యుడు మాత్ర మప్పుడప్పుడు పలుచని మబ్బులలోనుండి మందరశ్ములు కనుపించునే గాని యింతలో మరల నొక నల్లకానుగుల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుమ్ముమవంటి మేఘు మడ్డువచ్చి యతని లోక మును నేఁజుపరచును.

ఒంటరిగా నున్న మీనాక్షీ కేమియు దోచలేదు. ఆమెకు వీరభూపతి దగ్గర లేమి వియోగభారము ననిపించలేదు. ప్రతిక్షణ మతని రాక నెదురుచూచు నామె దేహము మాటి మాటికి క్రొత్తక్రొత్త పులకలచే గరగరికలు దాల్చుచుండెను. ఆమె కింతలో నేకవీరవద్దకు పోవలె ననిపించినది. ఇదివర కామె యేకవీర యింటికి పదిసార్లుదాక పోయియుండవచ్చును. ఏకవీర యనిన మీనాక్షికి చెప్పరానంత ప్రేమ యున్నది. ఆ ప్రేమకు కారణ మున్నది. ఆమెను చూచినంతనే మీనాక్షికి తన జీవిత మంతయు జ్ఞప్తికి వచ్చును. తనజీవిత రహస్య మంతయు నొక గుళికవోలె యామెలో నున్న ట్లనిపించును. కాని యేకవీరకు మీనాక్షిమీద నేటిప్రేమ? మీనాక్షి యేకవీరకు స్థానాపతి భార్య. స్థానాపతికి తనభర్తకు స్నేహము. స్థానాపతి కుద్యోగ మిప్పించినది తనభర్త. అందుచేత గూడ దనయందు మీనాక్షికి ప్రేమ కలుగవచ్చును. అయినను అంతప్రేమ చూపుచున్న మీనాక్షిని హృదయముతో దాను ప్రేమించలేకపోయినను, లోకమర్యాద మెంతవర కభిలషించునో అంతవర కామెను ప్రేమించునట్లు వ్యక్తపరచుచుండెను. అందు కనియే అంతవర కిల్లు కదలని యేకవీర రెండు మూడుసార్లు స్థానాపతి యింటికి వెళ్లినది. వెళ్లినది, కొంచెము సేపు మాత్రమే యుండి తిరిగియు వచ్చినది. మీనాక్షి యామెకు తమ యిల్లంతయు జూపించ నెంచినది. ఏకవీర యామె కెడ మీయక వెళ్లినట్లే వెళ్లి తిరిగి వచ్చినది. మీనాక్షి సహజముగ వివేకవతి; లోకులభావములు వారి ప్రవర్తనలవలన తెలిసి కొను నేర్పు కలదియ కాని, యిప్పటి యామె స్థితి యొక తన్మయత్వముగా నున్నది. తన తొల్లిటిప్రేమ; దానిపరిణామము; తన యిచ్ఛ లేని తల్లిదండ్రుల బలవంతమువలనిపెండ్లి; ఆ వచ్చినభర్త తనయిచ్చ నడిపినవాడు; దైవా ద్వాకుట్టాన్ కలయిక; అతని మహత్తర త్యా గము-ఈ విచిత్రసంఘటనమెల్ల నామె యెడం దలో దేనినిగూర్చియు నాలోచించుట కెడ మియ్యలేదు. తన వివాహ మైన నాటినుండి తన పతియెడల తనదోష మామెను వేధించు చుండెను. ఇతరమైన యేసంగతిని గూర్చి యూహించుటకు దావియ్యని యామెమనసు తనశక్తినంతయు నీవైపునకు తోసినది. దివా రాత్రము లామె వీరభూపతిని గూర్చియే యూహించుట. ఏకవీర తనయెడల నెట్లు ప్రవ ర్తించినది యామెకు గుర్తే లేదు. నాడు మర ల నేకవీరను జూడబో నెంచి శకటవాహకుని బిలిచి బండి యాయత్తపరుపుమనెను.

తాను తలదువ్వుకుని, క్రొత్తచీర తాల్చి, నగలు ధరించి, ముంగిట నిలిచిన శకట మారో హించ బయటికి వచ్చెను. ఆమె ప్రొద్దున నొక సేవకుని వీరభూపతిని నాటిరాత్రికి రమ్మని కబురంపినది. వాడు వచ్చి స్థానాపతి రాత్రికి వత్తునని చెప్పిరని వార్త తెచ్చినాడు. వానిని పంపించి మీనాక్షి బండిలో గూర్చున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బండిలో గూర్చున్న మీనాక్షీ కన్ను లలో వీరభూపతి యాడినాడు. ఎఱ్ఱనిమానిసి. శాంతమైన వదనము. ఎఱ్ఱని మొగమున నల్లని మీసముల చివరలు మెలికలు తిరిగి తామర మీద తుమ్మెద లాడిన ట్లునికి. ఆజానుబాహువు. చక్కనికన్నులు. ఎప్పుడు నవ్వుచున్న మొగము. మీనాక్షీ తా గప్పుకొన్న బంగరు పూవులుగల తెల్లని పట్టుసేలువలోపల రెండు చేతులు ప్రక్కల కదుముకుని, కన్నులు మూసికొని, బండిలో నొకవైపున కొదిగి కూర్చున్నది. రంయిమని చల్లనిగాలి తెరలసందుగా లోనికి దూరినది. మీనాక్షీ కన్నులు మరింత మూసికొని, నక్కినక్కి మూలమూల కొదిగి యొదిగి కూర్చున్నది.

ఆశకటము రాజదత్తము. ప్రధానాధికారులకు ప్రతివారికి రాజుగారి శకట మొకడు కానుక. అది యిది. బండికి నాలుగుచక్రములు. క్రొత్తరంగు. నందీశ్వరునివంటి రెండు వృషభములు బండికి గట్టబడెను. బండివాడు బహుప్రయత్నమున వృషభముల నంకెకు తెచ్చుచున్నాడు. బండికి నొగవద్ద స్థానాపతి పేరున్నది. ఎద్దులవీపులమీద కప్పబడిన యెఱ్ఱని పట్టుసెల్లాలమీద స్థానాపతిపేరు వ్రాయబడి యున్నది. ఎడ్లకొమ్ములు కోనదేరి చివరల హొన్నుపొన్ను లమర్పబడి యున్నవి. అద్దాలు, మువ్వలు, చిఱుగంటలు నమర్చిన వెంట్రుకల త్రాళ్ల సికమారులు, మెడలకు గంటల పట్టెడలు, నాలుగు కాళ్లకు వెంట్రుకలత్రాళ్లు ప్రకాశించు రెండువృషభములు దక్షయజ్ఞధ్వంసవేళ వీరభద్రుని వెన్నాడిన నందీశ్వర భృంగీశ్వరులవలె నురుసులు గ్రక్కుచుండెను. పార్వతీదేవికి హిమవద్రాజు పంపించిన సారెవలె, మీనాక్షీ దేవికి ప్రతి సంవత్సరారంభ వేళాకృత కళ్యాణార్థ పరిగుంఫితమంటపమువలె నాబండి వీథివెంట జరజర దొరలిపోయినది.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్న సైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములలో బంతులు దూరదూరముగా దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భా ర తి'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఉత్తరరామచరిత్రనాటకము-భవభూతిహృదయము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

శ్రీనివాసుని యవతార మైనవాఁడు
నిర్మల గుణాకరంబయి నెగడువాఁడు
న్యాయ్య విక్రమమునకు స్థాన మగువాఁడు
రామచంద్రుఁ డెప్పుడును క్రూరమతి కాఁడు.

రసముఁ బోషించుటకు నేను రాముచరిత
నన్యథా చేసియుంటి నయ్యె తెలుఁగుల
దాని నిజమైన కథగాఁగఁ దలఁచి లోకు
లకట! భ్రమపడుచుండి రటంచుఁ దెలిసె.

అమలినుఁడు ధర్మవిదుఁడు దయామయుండు
రామచంద్రుఁ డెక్కడఁ? గఠోరముగఁ గ్రూర
ఘోరమృగ సమాకుల వనక్షోణియందు
జనకతనయను డించి రమ్మనుట యేడ?

శోకము సమృద్ధిగాఁ దోఁచి చొక్కఁజేయ
వలయు రసికాళి నన్న భావప్రపుష్టి
కొఱకుఁ గథను మార్పఁగవచ్చు సరసరీతి
నగు నిది రసజ్ఞసంప్రదాయ క్రమంబు.

అట్టి రససంప్రదాయంబు నాశ్రయించి
భయముగా మీఁదఁబడవచ్చు శ్వాపదముల
నడుమ లక్ష్మణస్వామి జానకిని డించి
వచ్చె రామాజ్ఞనని నేను వ్రాసియుంటి.

రమణిని దలంచుకొని యేడ్చు రఘుకులమణి
కామెమూర్తి యుద్దీపక మగును గాన
ఆమె దుస్థితి శోచనీయమగు పొంటె
నడవిమెకముల కాహార మయ్యె నంటి.

పిలిచినం బల్కునట్టి వారలును లేని
కాఱడవిలోనఁ గ్రూళ్ళ మెకాలనడుమ
లక్ష్మణుఁడు డించె సీత నా లలన కల్ల
సమయమే ప్రసవించెడు సమయ మంటి.

పడఁతి యాకష్ట మనుభవింపంగలేక
తొందఱగ నట గంగలో దూఁకె నంటి
నట్టి సీతయాపద తల మెత్తనీక
యుమ్మలిక రాము ముంచివేయుటను గంటి.

అట్టి రామశోకంబు శబ్దార్పితమయి
చర్వణాబలమునను రసముగ మాఱి
యార్ద్రహృదయుల నెల్ల రసాబ్ధిలోన
మగ్నులం జేయునను రసమతముఁ గొంటి.

ఎన్నఁడో బాల్యమందుఁ దా నెత్తి పెంచి
నట్టిజనకుండు బ్రహ్మవిద్యావిదుండు
ధరణిజాతకై వత్సలతాప్రయుక్త
శోకమున మున్గిపోవుటఁ జూపియుంటి.

దండకారణ్యమునఁ దడ వుండి నట్టి
సీతమంచితనంబెల్లఁ జిత్తమునకు
నచ్చియుండిన కతన జానకిస్థితి వినఁ
బడుట వాసంతికిని గుండెపగిలె నంటి

తమసకు వసిష్ఠునకు నరుంధతికి దశర
థావనీంద్రుని భార్యల కందఱకును
సీత యాపద తాపంబుఁ జేసె ననుట
వెలయుటకె వారలఁ బ్రవేశపెట్టియుంటి.

ఇది యశేషము శోకసమృద్ధి రామ
చంద్రునందు సాధింపంగ సాధనమని
నాదుదృష్టి. శ్రీరామచంద్రప్రభు వాక
ధర్మవీరుఁడుగా దీనఁ దనరఁ గలఁడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టు వెల్లువలై పాఱునట్టి కరుణ
రసమును దిరస్కరించి ధర్మప్రజాను
రంజనోత్సాహ మున్న శ్రీరామభూవ
రుండు ధర్మవీరులఁ బ్రధానుండు గాఁడె?

ఇట్టి శోకాబ్ధిలో మునకలేని యొప్పి
ధాత్రి నిక్ష్వాకుకులుల గోత్రవ్రతముగ
జానుమీఱు ప్రజానురంజనమె చూచు
కొనుట ధర్మవీరుని చిహ్నమనఁగఁ దగదె?

రసము చిప్పిలునట్లుగా వ్రాయుచోట్ల
రసముఁ బోషించుకొఱకు వర్ణన మొనర్పఁ
బడిన వెయ్యవియో! వాస్తవంబు లెవియొ!
అని విమర్శించి కవిభావ మరయవలయు.

అందమైన యర్థాలంక్రియలను గాని
లలితరసపదలంకారములను గాని
అధికమా కవిప్రౌఢోక్తులందుఁ గాని
వర్ణనల వస్తువును వేఱు పఱుపవలయు.

తథ్య మనృతము గల చమత్కార సార
వర్ణనములందు లీనమై వస్తు వొప్పు
నెదిగి యల్లిన కాఁకరపాదలలోన
కానఁబడకుండు పచ్చని కాయవోలె.

అట్టి వస్తువున్ వర్ణనాభ్యంతరముల
మిణుకు మిణుకులాడుచునుండి మెఱయుదాస
గావ్యములలోనఁ బ్రతిభచేఁ గనఁగవలయు
నట్లు కాసనాఁడు చరితం బనృత మగును.

అర్థవాదంబులఁ దొఱంగి యర్థములను
గైకొనెడిరీతి వేదాలఁ గానఁబడును
అట్టి సంప్రదాయంబె కావ్యాదులందు
వస్తువును గ్రహియించెడు పట్ల వలయు.

పూజ్యుఁడైన వాల్మీకి తపోవనమున
కంపెఁ గాని కాఱడవుల దింపలేదు
ఆతపోవన మపుడు విద్యలకు తావు
శాంతికి నికేతనంబు మోక్షంబు త్రోవ.

ఎందఱో స్త్రీపురుషులు మోక్షేచ్ఛ నచటఁ
జేరుకొని కాఁపురమ్ములు చేయుచుండి
రచటఁ గాలముం గడపంగ నవనిజాత
నంపె రాముఁ డప్పటి చిక్కు నట్టి దగుట.

ప్రజకుఁ బ్రభువుపై భక్తి విశ్వాసములు న
శించె నిశ్శేషముగ దానఁ జేసి జనులు
పాపభీతి వీడిరి రామభద్రుఁ డెపుడు
నలుపఁబోఁడు బలాత్కారశాసనములు.

ఒక్కఁ డెవ్వఁడో చాకలి యక్కరణిని
జానకిని దూఱె ననుట యసత్యవార్త
యెల్లయెడలఁ బ్రజలలోన కొల్లగాఁగఁ
బ్రబలియుండె నా మిథ్యాపవాద మపుడు.

ప్రజలలోన నాబాల గోపాలముగను
రాముఁడు ధరాతనయఁ దెచ్చి రాగ మెసఁగ
నేలుకొనుచున్న విషయంబు నేవగించి
చర్చ లొనరించుచుండిరి సభలు చేసి.

ఎక్కడన్ వినఁబోయినఁ బెక్కుగతుల
రాముఁ గూర్చియు జానకీరమణిఁ గూర్చి
నిందలే వినఁబడఁజొచ్చె నిజముఁ గప్పి
పుచ్చలేక తెల్పిరి భద్రముఖులు చరులు.

ఇట్టిచో నొక్కవ్యక్తి కిక్కట్టనుకొని
యందఱుఁ జికాకు పఱుచు టన్యాయ మనుచు
ఋషుల యాశ్రమముల వసియింపఁ గోరు
రమణిని దపోవనుల కంపె రాఘవుండు.

తన్నుఁ బాయఁజాలని సీతతత్త్వ మెఱిఁగి
సుదతి నపుడు రాముఁడు కంటఁ జూడలేక
చెప్పకయె పంపె. లక్ష్మణస్వామియు నది
పల్కలేకయే ఋషికంటఁ బడక వచ్చె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కులాసా

మల్లాది రామకృష్ణశాస్త్రి గారు

౧

'బాగా లేదు. వేషమంతా మార్చాలిసిందే—ఎన్నిమాట్లు చెప్పను, నీకు కొర్నాటిచీరెలు బాగుండవని? మొన్న తెప్పించిన లేతగులాబీ చీరె కట్టుకోరాదూ!'

'పోనీలేద్దురూ, ఏలా ఉంటే నేం. వియ్యమంద బోతున్నానా? ఇట్టే పేరంటము వెళ్లి రావడానికి ఇవి చాలవూ?'

'ఓ—చాల కేం. అయినా రెండో మూడో రంగులు తక్కువ-లేకపోతే ఇంద్రచాపం లాగా మెరిసి పోయేదానవే! ఇంతకూ ఏలాటివాళ్లు ఏమాదిరి చీరెలు కట్టుకోవాలో ఎవరి బుద్ధికి వాళ్లకి తెలియాలి. ఎంత కాలం-అదికాదు, ఇది-అని దిద్దిచెపుతూంటారు, ఎవరు మాత్రం?—ఎవరి అందం—'

'నే నేది చేసినా అంతే లెండి. మీ రవు నన్న దెప్పుడు? నేను అందరికిమల్లే అందగత్తెను కాదు గనుక నే మీ రీసడించటం-కానీ లేండి. ఏం చేస్తాం—'

'ఉన్నమాటకు ఉలు కెందుకూ? నీకు తోచినంతే కాని ఒకరు చెపితే వినడమంటూ ఎన్నడైనా ఉన్నదా? ఇప్పుడు కొత్త ఏమిటీ, మామూలే కాదూ!'

'అప్పుడా మాత్రం తెలిసింది కాదేం: ఎందుకు కొన్నారూ?'

'నీకు తెలియదూ-ఎందుకంటే; నీ—'

'అవును. నాపోరు పడలేక కొన్నారు. అంతేనా? సరే లెండి; ఏమీ తోచనప్పు డల్లా కవ్వించి కజ్జా ఆడు తూంటాడు.'

'కాదు, సరస మాడుతూంటాను.'

'సరసాలకి నేనేం సానిదాని ననుకున్నారా?'

'ఆఁ-పారబాటే మరిచిపోయి అన్నా-మీనాన్న-ఆశ్రోత్రియపు ముండా కొడుకు-భువనేశ్వరం దగ్గరే కూర్చోపెట్టి పెంచాడాయెను మిమ్మల్ని! మీదగ్గర ఆఁ-అంటే తప్పు, నారాయణా అంటే బూతుమాట. సరసాలు కావులే, మీభాషలో ఆషామాసీ లంటారే అవి.'

'ఆనండి. ఆడపిల్లల్ని కన్నందుకు మానాన్న యీమాటలన్నీ మీచేత పడాల్సిందే. "అమ్మా, మంచిగా ఉండు" అని చెప్పాడు కాని ఆయన మాకు కాని పోని వేమీ నేర్పలేదే.—చచ్చి స్వర్గాన ఉన్నవాడిని ఇంకా సాధించడం ఎందుకండీ?'

'ఎంతఘనకార్యం చేశాడని—మిమ్మల్నికన్నందుకేనా ఆయన స్వర్గానికి వెళ్లడం?'

'కాదు; మీవంటివారు ఆయనకు అల్లుడై నిత్యమూ దీవించుతూండడంచేత!'

'నిజమే.'

'కాకపోతే! మనకు పిల్లలు పుట్టిన తరువాత కూడా, ఇంకా "మీనాన్న అట్లాంటివాడూ"—"నా కానాడు అది పెట్టలేదు"—"అవాళ నన్నట్లా అన్నాడు"-అని దెప్పుతూండటమేనా?'

'లేకపోతే మనిద్దరికీ తెలిసిన విషయాలు వేరే ఏమున్నాయీ? కాళిదాసు కవిత్వాన్నిగురించి మాట్లాడమన్నావా? కాంటినెంటల్ రినైజాన్సుమీద దబాయించమన్నావా? నీకు ఏది అర్థమవుతుందో అసంగతే ఎత్తుకోవాలి మరి.'

'మీకాళిదాసులూ, కవిత్వాలూ మా కెందుకు లెండి: ఏదో ఈ లాగే ఇంతకుంకం రాచుకొని బ్రతికితే అదే చాలు. అయినా, ఏటిలో కీడ్చి కోటిలోకి లాగుతారేం: నాచీరె బాగుండక పోవడానికి—మా నాన్నకు—నాకు చదువు రాక పోవడానికి—ఎక్కడి కెక్కడ కలిపారండీ?'

'అదే కాలక్షేపం చేయడం అంటే. పోట్లాడానన్న పేరు నా కెందుకు గాని, నీ యిష్టంవచ్చిన చీరెలు కట్టుకో—'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'మీశాసనాతనం మీరూను: మీ మాట విన లేదని అనిపించు కోడం నాకు మాత్రం ఎందుకూ, మీరు చెప్పిన మాదిరిగానే నడుచుకుంటాను:---చెప్పండి మరి---'

'చెప్పడం ఎందుకూ---ఇదం, చదువుకో---'

'ఏదీ--టెలిగ్రాము లా గున్న దే---ఏం వేసాలూ, వేళాకోళాలూనండీ! నాకే ఇంగ్లీషు వస్తే నే నిలా ఎందు కుండేదాన్ని---ఎక్కడనుంచి వచ్చిం దేమిటి?'

'అయినా చెప్పుకో చూశాం?'

'అబ్బ. ఏం విసిగిస్తారండీ: చెప్పకపోతే మానె లెండి. నాలుగు వేస్తున్నారు. వెళ్లాలి?'

'వినకుండానే?'

'మీరు ఏ వేళకూ తేల్చకపోతే మరి ఎలా?'

'కమలం వస్తూంది: నాలుగున్నరకి స్టేషనుకు వెళ్లాలి.'

'నిజంగానా?'

'నామాట నమ్మకపోతే చదువుకోరాదూ?'

'నామీదే ఆపేక్ష ఉండి నేనే చదువుకోవాలె అంటే తెలుగులోనే ఇయ్యకుండా, ఇంగ్లీషులో ఎందు కిస్తుంది? నాచెల్లెలికికూడా నన్ను చూస్తే పరిహాసమే.'

'పాపం కమలం అంతదూరం ఆలోచించి ఉండదు. ఇంతకూ చిన్నపిల్ల కాదూ?--అయితే, ఏమిటి నీవు స్టేషనుకు వస్తావా, రావా?'

'మీయిష్టం.'

'నాయిష్ట మేమిటి--వచ్చేది మీచెల్లెలే కాదూ?,

'రావడం మీ యింటికి కాదూ?'

'అవును మాయింటికే లే; మీయింటికికూడా వచ్చి చూసి పొమ్మని చెప్పడానికన్నా, నీవుకూడా రా వచ్చును కాదూ.?

'చాల్లేండి, మీమాటలూ---మీరూను-'

౨

కమలం విశాఖపట్నంలో యం. బి. చదువుతూన్నది.

శేఖరం పెండ్లినాటికే? పదిపదకొండేళ్ల పిల్ల. గుమ్మటంలాగా, ఆకుపచ్చ దక్షిణాది పరికిణీ కట్టుకుని, జఫర్ షర్టు తొడుక్కుని, 'బావా, గుడ్ మార్నింగ్' అని అల్లరిచేస్తూండేది. థర్డుఫారం చదువుతూన్న దేమో! క్లాసులో నేర్చుకున్న ఇంగ్లీషంతా బావమీద ప్రయోగించి, ఆతన్ని నిలువనిచ్చేది గాదు. శేఖరానికి చెల్లెళ్లు లేరు. అందుచేత కమలం అంతచనువుగా ఉండటం ఆతనికి చాలా సరదాగా ఉండేది. ఎప్పుడూ ఇద్దరూ ఓచోట కూర్చుని పోట్లాడుకుంటూండేవాళ్లు చిన్నపిల్లల్లాగా. పెళ్లయినప్పటినుంచీ వెయ్యిమార్లన్నా పళ్లాలు తిని ఉంటాడేమో శేఖరం మరదలిచేత.

లక్ష్మి కాపురానికి వచ్చి నాలుగేళ్లు దాటుతుంది. భార్య ఈడేరిన తరువాత అత్తవారింటికి తరుచు వెళ్లడం మానివేశాడు శేఖరం. భార్య వచ్చిన తరువాత వెళ్లాలిసిన అవుసరమే లేకపోయింది. ప్రాక్టీసు బాగా పెరగడం మొదలు పెట్టిన తరువాత ఊరు కదలడానికి వీలే ఉండేది కాదు. ఏడాది కోమారు పుట్టింటికి వెళ్లినప్పుడన్నా లక్ష్మి చెల్లెలిని చూసేది; శేఖరం మాత్రం మరదలిని చూసి ఎన్నాళ్లయిందో!

ఉత్తరం మాత్రం తప్పకుండా వ్రాస్తూండేది బావకు కమలం. 'నన్ను బట్టే ఆయన కదా, నా కెందుకు వ్రాయదూ?' అని లక్ష్మికి కోపంగా ఉండేది. శేఖరం వల్ల ఆనిశేషం చూచాయగా తెలుసుకొని, 'నీవు వివాహితవు. ఇంకొకరి దానవు. అందుచేత నీ క్షేమసమాచారాలు నీభర్తద్వారా నేను తెలుసుకోవడం మంచిది కాని నేను నీకుత్తరం వ్రాయడం కాని, నీవు స్వతంత్రించి నాకు జవాబు వ్రాయడం కాని అంత మంచిది కాదు.' అని కమలం పేర ఆమె వ్రాసింది. అప్పటినుంచీ లక్ష్మి ఆమాటే ఎత్తేది కాదు. కాని తనకు చదువు రాదు; కమలానికి వచ్చును కదా అని ఉడికిలుతూండేది.

కమలం దగ్గరనుంచి టెలిగ్రాం చూసుకుని శేఖరం పొంగిపోయినాడు. తాను కాపురం పెట్టిన తరువాత అదే ఆమె మొదటిసారి రావడం. వస్తానని ముందుగా నన్నా తెలియచేయకుండా, బయలుదేరుతూ వైర్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ్చింది. అందుచేత అయత్నితోపనతమైన ఆకులాసా ఆతన్ని వివశుణ్ణిగా చేసేసింది.

సెంట్రలులోకి జేరుకునే టప్పటికి పాసెంజెరు కూడా వచ్చేసింది. లక్ష్మిని గబగబ నడిపించుకుంటూ శేఖరం ఎగువకు పోతున్నాడు. పది అడుగులు వేసే టప్పటికి, ఒక సెకండుక్లాసు బండీలోంచీ వెనుక పాళాన 'హల్లో' అన్న ప్రత్యభిజ్ఞా పురస్సరంగా శేఖ రంబుజాన చెళ్లున దెబ్బపడ్డది: తిరిగి చూశాడు. లక్ష్మి కూడా నవ్వుమొగంతో సమీపించింది. ఐడియల్ మెడి కలు స్టూడెంటువేసంలో కమలం క్రిందికి దిగింది.

శేఖరం కరస్పర్శన మాచరించి, వామకరంతో 'ఏం అక్కయ్యా' అని లక్ష్మి భుజం తట్టింది. ఆమె ఏమి మాటాడలేదు. తల త్రిప్పి ఊరుకున్నది.

'ఏం బావా?—ఎట్లా ఉన్నావు?—మునపటి కన్న బలిసావే' అని అడిగింది ఆంగ్లంలో, ఆతనిచేయి విడువకుండానే.

'నిజమే, కొంచెం లావుపారాను—నీవు రావడం మటుకు చాలా సంతోషం—బావను మరచిపోదామను కుంటున్నావేమో అనుకున్నాం లక్ష్మీ నేనూను, నీవు ఎన్ని మార్లు రమ్మన్నా రాక పోవడంచేత --- కాదు లక్ష్మీ?' అని ఆతడు ఆంగ్రంలో అడిగాడు.

'అదంతా ఎందుకు లెండి. ఇప్పుడన్నా వచ్చింది: చాలు.'

'కాదు అక్కయ్యా! నాకు మాత్రం మిమ్మల్ని చూడాలని ఉండదూ. రావడానికి వీలు లేక పోతూ వచ్చింది. మాకు తలవని తలంపుగా ఈ వారం సెలవు వచ్చింది. ఎట్లాగ గడిపేది అనుకుంటూంటే, మాయింటి పక్క శర్మగారు గూడూరు ప్రయాణంగట్టారు: సరేకదా అని నేను కూడా వచ్చాను.'

'రాకరాక వచ్చినందుకు పదిరోజు లేనా ఉం డేదె! సెల్లాళ్లైనా ఉండకుండా ఎట్లా వెళుతావో చూ స్తాను.'

'మళ్లా పోట్లాట మొదలు పెట్టావూ? అలాగ యితే నేను నీతో మాట్లాడనే మాట్లాడను.'

'నీవు మాట్లాడే దేమిటి? నేను మాట్లాడించనూ?'

ముగ్గురూ నవ్వుకున్నారు. పోర్టరు సామాను కా రులో పెట్టాడు. శేఖరం భార్యను ఎక్కించి కమలానికి కూడా చేయి ఆసలా యిచ్చాడు: కమలం సవిలాసంగా చేయి త్రోసివేసి, 'పెళ్లికూతురులాగా—ముందు నీవెక్కి—కూర్చుందూ—నే నెక్కగలనులే.' అన్నది నవ్వుతూ.

శేఖరం స్టార్టుచేసాడు: కమలం ఆతని ప్రక్కనే కూర్చున్నది.

మూంటురోడ్డు సమీపిస్తూండగా కమలం, శేఖరం రెండు నిమిషాలు ఇంగ్లీషులో మాట్లాడు కున్నారు. తరువాత కమలం—సిగరెట్టు—శేఖరం దగ్గరనుంచి తీసు కొని—ముట్టించింది.

లక్ష్మి అంతవరకూ బయటికి చూస్తూ కమలాన్ని గమనించడం లేదు. ఘ్రాణం తనపనిని తాను నెరవేర్చేట ప్పటికల్లా చకితయై తిన్నగా తిరిగింది. మనసులో ఏమను కుందో తెలియదు; కాని కోపంతో జేవురించిన ముఖం తో కమలంమెడవంపుమీది పైటచెంగు పుచ్చుకుని లాగి, 'అదేం పనే' అన్నది.

కమలం సావకాశంగా వెనుకకు తిరిగి 'చదువుకున్న దాన్ని కాదూ?' అని మామూలువైపుగా కూర్చున్నది.

శేఖరం నవ్వి సిగరెట్టు వెలిగించాడు.

## 3

'జయబృందావన జయనరలీలా
జయగోవర్ధన చేతనశీలా.'

పంచమిరాత్రి. పండు వెన్నెల, పాలసముద్రం అతివేలమై లోకాన్నంతా ముంచివేసి, లోకాలో కాన్ని ఒరుసుకు పోతూన్న భ్రమ కల్పించి, 'ఈశా వాస్య మిదం సర్వం' అన్న ఉపనిషద్వాక్యాన్ని తమా షాగా జ్ఞాపకంచేస్తూంది.

వెన్నెలచాయ చీర కట్టుకుని, వెన్నెట్లో మెరసి పోతూ, కమలం విరియబూసిన నిత్యకల్యాణి పాదసమీ పాన ఇసుకలో కూర్చుని గిరీశబాబుగీతం పాడుతూంది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాష్మీరీసిల్కులాటి నులిమంచు తెరలు చందమామను కప్పేస్తున్నాయి. ఆతని కరస్పర్శ కమలానికి క్రమంగా అసహ్యమై పోతూంది.

పాట చాలించి, లేచి నిల్చుని, బాగా విరిసిన పువ్వులు కోసుకుంటూన్నది.

కుహూ మని కోకిల పొగరుబోతు తనంగా కూసింది. చివురాకు చెలులందరూ చకితలై, లతాంత సంతానాన్ని చాటుచేసుకొని దాక్కుంటున్నారు. విరికన్నెలు అందని నాథునికోసం ఆసపడి, తనుజీవితానికి అడవిని కాచిన వెన్నెలను తోడు రమ్మంటున్నారు.

'కమలం!'

కొంచెంసేపటిలో పాలరాతి బెంచీమీద, వెన్నెలలో కలకలలాడుతూ శేఖరం కూర్చుని ఉన్నాడు. ఎంతసేపయిందో వచ్చి! ఆమె అతన్ని అంతవరకూ చూడనే లేదు.

'అబ్బ! ఎవరో అనుకున్నాను!...కాదులే, నీవేననుకున్నా. కాని వస్తావనుకో లేదులే—'

'వచ్చాను—నీవు పాడుతున్నావని...'

'ఆలాగా—వినడానికా?—నన్ను చూడటానికేమో ననుకున్నా—అయితే సమీపానికి దయచేయి. ఇంకా బాగా వినబడుతుంది—'

'అంత చక్కగా పాడటం ఎక్కడ నేర్చుకున్నావూ?'

'నీ వీలాటి అర్థంలేని ప్రశ్నలు వేయడమో?'

'మరి పాడవూ?'

'ఏమంత అవుసరం?—నీకు అంత వినాలని ఉంటే, నేను పాడేటప్పుడు, చాటుకుండా వచ్చి విను?—'

'నేను పాడించనా, నీచేత?'

'నీచేత నవుతుందా—ఆఁ – తెలిసిందిలే, పాడుతా; లేకపోతే, ఈకోపమంతా మాలక్ష్మిమీద చూపిస్తావేమో. ఆడపిల్లనిచ్చుకున్నందుకు నీకు సలాం చేస్తూండాలి నాయనా!—బావా, బలేవాడవయ్యా—నాచేత పాడిస్తావేం—అవునులే, భాగవతంలో ఉందికాదూ, "పాడించెడివాడు రామభద్రుండట" అని? నీవు మాత్రం సామాన్యుడవా? ఆయన రామభద్రుడైతే, ఈయన బావభద్రుడు—ఏం పాడమన్నావు?—'

'నే నేం చెప్పగలనూ?—విని ఆనందించడమే నాచేత నైనది.'

'అంటే, రసికుడ నన్నమాట.'

'ఇంచుమించు అంతే.'

'అంతే అయితే—రసికుడంటే, మాసాంప్రదాయంలో శుద్ధ చవట అని అర్థం—వంట చేతకాని వాళ్లు రుచి చూసి చెపుతామని బయలుదేరినట్లు—పైగా అదో గొప్పగా చెప్పుకోవడం కూడానా?'

'కమలం, భగవంతుడికి ఇంత పక్షపాతం ఎందుకూ? ఎక్కడా లేని తెలివీ, ఎవరికీ లేని చక్కదనమూ నీకొక్కరికే కట్టబెట్టా లేం?'

'నేను నీతో మాట్లాడలేను;—ఓడిపోయి నాను అన్నదానికి కవిత్వపుధోరణా ఏం ఇది. ఎంత గడుసువాడవూ, బావా!

'నవీనజలధర–శ్యామసుందర
మదనమోహనధామ
న—య—న ఖంజన–హృదయరంజన
గోపినీవల్లభ శ్యామ'

... ... ... ...

కమల బ్రహ్మానందంగా పాడింది. శేఖరం మంత్రబద్ధుడు లాగా చేష్టలుడిగి కూర్చున్నాడు. ఎంతో సేపు ఆ ఆవేశం తగ్గనే లేదు. ఒకరినొకరు నిశ్చల నయనాలతో చూసుకుంటూ, పెదవి కదల్చకుండా, చిత్రప్రతిమల్లాగా ఉండిపోయినారు.

'అమ్మా, అదుగో నే పిన్ని—నాన్న కూడాను.'

ఉమాబాల దోవ తీస్తూండగా లక్ష్మి ప్రత్యక్షమైంది అక్కడ.

ఒకనిమేసం దూరానే నిలుచుని వారివైపు చూసింది. అమరారామం మీద విసుపు పుట్టి, కులాసాగా బయలుదేరి భూమి కవతరించిన దివ్యులులాగా మెరిసిపోతూన్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



లేటు మైసూరు మహారాజా శ్రీ చామరాజేంద్ర ఒడయరుగారు

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారి ఛాయాచిత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



‘ ఇంటిత్రోవ ’

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారి ఛాయాచిత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉమాబాల పరుగెత్తుకుని వెళ్లి కమలం ధ్యానానికి భంగం కలిగించింది. శేఖరం యోగనిద్ర చాలించిన మహర్షిలాగా, శాంతంగా, అక్కడనుంచి లేచి వెళ్లిపోయినాడు.

'దా, మనంకూడా వెళుదాం, చలిగా ఉంది' అని లక్ష్మి కూతురి చేయి పట్టుకుంది.

'నేను పిన్నితో వస్తాను.'

'ఇప్పు డప్పుడే రాదమ్మా! ——మనం ముందర పోదాం రా.'

'నేనూ వస్తున్నాను — నా కిక్కడేం పనుంది—నాకూ చలిగానే ఉంది.' అని ఆశ్చర్యపడుతూ అన్నది కమలం.

'చూశావు.-అమ్మా! నే చెప్పలా—పిన్నితో వస్తానని' అని ఉమాబాల సంబరంతో అన్నది.

'అలాగా——నాకు అంతమాత్రం తోచనేలేదే—చలిలో సంగీతం సాధనచేస్తా రంటారుకాదూ—అందుచేత ఇంకా చలి ముదిరేదాకా కూర్చుంటుం దేమో ననుకున్నా.'

'అయితే అక్కయ్యా! సంగీతానికి చలా, చలికి సంగీతమా, ముదరడం?'

ఉమాబాల ఏమో తెలిసిందానిలాగా నవ్వుతూ గంతులు వేయడం మొదలుపెట్టింది.

'అలా చూడు మరి, ఆగులాబీచెట్టు కడుపారా కన్న దేకదా ఆరెండు పుష్పాలున్నూ—ఒకదాన్ని మిసమిసలాడే పడుచుపిల్ల తలలో పెట్టుకుంటుంది—రెండోది దేవతార్చనలోకి చేరుకుంటుంది. జాతి ఒకటైతేనేం, గీత ఒకటి కాదు గదా!'

౪

'శుద్ధ దండుగ. బాగుండదని తెలిస్తే అసలు వెళ్లకుండానే ఉండేవాళ్లమే' అని విసుక్కున్నది, ఫూజ్ తీసివేస్తూ కమలం.

'కలగన్నామా ఏం!—అయినా, బొమ్మలూ అవీ చాలా బాగానే ఉన్నాయే?——ఏదో ఒకమార్గం, డబ్బు ఖర్చుపెట్టడానికి——' అని చాలా అమాయికంగా లక్ష్మి అందుకున్నది. కమలం అది వినిపించుకోకుండా,

'ఏమో నా కేమీ నచ్చలేదు బావా! రోజ్ బ్లాసమ్‌కు అంత గొప్ప పేరుందే; మరి అలా చేసిందేం?'

'పేరు కేముందిలే! తెచ్చుకుంటే వస్తుంది పేరు. రావడ మెంత, పోవడ మెంత——కాని యీసంవత్సరం ఈమాదిరి ఫిల్ము చూడలేదు. ఇవాళ ఎవరి మొగం చూసి లేచానో—' అని కునికి పాట్లు పడుతూ జవాబు చెప్పాడు శేఖరం.

'ఉమను పడుకోబెట్టి వస్తానని లక్ష్మి లోపలికి వెళ్లిపోయింది. శేఖరానికి నిద్ర పట్టింది.

ఎంత సేపటికో!——దేవేంద్రుడు రాళ్లవాన కురిపిస్తున్నట్లుగా కలగని, అదిరిపడి మేల్కొంచాడు శేఖరం. తాను మొదట పడుకున్న చోటనే ఉన్నాడు—ఏమో?—ఏం తెలియలేదు. పెద్ద మోతమాత్రం వినబడుతూంది—మరి కొంతసేపటికి తెలివి తెచ్చుకుని కలయ చూశాడు. కమలం రిసీవింగు సెట్టుదగ్గర కూర్చుని, తన వైపు చూస్తూ బిగ్గరగా నవ్వుతూంది.

'తమాషాగానే ఉంది నిన్ను చూస్తుంటే. పిలుస్తే పలుకుతుంది లాగుందే నిద్ర నీకు—ఇందాకనుంచీ కని పెడుతూనే ఉన్నా, దొంగనిద్ర పోతున్నావేమో నని రిమోస్టాట్‌ను సాపుగా త్రిప్పేసినా మేలుకోక పోతే——'

'ఎందుకు లేపావు కమలం!'

'లేపకపోతే అప్పుడే నిద్ర ఏమిటి నాయనమ్మలాగా?—కళ్లు తెరుచుకుని కూర్చో. బాంబే స్విచ్చాన్ చేశాను—ఇవాళ మంచి ప్రోగ్రాము ఉంది.'

'పోనిద్దూ.'——

'హలో ఎవ్విరిబాడీ...బాంబే కాలింగ్...'

శేఖరం పూర్తిగా మేలుకుని కుర్చీ దగ్గరగా లాగి కూర్చున్నాడు. చాలాసేపు పాట వినబడలేదు. లౌడ్ స్పీకరు స్విచ్చాఫ్ చేసి, హెడ్‌ఫోన్సు తగిలించుకున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఐ లవ్ యూ ఇన్ వైలెట్...'

కమలం నవ్వు మొగంతో వింటూంది. శేఖరం కొంతసేపు వింటూ కూర్చుని, తరువాత ఫోన్సు తీసివేసి, కమలం వంక కరువుదీరా చూస్తున్నాడు.

'వాల్ట్జ!'

నాట్-డి. అయ్యర్ నాట్యగీతాన్ని రికార్డు ద్వారా బ్రాడ్‌కాస్టు చేస్తున్నారు. నాగస్వరం విన్న నాగబాలలాగ కమలం ఆవేశంతో నాట్యోన్ముఖియై నిలుచున్నది. శేఖరం కూడా ఆమెను అనుకరించాడు.

లక్ష్మి ఆరంగమంతా తెల్లబోయి చూస్తూ నిలుచున్నది. కమలం ఆమెను చూసిందో లేదో కాని, నాట్యము చాలించలేదు.

'అమ్మా! ఎంతదానవే!'

శేఖరం భ్రాంతుడైనాడు. అంతవరకూ లక్ష్మి కూడా అక్కడ నిలుచుని ఉన్నదని ఆతనికి తెలియనే లేదు. ఏదో అపరాధం చేసినవాడిలాగా తలవంచుకుని, పోయి సోఫాలో కూర్చున్నాడు.

కమలం నవ్వింది.

'అక్కయ్యా! బావా చాలా బాగానే డ్యాన్సు చేస్తాడే-ఏమో ననుకున్నా ఇదివరదాకా. నీవు కాపురానికి వెళ్లినతరువాత ఆటాపాటా మానిపించి, భగవద్గీత చేతికిచ్చావేమో ననుకున్నా. ఇక పరవాలే!'

లక్ష్మి వినిపించుకోకుండా శేఖరం వంక కోపంతో చూసింది. ఆతను అక్కడనుంచి లేచి లోపలికి వెళ్లిపోయినాడు.

'కాఫీ చేసుకు త్రాగుదామా?--ఏమిటి-మాట్లాడవేం'-అని కమలం చాలా అమాయికంగా అడుగుతూ, లక్ష్మి చేయి పట్టుకున్నది.

మోటగా చేయి విదిలించి,

'ఏమిటి ఈ ఆగడం?-ఇది సంసారుల ఇల్లనుకున్నావా, మరి--'

కమలం లక్ష్మిమాటకు అడ్డం వచ్చి,

'నీకు కోపం వచ్చిందా, అక్కయ్యా' అన్నది.

'కోపమా--నాకు కడుపు నిండినట్లుగా ఉంది నిన్ను చూస్తే. పరువూ, ప్రతిష్ఠా--ఇంతయినా, వంశానికి--'

'ఆ' అని గర్జించింది కమలం,

'-ఏమిటే ఒళ్లు, తెలిసే మాట్లాడుతున్నావా!.. ఇదివరకు నీవు తెలివి తక్కువదానవే అనుకునేదాన్ని. చేతగానితనం కూడా బలిసిందే!—ఎరక్కపోయి వచ్చాను: తగినట్లుగానే గౌరవించావు'

'నిజమే, నిన్ను రమ్మనడం నాదే తప్పు.'

'నీవు రమ్మంటే వచ్చా ననుకున్నావా?'

'ఎందు కనుకుంటానూ? నాకు తెలియవూ మీవేషాలన్నీ?—ఎవరి మీద ప్రేమ ఉందో వారికోసం వచ్చావు.'

'అవును.'

'కాక! నీకు వదురూ బెదురూ ఎందుకూ?-నాన్న చూస్తే సంతోషించి చంకలు కొట్టుకునేవాడు—నిన్ను కన్నందుకు ఆయన అటు ఏడుతరాలు, ఇటు ఏడుతరాలవారు తరించారు'

'నిజంగానా?—ఏమో అందరితోబాటు నేనూ అనుకున్నాను కాని, నాలో ఇంత మహత్తు ఉందని నా కింతవరకూ తెలియదే!--నాన్నైనా ఎన్నడూ చెప్పలేదే!--'

'--నీతో మాట్లాడటమే పొరబాటు-'

అని లక్ష్మి లోపలికి వెళ్లిపోబోయింది. కమలం వెళ్లి ఆమె చెంగు పట్టుకుని ఆపి, పొగరుబోతు గుర్రాన్నిలాగా, సావధానంగా వెనకకు నడిపించుకుని వచ్చి సోఫాలో కూర్చోబెట్టింది.

తాను గ్రామోఫోను బల్ల నానుకుని నిలుచున్నది.

'మే మిద్దరమూ సంతోసంగా నాట్యంచేశామనేనా, నీకు కోపం?--చేతగాక పోవడం నీది లోపం--తెలిసిందా?-'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'నేను కులస్త్రీని.'

'అవును, అక్షరాలా అంతే.——మాళవిక ఎవరు?'

'నేను నీతో వాదించను.'

'అక్కర్లేదు. నేను చెప్పేది అర్థంచేసుకో: శేఖరం బావే గోష్పాదమంత జుట్టుంచుకుని, జంధ్యాలూ వేసుకుంటూ వేదం వల్లించే అవధాన్లగారయితే, నీ వేషం అప్పటికి తంచన్‌గా సరిపోయేది. ఆకాను కులాసాగా కాలం గడుపుదామనుకునే వాడూ, నీవు సోమి దేవమ్మలాగా వంటయిల్లు పట్టుకుని వదల నంటావు. మరి నీ ప్రవర్తన ఆయనికి బాగుంటుందేమో ఎన్నడైనా విచారించావూ?'

'పోనీ, ఇక నిన్ను చూసి నేర్చుకుంటాలే.'

'నేను చెప్పేది అదే. సహధర్మిణీహితచర్య అంతా నీకు కంఠతః వచ్చును కామా? భర్త అందరి కన్నా ఎక్కువ అని మనవాళ్లే చెప్పారాయెను: నీవు దానిరూఢార్థము తీసుకొని నోరులేని రాతి దేవుళ్లతో బాటుగానే మీ ఆయన్నూ చూస్తూన్నావు. నీ ఆదరణ, భక్తి ఎవరికి కావాలి?——బావ ఇంగితమెరిగి నీవు ఆతనికి అనుకూలంగా నడుచుకోవాలి గాని'

'నా కావేషాలు చేతకావు.'

'కాక పోవడం ఎవరిది తప్పు——నేర్చుకో.'

లక్ష్మి మాట్లాడలేదు.

'కరువాత——అంత చిడిముడిపాటు పనికిరాదు; నీ సొంతచెల్లెలినే అంత కఠినంగా అన్నదానవూ, రేపు ఎవరినైనా అంతే చేసేదానవే కాదూ? మగవాడితో ఆడది మాట్లాడటమే దోసమా? ఇంత తెలివి తక్కువతనమైతే ఎట్లా?'

'అది కాదు కమలం!——' అంటూ లక్ష్మి శాంతంగా ఏదో చెప్పవచ్చింది. కమలం ఆమె మాట చొరనీయకుండా,

'నే నెందుకు వచ్చా నంటే, మిమ్మల్ని ఇద్దర్నీ చూసి పోదామని——తెలిసిందా?——మీ యిద్దరి మీదా ఉంది నాకు ప్రేమ——నీవు నా సోదరివని నీమీదా, ఆతడు నీపతి అని, నీ సర్వస్వమని ఆతనిమీద. అది గాకుండా నీమీద పట్టే ప్రేమే నాకు; ఆతన్ని చూస్తే చాలా సరదా. నీవుకూడా ఆతన్ని సంతోష పెట్టగలిగితే, అప్పుడు మీ యిద్దర్నీ సమానంగానే చూస్తాను.——ఈపాఠం చెప్పడానికే నేను వచ్చింది కూడాను.'

---

## మా వ్యాస కర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములలో బంతులు దూరదూరముగా దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులులేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బోల్తా!

వెంపటి నాగభూషణంగారు

౧

పడకకుర్చీలో విశ్రమించి ఆ లోకలు ఫండు సత్రం గదిలో న్యూసు పేపరు చదువుతోంది సౌభాగ్యం. ముప్పైయేండ్లది పొట్టి, బొద్దుమనిషి. చామనచాయ శరీరం. ఇమిటేషన్ పట్టు చీరె కట్టుకున్నది. కళ్లకు రోల్డు గోల్డు జోడున్నది. జుట్టు బర్మాముడి వేసింది. మొత్తానికి అంత అందకత్తని చెప్పడమునకు వీలు లేదు. విటతండము గుండెలు విచ్చునట్లుగా చేసేటందుకు ఆమెలో యేమీ కన్పడదు.

'ఏమి పనిమీద వచ్చావు?' అన్నది, పేపరు చదవడం మానివేసి, గదిలోకి ప్రవేశించిన జ్ఞానసుందరమును చూసి.

'లేదు, మరేమీ పని లేదు. ఇక్కడ తమకు సప్లయిలన్నీ అంది సౌఖ్యంగా ఉన్న దేమోనని తెలుసుకోడానికి వచ్చాను'_అన్నాడు ఆమెవంక ఓరగా చూస్తూ.

'అన్నీ సరిగానే ఉన్నాయి. ఇంతకు ముందే గోపాలం వచ్చి కనుక్కు వెళ్లాడు. సాయంకాలం మీ ఆఫీసుకు వచ్చి తనిఖీచేస్తానని చెప్పాను.'

'చిత్తం. అన్నీ సిద్ధంగానే ఉన్నాయి.'

'తరువాత, చందాల పట్టీ గ్రామంలో పెద్దలందరి దగ్గరకీ పంపాలి. అప్పుడే ఒక చందా వసూలైంది. గోపాలం అయిదు రూపాయిలు చందా వేసి యిచ్చేశాడు. మహా ఉదార స్వభావుడల్లే కన్పడుతాడు.'

ఇది వినేసరికి జ్ఞానసుందరం చలించాడు. తన కన్న ముందే గోపాలం అక్కడకు రావడము, అయిదు రూపాయిలు చందా యివ్వడము అతనికి అనుమానం కల్గించినై. వెంటనే కోపంగూడా వచ్చింది. కాని శాంతపడి, గోపాలంకంటె గొప్పవాడుగాను, దానపరుడుగాను కన్పడవలె నని నిశ్చయించుకుని అన్నాడు:

'ఈ గ్రామంలో మేమంతా ఉదారస్వభావులమే. పరోపకార కార్యములలో యెప్పుడు వెనకంజ వేయము అందుకి నేనే సాక్ష్యం'_అంటూ తన జేబులోనున్న రెండు అయిదు రూపాయిల నోట్లు మడత విప్పి ఆమె కందిచ్చాడు, తన చందా మొత్తంగా.

ఆమె చిరునవ్వుతో దాని నందుకొని మనీపర్సులో పెడ్తూ,—

'గోపాలం యిచ్చిన దానికంటే యెక్కువ దానమే' అన్నది.

'దాని కేమి లెండి. మంచి కార్యము నేదైనా నిర్వహించడము మానవ విధి. దాని కేమి......అయితే గోపాలం తన నడవడి మార్చుకొంటున్నా డన్న మాట!' అన్నా డతను, ఆశ్చర్యము సూచిస్తూ.

ఆదుర్దాతో ఆమె తల పైకెత్తి,

'అదేమిటి, నడవడి మార్చుకోవడ మేమిటి? ఇది వరకల్లా గోపాలం.........'

'ఏమో లెండి, అదంతా నా నోటితో చెప్పడ మెందుకు? ఒకళ్లను గూర్చి వాళ్లు లేనప్పుడసలు మాట్లాడకూడదు. ఎందు కొచ్చింది లెండి. ఏమో యిప్పటికైనా గోపాలం బుద్ధి కుదిరి.........'

'అదేమిటి? సంశయంలో వదిలేస్తే యెట్లా విషయం? విషయ మేమిటో చెప్పకపోతే యిదంతా నీవు కల్పించినట్లుగా భావించవలసి వస్తుంది. తప్పేమీ లేదు, చెప్పు.'

'ఇదిగో, మీరు తప్ప దన్నారు కాబట్టి చెప్తున్నాను. నా పేరు మాత్రం బయటకు రానీయవద్దు, దయచేసి. గోపాలమంత కల్మషజీవి మరొకడు లేడు. తాను చెప్పే నీతులకు, చేసేపనులకు కొండంత వ్యత్యాసం. అతనితో నాకు కంటకముగా ఉన్నది._'

'అట్లానా! తనయొక్క అమాయకత్వం నిరూపించే టందుకు కాబోలు, యిందాక నాయెదుట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెన్నో సుభాషితము లాడాడే. ఇలాంటివాళ్లతో సంఘు మెట్లా వృద్ధిలోకి వచ్చేది......'

'ఎందుకు లెండి ఆగ్రహపడడం. మీరు స్వయముగా జూసినదాకా...'

'అదీగాక, తన కేమో చాలాఆస్తి ఉన్నదనీ, అవుసర మైతే దాన్ని సంఘము కోసము వెచ్చించడమునకు సిద్ధంగా ఉన్నాననీ చెప్పాడే?'

'అవు నట్లా చెప్పకపోతే యెట్లా? అదే ప్రస్తుత లోకం విధానం. తనకు భుక్తికి ఉంటే సంఘమున కిచ్చినంత ఫలం......'

'ఎంత అబద్ధ మాడాడు; ఎటువంటి వాడు గోపాలం!.........సరే, నీవు వెళ్లిరా......సాయంకాలం తనిఖీకి వస్తాను.'

'చిత్తం, శెలవు...'అని వంగి సలాము చేసి జ్ఞానసుందరం నిష్క్రమించాడు. అన్నీ తన కనుకూలంగానే ఉన్నా యని లోపల సంతోషం.

౨

సౌభాగ్యం క్రిస్టియను. నాలుగేండ్ల క్రితమే భర్తను యీపాడు లోకంనుంచి పంపివేసింది. అట్లా జరిగిన తర్వాత జీవితం గడిచేమార్గం కనపడలేదు. అట్లా అల్లాడుతుండగా పట్నంలో Society for Encouraging Pure Living and Abstinence from Drinking. (నిర్మల జీవితమును, మద్యపాన నిషేధమును హెచ్చరించి వృద్ధిచేసే సంఘము) స్థాపించారు మిషన్ వారు. పట్నంలో హెడ్డాఫీసు. అక్కడక్కడ పల్లెటూళ్లలో చిన్న బ్రాంచి ఆఫీసులు. వాటిల్లో ఒక్కొక్కచోట కొద్ది వేతనంమీద యిద్దరు గుమాస్తాలు. వారు ప్రతివారం ఒక నియమిత దినాన మీటింగు చేసి గ్రామస్థులకు సంఘమువారు చెప్పినప్రకారం నీతిబోధన చేయవలె. ఇట్లా యేర్పరచిన తర్వాత గ్రామములో గుమాస్తాలు సరిగా పనిచేస్తున్నారో లేవో యని తనిఖీ చేసేటందుకు కొద్దిజీతంమీద, బేటా, ప్రయాణపు ఖర్చులు యిచ్చి, సూపర్వైజర్లు. ఇటువంటి సూపర్వైజర్ పనే ఒకటి సంపాదించింది సౌభాగ్యం. ఆయిదో ఫారందాకా చదువుకున్నది. అందుచేతనున్ను, కొన్ని రెకమెండేషన్ల వల్లను ఉద్యోగ మిచ్చారు. నెలకు పాతిక రూపాయలు జీతం; పదిరూపాయిలు బేటా.

* * * * *

అట్లా ఉద్యోగరీత్యా తనిఖీనిమిత్తం సర్క్యూటు చేస్తూ ఆ ఊరు చేరుకుంది. అక్కడ సంఘం గుమాస్తాలు యిద్దరు–జ్ఞానసుందరం, గోపాలం. ఇద్దరూకూడా క్రిస్టియన్లే. ఇద్దరికీ నలభైయేళ్లకు తక్కువ ఉండవు. ఇద్దరూకూడా అవివాహితులే. జాతకంలో పెళ్లిగీత లేదనుకొని సర్దిచెప్పుకున్నారు తమకు తామే. ఏదో అట్లాగే తల, తోక ముడివేస్తూ జీవయాత్ర సాగిస్తున్నారు. అట్లా ఉండగా ఆగ్రామంలోకూడా సంఘం బ్రాంచి స్థాపించారు. ఆపర్యాడిలోనే వీరిద్దరకు గుమాస్తాపని దొరికింది. నెలకు పదిహేను రూపాయిలు జీతం. జీవితంలో వారి కది మహోత్కృష్టమైన సమయం. పనిలో జేరి యేదో వారికి తోచినట్లుగా సంఘంపని జరుపుతు, చేతకంటె మాటలు యెక్కువగా చెప్తూ కాలం పుచ్చుతున్నారు. యదార్థంగా ఆలోచిస్తే ఆసంఘంలో ఉండేటందుకు వారిద్దరిలో ఒక్కరికీ అర్హత లేదు!

* * * *

సూపర్వైజరు సౌభాగ్యంను లోకలుఫండుసత్రంలో దింపి, సహుపాయములన్నీ చేకూర్చారు జ్ఞానసుందరం, గోపాలం—యింటి దగ్గర యిద్దరకూ కూడా సంసారం లేదు కాబట్టి. ఆమె యింకా గ్రామంలోకి రాకపూర్వమే ఆమెనుగూర్చి అనేకవిచిత్రవార్తలు ప్రచారమైనవి. ఆమె గతించిన భర్త చాలాస్థితిమంతుడనీ,అతని అనంతరము ఆస్తి అంతా ఆమెకు లభించినట్లు, అయినప్పటికీ మానవసేవా పరాయణత్వాభిలాషతో సూపర్వైజర్ పనికి ఒప్పుకున్నదనీ, పెద్దపుకారు పుట్టింది. దానితో గుమాస్తా లిద్దరికీ నోరూరింది. ఆలోచన, యెత్తులు మొదలుపెట్టారు. అదివరకల్లా ఆషాఢభాద్రపదములల్లే ఉన్నయిద్దరూ రెండురోజులపూర్వంనుంచీ ఎడఎడంగా తిరుగుతూ యోచనలు ప్రారంభించారు. ఎవరికి వారు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆమెయెదుట భాగ్యవంతులుగాను, సంఘంపనిలో అసమాన ఉత్సాహం గలవారుగాను ప్రవర్తించి, ఏమాత్రం వీలైనా ఆమెను వివాహమాడి ఆమె ఆస్తినంతా లో బర్చుకుందామని నిశ్చయించుకున్నారు.

గ్రామంలోకి ఆమె రాగానే గోపాలం పోయి దర్శనం చేసుకొని, ఆమాటలు యీ మాటలు చెప్పి, తన యొక్క సదుద్దేశ్యములన్నీ ఒక్కొక్కొక్కలో వెల్లడించి, తన కేమో కొంత ఆస్తి ఉన్నట్లు, అవసర మైతే దానినంతా సంఘంకోసం ధారపొయ్యదల్చుకున్నట్టు సూచించాడు.

అతను వెళ్లినట్లు తెలియకుండా, అతను వెళ్లిన కొంతసేపటికే జ్ఞానసుందరం వెళ్లాడు సౌభాగ్యందర్శనార్థము. గోపాలంకంటె కొంచెం తెలివైన ఘటం. సమయానుకూలంగా మాట్లాడి పనిచేసే కుశాగ్రబుద్ధి అప్పుడప్పుడు కల్గుతుంది......ఆమెతో మాట్లాడుతు, గోపాలం విషయం విని అతనియెత్తు కనిపెట్టి, గుంభనగా అతనిశీలమును సంశయంగా వెలిబుచ్చి, తనయొక్క ఔదార్యం చూపేటందుకు పదిరూపాయిలు విరాళం యిచ్చాడు.

అప్పుడే గోపాలంయందుకంటె జ్ఞానసుందరమందు సౌభాగ్యానికి కొంత అభిమానము, కొంతగౌరవము, కొంత గురి కుదిరింది. ఇంతేకా, అతని అదృష్టమట్లా ఉన్నది.

*   *   *   *   *

3

తన యింటి ముందు వసారాలో కూర్చుని జ్ఞానసుందరం ఏవో కాగితములు చూచుకుంటున్నాడు. ఉసూరుమంటూ గోపాలం ప్రవేశించి,

'పోతోంది ప్రాణం; ఇహ ఆగదు' అన్నాడు.

'ఏమిటి గోపాలం, ఏమిటి విషయం?'

'ఏమున్నది. వచ్చి రెండురోజులైనా సూపర్‌వైజరు ఊళ్లోనుంచి పోదాయె. ఈ రెండు రోజుల్లోనూ గ్లాసెడు కాదుగదా గ్రుక్కెడు పుచ్చుకుందామన్నా ఏ మాత్రం వీలు లేకుండా ఉన్నది. ఏనిముషంలో పిలుస్తుందో, యేమో. అది కాస్తా బయటపడితే ఉద్యోగానికి స్వస్తి.....అబ్బబ్బ, ప్రాణం ఎగిరిపోయే టట్టుంది.'

'అదేమిటి గోపాలం, ఎందు కంత భయపడు తావు? ప్రాణంకంటె యెక్కువేమిటి ఉద్యోగం? ఇంతకూ కాస్త రహస్యంగా పుచ్చుకుంటే ఆవిడెకు తెలియవచ్చేం దేమిటి? పోనీ, అంతభయమైతే తెప్పించి యిక్కడ పుచ్చుకో, రహస్యంగా జరిగిపోతుంది.'

'ఏమో సుందరం, ధైర్యం చాలదు......'

'అబ్బే, యిందులో ధైర్యాని కేమున్నది? నేను చేస్తానుండు' అని లేచి యింటి యెదుట దుకాణములో నుంచి తానే స్వయముగా సారాయి తెచ్చి గోపాలానికి అందిచ్చాడు. వెనుక ముందు ఆలోచన లేకుండా తనివితీరేటట్టుగా త్రాగాడు. ఆ తొందరలో జ్ఞానసుందరాన్ని గూడా పుచ్చుకోమని మర్యాదచేయడం గూడా మరచిపోయినాడు గోపాలం. పుచ్చుకోడం పూర్తి అయిన తర్వాత మత్తెక్కి పడిపోయినాడు. ఆసమయం చూచి జ్ఞానసుందరం పరుగెత్తుతూ పోయి సౌభాగ్యాన్ని వెంటబెట్టుకుని తనయింటికి వచ్చాడు. ఆమె చూసే సరికి తప్ప త్రాగిఉన్న గోపాలం పిచ్చిమాటలాడుతూ, దానీవానితో అధికప్రసంగం చేస్తున్నాడు. సౌభాగ్యం కను పడే సరికి గోపాలం వణుకుతూ ప్రక్కద్వారంలోనుంచి పలాయితు డైనాడు.

దీర్ఘ నిశ్వాసం నిడిచి, సౌభాగ్యం ప్రక్కనున్న జ్ఞానసుందరం వంక చూచింది. అత నేమీ యెరుగనట్లుగా దీనముఖుడై,

'చూచారా, మీరే స్వయంగా!' అన్నాడు.

సౌభాగ్యం కళ్లల్లో తృప్తి తాండవ మాడింది. అతని దగ్గరగా వచ్చి,

'నిజంగా నీమో స్తరు మనిషి నాకు యెక్కడా కన్పడలేదు. నీవంటివా రుండ బట్టే యీ సంఘం యింత మాత్రమైనా నిల్చి ఉండగలిగింది. నీ విప్పుడు చేసినపని అమోఘము. యథార్థంగా నీబోటివారి సహాయంతో ఎన్ని మంచి కార్యములైనా చేయవచ్చు'—అంటూ అతనికి 'షేక్‌హాండ్' యిచ్చింది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానసుందరం శరీరం జలదరించింది; కాని ముఖం విప్పారింది. గెలుపు అప్పుడే నిగనిగలాడించి మాపుల్లో:

‘ఏమిటో లెండి. మీబోటివారు మెచ్చుకోవలసిందే. జనసామాన్యమునకి వన్నీ అర్థముకావు. “యదార్థవాదీ లోకవిరోధీ” అన్నట్లు నిజం చెప్తే నిష్కార్యము...’

అట్లా మాట్లాడుకుంటూ యిద్దరూ సత్రం జేరారు. అంతలోనే చీకటి పడ్డది. జ్ఞానసుందరం ఆమె దగ్గర శెలవు తీసుకుంటున్నాడు. అప్పుడే నౌకరు భోజన పదార్థములు తీసుకువచ్చాడు.

‘ఇప్పు డొక్కడవు చీకట్లో వెళ్లకపోతే యిక్కడే భోజనం చేయరాదూ, జ్ఞానసుందరం?’

‘చిత్తం, చిత్తం. దానికేం లెండి, చిత్తం——’, అంటూ నీళ్లు నమిలాడు అతను. లోపలమాత్రం ఉబ్బిపోయినాడు.

‘అలా కాదు. తప్పేమీ లేదు. భోజనం చేయవచ్చు.’

‘చిత్తం, ఆలాగే’ అన్నాడు తెగించి.

ఆరాత్రి సౌభాగ్యం, జ్ఞానసుందరం విందారగించారు. ఈపాటి కప్పుడే పరిచయం కొంచెం యెక్కువ అవడముచేత యిద్దరూ అనేక విషయములను గూర్చి ముచ్చటించారు, నిద్ర వచ్చేవరకు.

*　　*　　*　　*　　*

## ౪

ఇక తక్కినదంతా తేలిక విషయమే, జ్ఞానసుందరానికి. తనిఖీ పూర్తి కాలేదనే నెపంమీద మరొక నాలుగురోజులు ఆగ్రామంలోనే ఉండడమునకు నిశ్చయించుకున్నది సౌభాగ్యం......సత్రంలో వరుసగా మూడురోజులకన్న యెక్కువ ఉండనీరనే కారణంవల్ల తన మకాం మంతా జ్ఞానసుందర మింట్లోకి మార్చింది....

ఒకరోజు యిద్దరు కలిసి గ్రామం బయటకు షికారుగూడా వెళ్లారు.

ఊరిలోనుంచి అయిపు లేకుండా పోయినాడు గోపాలం.

*　　*　　*　　*　　*

వారి సంభాషణలలో యెప్పుడూ యెక్కువగా వారి వారి ఆస్థుల సంగతి వచ్చేది. ప్రథమంలో జ్ఞానసుందరం తనకున్న ఆస్థినిగురించి చెప్పినమాటలు జ్ఞాపకముంచుకుని సౌభాగ్యం

‘ఏం చేద్దాం, ఆస్తితో——’ అంటూండేది.

ఇదంతా గమనిస్తే సౌభాగ్యం తనఆస్తినంతా తిరిగి తాను గంగాభాగీరథీ సమానురాలయ్యేవరకు దాచుకునే ఉద్దేశ్యముతో ఉన్నట్లుగా కన్పడ్డది, జ్ఞానసుందరానికి.

ఏ దెట్లా ఉన్నా వివాహబంధం బిగిసిన తరువాత విచారింపవచ్చు తక్కిన విషయము లనుకుని సమాధాన పడ్డాడు అతను.

*　　*　　*　　*　　*

మహాసుదిన మది, యిద్దరకు. ఉదయం సుమారు ఏడుగంట లైంది. సూపర్వైజరు, గుమాస్తా చర్చిలో హాజరైనారు.

ఆసనయంలో జ్ఞానసుందరం కాబోతున్న తన భార్య-సౌభాగ్యం-ఇంక దృష్టిని పోనిచ్చేసరికి యెక్కడలేని ధైర్యస్థైర్యములు తెచ్చిపెట్టుకోవలసి వచ్చింది. ఆ మాత్రం నిబ్బరం గలవాడు కాబట్టే ప్రాణం ఆటించ లేదు. ఎక్కువగా ఆమెవైపు చూడవద్దని తీర్మానించుకున్నాడు.

సౌభాగ్యంగూడా పాపం, పూర్వపువిచారమంతా దిగమింగి, కేవలం సంఘసేవ కోసం చేయబోతున్న త్యాగముకోసం, ఇమిటేషన్‌చీర కట్టుకుని, ముడిపడని పొట్టిపెండ్రుకలను గూడా గట్టిగా అణచి కట్టి, ముఖంలో ఉన్న రెండు మూడు ముడుతచారలు కన్పడకుండా కొంత భస్మం అద్ది, ఎంతో అవస్థపడ్డది.

ఇద్దరూ దగ్గరగా నిల్చున్నారు. నలభై యేళ్ల వరుడు, ముప్పైయేళ్ల వధువు......ఫాదరీ పావన సలిలం శిరస్సునచిలకరించాడు. భార్యాభర్తలుయిరువురు మెల్లగా యిల్లు చేరారు. జ్ఞానసుందరం పెద్దశ్వాస వదిలాడు.

*　　*　　*　　*　　*

తమయొక్క పరిణయమహోత్సవ సందర్భములో యేవిధమైన విందుగాని, ఆర్భాటంగాని చేయవద్దని దంపతులు ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు. అదంతా అనవసరవ్యయమని వారితలంపు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందుచేత ఆరాత్రి వారిద్దరుమాత్రమే బల్లదగ్గర కూర్చుని భోజనమున కుపక్రమించారు.

'ఎట్లా పరిణమించింది వ్యవహారం, సౌభాగ్యం!'

'అంతా దైవకృతం. ఇట్లా పరిణమించినందుకు మన అభీష్టసిద్ధి అయినట్లయితే......'

'ఏమి టది?'

'ఏమున్నది? నీకున్న ఆస్థితో మనయిద్దరి జీవితం సాగిపోతుంటే పరాలోచన లేకుండా సంఘం విషయ మింకా యెక్కువగా శ్రద్ధ వహించి కృషిజేయవచ్చు...'

జ్ఞానసుందరం గుండెలో రాయి పడ్డది. వెర్రి చూపుతో,

'అయితే, సౌభాగ్యం నీడబ్బుతో......'

'అయ్యో, సుందరం, నాకు డబ్బెక్కడిది? డబ్బే కనుక ఉంటే యీ పనికిమాలిన నౌకరీ యెందుకు చేస్తాను......నీవో............'

'అయ్యో, సౌభాగ్యం, నేనూ అంతే...అయ్యో, మెడకు ఉరి.........పడ్డాను బోల్తా, పెద్దబోల్తా!...'

విద్వాన్. డి. రామమూర్తిశాస్త్రిగారు

## సీ తు వు

జనుల కుశలమె మదిఁ గోరి సరసగతిని
జీవనము నిడి మన్ననం జెంది మేఘుఁ
డరుగఁగా నేఁడు సీతువ, సరసమాన
సముల నింకింప దొరఁకొంటి సరసమె యిది.

ఈగి లేకున్న జనులకు సేగి లేదు
కాని పరదత్తజీవన హానిఁ జేయఁ
దగదు తగ దిది నిక్క మధర్మసరణి
జడుఁడ వీ వౌట సీతువ, చాల వెఱుఁగ.

నీరజము లేమి చేసెను నీకు నకట
పద్మినీకాంత నిన్నేమి బాధపెట్టె
నల గులాబీయు నీ కేమి హాని చేసెఁ
బెట్టికొంటి వదేల నీ పొట్ట వాని.

నీవు క్రౌర్యము పూనిన న్మావిహృదయ
పల్లవితభావము న్బయల్పడుపకుండ
మనుచు నెప్పటి యట్టులె మాన్యసద్వి
జాళిసచ్ఛీల మరయఁగ నట్టిదె కద.

నకనకంబడు నక్కపైన్దాటిపండు
నలఁదిపిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రమువలెఁ
గా దనక మూర్ఖతను బీద సాదులపయిఁ
జూపుదువు సీతువా, నీప్రతాప మయ్యొ.

లలి సుమనో ధర్మమ్ముల
దులుపుట జాడ్యంపుటీఁద దుర్భరసరణీ
నెలకొల్పుట నీకును నల
కలికిని నైజమ్ము శీత కాలమ కాదే.

క్రాలుదును నే నిదే రీతిఁ గాల మెల్ల
నని తలంచెదు శాశ్వత మరయ నేది?
పొడ వడంగించి నిన్నును బొరిగొనుటకుఁ
బొంచియున్నది వేసవి కొంచె మెఱుఁగు.

కాల మెల్లను నీరీతిఁ గ్రాలఁదలఁచి
తేని సాధింపు శక్తిమై దివ్యధాము
దైవవిధి నైతి శక్తుఁడ వీవు నేఁడు
వాని సాధింప నీ కింక వశమె తలఁప?

సర్వమును బల్లవింప నఖర్వగతిని
మహి సరగ సుమనోభి రామముగఁ జేసి
మన్ననం బొంద మాధవుఁ డున్నవాఁడు
ఖలుఁడె సజ్జనగౌరవ కారణుఁడుగ.

చిగురుమోవుల కొకవింత సొగసు కూర్చి
మోముఁదమ్ముల కామోదమును ఘటించి
యాత్రికాళికి మధురసాహారము నిడి
యామ వాఁ డుద్భవింపక యుండునె యిఁక!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భమిడిపాటి కామేశ్వరరావు గారు

## చుట్టా, బీడీ, సిగరెట్

చుట్టా, బీడీ, సిగరెట్లు త్రిమూర్తులని చెప్పచ్చు. వీటికి జన్మస్థానం ఆయొక్క ఆదివిరాట్స్వరూపమైన పొగాకు. ఈ రూపాల్లోనే గాక, పొగాకు, అనేకమైన ఇతర ఆకారాలల్లో, భూమిమీద, కర్మవశంచేత, అవతారాలు ఎత్తి ఉంది; తను నాశనం అయిపోయి ప్రపంచాన్ని నడిపిస్తోంది. పొగాకు ఇతరులకోసం తగులడిపోతోంది. అదే, చుట్టా, బీడీ, సిగరెట్, స్వరూపం! పొగాకు ఇతరుల నిమిత్తం పొడుమైపోతోంది. అదే ముక్కుపొడుం స్వరూపం! (అరవంలో మూకుతూల్ స్వరూపం) పొగాకు ఇతరులకై, వండి, ఉడికి, అడ్డమైన నూనెసరుకుతోటీ కలిసి ముక్కముక్కలు అవుతోంది. అదే మసాలా స్వరూపం! పొగాకు ఇతరులకొరకై సున్నమై నలిగిపోతోంది. అదే పట్టే స్వరూపం! పొగాకు ఇతరులకి, శిబిచక్రవర్తికి మల్లే నిజశరీరం కండలుచెంపి ఇస్తోంది. కొందరు ఉద్యోగులు ఏకచేరీలో పని మధ్యలో ఉండి, రొండిని జాగ్రత్తచేసి పట్టుకెళ్ళిన పొగాకుముక్క ఆపళంగానే అమాంతంగా కొరుక్కు తింటారు, పటికబెల్లం తిన్నట్టు. దాన్ని 'కచేరీతాంబూలం' అంటారు—అదే కచేరీతాంబూల స్వరూపం! ఇప్పుడు మనం పొగాకు యొక్క ధూమలక్షణం వెల్లడిచేసే త్రిమూర్తులనీ గురించిమాత్రమే కొంచెం ఆలోచిద్దాం! (ప్రపంచంలో ఉండే ప్రతీమారుమూలలోనూ పొగాకు మతం వ్యాపించే సెయ్యడానికి ఎక్కువ అవకాశం ఉంది గనక!)

చుట్ట అనే వస్తువు పొగాకుకి తాదాత్మ్య స్వరూపం—అనగా అభేదస్వరూపం. కాని కొందరిమతం వేరు. కొన్ని చుట్టల్లో పొగాకు కాడలు మాత్రమే ఉంటాయనిన్నీ, మరికొన్నింటిల్లో పారేసిన చుట్టపీకల కళేబరాలుంటా యనిన్నీ వారి అభిప్రాయం. అయినప్పటికీ చుట్టయొక్క పొత్తి పొరాలు ప్రకృతి పురుషులనిన్నీ, వాటిమూలంగా పరమాత్మ కణకణలాడుతూ వ్యక్తమౌతాడనిన్నీ అందరూ ఒప్పుకుంటారు. బీడీ లోపలిభాగం పొగాకు తుక్కు అయినప్పటికీ, బాహ్యం మాత్రం, వేరేపత్రం—తునికీ ఆకు, కొండొకచో జిల్లేడు. సిగరెట్టు లోపలిభాగం, అనేక ఓషధుల సాహాయ్యంచేత పొగాకుయొక్క కసటు పోగొట్టుకుని నవ్యసౌరభం ఆర్జించి, కాకితపు దాంపత్యం కలిగి ఉన్న నవీనావతారం సిగరెట్ స్వరూపం కాక, తక్కిన రెండూ హిందూదేశానికి చెందినవే అని ఒప్పుకోవచ్చు. బీడీ మహమ్మదీయులది, ఆపత్రంకూడా వారిదేశంలోనే దొరుకుతుంది. ఆమాట ఋజువుచేసుకోవచ్చు. పొగాకు అమెరికాలో, ఒకతెల్ల ఆసామీ ప్రయాణంచేస్తూ కనిపెట్టినట్టు చెబుతారు గాని, వొట్టిమాట! అది ఈ దేశాందే అని చెప్పడానికి అనేక నిదర్శనాలున్నాయి. సోమపానం, ధూమపానం గురించి సెలవిచ్చినట్టే ధూమపక్రం గురించి కూడా అనేకమంది ఋషులు స్పష్టంగా, తెగేసి, సెలవిచ్చారు. వెనక బాగా చుట్ట కాల్చడంచేత ధూమబిరుదు తెచ్చుకున్న ఒకాయన సంతతి వాడేట ధౌమ్యుడనే అబ్బాయి! ఇంకా ఇతర నిదర్శనాలు కావలిస్తే, 'రిసర్చి' చేస్తే, మనకి ఏవిధంగా సాక్ష్యాలుకావాలంటే ఆవిధంగా, రాగిరేకులు, తాళపత్రగ్రంథాలు, నాణాలు వగైరాలు దొరుకుతాయి. మనకి ప్రతికూలంగా ఉండేవి కూడా దొరికితే దొరకవచ్చుగాని, అది రిసర్చిగనక వాటిని కప్పిపుచ్చడంలో ప్రత్యవాయువు లేదు. అందుకని చుట్టగురించి మనం స్వవిషయంలా మాట్లాడుకోవచ్చు. చుట్ట అంటించడానికి పూర్వం చివరకొన పంటితో కొరుకుతారు—చివర మెలెట్టి ఉండడంవల్ల ఓ చివరనించి ఓచివరకి గాలి లాగటానికి రాధారీ లేదేమో అనే భయం చొప్పున. బీడీవెలిగించడానికి పూర్వం, దాన్ని తల్లకిందులుగా పెదవులలోపలికి పట్టుకుని, పెదవులు బిగించి, వెలిగించబోయే వేపుకి ఆవిరిపెడతారు—కొంత ఆవిరితడి దానికి తగిలి అది హెచ్చు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తగ్గులు లేకుండా గుండ్రంగా కాలుకుంటూరావడానికీ నిన్నీ, లోపలవేంచేసి ఉన్న షువంటి పొగాకు రేణువులు పీల్చే చివర నక్కి ఉండి, బీడీ వెలిగించి ఆదుర్దాగా పీల్చగానే, ఆ మొదటి పీలుపులోనే గొంతుకలో ప్రవేశిస్తాయేమో, వాటికి ముందస్తుగా ఉద్వాసన చెప్పకపోతే ఎల్లామరీ, అనే అభిప్రాయంతోటీనీ! సిగరెట్టు ముట్టించడానికి పూర్వం, దాన్ని పుస్తకంలాంటి బల్లపరుపు ప్రదేశం మీద ఉంచి, అరచేత్తో నొక్కి, ఇటూ అటూ రెండుమూడుసార్లు అప్పడాల కర్రని మల్లే, దొల్లించి, తీసి, పుస్తకాన్నెట్టి, మెల్లిగా తాటిస్తారు—అది లోగడ కర్ర భారీ ఉండినట్టాయినా పొగసజావుగా రాకపోతుందేమో అని భయమేసి. ఇల్లాగ్గా ఈస్వరూపాలు జీవం దాలుస్తాయి. ఈ మూడింటి లోకీ బీడీ అదోక మోస్తరు జంతువు. ఏమాత్రం వ్యవధానం లేక పెద్దపనిలో ఉండి ఒక్కదమ్ము, లిప్తలోలాగి, పోడానికి టైము సరిపోయే పెద్ద ఉద్యోగస్తులు, కానీకి చాలా వస్తాయిగదా ఎప్పుడు పారేసినా పారెయ్యొచ్చు, మనస్సుకేమీ బాధలేకుండా అనుకునే కొద్దివాళ్ళు, ఎవళ్లేనా చెయిచాస్తే, క్షోభలేకుండా వాడికి ఓటివ్వొచ్చునూ—అనేవాళ్ళు వగైరాలు బీడీ సేవిస్తారు. అయితే, ఓ కాని బీడీలకి ఓ అగ్గిపెట్టేనా అధమంకావాలి గనకనున్నూ, ఎక్కడేనా ఆజంతువు తాలూకు ఒక నెరుసు పడిందంటే ఆ చుట్టు పక్క ప్రాంతం అంతా దగ్ధపటలం అవుతుందనే భయంచేతనున్నూ దాని ప్రచారం కొన్ని కొన్ని చోట్లే ఉంటుంది.

ఇక చుట్టాసిగరెట్లని రెండింటని మాత్రమే పోల్చాలంటే, చుట్టమోటు—సిగరెట్టు నీటు, చుట్ట నల్లజాతి, సిగరెట్టు తెల్లజాతి. చుట్ట అంతా పొగాకే గనక, అది పత్రగ్రంథం, కాబట్టి సనాతనం. సిగరెట్టు కాగితపు వ్యాపారం, కాబట్టి ఆధునికం. ఇంగ్లీషు చదువుకీ సిగరెట్టుకీ సంబంధం ఉందని ఋజువు చూపించడానికే సిగరెట్టు కాగితంతో చేశారని కొందరి నమ్మకం. చుట్ట వాసన చుట్ట కంపు, సిగరెట్టు వాసన సిగరెట్టు పరిమళం. ఆ పరిమళం గ్రహించ లేనివాడు తనకి మళ్లీమహా ఇంగ్లీషువచ్చునని ఫ్రెమెుహం పెట్టుగుని చెప్పుకోడం అని కొందరి ఊహ. ఏమంటే! ఆ సిగరెట్టు వాసన కేవలం ఆ ఇంగ్లీషు వాసనేనండీ!

ఈ రెండు స్వరూపాలూ కూడా వాయురూపేణానూయమై, జగత్తంతా చివరికి మాయగదా అని చెప్పక చెబుతూంటాయి. ఇవి వెలిగి వెలిగి బూడిద కూడా అవుతాయి. ఆవిషయంలో చుట్ట బూడిదే పేరు మోసింది. దాన్ని కొందరు చచ్చుపిలుపులు పిలవక "చుట్ట విభూతి" అంటారు. కొందరు రహస్యంగా చుట్ట కాల్చేవాళ్లు అల్లాంటి విభూతి జాగ్రత్తగా కాలీ అగ్గిపెట్టెల్లో కిందరాలకుండా విడిచి, అది కురుపులకి మందుగా వాడుతున్నారట, మతాబా బూడిద వాడినట్టు! సిగరెట్టు విభూతికి అంత తెల్లదనం లేదు, పేరూ లేదు అందుకనే అది జాగ్రత్త చెయ్యరు. కొందరు, తక్కిన వేళ్లతో సిగరెట్టుపట్టుకుని చూపుడు వేలు ఒక్కటే మాత్రం అభినయించి, ఆవిభూతి ఊడకొడతారు. మరి కొందరు, దాన్ని తర్జనీ మధ్యమాలతో నొక్కిఉంచి, ఒక్కచిటికెలో ఆవిభూతి విసర్జిస్తారు. క్రియకి, గాలి గాలిలో కలిసి పోతుందర్రా అని ఈ రెండూకూడా సెలవిచ్చినా, వీటిల్లోనూ మళ్లీ కాస్తంత తేడా ఉంది. సిగరెట్టు మట్టుకి అంతా ఆఖరికి శూన్యమే అంటుంది. చుట్ట అల్లా అనదు. చుట్ట కాల్చేవాళ్లు ఉమ్ములువేస్తూంటారు. (ఉమ్ములవిషయంలో వీళ్లని మించేవాళ్లు మరోళ్లున్నారు, మసాలాకిల్లీలవాళ్లు!) ఆఉమ్ముల అభిప్రాయం ఏమంటే, చివరికి జగత్తంతా గాలిలో కలిసిపోదు, ఉంటే జలప్రళయం ఉండచ్చునీ! అని ఉంటే ఉండడం ఎంచేతంటే, కొందరు కొందరు చుట్టేర్వేరులు ఆకుమ్మిమింగేస్తారు. చుట్టలో పొగాకు చుట్టుగుని ఉండడం వల్ల దాట్లోనే ఎక్కువ తిరగడం ఉంది. సిగరెట్టులో వక్రత లేదుగాని, చీలిపోడం ఉంది. చుట్టలో ఉండే చేదు, రింగు, గీర వగైరాలు సిగరెట్టులో మృగ్యం. ఆరిందా జనం మధ్య ఉన్నప్పుడు సిగరెట్టే పీల్చాలి అనిన్నీ, తప్పని సరియై ఇతర స్వరూపాలు దొరకని స్థలంలో మాత్రం బీడీ ఊదుకోవచ్చునిన్నీ, కేవలం బాహ్యానికి వెళ్లి కాల్చడానికే చుట్టపుట్టిందనిన్నీ సిగరెట్ పక్షపాతులైన స్నేహితులు వాదిస్తారు. కానీ, ఒంట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రిగా ఉన్నవాడికి చుట్టే చుట్టం. ఎంచేతంటే, ఒక్కొక్కడు, కుర్చీలో కూర్చుని, చుట్టకాలుస్తూ, పొగకేసి చూస్తూ, గంటలకి గంటలు గడుపుతూ, పర్యవసానం శూన్యం అయినా దీక్షగా ఏదో ఆలోచిస్తున్నట్టు గంభీరంగా ఉండగలడు. సిగరెట్టువాడు అలా ఉండ జాలడు. చుట్టవాడు, తను ఏదోమూల కూర్చుని ఉన్నా, ప్రపంచం జరగడం విషయంలో తన ఖంజాయింపుకూడా కొన్నిపాళ్లు ఉన్నట్టు కనిపిస్తాడు. కాని, కిల్లీనమిలే సైములోనే చుట్టకాల్చడానికి వీల్లేకపోడం చుట్టయొక్క దౌర్భాగ్యం. ఆ వాటం సిగరెట్టుది. అందుకనే, భోజనమై, తాంబూలం వేసుకుని, అద్దం ఎదట "నెక్ టై" ముడేసుకుంటూ, పెదవి చివర సిగరెట్టు ఊగీసలాడు తూండగా, అప్పుడె మాటలు చెబుతూ, నాగరికత కాపాడుతూన్న ఉద్యోగులు తొమ్మిదిన్నరకి ఇళ్లల్లో దొరుకుతారు. చుట్టకాల్చడానికి దాన్ని పళ్లతో డ బాయించి పట్టుగోవాలి. అందుకని; అవతల చివర అగ్ని ఇవతల చివర (లాలా) జలం. సిగరెట్టుని పళ్లతో నొక్కినవాడు వొట్టి అభాంద్రాపీనుగు. వాడు, అది ఎంత కోమలం అయినదో గ్రహించనివాడు; వాడి పళ్లు ఊడకొట్టినా పాపంలేదన్నాడు. ఒక సిగరెట్టిష్టు! అంచేత, దాన్ని పెదవులతో పట్టాలి. ఆ మాటకొస్తే కొందరు ప్రజ్ఞావంతులు పెదవి చివరతోకూడా సిగరెట్టుని నిలబెడతారు, మీసంమీద నిమ్మకాయి నిలబెట్టినట్టు. అందుమూలాన్ని, సిగరెట్టు ఇవతలకొస తడిగా ఉండదు. ఆ కారణంవల్ల, సిగరెట్టులోని అద్వితీయ విశేషం ఏమిటంటే, అది మధ్యరంగంలో తీసి, ద్వితీయుడికి ఇచ్చి, వాడిప్రాణం రక్షించచ్చు, అల్లే ఎంగిలి కలియకుండా! ఈ అవాంతరం తప్పిపోయేటం దుకుగాను, కొందరు మిత్రులు ముందే సిగరెట్టుని సమద్విఖండనచేసి, చెరోసగం మొదట్లోనే పుచ్చుకుంటున్నారు. ఇది అరుదు. చుట్ట జంతువుకి ఇల్లాంటి ప్రజ్ఞ లేదు. కాని అందులో విశేషం మరోటి ఉంది. కాల్చే ఆసామీయే దాన్ని తల్లకిందులుచేసి పెదవులతో పట్టుగోవచ్చు. ఇది కొన్ని కొన్ని రకాల సోదరసోదరీమణులలో అభ్యాసం. చుట్టపొగముక్కులోంచి తెప్పించడం అంత సులువుకాదు; అందులో పాటి ఆకు మరీశ్రమ. ముక్కులోంచి పొగలొస్తాయనే కొందరు సిగరెట్టు కాల్చడం. చుట్టకాలుస్తూ మాట్లాడితే, తథదధాలు వగైరాలు పలకవు, వినేవాడికి చిరాకు. సిగరెట్టుకాలుస్తూన్నప్పుడు, ఓష్ఠ్యంతప్ప, కడమా అక్షరాలన్నీ, మూతి ఏవంకర గానో పెట్టి పలకచ్చు, పళ్లకి పనిలేదుగనక! చుట్టలో మరో చిక్కుంది. ఎవరో అస్తమానం ఇతర పనిమాను కుని పీలుస్తూంటేగాని ఆరిపోతుంది, వెధవ ఆరిపోడం ఇదీను! అందులో చుట్ట ఆరిపోడం ఉందే, అది గొప్ప ప్రాలుబ్ధాల్లో ఒకటి, అందుకనే కొందరు చుట్టకాలుస్తూండగానే ఏమరుపాటుగా నిద్రపోయినా, ఏమీ ప్రమాదంలేదు. అదిపట్టు తప్పి పడిపోయేవేళకి ఆరి ఉంటుంది. కాని, సిగరెట్టు ఎక్కువ బాధ్యతవహించిన ప్రాణి. సిగరెట్టుని అంటించి ఒదిలిపెడితేసరి, దానిపని అది క్రమేపీ చేసుకుంటూ పోతుంది, వెనకాల కొందరు లాగేవాళ్లు ఉన్నాసరే, మానినాసరే. అనగా, దానికి చూపిస్తే అందుకు పోగల తెలివి ఉంది. సిగరెట్టుకి పునర్జన్మలేదు. చుట్ట చాలా పాపం చేసుకున్న ఘటం గావును, దానికి పునర్జన్మలు ఉన్నాయి. అనగా, ఎవడేనా సోదరుడు కాల్చేకాల్చేచుట్ట ఆరిపి, తలపాగాలోనో, గోడమూలో పెట్టి కాస్సేపటికి మళ్లీ ముట్టిస్తూం టాడు. అది వాడికి బాగుండో, తప్పనిసరోగాని కడం వాళ్లు వస్తారు. మంచిచుట్ట వాసనే స్తేనే డోక్కునేవాళ్లు, చుట్టయొక్క జన్మాంతరవాసన తోటె ఘూర్ణిల్లుతారు. చుట్టలో మరోపేచీ ఉంది. ఒకొక్కప్పుడు దానికి చిన్న "బుసి" ఉండి, పీల్చేవాడికి అంకిళ్లు పడిపోయినా సరే, పొగమాత్రం రాదు, చచ్చినా! దాంతోటి, ఆ పీల్చే వాడికి ఊహూకోపం జాస్తీ అయి చుట్టు పక్కవాళ్ళని చంపాలని ఉంటుంది. అల్లాకొంత ప్రయత్నించి, కొసకి, ఏకాగితమో చుట్టుబెట్టుకుని ఎల్లానో ఇదవుతాడు. సిగరెట్టులో ఈక్షోభ లేదు. చుట్టవల్ల పళ్ళన్నీ జీవితంలోనే పొగచూరడం కాక, పెదవి మీద వాతలు కూడాను. అదీగాక, చుట్టకాల్చడం అనేది ఒక పనిలా కనిపిస్తుంది, సిగరెట్టు కాల్చడం పనిగానిపని—అందుకనే సిగరెట్టు చదువుకున్నవాడి కోడి! చుట్టవెన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంతో, ఇప్పుడూ, ఎప్పుడూ అంతే! సిగరెట్టు స్వల్ప కాలంలోనే మారుతుంది, కొత్తమార్కుది దిగుతుంది. ఇంత తెలివితేటలతో ఉన్న సిగరెట్టు కాల్చడం వల్ల ఉండేలాభాలు తియ్యడానికి, ఉన్నాయేమో చూడడానికి, ఓకమిటీవారు పనిచేస్తున్నారు, సులోచనాలు పెట్టుగుని. ఇది కాల్చడంవల్ల ఉండే ఖర్చు లెక్కవెయ్యడానికి మరోకమిటీ ఉన్నారు. వీరి రిపోర్టులు తేలే యోగ్యత కనిపించదు.

హెచ్చుతగ్గులు ఎల్లా ఉన్నాసరే, నేను చుట్ట మానను. మాస్తే, భూమి—వాయు సమస్య పరిష్కారం కాదు. ఈ ముక్కలే నాకు శరణు...అన్నాడు ఒకడు.

"ఎముక మిగిల్చి మాంసము నెల్ల భక్షించు
తుయరుగమ్మలకు వజ్రాయుధంబు
లోహమాండూరాల లొంగక సాధ్యమా
కఫవాతిములసితి కార్ముకంబు
శూలాన పొడిచిన లీల శూల జనించు
అల యజీర్ణముల సిద్ధౌషధంబు
మబ్బుపట్టిన యంత బొబ్బలు పెట్టించు
నుబ్బసాదులకు సూర్యోదయంబు
జనుల నగ్నిముఖుల నొనరించు నీ చుట్ట
కంపులెల్ల సాగ నంపుచుట్ట
దోమ బాధల తొలగ ద్రోయును పొగచుట్ట
చుట్ట మహిమలెన్న శూలి కగును"

మంచిచెడ్డలు ఎల్లాఉన్నాసరే. నేను బీడీమానను. మాస్తే, హిందూ—మహమ్మదీయ సమస్య పరిష్కారం కాదు. ఈముక్కలే నాకు శరణు—అన్నాడు ఇంకోడు.

దాడీ ముందుగ వచ్చెను
బీడీ తరువాత వచ్చె విధవిధములుగా
బీడీ పొగలకు పోద్దా
ఏడీ కాదనెడి పురుషు డెల్లాహైనం.

సులువు బలువులు ఎల్లా ఉన్నాసరే. నేను సిగరెట్టు మానను. మాస్తే, ప్రాచ్య—పాశ్చాత్య సమస్యపరిష్కారం కాదు. ఈముక్కలే నాకు శరణు—అన్నాడు మరోడు.

నాగరికత లేని ప్రజ
సిగరెట్ చవి చూడకుండ సిగరెట్ పొగరెట్
సిగసిగరెట్ పొగపొగరెట్
సిగరెట్ పొగరెట్టటంట చెల్లదు "స్వ్యాల్లీ".

ఇలాగ్గా, ధూమ విషయంలో హిందువులుయథాశక్తి పనిచేస్తున్నారు కాని అంతా నడుంకడితేగాని కార్యం నెరవేరదు. అంతాచేతులు కలిపి పనిచెయ్యాలి ధూమం, కీర్తికి మల్లేనే తెలుపుకాబట్టి, ఏనాడుహిందూ దేశమంతా ఏకమై పొగపీల్చి వదుల్తుందో, నాడే ఈ దేశపు శుభ్రకీర్తి దశదిశలా వ్యాపిస్తుంది. స్త్రీలుకొందరు ఇంగ్లీషునేర్చి, పురుషులతో సమానం అవడానికి చేస్తున్న యత్నాలలో సిగరెట్టు సేవిస్తూ ఉండడం శుభసూచన. ఈధూమ వ్యూహంలని కనిపించి నప్పుడల్లా అంటేస్తే, లోకకల్యాణం, ఆట్టే దూరం ఉండదు.

౨. విశేషాలు.

ఓ చోట జరగబోయే రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో వెయ్యవలసిన టేబిల్ గురించి మాటా మాటా వచ్చింది రౌండ్ టేబిల్ అనేది ఏదో ఊరికే సుంద్రంగా ఉండడమేకాక సంపూర్ణంగా ఉండాలని కొందరన్నారు. మరికొందరు అట్లా వీలులేదనిన్నీ, భూమిగాని మరి యితర గ్రహముకాని, అవి నడిచేదారులు గాని, ఏవీసంపూర్ణధోరణిలో లేవనిన్నీ, అందుచేత అయినదానికీ కానిదానికీ సంపూర్ణం అంటూపూర్వోక్త వట్టిపూర్ణం ముందు పుచ్చేసుగుని ఆపైని "సం" దెబ్బలాట ఆడితే, కడుపు నిండుతుందనిన్నీ, కాబట్టి ప్రస్తుతం టేబిల్ యొక్క ఆకారం కోడిగ్రుడ్డులా ఉంటుందనిన్నీ, వాదించారు. టేబిల్ యొక్క ఆకారం ఎల్లా ఉన్నా అది కొంతేనా ఇటూ అటూ జరగాలంటే, టేబిల్ యొక్క ప్రతీకోడుకీకింద చక్రప్రయోగం చెయ్యకతప్పదని మరికొందరు తెలివిగలవారు అన్నారు.

శారదాబిల్లు శాసనం అయినా దాన్ని జనం శారదాబిల్లు అనే వాడుతూంటారు. ఈ పరిపాలనలో జనం ఆబాలగోపాలంగా ఉచ్చరించిన పేర్లల్లో ఇదొటి. కాని ఈ మాటయొక్క వాడకం, అర్థం, వ్యాఖ్యానం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాత్రల్ని బట్టి ఉంటోంది. కొందరు దాన్ని 'శార్ధపు' బిల్లు అన్నారు—అనగా దీనితో శార్ధాలు ఆఖరు అనో, లేక దీనితో శ్రోత్రియత్వానికి శార్ధం అనో. కొందరు ఇది 'సరదా' బిల్లు అన్నారు—అనగా దీంతో జనానికి ఎక్కడలేని సోకులూ బయల్దేరుతాయని గావును. శారద అంటే సరస్వతి గనక ఈ బిల్లువల్ల ఆడవాళ్లు మాటలు నేర్చి మరి ఎవ్వరి మాటా లెక్క చెయ్యరు అని కొందరు. శారద అంటే 'నూతనం' అని అర్థం గనక ఈ కొత్తబిల్లుని శారదాబిల్లు అన్నారని కొందరు. శారద అంటే అసమర్థుడు అని ఉంది గనక అల్లాంటి వాళ్ల బిల్లుని శారదా బిల్లు అన్నారని కొందరు. శారద అంటే శరదృతువులో జనించింది అని అర్థం. ఇది కూడా శరదృతువుయొక్క సామీప్యంలో పుష్పించింది కాబట్టి ఇది శారదాబిల్లు అన్నారని కొందరిమతం. శారద అంటే ఏడేసి పత్రాలు ఒకొక్క పర్వం దగ్గిర ఉన్న అరటిచెట్టు అనికూడా ఉందికదా, ఇందులోకూడా ఏడుస్తూ ఏడుసార్లు ప్రతీపర్వానికీ పత్రాలు అనే విడాకులుపుచ్చుకోడం ఉంటుందిగదా అని దీన్ని శారదాబిల్లు అనిఉంటారు అని కొందరి వాదన. శా అంటే దేవతాపూజ, ర అంటే శూన్యమై దా అంటే చూపులు ఎక్కువవుతాయి గనక ఇది శారదాబిల్లు అని ఒకరు. శా అంటే సామర్థ్యం ర అంటే నశించి ద అంటే భేదాలు ఎక్కువవుతాయి గనక ఇది శారదా బిల్లు అని ఒకరు. శా అంటే శ్రేష్ఠుడు కూడా ర అంటే శిరస్సు వంచి దా అంటే భార్యని వేడుకోవాలిగనుక దీన్ని శారదా బిల్లు అన్నారని ఒకరు. శా అంటే తేజస్సుతో ర అంటే వజ్రంలాంటి దేహాలతో ద అంటే ఓర్పుతో జనం పుడతారు (ఇప్పటి మనిస్థిరకం కాకుండా)అంచేత ఇది శారదాబిల్లు అని ఒకరు. శా అంటే లక్ష్మీఉండాలి, ర అంటే మన్మథపరిపాలన ఉండాలి, దా అంటే వైరాగ్యం లాభ లేదు అనేటట్టు వస్తుంది గనుక దీన్ని శారదా బిల్లు అన్నారని ఒకరు. ఒక ముసిలావిడ ఈమధ్య మాట్లాడుతూ "అయితేనూ, ౧౪ ఏళ్లలోపల పిల్లలు పెద్దమనుషులు కాకూడదంటూ పైవాళ్లు రూలు పెట్టారట నిజమేట్రా, అబ్బాయి !"అని కొడుకుని అడిగింది. రేపు ఏప్రిల్ ఒకటో తారీఖులగాయతు ౧౪ ఏళ్లలోగా ఇండియాలో పెళ్లిళ్లు చెయ్యకూడదని దీని అర్థం అని ఒకావిడ వాదించింది. "అయితే, ఈ బిల్లురెండుమూడేళ్ల దాకా ఆచరణలోనికి రాదంటారు నిజమే? అని కొందరు అడుగుతూంటారు—అల్లా అయితే బాగుండునని వాళ్లలోపల అభిప్రాయం. ఒకవేళ అల్లా జరిగితే, ప్రస్తుతం పెళ్లిచేసిన వాళ్లలోకొందరు పశ్చాత్తాప పడతారు.

3. ప్రిన్సిపాలుకాదలచినవారికి ఉండవలసిన లక్షణాలు ఒక (కమిటీవారి అభిప్రాయం).

౧. ప్రిన్సిపాలు పొడుగేనా ఉండాలి, జబర దస్తీగానేనా ఉండాలి, వీల్లేకొస్తే రెండిందాలా ఉండాలి.

౨. ప్రిన్సిపాలు ఇంగ్లీషే చెప్పాలిగాని, తెలుగూ, హిందూస్తానీ, శాస్త్రంకాదు.

౩. ప్రిన్సిపాలు కడంవికాకపోతే పీడాపోయిరి. అధమం సిగరెట్టయినా నాగరికతతో పీల్చడానికి తగిన గుండెధైర్యం కలిగి ఉండాలి.

౪. ప్రిన్సిపాలు అధమం సాలుకి రెండు సందర్భాలలోనేనా పైవారితో ఓడిపోయే స్వభావం కలిగి ఉండాలి.

౫. ప్రిన్సిపాలు మంచి తెలివీ, అపూర్వప్రజ్ఞా కలిగి ఉండాలి. పాఠంచెప్పనక్కర్లేదు. దాన్ని బట్టే ఇతరులు ఆయన తెలివి స్థిరపరచడం.

౬. ప్రిన్సిపాలు రూల్సు ఉన్నాయికదా అని వాటిని అక్షరాలా యముడులా ఆచరణలో పెట్టరాదు.

౭. ప్రిన్సిపాలు స్వజనాన్ని ప్రేమించాలి.

౮. ప్రిన్సిపాలు కొంత దాన ధర్మ బుద్ధి కలిగి ఉండాలి.

౯. ప్రిన్సిపాలు ఒకవేళ అఖండమైన తెలివిగలిగి ఉన్నా, కుర్రాళ్లని పరీక్షకి పెట్టించకుండా ఆపకూడదు.

౧౦. ప్రిన్సిపాలు తెలివీఉండి, పనీచేసేవాడైనా ఎవరో ఒకమహామహుడి మాటేనా వినాలి కాని, ఏదేనా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెప్ప వెళ్లినప్పుడు తరుముకు నిరాకూడదు. ఒక్కని ఇన్కూ కలపనూకూడదు.

౧౧. ప్రిన్సిపాలు తనకి రాకపోతే రానట్టు ఊరు కోవాలిగాని, ఏరోజుకి ఆరోజు పాఠం ఎవరిదగ్గిరో చెప్పించుకుని క్లాసులోకి తయారు కాకూడదు.

౧౨. ప్రిన్సిపాలు తన సబ్జెక్టు అయేది కాక పోయేది, ఒకటేమిటి నాకన్నీ సమానమే అని ప్రతీ దానిమీదా ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు లెక్చరు ఇవ్వడానికి (ఇంగ్లీషున) తగినవాడు కావాలి. లేకపోతే, ఆయన తాలూకాబోర్డు ఎలిమెం టరీస్కూలు మేష్టరుకంటె తక్కువ అనుకుంటారు.

## ౪. వార్తలు

౧. ఆంధ్రవిద్యార్థుల సమావేశం యొక్క కార్య క్రమం యావత్తున్నూ ఇంగ్లీషు భాషలోనే జరిగి ఉండ డంవల్ల, వారు తమభాషమానుకోడంలో ప్రకటించిన స్వార్థత్యాగానికి సానుభూతి కనపరుస్తూ అక్కడ హాజ రుకాని, ఆంధ్రేతరులు ఒకతీర్మానమున్నూ, అరటిపం డొలిచినట్టు భావబోధ అయి ఉండడంవల్ల ఆమోదం వెలిబుచ్చుతూ హాజరైన ఆంధ్రస్త్రీబాల వృద్ధులు ఒక తీర్మానమున్నూ యేదిక్కులేని తమ ఇగ్లీషుని శ్రమపడి ఆంధ్రవిద్యార్థులు నిలబెట్టినందుకు తమ అమితకృతజ్ఞత గుమ్మరిస్తూ లండన్ కవులు ఒకతీర్మానరాజమున్నూ గావించి పంపినారని లోగడ ప్రచురింపబడిన సంగతి కల్లవార్త అని మావిలేఖరి పంపిన సవరణ నేడే మాకు చేరింది.

౨. జంతువులకూతలు, పిట్టలకూతలు, లోకంలో తక్కిన శబ్దాలున్నూ తానొక్కడే పుట్టించి సభనిరంజింప చెయ్యదల్చుకున్న ఒక ధ్వనికాడు టిక్కట్టుపెట్టగా, హాస్యానికి వేంచేసిన నూరురూపాయలజనులూ, అతడు రంగంమీదికి వచ్చేదాకా ఉండబట్టలేక, ఆయాయి జంతు పక్షుల ధ్వనిభేదాలు సునాయాసంగా చెయ్య మొదలు పెట్టగానే, హాస్యకాడు టిక్కట్టు సొమ్ము వాపసుచేసి, అట్టి అద్భుత చిత్రకళవారు అభ్యాసంలే కుండానే ఆర్జించినందుకు వారిలో ఒకరికైనా మెడలు ఇవ్వకమాననని పట్టుపట్టెను. ఆమెడలు ఒక విద్యార్థి పడసినందుకు ఆంధ్రులు ఎల్లానో తీరుబడి చేసుకుని కొంచెం గర్వపడాలి.

౩. ఒక గ్రామఫోను కంపెనీవాళ్లు గొప్పగాయ కుల దగ్గిర్నించి ఉచితంగా రికార్డులు పుచ్చుగోడానికి రాగపిల్లిలో దిగగానే, ఆంధ్రగాన విద్యాదక్షులు ప్రముఖులు చాలమంది, తమకు ఆహ్వానం రాకపోయినా, కంపెనీవారికి తమర్ని ఆహ్వానం చేసే సంకల్పం మన స్సులో ఉన్నట్టు దివ్యదృష్టిని కనిపెట్టి, వెళ్లగా, కంపె నీవారు స్వాగతపత్రం ఇవ్వనందున వీరు కోపంతో వెనక్కి నిష్క్రమించి సినీమాలో చేరాలని యత్నించు తున్నారని తెలిసినది.

౪. రైల్వే ప్రయాణీకుల సంఘాలు కలిసి ఎన్ను కున్న ఒకాయన ప్రయాణీకుల కష్టాలుగురించి రిపోర్టు తయారు చెయ్యడానికి రైళ్లో తిరిగితిరిగి కనిపెట్టిన సంగతి ఏమిటంటే! — రైల్వేకంపెనీవారికిన్నీ ప్రయాణీకులకు న్నూ ఎంతో అన్యోన్యంగా ఉన్నందుకు మిక్కిలి సంతో షం అవుతోంది. జనుము కంపెనీ వారిమాట జవదాటడం లేదు. కంపెనీవారు రైలుపెట్టెల్లో "ఎంగిలి మూయ వద్దు" అని రాసిన ప్రకారంగానే జనం అంతా పెట్టె లోపలే, జాగ్రత్తగా, అవలికి చెదరకుండా, ఉమ్మి వేస్తున్నారు. మరిన్ని కంపెనీవారు "దొంగలున్నారు, జాగ్రత్త" అని ఎల్లానూరాసేశారు గదా, ఊరుకుంటే వారు సమావేశమై చిన్న పుచ్చుకుంటారేమో అని ఎంతో అయిష్టంతో చాలామంది దొంగతనాలు యథాశక్తిగా చేస్తూనే ఉన్నారు. ఇది శాంతిసూచన—అనిరాశారు.

౫. నెల్లకితం మామిడిపురంలో అయి ఉన్న పెళ్లి సందర్భంలో, కన్యాప్రదాత పెళ్లికొడుకు కాళ్లు కడుగుతూన్న సమయంలో, కన్యాప్రదాతకి ముచ్చె మటలూపోసేటట్టు ఓ తేలు అంటపొడిచింది. ఎంత వెతికినా తేలు దొరక లేదు. చివరకి పెళ్లికూతురు అన్నగారు తన బ్యాటరీ లైటుతెచ్చి "ఫోకసు"చేసిన మీదట, ఆతేలు ఇంకా తిణుకూ బెణుకూ లేకుండా పెళ్లికుమారుడియొక్క మడవ సెరదల్లో మకాంచేసి ఉన్నట్టు తెలియవచ్చింది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౬. లక్షపిల్లి నగరంలో చాలామందిజేరి, భార్యాభర్తల విడాకులచట్టం ఉంటేనే చాలా బాగుంటుందని, ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ అభిప్రాయానికి ప్రతికూలంగా ఉన్నవాళ్లని వాళ్లు లోపలికి రానియ్యలేదు. దూసుకుపోయి వచ్చినవాళ్లని నోరెత్తనియ్యలేదు. ఈ తీర్మానం ప్యాసుచేసినవారిలో చాలమంది భార్యలూ కారు, ఆఖరికి భర్తలేనా కారు.

౭. ఎలెక్ట్రిక్ దీపాలు పెద్దగాలికి ఆరిపోయే స్వభావంకలిగి ఉండడంచేతనున్నూ,—(అంటే ఆగాలికి తీగెలు తెగుతాయి, తెగితే దీపాలు నిద్దరోతాయి), అవి ఉంటే దెయ్యంలా ఉండడం, పోతే ఏష్యం అయిపోవడమేగాని సన్నంగా ముత్తెం అల్లాచేసి అట్టే పెట్టుగోడానికి వీలులేనివి అవడంచేతనున్నూ, చటుక్కున ఏసిగరెట్టేనా అంటించుగోడానికి గాని, ఏనెయ్యేనా వెచ్చబెట్టుగోడానికిగాని ఈషణ్మాత్రమూ ఉపచరించేవి కాకపోడంచేతనున్నూ, రాత్రెళ్లు కూడా నిస్తేజంగా ఉండి ఏగ్యాసులైటేనా పట్టిగడితేగాని కంటికి ఆనకుండా చీకటిచేత ఆవరింపబడి ఉండే రకంవి అవడంచేతనున్నూ ఇంకానిదానంగా కొంతకాలం పరిశీలనచేసిన మీదటగాని మేము అట్టే తొందరపడము అని చంద్రాపురజనులు చేసుకున్నతీర్మానం, వారి జ్ఞానతేజానికి నమోనా.

౮. ఆంధ్రపేపర్ మిల్సంటే చప్పరించిన వాళ్లల్లో కొందరు, ఇప్పుడు మిల్సుసాగవోదిలి, కూతట్టి, తిరిగే సరికి బయద్దేరిన కాగితంచూచి తమరూ తెల్లపోయి "ఇంతాచేసి కాగితమేనా, పోదూ!" అని మళ్లీ చప్పరించారు.

౯. కలవలపట్నం అనేనగరంలో పౌరులంతా పట్టటిటి తమ ఊరిస్కూలు హెడ్డుమాస్టరుగారి పని సరిగా లేకపోవడంచేత ఆయన్ని శిక్షింపదల్చుకుని, ఆయన్ని పూర్తిగాతీసెయ్యడానికి చేతులురాక, "ఆయనహెడ్" మాత్రం తీసేసి మేష్టరీమాత్రం అట్టేపెట్టారు. ఆయన హెడ్ ఒక దీర్ఘమైనవ్యాధి అనిన్నీ, అట్టివ్యాధి ఏకోశాన్నీ లేని మరియొకర్నివారు ఆస్థానే వేశారనిన్నీ వినబడింది.

౧౦. నగరవాసులూ, అక్షరాస్యులూ అయిన ఆంధ్రజనం యావద్విశిష్టం ఎరుగున్న పేళ్లనిగురించి కాఫీహోటల్లో ఒకరావుగారు మాట్లాడుతూ, "గయోపాఖ్యానం, వీరేశలింగం, భక్తచింతామణి, కాశీమజిలీలు అపనాతనామనా!" లాంటివి సెలవిచ్చాడు. ఈలిస్టులో "నమస్తే"గాని, "కోరి భజింతుర్" గాని చేరే నూసన్లు ప్రతీనోటా గోసరిస్తూనే ఉన్నాయి.

౧౧. ఒక పట్టణంలోని కాఫీహోటళ్ల ఎదుటి వీథి భాగాలున్నూ, సోడాషాపుల ఎదుటి వీథి భాగాలున్నూ, నాటక వగైరాశాలల చుట్టుపట్ల వీథులున్నూ, కంకరలేని వీథిభాగాలున్నూ, కావలసిన వారి ఇళ్ల ఎదుటివీథి భాగాలున్నూ అహోరాత్రస్య తడిసియే ఉండడంవల్ల, వీథులు తడిపేయత్నంలో అంతమంది తమరికి తోడ్పడుతూన్నందుకు, ఆపట్టణమునిసిపాలిటీవారు తమపౌరుల్ని అభినందించిరి.

౧౨. గోదావరీ తీరజనులు పుణ్యజనులనిన్నీ, ఋషులనిన్నీ ఎక్కడివాళ్లో అనుకుంటారు. పుణ్యజనులు అనడంలో ఆశ్చర్యంలేదు, ఈయుగంలో కాని ఇక్కడ ఋషులు ఉండడం మాత్రం నిజం. ఎంచేతంటే, మెయిన్ రోడ్డుమీద ఎక్కడచూసినా ముక్కుమూసుకుంటూరు, స్మరించుకుంటూ ఉంటారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## రహస్సుధ

కొల్లూరు ధర్మారాయకవి గారు, బి. యే.

3

సిందూరారుణరేఖ తూర్పుదెసఁ దోఁచెన్, ధ్వాంత కల్లోలమా
లం దొల్కాఁడు సుఖప్రశాంతి మనపాలన్ నేఁడు లేదంచు సం
స్పందించెన్ తృణపర్ణపాళి, మధురాశా తప్త హృద్వీథి నీ
సందేశం బటుఁదోఁచె నేవియొ పిపాసా సూచకాలోకముల్

గాటపు కారు చీకటి జగంబున కాటుక పూయ, నిద్రతో
డ్పాటున జీవవాహిని విలంబన మొందఁగ, నేనొకండ ను
ద్ఘాటిత పక్ష్మల ప్రసరితంబగు వేదురు చూపులన్ గగు
ర్పాటొదవించు నీఁద రవంబు గ్రహింతును జాగరూకతన్.

నా కొఱ కాసచెంది నయనమ్ముల విచ్చితి వంతెచాలు దుః
ఖాకుల మామకీన హృదయంబున కెవ్వరెఱుంగ రాని యా
శాకళ లభ్యమయ్యె కలుషప్రచురంబగు నా పురాభవా
నీకము నాకసీమలకు నిచ్చెనమెట్లుగ మారె నొక్కటన్.

ఎక్కఁడ నెట్టికాలమున నేకవి భావపథంబునందుఁ బెం
పెక్కని యీ యలభ్యపద మేవిధి నీకును నాకుఁ గూర్చె? నో
మక్కువ మూఁగచెల్లెల! యమాయికమా భవదీయ వీక్షలం
దిక్కలుష ప్రపంచమునకే సుమి తోఁచు మలీమసాంకముల్.

కన్నుల నీరు బెట్టకుము; కాముకతావిధ మట్లుగాదు; నీ
వున్నెడ నాకు నేఁ గలిగియుండఁగ నీకును ఖేదమేటి? కే
తెన్నును లేని యంధ జగతిన్ తనపున్నెపు నీతి రీతి లో
నన్ నడయాడనిమ్ము; కరుణన్ విలపింపుము దాని కోసమై.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చెన్నపుర జలాధార చిత్రములు



౧. 'రెడ్ హిల్సు' వద్ద చెరువు, దానికట్ట



౨. పై చెరువునుండి పొలములకు నీరుపారు తూములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. చెన్నపురికి నీరును తెచ్చు గొట్టము-ప్రధానద్వారము



౪. చెరువుపద్ద నున్న నీరుపడియు కుండ్లు

శ్రీ యం. కె. రంగస్వామయ్యంగారి ఛాయాచిత్రములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## గా రె లు

ఒకఊళ్లో ఒకఆలూ మొగుడూ ఉండే వాళ్లు. ఒకనాడు మొగుడికి గారెలు తినాలని ఆశపుట్టింద. 'సామగ్రి తెస్తాను; గారెలుచేసి



'సామగ్రి తెస్తాను వడలుచేసి పెట్టు'

పెట్టన్నాడు. పెండ్లాము'సరే' అన్నది. కావలసిన సామగ్రి తెచ్చియిచ్చి మొగుడు పొలం మీద పోయినాడు.

పెండ్లానికేమో గారెలు చేయడం తెలియదు. 'వడలు ఎట్లా చేసేది' అని వాళ్ల పక్క యింటో విధవరాలిని అడిగింది. ఆమె 'ఒక శేరు ఉద్దిపప్పు నీళ్లలో నానబొయ్యి' అంది. 'అయితే నాకు తెలిసిందిలే'అని పైమాట వినకుండా యింటికివచ్చి పప్పు నీళ్లలో నానబోసింది. అవతల ఏంచేయాలనో తెలియలేదు. మళ్లీపోయి పక్కయింటిఆమెను అడిగింది. ఆమె 'ఆపప్పును వడియబోయ'మంది.'అయితే



'ఈమాటు దీనిపని పట్టిస్తాను !'

నాకు తెలిసిందిలే'అని యింటికిపోయి పప్పు వడియబోసింది. అవతల మళ్లీ తెలియలేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



'దీన్ని పట్టుకోండి వడలుపోస్తాను'

మళ్లీ పక్కయింటిఆమెను అడిగింది. ఈమారు ఆమెకు కోపంవచ్చింది. 'ఏమి దీనికింత గీర్వాణం ? చెప్పేదంతా పూర్తిగా విని తెలుసుకోదు. 'అయితే నాకు తెలిసిందలే' అని పోతుంది. మళ్లీ మళ్లీవచ్చి అడుగుతూ ఉంటుంది ఈ మాటు దీనిపని పట్టిస్తాను.' అనుకొని 'అమ్మా, ఆ పప్పులో రెండు శేర్లు ఉప్పు, నాలుగు శేర్లునీళ్లు పోసి పొయ్యిమీద పెట్టి దించుకో గారెలవుతుంది' అంది. ఇంటికివచ్చి పెండ్లాం ఆప్రకారంగా చేసింది.

ఇంతలో పొలంనుంచి 'గారెలు తిందాం గదా'అని గంపెడాశతో సంబరపడుతూ మొగుడువచ్చినాడు. ఆయన్ను కూచోమని ఒకదొన్నె ముందరపెట్టి 'దీన్ని పట్టుకోండి; గారెలుపోస్తాను' అంది. 'ఓశ్, ఇదేమిటే' అని సంగతంతా అడిగితెలుసుకొని విధవరాలి మోసం కనుక్కొన్నాడు. మర్నాడు 'ఈ మాటయినా ఆమెకు కోపంరాకుండా అంతా అడిగి తెలుసుకొని, సరిగా ఆమె చెప్పేటట్లు గారెలు చేయ'మని చెప్పి కావలసినసామగ్రి తెచ్చియిచ్చి పొలంమీద పోయినాడు.



'ఏమే, అయ్యోపాపం,
పక్కఇంటామెనటే కష్టపెడుతున్నావు.'

పెండ్లాము పక్కయింటి విధవరాలి దగ్గరికి మళ్లీ పోయింది. అప్పడామె తెల్లవారే తలగోరుకొని స్నానంచేసి మడికట్టుకొని గారెలపిండి రుబ్బుతూఉంది. ఆమెతో తన సంగతంతా చెప్పింది. ఆమెకు కోపంపోయి 'అయ్యో పాపం'అని నొచ్చుకొని 'ఇపుడు నేను గారెలు కాల్చబోతున్నాను. అంతా సరిగ్గా నేను చేసేట్టు చేయ'మని చేసిచూపింది. పెండ్లాము అదంతా చూసుకొని ఇంటికివచ్చింది. ఉద్ది పప్పు నానబోసింది. ఒకమంగలాణ్ణి దొడ్లోకి రమ్మని నున్నగా తలగొరిగించుకొంది. స్నానం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసి పక్కింటిఆమె దొడ్లో ఆరవేసి పెట్టు కొన్న మడిచీరను కట్టుకొని తలకు ముసుగు వేసుకొని ఉద్దిపప్పును రోట్లోపోసి రుబ్బుతూ ఉన్నది. 'ఈసారయినా సరిగా చేసిందో



'ఓసి దౌర్భాగ్యురాలా, నీకేం పోగాలమే, తలగొరిగించుకొని ముసుగు పెట్టుకొన్నావు.'

లేదో' అనుకొంటూ మొగుడు ఆసమయానికే యింటికి వచ్చాడు. ఆ రుబ్బుతూన్న ముసుగు మనిషిని దూరంనుండి చూచి 'ఏమే, అయ్యో పాపం! పక్కఇంటామె నటే కష్టపెడుతూ న్నావు'అంటూ దగ్గరికివచ్చాడు. పెండ్లాము తలమెత్తి ముసుగు వెనకకు త్రోసుకొని, 'పక్కయింటామె కాదండీ, నేనేనండీ' అంది.



'ముగుడికి నవ్వలేక కడుపు బద్దలయింది. క్రింద చతికిలబడ్డాడు.'

'ఓసి దౌర్భాగ్యురాలా, నీకేంపోగాలమే! తల గొరిగించుకొని ముసుగు పెట్టుకున్నావు!' అన్నాడు మొగుడు. 'మీరు తెల్లవారి అన్నా రుకదండీ, సరిగ్గా ఆమె చెప్పేట్లు చేయమని.' ఆమెకూడా 'అంతా సరిగ్గా నేను చేసేట్లు చేయ'మని చెప్పింది. అంతా సరిగ్గా ఆమె చేసేట్లు చేస్తూన్నానండీ. దీనికి మీకెందు కండీ కోపం'అని పెండ్లాం ఏడ్వ ఆరంభించింది. మొగుడికి నవ్వలేక కడుపు బద్ద లయింది. క్రింద చతికిలబడ్డాడు: పక్కింటిఆమె యీకథ నాకు చెప్పింది. నేను మీకు చెప్పాను.

—ముసలమ్మ.

చిత్రకారుడు: శ్రీ తలిశెట్టి రామారావు గారు బి. ఏ., బి. యల్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుముకులాట

ఏమిదుముకు — పసుపుదుముకు
ఏమిపసుపు — తోటపసుపు
ఏమితోట — చెఱుకుతోట
ఏమి చెఱుకు — వంట చెఱుకు
ఏమివంట — పిండివంట
ఏమిపిండి — తెలకపిండి
ఏమి తెలక — గొఱ్ఱె తెలక
ఏమిగొఱ్ఱె — పాలగొఱ్ఱె
ఏమిపాలు — చెముడుపాలు

దుముకుదుముకు

ఏమి చెముడు — బ్రహ్మ చెముడు
ఏమిబ్రహ్మ — పరంబ్రహ్మ
ఏమిపరం — బండిపరం
ఏమిబండి — కమ్మిబండి
ఏమికమ్మి — ముక్కు కమ్మి
ఏమిముక్కు — చిలకముక్కు
ఏమిచిలక — రామచిలక
ఏమిరామ — జై జయ్‌రామ!

---

## సీతారామకల్యాణ మహోత్సవాహ్వానపత్రిక



సెట్టి లక్ష్మీనరసింహము గారు

శ్రీపతి ధాత్రిపై నవతరించుట యీ యుగమందు ధర్మసం
స్థాపన మాచరించుటకా? ధర్మమణంచుటకో? వచింప వ
య్యా పరమేశ, యంచుఁ గలహాశనుఁ డుగ్రుని హెచ్చరింపఁ, ద
చ్చాపముఁ ద్రుంచినట్టి శుభధాముఁడు రాముఁడు మిమ్ముఁ బ్రోచుతన్.

అనఘ శ్రీరఘురామభక్తులకు నేఁడానంద మానంద మా
యెను: మా రామవిభుండు పెండ్లికొడుకాయెఁ; మాదు సీతమ్మ యా
తనికిం బెండ్లికొమార్త యామె నిదె: తత్కల్యాణము జూడ, మీ
రును మీరున్ మఱి మీరు మీరలును మీరుఁ రండు మీవారితో.

ఎవరి యింటి పెండిలి యిది? యెల్లవాసు-దేవు పెండ్లికిఁ బెద్దలు కావలయును;
ఇల్లనుచు వేఱె లేక వర్తిల్లు రాము-నొక్క యింటి వానిగను జేయుదము రండు.
జనకునకుఁ గూఁతురాయెనా? మనకుఁ గాక-పోయెనా? యయోనిజ సీత: యాయన
మనము ధారపోయఁగఁ జెల్లు జనని జాన-కమ్మ శ్రీరామవిభునకుఁ గాళ్లు కడిగి. [వలె

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గురుశిష్య సంవాదము

కూచి నరసింహము గారు

(వందనాశీర్వాదముల పిదప)

శి:—కుమారప్పగారు తరువాత నేమి చెప్పినారో విను కుతూహలముతో వచ్చినాను. వెనుకఁ జెప్పినది సత్పరిపాలనాపద్ధతి.

గు:—పందొమ్మిదవశతాబ్ది ప్రారంభమున హిందూదేశస్థితి యెట్లుండెనో తరువాతి పత్రికలో సప్రమాణముగాఁ జెప్పినారు.

శి:—తత్పూర్వస్థితిమాట యేమియు నెత్తికొనలేదా?

గు:—ఎత్తుకోక యేమి? ౧౦౧౧—౧౮౦౦ సంవత్సరముల మధ్యకాలములో మనదేశము మహోచ్చస్థితిలో నుండెనని వ్రాసినారు.

శి:—ఏమి వ్రాసినారో, కొంచెము సెలవీయరా?

గు:—అప్పుడప్పుడు కొన్ని దేశోపద్రవములు సంభవించుచుండినను, ఇతర దేశములతోఁ బోల్చి చూచిన యెడల, మొత్తముమీఁద, భారతవర్ష మారోజులలో సిరిసంపత్తులును, ప్రశాంతి సుఖమును అనుభవించినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

సముద్రముమీఁదను మెట్టమార్గమునను గూడఁ దన సరకుల నంపి, హిందూదేశము దూరదేశములతో విపులమైన వాణిజ్య వ్యాపారము పెట్టుకొని, యమితమైన ధనలాభము నొందుచుండెను.

నాఁటి హైందవులకు విశేషముగా శిల్పనైపుణ్యముండెడిది. వారు తమదేశములోఁ బండిన ప్రత్తి మున్నగు పదార్థములతోఁ బ్రశస్తములైన వస్త్రాదులు నేసి పరదేశముల కంపి యధిక ధన మార్జించుకొనెడు వారు. విలువగల సరకుల నిచ్చి వెండి బంగారములు దెచ్చుకొనెడివారు. అప్పు డెంతో రాజ్యబలముగల "రోమ్" కూడ "అయ్యో! మన ధనమంతయు హిందూదేశమే లాగుకొని పోవుచున్నదే!" యని పరిదేవనము నొందుచుండెడిదఁట.

ప్రజల తెలివితేటలచే దేశములోని ద్రవ్యములతో మంచిమంచి సరకులు కల్పించి వానిని స్వదేశీయులకును, బరదేశీయులకును విక్రయించి డబ్బు చేసికొనెడువారు. చేతినిండఁ బనియుఁ, గడుపునిండఁ దిండియు, నొడలినిండ బట్టయు నుండెడివి.

తూర్పు సముద్రతీరమున డాక్కానుండి బందరువఱకు నుల్లిపొరలవంటి "మస్లిన్" బట్టలు నేసి యెగుమతిచేసికొనెడు వారు. పశ్చిమసముద్రతీరమున "కాలికట్టు" నుండి ప్రశస్తమైన "కాలికో" బట్ట యమితముగా వచ్చుచుండెడివి. ఈవర్తకము ౧౮వ శతాబ్ది యుత్తరార్థమునఁ గూడ నుండెడి దఁట.

శి:—స్వదేశవాణిజ్య పోషణార్థము పాశ్చాత్య ప్రభువు లట్టి సరకు పై దిగుమతి పన్నులు వేసెడి వారు కారా?

గు:—ఏల వేయకుందురు? వేయకుండినఁ బ్రజ లూరకుండ నిత్తురా?

౧౮౩౫ వ సంవత్సరములో నొక పత్రిక గట్టిగా మొఱపెట్టుకొనఁగా, స్వదేశీయన వ్యాపారము చెడిపోకుండ కాపాడుటకు, ఇంగ్లండు దిట్టముగా దిగుమతి పన్నులు విధింపవలసి వచ్చినదఁట.

శి:—మనవా రారోజులలో నొక్క నూలిబట్టలే యెగుమతి చేసెడివారా? యితరమైన సరకులు కూడఁ బంపెడు వారా?

గు:—నూలిబట్టలే కాదు — పట్టువస్త్రములు, బుటేదారు పనిచేసిన బట్టలు, తివాసులు, చక్కని చెక్కడపు పని చేసిన రత్నభూషణములు, దంతిపుసరకులు, సుగంధి ద్రవ్యములు—ఎన్నెన్నో యెగుమతిచేసి యింద్రవైభవ మనుభవించెడువారు.

శి:— అవన్నియు నెవరి పడవలమీఁద వేసి పంపెడువారు?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గు:—తమ పడవలమీఁదనే కొన్ని పర్షియా సింధు శాఖ, అరేబియా మీఁదుగా నావల యూరప్పునకు సరకులు కొనిపోయెడివి; కొన్ని యీవల చీనా జపాను దేశములకుఁ గొనిపోయెడివి.

శి:—అబ్బా! మనవారి కప్పుడు నౌకానిర్మాణ నిపుణతకూడ నుండెడి దేమి?

గు:—ఆ! నిస్సందేహముగా! "రాధాకుముదము ఖర్జీ"గారు తాము వ్రాసిన గ్రంథములో నొక లేఖ యుదాహరించినారు. అది "బాలాసోరు"లో నున్న పాశ్చాత్యవణిక్ప్రతినిధులు లండనులో నుండు "ప్రణేత లసభ (The Court of Director's) కు ౧౬-౧౭-౧౬౭౧ తేదీని వ్రాసిన యుత్తరము. అం దిట్లు వ్రాయఁబడి యున్నది:—

"అనే కాంగ్లవర్తకులును, తదితరులును వారి పడవ లిటఁ బ్రతి సంవత్సరము కట్టించుకొనుచున్నారు. ప్రశస్తముగాఁ బెరిఁగిన మద్దురుకఱ్ఱ యిటఁ గావలసినంత యున్నది. తీరమునందు దివ్యమైన యినుము మున్నది. లంగరులు మున్నగు నినుపసరకు లీదేశస్థులు మిక్కిలి నేర్పుతోఁ జేయుచున్నారు. సుప్రసిద్ధ నౌకా నిర్మాత లనేకు లిట నున్నారు. పడవలు నిర్మించి వానిఁ గడలిపై విడుచుటలో వారికంటె నెక్కువ కుశలుల నీప్రపంచములో నేనెచటను జూడలేదు. తెరచాఁపలు, ఓడపగ్గములు, నూలి నిచ్చెనలు, మున్నగు పోతోపకరణములు వారు చేయు పద్ధతి కడుఁ బ్రశస్తమైన పద్ధతి."

౧౮౧౧వ సంవత్సరమునఁ గూడ ఇంగ్లండునకు యుద్ధనావలు ఇండియా కట్టిపెట్టెడిదఁట. హైందవ పోతనిర్మాతలనుండి ఇంగ్లండు వారు నమూనా లర్థించి తెచ్చుకొనెడువారఁట.

శి:—అయ్యో! యెట్టిదేశ మెంత యున్నతస్థితి నుండి యెంత నిమ్నస్థితికిఁ బడిపోయినది!

గు:—పూర్వకాలపు దివ్యభవనములు, కాలువలు, ఘంటాపథములు—అక్కడక్కడఁ గొన్ని, ప్రాచీన వైభవ స్మారక చిహ్నములుగా, నిప్పటికిని నిలిచి యున్నవి.

శి:—అప్పుడు క్షామభాధలే ప్రజ లెఱుఁగరు కాఁబోలు.

గు:—ఎఱుఁగరని చెప్పుట యసత్యము; కాని యావద్దేశము నొక్కమాఱు కబవు లప్పుడు బాధించెడివి గావు. ఆరోజులలో రాకపోకల సౌకర్యము లిప్పటి కంటె మిక్కిలి తక్కువగా నుండెడివి గావున, పండిన చోట్లనుండి పంట లేనిచోట్లకు సరకులు తీసికొనిపోవుట కడుఁ గష్టముగా నుండెడిది. ఆకాలములలో క్షామబాధా కారణ మనావృష్టి హేతుకమైన సస్యాభావము గాని ధాన్యాదులు కొని బ్రతుకుటకుఁ జాలినడబ్బు ప్రజల చేతిలో లేకపోవుట గాదు. ఆవిపత్తు దైవికము గాని దుష్పరిపాలనముచే మనుష్యుఁడు బుద్ధిపూర్వకముగాఁ దెచ్చి నెత్తిని వైచుకొన్న విపత్తు కాదు.

శి:—ఇప్పటివలెఁ గాక యప్పుడు బలవంతులగు పరరాజులు దేశముపైఁ బడి దోఁచుకొనెడు వారని విందుమే!

గు:—అప్పుడప్పు డట్టి విప్లవములు సంభవించెడి వన్నమాట వాస్తవమే. సారవంతమైన భూములు గలిగి ధనవంతమైయున్న దేశము చూచినఁ బరరాజుల కన్నులు గుట్టకమానవు. వారిదోఁపిడివలనఁ గొంతనష్టము ప్రజలకుఁ గలుగకయును మానదు. కాని, కంటి కగపడి చేతికి దొరకు డబ్బును, సరకులును దోఁపిడికాండ్రు లాగుకొని పోఁగలరు కాని, ప్రజల పదార్థోత్పాదనశక్తి నెట్లు పట్టుకొని పోఁగలరు? కనుక ఆబాధలు తఱచుగాఁ బట్టణములలో నుండు విత్తవంతులను దాఁకెడివి గాని, పల్లెలలో నుండు కర్షకులకును, చేతిపనులు చేసికొని జీవించు వారికిని దగిలెడివి గావు.

మఱియు, సేద్య మొకపవిత్రవృత్తిగా నప్పటి వారు భావించుకొనెడి వారు. అందుచేత నెక్కడనో రాజులకును రాజులకును జరుగురణములవలన సేద్యకాండ్రకుఁ గాని, చేలపై నుండు సస్యములకుఁ గాని యెట్టిసేగియుఁ దటస్థించెడిది గాదు. పంటకాఁపుల యాస్తి పాడుచేయుట పాతకముగాఁ బరిగణించెదు వారు.

కనుక, ౧౭౩౯ సం. లో జరిగిన "నాదర్షా" కొల్లవంటి యుపద్రవములవలన మనదేశమునకుఁ గొంత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తాత్కాలిక బాధ కలిగెడిది కాని పెద్దనష్టము సంభవించెడిది గాదు.

శి:—కష్టపడి సంపాదించుకొన్న యాస్తియంతయు నపహరించి మనుష్యులను ప్రాణావశిష్టులఁ జేసి విడిచిపెట్టి పోవుట పెద్దనష్టము గాక చిన్ననష్టమా? మీ యీమాట నా కేమియు నచ్చుట లేదు.

గు:—నష్టము లేదని నేఁ జెప్పుటలేదయ్యా! ఆ నష్టము కొందఱకే కలిగి కొంతకాలమే యుండెడిదని చెప్పినాను; ప్రజలజీవికలును, వృత్తులును నశించెడివి కావని చెప్పినాను. ఒకఁ డొకనిని దోఁచుకొని యంతటితో విడిచిపెట్టినాఁ డనుకొనుము; మఱియొకఁ డున్న సొమ్మెల్లఁ బట్టుకొని పోవుటయే కాక వాని గ్రుడ్లు పీఁకి, చేతులు నఱికిపూడఁ బోయినాఁ డనుకొనుము. పునర్ధనార్జనశక్తి పోఁగొట్టి రెండవవాఁ డెక్కువహాని చేసినవాఁడు కాలేదా?

శి:—ఔను; కథ సాగి పోనిండు.

గు:—కనుక, స్వరాజపీడయో, పరరాజపీడయో వదలి పోయినవెంటనే, పడిపోయిన వృత్తులు మరలఁ దలయెత్తి కామధేనువులవలెఁ బ్రజ మరల నైశ్వర్యవంతులఁ జేయుచుండెడివి.

దుర్వినియోగము చేసినను సద్వినియోగము చేసినను, పన్ను మొత్త మంతయు స్వదేశములోనే వ్యయింపఁబడుచుండెడిది. రాజులు భోగైకతత్పరులైనను, వారు వెచ్చించు డబ్బు తమ ప్రజలకడకే పోయెడిది. చిత్రచిత్రభోగపదార్థములు క్రొత్తక్రొత్తవి చేయు నేర్పు ప్రజల కలవడుచుండెను. ఆనూత్నవస్తుకల్పనశక్తి దేశమునకే లాభకారి యగుచుండెను.

స్వదేశీయులే పరిపాలన కృత్యములలోఁ బాల్గొనుచుండుట చేతఁ బెద్దపెద్దవేతనములు బుద్ధిశాలులగు మన దేశము వారికే ముట్టుచుండెడివి. దేశభక్తితోఁ బాలనము జరుపఁబడు చుండుటచే, వేనవేల కేవో వృత్తులు కల్పింపఁ బడుచుండెడివి.

గ్రామములోని పంచాయతి సభ్యులే స్థితిగతులు స్వయముగాఁ జూచి పన్నులు విధించెడివారు. పొరపాటుచే నందు హెచ్చుతగ్గులేమైన వచ్చినచోఁ బ్రజలు చెంత నుండు నధికారులతోఁ జెప్పుకొని వెంటనే వానిని సవరింపించుకొనుట కవకాశ ముండెడిది.

పంటనుబట్టి పన్నులు వేసెడివారు. అవి ధనరూపముగాఁ జెల్లించినను సరే, ధాన్యాదివస్తురూపముగాఁ జెల్లించినను సరే—అది రైతుల యిష్టమునకు విడిచిపెట్టెడువారు. అందుచేత వ్యవసాయము చేసిన వానికి ఏఁటి పంట యంతయుఁ బన్నురూపముగాఁ దుడిచిపెట్టుకొని పోకుండ, సంవత్సరగ్రాసమునకే కాక క్షామాది కష్టకాలమునకుఁగూడఁ గొంత మిగిలి యుండెడిది.

శి:—సరియే; యన్న వస్త్రముల కేకొదవయు లేకుండ నప్పటి ప్రజలు జీవించెడి వా రన్నమాట.

ఆనాఁడు వర్ణములఁ బట్టి వృత్తు లుండెడివి గనుక, నిండ్లే పాఠశాలలు గాను, వారివారి కర్మాగారములే యుచితముగాఁ గళా ప్రయోగభాగములు నేర్పు అభ్యాస స్థానములు గాను నుండెడివని యూహించుకొనఁ గలను. కాని లోకవ్యవహారమునకుఁ గావలయు సామాన్యవిద్య జనులకు బాల్యములోఁ గఱపుట కూళ్లలో నిప్పటివలె నప్పుడు బడు లుండెడివా? ఉన్నచో నవి యెట్లు పోషింపఁబడుచుండెడివి?

గు:—ఊరూర నొకబడి యుండెడిది. వృత్తిమాన్యము లిచ్చి యట్టి పాఠశాలలను నిలిపి పోషించెడు వారు. ఆలాగుననే యితరములైన స్థానపరిపాలనా శాఖలకుఁ గావలయు నుద్యోగులను నియోగించెడివారు. కావునఁ బ్రతిగ్రామమును బ్రజాపరిపాలనము క్రిందనే యుండు నొక చక్కని చిన్న రాష్ట్రముగా నుండెడిదని నీ వనుకొనవచ్చును.

శి:—ఆలాగునఁ బరిపాలింపఁబడు దేశము భూలోక స్వర్గముగా నుండదా? ౧౮వ శతాబ్దిచివరనఱకు మనదేశమన్ని విధముల నట్లే సుఖపడుచుండెడిది కాఁబోలు!

గు:—ఉండినట్లు మనవారే కాక, నాఁటిదేశము నద్దెసలు దిరిగి చూచిన యూరపువారగు బాటసారులును, దదితరులునుగూడ లిఖించిపెట్టినారు. అట్టి నలుగుర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాక్ష్యములు దిశకొక్కటి చొప్పున నెత్తి కుమారప్ప పండితుఁడుగారు పత్రికలో నుట్టంకించినారు.

శి:—అలాగునా? అవి యేవో తెలిసికొనఁబ్రార్థించుచున్నాను.

గు:—ఉత్తరమున నున్న భరతపుర సంస్థానము నుగూర్చి "బిషప్ హీబరు"గారు తన దిన చర్యాపుస్తకములో నిట్లు వ్రాసినారు:—

"జలసమృద్ధమై సేద్యము ప్రశస్తముగా జరుగుచున్నట్లు నాకగపడిన హిందూదేశ భాగములలో నిది యొకటి. పొలములలో పైరు పరమసుందరముగా నున్నది. ప్రత్తిపంట ప్రశస్తముగా నున్నది. పండిన చెఱకు లప్పుడే కోసి బయలుచేసిన విశాలక్షేత్రములును, అనేకములైన చెఱకుగానుగలను నేఁ జూచినాను. అన్నిటికంటెను దేశభాగ్యమున కివి యమోఘ దృష్టాంతములు. ప్రజాబాహుళ్యమంత గా లేదు కాని, పల్లెలన్నియు మిక్కిలి మంచిస్థితిలో నున్నవి. మరమ్మతులు బాగుగా జరుగుచున్నవి.

"కంపెనీ యధికారములో నున్న రాష్ట్రములఁ జూచి, రాజపుత్రస్థానములో నింపైన యిట్టి వ్యాపారములు చక్కఁగా సాగుచుండు ప్రదేశ ముండునని నేనను కొనలేదు. దీనిఁబట్టి భరతపుర ప్రభువు ప్రజలఁ దన బిడ్డలవలెఁ జూచుకొని పరిపాలనముచేయు నసాధారణ ప్రజ్ఞావంతుఁడనియైన నూహింపవలెను; లేదా, బ్రిటిషు రాష్ట్రములందలి పరిపాలనావిధానము స్వదేశప్రభువుల పరిపాలనా పద్ధతికంటెఁ బ్రజా సౌఖ్యవిషయమునను, దేశాభ్యుదయవిషయమునను దక్కువ యనుకూలముగా నున్న దనియైన నూహించుకొనవలెను."

శి:— మతగురువు గనుక, నసత్యభీతిచే నున్న దున్నట్లు వ్రాసినాఁడు.

గు:—కల్లలాడకుండుటకు క్రైస్తవ గురువే కానక్కఱలేదు. దక్షిణమున, నప్పుడు మహమ్మదీయ రాజ్యమై, టిప్పు సుల్తానుచేఁ బరిపాలింపఁ బడుచుండిన మైసూరురాష్ట్రమునుగూర్చి "లెఫ్టినెంటుకర్నల్ మూర్" గారు వ్రాసినమాటలు విను.

శి:—చిత్తము.

గు:—"దేశములోఁ బ్రయాణము చేయుచున్న పరదేశికి—చక్కఁగా సాగుబడిచేయఁబడుచున్న క్షేత్రములు, పాటుపడి పనిచేయు ప్రజలతోఁ గిటగిట లాడుచుండు ప్రదేశములు, కంటికింపుగాఁ గట్టఁబడి యభివృద్ధిలో నుండు పట్టణములు, విపులవ్యాప్తిగల వాణిజ్యము, ఎటు తిరిగి చూచినను ప్రజాసంతుష్టిని సూచించు లక్షణములు—ఇవి కనఁబడినప్పుడు, ఆదేశపరిపాలనము ప్రజాప్రియమై సుఖకరమైన పరిపాలనమని యతఁ డనుకొనుట సహజము. పైయభివర్ణనము టిప్పుగారి పరిపాలనము యొక్క ప్రతిరూపమే.

"అతని యేలుబడిలో నెల్ల జనులు సుఖించిరనియు, వారికంటె నే యితర రాజ్యప్రజలును ఎక్కువ సుఖవంతులు గారనియు ననుకొనుటకుఁ జాలినంత హేతుబల మున్నది.

"టిప్పుయొక్క ప్రవర్తనను గూర్చి ప్రతికూల వాక్యములు విని పరమానందము నొందుట కధికార సత్వము గల శత్రువు లతని కుండిరి. ఉండినప్పటికిని, టిప్పు సుల్తానునకుఁ గలంక మాపాదించు నుడులుగాని, సడుగులు గాని యెవరినోటినుండియు వినఁబడెడివి గావు."

శి:—ఇంకఁ దూర్పుపడమరలు మిగిలియున్నవి.

గు:—అవియు వచ్చుచున్నవి, తొందరపడకుము. తూర్పున నున్న వంగదేశమును గూర్చి "హాల్వెల్" దొరగారిట్లు వ్రాసినారఁట:—

"ప్రజలయర్థప్రాణము లిట నబాధ్యములు. సరకుతోఁ బోవు వర్తకుఁడైనను సరే, సామాన్యపథికుఁడైనను సరే, యీదేశములోఁ బ్రభు జాగరూకతచే సురక్షితముగాఁ బ్రయాణము చేయఁ గలఁడు. దమ్మిడి ఖర్చు లేకుండ, ఆరెకులు వెంటనే వచ్చి యంగరక్షకులై యతని నొక మజిలీనుండి యొకమజిలీకిఁ గొనిపోదురు......ధనవంతమగు "డాక్కా" మండలపు భూములన్నియు సాగులో నున్నవి. ప్రజలకు నిష్పక్షపాతమైన న్యాయము దొరకుచున్నది. పరిపాలకుఁడగు 'జెస్వంతరాయఁడు' సద్విద్యాశిక్షితుఁడైన ప్రభువు, విమలాంతఃకరణుఁడు, ఋజు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్గవర్తి, విసుగుకొనక శ్రమ కోర్చి యప్రమత్తుఁడై తన పరిపాలన కృత్యములు చేసికొనుచుఁ బ్రజాసౌఖ్య స్వాస్థ్యము లొనఁగూర్చుచున్నాఁడు. ప్రభుత్వమువా రెవరికో కొందఱకు సర్వగ్రాహకముగా సరకుల జట్టికిచ్చు పద్ధతి యతఁడు కొట్టివేసినాఁడు; ధాన్యములపైఁ బన్ను లు వేయుట మాని వేసినాఁడు."

శి:—అట్టిసత్ప్రభువుల సంరక్షణమున జనులు నిర్భయులై సమస్తసౌఖ్యము లనుభవింతురన్న, నం దాశ్చర్య మేమున్నది?

గు:—ఇఁకఁ బశ్చిమ రాష్ట్రములలో నొకటి యగు మహారాష్ట్రమునుగూర్చి "ఆంక్వెటిల్ డూపెర్రాన్" గా రిట్లు సాక్ష్యమిచ్చుచున్నారు:—

"మహారాష్ట్రదేశము నేఁ జొచ్చినప్పుడు, కృత యుగమునాఁటి యకాపట్యానందముల మధ్యమున నేనుండి నట్లు నాకుఁ దోఁచినది. ప్రకృతియొక్క సహజ సౌంద ర్యమట నింకను మాఱిపోలేదు. యుద్ధపీడ లింకను వారిని జెనకలేదు. ప్రజలు పూర్ణారోగ్యవంతులగను, జవసత్వ సంపన్నులగను, చిత్తోల్లాసము గలవారుగను నాకుఁ జూ పట్టినారు. అత్యంతమైన యతిథిసత్కార మాదేశములో సర్వజనసామాన్యమైన సద్ధర్మముగా నాకుఁ గాన్పించి నది. వచ్చి మా కున్న దేమో యథేష్టముగా ననుభవిం పుఁడు—అని యానందముతో నాహ్వానించుచున్నట్లు, స్నేహితులకు, ఇరుగుపొరుగువారికి, అపరిచితులకు వైదే శికులకు, అందఱకు, నప్పటి ప్రతిగృహము సుగమమై సిద్ధముగా నుండును."

శి:—పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున నున్న మనదేశస్థితి వినుట కెంతయు సంతోషకరముగా నున్నది. ఇరువదవ శతాబ్ది యాది యందలి స్థితి యెట్లుండెనని కుమా రప్పగారు చెప్పినారో వినఁగోరుచున్నాను.

గు:—దానిఁగూర్చి నీవు మరల వచ్చి నప్పుడు ముందు ముచ్చటించుకొందము.

శి:—అట్లైన, నే నిప్పటికి సెలవు దీసి కొందును; నమస్కారము.

గు:—కల్యాణ మస్తు!

---

# చమత్కారచంద్రిక

### మూలము

య ఏ వాద్యః స ఏ వాంత్యో
మధ్యమో మధ్య ఏవచ,
య ఏత స్న విజానాతి
తృణం చాపి న వేత్తి సః.

### తెనుఁగు పద్యము

తే. మొదలు చూచిన యాయగుఁ దుదిని జూడ
సా యగును దాని నడుమెల్లఁ జక్కఁజూడ
నడిమిదేయయి యొప్పారుఁ బుడమి దాని
నెఱుఁగలేనట్టియవ్వాఁడు తృణ మెఱుఁగఁడు.

తాడూరి లక్ష్మీనరసింహారావుగారు

### వివరణము

ఇందు వర్ణింపఁబడినది మూఁడక్షరముల మాట. అందు మొదటి యక్షరము "య"; చివరక్షరము "స"; నడిమియక్షర మా రెంటికిని నడిమదే. యా మొదలు సాదాఁకఁగల యక్షరములు "య-ర-ల-వ-శ-ష-స" యనునవి. ఇందు నడిమిది "వ" కావున శబ్దము "యవస" శబ్దము. దాని యర్థము తృణము—గడ్డిపరక.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గంగాలహరి

చెఱుకుపల్లి శివరామయ్య గారు
(వాణీసేవాసంఘము)

శ్రీమదఖండ ధాత్రీచక్రమున కెల్ల ప్రాప్తించినట్టి సౌభాగ్య మనఁగ
నిఖిల జగజ్జాల నిర్మాణలోలుఁడౌ ప్రమథనాథుని మహైశ్వర్య మనఁగ
చతురాస్య కంఠనిర్గత నిర్మలామ్నాయములకు నిత్యము మూట ముల్లె యనఁగ
సుమనసావళికి సంస్తుత్య రూపముఁ గాంచు బహుజన్మసుకృత సత్ఫలమనంగ
నలరి యమృతోపమానమైనట్టి నీదు-సలిలపూరంబు మాపాపచయము మాన్పి
నయముమీఱంగ మాకు మనఃప్రశాంతిఁ-గలుగఁజేయుత తల్లి గంగాభవాని!

కలుషంబార నొకింతయేఁ గనులకున్ గాన్పించినంతన్ దరి
ద్రుల దారిద్ర్యము పాపజాతి దురితస్తోమంబులన్ బాపి సం
చలితాజ్ఞాన తరుప్రకాండ దళనా శౌండీర్యమై మించు నీ
సలిలం బెప్పుడు మాకుఁ గూర్చు పరమైశ్వర్యంబు మందాకినీ!

పతితుండైన దలంప నంధ తమసవ్రాతంబు చండాంశు న
ట్లతి వేలంబుగ లోనడంగిన యవిద్యన్ రూపఱన్ జేయుచున్
శతమన్యుప్రముఖామర ప్రణుత మాన్యంబైన నీ మూర్తి సం
తత తాపత్రయమున్ హరించుచు మమున్ రక్షించు మందాకినీ!

నీ యాధారమె లోన నమ్ముకొనుచున్ నిశ్చింతతో మోహగ
ర్వాయత్తాత్ముఁడనై రయంబున నమర్త్యశ్రేణి వంచించితిన్
సాయం బించుక జేయ కిత్తఱి నుపేక్షన్ జేయ నేకాకినై
నా యీ దుస్థితి నేరితోఁ దెలుపఁగన్ యత్నింతు మందాకినీ!

రమణీయంబగు రాజ్యసంపదఁ దృణప్రాయంబుగా వీడి శాం
తమతిన్ నీదరిఁ జేరి దివ్యసుధకన్నన్ రుచ్యమౌ తోయమున్
తమిఁదీఱంగను గ్రోలు మానవుల యానందంబు వర్ణింప శ
క్యమె! వేయేల పరంబుఁ గూడ మఱువంగన్ జేయదే తల్లిరో?

బాలార్క ప్రతిమానమౌ కుపితశర్వాణీ కటాక్షాహతిన్
తాళన్ లేక భ్రమప్రమాదవశతన్ సంక్షోభముం జెందుచున్
ప్రాలేయాచల కన్యకాప్రియ శిరోభాగంబునం దాడు త్వ
ల్లీలాభంగ తరంగజాల మఘముల్ ఛేదించు మందాకినీ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాతస్స్నానములాడు రాజరమణీ వక్షోజ కుంభద్వయీ
స్ఫీత శ్రీమృగనాభ మెందనుక దేవీ! తోయమం దొప్పునో
ప్రీతిం గూడి మృగంబు లందనుక సంవేష్టించి బృందారక
వ్రాతంబుల్ విహరించు నందన సుఖారామప్రదేశంబునన్.

జననీ! సంస్మరియించు మాత్రముననే శాంతిన్ ప్రసాదించి కీ
ర్తనముల్ జేసిన యంతపాపములఁ బాఱందోలు "భాగీరథీ"
యను నీ కర్ణరసాయనంబయిన నామాలాపమే నాదు జి
హ్వాను మత్ప్రాణతతి ప్రయాణసమయం బందుల్ ప్రవర్తించెడిన్.

పరమానందముఁ జెంది నాకగమనవ్యామోహముల్ మాని నీ
దరులందున్ జరియించు కాకములు సైతంబున్ సుఖింపంగ కా
పురముల్ సేయు మనుష్యజాతమరణంబుల్ మాన్పు నీతీరమే
మఱిఁక మాభవబంధతాపవితతిన్ మాయించు మందాకినీ!

శ్రుతుల కభేద్యముల్ విషయశూన్యము రూపవిహీనముల్ నిజో
న్నతమహిమల్ తమోగుణ వినాశనకారణభూతముల్ సమం
చితముగ వాకొనన్ దలఁప జీవులకెల్ల నసాధ్యమౌచు సం
తతము విశుద్ధమైన పరతత్త్వము నీవె త్రిలోకపావనీ!

ధ్యానముల దానముల తపోధనముచేత
యజ్ఞముల గూడ నలవికానట్టి విష్ణు
పదము సాధారణంబుగ నొదవఁజేయు
నిన్ను నెవ్వారితోఁ బోల్పనేర్తుమమ్మ!

జననీ! చూచినయంతనే జన మనస్తాపంబులన్ బాపి శో
భనముల్ గూర్చెడి నీప్రభావము నుతింపన్ శక్యమే శైలజా
ఘనరోష స్ఫురణావరోధముల లెక్కంజేయకన్ ఫాలలో
చనుఁడే మౌళిపయిన్ ధరించు నిను నశ్రాంతంబు మందాకినీ!

నతమున్మత్తులు నిందసేయు పిశునుల్ సైతంబు రోమాంచసం
యుతులౌచున్ విననాడునట్టివియు వ్రాత్యుల్ గూడ వర్జించుచున్
పతితుల్ వాకొననట్టిలోకుల మహాపాపంబులన్ మాన్పుచున్
క్షితి విశ్రాంతి నెఱుంగదాన వెపుడున్ చింతింప నీవేగదా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనుజుల సర్వదుఃఖముల మాన్పఁగ నాకమునుండి బాఱు ని
న్ననిశము ఫాలనేత్రుఁడు జటాగ్రనిబద్ధనుగా నొనర్చె నం
చనుటకుఁజూడ లోభరహితాత్ముల చిత్తములందు లోభచిం
తన మొదవించు నీ గుణగణంబుల దోషమె కారణం బగుఁన్.

వరకైవల్య విహీనులన్ బధిరులన్ పంగ్వంధులన్ వేదనా
భర దుష్టగ్రహరోగులన్ నరకసంవాసార్హులన్ పాపసం
హరణోపాయ విహీనచిత్తుల నమర్త్యవ్రాత నిర్ముక్తులన్
పరిరక్షింప మహౌషధంబవు గదా! స్వర్లోక కల్లోలినీ!

అమ్మరో! తావకీనసహజామల శీతలతోయ మెంచ లో
కమ్మున మించె నాకమునుగాంచియు నిర్మలదేహధారులై
నెమ్మి భవన్మహామహిమనే పులకింప నొడల్ నుతింత్రు స్వాం
తమ్ముల భక్తిచే సగరనందను లిప్పటికిన్ ప్రమోదులై.

హాయిన్ గూర్చుచు స్వల్పపాపులను దుఃఖావిష్టులన్ బ్రోచి పూ
ర్ణాయుష్మంతుల జేయు తీర్థతతులమ్మా! గల్గులోకత్రయిన్
ప్రాయశ్చిత్తములందు లొంగని మహాపాపాత్ములన్ పుణ్యులన్
జేయంజాలిన తల్లి వీవెగద లోఁ జింతింప మందాకినీ!

ఆనందంబులకున్ నిధానము ప్రధానాంగంబు తీర్థాళికిన్
జ్ఞానోద్దీపితమున్ త్రిలోకపరిధానంబున్ తలంపన్ తిరో
ధానంబెల్ల మనోవికల్పములకున్ ధర్మప్రధానాంగణం
బౌ నీరూపము మాపుఁగావుత మదీయానంత చింతాచితిన్.

ఆదిన్ రాజ్యమదాంధులౌ నృపుల డాయం జేరియున్ క్రొత్తలౌ
ఖేదంబుల్ గనుగొంటి నాత్మహితముల్ క్షీణింపఁగాఁ జేసితిన్
నాదేదోషము మందబుద్ధినయి ని న్గాంచంగ లేనైతి నా
పైదాక్షిణ్యముఁ జూపి ప్రేముడి నన్నున్ పాలింపు మందాకినీ!

మరుదుత్తుంగ తరంగ సంచలిత శుంభత్పంక జాతప్రతా
నరజం బందున గూడి కుంకుమరుచిన్ వర్తించుచున్ దివ్యని
ర్జరకాంతాస్తన కుంభ యుగ్మములపై రాజిల్లు కస్తూరికా
గురులేపంబున పంకమౌ జలమె మాకున్ మాన్పు దుఃఖంబులన్. (సశేషము)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాగదీపగ





నాగరీ నాగరరూపఉ జాగర జామినికే మధి దోవు బిరాజే।
దీపక జోతి ఉజాస లియే కరతే నేకీ సంగ సఖిగన ఛాజే।
కామకలారస కేలి బఢావత భుమన అంగ అనుపమ భ్రాజే।
దీపగరాగ సిరే సబరాగ నియాబిధీ సోంసజి సోభా సమాజే॥
[జయపుర చిత్రము: దివాన్‌బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏమిటి?

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

ఈ జగంబు సర్వ మేమిటి యేమిటి?-యేమి యీజగం బిదెల్లఁ గూడ?
ఎవ్వరేని యిందు నెఱిఁగినవా రున్నఁ-జిత్తగించి నాకుఁ జెప్పరయ్య!.

ఇలనుండి యింతదవ్వుల నింతదవ్వుల నాకాశమం దేల యలరినావు?
కాఁకయు వెలుఁగు తూకముగాఁగ సరిపోవు పొల్కి నీ వం దేల పొలిచినావు?
ఆఱుమాసము లటు లాఱుమాసము లిటు లేల సమంబుగా నేఁగుచుందు
వీ గోళమును నింక నెన్నిగోళంబులఁ గాఁపాడ నీకేవి కట్టడి యిది?
సూర్యుఁడా నాకుఁ దెలియ దీ చోద్య మహహా-నీవు మాదేవదేవుని సేవకాగ్ర
హస్తమందలి కాఁగడావంచుఁ దలఁతు-నొప్పొ తప్పొ యిదెవ్వారు చెప్పవారు?-

ఆకాశంబున నూరకే చనెదవేలా? కొంచె మిందాఁగు నీ
వేకార్యంబు దలంచి పోయెదవు? నీ కేవార లీ సుందరం
బాకారంబు వెలుంగు నిచ్చి యిటు పొమ్మం చాన కావించిరో?
నాకుం దెల్పుము నేఁడు నీకథను జంద్రా, విందు నాద్యంతమున్.

ఓ నక్షత్రపథంబులార! మఱి ఓఓ మేఘజాలంబు లా
రా! నీలంబు తమంబులార! మఱి యోయాకాశమా! ఓగ్రహా
ద్యానంబా! యొకసారి యాఁగి మఱి మీ యర్థంబు తెల్పుండు! నా
కీనాఁటం దెలుపంగ మిమ్ములవినా యెవ్వార లున్నారహో!

ఓ జలరాశి, నే నిటుల నూఁగుచునుండెద; వోధరిత్రి, నీ
పైఁ జరణద్వయం బునుచువారముగాని నినున్ గ్రహింపఁగా
నోజను బొంద; మోపృథుశిలోచ్చయసంతతి, మీర లే శిలల్
గాఁ జనువారొ? మేమొ? యెఱుఁగన్ మఱి, చెప్పను మాట లుండియున్.

ఇది కారణ మది కారణ-మిది యదియును గాదు వేఱు హేతువు మావా
రెదొ వచియించిరి నాకున్-వదలదు మది శంక చెపుఁడు వాస్తవమయ్యా!

తనదు గర్భంబునందులఁ దనరుచుండి-యెదుగు పిల్లను దల్లి తా నెఱుఁగఁబోదు
తనను గర్భంబునందులఁ దాల్చుచున్న-తల్లి నిసుమంత యెఱుఁగదు దానిపిల్ల.

పాములు తేళ్లు జెఱ్ఱులును వ్యాఘ్రములున్ మఱి యేదుఁబందులున్
జీమలు దోమ లాదులగు చెన్నటి వేలొకొ యుండె? ఉండెఁబో
యేమది పీడ గూర్పవలెనేమి? యిదేమి విధంబు? తెల్పు నా
స్వామి? సమన్వయింత్ర ముదిపండితు లర్థము కాదు నాకొగిన్.

7. 4- 10 ౯౧౨

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెట్టెక్కి పడిన నెవఁడేఁ-గొట్టిన నొకసూది చీఁకుకొనిపోవ నదే
కుట్టినచో మామేనికి-నిట్టట్టన రాని బాధ యేలా స్వామీ?

ఆలంచున్ సృజియించి పేర్మిజిగు రొండంటించి యద్దానికిన్
జూలంచున్ మొలిపించి దానికిని బండుం గాయయుం గూర్చి యీ
మేళంబున్ మెలివెట్ట నేమిటికి సామీ? నీవె మేమైనచో
నేలా యీమెలి? యొక్కపెట్టున నె నీ వీరీతిఁ గారాదొకో!

నీ వున్నా వని నేను నమ్మెదను. ఆ నీవే సమస్తప్రపం
చావిర్భావ మటంచు నమ్మెదను దుఃఖాదుల్ సుఖాదుల్ స్వమా
యావిక్రాంతి యటంట! నమ్మెదను నేమైనన్ మహాదేవ! యీ
నీవున్ నేనని దుఃఖమున్ సుఖమునా నిర్మాణ మేలా ప్రభూ?

ఒక సౌఖ్యమె యొక నీవే-యొక యానందంబె యింక నొక జ్ఞానంబే
యొక టొకటిగనే జగతిని-నీకమీఁద సృజించు నేరు పించుక లేదే?

నీవే నేనని నేనె నీవనుచునున్ నీవే సమస్తంబునన్
భావంబందె యభూతపూర్వమగు నానందం బమందంబుగా
దైవారున్ మఱి యించుకేనియును దత్తత్త్వంబు భాసింపదో
దేవా! దేవరసన్నిధానమున నే తేలన్ వలెన్ సర్వమున్.

నీవే నేనయియుండుచో నిజముగా నీసందు నాసందునన్
ద్వైవిధ్యం బొనరించు వస్తువెదియో దైవారు; నద్దానినిన్.
నీవే చేసితి వట్టి వస్తువు నొగి న్నీవేల సృష్టించి త
య్యా? విద్వాంసుఁడ వీవె చెప్పఁగలవయ్యా! చెప్పు మో యీశ్వరా!

చిత్తమందు నీకుఁ జెడుతనం బుంట జ-గంబు చెడ్డగాను గానిపించు
నంచు నార్యులందు రస లందులో నేని-చెడ్డ నేల సృష్టి చేసితయ్యా?

ఏ నద్దాని సృజింపలేదు మఱి నీవే కూరి కూర్చుండి య
ద్దానిన్ సృష్టి యొనర్చుకొంటి వనుచున్ దండింపఁగాఁబోకు మ
య్యా! నాచేతనుగూడ దాని నిటు చేయం జేయఁగా నేల? య
య్యా! నాకుం దెలుపంగఁబోక చనెదయ్యా! యొట్టుసుమ్మేఁగినన్.

ఈ జగంబు సర్వ మేమిటి యేమిటి?-యేమి యీజగం బిదెల్లఁ గూడ?
ఎవ్వారేని యిందు నెఱిఁగినవా రున్నఁ-జిత్తగించి నాకుఁ జెప్పరయ్య!.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఔరంగజేబు

మొసలికంటి సంజీవరావుగారు

## 3. భ్రాతృసమరము

భయంకర భ్రాతృసమర మరయుటకు ముందు బీజపుర దండయాత్ర గురించి యొకింత గమనింపవలయును. తదనంతరమే, షాజహాను వ్యాధిగ్రస్తుఁడాయెను. వృద్ధజనకుఁడు దుర్బలుఁడై, రోగపీడితుఁడై, యుత్తరలోకాభిముఖుఁడాయెనని తెలియవచ్చినంతనే, షూజా, మురాద్, ఔరంగజేబులు సామ్రాజ్య సంపాదనార్థము ప్రచండ సన్నాహమ్ము లొనరించుకొని, దావాగ్నులవలె రాజధాని డాయఁబోయిరి. షూజా ప్రప్రథమము కిరీటధారణ మొనరించి, తన సార్వభౌమత్వము సగర్వముగఁ జాటించెను. ఆవెనుక, మురాదు అమితోత్సాహముతోఁ దన చక్రవర్తిత్వము బ్రకటించెను. కాని, కార్యశూరుఁడగు నౌరంగజేబట్లు తీవ్రపడక, పరిస్థితులు లెస్సగ బరిశీలింపుచు, షూజా మురాదులతోడఁ గొంత కాలము మంతన మొనరించి, మురాదుతోడి సంబంధము దృఢపఱచికొని, యదను దప్పక వైరుల నరుమాడి, భ్రాతృకంటకములను దొలఁగించి నిశ్చలముగ మూర్ధాభిషిక్తుఁడాయెను.

గోలకొండదాడి యనంతరము మీర్జుమ్లాకు మొగలాయీ సామ్రాజ్య ప్రధాన మంత్రిత్వము లభించెను. ఆలోపుననే, జుమ్లా యౌరంగజేబులు స్నేహబద్ధులైరి. మీరు జుమ్లా ౧౬౫౬ జూలై ౭ తారీకున డిల్లీనగరము జేరి, తన యపూర్వ వజ్రసమర్పణంబునఁ బాదుషాను బ్రసన్ను నొనరించుకొని, తనఖండ మంత్రిపదారూఢుఁడాయెను. తనమిత్రుని యునికి యౌరంగజేబున కెంతయు ననుకూలముగ నుండెను.

ఆసమయమున బీజపుర సుల్తాను వ్యాధిగ్రస్తుఁడాయెను. అతఁ డచిర కాలమునఁ జచ్చునని యెఱింగి, యౌరంగజేబు సమరసన్నాహము లొనరింపఁ దొడంగెను. అతఁడు తలంచినట్టులే, సుల్తాను మరణించెను (౮-౧౧-౧౬౫౬). తోడనే, యాతని కుమారుఁడగు రెండవ 'ఆదిల్షా' తనమంత్రి సాహాయ్యమున సింహాసన మారోహించెను. కాని యుద్ధప్రియుఁడగు నౌరంగజేబు ఆసుల్తాను గతరాజకుమారుఁడు కాఁడని వితండవాద మొనరించి, యాదేశముపై దాడివెడలుట కనుజ్ఞ యొసఁగవలయునని తత్క్షణము పాదుషాకువ్రాసి, తన సైన్యముల నాషోలిమేరకుఁ దరలించెను. అతఁ డంతటితో విరమింప లేదు. బీజపుర సైనికులు దేశద్రోహులై తనవంకఁ దిరుగు మాయోపాయముగూడ నాతఁ డొనరించెను. తద్రాజ్యవర్గమును లెఱింగి మీర్జుమ్లా సాహాయ్యమునఁ గార్యము సులభసాధ్యమగునని యెంచి, యౌరంగజేబా తని నాహ్వానించెను.

ఈ దాడి కేవల మధర్మము. బీజపుర మొక స్వతంత్రరాజ్యము. ఆదేశముపై మొగలుల కెట్టి యధికారమును లేదు. తొల్లి, షాజహా నాదేశస్వాతంత్ర్య మామోదించుటయే గాక, తాను జయించిన యహమ్మదునగర దేశమునందుఁ బాలుకూడ నాసుల్తానున కొసంగెను. అట్టి రాజ్య నారసత్వసందర్భమున యుద్ధమున కుఱుకుట యన్యాయము. సుల్తానుకుమారుఁడు సుల్తాను కుమారుఁడు కాఁడనుట కేవలము సాహసము. యథార్థకారణ మెద్దియన, బూర్వాపరసముద్ర వ్యాప్తంబగు బీజపుర రాజ్యము గోలుకొండకంటెఁ బ్రఖ్యాతమై, మొగలులకు నయన కంటకముగనుండెను. వారి యదృష్టవశముననంతలో సుల్తాను మరణించెను. తదధిపత్యము వహించిన యాకుమారుఁడు పదునెనిమిదేండ్ల బాలుఁడు: నూతనముగ జయించిన కర్ణాటదేశమునందలి జమీందారులు బీజపురాధికారము ధిక్కరించి తదధికారులనుఁ బాఱఁద్రోలిరి: రాజధాని యందలి ప్రభువులు మదోన్మత్తులై, పరస్పరకలహాని మగ్నులై, దేశక్షేమంకరుఁడగు ప్రధానమంత్రిని గణింపకుండిరి. దేశమట్లు క్షోభపడియుండునపుడే వారిని దండింపవలయునని యౌరంగజేబు నిశ్చయించెను: మీర్జుమ్లా యాశీర్వదించెను: షాజహాను సమ్మతించెను!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అధర్మదండయాత్రకనుజ్ఞ యొసఁగిన షాజహాను పదేశములు గమనింపఁదగియున్నవి.— బీజపుర దేశమంతయు జయింపవలయును; అంతయు సాధ్యముకాదేని, తొల్లి బీజపుర దేశము గ్రహించిన యహమ్మదునగరరాజ్యవిభాగ మాక్రమింపవలయును: కోటికిలోటులేని పరిహారముసైకొని, యా రాజ్యము వీడవలయును. ఆ సుల్తాను షాజహాను సార్వభౌమత్వ మంగీకరింపవలయును. తద్రాజ్యనాణెములు షాజహాను నామాంకితములు కావలయును. ఇందు మఱియు వైపరీత్య మెద్దియన, సుల్తాను సులువుగా సంధికొడఁబడునేని, మొగలుల భూరిప్రయత్నము లేమి కావలయును? కావున, నాయాఁపున గోలుకొండపైఁబడి, యా దేశ మాక్రమింపవలయునని షాజహాను హిత మొనరించెను! తత్సులభకార్య మెన్నఁడైనఁ జేయవచ్చునని యెంచి, క్రూరుఁడగు నౌరంగజేబు కష్టతర బీజపుర రాజ్యాక్రమణమునకే తలపడెను.

మొగలుల సన్నాహములు పూర్తియాయెను. ఔరంగజేబు దిగ్విజయ మొనరించునపు డాతని రాజధానియగు నౌరంగాబాదునందుఁ గాపుండుటకు మాళవరాష్ట్రపాలకుఁడగు షయిస్తఖా నరుదుంచెను మీరుజుమ్లా స్వీయసేనాసమేతుఁడై యేతెంచెను (౧౭-౧-౧౬౫౭). ఆతని కొఱకే తత్తరపడుచుండిన యౌరంగజేబా నాఁడే సుముహూర్తమున సరభసంబుగ బయలుదేఱెను.

రాజధానియగు బీజపురముపై దండెత్తి యా దేశమంతయు నాక్రమింపవలయునని యౌరంగజేబు నిశ్చయించెను. మార్గమధ్యమున నున్న 'బీదరు', 'కళ్యాణి' దుర్గములను ముందు సాధింపవలయును. ఆ దుర్గములు సాధారణములైనవికావు. కాని, యౌరంగజేబు తత్కార్యసాధనోచిత సన్నాహము లొనరించియే యుండెను. తమ దుర్గములను ముట్టడించు మొగలులను గదిసి, వారి వ్యూహములను ఛేదించి, తమ దుర్గముల నుద్ధరింపవలయునని బీజపుర దేశస్థులు ప్రయత్నించుచుండిరి. కాని, కార్యదక్షుఁడగు నౌరంగజేబు సిద్ధముగనుండిన విశేష సైన్యములను వారిపైఁబంపి, వారి ప్రయత్నములను భగ్న మొనరించెను. మొగలాయీ సైన్యము లాతెఱఁగున శత్రుసైన్యములను జెండాడుటయేగాక, ఆచుట్టునుండు గ్రామదులను దోపిడిచేసి, ప్రజానీకములను దెగనఱికి, గృహపంక్తులను గాల్చివైచి, సుక్షేత్రములను మరుభూము లొనరించెను. తాదృశబీభత్సకార్యకరణంబున, నౌరంగజేబు తలపెట్టిన ముట్టడి నిరాఘాటముగఁ గొనసాగెను. సమున్నతతలస్థాపితమై, విశాలపరిఖాత్రయ పరిరక్షితమై యున్నతప్రాకార పరివృతమై, దుర్గమమై, దుర్భేద్యమై యుండిన బీదరు దుర్గము నిరువదియేడు దినములలో నౌరంగజేబు సాధింపఁజాలెను (౧-౪-౧౬౫౭). చరిత్ర ప్రసిద్ధమై, బలిష్ఠమై, యుచితసేనా పరిరక్షితమై, బీదరు నగరమునకు ౪౧ మైళ్లదూరమున నున్న కళ్యాణీదుర్గము కూడ నట్టులే మూడుమాసములలో మొగలుల యధీన మాయెను (౧-౮-౧౬౫౭).

ఔరంగజేబు కళ్యాణీనగరము ముట్టడించునపుడే యాతని కుమారుఁడు విద్యుత్సన్నిభముగఁ బాఱి యట్టులే దేశమును భస్మీభూతమొనరించెను. పాదుషాతనయుఁడిట్టి ద్విగుణీకృతోత్సాహముతో బయల్వెడలి బీజపుర రాజధాని నాక్రమించి మహావిజయసౌఖ్యోన్మాదమనుభవింపవలసియుండెను. కాని, యౌరంగజేబున కంతటి భాగ్యము ప్రాప్తింపదాయెను. బీజపుర రాజ్య మింకను ముప్పది సంవత్సరములు రాజిల్ల వలయునని విధి నిర్దేశించెను. ఔరంగజేబు గాంచు విజయములు యువరాజును దారాకు దుస్సహము లాయెను. మీర్జుమ్లా యచట లేకుండుటచే నాతఁడు పాదుషాను సులువుగా మఱల్పఁజాలెను. బీజపుర రాయబారులుకూడఁ గృపణులై సంధి కొడఁబడవలయునని షాజహాను నర్థించిరి: తోడనే యాతఁడు సంధి యొనరించుకొని, యుద్ధము మాని, వెనుక మఱల వలయునని యౌరంగజేబు నాజ్ఞాపించెను. కళ్యాణీ దుర్గాక్రమణము పూర్తిగాక పూర్వమే, పాదుషా యాజ్ఞపిడుగువలె నౌరంగజేబునకుఁ దెలియవచ్చెను. ఆతఁడు హతాశుఁడాయెను.

నాఁడు గోలుకొండ దాడియు, నేఁడు బీజపుర దండయాత్రయు నొక్కవిధముననే పరిణమించెను. సిద్ధాన్నము గోల్పోయిన హర్యక్షమువలె నౌరంగజేబు దురంతక్రోధఘూర్ణితమనస్కుఁడాయెను. పాదుషా యాజ్ఞానుసారము షయిస్తఖాను ఔరంగాబాదు వీడి తనరాష్ట్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగు మాళవదేశమునకుఁ బ్రయాణమాయెను. ఇతర సామ్రాజ్య సైనికోద్యోగులుగూడ, నౌరంగజేబు నలదన్నను లెక్కసేయక, తమ రాజధానికిఁ బోఁ దొడఁగిరి. మీర్జుమ్లా యొక్కఁడు మాత్రముండఁజాలెను. బీజపుర దేశస్థుల గడుసరులు. మొగలాయీ సేనాబలము పలుచనగుటఁజూచి, బిగిసి, మొగలులకు సమర్పించుటకు కొడఁబడిన దేశమును దుర్గములను నెగవేయఁదలంచి, వారు కాలహరణ మొనరింపఁ జొచ్చిరి. బీజపురరాజ్య కబళనోత్సాహియగు నౌరంగజేబట్టి దైన్యమునకుఁ బాల్పడియుండిన సమయముననే, పాదుషా వ్యాధిగ్రస్తుఁడై మృతప్రాయుఁ డాయెనని భయంకరముగఁ దెలియవచ్చెను.

షాజహా నాకస్మికముగ వ్యాధిపీడితుఁడాయెను (౬-౯-౧౬౫౭) ప్రతిభాశాలులగు భిషగ్వరుల ప్రావీణ్యము వ్యర్థమాయెను. ఒక వారము దినము లావృద్ధరాజు కడుబాధపడెను. అనుదినము దర్శనమొసఁగు పాదుషా యగోచరుఁడగుటచేత, నా మహనీయుఁడు కాలధర్మమొందెననియే భావించి పురజనులు తల్లడిల్లిరి. పౌరులేకాక, పాదుషా ప్రాసాదాంతర జనంబులుఁ గూడ నను మానగ్రస్తులైరి. అత్యున్నతోద్యోగులు మాత్రము షాజహానును జూడఁజాలి యథార్థ మెఱింగియుండిరి. ప్రజా సంక్షోభ మడంపఁదలఁచి, యతిప్రయాసమునకోర్చి, పాదుషా యొకనాఁడు (తే ౧౮ ది.) తనమోము గనఁబఱచెను. సార్వభౌమవదన చంద్ర సందర్శనమునఁ బ్రజాసముద్ర మానందపరవశమాయెను. మృత్యుభయము తొలంగినను, షాజహాను మఱియొక మాసమువఱకుఁ బునర్దర్శనమీయఁజాలకపోయెను. ఆరోజుననే, పాదుషా మరణించెనను దుర్వార్త రాజధానిదాటి, సామ్రాజ్యమంతటను వ్యాపించెను. నిరంకుశ రాజశాసనబద్ధమై యుండిన మహాసామ్రాజ్యమొక్కత్రుటిలో నరాజకభూయిష్ఠమాయెను. బంగాళా రాష్ట్రము బాలించు షూజా—పాదుషా రెండవ కుమారుఁడు—పితృమరణము ధ్రువమనియెంచి, రాజత్వము వహించి, దారాను భంజించుటకు వడివడి సంసిద్ధుఁ డాయెను. గుజరాతు రాష్ట్రపాలకుఁ డగు మురాదు—పాదుషా నాల్గవ కుమారుఁడుగూడ సామ్రాజ్య సంపాదనమున కాయిత్తుఁ డాయెను. కాని, షూజావలె నాతఁడు తీవ్రపడక, యౌరంగజేబు సాహాయ్య మపేక్షించెను. మురాదౌరంగజేబుల స్నేహము దృఢతమమై, యౌరంగజేబునకు సార్థకముగను, తదాశ్రయునకుఁ బ్రాణసంకటముగను బరిణమించెను.

సుస్థిర సంకల్పధురీణుఁడగు నౌరంగజేబుభయంకర భ్రాతృసమరానల పరీక్షయందుఁ గృతార్థుఁడు కాఁజాలిన యద్భుత చరిత్రక్రమమరయుటకు ముందు, దారా యౌరంగజేబుల పరస్పర వైషమ్యము గ్రహింపవలయును.

దారా యౌరంగజేబుల చిత్తములు చిన్ననాఁటి నుండియుఁ బరస్పర విరుద్ధముగనే యుండెను. సుగుణరాశియగు జహనారా తొల్లి యగ్నిజ్వాలాదాహమునఁ గడు నొగులునపు డౌరంగజేబు తత్తరమున నటుఁబాఱి యుండెఁగదా! తదనంతరము, దారా తననూతనభవనము జూపవలయునని తన జనకుని, సోదరులను నాహ్వానించెను. దారా త్రోవసూప, వారు లోనికిఁ బోయిరి. ఔరంగజేబు మాత్రము వారిని వెంబడింపక, ఏసమాధానమీయక, ద్వారముననే నిలిచిపోయెను. అట్టి యసంబద్ధవర్తనము షాజహానునకుఁగూడ దుస్సహమాయెను. ఔరంగజేబు జహనారాకు నారహస్యకారణము దెలియఁబఱచెను. స్వీయభవనము జూపునెపమున, దారా పితృభ్రాతృసంహార మొనరించి తత్క్షణము చక్రవర్తికాఁ గోరెనని యనుమానించియే యౌరంగజేబు ద్వారపాలన మొనరించెను. ఇదియొక గాథయైనను, దారా యౌరంగజేబులకు సఖ్యము లేదనియు, సఖ్యము లేకుండుటయేకాక, యౌరంగజేబు క్రూరానుమానబాధితుఁడై తన జ్యేష్ఠసోదరు నేవగించెననియు వ్యక్తపఱుపఁ జాలియున్నది. దారా యౌరంగజేబు లొక్కయెడనుండుట యసమంజసమనియే పాదుషా యౌరంగజేబును గుజరాతు దేశపాలనమునకు నియోగించెను. ఆ సోదరు లెడముగనున్నను, ద్వేషబీజము స్థిరావాసమేర్పఱచుకొని మొలకెత్తి యథేచ్ఛగఁ బెరుగఁజొచ్చెను. సార్వభౌమపుత్రులలోనెల్ల నౌరంగజేబే కార్యదక్షుఁడై, మొగలాయీ వంశక్రమానుగతమగు నన్యరాజ్యగ్రహణధర్మము జయప్రదముగ నిర్వర్తింపఁ జాలియుండెను. కాని, యాతఁడు గోలకొండరాజ్యము పూర్తిగ వశపఱచుకొనఁ గలిగియుండినపు డాదేశపురాయ

బారులు దారాను బ్రసన్ను నొనరించికొనియే తమ వేళే
మును దక్కించుకొనిరి. బీజపుర దండయాత్రావసర
మునఁగూడ నట్టి విఘాతమే యౌరంగజేబునకు సంభవ
మాయెను. తండ్రియండనుండి, తండ్రి యభిమానము
జూరఁగొని, తండ్రిపంపున నేఁక సామ్రాజ్యసింహాసనా
సీనుఁడుగానున్న దారా యౌరంగజేబు ప్రతిపక్షులకు
శరణ్యుఁ డాయెను. దక్కను దేశాక్రమణ మవివేకము,
నసమంజసము, విశాలరాజనీతికి విరుద్ధము, బహుదోష
భూయిష్ఠమునని చరిత్రజ్ఞులు గ్రహింతురు. ఆ యవివేక
దుష్టప్రయత్న మఖండమొగలాయీ సామ్రాజ్యమును
భూడ్చివేయఁజాలిన మహాకూపముగఁ బరిణమించుటయే
గాక, పాశ్చాత్య ప్రభుత్వవిజృంభణకుఁగూడ ననుకూల
పడెనని చరిత్రకోవిదు లరయఁగలరు. కావున, దారా తన
సోదరుని దుష్టప్రయత్నము బ్రతిఘటింపఁ బూనుట
శ్లాఘనీయమే. ఐనను, యుద్ధప్రియుఁడగు నౌరంగజేబు
దారాకతంబున భగ్నపడి, క్రోధఘూర్ణితుఁ డగుట
సహజము.

దారా పాదుషాజ్యేష్ఠపుత్రుఁడు. తనయనంతర
మాతఁడే పాదుషా కావలయునని షాజహాను వాంఛిం
చెను. తనయభిమత మనేకవిధముల నాతఁడు వ్యక్తపఱి
చెను. కడు సులభముగు నల్హాబాదు, పంజాబు మొదలగు
రాష్ట్రపాలనమున కాతఁడు నియోగింపఁబడెను. ఆపాటి
దైనను గష్టపడనవసరము లేకుండ, తద్రాష్ట్రపాలనము
దన ప్రతినిధులకు వీడి, యాతఁడు రాజధానియందే
యుండఁజాలెను. దారా యనేక బిరుదములను నపూ
ర్వాధికారమును వడయుచుండెను. తొలుత ౪౦ వేల
సేనకును, పిమ్మట ౨౦ వేల సేనకును, తుదకు ౬౧
వేల సేనకును అధ్యక్షపదము క్రమముగా నాతని కలవ
డెను. ఆతని సంవత్సరవేతనము రెండుకోట్ల రూపాయలా
యెను. దారాకుమారు లౌరంగజేబు మొదలగు పాదుషా
పుత్రులతోడి సమానాధికారములు గాంచుచుండిరి.
పాదుషాపౌత్రులపాటి గౌరవ స్వాతంత్ర్యములు తనకు
లేకపోయెనే యని యొకసారి యౌరంగజేబువిలపించెను.
పాదుషా యాగ్రహమునకుఁ బాత్రులగు సామంతాది
యుసహాయనృపాలురు దారాను ఆశ్రయించుచుండిరి.
పాదుషాను సందర్శింప నరుదెంచు నధికారులు రాయబా
రులు మొదలగు ప్రముఖులు దారానుగూడ దర్శింపవలసి
యుండెను.

షాజహాను హృదయము స్పష్టమాయెను. తండ్రి
యనంతరము తాను సుఖముగాఁ దత్సింహాసన మలంకరిం
పవచ్చునని దారా విశ్వసించెను. ఔరంగజేబు సమర్థుఁ
డని యాతఁ డెఱుంగకపోలేదు. ఆతఁడు తన యున్నతిని
సహింపఁడని యెఱుంగకపోలేదు. తనచే ననేకసారులు
పరాభూతుఁడైన తమ్ముఁడు, పాదతాడిత భుజంగము
వలె నపాయమొనరింపఁజూచునని యెఱుంగకపోలేదు.
ఐనను, పాదుషా సమక్షమునఁ దనయెడ భయభక్తి విన
మ్రములై మెలఁగు సామ్రాజ్యోన్నతోద్యోగు లందఱుఁ దన
యధీనముననుండ, దలయెత్తి సాహసించు నౌరంగజేబు
నడంచుట సులభమని యువరాజు భావించెను. అత్యు
న్నతపదారూఢుఁడై, మహాసామ్రాజ్యమంతయుఁ దనదే
యని భ్రమించు మానవుఁ డన్యథాయెట్లు తలంపఁగలఁడు?
భావిఫలాదర్శమాతఁడు జూచునేని, సార్వభౌమసన్నిభ
మూర్తి యుద్ధమున నోటుపడి, నిలిచిన తావున నిలువ
నేరక, అన్నపానము లెఱుంగక పలుదేశములు బాఱి,
తుదకు హంతకుని చందమునఁ బట్టువడి, తాను సర్వజన
వంద్యుఁడై వెలింగిన రాజధానియందే హీనాతిహీనంబుగ
నూరేగి, భయంకర దుర్మరణమునకుఁ బాల్పడుట గాంచి
యుండును. కాని, మానవున కట్టి దివ్యదృష్టియా?

జ్వరపీడితుఁడైన జనకునకు దారా సాభిమాన
ముగ సర్వోపచారములు చేయించెను. షాజహాను కొం
చెము సుఖముగాంచి నంతనే, తన ప్రియపుత్రున కనేక
బహుమానము లొసఁగి, ప్రధానాస్థాన సభ్యులను, బ్రధాన
రాజోద్యోగులను రావించి, దారా తనయనంతర చక్ర
వర్తియనియుఁ, దానిపుడు జరాజ్వరపీడితుఁ డగుటచేత
నాతఁడే రాజకార్యములెల్లఁ జెల్లించుననియు, వారంద
ఱాతనిఁ దన్నువలెనే జూచి వినయవిధేయులై యుండ
వలయుననియుఁ బలికి, నాఁటినుండియు నాతఁడు దైవ
చింతన మొనరింపఁగోరెను. దారా యానాఁడే సర్వాధి
కారధురంధరుఁ డాయెనేని, లేదా, షాజహానే పరిపాలన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భారము వహించియుండెనేని బాగుండెడిది. అట్లుగాక, రాజ్యము ఘోరాపాయ మేఘావృతమైన యాసంకట సమయమున నిరువురును గలసి శాసింపఁ బూనుటచేతఁ నేతద్బహునాయకఫలిత మిథ్యపురకసును దారుణముగ ననుభవ వేద్యమాయెను.

దారా మూఢుఁడుగాఁడు. తన యధికారము నిర్వహించుకొనుట కనువగు మార్గము లాతఁడన్వేషించెను. తన మిత్రుల కధికతరాధికారము లొసంగెను. అట్టులే నూతన మిత్రులనుగూడ నాతఁడు సంపాదించెను. ఔరంగజేబు మిత్రుఁడగు మీర్జుమ్లాను మంత్రి పదవినుండి తొలఁగించెను. మాలవదేశ పాలకుఁడగు షయిస్తఖానుగూడ నౌరంగజేబు పక్షపాతియగుటచేత నాతనిని రాజధానికి రావించెను. కాని, యాఖాను రాజధాని యందుండియే యౌరంగజేబునకు హిత మొనరింపఁగలిగెను. అట్టి యౌరంగజేబు పక్షపాతులలో రోషనారా ముఖ్యురాలు. ఔరంగజేబును బోలిన యాపాదుషానందన తంత్రములు బన్నుచుఁ దనప్రియ సోదరున కమూల్యసాహాయ్య మొనరించెను. దారా ప్రయత్నము లావిధమున భగ్నములగుచుండెను.

షాజహాను నవంబరు మాసమధ్యమున రోగవిముక్తుఁడాయెను. షూజా యాలోపుననే యుద్ధసన్నద్ధుఁడై బయలుదేరెనని యాతఁ డపు డాలించెను. షాజహాను సమ్మతింప, షూజాను బ్రతిఘటించుటకు దారా యొక మహాసైన్యము నంపెను (౩౧-౧౧-౧౬౬౭). సమర్థుఁడగు జయసింహ మహారాజు తత్సేనాధిపత్యము వహించెను. దారా జ్యేష్ఠకుమారుఁడగు 'సులేమానుషూకో' యును, విశ్వాస పాత్రులగు సమర్థసేనాను లనేకులును నందుండిరి. షూజానునొంచి, వారతిరయమున మగిడిరాఁ గలరని దారా భావించెను. కాని, అది యొక గొప్ప తప్పిదము. దాన నాతని మూలబలము కృశించెను. సుడిగాలివలె మహాజవంబున నరుదెంచు నౌరంగజేబును మార్కొనినపు డాలోపము దారుణముగఁ దెల్లమాయెను.

ఔరంగజేబును వారించుటకు యశవంత సింహుఁడు బయలుదేరెను. యశవంతుఁడు యోధాగ్రేసరుఁడనియు, మహాపరాక్రమశాలి యనియుఁ బేరుగాంచెను. కాని, యాతఁడు జయసింహుని వంటి తంత్రజ్ఞుఁడు కాఁడు. మురాదు ఔరంగజేబు జన్మాతః యసాధ్యులై యుండిరి. పాదుషాపుత్రులను దాఁకుటకుఁ బాదుషా పుత్రుఁడే నాయకత్వము వహింపవలయును. అన్యులు తన్మహత్కార్య సాధనోచిత గౌరవరాహిత్యమున దుర్బలులగుదురు. ఔరంగజే బసాధారణుఁడు. అతఁడు సార్వభౌమ పుత్రుఁడును, మహాశూరుఁడును నగుటయే గాక, యఖండధీమంతుఁడుగూడ నైయుండెను. ఔరంగజేబునకు మురాదుగూడఁ దోడగుటచేత నాతని యాధిక్యము ద్విగుణీకృతమాయెను. యశవంతుఁడన్నో! సామ్రాజ్య సైన్యమున కాతఁడే నాయకుఁడైనను, తద్విభాగము లన్నింటిని శాసింపఁజాలక పోయెను. అందలి మహమ్మదీయ సేనావిభాగాధ్యక్షుఁడగు కాశిముఖాను తన యధికారము దలంచి, మత్సరపరుఁడై, రాజభక్తి మఱచిపోయెను. పుత్రవత్సలుఁడగు షాజహాను మురాదు ఔరంగజేబులు తనయాజ్ఞ మన్నింతురని భ్రమించి, యుద్ధ మనివార్యమగు వఱకు వేచియుండవలయునని యశవంతు నాజ్ఞాపించెను. ఔరంగజేబు సైన్యమట్టు గాక, యేకాజ్ఞాబద్ధమై, యేకాశయబద్ధమై, యజేయముగ నుండెను. అందలి రాజపుత్రమహారాష్ట్రసైనికులు గూడ స్వామిభక్తిపరాయణులు. అట్టి మహాసైన్యమును శాసించు మహాసేనాని విజయము గాంచుట సహజము.

రెండు సైన్యములును మాలవదేశమునందలి 'ధర్మతు' అను గ్రామముచెంత విడిసెను. భ్రాతృమహాసంగ్రామమునం ధర్మతు యుద్ధము మొదటిది. తదభివర్ణన మొనరించుటకుముందు, యశవంతుని స్వభావమును వ్యక్తపఱచు విషయ మొకటి గమనింపవలయును. మీర్జుమ్లా సిద్ధపఱచిన శతఘ్నీదళము ప్రశస్తమైనది. ఆఫిరంగుల నౌరంగజేబు తనసేనాముఖమున నిలిపియుంచెను. యశవంతున కట్టి మారణయంత్రములు లేవు. ఆకారణమున నాతని యుద్యోగి యొకఁడు చక్కని యుపాయ మాలోచించెను. నిశీథసమయమున నాఫిరంగి భటులపై నాకస్మికముగాఁ బడి, వారిని సంహరించి, ఆయంత్రముల నాక్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మింతునని యాతఁడు పలికెను. కాని, పరాక్రమశాలి యగు రసపుత్రయోధున కట్టి యధర్మాచరణము తగదని యశోవంతుఁడు తృణీకరించెను.

మఱునాఁ డుదయించుసరికి సైన్యములు రెండును యుద్ధసన్నద్ధము లాయెను. యశోవంతుని సైన్యము సుమారు నలుబదివేలుండెను. అందుఁ బదివేలసంఖ్యగల ప్రధానసేన రెండుబారులు తీరియుండెను. అందొకటి కాశిముఖాను క్రిందనుండెను. రెండవది యశోవంతుని క్రిందనుండెను. అందలి వామపార్శ్వమును ఇఫ్తిఖారు నామధేయుఁడగు మహమ్మదీయుఁడును, దక్షిణ భాగమును రాయసింహుఁడును బాలించుచుండిరి. మృత్యుభయ మెఱుంగక రిపుసంహార మొనరించు రెండువేల రసపుత్ర రహతూరులతోడ యశోవంతసింహుఁడు మధ్యభాగమున నుండెను. ఇతర సేనావిభాగములుగూడ నుచితస్థలములం దుండెను. కాని, ఈమహాసైన్యము నిలిచిన ప్రదేశమిరుకుగ నికృష్టముగ నుండుటచేత, యుద్ధమునందు సైన్యవిభాగములు సమయానుకూలముగఁ దిరుగుట కవకాశము లేకపోయెను. ఆపజయమున కదియొక కారణము.

ఔరంగజేబు సైన్యముగూడ సుమారు నలుబదివేలుండెను. అందు, మురాదుసేన పదివేలు. ఔరంగజేబు కుమారుఁడగు మహమ్మదు సుల్తాను,నజబతుఖానును గలసి యెనిమిది వేలదండుతోడ ముందుండిరి. కవచపరిరక్షితులగు నాసైనికు లపారయుద్ధానుభవము గలిగి యుండిరి. జుల్ఫికారుఖాను అనుసేనాని వారికి రక్షగా ఫిరంగులతోడముంగలనుండెను. మూర్షి దుకూలీఖానుఁడు ప్రధానశతఘ్నీ దళమును శాసింపుచుండెను. ఎడమభాగమున ముల్తఫతుఖానును, కుడిభాగమున మురాదును నుండిరి. మధ్యసేనావిభాగము ప్రత్యేకముగ నౌరంగజేబు పాలనమున నుండెను. వివిధ సేనాంగములను రక్షించుటకును, బోషించుటకును గూడ నౌరంగజేబు సముచిత సన్నాహము లొనరించుకొని యుండెను.

యుద్ధ ముదయముననే (౧౫-౪-౧౬౫౮) ప్రారంభమాయెను, సమర మారంభము నుండియు భీషణముగ నుండెను. శత్రుసైనికులు తుపాకులు గాల్చుచు, బాణవృష్టిగురియించుచు సమీపించినంతనే, యశోవంతుని రసపుత్రభటులు జలధరములవలె 'రామ్! రామ్!' యని యఱచుచుఁ దమతావులు వీడి, ఝరీప్రవాహమువలెఁ బాఱి, తెగఁబడిన వ్యాఘ్రములవలె శతఘ్నీదళమును దాఁకిరి. ఆఫిరంగులు కొంత సంహార మొనరించినను, ఉన్మాదులవలె వచ్చిపడుశత్రువులముందు జిత్తవోయెను. తత్ప్రధాన సేనానియగు మూర్షి దుకూలీఖాను వైరిప్రశంసనీయముగ నిరోధింపఁగడఁగి, నిహతుఁడాయెను. ఆదళము విచ్చిపాఱెను. జయోత్సాహులగు రసపుత్రులంత నౌరంగజేబు సైన్యమునుదాఁకిరి. సేనాముఖమునఁ గావలి యున్న జుల్ఫికారుఖాను భీరుఁడై పరుగిడక, తనరేనువు డిగ్గి, సైనికులను హెచ్చరించి, శ్లాఘనీయముగఁ బోరాడెను. పాప మాశూరుఁడు క్షతగాత్రుఁడై మరణించెను. రసపుత్రులు విజయపరవశులై యౌరంగజేబు సేనానికాయమును జీల్చి చెండాడఁ గడంగిరి. ఆ హైందవసైనికులొక్కని నాయకత్వమునఁ బోరాడిరేని, పిఱుఁదనున్న సేనావిభాగములు వారినిఁ బోషించెనేని, కాశిముఖాను స్వామిభక్తిరాయణుఁడై యుదారమనస్కుఁడైనొప్పదేనేని, యశోవంతుఁడు యశోవంతుఁడై యుండెడివాఁడు. దారా యదృష్టము బాగుగనే యుండెడిది.

అనుభవజ్ఞులగు నౌరంగజేబు సైనికులు నిశ్చలముగ నిలిచిపోరాడిరి. విఱిగిన సైన్యముగూడ నంతలో మరల నేర్పడి రసపుత్రులను జుట్టివైచిరి. వారు ప్రదర్శించిన శౌర్యమత్యద్భుతము. ఐనను, అన్యసాహాయ్యము లేని కారణమున నాసేనయంతయు ననలాంతర శలభగణంబు వలె మ్రగ్గెను.

రసపుత్రఝంఝానిలమునఁ గలంగిన యాసైన్యము నౌరంగజేబు చక్కఁగ నుద్ధరించెను. పాటిననఫిరంగి భటులు రయమ్మున నరుదెంచి, యశోవంతుని సేనావిభాగమును దహింపఁ దొడఁగిరి. అందుఁ గుడిభాగమును శాసించు రాయసింహుఁడు పందపగిది ససైన్యముగఁ బలాయన మొనరించెను. ఔరంగజేబు సోదరుఁడగు మురాదు యశోవంతుని శిబిరము నాక్రమించి,శాత్రవవామభాగమునఁ బిడుగువలెఁ దాఁకెను. ఆవిభాగమును బాలించు నిఫ్తి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖారుఖాను ఘనంబుగఁ బోరి త్రెళ్లెను. ఈఖాను మరణించుటచేతను, రాయసింహుఁడు పాఱిపోవుటచేతను, యశవంతుని ప్రత్యేకసైన్యము రక్షారహితమై శత్రు మారణమునకుఁ బూర్తిగ గుఱియాయెను. యశవంత సింహుఁడు మార్తాండునివలె దుర్నిరీక్షుముగ నాలుగుగంటలు పోరాడెను. ఆతని రహుతూరులుగూడ నద్భుతస్థైర్య విక్రమములు చూపిరి. కాని, యాసేన యత్యల్పము. అయ్యది క్షణక్షణము బలుపనగుచుండెను. అట్టి యసమాన యుద్ధమున యశవంతుఁడు జయించుట యసంభవము. ఐనను, ఆ మహాపరాక్రమశాలి వెనుజూపుట సహింపక, శత్రుసైన్యమునందుఁ జొరఁబడి, కొనయూపిరి నిలుచునంతవఱకు శత్రుసంహారమొనరించి, వీరస్వర్గ మలంకరింపవలయునని వాంఛించెను. కాని, తన యనుచరుల ప్రోత్సాహముచేత నాతఁడు రణరంగమువీడి, తన దేశమునకుఁ బోయెను. ధర్మతుయుద్ధము ముగిసెను.

భ్రాతృసమరమునందలి ప్రథమాంకముసమాప్తమాయెను. ఔరంగజేబు ప్రతిష్ఠాగరిష్ఠుఁడై, ప్రసిద్ధతరమగు 'సముగిర' యుద్ధమునకు శీఘ్రముగ సిద్ధపడెను.




శారదాబిల్లు వివాహములు – వాటిఫలితములు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పురాణచరిత్రము

**కవికొండల వెంకట సత్యనారాయణమూర్తిగారు**

(వెనుకటి సంచిక తరువాయి)

భూతములు ప్రప్రథమమున మిక్కిలి అనాగరికులను మోటుజాతివారు. వీరు సురలకంటెను, అసురులకంటెనుగూడ పూర్వులు. వీరికి సూక్ష్మనేత్రములు, లంబకర్ణములు, వ్రేలాడుచుండు పెద్ద పెదవులు, వాఁడియగు కోఱలు, పెద్దగోళ్లు, స్థూలదేహములు, తామ్రకేశములు, నల్లనిశరీరచ్ఛాయ కలవని పురాణములలో వీరికిఁగల నామములవలనఁ దెలియుచున్నది. వీరు మొదట దిగంబరులుగను, పిమ్మట చర్మధారులుగను, అటుపిమ్మట నారపట్టలను, చిత్రవర్ణముగల ఆకులను ధరించువారుగను నుండిరి. వీరు తొలుత మాంసభక్షకులై యుండి క్రమక్రమముగా అన్నము తినుట, సురాపానము చేయుట, నేయి త్రాగుట మొదలగువానిని నేర్చుకొనిరి. వీరు పుఱ్ఱెలను పానపాత్రలుగను, ఎముకలను పనిముట్లుగను, గవ్వలను అలంకారములుగను, పాములను హారములుగను వాడుకొనుచుండిరి. వీరికాలమున వివాహబంధమనునది లేకపోవుటచే విచ్చలవిడి సంచరించుచుండిరి.

కొంతకాలమునకు హిమాలయపర్వతముల తూర్పుకనుమలమీఁదుగ నుత్తరదేశములనుండి అసురులు (ఆర్యులలో నొకశాఖవారు) వచ్చి వీరికి ఒత్తిడి కలిగించుటచే అసురుల నెదిరించుటకై వీరు కొన్ని యాయుధములను, సైన్యములను, సేనానాయకులను నేర్పాటు చేసికొనిరి. శూలములను, కత్తులను, విండ్లను వీరు ఆయుధములుగాఁ జేసికొనిరి. సైన్యములను చిన్న చిన్న భాగములుగా విభాగించి ఆయా భాగములకు 'గణము'లని పేరిడిరి. ఒక్కొక్క గణమున కధిపతి యైనవాఁడు 'గణాధిపతి'యని పిలువఁబడుచుండెడివాఁడు. మొత్తముపై భూతగణము లన్నిటికిని అధిపతి 'భూతగణాధిపతి' యని పిలువఁబడుచుండెను. ఈ భూతగణాధిపతికిఁ రుద్రుఁడని యొక బిరుదు నామము కలదు. పురుషుఁడే కాక స్త్రీ కూడ కొన్ని గణములకు 'నాయిక'గా నుండు వాడుక కలదు. ఆ నాయికకు రుద్రాణియని బిరుదనామము కలదు. రుద్రాణి యనఁగా రుద్రునకు భార్యయని యర్థముకాదు. 'నాయిక' శబ్దమునకు నాయకత్వము వహించు స్త్రీయని యర్థముగాని నాయకుని భార్యయని యర్థము కాదు. అట్లే రుద్రాణి యనఁగా రుద్రాణి పదవియందుండు నొకయాఁడుది యని యర్థము.

వీరి గణములకు 'సింహముఖ గణము', 'ప్రమథ గణము' మున్నగు నామములు కూడ కలవు. గణాధిపతుల నామములు కూడ కొన్ని పురాణములలోఁ గాననగుచున్నవి. వీరభద్రుఁడు సింహముఖ గణమున కధిపతి. నందికేశ్వరుఁడు ప్రమథ గణమున కధిపతి. ఇట్లే వినాయకుఁడు, స్కందుఁడు, పుష్పదంతుఁడు, మాల్యవంతుడు, భైరవుఁడు మొదలగు మఱికొన్ని గణాధిపతుల నామములును కలవు.

అన్ని గణములకును ప్రత్యేక ప్రత్యేకధ్వజములు కూడ కలవు. అందు వినాయకుని ధ్వజచిహ్నము ఎలుక. రుద్రునకుఁగల చిహ్నము 'వృషభము.' మూషకవాహనుఁడు మొదలగు సమాసపదములందుఁ గల వాహనశబ్దమునకు 1 వహింపఁబడునది యని యర్థము గాని వహించునది యని యర్థము కాదు. మూషకవాహనుఁ డనఁగా మూషకధ్వజుఁడని యర్థము. ఇట్లే కాకివాహనుడు, గరుడవాహనుఁడు, మేఘవాహనుఁడు మున్నగువాని కర్థములు చెప్పుకొనవలెను.

అసురుల నెదిరించుటకీవిధముగా భూతములు తమ నాగరికత నభివృద్ధి గావించుకొనిరి. ఈక్రింద కొన్ని భూతాసుర యుద్ధములను వ్రాయుచున్నాము.

## భూతాసురయుద్ధములు

అసురులు మేరువు, మందరము మున్నగు పర్వత ప్రాంతముల నుండి కింపురుషవర్షము లేక టిబెట్ దేశము మార్గమున బ్రహ్మపుత్రానద పాయుమార్గమునను, మఱి

1 See "Ancient Indian Tribes, Part 1: Bhutas" by S. P. L. Narasimhaswamy.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్ని హిమాలయ పర్వతపు తూర్పుకనుమల మార్గమునను భారతవర్షమునఁ బ్రవేశింప నారంభించిరి. భూతజాతియు నా ప్రాంతముననె మొదట నివసించుచుండెను. అసురులను మొదట నెదిరించుటకు తగినంతశక్తి భూతములకు లేకపోవుటచే వారి నెదిరింప లేకపోయిరి. అందుచే వారు నిరభ్యంతరముగా నుత్తరహిందూస్థానమున, అనఁగా నిప్పటి అస్సాము (లేక కామరూప) దేశమునఁ బ్రవేశించి రాజ్యము నేర్పఱచుకొని బలపఱచుకొనిరి. అసురులు హిందూస్థానమునకు వచ్చిన మఱికొంతకాలమునకు సురలు హిమాలయ పర్వతముల పశ్చిమశాఖపైనుండి తిన్నగ కొండలు దాఁటి సింధునదీతీరమునఁ బ్రవేశించిరి. సురలు హిందూస్థానమునఁ బ్రవేశించుట అసురుల కిష్టము లేదు. అందుచే సురాసురులు సహజశత్రువులు కావలసివచ్చెను. ఈ సమయముననే అసురులకు పూర్వవైరులుగా నుండిన భూతములతో సురలు స్నేహము చేసికొని అసురులపై పురికొల్పిరి. అందుచే నొకవైపున భూతాసురయుద్ధములును, వేఱొకవైపున దేవాసుర యుద్ధములును ప్రారంభమయ్యెను. ఈ యుద్ధములన్నియు హిందూస్థానముననె కాలేదు. సాధారణముగ హిమాలయమున కుత్తర భాగముననె జరుగుచుండెను. ముందుగ భూతాసుర యుద్ధములన్నియు వర్ణించి పిమ్మట దేవాసురయుద్ధములను వ్రాసెదను.

## ౧

## అంధకాసుర యుద్ధము

దేవాసురులకు జరిగిన తారకమాయ యుద్ధములో భూతగణ నాయకుఁడగు స్కందుఁడు దేవతలకు సహాయమొనరించి తారకాసురుని సంహరించెను. ఆ కారణముచే హిరణ్యాక్షుని కుమారుఁడగు అంధకుఁడు భూతములపైఁ బగ సాధింప నెంచి తన సోదరుఁడగు శంబరాసురుని రుద్రుని యొద్దకు రాయబారిగాఁ బంపెను.

శంబరుఁడు మందరగిరి కేఁగి యచ్చటనున్న రుద్రునిఁ జూచి, 'అయ్యా! నే నసుర నాయకుఁడగు నంధకాసురుని దూతను. మారాజు దేవతలను జయించి త్రిలోకాధీశ్వరుఁ డయ్యెను. నీవు మారాజు సెలవు లేనిదె మందరగిరి 1 నాక్రమింపరాదు. కావున నీవు తత్‌క్షణము మందరగిరిని విడిచి పొమ్ము. పోవేని నీ ప్రాణములు నీవి కావు. మా రాజుతో స్నేహము చేసికొని బ్రతుక నెంచితివేని మీ రుద్రాణిని మారాజునకు రాణిగాఁ బంపుము' అని చెప్పెను. అందులకు రుద్రుఁడు 'ఓయీ! శంబరా! నీ రాయబారమును వింటిని. ఇంద్రునకును నాకును జరిగిన యొడంబడికననుసరించి నే నీ మందరపర్వతము నాక్రమించుకొంటిని. అందుచే నే నీ మందరపర్వత మెంతమాత్రమును విడువఁజాలను. ఇఁక రుద్రాణిని మీ యన్నయగు నంధకునకు రాణిగాఁ బంపుటకు నా కేమియు స్వతంత్రము లేదు. నీవే యామెయొద్దకు వెళ్లి స్వయముగా నామె నడుగు' మని చెప్పెను.

శంబరుఁ డామాటలను విని రుద్రాణియొద్దకు వెళ్లి అంధకుని రాయబారమును వినిపించెను. అందులకు రుద్రాణి 'శంబరా! రుద్రునకును అంధకునకును జరుగఁబోవు యుద్ధములలో నెవరు గెలిచిన వానికి నేను రాణి నయ్యెదనని మీరాజుతోఁ జెప్పుము' అని యామె ప్రత్యుత్తర మిచ్చెను. శంబరుఁడు తన దేశమునకుఁ బోయి యంధకునకీ సమాచారమును తెలియఁజేసెను. అంధకుఁడు రుద్రాణి ప్రత్యుత్తరమునకు మిగుల కోపించి రుద్రాణిపైకి యుద్ధమునకు బయలువెడలెను.

ఇక్కడ రుద్రుఁడును యుద్ధప్రయత్నములను జేయుచుండెను. నందికేశ్వరుని సర్వసేనానాయకునిగాఁ జేసి సకల గణములను, గణాధిపతులను రుద్రుఁడు యుద్ధమునకు సిద్ధపఱచెను. ఇంతలో దానవ సేనలు వచ్చి యుద్ధమునకుఁ దలఁపడెను.. ముందుగా వినాయకుఁడా దానవులతో యుద్ధము ప్రారంభించెను. కొంతకాలము యుద్ధ

1 ఈ మందర పర్వతము మేరు (సియర్‌ఖాన్) పర్వతమునకు తూర్పు శాఖగా నున్నది. — శ్లో॥ మహాపాదాస్తు చత్వారో మేరో రథ చతుర్దిశమ్, పూర్వేణమందరో నామ దక్షిణే గంధమాదనః, విపులః పశ్చిమేపార్శ్వే సుపార్శ్వశ్చోత్తరేస్మృతః॥ (వాయుపురాణము 1-35-16)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైన పిమ్మట వినాయకుని బలము సన్నగిల్లుటను రుద్రుఁడు కనిపెట్టి నందికేశ్వరుని యుద్ధభూమి కంపెను. నందికేశ్వరుని దెబ్బకు తాళఁజాలక సురలు వెనుకంజవేయ నారంభించిరి. అట్టి క్లిష్టపరిస్థితులలో నంధకాసురుఁడు ఉశనునితో మంత్రాంగ మొనరించి తన సైన్యమును భూతగణములతో ద్వంద్వయుద్ధమునకుఁ బురికొల్పెను. ఇంతలో దేవతలువచ్చి భూతములకుఁ దోడ్పడిరి. కొంతసేపటి కుభయబలములు అలసి యెట్టి ఫలితమును లేకయే వెనుకకు మరలిరి.

పై యుద్ధము వేదకాలమునకుఁ బూర్వము జరిగినదని చెప్పవలెను. సురాసురులు తాము భారత భూమిని జయించుచు కొంద ఱిక్కడ ప్రవేశించుచుండినను, హిమాలయమున కుత్తరమందుఁగల తమ మాతృ దేశమును మాత్రము విడువలేదు. భారత ఖండమును వలసదేశముగా మాత్రము చేసికొనిరి. పోరాటములు వచ్చినప్పుడు ఆ ప్రాంతముననే పోరాడుచుండెడివారు. ఈ యుద్ధకాలమునాఁటి అసురనాయకుఁడు అంధకాసురుఁడు. ఇతఁడు హిరణ్యాక్షుని కుమారుఁడు. హిరణ్యకశిపుని కుమారుఁడగు ప్రహ్లాదుఁడు బాలుఁడగుటచే నితఁడు ప్రహ్లాదునికి సంరక్షకుఁడుగా నుండెను.

ఈ కాలమునాఁటి కింకను నిండ్లు కట్టుకొని నివసించునంతటి నాగరికత లేదు. అడవులలోను, కొండలపైని, గుహలయందును జనులు నివసించుచుండిరి.

## ౨

## దక్షవధ

నవబ్రహ్మలలో నొకఁడగు దక్షుఁడు సురలకు ప్రజాపతిగా నుండెను. ఈ సురలు క్రొత్తగా మేరు పర్వతప్రాంతములనుండి హిమాలయముల మీఁదుగ భారత ఖండమునఁ బ్రవేశించినప్పుడు వారికిని తత్పూర్వము భారతఖండమునఁ బ్రవేశించిన* అసురులకును కొన్ని యుద్ధములు జరుగుచుండిన విషయ మిదివఱకు చెప్పియుంటిని. అందుచేఁ గ్రొత్తఁగా తామాక్రమించుకొనఁ దలఁచిన భారతఖండమున తనకు స్థానబలము కలుగుటకై సురలు, (అసురులకు శత్రువులగు) భూతములతో సఖ్య మొనరించుకొని, యుద్ధములయం దొండొరులకుఁ దోడ్పడుచు అసురుల జయించుచుండిరి. ఇట్లుండ, సురలకును భూతములకును గల సఖ్యము మఱింత బలపఱుప నెంచి దక్షుఁడు తన పెద్దకుమార్తెయగు 'సతిని' భూతనాయకుఁడగు రుద్రున కిచ్చి వివాహ మొనరించెను.

కొంతకాలము గడచిన పిమ్మట దక్షున కశ్వమేధ యాగము చేయవలెనను తలంపు కలిగినది. అశ్వమేధ మొనరించుట యన సామాన్యకార్యము కాదు. ముందుగా యజ్ఞహయమును నానాదిక్కులకు పంపి, ఆ గుఱ్ఱమును అడ్డిన రాజుల నెల్లరిని జయించి, తనకంటె బలవంతుఁడగు రాజు మఱి యెక్కడను లేఁడనిపించుకొని మఱియును యజ్ఞము నారంభింపవలెను. అసురులు గాని మానవులు గాని, మఱియెవ్వరు గాని తన్నెదిరించి గెలువలేరని దక్షునకు నమ్మకము కలదు. కాని భూతనాయకుఁడును, తన కల్లుఁడును నగు రుద్రుఁడు తనకంటె బలవంతుఁడని తనకనుమానము కలిగెను. అందుచే దక్షుఁడు రుద్రున కాహ్వాన మంపలేదు. దక్షుఁడు యజ్ఞము చేయుచుండిన విషయము రుద్రునకు తెలియనే తెలియదు.

ఇంతలో గౌతముని కుమార్తెయగు జయ తన పెదతల్లియగు రుద్రాణితో కలసి యజ్ఞమునకుఁ బోవలెనను నుద్దేశముతో మందరమున కరిగెను. జయ దక్షుని యజ్ఞవృత్తాంతమును రుద్రాణియగు† సతి కెఱింగించెను. తన తండ్రియగు దక్షుఁడు తన్ను యజ్ఞమునకు పిలువక అవమానపఱచె నను దుఃఖముచే నామె మరణించెను.

అందుకు దక్షుని పై రుద్రునకు మితిమీరిన కోపము వచ్చెను. బలవంతుఁడగు తా నుండఁగ దక్షుఁడు యజ్ఞము ప్రారంభించుట యొక యవమానము. అటు పిమ్మట మామగారు యజ్ఞము చేయుచు కూతుని, యల్లుని పిలువకపోవుట రెండవ యవమానము. ఈ రెండవ యవమానమువలన

* ఈ యసురులు దేవతలకంటె ముందుగా వచ్చిన వారగుటచే వీరికి 'పూర్వదేవు'లను నామము కలదు.

† వివిధ రుద్రాణుల నామములు:—సతి, ఉమ, కాత్యాయని, పార్వతి మొ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలిగిన దుర్భరమగు దుఃఖమువలన తనభార్యయగు సతి యాత్మహత్య గావించుకొనుట మూడవ పరాభవము. ఈ మూటివలనను ముప్పిరిగొన్న కోపాగ్నిచే రుద్రుఁడు మండిపడి, వెంటనే వీరభద్రుని పిలిచి సింహముఖ గణముతో దక్షునియజ్ఞమును నాశనము చేసి రమ్మని యాజ్ఞాపించెను.

వీరభద్రుఁడు ప్రళయకాలదావాగ్నివలె భూతగణములతో దక్షునియజ్ఞవాటిక కుఱికి పడి ముఖద్వారమ న నున్న ధర్మని నొక్కదెబ్బతో పైకీడ్చివేసి లోనఁ బ్రవేశించెను. అప్పుడు వసువులు, ఆదిత్యులు, ఇంద్రుఁడు మున్నగువారేతెంచి వీరభద్రు నెదుర్కొనిరి. కాని లాభము లేకపోయెను. వీరభద్రుఁడు లోనఁ బ్రవేశించి యజ్ఞశాలయందున్న దక్షుని తన యసిధారను రెండుతునుకలు గావించెను.

పై కథవలన జంబూద్వీపముయొక్క అప్పటి చరిత్ర మెట్లున్నదో కొంతవఱకు మనము గ్రహింపవచ్చును. అప్పటికి వివాహవిషయమున జాతిభేదములు లేవు. ఈశ్వర ప్రజాసర్గములోఁ జేరిన దక్షుని కుమార్తెను బ్రహ్మప్రజాసర్గములోఁ జేరిన రుద్రున కిచ్చి వివాహము చేసిరి. ఈ విషయుగ నా కాలమున భూభాగమున నెన్నిజాతులు కలవో అన్నిజాతులవారును అన్యోన్య సంబంధబాంధవ్యములను గలిగియుండిరి.— ఇఁక నీదక్షుఁ డేకాలము వాఁడో, యెవరికి సమకాలికుఁడో కూడ నించుక తెలిసికొనుట యుచిది కావున నాతనివంశవృక్ష మిట వ్రాసెదను.






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పై వంశవృక్షమువలన ఇక్ష్వాకువంశ సంభూతుండును, యువనాశ్వుని పుత్రుండును నగు శ్రావస్తువును, యయాతి కైదవతరము వాండగు శర్యాతియు, సుహోత్రునకు నాలుగవతరమువాండగు అజకుండును, చాక్షుషమనువునకు పదియవతరము వాండగు దక్షుండును నించుమించుగా సమకాలికులని చెప్ప నొప్పు. పై నుదాహరింపంబడిన అజకునకు అయిదవ తరమువాండు గాధి. అతని పుత్రుండు విశ్వామిత్రుండు — ఇందు ఉత్తానపాదుని వంశము వారెల్లరును హిమాలయమున కుత్తరమున నివసించినవారే గాని దక్షిణమున నివసించినవారు కారు.

## 3

## మహిషాసుర యుద్ధము

పూర్వము రంభుండు కరంభుండు ననునిరువురు దానవులు కలరు. ఒకానొక యుద్ధమున నగ్రజుండగు కరంభుండు ఇంద్రునిచే హతుండయ్యెను. రంభుండొకసారి తన యక్షమిత్రుని జూచుటకై మాలవతమున కరిగెను. అక్కడ 'త్రిహాయని' యనునామముగల యొక యక్షకాంతను జూచి రంభుండు మోహించెను. ఆ దానవుండగు రంభునకును యక్షకాంతయగు త్రిహాయనికిని 'మహిషుం'డను పుత్రుండు జన్మించెను.

ఈ మహిషుండు నానాంటికి వృద్ధియై తన బుద్ధిబలమువలనను, పరాక్రమము వలనను అసురుల నెల్లరిని స్వాధీనము చేసికొని, తండ్రిమరణానంతరము సింహాసనము నధిష్ఠించెను. ఈమహిషుండు రసాతలమున నొక భాగమగు 'శిలాభాము' రాష్ట్రమున నివసించుచుండెను. ఇతనికి రక్తబీజుండు, చండుండు, ముండుండు అను సచివులు కలరు. చండముండు లొకసారి వింధ్యపర్వతమున నుండంగా వారికి కాత్యాయని కనంబడెను. ఈ కాత్యాయని యాకాలమునాంటి రుద్రాణి. రుద్రాణియగు నాకాత్యాయని సౌందర్యమును చూచి దానవామాత్యు లిరువురును మిగుల నాశ్చర్యపడి, తమ ప్రభువగు మహిషుని యొద్దకు వచ్చి యామె సౌందర్యాతిశయమును నాతని మనస్సున కెక్కునట్లు వర్ణించి చెప్పిరి. మహిషుండును కాత్యాయనిని చేపట్టవలెనను నుద్దేశముతో మయుని కుమారుండగు దుందుభిని రుద్రుని యొద్దకు రాయబారిగాం బంపెను.

దుందుభి రుద్రుని కొలువున కేంగి, "అయ్యా! మా ప్రభువువారు దేవతలను జయించి ముల్లోకములకును ప్రభువులైరి. వారికోపాగ్నికి గుఱి కాకుండం బ్రతుక నెంచు రేని 'రుద్రాణి'ని మాప్రభువునకు రాణిగాం బంపుడు. లేనిచో యుద్ధమునకు సిద్ధపడుండు" అని దానవనాయకుని యుద్దేశమును తెలియంజేసెను. కాత్యాయని యా రాయబారము నాలకించి, "ఓయీ దుందుభీ! ఎవరు యుద్ధరంగమున నన్ను జయించెదరో వారిని నేను వరించెదను. ఇది మా కులధర్మము అని మీ ప్రభువుతో చెప్పుము" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఈ ప్రత్యుత్తరమునకు మహిషుండు మిగుల కోపించి, సేనాసమేతుండై భూతములపైకి యుద్ధమునకు బయలువెడలెను. ఉభయ సేనలకును ఘోరమగు సంగ్రామము జరిగెను. అందు మహిషుండోడి వెనుకకు మరలంగనే అమరుండను దానవనాయకుండు తన సేనతో కాత్యాయని నెదుర్కొనెను. కాత్యాయనికిని అమరునకును మరల పోరు ఘోర మయ్యెను. అందు నమరుండును, వాని సైన్యములును చెల్లాచెదరై యోడిపాఱిపోయిరి. ఈతం డోడిపాఱిపోయిన పిమ్మట దానవనాయకులు పెక్కండ్రు కాత్యాయనిని తలపడిరి. కాని కొందఱోడియుం గొందఱుచచ్చియు సైన్యమంతయు క్షీణించెను. తుదకు మహిషుండు స్వయముగా కాత్యాయని నెదుర్కొని యామెచే హతుండయ్యెను.

## ౪

## శుంభ నిశుంభులు

మహిషుండు మరణించిన పిమ్మట శుంభుండు దానవ రాజ్యమునకు భర్తయయ్యెను. కాత్యాయనిపై పగతీర్చుకొనుటకై శుంభుండును, నాతని సోదరుండగు నిశుంభుండును సర్వసేనాసమేతముగా భూతములపైకి దాడివెడలిరి. ఆ యుద్ధమున పేరుపొందిన దానవనాయకు లనేకులు హతులైరి. తుదకు శుంభ నిశుంభులు కాత్యాయనితో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వయముగాఁ దలపడిరి. ఆ సంకుల సమరంబున దానవ సోదరు లిరువురును సమసిరి.

ఇంతవఱకు పురాణములలో గోచరించుచుండిన భూతాసుర యుద్ధములను నాల్గింటిని పేర్కొంటిని. భూతములు ప్రప్రథమమున వారుండిన యనాగరిక స్థితి నుండి మిక్కిలి వడిగా నాగరికత సంపాదించి అసురులతో సరిసమమగు యుద్ధ నిపుణత్వమును సంపాదించి, తుదకు నసురుల నోడించుటకు తగినంత బలమును గూడ సంపాదించిరి. ఇట్లొకవంక భూతాసుర యుద్ధములు జరుగుచుండ, నింతకు ముందునుండియు వేఱొకవంక సురాసురయుద్ధములును తీవ్రముగా జరుగుచుండెను. కాని యీభూతాసుర యుద్ధములన్నియును దాదాపుగా హిమాలయ పర్వతప్రాంతమునను, దాని కుత్తరమునంగల దేశములయందును జరుగుచుండెనని చెప్ప నొప్పు. బ్రహ్మపుత్రానది లోయల మార్గమున అసురులు హిందూస్థానమునఁ బ్రవేశించి అస్సాము (కామరూప) వారి నివాసస్థానముగాఁ జేసికొనిరను విషయముమాత్రము చదువరులు మఱవకుందురు గాక!

---

# ఆశీస్సు

కొమాండూరు కృష్ణమాచార్యులు గారు

పవడపుఁ జాయలన్ జిదిమి బాలరసాల మనోజ్ఞ పల్లవ
చ్ఛవి విదళించి బింబఫలసాంద్రరుచుల్ గబళించి మించు నీ
నవకపు మోవిమానికము నంజుడుల౯ గమలించె బింబమం
చవి నయవృత్తి నొక్కఁతె శుకాంగన పుల్గునకే వివేకముల్.

తొలకరి వానకాలమునఁ దోయదగర్భ వినిర్గతంబులై
యొలయు సమీరడింభముల యోజనఁబూచు కదంబశాఖి నా
తలఁపున జొన్పె నీతనువు తామరసాయత నేత్ర వెన్నెల౯
జిలికి సహించి నీవు యమునాతటసీమల నాలఁ గాచితో.

నీలవలాహకచ్ఛవులు నింపెడు నీకమనీయకాయ మీ
పోలిక కంటకక్షతులఁ బోడిమిదూలె లతాకుడుంగ గ
ర్భాలయసీమల౯ జెలువుఁడా! యిటు డాఁగుడుమూఁతలాడితో
బాలిశకేళిలాలసుల భావము దోఁస మెఱుంగ నేర్చునే.

ఫాలమునందు ఘర్మకణ పంక్తులుపెట్టని సొమ్ములయ్యె గో
పాల! సుధాకరాతపవిభావరినుగ్రమయూఖనంది నీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూలముల౯ వ్రజాంగనలకోసము గాసిలినాఁడ వీ యుషః
కాలము దాఁక శయ్యయిదె కన్గవ మూయు మొకింత మేలగు౯.
మధుకర సంగతంబయిన మంకెన పూపనఁగాటు కేల నీ
యధరముపైని, ఫాలమున నంటినలత్తు కరంగ దేమి? యీ
విధమున నీకు వింతయగు వేసము వేసిన దాసిజన్మమే
మదురము మత్కుమారతనుమాధవ వ్రుచ్చిలి యిట్లు సేయు దే.
నీతోఁ శైశవవేళ గోకులమున౯ నిత్యంబు క్రీడించుట౯
చేతో జాతశరానలక్షుభితనై చిత్తప్రసూనంబు నీ
చేతంబెట్టిన దోసమే యిపుడు నిశ్చింతుండ బాధించెదు౯
ఊతంజేసిన ప్రాణముల్ సనక యారాటంబు నొందించెదు౯.
జలధి మథించుకాలమున సర్వజగద్దహనోగ్రకీలికా
వలయితమై జనించు విషవహ్నినిబోలి వనంబులేర్చు చి
చ్చులఁ గబళించి శంకరతఁజూపుట మారశిలీముఖార్చుల౯
మలమల మాడ్చివేయుటకె మాధవ ! చాలును నీదు కూటముల్.
నిజపతి బాహుపాశములు నిద్దురచే సడల౯ నిశీథిని౯
విజనములైన మార్గముల వెంబడి నీలపటావృతాంగినై
ప్రజలను గన్నుగప్పి బహుభంగులఁ ద్రొక్కనిచోట్లు ద్రొక్కితి౯.
కుజనుడ! నీదుసంగతిని గోరి కడుంగడు దుష్టచిత్తనై.
నాయురమందుఁ బుట్టినను నాథ! భవద్భుజ పంజరంబున౯
బాయక చక్రవాకముల భంగిని వృద్ధిని గాంచి మించె జ౯
దోయి భవత్కటాక్షములతోఁ బలుమారును జెల్మిచేసి క౯
దోయి విలాసముల్ గనిమె తోయజనేత్ర! తలంప విన్నియు౯.
అనుచు౯ బాష్పనిరుద్ధకంఠయగు రాధాంభోజ పత్రేక్షణ౯
ఘనబాహాంతర సీమఁజేర్చి పటుముక్తాస్థూల బాష్పాళి నొ
య్యన నాత్మీయకరంబున౯ దుడుచు ధూర్తాగ్రేసరుం డార్త ర
క్షణదీక్షాగతుఁ డేలుఁగాత నిజభక్తశ్రేణి నశ్రాంతము౯.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆకస్మిక ఛాయాచిత్రములు



నదీ స్నానము శ్రీ వి. ఆర్. తెన్నేటిగారి ఛాయాచిత్రము.



చిట్టితొట్టి స్నానము శ్రీ కే. వీరన్న సెట్టిగారి ఛాయాచిత్రము.



ఔదాసీన్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నా ఐరోపాఖండయాత్ర చిత్రములు



౧. ఆమరి మ్యూజియమున కెదురనున్న చతుష్పథము - బెర్లినునగరము, జర్మని



౨. ఫ్రెడరిక్ చక్రవర్తి మ్యూజియము-బెర్లినునగరము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## నీడగడియారము

కొ. నరసింహాచారి గారు

భూగోళము తన చుట్టు తానొకమారు చుట్టుటకు 24 గంటలకాలమగును. అట్లు చుట్టుటలో దానియొక్క సగభాగము మాత్రమే ఒక మారుగా సూర్యుని కభిముఖమైయుండగలదు. సూర్యుని కభిముఖమైయుండు అర్ధగోళముపై సూర్యుని కాంతిపడును. సూర్యకాంతిని పొందు భూగోళార్ధమున కదిపగటి కాలమందుము. సూర్యకాంతికి దూరమైయుండు తక్కిన గోళార్ధమునకది రాత్రికాలమందుము. భూమియొక్క దినచలనము పశ్చిమమునుండి తూర్పునకుగా నుండుటవలన, సూర్యుడు తూర్పునుండి పశ్చిమమునకు పోవునట్లు కనబడును. సూర్యుడు తూర్పున నుదయించి క్రమముగా నాకాశమున ప్రయాణముచేసి సాయంకాలమున పశ్చిమమున నస్తమించు పర్యంత కాలము సాధారణముగా నిర్ధరిన ప్రమాణమైయున్నది. భూగోళముయొక్క అక్షము నిలువుగా లేక ఉత్తర ధ్రువము వైపునకు వాలియుండుటవలన, దివారాత్రముల ప్రమాణములు సమములు కాక భేదపడియున్నవి. సూర్యుడు భూమధ్య రేఖకు ఉత్తరముననుండు కాలమున అనగా ఉత్తరాయణ కాలమున-నా భాగమున పగటికాలము దీర్ఘముగను, దానికి తగినట్లు రాత్రికాలము తక్కువగను నుండును. దక్షిణాయన కాలమున భూమధ్యరేఖకు దక్షిణముననుండు భాగమున పగలెక్కువగను, రాత్రి తక్కువగనునుండును. ధ్రువములకు సమీపముగా బోవుకొలది పూర్ణ దిన ప్రమాణమగు 24 గంటలును పగలుగనో రాత్రిగనో ఉండును. కావున నీడగడియారమును చేయునపుడు, భూమధ్య రేఖకు ఉత్తరమునగాని, దక్షిణమునగాని యెన్ని యంశము (degrees of latitude) ల దూరమున నొక ప్రదేశమున్నదో ఆ యంశముల నాధారముగ, నాప్రదేశమునకు నడగడియారమును చేయవలెను.

సాధారణముగ వనము, ఆకాశమున సూర్యుడుండు స్థితిని బట్టి కాలమును చెప్ప గలిగియున్నాము. సూర్యుడు దిక్చక్రము (Horizon) న తూర్పుననుండగా ఉదయము 6 గంటలందుము. నడినెత్తికి నేరుగా పైననుండిన మధ్యాహ్నము 12 గంటలందుము. దిక్చక్రమున పశ్చిమముననుండిన సాయంకాలము 6 గంటలందుము. పగటి ప్రమాణము 12 గంటల కాలమయిన యెడల తూర్పునుండి నెత్తి మీదుగా పశ్చిమమునకు పోవు సూర్యుని మార్గమును 12 సమభాగములుగ భాగించి అందెన్నవ భాగమున సూర్యుడుండిన ఉదయాది అన్నిగంటల కాలమయిన దనవచ్చును. దినప్రమాణము ఎల్లప్పుడును 12 గంటలుగా లేక మారుచుండుటవలన 12 సమ భాగములుగజేసి గంటలనిర్ణయించుటకు వలనుపడదు. అందులకై యొకప్రదేశముయొక్క అక్షాంశములగనుగొని, వానియాధారమున నేర్పఱుచబడిన నీడగడియారము, ఆప్రదేశమునకు సరియగు గంటను చూపగలిగియుండును. ఇప్పుడిచ్చట వర్ణించబడియుండు నీడగడియారము 30° అక్షరేఖపైనుండు ప్రదేశములకు దగియుండును.

7. 4- 13 ౬3౧




## నీడగడియారమును చేయువిధము

ఏదైన నొకసమచతురమును, జచపట అను దానిని (చిత్రము ౧) వ్రాసి దానియందు జను కేంద్రము (Centre) గను జచను అర్ధవ్యాసము (Radius) గను గలిగిన జచట అను పాదవలయము (Quadrant)ను వ్రాయవలెను. పిమ్మట చవద్ద, నీడగడియారము నుపయోగింపవలసిన ప్రదేశముయొక్క అక్షాంశప్రమాణమునకు సరియగుకోణము (ప్రస్తుతము ౩౦°) జచడ అను దానిని వ్రాయవలెను. ఆకోణముయొక్క ఉత్తరభుజమగు చడ, చతురముయొక్క కుడిప్రక్కయగు జటను డవద్దచేరునట్లు వ్రాయవలెను. పిమ్మట జను కేంద్రముగను, జడను అర్ధవ్యాసముగను జడణ అను పాదవలయమును వేయవలెను. జచట అను పెద్దపాదవలయమును ౬ సమభాగములుగ జేయవలెను. అటులనే జడణ అను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిన్నపాదవలయము గూడ ౬ సమభాగములుగ జేయవలెను. పెద్దపాదవలయమునందలి సమభాగములగుర్తించు ౧, ౨, 3, ౪, ౫ అను గుర్తులనుండి అడ్డముగ సమాంతర రేఖల (Parallel lines) ను వ్రాయవలెను. చిన్నిపాదవలయమును సమభాగములుగ గుర్తించు క, ఖ, గ, ఘ, జ అను గుర్తులనుండి నిలువుగ సమాంతర రేఖలను వేయవలెను. ఇందు 1 వద్దనుండివచ్చు అడ్డగీతయు కవద్దనుండిపోవు నిలువుగీతయు, ప వద్ద చేరును. ఇట్లు 2, 3, 4, 5 గుర్తులనుండి అడ్డముగాపోవు గీతలును, ఖ, గ, ఘ, జ అను గుర్తులనుండి నిలువుగపోవుగీతలును క్రమముగా ఫ, బ, భ, మలవద్దచేరును. పిమ్మట జనుండి ప, ఫ, బ, భ, మ లగుండా రేఖలను వేసినయెడల నవి, చతురముయొక్క చ, ప, ప, ట అను ప్రక్కలను VII, VIII, IX, X, XI, అను గుర్తులవద్దచేరును. ఈరేఖలే గంటలనుగుర్తించునవి. ఈసంఖ్యలే గంటల సంఖ్యలు. జ చ అను ప్రక్క VI గంటల రేఖయగును. జ ట అనుప్రక్క XII గంటలరేఖ యగును.

ఇంతవఱకును నీడగడియారమునందు గుర్తించవలసిన గంటలస్థానమును గనుగొంటిమి. ఇవి VII మొదలు XI వఱకును కలవు. ఈ గుర్తులను గడియారమునందలి ఎడమసగమున గుర్తించి పిమ్మట ఇట్టివే గుర్తులను కుడిసగమున గుర్తించి వాటికి నేరుగా XII గంటల రేఖనుండి కుడిపక్కగా I,II,III,IV,V అను సంఖ్యలనువేయవలెను.

నీడగడియారము ఎండలోనుండవలసినది కనుక కాగితమునందు వ్రాయుటతగదు. కొయ్యపలకమీదగాని రేకుమీదగాని గడియారమును గుర్తింపవలసియుండును. ఒక యడుగునిడివియు వెడల్పునుగల చతురమగు కొయ్యపలకనుగొని దాని మధ్య రంపముతో సగములోతునకు కోతవేయవలెను. ఈకోతియే చిత్రము 2 నందు జ త ట ధ లమధ్య నల్లని వెడల్పుగీతగా గుర్తింపబడియున్నది. ఆకోత కిరుప్రక్కలయందును సమముగా వ్యాపించునట్లు చ ధ అను రేఖను పలకయొక్క అడుగుభాగమున వేయవలెను. ఆరేఖపై, చ జ ప ట అను చిత్రము ౧ యందు వ్రాయబడిన చతురమువంటి చతురములను కోత కిరుప్రక్కల గుర్తించవలెను. అపుడు కోతకు ఎడమప్రక్క చ జ ప ట అనుచతురమును, కుడిప్రక్క త థ ద ధ అను చతురమును ఏర్పడును. కోతయొక్క వెడల్పును లెక్కయందు చేర్చరాదు. పిమ్మట ఈరెండు చతురము లందును, VII VIII IX X XI అను సంఖ్యలను ఎడమప్రక్కను, I II III IV V అను సంఖ్యలను కుడిప్రక్కను గుర్తించవలెను. (చిత్రము ౨).

## గడియారపు ముల్లు

ముల్లు, రేకుతోగాని, సన్నని కొయ్యతోగాని చేయవచ్చును. రేకైనయెడల మంచిది. సన్నని కొయ్యపలకయైనయెడల ఎండలో వానలోను వంగిపోవును. అది, గడియారమున కుపయోగింపబడిన పలకలయందలి కోతయందు చక్కగా బిగించదగినంత మందముగలిగియుండవలెను. ముల్లును ముందే యేర్పాటుచేసికొనినయెడల కోతదానికి తట్లుగానుండవలెను. ముల్లు త్రిభుజాకృతిగలిగియుండవలెను (చిత్రము 3) య ర ల అను త్రిభుజములకు క్రింద కోతయందు బిగించుటకై కొంత భాగమును వదలవలెను. పిమ్మట య ర ల అను కోణముకూడ 30° పరిమాణమునే గలిగియుండవలెను. (30° గడియారము నుపయోగింపవలసిన ప్రదేశముయొక్క అక్షాంశప్రమాణము) ముల్లును పలకయందు బిగించుటలో ర అను కోణము చ ధ అను ఆఱు గంటల రేఖ నానుకొనియుండి ల అను భాగము XII గంటలగుర్తు వైపునకుండవలెను. య ల అను ప్రక్కను అలంకారార్థము ఎట్టివిధముగకోసినను కోయవచ్చును. ముల్లుపలకలకు లంబము (Perpendicular) గా నిలచియుండవలెను.

పిమ్మట గడియారమును ఎండ చక్కగా పడునట్టి ప్రదేశమునొక స్తంభముపైనగాని, చలించగూడని ప్రదేశమునగాని బిగింపవలెను. అప్పుడు చ ధ అను ప్రక్క తూర్పు పడమరలుగ నుండి, ర అను కోణము దక్షిణమునకును, ల అను మొంటిమొన ఉత్తరమునకును చూచుచుండవలెను. గడియారము ఒకేమట్టముగ (Perfectly level) నుండవలెను. రల అను ప్రక్కయొక్క నీడ ఏగంటను తెలుపుగీతపైబడునో అన్ని గంటలని తెలిసికొనవచ్చును. (చిత్రము ౪ చూడుడు.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తుమ్మెదపదము

కాళ్ళూరి వేంకటనరసింగరావు గారు (కవితాసమితి)

ఏ తేనె కెరటాల నీదు లాఁడేవో !
ఈ తొలిప్రొద్దు నీ రెండ గాఁగేవు ;
గాలిసందిళ్లలో కలకలల్ నించి,
పూలకౌగిళ్లలో పులక లూరించి,
సెలయేటి పొత్తిళ్ల పలుకులు నేర్చి,
వలపుదారుల పాటకులుకులు జార్చు
నీముద్దు వాహ్యాళి నేడు చాలించి
ఏమె తుమ్మెద ! పల్కరింతు వామెతగ ?

*　　*　　*

నవవసంతాగమోత్సవ పురోహితుడ,
వఖిలలతాంత శుద్ధాంత విహారి,
వమల హృద్దళ వాసనాగమవేత్త,
వార్ద్రమధూళిశయ్యా భోగలాల
సాలససుకుమారశీలి, వారామ
నవ్యమరంద పానవ్రతధారి
వోమిళిందకుమారకా! మదీప్సితము
పండె నీదర్శనభాగ్యాన నేడు.

*　　*　　*

మాప్రబంధయుగాల మన్నెమ్ము దన్ని
రాజ్య మేలిన భృంగ రాజవు, నీదు
దర్శనావాప్తి చిత్తము పల్లవించె ;
కౌముదీ శుభ్రాచ్ఛ కౌతుకవీథు
లందు వీతెంచె నాహ్వానసౌరభము;
ఏనాటిదో మది నెల్ల నల్లుకొను
గాఢవాంఛాలతికయును పుష్పించె;

ఊహాతరంగాల కూకొట్టుకోర్కె—
తావకోదారసుధాగానపక్షు
మాలల చల్లగా జేలుచు మలసి,
మా పూర్వజాతీయ మాధురీనిలయ
రాహస్యముల నవగాహమ్ము సేయు;
మా యఃనాదికవీంద్ర మహిమామనోజ్ఞ
మందిరాంగణముల మంతనం బాడు;
చారుచారిత్రకాథాగహీనముగ
కాలకల్లోలిన్యరాళవేణికల
కాటుకరేకలై కలసి రూపరిన
మా మహాస్నత్యశోభామృతకిరణ
శీతలజ్యోత్స్నల నీతల నీదు
నీ రాక నా మనః కైరవలక్ష్మి
దారున బులకించు శారదరాక;
నీ రాక నా శోక నీరదగర్భ
నీలిమ సౌదామనీ రేఖ, తేటి !

*　　*　　*

భారతకవుల గంభీరగుంఫనల
పాకంపుచవుల తీపారె నీపాట;
పోతన వీణా ప్రపూతసంగతుల
సానబట్టినది నీ సన్నని పాట;
సూరన పక్వకళారుచిజీవ
సారమ్ము లూరు నీ సరసంపుబాట;
శ్రీనాథు ప్రౌఢ రసికతా స్రవంతి
నోలలాడినది నీ నీలాలపాట;



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దనార్యుని సుధా పేశలవాణి
సుద్దులు నేర్చె నీ ముద్దులపాట;
తిమ్మన నెమ్మదిలీపిపాండితుల
గమ్మని వలచు నీ కమ్మనిపాట;
వేంకటకవి ముగ్ధవిద్యారసార్ద్రి
రాగరక్తుల తీగె సాగె నీపాట;
సాహిత్యపోషణు సాంద్రప్రవాహ
సర్వాంక పాంధ్ర గాంధర్వగానముల
కళలు దేరినది చొక్కముగ నీపాట;
తారాశశాంకామృత ప్రేమబంధ
బాంధవ భావనా చందనసౌధ
వీథుల చలువల విలిచె నీపాట;
మా యాంధ్రవనవాటి మధుమాసశోభ
మరగి త్రావినది నీమధురగళమ్ము;
మధుకరా! ఆనాటిమా తోట తీపి
పచ్చి యారని తొంటి పస జుంటి తేనె
రుచిచూపవా! అపురూపమ్ము మాకు.

మా కవితాకళామయ సువిశాల
సామ్రాజ్యదిశల శాశ్వత ముజ్జ్వలించు
రసమూర్తు లా రాజరాజులకీర్తి
పోహళించు సుధా ప్రబోధమాలికల,
సెలవుల మాధురుల్ చిలుపలు గట్ట,
జడశిలాప్రకృతిలో సైతము జీవ
నోదయోష శ్రుతి నాదముల్ చెలగ,
పాడవే! మా తెల్గు పరువుపదాల.

* * *

మా పూర్వ కులమానినీ పూజ్యశీల
మాధురుల్ దేశాన మలసిననాడు
హాయి వీచికలలో హాయి తేలాడ
తీయగించితివేమొ తేటి! నీపాట.

గిరికామనోశ్రవణాంతరపూరసిక్త
మార్దవావస్థల మరగించినావు;
ప్రౌఢవధూధినీపక్వబాధాప్ర
సూనగుచ్ఛమరంద మూనబట్టేవు;
ముద్దరాలు సుభద్ర మురిపెంపు సిగ్గు
పరువుల మరుకాక కెరలించినావు;
గొల్లకన్నెల మాః మెల్ల కొల్లగొను
విరహబృందా హృదంతరచరు గూడ్
ఆ యమాయిక హృదయుల మనశ్శాంతి
కెసరు పెట్టితి వారియుసురు బోసికొని:
చాలదా నీకైన శాస్తి యీనాడు?—
కమ్మని గుబ్బెతకసరుల కసటు!
విరహిణీమోహవాగురల జిక్కుకొని
గ్రుక్కిళ్లు ద్రింగుచు కూర్కెనో యేమొ!
నాయికాభావనోన్మత్తలాస్యముల
వడి సుడివడి త్రొట్రువడి తారెనేమొ!
ముగ్ధా త్రపా మనో మోహనరక్తి
మరగి పై కురుగా మురిపించునేమొ!
నవ యమునాభంగ నాట్యరంగమున
తొలకాడు 'భ్రమరగీతల' నాటి మేటి
చిన్నతనము నాటి చీకాకువరుష
తరలదేమో తెర తెరల నీపాట!

పని లేని నేమంపు పంతాలు చాలు
పౌరుషశాలి కుదారశీలునకు
ముగ్ధల త్రిభువన మోహనస్నిగ్ధ
మానరోషారుణ మధురావలోక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవకప్రహార గౌరవములకన్న
కులములో నేమి కావలయును మధుప?
లావణ్యవతుల కోపావిల స్వాదు
భావణాఘూత సద్భావములకన్న
సరివారిలో వేరె బిరు దేల భ్రమర?

*　　*　　*　　*

షట్పదా! శోభాలసము లయి మలయు
స్వేచ్ఛాకటాక్ష మాధ్వీమాధురులను
మా యార్యమాత ప్రేమాదరపూత
పాడిపంటల దేలు బంగారు యుగము
లెన్నో నీపాటల కెలు గిచ్చినవియె;
ధర్మవీరుల యశో మర్మకవితలు,
క్షాత్రమూర్తుల పౌరుషాంకగీతికలు,
ప్రణయమోధుల స్వాదుభావరాగములు,
శాంతిఋషుల సత్యసాధు కీర్తనలు,
జ్ఞానదేశికుల ప్రసన్నతత్త్వములు,
బ్రహ్మచారుల వేదపాఠకారికలు
పుణ్యనదీక్షేత్ర భూములయందు,
సవనవాటికల నాహవరంగములను,
శిల్పశోభాహర్మ్య కల్పతల్పముల
గానమ్ము సేయు నీకంఠనాళముల
పాపాలు రాపాడు పాడుకాలమున
నేడు పాడు మనగా నేర్తునె నేను?
అస్వతంత్రత మూల్గు నాంధ్రమానసము
మూగవోయిన నీయమోఘనిర్ఘోష
రాశయమ్ముల తెలియర్గ వలంతి యటె?
తడిగొంతురవళి సందడి సడి లేక
అరుదైన నీపాట కాసించి వేడ
నర్హమే? తహతహ నల్లాడు గాక!
అవ్యాజకరుణా సమాహితబుద్ధి
నీవె తన్నాన దాహావిలచిత్త
శాంతికై గీత ప్రస్తావింతు గాక!

---

## రాజనీతి రహస్యము

కాళ్లకూరి గోపాలరావు గారు

అనయబలప్రయుక్తి నొరు లాపదఁ గూర్చెద రేని, తెంపుమై
ననయబలప్రయుక్తినె తదాపదఁ బాపికొనందగుఁ ; విషం
బునకు విషంబె యౌషధము; ముఖ్యము ప్రాణుల కాత్మరక్ష; సా
ధన మఘబంధురం బయిన, ధర్మమునం దది పుణ్యమే యగున్!

ఎదిరి యధర్మ మేర్పడఁగ నేచి పయిం బడి మోడి వేఁడినన్,
వదలఁగరాదు వానిని; కృపామతి యయ్యెడ బుద్ధిహీనతన్
విదిత మొనర్చు, ధర్మపథవృత్తము గా దది; యెన్నఁడైన వాఁ
డదయత హానిఁ గూర్చుఁ దన కందినయంతనె పాము కైవడిన్!

పృథ్వీరా జేడు మాఱులు విడిచిపుచ్చె-చేతఁ జిక్కిన ఘోరీని నీతి యనుచు;
ఒక్కపరి తనచేతికిఁ జిక్కినంత-ఘోరి పృథ్వీరాజును బట్టి గ్రుడ్డిఁ జేసె.

---

(తిమ్మరుసు నాటకమునుండి)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మన యాహారము

గోటేటి జోగిరాజు గారు

ఈవిషయమయి భారతి కడచిన సంచికయందు ప్రచురింపబడిన ప్రథమవ్యాసపు మొదటి యనుబంధమున పేర్కొనబడిన యాహారవస్తువులను గురించి చదువరులు గమనింపదగిన మరికొన్ని ముఖ్యవిషయము లీక్రింద వ్రాయబడును.

సామాన్యారోగ్యవంతుల యాహారమున ముఖ్య ద్రవ్యముగ నుండదగిన కర్బనోదజనితములకై దేహతత్త్వమునుబట్టి యనుకూలముగ గన్పడిన యేతృణధాన్యమునైనను ప్రధానపదార్థముగ నుపయోగింపవచ్చును. సామాన్యముగ చేబియ్యముగాని, గోధుమలుగాని యిందుల కనుకూలము. కొంతమందికి జొన్నలుగాని, చోళ్లుగాని యనుకూలముగ నుండవచ్చును. తృణధాన్యములలో మాంసకృత్తులును, చమురును తక్కువగ నుండును. కావున వీని కొరకు కాయధాన్యములను, చమురుదినుసులనుగూడ తిన వలసియుండును. కాయధాన్యములలో కంది తక్కినవాని కంటె చాలమంది కనుకూలముగ నుండును. ఆచారమును బట్టిగూడ దక్షిణదేశమున తక్కిన పప్పులకంటె కందిపప్పే హెచ్చుగ వాడబడుచున్నది. చమురుదినుసులలో వెన్నయు, నేయియు ముఖ్యమయినవి. కాని యివి సామాన్యుల కందరకును లభింపనివి. వీనికి బదులు చౌకగ లభించునవియు, చమురు విస్తారముగ గల్గియుండునవియు నగు వేరుసెనగ గింజల నుపయోగింప వచ్చును.

ఆహారమున కర్బనోదజనితములను తగ్గించి (ఇట్లు తగ్గించుట అతిమూత్రవ్యాధి బాధితుల కావశ్యకము) మాంసకృత్తులను, చమురును హెచ్చింపదలచిన యెడల పాలమీది మీగడ తరుక దినుటకు మిక్కిలి యనుకూలము. చమురును, మాంసకృత్తులనుగూడ మెండుగగల బాదం పప్పును, వేరుసెనగ గింజలునుకూడ ఇందుల కనుకూలము. వేరుసెనగ గింజలు పైత్యమును గలుగజేయునని చాల మంది యభిప్రాయము. కాని యితరవస్తువులతోపాటు మితిమీరకుండ (దినమునకు 3–౮ ఔన్సుల వరకు) మొలక కట్టిన గింజలను దినినను ఏమియు హాని లేదని లేకరి గత రెండు సంవత్సరముల యనుభవమునుబట్టియు దృఢముగ జెప్పగలడు.

తృణధాన్యములలో (ముఖ్యముగ వరిబియ్యములో) సున్నము తక్కువగ నుండును. కావున తృణధాన్యములను దినువారు పాలనుగాని, పెరుగునుగాని, మజ్జిగనుగాని తీసికొనుటవలన నీలోటు దీరును. పప్పుదినుసులు కూడ నీలోటును కొంతవరకు తీర్చును. కాని వానిని వలయు సున్నము నంతటిని యొసగునంతగా పుచ్చుకొన వీలుండదు. స్ఫురమును ఇనుమును తృణధాన్యములలో తగినంత యున్నవి. కాని కర్బనోదజనితములను తగ్గించుటకై తృణధాన్యములను తగ్గించి తినువారు ప్రథమ వ్యాసపు మొదటి యనుబంధమున పేర్కొనబడిన 3, 4, 5 తరగతుల కూరలను తగినంతగా దినుటవలన వీని లోటును పూర్తిచేసికొన వచ్చును. వరితవుడును, గోధుమపొట్టునుగూడ ఇందులకు మిక్కిలి యనుకూలము. వీనిని స్వల్పముగ దినిననే చాలును. లేకరి కీరెంటివలనను చాల మేలు కలిగెను. మరియు అనారోగ్యముగ నుండిన యాతనిబంధువుల పిల్లలకు కొందరికి గూడ ప్రతిదినమును ఒక టీ గరిటెడు బియ్యపుతవుడును పటిక పంచదారతోగాని, వెన్నతోగాని, అన్నముతోగాని కలిపి తినిపించుటచే చాల మేలు గనబడెను. పెద్దవాండ్రు దినమునకు ౧, ౨ ఔన్సులు దినవచ్చును.

A విటమిను పాలు, వెన్న మొదలగు క్షీరసంబంధ ద్రవ్యములలోను, ఆకుకూరలందును విస్తారముగ గలదు. తక్కిన కూరలందును, తృణధాన్యములందును, కాయధాన్యములందును, కొన్ని పండ్లలోను స్వల్పముగ గలదు. ఏవస్తువునైనను చాలసేపు గాలి తగులునట్లు కాచుటవలన గాని, వండుటవలనగాని ఈ విటమిను నశించును. కావున పచ్చిపాలను (ఆరోగ్యముగనున్న ఆవులపాలను పరిశుభ్రమయిన చేతులతో పరిశుభ్రమైన పాత్రలో పిదికిన వెం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టనే) పుచ్చుకొనుట మంచిది. ఇట్లే పచ్చివెన్న శ్రేష్ఠము. తృణధాన్యములను, కాయధాన్యములను ఉడికించకుండ కొంతకాలము నీటిలో నానవేసి తినుట మంచిది. ఆహారమున A విటమిను లోపించిన యెడల, కండ్లు, ఊపిరితిత్తులు, ప్రేగులు, గుండెలు, మూత్రకోశములు మొదలగు ప్రధానాంగములు రోగవంతము లగునని శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి.

B విటమిను కొన్ని యాకుకూరలందును, తృణధాన్యములందును, కాయధాన్యములందును, చమురుగింజలందును విస్తారముగ గలదు. తక్కినకూరలందును, పండ్లలోను, పాలు మొదలగు వానిలోను స్వల్పముగ గలదు. బియ్యమును అరగదంపిన యెడల తవుడుతో B విటమిను పోవును. కావున అరగదంపిన బియ్యమును, యంత్రములలో మెరుగుబెట్టిన బియ్యమును తినుట కర్తవ్యము గావు. బియ్యమును కడిగినపుడుకూడ అందలి B విటమిను ఆనీటిలో కరగిపోవును. కావున బియ్యమును దంపునపుడే పరిశుభ్రముగ నుండునట్లు జాగ్రత్తపెట్టి అంతగా కడగ నవసరము లేకుండ జూడవలెను. మరియు, ధాన్యమును దంపుటకు బదులు పైయాకమాత్రమే పోవునట్లు కర్రతిరుగలిలో విసరుట మరింత మంచిది. గోధుమలనుగాని, కాయధాన్యములనుగాని పై పొట్టుతోనే తినుట మంచిది. ఆయావస్తువులను ఉడకబెట్టుట వలన B విటమి నంతగా పోదు. కాని ఉడకబెట్టుట కుపయోగించిన నీటిని వార్చివేసినచో నది యానీటితో పోవును. కావున నీటిని తగుమాత్రముగ నుపయోగించి వార్చివేయకుండ యిగిరిపోవునట్లు చూడవలెను. B విటమిను ముఖ్యముగ నరములకును, మెదడునకును హృదయము, కార్జము, ఉలవకాయలు, మాంసకండరములు మొదలగు వానికిని బలము నిచ్చును. మలబద్ధమును పోగొట్టును. దీని లోపముచేతనే నజ్జువ్యాధి కలుగునని చెప్పుదురు.

C విటమిను ఆకుపచ్చగ నుండు తాజాకూరలందు (ముఖ్యముగ ఆకుకూరలందు)ను, నారింజ మొదలగు కొన్ని జాతుల తాజాపండ్లలోను విస్తారముగ గలదు. కాయధాన్యములందును, తృణధాన్యములందును ఈవిటమిను లేకపోయినను, వానిని మొలకకట్టినయెడల నం దిది పుట్టునని కనిపెట్టబడెను. ఈ విటమిను ఉష్ణతవలన చాలవరకు నశించును. గాలి తగులునట్లు ఉడికించిన నిది మరింతపూర్తిగ నశించును. కావున కూరలను మూతపెట్టి ఎంత స్వల్పకాల ముడికించిన నంత మంచిది. సీమవంగ, దోస, పొట్ల, ఆనప, బొండ మొదలగు కొన్ని జాతుల కాయలను అలవాటుచేసికొనుచో వండకుండగనే తిన వచ్చును. C విటమిను 'స్కర్వీ' అను రక్తసంబంధమగు రోగము రాకుండ కాపాడుటకే గాక, రక్తమును పరిశుభ్రముగ నుంచుటకును, పండ్లను, ప్రేగులను ఆరోగ్యముగ నుంచుటకును ఆవశ్యకము.

D విటమిను పాలు, పెరుగు, వెన్న, నేయి మొదలగు క్షీరపదార్థములలో మాత్రము గలదు. కొబ్బెరలోను, వేరుసెనగకాయలలోను స్వల్పముగ గలదు. కావున ఆహారమున నీపదార్థములు కొంతవరకుండవలెను. శరీరమునకు సూర్యకిరణములు సోకుటచేగూడ నీ విటమిను కొంతవరకు లభించునని కనుగొనబడెను. కావున శరీరమున కెండయును గాలియు తగులకుండ నెల్లపుడును దుస్తులతో కప్పియుంచుట మంచిది గాదని తేలుచున్నది. అందును ముఖ్యముగ చిన్నపిల్లలకు మిక్కిలి చిన్నదనముననే దుస్తులను తొడుగుట మరింత హానికరము. D విటమిను లోటువడునెడల ఎముకలును, పండ్లును బలహీనము లగును.

E విటమినుసంతానోత్పత్తికిని,సంతానారోగ్యమునకును ఆవశ్యకమని కనుగొనబడెను. కాని యిది యేయే పదార్థములం దెంతెంత గలదో అంతగా తెలియదు. ఇంకను F, G అను విటమినులుకూడ గుర్తింపబడినవి. కాని వీనినిగూర్చి యింకను పరిశోధనలు జరుగవలసియున్నవి.

పైని వ్రాయబడిన విషయములు చాలవరకు ఇదివరలో ఆరోగ్యప్రకాశిక మొదలగు పత్రికలందును, ఆహారవిషయ సంబంధములగు గ్రంథములందును వ్రాయబడినవే యయినను ప్రథమవ్యాసమునందలి మొదటి యనుబంధ పట్టిక నుపయోగించు వారిసౌకర్యార్థము ఇందు సంగ్రహించి వ్రాయబడెను.

కొందరు పాలనుగాని, పండ్లనుగాని, కొబ్బెరనుగాని ఒక్కొక్క పదార్థమును మాత్రమే తిని యారో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్యముగ నుండవచ్చునని యందురు. ఈవస్తువులలో నేది గాని ప్రత్యేకముగ ప్రథమవ్యాసమున వ్రాయబడిన యాహారనియమముల నన్నిటిని సమాధానపరుపజాలదు. కావుననే సామాన్యముగ నట్లు ఒకేవస్తువును దినువారు త్వరలోనే ఆపద్ధతిని విడువవలసిన వా రగుచున్నారు. మొత్తముమీద యాహారపదార్థముల సంఖ్యను విస్తారముగ పెంచకుండుట సౌకర్యమే యయినను, సాధ్యమయినంతవరకు వివిధములగు వస్తువులను దినుటచే ఒక దాని యందలి లోపమును మరియొకటి తీర్చుచుండుట కెక్కువ యవకాశము గలుగును.

పాలుమాత్రమే పుచ్చుకొను ౧౦౧ పా. బరువు గల మనుష్యుడు దినమునకు సుమారు ౨౻ సేర్లు పుచ్చుకొనవలసియుండును. అట్లు పుచ్చుకొనుచో మొత్తపు ఆహారపరిమితిలో లోటు రాకున్నను, శరీరమునకు కావలసిన ఇనుము పరిమితి చాలదు. మరియు, మాంసకృత్తుల యొక్కయు, సున్నముయొక్కయు, స్ఫురముయొక్కయు పరిమితి మితిమీరిపోవును. ఇట్లే పండ్లను మాత్రమే తినుచో ౧౦౦ పౌనుల తూనికగల మనిషి దినమునకు సుమారు ౧౫ అరటిపండ్లను, ౧౫ నారింజపండ్లను తినవలసియుండును. ఇట్లు తినునెడల, కర్బనోదజనితముల పరిమితి మీరి, చమురును, స్ఫురమును, ఇనుమును కొరవడును. ఇట్లే కొబ్బెరను (ముప్పేట కాయలను) దిను ౧౦౦ పౌనుల తూనిక గలమనుష్యుడు దినమునకు సుమారు ౧౪ ఔౌనుల కొబ్బెరను (సుమారు రెండు పెద్దకాయలను)తినవలసి యుండును. ఇట్లు తినునెడల కర్బనోదజనితములును, మాంసకృత్తులును కొరవడి చెమురు మితి మీరును.

ఇటీవల వార్తాపత్రికలలో వ్రాయబడుచు వచ్చిన వ్యాసములందలి కొన్ని యాహారపుపట్టికలుగూడ శాస్త్రనియమములకు సరిపడలేదు. శ్రీయుత బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారి సలహాపైని గాంధిమహాత్ముడవలంబించిన మొదటి పట్టికయందలి యాహారము (౮ తులముల గోధుమలు, ౮ తులముల బాదంపప్పు, ౮ తులముల ఆకుకూర, ౬ నిమ్మకాయలు, ౨ ఔౌన్సుల తేనె) సుమారు ౧౧౫౧ కాలరీల యుష్ణతనుమాత్రమే యిచ్చును. ఇది శరీరపరిశ్రమలేని ౮౫ పౌనుల కెక్కువ తూనికగల మనిషికి సరిపోదు. మరియొక పట్టికలోని యాహారము (గోధుమలు ౮ తులములు, బాదంపప్పు ౫ తులములు, కూర ౧౬ తులములు, ద్రాక్షపండు ౨౧ తులములు, నిమ్మకాయలు ౨, తేనె ౪ తులములు) కూడ పైని చెప్పినట్లు ౮౫ పౌనుల కెక్కువ బరువుగల మనిషికి చాలదు. మరియు పై రెండుపట్టికలందునుకూడ సున్నమును, స్ఫురమును కూడ కొరవడును. రెండవ పట్టికలో జేర్పబడిన ద్రాక్షపండు పరిమితి హెచ్చుగ నున్నది. చాలమంది కంతె పరిమితి యనుకూలింపదు. రామస్వామి గుప్తగారు (బెజవాడ) వ్రాసిన పట్టికలోని యాహారము ౧ ముదురు టెంకాయ (౮ ఔౌన్సుల కొబ్బెర), ౬ గుప్పెర్ల గోధుమలు (౬ ఔౌన్సులు), ౪ గుప్పెళ్ల సెనగలు ౪ (ఔౌన్సులు) ౬–౮ అరటపండ్లు (౨౪ ఔౌన్సులు) సుమారు ౧౪౧ పౌనుల బరువుగల మనిషికి సరిపోవును. కాని యిందు సున్నము లోటువడును. ఇందు ౧గుప్పెడు సెనగలను తగ్గించి సుమారు ౧ పావుసేరు పాలనుగాని 3/౪ సేరు మజ్జిగనుగాని పుచ్చుకొనుచో నీలోటు దీరును. ఇట్లేకొన్ని యితరపట్టికలందును కొన్నిలోపములుగలవు.

ఆహారమున కగు వ్యయముగూడ గమనింపదగిన ముఖ్య విషయములలో నొకటి. ప్రథమ వ్యాసమునందలి రెండవ యనుబంధమునందలి పట్టికలోని యాహారమునకు దినమునకు సుమారు ఆరణాలగును. III, IV, V అనుబంధములందలి యాహారమునకైనను, వెల యధికముగ నుండు బత్తాయి నారింజ పండ్లు గాక, తక్కువ ధరలకు బొప్పాయి, అరటి, సీమచింగ మొదలగు పండ్లను వాడునెడల, నంత కెక్కువ వ్యయము కాదు. పాలు, నెయ్యి, వెన్న మొదలగు వానిని వదలివేసి వానికి బదులు కొబ్బెరను దినుచో వ్యయమును ఇంకను తగ్గించవచ్చును. ఈ విషయమున రామస్వామిగుప్తగారి పట్టికకు పైని వ్రాసినట్లు కొంతమజ్జిగ జేర్చుచో మిక్కిలి చౌకయైన యాహారమేర్పడును. దినమునకు ౧౪౦ పౌనుల మనిషికి ౦–3–౬ కెక్కువ గాదు. ౧౦౦ పౌనుల మనిషికి దినమునకు ౦–౨–౬లె చాలును. జీర్ణశక్తి బాగుగ నున్నవారు దీని నవలంబించి చూడవచ్చును. కాని జీర్ణశక్తి బాగుగ లేనివారికి పాలు వెన్న మొదలగునవి మాని ముదురు కొబ్బెరను తినుట అనుకూలముగ నుండక పోవచ్చును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రబోధము

జి. జాషువ కవిగారు

కుక్కలకుఁ బందులకు లేని ఘోరమైన
యంటరాని తనంబు నీ కంటగట్టి
నమలి తినుచున్న భరత దేశమును జూచి
యతిశయించెద వేమోయి యాదిమాంధ్ర!

కుక్క కన్నంబు నట్టింటఁ గుడువఁ బెట్టి
పెంటదిబ్బంపయి నీకు విసరివేయ
జిరునగవు దేర దాని భుజించు నీదు
నోర్మి కెనయేది నీవు ధన్యుఁడవు సుమ్ము.

దప్పిచేత నీవు తన్నుకొనుచునున్నఁ
జెప్పరానివారు చేరవలవ
దనుచు బలుకునట్టి యదయులు గలచోటు
పాసిపోవ దేల? పంచముండ.

పుట్టఁ డానతోడఁ బూజ చేయఁబోవ
దరికిఁ జేరనీక తఱిమివేయు
అర్చకుండు భక్తు డందువా? ఆలాటి
దేవళంబులోన దేవుఁడున్నె.

చదువులేనివారు మదమాంసభక్షకు
లనుచు నిందచేతు రంతె కాని
చదువుకొన్న వారు సరస కేతెంచిన
నులికి పడెడువార లుండలేదె.

నీవు నిల్చుచోట నిలువంగ రాదంట
నీవు చేయు సేవ కావలె నట
ధర్మ మెంతవఱకు తలయెత్తెనో గుళ్లు
గోపురంబు లేమి కూర్పఁగలవా?

ధర్మమే జయంబు ధరణిలో ననుకొని
యూరకుందు వేల నోయి నీవు
ధర్మరాజుతోడ ధర్మంబు కడతేరె
ధర్మ మిప్పు డెందుఁ దగులఁబడియె.

వీథులెక్కి పెద్ద పిడుగులు పడినట్లు
బోధ సేయువారి మోముఁ జూచి
దేశభక్తులంచుఁ దృప్తిఁ జెందెద వేల?
మంచిరాళులన్ని మణులుగావు.

నీలో నెత్తురు చచ్చిపోయినది గా
నీ, యాదమాంధ్రా! రవం
తాలోచింపుము, కట్ట బట్ట? తినఁ గూ
డా? నీకుఁ బెద్దమ్మతో
నోలాడుంగద కొంప? నిన్నుఁ గని య
య్యో! యంచు బాష్పాంబువుల్
రాలం జింతిలు గాంధితో నిలువవే
రా! ధర్మయుద్ధంబునన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విద్వత్కవి ముడుంబ నరసింహాచార్య స్వామివారి చరిత్రము

మేడేపల్లి వెంకటరమణాచార్యులు గారు



విద్వత్కవి ముడుంబ నరసింహాచార్యస్వామిగారు.

మనప్రాచీనులైన భగవద్వర్ష నివాసులు చిరకాలమునుండి సర్వశాస్త్రములయందు, సర్వకళలయందు నద్వితీయులై యుండిరను నంశమునందరు నిర్వివాదముగా నొప్పుకొనుచున్నారు. అయినను వారి కొక గొప్ప లోపము కలదు. అది యెద్ది యనగా,—వాస్తవ చరిత్రాభావము (Absence of true historical account). ప్రాచీనగ్రంథకర్తల చరిత్రము నెవ్వరును వ్రాసిన వారులేరు. గ్రంథకర్తలును తమ చరిత్రమును వ్రాసియుండలేదు. పాణిని పతంజల్యాది మహర్షులు, వాల్మీకి కాళిదాసాది మహాకవులు నేకాలపువారో, యెచట నివసించిరో, యింక మరి యేగ్రంథములను రచించిరో ఆవృత్తాంతము మన కించుకంతయును దెలియదు. ఇట్టియాక్షేపమాంగ్లేయ గ్రంథకర్తలను స్పృశింపదు.

ఇదియు కాక మఱియొక్క విశేషముకూడ కలదు. ఏదేశమందైనను, ఏకాలమందైనను కవులు జీవించియుండగా వారియందు సమకాలికులైన జనుల కాదరము మందమై యుండును. కవిజనాగ్రణిగా నెన్నబడిన కాళిదాసు కూడ నీయంశమును తన మాళవికాగ్నిమిత్రములో నిట్లు వెల్లడించెను: "భాససౌమిల్లకవి పుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య కృతౌ కింకృతో బహుమానః."

శ్రీసింహాద్రినాథ కటాక్షవీక్షా సమాసాదిత నిరవద్య సకలవిద్యా వైభవుడు, శ్రీవత్స గోత్రోత్పన్నుడు, ముడుంబవంశజుడునగు శ్రీ నరసింహాచార్య స్వామి విషయమందు పూర్వోక్త దోషము పట్టకుండ నేను చిరకాలము నుండి యాతని శిష్యుడనై యుండుటచే నాతని చరిత్రమ నంతయును దెలుసుకొని యాకవిశిరోమణిరచించిన రామాయణ పీఠికయందు సంస్కృత భాషతో వ్రాసి పది సంవత్సరముల క్రిందట బ్రకటించితిని. ఇపుడు దానినే సంగ్రహించి తెలుగున వ్రాయుచున్నాను.

ఎల్లప్పుడతని సహవాసము చేసిన వారికి గాని తదితరుల కీతని లోకోత్తర ప్రతిభ తెలియదు. ఇతడు కూడ నొక పండితుడనియు, కవియనియు లోకులు సామాన్యాకారముగా దలంచుచుండిరి. ఈతడు మహా విద్వత్కవియే గాక అధ్యాత్మతత్త్వనిరూపకుడు. ఇదియే యీతని అత్యద్భుతకరమైన శక్తి విశేషము. ఈతడు శ్రీవైష్ణవకులోత్పన్నుడు; మహాపండితుడు. సకల విశిష్టాద్వైత వేదాంత గ్రంథములయందు నిష్ణాతుడైయున్నను శ్రీవైష్ణవజన సులభమైన స్వమతపక్షపాతమును విడిచి, శంకరబౌద్ధాది మత రాద్ధాంతకర్తలవలె కేవలతత్త్వగవేషియై



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కతత్పరుడై; పరస్పర విరోధముగల సకలోపనిషద్వాక్యములకు యథావస్థితమైన యర్థమును క్షురధారాతీక్ష్ణమగు స్వబుద్ధిచే విమర్శించి విప్రతిపన్న సగుణనిర్గుణ భేదాభేదాది విరోధము నతినిపుణము తొలగించి బ్రహ్మసూత్రములకు, దశోపనిషత్తులకు స్వయముగా విశదమైన వ్యాఖ్యానమును వ్రాసెను. తత్త్వైకాదశీ మొదలగు తత్త్వశాస్త్రములను రచించి స్వసిద్ధాంతమును వివరించెను. వ్యాపారాంతరములను విడిచి యెల్లపుడితనివలె నుపనిషద్వాక్య విమర్శ, జీవేశ్వర తత్త్వవిచారము నొనర్చుచు కాలము గడిపిన పండితశ్రేష్ఠు నింకొకరిని గానము. "యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ" అన్నట్లు సంసారాసక్తచేతస్కులయిన లౌకికులకు దారపుత్రాది పోషణార్థమై ధనార్జనావ్యాకులకర్మలయం దెట్టి ప్రీతి యుండునో అట్టి ప్రీతి యీ విద్వద్వర్యుని కీశ్వరతత్త్వచింతయందు, నీశ్వరోపాసనమందు కలదు. 1880 సంవత్సరము మొదలుకొని యాతని శిష్యుడనై యుండి దినమునకు నాలుగైదు గంటలాతనితో గడిపియుండుటచే నేనాస్వామి దినచర్యను, ప్రజ్ఞావిశేషమును, పాండిత్యాతిశయమును బాగుగా నెఱుంగుదును.

## నరసింహాచార్య స్వామి పూర్వులు

నరసింహాచార్య స్వామి పూర్వులు దాక్షిణాత్యులు; ద్రావిడులు. శ్రీభగవద్రామానుజానంతర కాలమందు స్థాపింపబడిన చతుస్సప్తతి పీఠస్థలలో ముడుంబై ఆచ్చాన్ అనునాతడొక ఆచార్యుడు. అతడే యీ ముడుంబవంశమునకు కూటస్థుడు. తొల్లి యీవాత్స్యముడుంబవంశ్యులు శ్రీయామునమునివర ప్రసాదలబ్ధపాండిత్యాతిశయము గలవారై గొప్పవారైరి. కాలక్రమమున నీ ముడుంబ వంశజులు దేహయాత్రానిర్వర్తనము కొరకు దక్షిణదేశ నివాసమును పరిత్యజించి యుత్తర దిక్కునకు బయలువెడలిరి. మరికొన్ని దినములకు వేదాద్రియందు ప్రవేశించి అచ్చటి రాజుచే నాదరింపబడినవారై స్వకుటుంబములతో సుఖముగా గొంతకాల మచట నివసించిరి. అక్కడ నున్న శ్రీవైష్ణవులతో యౌవనసంబంధములను గూడ జేసికొనిరి. ద్రావిడభాషను మరచిపోయి క్రమముగా నాంధ్రు లయిరి. ఇట్లు వేదాద్రిలోనున్న శ్రీవైష్ణవ కుటుంబములలో నొక కుటుంబమునకు వేదాచలపతియను నాతడధ్యక్షుడై యుండెను. అతడు తన ధర్మపత్నియగు కృష్ణాంబతో చిరకాలము గార్హస్థ్యసుఖము ననుభవించుచున్నను సంతతి లేనివాడైయుండెను. అంతలో వేదాచలపతికి వేదాద్రినారసింహుని కృపచే వేంకటవతియను నొక కన్యయు, నరసింహాచార్యుడను నొకపుత్రుడును పుట్టిరి. ఆ నరసింహాచార్యునకు వేదాద్రి, అతనికి కృష్ణామాచార్యుడు, అతనికి వీరరాఘవాచార్యుడు పుట్టిరి. ఇతడు వేదాద్రి సమీపమందున్న కిల్లురుప్ల గ్రామమందు నివసించియుండెను. ఇతనికి కృష్ణమాచార్యుడు, అజ్ఞాత నామధేయులైన మరి యిద్దరు పుత్రులును జనించిరి. ఈ కృష్ణమాచార్యుని వంశము సాహిత్యము వంశమని ప్రసిద్ధి నొందెను. అజ్ఞాతనాములైన కృష్ణమాచార్యుని సోదరులిద్దరు పిడుగురాయి గ్రామమందు కాపురముండి వైద్యజీవనముచే కాలము గడిపిరి. వీరలవంశము సంగీతముడుంబయని యిప్పటికి వ్యవహరింపబడుచున్నది. కృష్ణమాచార్యునికి రాఘవాచార్య సింగరాచార్య వేదాచార్యులను ముగ్గురు పుత్రులు, ముగ్గురు పుత్రికలును పుట్టిరి. (పేర్లు తెలియవు) కృష్ణమాచార్యుడాకాలమందు సంభవించిన క్షామపీడచే కుటుంబపోషణమందశక్తుడై కృష్ణామండలములోని యేలూరు గ్రామమునకు వచ్చి యచట కొంతకాలము నివసించియుండెను. కృష్ణమాచార్యుని పెద్దకొడుకయిన రాఘవాచార్యుడు యేలూరులోనున్న పండితులవద్ద కావ్యనాటకాలంకారాదులను జదివి సముచితమైన పాండిత్యమును సంపాదించి ఉభయభాషలలో జక్కగా కవనము జెప్పగలవాడయ్యెను. అతని కవితాధారకు, పాండిత్యమునకు సంతోషించి యేలూరులోనున్న ఉద్యోగస్థులందరాతనికి మాసభృతి యేర్పాటుచేసిరి. ఇట్లు కొంత ధనమును సంపాదించి రాఘవాచార్యుడు కుటుంబ భరణమందు తండ్రికి కొంత తోడ్పాటు గావించుచుండెను. ఇతడు తన తండ్రివలన హయగ్రీవమంత్రము నుపదేశము పొంది తీవ్రపురశ్చరణ చేసి శాంతి చేసిన నాటిరాత్రి హయగ్రీవస్వామి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యితనికి స్వప్నమందు ప్రత్యక్షమై, "వత్సా, నీకు విద్యాభివృద్ధి కాగలదు. నీకు భూలాభము కూడ గలుగును. ఇదే కాక నా కటాక్ష పాత్రుడు, మహాకవి, సకల శాస్త్రపారదృశ్వయు నగు పౌత్రు డొకడు నీ కిక ముందు జనించునని చెప్పి అంతర్హితు డయ్యెను. అప్పటినుండియు రాఘవాచార్యుడు స్వామియం దధికతర భక్తి గలవాడై తన్మంత్రమును ద్విగుణితోత్సాహముతో జపించుచుండెను. కాలక్రమమున గొప్ప విద్వాంసు డయ్యెను. కాలమిట్లు గడచుచుండగా, నీ ముగ్గురు సోదరుల తండ్రియగు కృష్ణమాచార్యుడు పరమపదమునకు విచ్చేసెను. కుటుంబము వృద్ధియగుటచే ప్రతిమాసమునకు వచ్చు రాబడి చాలక రాఘవాచార్యుడు దారిద్ర్యబాధ నొందుచుండెను.

ఈ కాలమందు విజయనగర రాజ్యపరిపాలకుడగు ఆనందగజపతీంద్రుని దత్త పుత్రుడగు విజయరాజ గజపతీంద్రుడు విజయనగర రాజ్యమేలుచుండెను. ఆ మహారాజు క్షీణదశ నొందిన శ్రీసింహాచల క్షేత్రము నభివృద్ధి నొందింప బ్రయత్నించి, స్థలాంతరమునుండి రప్పించి నలువది శ్రీ వైష్ణవ కుటుంబములను శ్రీ సింహాచల క్షేత్రమందు కాపురముంచెను. రాఘవాచార్యుడీ వృత్తాంతమును విని, వెంటనే విజయనగరమునకు బోయి మహారాజ జ్యేష్ఠసోదరుడగు సీతారామ రాజును జూచి తన కవితాచాతురిచే నాతని మెప్పించి, తదాజ్ఞచే స్వకుటుంబ పోషణమునకు చాలినంత మాసభృతి సంపాదించి, కుటుంబముతో శ్రీసింహాచల క్షేత్రమందు బ్రవేశించెను. ఇట్లు రాజదత్తజీవనులైన వైష్ణవులనేకులు శ్రీసింహాద్రిని జేరి సుఖముగా జీవించుచుండిరి. రాఘవాచార్యు డొకసంవత్సరమే అచట నుండెను. అంతలో కొందరు శీతజ్వరార్తులై భగవత్సాయుజ్యము నొందిరి మఱికొందరు జ్వరభీతిచే నితర గ్రామములకు జనిరి.

విజయనగరమునకు నలువదిమైళ్లదూరమందు పాలకొండయను చిన్న జమీందారీ కలదు. ఆ జమీందారునికి మంత్రియైన యొక బ్రాహ్మణుడు కూర్మరాజపురమను నొక అగ్రహారమును నిర్మించి, అచట విష్ణ్వాలయ ప్రతిష్ఠ చేయించి, దానిలో ద్రావిడవేద ప్రవచనపరులైన శ్రీవైష్ణవులకు గృహములను, భూములను దానము చేయుచున్నాడని విని, రాఘవాచార్యు డాగ్రామమున కరిగి యయ్యధికారిని జూడగా, నాత డితనికిగూడ నొకగృహమును, కొంత భూమిని ఇచ్చెను. అందుపైని రాఘవాచార్యుడు తన తమ్ముడగు వేదాచార్యుని ద్రావిడవేదాధ్యాపకునిగా నచట నుండ నియమించి, తాను ధనార్జనపరుడై దేశాటన మొనరించుచుండెను.

ఆకాలమందు కళింగనగరము చోళగంగు డను నామాంతరముగల అనంతవర్మ మహారాజుయొక్క రాజధానియై యుండెనని ముఖలింగ శివాలయపు గోడమీద నొక శాసన మున్నది. ఆపట్టణ మిపు డుత్సన్నమైనది. దాని స్థానమందు నగరకటకమను నొక చిన్నపల్లెటూరు లేచినది. ముఖలింగశివాలయము దానిలోనిదే. రాఘవాచార్యుని కాలమందు ముఖలింగము నగరకటకము ననంతవర్మచే పరిపాలితమైన పర్లాకిమిడి రాజ్యములో నంతర్భూతమైయుండెను. పర్లాకిమిడి రాజు నగరకటకమును, దానికి చుట్టుపట్ల నున్న గ్రామములను బల్లెఖాన పురుషోత్తముడను నొకసరదారునికి ముఖాసాగానిచ్చివైచెను. తనకున్న కొడు కొక్కడును హఠాత్తుగా పరలోకగతుడగుటవలన పురుషోత్తముడు పట్టజాలని దుఃఖముచే విరక్తుడై తన కనంత వర్మ యిచ్చిన భూములను బ్రాహ్మణులకు దానమిచ్చుచున్నాడనివిని, రాఘవాచార్యు డాయూరికి బోయి పురుషోత్తమునిజూచి, తన కవిత్వపాండిత్యములచే నాతని సంతోషపెట్టి యాతనివలన అచ్యుతపురమను నొక అగ్రహారమును, గృహమును బడసి యచటనే స్థిరముగా నివసించియుండెను. ఈ సమయమందే విజయనగరమహీపాలుని అన్నయగు సీతారామరాజు రాఘవాచార్యునికి వంశధారానదీతీరమందు మఱికొంతభూమినొసంగెను. రాఘవాచార్యు డిట్లు తాను సంపాదించుకొన్న భూమిలో కొంతభాగమును తనబంధువులకు పంచియిచ్చి వారి నచట స్థిరపరచెను. అతనికి ముగ్గురు కొడుకులు, పుత్రిక లిద్దరు పుట్టిరి. కుమారులలో నగ్రజుడు నరసింహాచార్యుడు. ఇతడును మహాకవి, విద్వాంసుడును. గరుడాచలచంపూకావ్యమును, సారంగధర చంపూకావ్యమును



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రచించెను. కనిష్ఠుడు వరాహస్వామి. జ్యేష్ఠుడైన నరసింహా చార్యున కొక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు పుట్టిరి. కనిష్ఠుడైన వరాహస్వామి కొక కుమారుడు, నలుగురు కుమార్తెలు పుట్టిరి. వీరి తండ్రియగు రాఘవాచార్యుడు వార్ధకదశలో నున్నవాడైనను, కొడుకులు, కోడండ్రు, మనుమలు, మనుమరాండ్రు మొదలగు వారి వృద్ధిని జూచి సంతసిల్లుచుండెను. రాఘవాచార్యుని జ్యేష్ఠపుత్రుడగు నరసింహాచార్యుని కుమారుడు వీరరాఘవాచార్యుడు రంగమాంబయను సాధ్వీమణిని పెండ్లియాడెను.

## నరసింహాచార్యస్వామి జననము

ఇట్లు కాలము జరుగుచుండగా 1841 సంవత్సరము సెప్టెంబరు 22 తేదీకి సమానమైన ప్లవసంవత్సర భాద్రపద బ॥ నవమినాడు రంగమాంబ యొక పుత్రుని గనెను. ఆతడే యీవ్యాసమునకు నాయకుడు. ఈతని పేరే నరసింహాచార్య స్వామి. ఈతడు జనించిన మరి మూడు సంవత్సరములకు క్రోధి సంవత్సర మా. బ॥ చవితి నాడు రంగమాంబ ద్వితీయ పుత్రుని గనెను. ఈతని పేరు వరాహస్వామి. ఈ కుమారులిద్దరు బాల్యములో నుండగా వీరి తండ్రి రాఘవాచార్యుడు భగవత్సాయుజ్యము నొందెను. వీరి పితామహుడు నరసింహాచార్యుడు విధవయగు కోడలిని, మనుమలను జాగరూకతతో సంరక్షించుచు, విద్యాభ్యాసోచితవయస్సు వచ్చిన పౌత్రులను తానే స్వయముగా కావ్యనాటకాలంకారాదులను జదివించి యొకరీతి పండితులగావించెను. ఆ యన్నదమ్ము లిద్దరిలో నీనృసింహాచార్య స్వామి బాల్యము మొదలుకొని అసాధారణ మేధాశక్తిసంపన్నుడు. రక్తకంఠుడు, వావధూకుడునై శ్రోతృజన శ్రోత్రరంజకముగా భారత భాగవత రామాయణాదులను జదువుచుండెడివాడు. తన సహాధ్యాయి యగు మరంగంటి కూర్మాచార్యులవద్ద నాంధ్రఛందస్సును నేర్చుకొని పదునొకండవ వత్సరమందే అనర్గళముగా కవనము జెప్పదొడగెను. అచ్యుతపురాగ్రహారనివాసి యగు అప్పన్నయను కుట్టుపనివా డొకనాడు పట్టుగుడ్డతో నొక సంచిని కుట్టి వీథిలోనికి దెచ్చి అమ్మజూపెను. ఈ బాలకవి యాపనివానిచేతిలో నాసంచిని జూచి దానియం దభిలాష గలవాడయ్యెను. గాని చేతిలో రొక్కము లేనందున నూరకుండి వానిపై నొక పద్యము రచించి చదివెనట.

క. మునియాగరక్షకుండును,
మునిపత్నీ రక్షకుండు మోదముతోడన్,
నినుగనుగొని బ్రోచుసుమీ,
దరిజీ అప్పన్న నాను సద్గుణధామా.

(బాల్యమగుటచే ఛందోలక్షణము బాగుగ నెఱుగడు గావున ప్రాస తప్పిపోయినది.) ఆపనివా డీ బాలకవి పద్యమును విని విస్మితుడై సంచిని ఊరక యిచ్చివేసి తన యింటికి బోయెను.

ఇట్లు నరసింహాచార్య స్వామి తన కవనచాతురిచే పండితులకు గూడ నాశ్చర్యము గలుగజేయుచు, జదువవలసిన గ్రంథముల నన్నింటిని తన పితామహునివద్ద జదివి, కవనమందు, శాస్త్రపాండిత్యమందు పూర్ణుడయ్యెను. అచ్యుత గ్రామవాసియగు నొక బ్రాహ్మణునివద్ద సంగీతము కూడ నేర్చెను. ఈతని తమ్ముడగు వరాహస్వామి యీతనివద్దనే సకల సాహిత్య గ్రంథములను జదివి పండితు డయ్యెను. ఈ వరాహస్వామి శఠకోపమంత్రమును తీవ్రముగా పురశ్చరణ మొనరించి మంత్రసిద్ధి నొంది, స్వప్నసాక్షాత్కృత శఠకోపుడై, ద్రావిడ భాషామయములైన శ్రీవైష్ణవమత గ్రంథములయం దసమానపాండిత్యమును బడసెను. తీర్థయాత్రాభిలాషచే దక్షిణదేశమునకు బోయి యచట నొక సంవత్సర ముండి, అచటి పండితులతో సహవసించి వారివలన ననేక మతసంప్రదాయములను గ్రహించి యాంధ్రదేశమందే కాక ద్రావిడదేశమందు కూడ నీ ద్రావిడ గ్రంథములయందు నిరుత్తరుడని ప్రసిద్ధిని గాంచెను. వందలకొలది శ్రీ వైష్ణవులకీ మత గ్రంథముల నుపదేశించి తనతో సమానపాండిత్యము గల వారినిగా జేసెను. ఇపుడా వరాహగురుని శిష్యులు దేశమం దంతట వ్యాపించియున్నారు.

## రాజసందర్శన వృత్తాంతము

కాలక్రమమున నీ నరసింహాచార్య స్వామి అంకురితయౌవనుడై కవితామాధుర్యముచేతను, గానమాధుర్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచేతను వినువారి వీనులకు విందొనర్చుచు పద్యములను, శ్లోకములను రచించుచు గొంతకాలము స్వగ్రామమందే నివసించియుండెను.

ఒకప్పు డీతడు తాతగారి పనుపున వార్షికము దెచ్చుకొనుటకు మందసాగ్రామమునకు బోయి యచటి జమీందారుని జూచెను. ఆ జమీదారు డీతని పాండిత్యమునకు, కవితాశక్తికి మిక్కిలి సంతోషించి వార్షికముకంటె నెక్కుడు పారితోషికము నిచ్చి సత్కరించెను. మఱియొకప్పు డీ బాలకవి నొక చుట్టము వావిలవలస గ్రామమునకు దీసికొని పోయెను. బొబ్బిలి జమీదారుగారి కాసన్న బంధు వగు వావిలవలస జమీదారుని జూచెను.ఆ జమీదారుని పేరు సీతారామయ్య. అతడు స్వయముగా విద్వాంసుడు, విద్వదభిమాని; రామానుజ సిద్ధాంతమం దభినివేశము గలవాడు. ఆతనిపై నీ బాలకవి చెప్పిన పద్యములలో నొక దాని నీదిగువ నుదాహరించు చున్నాను:

తే. గీ. వెండికొండకు నీకీర్తి వెలిగలీబు
పాలకడలికి మీగడ పవికిదళుకు
శశికిదనకందు మానుపజాలుమందు
కొన డదేలొకొ శ్రీరామకువలయేశ

వావిలవలస జమీందారు డీకవిశిఖామణిని దన యాస్థానమం దుంచుకొనవలయునని మిక్కిలి యభిలాష గలవాడై, యిదివరకు తన పండితుడైయున్న కాండూరి రామానుజాచార్యులను బిలిచి యీనరసింహాచార్యస్వామి మనపండితుగా నుండుటకు బోధపరుచుడని యాజ్ఞాపించెను. కాని రామానుజాచార్యు లెన్ని విధముల బోధించినను నరసింహాచార్యుడు వావిలవలసలో నుండుట కిష్టపడనివాడై యాపండితునితో నిట్లనియె: "అయ్యా! కొంతకాలము క్రిందట విజయనగరమహీపాలుడగు విజయరామగజపతి మహారాజు మృగయావినోదార్థమై పాలకొండ గ్రామమునకు సమీపమందున్న అరణ్యమునకు వచ్చియున్నపు డాతని జూచుటకు బోయియుంటిని. మహారాజ నర్మసఖుడగు గొట్టుముక్కల కృష్ణరాజు సహాయముచే మహారాజ సందర్శనముచేయ గలిగితిని. మృగయావర్ణన చతురములైన నాపద్యములను మహారాజు విని మిక్కిలి సంతసిల్లి, తమరాజధానియగు విజయనగరమునకు రమ్మని న న్నాజ్ఞాపించెను. తదాజ్ఞానుసారముగా నేను విజయనగరమునకు వెళ్లి ప్రభుసన్మాన పాత్రుడగు జమ్మి వాసుదేవరావుపంతుల పురుషకారబలముచే కుమార మహారాజైన ఆనందగజపతీంద్రుని దర్శనము చేసితిని. ఆతడు నాకు దర్శన మొసంగి దర్శనసభయందున్న రమ్యవస్తులను గనపరిచి పద్యములచేతను, శ్లోకములచేతను వానిని వర్ణింపు మనెను. నే నాక్షణమందే ఆశుధారగా శ్లోకములను, పద్యములను చెప్పి వర్ణించితిని. కుమార మహారాజు నాయందు ప్రీతిని జూచి నన్ను తన వద్ద నుంచుకొనుటకు సంకల్పించెను. తండ్రిగారితో చెప్పి జీతముకూడ చేయించెదనని వాగ్దానము చేసెను. ఇంతలో మహారాజావారు సకుటుంబముగా గాశికి విచ్చేయుట కుపక్రమించి ప్రస్థానము చేసిరి. ఆతరువాత నేను రాజాలనని మనవిచేసితిని. వత్సరాంతమందు మేము కాశీనుండి రాగానే మరల వచ్చి మాదర్శనము చేయుమని సెలవిచ్చిరి. అందుచే నేను రాజాంతరము నాశ్రయించుట కుత్సహింప" ననెను. ఈయనతల్లి రంగమాంబ కుమారుడు వావిలవలసలో నుండుట కిష్టపడక పోవుటను, జమీందారుడు నిర్బంధించుటయును జూచి దేహయాత్ర జరుపుకొనుటకై మన మిచట గొంతకాల ముండక తీరదని కుమారుని నిరోధించెను. ఈయన పితామహుడు నరసింహాచార్యుడుకూడ "నీ విక్కడ కొంతకాల ముండి రామానుజాచార్యులగారివద్ద బ్రహ్మసూత్ర భాష్యమును జదువుము. ఈగ్రంథమును జదువుట కింతకంటె మంచి సమయము నీకు దొరక"దని మనుమనికి బోధించెను. ఇట్లు నరసింహాచార్యుడు తనతల్లి, తాత చెప్పిన మాటపైని వావిలవలసలో నుండుటకు సమ్మతించి, రామానుజాచార్యులవద్ద బ్రహ్మసూత్ర భాష్యమును జదువ నారంభించెను. జమీందారు డీతనియం దత్యాదరము గలవాడై నిత్యము చాలినంత భోజనసామగ్రినిచ్చుచు నొక యింటిలో గాపుర ముంచెను. ఈరీతిగా నచట గొంతకాలము నివసించియుండి శ్రీభాష్యమును ముగించెను. ఆసమయమందు పితామహుడు నరసింహాచార్యుడు పరమపదించెను. అంత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లో క్షామబాధ తొలగి పంటలు బాగుగా ఫలించినవి. అప్పటికి నరసింహాచార్యస్వామి యిరువది రెండేండ్ల ప్రాయము గలవాడై యుండెను.

## దక్షిణదేశ ప్రయాణము

౧౭౪౪ సంవత్సరమునకు సరియైన రక్తాక్షి సంవత్సర మాఘమాసములో కూడ బెట్టిన భూమి శిస్తును మార్గ వ్యయముక్రింద నుపయోగపర్చుకొని కుమారుల నిద్దరిని దీసికొని రంగమాంబ దక్షిణదేశ యాత్రకు వెళ్లెను. క్రమముగా దక్షిణదేశమందున్న శ్రీ రంగ శ్రీ ముష్ణయాదవాద్రి, శేషాద్రి, కరిగిరి ప్రభృతి దివ్యదేశములను సేవించి మరల శ్రీరంగమునకు వచ్చి యచట గొంతకాలము నివసించి తన కవనచాతురిచే పండితులను మెప్పించి శ్రీరంగనాథుని విషయములో "క్షీరభవత్తృష్ణ రంగేశవేమకృష్ణ" అను మకుటముగల యొక శతకమును, స్తోత్రములను రచించెను. (ఈ శతకమును వావిళ్లవారు చెలికాని లచ్చారావుగారు తమ శతక సంపుటములయందు బ్రకటించిరి.) ఇట్లొక సంవత్సరము తీర్థయాత్రచే గడపి నరసింహాచార్యుడు స్వజనముతో మరల సింహాద్రికివచ్చి స్వామిని సేవించి విజయనగరము జేరెను.

## విజయనగరప్రవేశము మహారాజు సందర్శనము

ఇంతలో మహారాజావారు కాశీనుండి మరలి వచ్చిరి. గొట్టుముక్కల కృష్ణరాజుగారి సహాయముచే నరసింహాచార్యస్వామి ఆనందగజపతి మహారాజావారి దర్శనమునకు బ్రయత్నించెను. కృష్ణరాజు మహారాజు వద్దకు జని నిటుకు ప్రభువువారి దర్శనముచేసిన కుమారకవి నరసింహాచార్యుడిపుడు మరల దర్శనమునకువచ్చియున్నాడని మనవిచేయగా వెంటనే హుజూరుకు రప్పించి రెండు మూడుదినము లత్యద్భుత కల్పనలతోగూడిన ఆంధ్రగీర్వాణక వనమును విని ఆశ్చర్యపడి యిటుపైని మీరు నిత్యము ముందుగా బకీరుచేసుకొన నక్కరలేకుండ మాసన్నిధికి రావచ్చునని సెలవిచ్చిరి. ఇట్లు కొన్నిదినములు గతించిన తరువాత యాత్రాశాంతి జేసుకొనుటకు స్వగ్రామమునకును బోవుటకై సెలవిమ్మని నరసింహాచార్యుడు మహారాజు నడుగగా 'మీతమ్ముడు మొదలగువారిచే మీ గ్రామమందా యాత్రాశాంతిని జేయింపుడు. మీరిపుడు పోవల దని ప్రభువు వా రాజ్ఞాపించిరి. ఆనందగజపతీంద్రు డీతనియం దనుదినప్రవర్ధమాన మగు ప్రీతి గలవాడై కాలమునంతయు నీతనితో గడుపుచుండెను. కుటుంబ వ్యయములకు రెండువందల రూపాయీలనిమ్మని మహారాజు కోశాధ్యక్షుని కాజ్ఞాపించెను. అయిన నయ్యధికారి సొమ్మిచ్చుటయందు విలంబము చేసెను. పలుసారులడిగిన నుపేక్షించుటచే కుపితుడై స్వాదుజలపూర్ణమగు తటాకమందు మొసలివంటివాడని యయ్యధికారిని నిందింపగా నతడు ప్రభువుతో ఫిర్యాదు చేసుకొనెను. అపుడు ప్రభువువారు మన కవిపుంగవుని బిలిపించి మీరీతనిని క్షమింపుడని సెలవిచ్చిరి. అందుపైని నరసింహాచార్యుడు సాంత్వవచనములచే బ్రసన్నుని జేసుకొనగా నతడా సొమ్మిచ్చెను. అట్టి ధనసహాయముచే మన కవీంద్రుడు తల్లి తాను తమ్ముడు సుఖముగా కాలము గడపుచుండెను.

కాలమిట్లు నడచుచుండగా మహారాజావారు ప్రతి సంవత్సరము శ్రావణములో చేయించుచుండెడి కృష్ణలీలా మహోత్సవ మపుడు తటస్థించెను. తదుత్సవావలోకన కుతూహలియై విజయరామగజపతిమహారాజ పుత్రుడైన ఆనందగజపతితో నుత్సవార్థమై వేసినడేరాలో నమర్చిన గద్దెమీద గూర్చొని రాజవల్లభులలో (Courtiers) నృత్యగీతాది వినోదములను జిత్తగింపుచుండగా కుమారమహారాజు తండ్రిగారి కభిముఖుడై "బాబాజీ! మహావిద్వాంసుడు, కవనమం దప్రతిద్వందుడు, రక్తకంఠుడు పురాణము చక్కగా జదువగలవాడు నగు నొక శ్రీ వైష్ణవ కుమారుడు నన్నాశ్రయించుకొని యున్నవాడు, తమదర్శనము నభిలషించుచున్నవాడు. అతనికి సెలజీత మేర్పాటుచేయించుటకు నా ప్రార్థన" అని మనవిచేసెను. అది విని విజయరామక్షితీశు డత్యాదరముతో నీకవిప్రకాండుని దగ్గరికి బిలిచి నమస్కరించి మాటలాడ దొడగెను. నృసింహాచార్యుడపుడు మహారాజ విషయమై రచించిన శ్లోకములను, పద్యములను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## నా ఐరోపాఖండయాత్ర చిత్రములు




3. 'లస్టు గార్డెను' అను మ్యూజియము-బెర్లినునగరము



౪. బెర్లిను క్రైస్తవదేవాలయము-బెర్లినునగరము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౫. బెర్లినునగరమున శ్రీ వంగల వాణీబాయిగారు తనభర్త శ్రీ శివరామముగారి ప్రయాణించిన బస్సు
(ఇందు దంపతులు '21' అను అంకెలకు ఎగువ గలరు.)



౬. శ్రీయుత వంగల శివరాముగా రుపన్యాసముల నొసంగిన భవనము.
ఇచ్చట అఖిలప్రపంచవిద్యావిషయక మహాసభ జరిగినది.
ఈ భవనము 'స్విట్జరుల్యాండు' దేశమునందలి జినీవాపట్టణమున నున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రక్తకంఠముతో జదివియర్థము జెప్పెను. వానిలో రెండు పద్యముల నిచట స్థాలీపులాకన్యాయముగా కనబరుచు చున్నాను. తక్కినవి దొరకలేదు.

ఉ. ఈ జగమందు నిందునటు
　　లెల్లరకుం గనువిం దొనర్చు పై
యోజ గనంగ రా జనుట
　　కుల్లము సందియమొంద దిందునన్
రాజనుమాట మా విజయ
　　రామనరేంద్రునకే భాసంగు పై
రాజులు శోకవహ్ని మది
　　రాజుట రాజు లనంగఁ జెల్లెడిన్.

క. ఢక్కాఢఢ్ఢాంకరణరవ,
　ఛక్కాల్ఫణిపఫణమణినిపతనజకూల
　స్ఫుక్కర్ణ కుహరఘుర్ఘుర
　ముక్కోలపభీకగు ప్తముఖహార్మేంద్రా.

ఈపద్యములను విని పెద్ద మహారాజా వారు మిక్కిలి సంతోషించిరి. కవిని శ్లాఘించిరి. అతిమధుర స్వకంఠరవకబళిత వారాంగనాగానకోలాహలుడై నరసింహాచార్యుడు మహారాజాజ్ఞచే సంస్కృతభాగవతమును జదివి యర్థము జెప్పెను. మఱి రెండుమూడు దినములలో నుత్తమపండితోచిత వేతనము నను గ్రహించిరి. అది మొదలుకొని ఆనంద గజపతీంద్రుని యాస్థానమందున్న పండితు లందరిలో నగ్రేసరు డాయెను. మహారాజీతని వద్ద భర్తృహరి మొదలగు గ్రంథములను జదివి యీతని యం దాచార్యప్రతిపత్తిజేసెను. ఈ నృసింహాచార్య స్వామి రాజాస్థానమందున్న పండితబృందమం దగ్రాసనము నాక్రమించెను. ఈతని యాధిక్యమును జూచి యితర పండితు లసూయావిష్టు లగుచుండిరి గాని ప్రభు గౌరవముచే పైకేమియు ననజాలకపోయిరి.

ఒకమారు కూరెళ్లరామశాస్త్రి యను పండితు డొకడు నరసింహాచార్యస్వామిని పరిభవింపదలంచి "ఉమాముఖం చుంబతి వాసుదేవః" అను సమస్య నిచ్చి దీని నిపుడే పూర్తిచేయుమని కోరెను. స్వామి క్షణమాత్ర మాలోచించి పూర్తిచేసి యా శ్లోక మిట్లు చదివెను.

"భవిష్యదీశోపయమం విచింత్య హిమాలయస్యాలయ మేత్య కింతే,సు తేతిచోద్ధృత్య శిశుత్వముగ్ధ ముమాముఖం చుంబతివాసుదేవః." శాస్త్రిదీనిని విని సంతోషించెను.

మహారాజాస్థానమందున్న పండితులలో నొకడు మార్కండేయ పురాణము నాంధ్రీకరించిన మహాకవి, ప్రతిపక్షులను నిరసించుటయందు ప్రవీణుడు నగు మండ చిట్టికామశాస్త్రి యొకనాడు వసుచరిత్రములోని "ఆతన్వంగి యనంగ ఝుంకరణ వజ్జ్యాము క్తచూతాస్త్ర ని,ర్ఘాతంబోర్వక తమ్ములంచుఁ దటినీగర్భైకసంజాతకం, జాతవ్రాతము మాటుజెంద నవి యేచన్నాగె మున్మున్నుగాఁ,జ్ఞాతిచ్ఛేదనలేనకిమ్మనెడి వాచారూఢినిక్కంబుగన్" అను పద్యమును జదివి తమ్ములనుచోట శ్లేషపోకుండ నొక సంస్కృత శ్లోకముచే ననువదింపుడని నియోగించెను. ఆ మరుసటిదినమందు మన కవిపుంగవుడు "తన్వంగీకుసుమాస్త్ర ఝుంకరణ వజ్జ్యాఘాతచూతాశుగాద్భీతాః కిం శరణంభవేదిహాను మేత్యాలోచ్యనద్యాంజనేః సాకంజాత మవేక్ష్యపద్మమభజ త్తద్బాధతే హంత తాం జ్ఞాతిచ్ఛేదన లేన కింవద ఇదం స్వార్థాత్కథం ప్రష్ఠతేత్" అని శ్లోకమును రచించి కనపరచగా శాస్త్రి తృప్తుడైనట్లు కనపడలేదు. తరువాత మఱిరెండు మూడు దినములకు "ఈశః కనస్వీకృత కాంచనాంద్రిః కుబేరమిత్రం రజత చలస్థః, తథాపి భిక్షాటన మస్య జాతం విధా శిరస్థ్సే కుటిలే కుతస్స్యాః" అను విశ్వగుణాదర్శ శ్లోకమునుదీసి దీనికి సరియైన తెలుగు పద్యమును రచింపుమని యడిగెను. స్వామి అప్పటికప్పుడు "క. హరుఁడు కరధృతకాంచన, ధరుఁడు ధనదసఖుఁడు రజతధరణీ ధరమం, దిరుడయ్యు భిక్షమెత్తెడు,శిరమెక్కిన వంకవేల్పు సిరిఁ జెరచదొకో" అనుపద్యమును రచించి చదువగా శాస్త్రి యీ పర్యాయము మిక్కిలి మెచ్చుకొనెను.

తరుచుగా నాస్థానమందున్న పండితులు కొందరు స్వామికవిత్వచ్ఛాయ ననుసరించి రచించిన శ్లోకములను, పద్యములను మహారాజు శ్లాఘించుట జూచి సహింపక నరసింహాచార్యస్వామి యొకనాడుత్ప్రాసగర్భముగా నీ దిగువ శ్లోకమును జదివెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"భూభృన్మహిమ్నా పాషాణాః ప్రతిశబ్దాన్ప్రకుర్వతే; సాంప్రతం మూలశబ్దేభ్యః ప్రతిశబ్దేషు కౌతుకమ్."

దీనితో వారందరు తెల్లపోయిరి.

1896 సంవత్సరములో మహారాజావారిచిరంతన మిత్రుఁడువైశ్యకులోత్పన్నుఁడు నాంధ్రకవియునగు రాజామణిశ్రేష్ఠియను నాతఁడు చెన్నపురినుండి వచ్చి ప్రభుసన్మానితుఁడై కొంతకాల మిచట నివసించియుండెను. ఆసమయమం దాతడు నరసింహాచార్యస్వామితో దృఢపరిచయముగలవాఁడై, యాతని కవనశక్తికి విస్మితుడగుచు నొకనాడు తన ప్రశస్తినిసూచించు పద్యములను గొన్ని రచించియిమ్మని కోరెను. అందుపైని స్వామి యీ దిగువ వ్రాసినపద్యమును రచించి యిచ్చెను.

శా. వ్యాయామంబుల రాజఖేలనముల న్వాక్యోపపత్త్యామలన్, భూయో నైపుణమంది సద్రసికతా భూమాంతరంగాఢ్యుఁడై మాయాతీతసువృత్తిచే మెలఁగు సమ్యజ్జ్ఞాని రాజామణి, శ్రేయోనామ కవీంద్రుఁ డొప్పె విబుధశ్రేణీ మనోహ్లాదియై.

ఈ పద్యమును దీసికొనిపోయి శ్రేష్ఠి మహారాజునకు జూపెను. ఆనాఁటిసాయంకాలము మహారాజు పైకి సవారివిచ్చేయుచు స్వామినిబిలిపించి తత్పద్యాక్షర సంఖ్యాసమసంఖ్యములగు నూటయిరువది యెనిమిది రూప్యములను పారితోషికముగా నొసంగెను.

ఇట్టి మహనీయుడు పండితామక భూజము, దాంతుడు, శాంతుడు, సర్వవిద్యాపారంగతుడు, సకలభాషాకోవిదుడు నగు ఆనందగజపతి మహారాజు ప్రజాదౌర్భాగ్యముచే ౧౮౯౭ సంవత్సరపు మేనెలలో స్వర్గస్థుడాయెను.

ఇట్టి పోషకుడు గతింపగా నరసింహాచార్యస్వామి నిర్విణ్ణుడై, నిరుత్సాహియై వైరాగ్యమునొంది యెల్లపుడు భగవదుపాసనముతో కాలము గడపుచుండెను. ఇతనికి సింహాద్రినాథు డిలువేల్పు. ఈతడు రచించిన గ్రంథముల నన్నిటిని ఆస్వామి కంకితము చేసెను. ఈతడు నారసింహమంత్రోపాసకుడు. ముప్పది సంవత్సరముల వయస్సులోనుండగా నొకనాటిరాత్రి యీతనికి వేదవ్యాసులవారు స్వప్నమందు సాక్షాత్కరించిరి. నాటినుండి యీతి డార్షప్రతిభ గలవాడయ్యెను. విజయనగరమునకు దగ్గరగానున్న నల్లచెరువుమెట్టలలో నొక మెట్టమీద నాలయమును నిర్మించి దానిలో వేదవ్యాసులను కేశవస్వామిని ప్రతిష్ఠచేయించెను. ఆ దేవళమునకు సంస్థానమువారు స్వామి భోగరాగాదులక్రింద నెలకు ముప్పదిరూపాయ లిచ్చుచున్నారు. ఈతనికి భగవత్కవియని బిరుదు. ఇట్టి మహాభావు డెనుబదియేండ్లు జీవించి ౧౯౨౭ సం॥ సెప్టెంబరు ౨౨ తేదికి సమానమైన ప్రభవ సం॥ భాద్రపద బ॥ ద్వాదశిరోజున రాత్రి యెనిమిది గంటలవేళ భగవత్సాలోక్యము నొందెను

ఈ కవిపుంగవుని యాంధ్రగీర్వాణ కవనము దిక్ప్రదర్శనముగ సూచింపఁబడుచున్నది.

## గజేంద్ర వ్యాయోగము :

మలయపవన వీచీ నర్త్యమానాస్సతాడం, శుకపికమధులిడ్భి ర్గాప్యమానాశ్చ పశ్చాత్; లలిత మథినయన్త్యః పల్లవై రుల్లలద్భిః, విదధతి హరిశైలం వీరుధస్సోత్సవా న్నః.

సుమద్రవసపీతిసంభవ రసాకషాయః పరం పురున్మలయసంభవో నికృతి మంత్ర రాలోనయన్; స్ఫుటద్భిరథ చంపకైః కటుకగంధభాగుత్పల న్నమూమహలీనదీ దళ దుపేత్య పుష్పాణివ.

## మందహాస స్తవము :

హాసఃపరత్వ పరిలంబన జృంభితేన స్తంభేన మంజరదనచ్ఛదపాశబద్ధః; తద్బంధనంహరిప తే శ్లథయ న్నముక్తో మహాగ్ధ్యా దృశో ర్వినను తేనువిలంఘునాని.

గోపీపతేః కిసలయాధర దివ్యకాంతి సక్రాంతితోను హరిశైలపతే ష్స్మభోస్థా; శోభోత్కటౌ దృగనుయోగనివారణాయ హాసోవకుంఠయతి హంతనిజప్రభాభిః.

## నఖ స్తవము :

సింహాద్రీశ పదారవింద నఖరచ్ఛాయాస్తు యా గోపితా స్సింహాద్రేః ప్రవహంతి నిర్ఝరఝరీ కూటేన తామే హృది, గుప్తా భూమిభృతీవ యత్ర హృదయా త్తస్మాత్కవిత్వచ్ఛలా న్నిర్యాంత్యానన గహ్వరా న్మమకేకిం తారతమ్యం భవేత్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాగో ఽయం మధురాధ రే క్షిపతిమాం సింహాచలాధీశ తే జ్ఞానం త్వత్పదపద్మ శుభ్రనఖర జ్యోత్స్నామఘః కర్షతి, భోసింహాచలనాథ పాహి లలితం ద్వేధాశ్రమాపాదనా ద్యత్రార్తాశ్ర స్థితి రస్య తత్ర వసతిం దేహి ప్రభో మాచిరమ్.

## వాసుదేవ స్తవము:

గంభీర మేవ నిగమేషు రహస్యభావా దుక్తం పరం తవపదం భవతైవహంస, స్పష్టం నిరూపిత మరూపమలోక చక్షు ర్గాహ్యాశ్త్వతః సరస లోలతయా త్వయాకిమ్.

బద్ధాదరేపి పృథులే నిశిదీప్యమాన స్సాథే ప్రకాశే ఇవ దీపగణస్యరంధ్రైః, పూర్ణ స్తవాపి భువనే వసువాసుదేవ చ్ఛన్నో ఽప్యపాయవివరైః స్ఫురతిప్రకాశః.

## ప్రౌఢాశృంగారము

సీ. లికుచాకృతికుచావృతికచారు వికచాకు
　　లకచాళిముకులాళినకలుదెలుప
కరభాతిపరిభూతికరభూతికరభోరు
　　వుల జారి శ్రమవారి యొలపుబెనుప
ససమానబిసమానలసమాన భుజవల్లి
　　సుమపల్లవమతల్లి చెమటలొలయ
మృదుబింబమదడంబరదమంబు లొదవించు
　　పదును లింపొదవు కెంబెదవి హెచ్చ
లసదసమశరశింజి నీరసితనిశిత
దసితవిసృమరకింకిణీ విసరరుచిర
మసృణమణిరశనాఘృణి మంజుజఘన
యగుచు నగుచు మగువ మగవగల మిగిలె.

ఉ. బంభరసంగిసంగిరద
　　భంగురరింగదనంగసింజినీ
జృంభణ దూలు వాలుజడ
　　చెట్టుచెటేలన డింభకుంభభృ
త్కుంభకడింభహారికుచ
　　కుంభవిజృంభదురస్స్ఫురత్పరీ
రంభ మొసంగు రూపజిత
　　రంభ విశుంభదదంభసంభనర్.

తే. గీ. దుర్లభము నీదుమోము కందోయి కెపుడు
　　సులభ మఖిలేక్షణములకు సోమబింబ
　　మంబురుహనేత్ర యోలమోలంబులేవిః
　　నీశ్వరానీశ్వరకులంబు లెఱుఁగ గురుతు.

తే. గీ. తరుణి నీదుకాంతిఝురి కన్నులనుగ్రోలి
　　బొరలవలసె దాపగరిమ విరుల
　　చెండులంతలేసి కొండలచే నెంత
　　జోబగలిగె వింత సుందరాంగి.

## కామినీదృష్టిశృంగారము

౧. మ. తరుణీ, తావకదృష్టు లాత్మనయనో
　　　　ద్యత్కాంతిధారావళీ
　　పరిభూతుల్ సుడియింప గుంది పడు న
　　　　ప్పాటుల్ దొలంగింపఁబో
　　హరిణంబుల్ గడు రాజహృద్యుఁడని
　　　　చంద్రాంకస్వబంధుం గనం
　　గర మూర్ధ్వమ్మగ దాటు నమ్మృగము
　　　　డాగంబోవుటం గానవా.

౨. నీదగు దృష్టిసృష్టికయి
　　　　నీరజగర్భుఁడు మున్నె మోహ ము
　　త్పాదిత మాట దాని గొని
　　　　తద్దయుదేరిచి తేటదాచి దా
　　(?) నాదిని మడ్డిభ్రమ
　　　　రావళుల న్సృజియింపఁగాఁగదా
　　బీదతనంబునం బువుల
　　　　బిచ్చములెత్తఁగనాయెఁబాడుచుర్.

## సంకీర్ణశృంగారము

౧. ఎంచి తలంచి యార్పులాల
　　　　యించి దపించి విపంచి పెంచి వా
　　యించిన చీదరించి చలి
　　　　యించి ధరించిన మంచిసొమ్ములం
　　డించి యడంచి మంచిగ గ
　　　　డించి తెగించె విరించిసోదరో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దంచితచంచలాంచల సు
మాశుగ మాశుగపాత్రభీత్రయై.

౨. కుంతలరాహుసంవృతము
కోమలిసన్ముఖచంద్రబింబమే
కాంతమనోహరం బటుల
నయ్యును సంసృతి రాత్రి మోహతీ
ర్థాంతరమందుగ్రుంగిజప
మల్పమొనర్చి కృతార్థులౌదు రా
వంతయులేదు సంశయ మ
యారె రుచిం బచరింతు రిందునన్.

భగవత్కవి ముడుంబై నరసింహాచార్య స్వామి విరచితములైన కొన్ని గ్రంథముల పట్టిక.

## తెలుగు గ్రంథములు

౧. రంగేశశతకము. ౨. ప్రౌఢాశృంగారము. ౩. ముగ్ధాశృంగారము. ౪. కామినీదృష్టిశృంగారము. ౫. అంగశృంగారము. ౬. సంకీర్ణ శృంగారము. ౭. శ్రీకృష్ణచాటువులు. ౮. సత్యశతకము. ౯. సమస్యాపూరణములు. ౧౦. వృష్టిపంచాశత్. ౧౧. గరుడాచల నాటకము. ౧౨. కృతులు. ౧౩. హరికథలు. ౧౪. లక్ష్మీదండకము.

## తత్త్వగ్రంథములు

౧. బ్రహ్మసూత్ర భాష్యము. ౨. గీతాభాష్యము. ౩. దశోపనిషద్భాష్యము. ౪. సాంఖ్యసూత్రభాష్యము. ౫. సాంఖ్యకారికా భాష్యము. ౬. సిద్ధిత్రయ వ్యాఖ్యానము. ౭. తత్త్వ దర్పణము. ౮. యోగభాష్యటీక. ౯. తత్త్వైకాదశి. ౧౦. నృసింహలీల, ౧౧. జహదజహల్లక్షణా భంగము, ౧౨. ఆత్మతంత్రము, ౧౩. బ్రహ్మసూత్రరోమంథము, ౧౪. జ్ఞాన యాథార్థ్య సమర్థనము, ౧౫. ప్రపత్తిచింత, ౧౬. వేదాంతమునైకమత్యము, ౧౭. సద్వాక్య వాదము, ౧౮. సత్యమీమాంస, ౧౯. ఈశ్వరమీమాంస, ౨౦. పదశక్తిబోధ, ౨౧. న్యాయవిస్తరము, ౨౨. నృసింహ శారీరక భాష్యము.

## సాహిత్య గ్రంథములు

౧. ఉజ్జ్వలానందచంపు, ౨. రాజహంసీయము, (నాటకము), ౩ వాసవపరాశరీయము (నాటకము), ౪. కావ్యోపోద్ఘాతము, ౫. కావ్యప్రయోగవిధి, ౬. కావ్యసూత్రవృత్తి, ౭. అలంకారమాల, ౮. జయసింహాశ్వమేధీయము (నాటకము), ౯. చిత్సూర్యాలోకము, (గ్రహణముపై నాటకము), ౧౦. ఖిలావహేళనము, ౧౧. రామచంద్రకథామృతము, (౧౨౦౧౦ శ్లోకములు), ౧౨. ఆఖ్యాయిక, ౧౩. విక్టోరియా ప్రశస్తి, ౧౪. శ్రీకృష్ణకథామృతము.

## నీతిశాస్త్రము

౧. భృగుసూత్రభాష్యము, ౨. నీతిరహస్యము.

## వ్యాకరణము

౧. తెలుగున సంస్కృత వ్యాకరణము.

## స్తోత్రములు

౧. సింహాద్రినాథ స్తవము, ౨. నఖ స్తవము, ౩. మందహాస స్తవము, ౪. రంగనాథ స్తవము, ౫. దివ్యలీలావతార స్తవము, ౬. కూర్మనాథ స్తవము, ౭. కేశవ స్తవము. ౮. జ్వాలానృసింహ స్తవము, ౯. రామానుజ చతుస్సప్తతి, ౧౦. యోగనిద్రా స్తవము, ౧౧. పురుషోత్తమ స్తవము, ౧౨. వేంకటేశ్వర స్తవము౧౩. ద్వయ మంత్ర స్తవము, ౧౪. భగవద్విగ్రహ ధ్యానము, ౧౫. లక్ష్మీ స్తవము, మున్నగునవి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(వెనుకటి సంచిక తరువాయి)

౧౭

కన్నబిడ్డలు

కొడుకుల్లు పుట్టన్ని కడు పేమి కడుపు?
కుల ముద్ధరించన్ని కొడుకేమి కొడుకు?
కన్నకానుపులెల్ల కడుచక్కనయితె
కన్నల్ల పండుగే కన్నతల్లికిని

౧౮

లాభమ్మ లాభమ్మ ఏమిలాభమ్మ
కొడుకులను గంటేను కోటిలాభమ్మ.

౧౯

వీధిలో ఉయ్యాల అమ్మ వచ్చినది
కొడుకులను గన్నతల్లి కొనవె ఉయ్యాల.

౨౦

చప్పట్లు



చప్పట్లోయి తాళాలోయి
దేవుడిగుళ్లో మేళాలోయి
పప్పూ బెల్లం దేవుడికోయి
పాలూనెయ్యీ పాపాయికోయి.

౨౧

ఇంకొకటి

గోవిందుడమ్మా గోపాలుడమ్మా
కొబ్బరీబెల్లమ్ము కొనితెచ్చినాడే
ఏడాది కొకసారి యిటువచ్చినాడే
పల్లెటూళ్లు గాస చెల్లిపోయింది
గొల్లవాళ్లమ గాన కూడివచ్చింది
పట్న వాసములోన పనికివస్తుందా?

వివరణము

[చప్పట్లుచరుస్తూ ఈ పదం పాడుదురు. ఒక్కొక్క చరణమునకు రెండేసీ నాలుగేసీ చప్పట్లు చరుస్తారు.]

౨౨

మంచిమాటలు

ఒంటికణతానొప్పి ఒరగాలితీపు
పంటిపోటూ వద్దు పగవాడికైన.

౨౩

ఓచేడెకూ తగిలె మోచేతిదెబ్బ
అత్తింటి సౌఖ్యమని అంగలార్చింది.

౨౪

మారుతల్లీ చేత మాటపడలేక
సారంగ ధరుడమ్మ చావు కొప్పాడు.

౨౫

కృష్ణమ్మవంటివాడు కొడు కొకకడు పుడితే
కష్టాలు కడతేరు కన్నతల్లులకు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨౬

నిదురలో ప్రాణమ్ము అదరునో యేమొ
నిష్ఠురా లేలమ్మ కష్టజీవులపై.

౨౭

విద్య లేకుంటేను విభవమ్ము రోత
వినయమ్ము లేకుంటె విద్యలూ రోత.

౨౮

ఆయుస్సు మూడినను ఆకు చిరిగినను
బ్రతికించు వా రెవరు? అతుకు వా రెవరు ?

౨౯

బ ం డి ఆ ట



బండోయమ్మ బండి
బండికి కుచ్చులు తెండి
సుబ్బారాయుడి పెండ్లి
చూచివత్తాంరండి
అమ్మ నాకు బువ్వ
అర చేతిలో గవ్వ
నీళ్ల మీాద నిప్పు
అల్లరి పిల్లల ఒప్పు
చేయబోకు తప్పు
చేస్తే కాలి చెప్పు.

వి వ ర ణ ము

[పుడకలతో బండివలె కట్టి ముంజెకాయలో ఏవో చక్రాలు తగిలించి త్రాటికి కట్టి ఈడుస్తూ బాలకు లీపదము పాడుదురు.]

30

క ం చి కా మా తృ మ్మ!

కంచికి పోతావా కృష్ణమ్మ!
ఆ-కంచివార్త లేమి కృష్ణమ్మ!
కంచిలో ఉన్నది అవ్వ,
ఆ-అవ్వ నాకు పెట్టు బువ్వ.

బువ్వ ఉన్నది గాని కృష్ణమ్మ!
నీకు-పప్పు యెక్కడిదోయి కృష్ణమ్మ!
కోమటియింటిది అప్పు,
ఆ-అప్పు నాకు పెట్టు పప్పు

పప్పు ఉన్నది గాని కృష్ణమ్మ!
నీకు-కూర యెక్కడిదోయి కృష్ణమ్మ!
దొడ్లోను ఉన్నది బీర,
ఆ-బీర నాకు పెట్టు కూర.

కూర ఉన్నది గాని కృష్ణమ్మ!
నీకు-నెయ్యి యెక్కడిదోయి కృష్ణమ్మ!
కోమటి అక్కమ్మ చెయ్యి
ఆ-చెయ్యి నాకు పోయు నెయ్యి!

నెయ్యి ఉన్నది గాని కృష్ణమ్మ!
నీకు-పెరుగు ఎక్కడిదోయి కృష్ణమ్మ
ఉన్నయింట యిరుగుపొరుగు
ఆ-పొరుగు నాకు పోయు పెరుగు

బువ్వ తిందువు గాని కృష్ణమ్మ!
నీకు-ఆవూళ్లో పని యేమి కృష్ణమ్మ!
అక్కడ ఉన్నది అమ్మ,
నేను-మెక్కివత్తును కామాక్షమ్మ.

(సశేషము)

# మహర్షి బులుసు సాంబమూర్తిగారి జీవితసంగ్రహము

మొసలిగంటి తిరుమలరావు గారు



న్యాయవాది బులుసు సాంబమూర్తిగారు

శ్రీ సాంబమూర్తి గారు తపోగృహంలో నుంచి సమర రంగములోకి పునఃప్రవేశం చేసేసందర్భంలో ఆయన జీవితాన్ని గురించి మిత్రులకోరికపైని కొన్ని సంగతు లిందు వ్రాస్తున్నాను. ఆయనకు మరీసాన్నిధ్యంలో వుండేవాడననుటచే బొమ్మను మరీదగ్గరలో పెట్టుకుని చూచేవారికి దృశ్యము సరిగా కుదురనట్లు నావ్రాతలో ప్రత్యేకాభిమానము పక్షపాతము కనబడు నేమోననే అనుమాన మున్నప్పటికి యీపనికి పూనుకొన్నాను.

పార్థివ సం॥ర మాఘ బ౧౩ లు(౬-౩-౧౮౭౬) శివరాత్రినాడు లింగోద్భవకాలంలో జననము. అందుచేతనే పేరుకూడ సాంబమూర్తి అని పెట్టినారు. ఆంధ్రదేశంలో వైదిక సాంప్రదాయములోను, పాండిత్యములోను, వేదాధ్యయన సంపత్తిలోను చిరకాలానుగతమైన కీర్తి గలిగిన బులుసువారి వంశములో, భారతదేశములోని పండితకోటిలో ఘనాపాఠియని ప్రసిద్ధివహించి పునహానగరములో ౨౫ సం॥లైనా నిండకముందే వేద పరీక్షనిచ్చి యావద్భారత పండితవర్యులచే బ్రహ్మరథం పట్టించుకున్న సుబ్బావధానులుగారికి పుత్రులుగా జన్మించినందులకు సాంబమూర్తిగారు తమజన్మ సార్థకమగు మహాత్యాగమూర్తిగా పరిణామముపొంది తాము ధన్యులైనారు; ఆంధ్రజాతికి ధన్యత చేకూర్చారు.

(వారిజాతకము.)

| | | | |
|---|---|---|---|
| శ | | | బు |
| . | రాశి చక్రము | | ర-శు<br>చ-కే |
| కు<br>రా | | | |
| గు | . | ల | |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | |
|---|---|---|---|
| | ర | | |
| | అంశ చక్రం | | శు కే |
| చం రా | | | బు |
| శ | కు | | |

పార్థివసంవత్సర మాఘ బ ౧౩ లు (శివరాత్రి లింగోద్భవకాల) శతభిషనక్షత్రం-జననకాల రాహుమహా దశాశేషం ౧౩-సం ౬ మాసములు-(౬-౩-౧౮౮౬).

## బాల్యము

చిన్నతనములో వీరికి విద్యాభ్యాసము యావత్తు కాకినాడలోనే జరిగినది. పిఠాపురం రాజావారి కాలేజీలో చదువుకొనిరి. ఇప్పుడుకనబడే పట్టుదల, బండతనము వీరికి పుట్టినప్పటినుంచి వున్నవే. క్లాసులో బాగా చదివి మార్కులు సంపాదించేవారిలో వొకరు. అల్లరిచేసేజట్టుకు నాయకుడు. రెండుపాత్రలు యీయనే ధరించేవారు. రాజమహేంద్రవరంలో బి. యే. ప్యాసై చెన్నపట్నం వెళ్లి యఫ్. యల్. పరీక్షకు చదివినారు. చదువుకుంటూన్నరోజుల్లో యేవుద్యమం వున్నా కాలేజీలో హడావడి చేసేవిద్యార్థులలో యీయన వొకరు. కాకినాడ కాలేజీలో హిందూసమాజం సెక్రటరీగా కొన్నాళ్లున్నారు. ఎక్కడైనా రెండుపార్టీలుంటే అందులో ఒకదానికి ప్రాముఖ్యతవహించడం జీవితానికి అలవాటైపోయింది. అభిప్రాయాన్ని దాచుకొని అందరికీ మంచివాళ్ళుగా వుందామనే నీళ్లనమలే వ్యాపారం మొదటినుంచి లేదు. తన అభిప్రాయములయందు యెంత పట్టుదలవున్నా తనతో భేదించేవాళ్లతోమాత్రం అత్యంత సౌహృదయంతో మెలగి వాళ్ళప్రేమకు పాత్రులరయే స్వభావము ఆయనకు స్వతస్సిద్ధము. ఎఫ్. యల్. పరీక్ష తప్పిపోవడంచేత త్రివేంద్రమ్ వెళ్లి చదివిరి. అక్కడా కడతేరలేదు. అప్పుడు ఫస్టుగ్రేడ్ చదివి ప్యాసైనారు.

## వృత్తి

బి. యే.లో యీయన అభిమానశాస్త్రము పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics). ప్లీడరీపరీక్షలో తేరిన తరువాత ఒక సంవత్సరం విజయనగరం మహారాజావారి కాలేజీలో అధ్యాపకులుగా ప్రవేశించిరి. బి.యే. క్లాసుకు ఫిజిక్సుబోధన చేసేనారు. చెప్పేదేమిటో కష్టపడి చెప్పేవారు. విద్యార్థులలో చాలా ప్రేమానురాగములు సంపాదించిరి. ఒక్క సంవత్సరము మాత్రము అక్కడ వుండి అక్కడనుంచి కాకినాడవచ్చి ప్లీడరీవృత్తి ప్రారంభంచేసిరి. ౧౯౧౧ సంవత్సరములో ప్రారంభం ప్లీడరీ. అప్పటికీయన వయస్సు ౨౫ సంవత్సరములు. ప్రారంభంలోనే ప్రతిభ ప్రజ్వలించడం మొదలుపెట్టింది. మొదటిలోనే రెండువందల రూపాయల సంపాదన చేయ కలిగిరి.

## ౧౯౧౧—౧౯౨౦

వృత్తి ప్రారంభించినది మొదలు ఒకదేశ మన ప్రపంచక ధోరణిలో దేదీప్యమానంగా వెలిగిపోయింది. పెద్ద క్రిమినలు లాయరని పేరు వచ్చింది. ఏవుద్యమం వచ్చినా సాంబమూర్తి గారి జోక్యము ప్రమేయము లేనిదిలేదు. అప్పటిలో ముఖ్యముగా ప్లీడర్లలో ఆనమాయతగా వుండే దివ్యజ్ఞానసమాజంలోకూడా సాంబమూర్తి చేరినారు. దేనిలోనైన చేరితే కేవలం అదొక అందంకోసం, అలంకారంకోసం చేరడం ఆయన స్వభావంలో లేదు. దాని అంతు చూడవలసిందే. ఆంధ్రదేశం దివ్యజ్ఞానసభ కాకినాడలో జరిపారు. ఆయన ఇంట్లో ఆనిబిసెంటు, ఆరండేలు, త్రిలోకికరు, సదాశివయ్యరు మున్నగు పెద్దలకు ఆతిథ్యమిచ్చి ఆసభ నడిపారు. హోమరూలు ఆందోళనలో పూర్తిగా పనిచేసినారు. ఆనిబిసెంటమ్మనిపట్టుకున్నప్పుడు సాత్వికనిరోధము(Passive resistance) చేస్తామని దస్కతుచేసిన వాళ్ళలో సాంబమూర్తిగారు ప్రథములు. ౧౯౧౮ వ సంవత్సరము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మద్రాసు కాంగ్రెసుతో వీరియాత్రలు ప్రారంభము. అన్ని కాంగ్రెసులకు పోవుచుండేవారు. ౧౯౧౬ లో జరిగిన లక్నో కాంగ్రెసుకు సెక్రటరీగారైన న్యాపతి సుబ్బారావు పంతులుగారు, పోలవరం జమీందారుగారు, మోచర్ల రామచంద్రరావు పంతులుగారు, సాంబమూర్తిగారు ఒకపార్టీగా వెళ్లినారు. సుబ్బారావు పంతులుగారికి ప్రత్యేకం ఏర్పాటు కాబడ్డ దివ్యభవనంలో వీరి బసలు. అప్పుడు ౧౬ యేండ్ల బాలుడుగా నుండి నేనుకూడా అట్టహాసంతోవున్న సాంబమూర్తిగారిని చూచిన దృశ్యం యిది వ్రాస్తూంటే నాకంటికి కట్టినట్లుంది. ఇప్పటికొక నూతన జన్మ. ౧౯౨౦ స్పెషలు కాంగ్రెసులో మహాత్మాగాంధీగారు సహాయనిరాకరణోద్యమాన్ని ప్రవేశపెట్టారు. లజపతిరాయి, దాసు ప్రభృతులు తీవ్రంగా అడ్డుతగిలినారు. ఆతీర్మానం నెగ్గడంకోసం సాంబమూర్తిగారు యెక్కువగా తిరిగి వోట్లు కాన్వాసు చేసినారు.

సాంబమూర్తిగారు ఆంధ్రదేశములో జరుగుతూవున్న ఆంధ్రమహాసభలలో వుత్సాహముతో పాల్గొనేవారు. నాలుగవ ఆంధ్రమహాజనసభ ౧౯౧౬ లో కాకినాడలో జరిగినప్పుడు ఆహ్వానసంఘమునకు ప్రధాన కార్యదర్శి. అంతవైభవముతోను, ఉత్సాహంతోను ఆంధ్రసభ జరుగడం యిదివరలో యెరుగరు. కాంగ్రెసు కార్యదర్శిగా వున్న న్యాపతి సుబ్బారావు పంతులుగారు సభయేర్పాటును ప్రశంసించుచు, కాంగ్రెసును ఆంధ్రదేశానికి పిలిస్తే కాకినాడలోనే జరుపవలసి వుంటుందని సెలవిచ్చారు. మరి యేడు సంవత్సరాలకి ఆకాకినాడలోనే యీ సాంబమూర్తి చేతులమీదనే కాంగ్రెసుమహాసభకూడా దివ్యంగా జరిగింది. యేరాజకీయోద్యమంలోనైనా అతివాదానికి సాంబమూర్తిగారు నాయకులు. హోమురూలు వుద్యమం వచ్చినప్పుడు అందులో సాత్వికనిరోధవర్గానికి జెందెరి. అదిదాటడంతోటే సహాయనిరాకరణం దేశం అవలంబించాలనే ప్రథమంలోని స్వల్ప సంఖ్యాకులలో సాంబమూర్తిగారు ఆంధ్రదేశంలో ముఖ్యులు. సహాయనిరాకరణం అవలంబించిన తరువాత నాగపురంలో కాంగ్రెసు డొమినియనుప్రతిపత్తిని వదలి స్వరాజ్యదృష్టిని నిర్ణయించిన తరువాత సంపూర్ణ స్వాతంత్ర్య ప్రచారము సాంబమూర్తిగారు ప్రారంభించినారు. అసహాయోద్యమంలో ఆయన ప్రవేశించిన తరువాతి సంగతులు వ్రాసేముందర, ఆయన జీవితపద్ధతులు కేవలంరాజకీయమునకు సంబంధించని కొన్ని విషయములు మనవిచేస్తాను.

పుష్కలంగా ధనం ఆర్జన చేశేవారు. ఎప్పటిదప్పుడే ఖర్చువాలిసినదే. ఆయనకు రేపు అనేది అనంత కాలగర్భంలో వున్నది. మనకు కానరానిది. ఇప్పుడు యీదినము మాత్రము మనకు తెలిసినది. నిర్విచారము. నిరంతరానందము. ఫలహారము చేస్తే చక్కరకేళి అరటిపళ్లు గెలలతో దగ్గరబెట్టుకొని స్నేహితులతోబాటు ఆరగిస్తేనేకాని తృప్తిలేదు. భోజనం సావకాశంగా ఒక గంట చెయ్యాలి. లోటుండకూడదు. లోభత్వం లేదు. తనుతిన్నదేదో పంక్తిని అందరికి అందవలసినదే. పంక్తిని పదిమంది లేనిదే భోజనం చేసియెరుగను. మిత్రులు బంధుగులు పండితులు పేదలు నిరంతరము వచ్చి వారి ఆతిథ్యం పొందుతూ వుండేవారు. బీదవిద్యార్థులు వారమునకు రోజులు యేడే అవడంచేత యేదోవారం నిర్ణయించుకొని వారం రోజులూ భర్తీచేసేవారు. ఆయనవేషం చూస్తే రాజకీయాభిప్రాయాలలాగేరేపు వచ్చే Fashion కు మార్గదర్శిగా వుండేవారు. సిల్కునూటుకంటె తక్కువతొడిగితే గౌరవం కాదేమోయని అనుకునేవారు. జోళ్లు వుంచడానికో పెద్దగది. అవితుడవడానికో ప్రత్యేక పోర్టుఫోలియోతో ఒకనౌకరు. యీ వేషంవేసిన తరువాత ఒక మోటారుసైకిలెక్కి బయలుదేరితే కోరంగి రామచంద్రపురం ఆలమూరు రాజమండ్రీ కోర్టులలో పనిచూసుకొని సాయంత్రం క్లబ్బులో బిలియర్డ్సు టెన్నిసు వేళకు రావలసినదే. అయితే యింతవేషం వేసినా క్రాపింగు పెంచినా ప్రొద్దున్నే విభూతి మధ్యాహ్నం చూసేవాళ్ల కళ్లల్లో గ్రుచ్చుకునేటట్లు అడ్డగంధం అక్షతలు చూడడానికి ఆశ్చర్యంగా వుండేది. ఈ బహిర్వేషమునకు భిన్నమైన తత్త్వము అంతర్వాహినిగా

వుండి ఆవిభూతిలోను ఆ అడ్డగంధంలోను ప్రతిఫలిస్తూ వుండేవి. అదే బ్రాహ్మణసాంప్రదాయమైన త్యాగము. అవసరమైనప్పుడు పైకివచ్చి వెల్లువలై పారి వాడుచున్న భారతస్వాతంత్ర్యలతకు తిరిగి ప్రాణంబోయు ఉపస్రవంతిగా పరిణమించినది. కసరత్తుచేస్తే అదేపని. శరీరసౌష్ఠవము బహుచక్కనిది. పరిశ్రమ చేసినవారికి త్రికోణాకారము కలిగి Pyramid మోస్తరు అందమగు శరీరమేర్పడును. అట్టిదే సాంబమూర్తిగారిది. అంగసౌష్ఠవము లేనివారు ఆలోటును దుస్తులను కృత్రిమాలంకారములతో గప్పజూతురు. గ్రీకు శిలావిగ్రహ నిర్మాతలు, సహజసౌష్ఠవమునే అందమును ఆనందమును అని లక్ష్యముగా చేసికొనిరి. సాంబమూర్తిగా రంగవస్త్ర ధారియైనను, శరీరనిర్మాణమే ఆ ఘనకు వస్త్రసంకుచితమను లోపము లేకుండ చేసినది. ధైర్యము కొండవిరిగి నెత్తిని పడుచున్నను చలింపనిది. ఒకమారు ౧౯౧౮ లో ఢిల్లీ కాంగ్రెసుకు పోయి తిరిగి వచ్చుచుండగా యిరువురు దొరలు, ఒకడు జిల్లాఫారెస్టు ఆఫీసరు, రెండవవాడొక బ్యాంకియేజంటు, సాంబమూర్తిగారిని హరిద్వారుస్టేషనులో రైలులోనికి ఎక్కనివ్వలేదు. రైలునిలువదు. వ్యవధి లేదు. యీయనసామాను రెండవతరగతి బండిలోపెట్టట వాండ్లు త్రోసివేయుట ఇట్లు జరుగుచున్నది. దొరలు కదాయని రైలుపుద్యోగస్థులు యేమిచేయలేక తెల్లబోవుచుండిరి. చప్పున బండిలోదుమికి పారెస్టు ఆఫీసరగుదొరను జబ్బపట్టుకొనిరి. వాడీయనను గ్రుద్దెను. సరి ముష్టియుద్ధము ప్రారంభమయ్యెను. గ్రుద్దులతో గాని ఆదొరగారికి నాటలేదు. ఈయుద్ధము జరుగుతూండగా సామానంతా లోపలకువచ్చెను. అప్పుడు భారతీయుడు తనను తన్నగలడనే జ్ఞానం యిద్దరిదొరలకి కలిగింది. తరువాత రాజీపడరి స్నేహితులైనారు. ఎప్పటికైనా ఒకరి బలం ఒకరికి తెలిసిన తరువాత ఒకరియందు ఒకరికి గౌరవం కలుగుతుంది. ఆసంగతి అప్పుడు సాంబమూర్తిగారు ఒక ఆంగ్లేయునికి తెలియచెప్పినారు. ఇప్పుడు గాంధిగారి హయామున దౌర్జన్యం లేకుండా ఆసూత్రమే కార్యరూపం దాల్చుచున్నది. ప్లీడరీలో మంచి యెత్తులు చాతనవును. మేజస్ట్రీటుల నెప్పుడు ప్రాథేయపడి బ్రతిమాలుకొని యెరుగడు. ముందే తన పార్టీకి అన్యాయం జరుగుననే సూచనలు కనబడితే ఆమేజస్ట్రీటుతో యుద్ధము తప్పదు. చాకచక్యములోను బుద్ధికుశలతలోను కోర్టువారికంటె మించినవాడనే అభిప్రాయం వుండేది. ఏసంగతి చెప్పవలసినా నిర్మొగమాటం. నిర్భయం. వృత్తి వదిలివేసే సమయంలో నెలకు తొమ్మిదివందలు, వెయ్యిరూపాయల వరకు సంపాదించుచుండిరి.

## సహాయనిరాకరణం

కలకత్తా స్పెషల్ కాంగ్రెసు అనంతరము ఆయనతండ్రిగారు పరమపదించుటచేత నాగపురం కాంగ్రెసుకు వెళ్లలేదు. ౧౯౨౧ జనవరిలో దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు మున్నగు వారు కాకినాడ వచ్చి సాంబమూర్తిగారిని వృత్తి విసర్జింపవలసినదని కోరినారు. సరేయని అగ్నిహోత్రములోనికి దుమికినారు. ఒక్క నెలరోజులు వ్యవధిపొందినచో ఆయనకు లోకులనుండి రావలసిన నాలుగయిదువేల రూప్యములు పోయెడివి కావు. కాని అట్టివి లెక్కబెట్టు స్వభావము ఇసుమంతైన లేదు. అప్పటినుండి ప్రచారమునకు బయలుదేరి తూర్పుగోదావరిజిల్లాలో వుండే గ్రామములన్నిటిని చూచినారు. ఆయన త్యాగసాహసములు ప్రజలలో అపూర్వముగా ఉత్సాహమును కలుగజేసినవి. కాలినడకనెన్నో గ్రామములు తిరిగిరి. మండువేసవిలో కాలికి జోడులేకుండా పదిహేను యిరువదిమైళ్లు నడచిన దినరములు నే నెరుగుదును. ఇట్లు అయిదుమాసములు కాకుండగనే ౧౯౨౧ మేనెలలో సాంబమూర్తి స్వామినాయుడుగార్లు మున్నగు వారిమీద నేరారోపణ జేయవలెనని కొంతవరకు కేసునడిపి మరల కలెక్టరుపసంహరించుకొనెను. ఆసంవత్సరమే జిల్లామహాసభ జరిపి అందు ౧౯౨౧ డిసెంబరులో అహమ్మదాబాదులో జరుగు కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రకటింపవలసినదనే సిఫారసు ఆసభవారిచే ఆమోదింపచేసినారు. సాంబమూర్తిగారి స్వాతంత్ర్యోద్యమ ప్రచారము సహాయనిరాకరణోద్యమముతో ప్రారంభమయినది. ౧౯౨౧ లో ఉత్తరసర్కారులలో నుద్యమతీవ్రత యెక్కువగా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నున్న దని గవర్నమెంటువారు తమ బలప్రదర్శనము నిమిత్తము సేనలను జిల్లాలో నాలుగుచూలల త్రిప్పిరి. ఆరోజున డిసెంబరు ౨ వ తేదీని కాంగ్రెసు ఆఫీసుపై స్వరాజ్యపతాకము లెగురుచుండెను. ఆబావుటాక్రింద యింగ్లీషువారి సేవలు నడచుట కవమానకరముగా నుండెను. కలెక్టరగు బ్రేకను మిలిటరీ ఆఫీసరుతో వచ్చి ఆజండాలను తీసివేయవలసినదని ఆజ్ఞాపించెను. మేడమీద నున్నవారు అంగీకరించలేదు. కలెక్టరు జబర్దస్తీతో జెండాలు లాగివేయించి వెళ్ళిపోయెను. వెంటనే ౧౪౪ సెక్షను ప్రయోగించెను. మరియొకగంటకు సాంబమూర్తిగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ సభనుంచి మెయిలులో దిగినారు. ఆసభలో వ్యక్తి శాసనోల్లంఘనము ఆజ్ఞాపింపబడెను. ౨౬ తారీఖున జిల్లాలోవున్న మిత్రుల నందరను రావించి యేర్పాటులుచేసి రాత్రి ౨ గంటలకు శాసనోల్లంఘనముచేసి సాంబమూర్తిగారు జండాను తిరిగి కాంగ్రెసు ఆఫీసుపైని ప్రతిష్ఠించిరి. ౯ వ తేదీని ఆయనను, రంగయ్యనాయుడు గారు మున్నగు వారిని అరెస్టు చేసి జైలు కంపిరి. స్వాతంత్ర్యోద్యమ ప్రచార ప్రారంభముతోనే పతాకప్రతిష్ఠకూడా సాంబమూర్తిగారి హస్తములతోనే జరిగెను.

జైలులో ఒక వత్సరము బహుకులాసాగా గడిపిరి. రాజమహేంద్రవరం జైలులోవున్న ౧౪౦౦ మంది ఖయిదీల హృదయములమీదను సాంబమూర్తి రాజ్యము చేసెను. అది అధికారులకు తెలియనిది కాదు. జైలు నుండి తిన్నగా గయాకాంగ్రెసుకు వెడలి తిరిగి కాకినాడ వచ్చినపుడు ఆయనకు జరిగిన సన్మానము అపూర్వము. అది వర్ణింపనవసరము లేదు. చదువరులు చక్కగా నూహింపగలరని నమ్మెదను.

## కాకినాడ కాంగ్రెసు

౧౯౨౩ వ సంవత్సరపు కాంగ్రెసు ఆంధ్రదేశమున కాహ్వానింపబడినది. కాకినాడలో జరుపుటకు ప్రత్యేక సౌకర్యములు కలవని గుర్తించి పెద్దలంతా అంగీకరించిరి. సాంబమూర్తిగారి ధైర్యము, విజయోత్సాహము ముఖ్యముగా పనికివచ్చినవి. ఎంతమంది ఎన్ని పిరికి కబుర్లు చెప్పుచున్నప్పటికి ఆయన మనస్సు చలింపలేదు. స్వయముగా ప్రచారము చేసి ధనము వసూలు చేసెను. మంచిపనిలో నుండగా ఆయన యేకపుత్రుడు టైఫాయిడ్ జ్వరముచే సెప్టెంబరు ౪ వ తేదీని మరణించెను. పాప మాబాలునకు వివాహమై మూడునెలలు దాటలేదు. పిల్లలుకలతండ్రులకు సాంబమూర్తిగారి గర్భమున యెట్టి యారని చిచ్చు పెట్టబడినదో విదితము కాగలదు. ఈజీవితములో ఎవరికొరకు తండ్రులు తమ ఆశలు, ఆశయములు, కోరికలు నుంచుకొని యాత్రగడుపుదురో అట్టి దిహ్వాచినీయంత్రమువంటి పుత్రుడు పోయినప్పుడు పిచ్చి పట్టుటో ప్రపంచముతో సంబంధములేని వైరాగ్యములో పడిపోవుటో జరిగియుండవలసినది. కాని కర్మవీరుడు, కర్మఫలత్యాగి జ్ఞానకర్మమార్గముల మేళవింప చేయగలయోగి యగుటచే లోకకల్యాణమునందే తన ముక్తి యున్నదని నమ్మి ప్రజాసేవలో తన జీవిత పరమావధిని నిశ్చయించుకో కలిగెను. పదునెనిమిది దినములు గడువక మునుపే మరల కార్యనిర్వహణమున మగ్నుడై చింతను ప్రచ్ఛన్నము చేసికొనెను. ఇక కాంగ్రెసు కొన్ని దినములకే ప్రారంభమగునప్పుడు అంగవస్త్రమును ధరించుట ప్రారంభించెను. గాంధిగారు ౧౯౨౧ ఆగష్టు నెలలో అంగవస్త్రము ప్రారంభించి నప్పటినుండియు సాంబమూర్తిగా రీవిషయమై ఆలోచనలో తరుచు నిమగ్నులై యుండిరి. తుదకు అవలంబించిరి. కాకినాడ కాంగ్రెసు జయప్రదముగా ముగిసెను. మిత్రుల భయము లన్నియు మాసినవి. కొంతధనముకూడ మిగిలెను.

## సంపూర్ణ స్వాతంత్ర్యము

౧౯౨౪ సంవత్సరములో మద్రాసులో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహాసభలో సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము అధ్యక్షులయిన హరిసర్వోత్తమరావుగారి కాస్టింగు వోటుతో వీగిపోయెను. ౧౯౨౫ సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద బందరులో జరిగిన సభలో తీర్మాన మామోదింపబడెను. ౧౯౨౬లో ఏలూరులో, ౧౯౨౭లో అనంతపురంలోకూడా సాంబమూర్తిగారి వాదమే నెగ్గెను. ౧౯౨౯ నంద్యాలసభకు సాంబమూర్తిగారును



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారి అనుచరబృందమును వెళ్లుటకు వీలులేకపోయినది. అధ్యక్షులగు దొరస్వామి అయ్యంగారు తమయుక్తిచే స్వాతంత్ర్యతీర్మానాన్ని చర్చలోకి రాకుండా చేసినారు. కాంగ్రెసులోకూడా సాంబమూర్తిగారొక సూత్రమును పుచ్చుకొని తమవాద ప్రతివాదన చేస్తూండేవారు. ౧౯౨౬లో గౌహతీలో తమ తీర్మానాన్ని ఉపపాదించినారు. అదిచూచి మూటాముల్లీ సర్దుకొని బండియెక్కిన గాంధిగారిదగ్గరకు పెద్దలు కొందరు పరుగెత్తి ఆయన ప్రయాణం ఆపి కాంగ్రెసును యీసంపూర్ణ స్వాతంత్ర్య విపత్తునుండి తప్పింపవలెనని ప్రాధేయపడ్డారు. ఆరోజుకు ప్రయాణం మానుకొని గాంధీగారు మరునాడు విషయనిర్ణయసభలోనికి వచ్చారు. అదివరకు సాంబమూర్తిగారు గాంధీగారి సభలో దర్శనంచేయడానికి వెళ్లినపుడు "ఏమిటి సాంబమూర్తి, నీవు సంపూర్ణస్వాతంత్ర్యధూళి మహారేగగొడుతున్నావు" అని నవ్వినారు. (What Sambamurty! You are kicking up the dust of Complete Independence) సాంబమూర్తిగారీహేళనకు కొంచెం నొచ్చుకున్నా, మహాత్మాజీ, మీరు మాతో వస్తారని నాకు నమ్మకమున్నదని చిరునవ్వుతూ నమ్రతతో చెప్పినారు. సాంబమూర్తిగారిని తీర్మానం ఉపసంహరించుకోవలసినదని కోరినారు. ఆయన వెనకాలఉన్న బంగాళీవారు పంజాబీలు,సాంబమూర్తిగారిని ఉపసంహరించుకోవద్దన్నారు. చర్చజరిగింది, గాంధిగారు పెద్ద వుపన్యాసం చేసినారు తీర్మానం వీగిపోయింది కాని సి. రాజగోపాలాచారి, బజాజు నెహ్రూ ప్రభృతులంతా సాంబమూర్తి గారికినానాటికి దేశంలోను అఖిలభారత కాంగ్రెసు సంఘములోను బలంచేకూరుతోందనే సంగతి తెలుసుకున్నారు. తరువాత ౧౯౨౩ లో నాగపురంలో అవారీగారిచే నడుపబడుచుండే ఆయుధశాసన సత్యాగ్రహ విషయంలో సాంబమూర్తిగారు జోక్యము కలుగజేసుకొన్నారు. అక్కడకువెళ్లి ఆయనకూడా సత్యాగ్రహము అవలంబించినారు. కాని గవర్నమెంటువారు ఆయన నేమీచేయలేదు. తీగకదిలితే డొంకంతా కదులుతుందనే భావములో వూరుకున్నారు. తరువాత మద్రాసులో మకాంపెట్టి నీలువిగ్రహసత్యాగ్రహము నడిపినారు. మద్రాసులాంటి నిద్రమోతుపట్టణములో కొంతకదలిక పుట్టించినారు. కాని స్థానికమైనవుత్సాహము వుంటేనేకాని వుద్యమంకొనసాగే మార్గం కనబడలేదు. ఆభూమిలో వేడి పుట్టకపోతే పైనుంచి సృష్టించే వేడి ఎంతకాలం పనికేస్తుంది. కాని సాంబమూర్తిగారంటే దేశములో ఒక శక్తి అనేసంగతి అందరికి విశదమైంది. మద్రాసు కాంగ్రెసులో సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానాన్ని ఆయన ఆమోదిస్తూ చేసిన ఉపన్యాసము అందరిహృదయములలో తీవ్రసంచలనము కలిగించింది. ఆయనపట్టిన కార్యము అప్పటికి సగము ఆమోదమును పొందినది. పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు విదేశములనుండి నూతనోద్రేకముతో రావడము బ్రిటిషు గవర్నమెంటు బర్కెన్‌హెడ్డుప్రభువుయొక్క పొగరుబోతు సలహాపై శ్వేతముఖుల సైమనుకమిషనును యేర్పరచడము సాంబమూర్తిగారి ఆందోళన కాంగ్రెసంగీకారముపొందుటలో చాలా సహాయము చేసినవి.

తరువాత సైమనుకమిషను ఆందోళనలో మద్రాసులో అల్లరులు జరిగినవి. సాంబమూర్తిగారు కాకినాడలోవుండగా అక్కడ సలహాయిచ్చేనిమిత్తం వెంటనే రావలసినదని సత్యమూర్తిగారు టెలిగ్రాము యిచ్చిరి. వెంటనే బయలుదేరివెళ్లి మళ్లీకమిషను మద్రాసు వచ్చేనాటికి వ్యవహారము నడిపిరి. సాంబమూర్తిగారి పేరు మద్రాసు పట్టణములో ఆబాలగోపాలము యెరుగుదురు. స్కూలు పిల్లలుసహితము ఆయననుచూచి 'సాంబమూర్తి గారదుగో!' అనుకొనుట నేనెరుగుదును. సైమనుకమిషనుకు యెట్టి ఆహ్వానంప్రాప్తించిందో యేమిసన్మానం జరిగిందో సైమనుగారికే మనకంటె బాగా తెలియును. కలకత్తా కాంగ్రెసులో సాంబమూర్తిగారొకపక్షమునకునాయకులుగా పరిణమించిరి. కొత్తవుద్యమంయేదయినా వస్తే మొదటదానితోవ్యతిరేకించి తుదకు దానినాయకత్వంలో యేదోవిధంగా యిరుక్కునే చాకచక్యం శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారి కున్నట్లు మనభారత దేశంలో యింకెవరికి లేదు. కలకత్తాలో యిండిపెండెన్సు పార్టీకి నాయకుడ నన్నాడు. సరేఅన్నాము. నెహ్రూరిపోర్టుమీద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెహ్రూమీద ఆయనకుండే అసహనము లోకవిదితము. స్వాతంత్ర్యవాదము ఒక్కదెబ్బతో రెండుదెబ్బలు తీయడానికి వీలిస్తుంది. గాంధిగారితో రాజీజేసుకున్నారు అయ్యంగారు. కాని సాంబమూర్తిగారి ప్రమేయం లేకుండా యీయనను సంప్రదించకుండా ఈయనికి తెలియ



మహర్షి బులుసు సాంబమూర్తిగారు

కుండా చేసి అయిపోయిన తర్వాత యేమంటారు సాంబమూర్తిగారూ అన్నాడు. బహుబాగు అన్నారు సాంబమూర్తిగారు. కాని అయ్యంగారిని రాజీరూపంలో వూరద్రొక్కిన బెంగాలీసోదరులే ఆయనను వదలి వేసినారు. దానిమీద మళ్లీ గాంధీగారితో స్వతంత్రవాదులు పోటీ పడవలసి వచ్చింది. అప్పటి రాజీపరతులు గమనించడం వల్లనే గాంధీగారు లాహోరులో సంపూర్ణ స్వాతంత్ర్యవాదం అంగీకరింపక తప్పినది కాదు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గములో (Working Committee) వుభయ పక్షముల సభ్యులు వుండాలని సూత్రంయేర్పాటు చేసినారు కలకత్తాలో. గాంధీగా రొకలిస్టు తయారు చేసి అందులో సాంబమూర్తిగారి పేరు కూడా వ్రాసినారు. మోతీలాల్ నెహ్రూ గారందుల కగీంకరించినారు. తరువాత లాంఛనంగా శ్రీనివాసయ్యంగారిని సంపూర్ణ స్వాతంత్ర్యవాదుల పేరులు ౫ యివ్వవలసినదని కోరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారు. సాంబమూర్తిగారి పేరు యివ్వకపోతే జాగ్రత్త అని మేమంతా చెప్పినాము. నామాటేమిటని సత్యమూర్తిగారన్నారు. నాకేమయినా చోటుంటే చూడండని జమ్నాదాసు మెహతాగారన్నారు. తుదకు సాంబమూర్తిగారి పేరు తప్పనిసరైంది. సత్యమూర్తిగారికి పట్టరాని ఆగ్రహంవచ్చింది. అందతా పూర్వగాథ.

## సైమనుకమిషను

కలకత్తా కాంగ్రెసు అయింది. సైమనుకమిషను మళ్లీ పునర్దర్శనముకోసం వచ్చినది. ఫిబ్రవరిలో మద్రాసు వస్తుందని వేసినారు. వెనుకటిమోస్తరుగా రసాభాసమైతే వప్పుకొనేది లేదని సాంబమూర్తిగారు మద్రాసు వెళ్లి కూర్చున్నారు. ఈయననుచూస్తే గవర్నమెంటుకూ భయమే. మనవాళ్ళలో కొందరికీ భయమే. ఏవిధాగొడవ లేకుండా కమిషనొకత్రోవనొస్తే హరితాళం యింకో మూల జరిపి అయిందనిపిద్దామని మద్రాసు నాయకులు ఆలోచిస్తే యీయన అలావల్లగాదని పట్టుపట్టినారు. ఇదంతా గవర్నమెంటుకు మరింతకష్టం కలిగించింది. ఫిబ్రేవరి ౭ వ తేదీని రాత్రి ౮ గంటలకు ఆయన కాకినాడవస్తామని బెజవాడస్టేషనుకు రాగా అక్కడ, పట్టుకొని అరెస్టుచేసి ఒకవత్సరం శిక్షవేశినారు. తిరిగి వచ్చిన తరువాత యెంతకాలము వుండనిస్తారో తెలియదు. ఆయనను పట్టుకున్న వెంటనే తూర్పుగోదావరిజిల్లానుండి లెజిస్లెటివు కౌన్సిలు మెంబరు బిక్కిన వెంకటరత్నంగారు మల్లిపూడి పళ్ళంరాజుగారు, కళా వెంకట్రావుగారు, మద్దూరి అన్నపూర్ణయ్యగారు, పాలకోడేటి ప్రకాశరావుగారు, గోవిందాచార్యులుగారు, పెద్దలలో వెంకటప్పయ్యపంతులు, పట్టాభిసీతారామయ్యగారు మున్నగువార్లు మద్రాసువెళ్లి పోలీసువారు వద్దన్న వీథులలో నుంచేవుత్సవం జరిపి సాంబమూర్తిగారి వెనుక యెంత నైతిక బలము అంగబలము కలదో చూపించి తెలుగువాండ్లు కేవలము మాటలనేర్చినవాళ్ళే కారని ఋజువు చేసినారు.

సాంబమూర్తిగారి చరిత్ర వ్రాయడం అంటే దేశచరిత్ర వ్రాయడం అన్నమాట. (The History of A Country is nothing but the lives of its great men) ఆయనకు వేరే జీవితం, ఆలోచనా, కార్యక్రమం లేదు. ఆయనే దేశము దేశమే ఆయన. ఆయన యెన్నికలలో చేసినపనిని గురించి అట్టే వ్రాయలేదు. వ్రాసినకొలది విస్తరించవలసివచ్చును.

ఆయనలో వుండునది పట్టుదల, త్యాగశక్తి, సౌమ్యత, నిర్విచారము, నిర్మలానందము, ఉదారత, రాజకీయరంగములో పనిచేయువారిలో నుత్తమ బ్రహ్మచర్యము నింత దీక్షతో నవలంబించువారు కానరారు. కావున నెప్పటికైన అఖిలభారత నాయకత్వమునకు వలసిన సంకల్పశుద్ధి ఆత్మశక్తి అలవడుననే ఆశ కలిగించడమునకు కారణము కలదు.

—౮. ౩. ౩౧ కాంగ్రెసు పత్రికనుండి.

## కృతిసమర్పణము

దివాకర్ల వేంకటావధాని గారు

ఏనొక విధేయకవితా ప్రసూననిరత-భారతీపాదపద్మ సేవనపరుండ,
నైజధార్ష్ట్యంబు తోడై తనర్చులేమి-చిన్ననాఁ డంటఁ గట్టినచెలువ నాకు.

మాయనురాగ మిట్టిదని మాటికిఁ దెల్పఁగనేల? యెన్నఁడున్
బాయఁగ నిచ్చగింపదు విపర్యయ భావము లెప్పుడప్డు నా
కేమెడలోనఁ బుట్టి యెటకేనియుఁ బోయిన నెట్లు వచ్చునో
నాయనుఁగున్ దలోదరియు నవ్వుచు నచ్చటనే కనంబడున్.

గాసివహింపఁ బోక సహకార వితర్దిక బాలపల్లవ
గ్రాసముసేయుచున్ మధురగాన మొనర్చు పికంబురీతి స్వే
చ్ఛాసరణిన్ మెలంగుటకుఁ జాలఁ బ్రయత్న మొనర్తుఁగాని న
న్నాసఖినిల్వ నీయ దధికాశను-గొల్పి భ్రమింపఁ జేయుచున్.

కనఁగొన నెంచుచో నృపతికాంతు లనేకులు భూమియందు, వా
రిని నుతియింపనెంచు నెడనింద్రుఁడు చంద్రుఁడ వీవె యంచు ని
న్నొకకుబేరుఁ జేతురు మనోరథసిద్ధి యొనర్చి కొమ్ము పొ
మ్మని చెవి నిల్లు గట్టుకొని యాపెయు నన్ బురికొల్పు నిచ్చలున్.

అది జన్మాంతరమందుఁ జేసిన యఘం బౌనెమొ? భూమీశ్వరుల్
పదులు న్వందలు నిచ్చు దాతలయినన్ బ్రార్థింపఁగాఁ బోను, నా
మదికిన్ నచ్చదు వారలన్ బొగడు టేమాత్రంబు, నవ్వార లెం
తదయాశాలురునైనఁ గొల్వనియెడన్ నావాంఛఁ బూరింతురే?

జారులు, మద్యపాయు, లవిచారులు, సంతతదుష్టమార్గ సం
చారులు, రాజ్యమత్తులుఁ బ్రజాధనవర్ధిత భాగ్యభోగు లా
క్రూరులెకాని నూటికిని గోటికిఁ గూడఁ గనంగరాఁడు భూ
మీరమణాళి నొక్కఁడును మేటి గుణాన్వితుఁ డేమి సేయుదున్.

పొగడుటకు నైన సేవింపఁ బూనుకొనుట-కైన భగవంతుడే యర్హుఁ డగును గాక
సాటిమనుజులు పాత్రులా? సార్వభౌముఁ-డైన మానవమాత్రుఁడే యగునుగాదె?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలిగిన కావ్యకన్య నృపకాంతున కెవ్వనికైననిచ్చి పెం
డిలి యొనరింపఁ గష్టములు డింది సుఖించెద వెంతయేని, పూ
ర్వులును నవీను లెంద ఱిటు భూమిపుల న్దనియింపలేదు ? నీ
తలన జనించెనే యనుచుఁ దజ్ఞులుబోధ యొనర్చి రెంతయున్.

ఇట్టినికృష్టమార్గమున నేగిరి పెద్దలె చాలమంది కాఁ
బట్టి యొనర్పమా యనుట భావ్యముగాదని నాకుఁ దోచు నేఁ
బుట్టిన దాదిగా నుపరపోషణకున్ జెయిజాచకుండఁగా
నెట్టితి రోజులిప్పటికి నీచులకున్ సుత నమ్ముకొందునే ?

నిరయము నొందు నీజగము నిత్యుఁ డొకం డల యీశ్వరుండె, త
త్పరముగ లేని జన్మము వృథాయని నమ్మి భవమ్మురోసి, శ్రీ
ధరుపదచింతఁ దాననుపదంబు నొనర్చెడు కాంతచేత భో
గరతులకు న్నృపాలురకుఁ గష్టముగాక సుఖమ్ముగల్గునే ?

అనురాగంబునఁ బెంచికొంటి జను లాహా నాఁగ, నీడేరె, ఁబా
సిన దజ్ఞానము, సర్వలక్షణకళాశ్రీయుక్తిచే మించె; నా
యనుఁగున్ గూఁతున కీనుఁ డీశ్వరుఁడె గానర్హుండు, కాకున్న దు
ర్జన మూర్ధన్యులు రాజులా ? యనుచు నశ్రాంతంబు చింతించెదన్.

పరిణయ మాచరింప కిటుప్రాయమువచ్చినదాని నుంచు టె
బ్బెరికము గాఁగనుండు, నయవేత్తలు నీవిధి సమ్మతింప, రె
వ్వరికననేల ? నామనసువచ్చిన నాయకుఁడైన రాఘువే
శ్వరున కొసంగి జన్మమును సార్థకభావము దాల్పఁజేసెదన్.

అందుచే బది తరములేయనఁగ నేల?-తరతరంబులకేనియుఁ బరముగల్గు
నాతనికి బాధల న్దెల్పు టనవసరము-శ్రితజనావనుఁ డాతఁడే చేయు మేలు.

అని ప్రతిజ్ఞను జెల్లించుకొనిన యట్టి-ధన్యుఁడ విదే! నమస్సు పోతన కవీంద్ర!
నిన్నుఁబోలు కుమారులఁ గన్నయట్టి-ధన్యరాలికి నాంధ్ర మాతకును బ్రణతి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నా ఐరోపాఖండయాత్ర చిత్రములు

Bruxelles Vue générale de la Grand'Place
Brussels General view of the Market place

౭. బ్రస్సెల్సు (బెల్జియము) లోని పెద్ద బజారువీథి



౮. కుడినుండి: డాక్టరు వంగల శివరామ్‌గారు, వారిసతి వాణీబాయిగారు,
చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, లంకా సుందరరామ్‌గారు
లండనునగరమున విక్టోరియా స్టేషన్‌వద్ద తీసిన ఛాయాచిత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౯. డాక్టరు శివరాం దంపతులు బసచేసిన భవనము
స్కాట్లండు పీఠభూములందలిది.




౧౦. గారీకనుమ–సుందర ప్రకృతిదృశ్యము
స్కాట్లండు పీఠభూములందలిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నా ఐరోపాఖండ యాత్ర

శ్రీమతి వంగల వాణీబాయి గారు

నాభర్తగారికి అంతర్జాతీయ న్యాయశాస్త్రము నందు కార్నీజీ బహుమానము ఒసగబడినందున లక్నో విశ్వవిద్యాలయమునందు వారు చేయుచున్న రాజకీయ అంతర్జాతీయ న్యాయశాస్త్ర ప్రథమోపాధ్యాయ(Professor of Political Science& International Law) పదవినుండి కొంతకాలమువఱకు సెలవు



శ్రీమతి వంగల వాణీబాయి గారు

తీసికొని యూరపునకు వెళ్లవలసి వచ్చెను. ఆసందర్భమున నన్నుకూడ వెంట పెట్టుకొనివెళ్ల నిశ్చయించిరి. నేనిదివర కెన్నడును నావపై విదేశయానము చేసినదానను కాను. అయినను క్రొత్తదేశములను, క్రొత్త వింతలనుచూచు నభిలాష నన్ను ప్రేరేపించుటచే వారితో కలసి ప్రయాణమైతిని. మేము బొంబాయిలో 'అలెగ్జాండ్రా డాక్స్' అను రేవులో ఇటలీదేశపు 'లాయిడ్ ట్రీస్టినో' అను కంపెనీవారి 'కోంటీవియా' అను స్టీమరు నెక్కితిమి.

ఈబోటు చిన్నదైనను సకలసౌకర్యములను గలిగి సొగసుగా నుండెను. ౧౯౩౮ సం॥ జూలై 3 తేదిని ఓడనెక్కితిమి. మమ్మును సాగనంపుటకు అనేకులు స్నేహితులువచ్చి రేవున నిలువబడియుండిరి. మధ్యాహ్నము ౧౨ గంటలకు బోటును వదలిరి. ఒడ్డున నిలచిన జనులొక్కుమ్మడిగ హర్షధ్వానములు సలుపుచు చేతులను, జేబురుమాళ్లను, టోపీలను విసరుచు 'గుడ్ బై' చెప్పిరి. అప్పుడు నాకు కొంత విచారము కలిగినది. ఓడ కదలి కొంతదూరము సాగినపిమ్మట నేను తిరిగి మాతృదేశమునకు ఎప్పుడు వత్తునోయనియు, ఆహార, విహార, భోజన మజ్జన ఆచారభాషా వ్యత్యాసములతో నిండిన విదేశములయందెట్లు కాలము గడపుదునాయనియు యోచింపదొడగితిని. భూమి గోచరమగుచుండు నంతవరకు నచ్చే నిలుచబడి చూచితిని. పిమ్మట నేనును, నాభర్తగారును ఓడ పైభాగము (డెక్కు) మీదికివెళ్లి కొంచెముసేపు కూర్చుంటిమి. అక్కడ నాకు కళ్లు తిరుగుట తలనొప్పి ఆరంభించినది. దీనినే 'సీ సిక్నెస్' (sea sickness) అందురు. అందువల్ల దిగివచ్చి మా గదిలో పడుకొంటిమి. అప్పుడు సముద్రము చాల అల్లకల్లోలముగ నుండెను. ప్రయాణికు లందరును భోజనమునకు వెళ్లిరి. నాకు మాత్రము నిమ్మకాయ కల్పిన తేయాకునీరు ఇచ్చిరి. నాభర్తగారును భోజనము చేసివచ్చి వాంతిచేసికొనిరి. అంతట వారును పడకవేసిరి. వారదివరకనేక పర్యాయములు స్టీమరు ప్రయాణములు చేసినవారైనను ఒడలు తిరుగుట తప్పలేదు. ఇదే తీరున అనేకమంది ప్రయాణీకులకు జబ్బుచేసినది. అప్పుడు స్టీమరులోని డాక్టరువచ్చి మాకిద్దరికిని ఇంజక్షన్ చేసినాడు. రెండవ

నాటికి నాభర్తగారికి కొంచెము స్వస్థత ఏర్పడెను. నాకు మాత్రము ఆరోగ్యము కలుగలేదు. నాకు వేయించిన బంగాళాదుంపలు, రొట్టె, తేనీరు ఇచ్చినారు. 3 వ దినమున నాభర్తగారికిని మరికొందరికిని పూర్తిగా స్వస్థత కలిగెను. నేను ౪ దినములవరకును పడకమీదనుండి లేవనే లేదు. ౪ వ నాటికి సముద్రము శాంతి జెందినది. నాకును ఇతరులకును పూర్తిగా నెమ్మదించినది.

అంతటినుండి మేము ప్రతిదినము డెక్కుపై దిరుగాడుచుండెడివారము. నాకు కత్తులతోను, ఫోర్కులతోను భోజనము చేయుట రెండుమూడు దినములవరకును చేత కాలేదు. ఇంగ్లీషువారందరును నన్నుజూచి పరిహసించుచుండెడివారు. మాకు ప్రతిదినము ప్రొద్దున ప్రక్కమీద నుండగానే కాఫీయును బిస్కటులును, ౯ గంటలకు ప్రాతఃకాల భోజనమును, ౧ గంటకు లంచియును, సాయంకాలము ౪ గంటలకు టీయును, రాత్రి ౮ గంటలకు డిన్నరును ఇచ్చుచుండెడివారు. ప్రతిదినమును ౨ లేక 3 సారులు సంగీతకాలక్షేపములు జరిగెడివి. సాయంత్రము అందరమును పై డెక్కుమీదకి వెళ్లి ఆటలాడెడివారము రాత్రి భోజనమునకు ముందు ఈవెనింగు డ్రెస్సులు ధరించెడివారము. భోజనానంతరము సినీమా ప్రదర్శనములును నృత్యములును (dances) జరిగెడివి. ఇట్లు అనేకములగు వేడుకలు జరుగుచుండెడివి. ఈవిధముగా ప్రయాణము చేసి ౫ లేక ౬ దినములకు అరేబియా దేశమందలి ఏడెన్‌కు చేరితిమి. అక్కడ స్టీమరు ౬ గంటలు నిలిచినది. మేము లాంచీలలో నెక్కి ఏడెను పట్టణము చూచివచ్చితిమి. తరువాత స్టీమరు కదలి ఎర్రసముద్రమును ప్రవేశించెను. ఈసముద్రము అప్పుడు వాస్తవముగానే ఎరుపు వర్ణముగా నుండెను. అక్కడ మిక్కిలి వేడిగానుండుటవల్ల మేము పెక్కుమారులు సోడావాటరు, లైముజ్యూసు మొదలగు చలువగలిగించు పానీయములను త్రాగవలసివచ్చెను. అయినను, ఆనందకరముగా కాలము గడచినది. స్టీమరులో బొమ్మగుర్రపుపందెములును, స్టీమరు ఎన్నిమైళ్లు నడచినదో కనుగొనుటకు పందెములును, తదితర వివిధ వినోదములును జరుగుచుండెడివి. మేము ఉదయము ౭ సార్లును సాయంత్రము ౭ సార్లును స్టీమరు చుట్టు నడచుచుండెడివారము. ౭ సార్లు తిరిగిన ఒక మైలుదూరమగును. ఈవిధముగా ౪ దినములు ఎర్రసముద్రమునగడపి సూయజు కాలువ చేరితిమి. అది మధ్యధరాసముద్రమునకును, ఎర్రసముద్రమునకును మధ్య త్రవ్వబడిన పెద్దకాల్వ. ఆకాలువ గోదావరి జిల్లాలోని నిడదవోలు మదుగును బోలియుండును. సుమారు ౧౦౦ మైళ్ల నిడివిని ౨౦౦ అడుగుల వెడల్పును గల్గియున్నది. ఇరుప్రక్కలను చెట్లును, బంగాళాలును, రైళ్లును కలవు. అచ్చటి భూమి ఇసుకనేల. ఈకాలువ ఐగుప్తు దేశమునంటియున్నందున స్టీమరు కాలువలో ప్రవేశించినప్పుడు చాలమంది ప్రయాణికులు కైరో పట్టణమును, దాని సమీపముననుండు 'పిరమిడ్స్' అనెడి యెత్తయిన గోపురములను చూచివచ్చుటకు అచ్చట దిగి తిరిగి స్టీమరు కాలువను దాటుచోటునకువచ్చి చేరిరి. ఇట్లు పోర్టుసేడ్ అను రేవుపట్టణమును చేరితిమి. అక్కడ మేమును దిగి పట్టణమును చూచి వచ్చితిమి. అటుతరువాత మధ్యధరా సముద్రముమీద ప్రయాణము చేసి బొంబాయిలో బయలుదేరిన ౧౬ దినములకు అనగా జూలై ౧౯ తేదీకి ఇటలీ దేశములోని వెనీసు (Venice) నగరము చేరితిమి. ఈ పట్టణము సముద్రమునందే కట్టబడి మిగుల మనోజ్ఞముగా నుండును. ఇండ్లచుట్టును నీరు నిండియుండును. కాలువలే వీధులు. ఒకచోటునుండి మరియొకచోటునకు పోవలయునన్నచో 'గండోలా'లు అను పడవలపైనెక్కి ఈ కాల్వలపైన పోవలయును. ఒక యిండ్లవరుసకును మరియొక యిండ్లవరుసకును మధ్య అచ్చటచ్చట వంతెనలుండును. ఇండ్ల ముందరనుండు వాకిళ్లన్నియు కలిసి యొక వీథిగా కన్పించును. ఈవీథులలోనే దుకాణము లుండును. వీధులు జనులతో నిండియుండును. మేము స్టీమరుదిగిన వెంటనే యొక గండోలాను ఎక్కి గ్రాండు కెనాలుగుండ 'హోటల్ టర్మినస్'కు వెళ్లితిమి. భోజనములన్నియు సామాన్యముగ ఇండ్ల వెలుపలి ప్రాంగణములలోనే చేతురు. అదిచూచిన నాకాశ్చర్య మాయెను. అచ్చట మేము 3 దినములుండి ఊరంతయు చూచితిమి. నేను వీథులలో నడచునప్పుడు జనులు నాచుట్టును గుంపులుగూడి నాఛాయాపటము నెత్తెడివారు. ఎంద



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనగా నేను మనదేశపు చీరగట్టి బొట్టు పెట్టుకొని ఉండుట వారికి చిత్రముగా గన్పట్టెను. ఆయూర నొక్కచోట మాత్రము పెద్దమైదానము కలదు. అందు జనులు వ్యాయామములు, క్రీడలు సల్పుచుందురు. ఈమైదానమునందే లీడో (Lido) అను పెద్దచక్కని హోటెల్ సముద్రపు టొడ్డున నున్నది. ఈనగరమందు చేయబడు గాజుపనులు, చిత్రపటములు ప్రసిద్ధి కెక్కియున్నవి. మేము అక్కడ నున్నప్పుడు ఒక పెద్దపండుగ మనదీపావళి మాదిరిగా జరిగినది. అప్పు డనేకచిత్రములను బాణాసంచాలను కాల్చిరి. అక్కడ నుండి రైలుమీద ప్రయాణముచేసి 'మిలాన్' పట్టణముమీదుగా 'ఆల్ప్స'కొండలుదాటి స్విట్జర్లాండు దేశమందలి 'లూజా' పట్టణము చేరితిమి. అక్కడ విక్టోరియా హోటలులో దిగి రెండు దినములుండి ఊరంతయు చూచితిమి. ౨౨ తేది మధ్యాహ్నము 'లామన్' అను గొప్ప సరస్సులో స్టీమరుమీద జినీవా నగరము చేరితిమి. ఇది స్విట్జర్లాండుకు ముఖ్యపట్టణము. ఈదేశము పర్వతమయమై మంచు గురియుచు మిక్కిలి చలిగానుండును. ఇందు మిగుల రమణీయమైన తోటలును పచ్చికబయళ్లును కలవు. పాడి సమృద్ధిగా నుండును. జినీవాపట్టణము గడియారములకు ప్రఖ్యాతి జెందినది. ఇచ్చట మేము సుమారు ౧౫ దినము లుంటిమి. ఇక్కడ నాభర్తగారు సకల సామ్రాజ్యసభలో (League of Nations) కొన్ని యుపన్యాసములు ఇచ్చిరి. ఒకనాడు అక్కడి ప్రతినిధులకు ఒక గొప్ప 'స్విస్సు'స్త్రీ తోటవిందు ఇచ్చెను. మేముకూడ వెళ్లితిమి. అప్పుడు నేను ఆమెతో ప్రసంగించుచుండగా నొక ఫొటోగ్రాపు తీయబడెను. మేము ప్రతిదినమును విశేషములు చూచుటకు అనేకస్థలములకు పోవుచుండువారము. అక్కడనుండి ౧ దినము ట్రాముబండి మాదిరి రైలులో నెక్కి ఒకయెత్తయిన కొండపైకివెళ్లితిమి. ఆపర్వతము నెక్కి చూచిన ఇటలీ, ఫ్రాంసు, స్విట్జర్లాండు- ఈ మూడుదేశములు కాన్పించును. అక్కడ నొకగుండ్రని రాతిమీద నీమూడుదేశముల దిశలు తెలియుట కొకరంగుల పటము చిత్రింపబడియున్నది. నేను యూరపునందు తిరిగిన దేశములన్నిటిలోను ప్రకృతి సౌందర్యమునకు నెద్దియును దీనితో సాటిరాదు. ఆగస్టు ౨ తేదిని లామన్ సరస్సుమీద మేము ౧౨౦౦ మంది కలిసి యొక స్టీమరెక్కి మాంట్రూ అను ప్రదేశమునకువెళ్లి అచ్చట మరియొక కొండను ట్రాముపైన ఎక్కిపోయి చూచితిమి. మేమును, కమలాదేవి చటోపాధ్యాయిగారును మరికొందరును దిగివచ్చునప్పుడు కాలినడకను వచ్చితిమి. తిరిగి స్టీమరుమీదనే జినీవా చేరితిమి. ఇచ్చట సర్ జగదీశచంద్రబోసుగారిని లేడీ బోసుగారిని కలిసికొని సంభాషించితిని. లేడీ బోసుగారు మిక్కిలి యోగ్యురాలు. గర్వమొకింతయు లేదు. నన్ను అనేక పర్యాయములు వెంట నిడుకొని తిరుగుచుండెడిది.

తరువాత జినీవావదలి లూజాన్ మీదుగా ఫ్రాంసు దేశపు ముఖ్యపట్టణ మగు పారిస్ చేరితిమి. ఇది మిక్కిలి అందమైనట్టియు, విశాలమైనట్టియు పట్టణము. అక్కడ ౧౨ దినములు గడపితిమి. విశాలమైన రోడ్లును, ఎత్తయిన మేడలును, రమ్యమైన పార్కులును గలవు. రోడ్లు వెడల్పుగానున్నను నడచివెళ్లుట, దాటుట కష్టము. వేలకొలది మోటార్లు నిరంతరము తిరుగుచుండును. అక్కడ నాటర్ డామ్ అను గొప్ప క్రైస్తవాలయమునకు వెళ్లితిమి. ఇది ప్రపంచములోనెల్ల గొప్ప క్రైస్తవ దేవాలయమని యందురు. ఇంకొకదినము 'అయిఫెల్ టవర్' అను ఎత్తయినగోపురము నెక్కితిమి. దీనిమీదికి ఎలిక్ట్రిక్ లిఫ్ట్‌లో పోతిమి. ఇదియును ప్రపంచ ప్రసిద్ధమైన గోపురము. మరియొకదినమున నొక చక్కని ఆపెరానాటకమును చూచితిమి. ఈ ఆపెరాగృహము ప్రపంచమునందు మిక్కిలి ఉత్కృష్టమైనదిగా గణింపబడుచున్నది. అక్కడ 'ఆర్క్ డి ట్రయంఫ్' (Arc de Triumph) అను నొకస్థలమున నెల్లపుడు నొక అగ్నిజ్యోతి వెలుగుచుండును. దానిచుట్టును కిరణములవలె ౧౨ రోడ్లు వెడలుచున్నవి. పారిస్‌లో 'చాంపలేజా' అను పెద్దవీథి కలదు. దానికి ఇరుప్రక్కలను ఉన్నతమైన వృక్షములును, పూలమొక్కలును పెరుగుచు కన్నుల పండువుగా నుండును. ఈపట్టణము ఫాషనులకు ప్రఖ్యాతి చెందియున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్యారిసునుండి బయలుదేరి 'కలే' (Calais)అను రేవుపట్టణమున స్టీమరెక్కి ఇంగ్లాండు ఫ్రాంసు దేశముల మధ్యనున్న ఇంగ్లీషు ఛానల్ అను సముద్రముదాటి ఇంగ్లీషు రేవు పట్టణమగు డోవరుచేరి అక్కడ రైలు ఎక్కి లండను పట్టణము చేరితిమి. ఆరోజుసాయంత్రము 'గవర్' వీథిలో నొక హోటలులో దిగితిమి. ఈప్రకారము 3 దినములుండి కొంతవరకు పట్టణము చూచి అక్కడనుండి తిరిగి సముద్రము దాటి హాలెండు దేశమునకు వెళ్లితిమి. హేగ్ అను పట్టణములో, 'పమోనా' అనుహోటలులో దిగితిమి.ఆయూరిలో శాంతిమందిరము(Peace Palace) అను మందిరమున కొన్ని రాజకీయ సభలు జరిగెను. ఆ సభలకు నాభర్తగారు వెళ్లవలసియుండుటవలన మేము అచ్చట 2 వారము లుంటిమి. అప్పుడు ఆమ్స్టర్డామ్ మొదలగు కొన్ని యితరపట్టణములనుకూడ చూచివచ్చితిమి.

ఈ ఆమ్స్టర్డామ నందు వజ్రపు కోతపనులు బాహుళ్యముగా జరుగుచుండును. మేము కొన్ని షాపులకువెళ్లి అమూల్యమైన రత్నములను చూచితిమి. హేగ్ సమీపమున నొక చిన్నగ్రామమున జర్మనీకి చక్రవర్తిగా నుండిన కైజరుగారి దర్శనము చేసితిమి.

హాలెండునుండి బయలుదేరి జర్మనీదేశమునకు వెళ్లితిమి. ముఖ్యపట్టణమైన బర్లిన్ (Berlin) లో 4 దినములుండి తామస్ కుక్కు కంపెనీవారి పెద్ద మోటారుకారులలో పట్టణమంతయు చూచితిమి. ఒక్కొక్క కారులో 20 మంది కూర్చుండుటకు వీలుండును. పట్టణమునుచాలభాగములందలి జనులునువ్యసనములోనున్నట్లు కాన్పించిరి. యుద్ధ ఋణములను తీర్చలేక బాధపడుచున్నారని చెప్పుకొనిరి. కొందరు జర్మనీయొక్క పూర్వపు స్థితిని తలచుకొని వ్యసనపడుచున్నారు. ఇక్కడ మ్యునిసిపల్ పుస్తకభాండాగారము, కెతిడ్రల్, కెయిజరుగారి మందిరము, పాలేస్ మొదలగుగొప్పకట్టడములను చూచితిమి.

ఈదేశమును వదలి బెల్జియము దేశమునకు వెళ్లితిమి. దీనికి ముఖ్యస్థానమైన బ్రస్సెల్సు పట్టణమున 'హోటల్ సిసిల్'లో దిగితిమి. ఇచ్చట కట్టడములన్నియు చాల ఎత్తుగాను, విశాలముగాను, హృదయ రంజకముగాను ఉండును. వానిలో కాంగ్రెసు స్తంభము (Congress column) బజారు, కింగ్స్ హాల్, పురభవనము, న్యాయ మందిరము అనునవి మిక్కిలి రమ్యముగా నుండును. ఈపట్టణము చుట్టుప్రక్కల కొన్ని చిన్నగ్రామములను చూచి, 4 దినములు గడపి, 'హేగ్' పట్టణమునకు మరలవెళ్లి 2 దినములుండి, అంతట తిరిగి లండను నగరము చేరితిమి.

రెండవసారి లండను వచ్చినపుడు కొన్నిదినములు 'పెట్సువుడ్' అనుభాగమున నుంటిమి. అక్కడ నొక ఆంగ్లేయ గృహస్థునియింట (paying guests) డబ్బిచ్చి అతిథులముగా నివసించితిమి. లండనుపట్టణ విశేషముల గురించి వ్రాయుచో ఎన్నిపుటలు వ్రాసినను చాలదు. మేము తరచుగా పట్టణము చూచుటకు నేలలో తిరిగెడి రైళ్ల (Tube Railways) లోను మోటారుబస్సుల మీదను వెళ్లుచుండెడివారము. ట్యూబురైళ్లనునవి బహువిచిత్రముగా నుండును. ఒకదాని క్రింద నొకటి భూమిలో ఊరిచుట్టును తిరుగుచుండును. దగ్గరదగ్గరగా మధ్యస్టేషను లుండును. ఈసొరంగములలో ఎప్పుడును ఎలెక్ట్రిక్ దీపములు వెలుగుచుండును. వానిలోనికి దిగుటకును పైకి ఎక్కుటకును లిఫ్టులు, ఎస్క్యులేటరులు (Lifts & Exculators) అను సాధనము లుండును. అందులో ఎస్క్యులేటర్లు మిక్కిలి చిత్రమైనవి. అవి ఎల్లప్పుడును క్రిందకుమీదికి గిరగిర తిరుగుచుండును. కాలు పెట్టుటతోనే క్రిందికిగాని పైకిగాని కొనిపోవును. మామూలు రోడ్లు విశాలముగానున్నను జనసంకీర్ణములై మోటారులతోను ట్రాములతోను నిండియుండి దాటుటకు కష్టముగా నుండును. కాని వానియందు అచ్చటచ్చట పోలీసువారు నిల్చియుండి మార్గస్థులకు సౌకర్యములు కలుగజేయుచుందురు. వీరియాజ్ఞ అప్రతిహతము. చేయి యెత్తి యాగుమన్న చక్రవర్తి వాహనమైనను నిలిచిపోవును. అక్కడ రెండువారములు గడచిన పిమ్మట స్కాట్లండునకు వెళ్లితిమి. ఈదేశమునకు ముఖ్యపట్టణమైన ఎడింబరోలో 'గ్రాస్వినర్'హోటెలులో బసచేసి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిమి. అక్కడ 3 దినములుండి పట్టణమంతయు జూచితిమి. లండనుకన్న చిన్నదైనను చాల మనోహరముగా నుండును. అక్కడనుండగా 'కేసిల్' (castle) అనుభవనమున నొకనాడొకగొప్పవేడుక జరిగినది. జర్మనీయుద్ధమున పోరాడిన సైనికులు గొప్పఉత్సవము చేసిరి. అచటికి యుద్ధములో వికలాంగులైన సైనికు లనేకులు వచ్చియుండిరి. ప్రాత ఎడింబరోలో మే మొకమార్గమున బోవుచుండగా రోడ్డుపైన నొకచోట ఇటుకతోను సున్నముతోను కట్టబడిన యొక వలయాకారమగు గిరిని చూచితిమి. పూర్వకాలమున నెవరైన నప్పు తీర్చలేక పోయినప్పుడు దానిలో దాగెడివారట. అప్పుడు ఎవరికిని వారిని పట్టుకొనుటకుగాని అప్పుతీర్చుమని యడుగుటకుగాని యధికారము లేకుండెనట. మరియొకచోట మొక్కలతో నిర్మింపబడిన యొక పెద్దగడియారము కలదు. అది భూమిమీదనే యుండునుగాని, ఏదో యొకయంత్ర సాధనమువలన దిరుగుచు గంటలను దెలుపుచుండును. ఇంకొకచోట నొకసౌధమును నిర్మించుటకై పూర్వకాలమునందు కట్టబడిన కొన్నిరాతి స్తంభములు నిలిచియుండెను. ఎంత ద్రవ్యము నెచ్చించినను భవనము పూర్తిగాకుండెనట. అందువలన నా స్తంభములట్లే నిలచియున్నవి. వానిని చూచుటకు అనేకులు ఇప్పటికిని పోవుచుందురు. ఎడింబరోలో ౪ దినములుండి యచటినుండి స్కాట్లాండుపీఠభూమి (High-lands) లలోని 'పిట్లోక్రి' (Pitlochry) అనునొక చలువప్రదేశమునకు బోతిమి. ఇది మిక్కిలి చల్లగానుండి స్విట్జర్లాండును స్మరణకు దెచ్చుచుండును. నేను అక్కడ నున్నప్పుడు మైసూరు రాజ్యమందలి నందికొండలు జ్ఞాపకము వచ్చుచుండెను. వేసవికాలమునందు శ్రీమంతులు చల్లదనమునకై అక్కడికి బోవుచుందురు. కొండలపైనుండి పారు సెలయేళ్లతోను, పలువిధములగు పక్షి గణములతోను, మత్స్యలతాకర పుష్పజాతులతో రాజిల్లు సరస్సులతోను, నానావిధవృక్షసముదాయములతోను నిండి కంటికింపు గొలుపుచుండును. అచ్చట మేము 'బస్కీడు హౌస్' (Buskeid House) అను బంగాళాలో నుంటిమి. అక్కడనుండి గ్లాస్గోపట్టణమున కరిగితిమి. ఈయూరు ఫ్యాక్టరీలతో నిండి మురికిగా నుండును.

స్కాట్లాండు వదలి స్టీమరుమీద అయిర్లాండు (Ireland) వెళ్లితిమి. రెండుదినములు మాత్ర మచటనే యుండి డబ్లిన్, బెల్ఫాస్టు పట్టణముల జూచితిమి. అక్కడనుండి తిరిగి లండను వచ్చితిమి.

ఈసారి లండనులో 'పెట్నువుడ్'లో నుండక లండనుకు ౮ మైళ్ల దూరములోనున్న 'మార్డెను'లో నొక గృహస్థునియింట నుంటిమి. మార్డెనునుండి లండనుకు ట్యూబ్ రైలులో వెళ్లెడివారము. నేను తిరిగి హిందూదేశమునకు బయలుదేరువరకును అక్కడనే యుంటిమి. మాయింటి యజమానురాలైన 'త్యాగరు'సతి నాయెడల మిక్కిలి యనురాగముతో నుండెడిది. అక్కడ నుండగానే పెక్కుమంది ఆంధ్రులును, ఇతర భారతీయులును మాకు పరిచితులైరి. అప్పుడప్పుడు మేము వారియొద్దకును వారు మాయొద్దకును వచ్చుచు పోవుచు భోజనములు చేయుచుండు వారము. కన్నేపల్లి నరసింహము పంతులుగారి యింటికివెళ్లి అప్పుడప్పుడు తనివిదీర శుద్ధాంధ్రభోజనముచేసి వచ్చుచుండెడిదానను. నేను ఏదేశము తిరిగినను శాకపదార్థము తప్ప ఇతరపదార్థము నిచ్చగింపక పోవుటచేతను తెల్లవారుచేయు శాకపదార్థములు నాకు రుచింపక పోవుటచేతను వారి యింట భుజించునప్పుడు నాకు ప్రాణము లేచివచ్చెడిది. లండనులో తాజ్ మహల్, ఆర్యభవనము, వీరాస్వామి షఫీ అను ఇండియన్ భోజనశాలలు కలవు. వీనియందు అప్పుడప్పుడు విందులు, ఆంధ్రుల సంఘ భోజనసమావేశములు జరుగుచుండెడివి. మేమును అప్పుడప్పుడు భోజనము చేయుచుండెడివారము. ఒకనాడు మేము ఈవిధముగా సర్ సి పి. రామస్వామయ్యరుగారికి విందొసగితిమి. లండనులో నుండగా ఆదిపూడి వసుంధరాదేవిగారు, ఆచంట లక్ష్మీదేవిగారు, కన్నేపల్లి శారదాంబగారు మొదలగు నాంధ్ర యువతీమణులు నాకు స్నేహితురాండ్రయిరి.

లండనులో పార్లమెంటు భవనము, కోట, బకింగుహాము రాజమందిరము, థేమ్సునది వంతెనలు మొదలైన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెన్నియో విశేషములను చూచితిమి. ఒకనాడు కేంబ్రిడ్జి ఆక్సుఫర్డు కాలిబంతి పందెములను చూడవెళ్లి అచట వేల్సు యువరాజును చూచితిమి. విద్యాపీఠమైన కేంబ్రిడ్జికి వెళ్లి పిట్టుసతి (Mrs. Pitt) అను నామెయింట బసచేసితిమి. ఈమె యిండియాలో ననేక సంవత్సరములుండి తెనుగు బాగుగ నేర్చినది. ఆంధ్రుల విందు దినమున తెనుగు భాషలో నుపన్యసించినది. ఇక్కడ 3 దినములుండి గొప్ప కాలేజీలను ఇరాస్మస్ టవర్, మార్కెటు మొదలగు ప్రదేశములను చూచి యానందించితిమి. అచ్చటి ఇమ్మాన్యూయల్ కాలేజిలో పూర్వము నాభర్తగారు విద్యార్థిగా నుండినందున వారు దానియందు చాలసేపు నిలిచి పరిశీలనగా చూచిరి. కేంబ్రిడ్జినుండి తిరిగి లండను వచ్చి అచ్చటినుండి ఆక్సుఫోర్డు (Oxford) అను మరియొక గొప్ప విద్యాపీఠమునకు వెళ్లితిమి. ఇక్కడను పెక్కు గొప్పకాలేజీలు కలవు. ఈయూర వేదాంత శాస్త్ర మహోపాధ్యాయులుగానున్న సర్వేపల్లి రాధాకృష్ణనుగారి యింట విడిసితిమి. ఈవిధముగా లండను పట్టణమునందు సుమారు ౮ మాసములు సుఖముగా గడపితిమి. నాభర్తగారు ఇంకను కొన్ని పెద్దపరీక్షలకు చదువుచు కొంతకాల మచటనే యుండవలసి వచ్చుటవల్లను, నేను ఎక్కువకాలము అక్కడ నుండుట కవకాశము లేకపోవుటవల్లను నేను మాత్రము శ్రీమతి బిల్లీ మోరియా అనుపార్సీ స్త్రీసహవాసమున జనవరి 6 తేదీని లండనులో బయలుదేరి ఇండియాకు ప్రయాణమైతిని. లండను విక్టోరియా స్టేషనుకు అనేకమంది స్నేహితులు నన్ను సాగనంపుటకువచ్చిరి. వెన్నీసు పట్టణమువరకును రైలుమీద వచ్చి అక్కడ గ్యాంజి అను స్టీమరునెక్కి బొంబాయి చేరితిని. ఈ తిరుగు స్టీమరు ప్రయాణములో నా కొంతమాత్రము జబ్బుచేయలేదు. ప్రతిదినమును ఆటపాటలతో కాలము గడపితిని. స్టీమరులో అనేకమంది స్త్రీపురుషులు నాకు అత్యంత పరిచితులైరి. ఈస్టీమరునందే వచ్చిన చావలి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు నాకెంతయు సహాయభూతులుగా నుండిరి. బొంబాయిలో ౨౧ తేదీ మధ్యాహ్నము ౨ గంటలకు బాలర్డురేవునొద్ద (Ballard Pier) స్టీమరు దిగితిని. అచ్చటికి నాతండ్రిగారును, మరికొందరు స్నేహితులునువచ్చి నన్ను తీసికొని వెళ్లిరి. బొంబాయిలో కొన్నిదినములుండి జనవరి ౨౬ తేదీకి మద్రాసు చేరితిని.

---

# హెచ్చరిక

మంగపూడి వేంకటశర్మ గారు

భరతఖండమెల్ల బానిసంబున జిక్కి
దిక్కుమాలి తేజు దక్కుకతన
శీల మెగిరిపోయె సిరులెల్ల నుడివోయె
కడకు జీవనంబె కష్టమాయె.

చెట్టు కొక్కపిట్ట చేరెడు చందాన
పొట్ట చేతబట్టి పోయినారు
భారతమ్మ సుతులు ప్రాణాలపై గాంక్ష
జన్మభూమి విడచి జలధి గడచి.

వినమె "స్వర్గమునకు జనిన వడేకులు
తప్ప" వన్న సామెతను ధరిత్రి
నట్లె తప్పవయ్యె నచ్చోట మనవారి
కిడుమ లెట్లు తప్పు బడుగులకును?

బడుగు లొకటె కాదు బానిస ముద్రలు
దాల్చినట్టి గర్భదాసు లగుట
శ్వేతసీమలందు సిలుగు లందుచు నున్న
వారు వారివెతల వ్రాయ దరమె?

ఇంటను పొరుగింటను నిటు
కంటకములె సంభవించు కతము లరసి బల్
దంట తనంబున స్వేచ్ఛను
గొంటకు యత్నింతు రదెగొ కొందరు పెద్దల్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్తిగలుగు వారు సాయపడుట యొప్పు
శక్తిలేనివారు సంతసమున
చూచుచుంట యొప్పు చుప్పనాతితనంబు
బూని యడ్డుదగుల బూన దగదు.

పెద్దలను గేలి సేయుచు
పెద్దల నడకలకు పేర్లు పెట్టుచు తామే
పెద్దల మను గర్వంబున
గద్దరులై వదరదగదుగద సుమతులకున్.

జాతీయ సంస్థలను తమ
చేతనయిన సాయములను జేయుచు నెంతో
ప్రీతిని పోషింపం దగు
లాతిగ చల పట్టుకొని పలార్చుట తగునే!

కబురుపోతులకును కార్యశూరుల కష్ట
నిష్ఠురములు తెలియునే ధరిత్రి?
నీరు చొరక లోతునిజ మెట్లు తెలియును
సాముదెట్లు తెలియు సోమరులకు?

తామేమి చేయ బోవరు
తా మస్సులై పరుల నెంచెదరు పామరులై
సోమరులై దేశమునకు
తామరులై కొందరేమి దౌర్భాగ్యమొకో

కుడిచి యింటిలోన గూర్చుండి మెల్లగా
కడుపులోని చల్ల కదలకుండ
ధీమలగుచు ధనము దేహంబు దేశాన
కిచ్చువారి వెక్కిరింప దగునె.

చిల్లి గవ్వైన సాయంబు చేయలేని
గడియ సేపైన కిష్టంబు బడయలేని
వ్యర్థులునునసమర్థులు స్వార్థపరులు
మిట్టిపడ కూరకుండుట మేలుగాదె

పామరత్వంబుననో దుస్స్వభావముననో
స్వార్థతత్పరతనో ధర్మ సరణి దప్పి
కుల మతంబులు మిషగొని కలహములను
పెంచుచుందురు కొందరు పెద్దలేమొ.

కులమతాభిమానములు గల్గియుండియు
నెదుటి కుల మతాల కేవగడక
సంచరించు టొప్పు నను బుద్ధిచే నొప్పు
బుద్ధిమంతులైన పుణ్యమతులు

కులమతాభిమానముల జిక్కి పక్షపా
తములు గలిగియుంట తప్పు గాని
ఎవరికుల మతంబు లెల్లరు పెంపొంద
జేసికొనుట యేమి దోసమగును

ధనలాభమునకు తక్కిన
తనలాభమునకును నీతి ధర్మ వెలివం
చనవృత్తి గాగ జేకొని
మనెడు నరుని జీవనంబు మాన్యంబగునే?

చదువు లెరిగి జ్ఞాన సరణు లెరింగియు
కుక్షి నింపుకొనెడు గుఱుతు లెరిగి
కడుపుకొరకు నట్టి గట్టి నొల్లుటకంటె
హేయమైన కార్య మేదికలదు?

చేరకుడు శత్రువులలో
భారకులనకుండ కన్న భరతమ్మ కికన్ (?)
గోరకుడు బంధనంబులు
దూరకుడు స్వదేశ దీక్షితుల మోరకులై.

పాపపు చేతకు పశ్చా
త్తాపము పడి దైవముఖము ధర్మువు మదిలో
దోపగ సత్పథమున జని
దీపింపుడు జగముమెచ్చ దేవుడు మెచ్చన్.

నరజన్మ మెత్తి పశువుల
కరణిన్ వర్తించు టొప్పుగాదని మదిలో
నరసి వివేకపు సరణిన్
జరియింపుడు సాధులగుచు జగతిని మనుడీ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# పునర్విమర్శనము

## మేఘసందేశము

ఫాల్గుణ "భారతి" యందు, మద్విరచితమగు "ఆంధ్రమేఘసందేశము" పై నొక 'రివ్యూ' వెలువడినది. దానింగూర్చి కొన్ని యంశములు పాఠకులకు మనవిసేయుట కర్తవ్యముగా నెంచినాఁడను.

౧. విమర్శకు మకుటముగా నీ వాక్యము తోఁత్తనే కలదు: "వీరు చాలఁగష్టపడి దీని నాంధ్రీకరించినట్లు తామే పీఠికలో వ్రాసినారు." నేనెచటను అట్లు వ్రాయలేదు!

౨. గ్రంథము మొత్తము మీఁద విమర్శకుల పరితోషమునకుం బాత్రమైనట్లు, "చాలఁ జక్కఁగానే ఆంధ్రీకరించి యున్నారు" అను తొలిపుటలోని వాక్యమువలనఁ దెల్లమగుచున్నది. కాని యీ వాక్యము తప్ప కడమ పదిపుటలు (సన్నయచ్చు) దోషోద్ఘాటనముచేఁ బూరింపఁబడినది. ఇప్పటికిఁ బూర్వమేఘమే పూర్తియైనదఁట! ఇయ్యది వింతగఁదోఁపదా!

3. విమర్శకులు చూపించిన తప్పులలోఁ గొన్నింటిని మచ్చునకై మనవిచేసెదను:

i 'స్నాన' మనుట యొప్పు; 'జలకేళి' తప్పు!
(జలకేళి=తీర్థమాడుట, స్నానమాడుట)

ii 'చేతనాచేతనముల'కు 'అచేతనచేతనము'లనుట యొక తప్పు!

iii 'పుష్కలావర్తకముల'కు 'ఆవర్తక పుష్కలము'లనుట మఱియొక తప్పు!

iv 'ప్రభవతి', 'చతుర' శబ్దములకు నమసగ 'మేటి', 'నెఱి' యనుట యింకొక తప్పు!

"కరట తతుల్ కులాయములఁ గట్టుటఁ గ్రందగు రచ్చచెట్టులున్; పరిణతమైన పండ్లగమి నల్పగు నేరెటి తోఁపులున్; మనోహరమగుఁ గొన్ని నాళ్లి వ్వడియు నంచలు; నీవు దశార్ణ మేగఁగాన్." (ఇందు మూడు బంధులలోను 'అగు' సమాపకక్రియ.)

దీనికి విమర్శకులు వ్రాసిన దండాన్వయము!

'నీవు దశార్ణము వెళ్లఁగా, కాక సమూహములు

అలిక్కిడియయిన రథ్యావృక్షములును, పండినదియైన పండుపిండుచేతను, గూండ్లను కట్టుటచేతను, నల్పు అయిన నేరెటితోఁటలును కొన్ని దినములు పొవుచు నొకచో బసచేసిన హంసలును చక్కనిది అగును'!

vi మూలము: 'సభ్రూభంగం ముఖమివ'

మల్లినాథవ్యాఖ్య: 'ముఖమివ=అధరమివేత్యర్థః.'
అనువాదము: 'అధరంబును భ్రూకుటి యుక్తముంబలెన్'
నేనిట 'అధర' మనుట ఆక్షేపార్హమట!

vii అనువాదము:

"సొమ్ము, వీనదోవల్
బాలకపోలపుల్ జెనుటఁ బాపుట వాసిన, పువ్వులారికా
జాల ముఖాళికిన్ జలద ఛాయ నొసంగి, క్షణానురక్తివై."

విమర్శ: 'ఇది యేటి తెనిఁగింపో కదా! కలువలు వాడినట్లు కాళిదాసుగారనఁగా, ముఖములు వాడినట్లు వీరన్నారు. ఇదియు నొక మెఱుఁగోయేమో!' నేను 'ముఖములు వాడినట్లు' అననే లేదు! కలువలు వాడినట్లే అన్నాను!

viii మూలము: హైమం తాలద్రుమవన మభూదత్ర తస్యైవ రాజ్ఞః.

అనువాదము: 'కనకంబాతని తాళవృక్షవనమున్ గాలెంగదా యిచ్చటన్.'

విమర్శ: 'ఆతనిదనఁగా వత్సరాజుదా? లేక ప్రద్యోతనునిదా? వీరి రచన వత్సరాజు దనియే చెప్పుచున్నది.'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారచన యట్లు చెప్పనే చెప్పదు! మూలాను వాదముల రెంటను 'అతనిది' అనియే యున్నది. ప్రకరణముంబట్టి ప్రద్యోతునిది అనుకొనుట సులభము!

ix 'సురభి తనయా లంభజామ్' అనుటకు 'సురభి భవేష్టిజంబు' అనుట తప్పు!

| మూలము | అనువాదము |
|---|---|
| 'బంధుప్రీతి' | 'బంధురతి' |
| 'పుత్త్రిప్రేమ్ణా' | 'పుత్త్రిరతిఁ' |

విమర్శ: 'శివశివా! ఎక్కడనైనను తల్లికిఁ గొడుకునందు రతియుండునా? పద్యము రచించుచున్నామన్న సంబర మేగాని యౌచిత్యము చూచుకొన నక్కరలేదా? ప్రేమవేఱు, రతివేఱు అనిమాత్ర మెఱుఁగరా?...... ఈరెండును అనుచిత ప్రయోగములే యని నామతము.'

'రతి=అనురాగము,' 'అనురాగము=మారిమి'

– శబ్ద రత్నాకరము.

'రతి' శబ్దమునకు శృంగారేతరప్రయోగములు:

'తనసేవారతి చింతఁగాని పరచింతాలేశముఁ లేని సజ్జనులం బాండు తనూజులఁ'

ఆం. భాగ. 1-146.

'యోగనిద్రారతినుండి నాభిసింధుజ స్వర్గ లోక కంజాతకర్ణికఁందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు' ఆం. భాగ. vi—286.

iX 'రతులు పుణ్యసంగతుల యందు యారాజ చంద్రమునకు.'

ఆం. భాగ. Ix 82.

'జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునఁ.'

ఆం. భాగ. X-1238.

గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య

---

# సవరణ

## ౧

భారతి ఫాల్గుణమాస సంచిక ౩౯౮ వ పుటలో "యంబుదము క్రింద సాంధ్యరాగంబు పైని, నమరు" తరువాత "చంద్రులఁబోలుచు నలకములను, దనరు" అని చేర్చుకొనవలయును.

౩౯౯ వ పుటలో 'పృథ్వినేనౌదు' అను దానిని 'పుడమినేనౌదు' అనియు, 'చిగురు నేకాదు' అనుదానిని 'చిగురునేనౌదు' అనియు, 'చయము,నేనయఁగుదను' అనుదానిని 'చయము,లేనయగుదును' అనియు జదువుకొనవలయును.

## ౨

అదే సంచిక ౪౩౬-౪౩౭ వ పుటలలోని III, IV పట్టికల చివర కలములో "వీటినన్నిటిని జేర్చి ఆవిరిమీద ఉడికించవలయును" అను వాక్యమున 'వీటి నన్నిటిని' అనుటకు మారుగ 'ఇందు మొదటి యారింటిని' అని చదువుకొనవలయును.

భా. సం.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## భారతభాగ్యోన్నతి

సామవేదం జానకిరామ శర్మ

(రామకృష్ణసమితి)

షహజహాను చక్రవర్తి కాలమున భారతీయులమితైశ్వర్యయుతులై యుండిరి. ఆకాలపు చక్రవర్తుల భాగ్యోన్నత్యమున భారతదేశము సర్వోచ్చస్థాన మాక్రమించియుండెను. అబ్దుల్ అహమద్ షాహజహాన్ చక్రవర్తి ఐశ్వర్యమును గూర్చి లాహోరులో నుడివియుండెను. ఇప్పుడు రు 1-2-0 అప్పటి రు 1 కు సమానము. ఐనను, యిప్పుడు రు 1 కు కొనగల వస్తువులకంటె అప్పుడు 7 రెట్లు అధికముగ లభించుచుండెడివి.

మొగలు సామ్రాజ్య మంతటినుండియు 20 కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచుండెది. చక్రవర్తి $1\frac{1}{2}$ కోట్ల రూపాయలను మాత్రమే స్వంతఖర్చు క్రింద వాడుకొనుచుండు వాడు. షహజహాను తన మొదటి యిరువది సంవత్సరముల రాజ్యకాలమున, ప్రతి వత్సరమునను, $4\frac{1}{2}$ కోట్ల రూపాయలు నగదును, 5 కోట్ల రూపాయలు వస్తురూపకముగను, ధర్మకార్యములకై వినియోగించు వాడు.

ప్రాసాదములు మొదలగువాటి నిర్మాణమునకు చక్రవర్తి యెంత ధనము వ్యయమొనర్చినదియు, యీ దిగువ తెలుపబడినది.

| | | లక్షలరూపాయలు. |
|---|---|---|
| మోతీమసీదు, ఉద్యానవనము | ... | 60 |
| తాజ్ మహల్ ... | ... | 50 |
| రాజసౌధము, మరియితరములు, | ... | 50 |
| జుమ్మామసీదు ... | ... | 10 |
| ఢిల్లీ పట్టణమునకు ప్రాకారము | ... | 4 |
| ఢిల్లీయందు రాజకుటుంబము నమాజు చేయుటకేర్పరచిన సౌధము | ... | $\frac{1}{2}$ |
| లాహోరు ప్రాసాదము, ఉద్యానవనము | | 50 |
| కాశ్మీర ప్రాసాదము, ఉద్యానవనము: | | 8 |
| కంధారు దుర్గాలయము | ... | 8 |
| అజమీరు మహలు ... | ... | 21 |
| ముఖలిస్ పుర ప్రాసాదము | ... | 6 |

చక్రవర్తివద్ద 5 కోట్ల రూప్యములు వెలగల యాభరణములుండెడివి. యివిగాక 3 కోట్ల రూప్యముల వెలగల ఆభరణములను షహజాదా, షహజాదీలకిచ్చెను.

ప్రత్యేకము చక్రవర్తి ధరించెడి యాభరణముల వెల 2 కోట్ల రూపాయలు. చక్రవర్తి ధరించు జపమాలయందు 5 రత్నములును, 30 ముత్యములును, ఉండెడివి. వీటి వెల 8 లక్షల రూపాయలు. ఇదిగాక యింకను విలువగల హారములుండెడివి. వానియందు మొత్తము 215 రత్నములుండెడివి. ఒక జపమాలయందు కొలికి పూసగనున్న రత్నముయొక్క బరువు 32 వడ్లగింజలు. దీని మూల్యము ప్రత్యేకము నలుబదివేల రూపాయలు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొత్తము హారమంతయు, 20 లక్షల రూప్యముల వెల గలిగియుండెడిది. ఈ జపమాల యందలి రత్నముల నన్నిటిని అక్బర్ సంపాదించియుండెను. షహజహాను ధరించుకిరీటమం దంతటను పెద్దవియు, మిక్కిలి వెలగలవియు నగు రత్నములు కూర్చబడియుండెను. ప్రతి సంవత్సరము జరుగు రాజ్యాభిషేకోత్సవ దినమందు షహజహానాకిరీటమును ధరించి రాజకీయముల నారయుచుండెడివాడు. దీని యందన్నిటి కన్నను పెద్దవగు 5 రత్నములును, 24 పెద్ద ముత్యములునుండెడివి. కిరీటమందలి మధ్యరత్నము యొక్క బరువు 128 వడ్ల గింజలు. దీనివెల 2 లక్షల రూపాయలు. మొత్తము కిరీటము వెల 12 లక్షల రూపాయలు. 2? నవంబరు 1644 సంవత్సరమున మరల 40 వేల రూపాయల విలువగల ముత్యమొకటి చేర్చబడినది. చక్రవర్తికిగల వజ్రాభరణములందలి వజ్రము లన్నిటిలోను మిక్కిలి పెద్దదగు వజ్రముయొక్క బరువు 430 వడ్ల గింజల యెత్తు. దీని మూల్యము 2 లక్షల రూపాయలు

1653 మార్చి 22 వ తేదీని షాహజహాను చక్రవర్తి సింహాసనము లన్నిటియందును శ్రేష్ఠతమమగు మయూరసింహాసనమునధిరోహించెను. స్వర్ణకారులలో నిపుణుడగు బేబాల్ ఖానీ సింహాసనమును తయారు జేసెను. ఈ సింహాసనము పొడుగు $3\frac{1}{2}$ గజములు, వెడల్పు $2\frac{1}{2}$ గజములు, యెత్తు 5 గజములును యుండెడిది. పై భాగమమూల్య రత్నములచే నిండియుండి చూపరుల కానందాశ్చర్యములను గలుగజేయుచుండెను సింహాసన మందలి స్తంభములపై, రత్నములతోడను, మణులతోడను చిత్రింపబడిన రెండు మయూరములుండెడివి. దీనిని తయారు చేయుటకు 10 లక్షల రూప్యములు ఖర్చుఆయెను. సింహాసన మధ్యమందున్న మణి యొక్కటియే లక్షరూప్యములు వెలగలది. దీనిని ఫ్రాన్సుదేశ చక్రవర్తియగు శాహ్అబ్బాస్‌జహంగీరునకు కానుకగ నిచ్చెను. ఈ సింహాసనముపై, తైమూరు, మీర్‌షాహిరుఖ్, మిర్జీఉలూఖ్ బేగ్, శాహ్ అబ్బాస్, అక్బర్, జహంగీర్, షహజహాన్, అను పేరులు లిఖింపబడెను. సింహాసనమునకు క్రింది భాగమున, హాజీమహమ్మద్‌కుద్‌షీ, వ్రాసిన నలుబది పంక్తుల వ్యాసముగుండ్రని యక్షరములతో లిఖింపబడెను. వ్యాసమునకు పైన "న్యాయపరాయణుడగు చక్రవర్తి సింహాసనమ"ని చిత్రింపబడెను. సింహాసనమునకు క్రింది భాగమున సింహాసనమునకు క్రిందిభాగమున సింహాసనమేదినమున తయారగుట సమాప్తమాయెనో యా తేదీ వ్రాయబడియుండెను. సింహాసనమంతయు నొక కోటి రూపాయలాయెనట!

భారతదేశమందలి యిట్టి విపుల భాగ్యవంతమగు రాజ్యమును రక్షించుటకుగాను, 1648 సంవత్సరము నాటికి, ఢిల్లీ చక్రవర్తియగు షాహజహానునిసేనయందు, 2 లక్షలు అశ్వారోహకులును, 6 వేల పదాతులును, గాక, రాజ్యమందచ్చటచ్చట వీరులగు ఉమరావుల యధీనమున ఒకలక్ష సేనయు, 50 వేల యశ్వారోహకులును 4 లక్షల 50 వేల పదాతులును యుండెడివి. ఇట్టి మహోత్కృష్ట దశ ననుభవించిన భారతదేశము నేటికిట్టి నీచస్థితియందుండుట భారతీయుల దుర్దశను వెల్లడిపఱచుచున్నది.

---

## జార్జిబెర్నార్డ్‌షాగారి యభిప్రాయములు:

### తన నాటకములను గూర్చి

'ఫోరమ్' అను అమెరికా దేశపు మాసపత్రిక యందు 'షా'గారు తాము రచియించిన నాటకములను గూర్చి యిట్లు వివరించుచున్నారు:—

నా నాటకములన్నియు వానియందలి పాత్రల మనోవిశ్వాసములందును, ఆత్మలయందును విప్లవములను, తిరుగుబాటు మార్పులను ప్రదర్శించును. నేను వ్రాయు ప్రతి నాటకమును మతాంతర స్వీకారపుకథ యగునని ఛెస్టర్‌టన్ సరిగానే వర్ణించెను. నాటకరంగమునందభిమానముగల, సంస్కారులైన ఆధునికజనుల కొక్కువ రుచించు మాదిరి నాటకములను నేను వ్రాయుదును: జీవితచరిత్రములు, ప్రవర్తన గూర్చినచర్చలు, ఉద్దేశముల బహిరంగపరచుటలు, సంభావనమునందు వ్యక్తిగుణముల వ్యతిరేకత (వైరుధ్యము), తప్పుల ప్రమాదముల కనుగొనుట, హృదయముల విప్పిపెట్టుట—ఇన్నియేల, క్లుప్తముగ చెప్పవలెనన్నచో-జీవితప్రకాశనము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నిటికంటెను నన్ను గూర్చిన నీచవిమర్శనములలో నొకటి, నేనువట్టి కందిరీగవంటి వాడననియు, మనుష్యులను కుట్టి బాధించుటయేగాని వారి కేవిధమగు సహాయ మొనర్పవనియును, నేను వట్టి విధ్వంసకుడననియు చెప్పు విమర్శకులు తెలివిమాలినవారు, ఆలోచనలేనివారు. ఇంతకంటె సత్యదూరమైనది లేదు. స్త్రీపురుషులయొక్క ఆలోచనలను పురిగొల్పుటయందు నేను పడసిన అఖండ విజయమే నాతరమువారికి నే నొర్చిన ముఖ్యమగు సహాయము. నేను ఒక్కొక క్రొత్త నాటకము రచియించి మానవలోకమునకు నేనొక క్రొత్త సందేశమును తెచ్చి యిచ్చితిని. భావప్రపంచమున, నాకాలమునకు నన్ను వార్తాహరుడనవచ్చును

మొత్తముగా చూచినచో, నారచనయంతయు పూర్తిగానిర్మాణరూపముగ నేయున్నది. ప్రతినాటకమును నామనోవిశ్వాసములకు సాక్షిభూతముగనున్నది. సాధారణాభిప్రాయములతో నే నెట్లు సదా వ్యవహరింతునో నిరూపించుటకు, కొన్నిటినిమాత్ర ముదాహరింతును, candida కేండిడా: ప్రేమను గూర్చియు, స్త్రీపురుషుల సంబంధము గూర్చి; 'The Doctor's Dilemma' వైద్యుని సందిగ్ధావస్థ: వైద్యవృత్తియొక్క ప్రస్తుత శోచనీయావస్థనుగూర్చి.

'Man and Superman' 'మానవుడు,-'మానవోత్తముడు :' జన్మశాస్త్రము, జననమరణములు, మానవ సంతతి యొక్క భవిష్యత్తును గూర్చి.

'Major Barbara' మేజర్ బార్బరా: దారిద్ర్యము, ధనాధిక్యమునుగూర్చి.

'Androcles' ఏండ్రొకిల్స్: క్రీస్తుమతమును గూర్చి.

'Getting married' పెండ్లియాడుట: బొత్తిగా హద్దుపద్దులేని మనసాంఘికవ్యవస్థను గూర్చి.

'Heartbreak house' హార్ట్బ్రేక్ హౌస్, ఈనాటి నాగరికతనుగూర్చి.

'Caesar and Cleopatra' సీజరు - క్లియోపాత్రా: విశేషధీశక్తిని గూర్చియు, మహత్త్వమును గూర్చియు.

'Saint Joan' జోన్ఆఫ్ఆర్క్: వీరత్వమును గూర్చియు, ఋషిత్వమును గూర్చియు.

'Back to Methusela' మెథూసెలాకుమరలుడు: ఉత్క్రాంతి పరిణామధర్మమునుగూర్చి; కాని, 'The Apple cart' ఏపిల్ కార్ట్ (అతి క్రొత్తనాటకము)ను మీరే చదివి తెలిసికొనుడు! నేను చెప్పను!

సరియైన నాటకమును రచియించుటకు వలయున దేది యని నన్ను ప్రశ్నించిరి. ఇదిగో నాప్రత్యుత్తరము: ఊహాకల్పన. ఇంతకంటె నేనెక్కువ చెప్పజాలను; మహామనస్తత్వ వేత్తయని పేరొందినవా రెక్కువ చెప్పగలరేమొ కాని నాటకరచయిత యని పేరొందిన నేను కాదు. మహాపట్టణములోని పెద్ద వీధియందలి వచ్చుపోవు జనుల సమూహమును, వారివారి కార్యకలాపముల దొంతెరలను, సినీమాబొమ్మలయంత్రము మూలమున ప్రతిబింబించితి రనుకొనుడు. మీ రదిచూచి యేమి తెలిసికొనగలరు? అనుదినమును సంవత్సరములకొలది యావీధి నట్లే చూచుచుండిన వాడైనను, ఎట్లు జీవితముయొక్క అర్థము తెలిసికొనజాలక అజ్ఞుడై అచ్చెరువు గొనియుండునో అట్లే యుందురు. ఇట్టి అర్థముకాని విషయ పరంపరనుండి, నిజముకాక ఊహాకల్పితమైనను ఉండవీలగు కొందరు వ్యక్తులను, నిజము కాకపోయినను సంభవమగు కొన్ని కార్యములను ఎన్నుకొందుము. ; వీనివలన జీవితము అర్థమగుటకు వీలగును, దాని వ్యాఖ్యానము, అన్వయమునకు మార్గము తోచును. మహానాటక కర్తలు తమలోని పరిణామ నిర్వచన స్వభావముచే యీపనిని నెరవేర్పవలసివచ్చి, నాటకరంగమును, నాటకకళను నిర్మించి, తమ సందేశమును-బోధను ప్రపంచమునకు ప్రకటించుట కనువగు మార్గమును సారస్వతమున కల్పించికొనిన వెనుక, నాటకరంగమందలి చిన్నవారు (నటకులు) చిన్న ఉద్దేశములకై పాటుపడుదురు: తమయొక్కయు, డబ్బిచ్చి చూడవచ్చిన ప్రేక్షకగణముయొక్కయు అభిరుచిని,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కారపులోతును అనుసరించి ఒకమారు నవ్వించుటకో, నాటకరూపమున పెంకి కథలను వివరించుటకో, బోల్తా కొట్టించి నవ్వులపాటు సేయుటకో, లేక శోకముననో ఆనందముననో క్రోధముననో ముంచియెత్తుటకో; కాని యీనాటకరచనాకార్యమునకు మూలకారణమేదియన; మనము 'జీవితము' 'జీవము' అను విచిత్రమగు మాయకట్టు కథయొక్క స్వభావమును, ఉద్దేశమునుగూర్చిన స్పష్టమును విశాలమునైన పరిజ్ఞానమునకైన మన కోరిక-వాంఛయే. ఆ 'జీవము'నకు చెందియే మనము నిరంతరపీడాబాధితులమును, సాపరాధులము నయ్యు ఉన్నతపథగాములగు యంత్రముల మని యెరుగుచున్నాము.

నేడు జీవించియున్న మహానాటకకర్తలలో నేనే సర్వోత్తముడనని నిర్ధరించి చెప్పుచున్నారు. అది నిశ్చయమని మీ రెట్లెరుగుదురు? మనకు తెలియబడకగాని, పూర్వము నావలెనే చేతగాక నవ్వుతాలుపాలగు మోసగాడుగా యెంచబడువాడుగాని, యింకను గొప్ప గ్రంథకర్త యెవ్వడైన యశోమార్గమధ్యమున నున్నాడేమో! జి. బి. యస్. కంటె (నాకంటె) జీవశక్తి ఎక్కువదనియు, హెచ్చు మేలు చేయగలదనియు నేను విశ్వసింపకయుండజాలను.

అనువాదకుడు : జి. బ్రహ్మానంద

---

## 'షైపు' యంత్రచిత్రములు

ఈ చిత్రములను బందరు హిందూ కాలేజిలో 'కమర్షియల్ ఇన్‌స్ట్రక్టరు' శ్రీ బి. వి. రంగారావు (యఫ్. సి. ఐ.) గారు రెమింగ్టను నెం. ౧౨ రు షైపు యంత్రముతో చిత్రించినారు. వీనిని మెచ్చుకొని అఖిల భారత విద్యాశాఖాప్రదర్శనము (The All India Educational Exhibition) వారు బంగారు పతకమును, గౌరవ పత్రమును, (Certificate of honor) ఇచ్చిరి. షైపు యంత్రముతో నిట్లు చిత్రములను తయారుచేయుట సులువయినపనికాదు. ఈ చిత్రములను తయారుచేయ నేర్పును గడించుకొన్న శ్రీరంగారావుగా రభినందనార్హులు. వీరు తమకౌశలమును పెంపొందించుకొని రూపచిత్రములను, ప్రకృతిచిత్రములను తయారుచేసి, చిత్రకళకు క్రొత్తసొంపును, ఆంధ్రలోకమునకానందమును సమకూర్పగలరు.



శ్రీయుతులు బి. వి. రంగారావు గారు



పల్లెటూరి బడి



ముందువైపు



ప్రక్కవైపు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## కంపిలి-విజయనగరము

గ్రంథకర్త, డాక్టరు నే, వెంకటరమణయ్యగారు
ఎం. ఎ., పి. హెచ్. డి.

డాక్టరు వెంకటరమణయ్యగారు. మద్రాసు క్రిస్టి యను కాలేజీయందు చరిత్రాధ్యాపకులు, మంచిపండితులు. విజయనగర సామ్రాజ్య స్థాపనమునకు మూలకారణములను గురించియు, తద్రాజ్యస్థాపకుల గురించియు దీక్షతో పరిశోధనచేసి తమ సిద్ధాంతములను డాక్టరు వెంకటరమణయ్యగారు ఈచిన్న పుస్తకరూపమున వెల్లడించినారు. మొదట నీ రెండు వ్యాసములును మద్రాసు క్రిస్టి యనుకాలేజీ మాగజైను (1929-30) లో ప్రకటించి పిమ్మట పుస్తక రూపముగా ప్రచురించినారు. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమును వెదకి వెలికిదీసిన ప్రాచీన కన్నడ, తెలుగుగ్రంథములను పరిశీలించి వాటి ననుసరించి కంపిలి రాజ్యవృత్తాంతమును, విజయనగరసామ్రాజ్య స్థాపన వృత్తాంతమును శ్రీడాక్టరుగారు మిక్కిలి కృషి చేసి నిష్పక్షపాత బుద్ధితో, సత్యచారిత్రాన్వేషణదృష్టితో వ్రాసినారు.

ఈ గ్రంథమున మొదటి వ్యాసము కంపిలి రాజ్య వృత్తాంతము. మహమ్మదీయ చరిత్రకారులు కంపిలి రాజ్యమును గూర్చి వ్రాసినదంతయు కలిపి కడుస్వల్పము. వారు వ్రాసిన కొలదిపాటి వృత్తాంతములు గూడ ఇతర ఆధారములు ఇంతవఱకు కానరామిచే సరిగా నర్థముగాకున్నవి. వాటిని పురస్కరించుకొని వ్రాసిన సూయలు, డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు, రావుసాహెబు కృష్ణశాస్త్రి లూయీా రైసు మున్నగువారలు తమకు తోచిన యట్లు శాసనములు ప్రమాణములుగా గైకొని చరిత్ర నిర్మాణము చేసియుండిరి. కాని డాక్టరు వెంకటరమణయ్యగారు కంపిలి రాజ్యవృత్తాంతమును ప్రాచీన కన్నడ, తెలుగు గ్రంథములను పరిశోధించి మహమ్మదీయచరిత్ర కారులెంతవఱకు సత్యమును వ్రాసిపెట్టిరో చూపినారు. కన్నడ గ్రంథములలోని వృత్తాంతములను చారిత్రకదృష్టితో విమర్శించి డాక్టరుగారు కంపిలిరాజ్యచరిత్రమును సమగ్రముగా రచింపగలిగినారు. వారు చెప్పినట్లు ఆనెగొంది సీమను శాసనముల కొరకు జాగ్రతగా వెదకినచో ఇంకను నూతన విషయములు, ఆశ్చర్యము కలిగించు చరిత్రాంశములు నిస్సంశయముగా బయలుపడగలవు. డాక్టరుగారు దేశభాషాగ్రంథములు విమర్శించు నప్పుడు ఆ గ్రంథములను గురించియు, వాటిని రచించిన కవులను గురించియు, వాటి కాలమును గురించియు, వాటి సత్యత్వమునుగురించియు చర్చింపక పోవుట లోపమని చెప్పవలసియున్నది. కంపిలి రాజ్య స్థాపకుడైన ముమ్మడిసింగయగూర్చి వ్రాయునపుడును, ఆతని కుమారుడైన కంపిలరాయని యొక్కయు, మనుమడైన కుమారరామరాయల యొక్కయు దిగ్విజయములనుగూర్చి వ్రాయునపుడును విషయమును బోధకమగు నట్లుగా నొక దేశపటమును డాక్టరుగారు తయారుచేసి పాఠకుని కందీయవలసియున్నది. ప్రాచీనదేశీయ గ్రంథములు మహమ్మదీయ చరిత్రకారులు రచించిన చరిత్రలును వాకొనుచున్న కంపిలిరాయడు, ఆతని తండ్రి ముమ్మడిసింగడు రామదేవుడు ముగ్గురునుకూడ నిజముగ నుండినవారేయని శాసనప్రమాణముజూపి శ్రీడాక్టరుగారు నిరూపించిరి. కాని వారుజూపిన శాసన ప్రమాణములు సంపూర్ణముగ నింకు ఉదాహరింపబడలేదు. మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలను దేశీయభాషాగ్రంథములకును



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చారిత్రవిషయములందు పోలికలుండుటబట్టి, ఉభయుల వ్రాతలయందునుయథార్థముగనప్పట్టుచున్నదని డాక్టరుగా రువ్రాయుచున్నారు. మహమ్మదీయదండయాత్రకుకారణ ములు ఉభయులును యించుమించుగా నొకరీతిగనే వర్ణించినారు. అల్లావుద్దీనుకాలమున దక్షిణ దిగ్విజయ యాత్రగావించి కాలాగ్నివలె దేశమునచిచ్చుపెట్టిపోయిన మల్లిక్ కాపూరును, చూచి జనులు భీతచిత్తులై ఆతని కాలనేమి, లేక నేమియని నామకరణముచేసిరట! ఆతడు కాలనేమి యగునపుడు తురుష్కులు దానవులని వర్ణింప బడుటలో ఆశ్చర్య మేమి? కాని కన్నడ చరిత్రకారులు కాలనేమినిబోలిన తురుష్కసేనానుల నందరిని కాలనేమి యనియే పిలుచుచుండిరి. కంపిలిరాజ్యమును ధ్వంసము చేసినఖ్వాజాజహాను సేనానినికూడా కన్నడీయులు కాల నేమియనియే వ్యవహరించి నిజనామమును మరుగుపరచిరి. ఏదో ఒక తెలుగుకావ్యమునందు మలిక్‌కాపూర్, కాల యవనుడని పిలువబడినట్లు డాక్టరుగారు వ్రాయుచు న్నారు. ఆకావ్యమేదో తెలిపియుండిన బాగుండును! కంపిలిరాజ్యాపహరుణుడు ఖ్వాజాజహాను అని డాక్టరు గారు నిర్ణయించుచున్నారు. వీరి నిర్ణయము సమంజస ముగా నున్నది.

శ్రీ డాక్టరుగారి రెండవ వ్యాసమున విజయనగర సామ్రాజ్యస్థాపకులను గురించి వ్రాయబడినది.

విజయనగరసామ్రాజ్యస్థాపనమునకు మూలకారణ ములను డాక్టరుగారు మిక్కిలి సమర్థతతోడను చారిత్రక దృష్టితోడను విమర్శించిరి. విజయనగర స్థాపకులయిన హరిహరరాయ, బుక్కరాయ మహీపాలురు డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు, సత్యనాథయ్యగార్లు తలచినట్లు, హొయిసలబల్లాలదేవునికడ సామంతులుగారనియు, విజయనగర నిర్మాత ముమ్మడి హొయిసలబల్లాలదేవుడు కాదనియు, ప్రమాణములనిచ్చి నిర్ణయించిరి. విజయన గర నిర్మాణకథ హొయిసలరాజులకు వారి సామంతరా జులోకమున ముడి పెట్టుట, డాక్టరు కృష్ణస్వామి అయ్యం గారి యొక్కయు వారి శిష్యులయిన సత్యనాథయ్యగారి యొక్కయు కర్ణాటదేశాభిమానమును వెల్లడించుచున్న వనియు సత్యమైన చరిత్రను మరుగుపరచుచున్న వనియు డాక్టరు వెంకటరమణయ్యగారు చూపిన ప్రమాణములు తోపించుచున్నవి. సంగమవంశము లయిన హరిహరరాయ బుక్కరాయలు, కర్ణాటదేశీయులు గారనియు, ఓరుగంటి సీమలో జేరిన తెలుగునాటి గొడ్డలు అనియు, వారు, ఓరుగంటి కాకతీయమహాసామ్రాజ్య ము నశించినతరువాత, కంపిలిరాజ్యమును పొచ్చి యచ్చట కొంతకాలముండి పిమ్మట నారాజ్యవినాశనం తరమున పారిపోవుటకు ప్రయత్నింపగా పట్టుబడి, సుల్తాను మహమ్మదు టుఘ్లకుసాయెదుటకు గొంపోబడి యచ్చట మహమ్మదీయ మతము స్వీకరించి సుల్తాను యొక్క అనుగ్రహమును సంపాదించుకొని మరల కంపిలి రాజ్యమును సుల్తానునకు సామంతులుగా నేలుటకు నియ మింపబడిరనియు, పిమ్మట కొంతకాలమునకు ఆనెగొందిని విడిచి విజయనగరమును నిర్మించుకొని రాజధానిమార్చు కొనిరనియును, మొదటినుండి హరిహర బుక్కరాయలకు భల్లాణరాజులతో వైరమేసాగుచుండెననియు, నాకారణ మున హొయిసల భల్లాలదేవుని రాజ్యములో నుత్తర భాగమునంతయు; ౧౩౪౬ నాటికిజయించి హొయిసల రాజ్యమునుక్షీణింపజేసిరనియు, కాకతికృష్ణమనాయకుని ప్రేరణమున, నాతని బంధుగులగుటచేతగాబోలు, ౧౩౪౫ వ సంవత్సరమున తురుష్కసేనాప్రవాహము నడ్డగించి స్వాతంత్ర్యముప్రకటించుకొనిరనియు, ఎన్నో కారణముల నెత్తిచూపి ప్రశంసనీయమైనచారిత్రకదృష్టితో చర్చించిరి. సంగమవంశీయులు ఆంధ్రజాతీయులనుట కర్ణాటులకును కర్ణాటవాదమును ప్రతిపాదించు డాక్టరు అయ్యంగారు ప్రభృతులకును ఆశ్చర్యకరముగా నుండకపోదు. డాక్టరు వెంకటరమణయ్యగారు మహ మ్మదీయ చరిత్రకారులు వ్రాసిన దానిని పునర్విచారణచేసి యథార్థమును వెలికిదీసికొనివచ్చిరి. కంపిలిరాజ్య వృత్తాంతమునకును విజయనగర రాజ్య స్థాపనమునకునుగల సంబంధమును, ఉభయరాజ్యస్థాపకుల కునుగల పరస్పరసంబంధమును చక్కగా దెలిపియున్నారు. హరిహర బుక్కరాయ మహారాయలు ఆంధ్రు లనుటకు చూపిన కారణము లన్నిటికంటె, వారు ఓరుగంటి కాకతీయరాజవంశమునకు జెందినవారని నిష్పక్షపాత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధితో వ్రాసిన మహమ్మదీయ చరిత్రకారు లనేక ప్రమాణము మిక్కిలి విశ్వసనీయముగా నున్నది. ఈవిషయమున డా. వెంకటరమణయ్యగారి కృషి యెంతయు శ్లాఘనీయము. వీరి చారిత్రకవ్యాసముల నాంధ్రలోకము కొరకు వారు తెలుగున రచించెదరుగాక.

భా. వెం. కృ.

---

## ప్రేమ

క్రౌను సైజు; పుట ౬౮. వెల. రూ. ౦-౬-౦.

గ్రంథకర్త: వెలువోలు సీతారామయ్య చౌదరి.

ఇది అశ్వినీ కుమారదత్తు గారు తాము నెలకొల్పిన వ్రజమోహన్ కళాశాలయందలి విద్యార్థుల కొసంగిన యుపన్యాసములకు తెనుగు. దత్తుగారు, తనుజీవిత సర్వస్వమును ఉన్నతాశయముల కర్పించిన మహాపురుషులలో నొకరు. దైవభక్తులు, స్వార్థత్యాగులు, ప్రేమోపాసకులునగు వీరు యువకులకుజేసిన బోధనముపశ్యము ప్రశంసార్హము.

ఈ కాలమున ప్రేమయను పేరుమున నెన్నియే నధర్మములు నీతి బాహ్యములు, ననర్థదాయకములునగు విశేషములుసాఘింకసారస్వతప్రపంచములందుబొడసూపుచున్నవి. ఇట్టి తరుణమున ప్రేమయొక్క సత్యస్వరూప నిర్ణయమత్యావసరము. ఇకార్యమును దత్తుగారు చక్కగ నిర్వహించిరి. ప్రేమయందంకితములైయుండు నానందము, నవీనత, నిత్యత, ఉన్నత, వ్యాపకత, స్వార్థహీనత, మొదలగు నంశములు చెక్కటిని ఉదాహరణ పూర్వకముగ నిర్వచించియున్నారు. అట్టి ఆధ్యాత్మిక ప్రేమను హృదయమునంపలవఱచుకొనుటకు మార్గములను—ప్రేమమూర్తుల జీవితపఠనము ప్రకృతినిరీక్షణ, కార్యసాధనము, ఆత్మపరీక్షణము ఇత్యాది-సూచించియున్నారు. ఈగ్రంథము యువకులు చదువదగినది.

తెనుగుచేసిన చౌదరిగారు ఉపన్యాసములకనువగు సరళశైలిని వ్రాసియుండిన బాగుండెడిది. ఇది మాత్రము కొంత కొఱతయనక తప్పదు.

గు. వెం. సు.

---

## ఆంధ్రాధ్యాత్మరామాయణము

రాయల్ సైజున 450 పుటలు. దళసరి కాకితములు. మంచి అచ్చు. కాలికోబైండు. ఆంధ్రీకర్త పిసుపాటి నారాయణశాస్త్రి. వెల రూ. 3-0-0 లు.

దీనిని సంస్కృతములో వ్రాసినవారు విశ్వామిత్రమహర్షి. ఈ గ్రంథమును అనేకులు తెలిగించిరి. కాని వాని ప్రచారము మాత్రము అంతగా లేదు. వేదాంతమును ముఖ్యముగా బోధించు గ్రంథములు సర్వజనసుబోధకముగా నుండవలయును. ఆలోచింపగా నాంధ్రాధ్యాత్మరామాయణము మాత్రము అట్టి స్థానము నలంకరించినదనియే చెప్పవచ్చును. దీనిలో కథాభాగములతో పాటు వేదాంతవిషయములు కూడ సర్వజన సుబోధకముగు శైలితో ననువదింపబడినవి. అనువాదములో వీరు పూర్వకవులు త్రొక్కిన మార్గమునే యనుసరించిరి అని చెప్పవచ్చును. నన్నయాదులవలె నాయా తావుల స్వకపోలకల్పనములు కూడ జొనిపిరి. ఆ సంగతి పీఠికలోగూడ గవిగారు చెప్పకొనిరి. స్వకపోలకల్పనములు కూడ నాయా స్థలములలో హత్తుకొని హృదయంగమముగా నున్నవని దిగువ నుదాహరించిన పద్యములు చాటుచున్నవి.

మ. *క్రతుదీక్షా పరతంత్ర బుద్ధినగుటం
  గ్రవ్యాదు లస్మత్క్రియా
యతవై శ్వానరకీలలన్ శలభ
  సామ్యం బంద కారీతి గ
ర్వితులై నాయొనరించు జన్నమునకున్
  విఘ్నంబు గావించియుం
బ్రతుకం జాలిరిగాక వేఱుగలదే?
  రాజన్యచూడామణీ!

*ఉ. [illegible]కమునుదింగడియింపక ధైర్యమూ[illegible]
  [illegible]మ్మికి మునీంద్రుసన్నిధికి మెల్లగబొమ్ము శుభంబునుండ [illegible]
  లోకనసాదరోక్తుల ద్యులోకపవిత్రచరిత్ర; నీ [illegible]
  దాక యకంపనంకటిమహాత్మున కైన నవస్థ దప్పునే

పై పద్యములు స్వకపోలకల్పితము లయ్యును నెట్లు హత్తుకొనినవో? చదువరులు గ్రహింతురుగాక,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేదాంతభాగము ననువదించుటలోఁ గవిగారి జాగ్రత్తయు పేర్కొనఁదగినదియే యని చెప్పవచ్చును.

మూలము :

"జగతామాదిభూతాయా సామాయాగృహిణీతవ
త్వత్సన్నికర్షాజ్జాయంతే తస్యాం బ్రహ్మాదయః ప్రజాః
త్వదాశ్రయాసదా భ్రాంతిమాయాయాత్రిగుణాత్మికా
నూతేఽజస్రంశుక్లకృష్ణలోహితాస్సర్వదాప్రజాః
లోకత్రయమహాగేహేగృహస్థస్త్వముదాహృతః."

సీ. జగదాదిభూత యేసతి యమ్మహామాయ,
యిల్లాలునీకు లోకేశ! రామ!
నీ సన్నికర్షముచే సరోజభవాదు
లుదయించుచుందు రయ్యువిదయందు,
ఏమాయ నిన్నాశ్రయించి సదా త్రిగు
ణాత్మిక యైవెల్గు నట్టిమాయ
యనవరతంబు సితాసితలోహితకాయులౌ ప్రజలను
గాంచుచుండె

గీ. కల్లలాడుదువే? నీవు కమలానాథ!
ప్రకటలోకత్రితయమహాభవనమందు
నిండుతమి నుండు బల్గృహస్థుండ వైతి,
వింక దాఁచంగ నేటికి నిదియు వినుము.

అనువాదము—

మూలమునఁగలభావాదులనెట్లు అనువదించిరో చూడుడు!

వీరు కొన్నితావులలో మూలములో లేని అంశమును అనువాదమున సంఘటించిరి.

మూలము:

ఇతిశిష్యాన్ సమాదిశ్య స్వయం కించిత్తమన్వగాత్
రామేణవారితః ప్రీత్యా అత్రి స్స్వభవనం యయౌ

అనువాదము:

గీ. శిష్యుల కనుజ్ఞ నిడి రఘుశ్రేష్ఠు వెంటఁ
దానరిగి కొంతిదూరం, మానఁడు ముదమున
మరలుప, మదంబున నిజాశ్రమమున కేఁగెఁ
దన్నిరుపమాద్భుతగుణంబు లెన్నికొనుచు.

మూలమున రాముని చేన నుజ్ఞాతుఁడై యత్రిమహర్షి స్వాశ్రమమునకుఁ బోయెననిమాత్ర మున్నది. అనువాదమున వీరు రాముని చే ననుజ్ఞాతుఁడై యత్రి రామగుణముల శ్లాఘించుకొనుచుఁ బోయె నని యందముగాఁ జెప్పిరి. కొన్నిచోటులలో మక్కికి మక్కికిగానే తెలిగించిరి.

మూలము.

"అథ తత్ర దినం స్థిత్వా ప్రభాతే రఘునందనః
స్నాత్వామునింసమాపృచ్ఛ్య ప్రయాణాయోపచక్రమే"

క. దిన మండి యందు నుదయం,
బున స్నాన మొనర్చి యత్రిమునిసత్తము వీ
డ్కొని చనువాఁడై, యాత్రియ,
ననియెన్ శ్రీరాముఁ డ మ్మహామహుతో డన్.

పైపద్యము మక్కికిమక్కిగానే యున్నది.

కం. రమణీయంబతి............... త్త్వముఁ
డెలియఁగ.........నద్రిదుమారీ!" భా. కాం.

ఆ పద్యము, పైపద్యమున యతిదప్పినది. ఇట్లు చూపుట గ్రంథమున కొకలోపమనికాదు కాని ఇట్టి గ్రంథములలో స్వల్పమగు నిట్టిలోపములు చదువరుల కనుత్సాహమును జనింపఁజేయును. అవతారికలో ౨౦ వ పద్యమున "రమాజననీజనకులు" అను పదము, లక్ష్మీనారాయణుల ను నర్థమునఁ బ్రయోగించిరి. అది యంతసమంజసముగా నర్థసంపద నీజాలదని నామతము.

కవనమున మంచిధారాశక్తి యున్నది. గ్రంథము అత్యుత్తమమయినది. ప్రచారములోనికి రాఁదగిన గ్రంథరాజమనియే నానమ్మకము. బాల్యమున నిట్టిగ్రంథరచనలోఁ గృతార్థులగుట ముందు ముందు వారి వాగ్ధాటి బాగుగా నాంధ్రులమనంబు లలరింపఁజేయుటకే యని నానమ్మకము. వీరిట్టి గ్రంథములు అనేకములు వ్రాసి భాషావధూటి కలంకారములు సమకూర్తురుగాక.

ఉభయభాషాప్రవీణ-బులుసు నరసింహశాస్త్రి.

---

## శ్రీపుష్పాంజలి, ప్రథమసంపుటము: కావ్యములు

ఇందు శ్రీ కల్లూరి వేంకటనారాయణరావుగారి పద్యకావ్యములు సంపుటీకరించబడినవి. దీనిలో ఈయబడిన సంవత్సర సంఖ్యలను బట్టి ఇవన్నీ చాల కాలము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రింద రచింపబడినట్లు స్పష్టము. ప్రచురణలోని ఆలస్యమువలన ఇందు కొన్ని కావ్యాల విలువ మారినట్లు చెప్పవలెను. ఉదాహరణముగా ఇందలి 'విజయనగరసామ్రాజ్యము'లో ప్రధానవస్తువైన దేశాభిమానము ఆధునికదృష్టులకు పరిపోషణలో దుర్బలముగా కానవస్తూ కావ్యము విలువను తగ్గించదగిఉన్నది. అట్లే 'మల్లెమొగ్గలు'లోని ఖండకావ్యాలు కూడా అభివృద్ధి పొందుతున్న ఆధునిక భావగీతల ప్రక్క తక్కువ కొలతలో నిలువగలవు. కాబట్టి ఇందలి కాలసంఖ్యలు సరియైన విమర్శకు తోడ్పాటుగా ఉన్నవి. ఈ విమర్శలు వాటివాటి సందర్భాలలో వ్రాయబోతున్నాము.

మొట్టమొదటి 'శ్రీ సత్యనారాయణ మహాత్మ్యము.' కావ్యరచనలో ఇదే గ్రంథకర్త ప్రథమ ప్రయత్నము. ఛందోభాషాదికదోషములు కూడ ఈవిషయమునే తెలియజేయగలవు. వీటిని నిలిపిఉంచడము ఒక పక్షము నుండి వాంఛనీయమే అగును. మార్చివేయదలనువారు పాఠభేదాలను ఈయవలసి ఉంటుంది. 'శ్రీ సత్యనారాయణ మహాత్మ్యము'లో వివిధకథలకు ఐక్యత సంఘటించబడలేదు. ఇవిచెప్పుకొనుచు పోబడిన పద్ధతికూడ అసాధారణ నైపుణ్యమును ప్రదర్శిస్తూ ఉండలేదు. ఇంకుపద బహుళ్యముచేత పద్యములూ, పద్యబాహుళ్యముచేత కవిత్వమూ పలుచబడినట్లు చెప్పవలెను. కాని ప్రథమప్రయత్నముగా ఈ నిర్వహణ తృప్తికరముగానే ఉన్నది.

పిమ్మట 'విజయనగర సామ్రాజ్యము' ఇది గీతాదిమాలికలలో వ్రాయబడినది. ఇందలి దేశాభిమానము ఎట్లు కానవస్తున్నదో చెప్పబడినది. దీనిలోని ఉద్రేకము కేంద్రమునుండి చెదరిపోతూఉన్నా పాఠకుడిందలి ప్రధానవస్తువును ఏమరిపోలేదు. ముఖ్యముగా,

"బాలకుల్ సిదురింప నుయ్యాలలూచు
భామలెందరు తప్తలై పరువులిడిరొ"

అనేగీతభాగము,

"ఉత్కలాధీశు నిర్జింప నుద్యమించు
నెన్నులకుఁ బట్టులైనట్టి వీగృహములె"

వంటి పద్యపాదములు కలిగి హృదయమును తాకగలిగి ఉన్నది. ఈ తేజము అంతటా నిలువక పోవడమువల్లనే దీనికి ఆత్యుత్కృష్టత లేదు. పైగా ఇది ఉండినంత దీర్ఘముగా ఉండనక్కరలేదని మా అభిప్రాయము.

తర్వాతి 'సంధ్యోపాసన,' 'శ్రీమదాంజనేయ స్తవకళామాలిక'లను సులభముగా దాటి వేయవచ్చును. మొదటిది సంధ్యావందనకు పద్యానువాదము. రెండవదానిలో స్తుతి, నీతి జ్ఞానము ధ్యానము అనే ఉపశీర్షికలతో పూర్వశతకముల పోకడలు ఉన్నవి.

వీటికి పిదప 'మానసగీత' మిగిలిన అన్నిటికంటె వెనుక వ్రాయబడుటచేత కాబోలును ఎక్కువధారాశుద్ధి గుంభన కలిగి మిక్కిలి సరళముగా సాగినది. శ్రీసమర్థ రామదాసస్వామి రచించిన 'మానసబోధ' కిది ఆంధ్రీకరణము. భగవత్ స్తుతి మనఃప్రబోధము దీని ఆశయములు.

తుదను 'మల్లెమొగ్గలు' అన్నశీర్షికతో ౧౯౧౮ నుండి ౧౯౨౩ వరకు అప్పుడప్పుడు వ్రాయబడిన ఖండకావ్యములు సంపుటీకరించ బడినవి. వీటిలో కొన్నిటిలో భావకవిత్వచ్ఛాయ లున్నవి. కొన్ని, విద్యావతి, చంద్రోదయము వంటివి, చాటువుగా పేర్కొనవలసి ఉన్నది. ఇందలి కావ్యాలలో ఆంగ్లకవిత్వ ప్రోద్బలము కొంత కానవస్తున్నది. 'నాదుశోకంబు నుడువ నాంధ్రంబునందు పదములున్నవో లేవో—'అనుపాదములతో మొదలగు సోదరీ స్మృతిలో 'అమృతరములు నీవ! యాహాసముల్లఁగాంచుచునెయుంటి' అన్నది 'Those lips are thine, thy own sweets smiles I see' అనే Cowper పాదములను జ్ఞప్తికి తేగలవు, 'పోతన' అను కావ్యము నందలి ప్రవృత్తి (Mood) ని కదలించినది Wordsworth మిల్టనుపై వ్రాసినపద్యమని చెప్పవచ్చును. అయితే ఇట్టి స్వీకారములను గర్హించుట మా ఉద్దేశముకాదు. ఇందలి పోకడలను చూపించడానికే ఇది ఉద్ఘాటించబడినది. ఇక ఇందలి ఇతర వస్తువులుగా ప్రకృతి ఆరాధన (ప్రకృతి దర్శనము, సముద్రతీర సంధ్య), కవితా విషయములు (కవితాకన్యక, కవి), పౌరాణికాంశములు (శంకరుని విరహము, రుక్మిణీకల్యాణపానము), ముఖ్యమైనవి. వీటి పరిపోషణలో ఆధునిక ప్రా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాణ్యములకు నైపుణ్యము తక్కువగా కానవస్తుంది. అప్పటికే ప్రథమ భావకవులు వెలువడినా భావగీతము ప్రత్యేక స్వరూపముగా వాఙ్మయములో నిష్కృష్టము కాలేదు. దాని సరిహద్దులు స్ఫుటముగా గీయబడలేదు. కావున అప్పుడు అనేక భావగీతములు అపరిపక్వములుగా ఉండినవి. 'మల్లెమొగ్గల'లో గీతములు చాల వరకు ఈ విధముగా ఉన్నవి.

'మల్లెమొగ్గల'తో పుష్పాంజలి కావ్యములు పూర్తి అయినవి. వీటిలో ఆధునిక కవిత్వమున్నా గ్రంథకర్తగారి అభిమానము పీఠికలో సూచించబడినట్లూ రచనలో కానవస్తూన్నట్లూ పూర్వపద్ధతులకే చెందిఉన్నది. కాని ఇప్పుడు వికసనపొందుతున్న ఆధునికత్వము కవిత్వవిమర్శకులకు పరిశీలనీయము. పుష్పాంజలి గ్రంథకర్తగారే ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము (వావిళ్లవారు ప్రకటించినది) రచించిన 'కవిత్వవేది' అని తెలుస్తున్నది. పుష్పాంజలి, వాఙ్మయచరిత్రలను పోల్చిచూడగా వీరు కవిత్వరచనకంటె సారస్వతవిమర్శకు దొరకొంటే ఎక్కువరాణిస్తుందని పొడగట్టగలదు. ఇప్పుడు విమర్శన ఎక్కువ ఆవశ్యకముగా ఉన్నదన్న విషయము కూడా మరచి పోకూడనిది.

శ్రీ. శ్రీ.

---

## UNCLE SHAM

గ్రంథకర్త:—కన్హయలాల్ గాబాగారు. ౨౧౫ పేజీలు. వెదురుకాగితములు. రాయల్ సైజు. కాగితపు బైండు. వెల ౪ రూ. ౧౯౨౮ సం.

ఈ గ్రంథము మేయోకన్య వ్రాసిన 'భారతమాత' అను పుస్తకమున కొకవిధమైన జబాబు. ఇందులో అమెరికా దేశముయొక్క రాజకీయ, సాంఘిక, నైతిక, మత, అర్థికాదివిషయములస్థితి పూర్తిగా వర్ణింపబడియున్నది. ఈగ్రంథోత్పత్తికి 'భారతమాత' మేయో Mother India యే కదాకారణము. అట్టియెడ ఈ గ్రంథమును సంపూర్ణముగా బోధచేసికొనవలెనన్న 'భారతమాత'యందలి విషయములను తొలుత కొంచెమెరుగుట అవసరము.

## భారతమాత

ఈ గ్రంథముయొక్క యుద్దేశము ముఖ్యముగా రాజకీయము. భారతీయులు స్వపరిపాలనకనర్హులని అమెరికనులకును యూరోపియనులకును చాటించి భారతీయుల స్వాతంత్ర్యోద్యమమును వారలామోదించకుండునట్లుగను, సానుభూతి చూపకుండునట్లుగను చేయవలెనని ఈ గ్రంథముయొక్క ఆశయము. అంతేగాక భారతీయులలో హిందూమహమ్మదీయ వైషమ్యమును, బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల ద్వేషమును హెచ్చుచేయవలెననికూడ ఈ గ్రంథముయొక్క సంకల్పమే. కావున మేయోకన్య మనదేశముయొక్క రాజకీయ, మత, సాంఘిక, ఆర్థికాదిస్థితులను హేయముగను, అతిశయోక్తిగను వర్ణించినది. ఇందలి చిత్రణకు విశేష ఆధారములుగాని, ప్రమాణములుగాని లేవు. తనకు నిజమని తోచిన ప్రతివిషయమును ఈ గ్రంథమందు చేర్చినది. ఇంగ్లాండు పరిపాలించిననే భారతదేశము సుస్థితిలో నుండుననియు, స్వపరిపాలన నొసగినచో నరకమై నాశనమైపోవుననియు నిందనేకమార్లు నొక్కిచెప్పినది. ఈ గ్రంథము కేవలము పక్షపాతబుద్ధితోను జుగుప్సతోను వ్రాయబడినది. భారతదేశమందలి బ్రిటిష్‌ప్రభుత్వము నిందు మితిమీరి స్తుతించినది. మనదేశమందుగల లోపములు సంస్కరణబుద్ధితో చిత్రింపక హేళన చేయుటకును, అవమానపరచుటకును, మనము స్వపరిపాలనకు అనర్హులమని విదేశీయులకు చెప్పుటకు వ్రాసినది. మనకు తెలియని లోపము లిందేమియు పేర్కొనలేదు. బద్ధకంకణులమై అహోరాత్రములు సంస్కరించుటకై మనము పాటుపడుచున్నవే గాని క్రొత్తవిగావు. ఇంగ్లాండే భారతదేశము నుద్ధరింపగలదను విషయముపై శాస్త్రజ్ఞుల యభిప్రాయ మేమన: బ్రిటిష్‌ప్రభుత్వమున కూటికి గుడ్డకు లేక నిరుపేదయై నిరాహారిగను, దారిద్ర్యముగను, దుర్బలమైపోవుచున్న భారతదేశము, ఇంకను యిట్లే బ్రిటిష్ పరిపాలనములోనే యున్నచో మరికొన్ని తరములలో ఒక్క పిట్టయైన లేకుండ నాశనమైపోవును అని. ఇట్టి పరిస్థితులలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రిటిష్‌ప్రభుత్వమును పొగడుచు వ్రాసిన ఈ గ్రంథము భారతీయులకుపయోగము లేదు, ఆదరణీయముకాదు. ఇట్టి గ్రంథమునకు సరియైన జబాబు వ్రాయుట కిద్దరు ముగ్గురు ప్రయత్నించినారు. కాని కన్హయలాల్ గాబాగారే అందుకు సమర్థుల మనిపించుకొన్నారు. ఒక దేశముయొక్క మంచి చెడ్డలు పరీక్షించుటకు ముందు మనదేశ మేస్థితిలోనున్నదో చూచుకొనవలయును. అట్లుగాక ఒకరి లోపములను పేర్కొనుటవల్ల మనకు గౌరవము గల్గునా? మనవలెనే వారుకూడ మన లోపములను బైటపెట్టరా? మేయోకన్య భారతదేశమందలి సుగుణములుమాని దుర్గుణములనుమాత్రమే యెంచి అనేకవిధములుగా తూలనాడి హేళనచేసినది. కావున కన్హయలాల్ గాబాగారు అమెరికా దుస్థితిని సమగ్రముగా సప్రమాణముగా చిత్రించి మేయోకన్యకు సరియైన జబాబుచెప్పినారు. నష్టమైపోనున్న భారతదేశ గౌరవమును నిలబెట్టినారు.

## బూటకపు మామ

## (Uncle Shamp)

అమెరికా దేశముయొక్క రాజకీయ, మత, నైతిక, సాంఘికస్థితులు కడు హేయముగనున్నవి. గవర్నర్లు ప్రభుత్వధనమును దుర్వ్యయముచేసి చేసి జైళ్లలో కూర్చుండుట, రంగుజాతియగు నీగ్రోలపై నైచ్యము, అతిదారుణ శిక్షలు, ధనమే దేవు డనుకొనుచుండుట, మతముకూడ ధనార్జనకొక మార్గమగుట, ప్రజల లాలసత్వము ఆమెరికా స్త్రీలకు నీగ్రోలపై గల మోహము, విశేష కామేచ్ఛయందేగాని వివాహము నందిష్టములేకుండుట, శిశూత్పత్తియం దయిష్టము. మితిలేని వివాహవిమోచనలు, బాలబాలికల కామోద్రేకము, నూటికి తొంబదియైదు మందికి సుఖవ్యాధులు మొదలగున విందు వివరింపబడినవి. అమెరికనుల అధోగతికి ముఖ్యకారణము వారికి తగినంత ఆత్మజ్ఞానము లేకుండుట. ఆత్మజ్ఞానము పుష్కలముగానున్న భారతీయుల దశయెట్లున్నదన, లెక్కలేని జాతిమతభేదములు, మూఢభక్తి, మూఢాచారములు, బాల్యవివాహములు, బాల్యవైధవ్యము నిర్బంధవైధవ్యము, స్త్రీవిద్యలేమి, రక్తమాంసములను పీల్చిపిప్పిచేయు విద్యావిధానము, రాజకీయ ఆర్థిక పారతంత్ర్యము మొదలగునవి. వీటికి మూలకారణము ప్రపంచజ్ఞానము, ప్రాపంచిక జ్ఞానమును లేకుండుట. ఇట్లు అమెరికనులు భారతీయులుగూడ దుస్థితిలోనే యున్నారు. అమెరికనులు ఆత్మజ్ఞానమును, భారతీయులు ప్రపంచకజ్ఞానము, ప్రాపంచికజ్ఞానమును అభివృద్ధిచేసికొనవలసియున్నది.

భంగముకానున్న భారతమాతయొక్క గౌరవమును నిలువబెట్టిన కన్హయలాల్ గాబాగారికి మనఃపూర్వక వందనములు.

వలయువారు;— The Times Publishing Company, Lahore (India) అని వ్రాయవలయును.

చే. కా.

---

## స్త్రీ వివాహవయోనియమనము

డిమ్మీసైజు, రెండుభాగములు, పుటలు 38 + 28 వెల తెలియదు.

గ్రంథకర్త: వఝ్ఝల చినసీతారామశాస్త్రి గారు, విజయనగరము.

విజయనగరము మహారాజాకళాశాలా మాసపత్రిక నుండి పునర్ముద్రితము.

ఋత్వనంతర వివాహము శాస్త్రసమ్మతమగునా కాదాయను విషయ మిదివఱకే మహాసమర్థులచేత విచారింపబడి నిర్ణయింపఁబడియున్నదనియు, అందు.

౧. రజస్వలకే వివాహముచేయుట యుత్తమము

౨. ఆసన్నార్తవకు వివాహముచేయుట యుత్తమము

౩. పదేండ్ల యీడుదాటకుండ స్త్రీకి వివాహముచేయుట యుత్తమము. అను మూడు పక్షములుగలవనియు, తాము రజస్వలకే వివాహముచేయుట యుత్తమ మను సిద్ధాంతమునే అంగీకరించుచున్నామనియు "శ్రుత్యవిరుద్ధములగు స్మృతులప్రమాణములు కానేరవు"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అను సిద్ధాంతము ననుసరించియే తామీగ్రంథమును వ్రాసితి మనియు గ్రంథకర్తగారు వ్రాయుచున్నారు.

శ్రీశాస్త్రిగారచ్చటచ్చట వ్రాసిన నిర్ణయ వాక్యములవలన ౧. ఋత్వనంతరము ౩ సం॥ లోపల బాలికలకు పెండ్లిచేయవలయుననియు ౨. ధర్మశాస్త్రములందచ్చటచ్చట రజస్వలావివాహమును నిందించిన వచనములు ప్రత్యక్షఋతుమతీనిందావ్యాకములు కావనియు ౧౦ సంవత్సరములు దాటిన తరువాత రజస్వలయని పరిభావగా చెప్పిన (అనగా ౧౧ వ సం॥ వయసుగల పిల్లకాబోలు) బాలికయొక్క వివాహమును నిందించు వాక్యములు మాత్రమే అనియు ౩. గృహ్యసూత్రములకంటె మన్వాదిస్మృతులు ప్రమాణము లయినప్పటికిన్నీ గృహ్యసూత్రార్థమునే ఆమహర్షి తనధర్మశాస్త్రమునందు స్మరించుచున్నప్పుడు గృహ్యసూత్రము ప్రామాణికమా ధర్మశాస్త్రము ప్రామాణికమా యనుచర్చ అసంగతమనియు స్ఫురించుచున్నది.

గ్రంథకర్తగారి సిద్ధాంతము శాస్త్రసమ్మతమా? లేకవారు చూపిన సిద్ధాంతమును ఖండించెడి ప్రమాణాంతరవచనముల నుదహరించి తత్సమన్వయమును శాస్త్రీయరీతిగా జూపగలిగిరా లేదా యను విషయము మాకు వినుర్మవిషయముకాదు. శాస్త్రిగారు తాము నిర్ణయించిన విషయములకు ప్రమాణవాక్యముల నెంతవఱకు చూపగలిగిరి. వారు చూపిన ప్రమాణవాక్యములకు వారు వ్రాసిన భావమేనా లేక వేరు తాత్పర్యముగలదా యను విషయము మాత్రమే మాకిచట విమర్శనీయము. ఆదృష్టితో చూడగా శ్రీశాస్త్రిగారు తామువ్రాసిన వివరణమును బలపఱుచు ధర్మ శాస్త్రవచనములను సరియగు వానిని చక్కగా గనంబఱచలేదనియు, అట్టి ప్రమాణవచనముల నింకయు చూపించవలసియే యున్నారనియు తోచుచున్నది.

మచ్చునకు కొన్నిటిని చూపించుచున్నాడను: ఋత్వనంతరము ౩ సం. వివాహము చేయవలసిన దనువిషయమునకు

"త్రీణివర్షాణ్యృతుమతీ" త్యాది మనుబోధాయనాది స్మృతివాక్యములను పదేపదే యీ గ్రంథమునందు ప్రమాణముగా శాస్త్రిగారు చూపుచువచ్చియున్నారు. కాని ఆవచనములు కన్యాదానాధికారులగు పిత్రాదులు సకాలమున తనకు పెండ్లిచేయనియెడల కన్యక స్వయంవరము నెప్పుడు చేసికొనవచ్చు నను విషయమును తెలుపుచున్నవిగాని శాస్త్రిగా రుదహరించిన సిద్ధాంతమును బలపఱుచుట లేదు.

౨. ౧౩ వ పేరాయందు "వైవాహికోవిధిః స్త్రీణాంసంస్కారో వైదికః స్మృతః, పతిసేవాగురౌవాసః గృహార్థోఽగ్నిపరిక్రియా" అను మనువచనమును వివరించి వ్రాయుచు "మఱియుభర్తకు నుత్తమమగు రతిసౌఖ్యము నిచ్చుచు సంతానసంపదను కలుగజేయవలయును. ఇట్టి వైవాహికఫలములనెల్ల భర్తకుకలుగజేయదగిన వయసు స్త్రీకివచ్చినప్పుడే యామె పరిగ్రహార్హ యగును" అని వ్రాయించినారు. ఇది శ్లోకార్థముగా మాకు తోచుట లేదు. ఇట్టి స్వతంత్రవివరణములు శ్లోకార్థమునకు సంబంధించనివి అనేకము లీవ్యాసమునగలవు. ప్రమాణవచనముల నుదహరింపని వివరణములకు విలువలేదని తలంచుచున్నాము.

౩. అట్లే "త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం" అను మనువాక్యమునకురజోదర్శనానంతర వివాహవిధాయక వచనముగా తలచుప్రమాణముగా చూపుచువచ్చినారు. ౧౨వ యేట సమర్తాడుట సామాన్యముగా నుండవచ్చునుగాని ౧౨వయేడు అనగానే సమర్తాడిన తర్వాత బాలికయని విధిగాగ్రహించుట మాత్ర మెట్లు యుక్తమో తోచుట లేదు. కుల్లూకాదిమనువ్యాఖ్యాత లట్టి యభిప్రాయమును సూచించియున్నయెడల వ్యాసమునందు సూచించుట యుక్తమైయుండెను. కాని వారేలనో చూపియుండ లేదు.

౪. ఇట్లే నగ్నికాశబ్దార్థమును నిర్ణయించుచు, ౧. సిగ్గట్టిదో తెలియని బాలిక. ౨. సం. యీడుగల బాలిక ౩. కుచములురాని బాలిక. ౪. సమర్తాడనిపిల్ల ౫. సమర్తయీడులోనున్నపిల్ల. అని స్మృతి,వ్యాఖ్యా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకోశములందు గలదని యంగీకరించుచు "ఋతుమతియైన బాలిక"అను విషయమును స్మృత్యాదులందు గలదని నిరూపింపకయే "నగ్నిక"యనగా ఋతుమతియని వ్రాయుట మాత్రము యుక్తముగాలేదు. నగ్నికయనగా సమర్తాడిన పిల్ల యనుటకుగాను,

'త్రింశద్వర్ష షోడశాబ్దాం భార్యాం విందేత నగ్నికామ్.'

అను మహాభారత శ్లోకార్థము నుదహరించిరి. కాని ఆశ్లోకమువారి సిద్ధాంతమును బలపఱుపజాలదు. నగ్నిక యనగా సమర్తాడనిపిల్ల ౧౬ సం. వయసుగలదానిని 30 సం. యీడుగలవాడు పెండ్లియాడవచ్చును అను అర్థము అగునుకాని నగ్నికయనగా ఋతుమతియయిన స్త్రీయని మాత్రము పై శ్లోకార్థము నిరూపింప జాలదు. 'నగ్నిక'యనగా ఋతుమతియయిన పిల్లయని ప్రమాణాంతరము లున్నప్పుడే పై శ్లోకార్థము శాస్త్రిగారు చెప్పిన సిద్ధాంతమునకు ప్రోద్బలక మగునని తోచెడిని. పై శ్లోకార్థము మహాభారతమునం దెచ్చటిదో శాస్త్రిగారు చెప్పియున్న యెడల చక్కగా నుండియుండును. నిర్ణయసింధుకారుఁడీ శ్లోకార్థము నుదహరించి ఏ విషయమునైనా నిరూపించి యున్న యెడల ఆ విషయమునైనను శ్రీ శాస్త్రిగారచట విశదీకరించియున్న యెడల పాఠకులకు విషయము చక్కగా బోధపడియుండును. 'దశాబ్దాంతు'అని పాఠాంతర మున్నటుల శాస్త్రిగా రంగీకరించుచు కారణము చెప్పకయే 'సాహసము' అని త్రోసివేయుట వారివాదమునకు బలకరము కాజాలదు.

౫౨ వ పేరాయందు "యాకన్యా పితృవేశ్మస్థా యది పుష్పవతీ భవేత్। అసంస్కృతా పరిత్యాజ్యా నపశ్యేత్తాంకదాచన" ఇత్యాది శ్లోకముల తాత్పర్యము వ్రాయుచు "వివాహమునకు పూర్వము రజోవతియగు నప్పుడు పరుడెవ్వడును పెండ్లియాడఁడుగదా. ఎవఁడు పరిత్యజించుట, ఇటనున్నచో పరుఁడు దోషియగు టేమిటి?" అనిసంశయమును చూపించి, తన్నివారణార్థము దొంగతనముగ రజస్వలయయి యింటముట్లుకలుపుచు తల్లి తండ్రులు పెండ్లిచేయదలచగా అందులకంగీకరింపక మొండి వేసియున్న బాలికవిషయమయి పైశ్లోకములు ప్రవర్తించునని వచించిరి. కాని వా రావిషయమును బలపఱుచు ప్రమాణాంతరములను గనంబఱుపలేదు. పిత్రాదు లట్టి దానిని పరిత్యజించవలయునని అచటి పదములవలన సరళముగా అన్వయము అగుచున్నది.

౬. ౫౨ వ పేరాలో ఋత్వనంతర వివాహమునకు ప్రాయశ్చిత్తముగా చెప్పఁబడిన "కన్యామృతుమతీం శుద్ధాం కృత్వా" మున్నగు శ్లోకములుకూడ పెండ్లికంగీకరింపని బాలికను గూర్చియే యని ఉపపత్తులను చూపకయే శాస్త్రిగారు స్వాభిప్రాయమును ప్రకటించుటవారి వాదమునకు బలకరము కాదని తలచుచున్నాము. ౫౨ వ పేరాలోని ఆశ్వలాయనవచనము ప్రాయశ్చిత్తపూర్వకముగ పిత్రాదులు ఋతుమతిఅయిన పిల్లకు పెండ్లిచేయవలయునని విధించుచుండగా ౫౨ వ పేరాలోని మార్కండేయవచనము 'పరిత్యాజ్యా'అని ఋతుమతి అయిన అవివాహితయగు బాలిక పిత్రాదులచేత పరిత్యజింపఁదగినదియని విధించుట విరుద్ధమగును గదా యని కొందఱు శంకించుట కవకాశమున్నదిగాని అందులకు సమాధానము యేమనగా 'పరిత్యాజ్యా' అని చెప్పినచోట "ఏ తాంపరిణయన్విప్రః" అని విప్రశబ్దముండుటచేత అది బ్రాహ్మణ పరమనియు, ౫౨ వ పేరాలోని 'శుద్ధాం కృత్వా, అను శ్లోకమునందు "తాముద్వహన్ వరశ్చాపి" అని సామాన్యముగా చెప్పబడియుండుటచేత ప్రాయశ్చిత్తపూర్వక పరిగ్రహణము బ్రాహ్మణేతరపర మనియు ప్రతిపక్షులుచేసెడి వ్యవస్థకు శాస్త్రిగారు సమాధానము నెచ్చటను చెప్పియుండలేదు.

ఆపస్తంబాశ్వలాయనాది గృహ్యసూత్రకారులు ఋత్వనంతర వివాహమునే విధించినారనియు, వారు చెప్పిన ధర్మశాస్త్రములు కూడతదనుకూలముగనే యున్నవన్నియు ౫౫ వ పేరాయందు శాస్త్రిగారు వ్రాసినారుగాని ఆపస్తంబాశ్వలాయనాదుల స్మృతివాక్యములను నుదహరింపక "ప్రాప్తేతు ద్వాదశేవర్షే రజః స్త్రీణాం ప్రవర్తతే" యను అర్ధశ్లోకమును మాత్రము ఆపస్తంబ స్మృతిలోనిదని ఉదహరించిరి. "స్త్రీలకు ౧౨ వ యేట రజోదర్శనమగును' అని ఆయర్ధశ్లోకముయొక్క తాత్పర్యము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అట్టి బాలికకు పెండ్లిచేయవలయుననియో, లేక అంత కంటే పెద్దపిల్లను పెండ్లిచేయమనియో ఆస్మృతియందు గల పూర్వోత్తర సందర్భముల నుదహరింపకయే ఆపస్తంబధర్మశాస్త్రముకూడా ఋత్వనంతర వివాహమునే విధించుచున్నదని శాస్త్రిగారు వ్రాయుట వారివాదమునకు బలకరము కాదని తలంచుచున్నాము.

స్త్రీ వివాహ వయోనిర్ణయమును గూర్చి శాస్త్ర సిద్ధాంతమును వ్రాయుట కుపక్రమించిన గ్రంథకర్తగారు కాశీబ్రాహ్మణ మహాసభనుగూర్చియు పురుషుల ప్రవర్తనమంతయు అశాస్త్రీయముగ నున్నదనియు వ్రాయుట సంగతము కాదని తలంచుచున్నాము. అట్లే శిష్టాచారమును గురించి వ్రాయుచు నీ కాలమునందు శిష్టులే లేరని ఒక్కకలము పోటుతో పొడుచుట వింతగానున్నది. మన్వాదిస్మృతులు ద్వాదశవర్ష వయస్కావివాహమును ఉత్తమపక్షముగా నంగీకరించుచున్నవని పలుసారులు తమ గ్రంథమునందు వ్రాయుచు అట్టి మనుధర్మశాస్త్రవిహిత ద్వాదశవర్ష వయస్కా వివాహమును శిక్షార్హముగా నిరూపించుచున్న శారదాశాసనమునకు శాస్త్రిగారు సుముఖులగుటచూడ వారికి మన్వాది ధర్మశాస్త్రములందుగల గౌరవ మెట్టిదో మాకు బోధపడుట లేదు.

క. మా. శ.

---

**The Psychology and Strategy of Gandhi's Non-violent Resistence.**

క్రౌనుసైజు; పుటలు ౧౬౯; వెల రు ౧-౦-౦

ప్రకాశకులు: యస్. గణేశన్ అండ్ కో, తిరువల్లిక్కేణి, మదరాసు. గ్రంథము వలయువారు ప్రకాశకులకు వ్రాసిన బడయగలరు.

Economics of Khaddar అను గ్రంథమును రచించిన అమెరికా దేశీయులగు శ్రీయుత. రిచర్డ్ బి. గ్రెగ్ గారే యీగ్రంథమునకు రచయిత. గ్రెగ్ గారికి గాంధిజీయందును, ఆయన యహింసాసిద్ధాంతమునందును గల విశ్వాస మపరిమితము. కావుననే వారు ఈయుద్గ్రంథమును, మహాత్ముని షష్టిపూర్తి మహోత్సవసందర్భమున, భక్తి పూర్వకముగ నాయన కంకితమొనర్చినారు.

గాంధీజీ నడుపుచున్న అహింసాయుద్ధము సత్యాగ్రహము, గాలిలో మేడకాదు; అదియు ఆచరణ సాధ్యమైనసిద్ధాంతమే యని నిరూపించుట గ్రంథకర్త యభిప్రాయము. అందుచే, అసలు సిద్ధాంతముయొక్క తత్త్వమునుగూర్చి చర్చించు భాగమొకటి; అది యుద్ధపరికరముగా నెంతవర కుపయోగపడునని చర్చించు భాగమొకటి;— ఈవిధముగా గ్రంథము రెండు భాగములుగ విభజింపబడినప్పటికీ, అహింస యుద్ధకార్యములకు ప్రయోజనకరమా? దానికం దంతటి శక్తియున్నదా? యను నీయొక్క సమస్యయే గ్రంథమునందలి రెండు భాగములకును మూలసూత్రము.

సత్యాగ్రహము, యుద్ధము— ఈరెంటికిని భేదము గలదు. తత్వమునుబట్టీ, నడకనుబట్టీ, ఈరెంటికీ కొండంతవాసి. మొదటిదానికి అహింస యాధారము; ప్రేమ దాని మూలకారణము. రెండవదానికి హింస యాధారము; క్రోధము, భయము దాని మూలకారణములు. కాని ప్రయోజనములు మాత్రము రెంటికిని సమానములే; శత్రువును జయించుట; శాంతి స్థాపించుట.

ఈదృష్టిలో, ఈ రెంటికినిగల బలాబలములను చర్చించుటయే యీగ్రంథము పని.

యుద్ధము ఎన్నివందల వేల యేండ్లనుండియో ప్రపంచము నావరించుకొని, పాతుకొని పోయియున్న సాధనము. సత్యాగ్రహము వయస్సు నలుబదియేండ్ల కన్న నెక్కువలేదు. అందుచే యుద్ధమునకుగల ప్రయోజనకారిత్వము, సత్యాగ్రహమునకుగూడ కలదని యంగీకరింపబడుటకు ఇంకను కొంతకాలము పట్టుట తప్పదు. కాని కదలికలేని నిండు నమ్మకముతో, విచక్షణతో అహింసా సిద్ధాంతమును అనుసరించినచో దానిని నిరూపింపవచ్చునని గ్రంథకర్త [illegible]ము. మరియు, యుద్ధమునజయమెంత కష్టసాధ్యము? [illegible]బట్టియే,

"ధైర్యము, కార్య[illegible], శ్రమను బాధను ఓర్చుకొనగల సామర్థ్యము, స్వార్థత్యాగము, ఆత్మనిగ్రహము, శౌర్యము, ఆచరణపరత్వము." ఇవియన్నియు యుద్ధమునకెంతగ నవసరమో సత్యాగ్రహమునకుగూడనంతయవసరమే.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౧౧. కాంగ్రెసు కాలమ్ (స్మారకచిహ్న స్తంభము)

దీనిక్రింద గుర్తింపరాని బెల్జియనుసైనికుడు ౧౯౨౨ సం. నవంబరు ౧౧ వ తేదినాడు సమాధిచేయబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

Bruxelles Statue des Comtes d'Egmont et de Hornes
Brussels Counts of Egmont and Hornes Statue

౧౨. స్వాతంత్ర్యమునకై పోరాడి ఇచట శిరచ్ఛేదమునుగన్న యిద్దరుప్రభువుల శిలావిగ్రహములు
బ్రస్సెల్సు, బెల్జియము.



౧3. పోర్టు సెడు
వ్యాసకర్త్రి తీసిన ఛాయాచిత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుద్ధమునకు భయక్రోధములు మూలకారణము లగుటచే పిరికితనమునకుగూడ నందు స్థానము కలదు. కాని సత్యాగ్రహమున కట్లుకాదు.

"భయము కారణముగ హింస నుపయోగింపకుండుట యనునది హింస నుపయోగించుటకన్న అధమ పద్ధతి. భయముచే, పోరాటమునకు దూరముగ నుండువాడు, వాస్తవమునకు, మనస్సులో శత్రువును ద్వేషించుచునే యుండును. అదను దొరికిన ప్రతిపక్షిని ధ్వంస మొనర్పవలయునని కోరుచునే యుండును. ఇట్టిచో, తన ద్వేషశక్తి నతడుపయోగించుట లేదు; కాబట్టి అది కేవలము అణగి మాత్రమేయున్నదని యర్థము. కాని పోరాడుటకు ధైర్యముండియు ఊరకుండువాడే నిజమగు సత్యాగ్రహి. ఎందుకనగా, పిరికివానికి తాను క్షమింపజాలనను భయముండును. ప్రేమింపలేకపోయిన అహింసా యుద్ధములో పూర్తియైన జయమున కవకాశము లేదు." (పు. ౬౯.)

ఇట్లు బలవంతులే, నిండునమ్మకముతో సత్యాగ్రహము నవలంబించునప్పుడు యుద్ధములో సైనికు డెంత శక్తివంతుడుగనుండునో సత్యాగ్రహికూడ అంతటి శక్తివంతుడగును. ఇంతేకాదు, ఇట్టిచో, జయమునకుగూడ అహింసావలంబికే యెక్కువ యవకాశముగలదు. కారణము: హింసకు కోప మాధారము. దహించివేయుటయే కోపము చేయుపని. అహింసకు ప్రేమమాధారము; పోషించుటయే ప్రేమ యొనరించుపని.

"మరియు ఒండొంటిపై ప్రతిఫలించు ప్రభావములుగల యీ వ్యవహారములలో అహింసాబద్ధుడగువాడు ఇద్దరిలోను (రెండవవాడు హింసాపరుడు) బలవత్తరుడుగనుండుట సహజము. అతని ప్రశాంతియే యతని బలమును ప్రతిపక్షిబలమునకు రెండింతలు గావించును. కోపము మొదటమొదట శరీరమునకు, మనస్సునకు గొంత శక్తి నొసంగుననుట నిశ్చయమే. కాని యది దేహబలమును ధైర్యబలమును అతిశీఘ్రముగ మ్రింగివైచును. చిరకాలముండనిచ్చినచో తానావరించిన వ్యక్తిని పూర్తిగ నీరసింప జేసివైచును." (పు. ౪౪-౪౫)

ఇంతేకాదు. అహింసకు చూపరుల సానుభూతిని లాగికొను శక్తికూడ కలదు; తద్వారా శత్రువుగుండె నిబ్బరమును క్షీణింపజేయుగల శక్తికూడ కలదు.

ఐన, నిది కేవలము ఆదర్శవాదము కాదా? పైన జెప్పిన అహింస, ప్రశాంతి సాధ్యములా? అని ప్రశ్నించిన, సాధ్యములేయని గ్రంథకర్త సమాధానము. ఇంతవరకు దీనిని నిరూపింపగల సాక్ష్యములు చాలినన్ని లభింపకపోయినచో, అందుకు కారణము సిద్ధాంతములోగల లోపముగాదు. ఆరంభదశయగుటయే ఆకారణము; సరియైన కట్టుబాటు, విచక్షణ, నాయకత్వము లేక పోవుటయే అహింసయపజయమునకు హేతువు.

వ్యక్తుల విషయమున నిది సులభసాధ్యమే కావచ్చును. కాని, సంఘములకు సంఘములకు, దేశములకు దేశములకు సంబంధించిన పోరాటములలో నెట్లు?—కష్టమే కావచ్చును. కాని, యుద్ధతత్త్వమును బాగుగ దెలిసినవారుకూడ "ఉత్తమమగు శాంతియే యుద్ధముయొక్క న్యాయమైన ఆశయము" అని యంగీకరించుచున్నప్పుడు, అట్టి ఉత్తమశాంతికి సాధనముగ నుండదగినది శాంతిపద్ధతియే యైనప్పుడు,—పవిత్రమగు శాంతికి అట్టి పవిత్రమే యగు శాంతికాక మరియొకటి యాధారముగ నెట్లుండగలదు?—కష్టసాధ్యమే యగుగాక, కాలము కొంత యెక్కువగ నాక్రమించిన నాక్రమించుగాక, అహింసా మార్గమును మనమేల యవలంబింపరాదని గ్రెగ్ గారి గ్రంథము ప్రశ్నించుచున్నది.

లోకకల్యాణమునకై వ్యక్తులు, సంఘములు, దేశములు, తమ్ముదా మడుగుకొని సమాధానము చెప్పుకొనవలసిన ప్రశ్న యిదియే. పాశ్చాత్యదేశముల సైనిక నాగరికతకు (Military Civilisation) ఇదియొక సవాలు. గాంధిమహాత్ముని సత్యాగ్రహమునకు, అహింసాబద్ధమగు నిరోధమునకు, అర్థమిదియే.

శ్రీయుత గ్రెగ్ గారు ఈ నూతనవిషయమును చక్కగ క్రోడీకరించి తమగ్రంథము నమూల్యముగ నొనర్చుటకు చేసిన ప్రయత్నములు ప్రశంసనీయములు. సత్యాగ్రహసంరంభముతో మారుమ్రోగుచున్న యీరో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జులలో భారతీయులు అహింసా తత్త్వమును పూర్తిగ నెరింగియుండు టవసరము. ఈసందర్భమున, అహింసను ఒకయెత్తుగడగ (policy) మాత్రమే యంగీకరించు వారికిని, ఆదర్శముగ (Ideal) స్వీకరించు వారికినిగూడ ఈగ్రంథము మిక్కిలి ప్రయోజనకారిగ నుండగలదు.

[ప్ర. రం.]

---

## ఉషాపరిణయము

ఇదియొక యేడంకముల(సంస్కృత) నాటకము. లిపి తెలుగు. గ్రంథకర్త: శ్రీ గుండురామస్వామిశాస్త్రిగారు.

డిమ్మిసైజు, ౧౭ పుటలు. వెల తెలియదు. విలాసము తెలియదు.

నాటకనామమును బట్టియే యిందలియితివృత్తము కల్పితము కాక యైతిహాసికమని తేట తెల్లమగుచున్నది. నాటకశైలి అంతగా సరళముగాక గ్రంథకర్త పాండిత్యప్రకర్షను విశదపరచుచున్నది. కాని మచ్చుటచ్చట భావౌన్నత్యమును, నీతి ప్రకాశనమును పాత్రపోషణను లేకపోలేదు. ప్రథమాంకము నందలి బాణాసురమంత్రాలోచనయూ, భగవంతుడగు శ్రీకృష్ణుని దనశత్రువుగా చారుల వలన నెరింగి "బలవచ్ఛత్రువివ యే తూష్ణీంభావోఽనర్థాయైవ" అని తన్నివారణోపాయమునకై యమాత్యు బిలువ బంచుటయు ప్రశంసనీయములు. ఇంతియగాక మూడవ యంకమునందలి, "శ్రీకృష్ణో నిరపరాధినం సహస్తీతిమత్వా కంసాదివన్మంతుమంతమేవ బాణంహనిష్యతీతి తస్మిన్నపరాధముత్పాదయితు ముపాయమకరోత్" అనువీరసేనుని మాటలవలన శ్రీకృష్ణునియొక్క ధర్మ పరాయణతయు, శౌర్యమును విశదములగుచున్నవి. ఈలాటి కావ్యగుణములున్నను, ఈ నాటకమందు, "ఓజస్సమాసభూయస్త్వమేతద్గద్యస్యజీవితమ్"ను నాచార్యనండి వచనము వలన విశేషముగ గద్య కావ్యమందుండదగిన సమాసబాహుళ్యముండుట గరమాలోచనీయము. మరియు కేవల నిఘంటు గోచరములును, అప్రసిద్ధములునునగు, 'మంతు', 'వంఖు' మొదలుగాగల పదముల బ్రయోగించియూ, ప్రాకృతశ్లోకము లుపయోగింపదగిన పాత్రలకు సంస్కృత శ్లోకముల నుపయోగించియు, కొన్ని యెడల పద్యబాహుళ్యము నంగీకరించియు నీకవిసారస్వతమున కొక క్రొత్తమార్పు నంపాదించుచున్నాడు. 'నిరంకుశాః కవయః' అని తననిరంకుశత్వమువలన నీలాటి మార్పులచేర్పరచె ననుకొందమన్ననది సమంజసముగా నేరదు. ఏలన, పైనుదహరించిన యార్యోక్తి కవి తనమనమునందలి భావములను కొంచెమైనను శంకింపక వెలిపఱుపవలయు ననుటయందు మాత్రము నిరంకుశత్వమును స్థాపించుచున్నది కాని లక్షణగ్రంథవిరోధముగ నాచరించుట యందు గాదు. ఏది యెట్లున్నను ఇందలి భావౌన్నత్యము కొనియాడ దగియున్నది.

తి. వెం. రం.

---

## వేంకటాద్రీంద్ర చరితము

చారిత్రిక గంథము. గుంటూరు గోపాలకృష్ణ ముద్రణాలయమున ముద్రితము. 1930-వ సంవత్సరమున ప్రచురితము. గ్రంథము క్రౌనుసైజున 126 పుటలు. వెల: 0-12-0 అణాలు. దొరకుచోటు, విష్ణుభొట్ల శ్రీరామశాస్త్రి; రేపల్లె; గుంటూరు జిల్లా.

తెలుగు రాజన్యులలో నొకరి చరిత్రముకూడ నింతవఱకు ప్రత్యేకముగ ప్రచురితమై యుండలేదు. ప్రచురింపవలె ననెడు ప్రయత్నశీలత మాత్రము ఆంధ్రాభిమానులగు కొందఱియందు కానవచ్చుచున్నది. దశవర్షములకు పూర్వము శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు కాకతీయ ప్రతాపరుద్రుని ప్రత్యేకచరిత్ర ప్రచురింపుచున్నామని ప్రకటించిరి. దురదృష్టవశమున అది నేటికిని ఆంధ్రలోకమునకు చేకూఱలేదు. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు అళియరామరాయల జీవితము ప్రచురింపనున్నారను సంగతి ఆంధ్రులు తెలిసికొని సంవత్సరము దాటినది. కృష్ణదేవరాయలను గూర్చి ఒకరిద్దఱు గ్రంథములు ప్రచురించిరి. కాని అవి విపుల పరిశోధన మూలమున జనించినవికావు. ఆంధ్రరాజన్య చరిత్రముల సృష్టి ఇట్లు నిరుత్సాహమునకు తావలముగనుండగా విద్వాన్ బిరుదాంచితులును, రేపల్లెలోని ఉన్నతపాఠ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలలో ఆంధ్రపండితులును నగు శ్రీ విష్ణుభొట్లు శ్రీరామశాస్త్రిగారు 'వేంకటాద్రీంద్ర చరితము' అనుపేర సుప్రసిద్ధులైన అమరావతి ప్రభువులు శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయనివారి చరితము వ్రాసిరని విని మిక్కిలి సంతోషించితిని. కాని గ్రంథము చూచిన పిమ్మట నా సంతోషము చాల భాగమున నశించిపోయినది. అందుకు ముఖ్యములగు కారణముల నాలుగింటిని పేర్కొందును.

i. మొదటిది రాజావారి చరిత్రరచనకు సాయపడు విషయముల నన్నిటిని గ్రంథకర్తగారు కూలంకషముగ చూడకపోవుట. వీరు పీఠికలో నిట్లు వ్రాసిరి. "మున్ముందు కృష్ణా మాన్యువలును ప్రబంధంబులను ప్రవాదంబులను గొన్ని శాసనముల నాధారపఱచికొని యొకరీతిగఁ బొత్తమును ముగించితిని." ఇట్లు ముగించిన పిమ్మట శ్రీవారు తమ చారిత్రక గ్రంథకథానాయకుని మనుమలకు మనుమలగు శ్రీ రాజా వాసిరెడ్డి హరిహరప్రసాదుబహదరు మన్నె సుల్తానువారి కడనున్న రికార్డుకూడ చూచి గ్రంథము క్రొత్తవెలయించితిమనుచున్నారు. కాని గ్రంథమును చదివిన వారికి శాస్త్రిగారి గ్రంథరచనమున శాసనములు విమర్శించిరనుటకు తగిన దృష్టాంతములు పొడగట్టవు. వేంకటాద్రి నాయనిని గూర్చి గుంటూరు మండలములోని విను కొండ తాలూకా యందలి అగ్నిగుండాల గ్రామవాసియగు అగ్నిగుండాల ముకుందకవి 'వేంకటాద్రిచరిత్రము' అను పద్యకావ్యమును రచించియున్నాడు. అది అముద్రితమైనను దాని ప్రతులు గుంటూరు మండలమున చిక్కుచున్నవని వింటిమి. శ్రీ శాస్త్రిగారు గుంటూరుమండలమున ఉద్యోగమునకు కుదిరియున్నవారును ముకుందకవి ఏపురుషుని కీర్తిని గానముచేసెనో ఆపురుషుని చరిత్రము వ్రాసిన వారును అయ్యు అట్టి గ్రంథముయొక్క ఉనికి ఎఱుంగకుండుట గ్రంథరచనము విషయమున వారు విశేషపరిశ్రమ చేయలేదని తేటతెల్లము చేయుచున్నది. కూలంకష పరిశోధనము సల్పక ఇట్లు ఆసామాక్షీగా చారిత్రక గ్రంథముల రచియించుట భాషాపోషకము కానేరదు.

ii. రెండవది. "ఇదియొక కల్పితకథగాని పురాణగాథకాని కాదు. చారిత్రక విషయము కావున సాధ్యమయినంతవఱకుఁ జరిత్రాంశములనే సంతరించిరచించితిని" అని పీఠికలో వ్రాసికొనినను ఈ చారిత్రక గ్రంథమున శాస్త్రిగారు సందర్భశుద్ధిలేని పురాణగాథలను తెచ్చిపెట్టిరి. వేంకటాద్రి చేబ్రోలు దేవాలయ నిర్మాణవిషయ వివరమున వ్రాయబడిన పురాణగాథ (పుట: 92-98) ఇందుల కొక నిదర్శనముగ చేకొనవచ్చును. కేవల చారిత్రక మగునట్టి గ్రంథము నడుమ ఇట్టి పుక్కిటి పురాణగాథల దూర్చుటలో శ్రీ శాస్త్రిగారి అభిప్రాయ మెట్టిదో?

iii. మూడవది శాస్త్రిగారి గ్రంథరచనమున అందుకు సంబంధించిన శాసనములను ప్రబంధములను అవలోడించలేదు, సరికదా కాల్గులేకనే దేశసంచార మొనర్చు చున్న ప్రవాదములను పెక్కింటిని అద్భుతకల్పనలతో నున్నవానిని క్రోడీకరించిరి చారిత్రకాధారములు తక్కువగనుంట ప్రవాదములను కూడ నాధారముగ తీసికొను ఆచారము మనలో ఏర్పడియున్నది. అయితే ఆప్రవాదములను యథారీతిని సత్యదృష్టి గల చరిత్రకారుడు గ్రంథములలో జొప్పింప నొప్పుకొనడు. శాస్త్రిగారి గ్రంథరచనమున అట్టి సత్యదృష్టి నుపయోగింపలేదను విషయము ప్రతిపుటయు ప్రత్యక్షీకరించుచున్నది.

iv నాలుగవది ఈ గ్రంథము నందలి రచనావిధానము చారిత్రక గ్రంథములకు ఎంతమాత్రమును తగనిదిగానున్నది. ఏదియో నవలలలో మాత్రము స్థానము కనుగొనజాలు వర్ణనలెన్నియో ఈ గ్రంథమున సంతరింపబడినవి. గ్రంథారంభము మూడుపుటలు పఠింపుడు;చాలును. గ్రంథమంతయు ఇట్టి వర్ణనలతో నిండియున్నది.

శాస్త్రిగారికి చారిత్రక గ్రంథముల రచియించుటలో నిది ప్రథమ ప్రయత్నము కాబోలును. చారిత్రకాంశములకు సయితమవలయు చోట్ల తారీఖులు తెలుపబడలేదు; తుదకు సంవత్సరములైనను సూచింపబడలేదు. కొద్ది తావుల మాత్రము చెప్పబడినవి. లోపములున్నను ఇట్టి గ్రంథరచనారంభమునకు శ్రీ శాస్త్రిగారు అభినందార్హులైయున్నారు అని మాత్రము చెప్పకతప్పదు. వేంకటాద్రి మహనీయు చరిత్రము ఆంధ్రులు అవశ్యము పఠిం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పవలసినది. కావునవారు శ్రీశాస్త్రిగారిని ఈ గ్రంథము తిరిగి చారిత్రకదృష్టితో, విపులపరిశోధనముతో, చారిత్రక గ్రంథములకు తగియుండు రచనావిధానముతో క్రొత్తగా వెలయించునట్లు ప్రోత్సహింతురుగాక!

—ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

---

## ఆదిపాండు రంగ భక్తవిజయము

గ్రంథకర్త: కోయిల్ ఘనాల దేవరాజదాసుగారు, ప్రకాశకులు: యం. ఆది అండ్ కంపెనీ, మదరాసు.

ఇది పాండురంగ భక్తుల చరితములను మాత్రము చెప్పునట్టి యొక వచనగ్రంథము. ఇందు రమారమి ౧౦౦ గురు భక్తుల చరిత్రములున్నవి. ఇవి మహారాష్ట్రభాషాను వాదము లైనట్టు గ్రంథప్రకాశకుల పీఠికలో నున్నది. మరియు గ్రంథాదిని దాసుగారు వ్రాసినయవతారిక వేదాంత శాస్త్రాభిమానులు ముఖ్యముగ చదువఁదగియున్నది. అందు శివకేశవులవిషయమై అద్వైత విశిష్టాద్వైతమతస్థులకుగల నైసర్గిక వివాదమును పరిష్కరించుటలో దాసుగారి యుక్తివైచిత్రి యెన్నఁదగి యున్నది.

దాసుగారు కథలలోఁ గూడ దమకుఁగల వేదాంతాది శాస్త్రాభిమానము వెల్లడిచేసిరి. అందుచే నీ గ్రంథము సంస్కారహీనులు కాని వారికే ఎక్కువ యుపయుక్తమని చెప్పవలసియున్నది. దాసుగారు సందర్భానుసారముగా నాయాతావుల భగవద్గీతాదులనుండి యెత్తి వ్రాసిన శ్లోకములు మొదలగు వానిభావమును తేటతెల్లముగ వచన రూపమున వ్రాసినచో పామరులకుఁ గూడ నీ గ్రంథము బాగుగనుపయుక్తమై యుండును. కావున ఒక్కొక్కచోఁ బండితపామరాదులకుఁ గూడఁ దెల్లమగు శైలి, యొక్కొక్కచోఁ పండితే తరానవబోధకమగు శైలితో నొప్పారుటచే నీ గ్రంథము సర్వజనోపయోగమని చెప్పఁ జాలము. కథలు మాత్రము అపూర్వములు. పాండురంగ భక్తులయొక్క భక్త్యావేశజనితములును అదృష్టచరములును నగుపనులును, జగన్నియంతయగు పండరినాథుఁడు భక్తపరాధీనుఁడై భక్తులకు సేవకాదికృత్యములు చేసి యెట్టి కష్టములు కలుగకుండనట్లు రక్షించుటయును అను నీమొదలగు విషయము లీగ్రంథమునఁ జెప్పఁబడియున్నవి.

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి

---

## విక్రమోర్వశీయము

గ్రంథకర్తలు: శేషాద్రి రమణకవులు. వెల, 0-12-0 లు. నందిగామ (కృష్ణాజిల్లా) కు గ్రంథకర్తల పేర వ్రాసిన గ్రంథము లభ్యమగును.

ఈ పేరును బట్టి కాళిదాసకృతి యగు నాటకమేమో యన్న భ్రాంతికల్గును. కాని ఇదినాటకము కాదు. ప్రబంధము, అయినను కాళిదాసకృతికి తెలుఁగే. తెలుఁగుసేసినవారు "భావోద్రేకకర నూతనమార్గములకు సారస్వతలక్ష్యములగు పూర్వరీతులకును ఈ కావ్యమునఁ దావొసంగి పూర్వాధునికయుగ లక్ష్యములనిందు సమన్వయించితి"—రన్న వాసిఁ గాంచినవారు. ప్రబంధయుగమంతరించిన దన్నయపఖ్యాతి రాకుండ ప్రబంధజలధికి సేతువులై యున్నవారు.

దృశ్యకావ్యములను (నాటకములను) ప్రబంధముగా వ్రాసినవారు ఒకరిద్దరు పిల్లలమఱ్ఱి ప్రభృతులు పూర్వము గలరు. కాని వారిని నేటి విమర్శకులలో ఒకరిద్దరు విఖ్యాతులు "ప్రబంధీకరింపదగిన పురాణాదులు కాని, పురాణకథలుగాని లేనందునను, ప్రబంధముల పైఁగల యభిమానమును వీడలేక నాటకములు ప్రబంధములుగా సంతరింపవలసిన దురవస్థకుఁ బాల్పడిరి"—అని వెక్కిరించిరి. కాని ఇపుడు వీరివిషయమో? ఇఁకఁ బ్రకృతము నకు వత్తము.

విక్రమోర్వశీయ ప్రబంధరచనా విధానమును స్థాలీపులాకన్యాయమున రుచిచూచుటె ఇచట ముఖ్యము. అయిన దృశ్యములను ప్రబంధీకరించిన ప్రాచీనకవుల రచనావిధానమును కూడ సుంత యిం స్వీకరించుట దొసఁగు కానేరదు కదా, విషయము ప్రవృత్తి ప్రఖ్యాతి తౌల్యము నొందినవి గనుక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిన వీరన్న ప్రబంధకరణ విధానములో అచ్చ మానాటి ప్రబంధ లక్షణములగు నగరార్ణవశైలర్తు ప్రభృతులగు నష్టాదశవర్ణనములును గలవు. ఆయన స్వయముగా మిశ్రప్రబంధముగా శాకుంతలంబను ప్రబంధము బంధురప్రీతిం జెప్పఁ బూనినాఁడు. ఇందలి మిశ్రప్రబంధ మనుమాట, తాను కేవలము కాళిదాసుని నాటకమును గాని, లేక భారతకథ గాని ప్రధానముగా గొనక రసవత్తరము లగు ఘట్టములను రెండింటినుండియు నేర్చి కూర్చుచు వచ్చినట్లు తోఁపింపఁ జేయును. అందువలననే ఆయన—భారతప్రోక్తకథ మూలకారణముగ కాళిదాసుని నాటకక్రమము కొంత, తానకోక్తికి నభినవశ్రీ వహింప గూర్మి=కృతి సేయు మా కు శాకుతలంబు—అని కృతిపతి తన్ను గోరినట్లు కంఠోక్తిగా వ్రాసినాడు.

ఇక శేషాద్రి రమణకవులును పై విధమగు ప్రతిజ్ఞాదులే కలిగి కావ్యరచనకుఁ బూనినట్లుగాఁ, వారికృత్యాదిలోని—"నూత్న సత్కార్యకరణ ప్రయత్నమునకు సాహసించితి మెంతయుఁ జాపలమున", అనియు, "సమహిత నవ్యభావరస శోభితమై తగు విక్రమోర్వశీయము కృతి నొందఁగా దగు గుణాకరమూర్తివి నీవు"—అనియు నన్నమాటలను బట్టి మన మూహింపవచ్చును. కనుక నుభయకావ్యములలోని ఏదే నొక ఘట్టమును నుద్ధాటించి ప్రబంధీకరణ విధానమును రుచిచూతము. అందునను కావ్యేషు నాటకం రమ్యం. నాటకేషు శకుంతలా, తత్రాఽపిచ చతుర్థోంకః, తత్ర శ్లోకచతుష్టయమ్-అని చెప్పిన నాల్గు శ్లోకములలోనే పినవీరన్న కవిత రుచి చూపుట కుదాహరించెదను.

౧. శ్లో. యాస్య త్యద్య శకుంత లేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా, కంఠ స్తంభిత బాష్పవృత్తి కలుషః చింతాజడం దర్శనమ్, వైక్లబ్యం మమ తావ దీదృశ మహో స్నేహా దరణ్యౌకసః, పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖై ర్నవైః.

పినవీరన్న ఆంధ్రీకరణము:—(ప్రబంధశైలిని)

ఉ. పాపనఁ జూచుఁ జూచి మదిఁబుట్టిన ప్రేమము పేర్మి బాష్పముల్ గ్రమ్మనఁ గ్రమ్మఱం బెడమొగంబయి కన్నులనీరు మింగుచుం, గ్రమ్మఱఁ దా శకుంతల మొగంబును నశ్రులు నించు గొంత నేపమ్మని జాలిఁబొంది ధృతి యంతయు నిల్వక పిచ్చి పాఱఁగన్.

ఉ. ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁడైన తపస్వి కూర్మి గావించి శకుంతలం జనిచి విస్మృతినొందిన మోహపాశముల్, ద్రెంచుకొనంగ లేక తియతీపులఁ జిత్తముఁ గాసిపెట్టెఁ శీలించిన న్వాఁకింక వద లింపఁగ నోపెదు పాశబంధముల్.

ఇందు మూలములోని, 'హృదయం సంస్పృష్టముత్కంఠయా' 'చింతాజడందర్శనం' 'అరణ్యౌకసః' 'పీడ్యంతే గృహిణః' ఇత్యాదులగు వాక్యములును, దానికి ప్రబంధశైలిని చేసిన ఆంధ్రీకరణాదులలోఁగల వైపుల్యవైశద్యవిపరివర్త నాచిత్యాదులును సరసులు స్వయముగానే రుచిచూడదగును.

౨. శ్లో. పాతుంన ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా నాదత్తే ప్రియమండనాఽపి భవతాం స్నేహేన యా పల్లవమ్, ఆద్యేవః కుసుమప్రసూతి సమయే యస్యా భవత్యుత్సవః, సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్.

ఈక్రిందిసీసము పినవీరన్నగారి ప్రబంధశైలియాంధ్రీకరణము పైశ్లోకమునకు:—

సీ. అల పెఱుంగకతావకాలవాలములకు
నెమ్మితో నిరవొందనీరువోసి
క్రమవృద్ధిఁబొందు మా ర్గంబు లారసి వచ్చి
పూటపూటకుఁ జాలఁ బ్రోది సేసి
ప్రేమాతిరేకతఁ బ్రియమండనమునకేఁ
జిగురాకుఁ గొనగోర జిదుమ వెఱచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన
సఖులు దానును మహోత్సవ మొనర్చి
తల్లియై పెంచె మిమ్ము నే తలిరుబోడి
యత్తపారింటె కరిగెడు నాలతాగి
క్షితిరుహములార పుష్పిత లతికలార
యనుమతింతురుగాక క ల్యాణయాత్ర.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దీనియందును, 'వాణినారాణి'యన సాహసించిన సాహసికకవి చేసిన ప్రబంధశైలియాంధ్రీకరణమును చక్కగా పాఠకులు గుర్తింప వలసియున్నది. అంతనను మూలములోని,ఫసుమః ప్రసూతిసమయేప్రియమండనాఽపియస్యా భవ త్యుత్సవః పతిగృహం...అను నిత్యాదులకు కావించిన యాంధ్రీకరణములను మఱువరాదు. పైని లతలను సంబోధించుటలో—పుష్పితలతికలార—అన్న స్వతంత్రమగు సంబోధనవాక్యములోను, అనుమతింతురుగాక—కల్యాణయాత్ర—అనుదానిలోనుగల స్వేచ్ఛౌచిత్యములు పాఠకులు మఱువరానివి. తక్కినవి స్వయముగానే చూడఁదగును. ఇఁక విక్రమోర్వశీయముఁ జూతము:

అభిజ్ఞానశాకుంతలములోని చతుర్థాంకము వలెనే విక్రమోర్వశీయమునందలి చతుర్థాంకమును రసవత్తరమైన ఘట్టము. ప్రాచీనాలంకారికులు దీనినుండి అనేకలక్ష్యముల నుదాహరించుట పరిపాటి. అందులో, నవజలధర స్సన్నద్ధోఽయం, తిష్ఠే త్కోపవశాత్, త్వాంకామినో మహదపి పరదుఃఖం—ఇత్యాదులగు పదునైదు శ్లోకములు అనర్ఘరత్నములు. ఈరత్నములను మన యీప్రబంధములో నెట్లు పొదవిరో ఇటుపైని పాఠకులు అన్వేషింపదగును. కాని అందుండి అటకోటులుగా సచ్ఛాయలనీను ఒకరత్నమును కవులడకిన తావును మాత్రమే ఇట నుద్ధరించెదను.

శ్లో. త్వాం కామినో మదనదూతి ముదాహరంతి
మానావభంగనిపుణం త్వ మమోఘ మస్త్రమ్,
తా మానయ ప్రియతమాం మమ వా సమీపం
మాం వా నయాఽఽశు కలభాషిణి యత్రకాంతా.

(౪ అం. ౧౧ శ్లో.)

పైదాని సచ్ఛాయ కాఁబోలు శేషాద్రిరమణకవుల ప్రబంధమున ౪ ఆశ్వా. ౯౫ పద్యము. ఇంతవఱకు మూలగ్రంథములప్రతిష్ఠచే నాంధ్రీకరణములకు యశస్సు కలుగు స్థలములను ఒకటిరెండుదాహరించితిని. కాని వానివలనఁ బ్రకృతకావ్యంపుపుంత అవిస్పష్టము. కనుక యీ క్రింది భాగములను చదువరులు చిత్తగింతురుగాక.

౧. యా తపోవిశేషపరిశంకితస్య సుకుమారం ప్రహరణం మహేంద్రస్య, ప్రత్యాదేశో రూపగర్వితాయాః శ్రియః అలంకార స్స్వర్గస్య సా నః ప్రియసఖీ.

సీ. పరతపస్సురిశేష పరిశంకితమహేంద్ర
సుకుమారఖడ్గమే సుందరాంగి
నిజరూపగర్విత నీరజగేహినీ
పరిభావనిపుణ యే పద్మగంధి
సురచితసురసతీ పరివేష్టితస్వర్గ
భూషణప్రాయ యే ముద్దుగుమ్మ

మూలములోని సుకుమారం ప్రహరణం ప్రత్యాదేశో రూపగర్వితాయా శ్రియః అలంకారస్స్వర్గస్య—అను నిత్యాది సుకుమారరచనలు ఈ సీసములోఁబడి ఎంత అందగించినదియును, మా మిత్రులు నారాయణమూర్తి లెఱుంగనిది కాదు. ఏలయనఁగా — "ఊర్వశీనామ! నారాయణోరుధామ"—యని కవులే ముక్తకంఠములఁ బ్రశంసించుచున్నారు కాబట్టి.

౨. శ్లో. అగ్రే యాంతి రథస్య రేణుపదవీ చూర్ణీభవంతో ఘనాః, చక్రభ్రాంతి రరాంతరేషు జనయత్యన్యా మివారావలీమ్, చిత్రన్యస్త మివాచలం హయశిర స్యాయామవ చ్చామరం, యష్ట్యగ్రే చ సమం స్థితో ధ్వజపటః ప్రాంతే చ వేగానిలాత్.

విక్ర. ౧ అ. శ్లో ౪.

ఇది పురూరవుఁడు రాక్షసులచేఁజిక్కినయూర్వశిని దెచ్చుటకై వియత్పథమున రథయానమునఁబోవుచు రథవేగమును తత్కాలజనితములగు వింతలను వర్ణించు సందర్భము. కాళిదాసునకు రథవేగమును వర్ణించుట యన్న చాల యానందము. అసాధారణ మగు నేర్పు అతనికిఁ గలదు. శాకుంతల ౧వ యంకమున ౯వశ్లోకము—యదాలోకే సూక్ష్మం—అనుదానిని చూడుఁడు. ఇందు నేలపైని రథగమనమునలనఁ గలుగు వేగ మువవర్ణితము. అందును అంతరిక్షమున రథగమనమును వర్ణించుటలో అతని కౌతుఁడేసాటి పై నుదాహరించిన శ్లోకము రథము భూమినుండి అంతరిక్షమున కెగయు నప్పటి వర్ణనము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాకుంతలలో ౭వ యంకమున శైలానా మవరోహతీవ అనుశ్లోకమున (౮) అంతరిక్షమునుండి రథముఁ దిగునప్పటి వేగము ఉపవర్ణింపఁ బడినది. ఇcఁక ప్రకృతము నకు వత్తము. పైని చెప్పిన-అగ్రేయాంతి-యనుశ్లోకమునకు ఈపూజ్యులు చేసిన ఆంధ్రీకరణ మీక్రింది చంపకము.

చ. తురగఖురోత్థితం బయినధూళి కనంబడె ముందటన్ దవం
తరవివరప్రథప్రథ కనంబడెఁ బిమ్మటఁ బైనవృక్షముల్
శెరసెను స్యందనం బపుడు బిత్తఱిచూపుల సర్వదిక్కులన్
బఱపుచుఁ జెల్మికత్తియలు వచ్చుట యెప్డనియెంచుచుండెఁగన్.

మూలమునందలి 'రథస్య రేణుపదమీ చూర్ణీభవంతో ఘనాః, చక్రభ్రాంతి, అన్యామివారావళీం చిత్రన్యస్త మివ చామరం, యష్ట్యగ్రేవస్థితః ధ్వజపటః—ఇత్యాది సందర్భములకు మనకవులు ఇచ్చిన చంపకములోనివి శేషములు సహృదయుల మనస్సున కెక్కక తప్పదు. సౌందర్యవర్ణనలలోను, అట్లే శృంగారవర్ణనలలోను క్రొంగ్రొత్త త్రోవలు ఈకవులు త్రొక్కకనినారాయణానుశాసనము. దానిని కొంత రుచిమాత్రము. ఈక్రిందిది మాధ్యాహ్నిక కాలమును వర్ణించెడి ప్రకృతిసౌందర్యవర్ణన.

శ్లో. ఉష్ణార్తః శిశిరే నిషీదతి తరోర్మూలాలవాలే శిఖీ,
నిర్భిద్యోపరి కర్ణికారముకుళా న్యాలీయతే షట్పదః;
తప్తం వారి విహాయ తీరనలినీం కారండవ స్సేవతే,
క్రీడావేశ్మనిచైవ పంజరశుకః క్లాంతో జలం యాచతే.

దీనిభావమిది:—మాధ్యాహ్నికసూర్యుని తాపమున కోర్వఁజాలక, ఉష్ణాతు (వేడినిసహింపని)వగునెమలి చెట్టుమ్రాను మొదలున్న పాదునఁగూర్చున్నది. (నట్టనడి జామున చెట్లయొక్క మొదలనున్న పాదునందే నీడ సంభవించును కాఁబట్టి.) తుమ్మెద కర్ణికారపుష్పముయొక్క పైమొగ్గలను (ముక్కుతోఁ బైనున్న ఱేకులను) చీల్చి, ఆలోపల దాగుకొనుచున్నది. కారండవము సరోవారి యాతపము మసలిపోవుటచే తీరముననున్న కమలలతను (తీరమున నున్న దిగనుక కొంచెము చలువఁగల్గి యుండును.) సేవించుచున్నది. పాపము పంజరబద్ధ మగు శుకము (ఆటచిలుక, లేక పెంపుడు చిలుక) ఆనెమలిలాగునఁగాని, ఈతుమ్మెదలాగునఁగాని, ఆకారండవమువలెగాని, నీడవెదకికొని పోయి చేరుటకు స్వాతంత్ర్యము లేకయున్నది. కాఁబట్టి, ఆయొండకు సొమ్మసిల్లి తనకునీరు చూప్రపోషకులను పేరెత్తి పిలచి నీటిని అడుగుచున్నది. పెంపుడుచిలుక కాఁబట్టి యిట్లడుగుటవిరుద్ధముకాదుగదా.

ఈక్రిందిది మనకవులు పైశ్లోకము నర్థము ననువదించుచు స్వతంత్రభావసహితముగా, భావసమృద్ధియందు కూర్పుబింకము వచ్చునట్లు కూర్చినది. చూడుఁడు:—

సీ. ఎడలేక పొడమ కట్టెండ కోరుపలేక
నెమిళులు తరువుల నీడఁజేరె
తాపమ్ము సైరింపనోపకఁ కన్నెలే
డులు మెల్లమెల్ల తమ్మలను డాసె
వేడికోర్వక తేటి పిండు విచ్చెడి కొండ
గోగుపూవులపైనిఁ గూరుచుండె
బడలిక సైపక పక్షిసంతానంబు
చివురుటాకులమధ్య శిరముఁజేర్చె
తే.గీ. ఆతపతపీఁబులనఁ దటాకవారి
మసలుటంజేసి చేపలు మఱుగసాగె
పల్లవితసురసాలము పాడునాఁటె
కలువదాయ నభంబునఁ గ్రాలె నపుడు.

కాళిదాసుని శ్లోకమునందు ధ్వని వ్యంగ్యముతో సరసముగానున్నది. ప్రబంధము కాఁబట్టి మాధ్యందినసమండలవర్తిగా సూర్యుఁ డుండె నని చెప్పుట తప్పుకాదు. కాని భావముల ననువదించుటలో చూపదగినంత శ్రద్ధ ఆంధ్రీకరణమునఁ జూపలేదనవలసి వచ్చినది. 'కర్ణికారముకుళాన్యుపరినిర్భిద్య ఆలీయతే' అనుటకు కొండగోగుల పైనిఁ గూరుచుండె ననుట సమంజసమా అని సందియము. ఇచ్చట వ్యాఖ్యాత 'ఉపరి అగ్రతో నిర్భిద్యవిదార్య ఆలీయతే౽న్తర్లీనోభవతి'—అని అర్థమును నిర్వచించుట కవులు నెఱింగియేయుందురుగదా! అన్నిటికన్న మూల శ్లోకములోఁగల నాలవదృశ్యము కటికివానికైనను గుండెలఁగఱగించునది. దానికిందు, అనఁగా నాంధ్రీకరణ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునఁ జోటు దొరకలేదు. పైఁగా పక్షిసంతానము ఎండకోరువలేక చిగురుటాకులమధ్య శిరముఁజేర్చిన వని, చేపలు ఎండవేడిమికి నీరు మఱుఁగఁగా దానితోఁబాటు నివియు మఱఁగిన వని వ్రాయుట చింత్యము. శకున శాస్త్రము నెఱింగిన వారైనను, పక్షులు దాఁచుకొన్న శరీరమంతయుఁదాచుకొనుటే గాని ఒక్కతలను మాత్రమే కాపాడుకొన్న దానికి పర్యాప్తము కా దందురు. తల యున్నచోఁ బ్రదుకువదియును, తలను దాఁచుకొనునది యును సర్వజాతిమాత్రమే యనియు వా రందురు. (చూడుఁడు శాకునము.) ఇట్లే చేపలు మున్నగునవి ఎండతీక్ష్ణమునకు కాలఁది నీటియడుగునకుఁ బోయి కూరు కొనును- అచ్చట మిక్కిలి చలువగా నుండును. గనుక.

ఇఁక దీని నింతతో వదలుటకు ముందు వీరు సౌం దర్యవర్ణనములో త్రొక్కిన స్వతంత్ర మగు క్రొత్తత్రోవ కొక యుదాహరణము చూపవలయును. అందును ప్రకృతమగు మాధ్యందినవర్ణనము నందలిదే యొకటి యిచ్చిన బాగు గదా. ఇది వీరి స్వతంత్రరచనము. చూడుఁడు:—

క. విచ్చిన మోదుగుపలెఁ గా
ర్చిచ్చు దిశాంతరములందుఁ జెలరేఁగఁగ లేఁ
బచ్చికపాలములు రూపఱె
వచ్చెన్ తరుకోటరస్థ శకునచయంబుల్.

అబ్బా! ఎంత మందు టెండయో గదా! ఇఁక శృంగారవర్ణనలో గల శృంగారరసంబు కాంతాస్వరూ పంబుగనుటయు, కవులవాక్కులు స్త్రీత్వకలనఁగనుటయు అప్సరోవిభ్రమములు అద్భుతాకృతిబొనరుటయు- నిత్యా దులు-సభ్యముగ, సహజముగ సరళముగ, స్త్రీవర్ణనము ప్రకృతికి అనుకూలముగ గావించిన వని పెద్దలన్నమాట లను నేనేల కాదనవలెను? పం. ఆ. శా.

---

## MY MOTHER'S PICTURE.

### (నా తల్లి యొక్క చిత్రరూపము)

ఇది విఖ్యాత యశోధురంధరులగు బాబూ శ్యామసుందర చక్రవర్తిగారిచే మిస్ మేయో యొక్క పలుగాకి వ్రాతలకుఁ బ్రత్యుత్తరమిచ్చుచు వ్రాయ బడిన ఆంగ్ల గ్రంథము. క్రౌనుసైజున ౨౭౬ పుటలు. గ్రంథ నామమున కుదిగువ లోపల నున్న ముఖపత్రముపై An attempt to get at the Hindu Spirit in connection with the Mayo challenge [మేయోయొక్క (యత్యాచారపు) జృంభణ సందర్భమున సరియైన హైందవ తత్త్వమును తెలిసికొనఁ జేసిన ఒక ప్రయత్నము] అనియున్నది. మిస్ మేయో భారతీయులపై మానవజాతికంతకును మిక్కిలి రోఁతపుట్టు నట్లు వ్రాసిన Mother India (భారతమాత) యను గ్రంథమునకు పాశ్చాత్యదేశముల నపరిమిత ప్రచారము నుట సర్వ జగద్విదితము. ఈ పాశ్చాత్యకన్య భారతజ నులపై నీచత్వారోపములు, కల్పితములు, జుగుప్సాకర ములు, నసభ్యకథాదోష దూషితములునైన తుచ్ఛప్రసంగములను నోరూరఁ జవులు వుట్ట నుడువుటయు, ఏ తత్కథావంచితులైన మూర్ఖాగ్రేసరులు బళిబళీయని పత్రికా ముఖముల తమయుల్లాసమును ప్రకటించి మిక్కిలి కంపుగొట్టుచున్న యీ గ్రంథమునందలి కుళ్లును శతస హస్రహస్తముల సర్వదిగంతములనుండి మహార్యశ్రేణికి పరమాసహ్యము, నత్యమర్షము కలుగునట్లు విచ్చలవిడి వెత జిమ్ముటయు లోకమెఱుంగును కద! లాలా లజపత్ రాయిగారివంటి సుప్రసిద్ధదేశనాయకులు కూడ భారత జాతినిగూర్చి లోకమునవ్యాపించియున్న యసహ్యావా వరణమును తొలగించుటకై సు మనోమనోరంజనమైన వా ఙ్మయపుష్పముల వెనజల్లవలసివచ్చినది. లజ్పత్ రాయి గారి Unhappy India (దురదృష్ట భారతవర్షము), రంగయ్యరుగారు వ్రాసిన(Father India) (భారతజన కుఁడు), కన్హైలాల్ గౌబాగారి అంకుల్ షాం (అమె రికన్ మామ) మున్నగునవి మిస్ మేయోయొక్క యవాచ్య ప్రసంగములకుఁ బ్రత్యుత్తరముగా నాంగ్లమున వెలువ డిన వాఙ్మయలేశములు. ఆంగ్ల నాగరకతా వ్యామోహి తులై మనము సర్వవిధముల నిష్ప్రయోజకులమని, భ్రష్టు లమని, పతితులమని తలపోయు భారతీయులీగ్రంథముల లెస్సగా పఠించి తమ యజ్ఞాన నివారణమొనరించు కొన వలెను. అట్టి యాంధ్రులకు గూడనుపకరించుటకే గ్రంథ ములలోని ప్రధానవిషయములను దేశభాషాభిమానులాం ధ్రమునకు దీసికొనివచ్చుటయు మిక్కిలి యావశ్యకము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇప్పుడు శ్యామసుందర చక్రవర్తిగారు వ్రాసిన 'అస్మన్మాతృచిత్ర' మని యర్థమిచ్చు My Mother's Picture అను గ్రంథముకూడ నిట్టిదే. ఇందు వీరు మిస్ మేయోయొక్క సహజాసహ్యధోరణిని, ముఖ్యముగా నామెవ్రాసిన (Slaves of the Gods) (దేవతకుల బానిసలు) అను విపరీతకథాలాపమును యుక్తరీతిని గర్హించుచు భారతజాతియొక్క యథార్థతత్త్వమును లోకమునకు వివరింప బరిశ్రమించిరి. 'స్లేవ్సు ఆఫ్‌దిగాడ్సు' అను గ్రంథమున నవాన్యకథాలాలసయగు నీపాశ్చాత్యకన్య హైందవాచారముల కన్నిటికి విపరీతార్థములఁ జెప్పుచు హైందవ సంఘమును మిక్కిలి హేయముగ తూలనాడుచు, హిందువుడన్న పదమునకు సర్వదుర్గుణభూయిష్ఠుడు, పశువు, తుంటరియను నొక ఘోరమానవుడని లోకమునకుఁ దోచునట్లు కథలు కల్పించి ఏతత్కథాలంపటులకు మిక్కిలి రుచ్యముగా నుండునట్లు అన్నిరసముల బ్రదర్శించుచు ఆమె తన యెప్పటి వినింద్య పాకమును తయారుచేసెను. శ్యామసుందరచక్రవర్తిగారు తమగ్రంథమును Dedicated to the Slaves of the Gods (దేవతలకు బానిసలైన వారికీ గ్రంథము సమర్పితము) అని పెద్ద యక్షరములఁ బ్రకటించిరి. 'సాక్షి'యందుఁ జెప్పబడినట్లు మత సంపర్కము లేకుండ మనము తినలేము, ఆవలింపలేము, తుమ్మలేము, పెండ్లియాడలేము, పవళింపలేము, కడకు పిల్లలనైనఁ గనలేము. లేచినది మొదలు పండుకొనువఱకు హైందవుఁడైనవాఁడుచేయు సర్వజీవిత వ్యాపారములలో అనతిక్రమణీయమైన మతవిషయిక వాసనలు, నిబంధనలు నున్నవి. ప్రాచీన ఋషిప్రోక్తమైన మతవిషయిక వాసనలే కొలదిగనైన నిలిచియుండుట చేతనే ఆధ్యాత్మికదీప్తిమంతమని ప్రఖ్యాతిగన్న భారతజాతి యింకను జీవింపఁగలిగియున్నది. 'స్లేవ్సుఆఫ్‌దిగాడ్సు' అనుగ్రంథమున మనమతమును వెక్కిరించుచు వ్రాయబడిన మిథ్యాకథాప్రసంగములకు మిక్కిలి నొచ్చుకొనుచునే శ్యామసుందర చక్రవర్తిగారు తమ గ్రంథమును దేవతలకు బానిసలైన హిందూమహాజనులకు సమర్పించి భారతీయుల యాధ్యాత్మిక పౌరుషమునకు వన్నెఁబెట్టిరి. సుప్రసిద్ధ వంగదేశనాయకులు, భారతజాతీయతా ప్రబోధ సంగ్రామమున మహారథులనగు బాబూబిపిన్ చంద్రపాలుగారు శ్యామసుందర చక్రవర్తిగారు దేశమునకు చేయుచున్న నిరాడంబరమైన దేశసేవనుగూర్చి హృదయంగమమైన వాక్పుష్పములఁ బూజించుచు వ్రాసిన వ్యాసమే యీ గ్రంథముయొక్క ఘనతను వేనోళ్లఁ జాటఁ గలిగియున్నది. శ్రీ శ్యామసుందర చక్రవర్తిగారి గ్రంథమునం దంతటను ముఖ్యమైనది Women of India (హైందవవనిత) అను శీర్షికనున్న గ్రంథభాగము. ఈ భాగమునందే మిస్ మేయో 'స్లేవ్సుఆఫ్‌దిగాడ్సు' అను గ్రంథమునందల్లిన పాడు కథలకు చక్రవర్తిగారు మిక్కిలి మృదువుగా సమాధానమిచ్చిరి. న్యూఇండియా (నవీనభారత వర్షము) హిందూ ఇండియా అను భాగములు మిక్కిలి భావగర్భితముగ దేశభక్త్యుత్సాహ ప్రబోధకముగానున్నవి. మిగిలిన భాగములంత హృదయాకర్షకములుగ లేవు. గ్రంథమునందలి ప్రతిపుటయు శ్యామసుందర చక్రవర్తిగారి ప్రత్యేకవ్యక్తిత్వమును, దేశాభిమానమును, సనాతన ధర్మ పరాయణత్వమును, నిరర్థక సంస్కార విముఖత్వమును ఘోషించుచున్నవి. 'జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' (జననియు జన్మభూమియును స్వర్గముకంటెను గౌరవాఢ్యముల్) అను పెద్దల పలుకులయందు విశ్వాసమున్న ప్రతి భారతీయుఁడును శ్యామసుందర మహాశయునివలె సామాన్యజీవనమును, అలోకసామాన్య భావోన్నత్యమును జూపి కార్యశూరులైన యెడల భారతవర్షమునకు పాశ్చాత్యులాపాదించుచున్న హైన్యమును దురవస్థయు తొలఁగిపోకుండనుండవు, 'అస్మన్మాతృ చిత్రము' నందు శ్రీచక్రవర్తిగారు పాఠకులకు స్ఫురింపఁజేయుచున్న దేశమాతయొక్క దివ్యస్వరూపము మిక్కిలికొనియాడఁదగియున్నది. గ్రంథము వెల నాలుగు రూపాయలు. వలయువారు సంజీబనీ బుక్‌డిపో, 6, కాలేజిస్క్వేర్, కలకత్తా అని వ్రాసినఁ బడయుఁగలరు.

దివాకర్ల సోమసుందరరావు.

---

## ప్రబంధోఽకథావళి

గ్రంథకర్త: చింతలపూడి శేషగిరిరావుగారు.

ఇందు హరవిలాసము, శ్రీ కాళహస్తీశ్వరమాహాత్మ్యము, కాశీఖండము, పాండురంగ మాహాత్మ్యమూ,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉత్తరహరివంశము, ఏలామాహాత్మ్యము నను ప్రబంధముల యందలి కొన్ని యుపకథలను ఆధారముగాగొని వచనరూపమున పదికథలను రచియించిరి. పద్యరూపములనున్న మూలకథల కివిరూపాంతరములేయైనను శైలి, కథాసంగ్రథనము మొదలైనవానియందు మూలమును చాలగాపోలి యున్నవి. ఆంధ్రభాషాయోషకలంకారములైన ప్రబంధములవంకకు దారిచూపుటకు దగిన యవకాశములు లేకున్న మాధ్యమికపాఠశాలలయందు చదువు నాంధ్ర బాలురకు ప్రబంధములయం దభిరుచిగలిగించునట్లు ఈ కథలయందు అచ్చటచ్చట సరసముగ మూలగ్రంథముల యందలి పద్యములును చేరియుండుటచేత నీగ్రంథము మాధ్యమికపాఠశాలల యందలి బాలురు తప్పక చదువ తగినది.

'శైలికిమచ్చు; సౌ త్రపినాడను దేశంబున నుడుమూరను పక్కణంబుకలదు. నాథనాథుఁడను చెంచుఁ డే డప్పురవరంబున కధినాథుండు. మందస్మితజితకుందయైన తండ్రియును మందగామిని యాతనిభార్య. నాథనాథుని పరిపాలనంబున కబ్బిల్లపురంబునందలి భిల్లులందఱు సంతుష్టమానసులైయుండి తమకులాగత ధర్మముల విడువక మిగుల నిరాడంబరంబుగ జీవనంబు గడపుచుండిరి. కతిపయదివసంబులకా చెంచుదంపతులకు శివభక్తాగ్రేసరుండైన తిన్నండను బాలుండు జన్మించె. కొంతకాల మాబాలుండు క్రీడాసఖులైన నెఱుక బాలురతో నాట పాటలయందుఁ గాలము గడపిన పిమ్మట మాతాపితలాతనిఁ దమ పూర్వ సాంప్రదాయానుసారంబుగ విలువిద్య నభ్యసింపఁ జేసిరి. ఆతండును విల్లువట్టిన కొలఁది కాలంబునకే యసమానధనుర్విద్యాకుశలుం డయ్యె. పుత్రుని ధనుర్విద్యాకౌశలంబును గాంచి యన్నిపాదమిథునంబును మిగుల యానందించె.'

ఇందు అచ్చటచ్చట కాన్పించునట్లు శబ్దాలంకార భూయిష్ఠముకాక శైలిసరళముగ నుండిన బాగుండెడిది.

మరియు, "నకారము త్తియములు" (పుట ౩౭), "అట్టుకపై నట్టిపెట్టిన" (పుట ౪౫), "శబరీద్రోవదులు" (పుట ౪౭), "గోశఖేలనము" (పుట ౬౩), "రాజనందనులు హంసడిభకాభిధానులైయుండ విప్రనందనుండు జనార్దనుండు నాబరఁగి సమవయస్కులగు నబ్బాల త్రయం బాటపాటల యందు గూడి యుండిరి." (పుట ౫౭), "గోపలనుండు కొందరైకకంఠ్యముగ నాడు భీషణారావములును" (పుట౫౩), "హృదయేశునే పరమేశ్వరుంగా నెంచుచు దత్సేవయే యైహికాముష్మిక సాధనసూచకంబని" (పు-౪౩), "తండ్రి యబ్బాలారత్నమునకు వైవాహికంబొనర్చె." (పుట౪౨) "గరాగరి సేయుచుండ" (పుట౩౧) ఈ మొదలైన శబ్దములు, సమాసములు, వాక్యములు కొన్ని గ్రంథమున నక్కడక్కడగలవు. అట్టివానిని గ్రంథకర్తగారు రెండవ ముద్రణమున సవరించుకొన దగుదురు."

సుశీలకథ మొదట చూడుడు: గ్రంథకర్త 'యావనారంభమున యథోచితంబుగఁ దండ్రి యబ్బాలారత్నమునకు వైవాహికంబొనర్చె' నని వ్రాసినారు. దీనికి పాండురంగమాహాత్మ్యమున: 'సుశీలాభిధానయగు నబ్బాల గుణగణభాస్వరయై యథోచితకాలంబున' అని 'తాళిఘుండుగట్టిన మొదల్' ఇత్యాది పద్యముగలదు. 'యథోచితకాలము' అనుదానికి 'యావనారంభమున యథోచితంబుగ' అని వ్రాసినారు. గ్రంథమంతట నెట్లుచేసినారో!

'X'

---

## Sankaracharya the great and his successors in Kanchi

### ఆది శంకరులు-కాంచీపురపీఠాధిపతుల పరంపర

ఇది విజయనగరం మహారాజావారి కళాశాలలో వేదాంతశాస్త్రోపన్యాసకులుగ నున్న శ్రీమాన్. యన్. వెంకటరామన్ (యం.ఏ.) గారిచే రచింపబడి ౧౯౫౩ సంవత్సరముననే గణేశన్ కంపెనీవారిచే ప్రచురింపబడినది. ఆది శంకరుల జీవితకాలనిర్ణయమే యిందలి ప్రధానవిషయము. ప్రాచీనకాలమున సామాన్యముగా నీదేశమందలి మహాపురుషులందరు తాము తీవ్రసాధనచే సాధించిన విజ్ఞాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంపదను పరోపకారార్థము దేశమున వ్యాప్తినొందింప యత్నించిరేగాని, తమనామరూపములను చిరస్థాయిగా జేసికొనవలయుననెడి స్వార్థపరత్వముచే నంతగా ప్రేరితులైనట్లగపడదు. కావుననే యొక్కొక మహాపురుని కీర్తి యాతఁడొసంగిన విజ్ఞానముమూలముగా ననేకశతాబ్దములవఱకు నిలచియున్నను, ఆతనికాలమునుగూర్చిగాని, జీవితచరితమునుగూర్చిగాని నిశ్చయజ్ఞానము కలుగుట దుర్లభమగుచున్నది. హిందూదేశము మహత్తరంబగు నుపనిషదాది విజ్ఞానమును లోకమునకు వెల్లడించినదైనను, దానిని సాధించిన మహాపురుషుల చరిత్రము కాలప్రవాహముచే తుడిచివేయబడుటచే, అనుశ్రుతంబుగవచ్చుచున్న గాథలుమాత్రమే తరువాతికాలమున వారి కీర్తిను దెలుపు సాధనములగుట తటస్థించినది. ఆదిశంకరుల అద్వైత సిద్ధాంతములు దేశమందంతటను వ్యాపించి స్థిరముగ నెలకొనినను, వారి జీవితకాలమునుగూర్చి యభిప్రాయభేదము లింకను ప్రబలుచునేయున్నవి. ఇదివరలో విన్సెంటు స్మిత్తుమొదలగు చరిత్రకారులు పలువురు ఆదిశంకరులు, ఆతనికి సమకాలికుడని చెప్పబడుచున్న తిరుజ్ఞానసంబంధర్ (ద్రావిడశిశు) అనునాతడు క్రీస్తుశకము ౮వ శతాబ్ది ప్రాంతమునం దుండినట్లు నిశ్చయించి యున్నారు. కాని యీగ్రంథమున శ్రీ వేంకటరామన్‌గారు, కంచి కామకోటి పీఠమునధిష్ఠించిన ప్రాచీన గురుపరంపరను దెలుపు పుణ్యశ్లోకమంజరి, గురురత్నమాల, మొదలగు గ్రంథములనుబట్టి, ఆదిశంకరుల కాలము క్రీస్తుశకము మొదటి శతాబ్ది యైయుండునని నిశ్చయించిరి. ఇందు మొదటిది: పదునారవ శతాబ్ది ప్రారంభమున కామకోటి పీఠము నధిష్ఠించిన 'సర్వజ్ఞసదాశివ' గురువు ఆదిశంకరుల యనంతర మాపీఠము నధిష్ఠించిన గురుపరంపరనుగూర్చి యనుశ్రుతముగా వచ్చుచుండిన శ్లోకములను ప్రోగుచేసి స్వీయశ్లోకములను గొన్నిటినిజేర్చి కూర్చిన గ్రంథము. రెండవదియు నిట్టిదే. కాని యిది మొదటిదాని యనంతరము మఱికొంతకాలమునకు రచింపబడినది. వీనియందు గురుపరంపరసిద్ధిపొందిన సంవత్సర మాసపక్షతిథులు తెలుపబడినవి. దీనినిబట్టిచూడగా నాదిశంకరులకాలము క్రీస్తునకుపూర్వము ౨వ శతాబ్దియగును. విద్యారణ్యాదులచే రచింపబడిన 'శంకరవిజయాది' గ్రంథములుకొన్ని పరస్పరవిరుద్ధములగు విషయములతో గూడినవగుటచే విశ్వాసార్హములుగ లేవుగావున, శంకరస్థాపితమగు కామకోటిపీఠప్రాచీన గురుపరంపరనుదెల్పు నీగ్రంథములనుబట్టి ఆదిశంకరుల కాలము నిర్ణయింప ననువైయున్నదని యీగ్రంథకర్త యభిప్రాయము. వీనిలోనైనను కొంతచిక్కు లేకపోలేదు. ఆదిశంకరుని పిదప నీపీఠము నధిష్ఠించిన పదునొకండు గురిలో కొందరు ౧౧౩ సంవత్సరములు, ౯౬ సంవత్సరములు నాపీఠము నాక్రమించియున్నట్లుండుటచే నది కొంచెమతిమానుషముగ గనబడుచుండుటచే విశ్వాసార్హముకాదని తామేతలంచుచు, తరువాత వారిలో కొందరి కాలమునుమాత్ర మితరప్రమాణములు కొన్ని స్థిరపఱచుచుండుటచే వానియాథార్థ్యమునుగూర్చి మనము సందేహింప నక్కఱలేదని వెంకటరామన్‌గారు చెప్పుచున్నారు. కాని పదునారవశతాబ్దిలోని యొకపీఠాధిపతి ప్రోగుచేసి సమకూర్చిన ప్రాచీన శ్లోకసమితిలో, ఎనిమిదవశతాబ్దికి పూర్వమున వేదాంతజ్ఞానమున ప్రఖ్యాతి వహించిన ప్రాచీనపురుషులను కొందఱను ఈ పీఠమునకు ప్రాచీనతను, ప్రతిష్ఠను సంపాదించిపెట్టుటకుగా, దీని చరిత్రతో ముడిపెట్టియుండలేదని చెప్పుటకు దగిన యాధారమేమియు గనుపఱచియుండలేదు. ఇంతేకాక శ్లోకమంజరిలో దెలుపబడినరీతిగా క్రీస్తునకు పూర్వము ౫ శతాబ్దియే యాదిశంకరుని కాలమని ఒప్పుకొనుటకు వీరికి నిష్టమున్నట్లగపడదు. అది మిక్కిలి వెనుకకుపోయినదట. చరిత్రకారులు నిశ్చయించిన క్రీ. శ. ౮వ శతాబ్ది మిక్కిలి ముందుకువచ్చినదట. కావున రెంటికి మధ్యస్థముగా 'తునితగవు' చేసి క్రీ. శ. మొదటి శతాబ్దము ఆదిశంకరుల కాలమని వీరు నిర్ధారణచేయుచున్నారు. దీనివలన కుమారిలభట్టాదులుగూడ క్రీస్తుశకము వెనుకకు బోవుచున్నారు. ఇదియంతయు విచారణీయము. ౩వ యధ్యాయమున శంకరుని జీవితము, ౪వ యధ్యాయమున నాతని పిదప కాంచీపీఠము నధిష్ఠించిన గురు పరంపర యొక్క జీవితసంగ్రహమును దెలుపుచున్నవి. తుట్టతుద యీగురుపరంపలో నరువదియాఱవవారై ప్రస్తుత మాపీఠము నలంకరించుచున్న పరమహంస పరివ్రాజకా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చార్య జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్య స్వామివారియొక్క గుణాతిశయము విశేషముగా కీర్తింపబడినది. పుస్తకము వెల రు ౧-౮-౦.

కోరాడ రామకృష్ణయ్య, యం. ఏ.

---

## ముకుందమాల

క్రౌనుసైజు, పుటలు ౧౦, వెల రు ౦.౨.౦.

అనువాదకుడు: చెరుకూరి కాళహస్తీశ్వరశర్మగారు,

ఇది కవికులశేఖరభూపాలకవికృత సంస్కృత మూలమున కాంధ్రానువాదము.

ప్రకాశకులు: కోన ఆదినారాయణ శర్మగారు, బందరు.

---

## మారుతి మొదటి వాచకము

క్రౌనుసైజు, పుటలు ౬౦, వెల రు. ౦-౨-౬

గ్రంథకర్త: ఆర్. సూర్యనారాయణరావుగారు, అసిస్టంటు, గవర్నమెంటు ట్రెయినింగుస్కూలు, బందరు. ప్రకాశకులు: మారుతిరాం అండుకో, బుక్కుసెల్లర్సు, బెజవాడ.

---

## విమానయానము

క్రౌనుసైజు, పుటలు ౨౬౬, వెల తెలియదు.

గ్రంథకర్త: మోదుకూరి విశ్వనాథంగారు, యల్. యం. ఇ. (ఆనర్సు), కొత్తపేట, బెజవాడ.

ఇది Five weeks in a balloon అనునాంగ్ల గ్రంథమున కనువాదము.

---

## ధనమహిమ (వచనము)

క్రౌనుసైజు, పుటలు ౪౮, మూడు అణాల స్టాంపులుపంపిన వారికి గ్రంథమును పంపుదురు.

గ్రంథకర్త: పాకాల ఆలూరు వాసుదేవయ్యగారు, ప్రకాశకులు: ఎ. వి. రామచంద్రన్, ౮, మూర్తిలేను, పార్కుటౌను, చెన్నపురి.

## శారదానవల

క్రౌనుసైజు, పుటలు ౮౦, వెల తెలియదు.

గ్రంథకర్త: నేమాన సూర్యనారాయణశర్మగారు, సంపాదకుడు, ఆర్యవైశ్య, శ్రీకాకుళము, గంజాముజిల్లా.

---

## త్రాగుడుపాటలు

క్రౌనుసైజు, పుటలు ౧౬, వెల రు ౦-౨-౦

గ్రంథకర్త: పాల వెంకన్నగారు. ప్రకాశకులు: శెట్టిబలిజగ్రంథమండలి, నత్తారామేశ్వరము, అత్తిలిపోస్టు పడమటి గోదావరిజిల్లా.

---

## చికిత్సారత్నము

డిమ్మిసైజు, పుటలు ౧౨౮, వెల రు ౧-౧-౦

గ్రంథకర్త:— బాలకవిసింహ వేంకటరాఘవసూరిగారు.

ప్రకాశకులు: శ్రీ సత్యనారాయణ బుక్కుడిపోవారు, రాజమండ్రి.

---

## సహకారవాచకములు (కోఆపరేటివ్ రీడరు)

క్రౌనుసైజు, పుటలు ౪౦, వెల రు ౦-౮-౦.

గ్రంథకర్త: రిటైర్డు ఎక్స్ట్రా అసిస్టాంటు రిజిస్ట్రారు, రావుసాహెబు యం. వి. అప్పారావుపంతులు గారు, బరంపురము, గంజాంజిల్లా.

---

## చారుమతీమోహనము

(అయిదంకముల సాంఘిక నాటకము)

డిమ్మిసైజు, పుటలు ౧౧౧, వెల రు ౧-౧-౦.

గంథకర్త: దొంగలక్ష్మీ నరసింహంగారు. ప్రకాశకులు: దొంగవెంకన్నబ్రదర్సు, విశ్వేశ్వరాయపురము, రాజోలుతాలూకా.

---

## భక్తిపథము

డిమ్మి ౧౬పుటలసైజు, పుటలు ౮౦, వెల రు. ౦-౮-౦

గ్రంథకర్త: విద్యాభూషణ, కవిరత్న నరసింహశర్మగారు, మదనపల్లి.

---

## తరణము

ఫూల్సుక్యాప్ సైజు, పుటలు ౩౬, వెల రు. ౦-౮-౦

గ్రంథకర్త: కవికుమార శ్రీ రామచంద్ర అప్పారావుగారు, నూజవీడు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీ డాక్టరు. గోగులపాటి. గంగాధరం గారు, బి.ఇ, ఎం. ఎస్.సి, ఎ.ఎమ్. ఎస్.ఒ(మ్యూనిచ్)



ANDHRA PATRIKA

వీరు పెరుకలపూడి నివాసులు. ఆరుసంవత్సరముల నాడు విదేశములయందు ఇంజనీరింగ్ విద్య నభ్యసింప బోయి అమెరికా జర్మనీదేశములలో చదివి పెక్కుడిగ్రీలకు పొందిరి. పారిశ్రామిక విషయములందును పరిశోధనలజేసిరి. మరియు నీటివేగమును తెలుపుట కుపయోగించు క్రొత్తసూక్ష్మయంత్రము నొకదానిని కనిపెట్టిరి. వీరి యీనేర్పును మెచ్చుకొని మ్యూనిచ్ విశ్వవిద్యాలయమువారు డాక్టరు ఆఫ్ ఇంజనీరింగు పట్టమును ఇచ్చిరి. వీరు తాము విదేశములయందు గడించిన సామర్థ్యమును స్వదేశముయొక్క అభ్యుదయమునకై వినియోగింతురు గాక!

---

శ్రీ ఆర్. యన్. చావ్లాగారు,
ఏ. ఎం, ఇంజినీరుగారు



ANDHRA PATRIKA

వీరు ఇరువురు ఇండియానుండి ఇంగ్లాండునకు చిన్న విమానముపై వెడలిన మొదటి భారతీయులు. చావ్లాగారు విమానమును నడిపిరి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శ్రీ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బి. ఏ. (ఆనర్సు), ఎ. యస్. ఎ. ఎ.



వీరు సుప్రసిద్ధ రూపచిత్ర చిత్రకారులు. చావలి నాగేశ్వరరావు గారికి సోదరులు. బొంబాయి విశ్వవిద్యాలయమున పట్టభద్రులై ఇంగ్లాండుకుపోయి అచ్చట ఇన్కార్పొరేటెడ్ అకౌంటెన్సీ పరీక్షయందు విజయమునుగాంచి స్వదేశమునకు వచ్చిరి. చెన్నపట్టణమున ఆడిటరుగా నున్నారు. వీరు విదేశమునందు గడించిన యీ ప్రత్యేకసామర్థ్యమును స్వదేశమగు నాంధ్రదేశముయొక్క అభివృద్ధికై వినియోగింతురుగాక.

---

## బారిష్టరు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు

కవిరాజ బిరుదాంచితులు



కడచిన సంవత్సరమున బెజవాడలో ఆంధ్ర మహాసభవారు శ్రీ చౌదరీగారికి 'కవిరాజ' బిరుదము నొసంగి సత్కరించినారు. ఏతద్బిరుద లాభమును పురస్కరించుకొని యిటీవల చీరాల సారస్వతసమితివారు రజత పేటిక నొకదానిని వీరికి బహూకరించినారు. విద్వత్కవిశిఖామణియు, 'శతావధాని' బిరుదాంచితులును నయిన శ్రీ చౌదరిగారు సూతపురాణాది రసవత్పద్యగ్రంథములను, మఱికొన్ని వచన గ్రంథములను రచియించి యాంధ్రసారస్వతమును పెంపొందించినారు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## జాతీయనాయకుల రూపచిత్రములు.

## శ్రీ చావలి నాగేశ్వరరావుగారు

శ్రీయుత చావలి నాగేశ్వరరావుగారు, లక్ష్మీ భవను, గుజ్ దరుపార్కు, బొంబాయి.

చిత్రలేఖనమునందు అఖిలభారత విఖ్యాతినేగాక జగద్విఖ్యాతినిగూడ బడసిన ఆంధ్రమాతృ పుత్రరత్నము లలో నొకరును బొంబాయిలో ఆంధ్ర చిత్రశాలను స్థాపించినవారు నగు నాగేశ్వరరావుగారు భారత నాయ కులలో పెక్కుమంది చిత్తరువులను మిక్కిలి ప్రశంస నీయముగా చిత్రించి ఆంధ్రప్రతిభను ప్రపంచమునకు వెల్లడించిరి. శ్రీయుతులు పండిత మోతీలాలునెహ్రూ, జవహరలాలునెహ్రూ, సుభాసచంద్రబోసు మున్నగు నాయకులు నాగేశ్వరరావుకారి చిత్రకళా ప్రావీణ్యము నత్యధికముగా ప్రశంసించుచు లేఖలనువ్రాసియున్నారు. గాంధిమహాత్ముడు,లోకమాన్య తిలకు,లాలాలజపతిరాయి దేశబంధు చిత్తరంజనదాసు, దాదాభాయి నౌరోజి, రవీంద్రనాథ మహాకవి, పండిత మదనమోహనమాలవ్యా, శ్రీమతి సరోజనీదేవి, పండిత మోతీలాలునెహ్రూ, పండిత జవహరిలాలునెహ్రూ, సుబాస చంద్రబోసు, ఎస్. శ్రీనివాసయ్యంగారు, ప్రెసిడెంటు వి. జే. పటేలు, సర్దారు వల్లభాయి పటేలు, మహర్షి బులుసు సాంబ మూర్తి, డాక్టరు అన్సారి, అరవిందయోగి, దేశభక్త కొండా వేంకటప్పయ్య, జితేంద్రనాథదాసు, శ్రీశ్రద్ధా నందస్వామి, గోపాలకృష్ణ గోఖ్లేగార్లు మున్నగు పెక్కు మంది నాయకుల చిత్రపటములను వీరు చిత్రించిరి. ఇవి పెద్దసైజులోను, చిన్నసైజులోను గూడ నున్నవి. మహాత్ముని కారాగృహవాసమునుగూడ వీరు చిత్రించిరి. ఒక చిత్తరువునందు నెహ్రూ పండితు లిరువురునుకలరు. వేరొక చిత్తరువునందు జవహరలాలుగారు అశ్వారూ ఢులై యున్నారు. ఈచిత్రములు ప్రతియింటను ప్రతి పాఠశాలలలోను, ప్రతిపఠన మందిరమునను, గ్రంథాలయ మునందునను, వేయేల: ప్రజాసంస్థలన్నిటిలోను ముఖ్య ముగా నుండదగును. ప్రజలలో జాతీయ భావమును వృద్ధినొందించుటకు జాతీయ నాయకుల చిత్తరువు లత్యధి కముగా తోడ్పడగలవనుట కెట్టి సంశయములేదు. ఆంధ్ర దేశమునందలి లోకలుబోర్డులు మ్యునిసిపాలిటీలు జాతీయ విద్యాలయములు మున్నగు సంస్థలును, ప్రజలునుగూడ, నీయాంధ్రప్రముఖుని కళాకౌశలము నాదరించి తగిన ప్రోత్సాహము నొసంగెదరుగాక. ఇట్టి ప్రజాదరమువలన నాగేశ్వరరావుగారికను అత్యధికముగా కళాలక్ష్మీ దేవత నారాధించి ధన్యులగునట్లు పరమేశ్వరు డను గ్రహించుగాక.

(ఆంధ్రపత్రికనుండి)

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీమతి మిస్. కె. యస్. రంగారావుగారు,
ఎం. ఏ. యఫ్. ఆర్. జి. యస్.



శ్రీమతి మునునూరి జానకమ్మగారు





ఈమె గ్రేటుబ్రిటన్ రాయల్ జోగ్రాఫికల్ సొసైటీమెంబరుగా నెన్నుకొనబడినది. ౧౯౨౬ సం. మున ఇంగ్లాండుకుపోయి లండను విశ్వవిద్యాలయమున భూగోళశాస్త్రమున పట్టభద్రయై యచ్చట నేతచ్ఛాస్త్రమున బరిశోధనచేయుచున్నది. ఈమె మేరీకళాశాలలో నుపాధ్యాయినిగానుండినది. ఈమె డాక్టరు సుబ్బరాయన్ గారి భార్యకు చెల్లెలు.

ఈమెది కృష్ణాజిల్లాలోని అంగలూరు. నరసాపురము తాలూకా ప్రొగ్రెసివు యూనియన్‌వారి వ్యాసరచనపరీక్షయం దుత్తమస్థానమును గడించినది. ఈమెకు యూనియన్‌వారు బంగారు పతకము నొసగిరి.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాభిప్రాయ విశేషములు

గాంధిమహాత్ముడు ఫాల్గుణ శుద్ధ ౧౨ బుధవారము ప్రొద్దున నుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానము భారతస్వాతంత్ర్య ప్రస్థానముగను ప్రపంచశాంతిపర్వముగను ప్రపంచ లక్ష్యమును నఖండముగను నాకర్షించుచున్నది. అపూర్వమైన సత్యాగ్రహప్రస్థానము సర్వత్ర మహాసంచలనమును గలుగజేసిన విధమును ప్రపంచావృతమైన యుత్సాహాదరములు విశదము చేయుచున్నవి. సత్యాగ్రహప్రస్థానము ప్రజాహృదయమునందును ప్రభుత్వహృదయము నందును సందిగ్ధస్థితిని గలుగజేసినది. ప్రజల కాత్మశక్తియును, ప్రభుత్వమునకు స్వీయదుర్బలమును సువ్యక్తము లైనవి. గాంధిగారి నాయకత్వము క్రిందను సత్యాగ్రహదళము కెయిరా, బ్రోచి, సూరతు జిల్లాలయందు సబర్మతి నుండి దండివరకును రమారమి ౧౮౦ మైళ్లు సత్యాగ్రహయాత్రను జేసి ఏప్రిలు ౬ వ తేదిని దండియందు శాసనోల్లంఘన సంగ్రామము నుపక్రమించినది. సత్యాగ్రహదళము, దళప్రస్థానము, దళధర్మములు, దళనాయకుడు కలియుగమునందు సత్యయుగధర్మమును సువ్యక్తము చేసినవి. దుర్బలుడైన, వృద్ధుడైన గాంధిమహాత్ముడు ౬౧ వ యేటను పాదచారియై ఖద్దరు శాంతిసైన్యముతో జేసిన స్వాతంత్ర్యప్రస్థాన మపూర్వమై భారతీయుల కుత్సాహమును ప్రభుత్వమునకు విషాదమును గలుగజేసినది. సత్యాగ్రహదళమునకు లక్షలకొలది ప్రజలొసంగిన స్వాగతసత్కారములు; సమర్పించిన కానుకలు, దశదిశలందును ప్రతిధ్వనిల్లిన జయఘోషలు, ప్రార్థనలు, సంకీర్తనములు, గ్రామోద్యోగస్థుల రాజీనామాలు ప్రజలస్వాతంత్ర్యాభిలాషను ప్రకటించినవి. సత్యాగ్రహధర్మబలము సామ్రాజ్యాయుధబలమును నిర్జింపగల విధమును సత్యాగ్రహప్రస్థానము విశదము చేసినది. రాసునందు సర్దారువల్లభభాయిపటేలును నిర్బంధించిన నిరంకుశాధికారులు గాంధిమహాత్ముని నిర్బంధింపజాలకపోయిరి. దండియందు ప్రభుత్వము ఉప్పుశాసనోల్లంఘనమును జేసిన గాంధిమహాత్ముని నిర్బంధించలేదు. గాంధిమహాత్ముడు సత్యాగ్రహప్రస్థానము నారంభించిన దినమునుండియును శాసనతిరస్కారమును బోధించుచున్నను ప్రభుత్వము తటస్థభావమును వహించి గాంధిమహాత్ముని ధర్మవిజయమును లోకమునందు ప్రతిష్ఠించినది. అహింస, సత్యము, త్యాగము, ప్రేమ మహావిజయమును బడయగల విధమును లోకమునకు వ్యక్తము చేసినది. శాసనోల్లంఘనప్రస్థానమునం దారంభవిజయము సత్యాగ్రహదళమునకు గలిగినది. గుజరాతు దేశమునందు సత్యాగ్రహదళము గడించిన విజయమునె ఇతర ప్రాంతములందును సత్యాగ్రహదళములు గడించవలసి యున్నవి. సకలప్రాంతములందును బయలుదేరుచున్న శాంతిసైన్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు ప్రజాశక్తిని విస్పష్టము చేయుచున్నను నిరంకుశవర్గము నిర్లక్ష్యముచేయుట యవివేకము.

* * * *

దేశావృతమైన ఏస హాసంచలనము ప్రజాప్రబోధమును విశదము చేయుచున్నది. అన్నిప్రాంతములందును సత్యాగ్రహ శిబిరములేర్పడుచున్నవి. సత్యాగ్రహులు శాసనోల్లంఘనప్రస్థానమును జేయుటకు శిక్షణమును బొందుచున్నారు. వంగరాష్ట్రమునందు సేనగుప్తగారును, కర్ణాటకమునందు గంగాధరరావు దేశపాండేగారును, గుజరాతునందు మహాదేవ దేశాయిగారు, తమిళనాడునందు రాజగోపాలాచార్యులు గారు, పంజాబునందు సత్యపాలుగారు, ఆంధ్ర దేశమునందు దేశభక్త వేంకటప్పయ్యపంతులు గారు మొదలగు నాయకులు సత్యాగ్రహప్రస్థానములను నడుపుటకు నడుములను బిగించినారు. గౌతమీ సత్యాగ్రహాశ్రమము నుండియును, పేలాపురము నుండియును సంవత్సరాదిదినమునను సత్యాగ్రహదళములు బయలుదేరి తూర్పు పశ్చిమ గోదావరి మండలములందు సత్యాగ్రహప్రస్థానమును జేయుచున్నవి. బందరు, పల్లెపాడు, గుంటూరు, విశాఖపట్టణము, బరంపురము మొదలగు ప్రదేశములందు సత్యాగ్రహ శిబిరములు స్థాపితములై సత్యాగ్రహ దళములు శిక్షణమును బొందుచున్నవి. వందలకొలది సత్యాగ్రహారాధకులు చేరుచున్నారు. వేలకొలది రూప్యములు పుట్లకొలది ధాన్యము వసూలగుచున్నది. సత్యాగ్రహులను గ్రామస్థులును సన్మానాదరణములతో శిబిరములకు పంపుచున్నారు. ఆంధ్రదేశమంతయును సత్యాగ్రహ సన్నాహములతో నిండియున్నది. ఈ యుత్సాహము దేశావృతమైన దేశసేవాభిలాషను స్వాతంత్ర్యాభిలాషను విశదము చేయుచున్నది. ప్రభుత్వము ప్రజలను బెదరించుటయును విడదీయుటయును నిరర్థకము. ప్రజలయందు కొందరు బెదిరింపులకు భయపడి వెనుకాడినను వారి హృదయము గాంధిమహాత్మునితోను, సత్యాగ్రహులతోను, దేశముతోను నున్న విధమును ప్రజానాయకుల భక్త్యుత్సాహములు తెలుపుచున్నవి. నిరంకుశాధికారులు కన్నులను తెరచి, చెవులను విప్పి, మనస్సును ప్రసరింపజేసి దేశావృతమైన ప్రజాశక్తిని ప్రజాసంకల్పమును గ్రహించి స్వధర్మనిర్వహణమును జేయుట ప్రయోజనకరము గాని స్వలాభనిర్వహణమును జేయుట ప్రయోజనకరము గాదు. సత్యాగ్రహులు అసిధారావ్రతమైన సత్యాగ్రహవ్రతము ననుష్ఠించుటకై సత్యమును, అహింసను త్రికరణశుద్ధిగాను ననుష్ఠింపవలసి యుందురు. గాంధిమహాత్ముడు దండియందు సత్యాగ్రహులకు జేసిన ధర్మోపదేశములను భారతీయులందరును మననముచేసి యారాధింపవలసి యుందురు. భారతీయుల పతనమునకు వారి ధర్మపతనమే మూలమని నిత్యానుభవము విశదము చేయుచున్నది. దేశభక్తులు దేశద్రోహులుగను, గాంధిమహాత్ముడు మతి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్రష్టుడుగను, స్తోత్రపాఠకులు సత్యసంధులుగను, వంచకులు గౌరవనీయులుగను, దాసులధికారులుగను పరిగణింపబడెడి దేశమునందు ధర్మమునకు ప్రతిష్ఠ లేదనుట నిర్వివాదాంశము. దేహబలమునకును, మనోబలమునకును, ఆత్మబలమునకును మూలాధారమైన స్వాతంత్ర్య స్థితిలేని దేశమునందు పురుషార్థమునకు మూలమైన ధర్మమునకు ప్రతిష్ఠ లేకుండుటయును సహజము. ధర్మప్రతిష్ఠ లేకను పరదాస్యదుఃఖము ననుభవించుచున్న దేశమునందు ఆత్మవిశ్వాసమును గలుగజేయుటకును స్వరాజ్యమును స్థాపించుటకును గాంధిమహాత్ము డారాధించుచున్న సత్యాగ్రహప్రస్థానమును, శాసనోల్లంఘనసాధనమును సకలవిధములను నారాధనయోగ్యముగ నున్నది.

*　　*　　*　　*

నిరంకుశప్రభుత్వ విషాదము

గాంధిమహాత్ముడు భారతీయులకు వలెనే నిరంకుశాధికారులకును నిర్భయముగను ధర్మోపదేశము జేయుచు స్వధర్మ నిర్వహణమును జేయుచున్న విధమును ఇర్వినుప్రభువునకు గాంధిమహాత్ముడు పంపిన లేఖ విశదము చేయుచున్నది. రాజప్రతినిధికి మాసమునకు రూ. ౨౧౦౦౦ జీత మన్యాయముగ నున్న దనుట నిర్వివాదాంశము. వర్తమానవిషాదస్థితియందును ప్రభుత్వ మవలంబించుచున్న దండనభేదతంత్రములు పరమవిషాదమును గలుగజేయుచున్నవి. సర్దారు వల్లభభాయి పటేలుగారిని అనాలోచితముగ దండించుటయును సేనుగుప్తగారిని వారముదినములు నిర్బంధించుటయును ప్రభుత్వము నావరించిన విషాదావస్థకు నిదర్శనములు. శాసనోల్లంఘన ప్రస్థానము నుపక్రమించిన గాంధిమహాత్ముని సత్యాగ్రహ ప్రస్థానము నుపేక్షించుటయును ప్రభుత్వమునకు బట్టిన దురవస్థను దెలుపు చున్నది. ఉప్పు శాసనోల్లంఘనమును జేయుటకు బూనిన గాంధిమహాత్ముని నిరోధింపకుండుట గాంధిమహాత్ముని విజయమునకును ప్రభుత్వపరాజయమునకును నిదర్శనముగ నున్నది. దండియందును చిన్నా పురమునందును సత్యాగ్రహమును ప్రతిఘటించుటకు ప్రభుత్వ మవలంబించుచున్న కార్యక్రమము విచిత్రముగ నున్నది. ఆప్రాంతము లందు ఉప్పు లేకుండ జేయుటకై పోలీసువారు పడుచున్న శ్రమ విచిత్రమై విచారమును గలుగజేయుచున్నది. గాంధిమహాత్ముని సత్యాగ్రహప్రస్థానమునకు ప్రయోజనము ఉప్పుశాసనముల నుల్లంఘించుటగాని ఉప్పును పండించుట గాదు. ఉప్పు శాసనోల్లంఘనమునకెంత యుప్పైనను చాలును. నిషిద్ధ మైన యుప్పును కొంచెమమ్మినను శాసనోల్లంఘన మేర్పడుచున్నది. ప్రభుత్వము ఉప్పు సత్యాగ్రహము చేయుచున్న గాంధిమహాత్ముని కాంగ్రెసు సత్యాగ్రహదళమును నిర్బంధించక యుపేక్షించినపుడు కాంగ్రెసునకు ధర్మవిజయము గలిగినదని నిర్భయముగను జెప్ప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చును. గాంధిమహాత్ముఁ డవలంబించిన సత్యాగ్రహప్రస్థానమునకు మహాఫలము కాల గర్భమునందు గలదు. స్వాతంత్ర్యస్థాపనమునకు గాంధిమహాత్ముఁడవలంబించుచున్న ధర్మసాధనమునకును, ప్రతిఘటించుటకు ప్రభుత్వ మవలంబించుచున్న యధర్మసాధనములకును గల భేదమును రాజ్యాంగవ్యవహారములువిశదముచేయుచున్నవి. సామ్రాజ్య శాసన సభ యందు బట్టలసుంకముల సందర్భమునను ప్రభుత్వమును కపటప్రతినిధులును నవలంబించిన యధర్మమార్గము భారతరాజ్యాంగముల దుస్థితికి నిదర్శనములు. జిన్నాగారు, పురుషోత్తమదాసు గారు, జయకరుగారు, రామస్వామయ్యరు గారు మొదలగు స్వార్థపరాయణులు బ్రిటీషుప్రయోజనముల కేర్పడిన సుంకపువిధానమును పోషించి దేశద్రోహమునకు వడిగట్టుకొనుట సంతాపకరముగ నున్నది. ఈవిషాదస్థితి భారత రాజ్యాంగములకు సహజస్థితిగ నున్నది. పండిత మదనమోహన మాలవ్యగారును, నితరజాతీయ ప్రతినిధులును బ్రిటీషు ప్రభుత్వ మవలంబించుచున్న మాయోపాయములను నిర్భయముగను వెల్లడిచేసి వారిసభ్యత్వమునకు రాజీనామాల నొసంగుట ప్రశంసనీయముగనున్నది. మదనమోహన మాలవ్యగారు విదేశవస్త్ర బహిష్కారోద్యమమును వ్యాపింప జేయుటకు దీక్షను బూనుటయును దేశాభ్యుదయమునకు శుభసూచకముగ నున్నది. భారతప్రభుత్వ మవలంబించిన కుతంత్రము వారిరాజ్యాంగ తంత్రమును భగ్నము చేసినది. సకలపక్షసమావేశము, రౌండుటేబిలు సమావేశము దూరస్థములైనవి. సైమను కమిషను రిపోర్టు దినదినము వెనుకకు బట్టుచున్నది. ఈసందిగ్ధస్థితియందు స్వాతంత్ర్యసిద్ధికిని దేశక్షేమమునకును ప్రపంచశాంతికిని సత్యాగ్రహమే శరణ్యమని గాంధిమహాత్ముని సత్యాగ్రహప్రస్థానము వేనోళ్లను వ్యక్తము జేయుచున్నది. భారతీయులందరును గాంధిమహాత్ముఁ డవలంబించుచున్న సత్యాగ్రహదీక్షను బూని బ్రిటీషురాజ్య తంత్రమును భేదించి ధర్మధ్వజమును ప్రతిష్ఠించెదరు గాత! ఆంధ్రమహాజనులును సత్యాగ్రహస్థానమునందు యథార్థముగను భాగధేయమును గల్పించుకొని ఆంధ్రుల ప్రతిష్ఠను, గాంధిమహాత్ముని సంకల్పమును, భారతస్వాతంత్ర్యమును కాంగ్రెసు నిర్ణయమును, ప్రపంచ శాంతిని సఫలము చేయుటకు భగవదనుగ్రహమునకు పాత్రులయ్యెదరు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the AndhraPatrika Press, No.7,ThambuChetty St., Madra



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చిత్రములు

త్రివర్ణచిత్రములు—గ్రీష్మసాయంకాలము - సుబ్రహ్మణ్య.

సాధారణచిత్రములు—వ్యంగ్యచిత్రములు (౨) సింహాళచిత్రములు;ఒంటిమిట్ట కోదండ రామస్వామివారి చిత్రములు. (గాంధిమహాత్ముడు) ఇతరచిత్రములును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గ్రీష్మ సాయంకాలము

చిత్రకారుడు : శ్రీ గుఱ్ఱము మల్లయ్యగారు, ఆంధ్రజాతీయ కళాశాల, బందరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము, మే ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము వైశాఖమాసము సంఖ్య ౫

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, కామరాజుగడ్డ శివయోగానందరావుగార్లు

## ౨

## నేటిస్థితి

### రాళ్లు

శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణము లైనవి తుంగభద్రలో
పల గుడిగోపురంబులు సభాస్థలు లైనవి కొండముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగిపోయెను ఆంధ్రవసుంధరాధిపో
జ్జ్వల విజయప్రతాపరభసం బాకి స్వప్నకథావశేషమై.

నునుపులు సానబెట్టకయె నూత్నము లెప్పటి కప్పుడే శిలా
గణములు, ఒక్కటొక్కటి శకంబులనాటి చరిత్ర నూరిపో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సిన యది తత్కళాప్రతిభ జీల్చిన దుష్టవిధిప్రధాన సా
ధనములుగూడ విస్మయమహాతింబులు కించి దుపాత్త దుఃఖముల్.

ఈ పెనుకొండబండ లెటులెత్తిరొ ఆకసమంట లాఘవ
ప్రాపితకార్యమా యిది "సభాస్థలులైనవి కోటలైనవం
తా పనివాండ్ర కౌశలవిధానమె చూపు బలే" నవీనయం
త్రోపకృతుల్ విదేశపువిధుల్ పిసరంతయు నేర్చినారలో!

కొక్కెముల్ రాతినొక్కులుగాగ ఉయ్యాల సలిపినా డొక కొండపలక తొలిచి
సోపానములు రాతిసుల్లుగాగా నుయ్యి కొట్టినా డొక కొండగుట్ట తొలిచి
దూలముల్ రాతిబాదులెగాగ హర్మ్యము కట్టినా డొకకొండకటిని తొలిచి
వేదులెల్లను రాతివిరుపులుగా రచ్చ దిద్దినా డొకకొండదిబ్బ తొలిచి
సర్వనిర్మాణముల నద్రిచయమునందె-శిల్పి చేతిసాధనముల చెక్కినాడు
మరలు లేకుండ యంత్రాలమహిమలేక-ఆమహాశక్తికిని హేతు వరయలేము.

సర్వనిర్మాణమును శిలాస్థావరంబు-నాడు హంపీవెలుంగు విన్నాణమందు
సర్వనిర్మూలనము శిలాస్థావరంబు-నేడు హంపీ నశించిన పాడుస్థితిని.

తి మ్మ రు సు క చ్చే రీ

తిండికి లేక ఎంగిలి జితించిన మేనున తెల్గురాజ మా
ర్తాండుని తేరిపై ప్రణవతత్త్వము దెల్పెడి బాలకృష్ణుడై
యుండిన మంత్రితిమ్మరుసు ఊహల పావనమైన రచ్చలో
మండిన మంటతో నదియు మారె మసీదుగ మాచరిత్రలో.

చా క లి దా ని మే డ

[రామరాజు చాకలి కన్నెను వలచినాడు. దానికి దివ్యభవనము కట్టించినాడు. తుర
కలు బద్దలుకొట్టినా పగలకుండా దాని పూర్వవైభవము ఇప్పటికీ కాస్త కనిపిస్తుంది]

చాకలికన్నె లేనగవుచాలున ముత్తెపుపంట మానస
వ్యాకులమైన తచ్చరణవాతరయోద్ధత ధూళిధూసర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వీకృత మస్తకుండయి వసింపగ గట్టినమేడ శిల్పవి
ద్యాకృపిలోన శిల్పికి సతం బౌకభావములూరువ్యాఖ్యయా.

చాకలిమూటలో మురికిచాలుల శాంతియు సేవ ఓర్పు లే
కీకృతహూట గాంచి గుణకీర్తన చేసెను రామరాజు మా
చాకలికన్నె వన్నె పరజా తళుకీనిన మేడగోడలన్
తాకిన చిత్రచిత్రముల తల్పముపై ప్రణయామలాత్ముడై.

అ ష్ట కో ణ జ ల క్రీ డా గా ర ము

జలధారాంతర కేళికానిలయ మష్టాస్యంబు తత్క్రీడలో
పల స్వేచ్ఛావరణీయు లూగుదురు శుంభద్వ్యోమగంగాసరి
త్కలహంసీ మృదురావగీతముల నాకాంక్షించుచున్ రాచవా
రలు చేటీజన హాస్యవాగమృత ధారామోహితాత్మావధిన్.

దు రం త స్మృ తి

బాకుపోటున చిమ్మబడిన నెత్తురుజల్లు వెల్లవేసెనె రాజవీథి నిచట
గళపాశములు నీలకబరీభరంబుల పదనులో మిత్తి సాపడెనె యిచట
కులదేవతకు మ్రొక్కుకొనువేళ హారతి పొగలతావికి కత్తులెగసెనె యిట
అంత్యసందేశ గాఢాలింగనంబుల కలియనొత్తెనె చురకత్తి యిచట
శిరము తెగి మొండెమై కోటబురుజుమీద-పడకనిలిచిన "కాపలా"భయముచేత
శాత్రవులు కోటకెగబ్రాకజంకి సమయ-మునకు వేచుక తలదాచుకొనిరె యిచట.

దేవాలయములు

ఏదేవి చిలికెనో యీ పాలమీగడ విఠ్ఠలాలయ శిలావేదులందు
ఏజోదు చిందెనో యీ రక్తగంధము నరసింహదేవు పేరురముమీద
ఏశిల్పి దిద్దెనో యీ కారుమబ్బులు ద్వారపాలక రాము తేరు[1]మీద
ఏరాజు తూగెనో యీతులాడోలలో తులసి బంగారుమొక్కలకు మ్రొగ్గి

1. ఈగుడిని హజార్ రామస్వామి ఆలయ మంటారు. అక్కడవున్న రాతిరథముమీద చిత్రములను గూర్చి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏమహాభక్తు డిట జపియించినాడొ-దివ్య కోదండరామ పథిశ్రమాప
నయన శబరీఫలాపేక్ష నియతుడగుచు-కాలపుం దాటులందు సంకరము లన్ని.

ఆంధ్రాధిపాతపత్రాచ్ఛాదనాచ్ఛ వైరూపాక్షనాథు కర్బురపుకాంతి
[2]సరిగమపధనిసస్వరవల్లకీతుల్యరవ విఠోబా స్తంభ రాగఫణితి
కోదండరామసాంగోపాంగ నీలరోచి ప్రసారార్ద్రి శిలాప్రతిష్ఠ
ద్వార దేశాధిష్ఠ శ్రీరామదేవాలయస్థ శిలా చిత్రయజ్ఞవాటి
పన్నగస్వామిశయ్యా సపాండురారు-ణచ్ఛ విప్రసన్న ప్రశాంత ప్రమోద
పద్మనాభ మహాదేవు ప్రతిమగాంచి-విస్మయాధిక్యతను దేహవిస్మృతులము.

కోదండరామస్వామి

ఇనవంశోద్భవు డాలికై రణము చేయించెంగదా నీకు నై
తన కోదండము నెక్కు-వెట్టినటె స్వార్థం బా మహాదేవదే
వునికే కల్గ మనుష్యమాత్రులకు తప్పో నైజశక్తి ప్రతా
ప నిరూఢుల్ సుతు లుండగా కలిగెనా పంపాసతీ దుఃఖముల్!

నరసింహస్వామి-విరూపాక్షస్వామి

గజినిమహామదు కోపించి కత్తినెత్త-సోమనాథుడు పిడికెడు చూర్ణమయ్యె;
నారసింహునికోరల నరకి నేటి-కీవిరూపాక్షుకంటిలో నిసుముచల్లి.

---

2. ఇది విఠోబా ఆలయములోనిది. అక్కడి స్తంభనిర్మాణం బహుచిత్రంగావుంది. ఒక పెద్ద స్తంభం మధ్య వుంటే దానిచుట్టూ ఏడు పిల్ల స్తంభాలు వుంటవి. అవి ఆరోహణావరోహణక్రమంగా సప్తస్వరాలు పల్కుతవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఎఱ్ఱన "నృసింహపురాణము"

గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారు, యమ్.ఏ.

## ౧
## పీఠిక

ఆంధ్రకవికూటమునం బ్రథమ తాంబూలమున కర్హులయ్యుఁ, గొన్ని కారణములచే నించుక నిరసనమందువారలలో నొకఁడీయెఱ్ఱన. భారతకవిత్రయమునం దొకఁడయ్యు, నన్నయ తిక్కనలకు వెనుకటివాఁడగుటనో, వారిని భక్తిపురస్సరముగా స్వయము స్తుతించిన కతముననో, ఆదికవులకును దనకును రాజహంసక్రౌంచాంతర మని తననోటనె చెప్పికొనుట చేతనో, యిప్పటివార లీతనిని దొలియిరువుర సమానునిగ భావించుట కిష్టగింపరు. ఇంతియుకాక, నన్నయభట్టే ఆరణ్యపర్వమంతయు వ్రాయఁగా, నందుఁ గ్రిమిదష్ట భాగముల మాత్ర మెఱ్ఱన పూరించెనని యొకవాదము గూడ నిటీవల బయలు వెడలినది. మఱి యీతని "నృసింహపురాణ" "హరివంశ" కథలలోఁ గొన్నిటికిఁ బోతన "భాగవతము"తోడను, గొన్నిటికి సోముని "యుత్తర హరివంశము"తోడను సామ్యము కలదు. మూలకావ్య ప్రాశస్త్యము, నిజలలిత మధురశైలి, శబ్దాలంకార భూయిష్ఠత, అనన్యసదృశ భక్తిరస సంపద, యిత్యాదులు పోతన పండిత పామరజనాదరణముం బడయుటకుఁ గారణము లైనవి. సోముఁడును శబ్దాలంకారప్రియు లగు నొకతెగ పండితులకు అభిమాన పాత్రుఁడయ్యెను. కావున, ఎఱ్ఱనకుఁ బోతనతో సామ్యముగల భాగములఁ బోతనయే అధికుఁడనియు, సోమునితో సామ్యముగుపట్టుల సోమన్నయే మిన్నయనియుఁ బలువురు వచించుట ఘటిల్లినది. "హరివంశపు" పీఠికలో శేషాద్రిరమణకవు లిట్లు వ్రాసిరి. "ఎఱ్ఱాప్రగడ వ్రాసిన నృసింహపురాణములోని ప్రహ్లాదచరిత్రము పోతన సప్తమస్కంధములోని ప్రహ్లాదచరిత్రముతోఁ బోల్కి లేకున్నను, రసాతిశయమునఁ బోతనదే మేలుచేయిగనున్నది." ఇట్టి వ్రాఁతలకుఁ జేయూఁతయో యన్నట్లు "నృసింహపురాణ" ముద్రిత గ్రంథము అచ్చు తప్పుల కుప్పయై, పెక్కెడలఁ గవిభావమును మఱుఁగుపఱచి, రసభంగమునుఁ, బఠితలకుఁ విసువును బొడమించుచున్నదనవలసినందులకుఁ దత్ప్రకాశకులు నాపైఁ గినియకుందురు గాక.

తొలుదొల్తనే, పోతనార్య ప్రహ్లాదచరిత్రమందుఁ బైకొనునంత భక్తిరసంపువెల్లి నృసింహపురాణమున నలముకొనదని యొప్పుకొనవలయును. ఎఱ్ఱనయేల, నన్నయ తిక్కనాదులుగూడ, భక్త్యావేశమునఁ బోతనకు లోకువయే గదా! భాగవతమునందలి "శ్రీవల్లభుఁడు తన్నుఁ జేరిన యట్లయిన", "వైకుంఠచింతావివర్జిత చేష్టుఁడై", "మందార మకరంద మాధుర్యమునఁ దేలు", "అడుగద్దనకు మాధవానుచింతన సుధామాధుర్యమున" ఇత్యాది పద్యపమ్మోహనాస్త్ర పరంపరంగల చొక్కు "నృసింహపురాణము"న ప్రాముఖ్యముగా లేనిమాట వాస్తవము కాని తక్కుంగల కవితాగుణములం దేమిటను నృసింహపురాణమును పోతన కృతియేగాక మఱి యేకబ్బము నుమించనేరదని నాకుఁ దప్పని యభిప్రాయము. కల్పనచమత్కృతియందును, ఔచిత్యపోషణమందును, మానవస్వభావానుకరణమందును, ప్రకరణోచిత భాషాశైలియందును, వీనిచే ఘటిల్లు రసపుష్టియందును ఈకృతి కియ్యదియె యీడని చెప్పవచ్చును. ఏతద్గుణ సంపత్తిచే, నియ్యది ప్రబంధరూపముననున్నను, సర్వోత్కృష్ట దృశ్యకావ్యకల్ప మనఁదగును. వేయేల, కవి నామము మనకు మున్నుగాఁ దెలియని యెడల, నియ్యది తిక్కనకవనమే యని తప్పక మనము భ్రమింతుము. "ఈ యనర్గళధార, ఈయల్లిక జిగిబిగి, ఈ యొండురెండక్కరంపుఁబదములకూర్పు, ఈ భావగాంభీర్యము, ఈతత్త్వ విజ్ఞానము, ఈరసపోషణము ఆ తిక్కనార్యునివేగాని మఱియొకరి సొత్తు గానేరవ"ని యాగ్రంథముఁ జదువు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపుడు మనకుఁ దోఁచుటలో వింత లేదు. ఇందు మఱి యొక విశేషమేమన: ఈకావ్యము భారత భాగవత హరివంశాదులవలె, ఏ సంస్కృత మూలమునకును అనువాదము గాదు. కవి యిందలికథను బ్రహ్మాండాద్యనేక పురాణములనుండి యేర్చి, తన యిచ్చవచ్చినరీతిని మార్చి, సొంపుఁగూర్చెను. నేనెఱిఁగినంతవఱకు, ఇందు మూలకథలతో సామ్యముకన్న భేదమే అధికముగఁ గానవచ్చును. ఈ యుద్గ్రంథముపై నా కిట్టి భక్త్యనురాగములుండుటచే, ఎఱ్ఱనార్యుని కీర్తికిని, ఆంధ్రవాణికిని వరివస్యంగావింప నభిలషించి, మదీయాభిప్రాయ సమర్థకములగు విశేషాంశముల నందుండి యుదాహరించుచు నీవ్యాసము వ్రాయ నుపక్రమించినాఁడను. దీనిచేఁ గొందఱకేని యిక్కావ్యముం బఠింపఁ గుతూహలము వొడమునేని, తెన్మూలమున దీనికి నిర్దుష్టమగు చక్కని పునర్ముద్రణము లభించునేని, ఈ నా యుడుతసేవ సఫలమయ్యెనని భావించువాఁడను.

## ౨

## ఔచిత్యపోషణము:— కథయందలిమార్పులు

ఔచిత్యగుణము కావ్యకళకుఁ బ్రాణతుల్యము. ఇయ్యది ప్రకృత్యనుసారులగు రచనలచేతను, మానవ స్వభావానుకరణముచేతను రూఢిపడును. ఔచిత్యము నీకవి యెట్లు పోషించినదియు, ఇతఁడు పూర్వకథయందుఁ గావించిన మార్పులను, ఒనర్చిన పెంపకమును గాంచిన విశదమగును. ఇందులకు నిదర్శనము లీగ్రంథమున వేనవేలు తోఁపఁగలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నిట దిక్ప్రదర్శనముగ ఎఱ్ఱన యొనర్చిన కథావ్యత్యయముల యౌచితికిఁ గొన్ని యుదాహరణములొసంగెదను.

౧. ప్రహ్లాదచరిత్రమునకుఁ బూర్వరంగమగుదగు జయ విజయ శాపకథ యెల్లరకుఁ దెలిసియే యున్నది. విష్ణుదర్శనకుతూహలులై యేతెంచిన సనకసనందనాదులకు జయ విజయులు అసమయమని యడ్డుటయు, అందుల కమ్మహాత్ములు కినిసి వారి నసురయోనిం బుట్టుఁడని శపించుటయు, నపుడు శ్రీమన్నారాయణుఁ డే యచటికే తెంచి, యాఋషుల బుజ్జగించి, జయ విజయ శాపమున కనుమతించి, వీర లచిరకాలమున నాయంతికమునకు నరుదెంచునట్లుగా ననుమతింపవలయు నని కోరుటయు, దానికి వారు వల్లెయనుటయుఁ దత్కథా సారాంశము. ఇందు విమర్శనీయాంశములు రెండు కలవు. శ్రీవిష్ణువు వైకుంఠప్రాప్తి నొసఁగు నధికారము తనకేయుండఁగా నందుల కనధికారులగు ఋషులను వేడుకొననేల? త్రికాలవేది, "సమస్తభూతచేతోవిదితాత్ముఁడగు" దేవదేవున కెఱుక లేక, ఋషుల కట్టి యపచారము, ద్వారపాలకుల కట్టిశాపము ఘటిల్లు టెట్లు? కాదా; యెఱిఁగియు నౌదాసీన్యమూని, మూకీభావము వహించెనా? ఇందుఁ దొలిసంశయమునకు "నారాయణుఁడు సనకాదులను వేఁడుట, జయవిజయులు తనయంతికమున కరుదెంచుటకుఁ గాదు. వారు తిరిగివచ్చుట అచిరకాలమున నేనుటిల్లుటకు" అని సమాధానమేని, తన యంతికమునకు రప్పింపశక్తిగల వైకుంఠునకు "అచిర కాలమున" రప్పించుటకు మాత్ర మధికారము లేదా? మఱి రెండవప్రశ్నమునకు "విష్ణువు, సర్వమును ముందుగా నెఱిఁగియు కర్మబద్ధులగు జయవిజయుల దుర్బుద్ధియె వారలఁ జెఱుచునని యూరకుండెను" అని యుత్తరమేని, జయవిజయవృత్తము ఆశాపమును మోపఁదగినంత దుష్టమా? "మా ప్రభువు భార్యాయుతులై యేకాంతమున నున్నవారు. ఇంచుక వేచుఁ" డనుటయె కదా వారి మహాపరాధము? ఇంతమాత్రమునకు వారలు "అసుర యోనింబుట్టి లోకకంటకులు గండు" అను ఘోరశాపమున కర్హులా? అపచారలేశమున్నను, దండన దానిని మించినదనియే యెఱ్ఱన యాశయముకూడ. "ఇమ్మహాపురుషుల కింతమాత్రమునకుఁగాఁగ నేలకో యీకోపమిట్లు వుట్టె?" నని యచ్చటివారి గుజగుజ.

పై సందియములను ఎఱ్ఱన తనమార్పులచేఁ దొలంచెను. ఎట్లన, నిప్పురాణమున విష్ణువు సనకాదులను "జయవిజయులొనర్చిన యపచారము నాయది. ఉపశమనము నొందుఁ" డని యనునయించునే గాని, "మరల వీరల కచిరకాలమున వైకుంఠప్రాప్తిఁ గలిగింపుఁ" డని కోరఁడు. మఱియు విష్ణువు తనద్వారపాలకులతో "మీరు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తుది నస్మద్దైక్యత్వంబు నొందఁగలవారలు—(అంతికమునకు వచ్చుట మాత్రముకాదు). ఇదియంతయు నేన మాయా బలంబున మీకు శ్రేయఃకారణంబుగా సుత్పాదించిన యుపాయంబు. సనకాదులు కాదు; శర్వుండైన మద్భక్త జనంబుల ధిక్కరింప శక్తుండగునె! ఇత్తెఱంగు మాంగ ళ్యంబునా నంగీకరించునది" యని సెలవిచ్చును. ఇందుచే భగవంతుని యనన్యశక్తిసంపదయుఁ, సర్వజ్ఞతయుఁ బ్రస్ఫుటములగుటయే గాక, యీసంవిధానమెల్ల భగవ త్సంకల్పిత మనియు, నిక్కథకు శ్రీవిష్ణువే సూత్రధారుఁ డనియునుఁ దెల్లమగును.

౨. తనతమ్ముని వధించినాఁడని విష్ణువుపై హిర ణ్యకశిపుఁడు పగఁగొనినట్లు భాగవతకథ. ఇందుచే హిర ణ్యకశిపు దౌష్ట్యమునకు వ్యక్తిసంబంధమగు పగ యొకటి కారణమగుచున్నది. ఇట్టి వృత్తము లోకసామాన్య మగుటచే, అతని ద్వేషమునకు అతిలోకదౌష్ట్య మాపా దింపదు. మఱియు నియ్యది "హిరణ్యకశిపుఁడు దేవతలకు, గడకు శ్రీమన్నారాయణుని యెదుర్చుటకుఁ బురికొల్పినది యతని యహంకారమే. అదియే యతని సమూలనాశము నకు నేకైకకారణము"అను కథాప్రయోజనమునకు భంజ కముగా నున్నది. కావున నెఱ్ఱన తనకథయందు వ్యక్తి ద్వేషకారణమును బూర్తిగఁ దొలఁగించినాఁడు. ఇందు హిరణ్యకశిపుఁడు

"అసురుల తల్లికం బెను మదంబ పరిష్ఠ; త్రిలోక రాజ్యభోగములును నాక యోగ్యములు గాని, నిలింపుల కెట్లు కల్గు"నని తనహక్కును సాధించుటకు నిజజ్ఞాతులగు దేవతలపై నెత్తివచ్చును. "సర్వలోకైకవీరునిఁ గశిపునికి స్వర్గజైత్రయాత్రకు ఈ హక్కు నెపమేల! బాహుబల మున నిన్నయగుటయె చాలినహక్కు గదా? రాజ్యము వీరభోజ్యముగదా?! అనిన, లోకైకవీరుఁడు హిరణ్యకశి పుఁడుగూడ నొక న్యాయ్యమును బాటించి ప్రవర్తించె ననుటచే, ధర్మానిదేవత యట్టి అసురహృదయమును గూడఁ బూర్తిగ వికువలేదని తేటపడును. ఇయ్యది "There is a soul of good in things evil"అను మహాభావానకమునకు నుదాహరణమును అగును. ఈ న్యాయ్యావలంబనముచే హిరణ్యకశిపుని వీరత్వమునకు మెఱుఁగెక్కునే గాని, వన్నె తఱుఁగదు గదా!

౩. భాగవతకథయందు ఇంద్రాదులు హిరణ్య కశిపుని తపమువేఁడి సైరింపఁజాలక, బ్రహ్మతో మొఱ పెట్టుకొనినట్లును, అందుపై నాతఁడు వచ్చి యసురకు వరమిచ్చినట్లును ఉన్నది. నృసింహపురాణమున, బ్రహ్మ తనంతఁదానే ప్రీతుఁడై "కృప పెంపుదలిర్ప" వచ్చి, వరమిచ్చినట్లున్నది.

౪. భాగవతమున హిరణ్యకశిపుని బ్రహ్మస్తుతి వేదాంతమయమై, యతని యసురగుణమున కననుగుణ ముగ నున్నది. నృసింహపురాణమున "సముంచితార్థ మధుర బహువిధస్తోత్ర సమ్మర్ద రచన మున్నుగా నతఁ డిట్లని విన్నవించె"నని మాత్రమున్నది.

౫ హిరణ్యకశిపుఁడు కోరిన వర మెల్ల రకు విది తమే కాని యట్లు కోరుటకుఁ గారణము భాగవతమునఁ గాన్పింపదు. "అయ్యది ఊహకు సులభగోచరము కదా? హరిపైఁ బగదీర్చుకొనుటకే కదా యతఁడు దేనిచేతను చావులేకుండునట్లు వరముకోరినది." అందు మేని, అతని కోర్కె పగఁదీర్చుకొనుటే యైన యెడల, దానినే యేల కోరరాదు? మఱి యేమార్గముచేనైన పగదీఱు నుపాయ మేల కోరరాదు? చావులేకుండు వరమే యేల కోరవల యును? అనుప్రశ్న స్ఫురించును. ఇందులకు ఉత్తమ శిల్పమునం దుచితసంవిధానముచే నగు సమాధానము వల యును. అయ్యది నృసింహపురాణమునఁ గాన్పించును. ఇందు హిరణ్యకశిపుడు తపమునకేగుట తనహక్కగు అమరేంద్రత్వమును సాధించుటకొఱకు కావున నయ్యది కృపసేయుమనియే, యతఁడు బ్రహ్మను దొలుత నడు గును. అందుల కాయన యిట్లు నిపుణముగాఁ బ్రత్యు త్తరమిచ్చి, వాని కాకోర్కెను దొలఁగించును:

"సమధిక పూర్వదేవకులసంజనితుండవు నీవు; నీకు నస్యమరపదంబు తక్కువ; సురాధిపతిత్వము నీక కెంత! యనన్యామరవరేణ్యసంపదకు నగ్గలమై పెనుపొందు వైభవం—బునురుట యేమిటం గలుగు నట్టి వరంబుఁ దలంపు మింపుగన్"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందుపై, దనపదమే అడుగునో, త్రిమూర్తులపద మడుగునో యని కాఁబోలు "వనజభవుఁ డింక వీఁడేమని వేఁడునో యనుచు నాకులాత్మత నొందుచుండ" హిరణ్యకశిపుఁడు నెమ్మనంబున "నూహించి" యేమిటం జావ కుండునట్లు వరము వేఁడును.

౬. హిరణ్యకశిపుఁడు తపము సేయుచుండఁగా, దేవేంద్రుఁడు గర్భిణియగు లీలావతిని జెఱగొని పోవుట; నారదుఁ డతనిని వారించుట; నారదాశ్రమమున గర్భస్థుఁడగు ప్రహ్లాదుఁడు నారదుల యుపదేశము నాలకించుట ఈభాగవతకథాభాగము నృసింహపురాణమున వర్జితము. ఈ కథయందు దేవేంద్రుని వర్తనము మిక్కిలి యనుచితముగా నున్నది. "తత్ప్రసూతిపర్యంతము బద్ధఁ జేసి జనితార్భకు వజ్రముధారఁ ద్రుంచెదర్" అను ఇంద్రునివాక్యము కడునీచముగను అతిఘోరముగను ఉన్నది. హిరణ్యకశిపుఁడు "నూఱు దివ్యసంవత్సరములు" తపస్సు చేసెనట! లీలావతికి గర్భ మెప్పుడు వచ్చెను? అతఁడు తిరిగివచ్చినపిమ్మట గదా ప్రహ్లాదుని శైశవము భక్తియు వర్ణింపఁబడుట. ప్రహ్లాదుఁ డెప్పుడు జన్మించెను? ఇందులకు, "శతవత్సర గర్భ వృత్తాంతము మున్నగు స్వభావాతీతవిషయములు పురాణములఁ బెక్కులు కలవుకదా? ఇదియు నట్టిదే యేల కాఁగూడదు? స్వభావవిరుద్ధములు వర్జనీయములు గదా యనిన, మొదల నరసింహుని మూర్తియే స్వభావవిరుద్ధము గదా, దాని నేల యెట్టిన వదలలేదు?" అని బదులు వల్కుదురేని, యందులకు సమాధాన మిట్లు చెప్పవలసియుండును. కాళ్లులేని కథ లనేకములు పురాణముల నుండుట సత్యమే కాని, శ్రవ్యదృశ్యకావ్యకర్తలు ఆకరములగు నితివృత్తములను ఔచితీపోషణార్థమై మార్చుటయు జగద్విదితము కదా. ఈ మార్పు కత్తిసామువంటి దని వారు గ్రహించి యిందు మిక్కిలి జాగరూకత వహించిరి. కథాస్వరూపము మూలముట్టుగఁ జెడకుండునట్లు, ముఖ్యాంశములను బాహ్యాంగములను అట్లే యుంచి క్రియాశీలాది సూక్ష్మాంగములందుఁ దగుమార్పులు గావించిరి. అట్ల యెట్టినయుఁ బ్రకృతికతీతమగు నరసింహమూర్తిని కథకుఁ బ్రధానాంగమగుటచే మార్పక, కథాస్వరూపముఁ జెఱుపక మార్చుటకు వీలగు శతదివ్యవర్ష గర్భవృత్తాంతమును అవిశ్వసనీయమును, మహేంద్రకళంకాపాదకమును అగుదానిని వదలుట సమంజసము గాదా!

౭. భాగవతకథలోఁ బురోహితుఁడు హిరణ్యకశిపునితో "ఈమాటలు ప్రహ్లాదునకు మేము చెప్పలేదు, పరులును చెప్పరు. మీచరణంబులాన!" అని పల్కును. పురోహితుని నోట ననుచితంబగు నీ "మీచరణంబులాన" నృసింహపురాణమున లేదు.

౮. హరి యెల్లెడనున్నాఁడని ప్రహ్లాదుఁడు భాషింపఁగా, ఎందును లేఁడని దైత్యుఁడు సుతునిఁ దర్జింపఁగా విష్ణువు "నానాజంగమస్థావరోత్కర గర్భంబుల నన్నిదేశముల నరసింహాకృతి" నుండెను అని భాగవతము. ఇట్లుండెననుటచే భగవంతుని సర్వాంతర్యామిత్వము తెల్లముగాని, హిరణ్యకశిపుఁడు తన్నెందు చూపుమని ప్రహ్లాదునడుగునో తనకుఁ దెలియకుండినసే గదా యిట్లుండవలయును? "ఇది కవివాక్యము; భాగవతకవులగు వ్యాసబోపదేవపోతనాదులు మహాభక్తులు, వారికి విష్ణువు ఏరూపమున నేని గన్పట్టవచ్చునుకదా?" అనుచోఁ, గన్పట్టవచ్చును; కాని కవితాశిల్పముం జర్చించునపుడు, హరి "నానాజంగమస్థావరోత్కర గర్భంబుల నన్నిదేశముల నరసింహాకృతి నుండె"నను కవిసంవిధానమునకుఁ బ్రయోజన మరయవలదా? ఇట నా ప్రయోజనము హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిఁ దన్నెందుఁ జూపుమన్నను అందే విష్ణువు నృసింహరూపమున నావిర్భవించు నన్నగడయే కదా. ఇయ్యది కంబముఁగూర్చిన హిరణ్యకశిపుని ప్రశ్నము తనకుఁ దెలియకున్ననే గదా యవసరమగును. అది తెలియనిచోఁ, నతని సర్వజ్ఞత్వమునకుఁ గొఱంత యగునుగదా? అందుచే, ఎఱ్ఱన యీసంవిధానముం ద్యజించినాఁడు.

౯. హిరణ్యకశిపుఁడు భగవంతుని స్తంభమున నే చూపుమని యేల అడుగవలయును? "మఱి యెందేని జూపుమని అడిగినను, ఇట్టి ప్రశ్న కవకాశము కలదు గదా!" యనినఁ, గలదు; "జరిగినది జరిగినట్లు వ్రాయఁబడినది" అనుటయుఁ గళాదృష్టిచే సాధువగు నుత్తరము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానేరదు. ఇందులకు సమాధాన మొసఁగు సంవిధాన మాత్రమశిల్పమునం గల్పితము గావలయును. మఱియుఁ బ్రహ్లాదుఁడు బదులు పల్కుచు "ఎల్లెడల నున్నట్లే కంబమునను గలఁడు" అనిమాత్రము చెప్పక, "స్తంభాంతర్గతుఁడయ్యు నుండుటకు నేసందేహమున్ లేదు; నిర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్షస్వరూపంబునన్" అనుటలో, "ప్రత్యక్షస్వరూపంబునన్" "నిర్దంభత్వంబున" అను మాటలచే, నృసింహావతారమును హిరణ్యకశిపు వధయును అతనికిఁ బూర్వమే పొడకట్టినవని మన మూహింపవలెనా? ఇందులకు సమాధానము భాగవతమున మృగ్యము. ఏతన్నిమిత్త మెఱ్ఱన అద్భుతసంవిధానముం గూర్చెను. ఎఱ్ఱన హిరణ్యకశిపుఁడు "సముంచితకాంచన రత్నఖచిత మహాస్తంభ శతసంభారమండితంబగు సభామంటపంబు బ్రవేశించును." ప్రహ్లాదుఁడు భక్తిపరవశుఁడై విష్ణుమూర్తి శంఖచక్రాదులతోఁ దన యెదుట వర్తించునట్లు వర్తింపఁగా, హిరణ్యకశిపుఁడు "ఇతనికి వెఱ్ఱిపట్టినది" అని నిశ్చయించుకొనును. మఱలఁ బ్రహ్లాదుఁడట్లే "విష్ణుమూర్తి యెల్లెడను గలఁడు గలఁడు" అని ఘోషింపఁగా, "అతఁడిందుఁగల్గునె యనుచున్ జగద్వలయ ఘోరకరాహతిచేఁ గంబమును బ్రేయును." తత్క్షణము నృసింహస్వామి యావిర్భవించును.

తత్సభామంటపమున "స్తంభశతము" లున్న వనుటచేఁ, గంబములే యటనెల్లెడ నున్నట్లు చూపట్టుచుండె ననియు, హిరణ్యకశిపుని గద్దియకుఁ గరము సమీపమునఁ గూడ నొక స్తంభముండె ననియు, అతఁడు "స్తంభమున విష్ణువు కలఁడా"యని అడుగుట ఆలోచనతోఁ గూడిన ప్రశ్నమే కాదనియుఁ, బ్రహ్లాదునిచేష్టచే "రోషవశ" వివశుఁడై, వానితో "ఓరీ పిచ్చివాఁడా, కలఁడటరా నీచక్రి యిచ్చట?"అని భావోద్రేక పూరితుఁడగు వక్త (orator) బల్లగ్రుద్దునట్లు సమీపస్థమగు కంబమును గొట్టెననియుఁ బాఠకు లూహించుకొనుటకు సులువగు నాధార మేర్పడినది. ఈ స్వాభావిక హృద్య సంవిధానమున కెల్ల "మహాస్తంభశతసంభారమండితం" బను విశేషణమును బునాదిచేసిన యిక్కవీంద్రుని కళావైశారద్యము కరము ప్రశంసనీయము గదా!

౧౧. నృసింహస్వామి యావిర్భవింపఁగా, హిరణ్యకశిపుఁడు

"నరసింహశరీరముఁ దాల్చి, చక్రి శిక్షింపఁగ వచ్చినాఁడు; హరిచే మృతియంచుఁ దలంతు; నైన,నా-సొంపును శౌంపునందఱును జూడఁ జరింతు, హరింతు, శత్రువున్".

అనుచు "మెత్తంబడిన చిత్తంబున" నతనితో యుద్ధమునకు సమకట్టెనని భాగవతకథ. దీనింబట్టి, హిరణ్యకశిపుఁడు భయముచే సగమును, నృసింహునిచేఁ గొఱవయుఁ జచ్చెనని యేర్పడుచున్నది. ఇచ్చట ఎఱ్ఱన యొనర్చిన మార్పు, అమర్చిన సంవిధానమును గరము హృద్యములుగా నున్నవి. అవి మూడవభాగమున నిశదము కాఁగలవు.

## 3

## ఔచిత్య పోషణము: కథావిస్తృతి

పూర్వకథ యందు ఉచితములగు మార్పులు గావించుటయె గాక, యెఱ్ఱన రసవంతములగు పట్టులఁ బెంచి, తన కావ్యరాజమును నిర్మించెను. ఈ విస్తరముచే నతనికిఁ గథనల్లుటయందుఁ గల నేర్పును, అతని రసజ్ఞతయు, ఔచిత్యపరిజ్ఞానమును దెల్లమగును. ఉదాహరణములు:

౧. హిరణ్యకశిపుఁడు తపముసేయునపుడు, ఇంద్రుఁ డాతనింగూర్చి దేవగురునితో నాలోచించుట, వారియుద్యోగము, పిమ్మట నతఁడు వైరితపముఁ జెఱుచుటకై అప్సరసలనుబంపుట, వారివిభ్రమము లాతనిపట్ల వమ్మగుట—ఈ విస్తర మిక్కావ్యమున రసవత్తరమగు ఘట్టము, అమూలకము.

౨. దేవేంద్రుఁడు సపరివారుఁడై, బృహస్పతి సలహాఁగొని, వారితోఁగూడ వైకుంఠమున కేఁగుట, అచ్చట గరుత్మంతుఁడు వారి నెదుర్కొని, గౌరవించి, కొలువుకూటమునకుండ నియోగించి, శ్రీమన్నారాయణమూర్తికి వారిరాక నెఱిఁగించుట; భగవానుఁ డంతట వారికి దర్శనమొసంగి, వారి మొఱవిని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"వానికిఁ (హిరణ్యకశిపునకు)
గొఱఁతలు నిండునంతకును
గ్రూరతఁ గైకొనకున్నవాఁడ; ను
క్కఱఁ దిమిరం బడంపఁ డిమి
హారియుఁ బూనునె వేగకుండినన్."

అని ప్రత్యుత్తరమిచ్చి, తాను నృసింహావతారమెత్తి యతని వధింపఁబోవుట వారికిఁ దెలిపి, వారిని తిరిగి పంపివేయుట, దేవతలు "తత్కార్యోద్యోగప్రవర్తకుం"డగు వాచస్పతిని స్తుతించుట—ఈయుచితవిస్తరము అమూలకప్రాయమే.

౩. వసంతము, అస్తమయము, చంద్రోదయము వీనివర్ణనయు,అత్తఱిహిరణ్యకశిపువిహారము; కాంతయుఁ దాను సురాపానకేళి సల్పుట; పిమ్మట నిరువురు "రాగాకులసుప్తి" నొందుట; లీలావతి కలఁగనుట; అందువిష్ణువు సంతానఫలము నామెకిచ్చి, ఆమె మెడనున్న హారముఁ గైకొని పోవుట; ఆమె మేల్కొని తనకలను భర్తతోఁ జెప్ప వెఱచి, శుక్రాచార్యులకు విన్నవించి, ఫలమడుగఁగా, నాతఁడు "నీకుఁ బుత్త్రుఁడు, సద్బోధ సమగ్రుఁడగు పుణ్యుఁడు కలుగును. ఇంతట సంతసిల్లుము ధృతి దూలఁబోవ, మీఁది శుభాశుభస్థితులఁ దలంపనేల? అసుర సింహుఁడు ఎవ్వారిని జీరికిం గొనఁడు; నారాయణుఁ జేరుకొన్న మదినైనఁ బడు, మేలిట నెట్లు కల్గును?" అని చెప్పుట, ఆమెకు గర్భమగుట; గర్భస్థుఁడగు పుత్త్రునివలన నామెబుద్ధి నారాయణాయత్తమై యుండుట; హిరణ్యకశిపుఁ డామెకు భార్గవనిరూపితప్రకారంబునఁ బుంసవన సీమంతాది కలాపంబును నిర్వర్తించుట; పుత్త్రోదయమున, నాతనికి "మను లోకత్రయరాజ్యము నిరమిత్రముగాఁ గనినకంటె అధికసమ్మదము" కల్గుట; శిశువు మహిమచే "దివ్యకుసుమవర్షములు, దేవదుందుభిస్వనములు, అప్సరోభినయగతులు, కల్పభూరుహాంబరపతాకలుఁ" దనర్పగా, నవియెల్ల నిజోత్సవమునకుఁ దనబంట్లగు దివిజు లొనర్చు పనులుగా నాతఁ డూహించుట; "నిజ జన్మంబున నఖిలలోకప్రహ్లాదం బొనరించుటంజేసి" బాలునకు బ్రహ్లాదుఁడును నామము కల్గుట. ఈ విస్తరము సరసవర్ణనలసర్వస్వమును, ఔచిత్యసౌకుమార్యముల పెన్నిధియునై మనంబలరించును.

౪. హిరణ్యకశిపునాజ్ఞచే బ్రాహ్మణులుకృత్యను బ్రయోగించుట; అది ప్రహ్లాదునెడ విఫలమై పాలుర మీఁదికే తిరుగుట; వా రాక్రోశింపఁగాఁ, బ్రహ్లాదుఁ డనుకంపమానమానసుఁ డగుచు, నారాయణమూర్తిని ధ్యానించి, కృత్య నుపసంహరింపఁ జేయుట, అట్లే యముఁడును గింకరులును బ్రహ్లాదుని ప్రాణముఁ దీయ నెంచుటయు; వెంటనే విష్ణుసేనాపతి విష్వక్సేనుఁడు నిజకింకరకోటిచేతో నరుదెంచి, యమకింకరుల వెడలఁ గొట్టి, యముని "మొగమును ముక్కును జరియఁగ బిసవసు పిడికిళ్లఁ బొడుచుట"యు, విష్ణుభృత్యులు దైత్యపతి దాగికొనుట నెఱిఁగి, "వాఁడు నరసింహనఖంబులకెర గాఁగలవాఁ"డని నిశ్చయించినవారై, అతని నేమియుం జేయనొల్లక, "అదితిసూనుపురంబుఁ గాల్చి, దైత్యులఁ గొందఱ బారిసమసి, మరలి చనుట"యు ఈ పెంపకమునందు, విష్ణుని మహిమయుఁ, బ్రహ్లాదుని భక్తి విశేషమును, గృపాళు స్వభావమును చక్కఁగాఁ జిత్రింపఁబడినవి.

౫. నృసింహరూపం బవతరింపఁగనె, ఆయన తేజము "దేఱిచూడలేక, ఎక్కడనేన్ జనంగఁ దెరియింపు నెఱుంగక, దైత్యుఁ డెంతయుంజొక్క, మనంబున దిగులు సొచ్చును, చేష్టలు దక్కను." అప్పుడు ప్రహ్లాదుఁడు భక్తితన్మయుఁడగుచు, స్వామి నెదుర్కొని, నిశ్చేష్టితుఁడగు తండ్రిని జేర్కొని "మహాతపస్సంపన్నులకుఁ గానరాని పరమాత్మమూర్తి యిదె లోఁచెఁ; గృతార్థుల మైతిమి, ఇంక నీ కతలనుమాని యిప్పుడు నగణ్యకృపానిధి నాశ్రయింపుము; దాన నీదుష్కృతముల కెల్ల శుద్ధి యగు; నీకు ననంతసౌఖ్యములు నేకుఱును;

" నీకడుపునఁ బుట్టిన బుధ
మేకరణిం బాఁతునొక్కొ యేనని పడిలిన్
గైకొనవే నాపలు; కీ
పాకము దప్పుటయు భయము వాటిల్లుఁ జుమీ."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని పల్కెను. కాని హిరణ్యకశిపుఁడు "తనుఁ గాల్పఁ గొనిన చలము" విడువఁజాలక, రేగి "చేల యేల మాటల వెలిపింప నన్నుఁ జూచి, యెవఁడుసవతు, ఇటుచూడు మింక,

ఈ వికృత రూప మిటులై
చావఁదలఁచి తోఁచె; దీని సమయించెద; నా
లావున కెదురై పెనఁగఁగ
నీ విశ్వమునందుఁ గలఁడె యెవ్వాఁడైనన్."

అని పలికి 'యుత్సాహంబు మెఱయ' నృసింహునిపైకిఁ బోవును. దైత్యవధానంతరము నృసింహుని ఆదిత్యులును, ఆదిమునులును బ్రహ్లాదపురస్సరంబుగా నభినందనంబు లొనర్చుచు వినుతింతురు. అప్పుడు

" వీరరౌద్రభయానక విస్మయాఖ్య
రసములను బోధ్యభంగుల నెసక మెసఁగ
నఖిలభువన హృద్యంబుగ నవ్విభుండు
నిపుణ చక్రతాండవంబు నిర్వహించు."

తదనంతరము ఆ యున్మదఘోర విజృంభణము మాని, శాంతిల్లి ప్రహ్లాదునితో

" తండ్రియెఱుక లేమికి విషాదంబువలదు;
కాలగతితోడ నతనికి మేలు కలుగుఁ;
బుత్త్రికృత్యంబు లెల్లను బూని నడపు;
జనకునకుఁ ద్వద్విభూతియ సంభవించు.

దైతేయరాజ్య విభవ
ఖ్యాతి యెసఁగ, నీవు పెద్ద కాలము భవభో
గాతిశయము నాసక్తుఁడ
వై తగ భజియించి, పొందు మస్మత్పదమున్.

నాయెడ ననూయ సేసెన్
మీయయ్య యనంగవలదు; నిజ మతఁడును దో
షాయత్తుఁడు గాఁడు; తుదిన్
జేయుదు నతనికిని బరమ సిద్ధి, కుమారా!"

అని సెలవిచ్చును. ఈ మనోజ్ఞ విస్తరమునకును భాగవత కథకును గల తారతమ్యముఁ బరికించినయెడల, మానవ స్వభావజ్ఞత యందును, కల్పనసౌకుమార్యమందును, ఔచిత్యపరిపోషణమందును, ఎఱ్ఱన దంటయని యెఱుక వడును.

## ౮

## రసము, శైలి, విజ్ఞానము

ఇక్కావ్యమున భక్తియుతశాంతరసము అంగి యయ్యుఁ, గథయందు శృంగారమునకు లేశమవకాశము కలిగినను ఎఱ్ఱన దానిని పెద్దసేసి విపుల రమణీయవర్ణనల నింపి తన రసప్రలుబ్ధతను దెలిపికొన్నాఁడు. గ్రంథాదిని వైకుంఠపురవర్ణనమందును, లక్ష్మీనారాయణుల కేళివర్ణించుపట్టునను, హిరణ్యకశిపుతపమును, అప్సరసలు నిజవిలాసములచే భంగపఱుపయత్నించు తావునను, లీలావతీహిరణ్యకశిపుల చంద్రికాచంక్రమణము, సురాపానకేళి యిత్యాదుల వర్ణించుభాగమునను, ఇక్కవి సార్వభౌమునకుం గల శృంగారరసలోలుపత స్పష్టమగును. మఱియు నచ్చరల యాటపాటల వర్ణించుచోట నిక్కవికి గీతనృత్యాది లలితకళలపైఁగల యనురక్తిని జాటు పద్దెములు గానవచ్చును. విస్తరభీతిచే, అచ్చర గానము వర్ణనమాత్ర మిట నుదాహరించెద:

" అమృతంబుసోన పైనడరినట్లే, పాట
చెన్నున మ్రోడులుఁ జివురులెత్తె;
మారుతాహతి పేర, మ్రాకులు తలయూఁపఁ
దొడఁగెను గాన మాధుర్యమునకు;
ఇంపులగని యైన యీరాగరసము తీఁ
గలకుఁ గోరకపులకముల నొసఁగె;
సెలయేరులకు నశ్రుజలములు దొరఁగించె
గిరులును మంజుల గీతిఁ గరఁగి
యనినఁ బోలుఁ బొసఁగు, నగుఁ, దగు ననఁగ, స
చేతనంబులెల్లఁ జిత్రరూపు
లట్లు సోలి నిలువ నంగన యొక్కతె
పాడెఁ గలమనోజ్ఞ భంగు లలర."

కాళిదాసాది మహాకవులకుంబలె, నిక్కవికిని అలంకారములపై, ముఖ్యముగా అర్థాలంకారములపై నత్యభిలాషము గలదు. ప్రౌఢములగు చక్కని యుపమలకును,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉత్ప్రేక్షలకును ఇక్కావ్యము గని యనఁదగును. అందుండి రెండు పద్యరత్నములు మాత్రము వెల్వరించెదను:

" కుడువఁగనొల్ల కాంతయనుచుఁ
    ద్రోవ్వనఁ గూలఁగఁ ద్రోచుచుం, డగం
బడియెడు దానవప్రభుని
    పాలిటి భాగ్యమువోలె, మేడమీఁ
దెడలెడు బాలు విష్ణుమయ
    హృత్కు ధరించె ధరిత్రి దా నిప్రో
వి డె, మనుమన్న నాతనికి
    నింపుగఁ జేసిన సెజ్జయో యనన్."

" సురుచిర తారకా కుసుమ
    శోభి నభోంగణభూమిఁ, గాలనం
గరువపుసూత్రధారి జత
    నంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపఁగ ని
    శాసతి కత్తిన క్రొత్తతోఁపుఁ బెం
దెరయన, నొప్పు సాంధ్య నవ
    దీధితి పశ్చిమదిక్తటంబునన్."

భక్తియు శృంగారమునే కాక, హాస్యాద్భుతకరుణవీరాది రసములు నిక్కావ్యమునఁ దత్తదుచితస్థలంబులఁ బ్రకటము లగుచున్నవి. హాస్యమున కుదాహృతి:

" పేదప్రాణులఁ బొరిగొను బిరుదు నుగఁడ
వగుదు వీ పని యందంద మొగము మీఁదఁ
జప్పటలు పెట్టి దైత్యుఁడు జముని లావుఁ
జెవయునుఁ బొల్లుగాఁ గావు సేసి విడిచె."

" నవనిధులు పుచ్చుకొని, భ
వ్యవిమానము నాచికొని, సురారి కడిమిమై
'భవసఖుఁ డితఁ, డట్టిఁడ కా
నవు' నని, భిక్షేశుఁ జేసె నయ్యక్షేశున్."

" తపములఁ గ్రుస్సిన తపసులఁ బట్టి తె
    ప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు;
మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ
    గట్టి బొక్కని యలఁ గనణ మెత్తు;
భుజగేశ్వరుల శిరంబుల నున్న మణులూడ్చి
    కొమరార వ్రటువ గుండు లెత్తుఁ;
జెలఁగి గంధర్వుల చేతివీణెలు పిశా
    చులకిచ్చి పాడించి చూచి నవ్వు;......"

అద్భుతమున కొక్క యద్భుతోదాహరణము:

" వీపున నబ్ధి నొక్క పృథివీ
    ధరముం దగఁ దాల్చెనంచు, ల
క్ష్మీపతి పేర్మిసాలఁ గడుఁ
    జిట్టలుగా శ్రుతు లుగ్గడించు; నీ
రూపునఁ గోటిసంఖ్యల గి
    రుల్ ధరియించిన విష్ణుదాను పెం
పేపగిదిన్ నుతించునొకొ
    యింకని, వెక్కసమందె లోకముల్."

కరుణ కుదాహరణము:

" మునుమునఁ బుట్ట నీకకట
    ముద్దులపట్టి గదయ్య వీఁడు; మె
త్తని యొడ లింతయోర్చునె; కృ
    తంబుల సైఁచునె; మాను మింతలోఁ
గినుకలు; నీవు కట్టలుకఁ
    గీడొనరింపఁగఁ బొందఁజాలు వా
రనిమిష సిద్ధయక్ష ఖచ
    రాదులు గాక, తనూజుఁడే నృపా!"

ఉదాహృతపద్యములంబట్టియే, యిక్కవీంద్రుని యందు నన్నయార్యుని "యుభయవాక్ప్రౌఢి"యుఁ, దిక్కన "రసోచితబంధము"ను ఏకీభవించినట్లు తోఁచును. ఇది గాక, యీతని యందు "సూక్తివైచిత్రి" యొక విశేషముగ నుడువుట కవిసాంప్రదాయ సిద్ధమైయున్నది. ఈపొగడ్త మిక్కిలి సమంజస మనుటకు రెండుదాహరణము లొసంగెదను:

" వ్రతములఁ గ్రొచ్చి, శీలముల
    వ్రచ్చి, జపంబులఁ గ్రోలి, యుత్తమ
క్రతువులఁ దోలి, యోగములఁ
    గ్రాఁచి తపంబుల వేఁచి యెందున



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతిహతలీలమై, మదను
బాణచయంబుల తోడునీడలై,
ధృతులు దొలంచుచుండు సుద
తీ మదతీక్ష్ణకటాక్షకోణముల్."

"నిన్నింతవానిఁ జేసిన
యన్నాలుగుమోములతఁడు హరి పొక్కటి యం
దున్న వెలిదమ్మి యీనిన
కున్న యగుటఁ దెలిసి, విడువు కోపముఁ, దండ్రీ!"

పీఠికయందు నేను నుడివినట్లు, రసోచితశైలియందును, చిన్నితెనుఁగుమాటల కూర్పునందును, పద్దెంపుటల్లిక జిగిబిగియందును, తిక్కనకవనము భ్రాంతిఁ గొల్పు పద్యము లిక్కావ్యమున వేనవేలుగలవు. స్థాలీపులాక న్యాయమున నొక్క యుదాహరణము:

"తమవాడిమాఱిక్క కందర్పున కేపని
గైన సాధించు దివ్యాస్త్రమనఁగఁ
దమ తియ్యపలుకులు ప్రమదరాగాంబుధిఁ
దనరారు మవ్వంపుఁ దరఁగ లనఁగ
దమ వింతచెయ్వులు కమనీయ కోమల
శృంగారతరువు లేఁజివురు లనఁగఁ
దమ మద్దునవ్వులు తమకంపుఁ జీఁకటి
నిగిడించు నరిది వెన్నెల లనంగ
జొక్కుమందులనఁగ, సోయగంపు గను ల
నంగ, సుకమునిక్క లనఁగఁజాలి
యనుపమానమూర్తులై యొల్లసిల్లుదు
రంబుజాయతాక్షు లప్పురమున."

ఇట్లీకావ్యము కవితామతల్లికా శిరోవతంస మగుటయె గాక, జ్ఞానప్రదాయి మోక్షసంధాయియనియుఁ, గవి గొప్పతత్త్వవేత్తయు భక్తపుంగవుండు ననియుఁ జదువరులకు గోచరము కాఁగలదు. ఇందలి తత్త్వబోధ కొకటి రెం డుదాహరణములు:

"భవ దురునాభిరంధ్రభవ
పద్మరజః పరిమాణపాక సం
భవుఁడు విధాత; తద్విమల
భావకళాకణమాత్ర వైభవో
ద్భవము జగంబు; తద్వివిధ
భంగిక సర్గములోన నొక్కరుం
డివియని నిశ్చయింపఁగలఁ
డే భవదీయగుణంబు, లచ్యుతా!"

"విన్నంజాలు భవన్మహత్త్వము
భవ ద్విజ్ఞానసద్గోష్ఠియం
దున్నంజాలు భవత్పదాంబు
రుహసేవోత్సాహ సంపన్నులన్
గన్నంజాలు భవత్సమంచిత
జగత్కల్యాణనామంబుఁ జే
రొన్నంజాలు నరుండు శాశ్వత
శుభారూఢుండు లక్ష్మీశ్వరా!"

"ఆతఁడు కనుదెర్వ బ్రహ్మాండ వితతి యొదవు;
నతఁడు కనుమూయ నన్నియు నడఁగి పోవు,
భువన సంభవ సంహార భూరిమహిమ
తోయజాక్షున కరయ లీలాయితంబు."

ఇంతటి దివ్యజ్ఞాని యగుటచేతనే, ఎఱ్ఱన స్వకవిత్వానై పుణికి గర్వపడక గ్రంథాదినే తన నిరహంకృతి నెట్లు ప్రకటించెనో చూడుఁడు:

".....కతిపయాక్షర పరిగ్రహజనితం బైన నైసర్గిక చాపలంబుకతంబున,
మించినవేడ్క, వీనులకు
మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ, రా
యంచలు కూయఁ గ్రౌంచమును
నావలఁగూయఁ గడంగుభంగిఁ బ్రా
ఘాంచిత శబ్దసారులు మ
హాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తి సంగసుఖ
లీలకు, నేనును గాంక్ష నేసితిన్."

ఇట్లీవ్యాసమందు నిరూపితములు ఉత్తమకవిలక్షణములు నగు ఎఱ్ఱనార్యుని యౌచితీనిర్వహణమును, రససంపూర్ణత్వమును, రచనాప్రౌఢిమను, విజ్ఞానసంపత్తిని, సకల సుగుణమకుటమై ఆంధ్రకవుల నరుదగు వినయవిశేషమును మరల స్మరించి కొనియాడుచు నింతట విరమించువాఁడను.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రతాపకుమారి

శ్రీ శివశంకరశాస్త్రి గారు (సాహితీసమితి)

హమీరసింగు—

అచ్చెరు వయ్యె, మీనగరమందు వివాహమహోత్సవాంకముల్
ఎచ్చట గానరావు జలజేక్షణ! మీపరివారవర్గమో
ముచ్చట లేకయున్నయది, మోసముపోలిక గోచరించెడుఁ
జెచ్చెర సత్యముం దెలియజేయఁగదే భువనైకసుందరీ!

ఆయతమైన ఖడ్గమిదె హస్తమునందు, మహాపరాక్రమ
శ్రీయుతులైన సైనికులు చేరువకావలి యున్నవారదే!
ఏ మెడ దాచెనో పటకుటీరమున న్నిజవీరవర్గముఁ
న్యాయము వీడి నీజనకు డంబురుహోజ్జ్వల చారులోచనా?

ఇంకొకమాట నిన్నడుగ నెంతయుసిగ్గు జనించుచున్నదో
పంకరుహాయతాక్షి, పొరపాటున నీకటిదివ్యమండలా
లంకరణమ్మునఁ నిపుణలగ్నముగా చురకత్తియున్నదో
అంకిలిచెప్పకే ఛురిక నావలనుంచుము రాజపుత్రికా!

మాయలలో మహామహుడు మాళనదేవనృపాలుఁ డందుచే
ఈ యెడ జాగరూకత వహింపక తప్పనిదయ్యె నిన్ను మీ
నాయన రాజ్యరక్షకయి నా కుపహారముగా నొసంగెనా?
నీయనురాగమే యిచట నెక్కొనెనా సరసీరుహేక్షణా?

పెండిలియాటచే నెటులొ ప్రేమనటించుచు భర్తృగేహమం
దుండెద, నిందయేటికని యోర్పువహింపకు రాజపుత్రికా!

ప్రతాపకుమారి—

మీనామమ్మును విన్నదాదిగ మదిఁ మీపాదపద్మద్వయీ
ధ్యానంబే యొనరించుచున్నయది యీదాసి ప్రవీరాగ్రణీ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హమీరసింగు——

ఖండితవాక్యముల్ పలికి కష్టముగూర్చితి నీకుభ్రాంతినై,
నిండుమనమ్ముతో నిపుడు నిన్నువరించినవాడ ప్రేయసీ!
బంగరుబొమ్మ, నీలలితబాహులతాదృఢబంధనార్థినై
సంగరకర్కశుం డయినసైనికు డువ్విళులూరు నెంతయున్!

ప్రతాపకుమారి——

మీనిష్కల్మషవాక్యముల్ వినగ నా మేనెల్ల కంపించెడున్!
నేనిక్కమ్ముగ నిల్వజాల తమసాన్నిధ్యమ్మునందున్ ప్రభూ!

హమీరసింగు——

మంగళదేవతా, ముఖము మ్లానము చేయగబోక బంధురా
లింగన మీవె! దుర్లభనిలింప సుఖాంబుధి నోలలాడెదన్.

వింతగ నీముఖాంబుజము విన్నదనంబు వహింపనేల, క
ర్ణాంత విశాలనేత్రముల నశ్రువు లూరగనేల, సాధ్వసా
క్రాంత మనోజ్ఞఫాలమున ఘర్మకణమ్ములు నిల్వనేల, నీ
వింత వికారముం గనగ నేమిటి కోజగదేకసుందరీ?

ప్రతాపకుమారి——

ఆకర్ణింతురయేని మానమహతా మగ్రేసరా, మత్కథన్
మీకోపోగ్రకృశానుకీలలను భస్మీభూతమైపోవుదున్!

హమీరసింగు——

నిక్కపుప్రేమ గాఢముగ నీయెడనుండగ నాకు నేటి కో
చక్కనిచుక్క, యింతభయసంభ్రమగాద్గదికప్రసక్తి? నా
యక్కున జేర్చుకొంటిగద!——అన్యవిచారములం ద్యజింపుమా!
ఎక్కడ కట్లుపోయెదు?——క్షమింపుము యోధునికర్కశత్వమున్.

ప్రతాపకుమారి——

మీకీర్తిధ్వజమందు నిల్చినది యీమిథ్యావివాహమ్ముచే
ఆకల్పాంతము దుర్భరంబయిన నీలాంకంబు వీరాగ్రణీ!

హమీరసింగు——

నీమాటల్ మనముం గలంచినవి యోనీరేజపత్రేక్షణా,
ఏమాడ్కిన్ ఘటియిల్లు దుర్యశము నా కీతద్వివాహమ్మునన్!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతాపకుమారి—

పౌరుషమందు గణ్యతను ప్రాభవమం దసమానమైన దీ
ధారుణి బప్పరాట్కులము ; తద్వరవంశమునన్ జనించుటన్
మీరు మహాకులీనులును మిక్కిలిపూజ్యులుకాని నేటితో
గౌరవహాని సంఘటిలె గైకొనుట న్నను ధర్మపత్నిగాన్.

నాయనగారు సౌమ్యముగ నన్నునొసంగుటలో మహాప్రభూ,
మాయ మహానిగూఢ ! మిది మంగళదేవతకాదు, శుభ్రమౌ
మీయశమున్ హరించుటకు మేదినిమీద మనోహరాంగనా
కాయముతోడ సంభవముగాంచిన పెద్దపిశాచియే సుడీ !

కావున మండలాగ్రమున కాయముజీల్చి కవోష్ణరక్తధా
రావభృథంబునం బునరనావిలమై నిజకీర్తిచంద్రికల్
దేవ, చెలంగగా నిఖిలదిక్తటులందు సమాచరింపుడీ
భూవరధర్మ, మత్యధికపుణ్యము నాకు లభించు రూఢిగా !

హమీరసింగు—

ఏమాత్రంబు భయంబులే, దిక నిజంబేమో నిరూపించి ని
న్నీమానందము సంఘటింపదగదే శీఘ్రంబు ప్రాణేశ్వరీ !

ప్రతాపకుమారి—

ఊహము నాకులేనపుడు యోధకుమారునితోడజేసి రు
ద్వాహము తల్లిదండ్రులు, వివాహముమాత్రము కాకపూర్వమే
ఆహవభూమియందు నత డంతమునొందెను పోరుసల్పుచున్
సాహసమున్ వహించి కలసత్యముపల్కితి ప్రాణవల్లభా !

హమీరసింగు—

పాదద్వంద్వమువీడి లేవగదవే ప్రాణప్రియా, ఇంక నీ
ఖేదంబున్ విడనాడి నాభుజముపై గ్రీవమ్ము గీల్కొల్పవే !
ఏదీ నాప్రియకాంతకున్ సదృశురా లేతన్మహాంభోధి మ
ర్యాదాలంకృత ధారుణీతలమునం దంభోజపత్రేక్షణా !

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీకృష్ణునిపాత్ర-పారిజాతాపహరణము

విశ్వనాథ నరసింహముగారు, బి.ఏ.

పారిజాతాపహరణ ప్రబంధమున శ్రీకృష్ణుఁడు శృంగారనాయకుఁడు. అందు పారిజాత ప్రసూనము నారదమునిచే శ్రీకృష్ణున కీయఁబడుటయు, తత్ప్రసూన మాతఁడు రుక్మిణీ రమణికి,—సమక్షంబునఁ దనతో విలాసముకొఱకాడుచున్న రుక్మిణీరమణికి-ఒసఁగుటయు, తరువాత సత్యభామా వృత్తాంతమును, పిమ్మట పారిజాతప్రసవాపహరణము మొదలుగాఁ గల యశములు వర్ణింపఁబడినవి.

ఆప్రబంధమందలి కథా సంవిధానము, శ్రీకృష్ణుఁడు ప్రియభార్య యగు సత్యభామ కొఱకు నాకంబునకరిగి యచ్చోనున్న పారిజాతవృక్షంబును పెకలించి తెచ్చి యామె విలాసారామంబున నాటించుట, శ్రీకృష్ణుఁడు సత్యయెడ యెక్కువ మక్కువఁ దగిలియుండెనని స్ఫురింపఁజేయుచున్నది. అంతియ కాక శృంగార రసమున నాయకుల నేకరీతుల నాయికలను తృప్తులఁజేయుట విశదమయి యుండ, శ్రీకృష్ణుఁడు సవతియగు రుక్మిణీదేవికి భర్త పారిజాతంబొసంగెనను నీర్ష్యావేశంబునఁ దన్నూరార్పు భర్తను కాలితోఁదన్నినంత

"నెయ్యపుఁగిన్కఁ బూనితాఁ
చినయది నాకు మన్ననయ"

యంచు గ్రహించుట యత్యధికమగు శృంగార రస ముప్పతిల్ల జేయుచున్నది. మఱియు శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవికి పారిజాత మొసంగిన తరువాత నారదుఁడు తత్ప్రసూన ప్రభావ మామె కెఱింగించి యిట్లు నుడివెను:

"ఇన్ని దినంబులన్ సవతు
లిందఱిలో నలసత్యభామ కన్
సన్నల ద్రిమ్మరున్ హరివ
శంవదుఁడై యన వింధుఁ గాని యో
కన్నియ! నీయెడం గలుగు
గౌరవ మెయ్యెడఁ జూచి కానలే
కున్న ననర్ఘ దివ్యకుసు
మోత్తమ మేరికినైన నిచ్చెనే."

దీనిఁబట్టిచూడ శ్రీకృష్ణుఁ డగ్గలపుందమి రుక్మిణీరమణియెడఁ గలిగియుండెనని తెల్లమగుచున్నది. అయిన నిం దెవ్వరియం దాతని కెక్కువ మక్కువ?

సహృదయుండు దక్షిణుఁడనియు, గూఢ విప్రియకారి శఠుఁడనియు నాయకభేదము లెఱింగించుచున్నవి. శ్రీకృష్ణునకు రుక్మిణీసత్యలలో నెవ్వరియందైన నధికానురాగ మున్నయెడల నాతఁడు శఠనాయకుఁడు కావలసి వచ్చును. ఇంకొకనాయికను గోరినవాఁడయి జ్యేష్ఠభార్య యెడ మనసులేక నప్రియ మొనరించువాఁడు శఠుఁడు. శ్రీకృష్ణునకు సత్యయెడఁ బ్రేమ యధికమనిన నాతఁడు శఠుఁడని నిశ్చితమగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని శ్రీకృష్ణుఁడు దక్షిణనాయకుఁడే యనుట నిశ్చయము. ఆతని కందఱి యందును సమానమయిన ప్రేమయే కాని యొకరియం దెక్కుడు లేదు. ఏలన నాతఁడు

"ఏయే వేళల నే సరోజముఖియే
యేలీలలం గోరుఁ దా
నాయా వేళల నా సరోజముఖి నా
యాలీలలం దేల్చి..."

యుండెనని మున్ను వచింపఁబడినది. ఇందు మూలమున కృష్ణునకు మహిళామణు లందఱి యెడను సమానమయి స్వచ్ఛమయిన ప్రేమ యుండెనని తేటపడుచున్నది. అయినను శ్రీకృష్ణుఁడు నారదదత్తం బగు పారిజాతంబును రుక్మిణీదేవికి సమర్పించుటఁ గూర్చి యించుక యోజింపవలసి యున్నది. తొలుత కలహప్రియుండగు నారదుండు రుక్మిణీ సత్యభామల కిఱువురకును కలహకారణ మగుటకొఱకే యాదివ్యసుమంబుఁ దెచ్చెను. తెచ్చుటయు కృష్ణుఁడు రుక్మిణితో విలాసక్రీడ నున్నతఱి యాతని కిచ్చెను. అంతట కృష్ణుఁ డాపారిజాతంబును మనమున వినయమును, విస్మయంబును బెనఁగొనఁగఁ గైకొని రుక్మిణిం గాంచి సత్యభామతలంపున నిలువ

"ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో
నేమంచు నూహించునో
మది సాత్రాజితి దాని కేనిపుడు ప్రే
మం బంపినం దీని నె
ల్లిదముం జేసిన జాడఁ దోఁచునొకొ యా
లెమ్మిందు నేనున్కిఁ జె
ల్లదువో యేరికిఁ బంపఁగా..."

నని యనుకొనియెను.

రుక్మిణి కాదివ్యకుసుమ మిచ్చిన సత్యభామయలుకఁ జెందునేమో యనియు, సత్యభామకే యాపారిజాతమంపిన నిజ సమక్షమం దుండిన రుక్మిణీరమణి చిన్నవోవు ననియు కృష్ణుఁడు మనంబున నించుక చింతించెను. దీని వలన నాతని కిఱువురయందును సమానమైన ప్రేమయని నిశ్చయమగుచున్నది. ఏమయినను సమక్షమందుండిన రుక్మిణికే యాసుమమిచ్చుట సమంజసమని యూహించి యాపారిజాతమును రుక్మిణి కాతఁ డొసఁగెను.

మఱియు పారిజాతమును రుక్మిణి కిచ్చుచో "కనుఁగవ పిన్ననవ్వు దొలఁక న్మునినాథుని కన్నుసన్న నిచ్చిన..." యని చెప్పఁబడియున్నది. ఇందు కృష్ణునకు చిఱునగ వంకురించుటయం దర్థమున్నది. పైకి స్ఫురించునది యేమన నాయకుఁడగు కృష్ణుఁడు నాయికకు కుసుమము మందహాసముతో నిచ్చుట శృంగారచేష్టితము. ఇంతియకాక శ్రీకృష్ణుఁడు సురసుమము రుక్మిణీరమణి కిచ్చుచో సత్యభామ కినుకనొందు ననియు యామె పొలయల్కను తాను తీర్చుట కవసరమగుచో పారిజాతవృక్షమయినను దెచ్చి యిచ్చెదననియు మనమున నూహించియేచిఱు నగవుతోడ రుక్మిణికి పారిజాత మిచ్చెనని వ్యంగ్యము. పైఁజెప్పిన హాసకారణము శ్రీకృష్ణుఁడు దక్షిణనాయకుఁడని స్థిరపరచుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కొలంబో మ్యూజియము



కొలంబోమ్యూజియము



పోల నరువలోని యొక ప్రాచీన బౌద్ధాలయము-సింహళము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అనూరాధపురమునందలి చంద్రకాంత సోపానములు-సింహళము



ఒకానొక హైందవ దేవాలయము-సింహళము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇఃకమ ముందుదాహరించు నారదవాక్యము, "ఇన్నిదినంబులగ్ నవతులిందఱిలో" యనుపద్దియము కేవల కలహప్రియుండగు నారదవాక్యముకాని వేఱుకాదు. మఱియు భాగవతమందలి దశమస్కంధములో

"మాధవుండు దా
నరకునిఁద్రుంచి వానిభవ
నంబున నున్న పదాఱువేల సుం
దరులను నొక్కమాటు ప్రమ
దంబున నందఱ కన్నిరూపులై
పరిణయమయ్యె ... " నని చెప్పఁబడి

యున్నది. దీనిఁబట్టి శ్రీకృష్ణుఁడు దక్షిణనాయకుఁడని స్థిరపరచి యింతటితో విరమించుచున్నాము.

---

## సబ్రహ్మచారి

పెనుమర్తి వెంకటరత్నముగారు

నిర్దయ మహావిధిగ్ గఠిననింద యొనర్చుట నాల్కచేటు నీ
దుర్దశ కార్యకారణవిధుల్ ఫలియించినదేగదా! నిదా
ఘార్దితవేళ మేఘములకై వినువీథిని తొంగిచూచినగ్
వ్యర్థపుకాక, చాతకి లవంబును గ్రోలునటే పయస్సులగ్.

పోఁడిమిపోయి కాయలును బూవులు లేఁతచివుళ్లతోఁడఁ గ్రే
ళ్లాడుటఁ దక్కి జీవకళలన్నిటికిం జెడఁబాసి భానుపె
న్వేడిమిబారిఁబడ్డ విటపీ! చెలికారము సేయవచ్చి నా
మోడుమొడంద స్నేహరసమున్ జిలికింపఁగ నిచ్చయించెదగ్.

నావలెనీవునుగ్ మఱచినా వనుకొంటి గతానుభూతదుః
ఖావళులేల మెండి, వరుగై, యెపుడో ధరపైన వ్రాలగా
బోవుచు భావిచింతనము బోవిడనాడవు! భూతపూర్వపుం
జీవనగాథ త్రవ్వెదు, కృశించెద వుత్థితనూత్న వేదనగ్.

నిద్దురమంపులోన శయనింత మొకందు తలంపులేక, యే
సద్దునులేక, జీవనవిచారము పోకడపెట్టి, మోడులై
యిద్ధర వ్రాలిపోయి గతియించిన నాడును నేమనుచ్వాలెగ్
వద్దు! విధిగ్ దిరస్కరణవాక్యము లాడగవద్దు నెచ్చెలీ.

---

7. 5- 3 ౭౨౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆధునికకృతులు తద్భిన్నాభిప్రాయములు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

విచక్షణులారా! ప్రస్తుతము వెలువడు రసవత్ఖండికలపైఁ బలువురు భిన్నాభిప్రాయులై వివదించుచున్నారు. ఇట్టివివాద లొక్కొకతఱి నామిత్రులతో నాకే చాలసారులు తటస్థించెను. ఆధునికకృతుల నూతనత లేదనియు "మనసారస్వతమునకు నూతన వసంతోదయ మైన"దని వ్రాయువారి వ్రాఁతలు కేవలపక్షపాతమాత్రసారములనియుఁ గొందఱి నామిత్రుల యాశయము. అద్యతన ఖండకావ్యములఁ గొంతవఱకైన నూతనత్వము కలదనియు భావకవుల నుడికారముల వింతవింత తీయఁదనములు లేకపోలేదనియు నాయభిప్రాయము. ఈ విషయము కొంతవఱకు చర్చించి నాయభిప్రాయమును సహృదయలోకమునకుఁ దెలియఁజేయ యథామతి నిద్దాని రచింపదొరకొంటి. సుధీవరు లెవ్వరేని భిన్నాభిప్రాయులైనఁ గృప నెఱింగింపఁ బ్రార్థితులు.

ఆంధ్రసారస్వతకాలము మూఁడుయుగములుగఁ బెద్దలచే విభజింపఁబడెను. అందు మొదటిది పురాణయుగము, రెండవది ప్రబంధయుగము, మూఁడవది నాటకయుగము. పైనిఁ జెప్పిన పురాణయుగమునందలి మొదటి గ్రంథము నన్నయభారతము. అప్పటివారు సాధారణముగ నాగమాభ్యాసనిరతులు, నవిరళజపహోమతత్పరులునైయుండి యాంధ్రమున విశేషాసక్తులు గాక గీర్వాణగ్రంథములయందే యాసక్తులై యుండ రాజనరేంద్రుని యానతిని నన్నయ భారతము నాంధ్రీకరించెను. ఈ యాంధ్రీకరణము కేవల మార్యమతవ్యాప్తికై పామరసుసాధముగఁ జేయఁబడెను. తరువాతివాఁడగు తిక్కయజ్వయు నీయభిప్రాయమును జక్కఁగ గుర్తించి యీ యుద్యమమును సమీచీనముగ నెఱవేర్చి కృతార్థుఁడయ్యెను. ఎఱ్ఱన కీయభిప్రాయము కొంతవఱకు సడలెను. వారిశేషమును బూరింపవలసినవాఁడగుడు వారినే యనుసరించి తుదకు మతవ్యాప్తి కీ యుద్యమమని తలంపక క్రొత్తవర్ణనల నారంభించి ప్రబంధపరమేశుఁడను బిరుదమునందెను.

గీర్వాణగ్రంథములఁ బరివర్తించుట మతవ్యాప్తి కొఱకనుమాట స్మృతిపథమును దప్పిపోయెను. కవిత్వమునఁ జిత్రచిత్రగతులు వొడమినవి. నగరార్ణవాది వర్ణనలఁ గావ్యములఁ జేయఁదొడంగిరి. కొన్నిరోజులు జరుగనరికి మనకుఁగూడ లక్షణగ్రంథములు సమగ్రముగా నుండవలయునని కాఁబోలు కావ్యాలంకారచూడామణి మున్నగు గ్రంథములు పుట్టినవి. స్వతంత్రపుంబోకడలతో గ్రంథరచన యొనరించిన బాగుగనుండునని తలఁచి పెద్దనార్యుఁడు తక్కవపద్యముల కథాభాగమును మిక్కుటముగాఁ బెంచి రసవత్ప్రబంధ మొకటివ్రాసి ప్రబంధయుగమునకుఁ బ్రారంభమంగళదిన మైనాఁడు. ఆంధ్రభాషాయోషామణి బహువిధవిలాసవతియై "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అని నుతిఁగన్న దీయుగముననె. ఈ యుగముననే యొకప్రక్క ముద్దుకవిత్వపు ముచ్చటలు, వేఱొకవంక నేకైకదిన ప్రబంధఘోరేయవిలాసములు, మఱియొకదెస ద్వ్యర్థిగ్రంథగ్రథనానుభావములు, నింకొకచక్కి శుద్ధాంధ్రకావ్యనిర్మాణదక్షతలు, కొండొకవంక నేకాక్షరి, ద్వ్యక్షరి, పాదభ్రమక, చిత్ర, బంధ, గర్భ, నిరోష్ఠ్యజంఝూప్రభంజనములు, నింకొకవంక నుత్కటశృంగారప్రబంధరచనావైదగ్ధ్యములునై యాంధ్రకవిత పలుత్రోవలం ద్రొక్కెను.

పైవారి ప్రబంధములకన్న నూతనపథములఁ బోవు నుద్దేశములు మొలకలెత్తఁ జొచ్చెను. సముఖము వెంకటకృష్ణప్పనాయఁడు జైమినీభారతగద్యగ్రంథమును వ్రాసెను. గద్యగ్రంథములలో రెండవది చిన్నయసూరి నీతిచంద్రిక. పైయుద్దేశములు క్రమముగాఁ బరిపుష్టములై



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికాసవంతములయ్యెను. ఆంగ్లేయభాషలోను, గీర్వాణభాషలోనుగల రమ్యదృశ్యప్రబంధములు మన వాఙ్మయమున లేకయుండరాదని కాఁబోలు వీరేశలింగ మహాశయునిచేఁ గాళిదాసుని శాకుంతల మాంధ్రీకరింపఁబడెను. పదపడి యాంగ్లేయవాఙ్మయమునందువలెనే రాజశేఖరచరిత మను నవల నీతఁడు రచించెను. ఈ యుగమునకు మూఁడు నామములు గలవు. ౧ నాటకయుగము, ౨ నవలాయుగము, ౩ వీరేశలింగయుగము. ఈ యుగమునఁ గవిత నానారీతులతో నడచినది. కొందఱు భాషాంతరీకరణ నాటకములను, నట్టినవలలను, స్వతంత్రనాటకములను నవలలను వ్రాయఁదొడఁగిరి.

మఱియు నీయుగమునఁ జక్కని విమర్శనలు వొడమినవి. వ్యుత్పిత్సువులకు విమర్శనలు జీవాతువులు. ఇట్టి విమర్శకులలో వేదము వేంకటరాయశాస్త్రులుగారు, నస్మద్గురువరేణ్యులగు వజ్ఝలచినసీతారామస్వామిశాస్త్రులుగారు నగ్రగణ్యులు. వీరివ్రాఁతలు విద్యార్థిసార్థవాహ రత్నాకరములంట యతిశయోక్తి కానేరదు. ఇట్లే యింక నీకాలమున విమర్శనలు, వివేకవర్ధనులగు పత్రికలు మొదలగునని యెన్నియో వెలువడినవి.

క్రొత్తయుగ మారంభమైనది. ఆంధ్రసారస్వతోద్యానవనమునకు వాసంతకల్యాణావసరములు వచ్చినవి. శ్లేషయమకాను ప్రాసాదిజరత్పర్ణావళి రాలిపోయెను. ఏకాక్షరి, ద్వ్యక్షరి గర్భబంధాదికముతో నసహ్యరూపముతోనున్న గొంగళిపురుగు చచ్చిపోయెను. భావప్రధానమై నవరసాభిరమ్యయగు నాకు చిలుక తన మిసిమిఁ గొలుపు పసిఁడిఱెక్కల విదిర్చుచు నలుగడల రసికుల 'హాయి' యనిపించుచున్నది. ఇదియే నూతనసువర్ణరసవత్ఖండకావ్య చతుర్థయుగము. ఇందలికవులు పాశ్చాత్యనాగరకతాచతురమతులు. ప్రకృతితోఁ దమరమ్యభావముల మేళగించి తదేకతానముగ గాన మొనరించు గాయకులు. ప్రకృతిసౌందర్యముల నాలోకించి యాలోకించి ప్రముగ్ధులైపోవు భావకులు. తమవర్ణ్యముల సారస్వతముఖమునఁ జిత్రించి కుంచియ నొల్లక నవరసరాగభరితముగా నొనరించు చిత్రకారశిఖామణులు. పోసఁగముత్తెపుసరుల్ పోహళించినలీలఁ దమలోనఁ దొరయు శబ్దములఁగూర్చు ప్రోజడలు. లోఁదలంచినక్, రాతిరియున్ బవల్ మరపురానిహాయల్ చెలియారజెంపు నిద్దాతరి తీపులంబలెను దాచసిలంజేయు నేర్పరులు. వీరిలో ముఖ్యులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, దువ్వూరి రామిరెడ్డిగారు, విశ్వనాథము సత్యనారాయణగారు మున్నగువారు. వీరు స్వతంత్రులు, ప్రాచీనశుష్కనియమముల నంతగాఁ బాటింప నిచ్ఛలేనివారు. ఇట్లు వీరిలోఁ గొందఱీ గ్రంథములవలననే తెలియవచ్చెడిని. చూడుఁడు: కృష్ణశాస్త్రిగారు, కృష్ణపక్షాన–గీతిక.

"నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు
నాయిచ్ఛయేగాక నాకేటివెఱపు
కలవిహంగమపక్షములఁ దేలియాడి
తారకామణులలోఁ దారనై మెఱసి,
మాయమయ్యెదను నామధురగానమున,
నవ్విపోదురగాక నాకేటిసిగ్గు"

అని తమనిరంకుశత్వమును బ్రవ్యక్తీకరించినారు. ఇంక రామిరెడ్డిగారు.

"గీ. పంజరనిబద్ధ కీరంబు బయలుగాంచి
యడ్డుకమ్ములదాటంగ నాసచేయు
నటు బహిర్నియమంబుల నతికరించి
మన్మనంబుస్వాతంత్ర్యసీమకుఁ జరించు.
కాన యెవరేమియనుకొన్న దాననేమి
గలుగు కాల మనంతము యీ విశాల
భావలోకము క్రమముగాఁ బడయుమార్పు
యేలహృదయంబు వెలిపుచ్చ నింకయలుకు."

అని తమ బహిర్నియమనైరాశ్యమును, నిర్భయత్వమును నుగ్గడించుచున్నారు.

కాలానుగుణముగఁ బ్రాచీననియమముల మార్చుటయే నాగరకత. ఇట్టిది మనవారిలోఁ గొందఱికి సరిపడదు. కనుకనే వీరు ప్రస్తుతరీతులకు సరియగు శారదాబిల్లు మొదలగు సంస్కరణముల గర్హించి నాగరకలోకహాస్యాస్పదు లగుచున్నారు. ఏతాదృశులు కొందఱు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బహిర్నియమంబులను, ప్రాచీనఛాందసత్వములను సడలించిన భావకవులఁ గొన్ని యాక్షేపణలతో నిందించుచున్నారు. అందుఁ గొన్నింటిఁ బొందుపఱచి నాకుం దోఁచినటుల సమాధానము వ్రాసెదను చిత్తగింపుఁడు.

1. మొట్టమొదట భావకవిత్వమనఁగా నర్థము లేదఁట, 2. వీరి వ్రాఁతలలోఁ గవిత్వము లేదఁట, 3. వీరి కవిత్వమునఁ బ్రౌఢత్వము శిశువిషాణమఁట, 4. నీతి మృగ్యమఁట, 5. పచ్చిబూతులు వ్రాసి లోకమును నీతిబాహ్యమునుగా నొనరించుటలో వీరద్వితీయులఁట, 6. వీరు వ్రాసినదానినే వ్రాయు నసమర్థులఁట, 7. వీరు చేతఁగానివారగుటచే శ్లేషచిత్రాదికకవిత్వమును విడిచికొనిరఁట, 8. జానపదులజీవితములు వీరికి వర్ణ్యములగుట నున్నతభావములు కలుగుటకు వీలులేదఁట.

పైవారివాక్యము లెంతవఱకు యుక్తియుక్తములో విచారింతము. భావకవిత్వమనుమాట కర్థము లేదఁట—'కవేర్భావః కవిత్వం—భావప్రధానం కవిత్వం భావకవిత్వ' మని మధ్యమపదలోప సమాసము. కొందఱు దేనికప్రాధాన్య' మని యడుగవచ్చును. రసపరిపంథియగు ప్రతివిషయమున కప్రాధాన్యమని సమాధానము.

రెండవ యాక్షేపణ—వీరి వ్రాఁతలలోఁ గవిత్వము లేదఁట. ఈమాట కవిత్వమన నేమియో తెలియక యనినది.

తాను దేనిని వర్ణింపఁదలఁచినాఁడో దానినిఁ బాఠకుల యెట్టయెదుట నిలుపఁగలవాఁడే కవి. ప్రకృతిలోఁ దన్మయుఁడై రసికుల తనయపూర్వ కవితాసుధాతరంగిణి దోఁగింపఁగలవాఁడే కవి. కవి యొక్కొక్కతఱిఁ బాఠకుల గగనకల్లోలినీ శీకరసేకమున హాయిహాయి యనిపింపఁగలఁడు.

ఒక్కొకతఱి సుధర్మలో సుత్రామునంకభాగమున నిలిపి రంభాద్యప్సరఃకాంతల నాట్యానందాంబుధి నోలలాడించును. ఒక్కొకపరి కాంతారాంతములఁ గందమూలములఁ దినిపించి కాషాయాంబరములఁ గట్టించి "కఠినవిధీ"యనిపించును. వేఱొకతఱి ప్రకృతికాంత యొడిలోఁ బరుడఁబెట్టి జోకొట్టి ప్రముగ్ధునిఁ జేయును. ఇట్టివాఁడే కవి, వీనిదే కవిత్వము. ఇట్టిదే, వినఁగనే పాఠకుని చిత్తము నుఱ్ఱూతలూగింపఁగలదు. అంతియ కాని యేవోనల్లరాళ్ల వంటిపదముల దొర్లించియనుప్రాసనిరోష్ఠ్యాది నీరసనియమములఁ బెట్టికొని చెప్పినది కవిత్వముకాదు. మమ్మాటికి కాఁజాలదు.

చూడుఁడు: పైనిఁజెప్పినరీతిగా సూరనార్యుఁడు తన ప్రద్యుమ్నునిసారస్వతముఖమునఁ జిత్రించి పాఠకుల యెట్టయెదుట నెట్లు నిలిపినాఁడో—

"కలకల నవ్వినట్ల తెలి
కన్నుల నిక్కమచూచినట్ల లోఁ
బలుకగడంగినట్లఁ గడుభా
వగభీరత లబ్బినట్లఁ బెం
పొలయఁగనచ్చి జీవకళ
యుట్టిపడన్ శివ వ్రాసినట్టియా
చెలువున కాభిముఖ్యము
భజింప దలంకెను దానుబోఁటియున్"

తరువాతఁ బెద్దనార్యునికోన యెట్లు మనదృక్పథము నంటియున్నదో పరికింపుఁడు.

"కులిశధరాహతి పొలఁపున బైనుండి
యడుగుమోవఁగ జేసు రైనతటుల......
గాన ఘూర్ణితమగునొక్క కోనఁగనియె."

"తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువ కే
దారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లి బిల్లిఁగొను కాం
తారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమానజటిల
ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవల నొప్పునొక్కభవనం
బున్ గారుడోత్కీర్ణమున్"

ఇట్టి చిత్రణము సత్కవులకె యలవడును. ఇదియే నిజమగు కవిత్వము. ఈకవిత్వము మనభావకవులకున్నదో లేదో చూతము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"చిలుకలదండు కేంకృతులు
  సేయుచుమామిడియాకు తోరణం
బులు చదలెల్లఁ గట్టినటు
  మూఁగి చివుక్కునవ్రాలి దోరకం
కులు దమనోటఁబెట్టికొని
  గూళులకుం గొని పోవుచుండె సం
చలనము లేని నామనము
  సందడి చప్పటి కుల్కి మేల్కనెన్."

రామిరెడ్డిగారి ఒకపంటకారు - సాయంకాలము. పైపద్యమున వాలముపైఁ దోరణాకారముగా వ్రాలినచిలుకలదండు నెంతస్వభావమధురముగ వర్ణించినారో సహృదయులకు వేరే చెప్పవలయునా?

మఱియు విశ్వనాథము సత్యనారాయణగారు.

"కోనలన్నీ ముంచు కొనివచ్చు సెలయేటి,
  చానకిన్నెరసాని జలజలాస్రవియించు
నురగలోఁ బైకెగయు తరగలోఁగొంగ్రొత్త
  తేనెకాలువలూరెనో యమృతంపు
వానచినుకులుజారెనో."

"తేనెతరగలపిండు లోనజలజలసాగు
  చానకిన్నెరసాని జాలైన మేలైన-వాకలో
యందాల-రాకలో-బంగారు
  జిలుఁగుగంటలు మ్రోగెనో చిన్నారి
బిగువునవ్వులుసాగెనో."

అని యొకవాఁగును బాఠకుల దృష్టిపథములఁ బలురకాల వింతలతో మృదుమధురమగు పదజాలముతో నడిపించిరి.

మూఁడవ: యాక్షేపణ-నూతనత లేదఁట,

ఆంగ్లేయభాషలోని పెద్దకవుల గ్రంథములఁజదివి యందలి రమ్యభావముల మనజాతీయతతో మేళవించి యాంధ్రభావకు వన్నెఁదెచ్చు నేటికవిత్వమునకుఁ దాతలనాటి కవిత్వమునకుఁ జాలభేదము కలదు. వారి ప్రధానవృత్తములు వేరు- వీరి ప్రధానవృత్తములు వేరు - వారి శైలి వేరు, వీరిశైలి వేరు; శయ్యలో భేదము, కల్పనలవ్యత్యాసము, తలంపులభిన్నత, వర్ణనలఁ దారతమ్యము. చూడుఁడు- పెద్దనార్యుని సాయంకాలము.

క. "క్రుంకె నపరాంబురాశిం
  బంకజబంధుఁడు తదీయ బడబాముఖవీ
  ఙ్ఖాంకురిత కుతుకరథ్యని
  రంకుశ వేగాపహృతశతాంగుఁడు వోలెన్."

ఆధునికుని మునిమాపుం దిలకింపుఁడు.

గీ. "చల్లగా మెల్లగాసాగు పిల్లగాలి
  తరగలందు కలసిపోవు విరులవలపు
  వోలె రజని పడంతుక వేలిముసుఁగు
  చాయలం దైక్యమైపోయె సాంధ్యరోచి."

పై రెండుపద్యములఁ జక్కగా విని యాధునికులలో నూతనత యున్నదియు లేనిదియు సహృదయులే నిరూపింతురు గాత!

వీరికవితలోఁ బ్రౌఢత్వము లేదని యింకొక యాక్షేపణము, కవితాప్రౌఢిమ యనఁగా వీరికిఁ దెలియదని సువ్యక్త మనుచున్నది.

వ్యర్థపదములు లేక రసానుగుణములగు పదములతోఁ గూడి వినఁగనే హాయియనిపించునదియే ప్రౌఢకవిత్వము గాని నల్లరాళ్లవంటి 'ఘూర్ఘుమ్యమాణ' 'తుండపరిమృజ' 'ఆముష్యాయణ' మన్నగు పదముల శబ్దశాస్త్రములనుంచి మోసికొనివచ్చి కవితాప్రవాహమున కానకట్టు కట్టుట ప్రౌఢకవిత్వము కాదు. ఈ యభిప్రాయముతోనే మన యద్యతనకవిచంద్రుఁ డేమనుచున్నారో చూడుఁడు.

క. చెప్పవలెఁ గప్పురంబును
  గుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైఁబైఁ
  గప్పిన క్రియ విరిపాట్లను
  విప్పినగతి ఘుమ్మనన్ గవిత్వము సభలన్.

మఱియు మొల్ల యేమనుచున్నదో చూడుఁడు.

ఆ-వె. తేనెసోక నోరు తీయనయగురీతిఁ
  తోడనర్థమెల్లఁ దోఁపకున్న
  గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
  మూగచెవిటివారి ముచ్చటగును."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆదియందుంగాక సంగీతమునకుఁ గవిత్వమునకు నెడతెగని సంబంధము కలదు. ఈ సంబంధమును మన పూర్వకవీంద్రులు కొందఱెఱిఁగి నాతిదీర్ఘ సమాసముగఁ దమకవితను నడపినారు.

అందు కవిబ్రహ్మయగు తిక్కనామాత్యుని పద్యములు నాతిదీర్ఘ సమాసములై, మనోహరములై యుండును. చూడుఁడు:

క. క్షీరోదకగతి మనమును
వారలునుం గలసి బ్రదుక వలవదె నెమ్మిన్
వారిడుముల బడఁదగియెడు
వారే? పితృభాగమేలు వారలుగారే.

ఉద్యోగపర్వము.

మనపెద్దన యెంతకమ్మని కవిత్వమును జెప్పినాఁడో యారయుఁడు:

ఉ. అబ్బురపాటుతోడ నయ
నాంబుజముల్ వికసింపఁగాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసి
తోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగు చన్గవ గ
గుర్పొడువన్ మదిలోని కోరికల్
గుబ్బతిలంగఁ జూచె నల
కూబరసన్నిభు నద్ధరాసురున్.

కొందఱు తమ పాండిత్యమునంతయు నుపయోగించి పచ్చి పచ్చడయిపోయి యొక నల్లరాతిపంతెన కట్టినారు. చిత్తగింపుఁడు.

శా. "మాణిక్యక్రియ మాణసౌధవలభీ
మ్నాయాసరిత్తర్తుకా
మైణాక్షీసహభీతి సంభ్రమభర
వ్యాలోకమానాభ్రగా
క్షీణానర్గళ హాసభావిచలిత
స్ఫీతాంధకారశ్రియా
మాణ్భోనూత సితాన్యపక్షతతికం
బాపట్టణం బల్వషేః?"

పెద్దన దీర్ఘ సమాసములతోఁ జెప్పలేదా యని కొంద ఱడుగవచ్చును. ఈతని "అటసనికాంచె" మొదలగు పద్యములలో, లయపోషక పోవుటచేతను, చక్కనినడక యుండుటచేతను నాతని పద్దియములు ముద్దులుమూటఁ గట్టుచున్నవి. పై సత్కవుల కబ్బిన ప్రౌఢకవిత్వము మన యాద్యతన కవుల కున్నదో లేదో చూతము:

"చ. దొనదొన జారుబావ్వములఁ
దోయిటఁబూని భవత్పదాభిషే
కనియతి వచ్చుచున్న వ్రజ
కన్యలఁ బృందము త్రోవఁ దప్పిరో
యనిమది నైన నెంచవవు
రా తటి చిక్కని సుమ్మపాలు త్రా
విన చిరుబొజ్జలోఁ గలఁక
వెట్టదురా జగదేకసుందరా"

విశ్వనాథ సత్యనారాయణగారు

చ. అలరఁ బసేఁపు లెల్లరు హి
మాంబువుల న్నవ మల్లికా సతిక్
జలకము లార్చినారు వన
జాతపరాగ మలందినారు వేల్
జిలుఁగు హసారంగు పొందళుకుఁ
జీరలుకట్టిరి పెండ్లికంచుఁగో
మలజలజాతపత్రముల
మాటున నేటికి దాగినాఁడవో.

శ్రీ కృష్ణశాస్త్రిగారు

ఘటికయు వీరికవితలో నీతి మృగ్యమఁట.

ఈ విషయమును విశేషముగ విమర్శింప నవసరము లేదు. ఈ క్రిందిపద్యముఁ జదివినవారి కిందలి యథార్థము గోచరింపకపోదు.

"చ. సమయ మమూల్య మొక్కనిమి
షంబు వృథావన గ్రమ్మరింపనే
రము; మనయాయువా త్రుటీ ప
రంపర గాగ నెఱింగి నిద్రమాం
ద్యమును దొలంగి మీపనుల
నారయుఁడో జనులార యంచు డం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బముగ మెడ న్నిగుడ్చి కృక
వాకము గూసెడి నింటికొప్పునన్"

చ. వెలఁగల రత్నభూషలను
వేలకుఁ దాల్చిన నిన్నుఁ గాంచుచోఁ
గలుగదు ప్రేమ భర్తకు; వి
కస్వరమౌ వదనారవిందముం
దొలికడు ముద్దులేనగవు
లొక్కని మేపము తోఁపకున్న భూ
షలు ప్రణయానుబంధసదృ
శమ్ములు గావు కులాంగనాళికిన్."
— రామిరెడ్డిగారి 'కృషీవలుఁడు'

ఇంక వీరు పచ్చిబూతులు వ్రాసి లోకము నాశలము నేయుచున్నారను మాటను విచారింతము. పూర్వాధునిక కృతులు సమగ్రముగఁ జదివినవారి కీవిషయము విదితము.

చూడుఁడు.-'వసూరుస్సనదాయి-వస్నుదోయి' భాగ.

ఉ. "గుట్టసియాడ గబ్బిచను
గుట్టలపైఁ బులకాంకురావళుల్
తెట్టువఁగట్ట............"
"మూఁడువలపుల్ వలచెక్
ఫణిరాజకన్యకక్" [illegible]
అని చే. వెంకన్నయు,
"జలజల మరునిల్లు పెల్లు
చెమ్మగిలంగక్"అని

కూచిమంచి తిమ్మన్నయుఁ దమయపూర్వశృంగారమును వెలువరించిరి. ఇట్టిపద్యములు యుక్తాయుక్తవివక్షణా దక్షులగు కవిపుంగవుల నోటరాఁదగినవా? బాలునకు నీతులు, దేశభక్తియుఁ గఱపవలసిన నోటితో పచ్చిబూతు లుచ్చరించుటయా?—"కొదమ గుబ్బలపైని కోకను తొలగింప, యిదియేమనడిగితే - తుదినన్నుఁ గూడెనే" అని సిగ్గటి కోటిరూప్యములకన్న మేటియగు మానముం బోనాడి చేతులఁద్రిప్పి యభినయించు బోగముచాన జావళీలకన్న నీపద్యములు భిన్నములా?.

ఇట్టిపద్యములు బూతులో, యీక్రిందిపద్యములు బూతులో రసికులే నిర్ణయింతురుగాక!

గీ. క్రమసుస్నిగ్ధనీలాంశు కమ్ముఁదాల్చి
యెదురుపడితివి దేవి, నీ వింపులొలుక
నంబుదశ్యామమౌ మేన మురారిదేవు
లలితసంశ్లేషమందలి లక్ష్మివోలె.

గీ. కన్నులత్తమోడ్చి యానన కమల మల్ల
రమ్యముగ వాల్చి లజ్జాభిరామగతిని
లలితజంగమకాంచన లతికవోలె
హర్మ్యభాగములోనికి నరిఁగినావు.
—శివశంకరశాస్త్రిగారు.

" హేమమణిరత్నగణమేల లేమ మనసు
సౌధ్యసమయసువర్ణితచ్ఛాయ లరసి
తారకాశోభితాంబరతలము లరసి
చింతలను బాయుఁడము చేయి చేయి కలిపి"
—కృష్ణశాస్త్రిగారు.

సంస్కృతకవుల పరిపక్వశృంగారమును పరికింపుఁడు.

" కిమపికిమపి మందం మంద మాసత్తియోగా
దవిరళితకపోలం జల్పతో రక్రమేణ;
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్."
—భవభూతి.

ఇక వీరు వ్రాసినదానినే వ్రాయుచు చేతఁగాని వారని యింకొక యాక్షేపణము.

ఇది మన మెవరు మహాకవు లనుకొనుచున్నామో వారిగ్రంథములందే కావంబడుచున్నది. చూడుఁడు:

" యథా ప్రసిద్ధై ర్మధురం శిరోరుహై ర్జటాభి ర ప్యేవ మభూ త్తదాననమ్; న షట్పదశ్రేణిభిరేవ పంకజం సశైవలాసంగ మపి ప్రకాశతే."
—కుమారసంభవము.

అని వ్రాసి తిరిగి శాకుంతలమున.

"సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం మలిన మపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి, ఇయ మధిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనోజ్ఞా వల్కలేనాఽపి తన్వీ కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్." అని మఱల నాభావమునే యుపనిబద్ధించినాఁడు. సాధారణముగఁ గవులు తాము చక్కని కథాభాగములఁగాని, వర్ణనలఁగాని చొప్పించిన రమ్యభావములఁ, దనివి సనక మఱల నట్టి తావుల వ్రాయుచుందురు.

ఇంకొక యాక్షేపణ—వీ రసమర్థులగుటచే, నియమములను, శ్లేషాదికమును విడచికొనిరని. రసమున కడ్డము ప్రతినియమమును నుల్లంఘింపఁ గవికిస్వాతంత్ర్యము కలదు. ఇట్టి యభిప్రాయముతోడనె మురారి "యాచ్ఞా దైన్యపరాంచి యస్య కలహాయంతే మిథస్త్వంవృణు" అని స్వేచ్ఛగా యతిభ్రంశ మొనరించినాఁడు. ఇట్లే భవభూతి "వికసతి హి పతంగస్యోదయే పుణ్డరీకమ్" అని యతిభంగమును గణింపనైన లేదు. కాళిదాసుకూడ "తదన్వయే శుద్ధిమతి ప్రసూతిః శుద్ధిమత్తరః" అని గురులఘువులఁ దారుమారు చేసినాఁడు. ఇట్టి స్వాతంత్ర్యము మన తెనుఁగు కవులకుఁగూడ నున్నట్లు నారాయణకవికృత పంచతంత్రముఁ జదివిన వారికిఁ దెలియకపోదు. అదియు నుంగాక యీయతిప్రాసలు శ్రావ్యతకుఁ బుట్టినవి. అట్టి శ్రావ్యత యే యక్షరమున కాయక్షర మావృత్తి జరిగినఁ గలుగునుగాని క్షకార సకారములకు సరిపెట్టుకొన్న చోటఁ గలుగదు. యేయక్షరమున కాయక్షరము దొరకుట కష్టముగదా! కనుకనే మొట్టమొదట దశవిధములుగాఁ బుట్టిన యతి యనంతవిధము లైనది. తుదకీయతి ప్రాసలే మన యాంధ్రకవులప్రాణములు తీసి మనకవితను వ్యర్థపదభూయిష్ఠముగ నొనర్చినవి. గీర్వాణకవితలో నీశుష్కనియమములు లేకపోవుటచేతనే యావాఙ్మయమున, నంత దివ్యకవిత్వము పుట్ట వీలుకలిగినది. ఇట్లనుటలో మనవాఙ్మయమునఁ గ్రమకవిత్వము లేదని నాతలంపు కాదు. ఈశుష్కనియమములు లేనిచో నింకను జక్కని కవిత్వ ముద్భవింప నవకాశము గలిగెడిదని నాతలఁపు.

శ్లేషబంధాది కవిత్వము వీరు చేతనయి వ్రాయరో చేతకాక వ్రాయరో యెవరు నిశ్చయింపఁగలరు? అదియునుం గాక "కావ్యాంతర్గడుభూతా యా సాతు నేహ ప్రపంచ్యతే" అని సాహిత్యదర్పణమున విశ్వనాథుఁడు శ్లేషాదులయందలి తననైస్పృహ్యమును వెల్లడించెను. ఇంకొక యాలంకారికుఁడు "ప్రాయశో యమకే చిత్రే రసపుష్టి ర్నమృగ్యతే" అని యమకాదుల రసపుష్టిఁ గనసుమనెను. పూర్వాలాక్షణికులచే నిట్టిసన్మానములఁ గొన్నపాదుకైత యలవడకున్న మంచిదని సంతసింపవలసిన విషయములో వీరి నిందించుట తెలివితక్కువ కాదా?

జానపదుల జీవితము వీరికి వర్ణ్యమగుట నున్నతభావములు గలుగ వీలులేదని యింకొక యాక్షేపణము. ఇది జానపదజీవితరహస్య మెఱుంగక యన్నమాట.

నిజముగ మన మున్నతులము, మనచేఁతలు సమీచీనము లనుకొనుచున్నాము గాని వారివద్ద మనము నేర్చుకొనవలసిన వెన్నియో కలవు. వారు పగలెల్ల నెంతయో శ్రమపడి తమ కార్యములఁ దాము నిర్వర్తించుకొనుచు నెల్లరు నిట్లే సోమరులుగాక యుండుఁడను చక్కని నీతిని బోధించుచున్నారు.

కాపువారి యాఁడువారు కూడ భోజనాదికమును జేలలోనికిఁ దీసికొనివెళ్లి భర్తకిడి తదుచ్ఛిష్టమును భుజించి మగలతో సమానముగఁ బాటుపడి భర్తల ప్రేమాపాంగములకుఁ బాత్రులై తమ నిష్కపటప్రణయపాశముల నొండొరుల బెనవైచికొని నాగరకులమని చెప్పుకొనుచు భర్తల లక్ష్యపెట్టక స్వేచ్ఛగాఁ జరించు నవనాగరకాంగనామణులకు బుద్ధివచ్చునట్లు తమ జీవితాదర్శముల జూపుచున్నారు.

అదియునుం గాక వారి నిష్కలుషాశయములను, సజ్జన భక్తిపరాయణతలను, నకృత్రిమసౌందర్యములను, బ్రముగ్ధభావములను గన్గొనిన యేసహృదయునకు వర్ణింప నిచ్చవొడమదు? కాఁబట్టియే రామిరెడ్డిగారు "కృషీవలుఁడు" అను నొకఖండకావ్యమునఁ గర్షకునిగూర్చిన పెక్కుసందర్భములను నెంతో రమ్యముగ వర్ణించినారు.

కవిహృదయము దర్పణమువంటిది. హంసతూలికాతల్పంగతుఁడయి సర్వభోగాభిరాముఁడై వెలుఁగు మహారాజెట్లు కవిచిత్తదర్పణమునఁ బ్రకాశించునో యట్లే త్రాగ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గంజిలేక కట్ట గుడ్డలేక యూరివెలుపల మఱ్ఱిచెట్టుక్రింద "సర్వేశ్వరా" యనుచుఁ జింకిగోనెముక్కల శయ్య నధివసించి వనరు భిక్షుకుని జీవితమును ప్రతిబింబించును. గులాబిపూల సౌరభము వెదజల్లుచుఁ దియ్యని మావిజొంపముల జనులచిత్తములఁ జూఱఁగొనుచుఁ జంద్రోపలవేదికతో నింపునింపు నుద్యానవన మెట్లు కవికి వర్ణ్యమో యట్లే, కంకాళములతోడను నెడనెడ హృదయవిదారణ మొనర్చు గృధ్రనిస్వనములతోడను, పాతినశిశువునుఁ బైకెక్కలాగి బీభత్సముగఁ దినునక్కలతోను జుగుప్సావహముగనున్న మసనమును దప్పక వర్ణ్యము. ఈ విషయమును భవభూతి మాలతీమాధవమున స్పష్టపఱచియున్నాఁడు.

ఇట్టి యలవాటు మనయాంధ్రకవులకుఁ దరుచు లేదు. ఆంగ్లేయుల కిది ముఖ్యము. వారికి మనకవులవలె, నా మహారాజులే, యాసువర్ణసౌధములే, యా మన్మథోపాలంభనలే, యాచంద్రోపలవేదికలే యక్కరలేదు. సామాన్యజనుని జీవితమును వారు గ్రంథముల వర్ణింతురు. ఇట్టి పద్ధతినే మన యాధునికకవు లవలంబించిరి. చూడుఁడు:

రామిరెడ్డిగారు తమ 'కృషీవలుఁ'డను ఖండకావ్యమున:

సీ. వ్రాలినకొప్పులోపలి పూలరేకులు
　　సడలి యొక్కొక్కటి జారుచుండ
బరువంపుఱొమ్ముపై బయ్యెద చిను
　　గుల్లు గాలికి నట్టిటు గదలియాడ
యెలుగెత్తి పాడెడి యేలలు విని బాట
　　సారు లెక్క సకెము సల్పుచుండఁ
దమ్మలంపుంబూతఁ దవిలిన వాతెఱ
　　పైఁ బలుచాలు నవ్వకయెనవ్వ
చేతికొడవలి ఝళుపుచు చిన్నెలాడి
కన్నెమాలెత పిడి చుట్టి మున్నమున్న
మునువుతఱుగుచు నింటికిఁ బోవువేళ
సందెడోదె యీలేవె కర్షకకుమార!.

అని యొక కన్నెమాలెతఁ గంటఁగట్టినట్టెంత యభిరమ్యముగ వర్ణించినారు. మఱియు వీరలున్నదున్నట్లు వర్ణించుటలోను, ప్రకృతిలో లీనమై యాసాయుజ్య సుఖముచేఁ బరవశులై మాటలాడినారో యన్నట్లు వ్రాయుటలోను నిపుణులు. చూడుఁడు:

ఉ. అత్తల యాడుబిడ్డల భ
　　యం బొకవంకయుఁ గోర్కెవేఱొకర్
జిత్తములాగఁ బ్రోవ్వదయుఁ
　　జీరయు వేసవరించి తూఁగుసై
మత్తుననున్న వల్లభుని
　　మంచము మెల్లన వీడి దీనయై
చిత్తరికోడ లిల్వెడలె
　　వేకువఁ బ్రాచిపనుల్ వొనర్పగాన్.
—రామిరెడ్డిగారు

"అమ్మ యీచిన్ని జాబిల్లి కమ్మ యెవరు
యీతనికి బువ్వపెట్టువా రెవ్వరమ్మ"
* * * * *
"పోరువెట్టడె కొండపైఁ బోవలేక
భయము వేయదె క్రిందికిఁ బడునో యేమొ?"
—వేంకటపార్వతీశ్వరులు

ఇంక నాధునికులు పూర్వకవిత్వమో యని దేవులాడు ఛాందసుల నెట్లు పరిహసించుచున్నారో చూడుఁడు:

సీ. ప్రౌఢసమాస కల్పనమున్న మీయొద్దఁ
　　జూపుమీ యని చేయి చాపె నొకఁడు
శ్లేషకవిత్వమం జూపు మీకడనున్నఁ
　　గొనియెద నేనంచుఁ గొసరె నొకఁడు
ఆశుకవిత్వమ్ము నల్లుమంత్రమ్మున్న
　　నూదుమీ యని చెవి యొగ్గె నొకఁడు
సత్కావ్యరచనార సాయనం బున్నచో
　　నీబుడ్డి నిపుడు నిచ్చెనొకఁడు
ఘోరసీమట్లు వ్రాయంగఁ
బనికివచ్చు........."

సీ. కవితాలతాంగికిఁ గర్ణభూషణమైన
　　కలువ మీచేఁబడి నలిగిపోవు
　　...　　...　　...
　　...　　...　　...



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈతుపారజలమ్మి మీ చేతులంటి
మలినమై పోవు కొనకున్న మానె పొందు"
తోలకరి, పింగళి లక్ష్మికాంత ప్రభృతులు

కావున నో మిత్రవరులారా!

ఆధునిక కవిచంద్రుల లేనిపోని యాక్షేపణల జేసి నిందించుట మీకుఁ దగనిపనియని యిప్పటికైనఁ దెలిసికొండు.

నాగరకతా ప్రవాహము కోనలన్ని ముంచుకొని ప్రవహించుచున్నది. చదువులు మారెను. గురువులు మారి పోయిరి. తలఁపులు వేరు—అభిరుచి భిన్నము. వివాహ ములమాదిరి వేఱు—ప్రేమల తెరంగు వేఱు—ఇంక కవిత్వ మునకా నూతనత యుండరానిది? చూడుఁ డొకయ భిజ్ఞుఁ డెంతరమ్యముగఁ జెప్పినాఁడో.

గీ. " కాలపరివర్తనంబునఁ గలుగుమార్పు
దాని మాన్పంగఁ దరమె యెవ్వానికైన"

* * * *

"నవవసంతము నవ్యవనరమ మావికొమ్మలఁ గమ్మ చివురులు
పాటపాడెడి పరభృతంబును యెవ్వరాపుదురో"

అని శ్రీకృష్ణగారు.

హిమవత్పర్వతమునఁ బుట్టి యెన్నియో పువ్వు నికుంజములఁ దాటి సెలయేటి చెలిమికత్తెల చట్టాపట్టా లతో గానకళల వెల్లివిరియు తరంగనిస్వనాలతో మహా వేగమున హోరుమని పాఱు గంగాతరంగిణి నెవ్వ రాపఁ గలుగుదురు? ఆంగ్లేయమహాకవుల రమ్యభావముల మన జాతీయతతో మేళగించి మృదుమధురపదజాలములో మురిపములగు భావములతో ముద్దుల మూటఁగట్టు ము తాళ్యలసరములతో — శ్రావ్యముగ బ్రవహించు నాధునికకవితాసుధా ఝరి యెవరిచేతుల యడ్డుతో నిలచిపోవును? కనుక నీకవిత్వ మెంతమాత్ర ము నిందింపఁదగనిదనియు, క్రమముగ నూతనత నక్షిల షించు మన యాంధ్రకవుల కియ్యది యాంగ్లేయ సంప ర్కముకలనను, శ్లో. "పరిపాండు దుర్బలకపోలసుం దరం దధతీ విలోలకబరీక మాననం, కరుణస్యమూర్తి రధవా శరీరిణీ విరహవ్యథేవ వన మేతి జానకీ. అను దివ్య కవిత్వము వ్రాసిన కొంద అపూర్వకవుల సాంప్రదా యముఖలనను నలవడినదనియు "నీవు గమించువేళ, పూ ర్వకాలంబునందునభోపథాంత" మన్నగు దుష్టప్రయోగ ము లున్నను మనకుఁ గొరవడిన భావప్రధానకవిత్వమును వ్రాయసమకట్టిన వీరు మన కభినంద్యులనియు, తక్కుంగల లోపంబులను, దుస్సంధ్యాదిదోషంబులను జక్కఁదిద్దికొ నఁ బ్రోత్సాహ్యులనియు, వినయపూర్వకముగా మనవి సేయుచు గ్రంథవిస్తరభీతి నింతట విరమింతు:

"సుకవిభోగ్యమ్ము లివటి వస్తువులు వీని
కలపి వేయకుఁ డటునిటు కలఁచినైచి"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ద్రావిడభాషలు-వర్ణవినిమయము

కోరాడ రామకృష్ణయ్య గారు, యం. ఏ.,

జీవద్వస్తువులన్నిటివలెనే జీవద్భాషలకును మార్పు సహజము. సజీవములగు పదార్థముల యభివృద్ధికిఁ దోడ్పడు లక్షణములు కొన్ని సహజముగ వాని జన్మమునకుఁ గారణములగు పదార్థములనుండియే సంక్రమించుచున్నను పరిసరముల స్థితిగతులు కూడ కొంత తోడ్పాటు గావించుచున్నవనుట నిశ్చయము. ఈ రెంటియొక్క సమ్మేళనసాహాయ్యముచే నాజీవము పెంపొంది యభివృద్ధి గాంచుచు ననేకవిధములగు మార్పులకు లోనగుచు దనజీవయాత్ర కొనసాగించుచున్నది. అట్లే భాషలవిషయమునగూడ గాంచనగును. సమీపస్థములగు కొన్ని భాషలకు సహజములై సాజాత్యమును నిరూపింపఁగలిగిన సమానలక్షణములు కొన్ని స్థూలదృష్టికే యగపడుచుండును. అట్లయినను వీనికి భిన్నభాషలతోడి సాంగత్యమువలనఁగాని, దేశకాల స్థితిగతులనుబట్టి ఆయా భాషలను వ్యవహరించు జనుల యుచ్చారణపరిపాటిలోఁ గలుగుచుండు మార్పులవలనఁగాని మఱికొన్ని విశేషలక్షణము లబ్బుటచే నొక్కభాషయే భిన్నరూపములు గలదగుటయు, వీనిలో నొకదానికంటె మఱియొకటి విలక్షణమైన రూపమునొంది ప్రత్యేకభాషగా పరిగణింపఁబడఁదగినదై యుండుటయు సంభవించుచుండును. ఒక్క చెట్టునుండి వెలువడిన విత్తులే సహజముగ వానిలో సంక్రమించిన సత్తయందలి భేదమువలనను, పిదప నవి నాటఁబడిన క్షేత్రవిశేషములందలి గుణభేదమువలనను, అనంతరము వానికిఁ జేయఁబడిన దోహదవిశేషమువలనను, దేశకాలస్థితిగతుల సాహాయ్యమువలనను, భిన్నరీతులుగల వృక్షములై పెరిగి యొక్కొకప్పుడు వేఱువేఱురుచులుగల ఫలముల నిచ్చుచుండుటయు గలదు గదా. భాషలు నట్లె యొకమూలభాషనుండి బయలుదేరినవైనను దేశకాలస్థితులనుబట్టి యత్కించిద్భేదము గలవై పెరుగుచు వచ్చి తుదకొకకాలమున విడివడి పరస్పరసంబంధమును నిరూపించుటకు గూడ వీలులేనంతగా మాఱిపోయి కొంత కాలమునకు ప్రత్యేకభాషలుగ పరిగణింపబడుటయు తటస్థించును. భాషాబీజములు మొలకెత్తి శాఖోపశాఖలఁ దొడిగి వృద్ధినొంది భావఫలంబుల నొసంగుచు భిన్నరూపములుగల వృక్షములై విజృంభించుటకు వలయునావాప-భూమి మానవుని యాస్యరంగమే. ఈ రంగమున నాభాషానర్తకి వాచికాంగముల సాహాయ్యముచే ననేకచిత్రవిచిత్రరూపముల దాండవించుచు దననాట్యకలాకౌశలముచే నొక్కభావమునే యనేకవిధములగు విచిత్రరూపముల వ్యక్తము చేయుచుండును. ఆంతరంగికమగు భావ మొక్కటియేయైనను ఆస్యరంగమున తాత్కాలికముగ గ్రహించిన ధ్వన్యాత్మక రూపభేదమునుబట్టి, ఆయాకాలములయందా భాషాసతిని పూర్వరూపమున మనకగపడినదానికంటె భిన్నమైనదానినిగనే మనము తలంచుచుందుము కాని తత్తత్కాలములందానర్తకిచే గ్రహింపబడుచు వచ్చిన యాహార్యకసామగ్రి నించుక సూక్ష్మదృష్టితో పరికించినగాని తొలగించి చూచినగాని నైజంబగు మూలస్వరూపము మనకు వెంటనే గోచరింపక పోదు. ఈ భాషానర్తకి సులభముగ గుర్తింపఁబడుటకు వీలులేని యపూర్వరూపములను గ్రహించుట కనువగు నాహార్యకసామగ్రిని సమకూర్చు ప్రధానసాధనము మానవుని యాస్యరంగమునం దమరియున్న వాచికావయవములే (Organs of Speech) యగుచున్నవి. ఈ యవయవసామగ్రియొక్క సౌష్ఠవాసౌష్ఠవములు, ప్రయోగసరణి, మొదలగువానియందలి భేదమునుబట్టియే యాభాషాసతి క్రొత్తక్రొత్తరూపములను వహించుచుండుట తటస్థించుచున్నది. విచిత్రరూపధారిణియగు నీమెరూపములలో నొకదాని నొకకాలమునఁ జూచి దానికలవాటుపడిన యొక జనసంఘ మదియె యామె నిజస్వరూపమని తలంచుచుండును. ఆ కాలముననే మఱికొంద ఱామెను మఱియొకరూపమునఁ గాంచి తాము గాంచినదే యథార్థరూపమని తలంచుచుందురు. ఈ జన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంఘమే మఱికొంతకాలమున కామెను మఱియొకరూపమున గాంచి వెనుకటిరూపమే నిజరూపముగాని యిది కాదనియో లేదా ఈనూతనరూపమే నిజమైన రూపముగాని వెనుకటిది కాదనియో తలంచుచు భ్రమించుచుందురు. ఇట్లీభాషాసతి దేశకాలానుగుణంబుగ భిన్నరూపములను బొంది ఆయాజనసంఘములం దాయారూపములతో గొంతకొంతకాలమువరకు నిలచియుండును. తమకు గోచరించిన రూపమునే భావించుచు తద్రూపప్రకటనమున కనువగునట్లే తమ వాచికాంగములను బ్రయోగించుట కలవాట్లుపడిన యా జనసంఘమున కారూపమే సంప్రదాయ సిద్ధంబైన దగును. భాషారూపములం దిట్టి సంప్రదాయములు స్థిరపడినకొలఁది మూలస్వరూపమును గనఁగొనుట కవకాశము వీరికి తప్పిపోవుచుండును. కాని సూక్ష్మదృష్టితో పరిశీలించినచో నీభాషారూపములకును, జనుల వాచికావయవముల ప్రయోగసరణియం దేర్పడిన ప్రత్యేక సంప్రదాయములకును గల సంబంధమునూలముగా భాషారూపములకుగల పరస్పరసంబంధము, వాని పౌర్వాపర్యమును గొంతవఱ కన్వేషించి తెలిసికొని భాషాసతియొక్క మూలస్వరూపమును గూడ గుర్తించుట కేవల మసాధ్యము కాదు. ఈమార్గము ననుసరించుటచేతనే భాషల సంబంధబాంధవ్యములు, నందలి సన్నిహితత్వాసన్నిహితత్వములును గూడ నిర్ణయించి భాషాకుటుంబముల నేర్పఱచుట సంభవించుచున్నది.

ప్రస్తుతము దక్షిణహిందూదేశభాగముల వ్యవహరింపఁబడుచున్న యాంధ్ర తమిళ కన్నడ మళయాళాది భాషారూపములకు ప్రాచీనంబగు మూలరూపం బెట్టిదో, యది యాయాప్రాంతజనుల వాచికావయవ ప్రయోగభేదమునుబట్టి యెట్టి మార్పులను జెందుచువచ్చి తుదకిట్టిరూపములను వహించినదై నదోయించుక పరిశీలింతము. మూలభాషారూపములయు, ధ్వనులయు యాథార్థ్యమునుగూర్చి చెప్పుట యంత సులభసాధ్యము కాదు గాని సమానార్థకములై సజాతీయములగు సన్నిహిత భాషాపదములలో నీధ్వనులు పొందిన మార్పులను బట్టియు, నాధ్వనుల యుచ్చారణరీతులయందలి సౌలభ్యాసౌలభ్యములను బట్టియు నొక్కొక దేశమందలి యుచ్చారణపరిపాటిని బట్టియు మూలరూపము లివియై యుండవని కొంతవఱకు నిశ్చయింపవచ్చును.

ఈభాషలలోని పదాంతమందలి 'అ'కారధ్వని తిలకింపుడు. అది తమిళమున 'ఐ'అనియు,కన్నడమున 'ఎ'అనియు మాఱుచున్నది. మళయాళమున గూడ తెలుఁగున వలెనే అకారముగనే పలుకఁబడుచున్నది.

| తె | తమి | మళ | కన్న | తుళు |
|---|---|---|---|---|
| తల | తలై | తల | తలె | తలె |
| మల | మలై | మల | మలె | మలె |
| వల | వలై | వల | బలె | బలె |

తమిళమునకు రెండుప్రక్కలనున్న తెలుగు మళయాళములు రెండుభాషలలోను నీ 'అ'కారము తమిళమందువలె మార్పులేక అకారముగనే యుండుటను బట్టియు, అకారాంత సంస్కృతపదములు గూడ తమిళమున ఐత్వమును గ్రహించుచుండుటచేతను, cf ఆశ-త. ఆశై, చిత్ర-త. శిత్తిరై etc. ఈ పదముల ప్రాచీనరూపము అకారాంతమే యనియు, తమిళమున ఐకారాంతములు లేదా ఎయ్కారాంతరములుగను,కన్నడమున 'ఎ'కారాంతములుగ పలుకఁబడుట ఆ జనసంఘముల యుచ్చారణవైఖరినిబట్టి తరువాతికాలమున నేర్పడినదే యనియు తలంపదగియున్నది.

కన్నడమున నిది 'ఎ'గా మారుటను బట్టి, దీనికి పూర్వరూపము తమిళమునందలి 'ఎయ్' అనియు నా 'ఎయ్'నుండియే ఈ 'ఎ' అంతరూపము లేర్పడియుండుననియు తలంపవచ్చును. ఇంతేకాక పైపదములలో అకారాంతములే ప్రాచీనద్రావిడభాషారూపములని మఱియొక కారణముచే గూడ సాధింపవచ్చును. వలై, కొన్నై నడై, మొదలగు రూపములు వల, కుణ్ణి, నడ, అను అకారాంతధాతువులనుండి నామవాచకరూపములను కల్పించుటకుగా 'ఇ'కారప్రత్యయమును జేర్చుటచే తమిళమున నేర్పడినట్లగపడుచున్నది. cf మణ్ వెట్టి-వెట్టు + ఇ;(తె. వేటు)=మన్నునుదఱుకునది; త్రవ్వునది. అలరి—అలర్ ఇ= పువ్వు; పుణరి-పుణర్ + ఇ=అల, సముద్రము. ఈకార

ణముచే వల + ఇ, నడ + ఇ, కుజ్జ + ఇ-చేరి వలై, నడై, కుజ్జై అనురూపము లేర్పడి అవి కాలక్రమమున వలెయ్, నడై, కుజ్జయ్ అని యుచ్చరింపబడుచువచ్చి కన్నడదేశమున వలె, నడె, అను రూపములను బొంది యుండవచ్చును. దీనిని బట్టి ప్రాచీనభాషలోని 'అ'కారధ్వని కాలక్రమమున నాయా భాషలలో నాయా దేశజనుల యుచ్చారణరీతులను బట్టి యెట్లు మార్పునొందినది తెలియుచున్నది.

కొన్ని భాషలలోని పదముల ఇకార, ఉకారములు మఱికొన్ని భాషలలో ఎ, ఒ, లుగా మాఱుచున్నవి. వీనిని బట్టి ప్రాచీనభాషారూప మిదియని నిశ్చయముగా జెప్పుట కవకాశము చాలకున్నను సరళాక్షరములతో (simple vowels) గూడిన రూపములే సంయుక్తాక్షరములతో (diphthongs) గూడినవానికంటె ప్రాచీనములై యుండునని తలంపఁదగియున్నది.

| తమి. | తెలు. | కన్న. | |
|---|---|---|---|
| ఇడమ్ | ఎడము | ఎడ | |
| ఇలసు | ఎల | లేత | |
| ఇలదు | (ఎలదు) | లేదు | |
| చెవి | చెవి | కివి | |
| చెవిడు | చెవుడు | కివిడు | |
| చెడి | చెట్టు | గిడ | |
| కెడు | చెడు, కీడు, చేటు | కిడు | |
| కెత్తు | | కిరు | to scratch |
| ఇరంకు | ఎఱగు | ఎఱగు | to descend, to setdown as from a tree |
| కుట్టు | కొట్టు | కుట్టు | to beat |
| కొయ్ | కోయు | కుయి | to cut |
| కుఱి | గొఱ్ఱె | కుఱి | sheep |
| | కొఱుకు | కుఱుకు | to bite |
| కుడై | గొడుగు | కొడై | |

| | | | |
|---|---|---|---|
| | గుత్తి | కొత్తు | bunch |
| కునై | కొన | కొనె | point |
| కో, కోర్ | గ్రుచ్చు | కో | to string |
| | కోవె, క్రోవె | | pearls, bead, etc |
| ఉడల్ | ఒడలు | | |
| ఉళ్ | లో | ఒళ్ | |
| ఉఱి | ఒర | ఒరె | |
| గుఱ్ఱుకొట్టు | కొరె (నిద్రాంగధ్వని) | | to snore |

ఇం దికారోకారములతో గూడిన రూపములే ఎకారొకారములతోగూడిన రూపములకంటె ప్రాచీనములుగా నున్నట్లీ రెండవతరగతి రూపములలో గలిగిన మార్పులను బట్టిగూడ మన మూహింపవచ్చును. అట్టి రూపములు తమిళ, కన్నడములందే తెలుగునందలివాని కంటె హెచ్చుగా నున్నట్లగుపడుచున్నది. ఈపదములయందలి ఇకారోకారములు ఎకారొకారములుగ మా ఱు ట కు వా ని త రు వా తి వర్ణముపై గనబడుచున్న వివృతాకారముయొక్క సాహచర్యబలమే కారణమై యుండును. అనగా సంవృతాచ్చులగు 'ఇ', 'ఉ'లు వానితరువాత వచ్చిన వివృతాకారసాహచర్యముచే వివృతములై ఎ, ఒ,లుగా మాఱినవనుట. ఇట్టిమార్పు విశేషముగ నాంధ్రశాఖలో ప్రబలిన ట్లగపడుచున్నది. తులుభాషలో మఱియొక విశేషముకూడ కలదు. ఇతర భాషలలో కొన్ని పదములలోని ఎ కారము తుళుభాషలో ఒకారముగ పలుకబడుచున్నది.

| | | | |
|---|---|---|---|
| త. | వేండుమ్ | తు. | బోడ్ |
| త. | వెళ్ళి | తు. | బొళ్ళి |

ఇచ్చటకూడ వకారము ముందుగా బకారంబై, యీఓష్ఠ్యబకారము తాలవ్యైకారమును ఓష్ఠ్యఒకారముగా మార్చివేసియుండును. మొత్తముమీద నీభాషలలో వర్ణసమీకరణ విధానము అనగా నొకవర్ణముయొక్క సాహచర్యమువలన సమీపమందలియితర వర్ణములు మార్పునొంది తత్ప్రభావమునకు లోబడి దానితో సమత్వమును, లేదా సావర్ణ్యమును జెందుట విశేషముగాఁ బ్రబలినట్లు గానవచ్చుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టి మార్పు కేవల మచ్చులవిషయమున నేకాక హల్లులవిషయముననను గాంచనగును. దక్షిణ హిందూదేశ భాషలలో సజాతీయములని చెప్పదగిన యనేకపదముల లో పదాదికకారము కొన్ని భాషలలో చకారముగ మారుచున్న ట్లీక్రిందినిదర్శనమునుబట్టి మనకు డెలియ వచ్చుచున్నది. అనఁగా పదాదియందలి కంఠ్యకకారము లేదా కంఠ్యధ్వని తాలవ్యచకారము లేదా తాలవ్యధ్వనిగ మారుచున్నదనుట. ఈభాషలలోని యీ క్రిందిపదము లను గమనింపుడు:—

| | కన్న. | తుళు. | తమి. | తెలు. | |
|---|---|---|---|---|---|
| 1 | కిచ్చు | కిచ్చి | కిచ్చు | చిచ్చు | Fire |
| 2 | కెట్ట | కెట్ట | కెట్ట | చెడ్డ | Bad |
| 3 | కిఱు, కిత్తు | కిన్ని | చిఱు | చిఱి, చిఱు | small |
| 4 | కిలబు, కిలుబు, కిలిబు | కలెంగు | కళిమ్బు, మ.కిళర్పు | చిలుము | rust |
| 5 | కివి | కమి, కిబి | చెవి, మ. చెవి | చెవి | ear |
| 6 | కివుడు | కెప్ప | చెవిడి | చెవుడు | deafness |
| 7 | కిళి | గిళి | కిళి, మ.కిళి | చిలుక | parrot |
| 8 | కెక్కు | కెప్పె | కన్నం | చెక్కిలి, చెక్కు | cheek |
| 9 | కెం, కెచ్చనె | కెంపు | చెం, కెంపు ruby | చెం, చెన్ను | red |
| 10 | కెఱె | కెదు | చెఱై | చెఱువు | tank |
| 11 | కెల్లె | ... | చిల్లి | చిల్లి | a piece a splinter |
| 12 | కెళది | ... | చిలధి | చెలి | a female companion |
| 13 | గిడ | ... | చెడి | చెట్టు | a tree |
| 14 | గేణ్, గేణ | గేణ్ | చాణ్, శాణ్ | జేన, జాన | a span |
| 15 | కై-కహి | కై.పె | కళపు, కైప్పు | చేదు | bitterness |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 16 | ... | ... | కిట్టం | చిట్టము | rust, ore stone |
| 17 | కెల | కెల | చిల, శిల, మ. చిలె | ... | some |
| 18 | కీరె | ... | కీరై, మ. చీర | కూర | greens |
| 19 | కెయ్ | ... | కెయ్ | కయి, చెయ్యి | hand |

ఇట్టిమార్పు కొన్ని ధాతువులలోగూడ గానననగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 19 a | ... | ... | కీజ్ఞప్పు | చింపు | tear off |
| 20 | కీఠ | ... | చిఱై | ... | to slave |
| 21 | కిడు, కెడు | కెడు | కెడు | చెడు | to get spoiled |
| 22 | కెత్తు | కెత్తు | చెదుక్కు | చెక్కు | to chip to make thin |
| 23 | కెదుకు | ... | ... | చిలుకు | to stir |
| 24 | కెదరు | ... | చెదఱు | చెదరు | to scatter |
| 25 | కెయ్ | ... | చెయ్ | చేయు | to do |
| 26 | కెరె | ... | ... | చీరుట | to scratch with nails |
| 27 | కీ | ... | చీజ్, మ. చీ | చీము, చీకు, చివుకు | to become pus |
| 27 | ... | ... | కిత్తు, కింతు | చిందు | to hop, to leap about |
| 28 | ... | ... | కిరంకు | చిరాకు | to be jaded fatigued |
| 29 | కెణకు | కెణకు | ... | చెనకు | to provoke |
| 30 | కిముఱ్చు | ... | ... | చిముడు? | |
| 31 | కెళర్ | | | చెలరేగు | to expand |
| 32 | కేఱు | శూర్పకరణే | | చెఱుగు | to winnow |

ఈ పదములలోని మార్పులనుగూర్చి విచారింపగా నిందలి పదాదికకారము తాలవ్యచకారముగా మారుటకు గల ముఖ్యకారణము ఈ పదములన్నిటిలోను నీకకారము తాలవ్య ఇ, కార, ఎ కారములచే ననుసరింపబడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టయే యని తలంపవలసివచ్చుచున్నది. కంఠ్యకకారముపై వచ్చిన తాలవ్యములగు ఇ, ఈ, ఎ, ఏలు ఆకంఠ్యధ్వనిని తాలవ్యముగా మార్చియుండనోపును. కాని యిది సర్వసామాన్యమని చెప్పుటకు నవకాశము లేదు. ఏలయనఁగా కొన్ని పదములలోని కకారము తాలవ్యైకారానుసృతంబె యైనను ఇట్టిమార్పు పొందిన ట్లగపడదు. దీనినిబట్టి ఈ మార్పు భాషలో నెదోయొకకాలమున ప్రాధాన్యము వహించి తనప్రభావమును నెరపినదనిగాని, లేదా ఈపదములు మొదటినుండియు తాలవ్యాచ్చులతో గూడినవి గాక కొంతకాలమున కొకజనసంఘము నుచ్చారణమందు గలిగిన మార్పుచే తాలవ్యాచ్చులతో గూడినవైనవని గాని చెప్పవలసియుండును. అట్టిపదములను కొన్నిటి నీక్రింద బొందుపఱచుచున్నాడను.

| తమి. | కన్న. | తెలు. | |
|---|---|---|---|
| కెట్టం | గడ్డ | గడ్డము | Chin |
| కట్టి | గట్టి | గట్టి | Firmness |
| కెచ్చుకాయ్ | గజగ | గచ్చకాయ | |
| కెచ్చం | గెజ్జె | గజ్జె | Tinkling anklet |
| కిళఱు | కెళరు | కెలకు | to poke, to dig up, stir |
| కిల్లు | చివుటు / చిముటు | గిల్లు | to pinch pluck |
| కిటికి | కిటికి | కిటికి | window |
| కిట్టు గిట్టు | కిడై మ.కిడె | కిట్టు గిట్టు | to touch |
| కీఱు | కీఱు | గీరు గీచు | to scrape rub off |
| కీళ్జ | ... | క్రింద (cf క్రీ గాలు) | |
| కెటువు | ... | గడువు | term, fixed time |
| కళై | ... | గడ | pole |
| కంపరై | గంపె | గంప | basket |
| కేల్ / కెలిత్తల్ | గెల్ | గెలుచు | to conquer |

ఇట్లు తాలవ్యములుగా మార్పునొందని పదములలో సామాన్యముగా 'క'కార మాంధ్రకన్నడములందుఁ 'గ' కారముగా పలుకబడుచున్నట్లు. వీనినుండి మన ము గ్రహింపవచ్చును. గడ, గంప, గజ్జె మొదలగు కొన్ని పదములలో కంఠ్యముపై నకారమె తెలుగులో కనఁబడు చుండ తమిళమున 'ఎ'కారము కనబడుటయనునది యొక వేళ యిటీవలికాలమున జరిగినమార్పై యుండినను ఉండ వచ్చును. ఏలయనగా పదాదికంఠ్యముపై అకారముగల సంస్కృతపదములు తమిళమున నుచ్చరింపబడునపుడు 'ఎ'కారముతో గూడినవగుచున్నవి.

సం. గజ—త. కెజం

సం. గర్జిత—త. కెచ్చితం

ఈ కారణముచే తెలుగులోని గజ్జ, గచ్చకాయ గడ మొదలగుపదములు ప్రాచీనకాలమునుండియు 'అ' కారముతో గూడినవిగనేయుండ, నిటీవలికాలమున తమిళమున నెత్వముతో పలుకబడు నలవాటు ఏర్పడియుండునని యూహింపదగియున్నది.

దీనినిబట్టి చాలవఱకు మూలభాషలో ఇ, ఈ, ఎ, ఏలతోగూడిన పదాదికంఠ్యధ్వనులే, అనగా తాలవ్యాచ్చులు పరముగాగల కకారాదులే తాలవ్యధ్వనులుగ ననగా 'చ'కారాదులుగ మాఱినవి గాని తాలవ్యాపరకములుగాని ధ్వను లట్లు మారక సారళ్యమును మాత్రము (Softened) బొందినవని తెలియుచున్నది. ఈ కంఠ్యధ్వనులు తాలవ్యములుగ మాఱుటకు వానికి బరములైన తాలవ్యాచ్చులప్రభావమే (influence) కారణమని నిశ్చయించుటకు మున్ను తాలవ్యేతరాచ్పరకము లగు సజాతీయపదములను మఱికొన్నిటిని పరికింతము గాక! ఈక్రిందిపట్టికలోని పదములతో నీతాలవ్యధ్వనులు గాన రాకుండుట గాక పైపదములలోవలె గొన్నిటిలో పదాదికకారము సరళత్వమునుబొంది 'గ'కారమగుటమాత్రము గాననగును.

| కన్న. | తమి. | తెలు. | |
|---|---|---|---|
| కక్కు | ... | కక్కు (కఱకు) | Irregular surface, a notch |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | |
|---|---|---|---|
| కక్కు | కఱుక్కు | కక్కు | to vomit |
| కణ్ | కణ్ | కన్ను | |
| కంకి | ... | కంకి | an ear of jola |
| కట కట్ట కడ ... | | కడ | end. corner |
| కడల్ | కడల్ | కడలి | sea |
| కట్టు | కట్టు | కట్టు | to bind |
| కత్తు | కఱుత్తు | కుత్తుక | neck, throat |
| కత్తె కత్తి | కఱుదై | గాడిద | an ass |
| కదలు | కదలు | కదలు | to move |
| కన కణసు | కనవు | కల | a dream |
| కనర్ | ... | కనరు | bitter |
| కనలు | కనల్ | కనలు | to burn |
| కన్దు | కన్ఱు | కన్దు | a calf |
| కప్పు | కప్పు | కప్పము | tribute |
| కప్పు | కప్పు | కప్పు | to cover |
| కప్పు | కఱుప్పు<br>కప్పు | కప్పు<br>cf కాలు | blackness |
| కమ్బు | కమ్బు | కమ్మ | beam |
| కర | కరై | కరి | bank, shore |
| కల్ | కల్ | కల్లు | stone |
| కసవు | ... | కసవు | rubbish sweepings |
| కళ్ల కళ్ to steal | కళ్లన్ | కల్ల<br>కల్లరి | |
| కయ్ | ... | కాయు కాపు | to protect |
| కాడు | కాడు | కాడు | forest |
| కాదల్ | కాదల్<br>మ. కాళల్ | గాదిలి | affection |
| కాల్ | కార్ | కారు | black rainy season |
| కాల్ | కాల్ | కాల్ | foot |
| కావి | కావి | కావి (రంగు) | red earth |
| కుట్టు | కుట్టు | కొట్టు | to beat |
| కుడి | కుడి | cf కుడిచి క్రోలు | to drink |
| కుదురు | ... | కుదురు | fit |

| | | | |
|---|---|---|---|
| కుద | ... | కుదియు | to become tight |
| కుయ్ కోయ్ కోయ్ | | కోయు | to cut |
| కురుడ | కురుడ | గ్రుడ్డి | blind |
| కురుళ్ | కురళ్<br>కురుళ్ | కురులు | a curl |
| కుఱళ్ | కుఱళ్ | కుఱు (చ) | shortness |
| కుఱుకు | కొఱి | కొఱుకు | to bite |
| కుయ్య | ... | కొయ్య | wood |
| కుఱుచు | ... | గుజ్జు | dwarfish |
| కుగ్గు కుగ్గ | ... | క్రుంగు | to shrink bend. |
| కులుకు | కులై | కులుకు | to shake |
| | | to be agitated | the body as in dramatic action |
| కుఱి | గుఱి | గొయ్యి | a hallow pit |
| కూగు | కూగు<br>కూవు | తు. తె.<br>కూయు | to cry aloud |
| కూడల్ | ... | కూడలి | a junction |
| కూడు | ... | కూడు | to join |
| కూన<br>కూను<br>గూను | ... | గూని | a hump |
| కూర్ | కూర్ | కూర్చు | to be attached to lose |
| కూలు | కూలు | కూలు | to fall down |
| కూసు | కుంజు | కూసు<br>కూతు | a young one, daughter |
| కొడ | ... | కొడమ<br>కొడ | youth tenderness |
| కొడె | కొడై | గొడుగు | umbrella |
| కొణ్డెయ | కుణ్డియ<br>మ. కుఱిళె | కొణ్డెము | back biting |
| కొత్తు | ... | గుత్తి | bunch |
| కొనె | కునై, కోనై | కొన | point extremity |



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | |
|---|---|---|---|
| కొబ్బరి | కొప్పరై | కొబ్బరి | |
| కొమ్ము | కొమ్ము | కొమ్మ | a horn |
| కొమ్బు } కొమ్బె } | కొప్పు } కొమ్బు } | కొమ్మ | the branch of a tree |

## కొన్ని ధాతువులు

| | | | |
|---|---|---|---|
| కొఱె | కుఱై | కొఱస | to cut, smallness remainder |
| కొళ్ | కొళ్ } కొల్లు } | కొను | to take |
| కో | కో } కోర్ } | క్రోవె | |
| | cf ముత్యాలకోవలు | | to string |
| | గ్రుచ్చు | | to thread |
| కొంకు=కౌటిల్యే | | cf కొంకి | to get crooked |
| కరగు=విలీనే | | కఱగు | |
| కడంగు=ఔత్సుక్యే | | కడంగు | |
| కర్చు=ఖదనే | | కరచు | |
| కుట్టు=తాడనే | | కొట్టు | |
| కడి=ఖండనే | | కడికండలు | |
| కడె=మథనే, అవసానేచ | | కడగూడు } కడయు } | = వచ్చు |
| కాణ్=దర్శనే | | కను | |
| కందు=గతకాంతౌ | | కందు | |
| కుందు=క్షయే | | కుందు | |
| కుప్పు=పుంజీకరణే | | కుప్ప | |
| కుమ్మ=ముసలక్రియాయాం | | కుమ్మ | |
| కొయ్=లవనే | | కోయు | |
| కూర్=స్నేహే | | కూర్చు | |
| క్రనర్=అపక్వరసనే | | కనరు | |
| కిలిర్=హయధ్వనౌ | | సకిలించు? | |
| కవి=ఆచ్ఛాదనే | | కవియు | |
| కాస=దాహే | | కాచు | |

ఈపైజూపిన సజాతీయపదములను, ధాతువులను బట్టిచూడగా సామాన్యముగా 'క'కారము—లేదా, కంఠ్య హల్లునకు ఇ, ఈ, ఎ, ఏ, ఐ—అనగా తాలవ్యాచ్చులు పరమైనపుడే అది తాలవ్యహల్లుగా - చకార, జకారములుగా మార్పునొందినట్లును ఆ కంఠ్యహల్లునకు తాలవ్యేతరములగు నచ్చులు పరమైనపు డాకంఠ్యధ్వని యన్ని భాషలలోను గూడ నట్లే నిలచియున్నట్లు గానవచ్చుచున్నది. ఈ నియమము చాలవరకు అన్ని భాషలకు సమానములగు మూలధాతువులలో గూడ గానవచ్చుచుండుటచే నీసంప్రదాయ మతిప్రాచీనకాలమున్నదే బయలుదేరినదనియు గూడ తలంపవచ్చును. కాని యిది యాంధ్రశాఖలో హెచ్చుగను, తమిళ మళయాళములలో స్వల్పముగను గానవచ్చుచున్నదే గాని, కన్నడభాషలో నంతగా వ్యాపించిన ట్లగపడుటలేదు. కావుననే తమిళాంధ్రములను, అందు విశేషముగా నాంధ్రమునను గానంబడుచున్న తాలవ్యచకార మాదివర్ణముగా గలిగిన పదములకు సజాతీయంబగు కన్నడపదము సామాన్యముగా, కంఠ్యాదియై యుండుటను పైపట్టిక మనకు జూపుచున్నది. ప్రాచీనభాషలో నీపదములు కంఠ్యాదులే గాని తాలవ్యాదులని చెప్పుట పొసగదు. ఏలయనగా తాలవ్యాస్వరకములగుటచే తాలవ్యములనగా మాటి పదాదిచకారముతో గూడిన పదములు, ధాతువులు విశేషముగాగల ఆంధ్రమునందు గూడ తక్కినభాష లన్నిటియందువలె నాపదకుటుంబమునకుఁ జెందిన కొన్నిరూపములలో కంఠ్యకకారమే కనఁబడుచుండుట వలన కకారాదిపక్షములే ప్రాచీనములని చెప్పుగుగాని చకారాదులే ప్రాచీనములై యుండి కారణాంతరముచే నందలి చకారము కకారముగ మాఱినదని చెప్పుట కవకాశమేమియు నగపడదు. కయిశబ్దము చూడుడు. ధాతువు — కెయ్, గెయ్ అనునది. ఇది తెలుగున 'చేయు' ధాతువైనది. ఏ పనిచేయుటకైన నుపయోగించునది గావున హస్తము 'చేయి' అయినది. కాని ఇదియే దీని ప్రాచీనరూపమా యని పరిశీలించినచో 'కయి'రూపంబొకటి హస్తపర్యాయమై యేకవచనమునను బహువచనమున-'కేలు' అను రూపమును - వ్యవహారసిద్ధంబులై, యున్నవి. తక్కిన సజాతీయభాషలలో 'కయి' రూపమే ప్రాచుర్యమును వహించియుండుటను జూచియేయున్నాము, తమిళమున తెలుగునవలెనే 'కెయ్' ధాతువు. 'శెయ్'అనురూపముతో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానవచ్చుచున్నను కన్నడమున 'కెయ్' 'గెయ్'ధాతువులును, 'కయి' రూపమునేగాని తాలవ్యముతో గూడిన రూపమే లేకపోవుటచే ప్రాచీనధాతురూపము కకారవిశిష్టమే యనియు దానినుండి యేర్పడిన 'కయి'యే చెయ్–చెయ్యిలకంటె ప్రాచీనమనియు మనము నిశ్చయింప దగియున్నది. కన్నడభాషలో తాలవ్యచకారముతో గూడిన రూపమొక్క 'చేయు'ధాతువునకే కనబడకపోవుట లేదు. ఇట్లు తాలవ్యములుగ మారిన పదాదికంఠ్యధ్వనిగల సజాతీయపదము లేవియుగూడ తాలవ్యాదులై కన్నడమున గానవచ్చుట లేదు. అట్టిపదములన్నియు కంఠ్యాదులేయై యాభాషలో గానవచ్చుచుండెననుటకు పైపట్టికయే నిదర్శనము. ఈకారణముచే నీధ్వనికి లేదా యీపదములకు సంబంధించినంతవరకు కన్నడభాషయే ప్రాచీనభాషారూపములను నిలువబెట్టి కొనినదని మనము నిశ్చయింపవచ్చును.

కాని యీభాషలోగూడ నొక్కపదములో నీ మార్పు కనబడకపోలేదు. 'కెయ్' గెయ్లు చేయ్గా మారకపోయినను కెం–చెం చెన్నుగా మాఱెను మాఱిన దగుటచే వ్యాకరణములలో నీమార్పొక ప్రత్యేకసూత్రమున విధింపబడవలసి వచ్చినది. శబ్దమణిదర్పణమున,

"జని యిసుగం కెప్పనె బె
ప్పనె పప్పనెగళ చకార దోళ్ మత్వం కె
ప్పనె యాదిగెచత్వం మే
ణెసెతర మకారమిత్వక్కత్వం.

కెప్పనె, బెప్పనె, పప్పనె, పదముల చకారమునకు మత్వము విధించుచు కెప్పనె పదమునకుమాత్ర మాది 'క'కారమునకు 'చ'త్వవిధానముకూడ చేయబడినది. అనగా కెప్పనె+నీర్=కెం+నీర్=కెన్నీర్ (చెన్నీర్). బెప్పనె (=వెప్పన)+నీర్=వెం+నీర్=వెన్నీర్. పప్పనె+నీర్=పం+నీర్=పన్నీర్. కెప్పనె+కణిగిలె=చెంగణిగిలె (cf. కెందమ్మి, చెందొవ) కెప్పనె+తెంగు (=త. తేంగాయ్; తె–టెంకాయ)=చెందెంగు.

ఇట్లే 'చెంగణిగిలె' మొదలగు కొన్ని రూపములలో దప్ప నీభాషలో కకార కంఠ్యధ్వని తాలవ్యాచ్ఛరకమైనను తక్కిన కొన్ని భాషలలోవలె తాలవ్య చకారముగ మార్పునొందక, సామాన్యముగా ప్రాచీనభాషారూపముననే నిలచియున్నట్లగపడుచుండుటచేతను, తెలుగున విశేషముగను, తమిళమున తెలుగునందుకంటెకొంచెము తక్కువగను నీమార్పు ప్రాచుర్యమునవహించియుండుటచే, తెలుగు తమిళములు కన్నడమునుండి విడిపడినపిదపనే యీమార్పున కనువగు పలుకుబడి యీజనసంఘములలో ప్రారంభించియుండునని తలంపవలసి వచ్చుచున్నది. పైని జూపిన సుమారు ముప్పదిపదములుగల పట్టికలో కన్నడమున కకారముతో గూడినపదములన్నిటికిని దెనుగున చకారముతో గూడిన రూపములే గానవచ్చుచుండ తమిళమున సుమారు సగము పదములు మాత్రమే తాలవ్యముతో గూడిన రూపములుగానున్నవి. తాలవ్యాచ్ఛరకములైన కంఠ్యధ్వనులు తాలవ్యములుగ మాఱుటనుబట్టి "తాలవ్యీకరణ విధానము" (Law of Palatalization) నీద్రావిడభాషలలో నొక 'భాషానియమము'గా మనము గ్రహింపవచ్చును. ఈసూత్రవ్యాప్తిని మాత్రము బట్టిచూచినచో కన్నడము తమిళాంధ్రములకంటె ప్రాచీనభాషారూపముల నెక్కుడు జాగరూకతతో నిలుపుకొన్నదనికూడ మనకు దెలియవచ్చుచున్నది.

ఇండో యూరోపియన్ కుటుంబభాషలలో గూడ నిట్టి స్వరసూత్రమే (Sound law) కొంతపని చేసిన ట్లగపడుచున్నది. ఆ భాషలలో సయితము తాలవ్యాచ్ఛరకములకు కంఠ్యము లనేక పదములలో తాలవ్యములుగ మాఱుట తటస్థించినది. దీనిమూలమున పాశ్చాత్యశబ్దశాస్త్రజ్ఞు లా ఇండోయూరోపియన్ కుటుంబమునకు జెందిన భాషలకు గల సంబంధమును వాని సన్నిహితత్వమును గూడ కొంతవరకు నిర్ణయింపగలిగినారు. ఈకుటుంబమునకు జెందిన ఆర్యన్, ఆర్మీనియన్, ఆల్బేనియన్, బాల్టోస్లెవోనిక్, లాటిన్, గ్రీక్, ట్యూటానిక్, కెల్టిక్ మొదలగు భాషాశాఖ లతిచిరకాలము క్రిందటనే మొట్టమొదట రెండుశాఖలుగా విడిపోయి యటుపిమ్మట నింకను భిన్నశాఖలుగా మాఱిపోయినవని ప్రాచీనభాషలోని కంఠ్యధ్వను లీభాషా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాఖలలో పొందిన మార్పులనుబట్టి నిశ్చయించుచున్నారు. ఈ యాదిశాఖలకు దేశవిభాగమునుబట్టి పూర్వపశ్చిమశాఖలనియు (Eastern & Western) నాధ్వనికి గలిగిన మార్పునుబట్టి—శతం-కెంటుం-భాషలనియు పేరిడిరి. 'నూరు' అను నర్థముగల ప్రాచీన భాష లోని 'కెంటుం' అనుపదము పశ్చిమ భాగమందలి లాటిన్, గ్రీక్, కెల్టిక్ భాషలలో వరుసగా 'కెంటుం, ఎకెటాన్, హండ్' అను రూపములను బొంది యేదో విధముగా కంఠ్యధ్వనిని నిలుపుకొనియుండ ప్రాచ్యభాషలను జెందు, సంస్కృతము, బాల్టో స్లైవోనిక్ భాషలలో నీ కంఠ్యకకారము 'ఊష్మము'గా మాఱిపోయి వరుసగా, 'సెతెం, శతం, జింతాస్' మొదలగు రూపములను బొందుటచే నీ ప్రాక్పశ్చిమభాషల కీ ధ్వని నున్చరించు విషయమున చిరకాలముక్రిందటనే భేదమేర్పడినదని తెలియుచున్నది. ఇంతేకాక పశ్చిమ భాషలలో—బహుశః ప్రాచీనార్య ఇండో యూరోపియన్ భాషలలో గూడ నిప్పుడు సంస్కృతమున గలయట్టి 'చ' కారమువంటి తాలవ్యధ్వని యున్నట్లగపడదు. సంస్కృతమునను,—సంస్కృతముననేగాదు — ప్రాచ్యభాషలలో నీ తాలవ్యచకారము కనబడుచున్న పెక్కుపదములు పశ్చిమశాఖకు జెందినభాషలలోని సజాతీయరూపములలో (Cognate forms) కంఠ్యకకార మేకనబడుచున్నది. ఇందుకు నిదర్శనముగా నీక్రిందిపదములను జూడుడు.

| | |
|---|---|
| సం. పంచ | లాటిన్ పెంక్వె—గాథిక్, ఫిమ్ఫ్. |
| సం. చత్వార్ | లాటిన్—క్వెటూర్ |
| సం. చరః | గ్రీక్—కెర్నోస్ |
| సం. జఠరః | గాథిక్ కిల్థై |
| సం. ఓజస్ | లాటిన్ ఔగెః |
| సం. జనః | లాటిన్ గెనోస్ |
| సం. జజాన | లాటిన్ గెగ్నో |

కాని మఱికొన్నిపదములు కంఠ్యయుక్తములుగనే యెట్టి మార్పు లేకయున్నవి.

| | |
|---|---|
| సం. కర్కః | గ్రీ. కర్కినోస్ |
| కారుః | గ్రీ. కారుగ్ |
| కాలః | గ్రీ. కాలోస్ |
| కతరః | గ్రీ. కోతెరోస్ |
| యుగ్మం | గాథిక్ జూక్ ఇంగ్లీ యోక్ |
| గౌః | గ్రీ. బౌస్ (బ=గ) |
| గిరిః | లిథుా. గిరియ |

వెనుకటి పట్టికలోని పదము లట్లు తాలవ్యచకారములుగ మారుటకు గల కారణ మేమి యని విచారించినచో, మొదటిపట్టికలోని లాటిన్ మొదలగు భాషాపదములలో కంఠ్యధ్వనిగా గనబడుచున్న 'క' కారము తాలవ్యపరకం బగుటయు, రెండవపట్టికలోని కంఠ్యధ్వనులట్లుగాక, తాలవ్యేతరములగు నచ్చులు పరమందు గలవగుటయే యని మనము తెలిసికొనగలుగుదుము. ఇట్లు తాలవ్యాచ్చులు తమకు పూర్వమునగల కంఠ్యధ్వనులను తాలవ్యములుగ మార్చునట్టి విధానమునే యిండో యూరోపియన్ భాషలలో పరిశ్రమచేసిన శబ్దశాస్త్రజ్ఞులు (Indo European Philologist) 'తాలవ్యీకరణ విధానము' (Law of palatalization) అని చెప్పియున్నారు. ఇట్లీ రెండు భాషాకుటుంబములలోను గూడ నీమార్పొకరీతినే సంభవించియుండుటచే వాచికావయవముల ప్రయోగసరణి ననుసరించి భాషలలో గలుగుచుండు వికారములు ఒకవిధముగ స్వాభావికమగు పద్ధతినే జరుగుచుండునని తలంపదగియున్నది.

ఈ కంఠ్యధ్వనులు పొందు మార్పునుబట్టి ఇండో యూరోపియన్ భాషల సంబంధమును నిర్ణయించినరీతిని ద్రావిడభాషల సంబంధమును గూడ నిర్ణయింపదలచినచో తుళుకన్నడములు తక్కినభాషలనుండి, ప్రాచీన భాషనుండి చిరకాలముక్రిందటనే విడిపోయియుండునని యూహింపదగియున్నది. కాని యిది యింక నితర ప్రబలసాక్ష్యముచే ఋజువుచేయబడునంతవరకు నిశ్చయింప వీలులేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గంగాలహరి

చెఱుకుపల్లి శివరామయ్య గారు (వాణీసేవాసంఘము)

[వెనుకటి సంచిక తరువాయి]

కమలా భర్తృపదాంబుజంబె జననాగారంబు-సంవాసమా!
ప్రమథాధీశ జటానికేతనమునన్-వ్యాసంగమా! పాపకూ
పములన్ గూలిన మానవాళులఁ దరింపన్ జేయు కార్యంబె-లో
కమునం దెయ్యెడ నీకు లేదు బహుళోత్కర్షంబు? మందాకినీ!

శైలాగ్రంబులనుండి పాఱు తటినీసంఘంబులం దెద్ది నీ
లీలన్ శూలి జటాగ్రమం దలరె తల్లీ! ఏనదీతోయమా
శ్రీలోలాంఘ్రిసరోజమందు వసియించెన్ నీవలెన్ దేని నీ
తోలేశంబును సాటిదెత్తురు కవిస్తోమంబు భాగీరథీ!

స్థిరచిత్తుండయి పద్మసూనుఁడు సమాధిన్ బూనినన్ హాయిగా
హరి నిద్రించిన శేషతల్పమున నాట్యంబుల్ భవానీమనో
హరుఁడున్ జేసిన నేమి దానములు ప్రాయశ్చిత్తముల్ చాలు నీ
ధర నేరిన్ దలపోతు నర్థిజనమందారంబు నీవుండఁగన్.

పతితుఁడ రోగతప్తుఁడ నపారభవాబ్ధినిమగ్నుఁడన్ సమా
శ్రితుఁడను తృష్ణచేత వగఁజెందెడివాఁడ సుతుండ లోకపూ
జితవు నిరంతరం బమృతసింధువవున్ పరమాపథంబ వా
శ్రితుఁను బ్రోచు నీదటికిఁ జేరితి నెట్లు సముద్ధరించెదో?

పరమంబైన భవత్కథామహిమయే వ్యాపింప ధాత్రిన్ భయం
కర కోలాహలములున్ నశించె యమలోకంబందునన్ కాలకిం
కరు లెందో జని రెల్ల ప్రేతహరణాకాంక్షన్ సురావాస సుం
దరమార్గంబులఁ గూల్పఁజొచ్చెను విమానవ్రాతముల్ వింతగన్.

మాలోనన్ దినవర్ధమాన మగు కామక్రోధ జాత జ్వర
జ్వాలాజాలము సంతతోజ్జ్వలితమై బాధించు మమ్మున్ మరు
జ్జాలోత్తుంగ తరంగఖేలనముచే సంభిన్నమై లేచు నీ
లీలాంభఃకణరాసులే సతము తల్లీ! తాపముల్ మాన్పుతన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరికింపఁగ భువనాళికిన్ భవనమా బ్రహ్మాండభాండంబు-వి
స్ఫురదుత్తుంగ తరంగమాలికలలోఁ బూబంతిచందంబునన్
దొరలన్ శూలిజటాప్రదేశమున సంతోషంబుచే మించి కా
పురమున్ జేయు భవజ్జలప్రతతి రూపుల్ మాపు మా పాపముల్.

ధర నెవ్వాని సముద్ధరించునెడ తీర్థంబుల్ త్రపన్ గాంచునో
పరమేశాది సుపర్వులెల్ల శ్రవణద్వంద్వంబులన్ మూసికొం
దరో! ఆముష్కరు నన్ను దోషరహితాత్మున్ జేయ పాపాత్ములన్
పరిరక్షించెదమంచు లోఁదలఁచు గర్వం బీల్గదే వారికిన్.

కరుణవహించి లోన శునకంబులఁ జంపెడివారు సైతమున్
దురితపటంచు మాను పలుదోసము లన్నిట కేనుజూడ త
ల్లిరో! నిలయుండ నిట్టి నను లీలగఁ బ్రోవఁ దలంచుచుండఁగన్
నరపశువా సమర్థుఁడు ఘనంబుగ ని న్నిల సంస్తుతింపఁగన్?

తల్లీ! ఎవ్వనినుద్ధరింప భువికంతన్ విస్మయభ్రాంతి సం
ధిల్లంజేయునో! అట్టి పాపి యొకఁడేనిన్ గానరాఁ డంచు నీ
యుల్లంబందుఁ గలంతఁ జెందెదుగదా! ఒక్కండ నీకుండు లో
కెల్లన్ మాన్పఁగ సిద్ధమైతి కరుణాదృష్టిన్ బ్రసాదింపుమా.

తలపఁగరాని సేవనయు దబ్బరలాడుట దుష్టవాదముల్ -
సలుపుట నాత్మలోఁ జెడుతలంపులఁ బెంచెడు మద్గుణంబులన్
పలుమఱు కాంచియున్ వినియుఁ బాపునిఁ బ్రోవఁగ నీవుగాక న
న్యులు ననుజూతురే? సురమనోహరవాహిని, లోకపావనీ!

అనిశము తావకీన విమలాకృతిఁ గాంచఁగ నేరనట్టి యా
జనులకుఁ గన్ను లెంతటి విశాలములైన ఫలంబుగూడునే!
జననిరో! నీమనోహరవిశాలతరంగకలస్వనంబులన్
వినకయె యుండినన్ జనులవీనులకే యవమాన మిద్ధరన్.

అమరావాస సుఖంబుగాంతురు ప్రపుణ్యాత్ముల్ యథేచ్ఛన్ విమా
నములం దెక్కుచుఁ బాపులెల్ల నరకాంతర్మగ్నులై పాపకూ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పములన్ గూలుదురంచుఁ జేయఁబడు నేర్పాటెల్ల తల్లీ! జనా
ఘములన్ మాన్పెడి నీవులేని కుజనగ్రామంబునం దొప్పెడిన్.

గురుదారాగమనంబుఁ జేయు ఖలులున్ గోబ్రహ్మహత్యాది దు
ర్భరపాపప్రవిభిన్నచిత్తులు సురాపానప్రియుల్ స్వర్ణత
స్కరులున్ మేనుదొలంగ నీజలములో స్వర్గంబునన్ పుణ్యు లం
దఱికన్నన్ సుఖియింత్రు దివ్యపదవిన్ మన్నింప బృందారకుల్.

ప్రసవాలభ్య మనోజ్ఞసౌరభము నాఘ్రాణించుచున్ మన్మథ
వ్యసనాభీల శరక్షతాత్ములకుఁ బ్రాణాపాయమా మారుతం
బసమానంబయి తావకీనవిమలోద్యద్వీచికాసంహతిన్
వెస పూతం బొనరించుచుండెగద! దేవీ! మూఁడులోకంబులన్.

ఇహవాంఛల్ సమకూర్చునజ్జనులు స్వర్గేచ్ఛల్ ప్రసాదించు స
న్మహితాత్ముల్ గల రెందఱెందఱొ జగన్నాథుండుమాత్రం బిలన్
రహి నీమీఁదనె రెండులోకముల భారంబంతయున్ మోపుచున్
బహుళానంద సుషుప్తిలో మునిఁగె నంబా! లోకసంభావనీ.

పరమవ్రాత్యుల నీచులన్ పతితులన్ పాపాత్ములన్ నీకు నె
క్కరణిన్ బ్రోచెడి ప్రేమవీడఁగ నశక్యంబౌనొ! యారీతినే
ధర నార్తుల్ దురితంబుబాయఁగ నసాధ్యంబయ్యె నూహింప నె
వ్వరికిన్ లోకమునందు నైజగుణమున్ బాయంగ శక్యంబొకో.

పటుసంధ్యానటనంబుఁ జేయు గిరిజాప్రాణేశు చంచజ్జటా
తటలోల ల్లహరీకరాభినయమున్ తద్దివ్యజూటాంతరో
త్కటఖేలజ్జలపూర ధంధమరువాద్యభ్రాజితంబౌ వియ
త్తటినీ తాండవకృత్యమెల్లపుడు మాతాపంబులన్ మాన్పుతన్.

క్షేమలాభంబులను గల్గఁ జేతువనుచుఁ-బెట్టుకొనియుంటి నాశచే వీడినంత
నణఁగు విశ్వాసము జగత్త్రియంబునందు-నగు నిరాధారమమ్మ నిర్వ్యాజకరుణ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవిరళప్రేమచే నలరు నగ్ధశరీరుని దివ్యమౌ జటా
భవనమునుండి జాఱి వడి పాపటపైఁ బడినంత నైజమౌ
సవతితనంపుచూడ్కులను శైలజ చూచుచుఁ బైకి హస్తప
ల్లవమున జిమ్ము తావక విలాసతరంగము లింపుమీఱెడిన్.

అర్థిజనకల్పవృక్షంబ వయినకతన-నెందఱెందఱో నిన్ను భజించుచుంద్రు
నేనుమాత్రంబు సహజామితానురాగ-భరితుఁడనుసుమ్ము! తల్లి, నీపాదమాన.

అమ్మరో! ఫాలపట్టికలయందు నలంకరణంబుఁ జేయుమా
త్రమ్మున మాఁగవాళులకు తాపతమిస్రము భానురశ్మిచం
దమ్మున మాన్పి ధాతృలిఖితంబగు దుర్లిపి నూడ్చివేయు పూ
తమ్మగు నీదు మృత్తికయె దారుణదుఃఖములన్ హరించుతన్.

భవతాపాస్పదులైన జానపదులన్ ప్రాంచత్ప్రసూనాళి కై
తవవృత్తిన్ గని గేలిసేయుచు సుగంధవ్రాతసంపత్తిచే
భువియందున్ మధుపాళి నిత్యమలినంబుల్ మాన్పు మందాకినీ
సవిధక్ష్మారుహముల్ మదీయసఖులై సంతోషముం గూర్చుతన్.

కొందఱు కష్టదైవముల గొల్చుచునుండిరి మేటిజన్నముల్
కొందఱు చేయుచుండి రిఁకఁ గొందఱు సన్నియమవ్రతంబులన్
బొందుచునుండిరే నెపుడు పొందుగ తావకనామకీర్తనా
నందమునన్ జగంబును తృణంబుగఁ జూచుచునుంటి తల్లిరో!

ఆరయ పుణ్యపూరుషుల కాశ్రితభక్తుల కెల్ల మేలుచే
కూరుచు వేల్పులెంద ఱొనగూడరు పుట్టినదాది పున్నెమే
కూరిమి జేయరన్ వెతలగుందెడి పాపజనావళిన్ నిరా
ధారుల నీవుగాక మఱి ధాత్రిని నెవ్వరు బ్రోతు రమ్మరో!

పరమానందముతోడ నీకడ పయఃపానంబు గావించి ము
ష్కరులౌ నేస్తులతోఁ జరింపఁ జని విశ్రాంతిన్ దరిన్ గొంటి స
త్కరుణన్ మేల్కొనియున్న నన్ను భవదుత్సంగంబునం దుంచి ని
ద్దురపుచ్చంగదె మందమారుతములందున్ దేహ ముప్పొంగఁగన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాలేందున్ ముకుటంబునన్ ఫణులతో బంధించుచున్ వేగమే
లీలన్ నెన్నడుమున్ బిగింపు మికఁ దల్లీ! లోకసామాన్యుఁడం
చాలోచించి హసింపఁగా వలదు కాసంతన్ జగన్నాథునిన్
పాలింపన్ దరుణం బిదే తడయకన్ బాపాత్ము రక్షింపవే.

శరదమృతాంశు సన్నిభము చంద్రకళా విలసత్కిరీటమున్
స్ఫురితసుధోపమాంబర విభూషణముల్ కరమందు కుంభమున్
వరమభయాబ్జముల్ మకరవాహనవై చెలువొందు నిన్ను సం
స్మరణముఁ జేయువారి కవమానము లెన్నఁటికైనఁ గల్గునే.

దరహాసానన కాంతిపూరములచేతన్ ఘోర సంసార దు
ర్భరవహ్నిచ్ఛటలన్ తపించునరులన్ రక్షించుచున్ జిన్మయా
దరణీయోజ్జ్వల చంద్రికాతతిఁ జమత్కారంబులన్ జేయు నా
సరసీజేక్షణ శంతనాంగన సదాసౌఖ్యంబులన్ గూర్చుతన్.

మారెన్ మంత్రము; లౌషధంబులకు సామర్థ్యంబు లీల్గెన్; సుధా
సారంబెల్ల నశించె; మేల్గరుడపచ్చల్ క్రుంగె; స్వర్లోకసం
చారుల్ భీతిలి; రార్తిమున్గితి; భవజ్వాలాప్రభావంబులన్
వారింపం గదె! కాళియాహిత పదాబ్జద్వంద్వసంతోషిణీ!

ప్రమథాళిన్ గజచర్మమున్ నిజఫణివ్రాతంబు నందీందులన్
ప్రమథాధీశ్వరుఁ డొడ్డి జూదమున సర్వమ్మోడుచున్ దానె పం
దెమునం ద్రొగ్గఁ దలంచి శైలతనయన్ వీక్షింప లేనవ్వులన్
భ్రమతన్ ద్రోల్లెడు నీ తరంగనటనారంభంబె మమ్మేలుతన్.

శివ జటాజూటతల విభూషితశుభాంగ-కలుషచయభంగ విమలతరంగత్తరంగ
భక్తపోషణ సత్కృపాపాంగ గంగ-క్షితిని దురితము లడఁచి రక్షించుగాత!

ఘనయశుండు జగన్నాథకవివరేణ్య-విరచితం బగు గంగాలహరిని జదువు
వారికఖిలాయురారోగ్యవైభవాతి-శయము లొనగూడు భువిని నిస్సంశయముగ.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




(పైభాగము)
ఇసురుమునియ కొండపైగల దేవాలయము
(నడుమ) చంద్రకాంత సోపానములు
(క్రిందిభాగము) జేతవనారామమునందలి డాగోబా-సింహళము



సముద్రప్రాంతము-సింహళము



ఏనుగుల నీరాటము-సింహళము



మౌంటులివీనియా హోటలువద్ద సముద్రప్రాంతము-సింహళము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చతుర్థాంకము

### రంగము ౧

స్థానము:—విశ్వపతిమందిరము

సమయము:—ఉదయము

(విశ్వపతి సర్వసేనాధిపతి దర్జాన ముస్తాబు చేసి కొనుచు ప్రవేశము.)

విశ్వపతి:—ఏమిటీ అపశకునము? ప్రొద్దుననే కార్యాలయమునకు పోవువేళ నీ దాసి ప్రత్యక్షమైనది! (దాసిదీనాననముతో ప్రవేశము.) ఏమి, బదరికా! ఇట్లు వచ్చితివి? రాణి కుదయాలంకార మెవరు చేయు చున్నారు!

దాసి:—పూర్వపుదాసియే.

విశ్వపతి:—నీకేల చేయలేదు?

దాసి:—నన్ను చేయనీయలేదు. తిమ్మరుసు మంత్రిగారు తనను నియోగించినారట. వారు చెప్పువఱకు తా నాయుద్యోగ మెవరిని చేయనీయదట.

విశ్వపతి:—నిన్ను మేము నియోగించితిమని చెప్ప లేదా?

దాసి:—చెప్పితే, నవ్వి యూరకుంది. నాకు కోపమువచ్చి బయటికి వెంటపోయాను. ఇద్దఱము పోట్లాడుతుంటే ఇంతలో మహారాజుగారు వచ్చారు. రాణీగారు మా తగాదానంత వారికి చెప్పారు. రాజుగారు, నవ్వి, "అది ఎంతకాలమునుంచో ఇక్కడ ఉంది. దానితో పోట్లాడకు పో" అని నన్ను సాగనంపారు.

విశ్వపతి:—పోనీలే! దానితోపోట్లాడకు, పో. (దాసి తెలతెలబోవుచు ప్రస్థానము.) ఇప్పటికిని వాని నాగ్రహము విడిచిపెట్టనేలేదు. ద్వారరక్షకా! ఎవరు అచ్చట నీతో సంభాషించునది? విజయసేనాపతియా! రావచ్చునని చెప్పుము (విజయుడు ప్రవేశించును) ఏమి విజయా! అంగరక్షకులు మార్పబడిరా?

విజయుడు:—తిమరు పేర్కొనినవారి నందులకు నియోగించుటకు దుర్గాధ్యక్షు డంగీకరింపలేదు.

విశ్వపతి:—ఎందుచేత?

విజ:—ఇప్పుడున్న వారే శ్రీవారి విశ్వాసమునకు గూడ పాత్రులనియు, అయినను తమతో స్వయముగ ముచ్చటింతుననియు జెప్పెను.

విశ్వ:—మంచిది, నీవు పొమ్ము. (విజయుడు ప్రస్థానము.) అన్నియు నశుభముగ నేయున్నవి. నేడెప్పటికిని కదలకూడదు. (కూర్చుండి) ఏమి, యీ తిమ్మరుసు ప్రతిభ! బూజుపట్టిపొమ్మనిఅటకపైపారవైచితిననుకొంటి నేవాని కొంతపలుకుబడి యున్నది! మేరుపర్వతమును దోచుకొనవలయునన్నను, గడ్డిపోచను పెటికివేయవలయునన్నను, ఎల్లరకు వీని యాలోచనయే కావలెనా? ఆహా! ఆతని బుద్ధినిబద్ధమగు నీ రాజ్యయంత్రము చిత్రమై, అతిగూఢమై, దుశ్ఛేద్యమగుచున్నదే! కదలింపబోయిన కఱువ వచ్చును; ముట్టుకొనబోయిన కుట్టవచ్చును. దాసి మొదలుకొని దుర్గాధ్యక్షునివఱకుకూడ నెల్లరికి 'అప్పాజీ' పిచ్చియే. ఇంతగ్రంథము జరిగినను రాయలనుకూడ చిరంతనదురభ్యాసముపలెనే, యీ 'అప్పాజీ విధేయత' విడువలేదనియే తోచుచున్నది. పుత్రహంతకుడని తెలిసియు, నరికితు వేయలేదు; కారాగృహమున త్రోయలేదు. తండ్రిని కుమారుడు బెదిరించిన ట్లాకనిష్ఠగమును వైచి, ఏమో గొప్ప శాస్తిచేసినట్లే; చేతులు కడుగుకొని కూర్చునినాడే! ఏమి భయభక్తులు! (ద్వారమువైపు చూచి) ఓహో, బలభద్రుడా! రమ్ము. (బలభద్రుడు ప్రవేశించును) ఏమి నీ శవసాధన ఎంతవఱకువచ్చినది?

బల:—నగరునంతను మూలమూలలగాలించి వెదకితిమి. విశ్వప్రయత్నము లొనర్చినను కుమారుని కళేబరము జాడయైన గోచరింపలేదు.

విశ్వ:—తుద కగ్ని సంస్కారమునకైన నోచుకొనలేదు. పాపము దురదృష్టవంతుడు!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బల:—హంతకుడు పట్టుబడినప్పుడు వానినే నిర్బంధించి అడిగి తెలిసికొనవలెనే కాని.

విశ్వ:—ఏడీ! తాము నిర్ఘోషులట మాపై పగ సాధింతునని నిరాఘాటముగ ప్రతిజ్ఞ నేయుచు గోవింద రాయలు దుర్గమును విడిచిపోవుచున్నపు డొక్కడైన నిరోధింప గలిగెనా ; ఏమి. యీ అరాజకము! పోవు వాడు శవమును చంకబెట్టుకొని పోయియుండడు. పొమ్ము, వెదకింపుము. (బలభద్రుడు పోబోవును.) ఎచ్చట వెదకించెదవు? చేతిలో ఆ గ్రంథమేమిటి?

బల:—భగవద్గీతలు.

విశ్వ:—ఇది పారాయణచేయుచు శవాన్వేషణ మా? దీని వైరాగ్యబోధలో మా పని యెట్లు జరుగును? అయ్యో! మా కృష్ణరాయల నెట్లో "ఆంధ్రభోజుని" చేయవలయునని మీ సంకల్పమే అయినయెడల, నా మాట వినుడు. తిన్నగ శ్మశానమునకుబోయి పాతాళ పర్యంతము కుళ్లగించి పుస్తెలను భద్రము నేయుడు. "సంస్కృతభోజుని" ఏయుద్యోగి పుస్తెయైన నం దుండ కపోదు. పాండిత్యముయొక్క ప్రయోగజ్ఞాన మేమూల నైన నింత యంటియుండవచ్చును. దానిని దక్కించు కొనుడు. మీకును మాకును శ్రేయస్కరము.

బల:—తమ యాజ్ఞప్రకార మెచ్చట శోధింప మన్న, నచ్చటనే శోధింతుము.

విశ్వ:—కోపమువలదు. నా దుఃఖము తమకేమి తెలియును? దయయుంచి, నే నుపాయము చెప్పెదను. చేయుడు. ఈ రాత్రి రహస్యముగ మంత్రిగృహావరణను శోధింపుడు.

బల:—భాగ్యము.

(ప్రస్థానము.)

విశ్వ:—శవ మేమైనది? నేల పూడ్చబడి ధ్వంస మయ్యెనా? (నేలదన్ని) ఏమి ధాత్రీ! నీవు రత్న గర్భవా, శవగర్భవా? శవగర్భవే, పో...ఆ తిమ్మరుసు హంతకుడే గోవిందరాయలను పంపియుండును. తానిచ్చటనే యుండునా? ఉండడు. అవును.

ఉ. నాయనుమాన మే నిజము
నక్క వలె నేటునె వీని మారణో
పాయము చూడగావలె న
పాయముదాటవలెన్ శుభోదిత
శ్రేయుడవై జయేందిరను
జెందుటొ, యీశవగర్భయందె నే
జేయుటొ యంత్యవాసము ని
శ్చితిని నంతయు తేలగా వలెన్.

(సేవకుడు ప్రవేశము)

సేవ:—దేవా! పోర్చుగీసువర్తకశ్రేష్ఠి వచ్చి యున్నాడు.

విశ్వ:—సగౌరవముగ దోడ్కొనిరమ్ము.

సేవ:—చిత్తము. (ప్రస్థానము.)

విశ్వ:—ఆఁ, వీనిచే నాపనిగావింపవలెను. స్వ ముగ జేయరాదు. ... చేతకాదు కూడ. (మంచము నుండి ఒక నగలపెట్టెను దీసి తెచ్చి బల్లపై నుంచును. ఇంతలో వర్తకశ్రేష్ఠి ప్రవేశము.) ఓహో; స్వాగతము!

పోర్చుగీసు వర్తకుడు :—శుభవందనములు.

విశ్వ:—(వాని కాసనమును జూపి) తమ పైనిపలు మంత్రిభవనమును జాగ్రత్తగ గాచుకొనియుండిరా?

పోర్చు:—తమయాజ్ఞ ప్రకారము పోతుటీగ నైన లోనికి బోనిచ్చుట లేదు, లోనివారిని బయటికి రానిచ్చుటయు లేదు.

విశ్వ:—వానిగృహమే వానికి కారాగృహమైనది.

పోర్చు:—తమ రీయాజ్ఞ నీ పటుకే యిచ్చియుం డిన గోవిందరాయలుకూడ పోయియుండెడివాడుకాడు.

విశ్వ:—గతమునకు విచారమెందులకు? ఇదిగో మా కృతజ్ఞత (నగలపెట్టెను ముందుపెట్టి) యీ రత్నా భరణములు ౮ లక్షల దీనారముల విలువచేయును.

పోర్చు:—మహాభాగ్యము.

విశ్వ:—కాని, మీవలన నింకొకసాయము కావ లెను. దానికి ప్రతిఫలముగా గొప్ప జాగీర్ల నిప్పించెదము,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోర్చు:—తమయాజ్ఞ ?

విశ్వ.—హత్య చేయగలరా ?

పోర్చు.—తమ విరోధు లెవరు?

విశ్వ.—నాకు విరోధులు లేరు. మహారాజు విరోధులు.

పోర్చుగీసు:—వారికై మాప్రాణములనైన నిచ్చుటకు సిద్ధముగ నున్నాము.

విశ్వ:—రాజకుమారుని చంపించినది తిమ్మరుసు మంత్రి యని తమ రెఱుంగుదురుకదా ?

పోర్చు:—చిత్తము.

విశ్వ:—చిన్ననాటనుండియు పెంపబడిన మొగమోటముచే వారి నేమిచేయుటకును శ్రీవారికి మనస్కరించుటలేదు. కాని వారివిధిని మనము చేయుట మన విధి. మీ రీపనిచేసిన నొకటికాదు, రెండు జాగీరులనైన నిచ్చెదను.

పోర్చు:—నేటిరాత్రియే! ఇక మాకు సెలవు.

విశ్వ:—ఏః! ఈ విద్యలో నారితేరినదే యీ ఘటము. సంభావణ క్లుప్తముగ నడచినది. జాగీరు లని నంతనే కనుబొమలు విప్పారినవి. మ్లేచ్ఛా! నీ బుఱ్ఱను కూడ రాజ్యకాంక్షయే తొలుచుచుండెనా? వ్యాపారివి, పరిపాలనకూడ నుండవలసినదే! "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అని ధర్మగ్రంథములను, శాసనమునకును తూనికకుగూడ నుపయోగింపగలవు! కానిమ్ము. ఈరాత్రి యీపని కానిమ్ము. మంత్రి హత్యాపరాధము వీరి తలరుద్ది సర్వకోటీల దోచుకొని, ఒక్కొక్కని కొక్కొక్కజాగీరు శ్మశాన గర్భమున శాశ్వతభుక్తములుగ నిచ్చెదను.

(పెద్దిరాజుగారు ప్రవేశము)

పెద్ది:—బిజాపురము సుల్తాను దాడివెడలివచ్చుచున్నాడట, వింటిరా ?

విశ్వ:—లేదు. అయిన మనమిపుడు యుద్ధము సేయవలెనా ?

పెద్ది:— లేదు. కప్పురంపు వీడియంబును సేవించుచు నుయ్యేలమంచముపై నూగుచు సరసాలాపంబుల వినోదించుచుండవలెను.

విశ్వ:—"నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక ఆత్మకింపయిన భోజనమును" మరచిపోయినారు పెద్దలు.

పెద్ది:—అది కవిత్వమునకు.

విశ్వ:—తాతగారూ! తమపద్యము చిత్రముగ నున్నది. కవిత్వమునకు—"నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడె, మాత్మకింపయిన భోజనము"—తాంబూలమైన తరువాత భోజనమా ?

పెద్ది:—కవిత్వమున ఛందోనుకూలంబుగ నిట్టి తారుమారులకు స్వాతంత్ర్యంబు రసికలోకంబు కటాక్షించినది. మా అపరాధము లేదు.

విశ్వ:—పోనిండు. ఇదేమిటి ?..."ఒప్పుతప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్ దొరకినగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే ?" అంటిరి. "ఇదియొప్పు యిదితప్పు" అని లేఖకులు పాఠకులు చెప్పుచున్న వారితో సంప్రదించి సవరించుకొని తాము పద్యములు వ్రాయుదురన్నమాట. ఆంధ్రభోజునకు తమరున్నలోటును సంస్కృతభోజునకు కాళిదాసుకూడ తీర్చలేక పోయినాడు. గొప్ప కవిత్వపాకనిపుణులే, ఆంధ్రకవితాపితామహు లల్లసానివారు! నావాచాలతను పితామహులు క్షమింపవలెను. నిజముగ మనము సరసాలాపములనే వినోదించుచున్నాము...సరి తమరిపుడేమి నిశ్చయించిరి ?

పెద్ది:—అన్ని ఏర్పాటులును గావింపబడెను. బిజాపురసుల్తాను కొండపల్లి మీదుగా వచ్చునట. అతడా ప్రాంతముల జేరునప్పటికే గజపతిగూడ 'కృష్ణ'ను సమీపింపవచ్చును.

విశ్వ:—ఏ గజపతి ?

పెద్ది:—కటకపురాధీశ్వరుడు.

విశ్వ:—అతడుకూడ దండెత్తి వచ్చుచున్నాడా?

పెద్ది:—అవును.

విశ్వ:—అంతటి సమర్థుడా ?

పెద్ది:—సుల్తానుతో గలసి రాయలదాకవచ్చుచున్నాడు. కృష్ణను దాటిరాకమునుపే వారిని నిరోధించుటకు శ్రీవారు నిశ్చయించుకొనినారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్వ:—శ్రీవారు స్వయముగ సైన్యసంచాలన సేయుదురా ?

పెద్ది:—చిత్తము.

విశ్వ:— మేము ?

పెద్ది:—నగరరక్షణమునకు తమరు నియుక్తులైరి. ఆయుదంత మెఱింగించుటకే వచ్చితిని.

విశ్వ:—ఈ ఏర్పాటు లన్నియు నెవరు చేసినవి?

పెద్ది:—నేను

విశ్వ:—మాతో సంప్రదింపక ఆజ్ఞలను జారీ చేయవచ్చితిరా ? ఏమి, యింతస్వాతంత్ర్యము తీసికొని నారు ?

పెద్ది:—ఈ ఖడ్గము నెప్పుడు ధరించితినో అప్పుడే నా కా స్వాతంత్ర్యము వచ్చినది.

విశ్వ:—ఆహా ! దాని ఆధిక్యతయేమి ?

పెద్దిరాజు:—దీని ఆధిక్యతయా?—పూర్వప్రస్తుతాగామిమహామాత్యులకు శిరోమణియై, ఆంధసామ్రాజ్య నిర్మాతయై, దుర్లభ జయశ్రేయముల నెన్నిటినో చక్రవర్తికిగూర్చి, దుర్లోక్య తేజోవిరాజియైన శ్రీ తిమ్మరుసు వారు ధరించు కారణమున దీనికామహత్తు వచ్చినది. ఇది ధరించు మహాత్వమున నేమా నిర్ణయమమోఘమగును. చక్రవర్తికూడ యీగౌరవమును శిరోధార్యమని మమ్ము ధన్యులజేసె.

విశ్వపతి:—మంచిది. ఏదీ ఆఖడ్గమునిటు తెండు. అందులకు నేనే యోగ్యుఁడ నేమో ?

పెద్దిరాజు:—యోగ్యులేయైన నేనిచ్చుటఎందుకు? నగరరక్షణము తమ కంగీకారము కాకున్న మేము వేఱుగ చూడవలయును.

విశ్వపతి:—చిత్తము. శ్రీవారితో నాలోచించి వర్తమానమంపెదము.

పెద్దిరాజు:—చిత్తము. (ప్రస్థానము)

విశ్వపతి:—వానిఖడ్గమును ధరించు మాత్రమున నా మహాత్ముని సర్వతోముఖజాగ్రద్బుద్ధి కౌశలము వీని కబ్బునా? వృద్ధుని స్థానమున వృద్ధుఁడేర్పడవలె. ఏర్పడి నాడు, మందకొడిన్యృద్ధుడు. ఏమైనను మంత్రిపదవినుండు టచే నాకడ్డువచ్చుచున్నాడు. నావ్యూహములు నిరాఘాటముగ నిర్వహించుకొనుటకు నాకీపదవియే కావలయును. చూచెద నేల రాదో? (యవనిక.)

## రంగము ౨

స్థానము:—తిమ్మరుసు భవనము.

సమయము:—రాత్రి.

(తిమ్మరుసు పెద్దిరాజు ప్రవేశము)

పెద్ది:—గోవిందరాయలు చక్రవర్తిపై తిరుగుబాటుచేయుటకే లేచిపోయెనా ?

తిమ్మ:—కాని, నే నాపుకొనలేకపోతిని. అక్కటా ! నా అంశే, నావస్తువు నేనే ఆకర్షించుకొనలేకపోతినే. నా శ్రద్ధ నెచ్చటనో వ్యాసుపరచి స్వార్థలక్ష్యము నే మరచితిని. (రామకృష్ణకవి ఒక పేటికను గొని ప్రవేశించి పరికించుచు నిలుచును. ఉభయులు నాతని చూడరు) పితామహా ! యీ దుఃఖములో నాకు కవిత్వము వచ్చుచున్నట. చూడుడు. దుర్గరక్షణయందలి ఆతురతతో నొకడు జాగరణ గోపురారోహియై శత్రుసంచారమును దూరముననే పసిపట్టి యరికట్టుటకు దృష్టి సర్వస్వమును యంత్రముననే అర్పించి అచలుఁడై యుండెను. కాని దగ్గఱనుండియే శాత్రవముచుట్టును లేచి, ముసిరి, రెక్కలువిరిచి కట్టునప్పుడు, దేనికో గింజుకొను వాని నవ్వులాట బ్రదుకు నాకు సామ్యమునకు వచ్చుచున్నది. ఆహా ! మానవునికి స్వార్థము లేకపోవుటయు నొక దోషమేకదా !

గీ॥ నేటిదనుకపరార్థ జీవాటనంపు
గైపు గనుబ్రామ మెలఁగి దుర్గఘుఁడనైతి
సంఘహిత ధర్మమయకార్య చరణకైన
స్వార్థయోగమహాతపశ్చరణమలయు.

రామ:—సూత్రధారుడు యాజమాన్యమును మరచి కథానకమున రసమగ్నుడై పాత్రమున తన్మయుఁడగుచున్నాడు. నాటకము నడచునా ?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిమ్మ:—(దృష్టించి మందహాసముతో) ఏల నడు వదు? "తన జగన్నాటకంబున తాను నొకపాత్రమై సూత్రధారుడు నొచువరలు." నీశ్వరుని మానవు డనుక రించుచునే యుండును. ఆ పేటికయేమి?

రామ:—మహారాణీవారి రత్నాభరణములు పోర్చుగీసు వణిగ్వరునకు విశ్వపతిరాయలిచ్చిన బహుమానము.

తిమ్మ:—'నన్నీజు' గారు వెడలిపోయిరా?

రామ:—ఈ రాత్రి వెడలిపోవుచున్నారు. తమ విధేయులై యుండునట్లు పోర్చుగీసులందఱచేతను ప్రమాణము చేయించుకొనినాడు. ఈ సందసము సర్వవిషయముల నెఱింగించుచు వారే మనవళేము చేసినారు.

పెద్ది:—విదేశీయులు కదా యని వీరిని విశ్వసించె గాబోలు విశ్వపతి.

తిమ్మ:—పితామహా! ఈ నన్నీజు నాత్మగరిమ నన్ను మోహమున ముంచుచున్నది. అట్టి మహానుభావుడు నా ఆశయము నింతగా గౌరవించుటకూడ సిగ్గగనే యున్నది. నా భద్రమును శిరమున బెట్టుకొని అవస్థ పడుచున్నాడు.

రామ—అవస్థ ఏమున్నది? తన దేశస్థులనుట సులభముగనే వారిని మనదాసుల జేయగలిగెను.

తిమ్మ:— మా ప్రయాణమున కన్ని యేర్పాటులను జరిగెనా?

రామకృష్ణ:—చిత్తము. తమరెప్పుడు ప్రయాణమయ్యెదరు?

తిమ్మ:—ఆమె వచ్చుటతోడనే.

రామకృష్ణ:—ఆమె వచ్చియేయున్నారు.

పెద్ది:—ఎవరు?

తిమ్మ:—నేను నాకుమారుని వెంబడించి పోవుచున్నాను. నా వ్యూహములను సావధానముగా రామకృష్ణకవిగారు మీకు విశదము చేయగలరు. తమ రాశీర్వదించిపంపుడు. తొందఱపనులున్నవి. (రామకృష్ణకవి స్మృతి నభినయించి లోనికిపోవును.)

పెద్ది:—అయిన నేను సెలవు పుచ్చుకొందునా? ఆఁ. విశ్వపతి నగరరక్షణ కంగీకరింపలేదు.

తిమ్మ:—అవును. అంగీకరింపడు. గజపతిరాయలు తొరసిల్లుచున్నారు. తానచ్చట నుండవలెను. సుల్తానుకూడ వచ్చును. ఎవరి అంత్యముమీద తనభాగ్యమాధారపడియున్నదో, పొంచియుండవలదా?

పెద్ది:—నే ననునది ఎందులకనవచ్చిన యాయా సమిది. విశ్వపతిని రహస్యముగ నేల తెగటార్చరాదు?

తిమ్మ:—(చిరునవ్వుతో) అధీరులనీతి, అది మన కెందుకు? పితామహా! తమరినిజూచిన భయముగుచున్నది. ఎప్పుడో తమరాపని గావింతురు. తమకోప ముగ్రనర్యల కులుకును. తమకొక పరమరహస్యమును దెల్పెదను, వినుడు. మనము వృద్ధుల మగుచున్నాము. ఈ రాజ్యసంవృద్ధికి మఱియొకసమర్థుడగు యువకుడు కావలెను. అప్పుడుగాని, మనమిప్పుడు ప్రతిష్ఠించిన ధర్మములు మఱికొంత కాల ముత్సాహక్రమమున నడచుటకు నూతయివ్వవు. విశ్వపతి రహస్యము నాకు తెలియగనే వాని అద్భుత సాహసము వానియోగ్యతను స్ఫురింపజేసినది. వీనిని సాధుత్వమునకు, త్యాగశీలమునకు, పరోపకారమునకు లొంగదీసిన నితడు మన రాజ్యమున కెంతయు నుపకరింపగలడు. వానిని నాకు దక్కించుతునని నాకు వాగ్దానము చేయవలెను.

పెద్ది:—తమకు నే నెప్పుడు విధేయుడనే కావలసి వచ్చుచున్నది. తమ ఆశయము జయమగు గాక! (పోబోవును)

తిమ్మ:—ఆఁ. నగరమునందుకాని యుద్ధమునందుకాని సేనాపతులకు నాయాజ్ఞలు గుప్తముగ వారికే సరాసరి చేరుచుండును. అందుచే వారొకప్పుడు తమ యాజ్ఞల నుల్లంఘించునట్లు తోచవచ్చును. కాని తమరు క్షమించవలెను.

పెద్ది:—ఎప్పటికో పునర్దర్శనము?

తిమ్మరుసు:—భయము లేదు. తిమదీవన యమోఘము. పోయిరండు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దిరాజు:—జయము. (ప్రస్థానము.)

తిమ్మరుసు:— రామకృష్ణా! (రామకృష్ణకవిలో నుండి ప్రవేశించును.) మమ్ముమహత్యచేయు భార మొకటి పాప మావర్తకులపై నున్నదికాబోలు. రేపువారు విశ్వపతికి చెప్పవలయు సమాధానమును వారి కెటింగించుట మంచిది. లేఖవ్రాసి పంపుదమా?

రామకృష్ణకవి:—వారి సైనికు లిప్పటనే యుండిరికదా!

తిమ్మరుసు:—మన భటునిచేతనే శ్రేష్ఠికడకే పంపుము. వాని కీలేఖనుచూపి వెంటనే దానిని చించివైచిరావలెను.

రామకృష్ణకవి:—వ్రాయుడు. మన వేగులలో నొకని కీపని నిచ్చెదను. [ప్రస్థానము]

తిమ్మరుసు:—(లేఖవ్రాయుట నభినయించి) ఈ యుపాయముచాలును. సుల్తానుని మోసముచేయవలెను. యుద్ధముకూడదు. గజపతిని రాయలకు స్నేహితుని జేయవలెను. చిన్నారాణినే అందులకు ప్రయోగించుట మంచిది. సరి— (యవనిక.)

రంగము 3

స్థానము—రాయలమందిరము.
సమయము—ఉదయము.

(విశ్వపతి ప్రవేశము.)

విశ్వ:—అడుగడుగునకును సుడులుగొట్టుచు గండము లెదు రుబుకుచున్నవి. పగసాధింపవెడలిపోయిన గోవిందరాయలు నాప్రాణము నేల గురిచేసికొనడు? అబ్బో! యుద్ధమా! ఆయనుభవము లేదే! నాయాటలేమి సాగును? క్షత్రియవిద్యల నన్నిటినెంతో శ్రద్ధతో నభ్యసించితిని. ఏమిలాభము? విద్యలెప్పటికిని విద్యలే. రిపుప్రాణహరణలాలసుడగు యోధుడు బలిమిమై వీలుగొని యాక్రమించునేగాని శాస్త్రగౌరవమున క్రమపాతముల ఖడ్గమును ద్రిప్పునా? వ్యూహప్రయోగములనైన ప్రత్యక్షపరిచయము లేదు. ఈసామగ్రితోనే బోయిచేయునదేమి? ......ఏమియు లేద ? (దాసీప్రవేశము) ఏమియు లేదా విశేషము?

దాసి:—చిన్నారాణిగారు కనబడలేదు. రాజుగారు కోపముతోనున్నారు. మీకు ముందుగా—

విశ్వ:—శకునపక్షీ! నీకు మతి సరిగనున్నదా? ఏమి వదరుచున్నావు? (దాసీ భయము నభినయించి ప్రస్థానము) ఇది కూడ తప్పించుకొని పోయినదా? నాపై పగసాధించును కాబోలు. నా ప్రాణమున కీ పిశాచి ఎక్కడ దాపరించినది? ఇంక కొలది దినములో పికపట్టిన, తాను పోవుటెందులకు? సంతోషమున నేను సాగనంపెడి వాడనే మృత్యుగర్తమునకు?...ఆహా! రాయల కిప్పు డేదియో సమాధానము చెప్పక తప్పదే? "మీ పుట్టుపూర్వోత్తరము లేమి" యని ఇప్పుడైన నిర్బంధపెట్టక పోడే! ఏమి దిక్కు? ఇదియైన నెవటికి బోయె? ఇప్పట ఎవరు దానికి దిక్కు? ద్వారరక్షకా! మాకొఱకై పోర్చుగీసువర్తకశ్రేష్ఠి మామందిరమునకు వచ్చియుండును. ఇప్పటికి దోడ్కొని రమ్మని సేవకుని పంపుము...అతడైన రాత్రి నాపని గావించియుండెనో లేదో!

(విజయుడు ప్రవేశము)

విజ:—ప్రభూ! ఈ లేఖతోబాటు నా జీవితమును తమ కృపాధీనము చేసికొనుచున్నాడను. ఇందుచే నేను రాజద్రోహులకు ద్రోహమును, రాజభక్తులకు దాస్యమును జేయుచుంటినను విశ్వాసమున గర్వించుచున్నాడను (లేఖనిచ్చును.)

విశ్వ:—(లేఖను జదువుకొని ఆశ్చర్యము నభినయించి) నీ రాజభక్తి అత్యద్భుతము. నీకు గొప్ప బహుమానము సేయవలెను. ద్వారరక్షకా! (ద్వారరక్షకుడు వచ్చివేచియుండును.) వీనిని కారాగృహ యజమానికొప్పజెప్పుము. మాయాజ్ఞవచ్చువఱకు వీనిని నిర్బంధమున నుంచవలెనని తెల్పుము.

విజ:—ఇదియా, నా రాజభక్తికి ఫలము!

విశ్వ:— రాజద్రోహులనుండి నిన్ను రక్షించుటకు వేఱుమార్గము లేదు. క్షమించి సహనము నుపాసింపుము. (ద్వారరక్షకుడు విజయునితో ప్రస్థానము.) ఔరా! ఇది ఏ మాశ్చర్యము? పెద్దిరాజుగారికికూడ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యకాంక్షయా? మేము యుద్ధమున కేగిన తోడనే దుర్గమును తాను వశముచేసికొనుట! పరస్పరసహాయము నకు ప్రతిఫలసూచనగ గజపతితో రాయబారము నడుపుచున్న ట్లీ లేఖవలన స్పష్టపడుచున్నదే? ఆహా! ఈ రాజ్యలక్ష్మిపై నెందఱు కన్నువైచి కాచియున్నారు? జీవితము తిరిగిపోవుచున్నదను గుఱుతుకూడ మఱచి స్వార్థమునెల్ల నిందే జయించుకొను చుండిరే!

శా. ఆదిగ్గొన్నితరాలుగా మురిసి రా
　　　జ్యంబెల్ల వర్ధించె నా
　　త్మాదాయంబుగ వృద్ధతిమ్మరుసు; మీ
　　　దగ్గా వాని బోద్రోలి నా
　　కే దక్కంగద రాజ్యమింక నని శం
　　　కేలేక నేనుండ నే
　　దో దుర్మార్గత నన్నె మ్రింగ నవపు
　　　ద్ధం బేడ ప్రాప్తించెనో?.

కాని, యిప్పుడు కర్తవ్యమేమి? వీని నిప్పు డెదుర వచ్చునా? ప్రతిక్రియ స్ఫురించుట లేదు. ప్రమాదము ప్రబలముగ మొట్టినప్పుడు గాని ప్రతివిధానమునకు నా బుద్ధి ప్రకోపింపదు. వీని ప్రయత్నము కూడ నాకే విని యోగపడవచ్చునేమో! వీని కుట్రను గనిపెట్టి కల్పించు కొనవలెను. సరి. ఈ లేఖనురాయలకు చూపవలెనా? చూపెదను. ప్రయోజనమే కలదు. కాని, వీనిని రాజా గ్రహము నుండి కాపాడుకొనవలయుగూడ. (పోర్చుగీసు వర్తకుడు ప్రవేశము.) ఏమి, విశేషము?

పోర్చు:—గోవిందరాయలు ముందే పారిపోయె గాని, లేకున్న నతడుకూడ చిక్కుపడెడివాడే!

విశ్వ:—మిగిలినవారు?

పోర్చు:—మంత్రిని సకుటుంబముగ బంధించి కొండవీడునందలి మా కోటికి బంపితిమి.

విశ్వ.—అచ్చటి కెందులకు?

పోర్చు:—ఎవరుగాని వారి నీ రాజ్యమున సంహ రించి బ్రదికిపోగలరా? వారి యభిమానులగు సేనాపతు లీ రహస్యమును పసిబట్టుదురేని అప్పుడు మన ప్రాణము నకే ముప్పుగదా! అందుచే నిట్లుచేయవలసివచ్చినది. గమ్య స్థానము నేరగనే ఆపనికాగలదు.

విశ్వ:—అవును. ఇప్పుడు వారే ఎప్పటికో పారి. పోయిరని వదంతివేయవచ్చును. మంచిది. ఆవార్తతో తిరిగి దర్శనముచేయుడు.

పోర్చు:—భాగ్యము.　　　　(ప్రస్థానము.)

విశ్వ:—జిత్తులలో నక్కలను మించినవి యీ బుడతకీచులు. పెద్దననుకూడ నీ నక్కలకే వేయవయ వచ్చును. ఏమి, ఎంతసేపటికిని బయటికిరాడు? (అంతః పురమువైపు చూచి) సేవకా, శ్రీవారేమి చేయుచున్నారు?

సేవకుడు:—(ప్రవేశించి) ఇప్పుడే తమరి నడిగిరి. సౌగంధశిల్పికిరీటమును జక్కసేయుచున్నారు.

విశ్వ:—సరి, నీవుపొమ్ము. (సేవకుని ప్రస్థానము.) కిరీటము నొకడు చక్కజేయవలెను. పాదరక్షల నొకడు తొడుగవలెను. ఆభరణముల వేఱొకడలంకరింపవలెను. బాగున్నది. కట్టుబట్టనెవ్వడుకట్టవలెనో! రాజునుకావలె ననుకొంటిని. నాకు నీ యస్వతంత్రజీవనయోగ మేపట్టును కాబోలునే! పోనీ, మానుదునా? నాకెందు కీరాజ్యము? ఆహా! సద్భావము నొకింతధారణచేసినంత మాత్రముననే దుర్లభ పరాక్రమౌన్నత్యమునుండి సాధు సౌశీల్యమున కొకే అధఃపతితమగుచున్నదే! జాగ్రత్తగనుండవలెను. (రాయలు ప్రవేశించును. విశ్వపతి లేచి) ఓహో! దయ చేయుడు.

రాయలు:—(కూర్చొనుచు) నీ సోదరియెచ్చట?

విశ్వ:—కూర్చుండుడు. చాల ఆరాటముపడి యుందు రనుకొందును. ముందుగనే చెప్పిన తమ రంగీ కరింపరను భయమున కొంచెము స్వతంత్రించితిని. క్షమింపవలెను. మనమా, యుద్ధమునకు బోవుచుంటిమి. రాజ్యమా, చాల అల్లకల్లోలముగ నున్నది. కుమారు డట్లయ్యెనా? ఈమె ప్రాణమున కెవరు ముప్పుదలతురో! ఈభయములచే నాకేమియుదోచక ప్రస్తుత మామెను మాపితృగృహంబున కంపితిమి. మనము యుద్ధమునుండి తిరిగివచ్చుటతోడనే మాతలిదండ్రులే 'చిన్నాను' వెంట



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెట్టుకొనివత్తురు. బావా! అప్పుడు నేనొక దేశమునకు యువరాజునని తెలిసినచోఁ గోపమున నన్నా రాజ్యము నకు తరిమివేయగూడదు సుమా!

రా:—అబ్బా! గొప్పబరువును తీసివేసినావు. ఆభయమే నన్నును వేధించుచుండెను. పోనిమ్ము. మంచి పనినే చేసినావు. నామనస్సిప్పుడేమియు బాగుండ లేదు. నిన్నకొందఱు సేనాపతులు తిరుగబడిరే! కార ణము నూహించితివా?

విశ్వ:—ఏమైయుండును?

రా:—అప్పాజీకి నే నన్యాయముచేసినతినట! నాకు నతనికి నెవరో విరోధు లీరాజ్యముననుండి యీ చిత్రమును నడుపుచుండిరని వారియనుమానమట! వారు నిర్దోషులైన నాతో నేల చెప్పుకొనరాదు? మీదు మిక్కిలి నాపై పగసాధింప గోవిందరాయలు రాజ్యము పీడిపోయెనే? నాయపరాధ మేమి? శిక్షింపలేదు; తరిమి వేయలేదు.

విశ్వ:—అవును. వారిచర్యలు నిర్దోషత్వమును, సాధుత్వమును సమర్థించుచున్నవా? ఈ విచార మెందు లకు? ఆసేనాపతుల నేమిచేసిరి?

రాయలు:—అప్పాజీయే వారిని పిలిపించి ఏమో నచ్చజెప్పి పంపిరట! వారు తిరిగివచ్చి విధేయతను దెలిపి కొని క్షమాపణగోరిరి.

విశ్వ:—తమరు క్షమించితిరి. ఓయి, యనాయిక రాజా! ఏమి, బుద్ధావతారమిది? మేల్కొనుము, తనకు విధేయులగు సేనాపతుల మనయొద్దకాపుంచి రాత్రియే అప్పాజీకూడ లేచిపోయెనే! ఎందులకు? తండ్రికుమారు లిరువురుజేరి విపక్షులగూడి నిన్ను దాకుదురు. ఆత్మరక్షణ మనకు వాని సేనాపతులా, నీకుదిక్కు? అదియుగాక, యీ కపటమేమో నా కర్థమగుట లేదు. ఈ విద్రోహు లెల్ల రెవరికివారో, లేక నిన్నును నన్నును మతిభ్రష్టుల జేయుటకు వేర్వేఱువర్తించు నొకేపత్రలోనివారో, యీ లేఖను జూడుము,

రాయలు:—(లేఖను జదువుకొని) ఆఁ, పితా మహులా! రాజద్రోహమా? ఇది వారి దస్తూరియే. నీ కెట్లు చిక్కిన దీ జాబు?

విశ్వ:—ఈ లేఖను గజపతికి గొనిపోవ వానిచే పంపబడిన విజయుడే రాజభక్తి గలవాడగుటచే రహ స్యము నెఱిగించుచు నాచేతికిచ్చె.

రాయలు:—విశ్వపతీ! ఇందఱెట్లు కాచుకొని యుండ నాకీ రాజ్యమెట్లు దక్కును? దక్కినను ఇందఱి ఘోషతో నా కీ సౌఖ్యమెందులకు? వారిని పిలిపింపుము. రాజ్యమును నేనే పంచియిచ్చెదను.

విశ్వ:—విద్రోహులు వారి కెందులకు? ముద్దుల మఱదిని నేనుంటిని. నాకు పంచిపెట్టుము. వారిలో నే నెట్లో వేగెదను. బావా! ఆగ్రహము వచ్చినప్పుడు సన్యసింపరాదు. దాని ముమ్మరము తగ్గగనే, కాషాయాం బరునకు తిరిగి కామినీ చేలాంచలమే గతియగును. ప్రియ బంధువు లనుకొనబడువారు విద్రోహులైనప్పు డిట్టి విచారము కల్గుట ఉత్తమప్రకృతియే, కాదనను; కాని, ధర్మసంరక్షణ మానవుడైన ప్రతివానికినివిధి. అందును నీవుక్షత్రియుడవు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ నీవిధులు. లెమ్ము. ముందు విద్రోహుల జయింపుము. తెక్కలు గట్టి యీడ్చుకొనివచ్చి సభామధ్యమున బడవైచి— అప్పుడు—నలయుచో నింత రాజ్యముష్టిచే కనికరిం పుము. అప్పుడొక యనిర్వచనీయ తేజము నీపరివేష మున నృత్యము చేయగలదు. రమ్ము. ఈ జయయాత్రలో నేను నీకు సారథ్యము చేసెదను.

రాయ:—కానిమ్ము. అర్జునునకు కృష్ణుడు. నీవు— నాకు.

విశ్వ:—అవును.

మ. జగమేలే పరమాత్మ కృష్ణుడె యటన్
సారథ్యమున్ జేసె నీ
జగమేలే నరుడైన కృష్ణుడె; యిటన్
సారథ్యమేఁ జేసెదన్
యుగధర్మంబులు మాఱుచుండు నరుడో
హో! ఈశ్వరాదృష్టథా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తగవర్ధిల్లుట నేడు నావలన సా
ధ్యంబయ్యె, నేధన్యుడన్.

రాయ:—విశ్వపతీ! వారు చర్యలచే భయపెట్టు చుండిరి. నీవు వింతభాషములచేతనే భయపెట్టుచుంటివి. అయిన నా విశ్వాసము ననుభవించుటకు నీ వొక్కడవే మిగిలియుంటివి. పద; శత్రునిర్మూలనమునకు సంకల్పించి తిని. ఇక నీనే నా ప్రధానివి. నీ సారథ్యమును విశ్వసించి జయయాత్రను సేయుచుంటిని.

విశ్వ:—ధన్యోఽస్మి. ధన్యోఽస్మి. బావా!

ఉ. శ్రీ విజయోస్తు, దేవతలు
శ్రేణుల దీర్చుచు నీజమోదిత
శ్రీ విభవాధ్వమందున ర
చింతురు స్వాగతతోరణంబు లు
ర్వీశ్వర విన్ము, నీకు జయ
పెట్టుచు క్షోణితలేంద్ర కోటి నీ
త్రోవను వెంటనేనడువ
తోలుకువచ్చెద ముందుసాగుమా.

(ఇరువురు నిష్క్రమింతురు.)

యవనిక.

---

## ప్రణయభిక్ష

దినాకర్ల వెంకటావధాని గారు

ధీరవరేణ్యపూజితుఁడు దేశహితైక విధాయకక్రియా
శూరుఁడు సత్వమూర్తి గుణసుందరుఁ డంచు జను ల్వచింప నీ
కీరితి వింటి మేను పులకింపఁగ నెంతయు నాఁటినుండియున్
గూరిమి నీపయింగలిగెఁ గొంతయినన్ మరలింపరానిదై.

కాదనఁబోక నీ చెలిమి గాంచుటకున్ బ్రయతించుచున్న న
న్నాదృతిఁ జూడఁగోరెద మహాత్మ! నిరాదరణంబె కల్గినన్
నా దురవస్థ కేమి యొక నాతి పవిత్రమనోంబుజన్మమున్
మేదినిఁ ద్రోసి త్రొక్కిఁచను మేటియఘం బది నీకుఁ గల్గెడిన్.

ఆననమైన నీ వెఱుఁగ వక్కట, నాపయి మోహమేల? నీ
కో నవలా! యనంగఁ దగ దోమహితాత్ముఁడ! నీమనంబు స్వా
ధీనము నీకుఁగాని కలదే? నను వారణ సేయుశక్తి యెం
దైనను, గోరి నిన్వలచు టందలిదోషము నీ గుణాళిదే.

ఎద విధి చోదితంబనుచు నెంచి నన్ గ్రహియించు పూన్కి త
ప్ప దిఁక ఘుమంఘుమార్భటు లపారముగాఁ జెలరేగ మోహ సం
పదవెలిఁ జిమ్ముచున్ దరికి వచ్చెడు వాహినులన్ మరల్పఁగా
నుదధికి శక్తియున్నదె? తదుత్తమ సంగమ భాగ్య మొందదే?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సన్నిధిఁ జేరి నీ చరణ సారసము ల్భజియించు భాగ్య మిం
కెన్నఁటి కెన్నఁడంచుఁ జలియింపని రాగము తీగె సాఁగఁగా
నెన్నిప్రయత్నము ల్సలిపి యేమిఫలమ్ము మహాత్మ, నేఁటికిఁ
గన్నుల కాంక్షదీర నినుఁ గాంచితి విన్నప మాలకింపుమా.

వనితతనయాఁత వలచివచ్చిన రవంత
మైన గౌరవ ముండఁ బోదని యెఱుఁగుదు
పశము గాకుండ నుప్పొంగు ప్రణయరక్తి
నాపుకొన నెంతునేని శక్యమగునో కో.

మానెదవేమొ ? సంసరణ మగ్నుఁడ నానెడ మాతృదేశ సే
వానిరతప్రచార వినిపాతము గల్గ నఁటంచు నెంచి దే
వా, ననుగూడ నీయభిమతాధ్వము లందునఁ ద్రిప్పికొమ్ము వి
జ్ఞాన మొసంగి నీ నియమ సాధన కేల ఘటిల్లు నడ్డముల్?

చదువఁ నేర్చినదాన ప్రాణవిభు నిచ్ఛాపూర్తికిఁ బ్రాణముల్
వదలఁ జంకని హైందవాంగనను త్రోవంజూపుచుం బొమ్ము నీ
పదపద్మంబుల వెంటనంటెదఁ గడుఁ భారంబె యాఁగాక, సం
పదలు భోగమె కోరుదాన నని సంభావింపఁగాఁ బోకుమా!

ఇంతకు మించి నీకు వచియింపఁగఁ దగ్గది కానరాదు, నీ
స్వాంతము వచ్చెనేనియు శుభంబె తిరస్కృతిఁ జూపుదేని జ
న్మాంతము దాఁక నీశ్వరు ననంతరజన్మము నందునైన ని
న్గాంతునిఁ జేయఁగోరి యధికంబగు భక్తి భజించుచుండెదన్.

---

బండి సేతుపతిసౌధముముం దాగినది. ఆగి నెమ్మదిగా నంతఃపుర ప్రదేశముకడకు పోయినది. ఏకవీర గవాక్షమునుండి మీనాక్షిని చూచి మేడదిగివచ్చి యామెనుగలుసుకొన్నది. మీనాక్షి యేకవీరను చూచినది.

ఏకవీర ఆనాడు తెల్లని పట్టుచీర ధరించినది. శిరోజము లభ్యంజన మాచరించినట్లు పొడిపొడిగా నున్నవి. ఆమె కనులలో నొక లోలత్వ మున్నది. అది లోలత్వమనుట కన్న మోహనత్వమనిన బాగుండును. కంచుకము కూడ బంగరుపూవులుగల తెలిపట్టుది. అపుడామె తెలిమొగిలి పొరవలె నున్నది.

ఆనాడామెను మీనాక్షి చూచినంతనే పూర్వమామె నెప్పుడో చూచితి ననిపించినది. ఉలికిపడి మరల చూచినది. ఇంతలోఁ బరిచారిక తెచ్చిన మెఱ్ఱసేలువ నేకవీర కప్పుకున్నది. మీనాక్షికి మరల తన పరిచితురాలే కనిపించెను. ఏకవీర వివాహమైనదిమొదలు ఆకుపచ్చ చీరలు ధరించును. సర్వావయవముల యందు నేడు వారముల సొమ్ములు తాల్చును. వివాహపూర్వము తెల్లనిపట్టుచీరలు తాల్చెడిది. తలయెప్పుడు పొడిపొడిగా నుంచుకొనెడిది. వివాహానంతరమున తెలిచీర తాల్చినది. కుట్టాన తనశయ్యమీద నామె నిద్రించినది చూచినరాత్రియే మొదటిసారి. అది మొదలు కుట్టాన పెట్టిన గడువు మొదలు నెలనెల కమావాస్యలనాడు తాల్చుచు వచ్చినది. గడువు రెండేండ్లు గడచినది. ఏకవీరకు కుట్టాన మాటలయందు నమ్మకము పోయినది. మనసు క్రమక్రమముగాఁ దాను తొల్లి ప్రేమించిన యతని మీదికి తిరుగుచు వచ్చినది. అతనిని గూర్చి యూహాలు వచ్చినప్పుడెల్ల నేకవీర తెలియుడుపులు ధరించుచుండెను.

ఏకవీర కతనినిమూరు తెలియదు; అతని పేరు తెలియదు. మరి యేమి తెలియును? చంద్రసుకుమారమైన యతని మొగ మెఱుగును. అతని దీర్ఘాకృతి తెలియును. అతని సూదులవంటి కనులు తెలియును. అతని తుమ్మెద రెక్కలవంటి మీసములు తెలియును. ముందు పాయలుగాఁదీసి వెనుక ముశికొదిగిన యతని కేశపింఛము తెలియును. తమ యిద్దరి నడుమ త్రెంచరానిదిగా నున్న స్వచ్ఛ ప్రేమబంధము తెలియును. తన మొగములోని సౌందర్యమంతయు తాను తెల్లచీరధరించి తల పొడిపొడిగా నుంచినప్పుడు పట్టరానిదిగా నుండు ననికూడ నామెకు తెలియును. వివాహమైన రెండుసంవత్సరములుగా నేకవీర యాతని మరచిపోయినది. అతనిస్థానమున కుట్టానునకు వసతి నిర్మించినది. కుట్టా నావసతిలో నిలచినాడు కాడు. తాను నిర్మించిన ప్రేమసౌధమునకు కుట్టాన తీసిన నిర్దయాద్వారమునుండి తన తొల్లిటి వలపుకాడు ప్రవేశించినమాట యేక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీర కవగలిము కాలేదు, తన కిప్పుడు పెరిగిన తెల్లపట్టుచీరలమీది మక్కువ వెదకి చూచుకొనలేదు. తన తొల్లింటి ప్రేమోమూర్తి యామెకనులకు కట్టినట్లుండెను. ఆమె యతని ప్రత్యక్షమైన మూర్తినిగూర్చి, దాని నిలుకడను గూర్చి వితర్కించుకొనలేదు. అది యామెకు సర్వలోకములనుండి తాను గుప్తపరచుకున్న ధనము. ఆధనమునకు యాథార్థ్యము లేదని యామెకు తెలియును. ధర్మమునకు సాధనము యాథార్థ్యమునకు దవ్వైనది. అందుచేత నామె ధర్మబద్ధమై యాధనముమాట మరచిపోయినది. ధర్మముతోడి ధనము నభిలషించినది. ఈక్రొత్తధన మామెకు స్పర్శదూరమతిగమించినది. ఈరెండుధనములామెకయథార్థములైనవి. మొదలిధనము మధురప్రేమమయమైనది. రెండవధనము ధర్మప్రేమమయమైనది. తనకు దూరములైన యీరెంటిలో నేది మనస్సున నిల్పుటకు యోగ్యమైనదో ఆమెకు తెలియలేదు. తెలివికొలది రెండవ దానిని మనసు నామె నిలుపును. తనకు తెలియకుండ మొదటిది తానువచ్చి తనమన సావరించును. ఆయావృత్తి యామెకు తెలిసీ తెలియనట్లుండును.

తన్ను చూచినంతనే మీనాక్షి యులికిపడినదెందు కాయనుకున్నది. ఏకవీర మరల తనసౌందర్యమునకు ముగ్ధురాలయినదని సమాధానము చెప్పుకున్నది. ఇంతలో నిద్దరు తొల్లింటి పరిచితలవలె మాటలాడుకొనిరి. ఆ యులికిపాటు మీనాక్షి మరచిపోయినది. ఏకవీరకు మరపురాలేదు.

ఇరువురును జాజిపందిరి క్రిందుగా నేకవీరగదికి పోవుచుండిరి. ఒక పసరుమొగ్గ యేకవీరపై పడినది. ఒక పచ్చియాకు మీనాక్షిపైఁబడినది. పందిరి యంతయు వర్షముకొరకు నెదురుచూచుచున్నట్లు చెదురుపూలు విరిసినది. వర్షమును రమ్మన్నట్లు చిన్నగాలి కాకులు కదులుచున్నవి. పందిరిలోఁ జీకట్లు క్రమ్మినవి.

ఆకసమునఁ బడమటిదిక్కున బురదవలె వ్యాపించిన నల్లని పెద్దమేఘము నుద్ధృతి చూచి బండివాడు వర్షాశంకి శకటమును దూరాననున్న శకటములు నిల్పుచావడికిఁ గొంచుబోయి యెడ్లతలత్రాళ్లు చక్రములకు బిగించికట్టి సేతుపతుల శకటసారథుల పసిపిల్లతో నెనిమిదేండ్ల బాలికతో ప్రసంగములోనికి దిగెను. దానిపేరు అమృతము.

పిల్ల—ఎవరు వచ్చినది ?

బండివాడు—స్థానాపతిగారి అమ్మవారు.

పిల్ల పరికిణీతోడపైకిలాగి జనపనారత్రాడు పేనుచుండెను. ఆపిల్ల తలవెంద్రుకలు సంస్కారహీనములై రాగిబొచ్చువలె దాని మొగముమీద వ్రాలుచుండెను. త్రాడు పేనుచుండగా నాపిల్లకు తొడ మంటపెట్టి యుమ్మితీసి తొడకురాచుకుని బండివానివంకచూచి యతడు తనవంక చూచుటలేదని మరల తనత్రాడు పేనుకొనుచుండెను. చల్లని యీదురుగాలి యొకడువచ్చి యాపిల్లతలమీద నెండుతుంగ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుబురుమీాదవలె యథేచ్ఛముగా విజృంభించె ను. దానికనులలో చల్లగాలిచొరబడి చిన్ని కన్నీటిబొట్లు తెచ్చెను.

బండివాడు—కుట్టూణ సేతుపతి మహా రాజులుంగా రెపుడు వత్తురు.

పిల్ల—ఎవరు ?

బండి—బాబుగారు.

పిల్ల—బాబుగారా ? (అని ఆగి) నాకు తెలియదు.

చిన్నతుప్పర మొదలుపెట్టెను. అది పెద్ద వర్షమునకు మొదలని బండివా డనుకొనెను. పిల్లలేచి చూాడుదాకపోయి తనచేతులు వాన లో చాచి చేతులు తడిసిన తరువాత రెండు చేతులు మొగమున రాచుకొనెను. బండివా నిని చూచి నవ్వెను. అంగడినుండి యేవో సరుకులు కొనితెచ్చు సేవకుడు తడిసిపోదునని తొందరగా నడచుచుండెను. తుప్పర పెద్ద దయ్యెను. గుఱ్ఱపుసాలలలో కట్టివేయబడిన గుఱ్ఱములు పెద్దచినుకులు నేలపై నాకులపైఁ బడి చేయు సవ్వడికిఁ గనులు పెద్దవిచేసి వెను తిరిగిచూాచెను. ఒక గుఱ్ఱము సకిలించెను. ఆ సకిలింపు నందిపుచ్చుకొని గుఱ్ఱములన్నియు సకిలించెను. ఆరుబయటనున్న తడియరాని వస్తువులను పరిచారికలు లోనికిఁ దీసికొనిపోవు చుండిరి.

ఇరువురును గలసి లోనికిఁబోవు లోపుగా నేకవీరనేలువంచు తడిసినది. ఇరువురును గది లో పట్టుపరుపులపైఁ గూర్చుండిరి. ఒక పరి చారికవచ్చి యేకవీరపై నేలువతీసి దులిపి దూరమున గాలికారఁ బెట్టెను. ఇంకొకదాసి మరల నింకొక నేలువతెచ్చులోపల మీానాక్షి చకితయయ్యెను. ఎక్కడనా యీామెను చూచితినని యామె పోల్చుకొనలేకపోయెను. మీానాక్షి యాకదలిక యేకవీరకు తెలియక పోలేదు. ఆకదలిక కేకవీర చెప్పుకున్న యర్థము వేరు.

మీానాక్షి గార్హస్థ్యవృత్తాంత మేక వీరకు తెలియదు. ఏకవీరసంగతి మీానాక్షికి తెలియును. మీానాక్షికి తెలియునని ఏకవీరకు తెలియదు. ఏకవీర యూహలో తమప్రేమల గూర్చినంతవరకు ఒకరిసంగతి నొకరు తెలియ రాని గూఢతఁజేసి గౌరవమునందు సమాన ప్రతిపత్తికలరని విశ్వాసము. మీానాక్షికి స్థానా పతికి గాఢప్రేమము కాబోలును. లేకున్న మీానాక్షికింత యుత్సాహ మెక్కడిదియని ఏకవీర మీానాక్షి యూహలో నేకవీరరహ స్యము తనకు తెలిసి యునికి నసమానప్రతి పత్తి. ఆమెరహస్యము తనకు తెలిసియుంటఁ జేసి యేకవీరయునిన యొకవిధమైన లోకువ. ఆలోకువతనములో నగౌరవ మీాషత్తును లేదు. ఆరహస్యము తెలిసిన మీానాక్షికి నేక వీరతోఁ జనవు సహజముగాఁ బుట్టినది. ఈ సంగతి తెలియని యేకవీర కాచనవుభాగ మవ గతము కాలేదు.

స్త్రీలు సామాన్యముగాఁ గలసి కొన్న పుడు తమ భోగములనుగూర్చి వారికి తెలియ జేయుట యలవాటు. నొగ్లు, త్రోవలు పడక గది, జవాహిరీ యితరస్త్రీకి చూపించి వారి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దృష్టిలోఁ దానుగౌరవము సంపాదించుకొనుట స్త్రీలకు సహజము. ఆ సంగతి తెలిసికొనఁ బ్రయత్నించుట నూతనలకు సహజము. ఇన్ని సాక్లేకవీ రామీనాక్షులు కలసికొనినను మీనాక్షి యాప్రసంగము తెచ్చినది కాదు. ఏకవీరకనుమానము. తమ వైముఖ్యము స్థానాపతికి తెలియునని కుట్టాన తనకు చెప్పినాడు. స్థానాపతిభార్యతో చెప్పి యుండవచ్చును. ఇది యేకవీరకు మనస్సులో నొక కష్టశల్యము.

ఆనా డేకవీర మీనాక్షిని తీసికొనిపోయి, యిల్లంతయుఁ జూపించెను. ఆ మహాసౌధమున నున్న శిల్పమునకు వైశాల్యమునకు భాగ్యమునకు మీనాక్షి తల తిరిగిపోయెను. చివరకు పడకగది చూపించెను. ఆ మెత్తయిన మంచము ఆమంచమునందలి పనితనము, గోడలలోనున్న దేవతావిగ్రహములు మీనాక్షి కదియొక స్వర్గమనిపించినది. ఇరువురును మెట్లమీదుగా పెద్ద మంచముపై కెక్కి దానిమీదఁ గూర్చున్నారు. బయట జాజిపందిరిమీద చినుకులు పటపటధ్వనులు చేయుచుండెను. చల్లనిగాలి గవాక్షముగుండ గదిలోనికి బొంయిమని పోసుకొన్నది. ఇద్దరి నేలునలు తొలగిపోయినవి. వారు మరల సర్దుకొనలేదు. మీనాక్షి మనస్సులో నొకవర్షాకాలగాఢనీలావిల శర్వరీమధ్యవేళాగగనభాగపరివ్యాప్తకాలమేఘ గర్భభేదిమైన సౌదామని మెరసి మరల గాఢాంధకారములు క్రమ్మివైచెను. పరిక్షాళితమైన యొకపాపవాంఛాస్మృతి యామె మనసు లోతులలో సంగతమయ్యెను. లోనిమాధుర్యానుభవము ధర్మభీతి నంకురించనీయ లేదు. ఏకవీర పయ్యెద తొలగెను. నేత్రములర్ధనిమీలితము లాయెను. వాన జోరుమని కురియుచున్నది. వంతెన క్రిందితూములనుండి నిండు కాలువ నీరు వడబోసుకున్నట్లు మరల నీదురుగాలి గదిలోనికి పోసుకున్నది. మంచముపైన దుప్పటిలేచి వారి యిరువురి పైన పడ్డది. ఆగాలి చలి కాగలేక యేకవీర తన నేలువతీసి కప్పుకొని లోని తన దేహము ముడుచుకున్నది. ఆగాలి చలి కొడలు పులకించి మీనాక్షికంచెల ముడిసడలనిచ్చి యెదుట మ్మున వానచినుకులుపడి రెండుచేతులు చాచి చల్లనిగాలిని కౌగిలించుకున్నట్లు చేతు లెద నదుముకున్నది.

కొంత సేపటికి వాన వెలిసినది. బండివాడు శకటము తెచ్చినాడు. మీనాక్షివచ్చి శకటమధిరోహించెను. బండితరలిపోయెను. బండిలో పోవుచున్న మీనాక్షికన్నులు నేకవీరకన్నులు కలసినవి. అదే వీడుకోలు. వచ్చినది మొదలు వెళ్లువరకు మీనాక్షికి నేకవీరకు నొక మాటమైన జరుగలేదు. ఏకవీరకు విచిత్రమైనది. సేతుపతులసౌధము దాటిపోవుచున్న మీనాక్షికి చెరసాలనుండి బయలుపడ్డ ట్లయినది. ఆమె పెద్దయూపిరి తీసికొన్నది. వానచేత రాజబాట యంతయుఁ దడిసినది. దారిప్రక్క నీళ్లునిలచినవి. ఇంతవాన కురిసినదని మీనాక్షికి తెలియనేలేదు.

వర్షర్తువు సకలముఖముల విజృంభించినది. గగనకూటపు టెల్లలయందు గుంపులు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుంపులై మవ్వపుశంపలవంపులు సొగసుదాళ్లు హరించినవి. మొగిళ్లు అంపిలి నల్దెసల మొరసినవి. ఆకాశమునందు దూరమునుండి రివ్వుమన్న సవ్వడి వరుసకట్టిన బలాకముల ఱెక్కలదో, పరుగెత్తుకొనివచ్చు వానజల్లుదో తెలియుటలేదు. భూతమాంత్రికునిచేత బలాత్సమాహూతమైన యొకశక్తి వాయువీథికల ఛేదించుకు వచ్చినట్లు వాయువులు పెల్లురేగి మహాధ్వానముతో విజృంభించినట్లు నిశ్శబ్దనిశావేళ తుపానురేగిన సముద్రపుహోరు వినవచ్చినటు దూరమునుండి వానజల్లులమ్రోత వినవచ్చి జనులు వెనుదిరిగి చూచుచుండిరి. వడగళ్లకై వెదకులాడి యొక చప్పని వడగల్లు నోట వైచుకొని పిల్లలు తమకు తగిలిన దెబ్బలు మరచిపోవుచుండిరి.

అందందు చిన్నపడెలుపడెలుగానైన వాన నీళ్లలో గోరంకలు దంపతీయుక్తముగా కీచుకీచుమని రెక్కలుతడుపుకొనుచుండెను. శిశిరచంద్రజ్యోత్స్నకలహాంతరితవోలె జలదాంతర్నిగూఢబాష్పమై విముఖకా మొగలిపొట్టలలో నీరు నిలచి ఖండితసజలదీర్ఘసితాపాంగభ్రాంతి కల్పింపరాజహంసి భీతమై ప్రోషితభర్తృకవలె తామరతీగ గొడుగాకుక్రింద తలదాచుకొగా, నెమ్మి పురివిప్పి స్వాధీనపతికవలె నృత్యాభిరామమూర్తికా, మందారపూవును వదలి రాలేక రాలేక వచ్చిన తుమ్మెదయెడ నెఱ్ఱగన్నేరు ఈర్ష్యాకషాయితకా, వాసకసజ్జికవోలె నలంకరించుకుని కడిమి మేఘనాథునకు స్వాగతము పూన, బలాకాపాంగ మేఘనీలపటపరివృత యాకాశలక్ష్మి కాలపురుషుని నభిసరించ, విప్రలబ్ధాకృశీభూతదేహయష్టివలెఁ బోకమ్రానుపై మొవ్వలోని యాకులవెంట కన్నీరు గార్చు వర్షాశ్రీసర్వాఁసాకృతివలె మోహనాతిమోహనయయ్యెను. నాగలి యఱ్ఱున లాగుచున్న పొలము కాపుటెద్దుండియుండి తన మొగమున నిలచిన వాననీరు తలకదల్చి విదల్చుకొనుచుండెను. పెద్దచినుకు రాయిపెట్టి కొట్టినట్లు పడగమీద విసురుకొనగా బుస్సుమని మెగిరి కోడెత్రాచులు గాలి కబళము ప్రక్కవాటుగాఁ గొరికి దున్నిన మెట్టచాలుల వెంట పొలము కోరడివెంట కంచెలలోని పుట్టలకు పరువులెత్తెను. పాచిపట్టిన పెద్దపొలము బావుల నీటిమట్టపు కొండరాళ్లు వెలికివచ్చి ప్రక్కదాగులు పడియున్నట్లు బావురు కప్పలు వర్షాలక్ష్మి లంబాడియువతివేషమువేసి కాల ధరించిన నత్తగుల్లల గొలుసుల బొణుగురు రవమువలె రాత్రిందివము లొకటే యరపులరచినవి. వాన వెలిసి క్రింద బురదపైన తూనిగలాడుట గాలిలేమి సాయంసమయములందు పొలము కాపులకు కిచాళైపోయినది.

౨౦

ఆ సంవత్సరమున శ్రావణశుద్ధముననే వర్షములు విజృంభించినవి. కాళయ్యార్ కోవెలలో సుదర్యక్ సేతుపతి కోటకట్టి కొంతసైన్యమచటఁ గాపుంచెను. హఠాత్తుగా సుదర్యక్ సేతుపతి వెళ్లిపోవుటయు కుట్టాక్ సేతుపతి వచ్చుటయు సూచనగా రాజువ్యాధి, యాయన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మృతి రామనాథమున వార్తగాపొక్కి వ్యాపించెను. కుట్టా్ణి కుఱ్ఱవాడు. అతని ప్రతాప మెఱుగని కాళయ్యార్ కోవెలలోని దోపిడి గుంపులకు అతడన్న భయము లేకపోయినది. చెదరిపోయిన గుంపులను చేరఁదీసికొని యొక నాటి రాత్రి హఠాత్తుగా పోర్చుగీసువా డొకడు నాయకుడుగా కాళయ్యార్ కోవెల దుర్గము ముట్టడింపఁబడెను. లోన రెండువందల సైన్యము మాత్రమే యున్నది. వారే కోటతలుపులు మూసి యుద్ధ మిచ్చిరి. రెండువందలమంది మధురరాజసైనికులు నిరాయుధులై బయట నుండి పోయిరి. వార్త కుట్టానునకు మరునాడు ప్రొద్దున తెలిసెను, ఆవరకే దుర్గము శత్రువులకు స్వాధీనమై యుండుసని వార్తావహులు వచ్చిరి. కుట్టా్ణి మాటాడలేదు. మరల మరల రాయబారులచేత నడుగఁబడి కుట్టా్ణి తానప్పుడు రామనాథమును వదలివచ్చుటకు వీలులేదనియుఁ దానువచ్చినచో రామనాథములో నల్లరులు పేటురేగవచ్చుననియు జెప్పి వారిని పంపించెను. రాయబారులు విషణ్ణవదనులై వెడలిపోయిరి. ఈవార్త రామనాథమున వ్యాపించెను. కాళయ్యార్ కోవెలకును వ్యాపించెను. కాని రామనాథమున పట్టమంగళమున దుర్గములు యుద్ధములకు సిద్ధములు చేయబడుచుండెను. రాజసైనికులు ఆయుధములు పదునుపెట్టుకొనుచుఁ గోటలోనికి సాధన సామగ్రి నింపుకొనుచు ముట్టడి కెదురు చూచుచున్నట్లే తోచిరి. అందఱును కాళయ్యార్ కోవెల శత్రుహస్తగతమైన దనుకొని రి. లోని సైనికులు నిరాశులైరి. వారిలో కొందఱు కోట శత్రువులకు స్వాధీనము చేయుద మని మఱికొందఱు వద్దని వాదపడిరి. కోట వెలుపల నాలుగువందలమంది ప్రజలు కత్తులు కటారులు తుపాకులు ఉన్నవిగాని వారికి గుఱ్ఱములు, నేనుగులు, పిరంగులు లేవు.

మూఁడవనాటి సాయంతనమున ముట్టడి. ప్రజలు కోటతలుపులవద్ద ద్వారభేదన ప్రయత్నములు చేయఁజొచ్చిరి. వారందరిలో నొక యువకుడు మిగుల నుత్సాహము చూపుచుండెను. అతడు సులువుగా తక్కినవారి హృదయ మాకర్షించెను. గడ్డపలుగులతో భేదించి పెద్దదూలములను ద్వారములకానించి రెండు వందలమంది పూనినెట్టి తలుపులు ఛేదించ వీలు లేక చివరకు నొక యుపాయ మాయువకునికి తట్టెను. తలుపుక్రింద చిన్నగొయ్యిగాఁ ద్రవ్వి తమవద్దనున్న తుపాకిమందు దానిలోకూరి యగ్నిముట్టించవలెనని అందఱును సంతోషించిరి. గుంపులోనున్న పోర్చుగీసువారుకూడ శ్లాఘించిరి. ఈప్రయత్నములు లోపలివారికి తెలిసెను. వారిలో వారు క్రిందమీదఁబడి తలుపులు తెరచుటకు నిశ్చయించుకొనిరి. ఆ వార్త బయిట నున్నవారికి తెలియజేసిరి. జయజయధ్వానములు పిక్కటిల్లిపోయెను. కాని తలుపులు తెరవబడకపూర్వము కొన్నిషరతులకు వా రంగీకరింపవలెను. కోట కధికారి హిందువుడే యై యుండవలెను. లోపలనున్న సైనికులుకూడ కలిసెదరు. వారినికూడ ముట్టడివారిలోఁ జేర్చుకోవలెను. కొంతవిచారణ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యైన తరువాత నీపరతుకు ముట్టడివారిలోని పోర్చుగీసులుకూడ నీనిబంధనల కొప్పుకొనిరి. సంధ్యారాగము కృశించి చీకట్లలముకొను వేళ కోటతలుపులు తెరచిరి. లోని వెలి సైనికులు మొదట బెరుకుతోఁ, తరువాత చిరునవ్వుతో మరికొంతసేపటికి కొంత చనవుతోఁ గలసికొనిరి. ఇరుపక్షములవారును పెద్దకాగడాల వెలుతురున సభ చేసిరి. కోట యెవరి యొద్దికలో నుండవలెననియు మరల రాజసైన్యమువచ్చి ముట్టడివేసినచోఁ గోట నెట్లు రక్షించవలెననియుఁ బ్రశ్నలు బయలుదేరెను. కోట ముట్టడివేళ నుత్సాహము నెఱపిన యువకుడు కోటకు నాయకుని తీర్మానించినచో నతడే తక్కినసంగతులు విచారించుకొనునని చెప్పగా నందఱును సంతసించిరి. పోర్చుగీసుల కితని ప్రాముఖ్యము మనస్కరించలేదు. కాని వారిసంఖ్య ముప్పదికిమించి లేదు. అందుచే వారు నంగీకరింపక తప్పినదికాదు. సర్వజనీనముగా నా యువకుడే కోటకధికారిగా నెన్నుకొనఁబడెను.

అతడు మఱునాడు కందకము బాగుచేయించెను. క్రొత్తగా నీరు పెట్టించెను. కోటగోడ సడలినచోట బాగుచేయించెను. ముట్టడివేళ బయట మిగిలిపోయిన రాజసైనికులకుఁ గబురంపి వారినికూడ రప్పించి యందరిని కలియనిచ్చెను. ఊరిలోనున్న వారిలో నెవరైనదండులో చేరెడివా రుండిరేమో యని వెదకింపగా నుత్సాహముకొలది రెండువందలమంది వచ్చి చేరిరి. సైన్యము వెయ్యిమంది యయినది. వెయ్యిమంది సైన్యమును పదిభాగములుగా జేసి కోటలోనున్న రాజసైన్యములో వారిని ఆరితేరిన వృద్ధులనుతొమ్మండుగురను, తానును పదిభాగముల కధికారులనుగా నిర్ణయించెను. పోర్చుగీసువారిని ముప్పదిమందినొకభాగములో నుంచి తక్కినసైన్యమునుండి యాభాగములో నుండుట గౌరవ మనుకున్న వారి నందరిని తెప్పించి యాభాగములోఁ జేర్చెను. ఈ భాగమునకు తానే నాయకుడు. తాను వారిని మిక్కిలి పొగడి కోటమెగ్గడివేళ వారే సహాయపడవలెనని యుద్బోధించి తక్కిన తొమ్మిది వందలమందిని కోటకు నాల్గువైపుల నాల్గు రెండువందల నునిచి వందమందిని తనకు ననుచరులుగా నేర్పరుచుకొని యాపోర్చుగీసు భాగమునకు పనినేరుపరచక వదలెను. కోటకు మిక్కిలి యపాయము వేళఁగాని వారిని కదల్పరాదని చెప్పెను. వారును ప్రమత్తులై యథేచ్ఛముగా నూరివెంటఁ దిరుగుచు కోటకు వచ్చుచుఁ బోవుచుండిరి. రెండుమూన్నాళ్లుయిన తరువాత నాయకుడు వారిని గ్రామములోనికిఁ బోవునపు డాయుధములను కోటలోననే వదలిపోవలెనని యాజ్ఞ యిచ్చెను. వారు ప్రమత్తులై త్రాగి యారెండునాళ్లుగా గ్రామములో చేసిన యల్లరుల మూలముగా నీయాజ్ఞ సైన్యమంతకు సమంజసముగానే కనంబడెను. ఒకనాటిరాత్రి పోర్చుగీసు సైన్యభాగము కోటలోనికి రాలేదు. రాతిరి కోటతలుపులు వేయబడెను. వారు వెల్లిపోవునపుడు వారాయుధములు కోటలో వదలియే పోయిరి. ఆ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాత్రి నాయకుడు సభ చేసి వారా రాత్రి కోటకు రాకపోవుట దోష మని నిరూపించి నెమ్మది నెమ్మదిగా వారు గర్వముగలవారని పోర్చుగీసు వారిని నమ్మరాదని, వారిని తాను పొగడిన పొగడ్త యబద్ధమని, వారెవ్వరుగాని తక్కిన వారికన్న పెద్దయుద్ధనిపుణు లేమికాదని సైన్య ము మనస్సు వారియెడల విముఖముగా జేసెను. రాజసైన్యముమీాద తిరుగుబాటు చేసిన ముట్టడి నాయకులనందరిని నాయకు డా భాగములోనికి దీసెను. నాయకుడు వారిని గూర్చి చెప్పచు వారే ముట్టడికి ప్రధానులని 'మొన్న రాజసైన్యముమీాద దిరుగబడిరి. రేపు తమమీాద దిరుగబడెద' రని చెప్పెను. సైన్యములో నెక్కువభాగము వారియెడల విముఖత దాల్చెను. ఆ పెద్దసభను వదలి నాయకుడు సైన్యభాగముల నాయకులను బిల్చి ప్రత్యేకసభ చేసెను. వారు తొమ్మండుగురు రాజ సైన్యములోని నమ్మిక బంట్లని నాయకునకు తెలియును. అందుచేత నాయకుడు వారితో నిట్లనెను 'రేపు ఉదయర్గ సేతుపతి ఫిరంగులను తెచ్చును. పదివేల సైన్యమైనను తెచ్చును. రాజసైన్యము ముందు మనము నిలువలేము. మనము పోర్చుగీసులను సహాయత పిలువ వలెను. లేదా రాజునకు లొంగవలెను. ఇందు మీాకేది యిష్టము!' పదిమందియు నొకరిమొగ ము లొకరు చూచుచున్నారు. నాయకుడు మరలనన్నాడు. 'మీారీసంగతి పోయి మీాసైన్య ములతో సంప్రతించి రేపు నాకు సలహానిండు నేను రేపుదయమున పోర్చుగీసు సైన్యభాగము తో నొక సాహసకార్యమునకు బోవు చున్నాను. ఎల్లుండి సాయంకాలమున కిందుం డెదను. ఈలోపుగా కోట వీరయ్యప్ప నాయ కుని క్రింద నుండును.'

వీరయ్యప్ప నాయకుడు తెలుగు కాపు. మధుర రాజుల క్రింద పేరుమోసిన జోదు. ఏబదియేండ్లు దాటినవాడు. కోటయిట్లు దోషిడి కాండ్ర వశమగుటకు దుఃఖించుచున్నవాడు.

మరునాడు పోర్చుగీసు సైన్యభాగము ప్రొద్దుననే కోటలోనికి వచ్చెను. వచ్చినదాల స్యముగ నాజ్ఞమీాద సాయుధమై నాయకుడు ముందుగా గుర్రములమీాద కోటనుండి వెడలి పోయెను. వెనుకతలుపులు కిర్రుమను ధ్వనితో మూయబడెను. నాయకునకు ముప్పదియేండ్ల లోపు. నల్లనివాడు. కొంచెము పొట్టివాడు. విశాలములైన నేత్రములు. మీాసములునల్లగా దుమ్మెదరెక్కలవలె నుండును. శరీర మాయ సస్తంభమువలె నున్నది. అతని సేనానాయక లక్షణములును, గుఱ్ఱముమీాదపోవునతనిలాఘ వమును చూచి వెనుకనుండి సైన్యము కోట గోడలమీాదికి, అతనివెనుక నేవచ్చునది,యతని యెడల భయభక్తులు పెంచుకున్నది.

వింట విడిచిన శరము వలె సైన్యము రెండుజాములవరకు స్వారి చేసెను. నాయ కుని యాజ్ఞ నొకచోట దిగి వారు గడియ పాటు విశ్రాంతి తీసికొనిరి. వెంట తెచ్చు కొనిన యాహారమును భుజించిరి. మరల గుఱ్ఱములెక్కి యెక్కువవేగముతో బోయిరి. సైన్యభాగముననున్న దేశీయులకందఱకు వారు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామనాథమును సమీపించుచున్నారని తెలియును. వారు తమనాయకునియెడల నాశ్చర్యము పొందుచుండిరి. అతని సాహసమునకు నివ్వెఱపోవుచుండిరి. ఆనందపడుచుండిరి. ఆ యానందములో నాయకుడు తమయెడల నెంతో యాశపెట్టుకున్నాడందువలన గలిగిన గర్వము నున్నది. ప్రొద్దుగ్రుంక బోవువేళకు రామనాథము చేరిరి.

నాయకుడూరిబయట సైన్యభాగము నాపి యిట్లు చెప్పెను: 'ఇది రామనాథము. రామనాథ దుర్గవృత్తాంత మంతయు నాకుఁ దెలియును. ఇప్పు డొకమహాసాహసము చేయుచున్నాను. మీరందరు రామనాథ సైన్యపుదుస్తులలో నున్నారు. మీ కేమియు గుర్తుపడిపోవుదుమన్న భయము లేదు. ఈ కార్యము నెగ్గెనా మీయశస్సు దిక్కులఁ నిండగలదు.' అని పోర్చుగీసుసైనికుల ముప్పదిమందిని ఒకభాగముగాఁ దక్కిన డెబ్బదిమందిని ఏడుపదులుగాఁ జేసి మూడుపదులు తనతో రమ్మని తక్కిన నాలుగుపదులు కోట నాలుగుదిక్కుల నున్న ద్వారములకడకుపోయి రాతిరి రెండుజాములకు వేచియుండుడనెను. ఆనాల్గుపదులును విడివడి పోయెను. రివ్వున నరువదిమంది సైనికులతో నాయకుడు కోటవద్దకుపోయెను. దుర్గద్వారము తీసియున్నది. నిరభ్యంతరముగ లోన బ్రవేశించెను. ప్రవేశించినంత నే కోటతలుపులు మూయబడెను. నాయకుడు రాజసౌధమువద్దకు శరవేగమునఁ బోయెను. రాజసౌధము ముందు విశాలమైన ప్రదేశమున వేయిమంది యశ్వసైనికులు కవాతు చేయుచుండిరి. నాయకుని చూచిన వెంటనే సైన్యమంతయు జోహారు చేసెను. సేనానాయకుడు గుఱ్ఱమును నాయకునివద్దకు తెచ్చి వంగి నమస్కారము చేసి 'స్వామీ! యేమియాజ్ఞ!' అనెను. నాయకుడనవ్వి! 'సుందరేశ్వరనాయకుడా! మీరు పోర్చుగీసుబంటులు కావలయునేని యీముప్పదిమందిని మీరు సైన్యమున జేర్చుకొనవచ్చును. తక్కిన ముప్పదిమంది కాల్బలము. వారికి శిక్షచాలదు. గోవిందనాథుడుగారికి చెప్పి వారిని పదాతులలో చేర్చుకొనుడని చెప్పుడు' అనెను. వెంటవచ్చిన యరువదిమంది మొగములు వెలవెలఁబోయినవి. అందఱును గుఱ్ఱములు దిగుటకు వెంటనే యాజ్ఞాపింపబడిరి. వెయ్యిమంది యాశ్వికదళము నెదురుగా జూచుచు వారేమి చేయుదురు? గుఱ్ఱములు దిగిరి. కొత్వాలు వారిపేరులు నమోజు చేసికొనెను. ఆరాత్రి నాల్గుద్వారములవద్ద కాచిన నలుబదుండ్రు సౌజన్యముగా నాయకుని ప్రత్యేక దర్శనము పొంది రామనాథ సైన్యదళములోఁ జేరిరి. ఆనూటుగురు నీవిచిత్రమైన వంచనకు ముగ్ధులై పోయిరి. పరవశులయిరి. భీతిగొనిరి. కొందరు కోపగించిరి. వారికోపములు చుట్టున నున్న వేలకొలది సైన్యము చూచినంత రంగు వేసిన గుడ్డతో చేసిన గులాబిపూవుల రంగువలె జారిపోయినవి. వారిలోఁ గొందఱకు నాయకు డెవరో తెలిసినదికాదు. అందులో నొకనికి రాజసైన్యమున నెఱిగినవా డొక డుండెను. వానితో రహస్యముగ 'నాయన ఎవరు' అని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యడిగెను. అతడాశ్చర్యపోయి, 'నీ వెరుగవా! కుట్టాన్ సేతుపతి మహారాజుగారు, ఉదయన్ మహారాజుగారి కుమారుడు' అనెను. వానికి చేయి గుండెలో పలకుఁ బోనిచ్చి గ్రుద్దినట్లయ్యెను. రాతిరి తెల్లవారలా నూరుగురకు నిదుర పట్టలేదు. వారితోపాటు మరి నూరుగురకు పట్టలేదు.

గడచిన మూడునాల్గుదినములుగా మబ్బుపట్టినయాకాశము మఱునాఁ డెండ కాచినది. కాళయ్యార్ కోవెలలోనున్న నాల్గువందల రాజసైన్యములో నున్నవారికి బంధువులు, స్నేహితులు రామనాధసైన్యమునుండి రెండువందలమంది యేరబడిరి. వారితో కుట్టాన్ సేతుపతి కాళయ్యార్ కోవెలకు నాటిసాయంకాలము ప్రయాణమై ఆమఱునాడు సాయంకాలమునకు నెమ్మదిగా కాళయ్యార్ కోవెల చేరెను. నాయకుఁడు డిబ్బడిసైనికులతో వచ్చుట చూచి కోటతలుపులు సంతోషముగా తెరువబడెను.

స్నేహితులు స్నేహితులు కౌగిలించుకొనిరి. బంధువులు బంధువులు చనవుకొలఁది యోగక్షేమము లడుగుకొనిరి. క్రొత్తవారందరు రామనాథసైనికులని క్రొత్తవారిలో నాలుగువందలమందికి పైగాఁ దెలియును. ఈ విచిత్రసంయోగము నిగూఢార్థవంతమై పోయెను. అంతలో సైన్యమంతయు సమావేశము కావలెనన్న పిలుపు హాజారపుగంటలు పిలచెను. పదునొకంటువందల సైన్య మాచిన్ని కోటలోని బయలున క్రిక్కిరిసిపోయెను. నాయకుడు సైన్యము నిట్లు సంబోధించెను. 'నావెంట రామనాథసైన్యము వచ్చుటకు మీరాశ్చర్యపోవుచుంటిరి. ఇచటినుండి పోయిన నూర్గురు సైనికులు రామనాథసైన్యములోఁ జేరి నిన్ననే మొదటినెల జీతము ముందుగా బుచ్చుకొనిరని మీకు దెలిసినచో మీరు మరియు నాశ్చర్యపడెదరు. మీసంశయము తీరుట కొక కథ చెప్పెదను. ఉదయన్ సేతుపతిగారికి కుట్టాన్ సేతుపతియని కుమారుడు. శ్రీ ముద్దుకృష్ణప్పనాయక మహారాజుగారికి మరణసమయము ప్రాప్తించి యుదయన్ సేతుపతిగారు మధురకు వెళ్లి కుట్టాన్ సేతుపతిని రామనాథమునకు పంపించిరి. కాళయ్యార్ కోవెల తిరుగబడెను. కుట్టాన్ ముట్టడివాండ్రలో చేరి తాను వారికి నాయకుడయ్యెను. ముట్టడివాండ్రకు కుట్టాన్నకు వారికి భక్తి వీనికి ప్రేమ కుదిరెను. ఈ విచిత్రసంఘటనమువలన ముట్టడివారందరు కుట్టాన్ ద్వారా మధురరాజు సైనికులైరి. ఒకవందమంది ముట్టడిదారులలో నాయకులా రాజుసైన్యమును ముందుగా చేరిరి. తక్కిన వారు నేడు చేరనున్నారు.' అని నాయకుఁడాగెను.

రామనాథసైన్యము క్రొత్తమంది మహారాజు కుట్టాన్ సేతుపతిగారికి జయము జయమని ఘోషించిరి. నాయకుడు మరల 'ఇక్కడనున్న ప్రాతసైన్యము నాలుగువందల మందికిని రామనాథమునుండి నావెంట వచ్చిన రెండువందలమందికిని వీరయ్యప్ప నాయకులుగారు జీత మిప్పుడే యిచ్చెదరు' అనెను. ఆరువందల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కంఠములు జయజయధ్వానములతో నాకాశ మంటెను. వీరయ్యప్ప నాయకులు చేయిపైకె త్తిగా సవ్వడి యాగినది. నాయకుడు మరల 'తక్కిన యయిదువందల మందిని నేటినుండి మహారాజ సైన్యములో చేర్చుకున్నాము. ఇప్పుడు వారికిఁగూడ నెలజీతములు ముందు ఇచ్చుచున్నాడు. వారికి బహుమానములు మధురనుండి కొద్దిదినములలో రాగలవు.' అనెను. అప్రయత్నముగాఁ బదునొకండువందల మంది జయఘోషముచేసి వాయువీథులసహజ శబ్దగుణసామర్థ్యమును బ్రద్దలుకొట్టిరి. సైన్యము శాంతపడినతరువాత కుట్టాణ మహారాజు వెల రాళ్లు పొదిగిన పిడులతోడితొమ్మిది ఖడ్గములు తొమ్మండుగురు సేనానాయకులకు బహుమతి చేసెను. వీరయ్యప్ప నాయకుని మొగ మానంద బాష్పములచేత చల్లని చెరువునీటి కెరటాలు చిందిన తామరపూవువలె నుండెను. తక్కిన యెనమండుగురు నాయకులును కన్నులలో నాశ్చర్యము, పెదవులలో కదలిక, గుండెలలో భీతి, శరీరములందు వినయము, శిరస్సులయందు కృతజ్ఞతా నమ్రత్వము తాల్చిరి. సైన్యమంత యుఁ గూర్చున్నది కూర్చుండగానే డబ్బుపంచి పెట్టబడెను. సైన్యమునకంతకు తెల్లవారువరకు నిద్రలేదు. తరువాత కొంచెమునిద్ర. అందులో సుఖస్వప్నము. ఆనాడు వాన ఘోరముగాఁ గురిసెను. అగడ్త సముద్రమువలె తెపకలు కొట్టుకొనుచుండెను.

నాలుగురోజు లయినతరువాత కుట్టాణ రామనాథమునకు బోయెను. వెంటనే తాను రామనాథమునుండి తెచ్చిన రెండువందల సైని కులలో నేబదిమందిని, ముట్టడివేళ ప్రమాదిల్లిన రెండువందలమందిని, క్రొత్తసైనికులలో మూడు వందలమందిని, కోటముట్టడివాండ్రకు స్వాధీ నము చేయుమన్న నూటయేబదిమందిని కలిపి యేడువందలమందిని, యెనమండ్రు నాయకులను రామనాథమునకు తీసికొనిపోయెను. కాళ య్యార్ కోవెల నాల్గువందలమంది సైనికులు వీరయ్యప్పనాయకుని సంపూర్ణాధికారముక్రింద నుండెను. కోటవదలిపోవు కుట్టానునకు, వీర య్యప్ప 'నాయకుడా! సెలవు' అనెను. కుట్టాణ నవ్వి 'ఇక మీరు నాయకులు' అనెను.

## ౨౧

ఉదయాణ సేతుపతి మధురలో పట్టాభిషే కోత్సవములు పూర్తియైనతరువాత భాద్రపద శుక్ల పాడ్యమినాడు బయలుదేరి పంచమినా టికి రామనాథమునకు వచ్చెదనని కొడుకున కు కబురంపెను. కాళయ్యార్ కోవెల తిరుగు బాటునుగూర్చి కుట్టాణ తండ్రికి వర్తమానమం పెను. సేతుపతి కోవెలతిరుగుబాటు రాజుతో జెప్పెను. రాజు సేతుపతిని పొమ్మని తొందర పెట్టెను. తిరుమలనాయకుడు 'కుట్టానున్నాడు ఫరవాలేదని. పట్టాభిషేకోత్సవము లైనతరు వాతనే సేతుపతి పోవచ్చునన్నాడు. ఉదయాణ సేతుపతికి తొందరయెక్కువైనది. చిత్రము గా దాను పూర్వము రాజుమాట తీసివేయ జాలనట్లు తిరుమలనాయకునిమాట కాదన జాలమి నెతింగికొని యుదయాణ సేతుపతి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాశ్చర్యపోయెను. అది మొదలు తిరుమల నాయకుని తాను కలసికొనినప్పుడెల్ల నతనిని పైనుంచి క్రిందకు దిగబార చూచెడివాడు.

నాడు శ్రావణబహుళ దశమి. వర్షము జోరుమని కురియుచున్నది. కుట్టాన్ రామనాథమున రాజసౌధముపై తిరుగుచున్నాడు. కాళయ్యార్ కోవెల గెలుపువలన నతని మనస్సు మహానందమున మునిగియుండెను. కాని యతనిమనస్సులో నొక శంకకూడ నుండెను. క్రొత్తగా నైదువందలమంది సైన్యము చేర్చుటకు దన కేమి యధికారమున్నది. తండ్రి కోపగించును. అట్లు చేర్చుకొనకపోయినచో మరలఁ దాను అల్లరులకవకాశమేర్పరచినవాడ నగుదునని కుట్టాన్ తలచెను. తృప్తిలేని యైదారువందలమందిని వదలినచో నొక పెద్దశత్రుసైన్యమును రేపి వదలిపెట్టినట్లగును. అట్లువదలినచో దాను చేసిన వంచనకు వారిలో బ్రత్యపకృతిబీజమును నాటినవాడగును. అందుచేత వారిని సైన్యములోనికి దీసికొనక తప్పినది కాదు.

జరిగిన వ్యవహారమంతయు కుట్టాన్ లేఖ వ్రాసి రాజుగారికిని, తండ్రికిని పంపించెను. ఒకవేళ రాజు క్రొత్తసైన్య మంగీకరించనియెడల దానేమి చేయవలెను? దూరమ్మున నాకసములో నొక మెరపు మెరసెను. కుట్టానున కేకవీర కనులకు కట్టినట్లు కన్పించెను. కట్టతెంచిన బోదెనీరు పొలములోనికి బోసుకున్నట్లు వాని మనస్సు జలజల బ్రవహించి యేకవీర తన యిన్నాళ్లపొందిక లేని జీవనము, మీనాక్షీ వీర భూపతుల వివాహము, తన మనఃపరివర్తనము, తన మనస్సులో నేకవీర తాల్చిన ప్రణయరూపము, ఆమెను తాను చూడగాని రాచకార్యముల యభ్యంతరము నూహాపై నూహగా నతనిని క్రమ్ముకొనెను.

రెండుసంవత్సరములనుండియు తనమామగారు రాలేదు. కూతును చూడలేదు. తనకు తన మామగారికి పూర్వమేమియు సంబంధము లేదు. మామగారు సైన్యమును తాను తీసికొనునేమో. ఆయన మంచి సరదారు.

ఏకవీర మొదటిసారి తలంటిపోసుకునితన మంచముమీద తెల్లని చీరతాల్చి నిద్దురపోయిన-పెండ్లియయిన తరువాత మూడునెలల నాటి కథ స్మృతికి వచ్చెను. మెరపు తటాలున మెరసెను. కుట్టానునకు తెల్లచీర తాల్చిన యేకవీరను చూచినట్లయ్యెను. ఏకవీర తనకు భార్యయగుటచేత, తన సుముఖతయే యభ్యంతరమగుటచేత నిరభ్యంతరముగా మనసులో కుట్టాన్ ఏకవీరను కౌగిలించుకొనెను. ఆమె భుజములు, కంఠము, నేత్రములు ముద్దులతో నింపెను. ఆమె రహోవిస్రబ్ధమై యతని యెదురొమ్ముపై విశ్రమించెను. అప్పుడు తమగుడ్డపు వాళ్లపిల్ల అమృతము తొంగిచూచెను. కుట్టానునకు నవ్వువచ్చెను.

మరల సైన్యముమాట తోచెను. తండ్రి కోపగించెను. మామగారు తాను భరించలేననెను. తానే స్వంతముగా సైన్యమును పోషించుచుండెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంతలో వీరభూపతి స్మృతికి తగిలినాడు. మీనాక్షీ వీరభూపతులు సుఖముగా గాపురము చేయుచుండిరి. తాను వారింటికి మరల భోజనమునకు వెళ్లెను. మీనాక్షి గర్భవతి యయ్యెను. తానామెకు సారె చదివించెను.

మరల నింకొకయూహ. తాను, తనభార్యయు కలసి యామెపుట్టింటికి పోయిరి. అందు తాను భూలోకస్వర్గ మనుభవించెను. తనభార్య తన్ను ముగ్ధమనోహరాపాంగములలో, నూత్న నూత్నవిలాసములలో ముంచివేయుచుండెను.

కందాలోని నల్లపిల్లి యొకటి మేడమీదకువచ్చి తివాచిమీద చలికి ముడుచుకుని పండుకుని యెందుచేతనో కన్ను తెరచి మెల్లగా 'మ్యావు' అనెను.

కుట్టాన్ మనస్సు కదలిపోయెను. దానివంక చూచెను. మరల ధ్యానము.

తండ్రి సైన్యమును వదలివేయుమన్నాడు. తాను వద్దన్నాడు. ఇరువురకు పోట్లాట జరిగినది. సైన్యములన్నియు తనవైపు. వృద్ధసేనాపతులు మాత్రము తండ్రివైపు. తిరుమలనాయకుడు దూరముననుండి చూచుచున్నాడు.

మరల నింకొకయూహ. మీనాక్షీ వీరభూపతులకు పడుటలేదు. మీనాక్షి తనకుగాక, వీరభూపతికి గాక పోయినది. మీనాక్షి యుసురు తనకు తగిలినది. తనకు తనభార్యకు పొందికలేదు. ఏకవీర తనవలెనే చిన్నప్పుడెవరినో ప్రేమించినది. అది కారణముగా దనయందామెకు మక్కువలేదు.

మీనాక్షీ వీరభూపతులు; తాను తనభార్య; క్రొత్తసైన్యము తండ్రి; రాజు తిరుమలనాయకుడు; తన మేనమామగారియూరు గిర్రున కుట్టాన్ మనస్సులో చక్రభ్రాంతిపొందెను. వాన కురిసి కురిసి వెలిసెను. ప్రొద్దుగ్రుంకినది. బజారమునుండి ఘంటాధ్వని వినవచ్చెను.

శ్రావణబహుళ దశమినాడు మధురలో వర్షము కుండలతో దిగబోసెను. ఏకవీర తన పడకగదిలో మగని పెద్దమంచముమీద ద్వారబంధమునంటి గవాక్షమునుండి జాజిపందిరివంక జూచుచు గూర్చుండెను. వానబొట్లు జాజి ఆకులచివరల జాజిపూవులమీద నిలచి ముత్యములవలె కులుకుచుండెను. ఆ నిలచిన ముత్యము క్రొత్త నీటిబొట్టుచే తరుమబడి నేలపడి యాస్థానమున క్రొత్త నీటి బిందువు నిలుచుచుండెను. వాన ధారగా పడుటచేత తుమ్మెదలు పూవులమీద నిలుచు నాస్కారము లేక వానలో దడియుచు బందిరిపైన బరిభ్రమించుచుండెను. చల్లని గాలిపొర యేకవీరమీదకు విసరుకొనెను. ఏకవీరకన్ను లర్ధనిమీలితము లయ్యెను. ఆమెపయ్యెద కదలాడెను. ముంగురులు కెత్తూగాడెను. ఆమెత్వగింద్రియముమీద మెరుపుమెరసినంత కాలములో నొక తడిగుడ్డవేసి తీసినట్లు తోచినది. ఏకవీర చలించలేదు.

వానధారలు మిక్కుటమయ్యెను. జాజిపందిరిమీద వానజల్లు పడినకొలది పెద్దధ్వని చేయజొచ్చెను. జాజియాకుల చివరనుండి నీరు ధారగాపడుటయేగాని నీటిబొట్లు కొంచె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము సేపయినను నిల్చుటకు వీలులేకుండెను. తుమ్మెదలు పందిరిమీద నిలువలేక పందిరి క్రిందకుఁ బోయెను. మరల నొక చల్లనిగాలి తెర యేకవీరమీద పోసుకొనెను. ఆగాలివేగమునకు జాజిపందిరి కదలాడి పోయెను.

ఏకవీర జుట్టుముడి వీడి యామె భుజముల మీద వ్రాలెను. ఆమెపయ్యెద తొలగి పోయెను. ఆమెకనులు మూసికొని పోయెను. ఆమె త్వగింద్రియము రక్తప్రవాహదఘ్నముగా నీచల్లగాలిని కొలుచుకొనెను. గాలి మరల మరల నామెమీదికే విసరుకొన్నది. గాలి ఘోరవచ్చినపుడెల్ల నామె సరిగా కొలుచుకొన్నది.

వర్షమింకను పెద్దదైనది. పందిరిమీద చినుకులు పడుటయేగాని పడుట మరలపడుట యనుకాలవ్యవస్థ గోచరించుటలేదు. వానకు తడిసి కంచుమోతపోయిన నగారామీద సన్నని పుల్లలతో నెడతెరిపిలేక మ్రోగించిన మ్రోగించుటలోఁ గొరివి గిర్రున త్రిప్పినచోఁ ద్రిప్పుచున్న జ్ఞానముపోయి యొక్కటియే మెఱ్ఱని యగ్నివలయాకృతి యేర్పడినట్లు వేగముగా మ్రోయించిన నొక్కడే మొదలు, తుద, మధ్యస్థితిలేని ఏకమైన మ్రోతకలిగినట్లు పందిరిమీద ధ్వనికలుగుచుండెను వానబరువునకు పందిరి కదలిపోవుచుండెను. వర్షధ్వని తప్ప యింకొకధ్వని గాలిలో లేదు. మరల బెద్దగాలి రివ్వున విసరెను. పందిరి సౌధము మీది కొరిగెను. మంచముమీద పరచిన బందరు కలంకారుదుప్పటి ఘెగిరి యంచులు ముడుచుకొనెను. ఏకవీర విడివడినజుట్టు ఆమె మొగమున వక్షస్సున భుజములమీదఁ బ్రవాహవేగమున విధూతమైన శైవలమువలె నల్లలనాడెను. ఏకవీరకన్నులు గట్టిగాఁ దారకలపైన కనురెప్పలు, రెప్పలకండలు నాలుగంగుళముల ఘోర యేర్పడునట్లు మూసికొనెను. నిష్కంచుకమైన యామె యెదఁబొమ్మ నసవరాహముదూసి చన్న వెదురుపొదవలె సోర్ధ్వాధోభాగముగఁ గంపించెను. ఆమె త్వగింద్రియముయొక్క స్పర్శగుణవ్యాప్తి చర్మము దాటి లోని గోరువెచ్చని రక్తప్రవాహము దాటి శల్యములదాక తాకెనని తోచినదామెకు. ఆమెకు బాహ్యజ్ఞానము పోయినది. ఇంతలో సీదురుగాలివెంట చిక్కని వానజల్లు వచ్చి యామెమీద దుపాను మొదలుపెట్టువేళ సముద్రపుకెరటము లొడ్డున నున్న వానిమీద కొట్టుకొన్నట్లు కొట్టుకొనెను. ఆమె పంచేంద్రియగుణములు స్పర్శగుణైక్యము పొందెను.

కొంత సేపటికి పెద్దవాన యాగిపోయి మరల తుపరలోనికి దిగినది. అంత సేపటికి ఏకవీరకు స్మృతి కలిగినది. తన్ను తా జూచుకొన్నది. తల విరబోసుకున్నది. ఎదఁబొమ్మ దిగ్వాసముగా నున్నది. వాన తగ్గినది. సన్నని గాలి రేగినది. జాజిపందిరి యాకులు పూవులు సన్నని నీటిబిందువుల బరువుచేత గదలలేక కదులుచున్నవి. ఏకవీర ప్రక్కగా చూచినది. గుజ్జుపువాళ్ల పిల్ల అమృతము తన పెద్ద కన్నులు మరింతపెద్దవిచేసుకుని ఏకవీరవంక తదేకదృష్టితో జూచుచున్నది. ఏకవీరకు నిలు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



'సుబ్రహ్మణ్య'

చిత్రకారుడు: శ్రీ వాసుదేవనుగారు, అడయారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెల్ల సిగ్గయినది. తొందరగా తల ముడివేచు కుని సేలువ యెదఃబొమ్మమీదికి లాగు కొన్నది. మరల నమృతమున్న యెడ జూచినది. అమృత మందు లేదు.

ఏకవీరకు భయము వేసినది. ఆపిల్ల తన వంక నేల యట్లు చూచినది. ఈసారి దానిని చూచినప్పుడు కోపించవలెననుకున్నది. మరల నేమో విచారించ నారంభించినది.

చిన్నప్పటినుండియు నేకవీరకు వర్షాకాల మన్న దన్మయత్వము. మరియు జిన్నప్పుడు వానలోదిరిగి తండ్రిచేత దెబ్బలుదిన్నది. మఱి కొంచెము పెద్దయైనతరువాత పట్టుచీరలు వానలో దడిపి తల్లిచే జీవాట్లుతిన్నది. ఒకసారి వానలో నిలుచుండి బిగుసుకుపోయినది ఇదివర కామె వానలకు, జల్లగాలులకు దన్మయత్వము భజించెడిది. రెండు సంవత్సరములుగా నామెలో నొక క్రొత్తమార్పు వచ్చినది. ఆమెకు గాలి తన చల్లదనము కొలిచి చెప్ప మొదలుపెట్టినది. ఆమె దేహము క్రమక్రమముగా వాయువుయొక్క శైత్యోష్ణతల పరిమాణము కొలుచు విచిత్రయంత్రమువలెనైనది. కస్తూరిపూత, మంచిగంధపుపూత, కప్పురపుపొడి, వట్టివేళ్ల విసనకఱ్ఱ, మలయానిలము వీని ప్రత్యేకస్పర్శసుఖానుభవ మామె మనస్సునకు చక్కగా నేరుపరచి చదివిన పొత్తములోని యర్థమువలె విజ్ఞాతతత్త్వగాఢత్వకించి దూఢత్వాగూఢత్వముగా విస్పష్టముగా దెలియవచ్చెను.

అమృతము మరలవచ్చి తొంగిచూచి పారిపోయెను. ఏకవీర కలవరపడెను.

వర్షాసాయంసంధ్య వచ్చెను. పగలెల్ల వెలుగురేక లెరుగని రోదసి యావేళకు పడమటిదిక్కున నల్లనిమేఘముల నలుపులో గ్రుడ్డి మెఱుపులు తిరిగెను. శివరాత్రినాటి కృష్ణపక్ష గాఢయామినీవేళ గర్భగుడిలో నేకాభిషేకముచేత చెమ్మగిలిన యవకాశమున కర్పూర నీరాజనము వెలిగించగా దట్టమై నల్లనైన హారతిపొగ హారతిజ్వాలను కమ్ముకొన్నట్లు పొలిచిన దా వర్షాసాయంసంధ్య. దీపము వెలిగించు పరిచారిక గదిలోనికివచ్చి యేకవీరను సవినయముగా బిలచెను.

శ్రావణశుద్ధ దశమినాడు వత్తునని కబురంపించిన వీరభూపతి బహుళ పాడ్యమినాడు గాని యింటికి రాలేదు. వచ్చి భోజనముచేసి మరల రాజసౌధమున కేగెను. ఆనాటి కీనాడు బహుళదశమినా డింటికి వచ్చెను. ఈకాలములో మీనాక్షి ప్రేమ బీరువోలేదు. క్రొత్త క్రొత్తరుచుల వంటకములతో బతి నారగింపించి తాను గబగబ రెండుమెతుకులు తిని మేడపైకి పతి ననుసరించెను. వర్షము ద్రుతతాళ మందుకున్నది.

మీనాక్షి గవాక్షపక్షములు మూసినది. లోపల చీకటియయినది. వీరభూపతి మంచముపైనఁ గూర్చున్నాడు. మీనాక్షి ప్రక్కనిలుచుండి తాములపాకుల కీనెఱుతీసి సున్నము రాచి చేయిచాచినది. వీరభూపతి చేతనందుకున్నాడు. కొంతసేపటికి పతి చాలుననెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చాలునన్న తరువాత మీనాక్షి యొకయాకు చిలకచుట్టి వీరభూపతి నోటి కందిచ్చినది. అతడు నోరు తెరువలేదు. మీనాక్షి ప్రక్కఁ గూర్చుండి యాకుతో పెదవుల నడుమ సందు చేయఁ జొచ్చెను. అతడు కోపగించెను. ఆమె చిన్న పుచ్చుకొనెను. అత డంగీకరించెను. వర్షము గవాక్షపు తలుపులను రంయిమని గొడ్డళ్లతో గొట్టినట్లు కొట్టుచుండెను.

మీనాక్షి—మీరు సరిగా నింటికివచ్చి నెలనాళ్లయినది. అంతపనియున్నదా యేమి?

వీరభూపతి సమాధానము చెప్పలేదు. నిద్రవచ్చుచున్నట్లునటించెను. మీనాక్షి యది గ్రహించి మంచము దులిపి ప్రక్కవేసెను. అతడు పండుకొనెను. మీనాక్షి పాదము లొత్త బోయెను. అతడు వారించెను. బయటవర్షమును గాలియు గవాక్షమును బ్రద్దలుకొట్టునేమొ యనిపించినది. వీరభూపతి యాపాదమస్తకము ముసుగుపెట్టుకుని మంచమునకు నడుమ పండుకున్నాడు. ఆమె ప్రక్కన పండుకున్నది. ఆమె ఒడ్డున నున్నది. క్రిందబడునట్లున్నది. అతడు జరుగలేదు. కొంచెము సేపున్న తరువాత నతనిని జరుగుమన్నది. అతడు జరిగి యటు తిరిగి పండుకొనెను.

అట్లు గంటసేపైనది. వీరభూపతి నిద్రపోయినట్లున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ముక్తపరిగృహీత వేళాసమానముగా కనిపించెను. మీనాక్షి యతనిపైఁ జెయివైచి మరి కొంచమాగి గట్టిగా దగ్గరకులాగెను. అతడు కదలలేదు. నెమ్మదిగా నొకచేతిమీాద లేచి ముసుగుతీసి మొగమున చూచెను. గాలి విసురునకు గవాక్షము తోసుకొనివచ్చి ఒక జల్లు వచ్చి మంచమును తడిపెను. మీనాక్షి లేచి మరల తలుపులుమూసి గడియవేయు లోపల నామె మొగమున వానచినుకులు గ్రుద్దుపోసినట్లుండెను. పైటయు రైకయు తడిసెను. వీరభూపతి మేల్కొనెను. మీనాక్షి రైకయు, జీరయు మార్చినది. వీరభూపతి అంగీ చల్లబడెను.

మీనాక్షి—గాలికి కిటికీ తోసుకొని వచ్చెను. నిద్రభంగమైనది.

వీర....(కొంచెమాగి) నిద్ర పట్టనే లేదు.

మీనాక్షి కలవరపడినది. కాని లజ్జా ప్రథమసోపానము దాటితి ననుకొన్నది. విచారించినది. తా నేమి తప్పుచేసినది? తన వాంఛ ధర్మబద్ధమైన దే ననుకున్నది.

వీర—రాజసౌధమునకు బోవలయును.

మీనాక్షి—బండివాడు రాలేదు.

వీర—నడచిపోయెదను.

మీనాక్షి—తడిసిపోదురు.

వీర—పని యున్నది. మీనాక్షి నవ్వి యేదో అన్నది. వీరభూపతి కది వినపడలేదు. అతనికిఁ గోపము వచ్చినది.

మొగ మట్టుత్రిప్పుకున్నాడు. మీనాక్షి దగ్గరకుఁబోయి "కోపమెందుకు 'పనితడిసిపోవునా' అంటిని. క్షమించుడు" అనెను. వీరభూపతి కుక్కిరిబిక్కిరయ్యెను. దొడ్డిలో నేదో పెద్ద ధ్వనియయ్యెను. మీనాక్షి భయపడెను. వీరభూపతి 'దొడ్డిలో నేదో చెట్టు గాలికిపడెను'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాబోలు నన్నాడు. ఆమె పతిదగ్గరగా నిలుచున్నది. వీరభూపతికి ఒకకాలువ తూర్పుగట్టు మీాద నిలుచుండి పడమటిగట్టున కెట్లు చేరుదునా యనుకున్నట్లయినది. ఇంతలో నతనికి కన్నులు గిర్రునతిరిగి రెక్కలు వచ్చినట్లయి పడమటి గట్టుమీాదికి పోయి తూర్పుగట్టున కెట్లు చేరుదునా యనుకొనుచున్నట్లు తోచినది తనజీవితము. పూర్వము తాను చేరవలసిన స్థానము పడమర నున్నది. అది విచిత్రముగా తూర్పునకు తిరిగివచ్చినది. తాను పడమటిగట్టుపై నున్నాడు.

వర్షము బయట కొంతసేపు మద్దెలలు వాయించినట్లు, కొంతసేపు వెదుళ్లూదినట్లు కొంతసేపు తాటియాకు లీడ్చినట్లు కొంతసేపు అవ్వాయిచువ్వ లెగురవైచినట్లు, తోటాలు కాల్చినట్లు పిచ్చివానివలె నల్లరిచేయుచుండెను. ఇరువురును రెండవగదిలోనికి బోయిరి. మీానాక్షి కనులు తనచిత్రముమీాదికి పోయెను. దానికి దూరముననున్న వీరభూపతి చిత్రమును తెచ్చి యామె రెండును దగ్గరగా నుంచెను. వీరభూపతిబొమ్మ కలకల నవ్వినది. స్థానాపతి యాలోచనా నిమగ్నుడైనాడు. మీానాక్షి బొమ్మ విచారముఖము సూచించినది. మీానాక్షి మొగము కలకలలాడినది.

పతి మాటాడలేదు. మీానాక్షికి కనుల యెదుట తెరగా నాడినది. ఆమెచూపు తన పతి పూర్వప్రణయిని చిత్రముమీాద నిలచినది. ఆచిత్రమున నామె తెల్లనిచీర ధరించినది. కేశపాశము పొడిపొడిగానై ముంగురులు గాలికి కదలుచున్నవా యనునట్లుండెను. మీానాక్షి యులికిపడినది. 'స్త్రీ సంస్థానంచాప్సర స్తీర్థమారా దాక్షిపై్ౖయనాం జ్యోతిరేకం తిరోభూత్.' అన్న వాక్యములోని యనుభవమునకు సాజాత్యమైన యొకయనుభవ మామె మనోనేత్రము నెదుట గలిగినది.

బయట వాన తగ్గిపోయి మరల మొదలుపెట్టుచున్నది. ఇంక జాముప్రొద్దుండవచ్చును. మీానాక్షి నిరస్తభూషయై యింట బనులు చూచుకొనుటకు బోయినది. వీరభూపతి సంకల్పవికల్పశక్తి గోల్పోయిన మనస్సుతో మరల నిద్రకు బడినాడు.

పట్టాభిషేకోత్సవములు వర్షాకాలమున బడిపోయినవి. ఉత్సవములకన్న క్రొత్తరాజు క్రింద జేయవలసిన రాజ్యపు కట్టుబాటులకే చాలకాలము పట్టుచున్నది. వర్షము వెలిసిన సాయంకాలముల రాజసౌధపు టేనుగులు మొగసాలనుండి రతనాలుకుట్టి వెలగల జరీపనులు చేసిన పట్టుహౌదాలతో నూరుతిరిగి రాబోయి మరల రాజసౌధమునకు బురద మరకలతో వచ్చుచుండెను. ఉత్తమజాత్యశ్వములకుగూడ గాలుజారుచుండెను. రాజసౌధపు ముంగిళుల నౌబత్తుఖానాల మ్రోతకూడ వానకు చెమ్మగిల్లినట్లు మందముగా వినబడుచుండెను. విద్వద్బ్రాహ్మణులు రాజుగారిచ్చిన క్రొత్తసేలువల బంగారము దర్భాసనములలో దాచి తడిసిపోవునని భయము వదలక వంగివంగి పోవుచుండిరి. సాయంసంధ్యలు నల్లనల్లనై విషాద భావము మూర్తికట్టినవి. (సశేషము)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మం గ లి మే ళం



మొదటి దినము



రెండవ దినము.



మూడవ దినము



నాల్గవ దినము.



ఆఖరు దినము.

గళిసెట్టి రామంరావు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# దివ్య విభూతి

సోమంచి అన్నపూర్ణేశ్వరశాస్త్రిగారు

సాయంకాలమున నొంటరిగ నిర్మానుష్య ప్రదేశమగు నదీకూలమున గూర్చుచుంటిని. ఆలోచింప మొదలిడితిని. ఈలోకమున సౌఖ్యమునకు మార్గమేది?—ప్రాయశః మానవుడు మానవునకీసౌఖ్యరహస్యమును బోధింపలేదు. ఒకచో బోధించినను వీలైనమార్గమున కాదని కొందరు తలతురు.—ఈచుట్టుపట్టులనుండు భూతములయైన నది బోధింపగలుగునా?—చాల సేపటులనే యాలోచింప మొదలిడితిని. చుట్టునుచూచితిని.

ఆకాశమున జాబిల్లి షోడశకళాపూర్ణుడై ప్రజాలోకవర్తనకు నవ్వుచుండెను. నదీజలము లాతని జూచి నవ్వుచుండెను. తారకలు నవ్వుచుండెను. చంద్రికాస్నాతలై పంచభూతములును సంతసించుచుండెను. సకల విశ్వమును సంతసముతో నోంకారమంత్రము నుపాసించుచుండెను. కాని నా క్షుద్రహృదయమునమాత్రము సంతసము లేదు, శాంతి లేదు. భూదేవి నిరుపమానరత్నమాధురంధరయై, కేవలము తనసుఖమును మఱచి, తనమీద నివసించియున్నవాని కన్నిటికిని సౌఖ్యప్రదాయినినై యుంటినన్న గర్వమున విఱ్ఱవీగుచుండెను. రేవెలుంగు తానే లోకము నంధకారపిశాచమునుండి తప్పింపగల్గితినని కేరింతలు కొట్టుచుండెను. అట్టి వెలుగు ఉనికంటెను తామే ఘనమైనవని తలచుచున్నటులు నదీతోయములు, జాబిల్లి తనకరములుసాచి, వానిలో తెలుంగుదమని తలంచుచుండినను తా వీయకుండుటకు బ్రయత్నించుచుండెను. ఇట్టి తోయములనుకూడ దానుచలింపజేయు శక్తి గలిగినట్లు గంధవహుడు తలచి సంతసించుచుండెను. సర్వభూతములు నిట్లున్నవి. కాని అంతటను శాంతి. అపూర్వశోభచే వెలుంగు నాసర్వభూతములు నాయోంకారము నుచ్చరించుచు పరమేశ్వరు నుపాసించుచుండెను. తమతమ శక్తులదెలిసికొనియుండియు, వానిని ప్రకటింపజాలు నహంకారమున్నను, సకలభూతములును పరమేశ్వరు నుపాసించుచున్నవే!—వీనిశాంతియు, సంతసము నీమంత్రమహిమమే కాబోలును!—ఎంతటియహంకారమున్నను శాంతి నందవచ్చును. సంతసమున నుండుటకు మార్గమున్నది:—

ఎప్పుడట్లు నిష్కళంకులను తారకాచంద్రు లాకసమున వెలుంగుచుండునో, ఎప్పు డట్లు సకలప్రకృతియు నాయనంతుని మహాకీర్తిని పొగడుచు నోంకారమున నుపాసించుచుండునో, అట్టియతడే మానవుడు. పరమేశ్వర ధ్యానయుక్తుడగుటకును, ప్రకృతిరహస్యము నరయుటకును నిశ్శబ్దతను, శాంతిని గోరును.—అపుడే మానవుడు తానాయనంతశక్తునికభిముఖుడైయున్నటులు దెలిసికొనగల్గును. అపుడే మానవున కుద్రేకముగలిగి, మహత్తరరహస్యముల దెలిసికొన బ్రయత్నించును. అపుడే యాతడు తనకొల దని తెలిసికొనుటకు శక్తుడగును. ఈయనంతవిశ్వమున దా నసహాయుడై, విచారగ్రస్తుడై దీనుడగును ఆయనంతుని దివ్యనామోచ్చారణమున సకలవిశ్వమునకును గలిగిన ప్రతిభయు, సుఖమును తనకెట్లు చేకుఱునేరవో యనెడి విచారము గలుగును. అపుడే మానవు డాపరబ్రహ్మమునుగూర్చి, ఈవిశ్వమేమి? మానవు డెవడు?"—అని ప్రశ్నించును. ఇట్టిస్థితియే నాకును గలిగినది. ఈ మానవజీవితమునకు ఫలితార్థమేమి?—

ఓంకారమంత్రోచ్చారణముననే సకల భూతములకు నిట్టి చిదానందమొదవుచున్నదే! ఇట్టిపరమావధ ముండగా మానవున కందుల కీ వంత?—సుఖమలవఱచు కొనుట కింకను నుపాయము లెందులకు?—ఎపుడైన మానవు డిట్లొంటిగ, రాత్రియందు, ఉదాసీనభావము లేకుండగ, నిశ్చలముగ, సరిగనర్థముచేసికొనుచు చూచినాడా? ఈస్వర్గీయానందవిభూతినలరుచున్న యీ సకలవిశ్వమును వీక్షించినాడా?—వీక్షించి యుండినయెడల తప్పక సరియైనమార్గము దివ్యవిభూతి నొందుటకై దొరకియుం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డును. సచ్చిదానందముకొఱకు దేవులాడుటయే కాని మార్గము వెదుకనక్కఱలేదా? ప్రపంచమంతయును తల్లడిల్లిపోవుచున్నది!—ఐశ్వర్యము, భోగము, సుఖము—యీ మూడును ప్రతిమానవునకు కావలసినవే. ఇది యంతయు నెందులకు? ఎల్లప్పుడును సుఖముగనుండుటకొఱకే యీ యైశ్వర్యములు. కాని యెట్టివిధమైన యైశ్వర్యము ప్రపంచమునందు సర్వసాధారణముగ సౌఖ్యప్రద మయినదని ప్రశ్నించినయెడల నిర్ణయవిధానము దుర్ఘటము. ప్రతిమానవునికిని, ప్రతిజీవికిని ప్రత్యేకముగ నొకవస్తువే యైశ్వర్యప్రదమయినది; సుఖము నిండించునది. వ్యక్తిభావమునుబట్టి యదిమారుచున్నపుడు జనసామాన్యమునకు సౌఖ్యరహస్యబోధన యెట్లుచేయుట? కాని ప్రతిమానవుడును దీనినిగూర్చియే మాట్లాడును. ఏది తనకు సరిగతెలియదో దానినిగూర్చియే మానవుడు యెల్లపుడును వాగుచుండును. కనుక నాకు మాత్రము తెలిసియుండునా? కాదు కాదు. నేనెప్పుడును ఈ సకలానందకరవిభూతినుండి విముక్తుడనైననేమి? ఈ వివిధశృంఖలాబద్ధసంఘసమూహములనుండి దూరమేగిననేమి. ఈ మానవప్రపంచమునుండి నిష్క్రమించిననేమి" అనియే చింతించుచుంటిని. ఇట్టిస్థితిలోనే యీ నదీతీరసంచారము కలిగినది.

అపుడే యెన్నడునులేని ప్రౌఢి యబ్బినది.

నేను మానసికలోకమున కష్ట జీవిని. అందుననే జీవితము దుఃఖదాయక మని తలచియుంటిని. మానవుడెవ్వడైనను యీ యైహికసుఖ మనుభవించినను, ఎంతకాల మనుభవించినను దాని ననంతమని పిలచినాడా? ఏ జీవియైనను సుఖమాశించి పొందినను, చాలకాల మనుభవించినను దానిని త్వరగ మఱచిపోవును. అనగా ఆసుఖము క్షణికముగనుండును. అందుచే మానవుని మానసికస్థితి ననుసరించి జీవితము చాలభాగము దుఃఖ భాజనముగనే భావింపవలయును. అనగా మానసిక ప్రవృత్తిలోనే యీ దుఃఖ మిమిడియున్నది. కష్టకాలమే, కొలదియైనను యెక్కువగనగుపడును సుఖకాలమే క్షణికమగును. కనుక సంపూర్ణమైనదియు, విచ్ఛిత్తియెఱుగనిదియు, నగు సుఖమకంటె మానవునకీ ప్రపంచమందు కావలసినదేది? అట్టి సుఖము నెట్లుపొందుట? ఏవిధమైన సుఖమైనను, ఐహికమైనపుడు, క్షణికమైనదే!—కాని క్షణికముకాని, యలౌకిక సౌఖ్యముగలదా యనిప్రశ్న.—దేవుడనిన మండిపడు మానవులుకూడ నెప్పుడే నొకప్పుడు, కొన్నివేళలందు, మానవజీవిత మపేక్షించు సుఖముకంటె, నీభౌతికవిషయజనిత సుఖముకంటెను మహత్తరమైనది. యీ పంచేంద్రియవ్యాపారసుఖముకంటె విశేషమైనది. మానసికమైన సుఖమెద్దియోగలదని నమ్ముచున్నారు. కాని మానసికమైనదయినను అనంతమైనదగునా? కాని కొందఱు మానసమే సాంతమైనపుడు మానసిక మనంత మెట్లగునని ప్రశ్నించుచున్నారు. మానసికసుఖ మనంతమా?

ఇట్లాలోచించుచు కూరుచుంటిని. ఒంటరిగ నాయనంత సాగర నదీతీరమున నుంటిని; చుట్టునుచూచితిని. అదివఱకెన్నడు నెఱుగని యపూర్వభావప్రౌఢియబ్బినది. నావలెమానసిక వికలతనెఱుంగని వృక్షములు చంద్రికాలహరిలో నీదులాడుచు, నేవిధమైన విచారమునెఱుంగక యొండొంటిని గాగిలించుకొనుచు, వాయుప్రసారము చలించిన యాకులమధ్యనుండి ప్రసరించుచున్న ధవళచంద్రికాకిరణమిషంబున నవ్వుచు, సౌఖ్యరహస్యముల గుఱించి గుసగుసలాడుచుండెను. అనిర్వచనీయమౌనమునవలుకుచుండిన వివిధజంతుజాలమొనరించు నవ్యక్తమధురస్వరములచే ప్రకృతిశోభాయమానమై కనుపట్టెను. ముగ్ధత వహించెను. సర్వభూతసమ్మోహనమైన యామాధురి ననుభవించుటయే నిశారమణికిష్టము కాబోలును! సకలదేవతాపరివారుడై, యిట్టి పవిత్రసమయముననేగాబోలు దివ్యసుందరుడగు నామహానటుడు క్రీడించుట! ఇట్టి సమయముననే గాబోలు సకలమానిబృందమును ఆ విశ్వమోహనునివేణునాదము నాయోంకారమున నాపాదించి తన్మయతజెందునేమో! ఇట్టిసమయములనేకాబోలు మానవుని హృదయమందు నద్వితీయమయ్యు క్షణికమగునట్టి, యనిర్వచనీయమయ్యు శేముషీధురంధరమైనట్టియు, నవ్యక్తసుందరమధురమయ్యు మహత్తరమైనట్టియు, నాయనంతసాగరప్రాంతముల నించుకచేరుచుండినమహోద్దేశములు వెల్లివిరియును! ఇట్టరాత్రియందే గాబోలు నాయపూర్వప్రకృతి ప్రతిభ తనమహచ్ఛక్తిచే మానవుని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వశీకరణ మొనర్చును:—ఇట్లాలోచించుచు నిశ్చలముగ నాప్రకృతిసౌందర్యమును జూర గొనుచుంటిని.—

ఉన్నటులుండగానే యేదే నొకయసంబద్ధమగు సత్యమొకటిస్ఫురించినటులుదోచెను. అనశ్వరమగునీసకల ప్రకృతిభూతియు, ప్రతిభయుకూడ నిశ్చయమైనదేనా? ఇదివఱ కెన్నడెఱుగని యొక యవస్థకు లోనైతిని.— హృదయము గభీరముగ చలించెను. విచారముచే క్రుంగిన నా క్షుద్రహృదయమున నొకానొక యాశాజ్యోతి యుత్పన్నమయ్యెను. వదనమున విన్నదనముపోయి యొకవిధమైన చిరునవ్వుతోచెను. అహంకారమదమున నేను దానిని పూర్వ మనేకపర్యాయములు మహాపురుషులు తామస్వర్గవిభూతి ననుభవింప సంతసములో నాయనంతుని సన్నిధిని తలంచినపుడు వారిముఖశ్రీల చెలువొందిన దానిగ దలంచితిని. అయ్యో! ఎంతవెఱ్ఱి!

కాని, దానినంత చులకనగా ద్రోసివేయ జనదు. ఎందుకనగా, నెవడేని యొకమానవుడు తనజీవితమందున నెట్టి మహదాశయములు లేకను, మహదాదర్శముల జేరుటకై ప్రయత్నింపకయున్నను సంఘము సహించును. పైగ గౌరవించును. కాని, యెవ్వడైన నొకడట్టివి గలిగియుండి వానిని జేరుటకై యష్టకష్టములబడియు, చివరకు దారిలేక, వ్యధితుడై సాధారణ జీవితమున బడినయెడల సంఘము వానిని వెక్కిరించును. వాని నీసడించి ధిక్కరించును!

కాని యీ యజ్ఞతయేమి?—సంఘము నాకేమి యగును?-ఇది భ్రాంతిమూలకము నాయహంకారమదమే నన్నిట్లు చేయుచున్నది. అగును! నే నింకను సాధారణ మానవప్రకృతికి భిన్నుడను కాలేదుగాదా? అందుచే తనేకాదా యీ వికలత్వము, యీసౌఖ్య రహస్యశోధన!

మానవుడు బహిఃప్రకృతినిజయించి సౌఖ్య మను భవింపజూచుచున్నాడు. అది నిజముగ నద్భుతమే!— కాని మానవుని యంతఃప్రకృతిని జయించి సుఖమందుట మఱియు నద్భుతము!—నిజముగ నీగ్రహముల యొక్కయు, తదితరఖేచరగోళములయొక్కయు గతుల నెఱుంగుటయు, నాగతులకు మూలమైన శక్తిని దెలిసికొనుటయు ఘనమే; కాని మానవునిలోనున్న యహంకారమునకు నుద్రేకములకును, హావభావములకు కారణమైన యలౌకికశక్తి నెఱుంగుట మఱియు నద్భుతము! ఈ మానవునిలోని త్రిగుణములను జయించుటయు, మానసికప్రవర్తన నరికట్టుటయు మఱియు నద్భుతము. సాధారణ మానవుడు ప్రాపంచిక మగునట్టియు, తనకు కానబడునదియునగు విషయములచేత దఱిచూడ బ్రయత్నించుచునుగాని మనోనేత్రమునజూచి గ్రహింప బ్రయత్నింపడు. అట్టిమానవుడెపుడును ప్రాపంచికవిషయముల గ్రహించి వానివలననే సుఖమొనగూర్చికొన బ్రయత్నించును. పంచేంద్రియములకు గలిగెడు సుఖములకే యాతడాసించును. వానిని గనియేస్వర్గవిభూతితో తులదూగుచున్నటుల సంతసించును. కాని యిట్టిసుఖమే యనంతమైనదా? సాధారణముగ మానవుడు సుఖాపేక్షచేతనే యీకాలప్రవాహమున నొట్టుకొని పోవుచున్నాడు. ఆసుఖమునైనను క్షణికములగు వానిమూలముననే పొందగోరుచున్నాడు. కాని నిజమగునదియు,ననంతమైనదియు నగు సుఖము నెట్లు పొందగల్గునో తెలిసికొన బ్రయత్నించుట లేదు!

కాని కొందఱు మహాత్ములు "ఈ పంచేంద్రియ వ్యాపారమువలన నిజమగుసుఖము గలుగనేరదు. నిజమైన సుఖమెప్పుడును ఆత్మయందే యుద్భవించును. అట్టి సమయమున నాత్మచోదితములగు మానసాములుగూడ దానిననుభవింపగలుగును. అట్టి ఆత్మానందముపొందుటకై మాయనుండియు మమతనుండియు విముఖుడైయుండవలెను. అపుడే మానవుడు పరమేశ్వరుని యనంతసన్నిధినుండుటకు సమర్థుడు."—ఇది నిజముకాదని చెప్పుటకు మానవునికి హక్కేమిగలదు? మాయనుండియు, మమతనుండియు విముఖుడైయుండుటవలన నుపయోగము లేదనుటకు హక్కేమిగలదు?—ఉపయోగము పైకికనుపడకపోయిన విషయములన్నియు నబద్ధములేనా? ఉపయోగానుపయోగవిమర్శన తత్త్వరహస్యమునరయువారికొప్పునా?—ఉపయోగముకలుగుటయే నిజమైనదానికి తార్కాణమా? అదిగాకపోయినను మానవుడు భౌతికమైనయెడల సుఖమును క్షణకాలమే పొందుచున్నాడుకాని, సర్వదా యనుభవిం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మట లేదు! ఇట్టిసంగతియే మానవుని యనంతసుఖశోధనయందు ప్రవేశింపజేసినది. అందు మూలముననే చిదానందస్వరూపులగు మానులగూర్చి ప్రశంస యీప్రపంచమున వినబడుచున్నది. ఆత్మజ్ఞాని యొక్క డనుభవించిన సుఖము మన మెప్పు డనుభవింపలేము. ఆతడెల్లపుడును స్వర్గవిభూతితో — దివ్యవిభూతితో — తులతూగుచుండును.

ఈస్వర్గీయమగునట్టియు, యనంతమగు నట్టియు, చిదానంద మొందకుండుటకు సాధారణమానవుడు తన్నే యీ పాంచభౌతిక దేహముగను, లేక మానసముగను తలచుటయే కారణము. మహర్షులు "ఏ 'నీవు' సర్వశక్తుడవో, సర్వమయుడవో, నిష్కల్మషుడవో, పరిపూర్ణుడవో, అట్టి 'నీవు' యీమాయలోబడి, అహంభావముతో, స్వలాభపరాయణతతో సకలవిధములైన వికలతకును, కష్టములకును, సకలాపజయములకు లోనగుచున్నావు. ఒకప్పుడు భౌతికవిషయములవలన దేహసుఖ మనుభవించినను, మానసిక సుఖమనుభవించినను, ఆ సౌఖ్యసమయము దాటిపోగానే కష్టసముద్రమున బడుచున్నావు." అని చెప్పుచున్నారు. కావున మన మీలోకమున సాధారణమానవుని లౌకికజీవితము సుఖమైనదని దలచుట యెట్లు?—

ఇట్టి విషయములగూర్చి తలచుచు కూరుచుండుట బట్టి యిట్టి భావములు స్ఫురించుచుండెనా? లేక యిట్టి మహద్వాక్యములలో నిజముగలదనితోచుటయుపజ్ఞయా? ఏమో?— అప్పటి నామనోవృత్తము సరిగ తెలియుట లేదు కాని హాయి కల్గుచున్నది.—మానవుడెపుడు తానీ చిన్న శరీరమని యనుకొనుచున్నాడో యపుడే తాను చుట్టునున్న సకల ప్రపంచమునుండియు వేఱగుచున్నాడు. ఈ భేదభావముకల్గుటవలననే సకలకష్టములకు లోనగుచున్నాడు. మానవు డెపుడు తన యల్పత్వము, నీచత, యజ్ఞతవదలుచున్నాడో యపు డీప్రపంచమ్ము విచ్చార క్లేశము లెఱుంగని స్వర్గమగును.— మానవుడు సకల ప్రకృతిని జయించుగాక, యెంతకాలము తానెవ్వరో తెలిసికొనక యుండునో యంతకాలములను ఈ క్లేశపాశముల నుండి తప్పించుకొననేఱక తన్నుకొని చావవలసినదే!

ఇట్టిభావము లుదయించుసరికి నాకు దేహము తెలియలేదు. శరీరము తేలికయైపోయినది. వికలత్వముపోయినది.—ఉన్నటులుండి యంతయు శాంతము. క్రమముగ భావములుకూడ తావులేకుండపోయెను. కాని యొక విధమగు నత్యంతానంద మనుభవించితిని.—నేనేమి యెట్లు తలంచుచుంటినో తెలియలేదు. ఏది యెట్లు విమర్శించుచుంటినో యవగాహముకాలేదు. ఇట్టిభావములు గల్గుటకు గల కారణముగూడ తెలియలేదు. ఎందులకిటు లాలోచించుచుంటి ననుకొంటిని.—మానసికతత్త్వ మరయుట కష్టముగదా?

కొలదిసేపటికి భావస్ఫురణగూడ తగ్గిపోయినది. తరువాత యెప్పటి మనఃస్థితియే! మానసిక సుఖము క్షణికమని యనుభవమైనది.

"ఈ జీవితమున సుఖమందుటెట్లు? ఈజీవితమునకు ఫలితార్థమేమి?" అని యాలోచించుటవలన కాబోలు యిట్టిభావస్ఫురణము. కాని యాయలౌకిక భావప్రౌఢి మానవునకిట్టి ప్రకృతిసాంగత్యమున జనించునేమో? అని తలంచుచు నాకసమున నాదృష్టినిల్పితిని. అపు డొకచిత్రము కానవచ్చెను.

ఒక మేఘశకలము స్వచ్ఛమగు నీలాకాశమున నెటనుండి యో వచ్చినది. ఉన్నటులుండి యామేఘము రెండుముక్కలయ్యెను. నే నారెంటియందును రామలక్ష్మణులను చూచితిని. భావప్రపంచమున వీలు కేని దేమున్నది? వారిద్దఱును సల్లాపము చేసికొనుచుండిరి. వారి ముఖశ్రీయందెచటను చింతారేఖ లేదు. సౌభ్రాత్రమున తన్మయులై సర్వమును మఱచియుండిరి.

కొలదిసేపటికి వారి మధ్య నొకమానిసి, మేఘశకలమున సృష్టింపబడెను. అదియే సీత. ఉన్నటులుండి రామలక్ష్మణులు పనాటులైరి. సీతమాత్రము మాఱలేదు. ఆమె రాముని భుజముపై తలనిడికొని క్రింది ప్రపంచ లక్షణముల పరీక్షించుచుండెను. శ్రీరాము డన్నియు నామెకు చూపుచున్నాడు. ఆమె దుఃఖించుచుండెను. లక్ష్మణుడు కూడ విచారించుచుండినటులు కన్పట్టెను. క్రమముగ సీత మాయమయ్యెను. లక్ష్మణు డేడువ నారం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భించినాడు. రాముని పాదముల వ్రాలి యేదియో ప్రతి మాలినాడు. రాముడు లక్ష్మణుని లేవదీసి యాతనితో "వత్సా! మన మెట్టింటిమో, యారీతిని ప్రపంచమును విమర్శింతుము. మనలోని ప్రకృతియే మనము బయటను జూచుచున్నాము. కనుక, నెపుడును క్లేశములను గుఱించియు, దుర్మార్గములను గుఱించియు, పాపములనుగూర్చియు మాటాడకుము. ఇందఱు తత్త్వవేత్త లుదయించి యాత్మతత్త్వమును బోధించిన నిట్టి పాపములును, దుర్మార్గములు నీప్రపంచమున జూచుచున్నందులకై విచారింపుము. ఎపుడును కష్టములకై విచారింపకుము. ఎపుడు నీవీప్రపంచవిషయమై, నిజముగ విచారించి, మానవునకుపకారముచేయదలతువో యపుడు నీవు చూచుచున్న పాపముల విమర్శింపకుము. ఈ పాపములును, దుర్మార్గములును సకలబాధలును ప్రపంచమున మానవుని శక్తిహీనతకు ఫలములే! — ప్రతిమానవుడును, చిన్నతనమునుండియు, తా నీవిశ్వమున నణుమాత్రుడనియు, శక్తిహీనుడనియు, పాపభూయిష్ఠుడనియును బోధింపబడుచున్నాడు! నీ వుపకారముచేయదలతువేని, ప్రతిశిశువునకును "బ్రహ్మాస్మి" అను సత్యము నుపదేశింపుము! ప్రతివానికి తా ననంతశక్తుడనియు, పరిశుద్ధుడనియు, నెఱింగింపుము! ఈ సత్యమునెఱింగించి దాని ననుసరించి ప్రవర్తింపజేయుము. ఇదియే సత్యజ్ఞానము. ఇదియే సౌఖ్యరహస్యము. ఇది తెలిసికొనక మానవు డటులున్నాడు!" అని నుడివినట్లు నాకు వినబడినది. ఈ కొన్నిమాటలే నాకు వినబడుటకు కారణమేమి? ఇది యెల్లను నామనఃకల్పనమే మో? కాని జాగ్రదవస్థయందుండిన నాకు మోహముగల్గుటకువీలు లేదే!

ఇట్లనుకొనుచుండగా రామలక్ష్మణు లొండొరుల గౌగిలించుకొనిరి. రెండు చిత్రము లేకమైపోయెను. దానినుండి మరల యిద్ద రుద్భవించినారు. లక్ష్మణుని స్థానమున నర్జునుడు గాండీవము ధరించి నిలబడినాడు. రాముని స్థానమున మురళీధరుడు, కృష్ణుడు! — అర్జునుడు కృష్ణుని నుతించి ప్రార్థింపమొదలిడినాడు! ఆదివ్యసంగీత మాపంచభూతముల యోంకారమున లీనమైపోయినది. శ్రీకృష్ణుడు చిరునవ్వుతో నొకపాత్రము నర్జునునిచేత నిడినాడు. అర్జునుడు మోకరించి యందికొనినాడు! — కృష్ణు డాతనిజూచి, యాతని విన్నదనమునుజూచి "మిత్రమా! నీ వెందులకు విచారించెదవు? నీవెవరవో నీ వెఱుగ లేక యిట్లు చింతించుచుంటివి. నీ వమృతుడవు! నీవు జన్మాంతరరహితుడవు! నీ కట్టిచింతగాని, క్లేశముగాని లేదు. దేనిచేతను నీవు బాధింపబడవు. నీ వాయనంత నీలాకాశమువంటి వాడవు. ఆయాకసముమీద నెట్లనేకవిధములగు చిత్రవర్ణములుగల మేఘము లనేకము వచ్చుచుండునో, మాయమగుచుండునో, కాని యెట్లు ఆకసమెపుడు స్వభావముచే ననంతనీలమో, అట్లే నీవును! నీవే యీ యనంతవిశ్వప్రభుడవు; అనంతశక్తుడవు; పరిపూర్ణుడవు; పరిశుద్ధుడవు; మంగళస్వరూపుడవు. ఈ విశ్వమందున్న శక్తియంతయు నీయం దణగియున్నది. నీవు చిదానందస్వరూపుడవు. విచారించు టేల? అని మందహాసమొనర్చి అర్జునుని కౌగలించుకొనినాడు. ఒక్క మెరపు మెరసినది. మేఘము మాయమయ్యెను. నే నత్యంతవిస్మయాక్రాంతుడనైతిని ఇదినాకు సందేశమా? నేను నాచుట్టునున్న భూతములలో లీనమైపోయినటుల దోచెను. ఇదియే స్వర్గసౌఖ్యమా? ఇదియే దివ్యవిభూతియా? ఓం తత్సత్.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రేమ సూత్రం

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు (కవితాసమితి)

"అబ్బ! తెలిపయింది? పోసిండి! అంతే చాలును! తెల్లవారీదాకా రావడం మానేశారుకా! అదే పదివేలు. మీ కెప్పటి కయినా యీనిర్భాగ్యురాలు జ్ఞాపకంవస్తేఅదే మహామేరువు. స్త్రీముఖం కంటె శ్రీనివాస రావుముఖం మీూ కందంగా కనబడుతుంది కాబోలు! స్నేహమైతే పగలల్లా కలుసు కుంటారు. చాలిందికాదూ? రాత్రి పన్నెండు గంటలదాకా మీరక్కడ బాతాకానీ చేస్తూ వుంటే నేనొక్కర్తినీ యిలా కూర్చోనా? బాగానేవుంది!"

ఆమాటలు విని సుందర్రావు జేబులో వాచీతీసి చూచేడు. పావుతక్కువ తొమ్మి దయింది. కమలం మొగం చూచేడు. ఆమె కళ్లలో నీటిజాడలు కనబడ్డాయి. సుందర్రావు తగ్గివున్న దీపంతో సరిగా చిన్నబోయాడు. కమ లం అనురాగానికి మెచ్చుకొని కలకలలాడేడు. తన ముఖకళతో సరిగా దీపం హెచ్చించేడు. "కమలం!" ఇంకా తొమ్మిది కాలేదు. ఏమంత తొందర?

కమలం—"ఒక్కర్తైనా ఉండలేకా. మరే ముంది? నాకేలాతొందర? నే నందరిలాగూ తొందరపడీదాని నయితే బాగానే ఉండును. నేనెంత చేసుకున్నానో అంతేగాని మెక్కువ రమ్మంటే మెలావస్తుంది? నా తొందరచూచి మీూరాశ్చర్యపడితే తప్పలేదు. "మనుసుకురాని మనువుకు నిలుచుచోటే నిద్ద"రట

సుందర్రావు:—"ఇప్పుడేమయిందిచెప్పూ?"

కమలం:—"ఏమిటవుతుంది?ఏమీూకాదు!" ఎందుకలా బొమముడేసి చూస్తారు? నాదే తప్పా? వసంతుడితో విరహవేదనచెప్పుకుంటే కోకిలకంఠంతో కోప్పడ్డాడట. మన్మథుడు గదా అని పూలదండ కానుక పెడితే పుష్పబాణా లతో హృదయం పగులగొట్టడూ? మీూదా తప్పా? నాకీ! హృదయం దాచుకోలేకపోతే యిలా గేవుంటుంది. దామరపువ్వులాగు తెంపేసి మీూపాదాలదగ్గర పడేశాను నా హృదయం! పరాకుచేతనైనా మట్టేస్తారు. మీూ కేమిటి? మీూరు మగరాజులు! ఆడుదాని అనురాగానికి కూడా తెరచాటుండాలి కదా?"

సుందర్రావు:— "ఊరికే నువ్విలా రొస రొసలాడితే మెలాగూ? రేపటినుండీ మరి పైకి రాత్రిళ్లు వెళ్లనులే. ఇవాళకు క్షమించేవా?"

కమలం—"అన్నిటికీ వెటకారమే! నేనా క్షమించేదాన్ని? మీూరేమంటే చెల్లదు? మీూ యిష్టంవచ్చినట్టూ ఆడండి."

ఆయింట్లో సుందర్రావూ కమలంయిద్దరే వున్నారు. సుందర్రావు స్కూళ్ల ఇన్స్పెక్టరు గుమాస్తా. నలభైరూపాయిలు కాబోలు జీతం యిస్తారు. మరి భూములూ పుట్రలూ మేమీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేవు. సుందర్రావు మంచిజాగ్రతగా కాల క్షేపం చేసేవాడు. కమలంమాత్రం కొంచెం దర్జాఅయిన కుటుంబంలో పుట్టిందేమో వేషం లోనూ, భాషలోనూకూడా తన విశాలహృదయం చూపెస్తుంది. చీరల మెన్నికలో, నగల చేతల నాడెంలో, ముస్తాబులలో, మురిపింపులలో అనుదినం యేదో ఒకవింత కనిపెడుతూనే వుంటుంది. కమలం గదిలో రెండు నిలువుటద్దాలున్నాయి. వండుతూన్న రెండు గడియలూ ఏందూరంగా వుంటుందో కాని తక్కిన కాలమంతా కమలం ఆనిలువుటద్దాల మధ్యనే నిగనిగలాడుతుంది. చెక్కులు తుడుచుకుంటూ, చెంపలు దిద్దుకుంటూ, ముంగురులు ముడుచుకుంటూ, పెదవులు సవరించుకుంటూ, కనురెప్పలల్లారుస్తూ, ఎగాదిగా తన నీడ అద్దాల్లో చూచుకుంటూ ఒక్కొక్కనాడు వేళకూడా మరిచిపోతుంది. కమలం సారెవచ్చి యేడేళ్లయిందో, యెనిమిదేళ్లయిందో ఇవాళ సారె వచ్చినట్టుంది.

ఆరోజున మెల్లగా యిద్దరూ రాజీపడి వీథితలుపు గడియేసుకుని పడకగదిలో ప్రవేశించేరు. గదిలో ప్రవేశించగానే కమలం మొగాన్న చిరునవ్వు మొలకెత్తించింది. కన్నులరవాల్చింది. నీరులాటి చీర జిలుగుపైట భుజంమీదినుండి సగం జార్చింది. వక్షొన్ని దోబూచులాడించే వెలితిరవికెలోనుండి మిలమిలలాడే సన్నవాచీగొలుసు చేత్తో సవరిస్తూ కనురెప్పలు బరువుగా వాల్చి, అడుగుసంగోరు పెడుతూ అలా క్రీగంటను అద్దంలో చూచుకుంది. అలాగే సుందర్రావుముఖం చూచింది. ఇదంతా సుందర్రావు చూడనే లేదు. మంచంమీద దుప్పటీ దులిపి పరుస్తున్నాడు. పగలల్లా కచేరీలో కూర్చుని తలవంచికొని వ్రాసివ్రాసి వున్నాడేమో నడుం లాక్కొచ్చింది కాబోలు పాపం అతడలా ఆమంచంమీద సాగిలిపడ్డాడు. కమలం శృంగారచేష్టలు కనిపెట్టలేకపోయేడు. కమలం అలా నిలబడిపోయింది. చేతులు వ్రేలవైచి తలవంచికొని వేడినిట్టూర్పు విడిచింది. అలాగే సుందరావును చూచి రా? అలాగే తననీడ అద్దంలో చూచుకుంది. ఇంతలో సుందర్రావామెను చూచేడు "కమలం! యిలారా" అన్నాడు. కిటికీలోనుండి వస్తూన్న సన్నగాలిలో పెనగులాడుతూన్న ముంగురులను చేయి అంటీ అంటకుండా సవరించబోతూ, దీపపు వెలుగున మిలమిలలాడే వజ్రపుపొడి ఉంగరంనీడ వైపు అద్దంలో చూచి బరువుగా ఊపిరితీసి మెగసిన హృదయాన్నత్యంమీద రెండోచేయివేసికొని అద్దంలో నీడ చూచుకుని అలాగే సుందర్రావువైపు చూచి చురచుర లాలికించేసింది. ఆచూపుతో సుందర్రావు వచ్చి, అల కలచిక్కు సవరిస్తాడేమో అనుకుంది. పొడిఉంగరపువ్రేలు ముద్దుపెట్టుకుంటాడేమో అనుకుంది. బరువు ఊపిరిలో పలవరిస్తాడేమో అనుకుంది. అల్లలలాడే హృదయాన్నత్యానికి అభయహస్త మిస్తాడేమో అనుకుంది. అద్దపు నీడతో అల్లుకొనిపోతాడేమో అనుకుంది. అతడలాచూస్తూ కూర్చున్నాడు. పైటమరింత జార్చేసింది. చీరకుచ్చెళ్లు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జిలజిలలాడించేసింది. నడుంగడగడలాడించేసింది గోడలనున్న పటాలన్నీ ఛాయాగ్రహణ యంత్రాలయి తన విలాసాలను ముద్రించుకోకూడదా అన్నట్టు గదల్లా కలయచూచింది. ఇదంతా చూచిచూచి సుందర్రావు దిగ్గునలేచి మంచం నడుమను కూర్చున్నాడు. "ఏమిటి? కమలం? నీ వెప్పుడూ విశాలంగా మాట్లాడవూ! సినీమా బొమ్మలాగు క్షణానికొకలాగు కనబడతావు! సినీమాలో యిది ఫలానా అని ముందుగా కొంత వ్రాస్తారు. ప్రక్కనొకడు చెపుతూవుంటాడు. నిన్ను తెలుసుకోడానికి నాకలాటి సహాయాలేవీ లేవూ? నా కెలా తెలుస్తుంది? చెప్పమరీ!" అన్నాడు.

"మీకన్నిటికీ వెటకారమే? నే నంతదాన్నా? సత్యభామనా? వరూధినినా? అలాగే అనండి. ఆడదానిహృదయం మీ కెలా తెలుస్తుంది? కానీయండి. నన్నిలా యెన్నాళ్లాడిస్తారో ఆడించండి మీ అక్కర తీరినతరువాత నేను వక్కపాటయినా చేస్తారా? మీ జీవనవిధానం నాకూ తెలియకుండా ఉంది. అనుదినమూ అదే నడకా! మరి మార్పేలేదు. లెక్కలమేష్టరులాగు రెండుమెట్లలో తేల్చేస్తున్నారు. ముక్తసరిగా మూడుకార్యాలతో దినాలు గడిపేస్తున్నారు! భోజనం-కచేరీపని-నిద్ర - ఈ భాగ్యానికేనా నన్ను రంభలాగు నిత్యం కలకలలాడమంటున్నారు? యౌవనం ఒక్కటీ గాజుకాయలాగ మీకంటికి కనబడితే చాలు కాబోలు! మీ అక్కర తీరినతరువాత సగంత్రాగిన సోడాబుడ్డిలాగ ఆడుదాని శృంగారం అంతా అవతల పారపొయ్యవలసిందే? ఆడుదాని నవ్వు వెన్నెలలో మగవాడు శృంగార గీతాలు పాడాలి. ముంగురుతీగలమీద మురుగీతాలు మ్రోగించాలి. చూపుతీగలతో పూవుటీరాలు గట్టాలి. చెక్కుటద్దాలలో చిత్రలేఖనలు చూడాలి. పైటచెరగులో ప్రబంధాలు చదవాలి."

"అదేమిటో! అవన్నీ నా కర్థం కావు. కమలం."

ఆమాట విని కమలం ఉలికింది. తన ఉన్నతవక్షం క్రిందికి యెడమచేతి ముంజేయి వంచి దానిమొన కుడిమోచేతి నాని ఆ చేతి వ్రేలికొనను ముఖంనిలిపి సుందర్రావును పుల్కుపుల్కున చూచి జలజలా కన్నీటిబొట్లు జాలువారించేసింది. క్రిందిపెదవిని మునుపంటిక్రిందికి బిగించి తేలుడుగన్నులతో తీక్ష్ణంగాచూచి తల పంకించింది. చీరకుచ్చెళ్లు నలగకుండా, చెంపకురులు చెదరకుండ పైటచెరగు తొట్రుపడకుండా మెల్లగా ఆ నిలచినచోటనే నేల కొరిగింది. చాచిన చేతిదండమీద తల నానుకొని పడుక్కుంది. పైటచెరగుతో సంగోరుముసుగు వేసికొంది. వెక్కివెక్కి యేడవడం మొదలు పెట్టింది. ఆ నిట్టూర్పులలోనే ఆ వెక్కులలోనే "కలకంఠవధూకల కాకలీధ్వను"లు గలగలలాడించేస్తూంది.

"ఏమిటి కమలం! ఉరికేకూర్చో యేడుస్తాంవేం? నేను నీకేం తక్కువ చేసేను? నేనెంత నిర్భాగ్యుడనైనా, నా జీతం మొత తక్కువయినా, అందులోనే సర్దుకొని నీకోరిన చీర, నీవు చెప్పిన రవిక, నీవు చేయింపుమన్న



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నగ చేయించేను. నీముద్దు కేంలోపం చేశాను? నీవలంకరించుకుంటే నాకుమాత్రం సంతోషం కాదూ? నీశృంగారం నా ఆనందానికే అని నాకు తెలియదూ? అయితే నాకొక్కొక్కప్పుడు నీ లీలలు అర్థంకావు. అయినప్పుడల్లా ఆనందిస్తూనే వుంటాను. నీశృంగారచేష్టలు గబగబా వర్ణించడానికి కవిని కాను. విశాలంగా పాడడానికి గాయకుడను కాను. పదేపదే పొగడడానికి పండితుడను కాను. అదికాక నీవే చూస్తున్నావు. పగలల్లా పనిచేస్తేనే కాని మాకచేరీలో పని తెమలదు. పని యెక్కువ గుమాస్తాలు తక్కువ. ఎలాగో సాయంతనం అయి యింటికి వచ్చేసరికి అలసిఉంటానేమో నిద్రకోసం తహతహలాడుతుంది శరీరం. నీ చెప్పిన వలపుపందెరలెప్పుడు వేయడం? నాకు కలలోకూడా ఇన్స్పెక్టరు కోపపడుతూన్నట్టే వినబడుతుంది. అదికాక కమలం ఆరేళ్లయిందో, ఏడేళ్లయిందో నీకింకా యీసరదాలేమిటి? పోకులు లేకపోతేనేమీ మన సుఖానికి లోటులేదు కదా! నీవు రోజురోజుకీ ఒరదీసిన కత్తిలాగిలా మిలమిలా మెరిసిపడుతూవుంటే, నేనెంత పాషాణాన్నయినా భయపడనూ?" అన్నాడుసుందర్రావు.

కమలం లేచి కూర్చుని కన్నీళ్లు తుడుచుకుంటూ "అయితే మును పలాయెందుకన్నారు? మనమధ్య పిల్లలుంటే శృంగారభాగ్యం జుర్రుకోడాని కవకాశం ఉండదన్నారు. దానిని గురించి కావ్యాలు చదివేరు. నేనెప్పుడూ అనుకోని ప్రేమ నాకు నాయౌవనంమీదకల్పించేరు. నా యౌవనంతోటే మీ జీవనసుఖ ముందన్నారు. ఆయౌవనం పిల్లలవల్ల తగ్గిపోకుండా మందులిస్తున్నారు. పిల్లలుపుట్టకుండా యంత్రం తెప్పించేరు. నేనదంతా నిజమను కొన్నాను. మీ చెప్పిన కబురులు విని మీకోసమే దినదిన ప్రవర్ధమానంగా యౌవన శృంగారం పెంచుకుంటూఉంటే నాయీప్రయాసాన్ని పోకులనీ సరదాలనీ వెక్కిరిస్తారా? మీకు నిజంగా నా శృంగారం కావాలనుకున్నాను. ఇవన్నీ వట్టిపాటలేనా? ఆగ్రంథకారులేదో వ్రాస్తే మీరు కూడా అదే అని నన్నీపర్వతశిఖరంమెక్కించి యిప్పుడు క్రిందికిత్రోసివేస్తారా? నేను ప్రేమించిన వ్యక్తికి పనికిరాకపోయినతరువాత నాకీ శృంగారం యెందుకూ? ఆహా! అడవిమల్లెపువ్వునయినానే! స్వానుభవాసక్తిచేత తుమ్మెద వాత్తేవాల్తుంది. ఈపరిమళ మేలాదానికి? దానికడుపునిండినతరువాత నన్ను ముంగాళ్లను తంతే ఏంతుంది. దానిదా తప్పు? ఓఅడవిమల్లెపువ్వా, నాకంటె నీవే మిక్కిలి అదృష్టవంతురాలవు. నీజీవితకాలపరిమితి తక్కువవడంచేత నీదుఃఖంకూడా తక్కువే! నేనీ నిలువుపాటున వాడిపోయి నేలరాలిపోతే యెంతబాగుండును! నేనపురూపంగా వన్నెలిడికొంటూ చిత్రించుకుంటూన్న యీ నా శృంగార పటంమీద నా నాయకుడే నిరసించి ఉమ్మివేసినాడు." అని లేచి నిలబడి కమలం తననీడ అద్దంలో చూచుకుంటూ "కన్నులకు దిద్దికొన్న యివి కాటుక కొలుకులుగావు పూలములుకు లనుకున్నాను. నాకన్నీటిలో విన్నబాటున పాపమా కొలుకులెల చెదరిపోయినాయో! పాలమీగడ లాటి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెఱ్కులతభుకు చాటుచాటుకుపోయి మెలా సన్నగిలి పోతూందో! ముడిచికొన్న లలాటాన్ని నటించడాని కిష్టంలేక వెనుకకు పోవడానికి కాబోలు ముంగురులు తొట్రుపడి ఒకదానితో ఒకటి మెలా పెనగులాడుతున్నాయో! పైకి బాహాటంగా రావడానికి సంకోచించి నాడూర్పులుసైతం గద్గదికతో కాలక్షేపం చేస్తున్నాయి. చేయవూ? నైరస్యమెవరికి భరిస్తుంది? నేనిక నిలబడలేను! ఏంపతనం! ఎంతగర్వభంగం! నేనిలా కావడాని కేంతప్పు చేశాను. నేనీవంత మెలాభరించేది? భరించలేను! భరించలేను!!" అంది.

౨

"ఏమయ్యా! రాత్రిల్లా యేంచేస్తున్నావు? కళ్లలా మెఱ్ఱగా ఉన్నాయేం? అందుకేనా యేమిటి? నీకివాళ ప్రొద్దెక్కి తెల్లవారింది? ఎనిమిదయిందిగదా, యిప్పుడా కచేరీకి రావడం? టపా యెప్పుడు పంపుతావు? మాట్లాడవేం? నీకాండక్టేమీ బాగులేదు! ఎందుకాలస్యంగా వచ్చేవో సంజాయిషీ యిచ్చుకో" అన్నారు ఇన్స్పెక్టరుగారు. పాపం సుందరరావు రాత్రల్లా ఆనాటకం ఆడి ఆకన్నీళ్లు తుడిచి అలసిపోయేడేమో తెల్లవారి లేవలేకపోయేడు. ఎలాగో మొండి కెత్తి లేచి వెళ్లేసరికి రోజూకంటె ఆలస్యం అయింది. ఇన్స్పెక్టరలాకోపం పడుతూనే ఉన్నాడు సుందరరావు జబాబు చెప్పకుండా కచేరీ గదిలోకివెళ్లి పోష్టుకు పంపించవలసిన టపాలుసిద్ధంచేసి తనసొంతఉత్తరాలొకటో రెండో కలిపి బంట్రోతు చేతి కిచ్చివేసి కుర్చీలో అలా చేరబడి కూర్చున్నాడు. రాత్రి కథంతా ఆలోచించుకున్నాడు. ఏమిటిచేయడం? ఎవరితో చెప్పుకోవడం? మాట్లాడితే కమలం శృంగారం అంటుంది. విలాసం అంటుంది. ఒయ్యారమంటుంది. ఒద్దికలంటుంది. సరే యివన్నీ ఆడుదానిలో తగుమాత్రం ఉంటే ఆనందమేగాని, ఇలా విపరీతమయితే యెలాగ? పుంజెడు మెతుకులకోసం ప్రొద్దల్లా పాటుపడే నాలాటివాడి కీశృంగారాదులు చూచి మెచ్చుకోవడానికి సమయమెక్కడ చిక్కుతుంది? కమలం అస్తమానం రంభానలకూబరులలాగు రాత్రింబవళ్లు విహరిద్దామంటుంది. నేనిలా విహరిస్తూ కూర్చుంటే నాయీవిహారం మెవరు చూస్తారు? కానీ నేనిలా కమలాన్ని యేడిపించలేను. సరేమా అమ్మ వస్తుందిగదా! ఆమెపెద్దది. ఏదైనా ఉపాయం చెపుతుంది." అనుకొని లేచి భోజనానికని యింటికివెళ్లేడు.

3

"నాయనా సుందరం! ఏమిటీ కమలం వేషం? ఆయెగదువ్వడేమిటి? మెడా చేతులూ లేని రవికేమిటి? కచ్చలేకుండా కుచ్చెళ్ల చీరేమిటి? ఆసున్నితం ఆ సుకుమారం యివన్నీ యేమిటి? సంసారి కింత వేషమెందుకురా నాయనా? మానాడు మే మిలాగే ఉన్నామా? నగుకూ నప్రాణంటే పెట్టుకునే వాళ్లం లేకపోతేలేదు. గంధంపూసినట్టు రవికా కచ్చదోపుకొని చీరావద్దటరా నాయనా? అదేమో మాకిలాటి వేషాలమీదికి మనసే పోయేదికాదు. ఇంటిపనులునాలుగూ చేసుకుంటూ యజమానికీ పిల్లలకీ సంరక్ష చేసుకునేసరికి పొద్దేచాలీది కాదు.........అన్నట్టు! సుందరం — కమల యేమిటిరా నీ మీదలా చెపుతుంది? ఆడుదాని యౌవనం అలా నిత్యం కలకలలాడుతూఉండాలన్నావట! అలాగ ఉండడాని కేవో మందు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లిస్తున్నావట! ఆడుది పిల్లలను కంటే సొగసు చెడిపోతుందన్నావట. యౌవనం జారిపోతుం దన్నావట. పిల్లలుపుట్టకుండా యేదో యంత్రం తెప్పించి దాని కిచ్చేవట! ఏమిట్రా బాబూ! ఇదంతా నిజమేనా!" అని తల్లి గట్టిగా అడిగే సరికి సుందరరావు తలవంచుకొని నిలబడ్డాడు. "అవున్రా నాయనా! ఇవా మీ చదువులూ సం పన్నాలూనూ? బాగుంది. మీయిద్దరూ కలిసి భ్రూణహత్యలు చేస్తున్నారట్రా? ఆడుదాని యౌవనమంటే యేమిటనుకున్నావు? పిల్లలూ కాలక్షేపం సంసారం కట్టుబాట్లూ యివన్నీ వుంటేనే ఆడుదాని విలాసాలు భరించలేరా! అందులోనూ యేకాలక్షేపం లేకుండా స్వశరీ రాన్ని నిత్యం అలా సింగారించుకుంటూ మొగా న్నఅద్దం వ్రేలగట్టుకున్న ఆడుదాని నెవరుభరి స్తారురా బాబూ! పిల్లలవ్యావృత్తి ఉంటే ఆడుదింత పెచ్చురేగిపోగలదా? అదికాక బా బూ! పిల్లలక్కరలేకపోతే సంసారం యెందు కూ! మీయిద్దరూ ముసలాళ్లయితే మిమ్ముల నెవరు కనిపెడతారు! నేనిలా ఉండిపోతానా? ముసలికాలంలో కూడా యౌవనం ఉంటుందని యెవడేనా వ్రాసేడా యేమిటి? "కాలం నాటి పిల్లలూ కాలంనాటి డబ్బూ" అన్నారు. ఇవి లేకపోతే మిమ్ముల నెవరు చూస్తారు? ఎంత మాటన్నావు! బాబూ! పిల్లలు నీయౌవనాని కడ్డుతగుల్తారా? పిల్లలలాటి ప్రేమింపదగిన వస్తువున్నదా? అది అలాఉండగా-పోనీ యౌవ నం అలా నిలబడుతుందనుకో, అనుభవించే మగవాడేడీ? నీవేం మన్మథుడవా? నలకూ బరుడవా? వసంతుడవా? చంద్రుడవా? ఏపూట కచేరికి వెళ్లకపోతే ఆపూట తిండిలేదు గదా? నీలాటివాడా కమలం విలాసాలు కన్నె త్తి చూడగలడూ? అయినా, యిరవైనాలుగు గంటలూ తనముస్తాబూ, తన యౌవనం, తన విలాసం, ఇవ్వన్నీ తలచుకుంటూ కాలక్షేపం చేస్తూన్న ఆడుది గవ్వకేనా పనికివస్తుందా?"

సుందరరావు:—"అది కాదమ్మా, నా తక్కువ జీతంలో నాయింటినిండా పిల్లలుంటే నేనెలా భరించగలనో చెప్పు! పిల్లలు లేకపోతే మాజీతంతో మేము సుఖంగా కాలక్షేపం చెయ్యవచ్చును. అందుకోసం పిల్లలను కన క్కరలేదన్నాను."

తల్లి:—"అలాగట్రా? నీజీతం యిప్పుడు నీకు సరిపోతూందా? సరిపోతుంది కాబోలు! లేకపోతే యీబుటాలచీరలూ ఆమజిలీను రవి కెలూ, ఆ అత్తరవులూ, ఆవాసన నూనెలూ ఆసబ్బుబిళ్లలూ, గడియారపు గొలుసులూ గజ్జెలవడ్డాణాలూ అవిగాక ఆమందులూ యం త్రాలూ ఇవన్నీ యెలావస్తున్నాయి?"

సుందరరావు—"ఏంచెయమన్నావమ్మా! వీటన్నిటికీ మాభోజనానికీ నాజీతం సరిపోతుం దా? చాలదు! అలాగే అప్పుచేసి నెల వాయి దాలచొప్పున తీరుస్తున్నాను. క్రొత్తవస్తువులకు మళ్లా క్రొత్త అప్పులు చేస్తున్నాను. ఇంత తంటాలు పడ్డా దానికి సంతుష్టిలేకుండా ఉంది. ఎప్పుడూ చిడిముడిపడుతూనేఉంటుంది. ఎలాగు దీనితో దేవులాడడం!"

తల్లి—"అదేమో నాయనా! నాకేం తెలు స్తుంది. మీ చదువులూ మీ శాస్త్రాలూను?మీ వింతవింతవూహాలూ విపరీతాలూ నాలాటి ముసలిముండాకూతురు కేం తెలుస్తాయి? నేనే మేనా అన్నట్టయినా యీముసలిముండ మా యౌవనసౌభాగ్యం చల్లార్చేసిందని నామీద నేడుస్తారు మీయిద్దరూనూ!"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుందర—"అమ్మా! నువ్విప్పుడిలామమ్ము లను వదిలేస్తే యెలాగు? దాని నేదో లాలించి సంసార మార్గంలో పెడతావనే నీ కుత్తరం వ్రాసి రమ్మన్నాను. నువ్వువచ్చి అలాగేఅంటే నాకింకెవరు దిక్కు?"

తల్లి—"అలా గయితే కమలాన్ని నా పూచీకి ఒప్పచెపతావా? ఆరునెలలలోచూడు దానినెలామార్చేస్తానో! ఊహా ఉపాయం ఉం డాలి. తెలివితేటలూ ధీశక్తీ ఉండాలి. రోగం పోవడానికి మందుగాని ఆరోగ్యం కదలకుండా నిలపెట్టడానికి మందుందా? శిశుకోశాన్ని యంత్రసాధనంవల్ల లొంగతీశావు గాని స్త్రీ హృదయం లొంగతీయడాని కేయంత్రం కని పెట్టేవు నాయనా! మానసికావస్థలయిన సుఖ దుఃఖాలను యంత్రసాధనం వల్ల తారుమారు చెయ్యగలవా? పువ్వువాడిపోకుండా ద్రావకా లలో కప్పెట్టేవనుకో. ఆద్రావకంలో నుండి పువ్వుపైకితీస్తే యేమవుతుంది? అలా దాచిన పువ్వు అలంకారానికేనా, అనుభవానికి వస్తుం దా? గమగమవాసనలు చిమ్ముతుందా? కలకల విరబారుతుందా?"

సుందర:—ఏమిటో అమ్మా అవన్నీ నే నాలోచించలేదు. అయిందేదో అయింది. నీ వేదో సర్దుబాటు చేద్దూ.

తల్లి "ఆలాగే"

౪

ఏడు నెలలయింది. చేతులనిండా గాజులూ, చెక్కులనిండా తెలితళ్కులూ, పలుచపడ్డ శరీరం, బలపడ్డనడుం, ఉల్లిమళ్లవల్లె మల్లి రేకుల కవికా, ప్రేమపూరితములయిన చూపులూ పెద్దరికం తెలిపేనడకా, వీటన్నిటితో కమలం క్రొత్తదయింది. ఆమె కిప్పుడు సుందరావు మీద ప్రేమహెచ్చయింది. ఇప్పుడద్దంలో వాని ముంగురులే దిద్దుతుంది. కమీజుకు బొత్తాయిలు పెడుతుంది. కాఫీ తానే చల్లార బోసి వాని కందిస్తుంది. అద్దంలోనూ పయినీ కూడా సుందరావునే చూస్తుంది. ఇప్పుడు సుందరావానందతరంగాల నందుకొంటున్నా డు. నెలలునిండి కమలానికి కొడుకుపుట్టేడు.

* * *

ఆవేళ సాయంతనం కచేరినుండి సుంద రావు ఇంటికి వచ్చేడు. సాగా అందుకోడానికి కమలం యెదురుగా వచ్చింది. కమలం బాలెం తవేషం కన్నులపండువు చేస్తూంది. గదిలో మంచంమీద కూర్చుని సుందరావు ముద్దాప లేక 'యిలారా కమలం'! అన్నాడు. కమలం వచ్చింది మంచంమీద కూర్చోపెట్టుకుని చెదరి న కాటుక రేకలూ, చెక్కులపసుపూ, అసమాన ప్రేమపూరితములయిన కనులూ, పెదవుల తాంబూలపు టెఱుపూ బిగించిన నడుము చు ట్టూ, విడిన రవికకట్టూ, ఇవన్నీచూచి కమలం భుజంమీద చేయివేసి బుగ్గముద్దు పెట్టుకో పోయేడు. "ఇప్పుడు నన్ను ముద్దేమిటండీ! ఉండండి; బాబును తీసుకొస్తా" అని కొడుకు నెత్తుకొచ్చింది. ఆమంచంమీద ఆపిల్లవాడిని పడుకోబెట్టి "చూడండీ! బాబెలా నవ్వుతు న్నాడో" అని వంగి కమల మొకబుగ్గా సుంద రావొకబుగ్గా ముద్దుబెట్టుకున్నారు. కమల మొగమెత్తి సుందరావు మొగం సంతుష్టితో చూచి "ఇదే ప్రేమసూత్రం" అంది.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కొలంబో మ్యూజియము



ఇత్తడి బుద్ధవిగ్రహము-మకరతోరణము
తొమ్మిదిన్నర అంగుళములయెత్తు. (కొలంబో మ్యూజియము)



అడకత్తెర
(కొలంబో మ్యూజియము)



ద్వారపాలక విగ్రహము
2 అడుగులు $4\frac{1}{2}$ అంగుళముల యెత్తుగలది. (కొలంబో మ్యూజియము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చుట్టూ ఏనుగులుచెక్కినదిన్నె. కొలంబో మ్యూజియము.



ద్వారపాలక విగ్రహము.
ఎత్తు 2 అ. 9½ అం. (కొలంబోమ్యూజియము.)



ద్వారపాలకుడు, ఎత్తు 3 అ. 8 అం.
(కొలంబోమ్యూజియము.)



శయనబుద్ధుడు, 27 అంగుళములపొడవు



రువనవేలి దాగోబాపైనున్న సచిత్ర శిలాఫలకము.
దీనిపొడవు 6 అ. 3 అం. (కొలంబోమ్యూజియము.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## వెయ్యి రేకుల కలవపువ్వు

అనగా అనగా ఒకవూళ్లో ఒక బ్రాహ్మ డున్నాడు. ఆబ్రాహ్మడి కొకగయ్యాళిపెళ్లాం వుంది. ఆబ్రాహ్మడింట్లోనే అతని చిన్న చెల్లెలు కూడా వుండేది.

శ్రావణమాసంవచ్చింది. ఎక్కడచూసినా మంగళవారాల శుక్రవారాల నోములు నోచుకునేవాళ్లే, వాయనాలు పుచ్చుకునేవాళ్లే, పేరంటకానికని తిరిగేవాళ్లే.

ఇరుగుపొరుగు అమ్మలక్కలు ఆ బ్రాహ్మడి భార్యని చెల్లెల్ని పేరంటకానికి పిల్చేరు. గయ్యాళిపెళ్లాం వెళ్లనంది. ఆడపడచు "వొదినా వొదినా, నేను పేరంటకానికి వెళతాను, మరేమో నీపట్టుచీ రొకమాటు కట్టుకోడాని కిస్తూ" అంది. 'నాకులేనిపేరంటం నీ కెందుకూ నే నియ్యనుపో' అని వొదిన కసిరేసింది. ఆడపడచు మళ్లామళ్లా అడిగింది. 'పట్టుచీర పాడు చెయ్యనులే, తల్లీ' అంది. "పాడుచెయ్యవు కదూ, పాడుచెయ్యనని ఒప్పుకుంటావ్, వొట్టెయి చూస్తాను. ఇదిగో మరి నాపట్టుచీరమీద



"ఇదిగో మరి .నాపట్టుచీరమీద...గంధపుపిసరుపడ్డాసరే ఒప్పుకునేదాన్ని కాదుసుమా, జాగ్రత్త, భద్రం"

కనక ఆవగింజంత గంధపుపిసరు పడ్డాసరే ఒప్పుకునేదాన్ని కాదు సుమా, జాగ్రత్త, భద్రం" అని వొట్లు ప్రమాణాలు చేయించుకుని పట్టుచీరె మరీ యిచ్చింది. ఆడపడుచు పట్టుచీరకట్టుకుంది. పేరంటానికి వెళ్లింది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొద్దుపోయింది. చీకటి పడుతూంది. పేరంటకాన్నుంచి ఆపిల్ల తిరిగివచ్చింది. "ఇదిగో వదినా నీ పట్టుచీర యేమీ పడకుండా పట్టు కొచ్చేను. పారాణి, గంధంకూడా పడలే"దంది 'అలాగా సరే చూస్తానుగా' అంది. చీరపుచ్చు



"చీరెలా తగలపెట్టేశావే; మండపెట్టేశావు."

కుని చీరంతా విప్పి యిటూ అటూ వెతికి, ఒకఘడియసేపు వెతగ్గా వెతగ్గా ఆవగింజలో సగమంత గంధపుపిసరు పడివుండడం చూసి చీరెలా తగల పెట్టేశావే; మండపెట్టేశావు. "అయ్యో అయ్యో, నామొహం మండిపోనూ' నేను నీకియ్యనంటూ నే వున్నానమ్మా! అమ్మ, శక్తి, తల్లీ నన్ను పీకి పాకంపట్టేశావు; కాని నన్ను బతకనిచ్చేవా. అయ్యో,నాబుద్ధికాలా, నన్నిలా రవ్వపెడతావని అనుకుంటూ నేవున్నా నమ్మా" అనియేడ్చి, కేకలేసి కొట్టి, తన్ని, తిట్టి, చీరలుమ్మచుట్టి ఆడపడుచుమీద పారేసి తలకి వాసెనకట్టుకుని, నులకమంచంమీద పడు క్కుని రాగాలు పెట్టడం మొదలెట్టింది.

బాగా రాత్రిపడింది. మామ్మూలు వేళకు బ్రాహ్మడింటికి వచ్చేడు. 'ఒసేవ్ ఎక్కడున్నా వేవ్' అన్నాడు. 'ఏమేవ్ పలకవేం' అన్నాడు. 'అయ్యో నావల్ల యేమపరాధంవచ్చిందో'అను కున్నాడు. గజగజలాడేడు. ఇంట్లో మూల లన్నీ వెతికేడు. మంచంమీద పడుక్కుని వున్న పెళ్లాన్ని చూసేడు. నెమ్మదిగా దగ్గిరికి వెళ్లేడు. 'ఎందు కిలా పడుక్కున్నావేవ్' అన్నాడు. 'చె ప్పే బాబూ... చెప్పవు టే' అన్నాడు. 'నావల్ల యేమిటపరాధంవచ్చిందో చెప్పమా అయినా' అన్నాడు. 'నిన్ను బతిమాలుకుంటానుగా' అ న్నాడు. 'నీకాళ్లు పట్టుకుంటానే' అన్నాడు. అని రెండుకాళ్లుపట్టుకుని తలమీద పెట్టుకు న్నాడు. అప్పుడది లేచింది. మహాకోపంతోను



"అని రెండుకాళ్లుపట్టుకుని తలమీద పెట్టుకున్నాడు."

యేడుపుతోను, రాగాలతోను, నీచెల్లెలు నా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



"బ్రాహ్మడు పేలు వెతికినట్టుగా నటించి నువ్వుగింజ వొక్కొక్కటే చిటుకూచిటుకూమనినొక్కుతున్నాడు."

పట్టుచీర తగలపెట్టేసింది. ధ్వంసం చేసింది' అని రాగాలుతీస్తూ మళ్లా మంచంమీద పడుక్కుంది మళ్లీ. బ్రాహ్మడు బతిమాలేడు. మళ్లీ కాళ్లు నెత్తిమీద పట్టుకున్నాడు. గయ్యాళి మళ్లా లేచింది 'నీచెల్లెల్ని నువ్వే గోతికో నూతికో అప్పగిస్తే నేసరి లేక పోతే నేనిదిగో నూతులోదిగుతున్నా' నంది. బ్రాహ్మడు వద్దేఅని బతిమాలు కున్నాడు. 'ఇదిగో చస్తా'నని లేచింది. 'నువ్వుచెప్పినట్లు చేస్తా లేవ్' అని కేకవేసేడు. గయ్యాళి మళ్లీపడుక్కుంది.

బ్రాహ్మడు చెల్లెలిదగ్గిరికి వెళ్లేడు. 'చెల్లీ నిన్ను మీఅత్తారింటికి దిగపెడతా రా' అన్నాడు. 'ఇప్పుడేనా అన్నయ్యా'అంది. 'ఇప్పుడే పోదాంరా' అన్నాడు. 'అయితే సరే' అంది. బ్రాహ్మడు నువ్వులుకొన్ని కొంగున మూట కట్టుకున్నాడు. ఇద్దరూ బయలుదేరేరు.

చాలాదూరం నడిచిపోయేరు. అర్ధరాత్రయిపోయింది. ఒక పెద్ద నూతి సమీపానికి వచ్చేరు. 'చెల్లీ, నీకు నిద్రవస్తూన్నట్టుంది, నీ తల నా వొళ్లో పెట్టుకు పడుకో; పేలుంటే కుక్కుతా' అన్నాడు. 'సరే' అని పడుక్కుంది. బ్రాహ్మడు పేలు వెతికినట్టుగా నటించి నువ్వుగింజ వొక్కొక్కటే చిటుకూచిటుకూమని నొక్కుతున్నాడు. చెల్లెలు నిద్రపోయింది. బ్రాహ్మడు నెమ్మదిగా లేచేడు. 'నిద్రపోతుందిరా' అనుకున్నాడు. కదలనీయకుండా చేతులతో యెత్తుకొని నూతిదగ్గిరికి వెళ్లి గభీమని నూతిలో యెత్తేసేడు. ఇంటికి చక్కా బయలుదేరేడు.

తెల్లవారింది. ఆడవాళ్లునూతికినీళ్లుతోడుకోడానికి వచ్చేరు. చేదలు వెయ్యబోయేరు. నూతి నీళ్లవైపు చూసేరు. కళ్లు జిగేలుమన్నాయి, నిర్ఘాంతపోయేరు. తళతళ బంగారంలా మెరిసిపోతూన్న వెయ్యిరేకుల కలవపువ్వు కనబడింది. 'ఇదేమిచోద్యం' అని బుగ్గలమీద వేళ్లువేసుకుని నిలబడ్డారు.



"ఇదేమి చోద్యం."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దూరదేశాలనుంచి చాలామంది స్త్రీలు, పురుషులు వచ్చేరు. ఆవిచిత్రపు కలవపువ్వును చూసేరు. 'దీన్ని పైకి తియ్యా' లనుకున్నారు. నూతిలోకి దిగేరు. ఎవరు తియ్యబోయినా,

ముట్టా ముట్టకు నన్ను
ముట్టితే నీచెయ్యి కందు
పాపిష్టివాదినా పట్టుచీరి స్తే
పాపిష్టిఅన్న పడతోసె.

అని పాటపాడుతూ మునిగిపోయేది. ఏ వొక్కతికీకూడా దొరకలేదు.

మనబ్రాహ్మడి బావమరిది అత్తారింటికి వెల్లి పెళ్లాన్ని తెచ్చుకొద్దామని బయలుదేరేడు; వస్తున్నాడు. దారిలో యీవింత కలవపువ్వ సంగతి విన్నాడు. 'ఇదేమివింతో'అని ఆశ్చర్య పడ్డాడు. 'మనంకూడా చూడాలి' అనుకున్నాడు; నూతిదగ్గరికి వచ్చేడు. కలవపువ్వ పాడే పాట విన్నాడు. 'దాని అర్థంయేమిటి తెలియటం లేదే' అనుకున్నాడు. 'నూతిలోకిదిగితీద్దాం అనుకున్నాడు. దిగేడు. కలవపువ్వ మునిగిపోలేదు. దొరికిందిరా అని పట్టుకున్నాడు. గట్టుమీదికి తెచ్చేడు. కలవపూవు మళ్లా పాట పాడింది. బ్రాహ్మడికి కొంచెం అర్థంతోచిన ట్టనిపించింది. అన్న వొదినఅన్నమాటలు బోధపడ్డాయి. పట్టుచీర అన్నది తెలిసింది. అన్ని సంగతులు బోధపడ్డాయి. గభాలున యేడవడం మొదలుపెట్టేడు. 'తన పెళ్లామే నూతిలోకి తోసివేయబడిం' దనుకొన్నాడు. 'తన పెళ్లామే యీ కలవపు' వ్వనుకున్నాడు. కన్నీళ్లు కాలవలుకట్టేటట్లా యేడ్చాడు. యేడ్చేంప్రయోజనం? ఆపువ్వును నూతిలోంచి తీసి నెత్తిమీద



"నూతిలోంచితీసి నెత్తిమీదపెట్టుకుని యింటికి పట్టుకుపోయేడు."

పెట్టుకుని యింటికి పట్టుకుపోయేడు. అందరూ ఆపాపపు బ్రాహ్మణ్ణి తెగతిట్టేరు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సాముద్రికం

సామినేని ముద్దుకృష్ణ గారు

(౮-వ సంపుటము, ౨-వ సంచిక తరువాయి)

హస్తాలు : జాతులు

"నైసర్గికం కాలజం చ
చిహ్నం నైమిత్తికం తథా,
కాలదేశానుమానేన
జ్ఞాత్వా ఫల ముదీరయేత్."

—ప్రహ్లాద.

ఈప్రహ్లాద సూత్రాన్ని సర్వత్రా మనస్సులో వుంచుకొనుట చాలా ఉపయుక్తం.

చేయి చదవడానికి ముందు చేతిని జోర్లించి పరీక్షించవలెను. ఈపరీక్షలో హస్తం జాతినిర్ణయమౌతుంది. ఒక్కొక్క జాతిహస్తానికి కొన్ని కొన్ని ప్రత్యేకలక్షణాలు, గుణాలు శాస్త్రజ్ఞులు నిర్ణయించేరు. జాతిని నిర్ణయించిన తదనంతరం చేతిని వెల్లకితలా త్రిప్పి అరచేతిలో తారాస్థానాలనూ, రేకలనూ పరీక్షించి ఫలం నిర్ణయించవలెను.

తారాస్థానం గాని, రేక గాని ఒకజాతి హస్తంలో ఒకఫలాన్ని, ఇంకొక జాతిహస్తంలో ఇంకొకఫలాన్ని ఇస్తూ వుంటవి; అనగా తారాస్థానం గాని, రేకగాని హస్తంనిర్ణయించిన స్వభావానికి అనుకూలంగా వుంటే అవి గుణాన్ని వృద్ధిపరచి ఉపయోగపడతవి; లేక వ్యతిరేకఫలాన్ని సూచిస్తే సుడిపెట్టి ప్రతికూలంగావుంటవి. అందుచేత ముందుగా హస్తం జాతిని నిర్ణయించడం ముఖ్యం. ఇందునిమిత్తం సాముద్రికాన్ని రెండు భాగాలుగా విడదీశేరు.

గ్రీకు భాషలో 'షీర్' (Cheir) అంటే చేయి. ఈశాస్త్రాన్ని 'షీరోనమీ' (Cheirognomy) అని, 'షీరోమేన్సీ' (Cheiromancy) అని రెండుభాగాలుగావిభజించేరు. 'షీరోనమీ'లో హస్తాలు, వాటి జాతులు, వాటి లక్షణాలు, గుణాలు నిర్ణయించేరు. 'షీరోమేన్సీ'లో తారాస్థానాలు, వాటి ఉచ్చ నీచ, సాధారణపు వృత్తులు; రేకలు, వాటి వివిధరూపాలు, వాటి ఫలాలు నిర్ణయించేరు. ఈమొత్తం అంతాకలిపి హస్తశాస్త్రం. దీనిలో ఒకదాన్నివిడిచి ఇంకో భాగాన్నే చదివినట్లయితే చాలా తప్పులు చెప్పడానికి అవకాశం వున్నది. అందుచేత శాస్త్ర గౌరవంగలవారు ప్రారంభం నుంచీ జాగ్రత్తగా అవగాహన చేసికోడం చాలా అవసరం.

చేతినిర్మాణం ఎలాఅంటే, ఇరువదియేడు ఎముకలవల్ల. మణికట్టువద్ద ఎనిమిది ఎముకలూ—[వీటిని 'కార్పల్' ఎముకలు (Carpal bones)—అంటారు.] అరచేయి నొక్కిచూస్తే కనిపించే అయిదు ఎముకలు—[వీటిని 'మెటకార్పల్' ఎముకలు (Metacarpal bones) అంటారు.] బొటనవ్రేలిలో రెండూ తక్కినవ్రేళ్ల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. క్రిందను గుంపుగావున్న ఎముకలు 'కార్పల్' Carpal Bones ఇవి మణికట్టులోనివి. ఈ 'కార్పల్' ఎముకలమీదనుంచి నిడివిగా ఉన్న అయిదు పెద్ద ఎముకలు 'మెట కార్పల్' ఎముకలు Metacarpal Bones ఇవి అరచేయిమొత్తం. 'మెటకార్పల్' ఎముకలపైన, బొటవ్రేలిమీద రెండు, యితర వ్రేళ్లమీద మూడేసి వున్నవి. 'ఫెలేంజస్' Phalanges అంగుళ్యస్థులు.

లో మూడేసి చొప్పున పదునాలుగు— 'ఫెలెంజస్' (Phalanges) అనే అంగుళ్యస్థులూ. మొత్తం ౨౭. (ఈ ఎముకల ఒడ్డుపొడుగుల హెచ్చుతగ్గులవల్ల చేతివైశాల్యం)తద్రూపేణహస్తం జాతి ఏర్పడుతుంది. పూర్వీకులు హస్తాలను డబ్భయి, ఎనభయిజాతులుగావిడదీసినారు. కాని ఇటీవల శాస్త్రజ్ఞులు సెయింటుజెర్మైను, పీరో రాబిన్సను మొదలైనవారు సదుపాయం నిమిత్తం ప్రధానజాతులు ఏడుగా అంగీకరించినారు. ఆవిభాగం అనుసరిస్తాను.

౧. సైకిక్—ఆధ్యాత్మికహస్తం

అన్ని చేతులలోను ఇదిసుందరతమమైనది. అందుచేతనే అరుదు. శరీర పరిణామంతో పోల్చిచూస్తే ఈహస్తం ఎక్కువచిన్నదిగాను, నాజూకుగాను కనిపిస్తుంది. తగుమాత్రం అరచేయి. మిక్కిలి మృదువైనవ్రేళ్లు అనగా కణుపులు విశదంగా కనిపించకుండాను. గోటిభాగం చాలాపొడవుగా సూది మొనగాను గోళ్లు బాదం ఆకారంగాను, బొటవ్రేలు చిన్నదిగా అందంగాను ఉండడము ఈహస్తానికి ప్రత్యేకలక్షణం. వీరు జీవితానికి ముఖ్యంగా సంబంధించిన విషయాలను విస్తారంగా పాటించలేరు. సాధారణప్రపంచాన్ని ఒకఉన్నత శిఖరంమీద నుంచి చూచినట్లు చూస్తారు. అందుచేత ప్రపంచములో ఉపయుక్తంగా జీవించడానికి కావలసిన స్థూలదృష్టి వీరికిలేదు. వీరికి అగోచరాలను అన్వేషించవలెనని, మానవస్వభావానికి మూలసూత్రాలను తెలిసికోవలెనని అభిలాష హెచ్చు. తమవంటి సోదరస్వభావం గలవారితోగాని వీరు విస్తారం సంప్రతించలేదు.

సైకిక్‌హస్తం పెద్దదిగాను కణుపులు ఏర్పాటుగాను ఉండడం తటస్థిస్తే శక్తిసామర్థ్యాలు ద్విగుణీకృతం అయినా సహజంఅయిన సమయస్ఫూర్తి తగ్గుతుంది. ఈహస్తాలు మనదేశంలో విస్తారం.

౨. ఫిలసాఫికల్-వేదాంతిహస్తం

వేదాంతిహస్తంలో అరచేయి పెద్దదిగా విస్తారం కండలేకుండా ఎముకలుగాను, బొటవ్రేలు కొంచం పొడుగుగా రెండుకణుపులూ పెద్దవిగాను వుంటవి. ఈచేతిలో అన్నికణుపులూ విశదంగా తేలివుంటవి. ఎక్కువవింత ఏమిటంటే; వ్రేళ్లకొనలు కొంత 'స్పేచులేటు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాను, కొంత 'కానిక్'గానుకొంత చతురంగాను వుండి ఈమూటిలోనూ ఏజాతిఅయినదీ నిర్ణయించడానికి వీలుకాకుండా వుంటవి. అందుచేత ఇట్టి చేతుః గలవారికి మూడుహస్తాలలోను వున్న సుగుణాలు అలవడతవి.

వీరికి బాహ్యప్రపంచం ఎంతఅవగాహనో అంతఃప్రవృత్తికూడా అంత సుగోచరము. వీరి జీవితం సర్వత్రా సత్యాన్ని అన్వేషిస్తుంది. అందుచేత వీరు సాధారణ నియమములను పాటించరు. వీరు సాంఘికనియమాలకుగాని, ఆచారలకుగాని, ఏప్రమాణాలకుగాని పట్టుబడరు. వీరుసంపూర్ణమానసిక స్వాతంత్ర్యాన్ని కోరుతారు. ఎంతసేపూ న్యాయదృష్టితో సమస్తాన్ని పరిశీలించి నిజం తెలిసికోవలెనని బోధిస్తారు. వీరికి భూతభవిష్యద్వర్తమానాలు అవగాహనలో వుండడంవల్ల కేవల భౌతిక దృష్టిని ఆదరించరు.

చేతుల జాతులు



౧　　　　　౨

౧. సైకిక్ -Psychic- ఆధ్యాత్మికహస్తం.
౨. ఫిలసాఫికల్ -Philosophical- వేదాంతిహస్తం.



3　　　　　౪

3. కానిక్ - Conic -కళాహస్తం.
౪. స్పేచులేట్ - Spatulate -వెడల్పుహస్తం.



౫　　　　　౬

౫. స్క్వేర్ - Square -చతురహస్తం.
౬. ప్రైమరీ - Primary -అనాగరకహస్తం.
౭. మిక్స్డ్ - Mixed -కలగలుపుహస్తం.

ఈ బొమ్మలను జాగ్రత్తగా పరిశీలిస్తే వివిధజాతులకు గల భేదాలు సులభంగా గ్రహించగలరు.

'మిక్స్డ్' Mixed కలగలుపు హస్తం బొమ్మలలో ఉదహరించిన ౬ హస్తాలకలయిక కనుక వేరే బొమ్మ అవసరం లేదు.

## 3. కానిక్ — కళాహస్తం

ఈచేయి పొడుగుగా బాగాకండపుష్టి గలిగి సాధారణంగా గులాబీరంగుగా వుంటుం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డి. వ్రేళ్లు మొదళ్లలో సందులులేకుండా గుండ్రంగా విస్తారం మాంసపుష్టి కలిగి గోటిచివర భాగంవరకూ చక్కని ఆదోకలావుంటవి.

వీరికి చిత్రరచన, శిల్పం, ఎక్కువఅభిలాష సౌందర్యపిపాస హెచ్చు. వీరికి లలితకళల యందు అభిరుచి. ఆందోళనమాత్రమే కాని ప్రవేశం కలగడం కష్టం. ఈజాతికి సోమరితనం హెచ్చు. అందుచేత పట్టుదలతో సాధించడానికి తగినంత ఓపిక ఉండదు. కాని ఈహస్తాలలో వ్రేళ్లు చతురంగా ఉంటే కళలలో సహజంగా ఉన్న రుచులను కష్టపడి ఉపయోగించి గొప్పచిత్రకారులు, గాయకులు, శిల్పులు, కవులు కాగలుగుతారు. వీరు సంభాషణలో మిక్కిలి చతురులు. ఈస్వభావాలలో తొందర హెచ్చువుండడంవల్ల ఇతరుల స్వభావాలను ఆలోచనతో తెలిసికోలేరు. మంచిగానో చెడ్డగానో అభిప్రాయాలను తొందరగాకలుగజేసుకుంటారు. వీరికి కోపం హెచ్చు, కాని వీరికోపం తాటాకుమంటవంటిది. వీరుసాధారణంగా ధార్మికబుద్ధి, దయ, కలిగివుంటారు కాని ఒక్కొకప్పుడు మిక్కిలి స్వలాభాపేక్షకులుగా కూడా మారుతారు.

౪. స్పేచులేట్—వెడల్పుహస్తం

ఈచేయి కొంచం మోటుగా మెక్కువ వంపులతో వుంటుంది. వ్రేళ్లకొనలు పురివిప్పకుని వెడల్పుగావుంటవి. అరచేయి కొన్నిచేతులలో మణికట్టువద్ద మెక్కువ వెడల్పుగాను, కొన్నిటిలో వ్రేళ్ల మొదళ్లవద్ద ఎక్కువ వెడల్పుగాను వుంటుంది. మొదటిపద్ధతిని వుంటే ఆలోచనలువిస్తారం. రెండవతరహాను వుంటే కార్యసాఫల్యం ఎక్కువ.

వీరు ఎంతైనా శరీరకష్టానికి ఓరుస్తారు. శృంగారం, కవిత్వం ఆట్టేభర్జించవు. జీవితం సౌఖ్యంగా గడిచిపోడానికి కావలసినఅవసరాలు ఉంటేచాలును; తృప్తిగా జీవిస్తారు. వీరికిశక్తి సామర్థ్యాలు మిక్కుటం. వీరికి ప్రేమ, భక్తి మొదలైనగుణాలు ఘుడియఘుడియకు మారకుండా స్థిరంగా వుంటవి. వీరిబుద్ధి ఎంతసేపూ నూతనత్వాన్ని స్థాపించడానికి యత్నిస్తుంది. వీరుసాధారణంగా యంత్రనిర్మాతలు, ఇంజనీర్లు అయి క్రొత్తవాట్లను కనిపెడతారు. వీరికి తమశక్తి సామర్థ్యాలమీద నమ్మకం అతీతం.

ఈహస్తం పెద్దదిగాను దళంగాను, కండపుష్టిగా మెత్తగా ఉంటే శక్తిసామర్థ్యాలు తగ్గిపోతవి. సరియైన స్పేచులేట్ హస్తానికి ఉన్న గుణాలన్నీ మానసికం అయిపోయి జీవితానికి నిరుపయోగం కావడం తటస్థిస్తుంది.

౫. స్క్వేర్—చతురహస్తం

అన్నిచేతులలోను ప్రపంచంలో బాగుపడడానికి ఈచేయి ఎక్కువమంచిది. చతురం అనగా మణికట్టువద్దా, వ్రేళ్ల మొదళ్ల దగ్గరా చతురంగా ఏర్పాటు కావడమేకాకుండా వ్రేళ్లకొనలు కూడా నలుచదరంగా వుంటవి. గోళ్లు సాధారణంగా పొట్టిగాను చదరంగాను వుంటవి.

వీరిస్వభావం, ఎక్కువ జాగ్రత్త, నియమానుసరణం, అధికార విధేయత, ఇంటి

లోనూ బుద్ధిలోనూ భద్రం. వీరికి పట్టుదల, ఓరిమి, బాగావుండడంవల్ల పూనినకార్యాన్ని నిర్వహించి తీరుతారు. కళ, కవిత్వం విస్తారం రుచించవు. లాభకరమైన కార్యం అయితేనే కాని మనస్కరించదు. వీరికి వ్యవసాయం, వర్తకం అంటే చాలాయిష్టం. ఈ రెంటి లోనూ ఎంతైనా ఉపయోగ పడతారు. వీరు మిక్కిలి స్నేహపాత్రులు. హృదయం అర్పించి నచోట ప్రాణాన్ని అర్పిస్తారు. మాటదాటరు, పూర్తిగా విశ్వసనీయులు.

అరచేయిచతురం, వేళ్లుచదరంగా పొట్టిగా ఉంటే:

సాధారణంగా చాలాచేతులలో వుండే కలయిక ఇది. విశాలదృష్టి శూన్యం. ధనార్జన కుత్రవల్ల. లోభులు కాక పోయినా డబ్బు విషయంలో పదిసారులు లెక్క పెడతారు. అమితంగా ధనంకూర్చడం వీరి ఆశయం. ఇత రులయందు నమ్మకం తక్కువ.

అరచేయిచతురం, వ్రేళ్లు చతురం దీర్ఘం.

పొట్టివ్రేళ్ల చేతికన్నా ఈచేయి ఎక్కువ మేధస్సును సూచిస్తుంది. వీరు చక్కని తార్కి కులు. జీవితంలో చాలా మెలకువతోనూ, ఆలోచనతోనూ నడుస్తారు.

అరచేయిచతురం, కణుపువ్రేళ్లు:

కణుపువ్రేళ్లు సాధారణంగా పొడవు. వీరు చిన్నచిన్న సంగతులనుకూడా ఎక్కువ పాటిస్తారు. నూతన నిర్మాణాలు వీరికి సరదా. భవననిర్మాతలు, గణితశాస్త్రజ్ఞులు, వైద్యశా స్త్రవిశారదులు.

అరచేయిచతురం, స్పేచులేటువ్రేళ్లు:

ఉపయుక్తమైనసృష్టి వీరిది. గొప్ప ఇంజ నీర్లు, ఇళ్లకు, ఫేక్టరీలకు పనికివచ్చే సామ గ్రులు, మరలు సృష్టించేశక్తి వీరికి హెచ్చు.

అరచేయిచతురం, కానిక్ వ్రేళ్లు:

వీరు కళాభిమానులు, వీరికి సంగీతం, లలి తకళలు, సారస్వతం, కవిత్వం, అంటే ఆదరం. తమకళాకౌశలాన్ని వినియోగపరచి కీర్తి సంపాదిస్తారు. పూర్తిగా కళాహస్తంకాకుండా అరచేయి చతురంగా ఉండడంవల్ల భావంలో గల ఉద్రేకాన్ని నిర్వహణలో చూపగలుగు తారు.

అరచేయిచతురం, సైకిక్ వ్రేళ్లు:

ఇది చాలా అరుదు. ఎన్నిసదుద్దేశాలు ఉన్నా ఎంతపూనికతో యత్నించినా వీరు ఖయాలీబుద్ధివల్ల ఏమీ నిర్వహించలేరు.

అరచేయి చతురం, మిశ్రమంవ్రేళ్లు

ఇది తరుచు కనిపించేచేయి. పురుషులలో విస్తారం. ఈచేతిలో బొటనవ్రేలు బాగా వెను కకువొంగి మధ్యకణుపు వెనకకువంచితే వల యంగా వంగిపోతుంది. చూపుడు వ్రేలు చాలా సూదిగా వుంటుంది. వీరికి ఊహలు మెండు; చక్కనిఉద్రేకం ఉంటుంది. ఏకార్యా నికైనా సమర్థులు; కాని ప్రారంభంలో వుండే ఉత్సాహం తొందరలో తగ్గిపోతుంది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాగ్వాదంలో నిపుణులు. వీరికి మనశ్చాంచల్యం విస్తారం కావడంవల్ల సాధారణంగా జయం పొందరు.

౬. ప్రైమరీ-అనాగరకహస్తం

మూర్ఖులచేయి చూడడానికి మోటు అసహ్యంగాను, అరచేయిబరువుగా దళంగా పెద్దదిగా వుంటుంది. వ్రేళ్లకన్నా అరచేయి పెద్దదిగా కనిపిస్తుంది. అందుచేతనే మానవత్వంకన్నా, జంతుతుల్యంగా ఉంటుంది స్వభావం. ఈచేతిలో బొటనవ్రేలు బరువుగా, మొద్దుగా, గోటిభాగం ఉండగాను ఉంటుంది.

మానసికశక్తులు చాలాతక్కువ. ఈజాతిని, జంతుజాలాన్నివలె కామక్రోధాలు పూరించి వుంటవి. వీరివద్ద జిత్తులమారితనం హెచ్చు; అదైనా స్వభావంవల్ల వచ్చేదికాని బుద్ధిపూర్వకంకాదు. వీరు కాయకష్టంవల్ల జీవించేవారు. సాధారణంగా కూలీలు, బళ్లవాళ్లు యింకా మోటుపనులవల్ల దైనికజీవనం గడపవలసినవాళ్ల చేతులివి. ఇంకా కొన్నిలక్షణాలువుంటే వీరు సేనలో సాధారణసైనికులుగా ఉపయోగపడతారు. వీరికి పిచ్చి నమ్మకాలు ఎక్కువ.

౭. మిక్సెడ్ కలగలుపుహస్తం

ఈ చేతిలో అరచేయి సాధారణంగా చాలావరకూ చదరంగాను, వ్రేళ్లు కలగలుపుగాను ఉంటవి. ఇటువంటిచేతులు సర్వత్రా వున్నవి. సాధారణంగా చూపుడువ్రేలు 'శానిక్'గాను, మధ్యవ్రేలు 'చతురం'గాను, అనామిక 'స్పేచులేట్'గాను, చిటికెన 'ఫిలసాఫిక్'గాను ఉంటుంది.

వీరికి అనేక శాస్త్రాలలో జ్ఞానం ఉంటుంది. వీరు ఏపరిస్థితుల్లోనైనా ఏసంఘంలోనైనా నిపుణంగా ఖులాసాగా ప్రవర్తించగలరు. శాస్త్రం అయినా, కళఅయినా, మరి ఏయితరమైనా వీరికి సులభంగా అవగాహన అవుతుంది. వీరి వాక్చాతుర్యం అద్భుతం. కబుర్లలో ఎవ్వరితోనైనా ఆనందంగా కాలయాపన చేయగలరు. వీరు అనేకవిషయాలలో ప్రవేశిస్తారు కాని ఏదీ పూర్తిగా నిర్వహించే ఓపిక ఉండదు. చాంచల్యం హెచ్చు. అయినప్పటికీ ఈ చేతిలో బలమైన మేధస్సురేక ఉన్నట్టయితే వీరికివున్న విశేషం యితరచేతులలో ఉండదు. ఇట్టివారు క్లిష్టపరిస్థితులలో సమయస్ఫూర్తితో ప్రవర్తించి హాయిగా చిక్కులు విప్పతారు. వీరు రాచకార్యాలలో మంచి శక్తిమంతులు. మామూలు కలగలుపుచేయి గలవాళ్లు ఒకప్రదేశంలో అట్టేకాలం ఉండలేరు. వారు ఏపరిస్థితులలోనైనా ఖుషీగా ఉంటారు; వీరిని దారిద్ర్యం బాధించదు. ఐశ్వర్యం అధికానందాన్ని ఇయ్యదు. వీరికి ధనం సాధనం అంతంకాదు. ఎప్పుడు క్రొత్తక్రొత్త ఆలోచనలతో నిండి ఉంటారు. జీవితం బరువుగా తోచదు.

కళాహస్తాలు భావన, శిల్పము, సౌందర్యము అన్వేషించినట్లు; చతుర హస్తాలు నియమం ఏర్పాటు అంతటా పాటిస్తవి,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కనుపులచేతులు మానవప్రకృతిలోగల న్యాయాన్ని వెతుకుతూ వుంటవి. వేదాంతిహస్తాలు సర్వత్రా ఆధ్యాత్మికానందాన్ని అన్వేషిస్తూ వుంటవి.

ఇక వ్రేళ్లు

వ్రేళ్లు బాగా పొడవుగావుంటే ఆవ్యక్తి కార్యనిర్వహణలో ప్రతిచిన్నహంశాన్ని జాగ్రత్తగా చూస్తాడు. వ్రేళ్లు పొట్టిగావున్నా వ్యక్తి విశాల దృష్టితో ఆలోచనలుచేసి పెద్దపెద్ద ప్లానులు వేయగలడుకాని నిర్వహించడంలో చిన్నహంశాలను జాగ్రత్తపెట్టలేడు.

చూపుడువ్రేలు

రెండవవ్రేలికన్నా పొడుగుగావుంటే— ప్రపంచాన్నంతా సంగ్రహించవలెనన్న వెర్రి పుడుతుంది.

రెండవవ్రేలితో సమంగా వుంటే-అధికారం అంటే ఆశ. రెండవదానికన్నా చాలా పొట్టిగాఉంటే-భీరువు.

మూడవవ్రేలికన్నా దీర్ఘంగాఉంటే-పట్టరాని ఆశలు. మూడవవ్రేలితో సమంగాఉంటే విస్తారంధనం.పెద్దపేరు సంపాదించవలెననేఆశ.

మూడవవ్రేలికన్నా చాలా పొట్టిగా ఉంటే-జీవితంలో ఏవిధమైన ఆశయాలు లేవు. సాధారణ జీవనంతో తృప్తిపడతాడు.

రెండవవ్రేలు

మొదటివ్రేలికన్నా పొడుగుగావుంటే - మందబుద్ధి, ఎప్పుడూ పొరబాటులే చేస్తాడు.

మొదటివ్రేలితో సమంగాఉంటే - తగుమాత్రం ఆశలు. జీవితం చక్కగా నడుపుకుంటాడు.

మొదటి వ్రేలికన్నా చాలా పొట్టిగా ఉంటే-గొప్పవాణ్ణి కావాలెననే ఉపద్రవమైన వెర్రి.

మూడవవ్రేలికన్నా విస్తారం పొడవుగా ఉంటే-బుద్ధిమాంద్యం. అన్నియత్నాలను విఫలంకావిస్తుంది.

మూడవవ్రేలితో సమంగాఉంటే-జూదగాడు.

మూడవవ్రేలికన్నా చాలా పొట్టిగా ఉంటే తెంపరి. ప్రతివిషయంలోను అనవసరంగా తెగించి చొరబడతాడు.

మూడవవ్రేలు

మొదటిదానికన్నా ఎక్కువ దీర్ఘంగా ఉంటే-కళాభిమానం హెచ్చు; కాని నిరుపయోగం. నిర్వహించే ఓపికలేదు.

మొదటివ్రేలితో సమంగాఉంటే-ధనం, కీర్తిసంపాదించే ఆశ.

మొదటివ్రేలికన్నా చాలా పొట్టిగా ఉంటే-స్వశక్తిని తెలిసికోలేని అనవసరపు ఆశలు మెండు.

రెండవవ్రేలికన్నా అతిదీర్ఘంగాఉంటే - తెంపరి.

రెండవవ్రేలితో సమంగాఉంటే-జూదరి, పక్కా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండవ వ్రేలికన్నా చాలాపొట్టిగా ఉంటే-దుర్బుద్ధి సర్వాన్ని నాశనం చేస్తుంది.

నాల్గవ వ్రేలికన్నా బాగా యెక్కువ గాపొడవుగాఉంటే-కళాసంపత్తిలోఎక్కువ ఉత్సాహం. జయప్రదంగా నిర్వహిస్తాడు.

నాల్గవ వ్రేలితో సరిసమానంగాఉంటే- అనేకవిషయాలు చక్కగా గ్రహించ గలుగుతాడు. ఏవిషయమైనా బాగా నచ్చజెప్పగలడు.

### నాల్గవవ్రేలు

మొదటి వ్రేలితో సరి సమానంగ ఉంటే రాచ కార్యాల్లో నిపుణుడు; అద్భుతమైనయెత్తులు వేస్తాడు.

రెండవ వ్రేలితో సమానంగాఉంటే అసమానమయిన శాస్త్రజ్ఞానం. మూడవ వ్రేలితో సమంగాఉంటే అనేకవిషయాలు బాగా తెలిసికోగల జ్ఞాని. మంచి పలుకుబడి సంపాదించగలడు.

'దీర్ఘా కనిష్ఠికా యస్య
నఖరారుణసన్నిభః;
ధనవాన్ రాజమాన్యశ్చ
భూపాలోభవతిధ్రువమ్.'

(చిటికెనదీర్ఘంగా గులాబీ రంగు గలిగిఉంటే ధనవంతుడు; రాజపూజితుడు; లేక రాజు కాని కాగలడు.)

గోళ్లు




౧. రక్తం, హృదయం జబ్బు.




౧. గొంతుక జబ్బులు.

౨. ఊపిరి జబ్బులు.




౩. ఊపిరితిత్తులు బహుసన్నితం. వాటి సంబంధించిన రోగాలు

౪. ఉబ్బసం.




౧. పక్షవాతలక్షణాలు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౫. పొట్టిగా, చదరంగా, నీలిగావుంటుంది. హృదయం, రక్తం జబ్బు.
౬. పొట్టిగా, ముక్కోణంగా వుంటుంది. పక్షవాత చిహ్నం.
౭. పొట్టిగా, సన్నగా, వంపుగా వుంటుంది. వెన్నెముక పోటు.
౮. వెడల్పుగా, పెద్దదిగా వుంటుంది. మంచిఆలోచన పరుడు.
౯. నిరంతరజాడ్య పీడితుడు.
౧౦. పొడవుగా, సన్నగా, పెళుసుగా-విరుగుతూవుంటే నీరసం, బుద్ధిమాంద్యం.




౧౧. సన్నగా పొడవుగా ఉంటే పిరికితనం.
౧౨. బాదంరూపుగా పల్చగాఉంటే సౌమ్యుడు.
౧౩. పాలిపోతూ వంకరటింకరగా ఉంటే కోపిష్ఠి.
౧౪. ఎక్కువ వెడల్పు పొట్టి పెడసరితనంకోపం.

### గోళ్లు

గోళ్లపరీక్ష న్యాయంగా ఆరోగ్యరేఖతో కలిపి చూడవలసినది, కాని చేతిని తిప్పకుండా యిప్పుడే పరీక్షించడానికి వీలు కనుక ఇక్కడనే తెలియజేస్తున్నా. ఆరోగ్యరేఖ పరిశీలించినప్పుడు ఈ గోళ్లవల్ల తెలుసుకున్న సంగతులు తప్పక మనస్సులో ఉంచవలెను.

ఈ బొమ్మలవల్ల గోళ్ల ఆకారనిర్ణయం, అవిసూచించే వ్యాధులు విశదం కాగలవు.

### గోళ్ల రంగులు

"హారిద్రనఖరో భూయా
  ద్దురాచర రతోనరః;
రోగీతు నీలనఖరో
  రిక్తశ్చ శిథిలో నఖైః.

గోళ్లు పసుపు రంగుగా ఉంటే- దురాచారి, నీలిగా ఉంటే - రోగి. పెళుసుగా ముక్కలుగా విరిగిఉంటే-దరిద్రుడు క్రిందంచి శాస్త్రజ్ఞుల ప్రకారం.

వెలవెల పోతూఉంటే- శుష్కించే దేహి. స్వలాభాపేక్షకుడు.

పసుపుగాఉంటే-పైత్యం మందబుద్ధి.

విస్తారం ఎర్రగాఉంటే-వాతం, తొందర స్వభావం-అన్నిమతాలప్రకారం.

మంచిఆరోగ్యాన్ని చక్కని మేధస్సును సూచించే గోళ్లు బాదంఆకారంగా తగుమాత్రం గులాబీరంగుతో ఉండవలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## బొటనవ్రేలు



౧ ౨

౧. వంగినవ్రేలు—కలివిడిగల మనిషి. ఏపరిస్థితు లలోనైనా, ఎవరితోనైనా సఖ్యంగా మంచిగా ఉండ గలడు.

౨. నిడివిగా కొంచంకూడా వంగకుండా ఉంటే పెడసరి, బిరుసుదనం హెచ్చు.



౧ ౨ ౩

౧. నడుము సన్నగా ఉంటే—మంచి ఆలోచన పరుడు, కళలలో, కవిత్వంలో రుచిగలవాడు.

౨. వ్యవహార వేత్త.

౩. బుద్ధికుశలత కొంతతక్కువ.



౩ ౨ ౧

౧. మూడుకణుపులు చక్కగా ఉన్నవి. మంచిది.

౨. గోటిభాగం పెద్దది. తెంపరి చొరవ హెచ్చు.

౩. గోటిభాగం చిన్నది. మధ్యకణుపు పెద్దది—వాగాడంబరం హెచ్చు. కార్యశూన్యులు.



౩ ౨ ౧

౧. పెంకె కోపిష్ఠి.

౨. దాత. కళాసైపుణ్యం గలవాడు.

౩. చక్కనిశిల్పి. కళలోగాని సారస్వతంలోగాని.



గోటిభాగం ఎక్కువ కండపుష్టి గలిగి ఉండగా వుంటే పట్టరాని కోపం. తరుచు ఖూనీలు చేసేవాళ్ల చేతిలో ఉంటుంది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బొటనవ్రేలు

ఇక 'పీరోనమి' పూర్తి కావడానికి బొటనవ్రేలు పరీక్ష అవసరం. తొలిపలుకులో ఈవ్రేలి ప్రాముఖ్యమును గురించి చర్చించేము ఒక్క-బొటనవ్రేలి పరీక్షవల్లనే చాలావరకూ సాముద్రికాన్ని సాధింపవచ్చును. కాని ప్రస్తుత రచన హస్తం మొత్తంగా చదవడానికి కనుక, ఎక్కువ అవసరమైన సంగతులు మాత్రం తెలియజేస్తాను.

బొటనవ్రేలు విడదీసినప్పుడు చేతికి విస్తారం దూరంగాను, బొత్తిగా దగ్గరగాను కాకుండా ఉండవలెను. ఈ పరిమాణం కొన్ని చేతులు చూస్తే ఎవరైనా ఉజ్జాయింపుగా నిర్ణయించ గలుగుతారు. బొత్తిగా దూరంగాఉంటే - మనిషి పెడసరి, పెంకెగా ఉండి, మానవస్వభావాన్ని తెలుసుకుని మెలకువతో ప్రవర్తించే సామర్థ్యం తక్కువ కలిగిఉంటాడు.

బొత్తిగా దగ్గరగాఉంటే-ఎక్కువ మెత్తదనంవల్ల వృథాగా యితరులకు లోకువ ఔతాడు.

మధ్యస్థంగా ఉంటే - సమర్థతతో జాగ్రత్తగా పరిస్థితులను చూసుకుని మెలకువతో ప్రవర్తించగలుగుతాడు. రాచకార్యాలలో ఎక్కువ ఉపయోగిస్తాడు.

బొటనవ్రేలి ఆకారం, దానిగుణం; కణుపుల అన్యోన్యదీర్ఘత్వం బొమ్మలలో విశదంగా తెలుస్తుంది. బొటనవ్రేలు మణికట్టువద్దనుంచి గోటిచివరవరకూ తొమ్మిది భాగాలుచేస్తే గోటిభాగం రెండువంతులు, తరువాతభాగం మూడువంతులు, చేతిభాగం నాలుగువంతులు ఉండవలెను. ఇక పీరోనమి పూర్తి. ఇందులో తెలిసికొన్న సమస్తం జ్ఞాపకం ఉంచుకుంటే పీరోమేన్సీలో, చాలా ఉపయోగిస్తుంది.

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములలో బంతులు దూరదూరముగా దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులులేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కుంతీ సందేశము

శ్రీ శేషాద్రిరమణ కవులు

ఓయి జగత్త్రయాభరణ ఓయదునందన నిన్నుఁ గట్టఁగా
దాయలు బూనినారె? నిజదర్పభరంబునఁ బిచ్చలించి నీ
కే యెడ రాచరింపఁ బరికించిన దుష్టులిఁకెంత చాష్ట్యముల్
జేయఁగలేరు పాపులకుఁ జెట్టయు మంచితనంబు తోఁచునే.

కటకట యిద్ది కూడదని కానని కన్నుల వృద్ధుడైనఁ జె
ప్పట కెద సాహసింపఁడొకో? పోటుదనంబున నుత్సహించి వ
చ్చుట గని యాసుయోధనుని జూచియు సాత్యకి యెట్లు సైచె నీ
వెటుల సహించినాఁడవు హరీ, పగవారల బుజ్జగింతురే.

మనసామ్రాజ్యము ద్యూతరంగమున సంపాదించి సుంతేని సి
గ్గు నెదం బొందరు ధార్తరాష్ట్రులిది నీకుం దెల్లమైయుండ నే
మని సంధింపఁగ నేగుదెంచితివి కృష్ణా? రాజవయ్యుఁ సుద
ర్శనముం గేల ధరించియుఁ సయిచితే శత్రుక్షమాధీశులఁ.

బిచ్చపుఁగూటి కియ్యకొని బీరము కోల్పడి ధర్మజుండు నిఁ
బుచ్చిన నెట్లువచ్చితివి పోటరివయ్యును; సంధిగూర్పఁగా
వచ్చునె ధార్తరాష్ట్రులకుఁ బాండుతనూజుల కాహవంబులోఁ
జచ్చుట కియ్యకొన్న కలుషప్రతిపక్షులు రాజ్యమిత్తురే.

బీరం బేమయిపోయెనో సహజగంభీరంబు * గోల్పోయె ధ
ర్మారంభుండగు ధర్మరాజు కుఃధర్మాదుల్ విసర్జించి దు
ర్వైరివ్రాత మొసంగు బిచ్చమునకై వాపోవుచున్నాఁడు నీ
వేరీతిన్ సహియించి వచ్చితివి శౌరీ సంధిగావింపఁగన్.

ఆరిపోయిన దేమొ యనితరవిక్రమక్రముఁడైన భీముని క్రౌర్యపటిమ
కూలారెనో యేమొ కురుకులవిద్రోహకరమైన పార్థుని కౌశలంబు
మఱపయ్యెనో యేమొ యరిరక్తమునఁ దల నవరింపఁదలఁచు పాంచాలి కినుక
కడబట్టెనో యేమొ కవల మానసమందు నతిశయించెడి యాగ్రహాతిశయము.
అకట! నాల్గూళ్లు బిచ్చ మిమ్మనుచు నీవు-పగతురను వేఁడు విధ మెంచఁ బాండవులకు
రాచసిరి స్రుగ్గెనని తోఁచె; రాజతనయు-లిచ్చగింతురె పరపిండ హేయగతికి.

---

* గాంభీర్యంబు?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముల్లోకంబుల నేలఁగా భువి భవంబుం గొన్న కృష్ణుండు నా
యల్లుం డైదుగు రాత్మజాతులును వీరాగ్రేసరుల్, జీవితం
బెల్లన్ మార్తురపంచలో గడపఁగా నే నిట్లు పాలైతి, నే
తల్లుల్ సైతురు పుత్రదుర్విరహచింతావ్యాప్తి నన్నుంబలెన్.

పగతురనొంచి క్షత్రియుఁడు భాగ్యము లొందుట మేలు, కానిచోఁ
దెగుట హితంబు, మార్తురను దిక్కరి యాచన చేయు టొప్పునే?
తగవరియయ్యు ధర్మజుఁడు దైన్యభరంబు సహించి భిక్షుగో
రఁగ నిను బంపెనన్న నుడి అంపపుఁగోతలు కోసె నామదిన్.

పదమూఁడేడులు కాననాంతరముల న్బ్రహ్మజ్ఞులం గొల్చి తా
నెది యార్జించెనొ యట్టిజ్ఞానమున కౌనే యాచనావృత్తి, బె
ట్టిదుఁడై ధర్మజుఁ డున్నఁ జాలుసుమి, గాండీవోగ్రటంకారముల్
ప్రిదులన్ బార్థుఁడె తీర్పఁగాఁగలఁడు వైరివ్యూహసంఘాతమున్.

తానొక కొంత సేపు తనతమ్ముల నాపకయున్న యాజ్ఞనే
నీనిరుపాధికాగ్రహ వినిష్ఠురసూక్తి విబోధితాత్ములై
పూనరె భీమ పార్థు లరిపుంజములన్ దెగటార్ప; ధర్మజా
ధీనుల కెట్టు లబ్బును స్వదేశము నీదయ కల్గియుండినన్.

పేడికె యాగ్రహంబు నొదవించును ద్రౌపది నిష్ఠురోక్తు లె
గ్గాడిన నోర్చుకొంట నృపులందునఁ గంటిమె? రాచపాడి తా
వీడుటెగాక తమ్ములను వీడ్వడఁ జేయుచు నుండె; నీభరం
బాడుది సైప; దెట్టు లకటా! మన ధర్మసుతుండు సైచెనో.

పదునాల్గేడుల దుర్వియోగమునకున్ వాపోవ నోకృష్ణ, నే
తుదిదాఁకన్ భరియింతుఁ గష్టములఁ బుత్రుల్ జేరి నామాటగా
మదికెక్కన్ వచియింపు మిట్లు సురధామంబైన, సామ్రాజ్య సం
పదమైనన్ గదనంబె గూర్చుఁ బరులన్ బ్రార్థింప లాభించునే.

ఇత్తురుగాక కౌరవు, లదెక్కడి ధర్మము, రాజ్యభాగముల్
తొత్తు విధానఁ గైకొనుట? దోర్బలసాధ్యములైన సంపదల్
కత్తులతోఁ గడించిన యఖండజయంబులె రాచపుట్టువుల్
తెత్తురు; బిచ్చపుం బ్రదుకు ధీరులు మెత్తురె? యెన్నఁడేనియున్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును ముచికుందుఁడన్న నృపపుత్రుఁడు యక్షుని సేవజేసి పూ
జన మొనరింప నాతనికి సర్వవసుంధర యక్షుఁ డిచ్చె, న
జ్జనపతి యేలనాకు నిజశక్తిసమార్జిత రాజ్యలక్ష్మితో
మనిమెద నంచుఁ బల్కెనట; మాతనయుల్ విన రిట్టి ధర్మముల్.

తానొకరుండె రూపఱక ధర్మము వంశము రూపుమాపఁగాఁ
బూనిన కౌరవాగ్రజుఁడు పోటుదనంబున గాక రిత్త స
న్మానము నిచ్చగించి కొనుమా యని రాజ్యము పంచియిచ్చునే?
కానఁడు ధర్మజుండు రణకాతరులన్ దనియించు పద్ధతుల్.

పాండవుల కైదుగురకు ద్రౌపదికి నీవ-నేను దెలిపితి నని వచియింపుమయ్య
కాఁగల విధంబు కాలమే గడపు; నవలఁ-గలవు మాపాలి చక్రరక్షకుఁడ వీవు.

అయ్యయో కౌరవు లధములు సంధికిఁ గొసరి వేఁడిన నియ్యకొందురయ్య
పరపిండములు దిని బ్రదుకఁగా నినుబోలు రాచబిడ్డకు నెట్లు తోఁచెనయ్య
స్వారాజ్యమో స్వరాజ్యమొ పొందనగుఁగాని కొదువ బిచ్చము లియ్యకొందురయ్య
పగ దిగద్రావి యిప్పగిది దాయలతోడ దిట్టతనాన వర్తింతురయ్య
అనికిఁ బురికొల్పు మరుల నీ కది యసాధ్య-మైనఁ గానలలో దేహయాత్ర గడిపి
పరము గడియింపు మొండొక తెరవు నమ్మి-దాస్యమున కియ్యకొనకుమో ధర్మరాజ.

బిచ్చపుఁగూటిపైఁ దనకుఁ బెద్దయుఁ గోరిక గల్గెనేని పో
వచ్చును గ్రొత్తచోటులకు, వైరుల యాచన జేయు టొప్పునే
చచ్చుట కియ్యకొన్నయెడ సంగర మొప్పు; ఫలించు జన్మ; సం
పచ్చయ మబ్బు; కాలమదివచ్చినఁ జేకురు రాజ్యభోగముల్.

మనికికిఁ జేటుగూర్చి మన మార్తుర పంచలఁ బాయసాన్నముల్
దిని సుఖియించుకంటె నతిదీనత వేఱొక రుండఁ బోదు; పా
వనమగు రాజవంశమును బంకమునన్ బడఁద్రోయుకంటె నీ
ల్గిన యశమంచు నెంచి యనికిన్ జనుదెమ్మిఁక ధర్మనందనా!

నాఁడు సభాప్రదేశమున సాతుక వల్వల వీడదీయుచోఁ
బాడికి నీవు పాలుపడి భండన మాపితి వట్లు గానిచో
వాఁడి మెఱుంగుటంపరను బార్థుఁడు గాండివమందుఁ జేర్చి గో
రాడఁడె యేన్గుపోల్కి ధృతరాష్ట్రతనూజుల నూచముట్టుగన్.

వదలవు శాంతవృత్తి, మది వైరము తోఁచిన నింద్రుఁడేనియున్
బ్రదుకఁగనీవు, కోపమును భావములోపల దాచు పేర్మితో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వదరవు ధర్మశాస్త్రములు, వైరులునీవనఁ దల్లడిల్లుచుం
డెద రెటులోర్చుకొంటివి పటిష్ఠరుషాభర మో వృకోదరా!

గద చేఁబట్టి మహోగ్రవిక్రమ మెసంగన్ గౌరవవ్రాతమున్
దుదిముట్టింపఁగఁజాలు శూరమణివై, దుర్నీతి సైరించి ద్రో
వదికష్టంబుల కెట్టులోర్చితివొ నీప్రఖ్యాత బాహాబలా
స్పదరోషాగ్ని విరోధికాననము గాల్పన్ లేదె వాతాత్మజా!

ఆపఁగరాని కోపభర మాశయమందు ధరించి దీనమై
ద్రౌపది కుందుచున్నయది తత్ప్రతికారము సేయకున్నచో
నీ పటు విక్రమ స్ఫురణ నీ రణకౌశల మేల కాల్పనా ?
ఓపినవార లూరకొనుచున్న నిఁకన్ గతిమెద్ది పుత్రకా!

అవభృత † పూతమైన ద్రుపదాత్మజ పెన్నెరి బట్టినాఁడు కౌ
రవకులపాంసునుం డడరి అచ్చకు నీడ్వఁగ నోర్చికొన్న నీ
యవమతి నెంచినంత హృదయంబు జలించుఁ దదీయరోష మె
ట్లవునని విస్మరించితివొ యార్యులు నవ్వుచునుండఁ బుత్రకా!

బంధించి నిన్నుఁ బ్రవాహంబునం ద్రోచి చంపఁగా యత్నంబు సలిపినారు
నినుఁ గడతేర్ప దుర్నీతికిఁ బాల్పడి వివిధదుష్కృతులు గావించినారు
లక్కతో నిలుగట్టి చిక్కె భీముండని-క్రూరాత్ములై దరికొల్పినారు
తుదలేని విద్వేష మెద నించి నీ యంత్యమునకయి ధర్మంబు చెనకినారు
ధార్తరాష్ట్రులు చేయని దౌష్ట్యమున్నె-బిరుదు మగఁడవు నీ వెద వెలిఁపుగొన్న
‡ గుంతితో సాటి గాకున్నె గొడ్డురాలు-పృథులవిక్రాంతిజీవన భీమసేన!

పరకష్టంబు సహింపనేరని జగత్ప్రఖ్యాతవీరుండ వీ
వరిదౌష్ట్యంబు నెటుల్ సహించితివొ నీ యర్ధాంగలక్ష్మిన్ సభాం
తరమందున్ బలుబాములన్ బఱచుచో దైన్యంబుగా నెట్టులన్
బరికింపం దొరకొంటివో తెలియదో పార్థా, సముద్యద్ద్రవా!

కోపము నన్న యాపె ననుకొందము కొంచెము సేపు, తేపకుం
దేపకు యాజ్ఞసేని యతిధీరవచోహతి నొవ్వఁజేయఁగా
నోపితి వెట్లు? శాంతమును నోర్మియుఁ బాలులయందకాని, ది
గ్వ్యాపితశౌర్యులైన నరపాలురయందు రుచించునే సుతా!

---

† అవభృథ?. ‡ కుంతి గోడ్రాలితో సాటియగునా? గొడ్డురాలు కుంతితో సాటియగునా ?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎక్కటి కయ్యమందు శివునే యెదిరించిన దిట్టవీవు; నీ
యుక్కును సాహసప్రతిభ యుత్తరగోగ్రహణంబునాఁడు నల్
దిక్కులవెల్గె; నిత్తఱిని దీనునికైవడి సంధిపేరిటన్
గ్రక్కునకూటి కాసపడఁ గల్గునె మోక్షము రాచబిడ్డకున్.

కవ లెదిరిం జయింపఁగల గండరగండలు, భీమసేనుఁ డా
హవమున నిస్సమానుఁడు, రణాంగణమందు భవత్ప్రసక్తి నా
కవగత, మన్నిరీతుల దయానిధి కృష్ణుఁడు జూచుచుండఁ గౌ
రవులకు నీకు సంధికుదురన్ సహియింతునె నేను పుత్రకా!

గాండీవంబును నీవు సంగరమునన్ గౌరవ్యదౌష్ట్యంబుచే
బెండై చచ్చినఁ జింతనొందను, రణోర్వీన్ దాయలన్ గూల్ప కె
న్నండో నచ్చినయట్లు సంధియని కృష్ణస్వామి నంపించు నీ
బండారంబు తలంచి వందురెద భావంబందు వీరవ్రతా!

ఓకవలార! నాదునుడి యొండు వినుండు, దురాత్మకుల్ రుషా
వ్యాకులురైన కౌరవులు ప్రాణముబోయిన రాజ్యభారమున్
గైకొనుమంచు నీయ; రిఁకఁ గాఁగల కార్యము సంగరంబు; మీ
ఢాకకు నెవ్వరోర్తురు; కడంగుఁడు యుద్ధమొనర్ప నిత్తఱిన్.

కుంతికంటె రాచకూఁతురా మాద్రియే-వీరమాత యనుచు విశ్వమెల్ల
స్తోత్రమాచరించు సుదినంబు దిలకింపఁ-జిక్కబట్టియుంటి జీవములను.

ముడువకుమమ్మ పెన్నెఱిని, మున్మరమై తగు రోషభారమున్
విడువకుమమ్మ సుంతయును, వీరవధూమణివైన నీవె యె
ప్పుడయిన శాంతవృత్తి నెదఁబూనినఁ బాండవులెల్ల దీనులై
యడవులకేగు దుర్గతుల కాయితమాదురు సుమ్ము ద్రోవదీ!

నాఁ డల దుస్ససేనుఁడు జనంబులు చూడఁగ-నేను నోటితో
నాడగరాని చెట్ట కటు లాయితమాటయుఁ గృష్ణుఁ డంతలో
నాఁడు మొఱన్ దలంచుటలు నా కురువంశము గూలుదాఁక లో
వీడఁగనీకు; సాధ్వులను వేచిన పాపము రూపుమాపదే.

పాండవులకును ద్రుపదసంభవకు నిట్లు-కడఁకమై చెప్పుమయ్య, నా కామితంబు
మరల రాచఱికంబు నీమఱఁదులకు నొ-కింత దయయుంచి కూర్పుమా కృష్ణ! నీవు?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






## మన చిత్ర రచన

తలిశెట్టి రామారావు గారు, బి. ఏ., బి. యల్.,

ఆంధ్ర దేశములో చిత్రరచనయందు నూతన మైనరుచులు ప్రబలుచున్నవనియు, జాతీయ రచనను ప్రజ లామోదించుచున్నారనియు, మనచిత్రకారులు క్రొత్తమార్గములనుద్రొక్కి యితరరాష్ట్రీయులవారి పొగడ్తను బడయుచున్నారనియు, చిత్రకారులసంఖ్య పెరుగుచున్నదనియు, స్త్రీలుకూడ చిత్రములను వ్రాయుచు మార్గదర్శకు లగుచున్నారనియు సంతోషించుచున్నాము. కాని సంతోష మధికమగునప్పుడు ఆత్మవిమర్శనము తగ్గును. ఆత్మ విమర్శనము లేనప్పుడు తప్పుత్రోవల ద్రొక్కుట సహజము. ఆంధ్ర దేశమున చిత్రరచనను గూర్చి యిట్టిపరిస్థితులు ప్రబలియున్నవి. మన పొరపాటులను మనమిట్టియెడనున విమర్శించుకొనక పోయినయెడల శుభప్రదముగ వ్యాపించిన యుత్సాహము అనర్థమును చేకూర్చును.

బౌద్ధయుగమున వన్నె కెక్కిన చిత్రరచన ప్రపంచమునం దంతటను వేనోళ్ల బొగడ్త బడయుచున్నది. అజంత, 'బాఘ్', సింహగిరి (సీగిరియా) యందలి చిత్రములయొక్క భావ ప్రదర్శనమే యీకీర్తికి ముఖ్యమగు కారణము. వర్ణలేపనము పూర్వ మెటుల నుండెనో కాని యిప్పుడు మలినమై యుండుటవలన వర్ణలేపనమునం దగ్రగణ్యులైన పాశ్చాత్యుల దృష్టి నివి యాకర్షించియుండజాలవు. ఆకాలపు చిత్రకారులు రేఖల నతిలావణ్యముగ వ్రాసినను ఛాయాప్రదర్శనమున కలవడినదృష్టి నాకర్షించుటకు రేఖారచన ప్రధానకారణము కాజాలదు. వ్యక్తుల లావణ్యము వారి యంగముల పొందిక, వ్రేళ్లయందును వ్యక్తపరుపబడిన భావము, స్త్రీపురుషుల యేర్పాటు, అలంకారములు, భావపూరితము లైయున్న చిత్రములవిలువ ననేకవిధముల నధికపరచుచున్నవి. వీనియన్నిటికంటె మనము మనస్సునం దుంచుకొనవలసిన విషయము మరియొకటి కలదు. ఈ చిత్రములందును, బౌద్ధమతము క్షీణించి హిందూమతము పునరుజ్జీవనమునుబడసినకాలమున దేశమునందంతటను నిర్మింపబడిన శిల్పసంపత్తియందును అద్భుతముగ హిందువుల నాగరికత, వారి చిత్తవృత్తి, వారి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాంఘికజీవనము ప్రతిఫలించుచున్నవి. ఈ విశేషమువలననే యీచిత్రములు చిత్రరచనయందు హిందూదేశముయొక్క వ్యక్తిత్వమును నిలువబెట్టియున్నవి.

గ్రీకులు భారతదేశమునకు వచ్చినప్పుడు తమ శిల్పవిధానములను గాంధారదేశమున బ్రవేశపెట్టిరి. వాటి ననుసరించుటలో హైందవ శిల్పులు గ్రీకురూపములను నిలువబెట్టినను, హైందవచిత్తవృత్తిని బ్రదర్శించువిధమున నా రూపములను మార్చి, హైందవకళాభాగము లుగ వినియోగించి క్రొత్తరుచులను జూపజాలిరి. ఈవిగ్రహముల నిప్పుడు గ్రీకో బౌద్ధశిల్పములుగ పండితులు పేర్కొనుచున్నారు. గ్రీసు, రోము దేశములందు పూర్వకాలమున నిర్మింపబడిన అద్భుతమైన విగ్రహములతో నేపాటిపరిచయమున్నవారైన నీగాంధారవిగ్రహములు గ్రీకుప్రతిమలను బోలియున్నవని యంగీకరింపక తప్పదు. ఇట్టివి హైందవకళాభాగము లెటులయ్యెను?—హైందవనాగరికత నివి వ్యక్తపరచుచున్నవి కనుకనే.

అక్బరు మొగలుచిత్రరచనను డిల్లియందు ప్రవేశపెట్టెను. ఆవెంటనే యీనూతన విధానము ననుసరించి హిందూచిత్రకారులు రచనను బ్రారంభించి మొగలాయీలను కూడ మించిరి. డిల్లియందు పాలించినను ప్రభువునాదరణను బడయుచుండిన యీ రచన రాజపుత్రస్థానము, పంజాబు, అయోధ్య, వంగదేశము, దక్షిణ హిందూదేశములందు వ్యాపించెను. హైందవ చిత్రకారుల హస్తములందు బడి, ఆయాప్రాంతముల రుచులనుబట్టి వేరురూపములను దాల్చి కంగ్రాచిత్రరచన, రాజపుత్రచిత్రరచన, అయోధ్యచిత్రరచన, డక్కను చిత్రరచన, తంజావూరు చిత్రరచన మొదలయినవిగ ప్రబలెను. రచనయందు మొగలు చిత్రములకును యీ వేరువేరు ప్రదేశముల చిత్రములకును విశేషము భేదములేదు. అన్నిచిత్రములయొక్క వర్ణలేపనము, విగ్రహములతీరు, చెట్లు మొదలగునవన్నియు సుమారొకేవిధమున నుండును. 'రాజపుత్ర' (కంగ్రా, రాజపుత్ర, అయోధ్య) చిత్రరచనయు, తంజావూరు చిత్రరచనయు హైందవము లెటులయ్యెను? ఈరచన హైందవమైనయెడల డిల్లి, లక్నోచిత్రరచన హైందవ మేల కాకూడదు? హైందవుల నాగరికత, చిత్తవృత్తి రాజపుత్ర తంజాపురచిత్రములందు కానవచ్చుటయు, డిల్లి, లక్నోచిత్రములందు కానరాకపోవుటయు దీనికి ప్రత్యుత్తరము.

ఆంగ్లప్రభుత్వము ప్రారంభమైనప్పుడు ఆంగ్లవిధానముల ననుసరించి కొందరు చిత్రకారులు చిత్రరచనను చేయ ప్రారంభించిరి. వీటిని జానుకంపెనీచిత్రములని సాధారణముగ బిలుతురు. రవివర్మ పాశ్చాత్యచిత్రరచనకు హిందూత్వమును చేకూర్చి నూతనశకమును ప్రారంభించెను కాని వీరిచిత్రములు చరిత్రకు దూరమగుటచేతను, పూర్వపు విధానములను పునరుజ్జీవితములుగ జేసి జాతీయతకు అగ్రస్థానము నొసగుటకు ప్రయత్నములు ప్రబ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుటచేతను రవివర్మశకము శైశవావస్థయందే నన్నగిల్లుట కలుగుచున్నది.

రవివర్మచిత్రరచన జాతీయము కాదని కొందరు చిత్రకారులు తలచుటవలన సనాతన (అనగా బౌద్ధ, రాజపుత్ర) చిత్రరచనను లేవదీసి, వాటి ననుసరించి చిత్రములను వ్రాయ బూనిరి. వీరిచిత్రములందు హిందూత్వము బాగుగ కానవచ్చుచున్నది. కొందరు పాశ్చాత్య కళావిమర్శకులు ఇట్టిరచనను హేళనచేసినను మరికొందరు పొగడ ప్రారంభించిరి. తుదకు ఆంగ్లచిత్రకళాసమితివారు (Royal Academy of Artists) హైందవవిధానములు హిందూదేశమునకు తగినవనియు వీటిని హైందవులు విడనాడుట ఆత్మవినాశకరమనియు గ్రహించి తమయభిప్రాయమును లోకమునకు వెల్లడి చేసిరి.

చిత్రములందు ఈ హిందూత్వ మెచ్చట గలదు? ఈప్రశ్నకు ప్రత్యుత్తరము సులభసాధ్యము కాదు. ఇతర లలితకళలందు కల హిందూత్వము చిత్రరచనయందును కలదు. పైకి వెల్లడిచేయుటకు సాధ్యము కాకపోయినను ప్రతిహిందువుడును ఈ హిందూత్వమును గ్రహించియే యున్నాడు. ఇదివరలో భారతి సంపుటములందు ప్రచురమైన 'భారతీయచిత్రరచన—కొన్నివిశేషములు' అను మూడు వ్యాసములందు దీనినిగూర్చి నాకుతోచిన విషయములను వ్రాసియున్నాను. ఇప్పుడు చిత్రములను వ్రాయుచున్న ఆంధ్రులీ 'విశేషములను' ఇకముందైనను దృక్పథమున నుంచుకొందు రని మనవి.

ఆంధ్రదేశమునందీరచన ఆమోదమును బడయుటకు రెండు కారణములు: వంగదేశీయులీవిషయమున మార్గదర్శకు లగుటవలన యిరువురు వంగదేశీయులను రప్పించి బందరు జాతీయకళాశాలయందు ఆంధ్రయువకులకు నేర్పించుట; దామెర్ల రామారావు నూతనరచనను రాజమహేంద్రవరమున నొకసంస్థగ నిలుపజాలుట. ఇతర చిత్రకారు లచ్చటచ్చట విడిగ చిత్రించుచున్నను శుద్ధముగ పాశ్చాత్య రచననే యనుకరింపనివారు బందరు ననుసరించువారుగనో, రాజమహేంద్రవరము ననుసరించువారుగనో యున్నారు.

అజంత, వంగ చిత్రరచనలందు రేఖ ప్రధానము కనుక వీరందరును రేఖలతోనే చిత్రములను నిర్మించుచున్నారు. రాజపుత్ర, కంగ్రా, తంజావూరు చిత్రములందు రేఖలు కానవచ్చుచున్నను మొగలు సాంప్రదాయముల ననుసరించుటచే లేతచాయకు ప్రాముఖ్యము కలిగెను. చాయకు ప్రాముఖ్యము కలుగుకొలది రేఖలయొక్క ప్రాముఖ్యము తగ్గుట తప్పదు కనుక 'రాజపుత్ర' రచనయందు రేఖ రెండవస్థానము నాక్రమించవలసి వచ్చెను. ఇంతమాత్రమున యీచిత్రములందు హిందూత్వము తగ్గలేదు. రేఖలపైనే వ్యక్తినిర్మాణ మాధారపడియుండిన యెడల శిల్పమునందు హిందూత్వమునకు తావులేకయుండవలసినది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజపుత్రచిత్రము లన్నియు చిన్నవగుటవలన రేఖలతో వ్రాయుట అచ్చటచ్చట తప్పనిసరి యయ్యెను. కాని చిత్రములందు హిందూత్వము చూపించుటకు రేఖారచన తప్పకయుండవలెనన్నవాదము సరియైనది కాదు. రేఖలుండరాదని నేను చెప్పుటలేదు. రేఖల నుపయోగించుటకు కొంతయనుభవము, ధైర్యము కావలెను. అజంత, బాఘ్, సీగిరియాచిత్రములందు రాజపుత్రచిత్రము లందునవలె ఛాయయుండె ననుటకు నిదర్శనములు కలవు. కాలక్రమమున తక్కినరంగులన్నియు తీవ్రతను విడనాడునప్పుడు చాయనుజూపు లేతరంగులు మాయమైనవి. చాయను వాడినప్పటికిని ఆ బౌద్ధసన్న్యాసులు రేఖ నెంతమనోహరముగ నుపయోగించిరో కొంచెము పరిశీలించిన బోధపడగలదు. ఈ విషయములను పాటింపక పెద్దలు రేఖల నుపయోగించిరి కనుక తాము కూడ రేఖల నుపయోగింపవలెనను నిర్ణయము కాంగ జేసుకొనుటచే ఎవరో కొందరు చిత్రకారులు తప్ప తక్కినవారందరు రేఖల నుపయోగపరచి తమచిత్రములను పాడుచేయుచున్నారు. చాయ వెలుతురులను ప్రదర్శింపజాలనివారికి రేఖ యొక శరణ్యమైనటులు కనబడుచున్నది. ప్రకృతియందు కనబడునటుల దృశ్యములను వ్రాయకుండుటకు కొంతధైర్యము కావలెను. ఇట్టిధైర్యము కలుగుటకు అనుభవము, భావగభీరత ముఖ్యము. భావపూరితమైన చిత్రములలో కొన్నిటియందు ప్రకృతి నియమములను విడనాడుటయే శ్రేయస్కరము. కాని యిప్పుడు ఆంధ్రదేశమున ప్రచురింపబడుచున్న జాతీయచిత్రములలో నధికములం దేదీ యీ భావము? ఈ హిందూత్వము?

బందరుచిత్రములను చూడండి. ఆ శుష్కాంగము లేల? అజంతచిత్రములలో యీ దుమ్ములప్రోగులు కానవచ్చుచున్నవా? రాజపుత్రచిత్రములలో కానవచ్చుచున్నవా? శుష్కమైన అంగములను వ్రాయుటవలన చిత్రములకు హిందూత్వము వచ్చుననియా? భారతజాతి, భారతచిత్రరచన యిట్టి శుష్కస్థితియం దున్నదని లోకమునకు చాటుటకా? ఎవరో కొందరు వంగచిత్రకారు లిటుల వ్రాసినంతమాత్రమున వారేల యిటుల వ్రాసిరోయని యొక్కనిముషమైనను, విచారించక, వారి ననుకరించుట యేలనో గ్రహింప శక్యము కాకున్నది. ఆధ్యాత్మికదృష్టియే సనాతన హైందవచిత్రకారుని తలంపగుటచే స్నాయుపుష్టిని జూపుటకు వారి కగత్యము లేకపోయెను. కాని యిట్టి శుష్కశరీరములను వారెప్పుడును చిత్రింపలేదు. గాంధారశిల్పములందు స్నాయువులను జూపకయే అంగపుష్టిని జూపిరి. తపఃకృశుడైయున్న బుద్ధుని విగ్రహ మొక్కటి మాత్రము కలదు. ఇట్టిరచనవలన చిత్రకారుడు చూపజూచిన బుద్ధభగవానుని ధైర్యము, ఓర్మి, పట్టుదల, జ్ఞానోదయమునకు గావలసినయనుభవము ప్రస్ఫుటితము లయ్యెను. రోగపీడితులైయున్న స్త్రీలను వ్రాయునప్పుడుకూడ ఆచిత్రకారులకు శుష్కాంగము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను వ్రాయుటకు చేతు లాడినవి కావు. ఇది వారిదృక్పథమునకు అగత్యము లేకపోయెను. నిజమిటులుండ సర్వాంగసుందరు లని మన పురాతనకవులచే వర్ణింపబడిన పురాణవ్యక్తు లను కాని, శిల్పశాస్త్రములందు వర్ణింపబడిన దేవతారూపములను కాని, భావజనితములైన ఆధ్యాత్మికరూపములను కాని, పురుషులను కాని, స్త్రీలను కాని, వీరు వారన నేల యే మానవవ్యక్తిచిత్రమును వ్రాసినను శుష్కాంగములే యిప్పటిచిత్రములందు ప్రధానము లైనవి! దీనికితోడు భావము శూన్యము- ఇట్టి కొన్ని చిత్రములను చూచుటతో నిక నిట్టి జాతీయచిత్రకళ చాలుననుపించుచున్నది. ఈ శుష్కాంగముల కర్త మేచిత్రకారుడైనను ఈ భారతిద్వారా చూపించినయెడల ఆంధ్రులు కృతజ్ఞు లయ్యెదరు.

ఇక రూపనిర్మాణమును చూడండి. స్త్రీలనుకాని పురుషులనుకాని వికారముగ వ్రాయుట వీరి కానందముగ దోచుచున్నది. సనాతనహైందవచిత్రములను జూచినయెడల సౌందర్యము తప్ప వేరు కానరాదు. అజంత, బాఘ్ గుహలందలి స్త్రీ లతిసుందరులని మహాకళాకోవిదుల యొక్కయు, కళాయాత్రికుల యొక్కయు అభిప్రాయము. స్త్రీలు మానవలోకమున కలంకారములని పూర్వపుచిత్రకారులు భావించిరి. ఎన్నిచిత్తవృత్తులు కలవో అన్నివిధముల స్త్రీల నతిప్రేమతో సృజించిరి. వస్త్రవిన్యాసమునందు వింతరుచులు చూపుటకు ఆ కాలమున దుస్తులతో అంగములను గప్పుట విశేషముగ లేకపోయినను అలంకారములతో ఆవ్యక్తుల నెటు లలంకరించిరో చూడండి. వీరి శిరోజబంధములను పలువిధముల రచించి, నాగరికులైన యిప్పటిస్త్రీలకు కూడ క్రొత్త మార్గములను నేర్పసమర్థులైరి. స్త్రీలను ముత్యములతో పోల్చిరో యనునటుల నెచ్చటజూచినను వీరియంగములు ముక్తాలంకృతములే. 'రాజపుత్ర' చిత్రములందును స్త్రీ లతిసుందరులు. మొగలుసాంప్రదాయముల నీరాజపుత్రచిత్రకారు లనుకరించుటచే గృహమునందే మెలగెడి స్త్రీలను వీరు చిత్రింపజాలకపోయిరి. మొగలాయీలకాలమున స్త్రీలు మరుగునందుండుట ఆచారసామాన్య మగుటవలన, కాని వీలగునప్పుడెల్ల-ప్రత్యేకవ్యక్తులను, వారిరూపచిత్రములను, కృష్ణలీలాదిపురాణచిత్రములను, రాగిణిచిత్రములను——ఎంత యాహ్లాదకరముగ వ్రాసిరో యీచిత్రములను చూచినవా రందరికిని బోధపడగలదు. సుందరవిగ్రహములను వ్రాయుటయందు బౌద్ధయుగమునందలి చిత్రకారులతో వీరు పందెము వేసిరా యనిపించును. మనసనాతనచిత్రరచనాసాంప్రదాయముల నుద్ధరించుటకు సమకట్టియు, ఆధునిక జాతీయచిత్రకారు లిట్టి వికారరూపములను చిత్రించి పూర్వపుచిత్రకారు లేర్పరచిన మార్గముల నేల కంటకమయములుగ జేయుచున్నారో గోచరమగుటలేదు. ఏవో వికారము లైన ఛాయాచిత్రములను హిందువులుగ ప్రచురించి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనలను హాస్యాస్పదములుగ జేయుచున్న పాశ్చాత్య పత్రికాధిపతులకు వీరు తోడ్పడి హిందూదేశమున కపారమైన నష్టమును కలుగ జేయుచున్నారు.

ఇట్టిచిత్రములను వ్రాయువారిలో చాలామందికి ప్రకృతిననుసరించి చిత్రములను వ్రాయుట చేతగాదేమో! ఎట్టి చిత్రములను తరువాత వ్రాయ నుద్దేశించినను ప్రారంభమున ప్రకృతి ననుసరించి చిత్రములను వ్రాయుట నేర్చుకొనుట మంచిది.

రాజమహేంద్రవరము చిత్రములం దీలోపములు కానరావు కాని వీటియందు చాలా భాగములు భావరహితములై యుండుటచే నిష్ప్రయోజనము లగుచున్నవి. రవివర్మచిత్రమునో, పాశ్చాత్యచిత్రమునో తీసుకొని, అటులనే రేఖలతో వేరుకాగితముపై వ్రాసి చాయ నచ్చటచ్చట కొంచెముసూచించి, తక్కినభాగమును రంగులతో నింపినయెడల రాజమహేంద్రవరపుచిత్రములవంటివికావా యనిపించును. హిందూసాంఘికజీవనము, హిందూఆధ్యాత్మిక దృష్టి, హిందూ కళాసంప్రదాయములు హిందూచిత్తవృత్తి యీచిత్రములందు మరికొంచెము స్ఫుటముగ కానవచ్చినయెడల నివి మంచి జాతీయచిత్రము లగును. రామారావుగారి భావపటుత్వము, వ్యక్తుంకూటమియందు ప్రాందిక వారిశిష్యు లింకను నేర్చుకొనవలసియున్నది. ఛందస్సును నేర్చుకొని పద్యముల నల్లినంతమాత్రమున కవిమెటులుగాడో, చిత్రములను వ్రాసి రంగులను పూసినంతమాత్రమున చిత్రకారుడు కాజాలడు. భావమే కవిత్వమునకుగాని, సంగీతమునకుగాని, చిత్రములకుగాని పునాది జీవము. ఈభావము ననుసరించి వృత్తమును, రాగమును, రంగును ఉండును. కళాకోవిదులందు కలుగు పవిత్రభావములు చదువువారియందును, వినువారియందును, చూచువారియందును కలుగజేసి వారి హృదయములను పవిత్రములుగ జేయుటయే హిందూదేశపు లలితకళలయొక్క యుద్దేశము.

ఈజిప్టును ఆదర్శముగ దీసికొంటిమని రాజమహేంద్రవరమువారు చెప్పకొనుట కలదు. ఈజిప్టునందు ఆంధ్రత్వ మెచ్చట గలదు? పూర్వులు మనకేర్పరిచిన రాజమార్గములు తగవనియా? కళలు జాతిభేదము లెరుగవనియు, అన్నిదేశములందును కళలయుద్దేశ మొక్కటియే యనియు, పరదేశములందు నూతనవిధానములు కానవచ్చినయెడల మనము నేర్చుకొనుట శ్రేయస్కరమనియు, వీరు వాదించవచ్చును. దేశములందుకల నాగరికత, జ్ఞానము కళలవలన పైకి కానవచ్చును. ఆ పిమ్మట కళలు నాగరికతను, జ్ఞానమును తగు మార్గముల నడిపింపగలవు. నానాదేశముల చిత్రరచనను జూడ నాయాదేశముల నాగరికతను కళలను అనుసరించియున్నవి. అందువలననే ఐరోపా, అమెరికా చిత్రరచన, ఈజిప్టు చిత్రరచన, మహమ్మదీయచిత్రరచన, భారతీయచిత్రరచన, చైనా జపాను చిత్రరచన భేదించియున్నవి. హిందూదేశపు చిత్రరచనా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విధానములు చైనా జపాను దేశములందు మార్పు చెందెను. మహమ్మదీయచిత్రరచన, గ్రీకు శిల్పరచన హిందూదేశమునందు మార్పుజెందినవి. ఈజిప్టు దేశపు రుచులకును, భారత దేశపు రుచులకును చాలావ్యత్యాసము కలదు. వారి దృక్పథము వేరు; మనదృక్పథము వేరు. వారి రచన మనకు సరిపోవుననుటకు కారణములు చాలవు. ఆలోచన, భావము ఒక్కటైనచోటులందును భాషాభేదమువలన వేరువేరు కావ్యములు పుట్టుచున్నవి. భాష చిత్రరచనావిధానములో బోల్పదగును. ఇంతకును భారతీయ చిత్రరచనకు సంపూర్ణవ్యక్తిత్వము కలదనియు, భారతీయరచనకు మించిన భారత దేశమునకు సరిపోవురచన వేరులేదనియు, మనసంస్థల మొదల సానుభూతిలేని పాశ్చాత్యకళావిమర్శకులుకూడ అంగీకరించియున్నారు. ఈ విషయమును నేరచించిన 'భారతీయచిత్రరచన—కొన్నివిశేషములు' అను వ్యాసములందు వివరించియున్నాను.

ఇటుల వ్రాసితినని కోపగించక యిట్టి లోపములలో చిత్రించుచున్న చిత్రకారులు ఆత్మవిమర్శనమును గావించుకొందురుగాక! ఇక ముందైనను భావపూరితములైన చిత్రరాజములు వెలువడుగాక! ఆంధ్ర దేశమున జాతీయ చిత్రరచన పెరిగి, క్రొత్త రుచులను జూపి భారతభూమికి వన్నె దెచ్చుగాక!

---

## చాటుపద్యములు

వడ్డాది సుబ్బారాయఁడుగారు

గణములు ప్రాసముల్ యతులు కావ్యమునన్ గుణముల్ ఘటింపఁగా
రణములు; పద్యమల్లను దొరంకొనుచో, ననుకోనిభావజృం
భణ పదబంధశోభలటఁ బాటిలుఁ దన్నియమానుసారితన్;
సృణి కరిణింబలెం, గవితనీమమె సూ నడిపించు నింపుగన్.

మంచట్టుల్ చలిగాలిచేఁ గరఁగ యుష్మద్గ్రాప మర్విన్ ఘనా!
ముంచు న్నీరము నింగి డిగ్గి; యదియొప్పంగాని, యా నీ రెటుల్
గాంచన్ సన్నపుఁజిల్లులంబలె దొరంగన్ ధారలై? చాతకో
దంచ చ్చంచుపుటీప్రణాళికలచే నం చాత్మ నూహించెదన్.

సకలం బీసుఁ డొసంగె సౌఖ్యమునకై సంసారి; కైనన్ దదా
ప్తికి సంతృప్తి ప్రధానసాధనము; వేవే లెవ్వి యెన్నుండినన్



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుక మీాయంగను జాల వద్ది వెలిగాఁ; జోద్యంబు, సంపన్నుఁడుఁ
శిబిరం బెత్తైడువాఁడువోలె, నది లేచుఁ లేవడిఁ గుందెడుఁ.

చెలిమిని గొన్నినాళ్లె మను స్త్రీ పురుషుల్ జతవాసి వేఱువా
రల మరగఁ, మఱుంగును బరస్పర మిర్వురయుల్లముల్; గటా!
మెలమి ననేకవత్సరము లేకశరీరతనుండి యమ్మల
య్యాలు విడియాకులం బెఱల కాల్మగలై యెటుమంద్రో నెమ్మదిఁ.

నాటకమందుఁ బాత్రలయి నాయకులఁ వరియించి యాటలం
బాటల హావభావపుఁ జమత్కృతులఁ యువతుల్ నటింప, న
చ్చోటను వారిభర్త లదిచూచి ప్రహర్షితులైన, నార్హతుల్
నాటెడు నట్టిమోకుముఁ దలంతుఁ గరస్థమటంచు వారికిఁ.

కల రిలఁ జిత్రకారు లధికంబగు కౌశలి వర్ణతూలికా
దులను, నచేతనప్రతికృతుల్ పటముఃఖ్యములఁ లిఖించువా
రలు; లవమైన, వారు సరిరారుసుమీా మకరాంకశిల్పికిఁ;
దలఁపుల, బైలఁ, బాంధుల యథాస్థితిప్రాయునతం డనంగుఁడై.

కల్పవల్లియుండ, గడ్డిపోఁచను జేరి - కాళ్ల వేళ్లఁ బడెదు కాముకుండ!
చులుకి నగు లెగాక కలదె దానఃఫలంబు?-మరుఁడుపశువుఁ జేయు దొరకు మొఱకు.

ఆదిమద్యకృసంగ మకురాభ్యాసంబు మఱిమఱిచూ వోనమాలవ్రాఁత
యరుగుచోఁ దరిగిచూ పతుకులు గుణితంబు పిలుచుట, పలుకులు పేళ్ల చదువు,
పరిచయాధిక్యంబుపట్టుట పొత్తంబు, సరసభాషలు కావ్యచయపఠనము
లలితవిభ్రమభంగి లకుణజ్ఞానంబు, కలయికపైఁ గాంక్ష కవనచింత
ప్రణయలేఖలిఖించుట పద్యరచన-గా, ననంగగురుండు శృంగారవిద్య
దిద్దుటను, నైకబంధాద్యధికచమత్కృ-తుల రమణి రసికుమది రంజిల నొనర్చె.

పెనుపల్లెమ్మును నీళ్ల నించి, నడుమం బెంచుంచి, యచ్చో గుడం
బునుపం, బాత్రను మూఁగు చీమగుమియం దొక్కండు నీరీఁది చ
చ్చిన, నల్లెన్నియొ దోరి సేతు నగుడుఁ, సేమంబుగాఁ బ్రాఁకి చే
రెను దక్కన్నియు బెల్లు; మిట్టులె జయశ్రీఁగంద్రు శూరాగ్రణుల్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఒంటిమిట్ట శ్రీరామమహోత్సవ చిత్రములు



ఒంటిమిట్ట శ్రీరామాలయ సింహద్వారము



శ్రీరామ సామ్రాజ్యపట్టాభిషేకము



శ్రీరామ రథోత్సవము



శ్రీరామ గజోత్సవము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఫిలడెల్ఫియాలోని స్వాతంత్ర్యమందిరము.



స్వాతంత్ర్యమందిరమునందలి స్వేచ్ఛాఘంటా సౌధసోపానములు. ఫిలడెల్ఫియా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### ౩౧

కూనలమ్మపదాలు

'కూనరాగాలు తీస్తున్నా'డని మధ్యాంధ్రదేశమందున్నూ, 'కూనలమ్మ సంగీతాలు తీస్తున్నా'డని దత్తమండలమందున్నూ వాడుకలో నానుడి పలుకు ఉన్నది. అది ఈ క్రింది పదాలనుబట్టి పుట్టినది. ఇట్టిపదము లెన్ని ఉన్నవో తెలియదు. అరవములో అవ్వయార్ పదా లెంత విలువగలవో తెలుగులో కూనలమ్మపదాలుకూడా అంతవిలువగలవేలన వచ్చును.

జప తపంబులకన్న
చదువుసాములకన్న
ఉపకారమేమిన్న

ఓ కూనలమ్మా!

అన్నమిచ్చినవాని
నాలినిచ్చినవాని
నపహాసించుట హాని

ఓకూనలమ్మా!

మగనిమాటకుమాటి
కెదురుపల్కెడు బోటి
మృత్యుదేవతసాటి

ఓకూనలమ్మా!

కాపువాడే రెడ్డి
గరికపోచేగడ్డి
కానకుంటేగుడ్డి

ఓకూనలమ్మా!

కవితారసపుజల్లు
ఖడ్గాలగల్లుగల్లు
కరణాలకే చెల్లు

ఓకూనలమ్మా!

దుర్యోధనుడుభోగి
ధర్మరా జొకజోగి
అర్జునుండేయోగి

ఓకూనలమ్మా!

భీష్ముడనుభవశాలి
భీముడేబలశాలి
కర్ణుడే గుణశాలి

ఓకూనలమ్మా!

ఆడితప్పినవాని
నాలినేలనివాని
నాదరించుట హాని

ఓకూనలమ్మా

### ౩౨

జడుపు

పసిబిడ్డను ముందు కూర్చుండబెట్టుకుని యీక్రిందిపదము చెప్పతూ చివరకు కళ్లలో ఉఫ్ అని ఊదితే బిడ్డ కళ్లుమూస్తుంది. "అదుగో జడిసినావులే" అని గేలిచేస్తారు. అందాకా జడవను జడవను అని బదులు చెప్పతుంది.

"నూకలుపెడతాను మేకలుగాస్తావు? కాస్తా
పెద్దపులివస్తే జడవవుగద జడవను
చిఱుతపులివస్తే జడవవుగద జడవను
ఎలుగుబంటివస్తే జడవవుగద జడవను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సివంగివస్తే జడవవుగద జడవను

తోడేలువస్తే జడవవుగద జడవను

అన్నింటికీ 'జడవను' అని చెప్పను.

నేవస్తే జడవవుకద.

(ఇది చెప్పి కళ్లలో ఊదవలెను; కన్నులు మూసుకొనును )

జడిసినావులే అమ్మా జడిసినావు!!

33

వరుసపరాచకము.

వదినగారూ మీరు వాసిగలవారు
వండబోయినచోట కుండ నాకేరు
బావగారూ మీరు ప్రతిభగలవారు
నిండిన్న సభలోను పిండిబొక్కేరు
చక్కిలాలాబుట్ట చంకబెట్టుకొని
సభలోను మాబావ సంగీతపరుడు,

* * *

అందలముకోరింది కుందనపుకుచ్చు
అతిభోగికోరాడు అత్తవారిల్లు
పల్లకీకోరింది పచ్చన్నికుచ్చు
పరదేశికోరాడు పంచటరుగుల్లు

3౪

పరాచకాలు.

అత్తింటికోడలూ అలిగిపడుకుంది
అలుకల్లుతీర్చవే ములుకుల్లకఱ్ఱ
అట్లుతిని అన్నయ్య అలిగి పడుకంటే
తిట్లుతిని వదినమ్మ తీపులందింది.
పోద్దోయిపొద్దోయి అన్నయ్యవస్తే
జల్తారుచీరల్లు కట్టువదినమ్మ
చింతాకు చక్కన్న చీర చక్కన్న
సిరిదేవి మావదినచీర చక్కన్న

3౫

చక్కిలి గింతలు

పసిబిడ్డలను పెద్దవారు దగ్గరకూర్చుండబెట్టుకొని అరచెయ్యిపట్టుకొని ఈక్రిందిపదము చెప్పుతూ ఆయాపనులు చేస్తున్నట్టు అభినయిస్తూ చివరకు బిడ్డచంకలో చక్కిలిగింత పెట్టుతారు. బిడ్డనవ్వుతుంది.

"పప్పుపెట్టి పాయసంపెట్టి
అన్నంపెట్టి అప్పచ్చిపెట్టి
కూరపెట్టి ఊరుగాయపెట్టి
నెయ్యివేసి ముద్దచేసి
తినిపించి తినిపించి





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెయిగడిగి మూతిగడిగి
తాతగారింటికి దారేదంటే
(అత్తవారింటికి దారేదంటే)
ఇట్లాపోయి ఇట్లాపోయి
మోచేతిపాలెం ముందర్నుంచి
ఇట్లాపోయి ఇట్లాపోయి
ఇదిగోఇదిగో వచ్చాంవచ్చాం
చక్కావచ్చాం చక్కావచ్చాం
చక్కిలిగిలిగిలి చక్కిలిగిలిగిలి.

౩౬

దోసపండు

త్రోవలో ఒకరాజుతోటేసినాడు
తోటలోపల పండ్లుదొర్లుతున్నావి



దొర్లుతున్నవి తియ్యదోసపండ్లన్ని
ఆపండ్లు పంపాడు ఆరగించంగ
తింటేను తియదోసపండ్లే తినాలి
కంటేను కొడుకుల్ల కాన్పేకనాలి
కంటేను కొడుకుల్ల కాన్పేకనాలి
అందితే అన్నతో వియ్యమందాలి
అందితే అన్నతో వియ్యమందాలి
ఆడితే వదినతో జగడమాడాలి.

---

# చమత్కారచంద్రిక

తాడూరి లక్ష్మీనరసింహారావు గారు

మూలము

ఆదిశూన్యేతు కేదారం
మధ్యశూన్యే శివాలయమ్,
అంత్యశూన్యే పయోధారా
త్రయః కాచన వల్లరీ.

తెనుఁగు పద్యము

ఆ. మొదలువోవఁబొలముతుదివోవఁగానొక్క
పాలధార నడుము పాసెనేని
యగుశివాలయంబు నలమూఁడుఁ గలసిన
నొక్కతీవెయాచు నొప్పనుర్వి.

వివరణము:

ఇం దుద్దేశింపఁబడ్డ శబ్దము "గుమ్మడి"

మడి=పొలము, గుమ్మ=పాలధార, గుడి=శివాలయము, గుమ్మడి=తీగపేరు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మా కొత్తవకీలు






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## నలందా విశ్వవిద్యాలయము—క్షీణదశ

బౌద్ధులు స్థాపించిన యీ విశ్వవిద్యాలయము, ఇసింగు వచ్చి యిచట పదివత్సరములు విద్యనభ్యసించు చుండినపుడు ఉన్నతదశయం దుండెను. దాని పేరు ప్రతిష్ఠలు నల్గడల వ్యాపింప, క్రీ. శ. ౭౫౧ సం॥ న, అచట ప్రధానాచార్యులగు కమలశీలగారిని టిబేట్ ప్రభువు తన రాష్ట్రమందు నాస్తికత్వము నడుగంటించి బౌద్ధమతమును పునరుద్ధరించుటకై, రాయబారుల బంపి పిలిపించుకొనినట్లు తెలియుచున్నది. తరువాతి కాలము ననే అది క్షీణముకా బ్రారంభించెను. రాజపోషణ వలన విక్రమశిలయందు విశ్వవిద్యాలయ మేర్పడుటయే దీనిని కృశింపజేసియుండును. విక్రమశిలయే ఉత్తర హిందూస్థానమున కంతటికిని విద్యకు ముఖ్యస్థానమైనను, రెండు విద్యాలయములకును రాకపోక లుండియుండ వలెను. విక్రమశిలయందలి 'అసిత' గారిని తీసికొనిరమ్మని టిబేటు ప్రభువు పంపగావచ్చిన యా దేశపుసన్యాసి, మార్గమధ్యమున నలందాయందు బసచేసియున్నట్లు తార్కాణ కలదు. నలందావిశ్వవిద్యాలయము వేయివత్సరములు వెంపొందగలదని హియాంసాంగ్ ఐతిహ్యమునొకదానిని నుడివియున్నాడు; కాని అంత కాలము దానికి ప్రసిద్ధియున్నట్టు కన్పట్టదు.

పదియవ, పదునొకండవశతాబ్దములందు గూడ నలందావిశ్వవిద్యాలయము విక్రమశిలతో పోటీలు మెఱయ వాసికెక్కి యుండెనని కొందరభిప్రాయపడు చున్నారు. దీనికి తార్కాణగా, మహీపాలుడు రాజ్యమునకు వచ్చిన వెనుక ఆరుసంవత్సరములకు నలందాయందు వ్రాతప్రతి యొకదానికిప్రతివ్రాయఁ బడియున్నది. అది యిప్పుడు 'ఏషియాటిక్ సొసయిటివారి గ్రంథాలయమున గలదు.

డా. కీల్హార్న్ గారు తమ ప్రాచీనశాసనాది పరిశోధనలం బట్టి తొమ్మిదవశతాబ్ది చివరకాలమునుండి నలందా పేరు మాసిపోజొచ్చెనని చెప్పుచున్నారు. వీరి కాధారము, కాప్టన్ కిట్టోగారు బయటికి తీసిన గోస్రవణశాసనము. గోస్రవణము బీహారునకు నైరృతి మూలను, ఆరుమైళ్లుదూరమున కలదు. ఈశాసనమందు దేవపాలుడను రాజు వీరదేవుని నలందా విశ్వవిద్యాలయమున బ్రధానాచార్యునిగా నియమించినట్లు లిఖింపబడి యున్నది.

ప్రసిద్ధికెక్కిన యీ విశ్వవిద్యాలయము క్షీణించుటకు రెండుకారణములు చెప్పుచున్నారు. మొదటిది: దాని కట్టడములు పురాతనములై, కాలపరిణతి వలన నశించియుండ నోపును. రెండవది: విక్రమశిలయందు విద్యాలయము స్థాపింపబడుట, దానికి రాజపోషణ కలిగి, యిందుల కది యొజ్జవడుటయు, నందుచే విక్రమశిలకీర్తి ముందు నలందాకు మాపు ప్రాప్తించుట. ఇంతటికిని ఫలితముగా యిట్టి 'సంఘారామము' విశేషమాదరణలేక కృశించి, మహమ్మదీయులు దాడివెడలి వచ్చి, ఇతర విశ్వవిద్యాలయములతోఁ బాటు దీనిని ధ్వంసమొనర్చి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపుడు, పూర్తిగా నంతరించెను. 'పాగ్సముజంగ్' వ్రాత ప్రకారము, మహమ్మదీయులదాడితీఱినవెనుక గూడ ముదితభద్రుఁ డనుఋషి దేవాలయాదులను పునరుద్ధరించె ననియు, ముగధరాజున కమాత్యుడొకడు నలందాయం దొక దేవాలయమును నిర్మించెననియు దెలియుచున్నది మఱియునుం గాథ యిట్లుకలదు. ఇనటికి తీర్థికభిక్షువు లిరువురు రాగా, వారిపై నెవరో క్రొత్తశిష్యులు మైల నీళ్లను చల్లిరి. అందులకు వారు కినిసి, పండ్రెండుసంవత్సరము లు సూర్యారాధన గావించుటవలన మహత్వముపడసి యజ్ఞగుండమునుండి భస్మమును చేతికెత్తుకొని బౌద్ధదేవా లయము పయిజల్లిరి, ఇంతటితో నచటి గ్రంథాలయమే కాక, కట్టడములన్నియును భస్మీపటలంబులై పోయెను. శాలాదిత్య శాసనమందును ఇట్టి గాథయే కానిపించు చున్నది.

మే (ఇండియన్ స్టేట్ రైల్వేస్ మేగజిన్ నుండి)

---

## హిందువులు—రాబోవు జనాభా

రాబోవు జనాభా లెక్కలలో హిందువులు తమ సంఖ్యను గూర్చి జాగ్రత్తపడవలెనని హిందూమహాసభ కార్యద్రష్ట, పండిత దేవరత్న శర్మ వార్తా పత్రికలందిట్లు వ్రాయుచున్నారు.

"మహమ్మదీయులందును, క్రైస్తవులందును కుల భేదములుకలవనియు. ఆ కులములు తరతరములుగా పరస్పర వైరుద్ధ్యము కలిగినవనియు నందఱికిఁ దెలిసియేయున్నది. కాని, వారినిమాత్రము మహమ్మదీయులు, క్రైస్తవులని మొత్తములుగా సూచించి, హిందువుల ననేక భాగములుగా బ్రాహ్మణ, ఆర్య, బ్రహ్మో, సిక్కు, జైన, బౌద్ధ, ఆటవిక, ఇత్యాదులుగా విభజించి వ్రాయుచున్నారు. ఈవిధముగా దేశములోనిహిందువులను కొంచెపఱచి, అనేకులకు దురభిప్రాయమును కల్గించుచున్నారు. ౧౯౨౧ సం. జనాభా ప్రకారము హిందువులు ౨౧౬, ౭౩౪, ౫౮౬, మంది, మహమ్మదీయులు ౬౮, ౭౩౫, ౨౩౩, మంది, క్రైస్తవులు ౪,౭౫౪,౦౬౪, మంది 'అనితోచుచున్నది. కాని, హిందువులమొత్తమును సరిగా వ్రాసినయెడల ౨౪౨,౫౧౫,౯౯౪, అగును. ఇంతేగాక, అనేకులు హిందూసంస్కారమును కలిగి, హిందువుల యాత్రాస్థలములను సేవించుచు, హిందూ పురోహితులచేతనే వివాహాది కార్యముల నిర్వర్తించుచునేనో యొకటిరెండు మహమ్మదీయులదో, లేక క్రైస్తవులదో ఆచారములనుకలిగియున్నారు. వారిని హిందువులనుగాచూపక, మహమ్మదీయులుగనో, క్రైస్తవులుగనో చూపుచున్నారు. మఱి ఆటవికులును, కొండజాతి వారును అగుభిల్లులు, గాండ్లు, హిందూదేవతల నారాధించువారుగానుండి, హిందూమతభిన్నులగువారుగా జనాభా లెక్కలందుఁగలదు. ఈసారికి, "అస్పృశ్యులును"ని మ్న జాతివారిని హిందువులనుండి విడదీసి వ్రాయుదురని సందియము వొడముచున్నది. క్రైస్తవులందును, మహమ్మదీయులందునుంగూడ యిట్టి నిమ్నజాతులు కలవని మాత్రము వీరు గుర్తింపబోరు. ... ... ...

కావున ప్రతిహిందూసంస్థయును, ప్రతిహిందూ ప్రచారకుడును, రాబోవు జనాభాలో యెట్టి అన్యాయమును హిందువులకు గలుగకుండునట్లు చూడవలెను. ఈసంవత్సరము లోగా అస్పృశ్యుడనబడు హిందువు లేకుండునట్లు మనము కృషిసల్పవలెను. అదిగాక, అస్పృశ్యుడుగాచూడబడు వాడే, అస్పృశ్యుల లెక్కలో చేరునట్లు చూడవలెను. రెండవది: ఎన్నివిభాగములున్నను, వాని ప్రత్యేకసంఖ్య లొసగ బడినను హిందువులను మొత్తముగా చూపించునట్లు చేయవలెను. మూడవది: భిల్లులు, గాండ్లు, కాశియాలు మొదలైన ఆటవికులందఱును, హిందూఆచారములను పాటించువారు, హిందూదేవతలను కొల్చువారు, హిందువులుగనే లెక్కలందు పరిగణింపబడవలెను. నాలుగవది: మాల్కానాలు, ఇతరరాజపుత్రులు గుజారులు జాటులు, మొదలైనవారు, కష్టనష్టములకోర్చి ఇప్పటికిని హిందూఆచారములను, హిందూ సంస్కారములను వీడనివారు, శుద్ధివిధినిపొందకపోయినను సరియే, హిందూమతమును వారు నమ్మచుందురేని హిందువులుగనే లెక్కలందు చూపింపబడవలెను."

(మాడర్న్ రివ్యూ)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri







శ్రీయుత అంచూరు సుబ్బానాయుడుగారు,

వీరిది నెల్లూరుకు తూర్పుననున్న ఇందుకూరుపేట గ్రామము.

ముప్పదియైదు ఏండ్లకుపూర్వము నెల్లూరుమండలము రాపూరుతాలూకాలో పొదలకూరికి మూడుమైళ్లదూరమున అభ్రకపు గనిని త్రవ్వించి అందులభించిన అభ్రకమువలన కోట్లకొలది గడించిన లక్ష్మీపుత్రుడు,మహాదాత. ఇతనినిగూర్చి భారతి శుక్ల సంవత్సర జ్యేష్ఠమాస సంచికలో 880 అ. పుటయందు విశేషముగ గలదు.

శ్రీయుత డా. చిలుకూరు నారాయణరావు పంతులుగారు, యం. ఏ.

ఇటీవల వీరికి చెన్నపురి విశ్వవిద్యాలయమువారు పి హెచ్. డి. బిరుదము నొసంగిరి. వీరు ప్రస్తుత మనంతపురము దత్తమండల కలాశాలలో నుపాధ్యాయపదవి నధిష్ఠించియున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మాతృప్రేమ

జి. జాషువ గారు

మా తల్లికడుపులో మసలుప్రేముడిచింది జలధులై యిలమీఁద నిలిచెనేమొ!
మాయమ్మ నామీఁద మలఁపుచల్లనిచూపు మంచువెన్నెలఁ బుక్కిలించునేమొ!
మామాత నోటి కమ్మనిమాటతేనెయే కలశవారాశిలో మొలిచెనేమొ!
మాయంబ కౌఁగిటి మరుగునఁగలహాయి స్వర్గీయధృతి కనుప్రాసమేమొ!
చేరి తనమేని నెత్తురుటేరులందు-నేను నిలువీఁతలీదని నెలవు లేదు
జననదినమునఁ బురిటిమంచాలమీఁద-నేను తనగుండెకాయనై నిలిచినాను.

నాతలనొచ్చినం దన మనంబున మిన్నులుగూలిపోవ శో
కాతురయై యెదుర్కొను మదంబ మొగంబునఁ బంచప్రాణముల్
బాతరలాడుచుండ బహుభంగుల నాకొఱకై శరీరముల్
గోతకు నప్పగింపఁగలుగుల్ భగవంతుఁడు పృచ్ఛచేసినన్.

అరువదియేండ్లు నాదగు శిరోగ్రము నెక్కినఁ దల్లికంటికిన్
జిరుతనుగాకపో నిది విచిత్రము నేనిలుదాటిపోయినన్
మరలినదాక నావెనుక మాతృక (?) జీవము మూఁడుగాళ్లతో
దిరుగుచునుండ నీఋణముదీరదు రక్తము ధారవోసినన్.

తల్లిగర్భానఁబాడము వాత్సల్యజలధి-పుట్టుమొదలుగ నామీఁద పొరలుచుండు
మానవాకారమునఁ జెప్పలేనుగాని-దానిపరిమితి గొలుచుకొన్నాను నేను.

పొదుగుగిన్నియఁ బాలువోసిదూడకుప్రాపి(?)యట్టునాకెడుపాఁడి యావుచెంత
బొండంపుఁదిత్తులు నిండఁ దెచ్చినబువ్వ బిడ్డకుఁ దినిపించు పిట్టచెంత
పాలిండ్ల పట్టుద ప్పనిపిల్లతోఁగూడఁ గొమ్మకొమ్మకుదాటు క్రోఁతిచెంత
తాంబూలరాగదం తములనువ్వులసంతతులమోయుదానిమ్మ పొలఁతిచెంత
చలువకన్నీట నాదుమస్తకమునంటి-వృద్ధమాతృకయభిషేక మిచ్చుచుండ
వడకుఁదనమేలు తనక నాబ్జములనీడ-బ్రదికెదనుగాక నూరేండ్లవఱకు నేను!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఆంధ్రభారత కవితా విమర్శనము

ఆంధ్రగ్రంథమాల ౧౨వ కుసుమము. వెల రు. ౨. గ్రంథకర్త: శ్రీయుత కోరాడ రామకృష్ణయ్యగారు, యమ్. ఏ.; మద్రాసు విశ్వకళాపరిషత్తులో 'రీడరు'

మదరాసు విశ్వకళాపరిషత్తు రీడరు శ్రీయుత కోరాడ రామకృష్ణయ్య, యమ్. ఏ. గారు ఈగ్రంథము రచించిన వారనినప్పుడే యిందు విశేషగుణముండవలయునని యెల్లరకుఁ దోఁచును. మఱి గ్రంథము నాద్యంతముఁ జదువఁగా, నందలి గుణము తొలుత ననుకొన్నంతకును మిన్న యనియు, గ్రంథకర్తగారు 'రీడరు' మాత్రులేకాక ఆంధ్రదేశవిద్వద్విమర్శకాగ్రగణ్యులలో నొకరనియు రూఢిపడినది. వీరియందుఁ, బూర్వకవుల యెడ ముఖ్యముగా తిక్కనపై భక్తివిశేషమును, ఆనునిశ విమర్శన దృష్టియును 'తమలోఁ గడలొక్కని' వీరి కబ్బమున కెక్కుడువిలువం గూర్చినవి. ఆంధ్రచరిత్రాంగములగు మతసాంఘిక రాజకీయ సారస్వతోద్యమములందు వీరికిఁగల విశేషపాండితి యేతద్గ్రంథరచనా సందర్భమున మిక్కిలి యుపకరించినది. "తనకావించిన సృష్టితక్కొరులచేతంగాదునా" నని ప్రబంధపరమేశ్వరునిచేఁబొగడ్తఁగన్న తిక్కనార్యుని కళావైశారద్యము, మనోవృత్తి వివరణ, జాతీయత, 'యల్లిక జిగిబిగి' మున్నగు విషయముల నతి విపులముగఁ జర్చించుటవలన వీరు తమరసికతను, విమర్శనకౌశలమును ఆంధ్రలోకమునకుం బ్రకటించినారు. ఇందలి వీరి యాశయము లించుమించుగ నన్నియు సాధువులే సహృదయమోదావహములే యని నేఁదలంతును; ముఖ్యముగా కవిబ్రహ్మనుగుఱించిన వీరి ప్రశంసావాక్యములు, భక్తిపారవశ్యముచేఁ గాబోలు వారి యావేశము వీరియందు నావహించినట్లు తోఁచిం చి యమందానందముం గూర్చినవి. మచ్చునకివిగో యొకటి రెండు ఉద్ధృతములు:

"ఈ భారతరచనా విషయమున తిక్కనయెట్టి పూజ్యభావముల, నెట్టి భక్త్యావేశమును, ఎట్టికవితావేశమును, ఎట్టిజ్ఞానసంపత్తిని, ఎట్టి ధర్మపరత్వమును, ఎట్టి అద్వైతభావనిరూఢత్వమును, ఎట్టి ముముక్షుత్వమును, ఎట్టి వైదికమార్గనిష్ఠ ప్రవర్తనమును, ఎట్టిమాతృభాషాభిమానమును ఈ యవతారిక మూలమున వ్యక్తముచేసినాఁడో పరికింపుఁడు. ఇట్టి మహాపురుషుఁ డాంధ్రదేశమున మఱియొకఁడు బయలుదేర లేదనుట యతిశయోక్తి గానేరదు. ఆంధ్రవాఙ్మయమున నిట్టి మహనీయగుణ సంపన్నుఁడగు కవి మఱియొక్కఁడు లేఁడనుట సాహసము కాదు. ఆంధ్రభాషాసతిని స్వస్వరూపమున నిలిపి యుద్ధరించిన వారిలో నీతఁ డగ్రగణ్యుఁడని చెప్పవలసి యున్నది. ఈతని మూలమున నాంధ్రవాఙ్మయము, ఆంధ్రభాష, ఆంధ్రదేశము ఆంధ్రజనము, వేయేల, ఆంధ్రత్వమునదే ధన్యత్వమును బొందుచున్నది."

"ఇట్టి యద్భుతంబగు మానసికవృత్తి వివరణముఁ జిత్రకల్పనము నాంధ్ర వాఙ్మయమున మఱి యెచ్చటను గానము. ఈ విషయమున నీతఁ డొక్కొకప్పుడు షేక్స్పియర్, కాళిదాసాది మహాకవులఁగూడఁ దలదన్నుచున్నాఁడా యని తోఁపించును."

ఇట్టి 'రివ్యూ'లయందు గ్రంథవిషయ సంగ్రహము (Summary) నొసంగుట ఆచారమని మామిత్త్రులొకరు సూచించినారు. కాని సంగ్రహములఁ జదివిన మాత్రనే, అసలు గ్రంథము పొంతఁబోవకయే, గ్రంథాను

7. 5- 17 ౮౨౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మామూలాగ్రము 'దిగఁద్రావి గబ్బునఁ ద్రేఁచినట్లు', నటించుచు విజ్ఞవీగు మహనీయు లనేకులు కలరని యెఱింగిన వాఁడ నగుటచే ఆ పని నిట మానినాఁడను. గ్రంథవిషయము సర్వము చదివి సంతసింపవలయునదేయైనను, మదీయదృష్టి నత్యంత మాకర్షించిన యంశములలోఁ గొన్నింటినేని తడవుటయు, అవసరమగు నెడ నాయభిప్రాయమునుగూడ సూచించుటయు విధ్యుక్తముగఁ దోఁచెడిని.

౧. "తిక్కన మొదట నిర్వచనోత్తర రామాయణమును రచించిచూచి, యది తన కవితావిలాసోన్నతి కోర్వదని కాఁబోలు నీ భారతకథను చేపట్టినాఁడు." తిక్కన కవిత్వశిల్పము తొలికబ్బమున కన్న మలి కబ్బమున మఱింత పరిణతిం గాంచుట సహజము, వాస్తవము. కాని దీనినిబట్టి పూర్వగ్రంథమునందు కళాప్రౌఢి లోపమని మాత్రము పాఠకులు భ్రమింపకుందురు గాక, నిర్వచనోత్తర రామాయణమును ఉత్తకావ్యరాజమే. తిక్కన 'కవితావిలాసోన్నతి' నెంతయు 'నోర్చినదే.'

౨. ఆంధ్రజాత్యుత్పత్తిని గూర్చి గ్రంథకర్తగారి యభిప్రాయము. "ఉత్తరదేశమందలి యాదిమ నివాసులతోఁ గలిగిన కలయికచేఁ గాఁబోలు వైదికాచారములందు శ్రద్ధలేనివారై యనార్యాచారముల నవలంబించుటంచేసి యార్యజనసంఘముచే వేదబాహ్యులుగఁ దలంపబడిన వారును, విశ్వామిత్రసంతతి వారును, తచ్ఛాపహతులుగను నైతరేయ బ్రాహ్మణముననే పేర్కొనఁబడిన వారునగు మిశ్రతెగలవారు కొందఱు ఆర్యదేశమును వీడివచ్చి యార్యదేశపరిసర భూములందు, అనఁగా వింధ్యకు దక్షిణభాగమునను దక్షిణాపథమని చెప్పఁబడు మధ్యదేశమున దండకారణ్యభాగములను జేరుట తటస్థించినది. అంధకారబంధురంబగు నరణ్యప్రదేశమునఁ జేరి నివసించుటచే వీరిలోఁగొంద ఱాంధ్రులని పిలువఁబడిరి. కాలక్రమమున వీరు తూర్పు దక్షిణభాగముల నాక్రమించికొనివచ్చు సందర్భమున మధ్యపరగణాలలోని 'తేల్' నామకనదీ ప్రాంతవాసులగుటచే తెలుఁగువారని చెప్పఁబడిన దేశీయజనసంఘములోఁ గలసిపోయి యుందురు......తరువాతివారు దీనికి 'త్రిలిం' 'త్రిగ' ములనుండి వ్యుత్పత్తిని గల్పించిరి." ఇయ్యది చరిత్ర పరిశోధకులు గమనింపఁ దగియున్నది.

3. నన్నయభట్టు కన్నడభాషలో పంపకవి భారతమును జదివి, యాతని ననుసరించియుండునని యీ గ్రంథకర్తగారి యభిప్రాయము. సంస్కృత ప్రాకృత కర్ణాటభాషలయందు కవిరాజశేఖరుఁడైన నారాయణభట్టు ఇతనికి సహాయుఁడగుటయు, స్వయమితఁడు 'సకలభాషావాగనుశాసనుఁ'డని బిరుదుఁ గాంచుటయు పై యాశయమున కాధారములు. ఆంధ్రకర్ణాట భాషా కోవిదులగు విమర్శకు లీ రెండుగ్రంథములఁ బోల్చిచూచి, యెంతవఱకు నన్నయ పంపకవి ననుకరించెనో నిర్ణయింపవలసి యున్నది.

4. ఐరోపాయం దొకప్పుడు లాటినుభాషకుఁ గల గౌరవము దేశభాషలకు లేదని తలఁపఁబడినట్లే, యిప్పటికిఁగూడ, మన దేశమున సంస్కృతమునకు గౌరవాధిక్యమేగాక, సంస్కృతపండితులు పలువురు దేశభాషలఁ జులకనగాఁ జూచుటయు నెల్లరకు విదితమే. ఇట్లే సంస్కృతమునకును దెలుఁగునకును పూర్వమునుండి స్పర్థ కలదనియు, సంస్కృతభూయిష్ఠ రచనకుం బ్రతిమల్లముగ 'జానుతెనుఁగు' పేర నొకయుద్యమము ప్రబలియుండెననియు ఈగ్రంథమువలనఁ దెలియనగుచున్నది.

"ఉరుతర గద్య పద్యోక్తులకం టె
సరసమై పరఁగిన జానుఁదెనుంగు."

"ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు."

ఇత్యాదులవలన 'జానుఁదెనుఁగు' స్వరూపము గోచరమగుచున్నది. సంస్కృతపదముల శబ్దాడంబరము తెనుఁగున లేదనువాదమునకు

"అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయెగాదె కవి వివేకంబు"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని సమంజసమగు సమాధాన మొసఁగఁబడినది. విన్న కోట పెద్దనకాలముననఁగూడ గ్రంథకర్తగా రన్నట్లు తెలుఁగనిన నెట్టి యీసడింపు ప్రబలియుండెనో యీ పద్యమువలనఁ దెలియుచున్నది:

మ. "విలసద్భాషరసాద్యలంకృతులచే
　　విప్పారి, గీర్వాణ భా
షల కబ్బంబుల కెన్నిమంచి తనముల్
　　సంధిల్లు నాచందమై
వెలియుం బ్రాసయు నంత కగ్గలములై
　　వర్తిల్లు సత్కావ్యముల్
దెలుఁగంచుం జెవిఁబెట్టలేమి యుడు పం
　　దేఁగల్గునే మందిలన్."

ఈనాఁడును మన భోజనమునకు వలయునవి 'లవణము' 'సూపము' లేగాని "యుప్పును"ను "జప్పు"ను గావు గదా! మఱి సంధ్యావందనము తెలుఁగున నేల చెప్పఁగూడదని యెవరే నన్న మనమెంత మండిపడుదుమో!

౫. ఉ. "పాయకపాకశాసనికి
　　భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు, దాసును
　　ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధు
　　రంధరుఁడున్ దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁ డభిమతం
　　బుగఁ దోడయి నిర్వహింపఁగన్"

అను పద్యమున 'భారత ఘోరరణము'ను ఉపమానముగాఁ జెప్పుట గ్రంథాదియందే రాఁబోవుకథను సూచించుటకును, భారత రచనయు భారతయుద్ధమంత మహత్కార్యమేయని తెలుపుటకును, నారాయణ శబ్దముం జమత్కరించుటకును అని తలంచి యుంటిని. కాని యీగ్రంథమున నొక నూత్నార్థమిట్లు గాన్పించుచున్నది. "భారత ఘోరరణముయొక్క యీపద్యమువలన.....అసూయాపరత్వాది దుర్గుణపుంజయుక్తులతోఁగూడి, సత్పురుషుల కగమ్యములగు కొన్ని సభాంతరగములందు భారతసంహితను దెనుఁగుసేయు విషయమగు వాదములు కలిగెననియు, నట్టి సందర్భముల నారాయణభట్టు నన్నయకుఁ దోడయినిల్చి....కన్నడభాషా వాఙ్మయసాదృశంబును దెలిపి, ప్రతిపక్షులవాదంబున నోడించియుండునని...... యూహింపఁదగియున్నది." ఇయ్యది మిక్కిలి గమనింపఁదగి యున్నది.

౬. భారతమును నన్నయ వైదికదృష్టితోడను, దిక్కన కావ్యకళాదృష్టితోడను రచించినారని యీ గ్రంథకర్తగారి దృఢాశయము. నన్నయ వైదికాభిమానమునకు నిదర్శనములం బెక్కింటిని వీరు తొలి మూఁడు పర్వములనుండిచూపినారు. నన్నపార్యుఁడు వైదికకర్మలను వైదికాచారములను, కొన్నిచోట్ల స్వతంత్రించి యు నతిమాత్రముగాఁ బొగడిన మాట వాస్తవమే. కాని దానినిఁబట్టి, నన్నయకుఁ గావ్యకళాదృష్టిలోపమని చెప్పఁదగునా? తన్నుఁగూర్చి నన్నపార్యుఁడే "లోకజ్ఞు నుభయ భాషాకావ్యరచనాభిశోభితు, సత్ప్రతిభాభియోగ్యు...మత్యమరాధిపాచార్యు" ఇట్లు చెప్పికొన్నాఁడు గదా. కవి బ్రహ్మగూడ నన్నయను "ఆంధ్రకవిత్వవిశారదుఁడు" "విద్యాదయితుఁడు" అని పొగడియున్నాఁడు గదా. రాజసూయము, ద్రౌపదీవస్త్రాపహరణము, నలచరిత్రము మున్నగు రమ్యతమఘట్టముల నన్నయకన్న మెఱుఁగుగాఁదిక్కన యేనియు రచించియుండునా యని తోఁచుచున్నది. మొత్తముమీద కవిత్రయమువారి కవితామార్గము ఇంచుమించుగ నొకటియేయనియు, కావ్యకళాదృష్టి యందును నన్నయభట్టు తరువాతి యిరువురకు మార్గదర్శియే యనియు, తిక్కన నన్నయలకుఁ గుడి యెడమ భేదము దక్క నెక్కుడు వ్యత్యాసము లేదనియు నాయల్పబుద్ధికిఁ దోఁచినది.

౭. తిక్కనార్యుఁడు నన్నయ రచనమును జూచియుండఁడనియు, మూఁడు కృతులాతఁడు రచించెనని విన్నమాత్రముననే వానిని వదలి తక్కిన పర్వములఁ దానాంధ్రీకరింపఁ బూనియుండుననియు, అదియే తిక్కన యరణ్యపర్వశేషముం బూరింపకుండుటకుఁ గారణము గానోపుననియు ఈ గ్రంథకర్తగా రూహించినారు. ఇందులకు వీరొసఁగిన యుపపత్తి యిట్టిది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

i "నిర్వచనోత్తర రామాయణమున నన్నయ ప్రశంస గాన్పింపదు"—కాని యటఁ దిక్కన యేకవిని గాని పేరెత్తి ప్రశంసింపలేదు గదా. 'ఆది కవీంద్రుల నూత్నసత్కవీశ్వరులను' అన్నాఁడుగదా. వారిలో నన్నయయేల చేరరాదు?

ii తిక్కన తన యవతారికలో
"...ఆదిదొడంగి మూఁడుకృతు
లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యానయితుం డొనర్చె మహి
తాత్ముఁడు' నన్నయభట్టుదక్షతన్."

అనుటయందు 'విద్యాదయితుఁడు' 'మహితాత్ముఁడు' అనునవి నన్నయనుగూర్చిన విశేషణములుగాని యాతని కృతిని గూర్చినవి గావనియు, ఆంధ్రమున మొదట నుద్గ్రంథమును రచించిన వానిని 'ఆంధ్రకవిత్వవిశారదుఁ' డనుటలో విశేషము లేదనియు ఈ గ్రంథకర్తగారి సమర్థనము—కాని యిట్లు కావ్యమునుండి కవిని వేఱుపఱచుట సమంజసమా! తిక్కన దేనినాధారము చేసికొని నన్నయను బొగడియుండును? 'ఆంధ్రకవిత్వ విశారదుఁడు', 'విద్యావయితుఁడు' అనుటవలనఁ దిక్కనకు నన్నయ కవితయందును గల యాదరము వ్యక్తముగాదా? మీఁదు మిక్కిలి, మూఁడుపర్వములు నన్నయ 'దక్షత' మై రచించెనన్నాఁడు గదా తిక్కన. తాను నన్నయ కృతులను జదివి మెచ్చియుండకున్న, అతఁడు దక్షతమై రచించెనని తిక్కన యెట్లు కనుఁగొని యుండును?

మఱి తిక్కన అరణ్య పర్వశేషము నేల పూరింపలేదు? తనకును నన్నయగతియే పట్టునని కవిబ్రహ్మ భీతిల్లి దానిని వదలెనను 'పుక్కిటిపురాణమే' శరణ్యమా? తిక్కన యరణ్యపర్వశేషమును వదలుటకు శ్రీశ్రీ పానగల్లు రాజాగారు, పార్థసారథి రాయణింగారు హృద్యమగు సమాధానమని ట్లొసంగినారు. దీర్ఘమగు నవతారికతో, ఇష్టదైవప్రార్థన, స్వప్నగాథ, అంకితము, షష్ఠ్యంతములు మున్నగువానితో సక్రమముగఁ గావ్యము రచింప దొరకొనిన తిక్కన పర్వమధ్యమున నారంభించుట పొసఁగదు. ఏలయన: నిదియొల్ల అం దిముడదు. కావున తిక్కన నాలవపర్వముతో మొదలుపెట్టి పై శేషమును గడమ గ్రంథమును బూర్తిచేసిన, వెనుక వ్రాయుదమని తలంచి యుండును. మఱి యీపదునేను పర్వములు రచించిన వెనుకనైన దానిని బూరించుట కేమియాటంకమయ్యె ననుటకు జర, రుగ్మత, మృతి మున్నగు సమాధానములు సులభముగ నూహ్యములు.

ర. అరణ్యపర్వచరమభాగము క్రిమిదష్టమై శిథిలముకాఁగా ఎఱ్ఱన నన్నయపేరే పెట్టి యందచ్చటచ్చట పోయిన వర్ణములకు, పదములకు, పాదములకు అదుకులువెట్టియుండునను క్రొత్త సిద్ధాంతమునెడ ఈ గ్రంథకర్తగారు తమయసమ్మతిని దెలిపినారు. అరణ్యపర్వశేషపూరణము ఎఱ్ఱన స్వతంత్రరచనయే యనుటకు పలయు నుపపత్తినిగూడ వీరు సమగ్రముగా నొసంగియున్నారు. 'శారదరాత్రులు'తో నన్నయకవితా 'సుధాంశు' వస్తమించెననియు 'స్ఫురదరుణాంశు'వుతో ఎఱ్ఱనకవిత్వ 'వాసరముఖము' వెలిఁగెననియు నైతిహ్యము రూఢికెక్కియున్నది. ఇయ్యది యసత్యమనుటకు ప్రబలాధార మేదేని యుండవలయును. ఇట నయ్యది యరయనైయున్నది.

౫. విరాటపర్వరచనయందుఁ దిక్కన యెంతవఱకు మూలము ననుసరించెను? ఎటనెట నెట్లెట్లు స్వతంత్రించి మార్చుకొనెను? అనువిషయమును ఈగ్రంథకర్తగా రతివిపులముగఁ జక్కఁగఁ జర్చించి, మూలానువాదములకుఁగల ప్రతివ్యత్యాసమును తిక్కనార్యుని యౌచిత్యపరిజ్ఞానమును కావ్యకళానైపుణిని జాటుచున్నవని నిశ్చయించినారు. మఱి, తిక్కన గ్రహించిన మూలప్రతి యెట్టిదనుటకు ఇప్పుడు దొరకిన వానిలో నతిప్రాచీనమని తలంపఁబడుచుండి బండార్కరు పరిశోధనాలయమువా రవలంబించిన పాఠమునకు మూలమైనట్టి ప్రతికే యది దగ్గఱగా నుండియుండునని వీరి యాశయము. మఱియు, తిక్కనమార్పుల ననుసరించి క్రొత్తపాఠములు కొన్ని దక్షిణదేశపు మూలప్రతులలోని కెక్కుట సంభవించి యుండుననియు వీరి మతము. ఇందులకుఁ గావలసినంత యుపపత్తిని వీరు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సేకరించి యిటుఁ బొందుపఱచి యున్నారు. ఇయ్యది మిక్కిలి శ్రద్ధతోఁ జరుప వలయు భాగము. వీరి సిద్ధాంతము నంగీకరింతుమేని, యది తిక్కనార్యుని కళాప్రతిభలకు మఱింత ప్రబలనిదర్శనముగాఁ గైకొనఁదగి యుండును.

౧౦. ద్రౌపది సుదేష్ణ యొద్దకేఁగు ఘట్టమున "కనుఁగొని గారవంబును మొగంబున" ఇత్యాది పద్యమును వీరు ప్రాఁతపాఠముతోడనే యుద్ధరించినారు. ఈ పద్దెమునందలి కవితారసము 'గోదావరి ఆవఁగాయవంటి' దని శ్లాఘించిన కీర్తిశేషులు కళాప్రపూర్ణులు వేదము వేంకటరాయశాస్త్రులవారు బజారుపాఠము అన్వయ దోషపూరితము అసాధువని సిద్ధాంతీకరించి యిట్లు సవరించినారు.

వ. "కనుఁగొని గారవంబును మొగంబునఁ
    గేలుఁ బురఃప్రసారముల్
దనువున నమ్రభావమును
    దంతమరీచులు సామినిర్గమం
బును దనతోఁ గడల్కొనఁగ
    భూరితరాదరరేఖ నిందుర
మ్మనవుడు నంత నంత ద్రుప
    దాత్మజసేరి వినీతి నిల్చినన్."

ఈ సవరణ వీరికిని ఉపాదేయమగునని నమ్మెదను.

౧౧. భీముఁడు కీచకుని వధించుటకు నర్తనాగారమున కేఁగుచు ద్రౌపదినిగూడఁ దోడ్కొని పోయినట్లు తిక్కన మూలకథ నేల మార్చెనను ప్రశ్నకు, "తన భర్త కీచకవధలో రహస్యవిభేదమార్గము నవలంబింపకుండఁ జూచుటకే ద్రౌపది యాతని వెంటఁ దగిలి లోనఁ బ్రవేశించి యనతిదూరమున నోసరిలి కనిపెట్టి యుండె"నను సమాధానము నీ గ్రంథకర్తగా రూహించినారు. కాని, పోరాటమున రహస్యవిభేదము గాకుండ ఆమె యేమి చేయఁదలఁచినదో, యేమిచేయఁ గలదో దురూహ్యము. ప్రకరణముం బట్టి, భీముఁ డామెను నర్తనాగారమునకుఁ దోడ్కొని పోవుట స్వప్రతిజ్ఞా నిర్వహణార్థమని స్పష్టము. తొలుతనే యతఁ డాసాబగునిం దెగఁజూచి, నీకుం జూపి నీచిత్తంబు వడసెద'నని ప్రతిన పూనెను గదా. కీచక శవము నామెకుఁ జూపునపుడును భీముఁడు "చూచితే, సంతోషించితె" యని గదా పల్కెను. మఱి భీముఁ డట్టి ప్రతినయేల పూనెను? అను ప్రశ్న నిలిచియున్నది. తన ప్రియకు ఉత్సాహము, సంతోషము ఎక్కుడగుటకు అబలను అట్టిచోటికిఁ గొంపోవుట అపాయము గదా యనిన, భీమునకుఁ గీచకవధ దుష్కరమగు నొక మహత్కార్యముగాఁ దోఁపనే లేదు. అది లీలామాత్రమగు నొక వినోదముగా నాతఁడు భావించెను. ఆ వినోదమునకు అంగములే స్త్రీ వేషము వేయుటయు, తన ప్రియవివిపించుటకుఁగా కీచకుని వలపుఁబలుకులకుఁ వలపుగత్తెవలెనే 'మృదుకీతిని'మాఱుపల్కుటయు. మనము 'సినీమాల'కు, నాటకములకు మనయాఁడువారిని దోడ్కొనిపోవుట యెట్టిదో అట్టిదే భీముఁడు తనకాంత నీయంతర్నాటకముంజూడ వెంటఁబెట్టుకొనిపోవుటయు. ఈసంవిధానమెల్ల మూలమునందలి లోపముఁబూరించుటకుఁ దిక్కన కల్పింపవలసివచ్చినది. ఎట్లన,కటికిచీఁకటిగదిలో నిజస్వరూపమననే యెదిరి కగోచరుఁడై హఠాత్తుగా నాతనిపైఁదుమికి వానింబొలియించుట సులువై యుండఁగా, భీముఁడేల ఆడువేసముఁదాల్చి, యాతఁడు దానివలెనే పల్కి, కీచకునిమోసగింపవలసివచ్చెను? అను ప్రశ్నకు సమాధానము మాతృకయందు మృగ్యము. ఏతన్నిమిత్తమే తిక్కన పైసంవిధానముం గల్పించెనని నాయూహ.

పాఠకులకు శ్రీయుత రామకృష్ణయ్యగారి గ్రంథము సాంతముగ సావధానముగఁ జదివి యానందవ్యుత్పత్తుల నొందవలెనని కుతూహలము జనించుటకు ఈపాటి చాలునని తలంతును. ఆంధ్రసారస్వత ప్రపంచమునకిట్టి మహోపకారముఁ, గవిత్రయవాణికి-అందును కవిబ్రహ్మకీర్తికి ఇట్టి పరిపుష్టిం గావించిన శ్రీయుత రామకృష్ణయ్యగారిని, ఈ యుద్గ్రంథముచేఁ దక్షయాంధ్రగ్రంథమాల నలంకరింపించికొన్న దేశోద్ధారక శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారిని ఎంతేనుతించినను తనివితీఱదు. శ్రీయుత రామకృష్ణయ్యగారు ఈ గ్రంథమును మొదటి భాగముగా భావించి, యిందు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విరాటపర్వమును విమర్శించినట్లే భారతమునందలి కడమ పర్వములఁగూడఁదఱచి 'భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలు'టయేగాక, చిత్తసరోవరంబుల నింపికొని యాంధ్రావలి యితోధికమోదముం బొరయుట కెంతేని సాయపడును రగాకయనియు, ఆంధ్రవాఙ్మయముయొక్క విపులచరిత్రము నొకదాని రచించి, తెలుఁగున నట్టి గ్రంథము లేని కొఱంతం దీర్తురుగాకయనియు, ఇట్టి సదుద్యమములందు దైవమును ఆంధ్రభాషాభిమానులును,విద్యాధికారులును వారికిఁ దోడ్పడుదురుగాకయనియు నభిలషించువాడను.

గుఱ్ఱం వేంకట సుబ్బరామయ్య.

---

## విఘ్నేశ్వర చరిత్రము

ఇది యెనిమిది ప్రకరణములుగల యొక యాంధ్ర వచనకావ్యము, ఇందు క్రౌనుసైజున ౮౫ పుటలు గలవు. ఏతద్గ్రంథకర్తలు. శ్రీయుత గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు. ఈవిఘ్నేశ్వర చరిత్రము మన దేశమునం దాబాలవృద్ధ మెల్లరకు దెలిసినదే. అయినను గ్రథనకౌశలముంబట్టి కావ్యములకుఁ బాఠకుల నానందపరవశులంజేయు శక్తి పొడముచుండును గదా? గ్రంథప్రణేత లీగ్రంథ రచనమునకు భాగవత విష్ణు పురాణముల యందలి కథను మూలముగాఁ గైకొని యున్నారు. ఇంతేకాక ఆయా తావులందుఁ దత్తదుచిత రీతిని భాగవత విష్ణుపురాణాంతర్గతములగు శ్లోకములను పద్యములను నుపాకవుల చాటువులను గూడ నుదాహరించియున్నారు. శ్రీ శ్రీ శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారీ గ్రంథ పీఠికలో 'దీనిశైలి సులభము. మృదుమధురము, గసవంతము' అని యుగ్గడించి యున్నారు. అదికేవలము సత్యేతరము కాఁజాలదు. కాని కొన్నిపట్టుల దీర్ఘతమములైన సమాసములు సంఘటితము లగుటంబట్టియు, కొన్నిస్థలములందు వ్యాకరణ విరుద్ధములు కాకున్నను, సులభతిమమును సాధారణముగా వాడుకలో నుపయోగించునట్టివియును నగుపదములును ప్రయుక్తములగుటంబట్టియు, నీగ్రంథశైలి చదరముగా లేదని జెప్పవచ్చును. మరియు గజాసురుని హృత్కుహరమున వృదుఁడు ప్రవేశించుటచే నిజభర్తృ వియోగమును సహింపఁజాలక భవానీదేవి యారాతుసుని సంహరించి తనకు భర్తృసంయోగమును గావింపవలయునని బ్రహ్మాదులను వేడ్కొనును. అత్తఱి కమలాసనాదులు నందీశ్వరుని గంగిరెద్దుగాఁజేసి తారును గంట, డోలు, పీరణము మున్నగువానిని కేలఁబూని యాదుచు వాయించుచు గంగిరెద్దు నాడించుచు, గజాసురుని కొలువునకుఁ బోవుదురు. ఆసందర్భమున నారాజు కొలువునందు వారు గ్రామ్యభాషతో మాట్లాడుదురు. ఆసంభాషణ మెంతయు సరసముగను, హృదయంగమముగను నున్నదని వక్కాణింప వచ్చును. దీనివెల ౧౨ అణాలు. వలయువారు: ఆంధ్రావళీ గ్రంథమాలిక, ఎలమంచిలి. విశాఖపట్నంజిల్లా, అని వ్రాసినఁ బడయగలరు.

ఉభయభాషాప్రవీణ, బు. న. శా.

---

## Co-operative Reader: సహకారవాచకము

గంజాంజిల్లా బరంపురంలోని, సహకార సంఘముల రిటైర్డు ఎక్స్ట్రా అసిస్టాంటు రిజిస్ట్రారు, రావుసాహెబ్ ఎమ్. వి. అప్పారావు పంతులుగారిచే వ్రాయబడి క్రౌనుసైజున సుమారు ౭౧ పుటలుగలది. వెల ౮ అణాలు, గ్రంథకర్త ఛాయాచిత్ర మొకటియు, పాఠములకు సంబంధించిన ౧౫ యితరచిత్రములు నిందుకలవు.

ఈ గ్రంథకర్త సహకారవాచకములను ఆంగ్ల, ఉత్కళ, ఆంధ్రభాషల మూడింటను వ్రాసి ప్రచురించెను, ఈ పుస్తకము ౧౯౩౭లో వేసిన రెండవకూర్పు. గంజాంజిల్లాలోను యితర రాంధ్రోత్కళ ప్రాంతముల లోను ౪వ తరగతికి పైబడి ౩వ ఫారముదాక నుండు బాలబాలికలకు పాఠ్యపుస్తకముగ పెట్టబడుట కిదిజిల్లా విద్యాసంఘము వారిచేతను,అధికారులచేతను అంగీకరింపబడి, పెద్ద ఉద్యోగస్థుల ప్రశంసగన్నది. ఇందు ౨౫ పాఠ విభాగములున్నవి చిన్న గీతపద్యములు, నొకపెద్ద గేయముతోనుకూడి బాలబాలికలు చదివి సహకారము, ఐకమత్యము, పరస్పరసంఘములఆవశ్యకము — లాభములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొ.వానినిగూర్చి తెలిసికొనుట కెంతో యింపుగనున్నది, గ్రామపునవనిర్మాణకార్యమున భాగమును నీ సహకారోద్యమతత్త్వము అందరిక్షేమమున కొకొక్కడును ఒక్కని క్షేమమునకందరును, పాటుపడవలెనని. ఈ పుస్తకమును సుబోధముగ రచించి గ్రంథకర్త కృతకృత్యులైయ్యెను. ఇంకను ఇట్టివాచకముల కవసర మెంతేని కలదు. జ. బ్ర.

---

## శ్మశానవాటిక

గ్రంథకర్త:— శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. సాదా కాగితములు, ౨౩౦ పుటలు, దళసరి కాగితపు బైండు, ౧౯౧౪ సం|| కళాభివర్ధనీ గ్రంథనిలయము ౪వ ప్రచురణము.

ఇది యొక చారిత్రక పారిశోధకనవల. కథజరిగిన చోటు ఆంధ్రదేశము. కథ ఆమూలాగ్రము కల్పితమే.

ఈనవలయందు విరోధిపాత్ర భుజంగరాయడు. ఇతడు సహజముగా సుస్వభావుడు. అన్యాయ్యముగు ద్రోహబుద్ధి యేమాత్రమును లేదు. కాని తనకు గల్గిన స్వల్పాపకారమునకు ప్రభుత్వముగాక తానే ప్రతీకారము చేయవలెనను దుర్మార్గపుసంకల్పముచే ప్రభుత్వద్రోహియై పోయినాడు. ఇతని అంత్యకాలమున దేశమునకు ప్రజలకు, తన హ్రస్వదృష్టిచే గలిగిన ఆపదలకు, నష్టములకు మిగుల పశ్చాత్తాపపడినాడు. ప్రసాదరాయని మరణమునకు మిగుల విచారించినాడు. ఇదంతయుగూడ నీతని అంత్యవాక్యములలో (౨౧౪ పుట) విశదముగుచున్నది.

ఈనవలా పాత్రలలో కుమారస్వామి మిగుల గట్టివాడు. ఇతనియొక్క యెత్తులచేతను, జిత్తులచేతను విద్రోహిసంఘమంతయు ధ్వంసమైనది. భుజంగరాయడు పట్టుబడినాడు. ప్రసాదరాయనిమరణ మతివిషాదకరముగ నున్నది. ఒక ప్రసాదరాయని మరణమే యననేల, కథ విషాదములోనే ప్రారంభించి విషాదముతోనే అంతమొందినది. ఇందలి ముఖ్యరసము విషాదము.

రాజదంపతుల సౌజన్యమపారము, అద్వితీయము. కథాకల్పన దట్టముగానున్నది. కథాపూరణకై తేబడిన అసందర్భములు లేవు. నిష్కారణముగా కథసాదుగింపబడలేదు.

నవలాఘటనలయందు మనకు గల్గు ఉత్కంఠయు, ఆకర్షణము, అధికము. గ్రంథకర్త సంఘమును, జీవనమును, దేశమును లోతుగను, సూక్ష్మముగను పరిశీలించెను. వీరి భావన సాధారణముగ లోకాతీతముగ నుండక జ్ఞానయుతమై ప్రపంచకజ్ఞానముతో నిండి వెలయుచుండును. కాని, నవలలో నొకటి రెండు స్థలములలో వీరి ప్రపంచకజ్ఞానము కొంచెము సడలినది. ప్రసాదరాయడు తన భార్యయొక్క సహగమనమును కోరినాడు. ఆమె యొప్పుకొనినది, గ్రంథకర్త సతిని జంపించినారు. విద్రోహిని ఉప్పుపాతర వేయించినారు. ఈపట్టున గ్రంథకర్తయొక్క ధర్మశాస్త్ర జ్ఞానమును ప్రకటించినారు. సతిదురాచారము కాదనికాబోలు వీరి తాత్పర్యము! విగ్రహారాధనను గురించి వ్రాసిన "తాతలనాటి యాచారములను మాన్పించుట భారతదేశములో కష్టసాధ్యము. భారతభూమి దౌర్భాగ్యమునవలన భారతీయుల సూక్ష్మబుద్ధి యిపుడు "ఇంతయు మంచిది గాకున్న బూర్వు లేల యాచరింతురు" రనుమహోన్నత సిద్ధాంతము జేయునంతటి పరిపక్వ స్థితిబొందినది" అను వాక్యములు వీరికే చెల్లుచున్నవి, భారతదేశము నిజముగా అభివృద్ధికావలెనన్నచో క్షుద్రధర్మములు, క్షుద్రాచారములు నశించి జ్ఞానమును, ప్రపంచకజ్ఞానమును అభివృద్ధి చెందవలెను. ఇట్లు తెగించికొన్నగాని దేశము ప్రజలు అభివృద్ధిని గాంచరు.

శిక్షలతిక్రూరముగను దారుణముగను ఉండవలెననికాబోలు గ్రంథకర్త భుజంగరాయనిని ఉప్పుపాతర వేయించినారు. కథాకాలమునం బట్టి దారుణశిక్షలున్న మాట నిజమే. వాని కట్టిశిక్ష విధించుటయు సహజమే. కాని గ్రంథకర్త అట్టి దండనను ఖండించుట విమర్శింపకుండుట చూడ తానుగూడ దాని నంగీకరించినట్లుగనే భావింపవలసియున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రచయితయొక్క మానవస్వభావచిత్రణయు, ప్రకృతి పరిశీలనయు, అతిసూక్ష్మ మని చెప్పియుంటిని. ఏకవింశ (ఇరువదొకట౯) ప్రకరణమందలి 'కొమ్మదాసరాట' చదివినచో నీవిషయము స్పష్ట మగును.

ఈకథ తెలుగునాడులో జరిగినదన్న మాటయే గాని ఇందలి ఉత్తమ స్త్రీపురుష నామము లన్నియు వంగనామములే! వంగనవలా పఠన ఫలితము కావచ్చును.

కథలో నొకటి రెండు చోట్ల పాటల అవసరము గలదు. అందు పాటలభావము పద్యములలో బెట్టబడినది. గ్రంథకర్త పాటలగానను తలపెట్టనపుడు వాటి భావమును స్పష్టముగా సరళములగు పద్యములలో జెప్పుట యుత్తమము. కఠినసమాసభూయిష్ఠము లగు పద్యముల ప్రయోజనమేమి?

గ్రంథశైలి: గ్రాంథికము, సులభముగా తెలుగు మాటలలో తేలిపోవుచోట సంస్కృతపదములు ప్రయోగింపబడినవి. అన్ని జాతులవారి, తరగతులవారి సంభాషణలు గ్రాంథికములోనే జరుపబడినవి. వాక్యము లక్కడక్కడ తరుచు శబ్దాలంకారయుతములై అసహజముగ నున్నవి. శైలియంతయు పూర్వపుఫక్కి.

సాధారణముగా గ్రంథకర్త లొక్క నాటకములకే పాత్రలపట్టిక చేర్చుచున్నారు. నవలలకు గూడ నట్టి పట్టిక అవసరమే. అట్లు చేయకున్న పాత్రలసంబంధముల పట్టిక చదువరులు తయారుచేసికొనవలసి వచ్చును. గ్రంథరూపమం దొకలోపమగు. రహస్యమును, గూఢమును నవలా కళావిషయములే కాని వాటికి భంగమురాకుండ సాధ్యమైనంత వరకే పాత్రలపట్టిక చేర్చవచ్చును. ద్వితీయ ముద్రణయం దీగ్రంథమునకు పాత్రల పట్టిక చేర్పబడునుగాక!

గ్రంథము వలయువారు పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కలాభివర్ధనీ పరిషత్తు, రాజమండ్రి అని వ్రాయవలెను.

చే. కా.

---

## ఆంగ్లదేశచరిత్రసంగ్రహము.

గ్రంథకర్త. పుంగనూరు బసవరాజా హైస్కూలునందలి సహాయచారిత్రకోపాధ్యాయులగు భాస్కర సుబ్బయ్యగారు బి. యె; యల్. టి. మద్రాసు వేపేరి యందలి వి. రమణాఅండుకో వారిచే ప్రచురితము. ఈ గ్రంథము రెండుభాగములుగ రచియింపబడియున్నది. మొదటిభాగమున క్రీ. పూ. 55 మొదలు క్రీ. శ. 1485 వఱకు గల చరిత్రయు; రెండవభాగమున ట్యూడరు పేరి యడు మొదలు చివరవఱకు (1603) గల చరిత్రయు విపరింపబడినది. ఈభాగములు విద్యాశాఖాధికారులు నూతనముగ ప్రచురించిన ప్రణాళిక ననుసరించి నాలుగవ ఐదవఫారము విద్యార్థుల ఉపయోగార్థము వ్రాయబడినవి. దేశభాషల మూలమున విద్యగఱుపుటకు తగిన పాఠ్యగ్రంథములు లేవని చెప్పుట పరిపాటియైయున్నది. ఇట్టిగ్రంథముల ప్రచురణము అట్టి పరిపాటికి వీడ్కోలు యిచ్చి దేశభాషల మూలమున విద్య గఱుపవలయునను ఉద్యమమునకు పోషణమిచ్చును. కావున ఇట్టి గ్రంథరచనమునకు కడంగిన గ్రంథకర్తగారిని శ్లాఘింపవలసియున్నది. చరిత్ర తేదీలవారీగా వ్రాసి జరిగిన సంగతుల నన్నియు గుదిగ్రుచ్చి చరిత్రను విన సొంపుకానిదానివలె చేయక వీ రీ గ్రంథమున విషయవిభాగమున చరిత్రకథా నిర్వహణమునంతను ఒక్కచోటనే చేర్చుచు ఒప్పిదమైన పద్ధతి నవలంబించిరి. ఈ విషయమున వీరు (The Ground work of British History) ని ఆదర్శము నుంచికొనియుండుట మెచ్చదగినది. గ్రంథమునం దుపయోగింపబడిన భాష నిర్దుష్టము కాదనవలయును. సహజముగ ఉత్తేజకరముగ నుండవలసిన కొన్నిపట్టులు బొత్తిగ నిస్సారములుగ నున్నవి. నిదర్శనముగ రెండవ భాగములోని 'ఆంగ్లస్పానియా రాజ్యములపోరు' అను ప్రకరణము చూడవలయును. దేశభాషల మూలమున విద్యగఱుపు ఉద్యమము పోషించుటకై బయలుదేరిన ఈ గ్రంథమున దేశపటమున ప్రదేశముల నామములు ఇంగ్లీషుననే ముద్రింపబడియుండుట శోచనీయము. రెండవ కూర్పునకైన ఈలోపము ప్రచురణకర్తలు తప్పక సవరించవలెను. ప్రథమభాగము క్రౌనుసైజు 116 పుటలు, వెల 10 అణాలు. రెండవభాగము క్రౌనుసైజు, 90 పుటలు, వెల 8 అణాలు. వలయువారు ప్రచురణకర్తల పేర వ్రాయవలెను. ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## గోలీస్తూప బౌద్ధ శిలా చిత్రములు

గ్రంథకర్త:—టి. యన్. రామచంద్రన్ గారు, యమ్ యే. ఈ గ్రంథము మద్రాసు గౌనర్మెంటు చిత్ర వస్తు ప్రదర్శనశాల ప్రచురణము. చెన్నపురి గౌనర్మెంటు ముద్రణాలయమున ముద్రింపబడినది.

వెల రు. ౨-౧౨-౦ లు.

రమారమి అర్ధశతాబ్దము క్రితము చెన్నరాజధానిలోని ప్రాచీనవస్తు శిథిలావశేషములను పరిశీలించుతలంపుతో స్యూయెల్ దొర పర్యటనము సలుపుచు గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాకువచ్చి, ఆ తాలూకాలోని మల్లవరము గ్రామము దగ్గర నొకదిబ్బ యుండుటను గాంచెను. పరిశీలింపగా తత్పరిసరమున అమరావతి బౌద్ధస్తూపము నందలి వానింబోలిన పాలరాతి శిలాఫలకములు రెండు కానవచ్చెను. అందొకటి ఏడుతలలనాగము. మఱియొకటి కడు దీర్ఘమైన శిలాచిత్రఫలకము. ఇది ఏడరలుగ విభాగింపబడియున్నది. ఒక్కొక్క అరయందు బౌద్ధమతమునకు సంబంధించినగాథలు చిత్రితములై యున్నవి. వీటిలోని చాలచిత్రములు బుద్ధుని జీవితమునకు సంబంధించినవే. వీటిని గమనించి స్యూయెల్ దొర ఆదిబ్బను త్రవ్వినయెడల ఇంకను అందుండి యమూల్యములైన శిల్ప చిత్రములు బయలుపడవచ్చుననియు, అందువలన ఆదిబ్బ జాగరూకతతో కాపాడదగినదనియు వ్రాసియున్నాడు. అటుతరువాత మఱికొంతకాలమున కా ప్రాంతమునసే బుద్ధపాదములు, స్తూపాకృతి చెక్కిన రెండు శిలాఫలకములు బయలుపడెను. కాని గ్రామస్థులకీశిల్పచిత్రములు విలువకాని, యర్థముకాని బోధపడక వారు పరిమాణమున కడు పెద్దదిగనున్న నాగశిలను దెచ్చి, దాని కొకగదికట్టి దాని నందుంచి నాగుమయ్య అనుపేర బూజింప మొదలిడిరి. బుద్ధపాదములు చెక్కిన శిలాఫలకమును ద్వారము కుడిప్రక్కను, స్తూపాకృతిగల శిలాఫలకమును తలక్రిందుగ ద్రిప్పి ద్వారము ఎడమ ప్రక్కను స్థాపితము చేసిరి. దీర్ఘశిలాఫలకమును గోడలో వేసి కట్టివేసిరి. ఇపుడచ్చట ఆబుద్ధపాదములను అమ్మవారిపాదములందురు.

దక్షిణహిందూదేశ చారిత్రమున నెక్కుడు కృషి చేసి యమూల్యచారిత్రకవిషయములను గని పెట్టిన పరాసుదొర డుబ్రెయల్ ౧౯౨౬ వ సంవత్సరమున ఆదిబ్బను త్రవ్వించి అందలి కళానిధిని వెలువఱిచినంతవఱకు గౌనర్మెంటు పురాతత్త్వశాఖవారుకాని మరెవ్వరుకాని ఆదిబ్బ 'పరిమాణా'కు పోలేదు. డుబ్రెయల్ దొర త్రవ్వించి యందలి శిలాఫలకములను బయలు పెట్టగానే గౌనర్మెంటువారు వాటినిగుఱించి శ్రద్ధతీసికొనిరి. వాటి నన్నిటిని నేడు మదరాసు చిత్ర వస్తు ప్రదర్శనశాలలో చూడవచ్చును. అవి బహుకాలము భూగర్భమున అజ్ఞాతవాసము చేసి నేటికి మదరాసుచేరినవి. ఈ శిలాఫలకముల మీద చిత్రములనుగుఱించి వ్రాయబడినదే యీగ్రంథము. ఈశిలాఫలకములు దొరకిన స్థలమునకు మల్లవరము మూడు మైళ్లదూరమున నున్నది. గోలీ ఒకటి నరమైళ్ల దూరమున నున్నది. అందువలన సామీప్యమునుబట్టి వీటిని గోలీ స్తూప బౌద్ధశిలాచిత్రము లనియే పేర్కొనియున్నారు.

స్తూపముయొక్క ప్రాక్పశ్చిమోత్తర దిశలనుండు దీర్ఘములైన శిలాఫలకములు మూడును, ఆ ఇతరఫలకములును గోలీనుండి కొనిరాబడినవి. గోలీలోని నాగుమయ్య గుడిగోడలో అమర్చబడిన దీర్ఘశిలాఫలకము స్తూపపు దక్షిణదిశది కావచ్చునని యూహింపదగును. అమరావతి సాంచీలలోవలెనే గోలీలోని శిలాచిత్రములు కూడ బుద్ధుని ప్రాక్తన జన్మకథలను—వీటినే జాతక కథలందురు—, బుద్ధుని జీవితకథలను దెలుపునవే. మారుడు సిద్ధార్థుని తపస్సుభంగముచేయ బ్రయత్నించుట, సుజాత బోధసత్త్వుని కాహారప్రదానము చేయుట, మృగదావమున బుద్ధుడు ధర్మచక్రమును ప్రవర్తింపజేయుట, బుద్ధుడు యశోధరను జూడబోవుట, నలగిరియను ఏనుగును బుద్ధుడు స్వాధీనపఱుచుకొనుట—ఈ బుద్ధజీవితగాథలు గోలీశిలాఫలకముమీద చిత్రితము లైయున్నవి. ప్రాక్తన జన్మకథలలో చిత్రితములైనవి 'ఛద్దంత' (షడ్దంత), 'వెస్సంతర' (వైశ్యంతర), 'మాతృపోసక' (మాతృపోషక), శశజాతకములు. ఆయాచిత్రములు ఏయే గాథలకు సంబంధించినవో విమర్శించి గుర్తించుటలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రంథకర్తగారయిన శ్రీరామచంద్రన్‌గారు గొప్ప సామర్థ్యమును, గొప్ప పరిశీలనాశక్తిని జూపియున్నారు. బహు బౌద్ధగ్రంథావలోడనమునగాని యీ చిత్రముల నాయాగాథలకు సంబంధించినవిగ చక్కగ నిరూపించి గుర్తింప సాధ్యముకాదు. ఏతచ్చిత్రవివరణమున వారు చూపిన కుశలత వారివిమర్శనశక్తికి నిదర్శనముగ నున్నది.

జాతకకథలన్నిటిలో ఛద్దంత, వెస్సంతరజాతకములు శ్రేష్ఠమైనవి: తిలమానికములవంటివని చాలమంది బౌద్ధవాఙ్మయవేత్తల యభిప్రాయము. సంగ్రహముగ ఛద్దంతజాతకకథయిది. పూర్వజన్మము లొకదానిలో బోధిసత్త్వుడు యూథనాయకుడైన మహాగజముగ ఆఱు దంతములతో పుట్టి ఛద్దంతుడను పేరబరగెను. అతని కిరువురు భార్యలు. అందొకతెకు, రెండవయామెను తన మీదకన్న నెక్కువ ప్రేముడితో ఆదరించుచుండె నన్న కారణమున భర్తపై అసూయా క్రోధములు కలుగును. ఆమె కొంతకాలమునకు విధివశయై మాఱల జన్మమెత్తి కాశీరాజుకు ప్రేమపాత్రమైన రాణియై వఱలును. అప్పటికిని పూర్వజన్మవాసన గలిగి ఛద్దంతునిపై పగ దీర్చుకొనవలెనను తలంపుతో వ్యాధిగ్రస్తురాలైన ట్లభినయించి ఆఱు దంతములు కలిగిన మహాగజముయొక్క దంతములను దెచ్చిననేకాని తన వ్యాధి కుదురదని భర్తతో చెప్పును. పిదప కాశీరాజునసుమతిప్రకారము శోణుత్తరు డను నొకవ్యాధుడు రాణివలన వట్టి ఏను గుండుతావు తెలిసికొని తుదకు ఛద్దంతునికడకు వచ్చి, వానినిపట్టుటకై యొకగోయితీసి ప్రాంతమున వేచియుండును. ఏనుగుల తండముతో బయలుదేరి అరణ్యమున పర్యటనముచేయుచున్న ఛద్దంతుడు యూథమును విడిచి ముందుపోవుచు శోణుత్తరుడు త్రవ్విన గోతిలోకూలును. అంతట ఆవ్యాధుడువచ్చి ఛద్దంతుని వధింపబోవ అత డావ్యాధుడువచ్చినకారణమును గ్రహించి తన దంతములను గోసి యొసంగుటలో దానే యాతనికి దోడుపడును. దంతిభగ్నమైన పిదప ఛద్దంతుడు మరణించును. శోణుత్తరుడు దంతములను గొనిపోయి రాణికి చూపి ఛద్దంత మరణవార్త వినిపించును. ఆవృత్తాంతమును విన్న పిదప రాణి అత్యంత దుఃఖాకులిత స్వాంతయై చేద్పడి తుదకు కాలవశత నొందును. ఇక వెస్సంతర జాతకమును బోధిసత్త్వుని దానవీరతను వర్ణించును. వెస్సంతరుడు చేరికెముక లేని మహాదాత. ఎచ్చటికివెళ్లిన నచ్చట వర్షమును గురిపింప శక్తిగల శ్వేతగజమును నాతడొకప్పుడు కళింగబ్రాహ్మణులకు దానముచేసి తనతండ్రి రాజ్యమునందలి ప్రజల యాగ్రహమునకు పాత్రుడగును. ప్రజలందఱును పోయి రాజకుమారుని యనుచిత కార్యమును గుఱించి రాజుతో మొఱవెట్టుకొని తుదకు రాజకుమారుని రాజ్యమునుండి అడవులకు వెడల నడిపింతురు. రాజకుమారుడు తనకుటుంబముతో నడవులకు బోవును. రాజ్యబహిష్కృతుడును, అరణ్యగామియు నగు ఆ రాజకుమారుని కడకు నిరుపేదలైన బ్రాహ్మణు లర్థింపరాగా మొదట తా నెక్కివెళ్లురథమును, పిదప గుఱ్ఱములను, అటుపైనక ఇరువురు పిల్లలను తుట్టతుదకు అతని వితరణౌదార్యములను బరీక్షింపవచ్చిన సురాధిపతిశక్రునిచే నర్థితుడై తన భార్యనుగూడ దానముగ నిచ్చివేయును. శక్రుడు నిజరూపమును దాల్చి వెస్సంతరుని దానవీరత ప్రశంసించి, యాతనిభార్య నాతనికిచ్చివేసి, పెక్కు వరములనుగూడ నిచ్చును. పిల్లలతోగూడ వారిని దానముబడసిన బ్రాహ్మణుడు వెస్సంతరుని తండ్రి రాజ్యమునుండి పోవుచుండ ఆ రాజువారిని బ్రాహ్మణునుండి విడిపించి నుద కాపిల్లల మూలమున వెస్సంతరుని గని గొని, ఆతనిని భార్యాసహితముగ రాజ్యమునకు గొనివచ్చును. చిత్రితములైన జాతక కథలన్నిటిలో నీవెస్సంతర జాతకముననే చిత్రము లెక్కువ గలవు. గోలీశిలాఫలకములలో ఈ జాతక కథ ఎనిమిదరలలో చిత్రితమైనది. ఛద్దంతజాతకమున రెండు దృశ్యములు మాత్రమే చిత్రింపబడినవి. మాతృపోషక, శిశజాతకము లొక్కొక్క దృశ్యముతోనే ముగిసినవి.

శిలాఫలకముమీద ఒక కథను, మఱియొక కథకు సంబంధించిన చిత్రములను వేఱుపఱిచి చూపుటకై నడుమ నడుమ కాముక, యక్షచిత్రములు చిత్రితములైనవి. బొమ్మలన్నియు చూచుట కతిమనోహరముగ నున్నవి. వీటిలో చాలవఱకు చెడిపోకుండ సుస్థితిలోనే భద్రముగ నున్నవి. అమరావతీస్తూపచిత్రములను, వీటిని పోల్చి చూచినచో ఈ రెండు చోట్లను బని చేసిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శిల్పులు ఒకే పంథకు చెందినవారే యని సులభముగ గుర్తింపనచ్చును. ఈప్రతిమల తీర్పుతీరువలు నిరుపమాన ములై నయనానందకరముగ నున్నవి. ఇందు చెక్కబడిన స్త్రీపురుష ప్రతిమల దుస్తులను, ఆభరణములను, తలకట్టులను జూచినచో ఈప్రతిమలు చెక్కబడిన నాటి సంఘ పరిస్థితులు-వేషభూషణాదుల విషయమున—చక్కగ విశదము కాగలవు. ఏప్రతిమను చూచినను జీవకళ యుట్టి పడుచుండును. ఈచిత్రములలోని కడుసూక్ష్మ విషయములను గూడ రామచంద్రన్ గారు గమనించి చక్కగ వివరించియున్నారు. శిల్పులుగూడ కేవలము గ్రంథస్థమును పరంపరాగతమునైన నట్టి కథానకమునకు తమ బుద్ధినిగూడ గొంత యుపయోగించి కథలకు జీవము పోసి యున్నారు. కుటీరప్రాంగణమున నిలిచి వెస్సంతరుడు తనపిల్లలను ఛత్రిధారియైన బ్రాహ్మణునికి దానమిచ్చు చుండును. వెస్సంతరుడు నివసించునది అరణ్యమధ్యమున. అరణ్యమని తెలియజెప్పుటకు చెట్లు చేమలు, జింకలు చిత్రితములయినవి. అడవుల కోతు లుండుట కూడ అరుదు కాదు. శిల్పి కథలో లేని కోతులనుదీసికొనివచ్చి చిత్రకథా చమత్కృతికి రసపోషణ మొనరించియున్నాడు. రాజ్యమును, రథమును, గుఱ్ఱములను బోగొట్టుకొనిన వనవాసియైన నిరుపేద వెస్సంతరునినుండి యతని పిల్లలను గూడ దానముగ గైకొనుట అనుచితమని సూచింపగా బోలు ఒకకోతి బ్రాహ్మణ యాచకుని వెనుకజేరి యాతని బట్టచెరగుపట్టుకొని వెనుకకులాగుచున్నది మరియొక కోతి బ్రాహ్మణుని గొడుగును పట్టుకొని లాగుచున్నది. వేరొకకోతి వెస్సంతరుని కుటీరముపైనిలిచి, 'ఓ బ్రాహ్మణుడా! ఇంకను నీయాచనను విడువక, మా వెస్సంతరుని పిల్లలను గొనిపోవుచో మాడు ఏమిచేసెదనో,' యనునట్లు బ్రాహ్మణుని వైపుతిరిగి హుంకరించి యాతనిపై దుముకబోవుచున్నది. నోరులేని జీవజంతువులును ప్రకృతియుగూడ బాధితులైన సాధువులకు సానుభూతి చూపుచుండును కాబోలు! ఈ విధమున చిత్రవిశేషములనెన్నుచో ఎన్నిపుటలైన బట్టును. చూచి, యానందింపదగినవే కాని వ్రాయవలసినవి కావు. బౌద్ధయుగమున పరమోచ్చనందిన యాంధ్రుల శిల్పకళ కివి నిదానములు.

ఈ చిత్రములు చిత్రింపబడినకాలము మనకు స్పష్టముగ దెలియదు. కాని రామచంద్రన్ గారు అమరావతీస్తూప చిత్రములను, వీటిని కడుసూక్ష్మముగ పరిశీలించి పరిశోధించి పోల్చిచూచి యీ గోలీస్తూప చిత్రములు క్రీ. శ. మూడవశతాబ్దినాటివికా దగునని తేల్చియున్నారు. శాసనముల యాధారము లేనప్పుడు చిత్ర కాలనిర్ణయమునకు ఇంతకన్న మార్గము లేదు. ఒకానొక శిలాఫలకము మీద "సికమలతి [(క్రి)య]" అనియున్న శాసనమును కూడ కాలనిర్ణయమున కాధారముగ గొని తుదకు దాని ననుసరించి కూడ గోలీచిత్రములు క్రీ. శ. మూడవశతాబ్ది నాటివే యని నిర్ణయించియున్నారు. కాలనిర్ణయము విషయమున రామచంద్రన్ గారు చేసినకృషి స్తవనీయము.

బౌద్ధాంధ్రుల శిల్పకళ కిదివఱకు అమరావతియే తార్కాణముగ నున్నది. కాని అమరావతీస్తూపచిత్రములలో ఉత్తమములైనవి ఖండాంతరముల కేగుటచేత అమరావతీశిల్పకళయొక్క ఉత్కృష్టతయును, శ్రేష్ఠత్వమును తెలిసికొనుటకు మనకిచ్చట తగిన చిత్రనిదర్శనములు లేవు. కృష్ణానాటిలో మిన్నగ నెన్నదగినవి కలకత్తా వెళ్లినవి ఇప్పుడు బయలుపడుచున్నట్టియు, ముందు బయలుపడబోవునట్టియు ఇట్టి శిల్పకళానిధులను ఇంతటినుంచియైన ఆంధ్రులు భద్రపఱచి కాపాడుకొనినచో కాని ముందు పేరుప పొగలరు. ప్రాచీనాంధ్రుల యశస్సంపద కాధారభూతములైన వేవియన్న ప్రశ్నమునకు సమాధానమిచ్చునవి యీయనర్ఘ చిత్రరత్నములే. ఈ సంపద నశించినచో ఆంధ్రులకు కళాదారిద్ర్యముకాక వేఱేమికలదు? బౌద్ధయుగమునాటి ఆంధ్రదేశచారిత్రము మనస్ఫూర్తిమైనది. ఆంధ్రులప్పుడు ద్వీపాంతరముల నలసలుస్థాపించిరి. దేశాంతరములు విజ్ఞానజ్యోతిని వెలిగించిరి. సముద్రాంతరముల దాటిఖండాంతరములతో వర్తకవ్యాపారమును సాగించిరి. అహింసామూలకమైన ధర్మమతసందేశమును నలుదెసలకు బ్రాకించిరి: సిద్ధహస్తులై కళావల్లరిని బ్రోదసేసి పువ్వుపృష్టిని గురిపించిరి. బౌద్ధాంధ్రము ఎవ్వనిశరీరమును సంతోషపులకాంకితము కావింపదు?

అమూల్యములైన యీ గోలీచిత్రములను వెలువరిచిన దుబ్రెయిల్, రామచంద్రన్ గార్లు ఆంధ్రుల ప్రశం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సకు పాత్రులు. బయలుపడిన యీ గోలీచిత్రములు ఆంధ్రులహృదయములలో ప్రాచీన బౌద్ధాంధ్ర శిల్పచిత్రకళాభిరుచిని రేకెత్తించి ఏతద్విషయమై వారిని కృషి చేయ ప్రేరేపింపగలవని మా విశ్వాసము.

మ. సోమశేఖరశర్మ.

---

## వావిళ్ల వాచకములు

(ఒకటవ తరగతిమొదలు నాలుగవ తరగతివఱకు)

ఎలిమెంటరి పాఠశాలల బాలురకొరకు ఆంధ్ర వాఙ్మయమున ఎన్నియో వాచకములు పుట్టియున్నవి. బాలుర మనస్తత్త్వమునకు సరిపోయి వారిబుద్ధిని వికసింపజేయుచు నీతిబోధను, భాషాభివృద్ధిని గలిగించునవి వానిలో నాలవవంతు సైతము కానరాదు పేర్కొనదగిన కొన్ని వాచకములలో వావిళ్ల వాచకము లగ్రగణ్యములు. ఈ వాచకములను రచియించిన శ్రీ జయంతి గంగన్న పంతులుగా రాంధ్రలోకమునకు క్రొత్తవారు కారు. వీరు చిరకాల ముపాధ్యాయులుగనుండి బాలుర మనస్తత్త్వమును చక్కగ బరిశీలించి గుర్తింపగలిగిరనుటకు వీరి యీ యుత్తమ వాచకములే నిదర్శనము. ఈ వాచకములలో మొదటిదానిని సంపూర్ణముగ నభ్యసించిన బాలబాలికలు వర్ణక్రమ గుణితదోషములులేకుండ పదములను వ్రాయగలుగుదురు. మఱియు సచిత్రములయి పెద్దయచ్చుననున్న యిందలి పాఠములయొక్క యనుక్రమమును చిన్నపిల్లలు వర్ణసమామ్నాయమును, గుణితాదులను సులువుగ నభ్యసింప ననువుగ నున్నది.

సచిత్రములగు రెండు మూడు నాలుగు వాచకములయందు జాతీయములు, చారిత్రకములు, పౌరాణికములు, శాస్త్రసంబంధులు నగు చిన్నకథలు, వేమన సుమతిశతకాదులలోని సరసములగు నీతిపద్యములు, ప్రాచీనములు కొన్ని, స్వీయకృతములు కొన్ని అగుగీతములు గలవు. ఇవి అన్నియు పిల్లలబుద్ధిని పెంపొందించుచు వివిధసారస్వత శాఖలయందును ప్రవేశమునుగలిగించి వారి మనములయం దుత్సాహబీజములను నాటగలిగినవి. వీని శైలి క్లిష్టముకాక విషయ మా యా తరగతిపిల్లల మనస్సుల కెక్కునట్లు సుగమముగ నున్నది. సంధులు, అర్ధానుస్వారములు, శకటరేఫములు ఆయాతరగతులకు తగునట్లు నిర్దుష్టముగ ప్రయోగింపబడినవి. ఇటు పెక్కు తెఱగుల సుగుణభూయిష్ఠములయిన యీ వాచకములు తెలుగుపిల్లలందఱు చదువదగినవి. ఆంధ్రదేశమున అన్ని ఎలిమెంటరి పాఠశాలల అధికారులును ఈవాచకములను తమపాఠశాలలయందలి అందఱు పిల్లలచేత చదివించి వారికి మేలును సమకూర్చు టావశ్యకము. ఇట్టి మంచి పుస్తకములు లభించునపుడు వానిని చదివించుట ఉపాధ్యాయుల ధర్మము. ఈ చక్కనివాచకములను వ్రాసి తెలుగుపిల్లలకు మహోపకారమును కావించిన శ్రీ గంగన్న పంతులుగారు ఎంతయు ప్రశంసార్హులు.

X

---

# గ్రంథస్వీకారము

### పల్లెటూరిపాఠశాల (Village School)

తెలుఁగుఫార్సు

గ్రంథకర్త: శ్రీ. హరివేంకటేశ్వర్లుగారు. వెల రు. 0-10-0. వలయువారు మదనపల్లెకు గ్రంథకర్తగారి పేరిట వ్రాయవలయును.

---

### శంకరమహామనన (కన్నడ)

గ్రంథకర్త: వై. సుబ్బరావుగారు వెల, రు 0-2-6. అధ్యాత్మప్రకాశ కార్యాలయము, రెండవవీథి, చామరాజపేట, బెంగళూరుసిటీ.

---

### రాజరాజేశ్వరీ శతకము.

గ్రంథకర్త : గూడ కృష్ణకవిగారు, పెరవలి (తెనాలితాలూకా) వెల తెలియదు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీమంతిని

శిష్ట్లా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రికృతము. వెల రు. 0-5-0. ప్రకాశకులు: సత్యనారాయణ అండుకో, గుంటూరు.

---

వందేమాతరస్తోత్రమ్

మహావిద్వాన్ శ్రీమత్కోమాండూర్ రామానుజాచార్యులవారిచే విరచితము. వెల రు. 0-1-0. కోమాండూర్ గోవిందరాజాచార్యులు, రాజమహేంద్రవరమునకు వ్రాసిన బడయగలరు.

---

గంగావతరణము (నాటకము)

గ్రంథకర్త: సోమరాజు రామానుజరావుగారు వెల రు. 1-0 0. ప్రకాశకులు: కురుకూరి సుబ్బారావు గారు, సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ, (కృష్ణాజిల్లా)

---

ఆంధ్రమహిళామణుల కొకమనవి

కూచి నరసింహకృతము వెల రు. 0-1-6. ప్రకాశకులు: ముద్దా సోమప్పశాస్త్రి అండుసన్స్ 'వ్యాసకుటీరము' మేలుపాక (విశాఖపట్నముజిల్లా)

---

Some Problems of Vijayanagara History.

శ్రీ డా. చిలుకూరి నారాయణరావు, యమ్. ఏ., యల్., టి. పి. హెచ్. డి. గారిచే నాంగ్లమున విరచితము. వెలతెలియదు. వలయువారు దత్తమండల కలాశాల, అనంతపురమునకు గ్రంథకర్తగారిపేరిట వ్రాయ వలయును.

---

కలగీవాలేకే ఆదర్శ (హిందీ)

వెలలేదు, ప్రకాశకులు: ప్రచారసహాయక్ కమిటీ, శహీద్ సిఖ్ మిషనరీకాలేజి, అమృతసరము.

---

భక్తిరస శతక సంపుటము. (3)

వెల రు. 2-0-0. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్సు, ఎస్ప్లనేడు, మదరాసు.

---

నీతిశతక సంపుటము (1)

వెల తెలియదు. ప్రకాశకులు. వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్సు, ఎస్ప్లనేడు, మదరాసు.

---

The Children of the Kaveri.

(కథలు - ఇంగ్లీషు)

క్రౌను ౧౬ పుటలసైజున ౧౦౩ పుటలు.

వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త. శంకరరామగారు ప్రకాశకులు: వి. యల్ శాస్త్రి అండు కో, తిరువల్లిక్కేణీ, చెన్నపురి.

---

7. 5- 19 ౬౩౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతదేశము-నేడు

భారతదేశమందలి స్థితిగతులు క్రమముగ విపరీతస్థితిని జెందుచున్నవి. అవతారమూర్తియగు మహాత్ముని నాయకత్వమున స్వాతంత్ర్యమునుగడింప అహింసాబద్ధులయి భారతీయులు నడుముగట్టినారు; విదేశ ప్రభుత్వమునుండి విడివడి స్వతంత్రులుగ నుండగోరుచున్నారు. బ్రిటీషువారు ఎటులయినను భారతదేశమునకు స్వాతంత్ర్యము నొసంగ నిచ్ఛగింపకున్నారు. స్వాతంత్ర్యమునకయి భారతీయులుచేయుచున్న అహింసాత్మక ప్రశాంత ప్రయత్నముల నానా ముఖముల నరికట్టుచున్నారు. స్వాతంత్ర్య సంపాదనకై కావించు ప్రసంగములు కూడదన్నారు. పత్రికలు పడిపోవు శాసనములను ప్రకటించినారు. అహింసాపరాయణులగు భారతీయులకు పెక్కుతెరగుల నొత్తిడి కలిగించుచున్నారు. ఎంతయొత్తిడి కలిగినను భారతీయులు అహింసాబద్ధులై తమప్రయత్నమును సాగించుచునే యున్నారు. స్త్రీలును పురుషులతోపాటు నడుముగట్టుచున్నారు. వేలకొలది భారతీయనాయకులును శిక్షితులయి కారాగారములకు పోయినారు. ఇంకను పోవనున్నారు. తత్ఫలముగ ఆసేతుశీతాచలము భారతదేశమునందంతటను మహాసంచలనము కలిగినది. భారతీయుల హృదయభూమియందు చిరకాలముననే మొలకెత్తిన స్వాతంత్ర్యాపేక్ష క్రమముగ నభివృద్ధినిగాంచి నేటికి పుష్పించినది. ఇట్లే ఫలవంతమును కాగలదు. ఇకను భారతీయులు పరాధీనతను సహింపజాలరనుటను ఈమహాసంచలనమువలన బ్రిటీషువారు తెలుసుకొనవచ్చును. ఇప్పటికైన పాలకులు పాలితులు, స్వార్థపరమును, సంకుచితమునునైన తమభావమును ధర్మపరమును, విశాలమును గావించుకొని ఉభయతారకమును, ఉభయక్షేమంకరమును నగు మార్గము నవలంబించదగుదురు. ముప్పదిమూడుకోట్లు ప్రజలు ఏకగ్రీవముగ నాకాంక్షించుచున్న స్వాతంత్ర్యము నచిరకాలమున బ్రిటిషువారు భారతీయుల కొసగదగుదురు.



శ్రీమతి గుమ్మిడిదల

## దుర్గాబాయిగారు

ఈ వీరనారీమణి ఆంధ్రదేశమున అవతరించిన అహింసాధిదేవత; ధైర్యవతి. దేశమాతకు స్వాతంత్ర్యమును గడింప నడుముకట్టిన నాయకురాలు. ఈమె పుట్టువుచే నాంధ్రదేశము ధన్యమయినది. ఈ యువతీమణి నామాక్షరములు సువర్ణముతో లిఖించి పూజింపదగినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్వరాజ్య సత్యాగ్రహము-అరెస్టులు-శిక్షలు

1. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

2. శ్రీ భమిడిపాటి చినయజ్ఞ నారాయణశర్మగారు

3. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు

4. శ్రీ దిగుమర్తి రామస్వామిగారు

5. శ్రీ కొల్లూరు సూర్యనారాయణగుప్తగారు

వీరు ఏప్రిలు 18 వ తేదీ సాయంకాలమున విశాఖపట్టణమున అరెస్టు చేయబడిరి 24 వ తేదిని వీరికి 5 గురికిని ఆరేసి నెలలు కఠిన శిక్ష వేయబడెను.

6 మహర్షి బులుసు సాంబమూర్తిగారు,

7. శ్రీ వెన్నేటి సత్యనారాయణగారు

8. డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారు

9. శ్రీ కళా వేంకటరావుగారు

వీరిని నలుగురిని 19 వ తేదీ ఉదయము కాకినాడలో అరెస్టు చేసిరి. ఆనాడే విచారణగూడ జరిగినది. ఒక్కొకరికి ఒక సంవత్సరము విడికైదు వేయబడెను.

10. శ్రీ స్వామి నారాయణానందజీగారు

వీరు పూర్వాశ్రమమున పింగళి లక్ష్మీనారాయణగారు. వీరిని బెజవాడలో 19 వ తేదీ రాత్రి 3 గంటలకు అరెస్టుచేసిరి.

11. శ్రీ చెరుకువాడ వెంకట నరసింహంగారు

20 వ తేదీ ఉదయమున 9 గంటలకు బందరులో అరెస్టు చేయబడిరి, 22 వ తేదీని ఒక సంవత్సరము విడికైదు వేయబడెను.

12. శ్రీ డా॥భోగరాజుపట్టాభిసీతారామయ్యగారు

13. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు

21 వ తేదీ ఉదయము 9 గంటలకు వీరినిద్దరిని బందరులో అరెస్టుచేసిరి. పట్టాభి, కాళేశ్వరరావు, స్వామిజీగార్లకు 21 వ తేదీని ఒక్కొకరికి ఒక సంవత్సరము విడికైదు వేయబడెను.

14. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు

15. శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు

16. శ్రీ డాక్టరు పి. యస్. భాష్యం శెట్టిగారు

వీరిని ముగ్గురిని 21 వ తేదీ మధ్యాహ్నము ఒంటిగంటకు చెన్నపురిలో అరెస్టుచేసి వెంటనే విచారణచేసి ఒక్కొకరికి ఆరేసి నెలలు కఠినశిక్ష వేసిరి.

17. శ్రీ నేతి వేంకటాచలపతిగారు

వీరు గుంటూరు జిల్లా వాడరేవులో దళాధిపతి. వీరికి 22 వ తేదీని చీరాలలో జిల్లా మేజస్ట్రీటు 6 నెలలు విడికైదు వేసెను.

18. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారు

23 తేదిని ౧ సంవత్సరము విడికైదు వేయబడెను. అరెస్టును శిక్షయును 23 తేదినే జరిగినవి.

19. సర్దారు శ్రీ దండు నారాయణరాజుగారు

20. శ్రీ ఆత్మకూరి గోవిందాచారిగారు

వీరిని ఇద్దరిని 23 వ తేదిని ఉదయమున మట్లపాలెంలో అరెస్టుచేసిరి. ఆనాడే నరసాపురములో వీరికి ఒక్కొక్కరికి ఒకసంవత్సరము విడికైదు వేయబడెను.

21. శ్రీ నడింపల్లి లక్ష్మీనరసింహరావుగారు,

(గుంటూరు-శిక్ష 24-4-30. ఒకసంవత్సరము విడికైదు.)

22. శ్రీ మండపాక రంగయ్యనాయుడుగారు

23. శ్రీ పారుపూడి సత్యనారాయణగారు

24. శ్రీ మొసలిగంటి తిరుమలరావుగారు

కాకినాడలో అరెస్టు. శిక్ష 25-4-1930. చెరియొక యేడాది కఠినశిక్ష వేయబడెను.

శ్రీయుత అన్నాప్రగడ కామేశ్వరరావుగారు

గుంటూరు; శిక్ష 23-4-30, 6 నెలలు విడికైదు.

26. శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారు

గుంటూరు-అరెస్టు 29-4-1930. శిక్ష 1-5-1930. ఒకసంవత్సరం కఠినశిక్ష.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

27. శ్రీ వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాదరావుగారు
28 శ్రీ కవుతా చలపతిరావుగారు
29. శ్రీ జనాబు గౌసుబేగు సాహెబుగారు
30. శ్రీ మంత్రవాది వేంకటరత్నంగారు

ఒంగోలు-అరెస్టు శిక్ష 27-4-1930. చెరియొక వత్సరము కఠినశిక్ష.

31. శ్రీ రాజా కోటగిరి వేంకటకృష్ణారావు బహదరుగారు-గంపలగూడెము
32. శ్రీ కాకుమాను లక్ష్మయ్య చౌదరిగారు

(బెజవాడ అరెస్టు) శిక్ష 30-4-1930. రాజాగారికి ఒక శిక్ష. చౌదరిగారికి ఒక సంవత్సరం విడి కైదు.

33. శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు

(చీరాల-అరెస్టు - 29-4-1930. శిక్ష 1-5-30 ఒక సంవత్సరం కఠినశిక్ష.

34. శ్రీ మఠం బాలసుబ్రహ్మణ్య గుప్తగారు

(బెజవాడ-అరెస్టుశిక్ష. 1-5-1930. ఒక సంవత్సరం విడి కైదు.

35. శ్రీ ధారా గోపాలశాస్త్రిగారు
36. శ్రీ సూర్రపరాజుగారు చీరాల. అరెస్టు 30
37. శ్రీ భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారు

చీరాల-అరెస్టు. 30-4-1930. రెండుఏండ్లు కఠినశిక్ష 2-5-1930.

38. (శ్రీ) శ్రీకాకుళపు పట్టాభిరాములు గుప్తగారు
39. (శ్రీ) చీరాల రంగయ్యగారు

చీరాల-అరెస్టు శిక్ష 2-5-30. శ్రీ పట్టాభిరాములు గుప్తగారికి రెండేండ్లు కఠినశిక్ష—శ్రీ రంగయ్యగారికి ఒక సంవత్సరము కఠినశిక్ష.)

40. (శ్రీ) వల్లభనేని రామబ్రహ్మం చౌదరిగారు
41. (శ్రీ) మోటూరి వెంకటాచలపతి చౌదరిగారు
42. (శ్రీ) వల్లభనేని వెంకటకృష్ణయ్య చౌదరిగారు
43. (శ్రీ) అరెకపూడి కోటయ్యగారు
44. (శ్రీ) రాళ్లబండి దుర్గా నాగేశ్వరరావుగారు
45. (శ్రీ) కొమ్ము సత్యనారాయణగారు

(గుడివాడవద్ద కొమరవోలు 1-5-30. అరెస్టు 2-5-30 చెరి ఆరు నెలల కఠినశిక్ష వేయబడెను.

---

ఏప్రిల్ 27-వ తేదిన

ప్రెస్ ఆర్డినెన్సు అమలునకు వచ్చిన పిమ్మట ఈ క్రింది దినపత్రికలు ప్రకటన మానివేయవలసి వచ్చెను.

ఢిల్లీ

1 హిందుస్థాన్ టైమ్సు — ఇంగ్లీషు పత్రిక
2 అర్జున్ — దేశభాషా పత్రిక
3 తేజ్ — ,,
4 మిలాప్ — ,,
5 రిసాయత్ — ,,

కలకత్తా

6 అడ్వాన్సు — ఇంగ్లీషుపత్రిక
7 లిబర్టీ — ,,
8 అమృతబజారు పత్రిక — ,,
9 హిందీ పంచ్ — దేశభాషా పత్రిక
10 బంగబాసి — ,,
11 స్వతంత్ర — ,,
12 ఆనందబజారు పత్రిక — ,,
13 భారతమిత్ర — ,,
14 విశ్వామిత్ర — ,,
15 హితవాది — ,,
16 నాయక్ — ,,

లాహోరు

17 వీర్ — ,,
18 భారత్ — ,,
19 కర్మవీర్ — ,,
20 మజ్దూర్ — ,,

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




'విశ్వదాత,' 'దేశోద్ధారకుడు,' దేశసేవాపరాయణుడు నగు నస్మజ్జనకుడు దేశమాతకు స్వాతంత్ర్యమునుసంపాదింప బ్రయత్నించి తత్ఫలముగనాలుగు నెలలకాలము కృష్ణజన్మస్థాన నివా



సమును బడసెను. ఏప్రిల్ నెల ఇరువదియొకటవ తేదినాడు తత్ స్థానమును అలంకరించెను. నా తండ్రికి నాయెడగల వాత్సల్య మపారము.

అనుమానము నా తండ్రి నా కొసగు నూత్నాలంకారములను తచ్ఛుభాగమనపర్యంతము బడయజాలను. తదారోగ్యమును, అచిరకాలమున తచ్ఛుభాగమనమును, తద్వాంఛిత మగు దేశమాతృ స్వాతంత్ర్యమును అనుగ్రహింప విశ్వమంగళప్రదాత యగు సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

—భారతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గాంధి మహాత్ముడు

వీరు 'అరెస్టు' అయిరి

వార్త ౫-౫-౧౯30.

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madr

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రివర్ణచిత్రములు:—కల్క్యవతారము, ధనాసరీ.

సాధారణచిత్రములు, ఇతర చిత్రములు.

---



కల్క్యవతారము

శ్రీ యస్. వి. రామస్వామి మొదలియారుగారు ప్రకటనార్థము దయతో నొసంగిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము, జూన్ ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము జ్యేష్ఠమాసము సంఖ్య ౬

# హంపీ క్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, కాశరాజుగడ్డ శివయోగానందరావు గార్లు

## నేటి స్థితి

మంటలో నీదుమూర్తిని మాడ్చునాడు-కామదహనార్చిలో అగ్నికణ మొకండు
గాని కన్పింపబోదు ముష్కరవిరోధి-ఖడ్గములు పూతములా? రోషకలుషితములా?

## సంకీర్ణములు

ఆంతరంగిక భాషణాలయంబున దిమ్మ పగులు చూపింప దిప్పటికిగూడ
పంపాసరస్సులోపల లేతతరగలో విరుపు కన్పింప దీవేళగూడ
"చిగురుకొమ్మైమ్మనను చేవన్న" పెద్దన్ననుడి పొల్లుగాని దిప్పుడునుగూడ
* భీమసేనేక్షణాభీలరక్తిమలోన నలుపు కన్పింప దీనాడుగూడ

* కమలాపురము వెళ్లే త్రోవలో నగరరక్షకుడుగా పనిచేసిన భీమనాయకుని ప్రతిమ నల్లరాతిమీద ఎర్ర రాతి కళ్లతో చెక్కినారు. బతికి ఉన్న మనిషికి కోపంవస్తే ఇంత కంటియెరుపు ఉండదు.

7. 6- 1 ౧౯3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జడమ లివి చేతనత్వంపుజాడ లేడ- నేటికిని వీనిలో నిట్లు నిల్చిచిపోమె?
దివ్యసామ్రాజ్యపీఠాధి దేవతయగు-మా తెలుగువీర్య మేల యచేతనంబు?

ఈ జీర్ణక్షుద్రగ్రామ మేమి చూపించును- తెనుగు రారాజు పండినయశస్సు
*ఈ "లంజదిబ్బ"యం దేనీతి నిలుచును-రాకాసిరే డంటరానిమంట
ఈపాడుగుళ్లలో నేమి శేషించెను- తెలుగుభక్తుడు కత్తితెగిన మెరుపు
ఈ కొండకోనలం దేమి శబ్దించును వాల్మీకి యమృతంపు వానచినుకు
భారతీయ పురాణరూపములలోన- తెలుగు సామ్రాజ్యమును వన్నె దిద్దుకొనెన్
జీర్ణవిద్యామహారణ్యసీమయందె-కనుక ఫలితము రెంటనొక్కటిగ నిలుచు.

రామయ్య మర్కటరాజుతో భాషించుగుట్ట రాయలవారి కోటకొమ్ము
సీతమ్మ స్నానాలు చేసి జపించిన రేవు శత్రులు తేలలేనిలోతు
మాతంగముని తపోమహిమ నేర్చినకొండగుహ కమలవ్యూహ గుణముకలది
శబరి యెంగిలిపండు చవుల నూరినగుహ రారాజు దైన ఫిరంగిశాల
మా పురాణవీరులనాటి మహిమలెల్ల -ఆంధ్రసామ్రాట్ప్రజా రక్షణాలయములు
గా స్థిరపడినవి నిజముగా కనబడి-తుదకు పౌరాణికము లట్లు తూలిపోయె.

మహార్నవమిశాల

(దసరాదిబ్బ)

కురిసినదెచట వాక్కులజృంభణములోన కవిరాజుపైన బంగారువాన
సలిపిన దెచట ధూర్జటి దివ్యలేఖిని నవ్యవారాంగనా నర్తనంబు
తొడిగిన దెచట నిస్తులరాజహస్తము కవిపితామహు కాలి కంకణంబు
విరిసిన దెచట ప్రవీణవాచస్పతి రామలింగని హాస్యరససమృద్ధి
అది శిలలదిబ్బ దసరాలకైనదిబ్బ- తెలుగు లలితకళాదేవి తీర్చినట్టి
కొలువుకూటపుదిబ్బ వన్నెలకుదిబ్బ-మా మహార్నవమీశాల మంటపంబు.

ఆడుచున్నది రెక్కలార్చి గరుత్పతి తెలుగుజెండాకర్ర తీసిరేల
పిలుచుచున్నది పాలపిట్ట రాయలపేళ్లు వరుసగా గద్దెనెక్క రదియేల

* అప్పటి భోగమువాళ్ల వీథిని ఇప్పుడు లంజదిబ్బ అంటున్నారు. ఇక్కడే సీతమ్మను రావణుడు అపహరించి ముట్టుకోబోయి పతివ్రతాగ్నికి భయపడి గడ్డతో అమ్మవారిని రథముమీద పెట్టుకొన్నాడట.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాడుచున్నది రిచ్చపడి కోకిలాంగన అష్టదిగ్గజను లేమైరి రాగు
విలుచుచున్నది నెమ్మి విసిగి వన్నెలరాళ్ల తళు కమ్మ దేల వర్తకులగుంపు
ఆంధ్రసామ్రాజ్యనాటకాభ్యంతరమున-చివర తెర జారిపోయినచిన్నె లరసి
మంగళంబును బాడినమాడ్కి నేమొ-తీరి గొంతెత్తుచున్న దీ ద్విజకులంబు.

## స్నానాలచెరువు

అతిథుల స్నానాలకై త్రవ్వినారటో పనిబూని యీ రాతిపలకచెరువు
పొడిపించినారటో మకిబట్ట తెగిలింప రకరకంబులగుబ్బ రాతిమేకు
జపతపంబులకయి సమకూర్చినారటో పుణ్యాంగనలు రాతిపూలపీట
కరగించినారటో గంధాక్షతద్రవ స్ఫటిక శోణిత రాతి పాలనురుగు
వానతడిసినభూమియై సానవడిన-ఇనుపకమ్మియునై కోతగనిన కొయ్య
ముక్కయై నీటిబొట్టుల మొనలుకరుగు-చందనంబయ్యె తెల్గు వజ్రాలగుండె
నాడు, తురకలు ఛేదించునాడుగూడ.

## నర్తనశాల

కాళ్లపారాణి చిక్కన నృత్యవేళల చెమటలో కరగిపోసినది "చార"
చక్రభ్రమణవేళ జలతారు తలకట్టు తెగినముత్యాలు దిద్దినది "ముగ్గు"
విశ్రామకేళికావేళ వాదించి పచ్చీసులో నెంచి కచ్చినది "పావు"
నృత్యగానపరీక్ష నెరిగి దినాభ్యాసమునకు ధరించి విప్పినది "గజ్జె"
శేగిపోలేదు, చెరగనులేదు, కదలి-పంటగడి తప్పలేదు సప్తస్వరాల
కనుగుణంబుగ మ్రోయ మానినది లేదు-నేటికిని గిన్నరాంగనానిచయ మాంధ్ర
రాజకన్యానుసరణ పరత్వమందు-తెలుగునర్తనశాలలో తిరుగుకతన.

వెన్నెలరేల మా తెలుగు వీరులు కిన్నరకామినీవయో
భ్యున్నతి కొల్లగొందురట పూర్వము తమ్ములరాచకన్నియల్
మున్ననచేసి ప్రేమమున మంచినగాథల జ్ఞప్తి నాకమం
దున్నను వాడుకల్ విడువనోపరు నైజము లిట్టివేగదా.

నర్తనశాలలో ప్రణయనాట్య మొనర్చిన భీమబాహువై
వర్తనమప్డు కీచకుని వంతితిహాసములోన తెల్గు భూ
భర్తపసిండిసాలపయి బారిన మ్లేచ్ఛుల కంటి చూపులన్
వర్తిలు కీచకత్వముల వంతున కొక్కడు లేడె భీముడై.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## నా శ పే తు వు లు

గురుపూజలో తృప్తికుదురని సన్న్యాసి చిరునవ్వు మొలక వంచించె నేమొ
సిరిగర్వమున దృష్టిచెదరిన సిద్ధాంతి గుణకారలబ్ధి సంకుచితమేమొ
కవిరాజు పద్యసంకల్పహర్షంబున విషమాక్షరంబు కన్పింపదేమొ
దాసియయ్యు పతివ్రతాత్వభంగము కోడి నిట్టూర్పులో నగ్గి నిలిపె నేమొ
తెలుగురాజుకుపుట్టిన తెగులుపురువు-తొలిచెనో యేమొ ఆంధ్రుల తొలకరిసిరి
కానిచో ఎన్న డనుకోని దీనచరిత-కాస్పదంబయిపోవునే ఆంధ్రమాత!

[సశేషము]

---

# వసంతగానము

రామచంద్ర అప్పారావు గారు

౧

పూవు లెల్లెడ వికసించి తావి యలరఁ
బంపుచున్నవి నాపైకి మాట నేదొ,
యొలికి జాలు తరలిపోవ నొప్పుచుండు
నట్టి పూదేనె నీరాడ మనుచుఁ బిలుచు,
నొంటిగా రసాలపుశాఖ నొదిగి యొదిగి
పొంగు నానందమునఁ బాట మొదలువెట్టి
యెవరికిని గాకపోవున ల్లెల్లరికిని
రాగవల్లి మెఱుఁగుఁదీఁగె రహి వెలుంగఁ
గోయిల కలస్వనంబునఁ గూయుచున్న
దహా! వసంతము! నావనం బంత వింతఁ
గూర్చు శృంగారరసమును గురియుచుండె.
నిర్మలానందవశమున నేలనెల్ల
మఱచినాను, నాపాటల మాటఁగూడ
మఱచినాను నర్థపుజోలి కరుగనేల?
యో గులాబి! నీమనసెటు లొప్పు నట్లె
నాదు నాదంపు టర్థంబు నందుకొనుము,
మారుమూల నెందో యూరుఁబేరు లేక
యున్న యీవనంబందు నాకొప్పినట్లు
పాడుకొందుఁ—గేళాకూళిఁ బయలువెడలు
తేటనీట నెవ్వఁడొ యొక్క బాటసారి
తృప్తి దీరంగ దాహము దీర్చుకొనును
నిద్దురించును మఱచి, శాంతిని సుఖాన.
నీదు రేకయు నీడాలు నీదుతావి
వేలువేలుగఁ గని క్రొత్తవేదములను
వ్రాసి సుఖముగా జారిపో వాంఛదక్క
పూని నాసంగతినిగూర్చి యేనె తలఁప
నింక నన్యులగోల నాకేల బాల?—

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# తిక్కన కవితాసరణి

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు, యమ్.ఏ.,యల్.,టి. పి ఎచ్.డి.

(నెల్లూరు "ప్రోగ్రెసివ్ యూనియను" వారు మార్చి ౨౨ వ తేదీన జరిపిన తిక్కనజయంత్యుత్సవసందర్భమున జదివినది)

తిక్కన కవిబ్రహ్మ అని కవీంద్రులచేత పేరుపొందిన ప్రతిభాశాలి. ఆతడాంధ్ర భాషాప్రపంచమున అపూర్వమైన, అత్యాశ్చర్యకరమైన, ఆత్మసమ్మోహనకరమైన, అనిర్వాచ్యమైన సృష్టిని కల్పించినాడు. అతనికి పూర్వమట్లు కవితాసృష్టి ఆంధ్రభాషయందే కాదు. ఏభాషయందును కలుగలేదు. ఆతరువాతకూడా కలిగినట్లు తోచదు. ఇంగ్లీషు వాఙ్మయములో షేక్స్పియరును భావనాప్రకటనమునకును, ప్రకృత్యనుకరణశక్తికిన్ని ఉదాహరిస్తారు. కాని, అతనిభావన ఐహిక విషయ సంబద్ధమైనది. అతని నాటకకథలు చాలవఱకు మనుష్యలోకమునకు సంబంధించినవి. అతనిభావన కొన్నిచోట్ల మాత్రము మెరపువలె మెరుస్తుంది. ఆతనికు అంతటితో అంతరిస్తుంది. తిక్కన ప్రకటించిన భావన నిలుకడ గలిగిన విద్యుద్దీపము. చల్లని మనోహరమైన శుభ్రజ్యోత్స్న. మిల్టనుకవిభావనయందు మిన్నయే. దానివాతడు అమానుషవిషయవర్ణనమున నుపయోగించినాడు. కాని, ఆతడు తీసుకొన్న కథాభాగము మిక్కిలి సంకుచితమైనది. ఆతడు దేవతలను మనుష్యులుగా చేసినాడు. భారతకవులు మనుష్యులను తమకవితా బలము చేతదైవసములుగా చేసినారు. హోమరుకవి తన ఇల్లియడ్డు ఒడిస్సేలలో భారతకథాసంవిధానమునకు కొంచెము దగ్గరగా వచ్చినాడు. కాని, వర్ణనభాగమునగాని, కథావిస్తృతియందుగాని, కవిత్వప్రతిభయందుగాని, ఆతని ఐతిహ్యము మహాభారతకథతో దీటురాదు.

సంస్కృతవాఙ్మయ కర్తలలో కాళిదాసు అద్వితీయప్రతిభాశాలియై ఉన్నాడు. వర్ణనభాగములో గాని, అద్భుతకల్పనాప్రౌఢియందుగాని అతడసమానుడు. లలితకవిత్వమునం దాతనికి పెట్టినది పేరు. కాని, ఆతడే మహాభారతమును రచించిఉంటే, ఎట్లుండునో ఊహింప వీలులేదు. ఒకశకుంతలను, ఒకఊర్వశిని, విరహార్తుడైన ఒకయక్షుని, మోహనమూర్తులైన పార్వతీపరమేశ్వరులను సృష్టింపగలిగిన కాళిదాసు మహాభారతమునురచించిఉంటే అది ఒక శృంగార కావ్యముగా పరిణమించిఉంటుందిగాని, వీరరస ప్రధానమైన ఇతిహాసముగా ఏర్పడిఉండి ఉండదేమో అని నాఅనుమానము. కవికుల పితామహుడైన వాల్మీకి మనస్సున శోకమునిండి, పొంగిపొరలి,శ్లోకముగా పరిణమించినది. సంస్కృతములో గానీ, ఇతర భాషావాఙ్మయములోగాని దానికి సరివచ్చు కావ్యము కానరాదు కాని, రామాయణ కథ కేవలమును మానుషాతీతమయిపోయినది. మనుష్య వృత్తమున కందు తావులేకపోయినది. ధర్మాచరణమునందు శ్రీరాముడుగాని, దుర్మార్గవర్తనమందు రావణుడుగాని మానవులను కరించుటకు మిక్కిలియు దూరులై పోయినారు.

కవిత్వమునకును, భావనాప్రకటనమునకును ఆనువైనది భారతకథ. ఆకథ బహుభాషల బహువిధముల వ్యాప్తిజెందినది. బహుజనములు దానియందు బద్ధస్పృహులైనారు. దానిని—

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు సర్వలక్షణ సంగ్రహమని, యైతిహాసికు లితిహాసమని"యు బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబనియు కొనియాడినారు. దానిని పరాశరాత్మజుడు విశ్వజనీనమై పరగునట్లు చేసినాడని నన్నయ అన్నాడు. పరాశరాత్మజుడుకాక జైమిని, పైల, వైశంపాయనులును మహాభారతమును రచించినట్లు ప్రతీతి. జైమిని రచించినదానిలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అశ్వమేధపర్వమొక్కటి మిగిలినది. తక్కినవారి రెండు భారతములును కానరావు. జైనభారతము వ్యాస భారతకథకు కొంత విలక్షణముగా ఉన్నది-కథా విస్తృతియందు వ్యాసరచిత భారతమున కీడువచ్చినది మరిఒకటి లేదు. "మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే" అని వ్యాసభారతమునకు వ్యాఖ్యానకర్తలు నిర్వచనము కల్పించినారు ఇది న్యాయ్యమే. సంస్కృత భారతము మహత్త్వమునందును భారవత్త్వమునందును అద్వితీయమైనది. కాని, దానియందు ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, లక్ష్యసంగ్రహము, ఇతిహాసము, పురాణము, మొదలగు విషయములు వెల్లిగా ఆక్రమించి మహాకావ్యత్వమును మరుగుపడజేసినవి. సంస్కృత మహాభారతము మనకు పూజ్యమైనదియు, ఆరాధ్యమైనదియు, నమస్కరింపదగినదియు అయిన పారాయణ గ్రంథమయినది గాని కాంతాసమ్మితమైనదిగా పరిణమించలేదు. అందుచేతనే దానిని ద్విజేతరులు పఠింపకూడదను అభిప్రాయము ప్రబలినది.

భారతవర్షీయభాషలయందెల్ల మొట్టమొదట వ్యాసభారతము వెలువడినది మన ఆంధ్రభాషలో. పంపకవి నన్నయ్యకుపూర్వము కన్నడమున రచించినది జైనకథ. కన్నడములో కుమారవ్యాసుడు ప్రౌఢదేవరాయని కాలమున వ్యాసభారతమును రచించినాడు. కృష్ణదేవరాయని కాలమున తిమ్మన్న దానిని పూర్తిచేసినాడు. తమిళభారతము చాలా ఆధునికము. మళయాళ భారతమును అట్టిదే. ఇతరభాషలలోకూడ భారతములు తిక్కనకు తరువాతనే రచింపబడినట్లు తెలియవస్తున్నది.

తెనుగులో భారతము పూర్వచాళుక్యచక్రవర్తి అయినరాజరాజ నరేంద్రుని ఆస్థానములో ప్రారంభింపబడినదని మనకు తెలుసును. దానిని నన్నయభట్టురచించినాడని ఆదిపర్వాదియందు, ప్రథమపురుషముగా రచింపబడిన పీఠికవల్లను, ఆశ్వాసాంతగద్యలవల్లను, తిక్కనకాలము మొదలుగా స్థిరపడిన ప్రతీతివల్లను, మనకు తెలియవస్తున్నది. రాజరాజుకును తిక్కన్నకును మధ్యనుండిన కవులు నన్నయభారతమును స్మరించినట్లు మనకు నిదర్శనములు లేవు. రాజరాజుసంతతివాడైన విజయాదిత్యుడు శ్రీహర్మమున వేయించిన శాసనములో "సరాజరాజనృపతిః సువిశాలకీర్తిః, యః సూరిభిస్సహకిల స్మృతిజాలసార, మంధ్రీచకార వరభారత వంశవృత్తమ్"అని భారతకర్తృత్వమును రాజరాజుకే అంటగట్టినాడు. పండితులు కొందరు గ్రంథమును సాగించుటలో తోడ్పడినా రనడమునకు నారాయణభట్టు, సంస్కృత, ప్రాకృత, కర్ణాటకభాషలలో కవీభవజ్రాంకుశుడని ఖ్యాతినొందిన వాడు, సహాయపడినట్లు ఆప్రథమ పురుషపీఠికలోనే ఉన్నది. కొన్ని సంవత్సరాల క్రిందట నే నీ విషయాలు ప్రకటిస్తే కొందరికి కోపము వచ్చినది. కొందరికి కారణములేని నవ్వువచ్చినది. ఒకరికి కలలో రాజరాజు ప్రత్యక్షమయి, నన్నయయే ఆ భారతమును రచించినాడని నాకు సందేశము పంపినట్లు వ్రాసినారు. ఇప్పుడావాదమును తిరిగీ బయలుదేరజేయడమునకు నేనూహింపలేదు. ఆంధ్రులందరును నన్నయ్యయే కృతికర్త అని చాలాకాలమునుంచిన్ని విశ్వసిస్తున్నారు. ఆ విశ్వాసము శాశ్వతముగా నిలుచును గాక అనియే నా కోరిక.

కాని, నన్నయ రచించిన భారతభాగమునందు ప్రయత్నపూర్వకమైన, నియమసహితమైన రచన కనబడుతుంది. దానిలో పలువురు రచించినదానిని ఒక అధ్యక్షుడు సంస్కరించి ప్రచారములో పెట్టినట్లు అనేక సూచనలున్నవి. సీసపద్యములు, ఆటవెలదులు, తేటగీతములలోని నియమములట్టివి. ఈ నియమము లంతకు పూర్వముగాని, ఆతరువాతగాని లేవు. నియమబద్ధమగుటచేత ఆ భాగములో చాలామట్టుకు పద్యములు ధారగా ప్రవహింపవు. నన్నయ భారతరచనకై యేర్పడిన పరిషత్తుకు అధ్యక్షుడై దానిని లక్ష్యసంగ్రహముగా లాక్షణికులను సరింపవలసిన గ్రంథముగా దానిని నిర్మించినాడని నా ఊహ. అందుచేతనే ఆతనికి శబ్దశాసనబిరుదము కలిగి ఉండును. ప్రథమాంధ్రగ్రంథమయిన భారతమును లేనిననన్ని కట్టుదిట్టములతో బంధించకపోతే, భాషకు ప్రామాణ్యముగాని, గౌరవముగాని కలుగదని ఆవైదికుడు తలంచి ఉంటాడు. ప్రథమాంధ్రకావ్యముగా, లక్ష్యసంగ్రహముగా నన్నయరచిత భారతభాగము మన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మన్ననకు పాత్రమైనది. ఆవిషయమున నాకు దానియెడల అధిక గౌరవము కలదు. అందుచేతనే ఆతని గ్రంథమునకు లక్షణమును నిరూపింప ప్రయత్నించి ఈవిద్వద్బిరుదమును సంపాదించుకొన్నాను. అందుచేత ఆతనియెడల నేను కృతజ్ఞుడను కావలెను. ఆతడు నాకాచార్యుడు; పురోహితుడు. తన పురోహితత్వమహిమనే ఆతడున్ను వర్ణించుకొన్నాడు. ఆతడు కులబ్రాహ్మణుడు, అవిరళ జపహోమ తత్పరుడు; సంహితాభ్యాసుడు; నానాపురాణ విజ్ఞాననిరతుడు; సద్వినుతావదాతచరితుడు; సత్ప్రీతి భాభియోగ్యుడు; నిత్యసత్యవచనుడు; మత్యమరాధిపాచార్యుడు; సుజనుడు. అందుచేత పూజ్యుడు. భయగౌరవములచేత దూరముగా నిలుచుండి ఇతరులతనికి జోహారులు చేయవలసినదేకాని దగ్గరకుపోయి సరససల్లాప వినోదముల ప్రొద్దుపుచ్చ వీలులేదు. రాజరాజుకు ఆతడు అనుగ్రహ్యుడు మాత్రమే. మనుమసిద్ధి తిక్కనను "మామా" అనిపిలిచిన చనవు రాజరాజుకు నన్నయయెడల లేకపోయినది. అందుచేతనే నన్నయ రచితమని ప్రసిద్ధమయిన భాగములో వైదిక "చాదస్తము" ఎక్కువగా కనబడుతున్నది. రాజరాజు "విమలమతిం బురాణములు వింటి ననేకములు; అర్థశాస్త్రముల తెఱంగెఱింగితిని; ఉదాత్తరసాన్విత కావ్యనాటకక్రియములు పెక్కు సూచితి; జగత్పరి పూజ్యములైన యీశ్వరాగమముల యందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్" అని అన్నట్లు వ్రాసి, ఆతని భారతశ్రవణాసక్తితోబాటు, మొట్టమొదట భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతి తరువాత పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవము, సంతతదానశీలత, శశ్వత్సానుసాంగత్యము, అనేవి రాజరాజుకు కరంబిష్టంబులై యుండునట్లుగా ఆతనిచేత పలికించినాడు. ఇంకా వినండి: భారత కథాశ్రవణాభిరతిచేత "అమలసువర్ణశృంగఖురమై కపిల బహు గోశతంబును ఉత్తమ బహువేద విప్రులకు దానముచేసిన తత్ఫలంబు తథ్యము సమకూఁగు"ననిపించినాడు. ఇట్లే ఇతరస్థలములలో కూడా మూలములో ఎట్టి ప్రశంసయున్ను లేకపోయినా, వైదికమార్గము, వైదికధర్మము, వర్ణాశ్రమవిధానము, బ్రాహ్మణప్రశంస, ఇటువంటివి వస్తేసరి, నన్నయ్యకు ఆవేశము పుట్టుకుంది; వర్ణనమును పెంచుతాడు. జైనాదిమతవ్యాప్తిమూలమున అడుగంటిన వైదికధర్మమును మరల ప్రతిష్ఠాపించడమే ఆతని భారత రచనోద్యోగమునకు ముఖ్యహేతువని స్పష్టముకాకపోదు.

ధర్మబోధ అవశ్యాచరణీయమేకాని, మనుష్యజీవితమునకు కావలసినవి జీవితము అనుభవయోగ్యముగా జేయదగినవి ఇంకను చాలా విషయములున్నవి. ఎల్లప్పుడున్న "ధర్మంచర, సత్యంవద" అని ఘోషించడమువల్ల, ధర్మనిరతియు, సత్యనిష్ఠయు సహజములై ఉన్నవారికి కూడా కొంత విసుగుపుట్టకపోదు. అందుచేత జనులు దేవాలయములోని దేవునికివలె, ఇట్టి గ్రంథములకు ఒక టెంకాయకొట్టి, కర్పూరముతో హారతినిచ్చి ఒక మ్రొక్కుమ్రొక్కి, ఇంటికివచ్చి యథాప్రకారముగా జీవితానుభవలోలురౌతారు. ఇది నింద్యముకాదు; మనుష్యుల కది సహజము. అందుచేత వైదికధర్మబోధయే పరమలక్ష్యముగా గల నన్నయవిరచిత భారతభాగము మీద జనులకు ఎక్కువ ప్రీతికలుగకపోవుట వింతకాదు.

భారతకవిత్రయములో చేరినవాడు ఎఱ్ఱాప్రగడ. ఈతనికీగౌరవము "భారతశేషోన్నయనము" వల్ల కలిగినది. శిథిలమైన అరణ్యపర్వభాగమును పూర్తిచేయడముచేత ఈతడున్ను భారతకవి అయినాడు. నన్నయ అరణ్యపర్వము నాలుగో ఆశ్వాసము 142 వ పద్యములో ఆతని మతిభ్రమణముచేతనో, మృతిచేతనో ఆగిపోయి ఉంటుందని నేను విశ్వసింపను. నన్నయ అరణ్యపర్వమును కూడా పూర్తిచేసినాడనియే నానిశ్చయము. నన్నయమార్గమును బాగుగా గ్రహించి, "శరదవసరయుక్త" అరణ్యపర్వశేషమును ఎఱ్ఱాప్రెగడ పూర్తిచేసినా, తిక్కనకవిత్వముతో పోలికలుండడమువల్ల, ఎఱ్ఱాప్రెగడయే అరణ్యపర్వము నాలుగో ఆశ్వాసము మధ్యనుండి తుదివరకున్ను తానే రచించినాడని మ-రా-రా-శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ "ఆంధ్రభారతకవితావిమర్శనము" అను గ్రంథములో కొన్ని దృష్టాంతములను చూపినారు. అక్కరలలక్షణము, సీసపద్యముల తూగు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనస్తత్త్వ నిరూపణము, భాషాప్రయోగ సామ్యములు అనే శీర్షికల క్రింద వారు తమ ఉదాహరణముల నిచ్చినారు. శ్రీ రామకృష్ణయ్యగారి గ్రంథము బహు విమర్శ పూరితమై చదువ నింపుగానున్నది. అది భాషాభిమానులందరున్ను విమర్శతో జాగ్రత్తగా చదువవలసిన గ్రంథము. దానిలో వారు విమర్శార్హములైన అనేకవిషయములను చేర్చి, భాషాభిమానులకు చాలాపనిని కల్పించినారు. ఇందుకు వారు ప్రశంసనీయులు. అరణ్యపర్వశేష ప్రశంసనుగూర్చి మాత్రము ఇక్కడ కొంతప్రస్తావిస్తాను.

## అక్కరల లక్షణము

౧౨౧. పుట. "మొదటి రెండున్నర పర్వములలోని యక్కరపద్యముల లక్షణమును గ్రహించి చెప్పక, తుదిపర్వములలోని పద్యలక్షణమునే, యీ పద్యలక్షణముగా లాక్షణికులు గ్రహించుటచే, నప్పటికే యిప్పటివలెనే మొదటి భాగములోని నన్నయమధ్యాక్కరలకు లక్షణము సరిగాకుదురక, చిక్కుగానుండుట తటస్థించినదని చెప్పవలసియున్నది."

నన్నయ మధ్యాక్కరలకు లక్షణము సరిగా ఎక్కడ కుదురలేదో నాకు గోచరింపలేదు. నన్నయరచిత భారతమునుకొన్న భాగములో మొత్తము ౩౮ మధ్యాక్కరలున్నవి. ఈ అక్కరలు యుద్ధమల్లుని శాసనములోని అక్కరల లక్షణమునే కలిగియున్నవి. వీటిలో యతిస్థానము నాలుగోగణము మొదటి అక్షరము మీద ఉన్నది. అరణ్యపర్వశేషములో ఒక్క మధ్యాక్కర మాత్రమున్నది. దీనికిన్ని నన్నయఅక్కరకున్ను గణములొక్కటే గాని, యతిస్థానములో భేదమున్న మాటనిజమే. ఈ ఒక్కపద్యమును బట్టి నన్నయభారత భాగమునకున్ను, ఎఱ్ఱన్న ఉన్నయనముచేసిన భాగమునకున్ను ఛందస్సు విషయములో భేదమున్నట్లు నిరూపింప వీలులేదు. సీసపద్యములు, ఆటవెలదులు, తేటగీతముల విషయములోని నియమములు మూడుపర్వములలోను చెడకనిలచినవి. మొదటి రెండున్నరపర్వములలోని వృత్తములేతప్ప, అరణ్యపర్వశేషములో ఎక్కువగా ఇతరవృత్తములులేవు. అరణ్యపర్వశేషములోని మధ్యాక్కర ఉన్నీతభాగములోనిదేల కాకూడదో తెలియదు.

## సీసపద్యములతూగు

నన్నయ సీసపద్యములలో తిక్కనలోవలె తూగు అంత తరచుగా కనిపించదన్నమాట నిజమే. కాని, అరణ్యపర్వశేషములో మాత్ర మాతూగు అంతప్రస్ఫుటముగా ఉన్నదని కూడా చెప్పవీలులేదు. అరణ్యపర్వశేషములో 94 సీసపద్యములున్నవి. వాటిలో అయిదారింటిలో తప్ప తక్కినచోట్ల ఈ తూగు కనిపించదు. తక్కినవన్నీ నన్నయసీసములను పోలినవే. ఈ తూగుగల పద్యములు కూడా ఒక్కచోటనే కూడిఉండుట విశేషము.

## భాషాప్రయోగమందలి సామ్యములు

భాషాప్రయోగముల విషయములో నాదృష్టికి సర్వత్ర అరణ్యపర్వశేషము, అంతకు పూర్వభాగమందలి ప్రయోగములతోనే అనుకూలిస్తున్నది గాని, తిక్కన ప్రయోగములతో అంతగా పొసగిఉండలేదు. కొన్ని స్వల్పభేదములను కనిపెట్టి, వానినిబట్టి ఎఱ్ఱాప్రెగడయే అరణ్యపర్వశేషమంతయు వ్రాసినాడనుట సాహసము. ఈ చిన్న పోలికలున్ను ఉన్నీతభాగములలోనివే అని నా అభిప్రాయము. నన్నయభాషాప్రయోగములే అరణ్యపర్వశేషములోనున్ను కనబడుతున్నవని నిరూపించడమునకు నన్నయ, ఎఱ్ఱనభాగములకు ప్రత్యేకముగా వ్యాకరణములను వ్రాసి, ఈ రెంటిలోని ప్రయోగములున్ను ఒక్కరీతివే అని నిరూపించవలెను. నన్నయభాషాలక్షణమును కొంత సూక్ష్మముగా గమనించినవాడనగుటచేతను అరణ్యపర్వశేష ప్రశంస అప్రస్తుతమగుటచేతను, నన్నయ, ఎఱ్ఱన భాగములకు భాషాప్రయోగములలో ఎక్కువభేదముకాన్పింపదని మాత్రము నివేదించి ఇంతటితో ఈ విషయము విడుస్తున్నాను.

భారతకవులు నన్నయతిక్కన లిద్దరేఅనిన్ని, అరణ్యపర్వశేషోన్నయనము చేయుటముచేత ఎఱ్ఱాప్రెగడకూడా వారితో చేరినాడనిన్ని చెప్పడమునకు ఇంతపెంచవలసి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చినది. నన్నయతిక్కనలు రచించిన భాగములలో నన్న యరచించిన భాగము ప్రఖ్యాతిలోనికిరాలేదు. దానినిగురించి ప్రస్తావించిన వారిలో తిక్కన్నయే మొదటి వాడు. భారతమును పూర్తిచేయనుద్యమించిన వాడగుటచేత, ఆతడు మొదటి మూడు పర్వముల ప్రశంసను ఎత్తుకొనక తప్పినది కాదు. కాని, ఆతనికి కూడా ఆభాగముమీద అంత ఆదర మున్నట్లు కానరాదు. నన్నయను గురించి ఆతడు "ఆంధ్రకవిత్వవిశారదుండు, విద్యాదయితుండు, మహితాత్ముండు, నన్నయభట్టు ఆదిందొడంగి మూండుకృతులొనర్చె" అని చెప్పి ఊరకున్నాడు. తా నారంభించిన భాగము నెక్కువగా 'హృదయాహ్లాది, ఊర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి' అని వర్ణించుకొన్నాడు. విరాటపర్వ కథ అట్టిదే. అది తిక్కనచేతిలోపడి సంస్కృతములో కన్న ఎన్నియో రెట్లు వన్నె కెక్కినది. అది నన్నయ చేతిలోపడిన ఏమయి ఉండునో! విరాటపర్వమట్టిది గనుకనే భారతమును పఠించేవారు సాధారణముగా విరాటోద్యోగపర్వములను పూర్తిచేసి, తరువాత ఆదిపర్వము నెత్తుకొంటారు. ఏమహూర్తమున ఆరంభించినాడో గాని, తిక్కన్నమనస్సు ఒక చక్కని మనోహరమైన మార్గములో పడిపోయినది. ఏకబిగిగా పదిహేను పర్వములున్ను, ఒకటే సాపుగా, రసముచిప్పిల్లినట్లు సాగినవి. "ఏమి చెప్పుచున్నరు నాథా!" అను పద్యమును గురించి చెప్పు కథ సత్యదూరము కానేరదు. ఈసాపు, ఈ అందము, ఆబిగి, ఆపొంకము, ఆతీరు, ఆసొగసు అతని నిర్వచనోత్తర రామాయణములో అవతరించలేదు. నిర్వచనోత్తర రామాయణము నియమముతో కూడినది. నియమము ధారకు అడ్డుపడినది. అందుచేతనే తిక్కనపేరెత్తగానే, ఆతనిభారతము తలంపునకు వస్తుందిగాని, నిర్వచనోత్తర రామాయణము రాదు. అట్లే ఆంధ్రభారతము పేరెత్తగానే తిక్కన మనయెదుట నిలబడతాడుగాని, నన్నయ్య, ఎఱ్ఱన్నలు జ్ఞప్తికి రారు.

కవిత అనుభవించి, ఆనందించవలసినదే కాని, ఇట్టిదని నిరూపించవలసినది కాదు. అది చిత్రలేఖనము, సంగీతము, శిల్పము వంటి ఒకకళగాని, శస్త్రములచే ఛేదింపదగినశాస్త్రముకాదు. మల్లెపూవునకు ధావళ్యము, సౌరభ్యము సహజగుణములు. దూరమునుండియే అది ఘుమ్మని పరిమళిస్తుంది. దానికాధావళ్యము ఎందుకు కలిగినది? దానిలో ఎన్ని రేకలున్నవి? దాని ఆకార మెట్లున్నది? ఈ మొదలైన విషయాలు వృక్షశాస్త్రజ్ఞుడాలోచిస్తాడు. నిజముగా రసికుడయినవాడు తీగమీదనుండగానే దానినిచూచి, అంటిన కందునేమో అని దానిని ముట్టక దూరమునుండియే దాని సౌరభ్యమనుభవిస్తాడు. అంతకంటె తక్కువ రసికత కలవాడు దానిని చిదిమి చెవిసందుననో, సిగలోనో పెట్టుకొంటాడు. అట్లే మోహనగానమును విన్న రసికుడు తలయూచి పరవశు డౌతాడు. కాని శాస్త్రజ్ఞుడు దానిని ఛేదించి "సరిగమ" లలోనికి ప్రస్తరించుకొంటాడు. చక్కని చిత్తరవును చూచి ఆనందింపగల కళాభిజ్ఞుడు ఓహో అని మెచ్చుకొంటాడు. కాని చిత్రకళాశాలోపాధ్యాయుడు దానిలో నుపయోగపడిన రంగులు, తూలికలు, పింగాణీచిప్పలమీద దృష్టిని ప్రసరింప జేస్తాడు. టాజ్ మహాలును చూచి ఆనందింపలేని మోటుతాపీపనివాడు దానిలో ఎన్ని ఇటుకలుపడినవో ఎంచుకొంటాడు. అట్లే కవిత్వమువిషయములో లాక్షణికుడు కూడాను. లాక్షణికుడున్ను విమర్శకుడున్ను, ఇతర శాస్త్రజ్ఞులవలె కళాప్రతిభావంతులయిన కవుల పాలిటి రాక్షసులు. అట్టివారు కవికంఠపాశములు, కవిసర్పగరుడములు వ్రాసి కవిరాక్షసులమని తమ్ముపిలిస్తే సిగ్గుపడక గర్వముతో సంచరిస్తారు.

అయినా, విమర్శతోకూడిన అనుభవము కొంతవరకు లాభకారి అని ఒప్పుకోక తీరదు. చక్కని శిల్పమునుగాని, చిత్రమునుగాని, గానమునుగాని అనుభవింపగలవారు వాటినిర్మాణమును గురించి కొంత ఆలోచిస్తే అంతకంటె ఎక్కువ అందముకలిగే మార్గమును సూచించగలరేమో. ఇది సందేహాస్పదమే, కాని అట్టి ఆశగలవారి ఉత్సాహమునకు భంగము కలిగించడము అన్యాయము. వారినిమాత్రము ఆయావస్తువులను స్పృశించనీయకూడదు. ఆలలితవస్తువులు తాకుడు కోర్వజాలవు. అసలును చెరపకుండా విమర్శకులు తమయిష్టమువచ్చినమేరకు ఛేదనము చేసుకొనీయవచ్చును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిక్కన కవిబ్రహ్మ అనిన్నీ, అతడు అద్భుతావహమైన ఆంధ్రకవితా సృష్టిని కల్పించినాడనిన్నీ మనకు తెలియును. విరాటపర్వము ఆరంభమునుంచి శాంతి వరకున్ను ఒక్కసారిగా, ఒకవీక్షుతో ఎత్తినపుస్తకము దించకుండా నిద్రాహారములుమాని మైమరచి అతని కవిత్వసృష్టిలో మనము సంచరింపగలము. ఆపిదప మడిగట్టుకొని శాంత్యనుశాసనికములను పారాయణము ముగించుకొని, తరువాత ఉబుసుపోకగా పాండవులకు స్వర్గారోహణమునందు తోడ్పడగలము. ఈరీతిగా తిక్కన వ్రాసిన పదిహేను పర్వములున్ను మూడు ఊపులలో చదువవలసిన గ్రంథము. చదువవలసినది కాదు; చదువజేసే గ్రంథము.

ఇందుకుకారణము నన్నయవలె, తిక్కన భారతమును ధర్మగ్రంథముగా కాక, కావ్యసృష్టిగా, కవితావేశముతో రచించడమే అని వేరే చెప్పనక్కరలేదు. అట్టి దృష్టికలవాడు గనుకనే దానినతడు ధర్మశాస్త్రముగా గాని, వేదాంతముగాగాని, నీతిశాస్త్రముగాగాని, లక్ష్య సంగ్రహముగా గాని, ఇతిహాసముగా గాని, పురాణ సముచ్చయముగా గాని, దిద్దలేదు. ఆయా విషయముల నాతడక్కడక్కడ చేర్చుకొంటే, కవిత్వదృష్టితో చేర్చుకొన్నాడు కాని, మరియొక దృష్టితో కాదు. భగవద్గీతాది భాగముల నాతడు సంగ్రహపరచడమున్ను, కొన్ని భాగములను వదలివేయడమున్ను కూడా ఇందుకొరకేగాని, ద్వేషులనుండి ఆధ్యాత్మిక విషయములను దాచిపెట్టుటకు కాదు. అతడొకకవితాకన్యను సృష్టింప సంకల్పించినాడు. ఆకన్యక కుండవలసిన ఆకార సౌందర్యాది విషయముల నన్నిటిని మనస్సునందు రూపించుకొన్నాడు. అతని మనస్సులో ఏర్పడిన ఆ అనన్య సౌందర్యాకారమునకు తగిన భావసంపదను ప్రకటింపగల అవ్యక్తశబ్దబ్రహ్మమునుండి, బాహ్యావ్యక్త రూపమును గ్రంథరూపముగా వెలువరచినాడు. ఈ రూపమునందు గల అంగసౌష్ఠవలావణ్యవిభ్రమములను అనుభవింపగల రసికులు ధన్యులు.

ఇట్టి కవితాసృష్టినిగురించి ఆలోచించునపుడు, దానిని మరిఒకసృష్టితో పోల్చిచూడడము వ్యర్థము. ఈ పద్యమునకు మూలములో ఏ మున్నది? ఇది దక్షిణదేశపు ప్రతుల ననుసరించిన అనువాదమా, ఉత్తరదేశ ప్రతుల ననుసరించినదా? తిక్కన ఏ కాలపువాడు? ఎక్కడ జన్మించినాడు? ఎంతధనము సంపాదించినాడు? అతని కెంతమంది పిల్లలు?—ఇటువంటి చర్చలన్నీ నిరర్థకములు. చారిత్రకదృష్టితో చూచువారి కవి ఆవశ్యకములు కావచ్చునుగాని, కవితావిమర్శకునికి వాటితో పని లేదు. విమర్శకుడు కళలోని అందమునకు కారణములు ఊహించుకొంటే చాలును.

## తిక్కనకవితాసృష్టి

### ౧. శబ్దసామగ్రి

తిక్కనరూపము నిచ్చిన ఈ కవితాకన్యా జీవ ప్రతిమను నిర్మించిన సామగ్రిని (౧) శబ్దసామగ్రి (౨) ఛందస్సామగ్రి—అని రెండువిధములుగా ఏర్పరుచుకోవచ్చును. నన్నయవాడిన అచ్చికపదముల సంఖ్య సుమారు ౧౨౦౦ ఉంటుంది. సంస్కృతపదములు ఇంతకు అయిదింతలు ఉంటవి. మూడు పర్వముల కథమాత్రము గనుక ఇంత కొంచెము శబ్దసామగ్రిని నన్నయ ఉపయోగించుకొన్నాడని మనమనుకోవచ్చును. ఇదిగాక అచ్చికపదములు తిరిగితిరిగి అవే అనేకపర్యాయములు ప్రయోగింపబడి ఉండడముచేతను, ఆతడువాడిన సంస్కృతపదములలో ఒక్కటి సాధారణముగా ఒక్కటేసారియు, కొన్నిమాత్రము రెండుమూడుసార్లకంటె ఎక్కువ రాకపోవడముచేతను, అచ్చికశబ్దములకంటె సంస్కృతశబ్దములే ఎక్కువగా ఏర్పడినవి. కాని, తిక్కన భారతములో అచ్చికపదములసంఖ్య నన్నయగ్రంథములోకంటె 15 పర్వముల గుటచే అయిదింత లెక్కువగా ఉండవలసి ఉండగా పదిహేనింతలైనా ఎక్కువగా ఉండడమున్ను, సంస్కృత పదముల సంఖ్య నన్నయ గ్రంథములోకంటె మూడింతలు మాత్రము ఎక్కువగా కనబడుతుంది. తిరిగీతిరిగీవచ్చినప్పుడెల్ల పదములను ప్రత్యేకముగా లెక్కిస్తే, నన్నయ గ్రంథములో తెనుగు సంస్కృతపదము లించుమించుగా సమానముగాను, తిక్కన గ్రంథములో తెనుగుపదములు సంస్కృతపదములకంటె సుమా రెనిమిదిరెట్లు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎక్కువగను ఉన్నట్లు తెలుసుకోవచ్చును. ఇందువల్ల నన్నయకు సంస్కృతిమార్గముమీద ఎక్కువ అభిమానము నిన్ని, తిక్కనకు దేశిమార్గ మెక్కువ ఇష్టమనిన్ని మనకు తెలియగలదు. నన్నయతిక్కనలకు పదముల కూర్పులో కూడా ముఖ్యభేదమున్నది. నన్నయ సాధారణముగా సంస్కృతసమాసములను ఎక్కువగ వాడుతాడు. తిక్కన సంస్కృత శబ్దములను వాడినా సాధారణముగా వాటిని వ్యస్తముగానే వాడుతాడు. సమాసములను వాడవలసి వచ్చినప్పుడు రెండుమూడుపదములనుమాత్రమే సమసింపచేస్తాడు. నన్నయ సంస్కృతపదములను వాడినరీతి కొక్క ఉదాహరణము.

ఘనదురితానుబంధ కలి
 కాలజదోషతుషారసంహతిన్
దన యుదయప్రభావమున
 దవ్వులఁజోపి జగజ్జనాసరం
జనముగ రాజ్యసంతతవ
 సంతనితాంత విభూతి నెంతయుం
దనరుఁ జళుక్య మన్మథుఁడు
 ధర్మదయార్ద్రనిబద్ధ బుద్ధియై.

అతని దేశిమార్గమునకు అరుదుగా కనబడు ఉదాహరణములు:

నిండు మనంబు నవ్యనవ
 నీతసమానము, పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జ
 గన్నుత, విప్రులయందు నిక్కమీ
రెండును, రాజులందు విప
 రీతము గావున విప్రుఁడోపు నో
పం డతిశాంతుఁడయ్యు నర
 పాలుఁడు శాపముఁ గ్రమ్మరింపఁగన్.

నుతజల పూరితంబులగు
 నూతులు నూటికంటె నూన్నృత
వ్రత యొకబావి మేలు మఱి
 బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతువది మేలు తత్క్రతుశ
 తంబున కంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక
 సూనృతవాక్యము మేలు సూడఁగన్.

తిక్కన సంస్కృత మార్గమును చూడండి:

మ. బకవిధ్వంసి జటాసురాంతకు
 హిడింబ ప్రాణ హారీణు గీ
చక నిర్మూలన కేళిలోలు సమరో
 త్సాహైక శీలప్రవ
ర్తకు నాగాయుత సామ్యకీర్తితబలో
 దగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొనివచ్చు ధర్మజుడు బా
 హాటోపముం జూపగన్.

ఈపద్యము వెనకి పేర్చినది. ఈమార్గమే తిక్కన కిష్టము లేదు. ఆతడు సంస్కృతము నుపయోగించినా, తెనుగుపదముల నుపయోగించినా "అలతి యలతితునియల గాహళ సంధించిన విధంబు నమరగవలయు నే" కాని మఱియొకతీ రాతని నోటికి రాదు. అట్టి వాద్యమునుండి మనోహరగానము బయలుదేరి చే తీరవలెను.

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ; డ
 వశ్యము గెల్తుమనంగరాదు; రా
లచ్చికినై పెనంగిన బ
 లంబులు రెండును గెల్వనేర్చునే
హెచ్చుగుఁ గుందగుం దొడరు
 టెల్ల విధంబుల గోర్చునట్లుగా
కిచ్చఁదలంచి యొక్క మెయి
 నిత్తఱిఁ బొందుగఁ జేయుం దగున్.

చ. ఇది యొక పెద్దగట్టి మొన
 యీమొనముందట గోగణంబుతో
నదె యొక యల్పసైన్య; మట
 యాతల వేఱొక కొంతసేన య
ల్లదె యిటువంచి పెట్టఁ జనె
 నన్నిటిలోన వృథాభిమానదు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్మదబహుభాషియైన కరు
రాజెచటం జనుచున్న వాఁడొకో:

ఈమార్గము నన్నయకు సర్వసాధారణము గనుక చాలును. తిక్కనకు దీర్ఘసమాసములంటే ఇష్టము లేకపో లేదు. కాని, అవి పడవలసినచోట్లనే పడి తీగవలె సాగుతవి. చూడండి:

శా. సింగంబాఁకటితో గుహాంతరమునం
జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సము
ద్య త్క్రోధమై వచ్చునో
జంగంతారనివాసఖిన్నమతి న
స్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమర
స్థేమాభిరామా కృతిన్.

శా. దుర్వారోద్యమబాహువిక్రమ రసా
స్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన
విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవు రిప్డు నినుదో
ర్లీలన్వేసం గిట్టి గం
ధర్వ ల్మానముఁ బ్రాణముం గొనట త
థ్యం బెమ్మెయిం గీచకా!

సంస్కృత సమాసఘటనమునందు నన్నయమార్గము వింతగా ఉంటుంది. "ప్రకటిత భూతసంతతి; చంద్రికారాజిత సర్వలోకుడు; అనతశాత్రవుఁడు;" అని యారీతిగా బహువ్రీహిసమాసముల కూర్పు, శతృశానచ్ ప్రత్యయములతో నారంభించిన సమాసములనువాడుట నన్నయకిష్టము. ఇది తిక్కనకవితలో కానరాదు.

తిక్కన సంస్కృతశబ్దములను, తెనుగుపదములను పద్యములలో కూర్చుటయందు చూపిననేర్పే ఆతని కవితకు శోభ దెచ్చినది. ఒక్కొకచోట అతడు కేవల సంస్కృత శబ్దములనే విడివిడిగా ప్రయోగిస్తాడు: మధ్యమధ్య తెనుగుపదములతో టంకము వేస్తాడు:

ఉ. కూర్చుట నూత్నరత్నమున
కుం గనకంబునకుందగున్ జనా
ర్యార్చితమైన భారతము
పారకృపాపర తంత్రవృత్తి మైఁ
జేర్చిన దేవదేవునకుఁ
బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వర
ణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్.

కొన్నియెడల తెనుగుపదములతో పద్యములు సాగించి మధ్యమధ్య సంస్కృతశబ్దములతో బిగువుతెస్తాడు. ఇది ఆతని సర్వసాధారణ మార్గము:

ఉ. ఒప్పెడు మేను; పెంపుగల
యుల్లము నాగరికంపుఁజందముం
జెప్పకచూప కీతని వి
శేషముఁదెల్పెడుఁ గొల్చు టెంతయున్
దెప్పర మేమి సేయుదుఁ గ
డిందివిచారము పుట్టె; నెట్లితం
డప్పురి సంచరించు నొకొ
యన్య లెఱుంగకయుండునట్లుగన్

చ. ఇది గడుముద్దరాలు; పను
లేమియుఁ జేయఁగనేర దెంతయున్
మృదు వొక కీడు పాటునకు
మేకొనఁజాల; దుదాత్తచిత్త; యెం
టిదిరుగుదాని కోర్వదొక
టిం దనుదా సహరించు చొప్పెఱుం
గదు; తగ నొండులంగొలువఁ గా
వెర వెమ్మెయిఁ గల్గునక్కటా!

కొన్నిచోట్ల సంస్కృతపదములను వరుసగా పేర్చి, కూర్చి చప్పున దేశ్యపదరచనకు దిగుతాడు. ఈ విధము పరమ మనోహరము:

చ. అకుటిలుఁ; డార్యసమ్మతుఁ; డ
హంకృతిదూరుఁడు; నీతినిర్మలా
త్మకు; డనవద్యశీలుఁడు; స
ధర్ముడు; దాంతుడు; గొంతి మద్దునే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుం గొడుకు; మేను లేఁత; తన
యుల్లము మెత్తన; యిట్టి యాత డె
ట్లోకో యొరు నాశ్రయించు; విధి
యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్.

ఇట్లు కూర్చుటవలన సంస్కృతపదముల అందమున్ను, తెనుగుపదముల ఇంపుసొంపులున్ను ప్రత్యేకముగా గోచరించి, రెండింటి మార్గభేద ప్రస్ఫుట ప్రదర్శనమువల్ల ఆనందావిర్భావ మెన్నియో రెట్లు హెచ్చుగా పొంగిపొరలుతూ కలుగుతుంది.

ఈ రీతిగా తిక్కన పదములకూర్పు, ధ్వనులు, హొయలు, సొరు, అనేకవిధములుగా గమకము పొంది ఆ కవితాసౌందర్యమునకు తోడ్పడినవి. రెండేసి, మూడేసి, నాలుగేసి, అక్షరములు గల పదములు ఒకదానితో నొకటి అనేకవిధములుగా చేరి పదగమనము భరతశాస్త్రరీతి ననేకరీతులుగా పోషించినవి ఈపద్యముల నడకవిషయమై ముందుముందు తెలుపబోతున్నాను.

## ఛందస్సామగ్రి

శబ్దసామగ్రినిగురించి ముచ్చటించినప్పుడు తిక్కన రచనలో అచ్చికపదము లెక్కువగా ఉన్నవని చెప్పినాను. అచ్చికసంజ్ఞ తద్భవదేశ్యశబ్దములకు మనలాక్షణికు లుంచినది. కాని, దేశ్యశబ్దములు కూడ తద్భవములే అనిన్ని, అవి ప్రాకృతభవములనిన్ని నామతము. ఈ విషయమై ఎట్టి సందేహమున్ను నాకు లేదు. శబ్దరత్నాకరాదులలో దేశ్యములని ఉదాహరింపబడిన పదములలో చాలావరకు ప్రాకృతభవములే అని నేను దృఢముగా చెప్పగలను. మిగిలిన కొద్దిశబ్దములుకూడా ప్రాకృతభవములని కొలదికాలములో నిరూపింపగలనని నా ధైర్యము. నేను రచించిన "ద్రావిడ భాషాతత్త్వ" మను గ్రంథములో ఈ వాదమును నిరూపించినాను. మన లాక్షణికుల అభిప్రాయముకూడా అంతే కాని, ఆంధ్రముగాని, తక్కిన ద్రావిడభాషలుగాని, ప్రాకృతభాషావికారము లెట్లగునో వారెవ్వరున్ను నిరూపింపలేదు. కొన్ని శబ్దములకు మాత్రము వారు ప్రాకృతమూలముల నిచ్చి తృప్తిపడినారు. నే నావిషయమును నా గ్రంథములో కొంచెము లోతుగా విమర్శించినాను. కాల్డ్వెల్ తన ద్రావిడభాషల పరస్పరసంబంధమునుగురించి వ్రాసిన గ్రంథములో ద్రావిడభాషలకు సంస్కృతముతో సంబంధము లేదని వ్రాసినాడు. అవిమర్శకముగా మనవారున్ను, యూరోపియనులున్ను ఆవాదము నంగీకరించి, అదియే సిద్ధాంతమని నమ్ముతున్నారు. మనదేశములో కాకపోయినా యూరోపులో నాపుస్తకము ఈవిషయమై కొంతసంచలనము కలుగజేసినట్లు కనబడుతుంది. సర్ జార్జి గ్రియర్‌సన్, స్టెన్ కానో, బ్లాక్ మొదలయిన యూరోపియనువిద్వాంసులు కొంతతలలూపినారు. ఇంకను పరిశోధన కావలెనని నాకు వ్రాసినారు. నా గ్రంథమును జర్మను, ఫ్రెంచిభాషలలోనికి పరివర్తనము చేసుకొన్నారు. లండనులోని ప్రోబ్‌స్టేను కంపెనీవారు నూరుప్రతులనుకొని, పాశ్చాత్యవిద్వాంసుల కందజేస్తున్నారు. ఈ ప్రశంసఅంతా ఎందుకంటే, ఆంధ్రభాష ఒక ప్రాకృతభాష అనిన్ని, దానిని తిరిగీ సంస్కృతముతో అంటగట్టి ప్రాకృతమునకే ప్రాశస్త్యమును కల్పించి దానిని సంస్కృతముకంటె చిన్నగా తీర్చిదిద్దుటకై తిక్కనవంటి మహాకవులు ప్రయత్నించినారనిన్ని చెప్పుటకే. ప్రాకృతముమీద అభిమానము ఈదేశములో చిరకాలమునుంచిన్ని ఉన్నది. సంస్కృతము పురుషభాష అనిన్ని, ప్రాకృతము స్త్రీభాష అనిన్ని కాంతాసమ్మిత మైన కావ్యమునకు ప్రాకృతమే గాని సంస్కృతము అందము నివ్వదనిన్ని కొందరు ప్రాకృతకవు లన్నారు. ప్రాకృతకావ్య మమృతతుల్యమనిన్ని దానిని చదివి దాని అందమును గ్రహింపలేనివాడు రసికుడు కాడనిన్ని కొంద రన్నారు. "ఉత్తిబిసేసో కబ్బో భాసా జాహోఇ సాహోదు" (ఉక్తివిశేషం కావ్యం భాషాయాభవతి సా భవతు") అని ఒకర న్నారు. ఎట్లయితేనేమి సంస్కృతభాష సామాన్యజనుల కందరానిపండు కాగా ప్రాచీనప్రాకృతకావ్యములు బయలుదేరినవి. ఆప్రాకృత భాషలున్ను దుర్గమములు కాగా వాని వికారములయిన దేశభాషలలో కావ్యములు బయలుదేరినవి. కొందరు సంస్కృతభాషను మన్నింపనేలేదు. ఇట్టివారు తమిళులు. అయినా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారిభాష ప్రాకృతభాష కాకతీరదు. కొందరు సంస్కృతమును మన్నిస్తూ దేశభాషలలోకూడా ప్రాశస్త్యమున్నదని గ్రహించి వాటిలో కావ్యరచనకు పూనినారు:

దేవతల భాష కావున తెనుగుకన్న
సంస్కృతమె మిన్నయని యెంద్రు సరియె తెలిసె
రసికుఁడగువాఁడు తనదు జారుసిగలోన
తులసినే యిడుకొనునో జాజులనె యిడునో.

అని ఒకకవి అన్నాడు. హరిహరమూర్తి తనతో భారతమును "తెనుగుబాస వినిర్మింపఁ దివురు టరయు, భవ్యపురుషార్థ తిరుపక్వ ఫలము గాదె, దీని కెడ నియ్యకొని వేడ్కనూని కృతిపతిత్వ మర్థించి వచ్చితి దిక్కశర్మ" అని పలికినట్లు తిక్కన్న వ్రాసుకొన్నాడు.

తెనుగుభాష ఎట్లు ప్రాకృతజన్యమో తెనుగు ఛందస్సుకూడ ప్రాకృత జన్యమే. దేశీయచ్ఛందస్సులన్నీ మాత్రాగణబద్ధము లని మనకు తెలుసును. అట్లే వైదిక ఛ్చందస్సులున్నూ. తైత్తిరీయ ఐతరేయ ఆరణ్యకములలో ఛందః పురుష వర్ణన మున్నది. ప్రాకృతచ్ఛందస్సులు వైదికచ్ఛందస్సంప్రదాయములోనివి. సంస్కృతచ్ఛందస్సులూ, వృత్తాదులు క్రొత్తగా ఏర్పడినవి. పూర్వ సంస్కృతకావ్యములలోకూడా మాత్రాగణబద్ధ శ్లోకములు కానవస్తవి. వీటినే ప్రాకృతకవులు ఎక్కువగా వాడుకొన్నారు. ఛందఃపురుషుని శీర్షకమే, ప్రాకృతములోని "సీసఅఁ"; మన సీసమున్నూ అదే. అతని స్కంధకమే ప్రాకృతములోని "ఖంధఅం"; మన కందమున్నూ అదే. సంస్కృతములో "హస్తవృత్తి" అనే పద్యములేదు కాని, ప్రాకృతములోని "అర్థవిళద"అనేది మన ఆటవెలది అవుతుంది. ఇది ఛందఃపురుషుని హస్తవృత్తికావచ్చును. ప్రాకృతములోని "ఛేక్ గీదిఆ" మన తేటగీత. మన ద్విపద సంస్కృతనామముతోనే ఉన్నది. ఇది ప్రాకృతములో "దువఇ, దువది" అనే పేళ్లతో ఉన్నది. మన అక్కరలు "అక్షర" వృత్తముల వికారములు. మన తరువోజ "త్రిపద్యా" శబ్దవికారమైనట్లు తోస్తుంది. ఈ రీతిగా ఆంధ్రకర్ణాటక చ్ఛందస్సులన్నీ ప్రాకృతచ్ఛందోవికారములైనట్లు స్ఫురించకపోదు. ఆ ప్రాకృతచ్ఛందస్సులో ఛందఃపురుషుని ఆకారమునకు ముఖ్యములయిన శీర్షమునున్నూ, స్కంధమునున్నూ, హస్తవృత్తినిన్నీ, ద్విపదమునున్నూ మనవారు ఎంచుకొని ఉపయోగించుకొన్నారు. కాని, ప్రాకృత మాత్రాగణచ్ఛందస్సులకున్నూ, ఆంధ్ర దేశీయచ్ఛందస్సులకున్నూ చిన్న చిన్న వ్యత్యాసములు లేకపోలేదు. అట్లే, ఆంధ్రచ్ఛందస్సులకున్నూ కర్ణాటకచ్ఛందస్సులకున్నూ స్వల్పభేదములున్నవి. ఇట్టి భేదములవల్లనే ఈ రెండుభాషలకున్నూ ప్రత్యేకత్వమేర్పడినది. ఈవిగ్రహనిర్మాణములో శీర్షముకంటె, స్కంధము చాలా ఎక్కువ పరిమాణము కలిగి ఉండవలెను గదా. అందుచేత కందపద్యముల నెక్కువగాను, దానికి తగిన పరిమాణములతో తక్కిన అంగములనున్నూ నిర్మిస్తే చక్కని విగ్రహమేర్పడుతుంది. అట్లు చేయడమే శిల్పిచాతుర్యమును ప్రకటిస్తుంది. తక్కిన వృత్తములుకొలదిగాఉంటే అందము. అన్నీవృత్తములే అయి శరీరములేకుండా గాని, చిన్నదిగా గాని చేయడము కవిత్వశిల్పము కానేరదు. శిల్పి మనోహర విగ్రహమునుమాత్రము నిర్మించి తృప్తిపొందడు. ఆవిగ్రహమునకు తగిన పీఠముపై, గద్దెపై దానిని నిలుపుతాడు. గద్దెలేకుంటే విగ్రహమునకు గౌరవములేక, నేలపై పొర్లాడవలసి ఉంటుంది. అందుచేత క్రింద గద్దెవుంచి, దానిపై సుందరవిగ్రహమును ప్రతిష్ఠాపించి, దానిచేత మనోహర భావగానమును చేయించువాఁడే కవి. ఈఉద్దేశముతోనే చంపూకావ్యములు బయలుదేరినట్లు తోస్తుంది. గద్యమే కావ్యవిగ్రహమునకు గద్దె; గద్య శబ్దవికారమే 'గద్దియ, గద్దె' అయితే మన నిర్వచనము సరిపోతుంది. గద్దె అనగా ఉన్నతపీఠమని తెనుగులో అర్థమున్నదిగాని, సంస్కృతములో ఆ అర్థమున్నట్లు సంస్కృత నిఘంటువులు చెప్పవు. కాని, శబ్దరత్నాకరకారుడు గద్దె శబ్దము వైకృతమని చెప్పినాడు. ఎట్లుచెప్పినాడో తెలియదుగాని, ఆయన ఊహమాత్రము మన కిప్పట అనుకూలించినది. తిక్కన ఈశిల్పరహస్యమును తనభారతరచనయందు బాగుగా గుర్తించినట్లు తోస్తుంది-అతను రచించిన పదిహేనుపర్వములలోను గద్యపద్యములమొత్తము ౧౭౬౬౮. వీటిలో వచనములు ౪౭౬౦, అనగా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొత్తములో ౨౯% కందములు ౫౨౭౯, మొత్తములో ౩౩ ౧/౩%. తేటగీతములు ౧౫౭౭, సుమారు ౧౧%. ఆటవెలదులు ౧౦౧౧, ఇంచుమించు ౬%. సీసపద్యములు ౧౧౦౦, ఇంచుమించు ౭% తరువోజులు ౬, ఉత్సాహములు ౮. మొత్తము దేశీయచ్ఛందస్సులు ౧౩౫౪౦, అనగా మొత్తములో ౮౬.౪౨%. ఈ దేశ్యకావ్యశరీరమునకు అలంకారములుగా ఉత్పలమాలలు ౬౮౦, సుమారు ౩%, చంపకమాలలు ౯౫౩, సుమారు ౫%. శార్దూల విక్రీడితములు ౧౨౦, మత్తేభవిక్రీడితములు ౨౪౦. ఇవి విగ్రహమునకు హానికలుగకుండా కాపాడడానికి. పైనాలుగున్న కలిసి ౧౯౯౯. ఇక తక్కిన చిల్లరఅలంకారములు. స్రగ్ధరలు ౯, మహాస్రగ్ధరలు ౧౫, తరళములు ౫; వసంతతిలకములు ౨, మత్తకోకిలములు ౭, ఇంద్రవజ్ర ౧, తోటకములు ౯, కవిరాజ విరాజితములు ౨, దోదకము ౧, మంజుభాషిణి ౧, ఉపజాతి ౧, తోదకము ౧, భుజంగప్రయాతములు ౨, మానినులు ౩, మణిమాల ౧, స్వాగతము ౧, వనమయూరము ౧, నర్కుటములు ౨, బంధురము ౧; ద్రుతవిలంబితము ౧, శుద్ధవిరాటి ౧, లయవిభాతులు ౨, ఉపేంద్రవజ్ర, స్రగ్విణి ౧, ప్రణవము ౧, జలధరములు ౨, రుగ్మవతి ౧, మేదిని ౧, క్రౌంచపదము ౧, అంబురుహము ౧, ప్రహరణకలితము ౧, శిఖరిణి ౧, మణిగణనికరము ౧, లయగ్రాహులు ౪, మంగళమహాశ్రీ ౧, సరసిజము ౧, భాస్కరవిలసితము ౧, మందాక్రాంతము ౧, మొత్తము ౧౨౯. వీటిలో చాలామట్టుకు ఇంచుమించుగా అన్నీ స్త్రీపర్వములో ఉండడము విశేషము. ఇన్నిటిని స్త్రీపర్వములో ఎందుకు చేర్చినాడంటే స్త్రీపర్వము సరికి విగ్రహస్వరూపము స్పష్టముగా ఏర్పడినది గనుక అలంకరణమును కవిసాగించినాడని నాసమాధానము.

నిర్వచనోత్తర రామాయణమును తిక్కన ఈ దృష్టితో నిర్మించలేదు. దానిలో కావ్యవిగ్రహస్వరూపమే ఏర్పడలేదు. ఇందులో విగ్రహమునకు గడ్డలేదు. మొత్తము ౧౨౩౩ పద్యములలో ౭౬౦ దేశీయచ్ఛందస్సులు; ౪౭౩ సంస్కృతచ్ఛందస్సులు. కందములు ౫౨౫, సీసములు ౬౫, ఆటవెలదులు ౮౭, తేటగీతములు ౮౩. ఇట్లొక మొద్దుస్వరూప మేర్పడినది. ఈవిగ్రహము వికారమును కప్పిపుచ్చడమున, అలంకారములను ఎక్కువగా చేర్చినట్లు కనబడుతుంది. నన్నయ కవితాకన్య విగ్రహము ఛందోవిషయమున సౌష్ఠవమైనదే గాని విగ్రహము చిన్నది. దానిపీఠము చాలాపెద్దది. అనగా నన్నయవచనముతో చాలాభాగము కథను నడపినదన్నమాట, ఆవచనములు కూడా చాలాపెద్దవి. తిక్కనవచనము లట్లుగాక ముద్దుగా, ముక్తసరిగా ఉంటవి. నన్నయ కందములు ౧,౬౫౫; వచనములు ౨౦౨౧: తే. గీ. ౨౮౬; ఆ. వె. ౨౯౦; సీసములు ౩౧౬; తరువోజలు ౧౩; మధ్యాక్కరలు ౩౮; మధురాక్కరలు ౩; ఉత్సాహలు ౫; మొత్తము దేశీయ చ్ఛందస్సులు ౪౪౪౪; సంస్కృతచ్ఛందస్సులు ఉత్పలమాలలు ౩౧౭; చంపకమాలలు ౩౬౭; శార్దూల విక్రీడితములు ౪౧; మత్తేభవిక్రీడితములు ౧౨౬; మాలినులు ౮; స్రగ్ధరలు ౩; మహాస్రగ్ధరలు ౪; కవిరాజ విరాజితములు ౨, మానినులు ౨; లయగ్రాహులు ౪; పద్మకము ౧; తరళములు ౩౩; తోటకము ౧; మత్తకోకిలలు ౩౪; పృథ్వీ ౫; వనమయూరములు ౨; వసంత తిలకములు ౩; స్వాగతము ౧; ద్రుతవిలంబితము ౧; రథోద్ధతము ౧; అంబురుహము ౧; మణిభూషణము ౧; దండకము ౧; స్రగ్విణి ౧; మొత్తము ౯౫౭. మొత్తము నన్నయవాడిన గద్యపద్యములు.

నన్నయసీసములు నియమబద్ధము లని చెప్పినాను. ఆనియమమునుగురించి నామిత్రులు గడుగు సీతాపతిగారు చక్కగా పరిశోధించినారు. నేను నన్నయ ఆటవెలదులున్న తేటగీతములున్నకూడా నియమబద్ధములని నిరూపించి ఉంటిని. అట్టినియమము లేవీ తిక్కన గ్రంథములో లేవు. నన్నయ విగ్రహము తలగాని చేతులుగాని కాళ్లుగాని, ఆడించడమునకు వీలులేకుండా కట్టుబడిపోయినది తిక్కనకావ్య కన్య అట్టి బంధములకులోనుగాలేదు. అందుచేతనే తిక్కన కవిత్వము జీవకళలతో ఒప్పుచున్నది.

"కందము చెప్పినవాడు కవి. పందిని పొడిచినవాడు బంటు" అనుసామెతను మీరెరుగుదురు. ఈసా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెత తిక్కనవాడుక ననుసరించి వచ్చినది. కవిచోడప్ప ఈవిషయమున తాను తిక్కనతో సమానుడనని అనుకొన్నాడు. కాని, తిక్కనకందముల కవిచోడప్ప కందములు కావు. కవిచోడప్పకందములు వెట్టివాలకములు; తిక్కనకందములు తెనుగుభాష కామహాకవి కూర్చిన అందములు. తిక్కనకందములఁగూర్చి ఆలోచించక పూర్వము ఈకంద పద్య చరిత్రమును కొంత తడవవలసియున్నది. సంస్కృతములో కందమను పేరు లేదు. దానిలోని ఆర్యాగీతి మనకందమునకు సరిపోతుంది. కాని సాధారణముగా సంస్కృతకవులు ఆర్యావృత్తమునే వాడినారు గాని, ఆర్యాగీతులను వాడలేదు. ప్రాకృతములో ఈ ఆర్యాగీతికి "ఖందఅం" స్కంధకమ్ అని పేరు. ప్రవరసేనుడు తనసేతు బంధమహాకావ్యమును ఈ స్కంధకములలో వ్రాసినాడు. ఈకావ్యములో కొలదిగా ఇతర వృత్తములు కూడా ఉన్నవి. కాని అతనికి ఈకందమే ఇష్టమయినది.

కందపద్య లక్షణము:

చఉమత్తా అట్ఠగణా
పువ్వద్దే ఉత్తరద్ధ హోంతి సరూఆ
సో ఖంధఆ విఆణహు
పింగల పభణేఇ ముద్ధి బహుసంభేఆ."

దీనికి ఛాయ:

చతుర్మాత్రా అష్టగణాః
పూర్వార్ధే ఉత్తరార్ధే భవంతి సరూపాః
తం స్కంధకం విజానీత
పింగలః ప్రభణతి ముగ్ధే బహుసంభేదమ్

స్కంధకమునకు మరిఒకలక్షణము కూడా ఉన్నది.

స్కంధకమపి తత్కథితం
యత్ర చతుష్కల గణాష్టకే నార్ధం స్యాత్
తత్తుల్య మగ్రిమదలం
భవతి చతుఃషష్టిమాత్రికశరీరమిదమ్."

పై లక్షణము ప్రకారము కందములో రెండర్ధభాగములుండుననిన్ని, ఒక్కొక్క భాగములో నాలుగేసి మాత్రలుగల ఎనిమిదిగణములుండుననిన్ని తేలినది. ఆంధ్ర కర్ణాటక కందములలో ఈ లక్షణము కొంత సూక్ష్మముగా చెప్పబడినది. మొదటి పాదములోను, మూడో పాదములోను నాలుగేసి మాత్రల మూడుగణముల చొప్పున పండ్రెండుమాత్రలున్ను, రెండు నాలుగు పాదములలో నాలుగేసి మాత్రల అయిదు గణముల చొప్పున ఇరవై మాత్రలున్ను, మొత్తము ౬౪ మాత్రలున్ను కందములో ఉండవని కన్నడకందపద్యలక్షణము. బేసిని జగణముండకూడదను నియమము ఆంధ్ర కర్ణాటక లక్షణములలోనున్నది. అట్లు బేసిని జగణముండుటవల్ల "గండనిల్లద శశివదనెగె గర్భమాద తెఱనొళ్ కెడుగుం", "మగడు లేని శశివదనకు గర్భమయిన తెఱగునచెడు" నని నాగవర్మ చెప్పినాడు. ప్రాకృతస్కంధకములలో కూడా ఈ నియమమును పాటించినారుగాని, లాక్షణికులు ఆనియమమును వివరించలేదు. సంస్కృత ప్రాకృతములలో ఈవృత్తమందు ప్రాసనియమములేదు. కన్నడములోను, తెనుగులోనున్నది. తెనుగులో యతిస్థానములో అక్షరమైత్రి ఉండవలెనని కర్ణాటకములో కంటె ఎక్కువ విశేషమున్నది.

తిక్కన్న నియమములు మన్నించేవాడు కాడని మనవిచేసి ఉంటిని. నియమము లతని ననుసరింపవలసినవే కాని, అతడు నియమముల ననుసరించే వాడుకాడు. అంటే, అతని పద్యములలో స్వాతంత్ర్య మెక్కువ అనిన్ని, పద్యగమనమును, భావరమ్యతను మాత్రమే ఆతడనుసరించినాడనిన్ని నాఅభిప్రాయముగాని, అతని పద్యములలో గణనియమము కనబడదని నాఅభిప్రాయముకాదు. కాని, లాక్షణికులు ఏర్పరచినలక్షణము ప్రకారము అతని పద్యములను ఛేదింపకూడదని నాఉద్దేశము, అట్లు ఛేదిస్తే తిక్కన పద్యలక్షణముచెడును. ఆఛేదించిన భాగములు అర్థవంతములుగా ఉండవు. ఒక కందపద్యమును లాక్షణికుల ప్రకారము ఛేదించిచూతాము:

క. భూరిభ| వత్కా| రుణ్య|
క్షీరాం| బుధినా| దుకుష్ఛ| చిత్తం| బునవిస్|
తారము| హితముగ| నునిచితి|
వారయ| నచ్చెరు| వుగాదె| యఖిలాం| డపతీ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ రీతిగా ఖండించడమునకు మనమలవాటు పడిపోయి నాము గనుక, మనకది వికారముగా కనబడదు. తిక్కన తన పద్యములను లాక్షణికులు ఖండించడమునకు వ్రాయ లేదు. వాటిని చదివి ఆనందించవలెనని వ్రాసినాడు. అందుచేత, వాటిని చదువవలసిన తీరెట్లు అని ఆలోచిం చుకోవలెను. ఈ విషయమై చాలకాలమునుంచిన్ని ఆలోచిస్తున్నాను గాని ఒక త్రోవ చిక్కలేదు. తిక్కన పద్యముల గతిని అతిశీఘ్రముగా మార్చివేస్తాడు. అందు చేత లక్షణమన్నిటికిని ఒకటే అయినా, అర్థవంతముగా వానిని ఛేదించడానికి కూడా ఒకమార్గము దొరక గల దని నావిశ్వాసము. పద్యము విరుపుల ననుసరించి ఈవిభా గము చేసుకోవచ్చును. విరుపు ఎక్కడ ఉంటే అక్కడ విరామమని అనవచ్చును గాని, రెండోపాదములో మూడో గణము తరువాత విరామము అని చెప్పకూడదు.

క......లాసిక, తనమున నిపుణుండనైయ తని మెప్పింతున్.

క.....అని కడఁగు నిన సుతునకు, నమ్మద్రో ణుఁడు ద్రోణనంద-నుఁడుఁ గృపుఁడును శాంతనవుడు.

వీటిలో యతిస్థానమువద్ద విరామముంచుతే అర్థము చెడిపోతుంది గదా. అది విరామస్థానము కాదు. ఎక్కడ అర్థవంతమగుటకు మన విరామము కావలసి ఉంటుందో, అదియే విరామస్థానమను కొనడము భావ్యము గనుక, అర్థవద్విరామము ననుసరించి తిక్కన విరాటపర్వము మొదటి ఆశ్వాసములోని కందపద్యములు ఆలోచించుదాము:

క. పరమశివనిరత సంయమి
వరమానసకమలహంసవర్తనచం చ
చ్చరణనఖ చంద్రికా వి
స్ఫురణా చిత్రప్రకార శోభాఢ్యునకున్

ఈ పద్యము నంతటిని ఒక్కగ్రుక్కలో విరామమక్కర లేకుండా చదువవలెను:

క. జలనిధి హిమవద్భూధర
కలిత జనన కేళి కౌతుకవ్యక్తావ్య
క్త లలిత సౌందర్యస్ఫుర
దలఘుతను శ్రీసనాథ! హరిహరనాథా!

దీనిని రెండుగ్రుక్కలలో చదువవలెను. అనగా ఒక్కటే విరామము.

క. మనవంశంబును వృత్తం
బును బెంపును గావఁజాలు పుణ్యపతివి! దు
ర్జనులగు తులువల తలఁపులు
గనుఁగొని! యేమఱక మెలఁగగావలయుఁ జుమీ.

దీనిని రెండు విరామములు పుచ్చుకొని చదువవచ్చును:

క. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ
బనుపక యెంగిలికి లోనుపఱుపక తగువ
న్ననతోడ నరయువారల
కనురాగము నెఱపినడకు రస్మత్ప్రభులున్.

దీనిని మూడు విరామములతో చదువవచ్చును:

క. అనుటయు! దరహసితము మో
మునకుఁ దొడవుగాఁగఁ బలుకు ముద్దియ। యేఁ గృ
ష్ణునిదేవి! సత్యభామకుఁ
బనిసేయుదుఁ దొల్లి! పిదపఁ బాంచాలికడన్.

దీనిని నాలుగు విరామములతో చదువవలెను.

క. తెలుగుల పాడియొకఁ దెసఁ! జె
య్యల దామెన యొక్కవలన। ననువైయుండన్
మొలమోపి! పెక్కుచుట్లం
బలు ద్రాటం!జుట్టి గోపభావం బలరన్.

దీనిని అయిదు విరామములతో చదువవలెను:

క. అని చెప్పిన విని! యనుఁ బొ
మ్మని! కైకొని! ధర్మతనయుఁ! దండఱుమను! ని
ట్లనపాయత వర్తిల్లుద
మని! తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్.

దీనిని ఆరువిరామములతో చదువవలెను.

క. పెనుఁబోడవు! బలుపు! సొంప
మ్మను గలయది! దీన నెల్ల పురుషులకుఁ బ్రమో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జన మొక(ండు లేదు। నేరం
జన। జూడ(గ। నరయ। నెక్క సముకట్టంగన్.

దీనిని ఏడు విరామములతో చదువవలెను.

ఈరీతిగా విరాటపర్వము మొదటి ఆశ్వాసము లోని ౧౨౨ కందపద్యములలోను ఒక గ్రుక్కలో చదువ వలసినది ౧; రెండు గ్రుక్కలలో చదువవలసినది ౧; మూడు గ్రుక్కలలో చదువవలసినవి ౧౨; నాలుగు గ్రుక్కలలో చదువవలసినవి ౨౩; అయిదు గ్రుక్కలలో చదువవలసినవి ౪౫; ఆరు గ్రుక్కలలో చదువవలసినవి ౬౧; ఏడు గ్రుక్కలలో చదువవలసినవి ౧౩; ఎనిమిది గ్రుక్కలలో చదువవలసినవి ౮ను ఉన్నవి. అయిదు గ్రుక్కలలో చదువవలసిన కందములే తిక్కన గ్రంథములో తరుచుగా కానవస్తవి. ఇల్లే ఇతరపద్యముల విషయములో కూడా, అర్థవంతముగా విరామముల నేర్పరచుకొని తిక్కన పద్యములనుగాని, మరియొకరి పద్యములనుగాని చదువ నేర్చుకొనవలెనుగాని లాక్షణికులమార్గము త్రొక్కుట సమంజసముకాదు. ఈ గ్రుక్కలలో కూడా, ఒక్కొక్క గ్రుక్కలో ఎన్నెన్ని యక్షరములు సాధారణముగా చేర్చినాడో అనే విషయమును బట్టికూడా పద్యములు ఏర్పాటు చేసుకోవచ్చును. లేదా, కందపాదముల ఎత్తుబడిని పట్టి అయినా విభాగము చేయవచ్చును. ఏయే గణములను పద్యముల మొదట చేర్చినాడని కూడా విమర్శించుకోవచ్చును. ఈరీతిగా తిక్కన తనకందపద్యములకు స్వేచ్ఛయైన గతి కల్పించి కందమునకు గౌరవము కల్పించినాడు. ఎన్నిరీతులుగా దానిని కదము త్రొక్కింపవచ్చునో।అన్ని విధములు త్రొక్కించినాడు.

ఇంతవరకును తిక్కన కవిత్వ సరణిలోని బాహ్యరూపమును మాత్రము కొంతవరకు పరిచ్ఛేదించి చూపినాను. భావస్వరూపమును ఛేదించుటకు వీలులేదు. ఆలంకారికులు ఆపనికి ప్రయత్నపడినా విఫలమనోరథులౌతారని నానమ్మకము. భావమువలన పుట్టే ఆనందము అనిర్వచనీయమైనది. అందులో తిక్కన భావప్రకటనమును నిరూపించుటకు ఇప్పటి అలంకారశాస్త్రము చాలదు. దానిని అనుభవించియే తీరవలెను. ఆవిషయమై మరిఒక వ్యాసములో ప్రసంగిస్తాను.

---

## చందనము

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మ గారు

ద్రోదము శూన్యమంగము పటిష్ఠమునై తగు దుష్టవంశముల్
బృందములై పరస్పరనివిష్టనిఘర్షసముద్భవాగ్నిచే
నెందు స్వవంశముం దెలుపనేల? వనంబునె కాల్చు మానవా
నందన చందనా! మలయనందన! వీరల పొందు మానుమా!

కొల్లగ నెల్లదిక్కులను గొల్లలుగొట్టెడు నీపరీమళా
భ్యుల్లస మార( బిల్వ మలయోద్భవమా! చనుదెంచినా(డ నీ
వెల్లసిరుల్ గనుంగొన(గ నేమిట నుండెను? దొట్టలోపల
న్నల్లనిపాముగాక; యి(క నవ్విడు నీకు శుభమ్ము పోయెదన్.

కాంతాస్వైరవిహారకేళి కుపయుక్తంబౌ తరుల్ చెండ్లకు
న్నంతోషంబును గూర్చు ప్రేమా(కులు, ఫలౌన్నత్యంబుచే( దృప్తివి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్రాంతుల్ గొల్పెడి చెట్లు నీసమమె? భద్రశ్రీద్రుమంబా! భవా
త్యంతోష్ణంబును బాపనేర్తు స్వతనూత్యాగోపకారమ్ముచే.

కొమ్మలపై విహంగములు కోటరమందు భుజంగముల్ ప్లవం
గమ్ము లోగిన్ సిరిన్ వికచక్రమ ఘుమంఘుమ గంధనవ్యపు
ష్పమ్ముల భృంగముల్ చెలఁగు చందనపాదపమా! గణింపశ
క్యమ్మటె మాకు నీతనువునం దెటలేవు వనీపకావళుల్?

మోటు తండ్రి; కొండపొలము కాఁపురము; ద్వి-జిహ్వకులముతోడి చెలిమి; మొండి
కట్టెజాతి; యైనఁ గానిమ్ము చందన-మా! స్వసుగుణములనె యసముఁగంటి.

కంటికిఁగడ వెఁడుగా నేమ్చు కులకాంత గడప దాటియుఁగూడఁ గదియరాదు
కడుపు చుమ్మలుచుట్టఁగా వందిరెకితల్లి కాటివఱకుఁగూడఁ గదియరాదు
గడియించుసర్వమ్ముఁ గైకొన్న సుతుఁడెల్ల కాలుదాఁకంగూడఁ గాంచఁబోఁడు
కడుమేల్లుగనవల్ల గన్నవారు తిలోదకములొసంగుటకేని కానఁబడరు
ఔనె! బ్రదికినన్నాళ్లు నిన్ సానఁబట్టి-నట్టి గృహమేధి తోఁ అఁగి కాయంబు చితిని
గాలుచుండఁ దోడుతెకి యంగంబు వాయు-చుందు నీవంటివారేరి చందనంబ?

పాపిష్ఠ మనుజులు దురా-శాపరులయి స్వీయలాభసంపాదము క
య్యో పాపము! నీరూపము-మాప మురియుచున్నారు సిగ్గుమాలి మలాకా!

“భళిరే! యెంతటి దైవభక్తిపరుఁ డీపాటీరుఁడం చన్న ని
స్తులకీర్తిం గననో? బలిష్ఠు నొక మొద్దున్ శ్రీజగన్నాథుకై
జలమార్గంబునఁ బంపుదంట; మఱి వేసంగిన్ నృహార్యర్చనా
దుల సింహాచలమందు నుందువఁట; యెందు న్మేలె ప్రత్యాశయున్?

నీమూలంబున నాకృతిం బడసి నీనీడం బ్రవర్ధిల్లి నీ
యామోదంబును బొంది నీసముఖమున దావాసముం జేయు నీ
వేముఁగలోనగు నన్యజాతితరువుల్ వే లోకమున్ జొచ్చి య
య్యో మేమేపుఁడి చందనాఖ్యఁగమటం చున్నారయా! చందనా!

నీపేరు సెప్పికొని యె-న్నో పాట్లంబడుచు బ్రదుకుచున్న వగవఁగా
నీపేరునకె కళంకం- బాపాదింప నొరు, లెట్టులాఁగుదు సఖుఁడా!
ఘ్రాణతర్పణంబు గావింప లేని నీ-నామధారకులను నరులు నమ్మి
“పేరుగొప్ప” గాని యూరుదబ్బ యటంచుఁ-బలుకఁ జొచ్చి రెంత భంగపాటు?

(అడవిపువ్వులు)

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము

మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు, "కళాప్రపూర్ణ"

కామార్కదుగ్ధే ఆవిర్భూత

సాహిత్య మీమాంసయే కావ్యవాఙ్మయ విమర్శ విద్యకు మూలాధారము.

మన దేశమం దచ్చులేనందునను, పృథ్వి (ఇండియా) అతివిపుల మగుటయు, షట్పంచాశద్దేశముల నుండియు కావ్యవాఙ్మయ ముత్పత్తిల్లుచునే యుండుట చేతను, సంస్కృతవాఙ్మయవిషయములో మన పూర్వులు ప్రత్యేక కావ్యవిమర్శలు వ్రాయరైరి. మఱి యెల్ల కావ్యముల గుణదోషములను ఎఱుంగుటకు సాధనమయిన శాస్త్రమును రచించినారు. అదియే సాహిత్య మీమాంస. అదియే మనకు కావ్య ప్రకాశము, భావప్రకాశము, సరస్వతీ కంఠాభరణము, సాహిత్య చింతామణి, కావ్యానుశాసనము, కావ్యాలంకారము, కావ్యాదర్శము, రసార్ణవము, సాహిత్య రత్నాకరము, రసార్ణవసుధాకరము, ప్రతాపరుద్రీయము, సాహిత్య దర్పణము ఇత్యాదిగ్రంథ రూపమున లభించియున్నది.

ఆ మీమాంసలో గుణదోషస్వరూపచర్చయుం గలదు.

పూర్వోక్త గ్రంథములయందెల్ల గుణపరిచ్ఛేద మొకటియు దోషపరిచ్ఛేద మొకటియు గలవు.

దోషములు రసదోషములు, పదదోషములు, వాక్యదోషములు, పదవాక్యదోషములు, అర్థదోషములు అని అయిదు తెఱంగులు.

ఔచిత్యము గుణములకు మూలము. అనౌచిత్యము దోషములకు మూలము. క్రమముగా:—నైషధాదులందలి మానుష నాయికా నాయక శృంగార వర్ణన; కుమార సంభవమునందలి పార్వతీ పరమేశ్వరశృంగార వర్ణన.

అశ్లీలతా గ్రామ్యతా ప్రభృతి దోషములు పెక్కులు అలంకార గ్రంథములందు నిరుక్తములు.

కవిసమయములు స్వభావ విరుద్ధములయ్యును అవిలంఘనీయములు.

ఆకాశము నలుపు, పాపము నలుపు; యశఃకీర్తి హాసములు తెలుపు; క్రోధానురాగములు ఎఱుపు; నదీ సముద్రములందు తామరలు, కలువలు వర్ణింపబడును; జలాధారములందెల్ల హంసాది జలపక్షులు విహరించు చుండును; చకోరములు వెన్నెలం ద్రాగును; మేఘాగమమున హంసలు మానససరోవరమునకు తరలి పోవును; పూఁబోఁడుల పాదతాడనముచే నశోకమును, నోటి సుర నుమియుటచేఁ బొగడయు పూచును; విరహ తాపముచేత యౌవనవంతుల యొడల హారములును, హృదయమును వ్రస్సిపోవును; మదనునికి ధనుర్బాణములు పువ్వులు, అల్లెత్రాడు తుమ్మెదలబారు, ఇతని బాణమునకును స్త్రీకటాక్షమునకును యువజనుల హృదయము వ్రీలిపోవును; పగలు తామర, రాత్రి కలువయు వికసిల్లును; ఆశుక్ల పక్షమందును వెన్నెల కాచును; ఋతుమునకు నెమళ్లాడును; అశోకమున కాయలు లేవు; వసంతమున జాతిపువ్వు ముండదు; గంధపుఁ జెట్లయందు పూవులుం గాయలు లేవు; ఇంకను ఇట్టివి సత్కవిప్రబంధములవలన నెఱుంగఁ దగును.

కాళిదాసును ఖూనీచేయించిన వేశ్య కవిసమయ మెఱుఁగనిదైనందుననే భోజునికి పట్టువడినది:—

"రాజన్ తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయమ్, కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే నచదృశ్యతే."

వర్ణ్యము నేపదములతో నుద్దేశింపఁ దగునో, వేనితో నుద్దేశింపఁ దగదో కవిసమయము బోధించుచున్నది.

సీ. మదిరాక్షి చెవులతో మిమ్మది లెక్కలనరాదు
        ముద్దియకనులు తమ్మి లనరాదు
శుకవాణి బుగ్గలు ముకురంబు లనరాదు
        చెలిపండ్లు మల్లెమొగ్గలనరాదు
గజయానచంన్నులు బంగరుగిండు లనరాదు
        సతిబొడ్డు సుడి ని మెచ్చదనరాదు
సరసిజాననముడ్డి సైకతం బనరాదు
        హరిమధ్యకా ల్లి సల్లనఁగరాదు
గీ. క్రమతవీనికి వీనులు కన్నదోయి
    చెక్కలును బలువరుసయు నిక్కఁ జన్ను
    గవయుఁ బొక్కిలి పిఱుఁదు చొక్కంపుటడుగు
    లనుచు మును వాడి రవియ చేకొనఁగవలయు.

ఈ కాలమందు కువిమర్శకులు తండోప తండము. వీరి కారణమున సుకవులు గ్రంథరచన మానుకొనుటయుం గలదు. కొందఱు కువిమర్శకులు సమకాలికకవియొక్క ధీరతను సహింపరు. ప్రాచీనకవుల యాత్మశ్లాఘను మెచ్చుకొందురు. నక్క వినయమునకు హర్షింతురు. కవి యెట్టివాఁడయిన నేమి విమర్శనీయవాఙ్మయము ఆలేని గ్రంథమేగాని యాతఁడే కాఁడు.

ఉ. అంకెకుఁ దార్చెనే రసిక
        నంగలభారతి ప్రౌఢనీతి, నా,
    కింకిరి నాంధ్ర ద్రావిడియుఁ
        గేరుచు దైవియుఁ గూడి రెవ్వనిన్,
    జంకు కళంకు లేని కవి
        చంద్రుఁడు తోషిత కోవిదేంద్రుఁ డా
    వేంకటరాయశాస్త్రి కృతి
        వెంగలిమూక కెఱుంగ శక్యమే?

ఆ. కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
    నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
    బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
    ప్రౌఢ నన్ను వేఱె పొగడ నేల.

మన్దః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్;
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివవామనః.

ఇందు తొలి యుదాహరణమున సూత్రధారుఁడు ప్రరోచనార్థము కవి నగ్గించుచున్నాడు. ఇది సంప్రదాయమాత్ర నిర్వహణమనియు, దీనిచే కవియొక్క సౌజన్య దౌర్జన్యతదన్యతరములు రూఢికెక్కవనియు కువిమర్శకు లెఱుంగవలయును. రసార్ణవసుధాకరము(III—94, 95, 96) తృతీయ విలాసముం బరిశీలించిన ఈ విషయము స్పష్టపడును.

"కవయస్తు ప్రబంధార స్తే భవేయు శ్చతుర్విధాః,
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతిభేదతః.
అంతర్గూఢాభిమానోక్తి రుదాత్త ఇతిగీయతేః"

యథామాలవికాగ్నిమిత్రే:—
        పురాణమిత్యేవ నసాధుసర్వం
తథాపికావ్యం నవమిత్యవద్యమ్
        సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః
"పరాపవాదాత్స్వోత్కర్ష వాదీ తూద్ధతఉచ్యతే."

యథామాలతీ మాధవే:—
యేనామ కేచిదిహ
నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపితాన్ప్రతినైష యత్నః;
ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచపృథ్వీ.

"యుక్త్యానిజోత్కర్ష వాదీ ప్రౌఢఇత్యపరేజగుః"

యథామమ ఇవ:
నేదానీ న్తనదీపికా కిము తమ స్సంఘాతమున్మూలయేత్,
జ్యోత్స్నా కింనచకోరపారణకృతే తత్కాలసంరోహిణీ,
బాలః కిం కమలాకరాన్ దినమణి ర్నోల్లాసయే దఙ్గసా
తత్సంప్రత్యపి మాదృశాఽపి వచః స్యాదేవ సత్ప్రీతయే"

"వినీతో వినయోత్కర్షాత్ స్థాపకత్వ ప్రకాశకః."

యథా రామానన్దే:—
గుణో న కశ్చి న్మమ వాఙ్నిబంధే
లభ్యేత యత్నేన గవేషితోఽపి;

తథా ప్యస్య రామకథా ప్రబంధం
సన్తో ఒనురాగేణ సమాద్రియన్తే.

వార్తాపత్రికలందలి విమర్శలు

కొందఱు వార్తాపత్రికాధిపతులు విద్వాంసుల గ్రంథములపై ఎవరే కువిమర్శ వ్రాసి పంపినను నిజ పత్త్రికలో ముద్రింతురు. తాము స్వయము గుణ దోషము లెఱుంగని యసమర్థులై యిట్లుచేయుటచేత భాషాదేవతకు తామొనర్చుచున్న చేటును వారెఱుంగరు. వారిలో వెల్లేమనగా అప్రముక్కుడి విమర్శ నందుకొని గాసింబడి యీసెత్తి ఆ విద్వాంసులు ఆత్మ గౌరవమును గాచికొనుటకై వ్రాసెడి నైగుష్య భూయిష్ఠ వాదప్రతివాద ఖండనమండన భండన ముండన వ్యాసములతో తమ పత్రికలు నిండి జనరంజకములై 'చందాలం బెంచుంగాక' యని.

అట్లే ఒకానొక పత్రికాపతి, 'తవనాసికా ఇకోయణచీవభాతి' అని వాదమునకు పిలుచుటగా మదీయ ప్రతాపరుద్రీయనాటకమందలి కవి వాక్య మును "అంతట నిద్రితుఁడు రాజు ప్రవేశించుచున్నాడు" అనుదాని నిట్లాక్షేపించు వ్యాసమును ప్రకటించు కొన్నాడు:—"నిద్రితుఁడెట్లు ప్రవేశించును? ప్రవేశించు టకు మెలఁకువ వలయును. నిద్రలో గమన మెక్కడిది? ఈ ప్రకారము మేము చిరకాలము ప్రశ్నలు వేయు చుండెదము, దీనికిని భావివానికిని శాస్త్రిలవా రుత్తర మీఁ గలిగినయెడల నీయవలసినది." అని. దీనికి నేను భయపడి యుత్తర మీయలేదు. పత్రికాధిపతికి మదీయ వ్యాసములు లేక పోయినవి. ఇట్టి యవి ద్వత్సంపాదితము లగు పత్రిక లంతరించుటయు, సాధు విమర్శలం బ్రకటించు విద్వత్సంపాద్యమాన పత్రికలు చిరాయువు లగుటయు సహజమేగదా.

కొందఱు కవులు నిజగ్రంథములు బహుళములై వానియందు దోషములు మెండయి దూషకులు దండి యైనప్పుడు తామే పత్రికలు నడపుచుండు వారగుదు రేని వానియందు, లేనిచో క్రొత్తగా వైరినిబర్హ ణార్థము పత్రికలం బెట్టికొని వానియందేని పూర్వోక్త దూషకులను గసితీఱ తిట్టుదురు. ఎట్లన—ఇందుకు యుదాహరణము:—"అశోకుని కంఠ శేకలిం వ గూంజ చేయా, నా గ్రంథమును విమర్శించిన యల్లగూగాశాస్త్రి గారిని సగాలు గా ఛెకలిచి వైపుము." ఇది విమర్శకు నుత్తరము.

కవి కావించిన భాషాచిత్రవధ కాయాసపడి విమర్శకుఁడు విమర్శలోఁ జూపు కటుత్వమును తొలఁగఁ బెట్టి పరిశీలు విమర్శ యొక్క పటుత్వాపటుత్వములనే పరికించికొనుట మేలు.

దొంగలకును, నరహంతలకును అధికరణకుండు వోలె కాకవికి సాధువిమర్శకుఁడు దోషోద్ఘాటకుఁడును శాసితయు నగును. దొంగను "శ్రీయుతులైన యో దొంగయ్యగారూ, తమరు ఇట్టి చౌర్యమును కావింప వలసినవారు కారు, మహానుభావులరు. మఱి తమరు 8 సంవత్సరములు కారాగామందిరంబున నటకంబు గావించి రాజకీయమైన విందారగించుచు మమ్మఁ గృతార్థులం గావింపుఁడు." అని యధికరణకుఁడు వేడుకొనుటలేదు. అట్లే సాధువిమర్శకుఁడును కాకవిని వేడుకొనవలసిన పనిలేదు.

గ్రంథకర్తలు అచ్చునుండి తమగ్రంథము వెలు వడిన వెంటనే మెచ్చువాక్యములకై పలువురకుం బ్రతులం బంపుదురు. గ్రంథమును పంపిన గౌరవము నకు లోఁబడి యా పలువురలో పెక్కురు ఈ కర్తను ఏతదీయగ్రంథమును స్తుతించుచు బదులు వ్రాయుదురు. వీరిలో నెవ్వఁడేని గ్రంథమందలి దోషములను బయటఁ బెట్టెనా, అంత నాయిరువురకును గజ కచ్ఛపయుద్ధము. వీరికై శ్రీమన్నారాయణుఁడు చేయి చేసికొనఁడు గావున నీ యుద్ధము తీఱదు. మఱి ఉదయించు నపుడు పూర్ణచంద్రుడు "రాత్రి శైలూషికీక, వరుస న్మౌక్తిక పట్టమై నిటలమై వక్త్రంబునై" దోఁచి లోక మెల్ల వెన్నెల వెదచల్లునట్లు వాదప్రతివాద వాఙ్మ యోదయము, జాబులై, పుస్తకములై, పత్రికలై దేశ మందెల్ల తొమ్మిదవ యట్టంపుఁ బారాయణముగా పర్వ చుండును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇప్పటి మన బుద్ధిమంతులు తాము పశ్చాత్య సారస్వతమున నలవరించికొన్న పాటి వైదుష్యమును ఆంధ్ర సారస్వతమున నలవరించుకొని యుండినచో దేశమునం దసాధువిమర్శలు, అసాధు ప్రతిపాదకులును నశ్యను. సాధువిమర్శలే హెచ్చును.

సాధువాఙ్మయసంరక్షణార్థమై యొక విద్వత్సంఘము అపేక్షణీయమై యున్నది. అందులకై నేను రెండు మూడు మాఱులు యత్నించి నెఱవేఱక మానితిని.

అదిలేమిచే

"దేవునాన మున్ను దేశాన నొక్కఁడు
కవియుఁగలఁడొ లేఁడొ కలియుగమున
ఇపుడు వీథివీథి నింటింట నూరూరఁ
గవులు గలరు జగతిఁ గఅవుతోడ."

అని పెద్దలు చెప్పినను కవిగానివాఁ డేనియు నుండుంగాని విమర్శకుడుగానివాఁ డుండఁడు. ప్రతివిద్యార్థియు విమర్శకుఁడే [తప్పులు పుస్తకములు వ్రాసి పండితులచేత దిద్దించుకొనియో, దిద్దింపకయో ముద్రించుకొని దారి యెఱిఁగి పాఠశాలలలో పఠనీయములు గాఁ బెట్టించికొని జీవించు వాఁడునువిమర్శకుఁడే.] పండితప్రణీతగ్రంథములకును, వానికిని అరుణాపటబలీవర్దన్యాయము. వీనికి అర్థముగానిదెల్ల కఠినము; మృదుమధురము గాదు; సంస్కృతపదము కంటి పోటు; క్రొత్తపదము ప్రాణగొడ్డము.

"శ్రీనాథుండు ధరాధరం
బుడుప నాజిం బెట్టుడుం
దాన వీరానీకంబులురక్షితాధ్వ
మున డాయుం దూయ నెవ్వాఁడు క
న్గొనా తేనియ పట్టాకో తిత
ఉవాకోట్నాఁగ శర్మార్థి యా
భానం దేనవజార్జి లోకపతి
సర్వశ్రీయుతుఁ జేయుతన్."

విద్యాధికారి—అయ్యా, యీ వేంకటరాయ శాస్త్రిని కవన మెవరు పింగటించమన్నారయ్యా—తితఉవే మిటండీ తితఉవు! ఇటువంటి శబ్ద ముంటుందండీ భాషలో! దీని కర్థంకూడా వుంటుందండీ! నేనెప్పుడు యెఱుగనండీ యీలాంటి శబ్దాన్ని!

శాస్త్రి—అయ్యా, తితఉవనఁగా జల్లెడ. 'చాలనీ తితఉఃపుమాన్' అని యమరుఁడు.

విద్యా—నాందీపద్యంలో జల్లెడవర్ణనేమిటండీ శివకేశవస్తుతి యుండవలయు గాని. అయినా గానీ మన తెలుగుకీ సంస్కృతంతోటి సంబంధం వదలాలండీ, అప్పటికే గాని మనభాష బాగుపడదు.

శాస్త్రి—వదలాలంటారు, మళ్లీ మీరే సంస్కృతశబ్దాలు ప్రయోగిస్తారు. సంస్కృతమేమిటి? సంబంధమేమిటి?

విద్యా—అదిభాషపేరు, ప్రాపరునేము. ఇది వాడుకమాట.

శాస్త్రి—ప్రాపరునేము ఇంగ్లీషుభాషయేమిటి? కానీ సంస్కృత మనుదానికి వేల్పుబాస యనవచ్చునే! సంబంధానికి తగులాటమనవచ్చునే! భాషకు బాస అనవచ్చునే! అప్పటికి మీతెలుఁగు బాగా కీసటబాసట అవుతుంది. పోనీ మీరన్నట్లు సంస్కృతమాటలు వాడడం వాడుకే గనుక మీలాగే ఇతరులనుకూడా వాడనిస్తురూ.

విద్యా—శాస్త్రుర్లవారూ, మీతో వాదంచెయ్యలేమండీ. మీకు నమస్కారము. ఈ బల్లారి సరసవినోదినీసభవారిచాత ఈ శాస్త్రిగారి పద్యాల నాటకాలని గుఱించి ప్రహసనమాడిస్తామండీ. నాటకమంటే పాటలమయంగా వుండాలి.

ఇట్టి విద్యాధికారి విమర్శకులం గూర్చియే పూర్వులు:

"విపులహృదయాభియోగే
ఖిద్యతి కావ్యే జడో నమూర్ఖ స్స్వే;
నిన్దతి కఞ్చుక మేవ
ప్రాయ శ్శుష్కస్తనీ నారీ."

"పనిఎడినారికేళ ఫల
పాకమునం జవియైన భట్టహ,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్టని కవితానుగుంభములు
సోమరిపోతులు కొంద ఱయ్యెలా,
నని కొనియాడ నేర
రది యట్టిద లేజవరాలు చెక్కఁగీఁ
టిన వసవల్ప బాలకుఁడు
డెందమునం గలగంగ నేర్పునే.

ఇందుల మూలము—

"మదుక్తి శ్చేదన్తర్మదయతి సుధీభూయ సుధియః
కి మస్యా నామ స్యా దర సపురుషానాదరభరైః;
యథా యూనస్తద్వత్ పరమరమణీయాపి రమణీ,
కుమారాణా మన్తః కరణహరణం నైవ కురుతే."

ఇందు తోడిదే ఇంకొకటి:

"గ్రన్థ గ్రన్థి రిహ క్వచి
త్క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా;
ప్రాజ్ఞమ్మన్య మనా హఠేన పఠితీ
మాస్మిన్ ఖలం ఖేలతు;
శ్రద్ధారాద్ధ గురుశ్లథీకృత దృఢ
గ్రన్థి స్సమాసాదయ
త్వే తత్కావ్య సుధోర్మి మజ్జన సుఖ
వ్యాస జ్జనం పజ్జనం.

"ఇతర పాపఫలాని యథేచ్ఛయా
వితర తాని సఖే చతురానన;
అరసికేషు కవిత్వనివేదనం
శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ."

ఇందులకు తెలుఁగు మదీయము—

"ఇతరపాపఫలము లిచ్చవచ్చిన యట్లు
వ్రాయవయ్యనొసట వనజభవుఁడ!
అరసికాళి మ్రోలసరసకావ్యము చెప్ప
వ్రాయవలదు వలదు వలదు వలదు."

అని హెచ్చరించినారు.

ఇప్పటి గ్రథనము లిరుదెఱంగులు—ఎ. తర్జుమాలు, బి. స్వతంత్రములు.

తర్జుమాలయందు (1) మూలార్థము తెలియక రసమును పాడుచేయుటయు, (2) లక్షణము తెలియమిచే భాషను పాడుగావించుటయు నుత్కటకోటికములు. ఇవి పద్యకావ్యములుగాని, నాటకములుగాని, ఇతరములుగాని పూర్వోక్తదోషములతో నిండియుండినచో వీనిని విమర్శించువారి కిందుం బొగడుట కేమి మిగిలియుండును? ఇట్టి గ్రంథములను విమర్శించువారిని 'దోషములనేచూపిరి; గుణములను చూపరైరి' అని నిందించుట న్యాయ్యము గాదు.

మూలమునకు మెఱుఁగువెట్టిన శృంగారనైషధ కవిని పొగడని రసికులెవ్వరు?—

మ. రణకండూభరదుస్సహంబయిన
యారాజేంద్రదేవేంద్రు ద
క్షిణబాహాగ్రమునం జనించిన మహా
కీర్తిప్రవాహంబు కా
రణసంక్రాన్తగుణానుషంగమున
నో ప్రస్ఫీతదిజ్మత్తవా
రణగండస్థలకుంభకూలములపై
రాయుం దివారాత్రముల్.

ఇందులకు మూలము:

"యశో యద స్యాజని సంయుగేషు
కండూలభావం భజతా భుజేన;
హేతోర్గుణాదేవ దిగాపగాళీ
కూలంకషత్వ వ్యసనం తదీయమ్."

దిక్కులు ఆపగలయిన ఏవి వానికిం జెప్పిన కూలములయినవో తెల్పమి యిటు సొంపుగాదని శ్రీనాథుఁడు కీర్తినే ప్రవాహముం గావించి దానికి దిగ్గజగండస్థలకుంభములను కూలములంజేసినాఁడు.

ఉ. ఇప్పటి నీతలంపు తెఱఁ
గిట్టిద యింకిటమీఁద నెప్పు డే
చొప్పున నుండునో నిజము
సుద్దియొఱుంగముగాని యొుగ్మలీ
చెప్పెడిదేమి బాలికల
చిత్తము లంబుతరంగలోలముల్
తప్పునొ తాఁకునో కుసుమ
ధన్వుని యేటులు దైవికంబునన్."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇందుల మూలము—

"త్వచ్చేతసః స్థైర్యవిపర్యయంతు
సంభావ్య భాన్యస్మిత మజ్జ ఏవ
లక్ష్మీహి బాలా హృది లోలశీలే
దరాపరాద్ధేషురపి స్మర స్స్యాత్."

"బాలికలచిత్తము లంబుతరంగలోలసుల్" అను నుపమ దీనిపై అక్షరలక్షలు చేయును.

మ. ఇదె వీక్షింపు చకోరశాబకనిభా
క్షీ, దీర్ఘికాహంసి యి
ప్డుదకాంతః ప్రతిబింబితుఁ
గగన మధ్యోపస్థితుఁ జంద్రునిఁ
మది దర్శించి నిజాధినాథుఁ
డనుచుఁ వాత్సల్య మేపారఁగాఁ
జదురొప్పం బరిచుంబనం బొ
నరిచెఁ జంచూపుటాగ్రంబునఁ.

ఇందుల మూలము:

"పశ్యోన్నత సౌధస్థితి సౌఖ్యాలక్ష్యే
త్వక్కేళివల్యాంబుని బింబ మిన్దోః,
చిరం నిమజ్జ్యాహ సతః ప్రియస్య
భ్రమేణ యచ్చుంబతి రాజహంసీ."

"గగనమధ్యోపస్థితుఁ" అను విశేషణము దీనికి జీవాతువు.

అధునికులలో ఇట్టి పరశువేధి యెవనికిఁ గలదు! చెత్తను బంగారమను టెట్లు!

మఱి స్వతంత్రగ్రంథములన్ననో

1. ఔచిత్యబాహ్యత, 2. భాషాసంహారము అను నీరెండు దోషములతో నిండియున్నచో నవి పూర్వోక్తములైన ముక్కుడి తర్జుమాలతోఁ గూడ పరీక్షలకుం బెట్టుటకు యూనివర్సిటీ వారికిని, తిట్టుచుం బాఠము చెప్పుటకు మునిషీలకును, ఏడ్చుచుం జదువుటకు విద్యార్థులకును, 'చోరాయ గడ్డిలాభాయ' అని డబ్బుగడించుకొనుటకు కవికిని బెట్ట్స బుక్కులుగా పనికివచ్చునే గాని భాషానాళకములుగాక యెట్లు తప్పును? విమర్శకులకును రసజ్ఞులకును ఎట్లు హృద్యములగును? నాచన సోముని హరివంశము పనికిరాదఁట! అది బూతఁట! అందు స్త్రీప్రస్తావమున్నదఁట! కాకవికృతి పనికివచ్చునఁట! ఏలయన వాఁడు మనవాఁడఁట! కటకట!

యూనివర్సిటీవారు పరీక్షలకు పాఠముంచుట గ్రంథప్రాశస్త్యమూలకమని తలంపఁగూడదు. తద్విక్రయకారణమని మాత్రము తలంపనగు.

ఒకానొక పాడుగ్రంథమును యూనివర్సిటీ వారు పరీక్షకుం బెట్టిరి. దానిం బెట్టుదురని పండితు లెవ్వరును తలంపలేదు. పెట్టినందుల కాశ్చర్యపడిరి. గ్రంథకర్త అందలి యనంతదోషములను లోకు లుద్ఘోషింపఁగా విన్నవాఁడై పరీక్షకై విద్యార్థులు చదువందొడంగు నాలోన ఆతొలుతటి ముద్రణమును యూనివర్సిటీవారు నియమించిన దానిని నాశముచేసి పండితులచే కొన్నివందల తప్పులు సవరింపించికొని శేషించిన కొన్నివందలతప్పులతో ద్వితీయముద్రణమును ప్రకటించి విద్యార్థులకు విక్రయించును. అందులకు యూనివర్సిటీవా రాక్షేపించకుండుటను ఎఱిగియున్నారము.

స్వతంత్రగ్రంథములం జెక్కుఁడుట లక్షణమును, ఔచిత్యమును సర్వమంగళంబులు. ఒకానొక స్వతంత్ర నాటకమున రంగమఁట! ఆ రంగమంతయు పరిశీలించినను అందు చేతులు, పృష్ఠములుం బ్రిష్పుచున్న పాత్రము లెవరో తెలియదు.

ఇట్టి కవనములుం గలవు: 'పడతీ విన వది పలకిన పలకులు, విడచుము దానిని బిలచిన బలకడు.'

ఇంతకన్న వీథినాటకము ఈ విషయమున మేలు. అందు 'వందార్ వందానరే వేదవియాళర్ వందార్ వందానరే' అని, 'చందామార్కులరుగు డెంచెను, అసురేంద్రసభకు చందామార్కులరుగు డెంచెను.' అని ఆయా పాత్రమే తన పేరు చెప్పుకొనుచుం బ్రవేశించుట యేని కలదు.

ఇది సంస్కృతము రాక భరతసూత్ర మెఱుంగక, నాట్యశాస్త్రము తెలియక,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నానూచితస్య పాత్రస్య ప్రవేశో నిర్గమోఽపివా."

అన్న నియమమును వినియుండక, ఆంధ్రగీర్వాణ విద్యలయందు సున్నయు విసర్గయునై, కతిపయహూణాక్షరదుష్పరిచయముచే ఆకాశబాణములవలె సాహసించి యెగసినవారు గావించినది, నేలవిడిచినసాము.

ఒకానొక స్వతంత్రనాటకమున మంత్రిరాజును

"ఓ నరనాథ, యీవనటనోర్వర" అని యెాదార్చుచున్నాఁడు.

ఇంకొకదాన (అది దాఁ౦ బరీక్షకుంపఁబడినదాని తమ్ముఁడే) కథానాయికయయిన యమ్మాయి తండ్రిగారి మంత్రిని 'మాషర' అనియు 'ఏలరా సుమతీ' అనియు పల్కరించుచున్నది. ఇందుకై నాయన హర్షించి దానికి మంచి వరుని వెదకుచున్నాఁడు. రాజును దాసి "విక్రమ వర్మమహాప్రభూ" అని పేరుపెట్టి సంబోధించుచున్నది. అందుకై ఆరాజు ఆదాసికి ముండనకశాఘాతాది సత్కారములం గావింపక కేవలము హర్షించినాఁడు. నాయిక (మహారాజపుత్రి) నాయకుని (ఒకానొక మహారాజ కుమారుని)గూర్చి 'వాఁడు', 'వానిని' అనియే పలుకును. ఇంతకన్న విజయసేనుఁడో ఎవఁడో వాని పేరే పెట్టి 'ఆ విజయసేనిగాఁడు, ఆవిజయసేనిగానిని' అన్న మెఱుఁగని నాభావము. ఒకానొక మహారాజపట్టమహిషి దాసిని 'భర్తగారు వచ్చినారా' అని యడిగెను. ఇంతకన్న 'మా-లేక మదరాసు మర్యాదప్రకారము వన-మగఁడు గారు వచ్చినారా' అన్న మేలని నాతాత్పర్యము. "మగఁడు గాఁడు" అన్నను మేలే. గాఁడుచేత ననురాగాతిశయము రూఢికెక్కును గాఁడుపట్టియేకదా నాటకములకెక్కుట.

నాయిక చెలులు స్వయంవరసమాగత మహారాజ కుమారుల నుద్దేశించి "వీఁడో, వాఁడో, ఎవఁడో నీకు భర్తయగునులే" అని నాయికతోఁ బల్కుట. ఇది యీ క్రిందిపాటకుఁ దివిసిపోకయున్నది.—

అవర్ వందా వందాండీ
పోనా పోనాండీ. అవర్.
అవర్ పోనా నమకేండీ
వందా వందాండీ.

కట్టుమిల్లే మెత్తయిల్లే
కాలిపుడిక్కతాళియిల్లే
అవర్ వందా......

ఇంతకన్నను శృంగారము వలయునేని "నితంబముల్ పెద్దవి యాట" అను ప్రయోగమం దున్నది. ఇందలి 'పెద్ద' శబ్దమును ఆగ్రంథమునం గల శృంగారరసమును వడఁబెట్టి యాసారమునం జేసిన గడ్డలుగాఁ జెప్పవచ్చును. దీనిని ఆధునిక రసికులు 'సులభశైలి' యందురు. ఈ శృంగారమును సైతము మించవలయునన్న ఇందలి 'నితంబములను' త్రోసివైచి అలసాని పెద్దనాదులకు సయితము కైవసముగాని 'పిఱ్ఱలం' బెట్టుటయే సాధనము. అప్పటికి శృంగారము పరమావధిం బొందును. దానిని గూడమించవలయునేని 'ముడ్డి' యనఁదగు. అప్పటికి శృంగారము పరమావధిందాటి చక్రవాళపర్యంతమున దుస్సికొని వెలికి వెల్లువగట్టును. అప్పకవి 'సరసిజానన ముడ్డి సైకతం బనరాదు' అన్నాఁడే గాని 'పెద్దదియన రాదు' అనలేదు గదా! ఈ పెద్దనితంబములు పరీక్షలకిడంబడినవే.

మెట్టవేదాంతులని కొందఱు గలరు. వారు విమర్శకులం గొందఱను లక్షణవిరోధమాత్ర విమర్శకులని నిందింతురు. లక్షణ మనఁగా ఛందోవ్యాకరణములు మాత్రమని యీవేదాంతుల యభిప్రాయము. వాస్తవ మట్లుగాదు విమర్శనీయ విషయమెల్ల లక్షణగ్రస్తమే. అగుఁగాక! ఈ ఛందోవ్యాకరణ విరోధమాత్ర విమర్శంబును అత్యావశ్యకమే. వ్యవహారోపదేశమేని, మూలానుసరణమేని, కవనసౌభాగ్యమేని లేక అనఁగా నుపాదేయమేమియు లేక కర్ణకఠోరములయిన ముక్కిడిగ్రంథములలో శబ్దమాత్రమేని సాధువుగా నుండవలదా? కావ్యేందిరకు శబ్దార్థములు దేహముగదా?

"తనువగు శబ్దార్థంబులు
ధ్వనిజీవ మలంక్రియా వితానము సొమ్ముల్
తనరు గుణంబులు గుణములు
ఘనవృత్తులు నృత్తు లౌర కావ్యేందిరకున్."
నరసభూపాలీయము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేహము నాశమయిన దేహి యెట్లుండును?

ఔచిత్య పరీక్షలో నీక్రింది విషయముల నవధరింపవలయును.

౧. ఒకానొక రుక్మిణీ పరిణయనాటకమున రుక్మిణికిని చేటికలకును వితంతూవివాహవాదము—అతితీవ్రమ్ము.

౨. ఇంకొకరుక్మిణీపరిణయ నాటకములో బ్రాహ్మణుఁడు రుక్మిణీ సందేశమును శ్రీకృష్ణులవారి కందిచ్చును. శ్రీకృష్ణుఁడు, ఇప్పటి యింగ్లీషు స్టూడెంటువలె కన్నెను చూడక విద్యావిశేషములు సంభాషించి కనుంగొనక వివాహమాడనని చెప్పి ఆమెను కలసికొనుటకై కుండినపురమునకు బ్రాహ్మణునితో వచ్చి యూరివెలుపల వేచియుండుట. బ్రాహ్మణుఁడు కృష్ణాగమనమును నివేదించుటకును; ప్రమదవనమున సమాగమము కల్పించుటకును ఉద్యుక్తుఁడై రుక్మిణికడకుం బోవుట; బ్రాహ్మణుఁడటు తరలఁగానే బ్రాహ్మణి (అనఁగా నాతనియిల్లాలు) కామక్రీడకై శ్రీకృష్ణులవారిని పైకొనుట.

ఇవి భాగవతకథపై యింప్రూవుమెంట్లట.

3. రంగమందు చావుంజూపుట. పైగా మృతుని సోఫాపైని పరుండఁబెట్టి, తద్భార్యను సోఫాకోళ్లకుం గూర్చుండఁగట్టి శోకసరాళిం బాడించుట. దీనిపేరు 'ప్యాథా'సట.

(4) హిందూప్రభువు, చక్రవర్తి, క్షత్త్రియపుంగవుఁడు, సదాజేత, కృష్ణదేవరాయనియల్లుఁడు, తురకదాని నుంచుకొని దానిగర్భమున జనించిన తన తురకకొమరుని ద్రోహముచేత రణనిహతుఁడగుట. అంతటితో దక్షిణహిందూస్థానమున హిందూరాజ్య మంతరించుట. ఆతని యీతురకసంబంధమునకు పెద్దలెల్ల తలవంచుకొనుట. అందులఫలమైన క్షత్త్రియరాజ్యనాశమునకు చాతుర్వర్ణ్యమెల్ల దుఃఖించుట. దీనిపేరు 'ట్రాజెడీ'యఁట

(5) మఱియొక నేటికాలపు స్వతంత్రనాటకమున సుభద్రాదేవిని దుర్యోధనునికి ఉంపుడుగత్తెగా నిత్తమా, మాఱు మనువు పెండ్లాముగా నిత్తమా, అని యామె యన్నలకు పెనురగడ జరిగినది, కాని కుదకామె రాక్షసవివాహమునం దన్నుం గొనిపోయిన యర్జునునికే చిన్ననాఁటిమాటప్రకారము వదలంబడినది. ఔచిత్యలోపము లేకుండుటకై యీమె 'వాడనదినెగాద'నియుఁ జెప్పఁబడినది.

ఆధునికులలోఁ బలువురు (1) ఛందశ్శత్రువులుగాను (వీరి మతమును నేను మరియొక యుపన్యాసమున వివరించెద) (2) సమాసశత్రువులుగాను, 'మాహిషంచ శరచ్చంద్రచంద్రికాధవళం దధి' అను కాళిదాసప్రోక్తార్థ శ్లోకమునకు సమాసమున్నను అక్షరలక్షలు వచ్చినవి. ...సమాసమును విడఁదివిచిన ఆగేదెపెరుఁగు గడ్డ విఱిగి చిద్రుపలై విఱిగిపోయిన పాలపెరుఁగై పనికిరాకపోయి యీలక్షలంగోలుపోయి శిక్షలం దెచ్చికొనును. (3) అలంకారశత్రువులుగాను, 'కైతకశిఖాలీలాయితొమ్మన్న యుపమకే భవభూతికవనముకన్న కాళిదాసకవనము భారతీకర్ణావతంస కహ్లారకళికా మధూళీమాధుర్యముచేత నుత్కృష్టమై త్రాసులో మ్రొగ్గుచూపినది. అట్లే 'జంబూఫలాని పక్వాని పతన్తి విమలే జలే, తాని మత్స్యా న ఖాదన్తి జాలగోళకశంకయా' అను శ్లోకమున కడపటి సాలంకారపాదమునకు మాత్రమే యక్షరలక్షలువచ్చినవి. (4) లక్షణశత్రువులుగాను నడికట్టుకుని. ఇందులో మహాజన ప్రార్థన నంగీకరించి యూనివర్సిటీ వారును దొరతనమువారును వ్యాకరణశత్రువులను నివారించినారు. కాని వారి కపజయము జయతుల్యమే యయినది. ఎట్లన వారి ప్రభావముచేత పాఠశాలలయందు వ్యాకరణ ప్రవచనము మాన్పఁబడినది.

ఈశత్రుత్వమెల్ల నశక్తత్వము గాని మఱియొకటి గాదు.

శ్రీనాథుఁడు శృంగారనైషధములో తనపాటించిన యాంధ్రీకరణకవనప్రకారము నిట్లు వక్కాణించినాఁడు. "అశేషమనీషి హృదయంగమంబుగా, శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గుటించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, ఔచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబుగఁ జెప్పఁబడిన యీ శృంగారనైషధకావ్యంబు...విలసిల్లునాచంద్రార్కంబు"

మఱియు "మృదుమధురచిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులును.........పరివేష్టింపం గొలువుండి" అని నైషధకృతినాయకుని వర్ణించి నైషధకావ్యము మృదుమధురకవనమని నిజాభిప్రాయముం దెలిపినాఁడు. దానినే యిప్పటి కొందఱికలు కొందఱు ఇనుపగుగ్గిళ్లనియు, శిలావర్షమనియు వ్రాయుచున్నారు. నాటికిని నేటికిని కవిత యింతటి తీపిగట్లయినది.

మఱియు నీకాలమున దోషములు గుణములుగాను, గుణములు దోషములుగాను ఎన్నఁబడుచున్నవి.

గ్రంథచౌర్యము=బహుగ్రంథపాండిత్యము
అజ్ఞానము=వినయము
పేలవము=లలితము
దుర్వాదము=జయభేరి
అనౌచిత్యము=ప్రతిభ
తప్పుడుప్రయోగములు=భాషాభివృద్ధి
శృంగారము=బూతు

అత్యంత మనోహరములయిన గ్రంథములు కొన్ని ముద్రణవిషయశాంధ్రీకరణములచే పాడగుట కొకకొన్ని యుదాహరణము లొసంగి యీయుపన్యాసము నుపసంహరించెద.

పాండురంగ మాహాత్మ్యము 1-167.

క. స్మరశశితటిదజపవమా
నరవిసుధాసలిలముస్వనంతా రిష్టా
సురమృత్యుజ్వలనఁ జెలఁగు
సురవేశ్యలు గొలిచిరంత సుబ్రహ్మణ్యున్.

ఇందులకు టీక:

'స్మర.......జ్వలనన్=మన్మథుఁడు చంద్రుఁడు మెఱుపుయొక్క ప్రకృతివాయువు సూర్యుఁడు అమృతము జలము సప్తమహర్షులు భూమిశివుఁడు వీరియొక్క ప్రకాశముచేత, చెలఁగు=అతిశయించునట్టి.'

ఈక్రింది కాదంబరీ వాక్యముం గన్నం బద్యార్థసాధుపాఠములు తెల్లమగును.

అథావిబుధసద్మ న్యప్సరసోనామకన్యకాస్సన్తి. తాసాం చతుర్దశకులాని. ఏకం భగవతః కమలయోనేర్మనసః. అన్యద్వేదేభ్యస్సంభూతమ్; అన్యదగ్నేరుద్భూతమ్ అన్యత్పవనాత్ప్రసూతమ్. అన్యదమృతా న్మథ్యమానాదుత్థితమ్. అన్యజ్జలాజ్జాతమ్. అన్యదర్కకిరణేభ్యోనిర్గతమ్ అన్యత్సోమరశ్మిభ్యోనిపతితమ్. అన్యద్భూమేరుద్భూతమ్. అన్యత్సౌదామినీభ్యః ప్రవృత్తమ్. అన్యన్మృత్యునానిర్మితమ్. అపరం మకరకేతునా సముత్పాదితమ్. అన్యత్తు దక్షస్య ప్రజాపతే రతిప్రభూతానాం కన్యకానాం మధ్యేద్వేసుతే మునిరరిష్టాచ బభూవతుః, తాభ్యాం గంధర్వైస్సహకులద్వయం జాతమ్. ఏవమేతాన్యేకత్ర చతుర్దశకులాని.

కాదంబరి. పూ. భా. ౨౭౮ పు. బొంబాయి ము.

గీ. తప్పుగల్గిన చోటనే యొప్పుగల్గు
నరసికావలి కవితల యవగుణములు
సరసగణితావశోక్తులసరణియందు
నమృతధారా ప్రవాహంబు లడరుఁగాదె. -౧. ౧౭౮

క. శ్రీద్యుతి సువర్ణరేఖా
విద్యోతితి సదననికష విద్వదనీక
ప్రద్యోతన నుతగుణశత
వేద్యారామానుజేంద్ర వేదాద్రీశా! -౫. ౧

ఇందుల టీక:

ప్రద్యోతన=సూర్యుఁడా-విద్వాంసుల యొరయికచేత త్వష్టచేత సానపెట్టఁబడిన సూర్యునివలెఁ బ్రకాశించువాఁడా!

గీ. ఆచమూరువు యూథంబుఁ ద్రోచిపఱచె
వింట నమ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుము
లోల జిహ్వాకరాళ విశాలముఖత
నోలి భీతేందు మృగశాబమో యనంగ.

బోయ రాహువు; వానిచేతి యలఁగుతోడి మండలీకృత చాపము రాహువుయొక్క లోల జిహ్వాకరాళ విశాలముఖము; చమూరువు ఇందు మృగముయూథము ఇందుఁడు. మోవిగాని నోలిగాదు.

ఆముక్తమాల్యద ౪-౭౮



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నీయిచ్చయె మిన్నక పా
వోయి ముని ప్రవర నిన్ను మెప్పింతును భూ
నాయక సభ నిందులకై
నీయత్నము వలదు దవల నేను న్నాఁడన్.

మెప్పింతుననిన యతిభంగము. ఒప్పింతుననవలయు. సిద్ధసమాసమేని భూనాయక సభమున అనవలయు.

చ. సగరు నలుం బురూరవుఁ
ద్రిశంకుసుతున్ బురుకుత్సుఁ గార్తవీ
ర్యు గయుఁ బృథున్ భగీరథు
సుహోత్రు శిబిన్ భరతున్ దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వు శశి
బిందు ననంగుని నంబరీషుఁ బూ
రుఁ గురుని రంతి రాఘవు మరు
త్తుని గాలము కోలుపుచ్చదే.

ఇందుల టీక:

"షోడశమహారాజులను ౧. గయుని, ౨. పృథుని ౩, భగీరథుని, ౪. సుహోత్రుని, ౫. శిబిని, ౬. భరతుని, ౭. దిలీపుని, ౮. పరశురాముని, ౯. ౧౦. శశిబిందుని యౌవనాశ్వుని (అనఁగా మాంధాతను) ౧౧. అనంగునిన్, ౧౨. అంబరీషుని, ౧౩. పూరుని, ౧౪. కురుమహారాజును, ౧౫. రంతిదేవుని, ౧౬. రామునిన్, ౧౭. మరుత్తుని. వీరలను" అని పంచపాండవుల లెక్కకు విపరీతముగా నున్నది. పూరుగురుని అనునది సమాసము. యయాతినని యర్థము.

"గయాంబరీషౌ శశిబిన్ద్వనంగౌ
పృథుర్మరుత్తో భరతస్సుహోత్రః
రామాదిలీపౌ నృగరన్తిదేవౌ
యయాతిమాంధాతృ భగీరథాశ్చ."

వీరు షోడశమహారాజులు.

"హరిశ్చంద్రో నలో రాజా
పురుః కుత్సః పురూరవాః
సగరః కార్తవీర్య
శ్చ షడేతే చక్రవర్తినః."

వీరు షట్చక్రవర్తులు.

మ. పవిధారాపతనంబు గైకొనని
యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱఁ బ్రశ్రమంబునకు
నుద్యోగించె నాసత్ప్రసా
లవిభేదం బొనరించి నిల్వక వెసం
జన్నట్టి యుష్మన్మఖ
జ్జవనాస్త్రం బొసఁగు న్నిరుల్
రఘుకులస్వామిరమావల్లభా. ౪-౨౬.

ఇందు మూఁడవపాదమున లజయతి. 'కలీంజన్న' అని పఠింపవలయును.

చ. రయమున వృష్టికై యెదిరి
రచ్చలపై విధియించు రుద్రశన్
హయపతిమీఁద దంతిపతి
నాతనిపై నృపతిన్ గజాదిని
గ్ణయముల మెత్తులాడుదురు
మబ్బ్సకయించుక విప్ప వచ్చు వెం
గయి మతి పాటిపోదురు స
మస్త దిశాగతులైన యధ్వగుల్.-౪. ౧౩౧

ఇందు మూఁడవ పాదమున ర్ణమయతి. మ్రబ్బని పఠింపఁదగు.

శా. ఏణీశాబవిలోలనేత్ర కనుఁగొం
టే వీరు విద్యానరుల్
మాణిక్యోజ్జ్వలరత్నకుండలులు స
న్మార్గైకచారుల్ లస
ద్వీణాపాణులు చంద్రికామలశిరో
వేష్టుల్ త్రిపుండ్రాంకితుల్
వాణీయస్తనతారహారులు శివ
ధ్యానైకనిష్ఠాపరుల్.

—పారిజాతాపహరణము.

ఈ ముద్రణమున 'శిరోవేష్టుల్' అను పుల్లింగము చేతను శిరోవేష్టముచేతను (అనఁగా తలపాగాచేతను) సూచితులైన పురుషులకు చతుర్థపాదమున స్తనములు చెప్పంబడుట యాశ్చర్యము. 'వాణీయస్త్స్వర' అని పఠింప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలయు. 'కరముదొడ్డ'యని యర్థమగును. ఇది నాకా వించిన సవరణ. ఇందులనైతిహ్యములు. ఇప్పటికి రమారమి ౩౭ సంవత్సరములకుమున్ను ఈ పద్యముల పారిజాతాపహరణ భాగము యఫ్. ఏ. పరీక్షకు పఠనీయముగా నుండినది. ప్రవచనక్రమమున నీపద్యము రాఁగా, మదరాసు క్రిస్టియన్ కాలేజిలోని యాంధ్రప్రధానపండితులు శ్రీమాన్ నిశ్చింత వేదపెద్దరుమల్లయ్యగారును, పూర్వము నాకు నార్మల్ స్కూలులో నాంధ్రోపాధ్యాయులుగానుండి యేతద్వృత్తాంతకాలమున ప్రెసిడెన్సీ కాలేజిలో నాంధ్రప్రధానోపాధ్యాయులుగా నుండిన శ్రీచదలవాడ సీతారామశాస్త్రులవారును, దీనికర్థము పమ్మటయోజించి చెప్పెదమని విడిచినైరి. ఆకాలములో నేను కార్యవశమున మదరాసులోనుంటిని. అప్పుడు నాయొద్ద క్రిస్టియన్ కాలేజి యఫ్. ఏ. విద్యార్థి నాబాల్యమిత్రము శ్రీయుత ద్రోణంరాజు వేంకటకృష్ణారావుగారు నిత్యము మాయింట నీపుస్తకమును చదువుచుండిరి. ఆప్రాతస్సమయమున నొకనాఁడు మద్గురువర్యులు సీతారామశాస్త్రులవారు నాయున్నవీథికి కార్యాంతరమున వచ్చి నాకును తమ దివ్యసాన్నిధ్యము ననుగ్రహించి, "గ్రంథమేమి? ప్రకృతమేమి?"అని ప్రశ్నించిరి. ఇప్పుడే 'ఏణీశాబాకు అర్థము చెప్పితినని విన్నపించితిని. ఎట్లు చెప్పితివనిరి. స్తనమును తరప్రత్యయముగా మార్చితినంటిని. సవిస్తరముగాఁ జెప్పుమని యానతిచ్చిరి. ఇట్లువాక్రుచ్చితిని. "ఇటఁ బద్యమున విద్యాధరుల తారహారములు చెప్పఁబడినవి. మేఘోద్భవమౌక్తికములు కుక్కుటాండప్రమాణములనియు, అవి నేలంబడకముందే అంతరాళమననే విద్యాధరులు హరింతురని రత్నపరీక్షా గ్రంథమునను చెప్పఁబడియున్నది. అణీయస్ అనక డుం జిన్న. నాణీయస్ అనిన కడుందొడ్డ నాణీయస్తర అన్న కడుంగడుం దొడ్డ. కుక్కుటాండ ప్రమాణములగుటచే నట్టి వర్ణన విశేషాధాయకము; విద్యాధరు లగుటచే సముచితము. న ఆణీయస్ అనిఛేదమున్నందున ధ్యానశబ్దములోని 'యా'తో యతిసరిపడును"అని. అతంట వారు ఇయస్ తరప్రత్యయములు సమార్థకములు. ఇవి యొకదానిపై నొకటి రాఁదగు నా యని యాక్షేపించిరి. "శ్రేష్ఠతమాయకర్మణే ఆప్యాయధ్వమ్" అని శ్రుతి నుదాహరించితిని. అది వైదికప్రయోగము, లోకమున నెట్లు పనికివచ్చుననిరి. లోకమునం గూడవని నిషేధములేదని చెప్పుకొంటిని. ఇట్టి ప్రయోగాంతరము భాషలో చూపఁగలవా అనిరి. ఈపద్యము నుదాహరించితిని:— ఆముక్తమాల్యద ౪ఆ-౬౭.

స్రగ్విణి:—

"ఆస్థితాహీంద్ర శయ్యా డవీయస్తర
ప్రస్థితాంస్త్రీ స్త్రితక్రాంత చేతోఘుదా
కస్థల ప్రస్ఫురత్కౌస్తుభీయ త్విష మూ
ర్ధస్థలీ నృత్తమత్తల్లి పల్లీసకా."

అంతట వారు "అంగీకరించితిని, సంతోషించితిని. ఈ పద్యమునకు నేను అర్థము చెప్పక విడిచితిని. నేను చెప్పెదను" అని సెలవిచ్చిరి. అంతట నేను ప్రాంజలినై కృతార్థతం దెలుపుకొంటిని. నాఁటినుండియు అప్పుడప్పుడు ప్రసంగవశంబున ఎఱుఁగఁగలవారితో నేను నాకడమసవరణలతో దీనినిం బ్రస్తావించుట గలదు. పమ్మట నేను పారిజాతాపహరణమును ఈసవరణతో ముద్రించితిని. ఇతరుల తదనంతరముద్రణలకును ఈసవరణ యొక్కనదని తలంచెద.

జక్కనవిక్రమార్కచరిత్ర—శరదృతువుర-౩౬.

ఉ. హారివయూరవిభ్రమము
లంచలఁ జెందగఁ దద్విలాసముల్
తారలఁ జేరఁ బుష్పితక
దంబ విజృంభణ సప్తపర్ణనా
నారుచిర ప్రసూనభజ
నం బొనరించి శరత్సమాగమం
బారయ నంబుదాగమ మ
హామహిమోన్నతి నాక్రమించినన్.

ఉ. బాలలు లీలతో బలసుఁ
బంధులచాయఁ దనర్చి పంక్తికై
వ్రాలిన రాజనంబులకు
వచ్చు శుకంబులఁ జేరనీక పోఁ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డోలి రవంబుతోఁ జెలుపఁ
దోఁటల నీడలనుండి పాసి రు
న్మీలితహావభావ రమ
ణీమకరాంకుని సాహసాంకునిన్. ౪-౩౯.

రవము విని వీరున్నారని యెఱింగి చిలుకలు తొలఁగిపోవునని భావము.

దండయాత్ర

మ. దివిజస్త్రీస్తన కుంభకుంకుమముతో
దివ్యాంగనా పేటికా
నవరత్నాగరజంబుతో నమరకాం
తాదేహహారిస్రవ పం
కవిశాలోన్నతితో సుధీనిటల భా
గన్యస్త కస్తూరితో
నవనీరేణువు సాటిగాగ పరఁగె
నాశాకాశ సీమంబులన్. ౪-౨౧.

వీటికార్థమేగదా పేటికలో నుంచుట; మఱియు పేటికలో నుంచుటకన్న బరిణలో నుంచుకొనుట స్వాభావికము. వస్త్రములను పేటికలో నుంచుకొందురు. కావున వీటికా అనవలయు. ప్రక్రమము దివిజస్త్రీ సంబంధి వస్తువులైయుండ నడుమ సుధీసంబంధి వస్తువుం జెప్పుట ప్రక్రమభంగము గాదా. పైగా సుధీమాత్రులకు కస్తూరీ తిలకమేమి? ప్రభువులకైనం దగుఁగాక. కావున సురీ అనవలయు.

సురతావసానవర్ణన

సీ. తొంగలి తెప్పల తుదలఁ గైవ్రాలిన
కొసరుఁ జూపులయందు మిసిమిదోఁపఁ
దరహారముల వర్తనఁ గళాసించిన
కుచకుంభములు మీఁదఁ గొంతనిక్కఁ
గుంతలంబుల ప్రుల్లగింతలు సడలిన
కెమ్మోవిచుంబనక్రీడ కెలయు
మణికాంచికలయంబు మానంబు గైకొన్న
యురునితంబము కేళి కుత్సహింపఁ
గీ. జెమట చిత్తడి మైపూఁత జెదరి చనిన
నెమ్మనంబునఁ దమకంబు నివ్వటిల్ల
నన్న జలజాక్షి యొప్పు నృపోత్తమునకు
మదన పునరుద్భవ నికారమంత్రమయ్యె. ౪-౨౭.

తుదలన్, వర్తనన్ అను పదములు ప్రథమాంతములుగా నుండవలయు. కైవ్రాలిన, కళాసించిన, సడలిన, కైకొన్న అను భూతార్థక క్రియావిశేషణములు చేదావ్యర్థకములుగా నుండవలయును. పునరుద్భవ నికారమంత్రము పునరుద్భవకారిమంత్రము గావలయును. తదనుగుణముగానే దీనికి ఎత్తాకా ప్రాయమను నవ్యాహితపూర్వపద్యము.

క. సురతావసాన లీలా
పరిరంభము మీఁద రతికిఁ బ్రారంభముగా
దరుణియు నరుఁడు రమించిరి
కరమరుదుగఁ జతురకేతికర ప్రౌఢిన్.

౪-౨౨౧.

ప్రమదవనవిహారము

చ. అలరులతోఁటలోన విరు
లన్నియుఁ గోసితి రంచు బోటులన్,
సొలయఁగ నేల బాల యిటు
చూడఁగదే లతికావనీరుహం,
బులదెసఁ గ్రొవ్వి తండములు
పువ్వము లున్నవి యంచు ద్రోడయై,
పలుకు వయస్య నేర్పుకల
భామినువెల్లను మెచ్చి రిచ్చలన్. ౫-౩౫

ఇటవయస్యపల్కిన నేర్పేమున్నది? ప్రౌఢియేమున్నది? ఇక్కడ ప్రతిపద్యము చోద్యముగాఁ జెప్పం బ్రతినపట్టినవాఁడు.

క. ప్రతిపద్యము చోద్యముగాఁ
గృతి చెప్పిన నొప్పుగాక కృతినొకపద్యం
బతి మూఢుఁడైన జిత్రతఁ
బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్.

౧-౧౬.

ఇందు చోద్యమేమున్నది? పువ్వులు తనకు లేవాయెనని యలయుచున్న ముగ్ధను విక్రమార!– ...



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవవధువును తదీయవీక్షణమాత్రముచే "తిలకోవీక్షణేన" అని దోహదకళయందుఁ జెప్పినరీతిగా తిలకములు పూచును గావున ప్రౌఢవయస్య వానిని చూడుచున్నది. ఇందలి చమత్కారమును వివరింపబనిలేదు. ఉన్న భామినులు కోపనలంపటు: కోపనాసైనభామినీ" నవ్వి రనుటమందము. మాటనేర్పునకు మాటనేర్పరులు హర్షించి రనుట సుందరము; కావున "తిలకావనీరుహంబు"లనియు "కలభాషిణు"లనియుం బఠింపవలయు.

రాఘవపాండవీయము.

సీ. పదునాల్గు జాతులఁ బ్రిదివకాంతలమీఁదు
పద్మినీజాతిసౌభాగ్యవతులు

౧ కథారంభము, ౧౨.

" అఖిలదిగ్దేశభూప సముప్పితంబు
లసచు నరణముగతిఁ దోన నరుసదేరఁ
దను వరించు జయశ్రీలఁ గొనుచునతఁడు
పురికిఁ జనుదెంచు సొంపు వాగగోచరతఁబఱఁగె.

అని వాక్యశేషము. దశరథమహారాజునకును పాండు రాజునకును వారిచే దిగ్విజయమున జితులైన రాజులు పదునాల్గుజాతుల పద్మినులను అర్పించిరని టికాసారము ఆ పదునాల్గుజాతులను టీకాకారుఁడు ఇట్లు పరిగ ణించినాఁడు:—"బ్రహ్మ, క్షత్రి, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాహణ, కంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకర, తిలఘాతక, లుబ్ధక, చండాల, మాతంగు లనెడి పదునెని మిది జాతులలో బ్రాహ్మణజాతియు నరబాహ్యలయిన లుబ్ధక చండాల మాతంగజాతులును వినా కడమ పదునాలుగు జాతులయందును". అరిగాఁపు లిచ్చిన యీ పద్మినులయందలి రజక, చర్మకరపద్మిను లును దశరథపాండులకు భోగ్యలా? కాకేని వారి పద్మినీత్వ ప్రస్తావనయేల, తదర్పణమేల? 'పదునాల్గు జాతులత్రిదివ కాంతలన్" అని సమాసముం జేయవలయు ను. పై పాండురంగమాహాత్మ్యగత "స్మరశిక్ష" త్యాది పద్య ముద్రణవిమర్శయందుఁ జెప్పఁబడిన పదునాల్గు తెగల యప్సరసలర్థము. వారిని మీఁదు పద్మినులను అరి గాఁపురాజు లిచ్చిరనుట సమంజసము.

గీ. జగతిఁ గోసల కేకయ మగధుల లన
యలవరించిన యాజ్ఞలో మెలఁగఁ జేసె,—

ఇట టీకాకారుఁడు రామాయణార్థమున "కోసల ... తన యలన్" అని సమాసముగాఁగొని, భారతార్థమున "మగధులన్" అని విడఁదీసి "ఈదేశములరాజులను" అని యర్థము వ్రాసి కృతకార్యము రామికి గతివ్రాయక దాఁటి నాఁడు. మగధుల, ఇందలి తుదియకారము అధారణార్థ కము. లక్షణచే కోసలకేకయ మగధరాజులు సయితము, అనఁగా అంతటి గొప్పరాజులుకూడ' అని యన్వయము సేయవలయును.

భారతము-ధర్మజువాక్యము: కర్ణునిగుఱించి

చ. అనికి నాకసుం గలిగె
నాహవ మింతపమున్న యంమఁ బా,
ర్థ దుఁడును సత్యకాత్మజుఁడు
శాంతనవాంతకరుండు ద్రౌపదీ,
సుతులను జూడగా నద్రఁడు
నూత్రహయధ్వజ పాటనంబు సే
సి, తనువుఁదీవ్రకాండములఁ
జెండఁగ నే వెగడందితిం గదన్.

కర్ణ. ౩ఆ. ౩౧౯.

ఇ ట్లీపద్యము ప్రాచీనభారత ముద్రణమందును శబ్దరత్నాకరమందును గలదు. ఇందలి తద్ప్రాసము గని కొంద రిదానింతనులు తద్ప్రాసముం బ్రయోగించిరి; ప్రమాణమడిగినవారికి దీనినే చూపించిరి. ఇందలిది పార్షత శబ్దముగాని పార్షదశబ్దముగాదు. పృషతుఁ డనురాజర్షి యొక్క గోత్రాపత్యమగుటం బట్టి ధృష్టద్యుమ్నుఁడు, పార్షతుఁడు, ద్రౌపది పార్షతి. ఇంచుకపొరఁబాటు ఇంత చేటుం దెచ్చినది.

శృంగార నైషధము ౨—౯౭.

గీ. తరుణి నతనాభిమండ లోదంచనాభి
రామరోమావళీజ్యావిరాజమాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీదు తనువుండఁజేసి తా నెఱఁకు వేయు
రతిహరుఁడు హారగుళికల రాజవదన.

దమయంతిని ఉండచేసిన పిమ్మట పెండ్లియెవరికి? ఎవరి నెఱఁకులను వేయును. ఆ మెనే గోత్రములోకట్టి ఎముకలు విఱుగఁగొట్టునా? ఇట్లు పఠింపఁబడెను. "ఉండఁజేసితా" అనుదానిని "ఉండవిలుసేసి" అనియు, "రాజవదనను" "రాజహంసు" గాను పఠించునది. ఇందుల మూలము:—

"త్వద్గుచ్ఛానలిమౌక్తికానిగుళికా
స్తం రాజహంసం విభో
శ్వేష్యం విద్ధి మనోభువః స్వ ధనుషితాం
ఘోషాం ధనుర్మఞ్జరీమ్
య న్నిత్యాఙ్కనివాసలాలిత తవ
జ్యాభుజ్యమానంలస
న్నాభీమధ్యబిలావిలాసమఖిలం
రోమాళి రాలమ్బతే"

3-౧౨౭.

మ. స్రగ్ధర:—
"రతిక్రీడాహంసమోహగ్రహణ
శశిభృశప్రార్థనోన్నిద్రతారా
పతియై దుఃఖించు సత్యప్రసృమర
నిజదృగ్బాష్పధారాగతుండుర్
ప్రతిబింబప్రాప్తలాభప్రమదిత
మతియైరంజిలుర్ రాత్రులేతత్
ప్రతిపక్షక్షోణిపాలప్రమద
గిరిదరీప్రాంత కాంతారభూమిన్."

ఇది యన్యముద్రణపాఠము. ఇందు పూర్వార్థమునం బది యతిరదోషములున్నవి. 'రతిక్రీడా' 'గ్రహణ' 'శశి' 'ప్రార్థనో' 'సత్య' 'తుండుర్' అను నాలుగుతుండ్లను మార్చి యీయర్థము నిట్లు పఠింపవలయును:—

"రతిక్రీడాహంసమోహ
గ్రహోశశిభృశ ప్రార్థితోన్నిద్రతారా
పతియై దుఃఖించు సవ్యః ప్రసృమర
నిజదృగ్బాష్పధారాగతేందు."

ఇందుల మూలము:—

"ఏతద్భీతారినారీగిరిబిలనిగళ
ద్బాష్పవానిస్సరన్తీ
స్వక్రీడాహంసమోహగ్రహిళశిశు
భృశప్రార్థితోన్నిద్రచంద్రా;
ఆక్రన్దద్భూరియా త్తన్న యన
జలమిళచ్చంద్రహంసానుబింబ
ప్రత్యాసత్తిప్రహృష్య త్తనయ
విహసితైరాశ్వసీన్న ఖ్యాశ్వసీచ్చ."

౧౨-౭౫.

ఆంధ్రప్రసన్నరాఘవ నాటకము—V

ఇందు ఈ క్రింది శ్లోకమున క్వశబ్దమును ఆంధ్రీకర్త యేవాక్యములోని కాకర్షించిరో కనుటకై దాని తెలుఁగుం గనఁగా అది యిట్లుండినది. రసాభాసము నేను చెప్పనక్కఱలేదు.

"మాతస్తాతః క్వయాతః సురపతిభవనం హాకుతః పుత్రశోకాత్, కోఽసౌపుత్రశ్చతుర్ణాం త్వ మవరతయా యస్యజాతః కిమస్య, ప్రాప్తోఽసౌకాననాన్తం కిమితి నృపగిరా కింతథాఽసౌ బభాషే, మద్వాక్యబద్ధః ఫలం తే కి మిహ తవ ధరాధీశతా హా హతోఽస్మి".

ఇదిమాతుల గృహాగత భరతకైకేయీ సంవాదము:

శా. అమ్మా యెక్కడికేగెఁ దండ్రి సుత
యింద్రాస్థాని కేలా వియో,
గమ్మం గల్గగ నాత్మపుత్రునిదెసఁ
గా నేల యాపం డవ్,
ఇయ్యమ్మంగూర్చి నృపోక్తినాతఁ డెటు ల
న్యాయంబుగం బల్కె వా,
క్యమ్మే బంధము గాగఁ నాదిఫలమే
మా నీకు రాజ్యం బయో"—V

జామదగ్న్యుఁడు—(విలోకించి) వీఁ డర్థముగ్ధుఁ గదా? ఎందుచేత నవన్ వీనిఁ గామించుచున్నాఁడు. చెప్పుటయందు రాముఁడని పల్కుచున్నాఁడు — IV.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇందులకు మూలమైన దుష్టముద్రణము "అర్ధముగ్ధకల్ప్యాయాజనకః, యదేనం కామయతే. కర్తవ్యే రామ ఇతి జల్పతి." ఆంధ్రటీకకర్త 'కామయతే' అను పదమును 'కామయతే' అనునర్థమునం గొనెంగా వలయు. ఇందులకు సాధుముద్రణము—అర్ధ...... కామ ఇతి కర్తవ్యే రామ ఇతి జల్పతి". కామ అనుటకు రామ అనుటలో మా సరి, రా తప్పు. కావున నగమే మూఢుండనుట.

---

## మానసికోద్బోధము

పిసుపాటి నారాయణశాస్త్రి గారు

కాలఁగకు మెంతలేసి కడగండ్లకుఁ బాలయినన్, దురాశమై
మెలఁగకు మోపరానిపని మిడ్కెదనంచు నహంకరించుచున్
దొలఁగకు సత్యమార్గము నతుల్యము లౌల్యమునన్, జగంబుపై
నలుగకు మెన్నఁడున్, ముదమునందకు కుందకు పిచ్చిడెందమా!

"హితముగఁ దోఁచుదానిని గ్రహించెదఁ బ్రీతిఁ, దదన్యమున్ జగ
ద్ధితమయినం ద్యజింతు నెవరేమనినన్ గణుతింప"నంచుఁ ద్వ
త్ప్రతిభను జాటఁజూచెదవు బాపురె? యెంతటివెఱ్ఱి! యున్నవే
గతు? లిటువంటిమార్గములఁ గాలిడువారికి, మూఢచిత్తమా!

మతకర్తృప్రతిపాదితోచ్చపదవిం బ్రాపించి పాండిత్యవి
స్మితధీగోచర చిత్సుఖానుభవ మేమేఁ గాంచఁగా లేక మూ
ర్ఖతమైఁ గ్రొమ్మిడిమేలపున్ మతములం గాలుంచనుంకించె దో
హతబుద్ధీ! సతిఁ బాసి పుంశ్చలి వివాహంబాడు చందంబునన్.

పెద్దలమాటలన్ వినఁగఁ బ్రీతివహింపవు, వేదశాస్త్రపు
బ్బద్ధతులం దలంపవు, ప్రపన్నులపై దయనింప, వెప్పుడుం
గ్రుద్ధత హద్దమీఱి ప్రజలన్ వ్యతిరేకముగాఁ జరింతు వే
మిద్ది? కుమార్గగామి కగునే పరసౌఖ్యము? మూఢచేతమా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుమానింపవు మంచియంచుఁ జెడుగం చావేళ యీవేళ యం
చనయమ్ముల్ శ్రుతిదూష్య కార్యములు సేయన్ జేసి హస్తాదుల్
ఘనతంబొందఁగఁ జూతు విక్కటన శ్లాఘాపాత్రమౌదో? జగ
జ్జననిందంబడి దుర్గతిం గనెదవో; స్వాంతంబ! చింతింపుమా.

*　　*　　*　　*　　*　　*

నాలుగునాళ్లభోగములనమ్మి యిహమ్ము పరమ్ము రోయ గ
ర్వాలసవై యథేచ్ఛఁ దిరుగాడఁగఁ జూచెదుకాని; యిందిరా
లోలుని పాదపంకజములోని మరందమునాని శాశ్వత
శ్రీలకు మూలమౌపదవిఁ జేరఁగఁగోరవదేమి? చిత్తమా!

కరణపరంపరన్ నడుపఁగల్గిన మేటివి నీవు, నీనుడిన్
గరచరణాదులేగు, నటుగావునఁ దత్కృతమౌఫలంబు ని
న్బొరయకమాన దెన్నడును, బూజ్యపదంబున నున్నవారికిం
బరాపతిహోవుకార్యములు భావ్యములౌనటె? మూఢచిత్తమా!

"నిరవధికోగ్రసంసరణ నీరధిభంగపరంపరాహతిన్
గెరలిచి క్రోధబాడబశిఖిం బడఁద్రోయఁగ, మోక్షరాజ్యసు
స్థిరు నొనరింపఁగా, వలఁతి చిత్తమె" యంచువచించెఁ దొల్లి శ్రీ
హరి, చెడుచేతరోఁతయని యాత్మరతిం బదముంచు చిత్తమా!

చిక్కినదానితో నెటులొ చేయుము మెల్లగ జీవయాత్ర, లోఁ
బొక్కకు మేమి లేదనుచుఁ బొమ్ముపకారముసేయ నాపదన్
స్రుక్కినవారి, కాఁకటను శోషిలుప్రాణికి నింతగంజియే
నక్కటికమ్ముతోనిడఁ బ్రయత్నమొనర్పుము చాలుఁ, జిత్తమా!

కానికిఁగానియట్టి యధికారము మేరువుగాఁదలంచి మె
ప్పానిని జీరికింగొనవు, పాపము పుణ్య మనంగఁ బోవు, నే
నే నిఖిలాశ్రయంబనని మెంతయు గర్వముసెందె, దద్దిహో
దేనికిఁ జేతఁగాక జగతిం జెడుదానవు, మానసంబరో!

7.　　6-　　5　　౮౨౨

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమతయు జీవకోటియెడ, శాంతశమాదిగుణైకరక్తియుఁ
శమితభవప్రసక్తియును, సాధుజనావన పాదభక్తియుం
గ్రమముగఁగల్గి దుర్లభ మఖండసుఖావహమైన యాత్మత
త్త్వమును నెఱుంగకుండిన వృథాగద జన్మము? మూఢచిత్తమా!

సుతునకుఁ దల్లిదండ్రులును, సుందరికిం బ్రియభర్త, శిష్యసం
తతికి గురుండు కోడలి కనారత మత్తయు, ఘోరదుర్గుణా
న్వితునకు సద్గుణాఢ్యుఁడును, బిన్నకుఁ బెద్దయు, లొంగియుండునీ
చతప్రబలెఁ హితాహితవిచార మిఁకెక్కడ నీకు? డెందమా!

ఎవఁడెటుపెట్టిపుట్టె నటులే జరగుఁ సకలంబువాని, కీ
వివరమెఱుంగలేక యవివేకముకల్మి నసాధ్యకార్యముల్
దవిలియొనర్చి మెక్కుడుగ ద్రవ్యము మున్నగువానిఁగూర్చి పే
రువడయనెంతు వాము మెయిఁ, గ్రుంగెదవాపయి, మూఢచేతమా!

ఆరయ నాఱుచక్రముల కావలఁ గేవలదీప్తితో సహ
స్రారజలేజమందు విలసద్గతి వెల్గువెలుంగుఁ గానఁగా
నేరక యూరకే తిరుగనేర్తువు లోపలిచూపుఁజూడ వే
తీరున నీవు ముందు కడతేరుదు? వక్కట, మూఢచేతమా,

"హితముగఁ బల్కకంటెను హితేతరమార్గముఁ ద్రొక్కకుండు టే
హిత" మనిచెప్పి రార్యు, లిఁక నేమి? శ్రుతిస్మృతిబద్ధ సత్క్రియా
తతిని గ్రమమ్ముగాఁ జలుపు దార్ఢ్యము నీకడ లేదయేని; య
న్యతమమతంబులం దిగక హాయిగ నీశు భజించు చిత్తమా!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## శ్రీకృష్ణశాస్త్రిగారి "వెట్టిపాట"

శ్రీకర్లపాలెం కుటుంబశాస్త్రిగారు

"కృష్ణపక్షము"లోని "వెట్టిపాట" నాకేమీ బాగాలేదు. William Blake (విలియం బ్లేక్) అను ఆంగ్లకవి వ్రాసిన "Song of Innocence" అను పాటలలో మొదటిదాని కను కరణ మనుకుంటాను యీ "వెట్టిపాట". స్వేచ్ఛాప్రియులుకనుక మనకవిగారు స్వేచ్ఛగా అనుకరించారు. వేరువేరుకవులకు ఒకే భావం కలుగవచ్చునని నేను వొప్పుకుంటాను కాని, యీ"వెట్టిపాట"లోని భావ మసాధారణమైన దగుటవల్లనూ, కృష్ణశాస్త్రిగా రాంగ్లసారస్వతమును బాగుగా చదివినట్లగుపడుట వల్లనూ, వీరి కీభావము స్వయముగా కలిగినదనుకొనుట కవకాశము లేదు. బ్లేక్ కవి వ్రాసిన పాటలలో వొకశిశువు మబ్బుపైనుండి గొఱ్ఱెపిల్లనుగూర్చి యొకపాటపాడుమని కవి నడుగును; కవిపాడును. ఆపాటవిని ఆశిశువు "ఇంత యేడ్చుచు నింత నవ్వును." "వెట్టిపాట"లో మబ్బులోనుండివొక చిన్నిబాలుడు "చిన్న మేకనుగూర్చిపాడుమ"ని తమ నడిగినట్లునూ, తాము పాడినట్లునూ, ఆ పాటను విని ఆబాలుడు "ఇంత యేడ్చుచు నింత నవ్వి"నట్లును మనకవిగారు చెప్పుచున్నారు.

ఇరువురుకవులూ పట్టుమని పదిపాటల కంటే ఎక్కువ వ్రాయలేదు. ఇరువురిలోనూ ప్రధానభావ మించుమించు వొక్కటే. అదైనా, వేరువేరుకవులకు పరస్పర జ్ఞానము లేకుండా కలుగగల సామాన్యభావముకాదు. కనుక నే నిది అనుకరణమన్నప్పుడు పాఠకులు నాతో యేకీభవిస్తార నుకుంటాను. ఇల్లాంటి స్వేచ్ఛాను కరణములు నాకు ఇష్టమే. కాని "వెట్టిపాట" లో రసాభాసమైనది. కనుక దీనిని విమర్శింప వలసివచ్చినది. బ్లేక్ కవికి శిశువులందూ, గొఱ్ఱె పిల్లలందూ చాలా యిష్టం. చిన్నబిడ్డలను గురించీ, గొఱ్ఱెపిల్లలను గురించీ ఆనందంతో పాడుకునేవాడు. ఇంతేకాకుండా, ముగ్ధత్వము నకూ, (Innocence) సాధుత్వమునకూ శిశువులునూ, గొఱ్ఱెపిల్లలునూ, పెట్టినది పేరు (ముఖ్యముగా ఆంగ్లసారస్వతములో). "Lamb" అను ఆంగ్లపదమును గొఱ్ఱెపిల్లలకేకాక మహనీయు డగు "క్రైస్తు"కుకూడా వాడుతా రాంగ్లసార స్వతంలో, శిశువులనూ, గొఱ్ఱెపిల్లలనూ తలుచుకొన్నప్పుడల్లా క్రైస్తు జ్ఞాపకంవచ్చి తన్మయత్వంతో తాండవం చేసేవాడు బ్లేక్. అతడు రవీంద్రునివలె Mystic. ఇన్ని కారణాలవల్ల గొఱ్ఱెపిల్లను, శిశువును తనపాటలలో చేర్చాడతడు. మన కృష్ణశాస్త్రిగారు శిశువును చిన్నిబాలునిగానూ, గొఱ్ఱెపిల్లను మేక పిల్లగానూ మార్చుటయేకాక ముగ్ధగేయమును (Song of Innocence) "వెట్టిపాట"గానూ తయారు చేసినారు! బ్లేక్ కవి పాటలలో సారస్యమున్నది. "వెట్టిపాటలో" సారస్యం లేకపోగా కపటభావ ప్రకటనం కనిపిస్తుందనుకుంటాను. ఒక చిన్ని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాలుడు పాడమనడ మేమిటో తా మొక మేక పైన పాడడమేమిటో యెంత సహృదయత్వం తో చూతామన్నా అంతుపట్టడంలేదు. పైగా, పాటపాడింది తామేనని చెప్పచూ, "ఆ వెట్టి పాటకుడెవ్వడో" అన్న అసందర్భపుప్రశ్నతో ముగించారు. "మరచి విశ్వము నన్ను నేనే మరచి కన్నులుమూసి పాడుకొన్నానని చెప్ప కొను కవిగారి నింత విమర్శించడం బాగుండ దేమొ! నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు కృష్ణశాస్త్రిగారి భావప్రకటనము విశ్వాసార్హము కాదన్నారు. ఇది చాలా తీవ్ర మైనవిమర్శన. నే నీలభిప్రాయముతో సంపూ ర్ణముగా యేకీభవింపలేకపోయినా "వెట్టిపాట" లోని భావానుభవము మాత్రము విశ్వసించు ట కేవలమనర్హమనియే నావుద్దేశము. "వెట్టి పాట"లోని "వెట్టిమాత్రం భావోన్మత్తులవలె రమించువెట్టిగాని అన్యము కాదు" అని శ్రీ శివశంకరశాస్త్రిగారు అన్నారు. ఇందలి వెట్టి అంతప్రశంసనీయమైనదికాదను చిన్న విషయ మును "సింహావలోకనం" చేస్తున్నారు కనుక వారప్పుడు గ్రహించలేదేమో!

బ్లేక్ కవి గొఱ్ఱెపిల్లమీద వేరే కొన్ని పాటలు వ్రాసినట్లుగా కృష్ణశాస్త్రిగారుకూడ "ఏదో పాడితిన్" అని వూరుకోకుండా, తాము మేకపిల్లనుగూర్చి యేమనిపాడినారో అది వేరే పాటలుగా వ్రాసినట్లయితే కొంతవరకుబాగుం డేది. వీరు నిజంగా "భావోన్మత్తులవలె రమించింది" "రండురండు ప్రాణేశుడు రాకరాక వచ్చెనేడు" అని పిలిచినప్పుడేమొ. "కలుష దుర్దాంతపంకసంకలిత కుహరముల జనించు" నశ్రుధార "స్వామి" "పాదదేశమున బారి" పరమపావనజాహ్నవీప్రతిభ గాంచి" నప్పు డేమో. అంతేకాని "వెట్టిపాట"లో కాదు.

ఆంగ్లకవులను అనుకరిస్తూ, అనుసరిస్తూ, అనువదిస్తూ వ్రాయుతెనుగువారు జాగ్రత్తగా వుండకపోతే కలుగు లోపాలను చూపుట కీ వ్యాసమును వ్రాసితినే కాని కృష్ణశాస్త్రిగారి నాక్షేపణచేయుటకు కాదు. "కృష్ణపక్షి"మొక ప్రశంసనీయమైన గ్రంథము. అందులో కళంక మీ "వెట్టిపాట."

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భా ర తి'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏకవీర

విశ్వనాథ సత్యనారాయణ గారు

భాద్రపదశుక్ల పంచమినాటికి మధురనుండి రామనాథమున కుదర్ల సేతుపతి బదులు రాజలేఖ యొకడు పోయినది. ఇంకొక నెల పైగా సేతుపతి రాజనగరమున నిలువక తప్ప దు. కుట్టాన్ శౌర్యమునకు, రాజనీతి వేత్తృత్వ మునకు రాజు మెచ్చెను. కానుకలు పంచె ను. తిరుమలనాయకుడు చెలికానికి పొగడిక యుత్తర మొండు వ్రాసెను. క్రొత్తసైన్య మారువందలు వెంటనే మధురకుఁ జేర్ప వలయును. కుట్టాన్ తండ్రివచ్చువరకు రామ నాథముననే యుండవలెను. దశమినాడు బయలు దేరి క్రొత్తసైన్యములు గోవిందనాథుడు నాగ గా మధురకు ప్రయాణ మయ్యెను. కుట్టాన్ పేరు విన్న చుట్టుపట్లఁ బాళెగాండ్రకు, దోపిడి కాండ్రకుఁ బోర్చుగీసువాండ్రకు సింహస్వప్న మైనది. భాద్రపదము గోరంటపూవులతో వెనుకపట్టెను.

మధురపై నాకాశమున తెల్లని మేఘ ములు గాలికి కదలు దోమతెరలవలె కదలఁ జొచ్చెను. పవళ్లకు సూర్యకాంతి మొగము వాపు తగ్గెను. మీనాక్షీ దేవాలయమున కాంధ్రద్రావిడస్త్రీలు సాయంకాలముల చే మంతిపూవులు కుట్టిన పెద్దజడలతోఁ బోవు చుండిరి. నందీశ్వరుని యొడలరాచిన నూనియ యాయన కొమ్ములపై వ్రేల్గించి తద్విషాణ మధ్యమునుండి శివలింగదర్శనము చేయు భక్తు లుంచిన వీభూతి పులుముకుని తెల్లఁబడఁ జొచ్చెను. యామ్యదిశ నేకచుళుకాహంకార నిశ్శేషశోషితపాథోధిపయస్కుఁ డైన ముని తోఁచె.

వైఁగైనది పతిప్రేమ జారిపోవుట తోఁచిన కాంతమొగమువలె తనచివరల తెల్లఁబడఁ జొ చ్చెను. ఆమెలోని రాగచ్ఛాయ విరిగిపోఁ జొచ్చెను. కంఠేకాలుని శిరఃకోటీరమునకుఁ జంద్రకాంతమాలలు సమృద్ధిగా దొరకెను. శరల్లక్ష్మి యొకనాటిప్రొద్దున నున్నట్లుండి దిగంతవిశాలరమ్యవీక్షు హాసము చేసెను. గుఱ్ఱపువాళ్లపిల్ల అమృతముకూడ నాటిప్రొ ద్దున సెలవినాటి దిగంతవిశాలరమ్యహాసము చేసినది. అమృతము తెలివిగల పిల్లయని గ్రహించి యొకబ్రాహ్మణుడామెకు బదినాళ్లు గా జదువుచెప్పుచుండెను. ఆమె పదినాళ్లలో నక్షరములునేర్చి మాటలుచెప్పుడని యాయ నను బలవంతపెట్టగా నాయన 'ఆతిమ్మాచి'లో మొదటివాక్యము. 'ఆరంజేవిరుంబు' అని యామెకు నేర్పెను. ఆమెయు నామాటతెచ్చి బొగ్గుతో ఏకవీరసాధకుడ్యముమీద వ్రాసెను. ఏకవీర యది మరునాడుచూచి యేలొకో భయముపడి పారిపోయెను. ఈసంగతి యమృ తముచూచి యెందుకో దానికి తెలియకుండనే యొకపెద్ద నవ్వు నవ్వినది. ఆనవ్వు శరత్కాల ము లేతయెండలోకలసి జాజిపందిరిమీద ప్రాకి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయెను. సౌధకుడ్యముల సున్నముకాంతిలోఁ గలసిపోయెను.

ఎండలు పెల్లునఁ గాసెను. వర్షవేళ గొడ్ల త్రొక్కిడిబురదలైన ప్రదేశములు వాని కాలి గిట్టల గుర్తులుగుర్తులుగానే బిగియఁ జొచ్చెను. తెల్లుపూవులు దూరపుటెండ పొరలలోఁ దళ తళలాడెను. పంటబోదెలవెంట తెల్లని యెండు విరిగిపోయిన కొబ్బరి పాలవంటి నీరము సన్న గాఁ బ్రవహింపఁజొచ్చెను. బోదెమలుపులలో జాలరులు మాపులు నిలిపిపోయిరి. పచ్చని వరిపైరు నలుపుతిరిగి గుమ్ములుకట్టి పైని యాకు సపునీలిమకుఁ బ్రతిగానుండెను. కొత్తిమెర చేలు నాగటిచాళ్లలో చిన్నిచిన్ని మొక్కలుగా గాలి పొరలలోఁ జిన్నితలలాడించెను. సెనగ చేల మొక్కలు లేతప్రాయపు బుల్లతనమున రాతురులపుడు కొంచెము కొంచెము మంచు లకు గొంచెముగొంచెముగా దినదిన మెదుగు చుండెను. ప్రొద్దుటిపూట చల్లని లేయెండ మధ్యాహ్నమున వేసగియెండ సాయంతనసమ యముల నెండ యనిపించని యెండ రాతిరి రెండుజాములవరకు పలుచనిమేఘముల చాటున విరియఁబోసికొన్న చిక్కని పాలవంటి వెన్నెల రాతిరి రెండవజాము మొదలు మంచు కురియుట యిది శరత్కాలపు దివారాత్రము లకు సహజమయ్యెను.

అమృతమును శిక్షించవలెనని ఏకవీర. ఏకవీరకుఁ గనపడకుండ నమృతము. మేఘపు మఱుగున. నున్నపలుచని చీకటులు వెన్నెల యొకదానినొకటి పారద్రోలగా దప్పించుకుని తారాడగా నొప్పినట్లు వారిద్వరు శరద్రాత్రుల కొక సాటువ తెచ్చుకొనిరి. శరద్రాత్రుల గగన భాగ మొకవింతకళ తాండవించినది. కొంత సేపు తెల్లని చిక్కని మేఘములు గాలిచేత పరువులై మనుజుల పశువుల పాదఘాతములు లేని యిసుకతిన్నెలు గాలిదుమారములచేత నొక్కులు నొక్కులుగా నైనట్లు సముద్రపు కెరటములు వెనుకకుపోవుచు నొడ్డున నున్న యిసుకనేలఁ జిన్నిచిన్ని మెట్లుగా నమరించి నట్లు తెల్లనిచేప యొడలిపొరలట్లు ఒకటిరెండు కాన్పులైన ముగ్ధపురంధ్రీరహోవేళాస్పృష్టము దీపపువెలుగున మెరయు పొత్తికడుపట్లు రమ్య ముగా నుండెను. మరికొంత సేపు వలయాకార మంటందుచెడిన చిన్నచిన్న తెల్లనిమేఘములు వాని నడుమ నల్లని మేఘములు, తెల్లనివి చంద్రకాంతిచే మెరసి, నల్లనివి చంద్రకాంతి నాపి, హూణదేశపుటావు నొడలివలెఁ దామర గొడుగాకులు పూవులు నీటిపైకిలేచిన చెరువు పైభాగమువలె పూలుపూచిన సొరపాదువలె మనోహరమయ్యెను. మరికొంత సేపు పడమటి గాలి విసరి, యాదిక్కున చలువచేసి యార వైచిన ఖద్దరువస్త్రముల వలెఁ జిక్కని తెల్ల మొగిళ్లు, తూర్పునకుగాలి విసరున నెగిరిపోవుచు నక్షత్రములను, చంద్రుని, పడమటిదిక్కునకుఁ బరుగెత్తించుచున్నట్లు కనిపించుచుండెను.

ఆయొక శరద్రాత్రి. కుట్టార్ భార్య కొక లేఖవ్రాయ సంకల్పించి నాల్గుసార్లువ్రాసి చింపి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేసి కొంతసేపు మేఘములవంకఁ జూచి శరజ్జ్యోత్స్నలో నేకవీరకన్నుల తళతళ యున్నదనుకుని యామెకుఁ దన ప్రేమ హఠాత్తుగాఁ దెలియఁజేసి యామె గాఢతర పరిష్వంగము లోతులు త్రవ్వుకొందమనునాస లేఖ వ్రాయుట మాని తెల్లవారలా మెనే ధ్యానించుచుండెను. ఏకవీర తన్ను కుట్టాన్ ప్రేమించుట స్వప్నగత వృత్తాంతమనుకుని యాపరాని తన పూర్వ ప్రేమోమూర్తిని ప్రయత్నముచేత మనసు చొరకుండ నాపరాని వానిని శరత్కాలపు వెన్నెలల తెలికాంతులవలనఁ దాను ధరించుఁ దెలిపట్టుచీరలలోని యొక విశేషానుభవము వలన మరియుమరియుఁ దనయూహాలోనిలుచు వానిని చూచి యూహించి సాత్విక భావములకు లోనయి యొడలెల్ల పులకించి యాసుఖము తనరక్తమాంసములలోనికిఁగూడఁ జొచ్చిపోవు నట్లు భావించుకుని యింతలో నమృతము తన వంకఁ దొంగిచూచుచున్నట్లులికిపడి 'ఆరంజే విరుంబు' తన చెవులలో ధ్వనించి మరల కుట్టాన్ ప్రేమమూర్తి పరిణత భావుని భావించి నేలకుఁ గాక మింటికిఁగాక పరితపించు చుండెను.

తెల్లవారి లేయెండలు కాచి దొడ్డిలోని కాకరపూలు బీరపూవులు బంగరునాణెముల వలె పొట్లపూవులు వెండినాణెములవలె వంగ పూలు నీలాలవలె గన్నేరులు పచ్చల వలె మాణిక్యములవలె నకాలదోహదపుష్పిత మల్లికలు సూచీముఖపుష్యరాగముల వలె నిత్యమల్లిక లెట్టవి, తెల్లవి మెరని రాళ్లవలె, వైరకాంతముల వలె దొడ్డియంతయు ధనలక్ష్మి తాండవించినట్లయ్యెను. ఏకవీర మనస్సులో మాత్రము దారిద్ర్యము తాండవించెను.

౬౩

కృష్ణానది కుత్తరమునఁ దెలుగునాడులో విజయవాడకు దిగువ కూచిపూడియని బ్రాహ్మణాగ్రహారము గలదు. అందు సిద్ధప్ప యను బ్రాహ్మణయువకుడు, మందబుద్ధి, సోమరి, అమాయకుడు, నిరక్షరాస్యుడు, ఆయూరందఱకుఁ బరిహాసపాత్రము. ఆయూరిలో మరియొక బ్రాహ్మణుని కూతురు సిద్ధప్పకు తగిన పెండ్లమని ఆమెతండ్రి తనకూతునకుఁ దగిన వరుని తేలేకయు సిద్ధప్పయందు జాలిచేతను ఆతని కిచ్చి పెండ్లిచేసెను. పెండ్లితో జీవిత భారము తెలిసిన సిద్ధప్ప చదువుకోరిక బలిసి కృష్ణదాటిపోయి నానాపండితుల శుశ్రూషచేసి వేదశాస్త్రములు, సంగీతము, నాట్యము, భరతము సర్వాంకషముగా నేర్చెను. అతనిచదువు పూర్తికొరకు వ్యక్తురాలయిన యతనిభార్య స్వగ్రామమున మనస్సులో, నామె తల్లితండ్రి బహిరంగముగాఁ బ్రతీక్షచేయుచుండిరి. విద్యాపూర్తియయి యింటికి తిరిగివచ్చు సిద్ధశాస్త్రి మనస్సునానావిద్యలచేత పరిపక్వమయియనను భూతగృహస్థాశ్రమమను భూతదశనందినట్లయి తురీయాశ్రమముదెసఁ బరువెత్తెను. కాని మాయాలేశములో వదలక మనస్సును నిశ్చయమునకుఁ దేలేదు. కృష్ణవద్ద కిట్టిమూహాలతో వచ్చిన శాస్త్రి యిట్లు నదిచూచును కదా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణ యీయొడ్డాయొడ్డు మోచియున్నది. తెప్పకొయ్యకూడ లేదు. ప్రొద్దు గ్రుంకుచున్నది. గ్రామము కొరకు వెనుదిరిగిన నావుడ పోవలయును. ఇంటిమీద యాస రేచుచున్నది. సాహసించి కృష్ణకడ్డుపడినాడు. సగమీదు వరకు మానిసిపని 'త్రాహిత్రాహి' యయినది. తన కంత్యకాలము సమీపించిన దని యతడు మనసా మోక్షార్థి సన్న్యసించెను. ప్రయత్నరహితుడై చేతులు కాళ్లు కదపక యూగిన యతనిని తాలోత్తాల మొక కెరటము జంఘుదఘ్నమగు నీట నిలిపెను. ప్రాణాయామము చాలించిన యతనికి కృష్ణ అందినది. రేయి కూచిపూడి చేరినాడు. అల్లుడు తేజస్వి, సకల విద్యారాశి, వచ్చిన యానందము మరునాటికి గర్భాధానలగ్నము కుదిర్చినది. గృహారామక్షేత్రదర్శికి సిద్ధపండితునకుం గృష్ణ నడుమపూనిన యాతురసన్న్యసము జ్ఞప్తికి రాలేదు. ఆరాత్రి ఏకాంతమున భార్యాచేలాంచలాకర్షి యతడామెచే వారితుడయ్యెను. నిజమునకు సిద్ధప్పగాని, యతని భార్యగాని మందబుద్ధులుగారు. అంత ర్దీప్తులు. ఆమె యోగిని. తనభర్తయందు సన్న్యసిని చూచెను. శృంగారచిహ్నాలు లేని, నిదుర బడలికలు లేని, ఆసకదలికలు లేని వారి కన్నులు నలుగురమ్మలనోళ్ల నాట్యమాడి రహస్యము వెలికి తెచ్చెను. సిద్ధపండితుని మనస్సులో తనయందు యతిని గాంచిన భార్యమాటకు, కృష్ణయీతకు ముడివడి యతడమరుకుని మేనపర్యటించిన యాదిశంకరుడు సురేశ్వరుని వాక్కులచేతవలె ప్రబోధితుడయ్యెను. తత్క్షణము క్రమసన్న్యస్తుడై శిష్యులకు విద్యాదాత యయ్యెను. మందబుద్ధియగు సిద్ధప్ప సిద్ధేంద్రయోగికా నాయూరెల్ల నాతనికి శిష్యకోటి యయ్యెను. ఆయనలో నిగూఢమై యున్న కవితాబీజము ఆకస్మికముగం బ్రత్యవభాసించి నియచ్ఛింపఁబడి మూకీభూతమైన శృంగారభావ సర్వస్వము భగవంతునియందుం బర్యవసించి యతడు కదలిపోయెను. ఆయనలోం బరిపక్వములైన భరతము, నాట్యము, సంగీతము, దేశభాషాజ్ఞానము కవితాబీజమునకు రూపమేర్పచినవి. నేర్చిన పట్చాస్త్రములు మనస్సుగా మారినవి. అలంకారశాస్త్రమంతయు బుద్ధియయినది. సత్యభామాకృష్ణుల ప్రణయ మాత్మ యయినది. ఈదివ్యకవితారూప పరిణామముచేత దెలుగునేల నాలుగుదిక్కులు సంగీతసాహిత్యములను పేరికుచద్వయ మల్లలాడ భాషాదేవి కాలిగజ్జెలు గల్లుగల్లు రని మ్రోగినవి. సిద్ధేంద్రయోగిగ్రంథము రెండు భాగములు. మొదటిది గొల్లకలాపము. రెండవది భామకలాపము. గొల్లకలాపము పట్చాస్త్రమునకు నిలుకడ. భామకలాపము వడకట్టిన యలంకారభరతశాస్త్రములు. నాటకమున కృష్ణదేవునకు స్థానములేదు. సత్యభామ ప్రధానురాలు. సత్యభామయే శృంగారరసర్వసమున కాలంబనవిభావమని తెలిసినవారు సృష్టిలో ముగ్గురన్న ముగ్గురే. మొదటివాడు శ్రీకృష్ణదేవుడు. అతడు శృంగారసర్వస్వమును చూరగొన్నాడు. అతనికి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుక్మిణి వైకుంఠమునుండి తెచ్చుకున్న నిధానము కావచ్చును. ఆమె పాతివ్రత్యమునకు మచ్చుముక్క కావచ్చును. సత్యభామ శృంగారాధిదేవత. సర్వవిధనాయికలను సర్వభావములను సృష్టించినదామె. ఆసృష్టి యాతల్లిభర్తయగు భగవంతుని కంకితము చేసినది. ఆమె యాలంబనవిభావత్వ మెరిగిన రెండవవాడు నందితిమ్మన. పాదతాడనము కూడ శృంగార రసమునందు పర్యవసింపఁజేసిన యాదేవి రసమూర్తి యాయనకుఁ గొంచెముగాఁ దెలిసినది. కృత్రిమకవితాలక్షణము పెంచుకున్న యాకాల మతనిని సత్యాశృంగారదేవతాత్వము సంపూర్ణముగాఁ దెలిసికొననీయ లేదు. అతని రచనలో శాఖోపశాఖలై మొదలుతుద తెలియరాని యలంకారశాస్త్ర మొక్క యాశ్వాసముతో ముగిసెను. మూడవవాడు సిద్ధేంద్రయోగి. ఆయనసృష్టి యాయనకే తెలియును. శృంగారరసము భగవంతుని చెప్పినపుడు ఆలంబనవిభావము (కృష్ణునితోపాటు) సత్యభామయగుచున్నదని తెలిసికొనుట తేలిక కాదు. వంగదేశకవులు జయదేవ విద్యాపతులు రాధ కాపదవి కట్టిపెట్టిరి. ఆశృంగారము చైతన్యుని తన్మయత్వము ధ్వనించునుగాని శంకరుని విజ్ఞానమును ధ్వనించదు. సిద్ధేంద్రయోగి జయదేవవిద్యాపతులవలె భక్తుడు కాదు. యోగి, జ్ఞాని అందుచే నితడు కృష్ణునితోపాటు సత్యభామ నాలంబనవిభావము చేసెను. సత్యభామ నిఖలభావములకు నొరిపిడిరాయి. శృంగార రసలేశములను కూడ సంతరించి సిద్ధేంద్రయోగి 'భామకలాపము' అలంకారసర్వస్వముగా సృష్టించెను. నాట్యము, అభినయము, భావము సంగీతము నీసాల్గింటి మహాసమైక్యము తెలిసిన యాకవి తనగ్రంథమును కూచిపూడి యగ్రహారీకులకుఁ దారకోపదేశమట్లుపదేశము చేసి కవి కాలము పరిణతమైనకొలది మీకిది వంశపరంపరగా భుక్తికి ముక్తికి నాధారమని చెప్పి యావిద్య పరిత్యజించినవారు ముక్తిదూరు లగుదురని శాపమిచ్చి కొందఱు శిష్యులను తయారుచేసెను. వారు తెలుగుదేశము నాల్గుమోసల నీవిద్య వ్యాపింపజేయుచుండిరి. ఈవిద్యామూలమున సర్వశాస్త్రములలోని రహస్యములు సర్వజనులకుఁ దెలియుచుండెను. ఆనాటకము చూచిన కొలదిజనులకు హృదయములు కోమలములు మనస్సులు భావపూరితములు ఆత్మలు రసనిమగ్నము లగుచుండెను. అది తెలుగువారందఱికి నేర్వని విద్య యైనది. అజ్ఞానులుకూడ జ్ఞానులగుచుండిరి. కూచిపూడివారి భామకలాప మన్నచో నాఁోజులలోఁ బసిపిల్లల దగ్గరనుండి పారవశ్య మైనది. భామకలాపమునకు శరత్కాలపు వెన్నెలరాత్రులు కామధేనువులు. శరత్తు వెన్నెలలు మధురవీథులలో తలతల లైనవి. నాడు ఆశ్వయుజ పూర్ణిమ. మీనాక్షీసుందరేశ్వరుల కల్యాణమహోత్సవము. కల్యాణమంటపము వీరభూపతి యింటి కెదురుగా నున్నది. కూచిపూడివారి భాగవత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము కల్యాణమంటపమున కెదురుగా నాటి రాత్రి యాడబడును.*

మీనాక్షి శ్రావణశుద్ధ దశమినాడు సేతుపతుల సౌధమున కేగినది. మరల నే డేగినది. ఏకవీరను భాగవతము చూచుటకు పిలుచుకొని రాతిరి జాముప్రొద్దు పోయినతరువాత వచ్చినది. ఇద్దరును పలుచని తెరచాటున వారి యరుగులమీదఁ గూర్చుండిరి. ఒకవైపునఁ గల్యాణము జరుగుచుండెను. మరియొకవైపున హాంగు మేళము చేయుచుండిరి. జామున్నర ప్రొద్దు పోయినది. గొల్లకలాపము ప్రారంభ మయినది. గొల్లభామయు హాస్యగాడును తెర వెనుక నుండియుండి చాకలివాండ్రు దగ్గరగాఁ బెట్టిన రెండుకాగడాలమీదఁ జల్లిన గుగ్గిలము మెరుపులో ద్రుత తాళముద్ధతనాట్యముగ తెర వెలికివచ్చిరి. హాస్యగాని హాస్యమునకు, గోపికాభినయమునకు దాని యుచ్చారణకు దేశీయభాషాప్రయోగమునకు జనము కదలిపోవు చుండిరి. గోపిక 'చల్లోయమ్మచల్ల'యనుచు తనజాతిలక్షణములు పశువులమేకల గొఱ్ఱెల స్వభావములతో పశుశాస్త్రము చదివి షట్ఛాస్త్రముల యర్థ ముపన్యసించి రాగములు, తాళములు, భరతము అలంకారము చర్చించి గర్భధారణము, గర్భోత్పత్తి, నవమాసములలో శిశువు పరిమాణము ఆత్మతత్వము సృష్టికారణము సర్వమును చెప్పి సభికులముగ్ధులచేసి తెర వెనుకకుపోయెను. ఏకవీర తదేకధ్యానముతో వినుచున్నది. మీనాక్షి కొంతసేపు నాటకమును చూచుచుఁ గొంతసేపు కళ్యాణమునంకఁ జూచుచుఁ గొంతసేపు జనమున కవతల చరించు వీరభూపతిని కన్నులతో వెంబడించుచుండెను. రాత్రి రెండుజాములు దాటి మూడవజాముకూడ సగము గడచినది. అప్పుడు భామవేషమువచ్చి జడ తెరమీఁదవైచి తెర వెనుకనుండి తన కథ చెప్పుచున్నది. సభ్యులకందఱి కనిమిషత్వము వచ్చినది.

మీనా — ఆజడ తెరమీద వేయుట యెందుకో తెలియునా ?

ఏకవీర — తెలియదు.

మీనా — భరతశాస్త్రమందు తమకు సాటివారు లేరని పందెము చరచుటయట.

ఏక — అట్లయినఁ బండితులకుఁ గోపము రాదా?

మీనా — రావలయుననియే, వచ్చినచోఁ దమ శక్తి చూపించవలయు ననియే.

ఏక — కొందఱీర్ష్యాళువు లుండవచ్చును. వారు ప్రయోగముచేసి పగదీర్చుకొందురు.

మీనా — మంత్రశాస్త్రమున కూచిపూడి వారు మహాఘనులట. వారి శక్తియపరిమితమట.

ఇంతలో విరహిణి యయిన సత్యభామ తెరవీడి వచ్చి భగవంతుని దశావతారములు

* ముత్తువీరప్పనాయకుని కాలమునాటికి కూచిపూడివారి భాగవతము క్రొత్తగా దేశములోనికి వచ్చినది. సిద్ధేంద్రయోగి పదునేడవ శతాబ్దమువాడు. ముత్తువీరప్ప 1610 లో రాజ్యమునకు వచ్చెను. అప్పటికే కూచిపూడివారి భాగవతము పేరు మోగిపోయెను. చుట్టుపట్ల వేయిగ్రామములనుండి జనములు గుంపులు గుంపులై వచ్చిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నభినయించెను. ఆ హస్తవిన్యాసము ఆయవయవచాలనము, ఆ ద్రుతతాళము, ఆ సుస్పష్టోచ్చారణ, ఆ భ్రూవిక్షేపము ఆభావానుగుణ్య నేత్ర విస్తార తాని మీలనములు సాక్షాత్ భరతముని వచ్చి నేర్పెనాయన్నట్లున్నవి. తరువాత 'భామ' వేషగాడు ముగ్ధమధ్యాప్రగల్భ లాధారముగ విప్రలంభ శృంగారమభినయించుచు మానావస్థయందలి మధ్యాప్రగల్భల ధీరా, అధీరా, ధీరాధీరా భేదములు, నందులో మరల జ్యేష్ఠ కనిష్ఠల భేదమును సూచించి విప్రలంభావస్థలు పదియును నారంభించి యభిలాష చింతాస్మృతిగుణకీర్తనో ద్వేగప్రలాపోన్మాద వ్యాధులను నెనిమిది యవస్థలు నభినయించెను. రసజ్ఞుల హృదయములు తల్లడిల్లిపోయెను. పామరులందరు హాస్యగాని మాటలకు వశంవదులగుచుండిరి. హాస్యగాడు కూడ 'భామ' భిన్నభిన్న నాయికల నభినయించునపుడు వాగ్రూపమున తత్తదుచిత సఖీ నిరూపణము చేయుచు పండితుల హృదయము చూరగొనుచుండెను. భావయోగ్యములయిన పతాకాది హస్తములతోడి, స్వాధీనమైన నేత్రతారకాభ్రమణముతోడి, నిత్యాభ్యాస వశమైన నృత్యకౌశలముతోడి, యతని యభినయమునకు, సర్వవిద్యలకు జన్మస్థానమై బీజాక్షరరూపమున రాగివిగ్రహమున నావేశించియున్న శివుడు నాదతనుడు సుందరేశ్వరస్వామి పులకితుడై కనులు తెరచి చూచుచుండెను. మీనాక్షీదేవికూడ ముగ్ధయై యతనివంకఁ జూచుచుండెను. తద్వీథీ వాయువులలో మృదంగస్వానములు కాళ్లగజ్జెలరవములు విరజిమ్మిన లయరమ్యాతిరమ్యమైన భాగవతుల సంగీతపు ధ్వని ప్రతిస్థారలో నాడుచుండెను. ద్రష్టలైన లక్షజనములో పసిబిడ్డకూడ రెప్పవేయలేదు. తొలికోడి కూసినది. 'భామ' జడతావస్థ నభినయించుచున్నది. రాగము మారినది. తాళము మారినది. అది యొక క్రొత్తకీర్తన ప్రారంభించిరి. మీనాక్షికనులు నాట్యప్రదేశమునందు నిశ్చలముగా నతుకుకున్నవి. ఏకవీర ప్రాణములు పూర్వములైన యెనిమి దవస్థలు మానసికముగా ననుభవించినవి. జడతావస్థాభినయవేళ నాగీతమునకు తాళమునకు దించుకునిపోయినవి. ఆమె యొడలు విదల్చుకుని చెవులు, మూసికొని, చప్పుడు లేకుండ వీరభూపతి యింటిలోనికి పోయినది. ఆయిల్లామెకుఁ గొంతభాగము పరిచితము. మంచము వేసియున్న గది యామె యెఱుగును. కాని మీనాక్షీవీరభూపతులయు, వీరభూపతి పూర్వప్రణయినియు చిత్రములున్న గదిలోని కామె వారింటికి వచ్చిన మూడు సార్లలో నెప్పుడును పోలేదు. మీనాక్షి యామెకాగది చూపించలేదు. ఏకవీర పోయి మంచమున్న గదిలో నొకచోఁ గూర్చున్నది. కూర్చుండలేకపోయి పండుకున్నది. సుకుమారమైన యామె దేహమునకు నేల గ్రుచ్చుకుని యామె యవిచారితముగాపోయి మంచము మీద బండుకున్నది. బయటనుండి యాజడత్వము గలిగించు రాగము తాళము సన్నగా వినిపించుచుండెను. ఈమెను జడత్వము సన్నగా నాక్రమించెను. బయట 'భామ' వేష



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాడు నిధనావస్థ యమంగళ మని పరిత్యజించి వాసకసజ్జికాభినయము మొదలుపెట్టెను. రాగ తాళములు మరల మారినవి. క్రొత్తగీతిక యారంభించిరి. వాయుపథమెల్ల నింతకుపూర్వ ము విషాదభావపూరిత మైనది. మరల సం తోషభావములు చెలరేగినది. తాళము చిత్ర గతుల నడచుచున్నది. ఏకవీర కెదలోని దిగులు సన్నగిల్లినది. ఆమె నేదో కోరిక కలచి వేసినది. పండుకున్నది. లేచి యేమియుఁ దోచక నటునిటు తిరిగినది. ఇట్లు తిరుగుచుఁ బ్రక్కనున్న గదిలోనికి పోయినది. దీపము జేగంటవలె వెలుగుచున్నది. మీనాక్షీచిత్ర ము, వీరభూపతి పూర్వప్రణయినీచిత్రము, పైన వస్త్రాచ్ఛాదితములై యున్నవి. కావున నామె కవి గోచరించలేదు. వీరభూపతిచిత్రము గోడ కాన్పబడి యున్నది. ఏకవీర కనులు మిఱుమిట్లు గొనెను. ఆమె నిలువున జలించి పోయెను. ఆమె కెదురుగా తనపూర్వప్రణయ మూర్తి సాక్షాత్కరించిన ట్లుండెను. ఏక వీరలో చైతన్యము లేదు. ఆమె మనస్సు జడత్వము తాల్చెను. ఆమె కన్నులు తెరచుకొనియే యున్నవి. ఆ నేత్రము లలో జీవచిహ్నములేదు. ఆమె గోడకాను కుని నిల్చుండుటచేత క్రింద బడిపోలేదు. మనోరథము నిశ్చలమయ్యెను. చల్లనిగాలికి గవాక్షము తెరుచుకొనెను. బయట సఖీపరి హాసము వినవచ్చెను. ఏకవీర ప్రబోధితయ య్యెను. తాను నాయిక. ఆచిత్రస్థితివలన నది తననాయకుడు వత్తునన్న స్థలము. తాను వా సకసజ్జిక. ఇదేయూహ యామెకు. అప్పుడామె స్థితిలోని యణువునకును రసజగత్తును దాటిన యునికిలేదు. ఆమె మనస్సులో మీనాక్షి లేదు. అది మీనాక్షి యిల్లనిలేదు. తాను సేతుపతి భార్యననిలేదు. తా నెవరోకూడ లేదు. తానున్నది రసజగత్తు. ఆమె నాయిక. అందులో వాసకసజ్జిక. నాయకునికొర కెదురు చూచుచున్నది.

తూర్పు రేకలు తోచినవి. బయటసామగ్రీ సంపాదనపు గడబిడ తోచినది. ఏకవీర గది యొకతెలివివచ్చి చీరసర్దుకున్నది. తలవెండ్రు కలు గోళ్లతో చిక్కుతీసికొన్నది. తన నాయ కుఁడు తన్నువచ్చి కౌగిటఁ బూనుననుకున్నది.

మరల బయట మార్గవిలోకమను చేష్టా భినయము నంది గీతము మొదల్లు 'ఇటువచ్చు చున్నాడే, అటువచ్చుచున్నాడే' యనునవి వినఁ బడెను. ఏకవీర కనులు అప్రయత్నముగా ద్వారమువంకకుఁ దిరిగినవి. ద్వారము తళతళ లాడినది.

బయట నాట్యసౌందర్యము కన్నులు విచ్చి చూచుచున్న సుందరేశ్వరుని కంటివేడికి పూజారిచేతి చామరము మండిపోయినది. పూ జారి చాకలివానిచేతి కాగడాయంటుకొన్నదని వానిని కోపపడినాడు. నాటకమాడుటకు వేయ బడిన పందిరియాకుల చివరలెట్టబడినవి. 'భామ' వేషము వేసినవాని కోకచివరలు తగులఁబడి నవి. ఆదోషముకూడ చాకలివానిపై మోప బడెను. ఎవరో ప్రయోగము చేసిరన్న భ్రాం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తివలన మేళమునకు నాథుడైన వృద్ధబ్రాహ్మణుడు దిగ్బంధము చేసెను. అప్పుడే కృష్ణవేషము వచ్చెను. సుందరేశ్వరునిచూపు చల్లపడి గందరగోళమంతయుతగ్గిపోయెను. తెల్లవారెను. వచ్చిన కృష్ణునిమెడల సత్యభామ సమాదరము చూపుచున్న ధ్వనులు మరల లోనికి వచ్చినవి. ఏకవీరకనులు ద్వారమందున్నవి. అందు వీరభూపతి నిలుచున్నాడు. వారిద్ద రొకరివంక నొకరు చూచుకొనుచున్నారు. నాటి కారేండ్లక్రింద నంబాసముద్రమునకు వీరభూపతి వెళ్లినప్పుడు యామెతండ్రి యంతఃపురమున గవాక్షమునుండి యేకవీరచూపులు వీరభూపతి చూపులతో కలిసిన నిమేషమునకు నారేండ్ల తరువాత చెప్పరానన్నిమార్పులు జరిగి యిప్పుడొకరికొకరు తెలియకుండ నాకస్మికముగా మరల చూపులు కలసిన యీ నిమేషమునకు వారి యిద్దరి మనస్సులలో వ్యవధి లేనట్లు తోచెను. ఇరువురును తామొకరి నొకరు తప్ప యింకొకడేమియు నాసమయమున చూడలేదు; ఊహించలేదు. శరీరములతోబాటు మనస్సులతో నాత్మలతో వారిరువురాస్థలమునకే యా భావమునకే లగ్నింపబడిరి. ఆమె యిప్పుడు కోటలో బంధింపబడిలేదు. ఇతడు వీథియందు నిలబడి చేయునది లేక కాదు. వారి యిద్దరి ఈ సంయోగమెట్లు గలిగినదన్న ప్రశ్న రాలేదు. ఆమె యచ్చట నతడచ్చట నేల యున్నారన్న యూహ పోలేదు. వీరభూపతి పరిష్వంగార్థము దగ్గరదగ్గరకు వచ్చుచుండెను. ఏకవీర చేతులు చాచుకుని నిలంబడినది.

ఆమె యొడలెల్ల చెమ్మట పోసెను.

సవ్వడి లేక వీరభూపతి వేయు నడుగు లొక్కటొకటి యేకవీర కామె ప్రాణముల మీద వేయుచున్నట్లుండెను. ఆమె యొడలంతయు స్తంభించెను.

వీరభూపతి కౌగిలించుకొనదగినంత దగ్గరకు వచ్చెను. ఆమెపాదములక్రింద భూమి యల్లలనాడెను. ఆమె నిలువున పులకించినది.

అత డామెచేతులు తనచేతులతోఁ దాకెను. ఆమె దేహముమీది కొక విద్యుత్ప్రవాహము ప్రవహించెను. ఆమె యొడలంతయు కదలిపోయెను.

అతనిచేతు లామెదేహముచుట్టు చుట్టుకొనెను. అంతవరకు వినవచ్చిన యతనినిశ్వాసవాయువు యొక్క మనోహరమృదుస్వానము వినబడలేదు. ఆ నిశ్వాసవాయువు లోకము పూవులన్నియు పూచిన వనముమీది మందమారుతమువలె నామెఘ్రాణేంద్రియమును జూఱగొనెను. ఆమెచక్షుస్సు లతని చక్షుస్సులే చూచుచుండెను. ఆమెకన్నులలో వైవర్ణ్యముదయించెను. ఆమె త్వగింద్రియము చర్మదఘ్నముగా శిశిరాతిశిశిర మయ్యెను.

అత డామె నెదుఱొమ్మున కాన్చుకొనినాడు. ఆమె నేత్రములు తెరుచుకొని యుండియు నతనివంక జూచుటలేదు. వానికి చూచునట్టి గుణము పోయినది. కన్నులనిండ నశ్రువులు నిండియుండెను. అతని యాకౌగిలింతలోని చల్లదనము ఆమెరక్తములో ప్రవేశించెను. ఆమె



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కు భూమధ్యరేఖాప్రాంతస్థుని నుత్తరధ్రువ సమీపమున కొక్కసారి కొనిపోయినట్లయ్యెను.

అతఁడామెను గాఢాతిగాఢముగా గౌగిలించుకొనెను. ఆమె ఘ్రాణేంద్రియమున కతని నిశ్వాసపరిమళ మనుభవించు శక్తిపోయినది. గట్టిగా గౌగిలించుకొనుటచేత నామె హృదయమునుంచి ధ్వనిరీతి వచ్చినగాలి యామెకంఠమందు స్తంభించిపోయెను. అతని యా కౌగిలింతలోని చల్లదనము ఆమెలో నరమునరమున వ్యాపించినది. ఆమె హృదయములోని సర్వనాళములు నామహాస్పర్శసుఖ మనుభవించినవి.

అతఁడామె పెదవిపై నొక్క ముద్దిడెను. ఆమె జిహ్వేంద్రియ మాముద్దురుచి తెలిసికొనలేదు. అతనిస్పర్శ యీసారియామెలోని యస్థిసంచయమునకుఁ గూడ తాకినది. ఆమెకు హృదయసంచలనమునందు మాత్రమే స్థితి. తక్కిన సర్వాణువులయందుఁ బ్రళయము. చక్షుశ్శ్రోత్ర ఘ్రాణజిహ్వేంద్రియ జ్ఞానమంతయు త్వగింద్రియమంద లీనమయి యాస్పర్శగుణ మతిక్రాంతమర్యాదమై యామెయన్నపదార్థవాచ్యమైన సర్వమునందు నిండినది. మంచుగడ్డను కౌగిలించుకొన్నట్లుగాఁ జైతన్యపువేఁడి కానరాని యామె కౌగిలి వీరభూపతి కప్పుడు తెలిసినది. వెంటనే యతనికి ప్రబోధము కలిగినది. ప్రబోధము వెంట ప్రపంచ మంతయు గోచరించినది. తాను స్థానాపతి. ఆమె తా నాఁశేండ్లకుపూర్వము ప్రేమించిన యువతి. ఆమెపేరు తనకు తెలియదు. ఆమె యిచ్చట యెందు కున్నదో తనకు తెలియదు. తాను చేసినతప్పు సర్వము తత్క్షణ మాతని మనస్సులో స్ఫురించెను. అతఁడు దిగ్భ్రాంతి పొందెను. ఆ వెనుకటి నిముసమున మహానందము. మఱునిముసమున మహాసంశయావస్థ. ఆమెలో ప్రాణమున్నట్లు లేదు. ఆమె మూర్ఛపోయినదా? గతించినదా? వీరభూపతి తొందరపడెను.

బయట నాటకము చివరకు వచ్చినది. మీనాక్షి వెనుతిరిగి చూచెను. వెనుక నేకవీర లేదు. పరుగెత్తుకుని మేడమీదికి వచ్చెను. ఆమె గదిలోనను లేదు. క్రిందకు మరల దిగఁబోయి యయినఁ జూతమని రెండవగదిలోనికిఁ బోయెను. నేలపడియున్న యేకవీర, ఆమెవద్ద విషణ్ణుడైయున్న తనపతి. ఏకవీరలో మీనాక్షి తనపతి పూర్వప్రణయినీరూపము గుర్తించినది. కాని తనపతికిఁ జెప్పలేదు. ఈదృశ్యముచూచి యామె మనస్సు పరిపరివిధములఁ బోయినది.

వీరభూపతి యామెను చూచిన వెంటనే వచ్చి అతిదీనుడై జరిగిన సర్వము నామెకు నివేదించెను. అసంభవమైనది యతనిమాటలలోనను, అయథార్థమైనది యతనిమొగములోనను, యేమియు కనంబడలేదు. మీనాక్షి పోయి యేకవీరను ప్రబోధించు ప్రయత్నములు చేసినది. ఆమె స్పర్శవలన నామెకు మరల హృదయమునుండి వేడినెత్తురు నరములలో నెత్తురులో ప్రవహించెను. చర్మమున



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కు వేడిమివచ్చెను. నిశ్వాసమాడెను. కన్నులు తెరుపుడు పడెను. చెవులకు శబ్దము వినవచ్చెను. సర్వేంద్రియజ్ఞానము కలిగెను. ఆమె మనస్సు సహస్రధా పరుగెత్తెను. ఆమె తొందరలోలేచి లజ్జావనతవదనయై మీనాక్షి వెనుక నిలంబడెను. వెన్నెలలో దీపముదగ్గర నొక వస్తువునకు రెండునీడ లుండును. దీపపు చిక్కనినీడ; వెన్నెల పలుచని నీడ. వీరభూపతికి వారిద్ద రాతని కా రెండునీడలు. మీనాక్షిదీపపు నీడ. ఏకవీర వెన్నెలనీడ. బయట నాటకమాయి పోయినది.

## ౨౮

దిగ్భ్రాంతులయి యట్లే మువ్వురును అర గడియసేపు నిలుచుండిరి. ప్రతివిలిప్తయు నేక వీరావీరభూపతులకు నొక మహాయుగమంత భారముగా నుండెను. వీరభూపతి మెవ్వరో యేకవీరకుఁ గొంచెమర్థమయినది. కాని నిశ్చయము కాలేదు. వీరభూపతి కేగోడును తెలియ లేదు. కొంత సేపటికి అతడు మాట పెగుల్చుకుని మీనాక్షిని ప్రశ్నింపఁబోయెను. మాట రాలేదు. మీనాక్షి యతని యభిప్రాయము తెలుసుకుని యామె కుట్టాన్ సేతుపతి భార్య యని చెప్పినది. వీరభూపతిమీదఁ బిడుగుపడినట్లయ్యెను. నిలుచున్నవాడు పెద్దపెట్టున కేక వేసి నేలఁ జదికిలఁబడి 'అయ్యయ్యో!' అని తలవంచుకుని కుడియరచేతితో మాడపట్టున మోదుకొనెను. ఆ మఱుసిముసమున నాతనికి స్మృతిలేదు. ఈసంఘటనము వలన నేకవీరకు సర్వ మవగతమయ్యెను. మీనాక్షి పైగా విప్పి చెప్పెను. "ఈయన యేనాపతి. స్థానాపతి. కుట్టాన్ మహారాజు ప్రాణస్నేహితుడు. ఏకవీరా! ఇది విచిత్రసంయోగము. నీవివాహమునకు పూర్వము నీవీతనిని నావివాహమునకుఁ బూర్వము నేను కుట్టానును ప్రేమించితిమి. వారు మనలను ప్రేమించిరి. దైవసంఘటనము వ్యత్యస్త ఫలితమైనది. వారిద్దరు పరమమిత్రులైరి. నేను పరమమిత్రుని భార్యనగుట తెలిసి నీభర్త తన ప్రేమబంధము కోసివేసి నాయందు సోదరీప్రేమ నిలిపినాడు. నేను మీ యింటికి రాకపోకలకు కారణమిదియే. పాప మాకుట్టాన్ నాడుగా నీ యందలి ప్రేమచేఁ బరిభ్రమించుచున్నాడు. కాని రాచకార్యము లతనిని నీనుండి దూరము చేసినవి. ప్రేమోద్వేగియగు నతడు నేడు వచ్చునో రేపు వచ్చునో. ఉదయాన్ సేతుపతిగారు రామనాథమునకు బయలుదేరి నాల్గునాళ్లయి నది. నీయంతఃపురవర్తనము వీరభూపతికి నీదగు కుట్టాన్‌భార్యాత్వము తెలియనీయలేదిన్నిసంవత్సరములు. నేటిరాత్రి యీవిచిత్ర సంయోగము. నీవింతయుద్వేగ ప్రణయినివి."

ఈ చివరమాట లేకవీరకు వినంబడలేదు. తనయెడల కుట్టాన్ ప్రేమచలితుడని విన్నప్పుడు, అతడు నేడో రేపో వచ్చునన్నప్పుడు నామెనేత్రములలో నొకవిచిత్రసంచలనము కలిగినది. మీనాక్షి మాటలాడుచునే యున్నది. ఏకవీర త్రాచుపామువలె చర చర మేడదిగిపోయి కల్యాణమంటపమున కెదురుగా నిలుచున్నది. భాగవతు లందఱు వెడలిపోయి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రి. జనము సవ్వడి పదింటికి తొమ్మిదివంతులు తగ్గెను. స్వామిని కదల్చుటకు పూజారులు ప్రయత్నము చేయుచున్నారు. ఏకవీర తూర్పు దిక్కునఁ జూచెను. సూర్యభగవానుఁడు ఎఱ్ఱని నిప్పులు గ్రక్కుచున్నాడు. ఏకవీరకు భయమై కనులు మూసికొన్నది. తన దేహ మందు ప్రత్యణువునందు వీరభూపతిస్పర్శసుఖ చిహ్నములు ముద్రితము లైనట్లు తోచిన దామెకు. కనులు తెరచినది. ఎదురుగా గుఱ్ఱపువాళ్ల పిల్ల యమృతము నిలుచున్నది. చింపిరిజుట్టు. మాసిన పరికిణీ. చొక్కా లేదు. దానికన్ను లెఱ్ఱగా నున్నవి. ఇంతకుముందా తూరుపుదూరాలఁ దోచిన సూర్యబింబ మీ పిల్లగాఁ దనదగ్గరకు వచ్చిన ట్లున్న దామెకు. ఆమె నిలువెల్లఁ జలించిపోయినది. కనులు మూసికొన్నది. సూర్యబింబ మొకకంటికి నా పిల్ల యొకకంటికిఁ గనంబడిరి. వా రిద్దరు తన దేహమునందుఁ బ్రవేశించిన ట్లయిరి. ఆమె కన్నులు గిర్రున తిరిగినవి. ఓర్చుకోలేక కన్నులు తెరచి తూర్పువంకఁ జూడక, యమృతమున్న యెడఁ జూడక సుందరేశ్వరునివంక జూచెను. చాలనాళ్లుగా దేవుని కొక సంకల్ప మున్నది. ఆనాటి నాటకప్రదర్శనమువలన స్వామి యా సంకల్ప ముత్తేజిత మైనది. స్వామి కనులు తెరచు సంకల్ప వికల్పములు సహస్రముఖముల బిజృంభించు మనస్సునకై ప్రతీక్షించు చుండెను. ఆసమయమున నేకవీర మనస్సున సంకల్ప వికల్పములు శతసహస్రముఖముల విజృంభించుచుండెను. ఏకవీర కనులు భగవంతుని కన్నులతో గలసెను. స్వామి యా చూపు వెంట నామెలో బ్రవేశించెను. ఏకవీర భగవంతుని ప్రవేశభారమున తాగలేక మూర్ఛపోయినది. స్వామివిగ్రహము పూజారులచట నుండి కదల్పలేకపోయిరి.

రాబర్టు డి నోబిలియను నొకపోర్చుగీసుక్రైస్తవ మతవ్యాపకుడు సన్న్యాసివేషము వేసికొని తత్త్వబోధకస్వామి అని పేరుపెట్టుకుని పరిబోధితులుగాని సామాన్యులను మతాంతరులఁ జేయుచున్నాడు. విగ్రహారాధన దూషించుచున్నాఁడు. నాలుగేండ్లుగా నతని యాపని భగవంతుడు హర్షించినాడు. నేటి కతని ప్రాబల్యము మితిమీరుచున్నది. వాని పని కాపు చేయవలెనని చొక్కనాథశివుని యాజ్ఞ. ఏకవీరలో స్వామియాజ్ఞ వినంబడినది. ఆమెలేచి నిలంబడినది. స్వామికదలినాడు. జన మపుడే చుట్టును మూగిరి. వార్త పురమెల్ల వ్యాపించెను. అంతఃపురస్త్రీ; అప్సరస; మేలిముసుగు లేక దేవుని వెంటఁబోవుచుండెను. జను లామె సౌందర్యమునకు, నామెకన్నులలోని యగాధత్వమునకు మెచ్చుకొనుచుండిరి. భయపడుచు నుండిరి. అందఱును చొక్కనాథశివుని యాలయముముందున కేగిరి. స్వామికళ్యాణమున కచ్చట పెద్ద పందిరి వేయబడెను. ఏకవీర యచట నిలుచున్నది. స్వామివాహకులు నిలువబడిరి. జనము దూరముగా గ్రిక్కిరిసి పోవుచుండిరి. జాముప్రొద్దెక్కెను. వీరభద్రభట్టరు నతని వెంట నలుగురు దాసీలును వచ్చి యేకవీరకు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఎడ్లబండి
[ఇండో పరిషియను విధానము] చిత్రకారుడు: అబుల్ హసన్.

(కాశీవాసి శ్రీ సీతారాం షా గారి చిత్రసంచయమునుండి)
శ్రీ త్రివేణీపత్రికా సంపాదలు దయతో నొసగినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమస్కారము చేసిరి. ఆమె మాటాడలేదు. దాసీలు 'అమ్మా! ఇదియేమి? పోదమురమ్మ' నిరి. ఇంకొక దిక్కునకుఁ జూచెను. మీనాక్షి వచ్చెను. ఏకవీర "నింటికి పోదమురా. అంతః పురస్త్రీ లిట్లు వత్తురా ? ఇదియేమి యాగడ మమ్మా" యనెను. ఏకవీర భ్రూభంగముచేసెను. ఆమె నెవ్వరును బలవంతముగా లాగుకొనిపో ప్రయత్నించలేదు. ఆమె యెవ్వరి కోసమో యెదురుచూచుచున్నట్లుండెను.

ఎవరో రాజస్త్రీ యంతఃపురము వదలి వచ్చి పిచ్చియెక్కిన దానివలె బజారులవెంట బోవుచున్నదన్న వార్త నోబిలికి తెలిసినది. తన మతములో గలసిన యిద్దరు ముగ్గురు శిష్యులను వెంటఁబెట్టుకుని వలలో పిట్ట బడినదని తెలిసిన వేటకానివలె బరుగెత్తుకొని వచ్చెను. పగలు రెండుజాములైనది. చొక్కనాథసుందర శివుఁకంటిమంట భగ్గురని మండిపోవుచుండెను. నోబిలి జనమును తోసుకుని లోనికివచ్చినాడు. ఏకవీర కన్నులు విచ్చిచూచెను. నోబిలి ఆచూపు సాగలేకపోయెను.

ఏకవీర మందహాసము చేసినది. నోబిలి నిలువ ద్రొక్కుకొనెను.

జనము నిశ్శబ్దమైనది. సూది పడిన ధ్వని వినంబడుచున్నది.

* * *

తరువాత నేకవీరకు నోబిలికి వాగ్వాదము జరిగెను.

అందులో నోబిలిసిద్ధాంతము లేకవీర ఖండించి తనమతమును నిలబెట్టుకొనెను.

* * *

చివర కేకవీర యిట్లు తన వాదమును ముగించెను.

ప్రతిదేశములోనను జనసామాన్య ముందురు. సంఘమున నుచ్చస్థాన మాక్రమించువారు నుందురు. అందఱకు వివేకము సమానముగా నుండదు. ఏదేశమందైనను జనసామాన్యమునకు మతసారస్వతాది విషయములలో విశేషము తెలియదు. వారి కెవ డేమాటచెప్పిన నదియే వేదము. విద్యగలయొకసంఘ భాగమున గూడ మూఢు లుందురు. వారిని నీమతము లోనికి ద్రిప్పి నీబుజములు చట్టలు పొంగ నక్కఱలేదు. ఇంకొకసంగతి జెప్పెదను వినుము. బుద్ధి యెవనిసొమ్ము? వేళనుబట్టి యొకని బుద్ధి పనిచేయదు. ఒకమందబుద్ధియే సంతోషవేళ లోకములు జయించిన వానివలె మాట్లాడును. అర్జునుడంత మహావీరు డొకసమయమున కర్ణునిజూచి బెదరినాడు. అది వేళావిశేషము. వాదమునకు బైవాద మెప్పుడు నున్నది. తీవ్రతరవాదివచ్చినపుడు లొంగిపోవుసిద్ధాంతములు ప్రతిపాదించియేమి ప్రతిపాదించకయేమి? లోకమందరు మూఢులై యొక నీచమత మవలంబింతురనుము. ఆమతముండియేమి? లేకయేమి? నేడొకవందమంది నీమతస్థులైరి. రేపు నీతల దన్నినవానిమాటచే వారు వానిమత మవలంబింతురు. ఇది వృథాప్రయాస. మహావిజ్ఞాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖని తనమోక్షము తాను సాధించుకొనును. సనాతనధర్మము యుగములతరబడి నిలచినది. నీమతప్రాబల్యము బౌద్ధమత ప్రాబల్యముతోఁ బోల్చుకొమ్ము. దానిని గోట జిదిమినాడు శంకరుడు. తురుష్కులు కత్తిచూపి, తమమతము చూపి అదా యిదా అన్నారు. ఉత్తరమున జైతన్యమీరాబాయి ప్రభృతులు, పడమర రామదాసు శివాజీప్రభృతులు, తూర్పునవిద్యారణ్యులు నుదయించి శివునకు ప్రీతిచేసిరి. మీరింక నీమతమిల్లే ఘోషింతురా మీకుఁ దగినవారు మీకు నుదయింతురు. అవివేకుల యందలి యేకదేశఫలితము వలన లోకవంచనముగాక బ్రహ్మప్రీతిలేదు. భగవద్గీత చదువుకొనుము. "యదాయదాహిధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్." ఆమెగొంతు చివరకు రాను రాను పెద్దదైనది. కనులు నిప్పులు గ్రక్కెను. నిలువెల్ల కదలిపోయెను. 'సృజామ్యహం' అని విరుచుకుని పడిపోయెను. ప్రొద్దు గ్రుంకుచుండెను. దాసీలు వీరభద్ర భట్టరు మీనాక్షియు నామె నింటికి దీసికొనిపోయిరి. ఊరిలోని నగముజన మచ్చట నుండెను. ప్రొద్దుటినుండి యెవరికిని భోజనములేదు. డి నోబిలి యచ్చట నిలువలేకపోయెను. జనుల నిందావాక్యములు వినలేక తలవంచుకుని యదేపోత పోయెను. అతడు గతించిన నాలుగేండ్లుగా నిర్మించిన సౌధ మానాటితో నేలకు గూలెను. అతని శిష్యులు తలా ఒకత్రోవ పట్టిరి. జనులు సంజ చీకటులలో నొకరినొకరు త్రోసికొనుచు నిండ్లకుపోయిరి. భర్తజీవితమును సుఖపరచవలెనని తల్లి నేర్పించిన యేకవీర చదువు సుందర చొక్కనాథ శివున కుపయోగపడినది.

౨౫

ఏకవీర మరునాడు ప్రొద్దు తిరిగి నిదర లేచినది. ఆమెకు వెంటనే స్మృతికి వచ్చిన సంగతి వీరభూపతి కౌగిలింత. ఆపరిష్వంగపారవశ్యముపోయి దానిలోనున్న యొక మహానుభూతి యామెసర్వావయవములయందు రక్తనాళములయందు వ్యాపించినట్లే యున్న దామెకు. రెండవది విపరీతమైనయాకలి. ఆ వెనుకటిదిన మేమిజరిగెనో యామెకు స్మృతిలేదు. పరిచారికలు వేన్నీళ్లుపెట్టి తలంటి సుగంధద్రవ్యము లలంది స్నానము చేయించిరి. దీర్ఘములైన యామె కేశపాశము దులిపి యగురుధూపములు వేసిరి. ఒడలినిండ సువాసనా ద్రవ్యములు పూసిరి. జరీయంచులు పూవులుగల తెలిపట్టు చీర కట్టిరి. సుకుమారములు తేలికలైనవి మధురములైన పదార్థము లారగింపించిరి. ఒడల నగలు కొద్దిగా నలంకరించిరి. ఇంతలో నొక సేవకుడు పరుగెత్తుకునివచ్చి కుట్టాన్ సేతుపతి మహారాజు వచ్చుచున్నాడని యీపాటికి నగర ద్వారము చేరియుండునని తనప్రేమచిహ్నము దీర్ఘరమణీయాష్టాపదదామము భార్యకు పంపెనని తానామెను చూచునపుడది యామె ధరించియుండవలయునని చెప్పి గోధుమవన్నె త్రాచువలె తళతళలాడు నానగ నిచ్చెను. ఒక పరిచారిక తానది యందుకొని యేకవీర మెడలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైచెను. ఏకవీర వలడనలేదు. అమె మొగమున నంగీకారము లేదు. ఆహార మామె కాంచీప్రదేశమువరకు వ్రేలాడెను. ఆసూత్రము రైకలేని చోట మెడమీదఁదగిలి యామెకువిపలిప్తమైన సన్ననికత్తివాదర యంటుకున్నట్లయినది. ఆమె తాళలేక దొడ్డిలోనికిఁబోయి, తక్కినయాకులు కోయబడి సన్నని తెల్లని విరిసిన మువ్వాకుగల యరటిబోదెమొదల నిలుచుండెను. ప్రొద్దు మూడుజాములు దాటినది. ఆమె యటనుండి కదలలేదు. పరిచారిక లొకరిద్దరామెను పలుకరించుటకు భయపడిపోయిరి.

నురుగులు క్రక్కుచున్న గుర్రములుగల రథమునుండి కుట్టాన్ దిగెను. స్నానము చేసెను. స్నానము చేసినంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించెను. దాసీ లేకవీర నిన్నటికథ చెప్పిరి. అత డాశ్చర్యపోయెను. అల్పాహారము తీసికొనెను. తీసికొనినంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించుచుండెను. ఏకవీర యంతఃపురమును వదలి యక్లేగుట యెట్లన్నదన్న దొకదాసీ. కుట్టాన్ సమాధానము చెప్పలేదు. అతని యెదలో నేకవీర దేవతామూర్తి యనిపించినది. పసపు పచ్చని సన్నని పట్టు దోవతి బూదిరంగు జరీపూవుల పసపు పచ్చని పట్టుత్తరీయమును ధరించెను. తలకు ఘుమఘుమలాడు మందార నూనె రాచెను. కర్పూరపు తావులు చిమ్ము తాంబూలము సేవించెను. ఇంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించుచుండెను. ఒకదాసీ ఏకవీర చదువుకు నంద ఆశ్చర్యపడి రనెను. కుట్టాన్ మనస్సులో ప్రేమప్రవాహము కట్టలు తెగిపోయెను. ప్రొద్దు మూడుజాములు దాటినది. కుట్టాన్ ఏకవీరను చూచుట కామె గదిలోనికి బోయెను. ఆమె యచ్చటలేదు. ఒకపరిచారిక దొడ్డిలో నున్నదని చెప్పెను. అచ్చటికి పరుగెత్తుకుని పోయెను.

ఒంటి మువ్వాకువిరిసిన యరటిచెట్టుక్రింద నిలుచున్నది యేకవీర. ఆమె మెడలోఁ దాను పంపించిన హారము తళతళ యెండపొరలో మెరయుచున్నది. సౌదామినీగర్భమైన సితమేఘమలంకరించుకున్న శరల్లక్ష్మివలె నామె కుట్టాన్ కన్నులు మిరుమిట్లుగొలిపెను. కుట్టాన్ పరుగునపోయి కౌగిలించుకోవలె ననుకొనెను. ఏకవీర మొగము విషణ్ణమై యున్నది. కుట్టానామెను సముత్సాహపరుపనెంచి నవ్వెను. ఏకవీర మొగము వికృతమయ్యెను. కుట్టానామెను సమీపించెను. ఆమె వెనుక వెనుకకుఁబోయెను.

కుట్టాన్ కన్నులలో ప్రేమ కురిసినది. ఆమెకన్నులలో భయము విరిసినది. కుట్టాన్ మాటాడుద మనుకున్నాడు. ఆమె పరాంగన కాదు. ఇదివర కే తన్ను ప్రేమించినది; తాను ప్రేమించలేకపోయినాడు. ఇప్పు డా ప్రేమ మునరుకుని వచ్చినది. 'బాగుగా నున్నావా? ఏమి చేయుచుంటివి?' మొదలగు ప్రశ్నలకు తావు లేదు. తన ప్రేమకు దగిన దొక్కటియే. అది యొకగాఢ పరిష్వంగము. తాను మాటాడలేక పోయినాడు. అతని కన్నులవెంట నీరు గిర్రున తిరిగెను. గొంతుకలో గాద్గద్య మేర్పడెను. ఏకవీర యతని నాగుమన్నది. అత డొకయడుగు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముందునకు వేసెను. ఏకవీర యాసపెట్టినది. కుట్టాన్ నిలచిపోయెను. ఏకవీర యేడ్చినది. కుట్టాన్ మరల నొకయడుగు వేసెను. ఆమె తన్ను తాకవలదన్నది. తాకినచో చచ్చిపోయెద నన్నది. ఈమాటలు కుట్టానునకు వినిపించలేదు.

అతనిగొంతుక విడివడెను. ప్రశ్నమీదఁ బ్రశ్నగా నొక లక్షప్రశ్న లతనినోట వెలువడెను. 'ఇంతచదువెప్పుడు నేర్చితివి? క్రైస్తవ సన్న్యాసి నీముందు నోరు మెదపలేక పోయెనట కదా? అంతఃపురము వదలిపోవుట కెట్లుసాహసించితివి? నిన్ను సుందరేశ్వరు డేమైనఁ బూనెనా? నేను నిన్ననైన వచ్చితిని కాదు. వచ్చినచో నీవిజయమున కెంత సంతోషించి యుందును!' మరల నింకొకరీతి ప్రసంగము చేసెను. 'ఇన్నాళ్లుగా నిన్ను ప్రేమించజాలనందుకు క్షమించుము. దానికిఁ గారణము నీకు జెప్పితిని. ఆకారణము నాల్గునెలలక్రిందనే కారణము కాకుండ బోయెను. దుర్విధి నన్నుమధురనుండి తరిమినది. హఠాత్తుగా నిన్ను కలుసుకుని పొందుమహానందమునందలి యాశ. నీకు నా చేత నుత్తరము వ్రాయించలేదు. నామిత్రుడు వీరభూపతి భార్య మీనాక్షి—'అని కుట్టాన్ మొదలుపెట్టగనే యేకవీర పారిపోజొచ్చెను. ఆమె వీథివాకిలిదాటి హజారముదాటిపోయెను. కుట్టా నామెవెంట బరుగెత్తెను. అరజాము ప్రొద్దుండెను. వీథిలోనికివచ్చి యేకవీర తలయెత్తి చూచెను. మీనాక్షీదేవి దేవాలయ శిఖరపుబంగారపు తొడుగు యెండలో ధగధగమండిపోవుచుండెను. ఇంతలో గుట్టాన్ ఏకవీరను గలసికొనెను.

కుట్టాన్—ఎక్కడకు పోవుచుంటివి.

ఏకవీర—వైగై నదికి.

కుట్టాన్—ఎందుకు?

ఏక— నా యొడల మహాఘమున్నది. అది కడిగివేయుటకు.

గుర్రపువాళ్లపిల్ల యమృతము దువ్విన తలతో పరికిణీ తొడుగుకొని చొక్కా తాలిచి - బడి వదలిపెట్టిరి - యింటికి వచ్చుచు 'ఆరం జేవిరుంబు', 'ఆరవదు శినం' అని పిచ్చిపిచ్చిగా పాడుకొనుచు వచ్చుచుండెను. ఆమె యేకవీరనుచూచి భయపడి పారిపోయెను. ఏకవీర మరల బరుగెత్తెను. కుట్టాన్ వెంబడించెను. వైగై చూపుమేరలో నిలచెను. కుట్టానున కేకవీరకు మధ్యవందగజముల దూర ముండెను. ఏకవీర గాలి పొరవలె నెగిరిపోవుచున్నది. కుట్టాన్ పర్వతమువలె గదలలేకుండెను. ఏకవీర కెదురుగా నొకసన్న్యాసి వచ్చుచుండెను. ఏకవీర యతనినిజూచి నిలువున గంపించిపోయి కన్నులు రెండుచేతులతో మూసికొనెను. సన్న్యాసి యామె వంకనైన జూడలేదు. ఆమె యున్నయెడ దాటి సన్న్యాసి నెమ్మదిగా గుట్టాన్‌దగ్గరకు వచ్చుచుండెను. కుట్టాన్ చూచెను. ఏకవీర నిలుచున్నది. సన్న్యాసివంకజూచెను. కుట్టాన్ ఒక మహాశ్చర్యము పొందినట్లు దేహమువెనుకకు గదల్చెను. సన్న్యాసి తలయెత్తలేదు. కుట్టానతనిని పలుకరించెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుట్టాన్—వీరా! ఇదియేమి?

(సన్న్యాసి తలయెత్తెను. ఎదుట గుట్టానును చూచెను. వీరభూపతి కన్నులలో బాష్పము లేర్పడబోయి వెనుకకు మరల్చబడెను—కుట్టానున కనేకములగు నూహలు తోచెను. తన మీనాక్షిప్రేమ యితని సన్న్యాసమునకు గారణమనుకుని

'స్థానాపతీ! క్షమించ లేకపోతివి!'

అన్నాడు. వీరభూపతి కన్నులలో జాలి పొడసూపెను.

దూరమున నేకవీర మరల నడచుచుండెను. కుట్టాన్ వీరభూపతిని వదలి యామెను మరల ననుసరించెను. ఈసారి యేకవీర నడువలేక పోయెను. కుట్టాన్ యేకవీర నందుకొనెను. ఇరువురును గజమెడమునగా వైగై నీటి పొరవద్ద నామెయు నివతల నతడు నుండిరి. కుట్టానునకుఁ గోపమువచ్చెను.

కుట్టాన్—'అడుగు వైచితివా! నిన్ను బలవంతముగ నింటికిఁ దీసికొని పోదును.'ఏకవీర కదలలేదు. వీరభూపతి, తన ప్రేమ, దాని విచిత్ర పరిణామము పూసగ్రుచ్చినట్లు చెప్పెను. తన దేహములోనున్న ప్రతి యణువు వీరభూపతి స్పర్శ మనుభవించుచున్నదని చెప్పెను. అది యింకొక విజాతీయస్పర్శ తాళుకోలేద నెను. కుట్టాన్ చివరిమాటలు విన లేదు. అత డాలోచనలోఁ బడెను.

పడమట లోకబంధు డస్తమించఁ బోవుచున్నాడు. విచిత్రముగఁ జీకట్లును ఎర్రని కాంతులు నొక్కసారి లోకముమీదికివచ్చెను. ఏకవీర మొగము తూర్పునకుఁ దిరిగి యున్నది. కుట్టాన్ పడమటికిఁ దిరిగియున్నాడు. ఏకవీర మొగమునఁ జీకట్లు, కుట్టాన్ మొగమున వెలుతురు వ్యాపించినవి.

కుట్టాన్ చివరకు మాట్లాడెను.'ఇదియొక విచిత్రకథామంటపము. దీనికి మనమిద్దరము, మీనాక్షీ వీరభూపతులు నాలుగు స్తంభములము.' ఏకవీర యొకవిచిత్రమైనప్రశ్న వేసెను. 'మీరు నన్నింకను ప్రేమింతురా?' ఆమె పెదవులసందునుండి యొకసన్ననినవ్వు వినంబడెను. తపస్వియైనకుట్టాన్ తా నామెను ప్రేమించుచున్నానన్న సంగతి చెప్పలేదు. అతడు ప్రేమచే కదలిపోయెను. ప్రేమప్రవాహ మతనిమీద విఱుచుకుని పడినది.

హఠాత్తుగా కుట్టాన్ రెండుచేతు లామె దేహముచుట్టు చుట్టుకొనెను. అంతవరకు వినవచ్చుచున్న వైగైతరఁగల లెపకలసవ్వడి గాలి రివ్వుమన్న సడి యామె చెవులకు వినంబడ లేదు. ఆమె కన్నులు చీకట్లను చూచుచుండెను. ఆమె ఘ్రాణేంద్రియమునకు గాలిలో నొక వగరువాసన తోచెను. ఆమె త్వగింద్రియము చైతన్యరహిత మయ్యెను.

అత డామెనెదఁ బొమ్మన కాన్చుకొనెను. ఆమె నేత్రములలో చూపు తప్పిపోయెను. ఆమె దేహములోని రక్తము ప్రాణవాయువును భరించలేకపోయినది. ఆరక్తమంతయు మృత్యుస్పర్శవలనఁగలుగు శైత్య మలవరించుకున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతడామెను గాఢాతిగాఢముగా నొక్కుకొనెను. ఆమె నాసారంధ్రములలోని శ్వాస మాడలేదు. ఆమెనోరు కొంచెముగాఁ దెరచుకొనెను. ఆమెలో నాడి నిలిచిపోయెను.

అతడామెపెదవి తనపెదవితోఁ దాకెను. ఆమె హృదయములో బ్రాణవాయువు నిలచిపోయెను.

ఇదియంతయు కన్నుమూసి కన్నుతెరచునంతలో జరిగెను. ఈట్టానునకు బ్రబోధము గలిగెను. తనకౌగిలిలోని నిర్జీవపదార్థ మతడు వెనుకకు ద్రోసెను. అది మోకాటిబంటి నీటిలోబడి చప్పుడయ్యెను.

చీకటులు క్రమ్మి నల్లనిగుడ్డ కప్పబడిన గతప్రాణివలె వైఁగై తరలిపోయెను.

---

## అంకితము

ప్రభల రామబ్రహ్మానందమునకు

నీలోన నవవవల్ నించుకొన్న మనీష పూతావివలె దెసల్ ముంచకుండ
నీయందు వీరత నెగడినదాతృత యెల్లదిక్కుల ముసురెత్తకుండ
నీమై సహజమై జనించినట్టిరసాత్మ తరమైనలోతులు తడవకుండ
నీయెడందపసందు నిల్పుశిల్పజ్ఞత కృతి మేడ నిటుకలు నతుకకుండ
నైకగుణచిహ్నముల సమాహారమైన-నీయెడదవాని నిండు నిండించకుండ
నీయొడలితోడిపాటుగ మాయెడందఁ-గూడఁజిచ్చిడితివి సన్నిగూఢకోపి!

గురువయి మిత్రమై తలచుకొంటిని నీరచితంబు లాకృతి
స్ఫురణల నాకు నంకితము సొంపులునింపులు నింపుడంచు నా
సరసము తారుమారయి విషాదపుటుద్ధృతి పుక్కిలింతమై
విరచిత మస్మదంకితము విన్చెద నీమెటనున్న కోసమై.

అలప్రతిపద్యమున్ చదువునంతకుఁజంపెదు, విందు, దానియం
దలి ప్రతియక్కరంబుకలనంబును దానఁబొసంగు నర్థమం
దలి వలనంబు వాని యవినాస్థితి యూరక మెచ్చిమెచ్చి మీ
రలు కవిసార్వభౌము లవురా! యనుచుందువు నేటి కెచ్చటో!

నిను మెచ్చఁబోవుచుంటిని-నను మెచ్చుచునుంటి నీవు నను మెచ్చుటతో
డన జీవితంబు పుచ్చితి-నినుమెచ్చగ వేరుత్రోన నే నెఱుగమికిన్.

నాకయి నిల్వయుండిన దినంబులు నీగతి వెళ్లఁబుచ్చి యెం
దో కలియంగ వీలుకలదో నిను నంచని యూహ సేతు, నీ
లోకమునందు పూర్వజనిలో స్మృతియుండదు, నీవసించుపై
లోకపుజీవులందు స్మృతిలో జనిపూర్వత గూడియున్నదో?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విశాలాక్షి

**రాయసము వెంకటశివుడుగారు**

౧

నాగయ్యశాస్త్రి నవరసనగర ప్రఖ్యాత పౌరులలో నొకఁడుకాఁడు. పిత్రార్జితమగు స్వల్ప భూవసతి నాధారముచేసికొని, సంతృప్తి సకలైశ్వర్యములుగనెంచి, కాలము గడుపుచుండువాఁడు. అసుచాటు పిండివలె నింటనణఁగియుండెడి వాని కింత ప్రశస్తి యిపుడెట్లు వచ్చెను? పురమునం దెవ్వరిఁ జూచినను నాగయ్యశాస్త్రిని గుఱించి చెప్పుకొనువారే కానఁబడుచున్నారు. బజారులలోను, బహిరంగ ప్రదేశములందును, ప్రజల ప్రసంగములకు ప్రధానవిషయము శాస్త్రియె! నీరాటరేవులందలి నెలఁతలు మొదలుకొని, పాఠశాలలలోని బాలుర వఱకును పట్టణవాస్తవ్యులు శాస్త్రి ముచ్చటలే ప్రస్తావించుచుందురు. చిన్నలు పెద్దలు, స్త్రీలు పురుషులు,—ఎల్లరును నాగయ్యశాస్త్రి చరితమునే రామస్మరణముగఁ జేసికొన్నారు. దీనికిఁ గారణమేమి?

ఏదేని గొప్పవిశేషమున్నఁ గాని యెవరిగుఱించియైన జను లింతగఁ జెప్పుకొనుచుండరు. ఏలాటరీలో బహుమానమో, ఏ పెద్దపరీక్షలోని గెలుపో, ఏ గొప్పవారితోడి వియ్యమో, అసామాన్యలాభ మెవరికైనఁ జేకురినప్పుడె యిట్టి మూన్నాళ్ల ముచ్చటలు ప్రబలుచుండును. అశుభము సంభవించెననుకొన్నను, దగ్గరవారి కెవరికో యాకస్మిక మరణము, ధనాపహరణము, ఉద్యోగనష్టము,- మొదలగు కష్టము లేవియో సంప్రాప్తింపవలెను గదా! నాగయ్యశాస్త్రికిగాని, ఆతనిబంధువులకుఁ గాని యిట్టి యాకస్మిక శుభాశుభము లెవ్వియు నిటీవల సంభవింపలేదే! అటులైన ప్రజల కాతని గుఱించి యింత యాశ్చర్యము, ఆందోళనము నేఁడు గలుగ నేలయును?

౨

పాఠకుల కుతూహలము తీర్చుటకుఁ జెప్పవలసిన దేమనఁగా—నాగయ్యశాస్త్రిమీఁద నగర వారాంగనలలో మిన్న యొకతె భరణమున కభియోగము గొని వచ్చెను! ఆసత్యకాలపు బ్రాహ్మణుని మీఁద నెఱజాణ వనజాక్షి వ్యాజ్యెము వేయుట, ఎవరి కాశ్చర్యము గొలుపదు? మొదలు, నాగయ్యశాస్త్రి యునికియె జనులెఱుఁగనప్పుడు, ఆవంశ గౌరవము, ఆతని నిష్ఠానియమములు నెవరు వెదకెదరు? ఆపురుషుని చిరపరిచితులు సయితము మనుజుల గుణశీలముల రహస్యము వారి మొగమున విశదము గాకపోవచ్చునని యనుమానింపఁ జొచ్చిరి! బాగుగ నెఱిఁగినవారు మాత్రము, ఆనుజునికి విలాసినీ జనులతోటి సంసర్గము కేవల మసంభవమనియె విశ్వసించిరి. ఇట్లు వారివారి మనోభావాను గుణముగ నాగయ్యశాస్త్రిని గుఱించి పురవాసులు భిన్నాభిప్రాయులై యుండిరి.

ఒరుల జోలికిఁ బోకుండెడి నైష్ఠికుని మీఁది కిట్టి యపవాదములు దొరలఁ గారణమేమి? లోకమనఁగా, వివిధ చిత్తవృత్తులతో నొప్పెడిజనావళిగదా! సత్రములు, చావడులు నెలకొల్పు సజ్జనులును, దారులలో మండ్లు కొట్టు తుంటరులును, జగతిని గలసి మెలసియే మనుచుందురు! నాగయ్యశాస్త్రి నిరాడంబర జీవితము సాధువుల చక్షువులకుఁ జాటుపడియుండినను, కుజనుల కన్నులకు గంతలుగట్ట నేరకుండెను. ఒక ప్రాతఃకాలమున నదిలో స్నానముచేసి, మంత్రోచ్చారణచేయుచు నింటికి వచ్చుచుండు శాస్త్రికెదురుగ, సీమసారాయి సేవించి యొడలెఱుఁగక బాటప్రక్కఁ బడిపోయిన యొక యువకుఁడు గానఁబడెను. పరిచితునివలెనుండిన వాని మోము శాస్త్రి పరికింపఁగా, న్యాయవాది నారాయణశర్మ కనులుతెఱచి, బిడియమున మనసునందలి మైకము మాయమైపోఁగా, దిగ్గునలేచి కూర్చుండి యాయనకు నమస్కరించెను. ఈచిన్న సంగతి శాస్త్రి మనస్సీమనుండి తోడనె తొలఁగి పోయెనుకాని, తన తప్పు పరుల కంటఁబడెనని శర్మ మిగులఁ గనలెను. సంశయాత్ముల కన్నియు నాపదలవలెనే తోఁచును. ఒకనాఁడు నరసింహ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారాయణు లొకరి నొకరు చెట్టబట్టికొని, గుమ్మము ముందుండి సాగిపోవునపుడు, వీథియరుగుమీఁదఁ గూర్చుండు నాగయ్యశాస్త్రి వారిని తేఱిపాఱిచూచెను. చిన్ననాఁడు కళాశాలలో సహాధ్యాయులుగ నుండెడి వీరిప్పటికి నన్యోన్యానురాగమున నొప్పుచున్నారు. సామాన్యముగ సమశీలురకే స్నేహసఖ్యములు సమకూరుచుండును. న్యాయవాది నారాయణశర్మవలెనే, వైద్యుఁడగు నరసింహారావు నాయుఁడును, స్వవృత్తిని మంచిలాభ మందఁజాలక, యసంతృప్తిని గాలము గడుపుచున్నారు. తాము జీవనమునకెంతయొ గాసిపడుచుండునపుడు, ఇతరులనాయాససౌఖ్య మేల యనుభవింపవలెనని వీరు పేరలుకఁ బూని యుందురు. పదిమంది రోగులు తన యొద్ద కెపుడు పరుగెత్తికొనివత్తురా యని నాయుఁడును, చిక్కులలోఁ జిక్కిన నలుగురు కక్షిదారులు తనకెట్లు కండ్లఁబడెదరాయని శర్మయును, సతతము నాత్రపడుచుందురు! తమ కుపకరింపనివారు నిరర్థకులనియు, మీఁదు మిక్కిలి విరోధివర్గపువారనియు వీరు తలపోయుచుందురు!—తమ కేకీడును దలంపని నాగయ్యశాస్త్రిని గుఱించి యాస్నేహితులంత నిట్లు ముచ్చటించుకొనసాగిరి.

నారాయణ: "ఒకే ముంగివలె నుండు ఈ శాస్త్రి కెంత గర్వమనుకొన్నావు! ఆమధ్య నొక నాఁడు ప్రొద్దున విస్కీడోజు ఎక్కువై పెద్దవీథిని నేను క్రింద పడిపోయినపుడు, తన సొమ్మంతయూ పడిపోయినట్లు వీఁడు నాదగ్గఱకువచ్చి ముఖము గుర్తుపట్టెనురా! మాటా మంచీ లేకుండ, కనులు పెద్దవిచేసి, తలయూపి, యంతట వెడలిపోయినాఁడు! వీఁడు వట్టి తంత్రగొట్టుసుమీ! నాఁటి నాసంగతి యందఱికిని వీఁడు ప్రచురించుచున్నట్లు నే ననుమానపడుచున్నాను!"

దీనికి నాయుఁ డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:—"దానికి సందేహమేమి? వీనికి మన సంఘముమీఁద ప్రబల విరోధము — మన జాడలు వెలికిఁదీసి ప్రకటింపవలెనని వీనియుద్దేశము! రంగయ్య పంతులు, నేనును ఆమధ్య రిఫ్రెషుమెంటు రూములో బీఫ్‌పుచ్చుకొనుచుండఁగా, తనపుట్టె మునిగిపోయినట్లు వీఁడు తలుపుత్రోసిచూచి, మంచుగడ్డదొరుకునా యని యడిగి, లేదని బట్లరు చెప్పుచున్నను లోనికి చొరుచుకొనివచ్చి, ముఖములు పరిశీలించి మరలిపోయెను! ఎవడికైనా రోగమువచ్చునుగాని, వీడికి పడిసెమైనా పట్టదుగదా! తమ యింట్లో వాంద్రకిటీవలవచ్చిన జ్వరమునకు నాచే వైద్యముచేయింపుమని పున్నారావుచే నే కబురుపంపగా "చూస్తోచూస్తో శూద్రవాడి చేతినీళ్లు మందుపేరుచెప్పి యేమెట్లు త్రాగఁగలము!" అని శాస్త్రులు చెప్పివేసి, బ్రాహ్మణ వైద్యుని బెట్టినాడు. బీఫు సంగతి నాటికి నేఁడు జ్ఞాపకము వచ్చినది కాఁబోలు, శాస్త్రులు నన్నిపుడు తేఱిపాఱి చూచి, మనము దాటిరాగానే, నను కనే కాండ్రించి ఊసినాడు! మనసుజూచి బొత్తిగా లెగిచాడే కాదు!"

నారాయణ: "ఇంక తెలిసినది వీడిసంగతి వీడి భరతము పట్టితేనే గాని, మనకు మిండడవుతాడు! ఈసాయంత్రము వనజాక్షిని చూడఁబోవుచున్నాను. అది జాణ. వీణ్ణి వంచించే యుపాయము చెప్పఁగలదు! శాస్త్రిమీఁద ఏ జట్టిచ్చినా, మనకన్ని విధాలా లాభమేకదా! ఈమధ్య కేసు లేమీరాక, చేతులు కట్టివేసిన ట్లున్నవిరా! చూదాము మన అదృష్టము!"

## 3

తనకంటె వయస్సున చిన్నదైనను వలపున నారాయణ పెద్దయని భావించి వనజాక్షి మొదటినుండియు నావన్నెకానియందు తీఱని మోహమునఁ దవిలియుండెను. చెన్నపురి నుండునపు డారసికుని వ్యయములకు వారవనిత చేతిడబ్బు పెట్టుచుండెనని చెప్పుకొనిరి. నారాయణ చెప్పిన నాగయ్యశాస్త్రి వృత్తాంతము ఆవెలయాలు శ్రద్ధతో వినెను. అనుదినమును శాస్త్రిస్నానముచేసి తమయింటిముందుగనె పోవుచుండువాఁడైనను, ఆతనికి వనజాక్షికిని పరిచయ మేమియు లేదు. నిష్ఠాగర్వమున నుప్పొంగు శాస్త్రి నొక "ఊఁపు ఊఁపి" పాదాక్రాంతుఁడైన పిదప వానిని వదలిపెట్టెదమని ప్రియుఁడు మందహాసమునఁ బలికినపుడు, తన కాఘాందసునిమీఁద వైరబుద్ధిలేకున్నను, వాని నాడించి కామునికి వినోదము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలిపింపవచ్చునని వారకాంత వల్లెయనెను. ఆ ప్రేయసీ ప్రియులపు డేర్పఱచుకొనిన విధాన మేమనగా ఆబాల్యము తాను నాగయ్యశాస్త్రి యుంపుడుకత్తెననియు, ఇటీవల నేకారణముననో యాయనకు తనమీద మొగ్గలము తగ్గి తనను బోషింప విరమించెననియు, తనకును, తమ కిరువురకును గలిగిన కొమార్తెకును, మనుగడకు వలసిన భరణ మిప్పింపుడనియు. వనజాక్షి న్యాయస్థానమున నిపు డభియోగము కొనివచ్చుటకుఁ బూనుకొనెను! నాగయ్యశాస్త్రిదెస నేకోశమునను వైరబుద్ధి వహింపని వనజాక్షి తనవలపుకాఁడును కేవలము వినోదార్థమే యీనాటకమునఁ బాల్గొనుచున్నాడని భ్రమపడెను. కాని, శాస్త్రి మీఁద పగఁబూనిన నారాయణ, "ఊరక యాకొమ్మనూఁపుటకే" కాక, అదలి పండ్లతో తానొడినింపుకొను దురుద్దేశమున, వలసినచో నద్దాని విఱిచివేయుటకును సంకల్పించుకొనెను!

౪

న్యాయసభలో నిపుడు వనజాక్షి నాగయ్యశాస్త్రియు వాది ప్రతివాదులుగ నిలువఁబడిరి! పనిగలవారికి లేనివారికిని, ఈ నాటకము చూచి వినోదించు పెద్దపని గలిగెను. వ్యాజ్యము విమర్శింపఁబడు దినములందు సభాభవనము న్యాయవాదులతోను ప్రేక్షకులతోను నిండిపోవుచుండెను. అందఱి మాటకేకును, ఈ కపటనాటక సూత్రధారుఁడగు నారాయణశర్మ ముఖ్య లక్ష్యమయ్యెను. ఇట్టి చమత్కారకథను వెలయించి, ఇందఱికి వినోదము గల్పించిన నారాయణుని మీఁద తోడి న్యాయవాదు లభినందనములు కురిపించిరి. అదినటకు నోరెత్తి పలుకనేరని యాతఁ డొకసారిగ చమత్కార సంభాషణ చతురుడయ్యెను. సభాస్థలము, వనజాక్షి వదనసౌందర్యసరస వాగ్విలాసములు నలుగడల వ్యాప్తమగుట కేర్పడిన రంగస్థలమయ్యెను. నారాయణుని మాయావ్యూహమర్మ మెఱుంగని పెక్కండ్రు ప్రేక్షకులు, ఇంతకాలము తనను ప్రేమించిన నిరపరాధినియగు నాయనను వ్రతను, నిర్హేతుకముగ విడనాడిన పాతకము బ్రాహ్మణుని ముఖసీమను పంక్తులు తీఱిచి వ్రాసి యున్నట్టుగ భావించిరి! నాగయ్యశాస్త్రి రూపసి కాఁడు. పాడుపడినయింట బూఁజుపట్టునట్లు, ఆయంగ వైకల్యమునకు తోడు ఛాందసమును, సురుచిర వస్త్రాద్యలంకారముల పట్ల విముఖతయును, వెఱ్ఱివికారమును దెచ్చిపెట్టెను! ఇంక వాక్కున మార్దవము మచ్చునకైన గానరాదు! సమయాసమయము లెఱుఁగని కోపోద్రేకములకు వశీవర్తుఁడగు నతని వాక్పారుష్య ప్రభావమున, ఆతని పక్షమందలి సత్యము అసత్యముగఁ బరిణమించుచుండెను! అభియోగకారణముల యథార్థత అధికారి విమర్శనమునకె విడిచివైచి, శాంతమార్గమున నతఁడు తన పనులు చక్కపఱచుకొనుచుండిన యెడల పరిస్థితులు బాగుగనుండెడివి. అట్లు చేయక, ఆశుద్ధఛాందసుఁడు, వాది, న్యాయమూర్తి, న్యాయవాది సమూహము, ఒకరేల లోకమంతయు, తన సత్యపక్షమును ప్రతి ఘటించుట కవతరించిన పెద్దకలిమాయ యని తలపోసి, నిరతము దుమదుమలాడు మొగముతో జగతిమీఁదికి దాడివెడలెడి వెఱ్ఱి పాచాతికునివలె వర్తించెను! తన మితభాషిత్వమునకుఁ గొఱఁత తెచ్చెడి కటువులగు పదములు ప్రయోగించి యొక్కొకమాఱును, మానాభాసమగు నిశ్శబ్దతనూని యొక్కొకమాఱును, తనపక్షమునకు వాంపరాని నష్టము గలిగించుకొనెను. పెంకెపెడసరి కట్టెలతో మనసిచ్చి మాటాడు వారెవరు? ఐనను, తనవైపున వాదింపసమర్థుఁడగు న్యాయవాది నేర్పాటు చేసికొమ్మని యొకరిద్దఱు మిత్రులు బోధింపఁబోఁగా, శాస్త్రి వారిమీఁద మండిపడి, సకలమగు నన్యాయముల కాకరమగు న్యాయవాదుల సాయము మున్మాటికి తన కక్కఱలేదని చెప్పివేసి, వాది పక్షమున బలమగు సాక్ష్యము రుజువగుచుండఁగ, ఉపేక్షతోఁ దానూరక చూచుచుండెను!

౫

ఇప్పటికి వాదిపక్షమున సాక్ష్యము పూర్తి యయ్యెను. చిన్ననాఁటినుండియు వనజాక్షిని నాగయ్యశాస్త్రి చేరఁదీసి పోషించి, తన ప్రేమమున కాస్పద యగు నాకామినియం దొక కొమరితను బడసెననియును, ఇపుడు కారణముగ నా చపలుఁ డాయబలను విడనాడె

ననియును, మాతాపుత్రికల పరిపోషణమునకు ప్రతివాది యాదాయమునుండి సగమిచ్చినఁగాని చాలదనియును, రుజువయ్యెను. రుజువులకేమి భాగ్యము? ఈకాలమున న్యాయసభలలో ఫలుకుబడికలవా రెట్టిసాక్ష్యమునైన సమకూర్చి, ఎట్టి యన్యాయమునైన సమర్థించుకొనుచున్నారుగదా! ఇంక, తన సాక్షులను బిలిపించి, తన వాదము జరిపించుటకు సిద్ధపడవలయునని న్యాయాధిపతి ప్రతివాదిని హెచ్చరించెను. దీనికై యాతనికిఁ గొన్ని దినములు గడువీయఁబడెను.

ఒకానొకరు అదృష్టదేవతను తన మాటప ట్టెపట నని యడుగఁగా, జనుల సాధువాక్కులనని యా సరసు రాలు ప్రత్యుత్తరమిచ్చెను! నాగయ్యశాస్త్రి యాగ్రహ స్వభావుఁడని కనిపెట్టి, శత్రువులు వానినాదినములలో ననేకవిధములఁ గాకుచేసిరి. ఈవాదిప్రతివాదులకు వరూధినీ ప్రవరాఖ్యులని ప్రతినామములిడి, వారిని ప్రజలు పరిహసించుచుందురు! నగుమోముననుండు వరూధిని కే మాటయనినఁ గినుకలేదుకాని, ప్రవరాఖ్యుని యందుమాత్ర మాతని పేరిటివానికిఁ గల శాంతరసము మృగ్యము! పట్టుకొనువానికి పరుగిడువాఁడు లోకువ. న్యాయసభ కూడుటకు ముందును వెనుకను, అచటి యేపంచనైనఁ గూర్చుండు నాగయ్యశాస్త్రి యొద్దకు వనజాక్షి మెల్లగఁజేరి, "ఏమి బ్రాహ్మడా! నీనీమాలు, జపాలు ఎందుకు? ఏళ్లకొలదీ నమ్మిన నన్ను గొంతుక కోసి, కడుపునబుట్టిన కూతురు నీదికాదని చెప్పివేసి, నీవేమి ముందుకువస్తావు? ఇంత అన్యాయము నీకేల? ........"అని నిందించుచుండును! శాస్త్రిదానిమీఁదఁ గోపించి, అనరానిమాటలని, యాచోటు విడిచి యట్టె పోవును. ఇదిచూచి పెచ్చుపెరిఁగి వేశ్య మఱింత గోల చేయుచుండును. వినోదమున జనులు కోలాహలము చేయుచుందురు. తన న్యాయవాది నారాయణయ్యంత గైకొని, అంతకంత కావారకాంత, ప్రతివాదిని వాని యింటికడనె ముట్టడింపసాగెను! మాటిమాటికిని స్త్రీ ఘోషించుచుండుట, పురుషుఁడుకోపించుచుండుటయుఁ గనిపెట్టి లోకులు, ఆఁడుదాని మాటలు నిజమనినమ్మి, శాస్త్రి సద్వర్తనమును గూర్చి సందేహింపఁ జొచ్చిరి.

ఇంతేల, ఇట్టి పరిస్థితులవలన, శాస్త్రిదారాపుత్రాదులకె, అగ్నిహోత్రునివంటి వాఁడని పేరుపడిన గృహ యజమానునం దపోహములు పొడమసాగెను! లోక యాత్ర యింత దుర్భరమైనపుడు, తాను గృహస్థాశ్రమ మిఁక విసర్జింపవలసాయని శాస్త్రి యంత లోలోనఁదల పోయుచు, దిన మొకయేడుగఁ గడుపుచుండెను.

౬

ప్రతివాది సాక్ష్యము పరీక్షించు దినము వచ్చెను. పండ్రెండు గంటలకు న్యాయాధికారి యున్నతాసనాసీనుఁడయ్యెను. న్యాయవాదులతోను, ప్రేక్షకులతోను సభాభవనము క్రిక్కిఱిసి యుండెను

"మీసాక్షు లేరయ్యా? మీవాదనయేమి?" అని యధికారి ప్రతివాదిని సంప్రశ్నించెను. అంతట కోప సంతోషములు తనయాధిపత్యమునకై కొట్లాడు చుండెనా యనునట్లుగ, మొగము చిట్లించి నెట్టినవ్వు నవ్వి, శాస్త్రి లేచి యిట్లనెను. "నేను మనఃచేసికొనున దేమియు......" అశ్రై ర్యావేశమున జనించిన యకాండ వైరాగ్య మహిమమున శాస్త్రి, తన కేమియు వాదన లేదని చెప్పివేసి, తనసర్వస్వమును వారవనితకుఁ గట్టి పెట్టవచ్చునని న్యాయాధిపతికి విన్నవింప నుద్యుక్తుఁ డయ్యెను. కాని యాతని వాక్యము పూర్తికాకమునుపె బఱ్ఱుబఱ్ఱుమను శబ్దముతో నొక మోటారుబండి సభ గుమ్మము నొద్దకు వచ్చి నిలిచెను. అందుండి యొకపెద్ద మనుష్యుఁడు దిగి, లోనికివచ్చి, తాను ప్రతివాది పక్షపు బారిష్టరునని పలికెను. ఇట్లు వచ్చినవారు చెన్నపగర న్యాయవాదులలో నగ్రగణ్యులగు సర్వేశ్వర శాస్త్రి గారు. ఈ న్యాయ్యము మూలమున వీరి జూచు భాగ్యము తమకు లభించెనని సభాసదులు మురిసిపోయిరి. ఈతని సాయమున పాపము ప్రతివాది యీచిక్కునుండి బయలు పడునని పలువురు సంతసించిరి. నిశ్శబ్దముగ నుండుఁడని యధికారి ప్రేక్షకులను హెచ్చరించెను. ఏమి జరుగునో యను కుతూహలమున ప్రేక్షకులు తేఱిపాఱి చూచు చుండిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెన్నపురపు బాగిష్టరు, ఈలోపుగ ప్రతివాదిని న్యాయవాది ప్రముఖులను సంప్రదించి, తనచిన్న పుస్తకమునం గొన్ని సంగతులు వ్రాసికొనెను. సర్వేశ్వర శాస్త్రి యంతటలేచి, "గౌరవనీయులగు న్యాయమూర్తులకు ప్రతివాది చేసికొను మనవి యేమనంగా వాది పక్షమున ఋజువైన సాక్ష్యము ప్రతివాదికిని చాలును. అతనికి వేరే సాక్ష్య మక్కరలేదు. నాకక్షిదారుండు చేసికొను సంక్షిప్తమగు మనవిలో రెండే యంశము లున్నవి. మొదటిది: వారకాంతయగు వాదికి భరణమున కర్హత లేనేలేదు. ఉన్నదనుకొనిన యెడల, వాది యింక ముందు పవిత్రజీవితము గడపుదునని వాగ్దానము చేసెనేని, న్యాయమని తోంచిన మొత్తమును భరణముగ విధింప వచ్చును. వాది అట్లుండ సమ్మతింప దేని, భరణమునకే యర్హురాలు కాదు. రెండవయంశము: లేంబ్రాయమునయున్న కూంతును వాది కూటవృత్తిని దింపకుండ: ఆమె సంరక్షణమునుండి బాలను తక్షణము తొలంగించి తగిన శరణాలయమునం జేర్పింపుడని ప్రతివాది ప్రార్థించుచున్నాండు. అట్టి పరిహారము, ఇక్కడ లభింపనిచో, వేఱు న్యాయసభలో పొందుటకు ప్రతివాది ప్రయత్నింప నున్నాండు.

"వాది సాక్ష్యమును, ప్రతివాది మనవిని న్యాయమూర్తు లాలోచించి, తీర్పుచెప్పవచ్చును" అని పలికెను.

అంతట సభాభవన మంతటను, ముఖ్యముగ న్యాయవాదుల పీఠములయొద్దను, కలకలము చెలరేగెను. "బండ వాదమునకు మొండివాదము జవాబు!", "వాది నోట పచ్చివెలగకాయ పడినదే!" అని మందహాసములు చేయుచు, వకీళ్లు మాటాడుకొనసాగిరి. వాది వకీలు, ఇపుడీయెదురుమాడని యుదంతమున కమితముగ నిరుత్సాహమందెను. ఇటీవల న్యాయవాదులమధ్య మధ్యందిన మార్తాండుండై వెలిగిన నారాయణశర్మ, ఇపుడు పగటి చందురునివలె వన్నెవాసియుండెను. అతండిపుడు తక్కిన న్యాయవాదులతో గుసగుసలు సాగింపంజొచ్చెను. అపుడె ఫలాహారమునకు లేచిన న్యాయమూర్తి, తాను తిరిగి వచ్చులోపల సంగతి యేదో తేల్చుండని వాదిప్రతివాదుల వకీళ్లను హెచ్చరించి వెడలిపోయెను. అంతట వాదిప్రతివాదులును, వారి వకీళ్లును, తక్కిన న్యాయవాదులతో నాలోచనలు సల్పి, యొక కాకితమును తయారుచేసిరి. తిరిగి సభలోనికిరావేగమె, తనకు దాఖలుచేయంబడిన యా కాకితమును జూచుకొని, న్యాయాధిపతి "ఈ కేసును మధ్యస్తిగనుండి పరిష్కరించుటకు, న్యాయవాది వాసుదేవరావుగారు ఉభయవాదుల వలనను, వారి వకీళ్ల వలనను కోరంబడినారు. కాంబట్టి వాసుదేవరావు గారిని ఆకార్యమునకు నియమింపడ మైనది." అని చెప్పి, వేఱుపనిని చూచుకొనందొడంగిరి.

౭

ఈ వ్యాజ్యెమున నందఱు నమితముగ కుతూహలురై యుండుటవలనను, త్వరితముగ తమ్మీపీడ వీడవలెనని ఉభయవాదులు నభిలషించుట చేతను, ఆరాత్రియె ప్రతివాదవకీలు చెన్నపురికిం బోవలసివచ్చుటచేతను, ఆ సాయంకాలమె దీని విమర్శనమునకు వాసుదేవ రావు గారు పూనుకొనిరి. అందఱికిని సదుపాయముగ నుండుటకై వకీళ్లగదియె సభాస్థలమయ్యెను. ఉభయవాదుల వకీళ్లెగాక, వారి యనుమతిమీంద నితర న్యాయవాదులలోం బెక్కండ్రు నటికకి వేంచేసిరి. వినోదమునకని కావించిన యీయద్భుత కల్పనము తమకె యెదురు తిరిగి తనకక్షిదారురాలగు వనజాక్షి గొంతుక కురియగుటకు నారాయణశర్మ మిగుల వగచి, ఎటులైనం దా మీచిక్కునుండి తప్పించుకొనుటకు తహతహపడుచుండెను. నిరపరాధిమీంద నిర్హేతుకముగ నభియోగము తెచ్చి, నాగయ్యశాస్త్రికిం దానుంపుడుకత్తెనని పట్టికల్ల ఋజువుపఱిచి, తుదకు తన స్వతంత్రతను కూంతు సంరక్షకత్వము నొక్కసారిగం గోలుపోవ సిద్ధమైన తనదుస్థితికి వనజాక్షి యెంతయు వగచుచుండెను. ఏపాపమెఱుంగని తనమీంద నీతప్పు వ్యాజ్యెము తెప్పించి, తనను గాసిపెట్టి యవమానపఱిచిన కలికాలపురుషులగు నారాయణ నరసింహులతోడను, వారు చెప్పిన చొప్పున నాటలాడి, తనకీర్తి ధనాదు లపహరింపంబూనిన మాయలాండి వనజాక్షితోడను, తాను సమాధానపడనొల్లనని నాగయ్యశాస్త్రి మూతిముడిచి కూర్చుండెను!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈతగవు పరిష్కరింపుఁడని న్యాయాధిపతి యుభయపక్షములవారి కోరికమీఁదను నియమించుటచేత, తానీకార్యమునకుఁ బూనుకొనుచున్నానని వాసుదేవరావు పలికి, కాలహరణమునకుఁ గారణములగు దీర్ఘసాక్ష్యవాదములతోను, నిరర్థకములగు కర్మకలాపముతోను తమకు నిమిత్తము లేదనియును, సత్యాన్వేషణమునకును, సంఘయొడఁగూడుటకును సహకారములగు సూక్ష్మసూత్రములె తామిపు డవలంబింపవలెననియుఁ జెప్పెను. త్వరితముగనె తాను తీర్పుచెప్పవలెనుగాన, ఇదివఱకేమి జరిగినను, ఇపుడు మాత్రము తనయెదుట సాక్షులు పూర్తిగ నిజముచెప్పి, ఎటులైన వాది ప్రతివాదులకు సఖ్యసమాధానములు గుదిర్చి, తనను కృతకృత్యునిచేయుమని యాయన వేడెను. ఇదివఱకెన్నిరోజులు పట్టెనో యిపుడన్ని గంటలలోనే యీవిచారణ జరిగినను, వెనుకటివలెఁగాక సాక్షులందఱు కపటము విడిచి నిజము పలికిరి. అందుచేత, వినువారికెల్లరకును మిక్కిలి యాశ్చర్యము గొలుపునట్టి పరిస్థితులు బయలుపడెను! వ్యాజ్యెము యొక్క నిజమైన కారణము లిపుడు బహిరంగమయ్యెను!

అంతట మధ్యవర్తి వాసుదేవరావు, తమయెదుట నిపుడు ఋజువైనసాక్ష్యమును, ఉభయపక్షములవాదమును, విమర్శించి, ఈ వ్యాజ్యెమున వాదివకీలగు నారాయణశర్మయొక్క యసభ్య ప్రవర్తనము వలన న్యాయవాదిలోకమునకు ప్రతిష్ఠాభంగము కలిగెననియు, అక్కడిప్పుడీ వేశ్య నడుసులో దిగ విడిచి తాను తప్పించుకొనఁ జూచినను, నాగయ్యశాస్త్రి మరియాదకు నష్టము గలిగించినందుకైనఁ దానుత్తర వాదియై భావికాలమున చిక్కులలోనికి వచ్చుట స్పష్టమనియు, కావున తానీసమయమునఁనె యొక్కసారిగ తనచిక్కులు విడఁగొట్టుకొనుట యుక్తమనియుఁ జెప్పె, ఈ మాయావ్యూహము గల్పించినందు కాతఁడు వాది ప్రతివాదులకేమేమి పరిహారములు చేయునో ముందుగఁ దెలియఁగోరెను! శాస్త్రికేలోపములున్నను, గడుసుఁదనమున లోపములేదు—వలలోపడిన నక్క గింజుకొనిన కొలఁది యురిలో మఱింతబిగియునట్టుగ, తప్పించుకొనఁ దానెన్ని యుపాయములుచేసినను, అన్నియువ్యర్థమై తనస్థితి మఱింత విషమించుట నామాయావి యిపుడు గ్రహించి, తాను పశ్చాత్తప్తుఁడనై తిననియు, ప్రతివాదియొక్కయు,సభానాయకులయొక్కయు దయాదాక్షిణ్యములె తనకు శరణమనియుఁ జెప్పివేసెను! వనజాక్షి యన్ననో, తన స్వాతంత్ర్యమును, స్వపుత్రికాపోషణాధికారమును గోలుపోని యేపద్ధతికేని యొప్పుకొందు ననెను—నాగయ్యశాస్త్రి తన యాత్మగౌరవమునకు భంగమును, ధర్మవిరుద్ధమును గాని పథకమునకు సమ్మతింతుననెను. రాత్రి పదిగంట లగునప్పటికి, న్యాయ్యమును, సర్వజనాంగీకారమును నగుమార్గము వాసుదేవరావు సూచించెను. దాని కందఱును సమ్మతించిరి. తనమీఁద నీయభియోగము తెచ్చి, తననుగాసిపొందించినందుకు, వాదియు, వాది సలహాదారులును పరితపించి చేసినక్షమార్పణము ప్రతివాది యంగీకరించెను. వాది తనపుత్రునకు వ్యభిచారవృత్తి మప్పకుండ దానిని యోగ్యుఁడగు వరునికిచ్చి పెండ్లిచేయ సమ్మతించెను. తానికముందు ఋజుమార్గవర్తనుఁడ నయ్యెదనని నారాయణశర్మ వాగ్దానముచేసెను. కాకితమెక్కనేని యీ కడపటి యొడఁబాటు యువకుఁడగు నా న్యాయవాది పరువు ప్రతిష్ఠలకు భంగకరమగుననియు, మఱియు నది వ్యాజ్యెమునకు సంబంధింపని యన్యవిషయ మగుటచేతను అది తీర్పునఁ జేర్పఁబడలేదు. అంతటితో వాది ప్రతివాదుల వివాదములు తీఱిపోయెను. రాత్రి యందఱు నిండ్లకు వచ్చునపుడు పురుషోత్తమరావు తోటివకీళ్లలోఁ బలువురానందించినను, ఈయభియోగముపట్ల తనకు మొదటినుండియు నసమ్మతమె యనియును, ఒంటరియైనందువలనఁ దానేమియు చేయలేకుండియు న్యాయసభలో వ్యాజ్యెపువైఖరి గనిపెట్టుచు తుదకు చిక్కు దీర్చుకొనుట ప్రతివాది కలవిగానప్పుడు, తనకుఁ బరిచితుఁడును, నాగయ్యశాస్త్రికి దూరపుబంధువునగు సర్వేశ్వరశాస్త్రిగారికీసంగతి తాను తెలియఁబరిచితిననియు, తనకోరిక ప్రకార మాసత్పురుషుఁడు సమయమునకు వచ్చి శాస్త్రిని విపత్తునుండి తప్పించెననియు మాటల ధోరణిని జెప్పెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౭

గొప్పగాలివాన గృహవృక్షాదులను గూల్చివైచినను పుడమియందలి విపరీతాంకురములను రూపుమాపును. ఈ యభియోగము మూలమున సజ్జనుఁడగు నాగయ్యశాస్త్రి మితిలేని యలజడిపాలైనను, నవరసనగరమందలి సాంఘిక జీవనము చాలవఱకు సుష్ఠుపడెను. నీతినియమాదు లుల్లంఘించి స్వేచ్ఛగఁ దిరిగెడి యువకులంతటి నుండియు సాధువర్తనముపట్ల సుముఖులై ప్రవర్తించిరి. ఆపురమందలి యువజన పారిశుద్ధ్యసమాజమున కిపుడు నారాయణశర్మయే కార్యదర్శి. నరసింహారావునాయుఁడు సంఘ సంస్కారణము నందలి యభిమానమువలన, విద్యావతియు, సన్మార్గావలంబినియైన వనజాక్షి పుత్రికయునైన విశాలాక్షిని బరిణయమయ్యెను. వెనుకటివలె ముక్కుమూసికొని కూర్చుండక, నాగయ్యశాస్త్రి, స్నేహపాత్రుఁడై సంఘోజ్జీవనమునకు సాయపడు సత్కార్యములం దుత్సాహము గలిగియున్నాఁడు.

---

# అతిథులకుఁ బెట్టునది భాగ్య మవనిలోన

కవిభూషణ, కవిరాజ శ్రీరాజా వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు

పరిణతఫలపుష్పభార భాసురమైన వర్ణనీయోద్యాన వనములోన
బహువిధోపస్కార బంధు బంధురమైన మహనీయరమ్యహర్మ్యంబులోన
వితతవాతాయనాప్లుతమారుతంబైన శశికాంతమయచతుశ్శాలలోన
నతి మనోజ్ఞవ్యంజనాభిరామంబైన లాలిత కదలీదళంబులోన
రజితపాత్రంబులో మహారాజభోగ-సురుచిరాన్నంబు చక్కకే శరటిపండ్లు
మిసిమిగల యావుపెరుగుతో మేళవించి-యతిథులకు బెట్టునది భాగ్య మవనిలోన.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# విశ్వచిత్రము

చిట్టాప్రెగడ సీతారామాంజనేయులు గారు

౧. లోకవత్తులీలా కైవల్యం బ్రహ్మసూత్రాణి—౧-౨-33.
౨. నేహనానాస్తికించన పురుషాన్నపరం కించిత్—కఠోపనిషత్.
3. సర్వం చిన్మాత్రమేవహి బ్రహ్మైవసర్వం చిన్మాత్రం బ్రహ్మమాత్రం జగత్త్రియం—తేజబిందు.
౪. ఏకమేవాద్వితీయంబ్రహ్మ - సర్వంఖల్విదంబ్రహ్మ ఇదంసర్వం యదయమాత్మా ఆత్మైవేదంసర్వం.
—ఛాందోగ్యం.

త్రివిధంబౌనటకర్మ! జ్ఞానివశమై దృశ్యప్రపంచంబు మి
థ్య, వివర్తభ్రమగూడనౌనట! కటా! న్యాయంబె! త్వద్విశ్వరూ
ప విధానానుభవైకవేద్య రసచిత్ప్రామాణ్యసాభీష్టతాం
డవవిన్యాస సదాశివాత్మమయియుండన్! భక్తమూర్తీ! శివా!

భరమున్ దుర్భరమన్న భేదభయమున్ భావించి తత్తద్విధాం
తరతర్కంబున మున్గి లోఁబడుచునుండన్ సర్వలోకైకసుం
దరసూక్ష్మమ్మును, స్వస్వరూపము, ననన్యమ్మున్, నిజమ్మున్, నిరం
తరబ్రహ్మాత్మవిలేఖ్యమున్ గనఁగనౌనా! భక్తమూర్తీ! శివా!

ఒకచోనుంచి, మఱొక్కచోఁ జెలుపు; దుర్యోగంబొకం డొక్కచో
నొకచో భాగ్యపుఁగల్మి దేశసమయౌత్సుక్య ప్రమాణాదిజీ
వికసంకోచబహుత్వదుర్భిణులచే వీక్షించునట్టేనుగా
కకటా! సృష్టిత్వదన్యమన్న తలఁపేలా! భక్తమూర్తీ! శివా!

నిను, విశ్వంబును, వేఱుగాఁ దలఁచెనేర్చిన్; సత్యమిథ్యాదిభా
వన, లామీద సవిద్యమాయ, లటపై, వాదోపవాదార్థక
ల్పన శాస్త్రాటవిఁ ద్రిమ్మరింతలగు! సర్వజ్ఞా! సమస్తంబు, నీ
వను నద్వైతయథార్థతానుభవ మిమ్మా! భక్తమూర్తీ! శివా!

శ్రుతు లేకమ్మగు నద్వయమ్మునె పఠించున్‌గాని, లోకంబునా
కనుభూతివ్యతిరిక్తమౌ ననెడి జ్ఞానాభాస సిద్ధాంతని
ద్రను మేల్కొల్పుచు—'శాస్త్రయోని' వగుటన్ తత్ త్వం, త్వమేవాహమౌ
నని, శాస్త్రమ్ముసమన్వయింపవలె, నయ్యా! భక్తమూర్తీ! శివా!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ముళ్లచెట్టూ, కమ్మని పువ్వూనూ

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

"అబ్బాయీ! పెద్దముండ నాట్టే పేలించక యీపాటికి కాస్త కూకలేసుకో. ఎంతటివాళ్లయినా లోకానికి కసింత వెరవాలి"

"ఏం వచ్చిందమ్మా యిప్పుడూ?"

"నన్నడుగుతున్నావా కోడై కూస్తూ వుండగానూ?"

"నువ్వు చెప్పరాదూ?"

"ఏమ్మని చెప్పను నాయనా?"

"వుండడమే వస్తే వున్నవన్నీ చెప్పాలి"

"వుండడమేవస్తే అంటే? వున్నాయనా లేవనా?"

"నేను చూశానా విన్నానా?"

"చూడనూ చూడక, వినమా వినక యేం చేస్తున్నావూ?"

"నాకిదే పనా?"

"కుటుంబగౌరవం గంగలో కలసిపోతూ వుంటే దాన్ని కాపాడుకోవడం నీ పనికాదూ?"

"ఏం లోటు జరిగిందీ యిప్పుడూ?"

"నువ్విలా వెనకేసుకు వస్తూవుంటే నిన్నిక లక్ష్యపెడుతుందా అదీ?"

"ఏం జరిగిందో చెప్పమంటే సోది మొదలు పెడతా వేమిటమ్మా?"

"నామాటలు సోదికిందే కట్టేశావా?"

"సోది కాదు. నిజమే. సందేహం లేదు. ఇంతకీ జరిగిపోయిన అకార్యకరణం యేమిటి?"

"వొక్కటనా రెండనా చెప్పడానికి?"

"పోనీ పది చెప్పూ"

"నీకు మానాభిమానాలే వుంటే వొక్కతప్పు చాలదూ?"

"........................"

నిన్ననడం యెందుకూ? ఈరోజు లలాంటివి. పూర్వకాల ప్రీనుగుని నే నెంత మొత్తుకుంటే యేం లాభమూ?"

"ఏం జరిగిందో చెప్పమంటే చెప్పవు. పోనీ అని వూరుకో నేనా వూరుకోవు"

"నిజమే. నా కెందుకూ యివాళవుండి రేపు చచ్చిపోయీదానికీ? కాని అలా అనుకుని కళ్లారా చూస్తూ వూరుకో లేను. ఏం చెయ్యమన్నావూ? మాటిమాటికీ నువ్వు చెప్పు దెబ్బలు కొడుతూనే వున్నావు. అయినా కన్న కడుపూ. నువ్వు నన్నెంత తీసిపారేస్తూవున్నా నీకు అపకీర్తి వస్తూవుంటే నేను చూడలేకుండా వున్నందుకు నువ్వు నన్నిలా అనవలిసిందే. ఎందుకులే. పడ్డవాళ్లెప్పుడూ చెడ్డవాళ్లు కారులే

"అందరూ అంతేనా?"

"ఏకర్మమూ యెరగని వాళ్లంతే"

"ఏదిగిం దెవరో చెప్పరాదూ?"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"మేలుకున్న వాళ్ళని లేపడం యెలాగ నాయనా?"

"................"

"పీసపాటి వారి యింటో పుట్టాను. కల్లూరి వారియింటో పడ్డాను. రెండూ కూడా "వో హో" అనిపించుకున్న వంశాలే. అంచేతే యిలా గుంజుకుంటున్నాను; గాని కులం తక్కువదాన్నయితే నాకీ యేడుపే లేకపోయి వుండును"

"ఇప్పుడు కులం తక్కువవాళ్లెవరూ?"

"ఎవళ్లయితేమాత్రం నా కెందుకూ?"

"ఇంకేం మరీ? అలా అని మనస్సుకి సమాధానం చెప్పుకో. ఎప్పు డేమని పోతాావో అని కుర్రాళ్లు భయపడీలాగ—"

"నేనదే చెబుతూ వున్నాను"

"నువ్విలా తొందరమాట లంటూ వుంటే ఆమర్యాదా నిలుస్తుందా?"

"నిలిచే చోట నిలుస్తుంది. నిలిపీవాళ్లు నిలుపుతారు. తమకి మర్యాద కావలసినవాళ్లు యెదటివాళ్ల మర్యాదా నిలిపి తీరుతారు. మర్యాదా లేనివాళ్లూ యెరగనివాళ్లూ యేం నిలుపుతారూ?"

"మర్యాదా వున్నవాళ్లు లేనివాళ్లతో సరిగ్గా వెళ్లవచ్చునా?"

"పైవాళ్లయితే నువ్వన్నట్లే; కాని సంమ్మంధం యేడిసింది కదూ? బతికివున్నంత కాలమూ వొకయింటోనే తగులడాలి కాదూ? లేకపోతే యెవర్తిగొడవ యెవర్తి క్కావాలీ?"

"................"

"నాకొంపకి ముప్పువచ్చి నే నేడుస్తున్నాను గాని; లేకపోతే—"

"నిం డింటో కూచుని నువ్విలా అనవచ్చునా?"

"ఏం చెయ్యాను? మాలకూడు, తినమంటావా......బోగం కొంపా సంసారికొంపా?"

"ఇంతకీ మొగాడు అనాథ అయితే ఆడది నడివీధిలో భాగోతం కట్టడంలో ఆశ్చర్యం లేదు"

"అమ్మా! అరికాళ్లకింద మంట లెత్తిస్తున్నావు"

"నా మాట నీ కంత కష్టంగా వుందా నాయనా? ఇదిగో లెంపలు వాయించుకుంటున్నాను. అపరాధం వచ్చింది. క్షమించు. గడ్డితిన్నాను. ఇక కిక్కురు మంటే అడుగు. బుద్ధి వచ్చింది."

"................"

"ఇంకోమాటు ఈగొడవ తెస్తే చెప్పుచ్చుకు కొట్టు"

"................"

"మంచికి రోజులా యివి? పెళ్లాంగారు వచ్చాక యిక తల్లిముండ యెందుకూ?"

"................"

"మంచీ చెడ్డా తెలుసుకోడానికీ, కీర్తీ అపకీర్తీ గ్రహించడానికీ, ఎవళ్లని దిద్దుకోవలసినట్లు వాళ్లని దిద్దుకోడానికీ యెంతటివాళ్లు కావాలి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాయనా! మొగాడై పుట్టగానే సరా? చదువు కోగానే తీరిందా?"

"................"

"ఎన్నేళ్లు వెడితే యేమిటి సిగ్గూ బిడి యమూ లేకపోయాక?"

"................"

"ఇంతకీ దేవుడు నాగొంతు కోశాడు. ఆమహారాజుని బతకనిచ్చి నన్ను తీసుకుపోరాదూ? నాకీపాట్లు లేకపోవునే?"

"అమ్మా! ఇందాకణ్ణుంచి సాధించేస్తున్నావు. పేగులు తోడేశావు; కాని వొక్కతప్పు చెప్పలేకపోయావు"

"అవునోయి నాయనా! అంతే. అయితే అసలు నిన్ను కదపడమే నాకు బుద్ధితక్కువ. నువ్వింతవాడవైనాక యింకా నోరు తెరిచి— అయ్యో! నాబతుకొక్కాలిపోనూ"

"................"

"నా గ్రహచారం. వెంకుసోదెమ్మతో కాశీ వెళ్లిపోయివుంటే నాకీముప్పు వచ్చునా?"

"................"

"నిర్భాగ్యపుజన్మ. నాకు కాశీవాసం కూడా లభిస్తుందా? ఈ కళ్లతో ఎంత పాపం చూడాలో? ఎన్ని కుళ్లుమాటలు వినాలో? ఎన్నితిట్లు తినాలో? ఎన్ని చెప్పదెబ్బలు పడాలో? అప్పుడే అయిందా?"

"................"

"ఇంతకీ యెవళ్లు చేసుకున్న దెవళ్లనుభవిస్తారూ?"

"చివరికి చెప్పవలిసిందీ, చెప్పేదీయేమేనా వుందా యింతేనా అమ్మా?"

"వుంటేమాత్రం నాకెందుకు నాయనా? నీకిప్పటికేనా అభిమానం వచ్చిందేమో అనుకున్నాను"

"................"

"కందకి లేని దురద బచ్చలి కెందుకూ? "ఎన్నాళ్లో చచ్చావంటే ఆర్నెల్ల కిందటే" అన్నట్లు యేదియేమైనా నోరుమూసుకు వూరుకోవాలి గాని లేకపోతే మాట తక్కదు"

"................"

"చివరికి రొస్టు నాకెందుకూ? నేను నలుగురినోళ్లలోనూ పడిపోవడం యెందుకూ? అడ్డమైనకుంకలూ నాకు చక్కట్లు దిద్దరావడం యెందుకూ? ఇంతకంటే యీకొంప బాగుపడి యేడిస్తేనా?"

"నేను కచేరీకి వెళ్లిపోవచ్చునా అమ్మా?"

"వెళ్లవచ్చు నాయనా! నిశ్చింతగా వెళ్లవచ్చు. కళ్లు మూసుకుంటే సరి. మొండివాడు రాజుకంటే బలవంతుడట"

"హు—"

"వోస్. దీనిపేరు పౌరుషం కామోసు. ఇలాంటి వాజమ్మలకే అలాంటిదీ?............ .........వూరికే పోవడమేం? గడ్డితిన్నట్టుతిని, కుడితి తాగినట్టు తాగే పోవచ్చు. వుందనా లేదనా? పూర్వపాళ్లు యింత మట్టి సంపాదించి పోయారుకదూ?"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨

"ఏం వచ్చిం దేమిటి?"

"......................"

"ఎందు కలా యేడుస్తావూ?"

"......................"

"ఏం జరిగిందో చెప్పకపోతే యెలాగా?"

"నోటితో చెప్పాలా సగం చచ్చివుండి కూడానూ?"

"చెప్పకుండానే తెలుసుకోవచ్చు విసీ చూసీ వుంటే, కాని యింటో లేనుకదూ?"

........................,"

"ఎన్ని దుఃఖకారణాలు వచ్చినా కొంచెం సమాళించుకోవాలి. ఆవురు మని యేడిస్తే యేం లాభమూ?"

"నామీద చెయ్యి వెయ్యకండి. నేను మాలపీనుగుని. బోగంముండని"

"ఇష్టాలు లేకపోతే యెన్నిమాటలేనా వస్తాయి. అయినా—"

"నే నేమేనా అన్నానా?"

"నువ్వే అన్నా వనలేదు"

ఇద్దర్నీ సరిచేస్తున్నారా?"

"............................"

"ముందు కజ్జా పెట్టిన పీనుగుని చెప్పదెబ్బలు కొడతారా?"

"..............."

"పోనీ ముందు నేను తగువు పెట్టడం యెప్పు డేనా యెరుగుదురా మీరూ?"

"......................"

"నే నిక పడలేను. నాకు బతికే యోగం లేదు. నా కేదోదారి చూపించండి"

"వొక్కటే దారి—"

"గోదారి కదూ? అవును. మీ రలా అనకపోతే మ రేమంటారు?"

"ఇంతకీ జరిగిన ప నేమిటి?"

"మీరు వినకుండా వున్నారా? మీకు తెలవకుండానే వుందా నిజంగా?"

"నీ కష్టాలు వినలేదు కాదూ?"

"నా కష్టాలు వినా లని వుందా?"

"...................."

"ఈపాడు జన్మకి కష్టాలు కాకపోతే సుఖా లెలా వస్తాయి?"

"............"

"రామరామా! ఇంత దిక్కుమాలిన బతుకై పోయిందా నాదీ?"

"ఇప్పు డేం వచ్చిందో చెప్పవూ?"

"బందరు వుప్పెన. రావడానికి మరేం వుందీ? నా చెయ్యి వదలండి"

"ఎందుకు వచ్చిందీ?"

"నేను బతికి వుండడమే కారణం. ఎందుకు వచ్చిం దంటే యింకేం జెప్పనూ?"

"...................?"

"నాకర్మం కాలిపోయింది. నాఅవస్థ యింతట్లో తీరేదీ కాదు, మానేదీ కాదూ. తెల్లపోయి అలా నుంచుంటా రేం? కాఫీ చల్లారి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోతుంది పుచ్చుకోండి. తొరగా వెళ్లకపోతే అవతల మాట పడాలి లేవండి"

"ఇంటో యిలా తగులడుతూ వుంటే నోటికి పోతుందా యేమేనా?"

"నన్నేనా అందర్నీ అడుగుతాగా అలా నిలవదీసి?"

"అడగవలసిన మనిషి నడుగుతాను. తా బట్టిన కుందేటికి కాళ్లనీవాళ్లని అడిగితే మాత్రం యేం లాభమూ?"

"అయితే నాగతి యింతే యింక?"

"ఆపదలు కాపరాలు చేస్తాయా?"

"చాల్లెండి నేర్చుకుపోయారు వేదాంతాలు. ఇప్పుడేనా యింటోయిలా తగులడుతూవుంటే నోటికిపోతుందా అని అడిగారు మీరు? ఎవల్లో తగులడుతూంటే పైవాళ్లకి మీకే అలావుంటే స్వయంగా తగులడీవాళ్లకి — నల్లేరుమీదకి బండిలాగ సాగుతున్నట్టు కాదుకదా. దిక్కులేనివాళ్ల కెలా వుంటుందీ?"

"................"

"మాట్లాడరేం?"

"................"

"అయ్యో! నీకింత గండగత్తెర వచ్చిందా అని వోదార్చడాని కేనా తగనూ నేనూ? నా వాళ్లెవరూ దగ్గిరలేరనా యీ లోకువ?"

"................"

"నేనేం తప్పు చేశానూ? నావాళ్లు మాత్రం యేంలోటు చేశారూ? అడిగినంత కట్నమూ, కోరినన్ని లాంఛనాలూ— మొగాన యెన్ని కాసులు కొడితేయేమీ? మెదాన యెన్ని చీరలుపెడితే యేమీ?"

"................"

"పెళ్లిలోనే మొదలు యేడిపించడానికి. వూరంతా ముక్కుమీద వేలేసుకున్నారు ఆ మంకుతనం చూసి, వొక్కపూటేనా నవ్వుతూ భోజనానికి వచ్చినపాపాన పోతేనా? 'ఆ'అంటే అపరాధం, 'నారాయణా'అంటే బూతూ. తిన్న వణ్ణం వొంటపట్టనివ్వలేదు యిల్లాలు"

"..............."

"కార్యం నాటికి మూలపడ్డా పులుసు చావలేదు. వొక్కటే ధోరణి ఆజన్మకి"

"..............."

"నన్ను చూస్తే కళ్లు చిమచిమ లాడి పోవాలా? నేను విషం తాగించానా? తనకి నానంటివాళ్లు లేరూ?"

"......................."

"అంతకంటే నే నేమేనా విషం చెడ్డానా? అడిగీవాళ్లు లేక గాని తన ఆశ వంటి ఆశ కాదూ అందరిదీనీ?"

"నాకేసి చూడూ"

"నే నేడుస్తూ వుంటే చూడాలనివుందా?"

"అంత రాసి రంపాన పెడితే అదేలా బతుకు తుం"దని శాస్త్ర అడగ్గూడదూ?"

"ఇదివరకు అడగలేదూ?"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అడిగేం లాభమూ? నిఃపాదిగా అడిగితే మర్యాదా తక్కించుకునీ పుట్టుకే అదీ?"

"ఎంత బాధ పెడుతూ వున్నా కన్న తల్లిని కఠినంగా మందలించడం——"

"చేసుకున్న పెళ్లాన్నయితే కోసి కొరత నెయ్యవచ్చు కదూ?"

"అది నీ నాభిదగ్గిరనుంచి వచ్చిన మాటే?"

"నసాళం అంటుకుంటూంటే నాభి లెక్కేమిటి? అటు యేడూ, యిటు యేడూ పధ్నాలుగు తరాల నుంచి నా వాళ్లు దిక్కుమాలిన వాళ్లయిపోతున్నారు. తన వాళ్ల నెవళ్లేమన్నారూ?"

"ఏదో చూడూ. పూర్వకాలపు మనిషి. ఎరగవూ? ఎలాగో వోరగేసుకు పోకపోతే అశక్తి కాదూ?"

"అమ్మో నాబతుకు బగ్గైపోతే యింకా వోరగేసుకు పోవడం యేమిటండీ?"

ఇదివరకిలాగే త..వ నీమీద లేకుండా——"

ఇంకనేం? నావల్ల తప్పు లేనప్పుడు మీదమీదకి రావడం యెందుకూ?"

మళ్లీ మొదలూ——"

"మళ్లీ యేమిటి మళ్లీ యేమిటి? ఎప్పటి కప్పుడే మొదలూ. ఎప్పటి కేనా అంతం అంటూ వుంటేనా?"

"అలా అనకు"

వాళ్లు ముందుకు పోతూ వుంటే ఆనక యేం చెయ్యనూ? "కొడుకు బాగుండాలి కోడలు ముండా మొయ్యా" లనే రకంగా వస్తూవుంటే యెందాకానూ వోపిక పట్టడం?"

"............... "

"త నెంత తన తాహా తెంత? నా వాళ్ల మాట యెత్తడానికి తన కేం అవసరం వచ్చిందీ?"

"వూరుకోవూ ?"

నాతమ్ముడు రేపు కలకటే రయిపోతాడు. సీమ వెళ్లినవాళ్లంతా పుచ్చిపోయారా? తనవాళ్లే అంత వాళ్లయితే యిక కిందా మీదా వుందునా?"

"................"

నావాళ్లెవరూ రైలువాళ్లకి నౌకరీ చెయ్యడం లేదు"

"న న్నేనా చూడవూ?"

"మిమ్మల్ని చూస్తున్నాను కనకనే నా గతి యిలా వుంది. తనతో సరిగ్గా నేను కూడా తూర్పారబట్టేదా న్నయితే నా కీ యేడు పేమీ?"

"ఇం కేం మరీ? వోపిక పట్టడం యెలాగా తప్పనప్పుడు యీ కాస్తా మాత్రం యెందుకూ ?"

"................ "

"లే, నా మాట విను, నాకు టైము దాటిపోనివ్వకు"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"వుండండి, నన్ను వొదలండి, నేను లేవ గలను, మీరు వెళ్లి చేతులూ కాళ్లూ కడుక్కోరండి"

"అన్నీ అయినాయి. ముందు నువ్వు లే"

"అబ్బా వులిక్కిపడ్డానూ......నన్నిట్టే బుట్టలో పెట్టగలరు. అక్కడ కిమన్నాస్తి ఏడ్పే దాన్ని నవ్వించినా, నవ్వేదాన్ని ఏడ్పించినా నన్నే కదూ ? వొక్కమాటేనా "నీకిది బుద్ధి కా"దని గట్టిగా చివాట్లు పెడితే నా కీ కించ లేకపోవునే"

"చూడూ——"

"చూస్తూనే వున్నాను మీ అభిమానాలు"

"అదిగదీమాట, సెబాస్"

"వున్నమాట అంటే వులు కెక్కువ"

"వుండడమే వస్తే అంతే. కాని వుంటే యీమొెడమొగాలూ పెడమొగాలూ యేం?"

"వేషాలు"

"నాకేసి చూస్తూ అనూ ఆమాట"

"ఏం? నాకేం భయమా ?"

"లేదని నేనెరగనూ"

"ఏమిటీ?"

"ఏమయితే యేం లెద్దూ. చూడూ. గంతులేసేవాళ్లతో సరిగ్గా గంతు లెయ్యడం కాదు ప్రయోజకత్వం, వొకళ్లు గంతులేసేటప్పుడు మెదటివాళ్లు వూరుకుంటే తప్పెవరిదాతుంది? వేరేనోటితో చీవాట్లు పెట్టాలా?"

"మరే, ఇక మెన్నేనా చెబుతారు కబుర్లు. అయితే లెండి. ఎప్పుడూ చీకటే వుంటుందా?...... ఇవాళ పొయ్యి అంటించాటప్పటికి కాలు దువ్వింది. మనస్సు మనస్సులో లేదు. పకోడీలు పాకానపడ్డాయో లేదో చూసుకుమరీ తినండి"

"నీ మొగమ్మీద చిరునవ్వు మెరిసి పోతూవుంటే నాకన్నీ బాగానే వుంటాయి."

"ఏం కమ్మగా వుందా?"

"బరువుతీర్చేవూ? మగు పన్నది మెరగవు పాపం అయితే లే. వర్షాకాలపు మేఘం శరన్మేఘంగా మారిపోయింది నా కదే పదివేలు. మనస్సిప్పటికి కుదుట పడింద"

"కొందరికి మెదటివాళ్లేడుస్తూ వుంటే ఆనందం. ఆతల్లి బిడ్డలు కాదూ?"

"మళ్లీ యిలా తిప్పేవూ చక్రం?......ఇంకెందుకూ నాకూ? కబుర్లేనా నువ్వేమేనా——?"

"నా మొగమ్మీద చిరునవ్వు మెరిసి పోతూ వుంటే మీ కన్నీ బాగానే వుంటాయన్నారు. మీరు కులాసాగా వుంటే నాకు కడుపు నిండిపోదూ?"

"రత్నాల మాట! వెల వుందా ఆ మాటికీ? గాఢారణ్యంలోనుంచి నందనోద్యానంలో పడ్డట్టుంది. ఏదీ?"

"ఛీ......................"

"......................"

"అ——బ్బా! చంపేశారు"



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"తొందరగా కాఫీ పుచ్చుకో"

"చుర్రు మనడానికా? పన్ను దిగిందో యేమిటో? వాకట్లోకి యెలాగా వెళ్లడం?"

"మరో నాలుగు చిలక లెక్కువ తగిలిస్తే సరీ రంగులో రంగు—"

"ఏం? బాగుందా?"

"దివ్య చకోరంగా వుంది. ఇప్పుడో?"

"అ—మ్మో! హూనం అయిపోయింది వాళ్లు. చూశారా? నాకేం?

---

## రాజరాజు

జి. జాషువకవిగారు

నిన్నుఁబోలు మహీనేత నిక్కువముగఁ-బుట్టెనో! పరాశర దివ్య మునిసుతుండు
మున్ను మాతాత, పరిహాసమునకుగాను-కల్పనముఁజేసి వ్రాసెనో కౌరవేశ!

మాతాత సత్యవంతుఁడు-పూతములగు నాల్గువేదములు వ్రాసినవి
ఖ్యాతకవీంద్రుం డాతని-చేతి కల మబద్ధములు వచింపదుసుమ్మా.

వ్యాసకల్పిత మహాభారతామ్నాయంబు గుట్టుగా నిన్నుఁ దిట్టుకొనుచునుండ
ముగురుసత్కవుల పెంపుడుకావ్య రాజంబు పదిమందిలో బట్టబయలు సేయ
యింతలంతలు సేయు దృశ్యప్రబంధాళి మొత్తమై నిన్నాడిపోసికొనఁగ
చెప్పుడుమాటకుఁ జెవియొగ్గు భువనంబు "క్రూరాత్ముఁ" డని పండ్లునూరుచుండఁ
దౌడలు తెగిన బాధతో నింత దుష్కీర్తి-తోఁ బరాజయంబు తోడ రాఁగ
నరకమునకుఁబోయినావో, స్వర్గమునకుఁ-జేరినావా! నీవు కౌరవేశ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీ సావాసము చేసి ముజ్జగము పిండిం జేయగాఁజాలు, రా
ధా సూనుం డొకవ్యర్థజీవి యయి నిందాబద్ధుఁడై పోయె నీ
యాసల్ భీముగదాభిఘాతమున నుగ్గై యూరు యుగ్మంబుతో
నీ సింహాసనసీమ దుఃఖపడుచుండెన్ నేడు కన్నీళ్లతో!

సవ్యసాచికరాన సాము నేరుచుకొన్న బలమైన క్రొవ్వాడి బాణములకు
వాయుసూనుని బాహుబలముతోఁ బోరాడు మొక్కవోవని పుట్టె డుక్కుగదకు
పాంచాలి నులివెచ్చ బాష్పాంబువులఁ దేలు వజ్రనిష్ఠురశాపవాక్యములకు
యమతనూభవుని దీనాలోకములఁదోఁగి దీపించు శీతలాలాపములకు
సకల భువనంబు లాలించి సమ్మతించు-వనజనాభుని శుభ 'రాయబారము'నకు
సమ్మతింపక రక్తనిర్ఝరములందు-తానమాడితి వేల? గాంధారి తనయ!

అంటఁగరాని యగ్గి కెనయైనది ద్రోవది, యట్టిసాధ్వి, ప
య్యంట మొగానఁబూని, యకటా! యని యశ్రులు రాల నేడ్చినన్
దుంటరివై సహోదరులతో సభలోనఁ బరాభవించినా
వంట, మఱందివై వదినకా మొనగానితనంబుఁ జూపుటల్.

కురుభూపాలుఁడు బుద్ధిమంతుఁడని వాకోఁ బూనితిం గాని యా
దరణీయంబులు హేతువు ల్గలుగవద్దా? నీ చరిత్రంబునన్
గరళాన్నంబును, మాయజూదమును లాక్షాగేహముం ద్రౌపదీ
పరిభావంబు భయంకరంబులయి చూపట్టున్ గురుక్ష్మాపతీ.

నీయతనంబు లన్నియును నెత్తురుకూడు భుజించి మాయమై
పోయెఁగదా? వృథాపయశముం దలఁదాల్చిన నీకు నేఁడు నిం
డాయువుఁబోసినారు కవు లక్కట! పెందొడలూడి కుంటివై
యీ యవమానజీవితము నెట్లు సహింతువయా! సుయోధనా!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వకీలు వృత్తి బాగుండేది —



ఇన్ని పుస్తకాలు చదవ నక్కర లేక పోతే —



ఎక్కువ కేసులు వస్తే —



వచ్చినవారు బాగా పైకమిస్తే —



ఎదుట మరొక వకీలు లేక పోతే —



జడ్జి బుద్ధి చెప్పక పోతే —



కేసు పోయినవారు కోపము తెచ్చుకోకపోతే —



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## అన్నం రాజుపిట్ట

ఒక వడ్రంగి కుటుంబములో ఒక అన్న ఒక చెల్లెలు ఉండేవారు. వాళ్లిద్దరూ అన్యోన్యం ప్రేమతో పెరిగారు. ఇలా ఉండగా చెల్లెలికి వివాహమై కొన్నాళ్లకి అత్తవారింటికి వెళ్లి పోయింది. కొంత కాలానికి చెల్లెలిని చూడాలని అన్న బయల్దేరి వెళ్లాడు. అన్నని చూచి ఎక్కడ లేని సంతోషంతో పొంగిపోయింది. పుట్టింట వున్నప్పుడు అతనికి పరమాన్నం చాలా యిష్టంగా ఉండడముచేత ఆనాడు పరమాన్నం వండిపెడదామని చెల్లెలు అభిలషించింది. అయితే ఆపిల్లకి పరమాన్నం వండడం రాదు. తన తోడికోడలుదగ్గరకి వెళ్లి ఆవేళ తన అన్న రావడం, అతనికి పరమాన్నం అంటే ఇష్టంగా ఉండడం, మొదలైన విషయాలన్నీ చెప్పి పరమాన్నం యెలావండాలో చెప్పమని కోరింది. తోడికోడలు ఆపిల్లని లోపల అసహ్యించుకుంటూ ఉండేది. ఆపిల్లంటే ఆమెకేమీ పడేది కాదు. అంచేత ఎలాగైనా ఆ పిల్లని మోసగిద్దామన్న ఉద్దేశంతో "ఈ మాత్రం కాదటమ్మా! ఏముంది? బియ్యం తెచ్చి పాలల్లో కడిగి నేతిలో ఉడకబెట్టు. పరమాన్నం అవుతుందిలే" అంది. పాపం బాగూ ఓగూ ఎరగని ఆ పిల్ల అన్నని సంతోషపెడదామనే ఉత్సాహంతో తోడికోడలు చెప్పిన ప్రకారం బియ్యం పాలల్లో కడిగి నేతిలో ఉడకపెట్టడ మారంభించింది. గంటలకొలది పొయ్యి మంటబెడుతూ ఉంది. ఎంతకీ బియ్యం ఉడికేమార్గం కనపడడం లేదు. భోజనాలవేళ దాటింది. మూడు ఝాముల ప్రొద్దు తిరిగింది. బియ్యం ఉడకడం లేదు. పరమాన్నం తయారుకావడం లేదు. 'ఏం చెప్మా' అని తన సవతి దగ్గరికి వెళ్లి ఈసంగతి చెప్పింది. ఆవిడ ఈమాటలు విని "అయ్యో! వెర్రిబాగులదానా! నేతిలో బియ్యం ఎక్కడైనా ఉడుకుతవా? బియ్యం నీళ్లల్లో కడిగి పాలల్లో ఉడకబెట్టు. వెంటనే పరమాన్నం అవుతుంది" అన్నది. వెంటనే ఆపిల్ల ఆప్రకారం చేసింది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బియ్యం ఉడికినవి. పరమాన్నం సిద్ధమైంది. అన్నకి పెడదాముకదా అని అతన్నిపిలిచింది. ఈ ఆలస్యం చూచి కారణం తెలీక 'తనని భోజనానికైనా పిలిచిందికాదుకదా చెల్లెలు' అన్న చిన్నతనంతో 'బావగారింట తనకి అవమానం జరిగింది కదా' అన్న విచారంతో అతడుఎక్కడికో వెళ్లిపోయాడు.

ఎంతపిలిచినా అన్న రాకపోవడం చూచి ఇరుగుపొరుగులంతా వెదకి ఆలస్యానికి అలిగి అన్న వెళ్లిపోయాడుకదా తిరిగి ఆకలితో, అన్న విచారంతో, ఆపరమాన్నం ఒకగిన్నెలో పెట్టి ఓరుమాల్లో మూటకట్టి అన్న కోసం బయల్దేరిందా అమాయకపుపిల్ల. "అన్నో! అన్నో!" అనిపిలుస్తూ మార్గం తెలీక అడివిమార్గంపట్టింది. ప్రొద్దు గ్రుంకింది. నెత్తిమీద పరమాన్నం మూట పెట్టుకొని ఏడుస్తూఅడవల్లా తిరిగితిరిగి ఆచీకట్లో దిక్కులేనిఆపిల్ల ఒకపిట్టయిపోయింది. "అన్నో, అన్నో" అని అరుస్తూ ఇప్పటిదాక అడవిలోనే ఉండిపోయింది. "అన్నో" అని అరవడంవల్ల "అన్నంరాజు పిట్ట"ని, వడ్రంగి కుటుంబములోనిది కావడంచేత "వడ్రంగిపిట్ట"ని దాన్నందరూ పిలుస్తారిప్పుడు. నెత్తిమీద పరమాన్నంమూట పెట్టుకోవడంవల్ల టోపీవంటి జుత్తు ఏర్పడ్డ దీపిట్టకు. వడ్రంగిపిట్ట స్పష్టంగా అన్నో అని అరుస్తూ ఉంటుంది.

—వైశాఖి (కవితాసమితి)

---

## షట్పదా!

పురాణం కుమారరాఘవశాస్త్రి గారు

మందమలయానిలోర్మల మంచుమునుఁగు
జారఁగా, పత్రభంగముల్ సడలఁగా, స
రోవర తరంగడోలికలో మనోజ్ఞ
లీల నొకప్రక్క కొరిగి యుయ్యాల లూగు
చున్నయది, అదె పద్మిని చూచినావ?
దానిసౌకుమార్యంబు మార్దవము నిరుప
మాన; మిక నిరర్థకపరిభ్రమణ ముడిగి
తత్సమైకనిర్గతమరందలహరీ ని
రంతరాస్వాదమోదివై అంతరంగ
శాంతిఁగనవోయి, షట్పదా! సంశయింపఁ
బోకు, నీమీదగలరాగమున వసంత
మును, మునుజిలుకుచుండి లేతనగవారఁ
దెలుపుచున్నది వలపుతావులను నీకు.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ఏడవ సంపుటము-రెండవ సంచిక తరువాయి)

## ౨౧

నారాయణనుకోండి సరులార మీరు
చేసినాపాపములు చెల్లె ననుకోండి.

## ౨౨

గోవిందాగోవిందా అన్న వారికి
గ్రక్కునా వైకుంఠ మెదురుగావచ్చు.

## ౨౩

పోకంత పసుపూసి బొట్టమర బెట్టి
పొంకంపురాముని బొందితివా సీత.

## ౨౪

అన్నల్ని పాడేవు తమ్ముల్ని పాడేవు
నన్నేలపాడవే సింగారి దేవి
యేమనిపాడేది వెఱ్ఱిమాధవుడా.

## ౨౫

కాకిబాణము దొడిగి కంచురథ మెక్కి
కాముడు నావాడలకి వచ్చెననిపాడు
పూలబాణము దొడిగి పుష్పరథ మెక్కి
పుణ్యుడు నావాడలికి వచ్చెననిపాడు
నాగబాణము దొడిగి నవసజ్జెనెక్కి
నాశివుడు నావాడ వచ్చెననిపాడు.

## ౨౬

కొలిచేకొలిచేతూము తలకింద బెట్టి
అలిసిపడుకున్నాడు అన్నగోవిందు.

## ౨౭

సంద్రమువద్దున సానిబోగముది
జలకమాడి గిలకల్ల చెంబు మరిసింది.

## ౨౮

సానివారిపాపి చక్కన్నిదాని
నిద్రకి అన్నల్లు నిలుపుకున్నారు
సందకావొచ్చిన్న సానికూతురికి
సందెడుదండలిచ్చు నా చక్కనన్న
వేకుజామొచ్చిన్న వేశ్యకూతురికి
వేలియుంగరమిచ్చు నాయన్నరటన్న.

## ౨౯

నేరేడుపండంటి అన్న మాయన్న
నేడువస్తానని నెలకన్నారాడు
తాను వస్తానని తమ్ముణ్ణిపంపు
యేమోయిపెద్దన్న యెన్నటికిరావు
యేలేట పెళ్ళిళ్లు కుప్పనూర్పుళ్లు
యెడలేదు చెల్లెలా నినుజూడరాను.

## ౩౦

నిన్నగాక మొన్న నీవొచ్చినావు
యేమిమాయమ్మతో యెదురాడుతావె.

## ౩౧

అన్నలారా మీరు విన్నారలేదా
సీత చెర వెళ్లింది చూచారలేదా
చిత్రకూటాలన్ని చిన్నబోయినవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౩౨

ఆకాశబాణాలు చంద్రదీటీలు
అచ్చమా పువ్వొత్తులు అన్నపెళ్లిళ్లు.

౩౩

వారానవారాన వారల్లు డొస్తే
వారత్తవరికూడు వండుపాసెములు
వరికూడుచుట్టాలు వల్లమరివస్తే
జొన్నకూడువండి సోద్దెముతొ బెట్టు
జొన్నకూటిరాజు సుఖమెరుగడమ్మ
జోరుత్రాగి బొజ్జ పెంచుకున్నాడు.

౩౪

జాబాదివాడలో తప్పక తిరిగి
తెచ్చుకుంటివి శివుడ జడలగంగాను
పార్వతిదేవమ్మ నివుబుట్ల మించి
పాలవంటికులము నీటిపాలాయె.

౩౫

శివశివాగంటల్లు మోగుమావాడ
శివుడు జంగముబిడ్డ వచ్చుమావాడ
హరహరాగంటల్లు మోగుమావాడ
అక్కజంగముబిడ్డ వచ్చుమావాడ
జంగమైనాడమ్మ లింగమైనాడు
ప్రత్యక్షమైనాడు బాలాజిలోను.

౩౬

సోద్దేన నేనొక్క సోమారముంటె
జోలెగట్టుకశివుడు జోగంటవచ్చు.

౩౭

తమలపాకులమీద నద్దెండబోసి
నేబోతుంక్రిష్టమ్మ నీళ్లచెలమకి
ఊరగదెవ్వుదకంబు తేరగదెవ్వూట
చేదగజె నాచేతి ముత్యాలబిందె
అటుజూచియిటుజూచి కట్టొంకజూచి
కట్టబూదాబోయె పొట్టికోమటి
మాఅత్తకొట్టుంది బిందెత్తిపోవు
మీఅత్తకొట్టనేల బిందెత్తనేల
ఆవులగలవారి ఆడమనిషిని
కోడెలుగలవారి కోడల్ని నేను
మేకలుగలవారి మేనకోడలిని
బిందెత్తిపోవయ్య బిందెత్తిపొమ్ము.

౩౮

అత్తింటికోడలు వుత్తమురాలు
చేటలోజొన్నలుబోసి చేన్నిద్రబోను
రచ్చలోగూర్చున్న రాజేంద్రభోగి
మీఅమ్మయేగుండు లేచిరావయ్య
అమ్మరోఓయమ్మ నను గన్నతల్లి
నీవుతెచ్చిన కోడల్ని యేమంటివమ్మ
సందకాడచాకిల్లు త్రొక్కవద్దంటి
మూడిళ్ల ముంజూరు దుయ్యవద్దంటి
వాల్చినరోకల్ని దాటవద్దంటి
పొద్దున్నేపొరుగిల్లు పోవద్దటంటి

౩౯

యెన్నిమాయలువాడు చిన్నిజంగమ్మ
యెక్కడెక్కడ దిరిగి వెంటబడివచ్చు

౪౦

మాయలుగలవమ్మ మంత్రాలుగలవు
మందుసంచులుగలవు మా జగతిలోను.

సశేషము.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గురుశిష్య సంవాదము

(వందనాశీర్వాదముల పిమ్మట)

శి:—20 వ. శతాబ్దియారంభమున్న మన దేశస్థితిని గూర్చి ముందు మాటాడుకొందమని వెనుక సెలవిచ్చినారు; అందుకై యే యిప్పుడువచ్చినాను,

గు:—మంచిది నాయనా! వెన్నెల రాత్రుల పిమ్మటఁ జీఁకటి రాత్రులు వచ్చునట్లు సుఖదశ తరువాతఁ గష్టదశ వచ్చుచుండును. ఏకరీతిగా కాలమెప్పుడును గడవదు.

శి:—తత్వోపదేశములు చేయుచున్నారేమి?

గు:—దారిద్ర్యమునకును తత్వోపదేశములకును దగ్గఱ బాంధవ్యమున్నదిలే. దానిమాట యటుంచి కుమారప్పగారు మరలఁ బాశ్చాత్యులనే బోనులోఁ బెట్టి సాక్ష్యమిప్పించినారు వినుము.

శి:—ఆలాగుననా! ఎవరెవరేమని చెప్పినారో సవిస్తరముగా సెలవిండు.

గు:—సవిస్తరముగాఁ జెప్పినఁ బెద్ద భారతమగును. సంగ్రహముగాఁ బ్రస్తుత విషయమునకుఁ గావలయు మాటలే చెప్పెదను.

శి:—చిత్తము.

గు:—"దినముల కొలఁదిఁ బ్రయాణము చేసిచూచినప్పటికిని పశువులవలెఁ బాటుపడుచుఁ, గాళ్లీడుచుకొని నడచిపోవుచుండు, కటికిదరిద్రులే, ఎముకలగూండ్లవలె నుండు శుష్కశరీరులే, కంటికగపడుదురు గాని యితరులు గానిపింపరు. హిందూదేశము దారిద్ర్యదేవతాసదనమని చెప్పవచ్చును. చక్కనిమానవలక్షణములుఁగల మూర్తులలో ఆదైన్యపిశాచము ప్రవేశించియుండుట నాకు మఱియు శోచనీయముగాఁ జూపట్టినది......హిందూదేశము పరమదరిద్రదేశమన్నమాట యభిప్రాయమాత్రము గాదు, పరమసత్యము"

శి:—ఈ మాటలు చెప్పిన వారెవరు?

గు:—ఇంగ్లండుదేశపుఁ బ్రస్తుతమంత్రి యగు "రామ్సే మెక్డోనల్డు"గారే,అసత్యములాడు నన్యులుగారు.

"డాక్టరుజోసియా. ఓల్డుఫీల్డు"గారు మనహిందూదేశము స్వయముగాఁజూచి వచ్చి దానిఁ గూర్చి యొక వార్తాపత్రికకు వ్రాసినమాటలువినుము.

"గ్రామగ్రామమునకు నేఁబోయి యటనుండు పురుషుల యొక్కయు, స్త్రీల యొక్కయు, శిసువుల యొక్కయు దురవస్థఁజూచికడుదుఃఖించినాను. పొట్టకూటికై ప్రతిదినము వారు పడరానిపాట్లు పడుచు అర్ధభుక్తితోఁ గాలము కడపుకొనుచున్నారు.

రోఁతగానుండు లండను సందు గొందులు దాటి యచటి ప్రజలదుర్దశ చూచినాను. వారైన నొకప్పుడు నాకు మఱపువత్తురు గాని, ఋజుమార్గవర్తులై మితవ్యయులై ధీరులై సదా కాయ కష్టపడి చెమటలూర్చి పని చేసికొనుచు ముతుకపిండితోఁ జేసిన చిన్నరొట్టెముక్కతోను నంజుకొనుటకేవో కొన్ని యూరుఁగాయముక్కలతోను, రోజునకు రెండుసార్లు మాత్రమే త్రాగుటకుఁ జాలిన మజ్జిగతోను కాలక్షేపము చేసికొను వీరుమాత్రము నామనోనేత్రములకెప్పుడును గాన్పించుచునేయుందురు.

ఈ 1902 వ|| సంవత్సరము కఱవు సంవత్సరము గాదఁట. అయినప్పటికి నేనుజూచిన యనేకగ్రామములలోని పెక్కుకుటుంబములలో, నిలువధాన్యపు బుట్టలప్పుడే దాదాపుగా వట్టివైనవి అనఁగాఁ గోలఁదిగాఁ బండిన తమపంట పన్నులుచెల్లించుటకై వారప్పుడే యమ్మివేసికొన్నారన్నమాట; ఇఁక రెండుమాసములలో వారికిఁ దినుటకేమియు నుండదన్నమాట."

శి:—పరులకంటె కింతఘోరముగాఁ గష్టపెట్టు లేమి బాధ మనదేశమెట్లు భరించుచున్నదో భగవంతునికే యెఱుక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గు:—"నేను మతప్రచారకుఁడను నా క్రింద నున్న క్రైస్తవబృందము మూడువందలమంది వారి యాదాయములఁ బరీక్షించి సిసలుగాఁ గనుఁగొంటిని. రోజునకం దొక్కొక్కరికివచ్చు సగటురాబడి యొక ఫార్థింగు నకుఁ దక్కువ—అనఁగా నొకకానియైన గాదన్నమాట"

శి:—వీ రెవరయ్యా!

గు:—లండన్మిషన్ సంఘములోని "నోల్జు" దొరగారు. మొన్న మొన్న 1927 వ॥ సంవత్సరములో "డాక్టర్ రూథర్ఫర్డు"గారు గ్రామస్థుల ఘోరకష్టములు మిక్కిలి విచారముతో వ్రాయుచు నాడినపలుకులు వినుము.

"జీవనముకై ప్రజలు పడుశ్రమ భయంకరముగా నున్నది. వారి శరీరస్థితిఁజూడఁగా నొక్కమాటు అనాయాసముగాఁ జంపివేయకుండ నది వారినిబాధపెట్టి పెట్టి మందమందముగా మృత్యుముఖములోఁ జొరఁబెట్టఁ జూచుచున్నట్లున్నది. ప్రభుత్వమువారు పంటకై సరియైన నీటివసతు లేర్పఱిచికాని, భూమిసిస్తులు తగ్గించికాని కఱవు లాఁపుటకుఁ బ్రయత్నించుట లేదు. నేనను బ్రిటిషుపౌరులలో నొకఁడనే కనుక నందు నాకును బాధ్యతగలదని యెంచుకొనుచున్నందువలన నాకెంతో మనోవేదన గలుగుచున్నది."

శి:—బ్రిటిషువారిలోఁ గొందరైన దీనవత్సలులును దయాంతఃకరణులును నున్నారు!

గు:—ఉండకేమి? యోగ్యత యొకజాతి సొత్తుగాదు. ఈ మాటలు కూడ వినుము:—

"మనము చూచుచుండఁగనే హిందూదేశ మంతకంతకు దుర్బలమై పోవుచున్నది. మన పరిపాలనలో, నసంఖ్యాకులుగానుండు హైందవుల ప్రాణరక్తము, పాటువాఱుచున్న వార్ధివలె రోజురోజునకు క్షీణించి పోవుచున్నది."

శి:—ఇది యెవరి యభిప్రాయము?

గు:—అర్థశాస్త్రవేత్తయగు "హిండ్మన్" దొరగారి యభిప్రాయము.

శి:—ఈసాక్ష్యములు. చాలును ఇతరనిదర్శనము చూపి దేశస్థితిని దెల్పుఁడు.

గు:—పూర్వము చేతిపనులయం దెంతో నేర్పరులుగానుండిన శిల్పులు, వృత్తినాశనమగుటచే, జీవికలు దొరకక, పొట్టకూటికై భూమిమీఁదఁ బడవలసిన దురవస్థ సంప్రాప్తమైనది. సంవత్సరములోఁ గొంతభాగమే వారికిఁ బనియుండును, వానలు వెనుకపట్టిన తరువాత, ఏటిపొడుగునను జేయుట కేపనియును లేక, వారు సోమరులై పడియుండవలసివచ్చుచున్నది.

శి:—పాపము! ప్రజాభివృద్ధియైన కొలఁదిని కూడు గుడ్డలకు మఱియు నిబ్బందిగా నుండకమానదు.

గు:—ఔ నామాట నిజమే, కాని ప్రజాభివృద్ధియైనను, జనాభాలెక్కలను బట్టి "గ్రేట్బ్రిటన్"తోఁ బోల్చిచూచుకొనునెడల, మన హిందూదేశములో గతించిన ౧౮౯౧—౧౯౨౧ నడిమిముప్పది యేండ్లలోను తక్కువగానున్నట్లే కన్పట్టుచున్నది.

శి:—ఆలాగుననా?

గు:—ఇదిగో ప్రజావృద్ధిపట్టిక:—

| | 1891-1901 | 1901-1911 | 1911-1921 |
|---|---|---|---|
| హిందూదేశములో | | | |
| నూటికి | 2.5 | 7.1 | 1.2 |
| గ్రేట్బ్రిటనులో | | | |
| నూటికి | 12 2 | 11.6 | 5.4 |

కనుక హిందూదేశమునకుఁ బ్రజాభివృద్ధి బాధ అంతగా లేదు.

శి:—పోనిండు, ఉన్నబాధ లేవో యవియే చెప్పుఁడు.

గు:—స్వదేశసమస్త ద్రవ్యములతోఁ జక్కని వస్తువులు చేసి విదేశములకుఁ బూర్వము పంపుచుండిన మనదేశ మిప్పుడు, పండిన ప్రత్తి మున్నగు పంటలు, పండినట్టుగానే పరదేశములకంపి చదికిలఁబడి చేతులు ముడుఁచుకొని చూచుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెనుక విపులముగానుండు నూలివడుకుడు బట్ట నేత మున్నగు కుటీరవ్యాపారము లంతరించి పోయినవి; పోయినవానికి మాఱుగాఁ జేయుటకుఁ గ్రొత్తపను లేవియు లేవు.

ఇఁక హిందువులు పడవలు గట్టఁగలరను మాట, యెప్పటిదో పూర్వకాలపు సందిగ్ధవార్తయై పోయినది.

కడచిన యర్ధశతాబ్దిలోను కటిపుబాధలు తత్పూర్వముకంటె తఱచుగాను, ఘోరముగాను నున్నవి.

శి:—ఆబాధలు ప్రజలు నివారించుకొన కేల యున్నారు?

గు:—అట్టిశక్తి మనకున్న, నందఱవలెనే మనము నుందుము.

భారతమాత బిడ్డలే వెనుక గొప్పగొప్ప యుద్యోగములందుం డెడువారు. వారంద రిప్పుడు కూటికి గుడ్డకుఁ జాలని కొలువులలో నుమస్తాలు మున్నగువారుగాఁ బ్రవేశించినారు. ఉన్నతోద్యోగములు విశేషముగా యూరపు వారిచేతిలోనే యున్నవి. వారివారి బాగు వారుచూచుకొందురుగాని ప్రజలక్షేమము చూడరు. ఏలచూతురు? మన దేశముతో వారి కర్థసంబంధమే కాని యనురాగ సంబంధము లేదయ్యెను. పరిపాలితుల బాధలు పరిపాలకుల నంటునప్పుడుకదా వారికి పూఁచి భారము లుండుట. ఉద్యోగ ముండినన్ని నాళ్లు సాధ్యమైనంత డబ్బుకూడఁ బెట్టుకొనుచు, బొందు లిక్కడను, డెందము లింగ్లండులోను నిల్పి, యెప్పు డింటికిఁ బోదుమాయని వారు చెప్పులలో కాళ్లు పెట్టుకొని యుందురు.

విద్యమాడఁబోయిన నదియు నట్లే యున్నది.

శి:—విద్యకేమి? బి. ఏలు—ఎం. ఏలు; ఇంకేమే మోలు—ఎండలో తేగలపాఁతఱవలె బయలు దేరుచున్నారే!

గు:—ఉన్నారు. నాయనా. ఉన్నారు! కూటికి గుడ్డకుఁ గఱవై పడియున్నారు. స్థలభాండవిసర్జనముతోఁ జదువు సాగించుకొన్నారు. పాపము! బిరుదులు సంపాదించుకొన్నారు! ఉద్యోగములు మాత్రము త్తమాటలైనవి. చేసికొనుటకుఁ బనులు లేవు, శక్తులు లేవు. ఖనపాళియైనను గడ్డపాఱ పుచ్చుకొని పనిచేయఁ గలఁడు గాని, షేక్స్పియరు మిల్టనులు జిహ్వాగ్రమందుండునట్లు పఠించిన మన పాశ్చాత్య విద్యాపారంగతులు చేతిపనులు చేయఁజాలరు. సమర్థత తక్కువ, స్వాభిమాన మెక్కువ! గ్రామస్థులతోఁ గలసిమెలసి మాటలాడుటయే కష్టముగా నుండును. వ్యామోహ పెట్టి వృత్తులనుండిలాగి అవసరమునుబట్టి యుద్యోగములిచ్చుట సుకరముగాని, యిసుళ్ల తెరలవలె నేఁటేఁట బయలుదేఱు ఒక్కపాశ్చాత్య విద్యావేత్తలకు సరిపడిన క్రొత్త యుద్యోగస్థానములు కల్పించుట కష్టముగాదా?

శి:—ఉచితముగా గ్రామములలో పిల్లలకుచదువు చెప్పుటకు వృత్తిమాన్యములిచ్చి బడులుపెట్టెడు వారని మీరు వెనుకఁ జెప్పినారే!

గు:—ఇతరములైన దేశీయపు టేర్పాటు లన్నిటివలెనే యవియు గంగలోఁ గలిసినవి. ఆమాన్యములకుఁ బన్ను గట్టినారు.

శి:—వలలవలె దేశమంతటను రెయిలుబాటలు వైచినారే!

గు:—ఔను, వైచి మనదేశపు సిరిసంపత్తులనెడి చేపలను బట్టుకొని పైకిఁ బంపుచున్నారు వానిపై వెచ్చించుసొమ్ములో నల్పాంశము కాలువలు, చెఱువులు నూతులు, త్రవ్వించుటకు వినియోగించిన, నది సస్యాభివృద్ధికరముగ నుండును.

శి:—పరదేశపుసరకులు చక్కనివి చౌకగా మనకు దొరకుటకు, పెద్దదిగుమతిపన్నులు వేయక, విదేశవాణిజ్యము నిరవరోధముగా నడపుచున్నారే!

గు:—నిజమే! అనావశ్యకమైన భోగపదార్థములపై పన్నులు తగ్గించి ఆలోటు కూడఁదీసికొనుటకై, జీవనమున కత్యావశ్యకము లగు పదార్థములపై, బన్నులధికముగా వేయుచున్నారు. ఉప్పుపన్ను, భూమి పన్ను నట్టివే.

శి:—పందొమ్మిదవశతాబ్దిప్రారంభమున, కలకలలాడుచు నంత చక్కఁగా నున్న దేశము, ఇరువదవశతా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్ధిలో నిట్టి పితంతులక్షణములతో నొందుటకుఁ గతమే మో తెలియదు. ఇంత స్వల్పకాలములో నంతక్షీణదశ సేల ప్రాప్తించినదో యెఱుకపడకున్నది.

గు:—కారణము కుమారప్పగారు అరటిపండొలిచి చేతఁబెట్టినట్టు చెప్పినారు. వినుము.

దేశముయొక్క భాగ్యాభాగ్యములు రెండింటిని బట్టి యుండును:—౧. ప్రజలయొక్క ప్రకృతి ౨. పరిస్థితుల ప్రకృతి. పరిస్థితులను మరల (ఎ) స్వభావసిద్ధములనియు (బి) మనుష్యకృతములనియు, రెండుగా విభజించుకొనవచ్చును.

౧. హిందూదేశపు రైతునకు స్వతస్సిద్ధముగా నుండు బుద్ధి, అభినివేశము, కష్టాతికష్టమైన స్థితిలో నైనను అతఁ డగపఱుచు క్షమాబలము—ఇవి జగద్విదితములై యున్నవి. అవి లేవని చెప్పువాఁ డింతవఱకొకఁడును గాన్పింపఁడు కనుక మంత్రి "మెగ్డానెల్డు" గారి యీ క్రింది యభిప్రాయముతో నేతద్విషయకమైన చర్చ కట్టిపెట్టుకొనవచ్చును.

"హైందవ ప్రజలు ప్రపంచమందలి యితర జనులందఱికంటెను ఎక్కువపాటుపడి పనిచేయువారు, వారి భూములలో నత్యధిక భాగము సారవంతమై పుష్కలముగా ఫలించును."

౨. (ఎ) ఇఁక దేశస్వభావము పరికించి చూచిన, మంచి ధనోత్పాదకములగునిన్ని ఆయమూలములుగల యితరదేశము ప్రపంచములో నెక్కడనో కాని కానరాదు. ఇనుము, రాగి, మేంగనీస్, బంగారము, రాక్షసిబొగ్గు పెట్రోలియమ్, సీసము, ఉప్పు, పెట్లుప్పు ఇట్టి వెన్నియో భూమిలోనున్నవి. భూమిపై, వివిధములైన ధాన్యములే కాక, కాఫీ, తేయాకు, నీలిమందు, మున్నగు పెక్కుపంటలు పండును. గోఁగునార యిండియాలో నున్నంత యితరత్ర యెక్కడను లేదు. ప్రత్తిపంటలో భారతదేశము ప్రపంచమునఁ ద్వితీయస్థాన మాక్రమించియున్నది. గోధుమలు, చమురుగింజలు కూడఁ బరదేశములకుఁ బంపఁబడు సరకులలో ముఖ్యమైనవి: కావలసినంత విద్యుచ్ఛక్తి నుత్పాదించి పనిచేయించుకొనుటకున్నతములైన యనేకపర్వత శ్రేణులున్నవి. నిక్షేపమువంటి యిన్ని సదుపాయములుగల దేశము యొక్కటికి దరిద్రతకు దేశమే కారణమనిచెప్పుట కెవరికి నోరురాదు కనుక, విమర్శనముపై, మనుష్యప్రకృతియు దేశప్రకృతియుఁ గూడ నిరపరాధములని తేలినది.

2 (బి) తరువాత. మనుష్యకృతములైన "కృతక" పరిస్థితులఁగూర్చి విచారించుకొందము.

హిందూజాతిజనులు మితవ్యయులు, తృప్తాత్ములు. ఎంతచాలని జీవనాధార పదార్థములతోనైనను కాలము గడపుకొనఁ గలరు. అందుచేతనే వారికి పదార్థోత్పాదన శక్తి తక్కువగానున్నది—అని కొందఱొక విచిత్ర సిద్ధాంతము లేవఁదీసినారు. దానికి "డాక్టరు డేవెనోర్టు"గారిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు.

"ఇఁక నక్కఱలేదని పర్యాప్తకాముఁడై మనుష్యుఁ డెప్పుడు నాహారాది సౌఖ్యము లనుభవించుట మానఁడు. అవి సంపాదన శ్రమార్హములు గావని తెలిసికొనినప్పుడు మాత్రము మానివేయును"

శ్రమార్హములు గావని యట్టివానికై ప్రయత్నింపక ప్రజ లూరకుండుటకుఁ గారణమేమో విమర్శించి చూచుకొందము.

కృత్రిమపరిస్థితులు వివిధములుగా నుండును. అవి యన్నియుఁ బరిశీలించుట కిది తావుగాదు. దేశాయవ్యయములఁగూర్చి మాత్రము దెల్పెదను. వానితోపాటు పరిపాలకుల వశమునను న్న రెయిల్వేలను గూర్చియును, స్వదేశ విదేశ నాణక వినిమయముఁగూర్చియును గొంత విమర్శనము చేయఁబడును.

శి:—వచ్చుబడినిబట్టి వ్యయముచేసికొనుచు సంసారులు తమ కుటుంబవ్యాపారములు సాగించుకొనునట్లే దేశప్రభువులు తమ దేశవ్యవహారముల నడపుకొందురు, దానికిఁ బూర్వపక్షసిద్ధాంతముల యావశ్యకత యేమున్నది?

గు:—ఉన్నది. గృహస్థులకును, దేశపాలకులకును గొంచెము భేదమున్నది. గృహస్థుల రాబడి యింతయని స్థిరపడియుండును; దానిఁబట్టి వారు చేసికొనవలయు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖర్చులు నిర్ధారణముచేసి కొందురు. ప్రభువులు దేశవ్యయములు దొలుత స్థిరపఱుచుకొని, తరువాత వానికిఁ గావలయు నాదాయము పన్నుల రూపమున సంగ్రహించు కొందురు.

శి:—దానికి మాత్రము మితి లేదా? ప్రభునిష్ఠమై యున్న యాయాధికారము దుర్వినియోగము చేసినఁ బ్రజలు బాధపడరా?

గు:—సత్యము పలికినావు. అదియే చెప్పఁబోవుచున్న మాట. చెల్లించుటకుఁ బ్రజలకుఁగల శక్తి ననుసరించి రాజు పన్నులు వేయుచుండవలెను. అన్నోదకములకుఁ జాలినయర్థము ప్రజలకుంచి, హెచ్చుగానున్న సొత్తునుండియే ప్రభువు పాలనవ్యయములకుఁ గావలయు సొమ్ము పన్నురూపమున బుచ్చుకొనవలయును. విశిష్ట భోగపదార్థములపై వేయుపన్నులు ప్రజాపీడకములు గావు; సామాన్య భోగ పదార్థములపై వేయునవి యైనను అంతబాధకములుగా నుండవు. కాని జీవనమున కత్యంతావశ్యకములగు నన్నవస్త్రాదులపై వేయు పన్నులవలనఁ బ్రజలు మిక్కిలి క్షోభించి తిరుగఁబడుదురు. సత్త్వహీనులకు వస్తూత్పాదనశక్తి తగ్గిపోవును. అది దేశానర్థకరము.

శి:—పోనీ! అంతవఱకే ప్రభువులు పన్నులు వేసి, పాలనవ్యయము తగ్గించు కొనరాదా?

గు:—అదియే సత్ప్రభువులు చేయుపని. ప్రజలనుండి పన్ను రూపముగాఁ గొను ప్రతిపైసయును వారి క్షేమమునకై యే వినియోగపడవలెను. ప్రజాపదార్థోత్పాదనశక్తి హెచ్చుచేయుటకుఁ బరిపాలకు లెంతవ్యయించినను, అదియతిమాత్రముగాదు; దుర్వ్యయము గాదు.

శి:—మనదేశములోఁ బన్నులనుండి వచ్చినధన మెట్లు వ్యయింపఁ బడుచున్నదో యిఁకఁ జెప్పుఁడు.

గు:—ఇప్పటి కింతటితోఁ జాలించి, అదియింకొకసారి విమర్శించు కొందము.

శి:—అటైన సెలవుమటి! నమస్కారము!

గు:—శుభమస్తు!

---

# సుపార్శ్వని హితబోధ

శ్రీ వేంకట వీరరాజకవులు (కవితాసమితి)

క్రోధమేయున్న బలవద్విరోధమున్నఁ-బగతుఁ డగు రాముపైఁ జూపనగును కాని
అతులసుకుమారి సీతపై నలిగి చంపఁ-గడగు టది భావ్యమా దశకంఠ! నీకు.

కనుల వియోగబాష్పములు కాలువలై ప్రవహింప నిచ్చలున్
వనటలవెచ్చనూర్చుచు నపారవిషాద కృశాంగియైన యా
వనజదళాక్షి సీత దురవస్థఁ గనుంగొన నెంతవానికిన్
మనసు కలంగదే తునుమ మానసమొప్పనె దానవాగ్రణీ!

7.    6-    12    ౯-౨౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జనకుఁడు నీకు విశ్రవసు సద్గుణుఁడైన పులస్త్తి తాత, నీ
వనుపమధర్మశాస్త్రములు సాంగముగాఁ దగ నభ్యసించి యే
పున శతకోటిలింగములు ప్రొద్దునుగొల్చు మనీషివయ్యు కాం
తను వధియింప నెంచుటలు ధర్మమె? ఇయ్యది యుక్తకర్మమే?

"గురిగొని కుంభకర్ణుని రఘుప్రవరుండు వధింపగా భయా
తురుఁడయి వానికిఁ బ్రతి యొనర్పగలేక దశాననుండు భీ
కరకరవాలధారలను ఖండనచేసెను వానినాతి" నం
చరయఁగ నెల్లకాలములయందు జనుల్ నినుఁ బ్రువ్వఁ దిట్టరే?

అనుపమ పతివ్రతామణి నవనిసుతను-బల్మిమై పట్టితెచ్చిన పాపఫల మ
నంగ నీసుతుఁ డీల్గె; ఈ నాతిఁజంప-నెట్టివిపరీత మొదవునో యెఱుఁగవలదె?

ధృతిని త్రింశత్కోటి దేవతాగణము నిర్జించి సేవకులఁగావించినావు
నిరతము పార్వతీపరమేశులు వసించు కైలాసగిరి నెత్తఁగలిగినావు
దండంబు దండధరుండు నీపయివైవఁ బట్టి దానిని వానిఁ గొట్టినావు
మృత్యుదేవత హుంకరించి శూలమ్మెత్తి నినుఁదాఁక గదఁగొని నిలిపినావు
బళిర! అసమాన భవదీయబాహువిక్రమమ్ము చవిఁజూపి శత్రుసైన్యమ్ముఁ దునుమ
నగునుగాని పిచ్చుకను వజ్రాయుధమునఁ జంపినట్టుల సీత వధింపనగునె?

మగటిమి కల్గెనేని యసమానపరాక్రమ బాహు విక్రమ
మ్మగుపడ రాఘవుఁగదిసి యంత మొనర్పఁగఁ జెల్లు కానిచోఁ
బగతునిఁజేరి భూసుతను భక్తి సమర్పణఁజేసి తప్పులం
దగ క్షమియింపుమంచు శరణమ్ము వహింపఁగఁ జెల్లు నీకిలఁ.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఆగమములు

వేలాల సుబ్బారావుగారు, బి. ఏ.

హిందూ, బౌద్ధ, జైన సంప్రదాయములలో వారివారి యిష్టదేవతలయొక్క ప్రతిష్ఠా, పూజన, పురశ్చరణాదులకు జెందిన నియమములు, విధానములు గల కొన్ని ధార్మిక గ్రంథము లీయాగమము లనుపేర బరగుచున్నవి కాని

"కామికం యోగజం చింత్యం
కారణం త్వజితం తథా,
దీప్తం సూక్ష్మం సహస్రం చ
అంశుమాన్ సుప్రభేదకమ్;
విజయం చైవ విశ్వాసం
స్వాయంభువ మథానిలమ్,
వీరంచ భైరవం (రౌరవం) చైవ
మకుటం విమలం తథా;
చంద్రజ్ఞానంచ బింబంచ
ప్రోద్గీతం లలితం తథా,
సిద్ధం సంతాన శిరోక్తం
పారమేశ్వర మేవచ;
కిరణం వా తూలం చైవ
అష్టావింశతి రాగమాః."

అని కారణాగమమందలి ప్రమాణమునుబట్టి యీ ఇరువది యెనిమిది శైవాగమములే ఆగమము లనుపేర ప్రసిద్ధికెక్కి యున్నవి సామాన్య, మిశ్ర, శుద్ధ, వీరములని శైవములో నాలుగు ప్రధానభేదము లున్నవి. వీ రందరికి వేదములంబోలి ఆగమములు కూడ అపౌరుషేయములు. ఆగమము లనగా వచ్చినవని యర్థము. ఈశ్వరునుండి వచ్చిన వగుటవలన వీని కీపేరు సార్థక మగుచున్నది. మరియు ఆఙ్ పూర్వకగమ ధాతువువలన నేర్పడిన ఆగమశబ్దమునకు నిరుక్తములోని ప్రత్యక్షవృత్తి ననుసరించి సమగ్రమగు జ్ఞానమును బ్రాపింపజేయునవి కావునను ఈగ్రంథముల కీయాగమనామధేయము చరితార్థ మగుచున్నది.

జ్ఞానదాయకములగు గ్రంథము లగుటంజేసియే నాస్తికులైన బౌద్ధ, జైనులును దమ ధార్మిక శాస్త్రముల కీపేరును పెట్టుకొనిరి. మరియు వీర లీశబ్దమును దమ ధార్మికప్రమాణ గ్రంథములకు స్వీకరించుటం జేసి ఆకాలమున ఆగమపదమున కెంతటిప్రచారము ఎట్టి యాదరము ఉండినదియు విశదమగుచున్నది. ఈశ్వర విశ్వాసముగల హిందువులందరు దమ శాస్త్రములను భగవదుక్తములు, జ్ఞానదాయకములు నని గ్రహించియుండ నాస్తికులైనబౌద్ధ,జైనులు కేవలము జ్ఞానదాయకములనియే భావించుకొనియుండవచ్చును. ఆగమనామధేయము గాంచిన యన్నింటిలో నత్యంత ప్రాచీనమైనవి వేదములు. మనుష్యుల కీలోకమందు మిగుల ఆవశ్యకమైన పదార్థములెన్నికలవో వానియన్నింటిలో మరింత యెక్కువగ అవసరమైనది జ్ఞానము; ఎందుచేత ననగా, ఒక్క జ్ఞానము లభించినచో దాని ప్రభావము వలన మనుజుడు ప్రపంచమందలి తక్కిన సమస్తపదార్థములం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దెలిసికొని వాని సహాయమును లాభమంద గల్గును. కావున పరమదయాస్వరూపు డగు భగవంతు డాజ్ఞానమును అగ్ని, వాయు, రవి నామక ఋషులద్వారా లోకమున కంతటికి బ్రసాదించెను. ఈలాగున లభించిన వగుటచేత నే వీనికి ఆగమములను పేరుగలిగినది. మానవ జాతియొక్క విజ్ఞానమునకు మూలాధారము లీ వేదాగమములే. వైదిక యుగమందలి వారలు వేదప్రతిపాదితములైన అగ్ని, ఇంద్ర, వరుణ, ఆదిత్య, ద్యౌ, ఉషస్ మొదలగు దేవతల నారాధించుచు, తన్నిర్దిష్టములైన యజ్ఞాద్యను ష్ఠానముల సలుపుచు, తదనుకూలము లైన యాచారవ్యవహారముల బాలింపుచు వచ్చిరి. తరువాత గ్రమముగ దేశకాలముల ననుసరించి మనుజుల నీతి రీతి వ్యవహారము లందు బరివర్తనము లవసరమగుచురా ఆయా కాలములకు ఆయాదేశములకు అనుగుణముగ నుండులాగున బ్రాహ్మణ, స్మృతి, సూత్ర, ధర్మశాస్త్రములు లిఖింపబడినవి. కొన్నికొన్ని సందర్భములందు వీనిలో వేర్వేరువిధములైన వ్రాతలు కనబడుచుండినప్పటికి మొత్తము మీద నివి యన్నియు వేదానుకూలములే. ఉపనిషత్తు లుదయించునాటికే కొన్ని శైవా గమములు లుద్భవించు టారంభమయ్యెనని కొంద రువిద్వాంసుల అభిప్రాయమై యున్నది. వేదో క్తములైన దేవతలలో నప్పటికి రుద్రదేవతకే ప్రాధాన్యము లభించెను. తత్కాలమున బ్రచ లితములైె యుండిన సిద్ధాంతములనే గైకొని శాస్త్రజ్ఞులు ఆగమనిర్మాణమును గావించిరి. ఈ కారణమువలననే అనగా వేదోక్తసిద్ధాంత ములకు అనుకూలముగ నిర్మింపబడి యుండుట చేతనే ఇవియు అపౌరుషేయములుగ బరిగణిం పబడినవి. ఈవిషయమునే బలపఱుచుచు శైవ సిద్ధాంతనామక గ్రంథపీఠికయం దనేకనిదర్శన ములు సూచింపబడినవి. తదనుసారము "వేద మం దెట్టి ప్రాముఖ్యము అగ్నిపూజనమునకు గలదో అదేవిధమగు గౌరవము ఆగమములం దలి శివారాధనమున కొసంగబడినది. వేదము లోని యజ్ఞానుష్ఠాన క్రమము నవలంబించియే ఆగమములందు దేవాలయార్చనములు కల్పింప బడినవి." అనిశైవాగమసిద్ధాంతమువలన వెల్ల డియగుచున్నది. కాని బౌద్ధజైనులకు పూర్వ ము భారతీయులలో విగ్రహారాధనము ఉండిన ట్లు గానరాదు. సూత్రకాలానంతరము వేర్వేరు ఇష్ట దేవతోపాసనములు వెలువడినప్పటికి అవి నిరాకార నిర్గుణరూపములుగనే ధ్యానింప బడుచువచ్చినవికాని సాకారరూపమున గాదు. అనేక శాఖోపశాఖలుగ వ్యాపించిన వైదిక మతము శతాబ్దములు గడచిన కొలది ననేక దురాచారములకు లోనై శైథిల్యమును బ్రా పింప తుదకు వేదబాహ్యమును, నిరీశ్వరమును నైన జైనసంప్రదాయ మావిర్భవించినది. నాస్తి కు లగు వీరలు తమతమ గురువు లగు తీర్థం కరుల మూర్తులను జేయించి వానిని బూజింప సాగిరి. బౌద్ధులును కొంతవరకు ఈవిధానము నే యవలంబించిరి. ఈ రెండుమతములు భారతవర్షమం దెల్లకడల ప్రబలియుండిన కాల మందు జనుల కందరకు నొక విధమగు విగ్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హార్చనమం దభిరుచి జనించెను. ఈ హేతువు వలన బౌద్ధ జైనుల జయించి తిరుగ హిందూ మతమును నిలువబెట్టిన విద్వాంసులకు లోకుల మనస్సులకు దృప్తి గలిగించుటకుగాను వేరు ప్రకారము లగు విగ్రహముల సృష్టింపవలసి వచ్చెను. ఇట్టి విధానము లవలంబించిన వారిలో ప్రథములు శైవులు. అనంతరము వైష్ణవులు వీరినే యనుకరించిరి. కాని వీరు తమ మూర్తులను వేరొండువిధముగ నిర్మించుకొనిరి. ఇట్లు శైవుల ఇష్టదేవత యగు శివమూర్తి నిర్మాణమును గూర్చియు, వాని ప్రతిష్ఠా, దేవాలయరచన, అర్చనోత్సవముల క్రమము మొదలగువానిం గూర్చియు, సందర్భానుసారముగ దత్తదనుయాయులు నడచుకొనవలసిన విధులం గూర్చియు నీ యాగమములందు వివరింపబడి యున్నది. ఇది ముందు ముందు బాగుగ స్పష్ట మగును.

వేదములు ఈశ్వరదత్తము లైనటుల తదనుకూలములైన శైవాగమములును ఈశ్వర ప్రోక్తము లనుటలో అసమంజసము కాదని యిదివరకే సూచింపబడినది. శైవసంప్రదాయులు ఈ విషయమునే వేరొండువిధముగ బలపరచియున్నారు. సూత్రభాష్యములో శ్రీ నీలకంఠ శివాచార్యులవారు వేదాగమములకు శివుడే కర్త యని ప్రతిపాదనము గావించి యున్నారు. ఎట్లనగా :

"వయంతు వేదాగమయో ర్భేదం నపశ్యామః వేదోఽపి శివాగమః,
ఇతి వ్యవహార యుక్తేః తస్యతత్ కర్తృకత్వాత్,
అతః శివాగమో ద్వివిధః, త్రైవర్ణికవిషయః సర్వవర్ణికశ్చేతి,
వేదస్త్రైవర్ణికవిషయః, సర్వవిషయశ్చాన్యః, ఉభయోరేక ఏవ శివః కర్తా."

"ఈశానః సర్వవిద్యానాం"

"అస్యమహతోభూతస్య, నిశ్వసిత మిత్యాదిశ్రుత్యా"

"అష్టాదశానాం విద్యానామేతాసాం భిన్న వర్త్మనామ్, ఆదికర్తా శివస్సాక్షాత్ శూలపాణి రితిశ్రుతిః."

మాకు వేదశివాగమములకు భేద మగపడదు. వేదముకూడ శివాగమమనియే లోకప్రసిద్ధి: ఎందుకనగా దానికిని శివుడేకర్త. కావున త్రైవర్ణికవిషయమనియు, సర్వవర్ణిక విషయమనియు శివాగమము రెండు ప్రకారములు. వేదము త్రైవర్ణికవిషయము, తక్కినది సర్వవర్ణికవిషయము; ఈ రెండిటికి శివుడేకర్త. ఎట్లనగా సర్వవిద్యలకు ఈశానుడే కర్తయనియు, విద్య యామహాత్మయొక్క నిశ్వాస మనియు, వేరువేరుమార్గములబోవు నీయష్టాదశవిద్యలకు ఆదికర్త శూలపాణియగు సాక్షాత్ శివుడనియు శ్రుతిప్రమాణములున్నవని వ్రాసి యున్నారు. ప్రశ్నించునది దేవియు, ప్రత్యుత్తర మొసంగునది మహాదేవుడునైన ఆగమమనియు, ప్రశ్నించునది శివుడును ప్రత్యుత్తరమిచ్చునది దేవియునైన నిగమమనియు మరియొక నిర్వచనముగలదు.

"ఆగతం శంభువక్త్రేభ్యో గతంచ గిరిజాముఖే,
మతంచ వాసుదేవేన తస్మాదాగమ ఉచ్యతే."
"నిర్గతో గిరిజావక్త్రాత్ గతశ్చ గిరిశః శ్రుతిమ్,
మతశ్చవాసుదేవస్య నిగమః పరికీర్త్యతే."

శివునిచే పార్వతికి వినిపింపబడి వాసుదేవుని సమ్మతిగాంచినది ఆగమము: దేవివలన శివు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డాలకింప వామదేవునిచే సమ్మతింప బడినది నిగమము.

శివునియొక్క నాల్గుముఖములనుండి నాలుగు వేదములు జనించెననియు, నయిదవముఖమునుండి ఆగమములు పుట్టినవనియు మరికొందరి వాదము. కాని శివునియొక్క వేర్వేరు ముఖములనుండి కామికాదులు జనించినట్లు ముందు విశదమగును.

ఆగమముల జన్మస్థానము కాశ్మీరము వీనికి స్పందప్రత్యభిజ్ఞ దర్శనములని ప్రసిద్ధికలదు. ఈ స్పందప్రత్యభిజ్ఞ ప్రవాహము క్రమక్రమముగా వింధ్యోత్తరమువరకును, పూర్వమున బిహారు ప్రాంతములవరకును వ్యాపించెను. అనంతరము బూర్వభాగమున నింకను బంగాలమునందు ప్రవేశించి మత్స్యభుక్కులగు వంగదేశవాసులలో నిది శాక్తేయమతముగ మారి నిగమతంత్రరచనకు గారణభూతమైనది. ఇటు వింధ్యపర్వతము నతిక్రమించి దక్షిణముగ బ్రవహించి వీరశైవరూపముం గొని దక్షిణాపథమునందంతట వ్యాపించెను. ఇంతకంటె ముందుగ దక్షిణముగ బ్రవేశించిన స్పందప్రత్యభిజ్ఞశాఖ మరియొకటి శుద్ధశైవాదర్శనమునకు మూలాధారమయ్యెను. ఈసంప్రదాయము లన్నింటికి శైవాగమములే యాధారములు; కాని ప్రస్తుత ముబొంబయికి ఉత్తరభాగమున వ్యాపించియున్న లకుటీపాశుపతవిధానములును శివసంబంధములే కాని అవి శైవాగమములమీాద నాధారపడునవి కావు. ఈ నిగమాగమములకు తంత్రశబ్దము సామాన్యముగ వర్తించును. పూర్వదేశములలోని శాక్తేయనిగమతంత్రములకును దక్షిణమందలి శైవాగమతంత్రములకును వానియందలినీతులకు, ఉపదేశములకును సంబంధమెంతమాత్రము లేదు. వీనికి ప్రకాశాంధకారముల తారతమ్యమున్నదనుట అతిశయోక్తి కాదు. నిగమతంత్రములందలి విషయములు గూఢములు. సర్వజనోపయోగములు కావు. అవినీతికరమైన విషయములతో నిండియుండుటవలన నివి నిరసింపబడియుండ తన్మతపక్షపాతులగు వారలు కొందరు జీవన్ముక్తులగు సంపూర్ణజ్ఞానులకే తక్కతక్కినవారికి అవి పనికివచ్చునవి కావని సమాధానము నిచ్చియున్నారు కాని యిది యెంతవరకు సంగతమో తెలియదు. ఆగమతంత్రములు సర్వజనోపయోగములు. వామాచారులు వీనిని విశ్వసింపరు. అటులే దక్షిణాచారు లగువారలు నిగమముల దిరస్కరించి ఆగమములను మాత్రమే ప్రమాణములుగ దీకొందురు. వాములు శక్తిపూజాపరులు. వీరి నిగమతంత్రము లన్నియు శక్తిప్రోక్తములే. దక్షిణాచారుల అభీష్టదేవత శివుడు. వీరల ఆగమతంత్రము లన్నియు శివప్రోక్తములు. శాక్తేయు లగు వామాచారులలో పంచమకారములు ముక్తిదాయకములు— చూడుడు :

"మద్యం మాంసంచ మీనంచ ముద్రా మైథునమేవచ,
ఏ తే పంచమకారాస్స్యు ర్మోక్షదాహి యుగేయుగే."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నమాంసభక్షణే దోషో నమద్యేనన మైథునే,
ప్రవృత్తిరేషాభూతానాం, నివృతిస్తు మహాఫలా."
"నృణాంస్వభావజందేవి ప్రియం
భోజన మైథునం,
సంక్షేపాయ హితార్థాయ,
శైవధర్మే నిరూపితమ్."

మద్య, మాంస, మీన, ముద్రా, మైథునసేవనములు ముక్తిదాయకములు. మద్య, మాంస, మైథునముల సేవించుట దోషము కాదు. ఇవి ప్రాణులకు స్వభావములు. కాని వీనియెడల నివృత్తి కలిగియుండుట మంచిదే. భోజన మైథునములు జనులకు సహజముగా ప్రియములు. వారి కళ్యాణార్థమే వీని బరిమిత ముగ సేవింపవలయునని శాస్త్రములందువిధింప బడి యున్నది.

ఈప్రకారము శాక్తేయుల ధర్మములు వివరింపబడియుండ నివన్నియు శైవాగమము లందు మహానీచముగ నిందింపబడి యున్నవి. చూడుడు:వీరాగమములో

"క్వమద్యః క్వశివే భక్తిః, క్వమాంసం,
క్వ శివార్చనమ్
మద్యమాంస ప్రసక్తీనాం దూరే
తిష్ఠతి శంకరః."

ఎక్కడిమద్యము? ఎక్కడిభక్తి? మాంస మెక్కడ? శివార్చన మెక్కడ? శంకరుడు మద్యమాంస సేవులకు దూరముగ నేయుండును.

"గురుస్త్రీషు పరస్త్రీషు విప్ర
స్త్రీషుచ మైథునమ్,
కరోతి శివభక్తోపి శివ
ద్రోహీ భవిష్యతి."

నియత శైవాగమాచారపరుడయ్యు ఉపర్యుక్తదోషము లాచరించినశివద్రోహియగును.

"ఉచ్ఛిష్టం సహభోజ్యంచ చోరత్వం
జీవహింసనమ్,
భక్తానాంచన కర్తవ్యం కృత్వాచేత్ పాతకీ భవేత్."

ఉచ్ఛిష్టసేవన, సహభోజన, చోరత్వ, జీవహింసనముల, నెప్పుడును జేయగూడదు. చేసినచో పాతకు లగుదురు. మరియు నిట్టి దురాచారము లొనరించువా రందరు బ్రహ్మ రాక్షసు లగుదురని శివుడు వక్కాణించి యుండెను.

"కలౌ ప్రాయేణ దేవేశి రాజసా స్తామసా స్తథా,
నిషిద్ధాచరణాఃసంతో మోహయంతి త్యపర
[బహూన్,
ఆవాభ్యాం పిశితం రక్తం సురాంచైవ సురేశ్వరి,
వర్ణాశ్రమోచితంధర్మం అవిచా ర్యార్పయంతి యే,
భూతప్రేతపిశాచాస్తే భవంతి బ్రహ్మరాక్షసాః."

వామాచారులకు వేదాది సత్యశాస్త్రములు నింద్యములు, వేశ్యాసమానములు, కాని తమశాస్త్రములు మాత్రము పూజార్హము లైన కులవధువులు. చూడుడు:

"వేదశాస్త్రపురాణాని సామాన్యగణికా ఇవ,
యా పునః శాంభవీ విద్యా గుప్తా కులవధూ రివ."

రజస్వలా, గణికా, రజకీత్యాదులతోడ సంభోగము కాశీ, గయా, ప్రయాగాది తీర్థ సంసేవనములతో సమానమని వాముల నిగమ తంత్రములందు వక్కాణింపబడియుండ శైవాగమములందు .

"రజస్వలా తు చండాలీ కుష్ఠరోగవతీ హితా,
విధవాచేటికావేశ్యా సాం రతి శ్చాండాలలక్షణమ్"

అని వ్రాయబడియుండుటవలన మీదవచించిన వారితో సంపర్కము చేయుటవలన నరులు చండాలులగుదురని నిశ్చయింప బడియున్నది. మరియు:

"ఊర్ధ్వస్రోతోద్భవా ఏతే, నాభ్యాధస్స్రోతసాపరే."

అని లలితాగమమందు శివుడు ఊర్ధ్వరేతస్కుడైయుండ శైవాగమము లుద్భవించెనని యు, అధోరేతస్కుడై యుండిన కాలమున శాక్తతంత్రము లావిర్భవించెననియు వ్రాయబడి యుండుటవలన నీరెండుప్రకారములగు శాస్త్రములు పరస్పర విరుద్ధమార్గములుగనే పోవుచుండును. నిగమాగమములందలి యిట్టి వే యనేకప్రమాణముల మూలమున నీరెండు ప్రకారములగు శాస్త్రములు పరస్పరవిరుద్ధములని సిద్ధమగుచుండ ఆవలాన్ మొదలగు నిగమ తంత్రపక్షపాతులగు కొందరు వీనినన్నింటి నొక్క కోటిక్రింద జేర్పప్రయత్నించియుండుట అంత ఉచితముగ గనుబడుటలేదు. ఏదిమెట్లైనను కాశ్మీరదేశమున జనించి వింధ్యపర్వతముల బరిశుద్ధముగ వ్యాపకమందుచువచ్చిన శైవమతము బంగాళమునందు ప్రవేశించి అక్కడ ఆకాలమున ప్రచారములో నుండిన ఆచారాహారముల కనుకూలముగ శాక్తేయమతముగ మారియుండవచ్చు ననియు, దక్షిణమునందు బ్రసరించి నిరామిషులగు అచటి ద్విజాతుల ప్రభావమున వీరశైవముగ మారియుండవచ్చు ననియు నిశ్చయమగుచున్నది. మీద వచించిన ఇరువదియెనిమిది ఆగమములలో కామిక, యోగజ, చింత్య, కారణ, అజితాగమములు ఈశ్వరునియొక్క సద్యోజాతముఖమునుండి యు, దీప్త, సూక్ష్మ, సహస్ర, అంశుమాన్, సుప్రభేదకాగమములు వామదేవనామక ముఖమునుండియు, విజయ, విశ్వాస, స్వాయంభువ, అనిల, వీరాగమములు అఘోరనామకముఖమునుండియు, భైరవ లేక రౌరవ మకుట, విమల, చంద్రజ్ఞాన, బింబాగమములు తత్పురుషనామకవదనమునుండియు, ప్రోద్గీత, లలిత, సిద్ధ, సంతాన, శర్వోక్త, పారమేశ్వర, కిరణ, వాతూలాగమములు ఈశానాహ్వాయ ముఖమునుండియు జనించినవని కారణాగమమందలి తంత్రావతార పటలమునుండి విదితమగుచున్నది. ఈయాగమము లన్నియు ముఖ్యముగ కలియుగముకొరకుమాత్రమే సృజియింపబడియుండినట్లు ఈక్రిందిశ్లోకమువలన తెలియుచున్నది.

"కృతేతు శ్రుత్యుక్తాచారః
త్రేతాయాం స్మృతిసంభవః,
ద్వాపరేతు పురాణోక్తః కలౌ కేవలాగమః."

కృతయుగమునందు వేదోక్తాచారము, త్రేతాయుగమునస్మృతిప్రోక్తము, ద్వాపరమందుపురాణోక్తము, కలియుగమున కేవలము ఆగమోక్తాచారమువర్తిల్లును. ఇంతవరకు వ్రాసినదానిని ఈయాగమము లందలి విషయమే మైనదియు గొంతవరకు జదువరులకు బోధపడి యుండవచ్చును కాని యిపుడు మరికొంచెము వివరముగ వ్రాసెదను. వారాహీతంత్రములో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## ధ నా స రీ

లిఖతహాతీ జిహి సుగతీ జ్యాను ధికాను జగ్యోతి హీ చీ త్తనహీ,
బ్రిహాఛీన తన కి యో సిగారన సంగసఖీ జిహి బాహా గహీ;
సురతిలగీ జిహీ ధ్యాన బినూరతి ఆసున అగియా ఝీజరహీ,
దీపగకీ సు ధనాసరీరాగనీ నామ పరము అభిరామ కహీ.

[జయపుర చిత్రము: దివాన్ బహదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"సృష్టిశ్చ ప్రళయశ్చైవ, దేవతానాం యథార్చనమ్;
సాధనంచైవ సర్వేషాం పురశ్చరణ మేవచ.
షట్కర్మ సాధనం చైవ ధ్యానయోగ శ్చతుర్విధః,
సప్తభి ర్లక్షణై ర్యుక్తం ఆగమం తద్విదు ర్బుధాః."

అని యాగమలక్షణము చెప్పఁబడుట వలన సృష్టి, ప్రళయ, దేవతార్చన, సాధన, పురశ్చరణ, షట్కర్మ, ధ్యానయోగములకు సంబంధించిన విషయము లిందు వర్ణింపబడి యుండుట స్పష్టమగుచున్నది.

మెండియు,

"దేవదేవస్య కర్మాణి సుమహాంత్యద్భుతానిచ,
అవతారాశ్చ సోమస్య తథాన్యే ధర్మసాధనాః,
మహాంతిచైవ దానాని వ్రతాన్యపిచ కృత్స్నశః,
శివదీక్షాస్వరూపంచ శివధర్మానుకీర్తనమ్,
అష్టావింశత్యాగమేషు కీర్త్యంతే భూరిశః ప్రియే."

అను ప్రమాణమువలన పరమేశ్వరుని మహాద్భుతకార్యములు, అవతారములు, తక్కిన ధర్మసాధనములు, మహాదానవ్రతాదివిధానములు, శివదీక్షాస్వరూపములు, తత్సంబంధము లైన సంకీర్తనములు మొదలగునవి ఈ ౨౮ ఆగమములలో సవిస్తరముగ లిఖింపబడియున్నవి.

అదిగాక వేరువేరుమతముల ఇష్టదేవతలు సమస్త జగత్తునకు కర్తలు, హర్తలుగ గైకొనబడి వారినుండియే సకలచరాచర సృష్టి యుత్పన్నమైనట్లు వ్రాయబడి యుండుట ఆయా సంప్రదాయములవారి ధార్మిక గ్రంథముల నవలోకించుటవలన విశదము కాగలదు. అదేవిధమున ఆగమము లన్నింటిలో ప్రధాన దేవత శివుడు. అతని నుండియే సంపూర్ణ బ్రహ్మాండ మావిర్భవించినది. శివుడే సృష్టి, స్థితి, లయకర్త. కావున ఈశ్వరునుండి జగదుత్పత్తియైన విధానము, తద్వికాసవిహారాదులు, ఈశ్వరపూజాశ్రమనియమములు, తదీయ ప్రతిష్ఠాసేవనములు, తదీయారాధనోత్సవాది కార్యకలాపములు, విస్తృతరూపముతో నాగమములందు చిత్రింపబడియున్నవి. మరియు నీ యాగమప్రమాణము ననుసరించి శివుని నాభి నుండియే సమస్తదేవతలు జనించిరి. కుమారుడు హృదయసంజాతుడు. మరిపంచాశత్ కోటి దేవతలు, ఋషులు శివునిస్వేదమునుండి పుట్టిరి. బిందురూపదశాంశమునుండి శక్తు లావిర్భవించినవి. స్మృతి, సూత్ర, ధర్మశాస్త్రముల లోని విషయములన్నియు మరికొన్ని నూతనవిషయములతో నీయాగమములందు లిఖింపబడినవి. ఇందుకు కారణాగమమందలి ఆహ్నికవిధిపటలమును దిలకింపుడు. శైవోపాసకుడు మహేశ్వరుని ధ్యానించుకొనుచు బ్రాహ్మముహూర్తకాలమున శయనమునుండి లేచి గ్రామము వెలుపలికిబోయి నద్యాదినిషిద్ధప్రదేశములకు దూరముగ కాలకృత్యములం దీర్చుకొని పిదప దంతధావనము జేసికొని స్నానముచేయవలయునను విషయములు యాజ్ఞవల్క్యాది ధర్మశాస్త్రములలోని ఆహ్నికవిధులనుబోలియేయున్నవి. ఇదేవిధమున మరియనేకనియమములు స్మృతి ఆగమములకు సామాన్యముగ గలవు. మెండియు నిందు అకారాది క్షకారాంతము గల వర్ణముల లింగభేదములు, బీజములు, దేవతలు వానివాని రంగులు వానివాని ఫలములు, ఏ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యక్కర మెక్కడ నేవిధమున లిఖింపవలసి నదియు లోనగు వృత్తాంతములు విశదీకరింప బడి యున్నవి. చక్రనిర్మాణప్రకారము, దాని వేరువేరుదళములందు బీజాక్షరముల వ్రాయు విధానములు, బునాదులలో వర్ణవిన్యాసముఁగల రేకులనువేయించి వానిమీద గోడల నెత్తించి దేవాలయముల గట్టింపవలసిన రీతులు, అక్షర సంఖ్యాక్రమమున పంచ, షట్, అష్ట, నవ, దశ వర్ణోపేతము లగు మంత్రముల స్వరూప ములు, వానిశక్తులు, వానివలన గలుగు ఫల ములు, వానిప్రయోగించువిధులు, వానిప్రభా వమువలన శివసాన్నిధ్యప్రాప్తి, సాకల,శాంభవ సౌఖ్య, సావశ్య,సయుజములను అయిదుప్రకా రములగు ప్రణవభేదములు, వానిజపించుటచేత గలుగుసిద్ధులు మున్నగువిషయము లనేకము లీ యాగమములందు వివరింపబడి యున్నవి.

---

## నీ వెవండవో?

తుమ్మపూడి వెంకటరత్నం గారు

నేనొకనాడు నాదుజననీ కరడోలికయందుఁ దూఁగుచు
న్నా; నటువంటి నాడు నయనాల కొకొక్కముహూర్తమందు న
మ్మానిని నేత్రగోళములమధ్య వెలింగెడు జ్యోతులందు నీ
లేనగు మోము కన్పడె బలే! వివరింపుము నీవెవండవో?
మెఱుఁగుల తోటలోన పసమించెడు మేఘరథంబు పైన నం
బరమున వాయువేగమునఁ బైనమొనర్చుచు నీ చరాచర
స్ఫురితజగత్ప్రబోధక విశుద్ధగళధ్వనితోడ నన్ను హె
చ్చరిక యొనర్చుచున్ మొగము చాటొనరించిన నీవెవండవో?
'తళతళ'లాడిపోయితివి తళుక్కు మెఱుంగు మఱుంగు లోపలన్
'మిలమిల' లాడిపోయితివి మింట 'మినుక్కు'నుచుక్క లోపలన్
'పలపల'లాడిపోయితివి పర్వపువెన్నెల సోగలోపలన్
'కిలకిల' లాడిపోయితి శుకధ్వనిలోపల నీవెవండవో.
తుమ్మెదపాటలో నెమలి తొయ్యలియాడెడు 'బోగమాట'లో
కమ్మనిపాలపాపల మొగంబులఁ బర్వెడు తేనెతేటలో
సొమ్ములమూటలో నెదుటఁ జూడఁగనయ్యెడు బొమ్మలాటలో
'గమ్మని'పించునట్టి లయకాఁడవురా బళి నీవెవండవో?
ఎక్కడ నీదుశక్తియె మఱెక్కడఁ జూచిన నీదు వ్యక్తియే
ఎక్కడ నీదురాగమె యిఁకెక్కడఁ జూచిన నీదుభావమే
పెక్కు లిఁకేల సృష్టికిఁ బిపీలిక యాదిగ బ్రహ్మదాఁక నీ
వొక్కడవే కనంబడుచు నుంటివి చెప్పుము నీవెవండవో?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఔరంగజేబు

మొసలికంటి సంజీవరావు గారు

## భ్రాతృసమరము: సముగరుయుద్ధము

ధర్మాటుయుద్ధమునందు జయించిన యౌరంగజేబు బలమధికతరమాయెను. ఆతని నక్కడనే వారింపకుండుట యపాయకరము. తత్కార్యభారము దానే వహింపవల యునని దారా గుర్తించెను. అట్లుగాక, వృద్ధుఁడగు షాజహాను తానే సైన్యాధిపత్యము వహించి, నయభయ దండనోపాయములచేత మురాదౌరంగజేబులను వారి రాష్ట్రముల కంపివేయవలయునని యోచించెను. ఆతఁ డటు లాచరించె నేని, దారాకును, దనకును క్షేమకరముగ నుండెడిది. ఔరంగజే బెంతటి బలాఢ్యుఁడైనను, ఎంతటి ధీరుఁడైనను, ఎంతటి యుపాయశాలియైనను, మహాసామ్రాజ్యభారధురంధరుఁ డగు తండ్రియే సేనాముఖంబునఁ దోఁచునపుడు, నిలిచి పోరాడ నేరఁడు. అతని సేన లాతనిఁ దప్పక విడనాడియుండును. కాని, షాజహాను మంత్రులు వేఱువిధ మాలోచించిరి. పాదుషా యాస్థాన సభ్యులు భోగలాలసులై, యౌరంగజేబు పక్షపాతులై రణవిముఖులై యుండిరి. ఏకగర్భసంజాతులు యుద్ధమాచరించుటయే యసంబద్ధమనియు, నందు, జనకుఁడు తన కుమారులపైఁ దాడివెడలఁ బూనుట మఱియు ననుచితమనియు వారనుడివిరి. మురాదౌరంగజేబు లాగ్రానగరమున కరుదెంచిన యనంతరమే మహాసామ్రాజ్యశాసకులగు పాదుషావారు తమ ధూర్తపుత్రులను మందలించి వారి వారి రాష్ట్రములకు మఱల్పవచ్చునని యాసభ్యులు హితమొసఁగిరి. తన యభిమతము గూడ నట్టులే యుండుటచేత, షాజహాను వెంగలియై వారి మాట విశ్వసించెను. దారా కుపితుఁడై వారినిఁ దీవ్రముగ నిరసింప నాయాసభ్యులు సేనానులు నాతనియెడ మఱియు విముఖులైరి. వారి నైరుణ్యమువలనను, సులేమాను జయసింహాదులు షుజాపై దాడివెడలి దవ్వున నుండుటవలనను, దారాకుఁ జాల యనర్థము వాటిల్లెను.

దారా తీవ్రముగ సముచిత సన్నాహము లొనరించెను. తన కధీనులగు సామంతులను, సైనికోద్యోగులను వారివారి సేనలతోడఁ దనరాష్ట్రములనుండి రావించెను. తత్సేనలకు వలయు తుపాకులు ఫిరంగులు మొదలగు యుద్ధోపకరణములే గాక ధనముగూడ నవిరళముగ షాజహానొసంగెను. దారాసైన్యమును, రాజధానియందలివియు గలసి యరువదివేలాయెను. సమరసన్నాహములు పూర్తియైన యనంతరము తన జనకునకు నమస్కరించి యాశీర్వాదము వడయుటకు దారా షాజహాను చెంతకుఁ బోయెను. ఆతండ్రికుమారుల వియోగము వర్ణనాతీతము. తన యాత్మసంజాతుఁడు తనలో లీనమగునట్టు లాతని దృఢాభిమాన పూర్వకముగా గాఢాలింగన మొనరించి, పవిత్రధామమగు మక్కావంక మోముద్రిప్పి, యశ్రుధారార్ద్రనయనుఁడై పాదుషా దీవించెను. తనప్రియ పుత్రుఁడు తన కిఁకఁ గానరాఁడని యాతని కెట్టులో స్ఫురించెను గాఁబోలు. ఆముసలిఱేఁడు విషణ్ణహృదయుఁడై చూచుచుండ, నౌరంగజేబును బట్టి తెచ్చువాని వలె వైభవముతో సగర్వముగఁ దన యనంతసేనాముఖంబున దారా యుద్ధమునకు బయలుదేఱెను.

దారాసైన్యవిభాగ మొకటి మేనెల ౯వ తారీఖున వెడలెను. ౨౨ తారీఖున దారాకూడ ఛాంబలునదీ తీరస్థమగు ధోల్పురము జేరి, యౌరంగజేబు సేనావాహిను లావాహిని దాటి రాకుండ ఘనతరమగు ప్రయత్నము లొనరించెను. లోతునీకు లేని పాటిరేవు లన్నింటి నరికట్టి, మార్గము లన్నింటిని బంధించుటయే గాక, నదీతీరమున సమున్నతవేదికలు గట్టించి, వైరులను భస్మీభూత మొనరింపఁజాలు శతఘ్నుల నాపై నెలకొల్పి, యువరాజప్రమత్తుఁడై యుండెను. ఆలోపునఁ దనకుమారుఁడు జయసింహాది యోధజన మండితుఁడై యరుదెంచునంతనే సోదరుని భంజింపవలయునని యాతఁడు తలంచెను. పాపమా మందభాగ్యుఁ డింకను నౌరంగజేబుధీశక్తియుఁ గార్యదక్షతయును గుర్తింపఁజాలకపోయెను. ఆతఁ డప్రమత్తుఁడై నిశ్చలముగ నిబ్బరముగఁ గాచికొని యుండగనే, నలుబదిమైళ్ల దూరమున నౌరంగజే బొకపాటిరేవు గనిపట్టి, ససైన్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగ, సురక్షితముగ నడిదాటెను (23 తారీఖు). రేవుల న్నియు దారా కాచెనుగాని, మాలుయూలనున్న యొక్కటి మాత్ర ముపేక్షించెను. ఔరంగజేబున కదియే యక్కరకువచ్చెను. ఆవార్త తెలిసినంతనే, దారా భయ భ్రాంతుఁడాయెను. ఆదీతీరమున నాతఁడొనరించిన మహాసన్నాహములన్నియు వ్యర్థమగుటయే గాక, యాతని సేనాపృష్ఠ మరక్షితమాయెను. దారా యట నిలువనేరక, రయమ్మునఁ బాఱి, యాగ్రానగరమున కెనిమిదిమైళ్ల దూరమున సముగరుక్షేత్రమున విడిసెను.

సముగరుక్షేత్రము యమునానదీవలయవలయి తమై, విశాలమై, ప్రచండభ్రాతృసమరమున కనుకూల ముగ నుండెను. దారా యాప్రదేశము జేరినవాఁడి రణము నకు సిద్ధముగనే యుండెను. ఔరంగజేబుసైన్యము 28 తారీఖునఁ బ్రత్యక్షమాయెను. యుద్ధసన్నద్ధుఁడైయుండిన దారా తత్క్షణమే సేనను గదిపినచో జాగుండెడిది. ఔ రంగజేబుసైన్య మలసియుండెను. అయ్యది దారాసేనకం టెఁదక్కువకాదను. ఈ రెండు కారణములే గాక, యుద్ధా తురంబగు సైన్యమును నిర్హేతుకముగ నాపియుంచుట యవివేకము. దాన, వారి యుత్సాహము చల్లారుటయే గాక, తమ నాయకునిపైఁ గల విశ్వాసము తొలంగును. ఐనను, దారా ప్రమత్తుఁడు గాక, తన సేనలను జక్కగ వ్యూహము దీర్చికొని యుండెను. ఇసుకమయమగు నా మరుభూమియందు భాస్కరుఁ డుగ్రుఁడై యనలము గ్రక్కుచున్నను, అతని సైనికు లాయుధపాణులై తమ నిర్దిష్ట ప్రదేశములందు యథావిధంబున నిలిచియుండిరి. అగ్నికుండమువంటి యారణభూమియందుఁ గవచము ధరించిన యోధులబాధ వారికే తెలియవలయును ఆయు పరిస్థితమే గాక, రేయియెల్లను గూడ దారాసైన్య మట్టులే యుద్ధమున కాయత్తమై యుండెను.

అనభిజ్ఞుఁ డగు నౌరంగజేబు సముగరుక్షేత్రము జేరినంతనే తనసేనలకు విశ్రాంతి యొసఁగెను. తన యుద్యోగులు రాత్రియెల్ల సేనారక్షణ మొనరించు చుండ, నౌరంగజేబు వారిని హెచ్చరించి వారి రణో త్సాహము బెంపుజేసెను.

అరుణోదయము కాకపూర్వమే యౌరంగజేబు సేనావిభాగములు విశిష్టస్థానములు క్రమముగవీడి, తమ నాయకుఁ డేర్పఱిచిన తావులందు నిలిచిరి. ఆసేన యేఁబదివేలుండెను. దశసహస్ర సంఖ్యాయుతమగు పురో భాగ మౌరంగజేబుకుమారుఁడగు సుల్తాను మహమ్మదు నధీనమున నుండెను. ఆ రాజకుమారునకు సమర్థుఁడగు నజబతుఖాను బాసటయై యుండెను. జుల్ఫికారు, సాఫ్సీఖానులు శతఘ్నులతోడ నాసేనకు రక్షగాముంగల నుండిరి. ఇస్లామఖాను దక్షిణభాగమును శాసింపుచుం డెను. ఇందు మహమ్మదీయులే గాక, ఇంద్రద్యుమ్నుఁడు చంపతరావు, బుందేలుఁడు, హాడా భగవంతసింహుఁడు మొదలగు రసపుత్రసేనానులుగూడ నుండిరి. మురాదు తన పదివేల సేనతోడ నెడమనుండెను. ఆయా విభాగము లను సమయానుకూలముగఁ బోషించుటకు షేకుమీరు అనువాఁడైదువేల యుత్తమసైన్యముతోడ సిద్ధముగ నుండెను తన్మహాసేనామధ్యమునఁ గొండవంటి మదగ జంబారోహించి యౌరంగజేబు విశాలరణక్షేత్రమును బరిశీలింపుచుండెను. బహదూరుఖాను, ఖానీదురానీ యను ప్రసిద్ధసేనాను లాతని పక్షముల కధినాథులై యుండిరి. దృఢమగు నినుప కవచమును ఇనుపముండ్లను తొండమునఁ బ్రచండాయుధములను దాల్చిన సము న్నత మత్తేభము లుచితప్రదేశములందు భయంకరముగ నిలిచి యుండెను.

ఔరంగజేబు సైన్యముతోఁబాటు దారాసైన్యము గూడఁ గ్రమముగ బారులుగట్టి యుద్ధమున కాయిత మయ్యెను. సేనాముఖంబున దీర్ఘముగ శతఘ్నీదళ మును, ఆవెనుక తుపాకిదళము నుండెను. చిన్న మరపిరంగులైదువందల యుష్ట్రములమీఁద నాటియుంద నుండెను ఆవెనుక గజయూథమును, అశ్వికదళమును, కాల్బలమును గ్రమముగా నమరియుండెను. దారా రస పుత్రులనే విశ్వసించెను. హాడా, శిశోదియా, రహ తూరు, గౌరుశాఖల రసపుత్రులు, సేనాముఖమున నుండిరి. నిరుపమాన ధైర్యస్థైర్యసమన్వితుఁడై, మహమ్మ దీయులకుఁ గూడ నాదర్శప్రాయుఁడైన ఛత్రసాలుఁడు-

బూందీరాజు—ఆ విభాగమును బాలింపుచుండెను. విశ్వసనీయుఁడగు దిలేరుఖాను ౪౦౦౦ ఆఫ్ఘనులతోడను, ౩౦౦౦ ఉత్తమాశ్వికదళముతోడ నాస్కరుఖానును గూడ ముందేయుండిరి. ఈ విభాగములు సునిశితఖడ్గధారవలె రిపుచమూనివహమును ఛేదించుననియు, తక్కుంగల సైన్యముతోడ తానావిచ్ఛిన్నసేనానివహమును జెండి విజయముగాంతుననియు దారా విశ్వసించెను. ఆ సైనికులను ఆమాయకులును భయకాపట్యము లెఱుంగని సేవకులగుటచేత, దారా యంతనిర్భయముగ నుండెను. అతని ద్వితీయకుమారుఁడును, యశస్సాంద్రుఁడైన మహావీరుఁడు రుస్తుముఖానును వామభాగమును శాసింపుచుండిరి దక్షిణభాగము కాలీలుల్లాఖాను పాలనమునందుండెను. ఈఖానుఁడు పాదుషాయున్నము దినితిని కడుమాననీయుఁడై వృద్ధుఁడాయెను. అట్టి సేవకుఁడు యుద్ధమున స్వామిహితము మఱచి యన్యథా చరించుట శోచనీయము. సేనాముఖముననున్న విభాగము వెనుకఁ బదివేల సైన్యముండెను. అయ్యది యావిభాగమునకే గాక, పార్శ్వములకుఁ గూడ సమయానుకూలముగఁ దోడ్పడుట కేర్పడియుండెను. తద్విశాలసేనామధ్యమున దారా యొక సమున్నతగజరాజ మారోహించి క్షేత్రముఁ బరిశీలింపుచుండెను. అతని క్రిందఁ బ్రత్యేకముగ ౧౨౦౦౦ సేనయుండెను.

దారా మహాసంరంభముతోడ ఫిరంగులు ప్రయోయింప, నాయనంతరరణక్షేత్రము సాంద్రధూమాక్రాంతమై కంపించెను. ఔరంగజే బట్టి వృథావ్యయ మొనరింపనొల్లక, సుగ్యాసకు మాత్రము దానును బ్రత్యుత్తరపూర్వకముగఁ గొన్ని శతఘ్నులు పేల్చెను. తదనంతరము, దారా తనచతురంగబలంబులతోడ వడివడిఁబోయి రిపుసైన్యమును దాఁకెను.

యుద్ధ మొకపెట్టునఁ దీవ్రమై తీక్ష్ణమై దుర్నిరీక్షమాయెను భానుఁ డుజ్జ్వలముగ వెలుంగుచున్నను, కాఱుమేఘములఁ బోలు ధూమపటలములు గ్రమ్మివేయ రణావని యంధకారబంధురమాయెను. దారా వామపార్శ్వాధినాథుఁడగు మహాయోధుఁడు రుస్తుముఖాను తనసేనతోడఁ బాఱి రిపుశతఘ్నుల నాక్రమింపఁ గడఁగెను. కాని, యౌరంగజేబుఫిరంగిదళము ప్రశంసనీయముగఁ దమనేర్పు చూపుటచేత నటుపోఁజాలక, రుస్తుము ప్రక్కకుమఱలి, పురోభాగమును వెలుపువలెఁ దాఁకెను. ఔరంగజేబు మధ్యసేనం బాలించుబహదూరుఖాను తదపాయము గుర్తించి,రయమ్మున నటుపోయెను. ఐనను, అతని సేన యల్పమగుటచేత, నావీరుఁడు క్షతగాత్రుఁడై నేలఁబడెను. ఆతనిసేనావలిక్వాల తెగటారిరి. ఇఁక నాహతశేషులు పాఱవలసినదే. అట్టి సంకటసమయమున నిస్లాముఖాను షేకుమీరులు చయ్యన నరుదెంచి శత్రుసంహారమునకుఁ దలపడిరి. అధికతరమగు శత్రుసైన్యమునుఁ గాంచియు, రుస్తుము చలింపకపోయెను. తుదకొక తుపాకిగుండాతని హస్తము ఛేదించెను. మరణ మిఁక ధ్రువమనియెంచి యామహావీరుఁ డశ్వముపై నుఱికి, తనుఁబోలు పండ్రెండుగురు ధీరులతోడ రిపుసేనాకదంబమును జెండిచెండి వీరస్వర్గము గాంచెను. హతశేషమగు నల్పసేనతోడ దారాకుమారుడు వెనుకకుఁబాఱెను.

రుస్తుముఖానువలె ఛత్రసాలుఁడుఁగూడఁ బిడుగువలె శత్రుసైన్యమును దాఁకెను. ఛత్రసాలుఁ డుద్దండసాహసంబున శాత్రవశతఘ్నుల నడుమఁ దనసైన్యముతోడఁ జొరఁబడి, యౌరంగజేబు నుండి మురాదును వేఱుపఱచి యాతనిఁ గదిసెను. రసపుత్రుల శౌర్యమద్వితీయము. యుద్ధమొక క్రీడవలె విహరించు నాశూరులు వివాహార్థ మరుదెంచు పెండ్లికుమారులపగిది హరితాంబరధారులై, వివిధాలంకారవిరాజమానులై యశ్వారూఢులై, యాత్మరక్షణ చింతావిమూఢులై, క్రూరశార్దూలవిసరణప్రాయముగ రిపువధ మాచరించిరి. రామసింహ నామధేయుఁడగు రహతూరురాజు తనశిరోవేష్టనమునందలి యాణిముత్యములు తెల్లనికాంతులు వెల్లుగఁబఱప నొక్కత్రుటిలోన మురాదుగజంబును డాసి "దారాసింహాసన మాక్రమించువాఁడవు నీవా" యని నిందింపుచుఁ దనశూల మాతనిపై విసరెను. కాని వీరుఁడగు మురాదు వాడినారాచము గుఱిచూచి యాప్రతాపవంతునిఁ బరిమార్చెను. ఐనను అతని యనుచరులు నిరు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్సాహపడక ఆ యేనుఁగును జుట్టి మురాదు నడంప ప్రయత్నించిరి. మురాదు ధైర్యస్థైర్యము లమోఘములగుటచేతనే యాతఁడు మనఁజాలెను. రసపుత్రబాణము లవిరళముగ నాటుటచేత నాతని యంబారి యేదుపందివలెఁ గాన్పించెనని వర్ణింతురు. రసపుత్రులకు దావూదుఖానుగూడఁ దోడాయెను. మురాదు సేనాను లనేకులు మరణించిరి. మావటి మరణించెను. ఆ మహాయోధుఁడును క్షతవదనుఁడాయెను.

మురాదు నట్టి యవస్థకుఁ బాల్చేసిన రసపుత్రులు తన భ్రాతృసాహాయ్యమునకై యరుదెంచుచుండిన యౌరంగజేబునుగూడ గడిసిరి. యుద్ధ మతిదారుణ మాయెను. రసపుత్రుల శౌర్యము గోత్రప్రసిద్ధము. ఔరంగజేబు సైనికుల ధైర్యస్థైర్యములు గూడఁ బ్రశంసనీయములు. కాని, యుద్ధపరిశ్రాంతులగు రసపుత్రులోటు వడుట స్పష్టము. ఐనను తామలసియున్నను, వైరులు చిమ్మచలె గ్రమ్మి దహించివైచుచున్నను, రసపుత్రులు తమప్రాణములు తృణీకరించి యౌరంగజేబును జెండవలయు ననియే ప్రయత్నించిరి. ఛత్రసాలాది నాయకులు తెగటారిరి. రహతూరు రాజు రూపసింహుఁడు మహాసాహసియై తనయశ్వము డిగ్గి, యౌరంగజేబు మదేభము సమీపించి, యాతని భూపతను నొనరింపవలయునని సంకల్పించి యంబారి త్రాటిని నఱుకఁబోయెను. ఆవేటున నేనుగుకాలు తెగెను. ఔరంగజేబు సహిత మాశూరుని యతిసాహసమున కలరి, యాతని రక్షింపవలయు ననుచుండగనే, యంగరక్షకు లారసపుత్రసింహమును ఖండించిరి.

రుస్తుము ఛత్రసాలులవలె దారాయును దనతావు వీడి యుద్ధమున కుఱికెను. ఔరంగజేబును దాఁకి, విజయము చూఱఁగొనవలయునని యాతఁడాసించెను. కాని, యుద్ధరంగమంతటినిఁ గలయఁజూచుచు సమయానుకూలముగఁ దనసేనావిభాగములను నడిపించి పోషింపవలసిన సర్వసేనాధినాథుఁడు తదుచితస్థానము వీడి యొక సామాన్యునివలె యుద్ధమునఁ జొరఁబడుట యవివేకము. మఱియు, తన ఫిరంగులముందు తానేయుండుటచేత, శత్రుశతఘ్నులాతని సేనను దహించుచున్నను, దారా ఫిరంగులు యూరకుండవలసినవాయెను. ఆయరిష్టము తెల్లమయినంతనే, తన ఫిరంగులను ముందునకుఁ దేవలయు నని యాతఁడాజ్ఞాపించెను. కాని, తమ్ము శాసించు బలమచట లేమింజేసి, ఫిరంగిభటులు యుద్ధము దలంపక తమ శిబిరములనే దోపిడిచేయుటకుఁ బోయిరి. కొందఱున్నను, ఎండవేడిమికోర్వజాలక వృషభములు మరణించుటచేత నాకార్యమసాధ్యమయ్యెను. శాత్రవశతఘ్నులీలోపున నొక్కసారి యనలవృష్టిఁ గురియించి దారాసేనను మిక్కిలి చీకాకు పఱచెను. యువరాజట నిలువఁజాలక కుడివైపు దిరిగి షేకుమీరు సేనం దాఁకెను. దయ్యము లవలెఁబడి సురుమాదు రుస్తుముఖానాది మహాశూరులను వారించుటకుఁ దనచెంతనుండు సేనావిభాగముల నంపియుండుటచేత, నాసమయమున నౌరంగజేబల్ప సేనాపరివృతుఁడై యపాయకరమగు స్థితియందుండెను. అట్టి యవసరమున దారా విద్యుద్గతిఁ బాఱి యాతని గదిసెనేని, యా దౌర్భాగ్యుఁడు విజయాదిత్యుఁడై వెలింగెడువాఁడు. ఏకారణముననో గాని యట్టి మహావకాశ మాతఁడు పోనిచ్చెను. అలసియుండుటచేతను, శీఘ్రగమనమున కాప్రదేశ మననుకూలముగ నుండుటచేతను దారా వెడలఁజాలక పోయెనని మనోక్కి వ్రాయును. ఏమైనను, పోయిన మహావకాశము మగుడ వచ్చుట దుర్లభము. ఔరంగజేబాలోనఁ దన లోటు బూటుచేసుకొనెను. దారా యాతావునుండి ఛత్రసాలునకు సాయపడుట కటుఁబోయెను. తనవామపక్షమునుండి యాతఁడు దక్షిణపక్షమునకుఁ జరిగెను. అట్టి వ్యర్థప్రయత్నమువలన నాతనిసేన శత్రుశతఘ్నుల కాహుతియై కొంతయు, గొంత దుస్సహ సూర్యాతపంబునను నాశనమాయెను. తమ పురోభాగమును జేరునప్పటికి మిగిలిన సైనికులు మృతప్రాయులైరి.

మురాదు వైరిశరవిరాజమానుఁడై, యుద్దండపరాక్రమము నూపి, యాత్మరక్షణ మొనరించుకొనెను. మహాసేనాని యగు నౌరంగజేబు కష్టావసరమునఁ గలవరపడక, స్థిరచిత్తుఁడై, సేనారక్షణ మొనరించుకొనెను. దారా పక్షములు, పురోవిభాగమును విచ్ఛిన్నములాయెను. మిగిలిన సేనలు వ్యూహము చెడియుండెను. ఔరంగజేబు కుమారుఁడగు మహమ్మదుసుల్తాను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అదియే సమయమని కోదండసింహమువలె దారాపైఁబాఱెను. ఔరంగజేబు దక్షిణవిభాగమటువైరినిఁ జుట్టెను. శతఘ్నుల ఢాకమును నిర్భయముగా నటుఁదిరిగెను దారా యెటులుండెను! తన ప్రసిద్ధసేనానులు పెక్కండ్రు మరణింప, సేన తఱుఁగ, ఫిరంగులు నిరర్థకములుకాఁగ నాతఁడు కడుబడలి బలహీనుఁడైయుండెను. అట్టి సమయమునయైనను కాలీలుల్లాఖానుఁడు స్వామిభక్తి జూపఁడాయెను. మురాదు మీఁది కాతఁడే ముందుదూఁకెను. అయ్యది కేవల మారంభశూరత్వము, కృత్రిమము: అనంతర మానాయకుఁడు యుద్ధమునఁ బాల్గొనలేదు. ఆహా, అట్టి స్వామిద్రోహులు రణమునకు రాకుండుటయే స్వామికి క్షేమకరముగదా. విజయలక్ష్మీసమాక్రాంతుఁడై రాజధానికిఁ దిరిగిపోదునని విశ్వసించి యుద్ధమున కుఱికిన యువరాజున కిపుడు పరాజయము దయ్యమువలె గోచరించెను. ఐన నాతఁడు పందయైపాఱక, ధీరుఁడై తనసైన్యమును హెచ్చరించి యంత్యప్రయత్నమున కాయితుఁడాయెను. కాని, ఆ యల్పసేనానౌక యవిరళ రిపుసేనాతరంగ ఘూర్ణిత సముద్ర మధ్యస్థమై యెంతకాలము నిలువఁగలదు? రిపుసేనాతరంగము లనుక్షణముఁ బెఱుఁగుచుండెను. గుఱితప్పక వర్షించు ఫిరంగిగుండ్లచేత నాసేన శీఘ్రముగ క్షీణించుచుండెను. దారాతో మాటాడు సేనానులు సహితము మాటాడుచుండగనే నేలఁగూలుచుండిరి. ఐదారు వీశలభారముగల శతఘ్నీ గోళములు దారాచుట్టును దాండవమాడుచు నానాబీభత్సమొనరింపఁ దొడంగెను. గజారూఢుఁడైన యువరాజే పగతురతుపాకిగుండ్లకు గుఱియాయెను. భక్త్యభిమానపూరితులై భయవిహ్వలులై యాతని మిత్రు లాక్రోశింప, యువరాజు చేయునది లేక యున్నతగజరాజముడిగ్గి యశ్వారూఢుఁ డాయెను. తమ నాయకుఁ డగోచరుఁడైనంతనే, శత్రుమారణ సూర్యాతపదాహబాధలింకను సహించి పోరాడు హతశేషమగు సేనయును ఆత్మరక్షణోపాయాతురంబునఁ దిక్కు బలిమికొలఁది రణావని నుండి పలాయన మొనరించెను.

తాను నిలిచియుండగనే తనసేన విచ్చి పాఱుట గాంచి దారా మ్రాన్పడెను. ఆతనికుమారుఁడగు సిఫీర్‌షుకో తదాకస్మికభయంకర పరిణామము వలన మతిసెడి యేడ్చెను. దారా దట్టికిఁ దూణీరము బంధింపఁబోయిన సేవకుఁడు గుండు దెబ్బతిని యొక్క క్షణము క్రిందబడనే మరణించెను. దారా యింకను నటఁ దడయునేని, శాత్రవాధీనుఁడగుట తథ్యమని యెంచి, స్వామిభక్తిపరాయణులాతనియశ్వఖలీనముఁబట్టి యా మృత్యురంగమునుండి సపుత్రకముగ నాతనిఁ దొలంగించిరి.

యువరాజు నాలుగైదుమైళ్లు వడివడి బాఱి, పరిశ్రాంతుఁడై, యూపిరాడక యొక తరుచ్ఛాయ నాశ్రయించెను. పాదుషాప్రియపుత్రునకాయిట్టి దురవస్థ! అట్టి హేయంపు విశ్రాంతియైనను లేకపోయెను. శాత్రవమృత్యు ఘంటానినాదములు వెంటనే వీనులు దాక, దారాయనుచరులు దిగ్గున లేచిరి కాని, దేహమధిక శ్రమమ్మున దుర్బలమాయెను; విపరీతవిచారమ్మునఁ జిత్తము వికలమాయెను. అట్టి యవస్థఁ బాల్పడిన యువరాజు జీవితాశవీడి యట నిలుచుటయే పాడియని తలంచెను. శాశ్వతదుర్యశోమగ్నుఁడై తాను మనఁ జూచుటకన్న శాత్రవాధీనుఁడై మరణించుటయే వాంఛనీయమని యాతఁడు భావించెను. కాని, యింకను ఒక సంవత్సరము భయంకరబాధ లనుభవించి భయంకరమరణమునకుఁ బాల్పడవలసిన దారా నిజమిత్రహితోపదేశమున సత్వరము హయారూఢుండై రాజధానికిఁ బాఱెను.

దారా రణక్షేత్రమున గజావరోహణ మొనరించినంతనే యాతనికి మహాపజయమును, ఔరంగజేబునకు మహావిజయమును ప్రాపించెను. ఆతనిసేనయందా క్షణము జయజయధ్వానములు సెలంగెను. రణభూమి శీఘ్రముగ నిశ్శాత్రవమాయెను. విజయ మలవడినంతనే యౌరంగజేబు భూమికిడిగ్గి, మోఁకరించి, కడువినమ్రుఁడై పరమాత్మునకుఁ బ్రణామము లొనరించెను. అనంతర మాతఁడు తన సేనానుల యభినందనములకు గుఱియాయెను. ఆతఁడును వారివారి పౌరుషమును సముచితముగ నగ్గడించెను. తన సోదరుఁడగు మురాదును భ్రాతృప్రేమ విరియునట్లు సంభావించి, ఆతని యమేయధైర్య పరాక్రమంబులను గొనియాడి, తన్మహావిజయసంప్రాప్తి కాతఁడే కారకుఁడని స్తుతియించి, నాఁటి నుండియు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాతని రాజత్వము ప్రారంభమాయెననియుఁ బ్రీతికరము గఁబలికి, ప్రకృతము యుద్ధమునఁ దగిలిన గాయములను మాన్పుటకొఱకు నిపుణులగు ఘనవైద్యుల నౌరంగజేబు నియమించెను.

సముగరు యుద్ధవిజయి భావిచక్రవర్తి యని విస్పష్టమాయెను. ఔరంగజేబు రాజధాని కరుదేఱకుండ వారింపఁగల సైన్యము లేదు. భ్రాతృసమరమునందలి ద్వితీయాంకము సమాప్తమాయెను. ఇఁక, ఆగ్రానగరాక్రమణము, పితృనిర్బంధనము, మురాదు రాజత్వపరిణామము, ఔరంగజేబు కిరీటధారణము గురించియును అరయవలయును.

---

# వేదన

తురగా వేంకటరామయ్యగారు

ఊరుపేరులు లేనివాడా!
ఉండియును గతిలేనివాడా!
ఏడ డాగితివోయి లోకా
లేలజాలని ధీరుఁడా!

దారితెన్నులులేని నీకథ
దాసరయ్యలుపాడుచుంటే
మోహవాహిని నాపజాలక
మోసపోతిని క్రూరుఁడా!

ఏమిలంచముఁ బోసితివిరా
ఈ యసత్యపుగాథలన్నీ
పాడుకొంటూ లోకమంతా
పాడుచేసేవారికీ?

మాయ నెఱుఁగను మర్మ మెఱుఁగను
మనసు మెత్తనిదాననై నీ
పాదయుగమే శరణమని నే
పాడుచున్నది నిజమురా!

పొంగి లోకము నిండజాలి త
రంగలించే యూహాలన్నీ
మాపు రేపు లనే తుపానుల
మాసి రూపే వీడెరా!

పెద్దపులియై పాడుకాలము
గద్దరించుచు మ్రింగనుంటే
గుండె పగిలేవేళనైనా
కోమలిని దయ జూడరా!

ప్రకృతి సుందరి నిత్యమైతే
పాటలన్నీ సత్యమైతే
పాటలాధరివలపుబూాలే
పరిమళింపకవాడునా!

వద్దురా ఈపాడులోకము
వద్దురా కన్నీటిపాటలు
పాడి విఫలమ్మైన జీవము
వీడితేనే మేలురా!

ఉండజాలఁ దమోగ్నికీలల
మండిపోయే లోకమందున
సుందరోద్యానముల నీతో
నుందురా! కరుణింపరా!

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సూర్యుడు

నిడుమోలు కనకసుందరం గారు, యం. ఏ.

ఏ మండలమునకు మనము నివసించియున్న భూమి ఆకర్షణశక్తివలన గట్టుబడి సంవత్సరమున కొకతూరి ప్రదక్షిణముచేయుచు వలయు ఉష్ణమును వెలుగును గ్రహించుచున్నదో సకల చరాచరజీవకోటికి ప్రాణాధారభూతమగు నట్టి సూర్యమండలము భగవదంశ సంభూతమని హైందవులును – తదితరాస్తికులును – గ్రహించియున్నారు. "ఆదిత్యుడు" అను నామాంతరము ననుసరించియుండిన మత సాంప్రదాయములను వేరొకచో వ్రాసియుంటిని. ఇందులకు సంబంధించిన ఆధ్యాత్మిక చర్చలు నాకు అపరిచితములు కావున నేనావిషయమున వ్రాయ నసర్థుడను. సూర్యమండలముయొక్క భౌతిక లక్షణముల గొన్నిటి నిట నుదహరింపదలచితిని.

ప్రథమమున మనము నివసించియున్న భూమియు నింక యెనిమిది గోళములును సూర్యుని చుట్టును నియమితమార్గముల ప్రదక్షిణమొనర్చుచుండెడి గ్రహములని తెలిసికొనవలెను. ఈతొమ్మిది గ్రహములును సూర్యుని చుట్టును వలయాకారమున వేనిత్రోవ నవి తిరుగుచున్నవి. సూర్యుడీవలయములకు కేంద్రమున నున్నాడు. గ్రహములు నియమితమార్గముల తప్పకుండ నాకర్షించుచున్నాడు. అనగా, అతీతమగు నీజగన్నాటకమునకు సూర్యుడు సూత్రధారుడు!

సూర్యమండలము చదునైన పళ్లెరమువలె మన కంటి కగుపడుచున్నను అదియొక గోళమని యెల్లరు నెఱిగిన విషయమే. దూరదర్శకయంత్రమువలన చూచిన నిది విదితమగు. గెలీలియోయను సుప్రసిద్ధగ్రీకుశాస్త్రజ్ఞుడు కనిపెట్టిన యీయంత్రమువలననే పరిశోధకులును శాస్త్రజ్ఞులును నక్షత్రగోళముల భౌతికలక్షణములను సాధించియున్నారు. ఆగోళములయొక్క పరిమాణము మొదలగు నంశములను ప్రత్యక్షముగ గజముబద్దతో కొలిచిచూపుట మానవునకు దుస్సాధ్యమైనను పరిశోధనలవలన వానిని నిర్దుష్టముగ నిరూపించుట కీయంత్రము సాధకమగుచున్నది. ఈరీతిని నిర్ణయించిన అంశములను తెలిసికొన్నపుడు అనంతకోటి గోళములతో కూడిన యీబ్రహ్మాండము నందు మనకు నివాసస్థానమగు భూగోళ మొకపరమాణువని విస్పష్టముకాగలదు. ఈజ్ఞానము ప్రకృతిసామ్రాజ్యమును వశీకరమొనర్చుకొన యత్నించెడి మానవునికి తలవంపు.

మనకు వాడుకలోనున్న మానములందే జ్యోతిర్గోళముల భౌతికలక్షణములను తెలిసికొందము. సూర్యగోళముయొక్క వ్యాసము (Diameter) ౮,౬౬,౦౦౦ మైళ్లు. నాడీమండలరేఖ. (Equator), రేక, చుట్టుకొలత ౧,౩౬౧,౧౧౦ మైళ్లు. అనగా గంటకు ౬౦ మైళ్లు ప్రయాణముచేయగల రైలుబండినెక్కి ఎచ్చటను నిలువకుండపోయినచో సూర్యమండలము నొక్కసారి చుట్టివచ్చుటకు సుమారు ౫ సంవత్సరములు పట్టును. ఇకను సూర్యగోళమును పదిలక్షల సమభాగములుగ విభజించినచో నందొక్కొక్కభాగము భూగోళముకంటె పెద్దదిగనే యుండును. సూర్యుని త్రాసునం దొకవైపునుంచి రెండవప్రక్కను మూడు లక్షల భూగోళములనుంచినను త్రాసు తిరుగదు. భూమియందలి వస్తువులకు సూర్యునకున్నంత వేడిమిని కలుగజేయుట అసాధ్యము. భూమియందలి ఉష్ణముకూడ సూర్యుడు ప్రసాదించినదే. అటులైనచో కొండ శిఖరములు మొదలగు ఉన్నతప్రదేశములు దిగువభాగములకంటె సూర్యునకు చేరువలోనున్నను శీతలముగ నేల యుండవలయునను శంకకలుగవచ్చును. అగ్నిగుండము వలెనున్న సూర్యుని దాపునకు పోయిన కొలదియు వేడిమి హెచ్చవలయునే కాని తగ్గిపోవుట విపరీతముగ తోపవచ్చును. కాని సాంఘిక విషయములందువలెనే ప్రకృతి విషయములందును కంటికి దోచు ప్రత్యక్షప్రమాణములను పూర్వాపరసందర్భములను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గనునించి సమన్వయముచేయుట ఆవశ్యకము. కొండలపై చల్లగనుండుటకు కారణభూతము గాలియే. వాతావరణము —అనగా గాలి భూమిమట్టును మూడునాలుగుమైళ్లవరకును వ్యాపించియున్నది. ఈగాలి సముద్ర సమప్రదేశము లందు దట్టముగ నుండును. అట్టి సముద్ర సమప్రదేశము నుండి భూమిలోనికి అనగా, గనులు, గుహలు మొదలగు వానిలోనికి పోయినకొలదిని గాలి మిగుల దట్టమగుచుండును. పర్వతాగ్రములకు పోయినకొలదిని గాలి పలుచనై తగ్గిపోవును. కావున అట్టి శిఖరములకుపైన గాలియొక్క ఒత్తిడియు సాంద్రతయు తగ్గియుండును. సూర్యునివలన భూమి పగటియందు గ్రహించిన వేడిమి సూర్యుడు లేనపుడు—అనగా రాత్రులందు—క్షీణించుటకు సముద్ర సమప్రదేశములయందు దట్టముగనున్న గాలి అభ్యంతరము కలుగజేయుచున్నది. భూమియందు జొచ్చిన వేడిమి సూర్యుని పరోక్షమందు అనంతాకాశములోనికి తప్పించుకొని పారిపోకుండ గాలి నిర్బంధించుచున్నది. అట్టి అభ్యంతరము—లేక నిర్బంధము—గాలి దట్టముగ నున్న పట్టుల ప్రబలముగను, పలుచనగ నున్నచోటుల హీనముగను యుండుట సహజము. గాలి దట్టముగనున్న సముద్ర సమప్రదేశములయందు వేడిమి హెచ్చుగనుండుట కిదియే కారణము. గాలి పలుచనగనున్న పర్వతాగ్రములయందు శీతలముగ నుండుటకు నిదియే కారణము. ఈ రీతిగ ఉష్ణ ప్రచారమునకు (Radiation of heat) గాలి సాధకము (medium) ను, బాధకమునుకూడ నగుచున్నది. ఈ గాలి యసలు లేకున్నచో ప్రపంచమంతయు కొండ కోనలవలె మంచుతో కప్పబడియుండెడిది. ప్రజలెల్లరు శ్వేతముఖులై యుండెడివారు. తెలుపు నలుపు జాతులకు సమత్వ మేర్పడెడిది!

సూర్యబింబము పూర్వ పశ్చిమ దిక్కులయందున్నపుడు—ఉదయాస్తమయ సమయములందు—పెద్దదిగను ఊర్ధ్వబిందు (Zenith) ప్రాంతముల నున్నపుడు—అనగా మధ్యాహ్నములందు—చిన్నదిగను అగుపడుటకు కూడ నీగాలియొక్క ఉనికియే కారణము. ఉదయించిన బింబము ఆకసముపైకి పోయిన కొలదిని కృశించి మరల నస్తమించుసమయమున యథారూపమును దాల్చుటకు బింబమే యిట్టి మార్పులను చెందుచుండెనని యూహించుట వెఱ్ఱియగు. ఉదయ సాయంత్రనముల యందలి పెద్ద బింబముకంటె మధ్యాహ్నమందలి చిన్నబింబమే తీక్ష్ణతరముగ నుండుటయు నొకవింతయే. ఉదయ సాయంతనముల యందు వాలుగవచ్చి, భూమి నావరించిన గాలి యందు చొచ్చెడి సూర్యకిరణములు సరళములు (straight)గ రాజాలకవి వక్రత నొంది సూర్యబింబము యొక్క నిజరూపమును మార్చివేయుచున్నవి. మధ్యాహ్నములయందు కిరణములు సూటిగ భూమిపై ప్రసరించును కావున వక్రీకరణము(Refraction)నకు తావులేదు.

సూర్యమండలము భూమికి ౬,౮౯,౩౭౭ యోజనముల దూరమున నున్నదని సూర్యసిద్ధాంతమున నున్నది. "యోజనము"యొక్క ప్రమాణము మనకు వాడుకలో నున్న మానమునందెంతయో నిర్ణయింపలేముగాని ౧౩౫ మైళ్ళకు సమమగునెడల సూర్యసిద్ధాంతము నిర్ణయించిన సంఖ్య ఆధునికపరిశోధన ఫలితములకు సమమగును. సూర్యుడు భూమికి సుమారు ౯౨,౯౦౦,౦౦౦మైళ్ళ దూరములో నున్నాడని నేడు విశ్వసింపబడుచున్నది. రాత్రింబవళ్లు విధివిరామములేక చకచక ఒకకోటిసంఖ్యను లెక్కబెట్టుటకు నెలరోజులుపట్టును. అట్టికోట్లు తొమ్మిదియు,పైన సుమారు తొమ్మిది దినములలో లెక్కపెట్ట తగినన్నిమైళ్లదూరమున సూర్యుడున్నాడు.

అశ్విని మొదలగు స్థిరనక్షత్రములవలెనే సూర్యుడును స్వయంప్రకాశమగు నొక స్థిరనక్షత్రమే. కాని భూమి కత్యంత సమీపస్థుడై యుండుటవలన మనకు చాల ముఖ్యుడై భూమియందలి జీవకోటికి ప్రాణాధారభూతుడైయున్నాడు. మనకంటికగుపడునట్టియు, అగుపడనట్టియు లెక్కలేని యితర నక్షత్రములన్నియు మన నివాసస్థానమగు భూమి నాకర్షించుచు, భూమిచేత నాకర్షింపబడుచున్నను అవి దూరస్థములై యుండుటవలన వాని ప్రభావము మన కంటికి గోచరించుటలేదు. సమీపస్థుడగు సూర్యునిశక్తియే భూమియొక్క స్థితిగతులను, భూమియందలి శీతోష్ణప్రచారములను నిర్ణయించుటకు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తగిన ప్రాబల్యము కలదై యున్నది. భూమి సంచరించు మార్గమునకు సూర్యుడే కేంద్రమున నున్నాడు. భూమి యందలి శీతోష్ణస్థితిగతులు సూర్యుని వెలుగుపైననే ఆధారపడియున్నవి. కావున నీసూర్యగోళము యొక్క స్వభావమును కొంత తెలిసికొందము. సూర్యగోళోపరి భాగము రసాయనిక పదార్థములతో కూడిన మబ్బులతో కప్పబడి అచ్చటచట ముడులుపడినటు లగపడుచుండును. ఆ మబ్బులు భూమి నాశ్రయించియుండు మబ్బులవలె నీటితో కూడియున్నవి గాక ప్రజ్వలితములగు నగ్నిశిఖలవలె ప్రకాశవంతములైయున్నవి. ఇంతియేగాక చంద్రగోళమునందలి స్థిరముగనుండు కళంకమువలెనే సూర్యగోళమునందు అస్థిరములగు మచ్చలు కొన్ని కనబడుచుండును. ఈ మచ్చలు గోళోపరిభాగమున వివిధ ప్రదేశములయందు వివిధ రూపములదాల్చును. అందుకొన్ని చిన్నవి. కొన్ని పెద్దవి. ఒక్కొకపుడవి పెక్కులు కాన్పించును. ఒక్కొకపుడు కొలదిగనే కన్పడును. ఈ మచ్చలు ౧౭వ శతాబ్దమున దూరదర్శక యంత్రమును కనిపెట్టిన కొలది దినములలోనే మొదటిసారి గమనింపబడినవి. ఈ మబ్బులన్నియు స్థిరములై యుండక క్రమముగ కదలుచుండును. ౧౯౨౭ వ సంవత్సరమున స్క్రీనరు అను శాస్త్రజ్ఞుడు తీసిన ఛాయాపటముల వలన నీ మచ్చల కదలిక తెలిసికొన నగును.



(సూర్యునిపై నలుపుమచ్చలు-స్క్రీనరుచూచిన దృశ్యము.)

ఆ మచ్చలు ౨ వ తేదీ మొదలు ౧౯ వ తేదీ వరకు ఆక్రమించియుండినస్థానము నీప్రక్కపటము చూపుచున్నది. ౧౧, ౧౩, తేదీల యందు సూర్యమండలము మేఘములతో కప్పబడి యుండుటవలన ఛాయాపటములను తీయుటకు వీలుకలుగలేదు. కావున నాదినములందు సుమారుగ మచ్చలుండు ప్రదేశమును మాత్ర మీ పటము సూచింపుచున్నది. ఈ మచ్చలెల్లపుడు నొకే దిక్కునకు, అనగా, సూర్యబింబము యొక్క తూర్పు పార్శ్వమునుండి పశ్చిమ పార్శ్వమునకు క్రమముగ కదలుచున్నవి. సుమారు ౧౨, ౧౩, దినములలో నవి పశ్చిమోత్తమస్థానమును చేరి యటుపిమ్మట నదృశ్యములై సుమారు ౧౨, ౧౩, దినములలో తిరిగి తూర్పు పార్శ్వమున దృగ్గోచరములగును. దీనివలన సూర్యబింబము స్వకీయాక్షముపై సుమారు ౨౭ దినములలో నొకసారి ప్రదక్షిణము చేయుచుండునని గ్రహింపనగును. ఈ మచ్చలు దినదినమును-క్షణక్షణమును మారుచుండును. అటులనే యీ మచ్చలకు సమీపమున నగుపడు ప్రకాశవంతములగు విస్ఫులింగములు (ఫాక్యులీ=(faculoe) కూడ మారుచుండును. సూర్యబింబముపై మన మొకప్పుడు చూచునవి యొక్కటియైనను స్థిరమైయుండదు. ప్రకాశహీనములై; కనబడు మచ్చలును ప్రకాశవంతములై కనబడు బిందువులును క్షణక్షణమును వృద్ధిక్షయముల నందుచు, కొన్ని వారములు లేక నెలలుమాత్రము కంటికగపడుచు తుదకు నదృశ్యములగు చుండును. మరల నేరొకచో తిరిగి ప్రత్యక్షము లగు చుండును. ఈ పరిస్థితులవలన గ్రహింపదగు విషయ మేమన దృగ్గోచరమగు సూర్యగోళోపరిభాగము ఘనపదార్థ భూయిష్టము గాక వాయుపదార్థ సంఘన్నమైయున్నదనియే. ఈ వాయుపదార్థములే, మన భూమి యందలి నీటిమేఘములవలె, క్షణక్షణమును రూపమును మార్చుకొనగలుగును గాని ఘనపదార్థము లట్లు మార్చుకొనుట దుర్లభముకదా!

ఒక్కొకపు డీనల్లనిమచ్చలు విడివడి శకలములై వేరువేరు మార్గముల నిమిషమునకు సుమారు ౧౦౦౦ మైళ్ల వేగముతో కదలిపోవుచుండును. ఒక్కొకపుడీ చీకటి మచ్చలలోనుండి విద్యుత్స్ఫుకలములు బయలుదేరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సెకనునకు ౧౦౦ మైళ్లకు మించిన వేగముతో బోవుచుండును. ఇందులకొక నిదర్శనమును కారింగ్టను, హాగ్సను అను నిర్వురు పరిశోధకులు గమనించియుండిరి. ౧౮౫౯ వ సంవత్సరమున సెప్టెంబరు ౧ వ తేదీ నాటి అపరాహ్ణమందు సూర్యబింబము నొకతెరపై ప్రతిఫలింపజేసి అందలి నల్లమచ్చలయొక్క స్థానము, స్వరూపము, పరిమాణములను గూర్చి కారింగ్టను పరిశీలింపుచుండెను. ఆ సమయమునందే పెక్కు మైళ్లదూరమున హాగ్సను ఒకదూరదర్శక యంత్రమువలన ఆ నల్లమచ్చలయొక్క నిర్మాణమును పరిశోధింపుచుండెను. అపుడు ౮౦,౦౦౦ మైళ్లపొడవు; ౨,౧౧౦ మైళ్ల వెడల్పుగలిగి సుమారు ౧౨ వేల మైళ్ల దూరమున ప్రకాశవంతములైన రెండు వస్తువులొక పెద్దమచ్చ యొక్క అంచునుండి బయలుదేరి వారిద్దరి దృష్టిపథము నొకేక్షణమునం దాకర్షించెను. అవి సూర్యబింబము కంటె సుమారు సుమారు ౫, ౬, రెట్లధిక ప్రకాశవంతములై యుండెను. అంతట నవి సమదూరమున తూర్పుదిక్కునకై పోయిపోయి క్రమముగ చిన్నవై, ప్రకాశహీనములై సుమారైదునిముసములలో 3౬ వేల మైళ్లదూర ముపక్రమించి తుదకదృశ్యములయ్యెను.

ఈనల్లచుక్కలు సూర్య బింబమునం దన్ని భాగముల నగుపడవు. నాడీమండలరేఖ కుత్తరమునను దక్షిణమునను ౧౦, 3౦, డిగ్రీల నడుమ ప్రదేశమునందు మాత్రమే యవి యగుపడును. నాడీమండల రేఖపై నవి చాల యరుదుగ కన్పించును.

ఇంకొక చిత్రమేమన యితర ప్రదేశములం దీ చుక్కలు స్వల్పముగ నున్నపుడే నాడీమండలరేఖపై నివి యగుపడును. సూర్యమండలము యొక్క ఉత్తర దక్షిణోత్తమ ప్రాంతములం దివి యుండనే యుండవు. ఈ చుక్కల గమనమువలన సూర్యమండలము యొక్క ఆత్మప్రదక్షిణ కాలపరిమితి వివిధములుగ దోచుచున్నది. నాడీ మండల రేఖకడనున్న యొకచుక్క సూర్యునిచుట్టి వచ్చుటకు ౨౫ దినముల ౨ గంటలు పట్టుచున్నది. ౨౦ డిగ్రీల రేఖాంశము (Longitude)న నున్న చుక్క ౨౫



ఈపటమున గీతలతో చూపబడిన ప్రదేశమునందే సాధారణముగ నీ నల్లమచ్చ లగుపడుచుండును.

దినముల ౧౮ గంటలలో నొకసారి తిరుగుచున్నది. 30 డిగ్రీల రేఖాంశముననున్నది ౨౬ దినముల ౧౨ గంటలలో తిరుగుచున్నది. ౪౫ డిగ్రీల రేఖాంశముననున్నది ౨౭ దినముల ౧౨ గంటలలో తిరుగుచున్నది. దీనిని బట్టి చూడగా సూర్యమండలము యొక్క వేర్వేరు భాగములు వివిధములగు గమనవేగములతో తిరుగుచున్నట్లు విదితమగుచున్నది. నాడీ మండల ప్రాంతములు ధ్రువప్రాంతములకంటె త్వరితగతిని కదలుచుండుటయు విదితము. ఘనపదార్థభూయిష్ఠమగు భూమియందలి అన్ని ప్రదేశములును అక్షముచుట్టు యేకకాలమునందే ఆత్మప్రదక్షిణ మొనర్చుచున్నవి. కాని సూర్యగోళోపరిభాగములు వాయుపదార్థ భూయిష్ఠములగుటచే యీ నల్లచుక్కలు సముద్రమునందలి యోడలవలె స్వీయగమనము కలిగియున్నవని యూహింపనగును. సూర్యమండలము యొక్క నాడీ రేఖనుండి ధ్రువప్రాంతములకు పోయిన కొలదిని ఆయా భాగముల యొక్క కదలిక మందమగుచున్నది. కావున సూర్యమండల మొకప్రత్యేకగోళమే యయియున్నను స్థిరమగు ఘనపదార్థ భూయిష్ఠము కాదనియు గోళము ఆత్మప్రదక్షిణ మొనర్చుటలో అంతర్భాగముల కంటె బహిర్భాగములు నెమ్మదిగ కదలుచుండుననియు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెంచవలసి వచ్చుచున్నది. నేటివరకును సూర్యునియందలి చుక్కలను గూర్చియు సూర్యమండలము యొక్క భ్రమణమును గూర్చియు నిదమిత్థమని పరిశోధకులు నిర్ణయింప లేకున్నారు.

౧౮౨౬ వ సంవత్సరములో సూర్యగోళమునందున్న చుక్కలను స్వాబియను శాస్త్రజ్ఞుడు లెక్కించెను. వానిసంఖ్య సుమారు పది సంవత్సరములవరకు ప్రతి సంవత్సరమును మారుచు మరల నొకేవిధముగను వచ్చుచుండు నని ౧౭ సంవత్సరము లైనపిమ్మట నతడు ప్రచురించెను. ఒక సంవత్సరమునందు దేయేభాగముల నెన్నిచుక్కలగుపించునో సుమారు పదిసంవత్సరముల యనంతరము ఆయా భాగములయందన్నిచుక్కలే మరల కనుపించుచుండు నని యతడు గమనించెను. అట్టి యీ పదిసంవత్సరములలోను మొదటి ౨, ౩, సంవత్సరములలో నివి యమితముగ నగుపడి తరువాత నారేడు సంవత్సరములలో క్రమముగ తగ్గి మరల వృద్ధియగును. తరువాత పరిశోధనలవలన నీమార్పులు తిరిగివచ్చు చక్రముయొక్క పరిమాణము ౧౧ సంవత్సరముల ౪ వారములని నిర్ణయింప బడినది.

సూర్యుని యందలి నల్లచుక్కలకును భూమియందు ఆకర్షణశక్తిపాతమునకును (magnetic influence) సన్నిహిత సంబంధమున్నది. దిగ్దర్శకయంత్రము (compass) నందలి అయస్కాంతము సరిగా నుత్తర దక్షిణములను సూచింపక యామ్యోత్తరరేఖ (medium-circle) కు పడమరగ నొదిగియుండు ననియు, నీ యొరగుడు యొక్క పరిమాణము వేర్వేరు ప్రదేశముల వివిధములుగ నుండుననియు నెఱుగుదుము. ఇగ్లండులోని గ్రీనిచ్ పట్టణమునందలి పరిశోధనాలయమునందున్న దిక్సూచి ఉత్తరమునకు ౧౭ డిగ్రీలు పడమరగ నొదిగియుండి క్రమముగ నటునిటు మారుచు ననుదినము సూక్ష్మముగ వెనుకముందులకు తిరుగుటయు సంభవించుచుండును. ఈ వృద్ధిక్షయములు సరిగా ౧౧-౧/౧౦ సంవత్సరములలో నొకసారి ఒకేరీతిని కలుగుచుండును. ఈకాలపరిమితి సూర్యమండలము నందలి నల్లచుక్కలయొక్క వృద్ధిక్షయముల నిర్ణయించు కాలచక్రములో సరియగుచున్నదని గమనింపనగును.

సూర్యునియందు నల్లచుక్కలు మిక్కుటముగ నున్నపుడు భూమియందలి ఆకర్షణశక్తి యొక్క ప్రభావము విశేషముగ నగుపడుచుండును. సూర్యమండలముపైనకాత్తుగ నల్లచుక్కలగపడినపుడే భూమియందాకర్షణశక్తి యొక్క ప్రభావము ప్రత్యక్షముగ తోచిన సమయము లనేకములు కలవు. ౧౮౭౨ వ సంవత్సరమున ఆగష్టు 3 వ తేదీనాడు సుప్రసిద్ధుడగు యంగు (young) శాస్త్రజ్ఞుడు అమెరికాయందలి షెర్మను పట్టమున తన జ్యోతిషాలయమున యంత్రసాహాయ్యమున సూర్యమండలమును పరీక్షించుచుండగ నందు విపరీతమగు సంచలనము కలిగినట్లుల దోచెను. ఆసమయమునందే దిక్సూచి (compass) కడ పనిచేయుచున్న సహాయ శాస్త్రజ్ఞుడొకడాయంత్రము తీవ్రమగు సంచలనమునకు లోనైనట్లు గమనించెను. ఆకర్షణశక్తి (mgnetism) యొక్క యీవిజృంభణము గ్రీనిచ్ పరిశోధనశాలయందు కూడ గమనింప బడియెను. ఇట్టి నిదర్శనము లనేకముల వలన సూర్యగోళమునందు తీవ్రమగు నాందోళనము సంభవించినపుడెల్ల భూమియందాకర్షణశక్తిపాతము ద్యోతకమగుచుండునని నిర్ణయింప బడినది. కాని, సూర్యునియందెట్టి కల్లోలమును జరుగకుండగనే భూమిపై నాకర్షణశక్తి విజృంభించిన సమయములు విశేషము లున్నవి. కావున భూమియం దపుడపుడు ద్యోతకమగు నాకర్షణశక్తి పాతమునకు సూర్యుడొకడే కారకుడు కాడనియు, నితర గ్రహములును- నక్షత్రములును- కొంతవరకు కారణభూతము లనియు నూహింపవలసి యున్నది.

దూరదర్శకయంత్రమువలన తెలిసికొన్న విశేషములను గొన్నిటిని పైన యుదాహరించి యుంటిమి. స్పెక్ట్రొస్కోపు (spectroscope) అనునింకొక యంత్రసాహాయ్యమున భూమిపైనున్న లోహములలో కొన్ని సూర్యుని యందున్నవని నిరూపింప బడినవి. వెండి, యినుము, రాగి, సత్తు, తగరము, సీసము, బొగ్గు, స్వర్ణకము, మహాగ్నీషము, మణిశిల, సున్నము, జలవాయువు,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాణవాయువు మొదలగు వస్తువులు సూర్యునియందు కలవనియు, గంధకము, భాస్వరము, పాదరసము, బంగారము, సారజనకము యనునవి లేవనియు తెలిసికొన గలుగుచున్నాము. ఈ యంత్రము వలననే సూర్యుని యందలి నల్ల చుక్కలను కూడ పరిశీలింపగా నందు సున్నము, స్వర్జకములయొక్క ఆవిరి విశేషముగనుండు ననియు, ఇనుము మొదలగు లోహపదార్థములు లోపించి యుండుననియు తెలియుచున్నది.

సంపూర్ణసూర్యగ్రహణము కలిగినపుడు ప్రకాశవంతమగు సూర్యమండలము చంద్రునిచే నాచ్ఛాదింపబడును గదా. అట్టి సంపూర్ణగ్రహణము అరుదుగ సంభవించుటయేగాక కొన్నినిముషములకంటె యెక్కువకాలము నిలచియుండదు. కాని ఆ కొన్ని నిమిషములలోనైనను భూమియంతయు నంధకారముచే నిబిడీకృతమగును. ఆసమయమునందే విచిత్రములగు విశేషములు కొన్ని గమనింపవీలగును.




సంపూర్ణసూర్యగ్రహణ సమయమున చంద్రబింబము వెనుకనుండి యగుపడు విచిత్రవస్తువుల నీపటము చూపుచున్నది. ఈవస్తువులు (౧, ౨, ౩, ౪, ౫,) సూర్యబింబము నందలి "ఉన్నతము"లని పిలుతము అవి చంద్రబింబమునకు సంబంధించినవికాక సూర్యునను సరించి యున్నవేయని చులకనగ నిరూపింపనగును. గ్రహణము సంపూర్ణముకాగానే యవి బింబముయొక్క తూర్పుభాగమున నగుపడును. మొట్టమొదట మనము చూచినవిక్రమముగ కదలివచ్చు చంద్రునిచే నాచ్ఛాదితము లగుచుండ పడమరభాగమున క్రొత్తవి కొన్ని యగుపడును. గ్రహణముయొక్క సంపూర్ణత్వము తొలగిపోవగనే సూర్యరశ్మి ప్రబలమై వీని నదృశ్యములుగా చేయును.

౧౮౬౮ వ సంవత్సరమున ఆగష్టు ౧౮ వ తేదీని సంపూర్ణ సూర్యగ్రహణము హిందూదేశమున కలిగెను. గ్రహణ సమయమున చంద్రబింబముచే కప్పబడిన సూర్యబింబమును, దానియందలి ఉన్నతములను పరిశీలింపవలెనని ప్రముఖులగు శాస్త్రవేత్తలు సిద్ధప్రయత్నులై యీ భాగములు ప్రకాశవంతమగు వాయురూపపదార్థములతో నిండియున్నవని నిర్ధారణ చేయగలిగిరి. అపుడా ఉన్నతము లేస్థానమున నున్నవో తెలిసికొని మరునాడు సంపూర్ణ సూర్యరశ్మియందే జాన్సెన్ యను శాస్త్రజ్ఞుడు వానిని గురుతింప గలిగెను. ఈపరిశోధన ఫలితములు హిందూదేశము నుండి యింగ్లండునకు చేరక పూర్వమే సర్ నార్మన్ లాకియర్ అను శాస్త్రజ్ఞుడు తానునూతనముగనిర్మించిన స్పెక్ట్రొస్కోపు(spectros-cope) యంత్రసహాయమున సూర్యమండలము నంటి యుండు నీఉన్నతములను పరిశీలింప గలిగెను. అంతేగాక మనకు ప్రత్యక్షముగ నగుపడు సూర్య బింబము చుట్టును సుమారైదారువేలమైళ్లవరకు యీఉన్నతము లందుండు వాయుపదార్థములే ఆవరించియున్నవనియు నీయావరణమునందు జలవాయువు(Hydrogen)విశేషభాగమును సున్నము (calcium)ను, వేరొక నూతన పదార్థమును,తరచుగ ఇనుము,మాంగనీసు(manganese) మహోగ్నీషము (magnesium)యును కలవనియు నిర్ధారణ యయ్యెను. ఈనూతనపదార్థము ౧౮౬౮ వ సంవత్సరమువరకుభూమి యందెరుక లేకుండుటవలన (helium) హీలియం, అనగా, సౌరపదార్థము అనిపేరిడిరి. కాని యీనూతన పదార్థము నార్వే దేశమున దొరకిన క్లీవైట్ (cleveite) అను లోహపదార్థమును కాల్చుట వలన వెలువడిన వాయువువంటిదేనని ౧౮౯౫ వ సంవత్సరములో ప్రొఫెసరు రాంశేయును గారు కనుగొనిరి. ఈప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దార్థము పెక్కు నక్షత్రములయందు కూడ నిమిడియుండ వలెనని యిటీవల నిర్ణయింప బడినది.

సూర్యుని విద్యుద్గోళమునుండి పైకి ప్రజ్వలించెడి యీఉన్నతములు చాల గొప్పవైనవి. కాని చాల న స్థిరములు. దీపము లెట్లు రెపరెపలాడునో అటులనే యీఉన్నతములును యిటునటు కదలుచున్నటుల సావ కాశముగ జూచినచో విదితమగును. కొన్ని గంటలలోనే వీని స్వరూప మెంతో మార్పుచెందు చుండును. అందలి భాగములు సెకనునకు సుమారు నూరుమైళ్ల కంటె నెక్కుడు త్వరగా కదలుచు కొలదికాలములోనే వేలకు వేలమైళ్లు దూరము పోవుచున్నవి. వీనిలో కొన్ని సూర్యగోళము యొక్క అంచునుండి సుమారు ౮౦,౧౦౦ మైళ్లువరకు వ్యాపించియున్నవి. అట్టివాని చిత్రపటములు పెక్కులుకలవు. విచిత్రమగు నొక ఉన్న తముయొక్క చరితమిందువ్రాసెద. ౧౮౭౧ వ సంవత్సర మున అక్టోబరు ౭ వ తేదినాడు ౧౧-౩౦ గంటలకు సూర్యబింబముయొక్క ఆగ్నేయభాగమందొక యున్న తము కనబడెను. అపుడది ౮౦,౦౦౦ మైళ్లపొడవున నుండుటచే నంత విపరీతముగ నుండలేదు. అటుపిమ్మట నరగంటలో అది విచిత్రమగు పరిణామము గాంచెను. ఆయవకాశములో అది చాల ప్రకాశవంతమయ్యెను. దాని పొడవు ద్విగుణమయ్యెను. అటుపిమ్మట నొకగంటవరకు ఆఘన జ్వాల పైకెగయుచు పోయి అప్రతిమానముగ సుమారు ౩౫౦,౦౦౦ మైళ్ల పొడవునకు వ్యాపించెను. అంత నాప్రచండజ్వాల యొక్క జవ ముడిగి నట్లయ్యెను. ౧౨-౩౦ గంటలకు సరికి—అనగా నది జన్మించిన రెండు గంటలలో-ఆజ్వాల లన్నియు కృశించి యదృశ్యములై పోయెను.

ఈఉన్నతములు సాధారణముగ రెండుజాతులుగ విభజింప వచ్చును. మొదటిజాతివి నెమ్మది కలవై మన భూమియొక్క వాతావరణమున తేలుచుండు మబ్బులను పోలియున్నవి. రెండవజాతిలో హఠాత్తుగ నుద్భవించి మాయమైపోవు ఉన్నతములు చేరుచున్నవి. బ్రహ్మాండములైన జ్యోతిర్మయపదార్థములవలె నవి సూర్యగోళ పరిభాగమునుండి విసరివేయబడినటుల పుట్టుచున్నవి. ఈ రెండువిధములైన వస్తువులును స్వరూపమునందే కాక వానియందిమిడియుండు వాయుపదార్థముల యందు కూడ భేదించుచున్నవి. మబ్బులవంటి ఉన్నతములందు ముఖ్యముగ హీలియం (సౌరపదార్థము) సున్నము, జల వాయువును కలవు. హఠాత్తుగ పుట్టువానియందనేక ములగు లోహములున్నవి. ఈరెండవజాతి ఉన్నతములు సాధారణముగ సూర్యమండలము యొక్క ధ్రువముల చెంతనుండవు. కాని నలుపుమచ్చలకు చేరువలోనుండును. ఇందువలన సూర్యగోళము నందలి నలుపుమచ్చలే అందు కలిగెడి విపరీతములకు మార్పులకు కారణభూతములను నమ్మకము బలపడుచున్నది. ఒకనలుపుమచ్చ గోళము యొక్క అంచునకు చేరినప్పుడు కొన్ని యున్నతములచే నది యావరింపబడి యుండినటుల విదితమగును. కొన్ని సమయముల నొక నలుపుమచ్చకు సమీపమున వాయుప దార్థములు హఠాత్తుగ పైకుబుకుచుండుటయు కలదు.

సంపూర్ణ సూర్యగ్రహణమును పరిశోధించువారలు కనుగొనిన విచిత్రము నింకొకటి తెలుపవలసి యున్నది. దీనిని గ్రహణేతర సమయముల చూచుట కింతవరకును వీలుకలుగలేదు. ఇదియేదన సూర్యుని జ్యోతిర్మండలమే (corona). చంద్రబింబము సంపూర్ణముగ సూర్యునాచ్ఛాదింపగనే యిది సూర్యునిచుట్టును ప్రకాశవంతముగ నగు పడును. గోళమునకు చేరువనున్న భాగము చాల ప్రకాశ వంతముగ నుండునుకాని యది ఉన్నతములంత ప్రకాశ వంతముగనుండదు. ఈ ఉన్నతము లాజ్యోతిర్మండలమున రావపుండ్లవలె రాజిలు చుండునని యంగు పండితుడు వర్ణించెను. దీనిలోపలిభాగము సూర్యుని చుట్టును గోళ వ్యాసము (Diameter) న పదియవవంతు వెడల్పున నావరించియుండును. కాని దీని వెలుపలిభాగము నిమ్నోన్నతములను కలిగి మిగులవిశాలమై యుండును. సాధారణముగ నందు నల్లనిపట్టీలు అడ్డమువచ్చి సూర్యుని పార్శ్వమునుండి వెలుపలివరకును వ్యాపించును. అంతే గాక కొన్నిసమయముల సన్నని వెలుగు రేఖలు తరచుగ వల యాకారములదాల్చి యందు కనబడుచుండును. ౧౮౪౭ ౧౮౪౮, ౧౮౭౦ సంవత్సరములలో సూర్యునియందు నల్లచుక్కలు అరుదుగనున్న సమయముల కలిగిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రహణములపుడు ఈజ్యోతిర్మండలమున సన్నని జ్యోతిర్వాహినులు సూర్యునినాడీ మండలరేఖ ప్రాంతముల నగుపడెను. ౧౮౭౧, ౧౮౭౮, ౧౮౮౩ సంవత్సరములలో సూర్యునియందు నల్లచుక్కలు విశేషముగనున్న సమయముల కలిగిన గ్రహణములపుడు ఈజ్యోతిర్మండలము క్రమముగ వలయాకారముననుండి చుక్కలుండు ప్రదేశములందే విరివిగ పెరిగి యుండెను. సూర్యునందలి నల్లమచ్చలయొక్క రాకపోకలకును సూర్యగోళమునం దితర పరిస్థితులయందు కలిగెడి మార్పులకు సన్నిహిత సంబంధము కలదని యీవిషయమునను కూడ స్పష్టపడుచున్నది.

ఈజ్యోతిర్మండలమున ప్రకాశవంతమగు వాయుపదార్థమే కాక, దుమ్ము మొదలగు సూక్ష్మవస్తువు లుండి సూర్యకాంతిని ప్రతిఫలింప జేయుచున్నవి. కాని యిందీ పదార్థములు చాల పలుచగ నున్నవనుట స్పష్టము. తోకచుక్కలు మొదలగునవి సూర్యు నావరించియున్న జ్యోతిర్మండలముగుండ పోవునపుడెట్టి యవరోధమును పొందక యథాగతిని కదలుచుండును.

పరిశోధనముల వలన సూర్యునిగూర్చి పెక్కులు విశేషములు మనకు లభించినవి. కానివానినుండి యిదమిత్థమని పర్యవసానమును నిర్ణయించుటకు చాల నవరోధకములు కలవు. సూర్యగోళ స్వభావమునుగూర్చి శాస్త్రవేత్తలు వివిధాభిప్రాయములను కలిగియున్నారు. వివాదాంశములు కాని కొన్నిటిని మాత్ర మిందు వివరించెదను.

సూర్యునియందలి పదార్థముయొక్క సాంద్రత (density) భూమిలో నాల్గవపాలుండును. సూర్యునియొక్క బరువును అంతే పరిమాణము గల నీటిగోళముతో పోల్చిచూచిన యెడల నీజ్యోతిర్మయుడు నీటికంటె ఒకటిన్నర రెట్లు మాత్రము బరువుండును. సూర్యునియందలి పదార్థ మనంతము: భూమికంటె ౩౩౦,౦౦౦ రెట్లున్నది. కాని సూర్యుని యందలి పదార్థము చాల తేలిక. భూమియందున్నట్టి పదార్థ మాగోళమునందుండి యిపుడున్నయంత బరువుననే యుండవలసిన యెడల నది యిప్పటికంటె నాల్గవవంతు పరిమాణము కలిగియుండవలెను. సూర్యగోళమింత తేలికగా నుండుట వలనను, అధికమగు వేడిమికి నిలయమై యుండుటవలనను, అది వాయుపదార్థములతోనే కూడియున్నదని యెంచవలసి వచ్చుచున్నది. కాని ఆవాయుపదార్థ మేస్థితి యందున్నదో మన మూహింప జాలము. భూమియందలి ఆకర్షణశక్తి (gravity) కి ౨౭ రెట్లు అధికముగ సూర్యగోళోపరిభాగమున ఆకర్షణశక్తి కలదు. భూమియందు ౨౭ మణుగుల బరువును యెత్తుగల మనుష్యుని సూర్యగోళమునకు తీసికొనిపోయినయెడల అచట నతడొక మణుగు బరువును మాత్రమే యెత్తగలుగును. కాబట్టి సూర్యగోళమందలి వాయువులు చాల ఒత్తిడి కలిగియుండవలెను. కాని అందలి వేడిమివలన నవి ద్రవరూపమును చెందుటకైనను వీలులేకున్నది. సూర్యగోళముల అంతర్భాగముల విషయము మనకేమియు తెలియదు. మనకగుపడునది గోళముయొక్క బహిర్భాగములే, దానినే దీప్తిగోళము (photosphere) అందురు. శీతలవాయువులు గోళోపరిభాగము నావరించుటవలన నల్లచుక్కలు (sun-spots) కలుగుచున్నవని సెచి, లాకియర్ అను శాస్త్రజ్ఞులు ఊహించి యుండిరి. ఈయూహయే సమంజసమైనదిగ కనబడుచున్నది. హఠాత్తుగ జనించు "ఉన్నతముల" చెంతనే యీమచ్చ లగుపడుచుండునని పైన వివరించి యుంటిమి. కాని యాయున్నతములే శీతలవాయు ప్రచారమువలన కలిగి తుదకు మచ్చల రూపమును దాల్చుచున్నవో లేక నీయున్నతములవలన కలిగిన "లోయల" లోనికి శీతలవాయువులు ప్రవహించి మచ్చలను కలుగజేయుచున్నవో యిదమిత్థమని యింతటివరకును నిర్ణయము కాలేదు.

సూర్యుని పరివేషముకంటె చాలపెక్కుడు దూరమునకు వ్యాపించెడు రాశిజ్యోత్స్న (Zodiacal light) ను సూర్యాస్తమయానంతరమును సూర్యోదయమునకు పూర్వమును పెక్కురు గమనించియేయుందురు. ఈ జ్యోత్స్న సూర్యునిచుట్టును ఒకకోడిగ్రుడ్డు యొక్క ఆకారమున నుండును. సూర్యు డస్తమించిన చోటునను,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉదయింప బోవుచోటునను ఆకాశము ప్రభావంతమై కనుపట్టుచుండుట కీజ్యోత్స్నయే కారణము. ఇది యొక విధమగు దుమ్ముతోకూడి సూర్యకాంతిని ప్రతిఫలింప జేయుచుండునని విశ్వసింప బడుచున్నది.

సూర్యుడు తనప్రభను వేడిమిని తనచుట్టును సర్వతోముఖముగ వెదజల్లు చున్నాడు. అందు భూమికి చేరునది ౨,౦౦౦,౧౦౦,౦౦౦వ భాగమే. మనతోటి గ్రహములును చంద్రుడును కొంతభాగమును గ్రహించుచున్నవి. కాని యివి యన్నియు నేకమై ఆ అనంత వాహినియం దెంతస్వల్పభాగమును గ్రహింపగలుగుచున్నవి! ఆకాశమున నెగిరిపోయెడి కొంగ గ్రుక్కెడు నీరు త్రాగుటవలన క్రిందనున్న నదీజల మెంత క్షీణించునో యంతేభాగము సూర్యునియొక్క ప్రచండప్రభ గ్రహములు గ్రహించుటవలన క్షీణించుచున్నది.

సూర్యునియొక్క అపరిమితకిరణప్రసారమే పైరులను పెంచి ఫలవంతముగజేయు నింద్రజాలము. సముద్రమునందలి నీటిని ఆవిరిరూపమున నాకాశమునకు గొంపోయి వర్షధారారూపమున భూమి నుజ్జీవింపజేసి నదీనదముల నింపున దీ సూర్యుని వేడిమియే. ఉత్తేజజనకములగు వేడిమిని వెలుగును యిచ్చెడి సూర్యభగవానుని చలికాలమున మరువగలవారెవరు? మనము ఇంధనములచే రాజిలజేయు నగ్నియు సూర్యదేవుని ప్రసాదమే. సూర్యతేజము యింధనములయందును, బొగ్గులయందును చిరకాలము జీవించియుండుటవలననే అవి ప్రచండాగ్నిని మనకు వలయునపుడు ప్రసాదించి, మనయోడలను నడపుచు, యంత్రములను త్రిప్పుచు, నగరములను గృహములను వెలిగించుచు మనజీవితములను అనుభవనీయములుగా చేయుచున్నవి.

ప్రకృతిసామ్రాజ్యము నావరించిన కమనీయాలంకారమునకును, మనకు పుష్కలముగ లభించు పైరు పంటలకును, మనము జీవించుటకును ఇటునటు తిరుగాడుటకును వలయుశక్తికిని, బ్రహ్మాండము నావరించియున్న యనంతమండలములలో నొక్కదానికే మన మధికముగ ఋణగ్రస్తులమై యున్నాము. అదియేసూర్యమండలము.

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి'

---

7. 6- 15 ౯౪౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# దేవరహాస్యము

విద్వాన్ కే. బి. కోటిలింగం దేవరగారు

ఘటములందొ పత్రములందొ ప్రతిమలందొ
    భవ్యతరచిత్రలేఖనాపటిమ మెఱయ
లిఖితమాత్రైకరూపకుల్ లేఖలగుట
చిత్రపటములె సుమ్ము జేజేలనంగ.

సులువుగా వర్ణమంటంగ సురమొదలగు
ద్రావకంబులమెదిపి బర్హంపు తూలి
కాగ్రమునఁ జిత్రము రచింతు, రక్కతమున
బొమ్మలే సురల్ బర్హిర్ముఖమ్ము లయ్యె!

భాసురానంద రూప విన్యాస కలనఁ
బ్రతులఁ జాయల నళియింపఁబడక దివ్య
దేహముల సర్వకాలముఁ దేజరిల్లు
నమరులెవ్వారు చిత్రరూపములెగాక!

పలక బాఱని శారీర పటిమ కల్మి
నెల్లకాలము ముప్పదియేండ్ల కౌమరుఁ
బ్రాయమున వెల్గుచుండు నిర్జరుఁ డనంగ
నరయఁగా నట్టివేల్పు చిత్తరువ కాదె?

నేల కాలూనరాక, నేవేళ నెత్తు
పీటలను, గోడలను, పెద్దవేదికలను
తీవిఁగొలువుండి, పర్వసంభావనముల
స్వస్థులగు సుపర్వాణులు ప్రతిమలెకద?

తమ్ముఁగూర్చి మానవులెట్లు తలఁచుచున్నఁ
గాదనక సమ్మదమ్మునఁ గాంచుచుండు
సాధితాచల నిర్గుణస్వాంతు లగుట
సుమనసులు వేతెగలరె చిత్రములుగాక?

స్వేదరోమాంచ సత్త్వరసోదయంబు
రెప్పపాటును, నిద్రయు లేనివగుట
చిత్తరువులకె జెల్లు నస్వేదులనఁగ
ననిమిషులనంగ, నస్వప్నులనఁగ జగతి.

వరలుసారస్వతము వినా, స్వముఖమునను
వాక్పటిమ లేని బొమ్మ గీర్వాణ మయ్యె
నదితి యనుకాంత చిత్రింప నాది యందుఁ
జిత్తజువు లాదితేయాఖ్యఁ జెలఁగుచుండు.

యజ్ఞయాగాది కామ్య కర్మాళియందు
బలిసమర్పణఁ గ్రతుభుగాఖ్యలఁ జెలంగు
చహరహము గంధమాల్యాంబరాభరణము
లమరు దివ్యలు చిత్రప్రతిమలు గావె?

కన్నులుండి కానఁగలేక, కాళులుండి
మెదలఁగాలేక, నోరుండి మెక్కలేక
జిహ్వగల్గియు మాట్లాడఁ జేతఁగాక
మిడుకు జడదేవతలు చిత్రములె నిజంబు!

భూత శక్తులఁ దొలుత దివ్యలుగ నెంచి
వాని కటుపయి చిత్రరూపము లమర్చి!
చిత్రకథలెన్నొ వానిపై సృష్టిఁజేసి
రరసి చూడఁగ; దేవరహాస్యమిదియె?

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

(1833—1897)

ని. వెంకటరావు గారు, బి. ఏ.



మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు.

అభినవాంధ్రకవితా పితామహుఁడనియు ననర్గళ కవనధారాపారీణుఁడనియు నాంధ్రలోకమున వాసిఁగన్న యీ విద్వత్కవి విశాఖపట్టణమండలమున బొబ్బిలి దరినున్న పాలతేరను గ్రామమున క్రీ. శ. 1833 సంవత్సరము జూను 30 తేదిని జన్మించెను. ఈతఁడు వెలనాఁటి వైదిక బ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుఁడు పారాశరగోత్రుఁడు. కామకవికి జోగమాంబకుఁ బుత్త్రుడు. వీరివంశమంతయుఁ బండితవంశము. ఈ సత్కవిపితామహుఁడు పేరయసూరి. ఇందుమతీపరిణయము, లక్ష్మీనృసింహమూర్తిస్తుతి, నిర్దుష్టనిరోష్ఠ్య దాశరథీశతకాదులను రచియించెను. తండ్రి కామకవి బ్రహ్మోత్తరఖండము, కార్తికమాసవ్రత మాహాత్మ్యము, బలరామ క్షేత్ర మహత్త్వము, జానకీరామశతకము, సూర్యనారాయణ శతకము, రామప్రభుశతకము, శ్రీరామస్తవరాజాది సంస్కృతగ్రంథబృందము, శ్రీరామ దండకము, శ్రీకృష్ణదండకము, శ్రీమత్ త్రైపదేంద్ర దండకము మొదలగు బహుగ్రంథముల రచియించెను. ఈతని యన్నయైన రామస్వామిశాస్త్రి వేదాంతకృతికదంబము (ఇందు అవధూతానుభూతిగీతలు గలవు) గంగాలహరి, గంగాష్టకము, గంగాస్తవము మొదలగు భాషాంతరీకరణములు, ద్వాదశమంజరికాస్తవము, రామార్యస్తవము మున్నగు చిన్న కావ్యములును రచియించెను.

ఈ సత్కవి తొలుత తనతండ్రియగు కామసూరి యొద్దను, నటుపైని తాతాసూర్యనారాయణ యొద్దను విద్యాభ్యాసము గావించి, సంస్కృతాంధ్రములయందు సమానపాండిత్యము సంపాదించెను. మఱియు సాంఖ్యతారోపనిషన్మంత్రములను శ్రీమత్ త్రైపదేంద్రస్వామి వారివలనఁబడసి యద్వైతవేదాంతశాస్త్రమునఁ బ్రవీణుఁడయ్యెను.

సహజకవితాసంపన్నుఁడగు నీసత్కవి తన పంద్రెండవయేట ననఁగ క్రీ. శ. ౧౮౪౫ నుండి కవిత్వము చెప్ప మొదలిడి తనజీవితమంతయుఁ గవితావృత్తి యందే గడపెను. ఈతఁడు బొబ్బిలి సంస్థానమునం దాస్థానవిద్వత్కవియైనను, వేంకటగిరి మొదలగు రాజాస్థానముల సమ్మానితుఁడై, బొబ్బిలి పురాధీశ్వరుల దయచే సకలతీర్థయాత్రలు గావించి, వినయసౌశీల్యాది గుణముల చేత నొప్పి, యధునాతనాంధ్రకవిమండలికి భూషణప్రాయుఁడై యలరారెను.

---

౧. ఈతని కుమారుఁడు కామకవి, సోమేశ్వర క్షేత్ర మాహాత్మ్యము, సర్వేశ్వరశతకము, తరుణీశతకము, విష్ణుమాయావిలాసము, విక్రమార్కచరిత్రము మొదలగు కావ్యముల రచియించిన ట్లీతని శివమాహాత్మ్యఖండ పీఠిక నుండి తెలియుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ కవి తన పం(డ్రెండవయేట "కవితాలతాంకురము" నొక గంటకాలములోఁ బంతెగించి రచియించెను. మఱియు నాకాలమునందే "శ్రీగణపతిసరస్వతీపరకంద కదంబము"ను రచించిరి. వీరి యంత్యకవిత్వము ౧౮౯౭ సంవత్సరము జూను ౨౫, ౨౬, ౨౭, ౨౮ తేదులలో రచించిన "మృత్యుంజయ స్తవ"మను పేర నొప్పుచున్నది. ఇంక నీయేబదిరెండేండ్లలోను వీరు చెప్పిన కృతులకు లెక్కలేదు. వానిలో నెనుబదినాలుగు మాత్రము మిగిలి యున్నవి. వాని నీక్రింద బొందుపఱచుచున్నాఁడను.

## ఏకప్రాస శతకములు

౧. బ్రహ్మేశశతకము (లకారప్రాసము) "బలుగొట్టపురీనివాస బ్రహ్మేశశివా" అనుమకుటము.

౨. చిత్రిశతి (నకారప్రాసము) "మానసమా నిరంతరము మంగళదేవత నాశ్రయింపుమా" అను మకుటము.

౩. వేంకటశైలనాయకద్విశతి (లకారప్రాసము) "ఉజ్జ్వలహృదయా దయారస విశంకట వేంకటశైలనాయకా" అను మకుటము.

౪. వేంకటశైలనాయకశతకము. (దకారప్రాసము) "ఇందిరా, స్పదహృదయాదయారసవిశంకట వేంకటశైలనాయకా" యను మకుటము.

౫. విశ్వనాయకశతకము. (రకారప్రాసము) "తారకమంత్రదాయక గదాధరసాయక విశ్వనాయకా" అనుమకుటము.

౬. విశ్వనాథస్వామి శతకము (నకారప్రాసము) "నానాంతర్యామి విశ్వనాథస్వామీ" అను మకుటము.

౭. కాశీవిశ్వనాథ శతకము (కకారప్రాసము) "శ్రీ కాశీవిశ్వనాథ సిద్ధసనాథా"అను మకుటము.

౮. పార్థివలింగ శతకము" పాపౌఘతమఃపతంగ పార్థివలింగా" యను మకుటము.

౯. పరమశివ శతకము (సకారప్రాసము) "శివా, సాంబశివా సదాశివా పరమశివా!" అను మకుటము.

౧౦. సూర్యనారాయణశతకము. యకారప్రాసము. "సూర్యనా, రాయణ భక్తరక్షణ పరాయణ జన్మరుజారసాయనా" అను మకుటము.

౧౧. బాలశశాంకమౌళి శతకము, ౧౨ చంద్రఖండకలాపశతకము. ౧౩. కలి పురుషశతకము, ౧౪. ఈశ్వరశతకము, ౧౫. ఈశ్వరధ్యానశతకము.

శతకములు (౨౩) ౧. సీతారామద్వ్యర్థిశతకము, ౨. శ్రీ జనార్దనశతకము, ౩. కాశీకావిశ్వనాథ సీసపద్య శతకము (చిత్రబంధ కవిత్వసమేతము) "కాశీకావిశ్వనాథ దుర్గాసనాథ"అను మకుటము, ౪. పరమాత్మశతకము- "పరమాత్మానిత్యబోధాత్మకా"అను మకుటము-౫. పార్వతీశ్వరశతకము, ౬. కాశీశ్వనాథ ప్రభుశతకము, ౭. సర్వేశ్వరశతకము "ఇంక నిన్నే నందు సర్వేశ్వరా"అను మకుటము, ౮. సూర్యనారాయణ శతకము-"లోకహితచర్యా సూర్యనారాయణా" అను మకుటము, ౯. వేంకటరమణశతకము, ౧౦ వరాహనరసింహశతకము శతత్తారావళి "వరాహనరసింహా సింహాశైలాధిపా"అను మకుటము, ౧౧.జగద్రక్షకశతకము "పన్నగనగాధ్యక్షా జగద్రక్షకా" అనుమకుటము, ౧౨. రమానాయకశతకము.-"రామారమానాయకా"అను మకుటము, ౧౩. ఆంజనేయశతకము, ౧౪. రామరక్షాశతకము, ౧౫. గోపాలకృష్ణశతకము, ౧౬. బాలకృష్ణశతకము, ౧౭. రఘుపతి శతకము,౧౮. జగన్నాయక శతకము, ౧౯. రామలింగేశ్వర శతకము, ౨౦. సర్వకామదాశతకము,౨౧. గణపతి శతకము,౨౨. హరి శతకము, ౨౩. హరిహరేశ్వర శతకము.

## కావ్యములు

౧. శ్రీరాధాకృష్ణసంవాదము, ౨. శ్రీబొబ్బిలి మహారాజవంశావళి, ౩. ఉమాసంహిత (యాంధ్రము),౪. కాంచీమహత్త్వము, ౫. అమరుకము, ౬. అక్షరమాలికాఖ్యనిఘంటువు.

## మాలికా పద్యములు

౧. ఉపన్యాస విలాసభూషణము, ౨. ఈశ్వరప్రార్థనార్థచంపకమాలిక, ౩. కొల్లాపుర ప్రభుచరిత్రము,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౪. శ్రీగురుచరిత్ర, ౫. శ్రీవేణుగోపాల నక్షత్రమాలిక, ౬. జగత్పతి నక్షత్రమాలిక, ౭. జగదీశనక్షత్రమాలిక, ౮. మారీరోగభీతిహరేశ్వరనక్షత్రమాలిక, ౯. శ్రీవేంకటకృష్ణ యాచేంద్రప్రభు సమాగమనోత్సవవర్ణన సీసనక్షత్రమాలిక, ౧౦. జగదీశతారావళి, ౧౧. పంచరత్న నవరత్న యతివృష్టికష్ట హరణాష్టకాదిస్తుతికదంబము, ౧౨. మత్తకోకిలాష్టకాదివర్ణ పద్యావళి, ౧౩. తిత్తదుత్సవాది వర్ణవర్గార్థమాలికాది పద్యావళి, ౧౪. సమస్యాపూరణాది చిత్రకవనము, ౧౫. గేయమంజరి.

## దండకములు

౧. శ్రీరామ, ౨. శ్రీ సూర్యనారాయణ, ౩. శ్రీజగదంబాదండకము, ౪. జూబిలీదండకము.

## గద్యకవనము

౧. యాత్రాచరిత్ర, ౨. గురుచిత్రకథ, ౩. లఘుచిత్రకథ, ౪. శ్రీ బొబ్బిలి మహారాజ వంశావళి.

## ఉపన్యాసములు-ప్రకీర్ణకములు

౧. సకలమతసామరస్య సంగ్రహోపన్యాసము, ౨. దైవమానుషోపన్యాసము, ౩. కర్మవిపాకోపన్యాసము, ౪. స్త్రీపునర్వివాహ ధిక్కారోపన్యాసము, ౫. భావనామతోపన్యాసము, ౬. ప్రబంధసంబంధబంధ నిబంధనగ్రంథము.

## సంస్కృతగ్రంథములు

౧, గుణకశ్లోకాదిచిత్రరచన, ౨. కవితావినోద కోశము, ౩. శ్రీ గురుషోడశోపచారస్తుతి, ౪. సీతానేత్రస్తుతి, ౫. శ్రీకృష్ణనవరత్నావళీస్తుతి, ౬. శ్రీదేవీనవరత్నావళీస్తుతి, తత్పూజాపద్ధతి, ౭. బీజాక్షరస్తుతి ౮. కాశీశ్వరాష్టకము, ౯. మంగళాష్టక చతుష్టయము, ౧౦. శ్రీ వేంకటగిరి ప్రభుద్వ్యర్థిశ్లోక కదంబము.

పైగ్రంధపట్టికఁ దిలకించినచో నీమహాకవికవితా వైదుష్యము తేటపడగలదు. పై గ్రంథములలో రాధాకృష్ణసంవాదము, అమరుకము, కృష్ణాభ్యుదయము మొదలగు కావ్యములు దేశమందు వ్యాప్తమైనవి. అం దొకటి పండితమండలిచేఁ గొనియాడఁబడి యాధునికాంధ్రవాఙ్మయమున ముఖ్యప్రబంధములలో నొకటిగఁ బరిగణింపఁబడినది.

చతుర్విధ కవితావిశారదుఁ డగు నీకవికి బంగారమునకుఁ బరిమళ మబ్బిన భాతిని నుభయభాషాపాండిత్యము గూడ గలుగుటచే నిర్దుష్టకవనధోరణియం దాకాలము నీయనను మించిన వారు పెక్కురు లేకుండిరి. చిత్రబంధ కవితయం దీకవికి కలసామర్థ్యము పూర్వోదాహృత కవితావినోదకోశమునను, ప్రబంధసంబంధబంధనిబంధన గ్రంథమునను, రెండుమూడు శతకముల వలననుఁ దెలియనగును. ఒక శివరాత్రియంతయు నుపవసించి, లింగోద్భవ కాలమునం దుపక్రమించి తెల్లవారుసరికి పార్వతీశ్వరశతకము రచియించుటయు "పాపౌఘశమఃపతింగ పార్థివలింగా" యనియు "శ్రీకాశీవిశ్వనాథ సిద్ధసనాథా" యనియు మకుటములుగా నుండి రెండేకప్రాసశతకములు పంతముపైని మూడుదినములకు రచియించుటయు, రెండుమూడువందల చరణములుగల మాలికావృత్తముల నెట్టి దుష్కరప్రాసతోనైన ననర్గళధారతో రచియించుటయు నీకవి యాశుకవితాశక్తికి నిదర్శనములు. ఇట్టి యీతని ప్రతిభ బిందుపూర్వకదకారప్రాసముతో నైదువందల చరణములకుఁ బైగా రచియించిన శ్రీమత్ త్రైపదేంద్ర గురుచరితమునఁ గనఁదగును. వీరి యాంధ్రీకరణశక్తికి, అమరుక కావ్యము నుదాహరణముగఁ గొనవచ్చును. ఇఁక యమకములు, ద్విప్రాసలు, త్రిప్రాసలు, చతుష్ప్రాసలు, పంచప్రాసలు మొదలగు వానితో కవనము సెప్పుట యీ సత్కవికి మంచినీళ్లప్రాయము. అయిన వీరిశతకములు కొన్ని బహుమనోహరశైలితో గ్రాలుచున్నవి.

ఈవిద్వత్కవికీర్తి లోకమున వెల్లివిరియుటకు తొల్లి నెల్లూరుపురమున బ్రకటింపఁబడిన యముద్రిత గ్రంథచింతామణిపత్రికయే కారణము. ఈపత్రికవలననే యీకవీంద్రుని నామ మాంధ్రదేశమున సుప్రసిద్ధమైనదని చెప్పుట సత్యోక్తియేగాని యతిశయోక్తిగా నేరదు. ఈ పత్రికయందే శాస్త్రిగారి గ్రంథములు, మాలికలు, లేఖలు, పెక్కులు ప్రకటింపఁబడినవి. పైగ్రంథములలో ప్రబంధ సంబంధబంధ నిబంధనగ్రంథము శరత్తారావళి యను పరా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హనరసింహశతకము, శ్రీమత్ త్రైపదేంద్ర గురుచరిత్రము, శ్రీకృష్ణాభ్యుదయము, ప్రాస్తావికపద్యావళి, అ. గ్ర. చింతామణి ప్రకటితము. మఱియు నుపన్యాసవిలాసభూషణము ఈశ్వరప్రార్థనమాలిక, జిజ్ఞాసా విజ్ఞాపనము, శార్దూలనక్షత్రమాలిక, విశ్వేశ్వరీయప్రశంస, స్వీయ దినచర్య మొదలగు మాలికలు అముద్రితగ్రంథ చింతామణిప్రకటితములు అముద్రితగ్రంథ చింతామణ్యధిపతులు శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు శాస్త్రిగారి కవితయం దధికాదరము గలవారు. కావుననే సందర్భము గలిగినపుడెల్లఁ దమ పత్రికలో శాస్త్రిగారి కవనమును మించిన రసపుష్టిగల కవనము లేదనియు, చప్పిడి కవన మననేమియో శాస్త్రిగా రెఱుఁగరనియుఁ బలుమారులు ప్రశంసించిరి.

మఱియు రామకృష్ణయ్యగారు పార్వతీశ్వర శాస్త్రిగారి చిత్రమును వ్రాయించి, తమ పత్రికయందు బ్రకటించి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులైరి. ఇయ్యది 'నాత్మపర్యాయచర్యాసపర్య' అను నామాంతరము గలిగి హరిహరేశ్వర శతకమను పేర వెలయుచున్నది. ఇంతియే గాక శాస్త్రిగారి ప్రతిబింబము నాంధ్రలోకమున కొసంగినది వీరే. అయినను రామకృష్ణయ్యగారు భాషావిషయమై మిక్కిలి పట్టుదలగలవారు. ఒకప్పుడు బిందుపూర్వకటతవర్గయతులఁగూర్చి వీరికి వాదప్రతివాదములు జరిగినవి. అప్పుడు శాస్త్రిగారి వయస్సరువది మూడేండ్లు దాటినది. ఆయన నీసందర్భమున నూటయేబది చరణములు గల మత్తేభమాలిక రచించిరి. అందు వాదప్రతివాదయుక్తులెట్లున్నను మాలికయందలి ధారాశుద్ధి వర్ణనీయము, శాస్త్రిగారంతిమావస్థయందును యౌవనంబునందువోలె మేధాశక్తియు, కవితాస్ఫురణయు గల్గియున్నారని పైమాలిక చెప్పకయే చెప్పుచున్నది. శాస్త్రిగారు ప్రాణోత్క్రమణ సమయమున మృత్యుంజయునకు నమస్కరింతుఁ దరింతున్ అను మకుటముతో మృత్యుంజయస్తవ పద్యములఁ జెప్పుచు, నసువులు విడిచిరట. ఇందు ముప్పదియైదుపద్యములు మాత్రమే గలవు. ఈ విధముగ నేబదిరెండేండ్లు కవితావృత్తియందే జీవనముగడపి శాస్త్రిగారు హేవిళంబిసంవత్సర జేష్ఠ బ॥౧ంకి సరియైన క్రీ. శ. ౧౮౯౭ సంవత్సరము జూను తే ౩౦ దిని శివసాయుజ్యముం బొందిరి.

ఉభయభాషాకోవిదుఁడగు నీవిద్వత్కవి, యాంధ్రశతకవాఙ్మయమున నత్యున్నతస్థాన మలంకరింపఁదగినవాఁడు. సత్యవోలు భగవత్కవి శత శతకములు రచియించి యున్నట్లు చెప్పియున్నాఁడు కాని యవి నేడు కానరావు. పార్వతీశ్వరశాస్త్రిగారు రచియించిన శతకములు దేశమునందు వ్యాప్తిలోనుండి, బహుమనోహరమైన శైలితో నలరారుచున్నవి. ఈ శతకములన్నియుఁ బ్రత్యేకించి ప్రకటించిన శాస్త్రిగారి ప్రతిభ యింకను నాంధ్రలోకమునకు విశదము కాగలదు.

శాస్త్రిగారి కవన ధోరణిఁ దెలియుట క్రింద పద్యము లుదాహరించి యింతటితో నీ "జీవితము"ను ముగించుచున్నాను.

సీ. చిత్తజాతునిఁగన్న సత్తకాశిని బత్తి
జొత్తిలి మొకయదు గొత్తుచుండ
విత్తవతీయశో విత్తయా బిత్తరి
పొత్తుమై నొకపదం బొత్తుచుండ
నుత్తుంగరుచు లిగురొత్త హస్తములు
కట్ట్యుత్తమాంగస్థలుల్ హత్తివెలయ
దత్తత్పుమర్థసంపత్తికై ప్రజలు
ప్రపత్తిమై కేల్గవ లెత్తిమ్రొక్క
మెత్తనగు పాపరామెత్త నొత్తగిలఁగ
నత్తమిలి బత్తులకు నెల్ల బుత్తిముత్తు
లిత్తువఁట క్రొత్తయే యిట్టి వృత్తి నీకు
భక్తజనపాలకృష్ణ! గోపాలకృష్ణ.

శా. విశ్వంబంతయు నీవుగాగనుచు
శ్రీవిన్నిన్ను సేవించువా
రైశ్వర్యం బిహమందు నొంది
పరమందైక్యంబు బ్రాపింతుర
న్విశ్వాసంబునఁ దత్ఫలార్థినగుచు
న్నిన్గొల్చుచుంటిం జుమీ
శశ్వన్మంగళసంఘసంఘటన
కృష్ణా బాలకృష్ణా హరీ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. అక్షుల్నిన్గనునట్లు హస్తములు
నిన్నర్చించున ట్లాత్మని
న్నక్షీణంబుగనమ్మునట్లు చెవి
నిన్నాలించున ట్లాస్యముల్
దీక్షన్నిన్గొనియాడునట్లుకరుణ
న్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళసంఘసంఘటన
తృష్ణా బాలకృష్ణా హరీ.

క॥ యమునాతరంగిణీతో
యమునాదను మమరె నచట నగుహంసనికా
యమునా దగె నుడు సముదా
యమునాటి దినాంతదీపికావళిశేవన్

క॥ ఎంతటి మతిమంతులకును
మంతులు గననచ్చుఁ గృతుల మహి గవన్శ్రీ
మంతులు సామంతులు ధీ
మంతులు మంతులు దొరంగి మంతురు గుణముల్

ఉ. స్మేరముఖుండవై యభయచిహ్నము
జూపుచు తత్తరంబుతోఁ
జేరవకేగుదెంచి కుడిచేయి శిరం
బునఁజేర్చి, మంత్రవా
క్సారత దెల్పి నిద్దలము
చక్కటి వెన్నటి కబ్బ జేతువో
తారకమంత్రదాయక గదా
ధరసాయక విశ్వనాయకా!

ఉ. యాచకకల్పవృక్షము క్రియా
చతురుండు రిపుక్షీపార్థ్వమా
యాచణశేముషీనిధి నయా
చరణాదరణుండు, సద్విధే
యాచలమానసుం డురుదయాచ
తురాస్యసురుండు రూపధే
యాచమితస్మరోజ్జ్వలుడు యాచ
మహేంద్రుడు మర్త్యమాత్రుడే!

---

## బాలభాష

### 32

### మంచిమాటలు

బియ్యమ్ము తెల్లన్న పిండి తెల్లన్న
వరుసతప్పినవాని వలికి తెల్లన్న
వరుసగానీదాన్ని వరుసలాడేవు
పాపాత్మ! నీశిరసు పక్కున్న పగులు.

*    *    *

కాలినిండా గుడ్డ వెయ్యందిరోత
కానివాళ్ల కన్నెత్తి చూచిందిరోత
మంచిగంధపుచెక్క సాననే చీకు
మంచాలిదేహమ్ము మనసులో చీకు.

### 33

### ఈశ్వరుడు

లోకమ్మువారికీ రెండుకన్నుల్లు
లోకరక్షక, నీకు వేయికన్నుల్లు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇద్దరుపెండ్లాలు ఈశ్వరుడ నీకు
పలువరుస చక్కనిది పార్వతీదేవి
కన్నుల్లు చక్కన్న కనకదుర్గకును
ఇద్దరుపెండ్లాము లేలయ్య నీకు
ఎద్దెక్కితిరి గేవు ఈశ్వరుడ నీవు
బిచ్చమెత్తిందాక బిడ్డలకు లేదు
అడిగితెచ్చిందాక ఆలికే లేదు

* * *

## ౩౯

### తాత, పెండ్లి

ఊచకట్టోచేత ఉగ్గమోచేత
ఊగుతూవచ్చిన్న తాతెవ్వరమ్మ
మానికానిండాను మాడలోసుకుని
మనుమరాలా నిన్ను మను మడగవ స్తి
వాడిన్న పూవుల్లు వాసనలుగలవా
ఓతాత ! ఈమనుము వొద్దయ్యనాకు.

## ౪౦

### శ్రీరాములవారు

అయోధ్యరామయ్య అన్నయ్య మాకు
వాలుగన్నులసీత వదినమ్మ మాకు
రాములంతటివాడు రట్టుపడ్డాడు
మానవులకెట్లమ్మ మాటపడకుండ !
సీతమ్మ రామయ్య దారి గదలితె
పారిజాత పువ్వులు పలకరించినవి
సీతపుట్టగ నేల లంకచెడ నేల
లంకకు విభీషణుడు రాజుగానేల
ఏడుఏడూ యేండ్లు పదునాలుగేండ్లు
ఎట్లు లుంంటివి సీత నట్టడవిలోను
లక్ష్మయ్య నామరిది రక్షిస్తూ ఉండ
నా కేమిభయ మమ్మ, నట్టడవిలోన.

* * *

సీతపుట్టగ నేల లంకచెడ నేల
లంకకు రావణుడు రాజుగానేల

* * *

దేవునంతటివాడు జననింద పడెను
మానవుం డెంతయ్య మాటపడకుండ
అన్నదమ్ములులేక ఆదరువు లేక
తోడులేకా సీత దూరమైపోయె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వైటమీన్సు (Vitamines)

జల్లేపల్లి జగన్నాథరావుగారు, బి. ఏ.

మనము వైటమీన్సునుగురించి సయన్సు పత్రికలలోను, కొన్ని మందుల కాగితములలోను తరచుగా చూచుచున్నాము. మనము భోజనముచేయు పదార్థములందు వైటమీన్సు లేనిచో మనశరీరవృద్ధియు, కొన్ని వ్యాధులనుండి బాధపడకపోవుటయు జరుగనేరదని నూతనముగా (1911 లో) కనిపెట్టబడినది. ఇప్పటికిని వైటమీన్సుయొక్క రసాయనశాస్త్రము స్పష్టముగా తెలియలేదు. దానితో కలసియున్న యితరపదార్థములను తీసి వైటమీన్సు ఒక్కటినే ఎవరు విడదీసియుండలేదు. మరియును రికెట్సు (Rickets) అను వ్యాధి వైటమిన్ డి ఆహారములో లేనప్పుడు వచ్చునని ఒకయభిప్రాయము కాని ఆహారములో కేల్షియమ్ (Calcium) (ఎముకలలో నుండును) తగ్గి ఫోస్ఫరస్ (Phosphorus) హెచ్చినను, కేల్షియమ్ హెచ్చి ఫోస్ఫరస్ తగ్గినను రికెట్సు అను వ్యాధి వచ్చునని పరిశోధనవలన తెలియుచున్నది. అందువలన వైటమిన్సు డి. కిని రికెట్సుకు సంబంధములేదని కొందరి యభిప్రాయము. ఇట్లే వైటమీన్సుగూర్చి మీమాంసలున్నవి.

ఏది యెట్లున్నను, కొన్ని పరిశోధనల బట్టి మనము తినెడి యాహారములో కొన్ని పదార్థములున్ననేగాని (వైటమీన్సు అన్ననుసరే మరేమన్ననుసరే) మనము జీవింపనేరమని స్పష్టముగా నేర్పడినది. ఆపదార్థము లెక్కువగా నాహారములో నుండనవసరము లేదు. దీనికి సంబంధించిన పూర్వచరిత్ర కొంచెము చూచిన అంతయు స్పష్టమగును.

చాలదూరము ఓడ ప్రయాణము చేయువారు స్కర్వీ (Scurvy) అనువ్యాధినుండి బాధపడుచుండెడివారు. ఎక్కువకాలము ఓడలో నుండుటచే వారికి క్రొత్తగాకోసిన కూరకాయలును, మంచిపండ్లును దొరకెడివికావు. వాడినపండ్లును, ఎండిపోయిన కాయలను తినుటవలన వారు స్కర్వీబాధనుండి పీడింపబడిరి. కాని వారు నిమ్మపండ్లయు, కమలాపండ్లయు రసమును, ఎండిపోవని కూరకాయలను తినినప్పుడు ఆరోగము లేకయుండెడివారు. ఈసంగతి 1600–1700 సం. లందు కెప్టను కుక్కు, డాక్టరు లిండు (Captain Cook, Dr. Lind) అనువారు తెలిసికొనిరి. కాని తగినకారణము వారికి తెలియలేదు. మనము వైటమిను శాస్త్రజ్ఞులతోపాటు కారణ మెఱుగగలము. వైటమిన్ సి అనునది స్కర్వీకి మందు. అది మన ఆహారములో లేనప్పుడా వ్యాధి వచ్చును.

వైటమిన్ సి పండ్లరసములోను (నిమ్మ, కమలా మొదలగు) కూరకాయలలోను ఉన్నది. కాని అవి ఎండి నిలవయున్నచో వైటమిన్ సి. నశించును. కాబట్టి పై చెప్పిన ఓడప్రయాణికులు ఎండినవి తినుటవలన ఆరోగముచే పీడితులైరి.

మరియును బెరిబెరి (Beriberi) అనువ్యాధి జపాను (Japan) నందు, కొంచెము తక్కువగా మలయ పెనిన్సులా, డచ్ ఇండీస్, ఫిలిప్పైను ద్వీపములలోను ఉండెను. దీనికి కారణము డాక్టరు ఈక్మను (Dr. Eijkman) అను హాలండుదేశస్థుడు ౧౮౯౭ సం॥న కనుగొనెను. జపాను మొదలైన దేశస్థులు ఎక్కువగా యంత్రములలో బాగుచేసి తెల్లగానుండు బియ్యమును వండి తినుచుండిరి. అట్లెక్కువగా యంత్రములో బాగుచేయుటచే బియ్యములోనుండు ఒకవస్తువు నశించుటవలన బెరిబెరి వచ్చునని ఈక్మను చెప్పెను. ఆవస్తువునే ఇప్పుడు వైటమిను బి. తో పోల్చిరి. దీనినిబట్టి మన మెక్కువగా బాగుచేసినబియ్యము తినరాదని తెలియుచున్నది. వైటమిను బి బియ్యపుగింజపై తెల్లగా యొక పొరవలె కప్పియున్న పొట్టువందుండును. మన మెక్కువగా కడిగినచో ఆకడుగులోనికి అది పోవును.

మన ఆహారములో ముఖ్యముగా కార్బొహైడ్రేట్సు, ప్రొటీన్సు, ఫ్యాట్సు, మినరల్ సాల్ట్సు (Carbo-hy

drates, Proteins, fats, mineral salts, water) ఉండును. ఇవికాక మరికొన్నివస్తువులుకూడ ఆహారములో నుండవలెనని చాలాకాలముక్రిందటనే తెలిసికొనబడెను. కాని వైటమిన్సు అనుపేరు ఫంకు (Funk) అనునాత డొసగెను. 1911 గౌలెండు హాప్కిన్సు (Gowland Hopkins) అను ఇంగ్లాండుదేశస్థుడు ఫంకునకుపూర్వమే పెక్కుఆహారపరిశోధనలు ఎలుకలపై చేసెను. (1907-1909) హాప్కిన్సుగారు అప్పుడు వైటమిన్సు సంగతి తెలియకపోయినను వానిపరిశోధనలబట్టి మనము ఇప్పుడు వైటమిన్సుయొక్కవిలువ తెలిసికొనగలము. ఎనిమిదియెలుకకల కాహారపదార్థములను వేరువేరుగా తెచ్చి కలిపి ఇచ్చెను,

క్యాసినోజెన్, స్టార్చ్, కేన్‌షుగర్, మినరల్ సాల్టు, ఉదకము (Caseinogen, Starch, Cane Sugar, mineral salt and water) వైటమిను అవసరములేనిచో, ఈవస్తువులు శరీరమును కాపాడుటకు చాలును. మరియెనిమిదిఎలుకలకు పైచెప్పిన ఆహారమును దానితోపాటు ఒక టీస్పూను పాలును ఇచ్చెను. ఈ రెండెలుకలగుంపులను ప్రతి మూడవరోజున తూచుచుండెను.

| ఎలుకలు | ౦ రోజు | 18 వ రోజు |
|---|---|---|
| 1 వ ఎలుకలు | 45 గ్రాములు | 50 గ్రాములు |
| 2 వ ఎలుకలు | 45 గ్రాములు | 75 గ్రాములు |

౧౮ వ రోజునుండి ౧ వ ఎలుకలకు పాలిచ్చి, ౨ వ వానికిచ్చుట మానివేసెను. వెంటనే మొదటి ఎలుకలు పెరిగి, పాలుత్రాగుట మానిన ౨ వ ఎలుకలు క్రమముగా క్షీణించి బరువు తగ్గెను. దీనంతటికిని పాలలోనున్న వైటమినులే కారణము. కాబట్టి పాలలోపెరుగుట కనుకూలించెడి వైటమిను ఉన్నది. దానికి వైటమిను ఏ అనిపేరు పెట్టిరి.

మొట్టమొదట 3 వైటమినులు కనిపెట్టబడి రానురాను వానిసంఖ్య హెచ్చి ఇప్పుడు ముఖ్యముగా ౬ ఉన్నవి. వైటమినులను ఆహారముతోపాటు ఉడికించినచో నవి నశించి మనము తినెడి యాహారము ప్రయోజనములేక యుండును. అందువలన ఉడికించని కూరకాయలను, బేడలను తినుట మంచిది. కాబట్టియే అడవులలో పెరుగు మనుష్యుడు పచ్చిమాంసమును, పచ్చిదుంపలను తినుచుండి ఎక్కువ బలవంతుడుగా యుండెను. వైటమినులు ఆరింటిని కొంచెము తెలిసికొనుట మంచిది.

వైటమిను ఏ. ఇది మనుష్యుడు పెరుగుట కాధారము. ఇదిలేనిచో మనిషి క్రమేణ క్షీణించి బరువుతగ్గును. ఇంక నొకవిధమైన కంటిజబ్బు 'జరోఫ్తాల్మినా' (Xerophthalmina) వచ్చి ప్రాణహానికూడ కలుగును. ఈ వైటమిన్ ఎక్కువగా పాలలోను కోడిగ్రుడ్డు (పచ్చనిభాగము)లోను, కాడ్లివరుఆయిలులోనుయున్నది.

వైటమిను బి$_1$ ఇది పైదానివలె నారోగ్యమును కాపాడి బెరిబెరి అనువ్యాధిని తొలగించును. ఈ వ్యాధి అనేకవిధములుగా వచ్చును. దీనివలన అవయవములలో సత్తువ పోయి మనిషి నీరసించును. ఎక్కువగా యంత్రములో బాగుచేసిన బియ్యము తినుటవలన జపాను మొదలైన దేశములవారు ఈవ్యాధినుండి బాధపడుచుండిరి. వైటమిను బి. కోడిగ్రుడ్డు (పచ్చనిభాగము)లోను, కూరకాయలలోను, గోధుమ మొదలైన ధాన్యములలోను ఉన్నది.

వైటమిను బి$_2$ ఇది వైటమిను బి. ఉన్నచోట్ల దానితో కలసియుండును. ఇది పెల్లగ్రా (Pellafra) అను వ్యాధి రాకుండజేయును. దీనివలన అజీర్ణము, నోటినొప్పి, నాలుకనొప్పి, చేతులు, ముఖము, మెడ మొదలైనవి వాచుట సంభవించును. ఈవ్యాధినుండి మొక్కజొన్న లాహారముగాజేసికొన్న ఇటలీ, ఉత్తరఅమెరికా, రుమేనియావాస్తవ్యులు పీడింపబడుచుండిరి.

వైటమిను సి. ఇది స్కర్వీ అను రోగమునకు మందు. ఈ వైటమిను ఎక్కువగా పండ్లరసములోను కాయలలోను ఉండును. స్కర్వీవలన కీళ్లయందు సత్తువ తగ్గి, నోటిమాంసముచెడి పండ్లూడుటకూడ సంభవించును, బలముతగ్గి శరీరముపై నీలవర్ణముగల మచ్చలు లేచును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైటమిను డి. ఇది ఆహారములో లేనిచో రికెట్సు అనువ్యాధి వచ్చును. దీనివలన ఎముకలలో సత్తువపోయి ఎముకలు వంగిపోవును. ఈ వ్యాధి అనేకరకములుగా రావచ్చును.

వైటమిను ఇ. ఇది తక్కినవానివలె వ్యాధులను తొలగింపక సంతానము పొందించుటకు కారణముగ యున్నది. ఎలుకలపైజేసిన పరిశోధనలబట్టి ఈవైటమిను మగవారికిని, ఆడవారికికూడ ముఖ్యము. ఇది ఆహారములో లేనిచో గొడ్డువా రగుదురు. గోధుమలు నానవైచి కొంచము మొక్కలు వచ్చినతరువాత వానినుండి నూనె తీసినచో దానిలో నెక్కువగా వైటమిను ఇ. ఉండును.

పై నుదహరించినదానిబట్టి వైటమినులు మన కెంత ముఖ్యమో తెలియుచున్నది. గోధుమలు, సెనగలు, పెసలు మొదలైనవి నానవైచిన (కొంచము మొలకలు లేచిన తరువాత) వానిలో వైటమినులు ఎక్కువగా నుండును. గాంధీమహాత్మ డిట్టియాహారమును కొన్ని మాసములక్రిందట తినుచుండెను.

ఇట్టిసమయమున సూర్యరశ్మినిగూర్చి కొంత తెలిసికొనవలెను. సూర్యునికిరణములలో అల్ట్రావియలెట్ రేస్ (Ultra Violet rays) ఉన్నవని అందరకు తెలిసిన విషయమే. ఇవి వైటమిను డి. వలె రికెట్సును బాగుచేయుటయేగాక ఆరోగ్యమునిచ్చుటలో సూర్యకాంతినిమించిన దేదియు లేదు. చంటిబిడ్డలు చాలా జబ్బులనుండి బాధపడుచుందురు. దానికి వైటమినులు వారియాహారములో చాలకపోవుటయే కారణము. వారికి వైటమినులు ఉండు ఆహారము నిచ్చి (పాలు, కాడ్లివరు ఆయిల్ etc.,) వారిని ఎండలో ప్రతిరోజును $\frac{1}{2}$ గంట ఉంచిన వా రెక్కువ ఆరోగ్యవంతులుగా నుందురు. పిల్లలు ఎక్కువవేగముగా పెరుగుదురు గాన వారికి వైటమినులు ఎక్కువగా నిచ్చుచుండవలెను. మంచిపాలు (అధికముగా కాచకుండ) పోయుచు, తల్లికికూడ వైటమినులుఉండు ఆహార మిచ్చుచుండవలెను. పాలు, కాడ్లివరుఆయిల్, పండ్లు, పాడని కూరకాయలు మొదలైన వానిలో వైటమినులు ఎక్కువగా ఉండును గాన అవి ఇచ్చుట మంచిది. అదియునుగాక సూర్యకిరణములలో తరుచుగా స్నానమాడుచుండవలెను.

మనశరీరము మనముతినెడిఆహారమునుండి వైటమినులను జేయ లేదు. వృక్షజాతియొక్కటికే వైటమినులను చేయుశక్తి యున్నది. అందువలన మనము మన ఆహారమునకు వృక్షజాతిపై నాధారపడవలెను. కాడ్ (Cod) అనుచేపయం దెక్కువగా వైటమినులు ఉండుటకు కారణమేమన అది సముద్రములోనుండు నాచు, మొక్కలు మొదలైనవానిని తినుటవల్లనే యనిచెప్పవచ్చును. డయటములు (Diatoms) అను ఒకవిధమైన మొక్కయందు (సముద్రములోనుండును) ఎక్కువగా వైటమినులు ఉన్నవి. వానిని చిన్నచిన్న చేపలు తినును; ఆ చిన్న చేపలను డయటములను కాడ్ అనుచేప తినుటవలన దాని కాలఖండము (లివర్‌నందు) వైటమినులు చేరియున్నవి. కాడ్లివరుఆయిల్ మనుష్యునకు చాలా నుపయోగముగా నున్నది.

ఈదిగువ వైటమినులుకలుగు కొన్నివస్తువు లుదాహరింపబడినవి. అంకెలబట్టి వైటమినులు ఎంతెంత యున్నవి యూహింపవచ్చును.

ఈ వ్యాసమును నేను "భారతి" కార్యాలయమునకు పంపినతరువాత శ్రీ గోటేటి జోగిరాజుగారి "మన యాహారము" అను ౨ వ్యాసములు వెలువడినవి. మన యాహారమందు వైటమిన్సుకు గల విలువ అతి సూక్ష్మముగా నావ్యాసమందు చూపబడినది. శ్రీ జోగిరాజుగారి ౨ వ్యాసములు దీనితోబాటు చదివిన మన యాహారసమస్య పూర్తి యగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| వస్తువు | వైటమిను ఏ | వైటమిను బి 1 | వైటమిను బి 2 | వైటమిను సి | వైటమిను డి | వైటమిను ఇ |
|---|---|---|---|---|---|---|
| కూరగాయలు (Vegetables) | | | | | | |
| కాబేజి | 2 | 2 | 0 | 3 | — | ? |
| ఉల్లి | 1 | 2 | 0 | 2 | 0 | — |
| ఉరలగెడ్డ(తీయనిది) | 2 | 2 | 0 | 2 | — | 0 |
| గుమ్మడి | 1 | 0 | 0 | 0 | 0 | 0 |
| టొమాటో | 2 | 3 | 0 | 3 | — | 0 |
| కాయధాన్యము (Cereals) | | | | | | |
| బియ్యము (యంత్రమునుండి) | — | — | 0 | — | — | — |
| బియ్యము (గింజలు) | 1 | 2 | 0 | — | 0 | 0 |
| గోధుమ (గింజలు) | 2 | 3 | 0 | 1 | ? | 2 |
| గోధుమ (తెల్లనిపిండి) | — | 1 | 0 | — | — | 0 |
| గోధుమ-నూనె (Wheat germ oil) | 0 | 0 | 0 | 0 | 0 | 3 |
| పండ్లు (Fruits) | | | | | | |
| ఆపిల్ | 1 | 2 | 0 | 2 | | |
| ద్రాక్ష | | 2 | 0 | 2 | — | 0 |
| నిమ్మ | — | 2 | 0 | 3 | | 0 |
| కమలా | | 2 | 0 | 3 | 0 | — |
| అనాస | 2 | 2 | 0 | 3 | 0 | 0 |
| చమురు, క్రొవ్వు (Oils and fats) | | | | | | |
| పెరుగు | 3 | — | 1 | — | 1 | |
| కాడ్లివరు ఆయిల్ | 3 | — | ? | — | 3 | ? |
| ప్రత్తిగింజలనూనె (ది | ? | — | 0 | — | ? | 1 |
| కోడిగ్రుడ్డు (తెల్లని | — | 0 | 0 | — | 0 | 0 |
| ,, (పచ్చనిది) | 3 | 2 | 0 | — | 1 | 0 |
| కొబ్బరినూనె | — | — | 0 | — | | 1 |
| (Dairy products etc.,) | | | | | | |
| పాలు | 3 | 2 | | 2 | 2 | |
| జున్ను | 2 | 2 | 0 | — | | |
| తేనె | | | 0 | — | 0 | 0 |

—అనగా 1 కంటె తక్కువ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# హిందూదేశ 'బట్టల' పరిశ్రమకు రక్షణ

(సర్ జార్జి స్కూస్టరుగారి వాదనలోని లోపములు) చావలి వేంకటహనుమంతరావుగారు, యం. ఏ.

భారత ఆర్థికసభ్యుడగు సర్ జార్జి స్కూస్టరుగారు భారత శాసనసభలో ప్రవేశపెట్టిన ఆర్థిక పత్రమునందు వివాదాస్పదమైనవిషయము లనేకములు కలవు కాని వాటి యన్నిటియందును ఎక్కువ వివాదమునకు తావిచ్చు విషయము ఒక్కటికలదు. అది ఏదన మన దేశపు బట్టల పరిశ్రమవారికి ఇచ్చుటకేర్పాటు చేయబడిన రక్షణపద్ధతికి సంబంధించినది. సర్ జార్జి గారు హిందూదేశపు బట్టలపరిశ్రమ (ముఖ్యముగా బొంబాయి నాగ్‌పూర్, అహమ్మదాబాదు మిల్లులు) ప్రస్తుతములో నగుచున్న నష్టములను గమనించి, దానిని పూర్తిగ పడిపోకుండునట్లు రక్షించుటకును, తగినబలము చేకూర్చుటకును వీలుగా నుండునట్లు పైదేశములనుండి దిగుమతియగుచున్న బట్టలపై పన్నును 11%నుండి 15%కు హెచ్చించుట కుపపాదించిరి. అక్కడతో సర్ జార్జి గారు ఆగలేదు; ఇంగ్లండునుండి కాక ఇతర దేశములనుండి దిగుమతియగుచున్న బట్టలసరకుపై అదనముగ 5% చొప్పున రక్షణపన్నును విధించుటకు కూడ తీర్మానించిరి. ఈపన్నును విధించుటకు కారణములుగ ఆర్థికసభ్యుడు కొన్ని విపరీత సిద్ధాంతములను ప్రతిపాదించెను. దానివలన మనబట్టల పరిశ్రమ అభివృద్ధిపొందుటకు అవకాశము లుండునవియు, దానివలన ఇంగ్లండు దేశమునకు లాభము చేకూరినను దానికంటె ఎక్కువలాభము మనదేశమునకే కలుగుననియు, హిందూదేశము అభివృద్ధి మనస్సునందుంచుకొనియే తామీ రక్షణపన్నును విధింప బూనుకొంటి మనియు ఆర్థికసభ్యుడు తన ఉపన్యాసమునందు చాల విపులముగ చెప్పెను.

సర్ జార్జిగారు ఈపన్ను విధించుట కుపయోగించిన వాదనలలో ఒక చాలవింతయైన విషయమును వెలిబుచ్చిరి. ఇంగ్లీషు మంత్రివర్గమువారు ఇండియా ప్రభుత్వమువారికి ఒక అసాధారణ విజ్ఞాపన నొకదానిని పంపిరనియు, దానిలో ఇంగ్లండునందు ప్రస్తుతము తీవ్రముగనున్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటకును, వారిలో ఒకభాగము వారికైనను పని కల్పించుటకును ఇండియా ప్రభుత్వమువారు తోడ్పడవలెననియు ఈరక్షణ పన్నును లంకాషైరుతో పోటీచేయుచున్న ఇతర దేశముల దిగుమతులపై విధించిన అట్టి తోడ్పాటు చేయుట వీలగుననియు ఇంగ్లీషుమంత్రివర్గమువారు వ్రాసియుండిరి. ఆవిజ్ఞాపనవిషయమై అసెంబ్లీలో తెల్పుచు ఆర్థికసభ్యుడు "అసెంబ్లీవారు దానియందలి విషయములను గమనించి బ్రిటిష్ ప్రభుత్వమువారి కోరికను చెల్లించినచో వారిమనస్సులందు మనదేశపు భావి రాజకీయాదర్శములపై ననుకూలాభిప్రాయము కల్గి లాభము కల్గునని" వక్కాణించెను. ఇట్టివిషయములలో ప్రధానముగ నాలోచింపవలసినది ఇట్టిపన్నులను విధించుట హిందూదేశపు ప్రజలకును హిందూదేశ పరిశ్రమలకును లాభమా నష్టమా యనుసంగతి కాని బ్రిటిష్ గవర్నమెంటు మనకెప్పుడో లాభము చేయగలరనునది కాదు. మనదేశపుబట్టల పరిశ్రమ పరదేశముల ఒత్తిడికి రూపుమాసిపోకుండ కాపాడుకొనుటకు వీలగునా యనునది కాని లాంకషైరు పరిశ్రమకు దానివలన లాభము వచ్చునా నష్టమువచ్చునా యనునదికాదు. కాని స్కూస్టరుగారు మాత్రము మనదేశపు భాగ్యోదయముకంటె లాంకషైరు వారిభాగ్యోదయములను పెంపొందించుటయందే మనస్సుంచుకొని ఈపన్నును విధింప బూని యున్నారని చెప్పుటలో ఆశ్చర్యమేమేని కలదా?

సర్ జార్జిగారు ఆదాయవ్యయపట్టికలో వచ్చిన ౫.౫౭ కోట్ల రూపాయల నష్టమును పూర్తిచేయుటయే ముఖ్యోద్దేశముగా పెట్టుకొనిన దానికై ఇంకొకవిధమైన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విధానము నాలోచింపవలసినది (దీనివలన మేము ఆతని క్రొత్తపన్నులను విధించు విధానమును ఆమోదించుచున్నామని కాదు. ఆక్రొత్త పన్నులన్నియు అనవసరములు; వాటిని ప్రజలు భరించుస్థితియందు లేరు అను విషయములు ఎల్లరకును తెలిసినవే మరియు ఆదాయ వ్యయపట్టికయందలి లోటు తాత్కాలికమైనది కాని ప్రతిసంవత్సరమును వచ్చునది కాదు. దానిని పూర్తిచేయుటకు ఆర్థికసభ్యుడు వేరుమార్గముల నవలంబించి యుండవలసినదని మా అభిప్రాయము) కాని అట్లుచేయక ఈరక్షణపన్నును విధించుటయును అందునను లాంకషైరుకు ప్రత్యేకసౌకర్యములు కల్పించుటకు ప్రయత్నించుటయు అన్యాయము. కాని ఒక విషయమునుగురించి మాత్రము మనము సంతోషించవలసియున్నది. చాల కాలమునుండి మన దేశపు బట్టలయంత్రశాలల యజమానులు తమ పరిశ్రమచాల కష్టదశలోనున్నదనియు, తీవ్రనష్టములకు లోనగుచున్నదనియు, విదేశీయ దిగుమతులవలన పోటీవలన తమకు చాలనష్టము కల్గుచున్నదనియు, తమ పరిశ్రమను నిలువబెట్టుటకు రక్షణపద్ధతిని ప్రభుత్వమువారు ప్రవేశపెట్టినగాని లాభములేదనియు అనేకసార్లు విన్నపములు చేసికొని యున్నారు. ఈ విన్నపముల ఫలితముగ ౧౯౨౮ సంవత్సరములో ప్రభుత్వమువారు ప్రత్యేక సుంకముల విచారణసంఘము నొకదానిని బట్టలపరిశ్రమ విషయమై ఆలోచించుటకు ఏర్పాటు చేసియుండిరి. వారు మిల్లుయజమానులు తగినశక్తి సామర్థ్యములతో పరిశ్రమను నడుపుటలేదనియు, ఎక్కువ మూలధనమును దానియందు పెట్టి లాభములకొరకైయే ప్రయత్నించుచున్నారనియు, రాబడిఖర్చులకు సమన్వయించుటకు వారు ప్రయత్నించుట లేదనియు, వారు తమ బాధ్యతలను సరిగనిర్వహించి ఈ లోపములను తీసివేయుటకు ప్రయత్నించిన ప్రభుత్వమువారు రక్షణనిచ్చి తోడ్పడవలెనని యు సూచించియుండిరి. అప్పటికి మనబట్టల పరిశ్రమకు తీవ్రమైన పోటీ జపాన్ దేశమునుండి అందునను ముఖ్యముగ ముతక తెల్లబట్టలను తయారుచేయుటలో నుండెడిది. దానిపై ప్రభుత్వమువారు జపాన్‌నుండి దిగుమతియగు బట్టలపై కొంతసుంకమును విధించుట కేర్పాటుచేసి మూడు సంవత్సరములవరకు ఆసుంకము ఆచరణయందుంచబడుటకు నిశ్చయించిరి. ఇప్పుడుతిరిగి చైనాదేశపు పోటీ ఎక్కువగనున్నది. దీనినిగూర్చి మిల్లుయజమానులు చేసిన విజ్ఞాపనలననుసరించి ఇప్పుడీరక్షణపన్నును ప్రభుత్వమువారు విధించుటకు నిర్ణయించిరి. ఇప్పటికైనను వారికి ఈతలంపు తోచినందులకై మిల్లుయజమానులును దేశస్థులును సంతోషించవలసినదే. బట్టల పరిశ్రమ మన దేశీయ పరిశ్రమలలో పురాతనమైనది. సుమారు ౮౦ సంవత్సరముల క్రిందటినుండి అది నెమ్మదిగ కొనసాగుచున్నది; దానిలోని మూలధనము సుమారు నూరుకోట్ల రూపాయలు మనదేశస్థులదే. కాని ఎప్పటికప్పుడే ఇండియా ప్రభుత్వమువారు దానిపై శీతకన్నువైచి దానికి తగిన సహాయము చేయుటకు వెనుదీయుచునే యున్నారు. టారిఫ్‌బోర్డువారు వ్రాసినట్లు మిల్లు యజమానులవద్ద అనేకలోపము లుండవచ్చును; కాని వాటిని పురస్కరించుకొని దేశీయ పరిశ్రమలలో అగ్రస్థానములో నున్న బట్టల పరిశ్రమను అణచజూచుట ప్రభుత్వమువారికి తగదు. ౧౯౨౬ సంవత్సరము వరకును హిందూదేశపు మిల్లులలో తయారైన బట్టలపై ప్రభుత్వమువారు పన్నును విధించుచుండిరి. దానివలన పరిశ్రమ పడిపోవు పరిస్థితులేర్పడినప్పుడు రీడింగు ప్రభువు దానిని ఆర్డినెన్సుమూలముగ తీసివేయుట తటస్థించినది. తరువాత జపాన్ వారిపోటీ; తరువాత చైనా దేశస్థులపోటీ; ఇట్లువరుసగా ఏదోమూలనుండి ఆ పరిశ్రమకు నష్టమే వచ్చుచుండెను. అదికాక ప్రపంచస్థితులవల్లను, మిల్లులలో పనిచేయు కూలీలసమ్మెకట్ల వలననుకూడ మిల్లు పరిశ్రమ కష్టకాలములో నున్నదని స్పష్టమగును. వీటినన్నింటిని బట్టి చూచిన మిల్లు పరిశ్రమ దేశీయుల ఆదరణకును ప్రభుత్వమువారి సంరక్షణకును పాత్రమైనదని చెప్పవచ్చును.

కాని ఆర్థిక సభ్యునను తరువాత వర్తకసభ్యుడు (సర్ జార్జి రైనీగారు)ను చేసిన ప్రసంగములో లంకాషైరు వారికి లాభము వచ్చునట్లు చేయుట కామోదించు భాగమును మాత్రము మనమామోదింప జాలము. అసెంబ్లీ సభ్యులలో కూడ ఈవిషయమై తీవ్రాభిప్రాయము ప్రబలియున్నదని వినుటకు సంతోషముగా నున్నది. మనము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లంకాషైరు పరిశ్రమకు ఎందులకు సహాయము చేయవలెను అను విషయము నాలోచించిన ఏ వివిధమైన బలమగు కారణముకాని స్ఫురించుటలేదు. రాజకీయముగ చూచిన ఇంగ్లండునందలి వర్తకులు మొదలగువారు మనదేశ స్వాతంత్ర్యమునకు ఎల్లప్పుడును విముఖులుగ నేయున్నారు. ఇకముందుకూడ వారావిషయములో క్రొత్తమార్గ మవలంబింతురని యనుకొనుటకు తగిన నిదర్శనము లేమియు లేవు. ఆర్థిక దృక్పథమునుండి చూచినకూడ ఈ 'ఇంపీరియల్ ప్రిఫరెన్సు' (Imperial Preference) పద్ధతివలన లాభము లేదనియే తేలును. మనదేశము ప్రపంచమందలి ఎగుమతిచేయు దేశములలో ప్రధానస్థాన మాక్రమించుచున్నది; మనదేశపు ఎగుమతులలో సుమారు ౧౦౦ కి ౮౧ వంతు జపాను ఇంకను ఇతరదేశములకే (అనగా బ్రిటిష్ సామ్రాజ్యమునకు చెందని దేశములు) పోవుచున్నవి. అట్టి సందర్భములలో ఆదేశములనుండి దిగుమతియగు సరకులపై బ్రిటిష్ దేశమునుండి దిగుమతులపై కంటె ఎక్కువపన్నును విధించుటవలన వారికిని మనదేశమునకును మధ్యనున్న స్నేహమును సఖ్యమును చెడగొట్టుటయే యగును కాని వేరుకాదు. ఈ ఇంపీరియల్ ప్రిఫరెన్సు విధానమును ఇదివరలో ౧౯౧3 సంవత్సరమందు బ్రిటిష్ ప్రభుత్వమువా రొకసారి ప్రతిపాదించుటయు దానివలన నష్టమేకాని మనదేశమునకేమియు లాభము లేదని ప్రభుత్వమువారు త్రోసి పుచ్చుటయు జరిగినది. అప్పటికిని ఇప్పటికిని పరిస్థితులలో ఏమియు మార్పు కలుగలేదు. ఆదేకాక మనదేశపువర్తక వ్యాపారము పూర్వముకన్న ఎక్కువగ సామ్రాజ్యాంతర్గత భాగములు కాని దేశములతో జరుగుచున్నది. అందును జపాను దేశముతోను, అమెరికాతోను మనకెక్కువ వ్యాపారము సాగుచున్నది. మరియు జపాను మన ఆసియాఖండమునకుచెందినదేశము. ఎప్పటికైనను మనకు వారితో ఎక్కువ సంబంధముండుట కవకాశములున్నవి. లంకాషైరు లాభముకొరకై జపానుతో మనము కలహించుట ముందు ముందు చాలనష్టము. తరువాత జపాను బట్టల మిల్లు యజమానులు ఈరక్షణపన్ను తమకుచాల నష్టదాయకమనియు దానిని తీసివేయుట అవసరమనియు విన్నపము పంపియున్నారు. ఈవిషయమై అసెంబ్లీలో సుంకపు బిల్లు సందర్భములో మాట్లాడుచు బి. దాస్‌గారు స్పష్టీకరించియుండుట సమంజసముగా నున్నది.

రక్షణవిధానమును గూర్చి ఆలోచించవలసిన ప్రతి సందర్భములోను గమనించవలసిన ముఖ్యాంశమొకటి కలదు. అదియేదన అవిధానమువలన రక్షణ ఈయబడుచున్న వస్తువునుగాని వస్తువులనుగాని ఉపయోగించు ప్రజలకు దానివలన నష్టమున్నదా లేదా యనునది. దేశీయ పరిశ్రమలను పరదేశపుపరిశ్రమల పోటీనుండి కాపాడుటకు కొంత నిర్ణీతకాలముపరకు రక్షణ నిచ్చుటయు దానివలన కలుగు ఖరీదుహెచ్చుదలను ప్రజలుభరించుటకు ఒప్పుకొనుటయు సాధారణమైన విషయము. కాని ప్రస్తుతము చర్చనీయాంశమగు 5%అదనపు రక్షణపన్నును ఇంగ్లండునుండి కాక ఇతరదేశములనుండి దిగుమతియగు బట్టలపై విధించుట పైనచెప్పబడిన సందర్భములం దన్వయించునాయను విషయము చర్చనీయము. దానివలన మనదేశపు బీదప్రజలకు జపాన్‌చైనాదేశములనుండి దిగుమతియగు ముతకగుడ్డల నుపయోగించు ప్రజలకు గొప్పబరువు నెత్తినట్లగును. ఎందువల్లనన నూటికి ౫ రూపాయిలవంతున విధింపబడు ఈపన్నును ఆదేశవర్తకులు మనదేశప్రజలపై త్రోసివేయుటకు ప్రయత్నింతురు. అట్లుగాక వారారకపు బట్టలను దిగుమతిచేయుటయే మానుకొనిన, ఎక్కువఖరీదే కల్గినట్టియు, అనవసరమైనట్టియు లంకాషైరు గుడ్డలనే మనదేశీయులు ఉపయోగించుట తప్పనిసరియగును. మనదేశములోని మిల్లులు మదేశమునకంతకును సరిపోవుగుడ్డను తయారుచేయుట కష్టము. సర్ జార్జి రైనీగారు సుంకముల బిల్లును అసెంబ్లీలో ప్రవేశపెట్టుచు హిందూదేశ ప్రజలకు నష్టమురాకుండ చూచుటయు, బట్టల మిల్లుపరిశ్రమకు వీలగునంత సంరక్షణ నిచ్చుటయే తమయొక్కయు ప్రభుత్వము వారియొక్కయు ప్రధానోద్దేశమని చెప్పియుండిరి, ఆ సంగతి ఎంతవరకు నిజమో ముందుగాని తెలియుట కష్టము. కాని యీ పద్ధతివలన గొప్పలాభము చేకూరుట కవకాశ మున్నది. ఈపన్ను అవకాశమును పుచ్చుకొని మననాయకులు దేశములో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీవ్రప్రచారము చేసిన, దానివలన ఖద్దరు ఎక్కువ అభివృద్ధియై దాని అమ్మకము హెచ్చుటకు చాల సావకాశమున్నది.

ప్రభుత్వమువారు ప్రవేశ పెట్టదలంచిన (ఇంపీరియల్ ప్రిఫరెన్సు) విధానమువలన ఏవిధముగ చూచినను నష్టమేకాని లాభము లేదని తేలుచున్నది. ప్రజలకా హెచ్చు పన్నువలన బట్టలకు రీ దెక్కువయై నష్టము కల్గును; జపాను దేశముతోనా మనకు పోటీ హెచ్చయి ముందు ముందు స్నేహమునకు కీడువాటిల్లును. లంకాషైరుకా చాలలాభము కల్గి వారిసరకులు మన దేశములోనికి దిగుమతి హెచ్చగను. వాళ్వ్యాపండితుడు అసెంబ్లీలో చెప్పినట్లు ఈ పన్నువలన లంకషైరు బట్టలవర్తకమునకు ఏబుద్ధమైన లాభము మనకు లేకుండగనే మనము నూటికి ౧౪ రూపాయిల వంతున లాభమును కూర్చిపెట్టినవార మగుదుము. మన దేశపుబట్టల పరిశ్రమకు డబ్బుసహాయము ఏమియు ప్రభుత్వమువారు చేయునవసరము లేదు. దానికి కావలసినది నిర్మొగమాటమైన పోటీనుండి సరిపోవునట్లుగా కాపాడు సంరక్షణ విధానము మాత్రమే. ఆపరిశ్రమ యొక్క తాత్కాలిక అసహాయతను అనుగా పుచ్చుకొని ప్రభుత్వమువారు లంకాషైరు పరిశ్రమకు సహాయము చేయజూచుట హిందూదేశపు ఔన్నత్యముపై వారి కెంత మక్కువ కలదో తెల్పుచున్నది. ఇదివరలో ఉక్కుపరిశ్రమ సంరక్షణ సందర్భములో కూడ ప్రభుత్వమువారిట్లే ఇంగ్లీషు ఉక్కుపరిశ్రమకు లాభము చేకూర్చి పెట్టిరి. కాని అప్పుడు ఇంత తేట తెల్లముగ వారిఅభిప్రాయములను వారు వెలిబుచ్చి యుండలేదు: ఈపద్ధతిని అసెంబ్లీవారి నామోదింపవలెనని కోరుటలో ఇండియా ప్రభుత్వమువారు క్రొత్తగా ఏర్పడిన (యూనైటెడ్ ఎంపైరు పార్టీ రోధరుమీయరు, బీవరు బ్రూక్ ప్రభువులచే స్థాపింపబడినది) వారి ఆదర్శములను నిర్మొగమాటముగ ఆమోదించిరనుటకు సందేహము లేదు. అసెంబ్లీలో ప్రస్తుతము కాంగ్రెసుపార్టీవారు లేకపోవుటచే ఆర్థికసభ్యుడును, వ్యాపారసభ్యుడును తమప్రతిపాదనలకు తేలికగ ఆమోదనను బడయవచ్చును కాని, దేశములో మాత్రము వాటికి తీవ్రప్రతికూలమున్నదని ప్రభుత్వమువారు తెలిసికొనుట ముఖ్యము. బొంబాయిమిల్లుయజమానులు ఆవిధానమును ఆమోదించుటకు సిద్ధపడియుండవచ్చును కాని వారికి వేరువిధముగ చేయుటకు అవకాశము లేకుండ ప్రభుత్వమువారు పరిస్థితులను కల్పించిరి. ప్రభుత్వమువారి సూచనలను వారంగీకరించక పోయినచో తమపరిశ్రమకువచ్చు రక్షణ పోవునని వారు ప్రభుత్వమువారితో ఏకీభవించిన ఏకీభవించవచ్చును. కాని ఇతరులుమాత్రము ఇంపీరియల్ ప్రిఫరెన్సుకు తమవ్యతిరేకాభిప్రాయమును వెలిబుచ్చుట ముఖ్యము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



"భా ర తి"

ఛాయాచిత్రకారుడు: యమ్. కె. రంగస్వామయ్యంగారు, మద్రాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఏకామ్రనాథాలయ తటాకము-కంచి

ఛాయాచిత్రకారుడు: యమ్. కె. రంగస్వామయ్యంగారు, మద్రాసు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కాపయనాయకుడు

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

ఈ కాపయనాయకునిగుఱించి కొంతకాలమునకు పూర్వము 'రెడ్డిరాణి' పత్రిక కొకవ్యాసము వ్రాసియుంటిని. ఈ విషయమును గుఱించియే యింకను పరిశోధనచేయగా తేలిన విషయములనుజేర్చి వెనుకటివ్యాసమును సవరించి యీ వ్యాసమును వ్రాయుచున్నాను.

౧

ఓరుగంటి కాకతీయాంధ్రసామ్రాజ్య విధ్వంసానంతర దేశస్థితి అనితల్లికలువచేరు శాసనమున[1] ఇట్లు అభివర్ణితమైనది:

తస్మిన్ ప్రతాపరుద్రే స్వస్థానం
స్వేచ్ఛయైవ యాతవతి
అథ సా భూ ర్యవనమయీ
జాతైవాహో మహామహో మహిమా.

వరాహవ ద్వారిధివారిమగ్నాం
ధరా మశేషాం యవనోదరస్థాం
సముద్ధరన్ ప్రోలయనాయకేంద్ర
స్తతః ప్రతిష్ఠాపయతిస్మ తద్వత్.

స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే
విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్య గత్వా
అపాలయ త్కాపయనాయకేంద్ర
స్తదీయ్యరాజ్యం తరణిప్రతాపః.

అథ పంచోత్తరసప్తతి నాయక
సంసేవ్యమాన పదపద్మః
కాపానవనీశ్వరః శ్రీవిశ్వేశ్వర
కరుణయా క్షితి మరక్షత్.

తురుష్కై ర్యే సమాక్రాంతా
స్తే చాఽన్యే కాపభూభుజా
అగ్రహారాః పున ర్దత్తా
భూయో భువ సుభూభుజాన్.

విశ్వేశ్వరాయ వివిధాం ప్రవిధాయ సేవాం
యాతే విభౌ దివిచ తత్పదసేవనాయ
తై ర్నాయకై స్స్వనగరా ణ్యధిగమ్య సర్వై
స్సంరక్షితా గతవిరోధకథై స్వదేశాః.

పై శ్లోకములభావమిది: ప్రతాపరుద్రుడు గతించినపిదప యవనోదరస్థమైన అశేషదేశమును ప్రోలయనాయకు డుద్ధరించెను. ఆతడు దివంగతుడైన యనంతరము కాపయనాయకుడు రాజ్యముచేసెను. అతనిక్రింద డెబ్బదియైదుగురు నాయకులుండిరి. కాపయనాయకుడు తురుష్కులాక్రమించుకొనిన యగ్రహారములను భూసురులకు మఱల నిచ్చుటయేకాక వారి కనేక నూతనాగ్రహారములనుగూడ దానమొనంగెను. ఆతడు విధివశుడైన యనంతరము అతనికి సామంతులుగ నుండిన డెబ్బదియైదుగురు నాయకులును స్వనగరములకరిగి స్వదేశమును పాలించి పరిరక్షించుకొనజొచ్చిరి. వారిలో వేమనరేశ్వరు డొక్కడు.

కాకతీయసామ్రాజ్య పతనానంతర దేశస్థితియును, ప్రోలయ, కాపయనాయకాదుల విషయమును ఈకలువచేరు శాసనమువలన మాత్రమే తెలియుచున్నది; కాని యీయుగు

1. ఆం. సా. ప. ప. సం. ౧. సం. ౨.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వురు నాయకులకుగల పరస్పరసంబంధమెట్టిదో విశదమగుటలేదు. మహమ్మదీయాధికారదాస్యమునుండి విడిపించి దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించిన యీనాయకు లెవ్వరో, వారిరువురకుగల పరస్పరసంబంధమెట్టిదో తెలిసికొన బ్రయత్నింతము.

౨

ఏతత్ప్రియత్నసాఫల్యమునకు ఆకాలము నాటి నాయకరాజుల శాసనములు తక్క వేఱొం డాధార మేదియు లేదు. ఒకటి రెండు తక్క ఇవి యన్నియు ప్రాక్సముద్రతీరస్థ ఆంధ్రదేశమునమాత్రమే కానవచ్చుచున్నవి. పరిశోధించిచూడ ఇట్టివి యీక్రిందిశాసనములు కలవు:

(౧) కొప్పుల నామయ నాయకుని దోనెపూండి శాసనము[2]—శ. ౧౨౫౯.

(౨) కాపయ నాయకుని గణపేశ్వరము శాసనము[3]—శ. ౧౨౬౮.

(౩) కాపయ నాయకుని పిల్లలమఱ్ఱి శాసనము[4]—శ. ౧౨౭౫.

(౪) కొప్పుల కాపయనాయుని సింహాచలము శాసనము[5]—శ. ౧౨౭౨.

(౫) కొప్పుల నామయనాయకుని సింహాచల శాసనము[6]—శ. ౧౨౯౧.

(౬) ముప్పమదేవి సింహాచల శాసనము[7]—శ. ౧౩౧౦.

పై పట్టికలోని మొదటిశాసనము నందలి నామయనాయకుడు పిఠాపురము రాజధానిగ గౌతమనదీతటము మొదలుకొని కళింగము వఱకుగల "ఆంధ్రఖండమండలము"ను పరిపాలించెను. అతడు ప్రోలయనాయక, చోడమాంబల కొమారుడు: కొప్పుల కాపయనాయకుని మనుమడు. "పగమెచ్చుగండ" బిరుదాంచితుడు: ప్రత్యర్థిగర్వనిర్వాపహుడు.

కాపయనామమునం బరగు నాయకుని మొదటిశాసనము కృష్ణామండలము దీవితాలూకా గణపేశ్వరమున గానవచ్చుచున్నది. అది కాపయనాయకుని భృత్యుడైన "తుంబిడి ఉప్పలపుంబ్రోలులెంక" తనస్వామికి ధర్మువుగా దీవి గణపతీశ్వర దేవరకు చేసినదానమును దెలుపుచున్నది. ఈశాసనమున కాపయనాయకునికి "అఱుమనంగంటి పురవరాధీశ్వర" బిరుదము కలదు.

"ఆంధ్రదేశాధీశ్వర", "అనుమనగంటి పురవరాధీశ్వర" బిరుదముల నొప్పు కాపయనాయకుని పేర్కొను శాసన మింకొకటి కలదు. పై పట్టికలోని మూడవశాసన మిదియె.[8] ఇం దాతనినిగుఱించిన విశేషము లేవియులేవు.

2. Ep. Ind. IV, p. 356.
3. S. I. I. Vol IV, No. 950.
4. 'సుజాత' సం. ౧. సం. ౨.
5. S. I. I. Vol VI, No. 821.
6. S. I. I. Vol VI, No. 924.
7. S. I. I. Vol VI, No. 822.

8. హైద్రాబాదు ఆంధ్రపరిశోధకసంఘమువారు "పిల్లలమఱ్ఱిశాసనము"లను శీర్షికక్రింద "సుజాత"పత్రిక రెండవసంచికలో దీనిని ప్రకటించియున్నారు. కాని యీశాసనమున వారిచ్చిన పాఠముప్రకారము నాయకుని పేరు "కాచయ"యని కలదుకాని "కాపయ"యనిలేదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శకవర్షము ౧౨౮౨నాటి సింహాచలము శాసనము కొప్పుల కాపయ నాయకునిది. అది యాతడు చేసిన దానమును మాత్రము తెలుపును. ఇతర విశేషములు మృగ్యములు.

శకవర్షము ౧౨౯౧నాటి సింహాచలము లోని మఱియొక శాసనము నామభూపాలుడను కొప్పులనామయనాయకునిది. ఇతడు చతుర్థ వంశజుడని శాసనమువలన దెలియును.

పై పట్టికలోని కట్టకడపటి శాసనము కొప్పులయంగారి దేవులు ముప్పమ దేవులు 'కొప్పులయం గారికి.........ర్యాభివృద్ధిగా నున్ను, తమకు ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధిగాను, (శ్రీ) సింహాద్రి నరసింహనాథునికి [అం]దులాపల్లి అను గ్రామమును దానము చేసినట్లు కలదు. ఈ శాసనముయొక్క దాన కాలము శకవర్షము ౧౩౧౦ నాటికార్తిక కృష్ణసప్తమి గురువారము.

సింహాచలముననే పైపట్టికలోనికి రాని నాయకశాసన మింకొకటి కలదు.[9] అందలి విషయమిది:

కృష్ణాగౌతమ వాహినులచే పరివృతమైన 'గుద్రవాటీ'విషయమునకు కాపయాఖ్యనృపతి అధిపతి. కొప్పుల వంశవార్ధినగరుడైన ఆకాప భూపతికి ప్రోలక్షమావల్లభు డుదయించెను. ఆతనికి కొప్పులనాయకుడు కలిగెను. ఇతనికే కొప్పభూపతి యనియుపేరు. కొప్పులనాయని కొడుకు ప్రోలయ నాయకుడు.

వంశావతారక్రమము నింతవఱకు తెలిపిన పిదప శాసనము 'అందలాపల్లి' గ్రామము దాన మొసంగబడినట్లు తెలుపును. ఈ పట్టున శాసన శిల చెడినది. కావున దాన మిచ్చిన వారి పేరు తెలియరాదు. దాన కాలమును దెలుపు శకవర్ష సంఖ్యలోని కడపటి అంకెలు '౧౦' మాత్రము మిగిలినవి. మొదటి రెండంకెలు పోయినవి.

ఈ రెండు శాసనములను దగ్గర పెట్టుకొని చదివినచో రెండు నొకటిగనే కనిపించును. ముప్పమదేవి శాసన మన్నది అసలు శాసనములోని కడపటిభాగము: ఇది తెలుగున నున్నది: కొప్పుల వంశజులను గుఱించి కొంత సమాచారమును దెలుపు రెండవ శాసనము అసలు శాసనములోని మొదటి భాగము: ఇది సంస్కృతమున నున్నది. దానమీయబడిన గ్రామము రెంట నొక్కటే_

"కాచయ"యనుపాఠము ప్రమాదమని నాయభిప్రాయము. గణపేశ్వరము శాసనమునందలి నాయకునియొక్కయు, ఈపిల్లలమఱ్ఱి శాసనమునందలి నాయకుని యొక్కయు కాల మించుమించుగ నొక్కటే. "అఱుమనంగంటిపురవరాధీశ్వర"బిరుదము నొక్కటే. గణపేశ్వరము శాసనములోని "అఱుమనంగల్లు"ను, పిల్లలమఱ్ఱి శాసనములలోని "అనుమనగల్లు"ను ఒక్కటే. ఈగ్రామము నిజాంరాజ్యమున నల్లగొండజిల్లా సూర్యాపేటతాలూకాలోని పిల్లలమఱ్ఱికి పదిమైళ్లదూరమున ఇప్పుడు ఆమనగల్లు అనుపేర నున్నది. గణపేశ్వరము, పిల్లలమఱ్ఱి శాసనములలో బిరుదమున పేర్కొనబడిన గ్రామ మొక్కటే యగుటంజేసియు పిల్లలమఱ్ఱి శాసనపు "కాచయ" ప్రాయికముగ "కాపయ" నాయకుడే కానోపునని ఆశాసనమునుగూడ పై పట్టికలో చేర్చితిని.

9. S. I. I. Vo, No. 823.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందలాపల్లి[10]. ముప్పమ దేవి కొప్పభూపతి యన బరగు కొప్పులనాయని భార్య: (రెండవ) ప్రోలయనాయకుని తల్లి. ఈ రెండు శాసనములు నొక్కటియే యని తెలుచున్నది. గనుక నాయకవంశావతారక్రమమును దెలుపు శాసనము కాలముకూడ శకవర్షము ౧౩౧౦ యే కాదగును. అందలి ఉత్తరార్ధసంఖ్య ౧౧ యని యిదివఱకు దెలిసియే యున్నది. కావున పూర్వార్ధసంఖ్య ౧౩ కావచ్చును.

ఈశాసనమును, ముప్పమదేవి శాసనము నొక్కటేమైనను, ఈశాసనమును సౌకర్యము నిమిత్తము రెండవ ప్రోలయనాయకుని శాసనమని వ్యవహరింతము.

నామయనాయకుని దోనెపూండి శాసనమును, రెండవ ప్రోలయనాయకుని సింహాచలము శాసనమును సమన్వయించి చూచినచో కొప్పుల నాయకులవంశావతారక్రమము ఈ దిగువరీతిని గుదురును:




శకవర్షము ౧౨౮౨నాటి కాపయనాయకుడును, శకవర్షము ౧౨౯౧నాటి నామయనాయకుడునుగూడ కొప్పులవంశ సంభవులే. వారి శాసనములందు వారిని గుఱించిన విశేషము లేవియు లేకపోవుటచేత పై వంశవృక్షమున వారిస్థాన మెచ్చటో నిర్ణయింప వీలుకాదు. కాని యాంధ్రదేశమున తాతలపేరు మనుమలకు పెట్టు ఆచారము కలదు గాన ఒకవేళ శ. ౧౨౯౧నాటి నామయనాయకుడు శకము ౧౨౭౯ నాటి నామయనాయకుని మనుమడు కావచ్చును లేదా శకవర్షము ౧౨౮౨ నాటి కాపయనాయకుడును, శ. ౧౨౯౧నాటి నామయనాయకుడును కూడ కొప్పులనాయకుని కొమారులేమైనను గావచ్చు. ఎట్లయినను ఇవియెల్ల వట్టియూహలే. వీరి పరస్పర బాంధవ్య నిర్ణయమునకు తగినయాధారము లేవియు లేవు.

## 3

కొరుకొండ రాజధానిగ ఆంధ్రదేశమును పాలించిన నాయకరాజులు కొందఱు కలరు. ప్రాచీనకాలమున నొకప్పుడు ముక్కంటి సార్వభౌముడు గంగాతీరమునుండి మంచికొండ నామములంబరగు ఇరువురు నాయకవంశ ముఖ్యులను త్రిలింగదేశమునకు దీసికొని వచ్చెనట. వా రిరువురును దమ యిరువురిపేళ్లతో ఒక పట్టణమును గట్టిరి. దానికే 'మంచికొండ'యని

10. శాసనసంపుటమున ఇది [అ]దులాపల్లియని కలదు. ఈపాఠము పొరపాటనియు, [అం]దలాపల్లియే సరియైనపాఠముగ నుండుననియు నా యభిప్రాయము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పేరు. వారివంశములోనివారికి 'మంచికొండ' యే గోత్రమయ్యెను.[11] ఈ మంచికొండ గోత్రజుల వంశావతారక్రమ మిది.




ముమ్మడినాయకుని శాసనములు రెండు మాత్రమే కానవచ్చుచున్నవి. మొదటిది శకవర్షము ౧౨౭౫ నాటి కోరుకొండ స్తంభశాసనము.[12] రెండవది శకము ౧౨౮౦ నాటి శ్రీరంగము తామ్రశాసనము.[13] ముమ్మడినాయకుడు కాపయనాయకేంద్రుని తోబుట్టువు కూతురిని వివాహమైనట్లు ఆతని శ్రీరంగము శాసనమున నిట్లుకలదు.

> కన్యాం స్వసుః కాపయనాయకేంద్రః
> శ్రీరత్నభూతా ముపదాయ తస్మై
> ప్రతీతిరూపాన్వయ పౌరుషాయ
> పరార్థ మాత్మానమమన్యత స్వం.

ఈ విషయమే ముమ్మడినాయకుని సోదరుడైన సింగయనాయకుని శకవర్షము ౧౨౯౦ నాటి అక్కలపూండి శాసనమున[14] గూడ ఇట్లు తెలుపబడినది.

> ప్రఖ్యాతాంధ్రసురత్రాణః
> స్వయం కాపయనాయకః
> తస్మై స్వసు స్సుతాం ప్రాదా
> న్ముమ్మడీంద్రాయ భూభుజే.

పై శాసనముల మూలమున (శకవర్షము) పదుమూడవ శతాబ్ది (అనగా క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్ది) కడపటిభాగమున "ఆంధ్రసురత్రాణ" బిరుదాంచితుడును, ముమ్మడినాయక, సింగయనాయకులకు సమకాలికుడును అగు మఱియొక కాపయనాయకుడు కలడని తెలియవచ్చుచున్నది. ఈత డెవరు?

ఇతడు "ఆంధ్రదేశాధీశ్వర", "ఆంధ్రసురత్రాణ" బిరుదములు రెండు నొకేయర్థమును సూచించున వగుటచేత "అఋమనంగంటిపురవరాధీశ్వర", "ఆంధ్రదేశాధీశ్వర" బిరుదములతో నొప్పు శకము ౧౨౬౮, ౧౨౭౯ సంవత్సరములనాటి గణపవరము, పిల్లలమఱ్ఱి శాసనముల కాపయనాయకుడు కావచ్చును. ఇందుకు శాసనములనుబట్టి కాలము సరిపోవుచున్నది.

## ౪

ఇప్పుడు ముగ్గురు కాపయనాయకులు గలరు. కొప్పుల వంశసంభవులు ఇరువురు— మొదటి ప్రోలయనాయకుని తండ్రి యొకడు: శకము ౧౨౮౨ నాటి కాపయనాయకు డొక

11. Ep. Ind. Vol. XIV, p. 90, vv 7&8.
12 Govt. Ep. Coll. No. 44 of 1912.
13. Ep. Ind. Vol XIV, p. 83.
14. Ep. Ind. Vol XIII, p. 259.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు—; గణపవరము, పిల్లలమఱ్ఱి శాసనోదాహృతుడు,ఆంధ్ర దేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ, అఱుమనంగంటి పురవరాధీశ్వర బిరుదాంచితుడు,ముమ్మడినాయకుని సమకాలికుడును బంధువు అయిన కాపయనాయకు డొకడు. ఈ మువ్వురిలో కాకతీయ సామ్రాజ్యము పడిపోయిన పిదప యవనవారిధిమగ్నమయిన దేశము నుద్ధరించినవా రెవ్వరో గుర్తింపవలసి యున్నది. ఇంతియగాక దేశమన ఇచట ఆంధ్ర దేశమున కంతకు వర్తించునో లేదో కనుగొనవలయును.

మహమ్మదీయాధికారదాస్యమునుండి దేశమును విడిపించి స్వాతంత్ర్యమును సంపాదించినది "ఆంధ్రసురత్రాణ" బిరుదాంచితుడును, ముమ్మడినాయకుని బంధువు అయిన కాపయ నాయకుడే యని కీర్తిశేషు లైన రావుసాహేబు శ్రీ హెచ్. కృష్ణశాస్త్రిగారు తెలిపియున్నారు;[15] కాని యిది పొరపాటు.

కలువచేరు శాసనము ప్రకారము కాపయనాయకుని డెబ్బదియైదుగురు సామంతులలో వేమన రేశ్వరు డొక్కడు. ఈతనినే ప్రోలయ వేమభూపతి యందురు. ఇతడే (కొండవీటి) రెడ్డిరాజ్యసంస్థాత. అద్దంకి యీతని రాజధాని. కాపయనాయకుని మరణానంతర మీతడు స్వతంత్రుడై తనపాలబడిన దేశము నేలినవా డగుటచేత కాపయనాయకు డీతని రాజ్యారంభకాలమునకు పూర్వమే గతించి యుండవలెను. కాని వేమభూపాలుని రాజ్యారంభ కాలము విషయమున పరిశోధకపండితులలో భేదాభిప్రాయములు కలవు. ఈతని రాజ్యారంభము— స్వతంత్రముగ—శకవర్షము ౧౨౪౭ లోనని శ్రీయుత జయంతి రామయ్యపంతులు గారును[16], శకవర్షము ౧౨౪౬ లో నని ఆంధ్ర చరిత్ర చతురానన బిరుదాంచితులు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారును[17] వ్రాసియున్నారుకాని యీ తేదులు సరియైనవి కావని నా యభిప్రాయము. ఏలయన వేమభూపతి రాజధానియైన యద్దంకి కింకను దిగువనున్న కందుకూరిలో శకవర్షము ౧౨౪౪ నాటి కింకను కాకతీయప్రతాపరుద్ర దేవమహారాజుల శాసనములు[18] కలవు. కాకతీయసామ్రాజ్య మప్పటి కింకనుఅస్తమింపనేలేదు. ఓరుగంటిపై మహమ్మదీయుల కడపటి దండయాత్ర క్రీ. శ. ౧౩౨౩ (శకము ౧౨౪౫)లో జరిగెను[19]. ప్రతాపరుద్రుడు మహమ్మదీయులచే పరాజితుడై చెఱబెట్టబడి డిల్లీకి గొనిపోబడినను ఆతడనతికాలముననే కారాగారవిముక్తుడైనట్లు తె

15. Ep. Report for 1912-13, p. 129. శ్రీకృష్ణశాస్త్రిగారు వ్రాసినదానిని సింగయనాయకుని అక్కలపూండి శాసనమును పరిష్కరించి ప్రకటించిన శ్రీయుత కే. రామశాస్త్రిగారుకూడ అంగీకరించినట్లు కనబడును. వారీవిషయమున నేదియు చర్చించియుండ లేదు. చూడుడు. Ep. Ind. Vol XIII, p. 261.

16. Ep. Ind. Vol. VIII. p. 13.

17. ఆంధ్రు: చరిత్ర. సం 3. పుట ౧౩౭.

18. N. I. Vol II, Kr. 40 p. 561. బాపట్ల, నర్సారావుపేట తాలూకాలలోకూడ శకము ౧౨౪౪ నాటి శాసనములు కాకతీయప్రతాపరుద్రునివి చాల కలవు.

19. Sarikhi-Mubarak—shahi; Tr. Jour. B.O R. S. Vol XV, p. 180.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుపు గాథలు కలవు[20]. ప్రతాపరుద్రుని సేనానాయకులలో నొకడైన రేచర్ల సింగమ నాయనికి 'రాయబందీ విమోచక' బిరుద ముండుటచేత[21] ఒకవేళ నిది ప్రతాపరుద్రుని చెఱవిడిపించుటచేత వచ్చినదేమో యని యనుమానింప నవకాశము కలదు. అదియునుగాక ప్రతాపరుద్రుని శాసనములు శకము ౧౨౪౮ (క్రీ. శ. ౧౩౨౬) వఱకు గానవచ్చును. శకవర్షము ౧౨౪౮ కి సరియైన క్షయలో ప్రతాపరుద్రుని ప్రధానియైన కొలని రుద్రదేవుడు దానము చేసినట్లు తెలుపు శాసనము కలదు.[22] ప్రతాపరుద్రుడు కారాగారమున గాక విముక్తుడయియే కాలము చేసినట్లు కలువచేరు శాసనములోని "ప్రతాపరుద్రే స్వస్థానం స్వేచ్ఛయైవయాతవతి" అను శ్లోకార్థము వలనను దెలియనగును.[23] మహమ్మదీయ చరిత్రకారులుకూడ ప్రతాపరుద్రుడు నిర్బంధమున నుండ గతించినట్లు చెప్పరు[24]. ఈ కారణముల వలన ప్రతాపరుద్రుడు కారాగారవిముక్తుడై శకము ౧౨౪౮ వఱకు పరిపాలనము సాగించినట్లు స్పష్టమగుచున్నది. కావున ప్రోలయనాయక' కాపయనాయకులు దేశమును యవనవారిధి నుండి యుద్ధరించినది శకము ౧౨౪౮ కి తరువాతనే యగును. ఈ కాపయనాయకుడు కూడ గతించిన యనంతరము కాని వేమభూపాలుడు స్వతంత్రముగ రాజ్యమును సంస్థాపించి యేలి యుండలేదు. కావున, ఆతని రాజ్యారంభకాలముగ పైని తెలుపబడిన తేదీలు సరియైనవికావు.

శకవర్షము ౧౨౫౨ కు పూర్వము వేమనరేశ్వరుని శాసనములు కానరావు. స్థానిక చరిత్రములనుబట్టి శకవర్షము ౧౨౫౭ నాటి తామ్రశాసన మొకటి ప్రోలయ వేమారెడ్డిది కలదని తెలియుచున్నది. ప్రోలయ వేమారెడ్డి 'యాపాకుల బ్రహ్మభట్ల సోమయాజులుగారికి పరివోరు(?) గ్రామము నష్టభోగ తేజస్స్వామ్య సహితముగా' దానముచేసినట్లు ఆ శాసనమున గలదట[25]. ఆదానకాల మిట్లు తెలుపబడినది.

> శాకాబ్దే యుగ బాణ భాస్కర యుతే
> ఆంగీరస శ్రీసమే
> వైశాఖే ఉడుపేద్విపే కుజదినే
> శ్రీ వేమభూపాలకః
> బ్రహ్మభట్ల మహీసురాయ నగరీం
> పర్వేటిగ్రామాభిధాం
> ప్రాదా దుజ్జ్వల దష్టభోగసహితా
> మాచంద్రతారార్కగమ్.

దానమీయబడిన గ్రామము పరివేరు అని తెలుపబడినది. ఇది యిప్పటి పలివేరు (గుంటూరుజిల్లా) అగునేమో.

ఈ శాసన మింకను గౌనర్మెంటు శాసనశాఖవారి నివేదికలోనికి రాలేదు. ఈ శాసన

20. ఏకామ్రనాథవిరచిత ప్రతాపరుద్రచరిత్రము, (శైవప్రచారిణీగ్రంథమాలప్రతి: 3 వ అనుబంధము: వరంగల్లు) పుట ౭౬.

21. ఆంధ్రులచరిత్ర. సం ౨. పుట ౩౭౫.

22. Govt. Ep. Coll. No. 308 of 1915.

23. ఎగువ, పుట ౯౬౫.

24. Elliot and Dowson, History of India, Vol III. p.367.

25. Loc. Records, Vol. 57, P, 131.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును వదలివేసినయెడల గౌనర్మెంటు శాసన శాఖవారి ౧౯౧౯-౧౯౨౦వ సంవత్సరపు అయిదవసంఖ్యగల తామ్రశాసనమే ప్రోలయ వేముని మొదటిశాసనము. ఇది శకవర్షము ౧౨౫౭ నాటిది. ప్రోలయవేమారెడ్డి చిట్టమూరి తిమ్మనభట్టుకు చీమకుర్తి, భీమేశ్వరము, పురికొండ, మైలవరము, కుమారుపురి గ్రామములలోని భూమిని దానముచేసినట్లు ఈశాసనము తెలుపుచున్నది.

స్థానికచరిత్రలను విశ్వసించినచో ఆతని శాసనములు శ. ౧౨౫౨ నుండియే కాన్పించుచుండుటవలన ఆతడు శ. ౧౨౫౨ కి ఇంచుక పూర్వముకాని లేక తుదకు ఆ సంవత్సరమున నే కాని స్వతంత్రుడుగ రాజ్యమేలుచుండినట్లు తలంపనగును. ఒకవేళ శకవర్షము ౧౨౫౨ నాటి శాసనమును విశ్వసింపక పోయినను శ. ౧౨౫౭ నుండి యైన ఆతడు స్వతంత్రముగ పాలించుచుండిన ట్లంగీకరింపక తీరదు. ఈ రెంటిలో దేనిని విశ్వసించిననేమి? కడకు శకవర్షము ౧౨౫౭ నాటికైనను ప్రోలయ నాయక కాపయనాయకులు గతించిరని చెప్పవలసియుండును. ఈ కారణములవలన దేశస్వాతంత్ర్య సంస్థాతయైన కాపయనాయకుడు గణపేశ్వరము (శకము ౧౨౬౮), పిల్లలమఱ్ఱి (శకము ౧౨౭౫) శాసనములనాటి కాపయనాయకుడుకాని, శకవర్షము ౧౨౮౨ నాటి కాపయనాయకుడు కాని కాడని స్పష్టమగుచున్నది.

ఇక పీరిరువురను దీసివేసినచో మిగిలిన కొప్పుల కాపయనాయకుడే—శకవర్షము ౧౨౫౯ నాటి కొప్పులనామయనాయకునితాత: ప్రోలయనాయకుని తండ్రి—యవనులను వెడలగొట్టి దేశమున మఱల హిందూరాజ్యమునకు పునాదులు వైచెనని నిస్సంశయముగ దేలుచున్నది.

౫

ఇక ప్రోలయ, కాపయనాయకు లుద్ధరించిన దేశమేదో, కాపయనాయకుడు పాలించిన దేశమేదో తేల్చవలెను. కొప్పుల వంశజుల శాసనములు ప్రాక్సముద్రతీరస్థ ఆంధ్రదేశమున మాత్రమే కానవచ్చుచుండుటచేత ఈ కాపయనాయకుడు ఇప్పుడు ఆంధ్రదేశ మన బరగుదాని నంతను పాలించెనా లేదా యని సంశయము కలుగుచున్నది. అయినను మన కీతని శాసనము లేవియు దొరకక పోవుటవలన ఈవిషయము నించుక తరచుటయుక్తము.

ముందు రాయలసీమను దీసికొందము. ఇది క్రీ. శ. ౧౩౨౦ వఱకు కాకతీయాధికారముననే యుండెను. అనంతరము దీని నెవరు పాలించినది తెలిసికొన నాకాలమునాటి శాసనము లేవియు లేవు. కాని కన్నడబాస నున్న కొమారరాముని చరితము ఈప్రాంతమంతయు కంపిలిరాజుల వశమున నుండిన ట్లూహ యను మానమును గలిగించును.

ముమ్మడి సింగభూపతి కొమారుడైన కంపిలిదేవనృపతి హూసదుర్గము రాజధానిగ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుంతలమును పాలింపుచుండెను. ఓరుగంటి రాజయిన వీరరుద్రదేవు (రెండవప్రతాపరుద్ర దేవుడు)నికి ఈ కింపిలిదేవునికి తరచు యుద్ధములు జరగుచుండెను. ఒకతడవ ఈ కుంతలాంధ్ర దేశాధిపతులకు ఘోరసంగ్రామము జరిగెను. పద్మనాయక వంశజుడైన సింగమనాయడు (రేచర్లసింగమనాయడు) రాజపుత్రి దళములతోను, రెడ్డిపద్మనాయక బలములతోను కంపిలి రాయనిపై దాడివెడలెను. ఈసమరమున ప్రతాపరుద్రదేవుని సైన్యము లోడిపోయెనసియు, రణరంగమున శత్రుసైన్యమును కొల్లగొట్టినపిదప కంపిలిరాయలు సింగమనాయనికి ఏబది తురంగముల నొసంగి సంధియొనర్చెననియు ఆగ్రంథము తెలుపుచున్నది[26].

పరాజితుడైన శత్రువుతో కంపిలిరాయలు సంధికావించుకొనుట యేలాకో తెలియకయున్నది. ఎట్లయిన నేమి? గ్రంథస్థవిషయము లవి. ఏతద్విజయము కారణముగ నిప్పటి గాయలసీమ కంపిలిరాయని రాజ్యముననే చేరినచో అది క్రీ. శ. ౧౩౨౦ తరువాతనే జరిగియుండవలెను: ఏలయన అంతవఱకు ప్రతాపరుద్రదేవునిశాసనము లీప్రాంతముల గాన్పించుచునే యున్నవి. ఈదేశమంతయు తద్యుద్ధకారణముగ కంపిలిరాయని రాజ్యమున జేరినట్లు ఆగ్రంథమున జెప్పబడి యుండలేదు. కాని అట్లూహింపనవకాశమిచ్చు విషయ మిది. కంపిలిదేవునికొమారుడైన కొమార రామనాథుడు (ఈతనినే కొమారరాముడందురు) ఢిల్లీపాదుషాచేత పంపబడిన మహమ్మదీయ సైన్యాధిపతి నేమి యను వానిని జయించినపిదప రాజధానీ నగరమున విజయోత్సవములు జరిగెనని తెలుపుచు, ఏతన్మహోత్సవములకు రాయదుర్గము అధ్యక్షుడు, పెనుగుండి (?పెనుగొండ) పంపరాజు, గండికోట గంగరాజు, గుత్తిప్రభువు కాచయ్య మొదలగువార లేతెంచినట్లు పై గ్రంథము నుడువుచున్నది[27]. కంపిలిరాయనికి సామంతులు కానియెడల రాయలసీమలోని యీదుర్గముల యధిపతు లందరు ఆతని విజయోత్సవముల కేల వెళ్లియుందురు?

ఇదియే పై నుడివిన యనుమానమునకు గారణము. రాయలసీమ కంపిలిరాజ్యముననే చేరినచో అది క్రీ. శ. ౧౩౨౦, ౧౩౨౭ సంవత్సరముల నడుమ చేరియుండవలెను. ఏలయన క్రీ. శ. ౧౩౨౭ వ సంవత్సరముననే కంపిలి

26. J. M. S. Vol XX, Second Series No. 2, October 1929. — See "Studies in Vijayanagar History by Mr. M. H. Rama Sharma, p p. 95—96.
ఈవిషయమునుగుఱించియే మన్మిత్రులు శ్రీయుత యన్. వేంకటరమణయ్యగారుకూడ తమ 'కంపిలి—విజయనగరము'ను గ్రంథమున వ్రాసియున్నారు. కాని వారు సంధినిగూర్చి యట్లు చెప్పరు. వారిప్రకారము సింగమనాయకుడు యుద్ధమున ఓడిపోవుటయేకాక కుమారరామునికి ఖైదీగకూడ చిక్కెను. పిదప అతడు కంపిలిరాయని కడకు గొనిపోబడెను. ఆతడు సింగమనాయకుని చాల గౌరవముతో ఆదరించి వదలిపెట్టెను. చూడుడు: "Kampili and Vijayanagar", p. 9.

27. J. M.S. Vol- XX, Second Series, No. 2,Oct. 1929. "Studies in Vijayanagar History" p. 103.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యము విధ్వంసమయ్యెను [28]. ఇందలి సత్యా సత్యనిర్ణయమునకు పైన పేర్కొనబడిన దుర్గముల కాకాలమున నధిపతులెవ్వరో తేల్చవలసి యున్నది.

మొదట పెనుగొండ నెత్తికొందము. క్రీ. శ. ౧౩౨౦, ౧౩౨౬ సంవత్సరముల మధ్య ఆదుర్గమును పాలించుచుండిన దెవ్వరో తెలిసికొనుటకు శాసనాధారములేదు. అందువలన నద్దుర్గాధిపతి పంపరాజగునో కాదో తెలియదు. ఇక ఉదయగిరి నాలోచింతము. ఈదుర్గమును సంగముడు పాలించుచుండినట్లు తెలుపబడినది. కాని యది సరియైనట్లు తోపదు. ఏలయన ఈకాలమున కందుకూరు, కావలి ప్రాంతముల ఇతరరాజుల శాసనములు కానవచ్చుచున్నవి. దశవర్మదేవ మహారాజనునతడు నెల్లూరు మండలములోని కావలిప్రాంతమును క్రీ. శ. ౧౩౨౨లో పాలించుచుండెను [29]. ఉదయగిరి ప్రాయికముగ నతని యధికారముననే యుండదగును. ఇక గండికోటప్రాంతమున కాకతి ప్రతాపరుద్రదేవుని శాసనములు క్రీ. శ. ౧౩౨౦ వఱకు గలవు. గండికోటకైఫీయతునే నమ్మినచో కాకతీయప్రతాపరుద్రుని శాసనము క్రీ. శ. ౧౩౨౩ నాటిది[30] కూడ గానవచ్చుటవలన కాకతీయాధికార మాప్రాంతమున నప్పటికిని సాగుచుండినట్లే తలంపవలెను. అయినను ఈకాలముననే యొకగంగరాజిక్కడనుండినట్లుకైఫీయతువలననే తెలియుచున్నది. ఈతడు చోడవంశజుడు. ఇతనికొమారుడు దేవచోడ మహారాజు. బసవశంకరరాజనునతడు గుత్తికి ప్రతినామమైన జగతాపిదుర్గముననుండ ఆదుర్గమునకు ముట్టడివైచి యుద్ధముచేసి దేవచోడుడు దానిని సాధించినట్లు కైఫీయతువలన దెలియును [31]. ఈవిషయము ననుసరించియే అప్పటి గుత్తిప్రభువు కాచయ్య కాడని స్పష్టమగుచున్నది గండికోట గంగరాజు విషయము కేవలము కాకతాళీయముగ సరిపోయినట్లు భావింపదగును. ఈకారణములవలన ఇప్పటి రాయలసీమ కంపిలిదేవనికి స్వాధీనమయ్యెనా లేదా యన్నవిషయము సందేహాస్పదము.

కంపిలిదేవని కీప్రాంతము స్వాధీనపడ లేదన్నను ఈప్రాంతముల బరిపాలించుచుండిన రాజులు కాపయనాయకునికి సామంతులుగనుండిరో లేదో నిర్ణయించుట కష్టము. అందులకుదగిన యాధారము లేవియు లేవు. కావున ఈప్రాంతము కాపయనాయకునిక్రింద లేదనియే యిప్పటి కూహింతము.

ఇక తెలుంగాణెము విషయము నెత్తికొందము. ఓరుగల్లు పడిపోయినపిదప తెలుంగాణెము మొదటిమాఱు మహమ్మదీయ పరిపాలనముక్రిందికి వచ్చెను. రెండవ ప్రతాప

28. "Kampili and Vijayanagar" by Mr. N. Venkataramanayya, p. 22.

29. N. 1, Vol II, Kv. II, p. 707.

30. Loc. Rec. Vol 15, p. 55.
ఇది గొంకయరెడ్డి శాసనము. ఇతడు శకము ౧౨౮౫లో గండికోట పాలించుచుండినట్లు కలదు. ఇతడు ప్రతాపరుద్రుని సామంతుడని యితని యితర శాసనముల వలన తెలియనగును.

31. Loc. Rec. Vol 15. pp. 51-52.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుద్రుని శాసనములు క్రీ. శ. ౧౩౨౬ వఱకు గనబడుచుండుటచేత[32] క్రీ. శ. ౧౩౨౩ నుండి ౧౩౨౬ వఱకు కాకతీయాధికారము నామమాత్రముగనైన నచట చెల్లుచుండినట్లే భావింపవలసి యున్నది. అంతటినుండి అది మహమ్మదు బిన్ తుఘ్లకు పరిపాలితమైన రాష్ట్రిములలో చేరిపోయెను. ఢిల్లీపాదుషాయైన మహమ్మదు బిన్ తుఘ్లకు తన రాజ్యమునందలి యితరరాష్ట్రిములకువలెనే తెలుంగాణెమునకును భూమిపిస్తుకు సంబంధించిన కడితము (Register)ను తయారుచేయించెను[33]. ఆతడు క్రీ. శ. ౧౩౩౫-౩౬లో రాజకీయ సౌకర్యము ననుసరించి ఉత్తర తెలుంగాణెము, దక్షిణ తెలుంగాణెము అని తెలుంగాణెమును రెండు (రాజకీయ)విభాగములు గావించెను. సుల్తాన్‌పూరని పునర్నామకరణము కావింపబడిన ఓరుగల్లు ఉత్తర తెలుంగాణెమునకును, బెడదకోట యన బరగుబీదరు దక్షిణ తెలుంగాణెమునకును రాజధానులయ్యెను. మల్లిక్ కబూల్ ఉత్తర తెలుంగాణెమునకును, నజ్రత్ ఖాన్ దక్షిణ తెలుంగాణెమునకును అధిపతులుగనియమితులైరి[34]. ఇట్టి సందర్భములలో కాపయనాయకుడు తెలుంగాణెమునుండి యవనులనుబోద్రోలెనని కాని, దానినాతడు పరిపాలించెనని కాని చెప్ప వీలుకాదు.

ఇక ప్రాక్సముద్ర తీరస్థ ఆంధ్రదేశము కలదు. ఈ దేశమున కాపయనాయకుని శాసనములు లేకపోయినను అతని సంతతివారి శాసనములు కనబడుచున్నవి. వేమనరేశ్వరుడుకూడ కాపయనాయకుని సామంతులలో నొక్కడు గనుకను, సామంతులు కాపయనాయక మరణానంతర మెవరెవరు పాలించుచుండిన దేశమునకు వారు వారధిపతులైరని కలువచేరు శాసనమున కలదుగనుకను, వేమభూపాలునికి అద్దంకి రాజధాని కావునను మొదట కాపయనాయకుని రాజ్యము అద్దంకి దాటి కాకపోయినను అంతవఱకైన వ్యాపించియుండెనని విదితమగుచున్నది.

ఈ కారణములవలన ప్రోలయ, కాపయనాయకులు ఉద్ధరించినట్లు, పాలించినట్లు చెప్పబడిన దేశము ప్రాక్సముద్రతీరస్థ ఆంధ్రదేశమే కాని వేఱొకటి కాదని విస్పష్టమగుచున్నది.

ఇక ప్రోలయ కాపయ నాయకులకు గల సంబంధమునుగుఱించి విచారింపవలసియున్నది. వారిరువురికి ఒకరికొకరికి ఏవిధమయిన సంబంధము ఉండకయే పోవచ్చును. కాని అన్యథా యూహించుటకు కూడ అవకాశము లేకపోలేదు. కాపయనాయకుని కొడుకు (మొదటి) ప్రోలయనాయకుడు. ఆంధ్రదేశమున తాత పేరు మనుమనికిబెట్టు ఆచారముండుటవలన ఒకవేళ ప్రోలయనాయకుడు కాపయనాయకుని తండ్రియగునేమోయని యనుమానము. అట్ల

32. Govt. Ep. Coll. No. 308 of 1915.
33. J. R. A. S. 1922, p. 339.
ఈపని క్రీ.శ. ౧౩౨౬లోపున పూర్తియైయుండదని హేగు దొరగారు తెలుపుచున్నారు.
34. J. R. A. S. for 1922.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిన కాపయనాయకుని తండ్రి ప్రోలయనాయకుడు రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనారంభదశయం దుండియుండును. అతడు కడుపెద్దకాలము నివసించి, కాకతీయసామ్రాజ్య పతనానంతరము తురుష్కులతో యుద్ధముచేసి వారిని తఱిమివైచియుండును.[35] అనతికాలముననే ఆతడు గతింప కాపయనాయకుడు రాజ్యమునకు వచ్చెను.

కాని కాపయనాయకుడు విశ్వేశ్వరాజ్ఞచే రాజ్యభారమును వహించుట కంగీకరించి, భూమిని పాలించినట్లు కలువచేరు శాసనము చెప్పుటవలన ఒకవేళ ఈ ప్రోలయ, కాపయనాయకు లిరువురు పరస్పరసంబంధము కలవారగుదురా కాదా యనియే సంశయము కలుగుచున్నది. తండ్రికొడుకులేమైన తండ్రి పాలించిన రాజ్యమును తాను పాలించుటకు కాపయనాయకునికి ఒకరియాజ్ఞ యేల? అభ్యంతర మేల? కాని యీవిషయమున నింతకన్న నిర్ధారణగ జెప్పుటకు తగిన యాధారము లేవియు లేవు.

## ౬

మహమ్మదీయులను జయించి, వారిని తరిమివైచి హిందువులుస్వాతంత్ర్యమును సంపాదించినసందర్భ మింకొకటికలదు. ఇదిఢిల్లీపాదుషాయైన మహమ్మదు బిన్ తుఘ్లకు పరిపాలనము అంత్యకాలమున జరిగిన సంగతి. దీనిని గుఱించి 'తారీఖు ఫిరోజ్‌షాహి' అను గ్రంథమున తత్కర్తయైన 'జియా ఉద్దీన్ బార్ని' యిట్లు వ్రాయుచున్నాడు[36]:

"ఈవిషయ మిట్లు జరుగుచుండ అరంగల్ (వోరుగల్లు–వోరంగల్లు) లోని హిందువులలో పితూరీ రేగెను. కన్యనాయక్ అను నతడు దేశమున బలములను సమకూర్చెను. నాయబువశీరుగా నుండిన మల్లిక్ మఖ్బూల్ ఢిల్లీకి పారిపోయెను; (అంతట) హిందువులు అరంగల్ (వోరంగల్లు)ను స్వాధీనపఱచుకొనిరి. ఈ ప్రకారము (మహమ్మదు బిన్ తుఘ్లకు) దానిని సంపూర్ణముగ గోలుపోయెను. ఈ సమయముననే సుల్తాన్ (మహమ్మదు బిన్ తుఘ్లకు) కంబలము (కంపిలిదేశము)నకు పంపిన కన్యనాయకుని బంధువులలో నొకడు మహమ్మదీయమతమును వదలిపెట్టి, పితూరీ రేపెను. ఈప్రకారము కంబలభూమి (కంపిలభూమి) కూడ నష్టమయి హిందువుల చేతులలో పడెను."

ఈవిషయమునే 'ఫెరిష్టా'యను మరియొక మహమ్మదీయచరిత్రకారుడు ఇట్లు తెలుపుచున్నాడు[37]:

"ఈ సంవత్సరమున (హిజరీ ౭౪౪= క్రీ. శ. ౧౩౪౪) వరంగోలు (వరంగల్లు)నొద్ద నివసించుచుండిన "లద్దర్ దేవు" (కాకతిప్రతాపరుద్రదేవుని) కొడుకైన 'క్రిషన్(కృష్ణ) నాయకుడు' కర్ణాటకరాజైన బిలాల్ దేవుకాదులు ఓడించి తిరుమగొట్టిన తురుష్కసైన్యము లివియే కావచ్చును.

35. అరంగలు (వోరంగల్లు) మహమ్మదీయులకు స్వాధీనమైన పిదప మొగలాయిసైన్యము లనేకములు సరిహద్దులనున్న వారి నెదుర్కొని పోరాడినట్లును, కాని యా సైన్యములు పరాభూతములై తిరుమగొట్టబడినట్లును బార్ని తెలుపుచున్నాడు—Elliott and Dowson, Vol III, p. 234. ప్రోలయనాయక, కాపయనాయ

36. Elliot and Dowson; History of India, Vol III, pp. 245-6.

37. Brigg's Ferishta—Rise of the Mohamedan Power in India, Vol I, p. 427.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొద్దకు రహస్యముగబోయి, దక్కనులో నసంఖ్యాకులుగ నున్న మహమ్మదీయులు హిందువుల నందఱిని కడతేర్చుటకై పన్నుగడలు పన్నిరని వింటిననియు, కావున వారి నెదుర్కొనుటకై సంఘీభవించుట యుచితమనియు నాతనితో చెప్పెను. బిలాల్ దేవు (బల్లాళదేవుడు) తనబంధువులనందఱిని సమావేశపఱిచి యాలోచించి, మొట్టమొదట తనదేశములోని కోటలను భద్రపఱుచుకొని, పిదప తనరాజధానిని పర్వతప్రాంతమునకు మార్చవలెనని నిశ్చయించెను. తమయెత్తులన్నియు సాగి కార్యకారులైనప్పుడు తానుకూడ వరంగోలు (వరంగల్లు), తెలింగానాలలోని హిందువుల నందఱిని లేవదీసి తాను నాయకత్వమును వహించి నడిపించుక వచ్చెదనని వాగ్దానమొనరించెను.

"బిలాల్ దేవు (బల్లాళదేవుడు) కొంత సైన్యమును సమకూర్చి, దానిలో కొంతభాగమును కృష్ణనాయకుని యాధిపత్యమున నుంచెను. కృష్ణనాయకుడు వరంగోలు (వరంగల్లు) సాధించి, దాని కధిపతిగనుండిన ఇమాదుల్ ముల్కును దౌలతాబాదునకు తరుమ గొట్టెను. బిలాల్ దేవు (బల్లాళదేవు), కృష్ణ (కృష్ణ) నాయకులు కర్ణాటక ప్రభువులకు సామంతులుగ నుండిన మాబార్, ద్వారసముద్రరాజుల సైన్యములను గూడ దమసైన్యముల చేర్చుకొనిరి. వీరందఱును గలసి దక్కనులో మహమ్మదీయు లాక్రమించిన దేశమును స్వాధీనపఱుచుకొని, వారి నచటినుండి తరిమివైచిరి. ఈ ప్రకారము కొద్దినెలలలో మహమ్మదు తుఘ్లుకునకు ఆప్రాంతమున దౌలతాబాదు తప్ప రాజ్యమే లేకపోయెను."

మహమ్మదీయ చరిత్రముల ననుసరించి తెలియవచ్చు విషయము లివి. ఇతర రాజులతో గలసి రాజ్యమును సంపాదించిన ఓరుగంటినివాసిని కృష్ణనాయకుడనియు, అతడు ప్రతాపరుద్రుని కొడుకనియు ఫెరిష్టా చెప్పుచుండ, కొడుకని బంధువని తెలుపకయే ఆతనిని కన్యనాయక నామమున బార్ని పేర్కొనుచున్నాడు. ఇరువురునుగూడ స్వాతంత్ర్యమును సంపాదించిన నాయకునిపేరును వ్యత్యాసముగ దెలుపుచున్నను ఈవిషయము మహమ్మదుబిన్ తుఘ్లుకు పరిపాలనాంత్య కాలమున జరిగినట్లే తెలుపుచున్నారు. ఫెరిష్టాప్రకార మిది క్రీ.శ. ౧౩౪౪ లో జరిగెను. బార్నిమాత్ర మిది యెప్పుడు జరిగెనో నిర్ధారణగ తెలుపుటలేదు. మహమ్మదీయ చరిత్రాదికములను జూచి మహమ్మదు బిన్ తుఘ్లుకు రాజ్యమున జరిగిన సంగతులకు కాలనిర్ణయముచేసిన హేగుదొర గారు ఓరుగల్లు తెలింగానాలు స్వాతంత్ర్యమును హిజరి ౭౪౬లో అనగా క్రీ.శ. ౧౩౪౫-౧౩౪౬లో సంపాదించినట్లుతేల్చియున్నారు[39]. ఈకారణములవలన తెలింగానా మహమ్మదీయాధికారమును ద్రోసిపుచ్చినది క్రీ. శ. ౧౩౪౫-౧౩౪౬ల నడుమ నని నిర్ణయింపవచ్చును.

ఇక ఈ స్వాతంత్ర్య సంస్థాపనమునకు కారణభూతుడైన నాయకుడు ప్రతాపరుద్రుని కొడుకగునేమో విచారింతము. ఏకామ్రనాథ విరచితమైన ప్రతాపరుద్ర చరిత్ర

38. మహమ్మదీయచరిత్రకారులు తెలుగుదేశమునే 'తెలింగానా' నామమున వ్యవహరించియున్నారు. ఓరుగల్లు రాజధానిగనుండిన తెలుగుదేశమున కిది ముఖ్యముగ వర్తించును. ఇప్పటికిని నిజాంరాజ్యములోని ఆంధ్రదేశభాగమునకు 'తెలింగానా' అనియేపేరు.

39. ఈశ్వరప్రసాదుగారు ఇది క్రీ. శ. ౧౩౪౪ లో జరిగినట్లే విశ్వసించియున్నారు చూడుడు:—Medieval India, p. 256.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముమాత్రము ప్రతాపరుద్రునికి వీరభద్ర దేవుడను కొడుకు కలడనియు, ఆతడు ఏకశిలా నగరము మహమ్మదీయ సమాక్రాంతమైన వెనుక కొండవీటి కేగి యచ్చట పరిపాలనము నెఱపెననియు తెలుపుచున్నది[40]. ఈతడైన అక్కడ ఎంతకాలము పాలించెనో తెలియదు. ఆతని శాసనములు కూడ గానరావు. కలువ చేరు శాసనమును బట్టి చూచినను వీరభద్ర దేవుడను ప్రతాపరుద్ర కుమారు డొక డుండె నన్న విషయ మసత్యముగ గాన్పించును. ఒక వేళ ఈ వీరభద్రదేవుడు రాజ్యము చేసినను అది ఓరుగంటి సామ్రాజ్యము పతనమైన వెంట నే కాని ఎప్పుడో పదునెనిమిది వత్సరములకు తరువాత జరుగనేరదు. కావున ప్రతాపరుద్ర చరిత్రము విషయము విశ్వసనీయమైనదిగ గన బడదు.

ఫెరిష్టా వ్రాతయు అంతే. కాకతీయప్రభు వులలో మహాదేవుడని, రుద్రదేవుడని, గణపతి దేవుడని ఇట్టి పేరులే కలవు కాని, ఎవరికిని నాయకనామము లేదు. మాచయనాయక, జా యపనాయక, ముప్పిడినాయకాది నాయక నామాంచితులు పెక్కురు కాకతీయ సామం తులు కలరు. ఒక్క ఫెరిష్టా మాత్రమే కాని బార్నికూడ స్వాతంత్ర సంస్థాత (కన్యనాయకుడు) ప్రతాపరుద్రుని కొడుకని చెప్పుటలేదు. ఈ పై కారణముల వలనను, ఆతని శాసనములుకూడ గానరానందువలనను కృష్ణనాయకుడు[41] ప్రతాపరుద్ర కుమారునిగ నంగీకరింపరాదు. ఒకవేళ ఆతడు ప్రతాప రుద్రుని సామంతుడుగనో లేక సేనానిగనో యుండిన నుండవచ్చును. సామంతులు తాము తమ ప్రభువుల కొడుకులమని చెప్పకొనినట్లు తెలుపు శాసనములు కొన్ని కలవు. ఆవిధమున నే ఒకవేళ ఈ ఫెరిష్టా చెప్పు కృష్ణనాయకుడు కూడ ఉండిన నొకవేళ ప్రతాపరుద్రుని సేనా నియో, సామంతుడోయై ఆతనికి పుత్త్రప్రా యుడుగ నుండవచ్చును. అంతియగాని యీ తడు ప్రతాపరుద్రుని కొడుకే యనుటకు తగిన యాధారము లేదు.

హిందువుల యీవిజయము చిరకాలము నిలవలేదు. ఆనతికాలముననే వారు తాము నూతనముగ సంపాదించుకొన్న స్వాతంత్ర్య

---

40. ఏకామ్రనాథవిరచిత ప్రతాపరుద్రచరిత్రము, పూర్వోక్తప్రతి, పుటలు ౪౯-౫౦.

41. కృష్ణప్పనాయకుడు—ఫెరిష్టా చెప్పు కృష్ణ నాయకుడు—ప్రతాపరుద్రదేవుని కొడుకులలో నొకడని యే కాక, పెద్దకొడుకనికూడ శ్రీమాన్ యస్. కృష్ణ స్వామి అయ్యంగారు వ్రాయుచున్నారు (చూడుడు: South India and her Mohammadan invaders, page 180, foot note 1). వీ రిట్లు వ్రాయు టకు గల యాధార మేదో ? ప్రతాపరుద్రదేవునికి— వీరి యభిప్రాయమున—ఎంతమంది కొడుకులు కలరో ? ఈ కృష్ణప్పనాయకుడే ప్రతాపరుద్రుని యనంతరము రాజ్యమునకు వచ్చినట్లు వీరు వ్రాసిరన్న ఫెరిష్టా నాధా రము చేసికొని యట్లు వ్రాసియుందురని సమాధానపడ వచ్చును కాని పెద్దకొడుకని వ్రాయుట కాధారము ?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును గోలుపోయిరి. మహమ్మదు బిన్ తుఘ్లుకు పరిపాలనాంత్యకాలమున దక్కనులో రేగిన తిరుగుబాటులలో జాఫర్ ఖాన్ తిరుగుబాటొకటి. ఈతడు పాదుషా యధికారమును ధిక్కరించి ఇరువదివేల గుఱ్ఱపుదళమును కూర్చికొని ఇమాదుల్ ముల్క తబ్రీజీ ఆక్రమించియుండిన బీదరు (బెడదకోట)పై నెత్తివెళ్లెను. కాని యచ్చట పాదుషాసైన్యములు అపరిమితముగ నుండుటచేత వానితో కలియబడుటకు సాహసింపడయ్యెను. ఇట్టస్థితిలో తెలింగానా రాజు పదునైదువేల కాల్బలమును, దౌలతాబాదునుండి నాజరుద్దీన్ ఇస్మాయిల్ అయిదువేల గుఱ్ఱపుదళమును జాఫరుఖాన్‌కు సహాయార్థ మంపిరి. తుద కీదళముల తోడ్పాటుతో ఘోరసంగ్రామ మొనరించి ఆతడు విజయుడయ్యెను.[42] ఈతడు సంస్థాపించిన రాజ్యమునకే బహమనీ రాజ్యమనియు, జాఫర్ ఖాన్‌కు—సింహాసనారూఢుడైన పిదప—అలాయుద్దీన్ హసన్ బహామన్ షా యనియు పేరు.

తెలింగానా అధిపతిస్వాతంత్ర్యమును వహించుట బహామన్ షాకు ఇష్టము లేకపోయెను. ఆతడు తన కాపత్కాలమున గావించిన మహోపకారమును తుడిచివైచి బహామన్ షా స్వాతంత్ర్యాపహరణమునకై అతనిపై దాడి వెడలి కౌలాస్ మొదలగు కొన్ని గ్రామములను స్వాధీనపఱుచుకొని తుద కతనితో సంధి కావించుకొనెను. తెలింగానా అధిపతి ప్రతివత్సరము ఢిల్లీపాదుషాకు కట్టుకప్పమును బహామన్ షాకు చెల్లించుట కంగీకరించెను.[43] బహామన్ షా ఆతడు తనకు గావించిన యుపకారమును దలంచి ఉదారమైన క్షమాహృదయముతో అతని నాదరించెనట!

ఈపైవిషయములు ఫెరిష్టా వ్రాసిన చరిత్రమువలన దెలియవచ్చుచున్నవి. ఈసందర్భముల నెచ్చటను ఫెరిష్టా "తెలింగానా" అధిపతిపేరు తెలుపుటలేదు. కాని యతడు 'కృష్ణ' నాయకుడే యని మన మూహింపవచ్చును. ఏలయన మహమ్మదీయాధికారమునుండి తెలింగానాను విడిపించినది 'కృష్ణ' నాయకుడని యిదివఱలో చెప్పబడియే యున్నది. కావున అప్పటికి స్వతంత్రుడుగ పాలించుచుండిన వాడితడే. హిందువులు స్వాతంత్ర్యమును సంపాదించుటకు గోలుపోవుటకుకూడ ఎంతకాలమో పట్టలేదు. తెలింగానా అధిపతి బహామన్ షాకు సామంతుడై కప్పముకట్టుట కేర్పాటగుటచే తెలింగానా మహమ్మదీయరాజ్యాంతర్గతమైనను పరిపాలనమునుమాత్రము హిందువైన తెలుగునాయకుడే సాగించుచుండెను.

తెలింగానా స్వాతంత్ర్యమును వహించిన పిదప తదధిపతి మరల బహామని సుల్తానుకు సామంతుడైనదియు లేనిదియు మనకు బార్ని చరిత్రమువలన దెలియరాదు. ఏలయన ఆచరి

42. Brigg's Ferishta, Rise of the Mohamedan Power in India, Vol II, p.289; Khafi-khan—Elliot & Dowson — Vol. III, p. 14. కాపయనాయకునిచే నిర్జితుడైన పిదప అంతవఱకు ఓరుగంటి కధిపతిగ నుండిన ఇమాదుల్ ముల్క దౌలతాబాదు, బీదరులకు పోయియుండును. అందువలననే జాఫర్ ఖాన్ దండయాత్రనాటికి అతడు బీదరులో నుండుట సంభవించెను.

43. Brigg's Ferishta, Rise of the Mohamedan power in India, Vol II, p. 294.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రకారుడు ఢిల్లీ పాదుషాల చరిత్రమును మాత్రమే వ్రాసెనుకాని దక్కను దేశచరిత్రమును వ్రాయలేదు. అందువలననే ఢిల్లీ పాదుషాల చరిత్రమున దక్కను దేశచరిత్రమున కెంత వఱకు ప్రసక్తికలదో అంతవఱకే అందు తెలుపబడినది. మహమ్మదు బిన్ తుఘ్లకుపాదుషా పరిపాలనముతో చాలకాలమునుండి వచ్చుచుండిన దక్కను — హిందూస్థానముల సంబంధము మఱల కొంతకాలమువఱకు తెగిపోవుట సంభవించెను.

దక్కను దేశమును పరిపాలించిన మహమ్మదీయుల చరిత్రమును వ్రాసిన మహమ్మదీయ చరిత్రకారు డింకొకడు కలడు. అతనిపేరు అలీ బిన్ అజీజుల్లా తబాతబా. ఈతడు వ్రాసిన గ్రంథమునకు "బుర్హాని మాసీర్"అని పేరు. దక్కను దేశమున మహమ్మదీయుల పరిపాలనమును గుఱించి తెలుపు గ్రంథము లన్నిటిలో ఇదియే కడువిశ్వాసపాత్రమైనదని పరిశోధక పండితుల యభిప్రాయము. ఒకేవిషయమునుగుఱించి ఫెరిష్టాయును, ఇతడును పరస్పరవిరుద్ధముగను, వ్యత్యాసముగను చెప్పినచో నట్టియెడల చాల వఱకు "బుర్హాని మాసీర్" గ్రంథమునే ప్రమాణముగ గైకొందురు.

బహమన్‌షాకాలమున ఆతనికి తెలింగానాకు గల సంబంధము "బుర్హాని మాసీర్" గ్రంథమున ఇట్లు వర్ణితమైనది[44].

"సికందరుఖాను (బహమన్‌షా సేనాధిపతులలో ఒకడు) తనసైన్యోపయోగము నిమిత్తము బహుమానముగ గొన్ని యేనుగులను పంపవలసినదని యడుగుచు తెలింగానాకు 'వాలీ' (అధికారి) యైన 'కనాబాయందొ'క ఉత్తరము పంపెను. సికందర్ ఖాన్ ఉత్తరమును జూచి, అందలి విషయములను గ్రహించిన పిదప ఆతడు బహమన్‌షాకు సామంతుడనై విధేయుడుగ నుందునని తెలుపుచు ప్రత్యుత్తరమును, తదనుగుణముగ ఒక యొడంబడికనుకూడ వ్రాసిపంపి, ఆతనిని (సికందరుఖాను) ఒకమారు కలిసికొనగోరిక యున్నట్లు కూడ దెలిపెను. ఆప్రకారమే సికందరుఖాన్ బహుళసైన్యసమేతుడై తెలింగానా కరిగెను: వారిరువురును గలసికొనిరి. కనాబాయంద్ ఆతనికి అమూల్యములైన చాలవస్తువులను బహుమానమొసంగెను. బహమన్‌షా గొప్ప యనుగ్రహము చూపునని సికందరుఖాన్ కనాబాయందుకు ఆశగొలిపెను. కనాబాయందు సికందరుఖాన్ ద్వారా బహమన్‌షా సుల్తానుకుకూడ తగిన బహుమానములను రెండేనుగులను పంపెను. సికందరుఖాను — యొద్దకు వచ్చినతరువాత ఆయేనుగులను సుల్తానుకు పంపి కనాబాయందు యొక్క సత్సంకల్పమునుగూర్చి తెలియజేసెను. ఆతనిని మెచ్చుకొనుచు సుల్తాను సికందరుఖానుకొక యుత్తరమువ్రాసి ఆతనికి ఛత్రగౌరవము నొసంగెను. కనాబాయందుకు సుల్తాను రాజసన్మానములను గూడ జేసెను."

ఈ పైవిషయమును జదివినచో ఫెరిష్టా బేర్కొనిన కృషన్‌నాయకుడే "బుర్హాని మాసీర్"లో "కనాబాయంద్" అని పేర్కొనబడినట్లు తెలియగలదు. మహమ్మదు బిన్ తుఘ్లకుపరిపాలనాంత్యకాలమున పితూరీ లేపి స్వాతంత్ర్యమును సంపాదించి, అనతికాలముననే బహమన్‌షాకు మఱల సామంతుడైన తెలిం

44. Major J. S. King—The History of the Bahmani Dynasty, pp. 9-10.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానా అధిపతిని బార్ని, ఫెరిష్టా, అజీజుల్లాలు మువ్వురు—ఒకడు కన్యనాయకుడని,మఱియొకడు కృష్ణనాయకుడని, వేఱొకడు కనాబాయందని—మూడువిధముల పేర్కొనుచున్నారు.ఈ మువ్వురు మహమ్మదీయ చరిత్రకారుల గ్రంథములలో అజీజుల్లా గ్రంథము ఎక్కువ విశ్వసనీయమైన దగుటవలన ఆ తెలింగానానాయకుని పేరు కనాబాయందు కాదగునని నిశ్చయింపవచ్చును.

కాని యిచ్చటకూడ నొక చిన్న చిక్కు కలదు. ఈ గ్రంథమును ఇంగ్లీషుభాషలోనికి తర్జుమా చేసిన కింగు దొరగారు ఈ గ్రంథము యొక్క బ్రిటీషుమ్యూజియము వ్రాతప్రతులలో ఈనాయకునిపేరు ఒకచోట "కబానంద్" అనియు, మఱియొకచోట "కనసీదా" యనియు, వేఱొకచోట "కనానాయందు" లేక "కబానాయందు" అనియు వ్రాయబడియున్నట్లు తెలుపుచున్నారు[45]. కావున వ్రాతప్రతులలో ఈపేరు యొక్క రూపాంతరము లివి కానవచ్చుచున్నవి: (౧)కనసీదా (౨)కబానందు (౩)కనానాయంద్ లేక (౪) కబానాయందు. వీటిలో కడపటి మాటికి ఒండొంటికి కొంచెము పోలిక ఎక్కువ యుండుటవలనను, మొగటిదానికట్టిపోలికఏమాత్రము లేకపోవుటవలనను అది సరియైనదిగ గానరాదు. ఈకడపటి మాటిలో నేదో యొకరూపమును గ్రహింపక కింగుదొరగారు "కనాబాయందు" రూపము నేల ఎట్లు గ్రహించిరో తెలియరాదు.

తెలింగానా అధిపతి నాయకపదాంతనాముడని తెలిసియేయుండుటచేత "బుర్హానిమాసీర్" లోని "నంద్", "నాయంద్" పదములు "నాయక" పదముయొక్క దుష్టరూపములు కావచ్చును. అట్లయిన కబానాయక గాని కనానాయకగాని అతనిపేరు కావచ్చును.

ఈనాయకుడు స్వాతంత్ర్యమును క్రీస్తు శకము ౧౩౪౪-౧౩౪౫ల నడుమ సంపాదించినట్లు ఈవరలో నిశ్చయము చేసియున్నాము: అనగా అది శకవర్షము ౧౨౬౬-౧౨౬౭ సంవత్సరముల నడుమ జరిగెను. అప్పుడు మనకు దొరకిన శాసనముల ప్రకారము తెలియవచ్చువాడు కాపయనాయకుడు ఒకడు కలడు: ఇతడు గణపేశ్వరము, పిల్లలమఱ్ఱి శాసనముల నాటివాడు. ఇతనికి ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ బిరుదములుకలవు. కావున ఈకాపయనాయకుడే అజీజుల్లాపేర్కొను "కబానాయక" (కబానాయందు) కావచ్చునని నానమ్మకము. మహమ్మదీయులను జయించి ఆంధ్రరాజ్యరమావల్లభు డైనకతననే అతడు "ఆంధ్రదేశాధీశ్వర", "ఆంధ్రసురత్రాణ" బిరుదములను వహించియుండును. ఒకవేళ ఈతడటుపిదప బహమనీ సామంతు డైనను ఈబిరుదముల నాతడు గోల్పోవలసినయావశ్యకత కాన్పింపదు. ఢిల్లీపాదుషాచే నిర్జింపబడి

45. Ibid, p. 9—See foot notes, nos. 15 and 17.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు కాకతీయ రెండవ ప్రతాపరుద్రుడు పరం పరాగత బిరుదములను ధరించుచునే వచ్చెను. ఆరీతినే కాపయనాయకుడుకూడ బహమనీ షాకు సామంతుడేయైనను నిజముగ నాంధ్రదేశమునకు ఆతడే యేలికయగుటచేత "ఆంధ్రదేశాధీశ్వర", "ఆంధ్రసురత్రాణ" బిరుదము లాతనిపట్ల సార్థకములే యని చెప్పనగును. ఈ కారణములవలన అజీజుల్లా గ్రంథమునందలి "కబానాయందు" (కబానాయక - కాపయనాయక) నామమే సరియైనదనియు, ఈ కబానాయకుడు ఆంధ్రసురత్రాణ, ఆంధ్రదేశాధీశ్వర బిరుదాంచితుడగు గణపవరము పిల్లలమఱ్ఱి శాసనములనాటి కాపయనాయకుడే యనియు, ఈతడే ముమ్మడినాయకుని బంధువును సమకాలికుడుననియు నిర్ధారణ సేయవచ్చును.

ఇంతటి అధికారదక్షుడైన కాపయనాయకుని బాంధవ్యమును సహాయమును గలిగి యుండుటచేతనే కావచ్చును ముమ్మడినాయకాదులు గోదావరీతీరమున పిఠాపురము రాజధానిగ అంతవఱకు పరిపాలించుచుండిన కొప్పుల వంశజులను ఉత్తరమున కళింగమునకు దఱిమివైచి కోరుకొండ రాజధానిగ గోదావరీ తీరమున నూతనరాజ్యమును స్థాపింపగలిగిరి. పిఠాపురము రాజధానిగ పరిపాలనము నెఱపిన కొప్పులనాయకవంశజులలో కడపటివారి శాసనములు సింహాచలమున గానవచ్చుట కిదియే కారణమని తలంపవలసి యున్నది.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# దుర్విమర్శన విషద్రుమ విచ్ఛేదక జ్ఞానవీర కుఠారము

## అను నిష్కంటక నిరాఘాట ఘంటాపథ వినాశన విమర్శనము

దువ్వూరి జగన్నాథ శర్మగారు

చతుర్వర్గ ఫలప్రాప్తిః సుఖా దల్పధియామపి-కావ్యాదేవ —విశ్వనాథ కవిరాజు.

అల్పబుద్ధులకుఁగూడ కావ్యసుఖమువలననే చతుర్వర్గ ఫలప్రాప్తి యగు నని పూర్వులు ప్రబోధించియుండిరి కావ్యసుఖము లభించుటో-గుణాగుణ విమర్శనముగల పఠనపద్ధతివలన. దోషాంశములను విభజించి గుణవిశేషములను బైటికిఁ దెచ్చి చూపుటను అనుసంధింపఁదగిన ఉత్తమ విమర్శనములు కావ్యసుఖప్రాప్తికేకాక సారస్వతమునందు యథార్థమయిన యభిరుచిని గల్గించి జ్ఞానము నుత్తేజపఱచునని సత్యరతిగల వారెల్లరు నంగీకరింతురే కదా! భవభూతి మహాకవి యొక్క ఉత్తరరామచరితనాటకరసవిచారమనెడి ఉత్తమవిమర్శనము పేరు చెప్పి యీనడుమ భారతీ పాఠకులకు బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయ శాస్త్రిలవారి పరిశోధనలం దొకింత పరిచయము లభించినది. అందుపై కొన్ని విమర్శనములు కూడ బైలుదేఱి ఒక విధముగాఁ పెద్ద కోలాహలము కల్గించినవి. ఉత్తరరామ చరితనాటక రసవిచారమునఁ దీర్పు—కరుణ విప్రలంభమగుట నిష్కంటక నిరాఘాట ఘంటాపథమగుచుండఁగా దానిమీఁదఁ బఱుపఁబడిన దుర్విమర్శన విషద్రుమములను విచ్ఛేదించుటకుఁ గుఠారప్రయోగమే శరణ్యము గదా!—

"కశ్శోరః కుఠారః, కిలైకోపి తిగ్మో
వినిర్భేత్తు మీష్టే, విషద్రూ ననేకాన్"

కరుణవాదులు "తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్లు" అనునట్లు వారిపట్టుదల విడువక యేది యెట్లయినను సరియే కాని యియ్యది శోకస్థాయికమే యని "ననేమిరా" అన్నట్లందురేని వారిచిత్తము. వీరాది రసములకన్నిటికిని వారికిఁ దోఁచినట్లు మారుపేరులు పెట్టి తారుమారుగా శృంగారాదిరసము లని విశృంఖలముగా నుపన్యసించుచు నానందింతురుగాక!

ఇది చూచి శ్రీ వేంకట లక్ష్మినారాయణులు ఇప్పట్టునఁ జిరిగి కరుణవాదమునకుఁ దిగుట—అందులో (౧) "పృష్ఠతాడనము—దంతపతనము" (2) "సమాధానమునందు నీళ్లు నమలిరి" (౩) "శ్రీ శాస్త్రిగారి యవిమర్శకత" (4) "చల్లగా జారవిడిచిరి"—ఇట్టి మాటలను బ్రయోగించుట నాయభిప్రాయముచేత నభినందింప దగలేదు. కావున కుఠారప్రహరణము లిక్కడ ననవసరము కాదు.

—:"చల్లగా జారవిడిచిరి":—

—:ప్రధాన సిద్ధాంతమునే:—

శ్రీ వేంకట లక్ష్మినారాయణులు తమ వాదములో ముఖ్యముగా జబాబు చెప్పఁదగియుండిన ప్రధాన సిద్ధాంతమునే "చల్ల గా జారవిడిచిరి"—ఆప్రధానసిద్ధాంతమేది?—శ్రీ శాస్త్రిలవా రిట్లు వ్రాసిరి:—చూడుఁడు!—



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఈ నాటకము కరుణరసప్రధానమని చెప్పుట కింకొక గొప్ప ప్రతిబంధకము కూడఁ గలదు. సర్వత్ర భరతాదు లందఱును నాటక లక్షణముం జెప్పునప్పుడు శృంగార వీరరసములు రెండిటిలో నెద్దియేని యొక్క దానికే ప్రాధాన్యము నిరవకాశముగా నియమించి యుండిరి. ఆయ్యది ప్రాయికాభిప్రాయ మనుటయుం బ్రమాణ సిద్ధము కాదు. లాక్షణికోక్తము కాకున్నను ఆనుమానికముగా గ్రహించుటకైనను శృంగార వీరరసములకంటె నన్యమగు మఱియొకరసమునకుం బ్రాధాన్యము నిశ్చయముగాఁ గల ప్రాచీన నాటకము లెవ్వియునుఁ గనఁబడకుండుటవలన సపక్షమెద్దియును లేదు. ప్రకృత నాటకము పక్షుత నతిక్రమించుటలేదు కావున దీనిచే నిర్ణయింప శక్యముకాదు"

ఇక్కడ నడుగఁదగిన ప్రశ్న — వేంకట లక్ష్మీనారాయణులను—నాటకంబునకు వీరశృంగారములలో నేదైన నొక్కటి ప్రధానరసముగా నుండవలయు నన్న భరతనాట్యశాస్త్రమునకు మీరు విరుద్ధము భావింతురా? యని. ఐతే జానకీరాఘవ సమాగమము చూపట్టుచున్న ఉత్తరరామచరిత్రములో వియోగకథన మున్నను సీతారాముల పరస్పరానురక్తి నశింపనపుడు శృంగారము అంగియని యేఁ గరుణవాదులు చెప్పు నెల్ల కడఁ గన్పట్టు కరుణ మంగమనియు నేల చెప్పరాదు? మృతత్వ నిశ్చయము లేనప్పుడు—సీతయందు తన మనస్సుచేత దోషాపత్తి లేకుండఁగా ధర్మభీరుఁడయి కదా శ్రీరాముఁడు ప్రవాసపడెను—తినంతటఁ దాను. ఇట్టియెడ తాత్కాలిక నిర్వేదమునకుంబిమ్మటఁబండ్రెండేండ్లలోఁగా నిష్టసమాగమాభిలాషజనితమగు మనోవికారముచే నాయికానాయకు లుంబ యసంభవమా?—సంప్రయోగము కారాదుగాని శ్రీరాముఁడు సీతను జూడనైన నభిలషింపరాదా? అట్టియెడ నెడనెడఁ గల్గువైక్లబ్యముచేఁ గరుణ మంగరసమనియుఁ గరుణవిప్రలంభ(శృంగార)ము అంగియనియు నేలచెప్పరాదో! ఉత్తరరామచరిత్రమునఁ గరుణము లేదని యెవ్వరనిరి? వేంకటలక్ష్మీనారాయణు లింత విమర్శనము వ్రాయుటకు—కలదు—పలుతావుల—అదియున్నంత వఱకు విషాదరూపమయిన సంచారితప్ప స్థాయి కాదు. ఇట్లు ఒప్పుకొన్నచో శృంగారవీరప్రాధాన్యత యనెడిభరతసూత్రమునకు విరుద్ధము రాదు—సరికదా!—వియోగజనితవిషాదము — వైక్లబ్యము గల్గి మఱి ఏకోనపంచాశద్భావపరిపోషితం బగు రతిస్థాయి గల శృంగారము అంగిగా నిలిచి అందులకు శోకస్థాయిగల కరుణము అంగముగా విలసిల్లినదని యేల చెప్పరాదో. "శృంగార ఏకఏవ రసః" యను శృంగార ప్రకాశికారాదులమత మట్టిపట్టున నాదరణీయమై యుండునుగదా! ననేమిరా యను జేల? విమర్శకభేషజమునకు లోపము వాటిల్లుననియా? కావున వేంకటలక్ష్మీనారాయణులు ప్రధానసిద్ధాంతమునే చల్లఁగా జారవిడిచిరి. ప్రధానసిద్ధాంతమును జారవిడిచి చల్లఁగా నితర విషయముల నధికతరముగా విమర్శింపఁ బూనుట వేంకట లక్ష్మీనారాయణులు తగియుండెనని తలంతురా? వీరు "విమర్శకత", "కీల్గు నములుట", "పృష్ఠతాడనము—దంతపతనము" మాటలను ప్రయోగించుట మేలా?—వీరవిమర్శనములో శ్రీశాస్త్రిలవారి ౧-౨-౩-౪-౬. ౭-౮-౯-౧౦-౧౫ యుక్తులు తమకు సమ్మతములని యొప్పుకొనిరి. తక్కినచోట్ల శ్రీరాముఁడు విధురుఁడు కాఁడని యంగీకరించిరి. "మృతత్వనిశ్చయము రామునకు లేదన్నమాట మే మంగీకరించినదే" యని చెప్పి—మఱి అంగముగాఁ జెప్పఁదగిన కరుణమును అంగియనుచు వచ్చుటే సర్వత్రప్రధానాంశము-అది యెందుచేత? నాటకలక్షణసంబంధాన భరతసూత్రము వినుటచేత! అందువలన వీరికి శ్రీ శాస్త్రిగారి వాదము ధార్ష్ట్యము నవలంబించి వ్రాసినదిగాఁ గూడ కన్పట్టినది. ఉత్తరరామచరితములోఁ గరుణమే లేదని చెప్పువారికి జవాబిచ్చినటుల విఫలీకరించి వేంకటలక్ష్మీనారాయణులు ఇదుగో కరుణమనుచు వచ్చిరే కాని అది అంగమని భావింపక—అంగియని నిరూపింపక వ్యాసమును పొడుగించిరి. మఱియు "కవి మంగళాంతరూపకముల రచించుట శాస్త్రోక్తమగుటచే నిట్లు మంగళాంతముగ సీతారాములం గూర్చినాఁడు కాని కరుణవిప్రలంభమందలి రసమని సూచించుటకుఁ గాదు" అని నిరర్థకముగా వాదింపఁ జొచ్చిరి. ఎందుచేత? అవునన్నదానిని కాదనుటకే ఘుంటాపథ వినాశనము పేరున విమర్శనము వ్రాసిరే కాని అంగముగా రాఁదగిన కరుణ మంగియనుటకు సాహిత్యదర్పణాద్యనేకగ్రంథము లడ్డు వచ్చునని భయపడక—ఇంత చాలుననితలంచి ఆ ప్రస్తుత విమర్శనము విరమించితిని.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## హైందవవ్యాయామము

అమెరికాయొక్క—ముఖ్యముగ సంయుక్తరాష్ట్రములు (United States) యొక్క- నివాసులకు హిందూవ్యాయామముల శ్రేష్ఠత్వమును విశదపరచునిమిత్తము అచటి "ఫిజికల్ కల్చర్" అను జర్నలులో



శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు

చార్లస్. బి. రాత్ అనునతడు ప్రచురించిన వ్యాసమును శ్రీడాక్టరు ఆచంటలక్ష్మీపతిగారు పదునాల్గు పేజీలనొక చిన్నపుస్తకముగ ముద్రింపించి వెలువరించిరి. అనేక వేల సంవత్సరములక్రింద మనపూర్వీకులచే నేర్పరుపబడిన విద్యలకు విధానములకు మనము వీడుకోలుపు లిచ్చుచుండ ఇతర దేశములవారలు వాని నెట్లు మక్కువతో నాదరించుచున్నదియు నీ వ్యాసమును చదువుట వలన విదితము కాగలదు. మనదేశమందంతట దండెములు, బస్కీలు అనుపేరున ప్రసిద్ధికెక్కియున్నవే కాని, ఇవి మనకు క్రొత్తవ్యాయామములు కావు. వీనిని ప్రతిదినము చేయుచుండుట వలన దేహమందలి కండరములన్నియు సుచిత్రరీతిని వికాసావస్థను బొంది శరీరసౌందర్యము నభివృద్ధిపరచుటయేగాక కాయమందలి యే భాగమున కేప్రకారము బలముకలుగవలయునో ఆప్రకారమాభాగమునకు బలము గలుగుటంజేసి ఈ వ్యాయామములు విజ్ఞానానుకూలములని వీరి యభిప్రాయము. అందు సందేహము లేశమాత్రము లేదు. హిందువులు తెల్లవారి లేచినది మొదలుకొని రాత్రి శయనింపబోవువరకు గావించు శాస్త్రానుకూలములైన కార్యములన్నియు విజ్ఞానానుకూలములే. పాశ్చాత్య వ్యాయామములకు సాధనములనిమిత్తము ధనముకావలయును కాని వీనికి దమ్మిడీయైన ఖర్చు లేదు. అట్టి వీనిని విదేశీయులు శ్రద్ధతో జేయుచు లాభమందుచుండ మనము వానియెడల నుపేక్షాభావమూనుట మిగులశోచ

నీయము. పాశ్చాత్యవ్యాయామమునకంటె వీనివలనగలుగు శరీరఘటనము మిక్కిలి శ్రేష్ఠమైనదని లేఖకుని యభిప్రాయము. భారతవర్షమంగలివివిధప్రాంతములలో నివి కొంచెము వేర్వేరుప్రకారముల నభ్యసింపబడుచున్నను ప్రధానాంశ మంతటను నొక్కటే. ఇందు దండెములదీయు విధానములు నాలుగైదు, బస్కీలను దీయురీతులు రెండు మూడుప్రకారములు వివరింపబడియున్నవి. అందులో సాధారణదండెమొకటి. దీనిని ప్రధానముగ గొనియే తక్కిన మూడునాలుగు విధానము లేర్పరచబడినవి. రెండుచేతులు రెండుకాళ్లమీద వ్రాలి మోకాళ్లవరకు కొంచెము క్రిందుగను పైభాగము నేలకు సమానాంతరముగనుంచి అదేవిధముగ క్రిందికి శరీరమును దేవలయును. సుమారు 36 అంగుళముల ఎడము రెండుచేతులకును రెండు కాళ్లకు నుండవలయును. శరీరము సమానాంతరముగ నుండునటులే నేలకు తగినంత సామీప్యములోనికి దెచ్చి మెడను మీదికెత్తి వీలగునంతవరకు నిటునటు లాడించవలయును. తరువాత పిరుదులభాగము తగినంత ఎత్తుగ నుండులాగున లేచి గడ్డముతో రొమ్మును దాకవలయును. ఈ సాధారణదండెము ననుసరించియే మునకదండెము, కప్పదండెము, వలయదండెము, పాముదండెము మున్నగు ననేకవిధములు గల్పింపబడినవి. మునకదండెములో సాధారణదండె మందువలెనే నిలచి మడిమలమీద వెనుకకు జరిగి రొమ్ము నేలకు తగిలీతగలకుండ రాచుకొని వచ్చులాగు ముందునకుదెచ్చి వెంటనే పైకి లేవవలయును. కప్పదండెములో శరీరమును ముందుకు దోయక ఆరుఅంగుళముల ఎత్తున దేహమంతయు లేచి ముందు ఎగిరి పడునట్లు చేయవలయును. ఇట్లు గదిలో నొకమూల నుండి మరియొకమూలకేగి మరల వెనుకకు రావలయును. వలయదండెము సాధారణదండెములోవలె పిరుదులను సాధ్యమైనంత పైకెత్తి తుంట్లను వలయాకారముగ వచ్చులాగున ద్రిప్పవలయును. పాముదండెము సాధారణదండె మందువలెనే నిలచి ఒకమారు రొమ్ము క్రిందికి వీపుపైకి నుండులాగునను మరల వీపు క్రిందికి రొమ్ముపైకినుండు లాగునను వంచివంచి త్రిప్పవలయును. కాళ్లుచేతులు దక్క మరియేభాగము నేలకు దగులరాదు

బస్కీలనగా కొంచెమించుమించుగ గుంజిళ్లుదీయుటయే. తుంట్లపై చేతులనిడుకొని ౨౬ అంగుళముల ఎడముగ పాదములమీదనిలచి మెల్లగ నడుమువంచి కూర్చుండి మరల లేవవలయును. కుర్చీనొక చేతితో నాధారముగ గొని ఒంటికాలిమీద గూరుచుండి మరల లేవవలసిన వేరొకవిధముగు బస్కీలుగలవు. దండెములవలన మధ్యకాయమునకును, బస్కీలవలన కాళ్లకును అవర్ణనీయమగు వికాసము గలిగి శరీరము గ్రీసుదేశపుమూర్తులం బోలినదానినిగ జేయును. వీనిని చేయుటకు ముఖ్యసమయము ప్రాతఃకాలము. వ్యా



శ్రీయుత గామా 'సింహము'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. దండెములను దీయుటకు ఆరంభమందు మనశరీరమును ఏప్రకారముగా నుంచవలయునో దీనివలన దెలియును. ఇటుకలమీద రెండుచేతులు పెట్టబడియున్నవి.



౨. ద్వితీయావస్థ. శరీరమును నేలకు సమానాంతరమున నుండునట్లుగాగున క్రిందికి లేవలసిన రీతి.



౩. తృతీయావస్థ. వంచిన శరీరమును, తలను ఏప్రకారముగ మరల పైకి ఎత్తవలయునో దీనివలన దెలియనగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧౦. ౧౧. కప్పగంతుదండెముల దీయువిధమును దెలుపును. చిత్రములలోనున్న విధముననుండి శరీరమును కుప్పించుచు ముందుకు బోవలయును.

యామానంతరము స్నానముచేయవలయును. శాకాహారమునకు ప్రాముఖ్య మియ్యబడినది. ఈ వ్యాయామముల చేయు కులీనులగు హిందువులందరు మంచిశరీరసౌష్ఠవము, సౌందర్యముగలిగి ప్రపంచమందలి మానవశ్రేష్ఠులలో గణింపదగినవారని లేఖకుని యభిప్రాయము. మరియు నీచిన్నిపుస్తకమున హిందూవ్యాయామములవిషయమై, వాని నాచరించు ఇండియనులవిషయమై జిబస్కో యొసగిన యభిప్రాయములునుగలవు. ఇతనియుద్దేశానుసారము గామా మానవసింహము మరియు నితడు నిష్పక్షపాత బుద్ధితో హిందువులను మానవశ్రేష్ఠులని వచించుటచే విదేశీయులకు వీరి యెడల గల నికృష్టాభిప్రాయము లన్నియు దూరమయ్యెననుటకు సందేహము లేదు. ఇంత పర్యంత మెటులైనను ముందైన మన వ్యాయామము లందలి విలువను గణించి యువకులు దానిని మహోన్నత దశలోనికి దీసికొనివచ్చి మరియు గీర్తిప్రతిష్ఠల గాంచ వలయును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## "నందో రాజాభవిష్యతి"

ఈవాక్య మొకశ్లోకముయొక్క నాల్గవపాదము— నందుఁడు రాజు కాఁగలఁడు— అనునది దీనిసరియైన యర్థము. అట్టియీవాక్యము 'తరువాత నేమగునో చూతుము.' ఇప్పటి కీలాగున కానీ, అనునర్థమున లోకోక్తిగాఁ బరిణమించి చిరకాలముగా వాడుకలో స్థిరపడియున్నది. కాని యిది స్వార్థమును విడిచి లోకోక్తిగా మాఱుటకు దీనికి సంబంధించిన కథయే కారణము. ఆకథ తెలియకున్నను, పండితపామరసాధారణముగా లోకమంతయు నీ లోకోక్తిని పైని తెలిపిన యర్థమునందు వాడుచునేయున్నది. ఇదియే లోకోక్తుల రహస్యము. కావున నీలోకోక్తికి మూలమైన యా కథను తెలిసికొందముగాక.

పాండవవంశ వివర్ధనుఁడగు జనమేజయ మహారాజువంశమునఁ గాలక్రమమున, ఉత్తుంగభుజుఁడను పేరుగల రాజపుత్రుఁ డుదయించి పరిపాలకుఁడయ్యెను. అతనికిఁ బట్టమహిషియం దొకపుత్రుఁడు పుట్టెను. ఆ కుమారుని పేరు నందుఁడు(నందనుఁడు). ఆపిల్లవాఁడు జన్మించినపిదప రాజు తన దేవేరిని బ్రేమతోఁ జూడక యామె యంతఃపురమునకుఁ బోక క్రమముగా వేశ్యాలంపటుఁడయ్యెను.

అట్లు కొంతకాలము గడచినంత నొకనాఁ డొక రత్నాలవర్తకుఁ డమూల్యమైన మణిహార మొకటి యమ్మఁదెచ్చి రాజపత్నియంతిపురమునకు దానిని బంపెను. పట్టమహిషి యాహారమును జూచి మిక్కిలి మక్కువపడియు రాజు తనయెడ ననాదరము చూపియుండుటకును, తన యొద్ద రొక్కము లేమికిని మనస్సులోనే పరితపించి, అక్కఱలేదని త్రిప్పివేయుచున్నంత నామె ప్రియదాసి యొక్కతె వారించి యిట్లనెను.

"అమ్మా! అమ్మవచ్చినవస్తు వేదయినను, ఎంత వెల యిచ్చియైనను కొనుట రాజకులములయందలి యాచారము. అట్టియెడ మనస్సునకు నచ్చిన యీ హారము నూరక పోఁగొట్టుకొనవచ్చునా? ఇపుడు రొక్కము లేనిచో నొక యేఁడు గడువు పెట్టి యీవర్తకుని మరల రమ్మని చెప్పవచ్చును. అంతేకాని యీరత్నాలదండమాత్రము త్రిప్పివేయవద్దు. ఏమో! ఈలోపల నేమగునో! ఏది యెట్లుండి యెట్లువచ్చునో! మనదుర్గతి యెవరికిఁ దెలియును? ఈయేఁడాదిలో దేశకాలగతుఁడై యుత్తుంగభుజమహారాజే యంతరింపవచ్చును. లేదా, ఆ వేశ్యయే మృతిచెందవచ్చును. కాదేని యీవణిజుఁడే నశింపవచ్చును— మననందకుమారుఁడు రాజు కావచ్చును." అని చెప్పి సమ్మతిపఱచి యామెచే రత్నహారము కొనిపించెను. పై యర్థము గర్భితముగానున్న శ్లోక మిది—

ఉత్తుంగభుజనాశోవా, దేశకాలగతోఽథవా,
వేశ్యావణిగ్వినాశోవా, నందోరాజాభవిష్యతి.

ఇట్టికథకు సంబంధించియున్న 'నందో రాజాభవిష్యతి' యనువచనము కాలక్రమమున, ముందేమగునో చూతము. ఇప్పటి కీలాగునఁ గానిమ్ము, అనునర్థమునందు లోకోక్తిగా మాఱినది.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---

## నూతనగ్రహము




౧



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. క్రొత్తగ్రహమును నెప్ట్యూనుతో పోల్చిచూడగా నేర్పడు పరిమాణము ఇందు చూపబడినది. క్రొత్తగ్రహముయొక్కయు, భూమియొక్కయు విష్కంభము (diameter) ౪౧౧౦ మైళ్లు. నెప్ట్యూను విష్కంభము ౩౨౦౦౦ మైళ్లు. క్రొత్తగ్రహము సూర్యునకు భూమికంటె ఏబదింతలు అధికమగుదూరమున నున్నది. కావున దానికి సూర్యుడు కాంతిచూపిన చంద్రునివలె ప్రకాశిస్తుం. దీనిభ్రమణవేగము (Speed of revolution) భూమియొక్క భ్రమణవేగమున ఇరువదవవంతు మాత్రమే. భూమి ఏడాదికొకమారు సూర్యుని చుట్టివచ్చుచుండ నీగ్రహము ఇంచుమించు మున్నూరేండ్ల కాలమున చుట్టివచ్చును. వానకారుగాని, వేసవికాని యీగ్రహమున డెబ్బదియైదుసంవత్సరములకాలము.ండును.




౨

౨. అమెరికాయందలి హార్వర్డు విశ్వవిద్యాలయమునకు అధ్యక్షులయిన లారెన్సు లోవెలుగారి జ్యేష్ఠసోదరుడు పెర్సిలోవెలుగారు సూర్యకుటుంబమున ఇదివరకు మనుజులకు ఎఱుకలేని క్రొత్తగ్రహ మొకటి కానరానున్నదని యిరువదియైదేండ్లకుపూర్వమే చెప్పినారు. అది కనుపించగలస్థానమును సైతము ఖగోళశాస్త్రజ్ఞులకు తెలిపినారు. దానిని గనిపెట్టుటకు నక్షత్రశాలను నెలకొలుపుటకయి తగినప్రదేశమును ప్రపంచమంతట వెదకి మెక్సికోవద్ద నున్న అరిజోనా అడవిలో స్థాపించినారు. నాటిమొదలు అనుదినమును రాత్రులయందు ఆ గ్రహముయొక్క రాకను పరిశీలించుచుండుటకయి కొందరు పరిశోధకులను నియమించినారు ఆయన పదునాలుగేండ్లకుపూర్వము మృతినొందినారు. ఆనాటి ఆయన జోస్యము నేటికి సత్యముగ పరిణమించినదని పరిశోధకులు ప్రకటించుచున్నారు. వారికాగ్రహ మాయనచెప్పినచోటనే కనుపించెను. జ్యోతిర్మండలమున నాగ్రహము కనుపడుస్థానమును ఈ చిత్రము చూపును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౩

౩ లోవలు నక్షత్రశాలయందలి దుర్భిణి యంత్రముతో తీసిన ఛాయాచిత్రము. ఇందు క్రొత్తగా నగుపడిన గ్రహమును (బాణాకారరేఖలవద్ద) గాననగును.



౪

౪. లోవలు నక్షత్రశాలయొక్క శిఖరము. ఇచ్చట పరిశోధనలు సలిపి యీక్రొత్తగ్రహము కనుగొనబడినది.

---

## ఎడ్లబండి చిత్రము

రాజపుత్త్రి యొకడు ఎద్దులబండిలో స్వారి చేయుచున్నట్లు చూపబడిన యీచిత్రము హిందూ దేశములోని ఒకపారసీకచిత్రకారుని కృతి. అతడు తన భావనాదృష్టినిజూచిన యీదృశ్యమును అలంకరణప్రధానమైన తనకళలో శోభాయమానముగ తీర్చి దిద్దియున్నాడు. రథమునకు గట్టిన రెండెద్దులును మెడకు మువ్వలపటకాలతోను, కాళ్లకు కడియములతోను, కొమ్ములకు ముచ్చటగ చేయబడిన బంగారు తొడుగులతోను అలంకృతము లైనవి. ఈయలంకరణములు రథమునందలి రాజపుత్త్రిని విలువైన దుస్తులతో తులతూగుచున్నవి. రంగము ఎట్టి ఎప్పిడిగనుండు ధూళిధూసరితమైన ఢిల్లీ రాజమార్గముకాక పసిమి బూదిరంగుతో మనోహరమయిన స్థలము. అదియైనను కేలము వెంబగ వదలివేయబడక, మరీ క్రిక్కిరిసియుగాక, మరీ విడబడిచి ఎడమెడముగనుగాక విచక్షణతతో ఎడనెడ మృదులములైన ఆకుజొంపములతోను, పూలమొక్కలతోను అలంకృతమై రచనమునకు అపూర్వమై చిత్ర్యపు కమ్మదనమును గలిగించుచు భావనాబలమునందలి గొప్పదనమును విశదీకరించుచున్నది. ఎద్దులు రెండును సహజమైన వాస్తవికతను సూచించునట్లు పుష్టిగ అనతిక్రమణీయ లాలిత్యముతో చిత్రములైనవి. ప్రయాస సాధ్యమును, సాహసకార్యోపేతమును అగు ఎట్టి ప్రయాణమునకైననుఎదురుచూచు వేకుక, ధైర్య సాహసములతో కూడిన పర్యవేక్ష చిహ్నితమైన కల్గున్న వెడదకన్నులతోడి వానితలలు ముఖ్యముగ గమనింపదగినవి. ఎద్దులను వ్రాసినవిధముతో పోల్చి చూడగా మానవచిత్రముల వదనములు జీవకళా రహితములై చప్పగ నున్నవి. దీని ననుసరించి చూడగా చిత్రకారుడు స్వారిచేయు మానవుల మీదకంటె ఈయెద్దులను గుఱించియే యెక్కువ శ్రద్ధాభిమానములను చూపినట్లు కాన్పించును. చిత్రకారుని పేరుకూడ చిత్రముననే కలదు. అతని పేరు అబుల్ హస్సన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుప్రసిద్ధపారసీక చిత్రకారుడైన హీరట్ నివాసి అకారిజ్జా కొమారు డతడు. సఫావీద్ వంశమువారి ఆదరణమున వర్ధిల్లిన పారసీకచిత్రకళలోని విఖ్యాతమైన హీరట్ సంప్రదాయమునకు చెందినవాడు. ఈ అబుల్ హస్సన్ను, అతని తండ్రియైన అకారిజ్జాయును గూడ మొగలాయిప్రభువు అక్బరు ఆస్థానమున నుండువారు. జహాంగీరు ఇంకను యువరాజుగ నుండ అకారిజ్జా మొగలాయి ప్రభువు కొలువులో గుదిరెను. అబుల్ హస్సన్ శైశవమననే అతని తండ్రి హిందేశమునకు వచ్చి మొగలాయిప్రభువు కొలువున గుదురుటచేత జహాంగీరు పాదుషాయే అతనిని సంరక్షించి పోషించెను. అబుల్ హస్సన్ 'జహాంగీరు నామా'కు ముఖచిత్రముగ జహాంగీరు పట్టాభిషేక చిత్రమును చిత్రించెను. అబుల్ హస్సన్ పెరిగి పెద్దవాడయి, అతనిచిత్రకళ ఉత్తమ తరగతికి వచ్చునప్పుడు జహాంగీరు అతనియెడ చాల శ్రద్ధతీసుకొనుచుండెను. అతని చిత్రకళాప్రాశస్త్యమునకు అబుల్ హస్సన్పై జహాంగీరుకు అభిమానగౌరవములు మెండు. జహాంగీరు అతనిని 'నాదరు జ్జమాన్' (అనగా ఆకాలపు అద్భుతవిషయములలో అత్యద్భుతుడు) అని శ్లాఘించుచుండువాడు.

అక్బరు పాదుషా తన యాస్థానములోని చిత్రకారులకు పారసీకచిత్రములను ఒరవడిగా పెట్టెను. ఈ పారసీక సంప్రదాయమునకు, మొగలుసంప్రదాయమునకు చిత్రస్వభావమునను, పర్యవేక్షలోను, చిత్రరచనా పద్ధతిలోను చాల వ్యత్యాసము కలదు. మొదటి దశలో అక్బరుపాదుషా యాస్థానమున నున్న గొప్పవిశిష్టత కల పారసీక చిత్రకారుల చిత్రములను జూచి ఆ పారసీక సంప్రదాయమునందలి వృత్తి, ప్రవృత్తులకు దాసులై మొగలాయి కొలువులోని భారతీయచిత్రకారులు వాటిని అనుకరించు వారు. ముఖ్యముగ దేశీయులైన భారతీయ చిత్రకారులచే నిరూపితమైన దేశీయ మొగలాయిసంప్రదాయము ఎచ్చు తెచ్చుట మంచియున్న దానిని గ్రహించు సమాహారకపర్యవేక్ష కల దగుటచేత అనతికాలమునందే దేశీయులైన భారతీయచిత్రకారులు తమ పారసీకపు ఉపాధ్యాయుల పంథనుండి తప్పించుకొని రచనా పద్ధతిలోను, వీక్షాశక్తిలోనుగూడ అగ్రవాదిగనుండు వాస్తవికరీతిని నెలకొల్పిరి. అలంకారపరిస్ఫోటనము, అద్భుతవర్ణరీతి గల పారసీకసంప్రదాయమునుండి దానిని విస్పష్టముగ వేఱుపఱుపవచ్చును. మొగలాయిచిత్రములలో గానవచ్చురీతిని వాస్తవికత పారసీకసంప్రదాయమున పొడగానరాదు. చెట్లు, అంకురములు, మానవ చిత్రములు—ఇట్టి ఉజ్జ్వలాలంకారసంయుతములు, సమయ నిబద్ధములునగు రచనలు మొగలాయిసంప్రదాయమున లేవు. అందువలన 'ఇండో-పెరిషియన్' (భారతీయ-పారసీక) పదమువలన నిజముగ హిందూదేశములోని పారసీక చిత్రకారుల యొక్కయు, కొంతకాలము వారి సమయములను, ప్రవృత్తులను అనుసరించుచు వచ్చిన హిందూచరిత్రకారులయొక్కయు చిత్రముల గుణసంపద విశద మగును. మొగలాయి సంప్రదాయ మనుటవలన మొగలాయి పాదుషా ఆస్థానముననుండిన భారతీయచిత్రకారుల చిత్రములయొక్క సహజ, స్వదేశీయ గుణము తెలియనగును. ఈచిత్రసంప్రదాయము హిందూ, పారసీక, యూరోపీయ వృత్తుల విచిత్రసమ్మేళనమువలన నేర్పడినది. మొగలాయి ఆస్థానమునందలి 'ఇండో-పెరిషియన్' పద్ధతినాటి చిత్రకళ రచనావిధానమున బహుళముగ ఆలంకారికము: వీక్షాశక్తిలో ప్రచురముగ అపూర్వఘటనాత్మకము. ఇక్కడ ముద్రితమైన చిత్రము అబుల్ హస్సన్ వ్రాసిన చిత్రములలోనికెల్ల మేలుబంతి. ఈ చిత్రమువలన అక్బరు, జహాంగీరు పాదుషాలు మనకు ఎట్టి వారసత్వమును విడిచిపెట్టిపోయిరో విశదము కాగలదు.

[ఈ పై విషయములు ఓ. సి. గంగులీగారు ఈ చిత్రమును గురించి 'త్రివేణి' పత్రికకు వ్రాసిన వ్యాసము ననుసరించి వ్రాయబడినవి.]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




శ్రీకామకోటిపీఠాధిపతులు శ్రీ శంకరాచార్యులవారి మఠమునకు సంబంధించిన తామ్రశాసనములు.

(Copper-plate inscriptions belonging to the Sri sankaracharya of the Kamakoti-pitha.)

కీర్తిశేషులైన టి. యే. గోపినాథరావు, యమ్. యే., గారిచే పరిష్కృతములు.

ఈ గ్రంథమున ప్రకటింపబడినవన్నియు తామ్రశాసనములు. ఇవి కామకోటి పీఠము శ్రీశంకరాచార్య భగవత్పాదుల వారివి. అన్నియుకలిసి పదికలవు. వీటిలో

(౧) గండగోపాలచోళుని శాసనము. ఇందు కడపటిరేకు మాత్రమే మిగిలినది. మిగిలినవన్నియు పోయినవి.

(౨, 3) విజయనగరాధిపతియు, కృష్ణదేవరాయల యగ్రజన్ముడును, నరసానాయకుని పుత్రుడునైన వీరనరసింహరాయల నాటివి.

(౪, ౫) కృష్ణదేవరాయల నాటి రెండు శాసనములు.

(౬) ఎవరిదో ఒక శాసనమునందలి మొదటిరేకు. మిగిలిన రేకులు పోయినవి.

(౭) పుదుక్కోట తొండమాన్ భూపతి విజయరఘునాథ రాయల శాసనము.

(౮) మధుర విజయరంగ చొక్కనాథనాయకునిశాసనము.

(౯) సంస్కృతము, ఫారసీ, తెలుగులోనున్న ఫర్మానా ఎవరో మహమ్మదీయప్రభు విచ్చినది.

(౧౦) అక్కన్నమాదన్నగార్ల నాటిశాసనము.

వీటిలో మొదటిది గండగోపాలచోళుని శాసనము. ఈరాజు నిత్యము అష్టోత్తర శతబ్రాహ్మణులకు రసోపేతముగ మృష్టాన్న భోజనము నొసంగుటకై హస్తిశైలనాథాలయమునకు పశ్చిమమునకున్న మఠమునందలి శ్రీ శంకరాచార్యగురుపాదులకు ఖర సంవత్సరమున సూర్యుడు కర్కాటక రాశియందుండ మిత్రదైవత నక్షత్రయుక్తమైన శుక్లపక్ష దశమితిథిని సోమవారమున అంబికాపురమను గ్రామమును దానముచేసెను. ఈరాజు ఎవ్వరైనదియు నిర్ణయించుట కష్టముగ నున్నది. ఈశాసనములను పరిష్కరించి ప్రకటించిన శ్రీ గోపినాథరావుగారు ఈదానము క్రీ. శ. ౧౨౯౧ వ జూలై ౯ వ తేది సోమవారమున జేయబడినట్లు శ్రీ స్వామికణ్ణుపిళ్లగారి గుణకము ననుసరించిచెప్పుచున్నారు. ఈశాసనమునే శ్రీయస్. వి. వెంకటేశ్వర అయ్యరుగారు ఎపిగ్రాఫియా ఇండికా పదుమూడవ సంపుటమున ప్రకటించియున్నారు. వారుకూడ క్రీ. శ. ౧౨౯౧-౧౨౯౨ వ సంవత్సరమే ఈదాన సంవత్సరముగ అంగీకరించియున్నారు. ఈవిధముగ క్రీ. శ. ౧౨౯౧ వ సంవత్సరమును దానవత్సరముగ అంగీకరించినచో తిథి సరిపోవుటలేదు. స్వామికణ్ణుపిళ్లగారు చెప్పిన ౧౨౯౧ వ సంవత్సరము జూలై నాలుగవ తేది సోమవారము శుక్లద్వాదశి యైనది, నక్షత్రము జ్యేష్ఠ. అయినప్పటికి ఖరసంవత్సరముకర్కాటకరాశి సోమవారము అన్నియు సరిపోవుచుండుట చేత ప్రాయికముగ దానమీయబడిన తేది క్రీ. శ. ౧౨౯౧ వ జూలై ౪ వ తేది కావచ్చునని పిళ్లగారు తేల్చియున్నారు. ఈ విధమున వివరములను పరిశీలించినచో దానవత్సరము క్రీ. శ. 1291 అగునా కాదాయనియే సందేహము కలుగుచున్నది. ఈశాసనములను యస్. వి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంకటేశ్వర అయ్యరుగారు 'ఎపిగ్రఫియా ఇండికా'లో ప్రకటించిన సందర్భమున తత్పత్రికాధిపతులలో నొకరుగ నుండిన శ్రీ రావుసాహేబు హెచ్. కృష్ణశాస్త్రిగారు ఈదానశాసనమునగల తేదీవివరములు క్రీ.శ.౧౨౯౧ కిగాని ౧౨౯౨ కు గాని సరిపోవుటలేదనియు, ౧౨౯౧కి అఱువది సంవత్సరముల తరువాత వచ్చు ఖరసంవత్సరమున అనగా క్రీ. శ. ౧౩౫౧ లో కర్కాటకమాసము, శుక్లపక్షదశమి సోమవారము జూలై నాలుగవతేదియగుచున్నదనియు వ్రాసియున్నారు: వారి యభిప్రాయమున ఇదియే దానమీయబడిన సరియైన తేది. ఈ తేదీని నక్షత్రము విశాఖ: మిత్రదైవత నక్షత్రము అనూరాధకాని విశాఖ కాదేమో. ఎట్లయిననేమి దానవత్సరము గోపినాథరావు, యస్. వి. వెంకటేశ్వరఅయ్యరుగార్ల యభిప్రాయము ననుసరించి క్రీ.శ. ౧౨౯౧-౯౨ వ సంవత్సరమును, కృష్ణశాస్త్రిగారి యభిప్రాయము ననుసరించి క్రీ. శ. ౧౩౫౧ యు అగుచున్నది. ఈరెంటిలో ఏదిసరియైనది? క్రీ. శ. ౧౨౦౦ లు మొదలు క్రీ. శ. ౧౩౦౧, ౧౩౨౦ వఱకు నెల్లూరుమండలము దక్షిణభాగమునుండి కాంచీపురము వఱకు గల దేశమును గండగోపాలనామాంకితులైన భూపతులు పరిపాలించుచుండినట్లు మనకు శాసనాధారమున దెలియవచ్చుచున్నది. గండగోపాల తిరుకాళదేవచోడ, మధురాంతక పొత్తపిచోడ గండగోపాల, విజయగండగోపాల, మనుమగండగోపాల, రాజగండగోపాల, వీరగండగోపాల, గండగోపాలాది నామములం ధరించిన రాజేంద్రు లీకాలపు వారే. వీరిలో కొందఱు పల్లవవంశజులును గలరు. కొందఱు చోడవంశజులును గలరు. కొందఱు విక్రమసింహపురము నుండియు, మఱికొందఱు కాంచీపురమునుండియు, వేఱొక కొంద ఱితరస్థలముల నుండియు పాలించియున్నారు ఎట్లుచూచినను గండగోపాలనామమును వహించినవారి శాసనములు క్రీ. శ. ౧౩౨౦ తరువాత కానవచ్చుటలేదు. ఒకవేళ ఇంకను ఉండవచ్చుననుకొన్న కాంచీపురమునుండి పరిపాలనము నెఱపిన గండగోపాలురు క్రీ. శ. ౧౩౨౫ వఱకే కాని యటుతరువాత నుండ నవకాశము లేదు. ఏలయన అప్పటికి కాంచీపురప్రాంతము శంబువరాయల యధీనమయ్యెను. సకలలోకచక్రవర్తి వెన్నుమఱ్ఱకొండ శంబువరాయ, రాజనారాయణ శంబువరాయాదుల ప్రభుత్వము సాగుచుండెను. అందువలన ఒకవేళ శ్రీకృష్ణశాస్త్రిగారు చెప్పినట్లు శాసనమునం దొసంగబడిన తిథివార సంవత్సరములు క్రీ. శ. ౧౩౫౧ కు సరిపోయినను అప్పటికి గండగోపాల నామాంకితులైన రాజులెవ్వరును గానరానందున ఈశాసనము క్రీ. శ. ౧౩౫౧ కి పూర్వపుదేయై యుండునని యూహింపవలసియున్నది. గోపినాథరావుగారును, యస్. వి. వెంకటేశ్వర అయ్యరుగారును కూడ క్రీ. శ. ౧౨౯౧ దాన సంవత్సరముగ నిర్ణయించి ఈగండగోపాలవోలుడు విజయగండ గోపాలుడని నిర్ధారణ చేయుచున్నారు. ఇదేకాలమున పల్లవవంశజుడైన విజయగండగోపాల భూవరుడు కూడ మఱియొకడున్నను మనశాసనదాత గండగోపాల చోళుడను పేరు కలిగియుండుటచే చోళవంశజుడనుట స్పష్టమే కాని యతడు విజయగండగోపాలుడగునా యనియే సందేహింపవలసి యున్నది. ఏలయన విజయగండ గోపాలుని శాసనము లనేకములు దొరకినవి. చాల వాటిలో నీతనికి త్రిభువన చక్రవర్తి బిరుదము కూడ గలదు. మనశాసనమున ఆబిరుదము మాత్రమే కాక వాడుకగ ఆతనిశాసనములందు గానవచ్చు 'విజయ' పదముకూడ లోపించి, వట్టిగండగోపాల నామముమాత్రమే కన్పట్టుచున్నది. అదియునుగాక ఇంతవఱకు అనేకముగ బయలుపడిన యాతనిశాసనములను పరిశీలించినచో అవి యీతని ౩౧ వ పరిపాలన సంవత్సరమువఱకే కాని అటుపైని కానవచ్చుటలేదు. ఒకవేళ చెప్పవలచిన యెడల ఆతని దగునా కాదా యని సందిగ్ధముగ నున్న యీశాసనమునుబట్టియే, అందునను శాసనమునం దీయబడిన తేదీ వివరములు సరిపోకపోయినను ప్రాయికముగ శాసన దానవత్సరము కాదగునని శాసనపరిష్కర్తలచే నిర్ణీతమైన ౧౨౯౧ వ సంవత్సరమును బట్టియే విజయగండ గోపాలుడు నలువదియొక్క సంవత్సరములు పరిపాలించినట్లు చెప్పవలసివచ్చుచున్నది. ఏకైకఫలకమాత్రావశిష్టమైన యీశాసనము ననుసరించి శాసనదాత విజయగండ గోపాలుడని, అతడు నలువదియొక్క సంవ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్సరములు పరిపాలించెనని ఖండితముగ నిర్ణయించుటకు తగిన యనకాశము కనిపింపదు. ఈ కారణములవలన ఈ శాసనము విజయగండ గోపాలునిది కాదేమోయని సందేహము. ఒకవేళ విజయగండ గోపాలునిదే యైనయెడల దానపత్రము ౧౯౯౧ గోపినాథ రావుగారు వ్రాసినట్లు అతని ౩౧ వ పరిపాలనవర్షము కాక వెంకటేశ్వరఅయ్యరుగారు వ్రాసినట్లు ౪౧ వ పరిపాలనసంవత్సర మగుచున్నది. ఏలయన విజయగండ గోపాలుడు క్రీ. శ. 1250 లో రాజ్యమునకు వచ్చినట్లు అతని శాసనములవలన దెలియ వచ్చుచున్నది. శాసనకాలమునాటికి శారదామఠము హస్తిశైలనాథాలయమునకు పశ్చిమమున నుండెను. అప్పుడు పీఠాధిపతి శ్రీశంకరాచార్యగురుపాదులు.

ఈ గ్రంథమునందు విజయనగరాధిపతు లైన తుళువ వంశనృపాలుర శాసనములు నాలుగును, ఆరవీటి వంశభూపతుల శాసనము ఒకటియు (ఒకరేకు మాత్రమే)ను కలవు. తుళువ రాజుల శాసనములలో రెండు వీరనరసింహరాయలవి: రెండు కృష్ణరాయలవి. వీరనరసింహరాయల రెండుశాసనములును శా. శ. ౧౪౨౮ నాటివే. వీరనరసింహరాయ, కృష్ణదేవరాయ లిరువురును నరసానాయకుని కుమారులు. నరసింహరాయలు తిప్పాజీదేవివలన కలిగినవాడు. కృష్ణరాయలు నాగలాదేవివలన జనించినవాడు. వీరనరసింహరాయల శాసనములవలన అతడు శా. శ. ౧౪౨౮ లో శ్రీ సదాశివ సరస్వతులవారి శిష్యులైన శ్రీ మహాదేవ సరస్వతులవారికి ఎలిచ్చూర్, వెణ్పాకం, కుడియార్ తండలం గ్రామములు దానముగ నొసంగెనని తెలియుచున్నది. ఈశాసనములనుబట్టిచూడ వీరనరసింహరాయలు శా. శ. ౧౪౨౮ అనగా క్రీ. శ. ౧౫౦౬ నాటికే విజయనగర సామ్రాజ్యాధికారమును హస్తగతము చేసికొనినట్లు స్పష్టమగుచున్నది. కృష్ణదేవరాయల శాసనములలో ఒకటి శా. శ. ౧౪౪౪ నాటిది. మరియొకటి శా. శ. ౧౪౫౦ నాటిది. కృష్ణదేవరాయలు శా. శ. ౧౪౪౪ వ సంవత్సర మార్గశిర శుద్ధ ద్వాదశి తిథిని శ్రీ మహాదేవ సరస్వతులవారి శిష్యులైన చంద్రచూడ సరస్వతులవారికి పాడవూరు, కాట్టుప్పత్తు గ్రామములను, శా. శ. ౧౪౫౦ వ సంవత్సరమగు విరోధినామ శాఖ శు ౧౫ ఆదివారమున చంద్రశేఖరసరస్వతులవారి శిష్యులైన శ్రీసదాశివ సరస్వతులవారికి ఉదయంబాకం గ్రామమును దానముచేసెను. ప్రాయికముగ శా. శ. ౧౪౫౦ వ సంవత్సరపు శాసనమున పేర్కొనబడిన శ్రీ చంద్రశేఖర సరస్వతులవారు గోపినాథరావుగారనునట్లు శా. శ. ౧౪౪౪ వ సంవత్సరపు శాసనమున పేర్కొనబడిన శ్రీ చంద్రచూడ సరస్వతులవారే కాదగుదురు. అట్లయినచో వీరనరసింహరాయ, కృష్ణరాయల శాసనముల ననుసరించి యీ శారదాపీఠమునకు సంబంధించిన ఆచార్యగురుపాదులు మనకు నలువురు తెలియవచ్చుచున్నారు. వారెవ్వరనిన (౧): శ్రీసదాశివ సరస్వతులవారు (౨) శ్రీమహాదేవసరస్వతులవారు (౩) శ్రీచంద్రచూడ సరస్వతులవారు (౪) శ్రీసదాశివసరస్వతులవారు. శా. శ. ౧౪౪౪, ౧౪౫౦ సంవత్సరముల నడుమ శ్రీచంద్రచూడ సరస్వతులవారు సిద్ధిపొందియుండవలెను. ఆరవీటి వారికి సంబంధించిన శాసనమున ఒక్కరేకు మాత్రమేకలదు. అందు ఆరవీటి రాజులవంశావతారక్రమము వర్ణితమైనది. తాతపిన్నమరాజు మనిమనుమడును, రాఘవదేవుని కుమారుడునైన ఆరవీటినగరాధిపతి రెండవ పిన్నమరాజు. ఇతని కుమారుడు బుక్కరాజుతో శాసన మాగి పోవుచున్నది.

ఈగ్రంథమునందలి తరువాతి శాసనము పుదుక్కోట తొండమాన్ భూపతి విజయరఘునాథ రాయలనాటిది. శా. శ. ౧౬౧౩ దుందుభి సంవత్సరము చైమాసము పదునైదవ తేదీని శ్రీమతు తిరుమలయ్యప్ప తొండమాన్ కొమారుడు శ్రీమతు విజయరఘునాథరాయ తొండమాన్ ధరణీపతికి ఊడిగము చేయువారలును, అంబిల్ గ్రామము దక్షిణభాగమున నివసించువారును అయిన 'ఎరయ' తెగకు చెందినవారు ('అరైయమక్కళు') కాంచీపురములోని 'కుళ్కదైప్పవని' నివాసులైన పవని వేంకటయ్య కొమారుడు వేంకటకృష్ణయ్యకు కొంతధనమును, ధాన్యమును దానపూర్వకముగ నిచ్చి యీధర్మము ఆచంద్రార్కముగ సాగునట్లు కట్టడిచేసిరి. తిరుచునాపల్లి మండలముననూ, జంబుకేశ్వర ప్రాంతమునను ఈ శారదామఠమునకు గల భూముల వ్యవహార



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును ప్రతిగ్రహీతయైన యీ వేంకటకృష్ణయ్య కార్య కర్తగనుండి చక్కబెట్టుచుండియుండవచ్చునని శ్రీ గోపినాథరావు గారు తెలుపుచున్నారు. ఏతద్ధర్మమునకు సంబంధించిన కట్టుబాటులు—అనగా ఎవరెవరు మాసమున కెంతచొప్పున ధనమును, ధాన్యము నొసంగుచుండవలసినది—వివరముగ శాసనమున పొందుపఱుపబడినవి.

తరువాతి శాసనము మధురనాయక ప్రభువులది. ఇందలి దాత విజయరంగ చొక్కనాథనాయకుడు. ఇతడు చొక్కనాథ నాయని పౌత్రుడు. రంగకృష్ణముద్దువీరపనాయని పుత్రుడు. తల్లియు, తండ్రియుకూడ గతించినందున విజయరంగ చొక్కనాథ నాయని చిన్నతనమున ఆతని తండ్రితల్లియు, తాతయైన చొక్కనాథనాయని భార్యయునగు మంగమాంబ (క్రీ. శ. ౧౬౮౯–౧౭౦౬) సంరక్షణకర్త్రిగానుండి రాజ్యమును జాలసమర్థతతో పాలించి, పెక్కు ధర్మకార్యములొనరించి యశస్సునార్జించెను. ఈ విజయరంగ చొక్కనాథ నాయకుడు క్రీ. శ. ౧౭౦౬ మొదలు ౧౭౩౨ వఱకు రాజ్యముచేసెను. ఈ "విజయరంగ చొక్కనాథ నాయనయ్యవారు లోకగురుస్వాములైన శ్రీమచ్ఛంకరాచార్య స్వాములవారికి గజారణ్యక్షేత్రమందు పాకవాశికొండాం వీధిలో పూర్వం మొదలుకొని స్వాములవారికి స్వంత్త మఠం వుండ్డేటందున్న ఆమఠాన నిరంత్తరముగా అన్నదానం ధర్మాదులు నడిపించవలనని స్వాములవారు ఆజ్ఞాపించ్చినందున్న ప్రీతిగాను పూజనైవేద్యం అన్నదానం బ్రాహ్మణసంతర్పణ మొదలైనవి నడిచివచ్చే" టందుకుగాను కొంతభూమి దానముచేసియున్నారు. దానమిచ్చిన తేది శా. శ. ౧౬౩౦వ వికృతి సంవత్సర కార్తిక శు ౧౫ సోమవారం; అనగా విజయరంగచొక్కనాథ నాయకుడు రాజ్యమునకువచ్చిన రెండుసంవత్సరములకు జరిగినదానమిది. జంబుకేశ్వరమునకే గజారణ్య క్షేత్రమనియు, తిరువానైకావల్ అనియు నామాంతరములున్నట్లు శ్రీ గోపినాథరావుగారు తెలుపుచున్నారు.

తరువాతిది యొక ఫర్మానా. ఇది హిజిరా ౧౦౮౮ అనగా క్రీ. శ. ౧౭౧౦ నాటిది. ఇది సంస్కృతము, ఫారసి, తెలుగుభాషలలో కలదు కాంచీ దివ్యక్షేత్ర శారదామఠ సంస్థిత శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శంకరాచార్య పూజిత శ్రీ చంద్రమౌళీశ్వర స్వామికి దీపారాధన నిత్యనైవేద్య బ్రాహ్మణసమారాధన మొదలైన సకలవిధ పూజార్థంగా ఎవరో యొకసుల్తాను ఈనాము కట్టడ చేసినట్లు ఈశాసనము తెలుపుచున్నది. క్రీ. శ. ౧౭౧౦ లో దక్షిణదేశము కూడ మొగలాయిలకు స్వాధీనమయ్యెను. అప్పుడు ఢిల్లీలో పరిపాలించుచుండిన పాదుషా బహదూర్‌షా. కావున ప్రాయికముగ ఈదానము ఆపాదుషాచే చేయబడియుండునని గోపినాథరావుగారూహించుచున్నారు. పాదుషాకు ఈ ధర్మమునుగూర్చి విన్నపము చేసినది లింగోజి సంగరసు. ఇతడు చెంగలపట్టుకు సంబంధించిన మేలుపాక తరఫ్‌దారు (గౌనర్మెంటుపన్ను వసూలుచేయువాడు.)

ఈగ్రంథము నందలి కడపటిశాసనము శా. శ. ౧౬౦౮ నాటిది. శ్రీమత్కాంచీదివ్యక్షేత్ర శ్రీశారదామఠసంస్థితమైనట్టియు, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య స్వాములచే నధిష్ఠింపబడినట్టియు సింహాసనమున కభిషిక్తులైన శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ సంయమీంద్రులవారి యంతేవాసివర్యులు శ్రీమహాదేవేంద్ర సరస్వతులవారు రామశాస్త్రిలవారికి "గోలకొండ అక్కన్నమాదన్నవారు యిచ్చిన తమముసాగ్రామంలో చంగలపట్టుఘాగీరు సీమల అజూరుదగ్గర మేలుపాకలోను అగ్రహారంచేసి" యిచ్చిన దానమును ఈశాసనము తెలుపుచున్నది. వర్షాశనము మొదలైనవికూడ ఇయ్యబడినవి.

ఈశాసనములనుబట్టి శారదామఠము కామకోటిపీఠము మొదటినుండి క్రీ. శ. ౧౬౮౬ వఱకు కంచిలోనే యుండినట్లు తెలియుచున్నది. పిదప తంజావూరి మహారాజైన ప్రతాపసింహుడు క్రీ. శ. ౧౬౮౬వ ప్రాంతమున తన రాజధానియైన తంజావూరికి కామకోటిపీఠము మార్పవలసినదని యప్పటి శంకరాచార్యస్వాముల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారిని కోరెననియు, ఆప్రకారముగనే పీఠము తంజావూరికి మార్చబడెననియు, కాని కుంభకోణము తంజావూరికంటె అనుకూలస్థలముగ గన్పట్టుటచేత తిరిగి పీఠము తంజావూరినుండి కుంభకోణమునకు మార్చబడినదనియు చెప్పుదురు. ప్రస్తుతము ఈకామకోటిపీఠము కుంభకోణముననే కలదు. కుంభకోణమున కావేరీతీరమున నిప్పుడున్న శారదామఠమును తంజావూరి శెర్ఫోజీ మహారాజు క్రీ. శ. ౧౮౪౩లో కట్టించినట్లు ఆమఠములోని యొకశాసనము తెలుపుచున్నది.

శ్రీ టి. యే. గోపినాథరావు గారిది శాసనపరిశోధనలో అందెవేసిన చేయి. అమూల్యమైన తమ చరిత్ర పరిశోధనలవలన విఖ్యాతి గడించి కీర్తికాయులైరి. చేయదలచిన పనిని ఎంతచక్కగ వారు నిర్వర్తించువారో తెలుపుట కీగ్రంథమే ప్రమాణము. శారదామఠము కామకోటిపీఠము శ్రీ శంకరాచార్యస్వామివారు తమ భండారమునందున్న యీ యమూల్య శాసనములను ప్రకటింపించి దేశచరిత్రమునకు మతచరిత్రమునకు అత్యంతోపకారము కావించుట సమ్మోదావహము. ఇందు మూలమున శ్రీ స్వామివారికి చరిత్రపైగల యభిమానము వెల్లడియగుచున్నది.

మ. సోమశేఖరశర్మ.

---

## "THE CHILDREN OF KAVERI"
## (కావేరీ కిశోరములు)

క్రౌను ౮ పుటల సైజు-పుటలు ౧౦౩; వెల ౦-౧౨-౧

గ్రంథకర్త:—శంకరరామ్‌గారు; ప్రకాశకులు: వి. యల్. శాస్త్రి అండుకో, తిరువల్లిక్కేణి, మద్రాసు.

ఇది ఆంగ్లమున రచియింపబడిన ఐదు కథలు గల చిన్న సంపుటము. కావేరీతీరమందలి జానపదుల యిలివృత్తములు ఈకథలకు మూలాధారము. 'ఒకరి నమ్మకమును మరియొకరు పేక్షించుటనేరమా?' 'శత్రువుకూడ ప్రసాదమునటు', 'మూడుగజముల గుమ్మడి తీగ', 'తోడివాసనల పిలుపు' 'అవకాశముయొక్క దుర్వినియోగము' అని కథలకు నామకరణము. అన్నిటియందును రచయిత వాస్తవ వస్తుకల్పమునే పరిగ్రహించినాడని తోచును. ముఖ్యముగా బాలురను వర్ణించునప్పుడు వారి చిత్తములనతడు మాఱిగొనినాడని స్ఫురింపకమానదు. సంగీతతన్మయుడగు నారాయణుని ప్రజ్ఞావిశేషములు, పళనికిగల జీవకారుణ్య మాతృభక్త్యాదులు హృద్యములైనవి.

రచయిత నిపుణముగా తన రచనానైపుణిని దాచుకొని, కథలకు సహజసౌందర్యమును ఘటించినాడు. కథలను చదువునపుడు రచయితపై మనదృష్టిపోరదు. అందు వచ్చు స్త్రీపురుషులు సామాన్యముగా మనకు పల్లెటూళ్లలో కనిపించువారే. వారిచర్యలుకూడ పరిసరములకు సరిపోవునవే. కథలు పదములతో కూర్చిన ఛాయాచిత్రములవలెనున్నవి. అందువలన భావనాశక్తికి అవకాశముకొఱవడినదనికూడ చెప్పవచ్చును.

సులభశైలిలో ఈకథలు వ్రాయబడినవి. చిన్నిచిన్ని వాక్యములతోడనే వర్ణనలు సయితము మెఱుఁగగా నిర్వహింపబడినవి. ఆంగ్లభాష న్యసించు బాలురకు హైస్కూలు తరగతులలో ఇట్టి కథాసంపుటములను పఠనీయగ్రంథములుగా బెట్టుటవలన మేలు చేకురు నని విశ్వసింపదగును. (గు. వెం. సు.)

---

## వారకాంత

గ్రంథకర్త:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, కలాభివర్ధనీపరిషత్తు, రాజమండ్రి. ౯౬ పేజీలు, పేచు కాగితములు, అట్టబైండు. వెల ౧-౦-౦. ౧౯౨౩ సం.

ఇదియొక సాంఘికనాటకము. ఈ గ్రంథము ౧౯౧౯ సం||లో మొదటిసారి ముద్రింపబడినది. రెండవసారి ౧౯౨౩ సం||లో ముద్రింపబడినది. ఈరెండవ ముద్రణయొక్క పీఠికలో గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాడు. "ఈగ్రంథముయొక్క పేరునుబట్టి యిది రెండవకూర్పు; గాని మొదటికూర్పునకును దీనికిని యేమియు సంబంధములేదు. కథ అంతయు మారినది. పాత్రలు కొన్ని క్రొత్తవి చేర్పబడినవి. ప్రాతవి కొన్ని తొలగింపబడినవి. ఈతీరున అన్నివిధముల ఇది క్రొత్తనాటకము. ఇది మొదటికూర్పు". దీనిలో నొకవింత విషయము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలదు. పైవాక్యములలో గ్రంథకర్త యిది మొదటి కూర్పని వ్రాసియున్నాడు. ఇందలి భావమేమి? గ్రంథకర్త యీ గ్రంథమును రెండవకూర్పుగా నిశ్చయించక మొదటికూర్పుగా నిశ్చయించినాడు. అనగా యీకూర్పు తొలికూర్పును రద్దుచేయుచున్నదనియు, తొలికూర్పు యొక్క కర్తృత్వమును గ్రంథకర్త విడిచివేసెననియు తేలుచున్నది. ఇట్లు తొలుత వ్రాసినగ్రంథమును తా నుపసంహరించుకొనుటకు కారణము లుండవలెనుగదా. ఆకారణములేవో కనుగొందము.

## మొ ద టి కూ ర్పు

గ్రంథకర్త యీ నాటకమును తన పదు నెనిమిదవ యేట-అనగా బొత్తుగా చిన్నతనమందు, తన వాఙ్మయ సాంఘికాభిప్రాయములు పక్వస్థితి బొందని కాలమందు-వ్రాసెను.

ఈనాటకమందలి కథ భుజంగరాయకవిగారు రచించిన వారకాంత యను చాటుప్రబంధమునుండి గ్రహింపబడినది. మూలగ్రంథమందలి పద్యములే యిందు కొన్ని చేర్చబడినవి. కథయందు పాత్రలయందు విశేషముగా మార్పులేదు.

ఈ నాటకము సంఘముయొక్క ప్రతిబింబ మన తగినది. అట్టి సందర్భమున దీని నిర్వహణమునకును ప్రకృతికిని విశేషభేదములేకుండ నుండి యుండవలెను కదా. అట్లుగాక దీనియందు నాటకకళయు, శైలియు సాంఘిక నాటకమునకు తగినట్లుగా లేవు. ఇందు పద్యములును సంగీతమును యెక్కువగా నున్నవి. చిత్రవిచిత్రములైన వృత్తములు—నాటకకృతులు లేనికొరత తీర్చుటకుగా బోలు—చేర్చబడినవి. పద్యములు వృత్తములు అధికముగా గలవు: అక్కడక్కడ తప్ప అవి రసవంతముగా లేవు. అవి అనవసర మగుచోట్లకూడా వాడబడినవి.

వచనశైలి అధిక గ్రాంథికము. సంస్కృత పదములు,శబ్దాలంకారములు హెచ్చు; కృతకముగా నున్నది.

సంభాషణలయందు గాని, ఘటనాసృష్టియందు గాని విశేషప్రజ్ఞ మౌలికత్వము గానరాదు. అధిక గ్రాంథికముతో నిండియున్న ఈనాటకమందు ఇంగ్లీషు మాటలప్రయోగము స్వారస్యమును హెచ్చించుటకు బదులు తగ్గించి వికారమును గలిగించుచున్నది. ఇట్లీ గ్రంథమందు అభాసము హెచ్చుగాగలదు. ప్రదర్శన యోగ్యముగను, ప్రదర్శనానుకూలముగను లేదు.

పాత్రపోషణమందు పెద్దలోపములు లేవు. కన కాంగిలత కేశవవృక్షము అనునట్టి దీర్ఘమైన రూపకాలంకారము హర్ష మొసగుచున్నది.

ఇట్లు మిగుల నభాసముగనున్న ఈ గ్రంథము గ్రంథకర్త కసంతృప్తి గలిగించెననుటలో నాశ్చర్యము లేదు. కావున గ్రంథకర్త దీని నుపసంహరించుకొనదలచి 1923 సం॥లో క్రొత్తకూర్పును ప్రచురించెను. మన కిందొక లాభము గాన్పించుచున్నది. అదేమన గ్రంథకర్తయొక్క చిన్నతనమందలి వాఙ్మయసాంఘికోద్దేశములును, పెద్ద తనమునాటికి వాటియందు గలిగిన మార్పులును, పరిణామమును మనకు స్పష్టమగుచున్నవి.

## క్రొ త్త కూ ర్పు

ఈ కూర్పునకును పైకూర్పునకును చాలభేదములు గలవు. పోలికలు తక్కువ. కథయందు హెచ్చుభేదము కలదు. కొన్ని క్రొత్తపాత్రలు సృష్టింపబడినవి. ప్రాతవి కొన్ని విడిచివేయబడినవి. శైలియందును, పాత్రపోషణమందును భేదము చాలకలదు.

ఈ నాటకముయొక్క నాంది మొదటి కూర్పునందువలె గాక రసవంతముగాను చిన్నదిగా నున్నది. ఈ నాటకకథలో హెచ్చు భావనయు,ఘటనలయం దెక్కువ యోచనయు,సంభాషణలలోలోతగుఆలోచనయు గలవు.

పాత్రపోషణవిషయ మేమన మొదటి కూర్పులోని కనకాంగికిని, క్రొత్తకూర్పులోని కనకాంగికిని భేదము గలదు. మొదటికూర్పులో కనకాంగి కేశవుని మోహించి నారాయణశాస్త్రిద్వారా వానిని వశపరచుకొన్నది. ఇది వేశ్యాశీలమునకు భిన్నముగా నున్నది. క్రొత్తకూర్పులోమాత్ర మట్లుగాదు. కనకాంగి కేవలము వారకాంతయే.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శైలి:—సహజగ్రాంధికము. అవసరమగు పట్టులందు వ్యావహారికము ప్రయోగింపబడలేదు. ౪౩వ పుటయందలి గ్రామ్యభాషాప్రయోగము శైలిలో సాపులేకుండజేయుచు, గ్రంథకర్తకు గ్రామ్యభాషను వాడుటయందుగల జంకును తెలియపరచుచున్నది. ఏలనన అట్టి ఘట్టములు పెక్కున్నను గ్రంథకర్త ఆయాస్థలములలో గ్రామ్య ముపయోగించలేదు.

దీనిలో పద్యము లనవసరముగ జొప్పించబడినవి. ఆవిషయము నాటకము జదివిన ప్రతిపాఠకునకును బోధపడును. 7౩వ పుటయందలి పద్యములు నాటకములలో పద్యము లుండకూడ దనిపించుచున్నవి. సాంఘికనాటకములు గ్రాంధికమందు వ్రాయబడినంతకాలము పద్యముల వాడుక తప్పదు. గ్రాంథికమునకును పద్యములకును అట్టి లంకె కలదు! ఈ నాటకమంతయు వ్యావహారికములో నుండినచో ప్రదర్శనానుకూలముగ నుండెడిది.

నాటకమందలి యుద్దేశములు

వెంకటరావను పాత్ర మొకడు తొలుత హిందూ మతాచారము లన్నను, దేవాలయములన్నను రోతజెంది యుండి క్రమక్రమముగా సంధ్యావందనమును, విగ్రహారాధనను ఆమోదించెను. కవి యిట్లు హిందూమతాచారములను సమర్థించుచున్నాడు.

గ్రంథములో ప్రాచ్యప్రతీచ్య ఆచారములను గూర్చి చర్చలు గలవు. నాట్యకళనుగూర్చియు, సంగీతమునుగూర్చియు చర్చలు గలవు. ౯౬వ పుటలో "భారత జాతియొక్క సాంప్రదాయము మారనంతకాలము వేశ్యాబహిష్కారము సాధ్యము గాదు. ప్రయత్నించిన కొలది చెడును. దానికొఱకు చేసినప్రయత్నమూ, వెచ్చించిన ధనమూ, గడపిన కాలమూ వ్యర్థములు. మీదేశమున వేశ్యజాతి యనునది ఉండనేగూడదని దలంతురేని పాశ్చాత్యుల సంఘనియమము లన్నిటినీ అవలంబింపుడు.

వేంకట:—అట్లయిన భారతీయతయే జచ్చిపోవును. అది వలనుపడదు.

సుబ్బా:—కానిచో ఇది సాధ్యపడదు.

వేంకట:—నిశ్చయమే.

అని నాటకకర్త తెల్పియున్నాడు. అనగా జాతీయత నాశనముగాకుండ వేశ్యజాతిని నాశనము చేయలేమని తేలుచున్నది. కవి యిట్లు సాంఘికదుర్మార్గములనుండి జాతీయతను వేరుచేయలేకపోయెను. గ్రంథమిట్లు సంస్కరణశూన్యమైనది. కవియొక్కపాటు కేవలము వ్యర్థమగుటయేగాక వేశ్యజాతిని సమర్థించునట్టిదిగూడ నైనది. ఇట్లు కవి జాతీయతయందును, సాంఘికదుర్మార్గములందును తబ్బిబ్బులు పడెను. సాధ్యమగు విషయము నసాధ్యము చేసెను.

---

## వీరపూజ

గ్రంథకర్త:— శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, కలాభివర్ధనీపరిషత్తు, రాజమండ్రి. క్రౌను 8 పుటల సైజు, 190 పేజీలు, మంచికాగితములు, కాగితపుబైండు; వెల. 1. రూపాయి, 1918 సం॥

ఇది హిందూ క్షత్రియవీరులతో వెలసిన సంపుటి. చంద్రగుప్తుడు, పృథ్వీరాజు మొదలగువారిందు పేర్కొనబడిరి. ఇట్టిచారిత్రకరచనలు విద్యార్థులకు దేశచరిత్రపఠనమందు కౌతూహలము గలుగజేయును. కేవలము అస్థికలనదగు దేశచరిత్ర లిట్టిరచనలచే జీవకళ కల్గి ఆకర్షకములుగను ఆనందదాయకములుగ నుండును; చదువరుల కున్న తాదర్శము లొసంగును; వీరపూజయం దభిమానము గల్గించును.

జే. కా.

మనవాఙ్మయములో సాహిత్యమునుగూర్చియే విమర్శ తక్కువ. దేశచరిత్రనుగూర్చి వేరే చెప్పవలెనా? అట్టిస్థితిలో గ్రంథకర్త వీరుల జీవితములను విమర్శకదృష్టితో రచించి యాథార్థ్యభక్తికి తావొసంగలేదు. ఇందలి విమర్శరూపమును గుఱించి యొక విషయము చెప్పవలసియున్నది. వీరుని జీవితము తొలుత సంపూర్తిగా వక్కాణింపబడి పిమ్మట విమర్శింపబడినది. ఈ పద్ధతి యెక్కువ మేలైనది కాదు. మేలు పద్ధతియేదన, విమర్శ వీరుని జీవితాంశములనే అంటిరావలెను. ఈపద్ధతి జయము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాంచవలెనన్న వీరుల జీవితములను గ్రంథకర్త ఉత్తమ పురుషలో వక్కాణింపవలెనుగాని ప్రస్తుతము గ్రంథములో నున్నట్లు ప్రథమపురుషలో వక్కాణింపరాదు. ఇట్టి పద్ధతి అవలంబించినప్పుడే గ్రంథకర్త కథావిషయముతో నైక్యమై కథయొక్కయుద్వేగముతోను యుద్రేకముతోను సమముగాబోవుచు అంశములను విమర్శింపవలసినచోట్ల విమర్శించుచుండును. ఇట్టి పద్ధతి ప్రథమ పురుషరచనలకు కుదురదు. మరొకసంగతి: పై పద్ధతి సంపూర్ణముగా జయము గాంచవలెనన్న కావ్యవిషయము విస్తారముగా నుండవలెను. హ్రస్వరచనలకు పనికిరాదు. గ్రంథమందలి హ్రస్వరచనలకు గ్రంథకర్త అవలంబించినపద్ధతియే సరిపోయినది. పైన జెప్పబడిన యుత్తమపద్ధతి కార్లైలు మొదలగు మహాచరిత్రకారు లవలంబించినది.

'వీరపూజ'లో మన మనేక రాజ్యాంగసూత్రములను తెలిసికొనుచున్నాము. హిందూరాజులలో నైకమత్యము లేకపోవుటయే హిందూప్రభుత్వవినాశనమునకు ముఖ్యకారణము. ఐకమత్యములేని యుపాయము, ఉపాయములేని పౌరుషమును హిందూరాజులను దుర్గతికి దెచ్చినవి. క్షత్రియస్త్రీలయొక్క ధైర్యస్థైర్యములు కూడ పైకారణములచేతనే వ్యర్థమైనవి.

'వీరపూజ'లో వీరుల జీవితములలో మనకు మెచ్చునకైన నొక్కటేదీ కనబడకున్నది. కాలముతో నిమిత్తములేని గంధర్వకథ (Fairy tales)లవలె రచింపబడినవి. చరిత్రకథలన్నమాట మఱచి పురాణకథలవలె చదువవలె ననిపించుచున్నవి.

శైలి గ్రాంథికము. భావమునకు తగినట్లుగా భాష యున్నది. సరళశైలి.

'వీరపూజ'లో ప్రాచీనాంధ్ర క్షత్రియవీరుల చరిత్ర చేర్పబడలేదు. ప్రచురింపబడబోవు భాగములో చేర్పబడునని తలచుచున్నాను.

ఛే. కా.

---

## త్యాగరాజస్వామి కీర్తనలు

౫౭౨ పుటలు-మేలుబైండు వెల రు ౩-౦-౦

ఇందు ఆంధ్రవాగ్గేయకారచక్రవర్తియు, శ్రీరామభక్తాగ్రేసరుడును నగు త్యాగరాజుగారు రచియించిన కీర్తనములును, వారు రచియించిరని పేరుగన్న కీర్తనములును కలిసి ౫౭౫ కీర్తనములు, తద్రచితములగు 'ప్రహ్లాదభక్తవిజయము', 'నౌకాచరిత్రము' నను రెండు యక్షగానరూపప్రబంధములును గలవు. కీర్తనములలో విష్ణుపరములు ౪౪౩, శివపరములు ౪౭, దివ్యనామసంకీర్తనములు ౭౭, ఉత్సవసంప్రదాయకీర్తనలు ౭౩ ఇట్లు నాలుగుభాగములుగ ముద్రితములయినవి. ప్రతికీర్తనమునకును రాగతాళనిర్ణయము కావింపబడెను. కీర్తనల ప్రారంభపదముల అకారాదిపట్టికయు, మేళకర్తల క్రమమున జనకజన్యరాగములలోని కీర్తనలపట్టికయు గ్రంథాదిని గలవు. ఏతద్గ్రంథపరిశోధకులగు శ్రీ కె. వి. శ్రీనివాసయ్యంగారు వాడుకలోనున్న గాథల ననుసరించి శ్రీత్యాగరాజస్వామిగారి చరిత్రమును సమకూర్చి యీ సంపుటమున జేర్చియున్నారు. దక్షిణహిందూస్థానమునందంతటను మిగుల వ్యాప్తిలోనున్న యీత్యాగరాజకీర్తనములను సాధ్యమగునంతవరకు సంస్కరింపించి యిట్లు సుందరముగ ముద్రించి ప్రకటించి ఆంధ్రగాయకలోకమునకు సులభముగ నందజేసిన 'ఆది అండుకంపెనీ' వారు (ఎస్ప్లనేడు, మదరాసు) అభినందనార్హులు.

'X'

---

## జానకీపతిశతకము

క్రౌను ౮ పుటల సైజున ౧౯ పుటలు. ౧౦౮ వృత్తపద్యములుగలవు. వెల తెలియదు.

గ్రంథకర్త:—కొవ్వలి వెంకట రాజేశ్వరరావు గారు. వలయువారు గ్రంథకర్తకు, బరంపురము, గంజాంజిల్లా అని వ్రాయునది.

"జానకీపతీ" అను మకుటము ప్రతిపద్యాంతమునను గలదు. కవనము ప్రాథమికావస్థను సూచింపుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంచిధార యున్నది. రామరామ కవనము బాగుగాఁ దేలఁగలదు. కవిగారికి వేదాంతపరిచయము కొంచెమున్నట్లు తెలియుచున్నది. పద్యములు భక్తిభరితములు- వ్యాకరణాదిదోషముల కెడ మంతగాఁ గాన్పించదు. రామభక్తులు ముఖ్యముగాఁ జదువఁదగిన గ్రంథమనియే చెప్పవచ్చును.

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

---

### ధనమహిమ

క్రౌను ౮ పుటల సైజున ౫౦ పుటలు.

పేపరుబైండు

గ్రంథకర్త:—ఆలూరు వాసుదేవయ్యగారు. ఇది యొక చిన్న వచనకావ్యము. సరసమగు వాక్యసముదాయముతోను, ముద్దులొలుకుచు సర్వజనసుబోధకములగు పదజాలములతోను, సుప్రసిద్ధములును శ్రావ్యతరములును నగు సంస్కృతాంధ్రలోకోక్తులతోను, నామూలాగ్రరసోత్పాదకమై సర్వజనతాస్వాదనీయముగా నున్నదనుట యర్థవాదముకాదు. ధార, యమృతప్రవాహమే. శైలి కడుంగడు సులభము.

"ధనము ముఖ్యముగా నార్జింపవలయును. అట్లార్జించుకొని నిలువఁజేసి తన యనంతరము పరాధీనము చేయక, దానధర్మములు చేయుచుండవలెను. తాను పూర్తిగా ననుభవింపవలయును. ధనమున్నవాఁ డెట్టివాఁడైనను వానికి సమస్తగౌరవాదులు జరుగుచున్నవి. ధనహీనునకు నెట్టి సుగుణము లున్నను నెట్టి విద్య యున్నను నవియన్నియు వ్యర్థములు"—అను నీమొదలగు విషయము లిందు విస్తరింపఁబడినవి.

ఇందులో సందర్భానుసారముగా నొక కథ యందముగాఁ బొందుపరుపఁబడియున్నది. అందలి నాయకుఁడు మందచిత్తుఁడు. వానిభార్య యుత్తమపతివ్రతాశిరోమణి. మందచిత్తుఁడు, లోభాగ్రేసరుఁడు. ధనము నార్జించుట తప్ప దానిని వినియోగముచేయుటగాని యనుభవించుటగాని వానికి దెలియదు. ధర్మమార్గము నుపదేశించునట్టి భార్యను ననేక విధములుగాఁ గొట్టును, తిట్టును. అట్టి భర్తను యమదూతల స్వాధీనమైన వానిని, దయార్ద్రహృదయముతో గాపాడిన యాయుత్తమపతివ్రతాచరితము లోకములోని జనులకు మంచినీతిని బోధించుచున్నది. ఈ చిన్నిపొత్తము మాధ్యమిక పాఠశాలా విద్యార్థుల కెంతయు నుపయుక్తమని మా యభిప్రాయము.

ఉభయభాషాప్రవీణ

బులుసు నరసింహశాస్త్రి.

---

### విమానయానము

గ్రంథకర్త: మోదుకూరి విశ్వనాథంగారు

ఆంగ్లభాషలో జూల్సు వెర్నుగారు "విమానములో అయిదువారములు" అను గ్రంథమును రచించెను. అందు, విమానయానమున కాదిపురుషుడైన డాక్టరు ఫెర్గుసన్‌గారి సాహసకార్యములు సామాన్యులకు తెలియునట్లు మనోహరముగా వర్ణింపబడినవి. ఆగ్రంథము ననుసరించియే విశ్వనాథంగారు తమ యీపొత్తమును రచించిరి. వర్ణనలందు వీరు ఆంధ్రజాతీయములను ప్రయోగించి, తెలుగు చదువరులకష్టమును తగ్గింప ప్రయత్నించినారు. కాని, అటనట, వీరివచనము 'కవిత్వము'లోనికి దిగినది.

ఇది విమానయానముంగూర్చిన శాస్త్రగ్రంథము కాదు. ఒకటి రెండు ప్రకరణములలో విమానముయొక్కయంత్రనిర్మాణము వివరింపబడినది. ఆభాగములను గ్రంథకర్తగారు మెలకువతో సులభగ్రాహ్యములుగనే రచించిరి. కాని, యీగ్రంథముయొక్క ముఖ్యోద్దేశ్యము సాహసకార్యములకు చదువరులందర నుత్సాహము గొల్పుటయే. భౌతికరసాయనాది శాస్త్రములకు పశ్చిమఖండమే పుట్టినిల్లయినది. రైలు, స్టీమర్లవలెనే విమానములును పాశ్చాత్యదేశములందు సర్వసాధారణములయినవి. దీనికి కారణభూతులు ఫెర్గుసన్‌వంటి పరిశోధకులే. వారి ధైర్యస్థైర్యములు, త్యాగము, ధీశక్తి, ఉత్సాహము ఇవియేగదా ప్రపంచమందు పాశ్చాత్యులను బలాధికులను తేజోవంతులనుగా నొనర్చినవి. మొన్నమొన్న భారతీయయువకులు కొందరు ఇంగ్లాండు ఇండియాలకు విమాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యానమును నిర్వహించి ప్రశంసాపాత్రులైరి. ఆంధ్రులలో నొకరిద్దరైనను విమానయానమునకు గడంగుచో, ఆంధ్రావనికి కీర్తితెచ్చినవారగుదురు. అప్పుడే విమానములనుగూర్చి శాస్త్రగ్రంథములు కూడ తెలుగున వెలువడుట కవకాశముండును.

విశ్వనాథంగారి గ్రంథము ఫెర్గుసన్ గారు ఆఫ్రికాయందు గావించిన పరిశోధనలను వర్ణించునది. ఆదేశము 19 వ శతాబ్దాంతమువరకును దుర్గమమై, అనాగరికుల కాలవాలమైయుండెను పాశ్చాత్య పరిశోధకుల పరిశ్రమలవలన, ఇప్పు డాఖండము ప్రపంచమం దితరదేశములకు రాకపోకలు విస్తారముగా గలిగి అభివృద్ధిపొందుచున్నది. కావున వంద సంవత్సరములకు పూర్వము ఆదేశమెటులుండెనో చదువుట ఆశ్చర్యముగానే గాక వినోదముగా కూడ నుండును.

ఆఫ్రికా దేశపు పటమును గ్రంథములో చేర్చుట అత్యవసరము. అది లేకపోవుటవలన చదువరులకు కష్టము మిక్కుటము. (గు. వెం. సు.)

---

## పారిజాతాపహరణము

## పరిమళోల్లాసవ్యాఖ్యాసహితము

ఆంధ్రభాషయందు ప్రబంధములకు కొఱత లేదు. అవి చాలవఱకు సంస్కృతభాషాభూయిష్ఠములు. కావున సంస్కృతసాహిత్యసంపన్నులుగాని వారలకు తద్రసానుభవము సంపూర్ణముగ సమకూరజాలదు. ఆప్రబంధములలో కొన్నిటికి మాత్రమే వ్యాఖ్యానములు కలవు. వానియందు శృంగారనైషధమునకు, ఆముక్తమాల్యదకు, వసుచరిత్రకు గల వ్యాఖ్యానములు కూలంకషములు. నేటికి శ్రీనాగపూడి కుప్పుస్వామయ్యగారును రసవత్ప్రబంధమును 'తమ కెక్కువమక్కువగలదియును నగు పారిజాతాపహరణమునకు 'పరిమళోల్లాస' మనుపేర నీవ్యాఖ్యానమును రచియించి సహృదయాంధ్రలోకముయొక్క కృతజ్ఞతకు పాత్రులయిరి. ఇంకను కళాపూర్ణోదయము, ఉత్తరహరివంశము మొదలగు ప్రౌఢప్రబంధములు వ్యాఖ్యానములు లేమిని పండితులకుగూడ కొరకరానికొయ్యలుగ నున్నవి. సమర్థులగు విద్వాంసులు వీటికిని వ్యాఖ్యానములు రచియించి తద్రసామృతమును ఆంధ్రలోకము చవిగొను నవకాశమును గలిగింపవలసియున్నది.

ప్రకృతము పారిజాతాపహరణ వ్యాఖ్యాన స్వరూపస్వభావాదులను వేఱొక్కచోటకు పూర్వము మూలమునందలి సాధ్వసాధుపాఠనిర్ణయమును గూర్చి యొకింత చెప్పవలసియున్నది.

వ్యాఖ్యాత పీఠికలో సాధ్వసాధుమూలపాఠనిర్ణయమునుగూర్చి 'ఈగ్రంథమునకు ముద్రితాదర్శములు నాలుగేను కలవు కాని వానిలో నుత్తమంబులని నా మదికిఁ దోఁచినవి రెండు' అనియు, వానిలోను 'నపపాఠము లనేకములు గానంబడుటచే నింకను బ్రాచీన తాళపత్ర లిఖిత గ్రంథములు సంపాదింపఁ బ్రయత్నించితిం గాని యెక్కడను నొక్కటియుఁ జిక్కదయ్యె' ననియు, 'ఈరెంటియందును దప్పులనితోఁచినవానిని నా బుద్ధికి సమంజస మనియు, గవిహృదయంబనియు, స్ఫురించిన తెఱంగున సాహసించి సవరించితి' ననియు వ్రాసియున్నారు. అందఱకు అందుబడిలో నున్న చెన్నపుర ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున గల అయిదు సంపూర్ణతాళపత్రమాతృకలు వీ రేపాటియైన ప్రయత్నించి యున్నచో వీరికి లభింపకపోయెడివి కావు. మఱియు 'స్ఫురించిన తెఱంగున సాహసించి' పాఠనిర్ణయము కావింపవలసిన యావశ్యకము తప్పిపోయి యుండెడిది. వ్యాఖ్యానింప బూనిన గ్రంథముయొక్క మూలమును నిర్దుష్టముగ జూచుకొనకున్నచో వ్యాఖ్యానము దోషజుష్టమయి యల్పప్రయోజనకరము కాగలదు. అల్పమాత్రపరిశ్రమమున నే యిన్ని పాఠములు లభించినవి. ఎక్కుడుగ పరిశ్రమించినచో మూలమున నింకను గల దోషములు తీరి గ్రంథము నిర్దుష్టముగ నుండగలిగెడిది.

### పాఠాంతరములు

దనర్చి యాత్మవక్షోమణి-దనర్చు నాత్మవక్షోమణి.
—ఆ. ౧-౧.

మించినరహి-నించినరహి; చున్నదో, యున నఖరాంకురంబుల నయంబున-లీలనొ,య్యన నఖరాంచలంబుల రయంబున.
—ఆ. ౧-౫.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలిమలయల్లువాఁడు తలవాఁకధరించిన - వలిమల యల్లువాని తలవాకఁ దన(ల)ర్చిన. —ఆ. ౧-౬.

లక్కాంబికకు-బుక్కాంబికకు —ఆ. ౧-౧౧.

ఈశ్వరనృపతి భార్య బుక్కాంబిక కాని లక్కాంబిక కాదు. చూ: ఆముక్తమాల్యదా మనుచరిత్రలు; "పుణ్యాయతమతియైన బుక్కమాంబకు". మఱియు కొల్లిపఱశాసనము: "తతోభూద్బుక్కమాజాని రీశ్వరక్షితిపాలకః"—భారతి, అక్షయసంవత్సర శ్రావణసంచిక.

అరూఢతర-ఆరూఢబహు; చిరకీర్తి యింద్రలోకాంగనాభోగి నీగీతి—చిరకీర్తు లింద్రలోకాఁగనా భోగ గీతికల. —ఆ. ౧-౧౨.

వాసనయుం-వాసనలం. —ఆ. ౧-౨౦.

మునుకొని-మునుపొక; వీటికడనాహవభూమి-వీటశరణాగతుఁడైన; కరుణామతి-కదనంబున. —ఆ. ౧-౨౧.

నిపుణకరణశేయునకు-నిపుణకరసదయునకున్. —ఆ. ౧-౨౬.

'సదయునకున్' అను పాఠమును వ్యాఖ్యాత పాఠాంతర మనెను. కాని ఈపద్యమునందలి యమకమును పరికించినచో, 'సదయునకున్' అనుపాఠమే సరియని తెలియఁగలదు. చూ:

'రాధా తనయాధారిత
గాథాధః కరణనిపుణకర సదయునకున్
మేధావ దసాధారణ
బోధాకరహృదయునకును బుధసదయునకున్.'

౧, 3 పాదముల నొకతీరునను, ౨, ౪ పాదముల నొకతీరునను యమకము గలదు.

కూలముద్రుజ-కూటమూర్ధజ. —ఆ-౧-౨౭.

వేదార్థ-వేదాధ్వ. ఆ ౧-౨౯.

ఘనతాయనకారక - ఘనతాయనతారక్ష ...3౨ పద్యమునందలి యమకమును గుర్తింపమిచే కలిగిన దోషమిది. దీనికి వ్యాఖ్యానమును సరిగాలేదు.

నలుపు-నలువు. —ఆ. ౧-౫౬.

యక్కాంత-యేకాంత. —ఆ. ౧-౧౧౦.

వీరు యతితప్పినదన్న 'నల్గడలునారసి' అనుపాఠము ఇపుడు సరిపోవును.

కణిక-కళిక. —ఆ. ౧-౧౦.

కన్నీటిబొట్టు క్రిందికిజారునది మొగ్గవలె సొగదనము గలిగియుండును. కావున 'కళిక' అనుపాఠమే సమంజసమయినది.

సున్న-సన్న —ఆ. ౧-౧౫.

మనముల-మనమున —ఆ. ౧-౧౭.

యట్టికాంతలు-కాంతలెందును—ఆ. ౧-౧౨౧.

యీకలని-నీవలని. —ఆ. ౧-౧౬౬.

మాచవి-నాచవి. —ఆ. ౧-౧౭౭.

చనునో-చనెనో. —ఆ. ౨-౨౫.

'అనికైనం బలి నిన్నుఁ జాసితనెనో' అనిన వ్యాఖ్యాత వ్రాసినట్లు పారిజాతవృక్షమును దెచ్చునప్పుడు కానున్న ఇంద్రునితోడి యుద్ధమును సూచించుననుట కన్న వెనుక జరిగిన నరకాసురయుద్ధవృత్తాంతమును సూచించునన్న ఎక్కుడు సరసముగా నుండును.

చని-అని. —ఆ. ౨-౨౯,

ఇట 'చని' అన్న యతిభంగము.

పైజడిగా-పైణజడిగా. —ఆ. ౨-౪౫.

జాజిపువ్వులు-కాజపూవులు.—ఆ. ౨-౫౦.

కాజపూవులు తప్పనుకొని, వ్యాఖ్యాత యాపాఠము సరసము కాదన్నారు. ఈపూవులు చెరువులయందు వానకారున పూచును. ఇవి కలువపూవులవలెనే యుండును. అన్ని వ్రాతప్రతులయందును 'కాజ'అనియే యున్నది.

తరుణగోతర్ణకంబులు-తరళ (సరళ) గోతర్ణకంబులు. —ఆ. ౨-౬౭.

బాయుతోలంగు-బాయతోలంగు.—ఆ.3-౧౦.

పూరంబులచే-పూరాంబులచే. —ఆ. 3-3౫.

పల్క-పల్కు. —ఆ. 3-3౯.

యన-యని. —ఆ. 3-౪౨.

నందనోద్యానసీమ-నందనోద్యాన మిపుడు. —ఆ. 3-౪౪.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాలచాపల-బాల్యచాపల. —ఆ. ౫-౩౧.

దిగంతరాళ-దిగంగనాంగ. —ఆ. ౩-౫౯

గ్రోల-గ్రొత్త. —ఆ. ౪-౫.

గ్రోలఁగనెదుర్పడి—గ్రోలఁగని తూలుచు.
—ఆ. ౩-౬౬.

మన్ని-మిన్ని. —ఆ. ౪-౧౦.

మైన-లీల. —ఆ. ౪-౧౧.

నేత్రయు-నేత్రలు. —ఆ. ౪-౧౩.

కర్ణికావ్యాతి-కందుకాహతి. —ఆ. ౪-౧౭.

గుంది-గంది. —ఆ. ౪-౨౧.

దనివార-దనుపార; నందియిచ్చుచుఁ-నంజనిచ్చుచుఁ. —ఆ .౪-౨౨.

మోపుచుఁ-మార్చుచుఁ;

బరస్పరాంగ-బరస్పరాంస. —ఆ. ౪-౨౫.

దటిసె నొండొరుల-దజిసి రొండొరుల;

విహగవర-విహంగమ. —ఆ. ౪-౫౦.

నిల్పి-నిల్పె. —ఆ. ౪-౫౩.

యీడ్చు-యీడ్చె. —ఆ. ౪-౫౪.

నిందులతావి-పూవులతావి —ఆ. ౪-౫౬.

అట్టిసురతరువు నెఱుఁగక చుట్టపుమేలమునఁ గొంచు నరిఁగెడుమదినీ, కెట్టు జనియించె మరలఁ బెట్టుము బలభేదివిన్న వేఁలిమి(?)మీకుఁ.

ఇది ఆ. ౪-౫౬ పద్యమునకు తరువాత నున్నది.

గరసంజ్ఞ-గనుసంజ్ఞ. —ఆ. ౪-౫౦.

జూప-జేయ. —ఆ ౪-౬౦.

ధృతి-భృతి. —ఆ. ౪-౬౩.

నెక్క-నెంత —ఆ. ౪-౭౧.

పద-కర. —ఆ. ౪-౭౨.

శేవం-శేషం; జోప-జూప. —ఆ. ౪-౭౯.

?? శస్త్రీకృపాణంబులు-వల్గత్ కృపాణంబులు
—ఆ. ౪.౮౦.

లుల్లసిల్ల-లుప్పతిల్ల; బెడిదంబుగ బుట్టిన-బెడిదంబుగదొట్టిన. —ఆ. ౪-౮౯.

తిగిచి-తిగిచె. —ఆ. ౫-౪.

భిన్నాసురాస్త్రముల-మున్నసురేంద్రాస్త్రము.
—ఆ. ౫-౬.

ద్రుంపఁగా-నొంపగా;

గూడగఁబాఱు-దూరగఁబాఱె. —ఆ. ౫.౯.

త్రెక్కనం-త్రొక్కనం. —ఆ. ౫-౧౦.

?? భీకరముగ బాహులెత్తి-భీకర మగు బాహువెత్తి. —ఆ. ౫-౧౪.

క్రోధోక్తిఁ-ప్రౌఢోక్తిఁ.—ఆ. ౫-౧౯.

నొండ్లితరులు-గాకితరులు. —ఆ. ౫-౨౯.

తటిగొని-తటేగని. —ఆ. ౫-౩౧.

కొనియెనునామోద-కొనియె ననాఘ్రాత.
—ఆ. ౫-౪౪.

నరిగె-నరిగి. —ఆ. ౫-౪౭.

కర్చన-నర్చన. —ఆ. ౫-౫౭.

జేసె-జేసి. —ఆ. ౫-౬౯.

ప్రభుత్వము-ప్రమోదము —ఆ. ౫-౭౩.

ఆ. ౫-౯౧ పద్యమునకు తర్వాత ఈక్రింది 'అర్ధభ్రమకము' కలదు.

నాయశరగసార విరయ, తాయన జయసార సుభగధర ధీరయమా

మాయనిధీరధ గభసుర, సాయజనయతాయ రవిరసాగర శయనా!

పైన సూచించిన పాఠభేదములను గ్రంథమున జేర్చుకొని పఠించి సమన్వయించుకొన్నచో సరసముగ నాయాచోట్ల స్ఫురింపగల భావములను పాఠకులు తెలిసికొనగలరు. కాన ఇట తదర్థవివరణములమాట తలపెట్టలేదు.

ఇక వ్యాఖ్యానమునుగూర్చి: వ్యాఖ్యానమును ప్రారంభించుచు 'ఇహాన్వయముఖైనైవ సర్వంవ్యాఖ్యాయతేష ...మూలం లిఖ్యతే కించి న్నానపేక్షితము ... మల్లినాథసూరి తననియమమును పేర్కొన్నా... మందఱు వ్యాఖ్యాతలకును వర్తించునదియే. అందును 'మల్లినాథునిమాడ్కి నిరంకుశముగ వ్యాఖ్యానము వ్రాయఁ దదీయపాదరజంబును బోలిన నాబోటివానికిఁ దరమా'అని మల్లినాథసూరియెడ తమకుగల వినయభావమును తెలుపుటగా తమఅసమర్థతను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూచించి, 'అయినను నప్పుడితో త్తముఁడవలంబించినపద్ధతిని నేననుసరింపఁబూనితి ననిమాత్రము వాక్రువ్వఁగలను' అని మరలతమకు సామర్థ్యముగలదని ప్రకటించినపారిజాతాపహరణగ్రంథవ్యాఖ్యాతయెడల మఱింత యెక్కువగా వర్తింపవలసియుండును. కాని వ్యాఖ్యానము తన్నియమమునకులోనయినదని చెప్పుటకు వలనుగాకున్నది. వ్యాఖ్యానములు ప్రతిపదార్థము, భావార్థము, విశేషార్థము' ధ్వన్యాదులు, అలంకారములు, వానిలక్షణములు, విశేషార్థాదులు, వానిని ప్రతిపాదించుట కావశ్యకములయిన ఇతర గ్రంథప్రమాణములు మొదలయిన వివరములు గలిగి, చేత నొలిచిపెట్టిన అరటిపండువలె పాఠకులకు సుగ్రహముగ నుండదగినవి. ఏతంగుణవిశేషణ విశిష్టములగు వ్యాఖ్యానములను స్వరంకమపాండిత్యమండితులు, ప్రతిభాశాలులు నగు వారు రచియింపగల్గుదురు. వ్యాఖ్యాతలట్టివారు కాని నాడు తత్కృతవ్యాఖ్యానములవలన గ్రంథ స్వరూపస్వభావాదులు పాఠకులకు సరిగాగోచరము కాజాలవు. పారిజాతాపహరణవ్యాఖ్య యీవిషయమున నెంతకుజాలునదియు నీక్రిందియుదాహృతభాగములను- స్థూలదృష్టికి గోచరించినవానిని- పరికించినచో పాఠకులు తెలిసికొనగలుగుదురు.

౧. సత్యభామాభోగసక్తి-నాఁడును నేఁడు. ఆ. ౧-౧౯.

'సత్యభామతో భోగముల దగిలియుండుటచేత అని కృష్ణావతారపరమయిన అర్థము కృష్ణదేవరాయల పరమయిన అర్థమున 'సత్యమనెడు భామతో భోగముల దగిలియుండుటచేత' అని చెప్పదగును. దీనికి 'సత్య-యథార్థభాషణము నందును; భామాభోగ-స్త్రీలతోడి భోగమునందును (నిజభార్యలతోననుట) సక్తి-ప్రీతిని' అని వ్యాఖ్యానముగలదు. ఇది సమంజసముగా దోపదు.

౨. ఘనతాపనితారకాభికద్యుచరగవీ. ఆ. ౧-౩౨.

దీనికి 'ఘనతాప-అధికమైన వ్యసనమును; నితారక-పోగొట్టుటయందు; అభిక-ఆసక్తిగల, ద్యుచరగవీ-కామధేనువుయొక్క......' అని వ్యాఖ్య. ఇచట కృష్ణరాయల దానపరతంత్రత వర్ణితము. ఇకదీనియర్థము: 'ఘన-మేఘముయొక్కయు, తాపని (తపనునికొడుకు)కర్ణుని యొక్కయు, తారకాభిక - చంద్రుని యొక్కయు, ద్యుచరగవీ-కామధేనువు యొక్కయు' అని యుండవలెను.

3. 'పూనుకొని మేలుఁగీల్లకు, లోనయి విహరించువారి లోకమెఱుఁగదో; యానరకాసుర దమనుఁడు దానెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగదో కో!

ఆ. ౧-౯౧

దీనికి వ్యాఖ్యాత 'సుగమము' అని దాటిపోయినారు. ఇందు 'నరకాసురదమనుఁడు', 'భోజకన్య' అను పదములు సాభిప్రాయములు. నరకాసుర సంహారసమయమున తాను కృష్ణునకు సహాయముచేసితిననియు, భోజకన్య తోడ రాక యింటనుండెననియు, మేలుఁగీల్లకు లోనయిన తన్ను నేఁడు కృష్ణుడు మరచినాడనియు, సత్యభామ కృష్ణు నెత్తిపొడుచుచున్నది. ఈ సారస్యము అందరకు 'సుగమ'మగునా ?

౪. ముసుంగుద్రోచి య, 'క్కాంతగృహంబు నల్గడలు గన్గొని-ఆ. ౧-౧౧౧ దీనిలో 'యక్కాంత'యను పదమునకు వ్రాతప్రతులలో 'యేకాంత' అను పాఠాంతరమున్నది. వ్యాఖ్యాత 'నల్గడలునారసి' అన్న పాఠము అన్నిపుస్తకములలోను గానంబడుచున్న' దనుచు అది 'యతిభంగము' అనితలచి 'నల్గడలుగన్గొని' యని కవివ్రాసియుండునని యూహించి యట్లు సవరించితిని' అని వ్రాసినారు 'కన్గొని' అనుటకంటె 'ఆరసి' అనుపద ముచితమయినది. నల్గడలు ఊరక 'మాచి' అనుటకంటె 'వెదకి' అనుటయే సరసముగనుండును. 'ఈయేకాంతగృహములో దివ్యవాసనలెక్కడివి? ఆశ్చర్యముగానున్న' దని సత్యభామ నలువైపుల వెదకి చూచినదనిభావము. వ్యాఖ్యాతలు ప్రకరణముంబట్టి శబ్దములయు, తదర్థములయు, నౌచిత్యముల నెఱిగి వివరింపవలయును !

మఱియు నీపద్యముననే ''బాష్పకళికా' అను దానిని 'బాష్పకణికా' అని దిద్ది 'బాష్పకళికా' అనగా మొగ్గలవంటి బాష్పములని క్లిష్టార్థకల్పనము చేయవలసియుండును. కావున 'బాష్పకణికా' అనియే కవి వ్రాసియుండనోపు' అన్నారు. 'కళికా' అన్న పాఠము వ్రాతప్రతులలోను గలదు. కన్నీటిబొట్టు కంటినుండి జారుచున్నపుడు మొగ్గవలె సోగగానుండుట సహజము. కాన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాఖ్యాతచేసిన 'కణికా' అను దిద్దుపాటుకంటె 'కళికా' అను పాఠమే సముచితమయినది.

౫. 'ననుభవదీయదాసుని...............'

ఆ౧-౧౨౩.

అనుపద్యమునకు - సరియైన సంస్కృతశ్లోకము గలదు: అది యిది.

"దాసే కృతాగసి భవేదుచితః ప్రభూణాం పాదప్రహార ఇతి సుందరి నాత్ర దూయే; ఉద్యత్కఠోరపులకాంకురకంటకాగ్రై ర్యత్ఖిద్యతే మృదుపదం నను సా వ్యథా మే." —సాహిత్యదర్పణము.

ఇట్టివిశేషములను వ్యాఖ్యాతలు తమ వ్యాఖ్యానములయందు జూపదగుదురు.

౬. ఆయతతేజముల్ (ఆ-౨-౩౦.) అధికమయిన కాంతులు-అని వ్యాఖ్యాత. నిడుదలైన కాంతులు (కిరణములు) అనఁటొప్పును. సాయంసమయమున సూర్యకిరణములు దీర్ఘములుగ నుండును.

౭. 'తాకియుం దలచెడువారు లేరు' ఆ౨-౫౨

'మనలను, స్పృశించువారును, స్మరించువారును, నుండ' రని వ్యాఖ్యాత. జారకాంతలు వెన్నెలరాత్రులయందు తెల్లని అలంకారములను ధరించి సంకేతస్థలములకు పోవుదురేని వారి ధవళాలంకారయుతమగు దేహములు వెన్నెలతెలుపులోగలసి త్రోవనుపోవువారికి కానరాక పోవును. కాన వారికి జారిణుల శరీరములు పొరపాటున తగిలినను స్మరియింపక వారు తమత్రోవనబోవుదురు, జారిణులు నిర్భయముగ సంకేతస్థలములకు జనదగుననియు భావము.

౮. 'గజకచ్ఛపాశనఘాతుకుండు' ఆ. ౨—౭౨.

దీనికి వివరణమువ్రాయుచు శాపగ్రస్తులై గజకచ్ఛపరూపంబులఁ దాల్చియుండిన క్షత్రియుల నిరువురి నాహారంబుగాఁగొనియెను' అని వ్యాఖ్యాతవ్రాసిరి. ఇది పొరపాటు. క్షత్రియులుగారు శాపమును పొందినవారు, బ్రాహ్మణులు. చూడుడు:

క. "అనలనిభుండు విభావసు, డను విప్రుఁడు...

..........నాతని, యనుజన్ముఁడు సుప్రతీకుఁ డను వాఁ డతనిక్:—" ఆదిపర్వ. ఆ—౨.

౯. ఉ. సంతసమంది 'జాదులు ప్రసాదము'నయ్యెనటంచుఁబొంగి. ఆ. ౨-౭౫.

వ్యాఖ్యాత. 'జాదులుఁ బ్రసాదము నయ్యెక్:— ఇక్కడ 'జాదుల'ను పదమున కర్థమేమియో తెలియ లేదు. జాదులనఁగా జాజిపూవులని యొకయర్థము గలదు గాని యాయర్థ మిచ్చటఁ బొసఁగదు. విచార్యము. ప్రసాదము:—అనుగ్రహము' అని వ్రాసిరి. మఱియు 'ఈ' అను బంధములో 'జాతులనఁగా మనోరథసిద్ధియని యర్థము చెప్పవచ్చునని ప్రకరణముంబట్టి యూహింపదగియున్నది' అనియు వ్రాసిరి.

ఈపద్యము తరువాతిభాగమున గరుత్మంతుడు తనకు ఇంద్రునిపై పగ గలదనియు, దానిని తానిపుడు తీర్చుకొందుననియు చెప్పినట్లు గలదు. కావుననే కృష్ణుని స్వర్గలోకయాత్ర 'జాదులు, ప్రసాదము' అయినదని పొంగినాడు. ఒక మహానుభావునికి మ్రొక్కినచో నాతడు కొన్ని జాదులు ప్రసాదముగ నిచ్చును. అవి శిరోజముల కలంకారముగ ముడుచుకొనుటకును ఉపయోగించునవి. కావున నవి ఉభయథా ప్రయోజనకరములగును. ఇక్కడ కృష్ణుడు ఇంద్రలోకమునకుంబోయి పారిజాతమునుగొని తేవలయునన్న తననిశ్చయముం దెలుపగా గరుత్మంతుడు కృష్ణునికార్యమే కాక తన (పగదీర్చుకొను) కార్యమును సఫలమగునని పొంగినాడు. ఈ రెండుకార్యములును సమకూరును. కావున 'జాదులు ప్రసాదము'కూడ అయినదన్న సామెత. ఇట్టి విశేషవిషయములకు తావులేని వ్యాఖ్యానము సమగ్రము కాజాలదు.

౧౦. నోగలక్—ఆ. ౨-౮౨.

'మెడమీఁదనుంచి కట్టెడుకొయ్యలను' అని వ్యాఖ్యానము. 'నోగ' అనగా 'కూబరము' కాని, వ్యాఖ్యాత చెప్పిన 'మెడమీదనుంచి కట్టెడుకొయ్య' కాదు; దానికి 'కాడి' అని తెలుగున పేరు.

౧౧. 'ఆయతభూర్జపత్రములు' ఆ. ౨—౯౦.

'భుజపత్రములనెడు వెడల్పయినపర్ణములయందు; ఇది యొక విశాలమగు పర్ణము. అనంగలేఖక్రియలకు విద్యాధరాంగన లుపయోగింతురని కాళిదాసుఁ డువర్ణించి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్నాఁడు 'న్యస్తాక్షరా ధాతురసేన యత్ర భూర్జ త్వచః కుంజరబిందుశోణాః......ఇత్యాది.—కుమార సంభవము'

'భుజపత్రము'లనెడి పర్ణములనగా అర్థమెట్లు? 'ఇది యొకవిశాలమగు పర్ణము.' దీనికి పైవాక్యముతో నెట్లు సమన్వయము? అనంగలేఖక్రియలకు విద్యాధరాంగనలు భూర్జవృక్షముయొక్క పట్టను ఉపయోగించిరని కాళిదాసు చెప్పెను. పైవాక్యము పర్ణముల నుపయోగింతురను నర్థము నిచ్చుచున్నది. ఏవిధమునను సంబంధము లేని అనంగలేఖక్రియలతో నిక్కడపనియేమి? 'నా నపేక్షితముచ్యతే' అన్నాడుగదా వ్యాఖ్యాతకాదర్శప్రాయుడయిన మల్లినాథుడు!

౧౨. 'బాసదప్పువరగండాంకా!' ఆ. ౨-౧౫

'బాసదప్పు యను వానిని జయించినవాఁడనెడు బిరుదుగలవాఁడా'అని వ్యాఖ్యాత. ఇది పొరపాటు. 'బాసదప్పువరగండ' అనునది కన్నడబిరుదు. దీనికి 'ఆడిన మాటను తప్పినవారికి మగడు' అని అర్థము.

౧౩. "ఉన్నతసౌధమెక్కి యమృతోదరి......

గంటిరె నాకనిబొంకె నేర్పునన్" ఆ. 3-౧౫

ఇందలిసారస్యమును వ్యాఖ్యాత ఎత్తిచూపలేదు. 'అమృతోదరి' కావుననే 'బొంకినది.' దీనికి పూర్వమున్న 'కాళియభేది' యను పద్యమునగల 'నీలాలకా' అనుపదము 'సాభిప్రాయ'మని వ్రాసిన వ్యాఖ్యాత ఈపద్యమున గల 'అమృతోదరి' శబ్దమువలని సారస్యమును గుర్తింపమి వింతగా దోచును.

౧౪. 'చిల్వరాచకిరి త్రొటన్' ఆ. 3-౨౬.

చిల్వ-చిలువ—(చీ'నవా-నోరుగలిగినది-పాము అని యర్థము.) ఇట్టిపదము 'నలువ' నాలుగు వాతులు గలవాడు బ్రహ్మయని యర్థము., ఇట్లు వ్యాఖ్యానమున 'చిలువ' శబ్దనిష్పత్తిగలదు. పాము (ద్విజిహ్వము) చీలిన నాలుక కలదిగదా! 'అంత నయ్యురగులు నమృతం బుపయోగింపంగానక దానియున్నస్థానంబని దర్భలు నాకిన నాలుకలు రెండుగా వ్రయ్యలంజేసి నాటంగోలె ద్విజిహ్వులు నాఁబరగిరి'అని భారతము, ఆదిపర్వము. శ. ర. కారుల 'చిలుము (విషము) గల, వా-నోరు-చిలువ' అన్న-రూపనిష్పత్తి సముచితముగ గాన్పించుచున్నది.

౧౫. 'కార్తవీర్యభుజపంక్తిం జక్కుగావించితి'

ఆ. 3-3౪.

'చక్కుగావించితివి - నశింపజేసితివి' అని వ్యాఖ్యానము. 'చక్కుగావించితివి=నజేకితివి' అనుట ఉచితము.

౧౬. 'సరసిజనేత్ర చూచితివె......కుహళీవిగళన్నవకోరకావళుల్'—ఆ. 3-౧3. 'కుహళీ-పూగుత్తుల నుండి అని. వ్యాఖ్యానము:ఇదిసరికాదు. 'కుహళీ'అనగా పోకపొత్తు. క్రిందరాలిన సేసబ్రాలవలెనే పోకపొత్తుల నుండి రాలినమొగ్గలుఉండును. 'పరితః ప్రాంత......పరిమాణ ప్రథమానపూగకుహళీ ప్రాదుర్భవా మోదముల్.' కవికర్ణరసాయనము.

౧౭. 'తేనియయందుఁ గ్రోలఁ జనుదెంచిన యామొలదేఁటి దాఁటు లోనూనినడప్పిమూగఁబడి.' ఆ. ౪-౫.

'ఏలదేఁటి - లేఁ బ్రాయపుఁదుమ్మెద; దాఁటు లోన్-పరుగెత్తుటలో; ఊనినడప్పిన్-ఒదవినతృష్ణచేత; మూగఁబడి-చుట్టుకొనబడి.' ఇత్యాదిగావ్యాఖ్యానము. ఏలదేఁటిదాఁటు - లోనూనినడప్పిన్ - మూగఁబడి- అని యిట్లు విభజించి అర్థముచెప్పికొనవలెను. 'దాఁటు' సమూహమని అర్థము చెప్పవలెను. 'మూఁగఁబడి' అనగా చుట్టుమూగి అని అర్థము.

౧౮. పెరిగిన హారరత్నములపెల్లున నొక్కెడఁ దామ్రపర్ణియై. ఆ. ౪—33.

'పెరిగిన-తెగిజాఱిన; హారరత్నములపెల్లునన్—ముత్యాలహారములయందలి, మణులగుంపులవలన-అనఁగా ననేకముత్యములవలన ననిభావము; నభశ్చరనది-ఆకాశగంగానది; తామ్రపర్ణియై యొప్పెన్; అనఁగా నాకాశగంగానదీ జలములు ధవళములైనవు నాముత్యములు గుంపులుగా రాలినచోట నాముత్యములకాంతిచే నాస్థలంబున జలము లతివిమలంబులై తామ్రపర్ణివలె నొప్పెననిభావము'అని వ్యాఖ్యానము: ఇదిసరికాదు హారముల ముత్యములు ఆకాశగంగానదియందు రాలినవి. తామ్రపర్ణీనదియందు ముత్యములుండుట ప్రసిద్ధము గాన అట్లు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాలినముత్యములుండుటచేత నాకాశగంగానది తామ్రపర్ణియైనది. చూడుడు: 'తామ్రపర్ణీ సమేతస్య ముక్తాసారం మహోదధేః తే నిపత్య దదుస్తస్మై యశః స్వమివ సంచితమ్. రఘువంశము స. ౪.

౧౯. 'ఇంద్రద్రుమోత్పాటనంబు' ఆ. ౪-౬౦.

'దేవదారువృక్షమును పెల్లగించుట యని కృష్ణుని గోష్ఠవినోదక్రీడాపరమైనయర్థము'అని వ్యాఖ్యాత. 'ఇంద్రద్రుమము'అనగా మద్దిచెట్టు. 'ఇంద్రద్రుః కకుభోఽర్జునః' అని అమరము. శ్రీకృష్ణుడు చిన్ననాట ఱోలకట్టబడి జంటమద్దులను పెకలించినగాథ యిటననుసంధింపవలసినది.

౨౦. 'కదనాభిశంసియై' ఆ ౪-౬౩.

'యుద్ధమును తెలుపునదియై' అని వ్యాఖ్యానము. యుద్ధమును నిందించునదియై అనఁగా 'కృష్ణునితో యుద్ధము చేయకూడదు' అనియుద్ఘోషించునదియై అని అర్థము చెప్పవలయును. లేకున్న పద్యమునర్థము పొసగదు.

౨౧ 'మానసవేగరథ్యముతో' ఆ. ౪-౭౫

'మనోవేగమువంటి వేగముగల గుఱ్ఱమును;' అని వ్యాఖ్యానము. ఇది 'రథము'నకు విశేషణము. కావున 'గుఱ్ఱములుగల' దనవలెను....

ఇట్టి వెన్నియైన చూపవచ్చును. గ్రంథవిస్తరభీతిని విడువబడినవి.

ఈ వ్యాఖ్యయందుగల విశేషములనుగూర్చి: అలంకారములు, కావ్యగుణములు, మొదలగువానిని పేర్కొని వానిలక్షణములను వ్యాఖ్యాత వ్రాయక విడిచిరి. అలంకారములనుగూర్చి 'వానిలక్షణములను విద్యార్థు లలంకారశాస్త్రమువలన నెఱుంగగలరను తలంపున లిఖింపక విడిచితి' నన్నారు. ఇట్లు విడుచుట గొప్ప లోపము. ఛందోలక్షణములనుమాత్రము వివరించినారు. అలంకారములనే శాస్త్రములవలన నెఱుగగల పాఠకులు ఛందోలక్షణముల నెఱుగఁజాలకపోవుదురా? కొన్నిసంస్కృతపదముల కొక ప్రత్యేకానుబంధమున రూపనిష్పత్తులను వివరించినారు. ఈ వివరణ మున్నరూపమున పండితులకు పామరులకుకూడ ననావశ్యకము. ఇట్లే అనావశ్యకములగు వానిని పెంచివేయుట, ఆవశ్యకములగువానిని త్రుంచివేయుట నీవ్యాఖ్యానమున నచ్చటచ్చట గానవగును.

శ్రీకృష్ణదేవరాయలకు, తత్సతీమణికి జనించిన ప్రణయకలహము వృత్తాంత మీ పారిజాతాపహరణ గ్రంథము పుట్టుకకు కారణమనియు, కావుననే తద్వృత్తాంతమునకు సంబంధించిన గాథలు పెక్కులు సరసముగ నీకావ్యమున ధ్వనించుచున్నవనియు ప్రతీతి. అట్టిసారస్యములు వ్యాఖ్యానమున నంతగా గానరావు. మరియు గ్రంథావతరణికాభాగమునగల చరిత్రవిషయములకు ఇంకను విపులమగువివరణ మావశ్యకము.

ఇంకొకవిషయము: వీరు మనుచరిత్రము పారిజాతాపహరణముతో సరిరాదని యందులకేవేవో కారణములను పీఠికయందు పేర్కొన్నారు. ఆ కారణములన్నియు నిదివఱకే పలువురు క్షుణ్ణముగ విమర్శించి పూర్వపక్షములు కావించినవి. వీ రిట్లుచెప్పుటకు వీరికి పారిజాతాపహరణముపైగల 'ఎక్కువమక్కువ' యేకారణము కావలెను. కాకున్న పారిజాతాపహరణమువంటి పెక్కుప్రబంధములకు మార్గదర్శకమయి, సహృదయాస్వాదయోగ్యం బయి, రసవత్ప్రబంధరాజంబయి ప్రఖ్యాతిగాంచిన మనుచరిత్రమునువీరు తక్కువపరిచియుండరు. మనుచరిత్రలో 'వరూథినీగంధర్వుల సమాగమము నీతిబాహిరమనుట'యు నొకకారణముగ వీరుచెప్పిరి. కావున 'రసాభాసపూరిత'మనిరి. 'ఆడుదాని కాలిచేత తన్నుదినుట'మాత్రము రసాభాసముకాదు కాబోలు! కడు నీతికరము కాబోలు! మఱియు, పారిజాతాపహరణముననే చప్పిడిపద్యములు ఎక్కువగా గలవని చెప్పవచ్చును. ఇట్లు కుతర్కమున కెన్నియైన లోపములు కనుపడుచుండును. కాని నిష్పక్షపాత దృష్టిని జూచిన నుభయగ్రంథములును దానిదాని యునికినిబట్టి యదియది రసవంతముగనే యున్నదని సహృదయులు భావింపక పోరు. ఆనాడు కృష్ణరాయలు ఆత్మప్రణయగాథను గూర్చినదయ్యును పారిజాతాపహరణమునకును మనుచరిత్రకును గల తారతమ్యములను గుర్తించి తద్గ్రంథకవులను వారివారికి దగినట్లు లాదరించెను. కృష్ణరాయలు తాను పండితుడు; కవి; బహుకవిపండితపోషకుడగు చక్రవర్తి; సరసాగ్రేసరుడు; యుక్తా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుక్తముల నెఱిగినవాడు. వ్యాఖ్యాతకెలచినట్టు లాతడు తిమ్మనను పెద్దనకంటె దక్కువగా బహూకరించియుండి నను అది యాతడు తత్త్వమునెఱుగక కావించియుండడు. అది యాతనికి వ్యాఖ్యాత ఊహించునట్లు 'న్యూనత'యు కాజాలదు. మీదుమిక్కిలి ఆతని ఉచితానుచితజ్ఞతను జాటును.

గ్రంథముద్రణాదులు చాల సుందరముగనున్నవి. వెల రు 3-౦-౦మాత్రము.

'భారతి'

---

# గ్రంథ స్వీకారము

## తూము లక్ష్మీనృసింహదాసుచరిత్రము(ద్విపద)

డిమ్మి ౭ పుటల సైజు ౯ ౪ పు. వెల అణాలు ౪.

ప్రకాశకులు: శ్రీ అమరవాది పెద్ద రామానుజా చార్యులు-అర్చకులు, భద్రాచలము.

---

## శ్రీ భక్తకుచేల (అయిదంకముల నాటకము)

డిమ్మిసైజు. ౯3 పుటలు. వెల రు. ౧-౧-౦.

గ్రంథకర్త: శ్రీ అప్పల వీరవేంకటభోగయ్య శాస్త్రిగారు. ప్రకాశకులు: అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారు, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి.

---

## పతితనళిని (అపరాధ పరిశోధకనవల)

(రెండవభాగము)

డిమ్మిసైజు. 167పుటలు. వెల. ౦-౧౨-౦

గ్రంథకర్త: పోడూరి రామచంద్రరావు బి. ఏ., బి.యల్ గారు, ప్రకాశకులు: సరస్వతీగ్రంథమాల, కాకరపఱ్ఱు. తణుకు తాలూకు.

---

## చక్రపాణి (నిరూపకనవల)

క్రౌను ౪ పుటలసైజు,౯౬ పేజీలు, వెల రు౧-౯-౦ గ్రంథకర్త: చెలికాని సత్యనారాయణగారు, ప్రకాశకులు: పద్మనాయక గ్రంథమాల, పెంటనాగులవలస రాజాం పోస్టు.

---

## రమణమహాఋషి జీవితము (సచిత్రము)

తత్వానందస్వామిగారిచే రచితము. క్రౌను, పుటలు ౨౪. వెల తెలియదు. ప్రకాశకులు: సనాతన గ్రంథమాలా మేనేజరు, క్రాపపోస్టు (వయా) కొల్లూరు.

---

## గండికోట

క్రౌను ౧౬ పుటలు, వెల అ ౪. గ్రంథకర్త: జె. సుబ్బయ్యగారు, పొద్దుటూరు, కడపజిల్లా.

---

## తులసీదాసు జీవితచరిత్రము

క్రౌను ౪౨ పుటలు, మందికాగితములు. వెల అ. ౪. గ్రంథకర్త: బత్తుల లక్ష్మీకాంతంగారు, పెద్దాపురము.

---

## ప్రేమలేఖలు

క్రౌను ౧౪౯ పేజీలు, మంచికాగితములు, అందమైన అచ్చు, వెల రు ౧. రచయిత: బి. టి. నరసింహా చార్యులుగారు, మూర్తి బుక్కుడిపో, ౧౭3, మింటు స్ట్రీటు, మదరాసుకు వ్రాసిన పొందగలరు.

---

## ఆంధ్రనాయకుల జైలుపాటలు

భాగము ౧

(విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు) రచయిత: "సత్యాగ్రహి" క్రౌనుసైజు, వెల ౦-౧-౬



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాగము ౨

(భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, చెరుకువాడ వెంకటనరసింహం పంతులుగారు) క్రౌనుసైజు వెల ౦-౧-౬.

భాగము ౩

(మహర్షి సాంబమూర్తి, దండు నారాయణరాజు గార్లు) వెల ౦-౧-౬.

భాగము ౪

(ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు, గద్దే రంగయ్యనాయడుగార్లు) వెల ౦-౧-౬.

భాగము ౫

(నడింపల్లి నరసింహారావు, డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగార్లు) వెల ౧-౬-౧. ప్రకాశకులు : దేశోద్ధారక బుక్కుడిపో, బెజవాడ.

---

పునర్మిలన్ (హిందీ-నవల)

క్రౌను ౮ పుటలసైజున ౬౩౫ పుటలు.

వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త: శ్రీ రామానందశర్మా - 'ప్రేమయోగీ' ప్రకాశకులు: మేనేజర్, 'చిత్తరంజన పుస్తకమాలా' లఖీసరాయ్, ఇ. ఐ. రైల్వే.

రాజశేఖర కవికావ్యమీమాంస

(ఆర్యభారతి గ్రంథమాలిక—౩వ కుసుమము.)

క్రౌను ౮పుటలసైజు పు. ౪౫౭.

అనువాదకులు: కావ్యవ్యాకరణ తీర్థులు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.

ప్రకాశకులు: మేనేజరు, ఆర్య భారతీగ్రంథమాలిక, పురసువాకం, మద్రాసు—

ఈ గ్రంథమువెల గ్రంథమాలికచందాదారులకు రు ౧-౮-౦. ఇతరులకు రు ౩-౦-౦.

---

## పత్రికా స్వీకారము

### సమదర్శినీ ప్రమోదూత ఉగాదిసంచిక

(చిత్రపట శోభితము)

చందాదారులకు వెల 1-0-0, ఇతరులకు 1-4-0

వలయువారు: మేనేజరు, సమదర్శినీ ఆఫీసు, మౌంటురోడ్డు, మదరాసు అని వ్రాయవలెను.

---



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ మహిళా మండలి




శ్రీ ఇ. మధురంకన్యగారు

ఈమె క్రొత్తగా చెన్నపురి ఘోషా వైద్యశాలకు
సూపరింటెండెంటుగా నియమింపబడెను.




శ్రీమతి విశాలాక్షి నారాయణయ్యరుగారు

చెన్నపురమున గౌరవన్యాయాధికారిణి
(Hon. Magistrate) గా
నీమె నియమింపబడెను.




డాక్టరు లక్ష్మీదేవికన్యగారు

యం. ఆర్. సి. పి., యల్. ఆర్. సి. యస్.
ఈమె డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి కొమరిత.
ఈమె ఇంగ్లాండున ఉన్నత వైద్యవిద్య నభ్యసించి
చెన్నపురమున కిటీవల వచ్చెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి చందాదారుల కొక ముఖ్యమైన విజ్ఞప్తి

ఈ దిగువ నమోదుపఱచిన సంఖ్యలుగల చందాదారుల చందాలు ఈ ప్రమోదూత సం. జ్యేష్ఠమాసపు సంచికతో ముగియుచున్నవి. ఆయా సంఖ్యల చందాదారులు దయచేసి తిరుగ తమ తమ చందా సొమ్మును మణిఆర్డరుద్వారా పంపుట గాని, వి. పి. పంప ననుజ్ఞ ఇచ్చుట గాని కావింప ప్రార్థించుచున్నాము. అట్లు జూలై నెల ౧-వ తేదీ లోగా మాకు మణిఆర్డరు గాని వి. పి. అనుమతి గాని రాకున్నచో రాబోవు సంచిక వి. పి. ద్వారా పంపగలము. చందాదారులు ఆ వి. పి. ని త్రిప్పవేయక దయతో స్వీకరింప ప్రార్థితులు.

చిరునామా మార్పులు 1-వ తేదిలోపల తెలుప ప్రార్థితులు.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1033 | 1056 | 2200 | 2203 | 2212 | 2228 | 1218 | 1398 | 1408 | 1567 | 2232 | 2237 | 1846 |
| 1925 | 2290 | 2396 | 2435 | 2513 | 2529 | 2951 | 2993 | 3014 | 3025 | 3059 | 3107 | 3117 |
| 3230 | 3334 | 3365 | 3378 | 3383 | 3396 | 3391 | 3402 | 3413 | 3431 | 3435 | 3436 | 3446 |
| 3447 | 3672 | 3706 | 3712 | 3716 | 3737 | 3823 | 3872 | 3884 | 4047 | 4089 | 4101 | 4103 |
| 4106 | 4110 | 4115 | 4118 | 4120 | 4121 | 4127 | 4131 | 4140 | 4141 | 4144 | 4166 | 4178 |
| 4181 | 4189 | 4192 | 4213 | 4216 | 4282 | 4299 | 4302 | 4318 | 4319 | 4477 | 4478 | 4484 |
| 4496 | 4501 | 4502 | 4503 | 4504 | 4522 | 4531 | 4541 | 4542 | 4571 | 4586 | 4639 | 4670 |
| 4671 | 4723 | 4745 | 4837 | 4843 | 4856 | 4866 | 4868 | 4871 | 4874 | 4875 | 4876 | 4880 |
| 4882 | 4892 | 4893 | 4894 | 4903 | 4905 | 4906 | 4922 | 4928 | 4934 | 4943 | 4944 | 4951 |
| 4952 | 4977 | 4986 | 5180 | 5229 | 5243 | 5254 | 5257 | 5269 | 5274 | 5275 | 5298 | 5314 |
| 5354 | 5362 | 5384 | 5391 | 5393 | 5401 | 5406 | 5454 | 5511 | 5632 | 5636 | 5647 | 5652 |
| 5664 | 5668 | 5672 | 5673 | 5674 | 5676 | 5677 | 5681 | 5685 | 5686 | 5690 | 5691 | 5692 |
| 5693 | 5698 | 5699 | 5703 | 5704 | 5710 | 5711 | 5713 | 5714 | 5716 | 5718 | 5719 | 5721 |
| 5724 | 5725 | 5734 | 5737 | 5738 | 5740 | 5742 | 5745 | 5750 | 5754 | 5756 | 5758 | 5779 |
| 5780 | 5784 | 5787 | 5797 | 5873 | 5968 | 5972 | 5973 | 5975 | 5978 | 4670 | 4671 | 4807 |
| 5983 | 5689 | 3877 | 5998 | 5999 | 6000 | 2308 | 6002 | 2994 | 6007 | 6008 | 4881 | 6010 |
| 6011 | 5663 | 6014 | 6015 | 6017 | 6018 | 6023 | 6025 | 5281 | 4873 | 3886 | 6031 | 6036 |
| 4948 | 6039 | 5762 | 6040 | 6041 | 6043 | 6044 | 6052 | 6054 | 6055 | 5798 | 6072 | 6073, |
| 6074 | 5323 | 6092 | 6109 | 6113 | 6117 | 6133 | 6139 | 4410 | 6165 | 6205 | | |

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7620

—మేనేజరు : భారతి.

Printed and Published by G. Subbaramayya, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైసూరు దశరా ప్రదర్శనమునం




ఒసగబడిన యోగ్యతా పత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

